## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీమద్భగవద్గీత

## ప్రథమ షట్కము

ప్రతిపదార్థ - తాత్పర్య - రామానుజభాష్య

ఆంధ్రానువాద సహితము


రచయితలు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణరామానుజజీయరుస్వామివారు

తాత్పర్య చంద్రికావివరణ

విశేషార్థములు

న్యాయవేదాంత విద్వాన్

తె. కం. గోపాలాచార్యస్వామివారు



ప్రకాశనము

శ్రీ మదుభయ వేదాంతాచార్యపీఠము

వెల : **15-00**

# గీతార్థతత్త్వజిజ్ఞాసులకు మా చిన్న విన్నపము

శ్రీమద్భగవద్గీత కనేక భాష్యము లనేకభాషలలో వెలసినవి. అందు ప్రధానముగా పరిగణింపబడు భాష్యములు మతత్రయాచార్యులు ప్రసాదించినవి. వానిపైనకూడా వ్యాఖ్యానము లవతరించి వానికి వన్నె తెచ్చినవి. అట్టిగీతాభాష్య వ్యాఖ్యానములలో శ్రీ వేదాంతదేశికస్వామివారు భగవద్రామానుజుల భాష్యముపై వ్రాసి కృపజేసిన "తాత్పర్యచంద్రిక" యను వ్యాఖ్యానము చాలా ప్రసిద్ధమైనది.

భగవద్రామానుజుల శ్రీభాష్యమునకు వ్యాఖ్యానమైన వ్యాసాచార్యులు ప్రసాదించిన శ్రుతప్రకాశికవంటిది తాత్పర్యచంద్రిక.

శ్రీవారి గీతాభాష్యమునకు,

"అపి జీవేదపీత్వాపి స్తనం మాతుః స్తనన్ధయః
నత్వపీత్వైవ వేదాన్తీ వ్యాసాచార్య వచస్సుధామ్."

చంటిబిడ్డ తల్లిపాలుత్రాగకున్నను బ్రతికియున్న యుండవచ్చునుగాని వ్యాసాచార్యులు ప్రతిపాదించిన శ్రీభాష్యవ్యాఖ్యానమగు శ్రుతప్రకాశికారసాస్వాదమును చేయని వేదాంతి బ్రతుకనేరడు అనినట్లు గీతాభాష్యమున కీతాత్పర్యచంద్రికా వ్యాఖ్యానమున్ను అట్టిదే.

శ్రీభాష్యకారులు తమ నిరుపమబుద్ధికౌశలముతో నిర్వచించిన కొన్నిగీతా ఘట్టములను శ్రీ దేశికులవారు చక్కని అప్రధృష్యయుక్తిప్రమాణాదులతో సమర్థించినస్థలములిం దనేకములు కలవు. ఉదాహరణమునకై మొదటియధ్యాయమున

"అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం"

అనుశ్లోకమునందలి పరోక్షనిర్దేశపరమైన "తత్" శబ్దాన్వయమున ఇతరవ్యాఖ్యాతలు కొట్టిన పల్టీలను చూచిన వారి పాండిత్యప్రకర్షకెంతో జాలికలుగును. అట్టితరి మనభాష్యకారులు 'తత్' అనుశబ్దమును 'బల'ముతో సమానాధికరణపదముగా (విశేషణముగా) నన్వయించక కారణపరముగా తత్ = తస్మాత్కారణాత్ అని యర్థమును సాయించి యతిసరసముగా సమన్వయించిరి. దానిపై పూర్వపక్షులు చేయు ఆశంకల నన్నిటిని వీరు ప్రామాణికసరళసరసయుక్తులతో నెంత నేర్పుగా నిరసించి సమర్థించిరో గమనించినచో వారికి శ్రీరామానుజులపట్లగల గౌరవభావము వ్యక్తమగుచున్నది. 3వ యధ్యాయమున చివరశ్లోకమున "యో బుద్ధేః పరతస్తు సః"

అనుపదమునకు ప్రకరణమును విడిచి యొచ్చటనో కఠోపనిషద్వాక్యమును పురస్క-
రించుకొని యితరులు భగవత్పరముగా వ్యాఖ్యానింపగా శ్రీభాష్యకారులు ప్రాకర
ణిక "కామ" పరముగా చేసిన అర్థమును శ్రీదేశికమువారు తమ తాత్పర్య
చంద్రికలో నెంత నేర్పుగా సమర్థించిరో గమనించవచ్చును. ఇట్లెన్నియో ఘట్టము
లీ వ్యాఖ్యానమునందు గలవు. ఎంత కొంటిప్రశ్నల నైనను వారే ఆప్రశ్నల
నుద్ఘాటించి నోరు మెదపనీయకుండునట్లు సమాధానముల నొసంగిరి.

"ధ్రువం జన్మ మృతస్య చ" అనుచోట చచ్చినది పుట్టినచో చనిపోయిన
బిడ్డకొఱకై ఏడ్వనేల? తిరిగిపుట్టునుగదా! రోగములకు మందేల? తిరిగి ఆరోగము
పుట్టునుగదా! యుద్ధముచేసి శత్రునిరసన చేయనేల? ఆశత్రువు తిరిగి పుట్టును
గదా! యని యిట్టి ప్రశ్నలకున్ను ఎంత చక్కని జవాబులను సెలవిచ్చిరో నాయా
ఘట్టములను చదివి యనుభవింపవచ్చును.

"అంతవంత ఇమే దేహాః" అనుశ్లోకవ్యాఖ్యానమున శ్రీభాష్యకారులు ఆత్మ
నిత్యత్వసమర్థనకై చూపిన మూడు అనుమానములు, శరీరానిత్యత్వసమర్థనకు చూపిన
మూడు అనుమానములలో 'ఆత్మనిత్యత్వము' శాస్త్రముచేతనే తెలియదగినది
గాన దానిని అనుమానములచే సమర్థించుట యుక్తమే గాని ప్రత్యక్షానుభవ
సిద్ధమైన దేహానిత్యత్వమును అనుమానముచే- అందును మూడు అనుమానములచే
సాధించుట పిష్టపేషణము కాదా! యనుప్రశ్నకు దాని సార్థక్యమును ఎనిమిది కార
ణములతో నెంతచక్కగ సమర్థించిరో గాంచినవారికి శ్రీభాష్యకారులపై గల శ్రద్ధా
భక్తులకు ఆశ్చర్యము గలుగక మానదు.

ఇట్టి మహత్తరగ్రంథరత్నము సంస్కృతభాషలో నుండుటచే నందరు గీతా
జిజ్ఞాసులకును అందుబాటులో లేదని ఊడయివరులవలె విశాలహృదయులగు మన
శ్రీ శ్రీ శ్రీ త్రిదణ్డి శ్రీమన్నారాయణజీయరుస్వామివారు వెనుక శ్రీ తేవప్పెరుమాళయ్యా
గారి క్వచిత్క్వచిత్ తాత్పర్యచంద్రికానువాదమును అవలంబనముగా దీసుకొని అనేక
సందర్భములలో నిశోధికముగా సరసశైలిలో ననువదించి ఆంధ్రలోకమునకు
మహోపకారమును గావించిరి.

రాజకుమారుడు తిని పారవేసిన మామిడిటెంకను ఈగలు మూసెరి, మిగిలిన
రసమును మరింత ఆస్వాదించునటుల-గ్రంథవిస్తరణభీతిచే వారచ్చటచ్చట విడిచి
నట్టియు తనబుద్ధికి తోచినట్టియు కొన్ని విశేషార్థములను అధ్యాయావసానములో
మన గోపాలాచార్యస్వామిగారు చేర్చిరి. మూలశ్లోకములోని కొన్నిపదములపై
అంకె లుండును. ఆయంకె సూచించు ఆపదవివరణము అధ్యాయావసానమున ఆదే
సంఖ్యగా చూచి యనుసంధించవచ్చును. ఈవిధముగా తాత్పర్యచంద్రిక చాలా

భాగము ఆంధ్రమున ననువదించబడి గీతార్థతత్త్వజిజ్ఞాసుల కెంతయో యుపకరించు
నని యాశించుచున్నాము.

దీని మూడుషట్కములు మూడు భాగములుగా విభజించి పాఠకులసౌకర్యా
ర్థమై ముద్రింపజేసిరి. దీని ముద్రణదోషములను శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీభాష్యం
అప్పలాచార్యస్వామివారు (చీఫ్ లెక్చరర్ సంస్కృతం- కాకినాడ కాలేజీ) పరిహరించి
నిర్దుష్టమైన ప్రబంధముగా ప్రసాదించినందులకు వారికి మా కృతజ్ఞతాభివందనముల
నర్పించుచున్నాము.

మొదటలో యీ తికమకలకు కొంచెము భయపడినను, చివరకు శ్రీపతిప్రెస్
వారున్ను, దుర్గాప్రెస్ వారున్ను గీతయందేమి, మాయందేమి, శ్రీ అప్పలాచార్య
స్వామివారియందేమి, వారికిగల గౌరవాభిమానములను చూపుచు కడుంగడు శ్రద్ధతో
నచ్చువేయించి యిచ్చినందులకు వారికి శ్రియఃపతి సకలశ్రేయస్సుల నిచ్చి బ్రోచు
గాక యని యాశీర్వదించుచున్నాము.

పాఠకులీగ్రంథములను స్వీకరించి దీనికై శ్రీ శ్రీ శ్రీ జీయరుస్వామివారు
గావించిన వ్యయప్రయాసలకు సాఫల్యమును కలుగజేయ ప్రార్థించుచున్నాము.

కాలకృతమైన ధరల ఔన్నత్యముచే గ్రంథమూల్యమున్ను పెరిగినది. ఐనను
దీని ప్రాశస్త్యమును తత్త్వనిరూపణములో గల నగ్రగణ్యతను గమనించి మూల్యా
ధిక్యమును గీతాతత్త్వజిజ్ఞాసులు పాటించక ప్రోత్సహింతురని యాశించుచున్నాము.

ఇట్లు
**ఉభయవేదాంతాచార్యపీఠ కార్యవర్గము.**



శ్రీ కృష్ణాయ నమః

# శ్రీమద్భగవద్గీతా-ప్రార్థనశ్లోకములు

జయతు జయతు దేవో దేవకీనన్దనోఽయమ్ ।
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః ।
జయతు జయతు మేఘశ్యామలః కోమలాఙ్గో ।
జయతు జయతు పృథ్వీభారనాశో ముకున్దః॥

కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహమ్ ।
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తుభ్యం నమః ।
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహమ్ ।
కృష్ణే తిష్ఠతి సర్వమేతదఖిలం హేకృష్ణ రక్షస్వమామ్॥

నమో నమో వాఙ్మనసాతిభూమయే ।
నమో నమో వాఙ్మనసైకభూమయే ।
నమో నమోఽనన్తమహావిభూతయే ।
నమో నమోఽనన్తదయైకసిన్ధవే॥

.........

శ్రీమద్గీతాకాలక్షేపారంభమునందుఁ దమతమ సంప్రదాయమునకుఁ దగినట్లు గురుపరంపరానుసంధానపూర్వకముగా ననుసంధింపవలసిన శ్లోకములు.

1. శ్లో॥ వ్యాసం వశిష్ఠ నప్తారం । శక్తేః పౌత్ర మకల్మషమ్ ।
పరాశరాత్మజం వందే । శుకతాతం తపోనిధిమ్॥

తా. వశిష్ఠమహర్షి మునిమనుమఁడును, శక్తిమనుమడును, శ్రీ పరాశరమహర్షి పుత్రుడును, తపోనిధియు, పాపదూరుడును నగు శ్రీ వ్యాసమహర్షిని సేవించుచున్నాను.

2. శ్లో॥ సమ్యఙ్న్యాయ కలాపేన। మహతా భారతేన చ।
ఉపబృంహిత వేదాయ। నమో వ్యాసాయ విష్ణవే॥

తా. బ్రహ్మసూత్రసముదాయముచేతను, శ్రీ మహాభారతము చేతను వేదాన్తార్థములను లెస్సగ విశదీకరించిన శ్రీ మహావిష్ణ్వవతారభూతులైన శ్రీ వ్యాసమహర్షికి వందనము.

3. శ్లో॥ సారథ్య మర్జున స్యాజౌ। కుర్వన్ గీతామృతం దదౌ।
లోకత్రయోపకారాయ। తస్మై కృష్ణాత్మనే నమః॥

తా. భారత యుద్ధరంగమున అర్జునునకు సారథ్య మొనరించుచు మూడు లోకములయందుండు చేతనజాతము నుద్ధరించుటకై గీతామృతమును ప్రసాదించిన ఆ శ్రీకృష్ణభగవానులకు నమోవాకములు.

4. శ్లో॥ ప్రపన్న పారిజాతాయ। వేత్రతోత్రైక పాణయే।
జ్ఞాన ముద్రాయ కృష్ణాయ। గీతామృత దుహే నమః॥

తా. శరణాగతుల పాలిటి కల్పవృక్షమై ఒకచేత గుఱ్ఱముల త్రోలెడు కొరడాకర్రను వేరొకచేత జ్ఞానముద్రను ధరించి గీతామృతమును పితికినట్టి కృష్ణపరమాత్మకు నమస్కారము.

5. శ్లో॥ కరకమల నిదర్శితాత్మ ముద్రః।
పరికలితోన్నత బర్హిబర్హ చూడః।
ఇతరకర గృహీత వేత్ర తోత్రో।
మమ హృది సన్నిధి మాతనోతు శౌరిః॥

తా. ఒక కరసరోజముచే జ్ఞానముద్రను జూపుచు, వేరొక పాణి కమలమున కొరడాకర్రను ధరించి, ఉన్నతమగు నెమలి పింఛముచే నలంకరింపబడిన కేశపాశమును కలిగియున్న శ్రీకృష్ణపరమాత్మ నా హృదయకమలమున సన్నిహితుడై విరాజిల్లుగాక!

6. శ్లో॥ అగ్రే కృత్వా కమపి చరణం జాను నైకేన తిష్ఠన్ ।
పశ్చాత్పార్థం ప్రణయ సజుషా చక్షుసా వీక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే, దక్షిణే జ్ఞానముద్రా ।
మాభిభ్రాణో రథమధి వసన్ పాతు న స్సూతవేషః॥

తా. ఒక పాదమును ముందువకు జాచి వేరొక కాలు మోకరించి కూర్చొని వెనుకనున్న యర్జునుని స్నేహమొలుకు చూపుతో జూచుచు ఎడమచేత కొరడాను కుడిచేత జ్ఞానముద్రను ధరించి రథమున వేంచేసియున్న సూతవేషధారి యగు శ్రీకృష్ణపరమాత్మ మమ్ము బ్రోచుగాక.

7. శ్లో॥ కృష్ణం కమల పత్రాక్షం । పుణ్య శ్రవణ కీర్తనమ్ ।
వాసుదేవం జగద్యోనిం । నౌమి నారాయణం హరిమ్॥

తా. పుండరీకాక్షుడును, తన గుణములను కీర్తించినవారికిని, తన కథలను వినువారికిని పుణ్యప్రదమైనవాడును, జగత్తునకు త్రివిధకారణమైనవాడును ఆశ్రితుల పాపహారియునగు వసుదేవసూనుడైన నారాయణుని నమస్కరింతును.

8. శ్లో॥ కృష్ణాయ యాదవేన్ద్రాయ । జ్ఞానముద్రాయ యోగినే
నాథాయ రుక్మిణీశాయ ॥ నమో వేదాన్త వేదినే॥

తా. యదుకుల తిలకుడును, జ్ఞానముద్రాధారియు, యోగియు, సకలజగచ్ఛేషియు, రుక్మిణీవల్లభుడును, నిఖిలాగమాంత సంవేద్యుడును నగు శ్రీకృష్ణపరమాత్మకు వందనము.

..........

# గీతాపారాయణావసానమం దనుసంధించవలసిన శ్లోకములు

1. శ్లో॥ గీతాశాస్త్ర మిదం పుణ్యం। యః పఠేత్ప్రయతః పుమాన్
విష్ణోః పద మవాప్నోతి। భయ-శోకాది వర్జితః॥

తా. పవిత్రమగు నీ గీతాశాస్త్రము నే మానవుడు సదాచార సంపన్నుడై నిత్యమనుసంధించునో వాడు భయము, దుఃఖము మొదలగునవి లేక, భగవత్సాయుజ్యమును బడయగలుగుచున్నాడు.

2. శ్లో॥ గీతాధ్యయన శీలస్య। ప్రాణాయామ పరస్య చ
నైవ సన్తి హి పాపాని। పూర్వజన్మ కృతాని చ॥

తా. విడువక నలవాటుగ పాటించు గీతాధ్యయనము కలవానికిని, ప్రాణాయామ నిరతునకును పూర్వజన్మార్జితమైన పాపరాశి యంతయు పటాపంచలై పోవును.

3. శ్లో॥ మల నిర్మోచనం పుంసాం। జలస్నానం దినేదినే
సకృద్గీతామ్భసి స్నానం। సంసార మల మోచనమ్॥

తా. మానవులు నిత్యమాచరించు జలస్నానము బాహ్యమాలిన్యమును మాత్రము పోగొట్టజాలును, కాని యొక్కసారి గావించిన గీతాప్రవాహావగాహనము సంసారమలమునే యపహరించును.

4. శ్లో॥ గీతా సుగీతా కర్తవ్యా। కిమన్యైశ్శాస్త్ర సఙ్గ్రహైః।
యా స్వయం పద్మనాభస్య। ముఖపద్మా ద్వినిస్సృతా॥

తా. సాక్షాత్తుగా పద్మనాభుని ముఖపద్మమునుండి యావిర్భవించిన గీతాశాస్త్రమును లెస్సగ గానమును గావించుచో నితర శాస్త్రముల నెఱుంగుట పిష్టపేషణమే.

4. శ్లో॥ భారతామృత సర్వస్వం। విష్ణోర్వక్త్రా ద్వినిస్సృతమ్ ।
గీతాగఙ్గోదకం పీత్వా। పునర్జన్మ న విద్యతే॥

తా. పాలకడలి అమృతమువలె భారతమునకు సర్వస్వ మన దగినదై సాక్షాత్తుగ శ్రీకృష్ణపరమాత్మ ముఖారవిందము నుండి వినిర్గళితమైప గంగవంటి పవిత్రమైన గీతాశాస్త్రా ర్థములను సాదరముగ నాలించి యాచరించువానికి తిరిగి జన్మ లేనేలేదు.

6. శ్లో॥ సర్వోపనిషదో గావః । దోగ్ధా గోపాల నన్దనః ।
పార్థో వత్స స్సుధీర్భోక్తా। దుగ్ధం గీతామృతం మహత్॥

తా. శ్రీకృష్ణపరమాత్మ లోకోత్తరమై పాలవలె స్వచ్ఛమై భోగ్యమును సత్త్వగుణాభివర్ధకమునునై అమృతమువలె జరామరణములు లేకుండ జేయునట్టి గీతాశాస్త్రమును, సకలోపనిషత్తులను గోవులుగా గల్పించి అర్జునుని దూడ నుగా చేసికొని తాను స్వయముగ పితికి లోకమునందలి ముముక్షువుల యనుభవమున కందజేసెను.

7. శ్లో॥ ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం ।
ఏకో దేవో దేవకీపుత్ర ఏవ ।
ఏకోమన్త్రస్తస్య నామాని యాని ।
కర్మాప్యేకం తస్య దేవస్య సేవా॥

తా. శ్రీకృష్ణుడు పాడిన గీత యొక్కటియే శాస్త్రము, శ్రీకృష్ణుం డొక్కడే దేవుండు, శ్రీకృష్ణుని శుభనామములే ముఖ్య మంత్రము. శ్రీకృష్ణుని సేవయే కర్తవ్యమగు కర్మవిశేషము.

..........

ఓమ్॥ అస్య శ్రీ భగవద్గీతామహామన్త్రస్య

భగవాన్ వేదవ్యాసః ఋషిః

అనుష్టుప్ ఛన్దః

శ్రీకృష్ణః పరమాత్మా దేవతా

అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చభాషసే... ఇతిబీజమ్

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ... ఇతి శక్తిః

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః } ఇతికీలకమ్

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకం } ఇత్యంగుష్ఠాభ్యాం నమః

నచైనం క్లేదయ న్త్యాపో నశోషయతి మారుతః } ఇతి తర్జనీభ్యాం నమః

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ } ఇతి మధ్యమాభ్యాం నమః

నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః } ఇత్యనామికాభ్యాం నమః

పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః } ఇతికనిష్ఠికాభ్యాం నమః

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ } ఇతి కరతలకరపృష్ఠాభ్యాం నమః

ఇతి కరన్యాసః

• • • • • • • • •

## అథ హృదయాదిన్యాసః

| | |
|---|---|
| నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః | ఇతి హృదయాయ నమః |
| న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః | ఇతి శిరసే స్వాహా |
| అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ | ఇతి శిఖాయై వషట్ |
| నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః | ఇతి కవచాయ హుమ్ |
| పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః | ఇతి నేత్రద్వయాయ వౌషట్ |
| నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ... | ఇత్యస్త్రాయ ఫట్ |

శ్రీకృష్ణప్రీత్యర్థే పాఠే వినియోగః

# శ్రీకృష్ణాష్టోత్తరశతమ్

శ్రీకృష్ణః కమలానాథో వాసుదేవ స్సనాతనః ।
వసుదేవాత్మజః పుణ్యో లీలామానుషవిగ్రహః ॥ ౧

శ్రీవత్సకౌస్తుభధరో యశోదావత్సలో హరిః ।
చతుర్భుజాత్తచక్రాసిగదాశఙ్ఖాద్యుదాయుధః ॥ ౨

దేవకీనన్దన శ్శ్రీశో నన్దగోపప్రియాత్మజః ।
యమునావేగసంహారీ బలభద్రప్రియానుజః ॥ ౩

పూతనాజీవితహర శ్శకటాసురభఞ్జనః ।
నన్దవ్రజజనానన్దీ సచ్చిదానన్దవిగ్రహః ॥ ౪

నవనీతవిలిప్తాఙ్గో నవనీతనటోఽనఘః ।
నవనీతనవాహారో ముచికున్దప్రసాదకః ॥ ౫

షోడశస్త్రీసహస్రేశ స్త్రిభఙ్గీ మధురాకృతిః ।
శుకవాగమృతాబ్ధీన్దు ర్గోవిన్దో యోగినాంపతిః ॥ ౬

వత్సవాటచరోఽనన్తో ధేనుకాసురభఞ్జనః ।
తృణీకృతతృణావర్తో యమళార్జునభఞ్జనః ॥ ౭

ఉత్తాలతాలభేత్తా చ తమాలశ్యామలాకృతిః ।
గోపగోపీశ్వరో యోగీ కోటిసూర్యసమప్రభః ॥ ౮

ఇళాపతిః పరంజ్యోతి ర్యాదవేన్ద్రో యదూద్వహః ।
వనమాలీ పీతవాసాః పారిజాతాపహారకః ॥ ౯

గోవర్ధనాచలోద్ధర్తా గోపాల స్సర్వపాలకః ।
అజో నిరఞ్జనః కామజనకః కఞ్జలోచనః ॥ ౧౦

మధుహా మధురానాథో ద్వారకానాయకో బలీ ।
బృన్దావనాన్తసఞ్చారీ తులసీదామభూషణః ॥ ౧౧

శమన్తకమణే ర్హర్తా నరనారాయణాత్మకః ।
కుబ్జాకృష్ణాంబరధరో మాయీ పరమపూరుషః॥ ౧౨

ముష్టికాసురచాణూర మల్లయుద్ధవిశారదః ।
సంసారవైరీ కంసారి ర్మురారి ర్నరకాన్తకః॥ ౧౩

అనాదిబ్రహ్మచారీచ కృష్ణావ్యసనకర్శకః ।
శిశుపాలశిరశ్ఛేత్తా దుర్యోధనకులాన్తకః॥ ౧౪

విదురాక్రూరవరదో విశ్వరూపప్రదర్శకః ।
సత్యవా క్సత్యసఙ్కల్ప స్సత్యభామారతో జయీ॥ ౧౫

సుభద్రాపూర్వజో విష్ణు ర్భీష్మముక్తిప్రదాయకః ।
జగద్గురు ర్జగన్నాథో వేణునాదవిశారదః॥ ౧౬

వృషభాసురవిధ్వంసీ బాణాసురకరాన్తకః ।
యుధిష్ఠిరప్రతిష్ఠాతా బర్హిబర్హావతంసకః॥ ౧౭

పార్థసారథి రవ్యక్తో గీతామృతమహోదధిః ।
కాళీయఫణిమాణిక్యరఞ్జిత శ్రీపదామ్బుజః॥ ౧౮

దామోదరో యజ్ఞభోక్తా దానవేన్ద్రవినాశకః ।
నారాయణః పరంబ్రహ్మ పన్నగాశనవాహనః॥ ౧౯

జలక్రీడాసమాసక్త గోపీవస్త్రాపహారకః ।
పుణ్యశ్లోక స్తీర్థపాదో వేదవేద్యో దయానిధిః॥ ౨౦

సర్వతీర్థాత్మక స్సర్వగ్రహరూపీ పరాత్పరః ।
ఏవం శ్రీకృష్ణదేవస్య నామ్నా మష్టోత్తరం శతమ్॥ ౨౧

కృష్ణనామామృతంనామ పరమానన్దకారకమ్ ।
అత్యుపద్రవదోషఘ్నం పరమాయుష్యవర్ధనమ్॥ ౨౨

ఇతి శ్రీకృష్ణాష్టోత్తరశతం సంపూర్ణమ్.

# శ్రీ కృష్ణాష్టకమ్

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

అతసీపుష్పసఙ్కాశం హారనూపురశోభితమ్ ।
రత్నకఙ్కణకేయూరం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

కుటిలాలకసంయుక్తం పూర్ణచన్ద్రనిభాననమ్ ।
విలసత్కుణ్డలధరం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

మన్దారగన్ధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్ ।
బర్హిపిఞ్ఛావచూడాఙ్గం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

ఉత్ఫులపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్ ।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

రుక్మిణీకేళిసంయుక్తం పీతామ్బరసుశోభితమ్ ।
అవాప్తతులసీగన్ధం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

గోపికానాం కుచద్వన్ద్వకుఙ్కుమాఙ్కితవక్షసమ్ ।
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

శ్రీవత్సాఙ్కం మహోరస్కం వనమాలావిరాజితమ్ ।
శఙ్ఖచక్రధరం దేవం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి ॥

శ్రీకృష్ణాయ పరబ్రహ్మణే నమః.
శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమద్భగవద్గీత



## అవతారిక.

శ్లో॥ * యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః ।
వస్తుతాముపయాతోఽహం యామునేయం నమామితమ్ ॥

---

## తాత్పర్యచంద్రికాదులలోని విశేషార్థ వివరణము.

* శ్రీయామునాచార్యులు భగవద్గీతార్థము లన్నియు క్రోడీకరించి గీతార్థసంగ్రహ మను నొక సంగ్రహమును రచించియున్నారు. దానిని మార్గప్రదర్శకముగా నుంచుకొనియే రామానుజాచార్యులు గీతకు భాష్యము వ్రాసిరి. మఱియు యామునాచార్యులు రామానుజాచార్యుల యాచార్యపరంపరలో పూర్వులైనవారు గనుక పరమాచార్యులును అగుదురు. ఇంతేకాక ప్రారంభింపఁగోరిన గ్రంథము నిర్విఘ్నముగా పరిపూర్తి నొంది వర్ధిల్లుటకు ఆదిని మంగళ మాచరించుటయు నవశ్యము. కనుక యామునాచార్యులు గీతార్థముల నుపదేశించినవా రగుటను వారి ననువర్తించుటవలన స్వాచార్యులకు తృప్తికలుగుటను అనుసంధించి మొదట వారిని స్తుతించి యాపరమాచార్యస్తుతిరూపముగా గ్రంథాదిని జేయు మంగళము నాచరించుచున్నారు:— యత్...కల్మషః=యత్=ఎవ్వరియొక్క-యచ్ఛబ్దము ఆచార్యగుణసమృద్ధి సర్వోత్కృష్టమగుటవలనఁ గలిగిన ప్రసిద్ధిని సూచించుచున్నది. పద అంభోరుహ=పాదారవిందములయొక్క-ఇట పదములను అంభోరుహములనుటచే అవి భోగ్యములుగా నుండుటయు, కాఁబట్టియె వాని యందలి ప్రీతిగలుగుటయు తెలియుచున్నది గాన వానిని గూర్చిన ధ్యానమును ప్రీతిపూర్వకమైన దని సిద్ధించుచున్నది. 'స్నేహపూర్వమనుధ్యానం భక్తి రిత్యభిధీయతే' అన్నట్లు, అట్టిధ్యానము భక్తిరూప మగుచున్నది. ధ్యాన=అట్టినిరంతర చింతనముచేత-ఇచట ధ్యానశబ్దముచే ద్రోణాచార్యుని చక్కగ నుపాసింపక ధ్యానమాత్రముచే సిద్ధినిబొందిన యేకలవ్యునివలె తాను యామునాచార్యులకు శిష్యులగుట తెలుపఁబడినది. విధ్వస్త=పటాపంచలు సేయఁబడిన, అశేష=సమస్తములైన, కల్మషః=పాపములు గలవాఁడు-ఒకతూరి చూచినమాత్రనే బహుతరముగా కల్మషములు విధ్వస్తము లగుచున్నవి. నిరంతరస్మరణముచేత అవి సవా

* శ్రియఃపతియు,

*నిఖిల హేయప్రత్యనీక కల్యాణైకతానుఁడును,

---

షముగా నిర్మూలము సేయఁబడినవని 'విధ్వస్తాశేషకల్మషః' అన్నారు. ఇట్టి, అహం=నేను, వస్తుతాం=వస్తుత్వమును, ఉపయాతః=పొందితినో-ఎవ్వనిపదారవిందముల ధ్యానించిపాపములనెల్లఁ బోఁగొట్టుకొని నేనొకవస్తువనఁదగితినోయమట, తం=అట్టి, యామునేయం=యామునాచార్యులను, నమామి = నమస్కరించుచున్నాను దీనిచే స్వాచార్యులనతెనే ఆయాచార్యుల పరంపరను గూడ అత్యాదరముతో భజింపఁదగునని శిక్షితమైనది.

*. ఇచట 'నారాయణః పరం బ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః' అను యామునాచార్యుల సంగ్రహప్రథమశ్లోకమున గీతాశాస్త్రమునందెల్ల ప్రతిపాద్యుఁడైనవాఁడు నారాయణుఁడని చెప్పఁబడినది. నార+అయనః=నారములు అయనముగాఁగలవాఁడు. లేక, నారములకు అయనమైనవాఁడు అని వ్యుత్పత్తి. భగవంతుఁడు దివ్యాత్మస్వరూపుఁడు. నారములు అనఁగా అతని దివ్యాత్మస్వరూపముతప్ప తక్కినవి సమస్తము. వానికి అయనము (అనఁగా స్థానమైనది) భగవంతునిస్వరూపము. రామానుజాచార్యులును సంగ్రహశ్లోకము ననుసరించి గీతా ప్రతిపాద్యవస్తువగు నారాయణుని ప్రతిపాదింపఁబూని ముందు అయనశబ్దార్థమగుదివ్యస్వరూపమును నిష్కర్షించి తెలుపుచున్నారు (శ్రియఃపతియు) శ్రీదేవికి పెనిమిటియైనవాఁడు. 'ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః। నాగపర్యఙ్క ముత్సృజ్య హ్యాగతో మథురాం పురీమ్' (హరివంశము 54-50) 'శ్రీదేవికి నిత్యసహచరుఁడై చేతనాచేతనములు శరీరముగాఁ గలిగియుండుటచే అన్నిటియందును వ్యాపించినవాఁడై పాలసముద్రము వాసగృహముగాఁ గలయీభగవంతుఁడు, వ్యూహావస్థంజేసి మనుష్యులకెల్ల వారికి దృష్టిగోచరుఁడు కాఁగోరి తనశయ్యయైన అనంతుని సంకర్షణరూపముతో మొదట నవతరింపఁజేసి మథురాపురికి తాను వేంచేసినాఁడు' అని నారాయణునికి శ్రీదేవితోడి నిత్యసాహచర్యము చెప్పఁబడినది. మఱియు 'అర్థో విష్ణు రియం వాణీ' (విష్ణుపురాణము - ప్రథమాంశము, 8-18.) 'విష్ణువు అర్థము, ఈమె (శ్రీదేవి) వాక్కు-శబ్దము' అని శబ్దార్థములకువలె విష్ణువునకును శ్రీదేవికిని నిత్యసంబంధము చెప్పఁబడినది. ఇట్లు నారాయణుఁడు శ్రీతోడి నిత్యయోగమువలన స్వరూపసిద్ధముగా శ్రియఃపతి యయ్యెను, అనఁగా శ్రియఃపతిత్వము నారాయణునికి స్వరూపములో చేరిన దయ్యెను. కనుకనే అతనిస్వరూపము వివరించునీపట్టున 'శ్రియఃపతి' యని నిరూపించిరి.

* నిఖిల ... తానుఁడును - నిఖిల = సమస్తములైన, (హేయ) త్యాజ్యములైనవానికి, (ప్రత్యనీక) ప్రతిభటమైనట్టి - విరోధియైనట్టిదగు - తీర్థ సేవాదులంకూడ

† స్వేతర సమస్తవస్తు విలక్షణానంత జ్ఞానానందైక స్వరూపుఁడును,

---

కొన్ని కొన్ని హేయములను పోఁగొట్టును గావున అవి గావనుటకై నిఖిల హేయ ప్రత్యనీక మనఁబడెను. ఇట్టి, (కల్యాణ) మాంగల్యము యొక్క, (ఏకతానః) ముఖ్య స్థానమైనవాఁడు - కేవలకల్యాణమయుఁడైన వాఁడనుట - లేక, (కల్యాణ) మీఁదఁ జెప్పఁబడుకల్యాణగుణములకే, (ఏకతానః) ఆశ్రయమైనవాఁ డనియు నర్థము - హేయప్రత్యనీక మైనది ఒకరి యందలిహేయములను నిరాకరించునట్టిచో తనయం దలి హేయములను నిరాకరింపక పైఁచుట గలుగదు. కనుక హేయశూన్యమును అగు నని అర్థమువలన సిద్ధించుచున్నది. ఇట హేయములకు 'నిఖిల' అను విశేష ణము గూర్చుటచే అచిత్తులన్నిటఁ గలుగు వికారాదులును చిత్తులన్నిటను గలుగు క్లేశాదులును సంగ్రహింపఁబడినవి.

† స్వేతర ... స్వరూపుఁడును - త్రివిధములైన చేతనములును అచేతనము లును ఒకటివలెనే యొకటి పరాధీనము లగును గాన నిట్టిస్వాధీనమగు వస్తువు మఱొకటి లేదనెడియభిప్రాయముతోఁ జెప్పుచున్నారు. (స్వ + ఇతర) తన కంటె ఇతరములైన, (సమస్తవస్తు) సకలపదార్థములకు — సర్వవిధచేతనా చేతనములకును, (విలక్షణ) వేఱులక్షణములుగలదియు, (అనంత) అంతము లేనిదియు - మూఁడువిధములైన పరిచ్ఛేదములు లేనిదనుట, (జ్ఞాన ఆనంద) జ్ఞానమును ఆనందమును అగు - జ్ఞానానందమయమైన, (స్వరూపుఁడును) స్వరూపముగలవాఁడును. 'ఈదేశ మందేయున్నది; ఈదేశమందు లేదు' అని దేశపరిచ్ఛేదము. 'ఈకాలమందు ఉన్నది; ఈకాలమందు లేదు' అని కాలపరిచ్ఛేదము. 'ఇదియిదికాదు' అని వస్తుపరిచ్ఛే దము. ఈమూఁడు పరిచ్ఛేదములు లేనిది - అనఁగా సర్వదేశసర్వకాలములను వ్యా పించి సర్వవస్తువులందును అంతర్యామియై యుండునదే అనంతము. వస్తుపరిచ్ఛేదము లేనిది యనఁగా పరస్పరము విరుద్ధములుగా నుండు అయావివిధవస్తువులును తానుని స్వరూపమునం దొక్కవస్తువే యగు నని కాని, తా నొకటితప్ప తక్కినవస్తువులెల్ల మిథ్య లగు నని కాని గ్రహింపరాదు. సమస్తవస్తువులును ఈశ్వరునికి శరీరము గావునను, సమస్తవస్తువులందును ఈశ్వరుఁడు అంతరాత్మయై వ్యాపించి నియమించు చుండును గావునను, శరీరమును అందలియాత్మయు రెండును ఏకవస్తువుగానే గ్రహిం చునట్లు, శరీరభూతమైన యొక్కొక్కవస్తువును అందలిపరమాత్మ యగుభగవంతుఁ డును చేరి యేకవస్తువే యగుటచే ఒక్కొకవస్తువును భగవంతుఁడే యగు ననియు, కావున ఒక్కొక్క వస్తువు పేరును భగవంతునికే చెల్లు ననియు, కనుక భగవంతుఁడు తప్ప మఱియొకవస్తువు లేదనియు, ఈప్రకారము గ్రహించునది. ఇదియే విశిష్టా ద్వైతమున వస్తుపరిచ్ఛేదరాహిత్యము. ఇది యీశ్వరునికిని తక్కినవస్తువులకును గల శరీరాత్మభావముచేఁ గలిగినది. దీనింబట్టి, ఈశ్వరునితోడ చిత్తులకు జ్ఞానభోగము లందు సమత్వము గలిగియు, సర్వప్రకారములందును సమత్వము గలుగదనుట సిద్ధము.

*స్వాభావికానవధికాతిశయ జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తి తేజః ప్రభృత్య
సంఖ్యేయకల్యాణగుణగణమహోదధియును, *స్వాభిమతానురూపైక
రూపాచింత్య దివ్యాద్భుత నిత్య నిరవద్య నిరతిశయౌజ్జ్వల్య సౌందర్య
సౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనంత గుణనిధి దివ్య

---

* స్వాభావిక ... మహోదధియును - ఇందు గుణములు చెప్పఁబడుచున్నవి. ముక్తులకును నిత్యులకును గల జ్ఞానాదిగుణములు పరమాత్ముని సంకల్పమున కధీనము లైనవి, పరమాత్మునిజ్ఞానాదులు అట్టివి గావనుటకై 'స్వాభావికములు' అనఁగా పరాధీనములు కానివి-అనఁబడినవి, మఱియునవి, నిరవధిక + అతిశయములు - మేర లేని అతిశయముగలవి. ఈ రెండు విశేషణములచే 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబలక్రియా చ' (శ్వేతాశ్వతరోపనిషత్తు. (౬-౮.) అను శ్రుతి ప్రతిపాదితము లైన పరత్వస్వాభావికత్వములు ప్రతిగుణమునకును గలవని తెలియనయ్యెను. జ్ఞాన, బల, ఐశ్వర్య వీర్య, శక్తి, తేజస్సు లనెడి గుణము లాఱును సమస్తగుణబృందమునందు ప్రధానములు గావున కంఠోక్తముగాఁ జెప్పఁబడినవి. తక్కిన సౌశీల్యాదిగుణములు 'ప్రభృతి' శబ్దముచే గమ్యములుగా సంగ్రహింపఁబడినవి. మఱియు భగవంతుఁడు జగత్తునకు సంహారమును, సృష్టిని, రక్షణమును జేయుటకై సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడు అను వ్యూహములు మూఁటిని బొందును. అందు మొదటి వ్యూహమున తత్కార్యమునకుఁదగునట్లు జ్ఞానబలములును, రెండవ దానియందు ఐశ్వర్యవీర్యములును, మూఁడవదానియందు శక్తితేజస్సులును, పుట్టును గనుక, ఆ క్రమమునుబట్టియె జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తితేజస్సులు అని యీ గుణక్రమము ఏర్పఱుపఁబడినది. మఱియు భగవంతుఁడు 'తనంతనే సర్వమును సర్వవిధములచేతను సర్వకాలములందును ప్రత్యక్షముగా తెలియును (జ్ఞానము); అట్లు ప్రత్యక్షముగా తెలిసిన సర్వమును ధరించును (బలము); ధరించుచునే నియమించును (ఐశ్వర్యము; ధరించుచును నియమించుచును పటుత్వము సడలకుండును (వీర్యము); అఘటితములను ఘటింపఁజేయును (శక్తి); వానిని ఘటించునపుడు మఱొకరిసాహాయ్యమపేక్షింపకయు ఒకరికిని తన్ను క్రిందుపఱుప శక్యము గాకయు, తానే యందఱిని క్రిందుపఱుచును (తేజస్సు); అనెడి యీ కార్యక్రమమునుబట్టియు గుణక్రమము ఇట్లు పఠింపఁబడుచున్నది. ఇట్టి జ్ఞానాదిగుణములు. (ప్రభృతి) మొదలుగాఁగల, (అసంఖ్యేయ) లెక్కింపరాని, (కల్యాణగుణగణ) కల్యాణగుణ సమూహములకు, (మహోదధియును) మహాసముద్రమువంటివాఁడును. ఇందు గుణములకు 'అసంఖ్యేయ' మనియు 'మహోదధి' యనియుఁ జెప్పుటచే 'యథా రత్నాని జలధేరసంఖ్యేయాని పుత్రక। తథా గుణా హ్యనన్తస్య అసంఖ్యేయా మహాత్మనః (వామనపురాణము. 74-40) ఇత్యాదులు తలంపునకు వచ్చుచున్నవి.

రూపుండును, *స్వోచిత వివిధ విచిత్రానంతాశ్చర్య నిత్య నిరవ
ద్యాపరిమిత దివ్యభూషణుండును, స్వానురూపాసంఖ్యేయాచింత్య
శక్తి నిత్య నిరవద్య నిరతిశయ కల్యాణ దివ్యాయుధుండును, *స్వాభి
మతానురూప నిత్య నిరవద్య స్వరూప రూపగుణ విభవైశ్వర్య శీలా
ద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణ గణ శ్రీవల్లభుండును,
* స్వసంకల్పానువిధాయి స్వరూపస్థితి ప్రవృత్తిభేదాశేష శేష
తైకరతిరూప నిత్యనిరవద్య నిరతిశయ జ్ఞానశక్తి క్రియైశ్వర్యాద్య
నంత గుణగణాపరిమితసూరులచేత ననవరతము స్తుతింపఁబడుచుండు

---

* స్వాభిమత ... దివ్యరూపుఁడును-ఇందు విలక్షణవిగ్రహయోగము చెప్పఁగ
బడుచున్నది (స్వ అభిమత అనురూప) తనకు అభిమతమైనదియు అనురూపమైన
దియు-అభిమతమైనను అనురూపముగాకయు అనురూపమైనను అభిమతముగాకయు
లోకమున నుండుటగలదు గాన రెండునైనదిగా చెప్పఁబడెను. (ఏకరూప) ఎప్పు
డును ఒక్కరీతినే యుండునదియు-వ్యూహవిభవాదులైన అవస్థలందును విగ్రహము
నకు హేయప్రత్యనీకత్వము ఆనందావహత్వము మొదలైన స్వభావములు వీడకుండు
ననుట. (అచింత్య) చింతింపఁ దగము కానిదియు, (దివ్య) పరమాకాశమందు వర్తిం
చునదియు, (అద్భుత) ఆశ్చర్యమైనదియు - వటపత్రశయన విశ్వరూపాదులచేత
ఆశ్చర్యమైనదనుట, (నిత్య) నిత్యమైనదియు, (నిరవద్య) జర మొదలగుదోషములు
లేనిదియు, (నిరతిశయ, ఔజ్జ్వల్య, సౌందర్య, సౌగంధ్య, సౌకుమార్య, లావణ్య,
యౌవన, ఆది) తమకంటె ఉత్కృష్టమైనదిలేనట్టివగు, నిగనిగ మనుకాంతి, అవయవ
శోభ, మంచివాసన, మహాబలముండియుఁ బువ్వువలె మెత్తందనము, సముదాయ
శోభ, యౌవనము, మొదలగు (అనంతగుణనిధి) లెక్కలేని గుణములకు పాఁలేఅయ్యై
నదియు, (దివ్య) అప్రాకృతమైనదియు అగు, (రూపుఁడును) విగ్రహము గలవాఁ
డును-ఇట ఔజ్జ్వల్యము మొదలైనవానిచే శుభాశ్రయత్వమునకును భోగ్యత్వమున
కును అనువైన మంగళ గుణములు చెప్పఁబడెను. (సుకుమారౌ మహాబలౌ) (రామా
యణము) అని మహాబలత్వముతోడి సౌకుమార్యము తెలియునది.

* స్వోచిత...భూషణుండును-స్వరూపమును దానిగుణములను విగ్రహమును
దానిగుణములను జెప్పి విగ్రహమందున్న ఆభరణవర్గమును ఆయుధవర్గమును తెలుపు
చున్నారు. (స్వ ఉచిత) అట్టివిలక్షణవిగ్రహముతోఁగూడిన స్వరూపమునకుఁ దగి
నట్టియు (వివిధ) హారకిరీటాదిరూపముచే నానావిధములైనవియు, (విచిత్ర)
బంగారు మణులు మొదలగువానిచే విచిత్రములైనవియు, (అనంతాశ్చర్య) కొలఁది

చరణయుగళము గలవాఁడును *వాఙ్మనసాపరిచ్ఛేద్య స్వరూప స్వభా
వుండును †స్వోచిత వివిధ విచిత్రానంతభోగ్య భోగోపకరణ భోగ
స్థాన సమృద్ధానంతాశ్చర్యానంత మహావిభవానంత పరిమాణ

---

లేని ఆశ్చర్యమును గలిగించునవియు, (నిత్యనిరవద్య) నిత్యములును నిరవద్యములు నైన
వియు, (అపరిమిత) లెక్కలేనివియును, (దివ్య) అప్రాకృతములైనవియు అగు,
(భూషణుఁడును) భూషణములు గలవాఁడును - (స్వఅనురూప) తనకుతగినట్టివియు,
(అసంఖ్యేయ) లెక్కింపఁదరము కానివియు, (అచింత్యశక్తి) ఎన్న నలవికాని శక్తి
గలవియు-[illegible]ద్దండ్రు గడ్డపాఱలు మొదలగు పెక్కింటిచేతఁ గష్టపడి చేయవలసిన
సాలపర్వతభూతలవిదళనమును ఒక్క బాణముచేతనే కదా రామావతారమున చేసి
నాఁడు. కనుక వానిశక్తి అచింత్యమనుట, (నిత్యనిరవద్య)ములైనవియు, (నిరతి
శయకల్యాణ) నిరతిశయానందము గూర్చునవియు, (దివ్య)మైనవియు నగు (ఆయుధ)
ములు గలవాఁడును.

* స్వాభిమత ... వల్లభుండును-పూర్వము భగవంతుని స్వరూపము నిరూపించు
టకై సామాన్యముగా శ్రీదేవిని జెప్పి యిపు డతనివిభూతినడుమను నెలకొనియున్న
యా దేవిని విశేషించి తెలుపుచున్నారు. (స్వఅభిమత అనురూప నిత్య నిరవద్య)ము
లైనవి యగు, (స్వరూప) దివ్యాత్మస్వరూపమును, (రూప) దివ్యవిగ్రహమును,
(గుణ) నిరతిశయౌజ్జ్వల్య సౌందర్యాదులగు విగ్రహగుణములును, (విభవ) పరిజనము
మొదలైనవిభవమును, (ఐశ్వర్యశీల ఆది, అనవధికాతిశయ, అసంఖ్యేయ, కల్యాణ,
గుణగణ) ఐశ్వర్యము శీలము మొదలుగాఁ గలవియు, మితిలేని అతిశయము గలవియు,
లెక్కింపరానివియు, మంగళకరము లైనవియు నగు, గుణముల యొక్క సమూహ
మును), గల, (శ్రీ) లక్ష్మీదేవికి, (వల్లభ) చెలువుఁడయిన వాఁడును-శ్రీదేవికిఁ గల
స్వరూపమును, రూపమును, రూపగుణములును, విభవమును, ఐశ్వర్యాదిగుణగణ
మును ఈయైదును భగవంతుఁడగు తనకు అభిమతములును అనురూపములును నిత్యము
లును నిరవద్యములు నగు నని యర్థము. లక్ష్మీస్వరూపము నిర్వికారమై సర్వకాల
వర్తియగుటచే నిత్యమైనది; జరాదులు లేమిచే నిరవద్యమైనది; భగవంతునిస్వరూప
మువలె కల్యాణైకతానత్వాదులు కలిగియుండుటచే అనురూపమైనది. రూపము
(విగ్రహము) పరమపదమునం దున్నట్టిదే అవతారాదిదశలయందు నుండుటచే నిత్య
మైనది. అది 'అస్యా దేవ్యా యథా రూప మఙ్గప్రత్యఙ్గసౌష్ఠవమ్, రామస్య చ యథా
రూపం తస్యేయమసితేక్షణా' 'విష్ణోర్దేహానురూపాం వై కరోత్యేషాత్మనస్తనుమ్'
అన్నట్లు అనురూపమైనది. విగ్రహగుణములు ఒకప్పుడును కొఱవడకుండుటచే
నిత్యములు; మిఱుమిట్లుగొలుపుట మొదలగుదోషములు లేమిచే నిరవద్యములు. విభ

నిత్యనిరవద్యాక్షర పరమవ్యోమనిలయుండును. *వివిధ విచిత్రానంత భోగ్యభోక్తృవర్గ పరిపూర్ణ నిఖిల జగదుదయ విభవ లయ

---

వము 'దేవతిర్యఙ్మనుష్యేషు పున్నామా భగవాన్ హరిః॥ స్త్రీనామ్నీ లక్ష్మీర్మైత్రేయ నానయోర్విద్యతే పరమ్' అన్నట్లు అనురూపమైనది. ఈశ్వరుని ఐశ్వర్యాదులే అనవధికాతిశయములుగాన లక్ష్మియైశ్వర్యాదులును అట్టివగుట యెట్లు? అన్నచో లక్ష్మియైశ్వర్యమీశ్వరుని కభిమతముగాన దోషములేదు. 'అస్యేశానా జగతో విష్ణుపత్నీ' అని విష్ణుపత్నీత్వవేషముననేకదా సమస్త జగమును ఏలుచున్నది. ఐశ్వర్యము నిగ్రహాదిప్రసక్తి లేమిచే నిరవద్యమైనది. నిగ్రహాదులు పురుషుని కనురూపములుగాన నామెవల్లభుని భాగమే యగును. శీలమనగా మహత్త్వముండినను మందులతో గుత్తముగా గలసిమెలసి యుండుటగదా. అట్టియెడల తనయుత్కర్షను ఒకప్పుడును తెలుపకుండుటయే ఆశీలముయొక్క నిత్యత్వము. అది 'తుల్యశీలవయోవృత్తామ్' (రామాయణ) అన్నట్లు అనురూపమైనది.

* స్వసంక...చరణయుగళము గలవాడును—ఇట నిత్యపరిజన విశిష్టత్వమును జెప్పుచున్నారు. (స్వసంకల్ప అనువిధాయి) తనసంకల్పమును అనుసరించి నడచునట్టివైన (స్వరూపస్థితిప్రవృత్తిభేద)ములు గలవారును, (అశేషశేషతా ఏకరతిరూప) సమస్తమైన శేషవృత్తియందే ముఖ్యముగా (అవలంబించి) యున్న ప్రీతియే స్వభావముగా గలవారును - సర్వవిధకైంకర్యములను జేయుటయందే వారికి ప్రీతి. అది మఱియొకచోటియందును గలుగదు-ఆప్రీతియే వారికి స్వభావమని యర్థము. (నిత్య) నిత్యులును-ముక్తులవలె ఒకప్పుడు స్వరూపాదులు సంకోచించియుండినవారు గారు-నిత్యమును సంకోచింపకుండు జ్ఞానాదిగుణములు గలవారనుట. (నిరవద్య) క్లేశము కర్మము స్వాతంత్ర్యము అభిమానము మొదలైనదోషములు లేనివారును, (నిరతిశయ) మైన, (జ్ఞానశక్తి క్రియా ఐశ్వర్య ఆది అనంతగుణగుణ) ములుగలవారును, (అపరిమిత) కొలదిలేనివారును అగు, (సూరులు) చరణయుగళము నెల్లప్పుడును స్తుతించుచుందురని యర్థము. నిత్యసూరులస్వరూపస్థితిప్రవృత్తులు పరమాత్మునిసంకల్పమునకు లోనయినవనగా అతని నిత్యేచ్ఛచేత సిద్ధించినవనుట. అతని కిచ్ఛలేకపోయినా వానినెల్ల మరల దీసికొనజాలును. కాని యట్లిచ్ఛలేకపోవుట యొకప్పుడును సంభవింపదు. ఆయిచ్ఛ నిత్యమైనది. పరమాత్మసంకల్పమునకు లోనయిన స్వరూపస్థితిప్రవృత్తులు గలిగియుండుట బద్ధముక్తప్రకృతిప్రాకృతకాలాదులన్నింటను సమానము. అశేషశేషతయనగా భగవంతుని కభిమతమైన ఆకారములెల్ల గలిగియుండుట. 'శరా నానావిధాశ్చాపి ధను రాయతవిగ్రహమ్। అన్వగచ్ఛన్త కాకుత్స్థం సర్వే పురుషవిగ్రహాః' 'నివాసశయ్యాసనపాదుకాంశుకోపధాన వర్షాతప వారణాదిభిః। శరీరభేదైస్తవ శేషతాం గతైర్యథోచితం శేష ఇతీరితే జనైః॥ ఇత్యా

లీలుండును † పరబ్రహ్మమును పురుషోత్తముఁడును నగు నారాయణుఁడు బ్రహ్మ మొదలుకొని స్థావరములవఱకుఁ గలసమస్తజగత్తును సృజించి, నిజస్వరూపముతో నెలకొనియున్నపుడు బ్రహ్మాది దేవతలకును మనుష్యులకును ధ్యానారాధనములకు అగోచరుఁడగుటంబట్టి * అపార కారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్యమహోదధి గావున † తన స్వభావమును విడువకయే తనరూపమునే ఆ యావానికి సజాతీయ మగుసంస్థానము గలది గావించుచు ఆ యాలోకములం

---

దులం దెలియునది. వారి జ్ఞానక్రియైశ్వర్యాదులు నిత్యనిరవద్యనిరతిశయములు. జ్ఞానము నిరతిశయ మనఁగా పరమాత్మజ్ఞానముతో సాటియైనదనుట. క్రియ నిరతిశయమనఁగా స్వచ్ఛందానంతకైంకర్యమై యుండుట. ఐశ్వర్యము నిరతిశయమైనదనఁగా తమ యిచ్ఛచేతఁ గయికొనెడి ఆయాశరీరేంద్రియాదులను నియమించుట యందు అడ్డులేక యుండుట-వానిని ఏయడ్డములేక తలఁచినట్లెల్ల భగవత్కైంకర్యమునకై నియమించుట యని భావము. కాని యన్నిటియందును అది గలిగియుండుట కాదు. ఇదియే 'జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ' అని సూత్రింపఁబడెను. ఇట్టిసూరులే 'సదాపశ్యన్తి సూరయః, తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమిన్ధతే' అని ప్రతిపాదింపఁబడిరి. విపన్యవు లనఁగా విశేషించి స్తుతిశీలురు.

* వాఙ్మ...స్వభావుండును, (వాచ్ మనస) వాక్కునకును మనస్సునకును (అపరిచ్ఛేద్య) ఇంతయని కొలఁది యిడరాని, (స్వరూపస్వభావ)ములు గలవాఁడు, స్వరూపస్వభావములు కొలఁది యిడరానివే కాని తెలియరానివి గావు. తెలియరాని వన్నయెడల 'తద్విజిజ్ఞాసస్వ' 'మనసాతువిశుద్ధేన' 'బ్రహ్మవిత్' 'ఆనన్దం బ్రహ్మణో విద్వాన్' ఇత్యాదులగు వేదకశ్రుతులకు విరుద్ధమగును. 'యతోవాచో నివర్తన్తే అప్రాప్యమనసాసహ) ఇత్యాదు లూహ్యము.

† స్వోచిత ... నిలయుండును-ఇందు వాసస్థానమగు నిత్యవిభూతిని జెప్పుచున్నారు. (స్వోచిత) తనకు తగినదియు, (వివిధవిచిత్ర)ములైనవియు, అగు (భోగ్య భోగోపకరణ భోగస్థాన)ములచేత-భోగ్యములనఁగా శబ్దాదివిష...ములు, భోగోపకరణము లనఁగా భోగమునకు సాధనములైన దేహేంద్రియాదులు, భోగస్థానము లనఁగా సౌధారామప్రదేశాదులు, ఇట్టివానిచేత, (సమృద్ధ) నిండినదియు, (అనంతాశ్చర్య) మైనదియు, (అనంతమహావిభవ)ము గలదియు - అడ్డముగాను పొడుగాను దానికి కొలఁదియు మేరయు లేవు; క్రిందమాత్రము ప్రకృతినిబట్టి దానికి మేర కలదు.

(నిత్య) ప్రాకృతాకాశమువలె లయములేనిదియు, (నిరవద్య) శుద్ధసత్త్వమయ మగుట
చేత రజస్తమస్సులును వానికార్యములును లేనిదియు, (అక్షర) మైనదియు - దాని
కేయంశమందుఁగాని సృష్టిసంహారములు లేవనుట, అగు, (పరమవ్యోమనిలయుఁడు)
పరమాకాశము-పరమపదము-వాసస్థానముగాఁ గలవాఁడు.

* వివిధ...లీలుఁడును-ఇందు లీలావిభూతియోగమును జెప్పుచున్నారు. (వివిధ
విచిత్ర)ములును, (అనంత)ములునగు, (భోగ్యభోక్తృవర్గముల)చేత, (పరిపూర్ణ)మైన,
(నిఖిలజగత్ ఉదయవిభవలయ) సమస్తజగముయొక్క ఉత్పత్తియు స్థితియు లయ
మును అనెడి, లీలలు గలవాఁడును, భోగ్యములు శబ్దస్పర్శాదిరూపముచే వివిధ
ములు; దివ్యాదివ్య భేదముచే విచిత్రములు. భోక్తృవర్గము దేవమనుష్యాదిభేదముచేత
వివిధము; వర్ణాశ్రమాదిభేదములచేత విచిత్రము. పరమపదమందు భోక్తృవర్గమునకు
జ్ఞానసుఖాదితారతమ్యము లేనందున వారికి వివిధత్వము చెప్పఁబడదయ్యె. లీలా
విభూతియందును భోగోపకరణభోగస్థానములు గ్రాహ్యములు. జగదాకారముగా
తాను ఉదయాదులు పొందుటయె లీలలు. జగదాకారముగాఁ బరిణమించినచో
వికారి కాఁడా యనఁగా సూక్ష్మచిదచిద్విశిష్టుఁ డయియే యట్టివికారమును
బొందుచున్నాఁడు గాని స్వరూపముచేతఁ గాదు; కాన నిర్వికారుఁడే యగును. బాలు
నికి యౌవనాదులు కలిగినపుడు స్వరూపమునకు వికారము గలుగనట్లే భగవంతునికి
జగదాకారత్వాదులందును స్వరూపవికారము లేదని తెలియునది. అవాప్తసమస్త
కామునకు జగద్వ్యాపార మేలయనఁగా లీలనుబట్టియని లీలాశబ్దము.

† బ్రహ్మలక్షణములతోఁ గూడియుండుటచే నారాయణుఁడే పరబ్రహ్మమని
'నారాయణ పరంబ్రహ్మ' 'నారాయణః పరంబ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః' ఇత్యా
దుల చెప్పిన నిట ప్రతిపాదించిరి. ఈమూఁడును కృష్ణునకును చెల్లు నని 'పరం
బ్రహ్మ పరంధామ పవిత్రం పరమంభవాన్' 'ప్రథితః పురుషోత్తమః' 'ఏష నారాయణః
శ్రీమాన్' ఇత్యాదులచేతఁ దెలియునది. సర్వసామానాధికరణ్యమును సర్వవైలక్ష
ణ్యమును సర్వాంతర్యామిత్వముచేత ఉపపన్నమని యీమూఁడు పదములయభిప్రా
యము.

* తనకే ప్రయోజనము లేకుండఁగా అవతారము లెత్తనేల యనఁగా 'అపార
...దధి' అనఁబడెను. కారుణ్యమనఁగా తనప్రయోజనమేమియుఁ గోరక పరుల
దుఃఖములకు తాళకుండుట. మిక్కిలి గొప్పతన మున్నను తక్కువవారితోడ
గుప్తముగా కలసిమెలసియుండుట సౌశీల్యము. పరులదోషములను నిరసించి పాటిం
పనిస్వభావము గలిగియుండుట వాత్సల్యము. వత్సస్య ఇదం వాత్సం తత్ లాతీతి
వాత్సలా తత్స్వభావం వాత్సల్యమ్ అని వ్యుత్పత్తి. ఆవు తనదూడదేహమునందలి

§ దవతరించి యవతరించి వారివారిచే ఆరాధితుఁడై వారి వారి యిష్ట మునకుఁదగినట్లు ధర్మార్థకామమోక్షము లనుఫలముల నొసంగుచు * భూభారము దింపునెపమున, అస్మదాదులకుఁ గూడ మిక్కిలి యాశ్రయింపఁ దగియుండుటకు "తతోఽఖిలజగత్పద్మ బోధాయాచ్యుతభానునా దేవకీపూర్వసంధ్యాయా మావిర్భూతమ్మహాత్మనాః"

---

ముతికినిగూడ భోగ్యముగా నాకుట వాత్సల్యము. పిశాచగోపాలగోపికాదులకుఁ దన్నె యిచ్చుకొన్నను ఏమి యిచ్చితిమని భావించుట ఔదార్యము, ఈగుణములం బ్రేరింపఁగా అవతరించుచున్నాఁడు.

† 'అజోఽపిస న్నవ్యయాత్మా' ఇత్యాదు లిందులకుఁ బ్రమాణములు.

♦ దీనిచే అవతారవిగ్రహముకూడ అప్రాకృత మగు పరమపదమందలి విగ్రహముయొక్క అంశవిశేషమెయని తెలియునది. ఇదియె 'న తస్యప్రాకృతామూర్తి ర్మాంస మేదోఽస్థిసమ్భవా' 'నభూతసంఘసంస్థానో దేహోఽస్య పరమాత్మనః' ఇత్యాదులచే నెఱుంగునది.

§ 'యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత' 'సంభవామి యుగే యుగే' 'బహూని మే వ్యతీతాని జన్మాని' ఇత్యాదు లెఱుఁగునది. వారి.. ఆరాధింపంబడుట, 'యస్యావతారరూపాణి సమర్చన్తి దివౌకసః। అపశ్యన్తః పరం రూపమ్' ఇత్యాదులచే నొప్పునఁ దెలియునది.

* అవతారమునకు భూభారమును దింపుట వ్యాజమాత్రము. అందఱకు ఆశ్రయణీయుఁడగుటయె సాక్షాత్తయిన ఉద్దేశ్యము. దుర్జనులనాశము సేయుట సాధురక్షణమనుమహాప్రయోజనమునకు సంబంధించినదిగదా. అస్మదాదు లనఁగా అయోగ్యులైనవారనుట. మహాయోగులపరిశుద్ధమనస్సుచేత గ్రహింపఁగష్టమైన వాఁడు సౌలభ్యాతిశయముచేత మనుష్యులకును - అందును గొల్లవారలవలెనను- మాంసంపుఁగన్నులకుఁ గ్రహింపఁదగినవాఁడయ్యెనని భావము. ఇట్లవతరించుటకును కన్నులకగపడుటకును ప్రయోజనము కేవలము ఆరాధింపఁదగియుండుట మాత్రము గాదు; అనుభవింపఁదగియుండుటయు నగుననియె 'పరావర' ఇత్యాదులం జెప్పఁబడెను. పరు లనఁగా ఉపాసనసమర్థు లగు బ్రహ్మరుద్రభీష్మాక్రూరాదులు. అవరు లనఁగా గొల్లలు మొదలగువారు. నిఖిలజను లనఁగా స్త్రీపుంసాదివిభాగములేక 'పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్' అన్నట్లుండుట తెలియునది. దివ్యచేష్టితములు నవనీతనటనాదులు.

అనుకీతిని దేవకీనందనుఁడై భూమియం దవతరించి, సకలమనుజుల నయనములకు విషయభూతుఁడగుచు, పరావరు లగునిఖిలజనుల మనస్సులను నయనములను హరించునట్టి దివ్యచేష్టితములను గావించుచు, పూతనా శకట యమలార్జునారిష్ట *ప్రలంబ ధేనుక కాలియ కేశికువలయాపీడ చాణూర ముష్టిక తోసల కంసాదులను వధించి, †అనవధికదయా సౌహార్దానురాగ గర్భము లగు విలోకనాలాపామృతములచేత విశ్వమును ఆప్యాయితము చేయుచు, ♦నిరతిశయ సౌశీల్యాది గుణగణములను వెలిపుచ్చుటచేత అక్రూర మాలాకారాదులను బరమభాగవతులను గావించి, h పాండుతనయుని యుద్ధమునకు పురికొల్పు వ్యాజముచేత పరమపురుషార్థలక్షణ మగుమోక్షమునకు సాధనముగా వేదాంతమునందు చెప్పఁబడినదియు స్వవిషయమైనదియు జ్ఞానకర్మసాధ్యమైనదియు నగు భక్తియోగము నవతరింపఁజేసినవాఁడయ్యె. *అందు పాండవులకును కౌరవులకును యుద్ధము

---

* బలభద్రుఁడు భగవదంశరూపమే కావున నతఁడు చేసిన ప్రలంబ ముష్టికాదివధము భగవంతుండు చేసినదిగానే యిచట చెప్పఁబడెను.

† ప్రియతముని స్వరూపమును దర్శించుట ధారకము. వాని చేష్టితములను దర్శించుట పోషకము. వానితోడ ఆలాపాదులు చేయుట భోగ్యప్రకారము. సౌహార్ద మనఁగా హితమునుగోరుస్వభావము. అనురాగ మనఁగా ప్రీతి.

♦ ధర్మసంస్థాపనము తన యారాధ్యమగు స్వరూపముయొక్క దర్శనముచేతను, దేశకాలములచేత దూరస్థు లగువారికి పరంపరచే ననుగ్రహించునట్టి యుపదేశముచేతను, గావించుటను తెలుపుచున్నారు.

h ఇందు శ్రీమద్గీతోపదేశముతోడి సంగతి తెలుపఁబడినది. ఈగీత ఏడువందల శ్లోకములు గలది. అందు ధృతరాష్ట్రప్రశ్నశ్లోకములు సంజయప్రతివచనశ్లోకములు అర్జునప్రశ్నశ్లోకములు తప్ప తక్కిన వన్నియు భగవన్ముఖారవిందమునుండి వెడలివచ్చినవి. ఇదే గీతామాహాత్మ్యమునం దిట్లు చెప్పఁబడినది: "గీతా స్సుగీతాః కర్తవ్యాః కిమన్యైః శాస్త్రవిస్తరైః యాః స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతాః"

* ఇందు గీతాశాస్త్రమునకు ఉపోద్ఘాతము గూర్చిరి.

ప్రారంభింపఁగా † ఆ భగవంతుఁడు పురుషోత్తముఁడు సర్వేశ్వరేశ్వరుఁడు జగదుపకృతిమర్త్యుఁడు ఆశ్రిత వాత్సల్యవివశుఁడై పార్థుని రథిగాను తన్ను సారథిగాను సర్వలోకసాక్షికముగాఁ జేసెను. ♦ ఇట్లగుట తెలిసియు సర్వవిధముల నంధుఁ డగు ధృతరాష్ట్రుఁడు సుయోధనుని విజయము తెలియఁగోరి సంజయు నడిగెను.

---

† అవతారదశయందును పూర్ణత్వమును స్వచ్ఛందత్వమును పొందలగునవి 'అభ...శ్వరుఁడు' అను పదములచే ప్రతిపాదింపఁబడెను. వీనిచేత పరత్వమును 'జగ...వివశుఁడు' అని సౌలభ్యమును సంగ్రహింపఁబడినవి. జగదుపకారమునకు మర్త్యుఁడైనను ఉత్కృష్టచరిత్రమును మాని నికృష్టసారథ్యమును చేయనేల యనఁగా 'ఆశ్రి..వివశుఁ'డనఁబడెను. పార్థశబ్దముచేత వాత్సల్యమున కుపయుక్త మగు లౌకిక సంబంధము చెప్పఁబడినది. మేనత్త యగు పృథకొడుకుగదా పార్థుఁడు. ఈనికృష్ట కృత్యము సిగ్గుపడి రహస్యమునఁ జేయలేదనుటకై 'సర్వలోకసాక్షికముగా'(లోకము లెల్లఁ జూచుచుండఁగా) అనఁబడెను.

♦ శ్రియఃపతి యిత్యాదులను తెలిసియు ననుట. కనులచేతనే కాక యిహపరములందలిహితములను తెలియని మనస్సుచేతను గూడ అంధుఁడు గావున సర్వవిధముల చేత అంధుఁ డనఁబడెను.



# శ్రీ భగవద్గీతా — ప్రథమోఽధ్యాయః

## అర్జునవిషాదయోగః.



ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుడు పలికెను.

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ॥ 1

టీ. హేసఞ్జయ=ఓసంజయుఁడా, ధర్మక్షేత్రే=ధర్మానుష్ఠానమునకు యోగ్యస్థానమైన - కురుక్షేత్రే=కురుక్షేత్రమనెడి దేశమునందు, యుయుత్సవః=యుద్ధముచేయఁ గోరువారై, సమవేతాః=కూడిన, మామకాః=దుర్యోధనుఁడు మొదలగు నావారును, పాణ్డవాశ్చైవ=ధర్మరాజాదులగు పాండుకుమారులును, కిం=ఏమికార్యము అకుర్వత=చేసిరి.

తా॥ ఓసంజయా, పుణ్యక్షేత్ర మగు కురుక్షేత్రమునందు యుద్ధముసేయునిచ్ఛతోఁ గూడిన దుర్యోధనాదు లగు నావారును ధర్మరాజాదు లగుపాండవులును ఏమి చేసిరి?

ధృతరాష్ట్రుఁడు దుర్యోధనునిజయముఁ దెలియఁగోరి యిట్లడుగఁగా సంజయుఁడు అందులకు 'యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః। తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతి ర్మతిర్మమ' అని యీయుత్తరమును జెప్పఁబోవువాఁడై దీనిని సమర్థించుటకు వలసిన యవాంతరవృత్తాంతమును 'దృష్ట్వాతు' అని చెప్పుచున్నాఁడని తెలియునది.

సంజయ ఉవాచ=సంజయుఁడు చెప్పెను.

3

శ్లో॥ దృష్ట్వాతు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్య ముపసఙ్గమ్య రాజా వచన మబ్రవీత్॥ 2

టీ. తదా=అప్పుడు, రాజా=రాజయిన, దుర్యోధనః=దుర్యోధనుఁడు, వ్యూఢం=వ్యూహములుగా తీరియున్న, పాణ్డవానీకం=పాండవుల సేనను, దృష్ట్వా=చూచి, ఆచార్యం = ద్రోణాచార్యుని, ఉపసఙ్గమ్య=సమీపించి, వచనం = చెప్పఁబోవు వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా॥ అప్పుడు రాజైన దుర్యోధనుఁడు పద్మశకటసూచీ వరాహాదివ్యూహరచనతోఁ దీర్పఁబడియున్న పాండవబలమునుం జూచి ద్రోణాచార్యునియొద్దకుఁ బోయి యీ ప్రకారము చెప్పెను.

4

శ్లో॥ పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ 3

టీ॥ హే ఆచార్య=ఓ ఆచార్యుఁడా, ధీమతా=బుద్ధిమంతుఁడును, తవ=నీకు, శిష్యేణ = శిష్యుఁడునగు, ద్రుపదపుత్రేణ = పాంచాలరాజగు ద్రుపదుని కుమారుఁడైన ధృష్టద్యుమ్నునిచేత, వ్యూఢాం=వ్యూహములుగా తీర్పఁబడినదియు, మహతీం=గొప్పదియు నగు, పాండుపుత్రాణాం = పాండవులయొక్క, ఏతాం= ఈ ఎదుట నుండు, చమూం= సేనను, పశ్య=చూడుము.

తా॥ ఓ ఆచార్యా, బుద్ధిమంతుఁడును నీశిష్యుఁడును అయిన ధృష్టద్యుమ్నునిచే వ్యూహాకారముగా రచింపఁబడినదై గొప్పదియగు నీపాండవబలముఁ గనుంగొనుము.

అవ. ఆయతిశయమునే తెలిపించువాఁడై చెప్పుచున్నాఁడు.

5

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।
పురుజి త్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః ॥ 5

యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ 6

టీ. అత్ర=ఈపాండవసేనయందు, శూరాః=శౌర్యగుణవంతులును, మహేష్వాసాః=గొప్పవిలుకాండ్రును, యుధి=యుద్ధవిషయమునందు, భీమార్జునసమాః=భీమార్జునులతో సమానులు నగు, యుయుధానః=(శ్రీ)కృష్ణునితమ్ముఁడగు సాత్యకియు, విరాటశ్చ = విరాటరాజును, *మహారథః=మహారథుఁడగు, ద్రుపదశ్చ = ద్రుపదమహారాజును, ధృష్టకేతుః=ధృష్టకేతువును, చేకితానః = చేకితానుఁడును, వీర్యవాన్=వీర్యము గలవాఁడైన, కాశీరాజశ్చ = కాశీరాజును, పురుజిత్ =పురుజిత్తును, కున్తిభోజశ్చ=కుంతిభోజుఁడును, నరపుఙ్గవః =పురుషశ్రేష్ఠుఁడగు, శైబ్యశ్చ=శైబ్యుఁడును, విక్రాన్తః=పరాక్రమవంతుఁడగు, యుధామన్యుశ్చ=యుధామన్యువును, వీర్యవాన్ =ధీరుఁడగు, ఉత్తమౌజాశ్చ=ఉత్తమౌజస్సును, సౌభద్రః=సుభద్రపుత్రుఁడైన అభిమన్యుఁడును, ద్రౌపదేయాశ్చ=ద్రౌపదియందుఁ బుట్టిన ప్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులును, సర్వే=అందఱును, మహారథా ఏవ=మహారథులే యైనవారు, (సన్తి =కలరు.)

తా॥ ఈపాండవసేనయందు శూరులును మేటివిలుకాండ్రును యుద్ధములో భీమార్జునులకు సమానులును నగుసాత్యకి, విరాటరాజు,

---

* ఏకో దశసహస్రాణి యోధయే ద్యస్తు ధన్వినామ్ । శస్త్రశాస్త్ర ప్రవీణశ్చ మహారథ ఇతి స్మృతః ॥ అనఁగా, ఎవఁడు ఆయుధవిద్యయందు నిపుణుఁడై పదివేల విలుకాండ్రతో తా నొక్కఁడే యుద్ధముచేయ సమర్థుఁడో వాఁడు మహారథుఁ డనఁబడును. అమితాన్యోధయేద్యస్తు సంప్రోక్తోఽతిరథస్తుసః। రథేనైకేన యోయోద్ధా సమ్యానోఽర్ధరథోత్తమః। ఇట్లు అతిరథ అర్ధరథులలక్షణము.

మహారథుఁడగు ద్రుపదుఁడు, ధృష్టకేతువు, చేకితానుఁడు, పరాక్రమవంతుఁడైన కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుఁడు, పురుషశ్రేష్ఠుఁడైన శైబ్యుఁడు, శూరుఁడగు యుధామన్యువు, వీర్యవంతుఁడైన ఉత్తమౌజస్సు, అభిమన్యుఁడు, ప్రతివింధ్యాదులైన యుపపాండవు లేవురును అందఱును మహారథులే యై యున్నవారు.

అవ. ఇట్లు పాండవసేనయందలి యోధాగ్రేసరులను చెప్పి, తనసేనయందలి యోధాగ్రేసరులను చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అస్మాకంతు విశిష్టా యే తా న్నిబోధ ద్విజో త్తమ ।
నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ 7

టీ॥ హే ద్విజోత్తమ = బ్రాహ్మణోత్తముఁడగు ద్రోణాచార్యా, అస్మాకంతు = మనవారిలోపల, యే = ఎవరు, విశిష్టాః = ముఖ్యులో మమ = నాయొక్క, సైన్యస్య = సేనకు, నాయకాః = అధిపతులో, తాన్ = వారిని, నిబోధ = తెలిసికొనుము, తాన్ = వారిని తే = నీకు, సంజ్ఞార్థం = చక్కఁగా తెలియుటకొఱకు, బ్రవీమి = చెప్పుచున్నాను.

తా॥ ద్రోణాచార్యా, మనబలంబున నెవరు ముఖ్యులో, నా సైన్యమునకు నెవరధిపతులో వారిని దెలిసికొనుము. మీకు చక్కఁగా తెలియుటకై వారిని జెప్పెదను.

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ ॥ 8

6

అన్యేచ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః ॥ 9

టీ॥ భవాన్ = మీరు, భీష్మశ్చ = భీష్ముఁడును, కర్ణశ్చ = కర్ణుఁడును, సమితిఞ్జయః = యుద్ధమందు జయశీలుఁడగు, కృపశ్చ =

కృపాచార్యుఁడును, అశ్వత్థామా=అశ్వత్థామయు, వికర్ణశ్చ=వికర్ణుఁడును, తథైవ=అట్లే, సౌమదత్తిశ్చ=సోమదత్తునికుమారుఁడగు భూరిశ్రవుఁడును, అన్యే=ఇతరులగు, బహవశ్శూరాశ్చ=అనేకశూరులును, మదర్థే=నాకొఱకు, త్యక్తజీవితాః=ప్రాణములను విడుచుటకు నిశ్చయించుకొనినవారు, సర్వే=అందఱును, నానాశస్త్రప్రహరణాః=అనేకములగు ఆయుధములు గలవారును, యుద్ధవిశారదాః=యుద్ధమునందు నేర్పు గలవారును నై, (సన్తి=ఉన్నారు.)

తా॥ మీరును, భీష్మాచార్యుఁడును, కర్ణుఁడును యుద్ధమున జయశీలుఁడగుకృపాచార్యుఁడును, నశ్వత్థామయు, వికర్ణుఁడును, భూరిశ్రవుఁడును, మఱియును జయద్రథుఁడు మొదలగుననేక శూరులు నందఱును యుద్ధసమర్థులై నాకొఱకు ప్రాణములవిడువ నిశ్చయించుకొని నానాశస్త్రాస్త్ర సంపన్నులై యున్నవారు.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥ 10

టీ॥ తత్=కాఁబట్టి=భీష్మాభిరక్షితం=భీష్మునిచే అంతటను రక్షింపఁబడుచున్న, అస్మాకం=మనయొక్క, బలం=సేన, అపర్యాప్తం=చాలకున్నది, భీమాభిరక్షితం = భీమసేనునిచే రక్షింపఁబడుచున్న, ఏతేషాం=ఈ పాండవులయొక్క, ఇదం బలం=ఈసైన్యము, పర్యాప్తం=చాలియున్నది.

తా॥ * ఇట్లు స్వకీయ పరకీయ సేనలయందలి శూరాగ్రపురుషుల సంఖ్య న్యూనాధిక్య మగుటచేత, భీష్మునిచే కాపాడఁబడుచున్న మన

* ఇట దుర్యోధనునిసైన్యమును 'భీష్మాభిరక్షితమ్' అన్నందులకు ప్రతిగా పాండవసైన్యమును 'భీమాభిరక్షితమ్' అని నిర్దేశించినందుల కభిప్రాయమేమి? యని శంకగలుగుచున్నది. కురుసేనకు భీష్ముఁడు సేనాధిపతియైనట్లు పాండవసేనకు భీముఁడు సేనాధిపతిగాఁడు. ధృష్టద్యుమ్నుఁడే యట్లగును. భీష్ముఁడు 'శక్తోహం ధనుషైకేన నిహన్తుం సర్వపాణ్డవాన్ । యద్యేషాం నభవేద్గోప్తా విష్ణుః కారణ

బలము పరబలమును జయించుటకు చాలకున్నది. భీమునిచే కాపాడఁ బడుచున్న యీ పాండవులబలము మనబలమును జయించుటకు[7] చాలియున్నది.

అవ. కాఁబట్టి మీరిట్లు వర్తింపవలయునని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః ।
భీష్మ మేవాభిరక్షన్తు భవన్త స్సర్వ ఏవ హి ॥ 11

టీ॥ భవన్తః=మీరు, సర్వేఏవ=అందఱును, సర్వేషు=సమస్తము లయిన, అయనేషు=వ్యూహప్రవేశ మార్గములందు, యథాభాగం=వంతులచొప్పున, అవస్థితాః = వర్తించుచున్నవారై, భీష్మమేవ=భీష్మునినే, అభిరక్షన్తు హి=అంతటను రక్షించుదురుగాక.

తా॥ మీరందఱును, అన్నివ్యూహప్రవేశమార్గములయందు[8] మీవంతులచొప్పున నిలిచియుండి భీష్ముని నలుప్రక్కల సంరక్షింపవలయునుగదా.

---

పూరుషః' 'కారణార్థము మనుష్యుఁడై యున్న విష్ణువు పాండవులకు రక్షకుఁడుగాఁ జేసి వీరినందఱిని ఒక్కవింటనే గెలువనేర్తును' అని తానే చెప్పికొనియున్నాఁడు గావున ఇట్టి భీష్మునితో సాటియైన పౌరుషము భీమునకుఁ గలుగుట కానరాదు. భీష్మునికి ప్రతిబలమగు పాండవసైన్యమునకు భీముఁడు అధిపతియుఁ గాఁడు; అధిపతి ధర్మరాజే యగును. ఆ ప్రతిబలమందలి భటులలో భీముఁడు ప్రధానుఁడును గాఁడు. అట్టివాఁ డర్జునుఁ డనియే ప్రసిద్ధి. కనుక భీష్మునికి ప్రతిగా భీముని నిర్దేశించుటకు కారణ మేమనఁగా, భీష్ముఁడు సమస్త పాండుకుమారులను రక్షించుటయందు ప్రవణుఁడైనవాఁడు. అతనికి వ్యత్యస్తముగా భీముఁడు సమస్తధార్తరాష్ట్రులను వధించుటకు దీక్షఁ బూని యందులకుఁ దగినసాహస బల సహాయాది సంపత్తి గలిగిన వాఁడు. కావుననే భీష్మునకు మాఱుగా భీముఁడు నిర్దేశింపఁబడినాఁ డని తెలియునది.

9A

శ్లో॥ తస్య సంజనయ న్హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైశ్శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్॥12

టీ॥ ప్రతాపవాన్=పరాక్రమవంతుఁడును, కురువృద్ధః=కౌరవులలో పెద్దయు నగు, పితామహః=భీష్ముఁడు, తస్య=ఆ దుర్యోధనునికి, హర్షం=సంతోషమును, సంజనయన్=చక్కఁగా పుట్టించుచు ఉచ్చైః=గట్టిగా, సింహనాదం=సింహధ్వనిని, వినద్య=ధ్వనింపఁజేసి, శఙ్ఖం=శంఖమును, దధ్మౌ=పూరించెను.

తా॥ ఇట్లు దుర్యోధనుఁడు స్వబలపరబలముల తారతమ్యమును జూచి మనస్సునందు దుఃఖమును పొందియుండఁగా పరాక్రమవంతుఁడును, కౌరవులలో వయసుచేతను జ్ఞానముచేతను పౌరుషముచేతను నధికుఁడును నగు భీష్ముఁడు ఆ విషాదము నెఱిఁగి యాతనికి సంతోషము కలుగునట్లు మిక్కుటముగా సింహనాదము చేసి శంఖమును పూరించెను.

అవ. ఇట్లు సేనాపతి యగుభీష్మునియొక్క యుద్ధోత్సాహమును జూచి వాని యాజ్ఞచే సైనికులును యుద్ధోత్సాహమునందు ప్రవర్తించినవారైరి.

శ్లో॥ తత శ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।
సహసైవాభ్యహన్యన్త స శబ్ద స్తుములోఽభవత్॥ 13

టీ. తతః=పిమ్మట, శఙ్ఖాశ్చ=శంఖములును, భేర్యశ్చ=దుందుభులును, పణవ ఆనక గోముఖాః=ఉడుకలు తమ్మటలు బూరలును, సహసా ఏవ=ఒకసారిగానే, అభ్యహన్యన్త=కొట్టబడినవి, స శబ్దః=ఆధ్వని, తుములః=సంకీర్ణముగా, అభవత్=ఆయెను.

తా. అనంతరము శంఖములు భేరులు ఉడుకలు తప్పెటలు బూరలు మొదలైన వాద్యవిశేషములు ఒకసారిగ ప్రయోగింపఁబడెను. ఆధ్వనులు కలసి యంతటను వ్యాపించెను.

అవ. పిమ్మట పాండవసైన్యమునందు కలిగిన యుద్ధోత్సాహ మును చెప్పుచున్నాఁడు.

9C

శ్లో॥ తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ।
మాధవః పాణ్డవ శ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః॥ 14

టీ. తతః = అటుపిమ్మట, శ్వేతైః = తెల్లనివియగు, హయైః = గుఱ్ఱములతో, యుక్తే = కూడుకొనినదియు, మహతి = ఉత్కృష్ట మైనదియు నగు, స్యన్దనే = రథమునందు స్థితౌ = ఉన్న, మాధవః = శ్రీకృష్ణమూర్తియు, పాణ్డవ శ్చైవ = అర్జునుఁడును, దివ్యౌ = అప్రా కృతము లగు, శఙ్ఖౌ = శంఖములను, ప్రదధ్మతుః = లెస్సగా, పూరించిరి.

తా. కురుసైన్యముయొక్క వాద్యవాదనానంతరము, తెల్లని గుఱ్ఱములు పూన్చిన మహారథమునం దున్నకృష్ణార్జునులు తమ దివ్యశంఖముల నొత్తిరి. 9B

శ్లో॥ పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః।
పౌండ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః॥ 15

టీ. హృషీకేశః = శ్రీకృష్ణుఁడు, పాఞ్చజన్యం = పాంచజన్య మనెడి శఙ్ఖమును, దధ్మౌ = పూరించెను, భీమకర్మా = భయంకర వ్యాపా రము గల, *వృకోదరః = భీముఁడు, పౌండ్రం = పౌండ్రమనెడి మహాశఙ్ఖం = గొప్పశంఖమును, దధ్మౌ = పూరించెను.

---

*వృక ఉదరః = వృక మనెడియగ్ని కడుపులోఁ గలవాఁడు.

తా. శ్రీకృష్ణుఁడు పాంచజన్యమును అర్జునుఁడు దేవదత్తమును బూరించిన వెంటనే శత్రుభయంకరము లగుకృత్యములఁ జేయు భీముడు పౌండ్ర మనుమహాశంఖమును పూరించెను. 10

శ్లో॥ అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః।
నకుల స్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥ 16

టీ. రాజా = రాజును, కున్తీపుత్రః = కుంతీపుత్త్రుఁడు నగు, యుధిష్ఠిరః = ధర్మరాజు, అనన్తవిజయం = అనంతవిజయ మను శంఖమును, దధ్మౌ = పూరించెను, నకులః = నకులుఁడు, సహదేవశ్చ = సహదేవుఁడును సుఘోషమణిపుష్పకౌ = సుఘోషము మణిపుష్పకము ననుశంఖములను, దధ్మతుః = పూరించిరి. 11

తా. కుంతీపుత్త్రుఁ డగుధర్మరాజు అనంతవిజయ మను శంఖమును పూరించెను. నకులుఁడు సుఘోష మనుశంఖమును, సహదేవుడు మణిపుష్పక మనుశంఖమును బూరించిరి.

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖణ్డీచ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః॥ 17
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చమహాబాహుః శఙ్ఖాన్ దధ్ముః పృథక్ పృథక్॥ 18

టీ. పృథివీపతే = ధృతరాష్ట్రమహారాజా, పరమేష్వాసః = గొప్పవిల్లు గల, కాశ్యశ్చ = కాశీరాజును, మహారథః = మహారథుఁడైన, శిఖణ్డీచ = శిఖండియును, ధృష్టద్యుమ్నశ్చ = ధృష్టద్యుమ్నుఁడును, విరాటశ్చ = విరాటుఁడును, అపరాజితః = అపజయముఁ బొందని, సాత్యకిశ్చ = సాత్యకియును. ద్రుపదః = ద్రుపదరాజును, ద్రౌపదేయాశ్చ = ద్రౌపదీకుమారులైనయుపపాండవులును, మహాబాహుః = గొప్పభుజములు గల, సౌభద్రశ్చ = అభిమన్యుఁడును,

సర్వశః = సేనయందంతటను, పృథక్ పృథక్ = వేఱు వేఱుగా, శఙ్ఖాన్ = శంఖములను, దధ్ముః = పూరించిరి.

తా. ధృతరాష్ట్రమహారాజా, మేటివిలుకాఁడగు కాశీరాజును, మహారథుఁడగు శిఖండియు, ధృష్టద్యుమ్నుఁడును. విరటరాజును, యుద్ధమునం దపజయము నొందని సాత్యకియు, ద్రుపదరాజును, ఉపపాండవులును, భుజబలము గలయభిమన్యుఁడును, సేనయంతటఁ గల తక్కిన యోధాగ్రేసరు లందఱును వేఱువేఱుగా తమతమశంఖములను పూరించిరి.

పాండవసేనానాయకులు వేఱువేఱుగా శంఖములను బూరించి రనుటచే తమశంఖధ్వను లొక్కటొకటియును దుర్యోధనాదులకు హృదయభేదనము గావించునట్లు పూరించి రని భావము.

శ్లో॥ సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములోఽప్యనునాదయన్॥ 19

టీ. తుములః = సంకులమైన, సఘోషః = ఆశబ్దము, నభశ్చ = ఆకాశమును, పృథివీంచ = భూమినిని, అనునాదయన్ అపి = ప్రతిధ్వనుల నిచ్చునట్లు చేయుచున్నను, ధార్తరాష్ట్రాణాం ఏవ = నీ పుత్రులగు దుర్యోధనాదులయొక్కయె, హృదయాని = గుండెలను, వ్యదారయత్ = బ్రద్దలుచేసెను.

తా. భయంకరమైన ఆశంఖనాదము భూమ్యంతరిక్షములయందంతట ప్రతిధ్వను లెసగఁజేయుచున్నను, నీపుత్రులగు దుర్యోధనాదులకుమాత్రము గుండెలు పగిల్చిన దయ్యెను. (ఇతరులకు సంతోషహేతువయ్యె నని భావము. దుర్యోధనుని గెలుపున కువ్విళ్ళూరుచున్న ధృతరాష్ట్రునకు సంజయుఁడు దుర్యోధనుని యపజయమే యిట సూచించినాఁ డని తెలియునది.)

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాణ్డవః॥ 20
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే ।

టీ. మహీపతే = రాజా, అథ = శంఖారావము చేసిన పిమ్మట, శస్త్రసంపాతే = ఆయుధప్రయోగము, ప్రవృత్తే (సతి) = ప్రవర్తించిన దగుచుండఁగా, కపిధ్వజః = హనుమంతుని ధ్వజమునందుఁ గల, పాణ్డవః = అర్జునుఁడు, వ్యవస్థితాన్ = యుద్ధసన్నాహముతో నిలిచి యున్న, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, దృష్ట్వా = చూచి, ధనుః = వింటిని, ఉద్యమ్య = ఎత్తి, తదా = అప్పుడు, హృషీకేశం† = శ్రీకృష్ణునిఁగూర్చి, ఇదం వాక్యం = ఈమాటను, ఆహ = పలికెను.

తా. ఓరాజా, అంత కపిధ్వజుఁడైనయర్జునుఁడు యుద్ధసన్నద్ధులై నిలిచియున్న దుర్యోధనాదులఁ గనుంగొని, బాణప్రయోగ సమయం బగుటయు, గాండీవంబు పైకెత్తి శ్రీకృష్ణుని నవలోకించి యిట్లనియె.

అర్జున ఉవాచ :—

శ్లో॥ సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥
యావ దేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్ ।
13A
కై ర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥ 22

టీ. హే అచ్యుత* = ఓకృష్ణా, అస్మిన్ = ఈ, రణసముద్యమే = యుద్ధోద్యోగమునందు, మయా = నాచేత, కైస్సహ = ఎవ

---

†(హృషీకమనగా ఇంద్రియములు, ఈశుడనఁగా నియమించువాఁడు, పరాపరములగు సమస్తజనుల బాహ్యాంతర కరణములను సర్వప్రకారముల నియమించువాఁడని యర్థము.

*అచ్యుతః = స్వరూపస్వభావాదు లగు జ్ఞానశక్త్యాదులనుండి చ్యుతుఁడు కాని (జాఱని)వాఁడు. జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజస్సులను నిరయైనవాఁడు.

రితో, యోద్ధవ్యం = యుద్ధము చేయదగినదో, యోద్ధుకామాన్ = యుద్ధము సేయఁ గోరిక గలవారై, అవస్థితాన్ = ఎదుట నిలిచి యున్న, ఏతాన్ = వీరిని, యావత్ = ఎంతలో, అహం = నేను, నిరీక్షే = చూతునో, (తావత్ = అంతవఱకు), ఉభయోః = రెండైన, సేనయోః = సేనలయొక్క, మధ్యే = నడుమ, నాయొక్క, రథం = రథమును, స్థాపయ = నిలుపుము.

తా. ఓకృష్ణా, ఈయుద్ధోద్యోగమునందు నే నెవరితో యుద్ధము సేయదగినదో, యుద్ధముసేయఁ గోరివచ్చినవార లెవరెవరో, వారిని చక్కఁగా నవలోకించువఱకు (లేక, వారిని చూడదగినస్థానమునందు) ఈ రెండుసేనలనడుమ మనరథము నిలుపుము.

13B

శ్లో॥ యోత్స్యమానా నవేక్షేఽహం యఏతేఽత్రసమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః॥ 23

టీ. దుర్బుద్ధేః = చెడ్డబుద్ధిగల, ధార్తరాష్ట్రస్య = దుర్యోధనునికి, ప్రియచికీర్షవః = ఇష్టము చేయఁగోరినవారై, యుద్ధే = యుద్ధమునందు, యే ఏతే = ఏవీరు-భీష్మద్రోణాదులు అత్ర = ఇచ్చట, సమాగతాః = వచ్చి చేరియున్నారో, యోత్స్యమానాన్ = యుద్ధముచేయఁగలవారిని, అహం = నేను, అవేక్షే = చూచెదను.

తా. దుష్టబుద్ధియగు దుర్యోధనునకు ప్రియము గావింపఁగోరి యిచ్చట మనతో యుద్ధముచేయుటకు వచ్చి చేరియున్న వారెవ్వరెవ్వరో వారిని నేను చూచెదను.

సంజయ ఉవాచ = సంజయుఁడు చెప్పుచున్నాఁడు :

శ్లో॥ ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥ 24
భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూ నితి॥ 25

టీ. హే భారత = ఓ ధృతరాష్ట్రా, *గుడాకేశేన = అర్జునుని చేత, ఏవం = ఈప్రకారము, ఉక్తః = చెప్పఁబడిన, హృషీకేశః = శ్రీకృష్ణుఁడు, ఉభయోః సేనయోః = రెండుసేనలయొక్క, మధ్యే = నడుమ, భీష్మద్రోణప్రముఖతః = భీష్మద్రోణులయెదుటను, సర్వేషాం = సమస్తమైన, మహీక్షితాంచ (ముఖతః) = రాజులందఱు (యెదుటను-అందఱు) చూచుచుండఁగా, రథోత్తమం = రథశ్రేష్ఠమును, స్థాపయిత్వా = నిలిపి, హేపార్థ = అర్జునా!, సమవేతాన్ = చేరియున్న, ఏతాన్ = ఈ, కురూన్ = కౌరవులను, పశ్య = చూడుము, ఇతి = అని, ఉవాచ = పలికెను.

తా. ఓరాజా, ఇట్లు అర్జునప్రేరితుఁడై నవెంటనే శ్రీకృష్ణుఁడుభయసేనామధ్యమున భీష్మద్రోణాది సమస్తవీరుల కభిముఖంబుగా రథంబు నిలిపి, అర్జునా, యుద్ధము చేయునభిలాషతోఁ గూడియున్న యీకౌరవసైనికుల నవలోకింపు మని పలికెను.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా॥
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి ।

టీ. అథ = పిదప, పార్థః = అర్జునుఁడు, తత్ర = అచ్చట, ఉభయోః సేనయోః = రెండు సేనలయందును, స్థితాన్ = ఉన్న, పితౄన్ = తండ్రివరుసవా రయిన భూరిశ్రవఃప్రభృతులను, పితామహాన్ = తాతవరుసవా రయినభీష్మాదులను, ఆచార్యాన్ = గురువు లయిన ద్రోణాదులను, మాతులాన్ = మేనమామ లయిన శల్యాదులను, భ్రాతౄన్ = అన్నదమ్ము లయిన దుర్యోధనాదులను, పుత్రాన్ =

---

*గుడాకేశః (గుడాకా = నిద్రాలస్యములకు, ఈశః = నియంత (నిద్రను జయించినవాఁడు)-అనగా అంతటను జాగరూకుఁడు. "నిద్రాలస్యే గుడాకా స్యాత్" అని నిఘంటువు.

కుమారు లయిన లక్ష్మణాదులను, పౌత్రాన్ = మనుమ లయిన లక్ష్మణపుత్రాదులను, తథా=అట్లు, సఖీన్ = స్నేహితు లగుకృత వర్మాదులను, శ్వశురాన్ = ద్రుపదరాజువలె మామలను, సుహృదశ్చ = హితము గోరువారిని, లేక, ఉపకారముఁ బొందినవారిని, అపశ్యత్ = చూచెను.

తా. పిమ్మట అర్జునుఁడు ఆరెండుసేనలయం దున్న తండ్రి తాతవరుసలవారిని, ఆచార్యులను, మేనమామలను, అన్నదమ్ములను కొడుకు మనుమఁడు మొదలైనవరుస గలవారిని, మిత్రులను, మామగార్లను తనహితము కోరువారిని అందఱను జూచెను.

శ్లో॥ తా న్సమీక్ష్య సకౌన్తేయ స్సర్వాన్ బన్ధూ నవస్థితాన్ ॥
కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్ ।

టీ. సః=ఆ, కౌన్తేయః=అర్జునుఁడు, అవస్థితాన్=యుద్ధసన్నాహముతో నిలిచియున్న, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, బన్ధూన్=చుట్టములను, సమీక్ష్య=చక్కఁగా చూచి, పరయా=అధికమయిన, కృపయా=కనికరముచేత, ఆవిష్టః=పరవశుఁడై, విషీదన్ = దుఃఖించుచు, ఇదం= ఈవాక్యమును, అబ్రవీత్ =పలికెను.

తా. ఇట్లు యుద్ధరంగమునందు వచ్చియున్న బంధువుల నెల్లరనుజూచి, అర్జునుఁడు అత్యంత దయాపరవశుఁడై దుఃఖించుచు నిట్లు పలికెను.

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్॥ 28
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
వేపథు శ్చ శరీరే మే రోమహర్ష శ్చ జాయతే॥ 29
గాండీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే ।
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ 30

టీ. హే*కృష్ణ=ఓకృష్ణుఁడా, యుయుత్సుం=యుద్ధముసేయ నిచ్ఛ గలయట్టియు, సముపస్థితం=ఎదుట వచ్చియున్నట్టియు, ఇమం స్వజనం=ఈబంధుజనమును, దృష్ట్వా=చూచి, మమ=నాయొక్క, గాత్రాణి=అవయవములు, సీదన్తి=కృశించుచున్నవి. ముఖంచ=నోరును, పరిశుష్యతి=ఎండిపోవుచున్నది, మే=నాయొక్క, శరీరే=దేహామునందు, వేపథుశ్చ=వడఁకును, (జాయతే=పుట్టుచున్నది), రోమహర్షశ్చ=పులకరింతయు, జాయతే పుట్టుచున్నది, హస్తాత్=చేతినుండి, గాండీవం=గాండీవము, స్రంసతే=జాఱుచున్నది, త్వక్చైవ=చర్మమును, పరిదహ్యతే=అంతటను దహింపబడుచున్నది, మే=నాయొక్క, మనశ్చ=మనస్సును, భ్రమతీవ=తిరుగుచున్నట్లున్నది, అవస్థాతుంచ=రథమున నిలుచుటకును, న శక్నోమి=శక్తి లేక యున్నాను.

తా. కృష్ణా, యుద్ధేచ్ఛతోవచ్చియున్న స్వజను లగువీరలం జూచి నాకరచరణాద్యవయవములు తడఁబడుచున్నయవి. నోరు ఎండి పోవుచున్నది. నాశరీరంబున వడఁకును పులకరింతయుఁ బొడము చున్నయవి. గాండీవము చేతినుండి జాఱుచున్నది. దేహాము మండు చున్నది. నామనస్సుతల్లడిల్లుచున్నది. 14 ఇఁక రథంబున నిలిచి యుండ శక్తుఁడను గాను.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ।
న చ శ్రేయోనుపశ్యామి హత్వా స్వజన మాహవే॥ 31

టీ. హే*కేశవ=ఓ కృష్ణా, విపరీతాని=అనిష్టసూచకములగు, నిమిత్తాని=శకునములను, పశ్యామి=చూచుచున్నాను. ఆహవే=

*కృష్ణ=పూర్ణమైన సుఖము గలవాఁడు.

*క ఈశ వ=బ్రహ్మను రుద్రుని రక్షించువాఁడు.

యుద్ధమునందు, స్వజనం=బంధుజనమును, హత్వా=చంపి, అను = అటుపిమ్మట, శ్రేయశ్చ=మేలును, న పశ్యామి=చూడకున్నాను.

తా. కృష్ణా, అనిష్టసూచకము లగుశకునములు గానంబడు చున్నవి. యుద్ధమునందు బంధుజనమును బరిమార్చుటవలన నగు ఫల మెద్దియో కానరాదు.

శ్లో॥ న కాఙ్క్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేన వా॥ 32

టీ. హే కృష్ణ=ఓకృష్ణా, విజయం=జయమును, రాజ్యంచ = రాజ్యమును, సుఖానిచ = సుఖములను, న కాఙ్క్షే = కోరను, హే గోవిన్ద†=ఓగోవిందా, నః=మాకు, రాజ్యేన=రాజ్యముచేత, కిం= ఏమి ప్రయోజనము, భోగైః = (భూమ్యాది) భోగములచేతఁగాని, జీవితేనవా=బ్రదికియుండుటచేతఁగాని, కిం=ఏమిప్రయోజనము?

తా. కృష్ణా, నాకు జయమువలదు, రాజ్యమువలదు. సుఖము లభిలషించువాఁడనుగాను. రాజ్యమువలన మా కేమి ప్రయోజనము? మఱి భోగమువలనఁ గాని బ్రదికియుండుటవలనఁ గాని మనకు వచ్చునది యేమి? 15

శ్లో॥ యేషా మర్థే కాఙ్క్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥ 33

టీ. నః=మనకు, రాజ్యం=రాజ్యము. యేషాం=ఎవరియొక్క, అర్థే=(సుఖరూప మైన) ప్రయోజనముకొఱకు, కాఙ్క్షితం=కోరఁబడినదో, భోగాః=సుఖసాధనములును, సుఖానిచ=సుఖములును, (కాఙ్క్షి

---

† గోవిన్ద - ఇంద్రియములు అధిష్ఠానముగాఁగలవాఁడు; లేక, వేదముచేత దెలియఁబడువాఁడు; లేక, గో అవిద్ ద=వాక్కులయొక్క అజ్ఞానమును ఛేదించువాఁడు.

తాని=కోరబడినవో), తే ఇమే = అటువంటివీరు, ప్రాణాన్ = ప్రాణ ములు (మీఁది ఆశ)ను, ధనానిచ=ధనముల (మీఁది ఆశ)ను, త్యక్త్వా= విడిచి, యుద్ధే=యుద్ధమునందు, అవస్థితాః=వచ్చి నిలిచియున్నారు.

తా. ఎవ్వరినిమిత్తము రాజ్యమును భోగ్యవస్తువులను సుఖ మును గోరుదుమో అట్టి బంధుజనము ప్రాణములమీఁదను ధనముల మీఁదను ఆశవదలి యుద్ధరంగమునందు వచ్చియున్నారు.

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః ।
మాతులా శ్శ్వశురాః పౌత్రాః స్యాలా స్సమ్బన్ధిన స్తథా॥ 34

టీ. ఆచార్యాః=గురువులును, పితరః=తండ్రులును, పుత్రాః= కొడుకులును, తథైవ=అట్లే, పితామహాః=తాతలును, మాతులాః= మేనమామలును, శ్వశురాః=మామలును పౌత్రాః=మనుమలును, స్యాలాః = బావమఱందులును, తథా = ఆప్రకారము, సమ్బన్ధినః = చుట్టములును

తా. వారెవ్వరనఁగా ఆచార్యులు, తండ్రులు, కుమారులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావలు, మఱఁదులు, సంబంధులు నగు బంధువులు.

శ్లో॥ ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే॥ 35
నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యాజ్జనార్దన ।

టీ. మధుసూదన=కృష్ణా, ఘ్నతోఽపి=మనలనుహింసించువా రైనను, ఏతాన్=వీరిని, త్రైలోక్యరాజ్యస్య హేతోరపి = మూఁడు లోకముల రాజ్యాధిపత్యమునిమిత్తమైనను, హన్తుం = చంపుటకు, న ఇచ్ఛామి=ఇచ్ఛగింపకున్నాను, మహీకృతే = భూమిమాత్రప్రాప్తి

కా౦అను, కిం ను = చెప్పవలసినదేమి, *జనార్దన = కృష్ణా, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, నిహత్య = చంపి, నః = మనకు, కా ప్రీతిః = ఏమిసంతోషము, స్యాత్ = కలుగును.

తా. కృష్ణా, వీరు నన్నుఁ జంపినను జంపనీ. త్రైలోక్య రాజ్యాధిపత్యము ప్రాప్తమయినను వీరిని జంపుటకు నాకు మనసు రాకున్నది. ఇట్లుండ మహీమాత్రలాభమునకై వీరిని జంప నెంతునా? జనార్దనా, దుర్యోధనాదుల జంపుటవలన మన కేమి సంతోషము కాఁగలదు?

శ్లో॥ పాపమే వాశ్రయే దస్మాన్ హత్వైతానాతతాయినః॥ 36
తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ సబాన్ధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ॥ 37

†ఆతతాయినః (అపి) = మహాపాతకులయినను, ఏతాన్ = వీరిని, హత్వా = చంపి, (స్థితాన్ = ఉన్న), అస్మాన్ = మనలను, పాపమేవ = పాపమే, ఆశ్రయేత్ = పొందును.

టీ. మాధవ = కృష్ణా, తస్మాత్ = దానివలన, వయం = మనము, సబాన్ధవాన్ = బంధువులతోఁగూడిన ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, హన్తుం = చంపుటకు, నార్హాః = తగినవారము కాము, స్వజనం = స్వజనమును, హత్వా = చంపి, కథం హి = ఎట్లుగా, సుఖినః = సౌఖ్యవంతులము, స్యామ = అగుదుము.

---

*జన అర్దన = జనులను చంపువాఁడు-అనఁగా సంహారకర్త; లేక, దుర్జనులను హింసించువాఁడు; లేక పుట్టుకను బోఁగొట్టువాఁడు.

† అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః। క్షేత్రదారహర శ్చైవ షడేతే హ్యాతతాయినః॥ ఇండ్లు మొదలగువానికి నిప్పు పెట్టువాఁడు, విషము పెట్టువాఁడు, శస్త్రము చేతఁగలవాఁడు, ధనము నపహరించువాఁడు, భూమిని భార్యను హరించువాఁడు, ఈయార్గురును ఆతతాయులనబడుదురు.

తా. కాఁబట్టి వీరు మహాపాతకు లయినను వీరలం జంపి మనము గట్టుకొనునది పాప మొక్కటియే. బంధుజనములతోఁగూడ దుర్యోధనాదులను సంహరించుట మనకు యుక్తము కాదు. మాధవా, స్వజనమును సంహరించి మన మెట్లు సుఖముఁ జెందఁగలము ?

16

శ్లో॥ యద్య ప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్॥ 38

కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన॥ 39

టీ. లోభోపహతచేతసః=రాజ్యమునందు పేరాసచేతఁ జెడఁగొట్టఁబడినవివేకముగల, ఏతే = ఈదుర్యోధనాదులు, కులక్షయకృతం = వంశనాశమువలనఁగలుగు, దోషం = దోషమును, మిత్రద్రోహే=మిత్రద్రోహమునందలి, పాతకంచ=పాపమునును, నపశ్యన్తి యద్యపి=ఆలోచింపకపోయినను, హేజనార్దన=ఓకృష్ణా, కులక్షయకృతం = కులనాశమువలనఁ గలిగింపఁబడు, దోషం = పాపమును, ప్రపశ్యద్భిః = చక్కఁగా తెలిసికొనుచున్న, అస్మాభిః = మనచేత, అస్మాత్ పాపాత్ = బంధువధరూపమైనయీపాపమునుండి, నివర్తితుం=మరలుటకు కథం=ఎట్లు, నజ్ఞేయం= తెలియఁదగదు.

తా. రాజ్యమునందలి పేరాసచేత వివేకము చెడినవారు గాన ఈదుర్యోధనాదులు స్వకులక్షయముచే కలుగుదోషమును మిత్రద్రోహముచే నగుపాతకమును నెంచువారు గాకున్నను, జనార్దనా, కులక్షయమువలన కలుగుదోషమును పరికించునట్టి మన మీపాపము పరిహరింప నుపాయముఁ గానకపోవు టెట్లు ?

అవ. అర్జును డీశ్లోకమున మొదలిడి 44వశ్లోకమువరకు యుద్ధానర్థములను పేర్కొనుచున్నాడు.

శ్లో॥ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత॥ 40

టీ. కులక్షయే (సతి) = వంశనాశము కలుగుచుండఁగా, సనాతనాః=శాశ్వతము లైన, కులధర్మాః=కులధర్మములు, ప్రణశ్యన్తి = నాశమును బొందును, ధర్మేనష్టే (సతి) = ధర్మము నశించిన దగుచుండఁగా, అధర్మః ఉత=అధర్మమో, కులంకృత్స్నం=కులమునంతటిని, అభిభవతి=క్రిందుపఱుచుచున్నది-వ్యాపించుచున్నది.

తా. కులనాశము సంభవించినప్పుడు చిరకాలమునుండి పరంపరగా నాచరింపబడుచున్న కులధర్మములు నాశము నొందును. అంతియ కాక యట్టియాచారములు నశించినయెడల కులం బంతెయు నధర్మమునఁ బ్రవర్తిల్లును.

శ్లో॥ అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసఙ్కరః॥ 41

టీ. హేకృష్ణ=ఓకృష్ణా, అధర్మాభిభవాత్ = అధర్మము మించుటవలన, కులస్త్రియః=కులస్త్రీలు, ప్రదుష్యన్తి=పరమదుష్టలగుదురు. వార్ష్ణేయ=కృష్ణా, స్త్రీషు దుష్టాసు (సతీషు)=స్త్రీలు చెడినవార లగుచుండఁగా, వర్ణసఙ్కరః=వర్ణము లొకటితో నొకటి కలసిపోవుట, జాయతే=కలుగుచున్నది.

తా. కృష్ణా, అట్టియధర్మము మించుటచేత కులాంగనలు దుష్టలై చెడుదురు. స్త్రీలు చెడిన వర్ణసంకరం బగును. అనఁగా బ్రాహ్మణాది జాతివ్యవస్థ లేకపోవును.

17

శ్లో॥ సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః॥ 42

టీ. సఙ్కరః=వర్ణసంకరము, కులఘ్నానాం=కులమును చెడఁగొట్టినవారికిని, కులస్య=కులమునకును, నరకాయైవ=నరకముకొఱకే, (భవతి=అగుచున్నది), హి=ఏలనఁగా, ఏషాం=వీరియొక్క, పితరః=పితృదేవతలు, లుప్తపిణ్డోదకక్రియాః (సన్తః)=లోపించినపిండోదక కార్యములు గలవారగుచు, పతన్తి=నరకమునఁ బడుదురు.

తా. వర్ణసంకరమువలన కులనాశకులకును కులమువారికిని నరకమే కలుగును. ఏలయనఁగా. వారి పితృదేవతలు తమ్మునిర్దేశించి పిండోదకక్రియలు చేయువారు లేకుండుటచేత నధోగతిఁ జెందుదురు. (నరకమున బడుదు రనుట).

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ 43

టీ. కులఘ్నానాం=కులనాశకులయొక్క, వర్ణసఙ్కరకారకైః=జాతిసాంకర్యముఁ జేయు ఏతైః దోషైః=ఈదోషములచేత, శాశ్వతాః = పరంపరాప్రాప్తములయిన, జాతిధర్మాః=వర్ణాచారములును, కులధర్మాశ్చ = కులాచారములును, ఉత్సాద్యన్తే = చెడఁగొట్టబడుచున్నవి-లోపించుచున్నవి.

తా. ఇట్లు కులము చెఱిచినవారలదోషములచేత వర్ణసంకరమై, పురాతనమగు కులధర్మములును వర్ణాచారములును జెడును.

శ్లో॥ ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ॥ 44

టీ. హేజనార్దన=ఓకృష్ణా, ఉత్సన్నకులధర్మాణాం=నశించిన కులధర్మములు గల, మనుష్యాణాం=మనుష్యులకు, నరకే=నరకమునందు, నియతం = ఎల్లప్పుడును, వాసః = ఉనికి, భవతి=అగుచున్నది, ఇతి=అని, అనుశుశ్రుమ=వింటిమి.

తా॥ కృష్ణా, కులధర్మములు చెడినమానవులకు ఎల్లప్పుడును నరకవాస మగు నని వినియున్నాము.

శ్లో॥ అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః॥ 45

టీ॥ అహో=ఆశ్చర్యము, బత=అయ్యో, యత్=ఏకారణము వలన, వయం = మనము, రాజ్యసుఖలోభేన = రాజ్యమందును సుఖ మందును పేరాసచేత, స్వజనం=బంధుజనమును, హన్తుం=చంపుటకు, ఉద్యతాః = యత్నించితిమో, (తత్ =ఆకారణమువలన), మహత్ = అధికమైన. పాపం=పాపమును,కర్తుం=చేయుటకు, వ్యవసితాః=ఉద్యుక్తుల మైతిమి.

తా॥ కటకటా! మనము మహత్తర మైనపాపము గట్టికొను నుటకుఁ బాలుపడితిమి. రాజ్యసుఖములందలి పేరాసచేత మన బంధు జనమును జంప యత్నించితిమి కదా.

శ్లో॥ యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః ।
18
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్॥ 46

టీ॥ శస్త్రపాణయః = ఆయుధములు చేతులలోఁగల, ధార్త రాష్ట్రాః=దుర్యోధనాదులు, అశస్త్రం=ఆయుధరహితుఁడును,అప్రతీ కారం=ప్రతిక్రియచేయలేనివాఁడునునగు, మాం=నన్ను, రణే=యుద్ధ మునందు, హన్యుర్యది = సంహరించి రేని, తత్ =ఆమరణము, మే= నాకు, క్షేమతరం=మిక్కిలిక్షేమము, భవేత్ =అగును.

తా॥ శస్త్రాస్త్రములు పరిత్యజించి ప్రతియుద్ధము చేయని నన్ను శస్త్రపాణు లయిన దుర్యోధనాదులు యుద్ధమునందు వధించి రేని అదియును నాకు మిక్కిలి క్షేమమే యగును,

సఞ్జయ ఉవాచ = సంజయుఁడు చెప్పెను.

19

శ్లో॥ ఏవ ముక్త్వాఽర్జున స్సఙ్ఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ 47

టీ. సఙ్ఖ్యే=యుద్ధరంగమునందు, అర్జునః=అర్జునుఁడు, ఏవం= ఈప్రకారము, ఉక్త్వా = పలికి, శోకసంవిగ్నమానసః = దుఃఖముచేత మిక్కిలి చలించినమనస్సు గలవాఁడగుచు, సశరం = బాణములతోఁ గూడిన, చాపం = ధనుస్సును, విసృజ్య= విడిచి, రథోపస్థే = రథము మీఁద, ఉపావిశత్=కూర్చుండెను.

తా॥ అర్జునుఁడీవిధమునఁ బలికిశోకముచేత మనస్సుమిక్కిలి కలఁత నొందఁగా, ఎక్కుపెట్టినగాండీవమును దిగువఁబడవైచి రణ రణరంగములో రథిస్థానమువిడిచి రథముపయిఁ జదికిలఁబడెను.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జున విషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.

ఇది యుపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ శాస్త్రంబును శ్రీకృష్ణార్జున సంవాదరూపంబును నగు శ్రీభగవద్గీతలయందు అర్జునవిషాదయోగం బన్నది ప్రథమాధ్యాయము.



* రామానుజభాష్యము- "దుర్యోధనుఁడు భీమునిచే సంరక్షిత
మైన తనబలమును తానే చూచి తన్ను గెలుచుట కాబలము చాలి
యుండుటయు తనబలము వారిని గెలుచుటకు చాలకుండుటయు నాచా
ర్యునికిఁ దెలిపి లోపల విషణ్ణుఁడయ్యెను. అతనివిషాదమును గనుఁ
గొని భీష్ముఁ డతనికి హర్షముఁ బుట్టించుటకు సింహనాదము చేసి శంఖ
మును పూరించి శంఖభేరీధ్వనులచే గెలుపునూచించునట్టి ఘోష
మును జేయించెను. అంత నాఘోషమును విని సర్వేశ్వరేశ్వరుఁ
డగు పార్థసారథియు రథియగు పాండుకుమారుఁ డర్జునుఁడును, త్రై
లోక్యమును జయించుటకు సాధన భూతములగు మహారథములం
దున్నవారై ముల్లోకములను గంపింపఁజేయుచున్నవియు శ్రీమంత
ములునగు పాంచజన్య దేవదత్తముల నెడి దివ్యశంఖములఁ బూరిం
చిరి. అంత యుధిష్ఠిరుఁడును, భీముఁడు మొదలగువారును తమతమ
శంఖములను వేర్వేఱపూరించిరి. ఆఘోషము దుర్యోధనాదులయిన
నీకుమారులందఱ హృదయములను భేదింపఁగా 'ఇంతతో నశించినట్టే
కురుబలము' అని ధార్తరాష్ట్రులు తలఁచిరి." ఈప్రకారముగా, దుర్యో
ధనుని విజయమును గోరుచున్న ధృతరాష్ట్రునకు సంజయుఁడు
చెప్పెను. అంత యుద్ధము సేయఁగోరి నిలిచియున్న ధార్తరాష్ట్రు
లను జూచి, లంకాదహనము చేసిన బలువానరుని ధ్వజమునం గల
పాండుకుమారుఁ డర్జునుఁడు, జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజస్సులకు
నిధియు, నిజసంకల్పమున జగదుదయస్థితిలయములను లీలలుగాఁ
గావించువాఁడును, హృషీకేశుఁడు గావున పరావరము లగుసకలజన
ముల బాహ్యాంతరకరణముల సర్వప్రకారముల నియమించుచుండు
వాఁడును, ఆశ్రితవాత్సల్యమున వివశుఁడై తనకు సారథ్యము సేయు
చున్నవాఁడు నగుభగవంతునిఁ జూచి, తాను యుద్ధము సేయఁగోరి
నిలిచియున్నవారిని కలరూపునఁ గనుఁగొనువాఁడై వారిని జూచు
టకుఁ దగినట్టిస్థానమున రథమును నిలుపుమని పురికొలిపెను. అట్లు

పురికొలుపఁబడి యాభగవంతుఁడు భీష్మద్రోణాదులును తక్కిన రాజులును ఎల్లవారును జూచుచునే యుండఁగా నర్జునుఁడు చెప్పినట్లు చేసెను. నీవారలు గెలుచు స్థితి యిట్టిదనియువారల నత్తిపొడుచునట్లు చెప్పెను. ఆపార్థుఁడన్నననో గొప్పమనసు గలపరమకారుణికుఁడును దీర్ఘబంధువును పరమధార్మికుఁడును నగుం గావున తానును తనతోఁబుట్టువులును మీచేత నతిఘోరమ్ములైన జతుగృహదాహాది మారణకర్మములచే మాటిమాటికి వంచింపఁబడియున్నవారయ్యును పరమపురుషుని సాహాయ్యమునఁ దనచే చావనున్న నీవారలను విలోకించి బంధుస్నేహమునను మిక్కుటమైన కృపవలనను ధర్మాధర్మ భయమునను అవయవము లన్నియు మిక్కిలియు విరవిరఁబోవ 'సర్వవిధముల నేను యుద్ధము సేయను' అని చెప్పి బంధువిశ్లేషమువలనఁ గలుగుశోకముచే మనస్సు కొందలపడఁగా అమ్ములను వింటిని విడిచి రథోపస్థమునఁ గూర్చున్నవాఁడయ్యెను.

(i)

"మాతుర్దోషా దివ బహిరగా ।
దన్త్రరప్యన్ధభావమ్॥

తల్లి సంభోగసమయమున వ్యాసుని వికృతరూపమునకు భయపడి కన్నుల మూసుకొనుటచే కనులు కనబడనటులనే తన దుర్మార్గుడైన దుర్యోధన దుశ్శాసనాది బిడ్డలయందలి కామముచే

"ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ॥"

అనినటుల నిత్యసన్నిహిత శత్రువగుటచే జ్ఞానము నావరించి వివేకమును హరించెను.

"కామం కర్ణాన్త విశ్రాన్తే ।
విశాలే తస్య లోచనే ।
చక్షుష్మత్తా తు శాస్త్రేణ ।
సూక్ష్మకార్యార్థ దర్శినా॥"

చెంపకు చారెడు కన్నులున్నను సూక్ష్మార్థ విమర్శనాపాటవముగల శాస్త్రజ్ఞాన మున్నందుననే కన్నులు కలవాడుగా పరిగణింపబడును.

ఈ ధృతరాష్ట్రున కీరీతిగా రెండు కన్నులు (ఆంతర-బాహ్య చక్షుస్సులు) లేకపోవుటచే శ్రీభాష్యకారులు "సర్వాత్మనా అంధః" అని సెలవిచ్చిరి. దీనికి నిదర్శనముగా "సుయోధన విజయ బుభుత్సయా" యని సాయించిరి.

ఈయనన్తర్భావము వీరి కెట్లుగోచరించెననగా-
"యుయుత్సవః కురుక్షేత్రే సమవేతాః కథమకుర్వత"
యని యడుగవలసియుండగా- "కిమకుర్వత" యని ప్రశ్నించుట చేతను "మామకాః" అని ఊరుకోనక "పాణ్డవాశ్చైవ" యని పాండవులను వేరుచేయుటచేతను స్పష్టమగుచున్నది.

ఈశ్లోకమున నొక వేదాంతరహస్యార్థము స్ఫురించుచున్నది. అది ప్రతివారును ముఖ్యముగా గమనించవలసినది. ఏమనగా-
ఒక సజ్జను డొక యకించనున్నైనను నావాడని యభిమానించినచో-
"పశుర్మనుష్యః పక్షీవా ।
యేచ వైష్ణవ సంశ్రితాః ।
తేనైవ తే ప్రయాస్యన్తి ।
తద్విష్ణోః పరమంపదమ్॥"
అనినట్లు ఆతనితోపాటు పరమపురుషార్థమును బడయగల్గును.

అందువలననే శ్రీభాష్యకారులు "యద్వా భాగవతాభిమాన వసతిః" యని చివరమెట్టుగా సెలవిచ్చిరి. అట్లుగాక విపరీతముగా

నొక దుర్మార్గునిచే నావాడని యభిమానింపబడువాడు "సహేన్ద్రాయ తక్షకాయ స్వాహా" అనునటుల నాతనితోనే నశించును.

అందుల కీశ్లోకమే మనకు తార్కాణము. ధృతరాష్ట్రుని డభిమానించిన కౌరవులగతియు, శ్రీకృష్ణు డభిమానించిన పాండవుల గతియును పాఠకు లెఱుంగనిది కాదు.

(2)

వ్యాసమహర్షి ప్రసాదించిన దివ్యచక్షుస్సువలన సకలసమర వృత్తాంతమును సాక్షాత్తుగా చూచినవాడును, 'శుద్ధభావంగతో, భక్త్యా శాస్త్రాద్వేద్మి జనార్దన" మ్మనుటచే భక్తి సహకృత శాస్త్ర జ్ఞానము కలవాడు నగుటచే యధార్థ దర్శియు, యథార్థవాదియునై, ఆప్తతముడుగా సంభావింప తగినవాడగు సంజయు నడిగెను.

2 శ్లో:-(3)

ఈశ్లోకమున "తు" అని "దృష్ట్వా" తో చేర్చబడినది. ఇది యొక విశేషార్థము తెలుపుచున్నది. అమరకోశకారుడు "తు" "అథ" శబ్దము కొక సంకేతము నేర్పరచెను. "త్వన్తాథాది న పూర్వభాక్" అనగా నేపదమునకు చివర "తు" చేర్పబడునో ఏ పదమునకు ముందు "అథ" చేర్పబడునో ఆ పదములు వెనుకనున్న పదముతో నన్వయింపక ప్రత్యేకార్థము నిచ్చును.

అటులనే యిచ్చట దుర్యోధనుడు యింట నున్నంతవరకు యీ పాండవులను జయించుట నా కొక పెద్దపనియా, కాలి గోటితో మీటనా? యని యహంకరించుచుండెను. కాని రణరంగమునకు వచ్చి చూడగనే ఆ బుద్ధి మారి భయభీతుడై దుఃఖితు డయ్యెనని తెలుపుచున్నది. ఈ యర్థము ముందు "అపర్యాప్తం" అను శ్లోకార్థమున కెంతో అనుకూలము.

3 శ్లో॥-(4)

ఈశ్లోకమున దుర్యోధనుడు "మహతీం" అను విశేషణముచే పాండవసైన్యమును,

"ధీమతా" "తవ శిష్యేణ" అను విశేషణములచే పాండవ సేనానాయకునిన్ని ప్రశంసించుచున్నాడు.

4 శ్లో॥-(5)

ఈశ్లోకమున దుర్యోధనుడు పాండవసేనావీరులను ప్రశంసించుచున్నాడు.

"భీమార్జున సమా" యనుటచే

"భీతస్య సర్వం భయకారిణాం"

అను న్యాయమునుబట్టి పరవీరు లందరును భీమునివలెను అర్జునునివలెను నాతనికి గాన్పించిరి. భీముడు తనను చంపుటకును అర్జునుడు

"కః కర్ణః కస్సుయోధనః"

అనినట్లు తన కభిన్నుడైన కర్ణుని చంపుటకును ప్రతిజ్ఞను గావించుటచే వారివలన కలిగిన భయముచే నందరును వారిద్దరివలెనే గాన్పించిరి. అందరును మహారథులవలెనే గాన్పించిరి.

8. 9 శ్లో॥-(6)

తన సేనలోని వీరులను పాండవసేనలోని వీరులకన్న నల్ప సంఖ్యాకులని పేర్కొనుచున్నాడు.

"అన్యేచ" యని మిగిలిన వారిని ఊరును పేరును లేకయే నాకృతిగణముగా పరిగణించుచున్నాడు.

"మదర్థేత్యక్తజీవితాః" అని అప్రయత్నముగా నశ్లీలవాక్కు ఆతని నోటినుండి వెలువడెను.

10 శ్లో॥ (7)

ఈ 10వ శ్లోకమున దుర్యోధనుడు భీష్మ పితామహునితో- నుభయసేనల తారతమ్యము నుగ్గడించుచున్నాడు.

ఈశ్లోకము నన్వయించుటలో నొకచిక్కు గాన్పించుచున్నది.

భీష్మాభిరక్షితం అస్మాకం తద్బలం అపర్యాప్తం।

భీమాభిరక్షితం తు ఇదం ఏతేషాం బలం పర్యాప్తం॥

అనిగదా అన్వయక్రమము.

సంస్కృతభాషలో పరోక్షనిర్దేశమును తత్ శబ్దముతోను అపరోక్షనిర్దేశమును ఏతచ్ఛబ్ద ఇదంశబ్దములతోను చేయుట వ్యాకరణసిద్ధమైన నిర్దుష్టపద్ధతి.

దీనిని చెప్పువాడు దుర్యోధనుడు. తన సేనలోనుండి చెప్పుచున్నాడు. ఇతనికి తన సేన అపరోక్షముగాని పరోక్షముకాదు. అట్టి తరి "అస్మాకం తత్ బలం" అనుట తగునా? పాండవసేన దూరమున నున్నది. దానిని "ఏతేషాం ఇదం బలం" అనుట తగునా? యను శంక ఉదయించుచున్నది. ఈచిక్కును తీర్చుటకు వ్యాఖ్యాత లనేక తబ్బిబ్బులు పడిరి.

1. ఒకరు – పాఠభేదమును కల్పింతుమనిరి.
2. మరియొకరు – దూరాన్వయమును గావింతుమనిరి.
3. ఇంకొకరు – వాక్యభేదమును కల్పింతుమనిరి.
4. వేరొకరు – పదార్థభేదమును కల్పింతుమనిరి.

వారి సమన్వయములను అందలి దోషములను గమనింపుడు.

1. పాఠభేదము – భీమ – భీష్మ శబ్దముల స్థానమును మార్చుట.

అనగా – భీమాభిరక్షితం తత్ బలం అస్మాకం అపర్యాప్తం భీష్మాభిరక్షితం ఇదం బలం తు ఏతేషాం పర్యాప్తం, భీమునిచే

రక్షింపబడు ఆ పాండవబలము మనకు అనగా మనల జయించుటకు చాలదు. భీష్మునిచే రక్షింపబడు ఈ మనబలము వీరికి అనగా పాండవులను జయించుటకు చాలును. అని అర్థము సమంజసముగా సమన్వయమగును. తచ్ఛబ్ద బలశబ్దములకు సామానాధికరణ్య స్వారస్యమూ చెడదు. దుర్యోధనుని యభిప్రాయమునకు అనుగుణముకూడా నగుచున్నది అందురు.

2. దూరాన్వయపక్షము-(వ్యవహితాన్వయము)

ఇది రెండువిధములు-

1. భీమాభిరక్షిత భీష్మాభిరక్షిత పదములను ఇచ్చట దాని నచ్చటను, అచ్చట దాని నిచ్చటను అన్వయించుట, 2. లేక అపర్యాప్తం తత్, పర్యాప్తంతు ఇదం అను పదసమూహములను ఇచ్చట దాని నచ్చటను. అచ్చటి దాని నిచ్చటను అన్వయించుట.

అనగా - భీష్మాభిరక్షితం అస్మాకం ఇదం బలం పర్యాప్తం భీమాభిరక్షితం ఏతేషాం తత్ బలం అపర్యాప్తం.

పర్యాప్తం - చాలియున్నది, అపర్యాప్తం - చాలదు. అనియే యర్థము.

3. వాక్యభేదపక్షము-

అపర్యాప్తం తత్ - ఆపాండవబలము చాలదు. ఏలననగా- అస్మాకం బలం భీష్మాభిరక్షితం, మన బలము భీష్మునిచే రక్షింపబడుచుండుటవలన-

పర్యాప్తం తు ఇదం - ఈ మనబలము చాలియున్నది. ఏలననగా-ఏతేషాం బలం భీమాభిరక్షితం, అనగా-వీరి బలము భీముని బలముచే రక్షింపబడుచుండుటవలన,

4. పదార్థభేదపక్షము-

పర్యాప్తం అనగా పర్యాపనం అనగా సమాపనం అనగా నాశన సమర్థం (కడతేర్చగలది)

అపర్యాప్తం-నాశన అసమర్థం (కడతేర్చ లేనిది)

భీష్మునిచే రక్షింపబడు మన బలమును ఆ పాండవబలము అపర్యాప్తము నాశనము చేయలేనిది. భీమునిచే రక్షింపబడు ఈ పాండవుల బలమును (గూర్చి) మన యీబలము పర్యాప్తం - నాశనము చేయగలది.

ఇట్లన్వయించుట రాజబాటను వీడి దొంగలగుడిశలో దూరినట్లున్నదని (శ్రీ)భాష్యకారు లతినేర్పుగా నన్వయించిరి.

తత్ శబ్దమునకు సామానాధికరణ్యాన్వయమును, అనగా - బలమునకు విశేషణము చేయుటను మాని, కారణపదముగా నన్వయించి యనాయాసముగా యీ చిక్కును తొలగించిరి.

తత్ ఆ కారణమువలన - అప్పుడు -

ఆ కారణమువలన భీష్మునిచే రక్షింపబడు మనబలము పాండవులను గెలుచుటకు చాలదు.

భీమునిచే రక్షింపబడు ఈ పాండవబలము (మనలను గెలుచుటకు) చాలియున్నది - అనిసరసమైన అర్థము తేలుచున్నది. చూచితిరా (శ్రీ)బాష్యకారుల సమన్వయ చాతుర్యము.

పై వారి యన్వయ ప్రక్రియలోని దోషములు సుస్పష్టముగా విజ్ఞులకు గోచరించుచునేయున్నవి-చూడుడు.

ఆ పక్షము లన్నియును ఏగతియు లేనప్పు డంగీకరించవలసిన వియోగాని సర్వజన పఠితపాఠమున కిట్లు సరస సమన్వయ మున్నప్పు డాదరించదగినవి కావు. అదియే ముఖ్యదోషము.

మరియు-పాఠభేదము. వ్యవహితాన్వయము, వాక్యభేదము, అప్రసిద్ధార్థకల్పనము, అను నివి శాస్త్రకారులు మిక్కిలి హేయముగా పరిగణించు పక్షములు.

వాక్యభేద యోజనలో జూపిన రెండు హేతువులున్ను యథాక్రమముగా నన్వయించవు.

ఆ పాండవ బలము చాలదు- అను ప్రతిజ్ఞను సాధించుటకు ప్రయోగించు హేతువు ఆపక్షమునందుండునది కావలెను.

ఇప్పుడు వీరు చెప్పిన హేతువు "మన బలము భీష్మునిచే రక్షింపబడుచుండుటవలన" అనుదానికి పక్షమైన పాండవబలముతో నేమి సంబంధము కలదు ? అట్లే రెండవహేతువున్ను ఆ యా బలములను రక్షించువాడు ప్రబలుడైనను దుర్బలుడైనను ఆబలము సమర్థమగుటకు అసమర్థమగుటకును కారణమగునేగాని ప్రతిబలము యొక్క సామర్థ్యాసామర్థ్యముల కెట్లు హేతువగును- కావున శాస్త్రదృష్ట్యా యీ హేతువులు రెండును స్వరూపాసిద్ధము లనబడును. గాన సాధ్యమును సాధింపజాలవు. దీనిని సమర్థించుట కెన్నిదారులు త్రొక్కినను అవి యన్నియు దొంగదారులే యగును.

కాని శ్రీభాష్యకారుల సమన్వయములోను కుదృష్టులకు కొన్నిదోషాభాసములు గాన్పింపకపోవు. అవి ఆభాసములే.

1. తత్పద- బలపదములకు స్వరససిద్ధమైన సామానాధికరణ్యము భంగపడుట,
2. వెనుక పరబల ప్రాబల్యమునకును, స్వబల దౌర్బల్యమునకును హేతువులను చెప్పక యే 'ఆ కారణమువలన' యనుట అసంగతము.
3. దుర్యోధను డనేకపర్యాయములు ధృతరాష్ట్రునితో-
"న భేతవ్యం మహారాజ! న శోచ్యా భవతా వయమ్ ।
సమర్థాస్స్మ పరాన్ జేతుం బలినః సమరే విభో॥"

తండ్రీ! నీవు భయపడకుము. మాకొఱకై చింతింపకుము. మేము బలవంతులము. యుద్ధమున శత్రువులను గెలుచుటకు సమర్థులమని చెప్పి చెప్పి భీష్మద్రోణాదులచే రక్షింపబడు స్వబలము నిప్పు డసమర్థమని జెప్పునా? అట్లు చెప్పుట కిప్పుడేమి యాపద వచ్చినది.

4. మరియు యుద్ధ ద్వితీయ దివసమున - దుర్యోధనుడు భీష్మ ద్రోణాదులతో-

> అపర్యాప్తం త దస్మాకం బలం పార్థాభిరక్షితమ్ ।
> పర్యాప్తం త్విద మే తేషాం బలం పార్థివసత్తమాః॥

ఓ రాజాధిరాజులారా! అర్జునునిచే రక్షింపబడు ఆ పాండవ బలము మనలను జయించుటకు చాలదు. కాని యీ మన బలము పాండవులను జయించుటకు చాలియున్నదని చెప్పెను.

ఈశ్లోకమున 'అస్మాకం - అపర్యాప్తం' అనియే అన్వయించవలెనుగాని 'అస్మాకం - బలం' అని అన్వయించుట తగదుగదా- అట్లే యిచ్చటను దానితో సమానార్థకముగనే యుండవలెను. కాని విపరీతముగా నుండరాదు.

5. ఇట్లర్థమును జెప్పుట దుర్యోధనుని పాత్రను గుర్తెఱుంగని పామరత్వము-

ఈప్రశ్నలు శ్రీభాష్యకారాన్వయపద్ధతి నడ్డజాలవు. వినుడు.

తమ బలమును భీష్మాభిరక్షితం అని చెప్పి పాండవబలమును భీమాభిరక్షితం అని భీష్మునకు ప్రతికోటిగా భీముని నిర్దేశించుట కేమి కారణమో యొకింత పరికింపుడు :

1. భీష్మునివలె భీముడు సేనాపతియనియా?
   కాడే. పాండవ సేనాపతి ధృష్టద్యుమ్నుడుగదా.

2. భీష్మునితో సమాన పౌరుషవంతుడనియా ?
అట్లనరాదు. భీష్మభీముల పౌరుషములలో నెంతో తార తమ్యము గలదు. ఆమాట భీష్ముడే చెప్పెను వినుడు-
"శక్తోఽహం ధనుషైకేన నిహన్తుం సర్వ పాండవాన్ ।
య ద్యేషాం న భవే ద్గోప్తా విష్ణుః కారణపూరుషః॥
పాండవులను కృష్ణుడు కంటికి రెప్పవలె కాపాడుటకు సన్నద్ధుడు కానిచో పాండవుల నందరను హతమార్చుటకు నే నొక్కడనే చాలుదుననెను.

3. భీముడు శత్రుబలమున కధీశ్వరుడనియా ?
అట్టివాడు ధర్మరాజేగదా !

4. పాండవసేనలో ప్రధానుడనియా ?
అట్టివా డర్జును డనియే దుర్యోధనుని యభిప్రాయము. అందులకే "అకారాదీని నామాని అర్జున త్రస్తచేతసః" అని భారతమున చెప్పబడెను. అనగా-గోగ్రహణ స్వగ్రహణ ఘట్టములలో నాత డర్జునుని సామర్థ్యమును ప్రత్యక్షముగా ననుభవించినవాడు గావున నర్జును డన్న నులికిపడుటయేగాక అకార మాదియందుగల ఏమాట విన్నను త్రుళ్ళిపడుచుండెనట.

మరి భీష్మునకు ప్రతికోటి భీముని చెప్పుట కేమి హేతువు ?

అనగా - భీష్ముడు పాండవులలో నొక్కరినైనను చంపనని ప్రతినయొనర్చియే సేనాధిపత్యమును స్వీకరించెను. భీముడు కౌరవులలో నొక్కనినిగాని బ్రతుకనీయనని శపథ మొనరించెను. దానికితో డాతనికి భుజబలము, సాహసము, సహాయాదులు పుష్కలముగ నున్నవి. ఈకారణముచేతనే భీష్మునకు ప్రతికోటిగా భీముని పేర్కొనెను.

ఇంతకుముందు పరబల ప్రాబల్యమునకును స్వబల దౌర్బల్యమునకును హేతువులే ప్రసక్తము కాలేదే! అట్టితరి తత్ - ఆకారణమువలన అను నర్థ మెట్లుఘటించుననిగదా ఆక్షేపణ? ఆకారణము లెన్ని ప్రసక్తమైనవో వినుడు :

(అ) మొదటలోనే పరబలము తనబలముకన్న నాలుగ క్షౌహిణిలు తక్కువేయైనను దానిని జూచి 'మహతీం చమూం' అనుట పరసేనాతిశయమును వర్ణించుట కాదా?

(ఆ) పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్ ।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥
ఆచార్యా! అబ్బో! పాండవుల యీ మహత్తరమైన సేనను చూడుడు. బుద్ధిమంతుడగు మీ శిష్యుడైన ద్రుపదరాజపుత్రు డెట్లు వ్యూహము పన్నెనో!

ధీమతా అతః తవ శిష్యేణ- తవ శిష్యేణ అతః ధీమతా అని అన్వయము.

ఈతడు బుద్ధిమంతుడు గనుక మీ రీతనిని శిష్యునిగాగొని సమస్త ధనుశ్శాస్త్ర రహస్యముల నుపదేశించి పెద్దను గావించిరి.

మీకు శిష్యుడుగనుకనే యింతబుద్ధిశాలియైనాడని. ఇది పరసేనాపతిని వర్ణించుటకాదా!

(ఇ) అత్ర శూరా మహేష్వాసాః భీమార్జునసమా యుధి
అని ప్రారంభించి 'సర్వ ఏవ మహారథాః' అనుట పరసేనను వర్ణించుటకాదా?

పరసేనలో నందరును మహారథులే యనియు, ఎవరిని చూచినను భీముడు, అర్జునునివలెనే కాన్పించుచున్నారనియు చెప్పుటను గమనించుడు.

"మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్ ।
దుశ్శాసనస్య రుధిరం న పిబా మ్యురస్తః ।
సంచూర్ణయామి గదయా న సుయోధనోరూ ।
సన్ధిం కరోతు భవతాం నృపతిః పణేన॥"

ధర్మరాజు శ్రీకృష్ణుని కౌరవులతోడ సంధికై యనుపుచున్న వార్త విని భీముడు సహదేవునితో నేను రణరంగమున క్రోధావిష్టుడనై దుర్యోధనాది నూరుగురు సోదరులను నా గదతో మర్దించనినాడును, దుశ్శాసనుని వక్షస్థలమును చీల్చి రక్తమును పానముచేయనినాడును, దుర్యోధనుని తొడలునాగదతో నుగ్గుచేయనినాడు మీరాజైన ధర్మరాజు సంధిగావించుగాక యనియు, ద్రౌపదితో నాతడు సభలో-

చంచద్భుజ భ్రమిత చండగదాభిఘాత
సంచూర్ణితోరుయుగళస్య సుయోధనస్య ।
స్త్యానావముష్టి ఘనశోణిత శోణ పాణిః
ఉత్తంసయిష్యతి కచాన్ తవ దేవి! భీమః॥

నాచేతనున్న గదాదండమును బిరబిర ద్రిప్పుకొనుచు నేగి వజ్రాహతమగు కొండవలె దుర్యోధనుని తొడలను గుండ పిండి చేసి వాని శరీరమునుండి పొరలుచున్న వేడి చిక్కనిరక్తమును నాచేతులకు పూసికొని వచ్చి నీ కురుల కలది వాటిని నేను ముడివేయనిచో నేను భీముడను కాను. చూచుకొనుమని చేసిన ప్రతినయు దుర్యోధన శ్రవణ కుహరముల క్షణక్షణే నూతనమై ప్రతిధ్వనించుటచేతను,

అర్జునుడు సభారంగమున కర్ణుని సంహరింతునని ప్రతిన యొనర్చుటచే "కః కర్ణః కస్సుయోధనః" యనునట్లు కర్ణ దుర్యోధనులకు శరీరము వేరైనను ఒకేవ్యక్తిగా భావించు మిత్రులగుటచే నా ప్రతిజ్ఞ తనను చంపుటకే గావింపబడినదని భావించుటచేతను ఉభ

యులవలన కలిగిన భయాతిశయముచే "భీతస్య సర్వం భయకారి నూనం" అను న్యాయముగా పాండవ సేనలో ప్రతియోధుడును భీమార్జునులవలెనే యాతనికి గోచరించుట వింతయా? ఇది పరసేనను వర్ణించుటకాదా? పాండవబలములోని వీరులను లెక్కించుచు భీమార్జునులవంటి మహారథులను సుమారు ఇరువదిమందిని పేరుపేరుగా వర్ణించుట పరసేనాతిశయ వర్ణనము కాదా?

తన సేనలో నేమైనా సేనను వర్ణించెనా? సేనాపతిని వర్ణించెనా? పైగా తన సేనలోని ప్రధానవీరులను పరిగణించుటలో "భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ" యని యారంభించి యేడుగురను మాత్రమే పేర్కొనుచు మిగిలినవారిని "అన్యేచ బహవశ్శూరాః" అనిఆకృతి గణములో చేర్చెను. మరియొక విపరీత వార్తను వినుడు. "మదర్థే త్యక్తజీవితాః" అని వారందరిని చచ్చిన శవములని పేర్కొనెను. నాకొఱకై జయేచ్ఛ గలవారనిగదా చెప్పవలసినది? సరి. లోపల అభిప్రాయ మెట్లున్నను నోటినుండి వచ్చిన దీయమంగళ ప్రసంగముగదా!

"తస్య సఞ్జనయన్ హర్షం కురువృద్ధః పితామహః" అని యప్పుడు ఆనందమును పుట్టించవలసిన దశలో నున్నాడనుట అంతకు పూర్వము దుఃఖించుచున్నాడనియేగదా భావము. కావుననే భాష్యకారు లీశ్లోక వ్యాఖ్యానమున "దుర్యోధనః స్వయ మేవ భీమాభిరక్షితం పాణ్డవానాం బలం ఆత్మీయంచ భీష్మాభిరక్షితం బలం చావలోక్య ఆత్మవిజయే తస్య బలస్య పర్యాప్తతాం ఆత్మీయస్య బలస్య తద్విజయే చా పర్యాప్తతాం చ ఆచార్యాయనివేద్య అంత ర్విషణ్ణోఽభవత్" అని వ్రాయించిరి.

అనగా-దుర్యోధనుడు స్వయముగ భీమునిచే రక్షింపబడుచున్న పాండవుల సేనను, భీష్మునిచే సంరక్షింపబడు తన సేనను

చూచి తమను జయించుటకు పాండవసేన చాలియుండుటను, తన సేన పాండవులను జయించుటకు చాలకుండుటను, ద్రోణాచార్యులవారి కెఱింగించి దుఃఖించెనని సెలవిచ్చుట ఎంతయో సంగతము.

ఆపైనగూడా "స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్" అనగా శ్రీకృష్ణుడు పాంచజన్యమును, అర్జునుడు దేవదత్తమును, భీముడు పౌండ్రమును, ధర్మరాజు అనంతవిజయము, ఇట్లు పాండవులు పేరెన్నికగన్న తమ తమ శంఖములను పూరించగా నాధ్వని భూమ్యాకాశములనిండి నీపుత్రుల హృదయములను ముక్కముక్కలు గావించినదని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

దానికి భాష్యకారులు "అద్యైవ నష్టం కురూణాం బల మితి ధార్తరాష్ట్రా మేనిరే" నేడే మనమంతా నశించితిమని దుర్యోధనాదులు తలంచిరని వచించిరి. ఇది భయకార్యము, విచారకార్యమును కాదా!

ఈకారణములు చాలవా, "తత్" అనగా ఆకారణమువలన ననుటకు? కనుక శ్రీభాష్యకారులు సెలవిచ్చిన యర్థమే సర్వథా ఉపపన్నము. అట్లర్థమును జెప్పిననే ఇతర వ్యాఖ్యాతలు త్రొక్కిన తప్పుడు త్రోవలు త్రొక్క నవసరముండదు, పరబలము దుర్యోధనునకు పరోక్షము కాదు గాన పాండవబలమును "భీమాభిరక్షితం ఏతేషాం బల"మ్మనుట దోషముకాదు. "దృష్ట్వాతు పాండవానీకం" "పశ్యైతాం" ఏతేషాం" మొదలుగాగల ప్రత్యక్ష నిర్దేశములను గాంచుడు.

భీష్మద్రోణాది మహావీరులచే రక్షింపబడు తన సేనను దుర్బలమనుకొనునా? యనుప్రశ్నకు సమాధానమును వినుడు! భీష్మద్రోణాదుల వధ సోపాధికమైనను ఆ యుపాధి దుర్యోధనునెఱుంగును గావున వారి వధను శంకించి భయపడుటలో ఆక్షేపమేమియును లేదు.

"న భేతవ్యం మహారాజ!" ఇత్యాదులచే ననేకమారులు తన బలసామర్థ్యము నుగ్గడించినను, ఇప్పుడిట్లు భయపడుటకు కారణము లేదనరాదు. అర్జునుడు కౌరవులను పరిమార్చు సంకల్పముతో, శ్రీకృష్ణుని సారథిగా నిడుకొని రణరంగమునకురికి "ప్రవృత్తే శస్త్ర సంపాతే" యనినట్లు బాణసంధానావస్థవరకు వచ్చియు తనచే చంప బడు గురు జన బంధు మిత్రాదులను జూచి స్నేహము కారుణ్యము ధర్మాధర్మ భీతులతో కలతచెంది దుఃఖించి యుద్ధవిముఖుడై తిరిగి శ్రీకృష్ణునిచే ప్రోత్సహింపబడి యెట్లు నిలబడెనో అట్లే దుర్యోధనుడును ఒక్కడైనను పాండవులకు తోడుపడడనుగొనుచున్నవానికి ఏడక్షౌ హిణీల సేన యుద్ధమునకు సన్నద్ధమై నిలచుటయు, దృఢముగా బుద్ధి మంతుడైన ద్రోణ శిష్యుడగు దృష్టద్యుమ్నునిచే పన్నబడియుండు టయు, తమకంటె హెచ్చు మహావీరుల సంఖ్య గాన్పించుటయు, అందరును భీమార్జునులతో సమబలులగుటయు, శ్రీకృష్ణు డర్జునునకు సారథియై నిలుచుటయు, జూచుటచే భయవిషాదములకు లోనగు టయు భీష్మాచార్యులచే సింహనాద శంఖధ్వానములచే ప్రోత్సహిం పబడుటయు నొక వింతయా?

రెండవరోజున తన నాయకులతో పలికిన శ్లోకము యీ శ్లోక మును భిన్నార్థబోధకములు కాకూడ దనునది రాజాజ్ఞయా? శబ్దసా దృశ్యమెచ్చటనో యున్నదని యర్థసాదృశ్యముకూడ నుండవలెనా? భోజనప్రకరణములోని సైంధవశబ్దమునకును యానప్రకరణములోని సైంధవశబ్దమునకు నొకేయర్థము నేచెనటియైన జెప్పునా? యుద్ధసిద్ధి చంచలమైనదని యందరెఱుంగునదియేగాన నభిప్రాయములు ముందు వెనుకలలో మారుచుండవచ్చును. ఇంటియం దున్నప్పు డున్న భావము యుద్ధరంగములో మారుట యొకవింతయా? విపరీతమా? ఉత్తర కుమారు డింటను రణరంగమున నొక్కరీతిగనే యుండెనా? ప్రథమ దివసమున యుద్ధపద్ధతిని గాంచి కొంచెము నిరుత్సాహము చెందిన

తన బలమును ప్రోత్సహించుటకు రెండవనా డట్లనవచ్చును. అందు లకే "దృష్ట్వాతు" అని "తు" శబ్దము ప్రయోగింపబడినది. ఈ "తు" శబ్దము "నపూర్వభాక్" అనున్యాయముచే వెనుకటి స్థితికి వైలక్షణ్యమునే జెప్పునుగదా !

ఈకారణములచే శ్రీభాష్యకారుల యోజనయే నిర్దుష్టమై సోపపత్తికమైన ప్రమాణమై యొప్పుచున్నది.

దీనిచే శ్రీభాష్యకారుల నిర్దుష్ట సమన్వయ పటుత్వము స్థాలీ పులాకన్యాయముగ జూపబడెను.

11 శ్లో॥-(8)

భీష్ముడు స్వచ్ఛందమరణము కలవాడును అజయ్యుడు నైనను పాండవులను చంపనని శపథమొనర్చి నాయకత్వమును వహించుటచే పాండవు లాతని కిక బ్రతుకరాదను బాధను కలిగింతురో యను భయము దుర్యోధనునకు కలదు. భీష్ము డొక్కడు బ్రతికియున్న శత్రువీరు లెవ్వరును తన సేనను కన్నెత్తియైనను చూడజాలరు. ఇక పాండవ వధ తాను కర్ణుడు మొదలగువా రనాయాసముగ చేయ వచ్చును అను నమ్మకముతో భీష్ముని సంరక్షించడని తన వీరులను ప్రోత్సహించుచున్నాడు.

12 శ్లో॥ (9A)

ఈ శ్లోకమున "సఞ్జనయన్ హర్షమ్"ను నిర్దేశము దుర్యో ధనుని స్థితి సంతోషమును బుట్టించవలసిన స్థితిలో నున్నదని సూచించు చున్నది.

అందువల్లనే శ్రీభాష్యకారులు "అన్తర్విషణ్ణోఽభవత్" మనో దుఃఖముతో క్రుంగియున్నాడని సెలవిచ్చిరి.

14 శ్లో॥-(9B)

"తతః శ్వేతైః" ఈ శ్లోక మీ యధ్యాయమునకు ప్రాణము అధ్యాయమునకే కాదు గీతాశాస్త్రమున కంతకును అనియును, చెప్పవచ్చును.

ఇది గీతా తాత్పర్యమును సూచించుచున్నది.

ముముక్షువునకు కర్తవ్యమును బోధించునది ఈ గీతాశాస్త్రమే. ఇదే విషయము ప్రణవముచే బోధింపబడుచున్నది. కావున గీతాశాస్త్రమున్ను ప్రణవమున్ను సమానార్థకములే యని నమ్మవలెను. ప్రణవమున మకారమున కర్థమగు జీవుడు అకారవాచ్యుడగు సర్వేశ్వరునకే ప్రీతిరూపముగా తన విధ్యుక్త కార్యములను కైంకర్యబుద్ధితో చేయవలెనని చెప్పబడుచున్నది. గీతయందును ప్రతిమానవుడును తన విధ్యుక్తధర్మములను తన కొరకు ఫలమును గోరక భగవదర్పణబుద్ధితో నాచరించవలెనని బోధింపబడుచున్నది.

ఈ యర్థ మీ 14వ శ్లోకముచే ధ్వనింపచేయబడుచున్నది. ఎట్లనగా—

తెల్లని గుఱ్ఱములనగా దోషములు లేని నాలుగు వేదములు, దోషములు—భ్రమ- ప్రమాద - విప్రలంభ (మోసము)- అశక్తి యనునవి, ఇవి మనుష్యులచే వ్రాయబడు గ్రంథములలో నుండుట స్వభావము. ఈగీత సాక్షాద్భగవంతునిచే ప్రతిపాదింపబడినదగుటచే దీని కాదోషములు లేవు అట్టు దోషములు లేక భగవంతునిచే నావిష్కరింపబడినవి నాలుగు వేదములు.

హయ-గతౌ : నడచుట. ఈ ధాతువునుండి "హయ" శబ్దము బుట్టినది గత్యర్థము లన్నియును బుద్ధ్యర్థముల నిచ్చును గాన నిచ్చట హయము లనగా జ్ఞానప్రదములగు నాలుగు వేదములు

అవి తెల్లనివనుటచే ఆ నాలుగు దోషములున్న వీనికి లేవని తెలియు
చున్నది. యుక్తే- కూడుకొనిన- అట్టి వేదములతో కూడియున్న
అనగా- ఆ వేదార్థములను తెలుపు మహతి స్యన్దనే- గొప్పరథము
నందు. ఇచ్చటను స్యన్దూ = ప్రసవణే=కారుట, స్రవించుట అని
యర్థము గాన నిదియును నేకవిధమైన గమనార్థకధాతువే యగు
టచే జ్ఞానప్రదమైన గీతాశాస్త్రమునందని యర్థము. అనగా- తత
శ్శ్వేతైః హయైః......స్యన్దనే- యనుటచే పౌరుషేయదోషములు
లేని వేదార్థములను వెలిబుచ్చు గీతాశాస్త్రమునందు అని యర్థము
సిద్ధించినది. మహతి యనుటచే పౌరుషేయగ్రంథముల కన్నను
ఉత్కృష్టమైనదని యర్థము సూచింపబడినది. దీనియందు "స్థితౌ"
శిష్యాచార్యులుగా నుండినవారు దివ్యౌశంఖౌ=ఇచ్చట శంఖమనగా
ఆకారసామ్యముచేతను లక్షణముచేతను ప్రణవమని యర్థముగాన
శంఖములనూదించిరి యనుటచే ప్రేరణకర్త ప్రేర్యకర్తలుగానుండి
ప్రణవార్థమును లోకాంతర కాలాంతరపురుషులుగూడ నిరంతరము
అనుభవించదగినంత దృఢముగ నిరూపించిరని యర్థము ధ్వనించు
చున్నది.

14 శ్లో॥-(9C)

ఈ రథము అర్జునునకు ఖాండవవనదహన సమయమున నగ్ని
హోత్రుడొసంగిన నంద ఘోష మనుపేరు కలది.

15, 16 శ్లో॥-(10)

15, 16 శ్లోకములలో కృష్ణార్జునులయొక్కయు మిగిలిన నలు
గురు పాండవులయొక్కయు శంఖముల పేర్లు తెలుపబడుచున్నవి.

పంచజనుని చంపి యాతని ఎముకతో నిర్మింపబడినది
"పాంచజన్య"మనియు,

దేవతలచే బహూకరింపబడినది "దేవదత్త" మనియును వినిన వారి హృదయములను భయాగ్నిచే భిన్న భిన్న మొనరించునదిగాన "పౌండ్ర" మనియును పిలువబడును. (పుడి-ఖణ్డనే)

16 శ్లో॥-(11)

ధర్మరాజు ధర్మాత్ముడు గాన ఆతనిచే నూదబడిన శంఖధ్వని తప్పక గొప్పవిజయమును నొసంగునుగాన దానికి "అనంతవిజయ" మని పేరుంచబడెను.

నకులుడు సౌందర్యమే ప్రధానముగా కలవాడు గాన తన యందమునకు తగినరూపము మనోహరమైన ధ్వనిని కల శంఖమును చేబట్టుటచే దానికి "సుఘోష" మనియును,

సహదేవుడు చిన్నవాడగుటచే సౌష్ఠవప్రియుడుగాన తన శంఖమునకు క్రిందభాగమున మాణిక్యగుచ్ఛము నొకదానిని వ్రేల గట్టెను. అందుచే నాతని శంఖమునకు "మణిపుష్పక"మనియును పేర్లుంచబడెను,

19 శ్లో॥-(12)

హృదయము అణు పరిమాణమున్ను, నిత్యమును, శస్త్రాదులు ఇతరవస్తువులను నశింపజేయునుగాని యిట్టి మనస్సును కాదు.

అట్టితరి శంఖధ్వని యెట్లు బ్రద్దలుగావించెనన్నచో చెప్పు చున్నారు. "కౌరవు లిప్పుడే" ఇత్యాది.

22 శ్లో. (13) ఎ

22వ శ్లోక ఉత్తరార్థము నిట్లన్వయించవలెను-

కైస్సహ (స్థిత్వా) మయా (పరైః) యోద్ధవ్యం.

నేనెవరితోఁ కూడియుండి శత్రువులతోఁ యుద్ధమును చేయవ లెనోఁ' అని యిట్లన్వయించనిచోఁ నీ శ్లోకమునకు 23వ శ్లోకముతోఁ పునరుక్త్యముండును. తన పక్షీయులను చూడవలెనను కోరికను తెలుపును.

23 శ్లోకమున (13 బి)

దుర్యోధనునకు సహాయమును చేయవచ్చిన పరసైన్యమును చూడవలెనను కోరిక చెప్పబడును.

అందులకేగదా—

"సేనయోరుభయోర్మధ్యే" అని రెండు సేనలమధ్యను రథ మును నిలుప గోరినది,

29, 30 శ్లో॥

ఇవి నిజముగ నితరులకు దుశ్శకునములే కార్య విఘాతమును సూచించునవియే. ఐనను యాత్ర యోగేశ్వరః కృష్ణః 'యత్ర పార్థో ధనుర్ధరః। తత్ర శ్రీర్విజయః...అను నట్లు శ్రీకృష్ణుడండగ నుండు టచేనవి పాండవులకు విఘ్నకారులు కాజాలవు.

32 శ్లో॥ చివర

అర్జునునకు గుహ్యతమమైన వేదాంత విషయములను ప్రశ్నిం చుటకును వినుటకును వలయు వైరాగ్యోదయ మారంభమైనది. ఇష్ట వియోగము అనిష్టాగమమే కదా వైరాగ్యమునకు నిదానము-

శ్లో॥ భోగే రోగభయం, కులేచ్యుతిభయం విత్తే నృపాలాద్భయం।
శాస్త్రేవాదిభయం గుణే ఖలభయం రూపేజరాయా భయమ్।
మానేదైన్య భయం బలేరిపుభయం కాయేకృతాన్తాద్భయం।
సర్వం వస్తుభయావహం భువి నృణాం, వైరాగ్యమేవా
భయమ్॥

38 శ్లో॥ (16)

లోభోపహత చేతసః-

లోభేన=రాజ్యలాభాభిలాషచే, ఉపహతాని=దూషింపబడిన చేతాంసి=మనస్సులు యేషాంతే.

రాజ్యమును బడయవలెనను కోరికతో చెడగొట్టబడిన మనస్సులు కలవారు అని యర్థము. భీష్మాదుల కట్టి లోభము లేదే యనిన-

లోభోపహతే = దుర్యోధనునియందు, చేతాంసి యేషాంతే మనస్సులు కలవారు.

అనగా ఆతని పక్షీయులని యర్థమును చెప్పవలెను.

43 శ్లో॥ (17)

గమనిక-

సాంకర్య దోషమును గీతా శ్లోక మింత స్పష్టముగా వక్కాణించు చున్నను గీతావ్యాఖ్యానమును గావించు ప్రముఖ నాయకులే సాంకర్యమునకై ప్రేరణ చేయుట ఎంత విపరీత ప్రవృత్తియో యోచింపుడు.

వీరా స్తికులేనా ?

46 శ్లో॥ (18)

ఈశ్లోకము నందలి 'క్షేమతరమ్మను పదమును గమనింపుడు.

యుద్ధమున చేతియందాయుధము లేని వానిని గాని దెబ్బకు దెబ్బ తీయని వానిని గాని చంపినచో మహా పాపము వాటిల్లును. దానిచే చిరకాలము ఘోరం నరకము ననుభవించును. మృతునకు వీర స్వర్గము లభించును. కావున మాకు అస్థిరమైన రాజ్యలాభము లాభదాయక మగుటకన్న మాశత్రువులకు ఘోర నరకప్రాప్తియే మాకు మిక్కిలి సమ్మతమని యర్జునుని భావము. అందుచేతనే క్షేమతరమ్మని తరప్ ప్రయోగము.

47 శ్లో॥ (19)

యుద్ధమును చేయవలెనను గట్టి పట్టును విడిచి యుద్ధ మహా యజ్ఞమునందలి స్రుక్ స్రువాదిస్థానీయములగు ధనుర్బాణములను విడిచిపెట్టి ప్రాయోపవేశమును చేయుగోరువాని వలె రథమున రథికుడు కూర్చుండవలసిన స్థానమును విడిచిపెట్టి రథమానకు మధ్య భాగమున కూర్చుండెను-

(ఓవిజీ-భయచలనయోః)

యుద్ధమొక యజ్ఞము-

శ్లో॥ చత్వారో వయ మృత్విజః స భగవాన్ కర్మోపదేష్టాహరిః
సజ్గ్రామాధ్వర దీక్షితో నరపతిః పత్నీ గృహీతవ్రతా ।
కౌరవ్యాః పశవః ప్రియాపరిభవ క్లేశోపశాన్తిః ఫలం
రాజన్యోపనిమన్త్రణాయ రసతి స్ఫీతం యశోదున్దుభిః॥
భీము డిట్లు సహదేవునితో ననుచున్నాడు.
మనము నలుగురము ఋత్విక్కులము.
కర్మాధ్యక్షుడు శ్రీకృష్ణుడు.
ధర్మరాజు దీక్షనుపూనిన యజమాని.
ద్రౌపది నియమ నిరత-
కౌరవులు నూరుగురు పశువులు.

ప్రియురాలి పరాభవ శాంతి యజ్ఞఫలము. రాజులనందరను ఆహ్వానించుటకు దుందుభి మ్రోగుచున్నది.

శ్రీమత్ యామునమునయే నమః

## గీతార్థ - సంగ్రహము

శ్లో॥ విగాహే యామునం తీర్థం, సాధు బృందావనే స్థితమ్
నిరస్త జిహ్మగ స్పర్శే, యత్ర కృష్ణః కృతాదరః
అవతారిక—

తత్త్వహితములు అధ్యాత్మ శాస్త్రసారములు. అందు పర తత్త్వము నారాయణుడనియు, పరమహితము నారాయణ ధ్యానమే యనియు, మహాత్ములు నిర్ణయించిరి. ఈరెండింటినీ భగవద్గీత చెప్పు చున్నదని తెలుపుచు నా తత్త్వమును మొదట చెప్పుచున్నారు-

1. శ్లో॥ స్వధర్మజ్ఞాన వైరాగ్యసాధ్య భక్త్యేక గోచరం।
నారాయణః పరం బ్రహ్మగీతా శాస్త్రే సమీరితః॥

తాత్పర్యము :

తన వర్ణాశ్రమ ధర్మములచేతను, ఆత్మీయాధ్యాత్మ జ్ఞానము చేతను, తదితర విరక్తిచేతను భక్తియోగము సాధ్యము. దీనిచే తను మాత్రమే పరమాత్మ లభ్యుడగును. ఆతడే యీ గీతాశాస్త్రమున చక్కగ చెప్పబడెను. ఆతడే యీ శాస్త్రమునందు ముఖ్యముగా తెలుపబడిన తత్త్వము.

(21)

అవతారిక-

ఇక ముందు ఈ శ్లోకములచేతను వరుసగా మూడు షట్క-ముల యర్థమును సంగ్రహించుచున్నారు-

పూర్వషట్కము-

2 శ్లో॥ జ్ఞాన కర్మాత్మికే నిష్ఠే।
యోగలక్ష్యేసుసంస్కృతే।
ఆత్మానుభూతి సిద్ధ్యర్థే।
పూర్వషట్కేన చోదితే॥

తాత్పర్యము-

యోగమనగా ఆత్మసాక్షాత్కారము. అది ఫలాపేక్షలేని బుద్ధితో సంస్కరింపబడిన జ్ఞానయోగ కర్మయోగములకు ఫలము. అట్టి యాత్మానుభవము సిద్ధించుటకొఱకు సాధనములు మొదటి షట్కమున చెప్పబడినవి.

అవ. మధ్యమషట్కమున పరతత్త్వవిషయమైన సన్నిహితోపాయమగు భక్తియోగమును గుఱించి చెప్పుచున్నారు.

శ్లో॥ మధ్యమే భగవత్తత్త్వయాథాత్మ్యావాప్తిసిద్ధయే ।
జ్ఞానకర్మాభినిర్వర్త్యో భక్తియోగః ప్రకీర్తితః॥

తా. మధ్యమ (రెండవ) షట్కమున భగవంతుడనెడు పరతత్త్వముయొక్క యాథాత్మ్యమును బడయుట యనెడు ఫలముకొఱకు జ్ఞానకర్మయోగములచే సిద్ధించు భక్తియోగము చెప్పబడుచున్నది.

అవ. మూడవ షట్కమున చెప్పగా మిగిలినదంతయును చెప్పబడుచున్నదనుచున్నారు.

శ్లో॥ ప్రధాన పురుష వ్యక్త ।
సర్వేశ్వరవివేచనమ్ ।
కర్మధీః భక్తి రిత్యాది ।
పూర్వశేషోఽన్తిమోదితః॥

తా. కారణావస్థలోనున్న ప్రకృతి, బద్ధజీవులు, శుద్ధజీవులు, కార్యావస్థలోనున్న ప్రకృతి, సర్వేశ్వరుడు అను పదార్థములు వేఱు వేఱుగా ననుసంధింపబడినవి. మరియు కర్మజ్ఞానభక్తులున్ను వెనుక చెప్పగా మిగిలినవి యిందు విశోధింపబడినవి.

అవ. ఇక పదునెనిమిది శ్లోకములచే వరుసగ నొక్కొక్క అధ్యాయముయొక్క యర్థమును సంగ్రహించి చెప్పుచున్నారు.

శ్లో॥ అస్థానస్నేహకారుణ్య ।
ధర్మాధర్మధియాకులమ్ ।
పార్థం ప్రపన్న ముద్దిశ్య ।
శాస్త్రావతరణం కృతమ్॥

తా. కూడని బంధుస్నేహముచేతను, దయచేతను ధర్మమైన యుద్ధమును అధర్మముగా తలంచి కలతనొంది శరణాగతుడైన యర్జునుని గూర్చి గీతాశాస్త్రము ప్రారంభింపబడినది.



# శ్రీ భగవద్గీతా — ద్వితీయోఽధ్యాయః

## సాఙ్ఖ్యయోగః



### అవతారిక.

ఆత్మ దేహమునకంటె వేఱై నిత్యమైయుండుటయు, శాస్త్రవిహితధర్మములగు యుద్ధాదికర్మములను ఫలాపేక్షలేక చేయుటయే యట్టియాత్మస్వరూపప్రాప్తికి సాధనమగుటయును దెలియక దేహమే యాత్మ యనియు, యుద్ధము పాప మనియు భ్రమించి మోహితుఁడై, యుద్ధము మాన నిశ్చయించిన యర్జునుని యామోహమును బోఁగొట్టుటకు ఆత్మనిత్యత్వమునుగుఱించిన సాంఖ్యజ్ఞానమును, అట్టిజ్ఞానముతోఁ గూడినదై ఫలాపేక్షారహిత కర్మానుష్ఠానరూపమైయున్న కర్మయోగమును, దానికుద్దిష్టఫలమైన స్థితప్రజ్ఞత యను జ్ఞాననిష్ఠయు (జ్ఞానయోగమును). ఆస్థితప్రజ్ఞతచే సాధ్యమగు యోగము అనడి ఆత్మదర్శనమును, స్థితప్రజ్ఞతయొక్క స్వరూపమును, దానిని సాధించుటకు ఇంద్రియజయమావశ్యక మగుటయు, ఇంద్రియజయము భగవంతుని స్మరణముచేతనే సాధ్యమగు ననుటయు, భగవంతుని స్మరణము తప్ప తక్కినయుపాయములచేత దానిని సాధింపఁజూచువారికిఁ గలుగుక్లేశములును ఈద్వితీయాధ్యాయమున వివరింపఁబడుచున్నవి.

సఞ్జయ ఉవాచ = సంజయుఁడు (ధృతరాష్ట్రునకు) ఇట్లు చెప్పెను :

1

శ్లో॥ తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః॥ 1

1

టీ. తథా=అట్లు, కృపయా=కనికరముచేత, ఆవిష్టం = ఆవేశింపఁబడినవాఁడును, అశ్రుపూర్ణాకులేక్షణం=కన్నీటితో నిండినవై వ్యాకులములైననేత్రములు గలవాఁడును, విషీదన్తం=దుఃఖించు

చున్నవాఁడు నగు, తం = ఆ యర్జునునిఁగూర్చి, మధుసూదనః = శ్రీకృష్ణుఁడు, ఇదం వాక్యం = ఈవచనమును, ఉవాచ = పలికెను.

తా. అట్లు దయాక్రమేతుఁడై కన్నీరు విడుచుచు వ్యాకులతఁ జెందినవాఁడును. దుఃఖాక్రాంతుఁడునైనయర్జునుని చూచి శ్రీకృష్ణు డిట్లు పలికెను.

శ్రీ భగవా నువాచ = శ్రీకృష్ణుఁడు పలికెను :

శ్లో॥ కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున॥ 2

టీ. హే అర్జున = ఓ అర్జునా, అనార్యజుష్టం = పామరులచేత నవలంబింపఁబడునదియు, అస్వర్గ్యం = పరలోకవిరోధియు, అకీర్తికరం = అపకీర్తి కలుగఁజేయునదియును అగు, ఇదం కశ్మలం = ఈ దుఃఖము, విషమే = సంకటసమయమందు, కుతః = ఎందువలన, త్వా = నిన్ను, సముపస్థితం = పొందినది.

తా. అర్జునా, పామరులకు సహజమైనదియు, స్వర్గ (పరలోక) విరోధియు, అపయశస్సునకు కారణము నైనయీదుఃఖమకాలమునం దెందులకు నీకు సంభవించినది ?

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వ య్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప॥ 3

టీ. పార్థ = అర్జునా, క్లైబ్యం = అధైర్యమును, మాస్మగమః = పొందకుము, త్వయి = నీయందు, ఏతత్ = ఇది, న ఉపపద్యతే = తగదు, హేపరన్తప = శత్రువులను దపింపఁజేయు అర్జునా. క్షుద్రం = తుచ్ఛమైన, హృదయదౌర్బల్యం = మనస్సునందలిదైన్యమును, త్యక్త్వా = విడిచి, ఉత్తిష్ఠ = లెమ్ము.

తా. అర్జునా, భయమును జెందకుము. ఇది నీకు యుక్తము కాదు. పరంతపా, తుచ్ఛమైన యీమనోదైన్యమును వదలి యుద్ధము చేయుటకు లెమ్ము.

అర్జున ఉవాచ=అర్జునుఁడు చెప్పెను :

4
శ్లో॥ కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
4
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హౌ వరిసూదన॥ 4

టీ. అరిసూదన=ఆశ్రితశత్రునిరసనా, మధుసూదన=కృష్ణా, పూజార్హౌ=పూజింపఁదగిన, భీష్మం=పితామహుఁడగుభీష్మునిని, ద్రోణంచ=ఆచార్యుఁడగు ద్రోణునిని, అహం=నేను, సంఖ్యే=యుద్ధమునందు, ఇషుభిః-బాణములచేత-కథం=ఎట్లు, ప్రతియోత్స్యామి=ఎదిరించి యుద్ధము చేయుదును.

తా. మధుసూదనా, పూజార్హులగు భీష్మద్రోణులపయి బాణప్రయోగము చేసి నే నెట్లు ప్రతియుద్ధము చేయుదును?

శ్లో॥ గురూ నహత్వా హి మహానుభావాన్ ।
5A
*శ్రేయ శ్చర్తుం భైక్ష మపీహ లోకే ।
హత్వాఽర్థకామాంస్తు గురూ నిహైవ ।
5B
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్॥ 5

టీ. మహానుభావాన్ = గొప్పప్రభావము గల, గురూన్ = పెద్దలను, అహత్వా=చంపక, ఇహ లోకే=ఈలోకమునందు, భైక్షమపి=భిక్షాచరణమైనను, చర్తుం=ఆచరించుట, శ్రేయః=మేలుకదా

---

*శ్రేయోభోక్తుం (పాఠాన్తరం) - భైక్షం = భిక్షాన్నమును, భోక్తుం = భుజించుట.

అర్థకామాన్ = భోగార్థములందు మిక్కిలి యాసక్తి గలయట్టి, గురూన్ = గురువులను, హత్వాతు = సంహరించియో, ఇహైవ = ఇచ్చటనే-వా రనుభవించినచోట్లనే, రుధిరప్రదిగ్ధాన్ = వారిరక్తముచేఁ బూయఁబడినవి యగు, భోగాన్ = భోగములను, (కథం) భుఞ్జీయ = (ఎట్లు) అనుభవింతును.

తా. మహానుభావులును నాకు గురువులు నైన భీష్మద్రోణాదులను జంపుటచే లభించెడి భోగముల ననుభవించుటకంటె వారిని జంపక భిక్షాచరణ మైనను చేయుటయే మేలు. ఏ లనఁగా వారు విరక్తులు కారు; మనవలెనే భోగములందు మిక్కిలి యపేక్ష గలిగి యున్నవారు. అట్టిగురువులను జంపితిమా, వారి భోగముల ననుభవించునప్పు డెల్ల నవి నెత్తుటఁ దడిసిన యాగురువులను జ్ఞప్తికిఁ దెచ్చుటచే నవియును నెత్తుటఁ దడిసినవానివలెనే యసహ్యములుగాఁ దోఁచును. కాన వానివలన ఇహలోకసుఖమును లేదు. వా రనుభవించుచుండిన భోగములనే వా రుండిన తావులయందే కూర్చుండి యెట్లనుభవింతును ?

శ్లో॥ న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః ।
యా నేవ హత్వా న జిజీవిషామః ।
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ 6

టీ. నః = మనకు, కతరత్ = ఏది, గరీయః = శ్రేష్ఠమో, ఏతత్ = దీనిని, న విద్మః = ఎఱుఁగకున్నాము. జయేమ యద్వా = మనమే జయింతుమో, నః = మనలను, జయేయుః యదివా = వారే జయింతురో, యాన్ = ఎవరిని, హత్వా = చంపి, నజిజీవిషామః = బ్రదుక నిచ్ఛగింపమో, తేధార్తరాష్ట్రాః ఏవ = అట్టి దుర్యోధనాదులే,

ప్రముఖే = ఎదుట, మనలను జంపఁగోరినవారై తాము మనచేఁ జచ్చుటకనువుగా, అవస్థితాః=నిలిచియున్నారు.

తా. యుద్ధము చేయుట మేలో మానుట మేలో, మనమే జయింతుమో వారలకే జయము కలుగునో యెఱుఁగఁజాలము. ఎవ్వరిని వధియించినపిదప మనము బ్రదికియుండఁగోర నేరమో అట్టి భీష్మదుర్యోధనాదులు యుద్ధసన్నద్ధులై కట్టెదుట నిలిచియున్నారు. (అట్టివారిని జంపుటకంటె వారిచే చంపఁబడుట మేలని నాకు దోఁచుచున్నది.)

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః ।
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితంబ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ 7

టీ. కార్పణ్య...స్వభావః–కార్పణ్య=(వీరిని జంపి మన మెట్లు జీవింతుమనెడి) మనోదైన్యము చేతను, దోష = కులక్షయమువలనఁ గలుగుదోషము చేతను, ఉపహత=కొట్టఁబడిన, స్వభావః=స్వభావము గలవాఁడ నగు, (అహం=నేను), ధర్మసమ్మూఢచేతాః=ధర్మమునందు సందియముపొందినమనసుగలవాడనై, త్వాం=నిన్ను, పృచ్ఛామి = అడుగుచున్నాను, యత్=ఏది, శ్రేయః=మేలు అని, నిశ్చితం=నిశ్చయింపఁబడినది, స్యాత్=అగునో, తత్=దానిని, మే=నాకు, బ్రూహి=చెప్పుము. తే=నీకు, అహం=నేను, శిష్యః=శిష్యుఁడను-శిక్షకు తగినవాఁడను, త్వాం=నిన్ను, ప్రపన్నం = శరణుజొచ్చిన, మాం=నన్ను, శాధి=శాసింపుము.

తా. స్వజనమును జంపెద నని మనస్సు దీన మగుటవలనను కులక్షయమగు ననుభయమువలనను స్వాభావికమగు నాధైర్యము

చెడఁగా, ధర్మ మిగి యని తెలియక మనస్సున సందియము పొంది
7
యున్నాడుగుచున్నాను. ఏది నిశ్చయముగా శ్రేయస్కరమై యుండునో
దానిని నాకుఁ జెప్పుము. నీకు నేను శిష్యుఁడను. నిన్ను శరణము
జొచ్చితిని గాన శాస్త్రార్థరహస్య ముపదేశించి యిట్లు చేయుము
అట్లు చేయకుము అని నన్ను శిక్షింపుము.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా ।
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్ ।
అవాప్య భూమా వసపత్న మృద్ధం ।
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్॥ 8

టీ. భూమౌ=భూమియందు, అసపత్నం = శత్రువులు లేనట్టి
దియు, ఋద్ధం = సమృద్ధమైనదియు నగు, రాజ్యం = రాజ్యమును,
సురాణాం = దేవతలయొక్క, ఆధిపత్యంచ = ఆధిపత్యమునుగూడ,
అవాప్య అపి=పొందియును, ఇన్ద్రియాణాం=ఇంద్రియములకు, ఉచ్ఛో
షణం = అత్యంతసంతాపకరమయిన, మమ=నాయొక్క, శోకం =
దుఃఖమును, యత్ = ఏది, అపనుద్యాత్ = పోఁగొట్టునో, (తత్ =
దానిని,) న ప్రపశ్యామి హి=కానకున్నానుగదా.

తా. నిష్కంటకమును సమృద్ధము నైనట్టిమహీరాజ్యము
మాత్రము కాదు; దేవాధిపత్యము నయితము లభించినను, బంధు
వధోద్యోగమున నింద్రియముల శోషింపఁజేయుచున్న నాశోక మేవిధ
మునఁ దొలఁగునో అట్టియుపాయ మెద్దియు నాకుఁ గానఁబడకున్నది.

సఞ్జయ ఉవాచ=సంజయుఁడు పలికెను :

8 8
శ్లో॥ ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః ।
8
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవహ॥ 9

టీ. పరన్తపః=శత్రుసంహారకుఁడైన, గుడాకేశః=అర్జునుఁడు, హృషీకేశం (ప్రతి)=శ్రీకృష్ణుని (గూర్చి), ఏవం=ఇట్లు, ఉక్త్వా=పలికి, న యోత్స్యే=యుద్ధముచేయను, ఇతి=అని, గోవిన్దం (ప్రతి) = కృష్ణునితో, ఉక్త్వా=చెప్పి, తూష్ణీంబభూవ=ఊరకుండెను, హ=ఆశ్చర్యము. [హృషీకేశుఁ డనుటవలన అర్జునుని హృషీకములను సదర్థములను వినుటకై పురికొల్పినాఁ డని తెలియునది.]

తా. శత్రుసంహారకుఁడైనయర్జునుఁడు శ్రీకృష్ణునిఁ గనుంగొని యీతెఱఁగునఁ బలికి యుద్ధముచేయ నని యూరకుండెను. ఏమాశ్చర్యము? భగవంతుఁడు చేయఁగోరిన భూభారావతరణకార్యమునందు నిమిత్తభూతుఁడైనయర్జునునికిఁ దగనిచోట శోకము గలిగెనని సంజయుఁడు శోకించుచున్నాఁడు.

అవ. ఇట్లు తగనియెడ, స్నేహమును కారుణ్యమును ప్రాప్తింపఁగా నర్జునుఁడు తనప్రకృతిని దప్పినవాఁడై క్షత్రియులకు యుద్ధము పరమధర్మ మయ్యును అధర్మమని తలఁచుచు ధర్మమిది యనియు అధర్మమిదియనియుఁ దెలియక వ్యాకులతచెంది ధర్మమును దెలియఁగోరి శరణాగతుఁడు కాఁగా నతని నుద్దేశించి, శరణాగతవత్సలుఁడును భగవంతుఁడు నైన శ్రీకృష్ణుఁడు, 'ఆత్మ నిత్య మైనది భగవదధీనమైనది' అనెడి శుద్ధాత్మస్వరూపవిషయ మైనజ్ఞానముచేతను, 'ఫలాభిసంధిరహితముగ యుద్ధము సేయుట అట్టి ఆత్మస్వరూపప్రాప్తికి ఉపాయ మగును' అనెడిజ్ఞానముచేతను తప్ప తక్కినవిధమున వీని యజ్ఞానము ఉపశమింప దని యోచించి యధ్యాత్మ శాస్త్రము నవతరింపఁ జేయువాఁ డయ్యెను.

9A

శ్లో॥ త మువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।
సేనయో రుభయో ర్మధ్యే విషీదన్త మిదం వచః॥ 10

టీ. హే భారత=ఓధృతరాష్ట్రా, హృషీకేశః = శ్రీకృష్ణుఁడు, ఉభయోః సేనయోః = రెండుసేనలయొక్క, మధ్యే = నడుమ, విషీదన్తం=దుఃఖించుచున్న, తం=ఆ యర్జునునిఁగూర్చి, ప్రహసన్నివ = పరిహాసవాక్యమును పలుకుచున్నవానివలె, ఇదం వచః= ఈ చెప్పఁబోవు వాక్యమును, ఉవాచ=పలికెను.

తా॥ రాజా, (ఇట్లు అర్జునుఁడు దేహము వేఱు ఆత్మ వేఱు అని దేహాత్మల యథార్థస్వరూపమును వాని పరస్పర భేదమును దెలియనందున శోకము నొందెను; మఱి, 'దేహమునకంటె ఆత్మ వేఱు' అని ఆరెంటి స్వరూపములను పరస్పరభేదమును తెలిసి చెప్పెడు ధర్మములను మాటాడెను. ఇట్లు పరస్పరవిరుద్ధము లైనగుణములతోఁ గూడినవాఁడై, తటాలున ప్రయత్నము మాని, యుద్ధమునకుద్యుక్తము లైన) రెండు సైన్యములనడుమ దుఃఖపడుచున్న యర్జు
9C
నునిఁ జూచి, పరమపురుషుడగు భగవంతుడు పరిహాసవాక్యము లాడువానివలె (ఆత్మయొక్కయు పరమాత్మయొక్కయు యథార్థస్వరూపమును బొందుట కుపాయము లైన కర్మయోగ భక్తియోగములు గలదియు 'న త్వేవాహం జాతునాసమ్' అనుట మొదలుగా 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః' అను పలుకుఁ గలదియు నగు) ఈవాక్యమును జెప్పెను. 9B

శ్రీభగవానువాచ=భగవంతుడు చెప్పెను :

10 10
శ్లో॥ అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
10
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః॥ 11

టీ. త్వం = నీవు, అశోచ్యాన్ ప్రతి = శోకింపఁదగనివానిని గూర్చి, అన్వశోచః = దుఃఖించితివి, ప్రజ్ఞావాదాంశ్చ = ప్రజ్ఞ గలిగియున్న వాదములను, భాషసే=పలుకుచున్నావు, గతాసూన్=పోయిగి

ప్రాణములుగల శరీరములంగూర్చియు, అగతాసూన్ = ఆత్మలం గూర్చియు, పణ్డితాః=యథార్థస్థితి నెఱుంగువారు, న అనుశోచన్తి= దుఃఖింపరు.

తా. అర్జునా, నీవు శోకింపఁదగనివానింగూర్చి శోకించెదవు మఱి *'పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః' ఇత్యాదిగా దేహాత్మస్వభావముల నెఱిఁగి చెప్పెడు మాటలు పలికెదవు. దేహాత్మ స్వభావముల నెఱిఁగినవారికి నిందు శోకింపవలసిననిమిత్తము కొంచె మైనను లేదు. దేహాత్మస్వరూపములు దెలిసినవారు దేహము లనిత్య ములు గాన వానింగూర్చియు, ఆత్మలు నిత్యములుగాన వానిని గూర్చియు, దుఃఖింపరు. ఆత్మ వేఱైనది యని తెలియక వీరిదేహ ములనే ఆత్మగాఁ దలఁచి వీరిని జంపుచున్నానే యని శోకించుటయు, దేహమునకంటె ఆత్మ వేఱు అని తెలియుటచేఁ జెప్పునట్టి 'ధర్మము అధర్మము' అనుమాటలను పలుకుటయు, ననునిది నీయందు మిక్కిలి ప్రతిషిద్ధముగా కనఁబడుచున్నది. కాఁబట్టి నీవు దేహస్వభావము నెఱుఁగవు. దేహమునకంటె ఆత్మ వేఱై నిత్యమైనదనియు, అట్టి యాత్మప్రాప్తికిని ఉపాయము యుద్ధాదికమైన ధర్మమనియు నెఱుఁ గవు. ఈయుద్ధము ఫలాపేక్ష లేక చేసినయెడల నిది ఆత్మయొక్క యథార్థస్వరూపమును బొందుట కుపాయమగును. (ఆత్మకు జనన మరణములు లేనందున, దానికి జననముచేత కలుగుట గాని మర ణముచేత నశించుట గాని లేదు. కాఁబట్టి దానినిగుఱించి శోకింప నక్కఱలేదు. దేహమో కుండమొదలైనవానివలె అచేతనమై పరి ణామస్వభావము గలది గనుక దీనికి ఉత్పత్తివినాశనములు స్వాభావిక

* చూడు ౧ అధ్యా-౧౨ శ్లో-పితృలోకమునుండి ఆత్మలు పరలోకమునకుఁ బోవుట, పితృదేవతలగుట, పిండోదకములు గొనుట మొదలైనమాటలు దేహమున కంటె ఆత్మ వేఱై దానివలె నిచ్చటనే నశింపక నిత్యమై యుండునని దేహాత్మస్వరూప జ్ఞానమునే చెప్పునట్టిమాటలుగాఁ దెలియునది.

ములు. కాఁబట్టి దీనినిగూర్చియు శోకింప నక్కఱలేదు. ఇట్లు రెంటికిఁ గలస్వభావము లిట్టివని తెలియక వానినిగూర్చి దుఃఖించుచున్నావు.

11

అవ. దేహాత్మస్వభావములను చెప్పఁబూని మొదట ఆత్మస్వభావమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః।
న చైవ న భవిష్యామః సర్వే వయ మతఃపరమ్॥ 12

టీ. అహం = ఈశ్వరుఁడ నైననేను జాతు = ఒకప్పుడును, నాసం(ఇతి)తు = లేకుంటిని (అనునది), న ఏవ= లేనేలేదు, త్వం = జీవుఁడ వైననీవు, (నాసీరితి)న=(లేకుంటి వనునది) లేదు. ఇమే=ఈ, జనాధిపాః=జీవు లైనరాజులును, (నాస న్నితి) న = (లేకుండిరనునది) లేదు. వయం సర్వే = మన మందఱమును, అతఃపరం=ఇఁక మీఁదను, న భవిష్యామః (ఇతి) చ= లేకపోయెదము అనునదియును, న ఏవ = లేనేలేదు.

తా. సర్వేశ్వరుఁ డగునేను ఇప్పటికిఁ బూర్వ మనాదిగానున్న కాలమున నొకప్పుడును లేకున్నవాఁడను గాను. నాకు ఈశితవ్యులైన సమస్తక్షేత్రజ్ఞులలో నొకఁడ వగునీవును తక్కిన యీరాజులందఱును అట్లే మున్నెప్పుడును లేకున్నవారు గారు. నేనును మీరును అందఱమును ఇఁకమీఁద లేకుండుమనుట లేనేలేదు. (అనఁగా పరమాత్మయు సర్వేశ్వరుఁడు నగు నే నెట్లు నిత్యుఁడనుటకు సందేహము లేదో అట్లే క్షేత్రజ్ఞులైన యాత్మలు మీరును నిత్యులే యని తలంపవలయును.)

అర్జునుఁడు బంధువులను వధింపనోపక వారి దేహములే యాత్మలనియు, అవి బాణాదిహతములై నశించునని తలఁచుటచే అనిత్యము

లనియు, అజ్ఞానముచే మోహితుఁడుకాఁగా వానికిఁ గలిగిన యా మోహమును దొలఁగించుటకై భగవంతుఁ డాయాత్మల పారమార్థిక నిత్యత్వమును 'నత్వేవాహమ్' మొదలుగా ఉపదేశింపఁబూనిన సమయమున 'అహమ్', 'త్వమ్', 'ఇమే', 'సర్వే', 'వయమ్' అని తన్నును దక్కినవారిని వేఱు వేఱ చెప్పెను; కాన తనకును ఆత్మలకును, ఆత్మలలో ఒకటికొకటికిని, భేదము పారమార్థిక మైన దని భగవంతుఁడే చెప్పినాఁ డని తెలియుచున్నది.

*(శంకరీయులు) ఇందులకు 'దేహభేద మనువర్తించుటంబట్టి అట్లు వేఱువేఱ చెప్పినాఁడే కాని యాభేదమునుబట్టి కా'దన్నచో, దేహ

* శంకరులు బ్రహ్మ మొకటితప్ప మఱేదియును లేదు. బ్రహ్మము, మాయ ఆవేశింపఁగా, తన్ను పెక్కువస్తువులుగా భ్రమించుచున్నది కాన జగమునందు రాముఁడు సోముఁడు ఇత్యాదులందలి చిత్తులును (ఆత్మలును), దేహము ఘటము పటము ఇత్యాదులైన యచిత్పదార్థములును (అనఁగా బ్రహ్మము తప్ప తక్కిన నానావస్తు భేదములన్నియు) మిథ్యలు; భ్రాంతికల్పితములు. దేహములు మిథ్యలయ్యును, పైకి అవి పెక్కులు వేఱువేఱుగాఁదోఁచుటచే దానింబట్టి వ్యవహారవశమున భగవంతుఁడు 'నేను' 'నీవు' అని యిట వేఱువేఱ నిర్దేశించినాఁడుగాని దానిచే ఆత్మలు పెక్కులు వేఱువేఱ కలవని తలఁపగాదు. దేహభేదములు పెక్కులు కనఁబడుటయు అజ్ఞానమూలమైన భ్రాంతియే. జ్ఞానముదయింపఁగానే యీ భేదములన్నియు నశించి బ్రహ్మ మొక్కటియే యంతటను గనుపట్టును అనెదరు. భాస్కరులు, బ్రహ్మ మొక్కటియే. దానినుండి అచిత్తు పుట్టి దేహాదిరూపముగా ఉపాధులై బ్రహ్మముయొక్క యంశములను ఆవరింపఁగా, అట్లావరింపఁబడిన బ్రహ్మాంశములే, భ్రాంతివలన, జీవులుగా తోఁచును గాని జీవులు బ్రహ్మముకంటె వేఱుగావు. ఇట్లు జీవులు మిథ్యలయ్యును వానియుపాధులైన దేహములు సత్యములై పెక్కు వేఱువేఱుగానున్నవి గాన ఆయుపాధుల భేదముఁబట్టి 'నేను' 'నీవు' అని వేఱువేఱనిర్దేశము కలిగె' నందురు. రామానుజులు, జగత్తునందలి భేదము లన్నియు సత్యములే. ఏదియు మిథ్యగాదు. కనుక బ్రహ్మము వేఱు; జీవులు వేఱు. జీవులు పెక్కులు; పరస్పరమును వేఱువేఱు. కావుననే 'నేను' 'నీవు' అని వేఱునిర్దేశము తగియున్నది. శంకరులు, కేవల దేహభేదమునుబట్టి యట్లు చెప్పఁబడుటచే ఆత్మభేదము లేదనుట సరికాదు. అర్జునుఁడు భ్రాంతుఁడై యున్నవాఁడు. వానికి, వారిమతము చొప్పున భ్రాంతికల్పితములైనదేహముల భేదముంబట్టి 'నేను'

భేదమును వారిమతముచొప్పున మాయాకృతము గాన అపారమార్థిక
మైనది. పారమార్థికవిషయ ముపదేశింపవలసినప్పుడు అపారమార్థిక
దేహభేదమును ఈశ్వరుఁడు పరిగణింపఁడు. (భాస్కరీయులు) "దేహా
ద్యుపాధి సత్య మగుటంబట్టి దేహభేదము పారమార్థికముగాన దానిం
బట్టి యట్లు వేఱువేఱు నిర్దేశించె" నన్నచో, దేహభేదము సత్య
మైనను దానింబట్టి తోఁచు ఆత్మభేదము అసత్యము గనుక తత్త్వోప
దేశ సమయమున తాత్త్వికము కాని యాభేద మేర్పడునట్లు 'నేను
నీ'వని నిర్దేశించు ననుట యొప్పదు. శ్రుతియు "*నిత్యో నిత్యానాం
చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్"
(నిత్యులై యనేకులైన చేతనులకు, నిత్యుఁడగు చేతనుఁ డొకఁ
డెవ్వఁడో వాఁడు కోరికల నొడగూర్చుచున్నాఁడు) అని ఆత్మలకు
భేదము స్వాభావిక మైనదిగా చెప్పుచున్నదే కాని సత్యోపాధిచేఁ
గాని మిథ్యోపాధిచేఁగాని కల్పితమైన దనలేదు.

"అజ్ఞానకృతమైన భేదదృష్టిచే అట్లు 'నేను నీవు' అను భేదము
నిర్దేశించినాఁ"డన్నచో, ఇచ్చట నుపదేశించువాఁడు పరమపురు
షుఁడు. పరమార్థమైనది వానిదృష్టి కవశ్యము గోచరింపక మానదు.

---

'నీవు' అనుట మఱింత భ్రాంతికరము, వానిభ్రాంతి నివర్తింపవలయును. 'నేను'
నీవనుట భ్రాంతినివర్తించుటకై పఠించిన మంత్రముగాదు. మంత్రమేని దానియభి
ప్రాయ మెట్లైనను గావచ్చును. భ్రాంతినివృత్తికై యుపదేశించిన తత్త్వవాక్యము
కాన యట్లు వేర్వేఱ నిర్దేశించినందుల కాత్మభేదము సత్యమై యుండవలయును.
భాస్కరులు చెప్పునదియు సరిగాదు. వారిమతముచొప్పున దేహభేదము సత్యమైనను
ఆత్మలు మిథ్యలుగావున ఆత్మభేదమును మిథ్యయే. కాన తత్త్వముపదేశించునపుడు
'నేను' 'నీవు' అని వేర్వేఱ నిర్దేశించుట ఆత్మభేదము సత్యమని అర్జునునకు తోఁపించును
గాన అతాత్త్వికమైనయట్టివాక్యము భగవంతుఁడు చెప్పఁడు. కనుక ఆత్మలు
పెక్కులై పరస్పరము వేర్వేఱై యుండిననే నేను నీవు అని వేఱువేఱనిర్దేశించుట
చెల్లును. కాన ఆత్మల బహుత్వమును భేదమును సిద్ధము.

* శ్వేత-ఉ. ౬-౧౩.

కాన †నిర్విశేషమై, కూటస్థమై, నిత్యమై, చైతన్యరూపమై యున్న యాత్మస్వరూపము సాక్షాత్కరించుటవలన నతనికి అజ్ఞానమును (అవిద్యయు) తత్కార్యమైన భేదభ్రమయును నివర్తించియుండఁగా, అజ్ఞానమువలన 'నేను' 'నీవు' అని భేదమును కనుఁగొనుటయు, తన్మూలమున తన్ను గురువుగాను ఎదిరిని శిష్యునిఁగాను దలఁచి యుపదేశాది వ్యాపారములు సేయుటయు నొప్పవు.

'భగవంతునికిఁ గలిగియున్న యద్వైతజ్ఞానముచే భేదజ్ఞానము బాధితమై పోయినను, వాసనావశమున మరల ననువర్తించుచున్నది. కాన బాధితానువృత్తిరూపమైన (అనఁగా బాధింపఁబడియు మరల ననువర్తించునట్టిదైన) యాభేదజ్ఞానముచే ఈశ్వరుఁడు 'నేను' నీవు' అను భేదము నిర్దేశించినాఁడు. ఏనను ఒకవస్త్రము కాలిపోయినపిదప నది తనవస్త్రాకారమును విడువకుండినను పూర్వమువలె నెట్లుప యుక్తము కానేరదో యట్లే భేదజ్ఞాన మద్వైతజ్ఞానముచే బాధితమైన పిదప వాసనారూపముగా అనువర్తించినను పూర్వమువలె పరమ పురుషునికి బంధకము కానేరదు'' అన్నయెడల నిదియొప్పదు. ఎట్లన, ఎండమావులను జూచి నప్పుడు మొదట జలజ్ఞానముగలిగియు పిదప నది జలముకాదనెడి జ్ఞానముచే ఆ జలజ్ఞానము బాధితమగును. అట్లు బాధితమై యది యనువర్తించియు నాయెండమావులనుండి జలము తెచ్చుకొనుట మొదలైన ప్రవృత్తుల నది కలిగింపదు. అట్లే యిందును అద్వైతజ్ఞానముచే భేదజ్ఞానము బాధితమైనపిదప అనువర్తించు చున్నను, అది మిథ్యార్థములను గుఱించినదే యగునని నిశ్చయ ముండుటవలన, అది మిథ్యాభూతులైనశిష్యాదులనుగుఱించి ఉప దేశాదిప్రవృత్తులను గలిగింపనేరదు. మఱియు నీశ్వరునికి మొదట అజ్ఞానముండిననేకదా అది శాస్త్రాధిగత తత్త్వజ్ఞానముచే పిదప

† సజాతీయ విజాతీయ స్వగతభేదరహితము నిర్విశేషము. నిర్వికారమైనది కూటస్థము.

బాధితానువృత్తి యగును. ఈశ్వరున కజ్ఞానమున్నదనుట
*'యస్సర్వజ్ఞస్సర్వవిత్', †'పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే స్వాభా
వికీ జ్ఞాన బలక్రియాచ' §'వేదాహం సమతీతాని వర్తమానాని
చార్జున। భవిష్యాణి చ భూతాని మాంతు వేద న కశ్చన॥'
ఇత్యాదిశ్రుతిస్మృతులకు విరుద్ధము. కనుక అజ్ఞానమే లేనప్పుడు
అది బాధితానువృత్తి యగు ననుటయే యశక్యము.

మఱియు పరమపురుషునికిని ఇప్పటి గురుపరంపరకును 'ఆత్మ
స్వరూపము ఒక్కటియే; దానికి రెండవది లేదు' అను నిశ్చయ
ముండునేని, భేదజ్ఞానము అనువర్తించినను, రెండవది లేనిదిగా తాము
నిశ్చయించిన యాత్మస్వరూపమును రెండవవాని కెవని కుపదేశిం
తురు ? అని యడుగవలసియున్నది. "నిజముగా రెండవది లేకున్నను,
ప్రతిబింబమువలె తోఁచుచున్న అర్జునుఁడు మొదలైన రెండవవారి
కుపదేశింతు" రన్నచో, వెఱ్ఱిలేనివాఁ డెవఁడుగాని మణులు కత్తులు
అద్దములు మొదలైనవానియందుఁ దోఁచుచున్న తనబింబములను
జూచి యవి తనకంటె వేఱు కావని తెలిసి వాని కేయర్థమునుగాని
యుపదేశింపఁ డనఁగా, ఇఁక మోక్షార్థము నుపదేశించుటయే కలు
గదు. బాధితానువృత్తి గలుగునని యొప్పుకొని యింతవాదము
సేయనేల ? మొదట బాధితానువృత్తి గలుగు నని చెప్పుటయే వారికి
నొప్పదు. ఎట్లన, ఆత్మవ్యతిరిక్త భేదజ్ఞానమునకు (అనఁగా ఆత్మకంటె
వేఱైనవానిని తోఁపించుజ్ఞానమునకు) కారణము అనాదిదోషము.
అది బాధకమైన అద్వితీయాత్మజ్ఞానముచేత, (అనఁగా ఆత్మకంటె
రెండవది లేదనుజ్ఞానముచేత) నశించినదై యున్నది. ఇట్లు అద్వితీ
యాత్మజ్ఞానముచే నాశితమై కారణమైనదోషమే లేకుండఁగా
తత్కార్యమైన భేదజ్ఞానము ఘటించుట యెట్లు ? అది ఘటింపనప్పుడు
బాధితానువృత్తి యగుటయే యెక్కడిది ?

* ముం. ఉ. ౧-౧-౯; ౨-౨-౭. † శ్వే. ఉ. ౬-౮.

“చంద్రుఁ డొకఁడయ్యును కంటియందలి తిమిరాదిదోషములచే ఇద్దరు చంద్రులు గనఁబడుదురు. చంద్రుఁ డొకఁడే యనుజ్ఞానముచే ద్విచంద్రజ్ఞానము బాధిత మయ్యును అనువర్తించునట్లు, అద్వైతజ్ఞానముచే భేదజ్ఞానము బాధితమయ్యు ననువర్తించు” నన్నచో, చంద్రైకత్వజ్ఞానముచే ద్విచంద్రజ్ఞానము బాధిత మైనది కాని, ఆ ద్విచంద్రజ్ఞానమునకుఁ గారణమైన తిమిరాదిదోషము పారమార్థికమైనది గాన బాధితము కాకుండును. కనుక, పారమార్థిక కారణ ముండువఱకును తత్కార్యమైన ద్విచంద్రజ్ఞానము బాధితాను వృత్తియగుట (అనఁగా బాధితమయ్యు ననువర్తించుచుండుట) యుక్తమే. అట్లు అనువర్తించుచున్నను అది చంద్రుఁ డొకఁడే యను ప్రబలప్రమాణముచే బాధిత మగుటవలన ఏమియుఁ జేయ నేరదు. ఇందో, భేదజ్ఞానమును దానివిషయములును దానికారణమును అన్నియు అపారమార్థికములు. కనుక వస్తుయాథాత్మ్యజ్ఞానముచే అపారమార్థికములైన భేదజ్ఞానమును దానివిషయములును దాని కారణమును అన్నియు నశించియుండఁగా ఎట్లును బాధితానువృత్తి కలుగనేరదు. కారణసహితముగా నశించిన పిదప కార్య మెట్లుండును ? కాఁబట్టి సర్వేశ్వరునికిని ఇప్పటి గురుపరంపరకును తత్త్వజ్ఞాన ముండెనా గురుశిష్యాదిభేదదర్శనముగాని తత్కార్యములైనయుపదేశాదులుగాని కలుగవు; భేదదర్శన ముండెనా దానికి హేతువైనజ్ఞానమును వారికుండును గాన ఆయజ్ఞత్వముంబట్టి వారుపదేశము సేయుట యెంతయుఁ గలుగనేరదు.

[“మఱియు బ్రహ్మ మొకటియే అవిద్యావశ బలమై జీవుఁ డగును. కావున జీవుఁ డొక్కఁడే కాని పెక్కండ్రు లేరు. కలఁ గనువానికి కలలోఁ గనఁబడు పురుషులవలె ఆ యేకజీవునికిని భ్రాంతివలన అనేక జీవులు ప్రతిభాసింతురు. కల గన్నవానికి మేలుకొనుటచే కలలోఁ గనబడినవెల్ల బాధితము లగునట్లు ఆ యేకజీవునికి ఒకప్పుడు గలుగు

తత్త్వజ్ఞానముచే వానికిఁ గనఁబడెడి యీ మిథ్యాప్రపంచము బాధితమగును" అందురు. అట్లైన నుపదేశముసేయు వాసుదేవాది గురువులెవరు ? ఆయేకజీవుఁడా ? లేక వానిచేఁ జూడఁబడు మఱియొకరా? మఱి యర్జునాది శిష్యులు అతఁడా ? లేక అతనిచేఁ జూడఁబడు మఱియొకరా ? అని యడుగఁదగును. జీవభూతుఁడైన యీ బ్రహ్మమే గురుఁడేని అప్పు డట్టి గురువునకుఁ గల అద్వితీయాత్మవిజ్ఞానమువలననే (అనఁగా తనకంటె రెండవది లేదను నెఱుకవలననే) ఆబ్రహ్మమునకుఁ గలయజ్ఞానమును తత్కార్యములైన శిష్యాచార్యత్వాది భేదములును నశింపగా, అట్లు నశించిన శిష్యునిఁగూర్చి యుపదేశము సేయుటవలనఁ బ్రయోజనమేమి ? ["గురుఁ డాయేకజీవుఁడు కాఁడు గాని వానిచేఁ జూడఁబడు మఱొకఁడగును. జీవుఁ డొకఁడే కలఁడు గాన వానిచేఁ జూడఁబడు మఱొకఁడైన యీగురువును అతని అద్వైతజ్ఞానమును కల్పితములే యగును. అయినను కలఁగనువానిచే కలయందు కల్పితుఁడైన యొకపురుషునియొక్క విజ్ఞానమువలన ఆకల బాధితము కానట్లు ఆయేకజీవునిచే కల్పితమైన యీ గురువుయొక్క విజ్ఞానముచే ఆజీవునికిఁ దోఁచు మిథ్యాప్రపంచము బాధితము కానేరదు. అది బాధితమగుటకై కల్పితుఁడైన యీగురువు తనజ్ఞానము నుపదేశింపవలసి యున్నది గాన ఉపదేశము నిష్ప్రయోజనము గాదు" అన్నచో, ఉపదేశార్థమైనయీ] గురువును అతని జ్ఞానమునుఁ గల్పితములేని [శిష్యుడును ఆయేకజీవుఁడే యనుటకు ప్రమాణము లేదు గాన] శిష్యుఁడును వాని యద్వైతజ్ఞానమును [నిజము లనుటయెట్లు ? అవియును] గల్పితములే యగునుగాన శిష్యుని యొక్క కల్పితజ్ఞానమును వానియజ్ఞానమును నివర్తింపఁజేయనేరదు. "శిష్యుని యద్వైతజ్ఞానము కల్పితమైనను పూర్వమున్న భేదజ్ఞానమునకు విరోధి యగుటచే దానిని నివర్తింపఁజేయు" నన్నచో నప్పు డాచార్యజ్ఞానమును అట్టిదే యగును. అదియే యీభేదజ్ఞాన,

మును నివర్తింపఁజేయును. అనఁగా జీవుఁ డొక్కఁడే కాన ఆచార్యు నికిఁ గలయద్వైతజ్ఞానముచేతనే జీవునకు పూర్వ మున్నభేదజ్ఞానము నివర్తింపఁగా అంతటను గల శిష్యాచార్యత్వాదిభేదము లన్నియు నశించునుగాన శిష్యుని కుపదేశమే నిరర్థకమగును. ఇఁక శిష్యుని జ్ఞానముతోఁ బని యేమి? కాన అద్వైతసిద్ధాంతము అనుపపన్నము.

12

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారంయౌవనంజరా।
తథా దేహాన్తరప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి॥ 13

టీ. అస్మిన్ దేహే = ఈ ఒక్క దేహమునందు వర్తించునట్టి, దేహినః = ఆత్మకు, కౌమారం = బాల్యము, యౌవనం=యౌవనము, జరా=ముసలితనము, యథా (భవన్తి)=ఎట్లు కలుగుచున్నవో, తథా= అట్లు, దేహాన్తరప్రాప్తిః = మఱియొకశరీరమును బొందుటయును, (భవతి=కలుగుచున్నది), తత్ర=ఆవిషయమునను, ధీరః=బుద్ధిమంతుఁడు, నముహ్యతి=మోహము నొందఁడు-భ్రమింపఁడు.

తా॥ ఒకదేహమునందలి ఆత్మకు ఆదేహమునందే బాల్యము యౌవనము వార్ధకము ఎట్లు సంభవించునో, అట్లే దేహాంతరము గలుగుటయును నిశ్చయము. ఈవిషయమునందు బుద్ధిమంతుఁడు భ్రమింపఁడు.

బుద్ధిమంతుఁడు, ఒకశరీరమునకు బాల్యావస్థ పోయి మఱి యౌవనాద్యవస్థలు కలుగునపుడు ఆశరీరమునందుండు ఆత్మ స్థిరమైన దనుబుద్ధితో అది నశించినది యని దుఃఖింపక యె ట్లుండునో, అట్లే ఆదేహము పోయి మఱియొక దేహము కలుగునపుడును ఆ యాత్మ అట్లు నశింపకయె యున్న దని తలఁచి దుఃఖింపఁడు. బాల్యాద్యవస్థలు దేహమునుబట్టి ఆత్మకు సంభవించునట్లు జననమరణములును దేహమునుబట్టియే ఆత్మకు కలుగుచున్నవి. కాబట్టి ఆత్మ నిత్యమగుటచే ఆత్మవిషయమై దుఃఖింపఁగూడదు. మఱి చేయవలసిన దేమి

యనఁగా:—నిత్యములే యగు ఆత్మలు అనాదికర్మవశ్యములై ఆయా కర్మములకు తగిన దేహములను బొందుచుండును. ఆయా దేహము వలన ఆత్మకుఁ గలిగినబంధము నివర్తించుటకొఱకు ఆ దేహముచేతనే *శాస్త్రీయములై స్వవర్ణోచితము లగుయుద్ధాది కర్మములను ఫలాపేక్ష విడిచి యాచరించుచుండవలయును. అప్పుడు ఇంద్రియములు వానివాని విషయములతో సంబంధించుటచేత శీతోష్ణాదులవలన సుఖదుఃఖములు కలుగక మానవు అయినను, ప్రారంభింపఁబడిన యాకర్మలు ముగియువఱకును వానిని ఓర్చుకొనియే తీఱవలెను.

13
అవ. ఈయర్థమును అనంతరమే యిందు చెప్పుచున్నాఁడు.

14
శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
14
ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత॥ 14

టీ. కౌన్తేయ=అర్జునా. మాత్రాస్పర్శాః = శబ్దాదివిషయములతో శ్రోత్రాదీంద్రియములయొక్క సంబంధములు, శీతోష్ణసుఖదుఃఖదాః = చలి వేఁడి మొదలగు సుఖదుఃఖములను గలుగఁజేయునవి, ఆగమాపాయినః = రాకపోకలుగలవి, అనిత్యాస్తు = ప్రవాహరూపముగా ఎడతెగకుండునవిగావు (తస్మాత్ = కావుననే), భారత= అర్జునా, తాన్=వానిని, తితిక్షస్వ=ఓర్చుకొనుము.

తా. అర్జునా, శబ్దాదివిషయములతో ఇంద్రియములు సంబంధించినపుడు శీతోష్ణసుఖదుఃఖములుకలుగును. అవి వచ్చుచుఁ బోవుచు నుండునవి గాన బంధమునకు హేతువులైన కర్మములు నశింపఁగానే నివర్తించునవి, కాఁబట్టి యుద్ధాదులైన శాస్త్రీయకర్మములు ముగియు

---

* శాస్త్రీయము లనుటచే ఈశ్వరుని శాసనమునకు లోఁబడనిచో దండము గలుగునవియు, స్వవర్ణోచితములనుటచే యుద్ధాదులు విడిచి భైక్షమాచరింపరాదనియు, ఫలాపేక్ష విడిచి యనుటచే మోక్షముకొఱకనియుఁ దెలియునది.

వఱకు వానిని ధైర్యముతో *సహింపుము. అనఁగా, ఆత్మలు నిత్యములయ్యును అనాదికర్మవశ్యములైనవి. కనుక వానికి ఆయా కర్మములవలన ప్రాప్తమైన శరీరసంబంధముచేత విషయానుభవము కలుగునపుడు సుఖదుఃఖములు కలుగక మానవు. కాబట్టి వానిని సహింపుమని భావము.

పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనెడి పంచభూతములును వానిని ఆశ్రయించియుండెడి శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములును తన్మాత్రములచేఁ గలిగినవిగాన మాత్ర లని చెప్పఁబడుచున్నవి. వాని స్పర్శములు, చలువ వేఁడి మెత్తన పరుసన మొదలగు రూపములతో సుఖదుఃఖప్రదములుగా నుండును. వానికి ఇంద్రియములతోడి సంబంధములే "మాత్రాస్పర్శములు". తన్మాత్రములనఁగా భూతములయొక్క సూక్ష్మావస్థలు.

15

అవ. అట్లు ఓర్చుకొనుట యేల యనఁగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥ 15

టీ. హేపురుషర్షభ=ఓపురుషశ్రేష్ఠుడైన అర్జునా, ఏతే = ఈ విషయవాసనలు, సమదుఃఖసుఖం = సుఖదుఃఖములయందు సమబుద్ధి గల, ధీరం=ధైర్యవంతుఁడగు-నిశ్చలుఁడైన, యం పురుషం=ఏపురుషుని, న వ్యథయన్తి=బాధింపవో, సః హి = వాఁడుగదా, అమృతత్వాయ=మోక్షముకొఱకు, కల్పతే=సమర్థుఁడగుచున్నాఁడు.

తా. అర్జునా, ఏధీరుఁడు త్రోసిపుచ్చరాని దుఃఖమునుగూడ అది కర్మక్షయహేతువై అనుకూలమగుటవలన, సుఖముగనే తలఁ

---

* దుఃఖమును ఓర్చుకొనుటగలదుగాని సుఖమునుగూడ ఓర్చుకొనుటయన నేమి యనఁగా దానియందుపేక్ష గలిగి ఉబ్బు లేకుండుట యని తెలియునది.

చుచు, మోక్షసాధనముగా స్వవర్ణమునకుఁ దగిన యుద్ధాదికర్మము
లను ఫలాపేక్ష లేక చేయుచుండఁగా, వానిలోఁ గల్గు బాణపాతము
16 17
మొదలైన మృదుక్రూరస్పర్శములు పీడించినను నోర్చుకొనియుం
డునో వాఁడే నిత్యానందరూపమగు మోక్షమును సాధించును గాని
దుఃఖ మోర్వఁజాలని నిసుబోఁటివాఁడు గాడు. ఆత్మలు నిత్యము
లగుటచే వానిని రక్షింపవలసినది లేదు; మఱి వానికొఱకై చేయవల
సిన దింతయే యని భావము

అవ. 'గతాసూనగతాసూం శ్చ' అని యాత్మలు నిత్యము
లగుటచేతను, దేహములు స్వాభావికముగా నశించున వగుటచేతను
వానినిగూర్చి శోకింప నిమిత్తము లేదని పూర్వము చెప్పినదానినే
ఉపపాదించుచున్నాఁడు.

శ్లో॥ నాఽసతో విద్యతేభావో నాఽభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥ 16

టీ. అసతః = నశించుస్వభావము గలశరీరమునకు, భావః =
ఉండుట, నవిద్యతే= లేదు. సతః= నశింపనిజీవాత్మకు, అభావః= లేకుం
డుట, నవిద్యతే= లేదు. అనయోః = ఈ-కనఁబడుచున్న, ఉభయో
రపి= రెంటియొక్క (దేహాత్మలయొక్క) యును, అన్తః = నిర్ణయము,
తత్త్వదర్శిభిః=తత్త్వము నెఱిఁగినవారిచేత, దృష్టః= తెలియఁబడినది.-

తా. నశ్వరమైన దేహమునకు నిత్యత్వమును, స్థిరమైనయా
త్మకు అనిత్యత్వమును లేవు. అచిద్వస్తువగు దేహమునకు అసత్త్వమే
స్వరూపమనియు, చేతనమైన యాత్మకు సత్త్వమే స్వరూప మనియు,
తత్త్వదర్శను లైనవారు ప్రత్యక్షముగాఁ జూచినట్లు తెలిసి నిశ్చ
యించియున్నారు.

వినాశము నొందు స్వభావమే అసత్త్వము. అవినాశస్వభా
వము సత్త్వము. భగవంతు లగుపరాశరులును నిట్లే చెప్పియున్నారు.

* 'తస్మాన్న విజ్ఞానమృతేఽస్తి కించిత్ క్వచిత్ కదాచిద్ద్విజ వస్తుజాతమ్।' 'సద్భావ ఏవం భవతో మయోక్తో జ్ఞానం యథా సత్యమసత్యమన్యత్' (వి. పు. 2-12-45) 'అనాశీ పరమార్థశ్చ ప్రాజ్ఞైరభ్యుపగమ్యతే। తత్తు నాశి న సన్దేహో నాశిద్రవ్యోపపాదితమ్'(వి.పు, 2-14-24) 'యత్తు కాలాన్తరేణాపి నాన్యసంజ్ఞాముపైతి వై। పరిణామాది సంభూతాం తద్వస్తు నృప తచ్చ కిం' (వి.పు. 2-13-100) అని చెప్పియున్నారు. ఇందును 'అన్తవన్త ఇమే దేహాః' 'అవినాశి తు తద్విద్ధి' అని చెప్పఁబడుచున్నది. కావున అవినాశిత్వమును వినాశిత్వమునే సత్త్వము అసత్త్వము అని చెప్పుటకు హేతు వని తెలియుచున్నది. ఇచ్చట † సత్కార్యవాదము అసంగతముగాన ఈశ్లోకము

---

* దీనికి 'ద్విజా! కాఁబట్టి వస్తుసమూహమున, విజ్ఞానమైన ఆత్మ తప్ప తక్కినయేదిగాని యెచటఁగాని యెప్పుడు గాని వస్తు లేదు'. 'నీకు నేనిట్లు, జ్ఞానము-ఆత్మ-సత్య మనియు తక్కినవెల్ల అసత్య మనియుఁ జెప్పితిని' అని యర్థము. ఇట్లు, ఆత్మ సత్యమనియు దేహము అసత్యమనియు చెప్పఁబడుట తెలుపఁబడినది. సత్యము అసత్యము అనుటకు పరమార్థము అపరమార్థము అని అర్థములగును గాని అవి అనాశి వినాశి యని యర్థము లెట్లు? అనఁగా ఇందులకై 'అనాశీ పరమార్థశ్చ...ద్రవ్యోపపాదితమ్' అనాశియైనది పరమార్థము-అనఁగా సత్యము, అని ప్రాజ్ఞు లంగీకరింతురు. నశించు ద్రవ్యములతో నైనది నశించునది సందేహము లేదు' అనిరి. అనాశి యగుటయే పరమార్థ మనుటకును, వినాశి యగుటయే అపరమార్థ మనుటకును హేతు వని భావము. 'సత్యము అసత్యము' అనుటకు అర్థములుగాఁ జెప్పఁబడిన 'అవినాశి వినాశి' యనఁగా నేమి? యని శంక రాఁగా, అందులకై 'యత్తు కాలాన్తరేణాపి నాన్యసంజ్ఞాముపైతి వై। పరిణామాదిసమ్భూతాం తద్వస్తు నృప తచ్చ కిమ్॥' కాలాంతరమునను, వికారాదులచే మఱియొక పేరు నొందనిది వస్తువు. రాజా! అది యేది? అని వికారములను వానిచే వేఱు పేర్లను బొందునది అవస్తు వనియు, అట్టిది గానిది వస్తు వనియుఁ జెప్పఁబడినది. కాఁబట్టి వినాశి యనఁగా వికారమును బొందునది; అవినాశి యనఁగా వికారమును బొందనిది యని యర్థము. కాఁబట్టి దేహమునకు వికారిత్వమూలమైన వినాశిత్వమునుబట్టి అసత్త్వ మనియు, ఆత్మకు అవికారిత్వరూపమైన అనాశిత్వమును బట్టి సత్త్వ మనియు పేళ్లు చెప్పఁబడుచున్నవని గ్రాహ్యము.

† సత్కార్యవాదము సాంఖ్యప్రోక్తము. 'నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః' అనుటకు 'లేనిది కలుగఁజాలదు. ఉన్నది లేకపోవదు' అని యర్థము.

తత్పరము గాదు. దేహాత్మల స్వభావములను దెలియక మోహము నొందినవానికి ఆమోహము శాంతించుకొఱకు ఆరెంటియొక్క స్వభావము లైన నాశిత్వమును అనాశిత్వమును వివేచించి చెప్పఁదగును. అదియే 'గతాసూ నగతాసూంశ్చ' అని ప్రస్తావింపఁబడినది. దానినే 'అవినాశి తు తద్విద్ధి' 'అన్తవన్త ఇమే దేహాః' అని వెంబడిని ఉపపాదించుచున్నాఁడు. కావున ఉక్తార్థమే గ్రాహ్యము.

18

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్ ।
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి॥ 17

టీ. యేన=ఏ ఆత్మతత్త్వముచేత, ఇదంసర్వం = ఈప్రపంచమంతయు, తతం = వ్యాపింపఁబడినదో, తత్ = దానిని, అవినాశి = నాశము లేనిదిగా, విద్ధి= తెలిసికొనుము. అవ్యయస్య=నాశము లేని, అస్య = దీనికి, కశ్చిత్ = ఏపదార్థ మయినను, వినాశం=నాశమును, కర్తుం=కలుగఁజేయుటకు. నార్హతి=అర్హము గాదు-తగదు.

తా. చేతనమగు ఏయాత్మ తత్త్వము తా నతిసూక్ష్మమగుటచేత తనకు వ్యతిరిక్తమైన యీ యచేతనప్రపంచమునందంతటను వ్యాపించియున్నదో అట్టిదానికి నాశము లేదని యెఱుఁగుము. నాశము లేని యీయాత్మను నాశమునొందింప నెట్టిపదార్థమునకుఁగాని శక్యము గాదు.

నాశమును గలిగించునట్టిశస్త్రము జలము అగ్ని వాయువు మొదలైనవి తమచే నశింపజేయఁబడు వస్తువులయందు వ్యాపించి నాశముఁ గలిగించుచున్నవి. వ్యాపించి నాశముసేయునవి సూక్ష్మములుగాను వానిచే వ్యాప్తములై నాశమునొందునవి వానికంటె

---

ఇది యీప్రకరణమునకుఁ బొసఁగినది కాదు దేహాత్మస్వభావము తెలియంగక మోహితుఁడై యున్న యర్జునునికి ఇందు దేహాత్మవివేచనము లేదు. తన్మూలకమయిన శోకాపనోదనమును గలుగదు. కాన యిది అసంగతమని భావము.

స్థూలములుగాను నుండును. సూక్ష్మము స్థూలమునందు వ్యాపించి నాశము కలిగించునే కాని స్థూలము సూక్ష్మమునందు వ్యాపించి నాశము కలుగఁజేయఁజాలదు. ఆత్మతత్త్వము, తక్కిన యన్నిటియందును వ్యాపించునది గనుకనే వాని కన్నింటికంటె మిక్కిలి సూక్ష్మమై యుండును. తక్కినవి దానిచేత వ్యాప్తములగును గాన దానికంటె స్థూలము లగును. ఇట్లు వ్యాపకమై, కావుననే నిరతిశయసూక్ష్మమై, దానివలన వినాశమునకనర్హమై, యుండు ఆత్మతత్త్వమునకు, దానిచే వ్యాపింపఁబడినదగుటవలన దానికంటె స్థూలముగా నుండెడు తక్కిన యచేతనవస్తు వేదిగాని నాశముఁ గలిగింపఁ జాలదు. స్థూలము సూక్ష్మమును నశింపఁజేయఁ జాలదన్నప్పుడు సమ్మెట మొదలైనవి స్థూలములుగా నుండినను కుండ మొదలైనవానిని నశింపఁజేయలేదా యన్నచో అవి *వేగముతోఁ గూడినసంయోగముచే సూక్ష్మమైన

---

* 'వేగముతోడి సంయోగ' మనుటవలని సారస్యమేమనఁగా—సమ్మెటమీఁద ఉరకకుండను పెట్టఁగా ఆసంయోగమాత్రముచే కుండ నశింపదు. కాన సంయోగ మాత్రము నాశము గలిగింపఁజాలదు. సమ్మెటకు వట్టి వేగముమాత్రము ఉండి సంయోగము లేకున్నను కుండ పగులదు. కావున వేగమాత్రము నాశము కలిగింపదు. గడ్డిపోఁచకు వేగమును సంయోగమును ఉండినను కుండను పగుల్పఁజాలదు. సమ్మెట వంటి ద్రవ్యవిశేషముతో ఆవిగూడియుండినచో నది పగులును. కనుక కేవల వేగ సంయోగములు రెండును నాశకములు గావు. ద్రవ్యవిశేషముయొక్క వేగముతోడి సంయోగమును గావలయును. సమ్మెట వెనుకటిభాగము కుండతో సంయోగము నొందినను అది నశింపదు. దాని ముందటిభాగమే యట్లు సంయుక్తము గావలయును. కావున కాఠిన్యాదియుక్తమైన ద్రవ్యవిశేషపు భాగవిశేషముయొక్క వేగముతోడి సంయోగమే నాశకమగునని తెలియుచున్నది. ఇది సరికాని యిక్కడ సమ్మెట పగులఁగొట్టినదానికి వాయువును హేతువుగాఁ దెచ్చుట యెట్లు? అనవచ్చును. వేగము వలన వాయువు పుట్టుట ప్రత్యక్షసిద్ధము. మిక్కిలి కటువైనశబ్దము బిట్టుగా తాఁకగా వస్తువులు క్షోభించుటయుఁ దెలియుచున్నది గాన వాయువు ద్రవ్యంబులంజొచ్చి నాశముసేయుననుట యేర్పడుచున్నది. వాయు వంతటను గలదు. ఇటఁగూడ వాయు వున్నది గావున సమ్మెటతో వాయువిశేషము గూడి కుండకన్నను సూక్ష్మమగుటచే దానిని నాశము సేయుచున్న దనుట అంగీకరింపఁదగియున్నది. కొన్నియెడల సమ్మెట మొదలైనవి వేగము లేకయె ఆక్రమణాది మాత్రమున నాశము సేయుచున్నవి. అట్టి

వాయువును బుట్టించి తిన్మూలమున నాశముఁ గలిగించుచున్నది.
కాన ఆత్మతత్త్వము అవినాశి.

19 శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత॥ 18

టీ. నిత్యస్య=ఉత్పత్తిరహితుఁడును, అప్రమేయస్య = ప్రమాణముచేత నెఱుఁగరానివాఁడును, అనాశినః=నాశము నొందనివాఁడును నగు, శరీరిణః=శరీరి (ఆత్మ)యొక్క, ఇమే=ఈ దేహములు, అన్తవన్తః=వినాశస్వభావము కలవిగా, ఉక్తాః=(శాస్త్రములచేత) చెప్పఁబడినవి, తస్మాత్ = ఆ కారణమువలన, హేభారత = ఓయర్జునా, యుధ్యస్వ=యుద్ధము చేయుము.

తా. అర్జునా, నాశమునకనర్హుఁడు కావుననే నాశము లేనివాఁడును, దేహమువలె భోగ్యరూపమునఁ దెలియరానివాఁడును అగు ఆత్మ, తనపూర్వకర్మములను అనుభవించుకొఱకే పంచభూతసంఘాతరూపమైన యీ దేహములతోడి సంబంధము నొందునని శాస్త్రములు చెప్పుచున్నవి ఇట్లు దేహములు కర్మవశమునఁ బుట్టినవి. కావున ఆకర్మము ముగియఁగానే అవి నశించును. ఇట్టి ఆత్మనుగూర్చియు దేహములను గూర్చియు శోకము దగదు. కావున సంశయమువదలి యుద్ధము సేయఁ బ్రారంభింపుము.

*'దిహ ఉపచయే' అను ధాత్వర్థమునుబట్టి దేహములు ఉపచయరూపములైనవి-(అనఁగా పెరుఁగునట్టివి- అవయవములు గలవి

యొడల సమ్మెటయవయవముచే ఒత్తుడుపడినకుండయవయవవిశేషములు తమకంటె స్థూలమైన కుండ యితర భాగమును జొచ్చుటచే అని పగులుచున్నది. లేక వాయుపూరితమైనతిత్తి మొదలైనవానినుండి వాయువు వెడలువట్లు ఆయాక్రమణమువలన లోపలి వాయు వెడలుటం బట్టియు దానిచే కుండకు నాశము గలుగునని చెప్పవచ్చును.

* 'ఈశ్లోకమున దేహమునకు 'అన్తవన్తః' 'ఇమే' 'దేహాః' అని మూఁడు విశేషములుగలవు 'అన్తవన్తః' అనుటకు వినాశస్వభావములని యర్థము. 'ఇమే'

యనుట.) కావుననే ఈదేహములు అంతవంతములు-అనఁగా వినాశ స్వభావము గలవి.) ఎట్లనఁగా ఉపచయాత్మకములైన ఘటాదులు అంతవంతములుగాఁ గనుపట్టుచున్నవి. నిత్యుఁడైన శరీరికి (అనఁగా ఆత్మకు) ఈదేహములు కర్మఫలములను అనుభవించుకొఱకై పంచ భూతముల సంఘాతమురూపముగా ఏర్పడినవి. ఇవి, 'పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన' ఇత్యాది శాస్త్రములచే (కర్మఫల

---

అని నిర్దేశించుటచే భూతసంఘాతరూపములైనవని ఫలితార్థము. పెక్కుభూతముల కూడికచేతనైనవియు అనిత్యములు కావున ఇవియు అనిత్యములే. 'దేహాః' అనుటవలన బాహుళ్యార్థముంబట్టి ఉపచయాత్మకములు—అనఁగా సావయవములని యర్థము స్ఫురించుచున్నది. సావయవము లనుటచేతను అనిత్యములని తెలియుచున్నది. 'శరీరిణః' అను షష్ఠి, సంబంధమును దెలుపుచున్నది గావున శరీరియగు ఆత్మతో కర్మఫలానుభవముకొఱకవి సంబంధించుచున్నవనియుఁ దెలుచున్నది. దీనినే 'పుణ్యః పుణ్యేన' బృ-ఉప-అధ్యా. ౪. బ్రా. అనుశ్రుతి ప్రతిపాదించెడిని అవి, కర్మఫలముల ననుభవించుటకై కలిగినవనుటచే అర్థసిద్ధముగా కర్మములు ముగియఁగానే నశించునవనియు నేర్పడుచున్నవి. ఇట్లు దేహము నాశస్వభావమును, భోగార్థమును, సావయవమును, సంఘాతరూపమును వ్యాప్యమునుగా నున్నది. దీనికి వ్యత్యస్తముగా ఆత్మను వర్ణించుచున్నాఁడు; ఆత్మకు, 'నిత్యస్య' 'శరీరిణః' 'అనాశినః' 'అప్రమేయస్య' అని నాల్గు విశేషణములు చెప్పఁబడియున్నవి. నిత్య మనుటచే దేహమువలె నాశార్హము గాదు. ఏలనఁగా అది అప్రమేయము. ప్రమేయమనఁగా జ్ఞానమునకు విషయమైనది. అయినను కేవలము జ్ఞానవిషయ మను నర్థము దగదు. 'ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః' అనుచో, దేహము ఆత్మకు జ్ఞానవిషయమే కాక భోగ్యమును అగును గావున ప్రమేయ మనుటకు భోగ్యత్వమువఱకు అర్థము గ్రాహ్యము. కాన, అప్రమేయ మనఁగా భోగ్యముగానిది-దేహమువలె కర్మఫలార్థమైనభోగ్యము గాక భోక్తయైనదని యర్థము. మఱియు ఆత్మ, దేహమువలె సావయవము గాదు. ఎట్లనఁగా, ఆత్మ, యొక గృహమునుగాని క్షేత్రమునుగాని 'నేను దీనిని ఎఱుఁగుచున్నాను' అనును. గృహమునుజూచి 'నేను ఎఱుగుచున్నాను' అనునప్పుడు ఆగృహముయొక్క సమస్తభాగములను తాను ఒక్కఁడే ఒక్కరూపుననే తెలియునట్లు దేహమునుగూర్చియు అట్లు చెప్పునప్పుడు దాని సమస్తావయవములను తాను ఒక్కఁడే ఒక్కరూపుననే తెలియువాఁడగుచున్నాఁడు; కాని ఆయాయవయవములను తెలియువాఁడు వేఱువేఱుగఁగాని తెలియుట వేఱువేఱువిధముగఁగాని యుండదు. ఇట్లు దేహమును దాని యవయవముల నెల్లను తెలియువాఁడు 'నేను' అని యొక్కఁడుగాను, తెలియుట 'ఎఱుఁగు

భోగార్థములని) చెప్పఁబడినవి. (ఇట్లు కర్మాధీనముగా ఉత్పత్తి నొందునవి గావున) కర్మావసానమున నశించునవి. ఆత్మయో అవినాశి. ఏలనఁగా నది అప్రమేయమైనది. ఆత్మ ప్రమేయముగా కనఁబడదుగదా. అయితే ప్రమాతగాఁ గనఁబడుచున్నది. అట్లనియే యిందు 'ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః' అని

---

చున్నాను' అని యొక్కరూపుగాను నుండుటంబట్టి అట్లు తెలియునట్టి యాత్మకు అవయవము లుండఁజాలవు. ఎట్లనఁగా-దేహము అవయవములుగలదిగదా. అందు ఒక యవయవమునకుఁ గలుగుబాధాదులు మఱియొక అవయవమునకుఁ దోఁపవు. అట్లే ఆత్మకును అవయవము లుండునేని వానియం దొక్క అవయవమునకుఁ దోఁచినది మఱొక యవయవమునకుఁదోఁపదు. కుడిచేతియందున్న యాత్మయొక్క యవయవమునకుఁ దోఁచినది, ఎడమచేతియందున్న యాత్మయొక్క యవయవమునకుఁ దోఁపదు. కనుక కుడిచేతియందుఁ గలిగినదానిని అనుభవించునది ఆత్మయం దొక్క భాగముగాను ఎడమచేతియందు కలిగినదానిని అనుభవించునది ఆత్మయొక్క మఱియొక భాగముగాను ఉండునే కాని పూర్ణముగా ఒక్కయాత్మయే రెండుచేతులయందును గలుగువానిని అనుభవింపఁజాలదు. కాఁబట్టి 'నేను కుడిచేతఁ గొట్టితిని; మరల ఎడమచేత తట్టితిని' అని ఒక్కయాత్మయే రెండుచేతులందును గలుగువానికి 'నేను' అని ఒక్కఁడే ప్రమాతగా చెప్పుకొననేరదు. అది, నిరవయవమై యుండిననే అట్లు చెప్పుకొనఁగూడును. ఆత్మయొక్క అవయవములు అతివేగముగా దేహావయవములందు సంచరించుచుండుటచే దాని ఒక యవయవమునకుఁ దోఁచినదే మఱియొక యవయవమునకును దోఁపవచ్చు ననరాదు. అప్పు డది చూర్ణపుంజము వంటిదే యగును గాన సంఘాతరూపముకూడ దానికి లేకపోవును వస్త్రములందు కస్తూరివాసన దగులుచుండునట్లు మఱియొకదాని వాసన ఆత్మకు దగులుచున్న దనరాదు. అప్పుడు తల్లి అనుభవించినది గర్భముకూడ అనుభవించుటచే పుట్టిన వెనుక తల్లి యనుభవించినదెల్ల శిశువు స్మరింపవలయునుగదా. అట్లులేదు. కాఁబట్టి దేహమునం దేయవయవమునందు ఏది తోఁచినను అన్నిటికి 'నేను' అని ఆత్మ ఒక్కఁడే ఒక్కరూపుననే, అనుభవించుటచు జూడఁగా ఆత్మ నిరవయవమే యగును; సావయవమైనచో ఆయాయవయవమునకు ఆత్మలో కొంచము కొంచమే భోక్తగా నుండునేకాని అన్నియవయవములకు 'నేను' అని ఒక్కఁడే భోక్తగాఁ గనుపట్టఁడు. ఇట్లు దేహమంతటను ఏకరూపముగా (ఒక్కతీరుగానే) ఆత్మ 'నేను' అని ప్రమాతగా నుండుటంబట్టి నిరవయవమే యగును. ఆత్మ వ్యాపకమునగును. ఇట్లు ఆత్మ దేహమునకు వ్యతిరిక్తముగా నాశానర్హమై భోక్తయైనిరవయవమై వ్యాపకమై యుండుటచే నిత్యమగుట సిద్ధము.

చెప్పఁబడెడిని. మఱియు ఆత్మ, ఇతరమునకు-అనఁగా గృహక్షేత్రాదులకు 'దీనిని నే నెఱుఁగుచున్నాను' అని ఒక్కరూపుననే ప్రమాతగాఁ గనుపట్టునట్లు దేహమునం దంతటికిని ఏభాగమందును 'దీనిని నేను ఎఱుఁగుచున్నాను' అని ఒక్కరూపున ప్రమాతగా కనుపట్టుచున్నాఁడు; కాన అనేకములైన యవయవములతో నైనట్టు చూపట్టఁడు. ఇంతేకాక దేహాదులకు వలె వేఱువేఱుచోట్ల ప్రమాతకు వేఱువేఱు ఆకారములు కానరావు. కాఁబట్టి ఒక్కటేరూపున నిరవయవముగా నుండుటవలనను, ప్రమాతయగుటవలనను, వ్యాపకమగుటవలనను ఆత్మ నిత్యమైనది. దేహమో. అవయవాత్మకమగుటవలనను, శరీరికి (ఆత్మకు) కర్మఫలభోగముకొఱ కగుటవలనను, ఏకరూపముగా నుండకుండుటవలనను, వ్యాపకమగుటవలనను వినాశియైనది. కాఁబట్టి దేహముయొక్క వినాశస్వభావమును బట్టియు, ఆత్మయొక్క నిత్యస్వభావమునుబట్టియు రెండునుగూడ శోకస్థానము గావు. ఇది తెలిసి శస్త్రపాతము మొదలైన యనివార్యములగు పరుషస్పర్శములు తనకుఁ గలిగినను ఇతరులకుఁ గలిగినను వానిని ధైర్యముతో సహించి మోక్షప్రాప్తికొఱకు ఫలము నుద్దేశింపక యుద్ధ మనెడు కర్మమును ఆరంభింపుము.

శ్లో॥ య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥ 19

టీ. యః = ఎవఁడు, ఏనం (ప్రతి) = ఇట్టియాత్మను (గూర్చి), హన్తారం = చంపెడి హేతువును (అగ్ని మొదలైనదానిని హననకర్తఁ)గా, (కమపి) వేత్తి=ఏదే నొకటిని తలఁచుచున్నాఁడో, యః= ఎవఁడు, ఏనం = ఈయాత్మను, హతంచ = చంపఁబడినవానినిగాను, మన్యతే = తలఁచునో, తౌ ఉభౌ=వారిద్దఱును, నవిజానీతః=ఎఱిఁగినవారు కారు, (ఏలయనఁగా), అయం = ఈయాత్మ, నహన్తి=చంపుటకు హేతువుగాఁడు; నహన్యతే=చంపఁబడఁడు.

తా. ఎవఁడు పూర్వోక్తస్వభావమైన ఆత్మను చంపుటకు దేని నేని సాధనముగాతలఁచునో, ఎవఁడు ఏదేనొక హేతువుచే ఆత్మ చంపఁబడెనని తలఁచునో, వార లిరువురును ఆత్మస్వరూపము నెఱుఁగనివారు. ఉక్తహేతువులచేత, ఆత్మ నిత్య మగుటం బట్టియే చంపుటకు హేతువును గాఁడు. కాఁబట్టియే చంపఁబడఁడు.

[బ్రాహ్మణాదిశబ్దములు కేవలదేహమునకే కాక యందలి యాత్మలకును చెల్లును అందు దేహము అచేతనము గావున దానికి హింససేయుట వ్యర్థము. కావుననే అచేతనములైన మృతశరీరములను హింసచేయువానిఁ గూర్చి నిందించుటగాని ఆక్రోశించుటగాని కనఁబడదు. చేతనమైన ఆత్మయె హింసకు యోగ్యము. కావున 'బ్రాహ్మణం హన్తి' అనుచో బ్రాహ్మణశబ్దము ఆ దేహమునకును అందలియాత్మకును జెల్లినను హన్తి ధాతువునకు హింసాయోగ్యమగు

20A

చేతనమైన యాత్మయేకర్మము కాఁదగును. ఇట్లుండఁగా 'నహన్తి' 'నహన్యతే' అని యాత్మ హింసకు యోగ్యము కాదనుట యెట్లు? అన్నచో] హన్తిధాతువునకు ఆత్మకర్మమయ్యును, అది [ఆత్మయొక్క స్వరూపమును దూల్చుటను జెప్పదు] శరీరవియోగకరణమును (అనఁగా ఆత్మకు శరీరవియోగమును గలిగించుటనే) చెప్పుచున్నది. ['హన్తి' యనుటకు అర్థ మేమైనను అగుఁగాక] 'నహింస్యా త్సర్వభూతాని' 'బ్రాహ్మణో నహన్తవ్యః' ఇత్యాదిశాస్త్రములు [సామాన్యముగాను విశేషముగాను హింసయే కూడ దనుచున్నది గాన హింసయెట్లును దగదన్నచో అవి] విహితములుకానట్టి హననములను-అనఁగా శరీరవియోగకరణములను-గూర్చి నిషేధము

20B

చెప్పునవి [కాని విహితములైన యాగపశువధము శత్రువధము మొదలైనవానిని నిషేధించునవి గావు.]

అవ. పూర్వోక్తహేతువులంబట్టి ఆత్మ నిత్యమగుటచే దానికి పరిణామములు గలుగవు గావున అచేతనదేహధర్మములగు జననమరణాదులెల్లను దానికి కలుగనేరవని చెప్పుచున్నాఁడు.

21A

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః।
22
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ 20

టీ. అయం=ఈయాత్మ. న జాయతే = పుట్టువాఁడు కాఁడు, నమ్రియతేవా=చచ్చువాఁడునుకాఁడు, అయం=ఈయాత్మ, కదాచిత్ = ఒకప్పుడు (కల్పాదియందు), భూత్వా=పుట్టి, భూయః = మరల (కల్పాంతమునందు), నభవితావా న=లేకపోవువాఁడును కాఁడు - ఆ అయం=ఈ యాత్మ, అజః=పుట్టుక లేనివాఁడు, (కావున నే,) నిత్యః= నాశము లేక యుండువాఁడు, శాశ్వతః = స్థిరరూపుఁడు, పురాణః = పురాపి నవః=పురాతనుఁ డైనను క్రొత్తవాఁడు, శరీరే=దేహము, హన్యమానే సత్యపి = హతము సేయఁబడుచున్నను, న హన్యతే = హతుఁడు గాఁడు.

తా. సమస్తదేహములందును ఎల్లవారును అనుభవించుచుండు జననమరణములు ఒకప్పుడును ఆత్మను అంటవు. ప్రజాపతి మొదలైనవారి దేహములందలి యాత్మలు కల్పాదియందుఁ బుట్టి కల్పాంతమునందు నశించుటయు లేదు. కనుక సర్వదేహములందుం గలయీయాత్మ జన్మరహితుఁడై, నాశరహితుఁడై, పరిణామశూన్యుఁడై, పురాతనుఁడయ్యుఁ గ్రొత్తగానే యుండును. కాఁబట్టి తాను
21B
బొందియుండు దేహము వధింపఁబడినను నాశము నొందఁడు.

శ్లో॥ వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయం।
23
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తికమ్॥ 21

టీ. హేపార్థ=అర్జునా, యః = ఎవఁడు, ఏనం = ఈయాత్మను, అవినాశినం=నాశములేనివానినిగాను, అజం=పుట్టుకలేనివానినిగాను. అవ్యయం=స్థిరరూపునిఁగాను, కావుననే, నిత్యం=నిత్యునిఁగాను, వేద= తెలిసికొనుచున్నాఁడో, సః పురుషః = ఆపురుషుఁడు, కథం=ఎట్లు, కం=ఏ ఆత్మను, ఘాతయతి=చంపించుచున్నాఁడు, కం=ఏ ఆత్మను, హన్తి=చంపుచున్నాఁడు.

తా. అర్జునా, ఆత్మ వినాశము లేనివాఁడనియు ఉత్పత్తి లేని వాఁడనియు కావుననే నిత్యుఁడనియును ఎవ్వఁడు డెలియంజాలునో అతఁడు దేవమనుష్యతిర్యక్ స్థావరశరీరములందుఁగల ఆత్మలలో, ఏయాత్మను ఎవరినిగొని ఎట్లు చంపింపఁగలవాఁడు? ఏయాత్మను ఎట్లు తాను చంపఁగలవాఁడు? (అనఁగా ఈయాత్మలను చంపించుచు న్నాను చంపుచున్నాను అను శోకము నొందుటకు మూలము ఆత్మ స్వరూపముయొక్క యథార్థస్థితిని-అనఁగా దానియొక్క నిత్యత్వా దులను, డెలియకుండుటయే యని భావము.)

అవ. ఆత్మలు నిత్యము లగుటచే, యుద్ధమువలన వానికి అని త్యము లగు శరీరములను విడుచుటమాత్రమే కలుగును గాని మ రేబాధయుఁ, గలుగ దనుట సరిగాని, రమణీయములగు భోగములకు శరీరములు సాధనము లగుటచే అట్టివానిని ఎడఁబాయుట దుఃఖ కరము కాదా యనఁగా దానికిఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ 22

టీ. నరః=మనుష్యుఁడు, యథా=ఎట్లు, జీర్ణాని=శిథిలములయిన, వాసాంసి=వస్త్రములను, విహాయ=విడిచి, నవాని=క్రొత్తవియగు, అపరాణి=ఇతరవస్త్రములను, గృహ్ణాతి=స్వీకరించుచున్నాఁడో, తథా=అలాగున, దేహీ=జీవుఁడు, జీర్ణాని=శిథిలములయిన, శరీరాణి=దేహములను, విహాయ=విడిచి, నవాని=క్రొత్తవియగు, అన్యాని=ఇతర దేహములను, సంయాతి=పొందుచున్నాఁడు.

తా. మానవుఁడు జీర్ణములగు వస్త్రములు పరిత్యజించి నూతన వస్త్రము లేవిధముగా పరిగ్రహించునో, అట్లే జీవుఁడు శిథిలములైన దేహములను వదలి నవీనములగు నితరశరీరములను బొందును. (ధర్మయుద్ధమునందు శరీరము విడిచినవారికి విడువఁబడిన శరీరములకంటె రమణీయము లయినశరీరములు లభించు నని శాస్త్రమువలనఁ దెలియుచున్నది. కాఁబట్టి ఇది శోకింపఁదగనివిషయముమాత్రమే కాక సంతోషనిమిత్తమైన విషయము నైయున్నది.) 24

శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
నచైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥ 23

టీ. ఏనం=ఈజీవుని, శస్త్రాణి=ఖడ్గము మొదలైన ఆయుధములు, న ఛిన్దన్తి=ఛేదింపవు, పావకః=అగ్ని, ఏనం=ఈజీవుని, న దహతి=కాల్పదు, ఆపః=నీళ్ళు, ఏనం=ఈజీవుని, న క్లేదయన్తి=తడుపవు, మారుతః=వాయువు, న శోషయతి=శోషింపఁ జేయదు.

తా. ఈజీవాత్మ సమస్తతత్త్వములందు వ్యాపించుస్వభావము గలది గాన ఆ తత్త్వము లన్నిటికంటె తాను సూక్ష్మమైన దగుటచేత దీనిని ఆయుధములు ఖండింపఁజాలవు. అగ్ని దహింపఁజాలదు. ఉదకములు తడుపఁజాలవు, వాయువు శోషింపఁజేయఁజాలదు. (ఆయుధాదులు ఆత్మకు వ్యాప్యము లగుటచే ఆత్మకంటె స్థూలములగును గాన నవి ఆత్మను జంపఁజాల వని భావము.)

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ ।
25 26
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః॥ 24

టీ. అయం=ఈయాత్మ, అచ్ఛేద్యః=ఛేదింపఁబడఁదగనివాఁడు, అయం=వీఁడు, అదాహ్యః = దహింపఁబడఁదగనివాఁడు, అక్లేద్యః = తడుపఁబడఁ దగనివాఁడు, అశోష్య ఏవచ = శోషింపఁబడఁదగని వాఁడును, అయం=వీఁడు, నిత్యః=నిత్యుఁడు, సర్వగతః=సర్వవ్యాపి, స్థాణుః=స్థిరస్వభావము కలవాఁడు, అచలః=చలింపనివాఁడు, సనాతనః=అనాది యైనవాఁడు.

తా. కావున ఈయాత్మను ఛేదింపను, దహింపను, తడుపను, ఎండింపను శక్యము కాదు. ఇతఁడు నిత్యుఁడు, సర్వవ్యాపి, స్థిర స్వభావము గలవాఁడు, చలింపనివాఁడు, పురాతనుఁడు. 27

28 29
శ్లో॥ అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే ।
తస్మా దేవం విది త్వైనం నానుశోచితు మర్హసి॥ 25

టీ. అయం=ఈయాత్మ, అవ్యక్తః = (జ్ఞానేంద్రియములకు) గోచరుఁడు కానివాఁడు, అయం = వీఁడు, అచిన్త్యః = (మనసునకు) తలంప నశక్యుఁడు, అయం=వీఁడు, అవికార్యః = (కర్మేంద్రియముల చేత) వికారములను బొందింపరానివాఁడు, (ఇతి=అని), ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు, తస్మాత్ = ఆ హేతువువలన, ఏనం = ఈ యాత్మను, ఏవం=ఇట్లు, విదిత్వా = తెలిసికొని, అనుశోచితుం = దుఃఖించుటకు, నార్హసి=తగవు.

తా. ఈ ఆత్మ యితరవస్తువులవలె చక్షురాదిజ్ఞానేంద్రియము లకు గోచరుఁడు కాఁడనియు, మనస్సుచేత సైతము తలంప నశక్యుఁ డనియు. కర్మేంద్రియములచేత వికారమును బొందింపరానివాఁ

డనియు చెప్పఁబడుచున్నాఁడు. కావున ఆత్మ యిట్టి దని తెలిసికొని ఇట్టిలక్షణములు గలదానినిగూర్చి నీవు శోకింపఁ బనిలేదు. 30

అవ. దేహమునకంటె వేఱైన ఆత్మ నిత్యుఁడగుటచే శోకింపఁదగ దని చెప్పి, యిప్పుడు జననమరణస్వభావములు గల దేహమునే యాత్మగాఁ దలఁచినను దుఃఖింపఁ బని లే దనుచున్నాఁడు.

31
శ్లో॥ *అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
32
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి॥ 26

టీ. నిత్యజాతం = ఎల్లప్పుడు పుట్టుచున్నదియు, నిత్యం = ఎల్లపుడు, మృతంచ = నశించుచున్నదియు నగు దేహమునే, ఏనం = ఈ యాత్మనుగా, అథ మన్యసే = తలతువేని, తథాపి = అట్లయినను, హే మహాబాహో = గొప్పభుజములు గలఅర్జునా, త్వం = నీవు, ఏవం = ఇట్లు-అతిమాత్రమనుట, శోచితుం = దుఃఖించుటకు, నార్హసి = తగవు.

తా. అర్జునా, ఎప్పుడును జననమరణములను దప్పక పొందుచుండెడియాశరీరమునే యాత్మ యని తలఁతువేని, అప్పటికిని, దేహము పరిణామస్వభావము గలది గనుక దానికి ఉత్పత్తివినాశములు త్రోసిపుచ్చ నలవిగావు. కావున, అట్టి దేహమేయైనయాత్మను

* పూర్వము ఆత్మకు నాశమే లేనందున శోకమేకలుగదని చెప్పఁబడెను. ఇప్పుడు దేహమేయాత్మయని తలఁచుటచే అట్టియాత్మకు నాశము కలుగుటను పరిహరింప నలవిగాదు. కావున దానినిగూర్చి యేదోకొంత శోకింపవచ్చును గాని మహాబాహుఁడ వగునినుబోఁటికి మిక్కిలి శోకించుట తగదని చెప్పినాఁడు. లేక, పూర్వము దేహముకంటె ఆత్మ వేఱు అని యొప్పుకొనియుండుటచే పరలోకాది భయమున అతిమాత్రశోకము తగియుండెను. ఇప్పు డట్టిభయము లేనందున ఈ యుద్ధము నినుబోఁటివారునికి అతిమాత్రప్రీతికరమయి యుండఁగా అతిమాత్రశోక మెట్లు? అనియు భావమూహ్యము.

గూర్చి యిట్లు మిక్కిలియు శోకించుట నీను బోఁటివారలనికి ఎంతమాత్రము దగదు. 33

34

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్య చ।
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి॥ 27

టీ. జాతస్య=పుట్టినవానికి, మృత్యుః=నాశము, ధ్రువోహి = నిశ్చయముగదా, మృతస్య=నశించినవానికి, జన్మచ = పుట్టుకయును, ధ్రువం=అట్లే త్రోసిపుచ్చరానిది, తస్మాత్=ఆకారణమువలన, అపరిహార్యే = నివారింపఁగూడని, అర్థే=విషయమునందు, త్వం = నీవు శోచితుం=దుఃఖించుటకు, నార్హసి=తగవు.

తా. పుట్టినవానికి నాశము తప్పకవచ్చుట కనఁబడుచున్నది. అట్లే నష్టమైనవానికి ఉత్పత్తియు తప్పక కలుగును. పుట్టుచు గిట్టుచు మరలఁ బుట్టుచునుండు పరిణామములు ఒకటివెనుక నొకటిగాఁ గలుగు చుండును. దీనిని పరిహరింప నలవిగాదు. కాన దీనిఁగూర్చి నీవు శోకింప నక్కఱలేదు.

*[అసత్కార్యవాదమున పూర్వము అసత్తుగా (లేనిదిగా) నుండిన ఘటము మొదలైనవానికే ఉత్పత్తి కనఁబడును. నష్టమైన వస్తువు, నాశమునకు మునుపు సత్తే యగును. సత్తునకు ఉత్పత్తి లేదు గావున, సత్తేయగు నష్టమైన దానికిని ఉత్పత్తి కలుగదు. కనుక) నష్టమైనదానికి ఉత్పత్తియనునది యెట్లు చెల్లును? అన్నచో, సత్తునకే

---

* అసత్కార్యవాది 'పూర్వము లేకుండిన కుండకే పుట్టుక కనఁబడుచున్నది గావున అసత్తునకే యుత్పత్తి. మన్ను ఉండినను అందు కుండ లేదుగదా. కావున కుండ ద్రవ్యాంతరమే' యని యభిప్రాయపడుచున్నాఁడు. ఇది వట్టి వాదము మాత్రమే. రామానుజులు 'మన్ను కుండ యను పేర్లు వట్టి యవస్థాభేదములే. అవస్థలయం దెల్ల రెండటిద్రవ్య మొక్కటియె తప్పక వచ్చుచున్నది గాన మన్నును కుండయును ఏకద్రవ్యములే కాని భిన్నద్రవ్యములు కా' వని యభిప్రాయపడు చున్నారు.

ఉత్పత్తి కనఁబడుచున్నది; అసత్తునకు కనఁబడదు. కావున నిది చెల్లును. (సత్తైనదాని కుత్పత్తి యక్కఱలేదు. పూర్వము అసత్తు అగుఘటాదులకు ఉత్పత్తి కనఁబడుచున్నది. కనుక సత్తునకు ఉత్పత్తియు అసత్తునకు ఉత్పత్తిలేమియు నెట్లు? అన్నచో) ఉత్పత్తి, వినాశము మొదలైనవి సత్తయిన ద్రవ్యముయొక్క అవస్థావిశేషములే కాని వేఱుగావు. ఎట్లనఁగా తంతువులు మొదలైన సద్ద్రవ్యములే నేఁత మొదలైన రచనావిశేషములతోఁ గూడినవై పటములు మొదలైనవిగా చెప్పఁబడుచున్నవి. (తంతు వను సద్ద్రవ్యమే నేఁతవలన పటముగా ఉత్పత్తినొందినది) అసత్కార్యవాది అసత్తునుండియే పటము ఉత్పత్తి నొందిన దని వాదించుచున్నను అతనిమనస్సునకు రచనావిశేషముతోఁ గూడియున్న తంతువులను సద్ద్రవ్యమాత్రమే పటమునందును కనఁబడుచున్నదిగాని మఱొకద్రవ్యము గానరాదు. (కానఁబడక పోయినను కల్పించుకొనవచ్చు నన్నచో) పటమునందు తంతువే ఒకవిధమైన సంయోగమును బొందియుండుటతప్ప మఱియొక్క ద్రవ్యము చూపట్టదుగదా. (మరియు అసత్కార్యవాది సత్తయినదానికి ఉత్పత్తికలిగించు నేఁత మొదలైన కారకవ్యాపారములు వ్యర్థమనియు మఱియొకనామము పెట్టుట పొసఁగదనియు కట్టుకొనుట మొదలైన వ్యవహారములు చెల్లవనియుఁగావున అసత్తునకే యివి యన్నియుఁ జెల్లుననియుఁ దలఁచికదా అసత్తునకే యుత్పత్తినంగీకరించుచున్నాఁడు; అట్లేల? సత్తును ఒకయవస్థనుండి మఱొకయవస్థను బొందించుటచే కారకవ్యాపారము సార్థకమగుచున్నది. నామాంతరమును వ్యవహార విశేషములును చెల్లుచున్నవి. ఇట్లు సద్ద్రవ్యము ఒక యవస్థ నుంచి మఱొకయవస్థను బొందు) నంతమాత్రముననే కారకవ్యాపారాదులు పొసఁగుచున్నవి. (సత్తునకు మఱొకయవస్థ కలుగుటచేతనే యవన్నియుఁ దెలిపిడిగా పొసఁగుచుండఁగా, అందులకై, తెలియరాని మఱియొక ద్రవ్యమును గల్పించుకొనవలసిన

ప్రయాస మేల ? కావున) ద్రవ్యాంతరమును గల్పించుట యుక్తము
గాదు. కాఁబట్టి ఉత్పత్తి వినాశము మొదలైనవి. సత్తయినద్రవ్యము
యొక్క అవస్థావిశేషములు. ఉత్పత్తియనెడు అవస్థను బొందినద్రవ్యము
నకు, దానికివిరుద్ధమైన మఱియొక యవస్థను బొందుటయే నాశము
అని చెప్పఁబడును. ఎట్లన; మన్ను పిసుకఁబడి ముద్దయై పిదప కుండయై
పగిలి పెంకులై కాలవశమున పొడియగుచున్నది. ఇట్లు మృత్తు అను
ఆ ద్రవ్యమునకు పిండత్వము, ఘటత్వము, కపాలత్వము, చూర్ణత్వము
మొదలైన అవస్థలు అనఁగా పరిణామములు వరుసగా కలుగుచున్నవి.
కాఁబట్టి అది పరిణామిద్రవ్యమగును. ఇట్లు పరిణామిద్రవ్యమునకు
పరిణామపరంపరలు కలుగక మానవు. ఆ ద్రవ్యమునకు మొదటి
యవస్థలందు ఉత్పత్తియు పిమ్మటియవస్థలయందు నాశమును వరుసగా
కలుగుచున్నవి. పిండావస్థయందున్న మృద్ద్రవ్యమునకు ఘటావస్థ
కలుగఁగా దానికి పిండావస్థయందు నాశమును ఘటావస్థయందు
ఉత్పత్తియుఁ గలుగుచున్నది. (ఇట్లే తక్కినయవస్థలందును పూర్వావ
స్థలు నాశములుగాను ఉత్తరావస్థలు ఉత్పత్తులుగాను ఎఱుంగునది.
ఇట్లు ఎన్నియవస్థలు మాఱి ఎన్ని యుత్పత్తివినాశములు పొందినను
ఆయన్నింటను ఆమృద్ద్రవ్యముయొక్క స్వరూపము మాత్రము
చెడదు.) కాఁబట్టి పరిణామిద్రవ్యముల కెల్ల అట్టి ఉత్పత్తివినాశాఖ్య
పరిణామపరంపరలు అవశ్యము సంభవించును. వాని విషయమై
దుఃఖింపఁ బనిలేదు.]

*అవ. సద్ద్రవ్యమునకు, పూర్వావస్థకు విరుద్ధమైన మఱొక

---

* ఇంతవఱకు ఉత్పత్తివినాశములు అపరిహార్యము లగుటచే దుఃఖింపరాదని
చెప్పి యిప్పుడు ఆయావస్తువుల నియతస్వభావమునుబట్టియు దుఃఖింప నవశ్యము
గాదనుచున్నాఁడు. అనఁగా ద్రవ్యములకు నిప్పుడు వ్యక్తముగా కనఁబడుచుండు
మనుష్యత్వాదిదశలే స్వభావము గాదు. ఇంతకుఁ బూర్వము అవ్యక్తముగానున్న
యవస్థయు వానికి స్వభావము గాదు. సామాన్యముగా పరిణామము పొందుచుండుటయే

యవస్థ గలుగుటం జూడఁగా ఏదో కొంత దుఃఖము గలుగుచున్నది. ఆదుఃఖముగూడ మనుష్యాదిభూతములపట్ల కలుగదనుచున్నాఁడు.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా॥ 28

టీ. హేంభారత = ఓ అర్జునా, భూతాని = మనుష్యాదిశరీరములు, అవ్యక్తాదీని= తెలియబడని పూర్వావస్థ కలవి, వ్యక్తమధ్యాని= తెలియఁబడిన మధ్యమావస్థ గలవి, అవ్యక్తనిధనానిఏవ= తెలియఁబడని నాశము (ఉత్తరావస్థ) గలవియే, తత్ర=ఆవిషయమునందు, పరిదేవనా కా=దుఃఖమేమి ?

తా. ఓ అర్జునా, మనుష్యాది శరీరములపూర్వావస్థ తెలియదు. వానియొక్క మనుష్యత్వము మొదలైన మధ్యమావస్థలుమాత్రము తెలియుచున్నవి. మరణానంతరము వాని యుత్తరావస్థ యేదియో తెలియరాదు. ఇట్లు పరిణామములు పొందుచుండుట వానికెల్ల 35
స్వభావము. ఈవిషయమై వగవఁ బని యేమి ?

అవ. ఇంతవఱకు శరీరమునే యాత్మగా గ్రహించినను శోకింపఁ బనిలేదని చెప్పి యిప్పుడు శరీరమునకంటె వేఱై యాశ్చర్యస్వరూపమై యొప్పు ఆత్మను కన్నవాఁడుగాని కని చెప్పువాఁడు గాని విన్నవాఁడుగాని విని యెఱింగినవాఁడుగాని దొరకుట అరుదని చెప్పుచున్నాఁడు. 36

శ్లో॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనమ్ ।
ఆశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః ।

---

వాని స్వభావము. కాఁబట్టి పరిణామిద్రవ్యమునకు అవ్యక్తమైన పూర్వావస్థగాని వ్యక్తమైన మధ్యావస్థగాని ఎట్లు శోకనిమిత్తముగాదో అట్లే అవ్యక్తమైన ఉత్తరావస్థయు శోకనిమిత్తము గా నేరదని భావము.

ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి ।
శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29

టీ. ఆశ్చర్యవత్ (అవస్థితం) = అద్భుతవస్తువువలె నుండు, ఏనం=ఈయాత్మను, కశ్చిత్ ఏవ=ఒకనొకఁడె-సుకృతియు గలవాఁడె, పశ్యతి=చూచుచున్నాఁడు, తథా-తథావిధః=అట్టివాఁడు, అన్యః ఏవ=మఱియొకఁడె, ఆశ్చర్యవత్=(అవస్థితం) = అద్భుతవస్తువువలె నుండు నీయాత్మనుగుఱించి, వదతి=చెప్పుచున్నాఁడు, అన్యశ్చ=మఱియొకఁడును, ఆశ్చర్యవత్ = అద్భుతవస్తువువలెనుండు, ఏనం = ఈఆత్మను, శృణోతి=వినుచున్నాఁడు కశ్చిత్ చ=ఒక్కఁడును, ఏనం=ఈఆత్మను, శ్రుత్వాఽపి=వినియును, న వేద ఏవ=ఎఱుఁగకయే యున్నాఁడు. 37

తా. ఇట్టిస్వభావము గలజీవుఁడు తనకంటె నితరములైన సమస్తవస్తువులకును సజాతీయుఁడును విజాతీయుఁడును గాకుండుట వలన ఆశ్చర్యమువలె నున్నాఁడు. ఇట్టిజీవుని, పాపములు క్షీణించి పుణ్యము వృద్ధినొందిన యొకానొకఁడు కనుఁగొనుచున్నాఁడు. అట్టి యొకానొకఁడు మఱొకనికి చెప్పుచున్నాఁడు. అట్లు ఎవఁడో యొకఁడె వినుచున్నాఁడు. అట్లు విన్నను గాని దానిని యథావస్థితముగ (కలరూపున) తెలిసికొన్నవాఁడొక్కఁడును లేనేలేఁడు. ఇట్లు చూచినవారలలోను చెప్పినవారలలోను వినినవారలలోను ఎవ్వఁడు గాని దానిని ఉన్నది యున్నట్టుగాఁ జూచుటయు చెప్పుటయు వినుటయు దుర్లభము.

38

శ్లో॥ దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి॥ 30

టీ. హేభారత = అర్జునా, సర్వస్య = దేవతలు మొదలైన సమస్తప్రాణులయొక్క, దేహే=దేహము, (వధ్యమానేపి = చంపఁ

బడుచున్నను) అయం దేహీ = ఈయాత్మ, నిత్యం = ఎల్లప్పుడును, అవధ్యః = చంపఁబడఁదగనివాఁడు, తస్మాత్ = అందువలన, త్వం = నీవు, సర్వాణి భూతాని = సమస్తభూతములను గూర్చి, శోచితుం = దుఃఖించుటకు, నార్హసి = తగవు.

తా. అర్జునా, దేవతలు మొదలైన సమస్తజంతువులయొక్క దేహములు వధింపబడుచున్నను ఆ దేహములలో నొక్కొక్కటియందుండు దేహి (ఆత్మ) యెప్పుడును వధ్యుఁడు గాఁడని తలఁపవలయును. దేవతలు మొదలుకొని స్థావరములవఱకుఁ గల సర్వభూతములును ఆకారములందు విషమములుగా నుండినను అందలి యాత్మలన్నియు స్వరూపస్వభావములయందు సమానములుగాను నిత్యములుగాను ఉన్నవి. విషమములుగాను అనిత్యములుగాను నుండునవి దేహములు మాత్రమే. కాఁబట్టి భీష్మాదులనుగుఱించి మాత్రమే కాదు: దేవతలు మొదలుగా సమస్తభూతములనుగుఱించియు నీవు శోకము నొందవలదు. 39

అవ. ఇట్లు శోకము తగదని చెప్పి 'వేపథుశ్చ శరీరే మే' అనుచో చెప్పఁబడిన శరీరకంపము గూడ తగదని చెప్పుచున్నాఁడు. 40

40

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయో౽న్యత్ క్షత్రియస్య నవిద్యతే ॥ 31

టీ. అపిచ = ఇంతేకాక, స్వధర్మం = స్వకీయమగు క్షత్రియధర్మమును, అవేక్ష్య = ఆలోచించి, వికంపితుం = చలించుటకు, నార్హసి = తగవు, క్షత్రియస్య = క్షత్రియునికి, ధర్మ్యాత్ = న్యాయ్యముగా ప్రవర్తించునట్టి, యుద్ధాత్ = యుద్ధముకంటె, అన్యత్ = ఇతరమైన, శ్రేయః = మేలు, న విద్యతే హి = లేదుగదా.

తా. ఇంతేకాక, అగ్నిషోమీయాదియాగములందు ప్రాణిహింస యుండినను అవి ఎట్లు ధర్మ్యములగునో యట్లే యీ ప్రారంభింపఁబడిన యుద్ధము ప్రాణిహింసాత్మకమే యైనను ఇదియు స్వధ

ర్మమే (అనగా క్షత్రియునికి ధర్మశాస్త్రములందు విధింపఁబడిన యర్థమే) యని యెంచి దీనినుండి నీవు చలింపరాదు. ఏలనఁగా, క్షత్రియునకు న్యాయ్యముగాఁ బ్రవర్తించినయుద్ధమునకంటె శ్రేయస్కర మైనది వేఱొకటి లేదుగదా.

'శౌర్యం తేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్ । దానమీశ్వరభావశ్చక్షాత్రంకర్మస్వభావజమ్॥ (గీత-౧౮-౪౩) అని క్షత్రియునికి స్వాభావికమైన కర్మము, మీఁదఁజెప్పఁబడుచున్నట్లు నీకు యుద్ధము స్వధర్మమే. మఱి అగ్నిషోమీయాదులు హింసాత్మకము లగుటచే, అధర్మము లనరాదు. అందు పశువునకు హింసలేదు. (అనర్థమును పుట్టించుకార్యమే హింస. దానికి విపరీతమైనది రక్షణమే యగును. ఏలన) పశువునకు సంజ్ఞపనమువలన, అప్పటికిని హీనతరమైన ఛాగాది దేహముపోయి కల్యాణతరమైన దేహములు స్వర్గాదు

41

లను ప్రాపించు నని శ్రుతియున్నది. *'నవా ఉ వేతన్మ్రియసేన రిష్యసే దేవాఇదేషిపథిభి స్సుగేభిః । యత్ర యన్తి సుకృతో నాపి దుష్కృతః । తత్ర త్వా దేవ స్సవితా దధాతు' అని శ్రుతి ఈ యుద్ధమందును మృతులైనవారికి 'వాసాంసిజీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి' ఇత్యాదులచే కల్యాణతర దేహాదులు ప్రాప్తించుట చెప్పఁబడియున్నది. కాఁబట్టి, రోగార్తుఁడైనవానికి చికిత్సకుఁడు చేయు శల్యాదికర్మములవలె, పశువునకు అగ్నిషోమీ

42

యాదులందలిసంజ్ఞపనము రక్షణమే యగునుగాని హింసకాదు. అట్లె ధర్మయుద్ధమున వధమును రక్షణమే కాని హింస కానేరదు.

---

* యజు. ౪-౬-౯-౪౬, యజు. తైత్తి-బ్రాహ్మణ. ౩-౭-౭-౯౪. 'ఓ పశువా, నీవు ఈసంజ్ఞపనముచేత సర్వవిధముల మరణింపవు. కాబట్టియే నశింపవు. కాని సుఖముగాఁ బోఁదగినమార్గములచే దేవతలనే పొందుదువు. అందు (ఆ యుత్తమలోకమునందు) పుణ్యవంతులగువారు పోవుదురు. పాపులు పోనేపోవరు. అందు సవిత యనుభగవంతుఁడు నిన్ను నిలుపుకొనుఁగాక' యని యర్థము.

43

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధ మీదృశమ్॥ 32

టీ. హే పార్థ = అర్జునా, యదృచ్ఛయా = తనంతటనే-ప్రయత్నము లేకయే, ఉపపన్నం=ప్రాప్తమైనదియు, అపావృతం = తెఱవఁబడిన- అడ్డులేని, స్వర్గద్వారం=స్వర్గమునకు ద్వారరూప మైనదియు నగు, ఈదృశం=ఇట్టి, యుద్ధం=యుద్ధము, సుఖినః=భాగ్యవంతులగు, క్షత్రియాః=క్షత్రియులు, లభన్తే=పొందుచున్నారు.

తా. అర్జునా, తనంతట దైవికముగాఁ బ్రాప్తమైనదియు, నిరతిశయసుఖరూప మైనమోక్షమునకు నిర్విఘ్నసాధన మైనదియు నగు ఇట్టియుద్ధము పుణ్యవంతు లగుక్షత్రియులకే లభించును. అనఁగా నీభాగ్యవశమున నిట్టిమహాశ్రేయస్సు తనంతట సమీపింపఁగా చలించుట యేల అని భావము.

45 44

శ్లో॥ అథ చేత్త్వం ధర్మ్య మిమం సంగ్రామం న కరిష్యసి।

46

తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి॥ 33

టీ. అథ=మఱియు, త్వం=నీవు, ధర్మ్యం = ధర్మయుక్తమైన, ఇమం=ఈ-తనంతట సంప్రాప్తమైన, సంగ్రామం = యుద్ధమును, న కరిష్యసిచేత్=చేయకపోదువేని, తతః=దానివలన చేయనందున, స్వధర్మం=స్వకీయ మైన క్షత్రియధర్మమును, కీర్తిం చ=యశస్సును, హిత్వా=విడిచి, పాపం=పాపమును, అవాప్స్యసి=పొందఁగలవు.

తా. క్షత్రియుఁడ వగునీవు స్వధర్మ మైనయీయుద్ధమును అజ్ఞానమువలన చేయవైతివేని, ప్రారబ్ధధర్మమును చేయనందున, స్వధర్మఫల మగునిరతిశయసుఖమును, జయమువలనఁ గలుగు నిరతిశయకీర్తిని, బోఁగొట్టుకొని నిరతిశయ మగు పాపమును బొందుదువు.

47 48
శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్ ।
సమ్భావితస్య చాకీర్తిః మరణా దతిరిచ్యతే॥ 34

టీ. అపి చ = ఇంతేకాక, భూతాని = సర్వప్రాణులు, తే = నీయొక్క, అవ్యయాం = శాశ్వతమగు, అకీర్తిం=అపకీర్తిని, కథయిష్యన్తి=చెప్పకొనఁగలవు, సంభావితస్య = గౌరవింపఁబడిన వానికి, అకీర్తిః=అపకీర్తి, మరణా చ్చ=చావుకంటెను, అతిరిచ్యతే = అధికమగుచున్నది.

తా. (నిరతిశయమగు సుఖమును గీర్తియుఁ జెడుట మాత్రమే కాదు.) 'అర్జునుఁడు యుద్ధ మారంభింపఁగానే భయపడి పాఱిపోయెను' అని సర్వదేశకాలములందును నశింపక వ్యాపించునట్టి నీయపకీర్తిని, సమర్థులును అసమర్థులును అగు సర్వభూతములును బ్రకటము సేయును, (దానివలన నాకేమి యని యందువేని) శౌర్యవీర్యపరాక్రమాది గుణముల నెల్లవారిచే సన్మానింపఁబడినవానికి
49
అట్టిగుణములు చూపమిచే అపకీర్తి కలుగుట మరణముకంటె నధికము. (ఇట్టియపకీర్తిని వినుటకంటె మరణమె నీకు శ్రేయము అని భావము.)

అవ. బంధువిషయమైన స్నేహముచేతను కరుణచేతను యుద్ధమును మానినశూరుఁడ నగునాకు అపకీర్తి యెట్లు కలుగుననఁగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ భయా ద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
50
యేషాంచత్వం బహుమతో భూత్వాయాస్యసిలాఘవమ్॥ 35

టీ. యేషాం=ఎవరికి,త్వం=నీవు,బహుమతః భూత్వా=గొప్పగా ఎన్నఁబడినవాఁడవైయుండి, లాఘవం=(ఇఁక)చులుకనను, యాస్యసి=

పొందఁగలవో, (తే=అట్టి,) మహారథాశ్చ = దుర్యోధనాదిమహారథు లును, త్వాం=నిన్ను, భయాత్=భయమువలన, రణాత్ = యుద్ధము నుండి, ఉపరతం=మఱలినవానిఁగా, మన్యన్తే=తలంతురు.

తా. ఏకర్ణదుర్యోధనాదిమహారథులు, నీవు శూరుఁడ వని యిదివఱకు నిన్ను గొప్పగాఁ దలఁచియుండిరో వారే యిఁక నీవు యుద్ధము కలుగఁగానే ఏమియు చేయక యూరకుండుటనుబట్టి నిన్నుఁ జులుకనగాఁ జూతురు. మఱి వారు నిన్ను శత్రుభయమువలన యుద్ధమునుండి మఱలినవానినిగాఁ దలంతురు. (కాని బంధుస్నేహా దులవలన మఱలినవానినిగాఁ దలంపరు. ఏలనఁగా శూరులగు వైరు లకు బంధుస్నేహాదులవలన యుద్ధమునుండి మఱలుట కలుగదు.) 51

అవ. మఱియును. 52

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః।
53
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥ 36

టీ. తవ=నీయొక్క, అహితాః = శత్రువులు, తవ-నీయొక్క, సామర్థ్యం=శక్తిని, నిన్దన్తః = దూషించుచున్నవారై, బహూన్ = అనేకములయిన, అవాచ్యవాదాంశ్చ=పలుకఁదగనిపలుకులనుగూడ, వదిష్యన్తి=చెప్పుదురు. తతః=అంతకంటె అట్టిమాటలు వినుటకంటె, దుఃఖతరం=మఱింత దుఃఖకర మైనది, కిం ను=ఏమి యున్నది?

తా. నిశత్రువులు ('శూరులగు మాముందట ఈయర్జునుఁడు నిమిషము నిలువ శక్తుఁడా? వీనిసామర్థ్య మెల్ల మఱియొకచోటనే కాని, మాయెదుటఁ గాదు' అని) నీసామర్థ్యమును నిందించుచు ఆడ రానిమాటల నధికంబుగ నాడుచుందురు. అంతకంటె మించిన దుఃఖ మేమియున్నది? (అనఁగా నట్టిమాటలు వినుటకంటె మరణమే శ్రేయ మని నీవే తలంతువని భావము.) 54

55

అవ. శూరుఁ డగువానికి, తన చేత శత్రువులు చంపఁబడు టయు, తాను శత్రువుల చేత చచ్చుటయు, నీరెండును శ్రేయస్సును గలుగఁజేయు ననుచున్నాఁడు. 56A

56B

శ్లో॥ హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
56C
తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37

టీ. కౌన్తేయ=అర్జునా హతో వా = చంపఁబడినవాఁడ వైతి వేని, స్వర్గం = స్వర్గమును, ప్రాప్స్యసే = పొందఁగలవు, జిత్వా వా = జయించితివేని, మహీం=రాజ్యమును, భోక్ష్యసే=అనుభవింపఁగలవు, తస్మాత్ = దానివలన - ఈరెండు శ్రేయస్సాధనము లగుటవలన, యుద్ధాయ = యుద్ధముకొఱకు, కృత నిశ్చయః = చేయఁబడిన నిశ్చయము గలవాఁడవై, ఉత్తిష్ఠ=లెమ్ము,

తా. అర్జునా, ధర్మయుద్ధమున శత్రువుల చేత చంపఁబడితివేని, యిట్టిచావు చేతనే మోక్షమును బొందెదవు. శత్రువులను జయించితివా అకంటక మగురాజ్యం బనుభవించెదవు. (వారిని జంపఁగా వచ్చిన రాజ్యభోగము హెచ్చా? యనకుము. కేవల రాజ్యమే కాదు; ఫలాపేక్ష లేక చేయు యుద్ధమనునట్టిధర్మము మోక్షసాధనమగుట చేత మోక్షమునుగూడఁ జెందఁగలవు) కావున యుద్ధమునకుఁ బూనుట పరమపురుషార్థలక్షణ మగుమోక్షమునకు సాధన మని నిశ్చయించి యందులకై లెమ్ము. (కుంతికడుపున బుట్టిననీ కదియే యుచిత మని భావము.)

అవ. మోక్షము నపేక్షించువాఁడు యుద్ధము ననుష్ఠింపవలసిన ప్రకారమును జెప్పుచున్నాఁడు.

57A
శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
57B
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥ 38

టీ. సుఖదుఃఖే = సుఖదుఃఖములను, సమేకృత్వా = సమములుగాఁ జేసికొని, లాభాలాభౌ=సుఖదుఃఖములకుఁ గారణమైన లాభనష్టములను, జయాజయౌ=జయపరాజయములను, (సమౌకృత్వా=సమములుగాఁ దలఁచి) తతః=దానివలన, యుద్ధాయ=యుద్ధమునకు, యుజ్యస్వ=తలపడుము, ఏవం (చేత్) = ఇట్లు చేసితివేని, పాపం = పాపమును, న అవాప్స్యసి=పొందవు.

తా. ఇట్లు దేహమునకంటె వేఱయ్యు, దేహస్వభావము యొక్క యేతగులును లేకయు, నిత్యమయ్యు నుండునది ఆత్మయని యెఱింగి, యుద్ధమున తప్పక కలుగు బాణపాతాదులవలని సుఖదుఃఖములను, ద్రవ్యలాభనష్టములను, జయపరాజయములను, సమములుగాఁ దలఁచి, వానివలన బుద్ధికి వికారము కలుగనీక, స్వర్గాదిఫలముల నుద్దేశింపక, కేవలము కర్తవ్య మని తలఁచి యుద్ధము నారంభింపుము. ఇట్లు చేసినఁ బాపముపొందవు. (అనఁగా దుఃఖరూపమగుసంసారబంధమునుండి విడివడుదు వని యర్థము.)

అవ. ఇంతవఱకు ఆత్మ *యాథాత్మ్యజ్ఞానము నుపదేశించి, ఇఁక నట్టిజ్ఞానమును పురస్కరించుకొని మోక్షసాధనముగాఁ గావించు కర్మయోగమును జెప్పఁదొడఁగుచున్నాఁడు.

---

* యాథాత్మ్యము అనఁగా యథావస్థితమైనప్రకారము-యథార్థస్వరూపము-కలరూపు. ఆత్మయొక్క నిత్యత్వము మొదలైనవియే దానియాథాత్మ్యము-దాని కలరూపు. దీనిని ఎఱుఁగుటయే (అనగా దీనిని గుఱించిన జ్ఞానమే) ఆత్మ యాథాత్మ్య జ్ఞానము. దేహమే యాత్మయని భ్రమించి ఆత్మయొక్క యాథాత్మ్యము నెఱుఁగక శోకించుచున్నయర్జునునికి దాని నిత్యత్వాదిరూపమైన యాథాత్మ్యమును 'నత్వేవాహం' అనుట మొదలుగా 'తస్మాత్సర్వాణిభూతాని' అనువఱకు ఉపదేశింపఁబడి

58 శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి॥ 39

టీ. హే పార్థ=అర్జునా, సాంఖ్యే=ఆత్మతత్త్వవిషయమునందు, ఏషా=ఈ ప్రతిపాదింపఁబడిన, బుద్ధిః=జ్ఞానము, తే=నీకు, అభిహితా=చెప్పఁబడెను, యయా బుద్ధ్యా=ఎట్టికర్మయోగబుద్ధితో, యుక్తః=కూడినవాడవై, కర్మబన్ధం=కర్మమువలనఁగలుగుసంసారబంధమును, ప్రహాస్యసి=వదలుదువో, యోగే=కర్మయోగవిషయమందు, ఇమాం=ఈ చెప్పఁబోవుబుద్ధిని, శృణు=వినుము.

తా. కర్మయోగానుష్ఠానమునకు ముందు ఆత్మతత్త్వజ్ఞానము ఉండవలయును. కావున ఆయాత్మతత్త్వజ్ఞానముకొఱకు ఏబుద్ధి చెప్పఁదగునో అది 'నత్వేవాహం' మొదలుకొని 'తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి' అనువఱకును చెప్పఁబడినది. అట్టి ఆత్మజ్ఞానముతోఁ గూడినదై మోక్షసాధనభూతమై యుండు కర్మానుష్ఠానమునఁ బ్రవేశించిన బుద్ధియోగవిషయములోఁ జెప్పఁదగినబుద్ధిని ఇదిగో చెప్పుచున్నాను వినుము. ఈ బుద్ధియోగముచే నీకు సంసారబంధము వదలును.

అవ. మీఁదఁ జెప్పఁబడుబుద్ధితోఁ గూడినకర్మయొక్క మహాత్త్వమును జెప్పుచున్నాఁడు.

---

నది. ఇట్లు ఆత్మ యాథాత్మ్యమునుగూర్చినజ్ఞానము ఉపదేశింపఁబడినతోడనే ఆత్మయాథాత్మ్యమునుగూర్చిన చింతనవిశేషమైన జ్ఞానయోగమును చెప్పుట యుచితము. అయినను జ్ఞానయోగమునకు సాధనము కర్మయోగము. కనుక నిప్పుడు మొదట కర్మయోగము చెప్పఁబడుచున్నది. మఱియు కర్మయోగ మనఁగా ఆత్మయాథాత్మ్యజ్ఞానమును మున్నిడుకొని మోక్షము తప్ప తక్కినఫలముల నేమియుఁ గోరక శాస్త్రవిహితము లైనకర్మముల ననుష్ఠించుటయే కాని వేఱు కాదు. ఇట్టి కర్మయోగమున మొట్టమొదట ఆవశ్యకమైన ఆత్మయాథాత్మ్యజ్ఞాన మింతవఱకుఁ జెప్పఁబడఁగా, ఇఁక దానిని మోక్షసాధనముగా ననుష్ఠించుప్రకారమును (అనగాఁ ఆప్రకారమును గూర్చిన బుద్ధిని) 'బుద్ధిర్యోగే త్విమాం శృణు' అని చెప్పుచున్నాఁడని తెలియునది.

శ్లో॥ † నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥ 40

టీ. ఇహ=కర్మయోగమునందు, అభిక్రమనాశః=అభిక్రమ=ఆరంభమాత్రమున కైనను, నాశః=నాశము, నాస్తి = లేదు, ప్రత్యవాయః=దోషము, న విద్యతే = కలుగదు, అస్య ధర్మస్య = ఈకర్మయోగ మనెడిధర్మముయొక్క, స్వల్ప మపి=స్వల్పాంశ మయినను, మహతః=అధికమైన, భయాత్ =సంసారభయమునుండి, త్రాయతే=రక్షించుచున్నది.

తా. ఈశ్వరారాధనరూపమగు నీకర్మయోగము నారంభించి ముగింపకపోయినను ఫలము లేకపోదు. ఆరంభించినది చెడినను పాపము సంభవింపదు. ఈయోగము కొద్దిగా నాచరింపఁబడినను మహత్తరమగుసంసారభయమునుండి రక్షించును.

ఈకర్మయోగవిషయమే 'పార్థనైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే' అని మీఁద ప్రపంచింపఁబడును. కర్మయోగము
59 60
తప్ప నితరము లగు సమస్తలౌకికవైదికధర్మములు సమాప్తిపర్యంత మాచరింపఁబడక నడుమ విడువఁబడునేని అవి నిష్ఫలమగుటయే కాక దోషమునుం గలుగఁజేయును. కర్మయోగమట్లు గాక కొద్దిగా నాచరింపఁబడినను ఆస్వల్పాంశమునకుఁ దగినఫలము నొసఁగుటయే కాక విడిచిపెట్టుటచే దోషమును కలిగింప దని యభిప్రాయము.

---

† 'ఇమాంశృణు' అని బుద్ధిని చెప్పఁబూనినతోడనే 'వ్యవసాయాత్మికా బుద్ధిః' అని చెప్పవలసియున్నది కాని 'నేహాభిక్రమ' అని చెప్పుట సంగతము కాదన్నచో, చెప్పఁబూనినదాని మాహాత్మ్యమును ఉపక్రమమున చెప్పుటచే దానిని తెలిసికొనవలయు నని మిక్కిలిరుచి కలుగును. కాన దాని మహత్త్వము ముందు చెప్పఁబడుట సంగతమే యని గ్రాహ్యము.

అవ, కామ్యకర్మములను గుఱించిన బుద్ధికంటెను మోక్షసాధన మగుకర్మమునుగుఱించినబుద్ధి విశేషించిన దని చెప్పుచున్నాఁడు.

61

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన ।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥ 41

టీ. హే కురునన్దన=అర్జునా, ఇహ=సర్వకర్మముల యనుష్ఠానమందు, వ్యవసాయాత్మికా = శుద్ధాత్మయాథాత్మ్యముయొక్క నిశ్చయమును మున్నిడుకొన్నదియగు, బుద్ధిః = మోక్షేచ్ఛగలవానిబుద్ధి, ఏకా=ఒకటి. అవ్యవసాయినాం=ఆత్మస్వరూపనిశ్చయము లేనివానికి, బుద్ధయః = బుద్ధులు, అనన్తాశ్చ = అనంతప్రకారములు గలవియును, బహుశాఖాః=అనేకశాఖలు గలవియును.

62

తా. అర్జునా, మోక్షేచ్ఛ గలవానికి శాస్త్రీయములు లగు సమస్తకర్మములయందును ఆత్మస్వరూపనిశ్చయపూర్వక మైనబుద్ధి, మోక్షము నొకటినే యుద్దేశించుటచే ఒక్కటియే యై యుండును. ఆత్మస్వరూపనిశ్చయము లేక కామ్యకర్మముల నాచరించువారి బుద్ధులు బహుశాఖలు గలిగి అంతము లేనివై యుండును. (అనఁగా, వైదికకర్మము లనుష్ఠించువారు ముముక్షువు లనియు భోగైశ్వర్యకాము లనియు నిరుతెగలై యుందురు. వారిలో మోక్షఫలమును బొందఁ గోరువారిబుద్ధి ఆత్మయాథాత్మ్యమును నిశ్చయించుకొని ఆ నిశ్చయమును మున్నిడుకొని యుండును. కామ్యకర్ము లగువారిబుద్ధి

62

అట్టినిశ్చయము గలది గాదు. కామాధికారులకు 'దేహముకన్న వేఱై ఆత్మ యొక్కటి యున్నది' అనునంతమాత్రము తెలిసినఁ జాలును. ఆత్మయాథాత్మ్యనిశ్చయము వారికి అంతఁగా అపేక్షితము కాదు. ఆనిశ్చయము వారి కున్నను దానికి అనుగుణముగా మోక్షమును

గోరక స్వర్గపుత్రపశ్వన్నాదికామ్యములనే కోరుటయు దానికి వలయు సాధనముల ననుష్ఠించుటయు తత్ఫలము లనుభవించుటయు వారికిం
63
గలుగవచ్చును. అట్లు గలుగుటవలన శాస్త్రవిరోధ మేమియును లేదు. ముముక్షువునకు సర్వకర్మములును మోక్ష మనెడిఫల మొక్కటికే
64
సాధనములుగా విధింపఁబడుచున్నవి. ఇట్లు వానివ్యవసాయాత్మికమైనబుద్ధి, ఒక్కఫలమునే సాధింపఁజూచునది గాన ఒకటియే. అయినను ఆయాకర్మములు *స్వరూపమునందు నానావిధములుగా నుండు

---

* నిత్యములు నైమిత్తికములు కామ్యములు అను సమస్తకర్మములు ముముక్షువుచే అనుష్ఠింపఁబడు నేని, అవి సాక్షాత్తుగాఁగాని పరంపరగాఁగాని మోక్షమును సాధించుట కుపకరించును గాన మోక్ష మొకటియే వానికి ప్రధానమైన ఫలము. వానికే 'సర్వమాయురేతి' ఇత్యాదిగా ఆయువు మొదలగు అవాంతరఫలములు చెప్పఁబడినను అవి యామోక్షమున కుపయోగించునవి మాత్రమే యగుచుగాని వేఱు గావు. కాన సమస్త కర్మములును మోక్షఫల మొకటికే సాధనము లగును. ఇట్లాకర్మములు ఏకఫలసాధనములైనను క్రమముగా వానిస్వరూపములు నానావిధములుగా నుండఁగా వానినిగుఱించినబుద్ధి యేకముగా నెట్లుండు నన్నచో సమస్తకర్మములును ఏకఫలసాధనముగా ఏకవిధిచేత గ్రహింపఁబడుటవలన అవి ఏకశాస్త్రార్థ మగును. కాన యాకర్మములనుగుఱించిన బుద్ధి, వానియం దవాంతరభేదము లుండినను, అవి ఏకశాస్త్రార్థము లని యనుసంధించుటచే అదియును ఏకమే యగునని చెప్పఁబడినది. అయినను వేఱువేఱువిధులచే స్వరూపములు సిద్ధించియు వేఱువేఱువాక్యములచే నియమములు కలిగియున్న కర్మములు భిన్నశాస్త్రార్థములే కాని ఏకశాస్త్రార్థ మెట్లగు నన్నచో, ఇందులకు దృష్టాంత మొకటి యుదాహరింపఁబడినది. ఆగ్నేయము, అగ్నీషోమీయము, ఉపాంశుయాజము ఆగ్నేయము, ఐంద్రదధి, ఐంద్రపయస్సు అనెడి యీ యాఱుయాగములు దర్శపౌర్ణమాసము లనంబడును. ఆగ్నేయాదులలో మూఁడు పూర్ణమాసియందును (పున్నమయందును) తక్కినమూఁడు దర్శమందును (అమావాస్యయందును) జరుపఁబడును. ఈయాగములాఱును వానినియమములతో 'యదాగ్నేయోऽష్టాకపాలోऽమావాస్యాయాంచ పౌర్ణమాస్యాం చాచ్యుతో భవతి' ఇత్యాదిగా వానిస్వరూపమును మొదటఁ దెలుపునట్టి వాక్యములచే వేఱువేఱ ప్రతిపాదింపఁబడినవి. పిదప 'యఏవం విద్వాన్ పౌర్ణమాసీం యజతే' 'యఏవం విద్వా నమావాస్యాం యజతే' అని సముదాయముల ననువదించు వాక్యద్వయముచే సముదాయద్వయముగాఁ జెప్పంబడినవి. పిదప నీరెండును 'ఏతాభ్యాం దర్శపౌర్ణ

నపుడు వానిని గుఱించినబుద్ధి ఏకముగా నెట్లుండు నన్నచో నవి యెల్లను ఏకఫలసాధనములుగా ఏకవిధిచేత గ్రహింపఁబడుటవలన ఏకశాస్త్రార్థ మగుచున్నది. కావున సర్వకర్మములను గుఱించిన బుద్ధియు ఏకముగానే యుండును గాని, ఈకర్మ మీఫలమునకు సాధనము ఆకర్మము ఆ ఫలమునకు సాధనము అని, వేఱువేఱై పెక్కు-లుగా నుండదు. ఆగ్నేయాదు లైనకర్మములు లాఱును వాని యితికర్తవ్యతలతో, స్వరూపమునందు వేఱు వేఱుగా నుండినను, మొత్తమునకు స్వర్గమనెడి యేకఫలమునకే సాధనములుగా విధింపఁబడుటవలన. అవి యెల్ల ఏకశాస్త్రార్థమే యగుటంబట్టి వానినిగూర్చిన బుద్ధియు ఎట్లు ఏకముగానే యుండునో, అట్లే యని యర్థము-

65

(అనఁగా సర్వకర్మములును మోక్షమనెడి ఏకఫలమునకే సాధనములుగా విధింపఁబడుటచే ఏకశాస్త్రార్థ మగునుగాన వానియం దెల్ల 'మోక్షసాధనములు' అని వారికి బుద్ధియు ఏకముగానే యుండును.) ఆత్మయాథాత్మ్యనిశ్చయము లేనివారు పుత్రులు పశువులు అన్నము మొదలైనఫలములను గోరి వానికి సాధనములుగా కర్మము లాచరింతురు; కాన వారు గోరినఫలములు *అనంతము లగుటవలన

---

మాసాభ్యామ్' (కాత్యా-శ్రౌ-౪-3-౪౨) అని కామాధికారమున స్వర్గసాధనవిషయమందు ఒక్కటిగాఁ జేసి కర్తవ్యముగా విధింపఁబడినవి. ఇట్లు ఆయాఱును స్వరూపాదులందు వేఱువేఱయ్యు స్వర్గమనెడి ఏకఫలమునకు సాధనములుగా ఏకవిధిచే గ్రహింపబడుటచేత ఏకశాస్త్రార్థ మైనది. అట్లే సమస్తకర్మములును తమతమ స్వరూపాదులం వేఱువేఱువిధులచేత సిద్ధించినను తుదకు మోక్షమనెడి యేకఫలమునకు సాధనములని విధింపఁబడుటచే ఏకశాస్త్రార్థమే యగునుగాన వానినిగూర్చినబుద్ధియు ఏకమే యగు నని భావము.

* ఇట ప్రధానఫలభేదములు అనంతము లగుటంబట్టి అనంతములనియు, అవాంతరఫలభేదములు పెక్కులగుటంబట్టి బహుశాఖ లనియుఁ జెప్పఁబడుట తెలియునది. అనఁగా వృక్షములు స్వరూపముచే పరస్పరభిన్నములై అనంతములుగా నుండుటయే కాక తమలో నొక్కొక్కటియు పెక్కుశాఖలు గలిగియుండునట్లు, కర్మములు

వారిబుద్ధులును 'ఇది యీఫలమునకు సాధనము, అది యాఫలమునకు సాధనము' అని అనంతములుగా నుండును. అందును, దర్శపూర్ణమాసాదికర్మములు అవి యవి ఆయాప్రధానఫలమునకే ఏర్పఱుపఁబడినను, వానిలో ఒక్కొక్కటికి, 'ఆయురాశాస్తే' అని ఆయువు మొదలైన అవాంతరఫలభేదములును దెలియుచున్నందున ఒక్కొక్కటియు లోపల అనేకశాఖలు గలవిగాను నున్నవి. కాన వానిం గూర్చిన బుద్ధులును అనేకశాఖలుగా నుండును. ఇట్లు అవ్యవసాయుల
66
కర్మములు అనంతములును బహుశాఖలునుగా నుండుటంబట్టి వారి బుద్ధులును అనంతములును బహుశాఖలు నగును. దీని ముఖ్యాభిప్రాయ మేమనఁగా-నిత్యనైమిత్తికము లైనకర్మములకు ప్రధానఫలములును అవాంతరఫలములును జెప్పఁబడి యున్నవి. ఆఫలముల నన్నిటిని బరిత్యజించి సర్వకర్మములను మోక్షైకఫలములుగాను గావుననే యేకశాస్త్రార్థముగాను నాచరింపవలసినది. మఱి తమతమ వర్ణాశ్రమములకు తగినట్టి కామ్యకర్మములనుగూడ వానివానిఫలములను విడిచి మోక్షఫలసాధనములుగా నిత్యనైమిత్తికములతో నొక్కటిగఁ జేర్చుకొని శక్తికొలఁది నాచరింపవలయును. 67

69

అవ. ఇకఁ గామ్యకర్మాధికారులను దూషించుచున్నాఁడు.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః। 68
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః॥ 42
కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ 43

---

అనంతములైన ప్రధానఫలములంబట్టి అనంతస్వరూపభేదములు గలవిగాను, ఒక్కొక్కటియు అప్రధానములైన పెక్కు అవాంతరభేదములఁబట్టి బహుశాఖలుగాను నుండును. కాన వానినిగూర్చిన బుద్ధులు నట్లై యుండు నని భావము.

భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే॥ 44

టీ. పార్థ=అర్జునా, వేదవాదరతాః = వేదవాక్యములం దను రక్తిగలవారును, అన్యత్ = స్వర్గాదులకంటె వేఱొకటి, నాస్తి ఇతి వాదినః=లేదని వాదించువారును, కామాత్మానః=కామ్యవిషయము లందు మనస్సుగలవారును, స్వర్గపరాః = స్వర్గమునం దాసక్తులును నగు, (యే) అవిపశ్చితః=(ఏ) అల్పజ్ఞానులు, జన్మకర్మఫలప్రదాం = పునర్జన్మరూప మయినఫలము నిచ్చునదియు, క్రియావిశేషబహుళాం= పెక్కులైన క్రియలచేత నతిశయించినదియు, భోగైశ్వర్యగతిం ప్రతి (వర్తమానాం) = స్వర్గాదిసుఖానుభవరూపమైన ఐశ్వర్యముయొక్క ప్రాప్తి నుద్దేశించి (ప్రవర్తించు)నదియు, పుష్పితాం = చూపునకు మాత్రము రమ్యమయిన, ఇమాం=ఈ, యాం వాచం=ఏవాక్య మును-ప్రవదన్తి=అధికముగా చెప్పుచున్నారో, తయా=అట్టివాక్యము చేత, అపహృతచేతసాం=అపహరింపఁబడిన ఆత్మజ్ఞానము గలవారైన, (తేషాం) భోగైశ్వర్యప్రసక్తానాం=సుఖానుభవరూపమైన ఐశ్వర్యము నందు మిక్కిలి ఆసక్తి గల అట్టివారియొక్క, సమాధౌ = మనస్సు నందు, వ్యవసాయాత్మికాబుద్ధిః=నిశ్చయపూర్వక మగు బుద్ధి, న విధీ యతే=చేయఁబడదు-పుట్టదు.

తా. అర్జునా, అల్పజ్ఞులు, వేదములందలి కర్మభాగమునందు స్వర్గాదిఫలములఁగూర్చి చేయఁబడువాక్యములయందు తగులువడి ఆ వైదికకర్మములకు స్వర్గముకన్న నధిక మగుఫలము వేఱొక్కటి లేదని పలుకుచు, కామ్యవిషయములందు మనసు తగిలినవారుగాన, స్వర్గమునే పొందఁగోరుచుందురు. (అనఁగా మోక్షవిముఖు లగు దురు) మఱియును వేదములయందు (కామ్యవిధిభాగపరమైన) యా వాక్యము, మనుజులు యజ్ఞాది వైదికకర్మములఁ జేసి వానిఫల మగు స్వర్గాదిసుఖముల ననుభవించినవెనుక వారికి మరల కర్మభూమి

యందు పునర్జన్మరూపమైనకర్మఫలమును ప్రతిపాదించునే కాని మోక్షమును ప్రతిపాదింపదు; తత్త్వజ్ఞానము లేక అది యనుష్ఠింపఁబడును గాన యందు మోక్షమనెడి యేకఫలము నుద్దేశించుట కలుగదు. పశ్వన్నాదులైన బహువిధఫలములే యుద్దేశింపఁబడును కాన ఆఫలములకు సాధనములైన పలువిధములగు కర్మములను అది రూపించునదియు నగును. ఇంతేకాక, అది భోగైశ్వర్యప్రాప్తికొఱకే ప్రవర్తించునది కాని మోక్షమునకుఁ గాదు; కావుననే ఫలములేక పువ్వులుమాత్రము కల దానివలె ప్రయోజనములేక పైకిమాత్రము రమణీయముగా తోఁచుచుండును. అట్టివేదవాక్యమును, ఆయల్పజ్ఞులు ఎక్కువగా చెప్పుకొనుచుందురు. అట్టివారు తమకును భోగైశ్వర్యములందు విశేషాభిలాష యుండుటవలన, భోగైశ్వర్యములను గుఱించినయీవాక్యములందు మనస్సు తగిలి దానిచేత ఆత్మజ్ఞానము పోఁగొట్టుకొన్నవారగుదురు. కావున వారిమనస్సునందు, ఆత్మస్వరూపము చక్కఁగాఁ దెలిసినపిదప మోక్షమునకై సమస్తవైదికకర్మములనుష్ఠింపవలయు ననెడిబుద్ధి యెన్నఁటికిని కలుగనేరదు. కాఁబట్టి ముముక్షువునకు కామ్యకర్మములయందు సంగ మెపుడును తగదు. 71

అవ. తలిదండ్రులు[72] వేన[73] వేలమందికంటెను మిక్కిలివాత్సల్యము[74] గలదై ఆత్మోజ్జీవనము మొదలైనహితముల నుపదేశించుటకు ప్రవర్తించుచున్న వేదములు ఇట్లు అత్యల్పఫలములై పునర్జన్మమును[75] గలుగఁజేసెడికర్మములను ఏల చెప్పుచున్నవి? వేదవిహితమైన కర్మలను ఎట్లు త్యాజ్యమనవచ్చును అని? యడుగఁగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ 45

టీ. వేదాః= వేదములు, త్రైగుణ్యవిషయాః=సత్త్వరజస్తమోగుణములు గల పురుషుల హితమును ప్రతిపాదించునవి. హే అర్జున= ఓయర్జునా, నిస్త్రైగుణ్యః=అన్యోన్యముకలసిన ఈమూఁడుగుణములు లేనివాఁడవును-నిర్ద్వన్ద్వః = సకలసాంసారికస్వభావములు లేనివాఁడవును, నిత్యసత్త్వస్థః=ఎల్లప్పుడు శుద్ధసత్త్వగుణమునే ఆశ్రయించినవాఁడవును, నిర్యోగక్షేమః=లభింపనివానిని బొందుట యనెడియోగమును ప్రాప్తమైనవానిని రక్షించుట యనెడిక్షేమమును విడిచినవాఁడవును, ఆత్మవాన్ = ఆత్మస్వరూపమును వెదకుటయం దాసక్తుఁడవును, భవ=అగుము.

తా. మిక్కిలి సత్త్వగుణము గలవారు మాత్రమే మోక్షమును గోరుదురు. తక్కినరజస్తమోగుణములు మిక్కిలిగాఁగలవారు దానిని ఒల్లక స్వర్గాదిసాధనములనే కోరుదురు. కనుక వేదములు వీరికి, వీరిగుణముల కనుగుణముగా స్వర్గాది ఫలములను సాధించు 77 టయే హితమని బోధింపవేని, యపుడు వీరు రజస్తమస్సులు మిక్కుటముగాఁ గలవారు గావున సాత్త్వికఫలమైన మోక్షమునకు విముఖులై తా మపేక్షించిన స్వర్గాదిఫలములకు సాధనము లివి యని మఱియొకదానిచే నెఱుఁగలేక కామప్రావణ్యముచే వివశులై ఉపా 78 దేయములుకానివానిని ఉపాదేయములుగా భ్రమించి చెడిపోదురు. కావున వేదములు మిక్కిలిసత్త్వగుణు లైనవారికిని, మిక్కిలిరజో 76 గుణులైనవారికిని, మిక్కిలితమోగుణు లైనవారికిని వాత్సల్యముతో వారివారికిఁ దగినహితములను బోధించుచున్నవి. ఇట్లు వేదములు మూఁడుగుణములు గలవారినిగుఱించియుఁ బ్రవర్తించుచున్నవి. నీవి 79 80 ప్పుడు సత్త్వమే మిక్కిలి కలిగియున్నావు. దానిని వృద్ధిఁబొందింపుము. మూఁడుగుణము లొండొంటితోఁ గలిసి మిక్కిలి యగునట్లు చేయ

కుము. వానిని మిక్కుటముగు నట్లు పెంపకుము. ఇట్లు వర్తించుట వలన పుణ్యపాపములకుఁ గారణము లగుసకలసంసారస్వభావముల నెల్ల విడిచినవాఁడవై, రజస్తమోరహిత మగునట్లు సత్త్వగుణమును మాత్రము నిత్యమును వృద్ధి బొందించుకొని శుద్ధసాత్త్వికుఁడవుకమ్ము.
81
ఇట్టివాఁడ వగుట కుపాయ మెద్ది? యంటివేని, ఆత్మస్వరూపంబును, ఆత్మస్వరూపముఁ బొందుటకు నుపాయము లగునవియును తప్ప తక్కినవాని ప్రాప్తిని గోరక, ప్రాప్తించినవాని రక్షణము సేయక ఆత్మస్వరూపమును గని పెట్టుటయే పనిగా నుండుము. ఇట్లు చేయుదు వేని రజస్తమస్సుల ప్రాచుర్యము నశించి సత్త్వము వృద్ధిఁబొందును.

అవ. వేదమునందు చెప్పఁబడిన దంతయు నందఱకును ఉపాదేయము కాదని దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యావా నర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ 46

టీ. సర్వతః=అంతటను, సంప్లుతోదకే = నిండియున్ననీరుగల, ఉదపానే=తటాకమునందు, యావాన్ =ఎంత, అర్థః=ప్రయోజనమో, విజానతః=ఆత్మజ్ఞానము గల, బ్రాహ్మణస్య = బ్రహ్మజ్ఞాన నిష్ఠుడగు-ముముక్షువునకు, సర్వేషు=సమస్తములైన, వేదేషు = వేదములయందు, తావాన్ అర్థః=అంతే ప్రయోజనము.

తా. స్నానపానాది 82 నానావిధ ప్రయోజనముల కొఱకుఁ గల్పింపఁబడినదై సర్వత్ర జలపూర్ణమైయుండు తటాకమునందు దప్పిగొన్నమనుజుఁడు, తాఁగుట కెంతజలము ప్రయోజనమో అంత మాత్రమే గ్రహించునుగాని జలమునంతయు గ్రహించుటలేదు. అట్లే సర్వాధికారులకొఱకును బ్రవర్తించుచున్నదై కావుననే వారివారికి వలయు సమస్తవిషయములతో నిండియుండునది యగు వేదములం

దెల్ల వైదికుఁడును ముముక్షువును నగువానికి ఎంతమాత్రము మోక్ష 83 సాధనమో అంతమాత్రమే ఉపాదేయము (గ్రహింపఁదగినది) గాని అంతయు నుపాదేయము కాదు.

అవ. కాఁబట్టి సత్త్వనిష్ఠుఁ డగునట్టిముముక్షువునకు *కింత మాత్రమే ఉపాదేయ మగునని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
85
మా కర్మఫలహేతుర్భూర్మా తే సఙ్గోఽస్త్వకర్మణి॥ 47

టీ. తే=నీకు, కర్మణ్యేవ = కర్మస్వరూపమునందు మాత్రము. అధికారః=అధికారము (కలదు), కదాచన=ఒకప్పుడును, ఫలేషు = వానికి సంబంధించిన స్వర్గాదిఫలములయందు, మాభూత్ = (అధి కారము) లేదు. †కర్మఫలహేతుః=కర్మములకును వానిఫలములకును

---

* మోక్షసాధనములు తప్ప తక్కినవన్నియుఁ బరిత్యజించుటచే నిత్యనైమిత్తి కాదుల నుల్లంఘింపవలసి వచ్చును. దానిచే కామచారదోషము కలుగును. మఱి పూర్వశ్లోకమున 'తావాన్' అనఁగా 'అంతమాత్రము' అని యున్నది. ఈశ్లోకమున 'అంతమాత్రము' అన్నందులకు ఇంతమాత్రము అని తెలుపుటచే కామచారదోషము గలుగదు. ఇంతమాత్రమనఁగా కర్మముల స్వరూపమాత్రము అని తెలియునది. అనఁగా కర్మములయొక్క ఆయాఫలములను వదలి వాని సాధారణస్వరూపమాత్రము ఉపా దేయముగాఁ గొనవలయు నని భావము. ఈఫలత్యాగముచే, ఒకఫలమును గోరి మఱొకయుపాయమును అనుష్ఠించుదోషమును గలుగదు.

† 'కర్మణ్యేవాధికారః' 'మా తే సఙ్గోఽస్త్వకర్మణి' అని పూర్వోత్తరములందు కర్మములను గావింపుమని చెప్పి నడుమ 'మాకర్మఫలహేతుర్భూః' అని కర్మములకు హేతువు-అనగా కర్త-గాకుండుము అనుట విరుద్ధ మగుచున్నది. కాన యిట 'హేతువు గాకుండుము' అనఁగా వాస్తవమున హేతువు గాకుండుమని యర్థము గాదు. హేతువుగా నుండుటను అనుసంధింపవలదని భావము. కర్మమునకు హేతు త్వముగాదు హేతుత్వానుసంధానమే నిషేధింపఁబడినదని గ్రాహ్యము. మఱి యిట 'మా ఫలేషు కదాచన' అని ఫలహేతుత్వము నిషేధించియుండఁగా 'మాకర్మఫల హేతుర్భూః' అని మరల దానిని నిషేధించుట పునరుక్తమగును. ఇది యిట్లుండ

కారణము (అనఁగా కర్త) మాభూః = కాకుండుము, తే = నీకు. అక
ర్మణి = కర్మములను అనుష్ఠింపకుండుటయందు, సఙ్గః = ఆసక్తి, మా
అస్తు = కలుగకుండునుగాక.

తా. నిత్యము నైమిత్తికము కామ్యము అనఁబడునవై ఒకా
నొక ఫలవిశేషముతో సంబంధించినవిగా శ్రుతులందుఁ బ్రతిపాదింపఁ
బడుచున్న కర్మములలో నిత్యసత్త్వనిష్ఠుఁడును ముముక్షువు నగునీకు
కర్మమాత్రమందు అధికారము కలదు; కాని, దానిని సంబంధించి
నవిగాఁ దెలియఁబడుఫలములందు ఒకప్పుడును అధికారము లేదు.
కర్మము ఫలముతోఁ గూడిన దైనయెడల బంధరూప మగుటవల
నను, ఫలము లేక కేవలమైన కర్మము నన్ను ఆరాధించుటయే యై
85
మోక్షహేతు వగుటవలనను, కర్మమునకును వాని ఫలములకును
హేతువుగాకుము, కర్మములను అనుష్ఠించుచుండినను నిత్యసత్త్వస్థుఁ
డును ముముక్షుఁడు నగునీవు అకర్తృత్వముగూడ అనుసంధింపవల
యును. ఆఁకలి నివర్తించుట మొదలైనఫలములకుఁగూడ నిన్ను
హేతువుగా నీ వనుసంధింపరాదు *ఆ రెంటిని గుణములందుఁగాని

భోజనాదులవలన క్షున్నివృత్త్యాదిఫలములు కలుగునుగదా. ఈఫలములను నిషేధించి
నచో వీని కుపాయము లైన భోజనాదులందలిరక్తియు నివర్తించును గాన శరీరధార
ణాదులు లేక ఉపాయానుష్ఠానమే లోపించును. కనుక ఫలనిషేధము పొసఁగదు.
కాన యిందులకై 'క్షున్నివృత్త్యాదులైన ఫలములకుఁగూడ' అని చెప్పఁబడినది.
అనఁగా ముందు 'ఫలేషు' అనుచో సామాన్యముగ ఫలములను చెప్పి యిప్పుడు
'ఫలహేతుః' అనుచో క్షున్నివృత్త్యాదివిశేషఫలములను చెప్పుటచే పునరుక్తి కలు
గదు. మఱి క్షున్నివృత్త్యాదిఫలముల స్వరూపమును నిషేధింపలేదు. ఆఫలములకు
తాను హేతువని యనుసంధించుటమాత్రమే నిషేధింపఁబడినది గాన ఉపాయాను
ష్ఠానలోపము మున్నగుదోషములు కలుగవు.

* కర్మమునకును ఫలములకును తాను హేతువుగా నుండియు హేతువుగాదని
యనుసంధించుట యెట్లు? ఆహేతుకమైనదానికి ఉపాయ మనుష్ఠింపనేల? మఱి
ప్రయాసమెందుకు? అన్నచో, కర్మమునకును ఫలమునకును హేతువు గుణములని

సర్వేశ్వరుఁ డగునాయందుఁగాని అనుసంధింపవలయునని మీఁదఁ జెప్పఁబడెడిని. ఇట్లు అనుసంధించి కర్మము చేయుము. 'నేను యుద్ధము చేయను' అని నీవు మున్ను చెప్పినట్లు కర్మమును అనుష్ఠింపకుండుట యందు నీకు సంగము లేకుండుఁగాక-అనఁగా పూర్వోక్తప్రకారమున యుద్ధాదికర్మమునందే సంగ ముండుఁగాక యని యర్థము. 86

అవ. దీనినే మఱింత స్ఫుటముగాఁ జెప్పుచున్నాఁడు.

87

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥ 48

టీ. హే ధనఞ్జయ=అర్జునా, సఙ్గం=ఆసక్తిని, త్యక్త్వా=విడిచి, సిద్ధ్యసిద్ధ్యోః=ప్రాప్తియందును అప్రాప్తియందును, సమః=సమానుఁడవు, భూత్వా=అయి, యోగస్థస్సన్ = యోగమునం దున్నవాఁడ

---

కాని సర్వేశ్వరుఁడనికాని యనుసంధింపవలయునని మీఁదఁ జెప్పఁబడుచున్నదిః కాఁబట్టి యహేతుకత్వము లేదు. కాని, ఆత్మమాత్రము అందులకు హేతువుగాదని యనుసంధించుటచే అది దానిని అనుష్ఠింపలేదని ప్రసక్తి కలుగదా? యనవచ్చును. అయినను ఇచట అనుష్ఠించుటను అనుష్ఠింపమిగా భ్రాంతిచెప్పలేదు. అనుష్ఠించినవాఁడై యుండఁగా అట్టివాఁడు గాఁడని గ్రహించునట్లును విధింపలేదు. 'పరాత్తు తచ్ఛ్రుతేః' 'య ఆత్మానమన్తరో యమయతి' 'సర్వస్యచాహం హృది సన్నివిష్టః' ఇత్యాది శారీరకసూత్ర శ్రుతిస్మృతులవలన ఆత్మయొక్క కర్తృత్వము పరమాత్మకధీనమైనదని తెలియుచున్నది. మఱియు ఆత్మకుఁ గలకొన్ని కార్యములు త్రిగుణములచేఁ గలిగినవి కాని దానికి స్వరూపముచే సిద్ధించినవిగావు ఇట్లు ఆత్మ చేయు కార్యమునకు పరమాత్మాదులు హేతువులు పెక్కులుండఁగా ఆత్మయొక్కటే హేతువనుటయు, త్రిగుణములచే దానికిఁ గలిగినవానిని స్వరూపముచేఁ గలిగినవనుటయు, భ్రాంతిసిద్ధములుగాన యీ రెంటిని ఇట నిషేధించి గుణములును సర్వేశ్వరుఁడును ఆత్మ కార్యమునకు హేతువులుగా అనుసంధించుట చెప్పఁబడినది, ఇట్లు ఆత్మకు కర్మఫలముల హేతుత్వానుసంధానమును నిషేధించినను వానియొక్క స్వరూపమును నిషేధింపరాదుగాన 'ఇట్లు అనుసంధించి కర్మమును జేయుము' అని అనుష్ఠింపకుండుటయందు తగులు వలదని చెప్పి ఈయనుష్ఠింపమికి 'నయోత్స్యే' అన్న యర్జునుని తొంటి కార్యమునే యుదాహరించిరని తెలియునది.

వై, కర్మాణి=యుద్ధాదికర్మములను, కురు=చేయుము. సమత్వం = సిద్ధ్యసిద్ధులయందు సమానమైన మనస్సు గలిగియుండుటయే, యోగః (ఇతి) ఉచ్యతే=యోగ మని చెప్పఁబడుచున్నది.

తా. రాజ్యబంధుపుత్రభృత్యులయందు సంగమును వదలి, సిద్ధ్యసిద్ధులను సమముగాఁ గొను యోగమునందు నిలిచి, యుద్ధాదికర్మముల నాచరింపుము. వానియందు తత్ఫలములగు జయము మొదలైనవి సిద్ధించినను సిద్ధింపకుండినను సమానమగు మనస్సు గలిగి యాకర్మములను జేయుము. సిద్ధ్యసిద్ధులయందలి యీ సమత్వము 'యోగస్థః' అని యిట *యోగ శబ్దముచే చెప్పఁబడినది. సిద్ధ్యసిద్ధులయందు సమత్వరూపమైన చిత్తసమాధానమే యోగ మనఁబడును.

అవ. ఎందుల కిది మాటిమాటికిఁ జెప్పఁబడుచున్న దనఁగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనఞ్జయ।
88 89
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ 49

టీ. హేధనఞ్జయ=అర్జునా, బుద్ధియోగాత్ = బుద్ధియోగము కంటె (ఇతరత్ = అన్యమైన), కర్మ = కామ్యకర్మము, దూరేణ = మిక్కిలి, అవరంహి=తక్కువగదా; బుద్ధౌ=సమత్వబుద్ధియందు, శరణం = ఆశ్రయమును, అన్విచ్ఛ = కోరుము-ఆబుద్ధియందే వర్తింపుమనుట, ఫలహేతవః = ఫలాపేక్షతో కర్మములఁ జేయువారు కృపణాః=దీనులు.

---

* యోగశబ్దమునకు పాతంజలయోగశాస్త్రమునందు 'యోగ శ్చిత్తవృత్తి నిరోధః' అనఁగా చిత్తసమాధాన మని చెప్పంబడినది.

తా. ప్రధానఫలమును త్యజించినదై, అవాంతరఫలముల సిద్ధ్యసిద్ధులయందు సమమై యుండుబుద్ధియోగముతో చేయఁబడు కర్మముకంటె ఇతరమైన కామ్యకర్మము మిక్కిలి నికృష్టమయినది. పూర్వోక్తబుద్ధియోగముతోఁ గూడిన కర్మము నిఖిలసాంసారిక దుఃఖముల దొలఁగించి పరమపురుషార్థలక్షణమగు మోక్షమును బొందించును. ఇతరమైనది అపరిమిత దుఃఖరూప మగుసంసారమును బొందించును. కాన రెంటికిని ఎక్కువతక్కువలంబట్టి వైషమ్యము మిక్కిలిగానున్నది. కనుక కర్మముల నాచరించునపుడు అట్టి బుద్ధియందు వర్తింపుము. ఫలాపేక్షతో కర్మముల నాచరించువారు దీనులయినవిత్యసంసారు లగుదురు.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ 50

టీ. బుద్ధియుక్తః=బుద్ధియోగముతోఁగూడినవాఁడు, ఇహ = ఈజన్మమునందు, సుకృతదుష్కృతే = పుణ్యపాపములను, ఉభే = రెంటిని, జహాతి=త్యజించుచున్నాఁడు, తస్మాత్ = ఆకారణమువలన, యోగాయ=సమత్వరూపమైన బుద్ధియోగముకొఱకు, యుజ్యస్వ = సిద్ధపడుము, కర్మసు = కర్మములయందు-కర్మము లాచరించునపుడనుట, యోగః = బుద్ధియోగము, కౌశలం = సామర్థ్యము-సామర్థ్యముచే సాధింపఁదగిన దనుట.

తా. బుద్ధియోగముతో కర్మముల నాచరించుపురుషుఁడు
90
అనాదికాలసంచితములును అనంతములును బంధహేతువులు నైన పుణ్యపాపకర్మములను రెంటిని ఇహమునందె త్యజించును. కాఁబట్టి సమత్వరూపమైన అట్టిబుద్ధియోగముకొఱకు నుద్యోగింపుము. బుద్ధియోగముతో కర్మములు చేయుటయే మిక్కిలిసామర్థ్యము. కాఁబట్టి సమత్వబుద్ధియుక్తుఁడవు గమ్ము.

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।
91 91
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥ 51

టీ. బుద్ధియుక్తాః = బుద్ధియోగముతోఁగూడిన, మనీషిణః = వివేకజ్ఞులు, కర్మజం = కర్మమువలనఁ గలుగు, ఫలం = ఫలమును, త్యక్త్వా = విడిచి, జన్మబన్ధవినిర్ముక్తాఃసన్తః = జన్మమనెడిబంధనమునుండి బొత్తిగావిడువఁబడినవారగుచు, అనామయం = ఉపద్రవరహితమగు, పదం = స్థానమును, గచ్ఛన్తిహి = పొందుచున్నారు గదా.

తా. బుద్ధియోగముతో కర్మముల నాచరించుజ్ఞానులు కర్మములవలనఁ గలుగు స్వర్గాదిసకలసాంసారికఫలములను త్యజించి పునర్జన్మ మనెడిబంధములనుండి సవాసనముగా విడివడినవారై నిరుపద్రవమైన మోక్షపదవి నొందుదురు. ఇది ప్రసిద్ధమే కదా.

92
శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥ 52

టీ. తే = నీయొక్క, బుద్ధిః = బుద్ధి, మోహకలిలం = అజ్ఞానరూపమగుకలుషమును, యదా = ఎప్పుడు, వ్యతితరిష్యతి = దాఁటఁగలదో, తదా = అప్పుడు, శ్రోతవ్యస్య (కృతే) = వినవలసినయర్థముకొఱకును, శ్రుతస్యచ (కృతే) = వినినయర్థముకొఱకును, *నిర్వేదం = నిన్ను నీవే నిరసించుకొనుటను, గన్తాసి = పొందఁగలవు.

తా. (ఇట్లు చెప్పఁబడినప్రకారమున కర్మమునందు వర్తించు
93
చున్నవాఁడవై అట్టివర్తనముచేఁ బాపములు పోఁగొట్టుకొన్నవాఁడ

* నిర్వేద మనఁగా తన్ను తాను నిరసించుకొనుట. 'ఆప్తతములైనవా రెంత చెప్పినను వినక త్యాజ్యము లైనవానియందు మున్ను సంగము కలిగియు ఉపాదేయము లైనవానిని ఇంకను దెలిసికొనకయే నున్నాఁడనే' యని నిర్వేదపడుట ఇట గ్రాహ్యము.

వగు) నీయొక్క చిత్తము (ఇంకను అత్యల్పఫలసంగమునకు హేతుభూతమై యుండు) దేహాత్మాభిమానరూప కాలుష్యమును ఎప్పుడు విశేషించి యతిక్రమించునో అప్పుడు ఆప్తతములగు మాబోంట్లవలన నింతకుఁబూర్వము త్యాజ్యములుగా నీవు వినినఫలాదులకుఁ
94
గాను ఇఁక వినఁబోవు అర్థమునకుఁగానును నిన్ను నీవే నిరసించుకొనఁగలవు.

అవ. 'యోగేత్విమాం శృణు' ఇత్యాదులచేఁ జెప్పఁబడినదియు ఆత్మయాథాత్మ్యజ్ఞానపూర్వక మైనదియు బుద్ధివిశేషముచే సంస్కరింపఁబడినదియు నగు ధర్మానుష్ఠానమునకు ఉద్దేశ్యభూత మగు యోగ మనెడిఫలమును జెప్పుచున్నాఁడు.

95
శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
101 102
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి॥ 53

టీ. శ్రుతివిప్రతిపన్నా=వినుటచేత విశేషముగా తెలిసికొనఁబడినదై, అచలా=ఏకరూపమైన, తే = నీయొక్క, బుద్ధిః=ప్రజ్ఞ, సమాధౌ=మనస్సునందు, యదా=ఎప్పుడు, నిశ్చలా = చలింపనిదై, స్థాస్యతి=స్థిరముగ నుండునో, తదా = అప్పుడు, యోగం = ఆత్మావలోకనమును, అవాప్స్యసి=పొందఁగలవు.

96 97
తా. ఆప్తతము లగుమావలనఁ గలిగినవినికిచేత విశేషముగా గ్రహింపఁబడినదియు, (ఇతరము లగుసకలవస్తువులకును విజాతీయమును సజాతీయమునుగాక నిత్యమై నిరతిశయసూక్ష్మతత్త్వమైయుండునట్టి ఆత్మవిషయముగాఁగలదియు, కాఁబట్టి 'వ్యవసాయాత్మికాబుద్ధి
98 99
రేకా' అనునట్లు (తనంతట) చలింపక ఏకరూపముగా నుండునదియు

నగునీబుద్ధి, ఫలసంగరహితకర్మానుష్ఠానముచేత నిర్మలముగాఁ జేయఁ
బడిననీమనస్సు[101]నందు ఎప్పుడు స్థిరముగా[100] నిలుచునో, అపుడు నీవు
యోగమును (అనఁగా ఆత్మావలోకనమును) బొందుదువు. దీని
[102]అభిప్రాయమేమనిన - *శాస్త్రజన్యమైన ఆత్మజ్ఞానమును మున్నిడు
కొని చేయఁబడు కర్మయోగము స్థితప్రజ్ఞత యనెడి జ్ఞాన
నిష్ఠను గలుగఁజేయును. జ్ఞాననిష్ఠారూపమైన ఆస్థితప్రజ్ఞత యోగ
మనెడి ఆత్మావలోకనమును సాధించు నని భావము. 100

అర్జున ఉవాచ :

అవ. ఇట్లు చెప్పఁగా, అర్జునుఁడు ఫలసంగరహితకర్మానుష్ఠాన
రూపమైనకర్మయోగముచే సాధ్యమైనదియు యోగమునకు సాధన
మైనదియు నగుస్థితప్రజ్ఞతయొక్క స్వరూపమును స్థితప్రజ్ఞునియొక్క
అనుష్ఠానప్రకారమును నడుగుచున్నాఁడు.

అర్జున ఉవాచ :

శ్లో॥ [103]స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥ 54

టీ. కేశవ=కృష్ణా, సమాధిస్థస్య=సమాధియందుండెడి, స్థిత
ప్రజ్ఞస్య=జ్ఞాననిష్ఠునికి భాషా = స్వరూపవాచకశబ్దము, కా = ఏది-

---

* మొదట శాస్త్రశ్రవణముచేత తత్త్వజ్ఞానము (అనఁగా ఆత్మయొక్క నిజ స్వరూప మిట్టిది యనుతెలివి) కలుగుచున్నది. ఇదియె ఆత్మజ్ఞానము అనియు చెప్పఁ బడుచున్నది. పిదప రెండవది స్మృతిసంతతిరూపమగు ఉపాసనము-స్మృతిసంతతి యనఁగా ఎడతెగని స్మరణము-తైలధారవలె అవిచ్ఛిన్నముగా ఆత్మను స్మరించు చుండుట. ఈస్మృతిసంతతిరూపమైన యుపాసనమునకే స్థితప్రజ్ఞత, జ్ఞాననిష్ఠ, జ్ఞానయోగము అని మూఁడుపేళ్ళు వ్యవహరింపఁబడుచున్నవి. పిదప మూఁడవది ఈయుపాసనమూలమునఁ గలుగు ఆత్మసాక్షాత్కారము. అనగా ఆత్మదర్శనము. దీనికే యోగమనియు పేరు. ఈమూడుఁను జ్ఞానపూర్వభేదములని యెఱుంగునది.

అనఁగా మఱియు నేశబ్దముచేత వానిని నిర్దేశింపవచ్చును-వానిస్వరూప మెట్టిది యని యర్థము, స్థితధీః=ఆస్థితప్రజ్ఞుఁడు, కిం=దేనిని, ప్రభాషేత=పలుకును, కిం ఆసీత=ఎట్లు కూర్చుండును, కిం వ్రజేత = ఎట్లు నడచును-వానినడత యెట్టిది?

తా. సమాధినిష్ఠుఁడై స్థితప్రజ్ఞత గలపురుషుఁ*స్వరూప మెట్టిది? అతఁ డెట్టిభాషణాదులను చేయును? ధ్యానముకొఱ కెట్టి ఆసనాదులు గలిగియుండును? (కిం గమనం కుర్యాత్) ఏమిటఁ బ్రవర్తించును?

శ్రీ భగవా నువాచ :

అవ. స్థితప్రజ్ఞతయొక్క పరిపాకమునకుఁగల నాలుగుదశలు రాఁగల నాలుగుశ్లోకములందు ఎరుకగా నిరూపింపఁబడుచున్నవి. అందు పూర్ణపరిపక్వ మగునాలుగవదశ వశీకరణసంజ్ఞ అనుపేరుగలది మీఁదిశ్లోకమునఁ జెప్పఁబడుచున్నది. మఱియు స్థితప్రజ్ఞుని స్వరూప మెట్టిది? యను మొదటి ప్రశ్నమునకు నుత్తరముగా, వానివృత్తివిశేషమును జెప్పినయెడల వాని స్వరూపముగూడఁ జెప్పఁబడినదే యగును గనుక వానివృత్తివిశేషమును మొదట చెప్పుచున్నాఁడు. 104

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ 55

టీ. హేపార్థ=అర్జునా, ఆత్మనా = ఆత్మనే యవలంబించినట్టి మనస్సుచేత, ఆత్మన్యేవ = ఆనందరూప మైనతనయాత్మయందె, తుష్టః=సంతోషించినవాఁడై, మనోగతాన్ = మనస్సునం దుండెడి,

---

*దేనియొక్క స్వరూపముగాని దానియొక్క వాచకశబ్దముచేత నిర్దేశింపఁబడుచున్నది గనుక నిందు స్థితప్రజ్ఞునికి వాచకశబ్ద మేది యనుటచే వానిస్వరూప మెట్టిది అనునర్థము ఫలించుచున్న దని గ్రాహ్యము.

సర్వాన్=సమస్తమైన, కామాన్=కోరికలను, యదా = ఎప్పుడు, ప్రజహాతి=బొత్తుగ విడుచుచున్నాఁడో, తదా = అప్పుడు, స్థితప్రజ్ఞః= స్థితప్రజ్ఞ గలవాఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా. అర్జునా, *ఎప్పుడును ఆత్మయే విషయముగాఁ గలిగి యుండునట్టి మనస్సుచేత ఆనందరూపమైన తనయాత్మయందే తృప్తి నొందినవాఁడై (అనఁగా ఆత్మయందే సంతోషించిన మనస్సుగల వాఁడై) ఆతృప్తిచేత ఆత్మతప్ప తక్కినమనోరథము లన్నియు బొత్తిగా నెప్పుడు వదలుచున్నాఁడో, అప్పుడు స్థితప్రజ్ఞుఁ డనఁబడు చున్నాఁడు. ఇదియే జ్ఞాననిష్ఠయొక్క కాష్ఠ-అనఁగా స్థితప్రజ్ఞతయొక్క పూర్ణపరిపాకదశ. 105

అవ. ఈనాలుగవదశకంటె కొంచెము తక్కువపరిపాకముగల *మూఁడవదశను ఏకేంద్రియసంజ్ఞ అనుదానిని జెప్పుచున్నాఁడు.

106

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాస్సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే॥ 56

టీ. దుఃఖేషు = దుఃఖహేతువు లగువానియందు, అనుద్విగ్న మనాః = క్షోభమునొందని మనస్సు గలవాఁడును, సుఖేషు = సుఖ హేతువు లగువానియందు, విగతస్పృహః = స్పృహ లేనివాఁడును,

---

* నిరతిశయానందరూప మగువాత్మయే యుద్దేశ్యముగాఁ గలిగి దానియందే రమించుచుండు మనస్సు గలవానికిఁ దక్కిన యాయాపదార్థములందుఁ గలయాయా కోరిక లన్నియు మఱల మొలకెత్తకుండునట్లు సవాసనముగ పూర్ణముగ నశించుచున్న వని భావము.

* ఉద్వేగస్పృహారాగాదులు నాలుగవదశకును మూఁడవదశకును సమానమే యైనను, ఈమూఁడవదశయందు ఔత్సుక్యమాత్రమును చూపఁజాలువిషయవాసన బూడిదలోనినిప్పువలె నొక్కింత మిగిలియుండుటచే ఇది నాల్గవదశకంటెను వే ఱగు చున్నది.

వీతరాగభయక్రోధః = ఆశ భయము క్రోధము లేనివాఁడును అగు, మునిః=ఆత్మమననశీలుఁడు, స్థితధీః (ఇతి)=స్థితప్రజ్ఞుఁ డని, ఉచ్యతే= చెప్పబడుచున్నాఁడు.

తా. †ప్రియవస్తువిశ్లేషాదిదుఃఖములకు నిమిత్తము లైనట్టివి ప్రాప్తించినను వానివలన దుఃఖింపనివాఁడును, సుఖసాధనము లగునవి దగ్గఱ నుండినను వానియెడల పూర్వముండినస్పృహ లేనివాఁడును, రాగభయక్రోధములు లేనివాఁడును, ఆత్మమననశీలుఁడును నగు వాఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁడు. ఉద్వేగస్పృహారాగాదులు లేనివాఁడై సాక్షాత్కరింపఁబోవుచున్నయాత్మను మననము చేయుచు నుండువాఁడు స్థితప్రజ్ఞుఁ డని భావము. 107 స్పృహ యనఁగా సామాన్యముగా అనురాగము. రాగ మనఁగా కలుగనట్టివానియెడల స్పృహ. 108 ప్రియము లైనవి పాసిపోవుటకును, అప్రియము లైనవి వచ్చుటకును సూచకము లైన హేతువులను జూడఁగాఁ బుట్టునట్టిదుఃఖమే భయము ప్రియములపోకకును అప్రియములరాకకును హేతుభూతు లగునట్టి యితరచేతనులకు దుఃఖము కలిగించునట్టి తనమనోవికారమే క్రోధము. 109

అవ. మూఁడవదశకన్నఁ గొంతతక్కువపరిపాకము గల రెండవ దశను *వ్యతిరేకసంజ్ఞ అను పేరు గలదానిని జెప్పుచున్నాఁడు.

---

† ప్రియవిశ్లేషాదులు ప్రాప్తించి బాధపెట్టునపుడు కలుగునది దుఃఖము. అవి ప్రాప్తించునని కేవలసూచకము లగపడినపుడు కలుగుదుఃఖము భయము.

* అపక్వములైన కషాయములను పక్వములైన వానికంటె వేఱయినవిగాఁ దలఁచి వానినిగూడఁ బక్వతను పొందించుదశయే వ్యతిరేకసంజ్ఞ యనఁబడును. ఇట పూర్వమే తన్ను అంటియుండు ప్రియులయెడ తానే స్నేహము చూపఁడనియు, దైవికముగా నడుమ ప్రాప్తించిన ప్రియసంశ్లేషాదులందు అభినందనాదులను చూపఁడనియు చెప్పఁబడుటచే, అపక్వము లైన రాగాదులను పక్వము సేయఁగోరి స్నేహము, అభినందనము, ద్వేషము అనెడి మనోవ్యాపారవిశేషములను వారించుచున్నాఁడని

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।
110
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

టీ. యః=ఎవ్వఁడు, సర్వత్ర=అన్నిట-ప్రియములైనవానియం దెల్ల, అనభిస్నేహస్సన్ = స్నేహములేనివాఁడగుచు, తత్తత్ శుభాశుభం = ఆయా ఆనుకూల్యప్రాతికూల్యములను, ప్రాప్య = దైవికముగా పొందియు, న అభినన్దతి = సంతోషింపఁడో, న ద్వేష్టి=ద్వేషింపఁడో, తస్య = వానియొక్క, ప్రజ్ఞా=జ్ఞానము, ప్రతిష్ఠితా=మిక్కిలి స్థిరమైనది.

తా. తన్ను సంబంధించి యున్న ప్రియములగువానియందంతటను స్నేహమువదలి ఉదాసీనుఁడయి (తగులు లేనివాఁడై), దైవికముగా ప్రియసంయోగరూప మగుశుభ మైనను ప్రియవియోగరూపమైన యశుభమైనను గలిగినప్పుడును వాని ననుమోదించుటగాని ద్వేషించుట గాని లేకయు నుండునో అనఁగా అనుకూలమైనవి కలిగినప్పుడు ప్రశంసింపకయు, ప్రతికూలము లైనవి కలిగినపుడు నిందింపకయును దాసీనుఁడై యుండునో-అట్టివాఁడును స్థితప్రజ్ఞుఁడు.

అవ. రెండవదశకన్న తక్కువపరిపాకము గల మొదటిదశను యతమానసంజ్ఞ అనుపేరు గలదానిని జెప్పుచున్నాఁడు.

111
శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58

టీ. యదా=ఎప్పుడు, అయం=ఇతఁడు ఈయోగి, ఇన్ద్రియాణి=విషయములను స్పృశించుటకు ఉద్యుక్తము లైయున్న చక్షురా

యర్థము. అనగా ఆరాగాదులను ఉదాసీనత్వముగాను సిదప అనభినందనముగాను అద్వేషముగాను పక్వము సేయుచున్నాఁడని భావము. కాన యిది వ్యతిరేకసంజ్ఞ యగుచున్నది అనఁగా ఉదాసీనత్వాదులచే రాగద్వేషాదులను నివారించుచున్నాఁడని గ్రాహ్యము.

దీంద్రియములను, కూర్మః=తాఁబేలు, అఙ్గానీవ=కరచరణాద్యవయవములను వలె, సర్వశః = సమస్తవిధముల, ఇన్ద్రియార్థేభ్యః = శబ్దాది విషయములనుండి, సంహరతే=మఱలించుకొనుచున్నాఁడో, (తదా= అప్పుడు), తస్య = వానియొక్క, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా = మిక్కిలి స్థిరమైనది.

తా. *ఎపుడు చక్షురాదీంద్రియములు శబ్దాదివిషయములను దాఁకుటకు నుద్యోగించునో అపుడే, తాఁబేలు తన యవయవములను ముడిఁచి లోపలి కీడ్చుకొనుతెఱఁగున, విషయములనుండి ఆ యింద్రియములను సర్వవిధముల మఱలించి మనస్సును ఆత్మయందు గట్టిగా నిలుపువాఁడుగూడ స్థితప్రజ్ఞుడు ఇట్లు స్థితప్రజ్ఞత ప్రారంభము మొదలుకొని పరిపాకము వఱకు నాలుగుదశలు గలదిగా నున్నది. *ఈ నాలు

---

* ఇచటవిషయములను దాఁక నుద్యుక్తము లైయుండునపుడే ఇంద్రియములను మరల్చుటను జెప్పుటచే, వార్ధకమురోగము మొదలైనవానిచేఁ గలిగిన యశక్తిచేఁగాని నిద్రాదులచేఁగాని వానిని మరల్చుటగాదని తెలియునది. మఱియు నుద్యుక్తమైనపుడే యనుటచే, తాఁక నున్నపుడే కాని తాఁకి యనుభవించిన వెనుకఁ గాదనియు సూచితము. ఇంతేకాక కూర్మోపమానముచే తాబేలు తలఁచుకొన్నమాత్రమున తనయంగములను లోని కెట్లు ఈడ్చుకొనునో అట్లె ప్రథమదశయందుండు స్థితప్రజ్ఞుఁడును విషయములతోఁ గలియ సిద్ధముగా నున్న తనయింద్రియములను తలఁచినమాత్రమున వానియన్నింటినుండి మరల్చుకొను లాఘవము గలవాఁడై యుండు నని యెఱుంగునది. ఇట్లు మరల్చుటచే విలోకనశ్రవణాదిబాహ్యవ్యాపారములన్నియు లేనివాఁడై వాఁడు మనస్సును లోనున్న యాత్మయందు నెలకొల్పుచున్నాఁడు.

* మొదట బాహ్యేంద్రియములను విషయములనుండి మరల్చి బాహ్యవ్యాపారములను మాని మనస్సును లోనున్న యాత్మయందు నిలుపుటకు యత్నముచేయవలయును. ఇదియె యతమానసంజ్ఞ అను మొదటిదశ. ఇట్లు ఇంద్రియములు బలాత్కారముచే మరల్పఁబడినప్పటికిని శేషించియుండు రాగద్వేషాదిదోషములచేత కలుషితమైన మనస్సు వానిని మరల విషయములదెస నిగుడునట్లు పురికొల్పుటయే కాక తాను ను ఆత్మయందు నెలకొనుటకు అశక్తమగుచున్నది. కాఁబట్టి పక్వములుగాక మిగిలియున్న రాగాదులను మొదట ఉదాసీనత్వముగాను పిదప అనభినందనము మొదలైనవిగాను మాఱునట్లు పక్వముసేయవలయును; అనగా నవి పూర్ణముగాఁ దొలఁగు

గింటిలో ముందు చెప్పఁబడిన యొక్కొక్క దశకును దాని వెనుకటిది సాధన మని యెఱుంగునది.

అవ. ఇప్పుడు జ్ఞాననిష్ఠను పొందుట కష్ట మనియు దానిని పొందునుపాయమును జెప్పుచున్నాఁడు. 112

---

నట్లు ఉదాసీనత్వము మొదలైనవానిని జాల్పవలయును. ఇదియె వ్యతిరేకసంజ్ఞ అను రెండవదశ. ఇట్లు రాగాదులు పక్వము లైనను (పూర్ణముగా నశించినను,) అనాది కాలమునుండి విషయముల ననుభవించుచుండినందువలనఁ గలిగియున్న విషయవాసన మాత్రము విషయానుభవము నశించినను, తాను నశింపక ఆ విషయములయెడల ఔత్సుక్యమాత్రమును గలిగించి ఆత్మ ననుభవింపఁగోరు బుద్ధిని కలంచుచున్నది. అయినను, మొదట పురుషులను ద్వేషించునదిగానుండిన యొక యువతికి సుందరాంగు డనునొక యౌవనపురుషునిఁ జూపఁగా నది వానిని జూచి పిదప వానియెడల తుష్టి గలదియె ట్లగునో అట్లే, యాబుద్ధికి నిరతిశయానందరూప మగు నాత్మను జూపి రానురాను దానియందు మిక్కిలి తుష్టి గలుగఁజేసి యాతుష్టియొక్క పటిమచేత బాహ్యవిషయవాసనాసమూహమును అది గలుగఁజేయు ఔత్సుక్యమును నిర్మూలము చేయఁబూనవలయును. ఇందులకు స్మరింప నలవికాని బహుదీర్ఘకాలము పట్టును. ఇట్టి పూనిక గలదియె ఏకేంద్రియసంజ్ఞ అను మూఁడవదశ. ఇట్లు ఆత్మరతిచేత సమస్తవాసనలును నశించి తుదకు ఔత్సుక్యముమాత్ర మయినను గలుగకపోఁగా పరమవైరాగ్యయుక్తమై వశీకరణసంజ్ఞ అను పేరు గలిగిన నాలుగవదశ కలుగుచున్నది. ఇదియె స్థితప్రజ్ఞతయొక్క పూర్ణపరిపాకదశ. ఈదశయే యోగము అనెడి ఆత్మావలోకనమును సాధించుచున్నది. ఆత్మావలోకనమే పరంపరగా నిరతిశయ పురుషార్థరూపమగు మోక్షమునకు సాధన మగునని మీఁద తెలుపఁబడును. కామములు కామములుగా కనఁబడకుండుట; అట్లై కనఁబడుచుండినను వానియందు సంగము లేకుండుట; సంగలేశముతో వాని ననుభవించుచుండినను అతిస్నేహము లేకుండుట; అనురాగము మిక్కిలిగా నుండినను దానిని నిరోధించుటకై తొడిఁబడుట; అని కాష్ఠాదశ మొదలుగాఁ గల నాలుగు అవస్థలకును వరుసగా వైషమ్యము తెలియునది.

54-వ శ్లోకమున స్థితప్రజ్ఞుని స్వరూపాదులను గుఱించిన నాలుగు ప్రశ్నములకు క్రమముగా నుత్తరము లెట్లనఁగా-ఆత్మరతిత్వమే వానిస్వరూపము. 'ఆశ్చర్యవ ద్వదతి' అనునట్లు ఆత్మను గుఱించిన భాషణమే వాని భాషణము. ఆత్మానుసంధానమే వానియాసనము. ఆత్మప్రాప్తికొఱ కైన ప్రవృత్తియే వానివ్రజనము (నడత) అని యెఱుంగునది.

113

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ 59

టీ. నిరాహారస్య=ఆహారము లేని, దేహినః=పురుషునికి, విషయాః=శబ్దాది విషయములు, రసవర్జం = విషయరాగము తప్ప, వినివర్తన్తే=నివర్తించుచున్నవి, రసః అపి=రాగముగూడ, పరం=ఉత్కృష్టమైన ఆత్మస్వరూపమును, దృష్ట్వా = చూచినపిదప, అస్య=ఈ పురుషునికి, నివర్తతే=నివర్తించుచున్నది.

తా. ఇంద్రియములను విషయములనుండి మరల్చుకొన్న పురుషునకు విషయానుభవము నివర్తించినను, విషయముల యందలి రాగము మాత్రము వదలదు. సుఖరూపము లైన విషయములకంటె సుఖతర మగు ఆత్మస్వరూపమును గనుఁగొన్న పిదప, ఆవిషయరాగముగూడ నివర్తించును. (అనఁగా, విషయానుభవము నివర్తించినను విషయరాగముమాత్రము ఆత్మదర్శన మగునంతకు నివర్తింపదు. అది ఆత్మదర్శనమైననే నివర్తించు నని భావము.)

అవ. ఆత్మదర్శనము కలుగక విషయరాగము నివర్తింపదు' విషయరాగము నివర్తింపకున్న ఇంద్రియములను జయించుట కష్టమనుచున్నాఁడు.

114

శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ 60

టీ. హే కౌన్తేయ=అర్జునా, యతతః అపి=ప్రయత్నము చేయుచున్నవాఁ డైనను, విపశ్చితః = శాస్త్రజన్య హేయోపాదేయ వివేక జ్ఞానము గల, పురుషస్య=పురుషునియొక్క, ప్రమాథీని=కలఁచునట్టి-బలవంతము లైన, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, మనః = విషయా

సక్తమైన మనస్సును, ప్రసభం=బలాత్కారముగా, హరన్తి హి=ఆకర్షించుచున్నవిగదా, విషయములందు బంధించుచున్నవి అనియర్థము.

తా. ఆత్మదర్శనము లేక విషయరాగము నివర్తింపదు. విషయరాగము నివర్తింపకుండునపుడు విద్వాంసుఁడైనపురుషుఁడు ఆత్మదర్శనముకొఱకు ఎంతప్రయత్నము చేయుచుండినను, వాని విషయరాగమే ఇంద్రియములకు బలము కావున దానిచే బలవంతములైన యింద్రియములు వానిమనస్సును మిక్కిలి కలంచుచు దానిని ఆత్మయందు నెలకొననీక బలాత్కారముగా లాగుచున్నవి; కాన ఆత్మదర్శనము లేకపోవుచున్నది. ఇట్లు ఇంద్రియజయము ఆత్మదర్శనముచేతనే కలుగునదైయున్నది. ఆత్మదర్శనము ఇంద్రియజయముచేతనే కలుగునదైయున్నది. ఈ అన్యోన్యాశ్రయణమువలన జ్ఞాననిష్ఠను పొందుట కష్టమగుచున్నది.

అవ. విషయరాగమువలన ఇంద్రియములు బలవంతములై మనస్సును మిక్కిలి కలఁచుచు దాని కాత్మదర్శనము కలుగనట్లు చేయుచున్నవి. కావున ఇంద్రియములను జయించిననే ఆత్మదర్శనము కలుగును. మఱియు, ఇంద్రియజయము కొఱకు ఆయింద్రియములకు బలము కలుగఁజేయు విషయరాగము నివర్తింపవలయును. విషయరాగమో 'రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే' అనునట్లు ఆత్మదర్శనముచేతనే నివర్తించును. ఇట్లు ఆత్మదర్శనముచేత రాగనివృత్తియు దానిచే ఇంద్రియజయమును కలుగుచున్నది. అనఁగా ఆత్మదర్శనముచే ఇంద్రియజయము కలుగునని యేర్పడుచున్నది. ముందు ఇంద్రియజయముచే ఆత్మదర్శనముకలుగునని చెప్పఁబడెను. ఇప్పుడు ఆత్మదర్శనముచే ఇంద్రియజయము కలుగునని చెప్పఁబడినది. ఇట్లు రెండును ఒకటినొకటి యాశ్రయించియుండుటచే ఒకటి లేక మఱియొకటి కలుగఁజాలదు. రెండును ఏకకాలమున కలుగనేరదు. ఇట్లీరెంటియొక్క అన్యోన్యాశ్రయణమువలన వీనిచే జ్ఞాననిష్ఠ కలు

గుట కష్టము కాఁగా దానిని పొందుటకు వేఱొకసులభోపాయమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61

టీ. తాని సర్వాణి=వానినన్నిటిని, సంయమ్య=వశపఱుచుకొని యుక్తః=సమాధి గలవాఁడును, మత్పరస్సన్=నాయం దాసక్తమైన మనస్సు గలవాఁడు నగుచు, ఆసీత=ఉండవలయును, యస్య=ఎవ్వనియొక్క, ఇన్ద్రియాణి = మనస్సు మొదలగు ఇంద్రియములు, వశే = తనవశమునందు, (వర్తన్తే=ఉన్నవో), తస్య = వానియొక్క, ప్రజ్ఞా=జ్ఞానము, ప్రతిష్ఠితా=మిక్కిలి స్థిరమయినది.

తా. (స్థితప్రజ్ఞతకు ఇంద్రియజయము కావలయును, ఇంద్రియజయము ఆత్మదర్శనము లేక ప్రత్యేకముగా కలుగదు. మఱి అన్యోన్యాశ్రయాదిదోషములును కలుగుచున్నవి. ఈ దోషముల నెల్ల పరిహరించుటకును, ఇంద్రియజయము ప్రత్యేకముగా కలుగుటకును ఉపాయ మేమన); విషయరాగముతోఁ గూడిన వగుటచే జయింపరాని వగునింద్రియములనెల్ల ఆత్మదర్శనము లేమినిబట్టి పూర్ణముగా జయింపకపోయినను, వానిని విషయస్పర్శము మానునంతవఱకైనను అణఁచి విషయములపట్టునుండి మనస్సును కొంత విడిపించి,

115

దానిని చేతస్సునకు శుభాశ్రయభూతుఁ డగునాయందు నిలిపి లయించునట్లు చేయవలెను. మనస్సును నాయందు నిలుపఁగా* 'యథాగ్నిరుద్ధతశిఖః కక్షం దహతి సానిలః । తథాచిత్తస్థితో విష్ణు ర్యోగినాం సర్వకిల్బిషమ్॥' (అనఁగా, గాలితోఁ గూడి పెర్చినజ్వాలలు గలిగియుండునగ్ని యెండినగడ్డి నెట్లు కాల్చునో అట్లే యోగులహృదయమునందు నెలకొనియుండు విష్ణువు వారియొక్క సకలపాపములను

* విష్ణుపురాణం. ౬. ౭-౭౪; గారుడపురాణం. పూర్వ. ౨౨౨-౧౬.

గాల్చివైచును) అనునట్లు, ఆమనస్సు, పుటమునందుఁ బెట్టినబంగార
116
మువలె, దోషములెల్ల దగ్ధము లగుటచే నిర్మలముగాఁ జేయఁబడి
నదై, విషయరాగము తొలఁగుటంబట్టి, తాను ఆత్మదర్శనము లేకయె
యింద్రియములను వశము చేసికొనును. అంత 'వశేహి యస్యేంద్రి
యాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా' అన్నట్లు ఇంద్రియములను వశము చేసి
కొన్నమనస్సు ఆత్మదర్శనమునకుశక్తి గలదగును. ఈ యుపాయము
చేత ఆత్మదర్శనము లేకయే ప్రత్యేకముగా నింద్రియజయము గలుగుట
వలన అన్యోన్యాశ్రయణదోషము లేకపోవును. ఆయింద్రియజయము
చేత స్థితప్రజ్ఞతయు సిద్ధించును. ఇట్లు స్థితప్రజ్ఞత కలుగఁగా ఆత్మావ
లోకనరూపమైన యోగము సులభమై యుండును అని భావము.
దీనిచే "కి మాసీత" అను ప్రశ్నకు త్తరము చెప్పఁబడినది. 117

అవ. మనస్సును నాయందుంపక స్వప్రయత్నాధిక్యము చేత నే
ఇంద్రియజయము గావింపఁగోరువాఁడు మిక్కిలి చెడిపోవు నని చెప్పు
చున్నాఁడు.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే॥
క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥ 63

టీ. విషయాన్=శబ్దాదివిషయములనే, ధ్యాయతః=చింతించు
చున్న, పుంసః = పురుషునకు, తేషు=ఆ విషయములయందు, సఙ్గః=
సంగము-రాగము, ఉపజాయతే=అధికముగా కలుగుచున్నది - వృద్ధి
యగుచున్నది, సఙ్గాత్=విషయానురాగమువలన, కామః=కామము,
సఞ్జాయతే=పుట్టుచున్నది. కామాత్ = కామమువలన, క్రోధః=కో
పము, అభిజాయతే=పుట్టుచున్నది. క్రోధాత్=కోపమువలన, సమ్మో
హః=అవివేకము భవతి=కలుగుచున్నది. సమ్మోహాత్=అవివేకము

వలన, స్మృతివిభ్రమః=మఱపు, (భవతి=కలుగుచున్నది), స్మృతిభ్రంశాత్=మఱపువలన, బుద్ధినాశః=నశించుట (భవతి=కలుగుచున్నది,) బుద్ధినాశాత్ = అవ్యవసాయము చెడిన హేతువువలన, ప్రణశ్యతి = నశించుచున్నాఁడు.

తా. (విషయరాగమును నిరసింపకయు, దానిని నిరసించుకొఱకు మనస్సును నాయందు నుంపకయు, నుండుపురుషుఁడు స్వప్రయత్నముచేత నింద్రియముల నెంత యడంచి యుండినను అనాది పాపవాసనచేత విషయధ్యానము వానికి తప్పక కలిగియుండును). ఇట్లు విషయములను ఇంద్రియములచేత స్పృశింపకుండినను వానిని మనస్సుచేత మాత్రము ధ్యానించుచుండు పురుషునికి పూర్వము వదలినవిషయసంగము మరల మిక్కిలి అధికముగా కలుగును. ఆసంగమువలన కామ ముదయించును. కామ మనఁగా *సంగముయొక్క విపాకదశ-పురుషుఁడు ఏదశను బొందఁగా విషయములను అనుభ

---

* సంగమునకును కామమునకును భేదము లేదు; రెండు నొకటియే. కనుక 'సంగాత్సంజాయతే కామః' అన్నట్లు ఒకటినుండి మఱొకటి పుట్టుట యెట్లు? అని శంక రాఁగా కామమనఁగా సంగముయొక్క విపాకదశ అని చెప్పిరి. అనఁగా సంగము ఒకానొక పరిపాకమును జెంది కామమగుచున్నదని యర్థము. ఇట్లు దానిని 'సంగముయొక్క విపాకదశ' అని సామాన్యముగా చెప్పుటచే దాని విశేషాకారము తేటపడనందున 'ఏదశను ..అది కామము' అని విశదీకరించిరి. మఱియు కామము సర్వదా క్రోధమునకు హేతువు గానేరదు. అది తనకు విషయమైనది సన్నిహితము కానపుడే కోపమును బుట్టించును. కాన 'విషయమైనది సన్నిహితముకానిచో,' అనఁబడినది. కోపము కామమునకుఁ బ్రతిబంధకభూతు లైన పురుషులనుగూర్చి మాత్రమే కలుగునదికాదు; అప్పుడు కృత్యాకృత్యములు తెలియకుండును గాన ఎదురుపడ్డవారి నందఱనుగూర్చియు కలుగునది. కావుననే 'సన్నిహితు లైనవారిని' అనఁబడినది. క్రోధమువలన సమ్మోహము కలుగుటచే దానివలన నిది యుక్తము అది అయుక్త మని చూడక అన్నియును జేయును గావుననే ఆత్మదర్శనార్థము తాను ఆరంభించియుండు ఇంద్రియజయాద్యుపాయములను మఱచిపోవును. ఉపాయములను మఱచిపోఁగా ఆత్మజ్ఞానముకొఱకు వానిని అనుష్ఠింపవలయు నను బుద్ధి (అనఁగా నిశ్చయము) నశించును అని భావము.

వింపక యుండఁజాలఁడో యది కామము. కామము వర్తించుచుండు
118
నపుడు దానికి విషయమైనది సన్నిహితముకానిచో సన్నిహితు
లైన పురుషులను జూచి 'వీరిచేత నాయిష్టము గొట్టుపడినది'
119
అని కోపము పుట్టును. కోపమువలన సమ్మోహము పుట్టును. సమ్మోహ
మనఁగా నిది చేయఁదగినది యిది చేయఁదగనిది యనువివేకములేమి.
అట్టివివేకము లేమిచే అన్నిటిని జేయును. మఱియు దానివలన ఆరం
భింపఁబడిన యింద్రియజయము మొదలగు యత్నములందు మఱపు
పుట్టును. మఱపువలన ఆత్మజ్ఞానార్థము చేయఁబడినవ్యవసాయము
120
చెడును. దానివలన మఱల సంసారమున మునిఁగి నశించును.

121
శ్లో॥ రాగద్వేషవియుక్తైస్తు విషయా నిన్ద్రియై శ్చరన్ ।
122
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥ 64

టీ. రాగద్వేషవియుక్తైః=రాగద్వేషరహితము లయినవియు, ఆత్మవశ్యైః=తనకు స్వాధీనము లయినవియు నగు, ఇన్ద్రియైః=ఇంద్రియముల చేత, విషయాన్ = విషయములను, చరన్ = తిరస్కరించి వర్తించుచున్న, విధేయాత్మా = స్వాధీనమగు మనస్సు గలవాఁడు, ప్రసాదం=మనోనిర్మలత్వమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా. (ముందు చెప్పఁబడినప్రకారమున సర్వేశ్వరుఁడును చిత్తమునకు శుభాశ్రయభూతుఁడు నగు నాయందు తనమనస్సునుంచి, అట్లుంచుటచే సకలపాపములును దహింపఁబడఁగా పాపవాసనామూలములగు) రాగద్వేషములు వీడినవియు అట్లు వీడుటచేఁ దనకు వశములైనవియు నగు తనయింద్రియములచేత విషయములను దిరస్కరించి (ఆదరింపక) వర్తించువాఁడు మనస్సును వశపఱచుకొని ప్రసన్నతను

బొందుచున్నాఁడు. (అనఁగా నిర్మలాంతఃకరణము గలవాఁ డగును.)

దీనిచే 'వ్రజేత కిం' అను ప్రశ్నమున కుత్తరము చెప్పఁబడినది.

ఇట్లు రాగద్వేషవియోగము చే ఇంద్రియజయమును, ఇంద్రియ జయముచే మనోజయమును, మనోజయముచే నాత్మదర్శనమునకు వలయు మనోనైర్మల్యమును గలుగుచున్న దని గ్రాహ్యము.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హాని ర స్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥ 65

టీ. హి=ఎందుచేత, ప్రసన్నచేతసః-ప్రసన్న = తేటపడినట్టి, చేతసః = మనస్సు గలవానియొక్క, బుద్ధిః = శుద్ధాత్మ విషయమైన బుద్ధి, ఆశు=శీఘ్రముగా, పర్యవతిష్ఠతే=స్థిరముగా నిలుచుచున్నదో, (అందువలన), ప్రసాదేసతి = మనస్సునకు నిర్మలత్వము కలుగుచుం డఁగా, అస్య=వీనియొక్క, సర్వదుఃఖానాం = సమస్తదుఃఖములకు, హానిః=నాశము, ఉపజాయతే=కలుగుచున్నది

తా. అట్టి యీపురుషునియొక్క మనస్సు ఆత్మదర్శనమునకు ప్రతిబంధకములైన దోషములన్నియుఁ దొలఁగి, ప్రసన్నము కాఁగా, అప్పుడే శుద్ధాత్మవిషయమగుబుద్ధి శీఘ్రముగా స్థిరపడుచున్నది. ఇట్లు మనఃప్రసాదము ఆత్మదర్శనమునకు హేతువగుటంబట్టి దానిచే ప్రకృతి సంసర్గమువలన జనించినసమస్తదుఃఖములకును నాశము కలుగు చున్నది.

శ్లో॥ నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా।
న చాభావయత శ్శాన్తి రశాన్తస్య కుత స్సుఖమ్॥ 66

టీ. అయుక్తస్య = యోగము లేనివానికి, బుద్ధిః = శుద్ధాత్మ విషయముగుప్రజ్ఞ, నాస్తి=లేదు-సిద్ధింపదు. అయుక్తస్య=అట్టివానికి, భావనా చ=ఆత్మస్వరూపమును మననముచేయుటయు, నాస్తి=లేదు.

అభావయతః = ఆత్మధ్యానము లేనివానికి, శాన్తిః = విషయస్పృహా నివృత్తి, నాస్తి = లేదు. అశాన్తస్య = విషయములయందాశ నివర్తింపని వానికి, సుఖం = సుఖము-నిత్యనిరతిశయసుఖప్రాప్తి, కుతః = ఎక్కడిది ?

తా. నాయందు మనస్సును సన్న్యసింపక స్వప్రయత్నము చేతనే ఇంద్రియనిగ్రహము చేయఁబూనినవానికి ఒకప్పుడును శుద్ధాత్మవిషయ మగుబుద్ధి సిద్ధింపదు. కావుననే వానికి ఆత్మమననముం గలుగదు. శుద్ధాత్మస్వరూపమును మననము చేయనివానికి విషయములయందలిస్పృహా నివర్తింపదు. విషయాభిలాష వదలనివానికి *నిత్యనిరతిశయసుఖప్రాప్తి యెక్కడిది ? 123

అవ. చెప్పబడినప్రకారమున ఇంద్రియజయము గావింపని వానికి కలుగునట్టియనర్థమును మరలఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి॥ 67

టీ. చరతాం = ప్రవర్తించుచున్న, ఇన్ద్రియాణాం = ఇంద్రియములయొక్క, (వర్తనం=వృత్తిని), అను=అనుసరించి, యత్=ఏ, మనః=మనస్సు, విధీయతే = వర్తిల్లఁజేయఁబడుచున్నదో, తత్ = ఆమనస్సు, అస్య=వీనియొక్క, ప్రజ్ఞాం=ఆత్మస్వరూపమునం దాసక్తమైనబుద్ధిని, అమ్భసి = నీటియందు, నావం=ఓడను, వాయురివ = వాయువువలె, హరతి హి=ఆకర్షించుచున్నదిగదా.

తా. పురుషుఁడు తనమనస్సును ఆయావిషయములయందు వర్తించుచున్న యింద్రియముల పోకడలవెంబడిఁ బోవనిచ్చెనేని, అట్టిమనస్సు, నీటియందు నడపఁబడుచున్నయోడను ప్రతికూలమగు

*అశాంతులకే స్వర్గాదిసుఖములు లభించును. శాంతులు అట్టిసుఖములను గోరుటలేదు. కావున నిట శాంతివలనఁ గలుగుసుఖము స్వర్గాదిసుఖము గాక నిత్యనిరతిశయమైనమోక్షసుఖమే యగు నని తెలియునది.

వాయువు బలాత్కారమున వేఱుదెసకుఁ గొనిపోవునట్లు. శుద్ధాత్మ స్వరూపమునం దాసక్తమగువానిబుద్ధిని వేఱుచోటికిఁ గొనిపోవుచున్నది. (అనఁగా విషయాసక్తముగఁ జేయుచున్నది అని యర్థము)

125

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 68

టీ. హేమహాబాహో=భుజబలముగల అర్జునా, తస్మాత్ = ఆ హేతువువలన, యస్య=ఎవ్వనియొక్క, ఇన్ద్రియాణి=ఇంద్రియములు, ఇన్ద్రియార్థేభ్యః=విషయములనుండి, సర్వశః = అన్నివిధముల చేత, నిగృహీతాని=నియమింపఁబడినవో, తస్య=వానియొక్క, ప్రజ్ఞా = ఆత్మజ్ఞానము, ప్రతిష్ఠితా=మిక్కిలి స్థిరమయినదగుచున్నది.

తా. (ముందు చెప్పబడినప్రకారమున మనస్సునకు శుభాశ్రయుఁడనగునాయందు నుంపబడిన మనస్సు గలవాఁడగుటచే) ఎవ్వఁడు తన యింద్రియములను విషయములనుండి సమస్తవిధముల నివర్తింపఁజేయునో వాఁడే స్థితప్రజ్ఞుఁడు.

అవ. ఇట్లు ఇంద్రియముల నడంచి ప్రసన్నమగుమనస్సునొందినవాని కగుసిద్ధిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥ 69

టీ. సర్వభూతానాం=సమస్తప్రాణులకు, యా=ఆత్మవిషయమైన ఏబుద్ధి, నిశా = రాత్రియో. రాత్రివలె అప్రకాశమైనదో, తస్యాం=ఆత్మవిషయమయిన ఆబుద్ధియందు, సంయమీ=ఇంద్రియముల నడంచినవాఁడు- ప్రసన్నమనస్కుఁడగు యోగి, జాగర్తి = జాగరూకుడుఁగా నుండును, యస్యాం = శబ్దాదివిషయమైన ఏబుద్ధియందు, భూతాని=ప్రాణులు, జాగ్రతి = జాగరూకులై యుందురో,

సా=శబ్దాదివిషయ మగు నాబుద్ధి, పశ్యతః=ఆత్మావలోకనము చేయుచున్న, మునేః=ఆత్మమననశీలునికి, నిశా=రాత్రి-రాత్రివలె అప్రకాశమయియుండును.

తా. (ఆత్మవిషయ మగుబుద్ధియే ఆత్మను కనుఁగొనుటకు సాధనము.) సర్వప్రాణులకు ఆ బుద్ధి రాత్రివలెఁ బ్రకాశింపకుండును కాఁబట్టి వా రాత్మను కనుఁగొనఁజాలరు. అయినను ఆబుద్ధి ప్రసన్న మనస్కుఁ డగువానికి పగటివలెఁ బ్రకాశించుచుండుటచే వాఁడు మేలుకొని దానిమూలమున ఆత్మను కనుఁగొనుచుండును. ప్రాణులు శబ్దాదివిషయమగుబుద్ధియందు మెలఁకువ గలిగియుందురు-అనఁగా వారి కదియే ప్రకాశించుచుండును. ఆత్మదర్శనము సేయుచుండు మునికన్నో అది రాత్రివలె అప్రకాశమైయుండును. (సర్వప్రాణులకు బుద్ధి ఆత్మవిషయమై యుండనేరక శబ్దాదివిషయమై యుండు ననియు, మునికి బుద్ధి శబ్దాదివిషయమై యుండనేరక ఆత్మవిషయమై యుండు ననియును భావము.) 126

127

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే ।
స శాన్తి మాప్నోతి న కామకామీ॥ 70

టీ. ఆపూర్యమాణం = అంతట తనంతనె పూర్ణమై యున్నదియు, అచలప్రతిష్ఠం=చలింపనిస్థితి గలదియు సముద్రం=సముద్రమును, ఆపః=నదీజలములు, యద్వత్=ఎట్లు, ప్రవిశన్తి= చొచ్చుచున్నవో, తద్వత్=అట్లు, సర్వే=సమస్తములయిన, కామాః=కోరికలు=శబ్దాది విషయములు, యం=ఏయోగిని, ప్రవిశన్తి=చొచ్చుచున్నవో-ఏజితేంద్రియుని యింద్రియములకు గోచరించుచున్నవో, సః = వాఁడు,

శాన్తిం=శాంతిని, ఆప్నోతి=పొందుచున్నాఁడు, కామకామీ = విషయాసక్తుఁడగువాఁడు, న (ఆప్నోతి)=శాంతిని పొందఁడు.

తా. తనంతటనె పూర్ణమై యుండు సముద్రము, నదీజలములు ప్రవేశించినను ప్రవేశింపకపోయినను, ఎట్లు కలంపఁబడక, యే విశేషమునుగాని పొందక, యేకరూపముగా నుండునో, ఆ తెఱఁగున నే యెవఁడు తనయింద్రియములకు శబ్దాది విషయములు గోచరములైనను కాకున్నను, ఆత్మావలోకన తృప్తుఁడగుటచేత తాను ఏవికారమును బొందకయుండునో, వాఁడే శాంతిని బొందును. శబ్దాదులచే వికారము నొందువాఁడు ఒకప్పుడుగాని యాశాంతిని బొందఁడు. 128

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః।
నిర్మమో నిరహఙ్కార స్స శాన్తి మధిగచ్ఛతి। 71

టీ. యః=ఏ, పుమాన్ = పురుషుఁడు, సర్వాన్=సమస్తములగు, కామాన్=కోరికలను-శబ్దాదివిషయములను, విహాయ=విడిచి, నిస్స్పృహః=ఆశ లేనివాఁడును, నిర్మమః=మమత లేనివాఁడును, నిరహఙ్కారః = దేహమునం దాత్మాభిమానము లేనివాడును నై, చరతి=వర్తించుచున్నాఁడో, సః = వాఁడు శాన్తిం = శాంతిని, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా. ఏపురుషుఁడు శబ్దాదిసమస్తవిషయములను పరిత్యజించి, వానియందు అభిలాష లేనివాఁడును దేహబంధువులయెడ మమత లేనివాఁడును నై, ఆత్మ కానట్టి దేహమునం దాత్మాభిమానము లేకయు వర్తించునో, వాఁడు ఆత్మదర్శనముచేత సమస్తదుఃఖనివృత్తిని బొందును. 129

130

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥ 72

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సాఙ్ఖ్యయోగోనామ

ద్వితీయోఽధ్యాయః.

శ్రీకృష్ణాయ పరబ్రహ్మణేనమః.

—...—

టీ. హేపార్థ = అర్జునా, ఏషాస్థితిః = కర్మానుష్ఠానమందలి యీస్థితి-అనఁగా జ్ఞానకాష్ఠ, బ్రాహ్మీ = బ్రహ్మప్రాప్తికి హేతువైనది, ఏనాం = ఈస్థితిని, ప్రాప్య = పొంది, న విముహ్యతి = మోహముఁ జెందఁడు-మరల సంసారమును బొందఁడనుట, అన్తకాలే అపి = చరమవయసునం దయినను, అస్యాం = ఈ స్థితియందు, స్థిత్వా = ఉండి, నిర్వాణం = సుఖరూప మైనబ్రహ్మను తనయాత్మను, ఋచ్ఛతి = పొందు చున్నాఁడు.

తా. ఈస్థితి (అనఁగా ఆత్మనిత్యత్వజ్ఞానపూర్వకమై స్థితప్రజ్ఞత నుద్దేశ్యముగాఁ గలదై యొప్పు ఫలసంగరహితకర్మానుష్ఠానము) బ్రహ్మప్రాప్తికి హేతువు. ఇట్టి కర్మస్థితిని బొందిన మనుఁజుఁడు మరల సంసారమును బొందఁడు. అంతిమవయసునం దేనియు నిట్టిజ్ఞానము గలిగెనేని నిర్వాణమయ మగు బ్రహ్మమును (అనఁగా సుఖైకస్వరూప మగునాత్మను) బొందుచున్నాఁడు.

131 ఇట్లు ఆత్మయాథాత్మ్యమును, యుద్ధ మనెడు కర్మము ఆ యాథాత్మ్యమును బొందుటకు సాధన మగుటయును ఎఱుఁగక, శరీరమే యాత్మయను భ్రమముచే మోహితుఁడై, యా మోహముచే యుద్ధమునుండి మరలినట్టివానికి మోహము శమించుకొఱకు నిత్యమైన యాత్మనుగూర్చిన సాంఖ్యబుద్ధియు, ఆ బుద్ధిని మున్నిడుకొన్నదియు, అసంగకర్మానుష్ఠానరూప మగు కర్మయోగమును

గూర్చినదియు, స్థితప్రజ్ఞతకును (అనఁగా జ్ఞానయోగమునకును) యోగమునకును (అనఁగా ఆత్మదర్శనమునకును) సాధనమైనదియు నగు యోగబుద్ధియును ద్వితీయాధ్యాయమందు చెప్పఁబడినవి. ఆవిషయమే 'నిత్యాత్మాఽసఙ్గకర్మేహా గోచరా సాంఖ్యయోగధీః। ద్వితీయే స్థితధీలక్షా ప్రోక్తా తన్మోహశాన్తయే' అని గీతార్థసంగ్రహమున చెప్పఁబడినది.

ఇది యుపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ
శాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును నగు
శ్రీ భగవద్గీతలయందు సాంఖ్యయోగం బన్నది
ద్వితీయాధ్యాయము. 132



* రామానుజభాష్యము—ఇట్లర్జునుఁడు కూర్చుండగానే భగవంతుఁడు 'ఎందుల కీశోకము తగనిపట్ల సంభవించిన' దని యాక్షేపించి 'తగనియెడలఁ గలిగిన యీశోకము విద్వాంసులు కానివారికిఁ గలుగునది; పరలోకమునకు విరోధి యైనది; అపకీర్తిని దెచ్చునది; మిక్కిలి క్షుద్రమైనది. మఱి హృదయ దౌర్బల్యముచేఁ గలిగినట్టిది. కావున దీనిని విడిచి యుద్ధమునకు లెమ్ము' అని చెప్పెను. మరల నర్జునుఁడు (బంధువులవలని) స్నేహమునను కారుణ్యమునను ధర్మాధర్మభయమునను వ్యాకులుఁడై భగవంతుఁడు చెప్పినది మిక్కిలి హితమైనదని తెలియక ''భీష్మద్రోణాదులు మాకు గురువులు; మఱి గొప్పగా నెన్నఁదగినవారు. అట్టివారి నెట్లు చంపుదును?' ఎట్లని, భోగములం దతిమాత్ర మాసక్తులై యున్నవారిని జంపి వా రనుభవించునట్టి యాభోగములనే వారినెత్తుటితో నంజుకొని వారియాసనములందుఁ గూర్చుండి యనుభవింతును? ఇట్లు యుద్ధ మారంభించి యావ్యాపారమునుండి మరలినయెడ మిమ్ము ధార్తరాష్ట్రులు బల

వంతముగాఁ జంపుదురందు వేని, చంపనిమ్ము. వారిని వధింపఁగాఁ గలిగెడి యధర్మపు గెలుపునకంటెను ధర్మాధర్మములను దెలియకున్నట్టివారిచే నోడుట యే గొప్ప యని నాకుఁ దోఁచుచున్న' దని చెప్పి "ఏది నాకు మేలని నిశ్చయింపఁబడినదో దానిని శరణాగతుఁడనై నను శిష్యునకు నాకు చెప్పుము" అని అతిమాత్రము దీనుఁడై భగవంతునిపాదముల నంటగొన్నవాఁ డయ్యెను.

1 శ్లో॥-(1)

ఈ శ్లోకము నక్షేపమునగా లోపలి దుఃఖము.

కాబట్టి "అశ్రుపూర్ణాకులేక్షణం" అనగా బాహ్యదుఃఖము.

"మధుసూదన" శబ్దముచే దుఃఖమునకు కారణమైన రజోగుణ తమోగుణములను పోగొట్టుట తెలుపబడుచున్నది.

2 శ్లో॥-(2)

ఈశ్లోకమున శ్రీకృష్ణుడర్జునుని దుఃఖమునం దారోపించిన

'అనార్యజుష్టం, అస్వర్గ్యం, అకీర్తికర'

మ్మనుమూఁడు దోషములను ముందుశ్లోకములలో క్రమముగ వివరించుచున్నాడు. అందు మొదటిదోషము

"అనార్యజుష్ట"మ్మని-

ఆర్యులనగా- ఆరాత్ యాతా బుద్ధిః యేషాం తే- ఆర్యాః.

"ఆరా ద్దూరసమీపయోః"

అను కోశానుసారముగ ఆరాత్ అను పదమునకు దూరము- దగ్గర యని యర్థము. శాస్త్రోక్తవిషయములకు దగ్గరగను, నిషిద్ధవిషయములకు దూరముగను పోవు బుద్ధికలవారు ఆర్యులు. వారిచే జుష్టముకానిది

"అనార్యజుష్టం" జుషూ- ప్రీతిసేవనయోః

అని ధాతువునుండి నిష్పన్నమైన "జుష్ట" మను పదమునకు సేవింప

బడునది యనిగాని ప్రేమింపబడునది యనిగాని యర్థము. అట్టిది కానిది
"అనార్యజుష్టం"
శిష్టులచే నాదరింపబడదగినది కాదని యర్థము.

అస్వర్గ్యం-స్వర్గ్యం అనగా పరలోకసాధనమని యర్థము. ఇచ్చట "అ" అనునక్షరము "అసురాః" అనునట్లు విరోధి యని యర్థము. కాబట్టి పరలోకప్రాప్తికి విరోధియని సెలవిచ్చిరి.

కశ్మలశబ్దమునకు మూర్ఛ పర్యంత దుఃఖమని యర్థము,

3 శ్లో॥-(3)

ఈ శ్లోకమున క్లైబ్యమనగా- కాతర్యము- అనగా పిరికితనము. దానికి కారణము హృదయదౌర్బల్యము. దానిని విడువమనుటచే కారణము లేనిచో కార్యముండదు కాన అధైర్యము తొలగి యుద్ధసన్నద్ధుడవు కమ్మని భావము.

4 శ్లో॥(4)

ఈశ్లోకమున "మధుసూదన" 'అరిసూదన"
అనుపదములు సాభిప్రాయముగ ప్రయోగింపబడినవి. కృష్ణా! నీవు లోకకంటకులగు భక్తశత్రువులను మాత్రము చంపితివికాని సాందీపనిసూదనుడవు (గురువులను బంధువులను చంపువాడవు) కావుగదా? నన్నేల వారిని చంపమని ప్రోత్సహించుచున్నావని సూచింపబడుచున్నది.

5 శ్లో॥-(5A)

"శ్రేయోభోక్తుం"
అనుచోట శ్రేయః అనగా- అంతకన్న మంచిదని యర్థము భిక్షాటనచేసి జీవించుట పరధర్మము.

"పరధర్మో భయావహః"

ఐనను గురువులను బంధువులను చంపుటచే లభించు రాజ్యభోగాను భవముకన్నను మంచిదని యే నా యభిప్రాయము. ఏలననగా- మహో పరిభావము కల గురువులను తత్తుల్యులను చంపి సంపాదించుకొను పారలౌకిక దుఃఖ మపారముకదా!

5 శ్లో॥-(5B)

ఇచ్చట భోగములు వారి రక్తసిక్తము లనగా వా రుపయో గించు పదార్థములను చూచిన వెంటనే వారి రక్తసిక్తగాత్రములు జ్ఞాపకమునకు వచ్చి దుఃఖహేతువులగునని భావము.

7 శ్లో॥-(6)

కార్పణ్యం=విడువవలసినవానిని విడువకుండుట. ఇది చేయవల సిన కృత్యములను ఎఱుంగకపోవుటవలనను, దుఃఖమును బాపు ఉపాయములను గాంచకుండుటవలనను బుట్టును.

లేక- జాలిని బుట్టించు దీనవృత్తిలోనిమగ్న మగుట.

మరియును- ఈ కృపణశబ్దమునకు ఔపనిషదమగు మరియొక అర్థముకలదు.

"యో వా ఏత దక్షరంగార్గి! అవిదిత్వాఽస్మాల్లోకాత్ ప్రైతి స కృపణః" అని.

అనగా- ఓ గార్గి! మానవుడై పుట్టియు ఆత్మయాథాత్మ్యము నెఱుంగకయే మృతిజెందువాడు కృపణుడని యర్థము- దానిభావము కార్పణ్యము.

అనగా- ఆత్మానాత్మ వివేకశూన్యత యని యర్థము. అది సకలానర్థములకును నిదానము.

7 శ్లో॥-(7)

ఈశ్లోకమున నర్జునుడు భగవానుని నిశ్చితమగు శ్రేయస్సును చెప్పుమని యడిగెను.

"యత్ శ్రేయ ఇతి నిశ్చితం తత్ మే బ్రూహి"
అంతమాత్రముననే శ్రీకృష్ణుడు గుహ్య- గుహ్యతర- గుహ్యతమము
లగు కర్మయోగ- జ్ఞానయోగ-భక్తి యోగరూపమగు నర్థముల నెల్ల,
ఉపదేశించెను ?

"నాఽపృష్టః కస్యచిత్ బ్రూయాత్"
అడుగక నుడువరాదని గదా శాస్త్ర ముగ్గడించుచున్నది. అట్టితరి
యిట్టి రహస్యార్థములను దుడదుడ చెప్ప తగునా? మరియు నీ గ్రంథ
మున పెక్కుచోట్ల యుద్ధప్రోత్సాహమే కానవచ్చుచున్నది. కాబట్టి
యీ గీత అధ్యాత్మశాస్త్రమున చెల్లదని పూర్వపక్ష ముదయించు
చున్నది. వానికి- ఇచట అర్జునుడు 'శ్రేయః' అని సామాన్యముగ
నడిగెను గాని విశేషించి ఫలానవిషయమని యడుగలేదు. పరమ
ఆస్తికుడైన అర్జునుడు భగవానుడు తనదగ్గరగ నుండగా యుద్ధమే
శ్రేయస్సుగ నెఱుంగదగినదనుట అసమంజసము.

కాబట్టి యీమిషతో పరమనిశ్శ్రేయస జిజ్ఞాసతోనే ప్రశ్నించె
నని చెప్పవచ్చును.

పోనిండు- యుద్ధమునుగూర్చియే ప్రశ్నించెనందము. ఐనను
పరమకారుణికుడగు భగవంతుండు యీ శ్రేయస్సనెడు సాధారణ
శబ్దముచు సాకుగా గొని లోకహితమునకై పరమహితోపదేశము నే
చేసెనని చెప్పవచ్చును. యుద్ధప్రోత్సాహమే యైనను పరమ నిశ్శ్రే
యససాధనముగనే యచ్చటచ్చట వివరింపబడెను.

ఇదియునుగాక కఠోపనిషత్తులో
"శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత ।
స్తౌ సమ్పరీత్య వివినక్తి ధీరః ।
తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి ।
హీయతేఽర్థాత్ య ఉప్రేయో వృణీతే॥

అను మంత్రములో శ్రేయోమార్గము నివృత్తిమార్గమనియు ప్రేయోమార్గము ప్రవృత్తిమార్గమనియును వివరింపబడినవి.

అర్జునుడు కంఠరవముగనే నివృత్తిమార్గము నేప్రశ్నించుటచే శ్రీకృష్ణపరమాత్మ ఆతని యభిప్రాయము నెఱింగిఅధ్యాత్మ శాస్త్రోపదేశమునే గావించెను.

9 శ్లో॥-(8)

ఈశ్లోకమున "గుడాకేశ" శబ్దమునకు

గుడాకా=నిద్రా, తస్యాః ఈశః నిద్రను నిగ్రహించినవాడు.

(ప్రబుద్ధజాగరూకస్వభావః) అనియు

గుడా=గుప్పెడులో నిముడు, కేశః = జుట్టుకలవాఁడు (పిణ్డితకేశః-) అనియును నర్థము.

గోవిన్దశబ్దమునకు-

దుఃఖమును పోగొట్టగల మాటలనేర్పుకలవాడని కాని, భూభారమును దీర్ప నుద్యుక్తుడైనవాడనిగాని యర్థము.

హృషీకేశః- హృష్యన్తి, హర్షయన్తీతి వా హృషీకాని = ఇంద్రియములు. వికసించునవి, ఆనందింపచేయునవి.

వానికి ఈశః=నియన్త యని యర్థము.

(i) వినదగిన మంచి యర్థములను వినుటకై అర్జునుని యింద్రియములను ప్రేరేపించువాడు.

(ii) అర్జునునకు కలిగిన యింద్రియక్షోభను శాంతింపజేయువాడు.

10 శ్లో॥-(9A)

ప్రహసన్నివ-

ప్రపన్నుడైనవాని దోషములను గాంచి పరిహసించుట తగదు.

శిష్యునకు వేదాంతోపదేశసమయమున పరిహాసము నిరుపయోగము. కావుననే భాష్యకారులు

"పరిహాసవాక్యం వదన్నివ" అని తెలిపిరి.

దానిభావ మేమనగా-

సరసముగను సుగమముగను సకలవేదాన్తాన్తర్గతములగు నిగూఢమైన గొప్పవైన యర్థముల నన్నిటిని యనాయాసముగ జెప్పుట.

(9B)

ఈశ్లోకమునకు వెనుకటి శ్లోకమువరకు ప్రథమాధ్యాయము మొదలుకొనియున్న గ్రంధమంతయును శాస్త్రోపోద్ఘాతము. ఇక మీద గ్రంధమంతయును శాస్త్రావతరణరూపమైనది.

9వ శ్లోకమువరకును ప్రథమాధ్యాయములోనే చేర్చదగి యున్నను అర్జునుని దుఃఖము పూర్వాధ్యాయమందును ఉండుటచే వేరువేరు అధ్యాయములుగ పెర్కొనబడినవి.

(9C)

"పరమపురుషుడును, భగవంతుడును' అను నీరెండు విశేషణములచేతను ఈశాస్త్రము ప్రమాణతమమని తెలియుటకు దగిన హేయ ప్రత్యనీకత్వ. కల్యాణగుణాకరత్వములు తెలుపబడుచున్నవి. అనఁగా పరమాత్మ (గీతాచార్యుడు) దుర్గుణ దూరుడును, సద్గుణాకరుడు నగుటచే నాతని శ్రీసూక్తి ప్రబల ప్రమాణమని భావము.

11 శ్లో॥-(10)

*అన్వశోచః=ఇది భూతకాల ప్రయోగము. దుఃఖమింకను సాగుచునే యుండుటచే నీప్రయోగ మనుపపన్నము. అయినను- ఎప్పటినుండియో సాగుచున్నదని తెలుపుటకై "అను" ఉపసర్గను భూతకాలమున్ను వాడబడినవి.

*భాషసే=ఇది వర్తమానము. ప్రథమాధ్యాయావసానమున
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః''
అని పలికిన మాట లిప్పటివి కావు.

''తూష్ణీం బభూవహ''

అని అప్పుడే విరమించివేసెను. కావున యిట్లు వర్తమాన ప్రయోగము అసంగతమని తోచుచున్నది. అయినను,

''వర్తమాన సామీప్యే వర్తమాన వద్వా''

అను వ్యాకరణ మర్యాద నవలంబించి అచిరకాలములో జరిగిన వాటిని వర్తమానకాలములో జెప్పవచ్చును.

*''గతాసూ నగతాసూంశ్చ'' అను

ఈపదముల కితరవ్యాఖ్యానకర్తలు సప్రాణములు నిష్ప్రాణములని (అనగా బ్రతికియున్నవారు, చనిపోయినవారని) యర్థమును చెప్పుదురు. భారతమున మోక్షపర్వమున పండితులచే సప్రాణ నిష్ప్రాణములనుగూర్చిన శోకము చెప్పబడుటచే ప్రకృతమున నది సమన్వయించదు. కాబట్టి దేహములనుగురించిగాని ఆత్మలను గురించిగాని పండితులు దుఃఖించరని శ్రీభాష్యకారులు వ్యాఖ్యానించిరి. ఇకముందు యీవిషయమే వివరింపబడినది. 12వ శ్లోకము మొదలు 25వ శ్లోకము వరకు ఆత్మనిత్యత్వము నుపదేశించి ఇట్లది నిత్యమైనదగుటచే దానిని గురించి శోకింపతగదనియును, అథచైనం 26 శ్లోకము మొదలు 30వ శ్లోకమువరకు దేహ మనిత్య మగుటచే దానినిగురించి శోకించ తగదనియును వివరింపబడుటచే శ్రీభాష్యకారుల అర్థమే ప్రకరణానుగుణమని గ్రహించవలెను.

## 12 శ్లో-(11)

అవతారిక-

అర్జునుని దుఃఖమున కారోపింపబడిన మూడుదోషములలో ''అనార్యజుష్ట'' మ్మను మొదటిదోషమును సమర్థించుచు

మునుముం దాత్మలను గురించి శోకింపదగదని ఋజువు చేయుచున్నాడు.

13 శ్లో-(12)

అవతారిక-

ఆత్మలు నిత్యమైనవగుటచే వానినిగూర్చి శోకింపరాదని చెప్పబడెను.

ఆత్మ నిత్యమైనచో పుట్టెను గిట్టె ననెడు వ్యవహార మెట్లనగా చెప్పుచున్నాడు.

14 శ్లో॥-(13)

అవతారిక-

ఆత్మనిత్యత్వమును గూర్చి చెప్పవలసిన దంతయును చెప్పిన తరువాత చెప్పవలసిన విషయమైనను ప్రధానముగా చెప్పదగిన దగుటచే నీ యర్థమును యిప్పుడే చెప్పుచున్నాడు.

14 శ్లో॥-(14)

కౌన్తేయ- భారత-

అను నీసంబోధనలచే క్షత్రియస్త్రీ కడుపున పుట్టిన వాడవును లోక ప్రసిద్ధమైన క్షత్రియసంతానమునకు చెందిన వాడవును నగు నీకు ధైర్యమే తగిన దని సూచింపబడుచున్నది.

15 శ్లో॥-(15)

అవతారిక-

ఎందులకు ఓర్చుకొనవలెను? అట్లు ఓర్చుటవలన ప్రత్యక్ష ఫల మేదైనను లభించునా? పరోక్షమైన ఫలము లభించునా? లేక తప్పనిసరి గాన సహించవలెనా? మొదటిపక్షము కాదు, దుఃఖరూపము గనే కదా కాన్పించుచున్నది. రెండవపక్షమును సరికాదు. ఆచార్యవధ- కులక్షయకృతపాపరాశులతో కదా యిది నిండియుండును?

మూఁడవపక్షమున్ను తగదు. యుద్ధమును మాని యింటనే యున్నచో శస్త్రప్రహారాదులనుండి తప్పించుకొనవచ్చునే, ఇక దేనికై తప్పని సరిగా నీ మాత్రాస్పర్శలను సహించవలెను ?

15 శ్లో॥-(16)

ఆరోగ్యమును కోరువాఁడు తీవ్రమగు ఔషధసేవవలన కలుగు బాధను సుఖసాధన మగుటచే సుఖముగనే భావించుచున్నాఁడు.

ధనార్జనపరుఁడును సముద్రతరణాది క్లేశమును సుఖమనియే భావించుచున్నాఁడు. అటులనే యీ ఓర్పు మోక్షసాధన మగుటచే దానిని సహించవలెను.

దొంగ మొదలగువారికిన్ని తితిక్ష మెండు, అది మోక్షసాధ నము కాదు. ఆ తితిక్ష మోక్షసాధనముకొఱకా మరి ?

15 శ్లో॥-(17)

ఈ స్పర్శలు వచ్చుచు పోవుచున్నట్టియు తత్వజ్ఞానముచే ముందుముందు సాగక నిలిచిపోవునట్టియు, మోక్షసాధనముల నను ష్ఠించుచుండగ తప్పనిసరిగ తటస్థించునట్టి శీతాతపాది దుఃఖములను శస్త్రపాతాదిబాధలను సహించుటయే ధర్మము.

వీనికి భయపడి ఆ విధ్యుక్త ధర్మములను చేయనిచో మోక్షము లభింపకపోవుట తనకు శాస్త్రము విధించిన ధర్మమును చేయకపోవు టచే భగవంతుని యాజ్ఞ నుల్లంఘించుటయే గావున అనర్థములకు పాలగును.

ధైర్యలోపముచే నపకీర్తి మొదలగునవియును తటస్థించును.

17 శ్లో॥-(18)

అవతారిక-

ఈశ్లోకమునం దాత్మనిత్యత్వము సహేతుకముగ సమర్థింప

బడుచున్నది. ఇది శోకమును పోగొట్టుటకు సన్నిహిత సాధనమున్ను ప్రాప్యకోటిలో చేరినదియు నగుటచే పురుషార్థభూతమైనదియునగు చున్నది.

కావున- ఆత్మ- నాశనము లేదని యెటుల తెలియుచున్న దనగా చెప్పుచున్నాడు.

18 శ్లో॥-(19)

లోకులందరును స్పష్టముగ నెఱింగిన దేహమనిత్య మనువిషయ మును ఉపచయాత్మకత్వ, శరీరిణః కర్మఫలార్థత్వాది హేతువులతో సమర్థింపనేల ?

కొన్ని శరీరములు ప్రత్యక్షముగనే నశించుట గోచరించుచుండు టచే భీష్మాదిశరీరములను గూర్చియు- అవియును వీనివలెనే శరీర ములే గాన శీర్యతే ఇతిశరీరం శిథిలమగునది శరీరమను వ్యుత్పత్తిని బట్టి యవియును నశించునని ఊహింపవచ్చును, అట్లు కాదేని శత్రు సంహారమునకై శస్త్రాదులను ప్రయోగించే పని లేక పోవునుగదా! తానుకూడ శత్రువులు ప్రయోగించు శస్త్రాదులను పరిహరింప పని లేకపోవును గదా! కావున శరీరవినాశము నందరెఱింగి యంగీక రించుటచే దానిని తిరిగి హేతువులచే సమర్థించుట సిద్ధసాధనము, పిష్టపేషణము. అందుచే శరీరమనిత్యమని సాధించు సావయవత్వా ద్యనుమానములు నిరర్థకములే యన్నచో- దీనికి ఎనిమిదివిధములగు ప్రయోజనములు కలవు. వినుఁడు :—

(1) ఆత్మలు శస్త్రాధీనవినాశ స్వభావముకలవి కావు గాన నవి నిర వయవములు. నిరవయవములు గాన నిత్యములని సాధించ వలెను. అనుమానముచే నొక యర్థమును సాధించుటకు అన్వయదృష్టాంతమును వ్యతిరేకదృష్టాంతమును జూపి సమ

ర్థించవలెను. కొండపై పొగకలదుగాన నిప్పుయున్నదని చెప్పుటకు వంటయిల్లు అన్వయదృష్టాంతము, మడుగు వ్యతిరేక దృష్టాంతము. అటులనే యిచటను పరమాణువు- ఆకసము మొదలగువానిని అన్వయదృష్టాంతముగా గొన్నను శస్త్రములచే నశించు స్వభావము కలవి సావయవములు. సావయవములు నశించును. దేహములట్టివేయని వ్యతిరేకదృష్టాంతము నకై దేహానిత్యత్వమును సాధించవలసియున్నది.

(2) దేహము సావయవముగాన నశించుననియును, ఆత్మ నిరవయవము గాన నిత్యుడనియును ఇట్లు దేహాత్మలకు గల విరుద్ధ ధర్మములను విస్తరించి చెప్పుటచే రెండింటికిని భేదము స్థిరపడి దేహాత్మ భ్రాంతి నివర్తించును.

(3) శస్త్రాదులనుండి తప్పించుకొన్నగాని రసాయనములను వాడుట వలనగాని శరీరము నిత్యముగా నుండునో యను శంకను బాపవచ్చును.

(4) ఇట్లు శరీరములకు వినాశమున్ను అవినాశసాధనములున్ను తప్పనిసరియగుటచే తన శరీరమునకును అదే గతి యని యెఱింగి దానిపై వైరాగ్యము జనించి తత్త్వేషణకే జీవితము నంతను వ్యర్థపరచకుండును.

(5) ఇతరుల దేహములను తానొక్కడే నశింపజేయువాడనని భ్రమను పోగొట్టుటమూలముగ ముందు చెప్పబోవు స్వతంత్ర కర్త ననుకొను దురభిమానము దూరమగును.

(6) నశింపజేయుసాధనము లున్నప్పుడు తప్పక యీశరీరము నశించి పోవునుగాన ఫలమును కోరక భగవదర్పణబుద్ధితో తన

వర్ణాశ్రమధర్మములను అనుష్ఠించి మరి తిరిగి పుట్టకుండునట్లును నశింపజేసుకొనవచ్చునని యును తోచును.

(7) ఏమిచేసినను నశించుటయే స్వభావముగాగలదగాన శరీరము నశించునని విచారించుట తెలివితక్కువతనమని తెలియును.

(8) ఇట్లు శరీర మనిత్యముగాన దీపముండగనే యిల్లు చక్కబెట్టు కొనవలెనన్నట్లు జీవించియుండగనే మోక్షసాధనముల ననుష్ఠించవలెనను త్వర పుట్టును.

ఇట్లనేక ప్రయోజనములను ఊహించుకొనవచ్చును.

19 శ్లో॥-(20A)

అట్లగుచో

"మనుష్యం హన్తి"

అను ప్రయోగమున కర్థమేమి ? ఇది శరీరమును మాత్రము చంపుటను బోధించదు. అట్లగుచో తల్లిదండ్రి చనిపోయినప్పుడు ఆశరీరములను చితిపైనుంచి భస్మముచేయుకుమారు నెవ్వరును పితృఘాతకుడు, మాతృఘాతకుడని నిందించుట లేదుగదా!. మనుష్యాది శబ్దములు ఆత్మపరకును అర్థమును బోధించుశబ్దము లనిగదా మనసిద్ధాంతము.

"మాంజిఘాంసతి"

"నన్ను చంపగోరుచున్నా"డనునప్పుడు హననమున కర్మ ఆత్మయే యని స్పష్టమేకదా !

కాబట్టి హింసింపదగిన ఆత్మయే హనన ధాతువునకు కర్మ యగుచున్నది. అట్లగుచో

"నాయం హన్తి న హన్యతే"

అను నీరెండు నెట్లు పొసగునన్నచో

"హన్తి" యను ధాతువుకూడా యను వాక్యముచే నీ యా శంకను పరిహరించుచున్నాడు.

హన్తిధాతువు సహజముగ ఆత్మను కర్మగా కలదే, కాని ఆత్మస్వరూపమును నశింపచేయునది కాదు.

కాని మారణార్థకముమాత్రమే. అటులనే లోకమునందును వేదమునందును వాడబడుచున్నది. మారణమనగా- శరీరాదుల నెడబాటుచేయుట.

"మృజ్" ధాతువునకు ప్రాణత్యాగ మర్థము.

## 19 శ్లోః (20B)

ఈరెండును ఒకటి సామాన్యహింసానిషేధ పరమును రెండవది విశేషహింసానిషేధపరము గదా! అందుచే రెండును చేయరానివే. నేనిప్పుడు యుద్ధము చేసినచో నీ రెండింటి విరుద్ధవ్యాపారమును చేసి నట్లేగదా యన్నచో- నీవు చేయునవి రెండును పశువునకును, శత్రువునకును హితములే కాన హింసయే కానేరవు.

పశువునకు నిహీనతర పశుశరీరముపోయి పుణ్యశీలుర లోకమున పుణ్యశరీరమును బడసి సుఖముల ననుభవించుననియు, ధర్మ యుద్ధమున చంపబడినవా డీపాపశరీరమునువిడిచి వీరస్వర్గమున దివ్య శరీరముతో దివ్యభోగముల ననుభవించుననియును శాస్త్ర ముద్ఘో షించుచున్నది. అయినచో- అట్లు చేయుమని శాస్త్రము చెప్పలేదు గాన నేను చేయజాలను అని సమాధానము.

## 19 శ్లో॥-(21A)

జన్మప్రభృతి దేహధర్మము లాత్మయందు లేవని చెప్పబడు చున్నది.

ప్రత్యక్షాదులవలన ఆత్మయందు పుట్టుట పెరుగుట చచ్చుట

మొదలగు ధర్మము లున్నవని తలంచుచున్న అర్జునునకు

"నజాయతే"

యనుశ్లోకముచేతనే ఆత్మయొక్క నిజస్వరూపము దేహవిలక్షణముగా చెప్పబడుచున్నది. అంతియగాని దేహముతో నాత్మకుగల సంయోగము దానినుండి విడిపోవుట యనెడు జన్మ-మరణములు దానికిలేవని చెప్పుటలో తాత్పర్యము లేదు.

19 శ్లో॥-(21AB)

ఇదేశ్లోకము కఠోపనిషత్తులో మంత్రముగా పరిగణింపబడినది.

"న జాయతే మ్రియతే వా విపశ్చి
న్నాయం కుతశ్చిన్న బభూవకశ్చిత్
అజోనిత్యశ్శాశ్వతోఽయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే"

అను గీతను ఉపనిషత్తనుటలో శబ్దసామ్యమున్ను అర్థసామ్యమున్ను ప్రధానకారణములు. ఇది శబ్దసామ్యమున్న శ్లోకము.

20 శ్లో॥-(22)

పురాణః-అనగా పురాపి నవః

ఇచ్చట నవశబ్దమునకు నవత్వముతో కూడిన ఆశ్చర్యత్వమర్థము.

అవయవములు గల వస్తువునకు అవయవములను పోషించి నూతనత్వమును సంపాదించవచ్చును. ఆత్మ నిరవయవమగుటచే నట్లు చేయుట కవకాశము లేదు. కాబట్టి

"పురాపినవః"

అని స్వాభావిక నవత్వము చెప్పబడినది.

21 శ్లో॥-(23)

ఈశ్లోకమున చంపుటలో నాత్మ కర్త కాదని చెప్పుటలో మాత్రమే ఉద్దేశ్యము కాదు,

చనిపోవుటనుగూర్చిన దుఃఖము తగదని చెప్పుటలోనే తాత్పర్యము. ఆ దుఃఖమును బుట్టించు రీతిని నిషేధించుటకే "కథం" అను శబ్దము వాడబడినది.

22 శ్లో॥-(24)

ఈశ్లోకమున రెండు శంక లుదయించుచున్నవి.

సార్వభౌమ శరీరమును విడిచినచో మిగిలియున్న పాపకర్మానుభవమునకై నారకశరీరమునోపశు పక్షి తరు గుల్మాది శరీరములను పరిగ్రహించుటయు నొకప్పుడు తటస్థించవచ్చును. ప్రళయములోవలె శరీరమే లేక పడియుండవలసియు వచ్చును- అందుచే చనిపోయిన వారినిగూర్చి దుఃఖము ప్రసక్తమగుచున్నదే.

మరియు- నూతనమైనంతమాత్ర మానంద దాయకమా? చిరకాలపరిచితమైన రాజభవనమును విడిచి నూతనకారాగార ప్రవేశముగాని, చినిగినబట్టను విడిచి క్రొత్తకౌపీనమాత్రమును గ్రహించుటగాని దుఃఖరూపమా? సుఖరూపమా?

మనుష్యశరీరమును విడిచినతోడనే క్రొత్తబట్టను ధరించినటుల దేవదేహమును ధరించుటను చూచుట లేదే- యనిశంక లుదయించుచున్నవి. అందులకే భాష్యకారులు ధర్మయుద్ధమునందు మరణించినవారికి విడిచిన శరీరముకంటె కళ్యాణతరశరీరము లభించునని శాస్త్రము తెలుపుచున్నదని తెలుపుచున్నారు.

మరియొక సంశయము కలుగుచున్నది.

ఈ చంపబడు దేహములు పాతబట్టవంటివి కావే, ఇంకను నిండు యౌవనవంతు లనేకులున్నారే. ఈయుపమాన మెట్లు ఘటించుసని శంక.

దానికి- శరీరములు కర్మానుభవమునకే ఏర్పడినవి. ఆకర్మ ముగిసినతోడనే ఆశరీరములు జీర్ణశరీరములనియే తలంపవలెను. ఆకర్మానుభవమునకు వయోనియమము లేదు. కావున జీర్ణవస్త్రములవంటివే యగును.

శరీరములను వస్త్రములతో పోల్చుటచే నొక విలక్షణమైన అర్థము ధ్వనించుచున్నది.

(ధ్వన్యర్థము)

గృహయజమాని తన కనుకూలమైన పరివారమునకు విలువైన బట్టలను ప్రతికూల పరివారమునకు మాన రక్షణకుమాత్ర ముపయోగించు ముతుక చౌకబట్టల నిచ్చునట్లే భగవంతుడు తన కనుకూలురగు భక్తులకు సత్వగుణసంపన్నశరీరములనిచ్చి ప్రతికూలులైన చేతనులకు నిహీనతరమైన శరీరముల నిచ్చుననియును సూచింపబడుచున్నది.

24 శ్లో॥-(25)

ఈశ్లోకమునందలి సర్వగత శబ్దమునకీక్రిందివిమర్శనుగమనించవలెను.

అణువగు నాత్మకు సర్వగతత్వమెట్లనగా- ఇచ్చట జీవ విభుత్వము చెప్పబడుటలేదు. అది యనేక శ్రుతులకు విరుద్ధము. ఇక నేమనగా అన్నివస్తువులలోను ప్రవేశించు యోగ్యతను మాత్రమే తెలుపును.

"అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి" అనుటచే సృష్టియనగా నామరూపములను కలుగజేయుట. అది జీవునిద్వారా పరమాత్మ యన్నిటిలోను ప్రవేశించిననే కలుగును. కాబట్టి ఒకరూపము ఒకపేరు ఉన్నదన్నచో అందు జీవుడును ఆతనిలో పరమాత్మయును కలరనియే నిశ్చయము. కాబట్టి సమస్త వస్తువుల లోను జీవుడు వ్యాపించియే యున్నాడు. అట్లు వ్యాపించుటకు తగి యుండు యోగ్యతను కలిగియుండుటయే సర్వగతత్వమున కర్థము.

24 శ్లో॥(26)

స్థాణుః, అచలః అను రెండుపదములున్ను నిత్యత్వమును వివరించుటకే ప్రయోగింపబడినవి.

లేక నాశనమునకు తగనిదనియు, నాశనపరికరములకు లోబడనిదనియు అర్థము.

సనాతనః—నిత్యశబ్దముచే అనంతత్వము చెప్పబడినదిగాన దీనిచే అనాదిత్వము చెప్పబడుచున్నది.

24 శ్లో॥-(27)

23, 24 శ్లోకములలో కేయర్థమును తెలుపుచుండుటచే పునరుక్తములవలె తోచుచున్నది. కాని యిందొక విశేషమును సూక్ష్మబుద్ధితో గ్రహించవలెను. నశింపకుండుటకు కారణములు రెండు. సాధనములకావస్తువులను నాశనము చేయుశక్తి లేకుండుటచే గాని ఆవస్తువులు సహజముగ నశింపజేయబడు స్వభావము కలవి కాకుండుట గాని. వేళ్లు కర్రను కోయజాలదనగా కర్ర కోయబడుస్వభావము కలది కాదని కాదు. వేళ్లున కాసామర్థ్యము లేదని యర్థము. అగ్ని రాతిని కరగించనేరదనగా అగ్నికి కరగించుశక్తి లేదని యర్థము కాదు. రాతికి కరగు స్వభావము లేదని యర్థము.

అటులనే యిచ్చట ఆత్మ కారెండును లేవని తెలుపుట కీరెండు శ్లోకములును చెప్పబడినవి. కావుననే 23వ శ్లోకమున శస్త్రిగులకు కర్తృత్వము చెప్పబడినది. అనగా వానికి యాత్మను నశింపజేయు శక్తి లేదని తెలుపబడినది.

24వ శ్లోకమున "అర్హార్థేయత్" ప్రత్యయమును ప్రయోగించి ఆత్మకు నశించు యోగ్యత లేదని తెలుపబడినది. కావున ఉభయవిధముల చేతను ఆత్మనశించదని ఋజువు చేయబడినది.

25 శ్లో॥-(28)

వ్యక్తమనగా- ఇంద్రియములకు గోచరించునది.
అవ్యక్తమనగా- అతీంద్రియము.
దీనికి ప్రమాణము- మోక్షధర్మే-
ఇన్ద్రియైర్గృహ్యతే యద్యత్ ।
తత్తద్వ్యక్త మితి స్థితిః ।
అవ్యక్త మితి విజ్ఞేయం ।
లిఙ్గగ్రాహ్య మతీంద్రియమ్॥
(లిఙ్గం=అనుమానము,)

25 శ్లో॥-(29)

ఆత్మకు వికారములను తెలుపు ప్రమాణము లేమియును లేక పోవుటచే నది యీశ్వర స్వరూపమువలె వికరించుటకు తగదు.

వికారములను తెలుపు ప్రమాణము లున్న ఘటాదులు వికరించుటకు తగియున్నవిగా మనము చూచుచునే యున్నాము.

25 శ్లో॥-(30)

తెలుసుకొని విచారించకుము అనుటచే ఆత్మను యథార్థముగా నెఱుంగుట దుఃఖము లేకుండుటకు కారణము.

కావుననే ఉపనిషత్తు-

'తరతి శోకమాత్మవిత్'

అని తెలుపుచున్నది. భాగవతమునందలి చిత్రకేతూపాఖ్యానమిందుల కుదాహరణము.

అందువల్లనే అర్జునుని దుఃఖమును మాన్పుటకై భగవానుడు ''నత్వేవాహ' మ్మను శ్లోకముతో నాత్మతత్త్వమును బోధించెను.

26 శ్లో॥-(31)

ఇచ్చట శ్లోకారంభమున ''అథ'' శబ్దము ప్రయోగింపబడినది. శోకకారణ సంకేతమునుబట్టి యిచ్చటినుండి వేరొకవిషయము తెలియనగును. ఆవిషయ మేమనగా- పదునొకండవ శ్లోకమున పండితులు శరీరములను గురించిగాని ఆత్మలను గురించిగాని దుఃఖించరని చెప్పి ఆత్మలను గురించి దుఃఖింపకుండుటను చెప్పుచున్నాడు.

లేక దేహముకన్న వేరొక ఆత్మ కలదని యంగీకరించినచో దుఃఖించడని చెప్పి నాస్తికదృష్టితో దేహమే యాత్మయని భావించినను దుఃఖించరాదని చెప్పుచున్నాఁడు.

26 శ్లో॥-(32)

ఇచ్చట మహాబాహో యని యర్జునుని సంబోధించుట సాభిప్రాయము. ఇంతవరకు నాత్మకు నాశము లేదుగాన శోకమునకు ప్రసక్తియే లేదని చెప్పెను. ఇప్పుడు దేహమే యాత్మ యని తలంచినను వానికి నాశమును తప్పించుట కెవరికిని శక్యము కాదు గాన నీవంటి పరాక్రమశాలికి స్వ-పరమరణ దుఃఖము బొత్తుగ తగదని సూచించుచున్నది.

26 శ్లో॥-(33)

ఇప్పుడు శరీరముకన్న వేరొక ఆత్మ లేదు గాన శరీరమే ఆత్మ అయినప్పుడు దానిని నశింపజేయుట యనగా సంసారవిమోచనమే గదా! అందుచే అంత ఉపకారమును చేయుట కెంతో గర్వించి సంతోషించవలసియుండగ నీకీ దుఃఖాతిశయము తగదే.

27 శ్లో॥-(34)

ఈశ్లోకమున పుట్టినది గిట్టకమానదనుట సర్వలోకవిదితమే గాని గిట్టినది పుట్టుననుట విపరీతముగా గోచరించుచున్నది.

గిట్టినది పుట్టినచో దుఃఖము బొత్తుగ లేకుండ జేసుకొనుట శక్యముకానిదగుటచే మోక్షశాస్త్ర మంతయును అప్రమాణమే కావలసివచ్చునుగదా. రోగమును బాపుకొనుట, శత్రువిజయము మొదలగు ప్రయాసలన్నియును వ్యర్థములేగదా! గుణవత్పుత్రప్రాప్తి కేడ్వనేల? యని శంక ఉదయించుచున్నది. దానికి ఉత్తరము శాస్త్ర దృష్టితో పై తాత్పర్యమున విశదీకరింపబడినది. దాని సారాంశ మేమనగా-

ఏ యవస్థతో ద్రవ్యము నశించిననో తిరిగి ఆ యవస్థతోనే యది పుట్టదు. కాని యదే ద్రవ్యము మరియొక యవస్థతో ఏదో యొక కాలమున యేదో యొక దేశమున బుట్టును. మన్ను ఘటాకారముతో బుట్టినది. అది యెప్పుడో యెచ్చటనో నశించి కపాలాకారముతో బుట్టును. అప్పుడు ఘటావస్థా ద్రవ్యమునకు నాశనమనియు కపాలావస్థా ద్రవ్యమునకు పుట్టుక యనియు చెప్పబడును. దానినిబట్టి మాత్రమే గిట్టినది పుట్టునని చెప్పబడినది. ఇవి కొన్ని మనకు తెలియ బడునవియును కొన్ని తెలియబడనివియును గాన పై యాక్షేపణల కవకాశము లేదు.

28 శ్లో॥-(35)

వస్తువులయొక్క స్వభావమే సామాన్యముగా దుఃఖహేతు వైనచో ప్రపంచముననున్న పదార్థము లన్నియు తమ కసాధారణ మైన విచిత్రస్వభావములతో కూడియున్నవియే గాన సంసారమున నుండుట సర్వథా దుఃఖసముద్రమున నుండుటయే యనవలెను, అట్టి తరి యిప్పుడు ప్రత్యేకించి శోకనిమిత్తమే మున్నది? సుఖసాధనము లగు నీ దేహములు ఔపాధికములైనను నశించినచో దుఃఖ మెట్లు కలుగకుండునందువా? అట్లగుచో దుఃఖహేతువులగు శత్రువులు భిక్షాటనము మొదలగునవి పరమార్థముగా శోకనిమిత్తములగునే గాని శత్రునిరసనము, చక్రవర్తిత్వమును అట్టివికావే. లేక సుఖ సాధనమగు నీ శరీరము నశించునని భయపడుచున్నావా? అయి నచో బలాఢ్యుడవగు నీవు నీశత్రువులను దునుమాడి నీశరీరమును కాపాడుకొనవలదా? బంధువులను చంపుటచే లోకాపవాదము కలుగు నని భయపడుచున్నావా? అట్లగుచో నీవు నీ బంధువులను సంరక్షించుటలో సమర్థుడవై యుండియు వారిని రక్షించక యుద్ధవిముఖుడ వై పోదువేని యిది యంతకు మించిన యపవాదుగదా! క్షత్రియునకు పిరికివాడను అపకీర్తి చావుకంటె నధికానర్థకరమైనది. శీతాతపాది సాంస్పర్శిక దుఃఖమువలెనిది పోగొట్టుకొన అశక్యమైనది కాదు. శాస్త్రవిచారములేని దేహాత్మాభిమానముచే తటస్థించినది గాన పోగొట్టుకొనతగినదియే.

29 శ్లో॥-(36)

అవతారిక-

ఇట్లు నాస్తికదృష్టితో చూచినను దుఃఖించరాదను సమర్థనను ముగించి దేహముకంటె వేరొక నిత్యమైన ఆత్మకలదను తన సిద్ధాంతమును దేహమే యాత్మ యని భావించు పాపాత్ములతో

నిండియున్న ఈ ప్రపంచములో నెఱుంగువాడే యరుదని తన సిద్ధాంతమును ప్రశంసించుచున్నాడు.

29 శ్లో॥-(37)

దేహముకంటె వేరగు ఆత్మను చూచువాడే దుర్లభము. ఇక ఉన్నదాని నున్నట్లు చూచువా డెవడుండును. ఒకవేళ ఉన్నదాని నున్నట్లు చూచువా డున్నను చూచినదానిని చూచినట్లు చెప్పువా డుండడు.

అట్టితరి ఇక సకలరహస్యములను చెప్పువా డెవడు?
అట్టివాడున్నను వినువాడు దొరకడు.

అట్టితరి బాహ్యాభ్యన్తర సమస్త శిష్యలక్షణములతో కూడిన వాస్తవశ్రోత దుర్లభుడు.

అట్టివా డున్నను చెప్పినదాని నంతను చెప్పినట్లు తెలుసుకొనువా డెవడు?

మొదట శ్రద్ధాభక్తులతో నియమనిష్ఠలతో వినవలెను, ఆపై మననమును చేసిన వినిన ఆత్మతత్త్వముయొక్క నిశ్చయము కలుగును. ఆపై చెప్పగల్గును. అదియైనను చిరకాలాభ్యాస మున్ననే ఉన్నదాని నున్నట్లు చెప్పగలుగును. ఆపై ధ్యానబలముచే ఆత్మ దర్శనము కలుగును. ఆతరువాత రత్నతత్త్వమువలె చిరకాలము దర్శించగా దర్శించగా బలిష్ఠమైన సంస్కార మబ్బి విశేషవిశిష్టముగా నాత్మను చూడగల్గును- అను క్రమము నెఱుంగవలెను. ఆత్మ దేహముకన్న వేరన్నచో అట్లు గోచరించదేమి యని యడిగినచో నది తెలియ శక్యమైనది కాదనియే సమాధానము.

ఇట్లెవ్వరును యెఱుంగనిదానినిగూర్చి నిన్నొక్కనినే నిందించిన నేమిలాభము?

30 శ్లో॥-(38)

"అశోచ్యానన్వశోచస్త్వం" ఇత్యాది శ్లోకము మొదలు "నత్వం శోచితు మర్హసి" శ్లోకమువరకు తగనిచోట జూపు కారుణ్యము పనికిరానిదని స్థాపించెను.

30 శ్లో॥-(39)

దేవాది సన్నివేశ వైషమ్యము దేహగతమేగాని ఆత్మకు లేదు. సుఖాది వైషమ్యము ఆత్మగతమే యైనను ఆయా దేహాద్యుపాధికధర్మమైన ధర్మభూత జ్ఞానముయొక్క అవస్థలలో గల తారతమ్యమే యదిగాన నదియును దేహమూలకమే.

చేతనులు దేవాది శబ్దములచే పిలువబడుట ఆ దేహాత్మలకు గల యెడబాటు లేని (అపృథక్సిద్ధ) సంబంధమూలమే.

31 శ్లో॥-(40)

అవతారిక-

ఇకమీద "స్వధర్మమపి" ఇత్యాది శ్లోకము మొదలు "మరణా దతి రిచ్యతే" అను శ్లోకమువరకు ధర్మము నధర్మముగా భావించు తామసబుద్ధి పరిహరింపబడుచున్నది.

32 శ్లో॥-(41)

హింస యనగా- అనర్థమును కలిగించు వ్యాపారము. ఇచ్చట అందులకు విపరీతముగా సార్థకవ్యాపార మగుటచే రక్షణమే యని యజ్ఞమున పశు విశసన (హింస) మాత్రము నుదహరించి తెలుపుచున్నారు.

32 శ్లో॥-(42)

దుఃఖమును కలిగించుటమాత్రమే హింసకానేరదు. వైద్యుడు రక్షణకొఱకై గావించు శల్యప్రయోగమున్ను, ఆచార్యులు గావించు తప్తచక్రాంకణము మొదలైనవియును హింస యనబడునా?

ప్రాణమును తీయుటను హింస యనరాదు. సర్వస్వమును దోచుకొనుట, పరకపీడ. న్యాయాల యవ్యవహారములలో ముంచుట మొదలగునవి హింస లనబడుట లేదా? వానిని హింస లనుట ఔప చారిక మనరాదు. అందులకు నియామక మేమికలదు? కావున అనర్థములుగా తేలునట్టియు, అప్పటికిమాత్రము దుఃఖమునిచ్చు వ్యాపారమే హింస యనబడును.

33 శ్లో॥-(43)

స్వర్గమనగా-

యస్మిన్నోష్ణం నశీతం।
యన్నదుఃఖేన సమ్భిన్నం।
న చ గ్రస్త మనన్తరం।
అభిలాషోపనీతం తత్।
సుఖం స్వర్గపదాస్పదమ్॥

ఏస్థానమున శీతోష్ణబాధలు లేవో, యెచ్చట దుఃఖము బొత్తుగ నుండదో, అనుభవము ముగించగనే నశించదో, కావలెనని కోరికతో సాధనానుష్ఠానముచే సంపాదింపబడినదో, ఆ సుఖమును స్వర్గమందురు; అనగా నిరతిశయ సుఖమునకే స్వర్గమని పేరు.

ఇంద్రాదు లుండుస్థానమును స్వర్గమనుట కది యట్టి సుఖము నిచ్చు స్థానమగుటచేతనే.

ధర్మము లన్నియు సహజముగ నిరతిశయసుఖము (మోక్షము) నిచ్చునవేయైనను, ఫలాంతరమును కోరుట దాని నడ్డివేయును.

33 శ్లో॥-(44)

అవతారిక-

ఇంతవరకును యుద్ధము క్షత్రియునకు ధర్మమే గాన నది నిరతిశయసుఖసాధనమని చెప్పబడినది. ఇకముందు దీనిని చేయనిచో ననర్థము చెప్పబడుచున్నది.

33 శ్లో॥-(46)

అవతారిక-

కేవలము ఐహిక-పారలౌకిక నిరతిశయపురుషార్థమును బడయకపోవుటయేగాక నిరతిశయదుఃఖమునకు కారణమైన పాపమునకు పాలగుదువు.

33 శ్లో॥-(45)

ఈ శ్లోకమునందును ప్రారంభములో

"అథ" శబ్దప్రయోగమును గాంచనగును. ఇచ్చటినుండి పైదాక వేరైనవిషయమని యాపదము సూచించుచున్నది, అదేమనగా-అర్జునుని దుఃఖమున కారోపించిన దోషములలో మూడవదియగు

"అపకీర్తికరత్వసమర్థనము"

ఈశ్లోకమున మొదలిడి నాలుగు శ్లోకములతో వివరించబడుచున్నది.

34 శ్లో॥-(47)

అవతారిక-

ఇంతవరకు దృష్టాదృష్ట ఫలహానియు, అదృష్టమగు అనర్థమును తెలిపి యిప్పుడు ఇంద్రియములకు గోచరించు అనర్థములను పేర్కొనుచున్నాడు.

34 శ్లో॥-(48)

అవ్యయుమనగా అవినాశియని యర్థము. నశించదు గాన సర్వకాలమును వ్యాపించి యుండును కాని సర్వదేశవ్యాపిత్వ మెట్లనగా-అపకీర్తి సర్వదేశములయందును వ్యాపించనిచో సర్వకాల వ్యాపిత్వమును లేకుండును- కాలవశమున తగ్గిపోయి లోకులు మరచిపోవుదురు, కాబట్టి సర్వకాలీనత్వమును కాపాడుటకై సర్వదేశవ్యాపిత్వమును సిద్ధించును.

34 శ్లో॥-(49)

కీర్తి లేకపోవుటకాదు- అపకీర్తి పాలగుదువు. అపకీర్తి మరణముకన్న గొప్పదనుచున్నారే. ఈ గొప్పతనము విడిచిపెట్టదగుటలోనా. పరిగ్రహించదగుటలోనా.

మొదటిపక్షము సమంజసముకాదు.

జీవన్ భద్రాణి పశ్యతి" "ఆత్మార్థే పృథివీం త్యజేత్" మరణము నైనను తప్పించుకొనవలెనని చెప్పియుండుటచే అపకీర్తి ననుభవించినను ప్రాణమును విడువరాదని శాస్త్రము చెప్పుచున్నది.

రెండవపక్షమును సరికాదు. యుద్ధమును మాని అపకీర్తినే ఆర్జించుము మరణముకన్న అపకీర్తియే గొప్పది అని యర్థమును చెప్పినచో నది ప్రకరణ విరుద్ధము-

ఇక నేమి యన్నచో-

యుద్ధమును చేసి చచ్చియైనను పోవచ్చును గాని దానిని విడచి అపకీర్తి నార్జించరాదు. అని యర్థము.

"జీవన్ భద్రాణి పశ్యతి"

అను నీతి క్షత్రియబిడ్డవగు నీకు తగదు,

అపకీర్తి యల్పమగుచో చనిపోవుటకంటె ఆయపకీర్తిని వహించుటయే శ్రేయస్కర మనవచ్చును. అదియట్టిదికాదు. ఇది సర్వదేశ సర్వకాలముయందును వ్యాపించియుండును. లోక మెన్నటికిని దీనిని మరువజాలదు.

ఈయపకీర్తి నరకము పాలుజేయునని స్మృతులు వాకొనుచున్నవి. ఉత్తరరామాయణములో రఘునాథుడు-

"అకీర్తి ర్యస్య నీయేత ।
లోకే భూతస్య కస్యచిత్ ।

పతత్యేవ వాధమాన్ లోకాన్ ।
యావచ్ఛబ్దస్సకీర్త్యతే॥

ఏ ప్రాణియొక్క అపకీర్తిగాని భూలోకమున ఎంతకాలము చెప్పబడుచుండునో అంతకాలము నీతడు అధోలోకముల పాలగుచుండును. యుద్ధములో చనిపోవుటయన్ననో అది ధర్మయుద్ధమృతి గాన స్వర్గమును బడయ జేయును.

35 శ్లో॥-(50)

ఈశ్లోకమున "బహుమతః" అను పదమునకు-

(1) బహుభిః గుణైః మతః,
(2) బహుభిః వీరైః మతః,
(3) బహుత్వేన మతః-
(1) అనగా- అనేక సద్గుణములు కలవాడవు,
(2) అనేకమంది వీరులచే కొనియాడబడితివి,
(3) లోకులచే గొప్పవాడవుగా లెక్కింపబడితివి.
అని యర్థములు.

35 శ్లో॥-(51)

శూరుడవగు నీతో విరోధము లేకున్నను, విరోధమున్నను పరాక్రమము లేనివాడ వైనను, మహారథులు నిన్ను లెక్కింపక పోవువారే.

36 శ్లో॥-(52)

అవతారిక-

వెనుకవారు గావించిన అపకారములను రాబోవు అప్రయోజకత్వారోపణమును చెప్పి తిరిగి రాబోవు అపకారమును చెప్పి యీ సమయమున జాలికూడదని చెప్పుచున్నాడు.

36 శ్లో॥-(54)

భీష్మద్రోణాదు లేమైన నన్నుచో వారు పెద్దలును శూరులు ననెడు గౌరవముచే సహించనైనను సహించవచ్చును గాని నిజమున తాము శూరులుగాక శూరులమని గర్వించు కర్ణ-దుర్యోధనాదులచే పలుకబడు దురుక్తులను సహించగలవా ?

36 శ్లో॥-(53)

"దుఃఖతరం" అనుచోట-

తరప్ ప్రత్యయము గుణములతో గూడిన వస్తువులను తెలుపు శబ్దములతోనే చేర్చబడును. కాని జాత్యాదిశబ్దములతో చేర్పబడ రాదు.

"ఘటతరః" అని వాడవచ్చునా ? అన్నచో దుఃఖశబ్దము ప్రాతికూల్యముతో గూడిన వస్తువును జెప్పును. అప్పుడు

"ప్రబలతరం" అనుటయే దుఃఖతరమ్మనుటలో తాత్పర్యము.
అందులకే "తరప్" ప్రత్యయార్థమును స్పష్టముగా
"అధికతర"మ్మని వ్యాఖ్యానించిరి.

36 శ్లో॥-(55)

నీవు దేశదిమ్మరివికావు. లేక ప్రపంచమును మరచిన సమాధి నిష్ఠుడవుకావు. అట్లగుచో దుఃఖమే యుండదు. నీవు మిక్కిలి బాధపడుదువు. అట్టి శత్రువుల లేవిడీమాటలను విని సహించలేక ఒక్కపెట్టునవారిపైబడి పెద్ద యుద్ధమును తప్పక చేయుదువు. నీ స్వభావము నాకు తెలియును. అప్పుడు నీకేధర్మమును గోచరించదు. ఆసమయమున నేను ని న్నాదుకొనను. కావున నీవు మొదటిలో చెప్పిన పాపములన్నియును నిన్ను చుట్టుకొని బాధించును. నామాట విని నీవిపుడు యుద్ధమునకు గడంగుదువేని నీభారము నంతను నేనే వహింతునుగాన నీకు అపజయముగాని పాపస్పర్శగాని యుండనేరదు.

38 శ్లో॥-(57A)

అవతారికలో-

ఇంతవరకు అర్జునుని దుఃఖమున కారోపింపబడిన మూడు దోషములను సమర్థించి కూడనిచోట నుదయించిన కారుణ్యము, ధర్మమునందధర్మబుద్ధినిన్నీ పరిహరించెను.

ఇకముందు ముముక్షువు యుద్ధముచేయు పద్ధతిని చెప్పుచున్నాడు.

38 శ్లో॥. (57B)

ఈ శ్లోకమున "పాప" శబ్దమునకు సంసారమని యర్థమును చెప్పవలెను. ఏలననగా-

ఇచ్చట పాప మనగా యుద్ధమును చేయుటగాని, గురువుల జంపుట గాని కాదు. ఆయుద్ధముభయులకును ధర్మమేగదా! వెనుక చేసిన పాప మనరాదు. దాని నిదినర కెప్పుడో చేసినప్పుడే పొంది యున్నాడు. ముందుచేయుబోవు పాపమనరాదు. అది యంటకుండుట కీయుద్ధము ప్రాయశ్చిత్తమా? పరిపక్వ ఉపాసనమా?

కావున నిచట పాపమనగా సంసారమే యని యర్థము.

ఈశ్లోకమున "సమేకృత్వా" యనుచోట "సమే" యను పదమును సుఖదుఃఖములతోను, లాభాలాభములతోను, జయాజయములతోను లింగమును మార్చి యన్వయించవలెను. సుఖదుఃఖే సమేకృత్వా, లాభాలాభౌ సమౌ కృత్వా ఇత్యాది. ఈమూడు జంటలలోను మొదటిజంట మాత్రమే (సుఖదుఃఖే) నపుంసక లింగము. తక్కిన రెండు జంటలును పుంలింగమే.

"భూయసాం స్యాద్బలీయస్త్వం"

అను న్యాయమును బట్టి రెండు పుంలింగజంటలతో నన్వయించు కొనుటకై నపుంసకలింగ

'సమ' శబ్దమును రెండుసారులు పుంలింగముగా మార్చుటకన్న

"సమౌ" అని ప్రయోగించి సుఖదుఃఖములతో నన్వయించుటకు మాత్ర మొక్కసారి నపుంసక లింగముగా మార్చవచ్చునే. అది లాఘవముకదా. ఇట్లేల నపుంసకలింగములో

"సమే" యని ప్రయోగించెననగా- దీనికొక పెద్ద లిట్లు సమాధానము నొసంగిరి-

"సమే" యనునది ద్వితీయాద్వివచనముకాదు. పుంలింగ సప్తమీవిభక్తి ఏకవచనము-

మయా=లక్ష్మ్యా సహితః సమః = శ్రియః పతిః- తస్మిన్ = సమే, అనగా- భగవంతునియందని యర్థము.

అపుడు సుఖదుఃఖములను, లాభాలాభములను, జయాపజయములను భగవంతుని యధీన మొనరించి గావించిన యుద్ధము పాపావహము కాదని తాత్పర్యము.

36 శ్లో॥-(56A)

అవతారికలో-

ఈ రెండును శ్రేయస్కరము లగుట నీకే కాదు నీచే చంప బడు భీష్మాదులకును శ్రేయస్కరములే. గాన నీకు పూజ్యులగు వారికి శ్రేయస్సును చేకూర్చుటకు ఆనందించవలెనుగదా! కావున నిస్సంశయముగ యుద్ధమును చేయుము- అనుచున్నాడు.

36 శ్లో॥-(56B)

ఈ శ్లోకమున-

"స్వర్గ" మనగా ఇది యమృతత్వ ప్రకరణమగుటచే పరమని శ్రేయసమైన మోక్షమని యర్థము.

36 శ్లో॥-(56C)

ఇచ్చట "కౌన్తేయ" యను సంబోధన సాభిప్రాయము.

సింహపుపిల్ల లేడిపిల్ల చేష్టలు చేయునా? తగునా? శుద్ధ క్షేత్రమున బుట్టిన నీవు మహత్తరమైన ధర్మమును చెడగొట్టుట తగదని తాత్పర్యము.

38 శ్లో॥-(58)

అవతారికలో-

ఆత్మయాథాత్మ్యజ్ఞానము నుపదేశించి పిమ్మట దానినే ధ్యానించుట యను జ్ఞానయోగము నుపదేశించుట యుక్తము.

"జ్ఞానయోగో జితస్వాన్తైః పరిశుద్ధాత్మని స్థితిః" అని.

అట్లు చేయక మధ్య కర్మయోగము నుపదేశింపనేల యనగా-ఆ జ్ఞానము కర్మయోగముచే సిద్ధించునదగుటచే

"కారణం పూర్వం కార్యం మనన్తరం"

గాన కర్మయోగమును చెప్పి-

"ప్రజహాతి యదా కామాన్"

ఇత్యాది గ్రంథముచే జ్ఞానయోగమును చెప్పెను.

40 శ్లో॥-(59, 60)

వైదికధర్మములు"

యని సామాన్యముగా చెప్పి విడుచుటలో తాత్పర్య మేమనగా- నిత్యకర్మలు కాని నైమిత్తిక కర్మములుగాని విచ్ఛిన్నమైనచో (చివరవరకు చేయక విడిచినచో) ఫలము నీయజాలవు. అనర్థమును కూడ తెచ్చిపెట్టును. నిజముగ శక్తి లేక కొలదిలోపములు తటస్థించి నను దోషము లేదు.

కామ్యకర్మలలో మాత్రము అంగములలో నేమాత్రము వైకల్యమున్నను నిరర్థకమే. ఫలము నీయజాలవు సరిగదా అనర్థము లను తెచ్చిపెట్టును. అనగా బ్రహ్మరక్షస్సులగుదురు.

40 శ్లో॥-(61)

అవతారికలో-

ఇట్లు కర్మయోగ మాహాత్మ్యమును చెప్పెడు వ్యాజముతో ఇతరకర్మలకన్న కర్మయోగముయొక్క ఆధిక్యము చెప్పబడినది.

"ఇక చెప్పెదన"ని ప్రతిజ్ఞను గావించిన విషయమును చెప్పు చున్నాడు.

41 శ్లో॥-(62)

కామ్యకర్మల ననుష్ఠించువానికి ఆత్మయాథాత్మ్యనిశ్చయ ముండనవసరము లేదు. ఆత్మ స్థిర (నిత్య) మనుజ్ఞాన మున్నచో నాతని కా కర్మల ననుష్ఠించుట కదిచాలును. ఆత్మయాథాత్మ్య నిశ్చయముతో నాతని కేమి ప్రయోజనము ?

పూర్వపక్షము:—

(1) అదిలేనిచో నాతనికి కర్మానుష్ఠానమే కుదురదందువా ?

(2) శాస్త్రమాతని కాజ్ఞానముండవలెనని విధించుచున్న దందువా?

మొదటి పక్షమున- కర్మానుష్ఠానమే కుదురదనుటకు-

(1) స్వర్గాది ఫలేచ్ఛయే యుండదా?

(2) స్వర్గసాధనానుష్ఠానమే కుదురదా?

(3) అది కుదిరినను వానికి స్వర్గానుభవమే కుదురదనియా?

స్వర్గము సుఖానుభవస్థానమని శాస్త్రము చెప్పుచుండగా ఆస్తికున కందు రుచి యెట్లు పుట్టకుండును?

ఇక రెండవవిషయము-

వాని కాస్వర్గానుభవము కావలెనని యాశ యున్నను దానికి సాధనమైన యాగమును చేయుటకు తగిన కరణకళేబరము లున్నవి. ఆఫలము ననుభవించువరకు తానుండున(ఆత్మయుండున)ను నమ్మక మున్నది. లోకమున నొకరహితు వ్యవసాయమును జేసి దానిఫలము ననుభవించుట చూచుచున్నాము కదా! ఇక నేల చేయకుండును.

ఇక మూడవయంశము-

శాస్త్రమున చెప్పబడిన కర్మను అంగాది వైకల్యములు లేక శ్రద్ధతో చేసిన ఫలము నిచ్చుటలో లోటేమి? ఆసుఖానుభవార్థమే ఆ కర్మ చేయబడుటచే దానిని యనుభవించునపుడు చక్రవర్తి భోగానుభవమువలె స్వర్గభోగానుభవమున ఆత్మయొక్క యాథాత్మ్యానుభవమున కేమి యవసరము? ఈవిషయమునంతను

"కామాధికారులకు"

అనుగ్రంథముతో సూచింపబడినది.

శాస్త్రము కంటికి గాన్పించు ఐహికఫలములకును కాన్పించని పుణ్యరూపమైన ఆముష్మికఫలములకును సాధనములను బోధించును.

41 శ్లో॥-(63)

దృష్టఫలములనుగూర్చి ప్రత్యేకించి ఆత్మయాథాత్మ్యనిశ్చయముతో పని లేదని చెప్పనవసరము లేదు. ఇక అదృష్టఫలములకైనను దాని యావశ్యకత లేదు.

కొన్ని యంగముల ననుష్ఠించనిచో యాగమే నిష్పన్నము కాదు. అటుల నీఆత్మయాథాత్మ్యనిశ్చయము యాగాది కరణశరీర నిష్పాదకము కాదు. కర్తయగు నాత్మయొక్క సంస్కారమునకై యీ యాథాత్మ్యనిశ్చయ ముండవలసిన పని లేదు. అట్టి ప్రోక్షణాదులు కామ్యప్రకరణములలో విధింపబడినట్లు

"ఆత్మానం తత్త్వతో జానీయాత్"

అని విధి కాన్పించదు. వేదాంతశాస్త్రమున చెప్పబడిన జ్ఞానవిశేషము అతిశయితమైన మరియొక ఫలమునకే యగుటచే నది యొక కర్మకు అంగమగుట ఉచితము కానేరదు. ఆత్మతత్త్వము నెఱుంగకున్నను స్వర్గాదుల ననుభవించుట కనుమతిని శాస్త్ర మొసంగుచునే యున్నది గదా!

"ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః।
ఏతచ్ఛ్రేయో యేభినన్దన్తి మూఢాః॥"

యజ్ఞములనునవి చిల్లులపడవలవంటివి. ఇవియే శ్రేయోదాయకములని ఆత్మతత్త్వము నెఱుంగనివారు పనిని చేయుచుందురని యర్థము. గీతయందును

"యామిమాంపుష్పితాం వాచం।
ప్రవదన్త్య విపశ్చితః॥"

అనియును ఇప్పుడే చెప్పబడును.

ఆత్మతత్త్వము నెఱుంగనివారు ధూమాది మార్గమున స్వర్గము నధిరోహింతురని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. అందుచే శాస్త్రబలముచే వీరికి ఆత్మయాథాత్మ్యనిశ్చయముతో పనిలేదు. ఈవిషయమునే

"విరోధమున్న" లేదనియు సూచించెను.

మోక్షమును కోరువానికిమాత్ర మీయాత్మయాథాత్మ్య నిశ్చయ ముండితీరవలెను. ఏమనగా-

మోక్షమనగా యథావస్థిత స్వస్వరూప ప్రాప్తియేగాన ఆ యథావస్థిత స్వరూపజ్ఞాన మీతని కుండవలెను. తత్క్రతున్యాయమున కిదియేగదా అర్థము.

దానినెఱుంగనివాడు దాని నెట్లుకోరును. కోరనిచో ముముక్షు వెట్లగును ? అది పురుషార్థ మెట్లగును ?

"అధ్యాత్మయోగాధిగమేనేతి"

తృతీయాశ్రుతిచే ఆత్మయాథాత్మ్యజ్ఞానము అంగముగా శాస్త్రము విధించుచుండగా నది లేనిచో సాధన మెట్లు పూర్తియగును ? తా నెవ్వరో తత్వము నెఱుంగని వానికి స్వరూపావిర్భావరూపమైన ఫలానుభవ మెట్లు ? కావున మోక్షార్థికి ఆత్మయాథాత్మ్యజ్ఞానము లేనిచో విరుద్ధమే యగును.

## 41 శ్లో॥-(64)

వ్యవసాయాత్మికబుద్ధికి ఏకత్వమన అర్థమేమి ? బుద్ధి వ్యక్తి ఒకటి యనియా ? కాదు. ఆ బుద్ధి సంతాన మనువదించుటచే నేకత్వ మెట్లు పొసగును. అనగా- బుద్ధి క్షణికముగాన బుద్ధిధారలో అనేక బుద్ధు లుండుటచే ఏకత్వ మెట్లు. విషయ మొక్కటియే యగుటచే నొక్కటియందురా ? కాదు. ప్రధానాంగములు ఉపాంగములను అవాన్తర భేదముచే నది యనేకవిధమే యగును.

అట్టి ప్రధానాంగ సముదాయాంగ సముదాయము నొక్కటిగా భావించిన దానినిగూర్చిన బుద్ధి యొక్కటి కావచ్చునే యనగా అటులైనచో నిది కామ్యకర్మలకును సమానమే గాన మోక్షసాధనమైన యీ వ్యవసాయాత్మికబుద్ధికి గల భేద మేమికలదు అన్నచో

"వ్యవసాయాత్మకమైనబుద్ధి" యని చెప్పుచున్నారు.

41 శ్లో॥ -(66)

(1) నిత్యనైమిత్తిక కామ్యకర్మలు వేరువేరైన ప్రధానఫల అవాంతరఫలములకు సాధనములుగా విధింపబడినవిగదా వాని కొకే ఫలమగుట ఎట్లు ఘటించును?

(2) కామ్యకర్మలను తద్విరుద్ధమైన నిష్కామకర్మలతో కలిపి చేయుట ఎట్లు తగును ?

(3) ఆయా కామ్యకర్మలకు శాస్త్రమున విధింపబడిన ఫలములయందాశ లేకున్నను వానిని చేయవలెనన్నచో అధికారము లేకున్నను బ్రాహ్మణుడు క్షత్రియాది ధర్మములను చేయుటలో దోషమేమి ?

(4) సమస్తకామ్యకర్మలను ఆచరించుట ఫలభేద ముండుటచే ఘటించుటెట్లు? అది దుష్కరముకూడ నగునుగదా !

(5) కొన్ని కామ్యకర్మలను మాత్రమే యనుష్ఠించిన చాలునన్నచో ఆకొన్ని ఫలానయని నిర్ణయించు విశేషశాస్త్రము లేకపోవుటచే అన్నిటిని ఆచరించవలసిరాదా ? అను సందేహములను బాపుటకై బుద్ధికి ఏకత్వము, బహుత్వమును చెప్పుటకు ఫలమును

దీని ముఖ్యాభిప్రాయ మేమనగా"

అను ముందు గ్రంథము బయలుదేరుచున్నది.

నిత్యనైమిత్తికకర్మలకు ముఖ్యఫలములును అవాంతరఫలములును ఏవియనగా-

ప్రాజాపత్యాది లోకప్రాప్తి;

ఇంతవరకు సంపాదించి పెట్టిన పాపవినాశము చేయకుండుటచే లభించు అనర్థపరిహారము అనునవి.

నిత్యనైమిత్తికములనగా- ప్రత్యేక ప్రత్యేకమేగాక, సమ్మిళితమైన నిత్యనైమిత్తికములని యర్థము.

41 శ్లో॥-(65)

ఆఫలముల నన్నిటిని విడుచుట యనగా నెట్లు కుదురును? ముముక్షువునకును, పాపవినాశమువలన అంతఃకరణశుద్ధి కలుగును. ఆరీతిగా నా కర్మల కుపయోగమున్నది గదా యన్నచో-

"మోక్ష మను నొకేఫలమునకే" యనిచెప్పబడినది.

ఇతరత్ర వీని వినియోగము వేరువేరుగా నుండుటచే ఫలము వేరగుటయును, శాస్త్రము వేరగుటయును నున్నను, ముముక్షువిషయమున- అన్నియు నొకేఫలము నుద్దేశించి యొకేరమయమున నొక్కనిచేతనే చేయుబడునవగుటచే ఫల మేకమగుట శాస్త్రార్థమేకమగుటయు నొక్కటియే యగుటలో విరోధమేమియును లేదు.

41 శ్లో॥-(67)

"శక్తి కొలది" అనగా-

శాస్త్ర మెప్పుడును శక్తినిబట్టియే కర్మలను విధించును. అశక్యమైన వానిని చెప్పదు-

మనువున్ను

"తద్ధికుర్వన్ యథాశక్తి।

ప్రాప్నోతి పరమాంగతిమ్॥

అని చెప్పుచున్నాడు.

ఏతావతా ముముక్షువునకు నిత్యనైమిత్తికములలోవలె కామ్య కర్మలలోను కొన్ని యంగములు లోపించినను ఫలము లేకుండుట గాని అనర్థముగాని కలుగనేరదు.

విచ్ఛిన్నమైనను అనర్థము లేదనుట జ్యోతిష్టోమాది కర్మలలో నొక్కొక్కదానిని చేయుకుండుటలో తాత్పర్యము కాదు. మరి యేమనిన-

మోక్షము లభించువరకును చేయవలసిన కర్మకలాపములో ప్రయాజాదులవలె నంగభూతములగు కర్మలలో నొక్కొక్కకర్మను చేయునపుడు దేశకాలవైపరీత్యములవలన దానిపై కర్మనుజేయ లేకున్నను అనర్థము లేదని మాత్రమే తాత్పర్యము.

42 శ్లో॥-(68)

42, 43, 44 శ్లోకములలోని కొన్ని పదములకు విశేషార్థములు వ్యుత్పత్త్యర్థములున్న-

అవిపశ్చితః— వివిధం పశ్యత్ చిత్ యేషాంతే విపశ్చితః- అనగా బహుజ్ఞులు, తేన భవన్తి=అవిపశ్చితః. అనగా ఉపనిషత్తులను చదివి ఎఱుంగవలసిన స్థిరాస్థిరపదార్థవివేకము లేనివారు.

వేదవాదరతాః— "వేదేషు-వేదాన్తేషు చ గీయతే" అన్నచోట వేదశబ్దమునకువలెనే యిచ్చట కర్మభాగపరమని యర్థము. వేదవాదాః= వేదవాక్యలు, అనగా విధి- ఫల- అర్థవాద వాక్యలు.

కామాత్మానః— కామేషు, ఆత్మా=మనః యేషాం తే.

స్వర్గపరాః— స్వర్గః, పరః=పరాయణం=పరమప్రాప్యము. యేషాం తే, మోక్షవిముఖులు.

జన్మకర్మఫలప్రదాం— జన్మ- కర్మకు ఫలమగునట్లు పైలోకమున ననుభవించగా మిగిలిన కర్మకును ఫలమని యెఱుంగవలెను. ఆ కర్మశేషము వలన గొప్పదిగాని, నీచమైనదిగాని జన్మరావచ్చు అని శాస్త్రము చెప్పుచున్నది.

42 శ్లో॥-(69)

అవతారికలో-

ఇట్లు కామ్యకర్మలనుగూర్చిన బుద్ధికన్న మోక్షసాధనమగు కర్మలనుగూర్చిన బుద్ధియొక్క వైభవమును జెప్పి మోక్షసాధనముల ననుష్ఠించవలెననెడు త్వరను బుట్టించుటకై కామ్యకర్మాధి......

42 శ్లో॥-(70)

జ్ఞానులు గావించు సకలకర్మలును జ్ఞానప్రచురములై యే యుండును, ఆకర్మలు ఒకేఫలమగు మోక్షముననే సాధనము లగు టచే వానికి ఏకశాస్త్రార్థత్వము. వారిచే మోక్షమున కుపయోగించని కర్మ లెన్నడును చేయనేబడవు. కాబట్టి శ్రమ అధికమున్ను పరిమిత మైనఫలమును ఉండునది కామ్యకర్మలు చేయువారికిమాత్రమే.

42 శ్లో॥-(71)

కామ్యకర్మలనుకూడ ఫలాశను విడిచి చేయుట యంగీకరింప బడుచున్నది. నిష్కామకర్మయోగమునకు ఫలము యథార్థాత్మ స్వరూపప్రాప్తియే. ఆస్వరూపము మాత్రము మోక్షమునకు విరుద్ధము

కానేరదు. కాబట్టి మోక్షేచ్ఛ యుండగా బంధకమగు మరియొక కోరిక యుండరాదు.

42 శ్లో॥-(72)

ప్రీతికి తల్లియు హితమునకు తండ్రియును లోకమున ప్రసిద్ధి కలదు.

వేదములు ప్రియమును హితమును బోధించునవి యగుటచే తల్లియు తండ్రియును అవియే యగుచున్నవి.

42 శ్లో॥-(73)

లౌకిక తల్లిదండ్రులు జన్మలనుబట్టి మారుచుందురు. కాని వేద మను నీతల్లిదండ్రులు అన్నిజన్మలలోను మనలను విడువక అనుసరించు చునే యుండును గాన వేలకొలది యనబడెను.

42 శ్లో॥-(74)

సమస్తాత్మలకును కావలసిన చతుర్విధ పురుషార్థసాధనములను, అపురుషార్థపరిహారసాధనములను బోధించుచు నొకప్పుడైనను విడు వక యుండుటచే వాత్సల్యాతిశయ శబ్దము వాడబడినది.

42 శ్లో॥-(75)

మోసగించుటకా? కాదు. హితమును బోధించువ వగుటచే:

తల్లి రోగముతోనున్న బిడ్డ మందును తిననిచో వెన్నలో నామందును పొదిగి వెన్నను తినుమని చెప్పును. అదిరోగశాంతికి ఉపకరించునుగదా! అట్లులనే మరియొక హితమునకై పర్యవసించు నని యందురా? కాదు. ఆయా కర్మలను బోధించు ప్రతిప్రకరణము నందును ఆయా కర్మల ఫలములలోనే యవి పర్యవసించుచున్న వగుటచే.

కావున పరమపురుషుని ఆజ్ఞారూపములగు నీవేదములు మొదటి నుండి చివరవరకును అపరిమిత దుఃఖములతో సేకూడి మిణుగురు పురుగువలె యేయల్పఫల సాధనములనో బోధించునవి యగుటచే విషము కలసిన మధుపానము నుపదేశించినట్లు కూడని వేయగు చున్నవి. కావున వానిని విడిచిపెట్టుటయే మంచిది. వేదవిరుద్ధమైన దగుచో విడిచిపెట్టుమని చెప్పవచ్చును గాని విధించినదానిని విడుచుట ఎట్లు? కర్మలను విధించు శాస్త్రమైనను అప్రామాణికము కావలెను. అవి ప్రమాణములే యైనచో వానిని చేయువద్దని చెప్పుచున్న భగవదుక్తి అప్రామాణికము కావలెను అన్నచో చెప్పుచున్నాడు.

42 శ్లో॥-(76)

ప్రథమమున

"సత్త్వరజస్తమః ప్రచురాః" అని క్రమ మున్నను విడిచి

"మిక్కిలి తమోగుణులైనవారికిని"

అని తమోగుణముతో ప్రారంభించుట లోకమున నున్నవారి ప్రాచుర్యమునుబట్టియే. తమోగుణప్రచురులు లోకమున నధికముగదా! రజోగుణప్రచురు లంతకన్న తక్కువ. సత్త్వగుణప్రచురులు అంతకంటె తక్కువగా నుందురు. ఈవిషయమును సూచించుటకే యీ క్రమ మవలంబింపబడినది. దీనినిబట్టి క్రమముగా ఐహికాముష్మిక మోక్షాభిలాషులగు పురుషులు సూచింపబడుచున్నారు.

42 శ్లో॥-(77)

సద్వైద్యుడు వాతపిత్తశ్లేష్మప్రకృతులగు పురుషులను పరీక్షించి వారి ప్రకృతికి తగిన మందులను, మందులకు తగిన అనుపానములను, వానికి తగిన పథ్యములను అపథ్యపరిహారములను విధించును. అట్లు చేయనిచో వారు దురుపదేశములచే అపథ్యములను సేవించి నశింతురు.

తాంబూలాదుల కలవాటుపడిన పిల్లలు తల్లిదండ్రులు డబ్బు నీయనిచో దొంగతనమున కలవడి చెడుదురు. అట్లే రజస్తమః ప్రచురులగు పురుషులకు తగిన సాధనములను శాస్త్రము చెప్పనిచో వారును తమ యభీష్టసిద్ధికై తప్పుడుదారులనుబట్టి చెడిపోవుదురు.

వేదమునందు నమ్మకములేనివాడొకడు తన శత్రువునుచంపు ఉపాయము నన్వేషించి వైదికునిచే అభిచారహోమములను (చేత బడియొ) ఉపదేశింపబడి వానిఫలమును గాంచి వేదమున నొకింత నమ్మకము కలుగగనే ధనాగమనమునకై రాజసకర్మల యందును క్రమముగా పరమపురుషార్థసాధనములయందును నమ్మకము కలవాడై తరించుట కవకాశము కలదు. దాహముతో పీడింపబడువానికి నీటి నీయవలెనా ? రసాయనపానము నుపదేశించవలెనా ?

మోక్షము నపేక్షించకుండుటకును, తనకు కావలసిన ఫలము నకు సాధనముల నెఱుంగకుండుటకును కారణము తమోగుణము యొక్క ఆధిక్యమే. ఫలములయం దాసక్తి కామసుఖానుభవాభిలాషయు రజోగుణాధిక్యమువలన. కామప్రవణులు దానియందలి అభినివేశమును మరల్పజాలక చెడుదురు.

42 శ్లో॥-(78)

పాపకర్మల ప్రాచుర్యముచే చెట్టుగను, పుట్టగను కూడ బుట్టి అచేతనప్రాయులై పురుషార్థయోగ్యత యీషణ్మాత్రమైనను లేనివా రగుదురు.

42 శ్లో॥-(79)

"నీవిపుడు సత్వగుణ ప్రచురుడవై యున్నావు" అనుట "శిష్యస్తేఽహం" అని శరణాగతిచేయుటవలననే.

అర్జున! శ్లోకమున యీసంబోధన ప్రకృతోపయుక్తముగా వాడబడినది.

సంబోధనవలన నీతడు సత్వగుణప్రచురుడని తెలియబడు చున్నది. అర్జున శబ్దమునకు తెలుపు అర్థము. సత్వగుణము తెలుపును చెప్పెడు శుక్లశబ్దముచే చెప్పబడును.

అర్జునా! నీవిప్పుడు సత్వగుణము నధికముగా కలిగియున్నావు. దానిని విడిచి చేయవలసిన కృత్యములను (యుద్ధమును) విడిచి, చేయరాని పనులను (భిక్షాటనాదులను) చేయకుము. దానిచే నీకు సత్వగుణ మడుగునపడి రజస్తమస్సులు తలయెత్తును.

42 శ్లో॥-(80)

నిస్త్రైగుణ్యశబ్దము- మూడుగుణములను నిషేధించుచుండగా సత్వగుణమును వృద్ధిపరచుమని యర్థ మెట్లు సిద్ధించునన్నచో.

నిజమే మూడుగుణములను నిషేధింపబడుచున్నవి. కాని ఆ నిషేధము సాంకర్యవిషయము. అనగా సత్వగుణముతో రజస్తమస్సులను కలవనీయకుమని యర్థము. అట్లుగాక సత్వగుణమునుకూడా నిషేధించినచో ముందు

"నిత్యసత్వస్థః"

అనుట తగదుగదా! ఆ సాంకర్య మెట్లుపరిహరింపబడుననగా- రజస్తమస్సులను వృద్ధిపరచు ఆహారవిహారములను మార్చుటచే నది సిద్ధించును.

42 శ్లో॥-(81)

రజస్తమః ప్రాచుర్యమును తగ్గించుకొనుమనియు సత్వప్రాచుర్యమును వృద్ధిపరచుకొనమనియు విధించుట తగదు. ఏమనగా-

వీనికి ఇది రజస్సు- ఇది తమస్సు. నేను దీనిని వృద్ధిని పొందించుచున్నానని తెలిసి ప్రవర్తించుచున్నాడా? తెలిసినగదా తాను దీనిని మాన్పుకొనగల్గును. వీడు సత్వగుణమునుగాని దాని ఉపాయములనుగాని యెఱుంగడే. ఎఱింగినగదా దానియందు ప్రవర్తించి వృద్ధిని పొందించుకొనగల్గును అని ప్రశ్న ఉదయించును.

దీనికి సమాధానము

గుణములను పట్టుకొని సాక్షాత్తుగా నీవు చేయవలసిన దేదియును లేదు.

"నిర్యోగక్షేమః ఆత్మవాన్"

అను రెండు సాధనముల నలవరచుకొనుము. అసాత్వికాహారములను సుతరాం దరిచేరనీయకుము వీనివలననే రజస్తమస్సులు తగ్గుటయు సత్వగుణోన్మేషము సిద్ధించును.

నిర్యోగక్షేమః

"ఆత్మవాన్" అనుపదముల కర్థమును అనువాదములో చూడుము.

## 46 శ్లో॥ (82)

అయాప్రయోజనముల నపేక్షించునందరికొఱకును కల్పింపబడినది. లేక స్నానము పానము మొదలగు వివిధ ఉపయోగముల కొఱకై త్రవ్వించబడినది.

## 46 శ్లో॥-(83)

వేదమున వర్ణము ఆశ్రమము ప్రవరాది భేదములనుబట్టి ధర్మములు వేరువేరుగా విధింపబడును. అవి యెవరి కెట్లు విధింపబడునో వారిచే నటులనే చేయబడవలెను. వేదమున చెప్పబడినను ముముక్షువునకు మోక్షసాధనము కానిది చేయతగదు, ఇతరవర్ణములకుగాని ఇతర

ఆశ్రములకుగాని ఇతర ఫలార్థులకుగాని చెప్పబడిన ధర్మములను తదితరు లాచరింపరాదు.

46 శ్లో॥-(84)

ఈశ్లోకమునందలి బ్రాహ్మణపదమునకు శ్రీ భాష్యకారులు
"వైదికస్య ముముక్షోః"

అని యర్థమును సాయించిరి. కానిచో క్షత్రియున కుపదేశము అసమంజస మగును గదా! ఆయర్థ మీశబ్దమున కెట్లు వచ్చినదనగా- (బ్రహ్మ=వేదమును, అణతి=ధ్వనించుచున్నాడు) గాన
"బ్రాహ్మణః"

అని దానికి వ్యుత్పత్తి. (అణ-శబ్దే అను ధాతువునుబట్టి) వేదాధికారము బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ముగ్గురకును కలదు.

47 శ్లో॥-(85)

కర్మఫలహేతుః-
"కర్మణాం ఫలం తస్య హేతుః"

అని షష్ఠీతత్పురుషగా జెప్పినచో రెండవపాదముతో పౌనరుక్త్యము ప్రసంగించును. కాబట్టి యిచ్చట కర్మచ ఫలంచ=కర్మఫలే-తయోః హేతుః అని అని ద్వంద్వము చెప్పవలెను. అనగా- నీవు కర్మకును ఫలమునకును కారణభూతుడవు కావని యర్థము- ఇది ఉభయపదార్థ ప్రధానముఅగుటచే శ్రేష్ఠతరము.

అందులకే భగవానుడు ద్వంద్వసమాసమును ప్రశంసించుచు "ద్వంద్వస్సామాసికస్యచ" అనెను.

ఇచ్చట వాస్తవమైన కారణత్వము నిషేధింపబడుటలేదు. అట్లనుసంధించవలదని చెప్పబడుచున్నది.

47 శ్లో॥-(86)

(1) నిత్యాదికర్మలకు ఫలము-

(1) ఇతరకర్మలు చేయుట కధికారము- స్నానము నిత్య కర్మ. అది సంధ్యావందనమునకు యోగ్యతను సంపాదించును.

సంధ్యావందనము నిత్యకర్మ. అది భగవదారాధనాది శాస్త్రీయకర్మలకు యోగ్యతను కలిగించును.

"సంధ్యాహీనోఽశుచిర్నిత్యం । అనర్హస్సర్వకర్మసు॥"

(2) ఇంతవరకు సంపాదించి కూడబెట్టిన పాపమును పోగొట్టును.

(3) వానిని చేయనిచో అనర్థము కలుగునని శాస్త్రము చెప్పుచున్నదా ? చేసినచో నా యనర్థము పరిహరింపబడును.

(4) వానికి ప్రాజాపత్యాది లోకసుఖానుభవము కలదు.

(5) పశు పుత్రాది ప్రాప్తియును కలదు.

(2) వేరొకయొక ఫలవిశేషముతో-

కర్మలను విధించు వాక్యములో కర్మల స్వరూపము మాత్రమే తెలుపబడును. ఆ పైన కామాధికారమున స్వర్గాదులతో సంబంధము వినబడుటచే దానికి స్వర్గము ఫలమగుచున్నది. అటులనే మోక్షాధికారమునకూడ మోక్షమనెడు విలక్షణ ఫలముతో సంబంధము వినబడుటచే మోక్షమే దీనికి ఫలమగుచున్నది.

(3) ఫలమునకు నీవు యోగ్యుడవు కావనుటచే ఆకర్మలో సంగము (అనగా యీకర్మనాదియను మమకారమున్న) నిషేధింపబడినది.

48 శ్లో॥-(87)

ఈశ్లోకమున "సఙ్గం త్యక్త్వా" అనుచోట సంగ శబ్దమునకు బంధకమగు సంగమని యర్థము.

రాజ్యమునందలి సంగము ఫలద్వారాబంధకము-

బంధువులు మొదలగువారియందలి సంగము యుద్ధమును చేయ నీయక బంధకమగును. ఆరెండును త్యాజ్యములే యగుటచే నిచ్చట విడువదగినవానిలో నారెండును గ్రహింపబడినవి.

అవతారిక-

ఆరువిధములైన తాత్పర్యలింగములలో

"అభ్యాస" యనెడు (మాటిమాటికిని చెప్పుట) లింగమును చెప్పగోరి పౌనరుక్త్య శంకను పరిహరించుచు ఈ సామ్యానుసంధాన రూపమగు చిత్తసమవధానమును పదే పదే చెప్పుటకు కారణమును జెప్పుచున్నాడు.

49 శ్లో॥-(88)

ఈశ్లోకమునందలి "శరణ" శబ్దమునకు

"ఉపాయే గృహరక్షిత్రోః శబ్దశ్శరణ మిత్యయం"

అను యనేకార్థములలో నిచ్చట గృహార్థమే గ్రహించదగినది. బుద్ధికి వాసస్థానము గృహాదులు ఆశ్రయ మెట్లనగా- కర్మయోగమున నిష్ఠను కలిగియుండుమని భావము.

49 శ్లో॥-(89)

కృపణాః—

"కదర్యే కృపణక్షుద్ర కిం పచాన మితంపచాః"

అను నీ సమానఘటకపదములు కదర్యుని (కుత్సితుని) బోధించును.

అనగా- ఇచ్చట ఫలమునుకోరి కర్మలనుచేయు పురుషులని యర్థము, వారే యిచ్చట నిందింపబడుచున్నారు.

51 శ్లో॥-(90)

బంధించుటలో బంగరుగొలుసు లైననేమి? యినుపగొలుసు లైననేమి? అటులనే ఆత్మను శరీరమను కారాగారములో బంధించుటలో పుణ్యమున్ను పాపమున్ను సమానములే. ముముక్షుస్థానములో నున్నవానికి స్వర్గసాధన మగుసుకృతమును పాపముతో సమానమే. అలౌకికమై యనిష్టసాధన మైనదనెడు పాపలక్షణము యీ పుణ్యమునకును కలదు. ముముక్షువునకు స్వర్గము నరకతుల్యమే.

"ఏతే వై నిరయాస్తాత ।
స్థానస్య పరమాత్మనః॥

ఈ గీతాశ్లోకమున బంధక మైనపుణ్యపాపముల పరిత్యాగము చెప్పబడినది.

51 శ్లో॥-(91)

అనామయం పదం = దీనికి ఒకానొకస్థాన మనిగాని, పరము ప్రాప్యమైన పరమాత్మస్వరూప మనిగాని యర్థము. లేక నిష్కామ కర్మ యోగప్రకరణ మగుటచే దానికి ఫలము ఆత్మప్రాప్తిమాత్రమే గాన పరమాత్మాత్మక శుద్ధాత్మస్వరూప మనియును చెప్పవచ్చును.

"పద్యతే = గమ్యతే ఇతిపదం"

అని వ్యుత్పత్తి. ఈమూడును ముక్తునకు సాక్షాత్తుగాగాని పరంపరగా గాని ప్రాప్యములే యగుటచే

"పద" శబ్దముచే చెప్పబడును.

51 శ్లో॥-(92)

అవతారిక-

ఈవిధమున జెప్పబడిన పరిత్యాజ్య = పరిగ్రాహ్య విభాగము, యుక్తి గాని శాస్త్రము గాని అవసరములేకయే నీకే స్పష్టముగ గోచరించునని చెప్పబడుచున్నది.

51 శ్లో॥-(93)

పుణ్యము పాపము అనెడు సాంసారిక కర్మవలననే మోహము జనించును. ఆ మోహము ఫలమును కోరక కర్మల నాచరించుటచే నశించును. కారణము లేనిచో కార్యమెట్లుండును ?

51 శ్లో॥-(94)

నిర్వేదము (అనగా- వ్యర్థమనుబుద్ధి) లేకపోవుటకు కారణము యీ మోహమే. మోహస్వరూపముకంటె వేరై దానివలన బుట్టునట్టి కాలుష్య మనునది వేరొండు లేదు.

పనికిరానివానిని పట్టి ప్రాకులాడుట, చేయవలసిన వానియందు పెడముఖమును బెట్టుటను, తలంచుకొన్నచో నిర్వేదము (అనగా తనను తానే నిందించుకొనుట) జనించును-

"తత్వజ్ఞానాప దీర్ష్యాదేః నిర్వేదస్స్వావమాననం"

వస్తుతత్వము నెఱుంగుటవలనను, ఆపదలు కలిగినను, ఈర్ష్య (గుణములయందు దోషబుద్ధి) జనించినను, నిర్వేదము పుట్టును, అది తనను తానే నిందించుకొనుటలో పర్యవసించును.

51 శ్లో॥-(95)

అవతారిక-

జ్ఞానయోగము (స్థితప్రజ్ఞ) అని చెప్పబడి ఉపాయమునకు మొదటిశ్లోకము ఆరంభింపబడుచున్నది.

53 శ్లో॥-(96)

సర్వజ్ఞుడైనట్టియు, సర్వశక్తి కలిగియున్నట్టియు పరమకారుణికుడైనట్టియు, భ్రమప్రమాద విప్రలంభాది దోషముల లేశమైనను లేనట్టి నిరుపాధికబంధువైన భగవంతునినుండి అని తాత్పర్యము.

53 శ్లో॥-(97)

ఇచ్చట (విప్రతిపన్నా అనుచోట) విశబ్దమునకు విరుద్ధమని యర్థము కాదు, వైశిష్ట్యమని యర్థము. సాక్షాత్ సర్వేశ్వరునినుండి వినుటచే దీనికి వైశిష్ట్యము కలిగినది.

53 శ్లో॥-(98)

శ్లోకమునందలి నిశ్చలమనగా- కలిగినబుద్ధి మాసిపోకుండక స్థిరముగ నుండవలెను.

53 శ్లో॥-(99)

శ్లోకమునందలి అచలమనగా- ఉండవలసిన అచలత్వము, అనగా- ఒకేరూపముగా నుండుట. ఫలాంతర రుచిభేదముచే నానా రూపములను దాల్చరాదనియు, విషయాంతరములకు పోసీయరాదనియును భావము.

టీక

53 శ్లో॥-(100)

"శ్రుతివిప్రతిపన్నా"

అనుటచే శ్రవణము విధింపబడుటచే మననముచే (యుక్తులతో సమాలోచనను జరుపుట) స్థిరీకరణమున్ను, కుయుక్తులచే చలించక నిలిచియుండుటయు నర్థము.

53 శ్లో॥-(101)

సమాధీయతే అస్మిన్ ఆత్మజ్ఞానమితి సమాధిః- మనస్సు. అనగా మానెదారవలె యఖండమైనధ్యానమునకు కారణమైయుండవలెను.

53 శ్లో॥-(102)

(1) యోగమనగా ఉపాయమనిగదా యర్థము- దాని నిచ్చట ఫలముగా చెప్పుచున్నారేల ?

(2) ఆత్మజ్ఞానము నార్జించికదా కర్మయోగము నాచరించవలెను. అట్టి ఆత్మజ్ఞానమే దానికి ఫలమన్నచో ఆత్మాశ్రయ దోషము రాదా ?

(3) శ్రవణ మననముల వలనను గదా స్థితప్రజ్ఞుడు అనుష్ఠానమును సాగించవలెను. అట్టితరి యాస్థితప్రజ్ఞ అనుష్ఠానముచే నెట్లు సాధింపబడును.

(4) స్థితప్రజ్ఞునకు ఫలము యోగమందురుగదా ! నిశ్చలమైన ప్రజ్ఞాస్థితి గాక ఆయోగి మననేమి- అను నీప్రశ్నలకు సమాధానముగా ముందుగ్రంథము బయలుదేరుచున్నది.

వెనుకటి ప్రశ్నల కుత్తరములు-

(1) ఉపాయమైన యోగము సమత్వబుద్ధి. ఫలమైన యోగము ఆత్మసాక్షాత్కారము. కావున విరోధము లేదు.

(2) ముందుండవలసిన ఆత్మజ్ఞానము శాస్త్రజన్యమైనపరోక్ష జ్ఞానము. ఫలమైన ఆత్మజ్ఞానము అపరోక్ష సాక్షాత్కారము.

(3) ఆత్మజ్ఞాన మనగా- వినుటచేమాత్రము కలుగు నిశ్చయాత్మకమైనతత్త్వజ్ఞానము మాత్రమే
జ్ఞాననిష్ఠయనగా- యోగము (ఉపాయమైనది).
సాక్షాత్కారము ఫలమైన యోగము. అదిసాధ్యము.

నిశ్చలమైన ప్రజ్ఞాస్థితి యనగా ఆఫలమునకు సాధనమైన స్మృతిసంతానము.

ఇట్లాదోషములు పరిహరింపబడినవి.

సారాంశము:—

మొట్టమొదట శాస్త్రమువలన ఆత్మతత్త్వము నెఱుంగవలెను. ఆపైన అవిచ్ఛిన్నమైనధ్యానప్రవాహరూప మైనఉపాసనము. దాని వలన ఆత్మసాక్షాత్కారము.

53 శ్లో॥-(103)

కా భాషా ? కిం ప్రభాషేత ? అను నీరెండుపదములకు పర్యాయత లేదు.

కా భాషా అనగా- ఆతని స్వరూప మెట్లుండునని ప్రశ్న.

కిం ప్రభాషేత- ఆత డేమిప్రసంగించునని వాచికవ్యాపారమును గూర్చిన ప్రశ్న.

ఈశ్లోకమునవాడబడిన కిం శబ్దములు క్రియావిశేషమును ప్రశ్నించుటనే సూచించును.

సమాధిస్థస్య=సమాధి యనగా మనస్సు. దానిస్థితి యనగా దానిని వశమున నిడుకొనుట.

ఈశ్లోకముచే స్థితప్రజ్ఞుని వాచిక- కాయిక- మానసిక అను ప్రశ్నములు అడుగబడినవి.

కిం ప్రభాషేత-వాచికప్రశ్న.

కిం వ్రజేత-కాయిక ప్రశ్న.

కిం ఆసీత-మానసప్రశ్న.

ఆసనము ధ్యానమునకే గదా!

53 శ్లో॥-(104)

అవతారిక-

కరణత్రయవ్యాపారము నడిగిన ప్రశ్నకు ముందు 4 శ్లోకములచే సమాధానము చెప్పబడుచున్నది. అందు ముందుగా-

53 శ్లో॥-(105)

హైరణ్యగర్భైరుక్తం-

"దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకార సంజ్ఞావైరాగ్యం" ఇతి.

దీని కర్థము- చూడబడినట్టియు కర్ణాకర్ణికగా వినబడినట్టియు ఐహిక ఆముష్మిక సమస్త ఫలములయందును విరక్తికలవానికి ఆఫలములయందు సకలవాసనలును తిరిగి పుట్టనట్లు నశించగా నట్టి యవస్థకు

"వశీకారవస్థ" యని పేరు.

56 శ్లో॥-(106)

అనుద్విగ్న అనుచో "విజ్" ధాతువునకు భయమున్ను, చలించుటయును అర్థము.

"వీతరాగభయః"

అనుచోట భయము చెప్పబడుటచే నిచ్చట చలనమను నర్థమునే గ్రహించవలెను.

అనుద్విగ్న యనుటచే నిర్దుఃఖత్వమాత్రమే వివక్షితము. దుఃఖమున్నచో యోగమునుండి చలించునుగదా!

తటస్థించుట యనగా దుఃఖపెట్టుట కారంభించినపుడని యర్థము.

56 శ్లో॥-(107)

స్పృహా-రాగశబ్దములు సామాన్యవిశేషవిషయములు కాబట్టి-విశేషశబ్దము దగ్గరగా వినబడినచో సామాన్యశబ్దమునకు ఆ విశేష శబ్దము చెప్పెడు అర్థమును విడిచి మిగిలిన అర్థమునే చెప్పవలెను. ఉదా-"చూతః" అనగా మామిడిచెట్టు అర్థము-

చూతవృక్షః అన్నచో చూత శబ్దమునకు

"మామిడి" అనిమాత్రమే అర్థమును చెప్పవలెను అటులనే యిచ్చటను- స్పృహాశబ్దము సామాన్యార్థ బోధకముగాన రాగశబ్దమునకు భావివిషయములపట్ల రాగమని యర్థమును చెప్పవలెను. స్పృహాశబ్దమునకు దానికన్న వేరైన విషయముల పట్ల స్పృహాగా నర్థమును చెప్పవలెను.

56 శ్లో॥-(108)

ప్రియమైన వస్తువు చేయిజారినను అప్రియమైన వస్తువు తటస్థించినను రెండును దుఃఖరూపములే. ఆ రెండింటికిని కారణమైనట్టిది గాని ఆ రెండింటిని సాధించు నిమిత్తముకాని హేతువనబడుచున్నది. దానియొక్క దర్శనముచే దానికి తోడైన సమస్త సహకారివర్గమున్ను సిద్ధపడియే యున్నట్లు మన మూహించుకొనవచ్చును. (ఇచ్చట దర్శనశబ్దమునకు జ్ఞానమే యర్థము.) దానిచే శరీరమంతయు కంపించుట ముచ్చెమటలు పోయుట మొదలగువానిని బుట్టించు దుఃఖము జనించును. దానికే భయమని పేరు. అట్టిభయము స్థితప్రజ్ఞున కుండరాదు.

56 శ్లో॥-(109)

క్రోధలక్షణము—

ప్రియవిశ్లేష అప్రియాగమన హేతుభూతః చేతనాన్తరగత దుఃఖహేతుభూత స్వమనో వికారః క్రోధః.

ప్రియవిశ్లేషాదుల వర్తమానము మాత్రమే కాదు. అవి వెనుకటివైనను కావచ్చును రాబోవునవి యైనను గావచ్చును. వానివిషయమైయ్యును క్రోధము జనించుట చూచుచున్నాము గదా! గాలి, యెండ, ముల్లు మొదలగు అచేతనపదార్థముల వలనను బాధలు కలుగుచున్నను వానిపై నెవడును కోపించుట చూడలేదు

గాన లక్షణమున అట్టి చేతనశబ్దము వాడబడినది. ఎవడైనను పిచ్చి వాడు వానిపైనను కోపగించినచో వానికవి చేతనములే యను భ్రాంతిచేతనే యని చెప్పవలెను. వేరొకచేతనునిపై యనుటచే తనకే దుఃఖమును బుట్టించు తన మనోవికారమును క్రోధ మనరు గాన వేరొకచేతనునిపై యని చెప్పబడెను (అన్తరశబ్దముచే). అట్లొకవేళ జనించినను దానిని నిర్వేదము పశ్చాత్తాపము మొదలగు పేరులతో వ్యవహరింతురు.

క్రోధవశ్యులై నూతబడుట మందుమ్రింగి చచ్చుట చేయువా రున్నను వారట్లు చేయుట వారి శత్రువులను పాలకులో మరియొకరో హింసించవలెననియే యట్లు చేయుదురు. ఈమనోవికారము రజో గుణ తమోగుణాధిక్యములచే బుట్టును.

అట్టి క్రోధము స్థితప్రజ్ఞున కుండదు.

56 శ్లో॥-(110)

అభినందన మనగా-

అభితో నందనం- అనగా- తత్సంబంధులయందును కాలాం తరములయందును కూడ ఆప్రేమ అనువర్తించుట.

ఇట్టి స్నేహముచ్చు.

56 శ్లో॥-(111)

సర్వశః- అనుటచే

చూచుట, వానితోగాని వానినిగూర్చిన ప్రసంగము, విలా సము, పరిహాసము మొదలగువానినికూడ చేయరాదని భావము.

ఈశ్లోకమున ఇంద్రియములను ప్రేరేపించు సంకల్పవిశేషము లను మాత్రమే నియమించుట చెప్పబడినది.

59 శ్లో॥-(112)

ఈశ్లోకముచే ఆత్మదర్శనమువలనగాని విషయరాగము పోదని చెప్పబడినది.

59 శ్లో॥-(113)

ఇచ్చట నిరాహార మనగా భోజనమును విడిచిపెట్టుట కాదని తెలుపుచున్నాడు. ఈవిషయమే ముందు

"న చైకాన్త మనశ్నతః" అనియు,
"యుక్తాహార విహారస్య" అనియును చెప్పబడును.
వేదముకూడా

"అత్యాశనా దతీపానాత్" అని చెప్పుచున్నది. మోక్షధర్మము నందును

"దశైతానీన్ద్రియోక్తాని ద్వారాణ్యాహార సిద్ధయే"
అని చెప్పబడినది. ఇంద్రియవిషయము లన్నియును

"ఆహార" శబ్దముచే చెప్పబడును. మనము లోకమున వాడుకొను తిండినిమాత్రమే విడిచినంతమాత్రమున సకలవిషయములును పోవు.

60 శ్లో॥-(114)

విపశ్చితః-
ఇచ్చట విపశ్చిత్వ మనగా- శాస్త్రమును చదువుకొనుటచే కలిగిన పరిగ్రాహ్య పరిత్యాజ్య పదార్థజ్ఞానము.
ప్రమాథీని- అనగా బలవంతులను కలచునవి.

శ్లో॥ 'బలవా నిన్ద్రియగ్రామో।
విద్వాంస మపి కర్షతి।
మాత్రా స్వస్రా దుహిత్రా చ।
న వివిక్తాసనే వసేత్॥

అను మను వాక్యమును జ్ఞాపకపరచుచున్నది.

శాస్త్రజ్ఞానముచే స్వాధీనమైన మనస్సును కలవానినైనను ఇంద్రియములు పరవశము గావించుచున్నవి. ఇంద్రియములకు రాగాదులే బలము- అవి తొలగినగాని యింద్రియములు లొంగవు.

60 శ్లో॥-(115)

ఇచ్చట శుభపదముచే హిరణ్యగర్భాదులు ముముక్షువునకు ధ్యేయులు కారని చెప్పబడెను. ఏమనగా-

విష్ణుపురాణములో భావనాత్రయవినిర్ముక్తస్వరూపమే ధ్యేయమని నిర్ణయింపబడెను. కర్మభావన, బ్రహ్మభావన, ఉభయభావనయని భావన మూడువిధములు. కర్మభావన కలవారు సామాన్యమానవులు. బ్రహ్మభావన కలవారు సనకాదులు. ఉభయభావన కలవారు చతుర్ముఖాదులు. ఈ ముగ్గురును

"నైవధ్యానోపకారకాః"
అని నిషేధింపబడిరి.

ఆశ్రయశబ్దముచే పరిశుద్ధాత్మస్వరూపము భగవత్ప్రాప్తికాముకునకు ధ్యేయము కాదని తెలుపబడినది. అట్టివాని మనస్సు అచ్చట నిలచియుండదు.

61 శ్లో॥-(116)

మనస్సు నిర్మలమనగా- రజస్తమస్సులణగి యుండుట, అది సత్వవృద్ధిచేతనే సాధ్యము. అది మనస్సు భగవంతునియందు నిలపినదుశ్శకము కాదు.

రజస్తమస్సు లడగిన శబ్దాది విషయానురాగము నశించును

61 శ్లో॥-(117)

ఈశ్లోకమున నింద్రియములకు విషయములతోగల సంబంధమును మాన్పమని మాత్రము చెప్పబడినదిగాని సుతరాం ఇంద్రియజయావస్థకాదు. అందుచే నన్యోన్యాశ్రయ దోషములేదు.

63 శ్లో॥-(118)

తన యభీష్టసిద్ధి కడ్డుపడువారిపై మాత్రమేగాక మంచిచెడ్డ లెఱుంగజాలనిస్థితిలో నుండునుగాన యిరుగుపొరుగున నున్నవారిపై కూడా ఆరోపము ప్రసరించును. శ్రీరామచంద్రుడు మనుష్యవిడంబనతో సీతాపహారఘట్టమున క్రోధము నభినయించుచు నెత్తుకొనిపోయిన వాడొక క్రూరరాక్షసుడే యైనను

"సదేవ గన్ధర్వ మనుష్యపన్నగం జగత్సశైలంపరివర్తయామ్యహం।
పురేవ మే చారుదతీమనిన్దితాం దిశన్తి సీతాం యది నాద్యమైథిలీమ్॥
అని యుగ్రుడయ్యెనుగదా!

"అభిజాయతే"

అన్నచో అభి=అభితః అను ఉపసర్గచే సిద్ధించిన యర్థము.

63 శ్లో॥-(119)

సమ్మోహః- సమ్=ఏకీకారము. కావున సమ్మోహమనగా మంచిని చెడ్డను ఒక్కవిధముగనే తలంచుట.

దేహాత్మ భ్రాంతి యనియును చెప్పవచ్చును.

"కిం తేన న కృతం పాపం ?

"క్రుద్ధః పాపం న కుర్యాత్కః ? క్రుద్ధో హన్యా ద్గురూ నపి"

63 శ్లో॥-(120)

ఈశ్లోకమున

"ప్రణశ్యతి"

యనుచో నిత్యమగు నాత్మకు నాశములేదుగదా! కావున నాశమనగా

"లేనిదాని వంటిదే"

యని యర్థము. ఆ లేకపోవుట యనగా దానివాస్తవస్వరూపము గోచరింపకపోవుట

("ణశ=అదర్శనే" యని ధాతువు) దానికి మూలము దేహాత్మ భ్రాంతి, ఆభ్రాంతికి కారణము దేహసంబంధము, అదియే సంసారము.

64 శ్లో॥-(121)

ఈశ్లోకమున "చరన్"
అనుపదమునకు తిరస్కరించి వర్తించుట యని యర్థము చెప్పబడినది అంతియగాని

"చర-గతిభక్షణయోః"

అను ధాతుసిద్ధ భోగార్థము కాక, గత్యర్థమే గ్రహింపబడినది. గతి యనగా ఆక్రమణము. పోనిండు భక్షణమని చెప్పినను సంహార మును దాని కర్థముగాన నదియును సమంజసమే. ఎట్లైనను విషయ ములను తిరస్కరించుటలోనే పర్యవసానము. తిరస్కరించుటయనగా అనాదరించుట.

"అనాదరః పరిభవః పరీభావ స్తిరస్క్రియా"
అని కోశముగదా!

64 శ్లో॥-(122)

మనః ప్రసాదము=నిర్మలచిత్తత. ఇది ఆత్మదర్శనమునకు కారణము. ఆత్మదర్శన మైనవానికి దుఃఖ మొక్కటియు నుండ నేరదు. కాబట్టి ఈశ్లోకమున

"ప్రసాదే...సర్వదుఃఖానాం హానిః"
చెప్పబడినది.

66 శ్లో॥-(123)

ఈశ్లోకమున మోక్షసాధనములగు యోగావయవములగు ప్రత్యాహారధ్యానధారణసమాధు లనబడు నాలుగును కలవానికి ఫలమైన మోక్షమున్ను ముఖ్యవృత్తితోను తాత్పర్యవృత్తితోను వెనుకటిది లేనిదే ముందు అవస్థకలుగదని చెప్పబడినది.

67 శ్లో॥-(124)

ఈశ్లోకమున

"హారతి" శబ్దమునకు వినాశ మర్థముకాదు. దృష్టాంతబలముచే చేరవలసిన చోటునకు చేరక మరియొకచోటునకు చేర్చుట చెప్పబడుచున్నది. అనగా- ఆత్మ ప్రవణము కావలసిన దానిని విషయప్రవణ మొనర్చునని చెప్పబడుచున్నది.

68 శ్లో॥-(125)

అవతారిక-

"యదా సంహరతే చాయం"

అను శ్లోకమున ప్రారంభించిన ఇంద్రియ నిగ్రహోపదేశమును ఇచ్చట ముగించుచున్నాడు.

68 శ్లో॥-(126)

వెనుక చెప్పిన ఫలమునే యిచ్చట ప్రశంసించుటచే పునరుక్తి లేదు. 69, 70, 71 శ్లోకములచే వెనుక ప్రజహాతీత్యాది 55వ శ్లోకము మొదలు నాలుగు శ్లోకములచే చెప్పబడిన నాలుగు అవస్థల యొక్క సిద్ధి ముగింపబడుచున్నది.

"విహాయ కామాన్......"నిస్పృహః"

అనుపదములు

"యతమాన" "వ్యతిరేకావస్థ"

లకు ఉపలక్షణములని గ్రహించవలెను.

70 శ్లో॥-(127)

అవతారిక-

శబ్దాదులు విషయములుగానే గోచరించని

"వశీకార"

దశవరకును గల ఆత్మసాక్షాత్కార దశయొక్కస్థితి చెప్పబడినది. ఈదశకు కొంచెము క్రిందదైన సన్నిహితమైన

"ఏకేంద్రియావస్థ"

చెప్పబడుచున్నది. అది శబ్దాది విషయము లింద్రియ గోచర మైనప్పటికిని వికారమును చెందకుండునట్టి దశ. అది యీశ్లోకమున చెప్పబడుచున్నది.

70 శ్లో॥-(128)

నిత్యము నిరవద్యము నిరతిశయమును నగుస్వాత్మానుభవ ఆనందమునందు మునిగియున్నవాఁడు నశ్వరములు దుఃఖమిశ్రములు అల్పములును నగువిషయానుభవానందబిందువులలో సక్తుఁడు కాఁడని ముఖ్యతాత్పర్యము.

ఈశ్లోక మొకపాఠమును నేర్పుచున్నది

సముద్ర మెల్లపుడును నీటితో నిండియుండునటుల నీ వెల్లప్పుడును ఆత్మానుభవముతో నుండియుండుము. సముద్రము నదీజలములు తనలోనికి రావలెనని కోరనటులనే నీవును విషయానుభవము నాశింపకుము. కోరకున్నను ఆ నీరు వచ్చిచేరినను సముద్రము ఏవిధమైన మార్పును చెందనటుల నీవున ఆవిషయానుభవము వచ్చిపడినను ఏవిధముగను పొంగునుగాని కుంగునుగాని చెందకుము. ఇట్లుండుటచే సముద్రశాంతి కేకొఱతయు లేకుండగ నుండునట్లే నీశాంతికిని భంగము లేకుండ గంభీరముగ నుండగలవు.

70 శ్లో॥-(129)

ఈశ్లోకముచే విషయాసక్తి కలవానికి కెన్నటికిని శాంతి దుర్లభమే యగునా యనెడు ఆశంక పరిహరింపబడుచున్నది. ఎట్లనగా-

వెనుకటిశ్లోకములో చెప్పబడినటుల విషయములను విషయములుగా చూడకుండుటయు అట్లు చూచినను వానిమూలముగ మనస్సు వికరించకుండుటయును సాధించవలెను. అట్లుండవలెననిన దేహాత్మ భ్రాంతిని తొలగించుకొనవలెను. అది తొలగిన శరీరము నందుగాని తత్సంబంధులయందుగాని మమకారము దొలగును. అది తొలగిన విషయసంపాదనేచ్ఛ తొలగును. అది తొలగిన విషయసంగ్రహణము దూరమై శాంతిని బడయగల్గును.

దేహాత్మభ్రాంతిచే మమకారము, దానిచే విషయసంగ్రహణేచ్ఛ దానిచే విషయసంగ్రహణప్రయత్నములు అందుచే కలుగు సాఫల్యవైఫల్యములచే కలుగు మనఃక్షోభ దానిచే శాంతి భంగము క్రమముగా కలుగును.

వీనికి వెనుక రెండుశ్లోకములును ఆత్మను సాక్షాత్కరించు ప్రయత్నములో నున్నపురుషుని యవస్థాభేదములను తెలుపును. ఈశ్లోకములచేతను విషయానుభవ నివృత్తిరూప మగుశాంతి చెప్పబడినదని సారాంశము.

70 శ్లో॥-(130)

అవతారిక-

ఈశ్లోకమున పరమప్రయోజనముగా ప్రసక్తమైనసంసార నివృత్తి యనబడుశాంతి యుపసంహరింపబడుచున్నది.

70 శ్లో॥-(131)

బాల్యావస్థనుండియు విషయాసక్తుడైనవానికిని ఉత్తరావస్థలోనైనను విరక్తినిచెంది గడచినదానికి వగచు పశ్చాత్తప్తుడైనచో వీని కధికారి కావచ్చును-

ఇక బ్రహ్మచర్యాద్యారంభమునుండియు నిష్కర్మయోగస్థితిలో నున్నవానికి వేరుగ చెప్పవలెనా ?

70 శ్లో॥-(132)

ద్వితీయాధ్యాయార్థ సంగ్రహశ్లోకము-

శ్లో॥ నిత్యాత్మాఽసఙ్గకర్మేహా। గోచరా సాఙ్ఖ్యయోగధీః।
ద్వితీయే స్థితధీలక్షా। ప్రోక్తా తన్మోహశాన్తయే॥
ముందుగా తాత్పర్యము-

ఆత్మ నిత్య మనువిషయ మైనసాంఖ్యబుద్ధితో స్థితప్రజ్ఞావస్థను సాధించు, ఫలసంగరహిత కర్మానుష్ఠానమును గుఱించిన యోగబుద్ధి యర్జునుని యజ్ఞానమును బోగొట్టుటకై ఈ ద్వితీయాధ్యాయమున జెప్పబడినది.



# శ్రీ భగవద్గీతాఽతృతీయోఽధ్యాయః.

## కర్మయోగః.

### అవతారిక.

*వేదాంతములం బ్రతిపాదితుండై, సమస్తములైన యవిద్యాది దోషములను లేశముగూడ లేనట్లు నిరసించి, అనవధికాతిశయాసంఖ్యేయకల్యాణగుణగణుండును పరబ్రహ్మమునైయొప్పు పురుషోత్తముని బ్రాపించుటకు †తదైకాంతికాత్యంతికభక్తి ఉపాయమగును. ఆభక్తి వేదనము ఉపాసనము ధ్యానము మొదలైన శబ్దములచేఁ జెప్పఁదగియున్నది: మఱియు నది ముముక్షువునకు బ్రాప్యమైనది. దానికి అంగము ఆత్మయాథాత్మ్యదర్శనము. కావున నిట్లు ముముక్షువునకుఁ బ్రాప్యమైనభక్తిని జెప్పుటకుఁగాను ముందు దానియంగము 'య ఆత్మాఽపహతపాప్మా' ఇత్యాదిప్రజాపతివాక్యములచే ప్రతిపాదితమైనప్రాప్తయగు అనఁగా (భగవత్ప్రాప్తినిగోరు) ఆత్మయొక్క యాథాత్మ్యదర్శనమనియు, అది జ్ఞానయోగముచే

---

*ఈశాస్త్రము మోక్షప్రధానమైనది. ద్వితీయాధ్యాయమందుఁ జెప్పఁబడిన యర్థము సాక్షాత్తుగా మోక్షోపాయముగాదు. కావున నట్టియర్థమును ఇట్టిశాస్త్రమునఁ జెప్పుట యసంగతము, అని శంక రాఁగా, నిందు సంగతమే యని నిరూపించుచున్నారు. ఎట్లన, పరమపురుషప్రాప్తి యనెడు మోక్షమునకు ఉపాయము భక్తి. భక్తికి అంగము ప్రత్యగాత్మదర్శనము. దీనికి సాధనములైన కర్మయోగాదుల స్వరూపములే రెండవ యధ్యాయమునఁ జెప్పఁబడినవి గాన అసంగతి లేదని భావము.

†ఏకాంతమనఁగా (ఏకత్రఅంతః) ఒక్కదానియందే నిశ్చయము. అట్టిది ఏకాంతికము. అనఁగా దేవతాంతరఫలాంతరములను పరిత్యజించి ఈశ్వరునే ప్రాప్యముగాను ప్రాపకముగాను దలఁచి వానియందే నెలకొని యుండునట్టిది. ఆత్యంతిక మనఁగా అత్యంతమైనది- అంతము లేనిదనుట. ఫలదశయందును నివర్తింపకుండునదని భావము. ఉపాయదశ మొదలుకొని ఫలదశవఱకును నశింపక పైపై నిరతిశయముగా పెరుగుచుండునదనుట.

సిద్ధించునదనియు, జ్ఞానయోగము ఆత్మనిత్యత్వజ్ఞానపూర్వక మైన అసంగకర్మానుష్ఠానమువలన (కర్మయోగమువలన) నిష్పన్న మగు ననియుఁ జెప్పఁబడినది. *ఆత్మదర్శనము పరవిద్యకు (అనఁగా భక్తికి)

---

*ఇది మొదలుగా భక్తికి ఆత్మదర్శనము అంగమనుటకుఁ బ్రమాణముల నుదాహరించుచున్నారు. 'య ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాస స్సత్యకామ స్సత్యసఙ్కల్పః సోఽన్వేష్టవ్యస్స విజిజ్ఞాసితవ్యః స సర్వాంశ్చ లోకా నాప్నోతి సర్వాం శ్చ కామాన్ యస్తమాత్మాన మనువిద్య విజానాతి ఇతిహ ప్రజాపతిరువాచ' (ఛాందోగ్య. ౮-౭-౧) 'ఏజీవాత్మ పాపరహితుఁడును, ముసలితనము లేనివాఁడును, మృత్యువులేనివాఁడును, శోకరహితుఁడును, ఆఁకలిలేనివాఁడును, దప్పిలేనివాఁడును, సత్యకాముఁడును, సత్యసంకల్పుఁడును, నగునో వానిని వెదకవలయును; వానిని తెలిసికొనవలయును. ఎవ్వఁ డాయాత్మను ఎఱింగి ధ్యానముసేయునో వాఁడు సర్వలోకములను సర్వకామములను బొందును' అని యర్థము. ఇది దహరవిద్యాప్రకరణము దహరవిద్యయనఁగా హృదయమున దహరాకాశమందున్న పరమాత్మను బొందువిద్య. ఇట ప్రజాపతికిని ఇంద్రునకును సంవాదమున్నది. ఈసంవాదమున ప్రజాపతి వరుసగా జాగ్రత్తు స్వప్నము సుషుప్తి యనెడియవస్థలతోఁ గూడినప్రత్యగాత్మను ఇంద్రుని కుపదేశింపఁగా నతఁడు 'నాహ మత్ర భోగ్యం పశ్యామి' 'ఈ ప్రతిబింబాత్మయందు అమృతత్వాభయత్వాదిక మైన భోగ్యము నాకుఁ గనుపట్టలేదు' అని యందందు విముఖుఁడై మరలమరల నడిగెను. పిదప నతనియోగ్యతను గనుఁగొని ప్రజాపతి 'అశరీరం వా వసన్తమ్ న ప్రియాప్రియే స్పృశతః' ఛాం. ౮-౧౨-౧ 'కర్మారబ్ధ మైనదేహమును వీడియున్న యాత్మను (శుద్ధాత్మస్వరూపమును) కర్మఫలభూతము లైనసుఖదుఃఖములు స్పృశింపవు' అని పరిశుద్ధాత్మస్వరూపమును జెప్పె నని సందర్భము తెలియునది. ఈపరవిద్యాప్రకరణమున పరవిద్యకంగముగా 'యస్తమాత్మాన మనువిద్య విజానాతి' అని ఆత్మస్వరూపదర్శనమును జెప్పి, జాగరిత స్వప్న సుషుప్తులకు అతీతమై అశరీరమై యుండునదిగా వానిని ప్రతిపాదించి 'ఏవమే వైషసంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపే ణాభినిష్పద్యతే' ఛాం ౮-౧౨-౨. 'ఇట్లే మిక్కిలి ప్రసన్నుఁడైన యీయాత్మ యీశరీరమునుండి లేచి పరంజ్యోతిని బొంది తనరూపముతో నిష్పన్నుఁ డగుచున్నాఁడు' అని పరవిద్యకు ఫల మైన పరంజ్యోతిః ప్రాప్తిని (మోక్షమును) జెప్పి యుపసంహరింపఁబడినది. పరవిద్యకుఁగల ఫలమునే ఆత్మదర్శనమునకును ఇట ఫలముగా చెప్పుటచే పరవిద్యకు ఆత్మదర్శనము అంగమగుట సిద్ధము. ఎట్లనఁగా, ఇచట ప్రజాపతివాక్యములు దహరవిద్యం గూర్చినవి. ప్రజాపతివాక్యములందు ప్రోక్త మైన ప్రత్యగాత్మదర్శనమునకు మోక్షమునకన్న వేఱు ఫలము చెప్పఁబడలేదు. ప్రత్యగాత్మదర్శనము తనంతటనే మోక్షమునకు సాధన

అంగ మెట్లనఁగా ప్రజాపతివాక్యమందు దహరవాక్యముచేఁ జెప్పఁ
బడిన పరవిద్యకు, ప్రాప్త యగు ఆత్మయొక్క స్వరూపదర్శనము
'య స్తమాత్మాన మనువిద్య విజానాతి' అని యంగముగాఁ జెప్పి,
జాగ్రత్స్వప్నసుషుప్తులకు అతీతుఁ డైన ప్రత్యగాత్మస్వరూపమును
అశరీరముగాఁ బ్రతిపాదించి, 'ఏవమేవైష సంప్రసాదోఽస్మాచ్ఛరీరా
త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే'
అని దహరవిద్యకుఁ (భక్తికి) గల ఫలమును దానికిఁ జెప్పి, యుప
సంహారము సేయఁబడినది. కాఁబట్టి ఆత్మదర్శనము భక్తికి అంగ
మనుట సిద్ధించుచున్నది. ఇంతేకాక తక్కినయెడలఁగూడ *'అధ్యాత్మ

మును గా నేరదు. అట్లగునేని 'నాన్యః పన్థా అయనాయ విద్యతే' ఇత్యాదిగా
భక్తియే మోక్షసాధన మనెడిశ్రుతులకు విరుద్ధమగును. మఱియు నిచట జీవప్రాప్తియే
ఫలమని చెప్పలేదు. 'పరం జ్యోతి' అని పరమాత్మప్రాప్తియే ఫలముగా విశేషిత
మైయున్నది. ఇట్లు పరవిద్యాప్రకరణమందు ఆత్మదర్శనము మోక్షమునకంటె వేఱు
ఫలము లేనిదిగాను అనఁగా మోక్షమే ఫలముగాఁ గలదిగాను, అయినను మోక్షము
నకు తనంతట సాధనము కానిదిగాను నుండుటం జూడఁగా, అది ప్రాకరణికమైన
పరవిద్యద్వారా మోక్షమునకు సాధనమై తన్మూలమున మోక్షఫలము నొసఁగునని
యేర్పడుచున్నది. కాన పరవిద్యకు అది అంగ మని తెలియుచున్నది. ఇట్లంగము
కానిచో పరవిద్యయొక్క 'ఏవమేవైష' అను ఫలము దీనికిని జెప్పుట పొసఁగదు.
కాన యీశ్రుతిచేత పరవిద్యకు (అనఁగా భక్తికి) ఆత్మదర్శనము అంగ మగుట
సిద్ధము.

*'తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్।
అధ్యాత్మయోగాధిగమేన ... జహాతి' కఠవల్లీ-౧-౨-౧౨ 'దర్శించుట కలవి గాని
వాఁడును, గుణత్రయములచేఁ గప్పబడుటచే గూఢుఁడైనవాఁడును; శరీరములం దను
ప్రవిష్టుఁ డైనవాఁడును, అందులోను హృదయగుహాయందు నున్నవాఁడును, దాని
లోపలివస్తువునందు (అనఁగా జీవాత్మయందు) నెలకొన్నవాఁడును, అనాది యైనవాఁ
డును, (అధ్యాత్మయోగాధిగమేన-విషయములనుండి మరల్చి చిత్తమును ఆత్మయందు
లయింపఁజేయుట అధ్యాత్మయోగ మనఁబడును.) అట్టి అధ్యాత్మయోగముచేత,
(అధిగమేన-పొందఁబడిన దగు జీవాత్మజ్ఞానముచేత, (తం దేవం) పూర్వోక్తలక్షణ
లక్షితుఁడైన యాపరమాత్మను, (మత్వా) మననముచేసి-జీవాత్మజ్ఞానము కలిగినచో
జీవాత్మకు సమానరూపముగానే పరమాత్మ యుండుటవలన పరమాత్మజ్ఞానముకూడఁ

యోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి' ఇత్యాదు లందు, 'దేవం మత్వా' అని విధింపఁబడుచున్న పరవిద్యకు 'అధ్యాత్మ యోగాధిగమేన' అని అంగముగా ప్రత్యగాత్మజ్ఞానమునుగూడ విధించి *'నజాయతే మ్రియతేవా విపశ్చిత్' ఇత్యాదులచే ప్రత్యగాత్మస్వరూపమును విశోధించి, 'అణోరణీయాన్' అని యారంభించి యీవాక్యముచే పరస్వరూపమును 'మహాన్తం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి' అని తదుపాసనమును, *'నాయమాత్మా

---

గలుగును గాన జీవాత్మజ్ఞానమును బొంది (అనఁగా ఆత్మదర్శనము లభించి) తన్మూలమున పరమాత్మజ్ఞానమును బడసి, (ధీరో... జహాతి) ధీరుఁడు విషయలాభాలాభముల వలనఁ గలుగు హర్షశోకములను బొందఁడని యర్థము. పరమాత్మజ్ఞానమే భక్తి. దీనికి 'అధ్యాత్మయోగాధిగమేన' అను ప్రత్యగాత్మజ్ఞానము (ఆత్మదర్శనము) అంగముగా విధింపఁబడుట తెలియునది.

*'నజాయతే మ్రియతేవా విపశ్చిత్' కఠ-౧,౨-౧౮ అని దీనిచే ప్రత్యగాత్మస్వరూపము (అనఁగా దాని నిత్యత్వాదులు) విశోధింపఁబడినవి. ఇదియే ప్రథమ షట్కాంశము. ద్వితీయతృతీయ షట్కాంశములు 'అణోరణీయాన్' ఇత్యాదులచే చెప్పఁబడుచున్నవి. 'అణోరణీయాన్మహతో మహీయా నాత్మాస్య జన్తోర్నిహితో గుహాయాం। తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదా న్మహిమాన మాత్మనః॥ ౨౦॥ ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః। కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి॥ ౨౧॥ అశరీరం శరీరేషు అనవస్థేష్వవస్థితమ్। మహాన్తం విభు మాత్మానం మత్వాధీరో న శోచతి॥ ౨౨॥' కఠ-౧-౨-౧౦- ఇందు ప్రత్యగాత్మయం దంతర్యామి యైయుండు పరమాత్ముని స్వరూపమును జెప్పుచున్నాఁడు. (అణోః) సమస్తాచేతనములకంటెను సూక్ష్మమగు చేతనమునకన్న (అణీయాన్) మఱింతసూక్ష్ముఁడైనవాఁడు, మఱింత సూక్ష్ముఁడగుటచే వానిలోపలఁ బ్రవేశింప దగినవాఁడనుట, (మహతః) గొప్పవియైన ఆకాశాదుల కంటెను, (మహీయాన్) మఱింత పెద్దవాఁడును-తనచే వ్యాప్యముకాని వస్తువు లేనివాఁడనుట, (అస్య జన్తోః) 'నజాయతే' అని మంత్రద్వయముచే నిర్దేశింపఁబడిన యీప్రత్యగాత్మకు, (ఆత్మా) లోపలఁ బ్రవేశించి నియమించువాఁడు, (గుహాయాం నిహితః) హృదయమం దున్నవాఁడును, (తం) అట్టిపరమాత్ముని, (అక్రతుః) కామ్యకర్మాదిరహితుఁడగుచు, (ధాతుః) ధారకుఁడైన పరమాత్మయొక్క, (ప్రసాదాత్) ప్రసాదమువలన, (ఆత్మనః) తనకు, (మహిమానం) మహత్త్వము సంపాదించువాఁడైన-తన సర్వజ్ఞత్వాది గుణములు ఆవిర్భవించుటకు హేతుభూతుఁడైన యీపరమాత్మను, (యదా పశ్యతి)

ప్రవచనేన లభ్యో నమేధయా నబహునా శ్రుతేన। యమేవైష
వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్' అని

ఎప్పుడు చూచునో, (తదావీతశోకోభవతి) అప్పుడు దుఃఖము వీడినవాఁడగును॥౨౦॥ 'ధాతుః ప్రసాదాత్' అని ప్రసాదశబ్దముచే చెప్పబడిన భగవదనుగ్రహము లేనట్టి వానికి పరమాత్మునితత్త్వము అత్యంతము లోకాతీతమైనదిగావున తెలియ నలవికాదనుచున్నాఁడు. 'కూర్చుండియు దూరము పోవువాఁడును పరుండువాఁడై అంతటను దిరుగువాఁడును హర్షాహర్ష విరుద్ధధర్మములు గలవాఁడు నయిన యాదేవుని నాకంటె నన్యుఁడెవ్వఁడు తెలియఁగలఁడు' అని యర్థము. కూర్చుండియే దూరము పోవుట మొదలైన ధర్మములు తక్కినవారియెడల విరుద్ధములుగా దోఁచినను సర్వాత్మకుఁ డగుటచే భగవంతునియందు జీవునిద్వారా పొసఁగియుండు నన్న వని భావము॥ ౨౧॥ (అశరీరమ్) కర్మకృతమైనశరీరము లేనివాఁడును, (అనవస్థేషు శరీరేషు) అస్థిరశరీరములందు, (స్థితమ్) నిత్యుఁడగుటచే నున్నవాఁడును, (మహాన్తం విభుం) మహావైభవశాలియైనవాఁడును అగు, (ఆత్మానం) పరమాత్మను, (మత్వా) మననము చేసి, (ధీరోనశోచతి) ధీరుఁడు దుఃఖము నొందఁడు అని యర్థము. ఇందు మొదట 'నజాయతే' అని ఆత్మస్వరూపము చెప్పఁబడినది. ఇదియే మొదటి షట్కాంశము 'అణోరణీయాన్' అని పరమాత్మస్వరూపమును 'మహాన్తం విభుమాత్మానం' అని తదుపాసనమును జెప్పఁబడినది. ఇదియే మధ్యమషట్కాంశము. 'నాయమాత్మా' అని తదుపాసనము భక్తిరూప మగుట చెప్పఁబడినది. ఇదియె తృతీయషట్కాంశము అని క్రమము తెలియునది.

*'నాయ మాత్మా ప్రవచనేన లభ్యోన మేధయా న బహునాశ్రుతేన। యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మావివృణుతే తనూం స్వామ్'॥ కఠ-౧-౨-౨౩ (అయం ఆత్మా) ఈపరమాత్మ, (ప్రవచనేన) ప్రవచనఫలమైన మననము చేత, (న లభ్యః) లభ్యుఁడు గాఁడు. (బహునాశ్రుతేన) మిక్కిలి శ్రవణముచేత (నలభ్యః) లభ్యుఁడు గాఁడు (ఏషః) ఈ పరమాత్మ, (యం) ఏజీవాత్మను, (వృణుతే) వరించునో, (తేన) ఆజీవాత్మచే, (లభ్యః) పొందఁదగినవాఁడు, (ఏషః) ఈపరమాత్మ, (తస్య) భగవత్ప్రియుఁడైన ఆజీవాత్మునికి (స్వాం) తనదైన, (తనూం) అప్రాకృత దివ్యమంగళవిగ్రహమును, (వివృణుతే) ప్రకాశింపఁజేయుచున్నాఁడు అని యర్థము. ఇందు 'న ప్రవచనేన' 'న మేధయా' ఇత్యాదులంబట్టి కేవలములైన మనన నిధిధ్యాసనశ్రవణములను నిషేధించి జీవుని భగవంతుఁడు వరించుటకు హేతుభూతమైన గుణవిశేషమగు భక్తిని విధించుట తెలియునది. అనఁగా మననాదులు భక్తిరూపమును బొందిననే భగవత్ప్రీతికరము లగు నని భావము.

యీ యుపాసనము భక్తిరూపమగుటయును బ్రతిపాదించి *'విజ్ఞాన సారథిర్యస్తు మనఃప్రగ్రహవాన్నరః। సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదమ్' అని పరవిద్యాఫలమును జెప్పి ఉపసంహారము చేయఁబడినది. ఇటమీఁద నాలుగధ్యాయములచేత ప్రాప్త యగు ప్రత్యగాత్మయొక్క యీ చెప్పఁబడిన దర్శనమే దానిసాధనములతోఁ గూడ విస్తరించి చెప్పఁబడుచున్నది.

1

అర్జున ఉవాచ :

శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥ 1

టీ. హేజనార్దన=ఓకృష్ణా, *బుద్ధిః=బుద్ధి-జ్ఞాననిష్ఠ, కర్మణః= కర్మమునకంటె, జ్యాయసీ=శ్రేష్ఠము యినదని, తే=నీయొక్క, మతా చేత్ = అభిప్రాయ మైనయెడల, కేశవ = కృష్ణా, తత్ = అప్పుడు, ఘోరే=భయంకరమగు-ఆత్మదర్శనవిరోధి యైన యనుట, కర్మణి= యుద్ధాదికర్మమునందు, మాం=నన్ను, కిం నియోజయసి = ఏల ప్రవర్తింపఁ జేయుచున్నావు?

---

*'విజ్ఞానసారథిః...పరమం పదమ్' కఠ-౧-3-౯, ఎవఁడు విజ్ఞాన మానెడు సారథిఁగలిగి మనస్సుయొక్క నిగ్రహము గలవాఁడును) అనఁగా సమాహితచిత్తుం డును) శుచియు విద్వాంసుఁడునగునో వాఁడు సంసార మార్గముయొక్క పారమైన విష్ణునియుత్కృష్టపదమును (అనఁగా వైకుంఠమును) బొందును. ఇట 'విజ్ఞానసారథిః' అని ప్రత్యగాత్మజ్ఞానమునకు 'విష్ణోః పరమం పదమ్' అను పరవిద్యాఫలమె చెప్పఁ బడుటచేతను మఱివేఱుఫలము దానికి లేమిచేతను అది పరవిద్యకు అంగ మనుట సిద్ధ మని స్థాపిత మైనది.

*ఇట బుద్ధియనఁగా జ్ఞాననిష్ఠ గ్రాహ్యము. పూర్వము కర్మమునకంటె జ్ఞానము శ్రేష్ఠ మని చెప్పలేదు. కాని, స్థితప్రజ్ఞతాప్రకరణమున, కర్మము జ్ఞాననిష్ఠకు హేతు వనియు జ్ఞాననిష్ఠయే ఆత్మదర్శనమునకు హేతువనియు చెప్పబడినది. ఇట్లాత్మదర్శ నమునకు జ్ఞాననిష్ఠ అవ్యవహితమైన సాధన మగుటచే కర్మమునకంటె శ్రేష్ఠ మని, చెప్పకపోయినను, సిద్ధించినది గాన నర్జునుఁ డిట్లడిగెను.

తా. జనార్దనా, కర్మముకంటెను జ్ఞానమే మేలనుట నీకు సమ్మత మయ్యెనేని హింసాత్మక మగుటచే నతిక్రూర మైన యుద్ధాది కర్మమునందు నన్ను నియోగింపనేల ?

2
("జ్ఞాననిష్ఠయే ఆత్మావలోకనమునకు సాధనము. కర్మనిష్ఠ యాజ్ఞాననిష్ఠకు సాధన మైనది. ఆ జ్ఞాననిష్ఠ, సర్వేంద్రియముల యొక్కయు మనస్సుయొక్కయు శబ్దాదివిషయవ్యాపారములు ఉడుగుటచే కలుగుచున్నది" అని చెప్పితివి. సర్వేంద్రియవ్యాపారవిరతిచే సిద్ధించెడి ఆత్మదర్శనము సాధింపవలసిన దని కోరినచో, సకలకర్మ నివృత్తిపూర్వక మగుజ్ఞాననిష్ఠయందే ప్రవర్తించునట్లు నన్ను నియోగింపవలయును గాని, సర్వేంద్రియవ్యాపారరూపమై కాఁబట్టియే ఆత్మ దర్శనమునకు విరోధి యగుటచే ఘోర మైయుండు యుద్ధాది కర్మము
3
నందు న న్నేల వినియోగించెద వని భావము.

శ్లో॥ వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
4 5
తదేకం వదనిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥ 2

టీ. వ్యామిశ్రేణ ఏవ=మిశ్రిత మగుటచే పరస్పరము విరుద్ధమే మైయుండు, వాక్యేన = మాటచేత, మే = నాయొక్క, బుద్ధిం=మనస్సును, మోహయసీవ = భ్రమింపఁ జేయుచున్న ట్లున్నావు, తత్ = ఆ కారణమువలన, యేన=ఏవాక్యముచేత, అహం=నేను, నిశ్చిత్య= (అనుష్ఠింపవలసినదానిని) నిశ్చయించి. శ్రేయః=మేలును-పరమపురుషార్థమును, ఆప్నుయాం=పొందుదునో, ఏకం = మిశ్రముకాని ఒక్క మాటను, వద=చెప్పుము.

తా. కర్మజ్ఞానమిశ్ర మగుటచే పరస్పరము విరుద్ధముగానుండు
6
వాక్యముచే నీవు నాబుద్ధిని భ్రమింపఁజేయునట్లు తోఁచుచున్నది.

ఎట్లన: 'ఆత్మావలోకనమునకు సాధనభూతమైన సర్వేంద్రియవ్యాపార నివృత్తిరూపమైన జ్ఞాననిష్ఠయు, దానికి వ్యతిరిక్తమైన సర్వేంద్రియ వ్యాపారప్రవృత్తిరూపమైన కర్మనిష్ఠయె సాధనము, దానినే చేయుము' అనువాక్యము విరుద్ధమును మిశ్రమునే యగును. కావున మిశ్రముకాక ఒక్కవిధముగ నున్నయేవాక్యముచేత నే ననుష్ఠింపవలసిన దిది యని నిర్ణయించుకొని శ్రేయముఁ బొందుదునో అట్టి మాటను జెప్పుము.

శ్రీభగవానువాచ :

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ । [7] [8] [12]
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥ 3

టీ. అనఘ = పాపరహితుఁడా, అస్మిన్ లోకే = యీలోకమందు, సాఙ్ఖ్యానాం = జ్ఞానులకు, జ్ఞానయోగేన = జ్ఞానయోగము చేతను, యోగినాం = కర్మయోగులకు, కర్మయోగేన = కర్మయోగము చేతను, నిష్ఠా = అనుష్ఠానక్రమము, ద్వివిధా = రెండువిధములుగా, పురా = ముందే, మయా = నాచేత, ప్రోక్తా = చెప్పఁబడినది.

తా. పాపరహితుఁడవగు అర్జునా, నేను ముందు చెప్పినదానిని [12] నీవు చక్కఁగా అవధరింపలేదు. నానావిధములైనయధికారులచే నిండియున్న యీలోకమునందు సాంఖ్యులకు జ్ఞానయోగమును, కర్మయోగులకు కర్మయోగమును, అని రెండువిధములైన నిష్ఠలు ఆయాయధికారులకు తగినట్లు వేఱువేఱుగానే పూర్వము నేను చెప్పితిని గాని మిశ్రముగాఁ జెప్పలేదు. లోకమునందలి పురుషులకు [9] ఎల్లవారికిని మోక్షాభిలాష కలిగినప్పుడే జ్ఞానయోగమునందు అధికారము కలుగదు. అయినను, మొదట ఫలము [10] నుద్దేశింపక పరమపురుషారాధనరూపములుగా రకర్మలను జేయుట యనెడికర్మయోగానుష్ఠా

11
నముచే మనస్సులోని దోషములను నిర్మూలము గావించి దానివలన నిందిృయములకు విషయవ్యాకులత్వము లేకుండునట్లు చేసి, పిదపనే జ్ఞానయోగమునం దధికారము పొందవలయును. ఇదియే క్రమము. 'యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదంతతం ॥స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః'॥ (మూడు అధ్యా, ౧౮ శ్లో. ౪౬) అని కర్మములు పరమపురుషారాధనైకరూపము లని మీందం జెప్పం బడెడిని. ఇట కూడ విషయవ్యాకులము లగు నిందిృయములు గలవారికి 'కర్మణ్యేవాధికారస్తే' అని ఫలోద్దేశము లేని కర్మయోగమే అనుష్ఠింపందగిన దని విధించి, ఆ యోగము చేత విషయవ్యాకులత్వ రూపమైన మోహమును దాంటినబుద్ధి గలవారికి 'ప్రజహాతి యదా కామాన్' ఇత్యాదులచే జ్ఞానయోగము చెప్పంబడినది. కాంబట్టి సాంఖ్యులకే జ్ఞానయోగము చేత స్థితి చెప్పంబడినది. యోగులకన్ననో కర్మయోగము చేత చెప్పంబడినది. సంఖ్య అనంగా బుద్ధి. దానితోం గూడినవారు సాంఖ్యులు- అనంగా ఆత్మైకవిషయ మగు బుద్ధితో సంబంధించినవారు సాంఖ్యులు. దానికిం దగనివారు కర్మయోగము

13
నకు అధికారులగు యోగులు. ఇట్లు విషయవ్యాకులబుద్ధులకు కర్మ యోగమునం దధికారమును అవ్యాకులబుద్ధులకు జ్ఞానయోగమునం దధికారమును వేఱు వేఱుగాం జెప్పబడినది కాన రెంటిని గలిపి యొక్కండే చేయవలయునను విరుద్ధవిషయమును జెప్పలే దని భావము.

14 15
అవ. లోకమునం గలపురుషుల కెవరికైనను మోక్షాపేక్ష కలిగినతోడనే జ్ఞానయోగము నాచరించుట కష్ట మనుచున్నారు.

16
శ్లో॥ నకర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥ 4

టీ. పురుషః = పురుషుఁడు, కర్మణాం = నిత్యనైమిత్తికాది శాస్త్రీయకర్మములయొక్క, అనారంభాత్ ఏవ=చేయుటకు మొదలు పెట్టకుండుటవలననే, నైష్కర్మ్యం=జ్ఞాననిష్ఠను, న అశ్నుతే = పొందఁడు. సన్న్యసనాదేవ-(ఆరంభించిన శాస్త్రీయకర్మలను) విడిచినంతమాత్రముననే, సిద్ధిం = జ్ఞాననిష్ఠారూపమైన సిద్ధిని, న సమధిగచ్ఛతి=పొందఁడు.

తా. పురుషుఁడు శాస్త్రీయమైన కర్మము లారంభింపకుండిన మాత్రముననే జ్ఞాననిష్ఠను బొందఁడు. ఆరంభించిన శాస్త్రీయకర్మములను విడిచినంతమాత్రమునను జ్ఞాననిష్ఠను బొందు ననుటయు యుక్తముగాదు. ఏలనఁగా ఫలసంగము లేక పరమపురుషారాధనరూపముగా నాచరింపఁబడునట్టి కర్మము చేతనే యీజ్ఞానయోగసిద్ధిని పొందవలయునుగాన యది లేక యీజ్ఞాననిష్ఠను బొందఁడు. ఫలము నుద్దేశింపని కర్మములచే గోవిందుని ఆరాధింపకయు, అందువలన అనాదికాలమునుండి వచ్చుచున్న యనంతపాపసమూహములు నశింపకయు, నుండువారికి అవ్యాకులము లైనయింద్రియములతో ననుష్ఠింపవలసిన జ్ఞాననిష్ఠ సంపాదించుట కష్టము. 17

అవ. దీనినే యుపపాదించుచున్నాఁడు. 23

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః॥ 5

టీ. కశ్చిత్ = ఎవఁడుగాని, జాతు=ఒకప్పుడును క్షణమపి = క్షణకాలమైనను, అకర్మకృత్=కర్మమును చేయనివాఁడై, నతిష్ఠతి= ఉండఁడు, హి=ఏకారణమువలన, సర్వః=ఒక్కొక్కఁడును, అవశః= అస్వతంత్రుఁడై, ప్రకృతిజైః = ప్రకృతిసంభవములైన, గుణైః = సత్త్వరజస్తమోగుణములచేత, కర్మ (ప్రతి)=కర్మమును (గూర్చి,) కార్యతేహి=ప్రవర్తింపజేయబడుచున్నాఁడు గదా.

తా. ఈలోకమున పర్తించువాఁ డొకఁడైనను ఎప్పుడేని క్షణమాత్ర మేనియు కర్మము సేయక యుండుటలేదు. 'నే నేమి యును జేయను' అని నిశ్చయించుకొన్నను ప్రకృతిజన్యములై ప్రాచీనకర్మవాసనానుగుణముగాఁ బెరిఁగియున్న సత్త్వరజస్తమో గుణములు ఎల్లవారిని స్వవశము చేసికొని తమతమకుఁ దగినపనుల యందు ప్రవర్తింపఁజేయుచుండును. (కావున కర్మయోగముచే పూర్వపాపసంచయమును నశింపఁజేసి దానివలన సత్త్వాదిగుణములను వశపఱుచుకొని నిర్మలాంతఃకరణముతో జ్ఞానయోగమును సంపా దింపవలయు నని భావము). 26

24 25 26

అవ. కర్మయోగము చేయక వేఱువిధమున జ్ఞానయోగమును సంపాదింపఁ బూనువాఁడు మిథ్యాచారుఁ డనుచున్నాఁడు.

శ్లో॥ కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
27
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥ 6

టీ. యః=ఎవఁడు, కర్మేన్ద్రియాణి=వాక్పాణిపాదపాయూపస్థ లనెడికర్మేంద్రియములను, సంయమ్య = అడఁచి, ఇన్ద్రియార్థాన్ = శబ్దాదివిషయములను. మనసా=మనస్సుచేత, స్మరన్ = తలఁచుచు. ఆస్తే = ఉన్నాఁడో, విమూఢాత్మా = మోహమును జెందిన మనస్సు గల, సః=ఆపురుషుఁడు, మిథ్యాచారః = కపటాచారము గలవాఁ డని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా. ఎవ్వఁడు, వాక్పాణిపాదపాయూపస్థ లనెడి కర్మేంద్రియ ముల నిగ్రహించినను మనస్సుచే శబ్దాదివిషయములను చింతించు చుండునో అట్టిమూఢాత్ముఁడు కపటాచారము గలవాఁ డని చెప్పఁ బడును. (కర్మయోగము చేయక పాపములు నశింపవు. బాహ్యాంతః

కరణములును జయింపఁబడవు. అట్టివాఁడు ఇంద్రియనిగ్రహము చేసికొని ఆత్మజ్ఞానముకొఱకు పూనినను మనోనిగ్రహము లేనివాఁడుగాన విషయాసక్తి గలిగి, ఆయాత్మయెడల తనమనస్సు విముఖము గావింపఁబడుటచే, విషయములనే స్మరించుచుండును. వానియుద్దేశ్యము ఆత్మజ్ఞానము; ఆచారము విషయస్మరణము. ఇట్లు ఉద్దేశ్య మొకటియు ఆచారము మఱియొకటియు నై యున్నది. కాబట్టి వాఁడు మిథ్యాచారుఁ డనఁబడుచున్నాఁడు. అట్టివాఁ డాత్మజ్ఞానమునకై యుద్యమించి, దానికి విపరీతుఁ డై మిక్కిలి నశించునని యర్థము.)
28

29
శ్లో॥ యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।
కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే॥ 7

టీ॥ హే అర్జున=అర్జునా. యస్తు=ఎవ్వఁడైతే, ఇన్ద్రియాణి=ఇంద్రియములను, మనసా=మనస్సుచేత, నియమ్య=అణచి, అసక్తస్సన్=ఫలసంగము లేనివాఁడై, కర్మేన్ద్రియైః = తమంతటనే కర్మమునం దాసక్తమైన కర్మేంద్రియములచేత, కర్మయోగం = కర్మయోగమును, ఆరభతే = ఆచరించుచున్నాఁడో, సః = వాఁడు, విశిష్యతే=జ్ఞాననిష్ఠునకంటె శ్రేష్ఠుఁడగుచున్నాఁడు.
30

తా. *పూర్వము చేసిచేసి యలవాటుపడియుండు కర్మముల

---

*అనఁగా మనకు ఇంతకుమునుపు చేసిచేసి యలవాటుపడియుండు విషయముల వంటివే శాస్త్రీయకర్మము లగునుగాని వేఱుకావు. మనయింద్రియములు స్వాభావికముగా తమంతట నే కర్మములం దాసక్తములై యుండును. ఇట్టి యింద్రియములతో అట్టి కర్మములను అనుష్ఠించుట మిక్కిలి సుకరమగుటయే గాక యే ప్రమాదమును కలుగనీయదు. ఇట్లు అలవాటుపడియున్న కర్మములే కలవై కాఁబట్టి యే ప్రమాదమును గలుగనీయనిదైన కర్మయోగమును బూనినవాఁడు, అలవాటుపడియున్నది కానిదై కాఁబట్టి ప్రమాదమును గలుగనిచ్చున దగుజ్ఞానయోగమును బూనినవానికంటె, నధికుఁ డగుచున్నాఁ డని భావము.

వంటివే యగు శాస్త్రీయకర్మముల నాచరించునపుడు (త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణము లనెడి) జ్ఞానేంద్రియములను ఆత్మావలోకనప్రవృత్తమైనమనస్సుచేత నిగ్రహించి, తమంతటనే కర్మాసక్తము లైన యాయింద్రియములచేత ఎవ్వఁడు ఫలాభిలాష లేనివాఁడై కర్మయోగము నాచరించునో అట్టివానికి ప్రమాదములు కలుగనేరవు. కనుక నతఁడు జ్ఞాననిష్ఠుఁడైనపురుషునికంటె శ్రేష్ఠుఁడు.

31

శ్లో॥ నియతం కురు కర్మ త్వం కర్మజ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః॥ 8

టీ. త్వం=నీవు, నియతం=ఎడతెగనిసంబంధము గల, కర్మ = నిత్యనైమిత్తికాదికర్మములను, కురు=చేయుము. అకర్మణః = జ్ఞాననిష్ఠకంటె, కర్మ=కర్మనిష్ఠ, జ్యాయో హి=శ్రేష్ఠము గదా, అకర్మణః= కర్మనిష్ఠ లేని-కర్మముల నాచరింపని, తే=నీకు, శరీరయాత్రాపిచ= శరీరధారణముగూడ, న ప్రసిద్ధ్యేత్=సిద్ధింపదు.

తా. అనాదివాసనవలన జనులకు ప్రకృతిసంసర్గము కలుగుచున్నది. ఆప్రకృతియొక్క గుణములు దానిదాని కనుగుణము లైన పనులను జనులచే చేయించుచునే యుండును గాని వారిని మారకుండనీయదు. కాబట్టి దానిసంసర్గమువలన జనులకు కర్మములు నియతములై (గట్టిగా నేర్పబడినవై) వారి నెడతెగక సంబంధించి యుండును. ఇట్లు కర్మము, ఎడతెగనిసంబంధమువలన అలవడినదై, కావున సుకరమై, ప్రమాదము కలుగనిదై, యుండుటచేత కర్మములను జేయుము. జ్ఞాననిష్ఠయో ఇంతకుఁ బూర్వము అలవాటుపడినది కాదు; మఱి కర్మమువలె ఎడతెగని సంబంధము గలదియు కాదు; కావున దుష్కరమును ప్రమాదయుక్తము నగును. కాబట్టి జ్ఞానయోగాధికారికిఁగూడ జ్ఞాననిష్ఠకన్న కర్మనిష్ఠయే హెచ్చు. మఱియు కర్మముల నాచరింపునపుడు ఆత్మస్వరూపవిషయజ్ఞానముచేత ఆత్మకు

అకర్తృత్వమును అనుసంధానముచేయుట వెంబడినే చెప్పబడెడిని. కావున జ్ఞానయోగమును సంబంధించిన ఆత్మజ్ఞానము కర్మయోగము నందును అంతర్గతమైయున్నది. ఇట్లు నియతముగ అలవడియుండుట వలన సుకరమై అప్రమాదమై యుండుటయేగాక ఆత్మజ్ఞానముగూడ లోపలఁ గలదై యుండుటచేతను కర్మయోగమే మేలైనది. 'జ్ఞాననిష్ఠకంటెను కర్మము మేలైనది' అనుమాట జ్ఞాననిష్ఠయందధికార ముండునప్పుడే చెప్పుట యొప్పును. అందధికారము లేనపుడు అట్లు రెంటినిఁ బోల్చి చెప్ప నక్కఱలేదు. కావునను కర్మమే హెచ్చు. సర్వకర్మములను వదలి కేవలజ్ఞాననిష్ఠకు పూనితివేని అప్పుడు నీ వేమియు చేయక యూరకుండుటవలన నీజ్ఞాననిష్ఠకు ఉపకరించునట్టి [32] దేహయాత్రగూడ నీకు సిద్ధింపదు. సాధనమును ఆరంభించినంతనే ఫలము కలుగదు. అది పూర్తినొందిననే కలుగును. కావున సాధనము [33] సమాప్తినొందుపర్యంతము శరీరమును బోషింపవలయును. న్యాయమార్గమున ద్రవ్యమార్జించి మహాయజ్ఞాదులను జేసి అందు దేవతా[34]దులకుఁ బెట్టి శేషించినయాహారముతోనే శరీరమును బోషింపవలయు నని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. *'ఆహారశుద్ధౌ సత్త్వ శుద్ధి స్సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః' అని శ్రుతియు నున్నది. 'తేత్వఘం

* 'మోక్షమునకు ఉపాసనము సాధనము. ఉపాసనము నిష్పన్నమగుటకు అంతఃకరణమున దానియుత్పత్తికి ప్రతిబంధకములైన పాపము లెల్ల పోవలయును. ఆపాపములు లేకపోవుట రాజసతామసాహారులకుఁ గలుగదు; సాత్త్వికాహారులకే కలుగును' అని 'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః। స్మృతిలమ్భే హృదయగ్రన్థీనాం విప్రమోక్షః (ఛాం-౭-౨౬-౨-వా.) అను శ్రుతి యుపదేశించెడిని. ఇచట సత్త్వమనఁగా అంతఃకరణము. గ్రంథియనఁగా ముడివలె విడిచిపుచ్చరాక హృదయమున పెనఁగొనియుండు అవిద్యారాగాదులు. ఆహారశుద్ధివలన అంతఃకరణశుద్ధియు దానివలన ధ్రువమైనస్మృతియు స్మృతిలంభముచే హృదయగ్రంథులయొక్క మోక్షమును (అనఁగా వీడిపోవుటయుఁ) గలుగు నని యర్థము.

భుఞ్జతే పాపా యే పచన్త్యాత్మకారణాత్' అని యిందేమీఁదఁజెప్పఁబడెడిని. కాన జ్ఞాననిష్ఠునకుఁగూడ కర్మము చేయనిచో దేహయాత్రయు సిద్ధింపదు. కాఁబట్టి ఇట్లు జ్ఞాననిష్ఠునికిఁగూడ దేహము వాల్చి యుండఁగా సాధనసమాప్తిపర్యంతము శరీరమును బోషించుటకు *మహాయజ్ఞాదినిత్యనైమిత్తికకర్మము లవశ్యకర్తవ్యము లగుటచేతను, కర్మయోగమందును ఆత్మయొక్క అకర్తృత్వమును అనుసంధించుటం జేసి ఆత్మయాథాత్మ్యానుసంధానము అంతర్భూత మగుటచేతను, ప్రకృతితో నెడతెగనిసంబంధము గలవానికి కర్మయోగము సుకరమును అప్రమాదము నగును. ఈమూఁడుకారణములనుబట్టి జ్ఞాననిష్ఠాయోగ్యునికిఁ గూడ జ్ఞానయోగముకంటె కర్మయోగమే 35 శ్రేష్ఠమగును. కాబట్టి నీవు కర్మమునే చేయుమని యభిప్రాయము. 36

అవ. కర్మము శ్రేష్ఠమగుట సరిగాని యాద్రవ్యార్జనాది కర్మములు అహంకార మమకారాదులను గలిగించి పురుషునియొక్క యింద్రియములను కలతఁనొందినవానినిగాఁ జేయఁగా వాఁడు కర్మవాసనచేత బద్ధుఁడు కాఁడా యనఁగా దానికిఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః ।
తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గస్సమాచర ॥ 9

టీ. యజ్ఞార్థాత్=యజ్ఞము ప్రయోజనముగాఁగల, కర్మణః=(ద్రవ్యార్జనాది) కర్మముకంటె, అన్యత్ర=ఇతరమగు, కర్మాచరణము

---

* పంచమహాయజ్ఞము లెవనఁగా:—(1) బ్రహ్మయజ్ఞము అనఁగా అధ్యాపనము వేదాదులను జదివించుట. (2) పితృయజ్ఞము అనఁగా తర్పణము-పిండోదకము లిచ్చుట. (3) దేవయజ్ఞము అనఁగా హోమము-నెయ్యి మొదలగువాని నగ్నియందు వేల్చుట. (4) భూతయజ్ఞము అనఁగా బలి-భూతములకు ఆహారము పెట్టుట. (5) నృయజ్ఞము అనఁగా అతిథిపూజనము- అతిథులను అన్నాదు లొసంగి పూజించుట.

నందు, అయం=ఈ, లోకః=సంసారిచేతనవర్గము, కర్మబన్ధనః=కర్మమే బంధనముగాఁగలది, భవతి=అగుచున్నది, హేకౌన్తేయ = అర్జునా, తదర్థం=యజ్ఞార్థము, కర్మ=ద్రవ్యార్జనాదికర్మమును, ముక్తసఙ్గస్సన్ - ముక్త=విడువఁబడిన, సంగఃసన్=సంగము గలవాఁడవై, సమాచర= ఆచరింపుము

తా. అర్జునా, యజ్ఞాదిశాస్త్రీయకర్మములకొఱకై ద్రవ్యార్జనాదికర్మములను గావింపక, స్వప్రయోజనముకొఱకై యాకర్మములను గావించుచుందురేని, లోకులు ఆకర్మముచే బద్ధులగుదురు. (అనఁగా *అనాదికాలప్రవృత్తమైన కర్మవాసనచే పయిపయి సంసారబద్ధులగుచు నుందురు. యజ్ఞార్థమై కర్మమును గావించినచో ఆకర్మవాసన బంధహేతువుకాదు.) కాఁబట్టి నీవు యజ్ఞార్థము ద్రవ్యార్జనాదికర్మములను ఆచరింపుము. అందు స్వప్రయోజనమును సాధించుకొఱకై †సంగము కలిగియుందువేని, యట్టిసంగమునుండి విడివడి

---

* ద్రవ్యార్జనాదికర్మములు పాపములు గావు. కాన యవి తమంతట బంధింపవు. వానివాసనయే బంధించును. అనఁగా అనాదికాలముగా ఆకర్మములను ఆచరించుచు వచ్చుచుండుటవలన వానిని విడిచిపెట్టినను వాని వాసనమాత్రము విడువక మరల ఆకర్మములను జేయునట్లు ముముక్షువును పురికొలిపి పయిపయి సంసారబంధము కలిగించుచుండునని తెలియునది. కనుక నిట 'కర్మబంధనః' అనఁగా 'కర్మవాసనాబంధనః' అని యర్థము సేయ బడియె. కావుననే దీని యువతారికయందును 'కర్మవాసనచే బద్ధుఁడు' అనియున్నది. కర్మములను స్వప్రయోజనమునకై కావించినచో వాని వాసన బంధించుననియు, యజ్ఞార్థముగాఁ గావించినచో వానివాసన బంధింపదనియు వివేకించుకొనవలయును.

† ఇట కర్మమునందు 'సంగము' అనఁగా కేవలము స్వప్రయోజనమును సాధించుటకై దానియందు తగులు గలిగియుండుట. ఇదియె సంగస్వరూపము. ఈ సంగమును విడుచుటయే సంగత్యాగము. ఇది అకర్తృత్వానుసంధానరూపమయిన కర్తృత్వత్యాగమునకును అఫలహేతుత్వానుసంధానరూపమయిన ఫలత్యాగమునకును విలక్షణమయినదని తెలియునది. అయినను మందుఁడుగూడ ఏప్రయోజనముగాని లేక యొకకార్యమునకుఁ బూనఁడు. కనుక ఏప్రయోజనము నుద్దేశింపక కర్మములను జేయుట యెట్లు? అన్నచో, వానిని ప్రయోజనమునకు సాధనముగా నెన్నకపోయి

యాకర్మముల నాచరింపుము. (ఇట్లు ముక్తసంగుఁడై యజ్ఞాదుల కొఱకు కర్మములను జేయుచుండఁగా యజ్ఞాదికర్మలచే ఆరాధితుఁడగు పరమపురుషుఁడు నీనికి అనాదికాలప్రవృత్తమైన వాసనను ఛేదించి యవ్యాకులమైన ఆత్మావలోకనము నొసంగునని యర్థము.)

అవ. ఏపురుషార్థమును సాధింపఁ బూనియున్నవారికిని, యజ్ఞశేషము చేతనే శరీరధారణము చేయదగునవియును, యజ్ఞశేషము కానట్టిదానిచే శరీరధారణము చేసినచో దోషము కలుగు ననియును, జెప్పుచున్నాఁడు.

38 37

శ్లో॥ సహయజ్ఞైః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్ ॥ 10

టీ. పురా=సృష్టికాలమందు, ప్రజాపతిః = సర్వేశ్వరుఁ డగు నారాయణుఁడు, *యజ్ఞైఃసహ = యజ్ఞములతోఁగూడ, ప్రజాః = ప్రజలను, సృష్ట్వా = సృజించి, అనేన = ఈయజ్ఞముచేత, ప్రసవిష్యధ్వం=వృద్ధిఁబొందించుకొనుఁడు, ఏషః = ఇది, వః=మీకు, ఇష్టకామ

---

నను, అవి. యొకస్నేహితునికి స్వప్రయోజన మేమియు నుద్దేశింపక తత్ప్రీతిమాత్రమునకై చేయు నుపచారమువలె, భగవంతునికి తత్ప్రీతిమాత్ర మునకై చేయు నారాధనమే యగును గాన యిదియే వానికిఁ బ్రయోజనమని యెన్నినచో వాని నాచరించుట యొప్పు నని తెలియునది. భగవంతు డా యజ్ఞాదికర్మలచే ఆరాధితుఁ డగు ననఁగా వానియందు హవిస్సు గొని ప్రీతినొందునని యభిప్రాయము కర్మములను స్వప్రయోజనమునకై యాచరించినచో కర్మవాసన విడువదు. అది విడువమిచే ఇంద్రియముల వ్యాకులత యుడుగదు. కాన యింద్రియజయమూలక మయిన ఆత్మదర్శనము గలుగదు. కర్మములను యజ్ఞాదులకై యాచరించినచో వానిచే భగవంతుఁ డారాధితుఁడై కర్మవాసనను త్రెంచివైచును. దానిచే ఇంద్రియముల వ్యాకులత యుడిగి యింద్రియజయము కలుగును. దీనిచే ఆత్మదర్శనము సిద్ధించు నని గ్రాహ్యము.

* 'సహయజ్ఞాః' అనుపాఠమునందు 'యజ్ఞముతోఁ గూడినవారినిగా.

ధుక్=కోరినకోర్కెలను పూర్తి చేయునది, అస్తు=అగుఁగాక, (ఇతి=అని,) ఉవాచ=పలికెను.

తా. ప్రజాపతి శబ్దము, హిరణ్యగర్భాదులకుఁగూడ చెల్లును. కాని 'పతిం విశ్వస్య' (తై-నార-అను-3-వా.) ఇత్యాది శ్రుతులం బట్టి యాశబ్దము నిరుపాధికముగా (అనఁగా ఇంత అంత అని అవచ్ఛేదము లేనిదిగా) నుండుటవలన, అండాద్యవచ్ఛిన్నులైన హిరణ్యగర్భాదులం జెప్పక అనవచ్ఛిన్నుఁడును సర్వేశ్వరుఁడును, విశ్వమును సృజించువాఁడును, విశ్వాత్ముఁడును, పరాయణుఁడును, నగు నారాయణుని చెప్పుచున్నది. సృష్ట్యాదికాలమునందు భగవంతుఁ డగు నా ప్రజాపతి అనాదికాలమునుండి ప్రవర్తించుచున్న *ప్రకృతిసంస

* సృష్టికిఁ బూర్వము ప్రజలు అనాదికాలప్రవృత్తమయిన అచిత్సంసర్గముచే వివశులై అచేతనప్రాయులై సర్వేశ్వరునిలోపల లీనులై యుండుటంబట్టి వారుండియు లేనట్లయి 'సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్' 'ఏకమేవాద్వితీయమ్' (ఛాం-౬-౨-౧) 'ఏకో హవై నారాయణ ఆసీన్న బ్రహ్మా నేశానః' (మహో-౧-౧) అన్నట్లు నారాయణుఁ డొక్కఁడే యుండునట్లు తోఁచుచుండెను. ఇట్లు ఒక్కఁడై తోఁచుచున్న సర్వేశ్వరుఁడు 'తదైక్షత బహుస్యామ్ ప్రజాయేయ' అన్నట్లు తనయందు లీనులైన ప్రజలకు వేఱువేఱ నామరూపములం గల్పించి తన్మూలమునఁ దాను పెక్కండ్రగుటఁ దలంచినవాఁడై యట్లు చేయఁగా 'తత్ర బ్రహ్మా చతుర్ముఖోఽజాయత' 'తస్య ధ్యానాన్తస్థస్య లలాటా ద్య్బద్బుద మభవత్ - బుద్బుదాత్ త్ర్యక్షః శూలపాణిః పురుషోఽజాయత' (మహో.౧-౧) 'సోఽభిధ్యాయ శరీరాత్స్వా త్సిసృక్షుర్వివిధాః ప్రజాః (మను-౧-౮) అన్నట్లు హిరణ్యగర్భుఁడు శివుఁడు మొదలుగాఁ గల ప్రజలను సృజించె నని యున్నది. ఇట బ్రహ్మాదులుగూడ ప్రజలగుటంబట్టియు వారికి నారాయణుఁడు జనకుఁ డగుటంబట్టియు, 'ప్రజాః సృష్ట్వా' అని అవచ్ఛేదము లేని ప్రజాశబ్దముచే బ్రహ్మాదికమయిన విశ్వమునకు స్రష్టయైన నారాయణుఁడే యిటఁ జెప్పఁబడిన ప్రజాపతి యగును. మఱియు 'తస్మాద్యజ్ఞా త్సర్వహుతః । ఋచస్సామాని జజ్ఞిరే' (పురుషసూ) 'సర్వాణిరూపాణి విచిత్య ధీరః । నామాని కృత్వాఽభి వదన్యదాస్తే' (పురుషసూ) అని యజ్ఞములతోడ సర్వప్రజలను సృజించునట్లు నిర్దేశింపబడిన యధికారపురుషునిఁగూడ సృజించినవాఁడు పరమపురుషుడే గనుక 'సహయజ్ఞైః ప్రజాః సృష్ట్వా' అని నిర్దేశింపఁబడిన ప్రజాపతి నారాయణుఁడే యగునని తెలియునది. ఇందు ప్రజలు అచిత్సంసర్గమున వివశు లగుటకు వారి యనాదికాల ప్రవృత్తకర్మప్రవా

ర్గమువలన స్వాధీనతతప్పి, నామరూపవిభాగము ఉపసంహృతమై, తనయందులీనులై సకలపురుషార్థములకును దగనివారై యచేతన ప్రాయులై పడియున్న ప్రజలను జూచి, పరమకారుణికుఁడు గాన వారు ఉజ్జీవించునట్లు చేయఁగోరినవాఁడై తనకారాధనములగు యజ్ఞములను నిర్వర్తించుకొఱకు యజ్ఞములతోడఁ గూడ నాప్రజలను బుట్టించి వారిఁ జూచి "ఈయజ్ఞముచేతనే మీమీవృద్ధిని జేసి కొనుఁడు.[39] ఈయజ్ఞము పరమపురుషార్థలక్షణమైన మోక్ష[40] మనెడి కామమును దాని కనుగుణములుగా నుండెడు కామములనును బూరించునది యగునుగాక" యని చెప్పెను.

శ్లో॥ దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పర మవాప్స్యథ॥ 11

టీ. అనేన=ఈయజ్ఞముచేత, దేవాన్=దేవతలను, భావయత=ఆరాధింపుఁడు, తే దేవాః=ఆదేవతలు, వః=మిమ్ములను, భావయన్తు=పోషింతురుగాక. పరస్పరం భావయన్తః=ఒకరినొకరు వృద్ధిఁ బొందించుకొనుచున్నవారై, పరం=ఉత్కృష్టమగు, శ్రేయః = మేలును, అవాప్స్యథ=పొందఁగలరు.

తా. *యజ్ఞములు కామములను బూరించుటయెట్లు? అన్నచో

---

హము కారణ మగుటచే సర్వేశ్వరుని పక్షపాతమునఁ గాని దయారాహిత్యమునఁ గాని వారి కట్టిసంసర్గము కలుగలేదనియు, కావున భగవంతునికిఁ బక్షపాతాదులు లేవనియుఁ దెలియునది. మఱియు ప్రజలు ఎల్లప్పుడును సుఖదుఃఖము లనుభవించుచుండుటవలన ఆయాసము నొంది అలసియుండుటచే విశ్రాంతి కలుగుటకొఱకును, ఎడతెగక అసన్మార్గమున వర్తించుచుండు వాసనను త్రెంచుటకొఱకును, ప్రళయమునఁదు వారి నామరూపములు ఉపసంహరింపఁబడుచున్నవని తెలియునది.

* యజ్ఞములచే తనకు వృద్ధియెట్లు? క్షణికక్రియారూపములైన యజ్ఞములు కాలాంతరమునఁగలుగుఫలములకు సాధనములగుట యెట్లు? 'నాన్యః పన్థాః' అని జ్ఞానమే మోక్షమునకు సాధన మనియుండఁగా కేవల స్వర్గాదులకు సాధనములుగా

దేవతారాధనరూపమైన యీయజ్ఞముచేత నాకు శరీరభూతులయిన నన్నే[41] యాత్మగాఁ గలిగియుండు దేవతలను ఆరాధింపుఁడు. 'అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ' అని మీఁదఁజెప్పఁబడును. అట్లు యజ్ఞముచేత ఆరాధింపఁబడిన యాదేవతలు, తమ్ము నారా[42]ధించుటకు మీకుఁ గావలసిన యన్నపానాదుల నిచ్చి మిమ్ము బోషింతురుగాక. ఇట్లు దేవతలును మీరును బరస్పరము వృద్ధినొందించుకొనుచు మోక్షాఖ్యమగు పరమశ్రేయస్సు నొందెదరు.

శ్లో॥ ఇష్టాన్[43] భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥ 12

టీ. యజ్ఞభావితాః=యజ్ఞములచే నారాధింపబడిన, దేవాః=దేవతలు, వః=మీకు, ఇష్టాన్=అభీష్టములగు, భోగాన్ = భోగములను, దాస్యన్తే హి=ఇత్తురు గదా, తైః=వారిచేత, దత్తాన్=ఇయ్యఁబడిన వానిని, ఏభ్యః=వీరికొఱకు, అప్రదాయ=ఇయ్యక, యః =

---

నేర్పఱుపఁబడిన యజ్ఞములు మోక్షసాధనము లెట్లగును?' 'కర్మణా బధ్యతేజన్తుర్విద్యయాచవిముచ్యతే। తస్మాత్కర్మనకుర్వన్తి యతయః పారదర్శినః' అని కర్మము జ్ఞానులాచరింపరని యున్నది కాన 'యజ్ఞ మెట్లువృద్ధికరము' అన్నచో దీనికి పరిహారము—యజ్ఞములచే దేవతలు ఆరాధింపఁబడుదురు. ఆదేవతలు నాకు శరీరము. 'అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ' (గీత-౯-౨౪) అని మీఁదఁ జెప్పఁబడునట్లు వారికిని అంతరాత్మనైయుండి నేనే యాయజ్ఞముల ననుభవించుచున్నాను గాన యజ్ఞములకు నేనే ఫలము నిచ్చువాఁడ నయ్యెదను. కాన యవి మోక్షప్రదములే యగును. అవి క్షణికక్రియ లయ్యును వానిచే దేవతలు సంతుష్టులై తమ్మారాధించుటకు వలయు నన్నపానాదు లొసంగుదురు గావున వానివలన కాలాంతరఫలములును దప్పక కలుగునని పరిహారము తెలియునది. దేవతలను భావించుట యనఁగా వారిని సంతోషపెట్టుట. దేవతలు మిమ్ము భావించుట యనఁగా వారిని సంతోషపెట్టుట. దేవతలు మిమ్ము భావించుట యనఁగా అపేక్షించిన వెల్ల నిచ్చి మిమ్ము పోషించుట యని తెలియునది.

ఎవఁడు భుఙ్క్తే=అనుభవించుచున్నాఁడో, సః=వాఁడు, స్తేన ఏవ = చోరుఁడే.

తా. పూర్వపూర్వయజ్ఞములచే నారాధింపఁబడిన మహాత్ములగు దేవతలు మీకు ఉత్తరోత్తరారాధనములకుఁ గావలసినవియు ఉత్తమపురుషార్థలక్షణ మగు మోక్షమును సాధించువారికి నిష్టములైనవియు నగుసమస్తభోగముల నొసంగుదురు. ఆదేవతలు తమ్ము నారాధించుకొఱకు నిచ్చినపదార్థములను యజ్ఞరూపమున మగుడ వారల కియ్యక యెవ్వఁడు తానే భుజించునో వాఁడు చోరుఁడే యనఁబడును. పరునిదై వానిప్రయోజనముకొఱకై యేర్పడియుండు వస్తువును తనదిగా నెంచి, దానిచేఁ దన్నుఁ బోషించుకొనుట[44] చౌర్యము. అట్టి చౌర్యముగలవాఁడు పరమపురుషార్థమునకుఁ దగనివాఁడగుటే కాక నరకమునుగూడ పొందఁగలఁ డని యభిప్రాయము.

అవ. *ఈవిషయమునే వివరించుచున్నాఁడు.

శ్లో॥ యజ్ఞశిష్టాశిన[45] స్సన్తో[46] ముచ్యన్తే[47] సర్వకిల్బిషైః ।
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచ న్త్యాత్మకారణాత్ ॥ 13

టీ. యజ్ఞశిష్టాశినః = యజ్ఞశేషమును భుజించునట్టి, సన్తః= సత్పురుషులు, సర్వకిల్బిషైః=సమస్తపాపములచే, ముచ్యన్తే=విడువఁబడుచున్నారు, యేతు=ఎవ్వరైతే, ఆత్మకారణాత్ =తమ నిమిత్తము, పచన్తి = వండుకొనుచున్నారో, పాపాః = పాపు లగు, తే = వారు, పాపమును, భుఞ్జతే=అనుభవించుచున్నారు.

---

*పూర్వోక్తమైనదాని కిది వివరణమే కాన పునరుక్తి లేదని భావము. అనఁగా పూర్వము 'శ్రేయః పరమవాప్స్యథ' అన్నందులకు నిట పూర్వార్ధమును 'తైర్దత్తాన ప్రదాయ' అన్నదానికి నిట ఉత్తరార్ధమును వివరణములని తెలియునది.

తా. ఇంద్రాదిరూపుఁడై యుండు పరమపురుషుని ఆరాధించుటకొఱకనియే ద్రవ్యములను ఆర్జించి పచనముచేసి దానిచే † యథావస్థితుఁడైనపరమపురుషు నారాధించి శేషించినదానిని భుజించుచు శరీరయాత్ర జరపు సత్పురుషులు అనాదికాలసంచితములై
48 49
ఆత్మయాథాత్మ్యదర్శనమునకు విరోధులగు సర్వపాపములనుండి విడిపడుదురు. అట్లుగాక భగవంతుఁడు ఇంద్రాదిరూపమున తన యారాధనముకొఱకు నిచ్చిన ద్రవ్యములను ఎవ్వరు తమ యుదరపూరణముకొఱకనియె పాకముచేసి భుజింతురో యట్టిపాపాత్ములు పాపమునే (అనఁగా పాపముగానే పరిణమించు అన్నమును) భుజింతురు. అట్టి
50
వారు తమపాపము నివర్తింపనందున ఆత్మావలోకనవిముఖులై నరకమునఁ బడుదు రని భావము.

అవ. మఱియును లోకదృష్టినిబట్టియు శాస్త్రదృష్టినిబట్టియుఁ జూడఁగా సమస్తమునకును యజ్ఞమే మూలమై యుండునని తెలియఁ జేయుచు, యజ్ఞమును అవశ్యముగా ననువర్తింపకున్న దోషము కలుగుననియుఁ జెప్పుచున్నాఁడు.

53
శ్లో॥ అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ 14

---

† ఇట 'యథావస్థితుఁడైన పరమపురుషుఁ' డనుటకు సారస్య మేమనఁగా కేవలము ఇంద్రాదులను ఆరాధించుటగూడ నిజమునకు పరమపురుషు నారాధించుటయే యగుచున్నది. అట్లయినను వారిలోనుండు పరమపురుషునిగూడ మనస్సున నుద్దేశించి యింద్రాదుల నారాధించిననే ఆరాధకునకు ఫలము కలుగును. కనుక నాయాదేవతలను అర్చించుట తదంతరాత్మయగు పరమపురుషునిపర్యంతము చెల్లుటకై 'యథావస్థితుఁ' డనఁ బడినది. అనఁగా 'ఇంద్రాదిశరీరకుఁడై యున్నపరమపురుషుని' నని యర్థము.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ 15
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయు రిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి॥ 16

టీ. అన్నాత్=అన్నమువలన, భూతాని=ప్రాణులు (సజీవశరీరములు), భవన్తి=కలుగుచున్నవి. పర్జన్యాత్=పర్జన్యునివలన-వర్షమువలన, అన్నసమ్భవః=అన్నము కలుగుచున్నది. యజ్ఞాత్=యజ్ఞమువలన, పర్జన్యః=పర్జన్యుఁడు-వర్షము. భవతి=కలుగుచున్నది, యజ్ఞః=యజ్ఞము, కర్మసముద్భవః=కర్మమువలన కలుగుచున్నది

టీ. కర్మ=కర్మము, బ్రహ్మోద్భవం=ప్రకృతిపరిణామరూపమగు శరీరముచేత కలిగినదిగా, విద్ధి=ఎఱుఁగుము. బ్రహ్మ=శరీరము, అక్షరసముద్భవం=అక్షరము (నాశరహితము) అనఁబడు జీవాత్మచేత కలిగినదిగా, విద్ధి=ఎఱుఁగుము, తస్మాత్=ఆ హేతువువలన, సర్వగతం = సమస్తపురుషార్థసాధనాధికృతమ్ - సర్వాధికారులను పొందియున్న, బ్రహ్మ=శరీరము, నిత్యం=ఎల్లకాలము, యజ్ఞే=యజ్ఞమందు, ప్రతిష్ఠితమ్=నిలిచియున్నది. (అనఁగా యజ్ఞమూలమైనది.)

టీ. ఏవం=ఈప్రకారము, ప్రవర్తితం=ప్రవర్తింపఁజేయఁబడిన, చక్రం=చక్రమును, యః=ఎవఁడు, ఇహ = ఈలోకమునందు, నానువర్తయతి = ప్రవర్తింపఁజేయఁడో, హే పార్థ = అర్జునా, సః=వాఁడు, అఘాయుః = పాపారంభమునకే యైన యాయువు గలవాఁడును, ఇన్ద్రియారామశ్చ-ఇన్ద్రియ=ఇంద్రియములే, ఆరామశ్చ=భోగస్థానములుగాఁ గలవాఁడునై, మోఘం = వ్యర్థముగా, జీవతి=బ్రదుకుచున్నాఁడు.

తా. అన్నమువలన సమస్తభూతములు కలుగుచున్నవి. వర్షమువలన న్నము పుట్టుచున్నది యనుటకు సర్వలోకులను సాక్షులు

గాన చెప్పవలసినది లేదు. యజ్ఞమువలన వర్షముగలుగుచున్న దను టయు 'అగ్నౌప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే' 'ఆదిత్యా జ్జాయతేవృష్టిః' ఇత్యాదిశాస్త్రములవలనఁ దెలియుచున్నది. యజ్ఞ మును, కర్తయొక్క వ్యాపారము లగు ద్రవ్యార్జనాదికర్మములవలనం గలుగుచున్నది. కర్మము బ్రహ్మమువలనఁ బుట్టుచున్నది. [ఇట

51

బ్రహ్మశబ్దముచే నిర్దేశింపఁబడినది * ప్రకృతిపరిణామరూప మగు శరీ రము. † తస్మా దేత ద్బ్రహ్మ నామ రూప మన్నంచ జాయతే (ముణ్డ-ము-౧-ఖం-౯-వా) అని బ్రహ్మశబ్దముచేత ప్రకృతి నిర్దేశింపం బడినదిగదా. ఇందుఁగూడ 'మమయోనిర్మహద్బ్రహ్మ (గీత-౧౪-౩)

---

* బ్రహ్మశబ్దము సాక్షాత్పరమపురుషునికి వాచకము. కాని యిట 'కర్మ బ్రహ్మోద్భవమ్' అనుచో కర్మము పరమపురుషునివలనఁ గలుగుననుట మిక్కిలియు మందము. కర్మము శరీరివలనఁ గలుగునది. ఆత్మ శరీరము అను రెండంశములుం చేరి శరీరియగును. అందు ఆత్మాంశము, మీఁద 'బ్రహ్మాక్షరసముద్భవమ్' అని అక్షరశబ్దముచే చెప్పబడుటవలన నిట శరీరాంశమే బ్రహ్మము గావలయును. కాన బ్రహ్మమనఁగా 'ప్రకృతిపరిణామరూప మగు శరీరము' అనఁబడినది.

† 'తస్మాత్ జాయతే' (ముండక. ౧-ము-ఖం-౯-వా) (తస్మాత్) సంకల్ప ముచేత సృష్టికి నున్ముఖుఁడైన బ్రహ్మమునుండి 'తతోఽన్నమభిజాయతే' అని యిట అన్నశబ్దముచే నిర్దిష్టమైన, (ఏతత్) ఈ, (బ్రహ్మ) అవ్యాకృత మనఁబడు బ్రహ్మము, (జాయతే) సాక్షాత్తుగ పుట్టుచున్నది. పరబ్రహ్మద్వారా, (నామరూపంచ జాయతే) నామరూపములు గలదై, (అన్నంచ) 'అద్యతే అత్తిచ భూతాని' అని అన్నశబ్దనిర్దిష్ట మగు భోగ్యభోక్తృరూపము గలదియునై పుట్టుచున్నదని యర్థము. అనగా ప్రధా నము అనఁబడు బ్రహ్మము (ప్రకృతి) కార్యము లగునపుడు ఘటపటాది నామరూప ములచే వేఱువేఱ విభక్తమై చేతనములకు భోగ్యమగుచున్నదని యర్థము. ఇట 'యస్సర్వజ్ఞ స్సర్వవిద్యస్య జ్ఞానమయం తపః। తస్మాదేత...జాయతే' అని పూర్ణ శ్రుతి. 'సర్వజ్ఞ స్సర్వవిత్' అని యిందు పరమపురుషుఁడు వేఱుగా చెప్పఁబడుటచే బ్రహ్మశబ్దము తత్పరము గానేరదు; జీవభోగ్యమగు ప్రకృతిపరమే కావలయునని తెలియునది. ఇట్లే 'మమయోని ర్మహ ద్బ్రహ్మ' అనుచో 'మమ' అని యీశ్వ రుఁడు తన్ను ప్రత్యేకముగా చెప్పుకొనుటచే బ్రహ్మశబ్దము తదితరమైన ప్రకృతిపరమే కావలయునని గ్రాహ్యము.

అని మీఁద బ్రహ్మశబ్దముచే ప్రకృతి నిర్దేశింపఁబడుచున్నది. బ్రహ్మశబ్దనిర్దిష్టమైన ప్రకృతిచే ప్రకృతిపరిణామరూపమైనశరీరము ఇట గ్రాహ్యము. కాఁబట్టి, 'కర్మము బ్రహ్మమువలనఁ బుట్టుచున్నది' అనుటచే ప్రకృతిపరిణామరూపమైనశరీరముచే కర్మము పుట్టునని చెప్పఁబడినదయ్యె.] *బ్రహ్మము (అనఁగా శరీరము) అక్షరము వలనఁ బుట్టినది. ఇట అక్షరశబ్దముచే నిర్దేశింపఁబడినది జీవాత్మ. అన్నపానాదులచే తృప్తుఁడైన అక్షరుఁడు అధిష్ఠింపఁగా, శరీరము

---

* ఆత్మను శరీరము స్వబుద్ధిపూర్వకమైనదిగాదు. కనుక 'బ్రహ్మాక్షరసముద్భవమ్' అనుచో బ్రహ్మమనఁబడు శరీరము అక్షరముచే (అనఁగా ఆత్మచేఁ) గలుగు ననుట అయుక్తము. మఱియు నిందు చక్రము చెప్పఁబడినది. అందు అన్నము మొదలుగా శరీరమువఱకును ఒకటివలన నొకటిగాఁ బుట్టుచున్నవిగాని శరీరమునకు హేతువైన యక్షరము అన్నాదులవలనఁ బుట్టుటలేదు. అట్లు అది పుట్టిననేకదా అన్నిటికిని కార్యకారణభావము గలిగి చక్రముగా పరివర్తించుట సరిపడును. కాన యిది యెట్లు? అన్నచో, ఇట 'బ్రహ్మాక్షరసముద్భవమ్' అనుచో శరీరమాత్రము అక్షరమువలనఁ బుట్టునదిగాఁ జెప్పలేదు. 'కర్మ బ్రహ్మోద్భవమ్' అన్నట్లు కర్మమునకు సాధనభూతమైనశరీరమే అక్షరమువలనఁ బుట్టును. అనఁగా కేవలశరీరము గాదు, శరీరము కర్మములను సాధించుటయే (అనఁగా శరీరమునకుఁ గల కర్మములను సాధించుశక్తియె) అక్షరమువలనఁ బుట్టుచున్నదని గ్రాహ్యము. శరీరము కర్మలను సాధించుటయు ఆత్మ దానిని అధిష్ఠించిననే కలుగును ఆత్మ శరీరమును అధిష్ఠించుటయు, అన్నాదులచే తాను తృప్తి నొందిననే కలుగును. ఇట్లు కర్మసాధనమయిన శరీరము ప్రత్యగాత్మాధిష్ఠానముచేతఁ గలుగుటవలన, బ్రహ్మము (శరీరము) అక్షరమువలనఁ గలుగుననుట యుక్తమే. అక్షరము అన్నాదులచే తృప్తినొందిననే అధిష్ఠాతయై కార్యములం జేయించును గాన అన్నాదులవలనఁ బుట్టుననుటయు యుక్తమే. ఇట అన్నియును ఒకటివలన నొకటి ఉత్పత్తి నొందుటచేతనే చక్రమేర్పడుచున్నదని తలంపరాదు. ఒకటి కొకటి ఏదే నొకవిధమున హేతువగుట చేతను చక్రము సిద్ధించుచున్నదని తెలియునది. లేక యుత్పత్తినిబట్టియే చక్రమేర్పడవలయునన్నచో, అప్పుడు 'కర్మ బ్రహ్మోద్భవమ్' 'బ్రహ్మాక్షరసముద్భవమ్' అను రెంటిని ఒకటిగా సముచ్చితము చేసికొనవలయును. అప్పుడు కర్మము అక్షరసముద్భవబ్రహ్మోద్భవము- అని అన్వయమగును అనఁగా అక్షరాధిష్ఠితబ్రహ్మమువలన (అనఁగా జీవాధిష్ఠితశరీరమువలన) పుట్టును. జీవాధిష్ఠితశరీరము అన్నమువలనఁ బుట్టును అని చక్రము పరస్పరోత్పత్తిచేతనే యేర్పడుచున్నది. ఇట 'అన్నాద్భవన్తి భూతాని' అనుచో భూత మనఁగా 'భ్రామయన్ సర్వభూతాని' ఇత్యాదులందుఁ బోలె సజీవశరీరముగా నర్థము గ్రాహ్యము.

కర్మము సేయ శక్తి గలదగుచున్నది. కావున కర్మమునకు సాధనమైన
52
శరీరము అక్షరమువలనఁ బుట్టున దగును. కాఁబట్టి సర్వాధికారులను బొందియున్నశరీరము నిత్యము యజ్ఞమందు ప్రతిష్ఠిత మైనది-అనఁగా యజ్ఞమూల మైన దని యర్థము. ఈవిధముగా పరమపురుషునిచేత ప్రవర్తింపఁజేయఁబడిన యీచక్రమును, సాధనము ననుష్ఠించుచుండు ఏకర్మయోగాధికారి గాని జ్ఞానయోగాధికారిగాని నడపఁడో, వాఁడు యజ్ఞశేషముచేత దేహధారణము చేయనందున పాపాయువు గలవాఁ డగును. కావుననే వాఁడు ఆత్మారాముఁడు గాక యింద్రియారాముఁ డగుచున్నాఁడు. అనగాఁ నింద్రియములే వీనికి ఉద్యానము లగుచున్నవి-అనఁగా యజ్ఞ శేషముచేత దేహమును మనస్సును బోషింపమిచే సత్త్వవృద్ధిలేక రజస్తమస్సులుమాత్రము ఉద్రేకింపఁగాఁ వాఁడు ఆత్మదర్శనవిముఖుఁడై విషయభోగములందే ఆసక్తుఁడగుచున్నాఁ డని యర్థము. దీనివలన జ్ఞానయోగాదులయందు ప్రవర్తించినను వానియత్నములు విఫలము లగును. కాఁబట్టి వానిబ్రదుకు వ్యర్థమే యగుచున్నది.

53

భూతములు (అనఁగా జీవముతోఁ గూడిన శరీరములు) అన్నముచేతను, అన్నము వర్షముచేతను, వర్షము యజ్ఞముచేతను, యజ్ఞము కర్తృవ్యాపారరూప మగు కర్మముచేతను, కర్మము సజీవశరీరములచేతను, మరల సజీవశరీరములు అన్నముచేతను, ఇట్లు అన్యోన్యకార్యకారణభావముచేత చక్రమువలె తిరుగుటవలన చక్ర మనఁబడెను.



అవ. ఆత్మదర్శనము సాధ్యము. దానికి జ్ఞానయోగాదులు సాధనములు. సాధనముల ననుష్ఠించుచుండువారికి మహాయజ్ఞాదివర్ణాశ్రమోచితకర్మములను జేయుట యావశ్యకము. కనుక సాధనమక్కఱలేకయే ఆత్మదర్శనము చేయుముక్తునికిమాత్రమే యాకర్మమావశ్యకము గాదని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః।
54
ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే॥ 17

టీ. యః=ఏ, మానవస్తు = మనుష్యుఁడైతే, ఆత్మరతిరేవ = ఆత్మయందే యాసక్తి గలవాఁడును, ఆత్మతృప్తశ్చ = ఆత్మచేతనే తృప్తిపొందినవాఁడును, ఆత్మన్యేవ=ఆత్మయందె, సన్తుష్టశ్చ=సంతోషించినవాఁడును, స్యాత్=అగునో, తస్య=వానికి. కార్యం = (ఆత్మదర్శనముకొఱకు) చేయఁదగినది, న విద్యతే=లేదు.

తా. ఏపురుషుఁడైతే కర్మయోగ జ్ఞానయోగము లనెడిసాధనముల నపేక్షింపక స్వయముగ ఆత్మాభిముఖుఁడై అన్నపానాదులచేతఁగాక ఆత్మానుభవముచేతనే తృప్తుఁడై, ఉద్యానహారచందనగీతవాద్యనృత్యాదులయందుఁ గాక ఆత్మయందే సంతుష్టుఁడై యుండునో-అనఁగా ఎవనికి ఆత్మానుసంధానమె *(ధారణపోషణభోగ్యములు మొదలైన వెల్ల నగునో) అట్టివాఁడు ఏసాధనమును లేక తనంతనె సర్వదా ఆత్మస్వరూపదర్శనము గలిగియుండును గనుక వానికి ఆత్మదర్శనముకొఱకు చేయవలసినది ఎద్దియు లేదు. 55

అవ. దీనికి హేతువును జెప్పుచున్నాఁడు.

---

* జ్ఞానయోగనిష్ఠుఁడైనను ఎవ్వనికి ధారణాదులు అన్నపానాదులచేతనే కలుగునో యట్టివానికి ఆత్మదర్శనముకొఱకు చేయవలసినది తప్పక యున్నది. ఎవ్వనికి ధారణాదులు ఆత్మానుసంధానముచేతనే కలుగునో (అనఁగా ఎవఁడు ముక్తుఁడో) వానికి అందులకై చేయవలసిన దేదియు లేదని భేద మూహించునది.

శ్లో॥ నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః॥ 18

టీ. తస్య=అట్టివానికి, ఇహ=ఇచ్చట, కృతేన=చేయఁబడిన దానిచేత, అర్థః=ప్రయోజనము, నైవ=కొంచెమైనను లేదు, అకృతేన =కర్మముచేయకుండుటచేత, కశ్చన=(అనర్థము) ఏదిగాని, న=లేదు అస్య = వీనికి, సర్వభూతేషు = ఆకాశాదిసమస్తభూతములందును, అర్థవ్యపాశ్రయః=ప్రయోజననిమిత్త మాశ్రయింపఁదగినది, కశ్చిత్=, ఒకటియును, న=లేదు.

తా. కాఁబట్టియే అట్టివానికి సాధనాపేక్ష లేకయే ఆత్మదర్శనము సిద్ధమై యుండుటచేత, దానికొఱకు సాధనముల నాచరించుట వలన ప్రయోజనముగాని, దానికొఱకు సాధనములను ఆచరింపకుండుట వలన ప్రత్యవాయముగాని, ఏదియు లేదు. వాఁడు ఆత్మారాముఁడగుటచే ఆత్మ తప్పతక్కిన సకల అచిద్వస్తువులయందును విముఖుఁడై యుండును. అట్టివానికి ఆత్మేతరములై ప్రకృతియొక్క వికార భేదములై యుండు నాకాశాది సమస్తభూతములయందును వాని కార్యములయందును ఒక్కటియైనను ఆత్మదర్శనముకొఱకు ప్రయోజనముగా స్వీకరింపఁదగినది కలుగదు. వానియన్నిటియెడల విరక్తి కలుగుటకే సాధనముల ననుష్ఠింపఁగా వానిని ప్రయోజనముగాఁ గైకొనుటెట్లు? అట్లు సాధన మక్కఱలేక యాత్మదర్శనము చేయు వానికే సాధనములందు ప్రవర్తించుట లేకుండును. కనుక అట్టివాఁడు ముక్తుఁడే యగును.

శ్లో॥ తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర ।
56 57
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః॥ 19

టీ. తస్మాత్=ఆకారణమువలన, అసక్తస్సన్ = సంగము లేనివాఁడ వగుచు, కార్యం (ఇతి) = అవశ్యము చేయవలసినదియె యని,

సతతం=ఆత్మప్రాప్తిపర్యంతమును, కర్మ=కర్మయోగమును, సమాచర =ఆచరింపుము, అసక్తః=సంగములేనివాఁడవై, కర్మ = కర్మమును, ఆచరన్=ఆచరించుచున్న, పూరుషః = పురుషుఁడు, పరం=ఆత్మను, ఆప్నోతిహి = పొందుచున్నాఁడు కదా.

తా. (సాధనాపేక్ష లేక ఆత్మదర్శనము గలవానికే సాధనములందు ప్రవృత్తి లేకుండుటంబట్టియు, సాధనమందు ప్రవర్తించినవానికిని, కర్మమే సుఖకరమై ప్రమాదము లేనిదై అంతర్గతమగు ఆత్మస్వరూపానుసంధానము గలదై యుండుటంబట్టియు, జ్ఞానయోగికిం గూడ తగుమాత్రము కర్మానువృత్తి కావలసియుండుటంబట్టియు, జ్ఞానయోగముకంటె కర్మయోగమే ఆత్మదర్శనము నొడఁగూర్చుటకు మేలైనది.) కాబట్టి. ఫలాదిసంగరహితముగా, కర్మమును అవశ్యముచేయవలసినదేయని తలఁచి ఆత్మప్రాప్తిపర్యంతము చేయుచుండుము. ఇట్లు సంగము మాని, (చెప్పబోవు అకర్తృత్వానుసంధానమును ముఖ్యముగాఁ గొని) కర్మముల నాచరించుపురుషునికి కర్మయోగముచేతనే ఆత్మప్రాప్తి సిద్ధించును, (జ్ఞానయోగముయొక్క సాహాయ్యమక్కఱలేక కర్మయోగమే ఆత్మప్రాప్తిని కలిగించుచున్నదని యర్థము.)

అవ. శిష్టులైనవారి యనుష్ఠానముచేతను కర్మయోగమే మేలైనదని తెలుపుచున్నాఁడు.

59 60 58

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః।

టీ. జనకాదయః=జనకుఁడు మొదలగువారు, కర్మణైవహి = కర్మయోగముచేతనేకదా, సంసిద్ధిం = ఆత్మప్రాప్తిరూపమైనసిద్ధిని, ఆస్థితాః=పొందినవారు.

తా. జ్ఞానయోగాధికారులకుఁ గూడ ఆత్మదర్శనమునకు కర్మయోగమే మేలైయుండుటచేత జ్ఞానులలో శ్రేష్ఠులైన జనకుఁడు

మొదలైన రాజర్షులు కర్మయోగము నాచరించియే కదా జ్ఞాన
యోగఫల మగు ఆత్మప్రాప్తిని బొందిరి.

అవ. ఇట్లు ముముక్షు వైనవాఁడు మొట్టమొదటనే జ్ఞాన
యోగమున కర్హుఁడు కానందున వాఁడు కర్మయోగాధికారి యగును.
కాఁబట్టి వానికి కర్మయోగమే చేయఁదగినదని చెప్పి జ్ఞానయోగాధి
కారికిఁగూడ కర్మయోగమే మేలైనదని సహేతుకముగా నిరూపిం
చినవాఁడయ్యె. ఇప్పుడు జనులలో విశిష్టుఁడుగాఁ జెప్పఁదగినవానికి
సర్వవిధములఁ గర్మయోగమే చేయఁదగిన దని చెప్పుచున్నాఁడు.

62 63

శ్లో॥ లోకసఙ్గ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి॥ 20
యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే॥ 21

టీ. లోకసఙ్గ్రహం-లోక=లోకులయొక్క, సంగ్రహం = ప్రవ
ర్తనమును, సంపశ్య న్నపి=ఆలోచించి యైనను, కర్తుం ఏవ = కర్మ
ములఁ జేయుటకె, అర్హసి=తగుచున్నావు. (ఏలయనఁగా,) శ్రేష్ఠః =
ప్రసిద్ధుఁడగు పురుషుఁడు, యద్యత్=ఏయేకర్మమును, ఆచరతి=ఆచ
రించుచున్నాఁడో, తత్తదేవ=దానినిదానినె, ఇతరో జనః = తక్కిన
జనుఁడును, (ఆచరతి=ఆచరించుచున్నాఁడు), సః=అతఁడు, (కర్మ =
అనుష్ఠింపఁబడుచున్న కర్మమును,) యత్ ప్రమాణం=ఏయంగముతోఁ
గూడినదిగా, కురుతే=చేయుచున్నాఁడో, లోకః = పామరజనుఁడు,
తత్=ఆయంగముతోఁ గూడినదానినిగానే, అనువర్తతే=అనుసరించు
చున్నాఁడు.

తా. లోకసంగ్రహార్థముగా నైనను నీవు కర్మమునే చేయ
64
వలయును. పూర్ణశాస్త్రజ్ఞానమునందును మంచి యనుష్ఠానమునం
దును ప్రసిద్ధుఁ డగువాఁడు ఏయేకర్మం బాచరించునో ఆయా కర

ము నే పూర్ణజ్ఞానము లేని యితరజనములును ఆచరింతురు. అనుష్ఠింపఁ

61

బడుచున్న కర్మమునుగూడ శ్రేష్ఠుఁడు ఏయంగముతోడ ఆచరించునో స్వల్పజ్ఞానము గల తక్కినలోకులును దానిని అయంగముతోనే యాచరింతురు. (కాఁబట్టి జనులలో శిష్టుఁడై ప్రసిద్ధినొందిన శ్రేష్ఠుఁడు తనకొఱకుఁ గాకపోయినను లోకరక్షకొఱకు నిజవర్ణాశ్రమోచిత మగు సకలకర్మములను సర్వదా ఆత్మప్రాప్తిపర్యంతము నాచరింప వలయును. అతఁ డాచరింపఁడేని అతనిని జూచి లోకులుఁ గూడ నాచరింపక నశింతురు. లోకనాశమువలనఁ గలుగుపాపము వానిని *జ్ఞానయోగమువలననుండియు భ్రష్టుఁ డగునట్లు చేయును.)

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ 22

టీ. పార్థ=అర్జునా, మే = నాకు, కర్తవ్యం = అనుష్ఠింపఁదగిన కర్మము, నాస్తి=లేదు, (ఏలనఁగా,) త్రిషులోకేషు = మూఁడులోకములయందును, అనవాప్తం = (ఇదివఱకు) పొందఁబడనిదై, అవాప్తవ్యం=(ఇఁక మీఁదఁ బొందఁదగినది కిఞ్చన=ఒకటియు, న = లేదు, (తథాపి) చ=అయినను, కర్మణి=కర్మమునందు, వర్త ఏవ=ప్రవర్తించుచునే యున్నాను.

65

తా. అర్జునా! అవాప్తసమస్తకాముఁడును సర్వజ్ఞుఁడును సత్యసంకల్పుఁడును సర్వేశ్వరుఁడును నై మూఁడులోకములందును దేవమనుష్యాది రూపముల స్వేచ్ఛతో వర్తించుచున్నవాఁడ నగునాకు కర్తవ్యంబైన దేమియు లేదు. పూర్వము నాకు లభింపక యిఁక

---

*జ్ఞానయోగముచేత ముక్తుఁడైనవానికి ఈలోకము సంగ్రహీతమైన నేమి? కాకున్న నేమి? యనరాదు. అట్టివానినిగూడ లోకనాశజనితపాపము కర్మయోగము నుండియే కాక జ్ఞానయోగమునుండియు భ్రష్టుఁ డగునట్లు చేయునని గ్రాహ్యము.

కర్మము చేసి ముందర లభింపవలసిన దేదియు లేదు. అట్లయినను లోకసంగ్రహార్థము కర్మమునందుఁ బ్రవర్తించుచునే యున్నవాఁడను. 66

67
శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥ 23

టీ. పార్థ=అర్జునా, అహం=నేను, జాతు=ఒకప్పుడును, అతన్ద్రితః=ప్రాలుమాలిక లేనివాఁడనై, కర్మణి=కర్మమునందు, నవర్తేయం యది=ప్రవర్తింపకపోదునేని, మనుష్యాః=(కర్మాధికారులగు) మనుష్యులు, సర్వశః=అన్నిప్రకారములుగా, మమ=నాయొక్క, వర్త్మ=(ప్రవృత్తి) మార్గమును, అనువర్తన్తేహి=అనుసరింతురు గదా.

తా. అర్జునా, సర్వేశ్వరుఁడును సత్యసంకల్పుఁడు నగు నేను 68 సంకల్పమాత్రమున జగదుదయాదిలీలఁ జేయువాఁడను కర్మవశమునఁ గాక నాయిచ్ఛచేతనే జగదుపకారార్థము మనుష్యుఁడుగా నవతరించినవాఁడ నైనను, ఇట్టి నేను కూడ మనుష్యులలో శిష్టజనాగ్రేసరుఁ డగువసుదేవునిగృహమునఁ బుట్టి *ఆపుట్టినకులమునకుఁ దగిన

* ఈశ్వరుఁడు కర్మవశ్యుఁడు గాఁడు. కాఁబట్టి కర్మనివృత్తికై కార్యమేదియుఁ జేయవలసినది లేదు. అయినను కేవలము తనయిచ్ఛచేతఁ గార్యములు చేయఁబూనినను అందులకును దగిన వర్ణాశ్రమములుగాని సామాన్యములగు ధర్మములాచరించుటకు వలయు మనుష్యత్వాదికముగాని యుండవలయును. అతనికి వాస్తవముగా వర్ణాదులు లేనే లేవు. కనుక కేవలమిచ్ఛచేత కర్మములు చేయఁబూనుకొన్నను దేనినిబట్టి చేయు నన్నచో, ఈశ్వరునకు వాస్తవముగా వర్ణాశ్రమములు లేవు గాని యాయావర్ణాదులకు ఆయాకర్మము ఉచితము లని చూపుటకై తన యప్రాకృత దివ్యవిగ్రహమునే ఆయాజాతీయరూపముగా పరిణమింపఁ జేసి ఆయావర్ణాదుల కుచితకార్యముల నాచరించుచున్నాఁడు. పురుషులు చూచి అతనిని ఆయాజాతివానినిగా నెంచి యతఁ డనుష్ఠించినవానిని తాము ను అనువర్తించి యుజ్జీవింతురు. కావుననే 'ఆపుట్టినకులమునకుఁ దగినకర్మము' అనబడినది.

కర్మమునందు ఎప్పుడును ప్రాలుమాలిక లేక ప్రవర్తించువాఁడను గానైతినేని, శిష్టజనాగ్రేసరుఁ డగువసుదేవునికి పుత్రుఁడైన నా యొక్క మార్గమే అపూర్ణజ్ఞానులైన శిష్టజనులు సర్వవిధముల ధర్మ మని తలఁచి దానిని అనుసరింతురు. ఇట్లు వారును నన్నుఁ జూచి, తాము చేయవలసినదానిని జేయక, యట్లు చేయనందునఁ బ్రత్య వాయము నొంది ఆత్మప్రాప్తి నొందక నరకమును బొందువా రగుదురు.

శ్లో॥ ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్ ।
71
సఙ్కరస్య చ కర్తా స్యాముపహన్యా మిమాః ప్రజాః॥ 24

టీ. అహం=నేను, కర్మ=కర్మమును, న కుర్యాంచేత్=చేయ నైతినేని, ఇమే లోకాః=యీ శిష్టజనులు, ఉత్సీదేయుః=చెడుదురు, సఙ్కరస్య చ=వర్ణసంకరమునకును, కర్తా=కర్తనుగా, స్యాం=అగు దును, ఇమాః ప్రజాః=ఈప్రజలను, ఉపహన్యామ్=చెఱిచినవాఁడ నౌదును.

తా. నేను కులోచితకర్మము సేయనైతినేని, శిష్టజనులెల్ల నన్నుఁ జూచి నాయాచారమునే పట్టి యదియే ధర్మమని నిశ్చయించు కొన్నవారై తామును చేయవలసిన కర్మము నాచరింపకయే నాశము నొందుదురు. శాస్త్రీయాచారములను పాలింపనందున శిష్టకులముల కన్నిటికిని సంకరము కలిగించుటకు నేనే కర్త నగుదును. దానివల ననే యీప్రజలను నేనే పిడపఁగూడ కర్మముల కనర్హు లగునట్లు చెఱుచువాఁడ నగుదును (ఇట్లే నీవుగూడ శిష్టజనాగ్రణి యగు
69 70
పాండురాజునకు పుత్రుడును ధర్మరాజునకుఁ దమ్ముఁడు నగునర్జునుఁడై విశిష్టుఁడవై జ్ఞాననిష్ఠను బూనితివేని పూర్ణజ్ఞానము లేని ముముక్షువు లగు శిష్టజనులు నీయాచారము ననుసరించువారై తమకు అధికరింపఁ

దగిన దిది యని తెలియుటచే కర్మనిష్ఠ నాచరింపక నశింతురు కావున విశిష్టుఁ డగు విద్వాంసుఁడును లోకరక్షణకొఱకు కర్మమే చేయ దగిన దని భావము.)

72 73
శ్లో॥ *సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।
74
కుర్యాద్విద్వాం స్తథాஉసక్తశ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్॥ 25

టీ. హే భారత = అర్జునా, అవిద్వాంసః = సంపూర్ణమైన ఆత్మజ్ఞానము లేనివారు గనుకనే, కర్మణి = కర్మమునందు, సక్తాః = విడువరాని సంబంధము గలవారు, యథా = ఏప్రకారముగా, కుర్వన్తి = కర్మముల నాచరింతురో, తథా = అట్లే, విద్వాన్ = ఆత్మజ్ఞానము గలవాఁడును, అసక్తః = కర్మమునందు సంగము లేనివాఁడై, లోకసఙ్గ్రహం = లోకసంరక్షణమును (సం = ఒక్కటిగాఁ జేసి, గ్రహం = స్వీకరించుట), చికీర్షుః = చేయఁగోరుచున్నవాఁడై, కుర్యాత్ = కర్మయోగమునే చేయవలెను.

తా. అర్జునా, ఆత్మవిషయమైన సంపూర్ణజ్ఞానము లేక కర్మమునందే విడువరాని సంబంధము కలిగియుండువారు (అనఁగా ఆత్మవిషయమై పూర్ణజ్ఞానము లేమిచే ఆత్మాభ్యాసరూపమైన జ్ఞానయోగ

---

* 'అవిద్వాంసః' 'కర్మణిసక్తాః' అను రెండు పదములనుబట్టి 'తెలిసినవారు కానందున సాంసారికకర్మములం దాసక్తులైనవారు' అని సాంసారిక కర్మపరులను గ్రహింపరాదు. అట్లు గ్రహించినచో 'కుర్యాద్విద్వాంస్తథాసక్తః' అనుటకు 'విద్వాంసుఁ డైనవాఁడును వారివలె కర్మయోగమునుగూడ విడిచి సాంసారికకర్మములనే చేయవలయు నని యర్థ మగును. కనుక అవిద్వాంసుఁ డనఁగా ఆత్మవిషయమును బూర్ణముగాఁ దెలియనివాఁడు. అనఁగా జ్ఞానయోగమం దధికారి గానివాఁడు. 'కర్మణిసక్తాః' అనుట కర్మయోగమం దధికారముగలవారు అని తెలియునది. ఇట్లే మీఁద 'అజ్ఞానాం కర్మసఙ్గినామ్' అనుటకును 'ఆత్మవిషయమై పూర్ణజ్ఞానము లేని కర్మయోగాధికారులు' అని అర్థము తెలియునది.

మం దధికారము లేనివారై కర్మయోగమునందు మాత్ర మధికారము గలవారు) ఆత్మదర్శనముకొఱకు కర్మయోగమునే చేయునట్లుగా, విశిష్టుఁ డని పేర్కొనఁబడినవాఁడు ఆత్మవిషయమును చక్కఁగా నెఱింగి యుండుటంబట్టి తాను కర్మమునం దాసక్తి లేక జ్ఞానయోగాధికారమునకు దగినవాఁడై యుండినను, లోకరక్షకొఱకు (అనఁగా తన యాచారమును జూచి శిష్టజనులు ధర్మమిది యని నిశ్చయించుకొనుటకొఱకు) కర్మయోగమునే చేయవలయును. (అవిద్వాంసుఁడు సంగము కలిగియు విద్వాంసుఁడు సంగము లేకయు కర్మమును జేయఁదగు నని భావము.)

శ్లో॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినాం ।
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్॥ 26

టీ. విద్వాన్=ఆత్మజ్ఞానము గలవాఁడు, అజ్ఞానాం=ఆత్మవిషయమై పూర్ణజ్ఞానము లేని కర్మసఙ్గినాం = కర్మయోగాధికారు లగు ముముక్షువులకు, బుద్ధిభేదం=కర్మమునం దాసక్తి గలబుద్ధికి మాఱుపాటును, న జనయేత్=పుట్టింపఁగూడదు, యుక్తః=కర్మయోగమే ఆత్మదర్శనమునకు సాధనమగు నను బుద్ధితో కూడినవాఁడై, సర్వకర్మాణి=సమస్తకర్మములను, సమాచరన్ = చక్కఁగా నాచరించుచున్నవాఁడై, జోషయేత్=ప్రీతిని గలిగింపవలయును.

తా. ఆత్మజ్ఞాన మంతగా లేమిచే జ్ఞానయోగము నవలంబింప శక్తి లేనివారు మోక్షమును పొందఁగోరి *అనాదికర్మవాసనవలన కర్మమే తమకు నియమితమై యుండుటచే కర్మయోగమునకే యధి

* కర్మవాసన యనఁగా ఉత్తరోత్తర పుణ్యపాపారంభకమైన పూర్వపూర్వపుణ్యపాపాంశవిశేషము. లేక, పూర్వపూర్వశరీర ప్రేరణానుభవవిశేషజనితమై ఉత్తరోత్తరశరీర ప్రేరణసమర్థమగు స్మృతికి హేతువై యుండు సంస్కారవిశేషము. మద్దెల, పిల్లనగ్రోవి మొదలగు వాద్యములను వాయించు సంస్కారమువలెనే.

కారు లై యుందురు. ఆత్మజ్ఞానము గలవాఁడు జ్ఞానయోగము నవలంబించెనేని వానిని జూచి అజ్ఞులగునట్టివారికి ఆత్మావలోకనమునకు కర్మయోగముకంటె మఱియొక సాధనము కలదనెడి బుద్ధిభేదము జనించును. కాఁబట్టి ఆశిష్టుఁడు జ్ఞానయోగాధికారియైనను తనవలన వారికట్టిబుద్ధిభేదము కలుగకుండుటకై జ్ఞానయోగాపేక్ష లేక కర్మయోగమే ఆత్మదర్శనమునకు సాధన మగుననెడిబుద్ధితోఁ గూడినవాఁడై, కర్మమునే చేయుచు వారికిని ఆకర్మలందెల్ల ప్రీతిఁ బుట్టింపవలయును.

అవ. కర్మయోగమును విద్వాంసుఁ డనుష్ఠించువిధమునకును అవిద్వాంసుఁ డనుష్ఠించువిధమునకును గల భేదమును తెలుపుచు కర్మయోగమునకుఁ గావలసినదైన ఆత్మయొక్క అకర్తృత్వానుసంధానప్రకారము నుపదేశించుచున్నాఁడు,

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
74 అహఙ్కారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే॥ 27

టీ. ప్రకృతేః = ప్రకృతియొక్క - ప్రకృతికి సంబంధించిన, గుణైః=సత్త్వరజస్తమోగుణములచేత, సర్వశః= అనేకవిధములుగా, క్రియమాణాని = చేయఁబడుచున్న, కర్మాణి (ప్రతి) = కర్మములను గూర్చి, అహఙ్కారవిమూఢాత్మా=అహంకారముచేత తెలియని ఆత్మస్వరూపము గలవాఁడు, అహం= నేను, కర్తా=కర్తను, ఇతి = అని, మన్యతే=తలఁచుచున్నాఁడు-భ్రమించుచున్నాఁడు.

తా. దేహాత్మాభిమానముచేత ఆత్మస్వరూపము నెఱుఁగనివాఁడు ప్రకృతిసంబంధము లగు సత్త్వరజస్తమోగుణములచే తమ తమ కనురూపముగా నయ్యైవిధముల నాచరింపఁబడు కర్మములకు తానే కర్తయని తలఁచును. (అహంకార మనఁగా అనహమర్థమైన

ప్రకృతియందు అహమభిమానము-తానుగానట్టి దేహమే తానని తప్పుగా గ్రహించుట-అనగా దేహాత్మాభిమానము.)

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే॥ 28

టీ. హే మహాబాహో = అర్జునా, గుణకర్మవిభాగయోః = సత్త్వాదిగుణముల విభాగమందును వానిచేఁ జేయఁబడు కర్మముల విభాగమందును, తత్త్వవిత్ తు = తత్త్వము నెఱిఁగినవాఁడో, గుణాః=సత్త్వాదిగుణములు, గుణేషు = తమతమ కార్యములయందు, వర్తన్తే=ప్రవర్తించుచున్నవి, ఇతి—అని, మత్వా=తలఁచి, న సజ్జతే= సంగము కలిగియుండఁడు-తాను కర్తయని తలంపఁడు.

తా. సత్త్వరజస్తమోగుణములయొక్కయు వానిచేఁ జేయఁబడు కర్మములయొక్కయు విభాగములస్వరూపము నెఱిఁగినవాఁడు, సత్త్వాదిగుణములు తమతమ కార్యములయందుఁ బ్రవర్తించుచున్నవి యని యెంచి గుణకర్మములందు కర్త తానని తలంపఁడు.

శ్లో॥ ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥ 29

టీ. ప్రకృతేః=ప్రకృతియొక్క, గుణసమ్మూఢాః = సత్త్వాది గుణములచే మోహముఁ జెందినవారు, గుణకర్మసు = గుణముల యొక్క కర్మములయందు-గుణములచేఁ జేయఁబడు క్రియలందే, సజ్జన్తే=ఆసక్తులగుచున్నారు, అకృత్స్నవిదః=సంపూర్ణమైన ఆత్మ జ్ఞానములేని, తాన్=అట్టి,మన్దాన్=మందబుద్ధులను, కృత్స్నవిత్= పూర్ణజ్ఞానము గలవాఁడు, న విచాలయేత్=చలింపఁజేయఁగూడదు.

తా. సంపూర్ణజ్ఞానము లేనివారు ఆత్మదర్శనమునకై పూనియు ప్రకృతిగుణములవలన ఆత్మస్వరూపమును కలరీతిని నెఱుఁగనివారై

కర్మములందే ఆసక్తు లగుచున్నారు (కాని ప్రకృతికంటె విలక్షణ
మైయుండెడి ఆత్మస్వరూపమునందు ఆసక్తులు కారు.) కావున వారు
జ్ఞానయోగమునకు తగక కర్మయోగమునందే అధికారము గలవారై
యుందురు. ఇట్టిమందబుద్ధు లయిన ఆ యసంపూర్ణజ్ఞానులను, సం
పూర్ణజ్ఞానము గలవాఁడు తాను జ్ఞానయోగ మవలంబించుటచేత
బుద్ధిచాంచల్యము నొందింపఁదగదు. వారు మందులు గాన తమంతట
తమయాచారమును నిర్ణయించుకొను పాటవము లేక శ్రేష్ఠజనుల
యాచారములనే యనువర్తింతురు. కాన కర్మయోగమును విడిచిన
తన్నుఁ జూచి కర్మయోగమునుండి బుద్ధిచలించినవా రగుదురు.
కావున శ్రేష్ఠుఁ డగువాఁడు జ్ఞానయోగాధికారి యయ్యును తాను
గూడ కర్మయోగమునందే నిలిచి, ఆత్మస్వరూపజ్ఞానముచే అకర్తృ
త్వమును అనుసంధించుచు, వేఱొక్క సాహాయ్య మపేక్షింపక కర్మ
యోగమే ఆత్మదర్శనమునకు సాధన మగు నని తెలుపుచు, దాని
యందు వారికి ప్రీతిఁ బుట్టింపవలయునని యర్థము. (జ్ఞానయోగాధి
కారి కర్మయోగము నవలంబించుట నికృష్టాధికారమును పరిగ్రహిం
చుట యని శంకింపరాదు.) జ్ఞానయోగాధికారికిఁగూడ జ్ఞానయోగ
మునకంటె ఈకర్మయోగమే మేలైన దని పూర్వమే చెప్పఁబడినది.
కాఁబట్టి విశిష్టుఁడైనవాఁడు, లోకసంగ్రహముకొఱకు దీనినే చేయ
వలయును. ప్రకృతిబంధవిముక్తమైన శుద్ధాత్మయొక్క స్వభావమును
ఇట్టి దని తెలిసికొని, దానంజేసి, గుణములే కార్యములను జేయు నని
తెలియుటవలన వానియందే కర్తృత్వము నారోపించి కర్మము నను
ష్ఠింపవలసినప్రకారము చెప్పఁబడినది. గుణములందు కర్తృత్వాను
సంధాన మనఁగా 'ఆత్మకు *ఈ కర్తృత్వము స్వరూపప్రయుక్తము

---

* 'ఈ కర్తృత్వము' అనఁగా పుణ్యపాపాదికర్తృత్వ మని యర్థము. పురుషు
నికి ముక్తావస్థయందును స్వాభావికమైన కర్తృత్వము గలదు. కాని అది గుణసంప
ర్కమూలఁ గలిగిన కర్తృత్వముగాదు. ఇదియో గుణసంపర్కమూలమైన పుణ్యపాపా

77

గాదు; మఱి గుణసంపర్కమువలనఁ గలిగినది' అని యుక్తాయుక్త వివేకముచే గుణకృత మైనదిగా అనుసంధించుట.

అవ. ఆత్మలకి కర్తృత్వము గుణముచే నైనది గదా. అయినను ఆత్మలు భగవంతునికి శరీరమై యతనిచే నియమింపఁబడునవి యైయుండుట వానిస్వరూపము. కావున అవి గుణములకంటె భగవంతునికే ముఖ్యముగా పరతంత్రము లైయున్నవి వాని యిట్టి స్వరూపము నిరూపించుటవలన వానికి గుణములచే కలిగినకర్తృత్వము సైతము †పురుషోత్తముఁడును సర్వాత్మభూతుఁడు నగు భగవంతుని యందే ఆరోపించి కర్మములు చేయఁదగిన వని తెలుపుచున్నాఁడు.

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥ 30

టీ. సర్వాణి=సమస్తములగు, కర్మాణి=కర్మములను, మయి=నాయందు, అధ్యాత్మచేతసా = ఆత్మయందు నెలకొన్న మనస్సుచేత, సన్న్యస్య=సమర్పించి, నిరాశీః=వానిఫలములం దాశ లేనివాఁడవును, కావుననే, నిర్మమః=మమకారము లేనివాఁడవును, భూత్వా = అయి,

---

దులవలనఁ గలిగినకర్తృత్వ మని తెలియునది. మీఁదిశ్లోకమున కర్తృత్వము భగవంతునియం దారోపించుటను జెప్పఁగా నిట గుణములం దారోపించుటను జెప్ప నేల యన్నచో, గుణములం దారోపించునంతమాత్రముచేతను దేహాత్మవివేకాదులు సిద్ధించుటకొఱకని తెలియునది.

† భగవంతుఁ డనుటచే తవనియంతృత్వము ఉపాస్యత్వము ఫలప్రదత్వము మొదలైనవాని కుపయుక్త మైన కల్యాణగుణగణము గలవాఁ డనియు, హేయప్రత్యనీకుఁ డనియును, పురుషోత్తముఁ డనుటచే చిదచిత్తులను నియమించుకొఱకు వానిలోనఁ బ్రవేశించుట మొదలైన వానివలన హేయస్పర్శప్రసక్తియే లేని విలక్షణుఁ డనియు, సర్వాత్మభూతుఁ డనుటచే త్రిగుణాత్మకమైన యచిద్ద్రవ్యమునకుఁ గూడ తానే నియంత యనియుఁ దెలియుచున్నది.

విగతజ్వరః = సంతాపము లేనివాఁడగుచు, యుధ్యస్వ = యుద్ధము సేయుము.

తా. సర్వేశ్వరుఁడును సర్వభూతముల కంతరాత్మ యైన వైనవాఁడు నగునాయందు సర్వకర్మములను అధ్యాత్మచేతముతో సన్న్యసించి నిరాశియు నిర్మముఁడును విగతజ్వరుఁడును నై యుద్ధాదు లైనవిహితకర్మముల నన్నిటిని గావింపుము.

అధ్యాత్మచేత మనఁగా ఆత్మయందలిచేతస్సు; అనఁగా ఆత్మ స్వరూపవిషయమై శ్రుతిశతములచే సిద్ధించినజ్ఞానము. ఆశ్రుత్యాదు లెవ్వి యన 'అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా...అన్తః ప్రవిష్టం కర్తారమేతం యజుషి-ఆరణే-౩-౧౧-౨౧-౨౩) 'య ఆత్మని తిష్ఠ న్నాత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి స త ఆత్మాన్తర్యా మ్యమృతః (బృ-౫.౭-౨౩) ఇత్యాదిశ్రుతులు, ఈయాత్మ పరమపురుషునిచేతనే ప్రవృత్తి గలదై యతనికి శరీరమై యుండు ననియు పరమపురుషుఁడే దీనిని ప్రవర్తింపఁజేయువాఁ డనియు చెప్పుచున్నవి. 'ప్రశాసి తారం సర్వేషామ్' (మను-౧౨-అ-౧౨౨) ఇత్యాది స్మృతులును జెప్పు చున్నవి. 'సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ' (గీత-౧౫-౧౫) 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి। భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా' (గీత-౧౮-౬౧) అని యిందును మీఁదఁ జెప్పఁబడుచున్నది. కాఁబట్టి ఆత్మలు నాకు శరీర మై నే నెట్లు ప్రవర్తింపఁజేయుదునో యట్లు ప్రవ ర్తించుట స్వరూపముగాఁ గలవి యని వాని యిట్టి *స్వరూపమును

---

* 'మయి సర్వాణి కర్మాణి సన్న్యస్య అధ్యాత్మచేతసా' అని అధ్యాత్మ చేతస్సుతో, (అనగా ఆత్మవిషయమైన జ్ఞానముతో), భగవంతునియందు సర్వకర్మ ముల కర్తృత్వము సన్యసించుట చెప్పబడినదిగదా. ఆత్మవిషయజ్ఞానముచేత ర్తృ

అనుసంధించుచు, దానం జేసి యిట్టిస్వరూపముగలవి తమంతట కర్తలు కాఁజాలవు గనుక కర్మము లన్నియు నాచేతనే చేయఁబడుచున్నవని తలఁచి, వానినెల్ల పరమపురుషుఁడ నగునాయందు సన్న్యసించి, అవి కేవలము న న్నారాధించుటలుగా నెంచి, వానిఫలములందు ఆశ వదలి, కావుననే కర్మములందు మమకారము విడిచినవాఁడవై, జ్వరమువాని, యుద్ధాదికమును జేయుము. అనగా *'పరమపురుషుఁ

---

త్వము సన్న్యసించుట యెట్లు సిద్ధించు నన్నచో శరీరమునకు ఆత్మ శరీరియై తాను నడుపునట్లే శరీరము ప్రవర్తించునుగాని, అది తనంతట కొంతేసూత్రమును బ్రవర్తింపఁ జాలదు అట్లే, ఆత్మకు శరీరి యగు భగవంతుఁడు తనశరీరమైన ఆత్మను నడపునట్లు అది ప్రవర్తించునే కాని తనంతటఁ గొంచెమేనియుఁ బ్రవర్తింపఁజాలదు. ఇట్లు భగవంతునికి శరీరమై కావున భగవంతునిచేతనే ప్రవృత్తి గలిగియుండుట ఆత్మకు స్వరూపమగును. ఆత్మకు గలయిట్టి స్వరూపమును దెలిసినయెడల దానికిఁ గల ప్రవృత్తియంతయు తనంతటఁ గలిగినదిగాదనియు తచ్ఛరీరి యైనభగవంతునిచేతనే కలుగున దనియుఁ దెలియవచ్చును. అనఁగా నది చేయు కార్యములకెల్ల భగవంతుఁడే కర్తయని తేటపడును. కాన ఆత్మస్వరూపవిషయమైన జ్ఞానము, ఆత్మచేయు కర్మములన్నింటికర్తృత్వమును భగవంతునియందే సన్న్యసించుపట్లు చేయునని గ్రాహ్యము. మఱియు యీశ్లోకమునఁగల 'సన్న్యస్య' 'నిరాశీః' 'నిర్మమః' అను మూఁడుపదములును కర్తృత్వత్యాగము, ఫలత్యాగము, స్వకీయతాసంగ త్యాగము, అను మూఁటిని వరుసగా గుఱించినవనియు, వానిలో పూర్వపూర్వమైనది ఉత్తరోత్తర మైనదానికి హేతువనియుఁ దెలియునది. స్వకీయతాసంగత్యాగమనఁగా ఒకవస్తువును తనదిగా తలచి యందు కలిగియుండుసంగమును త్యజించుట యని యర్థము

* ఈశ్వరునియందు జీవునికర్తృత్వము సన్న్యసింపఁబడినయెడల జీవుఁడగు నర్జునునిఁజూచి 'యుధ్యస్వ' అని కర్తగా నిర్దేశించుటయెట్లు? వీఁడు 'నిరాశీః' అన్నట్లు ఆశలేనివాఁడైనచో, కర్మము పరమపురుషారాధన మైననుగూడ, అం దాశలేక ఎట్లు ప్రవర్తించును? మఱియు వీఁడు 'నిర్మమః' అన్నట్లు నాదికాదు, అని మమతలేనివాఁడగునేని, 'ఈకర్మము నాది' యని మమతతో కర్మమును జేయుట యెట్లు? తనవ్యాపారమునే తాను అనుసంధింపనియెడ త్యాగము సేయువ్యాపారమును సైతము తలంపఁడు? ఇట్లు త్యాగమేతలఁపకుండఁగా 'విగతజ్వరః' అని జ్వరమును త్యజించుటెట్లు? అని శంకరాగా 'పరమపురుషుఁడు...కర్మయోగమునే చేయుమని యర్థము' అనువాక్యముచే పరిహారము చెప్పఁబడినది. అనఁగా పరమ

డగు సర్వేశ్వరుఁడు సర్వస్వామి గనుక తనకు శేషమై యుండుటచే తనది యగు ఆత్మను కర్తగాఁ గొని, తనయాత్మవి యగుటచే తనవియే యగు హవిస్సు మొదలైన యుపకరణములచేత, తన్నారాధించు ప్రయోజనమునకే, తానే, తనకర్మములను చేయించుచున్నాఁడు. నా దేమియు లేదు' అని యనుసంధించి యిట్లు కర్మములందు మమత మానినవాఁడవై 'ప్రాచీనములై అనాదికాలప్రవృత్తములైన యనంతపాపసంచయములచేత నే నెట్లగుదునో' యనియెడి లోపలి పరితాపమును వీడి, పరమపురుషుఁడే కర్మములచేత నారాధితుఁడై బంధమునుండి విడిచిపుచ్చు నని సుఖముగా కర్మయోగమునే చేయుమని యర్థము, ఈశ్వరునియొక్క సర్వేశ్వరత్వమును సర్వశేషిత్వ

---

పురుషుఁడు నేయించుకర్తయై జీవునిని చేయుకర్తగాఁగొనుటవలన 'యుధ్యస్వ' అనుట యొప్పుచున్నది. 'నిరాశీః' అనగా కర్మముయొక్క ఫలమునందుమాత్రమే ఆశలేని వాఁడను గాని కర్మములయొక్క స్వరూపమునందుఁ గాదు. కర్మస్వరూపమునందుఁ గాని యాశ యుండనేల: యన్నచో, అదిభగవదారాధనరూపమె కావున, దానిచే భగవంతు నారాధించుప్రయోజనము సిద్ధించును. భగవదారాధనమందుఁగాని యాశ యేల? యన్నచో, భగవంతుఁడు శేషి, జీవుఁడు శేషభూతుఁడు. శేషభూతునికి, శేషికతిశయము గూర్చుటయే ప్రయోజనము. ఇదియే వేదార్థసంగ్రహమున 'పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయత్వమేవ యస్య స్వరూపం సశేషః; పరశ్శేషీ' 'భగవంతుని కతిశయముఁ గూర్పు కోరికచేతనే ఉపాదేయమై యుండుట యెవని స్వరూపమో వాఁడు శేషభూతుఁడు. పరుఁడు శేషి' అని యున్నది. కాబట్టి శేషభూతుఁడగుజీవునకు శేషికారాధనరూపమైన కర్మముయొక్క స్వరూపమునందు ఆశ లేకుండినచో స్వస్వరూపమునకే భంగమగునుగాన వానికి కర్మస్వరూపమం దాశ యావశ్యకము. నిర్మముఁ డనఁగా 'ఈశ్వరుఁడు తనకర్మములను తానే చేయించుకొనుచున్నాఁడు' అని కర్మములందు 'నాది కాదు' అనునిర్మమతను అనుసంధించువాఁడని యర్థము. ఇట, నిర్మమత యనఁగా 'కర్మము నాదిగాదు' అని యనుసంధించుటే కాని 'కర్మము నాది గాదు' అని చేయక యూరకుండుట గాదు. భగవంతుఁడు సర్వేశ్వరుఁడుగాన తానిష్టపడినదెల్ల తానే చేసికొనుటకు శక్తుఁ డయ్యును, తనకు శేషభూతులైనజీవులకు శాస్త్రవశ్యత్వము తత్ఫలభోగము మొదలైనవి సిద్ధించుకొఱకు వారిని కర్తలుగాఁ గావించుచున్నాఁ డని భావము, ఇట్లు 'యుధ్యస్వ' యనుటయు 'నిరాశీః' 'నిర్మమః' అనుటయు నొప్పు నని తెలియునది.

ము 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దైవతానాం పరమంచ దైవతం' (శ్వే. ఉ-౬-అ-౭ వా), 'పతిం విశ్వస్య' (తై. నా. ౧౧-౩-౨౦౮) 'పతిం పతీనామ్' (శ్వే. ఉ.౬-అ-౭-వా) ఇత్యాది శ్రుతిసిద్ధము గదా. ఈశ్వరత్వ మనఁగా నియంతృత్వము. శేషిత్వ మనఁగా పతిత్వము. 78

అవ. ఇదియే సాక్షాదుపనిషత్సారభూత మైనయర్థ మని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ *యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః॥ 31

---

* ఇట 'యే...నిత్యమనుతిష్ఠన్తి శ్రద్ధావన్తః' 'అనసూయన్తః' అనుమూఁడును ఏకవాక్యగతము లగుటచే మూఁటిచేతను ఒకతెగవారే చెప్పఁబడఁగూడదా యని శంక రాఁగా 'తేఽపి' అనుచోఁగల అపిశబ్దము 'నిత్యమనుతిష్ఠన్తి' అను నిత్యానుష్ఠాతలను వేఱుగను, శ్రద్ధావంతులు అనసూయువులు అనునిరుతెగలను వేఱుగను, జేయుచున్నది గాన నందఱు నొకతెగ గారని భావము. ఎట్లనఁగా 'తేఽపి' 'వారుగూడ' అనుటచే అపిశబ్దమువలన సముచ్చయముగాని అపకర్షముగాని తెలియుచున్నది. అనఁగా 'నిత్యానుష్ఠాతలేకాక యితరులైన యధికారులుగూడ' అని నిత్యానుష్ఠాతలతో ఇతరాధికారులను సముచ్చయము చేయవచ్చును. లేక, 'పూర్వోక్తులైన జ్ఞానయోగులేకాక నిత్యానుష్ఠాతలుగూడ' నని జ్ఞానయోగులకంటె నిత్యానుష్ఠాతలగుకర్మయోగులకు అపకర్షము (తక్కువపాటును) సూచింపవచ్చును. మొదటిపక్షమునఁ జెప్పబడిన యితరాధికారులు, ఇది కర్మయోగప్రకరణము గాన, జ్ఞానయోగులు గారు. రెండవపక్షమున కర్మయోగులకుఁ దక్కువ పాటుచెప్పుట మిక్కిలి యనుచితము. మఱియు నిత్యానుష్ఠాతలు అశ్రద్ధాళువులుగను అసూయువులుగను నుండరు; శ్రద్ధావంతులుగను అనసూయువులుగను యుందురు. కాన వారికి 'శ్రద్ధావన్తః' 'అనసూయన్తః' అని విశేషణములు పెట్టుట వ్యర్థము. కనుక నీవిశేషణములు వేఱుతెగవారికే తప్పక యన్వయింపవలయును. కాన 'అపి' శబ్దము, సముచ్చయము చేయుప్రథమపక్షమున మూఁడు తెగలవారిని సముచ్చయము చేయవలయును; అపకర్ష పరమైన రెండవపక్షమునందు మొదటితెగవారికన్నను తక్కువవారినేని సూచింపవలయును. కనుక నిత్యానుష్ఠాతలు వేఱు అనియు తక్కిన యిరుదెగలవారును వేఱనియు గ్రాహ్యము. అయినను అనుష్ఠాతలకును, అనుష్ఠానములేక కేవలము శ్రద్ధయు యనసూయయుమాత్రముగలవారికిని సమాన

టీ. యేమానవాః = ఏమనుష్యులు, మే = నాయొక్క, ఇదం మతం=ఈయభిప్రాయమును, నిత్యం=ఎల్లప్పుడు, అనుతిష్ఠన్తి = ఆచరించుచున్నారో, శ్రద్ధావన్తః = ఆస్తిక్యబుద్ధి కలవారై యుందురో, అనసూయన్తః = అసూయ లేక యుందురో, తే అపి = వారుగూడ, కర్మభిః=సంసార హేతువు లగుకర్మములనుండి, ముచ్యన్తే = విడువఁబడుచున్నారు.

తా. శాస్త్రాధికారులైనయేమానవులు నాచే చెప్పఁబడిన యీమతమునే శాస్త్రార్థ మని నిశ్చయించి యట్లే ఆచరించుచున్నారో ఎవరు ఆచరింపకపోయినను ఈశాస్త్రార్థమునందు శ్రద్ధాళువులై యుందురో ఎవరు శ్రద్ధలేకపోయినను 'శాస్త్రార్థ మిట్లుండ నేరదు' అని మహాగుణమైన యీ శాస్త్రార్థమునందు అసూయచేత తప్పులు చెప్పకుందురో, వారందఱుఁగూడ బంధహేతువులై అనాదికాలప్రవృత్తము లగుసమస్తకర్మములనుండి విముక్తులగుదురు. (తేఽపికర్మభిః' అని యిట అపి శబ్దముచే వీరిని వేఱుచేయుటయైనది. ఈశాస్త్రార్థమునందు శ్రద్ధగలిగియు అసూయ లేకయు నుండువారు ఇప్పుడు దీని ననుష్ఠింపకపోయినను శ్రద్ధకలిమిచేతను అసూయలేమిచేతను పాపములు క్షీణించి త్వరలో నీశాస్త్రార్థమునే యనుష్ఠించి బంధవిముక్తిఁ బొందుదు రనిభావము.)

అవ. భగవంతుని కభిమతమైన యీ యుపనిషదర్థమును అనుష్ఠింపనివారికిని దీనియెడల శ్రద్ధ లేనివారికిని అసూయపడువారికిని కలుగుదోషమును జెప్పుచున్నాఁడు.

---

ఫలము చెప్పినయెడల, అనుష్ఠానము విధించుశాస్త్రము వ్యర్థమగునే యని శంకరాఁగా, 'ఇప్పుడు దీనిని అనుష్ఠింపకపోయినను...' ఇత్యాదిపరిహారము చెప్పఁబడినది. శ్రద్ధయు అనసూయయు 'ధర్మశ్శ్రుతోవా దృష్టోవా స్మృతోవా కథితోఽపివా, అనుమోదితోవా రాజేన్ద్ర పునాతి పురుషం సదా' అని భారతమున పాపమును బోఁగొట్టునట్లు చెప్పఁబడియున్నది.

శ్లో॥ యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్।
*సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టా నచేతసః॥ 32

టీ. యేతు=ఎవ్వరైతే, మే=నాయొక్క ఏతత్ మతం = ఈ యభిప్రాయమును, అభ్యసూయన్తః = ద్వేషించువారలై, నానుతిష్ఠన్తి =ఆచరింపరో, తాన్=వారిని, సర్వజ్ఞానవిమూఢాన్ = అన్నిజ్ఞానములయందు మిక్కిలి మూఢులనుగాను, నష్టాన్ = చెడినవారినిగాను, అచేతసః=చేతస్సు లేనివారినిగాను-(చేతస్సు=మనస్సు), విద్ధి= తెలిసికొనుము.

తా. ఎవరు 'ఈసమస్తాత్మలును నాశరీరమై నన్నే యాధారముగాఁ గలవై నాకు శేషమై నాచేతనే నడపఁబడునవై యున్నవి' అను నామతమును అనుసంధింపక సమస్తకర్మముల నాచరింతురో, ఎవరికి దానియందు శ్రద్ధలేదో, ఎవరు దానియెడల నసూయపడుచుందురో వారు వస్తుయాథాత్మ్యనిశ్చయములేక చెడి విపరీతజ్ఞానులై అన్నిట విశేషించి మూఢులైనవా రని యెఱుంగుము.

అవ. ఇట్లు ప్రకృతిసంసర్గము గల జీవునకు కర్తృత్వము గుణోద్రేకమువలనఁ గలుగుచున్నదనియు ఆకర్తృత్వము పరమపురుషాధీన మైనదనియు అనుసంధానము చేయుచు, కర్మయోగమునకుఁ దగినవాఁడుగాని, జ్ఞానయోగమునకుఁ దగిన వాఁడుగాని, కర్మయోగము సుకరమై అప్రమాదమై ఆత్మజ్ఞానము లోపలఁగలదై నిరపేక్షసాధన మైయుండుటచేతను, జ్ఞానయోగము దుష్కరమై సప్రమాదమైయుండుటచేతను, శరీరధారణాదులకును కర్మమే యపేక్షితమగుటచేతను, కర్మయోగమునే చేయవలయుననియు, విశిష్టుఁడైనవాఁడో

---

*'సర్వజ్ఞానవిమూఢాః' అనఁగా సమస్తములైన జ్ఞానములందును విశేషించి మూఢులైనవారనుట. ఆత్మస్వరూపముయొక్క కలరూపు దెలియనివా రగుటచే 'నేను' 'నాది' ఇత్యాదులైన యెఱుకలన్నిటియందును ఎఱుఁగఁదగిన యాయావస్తువులయొక్క స్వరూపములను (కలరూపులను) దెలియనివా రనుట.

విశేషించి దానినే లోకసంగ్రహముకొఱకు చేయవలయు ననియు ఇంతవఱకుఁ జెప్పఁబడినది. ఇఁక నీయధ్యాయము మిగతభాగమున జ్ఞానయోగము దుష్కర మగుటచే ప్రమాదముతోఁ గూడినదని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ *సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥ 33

టీ. జ్ఞానవానపి = జ్ఞానవంతుఁడైనను, స్వస్యాః = తనదగు, ప్రకృతేః=ప్రకృతికి-ప్రాచీనవాసనకుఅనుట, సదృశం=అనుగుణముగా, చేష్టతే=వ్యాపారములు చేయుచున్నాఁడు, భూతాని = ప్రాణులు, ప్రకృతిం = అనాదికాలప్రవృత్త మగువాసనను, యాన్తి = అనుస రించుచున్నవి, నిగ్రహః=శాస్త్రకృతనియమనము, కిం కరిష్యతి=ఏమి చేయఁగలదు ?

---

* 'సదృశంచేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి' 'జ్ఞానవంతుఁడుగూడఁ దన ప్రకృతికిఁ దగునట్టుగా చేష్టలు చేయుచున్నాఁడు' అనుచో అపిశబ్దముచే ప్రకృతి కనుకూలమైన ప్రవృత్తి లేనిజ్ఞానవంతుఁడుగూడ ప్రకృతి ననుసరించి చేష్టలు చేయు చున్నాఁడని సిద్ధించుచున్నది. కనుక 'జ్ఞానవాన్' అనుచో జ్ఞానము, ప్రకృతికి అనుకూలమైన ప్రవృత్తికి విరోధి యైనజ్ఞానముగా నుండవలయును. లౌకికజ్ఞానము అట్టి ప్రవృత్తికి విరోధికాదు గావున నది యిచటి జ్ఞానము కానేరదు. ఆత్మసాక్షాత్కార పర్యంత మయినజ్ఞానమున ప్రకృతి ననువర్తించు ప్రసక్తియే కలుగదు గావున నదియు నీజ్ఞానము గానేరదు. కాన నేజ్ఞానము నవలంబించి పురుషుఁడు జ్ఞానయోగమునఁ బ్రివర్తించుట కుత్సహించునో యట్టిజ్ఞానమే యిట వివక్షితము. ఇది ఆత్మస్వరూప విషయముగా శాస్త్రజన్య మయినజ్ఞానమే యగును. కాన 'జ్ఞానవానపి' అనుటకు నిట 'ప్రకృతి...ప్రతిపాదించునని జ్ఞానముగలవాఁడు గూడ' అని చెప్పఁబడిన దని గ్రాహ్యము. మఱియు చేతనులప్రవృత్తిరూప మైనచేష్టకు అసాధారణకారణము రాగద్వేషములు. ఇవియే అనంతరశ్లోకమునఁ జెప్పబడుచున్నవి. ఈరాగద్వేషము లకు మూలము ప్రాచీనవాసనయే. కాన నిట ప్రకృతిశబ్దమునకు ప్రాచీనవాసన యనఁబడినది. ప్రాచీనవాసనచేతనే ప్రవృత్తిరూప మైనచేష్ట కలుగుచున్న దని భావము.

తా. 'ప్రకృతిబంధరహితమైనయాత్మస్వరూప మిట్టిది. దానినే సర్వవిధముల ననుసంధింపవలయును' అని శాస్త్రములు ప్రతిపాదించుట నెఱింగినవాఁడు గూడ తన ప్రాచీనవాసన కనుగుణముగా ప్రాకృతవిషయములయందే ప్రవర్తించుచున్నాఁడు. ప్రకృతిసంబంధము గలసమస్తప్రాణులును అనాదికాలప్రవృత్తమగువాసననే యనువర్తించుచున్నవి. అట్టివాసనను వెంటనంటునట్టి ప్రాణులను శాస్త్రకృతనియమన మేమి సేయఁగలదు? (*అనఁగా అనాదివాసన బలీయమైనది గనుక శాస్త్రజన్యజ్ఞానము వారిని అట్టిమార్గమునుండి నిరోధింపఁ జాలదు.)

అవ. భూతములు ప్రకృతిని అనువర్తించుప్రకారమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఇన్ద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।

టీ. ఇన్ద్రియస్య = జ్ఞానేంద్రియములయొక్క, అర్థే = విషయమగుశబ్దాదులందును, ఇన్ద్రియస్య = కర్మేంద్రియములయొక్క, (అర్థే=విషయమగు వచనాదులయందును.) రాగద్వేషౌ-రాగ = విషయముల ననుభవింపవలయు ననెడి కోరికయు, ద్వేషౌ=ఆయనుభవమునకు ప్రతిబంధకము కలిగినప్పుడు పుట్టు క్రోధమును, వ్యవస్థితౌ = వర్జింపరానట్లు ఏర్పడియున్నవి.

తా. శ్రోత్రాది జ్ఞానేంద్రియములకు తమవిషయము లగు శబ్దాదులందును, వాగాదికర్మేంద్రియములకు తమ విషయములగు వచనాదులందును, ప్రాచీనవాసనవలన రాగము త్రోసిపుచ్చరానట్లు నెలకొని యుండును. ఇట రాగము, విషయముల ననుభవింపవలయు నని యువ్విళ్ళూరుచుండురూపమున నుండును. ఆయనుభవమునకు

* అనాదికాలప్రవృత్తమైన అచిత్తుతోడిసంసర్గమువలనఁ గలిగినదై, అపరోక్షమై, దేహాత్మభ్రమజనితమై, అత్యంత ప్రవృద్ధమైన వాసనను, ఇప్పటిదై, పరోక్షమై, శాస్త్రజన్యమైన జ్ఞానము తటాలున ఖండింప నేరదని భావము.

ఆక్కడ కలిగనేని ద్వేషము త్రోసిపుచ్చరానిదై తప్పక కలిగియుండును. (ఇట్లీరాగ ద్వేషములు రెండును, జ్ఞానయోగమునకుఁ బూని యింద్రియముల నెల్ల నడఁచియున్నట్టివానిని బలాత్కారముగా తమవశము చేసికొని తోడనే తమకార్యములందు ప్రవేశింపఁజేయుచున్నవి. కావున వాఁడు ఆత్మస్వరూపానుభవమునకు విముఖుఁడై చెడిపోవుచున్నాఁడు. అని భావము.)

శ్లో॥ తయో ర్న వశ మాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ॥ 34

టీ. తయోః=ఆరాగ ద్వేషములకు, వశం = అధీన మైయుండుటను, న ఆగచ్ఛేత్=పొందఁగూడదు, హి=ఏకారణమువలన, తౌ = ఆరెండును, అస్య=వీనికి, పరిపన్థినౌ = శత్రువులు-జ్ఞానాభ్యాసమును చెఱుపునవనుట.

తా. *జ్ఞానయోగ మారంభించునపుడు రాగద్వేషములకు వశమై చెడిపోవకుండవలయును. ఈరెండును వానికి జయింపరాని శత్రువులు కావున వానిజ్ఞానాభ్యాసమును భంగపఱుచును.

అవ. యుద్ధాదిరూపమైనకర్మయోగముగూడ దుఃఖరూపమగుటచే యథావత్తుగా చేయుటకు అశక్యముకాదాయనఁగా చెప్పుచున్నాఁడు.

79 శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ 35

టీ సు అనుష్ఠితాత్=సాంగముగా అనుష్ఠింపఁబడిన దైన-పరధర్మాత్=జ్ఞానయోగముకంటెను. స్వధర్మః = తనధర్మమువంటి

---

*కర్మయోగారంభమునందైతే చిరకాలముగా నలవాటుపడియుండు విషయములవంటి విషయములయందే ప్రవృత్తి గలిగియుండును గాన రాగద్వేషములు బలాత్కారము చేయఁజాలవు; జ్ఞానయోగారంభమునందో అలవాటులేని విషయములందు ప్రవృత్తి గనుక నవి బలాత్కారము మాపు నని భావము.

దైనకర్మయోగము, విగుణః (అపి)=అంగవైకల్యము గలదైనను, శ్రేయాన్=మేలయినది, స్వధర్మే=తనధర్మమగు కర్మయోగము నందు (వర్తించువానికి), నిధనమపి = మరణమైనను, శ్రేయః = శ్రేష్ఠము, పరధర్మః=అన్యధర్మమగు జ్ఞానయోగము, భయావహః= భయమును గలుగఁ జేయునది.

తా. 'కార్యతే హ్యవశః కర్మ' అనునట్లు ప్రకృతి తన గుణములద్వారా పురుషునిచేత కర్మములను జేయించుచునే యుండును. అట్టిప్రకృతిసంసర్గము గలవానికి కర్మయోగము సుకరమగుటచే వానికది *స్వధర్మమే యగును. అది అంగవైకల్యమేదైనను కలిగి

---

* ఇట స్వధర్మపరధర్మశబ్దములు వర్ణాశ్రమాదులంబట్టి ప్రయుక్తములైనవి గావు. స్వవర్ణాశ్రమధర్మములంతప్ప పరవర్ణాశ్రమధర్మములు నిషిద్ధములే యై యుండుటచే నిట క్రొత్తగా నిషేధింప నక్కఱలేదు. మఱి యిట వానికి ప్రసక్తియు లేదు. ఇట ప్రసక్తాంశములు కర్మయోగ జ్ఞానయోగములు. కనుక స్వధర్మ పరధర్మశబ్దములు స్వశక్యధర్మ పరశక్యధర్మములను (అనఁగా ప్రకృతములైన కర్మయోగ జ్ఞానయోగములను) గుఱించినవే కావలయును వానిలో కర్మయోగమునకు 'విగుణ' మనియు జ్ఞానయోగమునకు 'స్వనుష్ఠిత' మనియు విశేషణము లుంపఁబడినవి. విగుణ మనఁగా అంగవైకల్యముతోఁ గూడినది. విగుణమైన కర్మయోగమునకు ప్రతియైనది గాన జ్ఞానయోగమునకు స్వనుష్ఠిత (సు+అనుష్ఠిత) మను విశేషణమున 'సు' అనుటకు సగుణమైనదని యర్థము సేయఁబడియెను. 'అనుష్ఠిత' మనుటకు 'చక్కఁగా అనుష్ఠింపఁబడిన'దని యర్థముసేసినచో, అట్లనుష్ఠింపఁబడిన జ్ఞానయోగమునకు ఫలము తప్పక సిద్ధించునుగాన, ఫలయుక్తమైన జ్ఞానయోగమును కర్మయోగముకంటె తక్కువగాఁ జెప్ప నొప్పదు. అయినను దానిని తక్కువగా నిట చెప్పియుండుటచే 'అనుష్ఠిత' మనఁగా భూతార్థకక్రియనుబట్టి 'కొంతకాల మనుష్ఠింపఁబడి పిదప విచ్ఛేదమునొందిన' దని యర్థము సేయుట యొప్పును. కనుక 'స్వనుష్ఠిత'మైన- (అనఁగా సగుణమై స్వరూపవిచ్ఛేదము గలిగిన) జ్ఞానయోగముకంటె విగుణమై స్వరూపవిచ్ఛేదము లేనికర్మయోగమే మేలని యర్థము. స్వరూపమున విచ్ఛిన్న మగుదానికి ఫలమే కలుగదు గాన అది సగుణమైనను ప్రయోజనము లేదు. విగుణమైన దయ్యును స్వరూపమున విచ్ఛిన్నము కానిదై సాగుచుండినయెడల దానికి ఫలము తప్పదు కాన ప్రయోజనము గలదు. కాన నిట్టికర్మయోగమే శ్రేయ మని భావము అయినను కర్మయోగమునకు విచ్ఛేదము కలుగకుండుట యెట్లు; జ్ఞానయోగమునకుఁ గలుగుట

గుణము లేనిదైనను ప్రమాదముఁ గలుగనీయదు. జ్ఞానయోగము ప్రకృతిసంసర్గము గలవానికి అశక్యమగుటచే వానికి అది పరధర్మమే యగును. అది గుణము గలదైనను కష్టసాధ్య మగుటచేత కొంత కాలమే యనుష్ఠింపబడినదై ప్రమాదముతోఁ గూడినదయ్యె నుండును. కాఁబట్టి పరధర్మమువంటి దైన జ్ఞానయోగమునకంటె స్వధర్మమే యనఁదగు కర్మయోగము మేలైనది. మఱియు ప్రకృతి సంస్పృష్టుఁ డైనవానికి, కర్మయోగము స్వయముగాఁ గయికొనుటకుఁ దగియుండుటచే స్వధర్మ మగును గాన నట్టి కర్మయోగము వర్తించుచున్నపుడు వానికి ఒకజన్మమందు ఫలము లభింపక మరణము గలిగినను మేలే యగును. ఏలనఁగా, కర్మము వానికి నియతమై స్వాభావికముగా నుండును గనుక నిప్పటి కది అంగవికలమై యుండినను,

---

యెట్లు? అన్నచో, కర్మయోగమున నింద్రియములు తమ కలవాటుపడి యున్నవిషయములవంటి విషయములందే ప్రవర్తించుచున్నవి. కావున నది మిక్కిలి శక్యముగా నుండును కావుననే దానిని 'స్వయముగాఁ గయికొనుటకుఁ దగియుండుటచే స్వధర్మమగును' అనఁబడెను. ఇట్టిది గావున దాని కంతగా విచ్ఛేదము కలుగఁజాలదు. జ్ఞానయోగమున నింద్రియవ్యాపారములనే యడుపవలసి యుండుటచే నది యశక్యము గాన ప్రమాదగర్భమైనదై మధ్య విచ్ఛిన్న మగును. కావుననే దానిని 'స్వయముగాఁ గైకొనుటకు అశక్య మగు' ననఁబడెను కర్మయోగము విచ్ఛేదము లేనిదైనను విగుణముగా (అనఁగా అంగవికలముగా) నుండినయెడల ఫల మెట్లు కలుగు నన్నచో, నది యీజన్మమున ఫలము గలిగింపకపోయినను సులభమై యుండుటవలన నిర్విఘ్నముగా సాగుటచే జన్మాంతరమందు అవికల మైనదిగా నేర్పడి తన్మూలమున ఆత్మావలోకనఫలము కలిగించు నని యెఱుఁగునది. కావుననే 'ఏభంగము...సంభవింపవచ్చును' అనబడినది. ఈ కర్మయోగము ఆత్మదర్శనఫలముకొఱ కయినది గాన కామ్యకర్మములవలె ఫలాభిసంధి గలదయినను ఇది జన్మాంతరమందేని ఫలము నిచ్చును. విగుణమైనందులకు ఫలము విలంబముగాఁ గలుగు నింతేకాని, కామ్యకర్మమువలె ఫలమే లేనిది గాదు. ఇప్పుడు విగుణమైనను జన్మాంతరమున సగుణ మగును. అయినను వెంబడిజన్మముననే ఫలము నిచ్చుననుట నిర్ణయింపరాదు. వెంబడిజన్మముననో దాని కవ్వలిజన్మముననో ఫలము కలుగవచ్చును. కావుననే 'అవికలముగా ననుష్ఠించుట సంభవించును' అని కేవలము అవికలత్వము (అనఁగా సగుణత్వము) సంభవించుటమాత్రమే చెప్పబడెను గాని, ఫలసిద్ధి చెప్పఁబడినది గాదు.

'నేహాభిక్రమనాశోఽస్తి' అనునట్లు, అది ఏభంగము నొందక సాగు చుండునుగాన మఱొకజన్మమందేని దానిని అవికలముగా ననుష్ఠించుట సంభవింపవచ్చును. ప్రకృతిసంసర్గము గలవానికి జ్ఞానయోగము స్వయముగాఁ జేకొనుటకు అశక్య మగును గాన నది వానికి పరధర్మమే యగును. అట్టిజ్ఞానయోగము ప్రమాదగర్భ మగుటవలన నడుమవిచ్ఛేదము నొందవచ్చును. స్వరూపమున విచ్ఛిన్నమైనదానికి జన్మాంతరముననును ఫలము కలుగనేరదు గాన నిది భయంకరమైనది. (విచ్ఛిన్న మైనజ్ఞానయోగపు ఫలమునకంటె విగుణ మైనకర్మయోగపు ఫలము త్వరితమని భావము.)

అర్జున ఉవాచ :

80 81

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలా దివ నియోజితః॥ 36

టీ, వార్ష్ణేయ = కృష్ణా, అథ = ఇఁకను, అయం పూరుషః = జ్ఞానయోగమునందు ప్రవర్తించిన యీపురుషుఁడు, అనిచ్ఛన్నపి = విషయానుభవమును కోరనివాఁడైనను, కేన = ఏహేతువుచేత, ప్రయుక్తః = ప్రేరేపింపఁబడినవాఁడై, బలాత్ = బలాత్కారముగా, నియోజిత ఇవ = నియోగింపఁబడినవానివలె, పాపం = విషయానుభవరూప మగుపాపమును, చరతి = ఆచరించుచున్నాఁడు.

కృష్ణా, జ్ఞానయోగమున బ్రవర్తించినపురుషుఁడు విషయానుభవమునం దిచ్ఛ లేనివాఁ డైనను బలాత్కారముగా నియోగింపఁబడినవానివలె దేనిచేత బ్రేరితుఁ డై విషయానుభవరూప మైన 82 పాపము నాచరించుచున్నాఁడు? (అనఁగా విషయానుభవరూపమైన యనర్థమును బొందుచున్నాఁడు.)

శ్రీభగవానువాచ :

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహవైరిణమ్॥ 37

టీ. ఏషః = నీవడిగినయీ హేతువు, రజోగుణసముద్భవః = రజోగుణమువలనఁ బుట్టిన, కామః=శబ్దాదివిషయములందలిరాగము, మహాశనః = అధికమైనయాహారము గలది, ఏషః = ఈకామమె, క్రోధః=క్రోధరూపముగాఁ బరిణమించినదై, మహాపాప్మా = మహాపాపములకుఁ గారణభూత మైనది (అగు), ఏనం = ఈకామమును, ఇహ=ఈజ్ఞానయోగమున, వైరిణం=శత్రువునుగా, విద్ధి=ఎఱుఁగుము.

తా. సత్త్వాదిగుణము లొకప్పుడు హెచ్చుచు నొకప్పుడు అడఁగుచును నిట్లు వర్తించుచుండును. అట్టిగుణములమయమైనది ప్రకృతి. ఇట్టిప్రకృతియొక్క సంసర్గము గలవాఁడు సత్త్వగుణము పొడసూపినప్పుడు జ్ఞానమునకుఁ బూనినను, ప్రాచీనవాసనవలనఁ బుట్టినదై శబ్దాదివిషయములందు వర్తించునదై రజోగుణాధిక్యమువలన పెంపు నొందిన దగు ఈకామము వానికి శత్రువై వానిని విషయములకు లాగుచున్నది. ఈ కామమే, తనకు భంగము కలిగె నేని అట్లు భంగము కలిగించినచేతనులయెడల క్రోధరూపముగా పరిణమించి మహాపాపకారకమై వానిని పరహింసాదులందు ప్రవర్తింపఁ జేయుచున్నది. రజోగుణమువలన జనించిన యీ కామమును జ్ఞానయోగమునకు సహజశత్రువుగా నెఱుఁగుము.

84 85

శ్లో॥ ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేనచ ।
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్॥ 38

టీ. యథా=ఎట్లు, వహ్నిః=అగ్ని, ధూమేన=పొగచేత, ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో, (యథా = ఎట్లు) ఆదర్శః = అద్దము, మలేన=మురికిచేత, (ఆవ్రియతే) చ=కప్పఁబడుచున్నదో, యథా=

ఎట్లు, గర్భః=గర్భము (శిశువు), ఉల్బేన=మావిచేత, ఆవృతః = ఆవరింపఁబడియున్నదో, తథా=అట్లు, ఇదం=ఈప్రాణిసమూహము, తేన=ఆకామముచేత, ఆవృతమ్=ఆవరింపఁబడియున్నది.

తా. పొగచే నగ్నియు, మాలిన్యముచే నద్దమును, మావిచేఁ బిండమును నేవిధమున నావృతములై యుండునో ఆవిధమున నీ ప్రాణిసమూహము కామముచే నావరింపఁబడియున్నది.

86

అవ. అది ఆవరించియుండుప్రకారమును జెప్పుచున్నాఁడు.

87A 87B

శ్లో॥ ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా।

88

కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ॥ 39

టీ. కౌన్తేయ=అర్జునా, నిత్యవైరిణా=విషయాసక్తిని గలిగించుటచే అనాదిశత్రువైనదియు, కామరూపేణ = ఆశాస్వరూపమైనదియు, దుష్పూరేణ=పొందనర్హముకాని విషయములు కలదియు, అనలేన=తృప్తిచెందనిదియు నగు, ఏతేన=ఈకామముచేత, జ్ఞానినః=జ్ఞానస్వభావముగల ప్రాణియొక్క, జ్ఞానం=ఆత్మవిషయమైనజ్ఞానము, ఆవృతం=ఆవరింపఁబడినది.

తా. స్వభావముచే జ్ఞానాకారుఁడైనయీప్రాణియొక్క ఆత్మవిషయమైన జ్ఞానము, పొంద నర్హముగాని విషయములం బ్రవర్తించుటచేఁ బూరింప నలవి గానిదియును, యోగ్యములైనవి ప్రాప్తించినను తనివి లేనిదియు, విషయములందు వ్యామోహమును బుట్టించుటచే ఆత్మసాక్షాత్కారమునకు అనాదిశత్రువుగాను నున్న యీ కామముచేత ఆవరింపఁబడియున్నది.

అవ. ఈకామము ఏయుపకరణములచేత స్వతంత్రుఁడగు ఆత్మను ఆక్రమించి పరతంత్రునిగాఁ జేయుచున్నదో వానిని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఇన్ద్రియాణి మనో బుద్ధి ర స్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్॥ 40

టీ. అస్య = ఈ కామమునకు, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, మనః=మనస్సు, బుద్ధిః=బుద్ధియును, అధిష్ఠానం (ఇతి)=కామము వీని చేత ఆత్మను అధిష్ఠించునది యని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, ఏషః=ఈ కామము, ఏతైః=ఈయింద్రియమనోబుద్ధులచేత, జ్ఞానం = ఆత్మస్వరూపయాథాత్మ్యవిషయ మైనజ్ఞానమును, ఆవృత్య = కప్పి, దేహినం=ప్రకృతిసంసర్గము గల పురుషుని, విమోహయతి=వివిధము లుగా మోహింపఁజేయుచున్నది.

తా. ఈ కామమునకు *ఇంద్రియమనోబుద్ధులు ఆత్మను అధిష్ఠించుటకు సాధనములు. కామము తనకు ఆత్మాధిష్ఠానసాధనము లై విషయాసక్తము లై యుండు నింద్రియమనోబుద్ధులచేత ప్రకృతి సంసర్గము గల దేహియొక్క జ్ఞానమును గప్పి, వానిని అనేకవిధము లుగా మోహింపఁజేయుచుండును. (అనఁగా కామము ఇంద్రియ మనోబుద్ధులను అధిష్ఠించి తన్మూలమున పురుషుని స్వవశము చేసికొని వానిని ఆత్మజ్ఞానవిముఖునిగాను విషయానుభవమునం దాసక్తునిగాను జేయునని భావము.

శ్లో॥ తస్మా త్త్వ మిన్ద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥ 41

టీ. భరతర్షభ=భరతవంశమువారిలో శ్రేష్ఠుఁడ వగు అర్జునా, తస్మాత్ =ఆ కారణమువలన, త్వం=నీవు, ఆదౌ=మోక్షోపాయారంభ సమయమునందే, ఇన్ద్రియాణి=శ్రోత్రాదీంద్రియములను, నియమ్య=

* ఇచ్చట ఇంద్రియము లనఁగా బాహ్యేంద్రియములు. బుద్ధి యనఁగా పురుషార్థములు కానివానియందు పురుషార్థములే యనెడి విపరీతమైన యధ్యవసాయము. మన స్సనఁగా అంతఃకరణము.

కర్మయోగమునందు నియమించి, జ్ఞానవిజ్ఞాననాశనం-జ్ఞాన = ఆత్మస్వరూపమును గుఱించిన జ్ఞానమును, విజ్ఞాన = ఆత్మస్వరూపవివేకమును గుఱించిన విజ్ఞానమును, నాశనం=నశింపఁజేయునట్టి. పాప్మానం=పాపస్వరూప మగు, ఏనం=ఈకామమును. ప్రజహి=విడువుము.

తా. అర్జునా, (ఈ కామ మనెడి శత్రువు సర్వేంద్రియవ్యాపారోపరతిరూప మైన జ్ఞానయోగమునఁ బ్రవర్తించినవానికి విషయములం దాభిముఖ్యము గలిగించి వానిని ఆత్మయెడ విముఖునిఁగాఁ జేయుచున్నది,) కాఁబట్టి ప్రకృతిసంసర్గమువలన ఇంద్రియవ్యాపారములయందే ఆసక్తుఁడ వైననీవు, మొదట మోక్షోపాయము నారంభించునపుడే *ఇంద్రియవ్యాపారానురూప మగుకర్మయోగమునందు ఇంద్రియముల నియమించి, *ఆత్మస్వరూపవిషయ మైనజ్ఞానమును

---

* కామమునకు ఆత్మ నధిష్ఠించుట కైనట్టి యుపకరణములు ఇంద్రియమనోబుద్ధులుగదా. వానిలో 'ఇన్ద్రియాణి ఆదౌ నియమ్య' అని యింద్రియములను మొదట నియమించుట యిట చెప్పఁబడినది. ఇచ్చట ఇంద్రియనియమన మనఁగా, జ్ఞానయోగమువలె ఇంద్రియవ్యాపారముల నెల్ల పూర్ణముగా ఉడుపుటగాదు. ఏలన, మొట్టమొదట నట్లు చేయుట శక్యముగాదు. కర్మయోగమునందు 'యస్త్విన్ద్రియాణి మనసా' అని మునుపు చెప్పఁబడిన యింద్రియనియమనమే యిచటఁగూడ గ్రాహ్యము. కావుననే 'ఇంద్రియవ్యాపారానురూప మగుకర్మయోగమందు ఇంద్రియముల నియమించి' అనఁబడినది. అనఁగాఁ జ్ఞానయోగమందువలె నింద్రియముల వ్యాపారముల నెల్ల నుడుప నక్కఱలేదు. వానిచే వ్యాపారములను జేయించుచునే యావ్యాపారములను కర్మయోగమందు మాత్రము నిలుపవలయును. ఇదియే యిచటి యింద్రియనియమనము. మఱియు ఇంద్రియములు వ్యాపారములు చేయనిచో కర్మయోగము జరుగనేరదు. కనుక జ్ఞానయోగమువలె నింద్రియవ్యాపారము నడ్డగింపక కర్మయోగము ఇంద్రియవ్యాపారములకు అనురూపముగానే యుండుటచే ఇందు వానిని నియమించుటయు సులభ మని గ్రాహ్యము.

*స్వరూపమును గుఱించినది జ్ఞానము; స్వరూపవివేకమును గుఱించినది విజ్ఞానము. వివేక మనఁగా భేదము. దేహమునకంటె వేఱైన యాత్మ యొకటి కలదు అని ఆత్మస్వరూప మింతమాత్ర మెఱుఁగుట జ్ఞానము. దానికిఁ గల ఆనందమయత్వము అణుత్వము మొదలైన ధర్మములనుబట్టి విశేషించి దానిస్వరూపమునకును తక్కినవానికిని

తద్వివేకవిషయమైనవిజ్ఞానమును నాశము నొందింపఁజాలిన పాపిష్ఠమైన యీ కామరూపవైరిని నాశము సేయుము.

అవ. జ్ఞానవిరోధులలో ప్రధానమైనదానిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః॥ 42

టీ. ఇన్ద్రియాణి=ఇంద్రియములు, పరాణి=జ్ఞానమునకు విరోధము చేయుటయందు ప్రధానములైనవానినిగా, ఆహుః = (శాస్త్రములు) చెప్పుచున్నవి, ఇన్ద్రియేభ్యః=ఇంద్రియములకంటె, మనః = మనస్సు, పరం = ప్రధానమైనది, మనసః తు = మనస్సుకంటెను, బుద్ధిః=విపరీతమైన అధ్యవసాయము, పరా=ప్రధానము, బుద్ధేః తు= బుద్ధికంటెను, యః=ఏది, పరతః = ప్రధానమైనదియో, సః = అది-కామము.

తా. (ఇంద్రియములు విషయవ్యాకులములై యున్న యెడల ఆత్మవిషయమున జ్ఞానము ప్రవర్తింపదు గనుక) జ్ఞానమునకు విరోధము చేయుటయందు ఇంద్రియములు ప్రధానమైనవి యని చెప్పుదురు. (ఇంద్రియములు †విషయములనుండి నివర్తించినను మనస్సు

---

గల వివేకము (భేదము) నెఱుంగుట విజ్ఞానము, వివేకమునకు విచారము అనునర్థమున దేహమునకంటె వేఱైనయాత్మ యొకటి కలదని యెఱుఁగుట జ్ఞానము గాను దాని స్వరూపధర్మములను చక్కఁగా విచారించి యెఱుఁగుట విజ్ఞానము గాను గ్రహింపవచ్చును.

† ఇది జ్ఞానవిరోధులగువానిం జెప్పుప్రకరణము గాని జ్ఞానిని జెప్పుప్రకరణము గాదు. కాన నిట 'ఇంద్రియములు...నివర్తించినను' అనఁగా జ్ఞానయోగమందుంబోలె ఇంద్రియములను సర్వవిషయములనుండి పూర్ణముగా నివర్తించుట గాదు. విషయములు సన్నిహితములు కాకుండుట బలవంతముగా మరల్చుట మొదలైనవానిచేత బాహ్యేంద్రియములు విషయములనుండి నివర్తించుటయని గ్రహించునది. ఇట్లే 'మనస్సు ఇతరవ్యాపారములకు విముఖముగా నుండినను' అనగా దానికి వ్యాపారములన్నియు నిశ్శేషముగా నివర్తించుట కాదు, అది పూర్వవాక్యమున 'విషయాసక్తి' మైనదిగాఁ

విషయాసక్తమగు నేని ఆత్మజ్ఞానము కలుగదు గాన) ఇంద్రియముల కంటె మనస్సు ముఖ్యమైనవిరోధి. (మనస్సు ఇతరవ్యాపారములకు విముఖముగా నుండినను బుద్ధి విపరీతప్రవృత్తి కలిగియుండిన యెడల జ్ఞానము పరివర్తింపదు గనుక) మనస్సుకంటె విపరీతాధ్యవసాయ రూపమైన బుద్ధియె ముఖ్యవిరోధి. (ఇంద్రియ మనోబుద్ధులన్నియు శాంతినొందినను రజోగుణమువలనఁ బుట్టినదై యిచ్ఛారూప మగు కామము కలిగెనేని అదియే ఈ యింద్రియాదుల నన్నిటిని తన

---

జెప్పఁబడినది గాన అట్టి మనస్సునకు నిశ్శేషముగా వ్యాపారములు నివర్తింపవు మఱియు మనస్సునకు నిశ్శేషవ్యాపారనివృత్తి కలిగెనేని విపరీతాధ్యవసాయము ప్రవర్తింపదు. మనస్సును ఒకానొక విషయమందు నిలిపి దానినిగుఱించి 'చేయుదును చేయను' అని అధ్యవసించుటయే కదా అధ్యవసాయ మనఁబడును. కాన మనో వ్యాపారము లేనిచో అధ్యవసాయము కలుగదు. ఇఁక విపరీతాధ్యవసాయము గాని యెట్లు ప్రవర్తించును? కాఁబట్టి మనస్సు ఇతర వ్యాపారములకు విముఖమైన దనఁగా అది విషయాంతరములనుండి, యొకొక్కప్పుడు నిద్ర ఆలస్యము మొదలైనట్టి కారణములచేత తనంతటనే నివర్తించుచున్నది. అప్పుడు దానిని నివర్తింపకుండునట్లు ఎంతబలవంతముగా నడ్డగించినను శక్యము గాదు. ఈనివృత్తియే యిట గ్రాహ్యము. ఇట్లు నిద్రాదులచే తనంతటనె నివృత్తిఁ జెందినను దురాగ్రహాదిమాత్రమున విపరీతాధ్యవసాయము ప్రవర్తింపఁగా మనస్సుగూడ నివృత్తిని మాని యట్లె ప్రవృత్తి నొందును గాన మనస్సుకంటె నాయధ్యవసాయమే బలీయమైనదిగాఁ జెప్పబడినది. ఇంతేకాక కామము వాసనచేఁ గలిగినదై తనకనురూపమైన యధ్యవసాయములనే కలిగించుచుండును గాన 'ఇచ్ఛారూపము' అనఁబడెను. అనఁగా నది విషయేచ్ఛ యగు నని భావము. అది 'రజోగుణమువలనఁ బుట్టిన' దనఁగా ప్రాచీనకర్మములచే రేఁగినరజస్సుచేత కలుషితమగు మనోమాత్రముచేఁ బుట్టిన దని యర్థము. ఇంద్రియాదులు విషయాంతరములనుండి విముఖము లగుట సిద్ధించెనేని ఆవిషయేచ్ఛ యుండినను విరోధ మేమి? ఆత్మానుభవేచ్ఛయు నుండి, అధ్యవసాయమును మనస్సును ఆత్మయందే ప్రవణములు కాఁగూడదా? యన్నచో ఆత్మేచ్ఛయు నున్నది గాని అది యొకానొకప్పుడే కలుగునదై అల్పసత్త్వము ఆధారముగాఁ గలిగియుండును. విషయేచ్ఛయో ప్రవృద్ధములైన ప్రాచీనకర్మములచేఁ బుట్టింపఁబడినదై యెడతెగక యను వర్తించుచుండు రజస్సు ఆధారముగాఁ గలది. కనుక ఆత్మేచ్ఛ ఆత్మదర్శనాధ్యవసాయాదులను గలిగింపకుండునంతవఱకును విషయేచ్ఛ ప్రబలమై విషయానుభవాధ్యవసాయాదులనే కలిగించుచుండును గాన 'అదియే యీయింద్రియాదులను ..అడ్డగించు'

విషయములందుఁ బ్రవర్తింపఁజేసి ఆత్మజ్ఞానమును అడ్డగించును. కావున 'యోబుద్ధేః పరతస్తు సః' అని యీకామమే చెప్పఁబడినది. అనఁగా జ్ఞానమునకు విరోధముచేయుటయందు బుద్ధికంటెనుగూడ ముఖ్యమైనది ఆకామమే యగునని యర్థము. ఆత్మజ్ఞానమునకు విరోధులగువానియందెల్ల కామమె ప్రధానమని భావము.

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥ 43

ఇతిశ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగోనామ తృతీయోఽధ్యాయః.

టీ. మహాబాహో=అర్జునా, ఏవం=ఇట్లు, (కామం = కామమును), బుద్ధేః = బుద్ధికంటెను, పరం = ప్రధానమైన, (వైరిణం) బుద్ధ్వా=(జ్ఞానవిరోధి యని) తెలిసికొని, ఆత్మనా=అధ్యవసాయరూపమైన బుద్ధిచేత ఆత్మానం=మనసును. సంస్తభ్య = (కర్మయోగమునందు) నిలిపి, దురాసదం = అడఁప శక్యము కాని, కామరూపం = కామస్వరూపమయిన, శత్రుం = జ్ఞానయోగశత్రువును, జహి = నశింపఁజేయుము.

తా. అర్జునా, ఈవిధముగా కామమే జ్ఞానయోగమునకు బుద్ధికంటెను ప్రధానమైనవైరిగా నెఱిఁగి, బుద్ధిచేత మనసును *కర్మ

---

ననఁబడెను. ఇది దీనికిఁ బూర్వము లైనవానినెల్ల నడపునని చెప్పుట, బుద్ధిమనస్సులంగూడ తమకుఁ బూర్వమైన వానిని నడపు ననుటకు ఉపలక్షణ మగును.

* ఇట 'సంస్తభ్య ఆత్మానం ఆత్మనా జహి శత్రుం కామరూపమ్' అని మనస్సును సంస్తంభించుకొని కామమును జయించునట్లు చెప్పబడి యున్నది. ఇందు మనస్సును సంస్తంభించుట యనఁగా మనస్సును అత్యంతవశము సేసికొనుట గానేరదు. ఏలనఁగా, కామము ఇంకను జయింపఁబడలేదు. అది జయింపఁబడకుండు నంతవఱకును మనస్సును గలంచుచునే యుండును గాన మనస్సు వశము గాఁజాలదు కనుక కామమును జయింపకమునుపు మనస్సును సంస్తంభించుట యనఁగా మనస్సును

యోగమున చక్కఁగా నిలిపి, కామరూపమై చెనకరానిదై యున్న యీశత్రువును నశింపఁజేయుము.

ఇది యుపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ
శాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును నగు
శ్రీభగవద్గీతలలో కర్మయోగంబన్నది
తృతీయాధ్యాయము. 89 90



---

కర్మయోగమునందు స్థాపించుటయే యుక్తము, గాని వశముచేసికొనుట గానేరదు. కావుననే 'కర్మయోగమున నిలిపి' యనఁబడినది.

1 శ్లో॥-(1)

అవతారిక-

అర్జును డింతకు పూర్వమే యుద్ధవ్యాపారమునుండి విరమించు సంకల్పముతో నుండెను. ఇంతలో భగవంతుడు ప్రవృత్తి నివృత్తి రూపములగు కర్మయోగ జ్ఞానయోగముల నుపదేశించెను.

అందు తనప్రకృతికి తగిన నివృత్త్యుపదేశరసికుడై ప్రశ్నించు చున్నాడు.

1 శ్లో॥-(2)

(1) కర్మకంటె బుద్ధి గొప్పదని యెచ్చట చెప్పబడినది?
"దూరేణ హ్యవరం కర్మ"
అనుశ్లోకమున కేవల కర్మకన్న బుద్ధితో నాచరింపబడు కర్మకు అతిశయముమాత్రమే చెప్పబడినది.

(2) గొప్పతన మెందు విషయము?

(3) ఘోర మనగా-భయంకరము గదా! కర్మయోగము భయంకరము కాదే.

(4) శ్లోకమున కిం శబ్దము ప్రశ్నపరమా? అక్షేపపరమా అను ప్రశ్నలకు దీని ముఖ్యభావ మేమనగా అను గ్రంథముచే సమాధానము నొసంగుచున్నారు.

సమాధానములు—

(1) "జ్ఞాననిష్ఠ మాత్రమే" అను గ్రంథము మొదటి ప్రశ్నకుత్తరము.

(2) ఆత్మావలోకమునకు కర్మనిష్ఠకంటె సన్నిహితమైనందున, కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠను జ్ఞాననిష్ఠ ఆత్మావలోకనమును సాధించునని 2వ అధ్యాయ సిద్ధాంతము.

(3) కర్మయోగము సర్వేన్ద్రియవ్యాపారములచే సాధించదగిన దగుటచే సర్వేన్ద్రియవ్యాపారముల నరికట్టి సాధింపదగిన ఆత్మావలోకమునకు విరుద్ధ మగుటచే ఘోరమనబడినది.

(4) కిం శబ్దము ఆక్షేపపరము.

1 శ్లో॥(3)

నీప్రయోజనమును యీ ద్వారా సాధించుకొనుటకా-కాదు. నీవు పరిపూర్ణు డవుగదా!

సాంసారిక ఫలమును దేనినైనను నాకిచ్చుటకొఱకా? కాదు. జనార్దన! జన్మను లేకుండచేయు జనార్దనుడవై నాకు జన్మకారణ మైన సాంసారిక ఫలము నొసంగ సంకల్పింతువా?

నన్ను నిమిత్తముగా చేసుకొని భూమికి బరువైన దుర్యోధనాదులను దునుముటకై నన్ను మోసగించుటకా? కాదు. నీవు కేశవుడవు. బ్రహ్మరుద్రులకు తండ్రివై యుండి యిట్టి మోసమునకు ఒడిగట్టుదువా?

త్వరగా ఫలము నిచ్చుననియా? కాదు. జ్ఞాననిష్ఠ ద్వారా యిది ఫలప్రద మంటివికదా?

సౌకర్యముకొఱకా లేక చేయనిచో వచ్చిపడు అనర్థపరిహారము నకా? కాదు.

కర్మయోగ మనగా సకలేంద్రియములను పూర్తిగా వినియోగించి సాధించదగినది. వాని నన్నిటిని మానివైచి సంపాదించదగినది ఆత్మసాక్షాత్కారము. దీని కిది బొత్తుగ విరోధిగదా! ముముక్షువున కిది తగునా?

లోకమును కూడగట్టుకొనుటకా? కాదు వారికైనను ఉన్న దాని నున్నట్లు చెప్పవలెనేగాని మరియొకవిధము తగదుగదా!

ఈ కారణములచే నీకు ప్రాణసముడనగు నన్ను నీకిష్టముకాని పనిలో ప్రవేశపెంచుట తగదు.

2 శ్లో॥-(4)

ఇచట ఏకశబ్దమునకు కర్మజ్ఞానములలో నేదో యొకదానినని యర్థముకాదు. రెండింటిలో నొకటి యగు కర్మయోగమునే కదా చెప్పుచున్నాడు. అది తనకు యిష్టములేదు. అది తగదని దానియందు భ్రమకలిగినది. ఆభ్రమను పోగొట్టవలెను. పరస్పర వైషమ్య ముండరాదు. కావున అమిశ్రమైనమాటను చెప్పుమని యర్థము.

2 శ్లో॥-(5)

"నిశ్చిత్యవద" యని యన్వయించరాదు. సర్వజ్ఞుడగుసర్వేశ్వరునకు ఇప్పుడు క్రొత్తగా నాలోచించి నిశ్చయించవలసిన అవసరమే లేదుకదా! కావున

"అహం నిశ్చిత్య యేన అహం శ్రేయః ప్రాప్నుయాం తదేకం వద" అని యన్వయము.

2 శ్లో॥-(6)

ఇచ్చట ఇవ శబ్ద స్వారస్యమును గ్రహించవలెను.

నీవు కారుణికుడవు గాన నిన్ను నమ్మిన నన్ను మోహపెట్టవు. ఇది సత్యము. కాని నేనే మందబుద్ధి కలవాడ నగుటచే భ్రమించుచున్నానని భావము.

3 శ్లో॥-(7)

లోకమున వర్ణము, ఆశ్రమము, దేశము, కాలము కోరికలను బట్టి అధికారులు వేరువేరుగా నేర్పడియుందురు. అందుచే ధర్మ

ములు పరస్పర విరుద్ధములుగా గాన్పించినను వారివారి యధికార మునుబట్టి అవి వారికి తగియే యుండును. ఒకడే రెండు చేయవలసి వచ్చినచోగదా విరోధము గాన్పించునది.

అందువల్లనే "ప్రోక్తం" అను శబ్దము ప్రయోగింపబడినది అనగా- అధికారమును మించకుండునటులనే చెప్పబడెనని తాత్పర్యము.

3 శ్లో॥ (8)

"మయా" అనుటచేతనుకూడ-ఆయా అధికారభేదము నెఱింగి వాని హితమునే కోరుచు భ్రమప్రమాదవిప్రలంభ అశక్తిదోషములు లేని నాచే నని యర్థము.

3 శ్లో॥-(9)

మోక్షాభిలాష కలిగినను అనేక వేల పూర్వజన్మలలో గావించిన పుణ్యకర్మలచే పాపముల నన్నిటిని బాపుకొనిన ఏకొందరికి మాత్రమో వెంటనే యీ జన్మముననే మోక్షేచ్ఛ కలిగినతోడనే జ్ఞాననిష్ఠయం దధికారముండును. కాబట్టి శక్తులు అశక్తులను తారతమ్యమునుబట్టి కర్మయోగ జ్ఞానయోగములు విభజింపబడినవి.

3 శ్లో॥-(10)

సర్వజ్ఞుడు, సర్వశక్తుడు, కరుణావరుణాలయు డగు భగవానుని అనుగ్రహ మనెడు సుకృత విశేషముచే జ్ఞానయోగమున కర్హతను కలిగించుటకై పరమపురుషారాధనరూపత్వము చెప్పబడినది.

3 శ్లో॥-(11)

వ్యాకులమైన ఇంద్రియములు జ్ఞాననిష్ఠకు విరోధులు. అవ్యాకులత్వము అంతఃకరణమందలి కామక్రోధాది మాలిన్యమూలము. ఆ

కామాదులున్ను అనాదినుండి చేయుచున్న పుణ్యాపాపరూపము లగు కర్మలకు మూలమైన రజోగుణ తమోగుణమూలములు. దానిని అణచుశక్తి సత్వగుణమునకే కలదు. ఆ సత్వవృద్ధికీవిధముగ భగవదర్పణ బుద్ధితో శాస్త్రవిహిత కర్మానుష్ఠాన మత్యంతావశ్యకము. అందులకే కర్మయోగము నే చెప్పిన చొప్పున ఆచరించవలెను.

"ధర్మేణ పాప మప నుదతి"
వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్
విష్ణు రారాధ్యతే పన్థా నాన్యస్తత్తోషకారకః॥
ఇత్యాద్యనుసంధేయము.

3 శ్లో॥-(12)

ఈశ్లోకమున "అనఘ" శబ్దస్వారస్యమును గమనింపవలెను.

ఈశ్లోకమున నీవు అనఘుడవు (పాపము లేనివాడవు) అగుటచే నీ వెట్లు మోక్షసాధనానుష్ఠానమునకు అధికారి వగుచున్నావో అట్లే కొందరు కామ్యకర్మలయందు అధికారు లగుచున్నారు. కాబట్టి అనఘులకు కర్మయోగమునందుమాత్రమే యధికారము. అనఘతరులకు జ్ఞానయోగమునందే యధికారము అని యిట్లు సంసారతాపహార వైద్యశిఖామణి యగు సర్వజ్ఞకేశవునకు ఆయా యవస్థలకు తగినట్లు యీ యుపదేశము యుక్తమే.

3 శ్లో॥-(13)

జ్ఞానయోగమునకు తగియుండకుండుటకును కారణమును విశదపరచుచు విరోధిశంకను బాపుచు అవ్యామిశ్రవాక్యమును ఉపసంహరించుచున్నాడు.

4 శ్లో॥-(14)

అవతారికలో-

మోక్షమునందుండు కోరికయే పురుషుని నిష్కామకర్మ యోగమునందు ప్రవర్తింపచేయును. కాబట్టి యాయిచ్ఛ యుండినచో నిక వెనువెంటనే సన్నిహితమైన జ్ఞానయోగమున ప్రవర్తింప జేయుదేల ? యనగా

'లోకమున ఇత్యాది'.

4 శ్లో॥-(15)

లోకమున ననుటచే నీ సాంసారికలోకములో నున్నవాడనగుటచే శబ్దాదులయందే యింద్రియములు వ్యాపరించుచుండునుగాన వానిని జయించుట యనెడు జ్ఞానయోగము దుష్కరమని తాత్పర్యము.

4 శ్లో॥-(16)

నిష్కర్మ=నిష్క్రాన్తః కర్మయోగః-కర్మయోగమును పూర్తి చేసినవాడు అనగా జ్ఞాననిష్ఠుడని యర్థము-

తస్యభావః నైష్కర్మ్యం.

4 శ్లో॥-(17)

ఫలమును కోరక కర్మలను పరమపురుషారాధనభావముతో నాచరింపకున్నచో మోక్షము నియ్యవలెననుప్రీతి పరమ పురుషునకు కలుగదు. ఆ ప్రీతిలేనిచో నాతని నిగ్రహాత్మకమైన పాపరాశి తొలగదు. ఆ పాపరాశిచే రజస్తమస్సులు పెరిగి మనోమలములనబడు కామక్రోధాదులు వృద్ధిని చెందును. దానిచే రాగద్వేషములకు చిరకాలస్థాయిత్వ మేర్పడును. అవి యున్నంతవరకు ఇంద్రియముల కలవరము తప్పదు. ఇంద్రియము లిట్లు బాహ్యవిషయములయందు మనస్సునుకూడ నీడ్చుకొనిపోయి సంచరించునంతవరకు ఆత్మనిష్ఠ అసంభవము. ఇట్లు ఫలమును కోరని పరమపురుషారాధనకర్మ

లను చేయకయే జ్ఞాననిష్ఠ ననువర్తించగోరువాడు ఏడంతస్థుల మేడ యందలి ఏడవఅంతస్థు నొక్కసారి యెక్కగోరువానివలె నవ్వుల పాలగును.

4 శ్లో॥-(18)

హి=పూర్వశ్లోకార్థమునందలి ఉపపాదనను సూచించుచున్నది.

4 శ్లో॥-(19)

హి=ఈశ్లోకపూర్వార్థమును ఉపపాదించుచున్నది.

4 శ్లో॥-(20)

అధికారి వైచిత్ర్యమును తెలుపుచున్నది.

4 శ్లో॥-(21)

దివసము మొదలగు స్థూలకాలపరము.

4 శ్లో॥-(22)

అల్పకాలపరము.

4 శ్లో॥-(23)

అవతారికలో-

అనగా- పరమపురుషుని యారాధన రూపమగు కర్మయోగ మును విడిచిపెట్టినచో జ్ఞాననిష్ఠ దుర్లభము.

4 శ్లో॥-(24)

చేతనుడు సత్త్వరజస్తమోగుణములకు వశ్యుడగుటచే కర్మ యోగము నాచరించక జ్ఞానయోగము దుశ్శకముగాన- అనియర్థము.

4 శ్లో॥-(25)

పాపములు నశించిన గుణములు స్వాధీనమగును. గుణములు స్వాధీనమగుట యనగా మోక్షార్థప్రవృత్తికి అనుకూల్య మేర్పడినట్లే.

నిర్మలత్వమనగా- రజోగుణ, తమోగుణ ప్రాచుర్య మణుగం టుటగాని, వానివలన బుట్టు రాగద్వేషాదులు లేకుండుట గాని యర్థము.

4 శ్లో॥-(26)

ఈశ్లోకమున

"నిద్రించువాడే కర్మను చేయుటలేదే"

యని ప్రశ్న యుదయించును. దానికి సమాధానము- ఆ నిద్రయే యొకకర్మ. కావుననే వానికి దేశనియమము కాలనియమము మొదలగు విధినిషేధములు పెక్కులు కలవు అట్టితరి యది కర్మ యెట్లు కాకుండును? ప్రకృతిలో నున్నంతవరకును చేతనుడు గుణపరతంత్రుడే గాన కర్మయోగమును చేయక జ్ఞాననిష్ఠను బడయజాలడు. పాపములు పోయిన గుణములు తన యధీనములో నుండును. అప్పుడతడు మోక్షమునకై ప్రవర్తించగలుగును. ఆ పాపములు పోవుట పరమపురుషారాధనబుద్ధితో కర్మలు చేసిననే.

కావున కర్మయోగము అనివార్యము.

4 శ్లో॥-(27)

మిథ్యాత్వమనగా=అన్యథా భావః. అనగా తలచినట్లుగాక మరియొకరీతిగా నుండుట. చేయవలసిన జ్ఞానయోగమునకు పరిశుద్ధాత్మను ధ్యానించవలెను. అట్లు చేయక విషయము''ను ధ్యానించుచుండుటచే సంకల్పించిన జ్ఞానయోగమునకు విపరీతమైనదాని నాచరించుటచే వాని యాచారము మిథ్యయగుచున్నది-

అనగా- తలంచినట్లుండని దైనదని భావము.

4 శ్లో॥-(28)

ఈ వినాశము 2వ అధ్యాయాంతమున

"బుద్ధి నాశాత్ ప్రణశ్యతి" యని చెప్పబడెను.

7 శ్లో॥-(29)

అవతారికలో-

ఇట్లు మొట్టమొదటనే జ్ఞానయోగము నవలంబించఁగోరువానిని నిందించి నిష్కామకర్మయోగిని ప్రశంసించుచున్నాఁడు.

7 శ్లో॥-(30)

పూర్వాభ్యాసము ఉపకారకమని స్వీకరించినచో నిషిద్ధఆచారములనుండి యింద్రియముల నరికట్టుట దుశ్శక మగునే. దానియందే గదా పూర్వాచారవాసన ప్రేళ్ళుపారియుండును, అని ప్రశ్నించగా-

"పూర్వము చేసి చేసి"

ఇత్యాది చెప్పబడెను. అనగా- నిషిద్ధమైన కర్మలు తమ కభిమతమైన ఆత్మసాక్షాత్కారమునకు విరోధులని గట్టినమ్మిక యుండుటచే వాసన యెంత ప్రేళ్ళు నాటుకొనియున్నను పోగొట్టుకొనవచ్చును.

8 శ్లో॥-(31)

అవతారికలో-

సుకరమగుటచేతను ప్రమాదము లేనిదగుటచేతను మానుటకు శక్యము కానిదగుటచేతను కర్మయోగమే జ్ఞానయోగముకన్న మిన్నయని చెప్పుచు నర్జునుని మొదటిప్రశ్నకు సాక్షాత్తుగా సమాధానమును చెప్పుచున్నాఁడు.

8 శ్లో॥-(32)

సమస్తకర్మలను విడిచినవానికి శరీరపతన మైనచో జ్ఞానయోగావలంబియగు వీనికి సుకరముగనే మోక్షప్రతిబంధకమైన శరీరము పోయినపుడు ముక్తి నిష్ప్రయత్నముగ చేజిక్కునే చింతయేల యన్నచో

"దేహయాత్రా కూడ"

అని చెప్పబడుచున్నది.

సాధనానుష్ఠానమున ప్రవేశించినంతమాత్రముననే ఫలము వచ్చి వడిలో పడునా? పడదు. సాధనానుష్ఠానము పూర్తియైననే యది సిద్ధించును, ఆ సాధనానుష్ఠానపూర్తి నాలుగైదురోజులలోనే సిద్ధించునా? అట్లు సిద్ధించుచో నీశరీరమును మన ముపేక్షించిపోయి నందుకు సంతోషించవచ్చును. అది చాలకాలము పట్టును, అంత వరకును శరీరమును కాపాడుకొనవలెనుగదా! ఆ యుపాయము సాంతము కాకముందే శరీరము నశించినచో అనర్థము కూడా వాటి ల్లును, శరీరము నిలబెట్టుకొనవలయునే యనేము. అది మన యిష్ట ములో నుండునా? ఉదాసీనముగా నున్నంతమాత్రమున నది నశిం చునా? ఏప్రారబ్ధము ననుభవించుట కాశరీర మేర్పడినదో దాని యనుభవము గువరకు నది యుండవలసినదేగదా! పోనిమ్ము, తన యిష్టమువచ్చినట్లు శరీరము నిలబెట్టుకొనవచ్చు ననుము. దాని కేదో లౌకికమైన కర్మ నాచరించి నిలబెట్టుకొనవచ్చునే- కర్మయోగమేల? అన్నచో-

8 శ్లో॥-(33)

న్యాయమైన మార్గమున అని చెప్పబడుచున్నది.

ఈ గ్రంథాభిప్రాయ మేమనగా-

కర్మలకు ఫలములు నియతము లనియును అనియతము లని యును రెండువిధములు. ప్రబలమగు శాపమువలనను దేవతలిచ్చిన వరములవలనను కలుగు ఫలములు నియతములు. తదితర ఫలముల నియతములు. అవి యనియతములగుటయును స్వాభావికము కాదు, దేశకాలములనుబట్టియే. అనగా కాలాంతర దేశాంతర ఫలప్రద ములు, కానిచో కర్మలు నిష్ఫలమై శాస్త్ర మసత్య మగును. అనియ తములు తన యధీనములు. అనగా- ప్రాయశ్చిత్తముల నాచరించియో మంత్ర ఔషధ నీతిశాస్త్రములమూలముగనో బాపుకొనవచ్చును. అవి యందులకే యేర్పడినవి. అట్లు బాపుకొన శక్యముకానిచో రోగ

ఔషధాదులను సేవించకనే పోవును. జయశీలుడు యుద్ధద్యూతాదుల నాచరించకనే పోవలసివచ్చును. తాను స్వేచ్ఛతో చేయదగిన ప్రతిక్రియలే లేనిచో సహజమైన కర్తృత్వమే మృగ్యమగును గాన శాస్త్రమే వ్యర్థమగును. కాబట్టి నీవు జ్ఞానయోగమునే యవలంబింతువేని ప్రపంచమునకు కర్మవశ్యత్వమునే మాన్పినవాడవగుదువు.

8 శ్లో॥-(34)

"ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధి" యనుచో సేవకారముచే నిదినియమవిధి యని తెలుపబడుచున్నది. అనగా న్యాయముగా సంపాదించిన ధనముతో యజ్ఞముల నాచరించి మిగిలిన ధనముతోనే శరీరపోషణమును గావించుకొనవలెనను నియమ మేర్పడినది. ఇట్టి శరీరయాత్ర జ్ఞానయోగమునకు ఫలమగు భక్తియోగదశయందును ఉండవలెనని

"ఆహార శుద్ధౌ" అనుశ్రుతి చెప్పుచున్నది.

8 శ్లో॥-(35)

నీవు జ్ఞానయోగమునకు తగియున్నను కర్మయోగమునే చేయుము. అట్లుగాక నీవిప్పుడు జ్ఞానయోగము నాచరించ తగదు. కర్మయోగమునే యాచరింపుమని తాత్పర్యము.

8 శ్లో॥-(36)

అవతారికలో-

ఈశ్లోకము కర్మలను విధించునట్టియు, నిషేధించునట్టియు, వాక్యములకు ఒక వ్యవస్థను చేయుచున్నది.

10 శ్లో॥-(37)

ఈశ్లోకమున

"ప్రజాపతి రువాచ"

యని పరోక్షముగా చెప్పబడినది. దానికి కారణము- సారథిత్వ-ప్రజా

పతిత్వ రూప ధర్మభేదములచేతనేగాని వ్యక్తిభేదముచే కాదని తెలియ వలెను.

10 శ్లో॥-(38)

"సహయజ్ఞాః"

అని ఇతర భాష్యకారుల పాఠ మంత ప్రసిద్ధమైనది కాదని శ్రీభాష్యకారు లాపాఠమును విడిచి

"సహయజ్ఞైః"

అను పాఠమునే ఆదరించిరని శ్రీ దేశికులు సాయించిరి.

10 శ్లో॥-(39)

గోవువంటివి యజ్ఞములు- పాలవంటివి కోరికలు. ఆయజ్ఞములు ఫలప్రదాతనుండి ఫలములను గ్రహించి మీకొసంగును. అనగా నేనే మీరు చేయు యజ్ఞములచే నారాధింపబడి మీకొఱకు కోరికలను ప్రసాదింతునని తాత్పర్యము.

10 శ్లో॥-(40)

ఇచ్చట మోక్షమును ప్రధానఫలమునుగా జెప్పుట-

"అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే"

అని స్వర్గమును తృణీకరించిన అర్జునున కుపదేశించుటచేతను,

"మా ఫలేషు కదాచన" అని వెనుకను

"శ్రేయః పరం" అని ఇకముందును ఉపదేశించుటను బట్టియు నిచ్చట మోక్షమే ప్రధాన పురుషార్థముగా జెప్పబడినది.

11 శ్లో॥-(41)

పరమాత్మ ఆరాధనబుద్ధితో చేయబడిన కర్మ, మోక్షసాధన మగు జ్ఞానమున కంగముగా నిలచి మోక్షమును సాధించి యిచ్చును.

11 శ్లో॥-(42)

కర్మ క్షణికమైనను దేవప్రీతి యనదగు పుణ్యము ద్వారా ఫలము నీయగలుగును. ప్రలయమున నింద్రాదులు నశించినను నారాయణుఁ డుండుటచే నాతని ప్రీతిమూలముననే ఫలము లభించుట యుక్తమే.

12 శ్లో॥-(43)

అవతారికలో-

దేవతల నారాధించినచో వారు మనలను పోషించు రీతిని, దేవతలను ఆరాధించనిచో కలుగు అనర్థములను చెప్పుచున్నారు.

12 శ్లో॥-(44)

ఇచ్చట చౌర్య మన నేమి?

వీరు దేవత లనుభవించు భోగములను రహస్యముగాని బలవంతముగాని హరించుట లేదే.

వారు తనకిచ్చినవాని ననుభవించుట చౌర్యము కాదుగదా! రాజు లిచ్చిన భోగముల ననుభవించు కింకరులు చోరులని దండింపబడుచున్నారా? అట్లగుచో యజ్ఞఫలముల ననుభవించువారందరును దొంగలే కావలసివచ్చునే యనగా- చౌర్యమును వివరించుచున్నారు.

ఇతరుడు- వాని ప్రయోజనము నిమిత్తమై యనుటచే పరుడు మఱియొకరికై యే ఏర్పరచిన దానిని ఆ మరియొక డనుభవించుటగాని, తనది తా ననుభవించుటగాని, ఇతరునదేయైనను వాని యనుమతిని బడసి తానుపయోగించుకొన్నను దొంగతనము కాదని చెప్పుటకే ఆవిశేషణములు చేర్చబడినవి.

ఏతావతా పరకీయవస్తువునందు స్వకీయత్వబుద్ధి యుండుటయే దొంగతన మనబడుచున్నది.

ప్రస్తుతమున చోరత్వ మెట్లనగా:—

దేవతలను మనము కర్మలచే నారాధించినను వారు హవిస్సును స్వీకరించియే ఫలము నిత్తురు. రాజులు తమ నారాధించువారికి భూములను గ్రామముల నిచ్చినను వారందు పండు పంటలో నారవ భాగమును తమకు సమర్పించనిచో దండింతురు. అటులనే దేవతలును.

దీనిచే నాత్మ చౌర్యముకూడా నీదోషమున సూచింపబడుచున్నది. భగవదధీనమై భగవంతుడు తన కొఱకానేక అతిశయమును కోరియే ఏర్పరచి యుంచిన జీవాత్మను తన కతిశయమును కోరి తాను స్వతంత్రుడనని యభిమానించుటయే ఆత్మచౌర్యము. ఇదియే మహా దోషము.

13 శ్లో॥-(45)

యజ్ఞ శిష్టం (అమృతాఖ్యం) అశితుం శీలం యేషాం తే. అనగా రాగప్రాప్తమైన శరీరయాత్రకూడ యజ్ఞమున మిగిలినదానితోనే చేయవలెనని తాత్పర్యము.

13 శ్లో॥-(46)

"సన్తః యజ్ఞశిష్టాశిన ఏవ వర్తమానాః"
అని యన్వయించవలెను. లేక ఉత్తరార్థముననున్న
"పాపాః" అనుదానికి ప్రతికోటిగా నన్వయించుకొనవచ్చును.

13 శ్లో॥-(47)

సర్వకిల్బిషైః- సర్వశబ్దము బహువచనములచే పొయ్యి- కత్తి పీట-చీపురు- నీటిబిందె- రోలు మొదలగు వానిద్వారా లభించు పంచ సూనము లనబడు పాపములు మాత్రమే కాదు. అనాదికాల సఞ్చిత అపారపాపరాశిని తెలుపును. పంచసూనాదోషములు పంచమహా యజ్ఞములద్వారా పరిహరింపబడును.

13 శ్లో॥-(48)

పాపములు ప్రాప్తివిరోధు లనియు, ఉపాయవిరోధు లనియును రెండు విధములు. అందు ప్రాప్తివిరోధులు భక్తిచేమాత్రమే నశించును. కాబట్టి వానిని మినహాయించి యిచ్చట
''ఆత్మయాధాత్మ్యేత్యాది'' చెప్పబడినది.

శ్లో॥ జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయాత్ పాపస్యకర్మణః ।
యథాऽదర్శతల ప్రఖ్యే పశ్యత్యాత్మాన మాత్మని॥

13 శ్లో॥-(49)

ఇచ్చట పాపశబ్దముచే అభీష్టసిద్ధికి విరోధియగుటచే సాంసారిక పుణ్యములును చెప్పబడుచున్నవి.

13 శ్లో॥-(50)

తన పొట్టనింపుకొనుటకుమాత్రమే వండుకొని తినువాని పూర్వార్జితపాపము పోదు గాన ఆత్మసాక్షాత్కారమును చేయవలెనను తలంపే యుండదు. అంతమాత్రమేగాక ఇక ముందు ముందు పాపవృద్ధికికూడ చేయును గాన నరకమే సిద్ధించును, అందుచే వానికైహిక సుఖముగాని ఆముష్మికసుఖముగాని లేదు. ఋగ్వేదమున నీవిషయమే

''కేవలాఘో భవతి కేవలాదీ'' యని చెప్పబడినది.

15 శ్లో॥-(51)

కర్మ యనగా కర్త చేయు వ్యాపారము. అది బ్రహ్మనుండి పుట్టుట ఎట్లు? అది జీవుడు ప్రేరకకర్తగా జీవునివల్లనైనను పుట్టును లేక శరీరేంద్రియాదుల వల్లనైనను పుట్టును. కాకున్నను అన్ని కార్యములకు సాధారణముగ పరమాత్మ నిచ్చట కర్మకు కారణమని ప్రత్యేకించి చెప్పుటలో విశేష మేమున్నది. అట్లే చెప్పినను బ్రహ్మ అక్ష

రమువలన ఎట్లు పుట్టును. బ్రహ్మఅనగా పరమాత్మ యనుడు జీవాత్మ యనుడు ఇద్దరును నిత్యులే కదా! వారికి కారణమైన అక్షర మొకటి యెచ్చటనుండి వచ్చును? ఇతరభాష్యకర్తలు బ్రహ్మయనగా వేద మనియు అక్షరమనగా పరమాత్మ యనియు అర్థమును చెప్పి పరమాత్మనుండి వేద మావిర్భవించినదని వ్యాఖ్యానించిరి అర్థము బాగు గనే యున్నది. కాని చక్రత్వసిద్ధి యెట్లు? ఆపరమాత్మ కొక కారణ మేది? అందుచే

"ఇచ్చట బ్రహ్మమను శబ్దముచే"

అను గ్రంథము చెప్పబడినది.

15 శ్లో॥-(52)

కర్మయోగాధికారి శరీర మే యజ్ఞాపేక్ష కలదన్న మాట లేదు. జ్ఞానభక్త్యాది యోగాధికారుల శరీరమున్ను యజ్ఞసాపేక్ష మే.

15 శ్లో॥-(53)

ఈశ్లోకమున భూతశబ్దమునకు

"భవ తీతి భూతం"

అని కార్యమాత్ర మర్థము కాదు. అయినచో మహదాదులును కార్యములే. అవి యన్నమువలన బుట్టుచున్నవా?

పంచభూతములును కాదు. వాని పుట్టుకకును అన్నము కారణము కాదు.

భేతాళాది భూతగణమును కాదు. వానిని చెప్పుటలో తాత్పర్యమే లేదు.

శరీరమాత్ర మనియు నర్థము కాదు. కేవల శరీర మే పుట్టునా? జీవునితో కలసిగదా అది పుట్టును. మరియును శరీర లక్షణ లక్షితము లన్నియును అన్నమువల్లనే బుట్టుట లేదు.

కేవల జీవు డర్థమును కాదు. ఆతడు నిత్యముగదా !

కాబట్టి యిచ్చట భూతశబ్దమునకు జీవునితో కూడిన అచిత్పరిణామమగు శరీరమే యర్థమని తెలియవలెను.

17 శ్లో॥-(54)

"తస్య కార్యం న విద్యతే"

అనునది యెల్లు సంగతము. ముక్తునకును

"జక్షన్ క్రీడన్ రమమాణః"

అని కర్తవ్యమును శ్రుతి బోధించుచున్నది గదా !

కార్య మనగా

"న తస్య కార్యం కరణంచ విద్యతే"

అనినట్లు శరీరమనియును చెప్పరాదు.

"శరీరము లేదని చెప్పుట అప్రస్తుతము" కాబట్టి

"ఆత్మ దర్శనమునిమిత్తమై" అని చెప్పబడినది.

17 శ్లో॥-(55)

ఈ రెండు శ్లోకములును ఫలదశకు సంబంధించినవి. జ్ఞానయోగాధికారిని గూర్చినవి కావు.

19 శ్లో॥-(56)

అసక్తః- అనుటచే జ్ఞానయోగము నవలంబించకున్నను కర్మయోగమే ఆత్మప్రాప్తిని సాధించునని తెలుపబడుచున్నది.

19 శ్లో॥-(57)

ఇచ్చట పొందతగినవాడుగా చెప్పబడిన పరుడు దేహముకన్న వేరైన ఆత్మను తెలుపు ప్రకరణముగుటచే ప్రకృతికంటె పరుడైన జీవుడే కాని పరమాత్మకాదు.

20 శ్లో॥-(58)

"జనకాదయః" అనుపదమునకు శ్రీభాష్యకారులు

"రాజర్షయః జ్ఞానినా మగ్రేసరాః జనకాదయః"
అని వ్యాఖ్యానించిరి.

ఇందొక నిగూఢాభిసంధి కలదు.

రాజులు ప్రాయికముగా విశాలమైనట్టియు లోతైనట్టియు మనస్సుకలవారుగా నుందురు. అందులోను ఋషులనుటవలన మన యింద్రియములకు గోచరించని యర్థములనుకూడ చూడగలుగుదురు. అందును ఆత్మవేత్తలు అంతియగాక సహజముగనే స్వాధీనములో నున్న యింద్రియములు కలవారగుటచేతను ఉత్కటమైనసత్వగుణాభివృద్ధి కలవారగుటచేతను ఆత్మవేత్తలలో నగ్రగణ్యులనిభావము.

20 శ్లో॥-(59)

"కర్మణైవహి" అనుచో
"ఏవ" కారము

"హి" శబ్దమువలన జ్ఞానయోగము నవలంబించుటకు సర్వాత్మనా సమర్థులైన వానికిని కర్మయోగాచరణ మనివార్యమని సూచింపబడినది.

20 శ్లో॥-(60)

సంసిద్ధి శబ్దమునకు శుద్ధాత్మప్రాప్తి చెప్పబడినది.
ఈశ్లోకము వెనుక 19వ శ్లోకమున
"పరం ఆప్నోతి"

అను శబ్దమునకు నిదర్శనమును చూపించుచున్నది. అచ్చట పరశబ్దమునకు శుద్ధాత్మపరముగ నర్థము చెప్పబడుటచే నిచ్చట అట్టి యాత్మప్రాప్తిచే

"సంసిద్ధి" శబ్దమున కర్థముగా జెప్పవలెను.

21 శ్లో॥-(61)

చేయవలసిన ప్రధానకర్మను చెప్పినచో దాని నెట్లు చేయవలెనని ప్రశ్న యుదయించగా- అడిగి తెలిసికొనవలసియుండును. అప్పుడు

దానికి చేయవలసిన అంగకలాపములను చెప్పవలసియుండును. అందుచే

"యత్ప్రమాణం" అనుశబ్దమునకు

"యదంగముక్తం" ఏయే యంగములతో చేయబడునో యని యవసరమైన అర్థము సిద్ధించును.

ఇచ్చట ప్రమాణశబ్దమునకు అవధియర్థము. చేయవలసినకర్మ యొక్క అవధి అంగములే.

20 శ్లో॥-(63)

ఈశ్లోకములోని ఉత్తరార్థమందలి

"ఏవ" పదము

"కర్తుం" అనుదానితో నన్వయించవలెను. అనగా

"కర్తుమేవ" అగును.

కర్మైణైవ కర్తుమేవ అర్హాసి అని సిద్ధించును.

మొదటి ఏవకారము అన్యయోగవ్యవచ్ఛేదము. మరియొకటి కాదని చెప్పను. ఆ నిషేధింపబడున దేదియనగా "జ్ఞానయోగము".

రెండవ ఏవకారము (కర్తుం+ఏవ) అత్యంతాయోగవ్యవచ్ఛేదకము. బొత్తుగా చేయరాదనుటను మాన్పును. చేయక ఎంత మాత్రమును నుండరాదు సుమా యని యర్థమిచ్చును.

20 శ్లో॥-(63)

ఇచ్చటి పూర్వార్థమునందలి

"అపి" శబ్దము (లోకసంగ్రహమేవాపి) లోకసంగ్రహశబ్దముతో దగ్గరగా స్వరసగా అన్వయించుచుండ శ్రీ భాష్యకారులు

"సంపశ్యన్" తో నన్వయించిరి.

లోకసంగ్రహమపి" అని యన్వయించినచో లోకసంగ్రహమున కప్రాధాన్య మేర్పడవచ్చును.

"పశ్యన్నపి" అని యన్వయించినచో కర్మలు చేయుటకు వెనుక చెప్పబడిన హేతువులకన్నను లోకసంగ్రహమునకు ఆధిక్యము తోచును అది ముఖ్యము.

20 శ్లో॥-(64)

ఇచ్చట ప్రామాణికపురుషునకు పూర్ణశాస్త్రజ్ఞానము, మంచి యనుష్ఠానము, సుప్రసిద్ధత- అను మూడు విశేషణము లుంచబడినవి. వాని యభిప్రాయ మేమనగా-

పూర్తిగ నెఱుంగనివాడు చేసినను,

పూర్తిగ నెఱింగి చేయకున్నను,

పూర్తిగ నెఱింగినను అప్రసిద్ధుడైనను- వానిని లోకులు ప్రమాణముగా దీసికొనరని భావము.

22 శ్లో॥ (65)

సర్వేశ్వరేశ్వరి విశేషణములు-

కర్మవశ్యులైనజీవులకన్న విలక్షణమైనపరమపురుషుడే యీ శ్లోకమున

"మే" అను పదముచే చెప్పబడుచున్నాడని తెలుపుటకే. ఈ విశేషణములు భగవంతునకు స్వాభావికములైన విలక్షణమగు విభూతిని, కల్యాణగుణములయొక్క పూర్తిని తెలుపుచున్నవి.

వీనివలన- శ్రుతిస్మృతులు నాయాజ్ఞాస్వరూపములే. నాయాజ్ఞ నితరు లెల్లరును పాటించవలసినదియే- నన్ను నియమించువా డొకడు లేడు. అట్లున్నగదా ఆతనివలన నా కనర్థములు వాటిల్లునని భయపడి విధ్యుక్తములను చేయవలసియుండును.

"భీషాస్మాద్వాతఃపవతే, భీషోదేతి సూర్యః"

అనునట్టుల నాకు భయపడి వారు వారివారి పనులను చేయుదురు. నాకాభయము లేదు. ఇది

"సర్వేశ్వర" అను విశేషణమున కభిప్రాయము.

అవాప్తసమస్తకామ:—నాకు నాసంకల్పముచే బడయజాలని దొక్కటియును లేదు. ఇంతవరకు సంకల్పించి బడయునిది లేదు. అట్లున్నచో దానిని బడయుటకు కర్మలు చేయవలసియుండెడివి.

సర్వజ్ఞస్య- సత్యసంకల్పస్య-

నేను కర్మవశ్యులగు దేవతిర్యఙ్మనుష్యాదులతో సజాతీయావతారములను ధరించినను, వారికవలెనే జ్ఞానసంకోచముగాని నా యిచ్ఛ కాటంకముగాని లేవు. ఉన్నచో నవి పోవుటకు కర్మలను చేయవలసియుండెడిదేమో!

22 శ్లో॥-(66)

ఈశ్లోకముచే- భగవంతుడే తనకు ఏ ఫలాపేక్ష లేకున్నను తన యనుష్ఠానమును జూచి తమ వర్ణాశ్రమధర్మములను విడిచి లోకము చెడిపోవుటవలన తనకు దాపరించు అనర్థములు లేకున్నను పరమకారుణికుడు గాన లోకమును రక్షించుటకై కర్మయోగము ననుష్ఠించుచున్నానని చెప్పుటచే ఫలాపేక్షగల క్షత్రియుడై, తనను చూచి లోకులు చెడుటయను దోషమునకు బాధ్యుడై యుండు అర్జునుడు కర్మయోగమునే యవలంబించవలెనని చెప్పవలెనా? ఇక సామాన్యసంసారుల మాట చెప్పనేల? అని పై మూడుశ్లోకములచే చెప్పబడెను.

23 శ్లో॥-(67)

అవతారిక-

22వ శ్లోకమున "త్రిషులోకేషు"

అని యుండుటచే నది సకలావతారపరము.

ఈశ్లోకమున ''మనుష్యాః''

అని యుండుటచే నిది కృష్ణావతారమాత్రపరము. కాబట్టి యిందలి

''అహం'' అను పదమునకు ఈశ్వర స్వభావముతోపాటు శ్రీకృష్ణావతారమునకు అసాధారణమైన ఆకారమునకు సంబంధించిన వని తెలియవలెను.

23 శ్లో॥-(68)

తన సంకల్పమాత్రముచేతనే అన్నిటిని చేయగలవాడే యైనను జ్ఞానము నొసంగి తద్వారా ప్రవర్తింపజేయుటకే జగదుపకృతి మర్త్యుడుగా నవతరించినాడు.

న దేవా యష్టి మాదాయ రక్షన్తి పశుపాలవత్ ।
యం హి రక్షితు మిచ్ఛన్తి బుద్ధ్యా సంయోజయన్తి తమ్॥

అనగా- దేవతలు రక్షించుట పశువులకాపరివలె కర్రను చేబూని వెంటబడి రక్షించరు. రక్షించదలంచుకొన్నవానికి సత్కార్యముల నాచరించుబుద్ధి నొసంగి దానిద్వారా సత్కర్మల నాచరింపచేసి తత్ఫలముగా రక్షింతురు- అట్లుకానిచో గ్రహపీడితునివలె బలవంతముగా ప్రవర్తింపచేయబడినచో శాస్త్రవశ్యత లేకపోవును. దానిచే నాయనుష్ఠానమునకు తగిన ఫల ముండదు.

24 శ్లో॥-(69)

ధర్మరాజ పదస్థానే గీతాభాష్యమున

''యుధిష్ఠిర'' శబ్దము వాడబడినది. దాని వ్యుత్పత్తినిబట్టి యుధిష్ఠిరః=యుధిస్థిరః అని క్షత్రియ ధర్మమునందు అచంచల దీక్ష కలవాడని యర్థము సిద్ధించును. దీనిచే ఇదియును ఒక యజ్ఞమే. దీనికి

"రణయజ్ఞ" మని పేరు. ఇది క్షత్రియునకు ముఖ్య ధర్మము. దీనికి వెనుకంజవేయుట ప్రాయశ్చిత్తీయ మని తాత్పర్యము వేణీసంహార సంస్కృతనాటకమున-

"చత్వారో వయ మృత్విజః"

అను శ్లోకమున ధర్మరాజు యజమానిగాను, ద్రౌపది యధ్వరదీక్షిత పత్నిగాను, భీమార్జుననకులసహదేవులు నలుగురు ఋత్విక్కులుగాను, శ్రీకృష్ణుడు కర్మోపదేష్టయగు బ్రహ్మగాను, కౌరవులు పశువులుగాను ప్రియాపరిభవ శాంతిఫలముగాను రూపింపబడి రణయజ్ఞము వర్ణింపబడినది.

24 శ్లో॥-(70)

తండ్రి- సోదరులప్రసక్తియేల? నీవే స్వయముగ శిష్టజనాగ్రేసరుడవని ఊర్వశీ విరాట తనయాది వృత్తాంతములచే జగత్ప్రసిద్ధమైనది.

24 శ్లో॥-(71)

ఈశ్లోకమున- "ఉపహన్యాం" అనునపుడు ఉపహతి యనగా- ఇక నెప్పుడును కర్మల నాచరించుటకు తగకుండుట.

25 శ్లో॥-(72)

అవతారిక-

లోకులకు కర్మయోగ జ్ఞానయోగములలో కొందరి కొకదాని యందును, మరికొందరికి మరియొక దానియందును అధికారము కలదు. ఆత్మజ్ఞునకన్నను తన యధికారము నటుంచి సామాన్య ప్రజలలోగల ముముక్షువుల యోగ్యతకు తగినట్లుగా నాచరించవలెననియును, లోకసంగ్రహరీతినిన్ని చెప్పుచున్నారు.

ఈశ్లోకము మొదలు నాలుగుశ్లోకముల తాత్పర్యమును ఈ శ్లోక అవతారికలో చెప్పుచున్నారు.

ఈశ్లోకమున "అహఙ్కారశబ్దమున్నది. దానికి అనేకార్థము లున్నవి.

(1) అహంభావము.

(2) ప్రకృతియొక్క రెండవ వికారము. ఇది యింద్రియము లకును తన్మాత్రలకును పుట్టుటలో సహకరించును.

(3) గర్వము-(పెద్దల నవమానించుస్వభావము.)

(4) దేహాత్మ భ్రాంతి అనగా- శరీరమునే యాత్మ యను కొనుట.

27 శ్లో॥-(73)

25 శ్లోకమున-"యథా కుర్వన్తి తథా కుర్యాత్" అనునది కేవలము దృష్టాన్త దార్ష్టాన్తికవిషయము కాదు. తన యనుష్ఠానమును జూచి యితరులుకూడా కర్మయోగమునే ఎట్లు యనుష్ఠింతురో ఆప్రకారముగ విద్వాంసుడు కర్మయోగము నాచరించవలెను. అట్లైననే

"చికీర్షుర్లోకసఙ్గ్రహం" మ్మనునదియును సుసంగత మగును.

27 శ్లో॥-(74)

లోకసంగ్రహ మనగా-

సం=ఏకీకృత్య- లోకమునందున్న అధికారిజనమును ఏకముఖముగ జేసి స్వీకరించవలెను.

తన యనుష్ఠానవిషయమై తనతో నేకీభవించి ఏకగోష్ఠిగా నొనరించుట.

29 శ్లో-(75)

ఈశ్లోకమునందు నిషిద్ధకర్మలయందలి సంగమును మానవలెనని చెప్పదలంచబడలేదు. అట్లగుచో అవిచాల్యత్వము కుదర

జాలను. కాబట్టి పురుషార్థసాధనములలో దేనియందైనగాని వారి కుండురంగము చెప్పబడవలెను. ప్రస్తుతప్రకరణములలో పురుషార్థము ఆత్మసాక్షాత్కారమే. దానిని బడయుటకై ఆత్మతత్త్వము నెఱుంగని వాడు తాను వినిన ఉపాయములలో తనకు తోచిన దాని నేదో యొకదానిని స్వీకరించి చేయుచుండును. అదియే యిచ్చట చెప్ప దలంచబడినదని చెప్పుచున్నారు.

29 శ్లో॥-(76)

ఇచ్చట మందత్వమనగా- స్వతంత్రించి తన యనుష్ఠానమును నిర్ణయించుకొనజాలకుండుట.

లేక అల్పత్వమని చెప్పవచ్చును. అల్పత్వమనగా అధైర్యము. అధైర్య మేల? చులకనగా మరణించదగినవారగుటవలన దానికేమి కారణము? పూర్తిగ నెఱుంగనివారగుటవల్ల నే

"మూఢాల్పా పటువిర్భాగ్య మన్దాః" అని కోశము.

30వ శ్లోకమున చెప్పినట్లు సర్వేశ్వరునియందే సర్వకర్మ సన్న్యాసము చేయవగియుండగ మధ్య గుణములయందు కర్తృత్వము ననుసంధించమని యిచ్చట చెప్పుట దానివల్లనైనను దేహాత్మ వివేకము తొలంగునను అభిప్రాయముచేతనే.

29 శ్లో॥-(77)

యుక్తాయుక్త వివేక మనగా-

అన్వయవ్యతిరేకములు అనగా-

ఆత్మ శరీరముతో చేరియున్నప్పుడే సాంసారికకర్మలయందు ప్రవృత్తి కలుగుచున్నది. అది లేనిచో నా ప్రవృత్తి యుండదు. కాబట్టి సాంసారిక కర్మలయందలి ప్రవృత్తి ప్రాకృతశరీరసంబంధము మూలముగ వచ్చినదని యెఱుంగవలెను.

ఈశ్లోకముచే

"కర్తా శాస్త్రార్థవత్త్వాత్"

అను సూత్రార్థము వివరింపబడినది.

అనగా- శాస్త్రము సార్థకము కావలెననిన జీవుడు కర్తయని విశ్వసించవలె నని సూత్రార్థము.

శాసనాత్ శాస్త్రం-

శాసనమనగా మంచిచెడ్డలను తెలిపి ప్రవర్తింపజేయుట అది జ్ఞానమున్నవారికే చెల్లును.

30 శ్లో॥-(78)

ఈశ్లోకముచే

"పరాత్తు తచ్ఛ్రుతేః"

అను సూత్రార్థము వివరింపబడుచున్నది. అనగా- వెనుకటిశ్లోకముచే జీవుడు కర్తయని సిద్ధింపగా ఆ కర్తృత్వ మాతనికి స్వాయత్తమా, పరమాత్మాయత్తమా యని వికల్పించి పరమాత్మాయత్తమే యని నిర్ణయింపబడినది.

సామాన్యముగా జీవునికర్తృత్వము పరమాత్మ సంకల్పకృతమే గాని విశేషకర్తృత్వము చేతనాధీనమే. కావుననే జీవుడు పుణ్య పాపములకు బాధ్యుడగుచున్నాడు.

35 శ్లో॥-(79)

అవతారిక-

యుద్ధాదిరూపమైన కర్మయోగముకూడ దుఃఖరూపమగుటచే యథావత్తుగా చేయుట కశక్యముకాదా యనగా చెప్పుచున్నాడు.

36 శ్లో॥-(80)

ఈశ్లోకమున అథ శబ్దము ప్రశ్నార్థకము.

36 శ్లో॥-(81)

ఇచ్చట పురుషశబ్దమును ప్రయోగించుట చేతనుడు ఇష్టము లేకున్నను వాసనచేతనైనను ప్రవర్తింపజేయబడడు. చేతనుడుగదా యని తాత్పర్యము.

36 శ్లో॥-(82)

"సదృశం చేష్టతే స్వస్యాః"

అనుశ్లోకమున పూర్వవాసనానువర్తనము చెప్పబడినది. వాసన జీవునకు కోరికనుబుట్టించి ప్రవర్తింపజేయును. అట్టితరి జ్ఞానయోగము నభిలషించువాడు దానికి విరోధియగు విషయానుభవమును కోరకున్నను యీవాసన వాని నెట్లు విషయానుభవమున ముంచుచున్నది. ఒక అచేతన పదార్థము గాలిచేతనో నీటిచేతనో బలాత్కారముగ త్రోయబడినదై తలంపు లేకున్నను ఎట్లు కదలుచున్నదో అటులనే చేతనుడుకూడ చేయుచున్నాడే; ఇట్లు వీనిని యీగాలి నీరువలె ప్రేరేపించునదేది యని శంక.

37 శ్లో॥-(83)

కామాదులీమతమున ఆత్మధర్మములు, గుణము ప్రకృతి ధర్మము (గుణము) ఒకదానిధర్మము వేరొకచోట కార్యమును పుట్టించు టెట్లు అనగా-

"అట్టి గుణమయమైనది ప్రకృతి"

యనుగ్రంధము బయలుదేరినది. వేడికలది నిప్పు. దానిని తాకినచో చేతిలో బొబ్బ ఎక్కుచున్నది. అటులనే గుణముల కాశ్రయము ప్రకృతి. దానిసంపర్కముచే నాత్మయందు కామాదు లుదయించును.

అయినచో గుణత్రయము (సత్వరజస్తమస్సులు) గల ప్రకృతితో నాత్మకు సంబంధము సమానమేగదా! అప్పుడు సత్వాదికార్యములగు జ్ఞానాదులు ఒక్కుమ్మడి నేల యుద్భవింపవన్నచో-

ఒక్కొక్కప్పు డనుగ్రంథము బయలుదేరుచున్నది. అనగా- సత్వరజస్తమస్సులు మూడును సృష్టిలో విషమావస్థగా నుండును. ఎప్పు డేగుణము విజృంభించునో అప్పు డాగుణముయొక్క కార్యముచే చూడగలముగాని తక్కిన గుణకార్యము లుండనేరవు.

రజోగుణప్రచురు డైనవానికి జ్ఞానయోగారంభము మాత్ర మెట్లు ఘటించుననఁగా- ఈగుణములు పెరుగుచు తరుగుచు నుండుటలో నొకానొక సమయమున ఏదో యొకింత సత్వగుణమును తల యెత్తవచ్చును. అప్పు డీతడే జ్ఞానయోగము నారంభించవచ్చును.

ఇచ్చట "ఏషః, ఏషః"

అని రెండువాదలు వినిపించుచుండుటచే నివి రెండువాక్యములు ఈ రెండు వాక్యములచే తెలుపబడు

"ఏషః" శబ్దమున కొక్క కామమే యర్థము. కానిచో "అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః" అని "పాపాచరణే ప్రయోజకః కః?" అని ప్రశ్నించినప్పుడు "కామ ఏషః క్రోధశ్చ" అనిగదా చెప్పవలెను. పైనకూడా "విద్ధ్యేతావిహ వైరిణౌ" అని ద్వివచనాంతముగా చెప్పవలెను. ఆపైన ఆరు శ్లోకములలో

"తేన" "ఏతేన" కామరూపేణ"

అని యిట్లంతటను ఏకవచనముచేతనే నిర్దేశింపబడెను. కామ మాత్రమే నిర్దేశింపబడెనుగాని క్రోధశబ్దమే వాడబడలేదు. కామము కన్న క్రోధము వేరుగా నిర్దేశింపబడలేదు.

కావున కామమే ఒకయవస్థలో క్రోధశబ్దముచే చెప్పబడును. ఆయవస్థాభేదముచేతనే వాక్యభేదము ఉచితముగాని కామము క్రోధము రెండును వేరనికాదు.

ఈశ్లోకమున కామమునకు

"మహాశనః" అను విశేషణమును. క్రోధమునకు

"మహాపాప్మా అను విశేషణమును చేర్చి యన్వయించవలెను.

"మహాశనః అశనం=భోజనం=భోగ్యజాతం యస్య సః"

అను వ్యుత్పత్తి నిబట్టి యీవిశేషణము కామమున కెంతయో అను గుణము,

"న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి"

"హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభి వర్ధతే"

అనిగదా అభియుక్తోక్తి.

అటులనే క్రోధము-

"మహాపాప్మా" మహాన్ పాప్మా = కార్యతయా అస్యాస్తీతి మహాపాప్మా. మహత్తర పాపములను చేయించునది.

"క్రుద్ధో హన్యాత్ గురూ నపి" అని ప్రసిద్ధి కలదుగదా!

37 శ్లో॥-(85)

ఈశ్లోకమున నొక ముఖ్యవిషయమును గ్రహించవలెను.

విషయముల ననుభవించుటచే బుట్టిన వాసన బీజమువంటిది. తజోగుణము నీరువంటిది. ఈనీటిచే తడుపబడిన యాబీజములు కామ క్రోధము లనబడు మొలకల నెత్తును.

ఈప్రకరణమున కామ మనగా నాత్మధర్మమైన జ్ఞానవిశేషమే. రజస్సు ప్రకృతిగుణము.

ఈశ్లోకమున జెప్పబడిన కామక్రోధములు వెనుక వాసనచే బుట్టింపబడిన రాగద్వేషములయొక్క అవస్థావిశేషములే.

38 శ్లో॥-(86)

ఈశ్లోకమున కామమునకు పొగ, మాలిన్యము, మావి యను మూడు దృష్టాంతములు చూపబడినవి. ఇందు

పోగ, కామము సహజ మనుటకును; మాలిన్యము, వివేకము పశ్చాత్తాపము మొదలగువానిచే నీ కామమును పోగొట్టినను తిరిగి తిరిగి వచ్చుచునే యుండు ననుటకును; మావి తానెంత వివేకియై బలాఢ్యుడై ప్రయత్నించినను గ్రోసిపుచ్చరాకుండుటకును ఉదాహరణముగ జెప్పబడినవి.

కామము వాసననే బుట్టును గాన సహజమైనది. సహజమైన రజోగుణ సంపర్కము పోవునది కాదు కావున నది యున్నంతవరకు వచ్చుచు నేయుండును.

పాపకర్మకృతమగుటచే తొలగింప నలవిగాకుండును.

39 శ్లో॥-(87A)

ఇచ్చట జ్ఞానిశబ్దము నిష్పన్నజ్ఞాని పరము కాదు. అట్టివాని జ్ఞాన మెన్నడును కామముచే నావరింపబడజాలదు. కాబట్టి జ్ఞాన మింకను పూర్తిగా లేని సకలచేతనుల విషయమని గ్రహించవలెను.

39 శ్లో॥-(87B)

ఈశ్లోకమున కామము నిత్యవైరి యని చెప్పబడినది. దీనికి రెండువిధములుగా వ్యాఖ్యానకారులు సమర్థించిరి.

1. ఇది యనాదియు ఆత్మసాక్షాత్కార పర్యంతము విడువక యుండునదియును గాన నిత్యవైరి యనబడినది.

2. నిత్యసంసారులు కొందరుందురను మతము ననుసరించి అట్టి కొన్ని యాత్మల విషయమై నిత్య శత్రువుగనే యుండును.

39 శ్లో॥-(88)

కామమున కీశ్లోకమున

"అనలము" ను పేరుంచబడినది. అనగా- కావలసిన వెన్ని లభించినను

"అలం=చాలును" అనుతృప్తి

"న=లేదు" కనుక

"అనల" మనబడుచున్నది.

శ్లో॥ తృష్ణాఖని రగాధేయం । దుష్పూరా కేన పూర్యతే ।
యా మహద్భి రపి క్షిప్తైః । పూరకై రేవ ఖన్యతే॥

కామ మనునది అంతులేని పెద్ద గొయ్యి. దీని నింపుట కెవ్వరికిని శక్యముకాదు. చిత్ర మేమనగా దీనిని నింపుటకు ఉపయోగించిన వాటిచేతనే ఇది మరింత లోతుగ త్రవ్వబడుచుండును.

లేక "అనల" మనగా నిప్పు అనల శబ్దము కామము నందు గౌణముగా ప్రయోగింపబడినది. గౌణమనగా గుణములను బట్టి వచ్చునది. అగ్నికి దీనిని తగులబెట్టవచ్చును, దీనిని తగులబెట్టరాదను విషయ విభాగము గాని ఇన్నిటిని తగులబెట్టవలెనను అవధి గాని లేనటులే కామమునకు విషయ విభాగముగాని పరిమితిగాని లేవు.

39శ్లో॥ -(89)

## తృతీయాధ్యాయ సారము.

## జ్ఞానయోగముకంటెను కర్మయోగమునకు గల వైశిష్ట్యము.

1. సంసారమున పడియుండి సుఖదుఃఖముల ననుభవించుచు పూర్వజన్మసుకృతవిశేషముచే గాని భగవన్నిర్హేతుకకృపచే గాని ఆచార్య కటాక్షముచేగాని మోక్షేచ్ఛ గలవానికి మొదటి కర్త

వ్యము కర్మయోగమే. ఇందుల కుదాహరణ మర్జునుఁడే. ఈవిషయ మీ అధ్యాయమున ననేకోపపత్తులతో సమర్థింపబడినది.

2. జన్మాంతరసుకృతవిశేషముచేగాని భగవత్కృపచేగాని సాధనాంతరముల నాచరింపకయే యీజన్మ ప్రారంభమునుండియు ఆత్మప్రవణులైన శిష్టాగ్రేసరులకు లోకసంగ్రహముకొరకును దానినుపేక్షించుటచే తటస్థించు తన అనర్థమును బాపుకొనుటకును కర్మయోగమునే చేయవలెను. ఇందుల కుదాహరణము జనకుఁడే.

3. భగవంతుఁడే మనుష్యుఁడుగా నవతరించినచో పై యనర్థము లేకున్నను తాను చేయఁదలంచిన శిష్టరక్షణకును ధర్మసంస్థాపనమునకును ప్రతికూలముగా వారు తనదారినిబట్టి తమ కనర్హమగు జ్ఞానయోగము నవలంబించి తుదముట్టింపజాలక చెడిపోకుండుటకై తానును కర్మయోగమునే చేయవలెను. ఇందుల కుదాహరణము శ్రీకృష్ణపరమాత్మయే.

అను నీమూఁడు విషయములు ననేక ప్రమాణములతోను ఉదాహరణములతోను సమర్థింపబడినవి.

మరియు జీవుడు చేయు సాంసారికకృత్యములు ప్రకృతిసంబంధమువలన వచ్చినవే కాని అవి స్వాభావికములు కావనియు కాబట్టి వానిని చేయించునది ప్రకృతియే యనియు,

భగవంతునకు తాను దాసుడు గాన తనకు భగవంతు డాతని కైంకర్యమున కుపయోగించు దేహేంద్రియబుద్ధ్యాది పరికరముల నొసంగి తానే తన సేవను చేయించుకొనుచున్నాడని భావించి కర్మయోగమును ఫలసంగకర్తృత్వములను విడచి యాచరింపవలెనని యును, బోధించుచున్నది.

గీ తా ర్థ స ఙ్గ్ర హ ము

తృ తీ యా ధ్యా య ప్ర మే య ము.

7 శ్లో॥ అసక్త్యా లోకరక్షాయై । గుణేష్వారోప్య కర్తృతామ్ ।
సర్వేశ్వరే వా న్యస్యోక్తా । తృతీయే కర్మకార్యతా॥

తా. జ్ఞానయోగ విశిష్టులైనవారు కర్మయోగము నాచరింపకుండినచో తమను జూచి లోకులును దాని నాచరింపరు. దానివలన లోకులు చెడిపోవుదురు. దానిచే నీతనికి పాపము దాపరించును. అది యీతనిని జ్ఞానయోగమునుండియు భ్రష్టుని కావించును. కావున లోకమును రక్షించుటకొరకై స్వర్గాది ఫలములయం దాశను వీడి తనను కర్తనుగా భావింపక దానిని గుణములయం దారోపించిగాని లేక గుణములకును, వాని కాశ్రయమైన ప్రకృతికిని దానితో కూడిగాని దానిని విడచిగాని ఉండు జీవులకును నియంతయైన సర్వేశ్వరుని యందుంచిగాని కర్మయోగము నాచరింపవలెనని యీ తృతీయాధ్యాయమున చెప్పబడినది.



# శ్రీ భగవద్గీతా-చతుర్థోఽధ్యాయః.

## జ్ఞానయోగః.

~~~~~~~~

### అవతారిక.

తృతీయాధ్యాయమునందు, ప్రకృతిసంబంధము గలయట్టి ముముక్షువు మొట్టమొదటనే జ్ఞానయోగారంభమునకుఁ దగనివాఁడగుటవలన కర్మయోగమె చేయవలసినదనియు, జ్ఞానయోగాధికారికిఁ గూడ అకర్తృత్వానుసంధానపూర్వకముగాఁ జేయఁబడు కర్మయోగమే శ్రేష్ఠమనియు హేతుయుక్తముగాఁ జెప్పఁబడెను. *జనులలో శిష్టుఁడని ప్రసిద్ధికొందినవాఁడన్ననో, లోకమునకు ధర్మనిశ్చయము చేయుటకొఱకు విశేషించి కర్మయోగమే చేయఁదగినదనియును జెప్పఁబడెను. నాల్గవయధ్యాయమునందు. ఈవైవస్వతమన్వంతరప్రారంభమునందే నిఖిలజగత్తు నుద్ధరించుటకొఱకు నీకర్మయోగ ముపదేశింపఁబడినదగుటచే నిదియే కర్తవ్యమగుటను దృఢపఱచి, దీనియందు జ్ఞాన మంతర్గతమై యుండుటచేత నిదియే జ్ఞానయోగరూపమై యుండుటను నిరూపించి, దీనిస్వరూపమును, దీనియందుఁగల భేదములను, దీనియందు జ్ఞానాంశమే ప్రధానముగా నుండుటయుఁ జెప్పఁబడుచున్నవి. ప్రస్తావవశముగ భగవదవతారరహస్యమును జెప్పఁబడుచున్నది.

శ్రీభగవానువాచ :

శ్లో॥ ఇమం[3] వివస్వతే[2] యోగం ప్రోక్తవా[1]నహమవ్యయమ్ ।
వివస్వాన్ మనవే ప్రాహ మను[4]రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ 1

---

\* అప్రసిద్ధుఁడగువాఁడు, అశక్తుఁడైనను శక్తుడైనను తనకొఱకు కర్మయోగమే చేయఁదగినది. ప్రసిద్ధుఁడగువాఁడు, అశక్తుఁడైనను శక్తుఁడైనను, తనకొఱకును లోకరక్షకొఱకును ఆకర్మయోగమే చేయఁదగినది అని తృతీయాధ్యాయమున అభిప్రాయించితనము తెలియునది.
~~~~~~~~

5
శ్లో॥ ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః।
స కాలే నేహ మహతా యోగో నష్టః పరన్తప॥ 2

శ్లో॥ స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
6 7
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్॥ 3

టీ. అవ్యయం=శాశ్వతమైన, ఇమంయోగం = ఈకర్మయోగమును, అహం=నేను, వివస్వతే=సూర్యునికొఱకు, ప్రోక్తవాన్ =ఉపదేశించితిని, వివస్వాన్ =సూర్యుఁడు, మనవే=వైవస్వతమనువుకొఱకు, ప్రాహ = చెప్పెను, మనుః=వైవస్వతమనువు. ఇక్ష్వాకవే = (తన పుత్రుఁడగు) ఇక్ష్వాకువుకొఱకు, అబ్రవీత్ =చెప్పెను.

టీ. పరన్తప = శత్రువులను తపింపఁజేయు అర్జునా, ఏవం = ఈప్రకారము, పరమ్పరాప్రాప్తం=సంప్రదాయపరంపరగా వచ్చిన, ఇమం=ఈకర్మయోగమును, రాజర్షయః=జనకాది రాజర్షులు, విదుః= ఎఱుఁగుదురు. సః యోగః=ఆయోగము, మహతా కాలేన = దీర్ఘకాలముగుటచేత, ఇహ=ఈలోకమునందు, నష్టః=(ఇంచుమించుగా) నశించినట్టిదైనది

టీ. స ఏవ=అదే, పురాతనః=ప్రాచీనమైన, అయం యోగః= ఈకర్మయోగము, మే=నాకు, భక్తః=భక్తుఁడవును, సఖాచ=మిత్రుఁడవును, అసి (ఇతి) = అగుచున్నావని, అద్య = ఇప్పుడు, మయా = నాచేత, తే = (ప్రపన్నుఁడ వగు) నీకు, ప్రోక్తః = సవిస్తరముగాఁ జెప్పఁబడినది, ఏతత్ =ఇది, ఉత్తమం = శ్రేష్ఠమైన, రహస్యం హి = రహస్యము గదా.

తా. అర్జునా. నీ కిప్పుడు చెప్పబడిన శాశ్వతమైన యీకర్మయోగమును కేవలము నిన్ను యుద్ధమునకు పురికొల్పుటకుఁగాను గ్రొత్తగా నిప్పుడు కల్పించిచెప్పితినని తలఁపవలదు. సకల జగముల

నుద్ధరించుకొనుటకును, పరమపురుషార్థలక్షణ మగు మోక్షమునకు
సాధనముగాను, ఈయోగమును పూర్వమే *(అనఁగా మన్వంత
రారంభమునందే) నేనే సూర్యున కుపదేశించితిని, సూర్యుఁడు
వైవస్వతమనువునకుఁ జెప్పెను. ఆ మనువు ఇక్ష్వాకున కెఱింగించెను.
ఈవిధమున సంప్రదాయపరంపరగా ప్రాప్తించిన యీకర్మయోగ
మును పూర్వీకు లగు జనకాదిరాజర్షు లెఱుఁగుదురు. అట్టియోగము
బహుకాలమగుటచేత ఈలోకమున (ఆ యాశ్రోతల బుద్ధిమాంద్యము
8
వలన) నష్టప్రాయ మైనది. నీవు నాయెడ భక్తుఁడవును నాసఖుఁ
డవును నాయెడనే ప్రపన్నుఁడవును అగుటంజేసి పురాతన మైనయీ
యోగమును ఇప్పుడు చెడియున్నదానిని గాక అప్పటివలె స్వరూ
పము చెడక యున్నదానినే సపరికరముగాను సవిస్తరముగాను నిప్పుడు
నీకు నుపదేశించితిని, ఇది వేదాంతములయందుఁ జెప్పబడు ఉత్తమ
మయిన రహస్యము. (కావున దీనిని తెలిసికొనుటకును చెప్పుటకును
నాకుతప్ప మఱియొకనికి శక్యము కా దని భావము.)

9 10
అవ. ఈప్రసక్తియందు భగవంతునియవతారముల స్వరూప
11
మును కలరీతి నెఱుఁగుట కర్జునుఁడు అడుగుచున్నాఁడు,

---

* ఇది మన్వంతరాదియందె చెప్పఁబడినది గాన నిఖిలజగము నుద్ధరించుకొనుటకే యగును గాని నిన్నుయుద్ధమునకుఁ బురికొలుపుటకిప్పుడే కల్పించి చెప్పఁబడినదిగాదని భావము. మఱియు నిట 'ఇమం వివస్వతే ప్రోక్తవానహమ్' 'సమయా తేఽద్య ప్రోక్తః' అను నీరెంటిచే పూర్వము చెప్పినవాఁడను నేనేయని యేర్పడుచున్నది. కాఁబట్టి 'నాకు తప్ప మఱియొకనికి శక్యముగాదు' అనుట సిద్ధించినది. అనఁగా ప్రళయముచేతఁగాని యుగాది స్వభావముచేతఁగాని సంప్రదాయము విచ్ఛిన్నము కాఁగా మరల నేనే యా సంప్రదాయమును బ్రవర్తింపఁజేయుదును. బ్రహ్మాదులకుఁ గూడ నాయుపదేశము లేక దానిని తెలియుటకును చెప్పుటకును శక్యము గా దని భావము.

అర్జున ఉవాచ :

శ్లో॥ *అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః।
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి॥ 4

టీ. వివస్వతః = సూర్యునియొక్క, జన్మ=జననము, పరం = మునుపటిది, భవతః=నీయొక్క, జన్మ=జననము, అపరం=తరువాతిది, ఆదౌ=పూర్వము, త్వం=నీవు, ప్రోక్తవాన్=(సూర్యునికి) చెప్పితివి, ఇత్యేతత్ = అసంభావ్యమైన యీయంశమును, కథం= ఎట్లు, విజానీయాం=యథార్థముగా తెలిసికొనుదును.

తా. కాలసంఖ్యచే నీజన్మము నాజన్మముతో సమకాల మైనది గదా. నీవు ఇప్పుడు జనియించినవాఁడవు. సూర్యునిజన్మమో కాల సంఖ్యనుబట్టి పూర్వకాలమునందలిది. అనఁగా 28 చతుర్యుగములకు మునుపటిది. ఇట్టినీవు పూర్వముననే సూర్యున కుపదేశించితి వను మాట అసంభావనీయమైనది. ఇట్టిమాటను నే నెట్లు యథార్థముగా తెలియుదును ?

"ఈజన్మమే కాక ఇంతకుమునుపుచు జన్మాంతరములు గలవు గాన జన్మాంతరముచేతనుంగూడఁ జెప్పుట శక్యమగును. (అనఁగా, అప్పటి సూర్యునికి అప్పటిజన్మముచేతఁ జెప్పఁగూడును.) ఈశ్వరుఁ డగుకృష్ణునికే కాక మహాత్ము లైనవారికిని పూర్వజన్మములందుఁ

12

జేసినవానిని స్మరించుటయు నొప్పియున్నది. కాఁబట్టి ఇందు కాల సంఖ్యాదులనుబట్టి విరోధ మేదియుఁ గానరాదు. ఈ యర్జునుఁడును 'వివస్వతునికి నేను జెప్పితిని' అని తనకు చెప్పిన వసుదేవకుమారుని

* 'అపరం' అని పాఠాంతరము.

13 14

కృష్ణుని సర్వేశ్వరుఁ డని యెఱుంగును. కావుననే 'పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్। పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్॥ ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా। అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే' (గీతా-౧౦ అధ్యా--౧౨-శ్లో) అని చెప్పెడిని యుధిష్ఠిరరాజసూయాదులందు, భీష్మాదులు 'కృష్ణ ఏవహి లోకానా ముత్పత్తి రపిచాప్యయః। కృష్ణస్య హి కృతే భూత మిదం విశ్వం చరాచరమ్' (భారత, సభా, ౩౮--అధ్యా-౨౩-శ్లో) ఇత్యాదులందు పలుమాఱును జెప్పఁగా వినియు నున్నాఁడు. 'కృష్ణస్యహి కృతే' అనఁగా కృష్ణునకు శేషభూతమైనది యీ సమస్తమైనజగత్తని యర్థము. కాఁబట్టి యర్జునుఁడు కృష్ణునిపరత్వమును దెలిసియు నిట్లడుగుట కభిప్రాయమేమి ?'' యని యడిగినచో, వసుదేవసూనుఁ డగు నీకృష్ణుని అర్జునుఁడు భగవంతుఁ డని యెఱుంగునే. ఎఱిఁగియు నెఱుఁగని వానివలె నడుగుట కభిప్రాయ మిది. *నిఖిలహేయప్రత్యనీక కల్యాణైకతానుఁడును సర్వేశ్వరుఁ

* హేయము=త్యజింపఁదగినది...అనగా దోషము, 'నిఖిల...నీక' అనఁగా దోషములకన్నిటికిని ప్రతివిరోధియైనవాఁడు - దోషలేశములులేనివాఁ డనుట. 'కల్యాణ+ఏకతాన' మంగళములకే ఆశ్రయమైనవాఁడు - అఖండమంగళస్వరూపుఁ డనుట. వాని స్వరూపము దోషశూన్యమును అఖండమంగళాత్మకము నైనదని యర్థము.

భగవంతుని జన్మాదులు మిథ్యలా? సత్యమా? ఎట్టివి? అని సందేహములను బుట్టించు భగవంతుని విశేషములను జెప్పుచున్నారు. (నిఖిలహేయప్రత్యనీక) సమస్తములైన హేయములకును విరోధియైనది. అనఁగా నెవఁడు ఇతరులయందలి జన్మము జర మొదలైన హేయములను దొలగించునో యట్టివాఁడు తా నెట్లు వానినే కయికొను ననుట. (కల్యాణైకతానుఁడు) నిలువెల్ల కల్యాణమే యైనవాఁడు-స్వరూపానందముచే తృప్తుఁడైనవానికి జన్మముతోఁ బనియేమి యనుట, (సర్వేశ్వరుఁడు( సమస్తమునకు నియామకుఁడు-ఎవఁడేని యొకస్వతంత్రుఁడు ఇతనికి నియామకుఁడుగా నుండు నేని యప్పటికి ఇతనికి జన్మాదులు ఘటింపవచ్చును. అయిన, నట్టినియామకుఁడు లేఁడని భావము, (సర్వజ్ఞుఁడు) సమస్తము తెలిసినవాఁడు-ఇతఁడు తనకు

డును సర్వజ్ఞుఁడును సత్యసంకల్పుఁడును అవాప్తసమస్తకాముఁడు
నగు భగవంతుఁడు, దేవమనుష్యాదులు కర్మవశమున నెత్తుజన్మముల
వంటి జన్మము తాను ఎత్తుట యింద్రజాలములవలె మిథ్యయా? లేక
సత్యమా? సత్యమైనయెడల *జన్మించుప్రకార మెట్లు? ఈజన్మిం
చిన దేహము దేనిమయము? జన్మించుటకు హేతు వేమి? జన్మిం
చుట యెప్పుడు? ఎందుకొఱకు? అను నీవిషయములను తెలిసికొను
టకే కాని వేఱుకాదని వరుసగా శ్రీకృష్ణుని యుత్తరముల క్రమమును
బట్టి ప్రశ్నార్థములు తెలియుచున్నవి.

శ్రీభగవా నువాచ :

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప॥ 5

---

హితమును అహితమును తెలిసికొనఁజాలనివాఁడేని యప్పుడు బిడ్డలు మొదలైనవారు
తెలియక అగ్ని మొదలగువానిని స్వేచ్ఛచేతనే యంటునట్లు, తానును తెలియమివలన
స్వేచ్ఛచేతనే జన్మాదులు పరిగ్రహింపఁగలుగును. అయినను ఇతఁడట్టివాఁడు గాఁడు
గనుక జన్మాదులు గయికొనుట గలుగదని భావము. (సత్యసంకల్పుఁడు) పొల్లు
గానిసంకల్పము గలవాఁడు-అనఁగా తలఁచినది తప్పక సిద్ధించునట్టివాఁడు. హితా
హితజ్ఞాన ముండినను ఒకఁడు శుష్కములోఁ బడఁదలఁచి కొంపిలోఁబడుటగలదు.
అట్లు తలఁచినది తప్పుట లేనివాఁడు గనుక తనతలంపు నతిక్రమించి జన్మాదుల నెత్తు
వాఁడు గాఁడనుట, (అవాప్తసమస్తకాముఁడు) సమస్తములైనకోరికలను బడసిన
వాఁడు. ఏకేని యొక ప్రయోజనమును సాధింపవలసి యున్నయెడ అందులకై
జన్మాదులెత్తఁగూడును. ప్రయోజనమే లేకుండఁగా ఆజన్మాదు లెందుబకు? అని
భావము.

* జన్మప్రకార మెట్లు అనఁగా, జన్మించుట తన పరమేశ్వరస్వభావమును
పరిత్యజించియా లేక మఱియొకవిధమునసా? యని యర్థము. ఈదేహము దేని
మయము? అనఁగా త్రిగుణాత్మకమైన ప్రకృతిమయమా? లేక. అప్రాకృతమైనదా?
యనుట. జన్మహేతు వేది? అనఁగా హేతువు సంకల్పమాత్రమా? లేక, ఇచ్ఛచేఁ
గైకొన్న పుణ్యపాపములా? యనుట. జన్మము ఎప్పుడు? అనఁగా పుణ్యపాపములు
పరిపక్వమగుకాలమునందా? లేక, ధర్మగ్లాని కలుగుకాలమందా? యనుట. జన్మ
మెందులకు? అనఁగా సుఖదుఃఖము లనుభవించుటకా? లేక, సాధుపరిత్రాణము
నకా? యనుట.

టీ. హే అర్జునా, తవచ=నీకువలెనే, మే=నాకును, బహూని = అనేకములైన, జన్మాని = అవతారములు, వ్యతీతాని = కడచినవి, తాని సర్వాణి=వానినన్నిటిని, అహం = నేను, వేద = ఎఱుఁగుదును, పరన్తప=అర్జునా, త్వం=నీవు, న వేత్థ=ఎఱుఁగవు.

తా. అర్జునా, నీకువలెనే నాకును అనేకజన్మము లతిక్రమించినవి. మన యిద్దఱజన్మము లన్నింటిని సర్వజ్ఞుఁడ నగునే నెఱుంగుదును. కర్మవశమున సంకుచిత మైనజ్ఞానము గల నీ వెఱుంగవు.

ఈశ్లోకముచే 'బహూని మే వ్యతీతాని జన్మాని' అని చెప్పుట వలనను 'తవచ' అని దృష్టాంతముగాఁ గొనుటవలనను భగవంతుని *జన్మములు సత్యమై యుండుట చెప్పఁబడినది.

---

* అర్జునుఁడు 'పూర్వజన్మములు ఒక్కటియా? పెక్కా?' యని కాని 'అవి నీకుఁ దెలియునా?' యనికాని యడుగలేదుగాన జన్మములు పెక్కు లనియు అవి తనకుఁ దెలియు ననియుఁ గృష్ణుఁ డుత్తరము చెప్ప నేల? యన్నచో, ఆట్లు చెప్పుట యవి సత్యములని తెలుపుటకే కాని మఱియొకటి కొఱకుఁ గాదనుటకే 'జన్మము సత్యమై యుండుట చెప్పఁబడినది' అని యున్నది. జన్మములు పెక్కు లనియుఁ గడచి పోయిన వనియు తనకుఁ దెలియు ననియునే శ్లోకమున అర్థమగుచున్నదిగాని 'సత్యము లగు' నని యర్థము కాలేదే? యని యడుగవచ్చును. దీనికి సమాధాన మెట్లనఁగా- 'అప్పటివివస్వతునికి ఇప్పటి నీవు ఎట్లు చెప్పితివి?' అని యర్జునుని ప్రశ్నము. అందులకు 'అప్పటిజన్మముచేతఁ జెప్పితిని; ఇప్పుడు దానినే యనుసంధించి చెప్పుచున్నాను' అని సరిగా కృష్ణుఁడు చెప్పవలసిన యుత్తరము. అయినను అర్జునుఁడు కృష్ణునిపరత్వమును తెలిసియే తెలియనట్లు అడిగినాఁడనియు, కాన నతని ప్రశ్నమునకుఁ దెలిసికొనఁగోరిన విషయములు వేఱనియు, కావుననే కృష్ణుఁడును ఆ చెప్పవలసిన యుత్తరము చెప్పక 'బహూని...' అని వేఱుత్తరమును జెప్పె ననియు వివరింపఁబడినదిగదా. ఈ యుత్తరమునకు ఆ తెలిసికొనఁగోరినవానిలో ఏది ప్రశ్నముగా నుండఁగూడు నని యాలోచింపఁగా, 'జన్మము సత్యమా మిథ్యయా?' యనుటయే ప్రశ్నముగా నుండఁదగియున్నది. ఎట్లన (బహూని) పెక్కులు, (అతీతాని) కడచినవి అనెడి యీవిశేషణములు సత్యము లయినజన్మములకే చెప్పఁజెల్లునుగాని మిథ్య లయినవానికిఁ జెప్పఁదగవు. మిథ్యలైన జన్మములను 'జన్మాని' జన్మములు అనుట చెల్లదు; 'జన్మప్రతిభాసాః' జన్మమువలెనున్న తోఁపికలు అనుటయే చెల్లును; మఱియు 'అతీతాని' కడచినవి యనుట యొప్పదు; 'నష్టాని', 'నశించునవి' అనుటయే

అవ. *అవతారప్రకారమును దేహస్వరూపమును జన్మహేతువును జెప్పఁబడుచున్నవి.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా॥ 6

టీ. అజః అపి సన్ = పుట్టుక లేనివాఁడ నగుచును, అవ్యయాత్మా (అపి సన్) = నాశరహితమైనస్వరూపము గలవాఁడ నగుచును, భూతానామ్ = సర్వప్రాణులకు, ఈశ్వరః అపి సన్ = నియామకుఁడ నగుచును, స్వాం = నాదైన, ప్రకృతిం = స్వభావమును (అప్రాకృత మంగళవిగ్రహమును), అధిష్ఠాయ = అధిష్ఠించి (అనగాఁ విడువకయే), ఆత్మమాయయా = నాసంకల్పరూప మగుజ్ఞానముచేత, సమ్భవామి = జనించుచున్నాను.

తా. కర్మకృత మగుజననమరణములు లేనివాఁడ నగుచును, సర్వభూతనియామకుఁడ నగుచును, నాపరమేశ్వరస్వభావమును విడు

యొప్పను. ఇంతే కాక అర్జునుఁడు తనజన్మము నెట్టిది యని యడుగకపోయినను దానిని 'తవచ' అని కృష్ణుఁడు దృష్టాంతముగాఁ గొనుటంజూడఁగా, అర్జునుని జన్మము వలెనే తన జన్మమును సత్య మని రూపించుటకే యట్లు గొనుట యొప్పను గాని మఱియొక కారణ మందులకుఁ బొసఁగదు. కాన సత్యత్వమే యీశ్లోకమునఁ జెప్పఁబడినదని గ్రాహ్యము. అనఁగా దృష్టాంతము సత్యమగుటచేతను, తన జన్మములకు 'బహూని' అనియు 'వ్యతీతాని' అనియు విశేషణము లుండుటచేతను, సర్వేశ్వరుని జన్మములు సత్యములే కాని మిథ్యలు కా వని నిరూపితమయ్యెనని తెలియుంగునది. అనఁగా, నీయిప్పటిజన్మ మెట్లు సత్యమో అట్లే నాయిప్పటి యవతారమును సత్యము. ఇట్లే మనపూర్వజన్మములును సత్యములు. అయినను నీవు వాని తెలియంగవు నే నెఱుంగుదును. కాఁబట్టి నాపూర్వజన్మమునందుఁ జేసిన సూర్యోపదేశమును ఇప్పుడు స్మరించి చెప్పినవాఁడ నైతి ననిభావము.

* ఇచ్చట 'అజోఽపి...సన్' అని మొదటిసగముచేత అవతారప్రకారమును, 'ప్రకృతిం స్వామధిష్ఠాయ' అనుటచే దేహయాథాత్మ్యమును, 'సమ్భవా మ్యాత్మమాయయా' అనుటచే జన్మహేతువును జెప్పబడినవి.

నకయే, నాదివ్యవిగ్రహముతోనే నాసంకల్పముచేత దేవాదిరూపము గలవాఁడనై జనించుచుందును.

అజత్వము, అవ్యయత్వము, సర్వేశ్వరత్వము మొదలైనవి నాపరమేశ్వరత్వముయొక్క విశేషణములు. ఈప్రకారముల నన్నిటిని విడువకయే నాదైవప్రకృతి నధిష్ఠించి నామాయచేత పుట్టుచున్నాను. † ఇచట ప్రకృతి యనఁగా స్వభావము. నాస్వభావమునే యధిష్ఠించి,

† ఇట ప్రకృతిశబ్దముచే త్రిగుణాత్మకమైన ప్రకృతిని గ్రహింపరాదు. పర స్వరూపమునకె కాక అవతారములందుఁగూడ భగవంతుని విగ్రహము 'నభూత సఙ్ఘసంస్థానో దేహోఽస్య పరమాత్మనః' 'ఈపరమాత్ముని దేహము భూతసమూహము లచే నైనదిగాదు' (భారతము) 'నతస్య ప్రాకృతా మూర్తి ర్మాంస మేదోఽస్థిసమ్భవా' 'అతని ప్రాకృతదేహము-అనఁగా అవతారవిగ్రహము-మాంసము మెదడు ఎముకలు వీనిచేతఁ గలిగినదికాదు' (వాయుపురాణ-పూర్వఖండ-౩౮-౪౦) అన్నట్లు త్రిగుణాత్మకమైన ప్రకృతిచేఁగలిగినదిగాదు. కనుక నిట ప్రకృతియనుటకు అవతారమున కుపయుక్తమైన దేహోక్తప్రకృతియగును. కాఁబట్టియు ప్రకృతియనఁగా 'ప్రకృతిః పఞ్చభూతేషు స్వభావే మూలకారణే' అను నిఘంటువు చొప్పున స్వభావము అని యర్థము చేయఁబడినది. స్వభావ మనఁగా నిచట స్వభావమువలె అసాధారణ విశేషణమైయుండు విగ్రహము గ్రాహ్యము. కావుననే 'నారూపముచేతనే' యని విగ్రహము చెప్పబడెను. (అధిష్ఠాయ) అని తానే యాప్రకృతిని అధిష్ఠించుటవలన స్వాతంత్ర్యము తెలియుచున్నది గావున 'నా యిచ్ఛను' అనఁబడెను, లేక 'తన స్వభావమునే యధిష్ఠించి...బుట్టుచున్నాను' అనుట లేకవాక్యముగాఁ గొన్నచో, శ్లోకమునకు నిది మొత్తముమీఁది యర్థమగును అందు పరస్వభావమును దెలుపు మొదటిసగమునకు 'తన స్వభావమునే యధిష్ఠించి' యనియు 'ప్రకృతిం స్వామధిష్ఠాయ' అనుటకు 'నా రూపముచేతనే' యనియు 'సమ్భవా మ్యాత్మ మాయయా' యనుటకు 'నాయిచ్ఛను' అనియు నర్థములుగా గ్రహింపునది. ఈయోజనయందు ప్రకృతిశబ్దముచే అవతారమునకయిన దివ్యవిగ్రహమే గ్రాహ్యము. ఇందులకు 'ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్' (రా-పురుషసూక్త) 'తమస్సునకు (అనఁగా ప్రకృతికి) అవ్వల సూర్యవర్ణము గలవాఁడు' అని యర్థము దీనిచే అప్రాకృతుఁడనియు నిరతిశయదీప్తిమంతుఁ డనియు సిద్ధించుచున్నది. 'క్షయన్త మస్యరజసః పరాకే' (సామవేదసం-ఉత్తర ప్రపా. ౧౨ అధ్యా. ౨ఖం. ౪ అను. ౨ వా.) 'రజస్సునకంటె-(అనఁగా రజోగుణకమైన మూలప్రకృతికంటె)-నవ్వల నివసించువాఁడు' విగ్రహము లేక నివసించుట గలుగదు గనుక నిట నివసించువాఁ డనుటవలన విగ్రహము గలవాఁ

(అనఁగా) నారూపముచేతనే, నా యిచ్ఛను, బుట్టుచున్నానని యర్థము. తనస్వరూపము 'ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్' 'క్షయ

---

దనియు సిద్ధించుచున్నది. ఇట్టీరెండుశ్రుతులచే ప్రకృతికంటె నవ్వాలయైన పరమపదము నిలయముగాఁ గలనిత్యవిగ్రహము కలిమి చెప్పఁబడినది. ఈవిగ్రహమునకే అవతారదశను దెలుపుచున్నారు. 'యఏషోన్తరాదిత్యేహిరణ్మయః పురుషోదృశ్యతే' (ఛాం-౧-౬-౬) 'సూర్యమండలములోపల వర్తించువాఁడు బంగారువర్ణము గలవాఁడు నగు ఈపురుషుఁడు కనఁబడుచున్నాఁడు. ఇచట 'హిరణ్మయుఁ' డనఁగా రమణీయుఁ డని యర్థము. ఆదిత్యవర్ణుఁ డన్నను హిరణ్మయుఁడన్నను ఒకవర్ణమే. అయితే ప్రతికూలురకు ఆదిత్య వర్ణుఁడనియు అనుకూలురకు హిరణ్మయుఁ డనియు ముఖభేదముచేతఁ జెప్పఁబడుట తెలియునది. 'తస్మిన్నయం పురుషో మనోమయః అమృతో హిరణ్మయః'-'అందు (అనఁగా హృదయమునందు) శుద్ధమనస్సుచేత గ్రహింపందగినవాఁడును,మృత్యువులేనివాఁడును,హిరణ్మయుఁడునునగు నీపురుషుఁడు' (తైత్తి-శిక్షా-౬-౧) పూర్వశ్రుతిచే సూర్యమండలవర్తిగాను ఈశ్రుతిచే హృదయాంతర్వర్తిగాను జెప్పఁబడుటవలన నీరెంటిచే ఉపాసనస్థానవిశేషములందలిస్థితి తెలుపఁబడెను. 'సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి' (తైత్తి. నారా ౬-౧-౮) అనిమేషులగు దేవతలందఱును (లేక నిమేషులగుమనుష్యాదులందఱును) మెఱుపువన్నె గలపురుషునినుండి పుట్టిరి. '(మనోమయః ప్రాణశరీరం) భారూప స్సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామ స్సర్వగన్ధః సర్వరసః సర్వమిద మభ్యాత్తః' (ఛాం-౩-౧౪-౨) (భారూపః) భాస్వరరూపుఁడు-అప్రాకృత నిరతిశయకల్యాణ దివ్యరూపుఁడు, (సత్యసంకల్పః) కొట్టువడని సంకల్పము గలవాఁడు (ఆకాశాత్మా) ఆకాశమువలె సూక్ష్మమును స్వచ్ఛము నైనస్వరూపము గలవాఁడు-లేక తక్కిన సమస్తమునకు కారణభూతమైన యాకాశమునకును ఆత్మభూతుఁ డైనవాఁడు, (సర్వకర్మా) సర్వజగత్తు తనకర్మమైనవాఁడు లేక సర్వక్రియలును తనవియైనవాఁడు, (సర్వకామః) పరిశుద్ధములైన సర్వవిధభోగ్యభోగోపకరణాది కామితపదార్థములుఁ గలవాఁడు. (సర్వగన్ధః సర్వరసః) ప్రాకృతములైన గంధరసాదులు లేనివాఁడు-అప్రాకృతములును తనకే యసాధారణములును నిరవద్యములును నిరతిశయములును కల్యాణములును తనకు భోగ్యములు నయినసర్వవిధగంధరసములుఁ గలవాఁడు. (సర్వమిదమభ్యాత్తః) రూపము మొదలుగా రసమువఱకుఁ గలసర్వవిధకల్యాణగుణ సమూహమును స్వీకరించినవాఁడని యర్థము (మహారజనం వాసః) అతనివస్త్రము కుసుంభరాగము గలది. (బృహ-౪-౩-౬) ఈశ్రుతులెల్ల, విలక్షణమైన పరమపదస్థానము కలిగియుండుట వర్ణవిశేషము పురుషశబ్దవాచ్యత్వము మొదలైనవానిచేత 'ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్' అని మొదటఁ జెప్పఁబడిన పురుషసూక్తవాక్యమునకు సమానార్థకములుగా నుండుట, తెలియునది,

స్తమస్య తమసః పరాకే' 'య ఏషో౽న్తరాదిత్యే హిరణ్మయః పురుషః తస్మిన్నయం పురుషో మనోమయః అమృతో హిరణ్మయః' 'సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి' 'భారూపస్సత్యసఙ్కల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామ స్సర్వగన్ధ స్సర్వరసః' 'మాహారజనం వాసః' ఇత్యాది శ్రుతులవలన సిద్ధము. 'ఆత్మమాయయా' అనఁగా ఆత్మీయమైన మాయచేత [ఇచట, మాయాశబ్దము 'మాయా వయునం జ్ఞానమ్' (వేదనిఘంటు-ధర్మవర్గ ౨౨) అని జ్ఞానార్థకము. ఇట్లే అభియుక్తులును, మాయయాసతతం వేత్తి ప్రాణినాంచ శుభాశుభమ్' అని మాయాశబ్దమును జ్ఞాన మనునర్థమునఁ బ్రయోగించి యున్నారు. కాన] తన జ్ఞానముచేత ననుట-తనసంకల్పముచేత నని యర్థము. కాఁబట్టి అపహతపాప్మత్వము మొదలైన సమస్త కల్యాణ గుణములమయ్యమై యీశ్వరసంబంధియగు సమస్తమైన స్వభావమును విడువక నారూపమునే ఆయా దేవమనుష్యాదిజాతులకు సజాతీయమైన యవయవాకృతులు గలదిఁగాఁ గావించుకొనుచు నాసంకల్పముచేత దేవాది రూపములతోఁ బుట్టుచున్నా నని యర్థము. దీనినే 'అజాయమానో బహుధావిజాయతే' అని శ్రుతి చెప్పుచున్నది. అనఁగా ఇతరపురుషులకు సాధారణముగా కర్మముచేతఁ గలుగునట్టి జన్మము నొందక తనసంకల్పముచేత దేవాదిరూపములతోఁ బూర్వోక్తప్రకారమునఁ బుట్టుచున్నాఁడని యీ శ్రుతి కర్థము. * 'బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జున! తాన్యహం వేద

* ఇట 'వేద' 'సృజామి' 'దివ్యమ్' అను శబ్దములచే భగవంతుని జన్మము బుద్ధిపూర్వకమగుట, తన యిచ్ఛచేతఁ గైకొనుట, దివ్య మగుట మొదలైనవి తెలియుచున్నది. మాయాదిశబ్దములకు అవిద్యామలుగా నర్థముసేసినచో వీనికెల్ల విరోధము గలుగును. ఎట్లనఁగా 'జన్మాని' అని జన్మశబ్దము నిజమైన జన్మమును చెప్పునదే కాని జన్మప్రతిభాసమును గాదు. వ్యతీతశబ్దము బాధమును జెప్పదు. 'ఆత్మమాయయా' అనుటంబట్టి భగవంతుఁడు మాయాగృహీతుఁ డగునేని 'అహం వేదసర్వాణి' అని యతనికి సర్వవేదిత్వము కలుగఁజాలదు. 'ఆత్మానం సృజామ్యహమ్' అనుచో ఆత్మ మిథ్య యగునేని 'సృజామి' అని సృష్టిశబ్దము అందు ప్రయోగింపఁ జెల్లదు. అది

సర్వాణి' 'తదాఽఽత్మానం సృజామ్యహం' 'జన్మకర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః' అని వెనుకను ముందును జెప్పఁబడిన వాని కీయర్థమే యవిరుద్ధము గావున నిదియే గ్రాహ్యము.

అవ. జన్మకాలము చెప్పఁబడుచున్నది.

15

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।

16 17

అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం† సృజామ్యహమ్॥ 7

టీ. భారత=అర్జునా, యదా యదా=ఎప్పుడెప్పుడు, ధర్మస్య=వేదోక్తధర్మమునకు, గ్లానిః=హాని, భవతి=కలుగుచున్నదో, అధర్మస్య=అధర్మమునకు, అభ్యుత్థానం=అభివృద్ధి, (భవతి—కలుగుచున్నదో) తదా—అప్పుడు, అహం=నేను, ఆత్మానం=నన్ను, సృజామి = సృజింతును.

18

తా. నాజన్మమునకు కాలనియమము లేదు. ఎప్పుడెప్పుడు వేదోక్తమై వర్ణాశ్రమవ్యవస్థారూపముగాను కర్తవ్యముగాను నుండు ధర్మమునకు హానియు అధర్మమునకు వృద్ధియుఁ గలుగునో, అప్పుడెల్ల నేనే నాసంకల్పముచేతనే అవతారంబు గావించుచుందును.

అవ. తాను జన్మమెత్తుటకు ప్రయోజనమును జెప్పుచున్నాఁడు.

---

త్రిగుణములచేఁ గలిగినదేని 'దివ్యమ్' అని దివ్యత్వము చెప్పఁబడదు. కాన మాయాదులు సంకల్పాద్యర్థకములే యగును.

† ఈశ్వరుఁడు 'ఆత్మానం సృజామి' అనుచో ఆత్మ యనఁగా తనస్వరూపము గాదు; అది నిత్యమైనది గాన దానిని సృజించుట చెల్లదు ఇది జీవప్రకరణము గాదు కావున జీవుఁడును గాదు. ఆద్యవిగ్రహముతోఁ గూడిన తానును గాదు; ఆరూపము గూడ నిత్యమైనది గాన సృజించుట కర్హము గాదు. కనుక అవతారవిగ్రహముతోఁ గూడినతన్నే 'ఆత్మానం' అని చెప్పినాఁడు గాన 'పూర్వోక్తప్రకారముగ' నని యీవివరము తెలియుటకై కూర్పఁబడినది, అనఁగా పూర్వశ్లోకమున 'అపహతపాప్మత్వాదు... నారూపమునన్నే' అని చెప్పఁబడినప్రకారముగా నని గ్రాహ్యము.

19

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే॥ 8

టీ. సాధూనాం=ధర్మానుష్ఠానశీలు రగు సత్పురుషులయొక్క, పరిత్రాణాయ = రక్షణముకొఱకును, దుష్కృతాం = పాపకర్మము చేయువారియొక్క, వినాశాయ = నాశముకొఱకును, ధర్మసంస్థాపనార్థాయ=ధర్మమును చక్కఁగా స్థాపించుటకొఱకును, యుగేయుగే= అయ్యైయుగమునందు, సమ్భవామి=పుట్టుచున్నాను.

తా. *పూర్వోక్తలక్షణమైన ధర్మమే శీలముగాఁగలిగి వైష్ణవాగ్రేసరులును నన్నాశ్రయింపఁబూనినవారు నగుసాధువులు నా యొక్క నామకర్మస్వరూపములు తమవాఙ్మనసములకు అందనివిగా నుండుటవలన నాదర్శనముచేత తప్ప తక్కిన విధములచేత తమయొక్క ధారణపోషణాదులను బొందనివారై నన్ను చూడని క్షణమాత్ర కాలమును కల్పసహస్రముగా నెన్నుచు దుఃఖవశమున మిక్కిలి శిథిల గాత్రు లగుదు రని తలఁచి, యట్టివారికి నా స్వరూపచేష్టితావలోకనాలాపాదుల నొసంగి రక్షించుటకును, అట్టివారు కానట్టి దుష్టులను శిక్షించుటకును, నా యారాధనరూపమైన వైదికధర్మము క్షీణింపఁగా * ఆరాధింపఁదగిన నాస్వరూపమును జూపుచే మరల ఆధర్మమును

---

* 'పూర్వోక్తలక్షణమైన' అనఁగా పూర్వము 'వేదోక్తమై వర్ణాశ్రమవ్యవస్థా రూపముగా నుండు' అని చెప్పఁబడిన ధర్మమని తెలియనది. స్వరూపాదు లనఁగా విగ్రహము, పనులు, చూచుట, సంభాషించుట మొదలైనవి. సాధువులచే నారాధింపఁబడుటకుఁ దగిన నావిగ్రహమును (ఆకారమును) చూపి మనోహరములైన నా చేష్టలచే వారిని చొక్కించి దయతోడి చూపులతో వీక్షించి యింపుగా సంభాషించి వారిని రక్షింతు ననుట.

* ధర్మమును అనుష్ఠానమూలమునఁగాని ఉపదేశమూలమునఁగాని వ్యాసాదుల ద్వారా ప్రవర్తింపఁజేయుట శక్యమైయుండఁగా అవతారము లెత్తుటకు ఆవశ్యక మేమి? అన్నచో అవతారములవలన ఆరాధ్యమగు భగవంతుని రూపము కన్నులార సేవింపఁగలుగుటచే భక్తి యుత్పన్న మగుటయే ప్రయోజనమనియు అది మహోకవిధ

చక్కగా స్థాపించుటకొఱకును దేవమనుష్యాదిరూపములతోనే వియుగ మందుఁగాని అవతరించుచుండును. కృతత్రేతాదియుగవిశేషముల నియమముగూడ లేదని యర్థము. 20A

అవ. ఈశ్వరజన్మకర్మములవిషయ మైనజ్ఞానమువలనఁ గల్గు ఫలమును చెప్పుచున్నాఁడు. 20B

శ్లో॥ జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పున ర్జన్మ నైతి మా మేతి సోఽర్జున ॥ 9

టీ. హే అర్జున=ఓ అర్జునా, మే=నాయొక్క, దివ్యం = అప్రాకృతమైన, జన్మ=దేవమనుష్యాదిరూపములతో జనించుటను, కర్మచ= సాధురక్షణము మొదలగువ్యాపారమును, యః=ఎవఁడు, ఏవం=ఇట్లు, తత్త్వతః = కలరూపున-పరానుగ్రహముకొఱకని, వేత్తి = ఎఱుఁగుచున్నాఁడో, సః=వాఁడు, దేహం=ఈదేహమును, త్యక్త్వా = త్యజించినపిమ్మట, పునః = మఱల, జన్మ = జన్మమును, నైతి = పొందఁడు, మాం=నన్నే, ఏతి=పొందును.

తా. అర్జునా, ప్రకృతి కర్మమూలమై హేయమై త్రిగుణాత్మకమై యుండును. ఇట్టి ప్రకృతితోడిసంసర్గమే జీవులకు జన్మమగును. నాజన్మమో యట్టిది కాదు. మఱియు నేను సర్వేశ్వరత్వము సర్వజ్ఞత్వము సత్యసంకల్పత్వము మొదలైన సమస్తకల్యాణగుణములతోఁ గూడినవాఁడను. ఇట్టి నేను గైకొను జన్మములకును నాచేష్టితములకును, సాధులను రక్షించుటయు వారు నన్నాశ్రయించుటయునే ప్రయోజనములు. మఱియు నవి అప్రాకృతములును అసాధారణ

మైన నంతసులభముగా లభింపదనియు నవతారప్రయోజనము తెలియునది. లెక్కకు మిక్కుటమైన పరుషోక్తులు పలుకు జన్మత్రయ శత్రువైన శిశుపాలుఁడున్నా శ్రీకృష్ణుని దివ్యమంగళవిగ్రహసందర్శనమున ప్రేమపరవశుఁడై ముక్తుడయ్యెనే ఇక భక్తులమాట చెప్పనేల?

ములు నైనవి. నాజన్మచేష్టితములను ఇట్టివిగా తెలయూపున వాఁ డెఱుఁగునో వాఁడు *వర్తించుచున్న దేహమును వదలి పునర్జన్మము నొందఁడు; నన్నే పొందును. అనఁగా మదీయములైన దివ్యజన్మ చేష్టితముల యాథాత్మ్యజ్ఞానము చేత నన్నాశ్రయించుటకు విరోధు లగు పాపముల నెల్లనీజన్మముననే పోఁగొట్టుకొని నేను పూర్వము చెప్పినప్రకారమున నన్నాశ్రయించి, నన్నే ప్రియునిగాఁ గలిగి, నాయందే మనస్సు నుంచి, పునర్జన్మము నొందక నన్నే పొందును.

---

* 'త్యక్త్వాదేహం పునర్జన్మ నైతి' అనుటకు వర్తించుచున్న దేహమును పరిత్యజించి మరల జన్మము నొందఁడని చెప్పబడినది. ఇది యెట్లు! ప్రారబ్ధ కర్మము ముగిసినఁగదా మోక్షము సిద్ధించును. ప్రారబ్ధకర్మము ఇన్నిజన్మములకుఁ దీఱునని చెప్పుటకు వీలులేదు. ఏలన, అది వ్యాసాదులందును ఇన్నిజన్మములకు తీఱినదని యొకనియతి కనఁబడలేదు. మఱియు జన్మకర్మములనుగూర్చిన జ్ఞానమాత్రముచేత మోక్షము కలుగదు. అట్లు కలుగునేని దీర్ఘకాలముగా నెడతెగక యక్కఱతో సేవింపఁదగినదై మిక్కిలియు దుష్కరములైన కర్మజ్ఞానయోగములచే నొడఁగూర్పఁబడిన భక్తిరూపమైన యుపాసనముచేతనే మోక్షము సిద్ధించునను శాస్త్రము వ్యర్థమగునుగదా? యన్నచో 'మదీయములైన...నన్నేపొందును' అని పరిహారము చెప్పఁబడినది. అనగా నాదివ్యజన్మచేష్టితములను గుఱించిన జ్ఞానముచేత ఉపాసనమునకు విరోధులగు సమస్తపాపములును తొలఁగఁగా, ఈజన్మమునందే, మఱియొకజన్మమును గలిగించునట్టి పాపాంశముల నన్నిటి నడంపఁజాలినట్లు, పుష్కలముగా ఉపాసనము కలుగునుగాన, దానివలన జన్మాంతరము సిద్ధింపఁదు. ఇదియే 'వినిష్పన్నసమాధిస్తు ముక్తింతత్రైవజన్మని। ప్రాప్నోతియోగీ యోగాగ్నిదగ్ధకర్మాచయోఽచిరాత్' (విష్ణు. పురా. ౬-౭-౩౮) అని సమాధి నిష్పన్నమైనవానికి ఆజన్మమందే ముక్తి కలుగునని చెప్పఁబడి యున్నది. ఇటఁగూడ 'పూర్వము చెప్పినప్రకారమున నన్నాశ్రయించి' అనుటచే పుష్కలమైన యుపాసనావస్థ చెప్పబడినది. 'నన్నే ప్రియునిగాఁ గలిగి' అనుటచే, ప్రీతిరూపమైన భక్తిరూపాపత్తి చెప్పఁబడినది. 'నాయందే చిత్తముగలిగి' సమాధ్యవస్థ చెప్పఁబడినది. పిదప 'నన్నే పొందు' నని మోక్షము చెప్పఁబడినది. ఇట్లు జన్మకర్మజ్ఞానము పాపములను తొలఁగించి పుష్కలోపాసనము గలిగించి మోక్షము నిచ్చుననుటచే అది ఉపాసనద్వారానే మోక్షసాధన మగుట సిద్ధించుచున్నది గాన ఉపాసనశాస్త్రము వ్యర్థముగాదు. కావున వర్తమానదేహమందే మోక్షము గలుగుటయు నొప్పుచున్నది.

అవ. * అదియె చెప్పుచున్నాఁడు.

శ్లో॥ వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః॥ 10

టీ. వీతరాగభయక్రోధాః = పోఁగొట్టఁబడిన అనురాగము భయము కోపము గలవారును, మన్మయాః=నాయందె చిత్తము గల వారును, మాం = నన్ను ఉపాశ్రితాః = ఆశ్రయించినవారునగు, బహవః=పెక్కండ్రు, జ్ఞానతపసా=నాయవతారరహస్యవిషయ మైన తత్త్వజ్ఞాన మనెడి తపస్సుచేత, పూతాః=పవిత్రులై-న న్నాశ్రయించుటకు విరోధు లగుపాపములను బోఁగొట్టుకొనినవారై, మద్భావం=నా సాధర్మ్యమును, ఆగతాః=పొందిరి.

---

* 'అదియె' అనఁగా 'మదీయములైన నన్నే పొందును' అని పూర్వశ్లోక విషయమునే యనుట. దానినే యిట వివరించుట యెట్లనఁగా 'జ్ఞానతపసా పూతాః' అనుటయే 'మదీయదివ్యజన్మ...పోఁగొట్టుకొని' అని విస్తరింపఁబడినది. 'మా ముపాశ్రితాః' అనుటకు 'నన్నాశ్రయించి' అని చెప్పఁబడినది. 'వీతరాగభయక్రోధాః' అను దానియభిప్రాయమే 'నన్నే ప్రియునిగాఁ గలిగి' అని చెప్పఁబడినది. ఇది యెట్లన, విషయాంతరములందు ప్రీతియే రాగము. ఆరాగమున కడ్డుపడువారిని నిరసింపవలయు ననుకోరికయే క్రోధము. రానున్న యిష్టమునకు విరోధిగాని అనిష్టము యొక్క రాకనుగాని యుత్ప్రేక్షించుట భయము. ఇవి యన్నియు వాసుదేవునిభక్తులకుఁ గలుగవు. వారికి వాసుదేవునియందే ప్రీతి గనుక విషయాంతరములందు రాగము గలుగదు. రాగము లేనిచో తన్మూలమైన క్రోధమును గలుగదు. వాసుదేవుని లభించుటయే యిష్టమును, లభింపమియే యనిష్టము, వగునుగాన యీరెంటికంటె వేఱయిన యిష్టానిష్టములు వారికిఁ గలుగమిచే భయమును గలుగదు. ఇట్లు వాసుదేవుని యందే ప్రీతిగలవారికి రాగభయక్రోధములు గలుగమివలన 'వీతరాగభయక్రోధాః' అనఁబడువారే 'నన్నే ప్రియునిగాఁ గలిగినవా' రని చెప్పబడిరి 'మన్మయాః' అనుటకు 'నాయందే చిత్తము గలిగి' యనఁబడినది. 'మద్భావ మాగతాః' అనుటకు 'నన్నే పొందిరి' అనఁబడినది. కాన పూర్వోక్తమైనవిషయమే యీశ్లోకమునఁ జెప్పఁబడినదని తెలియునది. మఱియు నిచట 'మన్మయాః' అనుటచే భగవంతుని తోడిఐక్యము చెప్పఁబడినదిగా గ్రహింపరాదు. 'మామేతి సోఽర్జున' 'మమ సాధర్మ్య మాగతాః' 'మద్భావ మాగతాః' అనువానింబట్టి భగవంతుని స్వభావమైన అపహతపాప్మత్వాదులను బొందుట యని తెలియునది.

తా. నా జన్మకర్మముల విషయమైన తత్త్వజ్ఞాన మనెడి తపస్సుచేతఁ బవిత్రులైన యనేకు లిట్లయిరి-(అనఁగా, విషయాంతరములయందు ప్రీతిని వదలి, భయమును మాని, ఆ ప్రీతికి విరోధము చేయువానియెడల క్రోధములేక నన్నాశ్రయించి, నాయందె చిత్తము నిలిపి, నా సాధర్మ్యమును బొందిరి). ఇట్లే 'తస్యధీరాః పరిజానన్తి యోనిమ్' అని శ్రుతియు; [ధీరాః = ధీమంతులలో నగ్రేసరులైనవారే, తస్య=అతనియొక్క, యోనిం=జన్మప్రకారమును, జానన్తి= ఎఱుఁగుచున్నా రని యర్థము.]

21
శ్లో॥ *యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్।
22
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥ 11

టీ. పార్థ=అర్జునా, యే = ఎవరు-నన్నాశ్రయించుట కాసక్తులైనపురుషులు, యథా=ఏప్రకారము భావించుకొని, మాం = నన్ను, ప్రపద్యన్తే=ఆశ్రయింతురో, తాన్ = వారిని, తథైవ=ఆ భావించుకొన్నప్రకారముననే, అహం = నేను, భజామి = అనుగ్రహించుచున్నాను-వారికి నన్నుఁ జూపుచున్నాను, కాఁబట్టి, మనుష్యాః = నన్నునువర్తింపఁ గోరు మనుష్యులు, మమ=నాయొక్క, † వర్త్మ=స్వభావమును, సర్వశః = తాము కోరినప్రకారములచేత, అనువర్తన్తే = అనుభవించి వర్తింతురు.

---

* ఈ శ్లోకము, జనులు కోరిన రూపములతో నెల్ల భగవంతు నుపాసింప వచ్చు ననుటచే విగ్రహారాధనము ఒప్పు ననుటయు, యోగులకును గోచరింపని తాను జనులు కోరినవిధమున రూపమెత్తి వారు తన్ననుభవించునట్లు చేయు ననుటచే భగవంతుఁడు ఉపాసకులయెడఁ జూపు సౌలభ్యాతిశయమును దెలుపుచున్నది.

† ఇట 'వర్త్మ' యనఁగా దారియనికాని ఆచారమనికాని యర్థముసేయుట అసంగతము. శాస్త్రమర్యాదను అనువర్తించుటయుఁ గాదు. ఏలన నిది సౌలభ్యము నుపదేశించు ప్రకరణము గావున భగవంతుని యసాధారణ విగ్రహచేష్టాసౌశీల్యాదిస్వభావసముదాయపరముగా దానిని గ్రహింపవలయును గాన 'నాస్వభావము నంతయు' అని యర్థము సేయఁబడియె.

తా. అర్జునా, నేను దేవమనుష్యాదిరూపములతో అవతరించియు నన్నాశ్రయింపఁగోరినవారిని రక్షింతు నను నియమము లేదు. మఱేమనఁగా, వారు తమతమ యపేక్షలకుఁ దగినట్లు నన్ను పతి పితృ పుత్ర మిత్ర భృత్యాదిరూపముగాఁ గాని మఱి యేయర్చావతార రూపముగాఁ గాని యెట్లు సంకల్పించుకొని యాశ్రయింతురో యా రూపుననే వారికి నాదర్శన మొసఁగుదును. వేయేల, నావిగ్రహ చేష్టాసౌశీల్యాది స్వభావమంతయు యోగులయొక్క వాఙ్మనస్సుల కును గోచరింపనిదయ్యును, నన్ననువర్తించుటయే మనోరథముగాఁ గల మనుష్యు లందఱును సామాన్యము లగుతమచక్షురాదీంద్రియ ములచేతనే తాముకోరినట్లెల్ల దానిని అనుభవించువారై *వర్తింతురు.

సింహావలోకనము.

---

* ఇంతవఱకును కలిగిన ప్రశ్నములును వానికి పరిహారములును ఎవ్వి యనఁగా, హేయప్రత్యనీకుఁడైన యీశ్వరుఁడు హేయములగు దేహాదులను దా నెట్లు గయి కొనుచున్నాఁడు? అన్నందులకు, అతనియవతారాదులు కర్మవశమునఁ గలుగునవి కాకుండుట, త్రిగుణాత్మకమైన ప్రకృతిమయము గాక అప్రాకృతము లగుట, స్వేచ్ఛ చేతనే కయికొనబడినవై యుండుట, మొదలగువానిచే హేయములు కావని పరి హారము చెప్పఁబడెను. అతనికి పుణ్యపాపాదులు లేకుండుటచేతను నియామకుఁడును గలుగమిచేతను జన్మాదు లెట్లు కలుగును? అన్నశంక స్వేచ్ఛచేత జన్మాదు లెత్తు చున్నాఁడని పరిహరింపఁబడెను. ఆతనికి హితాహితములు తెలియమిచేతఁగాని తెలి సియు అశక్తిచేతఁగాని జన్మాదులు కలుగఁగూడదా? యన్నయాక్షేపము కర్మము నకు వశుఁడు గానందునను లీలార్థ మవతరించుటచేతను అతనికి అహితమే కలుగ దనియు, కాన అహితము తెలియకపోవుటయుఁ గలుగదనియుఁ బరిహరింపఁబడెను. ఏప్రయోజనము లేక జన్మాదు లేల యెత్తుచున్నాఁ డన్నందులకు సాధుపరిత్రాణము మొదలైన ప్రయోజనములు చెప్పఁబడెను సాధుపరిత్రాణాదులుగూడ సంకల్ప మాత్రముచేతనే చేయఁగూడదా? అవతారాదు లేల? యన్నందులకు 'పరిత్రాణాయ సాధూనామ్' అనుచో 'నా నామకర్మస్వరూపములు . నా స్వరూప చేష్టితావలోక నాలాపాదుల నొసఁగి వారిని రక్షించుటకును' అనియు, 'ధర్మసంస్థాపనార్థాయ' అనుచో 'ఆరాధ్యమగు నాస్వరూపమును ప్రదర్శించుటచేత' ననియు 'యే యథా మాం ప్రపద్యన్తే' అనుచో, ఎవ రెట్లు సంకల్పించుకొన్నను ఆరూపుననే పొడసూపు తనసౌలభ్యాతిశయమును దెలిపియు, పరిహారము చెప్పఁబడినది. అనఁగా, తనభక్తులు

అవ. ప్రాసంగిక మగుభగవదవతారవిషయమును ముగించి ప్రకృతవిషయ మగుకర్మయోగము జ్ఞానాకారమును బొందువిధమును చెప్పుటకుఁగాను ముందు అట్టిజ్ఞానరూపమైన కర్మయోగమున కధికారి యైనవాఁడు దొరకుట † అరుదు అనుచున్నాఁడు.

శ్లో॥ కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా॥ 12

టీ. ఇహ = ఈలోకమునందు, కర్మణాం=కర్మములయొక్క, సిద్ధిం=ఫలసిద్ధిని, కాఙ్క్షన్తః=కోరుచున్నవా రయి. దేవతాః=ఇంద్రాది దేవతలనుమాత్రము, యజన్తే=ఆరాధించుచున్నారు, హి=ఏలనఁగా, మానుషేలోకే= మనుష్యలోకమునందు, కర్మజా = కర్మమువలనఁ గలిగెడి, సిద్ధిః=పుత్రపశ్వన్నాదిఫలసిద్ధి, క్షిప్రం=శీఘ్రముగా, భవతి= అగుచున్నది.

తా. ఈమనుష్యలోకమునందును తక్కిన స్వర్గాదులందును, కర్మములకు ఫలము శీఘ్రముగా సిద్ధించును కావున ఈలోకమునం గల పురుషు లందఱును అనాదికాలముగా ప్రవర్తించుచుండు తమ

---

తన్ను దర్శింపక క్షణమాత్రము నిలుపోపఁ జాలనందువలనను భక్తులు గోరినరూపమునఁ బొడసూపు సులభుఁ డగుటవలనను అవతారము లెత్తుచున్నాఁ డని తెలియునది. మఱియు భగవంతుని జన్మాదులు సత్యమా? మిథ్యలా? అన్నందులకు సత్యములే యని నిరూపింపఁబడినది. అవతారములందు భగవంతుఁడు దుఃఖశోకభయాదులు కొన్నియెడలఁ బడినట్లు చెప్పుట యెట్లు? అన్నచో, నతఁడు అపహతపాప్మత్వాదులు గలవాఁ డగుటంబట్టియు, 'తేఽవఞ్చ్యంతే లోకాన్ మాయాయోగేన కేశవః। యే తమేవ ప్రపద్యన్తే తే నముహ్యన్తి మానవాః' (భారత. ఉద్యోగ. ౬౭-౧౫) అని మాయాయోగమున లోకులను వంచించుకొను కనుటంబట్టియు, అవియెల్ల అభినయమాత్రములే కాని యథార్థములు కావని యెఱుంగునది.

† అరుదగుటకు అది జ్ఞానరూపమై యుండుటయే కారణ మని భావము. రాగల యాఱుశ్లోకములలో నాలుగు అధికారినిగుఱించిన వనియు, రెండు కర్మస్వరూపమును గుఱించిన వనియుఁ దెలియనగును.

యొక్క అనంతపాపసంచయము నశింపకుండుటచేత వివేకము చెడిన
వారై శీఘ్రఫలముఁ గోరుచు పుత్రపశ్వన్నాదిఫలములకొఱకును
స్వర్గాదిఫలములకొఱకును యాగదానహోమాదిసమస్తకర్మములను
ఇంద్రాదిదేవతలకు మాత్రమే ఆరాధనములుగాఁ గావింతురుగాని
ఒక్కఁడైనను సంసారమునందు మనస్సున రోఁత గలిగి మోక్షా
సక్తితో పూర్వోక్తలక్షణమైన కర్మయోగముచే నన్నారాధింపఁడు.
(అనఁగా ఫలసంగము వదలి సమస్తకర్మములను తత్తద్దేవతలయం
దంతరాత్మయైన నన్నారాధించుటగా ననుష్ఠింపఁడని యర్థము.)23A

అవ. కర్మయోగారంభమునకు విరోధము సేయు పాపములు
నశించుటకు హేతువును జెప్పుచున్నాఁడు.

23B
శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్॥ 13

టీ. గుణకర్మ విభాగశః = సత్త్వాదిగుణములయొక్కయు,
కర్మ=శమదమాదివ్యాపారములయొక్కయు, విభాగశః = విభాగము
చొప్పున, చాతుర్వర్ణ్యం = బ్రహ్మక్షత్రియాది వర్ణచతుష్టయము,
మయా=నాచేత, సృష్టం=సృజింపఁబడినది, తస్య=ఆసృష్టి మొదలైన
దానికి, కర్తారమపి=కర్తనైనను, మాం = నన్ను, అకర్తారం=కర్త
కానివానినిగాను – ఫలమునుబట్టి కర్తృత్వము లేనివానినిగాను,
అవ్యయం=కర్మమువలనఁ గలుగు ఉత్పత్తి వినాశములు లేనివానిని
గాను, విద్ధి= తెలిసికొనుము.

తా. * బ్రహ్మక్షత్రియాదు లగు నాలుగువర్ణములు మొద

* 'తమ శ్శూద్రే రజః క్షత్రే బ్రాహ్మణే సత్త్వ ముత్తమమ్' అని ఆయావర్ణ
ముల కాయాగుణములను విభజించి పెట్టుట తెలియఁగఁ దగును. ఆయా వర్ణముల
సత్త్వాదిగుణములకుఁ దగిన శమాదికర్మములవిభాగము, గీత-18 యధ్యాయమున
'బ్రాహ్మణక్షత్రియవిశాం' అను 41వ శ్లోకము మొదలుకొని 'శూద్రస్యాపి స్వభా
వజమ్' అను 44వ శ్లోకవఱకుఁ దెలుపఁబడిన దై యున్నది.

లుగా (అనఁగా బ్రహ్మ మొదలుకొని స్తంబపర్యంత మైన) సమస్త జగత్తు, సత్త్వాదిగుణములయొక్కయు ఆయాగుణములకుఁ దగిన శమ దమాదివ్యాపారములయొక్కయు విభాగము చొప్పున, నాచే సృజింపఁ బడుచున్నది. సంహరింపఁబడుచున్నదియు. ఆవిచిత్రసృష్టి మొదలైన వానికిని నిత్యుఁడ నగునేనే కర్తనైనను, నన్ను కర్త గానివానిఁగా నెఱుఁగుము. 24

అవ. అది యెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే॥ 14

టీ. కర్మాణి=ఈవిచిత్రసృష్ట్యాదికర్మములు, మాం=నన్ను, నలిమ్పన్తి=అంటవు-సంబంధింపవు, కర్మఫలే=సృష్ట్యాదికర్మముల ఫలమునందును, పుణ్యాపాపకర్మఫలమునందును, స్పృహా=ఇచ్ఛ. మే=నాకు, న=లేదు. ఇతి=ఇట్లు, మాం=నన్ను, యః=ఎవఁడు, అభిజానాతి=ఎఱుఁగుచున్నాఁడో, సః=వాఁడు, కర్మభిః=కర్మముల చేత, నబధ్యతే=కట్టఁబడఁడు-విడివడు ననుట.

తా. సృష్ట్యాదికర్మములు నన్ను సంబంధింపవు. [అనఁగా దేవమనుష్యాదిరూప మగు సృష్టివైచిత్ర్యము వారివారి పుణ్యాపాప రూపకర్మవిశేషములంబట్టి వచ్చినదే కాని నావలన వచ్చినది కాదు. కాఁబట్టి ప్రాప్తాప్రాప్తవివేకము చేయఁగా, ఆ విచిత్రసృష్ట్యాదులకు నేను కర్తను గాను. మఱియును సృష్టికి పూర్వము జీవులు కరణకళే బరములు (దేహేంద్రియములు) లేమిచే దేనిని భోగించు (అనుభ వించు) శక్తియు లేనివారై యుండఁగా సృష్టివలన కరణకళేబరము లును దానివలన (భోక్తృత్వమును) భోగించుశక్తియు, భోగ్య (భోగింపఁదగిన) వస్తువులును కలిగెను. ఇట్లు భోక్తలైనజీవులు లా భోగ్యవస్తువుల ననుభవింతురు. వారిట్లు వానిని అనుభవించుట,

ఫలసంగాదులకు హేతువు లగు వారివారి కర్మములను అనుసరించియే కాని కేవలము నాసంకల్పమునే యనుసరించి కాదు.] కావున సృష్ట్యాదికర్మములయొక్క ఫలములందును పుణ్యపాపకర్మఫలములందుఁ గూడ వారికే రక్తిగాని నాకు రక్తిలేదు. [అనఁగా వారువారు తమ యిచ్ఛచొప్పున చేయు పుణ్యపాపకర్మములకుఁ దగిన ఫలముల నే నిచ్చువాఁడను మాత్రమే కాని నేను నా యిచ్ఛచొప్పున ఫలములను వారి కిచ్చుటలేదు. కాఁబట్టి, ఆఫలములందు నాకు రక్తిలే దనుట. సామాన్యముగా *సృష్టికర్త నయ్యును దేవాది విచిత్రసృష్ట్యాది కర్మములును వానిఫలములును నావలననే కలుగునవి కావు గనుక నేను కర్తను గా నని భావము.] ఇట్లే సూత్రకారులు † 'వైషమ్య

---

* హేతువు, సామాన్యమనియు విశేషమనియు రెండువిధములు. విచిత్రములైన (నానావిధములైన) మొలకలకు భూమి జలము మొదలైనవి సామాన్యహేతువులు. వాని వైచిత్ర్యమునకు నానిబీజవైచిత్ర్యము విశేషహేతువు. ఇట్లె సృష్ట్యాదులకు ఈశ్వరుఁడు సామాన్యహేతువు అందలి దేవమనుష్యాది వైచిత్ర్యమునకు వారివారిపుణ్యపాపకర్మమే విశేషహేతువు. సృష్ట్యాదులకు ఈశ్వరుఁడు సామాన్య హేతు వగుటచే కర్త యయ్యు, విశేషహేతువు కామిచే కర్త కాకయు నున్నాఁడు. కావుననే కర్తనయ్యు, కర్తను కా ననుట.

† ఈవిషయమునే వ్యాసులు 'వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్' (శారీర- ౨-౧-3౪) అను వేదాంతసూత్రమునఁ బ్రతిపాదించియున్నారు. అనఁగా-అందఱిని సమముగా సృజింపక దేవత లనియు మనుష్యు లనియు విషమముగా సృజించుటవలన ఈశ్వరునికి వైషమ్య (పక్షపాత) దోషమును, దానిచే నైర్ఘృణ్య (దయలేమి యను) దోషమును గలుగఁగా, ఈశ్వరుఁడు వారి వారి పుణ్యపాపకర్మము నపేక్షించి దాని సాహాయ్యము చేతనే విషమసృష్ట్యాదులను జేయునుగాని తనంతటఁ జేయఁడు గనుక నతనికా దోషములు కలుగవని నిరూపించియున్నారు. ఈశ్వరుఁడు సామాన్య హేతువుమాత్రమే యగుటను పరాశరులు విష్ణుపురాణమున 'నిమిత్తమాత్రమేవాయం సృజ్యానాం సర్గ కర్మణి' (1-4-51) అనుచో, 'దేవాది క్షేత్రజ్ఞులను సృజించు కార్యమునందు ఈశ్వరుఁడు నిమిత్తమాత్రమే యగును. ఏలన, దేవాదివిచిత్రసృష్టికి క్షేత్రజ్ఞులప్రాచీనకర్మశక్తులే ముఖ్యకారణ మైయున్నవి. కావున నీక్షేత్రజ్ఞవస్తువు దేవాదిభావము నొందుటకు నిమిత్తమాత్రమును (అనఁగా సృష్టికర్త యగు పరమ

నైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్' అనియు, అట్లే భగవంతుఁ డగుపరాశరులును 'నిమిత్తమాత్రమేవాయం సృజ్యానాం సర్గకర్మణి। ప్రధానకారణీభూతా యతో వై సృజ్యశక్తయః। నిమిత్తమాత్రం ముక్త్వేదం నాన్యత్కిఞ్చిదపేక్షతే। నీయతే తపతాం శ్రేష్ఠ స్వశక్త్యా వస్తు వస్తుతామ్' అని చెప్పియున్నారు. అనఁగా, (సృజ్యానాం సర్గకర్మణి) సృజ్యులయిన దేవాదిక్షేత్రజ్ఞులయొక్క సృష్టికి, (నిమిత్త...వాయం) కారణమాత్రమే యీపరమపురుషుఁ డగును. దేవాదివైచిత్ర్యమునకో, (సృజ్యశక్తయః) సృజ్యభూతులైన క్షేత్రజ్ఞుల (జీవుల) ప్రాచీనకర్మశక్తులే, (ప్రధానకారణీభూతాః) ప్రధానకారణ మగును. కాఁబట్టి, (నిమిత్తమాత్రం ముక్త్వా) సృష్టికి కర్తయగు పరమపురుషుని విడిచి, (ఇదం వస్తు) ఈ దేవాది క్షేత్రజ్ఞవస్తువు, దేవాదివిచిత్రభావమునొందుటకు, (న అన్యత్ కిఞ్చి దపేక్షతే) మఱియొకటిని-అనగా వేఱొక విశేషకారణమును-అపేక్షింపదు. (స్వశక్త్యా) స్వగతమైన ప్రాచీనకర్మశక్తిచేతనే, (వస్తుతామ్) దేవాదివస్తుభావమును-ఆయా రూపమును, (నీయతే) పొందింపఁబడుచున్నది, యని యర్థము.

ఇట్లు నేను సృష్ట్యాదులకు కర్తనయ్యును, కర్త కానివానినిగాను, సృష్ట్యాదికర్మములఫలములందు సంగము లేనివానినిగాను నన్ను ఎవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడు కర్మయోగారంభమునకు విరోధులును ఫలసంగాదులకు హేతువులు నగు ప్రాచీనకర్మముల నుండి విడివడును.

అవ. కర్మయోగమును విస్తరించిచెప్పుటకై అది అవశ్యము చేయఁదగిన దని శిష్టానుష్ఠానప్రదర్శనముచేత దృఢపఱచుచున్నాఁడు.

---

పురుషుని) వదలి వేఱొకటి నపేక్షింపదు. ఏలనఁగా, అవి తమయందుఁ గల ప్రాచీనకర్మ శక్తిచేతనే దేవాదివస్తుభావము పొందింపఁబడుచున్నవి అని నిరూపించి యున్నారు.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవతస్మాత్త్వం పూర్వైఃపూర్వతరం కృతమ్॥ 15

టీ. ఏవం = ఈప్రకారము, జ్ఞాత్వా = నా యవతారరహస్యమును తెలిసికొని, పూర్వైః = పూర్వులైన, ముముక్షుభిరపి = సూర్యుఁడు మనువు మొదలగు ముముక్షువులచేతను, కర్మ = కర్మయోగము, కృతం=ఆచరింపఁబడినది, తస్మాత్ = కాఁబట్టి, త్వం = నీవు, పూర్వైః = ప్రాచీనులచేత, కృతం = చేయఁబడినదిగనుకనే, పూర్వతరం = పురాతనమైనదియు-పూర్వమే వారికి చెప్పఁబడిన, కర్మైవ=కర్మమునే, కురు=ఆచరింపుము.

26

తా. నే నిట్టివాఁడ ననెడియెఱుక గలిగి యీయెఱుకచేత పాపములం వీడి పూర్వులైన ముముక్షువులును పూర్వోక్తలక్షణమగుకర్మయోగం బాచరించిరి. కాఁబట్టి నీవును నన్ను గుఱించిన పూర్వోక్తజ్ఞానముచేత (అనఁగా నేను సృష్టికిఁ గర్తనయ్యును గర్తగానివాఁడ ననెడియెఱుకచేత) పాపరహితుఁడవై పూర్వులైన సూర్యుఁడు మనువు మొదలగువారిచే నాచరింపఁబడినదియు వారలకు పూర్వమే నాచేఁ జెప్పఁబడిన దగుటచే పురాతనమైనదియు నిప్పుడు నేను జెప్పఁబోవు నాకారము గలదియు నయినయీకర్మయోగమునే చేయుము,

అవ. చెప్పఁబోవుకర్మయోగము నెఱుఁగుట కష్ట మనుచున్నాఁడు.

శ్లో॥ *కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
27
తత్తే కర్మప్రవక్ష్యామి యద్జ్ఞాత్వామోక్ష్యసేఽశుభాత్॥ 16

---

* ఈశ్లోకమందు మొదటిసగమున 'కర్మము' 'అకర్మము' అను రెండును తెలియరానివి అని చెప్పి, రెండవసగమున, ప్రకృతములైన ఆ రెంటిని జెప్పునట్లు చెప్పక 'కర్మ ప్రవక్ష్యామి' అని కర్మమును మాత్రము చెప్పెద ననుట యెట్లు?

టీ. కర్మ=ముముక్షువు అనుష్ఠింపఁదగిన కర్మము, కిం=ఎట్టిది, అకర్మ=అకర్మము, ఆత్మవిషయమైనయథార్థజ్ఞానము, కిం=ఎట్టిది, ఇతి అత్ర=అను నీకర్మవిషయమునను తదంతర్గతజ్ఞానవిషయమునను, కవయః అపి=విద్వాంసులును, మోహితాః = మోహమును జెందిరి-కలరీతి నెఱుఁగ రనుట; యత్ = దేనిని; జ్ఞాత్వా= తెలిసికొని (జ్ఞానపూర్వకముగా ననుష్ఠించి), అశుభాత్=సంసారబంధరూపమైన యనర్థమునుండి, మోక్ష్యసే=ముక్తుఁడవు కాఁగలవో, తత్=అట్టి, (కర్మ=జ్ఞానయుక్తమై నారాధనాత్మక మగు కర్మమును). తే=నీకు, ప్రవక్ష్యామి=చెప్పెదను.

తా. ముముక్షు వనుష్ఠింపవలసినకర్మ మెట్టిది ? కర్మమునందంతర్గతమగు ఆత్మయాథాత్మ్యజ్ఞానము ఏరూప మైనది ? అను నీ రెంటివిషయమునందు విద్వాంసులుగూడ భ్రమించుచున్నారు గాని కలరూపు నెఱుఁగరు. ఇట్లు ఏ కర్మమునకు జ్ఞానము అంతర్గతముగా నుండునో యాకర్మమును నీకుఁ జెప్పెదను, నీవు దానిని అనుష్ఠించి యశుభంబగు సంసారబంధమునుండి ముక్తుఁడవు కాఁగలవు. [కర్తవ్యమైన కర్మము నెఱుంగుటకు ఫలము దాని ననుష్ఠించుటయే కదా. కావున నెఱుఁగుట యనఁగా అనుష్ఠించుటయే యగును.]

---

అన్నచో మీఁద 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' అని కర్మమునందే అకర్మము ఉన్నదనుటంబట్టి కర్మాకర్మములు రెండును ఒకకర్మయోగము యొక్క అంశములే యగుచున్నవి. కర్మమునందు అంతర్గతమైయున్న ఆత్మస్వరూపజ్ఞానమే యగును. ఇట్లు కర్మము ప్రధానముగాను అకర్మము దానికి అంతర్భూతమైన విశేషణముగాను నుండుటచే కర్మశబ్దముచేతనే కర్మాకర్మములు రెండును గ్రాహ్యము లగుచున్నవి. కావుననే రెండవసగమున 'కర్మ' అని యొకటియే చెప్పెఁనాడు. దానికి 'తత్' అను విశేషణమువలన 'ఏది అకర్మమును (అనఁగా ఆత్మజ్ఞానమును) అంతర్గతముగాఁ గలదియో అకర్మము' అని యర్థము చెప్పఁబడియెను. ఇట్లు కర్మశబ్దముచేత నేతద్విశేషణమైన అకర్మముగూడ గ్రాహ్య మగుటంబట్టి 'కర్మ ప్రవక్ష్యామి' 'కురుకర్మైవ' 'గహనా కర్మణోగతిః' అని కేవలకర్మశబ్దమే యుభయమునకును చెప్పఁబడుచున్న దని గ్రాహ్యము.

అవ. ఈకర్మము నెఱుఁగుట యేల కష్టముగా నున్న దనఁగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥ 17

టీ. హి=ఏకారణమువలన, కర్మణః అపి=కర్మముయొక్కయు, బోద్ధవ్యం = తెలిసికొనవలసినది-(ఉన్నదో), వికర్మణః చ = వివిధములగుకర్మములయొక్కయు, బోద్ధవ్యం= తెలిసికొనవలసినది (ఉన్నదో), అకర్మణశ్చ = ఆత్మయాథాత్మ్యజ్ఞానముయొక్కయు, బోద్ధవ్యం = తెలిసికొనవలసినది (ఉన్నదో), (అతః=దానివలన,) కర్మణః=ముముక్షువులచే ననుష్ఠింపఁదగిన కర్మముయొక్క. గతిః = విధము, తెలిసికొనవలసినదానిప్రకారము, గహనా= తెలియ నశక్యమైనది.

తా. మోక్షసాధనభూతమగు కర్మముయొక్క స్వరూపము విషయమై తెలిసికొనవలసినది యున్నది. నిత్యనైమిత్తిక కామ్యరూపములచేతను తత్సాధనము లైన ద్రవ్యార్జనాదిరూపములచేతను వివిధత్వము నొందినకర్మముల (వికర్మము) విషయమై తెలిసికొనవలసినదియు నున్నది. ఆత్మయాథాత్మ్యజ్ఞానమువిషయమునందు తెలియఁదగిన యంశమును గలదు. కాఁబట్టి ముముక్షు వనుష్ఠింపవలసిన కర్మముయొక్క ప్రకారము నెఱుఁగుట కష్టము. (వికర్మమునందు తెలియఁదగినద యే మనఁగా, నిత్యనైమిత్తికకామ్యద్రవ్యార్జనాది కర్మములను ఫలభేదమునుబట్టి పెక్కువిధములుగా గ్రహింపక, అవి యెల్ల మోక్షమే ఫలముగాఁ గలిగియుండుటవలన ఏకశాస్త్రార్థమే యగు నని ఒక్కటే అనుసంధానము కలిగియుండుట. (ఇదియే 'వ్యవసాయాత్మికాబుద్ధి రేకా' అనుచోటనే చెప్పఁబడినది గాన యిట ప్రపంచింపఁబడదు.

అవ. వికర్మమునందును అకర్మమునందును తెలిసికొనవలసినదానిని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ *కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః।
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్॥ 18

టీ. యః = ఎవఁడు, కర్మణి = కర్మయోగమందు-కర్మమును చేయుచునే దానియందు, అకర్మ = ఆత్మజ్ఞానమును, పశ్యేత్ = చూచునో, యః=ఎవఁడు, అకర్మణి=జ్ఞానమందు-ఆత్మజ్ఞానము వర్తించుచుండఁగానే దానియం దనుట, కర్మచ=కర్మమును, పశ్యేత్ = చూచునో, సః = వాఁడు, మనుష్యేషు = మనుష్యులయందు, బుద్ధిమాన్ =సకలశాస్త్రార్థముల నెఱిఁగినవాఁడు, సః=వాఁడు, యుక్తః = మోక్షార్హుఁడు, కృత్స్నకర్మకృత్ = శాస్త్రార్థములను పూర్ణముగా నాచరించినవాఁడును.

తా. *కర్మమును జేయుచుండఁగానే దానియందు ఆత్మజ్ఞానమును, ఆత్మజ్ఞానము వర్తించుచుండగానే దానియందు కర్మము నెవఁడు చూచునో (అనఁగా కర్మమును జేయుచున్నపుడే, అందు ఆత్మ

---

* ఇంతవఱకును కర్మమునుగూర్చి యుపోద్ఘాతము రెండుశ్లోకములచేఁ జెప్పి యిప్పుడు ప్రకృతాంశము లగు కర్మమును అకర్మమును ఉపదేశించుచున్నాఁడని తెలియునది. ఇందు కర్మవిషయమున 'కర్మణ్యకర్మయః పశ్యేత్' అనుటయు, అకర్మమగు జ్ఞానమునందు 'అకర్మణిచ కర్మయః' అనుటయు 'బోద్ధవ్యము' నని తెలియునది.

* కర్మము కరచరణాదులచే అనుష్ఠింపఁబడునది. జ్ఞానము మనస్సుచే అనుసంధింపబడునది. ఇట్లు రెండును స్వరూపమున వేఱువే ఆగుటచే ఒకటితో నొకటి అన్వయింపదు. కనుక కర్మమునందు జ్ఞానమును జూచుట యనఁగా అనుష్ఠింపఁబడని వట్టికర్మమును జ్ఞానముగా చూచుట యనియు, జ్ఞానమునందు కర్మమును జూచుట యనఁగా అనుసంధింపఁబడని వట్టిజ్ఞానమును కర్మముగా చూచుట యనియు గ్రహింపవలయు' నని శంక రాఁగా, దానిని 'కర్మమును ..ఎవఁడు చూచునో' యని పరిహరించిరి. అనఁగా అనుష్ఠింపఁబడుచున్న కర్మమునందే జ్ఞానమును, అనుసంధింపఁబడుచున్న జ్ఞానమునందే కర్మమును జూడఁబడునని భావము. ఇది యెట్లు? ఒకటి ననుష్ఠించునపుడు మఱొకటిని కనుఁగొనుట యపేక్షితము కాదు ఒకటి ననుష్ఠించుచుండఁగా దానికంటె వేఱైనయొకటిని అనుసంధించుటయు దుష్కరము. మఱియు ఒకటిని అనుసంధించుచుండఁగా దానికంటె వేఱైన యొకటి ననుష్ఠించుట

యాథాత్మ్యము ననుసంధించుటచేత దానిని జ్ఞానాకారముగాను,
అజ్ఞానము కర్మయోగమం దంతర్గత మగుటవలన దానిని కర్మాకా

---

యశక్యము. కాన చేయఁబడుచున్న కర్మమునందు జ్ఞానమును, అనుసంధింపఁబడు
చున్న జ్ఞానమునందు కర్మమును, కనుట యెట్లు? వేఱువేఱువిధములైన రెంటిని
ఏకకాలమున ఒక్కటిఁ జూచుట యశక్యము గాదా? అన్నచో, ఇట చేయఁబడు
చున్న కర్మమునందు జ్ఞానమును జూచుట యనఁగా, అకర్మమును జేయుచుండునపుడే
అందు, ఆత్మయాథాత్మ్యమును అనుసంధించుటచేత, దానిని జ్ఞానాకార మైనదిగా
చూచుట యని తెలియునది. అనుసంధింపబడుచున్న జ్ఞానమునందు కర్మమును జూచుట
యనఁగా అజ్ఞానము వర్తించుచుండునపుడు అది కర్మయోగమునం దంతర్గతమైయుం
డుటవలన దానిని కర్మాకారముగా చూచుటయని తెలియునది. కావుననే కర్మ
మును చేయుచున్నప్పుడే ..కర్మాకారముగా చూచునో యనఁబడినది. దీనివలన
రెంటిని ఏకకాలమునఁ జూచుట పొసఁగుచున్నది. అనఁగా కేవలకర్మము గాక ఆత్మ
జ్ఞానముతోఁ గూడిన కర్మమే ఉపాయముగా విధింపఁబడియుండుటవలన ఒకటికి
మఱొకటి యపేక్షితమే యగును గాన ఒకటి ననుష్ఠించునపుడు మఱొకటి అపేక్షితము
కాకపోదు. కనుక రెండును ఒకటినొకటి అన్వయించియే యుండును. ఒక్కఁడే
చూచుట పోవుట పలుకుట మొదలగువానిని ఏకకాలమునఁ జేయుట గలదు. కావున
ఒకటి ననుష్ఠించుచుండఁగా మఱొకటిని జూచుట దుష్కరముగాదు. పోవుటయును
నిలుచుటయును ఏకకాలమునఁ గలుగుట పరస్పరవిరుద్ధము లైనట్లు జ్ఞానమును కర్మ
మును పరస్పరవిరుద్ధములు గావు; కాన నొకటి ననుసంధించునపుడు మఱొకటిని జేయ
వచ్చునని తెలియునది. ఇట్లు రెంటిని జేయుటవలన నుపయోగమును కలుగకపోదు.
పాముకాటువలనివిషమును దీయుమాంత్రికుఁడు ధ్యానము సేయుచునే చేత దిగదుడు
చుట మొదలగు చేష్టలను జపములను జేయుట గలదు గదా. దానిచే విషము నివ
ర్తించి వానిధ్యానమును కర్మమును రెండు నుపయుక్తము లగుచున్నవి. అట్లే కర్మమును
జేయుచుండఁగా దాని కర్తయగు ఆత్మయొక్క స్వరూపమును అనుసంధించుటచే
కర్మమును జ్ఞానమును రెండును సంపన్నము లగుచున్నవని తెలియునది; కావుననే
'కర్మమును జేయుచుండఁగా దానిని చేయుకర్త ..గలుగుచున్నది' యనఁబడెను.
మఱియు 'కృత్స్నకర్మకృత్' అని కృత్స్నశాస్త్రోక్తకర్మములను జేయువానికి
కృత్స్నశాస్త్రార్థములు తెలిసియుండవలయును గాన 'బుద్ధిమాన్' అనుటకు సర్వ
శాస్త్రార్థవిదుఁ డనఁబడెను. 'బుద్ధిమాన్' అని జ్ఞానమును 'కృత్స్నకర్మకృత్' అని
యనుష్ఠానమును జెప్పయుండుటంబట్టి అట్టివానికి అందుఅనుఁ దగిన ఫలమునకు
యోగ్యత యుండవలయును గాన 'యుక్తః, అనుటకు 'అర్హుఁడు' అనగా మోక్షార్హుఁ
డని యర్థము గ్రాహ్యమయ్యె.

రముగాను, ఎవ్వఁడు చూచునో) వాఁడే మనుష్యులయందు సర్వ శాస్త్రార్థముల నెఱిఁగినవాఁడు; వాఁడే మోక్షార్హుఁడు; వాఁడే సకల శాస్త్రోక్తకర్మముల నాచరించువాఁడు. కర్మమును చేయుచుండఁగా దానిని చేయు కర్త ఆత్మయే కనుక అట్టి ఆత్మయొక్క స్వరూపము ననుసంధించుటచేత అందే రెండును (అనఁగా జ్ఞానవిశిష్టమైన కర్మమును కర్మవిశిష్టమైన జ్ఞానమును) లెస్సగా కలుగుచున్నవి. ఇట్లు లోపల ఆత్మస్వరూపానుసంధానము కలదానినిగా కర్మము నెవఁడు చూచునో వాఁడే యట్టివాఁడని భావము.

అవ. ఇంద్రియవ్యాపారములు కలది కర్మము అవి లేనిది జ్ఞానము. ఇంద్రియములతో *ప్రత్యక్షముగాఁ జేయఁబడుచున్న కర్మము ఇంద్రియవ్యాపారము లేని జ్ఞానాకారమును బొందుట యెట్లు పొసఁగు ననఁగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః ।
28 29
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితంబుధాః॥ 19

టీ. యస్య=ఏముముక్షువుయొక్క, సర్వే = సమస్తములగు, సమారమ్భాః=కర్మములు, కామసంకల్ప వర్జితాః-(కామ)=ఫలసంగము చేతను, †(సంకల్ప) = దేహమే యాత్మయనెడు భ్రాంతిజ్ఞానము

---

* కర్మము చిరకాలమునకు మును పే చేసి తీఱినదై యిపుడు స్మరణమునకు మాత్రము వచ్చుచు, కావుననే జ్ఞానమాత్రముగా పరిశేషించెనేని దానిని జ్ఞానాకారమనవచ్చును గాని ప్రత్యక్షముగా చేయుచుండునట్టి కర్మమును జ్ఞానమని యెట్లు చెప్పవచ్చునని భావము. లేక 'ప్రత్యక్షముగా' అనుటచే జ్ఞానమునకు ప్రత్యక్షవిషయమై, 'చేయఁబడుచున్న' యనుటచే జ్ఞానముయొక్క కార్యమై యుండుకర్మమును జ్ఞానమే యనుట యెట్లు? అనియు భావము గ్రాహ్యము.

† 'సంకల్ప మనుచో (ఏకీకృత్యకల్పన) 'సం' అనుట ఏకీకారమునను 'కల్పన' మనుట భ్రాంతిజ్ఞానము ననువర్తించుచున్నది. ప్రకృతితో (అనఁగా ప్రకృతివికార

చేతను, వర్జితాః=విడువఁబడినవో, తం=అట్టి, పణ్డితం = విద్వాంసుని, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం=కర్మాంతర్గత మగు ఆత్మయాథాత్మ్యజ్ఞాన మను నగ్నిచేత దహింపఁబడిన ప్రాచీనకర్మములు గలవానినిగా, బుధాః = తత్త్వజ్ఞులు, ఆహుః=చెప్పుదురు.

తా. ఏముముక్షువుయొక్క ద్రవ్యార్జనాది లౌకికవ్యాపారము లతోఁగూడిన నిత్యనైమిత్తికకామ్యరూపకర్మములన్నియు ఫలసంగ రహితము లై యుండునో, మఱియు ఆత్మస్వరూపమును ప్రకృతికంటె వేఱుగా అనుసంధించుటవలన, ప్రకృతియే (అనఁగా దేహరూపమునఁ బరిణమించిన ప్రకృతియే) ఆత్మయని భ్రమించుటయు ప్రకృతిగుణ ములే ఆత్మగుణములని భ్రమించుటయు లేనివియు నై యుండునో, ఆపండితుఁడు కర్మాంతర్గతమైన ఆత్మజ్ఞాన మనెడి యగ్నిచేత మోక్ష విరోధులగు ప్రాచీనకర్మములను దహించినవాఁడని తత్త్వజ్ఞులు పలుకుదురు. (ఫలసంగమును దేహాత్మభ్రమమును లేక కర్మములు సేయువాఁడు జ్ఞానాగ్ని గలవాఁడని చెప్పుటవలన అట్టిఫలసంగాదరహిత కర్మమే ఆజ్ఞానాగ్ని కలది యగుచున్నది.) కావున ప్రవృత్తిరూపమైన కర్మముకూడ అంతర్గతమైన ఆత్మయాథాత్మ్యముకలది యగుటచేతను అట్టికర్మము జ్ఞానాకారమును బొందుట పొసఁగుచున్నది.

*అవ ఈవిషయమునే వివరించుచున్నాఁడు.

---

మైన దేహముతో) తన్ను నొక్కటిగాఁ జేసికొనియు-అనఁగా దేహమునే తన్నుగాఁ దలఁచియు, ప్రకృతిగుణములు హేతువుగాఁ గలకార్యములకు తన్నే హేతువుగాఁ దలఁచియు భ్రమించుట సంకల్పము. లేక, ప్రకృతిగుణము లగుసత్త్వరజస్తమస్సుల వలనఁ గలుగుదేవత్వ మనుష్యత్వాదిరూపములును, బలుపు బక్కన తెలుపు నలుపు మొదలయినవానిని, ఆత్మగుణములుగా అనుసంధించుటయు సంకల్పమనవచ్చును. ఇది ప్రకృతివియుక్తమైన యాత్మస్వరూపము నుపదేశించుప్రకరణము గనుక సంకల్ప శబ్దమున కీయర్థమే యుపపన్నము.

* పూర్వశ్లోకార్థమునే యిందును వివరించుట యెట్లనఁగా 'కామవర్జిత' అనుటకు 'త్యక్త్వా కర్మఫలాసఙ్గమ్' అనఁబడినది. 'సంకల్పవర్జిత' అనఁగా అస్థిర

30

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్కరోతి సః॥ 20

టీ. కర్మఫలాసఙ్గం=కర్మఫలమునం దాసక్తిని, త్యక్త్వా=విడిచి, నిత్యతృప్తః=నిత్యుఁడగు తనయాత్మయందు తృప్తిఁ జెందినవాఁడును, నిరాశ్రయః = అస్థిరమగు ప్రకృతియందు ఆశ్రయబుద్ధి లేనివాఁడును, (యః=ఎవఁడో), సః=వాఁడు, కర్మణి=కర్మమందు, అభిప్రవృత్తోఽపి = ఆభిముఖ్యముతో ప్రవర్తించినవాఁడైనను, కించిత్ కర్మ=ఒక్క కర్మము నైనను, న కరోత్యేవ=చేయకున్నవాఁడే.

తా. ఎవఁడు కర్మము ననుష్ఠించుచునే కర్మఫలమునం దాసక్తిని వదలి, నిత్యుఁడయినతనయాత్మయందే తృప్తుఁడగుచును, అస్థిరమగు ప్రకృతి తన కాశ్రయమగు ననెడి యధ్యవసాయము లేనివాఁ డయ్యె నుండునో వాఁడు కర్మములయం దాభిముఖ్యముతో ప్రవర్తించినను ఒకకర్మము నైనను జేయనివాఁడె యగును. అనఁగా, కర్మానుష్ఠానవ్యాజముతో జ్ఞానాభ్యాసము నే చేయువాఁడని యర్థము, (కాఁబట్టి కర్మము జ్ఞానాకారమునుబొందుట పొసఁగుచున్నది.) 31

---

ప్రకృతితోడి యేకీకరణమును వదలుట యనుటకు 'నిత్యతృప్తః' 'స్థిరుఁడైన యాత్మయందే తృప్తుఁడు' అనుటచే అస్థిరమైన ప్రకృతియందు తృప్తిలేనివాఁడనుట (అనఁగా అస్థిరమైన ప్రకృతితోడి యేకీకరణము లేనివాఁడనుట) సిద్ధము. ఇట్లు పూర్వశ్లోకార్థమే యిందు వివరింపఁబడినది 'నిరాశ్రయః' అనుటకు ఆశ్రయభూతములైన దేశాదిమాత్రియము లేనివాఁడని యర్థము చెల్లదు. ఏలనఁగా దేశాదులు ఆశ్రయములుగా లేకయుండుట శక్యము గాదు. కనుక లౌకిక వస్తువులలో ఏది తన కాశ్రయమని బుద్ధికిఁ దోఁచునో, దానియందెల్ల ఆశ్రయమనెడి బుద్ధిమాత్రమే లేనివాఁడని యెఱుంగునది కావున 'ఆశ్రయ బుద్ధిలేనివా' డనఁబడెను. మఱియు కర్మములను జేయుచుండియు కర్మమేదియు చేయఁ డనుట విరుద్ధముగాన 'కర్మానుష్ఠాన వ్యాజమున...చేయుచున్నాఁ' డని చెప్పబడెను, అనఁగా విపరీతవిషయములందు సంచరించి జ్ఞానాభ్యాసమునకు విరోధులైయుండు నింద్రియములు దానికి అనుకూలములైనవిషయములందు సంచరించుట మాత్రమే కదా కర్మయోగము. కనుక నిట్టి

32

*అవ. 'మరల కర్మము జ్ఞానాకారమే యగుట వివేచించి ప్రతిపాదించుచున్నాఁడు.

శ్లో॥ నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥ 21

టీ. నిరాశీః=ఫలోద్దేశము లేనివాఁడును, యతచిత్తాత్మా = నిగ్రహింపఁబడిన చిత్తమును మనస్సును గలవాఁడును, త్యక్తసర్వపరిగ్రహః-త్యక్త=విడువబడిన, సర్వ=సమస్తమైనవానినిగూర్చిన పరిగ్రహః = మమకారముగలవాఁడును, శారీరం = శరీరమాత్రముచేత సాధింపదగిన, కర్మ కేవలమ్ = కర్మమును మాత్రము, కుర్వన్ = చేయుచున్నవాఁడు, కిల్బిషం = సంసారబంధరూప మగుపాపమును, నాప్నోతి = పొందఁడు.

తా. ఫలాభిసంధి లేనివాఁ డై, †చిత్తమును మనస్సును నిగ్రహించి (అనఁగా విషయాంతరములందు చింత లేని మనస్సుగలవాఁడై) ఆత్మయే తనకు ముఖ్యప్రయోజనముగాఁ గలవాఁ డగుటవలన

---

కర్మయోగము ఆచరించుట జ్ఞానమును అభ్యాసము చేయుటయే యగుచున్నదని భావము.

* కర్మముయొక్క జ్ఞానత్వమును 'యస్యసర్వే' అని ఉపపాదించి 'త్యక్త్వాకర్మ' అని దానినే వివరించి యిఁక నిది మొదలుగా మూఁడుశ్లోకములచే విస్తరించి ప్రతిపాదించుచున్నారని తెలిసినది.

† బుద్ధి, అహంకారము, చిత్తము, అని మనస్సుయొక్క వృత్తులు మూఁడు. బుద్ధి యనఁగా అధ్యవసాయము (నిశ్చయము). అహంకార మనగాఁ అభిమానము (కోరుట). చిత్తమనఁగా చింత (విచారము). మనస్సు అనునది తలంపు అయిన యెడల, బుద్ధి అహంకారము చిత్తము ఈమూడును వరుసగా నిశ్చయించునట్టియు, కోరునట్టియు, చింతించునట్టియు తలంపు లగును. మనోవృత్తులైన యీ బుద్ధ్యహంకారములను తత్త్వములలోఁ జేరిన బుద్ధితత్త్వముగాను అహంకారతత్త్వముగాను భ్రమింపరాదు.

*భోగ్యభోగోపకరణము లగుతక్కినసమస్తప్రకృతిప్రాకృతవస్తువుల యందు మమత లేనివాఁడగుచు, జీవమున్నంతవఱకు శరీరసంబంధ మగు కర్మమాత్రము నాచరించువాఁడు జ్ఞాననిష్ఠ లేకపోయినను సంసారబంధరూప మగుపాపమును బొందఁడు. (అట్టివాఁడు నడుమ జ్ఞానయోగసాహాయ్య మక్కఱలేక కేవల మిట్టికర్మయోగముచేతనే ఆత్మస్వరూపమును దర్శించుచున్నాఁ డనుట.)

శ్లో॥ †యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే॥ 22

టీ. యదృచ్ఛాలాభసన్తుష్టః = యత్నము లేకయే తనంతట ప్రాప్తించిన వస్తువుల లాభముచే తృప్తిఁ బొందినవాఁడును, ద్వన్ద్వాతీతః = శీతోష్ణాది ద్వంద్వములనుసహించువాఁడును, విమత్సరః = మాత్సర్యము లేనివాఁడును, సిద్ధౌ=ఫలప్రాప్తియందును, అసిద్ధౌ =

* ప్రకృతి వస్తువులు-భోగ్యము లగు శబ్దాదివిషయములు. ప్రాకృతవస్తువులు-భోగోపకరణము లగు ఇంద్రియములు.

† 'శారీరం కర్మకుర్వన్' అని చెప్పియుండుటంబట్టి శరీరధారణము కొఱకు ద్రవ్యార్జనాదులందు అవశ్యము ప్రవర్తింపవలసియున్నది. దాని వలన శస్త్రపాతాదులు శీతోష్ణమృదుపరుషాదిస్పర్శములు త్రోసిపుచ్చరానివై కలుగును. అందును, పూనినదానికి విఘాతము సేయువానియెడల కోపము పుట్టును. పూనిక చెడఁగా సంతాపమును, చెడక లాభము కలుగఁగా సంతోషమును, పుట్టును. కాబట్టి యిట్లు కర్మయోగమే ఆత్మదర్శనమునకు విరోధులగు సమస్తవైరివర్గమును రేపెట్టుచున్నదే యని శంకరాఁగా, ఈశ్లోకమున దానిని బరిహరించుచున్నారని తెలియునది. ఇచట 'యదృచ్ఛాలాభసంతుష్టః' అనుటచే సమస్తవ్యాపారములనివృత్తి చెప్పఁబడిన దని తలంపరాదు. అట్లు తలంచినచో తనంతట వచ్చినవస్తువులను లోఁగొనుట మొదలైనవ్యాపారములుగూడ నివర్తింపవలసివచ్చును. కనుక చేయుచున్న వ్యాపారములకే యభిసంధి మొదలైనవానియొక్క నివృత్తి చెప్పఁబడినది. ఇందువలన ఏదేనియొక శరీరధారణవస్తువు తనంతట లభించెనేని దానికన్న మఱింత మాధుర్యాదులు గలవస్తువులకై ప్రవృత్తి సేయరాదని యుపదిష్ట మగుచున్నది.

అప్రాప్తియందును, సమః=సమచిత్తుఁడు నైనపురుషుఁడు కృత్వా అపి=కర్మములఁ జేసినను, ననిబధ్యతే=సంసారబంధమును బొందఁడు.

తా. శరీరధారణమునకు సాధనముగా తనంతట లభించిన వస్తువు లెంతకొంచెమైనను వానితో తృప్తిఁ బొందినవాఁడై, సాధన సమాప్తివఱకు త్రోసిపుచ్చఁగూడని శీతోష్ణాదిద్వంద్వములను సహించుచు, తనకు అనిష్టములు కలుగుటకు తన కర్మమే హేతువని తలఁచుటవలన పరులయందు మాత్సర్యము లే , యుద్ధాదికర్మములందు జయాదులు సిద్ధించినను సిద్ధింపక పోయినను సమచిత్తము గలిగి యుండు పురుషుఁడు కేవలకర్మమునే యాచరించినను జ్ఞాననిష్ఠ లేకున్నను సంసారబద్ధుఁడు గాఁడు.

శ్లో॥ *గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ 23

టీ. జ్ఞానావస్థితచేతసః=దేహాతిరిక్తమైన ఆత్మవిషయజ్ఞానమునందు నిలిచినమనస్సు గలవాఁడును, కాబట్టియే గతసఙ్గస్య=(ఆత్మ

* ఇంతవఱకు బుద్ధిపూర్వకముగాఁ బ్రయత్నించి పొందిన సంగపరిత్యాగాదులు చెప్పఁబడెను. ఇప్పుడు అట్టిప్రయత్నము లేక తనంతటనే కలుగు సంగపరిత్యాగాదులు చెప్పఁబడుచున్నవి అనఁగా 'త్యక్త్వాకర్మఫలాసఙ్గమ్' 'త్యక్తసర్వపరిగ్రహః' 'యతచిత్తాత్మా' ఇత్యాదులచే చెప్పఁబడిన బుద్ధిపూర్వక సంగత్యాగములచేత 'జ్ఞానావస్థితచేతసః' అని ఆత్మజ్ఞానమందు మనస్సు అవస్థితమయి యున్నది. కాఁబట్టి దానిని ఇప్పుడు నియమింపనక్కఱలేదు. ఇట్లు నిరతిశయభోగ్యమైన యాత్మస్వరూపము అనుసంధించుటవలన దానికి అన్యవిషయములందుఁ గలసంగము సవాసనముగా తనంతటనే నివర్తించుచున్నది. ఇట్లు సంగము నివర్తింపగా సర్వపరిగ్రహములను తాను త్యజింపవలసినది లేదు. అవియే తన్ను విడిచి పోవుచున్నవి. ఇట్లు జయింపవలసినవాని నెల్ల జయించి యథావస్థితమైనయుపాయమునందు నిరంతరాయముగా ప్రవర్తించువానికి ఆత్మసాక్షాత్కారమునకును తత్ప్రాప్తికిని విరోధులై పూర్వకృతములగు పుణ్యపాపములరూపమున నుండు సర్వకర్మములును నశించుచున్నవని తెలియునది.

తరవిషయములందు) ఆసక్తి లేనివాఁడును, ముక్తస్య = (సర్వపరిగ్ర హములచేత) విడువఁబడినవాఁడును, యజ్ఞాయ = యజ్ఞముకొఱకు, ఆచరతః=వర్తించువాఁడు నగుపురుషుని యొక్క, కర్మ=బంధహేతు భూత మగుపుణ్యపాపరూప మైన ప్రాచీనకర్మము. సమగ్రం=నిశ్శేష ముగా, ప్రవిలీయతే=నశించుచున్నది.

తా. ఆత్మజ్ఞానమందు నెలకొనినమనస్సు గలవాఁడగుటచే ఆత్మేతరవస్తువులయందాసక్తి లేనివాఁడై, కావుననే యన్నిపరిగ్రహ ములనుండియు విడివడి, పూర్వోక్త లక్షణము లైన యజ్ఞాది కర్మ ముల నెఱవేర్చుకొఱకు వర్తించుపురుషునికి బంధహేతుభూత మగు ప్రాచీనకర్మ మంతయు నిశ్శేషముగా క్షీణించును.

అవ. ఇంతవఱకు ప్రకృతిబంధము లేనిశుద్ధాత్మస్వరూపమును అనుసంధానముచేయుటతోఁ గూడినదగుటవలన కర్మము జ్ఞానాకార మైనదని చెప్పఁబడెను. ఇప్పుడు స్రుక్స్రువహవిరాది పరికరములతోఁ గూడినసమస్తకర్మము పరబ్రహ్మాత్మకమైనది అనెడి యనుసంధాన ముతోఁ గూడిన దగుటవలన ఆకర్మము జ్ఞానాకారమును బొందు చున్న దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా॥ 24

టీ. బ్రహ్మార్పణం-బ్రహ్మ=బ్రహ్మాత్మక మైన,అర్పణం=అర్పింపఁ బడు స్రుగాదిహోమసాధనములు గలదియు, బ్రహ్మహవిః-బ్రహ్మ= తానును బ్రహ్మాత్మక మైనదియు నగు, హవిః = పురోడాశాదిక మగు హోమద్రవ్యము, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మాత్మక మగు ఆహవనీయాది అగ్నియందు. బ్రహ్మణా=బ్రహ్మాత్మక మైనకర్తచేత, హుతం = హోమముచేయఁబడుచున్నది, (ఇతి=అని) బ్రహ్మకర్మసమాధినా =

సమస్తకర్మమును బ్రహ్మమయ మని అనుసంధానముచేయువాఁడు, తేన=ఆకర్తచేత, బ్రహ్మైవ=బ్రహ్మమగు తనయాత్మస్వరూపమే, గన్తవ్యం=పొందఁదగినది.

తా. బ్రహ్మకార్య మగుటవలన బ్రహ్మమగు స్రుగాదిహోమ సాధనములు గలదై తనంతట బ్రహ్మమగు హవిస్సు బ్రహ్మమగు నగ్నియందు బ్రహ్మరూపియైన యజమానునిచేత వేల్వఁబడుచున్నది'. అని సమస్తకర్మములు బ్రహ్మాత్మకమగుటవలన బ్రహ్మమయములుగా నెవఁడు తలంచునో, అట్టివాఁడు బ్రహ్మాత్మక మగుటవలన బ్రహ్మభూత మగు ఆత్మస్వరూపమునే తప్పక పొందును. అనఁగా, ముముక్షువు చేయుచుండు సమస్తకర్మములు పరబ్రహ్మాత్మకమే యనెడి యనుసంధానముతోఁ గూడియుండుటవలన జ్ఞానాకారమై జ్ఞాననిష్ఠా వ్యవధానము లేకయే సాక్షాదాత్మావలోకనమునకు సాధన మగు నని భావము. (ఇచట అన్నియు బ్రహ్మకార్యము లగుటచే బ్రహ్మములుగాఁ జెప్పఁబడె నని యెఱుఁగునది.)

అవ. ఇట్లు కర్మము జ్ఞానాకార మగుటను ప్రతిపాదించి కర్మయోగ భేదములను దెలుపుచున్నాఁడు. 33

శ్లో॥ దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞే నై వోపజుహ్వతి॥ 25

టీ. అపరేయోగినః = కొందఱు కర్మయోగులు, దైవం = ఇంద్రాది దేవతార్చనరూపమగు, యజ్ఞమేవ = యజ్ఞమునే, పర్యుపాసతే = సేవించుచున్నారు-అపరే = మఱికొందఱు కర్మయోగులు, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మరూపమైన అగ్నియందు, యజ్ఞేనైవ=స్రుగాది యజ్ఞోపకరణములచేతనే, యజ్ఞం = యజ్ఞసాధనమగు హవిస్సును, ఉపజుహ్వతి=హోమము చేయుచున్నారు.

తా. కొందఱు కర్మయోగులు *దేవతార్చనరూప మగు యజ్ఞమునందె నిష్ఠగలిగియుందురు. మఱికొందఱు బ్రహ్మరూపమైన అగ్నియందు స్రుక్స్రువాదులచేతనే హవిస్సును హోమము

---

* దైవమనఁగా దేవతతోడిసంబంధముగలదియనియర్థము. దైవముతోడి సంబంధము కర్మయోగుల కందఱికిని సామాన్యము. ఇటు సామాన్యముగా కర్మయోగమును జెప్పక "అపరే" అని యొకకొందఱాచరించుకర్మయోగ విశేషమును మాత్రము చెప్పుటచే ఇందలి యీ దైవసంబంధము సామాన్యమైనదిగాక విశేషమైనదిగా నుండవలయును గాన అర్చనరూపమైనదిగా గ్రహింపఁబడినది. పూర్వోక్తము లైన యాగాదులును దేవతార్చనములే కాన నిట అర్చనమునకుఁ గలవిశేష మేమి? యన్నచో, అర్చనశబ్దము ఆయా దేవతారూపాదులకుఁ గావించుపరిచర్యయందు ప్రసిద్ధము గాన నిట విశేషించినదిగానే గ్రహింపవలయును. అయినను మన్వాదులు 'దేవతాభ్యర్చనం చైవ సమిదాధాన మేవచ' అని దేవతార్చనమును నిత్యకర్మముగా చెప్పియుండుటవలన కర్మయోగులకందఱకును అవశ్యమై యుండఁగా ఈ యొకతెగ వారికి విశేషించి చెప్పుట యెట్లు? అన్నచో 'దేవతార్చన . నిష్ఠగలిగి యుందురు' అనంబడినది. అనఁగా అది కర్మయోగుల కందఱికిని గలిగియున్నను ఈ తెగవారికి మాత్రము అందు మిక్కిలి నిష్ఠ యుండునని గ్రాహ్యము. మఱియు నిట 'బ్రహ్మాగ్నా అపరేయజ్ఞం యజ్ఞేనైవ ఉపజుహ్వతి' అనుచో 'యజ్ఞమ్' అనుటకు కేవలయజ్ఞమని కాని తత్కారణమైన పరమాత్మాదులని కాని యర్థముసేసినచో నట్టియజ్ఞముగాని పరమాత్మాదులనుగాని 'ఉపజుహ్వతి' అని యాహోమముచేయుటకును హోమసాధనములంగా చేయుటకును పొసఁగదు కాన యజ్ఞ మనుటను యజ్ఞసాధనములంగా గ్రహించునది. అనఁగా 'యజ్ఞమ్' అనుటను హవిస్సుగాను 'యజ్ఞేన' యనుటను స్రుగాదిసాధనములుగాను గ్రహించునది. మఱియు పూర్వశ్లోకమున 'బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్' అనబడినది. అదియే యిచటఁగూడ 'బ్రహ్మాగ్నౌ అపరే' అని చెప్పఁబడినది. కాన పునరుక్తి కలుగుచున్నది. మఱియు సర్వకర్మయోగులకును సాధారణమైనదిగా పూర్వము చెప్పఁబడినదానిని ఇట నీతెగవారికి విశేషించి చెప్పుట యొప్పదు. కనుక నిందలి 'యజ్ఞేన' అనుటకు అర్థము వేఱుగా గ్రహింపవలయును. అనఁగా యజ్ఞశబ్దముచేత యాగమును, ఉపజుహ్వతిశబ్దముచేత హోమమును జెప్పఁబడుచున్నదిగదా. అవి కర్మయోగుల కందఱకు సామాన్యమే యైనను ఈకర్మయోగులకు అందు నిష్ఠయుండుటయే విశేషము అని భేదము తెలియునది. కావుననే 'బ్రహ్మార్పణం బ్రహ్మహవిః' అనువాక్యమున యాగములందును హోమములందును నిష్ఠ గలిగియుందురు అనఁబడెను. దీనివలన పునరుక్తి మొదలగుదోషములు పరిహృతములు.

చేయుచున్నారు. అనఁగా 'బ్రహ్మార్పణం బ్రహ్మహవిః' అనున్యాయమున వీరు యాగములందును హోమములయందును నిష్ఠగలవారగుచున్నారు.

శ్లో॥ శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీన్విషయానన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి॥ 26

టీ. అన్యే=మఱికొందఱు, శ్రోత్రాదీని = శ్రోత్రము మొదలగు, ఇన్ద్రియాణి = ఇంద్రియములను, సంయమాగ్నిషు = నిగ్రహమనెడి యగ్నులయందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు. అన్యే=ఇతరులు, శబ్దాదీన్ =శబ్దము మొదలయిన, విషయాన్ = విషయములను, ఇన్ద్రియాగ్నిషు = ఇంద్రియము లనెడు అగ్నులయందు, జుహ్వతి=హోమము చేయుచున్నారు.

తా. కొందఱు కర్మయోగులు శ్రోత్రాదీంద్రియములనెడు హవిస్సును *నియమనసంయమ మనునట్టి యగ్నియందు హోమము

* ఇచట సంయమమును అగ్నిగా రూపించుట యింద్రియములను భస్మము సేయుటకు (అనఁగా ఇంద్రియములను వ్యాపారములు లేనివానినిగాఁ జేయుటకు) అని తెలియునది. ఒక్కొక్క యింద్రియమునకు ఒక్కొక సంయమము చెప్పవలె సంయమాగ్నులు అని బహువచనము. ఇట్లే మీఁద ఇంద్రియాదులను అగ్నులుగా రూపించుటకు భావము తెలియునది ఇంద్రియ నియమనము సర్వకర్మయోగులకును సాధారణమై యుండఁగా నిట విశేషించి చెప్పనేల యని శంకరాఁగా 'నిగ్రహమునందె ప్రయత్నింతురు' అనఁబడినది. అనఁగా అందఱికిని అది అవశ్యమే కాని వీరుమాత్రము అందు విశేషించి ప్రయత్నపడుదురని భేదము తెలియునది. ఇట్లే; 'ప్రయత్నింతురు' అనుటకుఁ దాత్పర్యము మీఁదనెల్లఁ దెలియునది 'శ్రోత్రాదీని...' 'ఇంద్రియములను సంయమాగ్నియందు హోమము సేయుట'చే ఇంద్రియ నియమనము చెప్పఁబడినది. 'శబ్దాదీన్' అనుచో ఇంద్రియాగ్నులందు శబ్దాదివిషయములను హోమముసేయుట యననేమి ? ఇంద్రియములందు శబ్దాదివిషయములను సమర్పించుటయా ? కాదు. హోమముచేత హవిస్సునకు నాశము గలుగును గదా. శబ్దాదులను ఇంద్రియాగ్నులయందు హోమము సేయుట యనఁగా వానికి ఇంద్రియములతోడి సంబంధమును నాశము సేయుట యని యర్థము. కాన 'ఇంద్రియములకు శబ్దాదులందలి యాసక్తిని నివా

సేయుదురు-అనఁగా శ్రోత్రాదీంద్రియనిగ్రహమునందె ప్రయత్నము చేయుదురు. మఱికొందఱు కర్మయోగులు శబ్దాదివిషయరూపమగు హవిస్సును నింద్రియవర్గ మనునట్టి యగ్నియందు వేల్తురు-అనఁగా ఇంద్రియములకు శబ్దాదివిషయములందుఁ గలయాసక్తిని నివారించు విషయమున ప్రయత్నము చేయుదురు. తమంతట ప్రాప్తము లగు విషయముల ననుభవించుచున్నను వానియందు నాసక్తి లేనివా రగుచు ఆ విషయములను హవిస్సుగా భావించి వానిని అగ్నిగా భావింపఁబడు నింద్రియములయందుఁ బడవేయుదురు.

శ్లో॥ సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
*ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ 27

టీ. అపరే=మఱికొందఱు, సర్వాణి=సమస్తములైన, ఇన్ద్రియకర్మాణి-ఇంద్రియ = చక్షురాదీంద్రియములయొక్క, కర్మాణి =

---

రించుటకు ప్రయత్నించుచున్నా' రని తాత్పర్యము సేయబడెను. 'శ్రోత్రాదీని' అని యింద్రియముల నియమనము చెప్పఁబడెను. 'ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః' అని యింద్రియములకంటె విషయములు బలీయములైనవిగావున విషయముల నియమనము 'శబ్దాదీన్' అని చెప్పఁబడెను. మీఁద, విషయములకంటె బలీయమైన మనస్సుయొక్క నియమనము చెప్పఁబడును. విషయములను నియమించుట యనఁగా దూరముగాఁజేయుట లేక వానిసన్నిధిని పరిహరించుటయు నగును. దీనివలన నే యింద్రియములకు ఆవిషయమందలి ఆసక్తి నివర్తించుచున్నదని భావము. లేక, 'శ్రోత్రాదీని' అని విషయములసన్నిధిని పరిహరించుట చెప్పఁబడిన దనియు, 'శబ్దాదీన్' అని విషయములు సన్నిహితములైనను అవి యేమియు పనిసేయఁజాలనట్లు గావింపఁబడుట చెప్పఁబడిన దనియు విభాగము గ్రహింపవచ్చును.

* 'అర్థేభ్యశ్చ పరం మనః' అని అర్థములకంటె బలీయమైన మనస్సుయొక్క సంయమనము ఇట 'ఆత్మసంయమయోగాగ్నౌ' అని చెప్పఁబడినది. ఇంద్రియకర్మము లనఁగా దర్శనస్పర్శనాదులు. ప్రాణకర్మములు ఉచ్ఛ్వాసనిశ్వాసాదులు: లేక, ఇంద్రియవ్యాపారములకు హేతువులయిన సూక్ష్మవ్యాపారవిశేషములు దీనివలన మీఁదఁ జెప్పబడిన ప్రాణాయామము తేలగుచున్నది. మనస్సు, దేహమునకంటె వేఱైనదిగా శుద్ధాత్మస్వరూపమును అనుసంధించుటవలన జ్ఞానదీపిత మగుచున్నదని తెలియునది.

దర్శనము స్పర్శనము మొదలైన వ్యాపారములను, ప్రాణకర్మాణిచ-ప్రాణ=పంచప్రాణములయొక్క, కర్మాణిచ=ఉచ్ఛ్వాసము నిశ్శ్వాసము మొదలైనవ్యాపారములను, జ్ఞానదీపితే=జ్ఞానముచేతఁ బ్రకాశింపఁజేయఁబడుచున్న, ఆత్మసంయమయోగాగ్నౌ-ఆత్మ = మనస్సుయొక్క, సంయమ = నిగ్రహరూపమైన, యోగ = అభ్యాసమనెడి, అగ్నౌ=అగ్నియందు, జుహ్వతి=హోమము చేయుచున్నారు.

తా. మఱికొందఱు సమస్తేంద్రియవ్యాపారములను, ప్రాణాదివాయువులయొక్క బహిర్గమనాదివ్యాపారములను, జ్ఞానప్రకాశితమగుమనోనిగ్రహాభ్యాసమనెడి యగ్నియందు వేల్తురు-అనఁగా మనస్సునకు ఇంద్రియవ్యాపారములయందును ప్రాణవ్యాపారములయందును గలయాసక్తిని నివర్తింపఁజేయుటకు ప్రయత్నము చేయుచున్నారు-అని భావము.

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞా శ్చ యతయ స్సంశితవ్రతాః॥ 28

టీ. యతయః = యతనశీలురును, సంశితవ్రతాః = దృఢసంకల్పము గలవారునైన, అపరే = మఱికొందఱు, ద్రవ్యయజ్ఞాః=ద్రవ్యోపార్జనము చేసి దానిని దేవతార్చన దానాదులయందును యాగహోమాదులయందును వినియోగించుటయే యజ్ఞముగాఁగలవారును, (అపరే=ఇతరులు), తపోయజ్ఞాః = కృచ్ఛ్రచాంద్రాయణోపవాసాది తపస్సులె యజ్ఞముగాఁ గలవారును, తథా అపరే=అట్లే మఱికొందఱు, యోగయజ్ఞాః = పుణ్యతీర్థ పుణ్యక్షేత్ర స్థానప్రాప్తులే యజ్ఞముగాఁ గలవారును, (అపరే = మఱికొందఱు,) స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ-స్వాధ్యాయయజ్ఞాః జ్ఞానయజ్ఞాః = వేదాధ్యయనాభ్యాసము (మఱికొందఱు) తదర్థజ్ఞానాభ్యాసమునే యజ్ఞముగాఁ గలవారునై యున్నారు.

తా. గట్టిపూనికయు దృఢసంకల్పమును గల కర్మయోగులు, తాము న్యాయమున ద్రవ్యమును సంపాదించి, కొందఱు దేవతార్చనమునను, గొందఱు దానమందును, గొందఱు యాగములందును; కొందఱు హోమములందును వినియోగించుటకు యత్నింతురు, *వీరందఱును ద్రవ్యయజ్ఞులు. కొందఱు కృచ్ఛ్రచాంద్రాయణోపవాసాదులయందు నిష్ఠ గలవారై యుందురు; కొందఱు పుణ్యతీర్థ పుణ్యక్షేత్రాభిగమనమునందే ఆసక్తి గలవారై యుందురు; మఱి కొందఱు వేదాధ్యయనాభ్యాసపరులై యుందురు; తదర్థజ్ఞానాభ్యాసమునందు కొందఱాసక్తులై యుందురు.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥ 29

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।

---

* దేవతార్చనయాగాదులు పూర్వమే చెప్పఁబడియుండఁగా నిచట 'ద్రవ్య యజ్ఞాః' అని ఆయర్చనాదులను మరలఁ జెప్పుట నిరర్థకముగదా యన్నచో, ద్రవ్య శబ్దము సామాన్యవాచకముగాన దానమునుగూడఁ జెప్పునది యగును. దానము పూర్వము చెప్పబడలేదు గావున నందులకై దానిని గ్రహించు ద్రవ్యశబ్ద మిచటఁ జెప్పఁబడినది. ఇట్లైని, 'ద్రవ్యయజ్ఞాః' అని సామాన్యముగా చెప్పుటకంటె 'దానయజ్ఞాః' అని విశేషించి చెప్పరాదా? యన్నచో అర్చనదానయాగహోమయజ్ఞములు నాలుగును తపోయజ్ఞాదులకంటె నితరములైన యవాంతరయజ్ఞముల నెల్ల సంగ్రహించుచున్నవని సూచించుటకును, న్యాయార్జిత ద్రవ్యముచేతనే సాధింపదగిన వని తెలుపుటకును, వానికెల్లను సామాన్యమైన ద్రవ్య శబ్దము ప్రయోగింపఁబడె నని తెలియునది. కావుననే 'వీరందఱును ద్రవ్యయజ్ఞు' లనఁబడిరి. ఇట తపస్సు అనఁగా శాస్త్రోక్తమైనభోగసంకోచము. మఱియు నిది కర్మనిష్ఠాప్రకరణము గనుక 'యోగ' మనగా యోగాభ్యాసము కానేరదు; కర్మనిష్ఠాభేదప్రకరణము గనుక సామాన్యమైన కర్మయోగము గానేరదు. కనుక యోగ మనఁగా 'సంయోగము' అనఁగా 'ప్రాప్తి' యని యర్థముసేసి 'కర్మయోగస్తపస్తీర్థదానయజ్ఞానిసేవనమ్' అని సంగ్రహశ్లోకముచే సూచింపఁబడినట్లు పుణ్యతీర్థాది ప్రాప్తిగా గ్రహింపబడినది.

టీ. ప్రాణాయామపరాయణాః=ప్రాణాయామమునందు ఆసక్తులైన, అపరే=కొందఱు. నియతాహారాః=పరిమితమైన యాహారము గలవారగుచు, ప్రాణం=ప్రాణవాయువును, అపానే=అపానవాయువునందు. జుహ్వతి=హోమము సేయుచున్నారు, తథా=అట్లే, అపరే=మఱికొందఱు, అపానం=అపానవాయువును, ప్రాణే = ప్రాణవాయువునందు, జుహ్వతి=హోమము సేయుచున్నారు. అపరే = మఱికొందఱు, ప్రాణాపానగతీ=ప్రాణవాయువుయొక్క ఊర్ధ్వగతిని అపానవాయువుయొక్క అధోగతిని, రుద్ధ్వా=బంధించి, ప్రాణాన్ =ప్రాణవృత్తిభేదములను, ప్రాణేషు=ప్రాణములయందు, జుహ్వతి=హోమము సేయుచున్నారు.

తా. కొందఱు కర్మయోగులు ఆచారనియమముతో పూరక రేచక కుంభకము లనెడు మూఁడువిధము లైన ప్రాణాయామములందు నిష్ఠగలవారగుదురు. అనఁగా, వారు ప్రాణాయామపరులై పూరక రేచక కుంభకము లనుమూఁడు భేదములనుబట్టి మూఁడు విధములవారగుదురు. ఎట్లనఁగా కొందఱు ఊర్ధ్వగతి గల ప్రాణవాయువును అపానవాయువునందుఁ జేర్చి (క్రిందికిఁ బోనిచ్చి) పూరకమను నిష్ఠను సలుపుదురు. అట్లే కొందరు క్రింద నుండు అపానవాయువును ప్రాణవాయువునందుఁ జేర్చి (ఊర్ధ్వమునకుఁ బోనిచ్చి) రేచకమను నిష్ఠను సలుపుదురు. మఱికొందఱు ప్రాణవాయువుయొక్క ఊర్ధ్వగతి యగు ఉచ్ఛ్వాసమును అపానవాయువుయొక్క అధోగతి యగు నిశ్శ్వాసమును నిలిపి కుంభక మను ప్రాణాయామము సేయుదురు. 'అపానే జుహ్వతి ప్రాణం' అని పూరకము. 'ప్రాణే అపానం జుహ్వతి' అని రేచకము. 'ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి' అని కుంభకము. ఈ మూఁడు తెగలవారును నియతాహారు లగుదురు.

అవ. ఇప్పుడు చెప్పబడినవయి రెండువిధములైన యజ్ఞముల యందు నిష్ఠగలవారికి గలుగుఫలమును చెప్పుచున్నారు.

సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥ 30

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మసనాతనమ్।

టీ. ఏతే సర్వే అపి=వీరందఱును, యజ్ఞవిదః=యజ్ఞాన్ విన్దన్తి (లభన్తే)-మహాయజ్ఞములు మొదలుగాఁ గల యజ్ఞములందు నిష్ఠ గలవారు, యజ్ఞ = యజ్ఞముచేత, క్షపిత = నశింపఁజేయఁబడిన, కల్మషాః=పాపము గలవారును, యజ్ఞశిష్టామృతభుజః=యజ్ఞమునందు మిగిలిన అమృత మనబడు నన్నము భుజించువారునై, సనాతనం=శాశ్వతమైన, బ్రహ్మ=బ్రహ్మమును-ఆత్మస్వరూపమును, యాన్తి = పొందుచున్నారు.

తా. *ద్రవ్యయజ్ఞము మొదలుకొని ప్రాణాయామపర్యంతము

* ఇట్లు కర్మయోగము నానాభేదములు గలిగియుండుటంబట్టి యాభేదములందు నిష్ఠులైనవారికి అవాంతరఫలములందు భేదములు గలుగునా? ప్రాణాయామనిష్ఠులైనవారికి యజ్ఞాదులు త్యాజ్యములగునా? యని శంకలు గలుగఁగా, ఈశ్లోకమున వానిని పరిహరించుచున్నా రని తెలియునది. ఇట కర్మయోగభేదము లన్నియు సమములై ఫలభేదము లేకుండుటంబట్టి యెవఁడేది కోరినను దానిని గయికొనవచ్చును గాన 'సమకు సవిహాహితములైన' యనఁబడెను. మఱియు పూర్వము 'యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః' అని యజ్ఞశిష్టాశనముచేత శరీరయాత్ర సేయుచు పాపములు వీడుదు రన్న విషయమే యిచట 'యజ్ఞశిష్టామృతభుజః' 'యజ్ఞ క్షపిత కల్మషాః' అని చెప్పఁబడినది గాన కర్మయోగులందఱికిని 'అమృత మనం బరఁగు... సేయుచునే' యనంబడినది. మఱి యజ్ఞశబ్దము సామాన్యము గాను ప్రయోగింపబడియుండుటచే, అది మహాయజ్ఞములు నిత్యనైమిత్తికకర్మములునే, యగును గాని వేఱు గాదు. ఇట్లిందఱిని యజ్ఞశిష్టామృతభుజు లనుటచేతను, ఆయజ్ఞములును పరిహరింపరాని నిత్యాదులే యగుటచేతను, ప్రాణాయామనిష్ఠులకుఁ గూడ నవి కర్తవ్యములే కాని త్యాజ్యములు గావని తెలియునది. 'చేయుచునే' అని ఏవకారముచేత శరీరధారణార్థమైన యిట్టివ్యాపారము ఆత్మావలోకమునకు విరోధి గాదు; ఉపయుక్తమైనదే యని తెలియుచున్నది. అది లేనిచో వ్యాపారమే యశక్య మని భావము. పూర్వము 'బ్రహ్మైవ తేన గన్తవ్యమ్' అన్నదానికి వలెనే యిట 'యాన్తి బ్రహ్మ సనాతనమ్' అనుటయును ఆత్మస్వరూపప్రాప్తి అర్థముగా గ్రహించునది.

తమకు సమీహితము లయిన (అనఁగా వారువారు కోరిన) కర్మయోగభేదములయందు ప్రవర్తించిన వీర లందఱును 'సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా' అని చెప్పఁబడినవియు మహాయజ్ఞపూర్వకములైనవియునగు వివిధయజ్ఞములందు నిష్ఠ గలవారై, కావుననే యజ్ఞముల చేత పాపముల నాశముపొందించి, అమృత మనఁబరగు యజ్ఞశేషాన్నముచేత శరీరధారణము చేయుచునే కర్మయోగమును అనుష్ఠించుచు శాశ్వతమైన బ్రహ్మమును (అనఁగా ఆత్మస్వరూపమును) బొందుదురు.

నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ॥ 31

టీ. హే-కురుసత్తమ=అర్జునా, అయజ్ఞస్య = మహాయజ్ఞముల తోడ నిత్యనైమిత్తిక కర్మయజ్ఞములు చేయనివానికి, అయం = ఈప్రాకృతమైన, లోకః = ధర్మార్థకామము లనునట్టి పురుషార్థము, నాస్తి = లేదు, అన్యః = తక్కిన మోక్ష మను పరమపురుషార్థము, కుతః=ఎక్కడిది.

తా. అర్జునా, *మహాయజ్ఞాదిపూర్వకనిత్యనైమిత్తిక కర్మములు సేయనివారికి ఇహలోకసంబంధ మగు ధర్మార్థకామములనఁ

---

* నిత్యనైమిత్తికములు సర్వకర్మయోగభేదములకును సామాన్యముగా నావశ్యకము లైనవని తెలిసెనుగదా. కొందఱు తాను ఒక కర్మయోగభేదమును ఆచరించుచున్నా మనెడి యభిమానముచే ఆ నిత్యాదులను వదలిరేని సర్వపురుషార్థములును వారికి నశించునని యిందు చెప్పుచున్నారు. మఱియు మొదటినుండియు మోక్షమే పరమపురుషార్థముగా ప్రస్తుత మగువిషయమై యున్నది గాన 'అన్యః' అనుటచే ఇప్పటివానికి వేఱై మొదటినుండియుఁ బ్రస్తుతమై యుండు మోక్షమే గ్రాహ్యము. అప్రాకృతమైన మోక్షమునకు విరుద్ధముగా తక్కిన మూఁడుపురుషార్థములును ప్రాకృతము లై యుండు సామాన్యలక్షణము గలిగియుండుటంబట్టి యామూటికిని 'అయం' అని ఒకటిగా నిర్దేశము గలిగినదని తెలియునది కావుననే 'తదితరమైన... ప్రాకృతమైనది గదా' అనఁబడినది. అనఁగా నీమూఁడును ప్రాకృతము లగుటంబట్టి యొక్కటిగాను మోక్షమునకంటె వేఱుగాను గ్రహింపఁబడిన వని భావము.

బడు పురుషార్థములు సిద్ధింప వనఁగా తదితర మగుమోక్ష మనఁబడు పరమపురుషార్థసిద్ధి యెక్కడిది? (పరమపురుషార్థమైనదిగా మోక్షము ప్రస్తుతింపఁబడుటవలన తదితర మైన పురుషార్థము 'అయం లోకః' అని నిర్దేశింపఁబడు చున్నది. అది ప్రాకృత మైనదిగదా.)

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్ విద్ధి తా న్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥ 32

టీ. ఏవం=ఈప్రకారము, బహువిధాః = అనేకవిధము లగు, యజ్ఞాః = కర్మయోగములు, బ్రహ్మణః = ఆత్మస్వరూపముయొక్క, ముఖే = ప్రాప్త్యుపాయ మగుటయందు, వితతాః = విస్తరించినవై యున్నవి, తాన్ సర్వాన్ = వాని నన్నిటిని, కర్మజాన్ = ప్రతిదిన మను ష్ఠింపఁబడుచున్న నిత్యనైమిత్తికకర్మములవలనఁ బుట్టినవానినిగా, విద్ధి= తెలిసికొనుము, ఏవం=ఇట్లు, జ్ఞాత్వా=జ్ఞానపూర్వకముగా అను ష్ఠించి, విమోక్ష్యసే=సంసారబంధమునుండి విడివడుదువు.

తా. ఈప్రకారము *అనేకవిధములగు కర్మయోగములు

---

* బహుప్రకారము లగు కర్మయోగముభేదముల నుపదేశించినపిదప 'ఏవం బహువిధాయజ్ఞాః' అని చెప్పుటచే బహువిధయజ్ఞములు ప్రకృతవిషయములగు బహు ప్రకారకర్మయోగములే యగును గాన 'బహుప్రకారము లగుకర్మయోగములు' అని యర్థముచేయఁబడియెను. మఱియు నిట 'బ్రహ్మ' మనఁగా శుద్ధాత్మస్వరూపము. ముఖశబ్దమునకు 'ముఖంతు వదనే ముఖ్యేత్రమే ద్వారా భ్యుపాయయోః' అని యుపాయము అర్థము కనుక 'బ్రహ్మణోముఖే' అనుటకు ఆత్మప్రాప్తికి ఉపాయ మనుట. అట్టియుపాయమైన కర్మయోగమున అవాంతరభేదములు విస్తరించియున్న వని భావము. మఱియు 'తాన్ సర్వాన్ కర్మజాన్ విద్ధి' అనుచో 'తాన్' అని ప్రాణాయామాదులను వేఱుగను 'కర్మజాన్' అని నిత్యనైమిత్తికకర్మములను వేఱు గను చెప్పుటచే మొదటివి ప్రధానము లనియు రెండవతెగ తదర్థము లనియుఁ దెలియు నది. 'ప్రతిదినము...కర్మములు' అనుటవలన నిత్యాదులు ఫలసిద్ధివఱకు అనుష్ఠింపఁ దగు వనియు ప్రతిదినమును పాపమును బోఁగొట్టి పయిపయి సత్త్వమును వికసిల్లఁ జేయునవి గాన మిక్కిలియుపయుక్తములైన వనియు సూచిత మగుచున్నది. [బ్రహ్మణః = వేదముయొక్క, ముఖే = అంతము (శిరస్సు)లో-వేదాన్తమునందు, వితతాః= విస్తారముగా ప్రతిపాదింపఁబడినవి:—పరవరముని.]

యథావస్థితాత్మప్రాప్తికి సాధనములై యున్నవి. పూర్వోక్త లక్షణములను (అనగా అంతర్భూతజ్ఞానము లగుటచే జ్ఞానాకారములును) పూర్వోక్త భేదములు నగు ఆకర్మయోగము లన్నియు ప్రతిదిన మను ష్ఠింపఁబడుచున్న నిత్యనైమిత్తికకర్మములవలనఁ గలిగినవిగా తెలిసికొనుము. ఇట్లు తెలిసి అనుష్ఠించితివేని సంసారబంధమునుండి విడువడుదువు.

అవ. అంతర్గత మగు జ్ఞానము గలది యగుటచే కర్మము జ్ఞానాకార మని చెప్పఁబడెను. ఇట్లు అంతర్గతజ్ఞాన మగుకర్మము నందు జ్ఞానాంశమే ప్రధానమని చెప్పుచున్నారు.

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే॥ 33

టీ. పరన్తప=శత్రువులను తపింపఁజేయునట్టి, పార్థ=అర్జునా, ద్రవ్యమయాత్ = ద్రవ్యత్యాగరూప మగు క్రియా ప్రచురమైన, యజ్ఞాత్=యజ్ఞముకంటె, జ్ఞానయజ్ఞః=జ్ఞానరూపమయిన యజ్ఞము, శ్రేయాన్=శ్రేష్ఠము, (ఏలనఁగా,) సర్వం=సమస్తవిధ మయినదియు, అఖిలం = వైకల్యము లేనిదియు, కర్మ=క్రియారూపమైన అంశము, జ్ఞానే=జ్ఞానమునందు, పరిసమాప్యతే=పర్యవసించుచున్నది.

తా. *కర్మజ్ఞాన క్రియా ఉభయరూప మగు కర్మయోగ

---

* ఇక్కడ సంశయ మొకటి కలుగుచున్నది.—'శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః' అని ద్రవ్యయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము మేలైన దనుటచే, ఆత్మసాక్షాత్కారమునకు అంతరంగసాధన మగుజ్ఞానయోగమే ప్రధానమని గ్రహించుట యుచితము. 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' అనుటచే కర్మఫలమంతయు జ్ఞానమం దంతర్భూత మగుట తోఁచుచున్నది. మఱియు 'అపిచేదసి సర్వేభ్యః పాపేభ్యః పాపకృత్తమః' 'జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే' 'యోగసన్న్యస్తకర్మాణమ్' ఇత్యాదులగు మీఁదినిర్దేశములును కర్మయోగమునకు పరోధులుగానున్నవి. 'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే' అనుశ్లోకము

మందు ధనాదిసామగ్రీరూప మగు ద్రవ్యమయాంశముకంటె (లేక ద్రవ్యార్జనాదిరూప మగు కర్మమయాంశముకంటె) జ్ఞానమయాంశము శ్రేష్ఠము (ప్రధానము). సర్వకర్మములును తదితరములైన సమ

---

కర్మయోగముకంటె జ్ఞానమే మిక్కిలి పావనమని చెప్పుట తెలియుచున్నది' 'జ్ఞానం లబ్ధ్వా పరాంశాన్తి మచిరేణాధిగచ్ఛతి' అని యిందును జ్ఞానయోగము అంతరంగ సాధనము గావున శీఘ్రముగా ఫలము నిచ్చు ననియు తక్కినది యాలస్యమున నిచ్చు ననియుఁ దెలియుచున్నది. 'యేన భూతాన్య శేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి' అని సమదర్శనరూపమైన జ్ఞానస్వరూపమును మీఁదఁ జెప్పుటచే నిచ్చటఁ జెప్పఁబడు నదియు జ్ఞానయోగమే యని దృఢీకృత మగుచున్నది. ఏలన, కర్మయోగాంతర్గతమైన ఆత్మజ్ఞానముచేతనే అంతయు నిట్లు సాక్షాత్కరింపదు. కాన నిట చెప్పఁబడినది జ్ఞానయోగమే కావలయును. కాఁబట్టి యిది జ్ఞానయోగప్రశంసాప్రకరణమే కావలయును' అని యాక్షేపింపవచ్చును. ఇందులకు సమాధానము.—'శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్' అని జ్ఞానమును ప్రధానముగా చెప్పినంతనే జ్ఞానయోగమే చెప్పఁబడినదనరాదు. ఏలన 'కర్మ జ్యాయో హ్యకర్మణః' ఇత్యాదులందు పూర్వము జ్ఞానముకంటె కర్మమే ప్రధానముగాఁ జెప్పఁబడియున్నది. మీఁదియధ్యాయమునను 'తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే' అని కర్మయోగమే విశేషించినదిగా చెప్పఁబడుచున్నది. ఇట్లు ముందును వెనుకను కర్మమును అధికమైనదిగాఁ జెప్పినను మధ్య విరుద్ధముగా జ్ఞానయోగమే ప్రధానమని చెప్పుట యుచితముగాదు. కాఁబట్టి యిట జ్ఞానము కర్మయోగాంశమైన ఆత్మజ్ఞానమే కావలయును. మఱియు నీ యధ్యాయమునందు ఉపసంహారశ్లోకమగు 'తస్మాదజ్ఞానసమ్భూతమ్' అనుదానిలో జ్ఞానాసిచేత సంశయమును ఛేదించి 'యోగ మాతిష్ఠ ఉత్తిష్ఠ' అని యుద్ధమునకు లేచునట్లు విధింపఁబడినది. ఈజ్ఞానము సర్వవ్యాపారనివృత్తిరూపమైన జ్ఞానమగునేని దానిని హేతువైనదిగాఁ జెప్పిన వెనుక 'ఉత్తిష్ఠ' అని వ్యాపారరూపమగు కర్మమును జెప్పుట యొప్పునా? కనుక జ్ఞానమనఁగా కర్మయోగాంతర్గతమైనదే యుపసంహారమునఁ జెప్పఁబడిన దగును, కాన నిటఁగూడ నట్టిజ్ఞానమే చెప్పఁబడి యుండవలయును. 'సర్వంకర్మాఖిలం' అనుటయు కర్మములోని జ్ఞానాంశము ప్రధానమగుటకు హేతువును జెప్పుచున్నదే కాని వేఱుకాదు. 'జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి' 'నహి జ్ఞానేన సదృశమ్' ఇత్యాదులును జ్ఞానాంశము పాపనివర్తకమైనదని ప్రశంసించుచున్నవే కాని జ్ఞానయోగమును గుఱింపలేదు. 'యోగసన్న్యస్తకర్మాణమ్' అనుచో కర్మము ఫలసంగాదులు లేనిదై జ్ఞానాకారమును బొందుటమాత్రమే చెప్పఁబడినది. 'జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమ్' అనుచో కర్మయోగమునందలి జ్ఞానాంశమే సాక్షాత్కారరూపముగా పరిపాకమునొందుట చెప్పఁబడినది. దాని పరిపాకావస్థయే 'తత్స్వయం

స్తోపాదేయములును జ్ఞానమందు పర్యవసించుచున్నవి. (అనఁగా సమస్తసాధనములచేతను బాహ్యభూతమైన యాజ్ఞానమే కర్మాంతర్గతముగా నభ్యసింపఁబడుచున్నది. అనఁగా అట్లభ్యసింపఁబడుచున్న యాజ్ఞానమే క్రమముగా ఆత్మసాక్షాత్కారమును బొందించు ప్రాప్య దశకు వచ్చుచున్నదని భావము.)

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥ 34

టీ. తత్=ఆయాత్మవిషయజ్ఞానమును, ప్రణిపాతేన=సాష్టాంగ నమస్కారముచేతను, పరిప్రశ్నేన = అడుగుటచేతను, సేవయా = గురుశుశ్రూషచేతను, విద్ధి= తెలిసికొనుము, తత్త్వదర్శినః = ఆత్మ స్వరూపసాక్షాత్కారముగల, జ్ఞానినః=జ్ఞానులు, తే=నీకు, జ్ఞానం = జ్ఞానమును, ఉపదేక్ష్యన్తి=ఉపదేశముచేత ప్రత్యక్షమువలె విశదము చేయుదురు.

---

యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి' 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' అని తోట్రోనే విశదీకరింపఁబడుచున్నదిగాన నదియే యిచటను గ్రాహ్యము. ఇట్లే తక్కినవానికి సమాధానము తెలియుంగునది. కాన జ్ఞానమనఁగా కర్మయోగాంతర్గతమగు జ్ఞానాంశమే యిచట గ్రాహ్యము. కర్మముకంటె నితరములైన యుపాదేయము లెవ్వి యనఁగా, దానికి సాధనములైనవే. కర్మమును తత్సాధనములును జ్ఞానమునందు సమాప్తినొందు ననఁబడెనుగదా. సాధనములు జ్ఞానమున సమాప్తినొందుట యనఁగా ఆసమస్తసాధనములచేతను జ్ఞానమే ప్రాప్య మగుట. ఇట్లాజ్ఞానమునకై సమస్త సాధనముల ననుష్ఠించుచు వానిని కర్మయోగాంతర్గతముగా అభ్యసించుచు రావల యును. కర్మము జ్ఞానమునందు సమాప్తి నొందుట యనఁగా అట్లు కర్మమునందు జ్ఞానము నభ్యసించుచురాఁగా నదియే పరిపాకము నొంది క్రమమున ఆత్మసాక్షాత్కార దశను పొందుట యని యర్థము. అనఁగా కర్మమే ఆత్మజ్ఞానాభ్యాసముచేత జ్ఞానా కారమై ఆత్మదర్శనమును గలిగించునని భావము. ఇట్లు కర్మమును తత్సాధనములను అనుష్ఠించుచునే ఆత్మజ్ఞానమును అభ్యసించుచు రాఁగా కర్మముతోడి యాజ్ఞానమే పరిపక్వమై జ్ఞానయోగసాహాయ్య మక్కఱలేక తానే ఆత్మావలోకనమును గలిగించు నని ఫలితార్థము.

తా. (ఆత్మవిషయమైనజ్ఞానము 'అవినాశితు తద్విద్ధి' మొదలుకొని 'ఏషా తేఽభిహితా సాఙ్ఖ్యే' అనువఱకు నాచే నుపదేశింపఁబడినది. అట్టి జ్ఞానముతోఁ గూడినకర్మమునందు ప్రవర్తించుచున్న నీవు) నే నుపదేశించిన యాజ్ఞానమును నీపరిపాకమునకుఁ దగినట్లు అప్పుడప్పుడు ఆత్మస్వరూపసాక్షాత్కారము గలజ్ఞానులకు *ప్రణిపాతపరిప్రశ్న సేవాదులను జేసి వారివలన విశదముగా తెలిసికొనుము. ఆత్మస్వరూపము సాక్షాత్కరించినజ్ఞానులు ప్రణిపాతాదులచే సేవితులై, జ్ఞానమును దెలిసికొనుకోరికచే కలయు నడుగుచున్న

---

* ఉపదేశింపఁబడిన జ్ఞానమునే ఆయాపరిపాకదశలందు ప్రతిక్షణము విశదమగునట్లు మాటిమాటికి జ్ఞానులవలన వినఁదగు నని యిందు చెప్పుచున్నారు. భగవంతుఁ డర్జునునకు జ్ఞానమును విశదముగా నుపదేశింపఁడయ్యెనా? లేక యర్జునుఁడు విశదముగా తెలియఁడయ్యెనా? మరల మరల జ్ఞానులవలన దానిని వినవలసినదేల? యన్నచో, భగవంతుఁడు విశదముగానే యుపదేశించెను; అర్జునుఁడును ఎచ్చుటకతోనే గ్రహించెను. కాని అనాదికర్మార్జితము అయిన యనంతపాపసమూహము తత్త్వజ్ఞానమును అంతఃకరణముద్వారా ప్రసరింపనీక యడ్డపెట్టుచున్నది గాన నుపదేశింపఁబడియు, జ్ఞానము మిక్కిలి విశదము గానేరదు. కామిలారోగికి శంఖము తెల్లనిదని యెంత యుపదేశించినను ఆరోగము తీఱువఱకు అది పచ్చగనే కనఁబడును గదా. కనుక పాపములు తీఱువఱకు తత్త్వజ్ఞానము విశదము కానేరదు. కనుక కర్మయోగము ననుష్ఠించి పాపములను పోఁగొట్టుకొన్నపిదప జ్ఞానము విశదము గావించుకొను యోగ్యత కుదురును. పిదప నుపదేశమూలముగా పొందిన జ్ఞానమును సామాన్యముగా తానైపొందిన జ్ఞానమును సరియా యని తెలిసికొనుటకును, తెలియని దానిని ఎఱుఁగుటకును, మఱచిన దానిని తెలుపుకొనుటకును మరలమరల ప్రశ్న మావశ్యకము. అనఁగా నప్పుడప్పుడు జ్ఞానము పరిపాకముకొలఁదిని ప్రశ్నము సేయుచు రావలయును. కావుననే 'పరిపాకమునకుఁ దగినట్లు' అనఁబడెను. ప్రణిపాతమనఁగా మిక్కిలియు క్రిందుగా వ్రాఁగిలఁబడుట. దీనివలన ప్రశ్నమునకు పూర్వాంగము లయిన ప్రణామము పాదసంగ్రహము మొదలైనవి గ్రహింపఁబడినవి. పరిప్రశ్న మనఁగా తాను మిక్కిలి బుద్ధిమంతుఁ డగుటను మాటుచేసికొని తెలియనివానివలె చక్కఁగ అడుగవలసినవానిని అడుగక దానిని సంబంధించినవానిని అడుగుచు తన్మూలమున అడుగవలసినవానిని అడుగుట; ప్రతివాదివలె వయుక్తులచే సాక్షేపించుట గాదని భావము. సేవ యనఁగా భక్తి; లేక, చిరకాలముగా అనువర్తించుట యని తెలియునది.

నీయభిప్రాయమును గనుఁగొని జ్ఞాన ముపదేశింపఁగలరు. నే నుప
దేశించిన జ్ఞానమును మరలమరల జ్ఞానులవలన విశదముగా తెలిసి
కొను మని భావము

అవ. సాక్షాత్కారరూపమైన ఆత్మయాథాత్మ్యవిషయజ్ఞాన
ముయొక్క లక్షణము చెప్పఁబడుచున్నది. (అనఁగా కర్మాంతర్భా
తమై యప్పటప్పటిపరిపాకముకొలఁదికి తెలిసికొనవలసినదై యుండు
ఆత్మజ్ఞానము ఆత్మసాక్షాత్కారావస్థ నొందఁగా అప్పుడు దానిస్వరూప
మెట్టిదిగా దెలియవచ్చునో చెప్పుచున్నాఁ డని భావము.) 34

శ్లో॥ యద్ జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాణ్డవ।
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి॥ 35

టీ. హేపాణ్డవ = అర్జునా, యత్ = ఏజ్ఞానమును, జ్ఞాత్వా =
తెలిసికొని, పునః=మఱల, ఏవం=ఇటువంటి, మోహం=అజ్ఞానమును,
న యాస్యసి=పొందవో, యేన=ఏజ్ఞానముచేత, భూతాని = దేవమను
ష్యాదిరూపములతో నెంచఁబడు ప్రాణులను, అశేషేణ = అన్నిటి
నిను, ఆత్మని=నీవలెనే యవియన్నియు జ్ఞానైకాకారములై యుండు
అనియు, అథో=అటుపైని, మయి=అవియన్నియు నావలెనే యుండు
ననియును, ద్రక్ష్యసి=ప్రత్యక్షము చేసికొనగలవో.

తా. ఆత్మస్వరూపజ్ఞానము సాక్షాత్కరించినపిదప *అజ్ఞానము

* ఇచట భూతశబ్దముచే అచిత్సంసర్గము గల క్షేత్రజ్ఞవస్తువులను గ్రహించు
నది. 'నీయందు సమస్తభూతములను జూతువు' అనఁగా నీయందు సమస్తభూతము
లును ఉండఁగాఁ జూతు వని యర్థముకాదు. ఏలన, ఆత్మ సమస్తభూతములకును
ఆధారము గాదు 'నీయందు' అనఁగా 'నీయంతరాత్మయైన భగవంతునియందు'
అని అంతరాత్మపర్యంతముగా గ్రహించినచో అన్నిటికిని ఆధారము గాఁగూడదా
యన్నచో, ఇట ప్రకరణార్థము జీవసమాధి గాన నదియుఁ జెల్లదు. ఇక గ్రహిం
చుట యెట్లు? అన్నచో ఆత్మలన్నియు ప్రకృతిసంసర్గమువలన నానావిధరూపముల
నొంది దేవుఁ డనియు మనుష్యుఁ డనియు నిట్లు విషమములుగా గ్రహింపబడుచున్న వే

వలన మరల నిట్లు ప్రకృతిబంధకృతములగు దేవమనుష్యాది శరీర
ములు మొదలగువానినే ఆత్మలుగా భ్రమించునట్టియు ఆ భ్రమముచే
ఈ దేహము నాది యను మమత మొదలగువానికి ఆస్పదమైనట్టియు
అజ్ఞానమును నీవు పొందవు. మఱియును దానివలన దేవమనుష్యా
ద్యాకారములతో ననుసంధింపఁబడిన సర్వభూతములను నీయందే
చూడఁగలవు. (అనఁగా ప్రకృతిసంబంధరహితుఁడవై జ్ఞానైక
స్వరూపుఁడ వగు నిన్ను కనుగొన్నపిదప స్థాలీపులాకన్యాయమున
నీవలెనే తక్కినయాత్మలన్నియు జ్ఞానైకాకారము లైనను సమాన
ములై యుండుటను కనుఁగొందువు. ఏలనఁగా) ఆత్మ లన్నియు
ప్రకృతిబంధదోషమువలన దేవత లని మనుష్యు లని నానాభేదములు
కలిగియుండును గాని అవియన్నియు జ్ఞానమే స్వరూపముగాఁ గలవి
కనుక ఆ ప్రకృతిబంధదోషము వీడినవెనుక అన్నియును జ్ఞానైకాకార
ములై వడ్లగింజలవలె ఒకటివలెనే మఱియొకటి యుండును. ప్రకృతి
సంసర్గదోషము వీడిన యాత్మలయొక్క రూపము లన్నియును సమా
నములుగానే యుండునని మీఁద 'నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా
ద్బ్రహ్మణి తే స్థితాః' అని చెప్పఁబడెడిని. దేవమనుష్యాద్యాకారము
లతో ననుసంధింపఁబడు భూతముల నన్నిటిని నాయందే చూతువు.

---

కాని యవి ప్రకృతిబంధమును వీడి పరిశుద్ధములైనచో, అన్నియు జ్ఞానమే స్వరూప
ముగాఁ గలవి గావున అన్నియు సమానాకారములుగానే యుండును; కనుక
'నీయందు సర్వభూతములను జూతువు' అనఁగా నీపరిశుద్ధాత్మస్వరూపమును జూడఁగా
తక్కిన భూతముల యాత్మస్వరూపములును అట్లే యుండును గాన, అవికూడ స్థాలీ
పులాకన్యాయమున చూడఁబడినట్లే యగునని భావము. 'నాయందు సమస్తభూతము
లను జూతువు' అనఁగా పరిశుద్ధాత్మలు నాస్వరూపమే కలవి గావున నన్నుఁ
జూడఁగా వానిని జూచినట్లే యగునని భావము. ఇందులకే 'తదా విద్వాన్...ముపైతి'
(ముణ్డ-3-౧-3) యని శ్రుతి యుదాహరింపఁబడెను. పుణ్యపాపములను వీడఁగా,
(నిరంజనః) ఆ పుణ్యపాపమువలని ప్రకృతిసంసర్గమును ఆసంసర్గమువలని క్లేశాదులును
లేనివాఁడై, పరమపురుషునితోడి సామ్యము నొందునని భావము. 'నామరూపములు
వీడిన' అనుట 'తథా విద్వాన్నామ రూపా ద్విముక్తః' (ముణ్డ-3-౨-౮) అని యా
యుపనిషత్తునందలి వాక్యాంతరమును తలఁపించుచున్నదని గ్రాహ్యము.

వలనఁగా పరిశుద్ధము లగునాత్మవస్తువు లన్నియును నాస్వరూపము వంటిస్వరూపమునే కలిగియుండును. కనుక నన్ను చూడఁగా తక్కిన యాత్మస్వరూపములును నావలెనే యుండుట కనుగొందువు ఇదియే 'ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః' అని గీతయందు మీఁదఁ జెప్పబడుచున్నది. ఇట్లే 'తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్య ముపైతి' ఇత్యాదులందు నామరూపములు వీడిన ఆత్మవస్తువునకు పరస్వరూపముతోడిసామ్య ముండుట తెలియు చున్నది. కాబట్టి ప్రకృతిబంధరహితము లైనపరిశుద్ధాత్మవస్తువులెల్ల పరస్పరము సమానముగాను సర్వేశ్వరునితో సమానముగాను నుండు నని భావము.

అవ. ఇట్టిజ్ఞానముయొక్క మాహాత్మ్యమును జెప్పుచున్నాఁడు.

35

శ్లో॥ అపి చే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సన్తరిష్యసి॥ 36

టీ. సర్వేభ్యః పాపేభ్యః=పాపము చేసినవా రందఱికంటెను, పాపకృత్తమః=ఎక్కుడి పాపములను జేసినవాఁడవు, అసిచేత్ అపి= అయితివేనియు, సర్వం=సమస్తమైన, వృజినం=పాపమును, జ్ఞానప్లవేన ఏవ = జ్ఞానమనెడి తెప్పచేతనే, సన్తరిష్యసి = చక్కఁగా దాఁటఁ గలవు. 36

తా. మహాపాతకము లాచరించినవారికన్న నీ వధిక పాపములు చేసినవాఁడవైనను అట్టిపాపరూపమగు సముద్రమును ఆత్మవిషయ జ్ఞానరూప మగు తెప్పచేతనే దాఁటెదవు.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥ 37

టీ. హేఅర్జున=ఓఅర్జునా, సమిద్ధః=చక్కగా మండుచున్న, అగ్నిః=అగ్ని, యథా=ఎట్లు, ఏధాంసి=కట్టెలను, భస్మసాత్కురుతే=

భస్మముగా చేయునో, తథా=అట్లు, జ్ఞానాగ్నిః = అగ్నివలె ప్రకాశించు ఆత్మయాథాత్మ్యజ్ఞానము, సర్వకర్మాణి=సమస్తకర్మములను, భస్మసాత్కురుతే=కార్యకరములు గానివానినిగాఁ జేయును.

తా. అర్జునా, ప్రజ్వలించుచున్న యగ్ని కట్టెలను ఏవిధముగా భస్మము గావించునో, ఆప్రకారమే *ఆత్మజ్ఞానరూపమైనయగ్ని మోక్షప్రతిబంధకము లగు సమస్తప్రాచీనకర్మములను భస్మముగా (అనఁగా, కార్యకరములు గానివానినిగాఁ) జేయును.

37

శ్లో॥ † నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాఽఽత్మని విన్దతి॥ 38

---

* 'ఒక్కజ్ఞానమే అనాదికాలప్రవృత్తములైన అనంతపాపకర్మములను దొలఁగించుట యెట్లు? 'నాభుక్తం క్షీయతే కర్మకల్పకోటిశతైరపి । అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్॥' (బ్రహ్మవైవర్తే ప్రకృతిఖండే అ౬-20) ఇత్యాదివచనములంబట్టియు జ్ఞానము పాపమును దొలగించు ననుట యొప్పదు. కాన విలంబముననే పాపము నివర్తించును' అని శంక కలుగఁగా నిందు సమాధానము చెప్పఁబడుచున్నది. పూర్వశ్లోకమున సముద్రతరణదృష్టాంతమున, పాపసముద్రమును దాఁటియు మరల దానిని బ్రవేశించుటకు అయితి లేకపోవదు. ఇందు, కాష్ఠభస్మసాత్కరణదృష్టాంతమున భస్మమైన కట్టెలవలెపాపములు ఎంతమాత్రమును కార్యకరములు కాఁజాలవట్లు పూర్ణముగా నశించుటచే మరల నవి కలుగుటకు అయితి లేదని 'సర్వకర్మాణి' అనుటచే విరోధులై యుండు సాంసారికపుణ్యకర్మవిశేషములనుగూడ నివర్తింపఁజేయు ననుట గ్రాహ్యము. కనుక 'నాభుక్తమ్' ఇత్యాదులను అన్యపరములుగా గ్రహించునది.

† 'క్షేత్రజ్ఞ స్యేశ్వరజ్ఞానా ద్విశుద్ధిః పరమామతా' 'క్షేత్రజ్ఞునకు ఈశ్వరజ్ఞానమువలన మిక్కిలి యుత్కృష్టమైన శుద్ధస్వరూపము గలుగును' (యాజ్ఞవల్క్యస్మృతి-3-అధ్యా) అనుటంబట్టి ఈశ్వరజ్ఞానము ఉత్కృష్టమైనపావనము. దానికి తక్కువయగువానియందెల్ల పరిశుద్ధాత్మజ్ఞానమువలె పావనమైనదిలేదని భావము. అయితే అటువంటిజ్ఞానమును ఆచరించమని కోరినను అది కలుగదు. ఇట్లు అది పురుషవ్యాపారమునకు లోఁబువ కాకుండుటచే దానిని విధింపఁదగదే' యన్నశంక 'తత్స్వయం...విన్దతి' అని పరిహరింపబడెను. అనఁగా అహరహము జ్ఞానాకార

టీ. జ్ఞానేన=ఆత్మజ్ఞానముతో, సదృశం = సమానమైనదియు, పవిత్రం = శుద్ధికరమయినదియు, ఇహ = ఈలోకమునందు, నవిద్యతేహి=లేదుగదా, తత్=అట్టిజ్ఞానమును, యోగసంసిద్ధః=కర్మయోగసిద్ధిని పొందినవాఁడు, కాలేన = కాలక్రమమున, ఆత్మని=తన ఆత్మయందు, స్వయం = తానే-ఉపదేశము అక్కఱలేకయే యనుట, విన్దతి=పొందుచున్నాఁడు.

తా. ఆత్మజ్ఞానముతో సమానముగా శుద్ధికరమైనవస్తువు వేఱొకటి యీలోకమునందు లేదు. కాఁబట్టి అది సర్వపాపములను నాశముచేయును. ఎవఁడు, తా నుపదేశము నొందినప్రకారమున ప్రతిదినము జ్ఞానాకారమైన కర్మయోగము ననుష్ఠించుచు, దానిచేత సంసిద్ధిని బొందునో (అనఁగా రాగద్వేషాదులను వీడి నిర్మలాంతఃకరణము గలవాఁడగునో) వాఁడు పరిపక్వదశ నొందిన అట్టిజ్ఞానమును కాలక్రమమున తన యాత్మయందు తనంతటనె పొందుచున్నాఁడు. (అట్టి కర్మయోగికి తనంతటనే యాజ్ఞానము కాలక్రమమునఁ గలుగుచున్న దని భావము).

అవ. *దీనినే విస్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు.

---

ముగా కర్మయోగమును అనుష్ఠించుచు రాఁగా దానివలన సంసిద్ధి గలుగును-అనఁగా రాగద్వేషములు వీడి జ్ఞానమును ప్రాప్తించు యోగ్యత సిద్ధించును. ఇట్లు కర్మయోగమునందు అంతర్గతముగా జ్ఞానము నభ్యసించుచు వచ్చిన సంస్కారబలమువలనను, ఆ జ్ఞానము మును పెట్లు ఉపదేశింపఁబడెనో యదేవిధమయి యిప్పుడు ఉపదేశ మక్కఱ లేక తనంతటనే లభించును. జ్ఞానస్వరూపము తన్నేగురించిన ప్రయత్నములకు లోఁబడ కానిదైనను తన్మూలమును పూర్వోక్తరూపము నగుకర్మయోగము ద్వారా సిద్ధించుచున్నది గాన నది విధింపఁ దగినదియే యగునని భావము.

* 'దీనినే విస్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు' అనఁగా పూర్వశ్లోకముయొక్క రెండుపదములకు ఈశ్లోకముయొక్క రెండుపదములు వ్యుత్క్రమముగా (అనఁగా అందలి మొదటిపదమునకు ఇందలి రెండవపదమును అందలి రెండవదానికి ఇందలి మొదటిదియు) వివరణము లని భావము. మీఁదిశ్లోకమున 'అజ్ఞశ్చ అశ్రద్దధానశ్చ' అని యుండగా దానికిఁ బ్రతియైన యిందు 'శ్రద్ధావాన్' అని యొకటియే యున్నను

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి॥ 39

టీ. శ్రద్ధావాన్ = విశ్వాసమును త్వరయును గలవాఁడును, తత్పరః= దానియందె ఆసక్తి గలవాఁడును-సంయతేన్ద్రియః=ఇంద్రియ నిగ్రహము గలవాఁడును అగుపురుషుఁడు. జ్ఞానం = ప్రత్యక్షమువలె విశద మైన ఆత్మవిషయజ్ఞానమును, లభతే = పొందుచున్నాఁడు, జ్ఞానం లబ్ధ్వా=అట్టిపరిపాకావస్థయైన జ్ఞానమును బొంది, అచిరేణ = శీఘ్రముననే, పరాం=ఉత్కృష్టమయిన, శాన్తిం=మోక్షరూప మైన నిర్వాణమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా. ఇట్లు గురూపదేశమువలన జ్ఞానమును బడసి, ఉపదిష్ట మైన యాజ్ఞానమును వృద్ధిచేసికొనుటయందు త్వర గలవాఁడును, దాని యందే మనసు నిలిపినవాఁడును, తదితరవిషయములనుండి ఇంద్రియ ములను మరల్చుకొన్నవాఁడు నగు పురుషుఁడు పూర్వోక్తలక్షణము గలదై పరిపక్వదశ నొందినజ్ఞానమును త్వరలోనే పొందుచున్నాఁడు. అట్టిజ్ఞానమును బడసి శీఘ్రకాలముననే పరనిర్వాణమును బొందు చున్నాఁడు.

---

'జ్ఞశ్చ శ్రద్ధావాన్' అని రెండును ఉండఁదగునని యెంచి 'జ్ఞశ్చ' అనుటకు పర్యాయముగా 'ఇట్లు ఉపదేశమువలన జ్ఞానము బడసినవాఁడై' అని కూర్పబడినది. మఱియు నిచట ఉపాయము పూర్ణముగా నిష్పన్నమయి ఫలదశ ప్రస్తావింపఁదగి యుండుటంబట్టి 'శాన్తి' అనుటను శమముగా గ్రహింపరాదు 'సశాన్తి మాప్నోతి న కామకామీ' 'సశాన్తి మధిగచ్ఛతి' 'బ్రహ్మనిర్వాణమృచ్ఛతి' అని ద్వితీయాధ్యాయపు కడపటి మూఁడుశ్లోకములందును ఫలదశయందు శాంతినిర్వాణశబ్దములు సమార్థకములుగా చెప్పఁబడినవిగాన శాంతి యనఁగా నిర్వాణమగును. వానిలో నడిమిశ్లోకమందలి 'శాన్తి మధిగచ్ఛతి' అనుటయే యిటఁ గయికొనఁబడినది. దానికి మునుపటి శ్లోకమందలి 'ఆప్నోతి' అనుపదమును వెనుకటిశ్లోకమందలి 'నిర్వాణ' పదమును గొని 'నిర్వాణ మాప్నోతి' 'నిర్వాణమును బొందును' అని యారెంటిని దలఁపించుటకై వ్యాఖ్య సేయంబడుట గ్రాహ్యము. నిర్వాణమును అచిరకాలమునఁ బొందుట యనఁగా జ్ఞానయోగముచేఁ గాని దేహాంతరాదులచేఁ గాని విలంబనము నొందక ఈయాత్మజ్ఞానముచేతనే పొందుట యని తెలియనగు.

అవ. ఇట్లు జ్ఞానాధికారిని జెప్పి తద్విపరీతమైన యధికారిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥ 40

టీ. అజ్ఞః=ఉపదేశమువలన లభించుజ్ఞానము లేనివాఁడును, అశ్రద్ధధానశ్చ=జ్ఞానమును వృద్ధిచేసికొను నుపాయమునందు త్వర లేనివాఁడును, సంశయాత్మాచ = జ్ఞానమునందు సంశయముతోఁ గూడినమనస్సు గలవాఁడును, వినశ్యతి=నశించుచున్నాఁడు. సంశయాత్మనః=సంశయముతోఁగూడినమనస్సు గలవానికి, అయం=ఈ, లోకః=ధర్మార్థకామము లనెడు పురుషార్థము, నాస్తి=లేదు, పరః=మోక్షము, న=లేదు, సుఖం=సుఖమును. న=లేదు.

తా. ఉపదేశమువలన జ్ఞానము లభింపనివాఁడును, ఉపదేశింపఁబడినజ్ఞానమును వృద్ధిచేసికొనుటకు త్వరపడనివాఁడును, ఉపదేశింపఁబడిన యాజ్ఞానమునందును మనఃసంశయము గలవాఁడును నశింతుడు. ఇట్లు ఉపదేశింపఁబడిన ఆత్మస్వరూపవిషయ జ్ఞానమునందు సంశయముగలవానికి *ఇహలోకమునందలి ధర్మార్థకామము లను

* మోక్షమున కుపాయభూతమైన శాస్త్రార్థమందు సంశయము కలుగఁగా మోక్షపురుషార్థము లేకపోవలయునే గాని యితరపురుషార్థములుగూడ లేకపోవుట యెట్లు? అని యడుగఁగా శాస్త్రీయకర్మములవలననే సమస్తపురుషార్థములును సిద్ధించును గాన శాస్త్రమునందును సంశయము గూడదని తెలియునది. కావుననే 'సమస్త... సిద్ధులే యగును' అనఁబడినది. అయిన, ఆయాశాస్త్రములచేత ఆయా పురుషార్థములు సిద్ధించుఁగాక. మోక్షశాస్త్రమందలిసందేహముచేత తక్కినవి సిద్ధింపకపోవు టెట్లు? అన్నచో, అయుర్వేదాదులు కేవల మీదేహమాత్రముతోఁ జేరినఫలములను సాధించు కర్మములను బ్రతిపాదించునట్లు ఆయాశాస్త్రములును బ్రతిపాదించునేని యప్పుడు దేహమునకంటె ఆత్మ వేఱొకటి కల దనునిశ్చయము అక్కఱలేకపోవచ్చును. శాస్త్రము లట్టివి గావు. అవి, యజ్ఞాదులచే సాధింపఁదగినవియు దేహాంతరమునందుఁ గలుగునవియు నగు స్వర్గాదిఫలములను మిక్కిలియు

నట్టిపురుషార్థములే సిద్ధింపవు. ఇఁక మోక్షమెక్కడిది? (సమస్త పురుషార్థములును శాస్త్రీయకర్మములయొక్క సిద్ధులే యగును. దేహమునకంటె ఆత్మ వేఱైనదనునిశ్చయము గలవాఁడే అట్టిశాస్త్రీయకర్మములను జేసి సిద్ధిపొందును. ఆత్మయెడల అట్టి నిశ్చయము లేక సంశయము గలవానికి అట్టికర్మములను జేయుటగాని వానివలన పురుషార్థసిద్ధులుగాని కలుగవు గనుక) సుఖము కొంచెమైనను కలుగ నేరదు.

* శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసఞ్ఛిన్నసంశయమ్।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ॥ 41

టీ. ధనఞ్జయ=అర్జునా, యోగసన్న్యస్తకర్మాణం-యోగ= అట్టి బుద్ధియోగముచేత, సన్న్యస్తకర్మాణం=విడువఁబడిన కర్మములు గలవాఁడును, జ్ఞానసఞ్ఛిన్నసంశయం = ఆత్మజ్ఞానముచేత పోఁగొట్టఁ

---

ప్రతిపాదించుచున్నవి. కావున వానివిషయమున దేహమునకంటె ఆత్మ వేఱొకటి యున్నదను నిశ్చయము మిక్కిలి యావశ్యకముగా నున్నది. ఆ నిశ్చయములేక యేశాస్త్రీకర్మములును సిద్ధింపవు. ఇట్లు దేహాతిరిక్తాత్మవిషయమున సంశయముగలవానికి ఏశాస్త్రీకర్మమును సిద్ధింపమిచే వానివలనఁ గలుగు మోక్షమే కాక మఱితక్కిన యేపురుషార్థమును గలుగదని చెప్పఁబడినది.

* ఇందు అధ్యాయముయొక్క ప్రధానార్థము ఉపసంహరింపఁబడుచున్నది. ఇట యోగమనఁగా 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' ఇత్యాదులచే నుపదిష్టమైనబుద్ధియోగమనుగాని ఆత్మదర్శనరూపమైన యోగము కాదు. 'సన్న్యస్తకర్మాణమ్' అనుట కర్మస్వరూపమును త్యజించుట యని భ్రమింపరాదు. కర్మము, కర్తృత్వాదిత్యాగమువలన తన కర్మాకారము తిరస్కృతము కాఁగా జ్ఞానాకారమును పొందుచున్నది గదా. ఈకర్మాకారతిరస్కృతియే 'సన్న్యస్త' శబ్దముచే ఉపచరితమైనదని తెలియునది. కర్మాకారమును తిరస్కరించి జ్ఞానాకారమును బొందిన కర్మము గలవానిని అని భావము. దేహమునకంటె ఆత్మ వేఱు అనువిషయమున పూర్వము సంశయము గలిగినదిగా చెప్పఁబడుటవలన ఇట 'జ్ఞానసంఛిన్నసంశయః' అనఁగా దేహమునకంటె ఆత్మ వేఱు అనుజ్ఞానము సంశయముచేత ఛిన్నమైనదని గ్రహింపవలయునేకాని జ్ఞానయోగముచేత ఛిన్నముగా గ్రహించుట తగదని తెలియునది.

బడిన సందేహములు గలవాఁడును, ఆత్మవన్తం = పరిశాంతమైన మనస్సు గలవాడు నగుపురుషుని, కర్మాణి = ప్రాచీనకర్మములు, న నిబధ్నన్తి=బంధింపవు.

తా. అర్జునా, ఈయుపదేశింపబడిన బుద్ధియోగముచేత జ్ఞానాకారమును బొందినకర్మము గలవాఁడును, అట్లు ఉపదేశమువలన లభించిన విశదమైన ఆత్మజ్ఞానముచేత ఆత్మావలోకవిషయమైన సందేహములు పోఁగొట్టుకొన్నవాఁడును నై, ఉపదిష్టార్థమందు దృఢమైన మనస్సు గలవానిని బంధహేతువు లగుప్రాచీనకర్మములు బంధింపఁజాలవు.

38

శ్లో॥ తస్మాదజ్ఞానసమ్భూతం హృత్స్థం జ్ఞానాసినాఽత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత॥ 42

టీ. తస్మాత్=ఆ హేతువు వలన, భారత = అర్జునా, అజ్ఞానసంభూతం=అజ్ఞానమువలన కలిగినదియు, హృత్స్థం=హృదయమున నాటియున్నదియు నగు, ఆత్మనః = ఆత్మవిషయమైన ఏనం=ఈ, సంశయం = సందేహమును, జ్ఞానాసినా = ఆత్మజ్ఞాన మనెడి కత్తిచేత, ఛిత్త్వా = (ఖండించి) ఛేదించి, యోగం = నే నుపదేశించిన కర్మయోగమును, ఆతిష్ఠ=ఆచరింపుము, ఉత్తిష్ఠ=దానికొఱకు లెమ్ము.

తా. కాఁబట్టి, అర్జునా, అనాదిప్రవృత్తమగు నజ్ఞానమువలనఁ బుట్టి హృదయమునందు శల్యమువలె నాటియున్న యీ యాత్మవిషయమైన సందేహమును నే నుపదేశించిన యాత్మజ్ఞాన మనెడి కత్తి చేత ఖండించి నే నుపదేశించినట్టి కర్మయోగము నాచరింపుము. అందుకొఱకు లెమ్ము.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగో నామ చతుర్థోధ్యాయః.

# నాల్గవ అధ్యాయము-విశేషాంశములు

1 శ్లో॥-(1)

నిత్యసర్వజ్ఞుడైన భగవంతునియందుండుటచే నిదియును నిత్యమైనదియే. లేక నిత్యమైన ఫలము నొసంగునదియు నను నర్థమును చెప్పవచ్చును.

1 శ్లో॥-(2)

మన్వంతరమునగాని మహాకల్పారంభమునగాని భారతయుద్ధారంభమునగాని నాకన్న వేరొకని నెఱింగినవాడును చెప్పగలవాడును లేడని తాత్పర్యము.

1 శ్లో॥(3)

ఇది బుద్ధాగమమువలె అసురులకు నేను చెప్పినది కాదు. కాని సకలవేదమయుడగు సూర్యునికి చెప్పితిని.

1 శ్లో॥-(4)

('యద్వైకిఞ్చన మనురవదత్ తద్భేషజమ్'') అని మనువు చెప్పినదెల్ల మందేయని వేదముచే కొనియాడబడినట్టియు మానవధర్మనిర్ణేతగా నాచే నాదేశింపబడినట్టియు మనువు మొదలగు అధికారికోటిలో జేరినవారి యుపదేశపరంపరగా నిదిలోకమున నొకప్పుడు వ్యాపించినదియే.

1 శ్లో॥(5)

రాజులు విశాలగంభీరహృదయులు.. అందును త్రికాలవస్తువులను సాక్షాత్కరించు ఋషులునునగు అశ్వపతి, జనక, అంబరీషాది అనేకమంది కలరు, వీరందరును కర్మయోగము ననుష్ఠించి తరించినవారే.

1 శ్లో॥(6)

భక్తోఽసి=శాస్త్రమూలముగ నా మహత్త్వ మెఱింగినవాడగుటచే నాయందు మిక్కిలి ప్రీతిగలవాడవు.

1 శ్లో॥(7)

నా కృష్ణావతారమున గావించిన సౌలభ్యాతిశయముచే ప్రణయము (స్నేహము) విస్రంభమును (నమ్మకము) కలవాడవు.

1 శ్లో॥-(8)

"నష్టః" అను శబ్దమునకు వ్యాస భీష్మ అక్రూరాది మహాత్ము లిప్పటికిని ఉండుటచే పూర్తిగ నశించిన దనరాదు. అందుచే నష్ట ప్రాయమైనదని చెప్పబడినది.

1 శ్లో॥(9)

అర్జునుని కర్తవ్యము నుపదేశించు నీ ప్రసంగమున.

1 శ్లో॥(10)

కర్మవశ్యుడు కాకుండుట మొదలగుదానిని.

1 శ్లో॥-(11)

భ్రాంతిసిద్ధము లనుటను ఖండించు ప్రమాణములు, యుక్తులు మొదలగువానితో (ఉన్నదున్నటుల)

4 శ్లో॥-(12)

అనుభవమువలన నింతకుపూర్వమే సంస్కారము పుట్టియుండి. అది యదృష్టవిశేషముచే నుద్బుద్ధమై (మేల్కొని) పూర్వ మనుభవించినదానిని స్మరించుటలో నేమి యనౌచిత్యము? అప్పుడు పుట్టిన ఆవుదూడ జన్మాంతరమున స్తన్యము ఆకలిని పోగొట్టిన అనుభవముచే బుట్టిన సంస్కారము ఇప్పుడు బ్రతుకరోజు లుండుటచే నుద్బుద్ధమై జ్ఞాపకమునకువచ్చి ఎవ్వరి యుపదేశము అవసరములేకనే తల్లి పొదుగులో మూతినిబెట్టి స్తన్యమును పానముచేయుచున్నదిగదా!

మహాత్ములగు నితరులకు స్మృతిగాని భగవంతునకు ప్రాచీన వృత్తాంతసాక్షాత్కారమేగాని స్మృతికాదు. స్మృతియనుట ఔపచారికము.

4 శ్లో॥-(13)

గోవర్ధనపర్వతము నెత్తుట మొదలగు అద్భుత కృత్యములను బాల్యమునందే చూపియు, పుట్టినప్పుడే చతుర్భుజాదులను చూపియు తన సర్వేశ్వరత్వమును తెలియజేసియే యుండెను.

4 శ్లో॥-(14)

శ్రీకృష్ణుడు పరాత్పరుడను జ్ఞాన మర్జునునకు కలదని-కార్యము ద్వారా-వ్యవహారము ద్వారా-కారణముద్వారా-ఉపదేశము ద్వారా స్థిరపరచుచున్నారు.

భాష్యకారు లిచ్చట వసుదేవసూనుః పార్థః అని రెండుపదము లను వాడిరి. దానివలన అర్జును డాతనికి మేనమామబిడ్డ యనియు, పినతల్లి కుమారు డనియును తెలుపబడినవి. ఇది యితరులకువలె ఈశ్వరుని తెలుసుకొనుట కాటంకములైన ప్రాకృత సంబంధములు కాని యర్జునుని పుణ్యవిశేషమువలనను సర్వజ్ఞశిఖామణియైన. శ్రీకృష్ణుని యుపదేశబలముచేతను తెలియగలైను.

ఇది పెద్దలను ప్రశ్నించుపద్ధతి. ఇదియే వినయముతోకూడిన పరిప్రశ్న యనబడును.

7 శ్లో॥-(15)

ధర్మము కొంచెము వాడినను సహించని నేను ధర్మవినాశము నెట్లు సహింతును.

7 శ్లో॥-(16)

అధర్మ మొకింత తలయెత్తిననే సహించని నేను అది శాఖోప శాఖలుగా వ్యాపించిన నే నెట్లు సహింతును.

7 శ్లో॥-(17)

"ఆత్మానం" అనగా "జ్ఞానీత్వాత్మైవ మే మత" మ్మను టచే జ్ఞానిని సృష్టింతునను నర్థమును సృష్టింపవచ్చును.

7 శ్లో॥-(18)

జీవునకువలె పుణ్యపాపవిపాకముచే గలుగు కాలనియమము గాని నిర్ణీతమైన భగవంతుని సంకల్పముచే నేర్పడు కాలనియమము గాని మన్వంతర మహాకల్పరూపమగు కాలనియమముగాని లేవని అర్థము.

8 శ్లో॥-(19)

ఇచ్చట త్రాణ మనగా అనిష్టములను పోగొట్టి ఇష్టముల నొసంగుట. ఇట్టి వైష్ణవాగ్రేసరుల కనిష్టము భగవంతుడు లభించ కుండుటయే. భగవంతు నాశ్రయించి యాతనిని లభించుటచేతనే యా యనిష్టము తొలంగును.

8 శ్లో॥-(20A)

ఈశ్లోకమున త్రాణమునకు "పరి" యనియు నాశనమునకు "సం" అనియు ఉపసర్గల యర్థవిశేషములు పరికించతగినవి.

పరిత్రాణ మనుటచే కేవలము శరీర సంబంధమును పోగొట్టి మోక్షము నిచ్చుటయేకాక తన దివ్యమంగళ విగ్రహమును హృద యాకర్షక ఆధ్యాత్మిక చేష్టలను చూపియు, కరుణారస ముట్టిపడు నటుల కటాక్షించియు మృదుమధురభాషణములను వినిపించియు సంతోషపెట్టుట.

వినాశమనగా-స్వరూపనాశము నొనరించుటగాక విలక్షణమైన నాశనము. అది యెట్లనగా వైపరీత్యమునకు కారణమైన రాక్షస ప్రకృతి శరీరగ్రంథిని పోగొట్టుట మాత్రమే. అది పోయినచో వారి కిని ధార్మికత్వ ముదయింపవచ్చును.

సంస్థాపన మనగా- సమ్యక్ స్థాపనమ్- అనగా వారేమి చేసి నను యేమి పలికినను యేమి తలంచినను తనయందే పర్యవసించు నటుల చేయుట.

9 శ్లో॥-(20B)

అవతారిక-ప్రసంగవశమున చెప్పవలసివచ్చిన అవతారరహస్య. వాస్తవజ్ఞానము పరమపురుషార్థముగ మోక్షమున కుపాయమని చెప్పుచున్నారు-

10 శ్లో॥-(21)

అవతారిక-సజ్జనులను రక్షించుటకై దేవమనుష్యాది సజాతీయములగు నవతారములను తన సంకల్పము మాత్రముచేతనే పరిగ్రహించునని చెప్పుటచే తన నుపాసించుటకు ముఖ్యముగ నుండవలసిన తన సౌలభ్యము చెప్పబడినది. ఇప్పు డీశ్లోకమున ఆ సౌలభ్యమునకు చివర హద్దు చెప్పబడుచున్నది. ఇచట కృష్ణావతార వృత్తాంతముతోపాటుగ నర్చావతార వృత్తాంతముగూడ నుడువ బడినదని గ్రహించవలెను.

11 శ్లో॥-(22)

సర్వశః అనుటచే ప్రియతమ పితృ పుత్ర సుహృత్ భ్రాతృ భృత్య సారథిత్వాది రూపములును అర్చావతారరూపములును చెప్ప బడినవి.

సర్వశః అనగా అన్నివిధములుగా అనగా అలంకరించుట, ఊరేగించుట, ఉత్సవమును చేయుట మొదలగునవి.

12 శ్లో॥-(23A)

ఈశ్లోకమున "వరమద్య కాకః శ్వోమయూరాత్" రేపటి నెమలి కన్న నేటి కాకియే నయమను న్యాయము, సూచింపబడుచున్నది.

13 శ్లో॥-(23B)

తరగని పాపరాశి యందరకును సమానమే. దానిచే నవివేకమును తప్పదు. దానిచే నల్పఫలముల శీఘ్రముగా బడయవలెనను

నాశయు నందరకు నుండును. ఇక మోక్షేచ్ఛ యెవని కుదయించును? అట్టితరి మోక్షోపాయశాస్త్ర మెవరికని శంకరాగా రెండుశ్లోకము లతో సమాధానమును చెప్పుచున్నారు.

13శ్లో॥-(24)

సారాంశ మేమనగా సృష్టిరహస్యము నెఱింగినచో విరోధు లైన పాపములు పోయి నిష్కామకర్మయోగము ఘటించును.

14 శ్లో॥-(25)

ప్రాప్తాప్రాప్తవివేకమనగా పుణ్యపాప తారతమ్యమునుబట్టి సుఖదుఃఖాది విషమసృష్టిని చూచుచున్నాము గాన దానినిబట్టి విమ ర్శింపగా యని యర్థము.

15 శ్లో॥-(26)

ఎఱుక కలిగి పాపములు వీడి యనుటచే జ్ఞానము కర్మయోగ మునకు విరోధులగు పాపములను పోగొట్టి కర్మయోగమునకు కారణమగుచున్నది.

16 శ్లో।-(27)

ఇచ్చట 'జ్ఞాత్వా' అనుపదము అజహల్లక్షణతో కర్మజ్ఞానా నుష్ఠానములను బోధించును.

19 శ్లో॥-(28)

పండా యనగా- ఊహాపోహాలకు తగినబుద్ధి.

పండితు డనగా- దేహము విడువదగిన దనియును, ఆత్మ ఆద రింపదగిన దనియును నెఱుంగువాఁడు.

19 శ్లో॥-(29)

బుధులనగా- ప్రాప్యమును, ప్రాప్తయునగు నాత్మను ప్రాపక మగు కర్మయోగమును సంశయ విపర్యయములు లేకుండగ చక్కగ నెఱింగినవాడు.

20 శ్లో॥-(30)

నిత్య తృప్త పదమునకు 'నిత్యం'-తృప్తః' అని యర్థమును చెప్ప రాదు. అట్టి తృప్తికి కారణమును జెప్పలేదుగదా! ఇక 'కర్మఫలా సజ్గం త్యక్త్వా' అనుటచే వెనుకటి శ్లోకమునందలి కామవర్జితత్వము వివరింపబడినది.

ఇక 'సఙ్గవర్జితత్వము' వివరింపబడవలెను,

కామవర్జితపదముచే ననిత్యత్యాగము చెప్పఁబడినదిగాన దీనిచే నిత్యస్వీకారమును జెప్పుట ఉచితము.

కావున- 'నిత్యే స్వాత్మన్యేవతృప్తః' అని భాష్యకారులు వివరించిరి.

20 శ్లో|-(31)

ఈలీ డాచరించు కర్మయోగమనగా- విపరీతవిషయములలో సంచరించుటచే జ్ఞానాభ్యాసమును చెడగొట్టు నింద్రియములను అనుకూల విషయమున సంచరింపజేయుటయే.

21 శ్లో॥-(32)

ఈ చెప్పబడిన అర్థము తెలియశక్యము కానిదగుటచే స్పష్ట ముగా తెలియుటకును, ఇంతవరకు వేరువేరు స్థలములలో వ్యాకుల ముగా జెప్పబడిన దానినిన్నీ యొకటచేర్చి చెప్పుటకును,

ఈయర్థము తనకు మిక్కిలి యాదరించదగినదని తెలుపుటకును తిరిగిచెప్పుచున్నాడు.

25 శ్లో॥(33)

అవతారిక- ఇంతవరకు కర్మజ్ఞానాకారమగుటను వివరించి యిప్పుడు కర్మయోగభేదములను జెప్పుచున్నాడు,

ఈశ్లోకమునందలి 'యజ్ఞ' మనగా=హావిస్సు.

'యజ్ఞేన' అనగా స్రుగాది సాధనములచేత నని యర్థము.

35 శ్లో॥(34)

అవతారిక- ఈశ్లోకమున కర్మయోగములో నంతర్భూతమై యప్పటప్పటి పరిపాకదశను తగినటుల తెలిసికొనవలసినదై యుండు ఆత్మజ్ఞానము ఆత్మసాక్షాత్కారమువరకు వచ్చును. అప్పుడు దాని జ్ఞానస్వరూప మెట్టిదిగా తెలియవచ్చునో చెప్పుచున్నాడని భావము.

36 శ్లో॥-(35)

అవతారిక-

ఇంతవరకు కర్మయోగమున కర్మాంశకన్నను జ్ఞానాంశ ప్రధానమనియును, జ్ఞానముయొక్క పరిపాకమునుబట్టి దానికి తగినట్లుగా అప్పుడప్పుడు తెలుసుకొనుచుండవలె ననియును, అట్లు పరిపక్వదశకు వచ్చిన జ్ఞానముయొక్క లక్షణమున్ను తెలుపబడినవి.

ఇకముందు ఆ జ్ఞానమునకు విరోధులను పరిహరించు మాహాత్మ్యము తెలుపబడుచున్నది,

36 శ్లో॥-(36)

ఈశ్లోకమున జ్ఞానమొక తెప్పగా రూపింపబడినది. పాపమునకు "సర్వం=సమస్తమైన" అని విశేషణ మొకటి చేర్చబడినది.

"సంతరిష్యసి" అని దానిచే దాటుట చెప్పబడినది. దీనిని బట్టి పాప మొక అపారమైన సముద్రముగాను, ఆత్మజ్ఞానము దానిని దాటించు గొప్ప తెప్పగాను చెప్పబడుట తగియున్నది.

38 శ్లో॥-(37)

అవతారిక- అగ్నికి ఇతరపదార్థములు వేనికిని లేని దాహకత్వశక్తి యున్నటులనే యీ జ్ఞానమునకును పవిత్రతమ స్వభావము కలిగియుండుటను తెలుపుచున్నాడు.

42 శ్లో॥-(38)

అవతారిక- ఇట్లు విస్తారముగ నుపదేశించి ముగించిన యర్థమును యర్జునుని యనుష్ఠింపమని యుపదేశించి ముగించుచున్నాడు.

42 శ్లో॥-(39)

గీతార్థసఙ్గ్రహము-

చతుర్థాధ్యాయసారము-

8 శ్లో॥ ప్రసఙ్గాత్స్వ స్వభావోక్తిః।
కర్మణోఽకర్మతాస్యచ।
భేదాజ్ఞానస్య మాహాత్మ్యం।
చతుర్థాధ్యాయ ఉచ్యతే॥

తాత్పర్యము-

ప్రసంగవశమున అవతరించిన భగవంతుడు తన యసాధారణ భావమును జెప్పుటయు, కర్మము జ్ఞానాకార మగుటయు, కర్మయోగముయొక్క భేదములును, జ్ఞానముయొక్క మాహాత్మ్యమును చతుర్థాధ్యాయమున చెప్పబడినవి.



# శ్రీ భగవద్గీతా-పఞ్చమో ఽధ్యాయః.

## కర్మసన్న్యాసయోగః

### అవతారిక.

చతుర్థాధ్యాయమునందు కర్మయోగము జ్ఞానాకారమైనదనియు, దాని స్వరూపభేదములును, అందు జ్ఞానాంశమే ప్రధానమైనదనియుఁ జెప్పఁబడెను. మూఁడవయధ్యాయమునందు కర్మయోగము ఆత్మజ్ఞానము లోపలఁ గలదియు ప్రమాదము లేనిదియు సుకరమైనదియు నిరపేక్షమైనదియు నగుటవలన జ్ఞానయోగాధికారికిఁగూడ అదియే శ్రేష్ఠమైనదని చెప్పఁబడెను. ఇప్పుడు ఆత్మప్రాప్తికి కర్మయోగము జ్ఞానయోగమునకంటె శీఘ్రసాధనమగుటయు కర్మయోగమునం దంతర్గతమైన అకర్తృత్వానుసంధానము చేయవలసిన ప్రకారమును ప్రతిపాదించి, ఆయనుసంధానము మూలమై పరిపాకదశను బొందియుండుజ్ఞానమును వివరించుచున్నాఁడు. 1

అర్జున ఉవాచ :

2

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ పున ర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥ 1

టీ. హేకృష్ణ = ఓకృష్ణా, కర్మణాం = కర్మములయొక్క, సన్న్యాసం = పరిత్యాగమును (జ్ఞానయోగమును,) పునః=మఱల, (కర్మణాం) యోగంచ=కర్మయోగమునున్ను, శంససి=చెప్పుచున్నావు, ఏతయోః=ఈరెంటిలో, యత్=ఏది, శ్రేయః = శ్రేష్ఠమయినదని, సునిశ్చితం=చక్కఁగా నిశ్చయింపఁబడినదో, తత్=అట్టి, ఏకం = ఒకదానిని, మే=నాకు, బ్రూహి=చెప్పుము.

తా. కృష్ణా, కర్మసన్న్యాసమును (అనఁగా జ్ఞానయోగమును) చేయుమనియును, మరల కర్మయోగము నాచరింపుమని

యును వచియించెదవు. ఈ రెంటిలో నేది సులభముగా నాచరింపఁ దగిన దగుటవలన శ్రేష్ఠ మని నిశ్చయింపఁబడినదో దానిని నా కెఱిఁగింపుము.

(ద్వితీయాధ్యాయమందు ముముక్షు వైనవానికి మొదట కర్మయోగమే చేయఁదగిన దనియు, ఆ కర్మయోగముచే అంతఃకరణము నందలి దోషము లన్నియు తొలఁగి అది పరిశుద్ధ మైనవెనుక జ్ఞానయోగమును బొంది దానిచేత ఆత్మదర్శనము చేయవలసిన దనియు, ప్రతిపాదించితివి. ఇట్లు కర్మయోగముచేత జ్ఞానయోగమును జ్ఞానయోగముచేత ఆత్మప్రాప్తియు కలుగు నని చెప్పి మరల తృతీయ చతుర్థాధ్యాయములందు జ్ఞానయోగాధికారదశను బొందినవానికిఁ గూడ కర్మయోగమే శ్రేష్ఠమైనదనియు అది జ్ఞానయోగమును అపేక్షింపక తానే ఆత్మప్రాప్తికి సాధన మగు ననియుఁ జెప్పుచున్నావు. ఈ జ్ఞానయోగ కర్మయోగములు *రెంటిలో ఆత్మప్రాప్తికి సాధనముగా సులభముగా నాచరింపఁదగియుండుటయందును ఆత్మప్రాప్తిని శీఘ్రముగా కలిగించుటయందును నెద్ది శ్రేష్ఠ మని రూఢిగా నిశ్చయింపఁబడియున్నదో దానిని నాకుఁ జెప్పు మని భావము.) 3

శ్రీభగవా నువాచ :

4

శ్లో॥ సన్న్యాసః కర్మయోగ శ్చ నిశ్శ్రేయసకరా వుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే॥ 2

టీ. సన్న్యాసః = కర్మసన్న్యాసమును- (జ్ఞానయోగమును,) కర్మయోగశ్చ = కర్మయోగమును, ఉభౌ = ఈరెండును, నిశ్శ్రేయ

---

* జ్ఞానయోగ కర్మయోగములు రెండును ఒకటే ఫలమునకు సాధనము లగుటచే సమానము లగును గాన ఫలమును బట్టి ఆ రెంటిలో (శ్రేయః) మేలైనది యిది యని చెప్పవలవిగాదు. ఫలమును సుకరముగాను శీఘ్రముగాను ఒడఁగూర్చు విషయమునకే ఆ రెంటిలో ఏదైన నొకటి మేలైనది గావచ్చును. కావుననే 'రెంటిలో .. శ్రేష్ఠము' అనఁబడినది.

సకరౌ = మోక్షమును కలుఁగజేయునవి, తయోః = ఆ రెంటిలో, కర్మసన్న్యాసాత్ = జ్ఞానయోగముకంటె, కర్మయోగః = కర్మానుష్ఠానము, విశిష్యతే = శ్రేష్ఠమగుచున్నది.

తా. జ్ఞానయోగకర్మయోగములు రెండును జ్ఞానయోగము నాచరింప శక్తి గలవానికిఁగూడ మోక్షమునకు *నిరపేక్షములైన సాధనము లగుచున్నవి. అయినను ఈరెంటిలో జ్ఞానయోగముకంటె కర్మయోగమే విశేషించినది.

అవ. ఏల యనఁగా.

శ్లో॥ జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి ।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే॥ 3

టీ. హే మహాబాహో = ఓ యర్జునా, యః = ఏకర్మయోగి, న కాఙ్క్షతి = ఆత్మతప్ప తక్కిన దేనిని కోరఁడో, న ద్వేష్టి = (కావుననే) దేనిని ద్వేషింపఁడో, నిర్ద్వన్ద్వః = (కావుననే శీతోష్ణాది) ద్వంద్వములను ఓర్చుకొనువాఁ డగునో, సః = వాఁడు, నిత్యసన్న్యాసీ = నిత్యజ్ఞాననిష్ఠుఁ డని, జ్ఞేయః = తెలియఁదగినవాఁడు, సుఖం = (వాఁడు) సుఖముగా, బన్ధాత్ = సంసారబంధమునుండి, ప్రముచ్యతే హి = విడివడుచున్నాఁడు గదా.

తా. అర్జునా, ఏకర్మయోగి కర్మయోగాంతర్గతమగు ఆత్మానుభవముచేత తృప్తుఁడై, ఆత్మతప్ప తక్కిన దేనియందును కోరిక (రాగము) లేకయు, కావుననే దేనియందును ద్వేషమును లేకయు, ఇట్లు రాగద్వేషములు లేమివలన శీతోష్ణాదిద్వంద్వములు సహించువాఁ

---

* నిరపేక్షము—అనగా మఱియొక్కదాని సాహాయ్యమును అపేక్షింపనిది. నిరపేక్షసాధన మనగా, వేఱొక్కసాధనమును అపేక్షింపక తానే సాధనమై యుండునది. సాపేక్షమనఁగా వేరొక్కసాధనము సాహాయ్యము నపేక్షించునది. జ్ఞానయోగమునకు అశక్తుఁడైనవానికి కర్మయోగము సాపేక్షమేకాని నిరపేక్షము కానేరదు. జ్ఞానయోగమునకు శక్తుఁడైనవానికే అది నిరపేక్ష మగునపుట యొప్పును కనుక 'జ్ఞానయోగము నాచరింపశక్తి గలవానికిఁ గూడ' అనఁబడినది.

డయ్యు నుండునో వాఁడు నిత్యజ్ఞాననిష్ఠుఁ డని యెఱుఁగుము. వాఁడు సుకరమైన కర్మయోగమునందు నిష్ఠగలవాఁ డగుటవలన సుఖముగా సంసారబంధమునుండి విడువడును. (ఇచట సాధనము కర్మయోగము, ఫలము సంసారబంధవిముక్తి సాధనము సుకర మగుటచే ఫలము సుఖముగా కలుగునని భావము.)

అవ. ఆత్మప్రాప్తికి జ్ఞానయోగకర్మయోగములలో ఒక్కొక్కటియు తనంతటనే సాధనమగునుగాని ఒకటి మఱియొక దానిసాహాయ్యమపేక్షింప దనుచున్నాఁడు. రెండును నిరపేక్షాసాధనములని భావము.

శ్లో॥ *సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః ।
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్॥ 4

టీ. సాఙ్ఖ్యయోగౌ = జ్ఞానయోగకర్మయోగములు, పృథక్ = (ఫలభేదముచేత) వేఱువేఱైనవిగా, (యే) ప్రవదన్తి = (ఎవరు) చెప్పుచున్నారో, (తే) బాలాః = (వారు) అపక్వమైన జ్ఞానముగలవారు, న పణ్డితాః = పూర్ణముగా తెలిసినవారు కారు, ఉభయోః = రెంటిలోపల, ఏకమపి=ఏ ఒకదానినైనను, సమ్యక్ = లెస్సగా, ఆస్థితః= అనుష్ఠించినవాఁడు, ఫలం = (ఆత్మావలోకనరూపమైన) అఫలమునే, లభతే=పొందుచున్నాఁడు.

తా. (జ్ఞానయోగ కర్మయోగములు రెంటికిని ఆత్మదర్శనమొకటియే ఫలము. కావున ఆరెండును స్వరూపమునందు వేఱు

---

* ఇచ్చట సాంఖ్యశబ్దము కపిలదర్శనమును యోగశబ్దము హిరణ్యగర్భదర్శనమును గుఱించినవికావు. ఏలన కపిలాదిదర్శనములు ఇచ్చట ప్రస్తుతములుగావు. 'తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే' 'సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః' అని ముందును వెనుకను కర్మసన్న్యాస కర్మయోగములే చెప్పఁబడుచుండఁగా నడుమ నున్న సాంఖ్యయోగములును వానినిగుఱించినవే కావలయునుగాని మఱొకటి యగుట విరుద్ధము.

వేఱైనను ఫలమునందు ఒకటియే యగును. అయినను కొందఱు 'కర్మయోగము జ్ఞానయోగమునుమాత్రమే సాధించుచున్నది. జ్ఞానయోగ మొకటియే ఆత్మదర్శనమును సాధించుచున్నది' అని కర్మయోగమునకు జ్ఞానయోగమే ఫలముగాను జ్ఞానయోగ మొక్కటికే ఆత్మదర్శనము ఫలముగాను ఇట్లు రెంటికిని వేఱువేఱు ఫలములను జెప్పుచున్నారు. ఇట్లు) జ్ఞానయోగ కర్మయోగములు రెండును ఫలభేదముచేత వేఱువేఱైన వని చెప్పువారు బాలురవలె పరిపక్వము కాని జ్ఞానముగలవారే యగుదురు గాని చక్కఁగాఁ దెలిసినపండితులు కారు, రెంటికిని ఆత్మావలోకన మొక్కటియే ఫలము గాన నా రెంటిలో దేనినిగాని ఆశ్రయించినవాఁడు ఆత్మావలోకన మనెడి యాఫలమునే పొందుచున్నాఁడు.

అవ. ఈవిషయమునే వివరించుచున్నాఁడు. 9

10

శ్లో॥ యత్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।

ఏకం సాఙ్ఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి॥ 5

టీ. సాఙ్ఖ్యైః=జ్ఞాననిష్ఠులచేత, యత్=ఏ, స్థానం = స్థానము-(ఆత్మావలోకరూపమయినఫలము) ప్రాప్యతే=పొందఁబడుచున్నదో, తత్=ఆస్థానము, యోగైరపి=కర్మయోగనిష్ఠులచేతను, గమ్యతే = పొందఁబడుచున్నది. యః=ఎవ్వఁడు సాఙ్ఖ్యంచ= జ్ఞానయోగమును, యోగంచ=కర్మయోగమును, ఏకం = (ఒకఫలము గలవి యగుటచే) ఒక్కటే యగువానినిగా, పశ్యతి = చూచుచున్నాఁడో-ఎఱుఁగుచున్నాఁడో, సః = వాఁడే, పశ్యతి=చక్కఁగా తెలిసినవాఁడు.

తా. జ్ఞాననిష్ఠులచేఁ బొందఁబడెడి యాత్మావలోకరూపమైన ఫలమునే కర్మయోగనిష్ఠులును బడయుదురు. ఇట్లు జ్ఞానయోగకర్మయోగములు ఏకఫలప్రదములగుటవలన రెండును ఒక్కటే యగునని

(అనగా రెంటిలో నేదియైన నొకటి ఆత్మ దర్శనరూప మైనఫలము నిచ్చునని) యెవఁడు తెలిసికొనునో వాఁడే చక్కఁగా తెలిసిన పండితుఁడు.

11

అవ. కర్మయోగజ్ఞానయోగములు రెండును సమానము లైన యెడల 'కర్మయోగో విశిష్యతే' అని కర్మయోగమును విశేషించినదిగా చెప్పనేల ? యనఁగా కర్మయోగమునకు విశేష మింతమాత్రము కల దని చెప్పుచున్నాఁడు. 12

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః ।
యోగయుక్తో ముని ర్బ్రహ్మ న చిరే ణాధిగచ్ఛతి॥ 6

టీ. హేమహాబాహో = భుజబలము గలయర్జునా, సన్న్యాసస్తు=జ్ఞానయోగమైతే, అయోగతః=కర్మయోగము లేకయే, ఆప్తుం= పొందుటకు-సాధించుటకు, దుఃఖం=అశక్యము, యోగయుక్తః = కర్మయోగము నాచరించునట్టి, మునిః=ఆత్మమననశీలుఁడు, న చిరేణ = స్వల్పకాలములోనే, బ్రహ్మ=ఆత్మను, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా. *అర్జునా, కర్మయోగము లేకయే జ్ఞానయోగము పొందుట యశక్యము. కర్మయోగముతోఁగూడినవాఁడు అంతర్గతజ్ఞానము చేత స్వయముగా ఆత్మమననశీలుఁడై సుఖముగా కర్మయోగమును సాధించి స్వల్పకాలములోనే ఆత్మస్వరూపమును బొందును. జ్ఞానయోగముతోఁ గూడినవాఁడు బహుకష్టముతో జ్ఞానయోగమును సాధించును. కాఁబట్టి బహుకాలమునకు దానివలన ఆత్మప్రాప్తిని బొందునని భావము.

---

* ఇచట కర్మయోగజ్ఞానయోగములు రెంటికిని ఆత్మదర్శన మొకటే ఫలము గనుక రెండును సమానములే యగును. అయినను కర్మయోగము ఆచరించుటకు సులువుగాను ఫలము శీఘ్రముగా నిచ్చునదిగాను నున్నది. జ్ఞానయోగము ఆచరించుటకు బహుకష్టముగాను కావుననే బహుకాలమునకు పిదప ఫలము నిచ్చునదిగాను నున్నది. ఈ రెంటికిని గలభేద మింతమాత్రమే యని యెఱుఁగునది.

13
శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః।
14
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥ 7

టీ. యోగయుక్తః=కర్మయోగముతోఁగూడినవాఁడును, విశుద్ధాత్మా=పరిశుద్ధమైనమనస్సు గలవాఁడును, విజితాత్మా = స్వాధీనమయినమనస్సుగలవాఁడును, జితేన్ద్రియః=ఇంద్రియ నిగ్రహము గలవాఁడును, † సర్వభూతాత్మభూతాత్మా-సర్వభూత=దేవాది సమస్తభూతములయొక్క, ఆత్మభూత = ఆత్మ అయిన, ఆత్మా=తనయాత్మ గలవాఁడు, కుర్వన్నపి=కర్మములఁ జేయుచున్నను, న లిప్యతే=పూయబడినవాఁడు కాఁడు.

---

† ఆత్మలన్నియు ఒకటొకటికి వేఱువేఱై యున్నవనికదా సిద్ధాంతము. ఇట్లుండ 'సర్వభూతాత్మభూతాత్మా' 'దేవాదిసమస్తభూతములందలి ఆత్మయైన తనయాత్మ గలవాఁడు' అనఁబడినది. దీనిచే సమస్తభూతముల ఆత్మయు తనయాత్మయు ఏకమేయైనవాఁడు అని యర్థమగుటచే ఆత్మలకెల్ల ఐక్యము చెప్పినట్లగుచున్నది. ఇదియెట్లు? అన్నచో ఇచట 'అన్నిభూతముల ఆత్మయైన తనయాత్మ' అని అన్నిభూతములందు తనయాత్మయే యున్న దనుట ఆత్మలకుఁ గల ఆకారసామ్యమునుబట్టియే కాని స్వరూపైక్యమునుబట్టి కాదు. ఎట్లన 'సమస్తగృహములం దున్న వ్రీహి(వడ్లగింజ) యిదియే' అన్నప్పుడు ఒకవడ్లగింజయే అన్నిగృహములం దున్నదనుట కాక, ఈవడ్లగింజవంటి వడ్లగింజలే అన్నిగృహములం దున్నవనియే ఆకారసామ్యమునుబట్టి గ్రహింపఁదగునట్లు 'సమస్తదేహములందు నున్న ఆత్మ యిదియే' అన్నప్పుడు ఈ ఒక యాత్మయే అన్నిదేహములం దున్నది యనుటకాక, ఈ యాత్మవంటి యాత్మలే యున్నవని జ్ఞానైకాకారసామ్యమునుబట్టి గ్రహింపవలసియున్నది. కాన వాస్తవమునకు ఆత్మలు వేఱువేఱనియే తెలియునది. కావున 'ఆత్మయాథాత్మ్యమును అనుసంధించువానికి ... ఏకాకారమే యగునుగదా' యనఁబడినది. అయినను ఆత్మలు సమానము లగుట ప్రత్యక్షాదులకు విరుద్ధముగా నున్నదే. దేవతిర్యఙ్మనుష్యాది నానాభేదభిన్నములై కదా ఆత్మలున్నవి. అవి సమానము లెట్లగును?' అన్నఁదులకు 'దేవాదిభేదములు చెప్పఁబడెడిని' అనఁబడినది. అనగా ఆత్మలకు గల దేవాదిరూపభేదములు సత్యములే, అయినను ఆభేదములు స్వరూపసిద్ధములు గావు. కర్మోపాధిచే ఆత్మకు దేహాదిరూపముగాఁ గలిగినప్రకృతియొక్క పరిణామభేదములచే నయినవి. ఆత్మలు తమశుద్ధాకారమునందు సమానములే. ఆశుద్ధస్వరూపమునందే వానికి సామ్య మిట చెప్పబడినది యని భావము.

తా. కర్మయోగయుక్తుఁ డన్ననో శాస్త్రీయమై పరమ పురుషారాధనరూపమైన పరిశుద్ధకర్మమునందు వర్తించుచు అట్టి కర్మయోగమువలన పరిశుద్ధమైన మనస్సు గలవాఁడై, ఆ కర్మము తన కలవాటుపడియున్నదే కనుక అట్టిదానియందు మనస్సు ప్రవర్తించుటవలన దానిని సుఖముగా జయించి, దానివలననే యింద్రియములను

15

జయించినవాఁడునై, కర్తయైన ఆత్మయొక్క యాథాత్మ్యము ననుసంధించుచుండుటయందే నిష్ఠుఁడగుటవలన సమస్తములైన దేవాది భూతములయందలి యాత్మలవంటిదిగా తనయాత్మను అనుసంధించుచుండును, ఏలనఁగా ఆత్మయాథాత్మ్యమును అనుసంధించుచుండువానికి దేవాదులయాత్మలును తనయాత్మయు నేకాకారమైయుండును గదా. దేవాదిభేదములు ప్రకృతియొక్క పరిణామవిశేషరూపములే కాని ఆత్మయొక్క ఆకారములు కానేరవు. అట్టి ప్రకృతి పరిణామబంధము వీడినయాత్మ లన్నియు దేవాది సమస్తదేహములందును జ్ఞానైకాకారము లగుటవలన సమానాకారములే యగు నని 'నిర్దోషం హి సమం బ్రహ్మ' అనుచో వెంటనే చెప్పఁబడెడిని. (కాన దేవాదుల యొక్క ఆత్మలును తనయొక్క ఆత్మయు జ్ఞానైకస్వరూపము లగుటవలన అన్నియు నేకాకారము లని యనుసంధించునట్టి) పురుషుఁడు కర్మములు చేయుచున్నవాఁడైనను ఆత్మకానివానియందు ఆత్మ యనెడి యభిమానములేనివాఁ డగుచున్నాఁడు. దానివలన స్వల్పకాలములోనే వానికి ఆత్మప్రాప్తి కలుగుచున్నదని యర్థము.

16

అవ. సుకరమైనదియు శీఘ్రమైనదియు నగుటవలన కర్మయోగమే శ్రేష్ఠమైనది గనుక దానికి కావలసిన దేదో చెప్పెద విను మనుచున్నాఁడు.

శ్లో॥ నైవ కిఞ్చిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥

ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి।
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్॥ 9

టీ. తత్త్వవిత్ = ఆత్మయాథాత్మ్యజ్ఞానముగల, యుక్తః = కర్మయోగి, పశ్యన్ = చూచుచున్నను, శృణ్వన్ = వినుచున్నను, స్పృశన్ = తాకుచున్నను, జిఘ్రన్ = ఆఘ్రాణించుచున్నను, అశ్నన్ = భుజించుచున్నను, గచ్ఛన్ = నడచుచున్నను, స్వపన్ = నిద్రించుచున్నను, శ్వసన్ = ఊపిరి విడుచుచున్నను, ప్రలపన్ = మాటలాడుచున్నను, విసృజన్ = (మలమూత్రములను) విడుచుచున్నను, గృహ్ణన్ = గ్రహించుచున్నను, ఉన్మిషన్ = కన్నులు తెఱచుచున్నను, నిమిషన్నపి = కన్నులు మూయుచున్నను, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, ఇన్ద్రియార్థేషు = శబ్దాదివిషయములయందు. వర్తన్తేఇతి = ప్రవర్తించుచున్నవి యని, ధారయన్ = బుద్ధిచే నిశ్చయించినవాఁడగుచు, కించిత్ = ఒకదానినైనను, న కరోమి ఏవ ఇతి = నేను చేయకయె యున్నాను అని, మన్యేత = తలంపవలయును,

తా. * ఆత్మతత్త్వజ్ఞానము గలకర్మయోగి, నేత్రేంద్రియముచే

---

* 'పశ్యన్' 'శృణ్వన్' 'స్పృశన్' 'జిఘ్రన్' అను నివి చక్షురాదు లయిన జ్ఞానేంద్రియముల వ్యాపారములు. 'గచ్ఛన్' 'ప్రలపన్' 'విసృజన్' 'గృహ్ణన్' అను నివి పాదాదులైన కర్మేంద్రియముల వ్యాపారములు. ఇందు 'విసృజన్' అనునది 'పాయూపస్థే విసర్గార్థ మిన్ద్రియే తుల్యకర్మణి' అనునట్లు పాయూపస్థల రెంటియొక్క వ్యాపారమును గుర్తించుచున్నది. 'స్వపన్' 'శ్వసన్' 'ఉన్మిషన్' 'నిమిషన్' అను నివి ప్రాణవ్యాపారములు. ఇందు 'ఉన్మిషన్' నిమిషన్' అనునవి వ్యాన మనెడి ప్రాణముయొక్క వ్యాపారములు. 'శ్వసన్' అనునది ప్రాణము అనెడి ప్రాణవిశేషముయొక్క వ్యాపారము 'గృహ్ణన్' అనునది పాణివ్యాపారమైనను దానిచే 'తదపానేనాజిఘృక్షత్తదావయత్సైష ఏషోఽన్నస్య గ్రహో యద్వాయుః' అన్నట్లు అపానముయొక్క వ్యాపారము గృహీత మగుచున్నది. ఈవిభాగమును దెలుపుటకై 'శ్రోత్రాదులగు...ప్రవర్తించుచున్నవి' అనఁబడినది. ఇట్లు ఆయా వ్యాపారములకు కర్తలు ఇంద్రియాదు లనికదా అనుసంధింపవలయును. అయినను 'కర్తాశాస్త్రార్థవత్త్వాత్' (శారీరక ౧-3-33) ఇత్యాదులచే ఆత్మకే కర్తృత్వము స్థాపితమైయుండఁగా కర్తృ

చూచుచున్నను, శ్రవణేంద్రియముచే వినుచున్నను, త్వగింద్రియముచే స్పృశించుచున్నను, నాసికచే నాఘ్రాణించుచున్నను, జిహ్వచే రసాస్వాదనము చేయుచున్నను, పాదములచే నడచుచున్నను, నిదురించుచున్నను, ప్రాణవాయువుచే ఊపిరిపుచ్చుచున్నను, నోటిచే మాటలాడుచున్నను, పాయుగుహ్యములచే మలమూత్రములను విడుచుచున్నను, హస్తములచే గ్రహించుచున్నను, కూర్మమను వాయుభేదముచే కన్నులఁ దెఱచుచు మూయుచున్నను, ఈశ్రోత్రాదులగు జ్ఞానేంద్రియములును, వాగాదులగు కర్మేంద్రియములును ప్రాణములును తమతమవిషయములయందుఁ బ్రవర్తించుచున్నవి యని యనుసంధించుచున్నవాఁడై నేనేకర్మమునైనను జేయువాఁడనుగానని తలఁపవలయును. అనగాఁ జ్ఞానమే స్వభావముగాఁ గలనాకు నిట్టి పుణ్యపాపరూపమైన కర్తృత్వము ప్రాచీనకర్మమూలముగా వచ్చిన యింద్రియప్రాణములతోడి సంబంధమువలనఁ గలిగినదిగాని స్వరూపసిద్ధము కాదని తలంపవలయు నని యర్థము.

అవ. అకర్తృత్వానుసంధానమునకు ఫలము చెప్పుచున్నాఁడు.

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్రమి వామ్భసా॥ 10

టీ. యః=ఎవఁడు, కర్మాణి=శ్రోత్రాదీంద్రియవ్యాపారములను, బ్రహ్మణి=ప్రకృతిపరిణామవిశేషరూపమగు ఇంద్రియసమూహమందు,

---

యగు ఆత్మను అకర్తగాను అకర్తలగు ఇంద్రియములను కర్తలుగాను అనుసంధించుట భ్రాంతియేకదా అన్నందులకు 'జ్ఞానమే...తలఁపవలయును' అనఁబడినది. అనఁగా ఆత్మకు కర్తృత్వమున్నదికాని యది యిట స్వరూపసిద్ధమైనది కాదు; కర్మోపాధికృతమైనయింద్రియాదులతోడి సంబంధమువలనఁ గలిగినది. కాన యింద్రియాదులే యావ్యాపారములకు కర్తలు గాఁదగునని భావము. మఱియు జ్ఞానమే స్వభావముగాఁ గలముక్తునికి ఇంద్రియాదిసంబంధము స్వేచ్ఛచేతఁ గలుగుచున్నది. బద్ధులకు అట్లు స్వేచ్ఛచేతఁ గాక కర్మమూలముననే అసంబంధము కలుగు నని తెలుపుటకై 'ప్రాచీనకర్మమూలముగా' ననఁబడినది.

ఆధాయ=ఉంచి, సఙ్గం=ఫలసంగమును, త్యక్త్వా=విడిచి, కరోతి = కర్మములను జేయుచున్నాఁడో, సః = వాఁడు. అమ్భసా = నీటిచేత. పద్మపత్త్రమివ=తామరపాకువలె, పాపేన=దేహాత్మభ్రమరూప మైన పాపముచేత, న లిప్యతే=అంటఁబడఁడు.

తా. * బ్రహ్మశబ్దముచే ఇచట ప్రకృతి చెప్పఁబడుచున్నది.

---

* 'ఫలము నుద్దేశించియే కర్మము చేయుచున్నను 'నైవకిఞ్చిత్కరోమి' అని భావన యున్నచో దోషము కలుగదు. కాన నిట్టిభావనతో ఫలోద్దేశపూర్వకముగా కర్మము చేయవచ్చునుగదా. మఱియు వాస్తవమునకు తనకే కర్తృత్వము గలదేని అది ఉపాధివలనఁ గలిగినదిగా అనుసంధించుటవలనఁ బ్రయోజన మేమి? అట్లు అనుసంధించినను ప్రకృతిసంసర్గమే దేహాత్మభ్రమమునందు ముంచివేయదా'' యని శంకలు రాఁగా ఈశ్లోకమున పరిహారములు చెప్పఁబడుచున్నవి. 'నైవ కిఞ్చిత్కరోమి' అని భావన యున్నను 'సఙ్గం త్యక్త్వా' అని ఫలసంగముకూడ త్యజింపవలయుననియు వాస్తవమునకు కర్తృత్వము ఉపాధికృత మైనదిగాన; బ్రహ్మణ్యాధాయ కర్మాణి' అని దానిని ప్రకృతియందే సన్న్యసింపవలయుననియు, ఇట్లు చేయఁగా 'లిప్యతే న సపాపేన' అని దేహాత్మభ్రమమనెడిపాపమున మునుఁగుట కలుగదనియు పరిహారములు తెలియునది. బ్రహ్మశబ్దమునకు 'తస్మాదేతద్బ్రహ్మనామ రూపమన్నంచ జాయతే' (ముణ్డక-౦-౧-౧౦.) ఇత్యాదులందు ప్రకృతి అని యర్థమగుచున్నది. ఇందులకు 'మమయోనిర్మహద్బ్రహ్మ' అని గీతయందే యుదాహరణము చూపఁబడెను. బ్రహ్మ మనఁగ ప్రకృతి యగుఁగాక. ఇచట ఈయర్థమునకుఁ బ్రసక్తి యేమి? అని శంక రాఁగా 'ఇంద్రియములు...కాన' అనఁబడినది. అనఁగా పూర్వశ్లోకమున కర్మములకు ఇంద్రియాదులే కర్తలుగా ననుసంధించుట చెప్పఁబడెను ఇందు 'బ్రహ్మణ్యాధాయకర్మాణి' అని బ్రహ్మమే కర్తగా చెప్పఁబడెను. ఈ రెంటికి సామరస్యము కావలయునుగదా. కాఁబట్టి యింద్రియములకు కారణ మైన ప్రకృతియే బ్రహ్మశబ్దమున కర్థముగా గ్రహింపవలసినదయ్యె. మఱియు 'బృంహతీతిబ్రహ్మ' అని బృహత్త్వగుణమువలనను ప్రయోగబలమువలనను బ్రహ్మశబ్దము మూలప్రకృతి గావచ్చును. ప్రకృతి, మూలప్రకృతిరూపముననున్నపు డది పూర్వోక్తములైన 'పశ్యన్' 'శృణ్వన్' అను దర్శనశ్రవణాదులకు హేతువు గానేరదు. కాన ప్రకృతిని ఆరూపమందు ఆవ్యాపారములకర్తృత్వము గలదిగా అనుసంధించుట అశక్యము. అది యింద్రియరూపముననుండిననే ఆవ్యాపారముల కర్తృత్వమును దానియందు అనుసంధింపఁగూడును. కావున 'ఇంద్రియరూపముగా నెలకొనియున్న ప్రకృతియందు' అనఁబడెను. ఇట పాప మనఁగా నేమి? 'యోఽన్యథా సన్త

'మమ యోని ర్మహద్బ్రహ్మ' (౧౪-అధ్యా. 3 శ్లో) అని ప్రకృత్యర్థమున బ్రహ్మశబ్దమిందే చెప్పబడెడినిగదా. ఇంద్రియములు ప్రకృతి పరిణామవిశేషరూపములే కావున నింద్రియాకారముగా నెలకొనియున్న ప్రకృతియందు 'పశ్యన్ శృణ్వన్' ఇత్యాద్యుక్తప్రకారమున కర్మముల నుంచి (అనఁగా చూచుట వినుట మొదలైనకర్మముల కర్తృత్వమును దానిదాని యింద్రియములయం దారోపించి) ఫలసంగమును విడిచి, 'నైవకించిత్కరోమి' (నే నేమియు చేయుటలేదు) అని అకర్తృత్వమును అనుసంధించుచు, ఎవ్వఁడు కర్మము లాచరించునో వాఁడు ఇంద్రియాద్యాకారముగాఁ బరిణమించిన ప్రకృతితోడి సంసర్గము గలిగి వర్తించుచున్నవాఁడైనను, *తామరాకు జలముతోడిసంసర్గము గలిగి వర్తించుచున్నను అది జలముచే నెట్లు తడుపఁబడదో అట్లు, తానును ఆ ప్రకృతినే ఆత్మగాఁ దలఁచుట యనెడి బంధహేతువైనపాపముచే నంటఁబడఁడు.

---

మాత్మాన మన్యథా ప్రతిపద్యతే । కిం తేన నకృతం పాపం చోరేణాత్మాపహారిణా' (భారత-ఆది-౭౪-౨౪) (యః) ఎవఁడు (అన్యథా సన్తం) దేహేంద్రియాదులకు విలక్షణుఁడై జ్ఞానానందాది స్వరూపుఁడైయున్న, (ఆత్మానం) జీవాత్మని, (అన్యథా) వేఱువిధముగా-'దేవోహమ్' 'మనుష్యోహమ్' ఇత్యాదిప్రకారముగా ననుట, (ప్రతిపద్యతే) అనుసంధించునో, (తేన) మూర్ఖుఁడైనయా. (ఆత్మాపహారిణా) తన్నపహరించునట్టి, (చోరేణ) దొంగచేత, (కిం పాపం నకృతం) ఏపాపము చేయఁబడలేదు- మహాపాతకాదులన్నియు వానిచేతనే చేయఁబడినవగునని యర్థము. దీనిం బట్టి ఆత్మను అన్యథా గ్రహించుటయే పాపముగా ప్రసిద్ధమై యున్నది. ఆత్మయొక్క అకర్తృత్వమును అనుసంధించెడి యీప్రకరణమున అట్టి యనుసంధానమునకు విరోధియైన దేహాత్మభ్రమ మనెడి పాపముయొక్క నివృత్తిఁ జెప్పుటయే యుచితముగాన నిట పాప మనఁగా 'ప్రకృతినే ఆత్మగాఁ దలఁచుట' యనఁబడినది.

* ఇట పద్మపత్ర జలదృష్టాంతము సంసర్గము లేకుండుట మాత్రమును దెలుపుటకుఁ గాదు. పద్మపత్రమునకు నీటియందే జన్మము స్థితి మొదలైనవి కలిగినను ఆనీటిచే నగు తడియుట మొదలైనవి దానికెట్లు కలుగవో అట్లే ఆత్మకు ప్రకృతివలననే భోగము స్థితి మొదలైనవి కలిగినను ఆప్రకృతిచే నగుదేహాత్మభ్రమాదులు దానికి కలుగవని తెలుపుటకుఁ గూడ నని గ్రహించునది.

శ్లో॥ కాయేన[20] మనసా బుద్ధ్యా[18] కేవలై[19] రిన్ద్రియై రపి ॥
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే[17]॥ 11

టీ. యోగినః = కర్మయోగులు, ఆత్మశుద్ధయే = ఆత్మయొక్క ప్రాచీనకర్మబంధము నివర్తించుకొఱకు, సఙ్గం = ఫలసంగమును, త్యక్త్వా=విడిచి, కాయేన=శరీరముచేతను, మనసా=మనస్సుచేతను, బుద్ధ్యా = బుద్ధిచేతను-అధ్యవసాయముచేతననుట, *కేవలైః=అభినివేశము లేని, ఇన్ద్రియైరపి=ఇంద్రియములచేతను, కర్మ = కర్మమును, కుర్వన్తి=చేయుచున్నారు.

తా. ఆత్మకుఁ గలిగిన ప్రాచీనకర్మబంధములు నశించి అది పరిశుద్ధ మగుటకొఱకు కర్మయోగనిష్ఠులు స్వర్గాదిఫలసంగమును వదలి, శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధి (అధ్యవసాయము) చేతను, ఇంద్రియములచేతను, సాధ్యము లగుకర్మములను ఆచరింతురు.

శ్లో। *యుక్తః[21] కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః[22] కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ 12

---

* 'కేవలైః' అనుచో కేవలశబ్దము కాయము మనస్సు బుద్ధి అనునీ మూఁటితో విపరిణామముచే వేఱువేఱుగ నన్వయించినచో వట్టియింద్రియాదులు వానివానిపనులు చేయుచున్నవే కాని తా నేమియు చేయుటలే దని కర్తృత్వాభిమానము లేమిగాని, లేక, వానిపనులు తమవిగా గ్రహింపమిచే వానియెడల మమత్వబుద్ధి లేమిగాని తెలియుచున్నది. లేక, అది 'ఇంద్రియైః' అనుదానితో నన్వయించెనేని, కాయశబ్దముచే కర్మేంద్రియవర్గమును 'కేవలై రిన్ద్రియైః' అని జ్ఞానేంద్రియములను గ్రహించుకొనునది. జ్ఞానేంద్రియములు కేవలము లైనవియనఁగా మాటాడుట పుచ్చుకొనుట మొదలైన యితరకర్మములు లేనివై తమతమ కర్మములుమాత్రమే కలవి అనిభావము. దీనిచే 'ధర్మ శ్శ్రుతో వా దృష్ట్వా కథితో వా కృతోఽపి వా। అనుమోదితో వా రాజేన్ద్ర పునాతి పురుషం సదా' (భారత. అశ్వమేధికపర్వ. ౯౪-౫౯) ఇత్యాదులు సూచితము లగుచున్నవి.

* ఇందు కర్మ మొకటియే ఫలసంగముచే బంధహేతువును ఫలసంగము లేమిచే మోక్షహేతువును అగు నని చెప్పఁబడుటను తెలియునది.

టీ. యుక్తః = ఆత్మవ్యతిరిక్తములైన ఫలములందు చిత్త చాపల్యము లేక ఆత్మయందు ప్రావణ్యము కలవాఁడు, కర్మఫలం = కర్మమందు ఫలాపేక్షను, త్యక్త్వా = విడిచి, నైష్ఠికీం = స్థిర మైన, శాన్తిం = ఆత్మానుభవరూప మైన యూఱటను, ఆప్నోతి = పొందు చున్నాఁడు. అయుక్తః = ఆత్మావలోకనమం దాసక్తి లేనివాఁడు, కామకారేణ = కామప్రేరణచేత, ఫలే = కర్మఫలమందు, సక్తః = ఆస క్తుఁడై, నిబధ్యతే = బద్ధుఁ డగుచున్నాఁడు - నిత్యసంసారి యగు చున్నాఁడు.

తా. ఆత్మతప్ప తక్కినఫలములందు చపలుఁడు కానందున ఆత్మయందే ప్రావణ్యము గలవాఁడు కర్మముయొక్క ఫలమును వదలి, కేవలము ఆత్మపరిశుద్ధికొఱకు కర్మస్వరూపమును మాత్రము విడువక అనుష్ఠించి, స్థిర మై ఆత్మానుభవరూప మైననెమ్మదిని పొందుచున్నాఁడు. ఆత్మేతరము లగుఫలములందు చపలుఁ డగు వాఁడు ఆత్మదర్శనవిముఖుఁ డై కామప్రేరణమున ఫలమునందు సంగము కలిగి కర్మములను జేయుచు నిత్యమును కర్మబద్ధుఁ డై నిత్యసంసారి యగుచున్నాఁడు. (కావున ఫలసంగమును వదలినవాఁడై ఇంద్రియాకారముగా పరిణమించినప్రకృతియందు కర్మములను సన్న్య సించి ఆత్మయొక్కబంధము వదలుటకొఱకే కర్మములను జేయవలయును గాని స్వర్గాదిఫలములకొఱకుఁ గాదని భావము.)

అవ. ఇఁక దేహాకారముగా పరిణమించిన ప్రకృతియందు కర్తృత్వమును సన్న్యసించుటను జెప్పుచున్నాఁడు. (ఇంతవఱకు ఇంద్రియములందును ప్రాణములయందును కర్తృత్వ సన్న్యాసమును జెప్పి యిప్పు డారెంటికి నాశ్రయ మైనశరీరమునందే కర్తృత్వమును సన్న్యసించుటను జెప్పుచున్నాఁడనుట.)

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్॥ 13

టీ. దేహీ = దేహధారి యైనవాఁడు, మనసా = మనస్సుచేత, సర్వకర్మాణి=తనసమస్తకర్మములును, నవద్వారే = తొమ్మిదిద్వారములు గల, పురే = పట్టణమందు-నవరంధ్రములు గలదేహమునం దనుట, సన్న్యస్య = సన్న్యసించి-వదలి, వశీ = స్వతంత్రుఁడై, నకుర్వన్ = ఏప్రయత్నమును చేయకున్నఁవాఁడును, నకారయన్ ఏవ = ఆదేహముచేత దేనిని చేయింపకున్నవాఁడును నై, సుఖం = సుఖముగా, ఆస్తే=కూర్చుండును.

తా. దేహియైనవాఁడు కర్మములవిషయమున తనకుఁగల యీకర్తృత్వము ప్రాచీనకర్మమూలమున వచ్చిన దేహసంబంధముచేఁ గలిగినదేకాని స్వరూపముచేఁ గలిగినది కాదు అనెడి వివేకముతోఁ గూడిన మనస్సుతో తాను చేయునట్టి సమస్తకర్మములను తొమ్మిది ద్వారములపట్టణ మగు శరీరమునందు సన్న్యసించి, (అభిమానాదులకు వశము గాక తన పరిశుద్ధస్వరూపముచేత) స్వతంత్రుఁడై తాను * దేహమును అధిష్ఠించుటవలన చేయఁగలుగునట్టి ప్రయత్నమును చేయకయు, ఆదేహముచేత దేనిని చేయింపకయు నున్నవాఁడై (స్వకర్తృత్వాభిమానమువలనఁ గలుగునట్టి క్లేశాదులు లేక) సుఖముగా నుండును.

---

* ఆత్మ దేహప్రయత్నమునకు ఆశ్రయమగుటయు దేహస్పందనాదులకు హేతువగుటయు స్వరూపసిద్ధములు కాక ఉపాధికృతములే యగును. ఇట్లు స్వరూపసిద్ధముగా ప్రయత్నాశ్రయుఁడు కామిచే 'నకుర్వన్' అనియు, అట్లే స్పందనాది హేతువు కామిచే 'నైనకారయన్' అనియు చెప్పఁబడినది.

దేహమును దేహ మని చెప్పక 'నవద్వారపుర' మనుట యది ఆత్మవలె నిరవయవమును నిశ్ఛిద్రమును అణువును నియంతయు మొదలగునవి కాక, సావయవమును సచ్ఛిద్రమును పృథువును నియంతవ్యమును మొదలగునవి యగునని దేహాత్మల వివేకమును దెలుపుకొఱకని తెలియునది. పురమువలె శరీరమును, పురజనులవలె ఇంద్రియములను, సార్వభౌమునివలె పరమాత్మను, భృత్యునివలె స్వాత్మను చూచువానికిఁగదా స్పష్టతగలుగును. దేహమునే ఆత్మగా భ్రమించినచో తాను దేహమం దుండుటను తెలియక పురము మొదలైనవానియం దుండునట్లు తలఁచుచున్నాఁడు. ఆభ్రమము నివర్తించె నేని దేహమునే పురముగా తలఁచు నని భావము

అవ. ఇంద్రియాద్యుపాధులవలన ఆత్మకుఁ గలుగురూపమును ఆయుపాధులందే సన్న్యసించుట చెప్పఁబడినది. ఇప్పుడు శుద్ధాత్మ యొక్క స్వాభావికమైనరూపమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావ స్తు ప్రవర్తతే॥ 14

టీ. ప్రభుః = స్వాభావిక మైన స్వరూపముతో నుండెడి ఆత్మ, లోకస్య=ప్రకృతితోఁ జేరియున్న ఈలోకమునకు, కర్తృత్వం= దేవాదులకుఁ గల ఆయా కర్తృత్వమునుగాని, కర్మాణి= దేవాదులకుఁగల ఆయా కర్మములనుగాని, కర్మఫలసంయోగం=ఆయా కర్మములవలనఁ గలిగెడి దేవాదిఫలానుభవమునుగాని, న సృజతి = కలుగఁజేయఁడు, స్వభావస్తు=ప్రకృతివాసనయే. ప్రవర్తతే=ప్రవృత్తిని గలుగఁజేయుచున్నది.

తా. కర్మపరతంత్రుఁడు గాక స్వాభావిక మగుస్వరూపముతో నుండెడి ఆత్మ, దేవతిర్యఙ్మనుష్యస్థావరాదిరూపముగా ప్రకృతిసంసర్గము గలిగి వర్తించెడి యీలోకమునకు, ఇందలి దేవమనుష్యాదులకుఁ గల ఆయా కర్తృత్వమునుగాని, ఆదేవాదులకుఁ గల ఆయా కర్మములనుగాని, ఆయాకర్మములవలనఁ గలిగెడి దేవాదిఫలసంబంధములనుగాని కలుగఁజేయుట లేదు. అయిన నెవఁడు కలుగఁ జేయును? అన్నచో, ప్రకృతివాసనయే ఈ కర్తృత్వాదికము నంతయు కలిగించుచున్నది. *అనాదికాలప్రవృత్త మగునట్టి పూర్వ

* చేతనుఁ డగు ఆత్మకు కర్తృత్వాదులు లేనియెడల అచేతనమై చేతనము యొక్క గుణమాత్ర మగువాసనకు కర్తృత్వాదులు గలుగు నని తెలియు టెట్లు? స్వతస్సిద్ధుఁ డైనయాత్మకు కర్తృత్వము లేదేని (అనగా కర్మమునకు తాను కర్తగాఁడేని) అట్టివానికి వాసనయు ఎక్కడనుండి వచ్చినది? ఎక్కడనుండియు రానియెడల నప్పుడు వాసనయే వానికి స్వభావసిద్ధమైన దగుటగాన ఆవాసనచేఁ గలుగు కర్తృత్వాదులుకూడ స్వభావసిద్ధము లగును. అది యొకానొక హేతువువలనఁ గలిగినదేని, అప్పు డాహేతువుకూడ స్వభావసిద్ధ మగునేని దానివలనఁ గలుగువాస

పూర్వకర్మమువలన ఆత్మకు దేవాద్యాకార మైన ప్రకృతితోడి సంసర్గము కలుగుచున్నది. (అగ్నిసంసర్గమువలన కాలినయినుపగుండు అగ్నిగాఁ దలఁపఁబడునట్లు) ప్రకృతిసంసర్గమువలన ఆత్మయు ప్రకృతిగానే గ్రహింపఁబడుచున్నది. అనఁగా ప్రకృతిపరిణామము లగు దేవాదిదేహములే ఆత్మయనెడి భ్రమము కలుగుచున్నది. ఇట్లు దేహాకార మైనప్రకృతియే ఆత్మ యనెడి అభిమానమును కలుగుచుండఁగా దానివలనఁ బుట్టు *వాసనచేత ప్రకృతికార్యము లయిన

---

నాదులును స్వభావసిద్ధములే యగునని మునుపటిదోషము కలుగుచున్నది. ఆ హేతువు ఉపాధిచేఁ గలిగినదేని, కర్తృత్వములేని (అనఁగా కర్తగాని) ఆత్మకు అది వచ్చుట యెక్కడనుండి? వాసనచేతనే ఆవాసన వచ్చుచున్న దన్నయెడల అన్యోన్యాశ్రయణము కలుగును. ఏదో వేఱొకదానివలనఁ గలుగునన్నయెడల ఆవేఱొకటి యెట్లు వచ్చెనని అనవస్థ కలుగును కనుక ఇన్నిటికిని పరిహారముగా 'అనాది కాల ప్రవృత్తము కావని భావము' అనఁబడినది. అనఁగా కర్మమునకు మొదలిది యని చెప్పనలవిగాదు. అది అనాదికాలమునుండి వచ్చుచున్నది. ముందుముందు చేయఁబడిన కర్మములవలన వెనుకవెనుక విడువక దేవాద్యాకారముతో ప్రకృతి సంబంధించుచు వచ్చుచున్నది. ఆ సంబంధమువలన ఆదేవాద్యాకారములే ఆత్మ యను భ్రమము కలుగుచు వచ్చుచున్నది. ఆభ్రమమువలన వాసనయు ఆవాసనవలన ఈ కర్తృత్వాదులును గలుగుచున్నవి. ఈ కర్తృత్వాదులవలన కర్మములును వానివలన దేవాద్యాకారప్రకృతిసంసర్గాదులును మరలఁ గలుగుచున్నవి. ఇట్లు బీజాంకుర న్యాయమున (అనఁగా విత్తునుండి మొలకయు మరల మొలకనుండి యావిత్తును వరుసగాఁ గలుగుచు వచ్చుచున్నట్లుగా) ఇవి వచ్చుచుండుటచే అన్యోన్యాశ్రయాది దోషములు గలుగవు. ఇందు వాసన స్వభావసిద్ధముగాక ప్రకృతిసంసర్గము దానివలనఁ గలిగిన దేహాత్మాభిమానము అనెడి హేతువులచేతఁ గలిగినదనియు, ఆహేతువులును స్వభావసిద్ధములు గాక కర్మోపాధిచేఁ గలిగినవనియు, ఈ యుపాయము అనాదికాలమునుండియు ప్రవర్తించుచుండుటచే కర్తృత్వములేని యాత్మకు ఎట్లు గలిగినదో చెప్ప నలవి గాదనియు ఆశయము లూహించునది.

* వాసన యనఁగా సంస్కారము-అనుభూతార్థస్మరణము-అనఁగా ఇంతకు పూర్వమందో లేక పూర్వజన్మమందో చేయుచుఁగాని అనుభవించుచుఁగాని వచ్చినట్టి విషయమునుగుఱించి యిప్పుడు మనకు తెలియకయే తనంతనె కలుగునట్టిస్మృతిగాని, అట్టి స్మృతిమూలమున వానియందు మనకు తెలియక తనంతనె కలుగు అనురక్తి, అభిలాష, శక్తి, వానినిసంబంధించినవాడుక పొందలైనవిగాని వాసన యనఁబడును.

యిట్టి కర్తృత్వాదులు అన్నియును ఆత్మవిగా తోఁచుచున్నవి గాని అకర్తృత్వాదులు ఆత్మకు స్వరూపసిద్ధముగా కావని భావము.

24

శ్లో॥ † నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః।
అజ్ఞానే నాఽఽవృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః॥ 15

టీ. విభుః = ఆయాసమస్తదేహములయందు ప్రవేశించుటకు యోగ్యతగల ఆత్మ, కస్యచిత్=ఎవ్వనిదైనను, పాపం = పాపమును, నాదత్తే=పోఁగొట్టఁడు, సుకృతం చ=పుణ్యమునుగూడ, నాదత్త ఏవ= పోఁగొట్టఁడు, అజ్ఞానేన=జ్ఞానవిరోధి యగు పూర్వాపూర్వకర్మము చేత, జ్ఞానమ్=జ్ఞానము, ఆవృతం = కప్పఁబడినది, తేన = దాని చేత, జన్తవః=ప్రాణులు, ముహ్యన్తి=మోహముఁ జెందుచున్నారు.

తా. ఆత్మ తనకు సంబంధించినవాఁడగు నెవనియొక్క దుఃఖమునుగాని పోఁగొట్టఁడు; తనకు ప్రతికూలుఁడగు నెవనియొక్క సుఖమునుగాని పోఁగొట్టఁడు. వాఁడు ఒక్కచోటనె ఉండువాఁడుగాఁడు.

---

† ఇందు మొదటి సగము ఆత్మయొక్క అకర్తృత్వాదికమునకును, రెండవ సగము వాసనయొక్క కర్తృత్వాదికమునకును వివరణములని తెలియునది. ఒకరి పాపమును సుకృతమును పుచ్చుకొనుప్రసక్తియే లేదుగాన పాపమనఁగా తత్కార్యమయిన దుఃఖముగాను సుకృతమనఁగా తత్కార్యమయిన సుఖముగాను అర్థములు సేయఁబడెను. అందును పరులసుఖదుఃఖములంగూడ 'ఆదత్తే' అని పుచ్చుకొనుట యశక్యముగాన 'ఆదత్తే' యనుటకు పోఁగొట్టుకొనుటయని యర్థము చెప్పఁబడినది. మఱియు ఆత్మ అణువుగా శ్రుత్యాదిసిద్ధమగుటచే 'విభుః' అనుటకు సర్వవ్యాప్తుఁడని యర్థము తగదు. ఆయా కర్మముల కనుగుణముగా సమస్తదేహములను జొచ్చుటకు యోగ్యుఁడనిమాత్రమే యర్థము గ్రాహ్యము. ఏ ప్రదేశమును అనఁగా ఏదేహము గాని వానికి నియతము గాదని భావము. కావుననే నడుమఁగలుగు మిత్రులందును అమిత్రులందును జూపెడిసంబంధిత్వమును ప్రతికూలత్వమును నడుమఁ గలుగు దేహములతోఁ జేరినవే కాని ఆత్మతోఁగాదని సిద్ధించుచున్నది. దీనివలన మిత్రులదుఃఖము పోఁగొట్టుటయు, శత్రుల సుఖము చెఱుపుటయు ఆత్మకు ఉపాధికృత్యములే కాని స్వరూపసిద్ధములుగా వనియుఁ దెలియుచున్నది.

దేవాదిదేహములు వానిదేయగుచోటు గాదు. ఆయాకర్మములకుఁ దగినట్లు సమస్త దేహములందును ప్రవేశించునట్టియోగ్యత గలవాఁడగుటవలన సర్వవ్యాపకుఁడై యుండును. కావుననే వాఁడు ఒక్కరికిని అనుకూలుఁడు కాఁడు; ప్రతికూలుఁడు గాఁడు. ఈసంబంధిత్వ ప్రతికూలత్వాదు లన్నియును వాసనచే కల్పింపఁబడినవిగాని ఆత్మకు లేవు. 23 ఇట్టి స్వభావము గల ఆత్మకు ఈవిపరీతవాసన కలుగుటకు కారణ మేమనఁగా-జ్ఞానవిరోధి యగు పూర్వాపూర్వకర్మములు, ఆత్మను తమఫలములను అనుభవించుటకుఁ దగినవానినిగాఁ జేయుటకొఱకు వీనియొక్క జ్ఞానమును * సంకోచింపజేయుచున్నవి. జ్ఞానావరణరూప మైన ఆకర్మముచేత ఆత్మలు దేవాదిదేహములతోఁ గూడి జంతువు లగుటయే కాక ఆయా దేహాదులయందు † ఆత్మాభిమానరూపమైన మోహమునుగూడఁ జెందుచున్నవి. దానివలన అటువంటి ఆత్మాభిమానవాసనయు దానికిఁ దగిన కర్మవాసనయు గలుగుచున్నవి. ఈద్వివిధమైన వాసనవలన విపరీతమగు ఆత్మాభిమానమును కర్మముల నారంభించుటయు పొసగుచున్నవి.

అవ. 'సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి' 'జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా' 'నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే, అని పూర్వము చెప్పినజ్ఞానమును తిరిగి చెప్పుటకుఁ § దగినసందర్భము రాఁగా ప్రస్తావమునకుఁ దెచ్చుచున్నాఁడు.

---

* జ్ఞానము వికాసము నొందియున్నప్పుడు కర్మఫలము లైనసుఖదుఃఖములే తోపవు గనుక వానిని అనుభవించుటకు వలనుపడదు. కావుననే యాజ్ఞానమును కర్మములు సంకోచింపఁజేయుచున్నవని యెఱుంగునది.

† అభిమానము అనఁగా అజ్ఞానము-తప్పు అయినట్టి జ్ఞానము-తప్పుగాఁ దలంచుట. ఆత్మాభిమాన మనఁగా ఆత్మ కానిదానిని ఆత్మ యని తప్పుగా భావించుట.

§ ఇంతవఱకును తృతీయాధ్యాయప్రోక్తమైన అకర్తృత్వానుసంధానముయొక్క ప్రకారవిశేషములు చెప్పఁబడినవి. ఇప్పుడు చతుర్థాధ్యాయప్రోక్తమైన జ్ఞానస్వరూపమును జెప్పుటకు సమయ మని తెలియఁదగును.

శ్లో॥ జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనామ్ ।
తేషా మాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥ 16

టీ. యేషాం ఆత్మనాం = ఏయాత్మలయొక్క, జ్ఞానేన = ఆత్మ యాథాత్మ్యవిషయ మైన జ్ఞానముచేత, తత్ అజ్ఞానం=జ్ఞానమును ఆవరించునట్టి యా అజ్ఞానము, నాశితం = నశింపఁజేయఁబడినదో, తేషాం=ఆయాత్మలయొక్క, పరం=ఉత్కృష్టమైన-అసంకుచితమైన, తత్ =ఆ-స్వాభావికమగు, జ్ఞానం=జ్ఞానమును, ఆదిత్యవత్ =సూర్యుని వలె-సూర్యప్రభవలె ననుట, (సర్వం=సమస్తమును), ప్రకాశయతి= ప్రత్యక్ష మగునట్లు చేయును.

తా. ఇట్లు ఆత్మలన్నియును వర్తింపఁగా, వానిలో ఏయాత్మలకు పూర్వోక్తలక్షణ మైనదియు ఆత్మస్వరూపోపదేశమువలన జనించినదియు ప్రతిదిన మభ్యాసముచేయుటయొక్క అతిశయమున మిక్కిలి పవిత్ర మైనదియు నైన ఆత్మవిషయ మగు జ్ఞానముచేత, జ్ఞానావరణ మైనదియు అనాదికాలప్రవృత్త మగు అనంతకర్మసంచయరూప మైనదియు నగు అజ్ఞానము నాశము చేయఁబడిన దగునో, అట్టి యాత్మల యొక్క స్వాభావిక మై అపరిమిత మై సంకోచము లేనట్టి దైన జ్ఞానము వారికి సూర్యుని (ప్రభ) వలె సమస్తమును యథావస్థితముగా (ఉన్నది ఉన్నట్లు) ప్రకాశింపఁజేయుచున్నది. * ఇచట 'తేషామ్'

---

* మొట్టమొదట ద్వితీయాధ్యాయమున 'నత్వేవాహం' అనుశ్లోకమునందు ఆత్మలకు బహుత్వము చెప్పఁబడినది. అది తత్త్వోపదేశసమయ మగుటచే నప్పుడు యథార్థమునే చెప్పవలయును గాన నాసందర్భమున వేఱువేఱుగ చెప్పిన 'అహం' (నేను) 'త్వం' (నీవు) 'ఇమే' (వీరు) 'వయం' (మనము) అనువారెల్ల వేఱువేఱు అగుట సత్యమై ఆత్మలు పెక్కులగుటను నిరూపించుచున్నది. అందుఁ జెప్పఁబడిన బహుత్వమే చతుర్థాధ్యాయమున 'బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః' అనుశ్లోకమునందును ప్రతిపాదింపఁబడినది. బ్రహ్మసారూప్యమును పొందిన ఆత్మలకు ఉపాధివలనఁ గాని బహుత్వము కలుగదుగదా. కాఁబట్టి 'బహవః' అనుట వలన వాని బహుత్వము సత్యమేయగును. ఈబహుత్వమునే యీశ్లోకముకూడ

అని బహువచనముచేత అజ్ఞానము నశించిన ఆత్మలు పెక్కు లని చెప్పఁబడినది. దీనివలన 'న త్వేవాహం జాతు నాసమ్' అని ఆరంభమున ఆత్మస్వరూపములు పెక్కులని తెలిసియున్న విషయమే యిచట మఱింత స్పష్టముగా చెప్పఁబడినదయ్యెను. (కనుక అజ్ఞానముచే బహుత్వ మని చెప్పరాదు.) అజ్ఞానము నశించిన ఆత్మలకు ఉపాధి లేశముకూడఁ గలుగదు. కావున నిచట ఆత్మలకు చెప్పఁబడిన బహుత్వము ఉపాధిచేతఁ గలిగినది గానేరదు (కాన ఉపాధిచేతను బహుత్వము చెప్పుటకు లేదు.) 'తేషా మాదిత్యవద్ జ్ఞానమ్' అనుచో 'తేషామ్' అను జ్ఞాతలకు 'జ్ఞానమ్' అని జ్ఞానము వ్యతిరిక్తముగా నిర్దేశింపఁ బడుటవలన అది ఆత్మలకు స్వరూపానుబంధి యగు ధర్మముగా

25

నుండుట చెప్పఁబడిన దయ్యెను. ఆదిత్యదృష్టాంతమువలన ప్రభకును ప్రభ గలదానికిని ఎట్లో అట్లే జ్ఞాతకును (అనఁగా ఆత్మకును) జ్ఞానమునకును సంబంధ మని గ్రహింపవలయును. * కావుననే జ్ఞానమునకు సంసారదశయందు కర్మముచేత సంకోచమును మోక్షదశయందు వికాసమును దెలియుచున్నది.

---

మఱింత స్పష్టముగాఁ దెలుపుచున్నది. ఎట్లన, అజ్ఞానము నశించిన ఆత్మలకు 'తేషాం' అని బహుత్వము చెప్పబడినది, అజ్ఞానము నశించిన ఆత్మలకు ఉపాధివలన వానికి బహుత్వము కలుగదు. కావున బహుత్వము స్వరూపసిద్ధమే యని తెలుపఁబడినదయ్యెనని భావము. 'తేషాం' జ్ఞానమ్ అనుచో 'తేషాం' సంబంధషష్ఠి గాను 'జ్ఞానమ్' ప్రథమగాను ఉన్నది. ఇట్లు జ్ఞానము 'తేషాం' అనుదానికి వ్యతిరేకముగా (వానికంటె వేఱుగా) నిర్దేశింపబడినదిగాన జ్ఞానము 'తేషాం' అని నిర్దేశింపఁబడిన ఆత్మస్వరూపములు గాక వానికి వేఱై వానిని సంబంధించిన ధర్మముమాత్ర మగుట సంబంధషష్ఠిచే తెలియుచున్నది.

* 'కావుననే' యనఁగా 'ప్రభవంటిది కావుననే' యని యర్థము. అనఁగా ప్రభకు ఏదైన నొకటి కప్పినచో సంకోచమును అది నివర్తించినచో వికాసమును కలుగును. జ్ఞానము ప్రభవంటిది గావుననే అట్టి సంకోచవికాసముల నొందుచున్నదని భావము.

అవ. శుద్ధాత్మస్వరూపము నుపాసించువారికిఁ గలుగుఫలమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛన్త్య పునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥ 17

టీ. తద్బుద్ధయః=అట్టి ఆత్మదర్శనమునందె అధ్యవసాయము గలవారును, తదాత్మానః = ఆయాత్మవిషయమైన మనస్సు గలవారును, తన్నిష్ఠాః=ఆయాత్మజ్ఞానమును అభ్యసించుటయందే నిరతులైనవారును, తత్పరాయణాః=ఆయాత్మయే పరమప్రయోజనమని తలఁచువారును, జ్ఞాననిర్ధూతకల్మషాః=జ్ఞానాభ్యాసము చేత పోఁగొట్టఁబడిన పాపములు గలవారును, అపునరావృత్తిం=పునర్జన్మరహితమైన యవస్థను బొంది స్వస్వరూపముతో నుండు ఆత్మను, గచ్ఛన్తి = పొందుచున్నారు.

తా. అటువంటి శుద్ధాత్మదర్శనరూపమైనజ్ఞానమునందె అధ్యవసాయము గలవారును, ఆత్మవిషయమునందె మనసుగలవారును, ఆత్మజ్ఞానాభ్యాసమునందాసక్తి గలవారును, ఆత్మనే పరమప్రయోజనముగాఁ దలఁచువారును, ఇట్లభ్యసింపఁబడినజ్ఞానము చేత సమస్త ప్రాచీనపాపములను నశింపఁజేసి, పునర్జన్మము లేనిదై స్వస్వరూపముతో నుండు ఆత్మను (ఆత్మసాక్షాత్కారమును) బొందుదురు. *ఏయవస్థగల యాత్మకు పునరావృత్తి గలుగదో ఆయాత్మ అపునరావృత్తి యైనది. కనుక 'గచ్ఛన్తి అపునరావృత్తిమ్' అనఁగా 'స్వరూపముతో అవస్థితమైన ఆత్మను బొందుదు' రని యర్థము.

---

* ఇందు ఆత్మస్వరూపము అనెడి మేడకు ఎక్కుసోపానమగు జ్ఞానముయొక్క మెట్లను జెప్పుచున్నాఁడు. ప్రాప్యమైనది ఆత్మస్వరూపము కడపటిమెట్టు. దానికి మునుముందటిమెట్టు దానిప్రాప్తికి విరోధు లగుసమస్త పూర్వపాపములు నశించుట యనుమెట్టు లభింపఁగా పిదప ఆత్మప్రాప్తియే పొందదగినమెట్టు గాన 'అపునరావృత్తి' యనుటకు 'శుద్ధాత్మస్వరూపప్రాప్తి'గా అర్థము సేయఁబడియెను.

అవ. ఈయాత్మసాక్షాత్కార మెట్టి దనఁగా,

27

శ్లో॥ విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః ॥ 18

టీ. పణ్డితాః=ఆత్మజ్ఞానము గలవారు, విద్యావినయసమ్పన్నే= విద్యావినయములు గలవానియందును, బ్రాహ్మణే=కేవల బ్రాహ్మణునియందును, గవి=గోవునందును, హస్తిని=ఏనుఁగునందును, శుని చ=కుక్కయందును, శ్వపాకే చైవ=కుక్కను వండి తినుచండాలుని యందును, సమదర్శినః=సమముగా దర్శించువారు (అగుదురు.)

తా. ఆత్మస్వరూపయాథాత్మ్యము నెఱిఁగినవారు, విద్యావినయములు గలవానియందును, కేవలబ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుఁగునందును, శునకమునందును, శునకమాంసమును భక్షించు చండాలునియందును ఇట్లు ప్రకృష్ట నికృష్టము లగుసమస్తశరీరముల యందు నుండు ఆత్మలన్నియు జ్ఞానైకస్వరూపము లగుటనుబట్టి అంత

26

టను వానిని సమానముగా (అనఁగా ఏకాకారము లైనవానినిగాఁ) జూతురు. దృశ్యములగు బ్రాహ్మణ గో గజాది * విషమాకారములు ప్రకృతివియె కాని ఆత్మవి కావు. ఆత్మయె సర్వత్ర జ్ఞానైకాకారమున సముఁడని కనుఁగొందురని యర్థము.

---

* ఇట్టియాత్మసాక్షాత్కారమే చతుర్థాధ్యాయమున 'యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథో మయి' అని చెప్పఁబడినది. ఇట 'సమదర్శినః' అనుచో సమత్వమును అనుసంధించువారని చెప్పఁబడినదికదా. ఈసమత్వమువలన ఆత్మలకు శరీరగత మైన విషమత్వముగాని, శరీరవిశిష్టములై యుండుటచేఁ గలుగు జ్ఞానసంకోచాదులందలి విషమత్వముగాని, లేదని నిషేధింపఁబడలేదు. ఆత్మలకు శరీరగతమైన విషమత్వము కలదనియే ప్రతిపాదింపఁబడుచున్నది. జ్ఞానసంకోచాది విషమత్వము ఈపాధమూలమునఁ గలదనియే చెప్పబడుచున్నది. కాన సమత్వ మనఁగా ఇచట ఆత్మలయొక్క స్వాభావికస్వరూపమందలి సామ్య మనియే గ్రహింపవలయును. కావుననే 'విషమాకారములు....రని యర్థము' అనఁబడినది.

అవ. సామ్యదర్శనముయొక్క మాహాత్మ్యమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ † ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
29
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥ 19

టీ. యేషాం=ఎవరియొక్క, మనః=మనస్సు, సామ్యే=(ఆత్మలన్నియును జ్ఞానైకస్వరూపములనెడు సమత్వమందు), స్థితం=స్థిరముగా నున్నదో, తైః=వారిచేత, ఇహైవ=ఈ సాధనానుష్ఠానదశయందే, సర్గః=సంసారము, జితః=జయింపఁబడినది, నిర్దోషం-ప్రకృతిసంసర్గమనెడి దోషము లేకుండునది (కాఁబట్టి), సమంహి=సమముగా నుండెడి యాత్మవస్తువేకదా, బ్రహ్మ=బ్రహ్మము, తస్మాత్=

---

† ఇప్పటిసమదర్శిత్వము కాలాంతరమునందుఁ గలుగుఫలమునకు సాధనమగుటయేకాక యిప్పటికే ముక్తితో సాటియైన దుఃఖనివృత్తి కలిగించుచున్నదని యీశ్లోకమున సమదర్శిత్వమును ప్రశంసించుటమ తెలియునది.) మఱియు ఆత్మసామ్యమునందలి స్థితి సంసారజయమును గలిగించు నని కదా యున్నది. సంసారజయమునకు ఆత్మయందలి స్థితియే హేతువగునుగాని ఆత్మసామ్యమందలిస్థితి హేతువగునా? యని శంకరాఁగా 'నిర్దోషం...స్థితాః' అనఁబడినది. అనఁగా ప్రకృతిసంసర్గము వీడి సమమైయుండు ఆత్మవస్తువే బ్రహ్మము; కనుక ఆత్మసామ్యమందలిస్థితి బ్రహ్మమందలిస్థితియే యగును. బ్రహ్మమందలిస్థితియే సంసారజయము. కనుక ఆత్మసామ్యమందలిస్థితి సంసారజయమునకు హేతువగు నని యర్థము. ఇట భావ మేమనఁగా మొదట బ్రహ్మశబ్దము పరబ్రహ్మసామ్యమునుబట్టి శుద్ధాత్మపర మని తెలియునది. ప్రకృతిసంబంధము గలిగియున్నపుడే ఆత్మలు విషమములుగా కనఁబడును గాని ప్రకృతిబంధము వీడగా అవియన్నియు సమములై యుండును. కనుక సమమైనయాత్మ యనఁగా ప్రకృతిబంధము వీడిన శుద్ధాత్మయేయగును. శుద్ధాత్మయే బ్రహ్మముతోడి సామ్యమునుబట్టి బ్రహ్మమనఁబడుచున్నది. ఆత్మయొక్క సమత్వమందు ఉండుట యనఁగా సమమైనయాత్మయందు (అనఁగా శుద్ధాత్మయందు-అనగా బ్రహ్మమందు) ఉండుటలో యగును. శుద్ధాత్మయందు నెలకొనుటయె సంసారమును జయించుట. ఇదియే ముక్తి. కనుక ఆత్మసామ్యమందు ఉండుట ముక్తిని బొందుటతో సాటియే యగు నని భావము.

దానివలన, తే=ఆత్మసామ్యమునందు మనసు గలవారు, బ్రహ్మణి = శుద్ధాత్మస్వరూపమునందు, స్థితాః=ఉన్నవారే.

28

తా. ఎవరికి, జ్ఞానైకస్వరూపములగుటచేత ఆత్మలన్నియు సమమను భావమునందు మనస్సు స్థిరముగా నుండునో, వారు, ఈసాధనానుష్ఠానదశయందె సంసారమును జయించినవారగుదురు. ప్రకృతిసంబంధమనునట్టిదోషము లేకపోవుటచే సమముగా నుండెడి ఆత్మవస్తువే కదా బ్రహ్మము. కాఁబట్టి యుక్తరీతిని ఆత్మసామ్యమునం దుండువారు బ్రహ్మమునందు (అనఁగా ఆత్మస్వరూపమునందు) ఉన్నవారే. అనఁగా, శుద్ధాత్మస్వరూపమునం దుండుటయే సంసారమును జయించుట యగును గదా. ఆత్మలయందు జ్ఞానైకాకారత్వమునుబట్టి సామ్యమునే యనుసంధించుచుండువారు ముక్తులే యగుదు రని యర్థము.

అవ. కర్మయోగి యేప్రకారమున నుండినయెడల సమదర్శనరూపమైన యీజ్ఞానపరిపాకము కలుగునో ఆప్రకారమును ఆయుశ్లోకములచే ఉపదేశించుచున్నాఁడు.

శ్లో॥ న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య ।
నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః॥ 20

టీ. బ్రహ్మవిత్ సన్=తత్త్వజ్ఞుల యుపదేశముచే ఆత్మస్వరూపమును ఎఱిఁగినవాఁ డగుచు, బ్రహ్మణి స్థితః=ఆత్మస్వరూప అభ్యాసముతోఁ గూడినవాఁడై, స్థిరబుద్ధిః = స్థిరరూపమైన ఆత్మయొక్క దర్శనమును అనుభవించుటయందు నెలకొన్నవాఁడై, అసమ్మూఢః= దేహాత్మాభిమానము లేనివాఁడై, ప్రియం=తనకు ఇష్టమైనదానిని, ప్రాప్య=పొంది, న ప్రహృష్యేత్=సంతోషింపఁగూడదు, అప్రియం=

తనకు అనిష్టమయినదానిని, ప్రాప్య=పొంది, న ఉద్విజేత్ చ = దుఃఖింపనుంగూడదు.*

తా. తత్త్వజ్ఞుల యుపదేశము చేత ఆత్మయాథాత్మ్యమును దెలిసికొన్నవాఁడై ఆయాత్మకొఱకె ప్రయత్నము చేయుచు, దాని వలన దేహమే ఆత్మ యనుభ్రమమును వదలి, స్థిరరూపమయిన యాత్మయొక్క దర్శనమే తనకు అత్యంత ప్రియము అగుటవలన అట్టి ప్రియమును అనుభవించువాఁడగుటచేత అస్థిరములై ప్రాకృతములై యున్న తక్కిన ప్రియాప్రియములకు హర్షముగాని దుఃఖముగాని పొందక యుండవలయును.

31
శ్లో॥ * బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యస్సుఖమ్ ।
30
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥ 21

టీ. యః=ఎవ్వఁడు, బాహ్యస్పర్శేషు=ఆత్మవ్యతిరిక్తవిషయానుభవములయందు, అసక్తాత్మా = తగులులేనిమనస్సు గలవాఁడై,

* ఒకరికి ప్రియమైనదియు అప్రియమైనదియు మఱొకటి ప్రియమును అప్రియమును గానేరదు. కనుక ఒకనికి ఒకదానివలనఁ గలుగుహర్షముగాని ఉద్వేగముగాని మఱొకనికి అద్దానివలనఁ గలుగదు. కాఁబట్టి అందఱికిని సామాన్యముగా ప్రియమైనదియు నరుదు. ప్రియమును అప్రియమును వానివలనిహర్షమును ఉద్వేగమును, వారివారి దేహములు దేహావస్థలు మొదలైన యుపాధుల ననుసరించి ఏర్పడునవేకాని వేఱుకాదు. కావుననే 'ఎట్టిదేహము...గయికొనఁడు' అనఁబడినది. ఇందు సమదర్శనము గోరు కర్మయోగికి హర్షోద్వేగనివృత్తి చెప్పఁబడినది.

* ఇందు 'విన్దత్యాత్మని యస్సుఖమ్' అనుచోఁ గలసుఖము ఉపదేశాదులచే జనించిన జ్ఞానమువలనఁ గలుగు సుఖమనియు, 'సుఖమక్షయమశ్నుతే' అనుచోటఁ గలసుఖము ఆత్మసాక్షాత్కారమయినపిదపఁ గలుగు నిత్యసుఖమనియు, విశేషము తెలియునది. ప్రకృత్యభ్యాసమనఁగా మరలమరల ప్రాకృతములగు శబ్దాదిభోగ్యము లనుగుఱించినచింత. ఇందు బాహ్యవిషయములందు సంగములేమి చెప్పఁబడినది. బ్రహ్మయోగ మనఁగా శుద్ధాత్మసమత్వానుసంధానము.

ఆత్మని = అంతరాత్మయందే, సుఖం = సుఖమును, విన్దతి=పొందు చున్నాఁడో, సః=వాఁడు, బ్రహ్మయోగయుక్తాత్మా = ఆత్మాభ్యాస ముతోఁ గూడినమనస్సు గలవాఁడై, అక్షయం = మోక్షరూపమైన, సుఖం=సుఖమును, అశ్నుతే=పొందుచున్నాఁడు.

తా. ఎవఁడు, పూర్వోక్తప్రకారమున ఆత్మవ్యతిరిక్తవిషయాను భవములం దాసక్తి లేనిమనసు గలవాఁడై, తనఅంతరాత్మయందే

32

సుఖముఁ బొందుచున్నాఁడో, వాఁడు ప్రకృతివిషయాభ్యాసము మాని బ్రహ్మాభ్యాసముతోఁ గూడినమనస్సు గలవాఁడై బ్రహ్మానుభవరూప మగు శాశ్వతమైనమోక్షసుఖమును బొందును.

అవ. ప్రకృతిసంబంధము లగు భోగములు మిక్కిలి త్యజింపఁ దగిన వని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ *యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః॥ 22

---

* అనాదికాలమునుండియు బాహ్యస్పర్శములను చవిగొనుచున్నవానికి దానిని త్యజించుట యెట్లు? అని యడుగఁగా, వానియందు ఆర్జనాదిదోషములఁ గనుగొనుట వలన వానినుండి ఉపరమించుట శక్యమగునని యిందు చెప్పుచున్నాఁడు. దోష ములు ఐదు గలవు:—రాజసేవాదులందు శరీరము నశించుపర్యంతము ఆర్జింపవలసిన ఆర్జనదోషము; వేయిప్రాకారములు గలగర్భగృహమం దున్నను రాజు, నిప్పు, ఎలుక మొదలగువానినుండి రక్ష్యవస్తువును రక్షింపవలసిన రక్షణదోషము; 'స్వర్గేపి పాతభీతస్య క్షయిష్ణో ర్నాస్తి నిర్వృతిః' (వి-పు-౬-౫-౫౦) స్వర్గమునందును భ్రంశము గలుగు ననుభయమున క్షీణించుచుండును గనుక వానికి సౌఖ్యము గలుగదు.' అన్నట్లు క్షయదోషము; నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి। హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే' 'కామము ననుభవించుటవలన కామ మడఁగదు. ఆజ్యముచే అగ్నిహోత్రమువలె అది మరల పెరుఁగనే పెరుఁగుచున్నది.' అన్నట్లు భోగదోషము; ఇవి యన్నియు తెలుచుగా పరహింసాగర్భము లగుటచే హింసాదో షము; అని యైదు. ఈయైదును ప్రత్యక్షసిద్ధములే కాన వీని నుపదేశింప నక్కఱ లేదనుటకై 'కనఁబడుచున్నవి' అనఁబడినది. ఈదోషములను కనుఁగొనుటచే బాహ్య

టీ. హే కౌన్తేయ=అర్జునా, సంస్పర్శజాః = విషయేంద్రియసంబంధమువలనఁ గలుగునట్టి, భోగాః యే=సుఖములు ఏవియో, తే = ఆవిషయభోగములు, దుఃఖయోనయ ఏవ హి = దుఃఖహేతువులే కదా, ఆద్యన్తవన్తః=అల్పకాలమే వర్తించునవి, బుధః=విషయస్వరూపము నెఱిఁగినవాఁడు, తేషు=ఆవిషయసుఖములందు, న రమతే = రమింపఁడు-సంతోషింపఁడు.

తా. అర్జునా, విషయేంద్రియసంబంధమువలనఁ గలుగు సుఖములు దుఃఖహేతువులే యగును. మఱియు నవి యల్పకాలమే యుండునవిగాను గనఁబడుచున్నవి. వానియాథాత్మ్యము నెఱింగినవాఁడు వానియందు ప్రీతి నుంపఁడు.

శ్లో॥ *శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః॥ 23

టీ. యః=ఎవఁడు, శరీరవిమోక్షణాత్ప్రాక్=శరీరమును విడుచుటకుముందు-శరీరపాతపర్యంతము, ఇహైవ = ఈ సాధనానుష్ఠానదశ

---

స్పర్శములను గెలువ శక్యమగునని భావము. ఇందు బాహ్యవిషయములందు సంగము లేకుండుటకై వానిని దోషములుగా కనుఁగొనుట చెప్పఁబడినది

* ఇట్లు బాహ్యస్పర్శములందు మనస్సు తగులులేక సుఖము నొందుచు ప్రాకృత భోగములను దోషములుగాఁ గనుఁగొనువాఁడు, ఆత్మసాక్షాత్కారమునకును దాని వలని సుఖమునకును యోగ్యుఁ డగుట చెప్పబడుచున్నది. సాక్షాత్కారదశయందు కామక్రోధముల ప్రసక్తియే కలుగదు గాన నవి నివర్తించుట చెప్పఁదగదు. అవి కలుగునట్టిదశయందే అవి నివర్తించుట చెప్పఁదగును. కాన కలుగునట్టిదశ యగు సాధనానుష్ఠానసమయ మిట చెప్పఁబడినది. ఇట వేగ మనఁగా మనోవాక్కాయాదులయురవడి, అనుచితవిషయములను చింతించుట, నీచోక్తులు, రాజాంతఃపుర ప్రవేశము, మొదలైనవి కామజములైనవేగములు. పరహింసాదుల కుపాయములు చింతించుట, పరుషము లాడుట, ప్రహరించుట మొదలైనవి క్రోధజములైన వేగములు. 'విన్ద త్యాత్మని యః సుఖమ్' అనుటచే 'ఆత్మానుభవమందలిప్రీతిచే' నని తెలఁపించినారు. 'సుఖ మక్షయ మశ్నుతే' అన్నచో ఫలముగాఁ జెప్పఁబడిన భవిష్యత్సుఖయోగము 'స సుఖీ' అని యిట చెప్పఁబడెనని తెలియునది. ఇందు కామక్రోధజ మైనవేగము నివారించుట చెప్పఁబడినది.

యందే, కామక్రోధోద్భవం = కామక్రోధములవలనఁ గలిగినట్టి, వేగం=ఉరవడిని, సోఢుం = సహించుటకు-అణఁచుటకు, శక్నోతి= సమర్థుఁడై యుత్సహించుచున్నాఁడో, సః నరః = ఆపురుషుఁడు. యుక్తః=ఆత్మానుభవమునకు తగినవాఁడు, సః=వాడే, సుఖీ = ఆత్మానుభవసుఖము గలవాఁడును.

తా. శరీరవియోగమునకు మునుపు, ఈ సాధనానుష్ఠానదశయందే యాత్మానుభవమందలి ప్రీతిచే కామక్రోధములవలన మనోవాక్కాయములకుఁ గలుగునురవడిని నిరోధించుట కెవఁడు శక్తుఁడై యుత్సహించునో, వాఁడే ఆత్మానుభవమునకు తగినవాఁడు. వానికే శరీరవిమోక్షణానంతరము ఆత్మానుభవరూపమగుసుఖము గలుగును.

శ్లో॥ * యోఽన్తస్సుఖో[33]ఽన్తరారామ[34]స్తథాఽన్తర్జ్యోతి[37]రేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం[35] బ్రహ్మభూతో[36]ఽధిగచ్ఛతి॥ 24

టీ. యః=ఎవఁడు, అన్తస్సుఖః=ఆత్మానుభవమే సుఖముగాఁ గలవాఁడో, అన్తరారామః=ఆత్మయే క్రీడాస్థానముగాఁ గలవాఁడో, తథా=అట్లే, యః=ఎవఁడు, అన్తర్జ్యోతిరేవ = ఆత్మయే జ్ఞానముగాఁ గలవాఁడో, సః=అట్టి, యోగీ=యోగి, బ్రహ్మభూతః = అసంకుచితజ్ఞానాదిస్వరూపముతోనుండి, బ్రహ్మనిర్వాణం=శుద్ధాత్మయందు సుఖమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా. ఎవఁడుఁ సమస్తబాహ్యవిషయానుభవములను త్యజించి ఆత్మానుభవమె సుఖముగాఁ గలిగి, ఆత్మయె తనకు సుఖమును వృద్ధిఁ బొందించునదిగాను, ఆత్మయె తనజ్ఞానమునకు విషయముగాను గలిగి

---

* ఇచట 'అన్తస్సుఖః' 'అన్తరారామః' అన్తర్జ్యోతిః' అను పదములచే ఆత్మయే వరుసగా భోగ్య, భోగస్థాన, భోగోపకరణములుగాఁ గలవాఁడని తెలియనగు. ఇందు ఆత్మస్వరూపమునే అన్నివిధములైన భోగ్యములనుగాఁ జేసికొనుట తెలియునది.

వర్తించునో, అసంకుచితజ్ఞానాదియుక్తుఁడై బ్రహ్మస్వరూపుఁడగు యోగి ఆత్మానుభవసుఖమును బొందుచున్నాఁడు.

శ్లో॥ * లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః ।
38
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః॥ 25

టీ. ఛిన్నద్వైధాః = శీతోష్ణాదిద్వంద్వములచే విడువఁబడినవారును, యతాత్మానః=ఆత్మయందే నియమింపఁబడిన మనసు గలవారును, సర్వభూతహితే రతాః =సమస్తప్రాణులయొక్క మేలును గోరినవారునునగు, ఋషయః = అతీంద్రియవిషయములను జూడఁజాలినవారు, క్షీణకల్మషాః=నశించిన పాపములు గలవారై, బ్రహ్మనిర్వాణం=ఆత్మానుభవసుఖమును, లభన్తే=పొందుచున్నారు

తా. శీతోష్ణాదిద్వంద్వములను విడిచి, ఆత్మయందే మనసును నిలిపి, తమకువలెనే సమస్తప్రాణికోట్లకును మేలుకలుగఁజేయుటయందే ఆసక్తులగు ఋషులు (అనఁగా ఆత్మావలోకనపరులు) ఆత్మ

* సమదర్శిత్వ మనెడు జ్ఞానము పరిపాకము నొందుటకై దానిని సాధించు ననుష్ఠానప్రకారము 'న ప్రహృష్యేత్' అను శ్లోకము మొదలుకొని చెప్పబడుచున్నది హర్షోద్వేగములనివృత్తి' బాహ్యవిషయములందు నిస్సంగత్వము. అందుకై బాహ్యస్పర్శములను దోషములుగా దర్శించుట, కామక్రోధముల వేగము నివారించుట, ఆత్మనే సర్వవిధభోగ్యములుగా కల్పించుకొనుట, అను నివియెదు వరుసగా నయిదు శ్లోకములచేఁ జెప్పఁబడినవి. ఇఁక పూర్వోక్తములైన ద్వంద్వసహత్వాదులను దలపించుచు సమదర్శిత్వమునకు మిక్కిలియు నంతరంగసాధనమైన సర్వభూతహితరతిత్వము నిం దుపదేశించుచున్నాఁడు. సర్వభూతహితరతి యనఁగా 'శ్రూయతాం ధర్మసర్వస్వం శ్రుత్వా చాప్యవధార్యతామ్। ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్' (భారతే) అన్నట్లు తనకువలెనే తక్కినభూతములకును హితమాచరించుట. ఇట, 'ఋషయః' అనగా ద్రష్టలు-అనఁగా పరిశుద్ధములై పరస్పరసదృశములై యుండు ఆత్మస్వరూపముల సాక్షాత్కరించువారు. ఇట్టిసాక్షాత్కారసిద్ధియందు, 'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే' అన్నట్లు అత్యంతపావనమైన ఆత్మజ్ఞానముచేత 'క్షీణకల్మషాః' అని అనిష్టనివృత్తి యు 'బ్రహ్మనిర్వాణం లభన్తే' అని యిష్టప్రాప్తియుఁ జెప్పఁబడినది.

ప్రాప్తికి విరోధు లగుసమస్తపాపములను బోఁగొట్టుకొనినవారై ఆత్మానుభవసుఖమును బొందుచున్నారు.

అవ. ఈ చెప్పఁబడినగుణములు గలవారికి బ్రహ్మమును (అనఁగా ఆత్మస్వరూపమును) బొందుట మిక్కిలి సులభ మనుచున్నాఁడు.

శ్లో॥ *కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విజితాత్మనామ్॥ 26

టీ. కామక్రోధవియుక్తానాం = కామక్రోధములచే విడువఁబడినవారును, యతచేతసాం=ఆత్మయందే నియమింపఁబడిన మనసు గలవారును, విజితాత్మనాం = జయింపఁబడిన మనస్సు కలవారును నగు, యతీనాం=ప్రయత్నశీలురకు, బ్రహ్మనిర్వాణం = ఆత్మానుభవసుఖము, అభితః=అంతటను, వర్తతే=ఉన్నది.

తా. కామక్రోధములను త్యజించి, మనసును జయించి, దానిని ఆత్మయందే నియమించి, సమదర్శిత్వమునకుఁగాను ప్రయ

త్నముఁ జేయువారికి ఆత్మానుభవసుఖము అఱచేతి దైయుండును.

---

* పూర్వోక్తములైన ఆఱుశ్లోకములందు సమదర్శిత్వమునకు సాధకములుగాఁ జెప్పఁబడిన అనుష్ఠానప్రకారములే ఈశ్లోకమునందు సంగ్రహముగాఁ గూర్చి చెప్పఁబడినవి. ఎట్లన, 'కామక్రోధవియుక్తానాం' అనుట 'శక్నోతి' అనుశ్లోకముయొక్కయు, 'యతీనాం'(యతనశీలానాం)అనుట 'నప్రహృష్యేత్' 'బాహ్యస్పర్శేషు' అను రెండుశ్లోకములయొక్కయు 'యతచేతసాం' అనుట 'యోఽన్తస్సుఖః' అను శ్లోకముయొక్కయు, 'విజితాత్మనామ్' అనుట 'యేహి సంస్పర్శజాః' అని విషయభోగములందలిదోషములను కనఁబఱచుటచే మనసు వానియెడల ప్రవర్తింపనిచో ఆత్మవిషయముగా జయింపబడుటం జెప్పు శ్లోకముయొక్కయు అర్థములే యగుచున్నవి. ఈ యనుష్ఠానమందు అతిశీఘ్రముగా ప్రవర్తింతురుగాక యని దీనికి బ్రహ్మనిర్వాణమనుఫలము అవిళంబముగా నుండుటను జెప్పిరని తెలియునది.

అవ. ఇంతవఱకుఁ జెప్పఁబడినదియు యోగమనెడి ఆత్మావలోకనమే ఉద్దేశ్యముగాఁ గలదియు నగుకర్మయోగమును ఉపసంహరించుచున్నాఁడు.

శ్లో॥ స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాం ।
శ్చక్షు శ్చైవాన్తరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వానాసాభ్యన్తరచారిణౌ॥ 27

శ్లో॥ యతేన్ద్రియమనోబుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛా భయక్రోధో య స్సదా ముక్త ఏవ సః॥ 28

టీ. యః=ఎవఁడు-ఏకర్మయోగి, బాహ్యాన్ = ఆత్మవ్యతిరిక్తములగు, స్పర్శాన్=శబ్దాదివిషయములను, బహిఃకృత్వా=బహిష్కరించి-బాహ్యేంద్రియవ్యాపారమును వదలి, చక్షుః = చూపును, భ్రువోః=కనుబొమలయొక్క, అన్తరే ఏవ=నడుమనే-నాసాగ్రమందనుట, (కృత్వా=ఉనిచి,) నాసాభ్యన్తరచారిణౌ=ఉచ్ఛ్వాసనిశ్వాసరూపమున ముక్కులోపల సంచరించునట్టి, ప్రాణాపానౌ = ప్రాణాపానవాయువులను, సమౌకృత్వా = సమగతి గలవానినిగాఁ జేసి, యతేన్ద్రియ మనోబుద్ధిః- *యత = ఇతరములయందు ప్రవర్తించుటకనర్హములైనవిగాఁ జేయబడిన, ఇన్ద్రియమనోబుద్ధిః= బాహ్యేంద్రియములు మనస్సు బుద్ధియుఁ గలవాఁడును, విగతేచ్ఛాభయక్రోధః=రాగము భయము ద్వేషము లేనివాఁడును, మోక్షపరాయణః=మోక్ష మొక్కటియె ప్రయోజనముగాఁ గలవాఁడును అగు, మునిః=ఆత్మావలోకనపరుఁడో, సః=ఆ పురుషుఁడు, సదా = ఎల్లప్పుడును, ముక్త ఏవ=ముక్తుఁడేను-సంసారమును నివర్తించినవాఁడే.

---

* ఇట ఆత్మసాక్షాత్కారమునకు అవ్యవహితమైన పూర్వావస్థను గుఱించుటచే 'యత' అనుటకు 'ఆత్మ...కనర్హములైన' యని యర్థము సేయబడియె. 'స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాన్' అనుచో బాహ్యేంద్రియాదుల ప్రవృత్తిని వారించుటయు 'యతేంద్రియః' అనుచో అట్లు నివారించుటకు ఫలముగా ఆత్మదర్శనేతరములందు ప్రవృత్తి కనర్హములై యుండుటయుఁ జెప్పఁబడె నని తెలియునది.

తా. సమస్తబాహ్యేంద్రియవ్యాపారములను చాలించికొని, యోగమునకుఁ దగినయాసనమునందు దేహము సరిగా పెట్టుకొని కూర్చుండి, నాసాగ్రమునందు దృష్టి నిలిపి, నాసికములలోపల సంచరించు ప్రాణాపానవాయువులను ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములను సమగతిగలవానినిగాఁ జేసి, ఇంద్రియములను మనస్సును బుద్ధిని ఆత్మదర్శనమునందే నియమించుటచేత విషయాంతరములందు ప్రవర్తించుటకు అవశ్యములైనవానినిగాఁ జేసి, దానిచేతనే యిచ్ఛాభయక్రోధరహితుఁడై, మోక్షమొక్కటియె ప్రయోజనముగాఁ దలఁచి, ఆత్మదర్శనశీలుఁడై యుండువాఁ డెవఁడో, వాఁ డెల్లప్పుడు (అనఁగా సాధ్యదశయందువలె సాధనదశయందును) ముక్తుఁడే యనఁదగును. (అనఁగా ముక్తప్రాయుఁ డనుట.)

41

అవ *నిత్యనైమిత్తికకర్మములను ఇతికర్తవ్యతయుఁ గలదై యోగమును ఉద్దేశ్యముగాఁ గలిగియుండు కర్మయోగమును ఆచరించుటకు సుకరమైనమార్గమును జెప్పుచున్నాఁడు.

---

* ఈ యధ్యాయము మొదట 'సన్న్యాసం కర్మణాం కృష్ణ' ఇత్యాదులచే అర్జునుఁడు జ్ఞానకర్మయోగములభేదము నడుగఁగా కృష్ణుఁడు జ్ఞానయోగముయొక్క దుష్కరత్వాదులను కర్మయోగముల భేదము నడుగఁగా కృష్ణుఁడు జ్ఞానయోగముయొక్క దుష్కరత్వాదులను కర్మయోగముయొక్క సౌకర్యాదులను జెప్పెను. పిదప కర్మయోగముయొక్క యితికర్తవ్యత దానిశిరస్సగు యోగము విశదీకరించెను. ఇచట ఉపసంహారమునందును మును ప్రశ్నోత్తరములుగా ఉపక్రమించిన సౌకర్యాదులనే ప్రకారాంతరమున దృఢీకరించుచున్నాఁడు. కాన 'నిత్యనైమిత్తి... చెప్పచున్నాఁడు' అనఁబడినది. కాఁబట్టియే 'శాన్తి' శబ్దమునకు భగవత్ప్రాప్తిరూపమైన మోక్ష మని కాని కర్మయోగసాధ్యమగు ఫల మని కాని చెప్పక 'సుఖం బన్ధాత్ప్రముచ్యతే' (గీత-౫ 3) ఇత్యాదులందు చెప్పఁబడిన మనఃక్లేశశాంతి మొదలగు రూపమైన సుఖముగా తెలియునది. కనుక 'కర్మయోగమున సుఖముగా వర్తింతువు' అనఁబడినది.

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్।
43
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాన్తిమృచ్ఛతి॥ 29

టీ. **మాం** = నన్ను, యజ్ఞతపసాం = యజ్ఞములకును తపస్సులకును, భోక్తారం = భోక్తగాను-అనుభవించువానినిగాను, * సర్వలోకమహేశ్వరం = సమస్తలోకేశ్వరులకును నీశ్వరునిగాను, సర్వభూతానాం=సమస్తప్రాణులకును, సుహృదం = పరమమిత్రునిగాను, జ్ఞాత్వా= తెలిసికొని, శాన్తిం=సుఖమును, ఋచ్ఛతి=పొందుచున్నాఁడు (కర్మయోగమునందు సుఖముగా ప్రవర్తించుచున్నాఁడనుట.)

తా. మహాయజ్ఞాదులకును కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులకును ఆరాధ్యునిగాను లోకేశ్వరులకందఱికిని ఈశ్వరుఁడైనవానినిగాను సర్వభూతములకును హితునిగాను నన్ను తెలిసికొంటివేని పిదప కర్మయోగము నా యారాధనరూపమనెడి బుద్ధితో దానియందు నీవు సుఖముగా ప్రవర్తింతువు. [సర్వలోకమహేశ్వరుఁడనఁగా సమస్తలోకేశ్వరులకుఁగూడ ఈశ్వరుఁడైనవాఁడు. 'త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' అనికదా శ్రుతి. సుహృదులను ఆరాధించుటకు ఎల్లవారును ప్రయత్నింతురే కదా.] 40

* మహేశ్వరశబ్దమును రూఢ్యర్థమున రుద్రపరముగా గ్రహింపకుండుటకై 'సర్వలోకేశ్వరులకుఁగూడ నీశ్వరుఁడైనవాఁడు' అని సమాసార్థము చెప్పఁబడెను. ఇందులకు ప్రమాణముగా 'త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్। తం దైవతానాం పరమంచ దైవతమ్। పతిం పతీనాం పరమం పరస్తాత్। విదామ దేవం భువనేశ మీడ్యమ్' అని శ్రుతి యుదాహరింపఁబడియె. ఉదారుఁడును హితుడును నైనవానిని ఆరాధించుట అందఱికిని ప్రియమే కదా, నన్నును అట్టివానినిగానే యెఱుఁగుము. అప్పుడు నన్ను ఆరాధించుటయే యగు కర్మయోగము నీకు సుఖముగా నుండు నని భావము. యజ్ఞాదులకు తానే భోక్త యనుటవలన యజ్ఞరూపమగు కర్మయోగము తనయారాధనమే యగుట తెలియుచున్నది. 'సర్వలోకమహేశ్వరమ్' అనుటచే ప్రభుత్వమును 'సర్వభూతసుహృదమ్' అనుటచే పరమహితత్వమును స్ఫురించుచున్నవి.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగోనామ
పఞ్చమోఽధ్యాయః.

ఇది యుపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ
శాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును నగు
శ్రీ భగవద్గీతలలో కర్మసన్న్యాసయోగం బన్నది
పంచమాధ్యాయము.



## ఐదవ అధ్యాయము-విశేషాంశములు

1 శ్లో॥-(1)

ఈ యైదవ యధ్యాయమునకు కొంత మూడు నాలుగు అధ్యాయములతో సంబంధము కలదు. దానిని తెలుపుటకై వానియందు జెప్పబడిన విషయము లేవియో చెప్పబడని వేవియో విమర్శించుచు వానియందు చెప్పక విడచిన యంశములే యీ యధ్యాయమునకు ముఖ్యతాత్పర్యములని యీ పై యవతారికలో జెప్పబడినది.

కర్మయోగము దానికి ఫలమగు ఆత్మసాక్షాత్కారమును సాధించుటలో సుకరము శీఘ్రమును అనునవియే యిందలి ముఖ్యాంశములు,

1 శ్లో॥-(2)

అవతారిక-

'తద్విద్ధి ప్రణిపాతేన' యన శ్రీకృష్ణు డుపదేశించిన మాటను తలంచుకొని యీ చెప్పనివియు తెలుసుకొనవలసినదియు నేదియో నెఱుంగగోరి చెప్పిన దానినే తిరిగి యడుగుచు యర్జును డిట్లు పలుకుచున్నాడు.

1 శ్లో॥-(3)

( తాత్పర్యమునకు చివర చేర్చవలెను. )

కషాయము తొలగుటకై కర్మయోగము నాచరించవలెను. అది తొలంగినచో కర్మయోగమును విడిచి జ్ఞానయోగము నవలంబించవలెను. కావున జ్ఞానయోగమే ఆత్మదర్శనమునకు సాక్షాత్సాధన మని రెండవ యధ్యాయమును జెప్పబడెనని యర్జునుడు భ్రమించెను.

2 శ్లో॥-(4)

అవతారిక-

కర్మయోగము జ్ఞానయోగమును బుట్టించి ఆత్మదర్శన మొసంగు ననువిషయము అధికారిభేదమునుబట్టి చెప్పబడినది. నిజమునకు కర్మయోగజ్ఞానములు రెండును మధ్య వేరొకదాని యపేక్ష లేకయే ఆత్మసాక్షాత్కారమును కలుగజేయునని తెలుపుచు కషాయరహితుడైనను సుకరముగను శీఘ్రముగను ఆత్మసాక్షాత్కారమును బడయగోరునేని కర్మయోగమునే తప్పక చేయవలెనని భగవంతుడానతిచ్చుచున్నాడు.

ఇచ్చట నొకవిషయమును గమనించవలెను. ఒక గ్రామమునకు దగ్గరదారియును, చుట్టుదారియును గలవు. దగ్గరదారి అరణ్యమార్గము. నలగనిది. చుట్టుదారి రాజబాట. నిరంతరసంచారము గలది అరణ్యమార్గ మపాయబహుళము. ఆదారిని పోవువానికంటెను నలిగిన నిరపాయమైన చుట్టుదారిని పోవువాడే తన గంతవ్యమును త్వరగా చేరగలుగునుగదా. అదే న్యాయ మిచటను గమనించవలెను.

3 శ్లో॥-(5)

రాగద్వేషములు కలవాడు ద్వంద్వములను సహింపజాలడు.

4 శ్లో॥-(6)

శారీరకసూత్రములలో 'రచనానుపపత్తేశ్చ నానుమానం ప్రవృత్తేశ్చ' 'ఏతేన యోగః ప్రత్యుక్తః' మొదలగు సూత్రములచే ఆ రెండు సిద్ధాంతములను సూత్రకారుమే ఖండించిరి.

ఇంకను-

బహవః పురుషా రాజన్ సాంఖ్యయోగ విచారిణః। నైతదిచ్ఛన్తి పురుషం ఏకం కురుకులోద్భవః॥ అనియు, 'సహూసేన తు తద్వ్యాసః పురుషైకాత్మ్య ముక్తవాన్' అని మోక్షధర్మమున ఆ రెండింటికిని గల విరుద్ధాంశములను వ్యాఖ్యానించెను.

కావున- సంఖ్యా=బుద్ధిః, తయా అవధారణీయం ఆత్మతత్త్వం సాంఖ్యం-తదవధారణరూపం సాంఖ్యం, అని ఆత్మతత్త్వనిర్ణయాత్మకమైన జ్ఞానయోగమనియు, యోగమనగా తదతిరిక్తమును తత్సహచరితమును నగు కర్మయోగ మనియును అర్థము.

4 శ్లో॥-(7)

ఈ శ్లోకమున "పృథక్ బాలాః ప్రవదన్తి" యనుచో కర్మజ్ఞానయోగముల స్వరూపభేదము ప్రామాణిక మగుటచే నది నిషేధింపబడుట లేదు. ఆరెండిటి సంచయమును ఇచ్చట విధింపబడుట లేదు. ఏలనన ముందున్న పెక్కుశ్లోకములకే వేరువేరుగా నా రెండింటి యనుష్ఠానమును విధింపబడుచున్నది. కావున ఫలైక్యము మాత్రమే ఇచట విధింపబడుచున్నదని గ్రహించవలెను.

4 శ్లో॥-(8)

"న పణ్డితాః" అనుటచే శాస్త్రీయానుష్ఠానము నెఱుంగని పామరులను నర్థమును చెప్పరాదు. రెండింటికిని ఫల మొక్కటియే యని యెఱుంగరని మాత్రమే అర్థము. ఇచ్చట పాండిత్యమనగా-

సదాచార్యుల యనుగ్రహము మాత్రముచేమాత్రమే లభింపదగిన జ్ఞానమని యర్థము. అది లేనివారు పండితులు కారని యభిప్రాయము.

5 శ్లో॥-(9)

అవతారికతో చేర్చవలెను.

అనగా- కర్మయోగ జ్ఞానయోగములకు ఫలములు వేరగుటచే నవి వేరనువారిని నిందించెను, ఇప్పుడు రెండింటికిని యొకటే ఫలమగుటచే రెండు నొక్కటియే యను వారిని ప్రశంసించుచున్నాడు.

5 శ్లో॥-(10)

ఇచ్చట 'స్థాన' శబ్దమునకు దేశవిశేష మని యర్థమును జెప్పరాదు. ఏమనగా- జ్ఞానయోగాదులచే మాత్రము లభించు దేశ మొక్కటి యెచ్చటను చెప్పబడలేదు. మరి ఫలమే ఆస్థాన శబ్దమున కర్థము. ఆ ఫల మేమనగా-వెనుకను ముందును నున్న ప్రబంధముచే పది ఆత్మావలోకనమే యని యెఱుంగవలెను.

6 శ్లో॥-(11)

అవతారికకు ముందు అవతారికగనే చేర్చవలెను. (అవతారికకు అవతారిక)

"కర్మయోగో విశిష్యతే" అనుటచే జ్ఞానయోగమున కన్న కర్మయోగము గొప్పదనిగదా చెప్పబడినది. అట్లైతేరి యీ రెండింటికిని వికల్ప మెట్లు ఘటించును. అత్యంతతౌల్య మున్ననే గదా వికల్పము. అని శంకించగా- సౌకర్య శైఘ్ర్యములచే కర్మయోగము గొప్పదని చెప్పబడెను. రెండింటికిని ఫలములో భేదము లేకుండుటచే వికల్పము చెప్పబడినది. సుకరముగను శీఘ్రముగను ఫలము నిచ్చు ఉపాయము లుండగా నిది వ్యర్థముకాదా యనరాదు. అయ్యది యధికారి భేదములనుబట్టి యేర్పడినది. ఈవిషయమును "వికల్పోఽవిశిష్ట ఫలత్వాత్" అనెడు బ్రహ్మసూత్రముచే తెలుపబడుచున్నది.

7 శ్లో॥-(12)

అవతారిక-

కర్మయోగము సుకరమగుటలోను, శీఘ్రఫలప్రద మగుట లోను కారణమును జెప్పుచున్నాడు.

7 శ్లో॥-(13)

ఇచ్చట 'విశుద్ధి' యనగా రజస్తమో నివృత్తియును, దాని వలన కలుగు రాగద్వేషాది కషాయ నివృత్తియును.

7 శ్లో॥-(14)

ఇచ్చట "నలిప్యతే" యనుటచే కూడనిపనిని చేయుచున్నను దుష్టుడు కాడని యర్థమును గ్రహించినచో ననేకశాస్త్రములు నిష్ఫల మగును. లేక కర్మయోగము నాచరించుచున్నను దానిచే లిప్తుడు కాడనియును నర్థమును చెప్పరాదు. అట్లైనచో నిష్ఫలమగు ప్రయాస యగుటచే 'స కుర్యాన్నిష్ఫలం కర్మ' యనుటచే దానిని విడువవలసివచ్చును. జ్ఞానయోగివలెనే కర్మయోగియును ఆత్మసాక్షా త్కారఫలమునకు విరోధులగు వేటిచేతనుగాని లిప్తుడు కాడని మాత్రమే దీని భావము.

7 శ్లో॥-(15)

భిన్నముల నాత్మలగు కైక్య మెట్లనిన-

"ఆత్మయాథాత్మ్యము ననుసంధించువానికి" అని చెప్పబడి నది. దానిపై భిన్నములను ఆత్మల కైక్యము విరుద్ధముకాదా యని ప్రశ్న యుదయించుచున్నది- దానికి సమాధానము నిజమే- ఇచ్చట విధించబడునది స్వరూపైక్యముకాదు. అది ప్రత్యక్షానుమానాగమ పూర్వాపరగ్రంథ విరుద్ధము. ఇక నేమనగా- ఏకాకారత్వమే ఇచ్చట విధింపబగుచున్నది. ఎట్లనగా- 'మాగ్రామములోని యన్నియిండ్లలో నున్న ధాన్యమంతయు నిదియే' యన్నచో అ ధాన్యమంతయు నేక

జాతీయ మని యర్థమును చెప్పినట్లు అన్ని శరీరములలో నుండు ఆత్మ యిదియే యన్నను ఇతర దేహములలో నుండునట్టియు యీ దేహములో నుండునట్టియు నాత్మలు సమానాకారములే యని యర్థమే గాని స్వరూపైక్య మెంతమాత్రమునుగాదు.

ఈ సమానత్వముమాత్రము ప్రత్యక్షాది విరుద్ధము కాదా? దేవతిర్యగ్బ్రాహ్మణ క్షత్రియ బ్రహ్మచారి గృహస్థ పండిత పామర సబల దుర్బల ధనిక దరిద్ర వృద్ధ యువక మొదలగు పెక్కు వైషమ్యములతో నాత్మలు గోచరించుచుండ నవి యొకే ఆకారము కలవని చెప్పుట యెట్లు? అట్లు కానిచో 'బ్రాహ్మణో యజేత' యని ఆత్మపర్యంతమగు శాస్త్రీయ ప్రయోగము వ్యర్థము కాదా-యన్నచో "దేవాది భేదములు" అనుగ్రంధము ఆరంభమగుచున్నది.

ఈ గ్రంధాభిప్రాయ మేమనగా-

నిజమే, నీవు చెప్పిన దేవాదిభేదము ప్రమాణసిద్ధమైనదే, కాదనజాలము. కాని యది ఆత్మల స్వరూపములకు చెందినదికాదు. అది కర్మమూలమున ప్రకృతి పరిణమించగా వచ్చిన భేద ప్రయుక్తము గాన ఔపాధికము-వాస్తవముకాదు.

ఇచ్చట చెప్పిన సామ్యమీ శుద్ధావస్థకు సంబంధించినది. అనగా ఉపాధి రహితములగు ఆత్మలన్నియు జ్ఞానాకారములో సామ్యమును పొందియే యుండును.

8 శ్లో॥-(16)

అవతారిక-

ఇట్లడుగుచున్న నర్జుననకు సాక్షాత్తుగా నడిగిన ప్రశ్నకు భగవంతు డుత్తరము నొసంగెను.

ఇక పైన నాతని హృదయము నెఱింగిన శ్రీకృష్ణుడు చెప్పబోవు వాక్యమునకు ముందు గ్రంధములో గల సందర్భమును జూపుచున్నాడు.

11 శ్లో॥-(17)

ఇచ్చట శుద్ధి యనునది యేద్దైనను దోషముచే దూషితమైన దానికే యవసరము కదా! ఆత్మ కాదోష మేదియనగా-

ఆత్మస్వతః శుద్ధమైనద్దైనను అనాదికాలమునుండియు నాత్మ తత్త్వము నెఱుంగకుండ జేయు కర్మమే ఆదోషముగా గ్రహింప వలెను.

11 శ్లో॥(18)

బుద్ధ్యా యనగా- కృత్యధ్యవసాయముచే అనగా- చేయవలె ననెడు గట్టి పట్టుదలచే.

11 శ్లో॥-(19)

కర్తృత్వాభిమానము లేకయే, లేక మమతాబుద్ధికి లోనుగాని అని యర్థము.

11 శ్లో॥-(20)

అవతారిక-

చెప్పిన యర్థమును బలపరచుటకై యిది శిష్టాచారమని చెప్పుచున్నాడు. ఇదియే గదా ప్రమాణ మూర్ధన్యము.

12 శ్లో॥-(21)

ఇచట "యుక్తః" అనగా సమాహితచిత్తు డని యర్థము.

అనగా- ఫలాంతరములయందు విరక్తియు ఆత్మయందు రక్తి యును కలవాడని తాత్పర్యము.

12 శ్లో॥-(22)

ఇచ్చట "కామకార', మనగా- స్వేచ్ఛాచారము కాదు. అది యెప్పుడో చాల దూరముగ తరిమివేయబడినది. కాబట్టి కామము చేయు ప్రేరణ యని యర్థమును గ్రహించవలెను.

దీనిచే ఫలమునందు సంగముమాత్రము చెప్పబడుచున్నది.

15 శ్లో॥-(23)

ఇట్టి స్వరూపస్వభావమున ఆత్మను......అనుచోట-

ఈప్రశ్నకు సమాధానము-

"అజ్ఞానే నావృతం జ్ఞానం......"

శ్రీ. వి. పు. అవిద్యాకర్మసంజ్ఞాన్యా తృతీయా శక్తిరిష్యతే।

యయా క్షేత్రజ్ఞ శక్తిస్సా వేష్టితా నృప! సర్వదా।

సంసారతాపానఖిలా నవాప్నోత్యతిసన్తతాన్।

తయాతిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా।

సర్వభూతేషు భూపాల! తారతమ్యేన వర్తతే॥

విష్ణుశక్తి, క్షేత్రజ్ఞశక్తి, కర్మశక్తి యని శక్తులు మూడువిధములు- అందు కర్మశక్తికి అవిద్య యనియును పేరు. ఇది మూడవది. ఈకర్మ శక్తిచే (కర్మచే) క్షేత్రజ్ఞశక్తి (జీవగముదాయము) అంతటను ఆవ రింపబడినది. దానిమూలమున నవిచ్ఛిన్నమగు సంసారతాపములనే చేతను లనుభవించుచున్నారు. ఈ శక్తియొక్క ఆవరణ సకలప్రాణు లకును అనగా- దేవతిర్యఙ్మనుష్యస్థావరాదులకు సహజమే. కాని హెచ్చుతగ్గులుగా మాత్ర ముండును అని పరాశరుడు తెలవిచ్చెను.

15 శ్లో॥-(24)

అణువగు ఆత్మను విభువని తెలుపుటలోగల రహస్యమును గుర్తించవలెను. అది ఏమనగా-

పూర్వోక్తవివరణను బట్టి కర్మానుగుణముగా సకలదేహము లలో ప్రవేశించదగిన యోగ్యత ఆత్మకు కలదని తెలుసుకొంటిమి గదా! దీనినిబట్టి జీవునకు నిర్దిష్టమైన నొక ప్రదేశము లేదని సుస్ప ష్టము.

ఇందువలన గ్రహించదగినదేమనగా- జీవునకు దేహము నొక అద్దెకొంప యని భావించవలెనని తెలియుచున్నది. ఎవ్వడైనను అద్దె కొంపయందు మమకారమును బెట్టుకొని దానిని చక్కఁబరచ జూచునా? శిథిలమైనచో దానిని విడచి మరియొక యింటి కేగును గాని దానికి మరమ్మత్తు భారమును తనపై నిడుకొనడు. దానియం దాతడు ఉపేక్షాభావమునే వహించియుండవలెను గాని దాని సంరక్షణయందే తన జీవితమును గడపరాదు. ఇటులనే దేహము విషయమయ్యును అను నీతత్త్వ మీ సద్గోశములకు ధ్వనించుచున్నది.

16 శ్లో॥-(25)

ఇచ్చట ఆదిత్యశబ్దమునకు సూర్యకాంతి యర్థము. కాంతివలననే సూర్యునకు ప్రకాశకత్వము ప్రసిద్ధము. జీవునియందుండు జ్ఞానమున కీప్రభయే దృష్టాంతము కాదగినది.

యథాన క్రియతే జ్యోత్స్నా మల ప్రక్షాళనాన్మణేః ।
దోష ప్రహాణా న్నజ్ఞానం, ఆత్మనః క్రియతే తథా॥

బురదలోపడి కాంతివిహీనమైన మాణిక్యమునకు ఆ బురద కడిగినచిన కాంతికై వేరొక ప్రయత్న మవసరము లేకయే అది ప్రకాశించును. అటులనే ఆత్మకుగల జ్ఞానమున్ను కర్మచే సంకుచితమై ఆ కర్మను పోగొట్టుకొనిన స్వయముగనే అ జ్ఞానము ప్రకాశించును గాని దానికై చేయవలసిన దేదియును లేదు- అని సామ్యమును గాంచవలెను. ప్రభ యనగా పెద్దదీపము సూర్యుడు మొదలగువాని యందుండు విడదీయ వీలులేని తేజోద్రవ్యము. అటులనే జ్ఞానమున్ను ఆత్మయం దట్లే అపృథక్సిద్ధసంబంధముచే నుండు ద్రవ్యవిశేష మేయని గ్రహించవలెను. దీనికి సంకోచవికాసములు కలవను విషయము శ్రీభాష్యములో విస్తారముగా చెప్పబడినది.

18 శ్లో॥-(26)

ఆత్మలకు సామ్యమే సిద్ధాంతమైనచో బ్రాహ్మణ చండాలాదులకు స్పృశ్యత్వాదిసామ్యముకూడా నుండవలదా? యన్నచో వెనుక చెప్పినరీతిగా నని శ్రీ భాష్యకారులు సెలవిచ్చిరి,

అనగా- ఉపాధి లేని ఆత్మస్వరూపము జ్ఞానాకారముతో సమానమైనదని నమ్మకము కల మనస్సు కలిగియున్న వారనియే తాత్పర్యము. ఇదియే ఆత్మసామ్యమునం దుండుట.

18 శ్లో॥-(27)

ఈ శ్లోకమున "విద్యావినయ సంపన్నే" అను పదమును "బ్రాహ్మణే" అను పదమునకు విశేషణమని భ్రమించరాదు. ముందున్న పదములకు విశేషణములు లేకుండుటచేనిచ్చట విశేషణముగా నన్వయించిన క్రమభంగమగును- ఇచ్చట సాత్విక- రాజస- తామస శరీరములలో నున్నను ఆత్మలకు జ్ఞానమేయాకార మగుటచే వైషమ్యము లేదని తెలుపుటయే ముఖ్యోద్దేశ్యము.

అధికరణార్థముగల సప్తమీవిభక్తి ప్రయోగింపబడుటచే నందున్న ఆత్మలకు భేదము లేదనియే తాత్పర్యముగాని బ్రాహ్మణుని చండాలుని సమముగ జూచువాడు పండితుడని యర్థమును జెప్పుట యవివేకమే.

19 శ్లో॥-(28)

ఇచ్చట "జ్ఞానైకాకారతయా" అను వివరణను చేయనిచో బ్రాహ్మణ చండాలాదులకు తాక తగుట మొదలగు సామ్యము సిద్ధించెడిది. దానిని పరిహరించుటకై యీ వివరణ చేయబడినది.

19 శ్లో॥-(29)

శుద్ధాత్మ బ్రహ్మతో సమానమైన దగుటచే బ్రహ్మశబ్దముచే శుద్ధాత్మయే చెప్పబడుచున్నది.

21 శ్లో॥-(30)

బ్రహ్మయోగ యుక్తాత్మా=శుద్ధాత్మసమత్వానుసంధానముతో.

21 శ్లో॥-(31)

అవతారిక-

ఇట్లు పొంగుక్రుంగులు లేనివానికి ఆత్మలన్నియును, జ్ఞానాకారమైనవి యనెడు సమదర్శిత్వము కలిగి దానిమూలమున నిరతిశయ సుఖము స్వయముగనే సిద్ధించునని చెప్పుచున్నాడు.

21 శ్లో॥-(32)

మాటిమాటికిని ప్రాకృతములైన శబ్దాది భోగ్యపదార్థాభ్యాసము.

24 శ్లో॥-(33)

అవతారిక-

ప్రాకృత భోగ్యభోగోపకరణ భోగస్థానములను సవాసనగా విడచి, వాని నన్నిటిని ఆత్మయందే (రసానుభవసిద్ధికై) కల్పించుకొని "విన్దత్యాత్మని యస్సుఖం" అని చెప్పబడిన ఉపాయదశలోని యానందాతిశయమును విశదీకరించుచున్నాడు.

24 శ్లో॥-(34)

ఆరామము-

"ఆరామం స్యాదుపవనం
కృత్రిమం వనమేవ తత్"

ఇంటిచుట్టును సమీపమునందును విశ్రాంతికై నిర్మించుకొనిన చిన్న తోట.

ఇది భోగస్థానము. ఇది తన నీడ, చిగురు, పువ్వులు, పండ్లు మొదలగు తన గుణములతో సుఖమును వృద్ధిచేయును,

అటులనే ఆత్మానుభవమున్ను [illegible] స్వభావములైన "అపహతపాప్మత్వ జ్ఞానానందాది గుణములు [illegible], [illegible] కూర్చిన చర్చలవలనను, గ్రంధరచనలవలనను క్రీడలలో [illegible] ఆత్మ[illegible] సుఖ వర్ధకమగును. ఈ సామ్యత్వమును బట్టి ఆత్మ[illegible]రామమని నిరూపింపబడినది.

ఇతర భోగ్యవస్తువులకన్న [illegible] ఉపకరణముల స్వరూపము [illegible]. [illegible] జ్ఞానముకూడా నుండవలెను. కాబట్టి యిచ్చటి తాదేశజ్ఞానము మృగ్యము. ఇచ్చట అన్నియు నాత్మగ గదా!

24 శ్లో॥-(35)

బ్రహ్మనిర్వాణం- బ్రహ్మమే నిర్వాణ మనగా బ్రహ్మమనెడు నిర్వాణ మనిగాని అర్థమును చెప్పవలెను. నిర్వాణ మనగా సుఖము.

24 శ్లో॥-(36)

ఇదివరకు దేహమే యాత్మయను భ్రాంతి కలవాడగుటచే దేవభూతుడును మనుష్యభూతుడును నైన చేతను డిప్పు డాయభిమానము లేకుండుటచే వాస్తవమగు సంకోచరహితమైన జ్ఞానాది స్వరూపముతో వెలుగొందుచుండుటచే బ్రహ్మభూతు డని చెప్పబడుచున్నాడు.

24 శ్లో॥-(37)

జ్యోతిరేవ అనుచోటనున్న "ఏవ" కారమును శ్లోకమునందున్న పదము లన్నిటితోను చేర్చవలెను. కావుననే భాష్యకారులు తమ గీతాభాష్యమున "ఏక" శబ్దమును ప్రయోగించిరి.

25 శ్లో॥-(38)

యతాత్మానః=నియమితమనస్సును కలవారై.

ఇచ్చుట నియమన మనగా- దానిని తగినస్థానమున నెల కొల్పుట. ఆస్థానము శుద్ధాత్మయే.

26 శ్లో॥-(39)

అంతియకాని చేతితో నెత్తిన కఱ్ఱతో నందుకొనవలసిన కొన పండువంటిదికాదు.

29 శ్లో॥-(41)

ఈశ్లోక మొక చక్కని యర్థమును బోధించుచున్నది.

భగవదారాధన బుద్ధితో నిష్కామకర్మయోగము నాచరించుటకు ముఖ్యమైన మూడు విషయము లిందు బోధింపబడుచున్నవి.

దీని కొకలౌకిక దృష్టాంతమును తీసికొందము. లోకమున లక్షలాదిగ సంపాదించువాడు ఔరసుడగు భోక్త యొకడు లేనిచో విరక్తిని చెంది తన సంపాదనను నేదో యొక యితరకార్యములకై వినియోగించుటకు సమకట్టును. అట్టిసమయమున నొక బిడ్డడు కడుపున బుట్టిన ఇక వాని తాపత్రయమును చూడుడు.

మన మెంత పెట్టినను ఎంత చేసినను వాడు గిట్టువాడైనచో వానివలన మన మేయుపకారమును నెన్నడును గాననిచో నా సేవయందు విరక్తి జనించి చేసినదానికి పశ్చాత్తాపము గలుగును. ఉన్నవాడైనచో చేయగా చేయగా నెన్నటికైన నేదోఒరగదో యుడాయను యాశచే నాసేవ పెరుగుచుండును. ఉన్నవాడైనను పరుల పచ్చ గిట్టనివాడైనచో చేసిన దంతయు బూడిదబోసిన పన్నీరగును.

కావున నా మూడు దోషములును నాకు లేవని భగవానుడీశ్లోకమున నుపదేశించుచున్నాడు.

నేను నీవు సంపాదించిన కర్మల కన్నిటికిని భోక్తను. నీ కిచ్చుటకై నాకు లెక్కలేనన్ని లోకము లున్నవి. నేను నీ శ్రేయస్సునే కోరువాడను.

ఇక నాసేవచేయుటలో నీ కుపేక్ష యేల ? కావున నా కైంకర్యభావనతో కర్మయోగము నాచరించుము.

29 శ్లో॥-(41)

నిత్యనైమిత్తికేత్యాది వాక్యము లే- కర్మయోగ భేదములలో నేయొకదాని నవలంబించినను, జ్ఞానకర్మయోగముల నవలంబించి నిత్యనైమిత్తికాద్యంగకత్వమందరకును సాధారణమే యని తెలుపుచున్నది.

29 శ్లో॥-(42)

ఇచ్చట సర్వశబ్దమును ప్రయోగించుటచే కేవలము శాస్త్రము నెఱింగిన వారేగాక పామరులును పశుపక్ష్యాదులును ననియర్థము. కొందరింగితాకారములచే నొక పురుషుని తన వారియందు ప్రేమ కలవాడని యెఱింగి యంతమాత్రముచే సంతోషించి తృప్తులై యట్టి వారి ననువర్తించుట కెన్నివిధములుగనో ప్రయత్నింతురు.

సుహృత్తు గనుకనే యితరుల కైశ్వర్యమదగర్వముచే నుద్భవించు దౌర్మనస్యము లేనివాడని తెలియదగును.

29 శ్లో॥-(43)

## గీతార్థసంగ్రహము

## ఐదవ యధ్యాయ సారార్థము.

శ్లో॥ కర్మయోగస్య సౌకర్యం।
శైఘ్ర్యం కాశ్చన తద్విధాః।
బ్రహ్మజ్ఞాన ప్రకారశ్చ।
పఞ్చమాధ్యాయ ఉచ్యతే॥

### తాత్పర్యము :

కర్మయోగము జ్ఞానయోగముకన్న సుకరమును శీఘ్రముగ నాత్మసాక్షాత్కారమును కలిగించునదియు నని చెప్పి- కొన్ని దానివిధములను, కర్మయోగి ఏప్రకారముగ నెలకొనియున్న శుద్ధాత్మవిషయమైన సమదర్శనరూపమగు జ్ఞానపరిపాకము స్థిరముగ గలుంగునో ఆప్రకారము యీ పంచమాధ్యాయమున చెప్పబడుచున్నది.



# శ్రీ భగవద్గీతా - షష్ఠోఽధ్యాయః

## ఆత్మసంయమయోగః



### అవతారిక.

ఇంతవఱకు కర్మయోగము దానిసాధనములతోఁగూడ చెప్పబడెను. ఈయధ్యాయమునందు, జ్ఞానయోగ కర్మయోగములచే సాధింపదగినదై ఆత్మదర్శనరూపమై యుండుయోగము నభ్యసించు విధి చెప్పఁబడుచున్నది. అందును, కర్మయోగము జ్ఞానాకార మగుట వలన అది ఆత్మదర్శనమునకు నిరపేక్షసాధన మని ముందే చెప్పఁబడినను దానినే మఱింత దృఢపఱచుటకుఁగాను మఱల నది జ్ఞానాకారమైనదనియు, యోగమును (ఆత్మదర్శనమును) ఉద్దేశ్యముగాఁ గలదనియు, మొదటి తొమ్మిదిశ్లోకములచేఁ చెప్పబడుచున్నది.

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సన్న్యాసీచ యోగీచ న నిరగ్ని ర్న చాక్రియః॥ 1

టీ. కర్మఫలం=కర్మములయొక్క స్వర్గాదిఫలమును, అనాశ్రితస్సన్ =అపేక్షింపనివాఁడగుచు. కార్యం (ఇతి)=స్వతః ప్రయోజనము (అని), యః=ఎవడు, కర్మ=యజ్ఞాదికర్మమును, కరోతి = చేయుచున్నాడో, సః = వాఁడే, సన్న్యాసీచ = జ్ఞానయోగనిష్ఠుఁడును, యోగీచ=కర్మయోగనిష్ఠుఁడును (అగును), నిరగ్నిః = యజ్ఞాదులు లేనివాఁడు, న=సన్న్యాసియు కాఁడు, అక్రియశ్చ=కేవల జ్ఞాననిష్ఠుడును, న=కాఁడు.

తా. *ఎవ్వఁడు పరమపురుషారాధనరూపమగు కర్మమే తనకు

---

* అనాశ్రితః' అనుశ్లోకమున పూర్వార్థముచే కర్మయోగము ఫలరహితముగాను సుహృద్భూతపరమపురుషారాధనరూపముగాను నాచరించుటచే జ్ఞానాకార మగుట అనువదింపఁబడినది. ఉత్తరార్థముచే ఆకర్మమునకు 'స సన్న్యాసీచ యోగీచ' అని

ప్రయోజనమగునుగాని దానివలన సాధింపఁదగుస్వర్గాదిఫలము లొక్కటియు ప్రయోజనము గాదని తలఁచుటచే ఆ స్వర్గాదిఫలముల నపేక్షింపక కర్మము ననుష్ఠించుచున్నాఁడో, వాఁడే జ్ఞాన యోగనిష్ఠుఁడును కర్మయోగనిష్ఠుఁడును అగును. అనఁగా ఆత్మ దర్శనరూపమైన యోగమునకు సాధనములగు జ్ఞానయోగకర్మ యోగములు రెంటియందును నిష్ఠగలవాఁ డగునని యర్థము. శాస్త్రో క్తము లైనయజ్ఞాదికర్మములందు ప్రవర్తింపనివాఁడును కేవలజ్ఞాన నిష్ఠుఁడును అట్లు రెండుయోగములందును నిష్ఠగలవాఁడు కాఁడు.

---

జ్ఞానకర్మయోగసాధ్యమగు ఆత్మదర్శనమునందలినిష్ఠ ఫలముగా చెప్పుటచే అది నిర పేక్షసాధన మని (అనఁగా జ్ఞానయోగవ్యవధానములేక తానే యోగమనెడి ఆత్మ దర్శనమును సాధించునదని) దృఢీకరింపఁబడినది. 'స సన్న్యాసీ చ యోగీచ' అనుటచే జ్ఞానయోగనిష్ఠుఁడును కర్మయోగనిష్ఠుఁడును అని యర్థమగునేగాని ఆత్మ దర్శననిష్ఠుఁడని యర్థ మెట్లులభించెనన్నచో 'కర్మకరోతి' అని కర్మయోగనిష్ఠుని అనువదించివానినే 'సన్న్యాసీ' అని జ్ఞానయోగనిష్ఠునిగాఁ జెప్పుట విరుద్ధము. 'యోగీచ' అని కర్మయోగిగాఁ జెప్పుట నిరర్థకమును పునరుక్తము నగును. కాన 'సన్న్యాసీ' 'యోగీ' అనుటకు జ్ఞానయోగ కర్మయోగములచే సాధ్యమగు ఆత్మ దర్శనమునందు నిష్ఠుఁడనుటయే యుక్తము. ఫలమగు ఆత్మదర్శనమందలి నిష్ఠయే దానికి సాధనము లగు జ్ఞానకర్మయోగములందలినిష్ఠగా ఉపచరితమైనదని తెలియునది. మఱియు 'నిరగ్నిః' అనుటచేనే కర్మనివృత్తి చెప్పఁబడినదగుటచే 'అక్రియః' అనుటకు క్రియానివృత్తిమూలముగా క్రియావ్యతిరిక్తమైన దానియందు-అనఁగా దాని కాసన్నమగు జ్ఞానయోగమునందు-నిష్ఠుఁడని యర్థము సిద్ధించుచున్నది. కావుననే 'అక్రియః' అనుటకు కేవలజ్ఞాననిష్ఠుఁడనఁబడిరి. లేక 'న నిరగ్ని ర్నచాక్రియః' అను రెంటిచే శ్రౌతస్మార్తక్రియావిశేషములు నిషేధింపఁబడుటచే 'శాస్త్రోక్తము లైన యజ్ఞాదికర్మములందు ప్రవర్తింపనివాఁడు' అని ఫలితార్థముగాను, దీనికి 'కేవల జ్ఞాననిష్ఠుఁడు' అనుట యాశయముగాను గ్రహించునది. సామాన్యమగు సన్న్యా సాశ్రమమునకు 'అనగ్ని రనికేతస్స్యాత్' (మనుస్మృతి-౬-౨౫) అనియు 'త్యక్త్వా ద్రవ్యాగ్ని సాధ్యాని కర్మాణి' అనియు వ్యవచ్ఛేదములు చెప్పఁబడియున్నవి. ఇవియె యిచ్చట 'నిరగ్నిః' 'అక్రియః' అనఁబడినవి. కనుక ఈవ్యవచ్ఛేదములు గలవాఁడును సన్న్యాసికాఁడా యని శంకరాఁగా ఇట్టివ్యవచ్ఛేదము లిచట అసంగతములు గనుక ఇవి గలవాఁడు ఇట చెప్పఁబడిన సన్న్యాసియు యోగియుఁ గాఁడు గాని 'అనా శ్రితః...కర్మకరోతి' అనునట్లు చేయువాఁడే అట్టివాఁ డగునని భావము.

కేవలజ్ఞాననిష్ఠునికి జ్ఞాననిష్ఠ యొకటి మాత్రమే. కర్మయోగనిష్ఠునికి రెండునిష్ఠలును గలవని యభిప్రాయము. (ఇచట అగ్నిశబ్దమువలన అగ్నిహోత్రసంబంధము గల యజ్ఞాదులను గ్రహింపవలెను).

అవ. పూర్వోక్తలక్షణ మగు కర్మయోగమందు జ్ఞానము కూడఁ గల దని చెప్పుచున్నాఁడు,

శ్లో॥ యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ ।
న హ్యసన్న్యస్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన॥ 2

టీ. పాణ్డవ=అర్జునా, యం=దేనిని, సన్న్యాసమ్ ఇతి = ఆత్మయాథాత్మ్యజ్ఞాన మని, ప్రాహుః = చెప్పుదురో, తం = దానిని, యోగం=కర్మయోగమె యని, విద్ధి=ఎఱుఁగుము, హి = ఏలననగా, అసన్న్యస్తసఙ్కల్పః= దేహమె ఆత్మయని తలంచుటను విడువనివాఁడు, కశ్చన=ఒకానొకడును, యోగీ=కర్మయోగి, న భవతి హి = కాఁడు గదా.

తా. అర్జునా, ఏది జ్ఞానయోగమని (అనఁగా ఆత్మయాథాత్మ్యజ్ఞానమని) వచియింతురో అది కర్మయోగమే యని తెలిసికొనుము. ఏలన, నేను చెప్పియున్న కర్మయోగులలో (ఆత్మయాథాత్మ్యము ననుసంధించుటచేత దేహము ఆత్మ యనెడి భ్రమమును బోఁగొట్టుకొనని కర్మయోగి యెవ్వఁడును గలుగఁడు గదా.) [ఇచట కర్మయోగివిషయమున 'యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః' (గీత-౪-౧౯) అని సంకల్పవర్జనము పూర్వము చెప్పఁబడి యున్నది కదా.]

అవ. కర్మయోగమె ప్రమాదము లేక ఆత్మావలోకనమును సాధించుచున్న దనుచున్నాఁడు.

శ్లో॥ ఆరురుక్షోర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే॥ 3

టీ. యోగం=ఆత్మావలోకనమును, ఆరురుక్షోః=పొందనిచ్ఛగించు, మునేః=ముముక్షువునకు, కర్మ = కర్మయోగము, కారణం = సాధనముగా, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. యోగారూఢస్య = యోగమును ఎక్కిన-ఆత్మావలోకమున నెలకొన్నట్టి, తస్యైవ = వానికే, శమః = కర్మనివృత్తి, కారణం = సాధనముగా, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. * ఆత్మావలోకనరూపమగు యోగమును పొందనిచ్ఛగించు ముముక్షువునకు కర్మయోగమె సాధనము, అట్టియోగమున గట్టిగా నెలకొన్నవానికే కర్మనివృత్తి మోక్షసాధనమని చెప్పఁబడును. అనఁగా ఆత్మావలోకనరూపమైనమోక్షము కలుగువఱకు కర్మము చేయఁదగినదని భావము.

అవ. ఆత్మావలోకనమునందు స్థిరముగా నెలకొన్నవాఁడగుట ఎప్పుడనఁగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యదా హి నేన్ద్రియార్థేషు న †కర్మస్వనుషజ్జతే।
సర్వసఙ్కల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥ 4

---

* కర్మయోగమాత్రముచే సాధ్యమగుయోగము ఆత్మావలోకనమే యగును గాని పరమాత్మావలోకనముగాదనుటకై 'ఆత్మా...గోరు ముముక్షువు' అనఁబడెను. 'మోక్షపర్యంతము ఏదైన కర్మము చేయవలయు ననుభావముతో 'ముముక్షువునకు కర్మయోగమే' అనఁబడెను. ఆత్మావలోకనము మోక్షప్రాయమగుటచే మోక్ష శబ్దము దానియందు ఉపచరించుచున్నదని తెలియునది.

† 'కర్మను' అమచో చోదితకర్మమాత్రము గాదు; ఏలన, వానిని నిషేధింపనలవిగాదు. వైదికకర్మములును గావు; ఏలన వానియందు నిస్సంగత్వము దగదు. కనుక ఇంద్రియార్థములందు సంగముగలవారికి తదుపాయభూతములైనకర్మములే యిట గ్రాహ్యములు గాన వానియందు సంగము లేమి చెప్పఁబడెను. మఱియు 'సఙ్గం త్యజతి' ఇత్యాదిప్రయోగములందు సంగము కలుగఁగా దానిని బలవంతముగా నివారించుట తోఁచుచున్నది. ఇచట 'నానుషజ్జతే' అనుటచే సంగము స్వయముగానే కలుగకుండుట తెలియుచున్నది గాన 'సంగమున కర్హుఁడు గాఁ' డని యర్థము ఫలించుచున్నది.

టీ. యదా=ఎప్పుడు, ఇన్ద్రియార్థేషు=ఆత్మవ్యతిరిక్తములైన ప్రాకృతవిషయములయందును, కర్మసుచ=వానిని సంబంధించిన కర్మములయందును, న అనుషజ్జతే=సంగమున కర్హుఁడుగాఁడో, తదాహి=అప్పుడు గదా, సర్వసఙ్కల్పసన్న్యాసీ = సమస్తమనోరథములను విడిచినవాఁడై, యోగారూఢః = ఆత్మదర్శనమందు నెలకొన్నవాఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా. ఎవ్వఁడు, (ఆత్మావలోకనపర్యంతము కర్మయోగమునందే వర్తించుచుండెడి) ఈయోగి ఆత్మనే యనుభవించుట స్వభావముగాఁ గలవాఁడు గనుక ఆత్మతప్ప తక్కిన ప్రాకృతవిషయములందును వానిని సంబంధించిన కర్మములందును సంగము నొందుటకు తగనివాఁ డగునో, యప్పుడే, సమస్తసంకల్పములను విడిచినట్టితాను ఆత్మదర్శనరూప మగు యోగమునందు నెలకొన్నవాడని చెప్పఁబడుచున్నాఁడు. ఇట్లు యోగమునందు నెలకొనక దానిని పొందఁగోరుచుమాత్ర ముండువాఁ డన్నచో ఆత్మానుభవమునకు తగక విషయానుభవమునకే తగినవాఁ డగును, గాన అట్టివానికి విషయములందు సంగము లేమిని అభ్యసించుటయె స్వరూపముగాఁ గలది యగు కర్మయోగమే ఆత్మదర్శనమును కలిగించుటకు సాధనమగునుగాని యోగారూఢునికివలె కర్మనివృత్తి సాధనము కాదు. కాఁబట్టి ఆత్మదర్శనమును బడయఁగోరువాఁడు కర్మనివృత్తిని మాని, విషయసంగము లేమిని అభ్యసించునట్టిది యగు కర్మయోగమునే చేయవలయు నని భావము.

అవ. ఆవిషయమునే చెప్పుచున్నాఁడు.

2
శ్లో॥ ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః॥ 5

టీ. ఆత్మనా=విషయాసక్తము కానిమనస్సుచేత, ఆత్మానం=ఆత్మను, ఉద్ధరేత్=పైకెత్తవలయును, ఆత్మానం = ఆత్మను, న అవ

సాదయేత్ = క్లేశము నొందింపఁగూడదు, హి = ఏలనగా ఆత్మనః = తనకు, ఆత్మైవ = మనసే, బన్ధుః = బంధువు, ఆత్మనః — తనకు, ఆత్మైవ = మనసే, రిపుః = శత్రువు.

తా. విషయములందు తగులనిమనస్సుచేత (సంసారసముద్రమునుండి) ఆత్మ నుద్ధరింపవలయునుగాని, విషయాసక్తమగు మనస్సుచేత దాని నధోగతిఁ బొందింపఁగూడదు. ఏ లనఁగా విషయాసక్తము కానిమనస్సే తనకు బంధువు[3], విషయాసక్తమైన దే శత్రువు[4].

శ్లో॥ బన్ధురాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః[5] ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ ॥ 6

టీ. యేన = ఏపురుషునిచేత, ఆత్మనైవ = తనచేతనే, ఆత్మా = మనసు, జితః = విషయములవలననుండి జయింపఁబడినదో, తస్య = వానియొక్క, ఆత్మనః = ఆత్మకు, ఆత్మా = మనసు, బన్ధుః = బంధువు, అనాత్మనస్తు = మనస్సులేనివానికైనచో — మనస్సును జయింపనివానికైనచో, ఆత్మైవ = తనమనసే, శత్రువత్ = శత్రువువలె, శత్రుత్వే = శత్రుభావ మగునపకారమునందు, వర్తేత = ప్రవర్తించును.

తా. ఏపురుషుఁడు తనమనస్సు విషయములనుండి మరల్చుటవలన దానిని జయించినవాఁ డగునో అట్టివానికి వాని మనసే బంధువు. మనసును జయింపనివానికి వానిమనసే శత్రువువలె వానియెడల పగచూపుటయందుఁ బ్రవర్తించును; అనఁగా, వానిమోక్షమునకు విరోధియగుమార్గమునందుఁ బ్రవర్తించు నని భావము. మనస్సును విషయములనుండి మరల్చుటయే దానిని జయించుట యని తెలియనగును. ఈవిషయమునే భగవంతుఁ డగుపరాశరుఁడును విష్ణుపురాణమున 'మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః । బన్ధాయ విషయాసంగి ముక్త్యై నిర్విషయం మనః॥ (విష్ణు. పు. ౬. ౭. ౨౮) అని చెప్పియున్నాఁడు.

అవ. యోగమునందు గట్టిగా నెలకొన్నవాని యవస్థయు యోగమును పొందుట కుపాయమును చెప్పఁబడినవి. ఇప్పుడు యోగము నారంభించుటకు యుక్తమైన యవస్థ యేదియో దానిని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః॥ 7

టీ. శీతోష్ణసుఖదుఃఖేషు = శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములయందును, జితాత్మనః=వికారము నొందని మనస్సు గలవాఁడును, ప్రశాన్తస్య = బాహ్యేంద్రియవ్యాపారనివృత్తి గలవాఁడును నగు * పురుషునికి, (మనసి=మనస్సునందు,) పరమాత్మా=ఉత్కృష్టమైన ఆత్మ, సమాహితః=స్పష్టముగా అనుసంధింపఁదగినవాఁ డగుననుట. ఆత్మా=ప్రత్యగాత్మ, పరం=మిక్కిలి, సమాహితః=విశదముగా అనుసంధింపఁదగినవాఁడు.

తా. శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు మొదలగు ద్వంద్వములయందు వికారము నొందక సమచిత్తుఁడును

---

* ఇట్టిపురుషునికి పరిశుద్ధాత్మస్వరూపముయొక్క విశదానుసంధానము కలిగి పిదప తద్దర్శనరూప మగుయోగము సిద్ధించు నని భావము. మొదట విశదానుసంధానము పిదప దర్శనము అని తెలియునది. ఇట్లు ద్వంద్వములందు మనోవికారము లేక బాహ్యేంద్రియవ్యాపారము మానియుండునట్టి యవస్థయే యోగారంభమునకుఁ దగిన యవస్థయని గ్రాహ్యము. పరమాత్మ శబ్దము ఈశ్వరపరముగా ప్రయోగింపఁబడుట ప్రసిద్ధమైనను ఇది జీవాత్మ ప్రకరణము కనుక నిజస్వరూపముతోఁ గూడియున్న జీవాత్మ యిచట పరమాత్మయని చెప్పఁబడినదని గ్రహింపవలయును. ఇట్టిజీవాత్మకు పరమాత్మశబ్ద మెట్లు చెల్లు ననఁగా ఆత్మకు ఇంతకుఁ బూర్వము కలిగియుండిన అవస్థలకంటె నిజరూపముతోఁ గూడియున్నయవస్థ పరమము (ఉత్కృష్టము) అయినది గనుక నిట్టిస్వరూపావస్థితమైనయాత్మ పరమైనయాత్మగా (పరమాత్మగాఁ) జెప్పఁబడిన దని తెలియవలయును. లేక మీఁదఁ జూపఁబడిన మఱియొక యన్వయముచేతను అర్థము సేయవచ్చును.

బాహ్యేంద్రియవ్యాపారనివృత్తిగలవాఁడును నగు పురుషునియొక్క మనస్సునందు ప్రత్యగాత్మ నిజస్వరూపముతో స్పష్టముగా ననుసంధింపఁబడుచుండును. అనఁగా ధ్యానవిషయ మగును.

శ్లో॥ జ్ఞాన విజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః॥ 8

టీ. (యః) యోగీ = (ఏ) కర్మయోగి, జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా- జ్ఞాన=ఆత్మస్వరూపమునుగుఱించిన జ్ఞానము చేతను, విజ్ఞాన=ఆత్మస్వరూపమునుగురించిన విశేషజ్ఞానము చేతను, తృప్తాత్మా=తృప్తిఁబొందిన మనసు గలవాఁడును, *కూటస్థః= దేవమనుష్యాది జ్ఞానమే శుద్ధాత్మస్వరూపము ననుసంధానముచేయువాఁడు ననుట, విజితేన్ద్రియః = (కావుననే) ఇంద్రియములను జయించినవాఁడును, సమలోష్టాశ్మకాఞ్చనః=మట్టిపెల్లయందును రాతియందును బంగారమునందును సమప్రయోజనముగలవాఁడును నగునో, (సః) యుక్తః = (వాఁడు) ఆత్మావలోకనరూప మగు యోగాభ్యాసమునకు తగినవాఁడు, ఇతి = అని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా. ఏకర్మయోగి ఆత్మస్వరూపవిషయమైన జ్ఞానముచేతను *ఆత్మస్వరూపమునకు ప్రకృతికంటె విలక్షణముగాఁగల యాకార

---

* కూటము అనఁగా పమ్మెట, కూటమునకు ఇనుము మొదలైనవానితోడి సంయోగవియోగములు కలిగినను ఆ యినుము మొదలైనవియే చెడుచు మాఱుచునుండును గాని తాను చెడకయు ఏవికారమును జెందకయు ఎట్లుండునో అట్లే ఆత్మకు దేవాదిశరీరములతోడి సంయోగవియోగములు కలుగుచుండినను ఆశరీరములే చెడుచు మాఱుచు నుండునుగాని తాను, తన జ్ఞానైక స్వరూపముచెడక యనువర్తించుచుండుటచే, ఏవికారమును బొందకయుండును. కావున ఆత్మకూటముగా చెప్పఁబడినది. కూటస్థుఁ డనఁగా ఆత్మయందు నెలకొన్నవాఁడు. నిర్వికారమై జ్ఞానైకాకారమగు ఆత్మస్వరూపమును అనుసంధించువాఁ డనుట.

* ఇచట దేహమునకంటె వేఱైన ఆత్మయొకటి కలదనుబుద్ధియే జ్ఞానము. ఇది పరలోక సుఖాదులకొఱకుఁగాను కర్మములు చేయువారికెల్ల నావశ్యకము. దేహము

మునుగురించిన విశేషజ్ఞానము చేతను తృప్తిబొందిన మనసుగలవాఁడై, దేవత్వమనుష్యత్వాది సర్వావస్థలందును అనువర్తించుచున్నదియు జ్ఞానమే సర్వసాధారణమైన యాకారముగాఁ గలదియు నగుఆత్మను అనుసంధించుచు, దానివలన నింద్రియములను జయించి, (ప్రకృతి బంధరహితమైన ఆత్మస్వరూపమునందె నిష్ఠగలవాఁడగుటవలన ప్రాకృతవస్తు విశేషములందు భోగ్యతాబుద్ధి తనకు లేమిచే) మట్టిపెల్లయందును ఱాతియందును ఎంతప్రయోజనమో అంతప్రయోజనమే బంగారునందును గలవాఁడై యుండునో అట్టివాఁడు ఆత్మదర్శనరూపమైనయోగమును అభ్యసించుటకుఁ దగినవాఁడని చెప్పబడుచున్నాఁడు.

అవ. అచేతనములగు లోష్టాశ్మకాంచనాదులందుఁ గల సమప్రయోజనమే చేతనులగు సుహృదాదులందును అట్టియోగికి కలిగియుండు ననుచున్నాఁడు.

శ్లో॥ సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు।
6
సాధుష్వపి చ పాపేషు *సమబుద్ధి ర్విశిష్యతే॥ 9

---

నకు వేఱైనఆత్మ లేదని తలఁచినచో అది పరలోకమునకుఁ బోవు ననుతలంపుగాని, దానికి వలయు కర్మములం సేయుటగాని వారికిఁ గలుగదు. ప్రకృతికంటె విజాతీయమైన ఆత్మయొక్క ఆకారమునుగురించినజ్ఞానము విజ్ఞానము. అనఁగా ఆత్మకు నిత్యత్వ నిరతిశయానందత్వాది విశేషలక్షణములుం గలవు. ఇవి ప్రకృతికి లేవు, ఆత్మ ప్రకృతి కంటె విలక్షణ మైనది యని తెలుపునట్టి ఆత్మయొక్క నిత్యత్వాదిలక్షణములను తెలిసికొనుటయే విజ్ఞానము. ఇది మోక్షాధికారులకు విశేషించి యావశ్యక మైనది.

* సుహృదాదులయెడల సమబుద్ధి కలిగియుండుట యుక్తమే. కాని, సాధువులందును పాపులయందును యోగులకు సమముగా ప్రయోజన ముండునా? సత్సాంగత్యమును అసత్పరిత్యాగమును జ్ఞానవృద్ధికి హేతువులు గాన అవి యోగులకు అవశ్యాపేక్షితములుం గదా. కాన సాధువులందును పాపులందును సమబుద్ధి యోగుల కెట్లు దగును? అన్నచో, ఇప్పుడు నిర్దేశింపఁబడుచున్న యోగి యొకరిచే నుపజీవింపవలసిన దశలోనివాఁడు గాఁడు. అతఁడు సమస్తశ్రోతవ్యములను విని సమస్తకర్తవ్యములను చేసి సాక్షాత్కారమున కత్యంతయోగ్యమైనదశను బొందియున్నవాఁడు. అట్టివానికి

టీ. సుహృత్=తనహితమును గోరువారియందును, మిత్ర = సమవయస్సుగలవారై) హితముగోరువారియందును, అరి=అనర్థము కోరువారియందును, ఉదాసీన=హితముగాని అనర్థముగాని కోరుట నిమిత్తములేనివారియందును, మధ్యస్థ=జన్మముచేతనే హితాహితములను కోరనివారియందును, ద్వేష్య=పుట్టుకవలననే అనిష్టమును కోరువారియందును, బన్ధుషు = జన్మముచేతనే హితమును గోరునట్టి బంధువులయందును, సాధుష్వపి=సత్పురుషులయందును, పాపేషుచ= పాపాత్ములయందును, సమబుద్ధిః = సమమైనబుద్ధిగలవాఁడు, విశిష్యతే=అధికుఁడగుచున్నాఁడు.

తా. వయస్సు పాటింపక తన హితమును గోరునట్టి సుహృదులయందును, సమానవయస్కులై తనహితముఁ గోరునట్టి మిత్రుల యందును. ఏదే నొకకారణమునుబట్టి అనర్థమును కలిగింపఁగోరు శత్రువులందును, హితమునుగాని అనర్థమునుగాని కలిగించుట హేతువు లేమిచే నా రెంటిని జేయనివారగు ఉదాసీనులయందును, జన్మసిద్ధముగా ఆ రెంటిని జేయని వా రగుమధ్యస్థులయందును, జన్మసిద్ధముగా అనర్థమును జేయఁగోరు ద్వేష్యులయందును, జన్మసిద్ధముగా హితము గోరువారైన బంధువులయందును, ధర్మశీలురయందును, పాపశీలురయందును సమానబుద్ధి గలవాఁడు యోగాభ్యాసమున కర్హుఁడగుటచే అధికుఁ డగుచున్నాఁడు. (ఆత్మయొక్కటియే ప్రయోజనముగాఁగలవాఁ డగుటచే తక్కిన సుహృన్మిత్రాదులచే నే ప్రయోజనముగాని విరోధముగాని తనకు లేనందున వారియం దెల్ల

సాధువులతోఁగాని పాపులతోఁగాని ప్రయోజనము సమానమే. వానికి కేవలమా యోగమున కుపయుక్తమైన రహస్యస్థానాదులు మాత్రమే ఉపాదేయములు కాన సాధువులందును పాపులందును సమబుద్ధి నుంచుట తప్పిదముగాదు. యోగాభ్యాసము కుఁ దగినదశ పూర్వముగూడ చెప్పఁబడినది. ఇదియే దానికాష్ఠాదశ గావున విశిష్యతే' యనఁబడె నని తెలియునది.

సమబుద్ధి గలవాఁడు యోగము నభ్యసించుటకుఁ దగుటయందు విశేషించినవాఁ డగును.)

అవ. ఈ యధ్యాయమునకు ప్రధానార్థమగు సాంగయోగము నభ్యసించువిధిని జెప్పుచున్నాఁడు.

7

శ్లో॥ యోగీ యుఞ్జీత సతత మాత్మానం *రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥ 10

టీ. యోగీ=కర్మయోగనిష్ఠుఁడు, సతతం=ఎల్లప్పుడు, ఏకాకీ=ఒంటరివాఁడును, యతచిత్తాత్మా=నియమింపఁబడిన మనోబుద్ధులు గలవాఁడును, మనస్సుయొక్క చింతావ్యాపారమును అడఁచినవాఁడును, నిరాశీః=ఆత్మేతరవస్తువులయం దాశ లేనివాఁడు, అపరిగ్రహః=ఆత్మేతరవస్తువులందు మమత లేనివాఁడును, రహసి=జనులు లేని నిశ్శబ్దమైన ప్రదేశమునందు, స్థితఃసన్=ఉన్నవాఁడు నగుచు, ఆత్మానం=తన ఆత్మను, యుఞ్జీత=జేయవలయును-యోగమునందు ఉంపవలయును.

తా. పూర్వోక్తప్రకారమగు కర్మయోగమునందు నిష్ఠగల వాఁడు ప్రతిదినమును యోగాభ్యాసమునకుఁ దగినకాలమునందెల్ల, జనులు లేక నిశ్శబ్దముగానుండు ప్రదేశమందు ఎవ్వరును తనతోఁ గూడ లేక, యొంటరియై యుండి చింతలేనిమనస్సుతో ఆత్మేతర వస్తువులం దపేక్ష గాని, ఆత్మవ్యతిరిక్తమైనవస్తువును దేనినైనను నాది

* రహసి అనఁగా జనులు లేనిచోటని యర్థము. జను లాచోట లేకున్నను దానికి బయట నుండు వారిశబ్దము లచటికి వచ్చునేని మనస్సునకు సమాధానము కలుగ నేరదుగనుక 'నిశ్శబ్దము' అనఁబడినది. 'రహసి' అనుటచేతనే జనులు లేనిచోటు ఏర్పడఁగా మరల 'ఏకాకీ' అనుపదము పెట్టుట, రహస్యమున కర్హులై యుండు తోడిశిష్యులు సబ్రహ్మచారులు మొదలైన వారినిగూడఁ బరిత్యజించుటకొఱకుఁ గాన 'సహాయము లేనివాఁడు' అనఁబడినది.

యనుమమతతో స్వీకరించుట గాని లేనివాఁడై. ఆత్మను యోగము నందు ఉంపవలయును. అనఁగా ఆత్మదర్శనమందు నిష్ఠ గలవాఁడు కావలయును:

అవ. యోగాభ్యాసమునకుఁ గావలసిన బాహ్యోపకరణముల యొక్క నియమమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మన, ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్॥ 11
తత్రైకాగ్రం మనఃకృత్వా యతచిత్తేన్ద్రియ క్రియః ।
ఉపవిశ్యాఽసనే యుఞ్జ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే॥ 12

టీ. శుచౌ=పరిశుద్ధమగు, దేశే = ప్రదేశమునందు, స్థిరం = చలింపనిదియు, న అతి ఉచ్ఛ్రితం=మిక్కిలిహెడవు కానిదియు, న అతినీచం=మిక్కిలి తగ్గు కానిదియు, చేలాజినకుశోత్తరం = వస్త్రము కృష్ణాజినము దర్భలు పైపైని గలదియునగు, ఆత్మనః=తనయొక్క, ఆసనం=ఆసనమును, ప్రతిష్ఠాప్య = దృఢముగా వైచికొని, తత్ర ఆసనే=ఆ స్థిరాసనమునందు, ఉపవిశ్య = కూర్చుండి, మనః = మనస్సును, ఏకాగ్రం=యోగమునందే ఆసక్తమైనదిగా, కృత్వా = చేసి, యతచిత్తేన్ద్రియక్రియః=అడఁపఁబడిన చిత్తేంద్రియ వ్యాపారములు గలవాఁడై, ఆత్మవిశుద్ధయే=బంధనివృత్తికొఱకు, యోగం యుఞ్జ్యాత్ = ఆత్మదర్శనము చేయవలయుననుట.

తా. (* అశుచులైనపురుషులు అధిష్ఠింపనిదియు పరిగ్రహింప

---

* అశుచులైనపురుషులు పాషండులు పతితులు మొదలగువారు. అనుష్ఠించుట అనఁగా పరకీయవస్తువులతో తాను నిర్వాహకుఁడు మొదలైన వాఁడుగా సంబంధపడియుండుట. పరిగ్రహమనఁగా పరకీయవస్తువులు స్వకీయములుగా తలఁచుట. శుచియైన ప్రదేశ మనఁగా అశుచులైనవారు అధిష్ఠింపనిదియు (అనఁగా వారి

నిదియును అపరిశుద్ధవస్తువులస్పర్శము లేనిదియు నగుటచే) పవిత్ర
ముగా నుండునట్టి ప్రదేశమునందు దారువు మొదలైనవానిచే గట్టిగా
నిర్మింపఁబడినదై మిక్కిలి యెత్తును మిక్కిలితగ్గును గానియాసన
మును వైచి దానిపై దర్భలు పఱచి వానిమీఁద కృష్ణాజినమును
దానిపై మడుఁగువస్త్రమును పఱువవలయును. ఇట్లు మనఃప్రసాద
మును కలిగించునట్టి యాయాసనమునందు (శరీరము నిలుకడగా
నిలుచునట్లు ఒఱగు వైచుకొని) కూర్చుండి యోగమునందే మనస్సును
ముఖ్యముగా వర్తించునట్లు గావించి సర్వవిధముల చిత్తేంద్రియ
వ్యాపారముల నడంచి బంధనివృత్తికొఱకు యోగమును (ఆత్మదర్శన
మును) జేయవలయును.

9

అవ. కాయమునకును మనస్సునకును జేయవలసిన నియమము
లను జెప్పుచున్నాఁడు.

---

నిర్వాహకత్వాదులు లేనిదియు) వారు పరిగ్రహింపనిదియు (అనఁగా వారు తమదిగా
తలఁపనిదియు) నగు ప్రదేశ మని యర్థము. ఆసనము స్థిరముగా నుండుటకు దార్వా
దులతో నిర్మించుట హేతువు. అది దార్వాదిమయ మగుటంబట్టి కఠినముగా
నుండును గాన మృదువుగా నుండుటకై పయిని చేలమును; అందును మిట్టపల్లములు
లేక యుండుటకును శుద్ధికొఱకును దానిపయిని కృష్ణాజినమును; ఆయన్నిటిపయిని
శుద్ధికొఱకును సత్త్వము నున్మేషించుకొఱకును కుశలును; పఱవబడునని తెలియునది.
'కుశాజిన చేలోత్తరమ్' అని భాష్యపాఠ మొకట జూపట్టుచున్నది. అప్పుడు
పయిపయిని మృదువుగానుండుటకు మొదట కుశలును వానిపై కృష్ణాజినమును
దానిపైని చేలమును పఱవఁబడినదని యర్థము. ఈ చెప్పబడిన శుచిదేశాదులవలని
యుపయోగము మనస్సునకు ప్రసన్నత కలిగించుటయే కాన 'మనఃప్రసాదము కలి
గించు' అనఁబడినది. నిలుచుకొన్నచో ఆయాసమును పరుండినచో నిదురయు ప్రస
క్తించును గాన 'కూర్చుండి' యనఁబడినది. కూర్చున్నను వెనుకకొఱగకుండునట్లు
తనదేహమును నిలఁబెట్టుకొనఁ బ్రయత్నము సేయవలసియుండును. ఆ ప్రయత్నము
సమాధికి విరోధముగాన దానిని లేకుండఁ జేయుటకై 'ఒఱగు వైచుకొని' అనఁబడి
నది. చిత్తమనఁగాఁ ఇట చింతావృత్తి. 'ఏకాగ్రం మనః కృత్వా' అని అంత
రేంద్రియ మగు మనస్సుయొక్క వ్యాపారమును జెప్పుటచే అది యడంపఁబడినది
కాదు. ఇట అడంపఁబడు 'ఇంద్రియ'ములు బాహ్యేంద్రియములే యగు నని
తెలియునది.

శ్లో॥ *సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరమ్ ।
సమ్ప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్ ॥ 13

ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥ 14

---

* ఇదివఱకు శుచిదేశమందుఁ గూర్చుండుట మొదలుగా బాహ్యములగు యోగోపకరణములును మనస్సుయొక్క ఏకాగ్రత్వమును చెప్పబడెను. ఇక ఈ రెండుశ్లోకములయందు అంతరాంతము లగు కాయమనస్సులు గావింపవలసిన నియమవిశేషములు క్రమముగా చెప్పఁబడుచున్నవి. ఇట కాయ మనఁగా 'సిద్ధము' అనఁబడు శరీరముయొక్క మధ్యప్రదేశము. 'సమమ్' 'అచలమ్' 'స్థిరమ్' అను మూఁడును ధారణక్రియావిశేషములు. సమ మనఁగా ఋజుత్వము. పరిసిలువుగానుండుట. అచల మనఁగా కదలుటలేమి. స్థిర మనఁగా వెనుక కొఱగకుండునట్లు నిలఁబెట్టుకొను ప్రయాసముచే అంగములు కదలును గనుక అనిక వైచుకొని ఆ ప్రయాసమును కలుగనీయమిచే అంగముల కదలుటను మాన్పుట. ఈ యానికవలని 'స్థిరత్వ'ముచే 'అచల'ముగా నుండుట చిరకాలము కొనసాగఁదగిన దగుచున్నది. కావుననే 'అనికచే స్థిరముగా' ననఁబడినది. నాసికాగ్రమును జూచుట బాహ్యవస్తువులను జూడకుండుట కని తెలియునది. కన్నులు మూసికొన్నను బాహ్యవస్తువులను జూడకుండుట సిద్ధింపఁగా అందులకై నాసికాగ్రమును జూచుటను విధింపనేల? అన్నచో, నాసికాగ్రమును జూచుట నిద్రాదులను నివర్తించుటకుఁగూడ నని తెలియునది. అయినను యోగమున మనస్సు అంతర్ముఖమై యుండుటచే నాసికాగ్రమును సంభవింపదుగాన 'సంప్రేక్ష్యనాసికాగ్రమ్' అనుటచే నేత్రములదృష్టి సన్నిపాతము మాత్రము (అనఁగా నేత్రసంబంధి యగు తేజస్సు తనంతటనే నాసాగ్రమున నిపాత మగుట మాత్రము) చెప్పఁబడె నని తెలియునది. బ్రహ్మచారివ్రత మనఁగా ఇట బ్రహ్మచర్యాశ్రమము గాదు; 'బ్రహ్మచర్యంచ యోషిత్సు భోగ్యతాబుద్ధివర్జనమ్' అన్నట్లు స్త్రీలయెడ భోగ్యతాబుద్ధిలేమి. 'స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్ । సఙ్కల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృతిరేవచ । ఏతన్మైథున మష్టాంగం ప్రవదన్తి మనీషిణః। విపరీతం బ్రహ్మచర్య మేతదేవాష్టలక్షణమ్' (ఆగ్నేయపురాణమ్. ౩౭౨-అ. ౧౦-౧౧. శ్లో, బృహస్పతిస్మృతౌచ) మైథునముయొక్క అష్టాంగము లగు స్మరణాదులు లేకుండుటయే బ్రహ్మచర్యము; అనఁగా స్త్రీలదెస భోగ్యతాబుద్ధిపూర్వకమగు స్మరణాలోకనాలాపాదులు లేకుండుట యని తెలియునది.

టీ. కాయశిరోగ్రీవం = శరీరమును శిరస్సును కంఠమును, సమం=సమముగాను, అచలం=కదలకుండునట్లును, స్థిరం = ఆనికచేత స్థిరముగాను, ధారయన్=నిలుపుకొనుచు, దిశః=దిక్కులను, అనలోకయన్ చ=చూడకయు, స్వం=తనది యగు, నాసికాగ్రం=కనుబొమల మధ్యస్థానమును, సమ్ప్రేక్ష్య = చూచుచు, ప్రశాన్తాత్మా=మిక్కిలి నిమ్మళపాటు నొందినమనస్సు గలవాఁడును, విగతభీః = నిర్భయుఁడును, బ్రహ్మచారివ్రతే = బ్రహ్మచర్యవ్రతమునందు, స్థితః = ఉన్నవాఁడు నై, మనః=మనస్సును, సంయమ్య = అడంచి విషయములను.డి మరల్చి, మచ్చిత్తః = నాయందే మనస్సు గలవాఁడును, యుక్తః=అవధానము గలవాఁడును, మత్పరః = నేనే పరమప్రాప్యుఁడుగా గలవాఁడును నై-అనఁగా, నన్నే చింతించుచున్నవాఁడును నై, ఆసీత = కూర్చుండవలయును.

తా. శరీరమును శిరస్సును మెడను వంపు లేక సమముగావించి, యిటునటు కదల్పక ఆనికచేత స్థిరముగా నుంచుకొని దిక్కులం జూడక తన నాసాగ్రము నవలోకించుచు, మిక్కిలి యూరట నొందినట్టి మనస్సు గలవాఁ డై, భయరహితుఁ డై, బ్రహ్మచర్యయుక్తుఁ డై, మనస్సు అడంచి, నాయందు చిత్తముఁ జేర్చి, సావధానుఁ డై, నన్నే చింతించుచు కూర్చుండవలయును.

అవ. యోగాభ్యాసఫలమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః ।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి॥ 15

టీ. యోగీ = యోగాభ్యాసము చేయువాఁడు, ఏవం = ఇట్లు సదా = ఎల్లప్పుడు, ఆత్మానం=మనస్సును, (మయి = నాయందు), యుఞ్జన్ = చేర్చుచు, నియతమానసః = నిశ్చలమైనమనస్సు గలవాఁడై, నిర్వాణపరమాం = మోక్షముయొక్క స్వరూప మయి

నదియు, మత్సంస్థాం = నాయందు నున్నట్టిదియునగు, శాన్తిం = నివృత్తిరూప మైనముక్తిని, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

తా. యోగాభ్యాసపరుఁ డైనవాఁ *డిట్లు పరబ్రహ్మమును పురుషోత్తముఁడును మనస్సునకు శుభాశ్రయభూతుఁడునునగు నాయందు నెల్లప్పుడు మనస్సును జేర్చి, అట్లు నన్ను స్పృశించుటచే పవిత్రము గావింపఁబడిన దగుటవలన నిశ్చలమైన దగు మనస్సుగలవాఁడై, సుఖముయొక్క ఉత్కృష్టదశ యైనదియు నాయందుఁ గలిగియున్నట్టిదియు నగు ముక్తిని బొందుచున్నాఁడు. (అనగాఁ మనస్సునకు శుభాశ్రయుఁ డైనట్టి నాయందే మనస్సును నెలకొల్పి నన్నే చింతించుచుండుటవలన మిక్కిలి యుత్కృష్ట మైననిర్వాణసుఖమును నాయందుఁ బొందుచున్నాఁ డని భావము.)

అవ. ఇట్లు ఆత్మయోగమును ఆరంభించుచుచున్న వానికి మనస్సు నిర్మల మగుటకుఁగాను దానిని శుభాశ్రయభూతుఁ డగు

---

* జీవాత్మ యోగప్రకరణమున 'మచ్చిత్తః' 'మత్పరః' అని పరమాత్మ చింతనము చెప్పనేల? యనఁగా అందులకు కారణము ఈశ్లోకమునఁ జెప్పుచున్నాఁడు. 'మచ్చిత్తః' 'మత్పరః' అని మచ్ఛబ్దముచే పరత్వాదులు వ్యంజితములగుచున్నవిగాన 'పరబ్రహ్మ...నాయందు' అనఁబడినది. సర్వకారణుఁ డగుటచే సర్వాత్ముఁడు మొదలగువాఁ డగుట 'పరబ్రహ్మ' శబ్దముచే చెప్పఁబడినది. సర్వాత్ముఁ డయ్యును సర్వమునకు విలక్షణుఁడు గాన ఆ సర్వమునందలి దోషముల యొక్క సంస్పర్శములేని దేవతావిశేష మని 'పురుషోత్తమ' శబ్దాభిప్రాయము; ఇట్టివాఁ డగుటవలన 'మనస్సునకు శుభాశ్రయ భూతుఁ' డని తెలియునది. ఇట్టివానియందు 'ఆత్మానం యుఞ్జన్' అని మనస్సు నిలుపుటచే అది అద్దేవుని స్పర్శముచే పవిత్రీకృతమై 'నియతమానసః' అన్నట్లు నిశ్చలమగు చున్నది. యోగమునకు ఈ మనోనిశ్చలత్వము ఆవశ్యకము గాన నిందులకై పరమాత్మచింతనము సాధనముగా చెప్పఁబడె నని తెలియునది. 'నిర్వాణపరమాం మత్సంస్థాం శాన్తిమ్' అనుచో పరమాత్మయందు సంస్థితమైనశాంతి ఆఁకలి మొదలయిన ఊర్ములు ఆఱును లేకుండురూపమైనది. ఇదియే నిర్వాణముయొక్క కాష్ఠాదశ. లేక, మీఁది యవతారికలోఁ జెప్పఁబడినట్లు 'శుభాశ్రయభూతుండగు భగవంతునియందు మనస్సు నిలుపుట' యైనను ఈశాంతి గావచ్చు నని తెలియునది.

భగవంతునియందు నిలుపుటను జెప్పి, యిట్లు 'శుచౌ దేశే' అని ఉచితప్రదేశము మొదలుగా 'ఆసీతమత్పరః' అని పరమాత్మచింతన మువఱకుఁ గల యోగోపకరణములను జెప్పి, మఱియు నితరమైన యోగోపకరణములను జెప్పుచున్నాఁడు. (యోగోపకరణ మనఁగా యోగమునకు ఉపకారకమైనది-దానికి సహాయపడునది అని తెలియ నగును.)

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్త మనశ్నతః।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున॥ 16

10

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ 17

టీ. హే అర్జున, అత్యశ్నతః తు = అపరిమితముగా భుజించు వానికిని, యోగః = యోగము, నాస్తి = కలుగదు, ఏకాన్తం = భ్రాన్తిగా, అనశ్నత శ్చ=భుజింపనివానికిని, న=కలుగదు, అతిస్వప్న శీలస్య=మిక్కిలి నిద్రించుస్వభావము గలవానికి, న=లేదు, (అతి) జాగ్రతశ్చ=నిద్రయే లేక మేలుకొనియుండువానికిని, నఏవ=లేదు, యుక్తాహారవిహారస్య=మితమైన ఆహారమును సంచారమును గలవాని కిని, కర్మసు=చేయఁదగినపనులయందు, యుక్తచేష్టస్య = మితమైన వ్యాపారము గలవానికిని, యుక్తస్వప్నావబోధస్య=మితమైననిద్రయు మెలఁకువయుఁ గలవానికిని, దుఃఖహా=బంధనాశక మగు, యోగః= యోగము, భవతి=సిద్ధించుచున్నది.

తా. అర్జునా, అపరిమితముగా భుజించువానికిని, ఎప్పుడును భుజింపకయే యుండువానికిని, అతినిద్రాసక్తునికిని, నిద్ర లేకయే మేలుకొని యుండువానికిని, ఆత్మావలోకనాఖ్యాన రూపమైన యీ యోగము సిద్ధింపఁజాలదు అయిన నెట్టివానికి సిద్ధించు ననఁగా,

మితమైన భోజనము మితమైన సంచారమును గలిగి, కర్మములయందు మితమైన పరిశ్రమము గలిగి, మితమగు నిద్రయు మెలకువయును గలిగి యుండువతనికి సంసారబంధనాశక మగు నీయోగము సిద్ధించును. 11

[* అత్యాహారమును నిరాహారత్వమును అతివిహారమును అవిహారమును, అట్లే అతిమాత్రనిద్రయు అతిమాత్రజాగరమును, అట్లె అత్యాయాసమును అనాయాసమును, యోగమునకు విరోధులు. మితాహారవిహారములును, మితాయాసమును, మితస్వప్న జాగరమును గలవానికి సమస్తబంధనాశక మగు యోగము సంపన్న మగుచున్నది.]

అవ. ఇట్లు యోగోపకరణములను జెప్పినపిదప ఆయోగ దశను ప్రదర్శింపఁదలఁచినవాఁడై పూర్వము 'జితాత్మనః ప్రశాన్తస్య' ఇత్యాదులచేఁ జెప్పఁబడిన యోగయోగ్యమైన దశను మఱల పరామర్శించుచున్నాఁడు.

12

శ్లో॥ యదా వినియతం చిత్త మాత్మన్యే వావతిష్ఠతే ।
నిస్స్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥ 18

టీ. యదా=ఎప్పుడు, చిత్తం=చిత్తము, ఆత్మన్యేవ = ఆత్మయందే, వినియతంసత్=విశేషించి నియమింపఁబడినదై, అవతిష్ఠతే= నిలుచుచున్నదో, తదా=అప్పుడు, సర్వకామేభ్యః = అన్నికోరికల యెడల, నిస్స్పృహస్సన్ = ఆశ లేనివాఁడగుచు, యుక్త ఇతి = యోగార్హుఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

* 'యుక్తాహార' అను శ్లోకమువ విహారాయాసములు కూడ చెప్పఁబడి యుండుటవలన అవి 'నాత్యశ్నతః' అను శ్లోకమునకు గమ్యము లగు నని తెలుపుటకై 'అతివిహారమును అవిహారమును అత్యాయాసమును అనాయాసమును అనఁబడెను'.

తా. ఏదేని ప్రయోజనమును గుఱించుచుండు చిత్తము ఎప్పుడైతే ఆత్మనే నిరతిశయప్రయోజనముగాఁ గొనుటచే అందే విశేషించి నియమింపఁబడి నిశ్చలమై నెలకొని యుండునో, అప్పుడు ఎల్లకోరికలయెడల నిస్పృహుఁడగుచు యోగార్హుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

అవ. ముందు యోగదశ చెప్పఁబడుచున్నది.

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః॥ 19

టీ. నివాతస్థః=గాలిలేనిచోట నున్న, దీపః=దీపము, యథా=ఏప్రకారముగా, న ఇఙ్గతే=అచలమై ప్రభతోఁ గూడియుండునో, యతచిత్తస్య=నివర్తింపఁబడిన యితర మనోవ్యాపారములు గలవాఁడును, యోగం యుఞ్జతః=ఆత్మస్వరూపమును సాక్షాత్కరించుచున్నవాఁడగు, యోగినః=యోగియొక్క, ఆత్మనః=ఆత్మస్వరూపమునకు, సా=అది అనగా ఆదీపము కదలకుండుట, ఉపమా = సామ్యముగా, స్మృతా=యోగులచే ఉదాహరింపఁబడినది.

తా. గాలి లేనిచోట దీపము *నిశ్చలమై ప్రభతోఁ గూడియుండు ప్రకారము, మనస్సునకు ఆత్మయందలి వ్యాపారములేప్ప

---

* న+ఇఙ్గతే = చలింపదు-నిశ్చలమైన దనుట. నిశ్చలత్వమునకు పర్వతము మొదలైననిదర్శనము లుండినను దీపమునే దృష్టాంతీకరించుటచే దీపమువలె 'నిశ్చలమై ప్రభతోఁ గూడియుండు' నని తెలుపుట కని తెలియునది. దీపముయొక్క నిశ్చలత్వము ఇట శరీరముయొక్క కంపము లేమికిఁ గాను ఉదాహరింపఁబడినది గాదు. శరీరకంపము లేకుండుట 'సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలంస్థిరమ్' అని ధ్యానదశకు సాధారణమై యుండుటచే ఇట విశేషించి చెప్పనక్కఱలేదు. ఇంద్రియముల యొక్క కంపము లేమికిగానును అది ఉదాహరింపఁబడినది గాదు. ఆ ట్లింద్రియ కంపము లేమికే యుదాహృతమైనచో 'యోగినః సోపమా' అని యన్వయము గలుగదు; ఆత్మస్వరూపముయొక్క నిశ్చలత్వముకొఱకును అది యుదాహృతము గాదు. ఆత్మ తెక్కినయవస్థయందును నిశ్చలమే యగును. కనుక స్వయంప్రకాశ

తక్కిన చింత మొదలైన వ్యాపారము లెల్ల నివర్తించుటచేత ఆత్మ సాక్షాత్కారము చేయుచున్న యోగియొక్క ఆత్మస్వరూపమునకు, ఉపమగానుండునని (సమాధిదశను సందర్శించునట్టి యోగులు) చెప్పుదురు. గాలి లేనిచోట నుండుటచే దీపము నిశ్చలమై ప్రభతోఁ గూడియుండునట్లు మనస్సుయొక్క యితర వ్యాపారము లెల్ల నివర్తించుటచేత ఆత్మయు నిశ్చలమై జ్ఞానప్రభతోఁ గూడియుండు నని యర్థము.

---

మైన స్వజ్ఞానముయొక్క ప్రభచే ఇతరములైన సమస్తవృత్తులను నివర్తించి పరిశుద్ధమైయుండు ఆత్మస్వరూపమును ప్రదర్శించుటకే యీదీపదృష్టాంత మని తెలియునది. ఈవిషయమును సూచించుటకే 'యోగినః' అని ఆత్మసాక్షాత్కారము చేయువానికి చెప్పినను మరల 'ఆత్మనః' అని ఆత్మశబ్దముకూడ చెప్పఁబడినది గాన 'యోగికి ఉపమ' అనక ఆత్మస్వరూపమునకు 'ఉపమ' అనఁబడినది. 'యోగినః ఆత్మనః' అనుటకు యోగియొక్క ఆత్మకు అని యర్థము. ఇది సరికాని, దృష్టాంతమందు 'యథా నేఙ్గతే' అని యుండుటకు సాటిగా దార్ష్టాంతికమున 'తథా నేఙ్గతే' అని యుండవలయును. దీనికి బదులుగానే 'సోపమా' అని యున్నది గాన 'సోపమా' అనుటకు, అట్లు చలింపకుండును' అనఁగా 'నిశ్చలమైయుండును' అని మాత్రమే యర్థమగును గాని 'ప్రభతోఁ గూడియుండును' అనికూడ దానికి దార్ష్టాంతికమున నర్థమెట్లు సరిపడివచ్చును? మఱి యోగులు గానివారి ఆత్మస్వరూపమునకుఁగూడ చలత్వము కానిపింపదు. కనుక యోగి యాత్మస్వరూపమునకు నిశ్చలత్వము చెప్పనేల? అని శంక కలుగఁగా 'గాలిలేని...యర్థము' అని చెప్పఁబడినది. అనగా 'ఉపమా' అనుటచే దీపముతోడి సాధర్మ్యము ఆత్మస్వరూపమునకు నిర్దేశింపఁబడినది. కనుక 'యథా' అనుటతో 'సోపమా' అనుటకు అన్వయము పొసఁగుచున్నది. దీపమందు ధర్మము ప్రభ. దీనికి ప్రతిధర్మము ఆత్మయందు జ్ఞానప్రభ. రెంటికిఁగల సాధర్మ్యమునుబట్టి దార్ష్టాంతికమునందు 'ప్రభతోఁ గూడియుండును' అనుట పొసఁగుచున్నది. ఆత్మస్వరూపము నిశ్చల మైన దనఁగా తనంతట నిశ్చలమైనది కాదు. అది యెప్పుడును నిశ్చలమే. దాని ప్రభయైన జ్ఞానము నానావిధముల ప్రసరింపక నిశ్చలమైయుండుట యని భావము కాన దోషము లేదు. సంసారదశయందు జ్ఞానము ఇంద్రియములద్వారముననే ప్రసరించును. సమాధిదశయందు బాహ్యవిషయములందు మనోవృత్తియే లేకుండుటవలన తన్మూలమున జ్ఞానమును ప్రసరింపకుండునని తెలియునది. 'యతచిత్తస్య' అనుచో, చిత్తము మనస్సుయొక్క చింతావ్యాపారముమాత్రమేయైనను దాని తక్కిన వ్యాపారములను గూడ నిట గ్రహింపవలయును.

శ్లో॥ *యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥ 20
సుఖ మాత్యన్తికం యత్త ద్బుద్ధి గ్రాహ్య మతీన్ద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః॥ 21
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥ 22
తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥ 23

టీ. యోగసేవయా = యోగానుష్ఠానముచేత, నిరుద్ధం=విషయాంతరములనుండి నివర్తింపఁజేయఁబడిన, చిత్తం = మనస్సు, యత్ర=ఏ యోగమందు, ఉపరమతే=సుఖించుచున్నదో, యత్రచ=ఏ

---

* యోగమునే మరల ఆదరాతిశయముచే నిరతిశయపురుషార్థముగా చెప్పచున్నాఁడు. సుఖము 'అతీంద్రియ' మని ఇంద్రియములకు మీఱినదిగాఁ జెప్పుటచే 'బుద్ధిగ్రాహ్యమ్' అనుచో, బుద్ధిశబ్దమును ఇంద్రియవర్గముతోడి కేవలబుద్ధిగా గ్రహింపక 'ఆత్మబుద్ధి'గా గ్రహింపవలసినదయ్యెనని తెలియునది. ఆత్యంతికమనఁగా మరల దుఃఖముతో గలియనిది. 'ఆత్మని తుష్యతి' అన్న ఆత్మయందలి తోషము ఇతరసుఖములందు నిరపేక్షత్వము గలిగియుండుటపరముగాను 'సుఖ మాత్యన్తికమ్' ఇత్యాదుల సుఖము స్వరూపసుఖానుభవపరముగాను భేదము గ్రహించుటచే రెంటికి పునరుక్తి గలుగదు. ఇట 'వేత్తి' యనఁగా భోగరూపమైన వేదనము గ్రాహ్యము గాన అనుభవించుచున్నాఁడని యర్థము సిద్ధము. ఇతరవిషయములను నిరోధించుటయు వానియందు నిరపేక్షయు 'యత్ర' అనుశ్లోకమునఁ జెప్పఁబడినవి. ఆ రెంటిచే ఆత్మస్వరూపసుఖానుభవమును, అది తనంతట నిగుడుచుండుటవలన విచ్ఛేదము నొందింపరానిదై యుండుటయు 'సుఖమ్' అనుశ్లోకమునఁ జెప్పఁబడినవి. పిదప 'యం లబ్ధ్వా' అను శ్లోకముచే యోగము విరమించియుండు కాలములందుఁగూడ ఆత్మయే అభిలాషాస్పదమై యుండుటవలన బాహ్యములయిన సుఖములం దభిలాష చేతను దుఃఖముచేతను ఆత్మాభిలాష పరిహృతము గాకుండుట చెప్పబడుచున్నదని విషయవిభాగము తెలియునది. కావుననే దానిని (యోగము) 'విరమించినప్పుడు' అని విభాగము తెలుపఁబడినది. యోగదశయందు ఆత్మతప్ప తక్కిన లాభమును అనుసంధించుటయే కలుగదు. అట్లే వ్యుత్థానమందును ఉండవలయు నని భావము.

యోగమందున్నవాఁడై, ఆత్మనా = మనస్సుచేత, ఆత్మానం = ఆత్మను, పశ్యన్ = చూచుచున్నవాఁడై, ఆత్మన్యేవ = ఆత్మయందే, తుష్యతి = సంతోషించుచున్నాఁడో, యత్ = ఏది, అతీన్ద్రియం = ఇంద్రియములకు గోచరము కానిదియు, బుద్ధిగ్రాహ్యం = ఆత్మవిషయమైన బుద్ధిచేతనే గ్రహింపఁబడఁదగినదియు, ఆత్యన్తికం = మరల దుఃఖముతోఁ గలియనిదగు, సుఖం = సుఖమో, తత్ = ఆసుఖమును, యత్ర = ఏయోగమందు, వేత్తి = అనుభవించుచున్నాఁడో, యత్రస్థితః = ఏయోగమునందున్నవాఁడై, అయం = ఈయోగి, తత్త్వతః = అట్టి సుఖాతిశయస్థితినుండి యనుట, నచలతి ఏవ = బొత్తిగా చలింపఁడో, యం = దేనిని (ఏయోగమును), లబ్ధ్వా = పొంది, తతః = దానికంటె, అపరం = ఇతరమైన, లాభం = లాభమును, అధికమైనదానినిగా, న మన్యతే = తలంపఁడో, యస్మిన్ = ఏయోగమందు, స్థితః = నిష్ఠగలవాఁడై, గురుణా = అధికమైన, దుఃఖేనాపి = దుఃఖముచేతనైనను, న విచాల్యతే = చలింపఁబడఁడో- అనఁగా యోగమునకు ప్రతికూలమైన కీడ్పాటు నొందఁడో, దుఃఖసంయోగవియోగం = దుఃఖసంబంధమునకు విరుద్ధమైన స్వరూపముగల, తం = దానిని, యోగసంజ్ఞితం = యోగమనుపేరు గలదానినిగా, విద్యాత్ = తెలిసికొనవలయును, స యోగః = అట్టియోగము, నిశ్చయేన = ఇటువంటిది అనునిశ్చయముతో, అనిర్విణ్ణచేతసా = సంతోషముతోఁగూడిన మనస్సు గలవానిచేత, యోక్తవ్యః = ఆచరింపబడవలసినది.

తా. యోగానుష్ఠానమునంజేసి సమస్తవిషయములనుండి నివర్తింపఁబడినమనస్సు దేనియందు 'ఇది నిరతిశయ మగు సుఖము' అని తలఁచి రమించునో, దేనియందు తనమనస్సుచేత నాత్మను గనుఁగొన్నవాఁడై తక్కినవానిని గోరక ఆయాత్మయందే సంతోషించుచుండునో, దేనియందు ఇంద్రియములకు గోచరము గానిదై ఆత్మవిషయమగు బుద్ధిచేతనే గ్రహింపఁదగిన దగు నిరతిశయసుఖము

ననుభవించుచున్నాఁడో, దేనియం దుండువాఁడు అంతటిసుఖాతిశయము చేత ఆస్థితినుండి చలింపఁడో, దేనిని పొందినపిమ్మట దానిని విరమించినప్పుడు దానినే కోరుచు మఱియొకలాభము తలంపకుండునో, దేనియం దున్నవాఁడు దానిని విరమించియున్నప్పటికిని గుణవంతు లగుపుత్రాదుల నెడఁబాయుట మొదలైనట్టి భరింపరాని దుఃఖముల కేనియు చలింపకయుండునో, అట్టిదుఃఖసంబంధవిరుద్ధాకార మైనదియే యోగమనఁబడుచున్న దని యెఱుఁగవలయును. ఆయోగము ఇటువంటిది (అనఁగా నిరతిశయపురుషార్థ మైనది) అని ఆరంభించు నప్పుడు నిశ్చయము కలిగియుండుటచే ఫలసిద్ధియందు కొంచెము విళంబ మైనను దుఃఖము లేని (అనఁగా సంతుష్టినొందిన)మనస్సుతో దాని నభ్యసింపవలయును.

శ్లో॥ *సఙ్కల్పప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥ 24

---

* పూర్వము అందందు చెప్పఁబడిన మమకారపరిత్యాగాదుల నెల్ల సుఖగ్రహణమునకై యొక్కటిగాఁ గూర్చి వానిని యోగదశవరకును అనుష్ఠింపవలయునని యిట తలఁపించుచున్నారు. 'త్యక్త్వా సర్వాన్' అనుటచే సమస్తమును త్యజించుట సిద్ధింపఁగా 'అశేషతః' యనియు చెప్పుటవలన నిశ్శేషముగా త్యజింపనర్హములం గానివిషయముల నది సూచించుచున్నది. అట్టివానిని గూడ త్యజింపవలయు నని తెలుపుటకై 'అశేషతః' అని ప్రయుక్త మగుటచే 'అశేషతశ్చ' అని చకారము దానికిఁ గూర్పవలయును. లేకున్న దానిని ప్రయోగించుట వ్యర్థమగును. మఱి ఉత్తరవాక్యమునందు గ్రామశబ్దమే దానియర్థమును నియ్యఁజాలియున్నది గాన నందు దాని కన్వయము గలుగదు. కామములను మనస్సుచే త్యజించుట యనఁగా వానితో సంబంధము లేమిని అనుసంధించుట. అనఁగా 'కర్మముచేఁ గలిగిన శరీరముతో సంబంధించినవారుగదా పుత్రాదులు; ఆత్మస్వరూపమును సంబంధించినవారు గారుగదా' యని యనుసంధించుట యని తెలియుచున్నది. మఱియు కామములను 'సంకల్పప్రభవాన్' అని సంకల్పప్రభవము లైనవిగా విశేషించుటచే అసంకల్పప్రభవము లైన కామములు సూచితము లగుచున్నవి గాన కామములను సంకల్పజములని అసంకల్పజములని (అనఁగా స్పర్శజములని) విభజించి స్పర్శజములందు 'న ప్రహృష్యేత్' ఇత్యాదులచే పూర్వము చెప్పినట్లు హర్షోద్వేగములు లేకుండుటను దలపించినవారైరి.

శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చి దపి చిన్తయేత్ ॥ 25

టీ. సంకల్పప్రభవాన్=సంకల్పమువలనఁ గలుగు, కామాన్= విషయాశలను, సర్వాన్ = సమస్తమును, అశేషతః=నిశ్శేషము గానును, మనసైవ = మనస్సుచేతనే, త్యక్త్వా = విడిచి, ఇన్ద్రియ గ్రామం = సమస్తేంద్రియములను, సమన్తతః = సమస్తవిషయముల నుండి, వినియమ్య = నిగ్రహించి, ధృతిగృహీతయా = వివేకముతోఁ గూడిన, బుద్ధ్యా = బుద్ధిచేత, శనైశ్శనైః = మెల్లమెల్లఁగా, ఉపర మేత్=ఆత్మవ్యతిరిక్తము లైనవానినుండి విరమింపవలెను, మనః = మనస్సును, ఆత్మసంస్థం=ఆత్మయం దున్నవానినిగా, కృత్వా = చేసి, కిఞ్చిదపి = ఆత్మవ్యతిరిక్త మగు నేవస్తువునుగాని, న చిన్తయేత్ = తలఁపఁగూడదు.

తా. కామములు స్పర్శజములనియు సంకల్పజము లనియు రెండువిధములు. అందు శీతోష్ణాదులు స్పర్శజములు-అనఁగా స్పర్శ మువలనఁ గలుగునవి. పశుపుత్రాదులు సంకల్పజములు-అనఁగా సంక ల్పమువలనఁ గలుగునవి. అందు సంకల్పజములు స్వరూపముతో (అనఁగా సంపూర్ణముగా)నే విడువఁగూడినవి. అట్టి సంకల్పజముల నన్నిటిని మనస్సుచేతనే (అనఁగా నవి తన్ను సంబంధింపనివిగా నను సంధించుటచేత) విడిచి, స్పర్శజములు త్రోసిపుచ్చరానివి గనుక అవి కలిగినపుడు వానివలనఁ గలుగు సంతోషమును దుఃఖమును మాని, ఇంద్రియసమూహము నన్నిటిని సమస్తవిషయములనుండి నిరోధించి, వివేకవిషయిక మగు బుద్ధిచేత మెల్లమెల్లగా ఆత్మవ్యతిరిక్తములగు నెల్లవిషయములనుండి విరమించి, మనస్సును ఆత్మయం దునిచి, యించుకయును వేఱొక్కటి చింతింపఁగూడదు.

అవ. రజోగుణవశమువలన మనస్సు చలించెనేని చేయవలసిన దానిని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యతో యతో నిశ్చరతి మన *శ్చఞ్చల మస్థిరమ్।
తత స్తతో నియ మ్యైత దాత్మ న్యేవ వశం నయేత్॥ 26

టీ. చఞ్చలం = చలనస్వభావము గలది గనుకనే, అస్థిరం = (ఆత్మయందు) నిలుకడగా నుండనిది యగు, మనః=మనస్సు, యతః యతః=ఏవిషయము దిక్కుగా, నిశ్చరతి = బయలువెడలుచున్నదో, తత స్తతః=ఆయా దానివలననుండి, ఏతత్ = ఈమనస్సును, నియమ్య= మరల్చి, ఆత్మన్యేవ=ఆత్మయందే, వశం నయేత్ వశమును బొందింపవలయును.

తా. మనస్సు చలనస్వభావము గలది. కనుకనే అది ఆత్మయందు నిలకడగా నిలువనిదై విషయాసక్తికి హేతువగు నేయే దానికొఱకు (లేక, విషయసంబంధార్థము ఏయే యింద్రియముద్వారా) బయలువెడలునో ఆయా దానినుండి, యత్నముచే ఆమనస్సును మరలించి, ఆత్మయే నిరతిశయసుఖమైనదని భావించుటవలన అట్టియాత్మయందే అది వశమై నిలుచునట్లు చేయవలయును.

శ్లో॥ ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్॥ 27

టీ. ప్రశాన్తమనసం=ఆత్మయందు నిశ్చల మగు మనస్సు గలవాఁడును-(కావుననే), అకల్మషం = పాపము లేనివాఁడును, (కావుననే) శాన్తరజసం=నశించినరజోగుణము గలవాఁడును, (కావుననే) బ్రహ్మభూతం=స్వ (శుద్ధాత్మ) స్వరూపముతో నున్నవాఁడునునగు, ఏనం = ఈ, యోగినం = యోగిని, ఉత్తమం = నిరతిశయ మగు,

* 'చఞ్చలమ్' 'అస్థిరమ్' అని రెంటిచే పునరుక్తి గలుగును గాన 'చంచలస్వభావము గలది గనుకనే ఆత్మయందు అస్థిరముగానుండునది' యని యర్థము చేయఁబడెను. ఇందు మనస్సును ఆత్మయందు వశీకరించు నుపాయము చెప్పఁబడియె.

† సుఖం = ఆత్మానుభవరూపమైనసుఖము, ఉపైతి హి = పొందుచున్నదిగదా.

తా. మనస్సును ఆత్మయందు నిశ్చలముగా నుంచుటచే, సకలకల్మషములును దగ్ధములు కాఁగా, రజోగుణము నశించి, దాని వలననే శుద్ధాత్మస్వరూపముతో నుండు నీయోగనిష్ఠుని ఆత్మానుభవరూపమగు నుత్తమసుఖము పొందును.

॥ *ఏవం యుఞ్జన్ సదాఽఽత్మానం యోగీవిగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే॥ 28

టీ. ఏవం=పైని జెప్పఁబడినప్రకారమున, ఆత్మానం=ఆత్మను, యుఞ్జన్ = యోగమునచే చూచుచున్నవాఁడై, విగతకల్మషః = పోఁగొట్టఁబడిన సమస్త పాపములు గల, యోగీ = యోగి, బ్రహ్మసంస్పర్శం = బ్రహ్మానుభవరూపమై, అత్యన్తం = అపరిమితమగు, సుఖం=సుఖమును, సుఖేన = అనాయాసముగా, సదా = ఎల్లప్పుడు, అశ్నుతే=అనుభవించుచున్నాఁడు.

తా. ఈ చెప్పబడినవిధముగా యోగి యగువాఁడు ఆత్మయోగము నభ్యసించుచు దానిచేతనే సమస్తప్రాచీన పాపములను

† సుఖము విషయసుఖము గాదనుటకై 'ఉత్తమ' విశేషణము గూర్పబడెను గాన 'ఆత్మానుభవరూపమైన యుత్తమసుఖము' అనఁబడెను. ఆ సుఖము నిరతిశయమై దుఃఖసంభేదరహితమై యుండుటచే ఉత్తమ మనఁబడినది. ఇచట 'హి' శబ్దము పూర్వశ్లోకమందలి మనోవశీకరణమునకుఁ గాని ఈశ్లోకమందలి మనోవశీకరణమునకు గాని హేతువును జెప్పుచున్న దని గ్రాహ్యము.

* ఇట్లు యోగప్రభావముచే నావిర్భవించుసుఖము 'బ్రహ్మసంస్పర్శమ్' అ' బ్రహ్మానుభవరూపమైనదిగాను, సాక్షాత్కారమునకు పిదప 'అత్యంతమ్' అని నిరతిశయమైనదిగాను, 'సదా' అనుటచే నివర్తింపరానిదిగాను, 'సుఖేన' అనుటచే అనాయాస సాధ్యమైనదిగాను జెప్పఁబడుచున్నది, 'ఏవమ్' పూర్వోక్త ప్రకారమున అనఁగా 'యోగీ యుఞ్జీత' (గీ-౬-౧౦) అని యారంభమునఁ జెప్పఁబడిన ప్రకారమున నని యర్థము.

చోఁగొట్టుకొని బ్రహ్మానుభవరూపమై అపరిమిత మగుసుఖమును అనాయాసముగా నెల్లపుడు అనుభవించుచుండును.

13 అవ. (ఇట్లు యోగమును అభ్యసించువిధిని వివరించి) యిఁక యోగపరిపాకమునకుఁ గల నాలుగువిధములైన దశలను (జెప్పఁ బూని యందు ప్రథమదశను) జెప్పుచున్నాఁడు.

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ 29

టీ. యోగయుక్తాత్మా = యోగముచేత పొందఁబడిన ఆత్మస్వరూపము గలపురుషుఁడు, సర్వత్ర=ఆత్మలయందంతటను, సమదర్శనః సన్=సమదృష్టి గలవాఁ డగుచు, ఆత్మానం=తనయాత్మను, సర్వభూతస్థం=దేవాది సమస్తభూతములతో సమానమైన యాకారము గలదానినిగాను, సర్వభూతాని = సర్వభూతములయొక్క ఆత్మస్వరూపములను, ఆత్మని స్థితానిచ=తన యాత్మతో సమానమైన యాకారము గలవానినిగాను, ఈక్షతే=చూచుచున్నాఁడు. (దీనిచే సమస్తాత్మలయందును సామ్యదర్శనావస్థ చెప్పఁబడినది.)

తా. *ప్రకృతిబంధము వీడినయాత్మస్వరూపము లన్నియు

* 'ఆత్మ' శబ్దము పరమాత్మపరముగా గ్రహించినయెడల సర్వభూతములందు పరమాత్మయు పరమాత్మయందు సర్వభూతములు నుండుననుట పొసఁగునే! ఇట్లు ఆధారాధేయభావముచే అర్థము సుఖముగా నుండఁగా సామ్యదర్శనపరముగా అర్థక్లేశ మేల? యన్నచో, ఇది పరమాత్మయోగ ప్రకరణముగాదు గనుక నిది చెల్లదు. లేక, జీవాత్మయోగమున కుపయుక్తమైన పరమాత్మధ్యానముగా నిది చెప్పరాదో? యన్నచో ఈసమాధి కంతటి పరిపాకదశ యింకను ప్రసక్తము కాలేదు. లేక 'భూత'శబ్దవాచ్యము లగుజీవులకు 'ఆత్మ'శబ్దవాచ్యుఁడగు పరమాత్మకును నిచ్చట సామ్యము చెప్పఁబడినదని గ్రహింపఁగూడదా? యన్నచో, ఆజీవపరసామ్యము 'యోమామ్' అని వెంబడినె చెప్పఁబడుటచే నిట గ్రహించుట పునరుక్తి యగును. కనుక 'సర్వత్ర సమదర్శనః', 'యోయం యోగస్త్వయాప్రోక్తః సామ్యేన' 'నిర్దోషంహి సమం బ్రహ్మ' ఇత్యాదులచే ప్రతిపాదితమైనజీవులపరస్పర సామ్యమే యిచట వివక్షిత మని యెఱుఁగునది.

జ్ఞానమే ఆకారముగా గలవి. కాఁబట్టి అట్టి తనయాత్మయును నితర
భూతముల యాత్మలకును జ్ఞానైకాకార మగుస్వరూపమునందు
సామ్యమే. పైఁకి గనఁబడు దేవాదిదేహవైషమ్యము ప్రకృతివలననే
కలుగునది. ఇట్లగుటంబట్టి యోగముచేత ఆత్మస్వరూపమును బొం
దినవాఁడు ప్రకృతివియుక్తము లైనయాత్మ లన్నియు జ్ఞానైకాకారము
లగుటచే వానినెల్ల సమానములైన వానిగా చూచుచున్నాఁడు.

14

అట్టిసమదర్శనముగలవాఁడు తన యాత్మను సర్వభూతములందును
సర్వభూతములను తనయాత్మయందును జూచుచున్నాఁడు. అనఁగా
(ఆత్మ అణుస్వరూపము గనుక ఒకయాత్మ సర్వభూతములందును
సర్వభూతములు ఒక యాత్మయందును ఉండుట పొసఁగదు. 'విద్యా
వినయ...పణ్డితాః సమదర్శినః' 'సర్వత్రసమదర్శనః' అనుటచేతను,
'యోయం యోగ స్త్వయా ప్రోక్తః సామ్యేన' అని యనువదించుట
చేతను 'నిర్దోషంహి సమం బ్రహ్మ' అనియు వచించుటచేతను (జ్ఞానైక
స్వరూపము లగుటవలన ఆత్మలకు పరస్పరసామ్యము చెప్పఁబడి
యున్నది. కావున దీని ననుసరించి) తనయాత్మను సర్వభూతము

15

లతో సమానమైన యాకారము గలదానినిగాను సర్వభూతములను
తనయాత్మతో సమానమైన యాకారము గలదానినిగాను చూచు
చున్నాఁడని యర్థము గ్రహింపవలయును. (ఆత్మలన్నియు సమాన
ములే యైనను యోగమునందు తనయాత్మనుమాత్రమే అనుసం
ధించుచుండువాఁడు దానితో సమానములైనవానినిగా తక్కిన
యాత్మలను జూచుట యెట్లు? అనినచో, స్థాలీపులాకన్యాయమున
ఏకజాతీయము లగువస్తువులలో ఒక్కటిని చూచినయెడల తక్కిన
వానిని జూడకపోయినను జూచినట్లే యగునుగాన 'యోగమునందు
ఆత్మల నెల్ల సమానము లైనవానినిగా దర్శించును' అనుటచే) తన
ఒక్క ఆత్మను దర్శించినయెడల తక్కినయాత్మలన్నియు దానికి

సమానములే యగును గనుక వానిని జూడకపోయినను వానినెల్లఁ జూచినట్లే యగు నని యర్థము.

అవ. దానికంటె నధిక మగుదశను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ *యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి॥ 30

టీ. యః = ఎవఁడు, సర్వత్ర = సమస్తాత్మవస్తువులయందు, మాం=నాస్వరూపమును, పశ్యతి=సమస్తాత్మస్వరూపములతో సమానమైనవానినిగా నన్నుఁ జూచుచున్నాఁడో, సర్వంచ=సమస్తాత్మవస్తువులను, మయి = నాయందు, పశ్యతి = సమస్తాత్మవస్తువులను నాతో సమానమైనవానినిగా జూచుచున్నాఁడో, తస్య = వానికి, అహం= నేను, న ప్రణశ్యామి = కనబడకపోను, మేచ=నన్నుఁ జూచుకొనునట్టినాకును, సః=వాఁడు, న ప్రణశ్యతి=కనఁబడకపోఁడు.

తా. ఎవఁడు మఱింత యోగపరిపాకదశను బొందినవాఁడై, నాతోడిసాధర్మ్యమును *ఇంచుమించుగాఁ బొంది (అనగా తాను

---

* ఇట్లు జీవాత్మలకు రూపవైషమ్యము దేవమనుష్యాది ప్రకృతివికారములచేఁ గలిగినదే కాని స్వతస్సిద్ధము కాదని యావైషమ్యమును నిరసించి, జ్ఞానాకారమునవానికిఁ గల పరిస్పరిసామ్యమును అనుసంధించుట చెప్పఁబడినది. ఇట ఆయాత్మలకే దేవాదిరూపభేదములకు హేతువగు పుణ్యపాపములవలని తారతమ్యము ధ్వంసమునొందఁగా పరమాత్మతోడిపరమసామ్యమును అనుసంధించుట చెప్పఁబడుచున్నది.

*ఇంచుమించుగాఁ బొందినవాఁడు (ఉపాగతుఁడు) అనఁగా బుద్ధిచే పొందినవాఁ డని యర్థము. ఏలన, వీఁ డింతకును ముక్తుఁడు గాడు కాన సామ్యమును బుద్ధిచేమాత్రము పొందినవాఁ డని గ్రాహ్యము. పూర్వము శ్రుతిసిద్ధమయినదానిని మరల వివరణార్థముగా చెప్పుట అనువాదమగును. ఇట పుణ్యపాపవిధ్వంసముచే పరమసామ్యము 'తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమంసామ్యముపైతి' అనుశ్రుతిచే సిద్ధము. ఇందులకు 'యో మాంపశ్యతి' అని అనువాదము; ఈ యనువాదము (అనఁగా ఆశ్రుతి ప్రతిపాదితమయిన పరమసామ్యము) పూర్వమే సిద్ధించియుండినఁగదా కలుగును. అది యింతకుమును పెక్కడ సిద్ధించియున్నది?

నాయుట్టివాఁడగుట బుద్ధిచే నెఱింగినవాఁడై) 'నిరఞ్జనః పరమం సామ్య ముపైతి' అన్నట్లు పుణ్యపాపము లెల్ల నశించి నిజస్వరూప

---

యని శంకరాఁగా ఆ పరమసామ్యము ఈ 'నిరంజన' శ్రుత్యాదులచే సిద్ధమయి యున్నది; దాని యనుసంధానమును విహితమయి యున్నది. కాన దానియనువాదము ఇట ఉపపన్నమే యని తెలుపుటకై, 'నిరఞ్జనః...' అని శ్రుతి నుదాహరించి 'నాసామ్యమును జూచుచు ఎవఁడు సమస్తములైన యాత్మవస్తువులందు నన్నుఁ జూచుచున్నాఁడో' అని అనువాదమును చెప్పిరి. ఐనను ఈశ్లోకమునపరమాత్మ సర్వవ్యాపిగాను సర్వమును పరమాత్మనిష్ఠముగాను అర్థము తనంతట పైకి తోఁచుచున్నదిగాని, యది యిచట ప్రకరణాదులకుఁ దగియుండలేదు. కాబట్టిజీవపరమాత్మలకు ఆధారాధేయభావము గాక సామ్యదర్శనమే వివక్షితమయినదని చెప్ప వలయును. అయినను, తన యాత్మను అనుసంధానముచేయు నీయోగివిపాకమున పరమాత్మగాని తక్కినవిగాని స్ఫురింపవు గనుక జీవపరసామ్యముకూడ ఎట్లు గలుగునని శంక రాఁగా 'అందఱును పరస్పర...యనుసంధించుచున్నాడో' యనఁబడినది. (అనగా తన ఒక ఆత్మస్వరూపమునే చూచునట్టి యోగమునందు తక్కిన వానినెల్ల దానితో సమానములుగా చూచుట పొసఁగదు, కాన తక్కిన వానినెల్ల దానితో సమానములుగా చూచు టనఁగా తక్కినవియెల్ల దానివంటివే యని యనుసంధించుట మాత్రమే కాని చూచుటగాదు. పరమాత్మ-ఆత్మవర్గము- అను రెంటిలో ఒకటిని జూచుటచే మఱియొకటికూడ నిటువంటిదేయని యనుసంధించుచున్నాఁ డని భావము. అనఁగా ఆయోగి తన యాత్మస్వరూపమును అనుసంధించుట, దానివంటిదైన నా స్వరూపమును అనుసంధించునట్టిదే యగును గాన నన్నుఁ జూచినట్లే యనఁదగును. అట్టి వానికి నేను కనఁబడకున్నను కనఁబడునట్టివాఁడనే యగుదును. నేను నా స్వరూపమును అనుసంధించుట, దానివంటిదైన వాని యాత్మస్వరూపమును అనుసంధించునట్లే యగును గాన వాని నెప్పుడుఁ జూచునట్లే యగును. అట్టివాఁడు నాకెప్పుడును నావంటివాఁడుగాఁ గనఁబడుచుండును. ఇట్లు మే మొకరి నొకరు చూడకున్నను మామాస్వరూపానుసంధానములవలన ఒకరి నొకరు చూచుచున్నవారమే యనఁదగుదుమని భావము. ఎప్పుడును అన్నిటిని జూచుచుండు నీశ్వరునికి ఆయోగి కనఁబడుననుట యొకవిశేషము కాదు. కావున చూచుట యనఁగా స్వరూపము ననుసంధించుట యనియే గ్రాహ్యము. ఈశ్వరుడు తన స్వరూపమును అనుసంధించుచో సామ్యమువలన ఆయోగియొక్క ఆత్మస్వరూపమును సైతము అనుసంధించునట్టివాఁడే యగును గాన అతనికి అట్టియోగి తనతో సమానుఁడుగా కనఁబడుచున్నాఁ డనుట. అట్టియోగి యీశ్వరునికి తక్కినవారివలె సామాన్యుఁడుగాఁ గనఁబడక యెప్పుడును తనకుసమానుఁడుగా కనఁబడునని యాశయమే కాని ఊరక కనఁబడుచున్నాఁ డని యర్థము కాదు.

ములో నున్న (స్వా)త్మవస్తువు లెల్ల నాతో సమానము లైనవిగాఁ
జూచుచున్నవాఁడై (స్వా)సామ్యముచేత ఆత్మవస్తువులందెల్ల నన్నును,
నాయందు ఆత్మవస్తువుల నెల్లను జూచుచున్నాఁడో (అనఁగా అంద
ఱును స్వరూపమున పరస్పరసమానుల మగుటం జేసి పరమాత్మ,
ఆత్మవర్గము, అను నీరెంటిలో ఒకటిని జూచుటచే మఱియొకటికూడ
నిట్టిదే యని యనుసంధించుచున్నాఁడో) ఆయోగికి, తనయాత్మ
స్వరూపమును జూచునపుడు వానివలెనే యుండుటవలన, నేను కనఁ
బడకపోను. నన్నుఁ జూచుకొనుచుండునాకును, వాఁడు, నావలెనే
యుండుటవలన తన(స్వా)త్మను నాతో సమమైనదిగాఁ గనుఁగొనుచు,
ఎప్పుడును కనఁబడుచుండును. (దీనిచే ఆత్మ పరమాత్మలకు సామ్య
దర్శనావస్థ చెప్పబడినది.)

అవ. ఇట మఱింత యెక్కువపరిపాకము గలదశను జెప్పు
చున్నాఁడు.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ 31

టీ. యః=ఎవఁడు, ఏకత్వం=నాతోడి యేకత్వమును, ఆస్థితః=
అంగీకరించినవాఁ డగుచు, సర్వభూతస్థితం=సమస్తభూతములం దంత
ర్యామియై యున్నట్టి, మాం=నన్ను, భజతే=సేవించుచున్నాఁడో,
సః యోగీ = ఆయోగి, సర్వథా=అన్నివిధముల, వర్తమానోఽపి =
యోగమును విడిచి లేచినవాఁడైనను, మయి=వర్తతే = నాయందు
వర్తించుచున్నాఁడు.

తా. (జ్ఞానము యోగదశయందు సంకోచము లేక వికసించి
యుండును. కావున) యోగదశయందు ఎవఁడు, *అం[illegible]శుచితజ్ఞాన మే

* పూర్వశ్లోకమున 'పుణ్యపాపే విధూయ' అను శ్రుతిచెప్పిన (పుణ్యపాప)
కర్మములకు వశ్యులం గాకుండుటంబట్టి యాత్మలకు ఈశ్వరునితోడఁ గల సామ్య

యాకారముగాఁ గలిగియున్నవాఁ డగుటవలనఁ దాను సర్వభూత స్థితుఁడగునాతో సమానుఁడై యుండుటను గట్టిగా అనుసంధించువాఁడై, ప్రాకృతభేదమునువదలి (అనఁగా నాజ్ఞాన మెప్పుడును

---

మును దర్శించుట చెప్పఁబడినది. ఈశ్లోకమున కర్మరూప మయిన యవిద్య ఆవరించుట లేమిచే అసంకుచిత మయి స్ఫురించెడిజ్ఞానమే యాకారముగాఁ గలిగియుండుటం బట్టి ఆత్మలకు ఈశ్వరునితోడి సామ్యము ననుసంధించుటయు, ఇట్లనుసంధానము సేయు సంస్కారపు బలిమివలన వ్యుత్థాన (యోగమునుండి లేచిన) కాలమందును, తనంతటనే అట్టి యనుసంధానము అనువర్తించుచుండుటయుఁ జెప్పబడుచున్నది. 'సర్వథా వర్తమానః' అని సర్వథా వర్తించుట సమాధదశయందుఁ గలుగదు. కనుక నద వ్యుత్థానకాలమందని కాలభేదము గ్రహింపఁబడినది. ఇందు యోగి, సర్వభూతస్థితుఁడగు పరమాత్మునితో తాను ఏకత్వమును (సామ్యమును) అనుసంధించుట యనఁగా తానును పరమాత్మతోపాటు సర్వభూతస్థితుఁడై యుండుట ననుసంధించుట యగుచున్నది. అయినను ఆత్మ అణుస్వరూపుడు గనుక నట్టి స్వరూపముచేత వానికి సర్వభూతవ్యాప్తి కలుగదు. దీపము స్వరూపముచేత అంతటను వ్యాపింపక తనధర్మమగుప్రకాశముచేతనే సర్వత్ర వ్యాపించునట్లు అణువగు నాత్మయు స్వరూపముచేతఁ గాక స్వధర్మ మగుజ్ఞానముచేత నంతటను వ్యాపించుచున్నది. ఈశ్వరునికి స్వరూపముచేతను జ్ఞానముచేతను వ్యాప్తి కలదని తెలియునది. ఇట్లు ఆత్మ అసంకుచితజ్ఞానముచే సర్వవ్యాప్తి గలదగుటచేత అట్టివ్యాప్తి గల యీశ్వరునితో సామ్యమును బొందుచున్నది. కాఁబట్టి 'ఏకత్వ మాస్థితః' అనఁగా స్వరూపమున ఈశ్వరునితో ఐక్యమనిచెప్పక అసంకుచితజ్ఞానైకాకారమున ఈశ్వరునితో సామ్యమని చెప్పఁబడెను. మఱియు ఆత్మలకు కర్మముచే ప్రకృతిసంబంధము గలుగఁగా దానివలన పూర్వము అసంకుచిత మయి యుండినవానిజ్ఞానమునకు సంకోచము గలుగుచున్నది ఈశ్వరునిజ్ఞానమునకో అట్లు సంకోచ మెప్పుడును గలుగదు. జ్ఞానమందలి యీ యొక్కువతక్కువలవలన ఈశ్వరునికిని ఆత్మలకును సామ్యము లేక భేదము గలుగుచున్నది. ఇదియె ప్రాకృతభేద మనఁబడును. ఈప్రాకృతభేదమును (అనఁగా ప్రకృతిసంబంధముచేఁ గలిగిన జ్ఞానతారతమ్యమును—అనఁగా జ్ఞానతారతమ్యమునకు హేతుభూతమయినట్టి ప్రకృతిసంబంధమును) పరిత్యజింపఁగా ఆత్మలకు జ్ఞానము ఈశ్వరునిజ్ఞానమువలె అసంకుచిత మగుచున్నది గావున ఈయసంకుచితజ్ఞానైకాకారమునందు వారి కుభయులకు సామ్యము గలుగుచున్నది. కావుననే 'ప్రకృతి సంపర్గము ..వదలి' అనఁబడినది. 'ఆస్థిత' శబ్దముయొక్క బలముచే 'మిక్కిలి దృఢముగా' అని లభించినది. ఇట్టి దృఢానుసంధానముచేతఁ బుట్టిన సంస్కారప్రాబల్యమువలననే వ్యుత్థానమందును ఆయనుసంధాన మనువర్తించు నని తెలియునది.

సంకోచింపక వికసించియున్నట్టిదియు, తన జ్ఞానము కర్మమూలక
మగు ప్రకృతిసంసర్గమువలన సంకోచించి యున్నట్టిదియుఁ, గనుక
జ్ఞానమందలి యిట్టి తారతమ్యమువలన నాకును తనకును గలిగినభేద
మును తనజ్ఞానము వికసించినపిదప వదలి, అట్టివికాసముచేత నాతో
సమానుఁడై ఏకత్వరూపమును మిక్కిలి దృఢముగా దర్శించుచు
న్నాఁడో, ఆ యోగి యోగమును విడిచి లేచి లౌకికవిషయములందు
యథాయుక్తముగా ప్రవర్తించుచున్నపుడును తన్నును సర్వభూతము
లను చూచుచున్నవాఁడైనను నన్నే చూచుచున్నవాఁ డగును.
అనఁగా తనయందు సర్వభూతములందునుసర్వదా నాతోడిసామ్యమే
చూచుచున్నాఁ డని యర్థము.

అవ. యోగముయొక్క కాష్ఠాదశను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ 32

టీ. అర్జున, సర్వత్ర=అంతటనుగల, ఆత్మౌపమ్యేన-ఆత్మ= ఆత్మలయొక్క, ఔపమ్యేన=సామ్యముచేత, సర్వత్ర=తనయందును అన్యులయందును అంతటను గల, సుఖం వా=సుఖమునుగాని, దుఃఖం

---

'మాం భజతి' 'నన్ను భజించుచున్నాఁ' డనగా 'నాతో సమమైనయాత్మ... దర్శించుచున్నాఁ' డని యభిప్రాయము. 'మయి వర్తతే' 'నాయందు వర్తించుచున్నాఁడు' అని యర్థము. పరమాత్మయందు యోగివలెనే అయోగియు వర్తించుచున్నాఁడు గనుక ఈయర్థమున విశేష మేమియుఁ గలుగదు. కాన నిట వర్తించుట యనఁగా బుద్ధిచేత వర్తించుట (అనగా చూచుట యగును) గాన 'నన్నే చూచుచున్నవాఁ' డని యర్థము చెప్పఁబడెను. తనయాత్మను చూచినంతమాత్రముననే 'మాం' అనఁబడు పరమాత్మను జూచుట యెట్లు గలుగు నని శంక రాఁగా 'తన యందును...నాతోడిసామ్యమునే చూచుచున్నాఁడు' అని దానికి భావము చెప్పఁబడెను. వ్యుత్థానకాలమందు తన యాత్మను సాక్షాత్కరింపకపోయినను పరోక్షమున దానిని అనుసంధించుట మిక్కిలి విశదముగా నుండుటచే, అదియును తక్కిన యాత్మలను ప్రత్యక్షమునఁ జూచినట్లే యుండు నని తెలియునది.

యదివా=దుఃఖము నైనను గాని, సమం=తనసుఖదుఃఖములను పరుల సుఖదుఃఖములతో సమముగా, యః = ఎవఁడు, పశ్యతి = చూచుచున్నాఁడో, సః యోగీ=ఆయోగి, పరమః=యోగకాష్ఠను బొందిన వాఁడుగా, మతః=తలపఁబడినవాఁడు.

తా. *ప్రకృతిసంబంధము వీడినయాత్మలన్నియును అసంకుచిత మైనజ్ఞానమే ఆకారముగాఁ గలవగుటవలన సమానములగును. ఈ కారణముంబట్టి పుత్రజన్మాదిరూపసుఖముగాని పుత్రమరణాదిరూప దుఃఖముగాని తనకుఁ గలిగినదైనను మఱియెవరికిఁ గలిగిన దైనను అన్నియు తనకు సమానముగా సంబంధింపనివై యుండుటచే ఆ సుఖ దుఃఖము లన్నిటిని సమానముగానే యెవఁడు చూచునో (అనఁగా పరపుత్రజన్మమరణాదు లెట్లు తన్ను సంబంధింపవో యట్లే తనపుత్ర జన్మమరణాదులును తన్ను సంబంధింపనివిగా నెవఁడు చూచునో) అట్టియోగియే యోగముయొక్క యుత్కృష్టపరిపాకదశను బొందిన వాఁడని తలఁపఁబడుచున్నాఁడు.

అవ. చెప్పఁబడినయోగము మనోనిగ్రహమువలన సాధింపఁ దగినది యగుటచేత ఆనిగ్రహోపాయమును దెలియఁగోరి అర్జునుఁ డడుగుచున్నాఁడు.

---

* ఇది యోగపరిపాకమునకు మిక్కిలి యుత్కృష్ట మైన నాలుగవదశ. ఈదశ ప్రబలదుఃఖహేతువులు సంభవించినను నిర్వికారత్వము కలిగించును. మఱియు నవ్యైకర్మములయు జ్ఞానములయు ఎక్కువతక్కువలచే నవ్యైసుఖములును దుఃఖములును ఎక్కువతక్కువలుగాఁ దోఁచుచున్నను అట్లవితోఁచుటను తొలఁగించుట యనుసంధింపఁబడును. తక్కినవారి సుఖదుఃఖములవలెనే తన సుఖదుఃఖము లును తన్ను సంబంధింపకుండుటకు, తక్కినవారును తానును స్వరూపమున సమాను లగుటయే (ఆత్మౌపమ్యమే) హేతువు. అనఁగా పరపుత్రజన్మాదులకు తనయందును తనపుత్రజన్మాదులకు పరులయందును ఎట్లు సంబంధము లేదో యట్లే వానికెల్ల తన యందును సంబంధము లేదని భావము. కావుననే అన్నియెడలఁ గలుగు సుఖదుఃఖ ములును తనకు సంబంధశూన్యము లగుటచే సమానములే యగుచున్నవని భావము. సర్వత్రశబ్దము 'ఆత్మౌపమ్యేన' 'సమం పశ్యతి' అను నీరెంటితోను అన్వయించుచున్న దని గ్రాహ్యము.

అర్జున ఉవాచ:

16

శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన।
ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్॥ 33
చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ 34

టీ. హే మధుసూదన=ఓకృష్ణా, సామ్యేన = సామ్యముచేత, యః=ఏ, అయం = ఈ, యోగః = సమదర్శనరూపమైన యోగము, త్వయా=నీచేత, ప్రోక్తః = చెప్పఁబడినదో, ఏతస్య = ఈయోగము యొక్క, స్థిరాం స్థితిం = నిలుకడ యైన ఉనికిని, చఞ్చలత్వాత్ = (మనస్సుయొక్క) చపల స్వభావమువలన, అహం=నేను, నపశ్యామి= కనుఁగొనకున్నాను. హే కృష్ణ=ఓకృష్ణా, మనః=మనస్సు, చఞ్చలం= చపలస్వభావము గలదియు, బలవత్ = బలవంత మైనది గనుక, ప్రమాథి = క్షోభపెట్టునదియు, దృఢంహి = విపరీతవిషయప్రవర్తనమందు దృఢ మైనదియును గదా, తస్య = అట్టి మనస్సుయొక్క, నిగ్రహం-నిరోధమును, వాయోః నిగ్రహమివ=ప్రతికూలముగా వీచు మహావాతమును నిగ్రహించుటవలె, సుదుష్కరం=మిక్కిలి యసాధ్య మైనదానినిగా, అహం=నేను, మన్యే=తలఁచుచున్నాను.

తా. *కృష్ణా, ఆత్మలెల్ల ఒకటికొకటి సమములుగాక దేవ

---

* ఇట్లు జ్ఞానైకాకారత్వమునను, నిర్దోషత్వమునను, బ్రహ్మతద్గుణసంబంధమునను, ఇతరాసంబంధమునను సామ్యము వరుసగా నాలుగుశ్లోకములచేఁ జెప్పఁబడెను. యోగాభ్యాసవిధియు నాలుగువిధము లగు యోగులును జెప్పఁబడిరి. ఇఁక పూర్వము చెప్పఁబడిన యోగసాధనమునే విశదముగాఁ దెలియుటకు మరల నర్జునుఁ డడుగుచున్నాఁడు. జీవాత్మ పరస్పరము దేవమనుష్యాదిరూపభేదములచే వైషమ్యము; జ్ఞానైకాకారత్వముచే సామ్యము. పరమాత్మ మొదలుగాఁగల యాత్మ లన్నియు 'మిక్కిలియు భిన్నము' లైనవనఁగా వానికి భేదమును గలిగించు ధర్మములుమాత్రమే కాదు, విరుద్ధ స్వభావ ములే చూపట్టుచున్నవని భావము. 'త్వయాప్రోక్తః' నీయంతటనే సర్వజ్ఞుఁడవై యున్న నీకే దీనిని అనుసంధించుటకును ప్రవచించుటకును శక్యమగునని భావము.

తలు మనుష్యులు మొదలైన భేదములవలనను, జీవుడు ఈశ్వరుఁడు అను భేదములవలనను, మిక్కిలియు భిన్నములైనవిగా నింతకాలము అనుసంధింపఁబడుచుండినవి. ఇప్పుడు ఆత్మలన్నియు జ్ఞానైకాకారములగుటవలన ఒకటితో నొకటి సామ్యము గలిగియుండుటచేతను, పుణ్యపాపరూపకర్మమునకు వశము గాకుండుటవలన ఈశ్వరునితో సామ్యము గలిగియుండుటచేతను, వాని నన్నిటిని సమానములైనవిగా దర్శించునట్టి (సర్వత్ర సమదర్శనరూపమైన) యోగమును నీవు నాకుఁ జెప్పితివి. 34 (ఈయోగమువలన ఆత్మలయొక్క సామ్యమును తెలిసినవాఁడ నయ్యు అనాదిగా వానిభేదమునే అనుసంధించువాఁడనై చిత్తశుద్ధి లేకున్నట్టినాకు) మనస్సుయొక్క చంచలత్వము వలన ఆయోగము స్థిరముగా నిలుచుట గానకున్నాను. కృష్ణా, అట్లే కద! ఎడతెగక అలవాటుపడి యుండు విషయములందు సైతము నిలుకడలేక తనంతనే చంచలమైనదై పురుషునిచేత నొక్కచోట నిలుపుటకు శక్యము గాకుండు మనస్సు, వానియొక్క శరీరేంద్రియములను బలవంతముగా వ్యాకులము గావించి (వాఁడు నిలిపినచోట నుండక) మఱియొకచోట దృఢముగా చరించుచున్నది. ఇట్లు తనకు అలవడినవిషయములందుఁగూడ చలించునట్టిస్వభావము గలమనసును, దాని కలవాటుపడనిదై కావున దానికి విపరీతాకారమై యుండునాత్మస్వరూపమునందు నిలుపుకొఱకు నిరోధించుట, ప్రతి

17

కూలముగా వీచు మహావాతమును విసనకఱ్ఱ మొదలైనవానిచే నిరోధించుటవలెనే, మిక్కిలి దుష్కరమని నేను తలఁచుచున్నాను. మనస్సును నిగ్రహించుటకు నుపాయమును జెప్పుమని యభిప్రాయము.

---

*'అహం నపశ్యామి' అనాదికాలమునుండి భేదమునే యనుసంధించుచు చిత్తమును గెలువకున్న నాకుఁ దాని గనుఁగొన శక్యము గాదని భావము.

శ్రీ భగవానువాచ:

శ్లో॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్।
18
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥ 35

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః॥ 36

టీ. మహాబాహో = భుజబలము గల, కౌన్తేయ = అర్జునా, మనః=మనస్సు, చలం=చంచలస్వభావము గలది కనుకనే, దుర్నిగ్రహం=నిగ్రహింపశక్యము కానిది (అనుటయందు), అసంశయం=సందేహము లేదు, తు=అయినప్పటికిని, అభ్యాసేన = ఆత్మయొక్క అనుసంధానము చేయుటచేతను, వైరాగ్యేణచ = ఆత్మవ్యతిరిక్తములైన వానియెడలఁ గలుగునట్టి విరక్తిచేతను, గృహ్యతే=వశమగుచున్నది. (36) అసంయతాత్మనా = జయింపఁబడని మనస్సుగలవానిచేత, యోగః=సమదర్శనరూపమగు యోగము, దుష్ప్రాపః=పొందశక్యము కానిది, ఇతి = అని, మే=నాయొక్క, మతిః = నిశ్చయము, ఉపాయతః=కర్మయోగము అనెడి యుపాయముచేతనైతే, వశ్యాత్మనా=జయింపబడిన మనస్సుగలవాఁడై, యతతా=యోగము నభ్యసించువానిచేత, అవాప్తుం=పొందుటకు, శక్యః=సాధ్యమైనది.

తా. భుజపరాక్రమము గలయర్జునా, *మనస్సు చపలస్వభా

---

* ఇట శ్రీకృష్ణుఁడు, అర్జునుఁడు శంకోక్తముగాఁ జెప్పినదానినే యనువదించుచు నతఁడు తెలియఁగోరిన యుపాయమును రెండుశ్లోకములం జెప్పుచున్నాఁడు. అర్జునుఁడు మనస్సునుగూర్చి 'చఞ్చలం' 'ప్రమాథిబలవద్దృఢమ్' అని చెప్పినదానినే 'మనోదుర్నిగ్రహమ్ చలమ్' అని యంగీకరించి 'ఏతస్యాహం నపశ్యామి స్థితింస్థిరామ్' అన్నట్లు దానిస్థిరమైనస్థితి తెలియకుండుటకు 'అసంయతాత్మనా' అసంయతాత్మత్వమే కారణమని చెప్పుచున్నాఁడు. ఇందు 'అసంశయమ్' అనుట 'సత్యమ్' 'జానుపరే' అన్నట్లు అర్ధాంగీకారమును దెలుపుచున్నది. ఆత్మ నిత్యత్వము జ్ఞానత్వము ఆనందత్వము అకర్మవశ్యత్వము అమలత్వము మొదలైనగుణములం గలది గాన నిట్టిది గుణాకారమైయుండుటను అలవాటుచేసికొనుటచే దానియందుఁ గలుగు ఆసక్తిచేతను,

వము కలది గనుక నిగ్రహింప శక్యము కానిదియే యను నీవిషయము నందు సందేహము లేదు. అయినను, ఆత్మను గుణాకారమైనదిగా అభ్యాసము చేయుటచే దానియెడలఁ బుట్టిన ఆభిముఖ్యముచేతను, ఆత్మవ్యతిరిక్తవిషయము లయినవానిని దోషాకారములుగా కనుగొనుటవలన వానియెడలఁ బుట్టిన వైరాగ్యముచేతను, ఒకానొక విధమున మనస్సు నిగ్రహింపఁ బడుచున్నది. (36) మనస్సును జయింపనివాఁడు ఎంతటిబలిమి చేతఁగాని యోగమును బొందజాలఁడే యని నాయభిప్రాయము. నేను నీకు పూర్వము అంతర్గత మగు జ్ఞానము గలదై మదారాధనరూపమై యుండు కర్మయోగ మనెడు యుపాయమును జెప్పియున్నాను. ఆయుపాయముచేత మనస్సును జయించినవాఁడై యోగము నభ్యసించువాని కైనచో సమదర్శన రూప మగునీయోగమె పొందుటకు సాధ్యమగును.

అవ. ఇఁక అర్జునుడు *'నేహాభిక్రమనాశోఽస్తి' ఇత్యాదు

---

ఆత్మతప్ప తక్కినవానిని దోషాకారములుగా కనుఁగొనుటచే వానియందుఁ గలుగు విరక్తిచేతను, దానిని వశముచేసికొనవచ్చును. ఆత్మవ్యతిరిక్తము లైనవానియందలి విరక్తివలన వానినుండి మనస్సును మరల్చి, ఆత్మ గుణాకారమగుటను అలవాటు చేయుటచే మనస్సునకు దానియందే ఆసక్తి కలిగించి, యిట్లు దానిని వశముచేసికొన వచ్చునని భావము. ఏదియైనను అనుకూలమైనదిగా అలవాటు చేయుటవలన దాని యందు ఆసక్తియు, ప్రతికూలమైనదిగా కనుఁగొనుటవలన దానియందు విరక్తియు కలుగుట ప్రసిద్ధము. ఇది మనోనిగ్రహప్రకరణము గనుక 'అసంయతాత్మనా' 'వశ్యాత్మనా' అనుచోఁ గల ఆత్మన్ శబ్దమునకు మనస్సు అని యర్థము గ్రాహ్యము. 'మహాబాహో' అని సంబోధించుటచే సూచితమైన బలిమియే 'మిక్కిలి బలముచేతను' అని ఫలించినది. 'మే మతిః' అని తననిస్సందేహత్వమును దెలుపుటచే 'పొందఁ జాలఁడే' యనబడినది. మనోనిగ్రహమునకు పూర్వోక్తలక్షణమైన కర్మము మాత్రమే యుపాయము, ఇపుడు చెప్పఁబడిన అభ్యాసవైరాగ్యము లన్ననో దానికి అంగములు మాత్రమే యగునుగాన 'వశ్యాత్మనా' అనుటకు 'కర్మము...చేత మనసును జయించి' అనఁబడెను.

* ఇట్లు పూర్వము చెప్పఁబడిన యోగసాధనమే చక్కఁగా వినవయ్యెను. ఇఁక పూర్వము చెప్పఁబడినయోగమాహాత్మ్యమే వినఁదగినది గాన దాని యన్ని

లందు తాను వినిన యోగమాహాత్మ్యమునే కలరూపున దెలియు నట్లు వినఁగోరి మరల నడుగుచున్నాఁడు. జ్ఞానము అంతర్గతముగాఁ గలిగియుండుట చేతను యోగమును ఉద్దేశ్యముగాఁ బొందియుండుట చేతనుగదా కర్మయోగమునకు మాహాత్మ్యమని యందుఁ జెప్పఁ బడినది. ఆకర్మమాహాత్మ్యము యోగమాహాత్మ్యమే.

అర్జున ఉవాచ :

శ్లో॥ అయతి శ్శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి॥ 37
కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి॥ 38
ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హ స్యశేషతః।
త్వ దన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే॥ 39

37. టీ. కృష్ణ=కృష్ణా, శ్రద్ధయా=శ్రద్ధతో-ఆస్తికబుద్ధితో, ఉపేతః=కూడినవాఁడును-శ్రద్ధతో యోగమునందు ప్రవర్తించినవాఁడును, అయతిః = యత్నము లేనివాఁడునై, యోగసంసిద్ధిం =

---

ప్రకారములను సవిస్తరముగా వినుటకై యర్జునుఁ డడుగుచున్నాఁడు. యోగమాహాత్మ్య మనఁగా-యోగము శిథిలమైనను చిరకాలము అనేకపుణ్యలోకప్రాప్తి, మరల యోగయోగ్యులకులమునను యోగులకులమునను బుట్టుట. తన్మూలమున మరల యోగము పుష్కలముగాఁ గలుగుట, దానివలన అపవర్గసిద్ధి, యనునదియే. 'నేహాభిక్రమ' ఇత్యాదులు కర్మయోగమాహాత్మ్యమును జెప్పునవే కాని కర్మయోగమునకు ఫలమువంటిదగు ఆత్మావలోక మనెడి యోగముయొక్క మాహాత్మ్యమును జెప్పునవి గావు. కాన యోగమాహాత్మ్యమే వినఁబడినదై యుండగా యోగమాహాత్మ్యము వినబడినదనుట యెట్లు? అనఁగా, ఆకర్మయోగము యోగమునకు అంతరమైన ఆత్మజ్ఞానము అంతర్గతముగాఁ గలదియు యోగమును ఉద్దేశ్యముగాఁ గలదియు నే యగును. కాఁబట్టి యిట్లు యోగమే నిమిత్తముగాఁ గలదై యోగమున కంగభూతమై యున్న కర్మయోగముయొక్క మాహాత్మ్యమును జెప్పియుండుట దానికి అంగియైనయోగము మాహాత్మ్యమును జెప్పియుండుటయే యగును. అంగముయొక్క మాహాత్మ్యమును జెప్పుట అంగియొక్క మాహాత్మ్యమును జెప్పుటే యని భావము.

యోగసిద్ధిని, అప్రాప్య=పొందక, యోగాత్ = ఆయోగమునుండి, చలితమానసః = చలించినమనస్సు గలవాఁడు, కాం=ఏ, గతిం = కామము భోగము మోక్షము నరకము అనువానిలో నేగతిని, గచ్ఛతి=పొందుచున్నాఁడు.

38. టీ. హేమహాబాహో = గొప్పబాహువులుగల హే కృష్ణా, అప్రతిష్ఠః=కర్మయోగమును స్వర్గాదిఫలసాధనముగా అనుష్ఠింపనివాఁడును, బ్రహ్మణః పథి = ఆత్మప్రాప్త్యుపాయభూత మగు యోగమునందు, విమూఢః=మోహమువలన దానినుండి భ్రష్టుఁడైనవాఁడును, (ఇట్లు) ఉభయవిభ్రష్టః = రెంటికిని జెడినవాఁడై, (ఉభయవిభ్రష్టుఁ) ఛిన్నాభ్రమివ = తునిగిన మేఘమువలె, న నశ్యతి కచ్చిత్=నశింపఁడుగదా.

39. టీ. హేకృష్ణ = ఓకృష్ణా, మే=నాయొక్క, ఏతం సంశయం = ఈసందేహమును, అశేషతః = నిశ్శేషముగా, ఛేత్తుం = పోఁగొట్టుటకు, అర్హసి=తగుదువు, అస్య సంశయస్య=ఈసందేహముయొక్క, ఛేత్తా=నాశకుఁడు-త్వదన్యః = నీకంటె నితరుఁడు, న ఉపపద్యతేహి=పొసగడుగదా-తగినవాఁడు కాఁ డనుట.

తా. కృష్ణా, శ్రద్ధతో *యోగమునఁ బ్రవర్తించియు, దానిని

---

* 'శ్రద్ధయోపేతః' అని యోగమునందు శ్రద్ధమాత్రము గలిగి యందు ప్రవర్తింపకయున్నచో 'యోగాచ్చలితమానసః' అని దానినుండి చలించెననుట పొసఁగదు. ఒకదానియందు ప్రవృత్తియే లేనపుడు దానినుండి చలించుట యెక్కడిది? కనుక యోగమునందు శ్రద్ధయు దానియందు ప్రవృత్తియుఁగూడ నుండిననే దానినుండి చలించెననుట యొప్పునుగాన 'యోగమునందు ప్రవర్తించియు' అని కూర్పఁబడెను. 'యోగాచ్చలిత మానసః' అనఁగా పుష్కలమైన యోగమును ఆచరించుటకు తగినది గానట్టిచిత్తము గలవాఁడనుట. గతులు-కామము భోగము మోక్షము నరకము అని తెలియునది. ఇచట 'ఉభయవిభ్రష్టః' అని ఉభయమునుండి భ్రంశము చెప్పఁబడినది. ఆ ఉభయములో ఒకటి 'అప్రతిష్ఠః' అనియు మఱొకటి 'విమూఢః బ్రహ్మణఃపథి' అనియుఁ జెప్పఁబడినవి. 'బ్రహ్మణఃపథి' అనఁగా 'బ్రహ్మప్రాప్తి

మఱెంత దృఢముగా నభ్యసించు ప్రయత్నము లేకుండుటవలన, యోగసిద్ధిఁ బడయక యోగమునుండి చిత్తము చలించినవాఁడు (కామభోగ మోక్ష నరకము లనెడిగతులలో) ఏగతిని బొందును ? కృష్ణా! (సమదర్శనరూప మైన యోగమునుండి చలించి సమదర్శనరూపమైనయోగమునకుఁ బూనినపుడు దానిసాధన మైనకర్మయోగమును ఫలాపేక్ష విడిచి యథావిధిగా నాచరించుచున్నాఁడు.) కర్మయోగము యథావస్థిత మై (అనగా అనుష్ఠింపవలసిన ప్రకారముగా అనుష్ఠింపఁబడిన దై) స్వర్గాదులకు సాధనభూత మగును గాని దానిని

---

కుపాయభూతమైనయోగము' అని యర్థము. ఇట్లు రెండవది ఆత్మప్రాప్తిసాధనమైనయోగము అగుటచే దానికి ప్రతియోగి యైన మొదటిది సాంసారికఫలసాధనమైన కర్మమే కావలయును. కనుక 'అప్రతిష్ఠః' అనఁగా, అట్టికర్మము తనకు ప్రతిష్ఠ (అనఁగా పట్టు) గానివాఁడు-అనగా కర్మమునందు నెలకొనినవాఁడు అని యర్థము గ్రాహ్యమగుచున్నది. అయినను ఈయోగి కర్మస్వరూపమును అనుష్ఠించుటయందుఁ గాని దానికి వలయు ప్రయాసములందుఁ గాని కొంచెమైనను కొఱఁతపడలేదే. కనుక కర్మమందు నెలకొననివాఁడనుట యెట్లు? అన్నచో, కర్మమును యథావిధిగా అనుష్ఠించినను దానియందు ఫలసంగము లేనివాఁడు గాన నది నిష్ఫలమే యైనది. కనుక వానికి కర్మము ప్రతిష్ఠ గాదయ్యె ననఁగా అది యనుష్ఠించినంతమాత్రి ప్రతిష్ఠయయ్యెనే కాని ఫలము నిచ్చినంత ప్రతిష్ఠ గాలేదని భావము. కాన యథా......ప్రతిష్ఠగా నేర'దని అనఁబడెను. ఇట్లు కర్మము అనుష్ఠించియు అందు ఫలసిద్ధి లేకపోవుటచే దానినుండి భ్రంశము చెప్పఁబడెను. యోగమునుండి భ్రంశము 'విమూఢో బ్రహ్మణః పథి' అనఁబడెను. ఇచట 'విమూఢః' అనగా తెలియనివాఁడని యర్థము గాదు. తెలిసికొని యుపక్రమించి పిదప చలించినవానిని గుఱించియే కదా యిపుడు ప్రశ్నము. కాన 'విమూఢః' అనఁగా విమోహమువలన యోగమునుండి నివర్తించుటయే గ్రాహ్యము. 'అర్హసి' అనఁగా సర్వజ్ఞత్వకారుణికత్వప్రియసఖిత్వాదులు గలిగియున్ననీవే నాసంశయమును ఛేదించుటకు యోగ్యుఁడవని యర్థము 'కృష్ణ' శబ్దముచేతను 'త్వ' చ్ఛబ్దముచేతను సూచితమైనయర్థమే 'స్వయమాగానే .....అర్హుఁడు గాఁడు అనఁబడెను. అనఁగా ఇతరులజ్ఞానము ఇంద్రియాధీనమై అవిశదములైన యనుమానాదులప్రాయమై, క్రమక్రమముగాఁ గలుగునదై యుండును, నీజ్ఞానమో 'యోవేత్తి యుగపత్సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః। తం ప్రణమ్య హరిం శాస్త్రం న్యాయతత్త్వం ప్రచక్ష్మహే' అను భగవన్నాథమునులవచనము చొప్పున నుండు నని తెలియునది.

ఫలాభినంధి లేక యాచరించునట్టి యీపురుషునికి, అది ప్రతిష్ఠ (అనఁగా స్వర్గాదిఫలములను సాధించి యిచ్చునట్టు) కానేరదు; (కాబట్టి సాంసారికఫలసాధన మగుకర్మయోగమునుండి భ్రష్టుఁడగుచున్నాఁడు.) మఱి వాఁడు ఆత్మప్రాప్తికి మార్గమగు యోగమును ప్రారంభించినవాఁడైనను విమోహమువలన దానినుండి చ్యుతుఁ డగుచున్నాఁడు; (కాన ఆత్మ ప్రాప్తిసాధన మగుయోగమునుండియు భ్రష్టుఁ డగుచున్నాఁడు.) కాఁబట్టి ఇట్లు కర్మయోగమువలన స్వర్గాదిఫలప్రాప్తిగాని యోగమువలన ఆత్మప్రాప్తిగాని లేనివాఁడై, యుభయ భ్రష్టుఁడగువీఁడు, ముం దున్న పెద్దమేఘమునుండి చీలి, వెనుక నున్నట్టి వేఱొక పెద్దమేఘముతోను గూడికొనక, నడుమ నశించుమేఘఖండమువలె రెంటికిం జెడి నశించిపోవఁడుగదా, కృష్ణా, ఉభయభ్రష్టతవలన వీఁడు నశించియేతీఱునో, లేక, నశింపకుండునో (భోగమోక్షములలో నొక ఫలము నైనను బొందునో) యీసంశయమును నిశ్శేషముగాఁ దొలఁగించుటకు నీవ యర్హుఁడవు. స్వయముగా సమస్తము నెప్పుడును ఏకకాలమున ప్రత్యక్షముగా కనుఁగొనునట్టినీవు తక్క వేఱొక్కఁడు ఈనాసంశయమును బోఁగొట్టుట కర్హుఁడు కాఁడు గదా.

శ్రీ భగవా నువాచ:

శ్లో॥ పార్థ నై వేహ నాముత్ర వినాశ స్తస్యవిద్యతే ।
న హి కల్యాణ కృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి॥ 40

టీ. హేపార్థ=ఓయర్జునా, తస్య = యోగము నుపక్రమించి దానినుండి భ్రష్టుఁడైనవానికి, ఇహ = ప్రాకృతస్వర్గాదిభోగానుభవమందు, వినాశః=(కోరినది లభింపకపోవుట) నాశము, న విద్యతే ఏవ= కలుగనేరదు, అముత్ర చ = అనఁగా బ్రహ్మానుభవమునందును, న (విద్యతే) = (అట్టినాశము) కలుగనేరదు, తాత = తండ్రీ, కల్యాణ

కృత్ కశ్చిత్ = శుభరూపమగు యోగముచేయువాఁడెవ్వఁడుగాని, దుర్గతిం=చెడుగతిని, న గచ్ఛతి హి=పొందఁడు గదా.

తా. అర్జునా, *శ్రద్ధతో యోగము నారంభించి పిదప దాని నుండి భ్రంశము నొందినవానికి ప్రాకృతస్వర్గాది భోగానుభవమందుఁ గాని బ్రహ్మానుభవమందుఁగాని తాను కోరినది లభింపక పోవుటయు ప్రత్యవాయము నెడియనిష్టము కలుగుటయును లేదు. నాయనా! నిరతిశయకల్యాణరూపమగు యోగము చేయువాఁ డెవ్వఁడును కాలత్రయమునందును దుర్గతిని జెందఁడు గదా.

అవ. వాఁడు మఱి యెట్లగు ననగా జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ 41

---

* ఇట కర్మఫలము యోగసిద్ధి అను రెండుపురుషార్థములకొఱకు అన్వయమును జెప్పి యీ రెంటినుండి భ్రంశము నొందుటను బరిహరించుచున్నారు. ఇందు 'ఇహ' 'అముత్ర' అనుట భూలోక స్వర్గలోకాది పరములు గావని పరిహరించి 'ప్రాకృత స్వర్గాదిభోగానుభవము' అనియు 'బ్రహ్మానుభవము' అనియు నర్థము సేసిరి. ముముక్షువునకు పుణ్యముకూడ పాపమువంటిదే కాన దానికి పుణ్యఫలములైన స్వర్గాదులు గూడ భూలోకాదులవలెనే 'ఇహ' శబ్దముచే నిర్దేశింపదగియున్నది గాన 'ఇహ' అనుటకు 'ప్రాకృతస్వర్గాదిభోగానుభవ' మనఁబడెను. ఇట 'వినాశ' శబ్దము 'ప్రత్యవాయోన విద్యతే' అని పూర్వోక్తమైన ప్రత్యవాయమునుగూడ సంగ్రహించుచున్నది గాన 'ప్రత్యవాయము నెడియనిష్ట...' అనఁబడెను. కల్యాణమనఁగా సామాన్యమైన కల్యాణము గాక నిరతిశయకల్యాణమైన ప్రస్తుతయోగమునఁ బర్యవసించుటను దెలుపుటకై 'నిరతిశయ.... యోగము' అనఁబడెను. 'గచ్ఛతి' అని అనవచ్ఛిన్నమైన వర్తమాననిర్దేశమువలన 'కాలత్రయమునందును' అని ఫలితము. అనఁగా యోగము అనేక కాలమునుండి పెరుగుచున్న యనంతపుణ్యముచే సిద్ధించునది గాన నింతకుమునుపుగూడ దుష్కృతము లేదయ్యెను. ఇప్పుడును అది నిరతిశయ కల్యాణమై వర్తించుచున్నది. ఇకమీఁదను దానివలన పుణ్యలోకప్రాప్తి యోగసిద్ధి అపవర్గము మొదలైనవి కలుగనున్నవి. కావున కాలత్రయమునందును దుర్గతిలేదని భావము. లేక దుర్గతి యనఁగా నరకమని గాని యనిష్టమాత్రముగాఁ గాని గ్రహించినచో యోగము నుపక్రమించినవాని కట్టిదుర్గతి గలుగదని భావము

టీ. యోగభ్రష్టః = యోగభ్రష్టుఁడు, పుణ్యకృతాం = అతి పుణ్యము చేసినవారియొక్క, లోకాన్ = స్వర్గాది లోకములను, ప్రాప్య=పొంది, శాశ్వతీః=అనేకము లగు, సమాః=సంవత్సరములు, ఉషిత్వా=అచట వసించి, శుచీనాం=పరిశుద్ధు లగు-సదాచారశీలము గల, శ్రీమతాం = శ్రీమంతులయొక్క, గేహే = గృహమందు అభిజాయతే=పుట్టుచున్నాఁడు.

తా. *యోగమును ఉపక్రమించి భ్రష్టుఁడైనవాఁడు, అతి

---

* ఉభయపురుషార్థములంగోడి యన్వయమును 'ప్రాప్య' అనుట మొదలుకొని 'పరాంగతిమ్' (41-45) అనువఱకును విస్తరించి చెప్పుచున్నారు. ఇందు యోగము నుండి భ్రంశము నొందుటకు హేతువును, పుణ్యలోకప్రాప్తివలన నతిశయించిన ప్రాకృతపురుషార్థముల ననుభవించుటకు కర్మమనెడిసాధనము లేకపోయినను యోగమాహాత్మ్యమే సాధన మగుటయు, భోగములనుండి విగమింపఁజేయు విరక్తిని బుట్టించి యోగారంభయోగ్య లగువారికులమునఁ బుట్టించుటకు మగల యోగమాహాత్మ్యమే హేతు వగుటయుఁ బ్రదర్శించుచున్నారు. 'శుచితింత - కల్యాణము లైన' అనఁగా పూర్ణము తాను గోరినభోగములజాతిలోఁ జేరినవే యైనను దానికంటె నతిశయించినసుఖము గలవి యనుట. పూర్వపుణ్యములచేత పుణ్యలోకప్రాప్తి, పాపములచేత పాపలోకప్రాప్తి యగును గాని యోగమాహాత్మ్యమువలన నేమియు లేదనుపక్షమును నిరసించుటకై 'యోగమహిమచేతనే' యనఁబడినది. అనఁగా ధర్మార్థము సంపాదించిన ద్రవ్యమును భోగార్థముగా వినియోగించునట్లు ఆత్మప్రాప్తికిఁ గాను అనుష్ఠించినయోగమును భోగప్రాప్తికిని నుపయోగించుకొనవచ్చును గాన యోగమహాత్మ్యముననే యట్టియతికల్యాణభోగములం గలుగుచున్నవియని భావము. మఱియు పుణ్యము క్షీణించునట్లు యోగమహాత్మ్యము క్షీణింపదు గాన దానివలని భోగములను క్షీణింపకుండుటచే ఆభోగములం దెంతకాలమువఱకుఁ దృష్ణ యుండునో యంతకాలమును వానిని భోగించుచుండవచ్చునని 'భోగతృష్ణ..వఱకు' అనఁబడెను. మఱియు 'శుచీనాం శ్రీమతాం గేహే' అని యోగి, శుచులును శ్రీమంతులునగువారి గృహమునఁ బుట్టుననుటచే వారిశుచిత్వమును శ్రీమత్త్వమును వానియోగమునకు ఉపకారకములగును గాన వారిని యోగ ముపక్రమించుటకు యోగ్యులయినవారినిగాఁ జెప్పెను. మీఁదిశ్లోకమున 'యోగినామేవకులే' యోగులేయైనవారియింటఁ బుట్టుచున్నాఁడు. యోగయోగ్యులయింటఁ బుట్టు యోగికంటె యోగులయింటఁబుట్టు యోగి యెక్కువయైనవాఁడుగా గ్రహింపవలయును. కాన మొదటియోగి యోగారంభమందు భ్రష్టుఁడైనవాఁడుగాను రెండవయోగి యోగపరిపాకమందు భ్రష్టుఁడైనవాఁడుగాను ఇరువురకు తారతమ్యము గ్రహింపనయ్యె నని తెలియునది.

పుణ్యాత్ములు పొందఁదగినట్టి స్వర్గాదిలోకములను బొంది, ముందు తా నేజాతిభోగముల ననుభవింపఁ గోరి యోగమునుండి చలించినవాఁ డయ్యెనో యాజాతిభోగములను మఱింత మిక్కిలికల్యాణము లైన వానిని యోగమహిమచేతనే యనుభవించుచు, ఆభోగతృష్ణ ముగియు నంతవఱకును బెక్కేండ్లు అక్కడ వసించియుండి, పిదప నాభోగము నందు తృష్ణ మానినవాఁడై, సదాచారశీలము గలవారును ఐశ్వర్యసంపన్నులు నై యుండుటవలన తనయోగారంభమునకు అనుకూలురై యుండువారికులమునందు యోగమహాత్మ్యముచేతనే పుట్టుచున్నాఁడు.

శ్లో॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥ 42

టీ. అథవా=అట్లు కాదేని, ధీమతాం= తామే యోగము నుపదేశింపఁజాలినవా రగు, యోగినాం=యోగము నాచరించుచున్నవారియొక్క, కులే ఏవ=గృహమందే, భవతి = పుట్టుచున్నాఁడు, లోకే= ప్రాకృతు లైనవారికి, ఈదృశం=ఇట్టి, జన్మ=జన్మము, యత్ = ఏది కలదో, ఏతత్ = ఇది, దుర్లభతరం హి = మిక్కిలి దుర్లభ మైనది గదా.

తా. *యోగము పరిపక్వ మగునపుడు దానినుండి చలించిన

---

* ఇట 'యోగినాంకులే' అనుటచే ఒకానొకయోగియొక్క వంశమునందుఁ బుట్టుటగా గ్రహింపగాదు. ఏలన అంతమాత్రముచే, అట్లు పుట్టినవాని యోగమునకు సాహాయ్య మేమియుఁ గలుగదు. యోగియైనవానికే పుత్రాదులుగాఁ బుట్టిననే యతనివలన నుపదేశాదులకు అట్లు పుట్టినవాఁడు పాత్రుఁ డగును. కాన 'యోగినామ్' అనుటకు 'యోగము నాచరించుచున్నవారు' అని యర్థము చెప్పఁబడెను, మఱియు పూర్వశ్లోకమున 'శుచీనామ్ శ్రీమతామ్' అనబడ్డవారు, ఆపుట్టినవాఁడు మఱొక యుపదేష్టవలన యోగోపదేశము నొందుటకు అనుకూలురై మాత్ర ముండువారే కాని తామే యోగము నుపదేశింపఁజాలువారు కారని చెప్పఁబడెను. ఇందు 'ధీమతామ్' అనఁబడ్డవారు, తామే యోగోపదేశము సేయఁజాలువా రని చెప్పఁదగును గాన

వాఁడు, తమంతటనే యోగము నాచరించుచున్నట్టివాఁడును కావుననే యోగము నుపదేశింపఁజాలిన బుద్ధిమంతులును అగువారియింటఁ బుట్టుచున్నాఁడు. ఇట్లు యోగయోగ్యుల గృహమునందుఁ బుట్టుట యోగులగృహమునందుఁ బుట్టుట అను రెండువిధము లైనపుట్టుకలు లోకమున ప్రాకృతము లైనవారికి మిక్కిలి దుర్లభము ఇది యోగ మహాత్మ్యమువలననే కలుగునది.

శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన॥ 43

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।

టీ. హే కురునన్దన=అర్జునా, తత్ర=ఆజన్మమునందు, పౌర్వదైహికం=పూర్వదేహమందుఁ గలిగిన, తం = ఆయోగవిషయమైన బుద్ధితోడి సంబంధమును, లభతే=పొందుచున్నాఁడు. తతః=ఆబుద్ధి సంయోగమువలన, సంసిద్ధౌ = యోగము సిద్ధించువిషయమునందు, భూయః=మరల, యతతే=ప్రయత్నము సేయుచున్నాఁడు, సః = ఆ యోగభ్రష్టుఁడు, అవశోపి=స్వాధీనత (ఇచ్ఛ) లేనివాఁ డైనను, తేన= ఆయోగవిషయమైన, పూర్వాభ్యాసేన ఏవ = పూర్వజన్మాభ్యాసము చేతనే, హ్రియతే=యోగమునందే ఆకర్షింపబడుచున్నాఁడు, హి = ప్రసిద్ధము గదా.

తా. అర్జునా, యోగభ్రష్టుఁడు, ఆజన్మమందును, పూర్వజన్మమునం దనుష్ఠించిన యోగమునుగురించిన బుద్ధితోడ మరలఁ

---

‘తమంతటనే యోగము...వారు’ అనబడెనని తెలియునది. ‘ఈదృశమ్’ ఇటువంటిది. అనఁగా యోగమహాత్మ్యముచేతనే కలుగునది కావుననే దుర్లభమైనదని భావము.

గూడుచున్నాఁడు. ఆ బుద్ధికూడికవలన *నిద్రనుండి మేలుకొన్న వానివలె మరల నేవిఘ్నముచేతను గొట్టువడనట్లు యోగము లెస్సగా సిద్ధించుకొఱకు ప్రయత్నము చేయుచున్నాఁడు. పూర్వము యోగమభ్యసించుచుండినందున ఆ యోగవిషయమైన పూర్వాభ్యాసముచే ఆ యోగభ్రష్టుఁడు వివశుఁడయ్యును మరల ఆ యోగమునందే ఆకర్షింపఁబడుచున్నాఁడు. ఈ యోగమహత్త్వము ప్రసిద్ధము కదా యని యర్థము.

శ్లో॥ జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥ 44

---

* పూర్వదేహమం దారంభించినయోగము శిథిల మగుటవలనను, యోగికులమున జన్మించినంతమాత్రమున మోక్షము కలుగనందువలనను, మోక్షము సిద్ధించుటయెట్లు? అని యడుగఁగా నిందు ఉత్తరము చెప్పఁబడుచున్నది' పూర్వదేహమున సంసారహేతు వయిన బుద్ధియుఁ గలదు కాఁబట్టి 'బుద్ధిసంయోగమ్' అనఁబడినబుద్ధి యట్టి బుద్ధి గాదని తెలుపుటకై 'యోగమునుగుఱించినబుద్ధి' యనఁబడినది. అయినను సంస్కారము లన్నియు మఱియొక జన్మము రాఁగా మఱఁగి మాసిపోవును గాన పూర్వదేహమందలి యోగబుద్ధి యవలిదేహమునందు మాయక యనువర్తించుట యెట్లు? అన్నఁదులకు సుప్తప్రబుద్ధుని (అనఁగా నిదురపోయి లేచినవాని) దృష్టాంత మియ్యఁబడినది. అనఁగా పూర్వజన్మమునందు చేసినవెల్ల మఱుసటిజన్మమందు మఱవఁబడును గాని పుణ్యాత్ముల కట్టిమఱపు కలుగదు. కావున నిద్ర పోయి లేచినవాఁడు నిదురించుటకు మును పు చేయుచుండినకార్యమును మేలుకొన్నపిదప మఱవక యెట్లు చేయునో యట్లే పుణ్యాత్ములు పూర్వజన్మమం దారంభించినయోగమును మఱుసటిజన్మమందు మఱవక గట్టిగా అనుష్ఠింపఁజొత్తురని భావము. 'సంసిద్ధౌ' అనుచో 'సమ్' అను ఉపసర్గమువలన 'ఏవిఘ్నముచేతను కొట్టువడకుండునట్లు' అని సిద్ధించినది. పూర్వాభ్యాసమునకు 'తేన' అను విశేషణము నుంచుటచేత 'యోగవిషయమైన యభ్యాస' మనబడినది. ఏవకారముచేత 'యోగమునందే' యనుటయు ఫలించినది. ఇట 'హి' అని ప్రసిద్ధిని జూపుటచే పుణ్యాత్ములు పూర్వజన్మస్మృతి తప్పక పూర్వానుష్ఠానములను జేయుచుండుట యోగమాహాత్మ్య మనియు, ఈమాహాత్మ్యము ఆదిభరత విదురభీష్మాదులవృత్తాంతమువలన ప్రసిద్ధమే యగుననియు నాశయము. అర్జునుని 'పార్థ' అని మాతృకులశుద్ధియు 'కురునన్దన' అని పితృకులశుద్ధియు సూచించు శబ్దములచే సంబోధించుటవలన నతనికిని 'శుచీనాం శ్రీమతామ్' అనునవి యన్వయించుట సూచితము.

టీ. యోగస్య = యోగముయొక్క (స్వరూపమును), జిజ్ఞాసురపి = తెలియ నిచ్ఛగించినవాఁడును, శబ్దబ్రహ్మ = దేవమనుష్యాది శబ్దములచేఁ బేర్కొనఁదగినది యగుప్రకృతిని, అతివర్తతే = ప్రకృతిబంధమునుండి విడివడుచున్నాఁడు.

తా. *యోగమునందు ప్రవర్తింపక దానిని తెలిసికొనఁగోరికమాత్రము గలవాఁడుసైతము దానినుండి మనసు చలించినవాఁడగునేని మరల దానిని తెలిసికొనవలె ననెడిమనుపటికోరికనే పొందినవాఁడై, కర్మయోగాదులను ఆత్మసాక్షాత్కారరూపమైన యోగమును అనుష్ఠించి దేవమనుష్యాదిశబ్దవాచ్యమైన ప్రకృతియొక్క బంధమునుండి విముక్తుఁడగుచున్నాఁడు. శబ్దబ్రహ్మమనఁగా-దేవుఁడు, మనుష్యుఁడు, భూమి, ఆకాశము, స్వర్గము అనుమొదలయినశబ్దములచేఁ జెప్పఁబడఁదగిన ప్రకృతి. శబ్దబ్రహ్మమును అతివర్తించుచున్నాఁడనగా దేవమనుష్యాది శబ్దవాచ్య మగుప్రకృతియొక్క బంధమునుండి విడివడి దేవమనుష్యాదిశబ్దములచే జెప్పఁదగనిదై జ్ఞానానందైకస్వరూప మై యుండునట్టి ఆత్మను బొందుచున్నాఁడని యర్థము.

శ్లో॥ ప్రయత్నా ద్యతమాన స్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్॥ 45

---

* ఇందు ఒకవిషయమును గురించినవాసనయైనది ఆవిషయము నడుమ విచ్ఛిన్నమయినను మరల ఘటింపఁజేయునని ప్రసంగవశమునఁ దెలుపఁబడుచున్నది. శబ్దబ్రహ్మమనఁగా పరబ్రహ్మముగాదు. ఏలన, నది యతివర్తింపఁదగవిది ఈ కారణమునుబట్టియే జీవాదులును గానేరరు. శబ్దజన్యమగు జ్ఞానమునుగాదు. యోగవిషయమై జిజ్ఞాసగలవాఁడు జ్ఞానము నతివర్తించుట విరుద్ధముగదా. కనుక భోగ్యభోగోపకరణ భోగస్థానములనెడి నానావస్తువులుగఁ బరిణమించి దేవమనుష్యాది నానాశబ్దములచే పేర్కొనఁదగినదియు అతివర్తించుటకుఁ దగినదియు నగు ప్రకృతియే శబ్దబ్రహ్మమనుట యుక్తము.

టీ. తతః=యోగమహాత్మ్యమిట్టిదగుటవలన, సంశుద్ధకిల్బిషః = బొత్తిగా పోయినపాపములు గలవాఁడుగా, అనేక జన్మసంసిద్ధః = అనేకజన్మములచే యోగ్యుఁడైనవాఁడును, యత్నాత్ = అధికమైన పూనికవలన, యతమానః=యోగమునందు ప్రయత్నము చేయుచున్న వాఁడును అగు, యోగీతు=యోగి యున్ననో, (చలించినవాఁడైనను), పరాంగతిం=ఉత్కృష్టమైన ఆత్మప్రాప్తిని, యాతి=పొందుచున్నాఁడు.

తా. *ఈయోగముయొక్క మాహాత్మ్య మిట్టిదగుటవలన. అనేకజన్మములం దార్జించిన పుణ్యసమూహములచే పాపము లెల్ల పోఁగొట్టుకొనినవాఁడై దానివలన లెస్సగా యోగమున కర్హుఁడై యెక్కువపూనికతో దానిని అనుష్ఠించుచుండు యోగియున్ననో, దానినుండి చలించినను మరల నాయోగమును (లేక, దాని ఫలమగు ఆత్మప్రాప్తిని) తప్పక పొందును.

అవ. యోగము అన్నిటిని అతిశయించినపురుషార్థమగుటవలన దానియందు నిష్ఠగలయోగి యందఱికంటె నధికుఁ డనుచున్నాఁడు.

శ్లో॥ †తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున॥ 46

టీ. హే అర్జున = ఓయర్జునా, యోగీ = యోగాభ్యాసము చేయువాఁడు, తపస్విభ్యః= కేవల కృచ్ఛ్రచాంద్రాయణాదితపోనిష్ఠుల కంటెను, అధికః=శ్రేష్ఠుఁడు, జ్ఞానిభ్యోపి = శాస్త్రజన్యజ్ఞానము గల

* ఇంతవఱకును యోగభ్రష్టుఁడయినవానికి మరల దానిసంసిద్ధికై యత్నము చేయునంతవఱకు చెప్పఁబడినది. ఇక నాయత్నమువలననే వాఁడు ఆత్మప్రాప్తి లక్షణమయిన పరమపురుషార్థయోగము నొందుట చెప్పఁబడుచున్నదని తెలియునది.

† యోగమునకుఁ గలయిటువంటిమాహాత్మ్యము తపస్సు మొదలైనవానియందొకప్పుడును గలుగదు. కాఁబట్టి తపస్విప్రభృతులకంటెను యోగియే యధికుఁడని యోగమును యోగిని ప్రశంసించుచు జీవాత్మ యోగోపదేశమును ఉపసంహరించుచున్నాఁ డని తెలియునది.

వారికంటెను, అధికః = అధికుఁడుగా, మతః = తలఁపఁబడినవాఁడు, యోగీ = యోగియగువాఁడు, కర్మిభ్యశ్చ = కేవలము అశ్వమేధాది కర్మములఁ జేయువారికంటెను, అధికః = అధికుఁడు, తస్మాత్ = ఆ హేతువువలన, యోగీ = యోగివి, భవ = అగుము.

తా. *కేవల కృచ్ఛ్రచాంద్రాయణాదితపములచే నేపురుషార్థము సాధింపఁబడునో, ఆత్మజ్ఞానముతప్పఁ దక్కినజ్ఞానములచే ఏది సాధింపఁబడునో, కేవలములైన యశ్వమేధాదికర్మములచే సాధింపఁబడున దేదియో, యాయన్నిటికంటెను అధికమైనట్టి పురుషార్థమును యోగము సాధించునదిగావున ఆతపస్వులకంటెను జ్ఞానులకంటెను కర్ములకంటెను యోగి యధికుఁడై యుండును. అర్జునా, అట్లగుట చేత యోగివిగమ్ము.

అవ. ఇంతవఱకు పరవిద్య యగుభక్తికి అంగమై ప్రజాపతి వాక్యమునఁ జెప్పఁబడిన ప్రత్యగాత్మదర్శనము చెప్పఁబడినది. ఇఁక పరవిద్యయైనభక్తిని ప్రస్తావించుచున్నాఁడు.

శ్లో॥ *యోగినా మపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా ।

---

* యోగికిఁగూడ తపోజ్ఞానకర్మములు గలవు. అయినను వాని తపోజ్ఞాన కర్మములకంటె తక్కినవారి తపోజ్ఞానకర్మములు వేఱైనవి. కాఁబట్టి యిచట తక్కినవారికిఁ గలతపస్సు కేవలతపస్సనియు, వారిజ్ఞానము యోగులజ్ఞానమువలె ఆత్మమగుఱించినది కాక తక్కినవిషయములనుగుఱించినజ్ఞాన మనియు, వారికర్మము యోగులకర్మయోగముగాక కేవలమైన అశ్వమేధాది కర్మము లనియును గ్రహింపఁదగును, ఇట్టి కేవలతపోజ్ఞానాదులచేఁ గలుగు పురుషార్థములకంటె యోగము అధికమైన పురుషార్థ మగుటవలన యోగియైనవాఁడు అట్టికేవలతపోజ్ఞానాదులు గలతపస్వులు జ్ఞానులు మొదలైనవారికంటె నధికుఁ డగును. కావున, అర్జునా, అట్టి యోగివి కమ్మని భావము.

* ఇట్లు జీవాత్మయోగము సమస్తమునకంటెను నధికమైనదిగా ప్రతిపాదించిన పిదప అంతకంటెను పరమపురుషార్థము లేదని వినువారికి బుద్ధినిశ్చయము కలుగునో యని శంకించి ఆయోగమునకంటె అతిశయించినపురుషార్థమును స్వయముగానే సాధించునదియు, దానికి అంగియైనదియు, స్వవిషయమైనదియునగు భక్తియోగమును

శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ 47

టీ. మద్గతేన = నాయందే ఆసక్తమైనట్టి, అన్తరాత్మనా = మనస్సుతో, శ్రద్ధావాన్ = నన్ను పొందుటకు త్వరపడువాఁడై, యః=ఎవఁడు, మాం=నన్ను, భజతే = ఉపాసించునో, సః = అట్టినా భక్తుఁడు, మే=నాకు, యోగినాం=యోగులకంటెను, సర్వేషామపి = తపస్విప్రభృతు లందఱికంటెను, యుక్తతమః = మిక్కిలి శ్రేష్ఠుఁ డని, మతః=తలఁపఁబడినవాఁడు.

తా. †'యోగినామ్' అని పంచమ్యర్థమందు షష్ఠి 'సర్వభూతస్థ

---

మధ్యమషట్కమునఁ బ్రతిపాదించుటకై తానే యిచటఁ బ్రస్తావించుచున్నాఁడని తెలియునది.

† ఇచట 'యోగినామ్' అనుటకు 'యోగులలోపల' అని నిర్ధారణషష్ఠి చెప్పఁబడక 'యోగులకంటె' అని పంచమ్యర్థషష్ఠి చెప్పఁబడినదిగదా. పూర్వము చెప్పఁబడిన నాలుగుయోగులలో 'సర్వభూతస్థితం యో మాం భజతి' అని చెప్పఁబడిన యోగియే 'శ్రద్ధావాన్ భజతే యో మామ్' అని యిట సూచితుఁడైనాఁడు; నాఁడు ఆనలుగురిలోపల 'యుక్తతమః' అని నిర్ధారణముచే ప్రశంసింపఁబడినాఁడు; 'యుక్తతమః' అనుచో తమప్ప్రత్యయము నిర్ధారణార్థక మగును. కనుక నిర్ధారణషష్ఠి చెప్పఁదగియుండఁగా పంచమ్యర్థషష్ఠి యేల? యనఁగా, ఈశ్లోకమున ప్రస్తావింపఁబడు యోగి మధ్యమషట్కమునఁ జెప్పఁబడఁబోవు పరమాత్మోపాసకుఁడగు యోగియేకాని యింతకు మును చెప్పఁబడిన జీవాత్మోపాసకుఁడగు యోగికాఁడు. 'సర్వభూతస్థితం యో మాం భజతి' ఇత్యాదులు సామ్యదర్శనము ననుసంధించినయోగులనుగుఱించిన వని పూర్వమే ప్రతిపాదింపఁబడియున్నవి. మఱియు 'ఆత్మౌపమ్యేన' అను శ్లోకమున 'సర్వభూతస్థితమ్' ఇత్యాదులచే చెప్పఁబడినయోగికంటెను నెక్కుడైన యోగియు పూర్వము చెప్పఁబడియుండుటచే ఈయోగియు సర్వాధికుఁడు గాఁడు గాన నితనిని ఇట సర్వాధికుఁడుగా చెప్పుట పూర్వముతో విరోధించును. కాన నిట చెప్పఁబడినయోగి పూర్వోక్తులైన యోగులలోపలివాఁడు గాక వారికంటె నితరుఁడు గాన నిట పంచమ్యర్థమే యుక్తము. మఱియు 'యోగినామ్' 'అపిసర్వేషామ్' అనుచో 'యోగినామ్' అనబడినవారికే 'సర్వేషామ్' అనునది విశేషణముగా గ్రహించినచో అపిశబ్దమువలన నంతగా ప్రయోజనముగలుగదు ఎట్లన, అపిశబ్దము ప్రసిద్ధినిగాని సముచ్చయమునుగాని తెలుపునది. 'యోగినామపి' 'యోగులకంటెనుగూడ' అని అపిశబ్దము యోగులను బ్రశంసించుట (అనఁగా ప్రసిద్ధిని) ఇట సూచించినదగును. యోగులప్రశంస పూర్వమే తెలిసియున్నదిగాన నిట ననవపరము. మఱియు

మాత్మనమ్' (గీత. ౬-౪౭) ఇత్యాదులచే చతుర్విధులగు యోగులు ప్రతిపాదింపఁబడిరి. వారిలో నంతర్యామి తుఁడు కామిచే చెప్పఁబడఁ బోవుయోగికి నిర్ధారణమున షష్ఠి సంభవింపదు. 'అపి సర్వేషామ్' అని సర్వశబ్దముచే తపస్విప్రభృతులు నిర్దేశింపఁబడిరి. అందును ఉక్తన్యాయమున పంచమ్యర్థము గ్రహింపవలయును. యోగులందఱ కంటెను చెప్పఁబడఁబోవు యోగి శ్రేష్ఠతముఁడు. అతనితోఁ బోల్పఁగా తపస్విప్రభృతులును యోగులును అతనికి తక్కువై యుండుటయందు సమానులే కాని ఒకరికన్న నొకరు విశేషించినవా రెంతమాత్రమును గారని యర్థము. *మేరువును బట్టిచూడఁగా ఆవగింజలవలె, ఆవగింజ

---

'సముద్రాదపి అయం విపులః' అని సముద్రమునకంటె విపులము గానిదానిని ప్రశంసా పరముగా సముద్రమునకంటె విపులమైనదిగా చెప్పినట్లు యోగులకంటె అధికుఁడు గానివానిని ప్రశంసాపరముగా నధికుడన్నట్లు విపరీతప్రతీతియుఁ దోఁపవచ్చును. 'అపి' యొక్క ప్రశంసార్థకమును వదలి సముచ్చయార్థకము నాశ్రయింతము. అప్పుడు 'యోగినామపి' అని యింతమాత్రమే సముచ్చయమునకుఁ జాలును గాన 'సర్వేషామ్' అనుట యక్కఱలేదు. కాఁబట్టి సర్వశబ్దము యోగులకు విశేషణముగా గ్రహించుట యొప్పకున్నది, కాన 'యోగినామ్' అని యొకరిని 'సర్వేషామ్' అని వేఱొకరిని గ్రహించి యిరుతెగలను 'అపి' చే సముచ్చయము చేయుట యుక్తము. అందు 'యోగినామ్' అని చతుర్విధులైనయోగు లేర్పడిరి. 'సర్వేషామ్' అనుటచే మఱొకరి నేర్పఱచుట యుక్తము. కాన సర్వశబ్దముచే ఆయోగులకంటె నితరులై యింతవఱకే ప్రసక్తులైయున్నతపస్విప్రభృతులను గ్రహించుటే యొప్పియున్నది. కాన 'అపిసర్వేషామ్...నిర్దేశింపఁబడిరి' అనఁబడినది. యోగులకంటె తక్కువగా నుండు తపస్విప్రభృతులను గ్రహించుట యేల? యనఁగా ఉభయులును ఇట చెప్పఁబడు యోగికి తక్కువై యుండుటయందు సమానులే కాన తక్కువపాటునందు యోగులతోఁగూడ తపస్విప్రభృతులను సమముగా గ్రహించుట దోషము కాదని తెలియునది.

* 'యోగితోఁ బోల్పఁగా తపస్విప్రభృతులును యోగులును అతనికి తక్కువై యుండుటయందు సమానులే కాని యుభయులకు భేదము లేదు' అనుటచే తపస్విప్రభృతులును యోగులును సమాను లని ప్రసక్తి కలుగును. కావున మేరుసర్షప దృష్టాంత మియ్యఁబడినది. అనఁగా ఆవగింజలు మేరువునకు తక్కువై యుండుట యందు అన్నియు సమానములే యైనను ఒకటి కొకటిమాత్రము ఎక్కువతక్కువలుగానే యుండునట్లు, యోగులును తపస్వులును ఈయోగికి తక్కువై యుండుటయందు

లలో నొండొంటికి ఎక్కువతక్కువ లుండినను మేరువునుబట్టి చూడఁగా దానికి తక్కువై యుండుటయందు అవన్నియు సమానములే యని నిర్దేశింపవచ్చును. ఎవఁడు నన్ను అత్యంతప్రియునిగాఁ గొని నా యందలి ప్రీత్యతిశయమువలన నేను దప్ప మఱొకటి ధారకముగా లేనిస్వభావము గలవాఁడై యుండుటచే నాయందు మనస్సు నుంచి యిట్టియత్యంతప్రియుఁడనగు నన్నెడఁబాసి క్షణమాత్రము నోర్వఁ జాలకుండుటచే మత్ప్రాప్తివిషయమున త్వరగలవాఁడై నన్ను

† అనఁగా విచిత్రానంత భోగ్య భోక్తృవర్గ భోగోపకరణ భోగస్థానపరి

సమానులే యైనను ఒకరికొకరు మాత్రము ఎక్కువతక్కువలుగానే యుందురని భావము.

† ఇది మొదలుగా పన్నెండు విశేషణములచేత శ్రుతిస్మృత్యాది సిద్ధములై ఉపాసనోపయుక్తములయిన యాకారములను భజనీయుఁడగు తనకు చెప్పికొనుచున్నాఁడు. అందు 'విచిత్రానంత' అనుట మొదలుకొని 'వాఙ్మనసాపరిచ్ఛేద్య స్వరూపస్వభావుఁడును' అనువఱకును పరత్వమున కుపయుక్తము లయిన విశేషణము లనియు, తక్కినవి సౌలభ్యమున కుపయుక్తములయిన విశేషణములనియుఁ దెలియునది. మఱియు 'విచిత్రా . లీలుఁడును' అనుటచే జగత్కారణత్వమును తన్మూలమున లీలావిభూతియోగమును ప్రతిపాదించినాఁడు. పిదప ఆకారణత్వమువలన గుణమయము లగు ప్రకృత్యాదులతోడిసంబంధముచే తనకును దోషవత్త్వమును గుణవైకల్యమును కలుగునో యని శంకరాఁగా 'అస్పృష్ట ..నిధియు' అని దోషలేశరాహిత్యము కల్యాణగుణైకస్వరూపత్వము అను ఉభయలింగములను బ్రతిపాదించినాఁడు. పిదప 'స్వాభిమత ..రూపుఁడును' అని శుభాశ్రయమైన యప్రాకృత విగ్రహమును దెలుపుచు తన్మూలమున దివ్యాభరణాయుధ మహిషీపరిజనాదులను బ్రదర్శించుచు నిత్యవిభూతియోగము సూచించినవాఁ డయ్యె. ఇట్లు ఉభయవిభూతియోగమును ఉభయలింగత్వమును జెప్పి తన్మూలమున కేవలపరత్వమునందు ఉపాసనమున కందరానివాఁ డగుట 'వాఙ్మ...స్వభావుఁడును' అని చెప్పినాఁడు పిదప అవతారసౌలభ్యమునకు హేతువు లయినవానిని 'అపార...దధియు' అని చెప్పినాఁడు. ఇట విశేషము లనఁగా జాతి, గుణము, వృత్తము, విద్య మొదలయినవని తెలియునది. ఇట్లు శరణ్యుఁ డగుటకు వలయు కారుణ్యాదులం చెప్పి శరణ్యత్వమువలన ఫలించిన ఆశ్రితవిరోధినిరసనత్వమును 'ప్రణతార్తిహరుండును' అన్నాఁడు. ఇతరగుణములతో పాటుగా వాత్సల్యగుణమును జెప్పియున్నను దానితో తనకుఁగలవిశేషసంబంధమును,

పూర్ణ నిఖిలజగదుదయ విభవలయలీలుఁడును, అస్పృష్టాశేషదోషాన
వధికాతిశయజ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజఃప్రభృత్యసంఖ్యేయ
కల్యాణగుణగణనిధియు, స్వాభిమతానురూపైకరూపాచిన్త్య దివ్యా
ద్భుతనిత్య నిరవద్య నిరతిశయౌజ్జ్వల్య సౌన్దర్య సౌగన్ధ్య సౌకుమార్య
లావణ్య యౌవనా ద్యనంతగుణనిధిదివ్యరూపుఁడును, వాఙ్మనసాఽపరి
చ్ఛేద్యస్వరూపస్వభావుండును. అపార కారుణ్య సౌశీల్యవాత్సల్యౌ
దార్యమహోదధియు, అనాలోచిత విశేషలోకశరణ్యుఁడును, ప్రణ
తార్తిహరుఁడును, ఆశ్రితవాత్సల్యైకజలధియు, అఖిలమనుజనయన
విషయత్వము నొందినవాఁడును, అజహత్స్వభావుఁడును, వసుదేవ
గృహమునం దవతరించినవాఁడును, అనవధికాతిశయం బగు తేజముచే
జగమంతయు వెలిగించుచున్నవాఁడును, నిజకాంతిచే సమస్తమును
ఆప్యాయితముఁ జేయుచున్నవాఁడు నగునన్ను-భజించుచున్నాఁడో
(అనగా సేవించుచున్నాఁడో-ఉపాసించుచున్నాఁడో) యతఁడే ముందు
చెప్పఁబడిన చతుర్విధయోగులు తపస్వులు మొదలైనవా రందఱికం
టెను శ్రేష్ఠుఁ డని, సర్వమును సర్వదా యథావస్థితముగా, నాయం
తటనే, సాక్షాత్కరించుచుండునట్టి నేను దలచుచున్నాను. 19

---

విశేషించి యది యవతారములందు తనకు కార్యకారియగుటయు, సాపరాధులైన
వారును తన్నుజూచి భయపడకుండుటకును, జ్ఞానాదిశూన్యత కలిగియున్నపుడును
తానే రక్షకుఁడై యుండుటం దెలుపుటకును, తనయెడల వైముఖ్యము నివర్తించుట
కును, మరల 'ఆశ్రిత వాత్సల్యైకజలధి' అనుదానినే చెప్పినాఁడు. ఈ చెప్పఁ
బడిన కారుణ్యాదిగుణములచే ప్రకృతావతారమునకు, తక్కినయవతారములకంటె,
గలిగిన వైలక్షణ్యమును 'అఖిల...నొందినవాఁడును' అనంబడినది. అవతారదశ
యందే పరత్వసౌలభ్యములను సూచించునట్టి 'తేజస్సు' 'కాంతి' యను నవతార
విగ్రహ గుణవిశేషములను 'అనవధికా...ఆప్యాయితముఁ జేయుచున్నవాఁడును'
అన్నాఁడు. ఇచట తేజ మనఁగా భాస్వరత్వము-నిగనిగ మెఱయుట, కాంతి
యనఁగా రామణీయకము - ఇంపుగా నుండుట; లేక లావణ్య మనెడి వెన్నెలవంటి
ప్రభ యని కాని తెలియునది. దీనివలన 'అనౌపమ్యేన వపుషా హ్యమూర్తో
మూర్తతాంగతః । విశ్వమాప్యాయయన్ కాన్త్యా పూర్ణేన్ద్వయుతతుల్యయా॥
(సాత్వతసంహిత-౨-౭౦) అనుట స్మరించునది.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే ఆత్మసంయమ
యోగోనామ షష్ఠోఽధ్యాయః.

ఇది యుపనిషదర్థ ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ
శాస్త్రంబును శ్రీ కృష్ణార్జునసంవాదరూపంబును నగు
శ్రీ భగవద్గీతలయందు ఆత్మసంయమయోగం
బన్నది షష్ఠాధ్యాయము.
ప్రథమషట్కము సంపూర్ణము.



## ఆరవఅధ్యాయము - విశేషాంశములు

2 శ్లో॥-(1)

ఇచ్చట సంకల్ప శబ్దమునకు 'చేయుదును' అను తలంపును గూర్చిన యర్థమును చెప్పరాదు.

దానిని విడిచిన నిక కర్మ నాచరించుటయే దుర్ఘటము.

'ఫలవాంఛ' యనియు నర్థమును చెప్పరాదు. అట్లు చెప్పినచో కర్మయోగమునందు జ్ఞానయోగ మంతర్భూతమై యుండునని సమర్థించుట కేమి చెప్పినట్లగును. కావున ఆ యర్థము నిరర్థకమే.

సంకల్పము కామమునకున్ను కర్మలకున్ను కారణము. అట్టి సంకల్పమున్ను యిచ్చట చెప్పబడదు. అందులకు కారణము చెప్ప దలంచిన కర్మయోగమున జ్ఞానయోగ మంతర్భూత మనుటలో ఉపపాదకము కాకుండుటయే.

కావున- సం అనగా ఏకీభావము. అనగా దేహాత్మభ్రాంతి యని యర్థము. తత్వజ్ఞానముచే దానిని విడువవలెను.

5 శ్లో॥-(2)

యోగారూఢావస్థను సంపాదించి ఆత్మను సంసారసాగరము నుండి పైకి లేవతీయవలెను గాని దానియందు ముంచరాదు. రెండింటికిని మనస్సొక్కటియే కారణము.

5 శ్లో॥-(3)

ఇతర బాహ్యబంధువులు మోక్షవిరోధులగుటచే నబంధువులు.

5 శ్లో॥-(4)

ఇతరశత్రువులు ఆత్మప్రవృత్తికే కారణభూతులగుదురు. కావున శత్రువులు కానేరరు.

6 శ్లో॥-(5)

ఈశ్లోకమున నాత్మశబ్దమునకు మన స్సని యర్థ మెట్లు? ఇతర వ్యాఖ్యానకర్తలు 'కార్యకరణసంఘాత' మని యర్థమును గ్రహించిరే? ఇచ్చట నున్న సమస్తాత్మ శబ్దములకును స్వాత్మపరముగా నర్థము నేల చెప్పరాదు?

విషయములనుండి మనస్సును మరలించుట యనెడు మనోజయ మని యర్థ మెట్లు? అన్నచో- దీనిని కర్మగాను కర్తనుగాను అన్వయించవలసియుండుటచే వానికి భేద ముచితమే గాన నీయర్థమే సమంజసము.

మరియు పూర్వోత్తర గ్రంథ సందర్భమున్ను దీనినే బలపరచుచున్నది. దీని కనుకూలమైన నభియుక్తోక్తియు గలదని ప్రమాణ శ్లోకము నుదహరించిరి.

9 శ్లో॥-(6)

సమబుద్ధిః-

ఇచ్చట కొందరు వ్యాఖ్యానకర్తలు 'మయా సహావర్తత ఇతి సమః' శ్రీమన్నారాయణః- తద్బుద్ధిః సుహృదాదిషు- అనగా సుహృ

న్మిత్రాదులయందు ప్రహ్లాదునివలె భగవద్బుద్ధి కలవాఁడు 'విశిష్యతే' గొప్పవాడని తాత్పర్యమును వర్ణించిరి.

'విష్ణు శ్శస్త్రేషు యుష్మాసు మయి చాసౌ యథాస్థితః' అనియు విష్ణు. పురా. ప్రహ్లాదవచనము.

చిన్తయ సర్వం చిదచిద్రూపం।
తను రితి తస్య హరే రనురూపమ్।
తస్మాత్కస్మిన్ కలయసి కోపం।
పశ్చా ద్భజసి దురాపం తాపమ్॥

అను భజయతిరాజశ్లోకమును యీ యర్థమును సమర్థించుచున్నవి.

10 శ్లో॥-(7)

ఇచ్చట సతతం అనగా- సర్వకాలములయం దను నర్థము కాదు. అది అశక్యమును, అశాస్త్రీయమును కావున యోగాభ్యాస మునకై అనుకూలముగా శాస్త్రమున నిర్ణయింపబడిన సత్త్వగుణ మును వృద్ధిపరచునట్టి సమస్తకాలములయందు నని అర్థము.

11 శ్లో॥-(8)

శుచౌ-

శుచిశబ్దమును సంకోచించుటకు ప్రమాణము లేదు గాన ఒక దాని సంబంధముచే వచ్చిన అశుచిత్వముగాని స్వతస్సిద్ధమైన అశు చిత్త్వముగానిలేని ప్రదేశమని యర్థము చేయబడినది. ఇయ్యది శాస్త్రాంతరములలో చెప్పబడిన శోధకత్వమునుకూడా లక్షణయా చెప్పును.

శుచీభూత అని చ్విప్రత్యయము లేకుండుటచే సహజమైన శుద్ధికల ప్రదేశమని యర్థము. నదీతీరము, దేవాలయము, పర్వత గుహ మొదలైన ప్రదేశము.

11 శ్లో॥-(9)

నాత్యుచ్ఛ్రితం నాతి నీచం- ఇది ప్రత్యక్ష సౌకర్యమును తెలుపు పదములు.

17 శ్లో॥-(10)

యుక్త శబ్దమున కర్థము-

ఉదరస్యార్థ మన్నస్య తృతీయముదకస్యతు ।
వాయోస్స ఞ్చరణార్థం తు చతుర్థ మవశేషయేత్ ॥

తనపొట్టలో సగముభాగము అన్నమునకును, మూడవభాగము నీళ్ళకున్ను, నాల్గవభాగము ఊపిరి యాడుటకును ఉంచవలెను.

హెచ్చుతగ్గు లుండకుండుటకై యుక్త శబ్దము వాడబడినది,

ద్వంద్వసమాసమునందలి పూర్వశబ్దము సన్నిహితశబ్దముతోవలె అందున్న వ్యవహిత శబ్దముతోను అన్వయించును, అందుచే 'యుక్తాహారము, యుక్తవిహారము' అని యన్వయించవలెను.

విహారమనగా సంచారము లేక బద్ధకము కునికిపాట్లు పోగొట్టు వినోదమనియును చెప్పవచ్చును.

చేష్ట యనగా- శ్రమవలనబుట్టు ఆయాసము.

17 శ్లో॥-(11)

ఆత్మసంయమయోగ మనబడు నీ యధ్యాయమున ఆహారము నకు ప్రాధాన్య మొసంగబడినది. అందులకు కారణము 'అన్నమయం హి సోమ్యమనః' అను సద్విద్యావాక్యమే. మన స్సన్నమయ మగుట నచ్చటనే ప్రత్యక్షముగా ఋజువుచేయబడినది. పదునైదు దినము లన్నమును తినకుండుటచే చదివినదంతయు జ్ఞాపకము లేక పోవుట తిరిగి యన్నమును తినుటచే నది జ్ఞాపకమునకు వచ్చుటయు నందు చెప్పబడి మన స్సన్నపరిణామమని చక్కగ నిరూపింపబడెను. అనగా- తినబడిన అన్నములోని మిక్కిలి సూక్ష్మాంశమువలన మన స్సాప్యాయితమై శక్తిమంత మగును.

18 శ్లో॥-(12)

అవతారిక-

ఇట్టి యోగాభ్యాసపరికరములను చెప్పి వెంటనే యోగదశను తెలుపవలసియున్నది. కాని దానికి ముందుగా వెనుకనే చెప్పబడిన యోగయోగ్యదశ జ్ఞాపకము చేయబడుచున్నది.

29 శ్లో॥(13)

అవతారిక-

ఇంతవరకును యోగాభ్యాసవిధి విశదీకరింపబడినది.

'ఆత్మలాభ సుఖంయావత్ । తావద్ధ్యానం విధీయతే॥'

అనునట్లు ఆధ్యానమును ఆత్మలాభము కలుగువరకును చేయవలయు ననియు చెప్పబడెను.

29 శ్లో॥-(14)

ఆత్మలకు పరస్పరమును ఆధారాధేయభావ మెట్లు ఘటించును?

అణువగు నాత్మ సర్వభూతములయం దెట్లుండును? విభిన్న స్థానములయందున్న ఆత్మలకు ఒకేచోటనున్న తనయాత్మయందు నెలకొనియుండుట ఎట్లు ఘటించును? కావున నిచ్చట ఆత్మశబ్దము నకు పరమాత్మ యర్థమని చెప్పిన చక్కగ సమన్వయము కావచ్చునే యున్నచో చెప్పుచున్నారు,

29 శ్లో॥-(15)

ఇతడు తన యాత్మను మాత్రము అనుసంధించుట యనెడు యోగము నారంభించి యిప్పుడు ఆత్మల నన్నిటిని తనతో సమానాకారము కలవానినిగాను తన ఆత్మ వానితో సమానాకారము కలదిగను- ఆయాత్మల నన్నిటిని చూచుట పొసగు టెట్లనిన-

సన్నికర్ష లౌకిక సన్నికర్ష-అలౌకిక సన్నికర్షయని రెండు విధములు. అలౌకికసన్నికర్ష జ్ఞానలక్షణా, సామాన్యలక్షణా, యోగజ

లక్షణా యని మూడువిధములు. అందు సామాన్యలక్షణానన్ని కర్థచే నిది పొసగునని చెప్పుచున్నారు. అనగా ఒకేజాతికి చెందిన పదార్థము లలో నొక్కదానిని జూచిన స్థాలీపులాకన్యాయముగ ఆ జాతికి చెందిన వన్నియు నిట్లే యుండునని తెలియదగియున్నవి.

33 శ్లో॥-(16)

'మధుసూదన' యను సంబోధనకు-

కృష్ణా! నీవు రజస్తమోమయములగు ప్రబలమైన విరోధు లను స్వభావము కలవాడవు. కావున నీవే మనస్సును స్వాధీనపఱచు కొను ఉపాయమును సెలవిమ్మని భావము.

34 శ్లో॥-(17)

మనస్సును వశపరచుకొనుటకు సాధన మేదైనను దుర్బల మైనదియే యని తెలుపుటకును, ప్రబలమగు గాలిని దుర్బలమైన విసనికఱ్ఱ మొదలగునవి నివారింపజాలవనియును తెలుపుచున్నాడు.

అర్జును డిట్లు ప్రశ్నించుట దుష్కరమని విడుచుటకు కాదు. మరి ఉపాయము నెఱింగి సాధించుటకే.

35 శ్లో॥-(18)

మనస్సును స్వాధీనపఱచుకొనుటకు కర్మయోగమే ముఖ్య సాధనము.

అభ్యాసవైరాగ్యములు దాని కంగములుగా జెప్పబడినవి.

47 శ్లో॥-(19)

46వ శ్లోకమున యోగానుష్ఠానపరు డండఱికన్నను మిన్న గావున నీవా యోగానుష్ఠానపరుడవు కమ్మని యర్జునున కాదేశింపగా నాత డంతకు మించిన పురుషార్థము లేదని నమ్మి దానియందే నిలచి పోయి పరమపురుషార్థమునకు దూరు డగునని భయపడి పరమాత్మ స్వయముగనే మధ్యమషట్కమునందు విస్తారముగా దెలుపబోవు భక్తియోగమునకు బీజన్యాసమును జేయుచున్నాడు.

ఇంతవరకు వినిన యర్జునున కికముందు ఆరధ్యాయములతో భక్తియోగమును గూర్చి చెప్పెదను వినుమని జెప్పిన వినుకునుచెంది వినడను భయముతో తనంతనే ప్రశ్నించి తెలుసుకొనవలెనను జిజ్ఞాస కలుగునటుల సంగ్రహముగ

'సమే యుక్త తమో మతః' అని విడిచెను.

ఈ యుపదేశ నైపుణ్యమున కొక ఉదాహరణము కలదు.

ఒక మహాపండితుడు కరువుచే కుటుంబమును బోషించుకొన జాలక భారత-రామాయణకోశముల నొకబండి కెక్కించి యొక రాజసదనమున కేగి తానొక పండితుడననియును భారత రామాయణములను బాగుగ చెప్పగల ననియును ఆ రాజును వినుమని ప్రార్థించెను. రా జాగ్రంథముల పరిమాణమును కాలక్షేపపరిమితిని యెఱింగి ప్రబంధగౌరవమునకు భయపడి తనకు వానిని వినుటకు తీరిక లేదని విరమించెను. అంత నాబుద్ధికుశలుడగు నా పండితుడు ఒక్క శ్లోకము నైనను వినుమని-

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ మూర్ఖౌ ।
సుయోధన దశాననౌ ।
గోగ్రహణం వనభఙ్గంచ ।
దృష్ట్వా యుద్ధం ముహుర్ముహుః॥

అను నొకశ్లోకమును జదివి యర్థమును వివరించెను. అంత నారాజునకు ఆ గోగ్రహణమేదియో, ఆ వనభంగమేదియో వాని నెవ్వ రెప్పుడెందుల కెట్లుచేసిరో వానిని జూచియును యుద్ధమునకు సిద్ధపడిన నామూర్ఖు లెవ్వరో ఆ కథనంతను సవిస్తరముగ చెప్పుమని ప్రార్థించి ఆ పండితు నాదరించి కార్యాంతరవిముఖుడై కొన్ని సంవత్సరములు వినుగు విరామము లేకుండగ నా రెండు ఇతిహాసములను వినెనట.

అటులనే మిగిలిన 12 అధ్యాయములును భగవాను డర్జునున కుపదేశించెను. దానినా యర్జును డెంతయో శ్రద్ధాభక్తులతో వినెను.

## గీ తా ర్థ సం గ్ర హ ము

## ఆ ర వ అ ధ్యా య సా ర ము

10 శ్లో॥ యోగాభ్యాస విధిర్యోగీ।
చతుర్ధాయోగసాధనమ్।
యోగసిద్ధి స్స్వయోగస్య।
పారమ్యం షష్ఠఉచ్యతే॥

### తా త్ప ర్య ము-

ఆత్మావలోకన మనెడు యోగము నభ్యసించు పద్ధతియును, యోగి నాలుగువిధములగుటయును, యోగసాధనములైన అభ్యాస వైరాగ్యములును, మధ్యవిడిచినను యోగ మనర్థముల నాపాదించదనియును, చేసినంతకే పుణ్యలోకములు లభించు ననియు, అట్లు మధ్యే విచ్ఛిన్నమైనయోగము తుదముట్టుటకు తగిన శ్రేష్ఠుల వంశమున బుట్టు ననియు, అట్లారంభించి విడుచుటచే ప్రత్యవాయము లేదనియుం భక్తిరూపభగవదుపాసనము భగవద్ధ్యానమే యగుటచే మిక్కిలి గొప్పదనియు, నారవ యధ్యాయమున జెప్పబడెను.



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

## ద్వి తీ య ష ట్క ము

ప్రతిపదార్థ - తాత్పర్య- రామానుజభాష్య
ఆంధ్రానువాద సహితము

ర చ యి త లు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణరామానుజజీయరుస్వామివారు

తాత్పర్య చంద్రికావివరణ
విశేషార్థములు
న్యాయవేదాంత విద్వాన్
తె. కం. గోపాలాచార్యస్వామివారు

ప్ర కా శ న ము
శ్రీ మదుభయ వేదాంతాచార్యపీఠము

వెల 15.00

# శ్రీ భగవద్గీతా - సప్తమోఽధ్యాయః

## విజ్ఞానయోగః

—//—

### అవతారిక

1

*పరమప్రాప్యభూతుఁడును పరబ్రహ్మమును నిరవద్యుఁడును నిఖిలజగదేకకారణుఁడును సర్వజ్ఞుఁడును సర్వభూతుఁడును సత్యసంకల్పుఁడును మహావిభూతియు నగు శ్రీమన్నారాయణుని ప్రాపించుటకు వానియుపాసనమే ఉపాయము. అట్టియుపాసనమును జెప్పఁబూని ముందు దానికి అంగమైనదియు ఆత్మజ్ఞానపూర్వకకర్మానుష్ఠానముచే సాధింపఁదగినదియు నైన ప్రత్యగాత్మస్వరూపదర్శనము ప్రథమషట్కమున (మొదటి యాఱధ్యాయములందు) చెప్పఁబడినది. ఇప్పుడు మధ్యమషట్కమున (నడిమియాఱధ్యాయములందు) పరబ్రహ్మభూతుఁడైన పరమపురుషుని స్వరూపమును, భక్తిశబ్దవాచ్య

---

*శుద్ధజీవుఁడు ప్రాప్యుఁడు. వానికంటె నెక్కుడుగా ప్రాప్యుఁడగుటచే నీశ్వరుఁడు పరమప్రాప్యుఁడు. పరమప్రాప్యుండగుటకు హేతువు పరబ్రహ్మత్వాది లక్షణములు కలిగియుండుటయే. ఇట చెప్పఁబడిన పరమప్రాప్యత్వాదులు మధ్యమషట్కమునం దయ్యెయెడలఁ బ్రతిపాదింపఁబడియున్నవని తెలియునది. ఎట్లన, 'మా ముపేత్య పునర్జన్మ' ఇత్యాదులందు పరమప్రాప్యత్వమును, 'పరంబ్రహ్మ పరంధామ' ఇత్యాదులచే పరబ్రహ్మత్వమును, పురుషోత్తమత్వప్రకరణాదులందు నిరవద్యత్వమును (అనఁగా చిత్తు, అచిత్తు, వీనిసంబంధమువలనఁ గలుగు వికారక్లేశాదు లనెడు దోషములు లేకుండుట), 'అహం సర్వస్య ప్రభవః' ఇత్యాదులందు నిఖిలజగదేకకారణత్వమును, 'మత్తః పరతరం ఇత్యాదులచే సర్వజ్ఞత్వాదులును, 'సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః' ఇత్యాదులచే సర్వభూతత్వమును (సర్వమునందు అంతర్యామి యైయుండుటచే సర్వమును శరీరముగాఁ గలిగియుండుట), 'భూమిరాపోఽనలోవాయుః' 'ఇత్యాదులందును విభూత్యధ్యాయాదులయందును మహావిభూతిత్వమును బ్రతిపాదింపఁబడియున్నవి.

↓

మగు నతని యుపాసనము చెప్పఁబడుచున్నవి. ఇది *(అనఁగా కర్మానుష్ఠానముచే ఆత్మదర్శనమును సాధించి దానిచే భక్తిని లభించుట) మీఁద 'యతః[2] ప్రవృత్తిర్భూతానాం యేన సర్వ మిదం తతమ్। స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః' (గీ-౧౮-౪౬) అనుట మొదలుకొని, 'విముచ్య[3] నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే। బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాఙ్క్షతి। సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్' (గీ-౧౮-౫౩, ౫౪) అనువఱకు సంక్షేపించి చెప్పఁబడుచున్నది *ఉపాసనమో భక్తిరూపమును బొందియే పరప్రాప్తికి నుపాయభూత మగుచున్నదని వేదాంతవాక్యములచేతనే సిద్ధము. 'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి' 'వానినే యెఱింగి మృత్యువు నతిక్రమించుచున్నాఁడు. (శ్వేతా. ౩-౮) 'తమేవం విద్వా

---

*జీవుఁడు (అనఁగా ప్రత్యగాత్మ) ప్రాప్త (అనఁగా భగవత్ప్రాప్తిని బొందు వాఁడు). భగవంతుఁడు ప్రాప్యుఁడు (జీవునికిఁ బొందఁదగినవాఁడు) భగవత్ప్రాప్తికి ఉపాయము భగవదుపాసనము. దీనికి అంగము ప్రాప్తయగు ప్రత్యగాత్మ (యాథాత్మ్య) దర్శనము. ఈ యాత్మదర్శనము ఆత్మజ్ఞానముతోఁ గూడిన కర్మానుష్ఠానముచే సాధ్యము. అనఁగా ఆత్మజ్ఞానపూర్వక కర్మానుష్ఠానసాధ్యమగు ఆత్మదర్శనము అంగము. పరమాత్మోపాసనము అంగి. అంగమును ప్రాప్తయొక్క స్వరూపమును ప్రథమషట్కమునఁ జెప్పఁబడెను. అంగియు ప్రాప్యునియొక్క స్వరూపమును ఈమధ్యమషట్కమునఁ జెప్పఁబడుచున్నవని తెలియునది. ఇట్లు రెండు షట్కములయందు, ఆత్మజ్ఞానపూర్వకమగు కర్మయోగముచేత ఆత్మదర్శనమును దానిచేత భక్తియు లభించుననువిషయమె చెప్పఁబడిన దనుటకు నుపబలముగా నిందే యష్టాదశాధ్యాయమున ఆవిషయమే 'యతః ప్రవృత్తిః' అని సంక్షేపముగా చెప్పఁబడుచున్నదని చూపఁబడియె. 'యతః ప్రవృత్తిః' ఇత్యాదులచే కర్మానుష్ఠానమును, 'విముచ్య నిర్మమః' ఇత్యాదులచే ఆత్మదర్శనమును, 'మద్భక్తిం లభతే' అనుటచే ఆత్మదర్శనము వలనఁ గలుగు భక్తియుఁ జెప్పఁబడుచున్నవని తెలియునది.

*పూర్వషట్కముయొక్క కడపట 'శ్రద్ధావాన్ భజతే యో మామ్' అని మధ్యమషట్కవిషయ మగు భగవదుపాసనము చెప్పఁబడినది గదా. ఈ యుపాసనమే భగవత్ప్రాప్తికి (అనఁగా ముక్తికి) ఉపాయమనియుఁ జెప్పఁబడెను. ఈ యుపాసనము కేవలమైనది కాక భక్తిరూపమును బొందియే ముక్త్యుపాయ మగుననియు కావున

నదియే భక్తి యని చెప్పఁబడుచున్న దనియుఁ జెప్పిరి. అయినను 'తమేవ విదిత్వాతి మృత్యు మేతి' ఇత్యాదులచే వేదనమాత్రముచే మోక్షము గలుగు నని యున్నది. 'ఆత్మానమేవ లోక ముపాసీత' అని యుపాసనమును ముక్త్యుపాయముగాఁ జెప్పుటచే కేవలమైన వేదనముచేగాక ఉపాసనరూపమైన వేదనముచే మోక్షము గలిగినను కలుగుఁ గాక. భక్తిచే మోక్షమని శ్రుతియం దెచ్చటను గానఁబడదు. కాన నుపాసనము భక్తియనుటయు భక్తిచే మోక్ష మనుటయు వేదాంతవాక్యములచే సిద్ధముకాదే? యని శంకరాఁగా 'ఉపాసనమో ... సిద్ధము' అని యాది వేదాంతవాక్యములచే సిద్ధ మగునని ప్రతిజ్ఞ సేసి వరుసగా 'తమేవ ..'ఇత్యాదివాక్యము లుదాహరించిరి. అనఁగా అద్వైత్రశ్రుతులు ముక్త్యుపాయములుగా చెప్పు వేదనము దర్శనము ధ్యానము స్మృతి మొదలగువాని కెల్లను, ఆశ్రుతుల సామరస్యముచే సామ్యమును రూపించి, అవియెల్ల 'నాయ మాత్మా' అను శ్రుతిచే భక్తితో విశిష్టము లగుటవలన భక్తియే యగుననియు కావున భక్తియే మోక్షోపాయ మగుననియు, ఇట్లు వేదాంతవాక్యముల చేతనే సిద్ధించుట సిద్ధాంతముచేసిరి. ఇందు రెండు ప్రతిజ్ఞలు గలవు. వేదనమాత్రము గాక ఉపాసనమే ముక్త్యుపాయ మగునని మొదటిది. ఇదియే 'తమేవ...' అనుట మొదలుకొని 'తెలియుచున్నది' అనువఱకు నిర్వహింపఁబడినది. ఉపాసనము కేవల మైనది కాక భక్తిరూపమును బొందియే ముక్త్యుపాయమగును అనునది రెండవది. ఇదియే 'నాయమాత్మా...' అనుట మొదలుకొని 'భక్తి యని చెప్పబడు చున్నది' అనువఱకు నిర్వహింపఁబడినది. మొదటి ప్రతిజ్ఞను నిర్వహించుటకై వేదనమును ప్రస్తావించుచున్నారు.—'తమేవ విదిత్వాతిమృత్యు మేతి' 'తమేవం విద్వానమృత ఇహభవతి' అనువానిలో 'విదిత్వా' 'విద్వాన్' అనఁబడిన వేదనము, 'అతిమృత్యుమేతి' 'అమృత ఇహభవతి' అని ముక్త్యుపాయముగాఁ జెప్పబడినది గదా. వేదన మనఁగా జ్ఞానము. 'ఆత్మావాఅరే...నిదిధ్యాసితవ్యః' అనుచో 'ద్రష్టవ్యః' 'నిదిధ్యాసితవ్యః' అని దర్శనమును ధ్యానమును 'ఆత్మా' అని పరమాత్మయొక్క ప్రాప్తికి (అనఁగా ముక్తికి) ఉపాయములుగాఁ జెప్పఁబడినవి. 'ఆత్మాన...ముపాసీత', అని ఉపాసనమును దర్శనధ్యానములవలెనే 'ఆత్మా' అని పరమాత్మయొక్క ప్రాప్తియైన ముక్తి కుపాయముగాఁ జెప్పబడినది. ఇట్లు వేదనమువలెనే దర్శనధ్యానోపాసనములును ముక్త్యుపాయము లగుటచే అన్నియు ఏకార్థకములే యగును గాని వేఱువేఱు గాదు. ఐనను దర్శనమును ధ్యానమును వేఱువేఱు అర్థములు గలవియనుట ప్రసిద్ధము. అందును అవి రెండును 'ఆత్మావా...' అని యేకవాక్యమునందే ప్రయుక్తము లగుటచే రెండును ఏకార్థకములయినచో పునరుక్తి గలుగును గాన భిన్నార్థకములే కావలయును. కాన నవి రెండును వేదనముతోపాటు ఏకార్థకము లనుట యెట్లు? అని శంకరాఁగా అవి యేకవాక్యప్రయుక్తము లయినను భిన్నార్థకములు గాక సామాన్యవిశేషరూపమున

నమృత ఇహ భవతి' 'వానిని ఇట్లు ఎఱింగినవాఁడు ఇందు మృతిలేని
వాఁడగును' (పురుషసూక్తమ్) ఇత్యాదులచే 'విదిత్వా' 'విద్వాన్'
అని చెప్పఁబడిన వేదనము 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః...నిదిధ్యాసి
తవ్యః' 'ఓయీ ఆత్మయే దర్శింపఁదగినది ధ్యానింపఁదగినది (బృహ.
౬-౫-౬) అనువాక్యమునఁ గల దర్శనధ్యానములతోను, 'ఆత్మాన

---

ఏకార్థకములే యగునని తెలుపుటకై ఆరెంటిని వేఱువేఱ ముక్త్యుపాయములుగా ప్రతి
పాదించు భిన్నవాక్యముల నుదాహరించిరి. అనఁగా 'సత్త్వ...విప్రమోక్షః' అనుచో
ధ్రువస్మృతి (అనఁగా ధ్యానము) మాత్రమును 'భిద్యతే...పరావరే' అనుచో దర్శనము
మాత్రమును గ్రంథుల విడిచిపుచ్చునవిగాఁ జెప్పఁబడినవి. ఇట్లు భిన్నవాక్యములచేతను
ఆరెండును గ్రంథిమోక్షహేతువులుగానే చెప్పఁబడుటచే రెండును ఏకార్థములే
కావలయును. ధ్యానమును 'ధ్రువాస్మృతిః' అనుటచే ధ్రువమైన (అనఁగా తైల
ధారవలె అవిచ్ఛిన్నమైన) స్మృతిసంతాన మని తెలియునది. అయినను ఒక్క ఫలము
నకు రెండు వేఱువేఱు ఉపాయము లుండునట్లు గ్రంథిమోక్షమునకు ధ్రువస్మృతియు
దర్శనమును వేఱువేఱు ఉపాయములు కావచ్చును గాన రెండును ఏకార్థకములు గా
వన్నచో, అప్పుడు ఆరెండుపాయములును ఒకటి గురువైనదిగాను మఱొకటి లఘువై
నదిగాను, తారతమ్యము గలిగియుండవచ్చును. రెంటికి ఫల మొకటియే కాన, లఘు
వైనది యుండఁగా గురువైనదానితోఁ బనిలేదు గనుక నది యుపాయము కానిదగుట
ప్రసక్తించును. కాని నిది యుక్తము కాదు. మఱియు స్మృతిశబ్దము దర్శనమునందు
ఉపచరించుచున్నదనుటచేతను గుణమేమియు లేదు. కాన ధ్రువస్మృతి దర్శనముగా విశే
షితమైనది. స్మృతి, దర్శన మగునా యనఁగా ఆస్మృతి మిక్కిలియు విశదమగుటచే
దర్శనసమానాకార మగుననుటయే. భయశీలురు కాముకులు మొదలగువారియందు
స్మృతి, భావనాప్రకర్షమువలన (అనగా మనస్సునందు మిక్కుటముగా భావించుట
వలన) దర్శనసమానమగుట, మారీచుఁడు రామభయమున 'వృక్షేవృక్షేచపశ్యామి చీర
కృష్ణాజినామ్బరమ్। గృహీత ధనుషం రామం పాశహస్త మివాన్తకమ్' అని ప్రతివృక్ష
మునందు రామునిఁ జూచుట మొదలగువానివలనఁ దెలియునది. ఇట్లు భిన్నవాక్యగత
ములగు స్మృతియు దర్శనమును ఏకార్థములేయని సిద్ధింపఁగా ఏకవాక్యగతములయిన
'ద్రష్టవ్య నిదిధ్యాసితవ్యములును' అనఁగా 'దర్శనధ్యానములును' సామాన్యవిశేష
రూపమున ఏకార్థములే యగునని తెలియునది. ఇట్లు వేదనమే, స్మృతియు దర్శన
మును ధ్యానమును ఉపాసమును అగునని యేర్పడుచున్నది. అనఁగా వేదనము దర్శనమును
స్మృతిసంతానరూపమై దర్శనసమానాకారమై ధ్యానము ఉపాసనమే అని చెప్పఁబడు
చున్న'దని తెలియుచున్నది. ఇటు వేదనము కేవలమైనదిగాక ఉపాసనరూపమై ముక్తి

మేవ లోక ముపాసీత' 'ఆత్మనే లోక ముపాసించునది' (బృహ. ౧-౪-౧౫) అనఁబడిన యుపాసనముతోను 'సత్త్వశుద్ధా ధ్రువా స్మృతిః స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః' మనశ్శుద్ధి గలిగినయెడల స్మృతి నిలకడయైనదికాఁగా గ్రంథులన్నియును వీడుచున్నవి' (ఛాం. ౭-౨౬-౨) అను స్మృతిసంతానముతోను 'భిద్యతే హృదయగ్రన్థి

---

పాయమగు నను ప్రతిజ్ఞ సిద్ధాంతమైనది. ఇట్టియుపాసనము భక్తిరూపమై ముక్త్యుపాయమగు నను రెండవ ప్రతిజ్ఞను 'నాయ మాత్మా' అని సిద్ధాంతీకరించుచున్నారు. (అయం) పూర్వోక్తవాక్యముచే నిర్దేశింపఁబడిన, (ఆత్మా) పరమాత్మ (ప్రవచనేన) ప్రవచన ఫలమగు మననముచేత, (నలభ్యః) లభ్యుఁడుగాఁడు. (బహునాశ్రుతేన) మిక్కిలి శ్రవణముచేతను, (న లభ్యః) లభుఁడుగాఁడు (న మేధయా) కేవల భక్తిచేతను, (న లభ్యః) లభ్యుఁడు గాఁడు. (ఏషః) ఈపరమాత్మ, (యం) ఏజీవాత్ముని, (వృణుతే) వరించుచున్నాఁడో (తేన) ఆజీవాత్మచే, (లభ్యః) లభ్యుఁడు. (ఏషః) ఈపరమాత్మ, (తస్య) భగవత్ప్రియుఁడైన యాజీవాత్మకు, (స్వాం) తనదైన, (తనూమ్) అప్రాకృత దివ్యమంగళ విగ్రహమును, (వివృణుతే) ప్రకాశింపఁ జేయుచున్నాఁడు అని యర్థము. ఇందు 'యమే వైష వృణుతే', అని పరమాత్మ జీవునివరించుచున్నాఁడని యున్నదిగదా. ఇట్లు పరమాత్మచే జీవుఁడు వరణీయుఁడు అనగా వరింపదగినవాఁడు; అగుటకు హేతువేమి? జీవునియందలి గుణవిశేష మేదియైనను అందులకు హేతువు గావలయునుగదా. లేక ఈశ్వరుఁడు కేవలము స్వచ్ఛందముగా నట్లు వరించుచున్నాఁడుగాని జీవునిగుణవిశేషమునుబట్టి కాదు. అన్నచో, అప్పు డీశ్వరునికి వైషమ్యము (అనగా పక్షపాతము) మొదలగు దోషములు గలుగును. ఈశ్వరునికే వరణీయుఁ డగుటకై జీవునికి శాస్త్రములు చెప్పు విధులన్నియు వ్యర్థము లగును. కనుక నీశ్వరుఁడు స్వచ్ఛందముగా వరించుననుట చెల్లదు. జీవునియందు స్వతస్సిద్ధమైయున్న గుణవిశేషమునుబట్టి యీశ్వరుఁడు వరించుచున్నాఁ డన్నచో, జీవుఁడు స్వతస్సిద్ధగుణముచేతనే వరణీయుఁడగునేని, శాస్త్రములు విధించు కర్మజ్ఞానాదిసాధనములు వానికక్కఱలేకపోవును గాన శాస్త్రములనర్థకము లగుచున్నవి. కనుక జీవునియొక్క సిద్ధమైన గుణమును వరణీయత్వమునకు హేతువు గాదు. వానియొక్క సాధ్యమైన గుణవిశేషమె యందులకు హేతువు గావలయు. ఇది యట్లుండ పరమాత్మునికి ప్రియతముఁడైనవాఁడేకదా అతనికి వరణీయుఁ డగును. అతనికి ప్రియతముఁ డెవఁడు? 'ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహంసచ మమప్రియః' అను భగవంతునివచనమువలన, అతనిని మిక్కిలి ప్రియునిగాఁ గొనువాఁడే (అనఁగా అతనియందు మిక్కిలియు ప్రీత్యతిశయము గలవాఁడే) యతనికిఁ ప్రియతముఁడు. కనుక జీవుఁడు వరణీయుఁడగుటకు హేతువైన సాధ్యగుణవిశేషము భగవంతునియందలి ప్రీత్యతిశయమే యని తెలియుచున్నది. పూర్వము ముక్త్యుపాయ

శ్ఛిద్యన్తే సర్వసంశయాః । క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరావరే' 'ఆపరావరుఁడు దర్శింపఁబడగానే (అనఁగా దర్శనసమానాకారమగు వేదనమునకు విషయభూతుఁడు కాఁగానే) మనస్సుయొక్క-రాగాదిరూపమైన గ్రంథియు-(లేక హృదయస్థుఁడగు జీవునియొక్క-ప్రకృతిబంధరూపమైన గ్రంథియు-లేక శరీరమను గ్రంథియు) భేదింపఁబడుచున్నది. సమస్తసంశయవిపర్యయములును ఛేదింపఁబడుచున్నవి. పుణ్యపాపరూపములైన వీని కర్మములు క్షీణించుచున్నవి' (ముణ్డక-౨-౨-౮) అను దర్శనములోను ఇత్యాదులతో సమానార్థక మగుచున్నది. కాఁబట్టి ఆ వేదనము కేవలమైనదిగాక స్మృతిసంతానరూపము దర్శనసమానాకారమునై ధ్యానము ఉపాసనము అనుశబ్దములచే చెప్పఁబడు వాచ్యమగు నని తెలియుచున్నది. మఱియును 'నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా నబహునా శ్రుతేన। యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్' 'ఈయాత్మ ప్రవచనముచేత లభించునది కాదు. మేధచేతను

---

ముఁగా శ్రుతి ప్రసాదించిన వేదనము కేవలమైనది గాక స్మృతిసంతానరూపమై యుపాసనశబ్దవాచ్య మగు నని తెలిపియున్నది గదా. అదియే 'నాయమాత్మా' అనుశ్రుతిచే మఱియు విశేషిత మగుటవలన భగవంతుని యందలి ప్రీత్యతిశయముతోఁ గూడినదై కావుననే తానును మిక్కిలి ప్రియమైయుండు స్మృతిసంతానమె కావలయుఁ గాని కేవలమైన స్మృతిసంతతి గాదనియు, ఇట్టి స్మృతిసంతతియే ఉపాసనమని చెప్పఁదగు ననియు నిశ్చితమగుచున్నది. ఇట్టి ప్రీతిపూర్వకమైన స్మృతిసంతానమె (అనఁగా ధ్యానమే) 'స్నేహ...త్యభిధీయతే' ఇత్యాదివచనమువలన భక్తియని చెప్పఁబడుచున్నది. ఇట్లు ముక్త్యుపాయ మగు వేదనము కేవలమైనది కాక ఉపాసనరూపము గావలయుననియు ఆయుపాసనమును కేవలమైనది గాక భక్తిరూపమును బొందియే ముక్త్యుపాయ మగు ననియును కావున భక్తియే ముక్తిసాధనమనియు వేదాంతవాక్యములచేతనే సిద్ధము. ఇట్లు ముక్త్యుపాయమగు వేదనము భక్తిరూప మగుటవలననే 'తమేవం...విద్వాన్' అని వేదనమును ముక్త్యుపాయముగాఁ జెప్పుశ్రుతికిని 'నాహం...పరన్తప' అని భక్తిని ముక్త్యుపాయముగాఁ జెప్పుస్మృతికిని ఏకార్థత్వము సిద్ధించుచున్నది గాని లేనియెడల విరోధము గలుగును. కావున వేదనము ఉపాసనమై భక్తిరూపమై భక్తిశబ్దవాచ్యమును భగవత్ప్రాప్తిసాధనము నగుచున్నది సిద్ధాంతము.

గాదు, మిక్కిలి వినికిచేతనుగాదు, వీఁడు ఎవనిని వరించుచున్నాఁడో వానిచేతనే (వానికే) లభ్యుఁడు. వానికే ఈయాత్మ తన దేహమును (అనఁగా స్వరూపమును) తెలుపుచున్నాఁడు. (కఠ.౧-౨-౨౩) అని వేదనమును విశేషించుటవలన పరమాత్మునిచే వరింపఁదగియుండుటకు హేతుభూతమై, స్మరింపఁబడుచున్న విషయ మగు నాపరమాత్ముఁడు అత్యంత ప్రియుఁ డగుటచేత (అతనిని గుఱించినట్టిది యగు) తానును అత్యంత ప్రియరూపమై యున్న (వేదనరూప) స్మృతిసంతానమే యుపాసనశబ్దముచే వాచ్య మగు నని నిశ్చయింపఁబడుచున్నదిగదా. అట్లు ప్రియరూపమైయుండు నుపాసనమేకదా 'స్నేహపూర్వ మను ధ్యానం భక్తి రిత్యభిధీయతే' (లైఙ్గోత్తర) ఇత్యాదివచనములవలన భక్తి యని చెప్పబడుచున్నది. ఇట్లు ముఖ్యోపాయ మగు వేదనము కేవలమైనది కాక భక్తిరూప మగుటవలన 'తమేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పన్థా అయనాయ విద్యతే' అని భగవంతుని గుఱించిన వేదనము తప్ప వేఱొక ముఖ్యోపాయము లేదని నిషేధించు నీ పురుషసూక్తశ్రుతికిని, 'నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా। శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా। భక్త్యా త్వనన్యయాశక్య అహమేవం విధోఽర్జున। జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరన్తప' (గీ.౧౧-౫౩-౫౪) అని భగవంతుని గుఱించిన భక్తితప్ప వేఱొక ముఖ్యోపాయము లేదని నిషేధించు నీస్మృతికిని సమానార్థత్వము సిద్ధించిన దగుచున్నది. అందును సప్తమాధ్యాయమున 'భజతే యో మామ్' అని పూర్వషట్కముకడపట చెప్పఁబడిన యుపాస్యభూతుఁడగు పరమపురుషుని స్వరూపముయొక్క యాథాత్మ్యమును ప్రకృతిచేత నది మఱుఁగుపడుటయు, అట్లు మఱుఁగగుటను నివర్తించుకొనుటకు భగవంతునియందుఁ జేయఁదగిన ప్రపత్తియు, ఉపాసకులలో నుండు నవాన్తరవిధములకుఁ గల భేదమును, జ్ఞాని శ్రేష్ఠుఁడగుటయును, జెప్పఁబడుచున్నవి.

*శ్రీ భగవా నువాచ :

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ ! యోగం యుఞ్జన్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥ 1

టీ. హేపార్థ=అర్జునా, మయి=నాయందు, ఆసక్తమనాః=దృఢముగా తగిలిన మనస్సుగలవాడవును, మదాశ్రయః=నన్నే ఆధారముగాఁగలఁవాఁడవును, యోగంయుఞ్జన్ = యోగమును ఆచరించుటకుఁ బ్రవర్తించినవాఁడవునై, మాం=నన్ను, అసంశయం=సంశయములు లేనట్లును, సమగ్రం = సంపూర్ణముగాను, యథా = ఏప్రకారమున-అనఁగా ఏజ్ఞానముచేత, జ్ఞాస్యసి= తెలిసికొనగలవో, తత్ =దానిని (ఆజ్ఞానమును), శృణు=సావధానముగా వినుము.

తా. అర్జునా, నాయందు అభిముఖ్యముచేత తగులువడిన మనస్సు గలిగి- అనఁగా నాయందలి ప్రీత్యతిశయముచేత నాస్వరూప

---

*భగవంతుఁడు 'మామ్' అని భజనీయునిగాఁ జెప్పిన నన్ను భజించుటకై యిపుడు నాయథావస్థితి నుపదేశించెదనని యిందు చెప్పుచున్నాఁడు. 'ఆసక్త' అనుచో 'ఆ' అను నుపసర్గముచే ఉపాసనార్థమైన అభిముఖ్యము వివక్షితము. ఈ యాభిముఖ్యమునే 'నాయందలిప్రీత్యతి...స్వభావముగలదిగాన' అని సహేతుకముగా ప్రవచించినారని తెలియునది మఱియు విభూతి అవినాభూతమై యుండునని గావున దానిని ఎప్పుడుగాని యెడఁబాయుట పొసఁగదు. కాన 'విభూతి' యనఁగా నిట విభూతిమాత్రము గాదు; భగవంతుని కసాధారణములై యుండు పరిజనపరిబర్హాభూషణాదులను గ్రహింపవలయును. లేక విభూతిని విభూతిగా ననుభవింపకుండుటయే దానిని బాయుట కావచ్చును. ఇట్టి స్వభావాదులను బాయుట యనగాఁ దానిని తా నభిలషించినట్లు అనుభవింపకుండుటయే యగును. మనస్సు విశీర్ణమగుట యనఁగా కార్యములకు యుక్తముగానట్లు శిథిలమగుట. 'మదాశ్రయః' అనుటకు నన్నే యాధారముగాఁ గలవాఁడు (అనఁగా నన్ననుభవించుటయే ధారకముగాఁగలవాఁడు) అని యర్థము. ఇట యోగముయొక్క యనుష్ఠానము గాదు; యోగమున కుపయుక్తమైన భజనీయవిషయజ్ఞానమే చెప్పఁబడునదిగాన 'యుఞ్జన్' అనుటకు 'యోగము సేయఁ బ్రవృత్తుఁడైనవాఁడు' అనఁబడెను. 'తత్ శృణు' అనుచో గల 'తచ్ఛబ్దమునకు ప్రతి 'యత్' అని నిర్దేశింపవలసియుండుటవలనను ఉత్తరశ్లోకమున శ్రోతవ్యముగా 'జ్ఞానమ్' అని చెప్పుటంబట్టియు 'యథా' యనుటకు 'ఏజ్ఞానముచేత' నని యర్థము

ను గుణమును చేష్టితములను నావిభూతిని ఎడఁబాసినయెడల తత్త్వ మే విశీర్ణమగుచుండు స్వభావము గలదిగాన మనస్సును నాయందే క్కలి దృఢముగా నిలిపి, నన్నె వదలినచో నీవును నీయంతట విశీ ర్ణమాఁడ వగుటచే నన్నే యాధారముగాఁ గొని, నాయోగము చరించుటకుఁ బ్రవర్తించినవాఁడవై, యోగమునకు విషయభూతుఁ న నన్ను మీఁదివాక్యములచేఁ జెప్పఁబడెడి యేజ్ఞానముచేత స్సంశయముగాను పూర్ణముగాను దెలిసికొనఁగలవో యాజ్ఞానమును చ్చరికగల మనస్సుతో వినుము.

4 5
జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః।
యద్ జ్ఞాత్వా నేహ భూయోన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే॥ 2

టీ. యత్ = ఏజ్ఞానమును, జ్ఞాత్వా = తెలిసికొనిన పిమ్మట, యః = మరల, ఇహ_ఈనావిషయమున, జ్ఞాతవ్యం = తెలియవలసి ది, అన్యత్ =మఱియొకటి, న అవశిష్యతే_మిగిలియుండదో (అట్టి), జ్ఞానం = వివిక్తాకారమునుగుఱించినజ్ఞానముతోఁ గూడిన, ఇదం = చెప్పఁబోవునట్టి, జ్ఞానం=నాస్వరూపవిషయమైన జ్ఞానమును, అశే తః = సంపూర్ణముగ, అహం= నేను, తే = నీకొఱకు, వక్ష్యామి = ప్పెదను.

తా. *నేను నిఖిలహేయప్రత్య నీకుఁ డగుటచేతను, నానా సములై అనవధికాతిశయములై అసంఖ్యేయములై యొప్పు కల్యాణ

---

హ్యమయ్యె. వినబోవు విషయము అపూర్వమైనదిగాన వినువానికి నెచ్చరిక గలి చుటయే యీ ప్రథమశ్లోకపు ప్రయోజనముగాన 'ఎచ్చరికగల మనస్సుతో' నన నెను.

*పూర్వశ్లోకమున 'అసంశయం సమగ్రం' అన్నవిషయమునే యిట కొంచెము దీకరించుచున్నారు. ఇందు 'జ్ఞానము' స్వరూప నిరూపక ధర్మవిషయమైనదిగాను, జ్ఞానము' నిరూపితస్వరూపధర్మవిషయమైనదిగాను భేదము గ్రహించునది,

గుణగణములును అనంతమగు మహావిభూతియుఁ గలవాఁడ నగుట చేతను మద్వ్యతిరిక్తములైన సమస్తచిదచిద్వస్తు సమూహమున కంటె విలక్షణుఁడనై (వేఱైనవాఁడనై) యుందును. ఇట్టి నావివిక్తతను (చిదచిద్వస్తువులకంటె వేఱైయుండుటను) గుఱించినజ్ఞానముతోఁ గూడ, నాస్వరూపమునుగుఱించిన జ్ఞానమును నీకుఁ జెప్పెదను, వేయేల ? ఆజ్ఞానము నెఱిఁగిన పిమ్మట నావిషయమై తిరుగ వేఱొకటి తెలియవలసినది మిగిలియుండదు.

అవ. ఈచెప్పబడు జ్ఞానమును పొందుట మిగుల కష్ట మను చున్నాఁడు.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే ।
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః॥ 3

టీ. మనుష్యాణాం = శాస్త్రాధికారయోగ్యులగు దేవమను ష్యాదులయొక్క, సహస్రేషు = వేలమందిలో, కశ్చిత్ = ఒకా నొకఁడు, సిద్ధయే = నన్ను సాక్షాత్కరించుటకొఱకు, యతతి = ప్రయ త్నము చేయుచున్నాఁడు, యతతాం = అట్లు సిద్ధిపర్యంతము ప్రయ త్నము చేయువారలలోను, కశ్చిత్ = ఒకానొకఁడు, మాం = నన్ను, వేత్తి = తెలిసికొనుచున్నాఁడు, సిద్ధానామపి = నావిషయమైన జ్ఞాన సిద్ధి గలవారలలోను, కశ్చిత్ = ఒకానొకఁడు, తత్త్వతః = సలరూ పున, (వేత్తి = ఎఱుఁగుచున్నాఁడు.)

తా. *శాస్త్రాధికారయోగ్యు లగు వేలకొలఁది దేవమను ష్యాదులలో నొకానొకఁడే ఆత్మజ్ఞాన (మను సాక్షాత్కారరూప) సిద్ధి పర్యంతము యత్నముసేయును. అట్లు సిద్ధిపర్యంతము ప్రయత్నము

*ఇట మనుష్యశబ్దము జాతివిశేషమునుగుఱించినది గాదు. దేవాదులుగూడ వేదస్తుతజ్ఞానమునకు అధికారు లగుదురు కాన మనుష్యు లనఁగా సిద్ధికొఱకు యత్నము సేయుటకు యోగ్యులైనవా రని మాత్రమే యభిప్రాయపడుటచే 'శాస్త్రాధికార

చేయువారు వేవురలో నొకానొకఁడే నన్నుఁ దెలిసికొని నావలన సిద్ధిఁ బడయుటకై యత్నముచేయును. అట్లు నన్ను తెలుసుకొను వారలలో ఒకానొకఁడే నన్ను కలరూపున నెఱుఁగును. (ఒకానొకఁడే యనఁగా) ఒక్కఁడును లేఁడని యభిప్రాయము. 'మాంతు వేద న కశ్చన (గీ. ౭-౨౬)' 'సమహాత్మా సుదుర్లభః' (గీ. ౭-౧౯) అని కదా (అట్టివాఁడు దుర్లభుఁడగుట) మీఁదఁ జెప్పఁబడుచున్నది.

(అవ. 'భూమిరాపోఽనలః' అనుట మొదలుకొని 'న త్వహం తేషు తే మయి' అనువఱకును తనస్వరూపయాథాత్మ్యమును జెప్పుచున్నాఁడు).

శ్లో॥ భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ।
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥ 4

టీ. భూమిః=గంధగుణము గల పృథివియు, ఆపః=రసగుణము గల ఉదకములును, అనలః=రూపగుణముగల అగ్నియు, వాయుః=స్పర్శగుణముగల వాయువును, ఖం=శబ్దగుణముగల ఆకాశమును, మనః=మనస్సు మొదలైన యింద్రియ సమూహమును, బుద్ధిః=మహత్తత్త్వమును, అహంకారశ్చ=మూఁడువిధములు గల అహం

యోగ్యులు' అనఁబడెను. 'యతతిసిద్ధయే' అని సిద్ధి కొఱకు యత్నముసేయుట తెలుచుగా నందఱికిని సాధారణమే కనుక 'కశ్చిత్' అని యొకానొకనికిమాత్రము విశేషించి చెప్పుట యొప్పదు. కాఁబట్టి 'సిద్ధయే' అనుటకు 'సిద్ధిపర్యంతము' అనఁబడెను. సిద్ధి పర్యంతము ఒకానొకఁడే యత్నముసేయు నని భావము. మఱియు మనుష్యసహస్రములలో 'కశ్చిత్ యతతి సిద్ధయే' అని ఒకానొకఁడు సిద్ధిపర్యంతము యత్నము సేయుచున్నాఁడు అనఁబడెను. ఇట్లే మనుష్యసహస్రములలో 'కశ్చిత్ మాం వేత్తి' ఒకానొకడు నన్ను తెలియుచున్నాఁ డనవచ్చునుగదా. అట్లనక 'యతతామపి సిద్ధానామ్' అని సిద్ధిపర్యంతము యత్నించువారినే మరలఁజెప్పి వారిలో నొకానొకఁడే 'మాం వేత్తి' నన్ను తెలియుననుట కభిప్రాయ మేమన, అట్లు సిద్ధిపర్యంతము యత్నించువారిలోనే ఆసిద్ధిని నావలనఁ బొందుటకై 'మాం వేత్తి' అని నన్నెఱుఁగువాఁడు ఉండఁగూడును. ఒకసిద్ధిని గోరువాఁడు నన్నెఱుఁగుట యొల్ల నావలన ఆసిద్ధిని బొందుటకే

కారతత్త్వమును, ఇతి=అని. అష్టధా=ఎనిమిదివిధములుగా, భిన్నా=విభజింపఁబడిన, ఇయం=ఈ, ప్రకృతిః=జగత్తునకు మూలప్రకృతి, మే ఏవ=నాయదియే.

తా. *విచిత్రములై అనంతములై యెప్పు భోగ్యభోగోపకరణభోగస్థానములరూపమున నున్న యీజగత్తునకు మూలమై, గంధరసరూపస్పర్శశబ్దగుణసహితములగు పృథివ్యప్తేజోవాయ్వాకాశాదుల రూపమునను, మనస్సు మొదలగు నింద్రియములరూపమునను, మహదహంకారముల రూపమునను, ఎనిమిదివిధముల భిన్నమై యున్న యీప్రకృతి నాయది యనియే యెఱుంగుము.

శ్లో॥ అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥ 5

---

యగునుగదా. కనుకనే 'నన్ను తెలిసి...యత్నముసేయును' అనఁబడెను. 'వేత్తి తత్త్వతః' అని కలరూపున ఎఱుఁగుట చెప్పఁబడినది. కలరూపున ఎఱుఁగుట యనఁగా ప్రాప్యుఁడ నగు నేనే ప్రాపకుఁడు మొదలైనవాఁడని ఎఱుగుట. సామాన్యముగా ఎఱిగిన పిదపనే కలరూపున ఎఱుఁగుట కలుగును. అనగా సామాన్యముగా ఎఱిఁగినవారేర్పడిననే వారిలో కలరూపున నెఱుగువాఁ డేర్పడఁ గూడును. కాఁబట్టి 'యతతామపి...తత్త్వతః' అనువాక్యమును 'యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి' 'మద్వేదిషు కశ్చిన్మాం తత్త్వతః వేత్తి' అని వాక్యద్వయము వివక్షితమని తలఁచి 'సిద్ధిపర్యంతము... కలరూపున నెఱుఁగును' అనబడినది, మఱియు 'కశ్చిన్మాం వేత్తి' అనుచో 'కశ్చిదేవ వేత్తి' 'ఒకఁడే యెఱుఁగుచున్నాఁడు అని యర్థమగు నేని యిద్దఱు ఎఱుఁగరని సిద్ధించుచున్నది గాన నిది వ్యాస భీష్మాదు లనేకు లెఱిఁగియుండుటకు విరుద్ధ మగును. 'కశ్చిత్ వేత్తి ఏవ' 'ఒకానొకఁడు ఎఱుఁగనే ఎఱుఁగును' అని యర్థమగు నేని 'మహాత్మా సుదుర్లభః' 'మాంతు వేద న కశ్చన' అను దుర్లభత్వమునకు విరుద్ధ మగును. కాన 'ఒక్కఁడును లేఁడని యభిప్రాయము' అనఁబడినది.

*ఇచ్చట తన్నుగుఱించి యుపదేశము సేయఁబూని ప్రకృతి యెనిమిది విధములని చెప్పుట అసంగతము. అది స్వకీయమైనదిగాన దాని భేదములు చెప్పుట సంగతమే యన్నచో అది స్వకీయమైనదిగా ఇంతకు మునుపు ఉపదేశింపలేదు. కాన ఆ ప్రకృతి గాక ప్రత్యక్షాదిప్రమాణసిద్ధమై పృథివ్యాద్యాకారముగ పరిణమించి యున్న ప్రకృతి

టీ. మహాబాహో=అర్జునా, ఇయం=ఈప్రకృతి, అపరా=నికృష్టమయినది, ఇతస్తు=ఈప్రకృతికంటెను, అన్యాం = వేఱైనదియు, జీవభూతాం = జీవస్వరూపమయినదియునగు, ప్రకృతిం = చేతనప్రకృతిని, మే = నాయొక్క, పరాం = ఉత్కృష్టమైనదానినిగా, విద్ధి = తెలిసికొనుము, యయా =(జీవరూపమైన) ఏప్రకృతిచేత, ఇదం జగత్ = స్థావరజంగమాత్మకమైన యీజగత్తు, ధార్యతే = ధరింపఁబడుచున్నదో, (తాం అన్యాం జీవభూతాం ప్రకృతిం పరాం విద్ధి అని యన్వయము.)

తా. *ఇట్లు ఎనిమిది విధముల భిన్నమై యుండు నీప్రకృతి అచేతనమై చేతనమునకు భోగ్యభూతమైన దగుటచేత నికృష్టమైనది. ఈప్రకృతికంటె వేఱై (అనఁగా విసజాతీయాకారమై), దానికి భోక్తయగుటచే ప్రధానభూతమై చేతనరూపముగా నుండు నాప్రకృతి (మఱొకటి కలదని) యెఱుంగుము. జీవరూపమైన యీ చేతన ప్రకృతిచే అచేతనమైన యీజగమంతయు ధరింపఁబడుచున్నది.

---

యిట చెప్పఁబడినవి. తాను దానికన్న విలక్షణుఁడై దానికి శేషియై నియామకుఁడై యుండుట మొదలగునవి సిద్ధించుటకై 'మే' 'నాది' అని దానిని స్వకీయమైనదిగా విధించినాఁడు. ఇట భూతశబ్దముచే దానికి దవ్వగాని తన్మాత్రములు నుపలక్షితము లగుచున్నవి గాన గంధాదిగుణకము లనఁబడినవి. ఈతన్మాత్రములను జెప్పుటచే, ఇవి గలిగియున్న పృథివ్యాదులు పరస్పరము వేఱువేఱగుటయు అని వీనిని కార్యములుగాఁ గలిగియుండుటయును ప్రదర్శితము లగుచున్నవని తెలియునది.

*ఇట్లు అచిత్తునకు విలక్షణుఁడగుట ప్రతిపాదితమైనది. అచిత్తువంటివాఁడు కాని జీవునికంటెనుగూడ విలక్షణుఁ డగుట యిందు ప్రతిపాదింపఁబడుచున్నది. 'అపరా' అనఁగా అనుత్కృష్టమైనది. అనఁగా అప్రధానభూతమని యర్థము. 'భోక్తాభోగ్యమ్' (శ్వేతా. ౧-౧౨) అన్నట్లు ఒకటి భోక్తయగుటచే పరమైనదిగాను మఱొకటి భోగ్యమగుటచే అపరమైనదిగాను తెలుపఁబడినది. 'ఇతఃపరామ్' అనునంతమాత్రనే అచిత్ప్రకృతికంటె స్వరూపమున జీవప్రకృతి వేఱైనదని సులభముగా చెప్పఁగూడియు, 'అన్యామ్ అని యన్యశబ్దముగూడఁ జేర్చుట దానికిని దీనికిని గల జాతిభేదమును దృఢీకరించుటకుఁ గాఁబట్టి యందుల కనుగుణముగా 'అచేతనమై . చేతనరూపముగా నుండు నా ప్రకృతి' అని వైజాత్యము వర్ణితమైనది.

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా॥ 6

టీ. సర్వాణి=సమస్తములైన, భూతాని=చిదచిన్మిశ్రములైన బ్రహ్మాది స్తంబపర్యంత మయినవి యెల్లను, ఏతద్యోనీని ఇతి = ఈ చేతనాచేతన ప్రకృతిద్వయమే ఉపాదానకారణముగాఁ గలవి యని, ఉపధారయ = తెలియుము. తథా = అట్లు, అహం= నేను, కృత్స్నస్య = సమస్తమయిన, జగతః - ప్రపంచమునకు, ప్రభవః = ఉత్పత్తి స్థానమైనవాఁడును, ప్రళయః = నాశస్థానమైనవాఁడును, (అనియు తెలియుము.)

తా. *బ్రహ్మాది స్తంబపర్యంతము ఎక్కువతక్కువలుగానున్నవియు, చిత్తు అచిత్తు అను నీరెంటియొక్క మిశ్రమములైనవియు, మదీయములైనవియు నగు సమస్తభూతములును చేతనాచేతనసమష్టి

---

*ఇట్లు ప్రకృతిపురుషరూపముగ నుండుసమష్టిదశ చెప్పఁబడినది. ఇఁక నిందు మొదటిసగముచే వ్యష్టిదశ చెప్పి తక్కినసగముచే రెండును గలసి తనకు కార్యములగుటను జెప్పుచున్నాఁడు. ఇట చేతనుని ప్రకృతిగా నిర్దేశించినాఁడు. ఆత్మ, స్వరూపముచే నిర్వికారుఁడే. కనుక సవికారమైన అచిత్తువలె దీనినిగూడ తనను ప్రకృతి యనుట యెట్లు? అన్నచో, చేతనుఁడు స్వరూపమున నిర్వికారుఁడయినను కర్మవశమున దేవాదిశరీరేంద్రియములచేతను వానికి లోనయిన జ్ఞానము క్రియ భోగము మొదలయిన వానిచేతను విశిష్టుఁ డగుచున్నాఁడు. ఈవిశిష్టాకారమునుబట్టిమాడఁగా నింతకుమునుపు అచిత్రాప్తియుండై యుండెను గాన అట్టియవస్థంబట్టి అచిత్తువలె ప్రకృతిగా చెప్పఁబడుట దెలియునని. మఱి మూలమునందు భూతములను తనవిగాఁ జెప్పకొనకుండఁగా వానిని 'నాయవి' యని యతనివిగా భగవంతుఁడు చెప్పుట యెట్లు? అని శంకరాఁగా, అవి తనప్రకృతిద్వయమువలనఁ గలిగినవి గాన తనవిఁగాఁ జెప్పికొన్నాఁడనిరి. 'అజామేకామ్ లోహితశుక్లకృష్ణామ్ బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః। అజో హ్యేకోజుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః' (శ్వేతా.౪-౫) తేజస్సు అప్పు, అన్నము అను వికారములచే నొందిన ఎఱుపు తెలుపు నలుపు రూపములతోఁ గూడినదియు, తనకు సమానరూపము లగు వివిధభూతభౌతికపదార్థములను సృజించునదియు, ఉత్పత్తి లేనిదియు నగుదానిని (అనఁగా ప్రకృతిని) ఒకానొక విద్వాంసుఁడు (అనఁగా పరమాత్మ) ఉత్పత్తిలేమిచేత దానికి సమానుఁడే యగుచు అందు బుద్ధిచే సేవించుచు దాని

రూపములైనట్టి యీనారెండు ప్రకృతులవలన బుట్టినవిగా నెఱుంగుము. నారెండు ప్రకృతులవలనఁ బుట్టినవిగాన నవి నాయవియే యగును. అట్లు కాఁగా, సమస్తమైన జగత్తు నారెండు ప్రకృతులవలనఁ బుట్టుటచేతను, ఆరెండు ప్రకృతులును నావలనఁ బుట్టినవిగాన నాయవి యగుటచేతను, సమస్తమైన జగత్తునకును నేనే ఉత్పత్తికారణమును (పుట్టుచోటును) లయకారణమును (నశించు

---

ననుసరించి యున్నాఁడు. ఇంకొకవిద్వాంసుఁడు (అనగాఁ ప్రత్యగాత్మ) కొంతకాలము దాని ననుభవించి యంత వైరాగ్యము పుట్టి విడుచుచున్నాఁడు. 'నిత్యో నిత్యానాం. చేతనశ్చేతనానామ్' (శ్వేతా. ౬ ౧౩). 'ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీఉభావపి' (గీ. ౧౩-౧౯) ఇత్యాదులందు చిత్తును అచిత్తును పుట్టుకలేనివిగానుండఁగ పరమాత్మువలన నవి పుట్టుటయెట్లు? అన్నచో నందులకు 'మహా...భవతి' అని అవి రెండును పరమాత్మునియందు లయమునొందుటం బ్రతిపాదించుశ్రుతి నుదాహరించిరి. పరమాత్మునియందు ప్రలయమును జెప్పఁబడిమివలన ఉత్పత్తికూడ శ్రుతిసిద్ధమే యగునని భావము. ఇట ప్రకృతియు పురుషుఁడును పరమాత్మునియందు లయించుట యనఁగా క్షీరమందు నీరమువలె, వేఱుపఱుపరానట్లు ఒకవిధమునఁ గలిసియుండుట. దీనిచే ఆరెంటియొక్క ద్రవ్యస్వరూపములును నాశములేక నిత్యములుగానే యుండుటవలన 'అజామేకామ్' ఇత్యాదులగు నిత్యత్వమును జెప్పు శ్రుతులతో విరోధములేదు. ఈవిషయమునకే 'విష్ణోస్స్వరూపాత్' అని స్మృతి నుదాహరించిరి. 'మహాన్...ఏకీభవతి -(మహాన్) మహత్తత్త్వము. (అవ్యక్తే) అవ్యక్తమందు గుణములు మూఁడును సమములై యుండి పిదప విషమములై మహత్తు మొదలగువికారములఁ గలిగించుచున్నవి, కనుక 'మహత్తు అవ్యక్తమందు లీనమగును' అనఁగా మహత్తును బుట్టించు విషమావస్థ దానికి మునుముందటి సామ్యావస్థయందు లీనమగు నని యర్థము. ఈసామ్యావస్థయే యవ్యక్త మనఁబడుచున్నది. 'అవ్యక్త మక్షరే లీయతే' 'అవ్యక్తము అక్షరమందు లీనమగుచున్నది' అక్షరమనఁగా సామాన్యముగా చిత్తు (అనఁగా చేతనము) అని యర్థము. ఐనను చేతనమాత్రము 'అవ్యక్త మక్షరే లీయతే' అన్నట్టు అవ్యక్తమునకు ప్రకృతియు, 'అక్షరం తమసి లీయతే' అన్నట్టు తమస్సునకు వికృతియుఁ గానేరదు. కాన నిట అక్షరమనఁగా చేతనమాత్రము గాక చేతనసమష్టిగర్భమయి అవ్యక్తమనఁబడు గుణసామ్యముకూడ స్పష్టముగాకుండునట్టి అచిత్తుయొక్క యవస్థయని తెలియునది. ఇట చిద్గర్భమగు వస్తువునందు అక్షరశబ్దము ఉపచరించుచున్నది. దీనివలనను 'ప్రధానాదివిశేషాన్తం చేతనాచేతనాత్మకమ్' అను పరాశరవచనమువలనను, ప్రధానము మొదలుగా సమస్తతత్త్వ

చోటును) శేషియు (స్వామియు) నై యున్నా నని తెలియుము.
అచిత్సమష్టిరూపమైన ప్రకృతికిని చిత్సమష్టిరూపమైన పురుషునికిని
ఇరువురకును పరమపురుషుఁడే కారణమగుట శ్రుతి స్మృతిసిద్ధము.
[6]'మహానవ్యక్తే లీయతే। అవ్యక్త మక్షరే లీయతే। అక్షరం తమసి
లీయతే। తమః పరే దేవ ఏకీభవతి' (సుబాల. ౨-ఖం.) ఇత్యాదులు
శ్రుతులు. [7]'విష్ణోస్స్వరూపాత్పరతోదితే ద్వే రూపే ప్రధానం పురు
షశ్చ విప్ర' (వి-పు-౧-౨-౨౪.) [8]'ప్రకృతిర్యామయాఖ్యాతా వ్యక్తా

---

జాలమును చిదచిదాత్మకము లని తెలియునది. కావున గుణసామ్యావస్థయగు నవ్యక్తము
సామ్యావస్థ స్ఫుటము గానిదై అచేతనసమష్టిగర్భమై యుండు నక్షరమందు లీనమగు
చున్నదని యర్థము. 'అక్షరం తమసి లీయతే' అక్షరము తమస్సునందు లీనమగుచున్నది.'.
చిద్గర్భమై యుండుటయేకాక అచిత్తు అగుటయుఁగూడ వేఱువేఱ తెలిసికొన శక్యము
గానట్టి యవస్థ గలదై అతిసూక్ష్మమై యుండు ప్రధానము తమస్సు అనఁబడును.
ఇదియే అక్షరము మొదలయిన యవస్థలను బొందుటకు ఉన్ముఖమై యుండునపుడు
విభక్తతమస్సనియు, అట్లు ఉన్ముఖము గాకుండునపుడు అవిభక్త తమస్సనియుఁ జెప్పఁ
బడును. అది పరమాత్మని శరీరముగాఁగూడ చింతించుట కవశ్యమయి నీటియందలి
యుప్పువలెఁ తెలియరాక సర్వజ్ఞుఁడగు పరమాత్మునికే వేద్యమయి యుండును. అక్షరా
వస్థమయినది యిట్టి తమస్సనెడి యవస్థయందు లీనమగుచున్నదని యర్థము. 'తమః పరే
దేవ ఏకీభవతి' 'తమస్సు పరుఁడగు దేవునియందు ఏకీభవించుచున్నది.' మహత్తు
మొదలగు నవస్థలు వీడి అవ్యక్తము మొదలగునవస్థ లగుటచే ఒకటి మఱొకటియందు
లీనమగుట చెప్పఁబడినది. తమస్సు అను అవస్థ వీడి మఱొకయవస్థ యగుట లేనందున
నిట లీనమగుట చెప్పఁబడక 'ఏకీభవించుట' చెప్పఁబడినది. మఱియు తమస్తత్త్వము
'యస్య మృత్యు శ్శరీరమ్' అని మీఁద పరమాత్మునికి శరీరముగాఁ జెప్పఁబడుచున్నది
గాన తమస్సు పరదేవునియం దేకీభవించుచున్నది' అనఁగా అక్షరాదికార్యోపయోగా
ర్థము విభక్తమయిన తమస్సు, అట్టు కార్యమునకు నుపయుక్తముగాక అవిభక్తమయి
పరమాత్మకు శరీరభూతమయియుండు తమస్సునందు ఏకీభవించుచున్న దని యర్థము.
ఇట్లు మహదాదిశబ్దవ్యంజితే మగుప్రకృతియు అక్షరశబ్దవ్యంజితమగు పురుషుఁడును
పరమాత్మయందు లయమునొందుట చెప్పుటవలననే అతనినుండియే యవి యుత్పత్తి
నొందుట సిద్ధించుచున్న దని తెలియునది. ఈశ్రుతి కుపబలముగా 'విష్ణో...విప్ర' అని
స్మృతి యుదాహరింపఁబడినది. (విష్ణో స్స్వరూపాత్ పరతః) విష్ణుని రూపమునుండి

వ్యక్తస్వరూపిణీ పురుషశ్చ పృథా వేతౌ లీయేతే పరమాత్మని ।
పరమాత్మాచ సర్వేషా మాధారః పరమేశ్వరః । విష్ణునామా స
వేదేషు వేదాన్తేషు చ గీయతే' (వి. పు. ౬-౪-౩౧-౪౦) ఇత్యాదులు
స్మృతులు.

శ్లో॥ మత్తః పరతరం నాన్య త్కిఞ్చి దస్తి ధనఞ్జయ ।

టీ. ధనంజయ = అర్జునా, మత్తః = నాకంటె, పరతరం = అధిక శ్రేష్ఠమగు, అన్యత్ = మఱియొకటి, కిఞ్చిత్ = ఏదియును, నాస్తి = లేదు.

తా. అర్జునా, ప్రకృతిద్వయము సర్వమునకుఁ గారణమైన దైనను అట్టిదానికిని నేనే కారణమై యున్నాను. చేతనము సమస్తములైన యచేతనములకు స్వామిగా నున్నను, అట్టిదానికిని నేనే

---

యవల, (ప్రధానం పురుషశ్చ) ప్రధానము పురుషుఁడు అను, (ద్వేరూపే ఉదితే) రెండురూపములు ఉదయించినవి. 'పరతః ఉదితే' అనుచో సంధి ఆర్షము లేక 'పరతః దితే' అను పాఠము గ్రహించినచో, 'దో అవఖండనే' అనుధాత్వర్థమువలన ఆవిష్ణు రూపమునుండి యవి రెండును పృథగ్భూతములైనవి. అనఁగా నిటఁ ప్రలయదశను గ్రహించినచో ప్రధానపురుషేశ్వరులను మూఁడుతత్త్వములును ప్రలయదశయందును పరస్పరము స్వరూపభేదము గలిగియుండు నని యర్థము. 'పరతః అదితే' అని పాఠము గ్రహించినచో ఒండొంటికి అపృథగ్భూతములై (అనఁగా ఒకటినుండి యొకటిని విభజింపరానట్లు సంశ్లేషమునొంది) యుండునని యర్థము. ఈస్మృతివలనను ప్రకృతిపురుషులు పరమపురుష యోనులగుట తెలిసినది. ఈవిషయమునే స్ఫుటముగాఁ దెలియుటకై 'ప్రకృతి...గీయతే' అని యుదాహరింపఁబడినది. 'వ్యక్తావ్యక్తస్వరూపములు గలదిగా నేను జెప్పిన ప్రకృతియు పురుషుఁడు నను నీయిద్దఱును పరమాత్మనియందు లయింతురు. ఆపరమాత్ముఁడును సమస్తమున కాధారభూతుఁడు పరమేశ్వరుఁడు. విష్ణునాముఁడగు నతఁడు వేదములందును వేదాంతములందును (హిరణ్యగర్భ, ధాతృ, ప్రజాపతి, రుద్ర, ఇంద్ర, సత్, బ్రహ్మ, ఆత్మాదిశబ్దములచే) చెప్పబడుచున్నాఁడు' అని యర్థము. ఈశ్లోకము బ్రహ్మాండపురాణమునందును, ౧౭౩-అధ్యా, ౩౭-శ్లో) పఠింపఁబడుచున్నది.

స్వామిని. ఇట్లు *సర్వకారణుఁడును సర్వశేషియు నైయుండుటచేత నే నన్నిటి కధికుఁడ నెట్లో యట్లే జ్ఞానశక్తి బలాదిగుణయోగము చేతను నేనే అన్నిటికంటె నధికుఁడను. జ్ఞానబలాదిగుణాంతరములు గలిగి అన్నిటికంటె నధికమైనది నేను తప్ప వే ఒక్కటియు లేదు.

9

మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ 7

టీ. ఇదం = ఈ, సర్వం = సమస్తమైన చిదచిద్వస్తుసమూహము, సూత్రే = దారమునందు, మణిగణాః ఇవ = రత్నముల సమూహమువలె, మయి = అంతర్యామినై యుండు నాయందు, ప్రోతం = కూర్పఁబడినది.

తా. *సమస్తమైన యీచిదచిద్వస్తుసమూహము కార్యావస్థయం దుండునపుడును కారణావస్థయం దుండునపుడును నాకు శరీరమై, సూత్రమునందు మణిసమూహము గ్రువ్వఁబడియుండునట్లు ఆత్మనైయె నెలకొనియుండు నాయందు గ్రువ్వంబడియున్నవి; అనఁగా నన్నాశ్రయించి యున్నవి. (చిదచిదాత్మకమైన) జగత్తును బ్రహ్మమును (ఒకటికొకటి) శరీరముగాను ఆత్మగాను నుండుట 'యస్య పృథివీ శరీరమ్' (బృహ. ౫-౭-౩) 'యస్యాత్మా శరీరమ్' (శతపథ బ్రా. ౧౪, కాం) 'ఏష సర్వభూతాన్తరాత్మాఽపహతపాప్మా దివ్యో

*ఇట 'నేను పరులరుఁడను' అని విధిలేనిచో 'నాకంటె వేఱు పరతరమైనది లేదు' అని నిషేధము చెప్పుట అంతగా నుచితముగాదు. ఇట ఈనిషేధము చెప్పఁబడుట చేతనే ఆవిధియు సంభవింపకమానదు. కాన 'సర్వకార ..అధికుఁడను' అని పూర్వఁబడినది. 'జ్ఞానబలాదిగుణాంతరములుగల్గి.. నధిక మైనది' యనుటచే బ్రహ్మరుద్రాదులగు నధికారులును పరిశుద్ధాత్మలును గ్రోడీకృతు లయిరి. వీరును నాకంటె తక్కువయె యని భావము.

*పూర్వము భగవంతుఁడు సర్వము శరీరముగాఁగలవాఁ డనుటచే సర్వము యొక్క రూపములవికారము నొందుచున్నాఁడని ప్రసక్తి కలుగుచున్నది. ఈ సవికారత్వమును పరిహరించి సర్వమున కాధారుఁ డనుమూలమున సర్వశరీరుఁ డనుచున్నాఁడని యిట చెప్పఁబడుచున్నది. 'సర్వమిదమ్' అనుటచే సర్వావస్థలందును గల సమస్తచిద

దేవ ఏకో నారాయణః' (సుబా. ౭-ఖం.) అని అంతర్యామి బ్రాహ్మణములందు సిద్ధము.

---

చిద్వస్తువులు గ్రహింపఁబడుచున్నవి గావున 'ఈచిదచిద్వస్తువు...ఉన్నప్పుడును' అనఁబడినది. 'ప్రోతం సూత్రే మణిగణా ఇవ' అని సూత్రముచే లోపల ప్రవేశింపఁబడియుండి ఆశ్రయముగాను తాను ఆశ్రయిగాను నుండు మణిగణము చెప్పఁబడినది. దీనింబట్టి ఆత్మచే లోపల ప్రవేశింపఁబడి యది ఆశ్రయముగాను తా నాశ్రయిగాను నుండు శరీరము ప్రతీతమగుచున్నది. ఇట్లు 'ప్రోతం' అని అనుప్రవేశమువలనను 'సూత్రమణిగణ'ముల ఆశ్రయాశ్రయిభావమువలనను శరీరలక్షణము సూచితమగుటచే భగవంతునిచే అనుప్రవేశము నొంది భగవంతుఁడును దానును పరస్పరము ఆశ్రయాశ్రయిభావము గలిగియుండు సమస్తచిదచిద్వస్తుజాతము శరీరభూత మగుచున్నది గాన 'నాకు శరీరమై' అనఁబడినది. సూత్రదృష్టాంతమున సూత్ర మెట్లు తా నొక్కటియే అన్నిమణులకు నాధారమై వానియందు ప్రవేశించి గూఢమయి తనస్థితి వానివలనఁ గలుగక వానిస్థితియే తనవలనఁ గలిగినదై యుండునో అట్లే పరమాత్ముఁడు తా నొక్కఁడే సమస్తచిదచిత్తులకెల్ల నాధారభూతుఁడై వానియందుఁ బ్రవేశించి, గూఢుఁడై దేవాదిరూప మగుప్రకృత్యాదులస్థితి తనవలనఁ గలుగుటయేకాని తనస్థితి ప్రకృత్యాదులవలనఁ గలుగనివాఁడై యుండునని సిద్ధించుచున్నది. 'ప్రోత' శబ్దముచే సూత్రమునకు మణిగణములందుంబోలె లోపలనేకాని వెలుపల వ్యాప్తి లేదను ప్రతీతి గలుగుచున్నదిగాన దానిని నిరసించుటకే 'అనఁగా నన్నాశ్రయించి యున్నవి' అని యర్థాంతరము చెప్పఁబడినది. దీనిచే భగవంతునకు సమస్తమునందును అంతర్వ్యాప్తియు బహిర్వ్యాప్తియుఁ గలవని యెఱుంగునది. ఇట అంతర్యామి బ్రాహ్మణమునందుఁ జెప్పఁబడిన యంతర్యామి నారాయణుఁడే యని తెలుపుటకును అందుఁ జెప్పఁబడని తత్త్వాంతరములను గూడ 'సర్వభూత' అని సంగ్రహించి యన్నిటను అంతర్యామి యగునని నిరూపించుటకును 'ఏషసర్వ...నారాయణః' అను సుబాలోపనిషద్వాక్య ముదాహరింపఁబడినది. (ఏషః) ఈ, (సర్వభూతాన్తరాత్మా) ఇట భూతశబ్దము సత్తగల వస్తువును జెప్పునది గాన నుభయవిభూతులం దంతర్గతమైయున్న చిదచిద్వస్తుజాతమును నిర్దేశించుచున్నది గావున సమస్తచిదచిద్వస్తుజాతమునకు అంతరాత్మ యగువాఁడని యర్థము. (అపహతపాప్మా) పూర్వము పృథివి మొదలుకొని తమస్సువఱకుఁ జెప్పఁబడిన వస్తువులయందు అంతర్యామియై వర్తించుచున్నను వానియందలి దోషములచే స్పృశింపఁబడనివాఁడని యర్థము. (దివ్యః) దివిస్థితః=పరమపదనిలయుఁ డని యర్థము. (దేవః) ద్యోతనాదిగుణవిశిష్టుఁడు, (ఏకః) అద్వితీయుఁడు-సమాభ్యధికరహితుఁ డనుట. ఇట్టివాఁ డెవ్వఁ డనఁగా, (నారాయణ) నారాయణుఁడని యర్థము.

అవ. *కాఁబట్టి, సర్వమును పరమపురుషునకు శరీర మగుటచే దానికెల్ల ఆత్మయగు నాపరమపురుషునికి అవి ప్రకారములు (విశేషణములు) అగును. ఇట్లు సర్వమును పరమపురుషుని ప్రకారము లగుటవలన సర్వప్రకారుఁ డగు పరమపురుషుఁడే యున్నాఁడు గావున నా సర్వమునకుఁ గలశబ్దము లతనినే ముఖ్యవృత్తిచే చెప్పుచున్న వని వానికి పరమపురుషునితోడి సామానాధికరణ్యముచేఁ జెప్పుచున్నాఁడు.

---

* ఒకవస్తువునకుఁ గల జాతిగుణములు శరీరము మొదలయినవి దాని విశేషణములు (లేక-ప్రకారములు) అనఁబడును. ఆవస్తువు వానికి విశేష్యము, లేక-ప్రకారి యనఁబడును. సర్వమును పరమపురుషునికి శరీరమగుటచే నతనికి అవి ప్రకారములగును. పరమపురుషుఁడు సర్వమును ప్రకారి యగును. ప్రకారి లేక యట్టిప్రకారములుండజాలవు. ప్రకారములున్నవి యనఁగా అవి గలిగి యున్నప్రకారి యున్నాఁడనియే పర్యవసాన మేర్పడుచున్నది. కనుక సర్వము ఉన్నవి యనఁగా సర్వమును ప్రకారములుగాఁ గలిగినప్రకారి యగు పరమపురుషుఁడే యున్నాఁడనుట పర్యవసానమగుచున్నది. ఇట ప్రకారములు ప్రకారికి అపృథక్సిద్ధములై - (అనఁగా ప్రకారి లేకయే తమంతటనే వేఱుగా సిద్ధించునవి కానివై) యుండవలయును. దేహమనెడి ప్రకారము ప్రకారియగుదేహికి (అనఁగా ఆత్మకు) అపృథక్సిద్ధమయిన (అనఁగా ఆత్మ లేక యది తనంతటనే కలుగఁజాలనిది). ఇట్లు దేహము అపృథక్సిద్ధప్రకారమయి దేహికి నుండుటచే దేహమునకు వాచకములగు రంగఁడు రాముఁడు మొదలయినశబ్దములు, దేహిపర్యంతము పేళ్లుగా చెల్లుచున్నవి; అనఁగా దేహికిఁగూడ పేళ్లుగా పర్యవసించుట గలదు. దీనిచే అపృథక్సిద్ధములైన ప్రకారములకు వాచకము లయినశబ్దములు వానిప్రకారికిని వాచకము లగుటయందు పర్యవసించుచున్నవి. అట్టిప్రకారములకు పేళ్లయినశబ్దములచే తుదకు తత్ప్రకారియే చెప్పఁబడువాఁ డగునని తెలియుచున్నది. సర్వమును ఆత్మభూతుఁ డగుపరమపురుషునికి శరీరభూతము లగుటచే అవి కేవలమైనప్రకారములు గాక అపృథక్సిద్ధము లైనప్రకారము లగుచున్నవి గావున ఆప్రకారములకు వాచకములగు శబ్దములచేనెల్ల తత్ప్రకారియగు పరమపురుషుఁడే చెప్పఁబడుచున్నాఁడని తేలుచున్నది. ఇది యిట్లుండ, శబ్దము ఒకయర్థమునందు వర్తించును గదా. ఒకశబ్దము దానికి సంకేతితమయి యుండు నర్థమున వర్తించుట గలదు. జ్వలించుచు దహించునదై యున్నయొకవస్తువును జూచి 'అగ్ని' యన్నచో అగ్ని శబ్దము తనకు సంకేతిత మయి యున్నయర్థమునందే వర్తించుచున్నది గాన నిట్లు వర్తించుట అభిధావృత్తి లేక ముఖ్యవృత్తి శక్తి యనఁబడును. బ్రాహ్మణునిఁ జూచి 'అగ్ని' యన్నచో అగ్నిశబ్దము తనకు సంకేతిత మయిన యర్థమున వర్తింపక తనవలె శుచిత్వ

శ్లో॥ రసోఽహ మప్సు కౌన్తేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ 8
పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు 9
బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్।
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్॥ 10
బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్।
ధర్మా విరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥ 11

టీ. (8) కౌన్తేయ=అర్జునా, అహం=నేను, అప్సు=ఉదకములందు, రసః =రసమును, శశిసూర్యయోః = చంద్రసూర్యుల యందు, ప్రభా = కాంతియును, సర్వవేదేషు = సమస్తవేదముల యందు, ప్రణవః=ఓంకారమును, ఖే=ఆకాశమునందు, శబ్దః=శబ్దమును, నృషు=జీవులయందు; పౌరుషం=కర్తృత్వశక్తియు (లేక-నృషు = పురుషులయందు, పౌరుషం = పుంస్త్వమును), అస్మి = అగుచున్నాను. (9) పృథివ్యాం=భూమియందు, పుణ్యః = తులసి మొదలైనవానియొక్క పవిత్రమైన, గంధశ్చ = గంధమును, విభావసౌ =అగ్నియందు, తేజశ్చ=దహించుశక్తియును, అస్మి=నేనై యున్నాను, సర్వభూతేషు =బ్రహ్మాది సమస్తశరీరులయందు, జీవనం= ప్రాణముయొక్క స్థితికి హేతువును, తపస్విషు=తపస్సుగలవారియందు,

---

పవిత్రత్వాదులు గల మతియొక యర్థమునందు వర్తించుచున్నవి. ఇట అగ్నియనఁగా అగ్నివలె శుచిత్వాదులు గలవాఁడనుట. కనుక నిట్లర్థాంతరమునందు వర్తించుట లక్షణావృత్తి యనఁబడును. ప్రకారములకు వాచకములగు శబ్దములు ప్రకారియగు భగవంతునియందు వర్తించునని చెప్పఁబడెనుగదా. ఆశబ్దము లతనియందు వర్తించుట అభిధావృత్తి చేతనా? లక్షణావృత్తి చేతనా? యని యడుగవలసియున్నది. ప్రకారములు అపృథక్సిద్ధము లయినవి కాన సాక్షాత్ప్రకారియే యగుచున్నవి. కాఁబట్టి ప్రకారవాచిశబ్దములు అభిధావృత్తిచేతనే ప్రకారియందు వర్తించుచున్నవి. కావుననే 'ముఖ్యవృత్తిచే చెప్పుచున్నవి' అనఁబడినది.

తపశ్చ = తపస్సును, అస్మి = నేనై యున్నాను. (10) పార్థ = అర్జునా, మాం = నన్ను, సర్వభూతానాం = సమస్తభూతములకు, సనాతనం = నిత్యమైన, బీజం = మూలము- అనఁగా మూలమైన ఉపాదానద్రవ్యము అని, విద్ధి = తెలిసికొనుము, అహం = నేను, బుద్ధిమతాం = ప్రజ్ఞగల వారియొక్క, బుద్ధిః = నిశ్చయాత్మకమగు బుద్ధియు, తేజస్వినాం = ప్రతాపశీలురయొక్క, తేజః = పరుల నతిశయించుశక్తియు, అస్మి = అగుచున్నాను. (11) భరతర్షభ = అర్జునా, అహం = నేను, బలవతాం = బలముగల వారలయొక్క, కామరాగవివర్జితం = కామ్యవస్తువులందు రాగము లేనట్టి, బలం = ధారణాదిశక్తియును (స్వధర్మానుష్ఠానసామర్థ్యమును) భూతేషు = ప్రాణులయందు, ధర్మావిరుద్ధః = ధర్మశాస్త్రమునకు విరుద్ధముకాని, కామశ్చ = స్వభార్యయందలి ప్రేమ మొదలైనవియు, అస్మి = అగుచున్నాను.

తా. *అర్జునా, ఉదకములయందు రుచిగుణమును, సూర్యచంద్రులయందు జగదుపకారహేతువగు కాంతియును, సకల వేద

---

* 'రసోఽహమ్' 'రసము నేను' అనుచో 'అహమ్' అనఁగా భగవంతుఁ డగుచున్నాఁడు. కనుక 'రస'శబ్దమునకు 'అహమ్' శబ్దమునకు సమానముగా భగవంతుఁడే అధికరణము (అనఁగా ఆశ్రయము) అగుచున్నాఁడు. ఇట్లు రెండుశబ్దములును సమానమైనయధికరణము గలవిగాన సమానాధికరణము లగును. సమానాధికరణములై యుండుభావము సామానాధికరణ్యము. రసశబ్దము భగవంతునితో సామానాధికరణ్యము గలిగియున్న దనఁగా భగవంతునికే వాచక మగుచున్నదని యర్థము. అనఁగా రసమే భగవంతుఁ డగుచున్నదని భావము. రసశబ్దమునకు భగవంతునితో సామానాధికరణ్య మెట్లు? అప్పు మొదలగు ద్రవ్యములయొక్క రసాదులు భగవంతుఁ డగుట యెట్లు? అని యడిగినచో, ప్రకారియగు నొకవస్తువునకు, దానికి అపృథక్సిద్ధము లయిన జాతిగుణశరీరాదిప్రకారములును, ఉన్నవి. ఆ ప్రకారములకు వాచకములయిన శబ్దములు ఆప్రకారికిని వాచకములుగా పర్యవసించునని చెప్పఁబడెనుగదా. ఇట్లాప్రకారములకు వాచకము లగు శబ్దములకు సమానమైనయధికరణముగా ప్రకారి యుండుటచే ప్రకారితో సామానాధికరణ్యము నొందుచున్నది. అప్పు మొదలగు ద్రవ్యములు పరమాత్మునికి శరీరము. శరీరభూతమైన అప్పు మొదలగువానిప్రకారము లగు రసాదులు

ములయందు సారమగు ప్రణవమును, ఆకాశమునందు శబ్దగుణమును, జీవులయందు కర్తృత్వశక్తియును (లేక పురుషులయందు పుంస్త్వ మును), భూమియందు, సుగంధమును, అగ్నియందు తేజస్సును (దాహ కత్వశక్తియును), బ్రహ్మాది సకలశరీరులయందు ప్రాణస్థితిహేతువును, తాపసులయందు కాయక్లేశాదిరూపమైన తపస్సును, నేనేయగుదును.

---

శరీరియగు పరమాత్మునికిని ప్రకారములే యగుచున్నవి. పరమాత్ముఁడు ఆరసాదులకు ప్రకారి యగుచున్నాఁడు. కావున ప్రకారములగు రసాదులకు వాచకములయిన రసాదిశబ్దములును ప్రకారియగు పరమాత్మునికిని వాచకములై పరమాత్మునితో సామా నాధికరణ్యము నొందుచున్నవని తెలియునది. వస్తువులకు పరస్పరము ప్రకారప్రకారి భావము కలుగఁగా తద్వాచకము లయినశబ్దములకు పరస్పరము సామానాధికరణ్యము గలుగుచున్నది. ఆప్రకారములు జాతిగాఁగాని గుణముగాఁగాని శరీరముగాఁగాని యుండినను ప్రకారితో సామానాధికరణ్యము గలిగియుండుటకు హేతువు అవి యపృథక్సిద్ధము లగుటయే యని తెలియునది. కేవలము రసాదులను చెప్పుట చాలియుండఁగా వాని కాశ్రయములయిన అప్పు మొదలగు ద్రవ్యములనుగూడ నేల చెప్పవలయు? నన్నచో, ఆయాద్రవ్యమునందు ప్రధానములగు రసగంధాదిప్రకారము లకు తాను ప్రకారియగుటను దెలుపుకొఱకని తెలియునది. ద్రవ్యప్రకారములు ఆ పరమాత్మునిప్రకారములగుట 'కాఠిన్యవాన్యోఽబిభర్తి జగదేతదశేషతః। శబ్దాదింశ్చ యోవ్యాప్తీ తస్మై భూమ్యాత్మనే నమః' వి. పు. ౧ ౧౪ ౩౦ అని భగవంతుఁడు భూమ్యాత్ముఁడై భూమిప్రకారములగు కాఠిన్యాదులు 'కాఠిన్యవాన్' కాఠిన్యవంతుఁడు ఇత్యాదులచే తనప్రకారములుగాఁ జెప్పుకొనుటవలనఁ దెలియునది. అందు అప్పులందు రసము ప్రధానము. రసము పృథివియందు నున్నది. అప్పులకు రూపాది గుణములు నున్నవి. కనుక అప్పులకు రసమే ప్రధానముగా విశేషించి చెప్పుట యెట్లు? అన్నచో, తేజస్తత్త్వమునుండి పరిణమించిన యప్పులకు పూర్వతత్త్వములగు తేజో వాయ్వాకాశములం దుత్పన్నము కానట్టిరసము గలుగుటచే, అది దానికి ప్రధాన మని తెలియునది. ఇట్లే మీఁదెల్ల దానిదానికి విశేషించి యొక్కొకటి ప్రధానముగాఁ జెప్పుటం దెలియునది. ప్రభయనఁగా పరయాశ్రయమైనదానిని మీఱి ప్రసరించు తేజోద్రవ్యవిశేషము. చంద్రసూర్యులు ప్రభచేతనే జగదుపకారము సేయుటచే నది వారికిఁ బ్రధాన మనఁదగాఁ జెప్పఁబడెను. సర్వవేదములకు ప్రణవమే బీజమగుటచే నది వానియందు ప్రధానభూతమైనది. పౌరుషమనఁగా పురుషుని భావము. ఇది సంతానపరంపరకు హేతువగు వీర్యమని కొందఱు, కర్తృత్వశక్తి యర్థమైనచో 'నృషు' అనుటకు జీవులని యర్థము గ్రాహ్యము. మగతన మని యర్థము సేసినచో 'నృషు'

అర్జునా, సమస్తచరాచరభూతములకు అనాదిగా మూలమై యుండు ప్రకృతితత్త్వముగాను (లేక-వానిపరిణామశక్తిగాఁ గాని ఉపాదాన ద్రవ్యముగాఁగాని) నన్నెఱుఁగుము. బుద్ధిమంతులయొక్క వివేకశక్తియును, ప్రతాపశీలురయొక్క మనోధైర్యమును నేనుగను యున్నాను. అర్జునా, బలవంతులయందు *కామరాగరహిత మగు

---

అనుటకు పురుషులని యర్థము. 'పుణ్యోగంధః' అనుటచే తులసి మొదలగువాని గంధమని కాని సురభిగంధ మని కాని గ్రాహ్యము. ఇట్టి గంధమువలననే పృథివి సత్త్వోన్మేషమునుగాని సుఖమునుగాని కలిగించును. 'విభావసుః' అన్న యగ్నికి 'తేజస్సు' అనఁగా దహించుశక్తి. 'జీవనం సర్వభూతేషు' అనుచో సర్వభూతము లనఁగా బ్రహ్మరుద్రాదిసమస్తశరీరులని యర్థము జీవన మనఁగా ప్రాణనములేక ప్రాణస్థితి హేతువని యర్థము సర్వభూతములకు సనాతనమగు బీజము ప్రకృతితత్త్వము. లేక-ప్రధానధర్మమును నిర్దేశించు ప్రకరణముగాన బీజమనఁగా పరిణామద్రవ్యములు ఆయాకార్యములుగా పరిణమించు సామర్థ్యమనియు గ్రాహ్యము లేక బీజ మనఁగా జంగమస్థావరములు మొలచుటకుఁ గారణమైన యయ్యుపాదానద్రవ్యము. బుద్ధియనఁగా అధ్యవసాయము-లేక జ్ఞానమాత్రము తేజస్వు లనఁగా ప్రతాపశీలురు. వారియందు తేజమనఁగా ఒకరిచే క్రిందుపడునశక్యము గాకుండుట లేక-ఒకరిని క్రిందుపఱుచు సామర్థ్యము. బల మనఁగా ధారణాశక్తి, కామరాగవశమువలన స్వకార్యమునకుఁ బూనినవాఁడు తనబలముచే పరపీడాదులు గావించును. అట్టిబలముగాక ధర్మోపయుక్తముగా, శరీరాది ధారణాదులను జేయుబలమును నిర్దేశించుటకై 'కామరాగవివర్జిత' మైనబలము చెప్పఁబడినది. కామమనఁగా ఇచ్ఛయొక్క కాష్ఠాదశ రాగమనగాఁ ఇచ్ఛ లేక-కామమనఁగా కామ్యపదార్థములుగా గ్రహించినచో వానియందలి రాగ మనియు నర్థము సేయవచ్చును ధర్మావిరుద్ధమైన కామమే స్వదారప్రీత్యాదులు. 'ఇట సమస్తమును' అనుటచే బ్రహ్మరుద్రాదులు చేయుచున్నవానినిగాదె తప్పకయుండైన పరమాత్మయే చేయువాఁ డని 'అహం కృత్స్నస్య ప్రభవః' అన్న పూర్వోక్తమును స్మరింపజేయుచున్నది 'విలక్షణములు' అనఁగా వీరిచేఁ జెప్పఁబడు రాజసతామసములకంటె విలక్షణములని భావము. 'నావలననే నాయందే యున్నవి' అనుటచే అవి తనకపృథక్సిద్ధము లగుటయు, దానింబట్టియే వానికి తనతోడ సామానాధికరణ్యము సిద్ధించుటయు సూచింపబడెనని తెలియునది.

* కామ మనఁగా లభింపనివిషయములందు అభిలాష. రాగ మనఁగా కోరిన విషయము లభించినను మరల అధికవిషయములయందు ఆశ.

స్వధర్మానుష్ఠానసామర్థ్యమును, ప్రాణులందు ధర్మవిరుద్ధము కానిదై స్వభార్యాప్రేమాదిరూపమైయుండు కామమును నేనె యయి యున్నాను. అనఁగా సమస్తమును పరమపురుషునికి ప్రకారము లగుటచే, ప్రకారములనుఁ గలయన్ని శబ్దములచేతను వానిప్రకారి యగు పరమపురుషుఁడే చెప్పఁబడుచున్నాఁ డనుట.

రాజసతామసములు గాక విలక్షణములై యున్న యీవస్తువులన్నియు నావలననే పుట్టి, నాకు శేషములై, నాశరీర మగుటచే నాయందే నెలకొనియుండునవి. కనుక (అవి యున్నవి అనఁగా) అవి యెల్లప్రకారములుగాఁ గలనే నే యున్నవాఁడను. (అవియెల్లను నేనే యగుదు నని భావము.)

శ్లో॥ యేచైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే ।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి॥ 12

టీ. సాత్త్వికాః = సాత్త్వికగుణములు గలవియైన, భావాః = పదార్థములు, యే ఏవ - ఏవియో, రాజసాశ్చ రజోగుణములు గలవియు, తామసాశ్చ = తమోగుణములు గలవియునైన, (భావాః = పదార్థములు,) యే = ఏవియో, తాన్ = వానిని, మత్త ఏవ ఇతి = నావలనఁ గలిగినవియేయని, విద్ధి = తెలియుము. తేషు - ఆభావములయందు, అహం = నేను, న = లేను, తే అవి, మయి = నాయందు- నా శరీరమగుటచే, (సన్తి = ఉన్నవి.)

తా. విశేషించి చెప్పనేల? జగమునందు *దేహములుగాను, ఇంద్రియములుగాను భోగ్యవస్తువులుగాను, మఱియు నాయాదానికి

* ఈశ్లోకమున పూర్వోక్తములగు రసాదిశబ్దములకేకాక సమస్తవాచకశబ్దములకును తనతోడి సామానాధికరణ్యము గలదని చెప్పి స్వమాహాత్మ్యము నుపసంహరించుచున్నాఁడు. భావములు దేహేంద్రియభోగ్యములుగా నుండుట వ్యష్టిదశ యనియు 'ఆయా దానికి హేతువులుగా' నుండుట సమష్టిదశ యనియుఁ దెలియునది. 'ప్రహ్లాదః

హేతువులుగాను నెలకొనిసాత్త్వికములును రాజసములును తామస ములును నగు నేయే పదార్థము లున్నవో యవియన్నియు నావల ననే పుట్టినవిగా నెఱుఁగుము. అవి నాశరీరము అగుటచే నా యందే నెలకొనియున్నవనియు నెఱుంగుము. నేనో వానియందు లేను. అనఁగా నాస్థితి యొకానొకప్పుడును వానివలనఁ గలుగు నది కాదు. తక్కినయెడల శరీరమునకు స్థితి ఆత్మవలననే కలుగు చున్నదైనను, ఆత్మయొక్క స్థితికిని శరీరముతోడ్పాటుయుఁ గలదు. నాకో, ఆరెండును శరీరముగానుండియు నావలన వానికి స్థితియేకాని వానిచే నాస్థితికి అటువంటి తోడ్పాటు ఏదియు లేదు. (ఇట్లారెంటివలన నట్టి యుపకారము లేనప్పుడు వానిని శరీరముగాఁ దాల్చుటవలన ప్రయోజన మేమి యనఁగా) కేవల లీలయే ప్రయోజనమని యర్థము.

శ్లో॥ త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్॥ 13

టీ. సర్వం=సమస్తమయిన, ఇదం=ఈ, జగత్ = ప్రపంచము, త్రిభిః=మూఁడువిధములైన, గుణమయైః = సత్త్వరజస్తమో

---

ప్రీతిరానన్దః సుఖం సంశాన్తచిత్తతా' ఇత్యాదులు సాత్త్వికభావములు. 'అతుష్టిః పరితాపశ్చ క్రోధోమోహస్తథాక్షమా' ఇత్యాదులు రాజసభావములు. 'అవివిక్తిస్తథామోహః ప్రమాదః స్వప్నతన్ద్రితా' ఇత్యాదులు తామసభావములు. 'న త్వహం తేషు' 'నేను..వానియందు లేను' అనుటకు 'నేను వానియందు వ్యాపించియుండ లేదు' అని యర్థముగా భ్రమింపకుండుటకై 'నాస్థితి ..కాదు' అని యర్థము చెప్పఁబడెను. 'తే మయి' అనుచో 'మయి' అనుసప్తమి నాకధీనమై (అనఁగా శరీరమనుటచే నానియమనమునకు లోనై)యుండునని తెలుపుటచే 'నాశరీరము...యున్నవి' అనఁబడెను. 'నీ స్థితి వానికి లోనయినదని యెవరును జెప్పలేదే! కాఁబట్టి లోనుగాదని వ్యర్థముగా నిషేధింపనేల? యనఁగా 'తక్కినయెడల......' అన్నారు. అనఁగా శరీరముయొక్క స్థితికి ఆత్మయు ఆత్మయొక్క స్థితికి శరీరమును ఉపకరించుట గలదు. సమస్తభావములు నాశరీరముగాను నేను వానియాత్మగాను నుండుటవలన సమస్తముయొక్క స్థితికి ఆత్మభూతుఁడను నే నుపకరించునట్లే నా స్థితికిని శరీరభూతమైన యాసమస్తమును ఉపకరింపవలయునని తోఁపవచ్చును. కావున వాని స్థితికి నే నుపకరించుటయే కాని నాస్థితికి వానివలననట్టి యుపకారము లేదని తెలుపుటకై నిషేధము చెప్పఁబడినదని గ్రాహ్యము,

గుణమయములగు, ఏభిః భావైః = ఈపదార్థములచేత, మోహితం = మోహముం జెందింపఁబడినదై, మాం = నన్ను, ఏభ్యః = ఈపదార్థములకంటె, పరం = ఉత్కృష్టునిగను, అవ్యయం = ఎల్లప్పుడు నొక్కవిధముగ నున్నవానిఁగను, న అభిజానాతి = గుర్తెఱుఁగకున్నది.

తా. *కాఁబట్టి యిట్లు చేతనాచేతనాత్మకమైన నా యీజగత్తంతయును ఆయాకాలములందు నావలననే పుట్టుచు నాయందే

---

* ఇక్కడివఱకు భగవంతుఁడు తనయాథాత్మ్యమును జెప్పినాఁడు. ఇఁక 'త్రిభిః' ఇత్యాదులచే అది ప్రకృతిచేత మఱుఁగువడుటను జెప్పుచున్నాఁడు. గుణమయములైన భావములకంటె తాను పరుఁడు (అనఁగా ఉత్కృష్టుఁడు) అగుటను దెలుపుటకై 'భూమి రాపోఽనలః' అనుటం మొదలుగాఁ జెప్పఁబడిన తనస్వరూపయాథాత్మ్యమును 'మామ్' అని యనువదించుచున్నాఁ డని తెలుపుటకై 'ఇట్లు, చేతనా.....' అనఁబడినది. ఇట చేతనాచేతనములకు 'ఉత్పత్తి' యనఁగా క్రొత్తగా పుట్టుటయు 'ప్రలయ' మనఁగా స్వరూపముతో వర్తించుటయుఁ గాదు. భగవంతుని యందు లీనములైనవి స్థూలాకారమున వేఱువేఱ నామరూపములతో పొడసూపుటయే ఉత్పత్తి. భగవంతునియందు నామరూపములు తెలియరానట్లు అతిసూక్ష్మమై లీనమగుటయే ప్రళయము. ప్రళయము నొందినవానికి మరల నుత్పత్తి గలుగనేరదని గ్రహింపరాదు. కాన చేతనాచేతనములు పెక్కులు ఉత్పత్తిప్రళయములను బొందఁగూడుటచే, 'ఆయాకాలములందు' అనఁబడెను. అనఁగా అప్పుడప్పుడు పొందు నుత్పత్తులు తనవలననుండియే యనియు ప్రళయములు తనయందే యనియును భావము. దీనింబట్టి సమస్తకల్పములందును భగవంతుఁ డొకఁడే చేతనాచేతనములకు కారణమగునని తెలియుచున్నది. శరీరి లేకున్న శరీరము నిలువనేరదు. కనుక ఒకశరీరిని చెప్పినపుడు వానిశరీరము వేఱుగా గ్రహింపఁబడక వానితోఁగూడనే పరిగణింపఁబడుచున్నది. ఇట్లే ఈశ్వరుఁడన్నచో వానిశరీరమగు జగత్తంతయు వేఱుగా గ్రహింపఁబడక వానితోఁగూడనే గణింపఁబడుచున్నది. ఇట్లు ఈశ్వరుఁ డనుటవలన ఈశ్వరుఁడును ఈశ్వరశరీరమగు జగత్తును, రెండును గ్రహింపఁబడుటవలన ఉభయావస్థలయందుఁ గల జగత్తంతయు ఉభయావస్థలందును ఈశ్వరుఁడే యనఁదగుచున్నదని భావము. 'త్రిభిః గుణమయైః ఏభిః' అను పదములు మూఁటిచే గుణమయభావములకు దుఃఖమిశ్రత్వము, నశ్వరత్వము, సాతిశయత్వము మొదలగునవి వివక్షితములు. సత్త్వము సుఖాత్మకము. రజస్సు దుఃఖాత్మకము. తమస్సు మోహాత్మకము. భావములు రజస్తమస్సులతో మిశ్రములై యుండుటవలన దుఃఖమిశ్రము లనియు కార్యములగుటవలన అనిత్యము లనియు భావము. 'మామ్ ఏభ్యః పరమ్ అవ్యయమ్' అనెడి

మఱుఁగుచు నాయందే నెలకొనియు నాకు శరీర మయ్యు నన్ను ఆత్మగాఁగలిగియు నున్నది. కాన కార్యావస్థయందును కారణావస్థ యందును సర్వమును నాశరీర మే యైయున్నది. ఇట్లు సర్వశరీరుఁడ

---

యీపదములచేత నిఖిలదుఃఖప్రత్యనీకస్వరూపత్వము నిరతిశయానందత్వము నిత్యత్వము మొదలగునవి సూచితములని 'ఇటువంటివాఁడ నగు నేను' అన్నారు. ఇందు 'కారణత్వ'ముచేత పిత యగుటవలన హితము గోరుననియు, 'శేషిత్వము'చేత శేషభూతుల యుజ్జీవనముగూడ తనకు లాభముగాఁ దలఁచుననియు, 'జానా .....' అని సర్వజ్ఞత్వ సర్వశక్తిత్త్వాదులవలన వేఱొకనితోడ నపేక్షింపక తానే యనిష్టములను దొలఁగించి యిష్టముల నొడఁగూర్చుననియు 'ఇటువంటివాఁ' డనుటకు భావము. ప్రాకృతము లైనభాగములు శబ్దస్పర్శాదిరూపమున భోగ్యము లగును. పరమాత్ముఁడన్ననో స్వ స్వరూపముతో సమవేతములైన జ్ఞానశక్త్యాదికల్యాణ గుణములచేతను, ప్రాకృతశబ్దాదులకు విసజాతీయములైన యానుకూల్యప్రకారములు గలిగియున్న యప్రాకృతశబ్దాదులచేతను, తనయందు పర్యవసించునవిగాఁ దెలియుటవలన అప్రాకృతములవంటివగు ప్రాకృతశబ్దాదులచేతను ఒక్కొక్కటను నిరవధికముగాను నిరతిశయముగాను భోగ్యుఁడై యుండును గాన 'భోగ్యుఁడనై యుండు నయ్యుప్రకారములచేతను'గూడ ఉత్కృష్టతముఁ డగుచున్నాఁడని తెలియునది. ఇట్టిభోగ్యతమస్వరూపము అవికారి యగుటచే 'ఎప్పుడు నేకరూపముగానే యుండు' నని 'అవ్యయ' శబ్దము దెలుపుచున్నది. గుణములు మూఁడును ఒకటికొకటి ఎక్కువతక్కువలు లేకున్నను ఒకటినొకటి విడిచియుండవు గాన గుణత్రయముచే నగుభావములు దుఃఖమిశ్రములై యుండకతీఱదు. అవి నిహీనతరములనఁగా కర్మానురూపముగా గుణత్రయములచేనై కర్మానురూపముగా క్షుద్రము లగునని భావము. 'క్షణభంగురములు' అనఁగా క్షణములో తీఱునవి. కర్మము ముగియఁగానే క్షణమునేపుగూడ నిలువనేరనివనుట. సత్త్వము సుఖప్రకాశములను గలిగించునది గాన తక్కినగుణములచేతంబోలె దానిచేతను మోహ మెట్లు గలుగును ? అన్నచో విషమిశ్రమైన యన్నము మధుసేకముతోఁ దడిసెనేని మంచునకు దానిని దిన నభిలాష కలుగునుగదా. అట్లే అయ్యవిషయములు ఆయాకర్మముల కనుగుణముగా అనర్థము లందు పర్యవసించునట్టివైనను, అందు సత్త్వము సుఖలవమును గలిగించి యా లవముచే వాని ననుభవించునట్టు వ్యామోహము బుటించుచున్నది గాన అది మోహహేతువగుట యుక్తమే. 'ఇదం జగత్' అనఁగా అచిత్తుతో మిశ్రమైన చేతనవర్గము- అనఁగా దేవతిర్యఙ్మనుష్యస్థావరములు. ఇట గుణమయములయిన భావములనఁగా దేహములు గాను ఇంద్రియములుగాను తక్కిన భోగ్యపదార్థములుగాను నున్నవస్తువులు. ఇవి క్షేత్రజ్ఞాదులను మోహపెట్టి యీశ్వరుని స్వరూపయాథాత్మ్యమును మఱుఁగుపఱుచుచున్నవని భావము.

నగుటచే సర్వప్రకారుఁడ నగునేనే యున్నవాఁడ నగుచున్నాను. ఇట్లు సర్వకారణుఁడ నగుటచేతను శేషి నగుటచేతను జ్ఞానాద్యసంఖ్యేయకల్యాణగుణగణములు గలవాఁడ నగుటచేతను సర్వవిధముల నేనే అన్నిటికంటెను శ్రేష్ఠుఁడను. ఏకల్యాణగుణములచేత నైనను నాకంటె నెక్కువమైన దొక్కటియును లేదు. ఇట్టివాఁడ నగునేను నా కసాధారణములై యున్న కల్యాణగుణములచేతను, భోగ్యుఁడ నై యుండు నద్భుతప్రకారములచేతను, సాత్త్విక రాజస తామసగుణాత్మకము లగు మూఁడు పదార్థములకంటె మిక్కిలియు నుత్కృష్టుఁడను. (వానివలె నశింపక) ఎల్లప్పుడు నేకరూపుఁడనై యుండువాఁడను. ఇట్టివాఁడనయినను (నావలెఁగాక) గుణమయములై నాకంటె నిహీనతరములై క్షణభంగురములై యుండు నామూఁడుపదార్థములే దేవతిర్యఙ్మనుష్యస్థావరాత్మకముగా నున్న యీజగమునకు దానిదాని పూర్వకర్మానుగుణముగ దేహములుగాను ఇంద్రియములుగాను భోగ్యవస్తువులుగాను నేర్పడి తన్మూలమున జగత్తును మోహింపఁజేయఁగా నా మోహము (అజ్ఞానము) వలన, అది నన్ను ఇట్టివానినిగా (అనఁగా ఆపదార్థములకంటె మిక్కిలియుత్కృష్టునిగాను, వానివలె నశింపక యెల్లప్పుడు నేకరూపుఁడ నై యుండువానినిగాను) గుఱు తెఱుంగ లేకున్నది.

అవ. స్వతస్సిద్ధముగా నే నిరవధికాతిశయానందస్వరూపుఁడనై, నిత్యుఁడనై, యెల్లప్పుడు నేకరూపుఁడనై, లౌకికవస్తువులు భోగ్యము లై యుండు ప్రకారములచేతను (జూడఁగా దానికన్న నిరతిశయభోగ్యప్రకారుఁడ నగుటం బట్టి) మిక్కిలి యుత్కృష్టుఁడనై యెప్పటట్లనే వుండినను, భోక్తృవర్గములెల్ల, అత్యంతనిహీనములును గుణమయము లును అస్థిరములును అగుపదార్థములను భోగ్యములుగాఁ దలంచుట యెట్లు? అని యడుగఁగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ॥ 14

టీ. దైవీ = దేవుఁడ నగునాచే లీలార్థము నిర్మింపఁబడినదియు, గుణమయీ = సత్త్వరజస్తమోగుణమయ మయినదియునగు, ఏషా = ఈచెప్పఁబడిన, మమ = నాయొక్క, మాయా = ప్రకృతి, దురత్యయా = అతిక్రమింప శక్యముకానిది.

తా॥ సత్త్వరజస్తమోగుణమయ మైన యీనామాయ క్రీడా ప్రవృత్తుఁడ నైన నాచేత నే నిర్మింపఁబడినది గాఁబట్టి యెల్లవారికిని దీని నతిక్రమింప నలవి గాదు. (మాయ యనఁగా మిథ్యయని కొందఱి మతము. అది సరికాదు.) ఆసురరాక్షసాస్త్రములు మొదలయినవి మిథ్యలు కాక సత్యములే యైయుండఁగా అవి మాయాశబ్దముచే చెప్పఁబడుట మిథ్య లగుటచే కానేరదు; విచిత్రకార్యములం జేయుట చేత నే యగును. అట్లే ప్రకృతి మిథ్యయగుటచేతఁగాక విచిత్రకార్య కరమగుటచేత నే మాయ యనఁబడుచున్నది. మఱియు 'తతో భగవతా తస్య రక్షార్థం చక్రముత్తమమ్। ఆజగామ సమాజ్ఞప్తం జ్వాలామాలి సుదర్శనమ్। తేన మాయాసహస్రం త చ్ఛమ్బర స్యాశుగామినా। బాలస్య రక్షతా దేహ మేకైక శ్యేన సూదితమ్' (వి. పు. ౧-౧౯-౧౯, ౨౦.) *ఇత్యాదులందును నిట్లే తెలియునది. (ఇచట శంబరునిమాయాసహస్రము మిథ్యలైనయెడల నవి చక్రముచే హతముసేయఁబడుటే సంభవింపదు) ఇట్లు సత్యమైనదాని నే గుఱ్ఱించుటచే మాయాశబ్దము మిథ్యార్థములను జెప్పునది గాదు. (అయినను లేని మిథ్యలను ఉన్నట్టు కల్పించి చూపునట్టి యైంద్రజాలికులు మొదల

---

* దండనీతియందు సామదానభేదదండము లనెడి యుపాయములే కాక మాయ, ఉపేక్ష, ఇంద్రజాలము అను మూఁడుపాయములుకూడఁ జెప్పఁబడినవి. మాయ యనఁగా ఒకవస్తువును మఱియొకవస్తువుగాఁ జేయు శక్తి. ఇంద్రజాలమనఁగా ఒక వస్తువును మఱియొకవస్తువుగా తోఁచునట్లు చేయుశక్తి. కాఁబట్టి మాయ సత్యమైన వస్తువు నే గుఱించినదికాని మిథ్యను గుఱించికాదని తెలియుచున్నది.

యినవారు ఆ మిథ్యాసంబంధమువలన మాయావు లనఁబడుచున్నారు
గాన మాయ యనఁగా మిథ్య కాఁగూడదా యని యడుగవచ్చును)
వారు ఏవో మంత్రౌషధాదులచే మిథ్యార్థవిషయమైన బుద్ధిని పుట్టించు
చున్నారు. ఆబుద్ధికిఁ దోచునట్లు చేయఁబడినవిషయములు మిథ్యలు
గాని అది తనంతట పారమార్థికమే (అనఁగా సత్యమే) యైనది. ఇట్లు
వారు పారమార్థిక మైనబుద్ధిని పుట్టించుటచేతనే మాయావు లనఁబడు
చున్నారు గాని మిథ్యలగు దానివిషయములను బుట్టించుటచేతఁ గాదు.
కావున మాయాశబ్దము మిథ్యార్థకము గా నేరదు. (సత్యమైనబుద్ధినే
పుట్టించినను తుదకు మిథ్యార్థములను దోఁపించుటచే, ఆమిథ్యార్థ
సంబంధమే మాయావి యని ప్రయోగించుటకు నిమిత్తము కాఁ
గూడదా యన్నచో) ఆయింద్రజాలాదులందు మంత్రౌషధాదులే
విచిత్రకార్యకరము లగుటచే మాయ యగును గాని మిథ్యార్థములు
గాదు. కాన మంత్రౌషధాదులసంబంధముచేతనే మాయావి యనఁ
బడును గాని మిథ్యార్థసంబంధము చేతఁ గాదు. (అయినను మంత్రౌష
ధాదులను మిథ్యార్థములును మాయావిశబ్దప్రయోగమునకు సమాన
ముగా నిమిత్తము లగునట్లు సన్నిహితములై యుండఁగా అందు
మంత్రౌషధాదులే నిమిత్తమని విశేషించి గ్రహించుట యెట్లు?
అన్నచో) *ఒకశబ్దమునకు సర్వప్రయోగములందును అనుసరించి

---

* ఒకశబ్దమునకు ఒకయర్థము, సంబంధమువలనఁ గాని గుణయోగమువలనఁ గాని
నిర్వహింపరానిదిగా నుండెనేని యర్థాంతరము కల్పించుకొను కష్టము యుక్తము.
ఇచట మాయకు దానికార్యమగు బుద్ధితో పరంపరగా సంబంధముగలదు; గాన బుద్ధి
యందు దానిప్రయోగము చెల్లును. మిథ్యార్థమునందు ప్రయోగించినచో అపుడు
అస్త్రాదులందు మిథ్యాత్వసంబంధము కొంచెమైనను లేదు గనుక ఈయర్థము చెల్లదు.
మఱి మిథ్యార్థములకు గుణమే కలుగదు గనుక గుణయోగముచేతను అది అస్త్రాదులందు
ప్రవర్తించుటకు లేదు. ఇట్లు సంబంధము లేనందునను గుణయోగము లేనందునను
మాయాశబ్దమునకు మిథ్యార్థము పొసఁగనందున బుద్ధియందే ప్రయోగము యుక్తము.
కాన మాయాశబ్దము, ఇంద్రజాలాదులలో మిథ్యలయందు ఔపచారికముగా ప్రయో
గింపఁబడినదై తత్సంబంధి యైనబుద్ధియందే ముఖ్యముగా ప్రవర్తించుచున్నదని భావము.

వచ్చెడి. యొకయర్థమే దానియర్థ మగునుగాని తక్కినవి గావు. (కనుక మాయకు మొదటఁ జెప్పఁబడిన సత్యవిషయమైన యర్థమే యిచటఁ గూడఁ బొసఁగియుండఁగా మిథ్యావిషయమైన యర్థమును గల్పించు కొనుట యుక్తముగాదు. కాన సత్యములైన మంత్రౌషధాదులే మాయ యని విశేషించి గ్రహింపఁబడిరెను.) అయినను, ఆ యింద్ర జాలాదులందు మిథ్యాభూతములైన విషయములందే 'ఇది మాయ' యని మాయాశబ్దప్రయోగ మున్నది. (అట్టిచో మిథ్యలకు విచిత్ర కార్యకరత్వము లేనందున, మాయాశబ్ద మాయర్థమునఁగాక మిథ్యా ర్థమువనే ప్రయోగింపఁబడినది కాఁగూడదా యని యడుగవచ్చును.) 'మంచాః క్రోశన్తి' 'మంచెలు అఱచుచున్నవి.' (అనుచో మంచె లనఁగా మంచెలుగాక, దానిని సంబంధించియున్న మనుష్యులకు అర్థ) మగునట్లు, మిథ్యార్థములందు మాయాశబ్దము ప్రయోగించుట మిథ్య లను గుఱించినది గాక ఆమిథ్యలను సంబంధించినదైన మాయవలనఁ బుట్టు బుద్ధిని గుఱించినదగుటచే ఔపచారికమగును. గుణమయమును పారమార్థికము నైన యీభగవన్మాయయే 'మాయాంతు ప్రకృతిం విద్ధి మాయినంతు మహేశ్వరమ్' ఇత్యాదులందుఁ జెప్పఁబడు చున్నది. ఈమాయయొక్క కార్యము భగవత్స్వరూపమును మఱుఁగు పఱచుటయు స్వస్వరూపమే భోగ్యమైనదను బుద్ధి గలిగించుటయు నగును. కాఁబట్టి యిట్టిభగవన్మాయచే మోహితమైన జగమంతయు భగవంతుని నిరవధికాతిశయానందస్వరూపునిగాఁ తెలియకున్నది.

అవ. మాయావిమోచనమునకు నుపాయము నుడువుచున్నాఁడు.

శ్లో॥ మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే॥ 15

టీ. మాం ఏవ=నన్నే, యే=ఎవరు, ప్రపద్యన్తే=శరణు చొచ్చుచున్నారో, తే=వారు, ఏతాం=ఈగుణమయమును నాదియు నైన మాయాం=మాయను, తరన్తి=దాఁటుచున్నారు.

తా. *సత్యసంకల్పుఁడును, పరమకారుణికుఁడును, అనాలోచితవిశేషాశేషలోకశరణ్యుఁడును నగు నన్నే యెవరు శరణు చొచ్చుచున్నారో (అనఁగా నాయెడల యెవరు ప్రపత్తి చేయుచున్నారో) వారు గుణమయ మైన యీ నామాయను గడతురు. వారు నామాయను విడిచి నన్నే ఉపాసింతు రని యర్థము.

అవ. ఇట్లు భగవదుపాసనమును కలిగించునట్టి భగవత్ప్రపత్తిని అందఱును ఏల చేయ రనఁగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః॥ 16

టీ. మూఢాః=విపరీతజ్ఞానము గలవారును, నరాధమాః=మనుష్యాధములును, మాయయా అపహృతజ్ఞానాః=మాయచే నపహరింపఁబడినజ్ఞానము కలవారును, ఆసురంభావ మాశ్రితాః=అసుర

* ఇందు మాయావిమోచనమునకు ఉపాయము భగవచ్ఛరణాగతియని చెప్పుచున్నారు. ఎవ్వనియాజ్ఞవలన బంధము అలంఘనీయముగా నున్నదో వానివలననే యది నివర్తింపవలయునుగాని మఱొక్కనిచేతఁ గాదని తెలుపుటకై 'మామేవ' అని యవధారణ ముంపఁబడెను. అనఁగా భగవంతుని యాజ్ఞచే నతిక్రమింపరాకున్న మాయాబంధము భగవంతునిచేతనే విముక్తి నొందఁగూడునని భావము. 'మా మేవ' అని యున్న యీ యవధారణముయొక్క యభిప్రాయమే 'సత్య...శరణ్యుఁడును' అనఁబడెను. సత్యసంకల్పుఁడనఁగా సత్యమైనసంకల్పము గలవాఁడు. సంకల్పించిన కార్యము తప్పక సిద్ధించునట్టివాఁ డనుట. బంధవిషయమందే కాక మోక్షవిషయమందును అతనిసంకల్పము సత్యమైనది (అనఁగా తప్పక సిద్ధింపఁజేయుశక్తి గలది) గావున నతనిని గుఱించియే ప్రపత్తి సేయఁదగు ననుటకై 'సత్యసంకల్పుఁ' డనఁబడెను. శక్తిగలవాఁ డయ్యును దయలేనిచో ప్రపత్తివలన ప్రయోజన మేమియు లేదని శంక రాఁగా 'పరమకారుణికుఁ' డనఁబడెను. కారుణికుఁడయ్యును, తక్కినలోకులవలె 'కొందఱను పరిగ్రాహ్యులుగాను కొందఱను అపరిగ్రాహ్యులుగాను భేదము గలవాఁడేని అసహ్యాపరాధములు చేసిన జనులకు ప్రపత్తి సేయుటవలనఁ బ్రయోజన మేమి యన్నచో 'అనాలో...శరణ్యుఁడు' అనఁబడెను. సమస్తలోకులకును వారివారి జాతి గుణము వృత్తి మొదలగు విశేషముల నెంచక శరణొసంగు వాఁడనుట. ఈలక్ష్య

సంబంధమగు స్వభావమును ఆశ్రయించినవారును, అని, (చతుర్విధాః=నాలుగువిధము లైన), దుష్కృతినః=పాపకర్ములు, మాం=నన్ను, న ప్రపద్యన్తే=భజింపరు.

తా. *పాపకర్ములు నన్ను భజింపరు. వారు మూఢులు నరాధములు మాయాపహృతజ్ఞానులు ఆసురభావాశ్రితులు అని పాప తారతమ్యముచేత నాలుగువిధములై యుందురు. అందు మూఢుం లనఁగా విపరీతజ్ఞానులు- అనఁగా పూర్వోక్తప్రకారమున భగవంతునకు శేషమైయుండుటయుండే యాసక్తిగల తమ యాత్మయును తక్కినభోగ్యపదార్థములును తమకే శేష మని తలంచువారు. నరాధము లనఁగా- నాస్వరూపమును సామాన్యముగాఁ దెలిసినవారయ్యు నాయాభిముఖ్యమునకు అనర్హు లైనవారు. మాయాపహృతజ్ఞాను లనఁగా- నన్నుగుఱించియు నాయైశ్వర్యముచుగుఱించియు ప్రస్తుతమై

---

ణము- కాకి యగు కాకాసురుఁడు, కోఁతి యగు సుగ్రీవుఁడు, రాక్షసుఁడగు విభీషణుఁడు, స్త్రీయగు ద్రౌపది, 'యదివా రావణ స్స్వయమ్' 'రావణుఁడు వచ్చినను తోడ్కొనిరమ్ము' అన్నట్లు 'భార్య నపహరించిన పరమపాపిష్ఠుఁ డగురావణుఁడు' మొదలగువారిపట్ల స్పష్టముగా గనుపట్టుచున్నది. ఇది ఉపాసనప్రకరణము. ఉపాసనమునకు ప్రపత్తి అంగము. మీఁదఁ జెప్పఁబడు ఆర్తులు మొదలగు నలుగురికిని సాధారణ మైనదగుటంబట్టియు ఉపాసనాంగ మగుటంబట్టియు 'ప్రపద్యన్తే' అని ప్రపత్తి యిట చెప్పంబడినది. అయినను దీనిచే అంగి యగు ఉపాసనము గ్రాహ్యము గాన 'మాయను విడిచి...ఉపాసింతురని యర్థము' అనఁబడెను.

* ఈశ్లోకమునందు దుష్కృతులను జెప్పుచున్నాఁడు. ఇందును నాలుగు విధము లయినపురుషు లుండుటచే మీఁదిశ్లోకమందలి 'చతుర్విధాః' అను పదము ఇందును ఆకర్షించుకోనఁదగును. మూఢు లనఁగా విపరీతజ్ఞానము గలవారు. భగవంతునికి శేషమయినవానినెల్ల తనకు శేషముగాఁ దలఁచుటయే విపరీతజ్ఞానము. మూఢులవలెఁ గాక నరాధములు భగవత్స్వరూపమును గుఱించి జ్ఞానమును గలిగియుందురు. కాని యాజ్ఞానము సర్వలోకప్రసిద్ధము లగు నితిహాసపురాణాదులచేఁ గలిగిన సామాన్యజ్ఞానమే కాని ఉపనిషదర్థనిశ్చయముచే భగవంతుని సౌలభ్యాదులనుగుఱించిన విశేషజ్ఞానము కాఁజాలదు. మేరుపర్వతము మిక్కిలి యుత్కృష్ట మయినదని తెలిసియు అది సులభము

యున్న జ్ఞానము గలవారైనను అది యట్టిదికాదు అని మాయాకృతము లగు కూటయుక్తులచేత అజ్ఞానమును బోఁగొట్టుకొనినవారు. ఆసురభావాశ్రితులనఁగా- నన్నును నాయైశ్వర్యమునుగుఱించిన జ్ఞానము మిక్కిలి దృఢముగా నమరియుండియు దానివలన నాయెడ ద్వేషమే చూపునట్టివారు అని తెలియునది. వీరుసగాఁ జెప్పఁబడిన యీ నలుగురిలో ముందటివానికంటె వెనుకటివాఁడు మఱింత పాపిష్ఠుఁడని తెలియువది.

శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥ 17

టీ. హేభరతర్షభ=అర్జునా, ఆర్తః=నశించిన యైశ్వర్యమును మఱల నొందుటకు ఆరటపడువాఁడును, అర్థార్థీ = దానిని క్రొత్తగాఁ గోరువాఁడును, జిజ్ఞాసుః = శుద్ధాత్మానుభవరూపమగు కైవల్యమును బొందఁగోరువాఁడును, జ్ఞానీచ=భగవంతునిఁ బొందఁ

కానిదని దానియెడల నాసక్తి లేకుండునట్లు, భగవంతుఁడు పరుఁడైనట్లు సులభుఁడు గూడ నగు నని తెలియనందున వానియెడ ఉన్ముఖు లగుటకు నర్హులు గాకపోవుచున్నారని తెలియునది. మాయాపహృతజ్ఞానులకు భగవత్స్వరూపైశ్వర్యాదులను గుఱించి యింతవఱకుఁ జెప్పఁబడినజ్ఞానము ఉత్పన్నమయినను మాయచే అపహృతమయి పోవుచున్నది. మాయ యనఁగా విచిత్రకార్యమును జేయునదిగదా. ఇట విచిత్రమగు మోహకార్యమును జేయునట్టి కుదర్శనములు పాషండదర్శనములు కూటయుక్తులు మొదలగునవియే మాయ యనఁబడునవిగా గ్రాహ్యము. ఆసురభావాశ్రితులకు అట్టి జ్ఞానము ప్రమాణతర్కములచే బాధ్యముగాక దృఢముగా నిశ్చితమయియుండును గాన అపహృతము గాకపోయినను అది వారికి భగవంతునియెడల ద్వేషమే కలిగించుచున్నది భగవంతుఁడు నిరతిశయశక్తుఁడని తెలిసియు నతని ద్వేషించువారే 'విష్ణుభక్తిపరో దేవో విపరీతస్తథాఽఽసురః' (విష్ణుధర్మే. ౧౦౯-౭౪.) అనునట్లు అసురులు. ఆసురభావ మనఁగా భగవంతునియెడల ద్వేషమే యగును గాన 'ద్వేషమే కలిగించునదగును' అనఁబడెను. ఇట్లు ఈనలుగురును ఒకరికిమీఁద నొకరుగా జ్ఞానాధిక్యమును బట్టి చెప్పఁబడిరా? యని శంకరాఁగా పాపాధిక్యమునుబట్టియే యని తెలుపుట

గోరువాఁడును (అనెడియీ), చతుర్విధాః = నాలుగువిధములైన, సుకృతినః = పుణ్యాత్ములగు, జనాః = జనులు, మాం = నన్ను, భజన్తే = ఉపాసించుచున్నారు.

తా. *అర్జునా, పుణ్యాత్ములు నన్ను శరణుఁజొచ్చి నన్నే భజింతురు. వీరును పుణ్యతారతమ్యముచే నాలుగువిధము లగుదురు. పుణ్యముయొక్క యాధిక్యముచేతఁ గలిగిన ప్రతిపత్తివైశేష్యమును బట్టి మునుపటివారికంటె వెనుకటివారు అధికతము లగుదురు. వారెవరన, ఆర్తుఁడు-మునుపటిస్థితి లేనివాఁడు- మునుపటి యైశ్వర్యము

---

'మిక్కిలి పాపిష్ఠులు' అనఁబడెను. అనఁగా తెలిసినవాఁడు తప్పుచేయునేని మిక్కిలియు దండనకు పాత్రమగును. అట్లై ఈనలుగురు ఒకరికన్న నొకరు జ్ఞానమునం దెక్కువగా నుండి భగవంతునియెడల విముఖు లగుటంజేసియే ఒకరికన్న నొకరు మఱింతపాపిష్ఠు లగుచున్నారని భావము. జ్ఞానాతిశయ ముండియు భగవంతునివలన వైముఖ్యము కలుగుటకు ప్రాచీనపాపాతిశయమే కారణ మని 'పాపిష్ఠతమ' శబ్దము సూచించుచున్నది.

* ఇందు సుకృతులను జెప్పుచున్నాఁడు. 'చతుర్విధా భజన్తే' అని యిట భజనము (అనఁగా ఉపాసనము) చెప్పఁబడినది. ఈ యుపాసనమునకు అంగమైన ప్రపత్తి పూర్వశ్లోకమున దుష్కృతులకు లేదని చెప్పుటవలన నిట వారికి విలక్షణులగు సుకృతులకు కల దని చెప్పవలసి యున్నది, గాన 'శరణుఁజొచ్చి' అని ప్రపత్తిని జెప్పి పిదప 'భజించుచున్నారు' అనిరి. ప్రపత్తియందు వలయు విశ్వాసము పొందలయినవి యీనలుగురికి సాధారణమే. అందు వారిచ్ఛించుఫలమునుబట్టియే వారికి తారతమ్యముగలుగుచున్నది. సుకృతముయొక్క యెక్కువతక్కువలఁ గని ఫలప్రతిపత్తియు విశేషించిన దగుటవలన నొకరికొకరు ఎక్కువ యగుచున్నారు గాన 'సుకృత... అగుదురు' అనఁబడెను. అందు ఆర్తుఁ డనఁగా, పోఁగొట్టుకొన్నయైశ్వర్యము మరల రావలయునని ఆర్తి గలవాఁడు. అర్థార్థి యనఁగా, అర్థమును (అనఁగా అర్థింపఁదగిన యైశ్వర్యమును) ఇంతవఱకుఁ బొందనిదానిని అర్థించువాఁడు. ఫలభేదమును బట్టియే అధికారభేదము గలుగును గాన వీరిరువురకు ఫలము ఐశ్వర్య మొకటియే కావున అధికారము నొకటే. పోయిన యైశ్వర్యమును గోరుట పొందనియైశ్వర్యమును గోరుట అనియెడి యీయవాంతరభేదముచే ఊరక వేఱువేఱుగా చెప్పఁబడుచున్నారింతేకాని, పాఠక్రమముకంటె అర్థక్రమము బలీయము గావున 'జిజ్ఞాసు

పోయి మఱల దానిని బొందఁగోరువాఁడు. అర్థార్థి- ఇంతవఱకు నైశ్వర్యము ప్రాప్తింపకుండుటవలన దానిని గోరువాఁడు. ఈయిద్దఱికి ముఖభేదముమాత్రమే; ఐశ్వర్యవిషయమునం గల యైక్యముంబట్టి అధికార మొక్కటియే. జిజ్ఞాసువు-ప్రకృతివియుక్తమైనయాత్మస్వరూపము పొందఁగోరువాఁడు (శుద్ధాత్మానుభవరూపమగు) జ్ఞానమే వీనికి స్వరూపము గాన జిజ్ఞాసు వనఁబడెను. జ్ఞాని- 'ఇత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్' ఇత్యాదులచే చెప్పఁబడిన భగవచ్ఛేషత్వ

---

రర్థార్థి' అని అర్థార్థి, జిజ్ఞాసువునకు పిదప చెప్పఁబడినను ముందుగానే గ్రహింపఁబడినాఁడు. జిజ్ఞాసు వనఁగా కేవలజ్ఞానార్థిగా గ్రహింపఁదగదా? వాఁడును భగవజ్ఞానార్థియే కాఁగూడదా? ఆత్మార్థిగా నర్థ మెట్లు? అన్నచో, భగవజ్ఞానమే కోరువాఁడేని భగవంతుఁడే వానికిఁ బ్రాప్య మగునుగాన నిట ఫల (పురుషార్థ) భేద ముండదు. అయిన నిట ఫలభేదము చెప్పఁబడియున్నది గాన అధికార భేదమును నుండవలయును. ఆర్తుఁడు అర్థార్థి యని బాహ్యపురుషార్థములు గోరువారు చెప్పఁబడిరి. జ్ఞాని యని భగవంతునిఁ గోరువాఁడు చెప్పఁబడెను. ఇఁక జిజ్ఞాసు వనఁగానే పురుషార్థము గోరువాఁడు, అధికానందస్వరూపమగు జీవాత్మస్వరూపమును ప్రాప్యముగా (పురుషార్థముగా) నుండుట ప్రసిద్ధము. కాన జిజ్ఞాసు వనుటకు ప్రకృతిబంధరహితమైన కేవలాత్మస్వరూపమును బొందఁగోరువాఁ డనఁబడియె. అయిన జిజ్ఞాసు శబ్దము జ్ఞానార్థికి వాచకముగాన ఆత్మార్థి యని దాని కర్థ మెట్లు? అన్నచో జిజ్ఞాసు వనఁగా జ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడని యర్థమే. అయినను ఇట జ్ఞానమనఁగా శుద్ధాత్మానుభవరూపమైన జ్ఞానముగా గ్రహింపవలయును. దీనిచే శుద్ధాత్మ ప్రాప్తిని గోరువాఁడని యర్థము సిద్ధము. శుద్ధాత్మయే కేవలాత్మ యనఁబడును. కేవలాత్మస్వరూపానుభవమే కైవల్య మనఁబడును. జిజ్ఞాసువనఁగా కైవల్యార్థి యని తెలియునది. జ్ఞాని శుద్ధాత్మానుభవమున నిలువక భగవంతునే పొందఁగోరును. పట్టణమును ప్రవేశింపఁగోరిన బాటసారి నడుమ నున్న యొక చల్లని చెట్టునీడ నిద్రించినటు, భగవంతునిఁ గోరువాఁడు నడుమ ఆత్మానుభవమందు నిలుచుట యని తెలియునది. జ్ఞాని భగవంతునే పరమప్రాప్యునిగాఁ దలఁచుటచే భగవంతునే పొందఁగోరునుగాని ఆత్మానుభవమున నిలువఁడని తెలియునది. భగవత్ప్రాప్తియే మోక్షముగాన జ్ఞాని మోక్షార్థి యగును. ఇట్లు ఇందలి నలువురిలో మొదటియిద్దఱు ఐశ్వర్యార్థు లనియు మూఁడవవాఁడు కైవల్యార్థి యనియు నాలవవాఁడు మోక్షార్థి యనియు అధికారులుమాత్రము ముగ్గురే చెప్పఁబడుట తెలియునది.

మందే ఆసక్తమై యుండునదిగా ఆత్మస్వరూపము నెఱింగినవాఁడు. (ఆత్మస్వరూపము భగవంతునికి శేషభూతమనుజ్ఞానము కలవాఁడగుటంబట్టి) ప్రకృతివియుక్తమైన కేవలాత్మ (ననుభవించుట)తో నిలువక, భగవంతునిఁ బొందఁగోరి భగవంతునే పరమప్రాప్యునిగాఁ దలఁచుచుండువాఁడు.

10

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏక భక్తి ర్విశిష్యతే ।
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమ ప్రియః॥ 18

టీ. తేషాం=ఆనలుగురిలో, నిత్యయుక్తః=నాతో నిత్యసంబంధముగలవాఁడును, ఏకభక్తిః = నాయొక్కనియందే భక్తిగలవాఁడును అగు, జ్ఞానీ = జ్ఞాని, విశిష్యతే = అతిశయించి యున్నాఁడు. అహం=నేను, జ్ఞానినః = జ్ఞానికి, అత్యర్థం = చెప్పనలవిగానట్లు, ప్రియః హి = ఇష్టుఁడనుగదా, సచ = ఆజ్ఞానియు, మమ = నాకు, ప్రియః=(అట్లె) యిష్టుఁడు.

తా. *ఆనలుగురిలో జ్ఞానియే శ్రేష్ఠుఁడు. ఎట్లన, జ్ఞానికి నేనొక్కఁడనే ప్రాప్యము గనుక నాతోడిసంబంధము నిత్యమైయుం

---

* ఇందు జ్ఞానియొక్క శ్రేష్ఠత్వము చెప్పఁబడుచున్నది. వాని శ్రేష్ఠత్వమునకు 'నిత్యయుక్తః' 'ఏకభక్తిః' 'ప్రియోహి...ప్రియః' అని కారణములు మూఁడు. 'నిత్యయుక్తుఁ' డనఁగా ఇతరులిద్దఱును తమ కోరినఫలము సాధించువరకే సంబంధము భగవంతునితో పెట్టుకొనునట్లు గాక తాను సాధనదశయందు భగవంతునే సాధనముగాను ఫలదశయందు భగవంతునే ఫలముగాను గలిగియుండుటచే అతనితో నిత్యసంబంధము గలిగియుండును గాన శ్రేష్ఠుఁడగునని భావము. ఇట ఆర్తుని అర్థార్థిని ఒక్కఅధికారిఁగాను జిజ్ఞాసువును మఱియొక యధికారినిగాను గ్రహించుటచే, ఈముగ్గురిని 'తక్కిన యిద్దఱు' అని యిద్దఱినిగానే గ్రహించుట తెలియునది. దీనింబట్టి ఆత్మార్థికి ఫలదశయందు పరమాత్మని భోగ్యత్వము ననుసంధించుట లేదని తేలుచున్నది. 'ఏకభక్తిః' అనఁగా ఒక్కనియందే (అనఁగా భగవంతునియందే) భక్తిగలవాఁడనుట. తక్కిన యిద్దఱధికారులకు తమకోరినఫలము నందును దానికి సాధకుఁ డగుటంబట్టి భగవం

డును; తక్కిన యిరువురకు తాము కోరినది కలుగునంతవఱకే

11

నాతోడిసంబంధము. అట్లు జ్ఞానికి నాయొక్కనియందే భక్తి; తక్కిన

---

తురియందును ఇట్లు రెంటియందు భక్తి. జ్ఞానికో భగవంతుఁడొక్కనియందే భక్తి గాన శ్రేష్ఠుఁడగుచున్నాఁడని భావము. 'ప్రియోహి...మహమ్'—'అత్యర్థమ్' అనుచో, అర్థ మనఁగా అభిధేయము. అత్యర్థ మనఁగా అభిధేయమును అతిక్రమించినది. అభిధేయమును అతిక్రమించుట యనఁగా తక్కిన యభిధేయములవలెఁగాక దానికి విలక్షణమై యుండుట. అనఁగా తక్కిన యభిధేయములు చెప్పను శక్యములై యుండునట్లుగాక తాను జెప్ప నశక్యమై యుండుట. కాఁబట్టి జ్ఞానికి తాను ప్రియుఁడై యుండుట యింతంతని చెప్ప నలవిగాదనుట. ఈమాటం జెప్పువాఁడు భగవంతుఁడే కనుక 'సర్వజ్ఞుఁడును సర్వశక్తియు నగు నాకును' అని కూర్పఁబడినది. జ్ఞాని తనయందింతప్రీత్యతిశయము గలవాఁడు గావుననే భగవంతునకు శ్రేష్ఠుఁడగుచున్నాఁడు. ఐనను సర్వజ్ఞునకు ఏది తెలియదో అది లేనిదే యగును. అతని కెందు శక్తి లేదో దాని కతఁడు ఈశ్వరుఁడు గానేరఁడు. కాన నతనికి కొలఁది తెలియని జ్ఞానిప్రీత్యతిశయము లేనిదే కావలయును. దానిని జెప్పను శక్తి లేనపుడు ఈశ్వరుఁడే కాఁడు అని శంక గలుగఁగా 'నాయందుఁ గలప్రీతికి కొలఁది లేదు' అనఁబడెను. ఉన్న దానిని తెలియకుండుటయే అజ్ఞానమును దోషము నగును గాని గగనకుసుమమువలె లేనట్టిదానిని తెలియకుండుట అజ్ఞానము గాదు దోషమును గాదు. అట్లు తెలిసినచో నది పట్టిభ్రాంతియే యగును గాని జ్ఞానము గాదు. జ్ఞాని ప్రీత్యతిశయమునకు ఇంతయని కొలఁదిలేదు గాన లేనికొలఁదిని తెలియకుండుట సర్వజ్ఞునియం దొకయజ్ఞానము గాదు. ఇంతయని కొలఁది లేమిచే దానిని చెప్పుటకు శబ్దమును గలుగదు గావున చెప్పను శక్తిలేకుండుటయు సర్వశక్తికి నొకయశక్తి గాదు. కాన దోషములేదని తెలియునది. ప్రహ్లాదుఁడు జ్ఞానులలో నగ్రేసరుఁ డనుటవలన జన్మసిద్ధమగు నిరతిశయ జ్ఞానము గలవాఁడగుటయు తండ్రి పెట్టు పెక్కుబాధలకును చలింపకుండుటయు వివక్షితములు. 'దశ్యమానో మహోరగైః' అని మహాసర్పములు కఱచుట మొదలైన తీవ్రదుఃఖములు కలుగుచున్నను, ఆదుఃఖములు అనుభవింపకుండుట భగవంతునియందలి నిరతిశయప్రీతివలననే యని తెలియునది. 'సచ మమ ప్రియః' 'అట్టివాఁడును నాకు ప్రియుఁడు' అట్లైయనఁగా వానికి నాయందలిప్రీతి యింతంత యని చెప్ప నలవి గానియట్లై నాకు వానియందలి ప్రీతియు నున్న దనుట. 'సచ మమ ప్రియః' అనుచో మహోదారుఁడగునీశ్వరుఁడు జ్ఞానియెడల నిరతిశయప్రీతిం జూపుచున్నను వానిప్రీతిం బట్టి తాను ప్రీతిఁజూపుటవలన అతృప్తి గలిగియుండుట సూచితమని ఆచార్యులగు కొందఱి మతము.

యిరువురకు తాము కోరినదానియందును దానికి సాధనభూతుఁ డగుటచే నాయందును భక్తి. ఈకారణములంబట్టి ఆయిద్దఱకంటె జ్ఞానియే శ్రేష్ఠుఁడు. మఱియును (శోకకారణము.) నేను జ్ఞానికి అత్యర్థము ప్రియుఁడను గదా. అనఁగా జ్ఞానికి నే నెట్టి ప్రియుఁడ నగుదునో సర్వజ్ఞుఁడను సర్వశక్తియునగు నాకును జెప్పనలవి కాదని యర్థము. ఏలనఁగా, వానికి నాయందుఁ గల ప్రీతికి కొలఁది లేదు. జ్ఞానులలో నగ్రేసరుఁ డగు ప్రహ్లాదునికి 'స త్వాసక్తమతిః కృష్ణే దశ్యమానో మహోరగైః। న వివేదాత్మనో గాత్రం తత్ స్మృత్యాహ్లాదసంస్థితః॥' (విష్ణుపురాణం) అని యెట్లో అట్లె వానికిని నాయందలి ప్రియత్వము. ఆచెప్పనలవిగానియట్లే వాఁడును నాకు ప్రియుఁడు.

శ్లో॥ ఉదారా స్సర్వ ఏ వైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।
ఆస్థిత స్సహి యుక్తాత్మా మా మే వానుత్తమాం గతిమ్॥ 19

టీ. ఏతే సర్వే=వీరందఱును, మే=నాకు, ఉదారా ఏవ = దాతలే, జ్ఞానీతు=జ్ఞానియో, ఆత్మైవ=నా ఆత్మయే (నాయునికికి వాఁడే యాధారమని)- (ఇతి=అని) మే=నాయొక్క, మతం=నిశ్చయము, హి=ఏలనఁగా, సః=వాఁడు, యుక్తాత్మా=నాతోడి యోగమును ఎదురుచూచుచున్నట్టియాత్మ గలవాఁడై, మామేవ=నన్నే, అనుత్తమాం సర్వోత్తమమయిన, గతిం= ప్రాప్యస్థానముగా, ఆస్థితః=నిశ్చయించినవాఁ డగును.

తా. *వీరందఱును నన్నే యుపాసించువా రగుటవలన నాకు దాత లగుదురు. ఎట్లన, ఎవరు ఏదైనను కొంచెము నావలనఁ బుచ్చు

---

* పూర్వశ్లోకార్థమే యీశ్లోకముచేతను దృఢీకరింపఁబడుచున్నది. జ్ఞానులు అత్యర్థప్రియు లనుటచే తక్కినవారు కించిత్ప్రియు లగుట ఫలితము. ఇదియే 'ఉదారాస్సర్వే' అని విశదీకరింపఁబడెను, అందఱికును భగవంతుఁ డొక్కఁడే యుపాయ

కొందరో వారు నాకు సర్వస్వము నిచ్చునట్టివా రగుదురు. (కాఁబట్టి యైశ్వర్యాదులను నావలనఁ బుచ్చుకొనుటచే నాకు ఔదార్య మనెడి సర్వస్వము నిచ్చునట్టి దాతలే యగుదురు. [13] జ్ఞానియన్ననో నాకు ఆత్మయే (అనఁగా శరీరముయొక్క ధారణము ఆత్మకు లోనై యుండు నట్లు నాధారణము వాని యధీనమైనది) యని నాయభిప్రాయము. ఎందుచే నిట్లు? వాఁడు నన్ను వదలినచో తాను ఆత్మధారణము కలుగ నేరనివాఁడై (అనఁగా నిలువఁజాలనివాఁడై) నన్నే మిక్కిలి యుత్కృష్టమైనగతిగా (పరమప్రాప్యముగా) ఆశ్రయించియుండును. కనుక నట్టివానిని విడిచి నాకును ఆత్మధారణము కలుగదు (అనఁగా నేనును నిలువఁజాలను.) కాఁబట్టి నాకు వాఁడు (ఆత్మవలె ధారక మైనవాఁడు) సుమీ.

శ్లో॥ బహూనాం జన్మనా మన్తే జ్ఞానవా న్మాం ప్రపద్యతే।
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః॥ 20

మగుట సాధారణమని తెలుపుటకై 'నన్నే యుపాసించువారు' అనఁబడెను. ఫల మందే వారికి భేదము. 'త న్నుపాసించి తనవలన నడిగిపుచ్చుకొనువారు తనకిచ్చు దాత లెట్లగుదు' రన్నచో, సకలఫలప్రదమగు పరమౌదార్యమే భగవంతునికి సర్వ స్వము. ఆయిచ్చు నౌదార్యము పుచ్చుకొనువాఁ డుండినసే నెఱపఁగూడునుగాని లేనిచో నెఱపఁ దరముగాదు. ఇట్లు పుచ్చుకొనువారివలననే తనకు సర్వస్వ మగు నౌదార్యము సిద్ధించుచున్నదిగాన వారు తనకు సర్వస్వదాత లగుదురని భావము. 'ఆత్మైవ' అనుటచే శరీరమునకు ఆత్మ యెట్లు ధారకమో, అట్లు జ్ఞాని తనకు ధారక మని 'నాధారణము వానియధీనమైనది' అనఁబడెను. ఇందులకు 'ఆస్థితః.. గతిమ్' అనుటయే హేతువు. 'యుక్తాత్మా' అనఁగా నాతోడియోగమునే ఆశంసించుచుండు వాఁడు గాన నేనులేక యాత్మధారణము కలుగనివాఁడు. అనఁగా నన్ను అనుసంధిం పనియెడల మఱియొకటి ననుసంధింపఁ బూనుట కసమర్థుఁడై యుండుస్వభావము గలవాఁడనుట. 'మామేవ' అనుటచే ఉపాయభూతుఁడ నగునన్నేకాని మఱియొక ఫలలేశమును గాదనుట. ఇట 'ఐశ్వర్యాదికాములందఱును నాస్వరూపమునకు అతి శయము గలిగించువారే. జ్ఞానిమాత్రము నాస్వరూపమునకు సత్తనే కలిగించువాఁడు' అని స్వభక్తుని భగవంతుఁ డీశ్లోకమున స్తుతించుట తెలియనగు.

టీ. (ఏవంచు), బహూనాం = అనేకము లయిన, జన్మనాం = పుణ్యజన్మములయొక్క, అన్తే = తుదను, జ్ఞానవాన్ (భూత్వా) = జ్ఞానముకలవాఁడై, వాసుదేవ (ఏవ) = సర్వాత్మకుం డైనభగవంతుఁడే, సర్వం = ప్రాప్యము ప్రాపకము తక్కిన యభీష్టములు అన్నియును, ఇతి = అని, మాం = నన్ను, ప్రపద్యతే = ఉపాసించుచున్నాఁడో, సః = ఆ-అట్టి; మహాత్మా = పుణ్యాత్ముఁడు, సుదుర్లభః = మిక్కిలి దుర్లభుఁడు.

తా. *నాకు శేషభూతమై యుండుటయే పరమాత్మయొక్క స్వరూపము అని ఆత్మయొక్క యాథాత్మ్యము నెఱింగి నాయెడల

---

* ఈచెప్పఁబడిన జ్ఞానము అనేకజన్మములచే సాధ్యమగు పుణ్యముయొక్క ఫలమగుటంజేసి అట్టిజ్ఞానము గలవాఁడు శ్రేష్ఠుఁ డగునని మరల నిందుఁ దెలుపుచున్నాఁడు. ఇట 'బహూనాం జన్మనామ్' అనుటచే పుట్టిజన్మములు పెక్కింటిని చెప్పలేదు. ఎన్ని జన్మము లెత్తినను అవి కేవలము లైనయెడల నుపయోగములేదు. మఱియు ఏవో జన్మములు పెక్కు లెత్తినమాత్రమున 'జ్ఞానవాన్' అని జ్ఞానము కలుగ నేరదు. అట్లు కలుగునేని, అప్పుడుండదగువు ఏజన్మములనయినను పెక్కింటి నెత్తినమాత్రముననే ప్రయత్నము లేకయే జ్ఞానము కలుగవలసివచ్చును. కాన నిచట జన్మము లనఁగా కేవలములైనవిగాక పుణ్యము లైన జన్మములని చెప్పఁబడెను. మఱియు 'బహూనాం జన్మనామన్తే జ్ఞానవా న్మాం ప్రపద్యతే' అనఁగా 'జ్ఞానవంతుఁడు బహుజన్మముల కడపట నన్ను నుపాసించుచున్నాఁడు' అని యర్థ మగును. జ్ఞానము కలిగినపిదపఁ గూడ బహుజన్మము లెత్తి భగవంతు నుపాసించునని భావము తోఁచుచున్నది గాన నది యుక్తము గాదు. కనుక 'జ్ఞానవాన్ భూత్వా' అని యధ్యాహరించుకొన్నయెడల బహుపుణ్యము లెత్తిన పిదప జ్ఞానవంతుఁడై నన్నుపాసించుచున్నాఁడని యుక్తమైన యర్థము సిద్ధించుచున్నది. మఱియు 'జ్ఞానవాన్' జ్ఞానముగలవాఁడు 'వాసుదేవ స్సర్వమ్' అని భగవంతునిగుఱించి 'ప్రపద్యతే' అని ప్రపత్తి చేయుట చెప్పఁబడెను గదా. 'జ్ఞానవాన్' అనఁగా ఏమిజ్ఞానము గలవాఁడు? అన్నచో 'భూమి రాపః' ఇత్యాదులచే తాను భగవంతునికి శేషభూతుఁడై యుండువాఁ డనియు, 'అహం కృత్స్నస్య' ఇత్యాదులచే తనస్వరూపాదులు భగవదధీనములనియును భగవంతుఁడు సర్వోత్కృష్టుఁడనియును జ్ఞానముగలవాఁడే యింతవఱకుఁ జెప్పఁబడియుండుటచే 'వాసుదేవ... అనుజ్ఞానము గలవాఁడై' యని యర్థము చెప్పఁబడినది. 'వాసుదేవస్సర్వ

ప్రపత్తి చేయుట యల్పసంఖ్య గల పుణ్యజన్మములయొక్క ఫలము గాదు. అనేక పుణ్యజన్మములవలనఁ గలుగుఫలము. కావున అనేక పుణ్యజన్మములకుఁ గడపట "వాసుదేవునకు శేషమై యుండుటయే నాస్వరూపము. నాస్వరూపస్థితిప్రవృత్తులు అతనియధీనములు. అతఁడు అసంఖ్యేయములగుకల్యాణగుణములచేత అన్నిటికంటె నుత్కృష్టుఁ
14
డైనవాఁడు" అను జ్ఞానము గలవాఁడై 'వాసుదేవుఁడే నాకు పరమ
15
ప్రాప్యము, ప్రాపకము, నామనోరథమం దేదిగలదో యా సర్వమును అతఁడే' అని తలఁచినవాఁడై నన్ను ఉపాసించునట్టి మహాత్ముఁడు (గొప్పమనస్సు గలవాఁడు) లోకమునందు మిక్కిలియు దుర్లభుఁడు. 'ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహమ్' 'ఆస్థితస్సహియుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్' అని (భగవంతుఁడే పరమప్రాప్యముగాను ప్రాపకముగాను చెప్పు) ప్రక్రమముంబట్టి 'వాసుదేవస్సర్వమ్' అనుటకు నిదియే యర్థము. ఈజ్ఞానవంతుఁడును ఇట చెప్పఁబడిన (వాసుదేవశేషత్వైకరసత్వాది) లక్షణములు గలవాఁడే. ఏలన నితఁడే పూర్వము చెప్పఁ

మనఁగా నేమి యన్నచో, ఇందు మొదట ప్రాప్యముల భేదమునుబట్టియే యధికారుల భేదము ఏర్పఱుపఁబడెను. జ్ఞానాధికారికి 'ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహమ్' అని భగవంతుఁడే యత్యంతప్రియుఁడుగాను, కాన 'ఆస్థితస్సహి...మామేవానుత్తమాం గతిమ్' అని భగవంతుఁడే పరమప్రాప్యముగాను జెప్పఁబడుటచే 'వాసుదేవుఁడే నాకు పరమప్రాప్యుఁడు...అవి యన్నియు' నని యర్థము చెప్పఁబడినది. ఇట ప్రపత్తి యుపాసనమునకు అంగమే యగుటచే 'ప్రపద్యతే' అనుటకు ఉపాసించుచున్నాఁడని యర్థము సేయఁబడెను. ఇట జ్ఞానిని 'మహాత్మ' అనుటకు స్వరూపమున మహత్త్వము గలవాఁడని గ్రహించుట ప్రమాణవిరుద్ధము. పంక్తిపావనత్వాదిక మగు మహత్త్వము గ్రహించుటయు ప్రకృతమున కావశ్యకము గాదు. కాన 'జ్ఞానవాన్' అను జ్ఞానవిశేషమువలనఁ గలిగిన మహత్త్వము గలవాఁడని తెలుపుటకై 'మహామనస్సుగలవాఁడు' అనబడెను. ఫలాంతరములను గోరు ఆర్తుఁడు మొదలగు భగవదుపాసకులు గూడ దుర్లభులే కాన, వారు గాదని తెలుపుటకై జ్ఞాని 'సుదుర్లభః' అనఁబడినాఁడని తెలియునది.

బడినజ్ఞాని. ఎట్లన 'భూమిరాపః' అని యారంభించి 'అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా। అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరామ్। జీవభూతామ్' అని చేతనాచేతనములగు ప్రకృతులు రెండును పరమపురుషునికి శేషమైయుండుటయే స్వరూపముగాఁగలవిగా చెప్పఁబడినవిగదా. 'అహంకృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా। మత్తః పరతరం నాన్యత్కిఞ్చిదస్తి ధనఞ్జయ' అని యారంభించి 'యేచైవసాత్త్వికాభావారాజసాస్తామసాశ్చ యే। మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి' అని కార్యకారణములనెడి యుభయావస్థలందున్న ప్రకృతిద్వయముయొక్క స్వరూపస్థితి ప్రవృత్తులు పరమపురుషునికి లోనయియుండుటయు పరమపురుషుఁడు సమస్తము లయిన ప్రకారములచేతను సర్వమునకు మిక్కిలి యుత్కృష్టుఁడై యుండుటయుఁ జెప్పఁబడినది. కాఁబట్టి (వాసుదేవునికి శేషభూతుఁ డగుటయందే యాసక్తి మొదలగు లక్షణములు గల) వాఁడే ఇచట జ్ఞాని యని చెప్పఁబడుచున్నాఁడు.

అవ. అట్టిజ్ఞాని దుర్లభుఁడగుటనే యుపపాదించుచున్నాఁడు.

శ్లో॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః ।
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యానియతా స్స్వయా॥ 21

టీ. స్వయా = తమదైన, ప్రకృత్యా = పాపవాసనతో, నియతాః=నిత్యసంబంధము గలవారును, తైః=తమతమ ప్రాచీన వాసనకు అనురూపములగు నాయా, కామైః = కోరినట్టిపదార్థముల చేత, హృతజ్ఞానా స్సన్తః=అపహరింపఁబడిన భగవత్స్వరూపవిషయ జ్ఞానము గలవారునై, తంతం నియమం = (ఆయాదేవతలను మాత్రమే సంతోషపరచునట్టి) ఆయానియమమును, ఆస్థాయ = పొంది, అన్యదేవతాః = భగవంతునికంటె నితరులైన యింద్రాది దేవతలను, ప్రపద్యన్తే = ఆశ్రయించి అర్చించుచున్నారు.

తా. లోకమునం గల పురుషులందఱును *స్వకీయ మగు పాపవాసనతో నెప్పుడును గూడి యుందురు. అది గుణమయమగు పదార్థములయందే ప్రవర్తించునట్టిది. కావున వారు అట్టి తమతమ వాసనలకుఁ దగినట్టు గుణమయములే యైన యాయాపదార్థములనే కోరుదురు. అవి గుణమయము లగుటచేత వారికిఁ గల మత్స్వరూప విషయజ్ఞానమును బోఁగొట్టఁగా వారు (నన్ను భజింపక) ఆయాపదార్థములనే కోరి యవి సిద్ధించుటకొఱకు నాకంటె వేఱై కేవలులైన యింద్రాది దేవతలను ఆశ్రయించి ఆయాదేవతావిశేషమాత్రములను సంతోషపఱుచుటకై యే యేర్పడిన యాయాసంకల్పాది నియమములను గైకొని వానినే యర్చించుచున్నారు. 16

17A

శ్లో॥ యోయో యాంయాం తనుంభక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి।
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్॥ 22

---

* ఇందు 'కామైస్తైస్తైః' అని యాయా యిచ్ఛావిషయములను జెప్పుటచే ఆయిచ్ఛలకు హేతుభూతమైన సహజవాసనయే యిట స్వభావార్థకమగు ప్రకృతి శబ్దముచే గ్రహింపవలసియున్నది. కాన ప్రకృతియనఁగా వాసన యనఁబడెను. అది 'స్వయా' అని స్వకీయమనుట ప్రాచీనమైన స్వకీయానుభవముచేఁ బుట్టినదని భావము. దీనిచేతనే గుణమయములైన యాయాపదార్థములం దిచ్ఛగలుగుననియు ఆయిచ్ఛచేత భగవత్స్వరూపజ్ఞానము అపహృత మగునుగాన అన్యదేవతా భజనము కలుగుచున్న దనియు తెలియునది. కామమనఁగా కోరిక గాదు, కోరఁబడినపదార్థము. ఈయర్థముననే 'లభతేచ తతఃకామాన్' అని మీఁద చెప్పఁబడు కామశబ్దము ప్రయోగింపఁబడియుండుటవలన అదే యిచటఁగూడ గ్రహింపఁబడిన దని తెలియునది. దేవతలను బూజించుట వారిని శరీరముగాఁగలభగవంతునిఁ బూజించుటయే యగును. అయినను ఆపూజ భగవత్పూజయే యగుననెడి యనుసంధానము వారికి లేనందున వారు దేవతలనుమాత్రమే పూజించువారగుదురని చెప్పఁబడెను. ఇచటఁగూడ 'ప్రపద్యన్తే' అనుటచే, ప్రపత్తి మీఁది శ్లోకమునం గల 'శ్రద్ధయార్చితుమిచ్ఛతి' అనుట కనుగుణముగా అర్చనకు అంగమగునని తెలుపుటకై, 'వానినే యాశ్రయించి యర్చించుచున్నారు' అనఁబడెను. ఇట దేవతాంతర ఫలాంతర సంగాదులు జ్ఞానమునకు ప్రతిబంధకము లని భావము.

టీ. యః యః=ఎవఁడెవఁడు, యాంయాం తనుం=ఏయే దేవతా రూపమయిన నా దేహమును, భక్తస్సన్=భక్తిగలవాఁడగుచు, శ్రద్ధయా = శ్రద్ధతో, అర్చితుం = ఆరాధించుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాఁడో, తస్యతస్య=ఆయాపురుషునికి, తాం శ్రద్ధామేవ=నా దేహవిషయమైన యాశ్రద్ధనే, అచలాం=నిర్విఘ్నమైనదానినిగా, విదధామి =చేయుచున్నాను.

తా. *ఆ దేవతలుకూడ నా దేహములుగా 'య ఆదిత్యే తిష్ఠన్ యమాదిత్యో నవేద యస్యాఽదిత్యశ్శరీరమ్' ఇత్యాదిశ్రుతు

---

*దేవతాంతరఫలాంతరాసక్తులైనవారుగూడ ఆయాదేవతారాధనములును వానివలన ఫలములును శిథిలమైనయెడల అనర్థహేతువులైన నిషిద్ధోపాయములందుఁ బడుదురని భయపడి పరమకారుణికుఁడగు నేనే వారియయ్యాదేవతారాధనమునకు వలయు శ్రద్ధకుఁ గలవిఘ్నములను బోఁగొట్టి వానిఫలములనిచ్చుచున్నానని యీ రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు. 'య ఆదిత్యే తిష్ఠన్ య మాదిత్యోనవేద యస్యాదిత్యశ్శరీరమ్' ఇత్యాదులందు ఆదిత్యాదిదేవతలు భగవంతునికి శరీరము అగుట చెప్పఁబడియున్నది. దేవతలు భగవంతుని శరీరములు అనుటచే దేవతలు వట్టిశరీరమాత్రములే యనియు వానియందుఁగల ఆత్మలన్నియు రామకృష్ణాదిమూర్తులందుఁబోలె పరమాత్మయగు భగవంతుఁడొక్కఁడే యనియు గ్రహింపరాదు. ఎట్లన పూర్వశ్లోకమున 'ప్రపద్యన్తేఽన్యదేవతాః' అనుచో 'అన్యదేవతాః' అనఁబడినవారు భగవంతుని యసాధారణవిగ్రహవిశేషము గానేరరు. అట్టి విగ్రహముగల భగవంతుఁడుగాని కానేరరు. భగవంతునికంటె వేఱయినచేతనులే కావలయును. మఱియు 'దేవాన్దేవయజో యాన్తి మద్భక్తాయాన్తిమామపి' అని దేవతలను వేఱుగాను తన్ను వేఱుగాను జెప్పుటచే దేవతలును దానును వేఱువేఱుచేతనులని యేర్పడుచున్నది. కాఁబట్టి యిట దేవత లనఁగా దేవతల శరీరములును వానిలోపలి యాత్మలను రెంటిని గ్రహింపవలయును. ఒక్కొక్కదేవతయొక్క శరీరమును వానియాత్మయు రెండును జేరియే భగవంతునిశరీర మగుచున్నదికాని వట్టిశరీరమేకాదు. దేవతాంతరపరులు 'నతు మామభిజానన్తి తత్త్వేన' అనిమీఁదఁ జెప్పఁబడునట్లు భగవత్స్వరూపము దెలియరుగాన ఆయాదేవతలను భగవంతుఁడు తనువుగా నర్చించుట గలుగదు; తనువుగా నర్చించిరేని పరమాత్మ నర్చించిన వారే యగుదురుగదా. ఇట్లుండ 'యోయో... మిచ్ఛతి' అనుచో, 'యాం యాంతనుం' అని ఆదేవతలను లనతనువుగా భజింతురని భగవంతుఁడు చెప్పుట యెట్లు ? 'యాంయాం దేవతాం' అనికదా చెప్పవలయును

లచే ప్రతిపాదింపఁబడినవి. దేవతలు నాదేహము లని తెలియక పోయినను ఎవఁడెవఁడు ఆదిత్యాదిదేవతారూపమైన యేయే నాదేహమును (అనఁగా నాదేహమైన యేయేదేవతను) భక్తియుక్తుఁడై శ్రద్ధతో నర్చింపఁగోరుచున్నాఁడో, ఆయావానికి ఆయాదేవత నా దేహమని తెలియకపోయినను, వానియందుఁ జూపెడి యీశ్రద్ధ నా దేహమును గుఱించినదియేకదా యని నేను తలఁచి యాశ్రద్ధనే
17B
నిర్విఘ్నమైనదిగా చేయుచున్నాను.

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే ।
18
లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్॥ 23

టీ. సః = భక్తుఁడు, తయా = అనిశ్చలమైన, శ్రద్ధయా = శ్రద్ధతో, యుక్తస్సన్ = కూడినవాఁడై, తస్య = వానియొక్క-అయింద్రాదులయొక్క, ఆరాధనం (ప్రతి) = ఆరాధనమును (గూర్చి), ఈహతే = (చేయఁ) గోరుచున్నాఁడు, తతః = దానివలన-నాకు దేహభూతులైన యింద్రాదిదేవతల నారాధించుటవలన, తాన్ కామాన్ = తాను కోరినయాపదార్థములనే, మయైవ = నాచేతనే, విహితాన్ = ఇయ్యఁబడినవానిని. లభతేహి = పొందుచున్నాఁడుగదా.

తా. ఆభక్తుఁడు నిర్విఘ్నమైన యాశ్రద్ధతోఁ గూడినవాఁడై ఆయింద్రాదిదేవతలఁ గూర్చి యారాధనము చేయఁగోరుచున్నాఁడు.

---

తన్నచో, వారు ఆదేవతలను తనతనువుగాఁ దలఁచి భజింపకపోయినను వారు తన తనువునే భజించినారని తాను తలంచుకొనుటచే తనయభిప్రాయముచొప్పున 'యాం యాం తనుమ్' అన్నాఁడని తెలియునది. మఱియు రాజుయొక్క ఆత్మస్వరూపము తెలియనివాఁడయినను ఆరాజుయొక్క శరీరమును నలుఁగు మొదలగువానిచేఁ జక్కఁ జేయువాఁడు రాజుయొక్క యాత్మచేతనే ఫలమును బొందునట్లు భగవచ్ఛరీరములగు దేవతలను భజించువాఁడు తదాత్మ యగు భగవంతునిచేతనే ఫలముఁ బడయునని తెలియుచు

దానివలన (అనఁగా నాకు దేహభూతు లయిన యింద్రాది దేవతల నారాధించుటవలన) తా నభిలషించిన యాకామములనే నేనే విధింపఁగా లభించుచున్నాఁడు. (నిన్నుగుఱించినజ్ఞానము లేనివానికి నీవలన ఫలము గలుగుట యెట్లన్నచో) ఆరాధనకాలమందు ఆరాధ్యులయిన యింద్రాదులు నాదేహమును లనియు కావున నే వారి నర్చించుట నన్నారాధించుటయే యగుననియు వానికి తెలియక పోయినను వాస వమున కది తదంతర్యామి యగు నన్నారాధించుట యగుటంబట్టి ఆరాధకుఁ డభిలషించినదానిని నేనే విధించుచున్నాను.

శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసామ్ ।
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥ 24

టీ. తేషాం=ఇంద్రాది దేవతామాత్రములను బూజించునట్టి, అల్పమేధసాం = స్వల్పబుద్ధి గలవారికి, తత్ ఫలంతు=ఆదేవతారాధనమువలనఁ గలుగుఫలమో, అన్తవత్ =నాశము కలది, (భవతి= అగుచున్నది.) (ఏలనఁగా), దేవయజః = అన్యదేవతలను బూజించువారు, దేవాన్ = ఆదేవతలను - ఆదేవతలతోడి సాయుజ్యమును, యాన్తి =పొందుచున్నారు, మద్భక్తాః అపి=నాభక్తులును, మాం = నన్ను, యాన్తి =పొందుచున్నారు–నాతోడి సాధర్మ్యమును బొందుచున్నా రనుట.

తా. కేవలురైన యింద్రాదులనుమాత్రము యజించునట్టి యాయల్పబుద్ధులకు వారి నారాధించుటవలనఁ గలుగు ఫలము అల్పమును అంతము గలదియు నగును. ఏలనఁగా, ఇంద్రాది దేవతల నారాధించువారు ఆదేవతలనే పొందుదురు. ఇంద్రాదులుగూడ పరిచ్ఛిన్నములగు భోగములు గలిగి పరిమితమైన కాలమువఱకే వర్తించు

చుండువారుగదా; కాఁబట్టి వారితోడి సాయుజ్యమును బొందినవారు (ఆ దేవతలు పరిమితమగు తమకాలమును తమభోగములును ముగియఁగా క్రిందికి వచ్చునప్పుడు తత్సమానభోగులగుటచే వీరును తమ భోగాదులు తీఱి) వారితోఁగూడ క్రిందికి వచ్చుచున్నారు. నాభక్తులు కూడ (ఆ దేవతలనే యారాధించుచున్నను) * ఆ యారాధనకర్మములు మదారాధనములే యని యెఱింగినవారై ఆ దేవతలవలనఁ గలుగు పరిమితఫలమునందు సంగము వదలి నన్ను సంతోషపెట్టుటయే పరమప్రయోజనముగాఁ గలవారై యుండుటవలన నన్నుఁ బొందుచున్నారు. మఱియు రారు (పునరావృత్తి నొందరనుట). 'మా ముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ నవిద్యతే' అనికదా మీఁదఁ జెప్పఁబడెడిని.

అవ. †ఇతరు లన్ననో, ఎల్లవారికిని సులభముగా నాశ్రయింపఁ దగినవాఁడనగుటకై నేను మనుష్యాదులం దెత్తెడి యవతారమును గూడ కొంచెమైనను పసలేనిదిగాఁ జేయుచున్నా రనుచున్నాఁడు.

---

* ఇంద్రాదులతోడి సాయుజ్యము పరిమితమైనది గనుక వారి నుపాసించునట్టి వారిభోగాదులును పరిమితమై ముగియఁగా వారు మరల క్రిందిలోకమునకు వత్తురనియు, ఈశ్వరునితోడిసాధర్మ్యము నిత్యమైనది గనుక వాని నుపాసించువారిభోగాదులును నిత్యమగుటంజేసి వారు మరల క్రిందికి రారనియు భావము. ఈశ్వరుఁడు తన్నుఁగాని దేవతలనుగాని యుపాసించువారికి ఫలములను తానే యిచ్చుచున్నవాఁడుగాన దేవతలకుఁగాను తానిచ్చినఫలముగూడ నిత్యముగా నుండఁదగదా యన్నచో యందు తన్నునుపాసించువారికే తనతోడిసాధర్మ్యము నిచ్చును. దేవతల నుపాసించువారికి దేవతలతోడి సాయుజ్యాదులనుమాత్రమే యిచ్చుననియు గ్రహించునది.

† కొందఱు నన్ను విడిచి యితరదేవతల నుపాసించుచున్నారు. నేను కన్నులకుఁ దెలియనివాఁడనై యుండుటవలన వారు నన్నెఱుఁగనేరక యితరదేవతల నుపాసించుట యుక్తమే యనవచ్చునుగాని, ఇట్లు అందఱును సులభముగా నాశ్రయించుటకొఱకు కన్నులకుఁ దెలియువాఁడనై నేను మనుష్యాదులం దవతరించినప్పుడైనను నన్నుపాసింపవలెనుగదా. అప్పుడుఁగూడ నన్నుపాసింపక నాయవతారమువలన ప్రయోజనము పొందకయుండువారును మఱికొందఱు చతుర్విధసుకృతులకంటె నన్యులగువార్లు కలరని భావము.

21

శ్లో॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః ।
పరం, భావ మజానన్తో మ మావ్యయ మనుత్తమమ్॥ 24

టీ. అబుద్ధయః=నావిషయ మైనబుద్ధి లేనివారు, మమ=నాయొక్క, అవ్యయం = ఎల్లప్పుడు ఏకరూపమైనదియు, అనుత్తమమ్=సర్వోత్కృష్టమైనదియునగు, పరంభావం=నిరతిశయపరత్వసౌలభ్యరూపమైన, నాస్వభావమును, అజానన్తః=ఎఱుగకున్నవారై, మాం=నన్ను, అవ్యక్తమ్=(ఇంతకు పూర్వము) తెలియబడనివాఁడనై, వ్యక్తిం=ఇప్పుడు అందఱికిని తెలియుటను, ఆపన్నం = పొందినవానినిగా, మన్యన్తే=తలచుచున్నారు.

తా. *సర్వకర్మములచేత నారాధింపఁదగినవాఁడును, సర్వేశ్వరుడును, వాక్కుచేతను మనస్సుచేతను ఇట్టిదట్టిదని చెప్పుటకును దలంచుటకును సాధ్యములుకానట్టి స్వరూపస్వభావములు గలవాఁడును అగు నేను, మిక్కిలి కారుణ్యమువలనను ఆశ్రితవాత్సల్యము

---

* తాను పూర్వము అవ్యక్తుఁడైయుండి యిప్పు డవతారమువలన వ్యక్తుఁడగుట నిజమేకదా. దీని నాక్షేపింపవచ్చునా ? యన్నచో, తాను అవతారమువలన వ్యక్తుఁడయినట్లు తలఁచుట నాక్షేపింపలేదు. ఒకరాజకుమారునివలె కర్మవశమున నొకజన్మమెత్తి వ్యక్తుడయినట్లు తలంచుటనే యాక్షేపించినాఁడని తెలియునది. ఇట్లు ఆశ్రయింతురనఁగా ప్రపత్తిపూర్వకముగా భజింతురని యర్థమగును. అట్లు సేయమిచే దాని కంగముగా వర్ణాశ్రమాదిధర్మము లయిన స్తుతి నమస్కారాదులను గూడఁ జేయరని 'కర్మములచేతను నారాధింపరు' అన్నాఁడు. 'సర్వకర్మములచేత...అవతరించితిని' అనుటచే నిరతిశయపరత్వసౌలభ్యరూప మగు స్వభావము చెప్పఁబడినది. ఈశ్వరుఁడు కర్మవశమునఁ గాక కారుణ్యవశమున మనుష్యుఁడై పుట్టుచున్నాఁడు. అట్లు పుట్టినను వాని యీశ్వరస్వభావము చెడకుండుటయు, పరత్వలక్షణములే యగునవి. ఇట్లు పుట్టుటవలన వాని పరత్వమే గ్రహింపఁ దగియుండఁగా వాని మనుష్యత్వమునే గ్రహించుట బుద్ధిహీనుల లక్షణమని తెలియంగునది. మఱియు నిచట 'అవ్యక్తం వ్యక్తి మాపన్నమ్' అనుటచే అవతారమును, 'మామ్' అనుటచే ప్రకృతిపూర్వావతారమును సూచిత మగుటచే 'వసుదేవుని కొడుకుగా' అని కూర్పఁబడెను.

వలనను అందఱికిని సులభముగా నాశ్రయింపఁదగినవాఁడను కాఁగోరి, నాదివ్యస్వభావమును విడువకయే వసుదేవునికిఁ గొడుకుగా నవతరించితిని. ఇట్లగుట నాపరస్వభావము. ఇది నిత్యమై నిరతిశయమై యొప్పును. అయినను బుద్ధిహీనులు (నేనిట్లు మనుష్యుఁడనై పుట్టుట నాపరస్వభావమని యెఱుంగనివారై) సామాన్యుఁడగు నొక రాజకుమారునివలె పూర్వము తెలియబడనివాఁడై యుండి యిప్పుడు కర్మవశమున నొక జన్మ మెత్తి తెలియఁబడుచున్నవానినిగా నన్నుఁ దలంచుచున్నారు. కావున వారు నన్నాశ్రయింపరు; కర్మములచేత, నన్నారాధింపకయు నుందురు.

అవ. తన పరస్వభావము ఏల యిట్లు ప్రకాశముగాఁ దెలియకున్నదో చెప్పుచున్నాఁడు.

శ్లో॥ నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్॥ 25

టీ. యోగమాయాసమావృతః=మనుష్యత్వాది శరీర సంబంధమనెడి మాయచేత నావరింపఁబడిన, అహం = నేను, సర్వస్య= అందఱకును, ప్రకాశః = (పరస్వభావమునందు) తెలియఁబడినవాఁడను, న=కాను, మూఢః = మోహముఁ జెందిన, అయం=ఈ, లోకః=లోకమందలి జనము, మాం = నన్ను, అజం = జన్మములేనివానినిగాను, అవ్యయం = నాశరహితునిగాను, నాభిజానాతి = ఎఱుఁగదు.

తా. *క్షేత్రజ్ఞులకు అసాధారణమై యుండుమనుష్యత్వము మొదలగు సంస్థానములతోడి యోగ మనెడి (అనఁగా మనుష్యత్వాది

* "నీ సంకల్పమున కెదురులేదు కనుక, నీ వందఱికిని సమాశ్రయణీయుఁడ వగుటకై యవతరించితివేని నీసంకల్పము చొప్పున నందఱేల నిన్ను నాశ్రయింపరు' అని యడిగినచో సమాధానముగా దీనిని భగవంతుఁడు చెప్పుచున్నాఁడు. ఇచట

శరీరయోగ మనెడి) మాయచేతఁ గప్పబడినవాఁడనై యుండుటచే

---

'యోగమాయాసమావృతః' అనుచో, మాయ యనఁగా నేమిగా నుండదగు నని విచా
రింతము. ఇచట యవతారావస్థ చెప్పఁబడుచున్నది. మాయ యని త్రిగుణాత్మక
యైన మాయచే నావరింపఁబడుటను జెప్పినచో నిది పరావస్థకును అవతారావస్థ
కును సాధారణముగాన రెండవదాని కిపుడు చెప్పుటచే విశేషమేమియు కలుగదు.
సంకల్పాదిరూపమగు మాయయు రెండవస్థలకును సాధారణమే కనుక అవతారావస్థకు
అసాధారణమైన మనుష్యాదిసంస్థానవేషభాషాదికముతోడియోగము (అనఁగా సంబం
ధమే) ఇట మాయయనఁ జెల్లును. మాయ యనగాఁ విచిత్రసృష్టికరమని పూర్వము
వివరింపఁబడినది. పరుఁడైనవాఁడు కేవలమనుష్యత్వాదిసంస్థానమునొందు విచిత్ర
కార్యమును జేయుటచే నిది మాయ యనఁదగును. 'నీవు మనుష్యత్వాదివేషము
దాల్చి నీపరత్వభావమును మఱుఁగుపుచ్చుటచే అందఱు నిన్నుఁ బరుఁడని తెలియ
కున్నారు. కాన నిది నీదోషమే; యనఁగా 'మూఢోఽయం...మవ్యయమ్' అన్నాఁడు.
అనఁగా అందఱు నన్నాశ్రయింపవలయునని నేను మనుష్యత్వాదులను బొందఁగా అది
దుర్మతులగువారు నన్ను విడుచుటకే కారణమైనది. నేను నాపరస్వభావము నంతటిని
మఱుఁగుపఱుచుకొనలేదు. మనుష్యత్వాదులు దాల్చియుండియు లోకోత్తరమయిన
కర్మములు తేజము మొదలగునవి నెఱపుచుండుటచే నాపరస్వభావమును దెలుపుమనే
యున్నాను. అయినను మందులయిన లోకులు మబ్బులు క్రమ్ముటచే మినుక్కురని
కనఁబడుచున్న సూర్యునిఁ జూచి యేదో యొకించుక సాధర్మ్యమునుబట్టి మిడుఁగుఱు
బూఁచిగా గ్రహించినట్లు, నా మనుష్యత్వాదివేషమాత్రమును జూచి తేజఃకర్మాదు
లనుఁ జూడక నన్నుఁ గేవలమనుష్యాదులుగానే తలంచుచున్నారని భావము. నిరతి
శయమైన దీప్తి (అనఁగాఁ దేజస్సు) జగత్కారణుఁ డగు పరమపురుషునియొక్క
యసాధారణధర్మముగా వేదాంతములందు నిర్ణయింపఁబడి యున్నది. వాయ్వింద్రా
దుల నతిశయించిన కర్మము సర్వనియంత యగుటకు చిహ్నము. కావున నట్టి తేజః
కర్మములుఁ దనపరస్వభావమునకు చిహ్నములయ్యును వానినిబట్టి యీపరస్వభావమును
లోకులు తెలిసికొనకున్నారని తెలియునది. ఇట 'అజమ్' అనుటచే ఫలితము 'నిఖిల
జగదేకకారణుఁ' డనుట. 'అవ్యయమ్' అనుటచే లబ్ధము 'సర్వేశ్వరుఁ' డనుట. నన్ను
అజునిఁగాను అవ్యయునిఁగాను దెలియరు. తక్కిన పురుషులవలె కర్మముచేతఁ
బుట్టుకనొందినవానినిగాను జ్ఞానసంకోచాదులు గలవానినిగాను నెఱుంగుదురని
భావము. ఇచట 'నాభిజానాతి' అని చెప్పఁబడిన యజ్ఞానము ఈశ్వరుని పరావస్థను
తెలియమికాదు. అది యందఱికిని తెలియనిదే. కాన 'పరంభావమజానన్తో మమా
వ్యయ మనుత్తమమ్' అన్నట్లు మనుష్యత్వము గలిగియున్నను పరుఁడే యని తెలియ
మియే యిచట ననభిజ్ఞానమని తెలియునది.

నేనందఱకును బ్రకాశుఁడనుగాను (అనఁగా నా పరస్వభావ మందఱి కును బ్రకాశముగాఁ దెలియకున్నది). అయినను నేనట్టి మాయచే నాపరస్వభావమంతయు మఱుఁగుపఱుచుకొనలేను. ఏలన, నేను పైకి మనుష్యాదులుగా కనఁబడినను నా పరత్వమును సూచించునట్టి లోకోత్తరకర్మములను దేజస్సును బ్రకాశింపజేయుచునే యుందును. నాయందు మనుష్యత్వాద్యాకారములను జూచినమాత్రముననే యీలోకము మోహము నొంది నన్ను మనుష్యాదులుగానే భ్రమింపుచున్నది గాని వాయ్వింద్రాదుల నతిశయించిన నాకర్మములు, సూర్యాగ్నులను మించిన నా తేజస్సు అగపడుచున్నవైనను, ఉత్పత్తివినాశములు లేనివాఁడును అవ్యయుఁడును నిఖిల జగదేకకారణుఁడును సర్వేశ్వరుఁడు నగు నేను -ందఱకును సమాశ్రయణీయుఁడగుటకొఱకు మనుష్యాకారమును బొందియున్నవాఁడని గుఱు తెఱుఁగకున్నది.

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన॥ 26

టీ. హే అర్జున, అహం = నేను, సమతీతాని = జరిగినవియును, వర్తమానాని = జరుగుచున్నవియును, భవిష్యాణి = జరుగఁబోవునట్టివి యునగు, భూతాని = సమస్తభూతములను, వేద = ఎఱుఁగుదును, మాంతు = నన్నో, కశ్చన = ఒక్కటియు, నవేద = ఎఱుంగదు.

తా. *అర్జునా, భూతభవిష్యద్వర్తమానకాలత్రయమునంగల సమస్తప్రాణులను నే నెఱుంగుదును. కాని, నాచే అనుసంధింపబడు

* ఇఁట 'నాభిజానాతి' అని పూర్వశ్లోకమున చెప్పినచొప్పున వర్తమానకాల మందే కాక కాలత్రయమునందు లోకు లెవ్వరును తెలియరని చెప్పబడుచున్నది. 'వేదాహమ్' అని తన్ను సర్వజ్ఞునిగాఁ జెప్పకొననేల యన్నచో, తన్ను సర్వజ్ఞుఁడుగాఁ దెలియుటవలనఁ గదా తన్నే యాశ్రయించుట ఫలించును. కావుననే 'నన్నిట్లు సర్వజ్ఞునిఁగాను...దెలిసికొని నన్నే యాశ్రయించువాఁడు' అనఁబడెను.

చున్నవియు కాలత్రయమునందు వర్తించుచుండునవియు నగునట్టి ప్రాణులలో నన్నిటివానినిగాను (సర్వజ్ఞునిగాను), వాసుదేవునిగాను, అందఱును ఆశ్రయించుటకై యవతరించినవానినిగానును ఎఱింగి నన్నే యాశ్రయించునట్టివాఁ డొక్కఁడును గానఁబడఁడని యర్థము. *కావున అట్టిజ్ఞాని మిక్కిలి దుర్లభుఁడే యగును.

*అవ. అశ్లోకదా. 22

శ్లో॥ ఇచ్ఛా ద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరన్తప॥ 27

టీ. పరంతప = శత్రువులఁదపింపఁజేయునట్టి, హేభారత = అర్జునా, సర్వభూతాని=సమస్తభూతములు, సర్గే = జన్మకాలమందె, ఇచ్ఛాద్వేషసముత్థేన = రాగ (అభిలాష) ద్వేషములవలనఁ గలిగిన, ద్వంద్వమోహేన=శీతోష్ణాది (అనఁగాసుఖదుఃఖాది) ద్వంద్వరూపమైన మోహహేతువుచేత, సమ్మోహం = ఒక్కటిగాఁ దలచిఁ భ్రమించుటను, యాన్తి = పొందుచున్నవి.

తా. అర్జునా, †ఇచ్ఛాద్వేషములచేతఁ బుట్టిన శీతోష్ణాది ద్వంద్వమనెడు మోహము (గలిగించుదాని) చేత సర్వభూతములును

* 'అశ్లోకదా' యనుటచే జ్ఞాని చెప్పఁబడినట్లే దుర్లభుఁడగునని యీశ్లోకము చేతను నిరూపించుచున్నారు. ఇందు కాలత్రయమునంగల సమస్తభూతములును భగవంతునిగుఱించి యజ్ఞానము గలిగియుండుటకుఁ గారణమును జెప్పి, యిట్లిందఱికును అజ్ఞానమే సాధారణమై యుండుటచే జ్ఞానము గలవాఁడు దుర్లభుఁడని నిరూపిత మగుచున్నది.

† ఇందు, జన్మకాలమందే ఇచ్ఛాద్వేషములు సంభవించుననియు ఆ యిచ్ఛాద్వేషములచేత శీతోష్ణాదిద్వంద్వ మనెడి మోహము ఉత్థిత మగుచున్నదనియు ఆమోహముచేత సమ్మోహము గలుగుననియుఁ గదా చెప్పఁబడినది. జన్మకాలమందే యిచ్ఛాద్వేషములు కలుగుటకు నియితి లేదుగాన నవి కలుగఁజాలవు: కలిగినను అవి ద్వంద్వమునుగూర్చియే కలుగవలయునా ? భగవంతునిగూర్చి యేల కలుగరాదు? ఇచ్ఛా

జన్మించు కాలమందే సమ్మోహమును బొందుచున్నవి. అనఁగా— సత్త్వాది గుణమయములైన సుఖదుఃఖాదిద్వంద్వములు పెక్కింటిలో పూర్వపూర్వజన్మములందు ఏవిషయమునుగుఱించి యిచ్ఛాద్వేష

---

ద్వేషమాత్రముల చేత శీతోష్ణాదులు ఉత్పత్తి యగుట యెట్లు? అవి హేమంతగ్రీష్మాదు లయిన స్వకారణములవలననే కదా కలుగునవి? ద్వంద్వమునకు మోహాశ్రద్ధ యెట్లు? మోహముచేత మోహమును బొందుదు రనుటచే ఆత్మాశ్రయాదిదోషము ప్రసక్తించునే! యని శంకలు రాఁగా ఇట 'గుణమయములైన - యే యుఁ బుట్టినది కాదు' అని సమాధానములు చెప్పఁబడినవి. అనఁగా జన్మాంతరవాసన యనుకారణ మొకటి గలదు. ఒకజన్మమునందు ఒకానొక విషయమునుబట్టి యిచ్ఛాద్వేషము అలవాటు పడుటవలన పిదప నది తెలియఁబడకున్నను ఆవిషయమందే తిరుంతలనే వర్తించుచుండును. ఇదియే ఆవిషయపు వాసన యనఁబడును. ఇది పయిపయిని పిమ్మటిజన్మము లందును విడువక యనువర్తించుస్వభావము గలది. కనుక ఒకజన్మమందు ఒకద్వంద్వమును గుఱించి యిచ్ఛాద్వేషము లలవాటుచేయుటచేఁ బుట్టినవాసన మఱుసటిజన్మమందును అనువర్తించుటచే ఆజన్మమెత్తినపుడే ఆవాసనవలన ఆ ద్వంద్వమును గుఱించియే యిచ్ఛాద్వేషములు కలుగుచున్నవి. కనుక జన్మకాలమందే యిచ్ఛాద్వేషములు కలుగుటకు వీలు లేదనరాదు. ఆయిచ్ఛాద్వేషములు కలిగినను వాసనానుగుణముగా ద్వంద్వములను గుఱించిన వగునేకాని భగవంతునిగుఱించినవి కానేరవు. మఱియు ద్వంద్వము ఇచ్ఛాద్వేషములవలన ఉత్పత్తి యగుననఁగా ఇచ్ఛాద్వేషములకు విషయముగా స్ఫురించుననియేకాని దానివలనఁ బుట్టునని భావముకాదు. కాన దోషములేదు. ఇట మోహమనఁగా కరణవ్యుత్పత్తిచే మోహింపఁజేయునదని యర్థము. ద్వంద్వమోహము-(అనగా ద్వంద్వమనెడి మోహకారణమైనది) సమ్మోహమును బుట్టించును. ద్వంద్వము మోహకారణమైనది గావున సమ్మోహమును బుట్టించుచున్నదని భావము. కాన నిందును దోషములేదు. సమ్మోహమనఁగా ఒక్కటిగాఁజేసి భ్రమించుట. అభోగ్యమును భోగ్యముగాను, అద్వేష్యమును ద్వేష్యముగాను దలఁచి భ్రమించుట. అట్టి సమ్మోహమువలననే సమస్తప్రాణులు అభోగ్యములును ద్వేష్యములునగు ద్వంద్వముల లాభాలాభములయందే యిచ్ఛాద్వేషములు కలిగియున్నారు గాని భోగ్యుఁడును అద్వేష్యుఁడునగు భగవంతుని సంశ్లేషవియోగములందు ఇచ్ఛాద్వేషములు లేకున్నారని తెలియునది. ఇట్లు సమస్తప్రాణులకును జన్మకాలమందే పూర్వవాసనవలన నిచ్ఛాద్వేషములు ద్వంద్వములనుగూర్చియే కలుగును గాని భగవంతునిగూర్చి కలుగవు గాన భగవంతుని (సంశ్లేషవియోగములను) గుఱించియే యిచ్ఛాద్వేషములు పడుచుండునట్టిజ్ఞాని మిక్కిలియు దుర్లభుఁడని సిద్ధించుచున్నది.

ములు అలవాటుపడెనో, అద్దాని వాసనవలన మరల జన్మించునపుడే ద్వంద్వమనఁబడు నయ్యదియే యిచ్ఛాద్వేషములకు విషయమ్మై పుట్టి ప్రాణుల నెల్ల మోహింపఁజేయునది యగుచున్నది. ఇట్లు మోహింపఁ జేయునట్టి యద్దానిచేత సమస్త ప్రాణులును సమ్మోహమును బొందుచున్నవి- అనఁగా, ఆ ద్వంద్వమును గుఱించి యిచ్ఛాద్వేషములు పడుస్వభావముగలవియగును. కాని నాతోడి సంశ్లేషవియోగములవలన సుఖదుఃఖములుపడుస్వభావము గలవి కానేరవు. జ్ఞానియో నాతోడి సంశ్లేషవియోగములను బట్టియే సుఖదుఃఖములు పడునట్టి స్వభావము గలిగియుండును గాని తక్కిన వానినిబట్టి సుఖదుఃఖములను పడఁడు. ఇట్టిస్వభావము గల ప్రాణి యేదియుఁ బుట్టినదికాదు- అని చెప్పఁబడిన దగుచున్నది.

అవ. సర్వభూతములును సమ్మోహమును బొందునేని ని న్నుపాసించువాఁ డొక్కఁడును ఒకప్పుడును కలుగఁడుగదా. ఇట్లుండఁగా 'చతుర్విధా భజన్తే మామ్' అని నిన్నుపాసించువారు నాలుగు తెగలవా రున్నారని చెప్పితివే, ఇదియెట్లు? అని యడుగఁగా, దానికిఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః॥ 28

టీ. పుణ్యకర్మణాం=సుకృతకర్మములు గల; యేషాం జనానాం=ఏజనులయొక్క, పాపంతు = పాపమయితే, అన్తగతం=క్షీణతను బొందినదో, తే=వారు- ఐశ్వర్య కైవల్య మోక్షార్థులు అనుట, ద్వన్ద్వమోహనిర్ముక్తాః = సుఖదుఃఖాదిద్వంద్వరూపమగు అజ్ఞానము నుండి విడివడినవారును, దృఢవ్రతాః = దృఢసంకల్పముగలవారునై, మాం=నన్ను-నన్నే, భజన్తే=సేవించుచున్నారు.

తా. ఎవరికి, *గుణమయము లైన ద్వంద్వములను గుఱించిన యిచ్ఛాద్వేషములకు హేతువైనదియు, నాయెడల నాసక్తికలుగుటకు విరోధియైనదియు, అనాదికాలమునుండి ప్రవర్తించుచున్నట్టిదియు నగు పాపము, అనేకజన్మములయం దార్జించిన యుత్కృష్ట పుణ్యసంచయముచేత క్షీణించినదగునో, వారు (ఐశ్వర్యార్థులు కైవల్యార్థులు మోక్షార్థులు) వెనుక చెప్పబడినట్లు పుణ్యతారతమ్యముచేత నన్ను శరణుఁజొచ్చి గుణమయము లగుద్వంద్వము లనెడి మోహమునుండి విడివడినవారై, జరామరణవిముక్తిరూపమైన కైవల్యముకొఱకును, మహైశ్వర్యము కొఱకును, మత్ప్రాప్తిరూపమైన మోక్షము కొఱకును దృఢసంకల్పము గలవారై (యితరదేవతా భజనాదులు లేక) నన్నే భజింతురు.

అవ. భగవంతుని భజించునట్టి యైశ్వర్యార్థులు మొదలైన ముువ్వురకును జ్ఞాతవ్యము లైనవానిని (అనఁగా తెలిసికొనవలసిన విశే

---

* గుణమయములైన ద్వంద్వములు అనుటచే భగవత్సంశ్లేషవియోగము లనెడి సుఖదుఃఖరూపమగుద్వంద్వము గాదని తెలియునది 'ద్వన్ద్వమోహవినిర్ముక్తాః' 'మాంభజన్తే' అని ద్వంద్వమోహము వీడుటయు తన్ను భజించుటయునని ఫలములు రెండుగాఁ జెప్పుటచే వానికి ప్రతిబంధకమైన పాపమును 'ద్వంద్వములనుగుఱించిన యిచ్ఛాద్వేషములకు హేతువైనదియు' 'నావలని యాసక్తికి విరోధి యైనదియు' నని రెండుగా చెప్పఁబడినది. ఇట 'పుణ్యకర్మణామ్' అనుటయె పాపనివృత్తికి హేతువు, పాపము అనాదికాలప్రవృత్త మగుటచే అట్టిదానిని క్షీణింపఁజేయునట్టి పుణ్యము అనేకజన్మార్జితమైనదిగాను ఉత్కృష్టమైనదిగాను జెప్పఁబడెను. అనఁగా భగవద్జ్ఞానమునకు ప్రతిబంధకమైనట్టి పాపమును నివర్తింపఁజేయునట్టి పుణ్యము ఉత్కృష్ట మగుననియు, అనేకజన్మార్జితపుణ్యసంచయముచేతనే నాశమునొందగూడునట్టి పాపము అనాదికాలప్రవృత్త మగుననియు ఫలితము. 'భజన్తే' అను వర్తమాన వ్యపదేశముచే భగవదుపాసనము నారంభించుచున్నారని తెలియుచున్నదిగాన ఆ యారంభమునందే పాపముగాని ద్వంద్వమోహముగాని నిశ్శేషముగా నశింపనేరదు. కొంతయైనను మిగిలియే యుండును. కాఁబట్టి 'అంత' శబ్దమునకు నాశము అని చెప్పక క్షీణత్వము చెప్పఁబడినదని యూహ్యము.

షములను), వారికి ఉపాదేయములైనవానిని, ఇట రెండుశ్లోకములచే ప్రస్తావించుచున్నాఁడు.

శ్లో॥ జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతన్తి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్॥ 29

టీ. జరామరణమోక్షాయ = ప్రకృతిసంబంధము సవాసనముగా నివర్తించిన శుద్ధాత్మస్వరూపదర్శనముకొఱకు, మాం = నన్ను, ఆశ్రిత్య=ఆశ్రయించి, యే = ఎవరు, యతన్తి = ఆరాధనరూపమగుయత్నము చేయుదురో, తే = వారు, తత్ బ్రహ్మ = తద్బ్రహ్మమును, కృత్స్నం = సంపూర్ణమయిన, అధ్యాత్మం = అధ్యాత్మమును, అఖిలం=సమస్తమయిన, కర్మచ = కర్మమును, విదుః=ఎఱుఁగుదురు- ఎఱుఁగవలయుననుట.

తా. *ఎవ్వరు న న్నాశ్రయించి ప్రకృతివియుక్తమైన శుద్ధాత్మస్వరూపదర్శనమునకై (అనఁగా కైవల్యమునకై) ప్రయత్నము సేయుదురో, అట్టివారలు తద్బ్రహ్మమును సంపూర్ణమైన అధ్యాత్మమును సకలకర్మములను నెఱుగవలయును. అనఁగా నీమూఁటిని కేవలాత్మానుభవకాములకు అవశ్యము నెఱుఁగఁదగినదని భావము.

అవ. ఇట్లు ఆత్మప్రాప్తికామునియొక్క జ్ఞాతవ్యాంశమును జెప్పి ఇఁక ఐశ్వర్యార్థి తెలిసికొనవలసిన విశేషములను ముగ్గురికిని ఉపాదేయమైనదానిని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః॥ 30

---

* విదు కైవల్యార్థులని తెలియునది. 'విదుః' అనువర్తమానము విధియందు ప్రయుక్తమైనదిగాన 'ఎఱుఁగవలయును' అని యర్థము గ్రహించునది.

టీ. యే = ఎవరు-ఐశ్వర్యార్థులు, మాం = నన్ను, సాధిభూతాధిదైవం = అధిభూతముతోను అధిదైవముతోను గూడినవానినిగాను, సాధియజ్ఞంచ = అధియజ్ఞునితోఁ గూడినవానినిగాను, విదుః = తెలియుదురో, తేచ = ఐశ్వర్యార్థులును, ప్రయాణకాలే అపి = మరణకాలమందుఁ గూడ, యుక్తచేతసః = నాయందాసక్తమైన మనస్సుగలవారై - మాం = నన్ను, విదుః = ఎఱుఁగవలయును.

తా. †ఇట 'యే' అని మరల నిర్దేశించుటవలన పూర్వము నిర్దేశింపఁబడినవారికంటె (అనగాఁ కైవల్యార్థులకంటె) ఇతరులైన యధికారులు (అనఁగా ఐశ్వర్యార్థులు) నిర్దేశింపఁబడిరని తెలియుచున్నది. నన్ను సాధిభూతముగాను సాధిదైవముగాను ఎవరెఱుఁగుదురో-అనునిది యనువాదమువలె నున్నను అర్థము అప్రాప్తమగుటచే విధాయకమే (విధియె) యగును.-అట్లె సాధియజ్ఞునిగాను ఎవ రెఱుఁగుదురో-అనుట (సర్వాధికారులకు సాధారణమైనదిగా ప్రమాణసిద్ధమై యుండు యజ్ఞమనెడు) పదార్థముయొక్క- స్వాభావ్యమువలన ముగ్గు

† ఈశ్లోకము పూర్వోక్తులైన కైవల్యార్థులనే గుఱించినదేని 'సాధియజ్ఞంచ తే విదుః' అని కదా యుండవలయును. 'యేవిదుః' అనుటంబట్టి యది వేఱుఅధికారులను- (అనగా అధిభూతాదులంబట్టి యైశ్వర్యార్థులను) గుఱించినవిగాఁ జెప్పబడినది. మఱియు 'జరామరణ మోక్షాయ యతన్తియే' అన్నట్లు 'సాధిభూతాధిదైవంమాం యేవిదుః' అని యిందును యచ్ఛబ్దముమబట్టి అనువాదమని తోఁచినను అర్థము ప్రాసంగనందున విధియే కావలయును. ఇది విధియగుట ప్రశ్నాదులంబట్టి ఫలించెడిని. తెలిసిన విషయమందు ప్రశ్నాదులకు వీలుతేదుగదా. ఇది తెలియనివిషయ మగుటంజేసియే ప్రశ్నాదులకు పాత్రమైయె విధి యని యేర్పడుచున్నది, కాన తెలిసినవిషయమందు వర్తించు అనువాదము కాదయ్యెనని తెలియునది- మఱియు సాధియజ్ఞమనుట ఐశ్వర్యార్థియొకనికే చెప్పఁబడినను యజ్ఞపదార్థము మువ్వురకును సాధారణ మగుటచే ముగ్గురధికారులకు విహితముగా గ్రహింపఁబడెను. 'తేచ' అని చకారమువలన పూర్వోక్తులైన కైవల్యార్థులును, అధియజ్ఞ శబ్దముచేతను 'యుక్తచేతసః' అనుటచే నిర్దిష్టమైన అంత్యప్రత్యయముచేతను జ్ఞానులును, ప్రయాణకాలమందు స్వప్రాప్యానుగుణముగా భగవంతునిఁ బొందుదురనుట ఫలించినది.

రధికారులకును సమముగా విధింపఁబడుచున్నది. ఏలన, ముప్వురికిని నిత్యనైమిత్తికరూపము లయిన మహాయజ్ఞాదుల ననుష్ఠించుట అవర్జనీయముగదా- వారును (ఆమైశ్వర్యార్థులును) ప్రయాణకాలమందును తమ ప్రాప్యముల కనుగుణముగా (అనగాఁ తమ తమ ప్రాప్యములకు ననుగుణమైన యంతిమప్రత్యయపు నాకారముతో నున్న) నన్ను నెఱుఁగుదురు. 'తేచ' వారును అని చకారమువలన పూర్వోక్తులగు జరామరణమోక్షమునకై యత్నించువారును (అనఁగా కైవల్యార్థులును) ప్రయాణకాలమందు నన్నెఱుఁగుదురని చెప్పఁబడినవారగుచున్నారు. దీనిచే, జ్ఞానులుగూడ (వారలప్రసక్తి యిట లేకున్నను, యజ్ఞము అంతిమప్రత్యయము అనెడి రెండుపదార్థములును ముగ్గురధికారులకును సాధారణమగుటంబట్టి యా) పదార్థస్వాభావ్యము వలన ప్రయాణకాలమందును తమ ప్రాప్యమున కనుగుణముగా నన్నెఱుంగుదు రని చెప్పఁబడిన దగుచున్నది.

25 ఇతి భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విజ్ఞానయోగోనామ
సప్తమోఽధ్యాయః



# సప్తమోఽధ్యాయః

## విజ్ఞానయోగము - అవతారిక

(1) ఈ గ్రంథముచే-

శ్లో॥ పరత్వా నిరవద్యత్వాత్ ।
పితృత్వా ద్ధితవేదనాత్ ।
అన్తరాత్మ తయా దోష-
ప్రతిక్షేప క్షమత్వతః ।
భోగలీలార్థ నిస్సీమ-
విభూతి ద్వయ యోగతః ।
శ్రీమత్త్వా దప్యుపాస్యోఽయం ।
ప్రాప్యో నారాయణః పరః॥

అను శ్లోకమున చెప్పబడిన నారాయణునకు పరత్వ-ఉపాస్యత్వ- ప్రాప్యత్వములకు కారణము లొక్కొక్క హేతుగర్భవిశేషణములచే సూచింపబడుటను గమనించవలెను.

(2) ఏ సర్వేశ్వరునివలన ప్రాణులన్నియును ప్రవర్తించుచున్నవో, ఎవనిచే నీ జగత్తంతయును వ్యాపింపబడియున్నదో అట్టి యంతర్యామి స్వరూపుని మానవుడు తన వర్ణాశ్రమవిహితకర్మలతో నారాధించిన భగవంతుని బడయగలుగుచున్నాడు.

(3) అహంకారాదులను పూర్తిగ విడిచి మమకారరహితుడై ఆత్మానుభవముచే నానందించు పురుషుడు పరిశుద్ధాత్మానుభవమునకు తగినవాడగును.

పరిశుద్ధాత్మస్వరూపమును పొందినవాడు కర్మనిర్ముక్తస్వరూపుడై దేనినిగురించియును దుఃఖించడు. దేనిని కోరడు. సమస్త ప్రాణులయందును సమభావము కలవాడై నాయందు పరభక్తికలవాడగు చున్నాడు.

### 2వ శ్లోకము

ఇచ్చట-

జ్ఞాన మనగా — సామాన్యముగా భగవంతు నెఱుంగుట.

విజ్ఞాన మనగా — భగవంతుడు చేతనాచేతనములకన్న విలక్షణమైనవాడని సప్రమాణముగా నెఱుంగుట.

### 6వ శ్లోకము

మహత్తత్వ మవ్యక్తమునందును, అవ్యక్త మక్షరమందును, అక్షరము తమస్సునందును లీనమగుచున్నది. (తమస్సు అనగా మూలప్రకృతి.) అది పరదేవతయం దైక్యమును పొందుచున్నది. అనగా- నీటిలో నీరువలె విడదీసి తెలుసుకొనుటకు శక్యముగానట్లు కలసిపోవును.

మహత్తత్వ మనగా — త్రిగుణములును విషమావస్థను చెందిన ప్రకృతియొక్క మొదటివికారము.

అవ్యక్త మనగా — త్రిగుణములును సామ్యావస్థను పొందిన మొదటి మూలప్రకృతి స్వరూపము.

అక్షరమనగా — చేతన సమష్టిగర్భమై గుణసామ్యావస్థను పొందిన రెండవ మూలప్రకృతి స్వరూపము.

తమస్సు అనగా — చిద్గర్భమై అచిత్స్వరూపమై యుండుట కూడ వివక్తముగా తెలుసుకొన శక్యముగాని మూలప్రకృతియొక్క చివరస్వరూపము-

విష్ణువుయొక్క స్వరూపమునుండి పిమ్మట పుట్టిన ప్రకృతియును, జీవుడును అను రెండు రూపములు.

వ్యక్తస్వరూపమును కలిగియున్నట్టియు, అవ్యక్తస్వరూపమును కలిగియున్నట్టియు, ప్రకృతియును పురుషుడును అను నీ రెండును పరమాత్మయందు లీనమగుచున్నవి. సర్వనియంతయగు నా

సర్వేశ్వరుడే అన్నిటికిని ఆధారభూతుడు. ఆయన పేరు మహావిష్ణువు. వేదముల యందును, వేదాంతములయందును ఈ విషయము తెలుపబడుచున్నది.

7వ శ్లోకము

ఈశ్లోకమున మాణిక్యహారమును దృష్టాంతముగా జూపుటచే మన యొక విలక్షణమైన పాఠమును నేర్చుకొనవచ్చును.

మాణిక్యహార మనగా — తెల్లనివజ్రములు, నల్లని యింద్రనీల మణులు; యెఱ్ఱని కెంపులతో గ్రుచ్చబడిన హారమని గ్రహించవలెను.

దీనిచే సత్వరజస్తమోమయమగు ప్రకృతి సూచింపబడుచున్నది.

దారము మణులకు లోపలనే పైకి కన్పించకుండగనే వ్యాపించియుండును. దీనిచే నారాయణుడు "యః పృథివ్యాం తిష్ఠన్...యం పృథివీ నవేద" యని చెప్పినట్లు అన్నిటికిని లోపలనే ఎవ్వరికిని గోచరింపకయే వ్యాపించి యుండును.

ఆధారములేని మణియొక్కటియు నా హారమున లేనటులనే ఆ నారాయణుం డంతర్యామిగా నుండని పదార్థమొక్కటియును సంసారమున లేదు.

"న తదస్తి వినా యత్స్యాత్ మయాభూతం చరాచరమ్"

ఆ దార మన్నిమణులకు నొక్కటియే యైనటులనే ఆ నారాయణు డొక్కడే సమస్త పదార్థములకును ఆధారమై యున్నాడు.

"మత్తః పరతరం నాన్యత్ కిఞ్చిదస్తి పరాయణమ్"

ఆ మణుల కాధార మా దారమేగాని ఆచారమున కా మణు లాధారము కానటులే - సమస్తపదార్థములకును నారాయణు డొకడే ఆధారభూతుడుగాని ఆయున కాపదార్థము లాధారము కానేరవు.

"మత్థ్సాని సర్వభూతాని న చహం తేష్వవస్థితః"

ఆదార మాధారముగా లేనిచో ఆ మణులొక క్రమబద్ధముగా నిలవలేనటులనే ఆ నారాయణు డంతరాత్మగా నాధారభూతుడై యుండనిచో ప్రపంచ మంతయు నొక క్రమబద్ధముగా నడవజాలదు.

(భీషాస్మాద్వాతః పవతే, భీషో దేతి సూర్యః...)

(మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే న చరాచరం॥)

దారము లేనిచో హారమే లేనట్లు నారాయణుడు లేనిచో ప్రపంచమే యుండదు.

"అసన్నేవ న భవతి అసద్బ్రహ్మేతి వేదచేత్"

ఇత్యాదు లెన్నియో నీ యుదాహరణముచే నూహించుకొనవచ్చును.

17వ శ్లోకము

ఇట్లు భక్తులలో తారతమ్యము చెప్పబడినది.

భక్తుని యతిశయము నిక చెప్పుచున్నాడు.

శ్లో॥ చతుర్విధా మమ జనాః, భక్తా ఏవ హి తే శ్రుతాః।
తేషా మేకాన్తి శ్శ్రేష్ఠాః, తే చైవా నన్యదేవతాః।
అహ మేవ గతి స్తేషాం, నిరాశీః కర్మకారిణామ్।
యే తు శిష్టా స్త్రయో భక్తాః, ఫలకామా హి తే మతాః।
సర్వే చ్యవన ధర్మాణః, ప్రతిబుద్ధస్తు మోక్షభాక్॥

నాభక్తులు నాలుగువిధములుగ నుందురు. వారిలో దేవతాన్తరములను విడిచి నన్నే భజించువారు గొప్పవారు. వారికి నేనే ప్రాప్యుడను. వారి కితరకోర్కె లుండవు. మిగిలిన ముగ్గురు భక్తులును నానుండి ఐహిక ఆముష్మిక ఫలములను మాత్రమే కోరుదురు. వారి కాఫలములు వారు గావించు కర్మలవలెనే నశ్వరములు. కాని నాల్గవవాడు మోక్షము నొక్కదానినే ఫలముగ నాశించు బుద్ధిశాలి. ఆతనినే ప్రతిబుద్ధు డందురు.

(11) ఆతని కుపాయమగు భగవంతుడే ఫలము గాన యోగము ఫలదశలోకూడ ననువర్తించును.

(12) ప్రహ్లాదుడు మహావిషసర్పములచే కరవబడుచున్నను ఆతని మనస్సు పరమాత్మయందే లగ్నమైయుండుటచే నాతనిని తలంచు చుండుటచే కలిగిన మహదానందమున మునిగియుండి తన శరీర స్మృతియే లేక యుండెను.

ఇచ్చట కృష్ణశబ్దమునకు వాసుదేవుడని యర్థము కాదు.

"కృషి ర్భూవాచక శ్శబ్దో ణశ్చనిర్వృతివాచకః"

అను వ్యుత్పత్తిచే నిరతిశయ సుఖరూపమైన మోక్షైక కారణభూతు డగు నారాయణుడని యర్థము. లేక కల్పభేదముచే కృష్ణావతారము లకును భేదముండుటచే ప్రవాహరూపేణ యనాదియగు కృష్ణావతార మున గావించిన కాళియమర్దన మిచట సూచింపబడినది.

లేక- కర్షణాత్ కృష్ణః- భక్తుల దుఃఖములను పోగొట్టు శ్రీహరియే యిచ్చట కృష్ణు డనబడును. తీవ్రమగు దుఃఖానుభవము నకు కారణమైన ఘోర సర్పదంశనమున్నను దుఃఖమే వేదనగా భగవంతునియం దాతనికి గల నిరతిశయప్రీతిచే జనించిన మైమరపే కావలెను. అప్పు డాతనికి ఆత్మజ్ఞానమే లేదే యిక గృహాదులవంటి శరీరజ్ఞానమా యుండునది ?

18 వ శ్లోకము

(13) శ్రుతిస్మృతులలో నారాయణుడు సమస్త చేతనాచేతనము లకును సర్వదా ఆత్మభూతు డనియే వినుచున్నాము గాని యాతని కొక యాత్మ యున్న ట్లెచ్చటను వినలేదే యనగా-

"అయ మర్థ స్త్రయ్యన్త సిద్ధాన్తో భవతువా
మావా కృష్ణసిద్ధాన్త స్త్వయ మితి భావః"

ఈ యర్థ ముపనిషత్తులలో నుండుగాక లేకుండుగాక. ఇది శ్రీకృష్ణ సిద్ధాంతమని యెఱుంగుమని భగవదభిప్రాయమని 'మే మతం' అను టచే సూచింపబడుచున్నది. ఆహా! ఏమి యీ స్వాతంత్ర్య పరాకాష్ఠ.

ఇట్లు జ్ఞానిని తన కాత్మగా పేర్కొనుటచే 'యదా యదాహి' యను శ్లోకమున 'తదాత్మానం సృజామ్యహం' మ్మనుటచే జ్ఞానిని సృష్టింతు నని యొక నిర్వాహము కలదు. అట్లు సృజింపబడినవారే సూరులు (ఆళ్వారాదులు).

19 వ శ్లోకము

(14) ఈ వాక్యమును ఆళ్వారులు
ఉణ్ణుం శోఱుం పరుకు నీరుం
తిన్నుం వెత్తిలైయుం ఎల్లాం కణ్ణన్॥

అనగా- నాకు ధారక పోషక భోగ్యములగు అన్నము, నీరు, తాంబూలాదులు సర్వమును శ్రీమన్నారాయణుడే, యను పాశురముచేనుపబృంహణ మొనరించిరి. ఏకవచన ప్రయోగముచే నట్టివాడొక్కడైనను లభించరాదా? లభించనే లభించడే యని భగవానుడు తన యార్తిని వెలిబుచ్చుచున్నాడు.

(15) "నామనోరథమునం దేది కలదో" యన్నచోట
"త్వమేవ మాతాచ పితా త్వమేవ",
"పితాత్వం మాతాత్వం",
మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృత్। గతిర్నారాయణః" అను శ్లోకములను అనుసంధించవలెను.

20 వ శ్లోకము

(16) ఆయాఫలములకొఱకైనను ప్రాజ్ఞులు శ్రియఃపతికే శరణాగతు లగుచున్నారు. ప్రాజ్ఞ లనగా- 'ఫల మత ఉపపత్తేః' అను సూత్రార్థము నెఱింగినవారు. అనగా- ఆయా ఫలముల నొసంగువాడా శ్రియః పతియే గాని యచేతనమగు కర్మగాని కర్మవశ్యులై సృష్ట్యాది వ్యాపారములను చేయుచున్న బ్రహ్మరుద్రేంద్రాదులు గాని కానేరరు. శ్రియఃపతి యన్ననో సర్వజ్ఞుడు, సర్వశక్తి, మహోదారుడు కావున మన మాచరించు తన యాజ్ఞాస్వరూపములైన శ్రుతిస్మృతులలో జెప్పబడు యాగ దాన హోమములచేతను ఉపాసన

చేతను ఆరాధింపబడి ఐహికాముష్మిక భోగజాతమును స్వస్వరూప ప్రాప్తి యను నపవర్గమును, ప్రసాదించు ననుజ్ఞానము కలవారు. అట్లుగాక నచేతనములగు కర్మలను అవరులగు బ్రహ్మాదులను గొలుచువారు గంగయొడ్డున నూతిని త్రవ్వు మూర్ఖులకన్నలో తమ్ము లో అగుదురు.

ఇచ్చట నర్చన యనగా తప్పక ఫలము నివ్వగలరను మహా విశ్వాసముతో తనకు కావలసిన ఫలము నిమ్మని ప్రార్థించుచు ఆ దేవ తల కిష్టమైన కర్మలను గావించుచు వారిని ప్రసన్నులుగా చేసికొనుట.

## 21 వ శ్లోకము

(17) (A) ఇచ్చట "తను" శబ్దము ప్రయోగింపబడుటలోని రహస్యమును గుర్తించవలెను.

ఇది దేవతాంతరములను తెలుపు పదము.

దీనిచే ఇతర దేవత లందరును పరమాత్మ శరీరభూతులే యని తాత్పర్యము.

శరీర మనగా- ఆధేయము, విధేయము, శేషభూతమని గదా యర్థము.

దీనిచే పరమాత్మ సర్వశరీరి యని నిర్ధారణ మగుచున్నది.

(17) (B) నిర్విఘ్న మనగా-

పుట్టిన శ్రద్ధ చలింపకుండుట అనగా- ఆటంకములు లేకుండు టచే ఫలము సిద్ధించువరకును విడువకుండ సాగించుట.

## 22 వ శ్లోకము

(18) ఈశ్లోకమున 'హి' అనునది యవ్యయము. దానిని 'హితాన్' అని యన్వయించరాదు. ఆ కామ్యఫలములు ముముక్షువునకు హిత ములు కావు, 'అన్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసా' మ్మని నిందింపబడినవి. 'తయా' యని శ్రద్ధకు తచ్ఛబ్దము విశేష ణముగా నున్నది. 'తస్యారాధన' మని యా దేవతలకు తచ్ఛబ్ద విశే షణము కలదు. తిరిగి 'తతః' యని యా దేవతలకే తచ్ఛబ్దోత్తర

'తసిల్' ప్రత్యయాంత విశేషణము కలదు. కాబట్టి "కామాన్" అను పదమునకును తచ్ఛబ్దము విశేషణముగా నుండుట సరసము. మరియు 'తాన్ కామాన్' అనుటచే 'సకలఫలప్రదోహి విష్ణుః' 'చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవ శ్చతుర్భుజః' అను సర్వేశ్వరుని సకలఫలముల నొసంగు సామర్థ్యమున్ను సూచింపబడును.

23 వ శ్లోకము

(19) అల్పమేధసాం- అనగా

అల్పేషు (ఇంద్రాదిషు) మేధా = బుద్ధిః యేషాం తే- అనగా పరమాత్మకంటె తక్కువ అధికారము గల నింద్రాదులయందు ఫలదాత లనెడు అధ్యవసాయము కలవారు.

లేక- అల్పేషు=(ఇంద్రాదు లిచ్చు) నశ్వర ఫలములయందే- మేధా=బుద్ధిః, యేషాంతే. ఇంద్రాదు లిచ్చు అల్పాస్థిరఫలముల యందే ఇంతకు మించినవి లేవని నమ్మకము కలవారు.

లేక- అల్పా మేధా యేషాంతే.

అల్పులగు దేవతలయందును, అల్పములగువా రిచ్చు ఫలముల యందును మాత్రమే బుద్ధికలవారు అల్పబుద్ధులే గాన ఫలమునకును అల్పత్వమే సిద్ధించును:

(20) దేవతలను పొందుట యనగా- వారి సాయుజ్యమును, వారితో సమానములగు భోగముల ననుభవించుట యని యర్థము.

24 వ శ్లోకము

(21) అబుద్ధయః- అనగా-

పరమాత్మయొక్కయు ఆతని యవతారముల యొక్కయు శ్రవణముగాని మననముగాని నిదిధ్యాసనముగాని లేకపోవుటచేతను, ఆతని వైలక్షణ్యమును తెలియజేయు చిహ్నలు గాన్పించుచున్నను వానిని బట్టి యాతని వైలక్షణ్యమును నూహించు శక్తి లేకపోవుట చేతను వారిని అబుద్ధు లనెను.

27వ శ్లోకము

(22) అవతారికలో-

"బహూనాం జన్మనామన్తే" యను శ్లోకమున జ్ఞాని దుర్లభుడని చెప్పెను మూడుకాలములయందుండు సమస్తభూతములకును ఆ జ్ఞానము లేకుండుటకు సాధారణమైన కారణ మొక్కటియే యని దాని నీశ్లోకమున జెప్పుచున్నాడు.

(23) ఇచ్చట జ్ఞాని యనగా-

జ్ఞానీతు పరమైకాన్తీ, తదాయత్తాత్మ జీవనః।
తత్సంశ్లేష వియోగైక సుఖదుఃఖ స్తదేక ధీః॥

పరమాత్మ కధీనమైన జీవనము కలవాడై ఆతనితో కలసి యున్న ఆనందమును, ఆతని నెడబాసిన దుఃఖమును అనుభవించుచు, నిరంతర మా భగవంతుని తప్ప మరియొక దానిని చింతింపక యుండు జ్ఞాని పరమైకాంతి యనబడును.

ఇచ్చట భగవంతునితో సంశ్లేష విశ్లేషలు మానసికములని యెఱుంగవలెను.

ఈ యనుభవము తిరువాయ్మొళిలోని ఆళ్వారుల యనుభవములో గాననగును.

28వ శ్లోకము

(24) "మాం భజన్తే"- యనుచో శ్రీ భాష్యకారులు ఏవకారమును చేర్చి "మామేవ భజన్తే" అని వ్యాఖ్యానించిరి. దీనిచే అన్యయోగము నిరసించబడును.

దీనిచే నీశ్లోకమున దేవతాంతర భజనము పాపఫలమనియు అది నిశ్శేషముగా పోయినవారు నన్నే భజింతురుగాని ఇతర దేవతల దరి జేరరనియు ప్రమాణానుసారముగ తెలుపబడెను.

7వ అధ్యాయం-చివర.

(25) 7వ అధ్యాయమున "చతుర్విధా భజన్తే" అను శ్లోకముచే అధికారులు- ఐశ్వర్యార్థులు- కైవల్యార్థులు- మోక్షార్థులని ముఖ్యముగా మూడువిధములుగా చెప్పబడిరి. ఆర్తులు- అర్థార్థులును.

ఒకరు పోయిన ఐశ్వర్యమును తిరిగి బడయగోరి పరమాత్మ నుపాసించువారు. అర్థార్థులు నూతనైశ్వర్యమును గోరి పరమాత్మ నుపాసించువా రగుటచే వీరిద్దరును ఐశ్వర్యమునే పురుషార్థముగా నపేక్షించువా రగుటచే వీరిని ఒక కోటిలో చేర్చుటచే అధికారులు మూడువిధములైరి.

కైవల్యార్థులు — శుద్ధాత్మానుభవకాము లనియును,

మోక్షార్థులు—భగవదనుభవకాము లనియును భేదము నెఱుంగ వలెను.

వీరిలో ఐశ్వర్యార్థులు అధిభూతమును అధిదైవమును నెఱుంగ వలెననియును,

కైవల్యార్థులు—తద్బ్రహ్మ- అధ్యాత్మం- కర్మ- అను మూడింటి నెఱుంగవలె ననియు,

ముగ్గురును అధియజ్ఞము నెఱింగి- అంతిమ స్మృతిని కలిగి యుండవలెననియు నిర్ణయింపబడినది.

7వ అధ్యాయం—చివర.

(26) గీతార్థ సంగ్రహము.

శ్లో॥ స్వయాథాత్మ్యం ప్రకృత్యాస్య।
తిరోధి శ్శరణాగతిః!
భక్తి భేదః ప్రబుద్ధస్య।
శ్రైష్ఠ్యం సప్తమ ఉచ్యతే॥

తాత్పర్యము.

ఉపాస్యభూతుడైన పరమపురుషునియొక్క సర్వశేషిత్వాది రూపమైన స్వరూపయాథాత్మ్యమును దేహేంద్రియాదిరూపమైన ప్రకృతిచే నది మఱుగుపడియుండుటయు, తన్నివృత్తికొఱకు భగవత్ప్రపత్తి సేయుటయు, ఐశ్వర్యార్థులు మొదలైన యుపాసకుల భేదమును అందరిలో జ్ఞాని మిక్కిలి యిష్టు డగుటచే శ్రేష్ఠు డనియు నీ సప్తమాధ్యాయమున చెప్పబడినవి.



# శ్రీ భగవద్గీతా - అష్టమోఽధ్యాయః

## అ క్ష ర ప ర బ్ర హ్మ యో గః

—//—

### అ వ తా రి క.

సప్తమాధ్యాయమునందు పరబ్రహ్మమైన వాసుదేవుఁడు ఉపాస్యుఁడగుననియు సమస్తచేతనాచేతనవస్తువులకు *శేషియు కారణమును ఆధారమును అగుననియు, సర్వమును శరీరముగాఁ గలవాఁడు గాన సర్వమును ప్రకారముగాఁ గలవాఁడగుటంబట్టి ప్రకారము లగు నట్టి సర్వముయొక్క శబ్దములచే ప్రకారియగునతఁడే చెప్పఁదగినవాఁడనియు, సర్వమునకు నియామకుఁడనియు, సమస్తకల్యాణగుణగణములచే నతఁడే మిక్కిలి యుత్కృష్టుఁడనియు, దేహేంద్రియములుగాను భోగ్యవస్తువులుగాను బరిణమించినదై యనాదికాలప్రవృత్తమైన పాపప్రవాహము మూలమై యొప్పు సత్త్వరజస్తమోమయపదార్థములచేత నతనిస్వరూపము మఱుఁగుపడుననియు, మిక్కిలి యుత్కృష్ట

---

* సప్తమాధ్యాయమున, 'మయ్యాసక్తమనాః' ఇత్యాదులచే పరబ్రహ్మభూతుఁడగు వాసుదేవుని యుపాసనము ప్రస్తావింపఁబడినది. అతని యుపాసనమునకు (అనఁగా అతఁడే ఉపాస్యుఁడనుటకు) శేషముగాఁ దక్కినదంతయు నాయధ్యాయమునఁ జెప్పఁబడినది. అనఁగా ఆయుపాసనమే 'అహం సర్వస్యప్రభవః' 'వాసుదేవస్సర్వమ్' 'చతుర్విధా భజన్తేమామ్' ఇత్యాదులచే ప్రపంచింపఁబడినదనుట. 'భూమిరాపః' ఇత్యాది శ్లోకద్వయముచే సమస్త...శేషిత్వమును, 'ఏతద్యోనీని' అనుటచే కారణత్వమును, 'మయి సర్వ మిదం ప్రోతమ్' ఇత్యాదులచే ఆధారత్వమును, 'రసోఽహమ్' ఇత్యాదులచే సర్వశబ్దవాచ్యత్వమును సర్వశరీరకత్వమును 'మత్త ఏవేతి తా న్విద్ధి' ఇత్యాదులచే సర్వనియంతృత్వమును, 'మత్తః పరతరం నాన్యత్కిఞ్చిదస్తి' 'మామేభ్యః పరమ్' ఇత్యాదులచే 'అతఁడే మిక్కిలి యుత్కృష్టుఁ' డనుటయు 'త్రిభిర్గుణమయైః' అను సగము శ్లోకముచే 'దేహేంద్రియములుగాను...మఱుఁగుపడు' ననుటయు, 'జనాస్సుకృతి నోఽర్జున' అనుటచే మిక్కిలి యుత్కృష్టమైన...నివర్తించు' ననుటయు,

మైన సుకృతమువలనఁ గలుగు భగవత్ప్రపత్తిచే నది నివర్తించు నరియు, పుణ్యతారతమ్యమువలనను ప్రతిపత్తివిశేషమువలనను ఉపాసకులు, ఐశ్వర్యము అక్షరయాథాత్మ్యము (అనఁగా కైవల్యము) భగవత్ప్రాప్తి, అని మూఁటి నపేక్షించుటచే ఐశ్వర్యార్థు లనియు కైవల్యార్థులనియు మోక్షార్థు లనియు మూఁడుభేదములు కలిగియుందు రనియు భగవంతునిమాత్రమే ప్రాపింపఁగోరు జ్ఞాని నిత్యయుక్తుఁడును తదేక భక్తుఁడును నై యుండుటచే పరమపురుషుని అత్యర్థప్రియునిగాఁ గొనియుండుటవలన మిక్కిలి శ్రేష్ఠుఁడగుననియు, అట్టివాఁడు మిగుల దుర్లభుఁడనియుఁ బ్రతిపాదించి యైశ్వర్యార్థులు మొదలైన యీ ముగ్గురధికారులకును గల జ్ఞాతవ్యములయొక్కయు ఉపాదేయముల యొక్కయు భేదములను గడపటి రెండుశ్లోకములందు బ్రస్తావించిరి. ఇట్లు ప్రస్తావించినట్టి జ్ఞాతవ్యోపాదేయముల భేదములను ఇప్పు డీ యష్టమాధ్యాయమునందు వివేచించుచున్నారు.

శ్లో॥ కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ।
అధిభూతంచ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే॥ 1

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేస్మి న్మధుసూదన[1]।
ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః॥ 2

టీ. హేపురుషోత్తమ = కృష్ణా, తద్బ్రహ్మ = తద్బ్రహ్మము, కిం = ఏది, అధ్యాత్మం = అధ్యాత్మము, కిం = ఎట్టిది, కర్మ = కర్మము,

---

'చతుర్విధాః' అనుటచే 'పుణ్య ..మూఁడుభేదములు కలిగియుంద' రనుటయు 'తేషాం జ్ఞానీ' 'బహూనాంజన్మనామ్' ఇత్యాదులచే 'భగవంతునిమాత్రమే...శ్రేష్ఠుఁడగు' ననుటయు ప్రతిపాదింపఁబడినవి. 'యేషాంత్వన్తగతం' ఇత్యాదియగు నధ్యాయశేషము చేత ముగ్గు రధికారులకును జ్ఞాతవ్యములును ఉపాదేయములును జెప్పఁబడుచున్నవి. జ్ఞాతవ్యము లిచట సిద్ధరూపములైన జీవస్వరూపాదు లనుట. ఉపాదేయము లనఁగా అనుష్ఠేయములగు ఉపాసనాదు లని తెలియునది.

కిం=ఎట్టిది, అధిభూతంచ=అధిభూతంబును, కిం=ఎట్టిది, ప్రోక్తం=చెప్పఁబడినది, అధిదైవం=అధిదైవము, కిం=ఎద్దిగా, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది, మధుసూదన=శ్రీకృష్ణా, అత్ర=శాస్త్రమునందు, అస్మిన్ దేహే=ఇంద్రాదిరూపమున నగపడుచున్న ఈదేహమునందు, అధియజ్ఞః=అధియజ్ఞుఁడు, కః=ఎవఁడు, కథం=(వానికి అధియజ్ఞభావము) ఏప్రకారము? నియతాత్మభిః=ముగ్గురధికారులచేతను, కథం=ఏప్రకారముగా, జ్ఞేయః=తెలియఁదగినవాఁడవు, అసి=అగుచున్నావు.

తా. పురుషోత్తమా! జరామరణములనుండి విముక్తి నొందుటకొఱకు భగవంతు నాశ్రయించి యత్నముసేయునట్టి *కైవల్యార్థులకు జ్ఞాతవ్యములుగాఁ జెప్పఁబడిన తద్బ్రహ్మమును అధ్యాత్మమును కర్మమును నేమని చెప్పవలయును? ఐశ్వర్యార్థులకు జ్ఞాతవ్యములైన అధిభూతమును అధిదైవమును నేవి? మధుసూదనా! ఇంద్రాదిదేవతారూపమైన యీ నీదేహమునందు (అనఁగా నీదేహభూతులైన యీ యింద్రాదిదేవతలందు) ముగ్గురధికారులకును జ్ఞాతవ్యుఁడును అధియజ్ఞశబ్దముచే నిర్దేశింపఁబడినవాఁడును నెవఁడు? వాని కధియజ్ఞభావ మెట్లు కలిగె? నియతచిత్తులగు నీముగ్గురధికారులచేతను నీ వేవిధమున మరణకాలమున నెఱుఁగఁదగినవాఁడవై యుందువు?

శ్లో॥ అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః॥ 3

* 'ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ' అని యధికారులు ముగ్గురనుట యర్జునునకు మునుపే తెలియును. 'జరామరణమోక్షాయ' ఇత్యాదులందు ఆ యధికారులకుఁ గలభేదమును వారివారి కిదియిది జ్ఞాతవ్యములును ఉపాదేయములు నగుననియు నతఁ డెఱిఁగి యున్నాఁడు. కావుననే 'కింతద్బ్రహ్మ...పురుషోత్తమ' అనుచు కైవల్యార్థివిషయముగాను 'అధియజ్ఞః' అనుశ్లోకము ముగ్గురధికారులవిషయముగాను నర్జునుఁడు వారి వారి జ్ఞాతవ్యాదులను దెలిసియే చెప్పినట్లు అర్థము సేయఁబడెను. తెలిసియు నిట్లు ప్రశ్నములు సేయుట యందలి విశేషములను తెలిసికొనుటకే యని తెలియునది.

టీ. బ్రహ్మ=తద్బ్రహ్మ మనునది, పరమం=ప్రకృతిసంబంధమును విడిచినట్టి, అక్షరం=ప్రత్యగాత్మస్వరూపము, స్వభావః = ప్రకృతి, అధ్యాత్మం=అధ్యాత్మమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. భూతభావోద్భవకరః- భూతభావ = మనుష్యత్వాదులతోఁ గూడిన శరీరసంబంధముయొక్క, ఉద్భవ = పుట్టుకను, కరః = చేయునట్టి, విసర్గః= రేతస్సును విడుచుట, కర్మసంజ్ఞితః=కర్మమను పేరుగలది.

తా. *తద్బ్రహ్మమని నిర్దేశింపఁబడినది పరమమైన యక్షరము. క్షరింపనిది అక్షరము. (అను వ్యుత్పత్తిచే) అక్షర మనఁగా క్షేత్రజ్ఞ

* ఇట బ్రహ్మశబ్దము పరమాత్మతోడిసాధర్మ్యమునుబట్టి జీవాత్మయం దుపచరించుచున్నది. 'అక్షరం' అనఁగా 'న క్షరతీ త్యక్షరం' అనునిర్వచనముచే 'క్షరింపనిది' యనుట. ఇదియే క్షేత్రజ్ఞసముదాయము. దేహరూపమైన ప్రకృతితో సంసర్గము గలిగియుండు ఆత్మయే క్షేత్రజ్ఞుఁ డనఁబడును. అక్షరశబ్దము క్షేత్రజ్ఞుఁ డనెడి యర్థమున వర్తించుననుటకు 'అవ్యక్తమక్షరే లీయతే...' అని శ్రుతిప్రమాణముగా నుదాహరింపఁబడెను. ఈశ్రుతియందు అక్షరమనఁగా ఆత్మాంశము మగ్నమైనప్రకృతియొక్క యవస్థావిశేషమునకే యర్థమైనను ఆయాత్మాంశమునుబట్టియే దాని కట్లు పేరు గలిగినదిగాన అక్షర మనఁగా అచిత్తున మగ్నమైన చిత్తునకు (అనగాఁ క్షేత్రజ్ఞునకు) నర్థము. అక్షరమనఁగా అచిత్సంసర్గము గలయాత్మ. 'పరమం అక్షరమ్' అనఁగా అచిత్సంసర్గము లేని (అనఁగా ప్రకృతిబంధమువీడిన) శుద్ధాత్మస్వరూపమని తెలియునది. 'అధ్యాత్మమ్' అనఁగా ఆత్మయందుండునది—ఆత్మను సంబంధించినదనుట. ఆత్మకానిదై ఆత్మను సంబంధించియుండునట్టి ప్రకృతియని యర్థము. ఇట ప్రకృతియనఁగా భూతసూక్ష్మములును వానితోడిసంసర్గమువలనఁ గలుగు అజ్ఞానకర్మవాసనాదులును గ్రాహ్యములు. ఈభూతసూక్ష్మాదులు జ్ఞాతవ్యము లనుటకు శ్రుతిప్రమాణమును 'పంచాగ్ని విద్యయందు' అని తెలిపెరి. 'వేత్థ యథా పఞ్చమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తి' (ఛాం-౫-3-3) అని యుపక్రమించి 'ఇతితు పఞ్చమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తి' (ఛాం-౫-౯-౧) అని చెప్పి 'తద్యఇత్థం విదుః' (ఛాం-౫-౧౧-౧). అనఁబడినది. ఇట 'అప్'శబ్దముచే భూతసూక్ష్మములు గ్రాహ్యములు. 'విదుః' అని యవి జ్ఞాతవ్యములుగా ప్రతిపాదింపబడినవని తెలియునది. అయినను ఉపాయానుష్ఠానమునకుఁ గర్తయగు నిప్పటియాత్మస్వరూపమే ముముక్షువున కావశ్యకమై యుండఁగా దానిని విడిచి పరిశుద్ధాత్మస్వరూపమును జెప్పుట ముముక్షువున కెట్లుపయుక్తము? భూతసూక్ష్మాదులు నతని కుపయుక్తముగాఁ జెప్పనేల? అని శంకరాఁగా 'ఆరెం

సముదాయరూపము. ఇట్లని (అనఁగా అక్షర మనఁగా క్షేత్రజ్ఞసముదాయమని) 'అవ్యక్త మక్షరే లీయతే అక్షరం తమసిలీయతే' (సుబా. ౨-౧) ఇత్యాదిశ్రుతులు ప్రతిపాదించెడిని. పరమమైన యక్షర మనఁగా ప్రకృతివినిర్ముక్తమైన యాత్మస్వరూపము. స్వభావము అధ్యాత్మ మనఁబడుచున్నది. స్వభావ మనఁగా ప్రకృతి- అనఁగా ఆత్మ కానిదై ఆత్మయందు సంబంధించుచున్న భూతసూక్ష్మములును వాని

2

వాసన మొదలైనవియు. ఇవి పంచాగ్నివిద్యయందు జ్ఞాతవ్యములుగా చెప్పఁబడియున్నవి. ఆరెంటను (అనఁగా ప్రకృతి వియుక్తాత్మస్వరూ

---

డును...తెలియదగినవి' అన్నారు. శుద్ధాత్మస్వరూపమును ప్రాప్యముగాను భూతసూక్ష్మాదులు త్యాజ్యములుగాను జ్ఞాతవ్యము లనుటచే దోషము కలుగదని తెలియునది. ఇట పంచమాహుతి వివక్షితము, 'పంచమ్యా మాహుతౌ వాపః పురుషవచసో భవంతి' జలములు (పంచభూతములు) ఐదవయాహుతియందు (స్త్రీయందనుట) పురుషుఁడు (దేహధారి) అను పేరు కలదగుచున్నవి. అనఁగా మనుష్యత్వాదులతోఁ గూడిన దేహములు స్త్రీగర్భమునందు కలుగుచున్నవి, అని చెప్పఁబడి యున్నది. ఆశ్రుతి ప్రకారముగా స్త్రీసంయోగమునందు మనుష్యాది భావములను కలిగించు రేతోవిసర్గమే ఇట విసర్గశబ్దముచే గ్రాహ్యము. అందు పంచాహుతులు చెప్పఁబడియున్నవి. ఆత్మ నాలుగాహుతులైనవెనుక పంచమాహుతియగు స్త్రీయందు వచ్చి శరీరియై పుట్టుచున్నాఁడనియు, జలములు తక్కిన భూతములతోఁ గూడి వానికి ఆశరీర మగుచున్నదనియు తెలియునది. కనుక భూతభావ మనఁగా యోనిజములగు భూతముల (అనఁగా మనుష్యాదుల) భావము. అనగాఁ మనుష్యత్వాదులతోఁ గూడినశరీరము తోడికూడిక యని భావము. ఇట్లు స్త్రీసంబంధజనితమగు కర్మమును ముముక్షువునకు జ్ఞాతవ్యముగాఁ జెప్పటచే ప్రయోజనమేమి ? యన్నచో 'అది సమస్తమును...పరిహరణీయము లైనవిగాను ముముక్షువులచే జ్ఞాతవ్యము' అనఁబడినది. 'సమస్త'మనఁగా మనుష్యత్వము మృగత్వము మొదలగు ననేకజాతులకు హేతువగుటచే అనేకప్రకార మైనదనుట. అందులకు హేతువులగు కర్మములును దానికి ఫలములగు గర్భవాసాదులును దానియనుబంధములుగాఁ దెలియునది. పంచాగ్నివిద్యయందు అచిత్తు సర్వావస్థలందును వెంటనంటినదై త్యజింపనలవిగానిదై గర్భజన్మాదులను గలిగించునదని చెప్పఁబడుటచే నది యేవగింపఁదగినదనియు భయము పుట్టించునదియు నగును గాన 'ఉద్వేజనీయ' మగుట యుక్తము. 'పరిహరణీయ' మని యెక్కడఁ జెప్పఁబడిన దని యడుగఁగా 'యదిచ్ఛన్తో...చెప్పఁబడెడిని' యని చెప్పబడినది.

పమగు పరమమైన యక్షరమును భూతసూక్ష్మతద్వాసనాదులగు స్వభావమును అనఁబడు నీరెండును) వరుసగా ముముక్షువునకు ప్రాప్య ముగాను త్యాజ్యముగాను తెలియఁదగినవి. మనుష్యత్వాదిభావము లను బుట్టించునదియై 'పఞ్చమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తి' అని శ్రుతిసిద్ధమై స్త్రీసంబంధజనితమగు రేతోవిసర్గము, కర్మ మను సంజ్ఞగలది. అది సమస్తమును దాని యనుబంధములును ఉద్వే జనీయములై నవిగాను పరిహరణీయములై నవిగాను ముముక్షువులచే జ్ఞాతవ్యమైనది. పరిహరణీయముగా జ్ఞాతవ్య మగుటయు 'యది చ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి' అని వెంటనే చెప్పఁబడెడిని.

శ్లో॥ అధిభూతం క్షరోభావః పురుష శ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర॥ 4

టీ. దేహభృతాం వర = దేహధారులలో శ్రేష్ఠుఁడైన ఓ యర్జునా, అధిభూతం = అధిభూత మనఁబడునది, క్షరః = నశ్వర మైన, భావః = స్వభావముగలపదార్థము. పురుషః = పురుషుఁడు, భోక్తా = భోక్తృత్వావస్థనుజెందిన జీవుఁడు, అధిదైవతం = ఇంద్రాది దేవతలకుమీఁదుగా వర్తించువాఁడు. అత్ర దేహే = నాకు దేహ భూతులైన యీ యింద్రాదులందు (ఉన్నట్టి), అహమేవ = నేనే, అధియజ్ఞః = యజ్ఞములచే నారాధింపఁదగినవాఁడను.

తా. * ఐశ్వర్యార్థులకు జ్ఞాతవ్యముగా (అనఁగా తెలియవల సినదిగా నిర్దేశింపఁబడిన అధిభూతము-(అనఁగా ఆకాశాదిభూతము

* ఇట అధిభూతమనఁగా భూతములందు (అనఁగా ఆకాశాదిభూతములందు) వర్తించుచున్నవాని పరిణామవిశేషము. 'క్షరోభావః' అనఁగా క్షరణమునొందు స్వభావము గలది. ఆకాశాదిభూతములందు క్షరణస్వభావములై (అనఁగా నశ్వర

లందు వర్తించు ఆయాపరిణామవిశేషములు) క్షరణస్వభావములును విలక్షణము లైనవియును తమ కాశ్రయములగు నింద్రియములతోఁ గూడినవియును అగు శబ్దస్పర్శరూపరసగంధములు. విలక్షణము లై

ములై) వర్తించువాని పరిణామవిశేషములు శబ్దస్పర్శాదులును వాని కాశ్రయము లయిన యింద్రియములు నని తెలియునది. ఇవి యెల్లను ఐశ్వర్యార్థుల యసాధారణ భక్తియోగమునకుఁ బ్రసన్నుఁ డైనపరమాత్ముని సంకల్పముచేఁ బుట్టునట్టి భోగరూపములు గావున విలక్షణము' లనబడినవి. అనగాఁ ఇంద్రప్రజాపతిప్రముఖు లనుభవించువానికంటెను శ్రేష్ఠము లైనవని భావము. ఇట 'క్షరోభావః' జాత్యేకవచనము గాన బహువచనార్థముగా నెఱుఁగునది. ఇవి యైశ్వర్యార్థులకు ప్రాప్యములుగాన జ్ఞాతవ్యములని తెలియునది. అధిదైవత మనఁగా దేవతకు మీఁదుగా వర్తించువాఁడు. దేవత యనఁగా భగవంతుడు గాఁడనుటకై 'ఇంద్రప్రజాపతిప్రభృతు లగు సమస్త దేవతలకు మీఁదుగా వర్తించువాఁ డనఁబడెను. అందును 'మీఁదుగా' అనుట వారికి పైని కేవలము ప్రదేశమునుబట్టి యెక్కువను సూచించునది కాదని తెలుపుటకై 'ఇంద్రప్రజాపతి ప్రభృతుల భోగ్యజాతమునకంటె విలక్షణములయిన శబ్దాదులకు భోక్తయగు పురుషుఁడు' అని భోగప్రకర్షమునుబట్టియు వారికంటె నితని కతిశయమే చెప్పఁబడినది. ఇట భోక్తయగు పురుషుఁడుగదా జ్ఞాతవ్యుఁడుగా చెప్పఁబడినది. ఇట వేఱొక పురుషుఁడు వివక్షితుఁడుగాఁడు గనుక స్వాత్మస్వరూపుఁడగు పురుషుఁడే కావలయును. ఈపురుషుఁ డితరాధికారులకుఁగూడ జ్ఞాతవ్యుఁడే కావున నీయధికారికి మాత్రము చెప్పుటవలన విశేష మేమి? యన్నచో ఇట 'భోక్తయగు పురుషుఁ' డనుటచే కేవలపురుషుఁడు గాఁడు. అట్టిపురుషునియొక్క యాభోక్తృత్వదశయే ఐశ్వర్యార్థికి ప్రాప్యముగాన జ్ఞాతవ్య మని తెలియునది. 'అధియజ్ఞుఁ' డనగా 'యజ్ఞమునందు సంబంధించినవాఁ' డని నిర్వచనము. యజ్ఞమునందు భగవంతునికి ఆరాధ్యుఁడుగా సంబంధముగాన 'యజ్ఞములచే నారాధ్యుఁడుగా వర్తించువాఁడు' అనబడెను. యజ్ఞాదులందు ఆరాధ్యులు ఇంద్రాదులయియుండఁగా తా నారాధ్యుఁ డనుట యెట్లనఁగా 'నాకు దేహభూతులయిన... నేనే యారాధింపఁదగినవాఁడను' అనఁబడినది. ఇట్లు విలక్షణము లగుపూర్వోక్తశబ్దస్పర్శాదులును, ఇంద్రాదులకంటె నతిశయించిన భోక్తృత్వదశయును, ఐశ్వర్యార్థులు తమకు ప్రాప్యములుగా నెఱింగి వానిని అనుసంధింపవలయును. ఈశ్వరుఁడే అధియజ్ఞుఁ డనుట అధికారులు మూవ్వురును ఎఱింగి నిత్యనైమిత్తికాదు లనుష్ఠించునపుడు దానిని అనుసంధింపవలయును. ఇదియె వారివారికి జ్ఞాతవ్యము అని తెలియునది.

తమతమయాశ్రయములతోఁ గూడిన శబ్దస్పర్శరూపరసగంధములు ఐశ్వర్యార్థులకు ప్రాప్యములు గావున వారికి అనుసంధేయములు. అధిదైవతశబ్దముచే నిర్దేశింపఁబడినవాఁడు పురుషుఁడు – అధిదైవతము అనఁగా దేవతలకుమీఁదుగా వర్తించువాఁడు- ఇంద్రుఁడు ప్రజాపతి మొదలగు సమస్తదేవతలకు పయిని వర్తించువాఁడు. ఇంద్రప్రజాపతి ప్రభృతు లనుభవించునట్టి భోగ్యవస్తుజాతముకంటె విలక్షణమ్మలై అతిశయించియుండు శబ్దాదిభోగ్యవస్తువుల ననుభవించు(టవలన వారి కంటె నతిశయించిన భోక్తృత్వము గల) పురుషుఁడు. ఆ భోక్తృత్వావస్థ ఐశ్వర్యార్థులకు ప్రాప్య మగుటచే వారు దానిని అనుసంధింపవలయును. అధియజ్ఞశబ్దముచే నిర్దిష్టుఁడగువాఁడు నేనే. అధియజ్ఞుఁ డనఁగా యజ్ఞములచే నారాధ్యుఁడుగా వర్తించువాఁడు. నాకు దేహభూతులైనయింద్రాదులందు ఆత్మగా నెలకొనియున్నట్టి నేనే అధియజ్ఞుఁడను (అనఁగా) యజ్ఞములచే నారాధింపఁదగినవాఁడను అని దీనిని మహాయజ్ఞాది నిత్యనైమిత్తికముల ననుష్ఠించు వేళలయందు ముప్వురు అధికారులును అనుసంధింపవలయును.

శ్లో॥ అన్తకాలేచ మామేవ స్మర న్ముక్త్వా కళేబరమ్।
8
యఃప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥ 5

టీ. యః=ఎవఁడు, అన్తకాలేచ = మరణకాలమునందును, మామేవ=నన్నే, స్మరన్=స్మరించుచు, కళేబరం = దేహమును, ముక్త్వా = విడిచి, ప్రయాతి = వెడలుచున్నాఁడో, సః = వాఁడు, మద్భావం=నన్ను స్మరించినయాకారమును, యాతి = పొందుచున్నాఁడు, అత్ర = ఈవిషయమునందు, సంశయః = సందేహము, నాస్తి = లేదు.

తా. *ఇదిగూడ ముగ్గురికిని సాధారణము - అంత్యకాలము నందును నన్నే స్మరించుచు కళేబరమును విడిచి యెవఁడు పోవునో, వాఁడు నాయొక్క స్వభావమును బొందును. అనగాఁ అప్పుడు నన్ను ఏయాకారముగలవానినిగా అనుసంధించునో అటువంటియాకారము గలవాఁ డగు నని యర్థము. ఆదిభర తాదులు దేహవియోగకాలమున తాము స్మరించుచుండిన మృగములకు సజాతీయములగు నాకారములు గలవా రయిన ట్లని తెలియునది.

అవ. పురుషుఁడు తా నేవిషయమును స్మరించునో దాని జాతి యాకారమును బొందించుట అంతిమప్రత్యయముయొక్క స్వభావ మని యిక్కలి స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యంయం వాపి స్మరన్ భావం త్యజ త్యన్తే కళేబరమ్ ।
తం త మేవైతి కౌన్తేయ సదా తద్భావ భావితః॥ 6

టీ. కౌన్తేయ = అర్జునా, అన్తే = మరణకాలమందు, యంయం అపివాభావం = (దేవతిర్యఙ్మనుష్యస్థావరములలో) ఏయేభావమునై

---

* ఇది 'ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః' అను ప్రశ్నమున కుత్తరము గాన నియతాత్ము లనుటంబట్టియు అధియజ్ఞ పదార్థస్వాభావ్యముంబట్టియు ముగ్గురధికారులను గుఱించినదేకాని జ్ఞానిమాత్రమును గుఱించినది గాదని తెలియునది. ఇట మద్భావ మనఁగా నాయొక్క స్వభావమని యర్థము. ఈశ్వరునిస్వభావమును ప్రాప్తించినవాఁడు మఱియొకయీశ్వరుఁ డగునుగాన 'మద్భావ' మనుటకు 'అప్పుడు ... ..గలవాఁ డగును' అనఁబడినది. 'నాస్త్యత్రసంశయః' అని సంశయము లేమిని దృఢీకరించుటకు ఆదిభరతాదివృత్తాంతము నుదాహరించుట తెలియునది. ఆదిభరతుఁడు దేహవియోగకాలమున అనుసంధించిన మృగమే తాను కాలేదు. ఆమృగముయొక్క యాకారమువంటి మృగశరీరమునుమాత్రము గయికొన్నాఁడుగాన అధికారి 'మద్భావ' మనుటచే నేనుకాఁడు. నన్నెట్లనుసంధించునో యట్టి యాకారమునుమాత్రము పొందు చున్నాఁడని భావము. జడభరతుఁడు మరణకాలమునందు జింకను స్మరించుచు ప్రాణము విడిచినందున ఆరూపముననే ఘరళ జనించె ననునది పురాణప్రసిద్ధము.

నను, స్మరన్_స్మరించుచు, కళేబరం = శరీరమును, త్యజతి = విడుచుచు న్నాఁడో, తం తమేవ = ఆయాస్వభావమునే, ఏతి = పొందుచున్నాఁడు. (ఏలననగా,) సదా = ఎల్లప్పుడు-జీవితకాలమునందు ఎల్లప్పుడును, తద్భావభావితః-తద్భావ = అంతకాలమునందు స్మరింపఁబడు పదార్థ ముయొక్క అనుచింతనముచేత, భావితః = దానిని భావించుచునే యుండుటవాసనతో కూడినవాఁడై (యుండుటవలన).

తా. *అర్జునా, అంత్యకాలమునందు ఏయేరూపమును (అది నీచమైనను ఉత్తమమైనను) గాని చింతించుచు శరీరము పరిత్యజించునో, మరణానంతరమున ఆయారూపమునే పొందును. పూర్వమెల్లప్పుడు భావించుచుండినవిషయమే ఆ యభ్యాసవశమున అంతిమ ప్రత్యయమునందును గలుగునుగాని వేఱొకటి కలుగనేరదు.

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుద్ధ్య చ ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్య స్యసంశయః॥ 7

---

* ఇందు ఈశ్వరుని గుఱించిన యంతిమప్రత్యయమునకే యిట్టిస్వభావమని తలఁపరాదు. మఱి యేవిషయమును గుఱించిన యంతిమప్రత్యయమునకును నిదియే స్వభావమనియు, కావుననే భగవంతునిగుఱించిన దానికిని నిట్టిస్వభావము సాధారణ మయ్యెననియుఁ దెలియునది. 'తంతమేవ' అను వీప్సచే ఏయేభావము అనుసంధింపబడునో ఆయాభావమే కలుగును గాని మఱొకటి తాఱుమాఱుగాఁ గలుగదని గ్రాహ్యము. 'ఏవ' అనునవధారణముచే ప్రబలపుణ్యాంతరము గలుగుటను వారింపనలవి గాదని వివక్షితము. పిమ్మటి జన్మములలో నేదో యొకదానియందు పూర్వ మనుసంధింపఁబడిన దానియొక్క జాతిమాత్రము సర్వసాధారణముగాఁ గలుగునని భావింపకుండుటకై 'మరణానంతరము' అనఁబడినది. ఆదిభరతుఁడు మృగత్వము మఱుసటిజన్మముననే పొందెనుగదా. 'సదా తద్భావ భావితః' అనుటచే అంతిమప్రత్యయమే యిందులకు హేతువని వివక్షితముగాన 'పూర్వమెల్లప్పుడు...కలుగనేరదు' అనఁబడెను. కావున అంత్యకాలమున ఈశ్వరుని క్రొత్తగా స్మరింపవలయునన్నచో, అట్లు కలుగదు. కనుక మొదటినుండియు భగవద్విషయమైన స్మరణము నభ్యసించుచు రావలయును. అంతిమ ప్రత్యయ మనఁగా మరణకాలమునందుఁ గలుగునట్టి స్మరణము.

టీ. తస్మాత్ = పూర్వకాలాభ్యస్తవిషయమునందె అంతిమ స్మృతి కలుగుచున్నది గనుక, సర్వేషు కాలేషు = అన్నికాలములందును, మాం = నన్ను, అనుస్మర = స్మరించుచుండుము. యుద్ధ్యచ = యుద్ధమునుగూడ చేయుము (నిత్యనైమిత్తికకర్మలనుగూడ చేయుము. (ఇట్లుండువేని), మయి = నాయందు, అర్పితమనోబుద్ధిస్సన్ = ఉంపఁబడినమనస్సును బుద్ధియును గలవాఁడవై, మామేవ = నన్నే, ఏష్యసి = పొందగలవు, అసంశయం = సందియములేదు.

తా. *పూర్వకాలమందు అభ్యసించినవిషయమునుగుఱించియే అంత్యప్రత్యయము గలుగుచున్నది. కాఁబట్టి సమస్తకాలములందును మరణమువఱకు దినదినము నన్నే స్మరించుచుండుము. దినదినమును నన్ను స్మరింపజేయునవియు, వర్ణాశ్రమానుబంధులయినవియు శ్రుతిస్మృతిచోదితములయినవియు నగు యుద్ధము మొదలైన నిత్యనైమిత్తికకర్మలను జేయుచును ఉండుము. ఇట్టియుపాయమువలన నాయందే నీమనస్సును బుద్ధియు నర్పించి అంతకాలమునందును నన్నే స్మరించుచు, అభిలషించినప్రకారమెట్లో యట్లు నన్నే పొందుదువు.

10

ఈవిషయమునందు సందేహములేదు.

**అవ.** ఇట్లు ఒక్కొక్కఁడును తా నుద్దేశించిన ప్రాప్యమును తనయంత్యప్రత్యయమూలముననే పొందు నని సామాన్యముగాఁ

* ఇట్లు ఫలము అంతిమప్రత్యయమునకు లోనగుటచేతను అంతిమప్రత్యయము అనవరతమైన భావనకు లోనగుటచేతను నీవును అట్టి భావనను దానికుపకారకమైన కర్మమును చేయవలయు నని యిందుఁ జెప్పుచున్నాఁడు. 'సర్వేషు కాలేషు' అనుటచే 'సఖల్వేవంవర్తయన్ యావదాయుషం బ్రహ్మలోకమభిసంపద్యతే'(ఛా- ౮-౧౫-౧) 'వాఁడు ఆయువున్నంతవఱకు నిట్లు వర్తించుచు బ్రహ్మలోకమును బొందును' ఇత్యాది శ్రుతులంబట్టి 'మరణమువఱకును' అనఁబడెను. అయినను ప్రతిమాసమును ప్రతిపక్షమును అనుస్మరణము చేయుటనుంగూడ 'మరణమువఱకు' చేయుటగాఁ జెప్పగూడును గాన నట్లు గాదనుటకై 'ప్రతిదినమును' అనఁబడెను. ఏకాగ్రతకుఁ దగిన సాత్త్విక

జెప్పి యింక అధికారులు ముగ్గురును తమతమ ప్రాప్యములను బొందుటకై చేయునట్టి యుపాసన ప్రకారములకుఁ గలభేదమును జెప్ప నారంభించుచున్నాఁడు. అందు ఐశ్వర్యార్థుల యుపాసన ప్రకారమును, ఆయుపాసనమునకుఁ దగినట్లు వారికి కలుగు అంత్యప్రత్యయప్రకారమును, రాఁగలమూఁడుశ్లోకములందుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్॥ 8

టీ. హేపార్థ=అర్జునా, అభ్యాసయోగయుక్తేన = అభ్యాసములోను ధ్యానములోను గూడినదిగనుక నే, న అన్యగామినా = విషయాంతరములయందుఁ బ్రవర్తింపనిది యగు, చేతసా=మనస్సుచేత, దివ్యం = అప్రాకృతుఁడును, పరమం పురుషం = పురుషోత్తముఁడు నగునన్ను, అనుచిన్తయన్ = అంత్యకాలమునందును స్మరించువాఁడై, (మామేవ = నన్నే), యాతి = పొందుచున్నాఁడు- (నాతో సమానుఁ డగుచున్నాఁడు.)

తా. *అర్జునా, దినదినమును అభ్యాసధ్యానములతోఁ గూడినదగుటచే విషయాంతరములయందుఁ బ్రవర్తింపనిదియగు మనస్సుతో

కాలములందనుట. 'యుధ్యచ' అని యుద్ధము అనుస్మరణమునకు అంగముగాఁ జెప్పఁబడినది. ఇట యుద్ధము ప్రస్తుతమగుటంజేసి చెప్పఁబడినది; కాని యది తక్కిన వానికిని ఉపలక్షణము కనుక 'యుద్ధాదికము' అనఁబడినది. 'వర్ణాశ్రమానుబంధు' లనుటచే ఉపలక్షితము లయినకర్మము లిట్టివని తెలుపఁబడెను. నిత్యనైమిత్తికము లనుటచే ఫలాభిసంధిపూర్వకర్మములు గావని తెలుపఁబడెను. ఇట 'ఉపాయమువలన' ననఁగా 'కర్మానుగృహీతమైన యనుస్మరణముచేత' ననుట. ఇట అనుస్మరణమే మనస్సునర్పించుట యగును. బుద్ధి నర్పించుట యనఁగా 'ఫలప్రదుఁ డని యధ్యవసాయము గలిగియుండుట' యని తెలియునది.

* అంతిమప్రత్యయము ప్రసక్తింపఁగా దానికి హేతువుగా 'అనుస్మర' అని యుపాసనము ప్రస్తావింపబడినది. ఇప్పుడా యుపాసనపు భేదములు నిందుఁ జెప్పఁ

అంత్యకాలమునందు పరమపురుషుఁడును దివ్యుఁడును మీఁద చెప్పఁ బడుప్రకారము గలవాఁడును అగు నన్ను స్మరించువాఁడు నన్నుఁ బొందుచున్నాఁడు- అనఁగా నాతో సమానమైన ఆకారము గలవాఁ డగుచున్నాఁడు. ఆదిభరతుఁడు మృగము ననుసంధించి మృగత్వ మును బొందినట్లు న న్ననుసంధించువాఁడు, నేను నిశ్వైర్యవిశిష్టుఁడ నగుటచే నా యైశ్వర్యమునకు సాటియైనయైశ్వర్యము గలవాఁ డగు చున్నాఁడు. అభ్యాసమనఁగా నిత్యనైమిత్తికములకు విరుద్ధములు కాని కాలములందెల్ల మనస్సును ఉపాస్య మైనదానియందు నిలుపు టను అలవాటుచేయుట. యోగము అనఁగా ప్రతిదినమును యోగ కాలమునందు అనుష్ఠింపఁబడునదియు యథోక్తలక్షణమును (అనఁగా అత్యంతప్రియమై అతివిశదమగుటచే దర్శనసమానాకారమై యొప్పా నదియు) నగు ఉపాసనము.

అవ. ఐశ్వర్యార్థులకు ఉపాస్యుఁ డగు పరబ్రహ్మస్వరూప మును వారి అంతిమస్మృతిప్రకారమును చెప్పుచున్నాఁడు.

శ్లో॥ కవిం పురాణ మనుశాసితారమ్[11]
అణో రణీయాంస మనుస్మరే ద్యః[12] ।

---

బడుచున్నవి. 'అభ్యాసయోగ' శబ్దముచే ప్రాచీనమైన చింతనమును జెప్పుటచే 'అను చిన్తయన్' అనుటకు అంతిమచింతనమే కావలయునని 'అంతకాలమున' అని కూర్పఁబడినది. 'పరమం పురుషమ్' అన్నవాఁడు తానే కాన 'నన్ను' అని కూర్పఁ బడెను. 'మీఁదఁ జెప్పఁబడు ప్రకారము' అనఁగా వెంబడి రెండుశ్లోకములం జెప్పఁ బడువిధము అని యర్థము. ఐశ్వర్యార్థి పరమపురుషప్రాప్తిని గోరకుండఁగా 'పరమం పురుషం దివ్యం యాతి' అని దాని నతనికి ఫలముగాఁ జెప్పుట యెట్లు? అన్నచో, అతఁ డంత్యకాలమందు స్మరించునట్టిభోగముల నొసంగుటకు నెట్టియాకార ముప యుక్తమో యట్టి యాకారముతోఁ గూడియున్న పరమపురుషునికిఁ గలయైశ్వర్యము వంటి యైశ్వర్యమును బొందుచున్నాఁ డనియే యిందుల కర్థము గ్రహింపవలయును గాని పరమపురుషునిఁ బొందునని కాదు.

సర్వస్య ధాతార మచిన్త్యరూపమ్
13
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్॥ 9

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ।
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్॥ 10

టీ. కవిం=సర్వదర్శియును, పురాణం=అనాదిపురుషుఁడును, అనుశాసితారం=సర్వమునకు ఆజ్ఞాపకుఁడును, అణోః=సూక్ష్మమైన జీవాత్మకంటె; అణీయాంసం=సూక్ష్మతరుడైనవాఁడును, సర్వస్య= సమస్తజగమునకు, ధాతారం=సృష్టికర్తయును, అచిన్త్యరూపం = చింతింపనశక్యమైన స్వరూపము గలవాఁడును, తమసః = ప్రకృతి కంటె, పరస్తాత్=అవతల (అనఁగా అప్రాకృతమగు), ఆదిత్యవర్ణం = సూర్యునివంటివర్ణముగలవాఁడును, దివ్యం=దివ్యుఁడైనవాఁడును అగు, పరంపురుషం = పరమపురుషుని, యః=ఎవఁడు, భక్త్యా = నిరతిశయ ప్రేమరూపమైనభక్తితోను, యోగబలేన = యోగబలముతోను, యుక్తఏవసన్=కూడుకొనినవాఁడె యగుచు (దానివలన), అచలేన = నిశ్చలమైన, మనసా = మనస్సుచేత, ప్రయాణకాలే = మరణకాల మందు, భ్రువోః=కనుబొమలయొక్క, మధ్యే=నడుమ, ప్రాణం= ప్రాణవాయువును, సమ్యక్ = లెస్సగా, ఆవేశ్య = ప్రవేశింపఁజేసి- స్థాపించి, (తత్ర = ఆభ్రూ మధ్యమునందు) అనుస్మరేత్=స్మరించు చుండునో, సః=వాఁడు, తం = అతనిభావమును, ఉపైతి=పొందును- అతనియైశ్వర్యముతో సమానమగు నైశ్వర్యము గలవాఁ డగును,

తా. సర్వజ్ఞుఁడును, పురాతనుఁడును *విశ్వమున కాజ్ఞ సేయు వాఁడును, అణువగు జీవాత్మకంటె నతిసూక్ష్ముండును, సమస్తమునకు సృష్టికర్తయును, చింతింప నశక్యమై సకలేతర విసజాతీయమై యొప్పు స్వరూపముగలవాఁడును, అప్రాకృతమై సూర్యుని తేజస్సువంటి తేజస్సుగలిగిన యసాధారణదివ్యమంగళవిగ్రహము గలవాఁడును అగు నిటువంటి యీ పరమపురుషుని ఎవఁడు ప్రతిదినమును అభ్యాసము చేయఁబడుచున్న భక్తితోఁ గూడినట్టి యోగముయొక్క (అనఁగా భక్తియోగముయొక్క) బలిమిచే మిక్కిలి సంస్కారమును బొంది యుండుటవలన చలింపనిదై యొప్పునట్టి మనస్సు గలవాఁడై ప్రాణ ప్రయాణకాలమునందు భ్రూమధ్యమున ప్రాణవాయువును సంస్థాపించి ఆ భ్రూమధ్యమందు సదా స్మరించునో వాఁడు ఆ దివ్యపురుషుని

---

* ఇచట 'అనుశాసితారమ్' అనుచో ఎవరని అనుశాసించునది ? యని యాకాంక్ష రాఁగా 'సర్వస్యధాతారమ్' అనుచోఁ గల 'సర్వ'మునే అనుశాసించువాఁ డని సర్వపదమును ఆకర్షించుకొనవలయును. లేక, ఫలానివారి నని విశేషించి చెప్పక సామాన్యముగా చెప్పుటంజేసియు అనుశాసించుట 'సర్వ'మును అని తేలుచున్నది. ఈ యనుశాసనమునకు 'ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి ద్యావా పృథివ్యౌ విధృతేతిష్ఠతః' (బృహదారణ్యకే ౫-౮-౯) 'గార్గీ, ఈయక్షరునియొక్క యాజ్ఞాచక్రమందే దివియును భువియును ధరింపబడినవై యున్నవి' ఇత్యాదులు భావ్యములు. 'అన్తఃప్రవిష్ట శ్శాస్తా జనానామ్' (యజుషి. ఆరణ్యకే. 3 ప్రశ్నే. 3 అను) ఇత్యాదులందు పరమాత్మ సమస్తమును ప్రశాసించుటతోఁగూడ అంతఃప్రవేశమును జేయుచున్నాఁడని చెప్పఁబడియున్నది. అట్టి అంతఃప్రవేశమునకు ఉపయుక్త మగు సూక్ష్మతరత్వమును 'అణోరణీయాంసమ్' అని చెప్పఁబడినది. 'ధాతా పురస్తాద్యముదాజహార' ('పురుష సూక్తే) 'సూర్యా చన్ద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్' (తై. నారా. ౧.౩౮) ఇత్యాదులందు ధాతయనఁగా స్రష్టయని యర్థము గనుక 'సర్వస్యధాతారమ్' అనుటకు సర్వమునకు 'సృష్టికర్త' యని యర్థము చెప్పఁబడెను 'ఆదిత్యవర్ణం తమసం పరస్తాత్' (శ్వే. 3-౮) అను శ్రుతిఖండ మిచట నల్లబె పెట్టఁబడినది. వర్ణసంబంధము స్వరూపముచే ఘటిల్లదు. విగ్రహముచేతనే ఘటిల్లునుగాన 'ఆదిత్యవర్ణమ్' అనుటకు అసాధారణదివ్యరూపముగలవాఁ డనఁబడెను. ఇట 'తమస్సు' అనగా సమస్తమునకు కారణభూత మైన తమోద్రవ్యము వివక్షితము. కనుక 'తమసః పరస్తాత్' 'తమస్సున

భావమును బొందును. అనఁగా, నతని యైశ్వర్యముతో సమానమగు నైశ్వర్యము గలవాఁడగునని యర్థము.

14

అవ. *ఇట్లు ఐశ్వర్యార్థుల స్మరణప్రకారము చెప్పి, ఇఁక కైవల్యార్థుల స్మరణప్రకారము చెప్పుచున్నాఁడు.

---

కవ్యల' అనఁగా అప్రాకృతమైన దని యర్థము. అప్రాకృత మనుటచే అకర్మాధీనత్వము నిత్యత్వము (అనఁగా నిర్దోషత్వము) మొదలగునవి సూచితములు. ఈశ్లోకమునకు ఛాయగా 'ప్రశాసితారం సర్వేషామణీయాంస మణీయసామ్। రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తు పురుషం పరమ్' అను మనుస్మృతి. ౧౨ ౧౨౩ శ్లోకమున్నది. అనుకూలురకు హితరమణీయుఁ డగుటవలన హిరణ్యవర్ణుఁడు రుక్మాభుఁడు మొదలగు పదములును, ప్రతికూలురకుఁ దేఱిచూడరాని ప్రకాశముచే మిఱుమిట్లు గొలుపుటవలన ఆదిత్యవర్ణుఁడు మొదలగు వ్యపదేశములును జెప్పఁబడెడిని. 'భక్త్యా యుక్తో యోగబలేన' అనుచో 'భక్తి వేఱు, యోగబలము వేఱు' అని గ్రహింపరాదు. రెండును జేరి భక్తియోగమని యర్థము. భక్తియోగబలమే మనస్సు అచలముగా నుండుటకు హేతువు. ఆ భక్తియోగముయొక్క అవాంతరవ్యాపారము సంస్కారవృద్ధి. ఇదియె యోగ పర్యాయమైన 'యుక్త' శబ్దముచే సూచితమైనదిగాన 'మిక్కిలిసంస్కారము...వలన' అనఁబడినది. యోగప్రకరణములందు నిశ్చలమైన యవస్థానము చెప్పఁబడుటచే 'ఆవేశ్య' అనుటకు 'సంస్థాపించి' యనఁబడెను. ఇచట పురుషధ్యానమునకుఁగూడ ప్రదేశము భ్రూమధ్యమే; మఱియొకప్రదేశము చెప్పఁబడలేదు. కాన 'అభ్రూమధ్యమందు ఆదివ్య పురుషుని' అనఁబడెను. 'సతంపురుష ముపైతి' అనుచో పురుషునిఁ బొందుననఁగా పురుషునిభావమునొందును. ఇట భావ మనఁగా పరమసామ్యము గాదు, సమానైశ్వర్యమని తెలియునది. 'కవిమ్' ఇత్యాదులచే చెప్పఁబడిన యీశ్వరుని సర్వజ్ఞత్వాదిగుణములు, ఈశ్వరుఁ డైశ్వర్యప్రదుడగుటకు అనుసంధింపవలసినవిగాఁ జెప్పఁబడినవిగాని ఈశ్వరునిఁ బ్రాపించుటకుఁగాదని ఫలితము. ఇట్టు అంతిమకాలమందు స్మరింపఁదగినవిగా నిర్దేశింపఁబడిన యీశ్వరుని సర్వజ్ఞత్వాది విశిష్టాకారమే యంతకు మునుపుగూడ ధ్యానింపవలసినదని తెలియునది. ఇట్లే మీఁదనెల్లను నెఱుంగవలయును.

* ఇట స్మరణశబ్దము, ఉపాసనమును అంతిమప్రత్యయమును రెంటిని సంగ్రహించుచున్నది. ఏలన, ఆరెండును స్మృతివిశేషములే యగును.

శ్లో॥ య దక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః ।
య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సజ్గ్రహేణ ప్రవక్ష్యే॥ 11

టీ. వేదవిదః = వేదార్థము నెఱింగినవారు, యత్ = దేనిని, అక్షరం=అక్షరమని-వికారాదిరహితమైన దానినిగా, వదన్తి=చెప్పు చున్నారో, యత్=ఏ అక్షరమును, వీతరాగాః = కోరికలనువిడిచి నట్టి, యతయః = జితేంద్రియులు, విశన్తి = ప్రవేశించుచున్నారో, యత్ =ఏయక్షరమును, ఇచ్ఛన్తః=పొందగోరుచున్నవారు, బ్రహ్మ చర్యం=ఊర్ధ్వరేతస్కులై యుండువ్రతమును, చరన్తి = ఆచరింతురో, తత్ = ఆ, పదం=ఉపాస్యమైన నాస్వరూపమగు నక్షరముననుట, తే = నీకు, సంగ్రహేణ = సంక్షేపముగా, ప్రవక్ష్యే = చెప్పెదను.

తా. *వేదవేత్తలు ఏ యక్షరమును అస్థూలత్వాదిగుణములు

* 'నావేదవిన్మనుతే తం బృహన్తమ్' 'వేదవిదుఁడు కానివాఁడు గొప్పవాఁ డగు అతనిని తెలియలేఁడు' (యజుషి-కాఠకే. ౫ ప్ర-౧౧-౬) అన్నట్లు వేదముతప్ప ప్రమాణాంతరములకు అగోచరుడగుటంజేసి, 'వేదవిదో వదన్తి' అని వేదవిదులు చెప్పిన ప్రకారమున 'అస్థూలత్వాదిగుణములు గలవానినిగా' అన్నారు. ఇందు 'అస్థూల మనణ్వహ్రస్వమ్' (బృహ-౫-౮-౮) ఇత్యాది శ్రుతులు వివక్షితములు. ఇట బ్రహ్మ చర్యమనఁగా ఊర్ధ్వరేతస్త్వము మొదలయినవి. లేక 'అథ యద్యజ్ఞ ఇత్యాచక్షతే బ్రహ్మచర్య మేవతత్ ...అథ యన్మౌనమిత్యాచక్షతే...అథ యత్సత్రాయణమిత్యా చక్షతే...బ్రహ్మచర్యమేవతత్' (ఛాం. ౮ ౫-౧) అను శ్రుతి చెప్పున బ్రహ్మప్రాప్తి కొఱకయిన యేచర్యగాని బ్రహ్మ-చర్యమగుచున్నది. 'యత్-తత్' అనుటచే నభిప్రాయ పడిన ప్రసిద్ధిని 'నిఖిలవేదాంతవేద్యమై' యని చెప్పఁబడినది. అక్షరమనఁగా నిట జీవాత్మగాదు. వికారాది దోషరహితమైన పరమాత్మ గాన 'నాస్వరూపమును' అనఁగా నాయసాధారణరూపమును అనఁబడినది. ఇచట అక్షరరూపుఁడైన పరమాత్ముని యుపాసనమునకు ప్రసక్తిలేకున్నను అని అక్షరస్వరూపమైన జీవాత్మయొక్క ప్రాప్తి కొఱకు చెప్పఁబడిన దని తెలియునది.

గలదానినిగా వచియింతురో, విషయాంతరవిరక్తు లగు యతు లేయ క్షరమునుపొందుదురో, ఏయక్షరముం జెంద నిచ్ఛించిన యాయతులు బ్రహ్మచర్యము నాచరింతురో, నిఖిల వేదాంతప్రసిద్ధ మైన యట్టి నాస్వరూప మగు నక్షరమును, ఉపాసించుటకుఁ దగినట్లు, నీకు సంగ్రహముగాఁ జెప్పెదను.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుద్ధ్యచ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్॥ 12

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిమ్॥ 13

టీ. సర్వద్వారాణి = జ్ఞానప్రసరమునకు ద్వారభూతములగు సమస్తేంద్రియములను, సంయమ్య = వానివానివ్యాపారములనుండి మఱలించి, మనః = మనస్సును, హృదయకమలమునందున్నట్టి నా యందు, నిరుద్ధ్యచ = నిలిపియు, యోగధారణాం = యోగమనఁబడు నాయందే నిశ్చలమయినస్థితిని, ఆస్థితః = పొందినవాఁడై, బ్రహ్మ = పరబ్రహ్మవాచకమగు, ఓం ఇతి ఏకాక్షరం = ఓం అనెడు ఒకయక్షరమును, వ్యాహరన్ = ఉచ్చరించుచు, మాం = ఓంకారవాచ్యుఁడైన నన్ను, అనుస్మరన్ = ధ్యానించుచున్నవాఁడై, ఆత్మనః = తనయొక్క, ప్రాణం = ప్రాణవాయువును, మూర్ధ్ని = శిరస్సునం దుండు నాడి యందు, ఆధాయ = ఉంచి, దేహం = శరీరమును, త్యజన్ = విడిచి, యః = ఎవఁడు, ప్రయాతి = బయలువెడలునో, సః = వాఁడు, పరమాం గతిం = భగవత్సమానాకారము గల పరిశుద్ధాత్మస్వరూపమును, యాతి = పొందుచున్నాఁడు.

తా. *జ్ఞానమునకు ద్వారభూతము లగు శ్రోత్రాదిసమస్తేంద్రియములను వాని వ్యాపారములనుండి మరలించి, హృదయకమలనివిష్టుఁడై అక్షరుఁడైననాయందు మనస్సు నిలిపి యోగమనెడి ధారణనొంది (అనఁగా నాయందు నిశ్చలమైన స్థితిగలవాఁడై)

14

పరబ్రహ్మవాచక (అనఁగా మద్వాచకమగు ఓం అనెడి యొకయక్ష) రము నుచ్చరించుచు, ఓంకారవాచ్యుఁడైన నన్ను ధ్యానించుచున్నవాఁడై, తన ప్రాణవాయువును శిరస్సునం దుండు సుషుమ్నానాడీద్వారమున ప్రవేశింపఁజేసి, శరీరమునువిడిచి యెవఁడు అర్చిరాదిమార్గమున పోవునో, వాఁడు ప్రకృతిబంధరహితమై మత్సమానాకారమై పునరావృత్తిలేనిదై యుండు తన యాత్మస్వరూపమును (కైవల్యమును) బొందును. 'పరమాం గతిమ్' అనునది శుద్ధాత్మస్వరూపప్రాప్తియే యగుటను, 'యస్సనర్వేషుభూతేషు నశ్యత్సు న వినశ్యతి। అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్' అని యనంతరమే చెప్పఁబడెడిని.

అవ. ఇట్లు ఐశ్వర్యార్థులును కైవల్యార్థులును వారివారి ప్రాప్యములకనుగుణముగా భగవంతు నుపాసించుప్రకారము చెప్పఁబడినది. ఇఁక జ్ఞాని యగువాఁడు భగవంతు నుపాసించు ప్రకారమును భగవంతునిఁ బొందుప్రకారమును జెప్పుచున్నాఁడు.

---

* 'సర్వద్వారాణి సంయమ్య' అనుచో నవద్వారములని తోఁపకుండుటకై శ్రోత్రాదులగు నింద్రియములుగాఁ జెప్పఁబడినవి. అయినను ద్వారానుబంధములేని స్పర్శనాదులను ద్వారములనుట యెట్లు? అన్నచో, ఇచట ద్వారమనఁగా ప్రాపకమగు మార్గము-మూలము-అని యర్థముగాన 'జ్ఞానమునకు ద్వారభూతము' లనఁబడినవి. 'మనోహృదినిరుధ్యచ' అనుచో హృన్మాత్రమునందు మనస్సు నిరోధించుట-అనఁగా హృదయమునుమాత్రమే ధ్యానింపఁజెప్పుట యొప్పదు. కాన 'హృదయకమలనివిష్టుఁడగు నక్షరుఁడయిన నాయందు' అనఁబడినది. ఇట్లు గ్రహింపనిచో పిదప 'మామనుస్మరన్

శ్లో॥ అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః॥ 14

టీ. హేపార్థ=అర్జునా, యః=ఎవ్వఁడు, నిత్యశః=జ్ఞానమార్గమవలంబించినది మొదలు, సతతం=సర్వకాలమునందు, అనన్యచేతాః=ఇతర విషయములందుఁ బ్రవర్తింపని మనస్సు గలవాఁడగుచు, మాం=నన్నే, స్మరతి = చింతించుచున్నాఁడో, నిత్యయుక్తస్య=నాతోడి నిత్యయోగముగల-నాతోడి నిత్యయోగమును గోరునట్టి యనుట, తస్య=అట్టి, యోగినః=జ్ఞానికి, అహం=నేను, సులభః=సుఖముగాఁ బొందఁదగినవాఁడ నగుదును.

---

అనుట ఘటింపదు. ప్రణవము బ్రహ్మప్రతిపాదక మగుటంజేసి 'బ్రహ్మ' మనఁబడెను గాన 'మద్వాచకమైన' అని చెప్పఁబడెను. ప్రణవము భగద్వాచకమగుట శ్రుతిస్మృత్యాదిసిద్ధము. 'సర్వేవేదా యత్పదమా మనన్తి। తపాంసిసర్వాణిచ యద్వదన్తి। యదిచ్ఛన్తో బ్రహ్మచర్యంచరన్తి। తత్తేపదంసఙ్గ్రహేణ బ్రవీమ్యోమ్' (కఠోప - ౧ ౨-౧౫) ఇట పద మనఁగా 'పద్యతేగమ్యతే' అను వ్యుత్పత్తిచే ప్రాప్యస్వరూపము (అనఁగా బ్రహ్మస్వరూపము) చెప్పఁబడుచున్నది. సమస్తవేదములు దేనిని ప్రతిపాదించునో తపః ప్రధానములయిన ఉపరితనభాగములు దేనిని జెప్పునో దేనిని గోరువారు బ్రహ్మచర్యము ననుష్ఠింతురో అట్టి బ్రహ్మస్వరూపమును సంగ్రహముగా (అనఁగా సంగ్రహించి చెప్పునట్టి శబ్దముచే) చెప్పెదను. ఆ శబ్దమే 'ఓమ్' అని యర్థము. ఇట నామముచే నామి చెప్పఁబడెను. అట్లే 'ప్రణవో ధనుశ్శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే। అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయోభవేత్' (ముండకోపనిషత్ -౨-౨-౪) అనియు, 'ఆత్మానమరణింకృత్వా ప్రణవంచోత్తరారణిమ్। ధ్యాననిర్మథనాభ్యాసాత్పశ్యేద్బ్రహ్మగ్నిగూఢవత్'. (ధ్యానబిందూపనిషత్) అనియు 'ఓమిత్యేవం ధ్యాయథాత్మానమ్ (ముండక-౨-౨-౬) అనియు ప్రణవము బ్రహ్మవాచకముగాఁ జెప్పఁబడుట తెలియునది. ప్రణవముచేతనే భగవదర్చనముగూడ 'ఆవాహనాదికం కర్మయన్నసూక్తం మయాత్విహ। తత్సర్వం ప్రణవేనైవ కర్తవ్యం చక్రపాణియే' అన్నట్లు కావింపవలసినదిగానున్నది. కైవల్యార్థులకు అనఁగా ఆత్మార్థులకు ఆత్మయేకదా ప్రాప్యము, అందు పునరావృత్తిలేకుండు మాత్రమునుబట్టి అది 'పరమాంగతిమ్' అని పరమగతిగాఁ జెప్పఁబడినదని 'ప్రకృతిబంధరహితమై...పొందును' అనఁబడెను. ఇట్టి యాత్మకు పరమగతి యని పేర్కొనుట కేవలము ప్రకరణముంబట్టికాదు. మఱియీ యధ్యాయమందే దానిని గుఱించియే పరమగతియని ప్రయోగము గలదనుటకై 'యస్ససర్వే' అను శ్లోక ముదాహరింపఁబడినది.

తా. అర్జునా, ఎవఁడు * ఆరంభమునుండి సర్వకాలమును

---

* ఇట 'నిత్యశః' అనియు 'సతతమ్' అనియు రెండును సమానార్థకములగుటచే పునరుక్తి కలుగుచున్నది. కాన 'నిత్యశః' అనుటకు 'ఆరంభమునుండి' యని యర్థము చేయఁబడెను-అనఁగా నాయందు భక్తిసేయ నారంభించినది మొదలుగా నా ప్రాప్తినే కోరుచుండునుగాని ఆత్మానుభవాది ఫలములను నడుమఁ గోరుటలేదని భావము. మొదటినుండియు భగవత్ప్రాప్తియే యుద్దేశించినఫలమై యదియే సిద్ధించునుగాని అందులకై నడుమ ఆత్మానుభవాదులచే వ్యవధాన మక్కఱలేదని భావము. 'అనన్య చేతాఃస్మరతి' యనుచో 'అనన్యచేతాః' అనుటచే అవిచ్ఛిన్నత్వ మేర్పడుచున్నది. కాన నవిచ్ఛిన్నమైనస్మృతి యగుచున్నది. ఇట్టిస్మృతియె భక్తిరూప మగుటచే "నేనే అత్యంతము ప్రియుఁడనగుటచేత...మద్విషయస్మృతి చేయునో" యని భక్తిరూపింపఁ బడినది. 'నిత్యయుక్తస్యయోగినః' అని యనువాదము భగవత్ప్రాప్తి యనెడి ఫలము నకు మఱి దేనిచేతను వ్యవధానము లేదని తెలుపుకొఱకుఁగా తెలియునది. భగవ త్ప్రాప్తి యితరఫలములకంటె నతిశయించినదిగాన దానిని బొందుటకు ప్రయాసము మిక్కిలి గలుగునో యనఁగా 'కష్టములేకయే ప్రాప్యుఁడను నగుదును' అనఁబడినది. ఆశ్రితవత్సలుఁడగు నీశ్వరునికి ఈ సౌలభ్యము నిర్బంధముచేఁ గలిగినదనిగాక రాగ ప్రాప్తము (అనఁగా ప్రీతిచేఁగలిగినది) యని తెలుపుటకై 'వానినెడఁబాసి...వరించు చున్నాను' అనఁబడినది. ఇట్లనుట అతివాదమేమోయని శంక గలుగును గాన నట్లు కాదనుటకై 'యమేవైష...లభ్యః' అనుశ్రుతి యుదాహరింపఁబడినది. ఇందు 'వృణుతే' అని భగవంతుఁడు వరించుట చెప్పఁబడినదిగదా. ఈ వరించుట యేమి? తనకు శేషముగానో శరీరముగానో మఱి యిట్టి యే యాకారములచేతనో స్వీకరించు టయా? ఇట్టిస్వీకారము నిత్యసిద్ధముగాననిట చెప్పనక్కఱలేదు. ఇందులకు విపరీత మైనది వరించుట యగునా? యన్నచో అది కేవలవిరుద్ధమగుచే నంగీకరింపఁదగదు. లేక, తన ప్రాప్తినొసంగుట వరించుట యగునా? యన్నచో 'తేనలభ్యః' అని యీ శబ్దములచే స్వప్రాప్తి చెప్పఁబడియున్నదిగాన మరల 'వృణుతే' అనుటకును స్వప్రాప్తిని జెప్పుట పునరుక్తి యగును. మఱి వేఱొక ప్రకారమును అసంభవ మగుటం బట్టి యిట వరించుటగాఁ జెప్పరాదు. కాన 'నాప్రాప్తికి అనుగుణ...ఇచ్చుచున్నాను' అని వరించుట కర్థము సేయఁబడెను. ఇట ఉపాసనముయొక్క విపాకమనఁగా అది ధ్రువమైన స్మృతిరూపము దర్శనసమానాకారము మొదలగు రూపముల నుండుట యని తెలియునది. ఉపాసన విపాకమునకు విరోధులు దుష్కృతము, రజస్సు, తమస్సు, రాగద్వేష మోహములు మొదలయినవి. 'నిరతిశయభక్తియు మొదలగునవి' అనుచో మొదలగునవి అనుటచే పరమపదమందు భగవంతునిపర్యంకమును జేరువఱకు నడుమ నెయ్యది యపేక్షింపఁబడునో యదియంతయు నని తెలియునది. 'సేనే' అని యుప

వేఱువిషయములందు మనస్సు నుంపనివాఁడై నన్ను స్మరించునో, (అనఁగా నేనే వానికి అత్యంత ప్రియుఁడనగుటచే నన్ను స్మరించుట చేతనేకాని వేఱువిధమున ఆత్మధారణము లభింపలేనివాఁడై నిరతిశయప్రియుఁడ నగునన్ను గుఱించినదగుటచే తానును నిరతిశయ ప్రియమైయుండు మద్విషయస్మృతిని చేయునో) నాతోడి నిత్యయోగమును గోరునట్టి యాయోగికి నేనే ప్రాప్యుఁడను; కాని యైశ్వర్యార్థులు మొదలగువారికింబోలె మద్భావములగు ఐశ్వర్యాదికములు ప్రాప్యములు కావు. పట్టి ప్రాప్యుడనే కాదు. కష్టము లేకయే ప్రాప్యుఁడను నగుదును. వాని నెడఁబాసి యుండనేరక నేనే వానిని వరించుచున్నాను. అనఁగా, నాప్రాప్తికి అనుగుణమైన యుపాసనపరిపాకమును, దానికి విరోధు లగువాని నిరసించుటయు, అత్యర్థము నేను ప్రియుఁడనై యుండుటయు (అనఁగా నాయందలి నిరతిశయ భక్తియు) మొదలగునవి నేనే యిచ్చుచున్నానని యర్థము. 'యమేవైష వృణుతే తేన లభ్యః' అనికదా శ్రుతి. ఈ వరణ మిట్టిదే యగునని 'తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్। దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే॥ తేషామేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః। నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా' అని [illegible]ం జెప్పఁగలఁడు.

---

ధారణముచే పరమకారుణికుఁడ నగు నాదియే యీ భారమని యభిప్రాయము. 'యమేవైష' అను శ్రుతిని ఉపబృంహణముచే స్థిరీకరించుటకై 'తేషాం...' అని యుదాహరింపబడినది.

## సింహావలోకనము.

* ఈ యధ్యాయము మొదటం గల 'కింతద్బ్రహ్మ' ఇత్యాది ప్రశ్నములందును 'అక్షరం బ్రహ్మపరమమ్' ఇత్యాదియగు నుత్తరమందును పూర్వాధ్యాయము కడపట వీనిని ప్రస్తావించు 'జరామరణమోక్షాయ' 'సాధిభూతాధిదైవతమ్' అనువానియందును, ఐశ్వర్యార్థులు కైవల్యార్థులు మోక్షార్థులు (అనఁగా జ్ఞానులు) అని యీ క్రమము వివక్షింపఁబడలేదు, వానియందు ముగ్గురధికారులకును అధియజ్ఞమును అంతిమ ప్రశ్న

యము సాధారణమని ప్రతిపాదించుటయే ముఖ్యమై యుండెను గాన నధికారుల యొక్కువతక్కువలను నిరూపించెడి యీ క్రమము చెప్పఁబడదయ్యె. ఇచ్చటనో అయ్యైయధికారులకు నియతములైన యర్థములను వేఱువేఱ యుపదేశించు ప్రకరణము గాన వారియం దొకరికంటె నొకరు పయిపయి నుత్కృష్టు లని తెలుపుటకై ఐశ్వర్యార్థులు కైవల్యార్థులు భగవచ్ఛరణార్థులు (జ్ఞానులు) అని క్రమమునం జెప్పఁబడిరని తెలియునది. ఇది యట్లుండ నిచటఁ గొంద ఱొకశంక చేయుచున్నారు. ఎట్లన:— 'తే బ్రహ్మ తద్విదుః' (గీ-౭ ౨౯) 'కింతద్బ్రహ్మ' (గీ ౮-౧) 'అక్షరంబ్రహ్మపరమమ్' (గీ-౮-౩) అని చెప్పఁబడిన బ్రహ్మశబ్దము సాక్షాద్బ్రహ్మ విషయ మగుటకు బాధ యేమి? బ్రహ్మమే సర్వాత్మమగుటంబట్టి 'అధ్యాత్మ' మనఁగా బ్రహ్మమందుఁ గల సర్వమని గ్రహింపవచ్చును. 'భూతభావోద్భవకరో విసర్గః' (గీ ౮-౩) అనుటకు జగత్సృష్టిని గ్రహింపవచ్చును. లేక, దేవతల నుద్దేశించి ద్రవ్యత్యాగము సేయుట (అనఁగా నివృత్తిలక్షణమైన యజ్ఞము) అని గ్రహింపవచ్చును. 'అధిభూతం క్షరో భావః' అనుటకు 'అధిభవతీతి అధిభూతమ్' అను వ్యుత్పత్తిచే ప్రాణిజాతముగాను 'పురుషశ్చాధిదైవతమ్' అనుటకు పరబ్రహ్మముయొక్క అవస్థావిశేషముగాఁగాని లేక సమష్టిపురుషాదిగాఁగాని యర్థము సేయవచ్చును. 'అధియజ్ఞుఁ' డనుటకు 'యజ్ఞో వై విష్ణుః' అను శ్రుతి చొప్పున సకల యజ్ఞాభిమానియగు విష్ణు ననుదేవతగా గ్రహింపవచ్చును. 'అన్తకాలేచ' (గీ-౮-౫) ఇత్యాదులగు మూఁడుశ్లోకములును మోక్షార్థియొక్క యంతిమ ప్రత్యయమును గుఱించియే చెప్పఁబడినవి. ఈ యధ్యాయము మొదటంగల ప్రశ్నశ్లోకములు పూర్వాధ్యాయమున ప్రస్తావింపఁబడిన మువ్వురధికారుల జ్ఞాతవ్యోపాదేయములను గుఱించినవయినను, వానికి మీఁదిశ్లోకములు జ్ఞాని మిక్కిలియు దుర్లభుఁ డని యతనిని ముఖ్యముగ నిర్దేశించునవియే కావలయును. అట్లుకాక యితరులనుగూడ నిర్దేశించునవి యగునన్నయెడల 'మామేవ స్మరన్' (గీ-౮-౫) 'మామేవైష్యసి' (గీ-౮-౭) ఇత్యాదులు జ్ఞానులకే చెప్పఁదగిన భగవదేకస్మరణాదులు ఇతరులకుఁగూడఁ జెల్లిన ట్లగును గాన బాధ కలుగుచున్నది. కనుక వీనిం బట్టి యవి జ్ఞానినే గుఱించినవి గావలయును. కావుననే 'ప్రయాణకాలేచ కథమ్' (గీ-౮-౨) 'అన్తకాలేచ మామ్' (గీ.౮-౫) అను రెండుశ్లోకములు ముగ్గురధికారులను గుఱించినవయ్యును, వానివివరణమగు నిచ్చట వానియందుఁబోలె ముగ్గు రధికారులను గ్రహింపవలయు ననుట ఖండితమగుచున్నది. ఏలన, నిచ్చటను ముగ్గురధికారులను గుఱించినట్లు గ్రహించినచో 'మామేవ స్మరన్' (గీ-౮-౫) ఇత్యాదులతో విరోధము కలుగుచున్నది. అచ్చటను—(అనఁగా ఆ రెండుశ్లోకములును) ముగ్గురధికారులను గుఱించినట్లు తోఁపలేదు. ఐశ్వర్యార్థికి పరమపురుషుని గుఱించిన యంతిమ ప్రత్యయము అపేక్షిత మని ప్రమాణము గానరాదు. ఇట్లై మీఁదిశ్లోకములందును అధికారి

యొక్కఁడే. వానికి జ్ఞాతవ్యమగునదియే మాటిమాటికి అనువదించి విశేషాకారముగా విశదీకరింపఁబడుచున్నది గాన నిందు పునరుక్తిదోషము లేదు. మఱియు 'సంసిద్ధిం పరమాం గతాః' (గీ-౮-౧౫) 'సయాతి పరమాం గతిమ్' (గీ-౮-౧౩) 'తమాహుః పరమాం గతిమ్' (గీ-౮-౨౧) అనునివి సమానార్థకములే యగునని తప్పక తోఁచుచున్నది. కాన దీనికి కైవల్యపరముగాను మోక్షపరముగాను ఒకటికొకటి భిన్నార్థములు చెప్పుట యొప్పదు. పరమ సంసిద్ధియైనది పరమగంతవ్యమునకు (అనఁగా పరమగతికి) వేరు కానేరదు. మఱియు 'పరమం పురుషం దివ్యమ్' (గీ-౮-౮) 'సతంపరం పురుష ముపైతి దివ్యమ్' (గీ-౮-౧౦) 'పురుషస్సపరః పార్థ భక్త్యాలభ్యస్త్వనన్యయా' (గీ-౮-౨౨) అను వీనికి భిన్నార్థములు కల్పించుటయు యుక్తముగాదు. పరులుఁగూడ నెల్లవారు వీనికి నైక్యకంఠ్యముతో వ్యాఖ్యానము చేసియున్నారు" అనెదరు. ఇందులకు క్రమముగా పరిహారమెట్లనఁగా—భగవంతుఁడు అధియజ్ఞుని 'అధియజ్ఞోఽహమేవ' అని తన్నుఁగాఁ జెప్పుకొన్నాఁడుగదా—అట్లే యిట బ్రహ్మమనఁబడునదియు తానే యైనయెడల 'అహమేవ బ్రహ్మ' అని చెప్పుకొనియుండునుగదా. అట్లు చెప్పుకొనలేదు గాన నిచట అధ్యాత్మాదులవలెనే బ్రహ్మమనఁబడునదియు భగవంతునికంటె వేఱయినది గానే తోఁచెడిని. మఱి 'అక్షరం బ్రహ్మపరమమ్' అనుచో బ్రహ్మశబ్దము అక్షరశబ్దముచే విశేషితమైనదిగాన పరమపురుషుని గుఱించినదగు నన్నచో బ్రహ్మశబ్దమునకంటె అక్షరశబ్దము పరమపురుషుని కెక్కువగా వాచకముగాదు. అట్లది యెక్కువగా వాచకమయినంగదా దానింబట్టి బ్రహ్మశబ్దమునకు పరమపురుషుని పరముగా వ్యాఖ్యానము సేయవచ్చును. మఱియు 'ఏవం సతతయుక్తాయే భక్తాస్త్వాం పర్యుపాసతే। యేచాప్యక్షరమవ్యక్తమ్ (గీ-౧౨-౧) ఇత్యాదులందు పరమాత్మకంటె వేఱయిన యుపాస్య వస్తువే అక్షరశబ్దముచే ప్రతీతమగుచున్నది. 'ద్వేరూపే బ్రహ్మణస్తస్య మూర్తంచామూర్తమేవచ। క్షరరాక్షరస్వరూపే తే సర్వభూతేషుచస్థితే। అక్షరంతత్పరం బ్రహ్మ క్షరం సర్వమిదంజగత్' (విష్ణుపు-౧-౨౨-౫౫-౫౬) ఇత్యాదులందు అక్షరపరబ్రహ్మశబ్దములు పరిశుద్ధాత్మ విషయములుగానుండుట శారీరకభాష్యమున సమర్థింపఁబడియున్నది. కాఁబట్టి యిచట 'కింతద్బ్రహ్మ' అనుప్రశ్నమునకు 'అహమేవబ్రహ్మ' అని భగవంతుఁడు వ్యాఖ్యానము సేయమింజేసి, బ్రహ్మశబ్దము భగవంతునికంటె వేఱయిన వస్తువునే గుఱించుచున్నది. అక్షరము కేవలమైనదిగాక పరమమైనదిగా విశేషితమగుటచే నది ప్రకృతికంటెను వేఱయినదానిని గుఱించునదగును; కనుక 'అక్షరం బ్రహ్మ పరమమ్' అను మూఁడుశబ్దములు భగవంతునికంటెను ప్రకృతికంటెను వేఱయిన దానియందు (అనఁగా పరిశుద్ధాత్మయందు) నుపచారమున వర్తించుచున్నది. పిదప నీ పరిశుద్ధాత్మయే 'అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః' (గీ-౮-౨౧) అని చెప్పఁబడెడిని. ఈ శ్లోకము పరమాత్మపర మని శంకింపరాదు, 'యేచాప్యక్షర మవ్యక్తమ్' (గీ-౧౨-౧)

'యేత్వక్షర మనిర్దేశ్యమ్' (గీ-౧౨-౩) 'క్షరశ్చాక్షరఏవచ' (గీ-౧౫-౧౬) ఇత్యాదులం దుంబోలె నిచ్చటను అక్షరశబ్దము భగవంతునికంటె వేఱయినదానినే గుఱించుట తెలియుచున్నది. సంసిద్ధిశబ్దము పరమగతిశబ్దముచే నిర్దేశింపఁబడిన ప్రాప్యమునకంటె విలక్షణమై సమీచీనమైనసిద్ధిని తనంతటనే 'సం' అను ఉపసర్గపుశక్తిచే సూచించెడిని. కాన భిన్నార్థకమే యగును. ఇట్లు పూర్వోత్తరములను బరామర్శించుటచే ఈ యధ్యాయము మొదటం గల ప్రశ్న ప్రతి వచనవాక్యములు ముగ్గురధికారులను గుఱించునవిగా సిద్ధించుటచే వాని కవ్వలిగ్రంథములును, ఆ ముగ్గురధికారులను గుఱించినవగుట యుక్తము. మఱియు మొదట ముగ్గురధికారులను గుఱించి యుపక్రమించి పిదప కైవల్యభగవత్ప్రాప్తికాములను గుఱించి స్పష్టముగాఁ జెప్పుటంబట్టి నడుమనున్న 'అభ్యాస' ఇత్యాదులు పరిశేషమువలన ఐశ్వర్యార్థులను గుఱించినవిగానే చెప్పనొప్పును. భాగవతమున ధ్రువచరితమునందు 'భక్తిం హరౌ భగవతి ప్రవహన్' ఇత్యాదులచే ఐశ్వర్యార్థులకును పరమపురుషవిషయ మయిన అంతిమ ప్రత్యయము గలదు. 'బ్రహ్మ' 'పరంపురుషమ్' 'పరమాంగతిమ్' ఇత్యాదిశబ్దములచే నిందు సర్వత్ర పరమాత్మభజనము పరమాత్మప్రాప్తి మొదలగునవియే ప్రతీతము లగుచున్నవి. కాని యంతమాత్రముచే నివి యొక్కయధికారినే గుఱించినవని చెప్పనొప్పదు. ముందు ప్రయాణకాలమున భ్రూమధ్యమందు ప్రాణము లావేశించుటయు అందే పరమాత్మధ్యానము సేయుటయు విధించి పిదప హృదయమునందు ధ్యానమును మూర్ధమందు ప్రాణమును ఆకాలమందే విధించియున్నాఁడు. ఈరెండు నిటు పరస్పర విరుద్ధములగుట కాలభేదమువలననా? అధికారభేదమువలననా? యన్నచో కాలభేదము శ్రుతముగాదు. కనుక అధికారభేదమేయని సిద్ధమగుచున్నది. ఇంతేకాక 'శతంచైకాచ' (ఛాం-౮-౬-౬) ఇత్యాదులచేత మూర్ధన్యనాడిచే ఆత్మనిష్క్రమణము మోక్షహేతు వనియు, తక్కిన నాడులచే నిష్క్రమణము తక్కిన ఫలములకు హేతువనియుఁ దెలియుచుండుటంబట్టి ప్రయాణకాలమందు భ్రూమధ్యమందును మూర్ధమందును ప్రాణావేశము ఉత్క్రమణమునకే కాన అందందుఁగల నాడులచే ఉత్క్రమణమని యేర్పడుచున్నది. ఇట్లు ఉత్క్రమణనాడుల భేదమునుబట్టి అధికారిభేదమును సిద్ధించుచున్నది. మఱియు పూర్వాధ్యాయమందు 'చతుర్విధాభజన్తేమామ్' అని యధికారభేదము ప్రస్తావింపఁబడినది. ఆయధ్యాయముకడపటను 'జరామరణమోక్షాయ' 'సాధిభూతాధిదైవంమామ్' అను శ్లోకముల అధికారభేదము ప్రతిపాదింపఁబడినది. కాన నిచ్చటను అధికారభేదము స్ఫుటముగానున్నది. కాన ఏకాధికారిని (అనఁగ జ్ఞానిమాత్రము) గుఱించిన దనుట యుక్తముగాదు.

అవ. ఇఁక మిగత అధ్యాయమునందు జ్ఞానులకును కైవల్యార్థులకును బునరావృత్తి లేమియు, ఐశ్వర్యార్థులకుఁ బునరావృత్తికలిమియుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః॥ 15

టీ. మహాత్మానః=యథావస్థితముగా నా స్వరూపము నెఱిఁగినవారై, పరమాం=ఉత్కృష్టమయిన, సంసిద్ధిం=ఉత్కృష్ట పురుషార్థరూపుఁడ నైన నన్ను, గతాః=పొందినవారు, మాం=నన్ను, ఉపేత్య=పొంది, పునః=మరల, దుఃఖాలయం=దుఃఖములకు ఆస్పదమైనదియు, అశాశ్వతం=అస్థిర మయినదియు నగు, జన్మ=జన్మమును- ప్రాకృత దేహసంబంధమును, నాప్నువన్తి=పొందరు.

తా. *గొప్పమనస్సుగలవా రగుటవలన నా స్వరూపమును కలరూపున నెఱింగి, తమకు మిక్కిలియుం బ్రియుఁడ నగుటంజేసి నన్ను విడిచి ఆత్మధారణమును బడయలేక నాయందే మనస్సుతగిలి నన్నే యాశ్రయించి యుపాసించి పరమసంసిద్ధి రూపుఁడనైన నన్నుఁ బొందినవారు, నన్నుఁబొందినపిదప సకల దుఃఖములకు నాస్పదమై యస్థిరమై యుండు జన్మమును బొందరు - పునరావృత్తి నొందరనుట.

అవ. ఐశ్వర్యగతిని బ్రాపించినవారికిఁ బునరావృత్తి కలుగుటకును భగవంతునిఁ బ్రాపించినవారికిఁ బునరావృత్తి లేకుండుటకును హేతువును వెంబడిఁ జెప్పుచున్నాఁడు.

---

* ఇంతవఱకు ముప్పురధికారులకును వలయు జ్ఞాతవ్యోపాదేయ భేదములను గొన్నిఁటిని ప్రతిపాదించి యిదిమొదలుగా అధ్యాయాధికారమున కుపయోగించుటకై జ్ఞాతవ్యములుగానున్న ఫలములు స్థిరమనియు అస్థిరమనియు భేదముగలిగియుండుటను జెప్పుచున్నారు. ఇట జన్మము అశాశ్వతమనఁగా అస్థిరమని యర్థము. జన్మమనాదిగాఁ

శ్లో॥ ఆ బ్రహ్మభవనా ల్లోకాః పునరావర్తినోఽర్జున।
మా ముపేత్యతు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే॥ 16

టీ. అర్జునా, ఆ బ్రహ్మభవనాత్ = బ్రహ్మలోకపర్యంతము (నుండెడి), లోకాః = సమస్తలోకములు, పునరావర్తినః = తిరిగివచ్చెడివి-నశించునట్టి వనుట, కౌన్తేయ = అర్జునా, మాం = నన్ను, ఉపేత్యతు = పొందిననో, పునర్జన్మ = పునర్జన్మము, న విద్యతే = కలుగ నేరదు- పునరావృత్తి లేదనుట.

తా. అర్జునా, *బ్రహ్మాండముయొక్క గర్భమున భోగైశ్వర్యస్థానములై వర్తించు బ్రహ్మలోకము మొదలైనలోకములెల్ల పునరావృత్తిగలవి (అనఁగా నశించునవి) కాఁబట్టి ఐశ్వర్యగతిఁ బొందిన వారికి ప్రాప్యస్థానము లైన యాలోకములు నశించుటవలన వారికిని నశించుట తప్పదు. సర్వజ్ఞుఁడును, సత్యసంకల్పుఁడును, నిఖిలజగదుదయస్థితిలయ లీలుఁడును పరమ కారుణికుఁడును అగునేను సద్రైకరూపుఁడ నగుటచే నన్నుఁ బొందినవారికి నాశప్రసక్తియే లేదు. కనుక వారికి పునర్జన్మమును గలుగదు.

---

గలుగుచుండఁగా అస్థిరమెట్లన్నచో ఇట జన్మమనుట, దాని నెడతెగక సంబంధించి యుండు దేహభోగాదులనికాని దేహమనికాని గ్రహించువది. ఇట 'మహాత్మానః' అనుట స్తుతిమాత్రముగాఁ గొనుటకంటె పరమసంసిద్ధికి హేతువైన మహామనస్సు గలిగియుండుటగా గ్రహించుట యుక్తముగాన గొప్పమనస్సు గలవా రనఁబడెను. జ్ఞానుల మహామనస్త్వము పూర్వము ప్రపంచింపఁబడినదే యిచట 'నా స్వరూపము... ఉపాసించి' యని అనువదింపఁబడినది. సంసిద్ధియనఁగా సమీచీనమయినసిద్ధి. అభిలషితమైనఫలము నే సిద్ధియని పేర్కొనవచ్చును గావునను ఆ సిద్ధి పరమమైనదిగా చెప్పుటం బట్టియు 'పరమసంసిద్ధిరూపుఁడ నగునన్ను' అనఁబడెను. పరమసంసిద్ధిరూపమనఁగా పరమపురుషార్థరూప మని యర్థము.

* 'ప్రకృతియనెడు భగవన్మాయామహాసముద్రమందు బ్రహ్మాండములే బుద్బుదప్రాయములై యుండఁగా వానిలోపల వర్తించులోకముల విషయము చెప్పనేల?'

అవ. బ్రహ్మలోక పర్యంతము గల లోకములకును అందుఁ
15
గలవానికిని బరమపురుషుఁడు సంకల్పించిన యుత్పత్తి వినాశకాల వ్యవస్థను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ సహస్రయుగపర్యన్త మహర్య ద్బ్రహ్మణో విదుః।
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదోజనాః॥
అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రై వావ్యక్తసంజ్ఞకే॥ 18
భూత గ్రామ స్స ఏ వాయం భూత్వాభూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే॥ 19

టీ. (యే) జనాః=(ఏ) జనులు, అహోరాత్రవిదః=అహోరాత్రరూపమైన కాలవ్యవస్థ నెఱుఁగుదురో, తే=అట్టివారు, బ్రహ్మణః=చతుర్ముఖ బ్రహ్మకు, యత్ = ఏది, అహః=పగలో, (తత్ = దానిని), సహస్రయుగపర్యన్తం=వేయిచతుర్యుగముల పరిమితి గల దానినిగాను, రాత్రిం=రాత్రిని, యుగసహస్రాన్తాం=వేయిచతుర్యు

యనుటకై 'బ్రహ్మాండముగర్భమున...లోకము' అనఁబడెను. బ్రహ్మాండముయొక్క గర్భమునట్లుచే పరమాకాశమునకు (అనఁగా పరమపదమునకు) పునరావృత్తిలేదనుట సిద్ధించెడిని. ఐశ్వర్యములు అనిత్యములని ప్రతిపాదించుటకై యాలోకములం 'భోగైశ్వర్య'ము లనఁబడినవి. ఆ లోకములే అనిత్యములైయుండఁగా అందలియైశ్వర్యములు నట్టివేకావలయునని భావము. 'ఆ బ్రహ్మభవనా ల్లోకాః' అని భవనశబ్దముతో పాటు లోకశబ్దము చెప్పఁబడుటచే లోకమనఁగా జనము కానేరదు. మఱి లోకమునకు గమనములేదు గాన పునరావృత్తియుఁ జెల్లదు. కనుక 'పునరావర్తినః' అనుటకు 'వినాశమునొందునవి' అనఁబడెను. 'మా ముపేత్యతు' అనుచో తుశబ్దము పూర్వోక్తమైనవానికంటె వైలక్షణ్యమును దెలుపుచున్నది. కనుక పూర్వోక్తములవలె పునరావృత్తి లేనివాఁడు- అనఁగా అపునరావృత్తి గలవాఁడని యేర్పడుటచే ఈశ్వరునకు అపునరావృత్తి హేతువులగు సర్వజ్ఞాది విశేషణములు చెప్పఁబడెనని తెలియునది.

గములపరిమితి గలదానినిగాను, విదుః=తెలిసికొనుచున్నారు. అహోరాగమే=బ్రహ్మకు పగటికాల మయిన యప్పుడు, అవ్యక్తాత్=చతుర్ముఖదేహావస్థను బొందిన ప్రకృతినుండి, సర్వాః=సమస్తములయిన, వ్యక్తయః=త్రైలోక్యమునం దగపడెడి వస్తువులన్నియు, ప్రభవన్తి=పుట్టుచున్నవి. రాత్ర్యాగమే=బ్రహ్మకు రాత్రి అయిన యప్పుడు, అవ్యక్తసంజ్ఞకే=అవ్యక్తావస్థయనఁబడు, తత్ర ఏవ=ఆ బ్రహ్మ శరీరమునందె, ప్రలీయన్తే = లీనమగుచున్నది. పార్థ=అర్జునా, సః=అట్టి, అయం=ఈ భూతగ్రామః ఏవ= దేవమనుష్యాదిభూత సమూహమే, అవశః=కర్మపరవశమై, భూత్వాభూత్వా=పుట్టిపుట్టి రాత్ర్యాగమే= రాత్రికాల మయినప్పుడు, ప్రలీయతే=లయము పొందుచున్నది, అహరాగమే =పగటికాల మయినప్పుడు, ప్రభవతి=పుట్టుచున్నది.

తా. మనుష్యులు మొదలుగా బ్రహ్మపర్యంతము గల యయ్యె ప్రాణులకు నా సంకల్పముచేఁ గావింపఁబడిన యహోరాత్ర వ్యవస్థల నెఱింగినట్టివారు చతుర్ముఖబ్రహ్మకు పగలు *వేయి

---

| * కృతయుగమునకు | 1440000 | సంవత్సరములు |
|---|---|---|
| సంధికి | 2880000 | 1728000 |
| త్రేతాయుగమునకు | 1080000 | |
| సంధికి | 216000 | 1296000 |
| ద్వాపరయుగమునకు | 720000 | |
| సంధికి | 144000 | 864000 |
| కలియుగమునకు | 360000 | |
| సంధికి | 72000 | 432000 |
| చతుర్యుగము (లేక) ఒక మహాయుగమునకు ... | | 4320000 |

1000 మహాయుగములు బ్రహ్మకు నొకపగలు }
1000 మహాయుగములు బ్రహ్మకు నొకరాత్రి } =ఒక కల్పము.

చతుర్యుగముల పరిమితి గలదిగాను రాత్రియును అట్టి పరిమితిగలది గాను (అనఁగా అట్లు వేయిచతుర్యుగముల కొలఁది గలదిగాను) ఎఱుంగుదురు. 18. అందు బ్రహ్మకు పగలు వచ్చినపుడు, ముల్లో

---

360 కల్పములు బ్రహ్మకు నొకసంవత్సరము.

అట్టి 100 సంవత్సరములు ఒక మహాకల్పమనఁబడు. ఇదియే బ్రహ్మాయుస్సు. ఇట్లు నూఱుసంవత్సరములు గడిచినపిదప బ్రహ్మలోకపర్యంతముగల లోకము లన్నియు బ్రహ్మయును పరమపురుషుఁడగు నారాయణునియందు లయమునొందుదురు. ఇచట యుగశబ్దమును ప్రమాణాంతరములనుబట్టి చతుర్యుగపరముగా గ్రహించునది. 'సహస్రయుగపర్యన్తమ్' అని చతుర్ముఖుని యహస్సుయొక్కయు రాత్రియొక్కయు వ్యవస్థ నిట చెప్పనేలయనుటకు 'అవ్యక్తాద్వ్యక్తయః' అని యుత్తరము. అనఁగా బ్రహ్మకు అహస్సును రాత్రియును వచ్చునపుడు వరుసగా వ్యక్తులకు ప్రభవమును ప్రలయమును గలుగునని తెలుపుటకై యీయహోరాత్రములవ్యవస్థ చెప్పఁబడెనని గ్రాహ్యము. బ్రహ్మయొక్క అహస్సునందుబుట్టు వ్యక్తులుబ్రహ్మచే సృజింపఁబడినవియే కావలయును. కాన వ్యక్తు లనఁగా బ్రహ్మకు ముందుఁబుట్టిన మహదాదులు గానేరవు. మఱియును ప్రతి కల్పమందును సత్యలోకాదులకు ప్రలయములేదు గాన నవియును గావు. కనుక వ్యక్త అనఁగా త్రైలోక్యములోపల నున్న దేహేంద్రియాదివస్తువులు మాత్రమే కావలయును గాన నవియే యిట చెప్పఁబడెను. ఇవి చతుర్ముఖుని శరీరమునుండియే పుట్టును గాన అవ్యక్తమనఁగా మూలావ్యక్తము గాదు. అది యుపాదానముగాఁ గల బ్రహ్మశరీరమే యిట గ్రాహ్యము. ఇట్లు బ్రహ్మయొక్క అహస్సులును రాత్రులును గారణములై బడిబడివచ్చుచుండఁగా ప్రభవములును ప్రలయములును కార్యములై బడిబడివచ్చుచుండుననియు, ఇది సమస్తకల్పములందును వ్యాప్తమైయుండుననియు 'భూతగ్రామ' అను శ్లోకమునఁ జెప్పఁబడెడిని. ఇట భూతమనఁగా అచిత్తుతోఁగూడిన క్షేత్రజ్ఞుఁడు. ఇట్లు సృష్టిసంహారములకు లోనగుటకు హేతువు 'అవశః' అనఁబడెను. అనఁగా కర్మవశ్యుఁడనుట. ఈ నైమిత్తిక ప్రలయమును జెప్పుట శ్రుత్యాదిసిద్ధమైన ప్రాకృత ప్రలయమునకు నుపలక్షణము. 'ఆ బ్రహ్మభవనాత్' అనియు ముందు చెప్పఁబడి యున్నది. కాన సత్యలోక వినాశమును సిద్ధించుటచే 'బ్రహ్మలోకమువఱకుఁ గల' యనఁబడెను. ఇందులకు 'పృథివ్యప్సు లీయతే... అవ్యక్త మక్షరేలీయతే-అక్షరం తమసిలీయతే-తమఃపరేదేవ ఏకీభవతి' అని శ్రుతిప్రమాణము. పృథివ్యాదితత్త్వములే లయము నొందఁగా వానిచేఁ గల్పితములైన బ్రహ్మలోక బ్రహ్మశరీర బ్రహ్మాండాదులు

కములలోపల దేహేంద్రియ భోగ్యభోగస్థాన రూపములుగా వర్తించు
చుండు సమస్తములయిన వ్యక్తులు (కార్యపదార్థములు) ను చతుర్ము
ఖుని దేహరూపముగా నవస్థనొంది యున్న యవ్యక్తము (ప్రకృతి
నుండి పుట్టుచున్నవి. అవ్యక్తముయొక్క అవస్థా విశేషమయిన యా
చతుర్ముఖుని దేహమందే అవి రాత్రి వచ్చినపుడు లీనములగు
చున్నవి. 19. అట్టి యీ భూతసమూహమే కర్మవశ్యములై చతు
ర్ముఖునికి పగలువచ్చినపుడు పుట్టిపుట్టి రాత్రి వచ్చినపుడు అడఁగిపోవు
చున్నవి. మరల పగలు రాఁగా పుట్టుచున్నవి. అట్లు బ్రహ్మకు
సహస్రయుగముల కొలఁదికి నూరేండ్లు ముగియఁగా, ఆ తుదను
బ్రహ్మలోకమువఱకుఁ గల లోకములును బ్రహ్మయును, 'పృథివ్యప్సు
లీయతే. ఆపస్తేజసి లీయన్తే' (సుబాల-౨ ఖం) ఇత్యాదిక్రమమున
అవ్యక్తాక్షరతమః పర్యంతము నాయందే లయము నొందుచున్నవి.
ఇట్లు నేనుతప్ప తక్కిన సమస్తమునకు కాలవ్యవస్థచే నావలన నుత్ప
త్తియు నాయందు లయమును గలుగుటవలన వానికి ఉత్పత్తి వినాశ
యోగము త్రోసిపుచ్చనలవిగాదు. కనుక ఐశ్వర్యగతిని బొందిన
వారికి పునరావృత్తి పరిహరింపనలవి కాదు. నన్ను పొందిన
వారికన్ననో పునరావృత్తి ప్రసక్తియే లేదు.

---

లయించుటను జెప్పనేల ? యని భావము. అచిత్తునకు 'అక్షరము' 'అవ్యక్తము'
'తమస్సు' అనునవి అవస్థావిశేషములు. 'తమః పరేదేవ ఏకీభవతి' అని అన్నియు
తమస్సువఱకును పరదేవునియందే ఏకీభవించునట్లు శ్రుతియుండుటచే 'నా యందే
లయము నొందుచున్నవి' అనఁబడెను. శ్రుతులును 'ఏకోహవై నారాయణ ఆసీన్న
బ్రహ్మ నేశానః' (మహోప-౧-౧) అని మొదట నారాయణుఁడొక్కఁడే యుండుటయు
'యోబ్రహ్మాణం విదధాతిపూర్వమ్' (శ్వే-౬-౧౮) క్రమముగా మరల బ్రహ్మాదులను
సృజించుటయు నట్లె మరల బ్రహ్మాదులు లయించుటయును బ్రతిపాదించుచున్నవి.
ఇట్టి సృష్టిప్రళయములను నిపుడు ప్రతిపాదింపవలసినయక్కఱ యేమి? యన్నచో
'ఇట్లు.....త్రోసిపుచ్చ వలవిగాదు' అనఁబడెను. ఈ మూఁడు శ్లోకముల పిండి
తార్థమే యవతారికయందు చెప్పఁబడినదని తెలియునది.

అవ. *కైవల్యమును బొందినవారికిఁగూడ పునరావృత్తిలేదని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తా త్సనాతనః।
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥ 20

అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిమ్।
యం ప్రాప్య న నివర్తన్తే త ద్ధామ పరమం మమ॥ 21

టీ. తస్మాత్ అట్టి, అవ్యక్తాత్ =అచేతనరూపమగు ప్రకృతి కంటె. పరః=ఉత్కృష్టమయినదియు, అన్యః=విలక్షణమయినదియు, అవ్యక్తః=ఇంద్రియగోచరము కానిదియు, సనాతనః=నిత్యమయి నదియునగు, యః=ఏ, భావః=పదార్థము (జీవాత్మ), సర్వేషుభూ తేషు = ఆకాశాద సమస్తమహాభూతములు నశ్యత్సు = నశించు చున్నను, నవినశ్యతి=నాశమునొందదో, సః=అది, అవ్యక్తః= ఏ ప్రమాణముచేతను తెలియఁదగని, అక్షరః ఇతి=పరిశుద్ధాత్మ స్వరూప మని, ఉక్తః=చెప్పఁబడినది. తం=దానిని, పరమాం= ముఖ్యమయిన, గతిం=గతిసగా, ఆహుః=చెప్పుదురు. యం=ఏ పరి శుద్ధాత్మ స్వరూపమును, ప్రాప్య=పొంది, ననివర్తన్తే=మరల జన్మమునొందరో, తత్ =అది, మమ—నాయొక్క; పరమం=ముఖ్య మయిన, ధామ=నియమనస్థానము, (లేక) పరమం ధామ=ఉత్కృ ష్టమైన ప్రకాశము—మమ=నాది—నాకు శేషభూతమైనదిగా గ్రహింప వచ్చును.

---

*భగవంతుని బ్రాపించినవారికి, అపునరావృత్తి ముందే చెప్పఁబడెను. కైవ ల్యార్థికిని అవరోహణము లేదు గనుక అపునరావృత్తి చెప్పవలసియున్నది. ఇచట 'అవ్యక్తాత్ అన్యః అక్షరః' అని అవ్యక్తముకంటె వేఱయినదిగా నిర్దేశింపఁబడిన యక్షరము 'అపరేయమితస్త్వన్యామ్' ఇత్యాదులంబట్టి జీవుఁడే కావలయును. కనుక ఈ శ్లోకములు కైవల్యప్రాప్తులకును అపునరావృత్తి చెప్పునదే యగునని భావము.

తా. *అచేతన ప్రకృతిరూపమైన యీ అవ్యక్తమునకంటె

---

*ఇందు, 'అవ్యక్త' శబ్దమునకు విశేషణములగు 'పరః' 'అన్యః' అను రెండును సమానార్థకములు గావున పునరుక్తి గలుగుచున్నది. కాన 'పరః' అనుటకు 'ఉత్కృష్టుఁడు' అనబడెను. దేనియందు ఉత్కృష్టుఁ డన్నచో పురుషార్థ మగుటయందు ఉత్కృష్టుఁడు — అనఁగా ఉత్కృష్టమయిన పురుషార్థమగువాఁడు అనఁబడెను. ఈ ఉత్కృష్టతచేతనే ఆత్మ, అవ్యక్తమునకంటె స్వరూపమున వేఱయినవాఁ డని సిద్ధించుచున్నది గాన 'అన్యః' లనుటకు స్వరూపమున వేఱుపాటు చెప్పక ప్రకారమున వేఱుపాటు చెప్పఁబడినది. అనఁగా చేతనాచేతనత్వము లనెడి ప్రకారములచే వేఱుపాటు గ్రహింపఁబడెను గాన 'అచేతన...అవ్యక్తముకంటెను' అని అచేతన విశేషణముచే ప్రకృతిని 'జ్ఞానైకాకారుఁ డను విశేషణముచే ఆత్మకును వేఱు వేఱు ప్రకారములు చెప్పఁబడినవి. ఇచట భావమనఁగా పదార్థము. జీవుఁడు వ్యక్తుఁడు (అనఁగా గ్రాహ్యుఁడు) గాఁడు గనుక వ్యక్తః' అని పదచ్ఛేదముతగదు. 'అవ్యక్తోఽక్షరః' అని యిచటనే చెప్పఁబడియున్నట్లు అవ్యక్తః అనియే ఛేదము తగును. అవ్యక్తుఁడనఁగా ఏ ప్రమాణముచేతను వ్యక్తుడు కానివాఁడు. అయినను జీవుఁడు ప్రత్యక్షానుమానముల చేతను ఆగమముచేతను వ్యక్తుఁడై యుండగా అవ్యక్తుఁడెటగును? ఆ ప్రమాణములకు వ్యక్తుఁడుకానిచో ఆకాశపుష్పమువలె పేరికిమాత్ర మున్నవాఁడేకాని నిజమునకు లేనివాఁడగునే? యని శంకరాఁగా తనకే...అసాధారణాకారము గలవాఁడు' అనఁబడెను. అనఁగా ఆ యితర ప్రమాణములు జీవుని సాధారణ లక్షణములను ప్రతిపాదించునవే యగును. వాని యసాధారణాకారము వానికే యెఱుఁగ శక్యమగువని భావము. సనాతనుఁ డనఁగా నిత్యుఁడు. ఇందులకు హేతువు ద్వితీయాధ్యాయమునఁ జెప్పఁబడినట్లు 'ఉత్పత్తి...అర్హుఁడుగామిచే' అనఁబడెను. భూతమనఁగా నిచట మహాభూతములయిన ఆకాశాదులు. వానికి 'సర్వేషు' అను విశేషణముంబట్టి 'వాని కారణములును కార్యములును' అని కూర్చుట సిద్ధించినది. సర్వభూతములును నశించుచున్నను ఆత్మ నశింపదనికదా చెప్పఁబడెను. ఆ భూతములు నశించుచున్నప్పుడు ఆత్మకుఁగూడ నాశముకలుగుననుటకు ప్రసక్తిలేటు ఇటు నాశముకలుగుటకే ప్రసక్తిలేనపుడు 'నవినశ్యతి' అని నాశములేదని నిషేధమేల? అని శంకరాఁగా 'అందందు ఉన్నను' అని కూర్పఁబడెను. అనఁగా ఆ భూతములందెల్ల ఆత్మ యుండుటచె తిలలను దహించునపుడు అందలి తైలముకూడ దహింపఁబడునట్లు, ఆ భూతములు నశించునపుడు అందలి ఆత్మకును నాశము ప్రసక్తించుననియు అయినను అది నశింపదనియు భావము. 'అవ్యక్తోఽక్షరః' అని చెప్పఁబడుట యెక్కడనఁగా 'యేత్వ...ఇత్యాదులందు' అనఁబడెను. ఆ ప్రకరణములందు అచిత్తును ఈశ్వరునిని 'క్షరశ్చ' 'ఉత్తమః పురుష

పురుషార్థభావమునందు ఉత్కృష్టమైన వస్తువును (అనఁగా ప్రకృతి కంటె ఉత్కృష్టమైన పురుషార్థమగువాఁడును), జ్ఞానైకాకారుఁడుగా నుండుటచే నట్టి ప్రకృతికంటె విసజాతీయుఁడును, ఏ ప్రమాణము చేతను తెలిసికొనఁగూడనివాఁడును (అనఁగా తనకే తెలియఁదగిన తన యసాధారణాకారము గలవాఁడును-స్వయంప్రకాశుఁడును), ఉత్పత్తి వినాశముల కర్హుఁడుగామిచే నిత్యుఁడు నగునెవ్వఁడు, ఆకాశాది సమస్తభూతములును వాని కారణములును కార్యములును నశించు చుండగా, అందందు (నువ్వులలో తైలమువలె) తానుండినను వానిలోఁ గూడ తాను నశింపకుండునో వాఁడే అవ్యక్తుఁడు అక్షరుఁడు అని

---

స్త్వన్యః' అని వేఱుగా నిర్దేశించుటచే అక్షరశబ్దము జీవపరమే యగుచున్నది. కాన నీ యధ్యాయమందు 'అక్షరం బ్రహ్మపరమమ్' 'అవ్యక్తోఽక్షరః' అను అక్షరశబ్దమును పరిశుద్ధజీవపరమే కావలయును. మఱి 'యేత్వక్షర...' అనుచో అవ్యక్తాక్షర శబ్దములు రెండును ప్రయుక్తము లయినట్లె యిందును 'అవ్యక్తోఽక్షరః' అను రెండు శబ్దములును బ్రయుక్తములై యుండుటయు, ఇవి యందుంబోలె నిందును జీవపర మేయని గుర్తించుచున్నది. మీఁదిప్రకరణములం జెప్పఁబడఁబోవునది యిచట 'ఉక్తః' అని చెప్పఁబడినట్లుగా చెప్పుట యెటు పొసఁగుచునన్నచో, మీఁది ప్రకరణములకు మాఱుగా ఆ ప్రకరణములచే ఉపబృంహితమగు శ్రుతిని గ్రహింపవలయును. శ్రుతులు పూర్వసిద్ధములు కాన వానినిబట్టి యిట 'ఉక్తః' అనఁబడెను. 'ఆహుః' అనుటకు 'యదక్షరం వేదవిదో వదన్తి' అనుచోఁగల 'వేదవిదులు' అను కర్త నాకర్షించుకొని 'వేదవిదులు పరమగతినిగా చెప్పుదురు' అనఁబడెను. అక్షరపరమగతిశబ్దములు ఆత్మ యందుఁ బ్రయోగించుటకు వలయు యోగ్యతయే 'ప్రకృతిసంసర్గ... వెలకొనియున్న యాత్మ' యనఁబడెను. ప్రకృతిబంధమును బాసి పరిశుద్ధమై యుండుటంబట్టియే అక్షరమ నియుఁ బరమగతియనియు జెప్పఁబడుచున్నదని భావము. ఇట్టిది గావునదీనినుండి నివృత్తి గలుగదనుటకై 'నిజస్వరూపములో... నివర్తింపరు' అనఁబడినది. ధామమనఁగా స్థానము. ఆత్మ, స్థాన మయినపుడు స్థాని యీశ్వరుఁ డగుచున్నాఁడు. వీరిరువురకుఁ గలస్థాని స్థానభావము కేవలసంబంధము జెప్పునది గాదు. ఏలన, అది పూర్వమే సిద్ధమైయున్నది. కనుక 'య ఆత్మని తిష్ఠన్' ఇత్యాదులంబట్టి అధిష్ఠించి నియమించు సంబంధము గ్రాహ్యము; కాన నియమనస్థాన మనఁబడెను. అది 'పరమం ధామ' అని పరమమైన ధామముగాఁ జెప్పుటచే పరమము గానిది యేది యన్నచో 'అచేతన ప్రకృతి...'

'యే త్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే' (గీ-౧౨-౩) 'కూట స్థోఽక్షర ఉచ్యతే' (గీ-౧౫-౧౬) ఇత్యాదులందు చెప్పఁబడు చున్నాఁడు. వానిని వేదవిదులు పరమగతిగా (అనఁగా ప్రకృతిబంధ విముక్తమైన పరిశుద్ధస్వరూపముతో నున్న ఆత్మగా) చెప్పుదురు. వీఁడే 'యఃప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిమ్' అని యిచట పరమగతిశబ్దముచే నిర్దేశింపఁబడిన యక్షరుఁడు. అనఁగా ప్రకృతిసంసర్గము వీడి స్వస్వరూపముతో నెలకొనియున్న ఆత్మయని యర్థము. నిజస్వరూపముతోనున్న యిట్టియాత్మను బొందినవారు మరల జన్మింపరు. అట్టి ముక్తాత్మస్వరూపము నాకు పరమమైన ధామము-అనఁగా ఉత్కృష్టమైన నియమనస్థానము. అచేతన ప్రకృతి ఒకనియమనస్థానము. ఆయచేతన ప్రకృతితోడిసంసర్గముగల జీవప్రకృతి రెండవ నియమనస్థానము. అచిత్సంసర్గమువీడి నిజస్వరూపముతోనున్న ముక్తస్వరూపము పరమమైన నియమన స్థానము అని యర్థము. అది అపు నరావృత్తిరూపమైనది. (లేక) ధామశబ్దము ప్రకాశవాచకము. ప్రకాశ

---

అనఁబడెను. ముక్తుఁడుగూడ పరమాత్మకు పరతంత్రుఁడగు నేని స్వతంత్రుఁడగు నా పర మాత్మ మరల వానిని సంసారకూపమునఁ ద్రోయవచ్చునే యనఁగా 'అది అపునరా వృత్తిరూపమైనది' అనఁబడెను. అనఁగా సంసారమునకు కారణము అవిద్యాదులేకాని పారతంత్ర్యము గాదు. కనుక కారణమగు నవిద్యాదులు క్షీణించుటంబట్టియు ఈశ్వ రుని కారుణ్యాదులు స్వాభావికము లగుటంబట్టియు ముక్తునికి మరల సంసారగంధము గలుగదని భావము. లేక, భగవత్ప్రాప్తియే కాక పరిశుద్ధ జీవప్రాప్తికూడ పునరావృత్తి లేనిదనిభావము. లేక, ధామశబ్దమునకు తేజస్సు-అనఁగా ప్రకాశమనియు నర్థము. ప్రకాశ మిచట జ్ఞానమగును. 'పరమం' అను విశేషణమునుబట్టి 'ప్రకృతిసంసర్గ...పర మమైనధామము' అని చెప్పఁబడినది. ప్రకాశపక్షమున 'తత్ = ఆ, పరమంధామ = పరమమగు ధామము, మమ = నాకు-శేషభూత మని వాక్యార్థము. 'అపరేయమ్' ఇత్యాదులచే మునుపే తనకు శేషమగుటను జెప్పియున్నను, అచట సమష్టి చేతనాదు లను మాత్రము గురించి శేషమగుటను జెప్పెననియు నిచట ముక్తుఁడుగూడ తనకు శేషమగుటం జెప్పె ననియుఁ దెలియఁనగు. దీనిచే పునరుక్తి గలుగదు.

మనఁగా నిచట జ్ఞానమని యభిప్రాయము. ప్రకృతిసంసర్గముతో గూడి పరిచ్ఛిన్న జ్ఞానరూపమగు నాత్మాకారివై అపరిచ్ఛిన్న జ్ఞాన రూపముగల దగుటచే ముక్తస్వరూపము పరమమైన ధామము.

అవ. * జ్ఞానులకు ప్రాప్యమైనయది ముందు చెప్పఁబడిన కైవల్యార్థియొక్క ప్రాప్యముకంటె మిక్కిలివేఱైనదని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా।
యస్యాన్తస్స్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్॥ 22

టీ. హే పార్థ = అర్జునా, భూతాని = సమస్తప్రాణులు, యస్య = కారణభూతుఁడగు ఏ పరమపురుషునియొక్క, అన్తస్స్థాని = లోపలనున్నవో, యేన = ఎవనిచేత, ఇదం సర్వం = ఈ చరాచర ప్రపంచమంతయు, తతం = వ్యాపింపఁబడియున్నదో, సః = అట్టి, పరః పురుషః = పరమపురుషుఁడు, అనన్యయా = అన్యవిషయములేని భక్త్యా = భక్తిచేత, లభ్యః = పొందఁదగినవాఁడు.

తా. *'మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనఞ్జయ। మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥' 'మహతో భూతః పరమవ్యయమ్' ఇత్యాదులచే నిర్దేశింపఁబడినట్టి యెవ్వనిలోపల సర్వభూతము

16

లును అంతర్గతములై యున్నవో, పరుఁడైన యే పురుషునిచే నీసమస్తము నువ్యాప్తమైనదో, ఆ పరమపురుషుఁడు 'అనన్యచేతా స్సతతమ్'

*ఈ శ్లోకమున 'తు' శబ్దముచేత అర్థాంతరము దోఁచుటంబట్టియు, 'భక్త్యాఅనన్యయా' అనిన అనన్యభక్తియొక్క సామర్థ్యముంబట్టియు, పురుషశబ్దము 'సహస్రశీర్షాపురుషః' (పురుషసూక్త) ఇత్యాదులగు పెక్కుప్రయోగములందు పరమాత్మయందును వర్తించుటంబట్టియు, అది 'పరః' అని పరశబ్దముచే విశేషిత మగుటంబట్టియు, పూర్వోక్తఫలమునకంటె నధికఫల మిందు నుపదేశింపఁబడుచున్నదని 'జ్ఞానులకు ప్రాప్యమైనది...వేఱియనది' అన్నారు.

*ఆకాశాదులందు భూతములు అంతఃస్థితములైయున్నను ఆకాశాదులకు పర

అన్నట్లు అనన్యభక్తిచేత మాత్రము లభింపఁదగినవాఁడు (అనఁగా అనన్యభక్తులగు జ్ఞానులకు మాత్రము ప్రాప్యుఁడైనవాఁ డనుట).

అవ. *ఇఁక ఆత్మయాథాత్మ్యవిదునకును పరమపురుషనిష్ఠున కును సాధారణమగు నర్చిరాదిగతిని జెప్పుచున్నాఁడు. ఇరువురకును అర్చిరాదిక మగుగతి శ్రుతియందు శ్రుతమైయున్నది. ఆగతి అపున

17

రావృత్తిలక్షణమైనది. ఎట్లన-పంచాగ్ని విద్యయందు 'తద్యఇత్థం విదు ర్యేచేమేఽరణ్యే శ్రద్ధాతపఇత్యుపాసతే- తేఽర్చిషమభిసంభవ- న్త్యర్చి షోఽహః..' (ఛాం-౫-౧౦-౧) ఇత్యాదులందు అర్చిరాదిగతిచే

18

పోయినవానికి, 'స ఏనాన్ బ్రహ్మగమయత్యేష ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తన్తే' (ఛాం-౪-౧౫-౬) అని పర బ్రహ్మప్రాప్తియు అపునరావృత్తియు శ్రుతి ప్రతిపాదించుచున్నది. మఱియు 'తద్యఇత్థంవిదుః' అనెడి యీగతిశ్రుతి ప్రజాపతి వాక్యాదు లందు శ్రుతమైన పరవిద్యకు నంగభూతమగు ఆత్మప్రాప్తిని గుఱించి నది గాదు; (ఇది యంగ మగునాత్మప్రాప్తిని గుఱించినదేని యంగిని

త్వము లేదు. కనుక భూతములయంతఃస్థితిమాత్రముచే పరత్వము సిద్ధింపదు. అది సిద్ధించు టకై 'యస్య' 'యేన' అని ప్రసిద్ధిసూచకమగు యచ్ఛబ్దముచే పూర్వోక్తమగు పర త్వము తెలియుచున్నదని 'మత్తఃపరతరం..' ఇత్యాదిపూర్వోక్తులు చెప్పఁబడినవి. ఇట్టి భక్తి అనన్యమైనదనఁగా 'అనన్యచేతాస్సతతమ్' అన్నట్లు ఇతరమును గుఱింపక యెప్పుడున్న తన్నే గుఱించిన మనస్సుగలది యని యర్థము.

*'యత్రకాలేతు' అనుట మొదలుగా 'యోగయుక్తోభవార్జున' అనువఱకును గల తాత్పర్యమే 'ఇక...గతిని జెప్పుచున్నాఁడు' అని చెప్పఁబడెను. ఇందు ధూమాది గతిని జెప్పుట దానియెడ హేయత్వబుద్ధిగలుగుటకును అర్చిరాదిమార్గము నుపదేశించుట దాని ననుసంధించుటకును నని యిందలి తాత్పర్యమని భావము. పరమపురుషనిష్ఠునికే అర్చిరాది

గూడ గుఱించినట్లు కాన) 'యేచేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే' అని యంగి యగుపరవిద్యను గుఱించి ప్రత్యేకముగ శ్రుతి వ్యర్థమగు

---

గాని ఆత్మయాథాత్మ్యవిదునకును (అనఁగా ఆత్మనిష్ఠునకును) అదియెట్లు? అని యడుగఁగా ఇద్దఱికిని [అది కలిగియుండుట శ్రుతియందుఁ జూపట్టుచున్న దనిరి. మఱి యాత్మనిష్ఠునకు అపునరావృత్తి పూర్వము చెప్పఁబడియున్నది. ఇట అర్చిరాదిగతి 'అపునరావృత్తిలక్షణమైనది' అనుటచే అపునరావృత్తి మున్ను చెప్పఁబడిన ఆత్మనిష్ఠునికి అపునరావృత్తిలక్షణమైన అర్చిరాదియే గతి యగునని చెప్పినవారైరి. అర్చిరాదిగతి ఉభయనిష్ఠులకును సాధారణమె యనుటకును అది అపునరావృత్తిలక్షణ మనుటకును శ్రుతిని ప్రమాణీకరించుచున్నారు.—'తద్య ఇత్థంవిదుః-యే చేమేఽరణ్యే శ్రద్ధాతపఇత్యుపాసతే- తేఽర్చిషమభిసంభవన్తి - అర్చిషోఽహః' అని; 'తద్య ఇత్థంవిదుః' అనుటచే ఆత్మయాథాత్మ్యవిదులును 'యేచే...ఉపాసతే' అనుటచే పరపురుషనిష్ఠులును, 'తేఽర్చిష మభిసంభవన్తి' 'అర్చిషోఽహః' అనుటచే అర్చిరాది గతి ఆయుభయులకు సాధారణమగుటయుఁ జెప్పఁబడినది. అర్థ మెట్లనఁగా-(తత్) మున్ను ప్రస్తావింపఁబడిన సంసారిజీవుని స్వరూపమును, (యే) ఎవరు, (ఇత్థం) ఇట్లు పూర్వోక్తప్రకారమున- అనఁగా ద్యుపర్జన్యపృథివీ పురుషస్త్రీలందు శ్రద్ధాసోమవృష్ట్యన్నరేత శ్శరీరక మైనదిగాను దేహమునకు విలక్షణమైనదిగాను ప్రకృతికి వేఱయినదిగాను ననుట, (విదుః) ఎఱుఁగుదురో, (అరణ్యే) అరణ్యమందుండి, (యేచ ఇమే) ఎవరు, (శ్రద్ధా) శ్రద్ధతో- అనఁగా లక్ష్మితోఁగూడిన, (తపఃఇతి) తపస్సనెడి బ్రహ్మమును, (ఉపాసతే) ఉపాసింతురో, (తేఽర్చిషమభిసంభవన్తి) వారుభయులును అర్చిస్సును-అనఁగా అర్చిరభిమాని దేవతను-బొందుదురు. (అర్చిషః) అర్చిస్సు (దేవత) నుండి, (అహః) అహస్సు (దేవతను...). ఇట అహస్సు (దేవత) నుండి 'అహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షాత్ యాన్షడుదఙ్జేతిమాంసాంస్తాన్ । మాసేభ్య స్సంవత్సరం సంవత్సరాదాదిత్య మాదిత్యాత్ చన్ద్రమసం చన్ద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః సఏతాన్ బ్రహ్మగమయతి' అన్నట్లు పక్షమాస సంవత్సర ఆదిత్య చంద్రవిద్యుత్తులవఱకుఁబోఁగా వైద్యుత పురుషుఁడు బ్రహ్మముఁ జేర్చును. ఇట్లు ఉభయవిధనిష్ఠులకును అర్చిరాదిగతిని జెప్పి ఆగతి బ్రహ్మప్రాప్తినిగలిగించునదనియు పునరావృత్తి లేనిదనియుఁ జెప్పుచున్నాఁడు. 'సఏనాన్ బ్రహ్మగమయతి' వాఁడు-అనఁగా ఆవైద్యుత పురుషుఁడు బ్రహ్మమును బొందించుచున్నాఁడు. 'ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తన్తే'

చున్నది. (ఇట అంగి చెప్పఁబడుటచే అంగ మక్కఱలేదు గాన 'తద్య ఇత్థంవిదుః' అను శ్రుతి యంగమగు నాత్మప్రాప్తిని గుఱించునది

---

'దీనిచేత-అనఁగా ఈగతిచేత - పొందఁబడినవారు మనుష్యసంబంధియైన యీసుడికి (అనఁగా సంసారభ్రమణమునకు) మరలిరారు. అనఁగా పునరావృత్తి నొందరు' అని యర్థము. ఇక్కడ "యేచేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే' అను శ్రుతిచే బ్రహ్మోపాసనము (అనఁగా పరవిద్య యగు భక్తి) చెప్పఁబడెను గాన 'తద్య ఇత్థం విదుః' అను శ్రుతి దాని కంగ మగు ఆత్మప్రాప్తిని జెప్పునది కావచ్చును. ఏలన, అంగి యగు పరవిద్యయొక్క ఫలములగు అర్చిరాదిగతియు బ్రహ్మప్రాప్తియు అంగమునకును నిర్దేశించుటకు యుక్తమేకదా ? ' యని శంకింపవచ్చును. కాని 'తద్య ఇత్థం విదుః' అను శ్రుతి పూర్వపట్కమునఁ జెప్పఁబడిన పరవిద్యాంగమగు ఆత్మదర్శనమును జెప్పునదిగాదు. అది ఆయంగమును గుఱించినదేని అంగిఫలమును అంగమునకును జెప్పుట యుక్తమే; అయినను అంగికిని అంగమునకును ఫల మొక్కటియే కాన అంగిని జెప్పియుండఁగా అంగమును జెప్పినట్లై యగును; కనుక అంగమును వేఱ చెప్పనక్కఱ లేదు. అట్లుగాక అంగిని జెప్పి, దానితో సమానముగా నంగమునుగూడ వేఱ చెప్పిన యెడల అట్లు వేఱువేఱ చెప్పినందులకు ఆరెంటికిని ఫలమును వేఱువేఱైయుండవల యును; కాని యొకదాని ఫలమే మఱొక్కటికిఁ జెప్పనొప్పదు. లేక ఫలమొక్కటినే చెప్పినపుడు ఆరెండును ఒకటికి నొకటి అంగమును అంగియునుగాక వేఱైకాని యుండ వలయును. ఇట ఫల మొక్కటియే కాన నారెండిటికిని అంగాంగిభావముకలుగదు. కనుక 'తద్య ఇత్థం విదుః' అనుట పరవిద్యాంగమును గుఱించినదిగాదు. అట్లు గుఱించు నేని 'యేచే...త్యుపాసతే' అని పరవిద్యను గుఱించి వేఱ శ్రుతిని జెప్పుట వ్యర్థమే యగును. దీనింబట్టి పూర్వపట్కమునఁ జెప్పఁబడిన యాత్మదర్శనమును ఈపట్కమం దలి ఆత్మయాథాత్మ్యానుసంధానమును వేఱువేఱైన వని తెలియుచున్నది. 'తద్య ఇత్థం విదుః' అను శ్రుతి ఆత్మయాథాత్మ్యవిదులను గుఱించినదెట్లు ? అనఁగా 'పంచాగ్ని విద్యయందు...మరలిరారు. (అనఁగా పునర్జన్మమునొందురు) అని చెప్పఁబడినదని తెలియుచున్నది' అనఁబడెను. 'ఇతితు పఞ్చమ్యా మాహుతావాపః పురుషవచసో భవన్తి' 'రమణీయచరణా రమణీయాంయోనిమ్...కపూయచరణాః కపూయాం యోనిమ్' ఇట్లు ఐదవ యాహుతియందు (అనఁగా స్త్రీయం దనుట తక్కిన భూతములతోఁగూడిన) జలములు పురుషుఁడు (దేహధారి) అను పేరుగలదగుచున్నది.' 'ఘంచిక్రుత్యములచేయు

యగును.) ఆత్మయాథాత్మ్యవిదునకును పరమపురుష నిష్ఠునకును 'సవనాన్ బ్రహ్మగమయతి' అని బ్రహ్మప్రాప్తిని జెప్పుటంబట్టి, అచిత్తును వీడిన యాత్మవస్తువు బ్రహ్మాత్మకమగుటచే బ్రహ్మశేషత్వైకరసమని యనుసంధింపఁదగును. తత్క్రతున్యాయమునుబట్టియు నట్లనుసంధింపఁదగును. అది పరశేషత్వైకరస మగుటయు 'య ఆత్మని తిష్ఠన్ ... యస్యాత్మా శరీరమ్' (శతపథ-మాధ్య-౧౪-౬-౫-౩౦) ఇత్యాది శ్రుతిసిద్ధము.

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥ 23
అగ్నిర్జ్యోతిరహ శ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ 24

టీ. హేభరతర్షభ = అర్జునా, యత్రకాలే = ఏకాలమునందు-(కాలాభిమాని దేవతలుండు మార్గమునందు,) ప్రయాతాః = శరీరము విడిచిపోయిన, యోగినః = జ్ఞానులు, అనావృత్తిం = పునర్జన్మరాహిత్యమును, (పుణ్యాకర్మాణస్తు = పుణ్యాకర్మముగలవారు,) ఆవృత్తించైవ = పునర్జన్మమును, యాన్తి = పొందుచున్నారో, తం కాలం = ఆ మార్గమును అనుట, వక్ష్యామి = చెప్పెదను, అగ్నిర్జ్యోతిః = అగ్నిరూపమయిన తేజస్సును, అహః = పగలును, శుక్లః = శుక్లపక్షమును, షణ్మాసాః = ఆఱుమాసములుగల, ఉత్తరాయణం = ఉత్తరాయణమును - (అనఁగా ఈచెప్పఁబడిన వానికెల్లను అభిమాని దేవతలు,) (యత్రసన్తి = ఏమార్గమునందున్నారో,) తత్ర = ఆ మార్గముగా, ప్రయాతాః = ప్రయాణము చేసిన, బ్రహ్మవిదః = బ్రహ్మోపాసకులగు, జనాః = జనులు, బ్రహ్మ = బ్రహ్మమును, గచ్ఛన్తి = పొందుచున్నారు.

తా *(ఇచట మార్గమునందు, అహస్సు మొదలుగా సంవత్స

---

*యోగిశబ్దమునకు అనావృత్తి కనుగుణముగా జ్ఞానులనియు, ఆవృత్తికనుగుణ

రమువఱకుఁగల యాయాకాలముల యొక్క యభిమాని దేవతలు పెక్కండ్రు ఉండి వా రాయామార్గమును పొందించువా రగుటవలన కాలశబ్దముచేత కాలాభిమాని దేవతాపూర్ణమగు నామార్గము చెప్పఁబడుచున్నది.) అర్జునా ! దేహము విడిచి యేమార్గమునందుఁ బోయిన యోగులు అనావృత్తిని (అనఁగా పునర్జన్మము లేకుండుటను) పుణ్యకర్ములు ఆవృత్తిని (అనఁగా పునర్జన్మమును) బొందుదురో, ఆ మార్గమును జెప్పెదను. అగ్నిరూపమయిన తేజోభిమాని దేవతయు దివాభిమాని దేవతయు శుక్లపక్షాభిమాని దేవతయు, షణ్మాసపరిమితి గల యుత్తరాయణమున కభిమాని దేవతయు, మొదలగువా రుండునట్టి యే మార్గవిశేషముగలదో యట్టి మార్గమునఁబోయిన బ్రహ్మోపాసకులగువారు బ్రహ్మమును బొందుదురు. (జ్ఞానులు పరబ్రహ్మమును బొందుదురనియు, జిజ్ఞాసువులు - అనఁగా ఆత్మయాథాత్మ్యవిదులు ప్రకృతివియుక్తమైన ఆత్మస్వరూపమనెడి బ్రహ్మమును బొందుదురని గ్రహింపవలెను). *'అగ్నిర్జ్యోతిరహశ్శుక్లషణ్మాసా ఉత్తరాయణమ్'

19

అనుట సంవత్సరాదులకును ప్రదర్శనము.

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణషణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే॥

టీ. ధూమః=ధూమాభిమాని దేవతయు, రాత్రిః=రాత్ర్యభిమాని దేవతయు, తథా=అట్లే, కృష్ణః=కృష్ణపక్షాభిమాని దేవతయు,

---

ముగా పుణ్యకర్మయోగము (సంబంధము) గలవారనియు నర్థములు గ్రహింపఁదగును. లేనియెడల పుణ్యకర్ములు అనుకర్తను అధ్యాహరించు కొనవచ్చును. ఇది అర్చిరాది మార్గము, దీనినే దేవయానమందురు.

* ఈ అగ్నిర్జ్యోతిరాదులు 'తేర్చిష మభిసమ్భవ న్త్యర్చిషోఽహరహ్న ఆపూర్య

షణ్మాసాః = ఆఱుమాసముల పరిమితి గల, దక్షిణాయనం = దక్షిణాయనమున కభిమాని దేవతయు, (యత్రసన్తి = ఏమార్గమునందున్నారో), తత్ర = ఆ మార్గమునందు, చాన్ద్రమసం = చంద్ర సంబంధి యగు, జ్యోతిః = తేజస్సును, ప్రాప్య = పొంది, యోగీ = పుణ్యకర్మసంబంధము గలవాఁడు, నివర్తతే = మరల వచ్చుచున్నాఁడు.

20

తా. (ఇదియు ధూమాదిమార్గమందున్న పితృలోకాదులకు

21

ప్రదర్శనము. *ఇచట యోగిశబ్దము పుణ్యకర్మసంబంధులను గుఱించినది.) ధూమాభిమాని దేవతయు, రాత్ర్యభిమాని దేవతయు, కృష్ణపక్షాభిమాని దేవతయు, ఆఱుమాసములు పరిమితిగల దక్షిణాయనమున కభిమాని దేవతయు, ఏమార్గముననుండుదురో అట్టి చంద్రమండల మార్గమున, పుణ్యకర్మలఁ జేసినవాఁడు పోయి స్వర్గాదిభోగము లనుభవించి మరల వచ్చి యిచట జనియించును.

శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః॥

టీ. శుక్లకృష్ణే = శుక్లపక్షసంబంధముగల అర్చిరాదియు కృష్ణపక్షసంబంధముగల ధూమాదియు ననెడి, ఏతే గతీ = ఈ రెండుమార్గ

---

మాణపక్షా మాపూర్యమాణపక్షాత్ యాన్ షడుదఙ్ఙేతిమాసాం స్తాన్మాసేభ్యః స్సంవత్సరమ్...' ఇత్యాదిశ్రుత్యనుసారముగా సంవత్సరాదులనుగూడ గ్రహించుచున్నవని యొఱుంగునది. ఈయర్చిరాదిగతిలోనివియే 'అర్చిరహస్సితపక్షా నుదగయనాబ్దమరుదర్కేన్దూన్। అపివైద్యుత వరుణేంద్ర ప్రజాపతీ నాతివాహికానాహుః' అని విశదముగాఁ జెప్పఁబడియున్నవి.

*యోగులకు ధూమాదిగతియును పునరావృత్తియుఁ జెప్పనొప్పదు. కనుక ఇచట యోగ మనఁగా, ఉపాయము, లేక సంబంధము అని యర్థము గ్రహించి యోగులనుటకు

ములు, జగతః=లోకమునకు, శాశ్వతే=ప్రవాహరూపమున నిత్యమైనవిగా, మతేహి=(శ్రుతియందు) తలంపబడినవిగదా. ఏకయా=మొదటిదగు అర్చిరాదిమార్గముచేత, అనావృత్తిం=పునర్జన్మరాహిత్యమును, యాతి=పొందుచున్నాఁడు, అన్యయా = వేఱొకటియగు ధూమాదిమార్గముచేత, పునః=మరల, ఆవర్తతే=వచ్చుచున్నాఁడు-జన్మించుచున్నాఁడు.

తా. శుక్లగతి అర్చిరాదిక-శుక్లపక్షముతోఁ గూడినది అర్చిరాదిమార్గము. కృష్ణగతి ధూమాదిక-కృష్ణపక్షముతోఁ గూడినది ధూమాదిమార్గము. శుక్లగతిచే అనావృత్తిని (అనఁగా మరలిరామిని-పునర్జన్మరాహిత్యము ననుట) పొందుచున్నాఁడు. కృష్ణగతిచేత మరలి వచ్చుచున్నాఁడు (అనఁగా పునర్జన్మము నొందుచున్నాఁడు.) ఈశుక్లకృష్ణగతులు రెండును* జ్ఞానులకును, నానావిధ పుణ్యకర్మలకును [తద్య ఇత్థం విదుర్యేచే మేఽరణ్యే శ్రద్ధాతపః ఇత్యుపాసతే తేఽర్చిషమభిసంభవన్తి' (ఛా-౫-౧౦-౧) 'అథ యఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తేధూమమభిసంభవన్తి' (ఛా-౫-౧౦-3) అని.] శ్రుతియందు శాశ్వతము లైనవిగా నెన్నఁబడియున్నవి.

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥ 27

---

పుణ్యకర్మసంబంధు లని యర్థము చేసికొనఁదగును. ఇందు ధూమాదులు ధూమాదిమార్గమున నున్న పితృలోకాదులనుగూడ గ్రహించుచున్న వని తెలియనది. ఇది ధూమాదిమార్గము. దీనినే పితృయాన మందురు.

*ఇచట 'శుక్లకృష్ణే' అని రెండుగతులను జెప్పఁబడుటచే జగచ్ఛబ్దముచే ఆరెంటియధికారు లిరువురును జెప్పఁబడఁదగును గాన 'జ్ఞానులకును...కర్మలకును'

టీ. హే పార్థ=అర్జునా, ఏతే=ఈ, సృతీ = రెండుమార్గము లను, జానన్=ఎఱుఁగుచున్న, కశ్చన యోగీ=ఏయోగియును - ఏయుపాసకుఁడును, నముహ్యతి=మోహముఁ జెందఁడు, తస్మాత్ = కావున, అర్జున=అర్జునా, సర్వేషు=సమస్తములయిన, కాలేషు= కాలములయందును, యోగయుక్తః=(అర్చిరాదిగతిని చింతించుట యనెడి) యోగముతోఁ గూడినవాఁడవు, భవ=అగుము.

తా. అర్జునా, ఈ రెండుమార్గములనెఱిఁగిన (అనఁగా ఈ రెంటిలో నొకటి ఉపాదేయముగాను మఱియొకటి హేయముగాను నెల్లప్పుడు అనుసంధానము చేయుచున్న) యోగి యెవ్వఁడును ప్రాణ ప్రయాణకాలమునందు భ్రమమునొందఁడు. తాను పోఁదగిన అర్చి రాదిమార్గవిషయమునందు వ్యాకులచిత్తుఁడు కాఁడు. మఱి తనదైన

---

అనఁబడెను. 'తద్య ఇత్థంవిదుః-యేచేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే తేఽర్చిషమభిసమ్భ వన్తి-అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తేదత్త మిత్యుపాసతే తే ధూమమభిసమ్భవన్తి' అని శ్రుతి రెండుమార్గములను జెప్పుచున్నది. 'తద్యఇత్థం విదుః' అని యాత్మనిష్ఠులకును 'యేచేమేఽరణ్యే శ్రద్ధాతపఇత్యుపాసతే' అని పరమపురుషనిష్ఠులకును (జ్ఞానులకును) 'తేఽర్చిషమభిసమ్భవన్తి' అని అర్చిరాదిమార్గమును జెప్పుచున్నది. 'అథయ ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మిత్యుపాసతే' అని యిష్టాపూర్తాది వివిధపుణ్య కర్మనిష్ఠులకు 'తేధూమ మభిసమ్భవన్తి' అని ధూమాదిమార్గమును చెప్పుచున్నది అని తెలియనగును. 'అథ... ధూమమభిసమ్భవన్తి' ధూమాత్ రాత్రింరాత్రే రపరపక్ష మపరపక్షా ద్యాన్ షడ్ దక్షిణేతి మాసాంస్తాన్నైతే సంవత్సర మభిప్రాప్నువన్తి' అని శ్రుతి. అర్థము-(యేఇమే) ఏపురు షులు, (గ్రామే) గ్రామమందేయుండి, (ఇష్ట) యాగాదులను, (పూర్త) తటాకాదు లను, (దత్తం) దానములు, (ఇతి) వీనికి సజాతీయము లయిన యుపవాసాదులగు నితర కర్మములను, (ఉపాసతే) ఉపాసింతురో-యాగదానహోమాది కర్మముల నెవరనుష్ఠిం తురో యనుట, (తే) వారు, (ధూమం) ధూమమును-ఇట ధూమాది శబ్దములచే వాని వాని యభిమానిదేవతలను గ్రహించునది. ధూమమునుండి రాత్రి, దానినుండి కృష్ణ పక్షము, దానినుండి (షడ్దక్షిణామాసాన్) దక్షిణాయనమాసములను (బొందుదురు)

దేవయాన మార్గముచేతనే పోవును. కాఁబట్టి నీవు ఎల్లకాలము అర్చిరాదిగతి చింతనమనెడి యోగముతో (అనఁగా * ధ్యానముతోఁ) గూడియుండుము. 22

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు య త్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరంస్థాన ముపైతి చాద్యమ్॥ 28

టీ. ఇదం=ఈ (రెండు అధ్యాయములయందలి) భగవన్మాహాత్మ్యమును, విదిత్వా=తెలిసికొని, వేదేషు=వేదాభ్యాసములయందును, యజ్ఞేషు=యజ్ఞములయందును, తపస్సు=తపములయందును, దానేషు చైవ=దానములయందును, యత్=ఏ, పుణ్యఫలం=పుణ్యఫలము, ప్రదిష్టం = చెప్పఁబడినదో, తత్సర్వం = దానినన్నిటిని, అత్యేతి=అతిక్రమించుచున్నాఁడు. యోగీచ (భూత్వా)=జ్ఞానియునై; పరం=ఉత్కృష్టమయినదియు, ఆద్యం=అనాదియునగు, స్థానం=స్థానమును (పదవిని) ఉపైతి=పొందుచున్నాఁడు.

తా. *ఎవఁడుగాని యీ రెండధ్యాయములయందు చెప్పఁబడిన యీ భగవన్మాహాత్మ్యమును దెలిసి (కొనునేని) ఋగ్వ్య

---

(తే) ఈ యిష్టాపూర్తాది పుణ్యకర్మలు (నసంవత్సర మభిప్రాప్నువంతి) దక్షిణాయన మాసములను బొందియు విద్వాంసులవలె సంవత్సరమును బొందరని యర్థము.

*'నైతే...కశ్చన' అని గతిజ్ఞానమునకు గతిభ్రమము కలుగదని ఫలమును జెప్పి, యీ హేతువునుబట్టి 'యోగయుక్తోభవ' అన్నాఁడు. ఇం దా హేతువునుబట్టి యోగ శబ్దమునకు సాక్షాద్యోగము చెప్పుట పొసఁగదు గాన ప్రస్తుతగతి చింతనరూపమైన యోగమును (అనఁగా ధ్యానమును) గలవాఁడ వగుమని యర్థము గ్రాహ్య మయ్యెను.

* ఇట 'వేదేషు...యత్పుణ్యఫలమ్ప్రదిష్టమ్' అనుచోట 'వేదములందు ఏపుణ్య

**యజున్సు సామము అథర్వము ననెడి వేదముల నభ్యసించుట**

---

ఫలము ప్రతిపాదింపఁబడినదో' యని వేదములు ఫలమును ప్రతిపాదించునవిగా గ్రహింపఁబడినట్లు అర్థమగుచున్నది. 'యజ్ఞేషు' అని యజ్ఞాదిఫలము లిచట వేఱుగా చెప్పఁబడియుండుటవలన వేదము లిచట యజ్ఞాదిఫలములకు వేఱయినఫలములను ప్రతిపాదించునవిగా గ్రహించుకొనవలసి వచ్చుచున్నది. యజ్ఞాదిఫలములనుగూడ నవి ప్రతిపాదించునవిగా నుండియు ఆఫలములనుగాక వేఱుఫలములను ప్రతిపాదించునట్లు వాని కిచట సంకోచము కలుగుచున్నది. లేక, యజ్ఞాదిఫలములనుగూడ ప్రతిపాదించునవిగా గ్రహింతము. ఈయధ్యాయముల యర్థముగూడ వేదప్రతిపాదితమైన యర్థమే కనుక 'వేదేషు యత్పుణ్యఫలమ్ ప్రదిష్టమ్ తత్ ఇదమత్యేతి' అనుచో 'వేదములు ప్రతిపాదించుఫలమును (వేదప్రతిపాదితార్థమైన) యిది అతిశయించుచున్నది' అని ఒకటికంటె మఱొకటి యతిశయించునదిగా అర్థముకాఁగా 'వేదేషు' అన్న వేదములు ప్రతిపాదించు విషయము వే అనియు 'ఇదం' అన్న వేదప్రతిపాదితమైన విషయము వే అనియుఁ దేలుచున్నది. ఇట్లు 'వేదేషు' అన్న వేదములే 'ఇదం' అన్న వేదార్థమునుగూడ ప్రతిపాదించునవిగా నుండియు 'ఇదం' అన్న విషయమును గాక వేఱువిషయమును ప్రతిపాదించునట్లుమరలసంకోచము నొందుచున్నది. కాఁబట్టియిట 'వేదేషు యత్పుణ్యఫలమ్ప్రదిష్టమ్' అనుటకు వేదములు ఫలమును ప్రతిపాదించునవిగా గ్రహింపరాదు. యజ్ఞాదులవలె ఫలమును ఇచ్చునవిగా అర్థము సేసికొనవలయును. మఱియు వేదాభ్యాసము పాపక్షయాది ఫలముల నిచ్చుట శ్రుత్యాదిసిద్ధము గనుక 'వేదముల నభ్యసించుట' అనఁబడినది. పుణ్యఫలమ్' అనుచో ఫలమునకు విశేషణ మయిన పుణ్యము యజ్ఞాదులతోఁడి విశేష్యముగాఁ జేయుట, అట్టివానివలన కలుగు ఫలము శ్లాఘ్యమయినదిగాఁ దెలుపుటకని తెలియునది. సప్తమాధ్యాయముయొక్క ఆరంభమందే భగవన్మాహాత్మ్యము ఉపక్రమింపఁబడెను గదా. తక్కిన వెల్లను ఈ యధ్యాయముకడవఱకును దాని యనుబంధమే కాని 'అధ్యాయములు రెంటిచేఁ జెప్పఁబడిన భగవన్మాహాత్మ్యము' అనఁబడినది. 'తత్సర్వమత్యేతి' దానినంతయు నతిక్రమించుచున్నాఁడని యర్థము. అనఁగా రెంటిఫలములను వివేచించినపుడు ఒకటి నిరతిశయఫల మని తెలియుటచే దానియందు మిక్కిలి ప్రీతియు తక్కిన ఫలములందు విరక్తియు అనాదరమును గలుగునుగదా. కావుననే 'ఈ మాహాత్మ్యమును...తలఁచుచున్నాఁడు' అనఁబడెను. భగవన్మాహాత్మ్యజ్ఞానము పూర్వోక్తమైన జ్ఞానవిశేషముద్వారా పరస్థానప్రాప్తి కలిగించు ననెడి యభిప్రాయముతో 'యోగీ' అనుటకు 'జ్ఞానీచ భూత్వా = జ్ఞానియునై' అని ఆ జ్ఞానవిశేషమును రూపించుట తెలియునది. స్థానము 'పర' మనఁగా 'ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్' 'తదక్షరే పరమేవ్యోమని' దివ్యం స్థానమక్షరం చాప్రమేయమ్' అని దేశకాలదూరాగాములచే అన్నిటికంటె ఎక్కుడయినది,

యందును, యజ్ఞములు తపస్సులు దానములు మొదలయిన పుణ్య కర్మములయందును ఏఫలము నిర్దేశింపఁబడియున్నదో దానినంత యును అతిక్రమించుచున్నాఁడు—అనఁగా ఈ మాహాత్మ్యమును తెలిసికొనుటవలనఁ గలుగు సుఖాతిశయముచేత ఆవాని ఫలమునంతయు తృణమువలె తలఁచుచున్నాఁడు. మఱి యోగి (జ్ఞాని)యునై జ్ఞానికి పొందఁదగినదియు, సర్వోత్కృష్టమును, అనాదియు నగుస్థానమును బొందుచున్నాఁడు.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగోనామ అష్టమోఽధ్యాయః



# అ ష్టమో ఽ ధ్యాయః

## అక్షరపరబ్రహ్మయోగము - అవతారిక

### 1వ శ్లోకము

(1) 2వ శ్లోకమునందున్న "అస్మిన్ దేహే" యను చోట 'అస్మిన్' అను శబ్దము 'ఇదం' శబ్దముయొక్క సప్తమీ ఏకవచనము. ఇదం శబ్దమునకు తన యెదుట ప్రత్యక్షముగా గాన్పించుచున్నవారి విషయముననే ప్రయోగింపబడవలెను. ఇచ్చట భగవంతునకు శరీర భూతులగు నింద్రాదుల విషయమై యీ శబ్దము వాడబడినది. వారు ప్రత్యక్షభూతులా? యన్నచో నింద్రాదు లర్జునకు ప్రత్యక్షముగా గాన్పింతురనుటలో సందేహము లేదు.

### 2వ శ్లోకము

(2) అరుణ పుత్రుడగు శ్వేతకేతుని ప్రవాహణుడను పాంచాలరాజు కామ్యకర్మ లొనరించువారు బొందు దేశమునుగూర్చియు కర్మఫలానుభవ మచ్చట ముగియగనే వారు తిరిగి భూమికి వచ్చు రీతిని అర్చిరాది ధూమాది మార్గముల తారతమ్యమును, పైలోక గంధమే యెఱుంగని జీవులను గుఱించియు ప్రశ్నించి చివరకు భూత సూక్ష్మములు ఐదవ ఆహుతికి వచ్చుసరికి మనుష్యశరీరమును దాల్చు విధానమును, ఎఱుంగుదువా? యని ప్రశ్నించెను. ఆతడు దాని నెఱుంగక పోవుటచే తానే దానిని చెప్పెను.

పుణ్యకర్మలను గావించి మృతిచెందిన జీవు డాశరీరమును విడిచి పోవునపుడు భూతసూక్ష్మములతోను జ్ఞానేన్ద్రియములతోను ఏర్పడిన సూక్ష్మశరీరముతో ద్యులోకమున కేగును. శ్రుతి యా ద్యులోకము నొక యగ్నిగాపోల్చి దానియందు యింద్రియములు భూతసూక్ష్మ ములను జీవునితోపాటు వ్రేల్చును. దాన నీ భూతసూక్ష్మములు

చంద్రునివలె సుందరమైన సోమరాజ శరీరముగా పరిణమించును. జీవులును ఇంద్రియములును ఆ శరీరమున ప్రవేశింతురు. వెంటనే తిరిగి యా యింద్రియము లీ సోమరాజు రూపముతోనున్న భూత సూక్ష్మములను రెండవ యగ్నిగా రూపింపబడు పర్జన్యునియందు వ్రేల్చును. దానిచే నవి వర్షరూపముగా పరిణమించును. వెంటనే తిరిగి యా యింద్రియము లా వర్షాకారముతోనున్న భూతసూక్ష్మములను భూమియనబడు మూడవ యగ్నిహోత్రమున వ్రేల్చును. దాన నవి యన్నరూపమును దాల్చును. తిరిగి యింద్రియము లాయన్నరూపముతోనున్న భూతసూక్ష్మములను పురుషుడను నాల్గవ యగ్నిలో హోమముచేయును. దాన నవి రేతోరూపమును దాల్చును. తిరిగి యింద్రియము లా రేతోరూపముతోనున్న భూతసూక్ష్మములను స్త్రీ యనబడు ఐదవయగ్నిలో వ్రేల్చగా నా స్త్రీగర్భమునుదాల్చి పురుషుని గనును. ఇదియే పంచాగ్నివిద్య. సంసారమున వైరాగ్య ముదయించుటకై ఉపనిషత్తులలో నీ విద్య చెప్పబడినది. శ్రీ భాష్య తృతీయాధ్యాయ ప్రథమ పాదమున దీని వివరమును గాంచవచ్చును.

3వ శ్లోకము

(3) అనుబంధములనగా - కారణభూతములైన కర్మలున్ను, వాని కార్యభూతములైన గర్భవాసాదులును.

(4) పంచాగ్ని విద్యలో నచిత్తు సర్వావస్థలయందును విడువక వెంబడించుచుండుననియు విడిపించుకొన శక్యముకాదనియు, గర్భ జన్మాది దుఃఖముల కాకరమనియును, కాబట్టి యసహ్యించుకొనదగిన దనియు భయావహమైనదనియు చెప్పబడెను. ఉద్వేజనీయత్వమనగా. నిట్లు జుగుప్సనీయత్వమున్ను భయావహత్వమున్ను అగుట మాత్రమే.

4వ శ్లోకము

(5) ఈ సంబోధన అర్జునునికి అధ్యాత్మవిచారమున కుండవల సిన సత్వగుణాధిక దేహేంద్రియాదులు కలవనియు. భగవంతున కలౌకి కేంద్రాది దేహము కలిగియుండుటలో నుదాహరణమున్ను సూచింప బడినవి.

(6) ఈ శ్లోకమున భావశబ్దము జాత్యేకవచనము. గాన బహువచనార్థము నే గ్రహించవలెను.

(7) అధిదైవతం = ఇంద్రాది దేవతలకన్న గొప్పస్థితిలో నుండువాడు.

5వ శ్లోకము

(8) మద్భావంయాతి యనగా — భ్రమర కీటమువలె ఈశ్వ రత్వమును బడయునని యర్థమును జెప్పిన యనేకేశ్వరత్వ ప్రసం గము వచ్చును. లేక ముగ్గురు అధికారులకును అపహత పాప్మత్వాది గుణాష్టక రూపమైన ఈశ్వర స్వభావము లభించునన్నచో నిక యధి కారిభేద మేముండును? ఇక దీనికి పరిహార మెట్లనగా —

ఆ వస్తువు కన్న వేరై దానియందున్న ధర్మములు కలవగు నని మాత్రమే యర్థము. దీనిచే వెనుకటి దోషములుండవు.

(9) జడభరత దృష్టాంతమువలన ఐక్యమగునను భ్రమకు అవకాశమే లేదు. భరతుడు తాను తలంచిన మృగమే కాలేదుగదా! ఇక నా మృగముతో సమానమగు మృగశరీరమును పరిగ్రహించె నంతయే. అటులనే యీ చేతనుడును అని గ్రహించవలెను.

7వ శ్లోకము

నిస్సంశయేషు సర్వేషు, నిత్యం వసతి వైహారిః ।
ససంశయాన్ హేతుబలాన్ నాధ్యావసతి మాధవః॥

(10) అనగా - సంశయ విపర్యయ రహితముగ సధ్యాత్మ విషయములను చక్కగ నెఱింగిన వారియందు శ్రియఃపతి విడువక యుండును. కుతర్కములపై నాధారపడి సంశయగ్రస్త మనస్కుల వైపువ కొక్కయడుగునైనను పెట్టడు - అను శ్లోకము నిట యను సంధించవలెను.

9వ శ్లోకము

(11) కవియనగా—జరిగిన దాని నెఱుంగువాడు. ఇచ్చట నిది పరమాత్మను గూర్చిన శబ్దమగుటచే-సర్వదర్శి యని యర్థమును జెప్పవలెను.

(12) అణోరణీయాంసం—ఈశబ్దము ప్రశాసనార్థక పదముతో కలిపి వాడబడుటచే ప్రశాసనమనునది లోపల ప్రవేశించియే చేయ బడు వ్యాపారమని "అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానా" మ్మను శ్రుతి తెలుపుచున్నదిగాన అట్లంతః ప్రవేశమున కుపయోగపడు సూక్ష్మ తమత్వ మిూ విశేషణము తెలుపుచున్నది. అందువల్లనే శ్రీ భాష్య కారులు 'జీవాదపి సూక్ష్మతర'మ్మని చెప్పిరి.

(13) ఈరెండు శ్లోకములయందును జెప్పబడిన సర్వజ్ఞత్వాది గుణములన్నియు నైశ్వర్యము నొసంగుట కుపకరించు పరమాత్మ గుణములగుటచే నైశ్వర్యార్థు లీ గుణవిశిష్టునిగా పరమాత్మ నుపా సించుట కిప్పటినుండియు నలవరచుకొని యీ యభ్యాసపాటవముచే శరీరవియోగ సమయముననుు దానినే స్మరించి భావిజన్మలో నట్టి యపేక్షిత ఐశ్వర్యవంతు లగుదురు.

13వ శ్లోకము

(14) ప్రణవము (ఓమ్) భగవంతునే బోధించు పదమని యనేక ప్రమాణములును యుక్తులును (ఉపపత్తులును) కలవు.

మహాభారతమున మహేశ్వరుడే —

శ్లో॥ ఓమిత్యేవం సదా విప్రాః! పఠధ్వం ధ్యాత కేశవమ్॥

అనెను - అనగా - ఓ బ్రాహ్మణోత్తములారా! నిరంతరము "ఓమ్" అని యుచ్చరింపుడు. దాని కర్థమైన నారాయణునే ధ్యానింపుడు అనెను. ఇంతియేల? ఈగీతాశ్లోకము (13) నందే

'ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్ మా మనుస్మరన్' అని గదా భగవాను డానతిచ్చెను.

ఇచ్చట శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము-మని ప్రత్యయాంతమగు 'బృహి-వృద్ధౌ' అను ధాతువునకు సంకోచ నిమిత్తము లేకపోవుటచే స్వరూపమునుబట్టియు, గుణములనుబట్టియు బృహత్త్వముకల వస్తువని గదా! అట్టివాడు వాసుదేవు డొక్కడే యని శ్రుతిస్మృతు లుద్ఘోషించుచున్నవి.

'అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా' అను సూత్ర మట్టివానినేగదా ఉపాసించమని విధించుచున్నది. మరియును ధ్యేయవస్తువునకు వాచకమైన మంత్రమునేగదా ఉచ్చరించపలెను. మంత్రమొకనికి వాచకమై ధ్యేయవస్తువు మరియొకటి యైనచో నవి సరియగు ధ్యానమగునా? 'ఓమ్' అని ఉచ్చరించుచు 'మా మనుస్మరన్' దానికి వాచ్యుడనగు నన్ను ధ్యానించుచు అని స్వయముగ భగవానుడే విధించుచున్నాడు గదా! ఇక సంశయమేల?

'ఓమ్' కారమునకు నారాయణుడే యర్థమగుటకు ప్రమాణములు.

(1) మహాభారతమందలి రుద్రవాక్యము జూపబడెను.

(2) యాజ్ఞవల్క్య వాక్యము :—

దేవతాయాః పరాయాశ్చ సత్యలమ్బః ప్రణవస్స్మృతః
కశ్చిదారాధనాకామో విష్ణోర్భక్త్యా కరోతివై.

తదారాధన సాన్నిధ్యే ప్రతిమాం వ్యఞ్జికాం. యథా।
ధాతుద్రవ్యాదిపాషాణైః। కృత్వాభావం నివేశయేత్।
శ్రద్ధాభక్త్యాదరాద్యైశ్చ। తస్య దేవః ప్రసీదతి॥

ఓఙ్కారేణ తథాచాత్మా। హ్యుపాస్తే సప్రసీదతి।
తస్యోఙ్కారః స్మృతంనామ। తేనాహూతః ప్రసీదతి.
తస్మాదోమితి పూర్వంతు కృత్వా యుఞ్జీత తత్పరః॥

అనగా– ప్రణవము పరదేవతోపాసనకాలంబన మంత్రము. భగవదారాధనను భక్తితో చేయగోరువాడు తన కభీష్టమైన నారాయణుని విగ్రహమొకదానిని సువర్ణరజిత తామ్రాది ధాతువులతోనో, రాతితోనో చేయించి మంత్రపూర్వకముగా ప్రతిష్ఠించి తన మనోభావన నా విగ్రహమునందుంచి ఆస్తిక్యబుద్ధితోను,నిశ్చలభక్తితోను అత్యంతాదరముతోను ధ్యానించి యర్చించిన శ్రియఃపతి ప్రసన్ను డగును. ఆ యుపాసనకు ప్రణవమును ఆలంబనమంత్రముగా నవలబించవలెను. అట్లు గావించిన ఉపాసనచే నాతడు ప్రసన్నుడగును.

ఆయనకు ఓఙ్కారమభీష్ట నామధేయము– దానితో పిలచిన నాతడు వెంటనే ప్రసన్నుడగును. కాబట్టి మునుముం దోమని యుచ్చరించి యటుపైన ధ్యానార్చనాదులకు గడంగవలెను.

ఈ సందర్భమునం దీ శ్లోకములమధ్య యిచ్చటి సర్వద్వారాణిసంయమ్య మొదలు పరమాంగతిమ్ అనువరకు నిదే యాను పూర్వితో నీరెండు శ్లోకములు నుదాహరింపబడినవి.

హైరణ్యగర్భాది సిద్ధాంతములలో ప్రణవార్థమును వివరించుచు–

శ్లో॥ త్రిరాత్మా త్రిస్వభావశ్చ తథా త్రివ్యూహ ఏవచ
పాఞ్చరాత్రే తథాహ్యేష భగవద్వాచక స్స్మృతః
......ఓఙ్కారో విష్ణురవ్యయః।
భగవద్వాచకః ప్రోక్తః......॥

ప్రణవము త్ర్యాత్మకము - అనగా - బలము, వీర్యము, తేజస్సులు మూడును త్రిరాత్మ యనబడును.

ఈ ప్రణవము - త్రిస్వభావము - అనగా - జ్ఞానము, ఐశ్వర్యము, శక్తులు త్రిస్వభావములు.

ఈ ప్రణవము - త్రివ్యూహము - సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధులు త్రివ్యూహములు.

ఈషడ్గుణములును భగవంతుని యనంతగుణములలో ప్రధానములు. ఈ త్రివ్యూహములును పఞ్చధా వేంచేసియుండు నారాయణుని వ్యూహమూర్తులు.

కాబట్టి భావవికారశూన్యుడగు నారాయణునకే ఈప్రణవము వాచకము -

ఈ ప్రకరణోపసంహారములో ప్రణవము విష్ణువును జెప్పునదగుటచే దీనిని మరణసమయములో స్మరింపుడని చెప్పబడినది. పూర్వార్థములో ప్రణవమును ప్రశంసించి ఉత్తరార్థములో-

తద్విష్ణోః పదమపి పద్మజ ! ప్రసూతే
దేహాన్తే మమ మనసి స్థితం కరోతు॥

హేప్రజాపతే! ఇట్టి గుణోపేతమగు నీప్రణవము పరమపదమునుగూడ ప్రసాదించును; కావున నా శరీరమును విడుచువేళ ఆ ప్రణవము నా మనస్సున చలింపక యుండున ట్లనుగ్రహింపుము - అని ప్రార్థించినట్లు కలదు.

మహావిష్ణువుయొక్క ఆరాధనముకూడ నీప్రణవముతోనే చేయవలెననియు శాస్త్రము చెప్పుచున్నది.

తల్లిఙ్గైరర్చయేన్మన్త్రైః...అని పూజావిధానము నుపదేశించి

ఆయా యుపచారముల కాయామంత్రములను జెప్పి చివరకు.

ఆవాహనాదికం కర్మయన్నసూక్తం మయాత్విహ।
తత్సర్వం ప్రణవేనైవ కర్తవ్యం చక్రపాణయే
అర్చితం స్యాజ్జగదిదం తేన సర్వం చరాచరమ్.

ఇట్లు శ్రీ మహావిష్ణువు నర్చించిన చరాచరాత్మక ప్రపంచ మంత నర్చించినఫలము లభించును. పరమపురుషుని సాక్షాత్కార మును బడయదగిన ప్రణవోపాసనపద్ధతిని జెప్పుచు-

ఘణ్టాశబ్దవ దోఙ్కార ముపాసీత సమాహితః।
పురుషం నిర్మలం శుభ్రం పశ్యేద్వైనాఽత్ర సంశయః॥

స్వస్థచిత్తుడై ఘంటధ్వని వలె ఓఙ్కారమునుపాసించవలెను. అట్లుచేసినచో పరమపురుషుని దర్శనమగును. ఇం దేమాత్రమును సంశయములేదు. యోగానుశాసనసూత్రమున -

క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషః ఈశ్వరః తస్య వాచకః ప్రణవః- ఇతి.

క్లేశాదిహేయగుణరహితుడగు పురుషు డీశ్వరుడు. ప్రణవ మాతనిని తెలుపును - అని.

ఈ ప్రమాణములవలన ప్రణవము భగవంతుని (నారాయణుని) తెలుపుననియు, సమాధిదశలోను ఉత్క్రమణదశలోను ప్రణవము తోనే భగవంతుని ధ్యానించవలెనని సిద్ధమగుచున్నది.

17వ శ్లోకము

(15) సత్యలోకాదులు చతుర్ముఖబ్రహ్మయొక్క స్వతంత్ర సంకల్పముచే సృష్టించబడినవిగాన నవి స్థిరముగా నుండునో యని శంకింపగా- వానియొక్క కాలనియతియును పరమపురుషుని సంకల్ప ముచేతనే ఏర్పరుపబడినదని చెప్పబడెను. పరమాత్మ యొక్క స్వాతంత్ర్యమే హెచ్చుతగ్గులులేని రాత్రింబవళ్లయొక్క విచిత్ర

వ్యవస్థకు కారణము. ఈవిషయము భారతమున ఉద్యోగపర్వమునందు 37-13 శ్లో॥ చెప్పబడినది.

కాలస్య హి చ మృత్యోశ్చ జఙ్గమస్థావరస్యచ।
ఈశతే భగవానేకః సత్యమేవ బ్రవీమి తే॥

కాలమును మృత్యువును స్థావరజంగమాత్మక సమస్త జగత్తును శ్రియఃపతి యొక్కడే యేలుచున్నాడు. ఇది సత్యము. నేను నీకు చెప్పుచున్నాను వినుము.

భార - ఉద్యో - 67 అ. 12 శ్లో॥

కాలచక్రం జగచ్చక్రం యుగచక్రంచ కేశవః।
ఆత్మయోగేన భగవాన్, పరివర్తయతేఽనిశమ్॥

శ్రియఃపతి కాలమును, జగత్తును, యుగములను తనసంకల్పము చేతనే సదా నడపించుచున్నాడు.

మరియొకచోట నిట్లే -

తతో యుగసహస్రాన్తే। సంహరిష్యే జగత్పునః।
కృత్వా మత్స్థాని భూతాని చరాణి స్థావరాణి చ॥

వేయి యుగములు గడచినపిదప నీ స్థావరజంగమాత్మకజగత్తు నంతను సంహరించి నాశరీరమునందు సూక్ష్మరూపముతో ధరించి యుండును.

భార - మోక్షధర్మే -

నిత్యం హి నాస్తిజగతి భూతం స్థావరజఙ్గమమ్।
ఋతే తమేకం పురుషం వాసుదేవం సనాతనమ్॥

వాసుదేవు డొక్కడుదక్క మరి యే స్థిరచరపదార్థజాతమున్ను స్థిరముగ నుండజాలదు.

పృథివ్యాదితత్త్వములే నశించుతరి వానిచేత సృష్టింపబడిన బ్రహ్మలోకము బ్రహ్మశరీరము బ్రహ్మాండములమాట వేరుగా చెప్పవలెనా ?

22వ శ్లోకము

(16) ఈ శ్లోకమున పురుషశబ్దము ప్రయోగింపబడినది. ఆ పురుషుడే ప్రాప్యుడుగా చెప్పబడుచున్నాడు. ఆ శబ్దమునందే యాతని యుత్కర్ష గాన్పించును గాన పురుషశబ్ద వ్యుత్పత్తిని యెఱుంగదగినది.

1. పురి – శేతే – ఇతి పురుషః=నవద్వారపుర మనబడు శరీరము నందుండువాడు.
2. పూర్ణః పురుష ఉచ్యతే=అను నిరుక్తసూక్తినిబట్టి సర్వథా సర్వదా పరిపూర్ణుడు.
3. పురాపి – అస్తీతిపురుషః=అనాదిస్థితి కలవాడు.
4. పురు – సనోతీతి పురుషః=అధికముగా నిచ్చువాడు.

ఇట్టి మహత్తరమగునట్టియు ఉపాసన కుపయుక్తమైనట్టియు గుణములుకలవాడు ప్రాప్యుడనిచెప్పిన నిక నేమి కావలయును. ఇంతకు మించిన ఫలమిక నేముండును.

సహస్రశీర్షాపురుషః – ఇత్యాది సూక్తమున నీతని యసాధారణ వైభవ మెంతగనో చెప్పబడెను. ఈ శ్లోకమున పురుషశబ్దము కేవల జీవవాచి కాకుండుటకై 'పరః' అనియు విశేషణము చేర్చబడెను.

23వ శ్లోకము

అవతారికలో —

(17) పంచాగ్ని విద్యలో ఛాం. 5-10-1.

తద్య ఇత్థం విదు ర్యేచేమేఽరణ్యే
శ్రద్ధా తప ఇత్యుపాసతే తే ఽర్చిష మభిసంభవన్తి
అర్చిషోఽహః........

ఈ బద్ధజీవుని మే యాత్మ యాథాత్మ్యకోవిదులు పంచాగ్ని విద్యోక్తప్రకారముగా తెలుసుకొని ఉపాసించుచున్నారో ఎవరైతే

అరణ్యమునందుండి లక్ష్మీవిశిష్టతపోరూప బ్రహ్మము నుపాసింతురో వా రుభయులును అగ్న్యభిమాని దేవతను పొందుదురు, అచ్చటి నుండి అహరభిమాని దేవతను పొందుదురు— ......

(18) అమానవ పురుషుడు (వైద్యుతపురుషుడు) అర్చిరాది మార్గమున నిత్యవిభూతికి చేరిన ముక్తపురుషులను బ్రహ్మను పొందించును. ఈ విధముగ బ్రహ్మను పొందినవారు పునరావృత్తికలిగిన ఈ మానవలోకమునకు తిరిగిరారు.

24వ శ్లోకము

(19) అగ్నిరూపమైన తేజోఽభిమాని దేవతయు, దినాభిమాని దేవతయు, శుక్లపక్షాభిమాని దేవతయు, షణ్మాసపరిమితిగల ఉత్తరాయణమున కభిమాని దేవతయు మొదలగు వా రుండునట్టిమార్గమున బోయిన పరమాత్మోపాసకులు నారాయణుని బొందుదురు. అనగా— జ్ఞానులు (భక్తులు-ఉపాసకులు) పరబ్రహ్మను పొందుదురనియు కేవలులు శుద్ధాత్మస్వరూపమును బొందుదురనియును గ్రహించవలెను.

'తత్పురుషో ఽమానవస్సన్ ఏనాన్ బ్రహ్మగమయతి'

అనుటచే నర్చిరాదిమార్గమున పోయినవానికి బ్రహ్మప్రాప్తి తెలుపబడుచున్నదిగదా! అట్టితరి కేవలాత్మోపాసకునకు బ్రహ్మను పొందించు నర్చిరాదిమార్గగతి యెట్లుకుదురునని శంకింపగా—

ఈ పంచాగ్నివిద్యానిష్ఠుడు అబ్రహ్మాత్మక ఆత్మోపాసకుడు కాడు, మరి పరమాత్మ ఆత్మగాగల స్వాత్మోపాసకుడు. అట్లు కానిచో తత్క్రతున్యాయము విరోధించును. ఎట్లనగా— ఉపాసనాను గుణఫలప్రాప్తినిగదా ఆ న్యాయము బోధించును. ఇప్పుడు ఫలము విపరీత మైనదిగదా, ఆత్మోపాసకునకు ఆత్మప్రాప్తియే ఫలముకావలెను గాని పరమాత్మప్రాప్తి ఫల మెట్లగును?

26వ శ్లోకము

(20) ఆదిశబ్దముచే ఆకాశమును చంద్రునిగూడ గ్రహించవలెను.

(21) ఇచ్చట యోగశబ్దమునకు -

"యోగ స్సన్నహనోపాయ ధ్యాన సఙ్గతి యుక్తిషు."

అను కోశానుసారముగ ఉపాయ మనిగాని సంబంధ మనిగాని యర్థమును గ్రహించవలెను. ఉపాయార్థమైనప్పుడు - ఆ యాగఫల ప్రాప్తికై ఆ యాగాయుపాసనలను గావించినవాడనియూ, సంబంధమర్థమైనప్పుడు ధూమాదిపథము లుండుటచే పుణ్యకర్మస్వరూప సంబంధమే సిద్ధించును. అనగా పుణ్యకర్మలు చేయువాడని యర్థము.

ఈవిషయమును - అథయ ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మిత్యుపాసతే, తే ధూమ మభిసమ్భవన్తి- యను శ్రుతి సమర్థించుచున్నది.

(ఇష్టమనగా- యాగాదులు- పూర్తమనగా చెరువులు నూతులు మొదలగువానిని త్రవ్వించుటవంటి పుణ్యకర్మలని యర్థము.)

అనగా- ఏ పురుషులు గ్రామమునందే యుండి యాగాదులను తటాక నిర్మాణాది పుణ్యకర్మలను దానములను మరియు నిట్టివేయగు నుపవాసాదికర్మలను చేయుచున్నారో వారు ధూమాద్యభిమాని దేవత లుండుమార్గమున సుకృతఫలానుభవమునకై యేగుచున్నారు.

దీనికే పితృయానమనియును పేరు.

27వ శ్లోకము

(22) మార్గచింతనముకూడ నుపాసనవలె పరమపురుషప్రాప్తికి సాధనమే యైనను లోకమున దారి నెఱింగినవాడు తొట్రుపడక పయనించునట్లు ఇచ్చట నీమార్గము నెఱింగినవానికిని యట్టి యుపకార ముండును గాన నిట్లు చెప్పబడినది.

'తత్ప్రకాశిత ద్వారః' అని బ్రహ్మసూత్రమున జెప్పబడినట్లు భగవంతుని యనుగ్రహమువలన స్పష్టముగ జూపబడిన దారి కల వా డగును.

రెండు మార్గముల నెఱుంగుట విడువవలసిన మార్గమును విడుచుటకని యెఱుంగవలెను.

"యోగీ భవార్జున !" అనుచో సాక్షాత్తుగా యోగమును విధించుచున్నాడనుట పొసగదుగాన ధ్యానమాత్రవిధిగనే గ్రహించవలెను. యోగవిధి యేలకాకూడ దనగా- ఈ రెండుమార్గముల నెఱింగినందులకు ఫలమునుచెప్పి "తస్మాత్ = కాబట్టి" యని యీ జ్ఞానమునకే హేతువుగా పరామర్శించుటచే నిచ్చట యోగమును విధించుట యసంగతము.

సరియే- ధ్యానమునే విధించనిండు. ఆ ధ్యానము దేనినిగూర్చి యనగా దగ్గరనున్న గతినిగూర్చియే యనుట ఉచితముగాన ఆ ధ్యానము గతిచింతన రూపమైనదనియే గ్రహించవలెను.

బ్రహ్మసూత్రములలో నుపాసనకు ఫలమును జెప్పుచు -

తదోకో ఽగ్రజ్వలనం తత్ప్రకాశిత ద్వారో విద్యా
మాహాత్మ్యా త్తచ్ఛేష గత్యనుస్మృతి యోగాచ్చ,
హార్దానుగృహీత శ్శతాధికయా. (504 సూత్రం).

కఠ- శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాంమూర్ధాన మభి నిస్సృతైకా, । తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి । అనగా- హృదయ దేశమున నూటయొక్క నాడులు గలవు. అందొకనాడి బ్రహ్మకపాలమువరకును వ్యాపించియుండును. దానిగుండ బయటపడిన జీవుడు అర్చిరాదిమార్గమున పరమపదమున కేగును- అని తెలుపబడినది.

ఆ నాడీమార్గ మతి సూక్ష్మముగానుండునే యది యెట్లా జీవునకు గోచరించు ననగా- ఉత్క్రాంతిసమయమున హృదయమున

విరాజిల్లుచున్న శ్రియఃపతిచే నా నాడీద్వారము వెలుగొందింప బడును. దానిచే నామార్గము నవలంబించి బయటపడును.

శ్రియఃపతి యట్లెవ్వరికా వెలుగును ప్రసాదించుననగా — 'విద్యా మాహాత్మ్యాత్ తచ్ఛేష గత్యనుస్మృతి యోగాచ్చ" యను సూత్రఖండము తెలుపుచున్నది. అనగా- చేతనుడు గావించిన ఉపాసనచేతను, ఈతడు గావించిన నిరంతర అర్చిరాది మార్గచింతన చేతను ప్రసన్నుడై యట్లామార్గమును వెలుగొందించునని చెప్పఁబడెను.

చూచితిరా అర్చిరాదిమార్గ నిరంతరచింతన కెంత మాహాత్మ్యమున్నదో. అందులకే 508వ బ్రహ్మసూత్రమున యోగినః ప్రతిస్మర్యేతే స్మార్తేచైతే" యని- యోగినః ప్రతి = యోగనిష్ఠులను గూర్చి, స్మార్తే=ధూమార్చిరాదిమార్గములు రెండున్ను స్మరించదగినవని (విధింపబడుచున్నవి.)

అనగా- తాము గావించు ఉపాసనకంగముగా ప్రతినిత్యమును స్మరించదగినవి - అని (శ్రీ) భాష్యకారు లీ సూత్రమును వివరించి "నైతే సృతీ" యనెడు ప్రకృతశ్లోకముచే యుదహరించిరి. "ఏతే సృతీ" యనగా నేవియని శంకింతురని వారే యచ్చటనే "అగ్నిర్జ్యోతిః" 'ధూమోరాత్రిః' అని దేవయాన పితృయానములను జూపిరి. ఈ యర్చిరాదిమార్గచింతననే భగవానుడు "తస్మాత్ యోగీ భవార్జున=" తస్మాత్ అహరహరర్చిరాది గతిచిన్తనాఖ్య యోగయుక్తో భవ"

అనగా- కావున నీవు ప్రతిదినమును అర్చిరాదిమార్గమును ధ్యానించుచుండుట యనెడు యోగయుక్తుడవు కమ్మని యాదేశించెను.

ఈచింతనకిట్టి పరమపురుషార్థప్రదత్వ మనెడు మాహాత్మ్యముండుటచేతనే దయాళులగు (శ్రీ) వరదార్యులీ బ్రహ్మసూత్ర-భాష్య విమర్శనంతను సరళముగా రెండుశ్లోకములతో మనకు ప్రసాదించిరి.

దానిని మనము ప్రతిదినము వేకువను లేవగనే యర్థమును భావించుచు ననుసంధించవలెను.

పాఠకుల సౌకర్యార్థమై ఆశ్లోకముల నిచ్చట తాత్పర్యముతో నుదహరించుచున్నాను. -

1. శ్లో॥ సత్సఙ్గాద్భవనిస్పృహో గురుముఖాచ్ఛ్రీశం ప్రపద్యాత్మవాన్
ప్రారబ్ధం పరిభుజ్య కర్మశకలం ప్రక్షీణకర్మా నరః
స్యాసా దేవ నిరఙ్కుశేశ్వర దయానిర్లూనమాయాన్వయో
హార్దానుగ్రహలబ్ధమధ్యధమనిద్వారా ద్బహిర్నిర్గతః॥

2. శ్లో॥ ముక్తోఽర్చి ర్దినపూర్వపక్షషడుదఙ్మాసాబ్దవాతాంశుమత్
గ్లౌవిద్యుద్వరుణేన్ద్ర ధాతృమహిత స్సీమాన్తసిన్ధ్వాప్లుతః
శ్రీవైకుణ్ఠ ముపేత్య నిత్యమజడం తస్మిన్ పరబ్రహ్మణః
సాయుజ్యం సమవాప్య నన్దతి సమం తేనైవ ధన్యః పుమాన్॥

తాత్పర్యము :

సాత్త్వికుడగు విష్ణుభక్తునితోడి చెలిమిచే సంసారమునందు విరక్తి జనియించును. తోడనే సదాచార్యసమాశ్రయణ మొనరించి యాతనిమూలముగ శ్రియఃపతిని శరణజొచ్చి లబ్ధసత్తాకుడగును. ఆపై సంచితాగామికర్మల బారినుండి సంపూర్ణముగ విముక్తుడై శేషించియున్న ప్రారబ్ధము ననుభవించుచునుండి యా యనుభవము పూర్తియగుతోడనే తాను గావించు నుపాసన అర్చిరాదిమార్గచింత నలచే ప్రసన్నుడైన తన హృదయపీఠము నలంకరించియున్న నారాయణుని దయచే జూపబడిన [illegible] సుషుమ్నానాడీమార్గము గుండా బయటబడి అర్చి - పగలు - శుక్లపక్షము - ఉత్తరాయణము సంవత్సరమును, కాలాభిమాని దేవతలాతివాహికులు (అనగా మార్గదర్శకులు) గా నుండు మార్గమున నేగి [illegible] సూర్యమండలము భేదించి దానిని ఛిన్నముగావించుకొని, చంద్రవిద్యుల్లోక - వరుణలోక -

ఇంద్రలోకప్రజాపతు లాతివాహకులుగానుండు లోకములలో వారు చేయు సన్మానములను బడయుచు బ్రహ్మాండావరణమును దాటి లీలావిభూతిని విడిచి నిత్యవిభూతిలో ప్రవేశించి యందున్న నిత్యమును స్వయంప్రకాశమునునైన శ్రీ వైకుంఠనగరమునుజేరి యచ్చట శ్రియఃపతి భోగసజాతీయభోగానుభవ మనెడు తత్సా యుజ్యమును బడసి యాసర్వజ్ఞుడగు సర్వేశ్వరునితోపా టాతనికల్యాణ గుణముల ననుభవించుచు అనుభవజనితప్రీతికారిత కైంకర్యమున నిమ గ్నుడై శాశ్వతముగ తిరిగి రాకయుండును. ఆహా! ఆ పురుషు డెంత ధన్యుడోగదా.

(23) ఐశ్వర్యాక్షర యాథాత్మ్య
భగవ చ్చరణార్థినామ్
వేద్యోపా దేయ భావానా
మష్టమే భేద ఉచ్యతే॥

తాత్పర్యము:

బ్రహ్మ రుద్రేంద్రాది భోగములకన్న గొప్పదగు ఐశ్వర్య మును, శుద్ధాత్మస్వరూపమును, భగవచ్చరణాగతిని గోరువారికి ప్రత్యేకించి తెలుసుకొనదగిన శుద్ధాత్మస్వరూపాదుల యొక్కయు ఉపాదేయములైన వారి వారి యిష్టఫలముల కనురూపమైన పరమ పురుషధ్యానమును అంతిమస్మృతిని అర్చిరాదిమార్గచింతనమును యీ యెనిమిదవ యధ్యాయమున చెప్పబడినది.

# శ్రీభగవద్గీతా - నవమోఽధ్యాయః

## రాజవిద్యారాజగుహ్యయోగః.

—:०:—

### అవతారిక

ఇదివఱకు ఆ యాయుపాసకులకు వేఱువేఱుగా నేర్పడియుండు *జ్ఞాతవ్యోపాదేయ విశేషములు ప్రతిపాదింపఁబడినవి. ఇపుడు ఉపాస్యుఁడగు పరమపురుషుని మాహాత్మ్యమును, జ్ఞానులకుఁగల విశేషమును విశోధించి, భక్తిరూపమైన యుపాసనముయొక్క స్వరూపమును జెప్పుచున్నారు.

శ్రీభగవానువాచ.

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా[1] మ్యనసూయవే[2]।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

టీ. గుహ్యతమం=మిక్కిలి రహస్యమయినదియు, విజ్ఞానసహితం = ఉపాసనమును గుఱించిన విశేషజ్ఞానముతోఁ గూడినదియు నగు, ఇదం జ్ఞానంతు = భక్తిరూపమయిన ఉపాసనమనెడి ఈ జ్ఞానమును, అనసూయవే=భగవన్మాహాత్మ్యమునందు నమ్మకముగల, తే=నీకు, ప్రవక్ష్యామి=చక్కఁగా తేటపడునట్లు చెప్పెదను.

---

* పరమపురుషమాహాత్మ్యమును జ్ఞానుల విశేషమును పూర్వమే ప్రస్తుతమైయున్నది. ఇచట ఉపాసనమును తత్ఫలమునుబట్టి వారిప్రభావము విశోధింపఁబడుటచే 'ఉపాస్యుడగు...విశోధించి' యనఁబడెను. ఉపాసనముయొక్క స్వరూపము ఇట్టిదని నిష్కర్షించుటయే యీయధ్యాయముయొక్క ముఖ్యార్థమనియు, భజనోపాసనశబ్దము లీయధ్యాయమందును ఇతర ప్రకరణములందును ఒక్కవిషయమును గుఱించి ప్రయోగింపఁబడుటవలన శ్రుతిసిద్ధమైన యుపాసనమే భక్తియగుననియు నభిప్రాయమున 'భక్తిరూపమయిన...స్వరూపమును జెప్పుచున్నారు' అనఁబడెను.

యత్ = ఏజ్ఞానమును, జ్ఞాత్వా = తెలిసికొని, అశుభాత్ = భగవత్ప్రా ప్తికి విరోధములగు సమస్తపాపములనుండి, మోక్ష్యసే = విడువడఁగలవో.

3

తా. *మిక్కిలియు గోప్యమును భక్తిరూపము నైన యీ ఉపాసన మనెడు జ్ఞానమును ఉపాసనముయొక్క విశేషజ్ఞానముతోడ, అసూయలేకున్నట్టి (అనఁగా తక్కినవానికెల్ల విసజాతీయమై అపరిమిత ప్రకారమైయున్న నామాహాత్మ్యమును విని అట్లె యగు నని తలంచునట్టి) నీకు చెప్పెదను. ఆ జ్ఞానమును అనుష్ఠానపర్యంతము తెలిసికొని నాప్రాప్తికి విరోధులగు సమస్తమైన యశుభములనుండి విడివడుదువు.

---

* 'ఇదంతు' అనుచోఁగల తుశబ్దముచే భక్తియోగము, కర్మయోగజ్ఞానముల కంటె నధికమయినదని వివక్షితము. అనఁగా కర్మయోగము గుహ్యము, జ్ఞానయోగము గుహ్యతరము, ఇదియో (ఇదంతు) 'గుహ్యతమం' అని భావము. ఇచట జ్ఞాన మనఁగా భక్తిరూపమైన యుపాసనము. విజ్ఞానమనఁగా విశేషజ్ఞానము. ఇది పూర్వోక్తమయిన జ్ఞానము గాదు. అది ఉపాస్యాదులను గుఱించిన విశేషజ్ఞాన మగును. ఇది ఉపాసనమునకు సంబంధించిన విశేషజ్ఞాన మగును. ఉపాసనమునకు సంబంధించిన విశేష మనఁగా ఉపాసనప్రకారము. దీనిని వినెడియధికారి అసూయలేనివాఁడు గావలయును. అసూయ అనఁగా గుణములందు దోషములను కనిపెట్టు చిత్తవృత్తి. గుణములను గుణములనుగా నిశ్చయించుటయే అసూయలేమి యగును. కావునయిచట అసూయలేనివాఁ డనఁగా సకలేతరవిలక్షణమై యపరిమితప్రకారమైయుండు నీశ్వరుని మాహాత్మ్యమును విని అది అట్టిదే యగునని నమ్మునట్టివాఁడని తెలియునది. అనుష్ఠింపవలసినదానిని తెలిసికొన్నంత మాత్రముచే ఫలము గలుగదు. అనుష్ఠించిననే ఫలము, కనుక 'అనుష్ఠాన పర్యంతము' అనఁబడెను. ఉపాసనస్వరూపము నెఱుంగుటయే కాక దానిని అనుష్ఠించిననే మోక్షమని భావము. కర్మాదులచే భక్తియుత్పత్తికి విరోధులయినపాపములు నిరసింపఁబడును. భక్తిచేతనో భగవత్ప్రాప్తికి విరోధులయిన సమస్తపాపములును నిరసింపఁబడు నని తెలుపుటకై 'నాప్రాప్తికి...విడివడుదు' వనఁబడెను.

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్॥ 2

టీ. ఇదం = ఇది - భక్తిరూపాపన్నమైనజ్ఞానము, రాజవిద్యా = విద్యలకు రాజైనది- రాజులయొక్క విద్య- అనఁగా రాజులవంటి గొప్పమనస్సు గల వారియొక్క విద్యయనుట, రాజగుహ్యం = రహస్యములలో శ్రేష్ఠమైనది, ఉత్తమం = ఉత్కృష్టమైనట్టి పవిత్రం = మత్ప్రాప్తికి విరోధములగు సమస్త పాపములను బోఁగొట్టునదనుట, ప్రత్యక్షావగమం = ఉపాసింపఁబడు నన్ను ప్రత్యక్షమైనవానినిగాఁ గనఁగొనునట్టిది ధర్మ్యం = ధర్మ నిరతిశయ నిఃశ్రేయసరూపము, కర్తుం = అనుష్ఠించుటకు, సుసుఖం = మిక్కిలి ప్రియమైనదిగా అనుష్ఠింపఁదగినది, అవ్యయం = నాశరహితమైనదియు.

4

తా. ఇది రాజవిద్య-విద్యలకు రాజు; రాజగుహ్యము గోప్యములకు రాజు. లేక, రాజులయొక్కవిద్య గాన రాజవిద్య. రాజులు విరివియైలోఁతయినమనస్సు గలవారుగదా; అట్టి మహామనస్కులవిద్య, మహామనస్కులే దాఁపవలసిన దానిని దాఁచుటకు నిపుణులు గాన వారలకే యిది గుహ్యమైనది. *పరమపవిత్రమైనది - అనఁగా మత్ప్రాప్తికి విరోధులగు అశేషకల్మషములను అపహరించునది. ప్రత్యక్షభూతమయిన విషయము (విషయభూతుఁడగు నేను) గలది— అనఁగా భక్తిరూపమగు ఉపాసనముచే నన్నుపాసింపఁగా నేనప్పుడే ఉపాసకునకు ప్రత్యక్షమగుచున్నాననుట. అయినను ధర్మమునుండి వీడనిది.

---

* ఇంతకుముందు చెప్పిన ఇతరము లయినయుపాయములకంటె ఈ యుపాయమునకుఁగల యతిశయమును దెలుపుచున్నాఁడు. పవిత్రశబ్దమునకు 'ఉత్తమ'.మను విశేషణమునుబట్టి 'మత్ప్రాప్తికి విరోధులగు...అపహరించునది' అనఁబడెను. 'ప్రత్యక్షావగమమ్' అనుటకు ప్రత్యక్షమయినవిషయము గలది అనఁగా విషయభూతుఁడగు భగవంతుఁడు 'ప్రత్యక్షముగాఁ

(ధర్మ్మమగుటయనఁగా నిశ్శ్రేయసమునకు సాధన మగుట) అది స్వరూపముచేతనే మిక్కిలి ప్రియ మగుటచేతను, అప్పుడే నాదర్శనమును కలిగించునదగుటచేతను, తనంతట తానే నిశ్శ్రేయసరూపమైయున్నను, నిరతిశయనిశ్శ్రేయసరూపమును ఆత్యంతికము నగు మత్ప్రాప్తికి సాధనమైనదియునగుట. కాఁబట్టియే మిక్కిలి ప్రియమైనదిగా అనుష్ఠింపఁదగినది. నాప్రాప్తిని సాధించినను తాను క్షయింపనిది. ఇటువంటి ఉపాసనమును చేయువానికి నన్నే యిచ్చుకొన్నను నేను వాని కేమియు చేయలేదనియె నాకుఁ దోఁచుచున్న దనుట.

శ్లో॥ అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప।
5
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని॥ 3

టీ. పరన్తప=అర్జునా, అస్య ధర్మస్య=ఈయుపాసనమనెడి ధర్మమునకు, అశ్రద్దధానాః=దానియందు విశ్వాసపూర్వక మగు త్వర లేనివారైన, పురుషాః=పురుషులు, మాం=నన్ను, అప్రాప్య=

---

గలది యని యర్థము. ఉపాసనము స్మృతిసంతతిరూప మయినది కాన తనవిషయమును బ్రత్యక్షముగాఁ జూపనేరదు. ఉపాస్యుఁడు అప్రత్యక్షుఁడని శ్రుతి. మఱి ప్రత్యక్షముగా నుండు నితరవిషయమునకును ఉపాసనమునకును సంబంధము గలుగదు. కనుక ఉపాసనమందు విషయభూతుఁ డగుభగవంతుఁ డెట్లు 'ప్రత్యక్ష' మని శంకరాఁగా 'భక్తిరూపమగు...అగుచున్నా ననుట' అనఁబడెను. అనఁగా భక్తి తన విషయభూతుఁడగు భగవంతుని ప్రత్యక్షముగాఁ జూపదు. భగవంతుఁడు భక్తికిమెచ్చి తానే ప్రత్యక్షమగుచున్నాఁడని భావము. ధర్మ్యమగుట యనఁగా నిశ్శ్రేయసమునకు సాధన మగుట. 'ధర్మ్యమ్' అనుటచే భక్తి యట్టిధర్మ్యమగునని యర్థము. అనఁగా తమంతట ఫలభూతము లయినవి మఱియొకఫలమునకు ధర్మ్యమగుట (అనఁగా సాధనమగుట) దుర్లభము. భక్తియో యట్టిదిగాదు. 'స్వరూపముచేతనే ... గలిగించునదగుటచేతను' తనంతట నిశ్శ్రేయసరూపమగు ఫలమైనను నిరతిశయ నిశ్శ్రేయసరూప మగు భగవత్ప్రాప్తి యనెడు ఫలాంతరమునకుఁ గూడ సాధనమగుట (అనఁగా ధర్మ్యమగుట) గలదియని భావము. ఇది నిశ్శ్రేయసము; భగవత్ప్రాప్తి 'నిరతిశయనిశ్శ్రేయసము;' అని రెంటికి భేదము తెలియునది. 'సుసుఖంకర్తుమ్' అనఁగా 'చేయుటకు సుసుఖమైనది' అని

పొందక, మృత్యుసంసారవర్త్మని = మృత్యురూపమగు సంసారమార్గము నందు, నివర్తన్తే (నితరాం వర్తన్తే) = మిక్కిలి వర్తించుచున్నారు.

తా. అర్జునా (నిరతిశయప్రియుఁడ వగు నన్ను గుఱించిన దగుటచే తానును *నిరతిశయప్రియరూపమైనదై పరమనిశ్శ్రేయసరూపమగు మత్ప్రాప్తికి సాధనమై అవ్యయమైయుపాసనమని చెప్పఁబడునట్టి) యీధర్మమును అనుష్ఠింపఁదగినస్థితికి వచ్చినవారయ్యును దీనియందు నమ్మకతోడిత్వర లేకయుండువారై యట్టిపురుషులు నన్నుఁ జెందక బాధకస్వరూప మగు సంసారమునందే మిక్కిలియుఁ బ్రవర్తించుచుందురు. ఔరా ! యిది గొప్పయాశ్చర్య మని యర్థము.

---

యర్థము కాదు. చేయుటయందు సుసుఖమయినది, అనఁగా స్వరూపమందును తన విషయమందును మిక్కిలి యనుకూలమయినది గాన సుఖముగా ననుష్ఠింపఁగూడినదని భావము. 'సుసుఖమ్' అనుచోఁగల 'సు' అనెడి యుపసర్గముచే 'మిక్కిలి ప్రియమైనదిగా' ననఁబడెను. అవ్యయమనఁగా క్షయింపనిది. తక్కినకర్మములు ఫలముకలిగినంతనే నాశమునొందును. ఇదియో సుకరమయ్యును భగవత్ప్రాప్తియనెడి ఫలము కలిగినను నాశము నొందదు. అనఁగా భగవత్ప్రాప్తియనెడు ఫలముకూడ దీనికిఁ జాలదని యతిశయోక్తి దెలియునది. భగవత్ప్రాప్తికన్న నధికఫలమేమి యిది సాధింపవలయునో యని శంకను వారించుటకై 'ఇటువంటి ఉపాసనమును...నాకుఁ దోఁచుచున్నది' అని చెప్పఁబడెను.

*ఇట్టి యుపాసన రూపమయిన జ్ఞానము (అనఁగా జ్ఞానమనఁబడిన యుపాసనము) లేనిచో తన్నుఁబొందుట (అనఁగా మోక్షము) సిద్ధింపదని తెలుపుచు స్వరూపమందును ఫలమందునను నిరతిశయసుఖరూప మయినదీని నందఱు నేలయనుష్ఠింప రనుటకు హేతువు నిందుఁజెప్పుచున్నాఁడు. 'అస్య' అని భక్తికి పూర్వోక్తమైన సమస్తాకారమును బరామర్శించుటవలన 'నిరతిశయ.. అవ్యయమై' అనఁబడెను. 'అస్య' అనుసంబంధసామాన్యషష్ఠివలన 'అనుష్ఠింపఁదగినస్థితికి వచ్చిన' అని ఫలించినది. శ్రద్ధకు ప్రసక్తియుండియు చూపకున్ననే దోషమగును గాని లేనియెడల దోషముకాదు. కనుకనే శ్రద్ధతోఁ గయికొనఁదగినవారై యుండియు నని కూర్పఁబడెను. పురుషార్థ తారతమ్యవిదు లగు పురుషులు, ఉపాసనము స్వరూపమునను ఫలమునను నిరతిశయపురుషార్థమయిన దనియు సుకరమనియు నెఱింగియు, ఎంతమాత్రమైనను పురుషార్థమే కావట్టి యీసంసారమునే యాదరమున సేవించుచున్నారే ! యని భగవంతుని విస్మయమునుబట్టి 'ఇది...ఆశ్చర్యము' అని చెప్పఁబడెను.

అవ. * ప్రాప్యభూతుఁడగు నాయొక్క అచింత్యమహిమను ముందు వినుమని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః॥ 4
న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్।
భూతభృ న్న చ భూతస్థో మ మాత్మా భూతభావనః॥ 5

టీ. అవ్యక్తమూర్తినా = ఇంద్రియములకు గోచరముకాని స్వరూపము గల, మయా =(అంతర్యామియగు) నాచేత, ఇదం సర్వం జగత్ =చేతనాచేతనాత్మకమగు ఈ సమస్త ప్రపంచము, తతం= వ్యాప్తమైయున్నది, సర్వభూతాని=సమస్తభూతములు; మత్స్థాని= నన్ను ఆధారముగాఁ గొని నిలిచియున్నవి. అహం చ= నేనైతే, తేషు=వానియందు, న అవస్థితః – నెలకొనియున్నవాఁడనుగాను – నాస్థితికి అవి యేమియు నుపకరించునవి గావు, భూతాని=భూతములు, మత్ స్థానిచ న=నాయందున్నట్టివికావు, మే=నాయొక్క, ఐశ్వరం = ఈశ్వరసంబంధియైన - అఘటితఘటనా చాతుర్యమును, పశ్య = చూడుము. (ఆయోగ మెద్ది యనఁగా), భూతభృత్ =(నేను) సమస్తభూతములను భరించువాఁడను, భూతస్థః నచ = వానివలన నాస్థితికి ఏతోడ్పాటును లేదు, మమ = నాయొక్క, ఆత్మా = మనస్సు- అనఁగా సంకల్పము, భూతభావనః = భూతములను కలిగించునది -ధరించునదియు నియమించునదియును అనియు గ్రహించునది.

తా. నేను చేతనాచేతనాత్మకమగు ఈజగత్తునం దంతయు

---

*ఇంతవఱకు ప్రాపకముయొక్క మహత్త్వము చెప్పఁబడెను. ఇప్పుడు ప్రాప్యముయొక్క మహత్త్వము చెప్పఁబడుచున్నదని తెలియునది. ప్రాప్యముయొక్క మహిమ చెప్పుటయెల్ల అట్టి మహిమగలదానియొక్క ప్రాపకమునందు మఱింతఁగట్టిపూనిక గలిగించుటకే యగును. ప్రాపక మనఁగా ఉపాయము. ప్రాప్య మనఁగా ఫలము.

6

నాస్వరూపమును బయలుపఱుపకయే *అంతర్యామినై (అనఁగా దీని ధారణనియమనములకొఱకు శేషినై) వ్యాపించి యున్నాను. [అంతర్యామి బ్రాహ్మణమందు 'యః పృథివ్యాం తిష్ఠన్-యంపృథివీ న వేద-.య ఆత్మని తిష్ఠన్- య మాత్మా న వేద' అని చేతనాచేతన వస్తుజాలమునకుఁ గనఁబడకయే యంతర్యామియై (అనఁగా లోపల జొచ్చి నియమించువాఁడై) యందందు వ్యాపించియుండుట చెప్పఁబడినది. కావున] అంతర్యామి నగునాయందు ఈ సమస్తభూతములును నిలిచియున్నవి. [ఆ బ్రాహ్మణమందే 'యస్య పృథివీ శరీరమ్...యః పృథివీ మన్తరో యమయతి (బృ-౫-౭-౩), యస్యాత్మాశరీరమ్... య ఆత్మాన మన్తరో యమయతి' (శతపథే-మాధ్యందిన. ౧౪-౬-౫-౫-౩౦) అని జగత్తు శరీరమైయుండుటచేత నియమనమునకు లోనైనదని ప్రతిపాదించుటఁబట్టి దాస్థితి (ధారణ) నియమనములు అతని యధీనము లయినవనియు అతని శేషిత్వము ప్రతిపాదించబడినది.] నేను వానియందు నెలకొనియుండ లేదు- అనగా నాస్థితి వానికి లోన

---

* ఆకాశముకూడ అన్నిటను ఊరక వ్యాపించి యున్నది కాని అంతర్యామిగాఁ గాదు. అట్టివ్యాప్తి కాదనుటకై 'అంతర్యామినై' యనికూర్పఁబడెను. అంతర్యామి యై వ్యాపించుటకు ప్రయోజనము ధారణ నియమనములుగాన 'ధార...కొఱకు' అనఁబడెను. స్వరూపము బయలుపడక నియామకుఁడై అంతట వ్యాపించుటను దెలుపుటకు.-'యఃపృథివ్యామ్...అను శ్రుతి యుదాహృతము. ఇందలిపృథివిచేత ప్రాకరణికము లగు చేతనాచేతనములనన్నిటిని గ్రహించునది. అతనివ్యాప్తి కేవలమైనది గాక ధారణ నియమనములతోఁ గూడిన దనుటకు 'యస్యపృథివీ శరీరమ్' ఇత్యాదులు. ఇందు శరీరమనఁగా శరీరమువలె నియమనమునకు లోనయినదనుట. నియమనమునుబట్టి ధారణమును, శేషిత్వమును అర్థసిద్ధము లగుచున్నవి. 'మయాతత మిదంసర్వమ్' 'నేను దీనియందెల్ల వ్యాపించియున్నాను' అని చెప్పి 'నచాహంతేష్వవస్థితః' 'నేను వానియందు లేదు' అనుట విరుద్ధము. కాన నేను వానియందు లేదనఁగా వానియందున్నను వానికి లోనయిన స్థితి

యునదికాదు—నాస్థితికి అవి యుపకరించుటయేమియు లేదనుట. భూతములును నాయందున్నవికావు- అనఁగా *కుండ మొదలగునవి జలాదులను ధరించియుండునట్లు నేను వానిని ధరించియున్నవాఁడనుగాను. మఱి ధరించియుండుట యెట్లు? అన్నచో ఆత్మ శరీరమును సంకల్పముచేత ధరించునట్లు నేను వానిని నా సంకల్పముచేత ధరించుచున్నాను. * ఐశ్వరమైన నాయోగమును—అనఁగా మఱి వేఱొచ్చోటఁ గలుగరానిదై నాకుమాత్రమె కలిగియున్నదై యాశ్చర్యమైయున్న నా యోగమును—చూడుము. ఈయోగ మేమి యందువా? సమస్తములైనభూతముల నేను ధరించుచున్నానుగాని వానిచేత నా కుపకారమేదియు గలుగదు. నా యాత్మయె-(అనఁగా మనోమయ మగు

---

గలిగి యుండలేదు-అనఁగా నాస్థితికి వానివలన నేయుపకారమును గలుగదు అని యర్థము సేయఁబడెను.

* 'మత్ స్థాని సర్వభూతాని' అనియు 'నచ మత్స్థాని భూతాని' అనియుఁ జెప్పుటవలన భూతములు మొదట తనయందున్నట్టును పిదప లేనట్టును ప్రతిపాదించుట అసంగతమని శంకింపరాదు. మొదట ఉన్నవనుట అంతర్యామియగు తనయందున్నవనియు పిదప లేవనుట కుండయందు జలమువలె తనయందు లేవనియుఁ జెప్పుటగాఁ దెలియవలయును. కుండయందు జలమున్నట్లుగాక అంతర్యామియగు ఆత్మను గొని శరీరము నిలచియున్నట్లు భూతములెల్ల భగవంతునియందున్నవని యారెంటివలన నేర్పడుచున్నవి. మఱియు కుండ స్వేచ్ఛచేత జలమును ధరించునదికాదు కాన దానిని నియమింపను నేరదు. ఆత్మయో స్వేచ్ఛచేత (అనఁగా స్వసంకల్పముచేత) శరీరమును ధరించుచున్నది. నియమించుచున్నది. అట్లే యీశ్వరుఁడును స్వసంకల్పముచేతనే భూతముల ధరించుచు నియమించుచు నున్నాఁడని తెలియనది.

*'యోగస్సన్నహనోపాయధ్యానసఙ్గతియుక్తిషు' అనునిఘంటువువలన యోగమనఁగా ధ్యానమని యర్థము గనుక నిచట నాధ్యానమును సంకల్పరూపముగా గ్రహింపఁనగును. కావుననే యోగమనఁగా సంకల్పమనియర్థము సిద్ధించినది. యోగము 'ఐశ్వర్యమ్' అనుటచే అనన్యసాధారణమైనదిగాను, 'పశ్య' అనుటచే ఆశ్చర్యకరమైనదిగాను జెప్పఁ

నాసంకల్పమే) భూతములను గలిగించునదియు ధరించునదియు నియమించునదియు నగును. (ఇదియు నా యసాధారణయోగము). 7

అవ. తన సంకల్పమువలననే సర్వమునకును స్థితిప్రవృత్తులు గలుగుచున్న వనుటకు నిదర్శనము చెప్పుచున్నాడు.

శ్లో॥ *యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ॥ 6

టీ. నిత్యం=ఎల్లప్పుడును, ఆకాశస్థితః=ఆకాశమునందుండునదియు, సర్వత్రగః=అంతట సంచరించుచున్నదియునగు, మహాన్ వాయుః=గొప్పవాయువు, యథా = ఎట్లో-(మత్స్థః = నాయందున్నదో), తథా=అట్లు, సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములు, మత్స్థాని ఇతి=నాయందున్నవి అని, ఉపధారయ=నిశ్చయించుకొనుము.

---

బడెనని తెలియునది. ఆత్మ యనఁగా మనస్సు అనియు అర్థము. ఇచట మనస్సునకు బదులు మనోమయమగు సంకల్పమును గ్రహించుటచే ఆత్మకు సంకల్పమని యర్థము ఏర్పడినది.

* 'యథాకాశస్థితః వాయుః తథాభూతాని మత్స్థాని' అనుటకు 'ఆకాశమందు వాయువున్నట్లు భూతములు నాయందున్నవి' అని యర్థమగుచున్నది. కాని ఆకాశము వాయువుంగలిగియున్నను దానిని ధారణనియమనములు చేయదుగాన ఆకాశమందలి వాయువుయొక్క నియమనాదులు లేనిస్థితి భగవంతునియందలి భూతములయొక్క నియమనాదియుక్తమైన స్థితికి నిదర్శనము కానేరదు. కనుక 'ఆ వాయువునకు... తెలియుచున్నది' అని కూర్పఁబడెను. అనఁగా ఆకాశమందు వాయు వుండియు దాని నియమనాదులకు కనఁబడకయే నే నుండినట్లే తక్కినవాని నియమనాదులకును కనఁబడకయే నేనున్నానని భావము. అనఁగా ఆకాశమునఁ బఱచుచున్న యొకపక్షిదేహమునకు పట్టులేని యాకాశమువలన స్థితిగాని చలనముగాని కలుగనేరవు. కాని కంటికిఁ గనఁబడనిదై యాదేహములో వర్తించుచున్న చేతనవిశేషముచేతనే దానికా స్థితిచలనములు కలుగుచున్నవి. ఇట్లే వాయువునకు ఆకాశమువలనఁగాక దానియందుఁ గనఁబడకయే వర్తించుచుండు పరమపురుషునివలననే స్థితిచలనములు కలుగునని యూహ్యము. ఇట్లు పరమపురుషుఁడు కనబడకున్నను వాయువు మొదలైన వానికి స్థితి ప్రవృత్తులు వాని

తా. మహావాయువు పట్టులేని ఆకాశమందు నెలకొని అంతటను తిరుగుచున్నది. ఆవాయువునకు అందు పట్టేమియు లేదు గనుక దానికి (నేను తెలియఁబడకున్నను) దానిస్థితి నావలననే కలుగవలయునని తప్పక ఒప్పుకొనవలసి వచ్చుచున్నది. కాన అవి నాచేతనే ధరింపఁబడియున్న వని తెలియుచున్నది; అట్లె సమస్తభూతములును (వానికి తెలియఁబడకున్న) నాయందు నెలకొనియున్నవి గాన అవి నాచేతనే ధరింపఁబడి యున్నవని నిశ్చయింపుము. ఇట్లని వేదవిదులును: [8] 'మేఘోదయస్సాగరసన్నివృత్తి। రిన్దోర్విభాగః స్ఫురితాని వాయోః। విద్యుద్విభఙ్గో గతిరుష్ణరశ్మే। ర్విష్ణో ర్విచిత్రాః ప్రభవన్తిమాయాః' అని చెప్పెదరు. (విష్ణోః విచిత్రాః మాయాః అనఁగా విష్ణువుయొక్క అనన్యసాధారణములైన మహైశ్వర్యము లని యర్థము) [9] 'ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః' (బృ-౫-౮-౯) [10] 'భీషాస్మాద్వాతః పవతే। భీషోదేతి సూర్యః। భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ' (తై-ఆన-౮-అను) ఇత్యాదిక మగుశ్రుతియు నిట్లె చెప్పుచున్నది.

---

సంకల్పమువలననే కలుగుచున్న వనుటకు ప్రత్యక్షప్రమాణము లేకున్నను అనుమానాదులు గలవనుటకై వేదవిదుల వాక్యమును 'మేఘోదయః' అని చెప్పుచున్నారు. ఈవిషయమే శ్రుతులుకూడ 'ఏతస్యవా [ఈ నాశరహితునియొక్క యాజ్ఞ (అనఁగా సంకల్పము) వలననే సూర్యచంద్రులు (తమ తమ స్థానములందు) ధరింపఁబడినవారై నిలుచుచున్నారు. వీనివలనిభయముచేతనే గాలి వీచుచున్నది. వీని భయమువలననే సూర్యుఁ డుదయించుచున్నాఁడు. వీనివలనిభయమువలననే అగ్నియు ఇంద్రుఁడును] ఇత్యాదులు చెప్పుచున్నవి. ఇచట వాయునిదర్శనమునుబట్టి అనుమానప్రమాణముచేతను వేదవిద్వచనశ్రుతులనుబట్టి శాబ్దప్రమాణముచేతను 'సర్వముయొక్క స్థితిప్రవృత్తులు పరమపురుషసంకల్పాయత్తములు' అని తెలియుట గ్రాహ్యము,

అవ. దేనియొక్క సాహాయ్యమును అపేక్షింప నక్కఱలేనట్టి వాఁడగు భగవంతునియొక్క సంకల్పమువలననే సమస్తమునకును స్థితిప్రవృత్తులు కలుగు నని చెప్పఁబడినది. అట్లే వానిసంకల్పము వలననే సమస్తమునకును ఉత్పత్తిప్రళయములుగూడ కలుగుచున్న వని చెప్పుచున్నారు.

శ్లో॥ సర్వభూతాని[11] కౌన్తేయ ప్రకృతిం[12] యాన్తి మామికామ్।
కల్పక్షయే[13] పున స్తాని[14] కల్పాదౌ విసృజా మ్యహమ్॥

టీ. కౌన్తేయ=అర్జునా, సర్వభూతాని=స్థావరజంగమాత్మకములగు సమస్తభూతములు, కల్పక్షయే=బ్రహ్మయొక్క అవసాన సమయమునందు, మామికాం = నాశరీరభూతమైన, ప్రకృతిం = తమస్సు అనఁబడు ప్రకృతిని, యాన్తి=(నా సంకల్పముచే) పొందుచున్నవి, కల్పాదౌ=కల్పారంభమునందు, పునః=మఱల, తాని= ఆ భూతములవంటివానినే, అహం= నేను, విసృజామి=ప్రకృతినుండి విభజించి సృజించుచున్నాను.

తా. అర్జునా, కల్పక్షయమందు- (అనఁగా చతుర్ముఖబ్రహ్మ యవసానకాలమందు) నా సంకల్పముచేత చరాచరాత్మకములగు భూతము లన్నియును నాకు శరీరమైనదియు, నామరూపములచే వేఱు వేఱు విభజింపరానిదియు, తమస్సు అనఁబడునదియును అగు ప్రకృతిని పొందుచుండును. ఆ భూతములనే కల్పారంభమున క్రమ్మఱ నేను సృజియించుచుందును. 'ఆసీదిదం తమోభూతం - సోఽభిధ్యాయశరీరాత్ స్వాత్' (౧-౫) అని మనువుకూడ (ప్రకృతి యీశ్వరునకు శరీరభూతమై తమశ్శబ్దవాచ్యమైయుండుటను) చెప్పుచున్నాఁడు. 'యస్యావ్యక్తం శరీరమ్' (సుబాల-౭-ఖం) 'అవ్యక్త మక్షరే లీయతే అక్షరం తమసి లీయతే' (సుబాల-౨-ఖం) 'తమ ఆసీత్ తమసా గూఢమగ్రే

ప్రకేతమ్' (అష్ట-౮-ప్ర-౯-అను) [మొట్టమొదట తమస్సు ఉండెను-ఆ తమస్సుచేత అన్నియు మఱుఁగుపడి తెలిసికొనరాని వయ్యెను] ఇత్యాదిశ్రుతులును ఇట్లే చెప్పుచున్నవి.

[అవ. సమష్టివ్యష్టిరూప మగుసృష్టియొక్క ప్రకారమును తెలుపుచున్నారు.]

శ్లో॥ ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః।
15 16
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్॥ 8

టీ. స్వాం=నాదియైన, ప్రకృతిం=ప్రకృతిని, అవష్టభ్య=ఎనిమిదివిధములుగా పరిణమింపఁజేసి, ప్రకృతేః = ప్రకృతియొక్క, వశాత్ = అధీనతవలన, అవశం = స్వాతంత్ర్యములేనిదై యుండు, కృత్స్నం=దేవతిర్యఙ్మనుష్యస్థావరములు అని నాలుగువిధములైన, ఇమం=ఈ, భూతగ్రామం=జీవసమూహమును, పునఃపునః=మరల మరల-ఆయా (తగిన) కాలమునందనుట, విసృజామి=వివిధముగాను విచిత్రముగాను సృజించుచున్నాను.

తా. *నాప్రకృతి విచిత్రముగా పరిణమింపఁజాలినది. అట్టి ప్రకృతిని అధిష్ఠించి అష్టవిధములుగా పరిణమింపఁజేయుదును. పిదప, గుణాత్మకమైన దగుటచే మోహమును కలిగించునట్టిదైన నాప్రకృతికిఁ జిక్కి పరవశమై దేవతిర్యఙ్మనుష్యస్థావరము లని నాలుగువిధము లై

* 'ప్రకృతిం స్వాం అవష్టభ్య' అని 'తనప్రకృతిని అవష్టంభించుట' యనఁగా దానిని అధిష్ఠించుట-అష్టవిధములుగా పరిణమింపఁజేయుట. ఈ అష్టవిధములే 'భూమి రాపోఽనలో వాయుః' అని చెప్పఁబడినది - ఈ అష్టవిధపరిణామమే సమష్టిసృష్టి. దానికి 'ఇమమ్ కృత్స్నమ్' అను విశేషణములవలన దేవతలు మొదలుగాఁగల నాలుగు విధములును అందలి అవాంతరభేదములును గ్రహింపఁబడుచున్నవి- ఇదియే వ్యష్టిసృష్టి. ఈరెండు సృష్టులప్రకారమే యిందు 'విసృజామి' అని చెప్పఁబడినది. జీవకోటి ప్రకృ

యున్న యీ భూతసమూహమునంతయు, ఆయాకాలములయందు (విచిత్రనామరూప దేశకాలభోగాదులతోఁ గూడినవానినిగా) సృజించుచుందును. 17

అవ. ఇట్లు చేసినయెడల విషయము లైన యీ సృష్టిస్థితిసంహారాది కర్మములు భగవంతునికి నైర్ఘృణ్యము (నిష్కారుణ్యము) మొదలయిన దోషములను గలిగించి యతనిని బధించునే యనఁగా చెప్పుచున్నారు.

18

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ।
 ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు॥ 9

టీ. హేధనఞ్జయ=అర్జునా, తాని కర్మాణి = ఆవిషమసృష్టి మొదలగు వ్యాపారములు, తేషుకర్మసు = * ఆ కర్మములయొక్క వైషమ్యమునందు, అసక్తం = సంబంధములేనివాఁడనై, ఉదాసీనవత్ = తటస్థునివలె, ఆసీనం=ఉన్నట్టి, మాం=నన్ను, ననిబధ్నన్తి= వైషమ్య నైర్ఘృణ్యాదోషములను గలిగింపవనుట.

---

తికి వశమగుటకు హేతువు 'ప్రకృతిం మోహినీం శ్రితాః' అని అది మోహిని యగుటయె. అది మోహిని యగుటకు హేతువు 'త్రిభిర్గుణమయైః' అని అది గుణమయి యగుటయె. కావుననే 'గుణాత్మక...జిక్కి' అనఁబడెను.

* సృష్ట్యాదికర్మములకు ఈశ్వరుఁడే కర్త గనుక ఆ కర్మములతో వానికి సంబంధము కలదు గాని వాని వైషమ్యముతో వానికి సంబంధములేదు. కావుననే 'కర్మసు' అనఁగా 'కేవలకర్మములందు' అనక 'కర్మముల వైషమ్యమునందు' అని యర్థము సేయఁబడియెను. జీవులు, దేవతలని మనుష్యులని నానారూపముల సృజింపఁబడుచున్నారు; ధనికులని బీదలని నానాస్థితులు గలిగియున్నారు. కావున సృష్టిస్థిత్యాదికర్మములు అందఱియందును సమముగాఁ జేయఁబడక విషమములుగా నున్నవి. ఇదియే సృష్ట్యాదుల వైషమ్యము. 'నిబధ్నన్తి' నిబంధించుట యనఁగా సంసారబంధముగాదు వీలన, జగత్సృష్టి మొదలయినవి సంసారహేతువు లగుట గలుగదు. అది దుష్టత్వమైనను ఈశ్వరునికి నియామకుఁడు లేడు. కాన నైర్ఘృణ్యాదిదోషములు కలిగించుటే యగును.

తా. అర్జునా, విషమసృష్టి మొదలైన యీవ్యాపారములు[19] నన్ను నిబంధింపవు- అనఁగా నాయందు నిర్ఘృణత్వము మొదలయిన[20] దోషములను కలిగింపవు. ఏలనఁగా, క్షేత్రజ్ఞులయొక్క పూర్వకృతములయిన[21] కర్మములే దేవమనుష్యాది విషమభావమునకు (భేదమునకు) హేతువులు. నాకో, ఆ వైషమ్యముతో సంబంధములేదు. అందు నేను ఉదాసీనునివలె ఉన్నాను. ఇట్లని సూత్రకారులును. *వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్' - 'న కర్మా విభాగా దితిచే న్నానాది త్వాత్' (శారీర-౨-౧-3౪, 3౫) అని చెప్పిరి.

శ్లో॥ ♦మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునాఽనేన కౌన్తేయ జగద్ధి పరివర్తతే॥ 10

టీ. హేకౌన్తేయ=అర్జునా, అధ్యక్షేణ=ప్రత్యక్షముగా చూచుచున్న, మయా=సత్యసంకల్పుఁడనగు నాచేత, ప్రకృతిః=ప్రకృతి, సచరాచరం (జగత్) = జంగమస్థావరములతోఁ గూడిన ప్రపంచమును, సూయతే=పుట్టించుచున్నది. అనేనహేతునా = క్షేత్రజ్ఞకర్మానుగుణమైన నావీక్షణముచేత, జగత్ = జగత్తు, పరివర్తతేహి=చక్రమువలె తిరుగుచున్నదిగదా.

---

* సృష్ట్యాదుల వైషమ్యమునకు జీవులకర్మమే హేతువు గాని యీశ్వరుఁడు గాఁడని 'వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్' అను బ్రహ్మసూత్రమును, జీవులును కర్మప్రవాహములును అనాదులగుటచే ప్రళయకాలమందును అవి నశింపకుండునని 'న కర్మావిభా గాదితిచే న్నానాదిత్వాత్' [(ప్రళయమునందు ఆత్మలకు) విభాగము లేనందున కర్మము లేదనినయెడల (ఆత్మలు) అనాదులై యుండుటవలన (అట్లు) కాదు] అను బ్రహ్మసూత్రమును ప్రతిపాదించుచున్నవి.

♦ కర్మమునకు అనుగుణముగానే విషమసృష్టి కలుగుచున్నదేని అప్పుడు పరిణామశీలయైన ప్రకృతియే దాని కనుగుణముగా పరిణమించుఁగాక. నీతో పనేమి?' అనఁగా నిందు చెప్పుచున్నారు.

తా. అర్జునా, (ఇట్లు సృష్ట్యాదుల వైషమ్యమునకు నాయంతట నేను హేతువుకాను.) కాఁబట్టి నేను *ప్రకృతి కధికారినై సత్యసంకల్పముతో దానిని ఆయా క్షేత్రజ్ఞుల కర్మముల కనుగుణముగా వీక్షించుచున్నాను. అప్పు డది జగత్తునఁగల సమస్త చరాచరములను (తత్తత్కర్మానుగుణముగా నా సంకల్పమువలన) కనుచున్నది. క్షేత్రజ్ఞకర్మానుగుణముగా నేను వీక్షించు హేతువుచేతనే జగత్తు పరివర్తించుచున్నది. అని నా ♦ స్వామిత్వము సత్యసంకల్పత్వము నైర్ఘృణ్యాది దోషరహితత్వము నను నివి మొదలైన రూపముగా నున్న నాయొక్క[22] యైశ్వరయోగమును చూడుము. ఇట్లె శ్రుతియు * 'అస్మాన్మాయీ సృజతే విశ్వమేత త్తస్మిం[23] శ్చాఽన్యో మాయయా సన్నిరుద్ధః (శ్వేతా. ౪-౯-) 'మాయాన్తు ప్రకృతిం విద్యాన్మాయినన్తు మహేశ్వరమ్' అని చెప్పెడిని.

---

* ప్రకృతి నాయధికారములేక- అనఁగా నా సంకల్పములేక, తత్తత్కర్మానుగుణముగా పరిణమించి యీ విషమసృష్టిని గలిగింపఁజాలదని భావము. ఇట 'కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః' ఇత్యాది శ్రుత్యర్థము ప్రతిపాదితము. ప్రకృతియొక్క పరిణామము ఈశ్వరసంకల్పాధీన మగుటయు, జీవులు కర్మానుగుణముగా నాప్రకృతికి వశమగుటయు 'అస్మా ..మహేశ్వరమ్' ఇత్యాదిశ్రుతులను ప్రతిపాదించుచున్నవి.

♦ కర్మవశమైన జీవకోటికి శేషమైయున్న యీ ప్రపంచమునకు నీవు స్వామివగుట యెట్లు? కారుణికుఁడవై యుండియు కర్మమునకు లోఁకువయై దుఃఖమును గలిగించు నీకు సత్యసంకల్పత్వ మెట్లు? అని అడుగఁగా, 'నా స్వామిత్వమును...' అనఁబడెను. 'పశ్య మే యోగ మైశ్వరమ్' అని యుపక్రమించిన దాని కిది నిర్వహించుటగాన 'వసుదేవ...చూడుము' అనఁబడెను.

* అస్మాత్ = తనకు శరీరభూతమైన- తనతో అవిభక్తమైన సూక్ష్మావస్థయందున్న, ప్రకృతేః = ప్రకృతివలననుండి, మాయీ = సర్వేశ్వరుఁడు, ఏతత్ విశ్వం సృజతే = ఈ జగత్తునంతయు సృజించుచున్నాఁడు. తస్మిన్ = ఆ ప్రకృతియందు, అన్యః = బద్ధజీవుఁడు, మాయయా = ప్రకృతిచేత- అవిద్యచేత, సన్నిరుద్ధః = బద్ధుఁడని యర్థము. 'అనాది మాయయా సుప్తః' అని శ్రుతినిబట్టి, మాయామాయిశబ్దముల కర్థమును 'మాయాంతు' అని చెప్పుట తెలియునది.

24

శ్లో॥ ♦అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్।
పరంభావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్॥ 11

టీ. మమ=నాయొక్క, పరంభావం = అప్రాకృతమనుష్య భావమును, అజానన్తః=ఎఱుఁగకున్నవారై, మూఢాః=అవివేకులు, భూతమహేశ్వరం=సమస్తభూతములయొక్క యీశ్వరులకు ఈశ్వరుఁడనైన, మానుషీంతనుం = మనుష్య సంబంధమైన దేహమును, ఆశ్రితం = ఆశ్రయించిన, మాం = నన్ను, అవజానన్తి – ప్రాకృత మనుష్యులతో సమముగాఁ దలఁచుచున్నారు.]

తా. ఇట్లు సర్వభూతములకు మహేశ్వరుఁ డగుటవలన *సర్వజ్ఞుఁడును సత్యసంకల్పుఁడును నిఖిలజగదేకకారణుఁడును అగు నేను, అపారమైన కారుణ్యముచేత, అందఱు నన్ను సులభముగా నాశ్రయించుటకొఱకు మనుష్యదేహమును బొందితిని. స్వకృతము లగు పాపకర్మములచే అజ్ఞానులైనట్టివారు నే నిట్లగుట నాపరత్వమని తెలియక నామనుష్యత్వ మాత్రమును జూచి తక్కిన మనుష్యులతో నన్ను సాటిగాఁ జూచుచున్నారు – అనఁగా, సర్వభూతమహేశ్వరుఁడ నగు నేనె (కర్మవశమున స్వరూపస్వభావములు వదలి మనుష్యుఁడగుట లేక) నా యపారకారుణ్యము ఔదార్యము సౌశీల్యము వాత్సల్యమును బట్టి మనుష్యత్వమును బొందుట నాపరత్వమునకు లక్షణమగును. ఇది పరత్వమని తెలియక మనుష్యత్వమును ఆశ్రయించినంత మాత్రముచే నన్ను నితరసజాతీయునిఁగాఁ దలచి తిరస్కరించుచున్నా రని యర్థము.

25

♦ మహాత్ముల విశేషమును చెప్పుటకై మూఢుల స్వభావమును ఈ శ్లోకము చేతను మీఁదిశ్లోకముచేతను చెప్పుచున్నారు.

* భూతమహేశ్వరాదిశబ్దముల యభిప్రాయమే 'సర్వజ్ఞుఁడు...' ఇత్యాదులు. స్వస్వభావము నెప్పుడును వదలకుండునావికి మనుష్యత్వము నాశ్రయించుట సయితము పరత్వముతో సంబంధించినదే యగు నని భావము.

శ్లో॥ మోఘాశా[26] మోఘకర్మాణో[27] మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీ[28] మాసురీం[29] చైవ ప్రకృతిం[30] మోహినీం[31] శ్రితాః॥ 12

టీ. రాక్షసీం = రాక్షససంబంధమగు రాజసస్వభావముగలదియు ఆసురీం = అసురసంబంధమగు తామసస్వభావము గలదియు, మోహినీం = మోహింపఁజేయునదియును, ప్రకృతిమేవ = ప్రకృతినే, శ్రితాః = ఆశ్రయించినట్టివారు, విచేతసః = యథార్థజ్ఞానము లేనివారు, (కావుననే వారు) మోఘజ్ఞానాః = *(విపరీత జ్ఞానమువలన) నిష్ఫలమైనజ్ఞానము గలవారును, (కావుననే) మోఘాశాః = నిష్ఫలములైన కోరికలు గలవారును, మోఘకర్మాణః = నిష్ఫలములైన కర్మములు గలవారును అగుదురు.

తా. నా మనుష్యత్వమునందును పరమకారుణ్యము మొదలగువాని రూపముగా పరత్వమున్నది. అట్టి పరత్వమును మఱుఁగుపఱుచునదియు ♦ రాక్షసియు (రాజసియు) ఆసురియు (తామసియు) నగు ప్రకృతి నాశ్రయించినవారియొక్క వాంఛితములెల్ల నిష్ఫలములగును. వారి యారంభములన్నియు వ్యర్థములగును. మదీయములగు సమస్త[32] చరాచరవస్తువులందు విపరీతజ్ఞానముగలిగియుండుటచేత వారి జ్ఞానములును నిష్ఫలములగును. అట్లే అన్నిట వారికి యాథాత్మ్య

* విపరీతజ్ఞాన మనఁగా - అస్వతంత్రము స్వతంత్రమనియు, ఒకరిది తనదనియు, నిత్యమును అనిత్యమనియు, అజడమును జడమనియు ఇత్యాదులుగా నెఱుంగుట.

♦ ప్రకృతిరాక్షసి అనఁగా రాజసమైనది, అసురియనఁగా తామసమైనది. అనఁగా క్రోధలోభమయమైనదనుట. మోహిని యనఁగా పూర్వోక్తమైనభగవంతునిపరత్వమును- అనఁగా మనుష్యత్వమందును గల అపారకారుణ్యాదులను మఱుఁగుపఱుచున దనుట. 'మోఘజ్ఞానాః' అని ఒకజ్ఞాన విశేషమును (విపరీతజ్ఞానమును) విధించుటచే దానికి

33
జ్ఞానమును లేకుండును. అనఁగా సర్వేశ్వరుండ నగునన్ను ఇతరులతో పాటిగా తలంచి నాయెడ ఏమి చేయఁగోరుదురో, ఏమి యుద్దేశించి యారంభములు సేయుదురో, అవి యంతయును వ్యర్థమే యగు నని యర్థము.

34 35 36
శ్లో॥ *మహాత్మాన స్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః।
37 38
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥ 13

టీ. హేపార్థ=అర్జునా, (యే) తు=(ఎవరు) అయితే, దైవీం ప్రకృతిం=దేవసంబంధియగు సాత్త్వికప్రకృతిని, ఆశ్రితాః=ఆశ్రయించినట్టివారైన, మహాత్మానః = మహాత్ములో, (తే=వారు), భూతాదిం=భూతములకు కారణమైనవాఁడును, అవ్యయం = నాశరహితుఁడు (అగు), మాం=నన్ను-సౌలభ్యముచేమనుష్యుఁడనై యవతరించిననన్ను, జ్ఞాత్వా=ఎఱింగి, అనన్యమనసః=ఇతరమును గుఱింపని మనస్సు గలవారై, భజన్తి=భక్తిరూపమైన ఉపాసనము చేయుదురు.

తా. అర్జునా, ఎవరు తాము చేసిన పుణ్యసంచయములచేత నన్ను శరణుఁ జొచ్చి, పాపబంధముల నెల్ల పోఁగొట్టుకొని దేవసంబంధియగు (సాత్త్విక) ప్రకృతిని అవలంబించినవారైయుందురో, యామహాత్ములన్నవో, భూతములకెల్ల నాదికారణ మగుటచే *అవా

---

కారణమగు చేతస్సును (మనస్సును) నిషేధించుట తగదు. కాన 'విచేతసః' అనఁగా మనస్సు లేదనిచెప్పక మనఃకార్యమగు యాథాత్మ్యజ్ఞానము లేదని చెప్పఁబడెను.

* ఇట్లు మూఢులవృత్తినిజెప్పి యిప్పుడు తనయవతారమును సఫలముఁజేయు మహాత్ములవృత్తిని జెప్పుచు తన్ముఖమున వారివృత్తి యగు భక్తిని ప్రస్తావించుచున్నారు.

* 'భూతాదిమ్' అని ఉపాసించుటకు అశక్యమైన పరత్వమును చెప్పుటచే

జ్ఞానసగోచరములైన నామకర్మ స్వరూపములుగల పరునిగాను, పరమకారుణ్యముచే సాధురక్షణము కొఱకు (నాదివ్యస్వభావమును విడువకయే) మనుష్యుఁడనై యవతరించి యున్నవానినిగాను నన్నెఱింగి మఱియొక్కటను మనస్సు లేక నన్నే భజింతురు. అనఁగా, నాయందలి ప్రీత్యతిశయమువలన ,నన్నుభజించుటచేతనేకాని తక్కిన విధముల మనస్సును తమ్మును తక్కిన బాహ్యేంద్రియములను దాల్పనోపనివారై మద్భజనమే ముఖ్యప్రయోజనముగాఁ గలిగి నన్ను భజింతురు.

40 39

శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ 14

టీ. మాం=నన్ను, సతతం=ఎల్లప్పుడు, భక్త్యా=భక్తితో, కీర్తయన్తః=కీర్తించుచున్నవారును, దృఢవ్రతాః = స్థిరమైనసంకల్పము కలవారై, యతన్తశ్చ = దేవాలయనిర్మాణము మొదలగు ప్రయత్నము చేయువారును, నమస్యన్తశ్చ=సాష్టాంగనమస్కారము చేయువారును, నిత్యయుక్తాః=నాతో నిత్యసంబంధమును గోరువారున్నై, మాం=నన్ను, ఉపాసతే=ఉపాసించుచున్నారు.

తా. * నాయెడలఁగల అత్యంతప్రీతిచేత, నన్ను కీర్తించుట నాకార్యములందు యత్నించుట నాకు నమస్కరించుట యనునివి

---

'అవాఙ్మ...పరుఁ' డనియు 'మామ్' అని అవతారపర్యవసిత మగు సౌలభ్యమును చెప్పుటచే 'పరమ...అవతరించిన'వాఁడనియు చెప్పఁబడినది. అవతారమునకు కర్మము గాక దయాదులే మూలము గాన నవతారమప్పుడును జ్ఞానసంకోచాదులు లేమిని 'అవ్యయ' శబ్దము తెలిపెడిని. 'అనన్యమనసః' అనుదానికి వివరమే 'నాయందలి...' ఇత్యాదులు.

* పూర్వశ్లోకమున 'భజన్తి' అని ఉపాసనము (భక్తి) ప్రస్తావింపఁబడినది. అదియే అత్యంతప్రియరూపమై కీర్తనాదులను గలిగించునని చెప్పుచున్నారు. 'భక్త్యా'

లేనిచో, క్షణమునం దణుమాత్రముసేపైనను తాము నిల్వనోపరు గాన, మద్గుణవిశేషవాచకము లగు (నారాయణకృష్ణవాసుదేవాది) మన్నామములను తలంచి, సర్వాంగములు పులకింప హర్షముచే

41 42

డగ్గుత్తిక వొడమ, నారాయణ కృష్ణవాసుదేవేత్యాదులన్ నెప్పుడును కీర్తించువారును, అర్లె అర్చించుట మొదలైనట్టివియు నగు వాని కుప కరించు దేవాలయ నందనవననిర్మాణములు మొదలైనట్టివియునగు నా కర్మములయందు దృఢసంకల్పముతో నెల్లప్పుడును ప్రయత్నము చేయువారును, భక్త్యతిశయముచే వినమ్రములైన మనస్సు బుద్ధి అభి మానము పదద్వయము కరద్వయము శిరస్సు అనెడి అష్టాంగము లతో దుమ్మనియు బురద యనియు గులకఱాలనియు మఱి యేదియనియు తలంపక భూతలమున కొయ్యవలె పడి యెప్పుడును మ్రొక్కువారును, నాతోడికూడికను ఎప్పుడును గోరువారునై, ఆత్మ

43

యుండువఱకు మద్దాస్యమునందే వ్యవసితులై నన్ను ఉపాసింతురు.

శ్లో॥ *జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్॥ 15

టీ. అన్యే అపి = మఱికొందఱు మహాత్ములు, జ్ఞానయజ్ఞేనచ = జ్ఞానమనెడి యజ్ఞముచేతను – (చకారమువలన పూర్వోక్తములైన కీర్తనాదులచేతను), యజన్తః = సంతోషపఱచుచున్నవారై, బహుధా = బహుప్రకారములుగా, పృథక్త్వేన = దేవతిర్యఙ్మనుష్యస్థావరాత్మక మగు జగత్తురూపమున, విశ్వతోముఖం = అన్నిటిని ప్రకారములుగాఁ

అనుటకుఁ నాయెడల...నోపరు గాన' నని భావము. సతతశబ్దము కీర్తన యతన నమస్కార నిత్యయుక్త తోపాసనము లైదింటితోను అన్వయింపవలయును. 'మనోబుద్ధ్యభిమా నేన సహ న్యస్యభూతలే।కూర్మవచ్చతురః పాదాన్ శిరస్తత్రైవ పఞ్చమమ్'

గలిగియున్నట్టి, మాం = నన్ను, ఏకత్వేన = *ఒక్కఁడై యుండు భావముతో, ఉపాసతే = ఉపాసింతురు.

తా. మఱికొందఱు మహాత్ములు పూర్వోక్తములైన కీర్తనాదులచేతను జ్ఞానమనెడి యజ్ఞముచేతను నన్ను సంతోషపఱుచుచు, నన్నుపాసించుచున్నారు. ఎట్లు? బహుప్రకారములచేతను వేఱువేఱుగా (అనఁగా జగదాకారముచేత నానా ప్రకారముల) నున్నట్టి నన్ను ఒక్కనిగానే కొని ఉపాసింతురు. ఇందలిభావ[44] మిది - భగవం[45]తుఁడు వాసుదేవుఁడే[46] నామరూపములచే వేఱు వేఱుపడరానివై అతి సూక్ష్మములై యుండిన చిద చిద్వస్తువులను శరీరముగాఁ గలవాఁడై

---

అనునట్లు మనోబుద్ధ్యభిమానములు మూఁడును కరచరణములు నాలుగును శిరస్సు ఒకటియుఁ జేరి అష్టాంగము అని యెఱుంగునది.

* మొదట 'భజన్త్యనన్యమనసః' అని ఉపాసనము అనన్యమనస్త్వము గలదిగా చెప్పఁబడెను. పిదప 'సతతం కీర్తయన్తః' అని ఉపాసనమునకు అంతరంగములైన కీర్తనము మొదలగునవి చెప్పఁబడెను. ఇప్పుడు ఉపాసనమువలన తెలియఁదగు వస్తువు యొక్క ఆకారవిశేషమును- అనఁగా దానికి విషయమగు భగవంతుని ఎట్టియాకారము గల వానినిగాఁ దెలియవలయునో దానిని - చెప్పుచున్నారు.

* చిదచిత్తులు సర్వావస్థలయందును ఈశ్వరునికి శరీరమై యుండును. చిదచిద్వస్తువులు మొదట నామముచేఁగాని రూపముచేఁగాని వేఱు పఱుపఁగూడనంత అతి సూక్ష్మములై యుండెను. పిదప ఈశ్వరుని సంకల్పమువలన నామరూపములచే వివిధములై వేఱుపఱుపఁగూడినట్లు స్థూలములై దేవతిర్యఙ్మనుష్యస్థావరములుగా పరిణమించెను. కావున నామరూపములు గల చిదచిద్వస్తువులే దేవతిర్యఙ్మనుష్యాదులు. దేవతిర్యఙ్మనుష్యాదులు మొత్తమునకు 'జగత్తు' అని పిలువఁబడును. ఇది యిట్లుండ, భగవంతుఁడగు వాసుదేవుఁడు నామరూపములచే వేఱుపఱుపరాని సూక్ష్మచిదచిద్వస్తువులను శరీరముగాఁ గలిగియుండి పిదప 'బహుస్యామ్' (అనేకము అగుదును) అను తన సంకల్పమువలన వాఁడే నామరూపములచే నానావిధములై వేఱుపడిన స్థూలచిదచిద్వస్తువులను (అనఁగా దేవతిర్యఙ్మనుష్యస్థావరములు-అనగా జగత్తును) శరీరముగాఁ గలిగినవాఁ డయ్యెను. ఇట్లు దేవతలనియు మనుష్యులనియు నానావిధముల వేఱువేఱై

యుండెను. పిదప, సత్యసంకల్పుఁడు (గాన) నామరూపములచే వేఱు వేఱు విభక్తములైన స్థూల చిదచిద్వస్తువులు శరీరముగాఁ గలవాఁడ నయ్యెదనని సంకల్పించి అతఁడొక్కఁడే దేవతిర్యఙ్మనుష్యస్థావరము లనెడి విచిత్రజగత్తు శరీరముగాఁ గలిగి ఉన్నాఁడని అనుసంధించుచు నన్ను ఉపాసింతురు.

అవ. అన్నియును నాకు శరీరముగాన అన్నియును *శరీరియగు నేనొక్కఁడనే యగుచున్నాను. కనుక ప్రపంచమునం దంతటను నేనే యున్నవాఁడను అని చెప్పుచున్నారు.

---

యుండు జగత్తంతయు శరీరియగు నీశ్వరుఁ డొక్కఁడే యగునను అనుసంధానముతో ఉపాసింపవలయును. ఇట్టి యనుసంధానమే యిచట జ్ఞానయజ్ఞ మనఁబడెను. ఈశ్వరునికి జగత్తు అనెడి శరీరమునందు దేవతిర్యగాదిరూపపృథక్త్వమును, శరీరియగు తన యందు ఏకత్వమును గ్రాహ్యము. పృథగ్భూతములైన కరచరణాద్యవయవములన్నియుఁ జేరి అవయవి యొక్కఁడే యగునట్టు పృథగ్భూతములగు దేవతిర్యగాదులన్నియు (జగత్తంతయు) చేరి తచ్ఛరీరియగు ఈశ్వరుఁ డొక్కఁడే యగుచున్నాఁడని గ్రహించునది. (ఈశ్వరుఁడు దేవతిర్యఙ్మనుష్య స్థావరరూపముల వేఱువేఱుగా నుండియు సర్వశరీరకత్వరూపమున ఒక్కఁడే యగు నని భావము. జ్ఞానయజ్ఞమును జెప్పెడి యీశ్లోకమువలన శరీరవ్యాపార మవశ్యము లేక శుద్ధమానసిక మగు ఉపాసనమును తెలియనగును.)

* శరీరి విశేష్యము, శరీరము విశేషణము, శరీరిలేక శరీరముమాత్రము. ప్రత్యేకముగా కలుగనేరదు. కనుక శరీరము శరీరికి వట్టివిశేషణము కాక అపృథక్సిద్ధమైన విశేషణమును అగును. అపృథక్సిద్ధము అనఁగా ప్రత్యేకముగా సిద్ధింపనిది. అపృథక్సిద్ధి యనగా ప్రత్యేకముగా సిద్ధింపమి. కరచరణాద్యవయవములచే నైనశరీరము, శరీరికి అపృథక్సిద్ధమై యుండుటవలన అన్నియును జేరి శరీరియొక్కఁడుగా గ్రహింపఁబడుచున్నది. కాన 'రాముఁడు ఉన్నాఁడు' అనుచో, కాలు ఉన్నది చెవులు ఉన్నది అను అవయవగ్రహణము లేక రాముఁడు అని అవయవియే గ్రహింపఁబడును. శరీరశరీరిభావమూలమైన అపృథక్సిద్ధి గలచోట్లనె నిట్లుగ్రాహ్యము. కనుక స్థావరజంగమాత్మకమైన జగత్తు శరీరశరీరిభావముచే ఈశ్వరునికి అపృథక్సిద్ధమై యుండుటవలన అన్నియును జేరి యీశ్వరుఁ డొక్కఁడుగా గ్రహింపఁదగును. కావున ఆస్థావర మున్నది ఈజంగము మున్నది అనక ఈశ్వరుఁ డొక్కఁడే యున్నాఁ డనఁదగునని తెలియునది

శ్లో॥ అహం క్రతురహం యజ్ఞః స్వధాహ మహ మౌషధమ్ ।
మన్త్రోఽహ మహమేవాజ్య మహ మగ్ని రహం హుతమ్॥ 16

టీ. అహమేవ = నేనే, క్రతుః = జ్యోతిష్టోమాదికమైన క్రతువును, అహమేవ = నేనే, యజ్ఞః = బ్రహ్మయజ్ఞాది పంచకమును, అహమేవ = నేనే, స్వధా = పితృదేవతలకు పోషకమైనస్వధ, అహమేవ = నేనే, ఔషధం = ఓషధవికారమైన హవిస్సు, అహమేవ = నేనే, మంత్రః = మంత్రము, అహమేవ = నేనే, ఆజ్యం = నేయి-ఘృతసోమాదికమైన హవిస్సు అనుట, అహమేవ = నేనే, అగ్నిః = ఆహవనీయాదికమైన అగ్ని, అహమేవ = నేనే, హుతం = హోమము.

తా. నేనే జ్యోతిష్టోమాది క్రతువులును, నేనే నిత్యమైన పంచ మహాయజ్ఞములును, నేనే పితృగణపుష్టికరమగు స్వధయును, నేనే ఓషధివికారమయిన హవిస్సును. నేనే మంత్రమును, నేనే హోమార్థమయిన ఘృతసోమాదికమగు హవిస్సును, నేనే ఆహవనీయాదికమగు నగ్నియు. హోమమును నేనే యగుదును.

శ్లో॥ పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్ర మోఙ్కారః ఋక్సామ యజు రేవచ॥ 17

టీ. అస్య = ఈ, జగతః = చరాచరాత్మకమైన జగత్తునకు, పితా = తండ్రియు, మాతా = తల్లియు, పితామహః = తాతయు, ధాతా = ధాతయు, వేద్యం = వేదములచేత తెలిసికొనఁదగిన, పవిత్రం = పావనమయినదియు, ఓంకారః = ప్రణవమును, ఋక్సామయజుశ్చ = ఋక్సామయజుర్వేదములును, అహమేవ = నేనే.

తా. జగత్తునఁగల స్థావరజంగమములకు అచ్చటచ్చట తండ్రిగాను తల్లిగాను ధాతగాను పితామహుఁడుగాను ఉండువాఁడను * నేనే;

* ఇచట పితా మాతా అని యేకవచనమువలన స్థావరజంగమములకెల్ల ఈశ్వరుఁడొక్కఁడే పితయు ఒక్కఁడే మాతయు నగునని గ్రహింపఁరాదు. దానిదానికి మాతృ

'(ఇట ధాతృశబ్దము తల్లిదండ్రులు కాక ఉత్పత్తిప్రయోజకుఁడైన చేతన విశేషమున వర్ణించెడిని). వేదములచేఁ దెలియఁదగిన పావన వస్తువు లన్నియును నేనే; వానిని తెలుపునదై వేదమునకు బీజభూతమై యొప్పు ప్రణవంబును నేనే; ఋక్సామయజుర్వేదములును నేన యగుదును.

47 48 49

శ్లో॥ గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్ ।
ప్రభవ ప్రలయస్థానం నిధానం బీజ మవ్యయమ్॥ 18

టీ. గతిః=పొందవలసిన స్థానమును, భర్తా = పోషకుఁడును, ప్రభుః=శాసించువాఁడును, సాక్షీ = ప్రత్యక్షముగాఁజూచువాఁడును, నివాసః=వసించుస్థానమును, శరణం=రక్షకుఁడును, సుహృత్ =మంచి హృదయము గలవాఁడును (మేలుగోరువాఁడును), ప్రభవప్రళయస్థానం =అంతటను అన్నిటికిని పుట్టుచోటును లయించుచోటును, నిధానం= ఉత్పత్తిప్రళయముల నొందునవియును, అవ్యయం=(అందును) నాశరహితమైన, బీజం=కారణమును, (అహమేవ=నేనే).

తా. *గతియు-అనఁగా అచ్చటచ్చటఁ గల ప్రాప్యస్థానమును, ధారకుఁడును, నియామకుఁడును, సాక్షియు (ప్రత్యక్షముగాఁ జూచుచుండువాఁడును), గృహము మొదలయిన వాసస్థానమును, (ఇష్టములను పొందించునదగుటచేతను అనిష్టములను తొలఁగించునదగుటచే

---

పితృ తాదులు వేఱువేఱుగ కలరు గనుక అట్లు గ్రహించుట ప్రత్యక్షవిరుద్ధము. కాఁబట్టి అందంటు ఆయావానికిఁగల ఆయా తల్లులు తండ్రులు మొదలైనవారెల్ల ఈశ్వరుఁడే యని భావము. అయినను ఈశ్వరుఁడు స్వరూపముచేత ఆయా పితృతాదులుగా ఉన్నాఁడని తలఁపరాదు. ఆయాపితృతాదులందు అంతర్యామియై యుండి ఆయాపితృతాది కార్యములు చేయించుచున్నాఁ డనియె గ్రాహ్యము.

* 'గతి' యనఁగా స్వర్గము పృథివి మొదలైన గమ్యదేశము లనియు 'నివాస' మనఁగా గృహము మొదలైనవాసస్థానము లనియు 'శరణ' మనఁగా మొదటిరెంటివల్ల

చేతను సమాశ్రయింపఁదగినదై యుండుచేతనమే శరణము- రక్షకము, అట్టి) శరణమును, నేనే యగుదును, మేలు గోరువాఁడును, (బ్రహ్మాదులకే కాకమఱి) దేనికిని ఉత్పత్తిప్రళయములకు ఎద్ది స్థానమో అదియు నేనే. నిధానమును - (అనఁగా అందు) ఉప్పతిల్లునవియు లయించునవియునగు కార్యజాతము నేనే. మఱి యందందు (ఆయా వానికి ఎన్నఁడును) నాశములేని కారణము ఎద్దియో అదియు నేనే.

శ్లో॥ *తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున॥ 19

టీ. అర్జున, అహం = నేను, తపామి = అగ్నిసూర్యాదిరూపముగ తపింపఁ జేయుచున్నాను, అహం = నేను, వర్షం = జలమును, నిగృహ్ణామి = స్వీకరించుచున్నాను, ఉత్సృజామిచ = విడుచుచునున్నాను, అమృతం = లోకము జీవించుటకు కారణమును, మృత్యుశ్చ = నశించుటకు కారణమును, సత్ = ఇప్పుడు వర్తించునదియు, అసత్ చ = ఇప్పుడు వర్తింపనిదియు-(అనఁగా జరిగిపోయినదియు జరుగనున్నదియును,) అహమేవ = నేనే.

తా. అర్జునా, గ్రీష్మకాలమునందు అగ్నిసూర్యాదిరూపమున నేనే జగత్తును దపింపఁజేయుదును; పర్జన్యరూపమున నేనే జలమును స్వీకరింతును. అట్లె వర్షాకాలములందు నేనే (పర్జన్యరూపమున) వర్షము గురియింతును. దేనివలన లోకము బ్రదుకునో దేనివలనఁ జచ్చునో యారెండును నేనే యగుదును. వేయేల, ఇప్పుడు ఉన్న

---

అచేతనము గాక యిష్టములను గలిగించి అనిష్టములను తొలఁగించి రక్షించునట్టిచేతనమైనదనియు మూఁటికిని భేదము.

* ఇంతవఱకు లోకమున బ్రసిద్ధములగు నాయా మేలిపదార్థములయొక్క సత్తె తనయధీన మగుటను దెలిపి యిపుడు వానిప్రవృత్తులును తనయధీన మగుటను చెప్పుచున్నాఁడు.

వియు ఇంతకు మునుపు ఉండినవియు ఇకఁ గాఁబోవునవియు నగు వస్తు వులన్నియును నేనే. సకలావస్థలయందును గల సమస్త చిదచిద్వస్తు వులు నాకు శరీరము లగుటవలన అవియన్నియు శరీరియగు నేనొక్కఁ డనే యగుదునుగాన నేనొక్కఁడనే యున్నట్టివాఁడ నని యర్థము. ఇట్లు (దేవతలని మనుష్యు లని తిర్యగాదులని) వేఱువేఱు నామముల చేతను రూపములచేతను నానావిధముల వేఱువేఱై యున్నవాఁడ నైనను, (ఆ దేవమనుష్యాద్యాత్మకమైన) జగత్తంతయు నాకు శరీర మగుటచే నేను దానికి శరీరినై యుండుటవలన అంతయుఁ జేరి నేనొ క్కఁడనే యున్నట్టివాఁడను అని *ఏకత్వజ్ఞానములో అనుసంధించుచు నన్ను (మహాత్ములు) ఉపాసించుచున్నారు.

అవ. ఇట్లు భగవదనుభవమే ముఖ్యభోగముగాఁగల మహా త్ములైన జ్ఞానులయొక్క భజనకీర్తనాది వృత్తమును జెప్పి యిపుడు వారికిఁ గలవిశేషమును తెలుపఁ గోరియే కామ్యకాములగు †అజ్ఞానుల యొక్క వృత్తమును జెప్పుచున్నారు.

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।

*ఇచట అనుసంధింపవలసిన ఏకత్వము శుద్ధమైన యేకత్వముకాదు - అనఁగా అచ్చముగా ఒకటియే యగుననికాదు. అది విశిష్టమైన ఏకత్వము - అనఁగా అనేకము తోఁగూడి మొత్తమునకు ఒక్కటియే యైయుండుట. కావుననే బహుధాపృథక్త్వము గలదానిని ఏకత్వముతో అనుసంధింపవలయు ననఁబడెను. దేవాదినానానామరూపము లచే భిన్నమై యుండినను సర్వశరీరకత్వరూపమువలన ఏకమైయుండునట్లు అనుసంధింప వలయునని భావము. కావున ఇది శుద్ధైకత్వముగాక విశిష్టైకత్వముయొక్క అనుసంధాన మని తెలియునది.

† అజ్ఞానుల వృత్తమును జెప్పుటమూలమున మహాత్ముల విశేషము తెలియును గాన వారివిశేషము తెలుపుటకొఱకే అజ్ఞానులవృత్త మిపుడు చెప్పఁబడుచున్న దనుట.

తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోకమ్
అశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్॥ 20

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలమ్
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నాః
గతాగతం కామకామా లభన్తే॥ 21

టీ. త్రైవిద్యాః = ఋగ్యజుస్సామము లనెడి మూఁడు వేదములయందుమాత్రము నిష్ఠగలవారు, యజ్ఞైః=ఇంద్రాదుల నుద్దేశించిన యాగములచేత, *మాం=దేవతలకు అంతర్యామినై ఉన్న నన్ను, ఇష్ట్వా=యజించి, సోమపాః=సోమరసమును, పానముఁజేసినవారై, పూతపాపాః = స్వర్గప్రాప్తికి విరోధములగు పాపములను బోగొట్టుకొనినవారై, స్వర్గతిం = స్వర్గలోకప్రాప్తిని, ప్రార్థయన్తే = ప్రార్థించుచున్నారు. తే=వారు, పుణ్యం=దుఃఖసంబంధము లేని-సుఖరూపమైన, సురేన్ద్రలోకం=దేవేంద్రలోకమును, ఆసాద్య=పొంది, దివి=స్వర్గమునందు, దివ్యాన్ = దివ్యములగు - అమానుషములగు, దేవభోగాన్ = దేవతాభోగములను, అశ్నన్తి=అనుభవించుచున్నారు, తే=వారు, విశాలం=విస్తీర్ణమైన, తం=ఆ, స్వర్గలోకం = స్వర్గలోకసుఖమును, భుక్త్వా=అనుభవించి, పుణ్యే=పుణ్యము, క్షీణే=క్షయిం

* 'యజ్ఞైః మాం ఇష్ట్వా=యజ్ఞములచే నన్ను ఆరాధించి' అనుట భగవంతుఁడు తనకు తానే చెప్పుకొనుమాటయేకాని త్రైవిద్యులు అట్లు అనుసంధించువారని తాను చెప్పుమాట కానేరదు. వారికి భగవంతుఁడు తత్తద్దేవతా రూపుఁడనియు కావున తత్తద్దేవతాపూజనము భగవత్పూజనమే యగుననియు జ్ఞానములేనందున, వారు భగవంతుని తాము పూజించునట్లు అనుసంధించుటయే కలుగదు. కాఁబట్టి అది భగవంతుఁడు తానే యనుకొన్నమాటగాని వారు అట్లు చేయుచున్నారని చెప్పుమాట కాదు.

చినదగుచుండఁగా, మర్త్యలోకం = మనుష్యలోకమును, విశన్తి= ప్రవేశించుచున్నారు. ఏవం=ఇట్లు, కామకామాః = కామ్యము లగు స్వర్గాదులఁ గోరువారు, త్రయీధర్మం=త్రివేదోక్తమైన సామాన్య ధర్మమును, అనుప్రపన్నాః=ఆశ్రయించినవా రగుచు, గతాగతం= స్వర్గాదులకు పోవుటయు మరల విడిచివచ్చుటయు, లభన్తే=పొందు చున్నారు.

తా. * ఋక్కు యజుస్సు సామము అను త్రి (మూఁడు) విద్యలును త్రివిద్యము లనఁబడును. త్రివిద్యమందుమాత్రము నిష్ఠు లగువారు-అనఁగా త్రివిద్యమందు ప్రతిపాదింపఁబడిన కేవల కర్మము

---

* త్రయీ - అనఁగా ఋక్కు యజుస్సు సామము అను మూఁడువేదములు. త్రయ్యంతము-అనఁగా వేదాంతము-ఉపనిషత్తులనుట. కావున త్రయ్యంతనిష్ఠు లనఁగా వేదాంతనిష్ఠులగుజ్ఞానులు. ఋగ్యజుస్సామము లనెడి త్రివిద్యలును ద్విగుసమాసముచే త్రివిద్యము అగును. త్రివిద్యమందు నిష్ఠగలవారు త్రైవిద్యులు -కర్మకాండనిష్ఠులనుట. త్రైవిద్యులవలెఁగాక త్రయ్యంతనిష్ఠులగు మహాత్ములు పూర్వోక్తప్రకారమున నిఖిల వేదములచే నెఱుఁగఁదగినవాఁడు భగవంతుఁడే యని యెఱింగి వానియందలి అతి మాత్రమైన భక్తిచేఁ గలుగుకీర్తనయజనాదులచే వానినే ప్రాప్యముగాఁ గలిగి వానినే యుపాసింతురని తెలియునది. త్రయ్యంతనిష్ఠులకును విద్యాంగమైన కర్మమును సంబంధించిన సోమపానము కలదు. అట్టిసోమపానము త్రైవిద్యులకు లేదు గావున వీరికి కేవలము ఇంద్రాదియాగశేషమైన సోమపానము చెప్పఁబడెను. యజ్ఞశేషము కాని సోమపానము అధర్మము. అధర్మపరులకు స్వర్గాదిప్రాప్తి కలుగదు. కనుక స్వర్గాదులను ప్రాపించుధార్మికులగు త్రైవిద్యులయొక్క సోమపానము యజ్ఞశిష్టమైనదిగాఁ జెప్పఁబడెను. స్వర్గాదులకు గమనాగమనములు చేయునంతమాత్రమున దోషములేదు. అవి అస్థిరములును అల్పములును అగుటవలన అట్టివానిని పొందుచువిడుచుచునుండుటయే దోషము. కావుననే అల్పాస్థిరము లనువిశేషణము లుంపఁబడినవి. దేవతలు తమయొక్క భోగ్య వస్తువులను తమ్ము యజించునట్టివారికిఁ గూడ పంచియిత్తురు. కావున వారిని యజించు త్రైవిద్యులకు దేవభోగములు చెప్పఁబడినవి. అయినను, ఆ దేవతలు తాము దేవలోకమున అనుభవించు భోగ్యములనే యిత్తురు గాని, భూలోకమునఁ బొందునట్టి పశు పురోడాశాదుల నియ్యరు. కాఁబట్టి దేవభోగ్యములకు 'దివ్యాన్' అనువిశేషణముచేర్పఁబడెను. అనఁగా దేవతలయొక్క దివ్యములైన భోగ్యములేకాని భూలోక భోగ్య

నందు నిష్ఠగలవారు త్రైవిద్యులు. వారు త్రయ్యంతనిష్ఠులు కారు. త్రయ్యంతనిష్ఠులగు మహాత్ములు పూర్వోక్త ప్రకారమున నిఖిల వేదవేద్యుఁడు నేనే యని యెఱిఁగి నాయందలి యతిమాత్ర భక్తివలన జనించు కీర్తనాదులచేతను జ్ఞానయజ్ఞముచేతను నన్నే ప్రాప్యముగాఁ గలిగి నన్నే యుపాసింతురు. త్రైవిద్యులన్ననో వేదప్రతిపాద్యములైన యింద్రాదియాగములకు మాత్రము శేషమగు సోమరసములను పానముచేయుచు దానివలన స్వర్గాదిప్రాప్తికి విరోధులగు పాపములను వీడి ఆ యజ్ఞములను, కేవల మింద్రాదులే వానికి దేవతలుగా అనుసంధించి, యజించినను వాస్తవమునకు ఆ యింద్రాది రూపుఁడైన నన్నే యజించి (నవారగుదురేకాని) యట్లు (ఇంద్రాదిరూపమున) ఉన్నవాఁడ నని నన్నుఁ దెలియరు గాన (మోక్షము నడుగక) స్వర్గగతిని ప్రార్థింతురు. వారు దుఃఖముతోఁ గలియకున్న యీ దేవేంద్రలోకమును బొంది అచట దేవత లనుభవించు దివ్యభోగములను అనుభవింతురు. ఇట్లు వారు మనుష్యలోకమునకంటె[50] విశాలమైన స్వర్గలోకమును అనుభవించి[51] ఆ స్వర్గానుభవమునకు[52] హేతువైన పుణ్యము క్షీణింపఁగా మరల మనుష్యలోకమును ప్రవేశించుచున్నారు. ఈ విధమున త్రయ్యంతసిద్ధమగు జ్ఞానమునందు[53] ఆసక్తి లేమిచే కామ్యములగు స్వర్గాదులను గోరి[54] కేవలము త్రయీధర్మమును అనువర్తించునట్టివారు, అల్పములును అస్థిరములునైన స్వర్గాదులను మరల మరల అనుభవించుచును విడిచివచ్చుచు నుందురు.

---

ములు త్రైవిద్యులకు కలుగవని భావము. 'క్షీణే పుణ్యే' అనుచో స్వర్గప్రాప్తిని గలిగించు పుణ్యముమాత్రమే స్వర్గానుభవముచే క్షీణించును గాని తక్కిన పుణ్యములు క్షీణింపవని తెలియునది. పుణ్యములుగూడ బంధకమే గనుక ఆ తక్కిన పుణ్యముల వలన మనుష్యలోకమునందు గొప్పకులమునఁ బుట్టుట మొదలైనవి కలుగుచున్న వని గ్రాహ్యము.

అవ. మహాత్ము లన్నవో నిరతిశయ ప్రియరూపమైన మచ్చింతనము చేయుచు నిరతిశయానందుఁడ నగు నన్ను ప్రాపించి మరల రారు అని వారికిఁ గలవిశేషమును తెలుపుచున్నారు.

55

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।

56 57 58 59

తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

టీ. యేజనాః = ఏమహాత్ములగువారు, అనన్యాః = ప్రయోజనాంతరము లేనివారై, మాం = నన్నే, చిన్తయన్తః = చింతించుచు, పర్యుపాసతే = అఖండిత స్వరూపగుణ విభూతులతో ఉపాసింతురో, తేషాం = అట్టి, నిత్యాభియుక్తానాం = నాతో నిత్యసంబంధమును గోరునట్టివారియొక్క, యోగక్షేమం = ముందుకలుగని మత్ప్రాప్తిని పొందుట అనెడి యోగమును లభించుదానిని రక్షించుట -పునరావృత్తి లేమి అనెడి క్షేమమును, అహం = నేను, వహామి = ఇచ్చుచున్నాననుట.

60

తా. మఱియొక ప్రయోజనమును లేనివారై (అనఁగా నన్నుఁ జింతించుటచేతఁదప్పఁ దక్కిన విధముల నాత్మధారణము లభింపమి వలన నన్నుఁ జింతించుటయే ముఖ్యప్రయోజనముగాఁ గలవారై) నన్నుఁ జింతించుచు మహాత్ములగు జను లెవ్వరు నన్ను (పర్యుపాసింతురో- అనఁగా) సర్వకల్యాణ గుణాన్వితునిఁగాను సర్వవిభూతియుక్తునిఁగాను అన్యూనముగా (అఖండిత గుణవిభూతియుక్తునిఁగా) ఉపాసింతురో, వారు నాతో నిత్యయోగమును గోరుచుండువా రగుటచే నట్టి

61

వారికి నేను నాప్రాప్తి యనెడు యోగమును అపునరావృత్తియనెడు క్షేమము నిచ్చుచున్నాను. 62

శ్లో॥ *యే త్వన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః ।
తేఽపి మా మేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్ ॥ 23

టీ. కౌన్తేయ=అర్జునా, యేతు=ఎవ్వరైతే, అన్యదేవతాభక్తాః=అన్యదేవతలైన ఇంద్రాదులయందు భక్తిగలవారై, శ్రద్ధయా=విశ్వాసముతో, అన్వితాః=కూడినవా రగుచు, యజన్తే=(ఇంద్రాదిదేవతలను) ఆరాధింతురో, తేఽపి=వారును, అవిధిపూర్వకం=వేదాంతవాక్యములు విధించునట్లు అనుసంధింపక, మామేవ=నన్నే, యజన్తి=పూజించుచున్నారు.

తా. ఎవరు కేవలము త్రయీనిష్ఠు లయి ఇంద్రాదిదేవతల యందు భక్తిగలవారగుచు శ్రద్ధతో ఇంద్రాది దేవతలను ఆరాధింతురో, వారు సైతము పూర్వోక్తమగు న్యాయముచేత సమస్తమును నాకు శరీరమై నన్ను ఆత్మగాఁ గలిగియుండుటవలనను, ఇంద్రాది సమస్త శబ్దములు నాకు వాచకము లగుటవలనను, వాస్తవమునకు నన్నే ఆరాధించుచున్నారు; కాని ♦విధిపూర్వకముగా యజించువారు గారు. 'చతుర్హోతారో యత్రసంపదం గచ్ఛన్తి దేవైః' ఇత్యాది

* సమస్తదేవతలును భగవంతునికి శరీమగుటం బట్టి 'త్రైవిద్యామామ్' అన్న చోప్పున వారి నారాధించుట నిజమునకు నిన్నారాధించుటయని తెలిసి, నీవేల కేవల కర్మలకుఁగూడ మోక్షమనెడి యోగక్షేమమును ఒసంగవు? అనఁగా నీ శ్లోకమునను మీది శ్లోకమునను బదులు చెప్పుచున్నారు.

♦ 'పూర్వోక్త న్యాయముచేత' ననఁగా 'మయి సర్వమ్' ఇత్యాదులను బట్టియు ఈ యధ్యాయమందే 'మయా తత మిదం సర్వమ్' ఇత్యాదులనుబట్టియు నని యర్థము.

♦వేదములందు కర్మభాగము, దేవతలను కర్మములచే నారాధించుటను మాత్రము చెప్పుచున్నదిగాని వారి స్వరూపమును జెప్పదు. వేదాంతములో వారి యథావస్థిత స్వరూపమును దెలిపి అట్టి స్వరూపముయొక్క అనుసంధానముతో వారి నారాధింప వలయునని విధించుచున్నది. ఎట్లన- 'చతుర్హోతారో...' అనెడి యీ వేదాంతవాక్యము, దేవతలు పరమపురుషునికి శరీరభూతు లగుటచేతనే కర్మములు వారికి ఆరాధనములగును

వేదాంత వాక్యములయందు ఇంద్రాదులగు దేవతలు కర్మములయం దెట్లు ఆరాధ్యులుగా సంబంధపడియున్నారని (అనఁగా కర్మములచే ఏ విధమున ఆరాధ్యులగుదురని) విధింపఁబడియున్నదో యావిధిని
63
మున్నిడుకొని త్రైవిద్యులు యజింపరు. వేదాంతవాక్యసమూహము, పరమపురుషునికి శరీరముగా నున్నట్టి యింద్రాదులు ఆరాధ్య లని
64
విధించుచు ఆత్మభూతుఁ డగు పరమపురుషుఁడే ముఖ్యముగా ఆరాధ్యుఁ డని విధించుచున్నది. చతుర్హోతారః=అగ్నిహోత్ర దర్శపూర్ణమాసాదులగు కర్మములు, యత్ర=ఎందు- ఏపరమాత్మ ఆత్మభూతుఁడై నెలకొనియె యుండఁగా, దేవైః=వానికి శరీరభూతు లైనట్టి యింద్రాది దేవతలచేత, సంపదం=ఇంద్రాది దేవతలకు ఇవి ఆరాధనము లగును అనెడి సంపదను (అతిశయమును), గచ్ఛన్తి=పొందుచున్నవో యని యర్థము.

అవ. త్రైవిద్యులు వేదాంతవిధిని తెలియరు కాఁబట్టి 'ఇంద్రాదులను శరీరముగాఁగల పరమపురుషునికి ఆ కర్మములు ఆరాధనము లగును వాఁడే ఆరాధ్యుఁడు' అని తెలియక, దేవతలే యారాధ్య లని

---

అని విధించుచు, తన్మూలమున ఆ దేవతలకు శరీరియగు పరమపురుషునికే అవి ముఖ్యముగా ఆరాధనము లగును అని విధించిన దగుచున్నది. శరీరమును గుఱించిన యారాధనములు శరీరికే చెల్లునుగదా. పరమపురుషునికి శరీరభూతులైయుండుట దేవతాదుల స్వరూపము. ఈస్వరూపమును అనుసంధించియే వారిని ఆరాధింపవలయును. ఆదేవతలవలన ఆ కర్మములు పొందుసంపద యేదనఁగా అవి వారికి ఆరాధనము లగుటయే. త్రైవిద్యులు, వేదాంతములు విధించునట్లు శరీరభూతులగు దేవతల నారాధించుటచే శరీరియగుపరమపురుషుఁడే ఆరాధింపఁబడుచున్నాఁడు' అనుట తెలియక కర్మభాగమునుబట్టి అవి కేవలము దేవతలకే యారాధనములని తలఁచి వానిని ఆదేవతల నుద్దేశించియే చేయుచున్నారు కాని వేదాంతవిధిపూర్వకముగ భగవంతు నుద్దేశించి చేయుటలేదు. అయినను అవి తుదకు భగవంతునికే యారాధనము లగుచున్నవి గాన వారుకూడ భగవంతు నారాధించువారే యగుచున్నారని భావము.

తలఁచి వారినే ఆ కర్మములచే నారాధింతురు. (ఆ దేవతలు దేశ కాలపరిమితములైన భోగములుగల వారగుటచేత వారిని ఆరాధించు)

65

త్రైవిద్యులును పరిమితములైన ఫలములనే పొందినవారై (అవి తీఱఁగానే ఆ దేవతలతోఁ కూడ) చ్యుతి నొందునట్టి స్వభావము గలవారగుదు రని చెప్పుచున్నారు.

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవచ।
న తు మా మభిజానన్తి తత్త్వేనాత శ్చ్యవన్తి తే॥ 24

టీ. సర్వయజ్ఞానాం=ఇంద్రాదులనుద్దేశించి చేయఁబడుసమస్త యజ్ఞములకు, భోక్తాచ=ఆ యజ్ఞములచే నారాధింపఁబడువాఁడును, ప్రభుశ్చ=ఫలప్రదాతయు, అహమేవహి = నేనేకదా, మాంతు= నన్నో, తత్త్వేవ=యథార్థముగా, తే=వారు, న అభిజానన్తి=ఎఱుఁగరు, అతః=అందువలన, చ్యవన్తి=ఆ దేవతలవలనఁ కలుగు భోగములనుండి జాఱుచున్నారు.

తా. ఇంద్రాది దేవతల నుద్దేశించి చేయునట్టి సమస్తయజ్ఞములచేత నారాధింపఁబడువాఁడును, అందందు వారివారికి ఆ యాఫల

66

ముల నిచ్చువాఁడును నేనే యగుదునుగదా. ఐనను త్రైవిద్యులు నన్నిట్టివానినిగా నెఱుఁగకుగాన, తాము కేవలము దేవతలనే ఆరాధించునట్లు తలఁచి అందువలన పరిమితము లగుఫలములను బొంది అవి తీఱఁగానే వానినుండి చ్యుతి నొందువా రగుదురు.

అవ. వారువారు తాము చేయుకర్మము ఒక్కటియే యైనను, (ఆ కర్మమునే వారిలోఁ కొందఱు దేవతలను గుఱించియు, మఱి కొందఱు ఈశ్వరునిగుఱించియు సంకల్పించి చేయుచున్నారు. ఇట్లు కర్మము ఒక్కటియేయైనను దానినిగుఱించిన) సంకల్పముమాత్రము నందుఁగల భేదముచేత కొందఱు అత్యల్పఫలములను బొంది (పునరా

వృత్తిరూపమైన) చ్యుతి నొందు స్వభావముగలవా రగుచున్నారు. కొందఱు అనవధికాతిశయానంద పరమపురుషప్రాప్తిరూప మైనమహా ఫలమును బొంది పునరావృత్తి రహితు లగుచున్నారే. ఔరా! ఇది గొప్ప వైచిత్ర్యము అని చెప్పుచున్నారు.

శ్లో॥ యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః ।
భూతానియాన్తిభూతేజ్యా యాన్తిమద్యాజినోఽపిమామ్॥

టీ. దేవవ్రతాః=ఇంద్రాది దేవతల నారాధించు సంకల్పము గలవారు దేవాన్=ఇంద్రాది దేవతలను, యాన్తి=పొందుచున్నారు, పితృవ్రతాః=పితృదేవతల నారాధించు సంకల్పము గలవారు, పితౄన్=పితృదేవతలను, యాన్తి=పొందుచున్నారు. భూతేజ్యాః=యక్షరాక్షసపిశాచాది భూతములను ఆరాధించు (సంకల్పము గల)వారు, భూతాని=ఆయా భూతములను, యాన్తి=పొందుచున్నారు, మద్యాజినః=న న్నారాధించువారు, మాం అపి=నన్నే, యాన్తి=పొందుచున్నారు.

తా. *(వ్రతశబ్దము సంకల్పవాచకము,) ఎవరు దేవవ్రతులో-అనఁగా దర్శపూర్ణమాసాదు లగుకర్మములచేత 'ఇంద్రాదులను యజింతము' అని ఇంద్రాదులను యజించు సంకల్పము గలవారెవరో వారు ఇంద్రాది దేవతలను బొందుదురు. ఎవరు పితృయజ్ఞాదులచే

* ఇట్లే కర్మము సమానమేయైనను సంకల్పమాత్ర భేదముచేత ఫలవైచిత్ర్యము కలుగుచున్నది. ఇచట సంకల్ప విశేషమువలననే ఫలభేదము కాఁబట్టి వ్రతమునకు సంకల్పమే యర్థమగును. దేవవ్రతాః పితృవ్రతాః అనువానినడుమ యజనశబ్దమును, భూతేజ్యాః అను దాని తుదను వ్రతశబ్దమును మేళవించుకొనవలయును. ఆయాసంకల్పము గలవారికి దేవతలు మొదలయిన వేఱువేఱు ప్రాప్యములను జెప్పుట, ఆయా ప్రాప్యములతో సమానమగు కాలదేశములను సమానమగు భోగములను బొందుచున్నారని తెలుపుటకని ఎఱుంగునది.

'పితరులను యజింతము' అని పితరులను యజించు సంకల్పము గల వారో వారు పితరులను బొందుదురు. ఎవరు 'యక్షరక్షః పిశాచాదు లగుభూతములను యజింతము' అని భూతములను యజించు సంకల్పము గలవారో వారు భూతములను బొందుదురు. ఎవ్వరైతే ఆ యజ్ఞము లచేతనే 'దేవపితృ భూతశరీరకుండును పరమాత్మయు భగవంతుడును నగు వాసుదేవుని యజింతము, అను సంకల్పముతో నన్ను యజించు చున్నారో, అట్టివారు నన్నే పొందుచున్నారు. ఇట్లు దేవాదివ్రతులు దేవాదులను బొంది వారితోఁగూడ పరిమితమైన భోగమును అను భవించి వారికి వినాశకాలము కలిగినపుడు వారితోఁగూడ తాము వినాశమును బొందుచున్నారు. నన్ను యజించువా రన్ననో *ఆద్యాం తరహితుఁడును, సర్వజ్ఞుఁడును, సత్యసంకల్పుఁడును, అనవధికాతిశయా సంఖ్యేయ కల్యాణ గుణగణ మహోదధియు, అనవధికాతిశయానందుఁ డును, అగు నన్నుఁబొంది పునరావృత్తి లేకుందు రని యర్థము.

---

* ప్రాప్య మెట్లో అట్లే దానిని ప్రాపించువారును అగుదురు. ఇచట ప్రాప్యుఁ డగు ఈశ్వరుఁడు ఆద్యంతరహితుఁ డగుటచే నిత్యుఁడగును గాన వానిని ప్రాపించు వానికి పునరావృత్తి కలుగదు. ప్రాప్యము అనిత్యమైనదేకదా ప్రాపించువానికి పునరా వృత్తి కలుగును. మఱియు నీశ్వరుఁడు సర్వజ్ఞుఁ డగుటచే ప్రాపించువానికి విరోధియైన అజ్ఞానముయొక్క నాశము కలుగుచున్నది. అయినను ఈశ్వరుఁడు స్వతంత్రుఁ డగు టచే తన్ను ప్రాపించినవారిని తలఁచినప్పుడు తఱిమి వేయఁగూడదా అని శంక కలు గఁగా, వాఁడు సత్యసంకల్పుఁడు గనుక (అనఁగా 'భక్తులను మఱల పంపివేయను'అని వాఁడు చేసికొన్నసంకల్పము నిత్యమైనది గనుక) భక్తులకు పునరావృత్తి కలుగదు. వాని కల్యాణగుణములును ఆనందమును అనవధికములు (అనఁగా మేరలేనివి) గనుక వానిని బొందువారి భోగములును అనవధికము లయియుండు నేకాని పరిమితములు కానే రవు. ఇట్లు భగవంతునికి ఆద్యంతరహితత్వము మొదలైన విశేషణము లుంచుట. ఇతర దేవతాభక్తులకుఁ గలుగు పునరావృత్తి మొదలైనవి భగవద్భక్తులకు కలుగవని నిరూ పించుట కొఱకుఁగా తెలియునది. తద్భక్తులకు కర్మవశమునఁ గాకపోయినను స్వేచ్ఛ చేత పునరావృత్తి గలుగఁగూడదా యనఁగా భగవంతునియొక్క యేతాదృశగుణ విభూతుల ననుభవించునట్టివారికి తక్కిన విషయములందు వెగటు కలుగును గాన వారు స్వేచ్ఛచేతనుగూడ పునరావృత్తి నొందరు. అనఁగా ఇతర విషయానుభవమునకు మఱలిరారు.

అవ. నన్ను యజించువారికి ఇంతవఱకుఁ జెప్పినవిశేషముకాక, యీ మఱియొక *విశేషముకూడఁ గలదనిచెప్పుచున్నారు.

శ్లో॥ పత్రంపుష్పంఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥

టీ. యః=ఎవ్వఁడు, మే=నాకు, భక్త్యా=అత్యంతప్రీతితో, పత్రం=తులసి మొదలగు పత్రమునుగాని, పుష్పం = పువ్వుగాని, ఫలం=పండునుగాని, తోయం=నీరునుగాని, ప్రయచ్ఛతి=సమర్పించుచున్నాఁడో, తస్యప్రయతాత్మనః=అట్టి శుద్ధితోఁగూడిన మనస్సుగలవానియొక్క, భక్తి ఉపహృతం=అటువంటి భక్తితో సమర్పింపఁబడిన, తత్=ఆ పత్రపుష్పాదికమును, అహం=నేను, అశ్నామి=భుజించుచున్నాను.

67

తా. అందఱికిని సులభముగా దొరకు ఒక *పత్రముగాని

68

లేక పుష్పముగాని, లేక ఫలముగాని, (ఏది దొరకకపోయినను అతి సులభముగా తప్పక దొరకునట్టి) జలముగాని, ఎవఁడు నాయెడలం గల అత్యంత ప్రీత్యతిశయముచేత (నాకవి యిచ్చిననేకాని లేనియెడల తనంత నిలువనోపక వానిని నాకర్పించుటయే ముఖ్యప్రయోజనముగాఁ గలవాఁడై) నా కొఱకుఁగునో వాఁడు ఆ పత్రాదులను నా కిచ్చుటయే

---

* ఇంతవఱకుండు, ఉపాయమగు కర్మము సమానమైనను ప్రాప్యములయిన భోగమోక్షములు విషయములుగానుండుటవలన త్రైవిద్యులకంటె జ్ఞానులకుఁగలుగువిశేషము చెప్పఁబడినది. ఇప్పుడు ఉపాయమే విషయముగా నుండుటవలన (అనఁగా త్రైవిద్యులకు దుష్కరముగాను జ్ఞానులకు అత్యంతసుకరముగాను ఉండుటవలన) జ్ఞానులకుఁ గలుగు విశేషమును జెప్పుచున్నారని తెలియునది.

*'పత్రేషు పుష్పేషు ఫలేషు తోయేష్వక్రీతలభ్యేషు సదైవ సత్సు। భక్త్యేకలభ్యే పురుషే పురాణే ముక్త్యైకిమర్థం క్రియతేనయత్నః' అనుటయు నిచట నూహ్యము.

ముఖ్యప్రయోజనముగాఁ గలిగియుండుటవలన *పరిశుద్ధమైన మనస్సు కలవాఁడై యుండును. అట్టి పరిశుద్ధాత్ముఁడు ♦అటువంటి భక్తితో నాకర్పించు పత్రాదులు ఎంతస్వల్పములైనను వానిని నేను ♦సర్వేశ్వరుఁడ నయ్యు, నిఖిలజగదుదయవిభవలయలీలుఁడ నయ్యు, అవాప్తసమస్తకాముఁడ నయ్యు, సత్యసంకల్పుఁడ నయ్యు అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణుఁడ నయ్యు, స్వాభావికానవధికాతిశయా

---

* ప్రయోజనాంతరములందు రక్తి కలిగియుండుటగాని పుణ్యకార్యమునందైనను ఫలాభిసంధికలిగియుండుటగాని మనస్సుయొక్క అశుద్ధియగును. అట్టి యశుద్ధిలేమియే ప్రయతత్వము. కావున ప్రయోజనాంతరములను గాని ఫలములనుగాని కోరక పత్రాదులను భగవంతున కర్పించుటయే ముఖ్యప్రయోజనముగాఁ గలిగియుండుటయనెడి శుద్ధితోఁగూడిన మనస్సే యిచట ప్రయతాత్మశబ్దముచే గ్రాహ్యము.

♦ ఫలాభిలాషులకుఁగూడ ఒకానొకవిధమైన భక్తిగలదు. ఇది అట్టి భక్తికాదనుటకై 'అటువంటి' అను విశేషణముంచి పూర్వోక్తలక్షణమైన మహాత్మలభక్తి పరామర్శింపఁబడినది. మఱియును 'భక్త్యా' అని మొదటఁ జెప్పి మరల 'భక్త్యుపహృతమ్' రెండవతూరియు నాభక్తినే కీర్తించుటయేలనఁగా, అత్యల్పములగు పత్రాదులను భగవంతుఁ డత్యాదరముతోఁ చేకొనుటకు హేతువు ఆభక్తియేకాని మఱొకటి కానేరదని తెలుపుటకు. ఈ విషయమునే భగవంతుఁడు 'అణ్వప్యుపహృతం భక్తైర్మమ భోగాయ జాయతే। భూర్యప్యభక్తోపహృతం న మే భోగాయ జాయతే.' (భక్తులు నాకర్పించునది అణువంతైనను అది నాకు భోగార్హమగుచున్నది. భక్తిలేనివా రర్పించునది మిక్కిలి యైనను అది నాకు భోగార్హముగాదు) అని తానే చెప్పియున్నాఁడు.

♦ సర్వేశ్వరుఁ డనుటచే, ఇంద్రాదులు తమశక్తివృద్ధినొందుటకొఱకు హవిస్సు మొదలైనవానిని గ్రహించునట్లు నేను నాశక్తివృద్ధికొఱకు పత్రాదులను గ్రహించువాఁడను గాను. ఏలన, అంతటను ఎప్పుడును గల నియమనశక్తి నాకుఁ గలదు. అట్టి నా పరిపూర్ణశక్తిని నేను పెంపనక్కఱలేదు; కావున దానివృద్ధికై పత్రాదులను గ్రహింపను అని భావము. భక్తినిబట్టి గ్రహింతును అని భావము. నిఖిల ... లీలుఁడనుటచే, నాలీలకు ఉపకరణమైన జగత్తులోనిదే యీ పత్రాదులు గాని దానికి వెలిదైనవి కావు. అనఁగా నావస్తువులే నాకర్పింపఁబడు చున్నవని భావము. అవాప్తసమస్త కాముఁడనుటచే, నే నింతవఱకు పొందని దొకటియు లేదు. కాఁబట్టి క్రొత్తగా నొకటి పొందవలసినదియు లేదు. కావున పత్రాదులు భక్తిపూర్వకముగా అర్పింపఁబడినవని కైకొనుచున్నానేకాని అవి నాకు అపూర్వములైనవని కాదనుట. సత్యసంకల్పుఁ డనుటచే, నే నెట్టివస్తువునుగాని తలఁచినంతనే అది

నందమయు మగు నా స్వరూపము ననుభవించుచు నున్నవాఁడ నయ్యు, కోరికల కందరాని యొక *అపూర్వ ప్రియవస్తువు దొరకిన యెడ నెట్లో అట్లే అనుభవింతును. ఇట్లే మోక్షధర్మమందును 69 'యాః క్రియా స్సంప్రయుక్తాస్స్యురేకాన్తగతబుద్ధిభిః । తా స్సర్వా శ్శిరసా దేవః ప్రతిగృహ్ణాతి వై స్వయమ్' అని చెప్పఁబడి యున్నది. 70.

అవ. మహాత్ములగు జ్ఞానులకు అవాఙ్మానసగోచరమైన యిట్టి విశేషమున్నది. కనుక నీవును అట్టి జ్ఞానివై పూర్వోక్త లక్షణమైన భక్త్యతిశయముచే వినమితములైన ఆత్మాత్మీయములు గలవాఁడవై కీర్తన యతనార్చనప్రణామాదుల నిరంతర మాచరించుచు లౌకికములును వైదికములును అగు నిత్యనైమిత్తిక కర్మములను ఈ విధమున ఆచరింపు మని చెప్పుచున్నారు.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్॥ 27

---

తప్పక నాకుఁగలుగును. కనుక ఒకనివలన ఒకవస్తువును నేను పుచ్చుకొనుటకు హేతువు అది నాకు అశక్యమైన దని కాదు; అని అభిప్రాయము. అనవధిక...ఇత్యాదులచే గుణమునందునుకూ స్వరూపమునందును 'నిరతిశయానందమయుఁడనై తృప్తి నొందియున్న నాకు ఈ పత్రాదు లెంతమాత్రము అని భావము. ఆయా విశేషణములు చెప్పుటకుఁ గల అభిప్రాయములను తెలియునది.

* అత్యల్పమగు పత్రాదులను భక్తినిబట్టి అత్యపూర్వములైన ప్రియవస్తువులవలె భగవంతుఁడు చేకొనుచున్నాఁడనుట 'పరిపూర్ణోఽపి భగవాన్ భక్తైర్భక్త్యోపపాదితమ్। సాపేక్షవ త్తదాదత్తే తేనప్రీతో దదాత్యలమ్॥' అనుచోఁగూడ చెప్పఁబడినది. మఱియు మోక్షధర్మమున ఫలాంతరార్థులగు జనులు సమర్పించునవి 'తత్సర్వం దేవదేవస్య చరణావుపతిష్ఠతే' అని భగవంతునిపాదములందుండునట్లును పరమైకాంతిజనులగు భక్తులు సమర్పించువానిని 'యాః క్రియాః' అని భగవంతుఁడు శిరసున వహించునట్లును జెప్పం

టీ. కౌన్తేయ=అర్జునా, యత్ = ఏ లౌకికవ్యాపారమును, కరోషి=చేయుచున్నావో, యత్ అశ్నాసి = దేనిని భుజించుచున్నావో, యత్ జుహోషి=ఏ హోమమును వేల్చుచున్నావో, యత్ దదాసి=దానమును చేయుచున్నావో, యత్ తపస్యసి=ఏ తపము నాచరించుచున్నావో, తత్=ఆ సమస్తమయినదియు, మదర్పణం=నాయందు సమర్పింపఁబడిన దగునట్లు, కురుష్వ=చేయుము.

తా. అర్జునా, దేహయాత్రకు వలయునట్టి యే లౌకిక కర్మమును జేయుదువో, దేహధారణమునకొఱకు దేనిని భుజింతువో, హోమదానతపః ప్రభృతులైన యే వైదికకర్మములను నిత్యనైమిత్తికములను జేయుదువో, వానినంతయు నా కర్పణముగా చేయుము-అనఁగా నా కర్పితమగునట్లు చేయుము. సమస్తములగు లౌకిక వైదికకర్మముల కర్తృత్వమును భోక్తృత్వమును ఆరాధ్యత్వమును నాయందు సమర్పితమగునట్లు గావింపుమనుట. (కర్మములు *క్షణికము లగుటచే వానిని నాయందు సమర్పించుట యెట్లు అందువేని, కర్మములను సమ

---

బడియున్నది. మఱియు భగవంతుఁడు పత్రపుష్పాద్యల్పవస్తుప్రదానము చేతనే భక్తుల కతిసులభుఁ డగుచున్నాఁడు. త్రైవిద్యుల కట్లు కాఁడు. కాన వీరికంటె భక్తులకు భగవత్ప్రాప్త్యుపాయము అతిసుకరముగా నుండుటయే విశేషము అని తెలియునది.

* వస్తువు స్థాయి అనియు క్షణిక మనియు ద్వివిధము. స్థాయివస్తువులనఁగా నిలుకడగా నేర్పడియుండునవి ఇవియే పండు పువ్వులు మొదలైనవి. క్షణికములనఁగా క్షణమాత్ర మేర్పడియుండునవి. చేయఁబడుచున్న యాయాక్షణమువరకే యేర్పడియుండున వనుట. ఇవియే కర్మములు. సమర్పించుట అనఁగా ఒకచోటనున్న స్థాయి వస్తువును మఱొకచోటఁ గూర్చుట; కాన స్థాయివస్తువులగు పుష్పఫలాదులను ఒకచోటనుండి మఱియొకచోటఁ జేర్పఁగూడును (అనగా సమర్పింపఁగూడును) గాని క్షణికములగు కర్మములను అట్లు సమర్పింపఁ దరముకాదు. కనుక లౌకిక వైదికము లగు కర్మములను భగవంతునియందు సమర్పించుట యెట్లు? అని భావము.

ర్పించుట యనఁగా కర్మములనే సమర్పించుటకాదు. ♦కర్మముల కర్తృత్వమును భోక్తృత్వమును ఆరాధ్యత్వమును మాత్రము నాయందు సమర్పించుట యని తెలియుము.) *శ్రుతి సూత్రాదులవలన జీవునికే కర్తృత్వ భోక్తృత్వములును దేవతలకు ఆరాధ్యత్వమును తెలియుచుండఁగా అవి యీశ్వరుఁడనగునా కెట్లు చెల్లునందువేని, యాగదానాది కర్మములందు ఆరాధ్యులుగా తెలియుచున్న దేవాదులును, ఆ కర్మములకు కర్తయు కర్మఫలములకు భోక్తయు నగు ♦నీవును మదీయులై మత్సంకల్పమునకులోనైన స్వరూపస్థితి ప్రవృత్తులు గలవారునైయున్నారు. కనుక (మీఁకు గల కర్తృత్వాదులు నా సంకల్పమువలననే జరుగుచున్నవి) ఇట్లు నేను మీకందఱికిని ♦పరమశేషియు పరమకర్తయునై యుండుటవలన ఇట్టి నాయందే, కర్తయు భోక్తయు ఆరాధకుఁడును అగు నిన్నును, ఆరాధ్యులగు దేవతాసమూహమును, ఆరాధనములగు కర్మసమూహమును సర్వమును సమర్పిం

---

♦ కర్తృత్వము కర్మములు చేయువారికనియు, భోక్తృత్వము కర్మఫలముల ననుభవించువారికనియు, ఆరాధ్యత్వము కర్మములచే నారాధింపఁబడు దేవతల కనియుఁ దెలియునది. ఈ కర్తృత్వాదులు ఈశ్వరునియందు సమర్పించుట యనఁగా సర్వమునకు నీశ్వరుఁడే కర్తయు భోక్తయు ఆరాధ్యుఁడును అగునని అనుసంధించుట.

* కర్తాశాస్త్రార్థవత్త్వాత్' అను బ్రహ్మసూత్రము జీవునకే కర్తృత్వ భోక్తృత్వములను, శ్రుతిదేవతల కారాధ్యత్వమును జెప్పుచున్నవి. కనుక ఆ కర్తృత్వాదులు ఈశ్వరునికే కల వనుట యెట్లు అని భావము.

♦ ఇచట అర్జునుని 'నీవును' అనుటవలన నీవలెనే కర్తృత్వ భోక్తృత్వములు గల ఒక్కొక్క మనుజుఁడును అని భావము.

♦ మనుష్యాదులకు శేషులగు దేవతలకు సైతము శేషియగుటచే పరమశేషి యనియు, ఆయాకర్తల సర్వప్రవృత్తులకును సంకల్పవేషమున కర్త యగుటవలన కర్తలకు కర్తయగుచున్నాఁడు గాన పరమకర్త యనియుఁ జెప్పఁబడినది. కావుననే పరమకర్తయందు సామాన్యకర్త యొక్క కర్తృత్వాదులును, పరమశేషియందు సామాన్యశేషులగు దేవతల యారాధ్యత్వాదులును సమర్పింపఁదగు నని భావము. ఇది భక్తిప్రకరణము గాన 'అత్యంతప్రీతితో' ననఁబడెను.

పుము. (ఇట్లు నిన్నే సర్వమునకు కర్తగాను భోక్తగాను ఆరాధ్యునిఁగాను అనుసంధించినయెడల ప్రత్యక్షమున కర్తగానుండు నన్నును ఆరాధ్యులుగాఁ జెప్పఁబడు దేవతలను అనుసంధించుట యెట్లు అందువేని,) నీవు నానియమనమునకు లోనై యుండుటవలన నిన్ను నాకు శేషభూతుఁడై యుండుటే ముఖ్యస్వరూపముగాఁ గలిగియుండువానినిగాను. ఆరాధ్యులగు దేవతలు మొదలగువారిని సైతము ఇట్టి స్వభావమే లోపలఁ గలవారినిగాను, అత్యంతప్రీతితో అనుసంధింపుము అని భావము.

71

శ్లో॥ శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి॥ 28

టీ. ఏవం=ఇట్లు, సన్న్యాసయోగయుక్తాత్మా = సర్వమును భగవంతునియందు సమర్పించుట అనెడి అనుసంధానముతోఁగూడిన మనస్సు గలవాఁడవై, శుభాశుభఫలైః =అనుకూలప్రతికూలఫలములు గల,కర్మబన్ధనైః=కర్మప్రాచీనకర్మములనెడి, బన్ధనైః = మత్ప్రాప్తికి విరోధులైనవానిచేత, మోక్ష్యసే=విడువఁబడఁగలవు, విముక్తస్సన్ = (ఇట్లు) విడువఁబడినవాఁడవై, మాం= నన్ను, ఉపైష్యసి= పొందఁగలవు.

తా. *ఇట్లు సన్న్యాస మనెడి యోగముతోఁగూడిన మనస్సు గలవాఁడవై - అనఁగా ఆత్మను, నాకు శేషభూతుఁడును నియామ్యుఁడునై యుండుటే ముఖ్యస్వరూపముగాఁ గలవానిని గాను సర్వకర్మములను మదారాధనములను గాను అనుసంధించుచున్నవాఁడవై, లౌకికకర్మములను వైదికకర్మములను జేయుచుంటివేని శుభాశుభఫలములు గలిగినట్టియు మత్ప్రాప్తికి విరోధులైనట్టియు ప్రాచీనకర్మము

* ఇచట సన్న్యాసయోగశబ్దములచే జ్ఞానయోగ కర్మయోగములు గ్రహింపరాదు. సన్న్యాస మనఁగా పూర్వశ్లోకోక్తమైన సమర్పణము - ఆత్మ తన కర్తృత్వాద

న్నటినుండి విడివడుదువు. ఇట్లు వానినుండి విడివడినవాఁడ వై నన్నే పొందుదువు. (నన్నుఁ బొందుటకు ప్రతిబంధకములగు పూర్వకర్మములనుండి విడివడినయెడల నన్నే పొందుటకు సందేహము లేదని భావము.)

అవ. లోకమున ఎవరికిని లేనట్టిదియు ఉత్కృష్టమైనదియునైన నా స్వభావమును వినుము అనుచున్నారు.

శ్లో॥ *సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి నప్రియః।
యే భజన్తి తు మాం భక్త్యా మయితే తేషుచాప్యహమ్॥

టీ. అహం = నేను, సర్వభూతేషు = సర్వభూతములయెడల, సమః = (అన్నిటికిని ఆశ్రయింపఁదగినవాఁడ నై యుండుటయందు) సముఁడను, మే = నాకు, ద్వేష్యః = ద్వేషింపఁదగినవాఁడు, నాస్తి = (ఒక్కఁడును) లేఁడు, ప్రియః = ప్రియుఁడైనవాఁడు, న = లేఁడు, తు = అయినను, యే = ఎవరు, భక్త్యా = భక్తిచేత (నన్ను భజించుటే ముఖ్యప్రయోజనముగాఁ గలిగి) మాం = నన్ను, భజన్తి = భజించుచున్నారో, తే = వారు, మయి = నాయందు, (వర్తన్తే = వర్తించుచున్నారు), అహం = నేనును, తేషు = వారియెడ ననుట, (వర్తే =

---

లీశ్వరునియందు సమర్పించుట. యోగ మనఁగా అనుసంధానము. అట్లు కర్తృత్వాదులు సమర్పించి, తన్ను ఈశ్వరునికి శేషభూతునిఁగాను నియామ్యునిఁగాను కర్మములను తదారాధనములనుగాను అనుసంధించుట. ఇట్టి యనుసంధానముతో లౌకిక వైదికకర్మములను జేయువలె యిచట గ్రాహ్యము. సమర్పణబుద్ధితోఁ జేయఁబడుచున్న కర్మములు బంధకములు కావు కాన 'ప్రాచీనకర్మ'ము లనియు బంధనము లభిమత ప్రాప్తివిరోధులు గాన 'మత్ప్రాప్తి విరోధులైనట్టియు' ననియుఁ జెప్పబడెను.

* పత్రం పుష్పమ్' అను శ్లోకమున భక్తితో నేది సమర్పించినను అది దుర్లభమైనదని కాని సులభమైనదనికాని తక్కువైన దనికాని ఎక్కువైనదనికాని తారతమ్యమును పాటింపక స్వీకరించుటవలన ఈశ్వరుని సౌలభ్యము చెప్పఁబడినది. 'యత్కరోషి' అను శ్లోక

వర్తించుచున్నాను) - అనఁగా నేను నాకు ఉత్కృష్టులైన వారియెడల నెట్లో అట్లే వారియెడల ప్రవర్తించుచున్నా ననుట.

తా. సమస్తములైనభూతములును దేవత లనియు మనుష్యు లనియు [72] తిర్యక్కులనియు స్థావరము లనియు వ్యవహరింపఁబడుచున్నవై [73] జాతినిబట్టియు [74] ఆకారమునుబట్టియు [75] స్వభావముఁబట్టియు జ్ఞానమును బట్టియు ఒకటి కొకటి మిక్కిలి యెక్కువ తక్కువలుగా వర్తించు చుండును. అయినను నేను వాని యెక్కువతక్కువలను పాటింపక అన్నిటికిని సమముగా *ఆశ్రయింపఁదగినవాఁడనై యుందును. 'వీఁడు జాత్యాకారస్వభావ జ్ఞానాదులచేత నికృష్టుఁడు' అని ఆశ్రయించు విష యమున నాకు ద్వేషింపఁదగినవాఁడు లేఁడు - అనఁగా రోయందగి యుండుటంబట్టి నాకు త్యజింపఁదగినవాఁడు గాఁడు. అట్లే (జాత్యాదు లందుఁ ఉత్కృష్టుఁడైనయొకఁడు న న్నాశ్రయింపవచ్చునేని వానిని) నాకు సమాశ్రితుఁ డగుటనుబట్టియే తప్ప 'వీఁడు జాత్యాదులచేత మిక్కిలి యుత్కృష్టుఁడై యున్నాఁడని తలఁచి ఆజాత్యాదులతోఁ గూడియుండుటనుబట్టి న న్నాశ్రయించు విషయమున నాకు ప్రియుఁ డైనవాఁ డొక్కఁడును లేఁడు- అనఁగా నాకు సంగ్రహింపఁదగినవాఁడు

---

మున ఏ కర్మమునుగాని తనకు అర్పణము అను బుద్ధితో మాత్రము చేసినంతనె అది తనకు ఆరాధనముగాఁ జేసికొనుటవలన ఆ సౌలభ్యముయొక్క దార్ఢ్యము చెప్పఁబడి నది. ఈ శ్లోకమున జాత్యాకారాది తారతమ్యమును పాటింపక భక్తుల కత్యంతపరతం త్రుఁడై యుండుటవలన వాని సౌశీల్యము చెప్పఁబడెనని తెలియునది.

* జ్ఞానశూన్యములగు తిర్యక్కులకును స్థావరములకును భగవత్సమాశ్రయణ మెట్లు ? అని శంకగలుగవచ్చును. పుణ్యాధిక్యమువలన జ్ఞానవిశేషముగలిగిన గజేంద్ర వానరేంద్రాదులు భగవత్సమాశ్రయణము చేయుట నూహించునది. శాపాదులవలన స్థావరములైనవానికిని కొంతజ్ఞానముండునని మహర్షులు చెప్పుటంజేసి వానికిని భగవ

73

గాఁడు. అయినను, నాయందలి ప్రీత్యతిశయముచేత నన్ను భజింపక యున్నచో తమంత నిలువనోపక నన్ను భజించుట ముఖ్యప్రయోజనముగాఁ గలిగి యెవరు నన్ను భజింతురో అట్టివారు జాత్యాదులచేత ఉత్కృష్టులైనను గాని నికృష్టులైనను గాని నాకు ♦సమానగుణులైన వారివలె సుఖముగా నాయెడలనే ప్రవర్తింతురు. ఏలన, నేను అట్టి వారియెడల నాకంటె నుత్కృష్టులైనవారియెడల నెట్లో అట్లు ప్రవర్తింతును.

అవ. అందును.

శ్లో॥ *అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్।
సాధు రేవ స మన్తవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః॥ 30

టీ. సుదురాచారోఽపి = తనజాతికి ఉపాదేయమైన ఆచారమును చేయమియు, పరిహరింపఁదగిన ఆచారమును ♦చేయుటయు గలవాఁడైనను, అనన్యభాక్ = ఇతర ప్రయోజనము లేనివాఁడై, మాం = నన్ను, భజతేచేత్ = భజించునేని, సః = వాఁడు, సాధురేవేతి = సజ్జనుఁడే

దాశ్రయణము కలుగకపోదు. ఐన నది మనోవ్యాపారరూపముగా మాత్ర ముండు నని యూహ్యము.

♦ వారు, పరమేశ్వరుఁడ ననుభయము తక్క అట్లు సమానులవలె సుఖముగా నాయెడల ప్రవర్తించుచు నన్నే సేవించుచుందురు. పిత్రాదుల యందు భారముమోసి పుత్రులెట్లుందురో అట్లేవారును నేనును పరస్పరము ఉందుముగాని అధిపతియు సేవకులును పరస్పరము ఉండునట్లు ఉండము అని భావము.

* భగవంతుఁడు వారివారి సమాశ్రయణములను స్వీకరించు విషయమున వారి వారి జాత్యాదుల యపకర్షము ఏమియుఁ జేయనేర దని పూర్వశ్లోకమునఁ జెప్పఁబడెను. ఆ విషయమున వారివారి యాచారముల యపకర్షము నైతము ఏమియుఁ జేయనేర దని యిప్పుడు చెప్పఁబడుచున్నది.

♦ ఆయాజాతులవారికి ఆయాయాచారములు నియతములై యుండును. కాన, ఒకజాతివాఁడు తనకు నియతమైన యాచారమును జేయకుండుటయు తనకు నియతము

(వైష్ణవాగ్రేసరుఁడే) యని, మన్తవ్యః=గౌరవింపఁదగినవాఁడు, హి= ఏలనఁగా, సః=వాఁడు, సమ్యక్ =లెస్సగా, వ్యవసితః=నిశ్చయము గలవాఁడు- (నేను పరత్వ సౌలభ్యములు గలవాఁడ నని దృఢనిశ్చ యము గలవాఁడు).

తా. ఆయాజాతి విశేషములందుఁ బుట్టినవారికి ఆయా యాచారములు కొన్ని ఉపాదేయములుగాను గొన్ని పరిహరణీయములుగాను ఉండును. అట్టి ఆచారమును మిక్కిలి అతిక్రమించి వర్తించువాఁడై యున్నను, పూర్వోక్త ప్రకారమున - అనఁగా నిరంతరకీర్తనాదులచే నన్ను భజించుటె ముఖ్యప్రయోజనముగాఁ గలవాఁడై - నన్ను భజించునేని, వాఁడు వైష్ణవాగ్రేసరుఁడే యని గౌరవింపఁదగినవాఁడగును- అనఁగా పూర్వము చెప్పఁబడిన మహాత్ములతో సమానుఁడగు నని యర్థము. ఇది యెట్లన, వానికి వ్యవసాయము సమీచీనమై యున్నది గదా; * 'భగవంతుఁడు నిఖిల జగదేక కారణభూతుఁడు పరబ్రహ్మము నారాయణుఁడు చరాచరపతి నాయొక్కస్వామి నాకు గురువు నాకు సుహృదుఁడు నాకు పరమభోగ్యము' అని యెల్లవారికిని

---

కాని మఱియొకజాతి యాచారమును జేయుటయు రెండును దురాచారమే యని తెలియునది.

* భగవంతుఁడనుట మొదలుకొని చరాచరపతి యనువఱకు పరత్వమును గుఱించిన వ్యవసాయము; తక్కినవెల్ల సౌలభ్యమును గుఱించిన వ్యవసాయము అని తెలియునది. 'నాయొక్క స్వామి' అనుటకు నేను వాని విభూతికి వెలికాక వానిసొమ్మైయున్నాను. ఇట్లు తనకు శేషమేయైన నన్ను తానే పొందఁబూనినాఁడని భావము. ఈ విశేషణమువలన తనకును ఈశ్వరునకును స్వాభావికముగాఁ గలశేషశేషి భావసంబంధము తెలియుచున్నది. 'నాకు గురువు' అనుటకు మూర్ఖుఁడనైన నాకు మంచి జ్ఞానప్రదాతయగు మహోపకారకుఁడని భావము. 'నాకు సుహృదుఁడు' అనుటకు నేమహాపరాధి నయ్యు నాయెడం శోభనహృదయుఁడై యుండువాఁ డని భావము. 'నాకు పరమభోగ్యము' అనుటకు అతిక్షుద్రమును దుఃఖమిశ్రమును నశ్వరము నైన సుఖలవముతోఁ గూడియున్ననాకు నిరతిశయమై నిర్దోషమై నిత్యమై యొప్పుసుఖసముద్రమువంటి తన స్వరూపమును ప్రకాశింపఁజేసినవాఁ డని భావము.

76
ప్రాప్తింపని యీవ్యవసాయము వానికి కలిగియుండును. *ఈవ్యవసాయమాత్రముచేతనే వాఁడు పూర్వము చెప్పఁబడిన భజనతత్పరులగు మహాత్ములతో సమానుఁడు కాఁడు. 'భజతే మా మనన్యభాక్' అనునట్లు ఆ వ్యవసాయమునకు కార్యమై అనన్యప్రయోజన మగునిరంతర భజనముగూడ వానికి కలుగుచున్నది గాన వాఁడు సాధువనియె (అనఁగా అట్టి భజనపరులగు మహాత్ములతో సమానుఁడుగానే) గౌరవింపఁదగి యున్నాఁడు. అయినను అనుష్ఠానమందు వైకల్యము లేని వారివలె వైకల్యము గలవీనిని ఎట్లు గొప్పగా నెన్నఁగూడునన్నచో, ఈ వ్యవసాయమును దీనిచే జనించు ఉక్తప్రకార భజనమును వానికి కలిగియుండఁగా వాని యాచారవ్యతిక్రమము స్వల్పవైకల్యమే యగునని తలఁపవలయును గాని అంతమాత్రమునకు వానిని ఆదరింపకుండ రాదు; గొప్పగానే తలంపవలయు నని యర్థము.

80
అవ. * 'నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః ।
నాశాన్తమానసోవాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్' (కఠోప-౧-౨-

---

* ఇట్టి వ్యవసాయము 'బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్' అనునట్లు అనేక జన్మసిద్ధమైనది గనుక అందఱికిని సులభముగాఁ గలుగునది కాదు. దీనినే శ్రీశుకుఁడు జనకునకు 'జ్ఞానం చ వ్యవసాయశ్చ ద్వౌ పరప్రతిపాదకౌ, వ్యవసాయాదృతే బ్రహ్మ నాసాదయతి తత్పరమ్॥' అని చెప్పియున్నాఁడు.

*దుశ్చరితమువలన విరమింపనివాఁడును, కామక్రోధాదులు నివర్తింపనివాఁడును, నిలుకడయైనమనస్సు లేనివాఁడును, నిర్మలమైన మనస్సు లేనివాఁడును, బ్రహ్మమును గుఱించిన ప్రజ్ఞానముచేతనైనను వీనిని (బ్రహ్మమును) పొందఁడు అని యర్థము. ఇందు ప్రజ్ఞానమును భజనరూపముగా గ్రహించునది. దుశ్చరితాదులు గలవాఁడు భజనము గలవాఁడైనను బ్రహ్మప్రాప్తి నొందఁడనుట. దుశ్చరితాదులు వానియొక్క ఉత్తరోత్తర భజనోత్పత్తి ప్రవాహమును అడ్డగించుటవలన వానికి బ్రహ్మప్రాప్తి కలుగనేరదని భావము. ఈ శ్లోకమువలన దురాచారునికి బ్రహ్మప్రాప్తియే కాక దానికి సాధనమైన

-౨౮) ఇత్యాది శ్రుతివలన దురాచారము, పయిపయిని భజన మెడ తెగక పుట్టుచుండుటను అడ్డగించు నని తెలియుచున్నదే; కావున ఆచారదూరుఁడు భజనతత్పరుఁ డెట్లగు ననఁగాఁ జెప్పుచున్నారు.

77 78

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాన్తిం నిగచ్ఛతి।

79

కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥ 31

టీ. (సః=వాఁడు), క్షిప్రం=శీఘ్రముగనే * ధర్మాత్మా= నా భజనమునందు మనస్సు గలవాఁడు, భవతి = అగుచున్నాఁడు, శశ్వత్ = శాశ్వతమైన, శాన్తిం=మత్ప్రాప్తికి విరోధు లగు ఆచారములయొక్క నివృత్తిని, నిగచ్ఛతి=పొందుచున్నాఁడు, కౌన్తేయ= అర్జునా, మే=నాయొక్క, భక్తః=భక్తుఁడు - భక్తిని ఉపక్రమించిన వాఁడనుట, న ప్రణశ్యతి=నాశమునొందఁడు, (ఇతి=అని), ప్రతిజానీహి=నీవే ప్రతిజ్ఞ సేయుము.

తా. † ఇట్లాదురాచారుఁడు (అట్టి వ్యవసాయమువలనను) నాయందలి ప్రీత్యతిశయమువలనను గలిగిన అనన్యప్రయోజన మగు మద్భజనముచేత పాపముల నెల్లఁ బోఁగొట్టుకొనుచున్నాఁడు. పాప

యుత్తరోత్తర భజనప్రవృత్తియు కలుగనేరదని తెలియుచున్నది. అట్లు దురాచారాది రూపమైన పాపమువలన భజనము అనఁగా (ప్రజ్ఞానము) కొనసాగకపోవుట 'పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణం పునఃపునః । నష్టప్రజ్ఞః పాపమేన పున రారభతే ద్విజః' అను శ్లోకమువలనను దెలియనగును.

* ఇచట ధర్మమనఁగా భజనము. ఇట్టి అనన్య ప్రయోజనమైన భజనమే 'ధర్మస్యాస్యపరన్తప' అని ఈ యధ్యాయము దొలుత ధర్మశబ్దముచే నిర్దిష్టమైనది. కావున అట్లే యిచటను ధర్మశబ్దమున కర్థము గ్రాహ్యము.

† ఆచారమువలన పాపములు తొలఁగఁగా, దానివలన భక్తికి ప్రతిబంధకము లగు రజస్తమోగుణములు నశించి త్వరలో పరిపూర్ణభక్తి కలుగుచున్నది. కావున

ములు నశింపఁగా మధ్యజనమునకు ప్రతిబంధకములగు రజస్తమోగుణములు సమూలముగా నశించుచున్నవి. ఇట్లు ప్రతిబంధకములు నశింపఁగా త్వరలోనే విరోధిరహితమై పరికరసహితమై యొప్పు మధ్యజనమునందు మనస్సు గలవాఁడగుచున్నాఁడు. మత్ప్రాప్తికి విరోధులగు దురాచారములు శాశ్వతముగా వానికి నివర్తించుచున్నవి. అర్జునా, ఈ విషయమందు అనఁగా 'నాయెడల భక్తిని ఉపక్రమించినవాఁడు విరోధియగు దురాచారముతోఁ గూడియున్నవాఁడైనను *నశింపఁడు; అయినను నా భక్తిమహత్త్వముచేత సమస్తమగు విరోధిసమూహమును నశింపఁజేసి శాశ్వతంబగు విరోధినివృత్తిని బొంది త్వరితముగా పరిపూర్ణభక్తి గలవాఁడగుచు' అని నీవే ప్రతిజ్ఞసేయుము.

శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్॥

టీ. పార్థ = అర్జునా, యే = ఎవరు, పాపయోనయః అపి - పాపజన్మముగలవారును, స్యుః = అగుదురో, తే = ఆ, స్త్రియః = స్త్రీలు, వైశ్యాః = వైశ్యులు, తథా = అట్లే, శూద్రాః అపి = శూద్రులుకూడ,

---

మొదట ఆచారము భక్తి కావశ్యకమై యుండఁగా ఆచారములేనివానికి భక్తి యెట్లు కలుగునని శంక పొడముచున్నది. ఆచారము లేకపోయినను ఆరంభింపఁబడిన భక్తివలన పాపాది ప్రతిబంధకములు నశించి పూర్ణ భక్తి కలుగుచున్నది. ఇట్లు ఆచారమువంటిదే ఆరంభింపఁబడినభక్తి యగుచున్నదిగాన ఆచారము తప్పినవాఁడైనను అనన్యప్రయోజనమైన భక్తి నారంభించినవాఁడు త్వరలో పరిపూర్ణభక్తియుక్తుఁడగునని శంకాపరిహారము.

* ఇచట భక్తుఁడు నశింపఁడనఁగా వానిభక్తికిఁ గలవిరోధులు సమస్తమును నశింపఁగా వాఁడు పరిపూర్ణభక్తుఁ డగుననుట. వాఁడు భక్తిని ఆరంభింపఁగా దాని మహత్త్వమువలన సర్వవిరోధిసమూహమును నశించినవై అవి మరల కలుగనట్లు శాశ్వతముగా నివర్తించుటవలన త్వరలోనే వానికి పరిపూర్ణ భక్తి గలుగుచున్నదని భావము. ఆరంభింపఁబడినభక్తి పరిపూర్ణభక్తికి హేతువని తెలియునది.

మాం=నన్ను, వ్యపాశ్రిత్య=ఆశ్రయించి, పరాంగతిం = ఉత్తమ మయినమోక్షపదవిని, యాన్తిహి=పొందుచున్నారుగదా.

శ్లో॥ కింపున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా।
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్॥ 33

టీ. పుణ్యాః=పుణ్యయోనులును, భక్తాః = భక్తిగలవారును నగు, బ్రాహ్మణాః =బ్రాహ్మణులును, రాజర్షయః= ఋషితుల్యులగు క్షత్రియులును, తథా -అట్లుత్తమగతిఁ బొందుదు రని, కింపునః= మఱిచెప్పవలయునా, అనిత్యం=అస్థిరమయినదియును, అసుఖం సుఖ లేశము లేనిదియునగు, ఇమం=ఈ, లోకం=లోకమును, ప్రాప్య= పొంది (వర్తించుచుండుసీవు), మాం=నన్ను, భజస్వ = భజింపుము.

తా. (32-33) అర్జునా, (కర్మాధికారిణులుగాని) స్త్రీలు, (యాగా దులఁ జేయ నర్హులుగాని) వైశ్యులు, (అధ్యయనమునకు అర్హులుగాని) శూద్రులు, నికృష్టజన్మము గలవారైనను నన్నాశ్రయించి (అనఁగా నాయెడల భక్తిగావించి) రేని ఉత్తమ మగుమోక్షపదవిఁ బొందుదు రనఁగా, పుణ్యజన్మము గలిగి నాయందు భక్తిగల బ్రాహ్మణులకును రాజర్షులకును మోక్షము కలుగుట చెప్ప నేల ? కావున రాజర్షి వగు నీవు అస్థిరమై తాపత్రయముతోఁ గూడిన దగుటచే సుఖరహితమై యున్న యీలోకమునుబొంది వర్తించుచు నన్ను *భజింపుము.

అవ. భక్తిస్వరూపము చెప్పఁబడుచున్నది.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥

టీ. మన్మనాః=నన్ను ధ్యానించువాఁడవు, భవ = కమ్ము, మద్భక్తః=నాయం దత్యంత ప్రీతిగలవాఁడవై, మద్యాజీ=నాకు పరి

* ఇట్టి యీ క్షుద్రలోకమును జూచినయెడల రోఁత గలిగి మద్భజనమునందుఁ గలవై ముఖ్యము నివర్తించు నని భావము.

పూర్ణకైంకర్యము చేయువాఁడవు -కమ్ము, మఱియును, మాం = నన్నుఁ (గూర్చి), *నమస్కురు = అత్యంతప్రీతితోను, అత్యంత వినమ్రభావము తోను నన్ను ధ్యానింపుము, ఏవం = ఇట్లు-నన్ననుభవించుటకు సమర్థమైనట్టి, ఆత్మానం = మనస్సును, యుక్త్వా = పొంది, ♦'మత్పరాయణః = నన్నే ఆశ్రయముగాఁ గలవాఁడవై, మామేవ = నన్నే, ఏష్యసి = పొందఁగలవు.

తా. (మన్మనాభవ) సర్వేశ్వరేశ్వరుండును, నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణైకతానుండును, సర్వజ్ఞుండును, సత్యసంకల్పుండును, నిఖిలజగదేక కారణుండును, పరబ్రహ్మంబును, పురుషోత్తముండును, పుండరీకదళామలాయతాక్షుండును, స్వచ్ఛనీల జీమూత సంకాశుండును, యుగపదుదిత దినకర సహస్రతేజుండును, లావణ్యామృత మహోదధియు, ఉదారపీవరచతుర్బాహుండును, అత్యుజ్జ్వల పీతాంబరుండును, అమలకిరీట మకరకుండలహార కేయూర కటక భూషితుండును, అపార కారుణ్య సౌశీల్య సౌందర్య మాధుర్య గాంభీర్యౌదార్య వాత్సల్యజలధియు, అనాలోచిత విశేషాశేషలోక శరణ్యుండును, సర్వస్వామియు నగు నాయందు తైలధారవలె అవిచ్ఛిన్నముగా మనస్సు నుంచినవాఁడ వగుము. (మద్భక్తః) నా యందలి అత్యంత ప్రీతితోఁగూడిన మనస్సు నుంపుము. (మద్యాజీ) అనవధి కాతిశయప్రియమైన నాయనుభవముచే (నన్ననుభవించుటచే) కలుగు నాయజనమం దాసక్తుఁడవు గమ్ము, *యజన మనఁగా పరి

---

*"ణమ ప్రహ్వత్వే" అని ధాతువు.

♦ భగవంతునే ఆధారముగాఁగలిగియుండు, భక్తియొక్క కాష్ఠాదశకు మిక్కిలి దగ్గఱిదశ యని తెలియునది. ఇదియే 'మత్పరాయణత్వము.'

*ఇచట భక్తిస్వరూపమును సంబంధించినదగుటచే యజనమనఁగా భగవచ్ఛాస్త్ర

పూర్ణమైన శేషవృత్తి - ఔపచారికము - సాంస్పర్శికము - అభ్యవహారికము మొదలైన సకలభోగముల నిచ్చునట్టిదియేకదా యాగము. నా యనుభవముచేత జనించిన నిరవధికాతిశయప్రీతి కావించునట్టి నా యజనమునం దాసక్తుఁడ వగునట్లుగా నాయందు మనస్సు నుంపుమని యర్థము. మరల దానినే విశేషించుచున్నారు. (మాం నమస్కురు) అనవధి కాతిశయప్రియం బగు మదనుభవముచే జనించు నత్యంత ప్రియం బగు అశేష శేషవృత్తితో నిలువక అంతరాత్మయగు నాయం దతిమాత్రము వినమ్రతతోఁడి వ్యవసాయమును గావింపుము. (మత్పరాయణః) నేనే పరమం బైన అయనముగాఁ గలవాఁడవు - అనఁగా నాచేతఁదప్ప తక్కినవిధముల ఆత్మధారణము కలుగమిచే నన్నే యాశ్రయించినవాఁడ వగుము. ఇట్లు ఆత్మను (మనస్సును) గూర్చి మత్పరాయణుండవగుని. ఈ ప్రకారము అనవధికాతిశయంబగు ప్రీతిచేత న నన్నుభవించుటయందు సమర్థంబగు మనస్సును బొంది నన్నే పొందుదువు. ఇట ఆత్మశబ్దము మనస్సునుగూర్చినది. ఇట్టి దగునట్టి మనస్సుచే నన్ను ధ్యానించి, *అనుభవించి, పూజించి, నమస్కరించి, నన్నే ఆధారముగాఁ గలవాఁడవై, నన్నే పొందుదువు అని భావము. ♦నాకు శేషభూతుఁడవై యుండుటే ముఖ్యస్వరూపముగాఁ

---

ప్రతిపాదితమైన పూజావిశేషము - అనఁగా పరిపూర్ణ శేషవృత్తి - పూర్ణకైంకర్యమనుట. ఇది ఔపచారికము, సాంస్పర్శికము, అభ్యవహారికము, సాందృష్టికము మొదలైన భేదములకలిగియున్నది. ఔపచారిక మనఁగా తాఁకక కొంత ఎడగలుగఁజేయఁబడు కర్పూరనీరాజనము వీవనలు విసరుట మొదలైనవి. సాంస్పర్శిక మనఁగా తాఁకిచేయఁబడు పూలుసమర్పించుట చందనమలఁదుట. మొదలైనవి. అభ్యవహారికమనఁగా అన్నఫలక్షీరాదు లర్పించుట మొదలైనవి. సాందృష్టిక మనఁగా దీపాదు లుంచుట.

* భక్తి భోగరూపమైనది, ధ్యానము భక్తియుక్తమైనయెడల భోగరూప మగుచున్నది. కనుక 'అనుభవించి' అని చెప్పఁబడెను.

♦ ఈవాక్యమే నవమాధ్యాయార్థసంగ్రహము.

గలవాఁడవై, నా ప్రీతికొఱకు, శరీరధారణార్థమైన లౌకిక కర్మము
లను నిత్యనైమిత్తికములగు వైదిక కర్మములను నేనే చేయించు
చున్నవాఁడ నని చేయుచును, సంతతము మత్కీర్తన యతన నమ
స్కారాదులను ప్రీతితోఁ గావించుచును, జగత్తంతయు నానియ
మనమునకు లోనై యుండుటవలన నాకు శేషమేయైనదని అనుసంధిం
చుచును, అత్యంత ప్రియము లగు నా సౌలభ్య సౌశీల్యాది గుణగణ
ముల ననుసంధించియు, ప్రతిదినమును *ఉక్తలక్షణమైన యీ †యుపా
సనమును గైకొన్నవాఁడవై నన్నే పొందుదువు. 80

ఇది యుపనిషదర్థ ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదరూ
పంబును నగు శ్రీభగవద్గీతలయందు రాజ
విద్యారాజగుహ్యయోగం బన్నది
నవమాధ్యాయము.

81.

* అనన్యప్రయోజనమై, యజనమస్కారాది ప్రేరకమై, భగవదేక ధారకత్వ
దశాపర్యంతమై నిరతిశయ ప్రీతిరూపమై యుండులక్షణమే ఉక్తలక్షణము.

† కీర్తన యతనాద్యంగములతోఁగూడి భగవత్ప్రాప్తియే ఫలముగాఁగలిగి యొప్పు
భక్తిస్వరూపమే యిచట సంగ్రహముగా నిష్కర్షించి చెప్పఁబడినది.

## నవమోఽధ్యాయః

### రాజవిద్యారాజగుహ్యయోగము - అవతారిక

#### 1వ శ్లోకము

(1) ఇచ్చట ప్రయను ఉపసర్గవలన - చెప్పవలసినదానిని సమగ్రముగను, చులకనగను సుస్పష్టముగను చెప్పెదనను భావము స్ఫురించుచున్నది.

(2) ఇచ్చట - "అసూయకాయ మాం మాదాః" అను శ్రుతి వాక్యమును -

అసూయాపరులకు వేదమునుగాని వేదార్థమునుగాని చెప్ప రాదని విధి -

"న చ మాం యోఽభ్యసూయతి" యను గీతోక్తిని స్మరించవలెను.

#### 1వ శ్లోకము

(3) ఈ యధ్యాయమునకు భక్తిస్వరూపనిష్కర్షయే ముఖ్య తాత్పర్యమని గ్రహించవలెను.

తాత్పర్యమనగా - ఆ విషయము తెలియబడవలెనని ఉద్దేశముతో చెప్పబడుట.

ఇది దీని తాత్పర్యమని గ్రహించుటకై శాస్త్రజ్ఞులారు గుర్తులను ప్రసాదించిరి. అవి -

(1) ప్రారంభ పర్యవసానములు (2) మాటిమాటికి ఆవృత్తి చేయుట (3) మరి యే ప్రమాణములచేతను తెలుపబడనిదై దీనిచేతనే నెఱుంగ తగియుండుట (4) దీనికి ప్రధానపురుషార్థమును ఫలముగా చూపుట (5) తెలువదలచిన విషయమును ప్రశంసించుట (6) దీనిచే నా పురుషార్థము లభించుటలో యుక్తినిజూపుట యనునవి.

ఈ యారు లింగములును యీ యధ్యాయమున భక్తియోగ ముతో సమన్వయించుచున్న విధమును సంగ్రహముగా తెలుపబడు చున్నది.

(1) ఈ యధ్యాయము 'ఇదంతు తే గుహ్యతమం' 'జ్ఞానం విజ్ఞాన సహితం' అని ఉపాసనాత్మకజ్ఞానము (భక్తి) తో ప్రారంభమై 'మన్మనాభవ మద్భక్తో' యని భక్తియోగముతోనే ముగించుచున్నది గాన యీ యధ్యాయమునకు ముఖ్యతాత్పర్య విషయము భక్తి యోగమే.

(2) ఈ యధ్యాయ మధ్యమున –

(2) 'రాజవిద్యా రాజగుహ్యం' 'మహాత్మానస్తు... భజన్తి' (14) 'నమస్యన్తశ్చమాంభక్త్యా' (15) మాముపాసతే' (22) 'అనన్యాః. పర్యుపాసతే' (26) యో మే భక్త్యా ప్రయచ్ఛతి' – భక్త్యుపహృతం' (29) యే భజన్తి తు మాం భక్త్యా – (30) 'భజతే మాం' (31) మే భక్తః (33) భజస్వ మాం' అను శ్లోకములలో నీ భక్తికి ఆవృత్తి గాంచనగును.

(3) ఇతరత్ర చెప్పబడని భక్తియొక్క ప్రత్యక్షరూపత్వము, నిరతిశయ ప్రియత్వము కీర్తన యతన నమస్కార రూపత్వము లీ యధ్యాయమున చెప్పబడుటచే అపూర్వత్వము సిద్ధించుచున్నది.

(4) ఈ భక్తిస్వరూపమే యానందావహమగుటయు దీనిచే మహానంద స్వరూపమగు ముక్తి సాధింపబడుననియు చెప్పబడుటచేతను ఫలము చెప్పబడినది.

(5) రాజవిద్యా రాజగుహ్యం. అను రెండవ శ్లోకములో నీ భక్తియోగము ఎనిమిది విశేషములచే ప్రశంసింపబడుటచే అర్థవాద గానిపించుచున్నది.

(6) యత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్ - ఈభక్తిస్వరూపము నెఱింగి యనుష్ఠించితివో సంసారబంధమునుండి విముక్తుడ వగుదువు అనియు, 22వ శ్లోకములో- "యోగక్షేమం వహామ్యహ"మ్మని వారికి లేని పరమానందరూపమగు మోక్షము నిచ్చి, దానినుండి తిరిగి జారకుండగ నేనే రక్షింతుననియు, 25వ శ్లోకమున - 'యాన్తి మద్యాజినోఽపిమాం' - నన్ను బొంది పునరావృత్తి లేకుందురనియు, మన్మనాభవ మద్భక్తో - మామేవైష్యసి' నన్ను ప్రీతితో ధ్యానించుము. నన్నే బొందుదువని ముఖ్యఫలము తనవలననే యనిజెప్పి - దానికి ఉపపత్తి తన మాహాత్మ్యమే యని ఆ మాహాత్మ్యమును 4వ శ్లోకము నుండి 19వ శ్లోకమువరకు విస్తారముగా జెప్పుటచే యుపపత్తి జూపబడినది.

ఇట్లారు తాత్పర్యలింగములను భక్తితో సమన్వయించుటచే నీ యధ్యాయమున భక్తియోగమే ముఖ్యాంశమని తెలియుచున్నది.

మరియును మొదటి శ్లోకమున 'అనసూయవే' యని యర్జునున కొక విశేషణమును గాంచుచున్నాము. ఆ విశేషణమే యాతనికి గుహ్యతమ విషయశ్రవణయోగ్యతను తెలుపుచున్నది. అనూయ యనగా - కోశకారుడు 'అసూయా తు దోషారోపో గుణేష్వపి' యని సత్పురుషుని సద్గుణములను దుర్గుణములుగా నారోపించుట దుర్గుణమని చెప్పబడెను. ఇప్పు డర్జునున కాదోషము లేదని చెప్పనేల? యన్నచో ముందు తాను తన కసాధారణమైన అద్భుతమగు కల్యాణగుణములను చెప్పబోవుచున్నాడు. దానియందు దోషారోపణ చేయనివాడని దీనిచే సూచింపబడుచున్నది. ఆ గుణమును చెప్పనేల యన్నచో నుపాసనకొఱకేయని గ్రహించవలెను. పరంబ్రహ్మము కల్యాణగుణములతో ధ్యానించవలెనని 'తస్మిన్ యదన్తస్తదుపాసితవ్యం' అని ఛాందోగ్యశ్రుతి తెలుపుచున్నది. 'ఆదరాదలోపః' అను బ్రహ్మసూత్ర

మున్ను శ్రుతి అత్యంతాదరముతో మనమెఱుంగలేని భగవంతుని కల్యాణగుణములను చెప్పినది. వాటిని మనము లోపించి యుపాసన చేయరాదని తెలుపుచున్నది. ముక్తుని యనుభవమును వర్ణించు తైత్తిరీయ ఆనందవల్లి 'సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా' యనగా ముక్తుడు పరమాత్మను ఆతని కల్యాణగుణములను పరమపదమున అనుభవించునని చెప్పుచున్నది. (ఇచ్చట కామమనగా ముముక్షువున కితర కామములేమియు నుండవుగాన కామ్యన్తే ముముక్షుభిరితి. వ్యుత్పత్తిచే కల్యాణగుణములని యర్థమును చెప్పిరి) అట్టి యనుభవము తత్క్రతు న్యాయముచే నట్టియుపాసన చేసినవానికే సిద్ధించునుగాన నీ యధ్యాయమున ఉపాసనాత్మక భక్తియోగమే చెప్పబడుచున్నదనుట నిర్వివాదము.

మరియును – ఈ యధ్యాయమున భక్తియోగము –

(1) స్వరూపతః, (2) ఫలతః – ఇది లేనివారినిందా ద్వారా (3) దీనిచే పొందబడు తన మహిమను ప్రశంసించుటద్వారా (4) తన యారాధనా సౌకర్యమును చెప్పుటద్వారా (5) జాతికుల ధనాది ఉచ్చనీచభావము నారయకుండుటద్వారా (6) యెట్టినీచునైనను పవిత్రతముని గావించుటద్వారా –

ఇంకను ఈశ్లోకమున 'ఇదంతు' అని 'తు' శబ్దమొకటి ప్రయోగింపబడెను. అమరకోశకారుడు 'త్వంతాథాది నపూర్వభాక్' అని యొకసంకేతి మేర్పరచెను. అనగా పదమునకు చివర తుకార ముండునో దేనియొక్క ఆదియందు 'అథ' యుండునో నవి వెనుకటి గ్రంథముతో సంబంధించవని తెలిపెను.

కాబట్టి యిచ్చటనున్న 'తు' శబ్ద మీ భక్తియోగమును వెనుక చెప్పబడిన కర్మజ్ఞానయోగములనుండి వేరుపరచుచున్నది.

ఆ రెండును వరుసగా గుహ్యమును, గుహ్యతరమును. ఇదియో గుహ్యతమము.

ముక్తికి ముఖ్యకారణము భక్తియోగము - ప్రధానపురుషార్థ సాన్నిధ్యమునుబట్టి ఉపాయముల తారతమ్యముండును. భక్తియోగ మత్యంత సన్నిహితమగుటచే గుహ్యతమ మనబడినది. అనగా నది మోక్షమునకు ప్రతిబంధకమ్ములైన పాపముల నన్నిటిని బాపును. జ్ఞానయోగము దానిక్రిందది. కాన నది గుహ్యతరము. అది భక్తి యోగ ప్రతిబంధక పాపములను పరిహరించును. కర్మయోగము దాని క్రిందిది. అందుచే నది గుహ్యమే. అది జ్ఞానయోగమున కాటంకము లైన పాపములను బోగొట్టును.

ఈ భక్తియోగమున కీ ప్రశంస - వినుటలో నాసక్తిని పెం పొందించుటకును, దీనిని మిక్కిలి భద్రముగా అనధికారుల పాల్పడ కుండ కాపాడుటకును చేయబడినది.

(8) నేను నా భక్తునెన్నడును చెడనీయనని ప్రతిజ్ఞ గావింపిం చుటద్వారా - పలువిధములుగా ప్రశంసింపబడినది.

మరియు నీయధ్యాయమున మరియొక ముఖ్యాంశము నారయ వలెను. భక్తి పుట్టుటకును, వృద్ధిపొందుటకును జీవ-పర-సంబంధ జ్ఞానమత్యావశ్యకమని శాస్త్రము యుక్తులును తెలుపుచున్నవి. పితా పుత్రులు పరస్పర సంబంధజ్ఞానములేక కలహించి ఒకరినొకరు చంపు కొన నుద్యుక్తులైయుండ ఉభయుల నెఱింగిన నొక మధ్యస్థుడగు ఆప్తుడు వారికిగల పరస్పర పితాపుత్రసంబంధము నెఱింగింపగా వా రా కలహమును వీడి పరస్పర మాలింగన మొనర్చుకొని యెంతయో పశ్చాత్తాపపడి యేకీభవించిరి - అట్టి సంబంధములు మనకు పరమా త్మతో తొమ్మిది విధములుగ నున్నవని అష్టాక్షరీ మహామంత్రమే బోధించుచున్నది.

శ్లో॥ పితా చ రక్షక శ్శేషీ । భర్తా జ్ఞేయో రమాపతిః ।
స్వామ్యాధారో మమాత్మాచ । భోక్తాచాద్య మనూదితః॥

(1) పితాపుత్ర సంబంధము (2) రక్ష్యరక్షక సంబంధము (3) శేష శేషిసంబంధము (4) భర్తృభోగ్యసంబంధము (5) జ్ఞాతృ - జ్ఞేయ సంబంధము (6) స్వస్వామిసంబంధము (7) ఆధారాధేయసంబంధము (8) శరీరాత్మసంబంధము (9) భోక్తృ - భోగ్యసంబంధము అని యీ తొమ్మిది విధములు. ఇవి భక్తియోగమునకే ముఖ్యమైనవి. అవి మాత్రము నీ యధ్యాయమున 'పితాహమస్యజగతో' యనెడు శ్లోక మందును 18వ శ్లోకమునందును చెప్పబడుట గాంచనగును; కాబట్టి యీ యధ్యాయము భక్తియోగపరమనుట నిస్సంశయము.

2వ శ్లోకము

(4) రాజవిద్యా యను పదమునకు రాజులయొక్క విద్యయని షష్ఠీతత్పురుషగా చెప్పినచో నీ భక్తియోగము నియతాధికారమై క్షత్రియేతరులకు అవకాశము లేకపోవును. 'విద్యానాం రాజా' యని విద్యలలో రాజు - ఉత్తమము - అని (శ్రీ) భాష్యకారులు వివరించిరి. అనగా రాజైనవిద్య యని యర్థము.

(5) 'నివర్తన్తే' అను పదమునకు భాష్యకారులు "నితరాం వర్తన్తే" మిక్కిలి పడియుందురని యర్థమును సాయించిరి. తరుచుగ నీ పదమునకు 'మరలుచున్నా'రని యర్థమును చెప్పవలెను. అది యిచ్చట కుదురదు - మరలుచున్నా రనగనే దేనినుండి యని ప్రశ్న ముదయించును. దానికి యవధివాచకమగు పంచమ్యంతపద మీశ్లోక మున లేదు. 'మత్తః' యని పరమపురుషునే యవధిగా చెప్పెద మన్నచో 'మాం అప్రాప్య' యని వేరుగా చెప్పబడుటచేత తనను పొందనేలేదే తననుండి మరలుట యెట్లు? మరియు 'సంసారవర్త్మని'

యను - సప్తమీవిభక్తి అధికరణవాచక విభక్తిగాన ఆధేయము నాకాంక్షించును. అందుచే ఆధేయార్థమునే చెప్పుట స్వరసము. ఉపసర్గం కనేకార్థము లుండుటచే నిచ్చట 'నితరాం వర్తన్తే' యని యర్థము చెప్పబడినది. ఇది మరియెచ్చటను ప్రసిద్ధముకాదు.

(6) భగవంతుడు పైకికాన్పించక లోనవ్యాపించి యుండుటకు పూర్వాచార్యులొక చక్కని దృష్టాంతమును జూపిరి.

కుమారుడు పిచ్చివాడై వాడియగు ఖడ్గమునుచేబూని యింటి నుండి కలహించి బయలుదేరగాజూచి తల్లి ఎదురుగ వెళ్లిన తనను చంపుననియు విడచి యూరకొనిన వానినే చంపుకొనుననియు ఏమి చేయుటకును తోచక వానికి కాన్పించకుండ వెన్నంటును. ఎప్పటికైనను చేయినొచ్చియో మరియొక విపత్తిచేతనో ఆర్తితో 'అమ్మా' యనినతోడనే యెదుటపడి వానిని రక్షించి యింటికి గొనిపోవును. అటులనే భగవంతుడును మనకు కాన్పించినచో హిరణ్యాదులవలె తలబడ సిద్ధపడుదుము. విడిచి యూరకున్నచో మనస్థితియే సున్న యగునని తా నంతర్యామిగానుండి ద్రౌపది - గజేంద్రుడు - ప్రహ్లాదాదులవలె నార్తితో స్వామీ ! యనగనే వచ్చి రక్షించును' 'అన్తః ప్రవిశ్య శాస్తాజనానాం' అనుటచే శ్రుతులలో నంతః ప్రవేశమును చెప్పినచో నియమనమును, నియమనమును చెప్పినచో నంతః ప్రవేశమును అనుసంధించుకొనవలెను. దీనిచే 'నృపనభో' వ్యావృత్తిని తెలుపుచున్నది. రాజు శాసించును గాని లోపల ప్రవేశించి శాసింపడు. ఆకసము లోపల ప్రవేశించును గాని శాసింపనేరదు గదా.

## 4, 5 శ్లోకములు

(7) ఈరెండు శ్లోకములలోనున్న తాత్పర్యాంశమును ఏడవ యధ్యాయములోని ఏడవ శ్లోకముయొక్క ఉత్తరార్థములో నొక నానారత్నమయ హారమును ఉదాహరించి సమన్వయించెను.

అచ్చట కెంపు (ఎరుపు) వజ్రము (తెలుపు) నీలము (నలుపు) అను మూడు విధములగు రంగులుగల మాణిక్యముల నొకే దారముతో గ్రుచ్చిన హారమును జూపెను. ఈ హారములో దారము బయటకు గాన్పించదు. కాని రత్నముల యొక్క చక్కని సక్రమకూర్పునుజూచి దారము లోపల లేదనరాదు. అట్లే ప్రపంచమున్ను నలుపు (తమోగుణము) తెలుపు (సత్వగుణము) ఎరుపు (రజోగుణము) రంగులు గలిగియే కూర్చబడినది. ఈ ప్రపంచమున్ను క్రమబద్ధమై వర్తించుచున్నది. దీనికిని లోపలదారమువలె నీక్రమమును కాపాడుచు పరమాత్మ అంతరాత్మగానున్నాడు. కాన్పించకున్నను నియమబద్ధమగు లోకక్రమమును జూచి హారమునకు లోపలదారమువలె పరమాత్మ యున్నాడనియే యూహించవలసియున్నది. ఉపాధ్యాయుడున్న తరగతివలె నీ ప్రపంచ మంతర్యామిగా నున్న భగవంతునివలననే క్రమము తప్పుట లేదు.

భీషాస్మాద్వాతః పవతే । భీషోదేతి సూర్యః - భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ - మృత్యుర్ధావతి పఞ్చమయితి" యనెడి శ్రుతి యీయర్థమునే సమర్థించుచున్నది.

ఈ హారములో దారము లోనలేని మాణిక్యమొక్కటియును లేనటులనే ప్రపంచమున భగవంతు డంతర్యామిగా లేని పదార్థ మొక్కటియును లేదు.

అన్ని మాణిక్యములలోనున్న దారమొక్కటియైనట్లె యన్నిట నుండు పరమాత్మ యొక్కడే.

మాణిక్యములయొక్క క్రమబద్ధమైనస్థితికి దారమే కారణము గాని దారముయొక్క స్థితికి మాణిక్యములు కారణము కానేరవు. అటులనే ప్రపంచముయొక్క క్రమబద్ధమైనస్థితికి భగవంతుడే కారణముగాని భగవంతుని స్థితికి ప్రపంచము కారణము కానేరదు.

(8) మేఘోదయః :—

అస్మదాద్యగోచరోపాదానోపకరణ సమ్ప్రదానాదికానాం తత్క్షణాదేవ సకలదిఙ్ముఖవ్యాపినాం ధారాధరాణా ముత్పత్తిః.

సాగరసన్నివృత్తిః :—

సకల భువనాప్లావన లమ్పటస్యైవ జలనిధే రమ్బరాలమ్బినాం తరఙ్గాణాం వేలాతలే నివృత్తిః.

ఇన్దోర్విభఙ్గాః :—

ప్రతినియతకలావృద్ధిక్షయ శృఙ్గోన్నమనాది రూపః చన్ద్రమసో విభాగః.

స్ఫురితానివాయోః :—

అశఙ్కితాగమానా మనియతదిగ్విశేషాణాం తృణగిరితరు మణ్డలుణ్టాకానాం చణ్డమారుతాదీనాం విస్ఫూర్తయః.

విద్యుద్విభఙ్గః :—

ప్రశాన్తదహన మిహిర హిమకరాదిమహసి ప్రావృషి నిశీథేఽప్రవిదిత పూర్వోత్తరక్షణానాం క్షణరుచీనాం విభఙ్గః.

గతిరుష్ణరశ్మేః :—

నిరాలమ్బనే విహాయసి మహీయసో మిహిరమణ్డలస్య ప్రతినియత దిన రజని మాసాయన సంవత్సరాది దేశిక స్సఞ్చారః.

ఏవం విధాన్యన్యాని చ పరివేషో పరాగేన్ద్రచాపకరకా స్తనితాశని భూకమ్ప ప్రభఞ్జన భ్రమణాదయో ఉత్పాద్భుత ప్రకారా స్సర్వే సర్వవ్యాపినః సర్వశక్తే ర్విష్ణోరేవ విచిత్ర సృష్టిశక్తిమూలా భవితు మర్హన్తీతి శ్లోకార్థః.

దీనికర్థము

ఏ యే పదార్థములతో నిర్మింపబడుచున్నవో, ఏ యే సామగ్రితో నిర్మింపబడుచున్నవో ఎచ్చట వర్షించుటకై పుట్టినవో మన

కొంకింతయును తెలియకయే, యొక్క క్షణమాత్రకాలములోనే సకల దిగంతరములకును వ్యాపించు మేఘపంక్తుల పుట్టుకయును, లోకము నంత నొక్కసారి పొట్టనుబెట్టుకొనునోయనిపించు గంభీర సముద్రము యొక్క ఆకసమునంటు నంతవచ్చు తరంగములు తీరా ఒడ్డునకువచ్చి చప్పగ మరలుటయును, నియమము తప్పక సదాయొకేరీతిగ కళలు హెచ్చుచు తగ్గుచునుండుటయు, నొక కొమ్మువైకి లేచుట మరియొక కొమ్ము క్రిందకువంగుట మొదలగు చంద్రుని వికృతులును, ఎప్పుడు వచ్చునో యెటునుండి వచ్చునో తెలియుబడకనే అల్పమైన తృణము లను అధికమైన పర్వతములను చెట్లగుంపులను కూకటివ్రేళ్లతో కూలద్రోయునో యను ట్లు ప్రచండముగ వీచునట్టి చండభయంకర గాలులయొక్క విజృంభణమును, దీపములుగాని సూర్యచంద్రా దులుగాని లేనట్టి వర్షకాలపు యర్ధరాత్రి సమయమున, నెప్పుడు పుట్టునో యెప్పుడు గిట్టునో యెఱుగరాని మెరుపుల ప్రకాశమున్నూ, పట్టులేని యాకాశమున పరిమిత పరిణామముగల సూర్యభగవానుని యొక్క నియమముతప్పని పగలు రాత్రులు నెలలు అయనములు, సంవత్సరములను కల్పించు నడకయును, ఇంకను నిట్టి ఆకసమున చంద్రసూర్యులకు చుట్టును పెద్ద పెద్ద గూళ్లుకట్టుట, గ్రహణమేర్ప డుట, విచిత్రములైన ఇంద్రధనుస్సు లాకసము నాక్రమించుట, వడ గండ్లుపడుట, ఉఱుము ఉరుముట, పిడుగులు బడుట, భూమియంతయు పర్వతాదులతోకూడ నొక్కపెట్టుగ కంపించుట, హఠాతుగా సుడి గాలులువేయుట మొదలగు నియత్యద్భుతరీతులన్నియును సర్వవ్యాపి యను, సర్వశక్తులునుగల శ్రీ మహావిష్ణువుయొక్క విచిత్రసృష్టిశక్తి మూలమైనవియే యని యీశ్లోకార్థము.

(9) ఓ గార్గి! నాశరహితుడగు ఈపరంబ్రహ్మ యొక్కయే ప్రచండమగు శాసనముననే సూర్యచంద్రులు పూర్తిగ ధరింప బడినవారై యున్నారు.

(10) పరమాత్మవలన కలిగిన భయమువలననే వాయువు వీచుచున్నాడు. అట్టి భయముచేతనే సూర్యు డుదయించుచున్నాడు. ఈ భయముచేతనే అగ్నియు ఇంద్రుడును తమ విద్యుక్తధర్మములను నిర్వహించగలుగుచున్నారు.

7వ శ్లోకము

(11) కౌన్తేయ ! -

నీవు కుంతీదేవి కడుపునుండి బుట్టితివని నీ యంతట నీవెఱుంగ కున్నను ఆప్తులమాటలవలన నేగదా నీకావిషయము మనమున లెస్సగ నెలకొన్నది? అటులనే నా శరీరమునుండి ప్రపంచమంతయును బుట్టినదని ఆప్తతముడనగు నామాటవలననే యెఱుంగుము ! అని సూచించుటకే 'కౌన్తేయ' యని సంబోధించెను.

(12) దీనిచే ప్రకృతికి భగవచ్ఛేషత్వము సిద్ధించుచున్నది. ఆ శేషత్వమున్ను ప్రకృతి యాతనికి శరీరమగుటచేతనని తెలియవలెను. ఇందులకు 'యస్య తమశ్శరీరం' అను శ్రుతివాక్యమే ప్రమాణము. తమ స్సనగా సూక్ష్మరూపమును పొందిన ప్రకృతియే.

(13) అంతిమబ్రహ్మయొక్క చివర సమయమనిగాని, కల్పములయొక్క క్షయమనిగాని బ్రహ్మయొక్క ఆయురవసానమనిగాని యర్థము.

'సంహృత్యచ' స్వయంప్రభుః 'మనస్యైవ జగత్సృష్టిం సంహారంచ కరోతియః' అనిగదా చెప్పబడినది. ఇచ్చటను 'పునస్తాని విసృజామి' యని చెప్పబడినది.

(14) తాని - నశించినవానినే తిరిగి సృజింతునని యర్థము కాదు. ఆపని యాతనిశక్తికి దూరమైనదియే. కింతు -ఆ జాతీయ పదార్థములనని యే యర్థము.

ఇందులకు – యథర్తుష్వృతులిఙ్గాని నానారూపాణి పర్యయే దృశ్యన్తే తానితాన్యేవ...అనునట్లు ఆయా ఋతువులలో బుట్టి నానా విధములగు పువ్వులు కాయలు మొదలగునవి ఋతువులనుబట్టి పుట్టి నవియే=(అనగా – ఆ జాతీయములే) మారిమారి బుట్టుచుండుసను నిదర్శనము జూపబడినది.

8వ శ్లోకము

(15) దేవాది చతుర్విధ జాతులతోగూడిన వ్యష్టిజీవసము దాయము. అంతియకాని అచేతనపరముగ నర్థమును జెప్పరాదు. అట్లగుచో "ప్రకృతేర్వశాదవశం" అను పదములతో నన్వయించదు. అది చేతనమునకేకదా తగునది.

(16) "కృత్స్నం" అనుటచే చతుర్విధ భూతజాతము మాత్రమే గాక వాని యవాంతరభేదములుగూడ గ్రహింపబడుచున్నవి.

(17) ఈ శ్లోకము –
వికారజననీ మజ్ఞాం అష్టరూపామజాం ధ్రువామ్
ధ్యాయతేఽ ధ్యాసితా తేన తన్యతే ప్రేర్యతే పునః ॥
సూయతే పురుషార్థంచ । తేనైవాధిష్ఠితా జగత్ ।
గౌరనాద్యన్తవతీసా । జనిత్రీ భూతభావినీ॥
అను శ్రుత్యర్థమునే విశదీకరించుచున్నది.

ఇది ప్రకృతి అనగా - నానావిధ వికారములకు మూలభూత వస్తువు. ఇది జడమగుటచే జ్ఞానశూన్యమైనది. ఇది యనాదియగుటచే బుట్టునదికాదు. అటులనే గిట్టునదియుకాదు. రూపములు మారు చున్నను మూలము నశించదు. మట్టితోచేయబడిన కుండ మొదలగు వస్తువుల రూపములు మారినను అవి నశించినను మన్ను మన్నుగనే యుండును. ఇది పంచభూతములు, అహంకారము – మహత్తత్త్వము, అవ్యక్తమని యెనిమిది విధములు. వడ్రంగి ఉలి బాడిటి మొదలగు

పరికరములచే కర్త నధిష్ఠించిన నది నానా రూపములను దాల్చునట్లే నిదియును పరమాత్మచే నధిష్ఠింపబడి సృష్ట్యున్ముఖ మగుచున్నది. (అనగా స్థూలావస్థను పొందింపబడుచున్నది - సమష్టి భూతరూపముగా చేయబడుచున్నది) అపైన వ్యష్టిసృష్టికై ప్రేరేపి పబడుచున్నది. అటు పిమ్మట చేతనున కనుభవయోగ్యమైన భోగ్యభోగోపకరణ భోగ స్థానరూపమగు జగద్రూపమును బుట్టించుచున్నది. దీని కాద్యంత ములు లేవు. ఇదియే యిట్లు సమష్టివ్యష్టి సృష్టులను గావించుచున్నది. అధిష్ఠించుట యనగా - ఉపాదానమగు మూలద్రవ్యమును కర్త కార్యాత్మనా పరిణమింపజేయుటకు గ్రహించుటయే. అనగా - తన కిష్టమైన కార్యరూపవిశేషమునకు తగునటుల ప్రకృతి ద్రవ్యమును మధ్యమావస్థను పొందించుటయే.

9వ శ్లోకము

(18) ఈకర్మలు పుణ్యపాపములుకావు. తచ్ఛబ్దము పూర్వపరా మర్శిగాన నట్టి పుణ్యపాపకర్మలు పూర్వము ప్రసక్తము కాలేదుగదా, ఇక నేమన పూర్వముసృష్ట్యాది వ్యాపారములు ప్రసక్తమగుటచేవానినే యీ తచ్ఛబ్దము పరామర్శించును. ఆ వ్యాపారము సృజింపబడు భూతములలో వైషమ్యముంటుటచే దోషావహమని సూచింపబడినది గాన ఆ దోష మీశ్వరునకు లేదని యీ శ్లోకముచే సమర్థింపబడు చున్నది.

(19) ఇచ్చట 'మొదలైన' యనుటచే రక్షణ, సంహారము, కోపించుట అనుగ్రహించుటయున్ను గ్రహింపబడును.

(20) ఇచ్చట 'మొదలైన' యనుటచే పక్షపాతము అవ్యవస్థ (తోచినప్పుడు తోచినట్లు చేయుటయే తప్ప ఒక క్రమము లేకుండుట) గ్రాహ్యములు.

(21) 'ఏలననగా' యని భగవంతునకు దోషములు లేవని జీవుని కర్మలే ఆ తారతమ్యమునకు హేతువులని యీక్రింద ప్రమాణములు తెలుపుచున్నవి. వి. పు. 1-4-52.

'నిమిత్తమాత్రమేవాయం । సృజ్యానాం సర్గకర్మణి ।
ప్రధానకారణీ భూతా యతో వై సృజ్యశక్తయః॥

విషమసృష్టికి ముఖ్యకారణము సృజింపబడు చేతనులయొక్క కర్మలే గాన, వాని సృష్టిలో పరమాత్మ నిమిత్తకారణము మాత్రమే.

'నీయతే తపతాం శ్రేష్ఠ । స్వశక్త్యా వస్తువస్తుతామ్'

దేవాదులు తమ కర్మలచేతనే దేవత్వాదులు పొందింపబడుచున్నారు.

'ఆ బ్రహ్మస్తంబ పర్యన్త జగదన్తర్వ్యవస్థితాః ।
ప్రాణినః కర్మజనిత సంసార వశవర్తినః' ॥

బ్రహ్మ మొదలు కీటకమువరకుగల జగత్తునందున్న ప్రాణులన్నియును కర్మచే సిద్ధించు సంసారమునకు వశవర్తులై సంచరింతురు.

ఈ శ్లోకమును శ్రీభాష్యకారుల వివరణను విచిత్రముగా నొక న్యాయాలయ విచారణరూపముగా ననుభవించుటతో నొక విధమగు రసానుభవము గలదు. దాని నొకింత యనుభవింతము-

ఒకడొక నేరమును చేయును, దానిచే బాధింపబడినవాడొకడు న్యాయాధికారియొద్ద నివేదించుకొనును. ఆ న్యాయాధికారి యీ నేరస్థుని పిలిచి నీ వేమందువని యడుగును. దాని కాతడు తాను దోషిని కానని సమర్థించుచు నొక స్టేటుమెంటును దాఖలుచేసుకొనును. దాన్నిపై యధికారి విచారణను సలిపి సాక్షులను విచారించి శాస్త్రబలముపై నాధారపడి తీర్పును జెప్పును. దానిచే దోషి నిర్దోషి యైనచో విడువబడును. దోషియగుచో బంధింపబడును. ఇట్లే భగవంతు డింతకముందు శ్లోకములో 'ఇమం భూతగ్రామం

అహం విసృజామి' యనుటచే తానే యీసృష్టినంతను చేయుచున్నా
నని సెలవిచ్చెను. దానిపై యర్జునుడు లేకచేతను డాతనిపై వైష
మ్యనైర్ఘృణ్య (పక్షపాత నిర్దయత్వ) దోషముల నారోపించి
భాగవతాగ్రేసరుల యెదుట (పరాంకుశులువంటివారి యొద్ద) నివే
దించును. ఆ యధికారులు భగవంతునిపిలిచి నీవేమి చెప్పెదువని
యడుగగా 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం, తస్య కర్తారమపి మాం
విద్ధ్యకర్తారమవ్యయం' 'నచ మాం తానికర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ'
అనగా నాలుగు వర్ణములను నాలుగు విధములగల (దేవ - తిర్యక్ -
మనుష్య - స్థావరములను) నేనే సృజించుచున్నాను. దానిని చేయు
వాడను నేనేగాని నేను కర్తను మాత్రము కాను. అందుచే నాదోష
ములు నన్నంటవు - ఎందువల్లననగా 'న మాం కర్మాణి లిమ్పన్తి
నమే కర్మఫలే స్పృహా' 'నచమాం తాని కర్మాణి నిబధ్నన్తి ధన
ఞ్జయ' 'ఉదాసీన వదాసీనం, అసక్తం తేషు కర్మసు' అనగా - నాకా
(సృష్ట్యాది) కర్మలయొక్క ఫలములయందు ఆశలేదు. నే నావిషయ
సృష్టి కారణమగు కర్మలవిషయమై ఉదాసీనునిగా (తటస్థముగా)
నుండుటచే నవి నాకేవిధమైన దోషమునుగాని యాపాదించవు'
అనును.

అప్పుడీ సిద్ధాంతమును సమర్థించు ఘరానా సాక్షులు పిలి
పించబడుదురు. వారే వసిష్ఠ మనుమడు శక్తిపుత్రుడు వ్యాసునితండ్రి
యగు పురాణరత్నమగు విష్ణుపురాణకర్తయునగు పరాశరమహర్షి
యును, ఆతనికి పుత్రుడును శ్రీశుకబ్రహ్మర్షికి తండ్రియును వేద
విభజనకర్తయును అష్టాదశపురాణ కర్తయును నగు వ్యాస
మహర్షియును.

అందు మొదటిసాక్షి చెప్పిన సాక్ష్యము పురాణరత్నమున
ధికార్థ చేయబడినది. అది - నిమిత్తమాత్రమేవాయం, సృజ్యానాం

సర్గకర్మణి' 'ప్రధానకారణీ భూతా యతో వైసృజ్యశక్తయః' అని - భగవంతు డీ సృష్టివ్యాపారములో నిమిత్తమాత్రమేగాని ముఖ్యకారణము కాడు. ఆ కారణము సృజింపబడు ప్రాణులయొక్క కర్మలే యగునని సెలవిచ్చెను.

ఇక - వ్యాసమహర్షి సాక్ష్యము బ్రహ్మసూత్రములలో రికార్డు చేయబడెను. అది

"వైషమ్యనై ర్ఘృణ్యేన సాపేక్షత్వాత్" (2-1-34 సూ.)

పరమాత్మకు విషమసృష్టి ప్రయుక్తమైన పక్షపాతముగాని నిర్దయత్వముగాని యుండనేరవు. ఏమనిన - ఆయన సృష్టిని తన యిష్టము వచ్చినట్లు చేయక చేతనులుచేసుకొనిన పూర్వకర్మను అవలంబించియే చేయును. ఆతడు దయామయుడు. మనుష్యశరీర మిచ్చి జ్ఞానమిచ్చి కర్తృత్వశక్తిని సమానముగానిచ్చి తాను తలంచినట్లు చేయుటకు తగిన యింద్రియములనిచ్చి వానిని వినియోగించు శాస్త్రమును అనుష్ఠాతలగు శాస్త్రజ్ఞలను సృష్టించి మన నుద్ధరించుట కెన్నియో ప్రయత్నములను చేసెను. వానిని లక్ష్యపెట్టక స్వేచ్ఛా సంచారమును గావించి దుర్నడతల నడచిన తనశాస్త్రము జీవించుటకై దండన యొసంగును. దానికితగిన నానాజన్మలలో సృష్టించును. ఇందాతని దోష మేమున్నది?

వాచికైః పక్షిమృగతాం । మానసైరన్త్యజాతితామ్
శరీరజైః కర్మదోషైః । ర్యాతిస్థావరతాం నరః॥ మను 12-9.

వాక్కుతోచేసిన పాపమువలన వాగింద్రియోపయోగములేని పక్షులు పశువులుగాను, మనస్సుతోచేసిన పాపములచే నీచజాతివారుగాను, శరీరముతో చేసిన పాపములచే చెట్టు పుట్ట గట్టుగను బుట్టుదురు.

శ్లో॥ అవిద్యా కర్మసంజ్ఞాన్యా తృతీయా శక్తిరిష్యతే యయా క్షేత్రజ్ఞ శక్తిస్సా వేష్టితా నృప ! సర్వగా! ...త యా తిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞ సంజ్ఞితా సర్వభూతేషుభూపాల ! తారతమ్యేన వర్తతే॥ విపు 6,7-61, 62.

(తరతమ భావముగా) విష్ణుశక్తి, జీవశక్తి, కర్మశక్తియను మూడు శక్తులలో మూడవదియగు కర్మచే జీవజాతమంతయు తరతమ భావముగా నావరింపబడి యుండుటచే విషమసృష్టిని బడయుచున్నారు.

అని యిట్లు విషమసృష్టి కర్మాధీనమైనదని శాస్త్రము విధించు చుండుటచే దానికి బాధ్యుడు సృజింపబడు జీవుడే యగుటచే పరమాత్మకు పక్షపాత నిర్దయుత్వాదు లుండజాలవు.

జీవులును వారి కర్మప్రవాములును అనాదియగుటచే ప్రళయములో కూడ నవి యుండునని ప్రమాణములు జూపబడినవి.

## 10వ శ్లోకము

(22) వారివారి కర్మానుగుణముగ స్వశరీరభూతమగు ప్రకృతిద్వారా ఈ చరాచరాత్మకమగు ప్రపంచమును గాయధిపతి యగు సర్వేశ్వరుడు సృజించుచున్నాడు. అందు తదధీనుడైన జీవుడు నిబద్ధుడైయున్నాడు.

(23) మాయ యనగా ప్రకృతియని యెఱుంగవలెను. ఇట్టి మాయాశబ్దవాచ్యమైన ప్రకృతికి అధిపతియైనవాడు మహాదైశ్వర్య సంపన్నుడైన నారాయణుడని తెలుసుకొనవలెను.

## 11వ శ్లోకము

(24) మనుష్యజాతికి తగిన అవయవసముదాయము గల బంగారుతోను మన్నుతోను చేయబడిన కుండలకు ఉపాదాన పదార్థములు వేరు వేరైనను అవయవసన్నివేశ మొక్కటిరుగ నేయున్నట్లు,

అప్రాకృత భగవచ్ఛరీరమున్ను ప్రాకృత మానవశరీరమున్నూ ఆకారములో నొకేవిధముగ నుండును.

ఈ చెప్పుట మత్స్యాది శరీరములను ధరించుటకును ఉపలక్షణము.

(25) ఇచ్చట తిరస్కారమనగా –

"మానుషీం తను మాశ్రితం"

అని సాదృశ్యముంచుట. 'పరంభావ మజానన్తః' భేదజ్ఞానమున్నచో భ్రమయుండదు అది లేకుంచుట. ఈ రెండింటిచేతను ప్రాకృతమనుష్యులతో సజాతీయుడే యని భ్రమపుట్టును. గుణచేష్టాది హేతువులచే నుత్కర్ష గోచరించుచున్నను దానిని కప్పివేసి నీచత్వము నాపాదించుట.

12వ శ్లోకము

(26) వారి ప్రయత్నములన్నియు నారంభము నుండియును నిష్ఫలములే.

(27) అయథార్థమైనది. అనగా – అజ్ఞానముచే బుట్టింపబడిన ప్రవృత్తికి అభీష్టమైన ఫలము సిద్ధించకపోవుట.

(28) రక్షస్సులకు సంబంధించిన – అనగా తామసమని యర్థము.

(29) అసురులకు సంబంధించిన – అనగా – క్రోధలోభాదిమయమైన రాజసమని యర్థము.

(30) స్వభావమును – ఇచ్చట –

మన్యేత్వాం రాక్షసం క్రూరం।
అథవా తామసాత్మకమ్.
యస్మాత్ క్షిపసి గోవిందం।
పాణ్డవంచ ధనఞ్జయమ్॥

అనెడు భారత భీష్మపర్వములోని (66_31) దుర్యోధనునితో భీష్ముడనిన మాటను అనుసంధించవలెను.

ఓరీ! నీవు పరాత్పరుడగు శ్రీకృష్ణుని యాతని ప్రియభక్తుడగు నర్జునుని దూషించుచున్నావు. కాన నిన్ను క్రూరమైన రాజసస్వభావముగల రాక్షసుడవనియో లేక తామస స్వభావముగల అసురుడవనియో తలంచుచున్నా ననెను.

(31) భగవంతుని పరత్వమును మరుగుపరచునది.

(32) వైపరీత్య మనగా —

అస్వతంత్రులను స్వతంత్రు లనుకొనుట, ఇతరుల వస్తువును తనదనుకొనుట, దేహమును ఆత్మయని భ్రమించుట, నిత్యమును - అనిత్యమనుట, అస్థిరమైన దానిని స్థిరమనుకొనుట మొదలగునవి.

(33) వారు మోఘాశులు మొదలగు వారెట్లగుదురు - వారు గావించు యజ్ఞాదులకు స్వర్గము పశువు మొదలగువారి యభీష్టములు సిద్ధించుచునే యున్నవే, ఆ ఫలములకు సాధనములగు యజ్ఞాదుల యందు వారికి యథార్థ జ్ఞానమున్నదే - యనగా—

'నన్ను' ఇత్యాది గ్రంథము దానికి సమాధానముగానున్నది - అనగా - పరమ పురుషార్థమగు భగవత్ప్రాప్తికి చేయునవన్నియు నిష్ఫలమని భావము - ఇచ్చట యథార్థజ్ఞానము లేకుండుటచే మోఘ జ్ఞానము, దానిచే మోఘాశయు దానిచే మోఘారంభము అని కార్య కారణ భావము.

13వ శ్లోకము

(34) సౌలభ్యము -

(35) దైవీప్రకృతికి చెందినవాడవని సూచించును.

(36) సాత్త్వికమైన.

(37) పరత్వము –

యీ సౌలభ్య పరత్వగుణములచే నారాయణునకు ఉపాస్య త్వము – ప్రాప్యత్వమున్ను సిద్ధించును.

(38) నాశరహితుడు – కర్మవశమున కలుగు జన్మమును జ్ఞాన సంకోచాదులును లేనివాడు – కారుణ్య వశముననే యవతరించి నిజదివ్య స్వభావలక్షణములగు జ్ఞానవికాసాదులను విడువకుండువాడు.

ఈ శ్లోకారంభమున "తు" శబ్దమును ప్రయోగించుటచే వీరికి వెనుకటి పాపాత్ములవలెగాక భగవంతుని భజించుట కుపయోగించు అతిశయము చెప్పబడినది.

14వ శ్లోకము

(39) ఇచ్చట వ్రతమనగా సంకల్పము. దృఢమనగా దార్ఢ్యము – సంకల్పమునకు దార్ఢ్యమేమనగా గొప్పదైన ఆపదలో గాని ఆకస్మికముగా వచ్చిపడిసిన ఐశ్వర్యములోగాని మతిచలించి మరియొక దారిని త్రొక్కకుండుట.

(40) 'సతతం' అను పదము 'కీర్తయన్తః' అను పదముతో చేర్చి ప్రయోగింపబడుటచే నొక అపూర్వమగు నర్థమునిచ్చుచున్నది. అమరకోశమున –

'తతం వీణాదికం వాద్యం' అని తతమనగా తీగెలుమీటుచు వాయించు వీణ, ఫిడేలు మొదలగు వాద్య విశేషములని చెప్పబడెను.

'తతేన సహితం సతతం'

అనగా వీణాదులతో కూడిన వాద్యవిశేషములతో కూడినట్లుగా కీర్తయన్తః = పాడుచున్నవారు – అని యర్థము సిద్ధించుచున్నది.

(41) నారాయణ శబ్దమున్ను వాసుదేవ శబ్దమున్ను భగవంతుని సర్వతో వ్యాప్తిని తెలుపు రెండు ప్రసిద్ధపదములు. వానికి మధ్య అవ్యాపకమగు కృష్ణశబ్దము నేల చెప్పిరనగా –

ఇదియును కృషిర్భూవాచక శ్శబ్దః । ణశ్చనిర్వృతి వాచకః అను వ్యుత్పత్తినిబట్టి పురుషార్థ హేతుత్వమును చెప్పుచుండుటచే నిది పరవ్యూహాది సకలావస్థలకును సాధారణమైనదని తెలుపుటకే యని యెఱుంగవలెను.

ఈ కృష్ణశబ్దము వసుదేవసూనునందేగాక ఇతర యవతారముల యందును ప్రయోగింపబడును.

"ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా"

(తై. నారా - 1 అను) ఓ భూదేవీ ! నీవు పాతాళమునకు గొనిపోబడగా వరాహావతారమును ధరించినట్టియు నూరు భుజములు కలిగియున్నట్టియు భగవంతునిచే మహత్తర ప్రయత్నముచే నెత్త బడితివి అని యర్థము -

విష్ణు పురాణమున ప్రహ్లాద చరిత్రలోను; "సత్వాసక్తమతిః" అని ప్రయోగింపబడినది.

(42) ఎప్పుడును అనుటచే రహస్యమునందుగాని జన సమక్షమునగాని సిగ్గుపడరాదని తెలుపబడుచున్నది.

(43) 'మద్దాస్యమునందే' యనుచోట -

దాసభూతా స్స్వతస్సర్వే । హ్యాత్మానః పరమాత్మనః
నాన్యథా లక్షణం తేషాం । బన్ధేమోక్షే తథైవచ॥

అను శ్లోకానుసారము ఆత్మలకు సర్వదా దాస్యమే ముఖ్య లక్షణమను నర్థము సూచింపబడినది. 'దాసభూతాః' అనుచో "దాసాశ్చతే భూతాశ్చ" అనగా - 'యతోదాసాః తతోభూతాః' అనుటచే దాసులు గనుకనే భూతులు = అనగా సత్తావంతులు అని యర్థము. (భూ - సత్తాయాం - ) దాసులు కానివారు సత్తాహీనులే యని భావము.

15వ శ్లోకము

(44) ఇచ్చట కొన్ని ప్రశ్న లుదయించుటచే వానికి సమాధానముగా 'ఇందలి భావమిది' యను గ్రంథము బయలుదేరుచున్నది.

ఆ ప్రశ్న లేవియనగా —

(1) ఏకత్వేన పృథక్త్వేన చ ఉపాసతే యని యన్వయించరాదా ?

(2) ఒక్కడుగా నున్నవాడు బహుభంగులుగా నుండు టెట్లు? అట్లున్నచో వికారవంతుడును. సంసారియును కావలసిరాదా ?

(3) బహుభంగులుగా నున్నవానిని యేకవిధముగ నుపాసించుట భ్రాంతి కాదా ? యని.

ఈ ప్రశ్నల కీముందు గ్రంథము సమాధానము నొసంగుచున్నది.

(45) భగవచ్ఛబ్దమునకు జ్ఞాన-శక్తి-బలైశ్వర్య వీర్యతేజస్సులనెడు ఆరు ప్రధాన గుణములను కలవాడనియు, దుర్గుణ దూరుడనియును అర్థము. దీనిచే సృష్ట్యాదుల కుపయోగించు గుణవిస్తారము చెప్పబడినది.

(46) వాసు+దేవ. యని దీనిలో రెండంశములు కలవు. మొదటియంశచే సర్వతోవ్యాప్తి చెప్పబడుచున్నది. దానిచే సర్వ శరీరకత్వము తెలియుచున్నది. దానిచే వస్తుపరిచ్ఛేద రాహిత్యము. అనగా - సర్వము తానై సర్వశబ్దములచేతను తానే చెప్పబడుట తెలియుచున్నది.

రెండవ యంశముచేత - అవాప్త సమస్త కామునకీ సృష్ట్యాది వ్యాపారములేల యనగా 'దివ్ - క్రీడాయాం' అను లీలార్థమైన దేవ

శబ్దముచే నివి యాతనికి లీలలని 'లోకవత్తు లీలాకైవల్యం' అను సూత్రార్థము సూచింపబడుచున్నది. భగవాన్ + వాసుదేవః - అని రెండు పదములను చేర్చుటచే అనన్యోపాసకులగు ఏకాంతభక్తులు అనారత మనుసంధించు 'వాసుదేవ ద్వాదశాక్షరీ' మంత్రము సూచింప బడుచున్నది.

ఇచ్చట పృథివ్యాది బహుత్వముకాదు మన మెఱుంగదగినది. అది ప్రత్యక్ష సిద్ధమే.

ఒక్కని కెట్లనేకత్వమని శాస్త్రముచే నెఱుంగవలెను. అది ఒకడు సర్వశరీరుడని యెఱుంగుటచేతనే నిర్వహింపబడును.

18వ శ్లోకము

(47) గతిః - గమ్యతే=పొందబడినది.

అది స్వర్గాదికము గాని యందుండు భోగ్యజాతము గాని యర్థము.

(48) సుహృత్ - సు = శోభనం, హృత్ = హృదయం, యస్యాసః సుహృత్ -

హృదయమునకు శోభనత్వమేమి యనగా పరుల హితము నాకాంక్షించుటయే, (కోరుటయే).

(49) భర్తా=ధారకుడు

దీనికి 'పతి' యని యర్థమును జెప్పక 'ధారకుడ' ని యర్థమును చెప్పనేల యనగా -

ఈ ప్రకరణమున సర్వజన సాధారణమైన యర్థములు చెప్ప బడుచుండగా మధ్య యొక్కస్త్రీకి మాత్రమే సంబంధించిన 'పతి' యను నర్థమును చెప్పుట అస్వారస్యము. 'భృఞ్ - భరణే' యను ధాతువునుండి నిష్పన్నమగు భర్తృశబ్దమునకు యీ యర్థము ప్రసి ద్ధమే గదా!

విశేషార్థము — ఈరెండు శ్లోకములచేతను భక్తి (ప్రేమ) వృద్ధి పొందుటకు ముఖ్యతమమగు నవవిధ సంబంధజ్ఞానము సూచింపబడినది. జీవునకు పరమాత్మతో 9 విధములగు సంబంధములు గలవు. వీని నెఱింగినచో పరస్పర ప్రేమ వృద్ధి చెందును.

శ్లో॥ పితాచ రక్షకశ్శేషీ । భర్తాజ్ఞేయో రమాపతిః
స్వామ్యాధారో మమాత్మాచ । భోక్తాచాద్య మనూదితః॥

(1) పితాపుత్ర సంబంధము - 17వ శ్లోకమున 'పితాహమస్య జగతః' అనుటచేతను -

(2) రక్ష్య రక్షకసంబంధము - 18వ శ్లోకమున 'శరణం' - ("శరణం గృహరక్షిత్రోః" అను కోశానుసారము) అను పదము చేతను -

(3) శేష శేషి భావసంబంధము - ధాతా ('మూలపురుషుడు వంశమునకు శేషిగాన') అను పదముచేతను -

(4) భార్యా భర్తృసంబంధము - 18వ శ్లో. "భర్తా" యను పదముచేతను —

(5) జ్ఞాతృ - జ్ఞేయసంబంధము - 17వ శ్లోకమున "వేద్యం" అను పదముచేతను -

(6) స్వ - స్వామిభావసంబంధము 18వ శ్లోకమున "ప్రభుః" అను పదముచేతను -

(7) ఆధారాధేయ భావసంబంధము - 18వ శ్లోకమున 'నివాసః' అను పదముచేతను -

(8) శరీరాత్మ భావసంబంధము - 'వేద్యం పవిత్రం అహమేవ' వేదముచే తెలియదగిన పావనవస్తువులన్నియును నేనే యను సామానాధికరణ్యముచేతను -

(9) భోక్తృ - భోగ్యసంబంధము - 'ప్రభుః' అను పదము చేతను సూచింపబడుచున్నవి.

21వ శ్లోకము

(50) స్వర్గానుభవముచే బంధకములగు నితర పుణ్యకర్మలు నశింపవు ఆ పుణ్యమునకు తగిన ఆ సుఖము ననుభవించి మిగిలిన పుణ్య ఫలము ననుభవించుటకై విలక్షణజాతిలో జన్మించునని 'రమణీయ చరణాః రమణీయాం యోనిమాపద్యన్తే' బ్రాహ్మణయోనిం క్షత్రియ యోనిం వైశ్య యోనిం వా' అని శ్రుతి తెలుపుచున్నది. కాబట్టి శ్రీ భాష్యకారులు 'ఆ స్వర్గానుభవమునకు హేతువైన' యని సెలవిచ్చిరి.

(51) 'స్వర్గేఽపి పాతభీతస్య క్షయిష్ణోర్నాస్తి నిర్వృతిః' అందువల న నేస్వర్గమున పుణ్యఫలమైన సుఖము ననుభవించుచున్నను ఆపుణ్యము క్షీణించుననియు తాను తిరిగి భూమిపై జన్మించవలెననియు తలంచు కొనుచుండుటచే ఆ యనుభవించుచున్న సుఖము న్నీరై దుఃఖము నే యనుభవించునుగాన స్వర్గము నపేక్షించి కర్మలను చేయుక మోక్ష సాధనమైన భగవద్భక్తికి గడంగుడని సూచింపబడుచున్నది.

(52) మనుష్యలోకమునకు 'మర్త్యలోకం' అని మూలమున గలదు. దీనికర్థము మారణధర్మముగల (నశించు) లోకము అనియే, అందుచే నిది స్థిరమైనదికాదు కావున స్థిరమైన శాశ్వత పరమపదము నకు ప్రయత్నించుమని సూచింపబడుచున్నది.

(53) కేవలమనుటచే - ఈ కర్మలను అంగముగాగల ఉప నిషత్సిద్ధమైన పరమధర్మమగుభక్తియోగ మెవరికిని లేదనితాత్పర్యము.

(54) మూలమున 'గతాగతం' అనియున్నది -

గతంచ ఆగతంచగతాగతం = రాకపోకలు - ఇంతమాత్ర మొక దోషముకాదుకాని అల్పాస్థిరత్వములే దోషములు.

ఈ భోగము లనుభవదశయందును దుఃఖాత్మకములే. ఏల నన – "యథా పశురేవం స దేవానాం" మన మిచ్చట పశువుల నెట్లు చూతుమో దేవతలా లోకములలో మననట్లు చూతురు గాన. ఆయా లోకములలో నాయా సుఖముల ననుభవించుచున్నను — అయ్యో 'ఈ భోగములు క్షణికములే' నేడో రేపో పోవున్నందురే యని తలంచు మందుటచే దుఃఖతరములు – ఆ పుణ్యము తరిగిపోగనే పీరు క్రిందికి రావలసివచ్చిననాడు దుఃఖతమములు – ఇంక నాపైని యేతాముగూనవలె తిరిగి పుట్టుటకు లోబడిన గర్భవాసము వ్యాధులు ఆధులు నరకయాతనలు సంభవించుచో నా దుఃఖమిక చెప్ప నేల? ఇట్లు తెంపులేక సాగుచునే యుండును- అని యీ ఫలములయందును వానికి కారణము లైన కర్మలయందును రోతబుట్టి భక్తులు కావలెనని యిట్లు వర్ణింపబడినది.

22వ శ్లోకము

(55) జనాః — అనుటచే సార్థకమగు జన్మకలవారని తాత్పర్యము.

(56) అలబ్ధలాభము = భగవత్ప్రాప్తి రూపమోక్షము.

(57) లబ్ధరక్షణము = తిరిగి జన్మించకుండ చేయుట.

(58) ఇచ్చుచున్నాను –

ఇచ్చట – కరోమి, దదామి, తనోమి ఇత్యాది క్రియా పదములను ప్రయోగించక "మోయుట" అను నర్థముగల 'వహామి' పదమును ప్రయోగించుటలో భగవంతునకు భక్తులయందుగల ఆద రాతిశయము సూచింపబడుచున్నది. వారికి భగవంతుడు చేతికిచ్చి నచో మోసుకొనిపోవలసిన భారము వారికుండును గాన ఆ కష్టమును కూడ వారికి కలిగించజాలక తానే మోసితెచ్చి యిచ్చునను అర్థ

విశేషము సూచింపబడినది — ఇందులకు కుచేలునకిచ్చిన ఐశ్వర్యమే మనకు ఉదాహరణము.

(59) అహం = ఈపదముచే - ఔదార్య - సౌశీల్యాది గుణ విశేషములు వివక్షితములు.

(60) చింతనము వేరొక ఫలమునకు కాకుండుటచే నిరతిశయ ప్రీతిరూపమగునని తెలుపుటకే యీ విశేషణము చేర్చబడినది.

(61) మోక్షము నపేక్షించు నిరతిశయ భక్తవర్గమునకు భగవంతుడు ఆనుషంగిక ఫలాంతరములను ప్రసాదించినను (కైంకర్యము నకై ఆశ్రయించిన విభీషణునకు రాజ్యమునిచ్చినట్లు) మోక్షమున కుపయోగించక శరీరయాత్రకు మాత్ర ముపకరించు యోగక్షేమములను ప్రసాదింపదగదు గాన నిచ్చట యోగక్షేమములను మోక్షాను గుణముగ శ్రీ భాష్యకారులు వివరించిరి.

(62) ఈ శ్లోకమునందు -

ఈ యుపాయమూ మిక్కిలి సుఖరూపమైనది. ఫలమూనిత్యము, నిర్దుష్టము, నిరతిశయానంద రూపమునగుటచే మహాత్ముల (భక్తాగ్రేసరుల) అతిశయము చెప్పబడినది.

## 23వ శ్లోకము

(63) ఇంద్రాదులను మాత్రమే యారాధించుట కర్మభాగమున చెప్పబడెను. వారియొక్క నిజస్వరూపము (పరమాత్మను ఆత్మగా కలిగియుండుట) వేదాంతములయందు మాత్రమే తెలుపబడెను.

(64) ముఖ్యముగా —

నిజముగ హవిస్సున ఉద్దేశ్యము నారాయణుడే. ఆ నారాయణునకు శరీరభూతు లింద్రాదులు —

ఈ పరంపరగా నింద్రాదుల ఉద్దేశ్యులగుచున్నారు. ఈ విష యమే ఉపనిషత్తులలో ప్రతర్దన విద్యలో ప్రతిపాదింపబడినది.

24వ శ్లోకము

(65) పరిమిత ఫలమగుట — దేశమును బట్టియు కాలమును బట్టియు ఫలమును బట్టియును.

(66) 'ఫలమత ఉపపత్తేః' కర్మలే ఫలమునిచ్చునను మీమాంసమతమును నిరసించుచు వ్యాసమహర్షి యీ 3-2-37వ సూత్రమున పరమపురుషుడే సకల వేదోక్తకర్మలకును ఫలము నొసంగువాడు - ఏల ననగా - అతడు సర్వజ్ఞుడు, సర్వశక్తులు కలవాడు, మహోదారుడు కావున యాగదాన హోమాదులచేతను ఉపాసనచేతను ఆరాధింపబడి ఐహికాముష్మిక సమస్తభోగములను యివ్వగల సమర్థుడు - అని సమర్థించెను.

దీనివలన ఇంద్రాదుల నుద్దేశించి యారాధించినను ఫలము నిచ్చువాడను నేనే యగునట్లు నన్నుద్దేంచిన వారికి వేరొకడు ఫలము నిచ్చువాడు లేడనుచున్నాడు.

26వ శ్లోకము

(67) పత్రపుష్ప ఫలతోయములకు సాధారణముగా నున్న కార్యకారణ భావమునుబట్టి క్రమము కూర్చబడెను. అనగా ముందు చిగురు తొడుగును. దానివలన పూచును. దానివలన ఫలించును. అది బాగుగ పక్వమైనచో రసభరితమగును కదా!

(68) ఈ చెప్పుటలో సమానముగ చెప్పక "లేక, లేక" యని విడివిడిగా (వికల్పముగా) చెప్పుట కేమి ప్రయోజనమనగా - సమాసమును గావించినచో నన్నిటిని ఒక్కసారిగా సమర్పించవలెనే ఎట్లులభించునని భ్రమించి నిరాశులగుదు రేమోయని వికల్పించి భాష్యకారులు వ్యాఖ్యానించిరి. ఇదియే వ్యస్త నిర్దేశమునకు ప్రయోజనము.

ఆయా కాలానుగుణముగా వీలు వెంబడిని లభించినదే యొక్కటి యైనను చాలునని భావము. ఒక్కొక్కదానితోనే పరమాత్మ ప్రసన్నుడగును.

(69) పరమైకాంత మనస్కులగు భక్తులచే సమర్పింపబడునట్టి వాని నన్నిటిని భగవంతుడు స్వయముగ శిరస్సుతో స్వీకరించుచున్నాడు.

ఈ శ్లోకమునకు పెక్కురు తమ బుద్ధికుశలత కొలదిని పెక్కు అర్థములను జెప్పుదురు.

ఇట్లర్పించి యాదరింపబడిన వారెవరనగా :—

పత్రం - దీని నర్పించినది - ద్రౌపది. దూర్వాస ఆతిథ్యమునకు భయపడి శ్రీకృష్ణుని తలంచగా నాయన వేంచేసి ఆకలి యని అక్షయపాత్రలోని తోటకూరాకు నొకదానిని ఆమె తీర్థములో సమర్పించగా నారగించి వారి యాపదను (దూర్వాసుని వలన) బాపెను.

పుష్పం- గజేన్ద్రుడు భక్తితో సమర్పించిన పుష్పమును స్వీకరించి ప్రసన్నుడై యాతని గాపాడెను.

'నాహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన ।
కరస్థ కమలా న్యేవ పాదయోరర్పితుం తవ॥

అనిగదా గజేంద్రుని యభిసంధి. అనగా ఓ భక్తశత్రుహన్తా! శ్రీహరీ! నేనీ హేయమైన శరీర సంరక్షణార్థమై నిన్నుగూర్చి మొరబెట్టలేదు - నా తొండమునందలి తామర పుష్పములను వాడకుండగ నీ చరణారవిందముల యందర్పించవలెనని సుమా యని తన యభీష్టము లభించెను.

ఫలం - శబరి పదుమూడు సంవత్సరములు వాడకుండగను కుళ్ళకుండగను దాచియుంచిన పండ్ల నతిప్రీతితో నర్పించి పరమ పురుషార్థమును బడసెను.

తోయం - రంతిదేవుడు దీర్ఘోపవాసానంతరము పారణచేయ బోగా భగవంతుడు వృద్ధబ్రాహ్మణ రూపముతో వచ్చి యాతని యాహారము నర్థించి తినివేయుటయేగాక త్రాగుట కుంచుకొనిన తీర్థపాత్రనుకూడా రిత్తపుచ్చి యాతని యధ్యవసాయమున కచ్చెరు వొంది యనుగ్రహించెను. ఇత్యాది కథలెన్నిటినో ఉదహరించి చమత్కరింతురు. కాని నేనిచ్చట నొక ఆధ్యాత్మిక సమన్వయమును పాఠకుల హృదయానందకరముగ నుదహరింతును - వినుడు. భగవద్గీతలోని శ్రీకృష్ణపరమాత్మ వాడిన కొన్ని పదముల పరిభాషయే విలక్షణము. ఇది యేమన్న 'మేమతం' "అయం ఔపనిషదర్థో భవతు వా మావా శ్రీకృష్ణ సిద్ధాన్త ఇతి ఘుష్యతా"మనును ... ఇది యుప నిషత్సిద్ధమైన అర్థమగునో కాదో నాకేల? ఇయ్యది శ్రీకృష్ణ సిద్ధాంతమని చాటుము" అనును అట్లే యీ శ్లోకమునందును -

పత్రం - అనగా "ఛందాసియస్య పర్ణాని" యనుటచే వేదము లని యర్థము. దాన సంపూర్ణ సంస్కృత వేదమునుగాని తత్సమా నార్థకమైన దివ్యప్రబంధమునుగాని తత్సార బోధకములగు నితర దివ్యప్రబంధములనుగాని నిష్కామబుద్ధితో యనుసంధించి 'సర్వం కృష్ణార్పణమస్తు' అన్నచో నాతనికెంతో భోగ్యముగా వానిని గ్రహించి ప్రసన్నుడగును.

పుష్పం -అహింసా ప్రథమం పుష్పం, పుష్పమిన్ద్రియనిగ్రహః- సర్వభూత దయాపుష్పం, క్షమాపుష్పం విశేషతః - శాన్తిపుష్పం తపః పుష్పం ధ్యానపుష్పం తథైవచ సత్య మష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్. అనినట్లే యెనిమిది పుష్పములచే నాతడెంతో ప్రసన్నుడగును.

ఫలం - 'సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్' నిశ్చలచిత్తుడవై నీ వాచరించు లౌకిక వైదిక సమస్త కర్మలయొక్క

ఫలమును విడిచి యాచరించుము - ఎచ్చట నా ఫలమునర్పించ వలెననిన -

'యత్కరోషి...తత్కురుష్వ మదర్పణమ్'

అని తన కర్పించమని యానతిచ్చెను.

తోయం - అనగా "ఆహ్లాద శీత నేత్రామ్బుః! పులకీకృత గాత్ర వాన్ । సదాపరగుణావిష్టః ద్రష్టవ్య స్సర్వదేహిభిః॥"

నిరంతరము సర్వేశ్వరుని దివ్యమంగళ విగ్రహాను సంధానము చేతను ఆతని కల్యాణగుణానుసంధానముచేతనుకలిగిన ఆనందపారవశ్య మున కన్నులనుండి చల్లనినీటిధారను కార్చుచు ఆపాదమస్తకము పులకాంకురములచే వ్యాప్తమైయుండు భగవద్భక్తుడు దర్శనీయుడు అనియు ముకుందమాలయందు -

బద్ధేనాఞ్జలినాఽఽనతేన శిరసా గాత్రై స్సరోమోద్గమైః ।
కణ్ఠేన స్వరగద్గదేన నయనేనోద్గీర్ణ బాష్పామ్బునా
నిత్యం త్వచ్చరణారవిన్దయుగళ ధ్యానామృతాస్వాదినా ।
మస్మాకం సరసీరుహాక్ష! సతతం సమ్పద్యతాం జీవితమ్॥

అనగా -ఓ పుండరీకదళామలాయా తేక్షణా ! శ్రీహరీ - రెండు చేతులను జోడించి తలను భక్తిభారముతో వంచి శరీరము రోమాం చముతోనిండి డగ్గుత్తికపడి నేత్రములనుండి యానందబాష్పములు ధారధారలుగా కారుచుండ నిరంతరము నీపాదారవింద ద్వంద్వధ్యాన మనెడు అమృతపానముతోనే మాజీవితము గడుచున ట్లనుగ్రహిం పుము - అనునట్లు యిట్టివియే భగవంతున కత్యంతానందకరమని గ్రహించవలెను.

ఈవిషయము భారతమున ఆదిపర్వమందు—1-301 లో

శ్లో॥ తపోనకల్కోఽధ్యయనం నకల్కః స్వాభావికో వేదవిధిర్నకల్కః ।
ప్రసహ్య విత్తాపహరణం నకల్కః తాన్యేవ భావోపహతానికల్కః॥

అనగా - కృచ్ఛ్రచాంద్రాయణాదులు పాపహారములు కావు. వేదాధ్యయనము పాపహారణము కాదు. ఆ యా వర్ణాశ్రమములకు విధింపబడిన వేదోక్తసంధ్యావందనాదులు పాపహారణములు కావు. ఆకలిదప్పి మొదలగు దుఃఖాదులను సహించిచేసిన ధనార్జన పాపహారణము కాదు - కాని యీ తపఃప్రభృతులే ఫలము నపేక్షించి యాచరించినచో తప్పక పాపహేతువు లగును - కాబట్టి భగవంతు నుద్దేశించియే సత్కర్మనాచరించినను ఫలాంతరమును కోరరాదని భావము -

'భక్త్యా ప్రయచ్ఛతి - భక్త్యుపహృతం' అని రెండుసారులు భక్తిశబ్దప్రయోగమువలన మనమర్పించువానిని భగవంతు డాదరించ వలెననిన దానికి భక్తియొక్కటియే కారణము. వేరొండు కాదని సూచింపబడెను.

'అహం' అని చెప్పుటచే పత్రపుష్పాది క్షుద్రఫలములను పరిగ్రహించుటకు తగని భగవదతిశయమును సూచించు విశేషణములచే శ్రీ భాష్యకారులు దానిని వివరించిరి.

భారతమున ఉద్యోగపర్వములోని విదురోక్తి -

శ్లో॥ అన్యత్పూర్ణా దపాంకుంభా దన్యత్ పాదావనేజనాత్ ।
అన్యత్కుశల సమ్ప్రశ్నాన్న చేచ్ఛతి జనార్దనః॥

అనగా సంధికై వేంచేసిన శ్రీకృష్ణుని వశపరచుకొను ఉపాయ మేమని దుర్యోధనాది దుష్టచతుష్టయ మాలోచించుచుండ విదురుడు వారితో - శ్రీకృష్ణునకివి యేమియు నవసరము లేదు. ఆయన వేంచే యగా గుమ్మమున నొక జలపూర్ణ కలశనుంచుట, పాద్యము నొసంగుట, కుశలప్రశ్నను గావించుటకంటె వేరొక దానినిగాని యాత డపేక్షించడనెను.

కాబట్టి పత్రపుష్ప ఫలాదులు దుర్లభమైనను నీటికి కరువుండదు గదా యని చివరకు నీరు చెప్పబడెను - దీనికి ధనవ్యయముగాని ప్రయాసగాని పనిలేదు - దరిద్రున కైనను నిది దుర్లభము కాదు గాన సర్వసులభమని భాషించిరి.

ఈ శ్లోకమున - "యోమే" యని యచ్ఛబ్దమును వాడుటచే వీరు సాపరాధులా? నిరపరాధులా? బుద్ధిహీనులా? బుద్ధిమంతులా? యని సమర్పించువారి యోగ్యత నారయడని భావము - 'యేఽపి స్స్యుః పాపయోనయః' అని తానే సెలవిచ్చెను గదా!

"భక్త్యా" యనుటచే దృష్టాదృష్ట అనర్థపరిహారమునకు గాని ఫలాంతరములకు గాని యీసమర్పణ కాకూడదని సూచింపబడెను.

'పుణ్యకర్మలైనను ఫలాశతో చేసినవైనచో నా యాశయే మనస్సునకు మాలిన్యముగా భావింపబడును.

27వ శ్లోకము

(71) (చివర)

వేదాంతాచార్య మహాశయులీ శ్లోకమును - స్వభావార్థ శాస్త్రప్రాప్త సర్వకర్మ సమర్పణ విషయమన్త్రవిశేషోఽపి స్మారితః! ఇమమేవ శ్లోకం పురుషవ్యత్యయేన మన్త్రితమైవ క్వచిదను సన్ధత్తే- అనగా, శాస్త్రముచే వారివారికి వర్ణాశ్రమ ధర్మములుగా విధింపబడిన సమస్త కర్మలను శ్రియఃపతికి సమర్పించు మంత్ర విశేషమని సాయిం చిరి. దీనిని పురుషమార్చి ప్రతి కర్మారంభమునను సాత్విక త్యాగ మంత్రముగా వాడుదురు - ఎట్లనగా -

"యత్కరోమి యదశ్నామి యజ్జుహోమి దదామియత్
యత్తపస్యామి భగవన్ తత్కరోమి త్వదర్పణమ్"

29వ శ్లోకము

(72) తిర్యక్కులలో – గజేంద్రుడు, సుగ్రీవుడు మొదలగు పుణ్యాధిక్యముచే జ్ఞానాధిక్యముకలవారు భగవంతు నాశ్రయించి యభీష్టములను బడసిరి. కావున తిర్యక్కులకు శాస్త్రవశ్యతలేదే, శాస్త్రము వారికి ప్రవృత్తి నివృత్తులను కలిగించదే యను ప్రశ్న కవకాశములేదు. ఇది యుత్కృట పుణ్యశాలుల విషయము.

స్థావరములలో (చెట్లు మొదలగునవి) శాపాదులవలన చెట్టు పుట్టగా బుట్టినవారగుటచే నొక్కొక్కచోట జ్ఞానప్రసారమున్నదని మహాత్ములు సెలవిత్తురు. కాబట్టి కాయిక సమాశ్రయణము లేకున్నను మనోవృత్తి రూపమైన సమాశ్రయణము వానికి నుండవచ్చును.

సామాన్యముగా లోకమున ద్వేష్యులను విడచుట ప్రియులను సంగ్రహించుటయును చూచుచున్నాము. ఆ వైషమ్యము సర్వేశ్వరునకు తన నాశ్రయించిన వారివిషయమున లేదని చెప్పబడినది –

(73) జాతి యనగా – దేవత్వ – మనుష్యత్వ- బ్రాహ్మణత్వ క్షత్రియత్వాదులు.

(74) ఆకారమనగా – అందమైన స్త్రీయనిగాని అందమైన పురుషుడనిగాని, అవయవలోపాదులు లేనివాడనిగాని నా యాదరమునకు పాత్రులుకారు. కావున 'యేఽపిస్యుః పాపయోనయః' 'స్త్రియో వైశ్యా స్తథా శూద్రాః' అనెను.

(75) స్వభావమనగా – రాజస తామసాదులు. దేవతలు భగవంతు నాశ్రయించి యభీష్టముల బడయుట కెన్నియో ఉదాహరణములు కలవు. శాస్త్రమునకూడా 'అర్థిత్వ సామర్థ్యములు' అనగా తీరవలసిన కోరికలు, బలిష్ఠమైన అవయవములును ఉండుటచే దేవతలకును భగవదుపాసనలో నధికారమున్నదని 'తదుపర్యపి బాదరాయణ స్సంభవాత్' అను సూత్రమున చెప్పబడెను.

30వ శ్లోకము

(76) బహుళాచార వంతుడైనను యిట్టి యధ్యవసాయము శ్లాఘ్యమే - బంగరు గనిలోని రాతిముక్క నాదరముతో నెత్తుదురా? మురికిగుంటలోని ముత్యమును విడతురా ?

31వ శ్లోకము

(77) వీడు ఆచార వికలుడుగదా ధర్మాత్ముడగుటకు బహు కాలము పట్టునని సందేహింప నవసరములేదని తెలుపుచున్నది.

(78) ఈ శ్లోకమున ధర్మశబ్దమునకు వర్ణాశ్రమ ధర్మమని యర్థమును జెప్పరాదు. సామాన్య శబ్దమునకు విశేషవిషయముగా నర్థమును జెప్పవచ్చును. ప్రకృతము భక్తిప్రసంగము ప్రారంభమున కూడ 2వ శ్లోకమున భక్తిని 'ధర్మ్యం' అని ధర్మశబ్దముతోనే వ్యవహరించెను.

(79) కౌన్తేయ ! ప్రతిజానీహి -

తనభక్తుడు చెడడని తాను ప్రతిజ్ఞ చేయవలెనుగదా ! అర్జునుని శపథము చేయుమననేల ?

రామావతారమున 'ఏతద్వ్రతం మమ' యని తానే ప్రతిజ్ఞను చేయలేదా ? ఇచ్చట నట్లేల చేయరాదు ? అన్నచో - రామావతారమునకును కృష్ణావతారమునకును మహత్తర తారతమ్యమున్నది. తన భక్తుల ప్రతిజ్ఞను పాలించుటకై తన ప్రతిజ్ఞనైనను విడుచుటకు శ్రీకృష్ణుడు వెనుదీయడు. ఆ విషయము భీష్మశ్రీసూక్తివలననే గ్రహించవచ్చును. ఆయుధమును పట్టించెదనను భీష్మపితామహుని ప్రతిజ్ఞను కాపాడుటకై ఆయుధమును పట్టనెడు తన ప్రతిజ్ఞను విడవలేదా ?

"స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞాం ।
ఋతమధికర్తు మవప్లుతో రథస్థః॥"

"చక్రంబుచేబట్టి చనుదెంచు రయమున - పైనున్న పచ్చని పటముజార" యని పోతన వర్ణించెను. భక్తవత్సలా! కృష్ణా! నా ప్రతిజ్ఞను సత్యమును గావించుటకై నీ ప్రతిజ్ఞను వమ్ముచేసి చక్రంబుచేబూని చనుదెంచుచున్నావా?

ఏహ్యేహి ఫుల్లామ్బుజపత్ర నేత్ర!
ప్రసహ్యమాం పాతయ.........

రమ్ము రమ్ము. నాస్ఫుట వికసిత పద్మదళాయ తేక్షణ! కృష్ణా! నే నిదే ఆయుధ సన్న్యాసము నొనరించుచున్నాను. వెంటనే బలాత్కారముగా నీ చక్రముతో నాశిరమును దునిమి నీ భక్తుని కాపాడుకొను మనెను.

నృసింహావతార ప్రసంగమున –

శ్లో॥ సత్యం విధాతుం నిజభృత్య భాషితం।

తన భక్తుడగు ప్రహ్లాదుని "ఎందెందు వెదకిచూచిన యందందే గలడు చక్రి" యను ప్రతిజ్ఞను యథార్థమును గావించుటకుగాను స్తంభమునుండి నరసింహాకారముతో నవతరించెను.

రామావతారమందైనను సముద్రతీరమున విభీషణునకు లంకారాజ్య పట్టాభిషేకమును లక్ష్మణస్వామిచే చేయించెను.

అటులనే తన భక్తులను కాపాడుటలోనున్న అభినివేశముచే తాను చేసిన ప్రతిజ్ఞయే వైనచో జారునో యను భయముచే తన భక్తుడైన యర్జుననిచే గావింప జేయుచున్నాడు.

34వ శ్లోకము

(80) ఈ శ్లోకమున 'మన్మనా భవే' త్యాదినా అస్మచ్ఛబ్దము వాడబడుటలో తాత్పర్యము –

సామాన్యముగా భగవదుపాసనలు (32) అన్నిటియందును ఉపాసింపబడినట్టివిగాను వాని కుపయోగపడునట్టివిగాను అనేక

ప్రమాణములచే తెలుపబడి భగవంతుని దివ్యాత్మ స్వరూపము, తద్గుణములు, దివ్యమంగళ విగ్రహము, దాని గుణములున్ను యీ యుక్తచ్ఛబ్దముచే వివక్షితములగుచున్నవి.

ఇచ్చట సర్వేశ్వర శబ్దము ప్రయోగించుటలో ముఖ్యాభిప్రాయ మేమనగా -

అసమర్థుని నెంత సేవించినను ఫలము సున్న. బ్రహ్మాండము లనంతములు. బ్రహ్మేశానాదులు తామున్న బ్రహ్మాండములకే ప్రభువులుగాని యితర బ్రహ్మాండములకు కారు. మోక్షమునసలే ప్రసాదించలేరు.

(1) నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణైకతానే = పరమాత్మకు ఉభయలింగములసాధారణములు - ఉభయలింగము లనగా దుర్గుణదూరుడగుట — కల్యాణగుణముల కాకరుడగుటయును. ఆ రెండును యీ విశేషణముచే చెప్పబడుచున్నవి. హేయగుణములు కలవాడును గుణహీనుడును మన కుపాస్యులు కారు. అందుచే నీతడు సకలేతర విలక్షణుడు. సగుణ నిర్గుణ శ్రుతులకుగల పరస్పర విరోధమును ఘటక శ్రుతి యిటులనే పరిహరించుచున్నది. 'నిత్యం హేయగుణావధూనన పరాః నైర్గుణ్యవాదా శ్శ్రుతౌ। సత్యార్థాస్సగుణోక్తయ శ్శుభగుణ ప్రఖ్యాపనాద్బ్రహ్మణః' అనియే యీఘటక శ్రుతిబోధించు అర్థము. సగుణుడనుటలో కల్యాణగుణము లన్నియును నిస్సంకోచముగా కలవాడనియు, నిర్గుణు డనుటలో దుర్గుణమొక్కటియు దరిజేరని వాడనియు నర్థము. తాను నిర్దోషుడగుటయేగాక 'క్షేత్రజ్ఞస్యేశ్వరధ్యానాత్, విశుద్ధిః పరమామతా' అనునట్లు తనను ధ్యానించు చేతనునకు పరమ పవిత్రతను ప్రసాదించును. ఇట్లు సకలానిష్ట నివారకుడును మిక్కిలి భోగ్యుడును నగుటచే శ్రియఃపతి యొక్కడే మన కుపాస్యుడు.

(2) సర్వజ్ఞే సత్యసఙ్కల్పే = ఇవి రెండును సమస్త గుణము లకును ఉపలక్షణములును, ధ్యేయత్వ వ్యాపకమైన కారణత్వ మోక్ష ప్రదత్వమునకు ఉపయోగించునవియును. మోక్షప్రదుడును జగత్కా- రణమైనవాడును మాత్రమే ధ్యానింపదగినవాడని శాస్త్రము చెప్పు చున్నది. ఆ రెండింటికిని ప్రధానమైన నీ రెండు గుణములును అనిష్టములను పోగొట్టుటలో నీతనికి తెలియనివిగాని సహాకరించ దగినది వేరొకటిగాని లేదని యీ విశేషణములు రెండును తెలుపు చున్నవి.

(3) నిఖిల జగదేకకారణే = "కారణం తు ధ్యేయః" అను ప్రమా ణమునుబట్టి యితడే ధ్యేయుడని యీ విశేషణము తెలుపును. 'నిఖిల' యనుటచే అవ్యక్తాదులకును బ్రహ్మరుద్రాదులకునుగూడ కార ణమైనవాడని తెలుపబడుచున్నది.

పరస్మిన్ బ్రహ్మణి పురుషోత్తమే = ఈ విశేషణములచే శ్రియః పతికి సర్వాత్మకత్వమును సకల వైలక్షణ్యమును తెలుపబడినవి. ఇంతవరకు భగవంతుని కల్యాణగుణ విశిష్టస్వరూపము తెలుపబడినది.

ఇటుపైన సకల శాఖలలోను ఉమ్మడిగా పఠింపబడిన పురుష సూక్తముచే సిద్ధించునట్టియు, (శ్రీ) పురాణరత్నములో మనస్సునకు శుభాశ్రయమును తెలుపు ప్రకరణములో విస్తరింపబడినట్టియు దివ్య మంగళవిగ్రహమును దాని గుణములును చెప్పబడుచున్నవి.

పుణ్డరీక దళామలాయతేక్షణే —

"తస్యయథా కప్యాసం పుణ్డరీకమేవ మక్షిణీ" యని ఛాందోగ్యోపనిష త్తులో చెప్పబడిన గంభీరాంభస్సముద్భూత సుమృష్ట నాళరవికర నికర వికసిత పుణ్డరీకదళామలాయతేక్షణత్వము చెప్పబడుచున్నది.

స్వచ్ఛనీలజీమూత సన్నిభే — అనుచో స్వచ్ఛత్వమనగా మాణి క్యము అద్దము నీరు గాజు మొదలగు వానివలె రెండవ ప్రక్కనున్న

వస్తువులను చూపుట ప్రతిబింబమును గ్రహించుట మొదలగు నైర్మ ల్యము సూచింపబడుచున్నది.

ఉదారపీవర చతుర్బాహుః=అనుటచే భుజముల ఔదార్య మున్ను, బలిష్ఠతయు ఆశ్రిత సకలాభీష్ట ప్రదత్వమున్ను తెలుపబడు చున్నవి.

శ్రీకృష్ణునకు చతుర్భుజత్వము పరత్వమున స్వాభావికములే. ద్విభుజత్వము సహస్రభుజత్వము మొదలగునవి కోరినపుడు సిద్ధించునవి.

అమల కిరీటేత్యాది — ఇది శిరస్సు మొదలుకొని పాదముల వరకునుగల సమస్తావయవములందును విరాజిల్లుచున్న సకలాభరణ సముదాయములకును ఉపలక్షణము.

యుగపదుదితేత్యాది — ఇది ప్రతికూలురు కన్నెత్తిచూడ నైనను జాలరని తెలుపుచున్నది.

లావణ్యామృతేత్యాది — ఇది అనుకూలులకు భోగ్యముగను ఆకర్షకముగను నుండుటను చెప్పుచున్నది. లావణ్యమనగా - కంటి కానందము నొసగూర్చు విలక్షణకాంతి.

ఈ లావణ్యమునే శ్రీరామ - శ్రీకృష్ణుల దివ్యమంగళ విగ్రహ విషయమై వ్యాస వాల్మీకులు క్రిందివిధముగా వర్ణించిరి.

శ్లో॥ లోచనై రను జగ్ముస్తే । తమాదృష్టి పథాత్పునః ।
వనోభి రను జగ్ముశ్చ । కృష్ణం ప్రీతిసమన్వితాః ।
అతృప్తమనసా మేవం । తేషాం కేశవదర్శనే ।
క్షిప్రమ న్తర్దధే శౌరిః । చక్షుషాం ప్రియదర్శనః ॥
అచ్యుత స్యైవనాఽతృప్యన్ । ప్రేక్షమాణా జనార్దనమ్.

గోపికలు మధుర కేగుచున్న శ్రీకృష్ణుని కనిపించునంతదూరము నేత్రములతో సాగనంపిరి. వారి కా ప్రీతి యపారముగ నుండుటచే కనుచూపు దాటిపోగా మనస్సుతో సాగనంపిరి. ఎంతచూచినను

వారికి తనివితీరుటలేదు. ఆ నేత్రపర్వ స్వరూపును హఠాత్తుగా నంతర్థానమయ్యెను. అమృత మెంతత్రాగినను ఇంకను త్రాగవలె ననియే యుండును గాని యిక చాలుననిపించునా ?

శ్లో॥ మణి విడమ్బిని తస్య మనోహరే ।
వపుషి సక్తమనా మునిమణ్డలీ ।
వ్రతమముఞ్చత హోమమముఞ్చత ।
జపమముఞ్చత వేదమముఞ్చత॥

అడవులలో నాశ్రమ పరిసరములనుండి వేణువు నూదుచు గోవులవెంట నేగుచున్న శ్రీకృష్ణుని మనోహరమగు నా దివ్యమంగళ విగ్రహ మాణిక్యకాంతిని గాంచి మన స్సచ్చటనే నెలకొనిపోయి యితరేంద్రియములకు సహకరింపక పోవుటచే వ్రతము ననుష్ఠించు చున్నవా రా వ్రతమును, హోమ మొనరించుచున్న వా రా హోమ మును, జపముచేయుచున్న వా రా జపమును – వేదాధ్యయనమును చేయుచున్న వా రా వేదాధ్యయనమును, ఇట్లు తామాచరించుచున్న అనుష్ఠానము లన్నింటిని మానుకొని నిర్వైరభోయి యాతని సౌందర్యాసక్తులైరి.

అటులనే శ్రీ రామాయణమున అయోధ్యా కాండలో పట్టాభి షేక వేషముతో పురవీధుల సంచరించుచున్న శ్రీరామచంద్రుని సౌందర్యమును వర్ణించుచు వాల్మీకి మహర్షి –

నహితస్మాన్మనః కశ్చిత్ । చక్షుషీ వా నరోత్తమాత్
నర శ్శక్నోత్య పాక్రష్టుమతిక్రామతి రాఘవే॥

ఆతనియందు లగ్నమైె వెన్నంటి పోవుచున్న తమ కన్నులను గాని మనస్సునుగాని ఆతడు కాన్పించకుండగ వెడలిపోయినను మరలింప జాలరైరి :

అపార కారుణ్య సౌశీల్యాది విశేషణములచే - సౌలభ్యమున కుపయోగ పడునట్టియు, ఆశ్రయించుట కత్యంతావశ్యకము లగు నట్టియు అపరిమిత సౌందర్యాద్యుపేతములగు దివ్యాత్మ దివ్య మంగళ విగ్రహగుణములు తెలుపబడుచున్నవి.

అనాలోచిత విశేషేత్యాది - శ్రీ విభీషణులు శ్రీరామ చంద్రునకు 'సర్వలోక శరణ్యాయ' - ఇత్యాది శ్లోకముచే సర్వలోక శరణ్యుడని సార్థకమైన యుపాధి నొసంగెను. శ్రీరామచంద్రులును విభీషణ స్వీకార విషయమై 'సుదుష్టో వాప్యదుష్టోవా' అని శరణాగతుని గుణదోషముల నారయరాదనియు "విభీషణో వా సుగ్రీవ! యది వా రావణస్స్వయం" అని మొదట విభీషణుని పరిగ్రహించుటకు ప్రతిరోధమును కల్పించిన సుగ్రీవునే 'శుద్ధరవేత్తి విభీషణ' మ్మనుపంచి యాతనిని తోడితెచ్చుటకై పంపించుచు ఆతడు విభీషణు డనుకొనుట భ్రాంతి సుమండీ. రావణుడే వచ్చినాడని వ్యర్థముగా భయముతో తిరిగి వచ్చునో యని శంకించి సుగ్రీవా! మన మనుకొనినట్లాతడు విభీషణుడైనను సరియే, లేక నిజముగ రావణుడైనను సరియే సుమా. నేనాతని కభయమొసంగితినిగాన తిరిగిపోకు. తోడి తెమ్మని పంపిన వృత్తాంతమును మనమున నిడుకొని శ్రీ భాష్యకారులీ విశేషణమును చేర్చిరి.

సర్వస్వామిని —

ఆశ్రితులను రక్షించుట తనకే లాభమని ప్రవర్తించువాడు. సొత్తును కాపాడుకొనుట స్వామి ప్రయోజనమునకే గదా!

మద్యాజీ - ఇచ్చట భక్తి స్వరూపము నిరూపింపబడుచున్నది గాన వానికొరకైయే యేర్పడిన ఆగమ శాస్త్ర విశేషములచే తెలుపబడిన పూజావిశేషముల నీ యాగశబ్దము సూచించుచున్నది.

మాం నమస్కురు - ఇచ్చట నమస్కారమనగా - శాస్త్ర పరిభాషలో 'స్వావధికోత్కృష్టత్వ ప్రకార జ్ఞానజనక శిరోనమన

హస్తసంపుటీకరణాత్మకః వ్యాపారవిశేషః" అనగా, నీవు నాకన్న గొప్పవాడవను జ్ఞానము నమస్కరింపబడువానికి కలుగజేయుటకు తక్కువవాడు చేయునట్టి తలవంచి చేతులు జోడించుట యను పని - దీనిని చేయునపుడు నిరతిశయ భక్తితో రెండుకాళ్లు, రెండుచేతులు, మనస్సు, బుద్ధి అభిమానము తల యను యెనిమిది యంగములును వంగి నేల నంటవలెను. దీనినే శ్రీ భాష్యకారులు - "భక్తిభారావనమిత మనోబుద్ధ్యభిమాన పదద్వయ కరద్వయ శిరోభి రష్టాఙ్గై రచిన్తిత పాంసుకర్దమ శర్కరాదికే ధరాతలే దణ్డవత్ప్రణిపతన్తః" అని వ్రాయించిరి. ఆ వంగుటలో నేల నంటవలెను. ఆ వంగుటలో దుమ్ము ధూళి, రాయి, రప్ప, బురద యని చూడక చేతికఱ్ఱ జారిపడినట్లు యెదుట పడవలెను అని వ్రాయించిరి.

దీనినే అహిర్బుధ్న్య సంహితలో -

ప్రేక్షావతః ప్రవృత్తిర్యా। ప్రహ్వీభావాత్మికా పరా।

ఉత్కృష్టం పరముద్దిశ్య తన్నమః పరిగీయతే॥

అనగా - గొప్పవాని నుద్దేశించి బుద్ధిమంతుడైన చిన్నవాడు అణకువతో నితరాం వంగుటయను వ్యాపారము నమస్కార మన బడును" అని కలదు.

మత్పరాయణః. - "మయా వినా ఆత్మధారణ" మిత్యాది. ఇదియే భక్తియొక్క చివర అవస్థ. ఇదియే పరమ పురుషార్థప్రాప్తికి అత్యంత సన్నిహిత పూర్వావస్థ. ఈ శబ్దమట్టి ఫలాభిలాషను తెలుపు చున్నది.

తదేవం......

ఈ యధ్యాయమునకు ముఖ్యమైనట్టియు, సాంగోపాంగమగు నట్టియు ఫలము నవశ్యమిచ్చునట్టి భక్తిస్వరూపమును సంగ్రహముగ నిర్ధారణచేసి చెప్పి ముగించెను.

'తదేవం' అనుచో తచ్ఛబ్దమునకు ఆ కారణమువలన యని యర్థము. ఆ కారణమేది యనగా - "అర్జునా! నీవు దుఃఖబహుళ మగు సంసార సాగరమున పడియున్నావు గనుకను పరత్వ సౌలభ్య ములుగల నేను సకల దుఃఖసాగరములనుండియు నుద్ధరించగల నౌకా స్వామి నగుటవలనను ఉపాయ మత్యంత సుకరత్వాది గుణయుక్త మగుట వలనను" అనెడు నీ గంభీరార్థమును పరామర్శించుచున్నది.

ఉక్తలక్షణం —

గొప్పలాభమును ప్రసాదించు నమస్కారాదులలో ప్రవర్తింప జేయునేనే యన్నివిధముల ధారక పోషక భోగ్యమైనవాడ నను యవస్థవరకును తెచ్చు నిరతిశయ ప్రీతిరూపమైన దీ భగవదుపాసనము.

(31) చివర —

గీతాసంగ్రహము —

శ్లో॥ స్వమాహాత్మ్యం మనుష్యత్వే।
పరత్వంచ మహాత్మనామ్।
విశేషో నవమే యోగో।
భక్తిరూపః ప్రకీర్తితః॥

తాత్పర్యము —

ఈ తొమ్మిదవ అధ్యాయమున భగవానుడు తన మాహాత్మ్య మును తాను మనుష్యశరీరముతో నవతరించినను తన పరత్వమున కేమాత్రమును, భంగములేకుండుటయును, తన భక్తులగు పురుష శ్రేష్ఠులయొక్క వైభవ విశేషమును, భక్తియోగస్వరూప నిష్కర్ష యును చెప్పబడినవి.

# శ్రీ భగవద్గీతా - దశమోధ్యాయః

## విభూతియోగః — అవతారిక.

పూర్వాధ్యాయములందు భక్తియోగమును దాని పరికరములును చెప్పఁబడెను. ఇప్పుడా భక్తి పుట్టుటకొఱకును పుట్టిన భక్తి వృద్ధి నొందుటకొఱకును, భగవంతునియొక్క నిరంకుశైశ్వర్యాది కల్యాణ గుణములు అనంతములైనవనియు, జగత్తంతయు నతనికి శరీరమై యతఁడాత్మగాఁ గలిగియుండుటవలన అది శరీరి యగు నా భగవంతునియొక్క నియమమునకులోనై యతనివలననే నడపఁబడుచున్నదనియును, *సవిస్తరముగా చెప్పఁబడుచున్నది.

శ్రీ భగవానువాచ.

శ్లో॥ భూయ[1]ఏవ మహాబాహో[2] శృణు మే పరమం వచః।

యత్తే[3]ఽహం ప్రీయమాణాయవక్ష్యామి హితకామ్యయా॥

టీ. మహాబాహో=గొప్పభుజములుగల యర్జునా, అహం= నేను, ప్రీయమాణాయ=(నా మాహాత్మ్యమును విని) సంతసించుచున్న, తే=నీకొఱకు, హితకామ్యయా= (నాయందు భక్తిపుట్టి అభివృద్ధి బొందుట యనెడి) హితముఁజేయు నిచ్ఛచేత, భూయఏవ= సంగ్రహముగాఁ జెప్పఁబడిన మన్మాహాత్మ్యమును మరల ప్రపంచించి పరమం- ఉత్కృష్టమయిన, యత్ = ఏ, వచః = వాక్యమును,

---

* పూర్వము సపరికరమైన భక్తియోగముయొక్క స్వరూపమును ప్రపంచించుటకొఱకు భగవంతుని కల్యాణగుణాదులు సంగ్రహముగా చెప్పఁబడినవి. ఇప్పుడా గుణాదులే విస్తరించి చెప్పఁబడుచున్నవని భావము. ఇట్లు భగవంతుని కల్యాణగుణములు అనంతములనియు అతని కన్నియు లోనైనవనియు విస్తరించిచెప్పుటయెల్ల అతనియందు భక్తికలిగి వర్ధిల్లుటకొఱకని తెలియునది.

వక్ష్యామి=చెప్పఁగలనో, మే=నాయొక్క, (తత్ వచః=ఆవాక్యమును), శ్రుణు=ఎచ్చరికతో వినుము.

తా. అర్జునా, ఇంతవఱకుఁ జెప్పఁబడిన నా మహాత్మ్యమును విని అసూయ నొందక *సంతోషపడుచున్నాఁడవు గనుక ఇట్టినీకు నాయందు భక్తి కలిగి అది వృద్ధినొందుట యనెడి యొక హితమును జేయఁగోరినవాఁడనై పూర్వోక్తమైన మన్మాహాత్మ్యమునే మఱల ప్రపంచించి చెప్పనట్టి యొక మాటను జెప్పెదను. (ఇట్లు అతిముఖ్యమైనదగుటచే) దానిని హెచ్చరికతో వినుము.

5 6

శ్లో॥ న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః॥

టీ. మే=నాయొక్క, ప్రభవం = మాహాత్మ్యమును, సురగణాః=బ్రహ్మాది దేవసమూహములు, న విదుః=ఎఱుఁగరు, మహర్షయః=మహర్షులు, న (విదుః) = ఎఱుఁగరు, అహం = నేను, దేవానాం=దేవతలకును, మహర్షీణాంచ=మహర్షులకును, సర్వశః= అన్నివిధములను, ఆదిః హి = మూలభూతుఁడనుగదా (వారి పుణ్యమునకు తగినంత జ్ఞానాదులు యిచ్చువాఁడను).

తా. దేవతాసమూహములును మహర్షులును అతీంద్రియములైన విషయములం గూడ కనుఁగొనఁజాలినట్టి అధికతర జ్ఞానసంపద

* అర్జునుఁడు శ్రీయుతమాలుఁ డగుటవలననే చెప్పఁబోవు విషయమును వినుటకు యోగ్యుఁడయ్యెననియు, వచస్సు (మాట) మాహాత్మ్యప్రపంచమును గుఱించిన దగుటచేతనే పరమమైనదనియు, వినుచున్నవానినే మరల వినుమనుట వ్యర్థముగాన ఇచట 'శ్రుణు' 'వినుము' అనఁగా హెచ్చరికతో వినుము అనియు తెలియునది.

6
గలవారయినను అట్టివారుకూడ నా*ప్రభావమును (అనఁగా నా
యొక్క నామకర్మ స్వరూపస్వభావాదులను) ఎఱుఁగరు. ఏలనఁగా,
ఆ దేవతలకును మహర్షులకును నేను సర్వవిధములచేత (అనఁగా వారి
యొక్క స్వరూపమునకును జ్ఞానశక్త్యాదులకును) ఆది (మూల)
భూతుఁడను. అనఁగా వారియొక్క దేవత్వము దేవర్షిత్వము మొద
లైనవి కలుగుటకు హేతువగు పుణ్యమున కనుగుణముగా నేను వారి
కిచ్చిన జ్ఞానము పరిమితమైనది గనుక వారు (అపరిమేయములైన)
నాయొక్క స్వరూపాదులను యథావస్థితముగా నెఱుంగఁజాలరు.

అవ. కాఁబట్టి దేవాదులకును అచింత్యమైనట్టి తనయా
థాత్మ్యమును గుఱించిన జ్ఞానము, భక్తియొక్క యుత్పత్తికి ప్రతి
కూలములైన పాపములను తొలఁగించుట కుపాయ మగునను
చున్నారు.

9
శ్లో॥ యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥ 3

7
టీ. మర్త్యేషు=మనుష్యులలోపల, అసమ్మూఢః = నన్ను
ఇతరులతో నొక్కనిగాఁజేసి మోహపడనివాఁడైన, యః=ఎవఁడు,

* చెప్పఁబడు (తన ప్రభావమును గుఱించిన) జ్ఞానమునందు మఱింత యాదరము
గలుగుటకై అది అతిదుర్లభమని చెప్పుచున్నారు. ఇట ప్రభవమనఁగా అవతార రహ
స్యమును గుఱించినది గాదు. అది పూర్వమే ప్రపంచింపఁబడినది; కనుక ప్రభావమే
యగును. ప్రభావమేనామకర్మస్వరూపాదులని వేఱు వేఱ విచ్చి చెప్పఁబడెను. 'సర్వశః'
అను దానిభావమే 'వారి స్వరూప...శక్త్యాదులకును' అనఁబడెను. తాను వారి స్వరూ
పాదులకు ఆది యైనందున తన ప్రభావము వారికిఁ దెలియ నేరకుండుట యెట్లనఁగా 'వారి
యొక్క దేవత్వ.. ఎఱుంగఁజాలరు' అనఁబడెను.

* అజం = పుట్టుక లేనివాఁడును, అనాదించ = ఆదిలేనివాఁడును, *మాం = నన్ను, లోకమహేశ్వరమ్ = లోకేశ్వరులకును ఈశ్వరుఁడైన వానినిగా, సః = వాఁడు, సర్వపాపైః = మద్భక్తికి విరోధులగు సమస్త పాపములచేతను, ప్రముచ్యతే = మిక్కిలి విడువఁబడుచున్నాఁడు.

తా. లోకమునందు మనుష్యులకు రాజైనవాఁడు ఏదో యొక పుణ్యకర్మమువలన వారికి అధిపతి యైనను తుదకు ఆ మనుష్యులకు సజాతీయుఁడే యగునుగాని వేఱుకాఁడు. దేవతల కధిపతియు నట్లే

---

* 'అనాదిమ్' అనెడి యీ పదముచేత ఆది గల అజుఁడగు ముక్తాత్మునికంటెను విసజాతీయుఁడగుట చెప్పఁబడినది. ముక్తాత్మునియొక్క అజత్వము ఆది గలదనియు పరమాత్ముని అజత్వమునకు ఆది లేదనియు భావము. కనుక 'అనాదిమ్' అనఁగా స్వరూపమునందు అనాదియైనవాఁడని కాదు. ఈశ్వరుఁడును ముక్తుఁడును స్వరూపమునందు అనాదులైనవారే కనుక వారికి తారతమ్యము కలుగదు. కాఁబట్టి అజత్వమునందు అనాదియైయుండుటె యిచట గ్రాహ్యము-ఇట్టుండువాఁడు ఈశ్వరుఁడేకాని ముక్తుఁడు కాఁడు గనుక ముక్తునికంటె ఈశ్వరుఁడు విసజాతీయుఁడని యూహ్యము.

* హేయసంబంధమును వీడిన ముక్తుఁడు దాని కర్హుఁడెట్లగునన్నచో, దానిని వీడినంత మాత్రమున దాని కర్హుఁడు కాకపోఁడు - అది వీడకున్నప్పుడు దానికి లోను గాకుండిననే దానికర్హుఁ డనఁదగునుగాని అది వీడిన వెనుక దానికి లోనుగాకుండినంతనె దాని కనర్హుఁడనరాదు. కాఁబట్టి దాని కర్హుఁడే యనఁదగును. ఈశ్వరుఁడో దాని కెన్నఁడును అర్హుఁడు కాఁడు- ఏలన, వాని కది కలిగియుండెనేని దానికి తాను లోనై అజత్వములేకుండి పిదప ముక్తునివలె అజత్వము పొందువాఁ డగును. అనఁగా వాని అజత్వమునకు ఆది కలుగును. వాఁడు 'అనాదిమ్' అనుటచే అట్లు కాఁడు గనుక హేయసంబంధ ప్రత్యనీక స్వరూపుఁడై, కావుననే హేయసంబంధమునకు అనర్హుఁడై యున్నాఁడు. ఈ హేయరాహిత్యమును 'నిరవద్యమ్' (శ్వే-ఉప ౬ ౧౯) ఇత్యాది శ్రుతులుకూడ ప్రతిపాదించుచున్నవి.

నేను అనాదిగా జన్మవికారరహితుఁడనై, కావుననే హేయసంబంధ ప్రత్యనీకస్వరూపుఁడనై యున్నవాఁడను. కాఁబట్టి వికారిద్రవ్యమగు అచేతనము

యగును. అట్లే * భావనాత్రయములోనివాఁ డగుటవలనను, 'యో బ్రహ్మాణం విదధాతి' (శ్వే. ఉప. ౬-౧౮) అను శ్రుతివలనను, అండాధిపతి యగు బ్రహ్మయు నితరసంసారులకు సజాతీయుఁడే యగును. అణిమాద్యైశ్వర్యమును బొందిన సనకసనత్కుమారాదులు మఱికొందఱు

---

కంటెను, తత్సంసర్గమువలన సంసారి యై జన్మము లెత్తు బద్ధునికంటెను, పూర్వము హేయసంబంధము కలిగియుండినందున దాని కర్హుఁడనఁదగిన ముక్తునికంటెను విసజాతీయుఁడ నగుదును. మనుష్యులలోపల ఎవఁడు నన్ను ఇతరులకు సజాతీయునిఁగాఁ దలఁచి భ్రమింపఁడో అట్టివాఁడు నన్ను లోకేశ్వరులైన బ్రహ్మాదులకుఁగూడ ఈశ్వరునిఁగాను, కావున వారివలె నేనును ఇతరులకు సజాతీయుఁడను గానివానినిగాను ఎఱిఁగినవాఁడై, నాయెడల భక్తి కలుగుటకు ప్రతికూలము అయిన సకలపాపముల నుండి వీడినవాఁ డగుచున్నాఁ డని పిండితార్థము.

* కర్మభావన, బ్రహ్మభావన, ఉభయభావన అని భావనలు మూఁడు విధములు. కర్మానుష్ఠాననిష్ఠులయిన జనకాదులు మొదటిభావనకును, బ్రహ్మోపాసననిష్ఠులయిన సనకాదులు రెండవదానికిని, ఉభయనిష్ఠులయిన బ్రహ్మాదులు మూఁడవదానికి లోనైనవారు. ఇట్లు బ్రహ్మాదులెల్ల భావనాత్రయాంతర్గతులై యుందురు. భావనాత్రయమనఁగా—'త్రివిధా భావనా భూప విశ్వమేత న్నిబోధతామ్ । బ్రహ్మాఖ్యా కర్మసంజ్ఞాచ తథాచైవోభయాత్మికా॥౪౮॥ కర్మభావాత్మికాహ్యేకా బ్రహ్మభావాత్మికాపరా। ఉభయాత్మికా తథైవాన్యా త్రివిధా భావభావనా॥౪౯॥ సనన్దనాదయోయేతు బ్రహ్మభావనయాయుతాః। కర్మభావనయాచాన్యే దేవాద్యాః స్థావరాః పరాః॥౫౦॥ హిరణ్యగర్భాదిషుచ బ్రహ్మకర్మాత్మికా ద్విధా॥ (విష్ణు. పు. ౬-౭)- 'యథా హిరణ్యగర్భాదీన్...అశుద్ధా స్తే సమస్తా స్తు దేవాద్యాః కర్మయోనయః' 'ఆబ్రహ్మ స్తంబపర్యన్తా జగదన్తర్వ్యవస్థితాః। ప్రాణినః కర్మజనిత సంసార వశవర్తినః। యత స్తతో నతేధ్యానే ధ్యానినాముపకారకాః' అని బ్రహ్మాదులు భావనాత్రయాంతర్గతులనియు, పంచమవేదమయిన భారతమున 'బ్రహ్మాణంశితికంఠంచ యాశ్చాన్యా దేవతాఃస్మృతాః। ప్రతిబుద్ధా నసేవన్తే యస్మాత్పరిమితంఫలమ్' అని ప్రతిబుద్ధు లయినవారు బ్రహ్మాదులను పరిమితఫలప్రదు లగుటఁజేసి ఉపాసింప రనియు, 'ఏతౌద్వౌ విబుధశ్రేష్ఠ ప్రసాదక్రోధజౌస్మృతౌ। తదాదర్శితపన్థానౌ సృష్టిసంహారకారకౌ' అని బ్రహ్మాదులు భగవదధీనులై యుండుటయుఁ జెప్పఁబడియున్నది. కావున వీరియైశ్వర్యమెల్ల కాలభోగపరిమితమైనది. ఈశ్వరుని యైశ్వర్యమే అట్టిపరిమితి లేనిది. ఐశ్వర్య మనఁగా సమస్తమును నియమించుశక్తి.

8

నట్టివారే. ఇతఁ డన్ననో *లోకమహేశ్వరుఁడు - అనఁగా నిఖిల హేయ ప్రత్యనీ కానవధి కాతిశ యాసంఖ్యేయ కల్యాణైక తానుఁ డును, నియమనైక స్వభావుఁడును అగుటవలన తనకు నియామ్య ములై యుండు కార్యకారణావస్థములైన సకలాచేతనములకంటెను బద్ధులును ముక్తులు ననెడి సకలచేతనులకంటెను విసజాతీయుఁ డగును. ఇట్లని సమ్మోహము లేని మనుజుఁ డెవఁ డెఱుఁగునో వాఁడు సర్వపాపములను వీడుచున్నాఁడు.

అవ. ఇట్లు తన స్వభావమును అనుసంధించుటచేత భక్తి యొక్క యుత్పత్తికి విరోధులగు పాపములెల్ల నిరసింపఁబడుననియు, అట్టి పాపముల నిరసించుటవలననే అర్థసిద్ధముగా భక్తి యుత్పన్న మగుననియు ప్రతిపాదించి యిప్పుడు తన యైశ్వర్యముయొక్కయు తన కల్యాణగుణగణములయొక్కయు ప్రపంచమును (విస్తారమును) అనుసంధించుటచే భక్తి వర్ధిల్లు ప్రకారమును జెప్పుచున్నారు.

9 10

శ్లో॥ బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః ।

11

సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవచ ।

12 13 14

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః ।

భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ 5

---

* లోక మహత్ ఈశ్వరుఁడు లోకశబ్దము లోకమునంగల సకలమును గ్రహిం చుచున్నదిగాన దానికి 'కార్యకార...చేతనులు' అని యభిప్రాయము. 'మహత్' శబ్ద మునకు 'నిఖిల...తానుఁడు' అనుట అభిప్రాయము, ఈశ్వర శబ్దమునకు 'నియమనైక స్వభావుఁడు' అని యభిప్రాయము తెలుంగునది.

టీ. బుద్ధిః=మనస్సుయొక్క నిరూపణశక్తియు, జ్ఞానం=చిద చిద్వస్తు విశేషములను గుఱించిన నిశ్చయమును, అసమ్మోహః= విజాతీయములగు వస్తువులందు సజాతీయము లనెడిబుద్ధి నివర్తించు టయు, క్షమా=ఓర్పు, సత్యం=చూచినది చూచినట్లుగాను ప్రాణు లకు హితరూపముగాను పలుకుట, దమః = బాహ్యేంద్రియములను అనర్థవిషయములనుండి నివారించుటయును, శమః=అంతఃకరణమగు మనస్సును అట్లే నివారించుటయును, సుఖం=తనకనుకూలమగు అను భవమును, దుఃఖం=తనకు ప్రతికూలమగు అనుభవమును, భవః= అనుకూలానుభవమువలనఁ గలిగెడి మానసోల్లాసమును, అభావః= ప్రతికూలానుభవమువలనఁ గలిగెడి మనస్సంకోచమును, భయంచ= రాఁబోవుదుఃఖమునకు హేతువులైనవానిని చూడఁగా ముందుకలుగు నట్టి దుఃఖమును, అభయం = అట్టిదుఃఖముయొక్క నివృత్తియు, అహింసా=పరులదుఃఖమునకు కారణము కాకుండుటయు, సమతా= సమబుద్ధి కలిగియుండుటయు, తుష్టిః=సర్వాత్మలందును సంతోషించు స్వభావము గలిగియుండుటయు, తపః=శాస్త్రానుసారముగా భోగము లను తగ్గించుటవలనఁ గలుగు కాయక్లేశమును, దానం = తనకు భోగ్యములైన వస్తువులను అన్యుల కిచ్చుట, యశః=గుణవంతుఁ డను ఖ్యాతియు, అయశః=గుణహీనుఁ డను ప్రసిద్ధియు (మొదలైనవి), భూతానాం=దేవమనుష్యాది ప్రాణులయొక్క, పృథగ్విధాః=నానా విధములైన, భావాః=ప్రవృత్తినివృత్తులకు హేతువులైనట్టి మనో వ్యాపారములు, మత్తఏవ = నా సంకల్పమువలననే, భవన్తి = కలుగుచున్నవి.

తా. *బుద్ధియు, జ్ఞానమును, సమ్మోహము లేకుండుటయు, ఓర్పును, భూతహితముగా యథార్థమాడవలయునను మనస్సును,

* మనస్సుయొక్క నిరూపణశక్తిరూపమైనబుద్ధివలన చిదచిద్వస్తువిశేషనిశ్చయ

బాహ్యేంద్రియ నిగ్రహమును, మనోనిగ్రహమును, అనుకూలాను భవమును, ప్రతికూలానుభవమును, సుఖానుభవమువలన మనస్సునకుఁ గలుగు ఉల్లాసమును, దుఃఖానుభవమువలన మనస్సునకుఁగలుగు దీనత్వమును, భయమును, భయరాహిత్యమును, అహింసయు, శత్రుమిత్రాదులయందు సమత్వంబును, అందఱయెడ సంతోషస్వభావమును, శాస్త్ర ప్రకారమున భోగములను తగ్గించుటవలన కాయక్లేశము నొందుటయు, తనకు భోగ్యములైన వానిని అన్యులకిచ్చుట గుణవంతుఁడను పేరొందుట గుణహీనుఁడను పేరొందుట యనెడు వీనికిఁ దగిన మనోవ్యాపారములును, ఇది మొదలగు నానావిధములైన ప్రవృత్తి నివృత్తులకు హేతువులగు మనోవ్యాపారములు మత్సంకల్పాయత్తములై ప్రాణులకుఁ గలుగుచుండును.

అవ. సమస్త భూతములయొక్క సృష్టిస్థితులను ప్రవర్తింపఁ జేయువా రని ప్రసిద్ధి గలవారుగూడ తన సంకల్పమునకులోనై ప్రవర్తించునట్టివా రని చెప్పుచున్నారు.

శ్లో॥ మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥

---

రూపమైన జ్ఞానము కలుగుననియు," ఇట్టి జ్ఞానమువలన విజాతీయములందు సజాతీయ బుద్ధిరూపమైన సమ్మోహము నివర్తించు ననియు తెలియునది. మఱియును చూచినది చూచునట్లుగానే చెప్పినను అది భూతహితము కాకపోవచ్చును గనుక భూతహితముగాఁగూడ చెప్పునట్టిదే సత్యమనఁబడెను. సుఖదుఃఖము లనఁగా అనుకూలత్వ ప్రతికూలత్వ మాత్రములేయైనను ఇది మనోవృత్తి ప్రకరణము గనుక, వానికి అనుభవ శబ్దముకూడఁ జేర్పఁబడెను. శస్త్రచికిత్సాదులు హితరూపమైన దుఃఖములే యగును గాన హింసకానేరవు. కావుననే అహింసయనఁగా హితరూపమైన దుఃఖమును గలిగింపమికాదు; అహితరూపమైన దుఃఖమును కలిగింపకుండుటయే యని చెప్పఁబడెను. సమత్వము ఇందు చెప్పఁబడినట్లె పరాశరులచేతను 'సమమతి రాత్మసుహృద్విపక్షపక్షః' అని చెప్పఁబడియున్నది. వ్యాధులు మొదలైనవి కలిగినపుడు శాస్త్రీయమైన భోగసంకోచము తనంతటనే కలుగుచున్నది కాన అది క్లేశము కలిగింపదు. ఇట్టి భోగసంకో

టీ. పూర్వే=కడచిన మన్వంతరమందు, యేషాం=ఏమహర్షులయొక్క, లోకే = సంతానమయమైన లోకమునందు, ఇమాః ప్రజాః=ఈ (సమస్త) ప్రజలును, జాతాః=పుట్టినవారో, మానసాః= బ్రహ్మయొక్క మనస్సునఁబుట్టినవారైన, (తే=ఆ,) సప్తమహర్షయః =భృగువు మొదలైన మహర్షులేడుగురును, తథా=అట్లే, మానసాః =మనస్సువలనఁబుట్టింపఁ బడినవారైన, చత్వారః మనవః=సావర్ణికులను పేరుగల నలుగురుమనువులును, మద్భావాః=నా సంకల్పమును అనువర్తించువారు.

తా. కడచిన మన్వంతరమున నిత్యసృష్టి ప్రవర్తనకొఱకు భృగువు మొదలైన సప్తర్షులు బ్రహ్మ మనస్సువలననుండి పుట్టిన వారైరి. అట్లే ఆ మన్వంతరమునందు నిత్యస్థితి ప్రవర్తనముకొఱకు సావర్ణికులు (బ్రహ్మసావర్ణికుఁడు రుద్రసావర్ణికుఁడు ధర్మసావర్ణికుఁడు దక్షసావర్ణికుఁడు) అను *నలుగురు మనువులు (దక్షునికూఁతురైన

---

చము తపము కాదని తెలుపుటకై కాయక్లేశమును గలిగించు భోగసంకోచము చెప్పఁ బడినది. సమస్త కరణములయొక్క ప్రవృత్తియు తనకు స్వాధీనమైయుండఁగా మనోవృత్తులు తనకు స్వాధీనమని చెప్ప నేల యనఁగా, ఈప్రకరణమునందలి భక్తిరూపమైన మనోవృత్తికూడ తన సంకల్పమూలముననే కలుగునని తెలుపుటకొఱకని తెలియునది. ప్రవృత్తులకు హేతువులగు మనోవృత్తులే తనకు లోనై యుండఁగా ఇఁక ప్రవృత్తి నివృత్తులు తనకు లోనైయుండుట చెప్పనేల యని భావము.

*ఒక్కొక మన్వంతరమందు ఒక్కొకమనువే యుండుచుండగాన కడచిన మన్వంతరమొక్క దానియందు నలుగురు మనువులెట్లు? అన్నచో, ఆ మన్వంతరమున ప్రియయను దానియందు బ్రహ్మసావర్ణుడు మొదలైన నలువురిచేత మనసా పుట్టింపఁబడిన బ్రహ్మసావర్ణికుఁడు మొదలైన నలువురు మనువులనే కాని, వేఱువేఱు మన్వంతరములందుండు వేఱువేఱు మనువులు నలువురిని పూర్వమన్వంతరమునందుండినట్లు చెప్ప లేదని గ్రాహ్యము. ఆ మహర్షులును మనువులును స్వసంకల్పముచేత సృష్టిస్థితులను

క్రియయందు బ్రహ్మసావర్ణాదులు నలుగురిచే మనస్సువలనఁ బుట్టింపఁబడినివా రైయుండిరి. ప్రజలందఱు వీరల సంతానమయ్యైన లోక మందు - (వీరిపుత్రపౌత్రాదులనుండి) పుట్టినవారు. ఇట్లు ప్రళయము కలుగువఱకు ప్రతిక్షణమును సంతానమును కలిగించుచు పోషించుచు నుండు భృగ్వాది మహర్షులును మనువులును నాకుఁ గల భావమే కల వారు - నా మతమం దున్నవారు - అనఁగా నా సంకల్పమునకు లోనై ప్రవర్తించువా రని యర్థము.

శ్లో॥ ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికంప్యేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥ 7

టీ. యః=ఎవ్వఁడు, మమ=నాయొక్క, ఏతాం=ఈ, విభూతిం=ఐశ్వర్యమును - అనఁగా నా సర్వనియమన శక్తిని, యోగంచ= కల్యాణగుణరూప మయిన యోగమును, తత్త్వతః=యథార్థముగా, వేత్తి=ఎఱుఁగుచున్నాఁడో, సః = వాఁడు, అవికంప్యేన = నిశ్చల మయిన, యోగేన=భక్తియోగముతో, యుజ్యతే=కూడినవాఁ డగు చున్నాఁడు, అత్ర=ఈ విషయమునందు, సంశయః = సందేహము, న=లేదు.

తా. సర్వమును మదాయత్తము లైనయుత్పత్తి స్థితిప్రవృత్తులు కలిగియుండును. ఇదియే నా యైశ్వర్యము. నేను హేయప్రత్యనీకమైన కల్యాణగుణములతోఁ గూడియుందును. ఇదియ నా యోగము. ఇట్టి నా యైశ్వర్యమును యోగమును ఎవ్వఁడు *కలరూపున నెఱుంగునో వాఁడు నిశ్చలమైనభక్తియోగముతోఁ గూడినవాఁ డగును.

---

జేయు మహాత్ములై యుండుటచే వారు స్వతంత్రులేయని తలంపరాదు. వారును నా సంకల్పమునకు లోనై సృష్టిస్థితులను జేయువారేకాని వేఱుగాదు. కనుక వారి సంకల్పమువలనఁబుట్టినవారుకూడ నా సంకల్పమువలననే పుట్టినవా రని భావము.

* ఈశ్వరుని విభూతియోగముల (తత్త్వతః' కలరూపున) ఎఱుఁగుట యనఁగా ఈశ్వరునియందు అనీశ్వరస్వభావము లైన పారతంత్ర్యము దుఃఖము అజ్ఞానము

ఇందులకు సందేహము లేదు. అనఁగా, నా విభూతిని గుఱించినట్టియు కల్యాణగుణ (యోగ) మును గుఱించినట్టియు జ్ఞానము, భక్తియోగమును (చలింపనీక) పయిపయి వర్ధిల్లఁజేయును; అని (నేను చెప్పనక్కఱ లేదు. వాఁడు) తానే కనుఁగొనఁగలఁ డని యభిప్రాయము.

అవ. విభూతిగుణములయొక్క జ్ఞానపరిపాకమే భక్తియగును. అట్టి *భక్తియొక్క వృద్ధిని తెలుపుచున్నారు.

శ్లో॥ ♦అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః॥ 8

టీ. అహం = నేను, సర్వస్య = సర్వచేతనాచేతనప్రపంచమునకు, ప్రభవః = ఉత్పత్తికారణమయినవాఁడను, మత్తః — నావలన, సర్వం = సమస్తమును, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది, ఇతి = ఇట్లని, మత్వా = తలఁచి, బుధాః = జ్ఞానులు, భావసమన్వితాః = నాయందు స్పృహ యను మనోభావముతోఁ గూడినవారలై, మాం = (సర్వ కల్యాణగుణములతోఁగూడిన) నన్ను, భజన్తే = భజించుచున్నారు.

---

మొదలైనవానిని ఆరోపించుటనుగాని, అనీశ్వరునియందు ఈశ్వరునికిఁ గల స్వాతంత్ర్యము స్వతస్సిద్ధత్వము మొదలైనవానిని ఆరోపించుటనుగాని పరిత్యజించి యెఱుఁగుట యని తెలియునది.

* విభూతిజ్ఞానము పరిపక్వమగుకొలఁదిని భక్తి వృద్ధినొందుచున్నది. కనుక విభూతిజ్ఞానముయొక్క పరిపాకమే భక్తియొక్క వృద్ధియగును. అనఁగా ఆ జ్ఞానమే భక్తిరూపముగా పరిణమించి పెరుఁగుచున్నది.

♦ 'అహం...ప్రవర్తతే' అనుటయే విభూతి - అనఁగా ఐశ్వర్యము. 'మత్వా బుధాః' అనుటవలన అట్టి విభూతిని గుఱించిన జ్ఞానపరిపాకము చెప్పఁబడినది. 'భావసమన్వితాః భజన్తే' అనుటవలన భక్తియొక్క వృద్ధిచెప్పఁబడినది. కనుక విభూతిజ్ఞానపరిపాకమే భక్తివర్ధకముగా పరిణమించునని యూహ్యము.

తా. నేను సకలమైన (విచిత్రచిదచిన్మయమైన) ప్రపంచమున కు నుత్పత్తికారణము; నావలననే సమస్తమును బ్రవర్తించుచున్నయది, అని నాయొక్క స్వాభావికమైన యీ నిరంకుశైశ్వర్యమును సౌశీల్య సౌందర్య వాత్సల్యాది కల్యాణ గుణగణయోగమును తెలిసికొని జ్ఞానులగువారు నాయందు భావము గలవారై నన్ను సర్వకల్యాణ గుణాన్వితునిఁగా భజియింతురు. *భావమనఁగా మనోవృత్తి విశేషము — నాయందు స్పృహ గలిగి నన్ను భజింతు రని యర్థము.

అవ. (భావసమన్వితులై భజించుప్రకార) మెట్లు? (అని యడుగఁగాఁ జెప్పుచున్నారు).

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ॥ 9

టీ. మచ్చిత్తాః=నాయందుంపఁబడిన మనస్సు గలవారును, మద్గతప్రాణాః=నన్ను విడిచి నిలువనోపనివారు, *మాం = నన్ను,

---

* భావ మనఁగా మనోవృత్తి విశేషము. అది యిచట స్పృహ యని తెలియునది. ఈ స్పృహతో భజించుటే భక్తివృద్ధిసూచకమని గ్రాహ్యము. మఱియు నీ విభూతి జ్ఞానము భక్తిని గలిగించున దగుటచే భజనదశయందు కల్యాణగుణ విశిష్టమయిన స్వరూపమే అనుసంధింపఁదగినది. కనుక 'మాం' అనుటకు 'నన్ను సర్వకల్యాణ గుణాన్వితుని' అని యర్థము ఫలించినది. బ్రహ్మాదులయైశ్వర్యము స్వతస్సిద్ధమైనదికాదు. దానికి అవధియుఁగలదు. భగవంతునియైశ్వర్యము స్వతసిద్ధమయి నిరవధికమై యొప్పును గనుక స్వాభావికమైనదియు నిరంకుశ మయినదియు నని చెప్పఁబడెను. మఱియు సౌశీల్యవాత్సల్యాదులు భగవంతుని దివ్యాత్మస్వరూపముయొక్క గుణవర్గమునకును, సౌందర్యాదులు దివ్యమంగళవిగ్రహముయొక్క గుణవర్గమునకును ప్రదర్శకము లని గ్రాహ్యము.

* 'మాం బోధయన్తః కథయన్తశ్చ' అని ఒక్కరినే బోధించుటయు చెప్పుటయు పునరుక్తియగును గాన గుణములను బోధించుటయు కర్మములను చెప్పుటయునని విష

పరస్పరం = ఒకరి కొకరు, బోధయన్తః = తెలుపుచున్నవారును, కథయన్తశ్చ = ఒకరికొకరు వర్ణించి చెప్పుచున్నవారును (అయి), నిత్యం = ఎల్లప్పుడు, ♦తుష్యన్తిచ = సంతోషించుచున్నారు, రమన్తి చ = ఆనందించుచున్నారు.

తా. నాభక్తులు నాయందే మనస్సు లయించినవారును, నన్ను విడిచి నిలువఁజాలనివారున్నై, తమతమచే ననుభవింపఁబడిన నా గుణములను ఒండొరులకు బోధించుకొనుచు, దివ్యములును రమణీయములు నగు నాకర్మములను గీర్తించుచు, సంతోషించుచును రమించుచునుందురు. చెప్పువారు అనన్య ప్రయోజనమగుదానిని చెప్పుట చేతనే సంతోషింతురు - వినువారును అనవధికాతిశయ ప్రియంబగు దాని వినికిచేత రమించుచుందురు.

16

శ్లో॥ *తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తితే॥

యములు వేఱువేఱుగా చెప్పఁబడినవి. బోధనమనఁగా తెలియనిదానిని తెలుపుటగాను, కథన మనఁగా తెలిసినదానిని వర్ణించుటగాను గ్రహించి, తమతమవఱకు అనుభవించిన భగవద్గుణములను, అవి తెలియని అన్యులకు తెలుపుట, తెలిసినట్టి భగవదితివృత్తమును వర్ణించుట అని బోధన కథనశబ్దములకు భావము తెలియీనది.

♦ ఇచట 'తుష్యన్తిచ' 'రమన్తిచ' అను పదములయొక్క అర్థములకు భేదమంతగాలేదు గనుక రెంటిని ఒక్కరికే చెప్పుటవలన పసలేదు. కనుక మొదటిదానికి 'చెప్పువారు' కర్తలుగాను రెండదానికి 'వినువారు' కర్తలుగాను వేఱువేఱ చెప్పఁబడినది. ఇట్లు కర్తలు రెండు తెగలైనయెడల రెంటికిని 'మచ్చిత్తాః' ఇత్యాదివిశేషణములు నాలుగును చెల్లునా యనఁగా, చెప్పుటయు వినుటయు ఏకకాలమందే సంభవించును గాన చెప్పువారికిని వినువారికిని ఇరువురకును చెల్లునని తెలియునది.

*అవ. ఇంతవఱకు భగవద్గుణ విభూతిజ్ఞానము భక్తియొక్క యుత్పత్తికిని వివృద్ధికిని హేతువైనదని చెప్పఁబడెను. ఇప్పు డావివృద్ధమైన భక్తియే భగవత్ప్రాప్తికి

టీ. సతతయుక్తానాం=నాతో నెప్పుడును గూడియుండఁ గోరు చున్నవారును, భజతాం = నన్ను భజించుచున్నవారును (అగు) తేషాం = పూర్వోక్తజ్ఞానులకు, తం=ఆ - వారికోరికలోని దేదైనట్టి, బుద్ధియోగం=*దర్శన సమానాకారమైన యుపాసన విశేషమును, ప్రీతిపూర్వకం=ప్రేమతో, దదామి=ఇచ్చుచున్నాను, యేన = ఆ బుద్ధియోగముచేత, తే=వారు, మాం=నన్ను, ఉపయాన్తి=ప్రాపించుచున్నారు.

తా. నాతోడి నిత్యయోగమును ♦ గోరుచున్నవారై నన్ను భజించువారికి (ఆ జ్ఞానులకు), (వారు కోరిన) ఆ బుద్ధియోగమునే పరిపాకదశ నొందినదానిని నేను ప్రీతిపూర్వకముగా నిచ్చుచున్నాను. దానిచేత వారికి మత్ప్రాప్తి కలుగును.

అవ. మఱియును.

17 18 19

శ్లో॥ తేషా మే వానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥ 11

తేషాం=వారలకు, అనుకమ్పార్థమ్ ఏవ=అనుగ్రహము చేయుట కొఱకు, అహం=నేను, ఆత్మభావస్థః = వారి మనోవృత్తికి విషయుభూతుఁడనగుచు, భాస్వతా=ప్రకాశించుచున్న (నన్ను విశదముగా

పూర్వము కలుగఁబోవునట్టి విశదతమభగవత్సాక్షాత్కారరూపమైన అవస్థా విశేషము నకు హేతు వగుచున్నదని చెప్పుచున్నారు.

* ౭ అధ్యా-౧౪ శ్లోకమునడుగునఁ జూచునది.

♦ సతతయోగము ఇంకను కలుగలేదు గాన సతతయోగమును గోరుచుండుటయే యుచట గ్రాహ్యము. ఇచట బుద్ధియనఁగా ఎఱుఁగుట. బుద్ధియోగ మనఁగా భగవంతుని తెలియునట్టి యుపాసనము. అది పరిపక్వమైనదనఁగా విశదతమమై దర్శనసమా

అనుభవింపఁజేయునట్టి), జ్ఞానదీపేన = మద్విషయజ్ఞానమనెడి దీపము చేత, అజ్ఞానజం = ప్రాచీనకర్మమనెడి యజ్ఞానమువలనఁగలిగిన, తమః =(మద్వ్యతిరిక్తవిషయాసక్తి యనెడి) చీఁకటిని, నాశయామి = నశింపఁజేయుచున్నాను.

తా. వారిని అనుగ్రహించుటకొఱకే నేను, వారి మనోవృత్తికి విషయభూతుఁడనై యుండువాఁడను గనుక, వారికి నా కల్యాణ గుణ గణములను వెలిపుచ్చుచు మద్విషయమైన *జ్ఞానమనెడి ప్రకాశించుచున్న దీపముచేత, జ్ఞానవిరోధియు ప్రాచీనకర్మరూపమైన అజ్ఞానమువలనఁ బుట్టినదియు నాకు వ్యతిరిక్తములై పూర్వమునుండి అలవడియున్న విషయమందలి *ప్రావణ్యమైనదియు నగుచీఁకటిని నాశము సేయుచున్నాను.

---

నాకారముగా పరిణమించినదనుట. విశదతమ సాక్షాత్కారరూపమైన యీయుపాసన పరిపాకము భగవత్ప్రాప్తికి పూర్వము కలుగునట్టిది. ఇది కలిగిన పిదప భగవత్ప్రాప్తి సిద్ధించునని తెలియునది.

*ఇట్టి జ్ఞానప్రకాశమువలన వారికి విశదతమమైన మత్సాక్షాత్కారము కలుగఁగా దానిచేత నేను, దీపముచేత చీఁకటిని నశింపఁజేయునట్లు, జ్ఞానవిరోధియగు వారి పూర్వ కర్మములను, ఆ కర్మమువలన వారికి మద్వ్యతిరిక్తములైన శబ్దాదివిషయములందు పూర్వమునుండి అలవడియున్న ప్రావణ్యమును, నశింపజేయుచున్నాను. జ్ఞానప్రకాశమువలన విశదతమముగా భగవత్సాక్షాత్కారమనుభవించుటయు, దానివలన పూర్వ కర్మజనితవిషయప్రావణ్యము నివర్తించుటయు తెలియునది. జ్ఞానదీపమునకు 'భాస్వతా' అను విశేషణమువలన అది దర్శనసమానాకారమైన భగవదనుభవమును తెలుపుచున్నది. మఱియు స్వకల్యాణములను వెలిపుచ్చుటవలన శబ్దాది ప్రాకృత గుణనివృత్తి కలుగుచున్నది. జ్ఞానమునకు విరోధియైనది అజ్ఞానము. పూర్వదుష్కర్మములు జ్ఞానవిరోధులగుటచే, అజ్ఞానమనఁగా జ్ఞానవిరోధులగు పూర్వకర్మములే యని యిచట గ్రాహ్యము.

* భగవత్సాక్షాత్కారమును తెలియనీయక కప్పిపుచ్చునదగుటచే శబ్దాదివిషయ ప్రావణ్యము చీఁకటిగాను, దానిని పోఁగొట్టి భగవత్సాక్షాత్కారమును ప్రకాశింపఁ

20. అవ. ఇట్లు తక్కిన సమస్తములైన వానికిని విసజాతీయమైన వియు, భగవంతునికి మాత్రమే కలిగియుండునవియు. వినువారికి నిరతిశయానంద ప్రదమైనవియు నగు కల్యాణగుణయోగమును ఐశ్వర్య వితతియును విని దాని విస్తారమును వినఁగోరినవాఁడై అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.

అర్జున ఉవాచ.

శ్లో॥ పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్॥ 12

ఆహు స్త్వా మృషయ స్స ర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే॥ 13

టీ. పరంబ్రహ్మ=పరబ్రహ్మమనియు, పరంధామ=సమస్త జ్యోతులను ప్రకాశింప జేయువాఁడనియు, పరమం = ఉత్కృష్టతమమైన, పవిత్రం=స్మరించువారి సమస్త పాపములను నశింపఁజేయువాఁడనియు, (యం శ్రుతయః వదన్తిసః హి =ఎవరిని శ్రుతులు చెప్పుచున్నవో వాఁడుగదా), భవాన్ = నీవు, సర్వేఋషయః = సమస్త ఋషులును, దేవర్షిః= దేవర్షియగు, నారదః=నారదుఁడును, అసితః దేవలః=అసితుఁడనెడి దేవలమహర్షియును, వ్యాసః = వ్యాసుఁడును, త్వాం=నిన్ను, శాశ్వతం=నిత్యుఁడనియు, దివ్యం = పరమాకాశ నిలయుఁడనియు, పురుషం=పరాత్పరుఁడనియును, ఆదిదేవం = జగ

---

జేయునదగుటచే జ్ఞానము దీపముగాను, రూపింపఁబడినవి. విషయప్రావణ్యనివృత్తి వలన భజనము కలుగును గాన అట్లు కలిగిన భజనమువలన మరల విషయప్రావణ్య నివృత్తి యెట్లు? అని అన్యోన్యాశ్రయదోషము కలుగుచున్నది. అయినను భజనమునకు పూర్వము విషయప్రావణ్యము నివర్తించినను సంస్కారశేషమువలన అది సూక్ష్మముగా అనువర్తించుచుండును గనుక అట్టి సూక్ష్మప్రావణ్యమే యిపుడు భజనమువలన నివర్తించునదిగాఁ జెప్పఁబడెను గాన దోషము లేదని తెలియునది.

త్కారణభూతుఁ డనియు దేవుఁ డనియు, అజం=కర్మమువలన నైన జన్మము లేనివాఁ డనియును, విభుం=సర్వవ్యాపియనియు సర్వనియంతయనియు, ఆహుః=చెప్పుదురు, స్వయమేవచ=మఱియును నీవే, మే=నాకు, బ్రవీషి = చెప్పుచున్నావు.

తా. పరంబగు బ్రహ్మమనియు పరంబగు ధామ మనియు పరంబగు పవిత్ర మనియు ఎవనిని శ్రుతులు చెప్పుచున్నవో వాఁడు గదా నీవు [* 'యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి' (తై-భృగు-౧)[21] 'బ్రహ్మవిదాప్నోతిపరమ్' (తై-ఆన-౧)[22] 'సయోహ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవభవతి' (ముండక-3-౨-౯)[23A]] అని పరబ్రహ్మముగాను అట్లె పరంధామముగాను, [ధామ మనఁగా నిట జ్యోతిని జెప్పెడిని. పరంజ్యోతిః (అనుటకు) * 'అథ యదతః పరో[23B]

* యతో వా ఇమాని...(దేనివలననుండియే యీ భూతములన్నియును బుట్టుచున్నవో, దేనిచేత ఆ పుట్టినవి బ్రతుకుచున్నవో, దేనిని అవి చొచ్చి లీన మగుచున్నవో దానిని, తెలియఁగోరుము. అది బ్రహ్మము.), 'బ్రహ్మవిదాప్నోతిపరమ్' (బ్రహ్మము నెఱిఁగినవాఁడు పరమును - అనఁగా బ్రహ్మమును - బ్రహ్మసాయుజ్యము ననుట-పొందును. 'స యోహ వై...' (ఎవఁడు ఆ పరబ్రహ్మము నెఱుఁగుచున్నాఁడో వాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడుగదా - బ్రహ్మసాయుజ్యమును పొందుచున్నాఁడుగదా యనుట. 'పరమంసామ్యముపైతి' మమసాధర్మ్యమాగతాః' ఇత్యాదిశ్రుతిస్మృతులవలన బ్రహ్మమే యగుచున్నాఁడనఁగా తత్సాధర్మ్యమును నొందుచున్నాఁడని యర్థము) ఈ మూఁడు శ్రుతులును పరబ్రహ్మమని చెప్పుచున్నవి. ఇందు మొదటిశ్రుతి ఉపాస్యమైన బ్రహ్మమునకు లక్షణవాక్యము- అనఁగా ఆ బ్రహ్మము ఇట్టిదని నిర్వచించువాక్యము. ఈశ్రుతి వలన బ్రహ్మశబ్దమును, రెండవశ్రుతివలన 'పర' శబ్దవిశేషణమును, మూఁడవ శ్రుతి వలన రెండు శబ్దములును సిద్ధించిన వని తెలియునది.

* ధామమనఁగా ఇచట జ్యోతి యని యర్థము. 'పరంధామ' యనఁగా పరంజ్యోతి- 1. 'అథ యదతః పరో దివో జ్యోతి ర్దీప్యతే' (ఇప్పుడు- ఎందు-దీనికంతయును

దివో జ్యోతిర్దీప్యతే' (ఛాం-3-13-7) 'పరంజ్యోతి రుపసంపద్య[24] స్వేనరూపే ణాభినిష్పద్యతే' (ఛాం-8-12-3) 'తం దేవా జ్యోతిషాం[25] జ్యోతిః] అట్లే పరంబగు పవిత్రముగాను - పరమంబగు పావనము గాను - అనఁగా స్మరించినవారికి సమస్త కల్మషములతోడి శ్లేష మును (సంబంధమును) లేకుండఁజేయునదియు నాశము సేయునదియును గాను [♦ 'యథాపుష్కరపలాశ ఆపోనశ్లిష్యన్త ఏవ మేవం విది[26] పాపం కర్మ నశ్లిష్యతే (ఛాం-ఉప-4-14-3) 'తద్యథేషీకతూల[27] మగ్నౌప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వేపాప్మనః ప్రదూ యన్తే (ఛా-ఉప-5-24-3)' *'నారాయణపరం బ్రహ్మతత్త్వం నారా[28] యణః పరః । నారాయణ పరోజ్యోతి రాత్మానారాయణఃపరః' (తై- నారా-11 3)] శ్రుతులు చెప్పుచున్నవిగదా, పరావరయాథాత్మ్య

మీఁదుగా పరమైన దివ్యజ్యోతి వెలుఁగుచున్నదో) 2. 'పరంజ్యోతి రుపసమ్పద్య స్వేనరూపే ణాభినిష్పద్యతే' (పరంజ్యోతినిపొంది తన స్వరూపముతో నిష్పన్నుఁడగు చున్నాఁడు.) 3. 'తం దేవా జ్యోతిషాం జ్యోతిః' (జ్యోతులకు జ్యోతియైనవానిని దేవతలు) ఈ మూఁడు శ్రుతులును పరంజ్యోతి యని చెప్పుచున్నవి.

♦ పావనమనఁగా పరిశుద్ధముచేయఁజాలునట్టిది - పాపసంబంధమును పోఁగొట్టునదనుట. పరమమైన పావనమనఁగా సమస్తములైన పాపముల సంబంధమును పోఁగొట్టున దని యర్థము. 1. 'యథాపుష్కర...(ఎట్లు జలములు తామరాకును తడుపవో అట్లే పాప కర్మము ఇట్లు ఎఱిఁగినవానిని సంబంధింపదు.) 2. 'తద్యథేషీక...న్తే' (అగ్నియందు వేయఁబడిన ముండ్లదుబ్బు దూది యెట్లు దహింపఁబడునో అట్లే వీనిపాపములెల్ల నశిం చుచున్నవి.) ఈరెండుశ్రుతులును సమస్త కల్మషశ్లేషనాశకరమని- అనఁగా పరమ పావనమని చెప్పుచున్నవి.

* 'నారాయణ పరంబ్రహ్మ...నారాయణః పరః' అను శ్రుతియు పర బ్రహ్మమని బాగాఁ జెప్పుచున్నది.

విదులు (ఋషులు) అందఱును నిన్నే శాశ్వతునిఁగాను దివ్యునిఁగాను
పురుషునిఁగాను ఆదిదేవునిఁగాను అజునిఁగాను విభునిగాను జెప్పుదురు.
అట్లె దేవర్షియగు నారదుఁడును అసితుఁడగు దేవలుఁడును వ్యాసుఁ
29
డును చెప్పెదరు. ఎట్లన - 'యేచ వేదవిదో విప్రా యేచాధ్యాత్మ
విదో జనాః । తే వదన్తి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనమ్ ।
పవిత్రాణాం హి గోవిన్దః పవిత్రం పర ముచ్యతే । పుణ్యానామపి
పుణ్యోఽసౌ మఙ్గళానాంచ మఙ్గళమ్ । త్రైలోక్యం పుణ్డరీకాక్షో దేవ
దేవ స్సనాతనః । ఆస్తే హరి రచిన్త్యాత్మా తత్రైవ మధుసూదనః॥
30
(మహాభారతము- ఆరణ్య-౭౯-౨౯-౨౭-౨౮) 'ఏషనారాయణ శ్శ్రీ
మాన్ క్షీరార్ణవనికేతనః । నాగపర్యఙ్క ముత్సృజ్యహ్యాగతో
మధురాం పురీమ్ పుణ్యాద్వారవతీ తత్ర యత్రాస్తే మధుసూదనః ।
సాక్షాద్దేవః పురాణోఽసౌ సహిధర్మ స్సనాతనః' (భారత-ఆరణ్య-
31
౪౯, ౨౪-౨౫) అనియు అట్లె - యత్ర నారాయణో దేవః పర
మాత్మా సనాతనః । తత్ర కృత్స్నం జగత్పార్థ తీర్థా న్యాయతనా
నిచ । తత్పుణ్యం తత్పరం బ్రహ్మ తత్తీర్థం తత్తపోవనమ్ । తత్ర
దేవర్షయ స్సిద్ధా స్సర్వేచైవ తపోధనాః । ఆదిదేవో మహాయోగీ
యత్రాస్తే మధుసూదనః । పుణ్యానామపి తత్పుణ్యం మాభూత్తే సం
శయోఽత్రవై । కృష్ణయేవ హి లోకానా ముత్పత్తి రపి చాప్యయః।
కృష్ణస్య హికృతే భూత మిదం విశ్వంచరాచరమ్) భార-సభా-౪౯-
౨౩) అనియుఁ జెప్పెదరు. 'భూమి రాపోఽనలో వాయుః ఖంమనో
బుద్ధిరేవచ । అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా'
(గీత - ౭ - ౪) అనుట మొదలుకొని 'అహం సర్వస్య ప్రభవో

మత్తస్సర్వం ప్రవర్తతే' అనువలను కృష్ణుఁడు తానే యిట్లు చెప్పు కొనియున్నాఁడు. *

శ్లో॥ సర్వ మేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ।

32

న హి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః॥ 14

టీ. హే కేశవ = బ్రహ్మరుద్రులకును కారణభూతుఁడైనవాఁడా-కృష్ణా, మాం = శరణాగతుఁడనైన నన్నుఁగూర్చి, యత్ = ఏ నీ మహిమను, వదసి = చెప్పుచున్నావో, ఏతత్ సర్వం = దీనినంతయును, ఋతం = సత్యముగా, మన్యే = తలంచుచున్నాను, హేభగవన్ = జ్ఞాన శక్తిబలైశ్వర్యవీర్యతేజస్సులకు నిధియైనవాఁడా, తే = నీయొక్క, వ్యక్తిం = నిన్ను తెలుపునట్టి విధమును, దేవాః = సాత్త్విక ప్రకృతి గల బ్రహ్మాదిదేవతలును, దానవాః = తామస ప్రకృతిగల దానవులును, నవిదుః హి = ఎఱుఁగరుగదా.

తా. కేశవా, నీవు నాకు *అనన్యసాధారణమై అనవధికాతిశయమై స్వాభావికమైయుండు నీ యైశ్వర్యమును, నీయనంత కల్యాణ గుణయోగమును జెప్పెదవు. ఇట్లు నీవు చెప్పు దీనినెల్ల ఈ కారణమునుబట్టి (అనఁగా శ్రుత్యాద్యుల చేతను జెప్పబడుటంబట్టి) ఉన్నది

* నీవు పరబ్రహ్మమనియు, పరంజ్యోతియనియు, పరమపావనుఁడనియు శ్రుతులు చెప్పుచున్నవి. పరావరతత్త్వవేత్తలగు సమస్తఋషులును, దేవర్షియగు నారదుఁడును, అసితుఁడను పేరిగల దేవలమహర్షియును, వ్యాసుఁడును, కృష్ణుఁడై యవతరించిన నీవే నిత్యుఁడనియు, అప్రాకృతుడనియు జగత్కారణభూతుఁడనియు, జగద్వ్యాపార రూపక్రీడ గలవాఁడనియు, కర్మమువలనఁ గలుగుజన్మము లేనివాఁడనియు - అనఁగా నిర్వికారుఁడనియు, సర్వవ్యాపి యనియు, సర్వనియంత యనియు, పరాత్పరుఁడనియును జెప్పుదురు. నీవును నాతో నట్లే పలుకుచున్నావు' అని పిండితార్థము.

* అనన్య సాధారణమనుటచే సమానములేనిదనియు, అనవధికాతిశయమనుటచే

న్నట్టుగా సత్యమును జెప్పుటగానే తలంచుచున్నాను గాని నిన్ను పొగడుకొనుట మొదలైన యభిప్రాయము గలదిగాదు. కనుక, నిరతిశయజ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజోనిధీ, ఇటువంటి నిన్నుం దెలియఁజేయునట్టి విధమును దేవదానవులు సైతము పరిమితజ్ఞానులగుటంజేసి యెఱుఁగరు.

33 34 35
శ్లో॥ స్వయమే వాత్మానాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
36 37 38 39
* భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే॥ 15

టీ. హేపురుషోత్తమ = పురుషశ్రేష్ఠుడా, హేభూతభావన = సకలభూతములను కలుగఁజేయువాఁడా, హేభూతేశ=సమస్త భూతములకు నియామకుఁ డగువాఁడా, దేవ దేవ = దైవతములకును పరమదైవత మగువాఁడా, జగత్పతే=జగత్తులకు స్వామియైనవాఁడా, త్వం =నీవు, స్వయమేవ=తనంతనే, ఆత్మానం=నిన్ను, ఆత్మనా=స్వాభావికమైన జ్ఞానముచేతనే, వేత్థ=తెలిసికొనుచున్నావు.

తా. పురుషోత్తమా, సమస్తభూతములను సృజించువాఁడా, సమస్త భూతములకు నియామకుఁడా, దైవతములకును పరమదైవత మగు

---

అతిశయించినది లేదనియు, స్వాభావికమనుటచే ఒకరివలనఁ గలిగినది కానిదనియు తెలియుచున్నది.

♦ 'జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్యతేజాం స్యశేషతః । భగవచ్ఛబ్ద వాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః॥' అను పరాశరవచనముచేబట్టి భగవచ్ఛబ్దమున కీయర్థము చెప్పఁబడినది.

* భూతభావన, భూతేశ, దేవదేవ, జగత్పతి యను నాలుగింటి యర్థములను క్రమముగా 'సకారణం కరణాధిపాధిపః' - 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' -

వాఁడా, (అనఁగా ఎట్లు మనుష్య మృగపక్షి సరీసృపాదులను సౌందర్య సౌశీల్యాది కల్యాణగుణగణములచేత దేవత లతిశయించి వర్తింతురో అట్లె యా దేవతల నందఱను ఆయా గుణములచేత అతిశయించి వర్తించువాఁడా యనుట), జగత్స్వామీ, నీ స్వరూపమును నీజ్ఞానము చేత నీయంతట నీవ యెఱుఁగుదువు. [నీవు సర్వజ్ఞుఁడవగుటచే నీవైభవమును జెప్పుటకు నీవ సమర్థుఁడవు అని భావము.]

40 41 42

శ్లో॥ వక్తు మర్హ స్య శేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః।
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి॥

టీ. హి=ఏకారణమువలన, ఆత్మవిభూతయః-ఆత్మ=నీయొక్క, విభూతయః = ఐశ్వర్యములు - నియమన విశేషములు, దివ్యాః= అద్భుతములైనవియో, యాభిః=ఏ విభూతులతో, (యుక్తః=కూడినవాఁడవై), ఇమాన్ లోకాన్=ఈ లోకములను, వ్యాప్య=లోపల ప్రవేశించి, తిష్ఠసి=వర్తించుచున్నావో, (తాః=వానిని), అశేషేణ= నిశ్శేషముగా, వక్తుం=చెప్పుటకు, అర్హసి=(నీవే) తగుదువు.

తా. అనంతములైన *నియమన విశేషములతోఁ గూడినవాఁడవై నీ వీలోకములందెల్ల నియంతవై వ్యాపించియున్నాఁడవు. ఇట్టి యసాధారణములైన నీయొక్క నియమన విశేషములు దివ్యము

---

'తం దైవతానాం పరమంచ దైవతమ్' - 'పతిం పతీనాం పరమం పరస్తా ద్విదామ దేవం భువనేశ మీడ్యమ్' అను నాలుగుశ్రుతులు ప్రతిపాదించుచున్నవి.

* ఇచట విభూతి యనఁగా నియమనము. నియంతవై వ్యాపించియున్నాఁడ వనుటచే ఆకాశాదులవలె నూరక వ్యాపింపక అంతర్యామియై వ్యాపించియున్నాఁడ వనుట తెలియునది.

లైన (వి గనుక నవశ్యము తెలియఁదగినవి. అయినను అట్టి) వానిని జెప్పుటకు నీవే యర్హుఁడవు-నీవే తెలియఁబఱుపు మని యర్థము.

43

శ్లో॥ కథం విద్యా మహం యోగీ త్వాం సదా పరిచి న్తయన్।
కేషు కేషుచ భావేషు చిన్త్యోఽసి భగవ న్మయా॥ 17

టీ. అహం = నేను, యోగీ = భక్తియోగనిష్ఠుఁడ నై, త్వాం = నిన్ను, సదా = ఎల్లప్పుడు, పరిచి న్తయన్ = *చింతించుటకు ప్రవర్తిం చినవాఁడ నై యనుట, కథం = ఎట్లు, విద్యాం = తెలిసికొందును, హేభగవన్ = భగవంతుఁడా, కేషు కేషుభావేషుచ = మఱి యేయే భావములయందును, మయా = నాచేత, చి న్త్యః = చింతింపఁదగిన వాఁడవు, అసి = అగుచున్నావు.

తా. నేను భక్తియోగనిష్ఠుఁడనై భక్తితో నిన్ను సదా చింతిం పఁబూనితిని గాని, పరిపూర్ణైశ్వర్యాది కల్యాణగుణములతోఁ గూడిన వాఁడవై చింతనీయుఁడ వగునిన్ను నే నెట్లు తెలియుదును ? నీవింత వఱకు నాకుఁ జెప్పియున్న బుద్ధిజ్ఞానాది భావములందే కాక నీవు చెప్పని మఱియు నేయే భావములందు నిన్ను నియంతగా నేను చింతింప వచ్చును ?

44

శ్లో॥ వి స్తరే ణాఽఽత్మనో యోగం విభూతించ జనార్దన।

45

భూయః కథయ తృప్తి ర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్॥

---

*వేదనమునకు పూర్వము చింతనము కలుగనేరదు - అనఁగా గెలిసికొనక మునుపు చింతించుట యశక్యము. కావున 'చి న్తయన్' అనుటకు 'చింతింపఁబూని' అని యర్థము గ్రాహ్యము.

టీ. హేజనార్దన=ఆశ్రితజనుల యభీష్టముల నిచ్చువాఁడా - ఓకృష్ణా, ఆత్మనః=నీయొక్క, యోగం=జగత్సృష్టి మొదలగు గుణ యోగమును, విభూతించ = జగత్తును ప్రవర్తించుటను, భూయః= మఱల, విస్తరేణ=సవిస్తరముగ, కథయ చెప్పుము, అమృతం=నీ మాహాత్మ్యము అనెడి అమృతమును, శృణ్వతః=వినుచున్న, మే= నాకు, తృప్తిః=తృప్తి, నాస్తిహి=లేదుగదా.

తా. జనార్దనా, *'అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే' అని నీస్రష్టృత్వాది గుణయోగమును నీ విభూతిని (నియమనమును) ముందు సంగ్రహముగాఁ జెప్పితివి. వానిని మరల విస్తరించి చెప్పుము. నీవు చెప్పుచున్న నీ మాహాత్మ్యమనెడు అమృతమును వినుచున్నను నా కింకను తృప్తి కలుగ లేదుగదే - నాకు తృప్తి కలుగ లేదనుట నీకే తెలియునని యభిప్రాయము.

శ్రీభగవానువాచ

46 అవతారిక.

47 48

శ్లో॥ హన్త తే కథయిష్యామి విభూతీ రాత్మన శ్శుభాః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే॥ 19

---

* 'అహంసర్వస్య ప్రభవః' అనుటచే స్రష్టృత్వాది గుణయోగమును 'మత్తస్సర్వం ప్రవర్తతే' అనుటచే విభూతియను అనఁగా నియమనమును ముందే సంగ్రహముగా చెప్పఁబడినవి. యోగశబ్దమునకు, మునుపు సౌశీల్య సౌందర్యాది గుణయోగమని చెప్పి యిప్పుడు స్రష్టృత్వాది (సృజించుట మొదలైనవాని) యోగమును జెప్పుట యెట్లు? అన్నచో మొదటఁ జెప్పఁబడిన యర్థమునందలి ఆదిశబ్దములో స్రష్టృత్వాదులును, రెండవదాని ఆది శబ్దములో సౌశీల్యాదులును అంతర్భూతములైయున్నవి గాన దానికి సౌశీల్యాదులు స్రష్టృత్వాదులు రెండును అర్థమగుచున్నవి. భగవన్మాహాత్మ్యము వినుట కమృతమువలె భోగ్యమైనది. అందును భగవంతుఁడే దానిని చెప్పఁగా వినుట అత్యంతభోగ్యమైనదని తెలియునది.

టీ. *హన్త = ఓహో, కురుశ్రేష్ఠ = అర్జునా, ఆత్మనః = నాయొక్క, శుభాః = కల్యాణములుగా, విభూతీః = నా నియమనము నకు లోనై యుండువానిని, ప్రాధాన్యతః = ముఖ్యములైనవానిని (అనఁగా ఉత్కృష్టములైనవానిని), తే = నీకొఱకు, కథయిష్యామి = (కొన్ని) చెప్పెదను; మే = నాయొక్క, విస్తరస్య = విభూతివిస్తారమున కు, అన్తః = అంతము, న = లేదు.

తా. కురుశ్రేష్ఠా, కల్యాణములైన ♦ నావిభూతులలో ప్రధానమైనవానిని నీకు వచియించెదను. 'పురోధసాం చ ముఖ్యం మామ్' అనికదా చెప్పెడిని. జగత్తునందు ఉత్కృష్టములైన కొన్ని విభూతులను జెప్పెదను (అని యర్థము). అవి అనంతములగుటచే వానిని విస్తరించి చెప్పుటకును వినుటకును శక్యము కాదు.

సమస్తములైన భూతములకు బుద్ధి మొదలుగా వేఱు వేఱు విధములైన భావములు నావలననే కలుగుచున్నవి, అని చెప్పి 'ఏతాం'

* నావిభూతులను సంక్షేపముగా వినుటచేత తృప్తి నొందక మఱల దానిని విస్తరముగా వినఁగోరువాఁడీ లోకమునందు అతిదుర్లభుఁడు. అట్టి వాఁడిప్పుడు లభించినాఁడు- అని భగవంతుఁడు తన సంతోషాతిశయమును వెలిబుచ్చుచు 'హంత' అనుచున్నాఁడు.

♦ ఇచట విభూతి యనఁగా నియంతవ్యమైనది అని యర్థము. సమృద్ధిమొదలైనవి యర్థములు కావు. ఎట్లన- సమస్తభూతములకు పృథగ్విధములైన బుద్ధ్యాదులు 'మత్త ఏవ భవన్తి' అని చెప్పి 'ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః' అని ప్రతిపాదించినారు. 'ఏతాం' (అనఁగా 'ఈ') అనునది పూర్వోక్తమైన 'మత్త ఏవ భవన్తి' అనుదానిని పరామర్శించుచున్నది గాన ఈ విభూతి అనఁగా 'మత్త ఏవ భవన్తి' (నావలననే కలుగుచున్నవి) అనెడి యీవిభూతి యనుట - అనఁగా నాకధీనములై యుండుట అనెడి విభూతి యని భావము. దీనివలన విభూతిశబ్దమునకు నియమనము నియంతవ్యము అని అర్థములు సిద్ధించుచున్నవి. పూర్వప్రయోగములందు నియమనమనియు ఈ ప్రయోగమునందు నియంతవ్యమనియు నర్థము గ్రహింపనేల యన-ఇచట పురోధసాంచ ముఖ్యం మాం' అని యీశ్వరుఁడు సామానాధికరణ్యమువలన తానే పురోధసాధ్యుల్నిగా చెప్పుకొనుచున్నాఁడు. ఆ పురోధసాదులే యిచట విభూతులు

విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః' (గీ. ౧౦-౭) అని ప్రతిపాదించుటంబట్టి విభూతిత్వమనఁగా నియామ్యత్వము. అట్లే, అందు యోగశబ్దముచే నిర్దేశింపఁబడినది స్రష్టృత్వాదు లనియు, విభూతిశబ్దముచే నిర్దేశింపఁబడినది దానిచే ప్రవర్త్యత్వము (నియామ్యత్వము) అనియుఁగదా చెప్పఁబడినది. మరల 'అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే। ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః (గీ. ౧౦-౮) అనియుఁ జెప్పఁబడినది.

అవ * విభూతియోగములు రెంటిలో, సర్వభూతములను ప్రవర్తింపఁజేయుట యనెడి విభూతిని (నియమనమును) జరుపుట వానియందాత్మయై నెలకొనియుండియే యనియు, యోగశబ్దమునకు (పూర్వము చెప్పఁబడినట్లు) సర్వమును సృజించుటయేకాక పాలించుటయు సంహరించుటయుఁగూడ అర్థమగుననియు మిక్కిలి స్పష్టముగాఁ జెప్పుచున్నారు. 49

---

కాన విభూతికి నియమనకర్మమును జెప్పక నియమనమునకు లోనైయుండు వస్తువును అనఁగా నియంతవ్యమును జెప్పవలసియున్నది. పూర్వప్రయోగములం దిట్టి సామానాధికరణ్యము మొదలైనవి లేనందున నియమనము అని మాత్రమే అర్థము సేయఁబడెను. మఱియును, విభూతి నియంతవ్యము అని యర్థముకలుగుట మఱియొక విధమునను తెలియవచ్చును. ఎట్లన 'ఏతాం విభూతిం యోగంచ' అని చెప్పి మరల తోడనే 'అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే। ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః॥' అని చెప్పఁబడియున్నది. మొదటి శ్లోకమునందలి విభూతియోగములే రెండవదానియందు ప్రతిపాదింపఁబడుటవలన, యోగము 'అహం సర్వస్య ప్రభవః' అని చెప్పుటంబట్టి స్రష్టృత్వాదియోగ మనియు, విభూతి 'మత్తస్సర్వం ప్రవర్తతే' అని చెప్పుటంబట్టి తనచే ప్రవర్త్యమైనదనియు (అనఁగా తనకు నియంతవ్యమైనదనియు) తెలియనగును.

* అర్జునుఁడు 'విస్తరేణాత్మనో యోగం విభూతించ' అని విభూతి యోగములను విస్తరించి చెప్పుము అన్నందులకిది యుత్తరము - ఎట్లన విభూతి యనఁగా పూర్వము నియమనము అని మాత్రము సంగ్రహముగా చెప్పఁబడెను. ఇప్పుడు అన్నిటికి ఆత్మభూతుఁడై చేయునియమనము అని అదియే విస్తరించి చెప్పఁబడెడిని. ఇట్లే

51 52

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః।
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మన్త ఏవచ॥ 20

టీ. హేగుడాకేశ = అర్జునా, అహం = నేను, ఆత్మాసన్ = ఆత్మనై, సర్వభూతాశయస్థితః_సర్వభూత = సమస్తప్రాణులయొక్క, ఆశయ = హృదయమునందు, స్థితః = ఉండువాఁడను. (ఇది విభూతి ప్రశ్నమునకు సంగ్రహమైన యుత్తరము,) భూతానాం = భూతములకు, ఆదిశ్చ = సృష్టికర్తయును, మధ్యంచ = ఉత్పత్తిప్రళయములకు మధ్యస్థితి హేతువును _రక్షకుఁడును, అన్తశ్చ = లయకారణుఁడును, అహమేవ = నేనే. (ఇది యోగప్రశ్నమునకుసంగ్రహమైన యుత్తరము.)

తా. అర్జునా, నాకు శరీరభూతములైన * సకల ప్రాణుల హృదయమునందు నేను ఆత్మగా నెలకొనియున్నాను- ఆత్మయనఁగా శరీరమునకు సర్వవిధములచేత ఆధారమును నియంతయు శేషియు నైనది. అట్లె మీఁద 'సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ (గీత ౧౫-౧౫) 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా' (గీత ౧౮-౬౧) అని చెప్పఁబడుచున్నది. శ్రుతియు

---

యోగము అనఁగా పూర్వము సంగ్రహముగా చెప్పఁబడిన స్రష్టృత్వమేకాక పాలించుటయు సంహరించుటయునగు నని దానినిగూడ విస్తరించి చెప్పుటయు తెలియునది.

* ఈగీతయందు 'సర్వస్య చాహం హృది సన్నివిష్టః...ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని...॥' అని ఈశ్వరుఁడు సర్వప్రాణుల హృదయమునందు నెలకొనియున్నాఁ డనుటవలన 'సర్వభూతాశయ' అనుచో 'సర్వభూత' అనఁగా ప్రాణు లనియు 'ఆశయ' అనఁగా హృదయమనియు నర్థము సిద్ధించినది. 'హృద్దేశేతిష్ఠతి' అనుటవలన ఆధారత్వమును 'భ్రామయన్' అనుటచే నియంతృత్వమును తెలియునది. మఱియు నీవిషయమునే శ్రుతులును 'యస్సర్వేషు భూతేషు...' అనియు, 'య ఆత్మని తిష్ఠన్...' అనియును జెప్పుచున్నవి.

50
యస్సర్వేషు భూతేషు తిష్ఠన్సర్వేభ్యో భూతేభ్యోఽన్తరో యం సర్వాణి భూతాని నవిదుః యస్య సర్వాణి భూతాని శరీరం యస్సర్వాణి భూతాన్యన్తరో యమయతి ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః' (బృ-౫-౭-౧౫) అనియు, 'య ఆత్మని తిష్ఠ న్నాత్మనోఽన్తరో య మాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి స త ఆత్మాన్తర్యామ్యమృతః' అనియుఁ జెప్పుచున్నది. ఇట్లు సమస్తభూతములకు ఆత్మయై నెలకొని యున్నవాఁడనుగాన నేను వానికి ఆదియు మధ్యమును అంతము నగుదును - అనఁగా వారి యొక్క యుత్పత్తి స్థితిప్రళయములకు హేతువగుచున్నా నని యర్థము.

అవ. ఇట్లు భగవంతుఁడు తనకు విభూతులైనట్టి సకలమైన వానియందును ఆత్మయై నెలకొనియుండుటయే, తన్ను ఆ సకలమైన వానిశబ్దములవలన సామానాధికరణ్యముచే నిర్దేశించుటకు హేతువు అని ప్రతిపాదించి. తన విభూతివిశేషములను (అనగా ప్రధానవిభూతులను)*సామానాధికరణ్యముచేత (తన్నుఁగా) చెప్పుకొనుచున్నారు. భగవంతుఁ డాత్మయై నెలకొనియుండుటచేతనే కదా సమస్తములైన శబ్దములు అతనియందే పర్యవసించుచున్నవి. ఎట్లన - 'దేవుఁడు, మనుష్యుఁడు, పక్షి, వృక్షము' ఇత్యాదులగు శబ్దములు ఆయా శరీరములను ప్రతిపాదించుచునే వానివాని యాత్మలందు పర్యవసించుచున్నవి.

* అపృథక్సిద్ధ విశేషణములకు వాచకములైన శబ్దములు ఆయా విశేషణముల ద్వారా వానివాని విశేష్యములందు పర్యవసించుచున్నవి. అపృథక్సిద్ధ గలచోట్ల నిట్టి పర్యవసానము కలుగును. శరీరము ఆత్మకు అపృథక్సిద్ధిమైనదిగనుక శరీరవాచకములైన శబ్దములు ఆత్మయందు పర్యవసించును. అట్లయిన శరీరము దేహము కాయము మొదలైన శరీరవాచకశబ్దములవలన ఆత్మ గ్రహింపఁబడునా? యనిన నట్లుకాదు. కేవల శరీరవాచకములైన శబ్దములు కాక శరీరవిశిష్టమైన యాత్మలకు వాచకములైన దేవ

విభూతి యుపసంహారమునందు 'న తద స్తి వినా యత్స్యాన్మయా[55] భూతం చరాచరమ్' అని సమస్తమునకును దనతోడి అవినాభావమును చెప్పుటఁబట్టి భగవంతుఁడు వానికి ఆత్మయై నెలకొనియుండుటయే, ఆయా శబ్దముల సామానాధికరణ్యమునకు[56] హేతువు అని మీఁద చెప్పుచున్నాఁడు. అవినాభావము నియామ్యత్వముచేత నని యుపక్రమమందు 'మత్తస్సర్వం ప్రవర్తతే' అనుచో చెప్పఁబడినది.

**ఇక అవతారికలో**

శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి[54] రంశుమాన్।
మరీచి ర్మరుతా[57] మస్మి నక్షత్రాణా మహం శశీ॥ 21

టీ. అహం = నేను, ఆదిత్యానాం = ద్వాదశసంఖ్యగల సూర్యులలో, విష్ణుః – విష్ణువనెడి యాదిత్యుఁడు, జ్యోతిషాం = జగత్తునందలి

---

మనుష్యపక్షి వృక్షాది శబ్దములు ఆయా శరీరములను ప్రతిపాదించుచు ఆయా ఆత్మలందు పర్యవసించుచున్నవి. అనఁగా అట్టిశబ్దములు శరీరములవఱకేకాక అందలి యాత్మలవఱకు చెల్లుచున్నవి. ఇట్లే భగవంతుఁడు సర్వమునం దాత్మయై నెలకొనియుండుటవలన శరీరభూతమైన సర్వముయొక్క శబ్దములును భగవంతునియందే పర్యవసించుచున్నవి. ఆయావానికిఁ గల శబ్దములచే సామానాధికరణ్యమున భగవంతుని నిర్దేశించుటకు హేతువు ఆయావానియం దాత్మయై యుండుటేకాని అధ్యాసాదులుకావు. అధ్యాసాదులవలన హేయములెల్ల భగవంతుఁడేయగుట సిద్ధించునుగాన అదిసరికాదు. సామానాధికరణ్య నిర్దేశము అన్నిట ఆత్మభూతుఁడై నెలకొనియుండుటవలననే కలుగుచున్నదని యీ విభూతియొక్క యుపసంహారమునఁ జెప్పబడుచున్నది. అందు – 'నతదస్తి వినాయత్స్యాన్మయాభూతం చరాచరమ్' (నన్నువినా కలుగుభూతము ఏదియూ లేదు) అనఁగా భగవంతునివిడిచి ఏదియూ నుండదు అనుటవలన సర్వమును భగవంతునితోడ అవినాభావము ,కలిగియుండుట చెప్పఁబడినది. అవినాభావ మనఁగా విడిచియుండమి. ఆత్మను విడిచి శరీరముగునట్టిది గలుగనట్లు ఈశ్వరునివిడిచి సర్వభూత

ప్రకాశములగు పదార్థములలో, అంశుమాన్ = కిరణములుగల, రవిః = రవి - అనఁగా ఆదిత్యగణము, మరుతాం - దితిపుత్రులగు నలువది తొమ్మిదివాయువులలో, మరీచి = మరీచి యను నామాంతరముగల పరివహవాయువు, అస్మి = అయియున్నాను, అహం = నేను, నక్షత్రాణాం = అశ్విన్యాది నక్షత్రములకు (పతియగు) శశీ = చంద్రుఁడు.

తా. * ద్వాదశాదిత్యులలో నుత్కృష్టుఁడగు విష్ణువనెడి పండ్రెండవ యాదిత్యుఁ డెవఁడో వాఁడు నేను. జగత్తునందలి ప్రకాశకములలో ప్రశస్తకిరణములుగల ఆదిత్యగణ మెవరో వాఁడు నేను. నలువదితొమ్మిది వాయువులలో నుత్కృష్టుఁడగు మరీచి యెవఁడో వాఁడు నేను. నక్షత్రములకు పతియగు చంద్రుఁ డెవఁడో వాఁడు నేను.

---

ములు ఉండవు. ఈ యవినాభావమే సామానాధికరణ్య నిర్దేశమునకు హేతువు. అయినను 'రంగనివినా ఎవరును లేరు' అనుచో రంగఁడుతప్ప ఎవరునులేరు అని గ్రహించునట్లు 'భగవంతుని వినా ఏదియును ఉండదు' అనఁగా భగవంతుఁడుతప్ప వేఱొద్దియును లేదు అని అవినాభావమును గ్రహింపరాదా యనిన ఇచట అవినాభావమును ఇట్లు గ్రహింపరాదు. భగవంతునివినా ఏదియు నుండదు అనఁగా భగవంతుని నియమనమువినా దేనికిని స్థితి కలుగదనుట. వానికి నియామ్యమైయుండిననే దేనికిని స్థితి కలుగునని భావము. ఇట్లు భగవంతునితోడి అవినాభావము భగవంతునికి నియామ్యమై యుండుటవలననే కాని భగవంతుఁడు తప్ప మఱేదియు లేకుండుటవలనఁ గాదని తెలియునది.

* 'ప్రాధాన్యతః' అని చెప్పియుండుటవలన ఆయావానిలో ఉత్కృష్టములైనవియే గ్రాహ్యము. కనుక అందందు ఉత్కృష్టశబ్దము చేర్పఁబడుచున్నది. 'పురోధసాంచ ముఖ్యమ్' అనుచో ఉత్కృష్టపర్యాయమైన ముఖ్యశబ్దము కంఠోక్తముగా చెప్పఁబడినది. తక్కినచోట్ల దానినే గమ్యముగా గ్రహించునది. ఇందు ప్రయోగింపఁబడిన షష్ఠి 'లోపల' అనెడినిర్ధారణషష్ఠి. అయినను 'నక్షత్రాణా మహం శశీ' అనుచో శశి నక్షత్రములలోపల చేరినవాఁడుకాఁడు గనుక 'లోపల' షష్ఠి నిచట గ్రహింపరాదు. 'యొక్క' అనెడి సంబంధషష్ఠిని గ్రహించునది. అట్లె 'భూతానామస్మి చేతనా' ఇత్యాదులయందుకూడ సంబంధషష్ఠియె ప్రయుక్తమై యున్నదిగాన అంతటను నిర్ధారణషష్ఠియే యని గ్రహింపరాదు. ప్రాధాన్యతః' అనుటంజేసి నక్షత్రములకు పతి యని

శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి[58] దేవానా మస్మి వాసవః[59] ।
ఇన్ద్రియాణాం మన[60] శ్చాస్మి భూతానా మస్మి చేతనా[61]॥

టీ. వేదానాం = చతుర్వేదములలో, సామవేదః - సామవేదము, అస్మి = అగుచున్నాను. దేవానాం = దేవతలలో, వాసవః = ఇంద్రుఁడు, అస్మి = అగుచున్నాను, ఇన్ద్రియాణాం = పదునొకొండింద్రియములలో, మనశ్చ = మనస్సు, అస్మి = అగుచున్నాను, భూతానాం = చేతనములు గలవానికి, చేతనా = చైతన్యము - తెలివి, అస్మి = అగుచున్నాను.

తా. ఋక్కు యజుస్సు సామము అథర్వమనెడి చతుర్వేదములలో (సహస్రశాఖలుగలదై గానప్రధానమగుటచే నుత్కృష్టమయిన) *సామవేదము నేను. స్వర్గమునందు వసించు దేవతలలో (త్రైలోక్యాధిపత్యరూప పరమైశ్వర్య సంపన్నుఁడగుటచే నుత్కృష్టుఁడైన) ఇంద్రుఁడు నేను. ఏకాదశేంద్రియములలో (బంధమోక్షములకు కారణ మగుటచే) నుత్కృష్టమయిన మనస్సనెడి యింద్రియము నేను. చేతనావంతములైన ప్రాణులకుఁ గల చేతనము (బుద్ధి) ఏదియో అది నేను.

---

పతిశబ్దము గ్రహింపఁబడినది. 'జ్యోతిషామ్' అనుటకు ప్రకాశకములైనవానిలో అని మాత్రము అర్థము చెప్పినయెడల ప్రకాశకమగు పరంజ్యోతియు వానిలో చేరుచున్నది. పరంజ్యోతినిబట్టి చూడఁగా రవి మిణుగురుఁ బురుగువంటివాఁడేయగును గాని ఉత్కృష్టుఁడు కానేరఁడు. కనుక నే 'జగత్తునందలి' అను విశేషణము చేర్పఁబడినది. జగత్తునందలి ప్రకాశకములలో రవి ఉత్కృష్టుఁడని భావము. రవిశబ్దము ద్వాదశాదిత్యులకు సామాన్యమగుటచే దానివలన ఆదిత్యగణము గ్రహింపఁబడినది.

* ఇచట సామవేదము ప్రామాణ్యమునుబట్టి కాక, గీతిప్రధానత్వమును సహస్రశాఖాత్వమునుబట్టి వేదములలో ఉత్కృష్ట మైనదిగా చెప్పఁబడెను.

శ్లో॥ రుద్రాణాం[62] శఙ్కర శ్చాస్మి ♦విత్తేశో[63] యక్షరక్షసామ్।
వసూనాం పావక[64] శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్॥ 23

టీ. రుద్రాణాం = ఏకాదశరుద్రులలో, శంకరశ్చ = (లోకమునకు సుఖకరుం డగుటచే) శంకరుఁ డను పేరుగల రుద్రుఁడును, అస్మి = అగుచున్నాను, యక్షరక్షసాం = యక్షులకును రాక్షసులకును పతియగు విత్తేశశ్చ — కుబేరుఁడును, వసూనాం = అష్టవసువులలో, పావకశ్చ = పావకుఁడును, శిఖరిణాం = రత్నకాంచనమయములగు శిఖరములు గల పర్వతములలో, మేరుః = మేరువును, అహం = నేను, అస్మి = అగుచున్నాను.

తా. ఏకాదశరుద్రులలో శంకరుఁడు నేను. యక్షరాక్షసులకు పతియగు కుబేరుఁడు నేను. అష్టవసువులలో పావకుఁడను పేరుగల వసువు నేను. శిఖరశోభితములగు పర్వతములలో మేరుపర్వత మేదియో అదియు నేను.

శ్లో॥ పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్[65]।
సేనానీనా[66] మహం స్కన్దః[67] సరసా మస్మి సాగరః॥ 24

టీ. పార్థ = అర్జునా, మాం = నన్ను, పురోధసాం = పురోహితులలో, ముఖ్యం = ప్రధానుఁ డగు, బృహస్పతిం = బృహస్పతినిగా,

---

♦ కుబేరునికి రాక్షసత్వము లేదుగాన రాక్షసులలోఁ జేర్చుటతగదు. కాన 'నక్షత్రాణామహంశశీ' అన్నట్లు రాక్షసులకుపతిగామాత్రము గ్రహింపఁదగును. లేక యక్షరాక్షసజాతులకు అంతగా తారతమ్యము లేమివలన రాక్షసులలోపల యక్షాధిపతియగు కుబేరుఁడు చెప్పఁబడెనని యు గ్రాహ్యము మఱియు 'స్థావరాణాం హిమాలయః' అని పర్వతసామాన్యములో హిమాలయము ఉత్కృష్టముగాఁ జెప్పియుండుటవలన ఇచట 'శిఖరిణాం' అనుటకు శిఖరములుగల పర్వతములు అని పర్వతవిశేషము గ్రహింపఁబడి

విద్ధి=తెలిసికొనుము, అహం=నేను, *సేనానీనాం = సేనాపతులలో, స్కన్దః=కుమారస్వామియు, సరసాం=జలాశయములలో, సాగరశ్చ =సముద్రుఁడును, అస్మి=అగుచున్నాను.

తా. పురోహితులయందు ముఖ్యుఁడైన బృహస్పతి ఎవఁడో వాఁడు నేను. సేనాపతులలో కుమారస్వామి నేను. జలాశయములలో సముద్రుఁడు నేను.

68 69
శ్లో॥ *మహర్షీణాం భృగు రహం గిరా మ స్మ్యేక మక్షరమ్।
70 71
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః॥

టీ. మహర్షీణాం=మరీచి మొదలగు మహర్షులలో, భృగుః= భృగుమహాముని, అహం=నేను, గిరాం = అర్థవంతములైనశబ్దము లలో, ఏక మక్షరం=ఓమ్ అను ఒక యక్షరమగు ప్రణవము, అస్మి =అగుచున్నాను, యజ్ఞానాం=పశుహింసాదులులేని యజ్ఞములలో, జపయజ్ఞః=జపరూపమైన యజ్ఞము, అస్మి=అగుచున్నాను, స్థావ రాణాం=పర్వతములలో, హిమాలయః=హిమవత్పర్వతము, అస్మి= అగుచున్నాను.

తా. మరీచి మొదలగు మహర్షులలో భృగువు నేను. అర్థము

---

నది. అట్టి పర్వతములలో ప్రశస్తరత్నకాంచనాదిమయశిఖరములు గలది గాన మేరువే శ్రేష్ఠమైనదని భావము.

* ఇచట సేనాని శబ్దమువలన విష్వక్సేనాదులయిన అకర్మవశ్యులగు సేనాపతు లను గ్రహింపరాదు. అట్లు గ్రహించిన కుమారస్వామి వారిలో నికృష్టుండగును. కాఁబట్టి కర్మవశ్యులైన సేనాపతులను గ్రహించునది. అట్టివారలలో దేవసేనాపతి యగుటచే స్కందుఁడు ఉత్కృష్టుఁడు. 'సరసాం' అనుటచే ప్రవహింపక నిల్వుకడగా నుండు జలాశయములను గ్రహించునది. వీనిలో సముద్రుఁడు శ్రేష్ఠుఁడు. 'స్రోతసాం' అని ప్రవహించువానిలో గంగ ఉత్కృష్ట యైనదిగా మీఁద చెప్పఁబడెడిని.

* 'మహర్షీణామ్' అనుచో మహచ్ఛబ్దవిశేషణ ముండుటవలన ఋషులన్నందఱిని

గల శబ్దములలో నేకాక్షరమగు ప్రణవము నేను. యజ్ఞములలో నుత్కృష్టమగు *జపయజ్ఞము నేను. పర్వతమాత్రములలో హిమ వంతము నేను.

శ్లో॥ *అశ్వత్థ[72] స్సర్వవృక్షాణాం దేవర్షీణాం[73] చ నారదః।
గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం[74] కపిలో మునిః॥ 26

టీ. సర్వవృక్షాణాం = సమస్త వృక్షములలో, అశ్వత్థః = పూజింపదగినదని ప్రసిద్ధినొందిన రావిచెట్టును, దేవర్షీణాం = దేవర్షులలో

---

గ్రహింపక మరీచ్యాదిఋషి విశేషములను మాత్రమే గ్రహించునది. తక్కినఋషులు 'దేవర్షీణాం' ఇత్యాదులందు చెప్పఁబడుచున్నారు. సముద్రఘోషము మొదలయిన అర్థరహితశబ్దములును గలవుగాన అట్టివానిలో మిక్కిలి అర్థవంతమైన ప్రణవమును ఉత్కృష్టమైనదిగా చెప్పుటవలన దాని కేయతిశయమును కలుగదు. కనుక నే గిరామ్ అనుటకు అర్థవంతమైన యక్షరము లనఁబడెను - అర్థవంతములగు శబ్దములలో అది యుత్కృష్టమైనదనుట. పట్టియక్షరమాత్రములు 'అక్షరాణామకారోఽస్మి' యని చెప్పఁబడెడిని. 'ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ' అని ప్రణవమునకు ఏకాక్షరశబ్దయోగము కలదు. ఇచట యజ్ఞములనఁగా హింసాత్మకములుకాని యజ్ఞములనుట. వీనియందు జపయజ్ఞము ఉత్కృష్టమయినది. 'హింసాత్మకములుకాని యజ్ఞములు హింసాత్మకము లయినవానికంటె అతిశయించినవని 'కుర్యాద్ఘృతపశుం సఙ్గే కుర్యాత్పిష్టపశుం తథా। నత్వేవతువృథాహన్తుం పశుమిచ్ఛేత్కథంచన 'పశుయజ్ఞైః కథంహింస్రైః మాదృశోయష్టు మర్హతి। హింసాత్మకైస్తు కిం తస్య యజ్ఞైః కార్యం మహాత్మనః। ప్రస్వాపేచ ప్రబోధేచ పూజితో యేన కేశవః॥' ఇత్యాదులవలనఁ దెలియునది. ఇతర యజ్ఞములయందు పశు హింసాదిక్లేశ ముండుటచేతను జపయజ్ఞమునందట్టి క్లేశము లేకుండుటచేతను అది సర్వాశ్రమసాధారణ మగుటచేతను జపయజ్ఞము ఉత్కృష్టమని యభిప్రాయము.

* వృక్షములలో పారిజాతాదులు శ్రేష్ఠము లైనను పూజ్యములుగావు. రావిచెట్టు శ్రేష్ఠముకాకపోయినను పూజ్యమగును. పూజ్యతనుబట్టియే రావిచెట్టు చెట్లలో ఉత్కృష్టమైనది. సిద్ధులనఁగా పూర్వజన్మ సంచితసుకృత విశేషమువలన జన్మించినపుడే అణిమాద్యైశ్వర్యసిద్ధి గలవారు. వారిలో కపిలుఁడు శ్రేష్ఠుఁడు. పరశురామాదులును ఇట్టి సిద్ధులని తెలియునది.

నారదశ్చ = బ్రహ్మపుత్రుఁడని ప్రసిద్ధిగల నారదుఁడును, గంధర్వాణాం = గంధర్వులలో, చిత్రరథః = గంధర్వరాజైన చిత్రరథుఁడును, సిద్ధానాం = సిద్ధిపొందిన జ్ఞానులలో, కపిలః మునిః = కపిలుఁ డనెడి మునియును, (అహం = నేనే.)

తా. సమస్త వృక్షములలో పూజ్యమగు నశ్వత్థము నేను, దేవర్షులలో నారదుఁడు నేను. గంధర్వులలో చిత్రరథుఁడ నేను. సిద్ధులలో కపిలమహాముని నేను.

శ్లో॥ ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్॥ 27

(75, 76)

టీ. అశ్వానాం = అశ్వములలో, అమృతోద్భవం = సముద్రజలము నందుఁ బుట్టిన, ఉచ్చైశ్శ్రవసం = ఉచ్చైశ్శ్రవముఁగను, గజేంద్రాణాం = గజశ్రేష్ఠము లైన దిగ్గజములలో, (అమృతోద్భవం = అమృతము నందుఁ బుట్టిన), ఐరావతం = ఇంద్రుని వాహనమైన ఐరావతముగను, నరాణాం = మనుష్యులలో, నరాధిపం = సర్వనిర్వాహకుఁడగు రాజుఁగను, మాం = నన్ను, విద్ధి = తెలిసికొనుము.

తా. అశ్వములలో సముద్రమథనమునఁ బుట్టిన యుచ్చైశ్శ్రవము నేను. దిగ్గజములలో ఐరావతము నేను. మనుష్యుల యందు రాజు నేను.

శ్లో॥ *ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్।
ప్రజన శ్చాస్మి కన్దర్పః సర్పాణా మస్మి వాసుకిః॥ 28

(77, 78, 79, 80)

టీ. అహం = నేను, ఆయుధానాం = ఆయుధములలో, వజ్రం = వజ్రాయుధమును, ధేనూనాం = పిదికెడి యావులలో, కామధుక్ = కోరికల నిచ్చెడి కామధేనువును, అస్మి = అగుచున్నాను. ప్రజనః = ప్రజలయుత్పత్తికిఁగారణమగు, కన్దర్పః = మన్మథుఁడు, అస్మి = అగుచున్నాను (వాని యతిశయము నా యధీనమైనదని యర్థము). సర్పాణాం = ఏకశిరస్సు గల సర్పములలో, వాసుకిశ్చ = సముద్ర మథనమునందు త్రాడుగా నుండి ప్రసిద్ధుఁడైన వాసుకియు, అస్మి = అగుచున్నాను.

తా. *ఆయుధములలో వజ్రాయుధము నేను. ధేనువులలో దివ్యసురభి (కామధేనువు) నేను. (ప్రజలకు) జననహేతువైన మన్మథుఁడు నేను. ఏకశిరస్సుగల సర్పములలో వాసుకి నేను.

81

శ్లో॥ అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్।

82

పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్॥

టీ. అహం = నేను, నాగానాం = బహుశిరస్సులు గలపాములలో, అనన్తః = అనంతుఁడును, యాదసాం = జలమునందు వసించెడి వారలకు, వరుణశ్చ = (పతియైన) వరుణుఁడు, అస్మి = అగుచున్నాను. అహం = నేను, పితౄణాం = అగ్నిష్వాత్తాది పితృదేవతలలో, అర్యమా = పితృరాజయిన అర్యముఁడును, సంయమతాం = దండించువారలలో, యమః = యముఁడును, అస్మి = అగుచున్నాను.

తా. *బహుశిరస్సులు గల పాములలో ఆదిశేషుఁడు నేను.

---

* ఇచట ఆయుధము లనఁగా సుదర్శనాద్యాయుధములను గ్రహింపరాదు. కానికంటె వజ్రము నికృష్టమైనది గనుక అర్వాచీనాయుధములను గ్రహించునది.

* ఈరెండు శ్లోకములందుఁగల సర్పనాగశబ్దములకు పునరుక్తి లేకుండునట్లు

జలవాసులలో వరుణుఁడు నేను. పితృదేవతలలో నర్యముఁడు నేను; దండించువారలలో యముఁడు నేను.

శ్లో॥ ప్రహ్లాద[83] శ్చాస్మి దైత్యానాం *కాలః[84] కలయతామహమ్।
మృగాణాం చ మృగేన్ద్రోఽహం[85] వైనతేయ శ్చ పక్షిణామ్॥

టీ. అహం = నేను, దైత్యానాం = దితివంశజులలో, ప్రహ్లాదశ్చ = ప్రహ్లాదుఁడును, కలయతాం = అనర్థము కలిగింపఁగోరి గణించు సమయము ప్రతీక్షించువారిలో, కాలః = కాలపురుషుఁడగు మృత్యువును, అస్మి = అగుచున్నాను, అహం = నేను, మృగాణాం = మృగములలో, మృగేన్ద్రశ్చ = సింహమును, పక్షిణాం = పక్షులలో, వైనతేయశ్చ = గరుత్మంతుఁడును, (అస్మి = అగుచున్నాను.)

తా. దితివంశజులలో ప్రహ్లాదుఁడు నేను. అనర్థము కలిగింపఁగోరి సమయము లెక్కించువారలలో మృత్యువు నేను. మృగములలో సింహము నేను. పక్షులయందు గరుత్మంతుఁడు నేను.

శ్లో॥ పవనః[86] పవతా మస్మి ♦రామ శ్శస్త్రభృతా మహమ్।
ఝషాణాం మకర[87] శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ॥ 31

---

సర్పములనఁగా ఏకశిరస్కములైనవిగాను నాగములనఁగా బహుశిరస్కములైనవిగాను గ్రహింపఁబడెను. వరుణుఁడు జలజంతువుల జాతిలో చేరినవాఁడుకాఁడు గనుక వానికి ఆ జంతువులకు పతిగా సంబంధము చెప్పఁబడినది.

* కాలశబ్దమునకు యముఁడనియు కాలమనియు రెండర్థములు కూడ కలవు. ఐనను యముఁడు 'యమస్సంయమతామహమ్' అని పూర్వమే చెప్పఁబడుటవలనను 'అహమేవాక్షయః కాలః' అని కాలతత్త్వము పిదపఁ జెప్పఁబడుటవలనను ఇచట కాలశబ్దమునకు మృత్యువు అర్థము. పక్షులయందు గరుడుఁడు వేగవంతుఁడును వేదమయుఁడు నగుటంబట్టి యుత్కృష్టుఁడని తెలియునది.

♦ శస్త్రధారులలో రాముఁడు నేను. అనుచో రాముఁడు తానేయగుటవలన

టీ. పవతాం = గమనస్వభావము గలవారలలో, పవనః = వాయువు, అస్మి = అగుచున్నాను. శస్త్రభృతాం = ఆయుధములు ధరించినవారలలో, రామః = శ్రీరామమూర్తిని, అహం = నేను, ఝషాణాం = మత్స్యములలో, మకరశ్చ = మొసలియును, అస్మి = అగుచున్నాను. స్రోతసాం = ప్రవాహములలో, జాహ్నవీ = గంగ, అస్మి = అగుచున్నాను.

తా. ఎడతెగని గమనస్వభావముగలవారిలో వాయువు నేను. శస్త్రధరులలో అమోఘశస్త్రములు ధరించిన రాముఁడను నేను, (రాముని యమోఘశస్త్రధరత్వమును నాయొక్క విభూతి యగు ననుట). ఆదిత్యుఁడు మొదలైన క్షేత్రజ్ఞులు, ఆత్మయై నెలకొనియున్న భగవంతునకు శరీరమగుటచే, ధర్మభూతులుగాన, శస్త్రభృత్త్వస్థానీయు లగుదురు. మత్స్యములలో మత్స్యరాజైన మకరము నేను. ప్రవాహములలో గంగ నేను.

88 89
శ్లో॥ సర్గాణా మాది రన్త శ్చ మధ్యం చై వాహ మర్జున।
90 91
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్॥ 32

టీ. అర్జున = అర్జునా, సర్గాణాం = సృజింపఁబడువానికి ఆదిః = ఉత్పత్తికారణమును, మధ్యం = రక్షకుఁడును, అన్తశ్చ = నాశకుఁడును, అహ మేవ = నేనే, విద్యానాం = విద్యలలో, అధ్యాత్మవిద్యా = బ్రహ్మవిద్యయును, ప్రవదతాం = జల్పవితండావాదములను జేయు

---

తన్నే తనకు విభూతిఁగా (అనఁగా నియంతవ్యునిఁగా) చెప్పికొనుట అసంభావ్యము. శస్త్రధారియైన రాముఁడు ఉత్కృష్టుఁ డైనవాఁడు చేతనా చేతనములందు మఱెవ్వఁడును లేఁడు, కనుక రాముఁడు విభూతికాఁ సేరఁడు రామునియొక్క శస్త్రభృత్త్వమే

వారియొక్క, వాదః = తత్త్వనిర్ణయము కొఱకు ప్రవృత్తమయిన వాదము, అహం = నేను.

తా. సర్గములనఁగా సృజింపఁబడునవి. వానికి ఆది(కారణము) అనఁగా సర్వదా సృజింపఁబడు సమస్త ప్రాణులకు అందందుఁ గల సృజించువారు నేనే. అట్లే, అంతము-అనఁగా సర్వదా సంహరింపఁబడువారికి అందందుఁగల సంహారకులును నేనే. అట్లే, మధ్యమును (పాలనమును) - అనఁగా సర్వదా పాలింపఁబడువారికి పాలకులును నేనే. విద్యలయందు బ్రహ్మవిద్య నేను. వాదము చేయువారియొక్క *జల్పవితండా వాదములలో తత్త్వనిర్ణయార్థము ప్రవర్తించు వాదము నేనే.

92 93
శ్లో॥ అక్షరాణా మకారోఽస్మి ద్వన్ద్వస్సామాసికస్యచ।
94 94
అహమే వాక్షయఃకాలో ధాతాఽహం విశ్వతోముఖః॥ 33

టీ. అక్షరాణాం = అక్షరములలో, అకారః = అకారమును,

---

విభూతి యని తెలియునది. ఆదిత్యులు మొదలైన యితర వస్తువులను తనకు విభూతులుగా చెప్పుచువచ్చి నడుమ తన ధర్మమైన శత్రుభృత్త్వమును తనకు విభూతిగా చెప్పుట రీతిని తప్పుటగదా యన్నచో, క్షేత్రజ్ఞులైన యాదిత్యాదులు ఈశ్వరునకు శరీరమగుటచే అతనికి ధర్మభూతులే యగుచున్నారు. ధర్మియగు నీశ్వరునికి శత్రుభృత్త్వ మెట్లు ధర్మమో అట్లే ఆదిత్యాదులు ధర్మమగుచున్నారు. కనుక ధర్మములనడుమ ధర్మమును జెప్పుటే యగుచున్నదిగాన రీతిభంగమేమియు లేదని తెలియునది. విష్ణుపాదమునఁ బుట్టుటవలనను శివుఁడు తనతలయందు ధరించుటవలనను త్రిలోకములందు వర్తించుటవలనను గంగ ఉత్కృష్టగాఁ జెప్పఁబడెనని గ్రాహ్యము.

* జల్ప మనఁగా ఎదుటిపక్షమును ఖండించుచు తనపక్షమును స్థాపించుట. వితండ మనఁగా తనపక్షమును స్థాపించుకొనక యెదుటిపక్షమును దూషించుట.

సామాసికస్య = సమాస సమూహములలో, ద్వన్ద్వశ్చ = ద్వంద్వ సమాసమును, అస్మి = అగుచున్నాను. అక్షయః = నాశములేని - ఆద్యంతరహితమగు, కాలః=కలాముహూర్తాదిమయమగు కాలము, అహమేవ=నేనే. విశ్వతోముఖః=నాలుగు ప్రక్కల ముఖములుగల, ధాతా=బ్రహ్మయును, అహం= నేను.

తా. అక్షరములలో ('అకారోవై సర్వావాక్' అని శ్రుతి సిద్ధమై సర్వవర్ణములకు ప్రకృతియగు) అకారము నేను. సమాస సమూహములలో ద్వంద్వసమాసము నేను. అది ఉభయపదార్థ ప్రధాన మగుటచే ఉత్కృష్టమగుటచే ఉత్కృష్టముగదా. కలా ముహూర్తాదిమయమై ఆద్యంతములు లేనికాలము నేను. సర్వమునకు సృష్టికర్తయగు హిరణ్యగర్భుఁడు చతుర్ముఖుఁడు నేను.

95

శ్లో॥ మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్।

96

కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥

టీ. సర్వహరః = సమస్త ప్రాణులయొక్క ప్రాణములను హరించినట్టి, మృత్యుశ్చ=మృత్యువును, భవిష్యతాం=పుట్టంగలవారి యొక్క, *ఉద్భవశ్చ=ఉద్భవము (పుట్టుక) అనెడి కర్మమును, అహమస్మి= నేనైయున్నాను. నారీణాం=స్త్రీలలో, శ్రీః=లోకమాతయగు

---

* ఉద్భవముయొక్క స్థానము మొదలైనవి ముందె చెప్పఁబడియుండుటవలన ఇచట ఉద్భవ మనఁగా, ఉద్భవక్రియమాత్రముగా గ్రహింపఁబడినది. శ్రీ కీర్త్యాదులను ఇచట గుణవిశేషములుగా గ్రహించినయెడల అవి పురుషులకుఁగూడ కలుగును గాన 'నారీణాం' అని చెప్పుట పొసఁగదు. కావున అవి యిచట భగవంతుని యొక్క అసాధారణశక్తులే యగును. వానిలోనెల్ల శ్రీ యుత్కృష్టురాలు గనుక మొదటఁ జెప్పఁబడినది.

లక్ష్మియును, కీర్తిః = కీర్తియును, వాక్చ = సరస్వతియును, స్మృతిః = జ్ఞాపకశక్తియును, మేధా = బుద్ధియును, ధృతిః = ధీరతయును, క్షమా = క్షమ (ఓరిమి)యును, (అహమస్మి = నేనే యై యున్నాను.)

తా. సర్వజంతువుల ప్రాణములను హరించునట్టి మృత్యువు (యమకింకరుఁడు) నేను. పుట్టఁగలవానియొక్క పుట్టుకయనెడికర్మము నేను. స్త్రీలలో లక్ష్మి నేను. కీర్తి నేనె. వాక్కు నేను. స్మృతి నేను. మేధయు నేను. ధృతియు నేను. క్షమయు నేను.

97 98
శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసా మహమ్॥
99 100
మాసానాం *మార్గశీర్షో౽హ మృతూనాం కుసుమాకరః॥

టీ. సామ్నాం = సామగానములలో, బృహత్సామ = బృహత్ అనెడి ఉత్కృష్టమైన గానము, ఛన్దసాం = ఛందస్సుతోఁగూడిన మంత్రములలో, గాయత్రీ = గాయత్రియను ఛందస్సుతోఁగూడిన మంత్రమును, అహం (అస్మి) = నేనైయున్నాను, తథా = అలాగుననే, మాసానాం = ద్వాదశ మాసములలో, మార్గశీర్షః = మార్గశీర్షమును, ఋతూనాం = ఆఱు ఋతువులలో, కుసుమాకరః = ప్రశస్తమైన వసంత ఋతువును, అహం (అస్మి) = నేనైయున్నాను.

తా. సామములలో బృహత్సామము నేను. ఛందస్సులలో గాయత్రి నేను. మాసములలో మార్గశీర్ష మాసము నేను. ఋతువులలో వసంతఋతువు నేను.

---

* మార్గశీర్షము వర్షగర్భాధానకాల మగుటచేతను కేశవాదులు పన్నిద్దఱిలో మొదటివాఁడగు కేశవునిమాస మగుటచేతను వ్రతారంభకాల మగుటచేతను ఉత్కృష్టమైనది.

101
శ్లో॥ *ద్యూతం ఛలయతామస్మి తేజ స్తేజస్వినా మహమ్।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥

టీ. అహం = నేను, ఛలయతాం = వంచనచేయువానిలో, ద్యూతం = జూదమును, తేజస్వినాం = తేజోవంతులయొక్క, తేజః = తేజస్సును, అస్మి = అగుచున్నాను. (జేతౄణాం = జయశీలురయొక్క) జయః = జయము, అస్మి = అగుచున్నాను. (వ్యవసాయినాం = ఉద్యోగము గలవారియొక్క), వ్యవసాయః = ప్రయత్నము, అస్మి = అగుచున్నాను. సత్త్వవతాం = సాత్త్వికులయొక్క, సత్త్వం = సత్త్వగుణము-గొప్పమనస్సు, అహం = నేను.

తా. వంచనాస్పదములగు వ్యాపారములలో అక్షములు (పాచికలు) మొదలగు రూపముగా నుండు జూదము నేను. తేజోవంతులయొక్క తేజము నేను. జయశీలురయొక్క విజయము నేను. ఉద్యోగముగలవారియొక్క ఉద్యోగము నేను. సాత్త్వికులయందు సత్త్వగుణము (గొప్ప మనస్సు కలిమి) నేను.

102
శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనఞ్జయః ।
103 104
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః॥ 37

టీ. వృష్ణీనాం = యాదవులలో, వాసుదేవః = వసుదేవ పుత్రుఁడు, అస్మి = అగుచున్నాను, పాణ్డవానాం = పంచపాండవులలో, ధనఞ్జయః = అర్జునుఁడు, (అస్మి = అగుచున్నాను). అపి = మఱియును, మునీనాం = మననముచేత పరావరతత్త్వముల నెఱిఁగెడి వారలలో, వ్యాసః =

* జూదము అనాయాసముగానే ధర్మవిరోధము లేకయే పరులయొక్క సమస్త ద్రవ్యమును హరించు సాధనమగుటచే ఉత్కృష్టమైనదిగాఁ జెప్పఁబడెను.

వ్యాసుఁడు, అహం = నేను. కవీనాం = విద్వాంసులలో, ఉశనాకవిః = శుక్రుఁ డనెడి విద్వాంసుఁడు, (అహం = నేను).

తా. వృష్ణివంశసంభవులగు యాదవులలో *వాసుదేవుఁడు నేను. (ఇట అర్థాంతరము లేమింజేసియే వసుదేవసూనుత్వము విభూతి యగును.) పాండవులయందు అర్జునుఁడు నేను, మననముచేత అర్థ యాథాత్మ్యము కనుఁగొనువారగు మునులలో వ్యాసమునీంద్రుఁడు నేను. విద్వాంసులలో నీతి నిపుణత్వములచేత ప్రసిద్ధుఁడగు శుక్రాచార్యుఁడు నేను.

105
శ్లో॥ దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్।
106
మౌనం చై వాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్॥ 38

టీ. దమయతాం = శిక్షించువారియొక్క, దణ్డః = శిక్ష, అస్మి = అగుచున్నాను. జిగీషతాం = జయింపఁగోరువారియొక్క, నీతిః = రాజనీతి, అస్మి = అగుచున్నాను. గుహ్యానాం = గోప్యమయినవానియొక్క, గోపనములలో, మౌనం = మౌనము, అస్మి = అగుచున్నాను. జ్ఞానవతాం = జ్ఞానముగల వారియొక్క, జ్ఞానం = తత్త్వజ్ఞానము, అహం (అస్మి) = నేనగుచున్నాను.

తా. నియమము నతిక్రమించినచో దండించునట్టివారియొక్క

---

* వసుదేవపుత్రుఁడు తానే యగుటచేత తానే తనకు విభూతి (అనఁగా నియంతవ్యము) కానేరఁడు. కనుక ఇచట వసుదేవపుత్రత్వమే విభూతి యగును. కేవలము వసుదేవునికొడు కగుటమాత్రముచేతఁగాని అట్లు అవతరించుట మాత్రముచేతఁగాని ఉత్కృష్టత్వము కలుగదు. వసుదేవునింట చతుర్భుజుఁడై పుట్టి ఆగోపాలముగా ప్రసిద్ధమైయున్న అతిమానుషగుణరూపపరాక్రమములను జూపుటంబట్టియే యిచట అతిశయ

దండము నేను. జయింప నిచ్ఛగలవారియందు జయోపాయభూత మగు రాజనీతి నేను. గోప్యములగువానిని దాఁచునట్టి యుపాయము లలో మౌనము నేను. తత్త్వజ్ఞానవంతులయొక్క *జ్ఞానము నేను.

107

శ్లో॥ య చ్చాపి సర్వభూతానాం బీజం త దహ మర్జున।

108

న తద స్తి వినా యత్స్యా న్మయాభూతం చరాచరమ్॥ 39

టీ. హే అర్జున = ఓ యర్జునా, యత్ = ఏది, సర్వభూతానాం = సమస్తభూతములకు, బీజం = ఆదికారణమో, తదపిచ = అదియును, అహం = నేను. యత్ = ఏది, మయావినా = (ఆత్మభూతుఁడైన) నన్ను విడిచి, స్యాత్ = ఉండునో, తత్ = అట్టి, చరాచరం = జంగమస్థావర రూపమయిన, భూతం = భూతసమూహము, నాస్తి = లేదు.

తా. అర్జునా, సర్వావస్థలయం దున్న సమస్తభూతములకును ఆయాయవస్థకు తెలియునట్టియు తెలియనట్టియుకారణము ఏదియో అది నేనై యున్నాను. జంగమస్థావరరూపమైన సమస్త వస్తుసమూహమున †ఆత్మనై నెలకొనియున్న నన్ను విడిచియుండున దొక్కటియును లేదు. 'అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః' అని ప్రక్రమ ముంబట్టి 'న తదస్తి వినాయత్స్యా న్మయాభూతం చరాచరమ్' అను

---

ముగా గ్రహింపఁబడినది. ఇది యర్జునునకుఁ దెలిసియుండియు నిచటఁ జెప్పుట దృష్టాంతముకొఱకని తెలియునది.

* 'భూతానా మస్మి చేతనా' అని పూర్వము చైతన్యమాత్రము చెప్పఁబడి యుండుటవలన ఇచట జ్ఞానమనఁగా పురుషార్థోపయుక్తమైన జ్ఞానవిశేషమని గ్రహింపనది. "తజ్జ్ఞానమజ్ఞానమతోఽన్యదుక్తమ్' ఇతిశ్రుతేః.

† 'అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః' అని భగవంతుఁడు సర్వభూతముల హృదయమునందు ఆత్మరూపు నెలకొనియుండునట్లు ప్రక్రమమునఁ జెప్పఁబడి యుం

నిచ్చుటఁగూడ ఆత్మగా నెలకొనియుండుటయే వివక్షితము. సర్వావస్థలయందుండు సమస్త వస్తుసమూహము ఆత్మభూతుఁడనగు నాతోఁ గూడియుండునని యర్థము. దీనిచేత సమస్తమైన యీ సామానాధికరణ్య నిర్దేశమునకు ఆత్మగా నెలకొనియుండుటె హేతువని ప్రకటించుచున్నారు.

109

శ్లో॥ నాన్తోఽస్మి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప।

110

ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా॥ 40

టీ. హేపరంతప=శత్రువులఁ దపింపఁజేయు నర్జునా, దివ్యానాం=కల్యాణములగు, మమ=నాయొక్క, విభూతీనాం - నియామ్య వస్తువులకు, అన్తః=అంతము, నాస్తి = లేదు. విభూతేః = విభూతి యొక్క, ఏషః=ఈ, విస్తరస్తు=విరివియో, ఉద్దేశతః = సంక్షేపముగా, మయా=నాచేత, ప్రోక్తః=చెప్పబడినది.

తా. అర్జునా, కల్యాణములగు నా విభూతులకు పరిమితి లేదు. ఇప్పుడు నా విభూతి విస్తారమును కొన్ని యుపాధులచే సంక్షేపముగ నీకుఁ జెప్పితిని.

111 అవతారిక

శ్లో॥ యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా।

112

తత్త దే వావగచ్ఛ త్వం మమ తేజోంశసమ్భవమ్॥ 41

---

డుటచే ఈ యుపసంహారమునందును 'మయా వినా' అనుటకు కేవలము 'నన్ను విడిచి' అని యర్థముసేయక 'ఆత్మభూతుఁడగు నన్నువిడిచి' అనియే యర్థము గ్రాహ్యము. తా నన్నిటికి ఆత్మయగుట వలననే తన్నువిడిచి యొక్కటియు నుండఁజాలదనుట. సర్వవస్తువులను సర్వావస్థలయందును ఆత్మయగు తనతోఁగూడియే యుండునని

టీ. విభూతిమత్ = నియామ్యవస్తువులు గలిగినదియు, శ్రీమత్ = కాంతియుక్తమైనదియు-(ధనధాన్యసమృద్ధిగలదియు), ఊర్జితమేవవా = శుభకార్యారంభములందు ఉద్యుక్తమైనదియు నగు, సత్త్వం = భూతసమూహము, యద్యదస్తి = ఏదేది కలదో, తత్తత్ = ఆయా ప్రాణిసమూహ మంతయు, మమ = నాయొక్క, తేజోంశసమ్భవమేవ = నియమనశక్తియొక్క స్వల్పభాగములవలనఁ గలిగినదిగానే, త్వం = నీవు, అవగచ్ఛ = తెలిసికొనుము.

తా. నాకు నియంతవ్యమైయుండు సంపత్తిగలిగి కాంతిచేనొప్పి (లేక ధనధాన్యసమృద్ధమై) కల్యాణకార్యములందుఁ బూనియున్న వస్తు వొక్కొక్కటియు అచింత్యశక్తియుక్తుఁడనైన నాయొక్క 113 నియమనశక్తిలో కొంతభాగమువలనఁ గలిగినదిగా నెఱుంగుము. తేజస్సు - అనఁగా పరులను తనకు క్రిందుపఱచు సామర్థ్యము

114 అవతారిక

శ్లో॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్॥ 42

టీ. అర్జున = అర్జునా, అథవా = లేక, బహునా = విస్తారమయిన, ఏతేన = ఈ(చెప్పబడుచున్న), జ్ఞాతేన = జ్ఞానముచేత, తవ = నీకు, కిం = ఏమిప్రయోజనము. అహం = నేను, కృత్స్నం = సమస్తమైన, ఇదం జగత్ = ఈ జగత్తును, ఏకాంశేన = (నా మహిమలో) స్వల్పభాగము చేత, విష్టభ్య = నిలువఁబెట్టి, స్థితః = ఉన్నాను.

తా. అర్జునా, నీకు నేను చెప్పుచున్న యీ జ్ఞానమును విస్తార

---

భావము. ఇట్లు అన్నిట ఆత్మభూతుఁడై యుండుటయే అన్నింటితోడ సామానాధికరణ్య నిర్దేశమునకు హేతువగును గాని మఱొకటి హేతువుకానేరదని తెలియఁ జున్నది.

115
ముగాఁ జెప్పుచుండుటచే ప్రయోజనమేమి ? (సంగ్రహముగాఁ జెప్పె
దను.) కార్యావస్థయందుఁగాని కారణావస్థయందుఁగాని సూక్ష్మముగాఁ
గాని స్థూలముగాఁగాని యుండు చిదచిదాత్మకమైన యీ జగము
116
నంతయు, స్వరూపమునందును స్థితియందును ప్రవృత్తి విశేషములం
117
దును నా సంకల్పము నతిక్రమింపకుండునట్లు నా *మహిమయుండలి
118 119
పెక్కు వేల భాగములలో నొక్క భాగము వలన నిలువఁబెట్టుకొని నే
నున్నాను. ఇట్లే పరాశరులు 'యస్యాయుతా యుతాంశాంశే విశ్వ
120
శక్తి రియం స్థితా' అని చెప్పియున్నారు.

ఇతి శ్రీ భగద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతి
యోగోనామ దశమోఽధ్యాయః
121. గీతార్థ సంగ్రహము.

---

* ఇచట మహిమ అనఁగా పూర్వోక్తనియమనశక్తి. 'వికాంశ' అనుచో 'ఏక' అనుటకు అత్యంతస్వల్పమని యర్థము గ్రహించుటవలన పెక్కువేల భాగములలో నొక్కటి యని సిద్ధించినది.

(2) అజం = కర్మకృతజన్మలు లేనట్టి వానినిగాను.

(3) అనాదించ = ఆదిలేని వానినిగాను.

(4) లోకమహేశ్వరం = లోకేశ్వరుల కీశ్వరునిగాను, వేత్తి = తెలుసు కొనుచున్నా, సం = వాడు.

(5) సర్వపాపైః = సమస్త పాపములనుండియు, ప్రముచ్యతే = పూర్తిగ విడువబడుచున్నాడు.

(1) ఇతరులతో నన్ను సజాతీయునిగా దలంచి భ్రమింపని వాడు –

(2) అచేతనమైన ప్రకృతి యనేక వికారములను చెందును. చేతనుడైన జీవుడు నిత్యుడైనను కర్మకృతమైన అచిత్సంబంధము వలన పుట్టుచున్నాడు. కాబట్టి సంసారిచేతనునకు కర్మకృతమైన అచిత్సంబంధము జన్మము. పుట్టనివాడు గదా అజుడు. దీనిచేత అజుడనగా వికరించుటయే స్వభావముగాగల అచిత్తుకన్నను, దానితో సంబంధముగల బద్ధునికన్నను భగవంతుడు విజాతీయుడని చెప్పబడినది.

(3) ఆదిలేని అజత్వముకలవాడు. అనగా ముక్తునికన్న విలక్షణుడు. ముక్తుని అజత్వమునకు ఆది=మొదలుకలదు. ఏలనన – వాడు పూర్వము అచిత్సంసర్గమువలన జన్మలెత్తియెత్తి చివరకు దానిని విడచి ముక్తుడైన నాటినుండియే పుట్టుకలేకుండుటను పొందును. ఈశ్వరుని యజత్వమునకు ఆదిలేదు గాన నాతడు అనాదియైన అజుడు. ముక్తునకు పూర్వము హేతుసంబంధ ముండుటచే దాని కర్హుడే యగును. ఈశ్వరుడన్నో దాని కనర్హుడు. "ఇట్లు నిరవద్యం" మొదలగు శ్రుతులు చెప్పుచున్నవి.

(4) రాజులు మొదలైనవారు ఏదోయొక పుణ్యవిశేషమువలన లోకుల కధిపతులైనను నిజమునకు వారు లోకులకు సజాతీయులే

యగుచున్నారు - నేనట్లుగాక వారిని యేలుకొను స్వభావమును కలి వాడను. కావున నేను వారికంటె విలక్షణమైనవాడను - ఇట్లు అంగువాడు.

(5) మోక్షమునకు విరోధులగు సమస్త పాపములచేతను -

*జీవునకు ముక్తదశలో నచిత్సంబంధము లేదు. కాబట్టి సంసార దశలోనున్న జీవునిబట్టి పరమాత్మకు వైలక్షణ్యముండిన నుండుగాక - అంతియగాని ముక్తుని కన్నను విలక్షణు డెట్లగును. అను శంకను "దాని కర్తృడే"యనుట పరిహరించుచున్నది.

దాని భావమేమనగా -

జీవునకు ముక్తదశలో నచిత్సంబంధము లేకున్నను ఆతనికి హేయ సంబంధ యోగ్యత మాత్రము లేకపోదు. యోగ్యతయనగా - సహ కారులున్నప్పుడు కార్యముండుటయును అవి లేనప్పుడు కార్యము లేకుండుటయును - చేతనమునకు సహకారులు ప్రకృతి - కర్మయున్ను. అవి యున్నప్పుడు బద్ధత్వమున్ను అవి లేనప్పుడు ముక్తత్వమున్ను గదా నుండునవి. అందుచేనాతనికి హేయసంబంధార్హత్వమున్నట్లే. కాల విశేషముతో సంబంధములేని నిరవద్యత్వముండునది నారాయ ణున కొక్కనికే - ఈ విషయమునే 'నిరవద్యం' అను శ్రుతి తెలుపు చున్నది.

ఈ శ్లోకమున - మర్త్యేషు అనుచోట సప్తమీవిభక్తి నిర్ధార ణార్థమున వాడబడినది. దేవతలచేగాని మనుష్యులచేగాని లభింప శక్యముకాని జ్ఞానము మందమతులగు మనుష్యులకున్నదనిన నది యెవనికో యొకనికి భాగ్యవిశేషమువలననే కలిగినదనవలెను గదా!

(8) శ్లోకమున - అసమ్మూఢః - అనుచో -

సమ్మోహప్రసంగ మున్ననుగదా దానిని నిషేధించుట 'ప్రసక్తస్యహి ప్రతిషేధః' అనిగదా న్యాయము? - సంమోహమే భగ

వంతునకు లేనప్పుడు ఇక నిషేధమేల ? సమ్మోహముండుట కాలోక మహేశ్వరుడు కాన్పించిన గదా! కాన్పించకున్న నిక సమ్మోహ మెట్లు ? అది లేనిచో నిషేధమెట్లు ?

మరియు - బ్రహ్మరుద్రాదులుండగ పరమపురుషుడే లోక మహేశ్వరు డెట్లగును. మరియును బద్ధులకన్నను నిత్యులకన్నను - విలక్షణుడైన కావచ్చును గాని నిత్యులకన్న విలక్షణు డెట్లగును. అను నా శంకలకు పరిహారముగా 'అనగా' అను గ్రంథము ఆరంభ మగుచున్నది.

ఈ గ్రంథముయొక్క అభిప్రాయమేనగా - పైశంకలనన్నిటిని పరిహరించుటయే. అది యెట్లన - మనుష్యులకు ప్రభువులును దేవత లకు ప్రభువులును ఎట్లు తాము గావించిన పుణ్యవిశేషముచే పరిమిత దేశమున పరిమితకాలములో పరిమిత భోగములను అనుభవింతురు గాక యని భగవంతుడు సంకల్పించుటచే వారట్లు ప్రభువులై ఆయా పదవులను నిర్వహించుకొనుచు ఆయా భోగముల ననుభవించు చున్నారో అట్లే అండాధిపతులును అనుభవించుచున్నారు. కాని యవధిలేని యైశ్వర్యానుభవము శ్రియఃపతియగు నారాయణున కొక్కనికే.

(9) లోకమహేశ్వరం -

ఇట్లనుటచే సంకోచము లేకయే సమస్త విషయనియమన రూప మైన ఐశ్వర్యము అభిప్రేతముగాన నిత్యులుకూడ నియామ్యకోటిలో చేరుటచే వారికన్నను విలక్షణమైనవాడని తెలియబడుచున్నది.

రుద్రుని యైశ్వర్యము సహజమైనదని కొన్ని ప్రకరణములలో వినుపించుచున్నది. దానికాతని జన్మ మొదలుకొని యున్నదని యర్థ మును జెప్పవలెను. కాని యనాది సిద్ధమైనది కాదు. అట్లన్నచో ప్రమాణ విరోధ మేర్పడును.

భారతమున - శాంతి పర్వమునందు -

మహాదేవ స్సర్వమేధే మహాత్మా
హుత్వాత్మానం దేవదేవో బభూవ॥

మహానుభావుడైన శివుడు సర్వమేధమను మహాయజ్ఞమును చేసి యందు తననే యాహుతి చేసుకొని భగవదనుగ్రహపాత్రుడై దేవదేవుడయ్యెనని యుండుటచే నది యనాదిసిద్ధముకాదు.

4, 5 శ్లోకములు

(9) **క్షమా** = ఓర్పు మానస్సునకు వికారమును కలిగించు కారణమున్నను అది వికారమును పొందకుండుట. కోపహేతువుండి నను పరులకు దుఃఖమునకు (అహితమునకు) తాను హేతువు కాకుండుట.

ఈ క్షమానివారణలో నొక ప్రశ్న ఉదయించుచున్నది. కారణముండగ కార్యమెట్లు పుట్టకుండును? అట్లు పుట్టకున్నచో నది కారణ మెట్లగును? అన్నచో, కారణమున్నంత మాత్రమున కార్యము పుట్టవలెనన్న నియమము లేదు...మణిమంత్రౌషధులచే నగ్నియొక్క దహనశక్తి యరికట్టబడుటలేదా ? ప్రతిబంధకములు లేకుండవలెను గదా ? కాబట్టి ప్రతిబంధకములు లేక కారణమున్నప్పుడు కార్యము పుట్టకుండుట దోషము. లేనిచో కారణముల కాటంకము లున్నను కార్యములు పుట్టుచునే యున్నచో కార్య మెల్లప్పుడును అంతటను పుట్టుచునే యుండవలసియుండును. అట్టితరి క్షమకు ప్రతిబంధకము కోపము. అది యుండగా క్షమపుట్టదు. కాని మణి మంత్రాద్యవష్టంభనచే నిప్పును తాకినను బొబ్బపుట్టనట్లు ప్రబలమైన వివేకమనెడు ఆటంకమున్నచో నరికట్ట శక్యముకాని, కోపకారణమున్నను స్తంభింప చేయబడును.

(10) సత్యపద వివరణలో -

చూచినది చూచినట్లుగాను ప్రాణులకు హితముగాను పలుకుటకు అనుగుణమైన మనోవ్యాపారము.

ఈ సత్యపద వివరణలో 'చూచినది చూచినట్లు' అని చెప్పబడెను. వస్తువుయొక్క నిజస్వరూపము నెఱుంగుటకై యథార్థదర్శనమనివార్యముకాని తాను చూచినదానిని చూచినట్లు చెప్పుటలో వక్తకు దోషమేమి ? భ్రమవైవాగతము గదా ! పరమార్థమైనను పరానర్థహేతువైన దానిని సత్యమని వ్యవహరించరాదు.

'సత్యంభూతహితం ప్రోక్తం' అని గదా దాని లక్షణము.

ఇచ్చట నొక ముఖ్యవిషయమును జ్ఞాపకముంచుకొనవలెను.

సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాత్ ।
నబ్రూయాత్సత్య మప్రియమ్
ప్రియంచ నానృతం బ్రూయాత్ ।
ఏషధర్మ స్సనాతనః॥

సత్యమునే పలుకవలెను. అది వినువారికి ప్రియమైననే చెప్పవలెను. అప్రియమగుచో నడగక నిజమైనను నుడువరాదు. ప్రియమునే చెప్పవలెనుగదా యని అసత్యమును కల్పించి చెప్పరాదు. ఇది సనాతన ధర్మము.

(11) భయము - రాబోవు దుఃఖమునకు హేతువులైన వానిని చూడగా, ముందే కలుగునట్టి దుఃఖము - రాబోవు అనర్థమును తలంచుకొనుటయే భయమని భయమునకు లక్షణమును చెప్పినను ఆ తలంపే (జ్ఞానమే) మనకు ప్రతికూలమైనదగుటచే నదియే దుఃఖమనబడును. అంతియకాని మన సిద్ధాంతమున దుఃఖమను నొక గుణము నంగీకరించలేము. అనుకూలజ్ఞానమే సుఖము. ప్రతికూలజ్ఞానమే దుఃఖము.

(12) అహింస = పరులదుఃఖమునకు కారణము కాకుండుట. అహింసను వివరించుటలో 'పరుల దుఃఖమునకు కారణముకాకుండుట'

అని భాషించిరి. ఇచ్చట దుఃఖశబ్దమునకు అహితమని యర్థమును గ్రహించవలెను. వైద్యుడు మన హితముకొఱకై కొంతబాధను కలిగించినను దానిని హింసయనముకదా !

(13) తుష్టిః - సకల ఆత్మలవిషయమై సంతోషించు స్వభావమును కలిగియుండుట. ఆత్మకంతటను సంతోషమే స్వాభావికముగా ప్రాప్తించునది, కాని కొన్ని పదార్థములయందు కర్మయనెడు ఉపాధివలన ప్రతికూలబుద్ధి పుట్టును. దానివలన వైరాదులు జనించు నంతియే.

(14) దానము =తనకు భోగ్యములైన వస్తువులను అన్యుల కిచ్చుటకు అనుగుణమైన మనోవ్యాపారము. దీనినే భాష్యకారులు - ప్రతిపాదనమనిరి. ప్రతిపాదనమనగా-ఆ వస్తువునందు తన స్వత్వమును వీడి ఇతరుల స్వత్వము నాపాదించుట.

ఈ శ్లోకమున "బుద్ధిః జ్ఞానం" అని రెండును పర్యాయపదముల వలె భాసించి పునరుక్త దోషమును స్ఫురింపచేయును. అది సరికాదు.

"బుద్ధిమత్వా జ్ఞానాతి" అను ప్రయోగము కలదు. దీనినిబట్టి జ్ఞానమునకు బుద్ధి హేతువు గాన రెండింటికిని కార్యకారణభావము తెలియుచున్నది.' బుధ్యతే అనయా ఇతి బుద్ధిః అని వ్యుత్పత్తిని చెప్పి బుద్ధికి కారణత్వమునకు జ్ఞానమునకు కార్యత్వమును నెఱుంగవలెను.

మఱియు జ్ఞానము భ్రమ ప్రమ సాధారణము. బుద్ధి నిశ్చయాత్మకము అనియు భేదముకలదు. "మయిబుద్ధిం నివేశయ" అను చో బుద్ధి అధ్యవసాయపరముగా వ్యాఖ్యానింపబడెను.

7వ శ్లోకము

(15) విభూతి యనగా = ఐశ్వర్యము - అనగా - సర్వము తన యధీనమైన ఉత్పత్తిస్థితి ప్రవృత్తులను కలిగి యుండుట. (సర్వనియమనశక్తి) అట్టి వస్తువులను. యోగమనగా -

యుజ్యత ఇతియోగః - కల్యాణగుణ సంపత్తి, దుర్గుణ దూరుడును కల్యాణగుణాకరుడు నగుట.

10వ శ్లోకము

(16) ఈ శ్లోకమున 'ప్రీతిపూర్వకం' అను పదమును 'భజతాం' అను పదముతో చేర్చక 'దదామి' యను పదముతో చేర్చి యన్వయించవలెను.

భజనమనగా - 'ప్రీతిపూర్వ మనుధ్యానం'. కాబట్టి దాని యందే ప్రీతికలదుగాన దానితో నన్వయించుట పునరుక్తమగును. కావున 'దదామితో' నన్వయించినచో భజనఫలమును తెలుపును. దానిచే భగవంతుని ఔదార్యము ప్రకాశించును. అందుమూలమున నీ పదమునకు మహత్తరమైన ప్రయోజనము సిద్ధించును.

11వ శ్లోకము

(17) అనుకంపనమనగా - వారి యనిష్టములను బోగొట్టి యిష్టములను ప్రసాదించుటకు కారణమైన భగవదనుగ్రహము. దీనినే ముందు 11వ అధ్యాయమున ఆరంభమునందే "మదనుగ్రహాయ" అని చెప్పెను.

(18) ఈపదముచే ననుగ్రహించుటకు కారణభూతములైన జ్ఞానశక్తి కారుణ్యాదులతోను దివ్యమంగళవిగ్రహాదులతోను కూడి యుండుట సూచింపబడుచున్నది.

(19) తమస్సనగా - విషయాన్తర ప్రావణ్యము. కర్మవలన బుట్టి భగవత్సాక్షాత్కారమనెడు వెలుగు నరికట్టు తమస్సనగా విషయ ప్రావణ్యమే యగును. నిరతిశయ భోగ్యమైన భగవద్జ్ఞానము ఇతర భోగ్యవస్తువుల యందలి యాసక్తిని మాన్పుట మంచిదే.

స్థితేఽరవిన్దే మకరన్ద నిర్భరే।
మధువ్రతో నేక్షురకంహి వీక్షతే॥

12, 13 శ్లోకములు

(20) ఈరెండు శ్లోకములచే నర్జునుడు భగవద్విభూతి విస్తారముగా - వినకుతూహలము కలవాడైనను సంగ్రహముగా నింతవరకు భగవాను డానతిచ్చిన విషయములు తెలిసినవనియు నవియన్నియు నిజమని నమ్మితిననియును చెప్పుచు తన యనసూయతను సూచించు చున్నాడు.

(21) ఎవనినుండి యీ చరాచరములన్నియు జన్మించు చున్నవో జన్మించిన వన్నియును ఎవనివలన జీవించుచున్నవో ఎవని యందు నిమగ్నమై విలీనమగుచున్నవో. దానినే పరబ్రహ్మమని తెలిసికొనుము.

(22) బ్రహ్మ నుపాసించువాడు బ్రహ్మ సాయుజ్యమును బడయుచున్నాడు.

23. (ఎ) ఎవడా పరంబ్రహ్మ నుపాసించునో వా డాపరం బ్రహ్మ సాయుజ్యము నే బడయును.

23. (బి) దీని కూర్ధ్వముగా నుత్కృష్టమైన నే దివ్యజ్యోతి వెలుంగుచున్నదో.

(24) పరంజ్యోతిస్స్వరూపుడగు పరమాత్మను పొంది తన యసాధారణములగు అష్టగుణములతో ప్రకాశించుచున్నాడో.

(25) ప్రకాశమానమైన సూర్యచంద్ర అగ్నితారకలను కూడ ప్రకాశింపచేయు పరంజ్యోతి స్స్వరూపుడు.

(26) తామరాకునందు నీరంటనటుల భగవదుపాసకులకు కర్మలు బంధకములు కావు.

(27) నిప్పునబడిన దూదివలె భగవదుపాసకుని పాపము లన్నియును నశించిపోవుచున్నవి.

(28) నారాయణుడే పరంబ్రహ్మ యనబడువాడు, పరతత్వము నాతడే. పరంజ్యోతి స్స్వరూపుడు నాతడే. పరమాత్మ ఆ నారాయణుడే.

(29) వేదవేత్తలగు బ్రాహ్మణోత్తములును, అధ్యాత్మజ్ఞాన సంపన్నులును శ్రీకృష్ణుని మహాత్ముడనియు సనాతన ధర్మస్వరూపు డనియు చెప్పుచున్నారు. ఈ గోవిందుడు పవిత్రమైన వస్తువు లన్నిటికిని పవిత్రత నాపాదించువాడు. పుణ్యమగు వస్తువులకు పుణ్యము నిచ్చువాడు. మంగళవస్తువులకు మంగళావహుడు. పుండరీక నయనుడును దేవతలకు దేవుడును. అనాది పురుషుడును - ఇతర ప్రమాణములచే తెలియ నశక్యుడుగాని స్వభావము కలవాడును నగు నారాయణుడు మూడు లోకములకు నంతరాత్మగానుండి వానిని తనకు శరీరములుగా కలిగియున్నాడు.

(30) ఈ శ్రీకృష్ణుడు పాలసముద్రమునందు శేషశయ్యపై పవళించియున్న అవతారకందమగు శ్రీమన్నారాయణుడే. సాధుపరిత్రాణ ప్రధానోద్దేశముతో శేషతల్పమును విడిచి మధురాపట్టణమునకు విజయం చేసెను.

మధుసూదనుడు వేంచేసియుండు ద్వారకానగరము పుణ్యక్షేత్రము. ఈతడు సాక్షాత్తుగా దేవుడు, పురాణపురుషుడే, మరియు శరీరమును ధరించిన సనాతన ధర్మస్వరూపుడే.

(31) దేవుడును, పరమాత్మయు సనాతనుడును నగు నారాయణు డెచ్చటనుండునో అచ్చట సమస్త జగత్తులును, పుణ్యతీర్థములును, దేవాలయములును ఉండును. ఆయనే పుణ్యము. ఆతడే పరంబ్రహ్మ - ఆతడే తీర్థము. ఆయనయే తపోవనము. అచ్చటనే దేవర్షులు, సిద్ధులు, సకల తపోధనులుందురు. ఆదిదేవుడును మహాయోగియు నైన మధుసూదను డెచ్చటనుండునో అది పుణ్యములకు పుణ్యము నిచ్చునది. ఇందుసందేహములేదు. శ్రీ కృష్ణుడే లోకములన్నిటిని సృష్టించువాడు. చరాచరాత్మమైన ప్రపంచమంతయు నాతనికి శేషభూతమైనది.

"బ్రహ్మవేద బ్రహ్మైవభవతి" యనుచోట -

రెండుపదార్థముల ప్రకార మేకరీతిగనున్నచో రెండింటిని యభే దముగాజెప్పుట ముఖ్యమే - ఉదా : 'సోఽయం గౌః' అనునట్లు - అనగా - ఈ యెద్దున్ను ఆ యెద్దున్ను ఒకేవిధముగా నున్నవనియే దానియర్థము, అటులనే సకలసంబంధ వినుర్ముక్తుడగు జీవుడు బ్రహ్మ తోను సదృశుడగునని శ్రుతులు బోధించుటచే జీవుని బ్రహ్మయే యనుట ముఖ్యమేగాని లాక్షణికము కాదు.

'సోఽయం గౌః' అను దృష్టాంతమున్ను సాధర్మ్యమును నిమి త్తముగా జేసుకొని చెప్పబడినది మాత్రమే. కొందరు 'బ్రహ్మైవభవతి' యనుచోట ఏవకారమునకు "ఇవ త్వద్వేవమేవ' యని కోశముండు టచే - ఇవశబ్దమునకు పర్యాయపదమగుటచే నా యర్థమునే జెప్పి నందురు - ఇందులకు - "వైష్ణవ మాలభేతస్పర్ధమానో విష్ణురేవ భూత్వా ఇమాన్ లోకానభిజయతి" అని శ్రుతిప్రయోగమును జూపు చున్నారు.

ఈ శ్రుతిలోని ఏవకారమునకు ఇవార్థమును జెప్పినగాని ప్రక రణవిరోధము వచ్చును ఏలనన -

ఏవకారమున కభేదమే యర్థమును జెప్పినచో ఒకసంసారి పశుయాగమొనరించినంతనే విష్ణువే యగునా ? మరియు స్పర్థించు వానికి మోక్షాధికార ముండునా ? ఇచ్చట విష్ణువే అయిపోవునని యంతమాత్రమే ఫలముజెప్పబడినదా ? లేదే. 'ఇమాన్ లోకాన్ అభిజయతి' యని సాంసారికఫలము జెప్పబడినదే.

కాబట్టి పరాక్రమాది గుణసంపన్నుడై విష్ణువంతవాడై ఈ లోకముల నన్నిటిని తన స్వాధీనములో నుంచుకొనును అనిమాత్రమే ఆ మంత్రమున కర్థము;

అందుచే 'బ్రహ్మైవభవతి' యను నీ సామానాధికరణ్యము సాధర్మ్యమును పురస్కరించుకొని వచ్చినది మాత్రమే. 'పరమం సామ్యముపైతి' యని శ్రుతియును 'మమసాధర్మ్యమాగతాః' అని స్మృతియును చెప్పుచున్నవి గదా!

ఈ శ్లోకమున 'పరంధామ' యని కలదు -

ఈ ధామశబ్దమునకు తేజస్సనియు, స్థానమనియును అనేకార్థములున్నవి. కాని ఇచ్చట తేజస్సనియు యర్థమును జెప్పవలెను. స్థానమని చెప్పరాదు.

(1) ఏలనన — ఈశబ్దమునకు పరంధామ భవాన్ అని పరమాత్మను బోధించు భవచ్ఛబ్దముతో సామానాధికరణ్యము గాన్పించుచున్నది.

(2) ఇతరవస్తువులతోటి సామానాధికరణ్యము గల పదములతో సహపాఠము లేక భగవంతునితో సామానాధికరణ్యముగ నన్వయించు పదములతోటి మాత్రమే దీనికి సహపాఠము గాన్పించుచున్నది.

(3) భగవంతునకు - భాష్యకారులు ప్రమాణీకరించిన శ్రుతులచే చెప్పబడిన పరత్వమును ప్రకాశింపజేయు తాత్పర్యముతో ప్రయోగింపబడినది. కాబట్టి యీ శబ్దము స్థానాద్యర్థ పరముగాక తేజః పరమనియే సిద్ధాంతము.

నారాయణ పరం బ్రహ్మతత్వం నారాయణః పరః । నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః । అను రెండు వాక్యముల ప్రారంభమున నున్న - "నారాయణపరం - నారాయణపరః" అను పదములను సంప్రదాయా నభిజ్ఞులందరు పంచమీ తత్పురుషగా భావించి నారాయణునికంటె వేరొక తత్వమున్నది దానినిగురించి యీశ్రుతియని వదరుదురు. అది యెంతయో యసంగతము - ఆ శబ్ద

ములు లుప్తవిభక్తికములు- ప్రథమావిభక్తి లోపించినది. 'నారాయణః పరంబ్రహ్మ । నారాయణః పరోజ్యోతిః' అనియే వ్యస్తముగా అన్వయించుకొనవలెను. ఆ వాక్యములలో సమస్తపదములు లేవు. అన్నియును వ్యస్తములే. వాటితో సహపఠితములగుటచే నివియును ప్రథమాంతములుగను వ్యస్తములుగను నుండవలెను. ఇతర శ్రుతులలో గూడ (మహోపనిషత్తు) 'నారాయణః పరంబ్రహ్మ' యని ప్రథమాంతముగను వ్యస్తముగనే ప్రయోగింపబడినది. కాబట్టి సమస్త పదముగ జెప్పిన సకలశ్రుతి స్మృతిసూత్రములతో విరోధము తప్పదు-

ఆపైన ఉత్తరార్థముచే - ఇట్లు శ్రుతిసిద్ధమైన అర్థమే స్మృతీతిహాసపురాణ రూపములైన మహర్షుల సూక్తులచేతను, శ్రుతివలెనే స్వతః ప్రమాణ మనదగిన సర్వజ్ఞుడగు సర్వేశ్వరుని సూక్తిచేతను సిద్ధమగుచున్నదని చెప్పబడుచున్నది.

ఈశ్లోకము ఉత్తరార్థమున - 'పురుషం శాశ్వతం దివ్యం' అని పాఠక్రమమును విడిచి శ్రీ భాష్యకారులు 'శాశ్వతం దివ్యం పురుషం' అని క్రమమునేల మార్చిరనగా -

'పాఠక్రమాదర్థక్రమో బలీయాన్' అను న్యాయానుసారముగా యీ మార్పువలన నొక విశేషార్థములభించుననియే - అది ఏదనగా-

పరమపదమునందున్న పురుషునకు "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అని పురుషసూక్తమున జెప్పబడిన అమృత త్రిపాద్విభూతి విశిష్టవేషముతో శాశ్వతత్వము బోధించబడవలెనని యే పదములు ప్రయోగింపబడినవని సూచించుటకే -

ఆదిదేవం=అను పదము -

ఆదిశ్చాసౌ దేవశ్చ యని కర్మధారయసమాసము ఆది =అనగా జగత్కారణభూతుడు.

దేవః=జగద్వ్యాపారమును ఆటగా కలవాడు అని యర్థము -

కావునసే - విష్ణుపురాణమున - 1-2-18 శ్లోకములో
వ్యక్తం విష్ణుస్తథావ్యక్తం పురుషః కాలఏవచ ॥

క్రీడతో బాలకస్యేవ చేష్టాంతస్య నిశామయ ॥

సృష్టిలోని పదార్థములు, సృష్టికిపూర్వమందున్న పదార్థములు, చేతనులు, కాలము సమస్తమున్ను విష్ణ్వాత్మకములే. ఆటలాడు పిల్లవానికి వలెనే యీ సృష్ట్యాది వ్యాపారములు పరమాత్మకని యెఱుంగుము అనియు భారతమునందును -

మోదతే భగవాన్ భూతైః
బాలః క్రీడనకై రివ ॥

పిల్లవాడు ఆటబొమ్మలతోవలెనే శ్రీమహావిష్ణువు పంచభూతములతో నాడి ప్రసన్నుడగుచున్నాడు అనియు -

బ్రహ్మసూత్రములో (2-1-33)
'లోకవత్తు లీలా కైవల్యమ్'

అవాప్త సమస్తకాముడును పరిపూర్ణుడునగు నారాయణునకు తన సంకల్పము మాత్రముచేతనే భోగ్యభోగోపకరణ భోగస్థానముగ నుండు వివిధ విచిత్ర చిదచిన్మిశ్రజగత్తుయొక్క సృష్టితో లీలయే ప్రయోజనము ఎట్లనగా - లోకవత్ - సవేలసంపత్సంపన్నుడగు సార్వభౌముడు బంతియాటలు మొదలగునవి కేవల క్రీడార్థమేగదా! అట్లే పరమపురుషునకును జగజ్జన్మస్థితిధ్వంసాదులు -

కావునసే భాష్యకారులు - 'అఖిల భువన జన్మస్థేమ భఙ్గాదివతే' యని సాయించిరి -

ఇట్లు చెప్పుటచే దేవజాతికి చెందిన బ్రహ్మాదులున్ను భగవంతునికి లీలాపరికరభూతులనియును, పుట్టుక గలవారనియును చెప్పబడినది.

నారాయణా ద్బ్రహ్మాజాయతే-నారాయణాద్రు ద్రోజాయతే-ఏకోహ్వై నారాయణ ఆసీత్ 'నారాయణోపనిషత్' 'న బ్రహ్మానేశానః' అనియు -

అనగా - నారాయణుని నుండియే బ్రహ్మ - రుద్రుడును బుట్టుచున్నారనియు - సృష్టికి పూర్వము ఒక్క నారాయణుడే గాని బ్రహ్మ - రుద్రులు లేరనియును -

'తస్మాచ్చ దేవా బహుధా సమ్ప్రసూతాః' ముణ్డకోపనిషత్. ఆ నారాయణుని నుండియే దేవయోని విశేషములన్నియును - జన్మించినవనియును, వేయేల. హరివంశమునందును శ్రీకృష్ణ కైలాస యాత్రా ఘట్టమున రుద్రుడు శ్రీకృష్ణునిగూర్చి చేసిన స్తోత్రమున - (132-48).

'క ఇతి బ్రహ్మణో నామ ఈశో౽హం సర్వ దేహినాం ।
ఆవాంతవాఙ్గే సమ్భూతౌ తస్మా త్కేశవనామవాన్'
అని కేశవశబ్దమును నిర్వచించుచు -

కశ్చ ఈశశ్చ = కేశౌ = తౌ అన్య స్తః ఇతి కేశవః — అనగా కశబ్దమునకు బ్రహ్మ అర్థము. నేను ఈశుడను. మే మిరువురము నీ శరీరమునుండి పుట్టితిమి. కావున నీవు కేశవుడవైతివని స్వయముగ రుద్రుడే జెప్పెను.

ఇది శృతులలోని కారణవాక్యార్థము.
ఇది శోధకవాక్యార్థమున కుపలక్షణము.

'అజం = విభుమ్' ఇది శోధకవాక్యసమానార్థకము. శోధక వాక్యమనగా - పరమాత్మకు కారణత్వము చెప్పబడినతోడనే జగత్తున కారణ పదార్థములకున్న దోషములు పరమాత్మ కుండునేమో అని ఆశంక జనించును. దానిని పరిహరించు వాక్యము.

ఈ పదము లాపనినట్టు చేయుచున్నవో చూడుడు. అజమ్ = కర్మవలన వచ్చునట్టి జన్మలు లేనివాడు. లేక నిర్వికారస్వరూపుడు.

విభుమ్ = ఆకాశమువలె సర్వత్రనుండువాడు.

నిత్యమైనవాడున్ను -
లేక సర్వనియామకుడు.

దీనిచే అంతర్యామి బ్రాహ్మణాదులలో జెప్పబడిన కారణత్వాదుల కుండవలసిన వ్యాప్తి నియమనాదులు సూచింపబడినవి.

బ్రహ్మర్షిః నారదః = ఋషయః సర్వే అనినంతనే సర్వులలో నారదుడు చేరినను అప్రతముడని తెలుపుటకై నారదులు వేరుగ జెప్పబడిరి. నారదునకు దేవర్షి యని విశేషణముంచుటచే జాతిచేతను యీతడు సర్వోత్తముడని తెలియుచున్నది. దేవర్షులలోను కూడ 'దేవర్షీణాంచ నారదః' యని ప్రత్యేక భగవద్విభూతిగా పేర్కొనబడుటచే నింకను ప్రకర్ష కలదు.

అసితః = దేవలుడు అసితుని తండ్రి.

యేచ వేదవిదో విప్రాః । యేచాధ్యాత్మ విదోజనాః॥
తే వదన్తి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనమ్॥

అను శ్లోక విశేషార్థము.

వేదవిదః - కర్మభాగముయొక్క తత్త్వము నెఱింగినవారు.

అధ్యాత్మవిదః వేదాంతార్థ తత్త్వము నెఱింగినవాడు.

మహాత్మానం = సర్వాతిశయమైన పరమైశ్వర్యము మొదలగునవి కలవాడు.

లేక - మహాంశ్చాసావాత్మేతి మహాత్మా = పరమాత్మ యని యర్థము.

పరమాత్మ యనగా తాను స్వేతర సమస్త చేతనాచేతనాత్మక ప్రపంచమునకును ఆత్మగానుండువాడేగాని తనకు వేరొక ఆత్మకలవాడు కాడు.

సనాతనం ధర్మం=అని ధర్మమునకు సనాతనం అని విశేష ణము చేర్చబడినది.

ధర్మమనగా - యాగదానహోమాదులు. అవి దేశముచేతను, కాలముచేతను పరిమితమగు ఫలములనే యిచ్చునవి. అవి యును అనిత్యములే. శ్రీకృష్ణ ధర్మమన్ననో నిత్యమున్ను నిరతిశయ మును నగు ఫలము నిచ్చువాడు. తానును నిత్యముగా నుండువాడు.

పవిత్రాణాం హి గోవిన్దః పవిత్రం పరముచ్యతే।
పుణ్యానామపి పుణ్యోఽసౌ। మఙ్గళానాంచ మఙ్గళమ్।
త్రైలోక్యం పుణ్డరీకాక్షో దేవదేవ స్సనాతనః।
ఆస్తే హరిరచిన్త్యాత్మా తత్రైవ మధుసూదనః॥

ఈ శ్లోకములోని పవిత్ర శబ్దమునకు -

ఇచ్చట పవిత్రశబ్దము పాపవినాశకరమను నర్థములో వాడ బడినది.

పుణ్యశబ్దమునకు ఇష్టమగు ఫలమునకు సాధనమని యర్థము.

మఙ్గళ శబ్దమునకు - తన సాన్నిధ్యముచేతనే గొప్పసమృద్ధిని చేకూర్చు శుభకరమైన వస్తువని యర్థము.

త్రైలోక్యం పుణ్డరీకాక్షః=అను నీయభేదనిర్దేశమునకు నారా యణుడు మూడులోకములకు కారణభూతుడనిగాని మూడులోకము ములను శరీరముగా కలవాడని గాని యర్థము.

త్రయోలోకాః త్రైలోక్యం=బద్ధులు, ముక్తులు నిత్యులు లేక భూమి మొదలగు ఊర్ధ్వలోకములకు ఉపలక్షణము.

పుణ్డరీకాక్షః — అనుటచే అన్తరాదిత్య విద్యలో జెప్పబడిన దివ్యమఙ్గళ విగ్రహము సూచింపబడినది.

'తస్యయథాకప్యాసం పుణ్డరీక మేవమక్షిణీ' అను శ్రుతి

వాక్యమునకు ద్రమిడభాష్యకారులు సెలవిచ్చిన ఆరు అర్థములలో శ్రీ భాష్యకారులు సిద్ధాంతముగా స్వీకరించిన మూడర్థములకు సారమైన గంభీరాంభ స్సముద్భూత సుమృష్టనాళరవికరనికరవికసిత పుండరీకదళామలాయతేక్షణుడు అని యర్థము.

నారాయణ - పదముచే కేవలపరతత్వ నిర్ణయమునకే ఏర్పడిన నారాయణానువాకము సూచింపబడుచున్నది.

14వ శ్లోకము

(32) శ్రీ విష్ణుపురాణమున పరాశర మహర్షి భగవచ్ఛబ్దార్థము నీ క్రిందివిధముగా సెలవిచ్చెను.

శ్లో॥ జ్ఞానశక్తి బలైశ్వర్య । వీర్యతేజాం స్యశేషతః ।
భగవచ్ఛబ్ద వాచ్యాని వినాహేయైర్గుణాదిభిః ।

భకారమునకు - జ్ఞానశక్తులు -

గకారమునకు - బలైశ్వర్యములు.

వకారమునకు - వీర్యతేజస్సులు. అని యిట్లే మూడక్షరములు భగవద్గుణములలో ప్రధానమైన యారు గుణములను తెలుపుచున్నవి.

ఇక వ'కారముమీద అకారమున్ను చివరనున్న 'న'కారమున్ను తల్లక్రిందులుగా చదివిన 'న' యను నక్షరమగును. దానికి లేవని యర్థము. ఆ లేని వేవి యనగా - అపహత పాప్మావిరజో విమృత్యుర్విశోకోఽపిపాసు రవిజిఘత్సః - అను నీ ఘటకశ్రుతి వాక్యముచే తెలుపబడిన దుర్గుణములు. అవి లేవని యర్థము - (పుణ్యపాపములు, రజస్సు, చావు - దుఃఖము - దప్పి - ఆకలి.)

'తవానన్త్య గుణస్యాపి షడేతే ప్రథమే గుణాః' అని భగవంతుడనేక కల్యాణ గుణాకరుడైనను యారు గుణము లాతనికి ప్రధాన గుణములు మిగిలిన గుణములన్నియు నిందిమిడి యుండును.

ఈ శ్లోకమున – 'సర్వమే తదృతం మన్యే'

యనుటచే ఆ ప్తతములగు మహర్షి ప్రభృతులచేతను, వేదముల చేతను చెప్పబడుటచే నిది యంతయును యథార్థమని నమ్ము చున్నాను.

దీనిచే నర్జునుని అసూయారాహిత్యమున్ను, దానివలన నాతని రహస్యార్థశ్రవణ యోగ్యతయు సూచింపబడినవి.

15వ శ్లోకము

(33) ఆత్మనా- ఇతరుల యనుగ్రహముచే గాకయే - ఇత రుల్లైనచో 'మత్తస్స్మృతిర్జ్ఞానం' అనునట్లు నీవు ప్రసాదించిన జ్ఞాన ముచే నెఱుంగుదురు. లేక - ఆత్మనా = జ్ఞానముచేతననిగాని యర్థము.

'ఆత్మాజీవే ధృతౌ దేహే ఇత్యారభ్య - యత్నేఽ

ఽర్కేఽగ్నౌ మతౌ - వాయౌ వితికోశః'

(34) ఆత్మానం - అను పదమునకు 'త్వాం' అని వ్యాఖ్యా నించిరి. ఇది 'త్వమేవ త్వాం వేత్థయోఽసిసోఽసి' అను శ్రుతిని జ్ఞాపకము చేయుటకే

(35) పురుషోత్తమ != ఇది కేవలము పేరుమాత్రమే. ఉత్త రార్థమంతయు నాపేరునకు తగిన గుణములను తెలుపు పదములు.

(36) భూతములను పుట్టించువాడా -

'సకారణం కరణాధిపాధిపః' అను శ్రుతిసిద్ధము.

(37) భూతేశ - తమీశ్వరాణాం పరమం మహేశ్వరం' అను శ్రుతిసిద్ధము.

(38) 'దేవేశ - తం దైవతానాం పరమంచ దైవతం' అను శ్రుతిసిద్ధము.

క్షుద్రమైన పురుగులు దేవతలకెట్లో దేవతలు పరమాత్మ కటు లనే. 'కీటా స్సమస్తాస్సురాః దృష్టేయత్ర - (ముకుంద)

(39) 'జగత్పతే - విదామ దేవం భువనేశమీడ్యం' అను శ్రుతిసిద్ధము.

## 16వ శ్లోకము

(40) అర్హసి - నీ విభూతులు దివ్యమైనవి గనుక తప్పక వినదగినవి. కాబట్టి చెప్పబడవలెను. అవి నీ విభూతులుగాన వానిని చెప్పుటకు నీవే తగినవాడవుగాన నీవే చెప్పుము - అని ప్రార్థన సూచింపబడుచున్నది.

(41) భావప్రత్యయాంతమైన విపూర్వక 'భవతి'కి నియమనమే యర్థము. ఆ నియమనవిషయ మత్యధికమగుటచే వినవలెనను కుతూహల మపారముగనున్నది. దానిని తెలియజేయుటకే అశేషశబ్దము ప్రయోగింపబడినది.

(42) 'విభూతి' శబ్దమునకు నియమనమను వ్యాపారమనియును నియంతవ్యమనియును అర్థములు కలవు. నియంతవ్యము చేతనాచేతనాత్మకమగు ప్రపంచమంతయును. ఈ విభూతిశబ్దమున కా నియంతవ్యముతో సామానాధికరణ్య మున్నపుడు విభూతిశబ్దమునకు నియంతవ్యపరముగాను, అది లేనప్పుడు నియమనపరముగాను అర్థమును జెప్పవలెను.

18వ శ్లోకమున విభూతిశబ్దమునకు నదే యర్థమును జెప్పవలెను. కాని 19వ శ్లోకమున దానికి నియంతవ్యమే యర్థము. ఈ వివరణమును 19వ శ్లోక టిప్పణిలో చూడుము.

## 17వ శ్లోకము

(43) ఇచ్చట 'యోగీ' యను శబ్దమునకు భక్తియోగి యను నర్థ మెట్లనగా -

ప్రకరణమును బట్టియును, 'తాం సదా పరిచిన్తయన్'
అనుటచేతను -

ఈ యోగి సామన్య యోగిగాక భక్తియోగియని చెప్పుటయే ఉచితము.

మరియు - 'ఆవృత్తి రసకృత్ ఉపదేశాత్' అను బ్రహ్మ సూత్రము నిరంతర ధ్యానమును మోక్షసాధనముగా విధించుచున్నది. దానినిబట్టి 'ధృవాస్మృతియు' దీనికి సమానార్థకమగుచున్నది.

'త్వాం సదాపరిచి న్తయన్'.

కాబట్టి భక్తియోగమని చెప్పుటయే ఉచితము.

18వ శ్లోకము

(44) జనార్దన -

'జనాన్ అర్దయతీతి - జనైరర్థ్యత ఇతివా'

అనగా - భగవద్విముఖులను నరకాదుల కనిపి పీడించు వాడును.

అనుకూలురైన భక్తులచే తమకు కావలసిన ఫలములను యాచింపబడువాడనియు నర్థము.

(45) అమృత శబ్దమిచ్చట అతృప్తితో సహపఠితమగుటచే భగవన్మాహాత్మ్యమున భోగ్యత్వము వివక్షితము.

దానిని భగవంతుడే వినుపించిన భోగ్యతమమగును. అమృతము చంద్రునినుండి స్రవించును. ఈ యమృతము భగవానుని ముఖ చంద్రునినుండి స్రవించును -

(46) అవతారిక —

ఇట్లు వినినదానితో విసుగుచెంది తృప్తిని చెందక నింకను విన కుతూహలముచే ప్రశ్నించు నర్జునుని విషయమై మిక్కిలి ప్రసన్ను

డైన భగవంతుడు అర్జునుని యుత్తమ వంశాదులను బొగడుచు నాతని యోగ్యతకు మెచ్చి తన విభూతిని విస్తరించి ప్రత్యేకముగా జెప్పుటకును వినుటకును నశక్యమగుటచే ఆయా జాతీయములనెత్తి జాతికొక్కటిచొప్పున తన విభూతులను సంగ్రహించి చెప్పెదనను చున్నాడు.

(47) తే=అసూయ లేకుండుట, భగవన్మాహాత్మ్యమును విని సంతసించుట, దాని నెంతవిన్నను తృప్తిని చెందకుండుట మొదలగు మంచిగుణములుకల నీకు అని యర్థము.

(48) విభూతి శబ్దమున కిచ్చట నియమింపబడు పదార్థములని యర్థము చెప్పబడినది.

శ్రీ విష్ణుపురాణమున –

'బ్రహ్మ దక్షాదయః కాలః' 'విష్ణుర్మన్వాదయః కాలః' అని యిట్లు చెప్పిచెప్పి చివరకు 'జనార్దన విభూతయః' అనెను.

కాబట్టి నియామ్యములయందే విభూతి శబ్దము ప్రయోగింపబడెను.

20వ శ్లోకము

(49) అవతారికలో —

ఇట్లనుటచే వెనుక చెప్పబడినట్టియు, ముందు చెప్పబోవు నట్టియు సామానాధికరణ్య నిర్దేశములన్నిటికిని నిమిత్త మీరెండిం టిలో నేదో యొకటి యని తెలుసుకొనవలెను.

(50) ఏ పరమాత్మ సమస్త ప్రాణులకును అంతరాత్మగా నున్నవాడో, ఆ ప్రాణులన్నిటికంటెను విలక్షణమై యున్నాడో; అట్లున్నను యే పరమాత్మ నా ప్రాణు లెఱుంగజాలవో ఆ ప్రాణు లన్నియు నెవ్వనికి శరీరభూతములో ఏ పరమాత్మ సమస్త భూత

ములలో నంతరాత్మగానుండి వానిని నియమించుచున్నాడో అట్టి యమృత రూపుడైన పరమాత్మ నీకును అంతరాత్మయై యున్నాడు.

(51) ఈ శ్లోకమున ఆశయమునగా=హృదయము.

(52) సర్వభూతశబ్దమునకు భాష్యమున

'నాకు శరీరభూతములైన' యని యర్థము చెప్పబడినది. ఇది యెట్లనగా -

అహం ఆత్మా= నే నాత్మగానున్నానని యర్థము. ఆత్మశబ్దమున కనేకార్థములున్నను శరీరముతో సంబంధించియున్న జీవుని విషయమై ప్రసిద్ధికలదు. శరీరియగు జీవుడని ఆత్మశబ్దమున కర్థమును చెప్పగానే దానికి ప్రతిసంబంధియగు శరీరాపేక్ష కలుగుచున్నది. కాబట్టి నాకు శరీరభూతులైన యని యర్థము చెప్పవలసి వచ్చినది.

భూతములు జీవునకు శరీములు. ఆ భూతములకును జీవులకును కూడ ఈశ్వరున కాత్మత్వ మెట్లు సిద్ధించును? అని శంకించగా - ఆత్మలక్షణమును భాష్యకారులు 'ఆత్మ యనగా' యను గ్రంథముచే తెలుపుచున్నారు.

శరీరమున కన్నివిధములుగను ఆధారమై నియంతయై శేషియైనవాడు ఆత్మ.

కొందరీ మూడునుకలసి యొక్క లక్షణమందురు. మరికొందరీ మూడును మూడు వేరువేరు లక్షణములందురు. యతో వేత్యాది శ్రుతిచే బోధింపబడుటచే సృష్టిస్థితి లయకర్తృత్వత్రయము బ్రహ్మ లక్షణమైనట్లు యిచ్చటను శంకించిన యీ శంకను పరిహరించుచు మూడును సార్థకము లగుచున్నవి.

ఆధారమేయినిన నియంత వేరుగానున్నాడా? భూమి యాధారము కాదా? ఇత్యాది శంకలను పరిహరించుటకై మూడును సార్థకములే యగుచున్నవి.

శరీరలక్షణములను నాలుగువిధములుగ నాశంకించి ఖండించి దీనినే భాష్యకారులు శ్రీ భాష్యములో సిద్ధాంతీకరించిరి.

చైతన్యముకలవానితో నెన్నడును విడచియుండని సంబంధముతో విశేషణమైయుండు ద్రవ్యమే శరీరమని సిద్ధమైనట్టి శరీర లక్షణము -

కాబట్టి యిచ్చట భూతశబ్దము కేవలశరీరమే కాదనియు ఆశయ మనగా హృదయమనియు ఆధారత్వ నియన్తృత్వాదులు ఆత్మలక్షణ మనియు, సిద్ధించుటకును 'తథేతి=ఇట్లు',

యను గ్రంథముచే శ్రీ భాష్యకారులు గీతాప్రమాణములను చూపిరి.

ఆ ప్రమాణములేవి, వానివలన నీ యర్థ మెట్లు సిద్ధించుచున్న దనగా —

'సర్వస్యచాహం......జ్ఞానమపోహనఞ్చ
ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని । యన్త్రారూఢాని మాయయా'

అనియు —

'యస్సర్వేషు భూతేషు......ఏష అన్తర్యామ్యమృతః'

అనియు —

'య ఆత్మని తిష్ఠన్.........అన్తర్యామ్యమృతః'

అనియును —

'సర్వస్యచాహం' అను శ్లోకమునకు పిమ్మట 'ద్వావిమౌ' అని ప్రారంభించి 'క్షర స్సర్వాణిభూతాని' యని చెప్పబడుటచే సర్వభూతశబ్దము అచిద్విశిష్టజీవవాచక మని నిశ్చయింపబడుచున్నది గదా ! అట్లే యిచ్చటను భూతశబ్దమునకు కేవల శరీరముగాక శరీరములోనున్న జీవులని తెలుపును.

మరియు నీ ప్రకరణమునందే -

'ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః' అని చెప్పి 'యోలోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః' అని చెప్పబడి నది. ఇచ్చట 'బిభర్తి' - 'ఈశ్వరః' అను శబ్దములలో మొదటిపద ముచే ఆధారత్వమున్ను రెండవదియగు ఈశ్వరశబ్దముచే నియన్తృ త్వమున్ను స్పష్టముగా తెలియబడుచున్నది.

ఈశ్వరశబ్దమునకు రూఢిశక్తిచే స్వామిత్వ మర్థము సిద్ధించు చున్నది.

అంతియకాని యౌగికార్థము నే గొని నియమించువారి నందరిని ఈశ్వరు డను వాడుకలేదు. పాములను నియమించు గరుడుని పాముల కీశ్వరుడందురా ?

ఒక శ్లోకమున 'అహంహృది సన్నివిష్టః' అని కలదు. వేరొక చోట 'ఈశ్వరః హృద్దేశే తిష్ఠతి' అనియుకలదు. కాబట్టి 'అహం' అన్నను 'ఈశ్వరః' అన్నను అర్థమొక్కటియే.

రెండవ శ్లోకమున సర్వభూతశబ్దము జీవపరమే. ఏలననగా - 'యన్త్రారూఢాని మాయయా' యనిగదా నిర్దేశింపబడినది! యంత్ర మనగా శరీరము. ఆరూఢాని యనగా వానియందున్న జీవులు, వారే సర్వభూతాని యని చెప్పబడుచున్నారు -

'భ్రామయన్' అనుటచే నియన్తృత్వము సిద్ధించుచున్నది. హృద్దే శమునందుండుటచేత 'మయసర్వమిదం ప్రోతం' అని చెప్పబడినట్లు ధారకత్వము సూచింపబడుచున్నది -

ఇట్లు చేతనాచేతనాత్మకమైన సమస్త వస్తువులును శరీరముగా గలవాడని తేలినది.

దీనినే స్పష్టముగా తెలుపు శ్రుతులను ఆ పిమ్మట ప్రమాణీక రించిరి. ఇట్టీమూలశ్లోక పూర్వార్థమును జెప్పి ఆత్మగా నుండుటచే

నీశ్వరునకు ఉపాదానత్వమున్ను నిమిత్తత్వమున్ను సిద్ధించుటచే దాని నవలంబించి ఉత్తరార్థము నన్వయించుచు 'ఏవం' 'ఇట్లు' అని సాయించిరి.

అనగా 'నే నిట్లాత్మగా నుండుటచే వానికన్నిటికిని ఉత్పత్తి స్థితి లయకారణభూతుడ నగుచున్నాడ'నని చెప్పెను. 'ఆత్మయై నెల కొనియున్నవాడ'ననుటచే నిర్వికారుడగు తానే ఉపాదానమని నిర్ణయింపబడుచున్నది.

## 21వ శ్లోకము

(53) అవతారిక —

ఇకముందు చెప్పబడు పదార్థములలో కొన్నిటియొక్క ప్రాధాన్యము ప్రత్యక్షసిద్ధము. కొన్నిటియొక్క ప్రాధాన్యము శాస్త్రసిద్ధము. అటులనే కొన్నిటితో సామానాధికరణ్యము సాక్షాత్తుగాను మరికొన్నిటితో జీవునిద్వారాను అని గ్రహించవలెను.

(54) ఇచ్చట మతుప్ ప్రత్యయముచే రవికి నిర్ధారణ కుపకరించు నతిశయ తేజస్సంబధము వివక్షితమని గ్రహించవలెను – అందుచే పౌనరుక్త్యము పరిహరింపబడినది.

(55) అవినాభావమును చెప్పుటనుబట్టి —

ఆత్మలేనిది శరీర మేకాదని భావము. 'నిప్పులేక పొగలేదు' 'ధర్మిలేక ధర్మములేదు' అనినచో నగ్న్యాదులే పరమార్థములనియును ధూమాదులు మిథ్యయనియునుగాని అగ్న్యాత్మక మనిగాని జ్ఞానము కలుగదుగదా! అటులనే యిచ్చటను గ్రహించవలెను.

(56) పూర్వపక్షము —

'యజ్ఞదత్తుడుతప్ప యింట నెవ్వరును లేరు' 'తాడేగాని పాము లేదు' అనినచో నొకదానికే సత్త్వమును మిగిలినవాటి కసత్త్వమును

సిద్ధించుటలేదా అటులనే యిచ్చటను నేనే యున్నాను మరియేది యును లేదని యిచ్చట అర్థమును చెప్పరాదా? యన్నచో -

ఇచ్చట అవినాభావము నియామ్యత్వముచేత వచ్చినది. ఉప క్రమమునందు — 'మత్తస్సర్వం' ఇత్యాదినా తెలుపబడిన దనబడెను.

ఇయ్యది ఉపక్రమాధికరణ సిద్ధమైనది.

దీనికే అగ్ర్యప్రాయ న్యాయమందురు. అనగా -

'అసఞ్జాతవిరోధి కాల సముదితో పక్రమ విరుద్ధతయా ఉప సంహారస్య నోదయః' అనగా -

ఒక విషయమును ఉపపాదించ ప్రారంభించినపుడు దానికి విరుద్ధార్థ ప్రతిపత్తి యింకను ఉదయించదు గాన నవి యసంజాత విరోధులగును. తరువాత దానికి విరుద్ధమైన యర్థమేదైన నుదయించిన నది సంజాతవిరోధియే యగును. సంజాతవిరోధికంటె నసంజాత విరోధి ప్రబలముగాన ఉపక్రమమును బట్టియే యుపసంహారమును సవరించుకొనవలెను. ఇట్లు చెప్పుటచే సర్వశరీరముల యందున్న జీవు లకు బ్రహ్మైక్యము చెప్పబడుచున్నదను వాదము నిరస్తమైనది.

(87) నక్షత్రాణా మహంశశీ అనుచోట —

ఇచ్చట నిర్ధారణ షష్ఠికాదనియు సంబంధషష్ఠియనియు వెనుక టిప్పణిలో తెలుపబడినది.

ఇప్పుడు దానిపై పూర్వపక్ష సిద్ధాంతములను గమనింపుడు -

ఇంతకుముందును యీ పైనను అంతటను నిర్ధారణార్థములను జెప్పి మధ్యనొక్కదానికి సంబంధార్థమును జెప్పుట ప్రక్రమభంగము. కాబట్టి నక్షత్రశబ్దమునకు రాత్రిప్రకాశ మాత్రమే యర్థము చెప్పవలెను.

'నక్షత్రములనగా పుణ్యాత్ముల ప్రకాశమే' యని, శ్రుతి చెప్పు చున్నది. లేక చంద్రమండలము స్వర్గస్థులకు భోగస్థానమగుటచే

దానిని ప్రకాశమను అర్థమునుబట్టి నక్షత్ర మనవచ్చును. 'దేవగృహా వై నక్షత్రాణి' యని దేవతలు నివసించు స్థానములకు నక్షత్రములని పేరున్నదని శ్రుతి తెలుపుచున్నది. కాబట్టి యీ యర్థములో నిర్ధారణ షష్ఠియన్నను దోషము లేదు. ఇది ప్రకరణానుకూలమైన యర్థమని పూర్వపక్షము - సిద్ధాంతము - ఇది లక్ష్యార్థము. ముఖ్యార్థమే పొసగునప్పుడు లక్ష్యార్థమును చెప్పరాదు. మరియు పూర్వాపరములలోనంతటను నిర్ధారణార్థము లేనే లేదు -

'భూతానామస్మి చేతనా' యను చోటను,

'సర్గాణామాది రన్తశ్చ మధ్యం చైవాహ మర్జున'

'వాదః ప్రవదతా మహమ్'

'అహమేవా క్షయః కాలః'

'ఉద్భవశ్చ భవిష్యతామ్'

'ద్యూతం ఛలయతా మస్మి'

'తేజ స్తేజస్వినా మహమ్'

'జయోఽస్మి వ్యవసాయోఽస్మి'

ఇత్యాదులలో నంతటను నిర్ధారణ కుదురదుగదా -

కాబట్టి యిచ్చట చంద్రుడు నక్షత్రజాతిలో చేరడుగాన షష్ఠీ విభక్తికి నిర్ధారణార్థము ఘటించకపోవుటచే సంబంధ సామాన్యమందు షష్ఠీ విభక్తికి ప్రసిద్ధి ప్రాచుర్యముండుటచే ఆ సంబంధమేది ప్రమాణ సిద్ధమో దాని జెప్పుటయే న్యాయము.

22వ శ్లోకము

(58) ఇచ్చట సామవేదమునకు గానము ప్రధానమగుటచేతను, సహస్రశాఖ లుండుటచేతను, ప్రాధాన్యమును గ్రహించవలెను. తక్కిన వేదములకీ రెండును లేకుండుటచే వాని కపకర్ష - అంత మాత్రమేగాని వేదములలో ప్రామాణ్య తారతమ్యము లేదు. గీత

రూపమైన సామము ప్రధానమని శ్రుతి తెలుపుటచే సామవేదము గీత్యాత్మకముగాన దానికి ప్రాధాన్యము. భగవంతుడందులకే సామ-గాన లోలుడు ...

మరియు —

'ఋగ్భ్యోజాతం వైశ్యం వర్ణ' మాహుః

'యజుర్వేదం క్షత్రియస్యాహు ర్యోనిమ్'

'సామవేదో బ్రాహ్మణానాం ప్రసూతిః'

అనగా — వైశ్యులు ఋగ్వేదమునుండియు, క్షత్రియులు యజు ర్వేదమునుండియు, బ్రాహ్మణులు సామవేదము నుండియు పుట్టిరని చెప్పబడుటచేతను ఉత్తమ వర్ణమున కుత్పత్తి స్థానమగుటచే సామవేద మునకు ప్రాధాన్యము

మరియు — ఉపాసనలో గుణములకును దివ్యమంగళ విగ్రహ మునకును ప్రాధాన్యమునిచ్చు దహరవిద్యను, అంతరాదిత్య విద్యను తెలుపు ఛాందోగ్యోపనిషత్తును శిరస్సుగా కలదగుటచేతను గాన లోలుడగు శ్రీకృష్ణుడు దీనిని ప్రధానముగా కొనియాడెను

(59) దేవానా మస్మి వాసవః —

దేవు లనగా స్వర్గవాసులని యర్థము. లేనిచో బ్రహ్మాదు లని గ్రహించవలెను. అప్పుడు దేవేంద్రుని కుత్కర్ష యుండదు. మూల మున నున్న వాసవశబ్దమునకు ఇంద్రుడని భాష్యకారులు వ్యాఖ్యా నించిరి. ఇది యాతని యతిశయమును తెలుపుటకే. 'ఇది — పరమై శ్వర్యే' అను ధాతువునుండి గదా యీ శబ్దము పుట్టినది.

దేవ దానవ యుద్ధమైన తరువాత యీ విజయమంతయు తమదే యని యహంకరించు దేవతలను చక్కబరచుటకై యక్ష రూపముతో విచ్చేసిన భగవంతుడు అగ్ని వాయువుల నవమాన పరచి పంపి, యింద్రు నవమాన పరచక అతనికి తత్త్వము నుపదేశిం

చుటచే కేనోపనిషత్తులో నింద్రునకు ప్రాధాన్య మీయబడినది - 'తస్మాద్వా ఇన్ద్రోఽతితరామివాన్యాన్ దేవాన్ సహ్యేన న్నేదిష్ఠం పస్పర్శ! సహ్యేనత్ప్రథమం విదాంచకార బ్రహ్మేతి' అనునట్లు దేవతలలో నింద్రుడేల గొప్పవాడనగా - నాతడు యక్షాకారముతో విచ్చేసిన పరమాత్మను దగ్గరలో ననుభవించి యందరికన్న ముందాతడు పరం బ్రహ్మయని యెఱింగెను గాన - అని చెప్పుచున్నది - "నమే భక్తః ప్రణశ్యతి" యని భగవంతుని శపథముగాన "అసావుద్యూహాతశ్శత్రుః" ఇత్యాది ఆసురభావమును మాన్పి తత్త్వమునే తనకెఱింగించుటచే ప్రియభక్తుడీ యింద్రుడని గ్రహించవలెను.

"ఇన్ద్రియాణాం మనశ్చాస్మి" అనుచో -

నిర్ధారణ షష్ఠి యనుటకు మనస్సు యింద్రియములలో చేరక వేరుగా శ్రుతిస్మృతులలో చెప్పబడినదిగదా - ఎట్లు ఘటించుననిపూర్వపక్షము -

ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః (కఠో)
ఏతస్మా జ్జాయతే ప్రాణో మనస్సర్వే న్ద్రియాణిచ (ముం)

ఈ వాక్యములవలన మనస్సు యింద్రియములకంటె వేరుగా చెప్పబడినది గదా! అనగా - భాష్యకారులు -

'ఏకాదశే న్ద్రియాణాం యదుత్కృష్టం తన్మనః'
అని సాయించిరి. దీని యభిప్రాయ మేమనగా -

ఇన్ద్రియాణి దశైకంచ - "ఏకాదశం మనశ్చాత్ర"

ఇత్యాది శ్రుతులలో మనస్సుకూడా ఇంద్రియముగానే చెప్పబడుటచే నెచ్చటనో నొక మూల నదివేరనిచెప్పబడినను దానిని గోబలీవర్దన్యాయముగా సమన్వయ పరచుకొనవలెను. కాబట్టి నిర్ధారణకు భంగములేదు. గోబలీవర్దన్యాయమనగా - సామాన్య శబ్దమును విశేషమునందు పర్యవసింపజేయుట - గో వనగా ఎద్దు ఆవు

రెండును అర్థమైనప్పుడు ఎద్దునే తీసుకొనిరమ్మని చెప్పుట యీ న్యాయ ప్రయోజనము. అట్లే బాహ్యేంద్రియముల నుండివ్యావృత్తి మనస్సునకు చెప్పుటకై పృథక్కుగా జెప్పబడినది.

ఇక ఇతరేంద్రియముల కంటె మనస్సునకు ప్రాధాన్యమేమి యనగా - ఇది ఆప్తబంధువువలె నాత్మ నుద్ధరించుటకును ప్రాణ శత్రువువలె నాత్మ నధోగతిపాలు చేయుటకును ప్రధాన సాధన మగుటచే నింద్రియములలో మనస్సు విభూతిగా చెప్పబడినది.

'ఉద్ధరేదాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవహ్యాత్మనో బన్ధు రాత్మైవరిపురాత్మనః'
(60) 'మనఏవ మనుష్యాణాం కారణంబన్ధ మోక్షయోః'
ఇత్యాది ప్రమాణముల నారయవలెను.

ఒక్కొక్క యింద్రియముచే నొక్కొక్క జ్ఞానము కలుగును. కాని అన్ని జ్ఞానములకును మనస్సుకారణము.

అన్ని యింద్రియములతోను మనస్సు సంయోగించిననే ఆ యింద్రియములు తమ తమ జ్ఞానములను బుట్టించును. కాబట్టి యిం ద్రియములలో మనస్సున కుత్కర్ష చెప్పబడెను.

(61) భూతానా మస్మి చేతనా -

అనుచో నిర్ధారణ షష్ఠి కాదు. భూతములలో చేతనయను భూతమొక్కటి లేదుగదా! కావున నిది శేషషష్ఠి.

విశిష్ట వస్తువునందలి సారభూతవిశేషాంశ మిచ్చట వివక్షిత మైనది. ప్రాణులలో చేతనాంశయేగదా ముఖ్యము. ఇచ్చట కొంద రి ట్లాశంకించుచున్నారు.

కొన్ని గ్రంథములలో చేతనాంశము భూతములలో సారవ భూతముగా పరిగణింపబడుచున్నది. వినుడు .

'మహాభూతాని ఖం, వాయు, రగ్ని, రాప స్తథా మహీ।
షష్ఠస్తు చేతనాధాతుః ఆత్మా సప్తమ ఉచ్యతే'
అష్టమంతు మనో జ్ఞేయం — ఇతి —
'షష్ఠస్తు చేతనా ధాతుర్మన ఇత్యుపదిశ్యతే'

చైతన్యమునకు మనస్సు అధిష్ఠానముగాన రెండును అభేదముగా చెప్పబడినవి. కాబట్టి భూతానామస్మి చేతనా - అనుచో నిర్ధారణార్థమును చెప్పవచ్చును - అని సిద్ధాంతము - భూతషష్ఠమని చెప్పినంత మాత్రముచేత చేతన మహాభూతము కానేరదు అట్లగుచో పంచభూతములని ప్రసిద్ధియే భంగము కావలసివచ్చును.

అట్లగుచో సప్తమ అష్టమములుగా పరిగణించిన ఆత్మ-మనస్సులునుకూడ మహాభూతములుకావచ్చును. చేతనాశబ్దమున కప్రసిద్ధార్థమును అంగీకరించవలసి వచ్చును. కాబట్టి ప్రసిద్ధార్థమునే స్వీకరించుట ఉచితము.

కాబట్టి యిచ్చట షష్ఠి సంబంధమాత్రమునందే వాడబడినది.

## 23వ శ్లోకము

(62) రుద్రులు పదనొకండుగురులోను శంకరుల నుత్కర్ష యుండుటచే నాతనిని తన విభూతిగా పేర్కొనెను. అతని కా నామమే యుత్కర్షను తెలుపును - శం=సుఖమును, కరోతి = చేయువాడు అనగా - తన భక్తులకు సుఖప్రదుడని యర్థము. భగవద్భక్తులలో శంకరులు ప్రధానము.

"పాదోదకేన సలిలస్య శిరోధృతేన" యనినటుల భగవత్పాదోద్భవమైన గంగను శిరస్సున ననారతము ధరించుటచేత నాతడు శివుడు (మంగళకరుడు) అయ్యెను. నిరంతరమును రామతారక మంత్రమును జపించుచు హృదయమున నా శ్రీరామునే ధ్యానించుచు తన

భక్తులకు వారణసీ పుణ్యక్షేత్రమున వారి మరణ సమయమున కుడి చెవిలో రామతారక మంత్రము నుపదేశించు మహాభక్తులు గజా శంకరులు.

(63) విత్తేశు డనుటచే నీతనికిగల యసాధారణైశ్వర్యమే యీతని యుత్కృష్టకు నిదానము -

ఇంకను యీతడు ధనాగారమునకు ప్రభువును శంకరుని ప్రియ మిత్రుడున్ను అగుటయు నతని యుత్కృష్టకు నిదానములు.

(64) మేరువునకు ప్రశస్తమైన రత్నమయమగునట్టియు బంగారు వికారమైనట్టియు గొప్ప శిఖరములుండుటచే శిఖరములుగల కొండలలో గొప్పదిగా గణింపబడినది - ఇచ్చటి మతుప్పు ప్రత్యయము ప్రశంసాపరమైనది.

24వ శ్లోకము

(65) 'బృహతాం పతిః=బృహస్పతిః'

అను వ్యుత్పత్తినిబట్టి ఈతడు గొప్పవారైన ఇంద్రాది దేవతలకు హితాహితములను బోధించి పాలించు గురువగు పురోహితు డగుటచే వారి ననేకవిధముల సావధానుడై రక్షించువాడని యర్థము ను సూచించుటచే నీతడు విభూతిగా చెప్పబడెను.

ఈతనికి గీష్పతిః - అనగా - వాక్కులకు పతియనియు ప్రసిద్ధి కలదు గావునను ఉత్కృష్ట కలదు.

(66) ఉన్న ముప్పదికోట్ల దేవతలలోను నెవ్వరును జయించ లేని తారకాసురుని సంహరించుటకు దేవతలచే ప్రబల యత్నములు గావింపబడి పార్వతియందు పరమేశ్వరునిచే బుట్టింపబడి దేవసేనకు నాయకత్వమును వహించి వానిని జయించెను. కాన కర్మవశ్యులగు సేనానాయకులలో కుమారస్వామిని తన విభూతిగా పేర్కొనెను.

(67) ప్రవహించకుండ స్థిరముగనుండు జలాశయము లిచ్చట వివక్షితములుగాన నట్టివానిలో వైశాల్యమునుబట్టియు, లోతునకు గల ప్రాశస్త్యమునుబట్టియు సముద్రము నిచ్చట తన విభూతినిగా నుదహరించెను.

25వ శ్లోకము

(68) దేవతలలో గొప్పవారెవరని ఋషులలో సంశయ ముద యించి తత్పరీక్షార్థమై భృగుమహర్షిని పంపగా నాతడు బ్రహ్మ రుద్రులను పరీక్షించి వారు రాజసతామస ప్రకృతులని నిశ్చయించి శ్రీ మహావిష్ణువు నొద్దకేగి యాతని నంతకంటెను తీవ్రముగా పరీ క్షించి యాతడే గొప్పవాడనియు సాత్వికమూర్తియనియును నిర్ణ యించుటచేతను, సాక్షాల్లక్ష్మికి తండ్రియగుటచేతను మహర్షులలో నాతనిని గొప్పవానినిగా పరిగణించెను -

(69) అర్థముగల శబ్దములలో ప్రణవము సర్వోత్కృష్టమగు నర్థ మును చెప్పుటచేతను, 'ప్రణవాద్యా స్తథా వేదాః' 'ఓఙ్కారప్రభవా వే దాః' అనియు సమస్తమైన వేదములును ప్రణవమునుండియే పుట్టినవని వేదమునందే చెప్పబడుటచేతను, వేదము లేకాదు వాడుకలోనున్న సమస్త సంస్కృత పదములున్ను ప్రణవమునుండియే బుట్టినట్లు ప్రమాణము లుండుటచేతను ప్రణవమున కుత్కర్షకలదు గాన అర్థవత్తులగు శబ్ద ములలో ప్రణవము భగవద్విభూతిగా జెప్పబడెను.

వాడుక పదములన్నియును ప్రణవము నుండియే బుట్టినట్లు ప్రమాణ మేమనగా —

'నామరూపంచ భూతానాం। కృత్యానాంచ ప్రపఞ్చనమ్'
'వేదశబ్దేభ్య ఏవాదౌ। దేవాదీనాం చకారసః'॥

అనగా - చతుర్ముఖబ్రహ్మ పరమాత్మచే సృష్టికై యాజ్ఞా పింపబడి యాతడు ప్రసాదించిన వేదమునందలి శబ్దముల నాధారముగా

జేసుకొని దేవతలు మొదలగు చతుర్విధభూతములయొక్క **నామము** లను రూపములను సృజించెను. ఆ పదముల పైన జూపిన **ప్రణవ** ముచే వేదమునుండియే పుట్టినవి, కాబట్టి ప్రణవమునుండియే లౌకిక వైదిక శబ్దములన్నియును పుట్టినవి – ఇందుచే ప్రణవమున కుత్కర్ష చెప్పబడినది.

మరియు నిది హరిశబ్ద సమానాధికరణముగా 'హరిః ఓమ్' అని యుచ్చరింపబడుటచేతను గీతలో నెనిమిదవ యధ్యాయమున 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్ మామనుస్మరన్' అని తానే ఆ ప్రణవముచే చెప్పబడుదుననియు చెప్పుటచేతను, 17వ యధ్యాయమున 'ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధస్స్మృతః' అని ప్రణవము బ్రహ్మకు వాచకశబ్దమని చెప్పబడుటచేతను నిది సర్వోత్కృష్టుడగు శ్రీమన్నారాయణుని సాక్షాత్తుగా చెప్పునదగుటచే గొప్పదిగా పరిగణింపబడినది.

(70) 'యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి'
'విధి యజ్ఞా జ్జప యజ్ఞో'
'విశిష్టో దశభిర్గుణైః'

అనగా – శాస్త్రోక్తహింసా యజ్ఞములకన్నను జపయజ్ఞము పదిరెట్లధిక ఫలప్రదము – అయినచో నట్టి యజ్ఞములను శాస్త్రమేల చెప్పుచున్నదనగా – అహింసాత్మక యజ్ఞములను చేయలేనివారికై యివి చెప్పబడినవి. తక్కినవారి కవి చెప్పబడినవి. ఆ యజ్ఞముల యందైనను శాస్త్రవిధిని పురస్కరించుకొని తమ క్తరీతితో నాచరించు వారికా పశువుల కపకారము చేయవలెనను బుద్ధిలేకయే 'నవా ఉ ఏతన్మ్రియసే ! నరిష్యసీ' త్యాది మంత్రములో చెప్పబడినటుల నా పశువునకును హీనపశుజన్మ తొలగి దేవత్వము సిద్ధించుటచేతను "దేవాన్

భావయతానేన తేదేవా భావయన్తునః” అను నటుల దేవతలు వానిచే ప్రసన్నులగుటచేతను వానివలనను ఆదరించిన వానికి యనర్థ మొకింతయు నుండజాలదు. ఫలమునుగోరి వాని నాచరించిన ఫలమల్పమును శ్రమ అధికమును నుండును. ఆ ఫలమైనను తరిగిపోవునదిగాన దుఃఖమిశ్రము. అహింసాత్మక జపయజ్ఞమన్నచో గొప్ప అధికారులు చేయదగినది. భగవంతున కపరిమితానందదాయకములు గావున మోక్షసాధనములగును. కావుననే ఉపరిచరాదులు పిష్టపశుయాగమునే చేసిరి. మరియు హింసాత్మక యజ్ఞములలో హింసచేయుట యొకటి యధికారులను బట్టి ‘వీడిది చేయవచ్చును. వీడిదిచేయరాదని’ నియమముకలదు. క్లేశమధికము - జపయజ్ఞమునందు ఆ చిక్కులు లేవు. కాని చిత్త వైకల్యము కలుగకుండగ అర్థానుసంధానముతో చిత్తస్థైర్యము నార్జించి సబీజయోగముద్వారా వెంటనే సమాధియందు పెట్టుటచే నితర యజ్ఞములకంటె జపయజ్ఞము ప్రశస్తతమము. ఇది సర్వాశ్రమసాధారణము. ‘జప్యేనాపితుసంసిద్ధ్యేత్ బ్రాహ్మణో నాత్ర సంశయః।కుర్యాదన్య న్నవాకుర్యాత్ మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే’ అనగా - బ్రాహ్మణుడు మంత్రజపముచేతనే సిద్ధిని పొందుననుట నిర్వివాదము ఇతర విధుల నాచరించినను ఆచరించకున్నను గాయత్ర్యాది మంత్రజపయజ్ఞము చేతనే బ్రాహ్మణత్వము సిద్ధించును. ఇట్లే జపయజ్ఞము యజ్ఞాధికారములేని విధురుల (భార్య చనిపోయినవారు) కైనను సిద్ధి హేతువగుటచేతను నిది ఉత్కృష్టమైన విభూతిగా పరిగణింపబడినది.

(71) ‘స్థావరాణాం హిమాలయః’

పర్వతములలో మేరుపర్వతాది విశేషపర్వతము లిదివరలో చెప్పబడుటచేతను వృక్షములు ముందుచెప్పబడు చుండుటచేతను; ఆ రెండునుగాక హిమవంతుడు శైలరాజను ప్రసిద్ధిప్రాచుర్యముం

డుటచేతను స్థావరశబ్దమునకు సామాన్యపర్వతములను చెప్పివానిలో హిమత్పర్వతము విభూతిగా జెప్పబడినది.

మరియు - హిమత్పర్వతము అష్టాక్షరీ మంత్ర ప్రదాతయగు శ్రీమన్నారాయణుడు స్థిరవాసమును కల్పించుకొనుటచేతను శ్రీకృష్ణు డుద్ధవుని కలిదోషపుబారినుండి తప్పించుకొని నిత్యభగవత్సాన్నిధ్య మున కవకాశ మొసంగు స్థానముగాన నచ్చట నివసించమని యాజ్ఞ నిచ్చుటచేతను బ్రహ్మాది దేవతలందరును ఋషులందరును తమకు తపో భూమిగ నాదరించుటచేతను పెక్కుమహత్తర యజ్ఞములకు తావళ మగుటచేతను సామాన్యపర్వతములలో హిమవత్పర్వతము గొప్పదిగా లెక్కింపబడినది.

26వ శ్లోకము

(72) ఇది పారిజాతముకంటెను పూజనీయమైనది. దీని చిగురు బెరడు ఎండుకొమ్మలు ఆకులు మొదలగు భాగములన్నియును పవిత్ర కార్యముల కుపయోగపడుటచేత చెట్లలోనిది గొప్ప విభూతిగా నాదరింపబడినది.

(73) దేవర్షులు - మంత్రద్రష్టలు - వీరిలో నారదుని యతి శయ మనేక విధములుగ పలుచోట్ల ఇతిహాస పురాణములలో విస్త రింపబడినది. ఈతడు నారాయణపరత్వమును చాటుచు నిరంతర మన్నిలోకములలోను సంచార మొనర్చుచు పెక్కురను మహాభక్తు లను గావించుచు లోక కల్యాణమునకై భగవద్గుణములను నిరంతరము గానము చేయుచుండును. నారాయణుడు సంకల్పించిన ప్రతి కార్యమునకును పూర్వరంగమును రచించు మహాభక్తుడు. ఆది కావ్యమగు రామాయణ మీలోకమున నవతరించి మనలను పునీతు లను జేయున దీతని కతముననే కావున నీ నారదుడు దేవర్షులలో నుత్తమ విభూతిగా పేర్కొనబడెను.

(74) కపిలః— ఈతడు 'ఆది విద్వాన్ సిద్ధః' అనగా తపస్సిద్ధి గల విద్వాంసులలో ప్రథమగణ్యుడు శ్వేతాశ్వత రోపనిషత్తులో —

"ఋషిం ప్రసూతం కపిలం మహాన్తం"

అనగా - అతీంద్రియార్థద్రష్టయును మహాత్ముడును నగు కపిలుని గనెననియు, రామాయణమున -

"దదృశుః కపిలం తత్ర! వాసుదేవం సనాతనమ్"

అనగా సగరపుత్రులు యజ్ఞాశ్వమును వెదకుచు భూమిని త్రవ్వుకొనుచు పోయిపోయి దిగ్గజములనుదాటి ఒకచో తపంబొనరించుచున్న సాక్షాన్నారాయణావతారమగు కపిలమహర్షిని చూచిరి. ఇట్టి ప్రశంసకు పాత్రుడీ కపిల మహర్షి.

ఈతని క్రోధాగ్నిచే భస్మరాసులైపడియున్న సాగరుల నుద్ధరించుటచే భగీరథుడు ఘోరతపం బొనరించి యనేక విఘ్నములనోర్చి పుడమికిని పాతాళమునకును ఆకాశగంగను దెచ్చెను - కాబట్టి కపిలమహర్షి మనకు పరమపావనియైన గంగాప్రాప్తికి నిదానమగుటంజేసి నీతనిని సిద్ధులలో నుత్కృష్ట విభూతినిగా నాదరించెను -

(75) ఉచ్చైశ్శ్రవమునకు జన్మసిద్ధమైన ఉత్కర్ష చూపబడెను. ఇచ్చట అమృత మనగా నీరుగాని మథింపబడుచున్న అమృత మనిగాని యర్థము.

(76) దిగ్గజములన్నియును భూమిని వహించుటచే ప్రధానమైనవియే యైనను దిక్పాలురకు ప్రభువైన దేవేంద్రునకు వాహనమగుటచే నైరావతమునకు ప్రాధాన్యము.

ఈ శ్లోకమునందలి 'అమృతోద్భవం' అను శబ్దమును కాకాక్షిన్యాయముగ వెనుకనున్న ఉచ్చైశ్శ్రవములోను ముందున్న ఐరావతములోను అన్వయించవలెను. సముద్రమథనావసరమున దిగ్గజమగు నైరావతము ఉచ్చైశ్శ్రవమున్ను అమృత లక్ష్మిదేవులకు తోడ

బుట్టి శ్రియఃపతిచే ప్రశంసాపురస్సరముగ దేవేంద్రునకు ప్రధాన వాహనములుగ ప్రసాదింపబడినవి గాన నాయాజాతులలో నవి విభూతులైనవి.

28వ శ్లోకము

(77) ఇతరాయుధములన్నియును ప్రాణిసంహారమునకే యుప యోగపడునవిగాని వజ్రము రెక్కలతో నెగిరి గ్రామముల నుగ్గుచేయు పర్వతములయొక్క రెక్కలను ఛేదించుటకై ఉపయోగింపబడినది గావునను, మహాతపస్సంపన్నుడైన దధీచిఎముకలచే వృత్రాసుర సంహారార్థము నిర్మింపబడినదగుటచేతను సాధారణాయుధములలో నిది గొప్పదిగా పరిగణింపబడెను. (చక్రాయుధమునకు మించినది లేదు గదా.)

(78) 'ధేనూనాం'=పాలిచ్చు జంతువులలో నీ శబ్దము యౌగిక మైనను రూఢివలె నొక వ్యక్తియందే (కామధేనువునందే) వాడ బడినది.

ఆవులు పాలనే యిచ్చును గాని కోరికల నీయజాలవుకదా! కామధేను వట్టి సామర్థ్యము కలదగుటచే ఆవులలో నుత్తమమైనదిగా చెప్పబడినది.

(79) సంతానమున కుపయోగించని కామము కాదనుటకై 'ప్రజనశ్చ' అను విశేషణము వాడబడినది - ప్రాణులు పుట్టుటకు కారణము మన్మథుడు. అది యాతని యసాధారణాతిశయము. దాని నాతనికి ప్రసాదించినది భగవంతుడే గాన నాతనిని తన విభూతిగా చెప్పెను.

(80) సర్పము లనగా నొకతలగల పాములు. అందు వాసుకి దేవదానవులు మందరమునకు జుట్టి తమ బలమునంతను ఉపయోగించి

మథించినను తట్టుకొనగల సామర్థ్యమున్ను పొడవున్ను కలది కావునను, అమృతలక్ష్మీప్రభృతి మహత్తర పదార్థములు పుట్టుటకు సాధన మగుటవలనను సర్పములలో గొప్పగా పరిగణింపబడెను.

29వ శ్లోకము

(81) పెక్కుతలలుగల పాములలో అనంతుడు తన సర్వావయవములను సర్వకాలములయందును సర్వేశ్వరుని సర్వవిధకైంకర్యములయందును వినియోగించుటచే వానిలో నాదిశేషుని శ్రేష్ఠముగా లెక్కించెను ...

ఈ విషయమును ఆళవందారు 'శేష' శబ్దమునకు వ్యుత్పత్తిగా-

శ్లో॥ నివాసశయ్యాసన పాదుకాంశుకోపధాన వర్షాతప
వారణాదిభిః। శరీరభేదై స్తవశేషతాం గతై
ర్యథోచితం శేషఇతీర్యతే జనైః ॥

అని సాయించిరి. అట్లుపయోగపడని దేహేంద్రియాదులు నిరర్థకమనియే వారి యాశయము. దీనిని -

'న దేహం న ప్రాణాన్న చ సుఖమ శేషాభిలషితం'

..............................

నాన్యత్కిమపి తవ శేషత్వ విభవాత్ ।
బహిర్భూతం నాథ ! క్షణమపి సహేయాతు శతధా ।
వినాశం తత్సత్యం మధుమథన ! విజ్ఞాపన మిదమ్ ॥

అను శ్లోకమున సాయించిరి -

(82) అపరాధానుగుణముగ దండించు రాజాదు లందరికన్నను యెన్నడు నెవ్వరిపట్లనైనను న్యాయమును తప్పక శిక్షించు నేర్పు గలవాడగుటచే సమవర్తి యనబడు యమధర్మరాజు గాన నాతడు గొప్పవా డనబడెను.

ఈతడే నాచికేతునకు వరము లొసంగు నెపమున నతి గంభీర

మగు వేదాంతార్థముల నుపదేశించుటచే నధ్యాత్మవిద్యా పారంగతు డగుట మరియొక యుత్కర్ష -

30వ శ్లోకము

(83) ప్రహ్లాదః -

ఒక్కొక్క సద్గుణమున కొక్కొక్క మహాపురుషు డుపమాన ముగా గ్రహింపబడును. కాని ప్రహ్లాదుడు రాక్షస కులమున బుట్టి నను సత్పురుషుల సకల సద్గుణములకును ఉపమానముగా చెప్పదగి యుండుటచేతను దుర్భర హింసలకైనను తన ప్రాణత్యాగమునకైనను సంసిద్ధుడై లోకభయంకరుడగు తన తండ్రియెదుట తన యాస్తిక సిద్ధాంతముల నుపన్యసించి నాస్తికత్వమును ఖండించి ఆస్తిక్యమును ప్రత్యక్షముగా ఋజువుచేసి నృసింహావిర్భావమునకు నిదానమైన మహాభక్తుడు గాన దితిపుత్రులలో ప్రహ్లాదుడు భగవద్విభూతిగా పరి గణింపబడెను.

(85) గరుడుడు వేగాతిశయము కలవాడగుటచేతను భగవం తునకు గజేంద్రుడు మొదలగు సాధుపరిత్రాణము నరకాసురునివంటి దుష్టశిక్షణాది వ్యాపారములకు వాహనముగా నిత్యసన్నద్ధమై యుండు టచేతను, 'వేదాత్మా విహగేశ్వరః' అనునట్లు వేదమూర్తి యగుటచే తను విష్ణ్వాలయములలో భగవద్విగ్రహమున కెదురుగ ప్రతిష్ఠింపబడి తన రెండుచేతులతో భక్తులకు ఇదుగో నీతడే "వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః" అనునట్టి పరతత్త్వమని రెండుచేతులతో చూపుచు నుండు టచే నుత్తమ భగద్విభూతిగా పరిగణింపబడెను.

ఈతని వైభవమును ఈతనికిగల బహువిధములైన భగవత్సంబం ధమును ఆళవందారులు -

దాసస్సఖా వాహన మాసనం ధ్వజో ।
యస్తే వితానం వ్యజనం త్రయీ మయః ।
ఉపస్థితం తేన పురోగరుత్మతా ।
త్వదంఘ్రి సమ్మర్ద కిణాజ్క శోభినా॥
అని సెలవిచ్చిరి.

31వ శ్లోకము

(86) పవనః -

నిరంతర సంచారులలో వాయువును మించినది లేదు. నక్షత్ర గ్రహాదులును వాయువుచే ప్రేరేపించబడియే ప్రవర్తించును. కావున వాయువును తన విభూతిగా జెప్పెను.

నిరతిశయబలాఢ్యులైన భీమ హనుమంతు లీతని యంశ సంభూతులు. వారికిగల పరాక్రమమును భగవచ్ఛక్తిని గాంచినచో వారి జన్మకు కారణమైన నీ వాయువుయొక్క వైభవమును బలాదులును వ్యక్తము కాగలవు.

(87) ప్రవహించు నదులలో గంగానది శ్రీ విష్ణుపాదముల నుండి బుట్టుటచేతను సర్వజ్ఞుడగు నీశ్వరునిచే శిరస్సున ధరింపబడుట చేతను మూడులోకములను పవిత్రము గావించుచు ప్రవహించుట చేతను గొప్పదిగా చెప్పబడెను. అనేక నదులను ఓషధులను తన గర్భమున బెట్టుకొని విశృంఖలముగ దివారాత్రము లుద్ఘోషించుచు ప్రవహించు అలకనందానదియును దేవప్రయాగవద్ద గంగలో కలసి పోయి తన ఊరును పేరుచు పోయి యిక్కపైన గంగయనియే వ్యవహారింపబడునుగదా ?

సజ్జన సాంగత్యముచే నుత్తమ పురుషార్థ ప్రాప్తివలె అలకనంద కీ గంగా సాహిత్యము వలననే సముద్రప్రాప్తి; ఇట్టి వైభవోపేతమగుటచే భగవద్విభూతిగా పరిగణింపబడినది.

32వ శ్లోకము

(88) ఇచ్చట సర్గశబ్దమునకు కర్మణి వ్యుత్పత్తి నంగీకరించి సృజింపబడునవి యని యర్థము చెప్పబడెను.

(89) ఇచ్చట ఆదిమధ్యాన్తశబ్దముల కర్థమేమి? అవయవ విశేషములందుమా? దానిలో నేమి స్వారస్యమున్నది? కాలవిశేష మర్థమందుమా? ఆ విషయము ముందు చెప్పబడుచున్నదిగాన నిష్ప్రయోజనము. ఉత్పత్త్యాది క్రియా మాత్ర మర్థమందుమా? 'ఉద్భవశ్చ భవిష్యతా' మ్మని ముందు చెప్పబడుదానితో పౌన రుక్త్యము. ఈశ్వరునకే కారణత్వాదులు చెప్పబడుచున్నవందమా? 'అహమాదిశ్చ మధ్యంచ' ఇత్యాదినా 20 వ శ్లోకోత్తరార్థమున చెప్పియే యుండెను. పోనిండు దానినే యిచ్చట నిగమించుచున్నా డందమా? ఇంకను ఎంతనో చెప్పనున్నాడు కాబట్టి లోకసిద్ధమైన ఉత్పత్తి రక్షణసంహారములకు తానే ప్రధానకారణమని చెప్పుటలోనే తాత్పర్యము. ఆ కారణమగుటలోను 'బీజం మాం సర్వభూతానాం' అని ఉపాదానకారణము తానేయను విషయము వేరుగా జెప్పబడు టచే నిచ్చట నిమిత్తకారణత్వమే వివక్షితము.

'సర్గాణాం' అని నిరుపపదముగా జెప్పుటచే సర్వదేశ సర్వకాల ములయందును సృజింపబడు సమస్త పదార్థములయొక్క నిమిత్త కారణసముదాయ మంతయు తన యధీనమై యున్నదని చెప్పబడెను. దీనిని శ్రీ భాష్యకారులు 'సర్వదా సృజ్యమానానాం' (సర్వదా సృజింప బడు) అని వివరించిరి.

(90) జ్ఞానప్రదములగు చదువులన్నిటిలోను- పరస్వరూపము - జీవస్వరూపము - ఉపాయస్వరూపము - ఫలస్వరూపము - విరోధి స్వరూపములనబడు ఐదర్థములయొక్క వాస్తవస్వరూపము నెఱిం గించునట్టిది - వేదాంతము. అట్లు ఎఱుంగదగిన సకలార్థ బోధకమగుట

చేతను, ఉత్తమ పురుషార్థమైన మోక్షమును ప్రసాదించుటచేతను ఉత్తమమైనదిగా జెప్పబడినది. మరియు పదముల వ్యుత్పత్తి వేదాంత విద్యచేతనే సమగ్రముగ నెఱుంగబడును.

నారదుడు సనత్కుమారుని సన్నిధికేగి ప్రణమిల్లి నిలచెను. ఆతడు నారదుని నీ వింతకు ముందేమి యధ్యయనముచేసితివని ప్రశ్నించెను. దానికి నారదుడు నాలుగు వేదములను ఆరంగములను పదునాలుగు విద్యలను సమగ్రముగా చదివితినిగాని 'మంత్రవిదేవాస్మి - నాహమాత్మవిత్' అనగా మంత్రవేత్తనే యైతినిగాని ఆత్మవేత్తను కాలేదు కావున నా కధ్యాత్మ విద్యను గఱపుమని ప్రార్థించెను.

(91) 'వాదః ప్రవదతా మహమ్'

గౌతమతర్కమున పదునారు పదార్థము లంగీకరింపబడినవి. అందు 10, 11, 12వ పదార్థములు వాద - జల్ప - వితండములు.

వైశేషిక దర్శనమందును - 1 అ 2 ఆహ్నికమున 4 ప్రకరణములు కలవు. అవి - కథ - హేత్వాభాస - ఛల - దోష లక్షణములు.

అందు కథ మూడు విధములు - వాద - జల్ప - వితండము లని - వీనిలో వాదము=తత్త్వము నెఱుంగగోరి ప్రసంగించుట.

జల్పము - తాను జయించవలెనని తన పక్షమును సమర్థించు ప్రసంగము.

వితండము - తన దోషములను లక్ష్యపెట్టక పరపక్షమును మాత్రము ఖండించుటకుచేయు ప్రసంగము.

ఈ మూడింటిని 'ప్రవదతామ్' అవి యొక పదముచే సంగ్రహించిరి - తాను జయించుట యను స్వల్పఫలముకల జల్పము కన్నను, నిష్ఫలమైన వితండము కన్నను సర్వోత్కృష్టమైన మోక్ష

మే ఫలముగాగల వాదము గొప్పదని దానిని తన విభూతినిగా పేర్కొనెను.

33వ శ్లోకము

(92) బహ్వృచోపనిషత్తునందు -

'అ ఇతి బ్రహ్మ' అనియు, 'అకారోవై సర్వావాక్ - సైషా స్పర్శోష్మభి ర్వ్యజ్యమానాబహ్వీ నానా రూపా భవతి' అని చెప్పబడినది.

అనగా - మొదటి వాక్యములోని సామానాధికరణ్యము వాచ్య వాచక భావసంబంధ నిబంధనము. రెండవ వాక్యములోని సామా నాధికరణ్యము జన్యజనక భావ సంబంధ నిబంధనము. అనగా - అకార మునకు పరమార్థమే యర్థమనియు, అకారమునుండి సకల వర్ణములును బుట్టినవనియు నర్థము. స్పర్శ - ఊష్మాదులచే ప్రకాశింపచేయబడి యా యకారమే నానా వర్ణరూపములను దాల్చుచున్నదని యర్థము. అక్షరములన్నిటికిని 'అ' కారము కారణము. దానినుండి ప్రణవము పుట్టుచున్నది. 'యో వేదాదౌస్వరః ప్రోక్తః వేదాన్తే చ ప్రతిష్ఠితః' వేదము నధ్యయనము చేయుట. కారంభించినపుడును, అధ్యయనమును ముగించునపుడును ఉచ్చరింపబడు స్వరము ప్రణవము = 'ఓమ్' 'తస్య ప్రకృతి లీనస్య' దానికి ప్రకృతి 'అకారము'. తల్లీను డనగా తత్ప్రతిపాద్య డెవడో వాడే పరమేశ్వరుడు- అని చెప్పబడుటచే అకా రమునుండి ప్రణవము పుట్టినదని తెలియబడుచున్నది. ఆ ప్రణవము నుండి 'ఓంకార ప్రభవా వేదాః' అనుటచే వేదములు బుట్టుచున్నవి. ఆ వేదములనుండియే దేవాది చతుర్విధ భూతములును తద్వాచక శబ్దములును బుట్టుచున్నవి. 'నామరూపం చ భూతానాం । కృత్యా నాం చ ప్రపంచనం వేదశబ్దేభ్య ఏవా దౌ దేవాదీనాం చకారసః' అని ప్రమాణము.

ఇట్లు వాచకములన్నిటికిని వాచ్యములన్నిటికిని కారణమీ 'అ' కారము.

మరియు నిది 'అవ - రక్షణే' అను ధాతువునుండి బుట్టి నిరుపాధిక రక్షకుడగు నారాయణుని జెప్పుచున్నది. ఇట్లు సర్వశబ్దములకును కారణమై సర్వార్థములకును కారణమగు నారాయణుని చెప్పుటచే దీనిని తన విభూతిగా గణించెను.

(93) సమాసములలో -

అవ్యయీభావసమాసమునకు పూర్వపదార్థము ప్రధానము.

తత్పురుషలో - ఉత్తరపదార్థము ప్రధానము.

బహువ్రీహిలో - పదబహిర్భూతాన్యపదార్థము ప్రధానము.

ద్వంద్వ సమాసమున నన్నన్నో అందున్న పదార్థములన్నియును ప్రధానమే కాబట్టి యది సమాసములలో గొప్పదిగాన దానిని తన విభూతినిగా పరిగణించెను.

(94) అక్షయ శబ్దముచే కాలమునకు ఔపాధిక క్షణదినాది భేదము (పరిణామములు)లున్నను కాలస్వరూపము మాత్రము నిత్యమే. వికారములు ఔపాధికములు. ఇందులకు ప్రమాణము - 'అనాదిర్భగవాన్ కాలః నాన్తోఽస్య ద్విజ విద్యతేః (విష్ణు - 1, 25, 26)

కాలోఽస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధః -

ఈ ప్రమాణములచే కాలము భగవత్స్వరూపమే గాన నిత్యము- కాలమున కధిష్ఠాత భగవానుడే యనియు తెలియుచున్నది.

(94) ధాతాఽహం విశ్వతోముఖః -

ధాతృశబ్దము చతుర్ముఖుని యందు రూఢిశక్తి ప్రసిద్ధము. మరియు 'విశ్వతోముఖః' అన్నివైపుల ముఖములు కలవాడనియు విశేషించబడినది కావున హిరణ్యగర్భుడే యిచ్చట వివక్షితము.

ఇచ్చట 'విశ్వతః' అను పదమునకు నాలుగు దిక్కులనియే గ్రహించవలెను. కావుననే 'చతుర్ముఖః' అనబడెను. నాలుగు దిక్కులకును నాలుగు ముఖములు కలవాడు. అవి నిరంతరమును నాలుగు వేదముల నుచ్చరించుటకే నారాయణునిచే ప్రసాదించ బడెను.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం ।
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అను శ్రుతి.

శ్రియఃపతి ప్రప్రథమమున బ్రహ్మను సృష్టించి తాను పంచీకరణచే పాళ్లు వేసి కలిపియుంచిన పంచభూతాత్మక ప్రకృతితో జగత్తును సృజించమని నియోగించగా -

నాతడు -

"నామరూపంచ భూతానాం । కృత్యానాంచ ప్రపఞ్చనమ్
వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకారసః"

ఆతడు భగవంతుడు తనకు ప్రసాదించిన వేదముల నుచ్చరించుచు అందు నాలుగు విధములగు జీవరాసులలో నెవ్వరి నే యాకారముతో నే పేరులతో నే వృత్తులతో సృష్టించవలెనో యెఱింగి యట్లే సృజించెను.

ఈ కారణముచే పంచముఖ షణ్ముఖులకన్న నీ చతుర్ముఖున కతిశయముండుటచే భగద్విభూతిగా నీతడు పరిగణింపబడెను.

34వ శ్లోకము

(95) కర్మానుగుణముగా దండించు నధికారియగు యముడున్ను కాలావచ్ఛేదాధికృతమైన కాలమున్ను యీ యుభయున్ను ఇదివరలో చెప్పబడుటచే నిచ్చట మృత్యుశబ్దమునకు యముని యాజ్ఞను శిరసావహించి ప్రాణుల ప్రాణములను తీయుటలో నధికారముగల మృత్యువను పేరుగల పురుషు డిచ్చట చెప్పబడుచున్నాడు.

ప్రళయమున నందరను సంహరించు శ్రీ మహావిష్ణువే మృత్యువని చెప్పబడుచున్నాడని కొందరందురు. అది తగదు - ఏలనన - ఆ విషయము 'భూతానా మన్త ఏవచ' అని వెనుక చెప్పబడినది. ఉద్భవ సహపఠితమగుటచే నిచ్చట 'చావు' అర్థమని కొందరందురు. కాని ఉద్భవశబ్దమునకు పుట్టుట యను క్రియ అర్థమగుటచే దాని సాహచర్యమువలన నిదియును క్రియాపదమనుటయే ఉచితము.

(96) స్త్రీలలో సర్వసమాశ్రయణీయురాలును, పరమపురుషుని పట్టమహిషియును, పురుషకారమునకు తగిన కృపా - పారతంత్ర్యము - అనన్యార్హత్వము అను గుణములు కలదియు, లోకమాతయు నగుటచే లక్ష్మియును -

కీర్తికొఱకై సర్వస్వమును సమర్పించుట లోకరివాజుగాన కీర్తియు, భగవంతుని కల్యాణగుణముల ననుసంధించి ముక్తిని పొందుటకు ప్రధాన సాధనమగుటచే వాక్కును, ఉత్తమ గుణములగుటచేతను భగవదసాధారణ శక్తి విశేషము లగుటచేతను స్మృతి-మేధా-ధృతి - క్షమాదులున్ను ఉత్తమమైన విభూతులుగా పరిగణింపబడినవి.

35వ శ్లోకము

(97) గానరూపమగు సామలలో 'బృహత్సామ' గొప్పదని శ్రుతి చెప్పుచున్నది.

(98) గాయత్రీ - ఛందస్సులకు మాతయగుటచే దాని కుత్కర్ష కలదు. ఈ విషయము వేదమునందే కలదు. 'అగ్ర్యం వై ఛన్దసాం గాయత్రీ'' ఇత్యాది - ఛందోబద్ధమగు మంత్రములలో -

'సంధ్యాహీనోఽ శుచిర్నిత్యం అనర్హ స్సర్వకర్మసు' అని వేదాధ్యయన యోగ్యతయు దాని మూలమున భగవదారాధనాది సమస్తాత్మోజ్జీవన హేతుభూతములగు కర్మల కధికారము నాపాదించునది సంధ్యావందనము. అందు ముఖ్యతమాంగము గాయత్ర్యు

పాసన. తక్కిన క్రియాకలాప మంతయును దానికంగమే. ఈ గాయత్ర్యుపాసన ప్రభావమునకు లొంగనిశక్తులు ప్రపంచమున లేవు. సృష్టికి ప్రతిసృష్టి దీనివలననే. యముని గడగడ వణికించిన నాచికేతుని శక్తి దీనివలననే. సముద్రము నాచమనముచేసి యెండించిన అగస్త్యుని శక్తి దీనివలననే. ఇక్ష్వాకుల రథముల ననర్గళముగ నన్నిదిక్కులకు నడిపించిన వసిష్ఠుని శక్తి దీనివలననే.

ఇట్టి శక్తులను ప్రసాదించు మంత్రశ్రేష్ఠమగుటచే గాయత్రీ ఛందస్సును తన యుత్కృష్ట విభూతినిగా భగవంతు డానతిచ్చెను.

(99) మరియు మార్గశిరమాసము మొదలు మాఘమాసము వరకును గర్భోదక కాలముగా పరిగణింపబడుచున్నది. మార్గశిర మాసము మాసాధిదేవతలగు కేశవాదివ్యూహములలో మొదటివాడగు కేశవుని యధిదేవతగా కలదగుటచేతను, దేవతలకు రాత్రియగుటచే ననధ్యయనముగా పరిగణింపబడు దక్షిణాయనకాలమునకు అవసానమును దేవతలకు పగలుగా పరిగణింపబడుటచే నధ్యయనకాలముగా పరిగణింపబడు ఉత్తరాయణపుణ్యకాలమునకు ప్రారంభమగుటచేతను ఈ మాసము బ్రాహ్మముహూర్తము వంటిది. ఈ హేతువులచే నిది భగద్విభూతిగా పరిగణింపబడుచున్నది.

(100) 'కుసుమాకరః' అనుటచే వసంతఋతువు పేరువలననే సుఖహేతు వగుచున్నది. భగవదారాధన కుపకరించు సకల పుష్ప ఫలాదుల నొసంగునదగుటచే నుత్తమ విభూతిగా లెక్కింపబడినది.

(101) పాచికల నడకనుబట్టి జయాపజయములను నిర్ణయించుటచే నిచ్చట 'ఛల' మనబడెను. ఛలమనగా = వంచన, 'తేజస్వినాం తేజః' అనినటుల నిచ్చట 'దీవ్యతాం ఛలమహాం' అనలేదేమి యనగా – 'ఛలయతాం' అని ఛలమును చేయుటమాత్రమే చెప్పుట చేత వంచనాస్పదమైన – కొనుట, అమ్ముట, అప్పిచ్చుట, అప్పను

తీసుకొనుట (వడ్డీవ్యాపారము), దాయభాగ విభాగము, యుద్ధములనెడు స్థానములన్నిటికన్నను ద్యూతము గొప్పదిగా పరిగణింపబడినది. ఇట్టివే కోడిపందెములు గుఱ్ఱపు పందెములు చదరంగముమొదలగు నవియును గ్రహించవలెను.

ఇది పరద్రవ్యమును అనాయాసముగ హరించు సాధనము. ఇది వెక్కురీతులుగ నుండును. (సజీవద్యూతము నిర్జీవద్యూతము అని) అందు ప్రాణములేని పాచికలతో నాడు యీ ద్యూతము ధర్మమునకు కట్టుబడి యెదిరిని యోడించి యనాయాసముగా రక్తపాతాది రూపమైన హింసలు లేకయే సమస్త సాధనముల నార్జించు సాధనమగుటచే నుత్తమముగా చెప్పబడినది.

37వ శ్లోకము

(102) 'పాండవానాం భవానహం' అని నీవు అను నర్థముగల 'భవాన్' అను సర్వనామ శబ్దమును వాడక 'ధనఞ్జయః' అని పరోక్ష నిర్దేశమును చేయనేల ? యన్నచో -

ఇచ్చట యుష్మద్భవ చ్ఛబ్దాదులకన్న సాక్షాత్తుగా పేరునే చెప్పుట అత్యంతాసన్నత్వాది కారణములచే నతిశయావహము.

ధనంజయశబ్దమునకు అర్జున డనెడు పర్యాయపదముచే భాష్యకారులు వివరించిరి. ఇది యాతనికి ప్రసిద్ధమైన పేరగుటచే నెదురుగనున్నవానిని 'త్వం-భవాన్' అనక 'ధనఞ్జయ' అననే యీతడు వేరొకడా యను శంకకు అవకాశము లేదు. ధర్మములలో ధర్మరాజునకును, బలములో భీమునకును, అందచందములలో నకుల సహదేవులకును ఎట్లు సర్వాతిశాయిత్వము ప్రసిద్ధమో అటులనే యర్జునునకును 'ధనఞ్జయత్వములో' (ధనార్జనలో) సర్వాతిశాయిత్వము ప్రసిద్ధము.

పాండవులలో జితేంద్రియత్వమునకును, పరాక్రమమునకును, గీతవంటి అద్భుతరహస్యగ్రంథమును వినుటకును ఆయుధసామగ్రికిని

అర్జునుడు ప్రసిద్ధమైనవాడు గాన నా శబ్దముతో నాతనిని తన విభూతిగా పేర్కొనెను.

(103) 'మునీనా మప్యహం వ్యాసః'

అదృష్ట విశేషముచే మననముచేసి వస్తువులయొక్క తత్వము నెఱుంగు మునులలో వ్యాసమహర్షి - (1) సకల శాస్త్రములను తన బుద్ధిచే మథించి నారాయణుడొక్కడే ధ్యానింపదగిన వాడని నిశ్చయించుటచేతను.

(2) సకల రహస్యములను లెస్సగ నెఱింగిన వాడగుటచే వసిష్ఠుని మించినవాడని ప్రశంసింపబడుటచేతను.

(3) భగవంతుని విభవావతారములలో తానొక యవతార మగుటచేతను.

(4) వేదవిభాగమును గావించుటచేతను.

(5) బ్రహ్మసూత్రములను రచించుటచేతను.

(6) పురాణములను వ్రాసి లోకమునకు జ్ఞానదీపమును వెలిగించుటచేతను గొప్పవాడని నిర్వివాదముగా నంగీకరింపబడుచున్నాడు.

మరియు 'సహోవాచ వ్యాసః పారాశర్యః' అని వేదములచే కూడ ప్రశంసింపబడిన వాడగుటచే నాతడు పరమాత్మ విభూతిగా చెప్పబడెను.

ప్రమాణములు –

'ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః ।
ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణస్సదా ।
తపోవిశిష్టాదపి వై వసిష్ఠాన్మునిసత్తమాత్ ।
మన్యే శ్రేష్ఠతమం త్వాద్య రహస్య జ్ఞానవేదనాత్ ।'

(104) ఇచ్చట కవులనగా రచయితలుకారు. అట్లగుచో నాదికవియగు వాల్మీకి ప్రభృతు లింతను మించిన వారుకలరు. కావున నిచ్చట కవులనగా జ్ఞానాధికులనియే యర్థమును గ్రహించవలెను. శుక్రాచార్యులకు పండితులలో గౌరవము నీతి నిపుణుడగుటవల్లనే -

శ్లో॥ నకశ్చి న్నోషనయ తే
పుమానన్యత్ర భార్గవాత్
శేషసంప్రతి ప త్తిస్తు
బుద్ధిమత్స్వవశిష్ట తే॥

38వ శ్లోకము

(105) శాసనము నుల్లఘించిన వారిని దండించువారలలో దండన నేనే యనుట దండించకూడని వారలను దండించుట మిక్కిలి నరకహేతువని తెలుపుట కే.

(106) మౌనమునకు లోకవ్యవహారమునుబట్టి నోరు మెదప కుండుట. కాని యిచ్చట నట్టి యర్థమును గ్రహించినచో నట్టి మౌనము గుహ్యము కాదుగాన 'గుహ్యముఃలలో' అను నిర్ధారణ కుదుర నేరదు. మౌనశబ్దము 'అథమునిః' అనినట్లు ఆత్మవిద్యావిషయమందు మాత్రము ప్రసిద్ధమైన యర్థమును విడిచి అప్రసిద్ధార్థ కల్పనాదోషము. 'సత్వం సత్వవతామ్మ'ను నప్పుడు స త్త్వము పురుషధర్మ మైనటుల మౌనము గుహ్యధర్మము కాదుగదా ! కాబట్టి భాష్యకారులు 'గుహ్యే నాం సంబంధిషు' అని వ్యాఖ్యానించిరి (గోప్యమగువానిని దాచునట్లే) అనగా నిచ్చట సంబంధ మాత్ర షష్ఠీ విభ క్తియేగాని నిర్ధారణ షష్ఠి కాదు. ఆ సంబంధము గోప్య గోపనభావమని గ్రహించవలెను. ఒక విషయమును రహస్యముగా నుంచవలెననిన దానికి 'అషట్కార్ణ' మందురు. అనగా - ఇద్దరికంటె నితరు తెలుంగరాదని యర్థము. అనగా చెప్పుచున్నవాడు వినుచున్నవాడు మాత్రమే. మౌన మంత

కన్నను గోప్యము కదా! గోడకు చెవులుండు నన్నట్లు ఒక్క డొక్కనికి చెప్పినను ఎట్లో పొక్కకమానదుకదా! దాని ప్రసంగమే యెత్తనిచో నిక నంతకంటె రహస్యమేముండును అని భావము.

ఈ కారణముచే గోపనీయములలో నిట్టిమౌనము గొప్పదిగా లెక్కింపబడినది.

(107) ఇచ్చట బీజమనగా ప్రకృతి మాత్రముకాదు. అది సాక్షాత్తుగా సర్వభూతములకును బీజమగునా ?

ధాన్యాది విత్తనములందుమా ? అవి సర్వభూతములలో జేరిన స్థావరములకు బీజములైనను జంగమములకు కావుగదా!

మరి యేమనిన - ఆయా కార్యావస్థలోనున్న ద్రవ్యమునకు ఆయా కారణావస్థలోనున్న ఉపాదానద్రవ్యముమాత్రమే యిచ్చట బీజశబ్దముచే వివక్షితము - అనగా - ఘటావస్థలోనున్న మృత్తికకు పిండావస్థలోనున్న మట్టిముద్దవలెనని భావము. ఇట్లు చెప్పుటవలన ప్రాకృతసృష్టికిని నైమిత్తికసృష్టికిని 'అహమాదిశ్చ భూతానాం' అని చెప్పబడుటవలన నిచ్చట నిత్యసృష్టికి కారణభూతమైన నాయా ద్రవ్యములను తనకు శరీరములుగా గలవాడై యారూపమున వానిలో నాత్మగానుండి భగవంతుడు ఆయా కార్యములకు కారణమగుచున్నా డని భావము.

(108) 'నతదస్తి' అను గ్రంథమునకు 'నేనే యున్నాను నాకంటె వేఱైన దేదియును లేద'ని భావము. 'బ్రహ్మసత్యం జగన్మిథ్య' వాదమని భ్రమపడుదురో యని భాష్యకారులు అవినాభావార్థమును చెప్పుచున్నారు.

నేనంతర్యామిగా లేక స్వతంత్రముగా లేదని యర్థమే గాని వస్తువే లేదని కాదని తెలిపిరి.

ఉపక్రమోప సంహారములకైక రూప్యముండవలెను. ప్రారంభములో 'అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః' యని సర్వాంతర్యామిత్వముచే నవినాభావము చెప్పబడినది. ఇప్పుడు సర్వ శూన్యత్వము చెప్పబడిన వైరూప్యము కాదా! కాబట్టి ఉపసంహార గతమగు నీ శ్లోకమునందును నే నంతర్యామిగా లేనిదేదియును లేదని జెప్పుటయే స్వరసమైన యర్థము.

ఇట్లుపక్రమోప సంహారములలో తనతో నవినాభావమును జెప్పుటలో భగవదభిప్రాయ మేమైయుండుననగా అధ్యాయమునం దంతటను సమస్త పదార్థములతో తనకు గల సామానాధికరణ్య (అది నేను ఇది నేను అని చెప్పుట) నిర్దేశమునకు హేతువు తానన్నిటికిని అంతర్యామిగా నుండుటయేనని తెలుపుటయే.

కొన్నిచోట్ల అద్రవ్యములతోగూడ భగవంతునకు సామానాధికరణ్యము చెప్పబడెనే (రసోఽహమప్సు కౌన్తేయ ఇత్యాది) అది యెట్లు ఘటించుననగా ఆయాద్రవ్యమునకు (గుణాదికమునకు) ఆశ్రయమైన ద్రవ్యము భగవంతునకు శరీరమగుటచే దోషము లేదని గ్రహించవలెను.

### 40వ శ్లోకము

(109) ఇచ్చట దివ్యమనగా 'ఒకానొక విలక్షణ దేశమునం దున్న' అని యర్థమును చెప్పరాదు. అట్లన్నచో - నాకస్థానము నందు స్థిరముగా నుండని సూర్యాదులను చెప్పుట విరోధించును. కాబట్టి భాష్యకారులు 'కల్యాణీనాం' అని యర్థమును చెప్పిరి. ప్రారంభములోనే 'విభూతీ రాత్మనశ్శుభాః' అనెనుగదా! 'శుభాః' అను పదమునకే పర్యాయముగా 'దివ్యాః' అనెను. కాబట్టి రెండింటికిని సమానార్థముండవలెను.

(110) ఉద్దేశతః = ఏకజాతీయ అనేకవస్తువులలో ప్రధానమైన

ఒక్కొక్క వస్తువుగా - దీనినే ఉపాధులుగా జెప్పుట యుండును. ఉపాధియనగా - ఒక జాతికొక్కటి శ్రేష్ఠమైనదానిని చూచిచెప్పుట.

41వ శ్లోకము

(111) అవతారిక -

ప్రారంభములో 'ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ!' అని ప్రారంభించి విస్తారముగా చెప్పిన వానిని, ఇంకను తప్పక చెప్పవలసిన విభూతులనున్ను సంగ్రహించవలెనను నుద్దేశముతోను ఉపసంహరించుచున్నాడు.

(112) 'మమ' యనుటచే - వందరకును గోచరించుట, ఈశ్వరము కాకుండుట, అఘటిత ఘటనయున్ను సూచింపబడుచున్నవి.

(113) 'యథా శైలాందోళన దోహళినశ్చణ్ణ మారుతస్య తృణప్రేరణాదికం వేగలేశ మాత్రభవం తద్వదిహేతిభావః'। (చంద్రికలో).

అనగా - పర్వతము నూపగల గాలికి గడ్డిపరకను కదల్చుట కెంత వేగము కావలెనో అంతమాత్రపు నా నియమన శక్తిలేశముతో పుట్టుచున్నదని తెలుసుకొనుము.

42వ శ్లోకము

(114) అవతారిక -

ప్రధానముగా చెప్పెదనని చెప్పివేసెను. ఇప్పుడీ శ్లోకమున ప్రధానా ప్రధానవిభూతుల నెల్లను సంక్షేపించి సంగ్రహముగా చెప్పుచున్నాడు.

(115) విభూతులనన్నిటిని పూర్తిగా చెప్పితినన్నచో ప్రయోజనము లేదని భావము. ఏలనన - ఎంత చెప్పినను అంతులేదు గాన-

(116) అనిత్యపదార్థములకు స్వరూప సద్భావమనగా పుట్టుట.

నిత్యములకు లేకపోవుట లేకుండుట. నిత్యవస్తువులయొక్క స్వరూప మున్ను భగవంతుని నిత్యేచ్ఛాధీనమే యని గ్రహించవలెను.

(117) ఇచ్చట మహిమ యనగా నియమన సామర్థ్యమని యర్థము -

(118) ఇచ్చట ఏకశబ్దమునకు అత్యంతాల్పమని యర్థము.

(119) ఇచ్చట - 'విష్టభ్య' - అనగా స్వేచ్ఛాసంచారము నరికట్టుట లేక తనవశ మొనర్చుకొనుట.

(120) విశ్వశక్తిః=విశ్వశక్తియనగా విశ్వము ఆయా కార్యముల కుపయోగించు విశేషణాంశము (శక్తి=విశేషణము).

పరమాత్మయొక్క మహిమలోని పెక్కువేల భాగములలోని యల్పాంశ మాత్రమునందే ఈ విశ్వశక్తి నిలచియున్నది.

## (121) గీతార్థసంగ్రహము

శ్లో. స్వకల్యాణ గుణానన్త్య కృత్స్నస్వాధీనతా మతిః ।
భక్త్యుత్పత్తి వివృద్ధ్యర్థం విస్తీర్ణా దశమోదితా ॥

### తాత్పర్యము

భగవద్భక్తిపుట్టి యంతకంతకు పెరుగుటకై భగవంతుని నిరంకుశైశ్వర్యాది కల్యాణ గుణాతిశయమును చేతనాచేతనాత్మక ప్రపంచమంతటియొక్క స్వరూప స్థితిప్రవృత్తులన్నియు నాతని యధీనములో నున్నవనియెడు జ్ఞానము విస్తారముగా పదియవ యధ్యాయములో జెప్పబడినది.

---

# శ్రీ భగవద్గీతా - ఏకాదశోఽధ్యాయః

## విశ్వరూపసందర్శనయోగః - అవతారిక

1
ఇట్లు భక్తియోగముయొక్క యుత్పత్తికొఱకును వృద్ధికొఱకును
2
సకలేతర విలక్షణమై స్వాభావికమై భగవంతునికి మాత్రమే కలిగి యున్న కల్యాణగుణగణమును, భగవంతుఁడు సమస్తమునకు ఆత్మ యగుటయు, కాఁబట్టియె, యతనికి వ్యతిరిక్తములగు చేతనాచేతనాత్మకము లగు వస్తువులెల్ల అతని శరీర మగుటవలన అతనికి లోనైనట్టి
3
స్వరూపస్థితి ప్రవృత్తులుగలిగి యుండుటయుఁ జెప్పఁబడినవి. భగవంతుని కసాధారణమై యుండెడి యీ స్వభావమును, సమస్తము అతనికి
4
లోనైన స్వరూపస్థితిప్రవృత్తులు కలిగియుండుటయు, భగవంతునివలన అర్జునుఁడు విని అది యట్లే యగునని నిశ్చయించి అటువంటి భగవంతుని కన్నులార చూడఁగోరి చెప్పుచున్నాఁడు. అర్జునుఁడు భగవంతుని ప్రసాదము కలిగినపిదప నతనిని అట్టివానినిగానే కనుఁగొనుచున్నాఁడు. 'సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ । తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా' అని కదా మీఁదఁ జెప్పఁబడెడిని. 5.

అర్జున ఉవాచ.

9
శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్।
10
యత్త్వయోక్తం వచస్తేనమోహోఽయం విగతోమమ॥

టీ. మదనుగ్రహాయ = నన్ననుగ్రహించుటకొఱకు, పరమం = మిక్కిలి గుహ్యం = రహస్యమైనదియు, అధ్యాత్మసంజ్ఞితం =

అధ్యాత్మమని, పేరుగలదియునైన ,యద్వచః = ఏవాక్యము, త్వయా నీచేత, ఉక్తం = చెప్పఁబడెనో, తేన = ఆ వాక్యముచేత, మమ = నా యొక్క, అయం = ఈ ఆత్మను గుఱించిన, మోహః = అజ్ఞానము, విగతః = దూరముగా తొలఁగిపోయినది (నశించినది.)

తా. నేను దేహాత్మాభిమాన రూపమైన మోహముచేత మోహితుఁడను గనుక న న్ననుగ్రహించుటయే ముఖ్యప్రయోజనముగాఁ గలవాఁడవై నీవు నాకు ఆత్మస్వరూపమును గుఱించి చెప్పఁదగిన పరమరహస్యమైన విషయమును 'న త్వేవాహం జాతునాసమ్' మొదలుకొని 'తస్మాద్యోగీ భవార్జున' అనువఱకు చెప్పితివి. దానిచేత నాకు ఆత్మ విషయమైన యీ మోహము సర్వమును దూరముగా తొలఁగినది.

అవ. అట్లే.

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా।
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్॥ 2

టీ. హేకమలపత్రాక్ష = తామరతేకులవంటి నేత్రములు గల శ్రీకృష్ణా, భూతానాం = దేవాది సమస్తభూతములకు, త్వత్తః = పరమాత్మయగు నీవలనఁ గలిగెడి, భవాప్యయౌ = ఉత్పత్తి వినాశములు మయా = నాచేత, విస్తరశః = విస్తరముగా, శ్రుతౌహి = వినఁబడినవి గదా, అవ్యయం = నాశరహిత మయిన (అనఁగా) పరిమితి లేని, మాహాత్మ్యమపి = మాహాత్మ్యముగూడ, (శ్రుతం = వినఁబడెను).

తా. ఏడవయధ్యాయము మొదలుకొని పదియవదాని వఱకు చెప్పఁబడినట్లు, నీవు తప్ప తక్కిన సకలభూతములకును పరమాత్ముఁడ వగు నీవలననే ఉత్పత్తి ప్రళయములు కలుగుటను విస్తరించి వింటిఁడను గదా. కమలపత్రాక్షా! మఱియును సర్వచేతనాచేతన వస్తువులకు నీవు శేషివైయుండుట, జ్ఞానశక్త్యాది కల్యాణ గుణములచే నీవే యన్నిటి కంటె నుత్కృష్టుఁడవగుట, సర్వాధారుఁడవగుట, తలఁచుట తెప్ప వేయుట మొదలుగాఁగల సకల ప్రవృత్తులు నీవలననే జరుపఁబడుట, ఇత్యాద్యపరిమితమై నిత్యమైయొప్పు నీ మాహాత్మ్యమును సవిస్తరముగ వింటిఁడను. 'హి' శబ్దము మీఁదఁ జెప్పఁబడు దర్శనేచ్ఛను దెలుపు కొఱకు.

16

శ్లో॥ ఏవ మేత ద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర।

17 18 20 19

ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ॥ 3

టీ. హేపరమేశ్వర = బ్రహ్మరుద్రాదులకుఁ గూడ ఈశ్వరుఁడైనవాఁడా, త్వం = నీవు, ఆత్మానం = నిన్నుఁగూర్చి, యథా = ఏ ప్రకారముగా, ఆత్థ = చెప్పితివో, ఏతత్ = ఇది, ఏవం (ఇతి) = ఈప్రకారమని, (అవధృతం = నిశ్చయింపఁబడెను). హే పురుషోత్తమ = కృష్ణా, తే = నీయొక్క, ఐశ్వరం = ఈశ్వర సంబంధమై అసాధారణమగు, రూపం = స్వరూపమును, ద్రష్టుం = చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. పరమేశ్వరా, నిన్నుగుఱించి నీవు వచియించినవి యెల్ల నట్లే యగునని నిశ్చయించుకొంటిని. పురుషోత్తమా! ఆశ్రిత వాత్సల్యజలధీ! సర్వమును శాసించుటయందును పాలించుటయందును సృజించుటయందును సంహరించుటయందును భరించుటయందును కల్యాణగుణాకరుఁడవై యుండుటయందు సర్వోత్కృష్టుఁడవై యుండుట

యందును సకలేతర విసజాతీయుఁడవై యుండుటయందును, నీకు అసాధారణముగాఁ గలిగియున్నట్టిదియు ఈశ్వరుఁడ వగునిన్ను సంబంధించినట్టిదియు నగునీ రూపమును సాక్షాత్తుగా చూడఁ గోరుచున్నాను.

21

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్॥ 4

టీ. హేప్రభో=ఓస్వామీ, తత్ =అట్టి నీస్వరూపము, మయా =నాచేత, ద్రష్టుం=చూచుటకు, శక్యం (ఇతి)=సాధ్యమని, మన్యసే యది=తలంతువేని, తతః=అట్లైని, హే యోగేశ్వర = కల్యాణగుణయోగమునకు, ఈశ్వరా =నిర్వాహకుఁడా- (గుణపరిపూర్ణుఁడా), త్వం=నీవు, ఆత్మానం=నిన్ను-నీస్వరూపమును, మే=నాకు, అవ్యయం =సమస్తగుణ విభూతి విగ్రహాదులతోఁగూడిన రూపమును, దర్శయ = చూపుము.

తా. ప్రభూ, యోగేశ్వరా, సర్వమును సృజించుచును శాసించుచును సమస్తమున కాధారమయ్యు నుండు నీ స్వరూపముఁ జూచుటకు నేను తగుదునని తలంచితివేని నీ సంకల్పముచే అట్టిస్వరూపమును

22 23

నాకు సమగ్రముగఁ గానిపింపుము. (యోగేశ్వరా - అనగా 'పశ్య మే యోగమైశ్వరమ్' అని మీఁదఁ జెప్పఁబడునట్లు నీవు తప్పఁ దక్కిన వారి కెవ్వరికిని కలుగరాని జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తి తేజస్సులకు నిధియైనవాఁడాయని యర్థము. నీ స్వరూపమును నాకు సమగ్రముగ గానిపింపుము. 'అవ్యయమ్' అనునది క్రియావిశేషణము.)

అవ. ఇట్లు కౌతూహలముతో సాన్ద్ర గద్గదకంఠుఁడై యర్జునుఁడు ప్రార్థింపఁగా భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.

శ్రీ భగవా నువాచ. 24 అవ.

శ్లో॥ పశ్య మే పార్థ రూపాణి శతశో౽థ సహస్రశః।
26
*నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥ 5

టీ. హేపార్థ=అర్జునా, శతశః=నూఱులకొలఁదియు, అథ = ఇఁక, సహస్రశః= వేలకొలదియు, నానావిధాని = అనేకప్రకారము లయినవియు, దివ్యాని=అప్రాకృతములైనవియు, నానావర్ణాకృతీని= పెక్కురంగులును ఆకారములును గలవియునగు, మే = నాయొక్క, రూపాణి=రూపములను, పశ్య= చూడుము.

25

తా. అర్జునా, నూఱులకొలఁదిని వేలకొలఁదిని నానాప్రకార ములును అప్రాకృతములునై, తెలుపు నలుపు మొదలగు నానావర్ణ ములను నానావిధాకారవిశేషములును గలవియై, సర్వమున కాశ్ర
27A
యములునైయుండు నా రూపములను గనుంగొనుము.

శ్లో॥ పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా।
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత॥ 6

టీ. హేభారత=అర్జునా, ఆదిత్యాన్ =పన్నిద్దఱుసూర్యులను, వసూన్=ఎనమండ్రు వసువులను, రుద్రాన్ = పదునొక్కరు రుద్రు లను, అశ్వినౌ=ఇద్దఱు అశ్విదేవతలను, మరుతః= నలువదితొమ్మం

* 'నానావిధాని' అనుటచే నానావిధ భూషణాయుధలాంఛనభుజ సంఖ్యాది ప్రకార విశేషములతోఁగూడినవనియు, 'నానావర్ణ' అనుటచే ఆయా యుగములందు వాసుదేవాదిరూపముల సితరక్తపీత కృష్ణవర్ణములు మొదలయినవానితోఁ గూడిన వనియు, 'నానాకృతి' అనుటచే దేవమనుష్య తిర్యగాద్యాకృతులతోఁ గూడినవనియు గ్రహించునది.

ద్రుమరుత్తులను, పశ్య = చూడుము, తథా = ఆలాగుననె, అదృష్ట పూర్వాణి = పూర్వము చూడఁబడనివియును, బహూని = అనేకములునగు, ఆశ్చర్యాణి = అద్భుతములను, పశ్య = చూడుము.

తా. అర్జునా, నాకుఁ గల పెక్కురూపములలో నొక్కదాని
27B
యందు ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాదశరుద్రులను ఇద్ద
28
ఱాశ్వినులను, నలువదితొమ్మిది మరుద్గణములను, (ఇది ప్రదర్శనార్థముగాన) ఈజగత్తున ప్రత్యక్షముగాను శాస్త్రమూలముగాను గనఁ
29
బడునట్టి సర్వవస్తువులను, మఱియు సర్వలోకములకును *సర్వశాస్త్రములందును ఇంతకు మునుపు చూడఁబడనట్టి పెక్కులాశ్చర్యములను చూడుము.

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమ దేహే గుడాకేశ యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి॥ 7

టీ. హేగుడాకేశ = ఓయర్జునా, సచరాచరం = జంగమస్థావరములతోఁగూడిన, కృత్స్నం = సమస్తమైన, జగత్ = జగత్తును, అన్యత్ = ఇతరమగు, యత్ చ = మఱిదేనిని, ద్రష్టుం = చూచుటకు, ఇచ్ఛసి = ఇచ్ఛగించుచున్నావో, (తత్ = దానిని), మమ = నాయొక్క, ఇహ దేహే = ఈ ఒక్క దేహమునందు, ఏకస్థం = ఒకప్రదేశమం దున్నదానినిగా, అద్య = ఇప్పుడు, పశ్య = చూడుము.

తా. అర్జునా, నాకు పెక్కు దేహములు గలవు. వానిలో

---

* 'అదృష్టపూర్వములచే అశ్రుతపూర్వములును గ్రహింపఁబడుచున్నవి.' కాన 'శాస్త్రములందును జూడఁబడనట్టి' అని కూర్పఁబడెను.

*నాయీ యొక్క దేహములో, అందును ఒక భాగముననే చరాచరాత్మకమగు సకలప్రపంచము నుండుట నిపుడవలోకింపుము. మఱియు నెయ్యది చూడఁ గోరెదవో దానినిగూడ ఆయొక దేహమునం దొక్క భాగముననె యుండుట చూడుము.

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా।
32 30 31
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్॥ 8

టీ అనేన = ఈ, స్వచక్షుషైవతు = నీప్రాకృతమగు కంటితోనే, మాం = నన్ను, ద్రష్టుం = చూచుటకు, నశక్యసే = శక్తుఁడవుగావు, తే = నీకు, దివ్యం = అప్రాకృతమగు, చక్షుః = దృష్టిని, దదామి = ఇచ్చుచున్నాను, మే = నాయొక్క, ఐశ్వరం = నాకు అసాధారణమయిన, యోగం = అనంత కల్యాణగుణ విభూతి విగ్రహయోగమును, పశ్య = చూడుము.

తా. నేను నా దేహమందొక భాగములో జగము సర్వమును చూపెదను. నియతమును పరిమితము నగువస్తువులను గ్రహించు నీ ప్రాకృతచక్షువుచే, సకలేతర విసజాతీయుఁడును అపరిమేయుఁడు నగు నన్నుఁజూడ శక్తుఁడవు గావు. కావున నన్నుఁ జూచుటకుఁ దగిన అప్రాకృతదృష్టి నీకొసఁగెద. నాయొక్క అసాధారణమైన యోగమును - (-అనఁగా అనంతజ్ఞానాది యోగమును అనంత విభూతియోగమును) జూడుము.

సఞ్జయ ఉవాచ.

శ్లో॥ ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥ 9

* 'దేహే' అని ఏకవచనాంతముగా చెప్పుటచే తాను ప్రదర్శింపఁబోవు దేహము

టీ. హేరాజన్ = ఓ ధృతరాష్ట్రమహారాజా, మహాయోగేశ్వరః = సకలాశ్చర్యయోగమును తనయధీనముగఁగల, హరిః = శ్రీకృష్ణుఁడు, ఏవం = ఇట్లు, ఉక్త్వా = పలికి, తతః = అటుపైని, ఐశ్వరం = ఈశ్వరుఁడగుతన్ను సంబంధించిన, పరమం = మిక్కిలియుత్కృష్టమయిన, రూపం = రూపమును, పార్థాయ = అర్జుననికొఱకు, దర్శయామాస = చూపెను.

తా. రాజేంద్రా, ఇట్లు చెప్పి *సారథ్యమునందున్నవాఁడును పార్థుని మేనమామకొడుకును [ "య్యును] మహదాశ్చర్యములైన యోగములకు నీశ్వరుఁడును హరియు పరబ్రహ్మ భూతుఁడునగు శ్రీనారాయణుఁడు తన కసాధారణమై వివిధమును విచిత్రమునగు జగత్తునకెల్ల ఆశ్రయమై విశ్వమునకు నియామకమైన రూపమును తన మేనత్తయగు పృథకొడుకునకు అర్జునునకుఁ జూపెను.

అవ. ఆ రూపం బిట్టి దని తెలుపుచున్నారు.

33 34

శ్లో. అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥ 10
దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్।

35 36

సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ 11

---

ఒక్కటియె వివక్షితముకాన 'నాయీదేహ' మనఁబడెను. మఱియు నెయ్యది చూడఁగోరెదవో యనుటయందు కురుపాండవుల జయాదికమును జూడుమనుట గర్భితము. (చూడు. అధ్యా ౨-శ్లో ౧౬).

* (మహాయోగేశ్వరుఁడు 'హరి' అనెడి యీ రెంటికి తిరస్కారకమైన పూర్వరూపము 'సారథ్య ..హరియు' నని గ్రహింపఁబడెను.) 'మహాయోగేశ్వరుఁడు' 'హరి' యను నీ రెంటి యభిప్రాయమే 'పరబ్రహ్మ...నారాయణుఁడు' అనఁబడెను. 'పశ్య మే యోగ మైశ్వరమ్' 'పరమం రూప మైశ్వరమ్' అను నీరెంటియందును గల ఐశ్వర

టీ. అనేక వక్త్రనయనం = అనేకముఖములును అనేక నేత్రములును గలదియు, అనేకాద్భుతదర్శనం = నిరతిశయమైన యాశ్చర్యముగాఁ జూడఁబడినదియు, సర్వాశ్చర్యమయం = ఆశ్చర్యములైనట్టి సకలతత్త్వములకు ఆశ్రయమైనదియు, దేవం = ప్రకాశించుచున్నదియు, అనన్తం = దేశకాలపరిచ్ఛేదములకు తగనిదియు, విశ్వతోముఖం = అన్నిదిక్కులయందును వర్తించు ముఖములు గలదియు, దివ్యమాల్యామ్బరధరం = అప్రాకృతములైన పుష్పమాలికలను వస్త్రములను ధరించినదియు, దివ్యగన్ధానులేపనం = అప్రాకృతములగు సుగంధములపై పూఁతగలదియు, అనేక దివ్యాభరణం = అనేక జాతీయములగు కిరీట కుండలాది దివ్యభూషణములు గలదియు, దివ్యానేకోద్యతాయుధం = అప్రాకృతములైన యాయుధములను పెక్కింటిని నిలువునఁ బట్టికొనియున్నదనియు నగు, (రూపం దర్శయామాస = రూపమును జూపెను).

తా. *అనేకముఖములును అనేక నేత్రములును గలదై నిరతిశయమై అపరిమితాశ్చర్యముగాఁ గనఁబడుచున్నదియు, ఆశ్చర్యములగు సమస్త తత్త్వముల కాశ్రయమైనదియు, ప్రకాశించుచున్నదియు,

---

యోగమును ఐశ్వరరూపమును ఒకటియే గాని వేఱుకావు. ఇచట రూపశబ్దమువలన ఈశ్వరుని స్వరూపమున గాని విగ్రహమునుగాని అసాధారణాకారమునుగాని గ్రహింపవచ్చును. పార్థశబ్దమువలన మేనత్తయైన పృథకొడుకు గాన వానియందలి ప్రీతియే స్వరూపమును జూపుటకు హేతువని తెలియునది. ఆ రూపము నానా విధమును విచిత్రమును నిండు సమస్త జగత్తున కాశ్రయమైనదియు సమస్తమును నియమించునదియు నగును.

* ముఖములు సంఖ్యయందే కాక జాతిభేదములనుబట్టియు అనేకములని భగవచ్ఛాస్త్రములందు శ్రీవిశ్వరూపధ్యానమునఁ జెప్పఁబడుచున్నది. ఇట్లె వస్త్రాభరణాయుధములును అనేకములగునని తెలియునది. 'జగదేతన్మహాశ్చర్యం రూపం యస్య మహాత్మనః' అని సర్వతత్త్వాత్మకమును ఈశ్వరునిరూపమును అగు జగత్తును ఆశ్చర్యముగాఁ జెప్పుటచే, 'సర్వాశ్చర్యమయమ్' అనుచో ఆశ్చర్యశబ్దమునకు ఆశ్చర్యములైన

కాలత్రయమునందుఁ గల సమస్త జగత్తునకును ఆశ్రయమగుటచే దేశకాలపరిచ్ఛేదములకు అనర్హమైనదియు, అన్నిప్రక్కల ముఖములు గలదియు, తన కుచితములైన దివ్యవస్త్రములను దివ్యగంధములపూఁతను దివ్యమాల్యములను దివ్యాభరణములను దాల్చినదియు, దివ్యములైన యనేకాయుధములను నిలువునఁ బట్టుకొనియున్నదియు నైనరూపమును జూపెను.

అవ. దేవశబ్దముచే నిర్దేశించిన యీ ప్రకాశమానత్వమునే యిప్పుడు విశేషించి చెప్పుచున్నారు.

శ్లో॥ దివి సూర్యసహస్రస్య భవే ద్యుగప దుత్థితా।
యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః॥ 12

టీ. దివి = ఆకాశమునందు, సూర్యసహస్రస్య = వేయిసూర్యుల యొక్క, భాః = కాంతి, యుగపత్ = ఏకకాలమునందు, ఉత్థితాభవేద్యది = బయలువెడలినయెడల, సా = అట్టికాంతి, తస్యమహాత్మనః = ఆ మహాత్మునియొక్క, భాసః = కాంతికి, సదృశీ = సమానమైనది, స్యాత్ = అగును.

---

తత్త్వములని యర్థముసేయఁబడినది. 'అనంతమ్' అను విశేషణము స్వరూపమునకే తగిన దైనను ఇచట విగ్రహముయొక్క విశేషణములనడుమ అది యుండుటవలన విగ్రహమే యిచట అనంతమైనదిగా తెలియనగును. ఇట్లు విగ్రహము అనంతమగునేని అది యంతట వ్యాపించునపుడు దానికి తక్కినతత్త్వములవలన అడ్డపాటు ఏదియుఁ గలుగదా యని శంకింపఁదగదు. దానియొక్క శక్తివిశేషమువలన ప్రతిఘాతము దాని కెచ్చటను గలుగదు. కాఁబట్టియే ప్రకృతి మొదలైన సకలజగత్తున కది యాశ్రయమగుట పొసఁగును. జగత్తునకెల్ల నాశ్రయమగుటచే దేశపరిచ్ఛేదము లేనిదనియు, కాలత్రయమునందునుగల జగత్తున కాశ్రయమైనదగుటచే కాలపరిచ్ఛేదము లేనిదనియు, ఈరెండుపరిచ్ఛేదములు లేమిచే అనంత మనఁబడినదనియు గ్రాహ్యము. ఇచట పాఠక్రమమును విడిచి అనుభవక్రమమును గ్రహించి పిదప దానికి పృథక్సిద్ధములైన విశేషణములు గ్రహింపఁబడుచున్నవి. కనుక మొదట ఆకారప్రతీతిని గలిగించు 'అనేక వక్త్రా'ది విశేషణ

తా. ఆకాశమున సహస్ర సూర్యబింబములకాంతి యేకకాలమునఁ బ్రకాశించునేనియు నది నమ్మహాత్మునికాంతికి సరి గావచ్చుఁదగి యుండెను. ఇట్లు చెప్పుట *తేజస్సు అపరిమితమైనదని తెలుపుటకొఱకు- అక్షయ తేజస్స్వరూపమని యర్థము.

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
అపశ్య ద్దేవ దేవస్య శరీరే పాణ్డవ స్తదా॥ 13

టీ. పాణ్డవః=అర్జునుఁడు, తదా=అప్పుడు, అనేకధా=నానా విధములుగా, ప్రవిభక్తం=విభజింపబడినదియు, కృత్స్నం=సమస్తమైనదియు నగు, జగత్ = జగత్తును, దేవ దేవస్య = భగవంతుఁడగు శ్రీకృష్ణునియొక్క, తత్రశరీరే=ఆ విశ్వరూపమునందు, ఏకస్థం = ఒక ప్రదేశమునందుండు దానినిగా, అపశ్యత్ =చూచెను.

తా. అర్జునుఁడు, అంతములేని నిడివియు వెడల్పును గలదియు, అనంతములైన బాహూదర వక్త్ర నేత్రములుగలదియు, అపరిమిత తేజస్సుగలదియు, అపరిమిత దివ్యాయుధములతోఁగూడినదియు, స్వో

---

ములకు అర్థముచెప్పి పిమ్మట పృథక్సిద్ధములైన 'దివ్యమాల్యామ్బరా'దులకు అర్థము చెప్పఁబడినది ఈ పృథక్సిద్ధ విశేషణములగు అంబరాదులందును మొదట అంబరము పిదప గంధమాల్యాభరణాయుధములు ధరించు క్రమమునుబట్టి అన్వయము చేయఁబడిన దని తెలియునది.

* 'సూర్యసహస్ర' అనుచో 'సహస్ర' అను సంఖ్యనుబట్టి ఆ సంఖ్య మాత్రము గల సూర్యులకంటె నెక్కువతేజస్సుగలవాఁడని గ్రహింపరాదు; అప్పుడా తేజస్సునకొక పరిమితి కలుగును. కాన 'సహస్ర' అను సంఖ్యకు అపరిమితము అని భావము గ్రహింపఁదగును. అపరిమిత తేజస్సు గలవాఁడనుట-అఖండ తేజస్స్వరూపుఁడనిభావము. వ్యాసానుగ్రహమువలన లభించిన దివ్యచక్షుస్సుచే సంజయుఁ డిట్టిరూపమును చూచెనని తోఁచుచున్నది. లేనియెడల భగద్విగ్రహకాంత్యతిశయమును ఇట్లు వర్ణించుట కెట్లు పొసఁగును?

చితములైన యపరిమిత దివ్యభూషణ దివ్యమాల్యాంబర దివ్యగంధా నులేపనములు గలదియును, అనంతాశ్చర్యమయ మైనదియునగు నా దేవదేవుని దివ్యశరీరమునందు, 'బ్రహ్మ మొదలుగాఁగల నానావిధ విచిత్ర దేవతిర్యఙ్మనుష్యస్థావరాదులైన భోక్తృవర్గములయొక్కయు భూమ్యాకాశ స్వర్గపాతాలాతలవితల సుతలాది భోగస్థానములయొక్క-యు భోగ్యభోగోపకరణములయొక్కయు భేదములచేత అనేకవిధ ముల భిన్నమై ప్రకృతి పురుషాత్మకమైయున్న సమస్త జగత్తును ['అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే' (గీత-౧౦-౮) 'హన్త తే కథయిష్యామి విభూతీరాత్మనశ్శుభాః' (గీత - ౧౦-౧౯) 'అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః' (గీత - ౧౦-౨౦) 'ఆదిత్యానా మహం విష్ణుః' (గీత-౧౦-౨౧) ఇత్యాది మొదలుకొని 'న తదస్తి వినా యత్స్యా న్మయాభూతం చరాచరమ్। విష్టభ్యాహ మిదం కృత్స్నం మేకాంశేన స్థితో జగత్' (గీత-౧౦-౩౯) అనువఱకుఁ జెప్పఁబడినదానిని] ఒక్కచోట నున్నదానినిగా భగవత్ప్రసాద లబ్ధమై భగవద్దర్శనానుగుణమైన దివ్యచక్షువు గలవాఁడై చూచెను.

శ్లో॥ తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత॥ 14

టీ. తతః=భగవద్దివ్య విగ్రహసందర్శనమువలన, విస్మయావిష్టః=ఆశ్చర్యముతోఁ గూడినవాడును, హృష్టరోమా = రోమాంచము గలవాఁడు నగు, సః ధనఞ్జయః = ఆ యర్జునుఁడు, దేవం విశ్వరూపధరుఁడైన శ్రీకృష్ణుని, శిరసా=శిరస్సుచేత, ప్రణమ్య=నమస్కరించి, కృతాఞ్జలిః= చేమోడ్పు గలవాఁడై, అభాషత = పలికెను.

తా. పిమ్మట ధనంజయుఁడు మహాశ్చర్యమగు సమస్తజగత్తును తన దేహమునందొక మూల నిలువఁబెట్టుకొని సమస్తమును

నడపువాఁడై మిక్కిలి యాశ్చర్యములైన యనంత జ్ఞానాది కల్యాణ గుణగణములతోఁగూడి యొప్పుచున్న దేవునిఁజూచి, ఆశ్చర్యావిష్టుఁడై పులకాంచితగాత్రుఁడగుచు, దండమువలె నేలఁబడి శిరస్సుచే నా విశ్వరూపధరునకు ప్రణమిల్లి చేతులు ముకుళించి యిట్లనియె.

అర్జున ఉవాచ.

శ్లో॥ పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూతవిశేషసఙ్ఘాన్।
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్॥ 15

టీ. హే దేవ = ఓ దేవా, తవ = నీయొక్క, దేహే - దివ్యశరీరమునందు, సర్వాన్ = సమస్తమైన, దేవాన్ = దేవతలను, తథా = అట్లె, భూతవిశేషసఙ్ఘాన్ = విశేషప్రాణికోట్లను, బ్రహ్మాణం = చతుర్ముఖబ్రహ్మను, కమలాసనస్థం = బ్రహ్మమతమునందు నెలకొన్నట్టి, ఈశం = రుద్రుని, సర్వాన్ ఋషీంశ్చ = సకలఋషులను, దివ్యాన్ = ప్రకాశించుచున్న, ఉరగాన్ = వాసుకి మొదలగు నాగేంద్రులను, పశ్యామి = చూచుచున్నాను.

తా. దేవా! సకలదేవతలను, సమస్త ప్రాణివిశేషముల సమూహములను, అండాధిపతి యగు చతుర్ముఖబ్రహ్మను, బ్రహ్మమతమునం దుండు రుద్రుని, దేవర్షులు మొదలగు ఋషులనెల్ల వారిని, ప్రకాశించుచున్న వాసుకి తక్షకుఁడు మొదలయిన సర్పములను, నీ దేహమునందుఁ గనుఁగొనుచున్నవాఁడను.

శ్లో॥ అనేక బాహూదరవక్త్రనేత్రం



పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్।

38
నాన్తం న మధ్యం న పున స్తవాదిం
39
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప॥ 16

టీ. విశ్వేశ్వర = ప్రపంచనియామకుఁడవగు, హేవిశ్వరూప = విశ్వరూపధరుఁడ వయినయోస్వామీ, త్వాం = నిన్ను, అనేకబాహూదరవక్త్రనేత్రం = అనేకభుజములును ఉదరములును నేత్రములును గలవానినిగాను, అనన్తరూపం = పరిమాణములేని ఆకారముగలవానిని గాను, సర్వతః = అంతటను, పశ్యామి = చూచుచున్నాను. పునః = మఱల, తవ = నీయొక్క, ఆదిం = మొదలును, న పశ్యామి = చూడకున్నాను, మధ్యం = మధ్యమును, న = చూడకున్నాను, అన్తం = తుదను, న = కానను.

తా. అనేకములగు బాహువులును ఉదరములును ముఖములును నేత్రములును గలిగి పరిమాణము లేని యాకారముగల నిన్ను అంతటం గనుఁగొనుచున్నవాఁడ. ప్రపంచనియామకుఁడా! విశ్వశరీరా! నీవు అనంతుఁడ వగుటచే నీరూపమునకు ఇది యాది యనియు ఇది మధ్యమనియు ఇది యంతమనియును నాకుఁ గనఁబడకయున్నది.

40
శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతోదీప్తిమన్తమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్॥ 17

టీ. తేజోరాశిం = కాంతిపుంజమైన వాఁడవును, సర్వతోదీప్తిమన్తం = అంతటను వ్యాపించునట్టి ప్రకాశముతోఁ గూడినవాఁడవును,

దీప్తానలార్కద్యుతిం = జ్వలించెడి యగ్నిసూర్యులకాంతివంటి తీవ్ర కాంతి గలవాఁడవును, సమన్తాత్ = విగ్రహ ప్రదేశమునం దెచట నైనను, దుర్నిరీక్షం = చూచుటకుఁదరముగాని వాఁడవును, అప్రమేయం = కొలఁదిపెట్ట శక్యముగాని వాఁడవునగు, త్వాం = నిన్ను, కిరీటినం = కిరీటాదిభూషణములు గలవానినిగాను, గదినం చక్రిణంచ = గద చక్రము మొదలగు ఆయుధములు గలవానినిగాను, పశ్యామి = చూచుచున్నాను.

తా. * తేజోరాశివై, అంతట నిండిన దీప్తుఁవలన నేత్రపక్షను జూడశక్యము గాక, జ్వలించుచున్న సూర్యాగ్నుల తేజస్సువంటి తీవ్రతేజస్సు గలిగి, కొలఁదిపెట్ట శక్యము గాకయుండు నిన్ను, కిరీటాది భూషణములను చక్రగదాద్యాయుధములను ధరించినవానినిఁగాఁ గనుఁగొనుచున్నవాఁడను.

---

* ఇందును పాఠక్రమమును విడిచి అనుభవక్రమమున అన్వయము సేయఁబడినది. 'తేజోరాశిమ్' అని ధర్మిస్వరూపము నిర్దేశింపఁబడినది. తేజస్స్వరూపుఁడనుట. 'సమన్తాద్దీప్తిమన్తమ్' అనుటచే, అస్య భాసా సర్వమిదం 'భాతి' అని ప్రభయొక్క సర్వవ్యాపిత్వము చెప్పఁబడినది. దుర్నిరీక్షత్వమునకు హేతువు దీప్తానలార్కద్యుతి కలిగియుండుట. ఇచట ద్యుతియనఁగా కిరణరూపమైన తేజస్సు గ్రహించినచో 'దీప్తిమన్తమ్' అనుదానితో దీనికి పునరుక్తి కలుగదు. లేదా 'దీప్తిమన్తమ్' అనుచో ప్రభయొక్క సర్వవ్యాపిత్వము 'దీప్తానలార్కద్యుతిమ్' అనుచో ఆప్రభయొక్క దుర్నిరీక్షత్వము కలిగించునంతటి తీవ్రత్వమును గ్రహించినను పునరుక్తి కలుగదు. ఇట్లు 'తేజోరాశిమ్' మొదలైన విశేషణములవలన ఈశ్వరుని సామాన్యముగా గ్రహించుటయు, 'కిరీటినం' ఇత్యాదులవలన ఆతనికి కిరీటచక్రాద్యసాధారణ చిహ్నములచే సర్వేశ్వరుఁడుగా విశేషించి గ్రహించుటయును తెలియునది. 'కిరీటినం' అనుట తక్కిన భూషణవర్గమునకు, 'గదినం చక్రిణం' అనుట తక్కిన ఆయుధవర్గమునకును ఉపలక్షణమని తెలియునది. మఱియు భూషణవర్గములో కిరీటమును నిర్దేశించుట సర్వేశ్వరత్వమును తెలుపుటకనియు, ఆయుధవర్గములో గదాచక్రములను నిర్దేశించుట అవి భగవంతునికి మాత్రము అసాధారణములై యుండుటచేత ననియు గ్రాహ్యము.

శ్లో॥ *త్వ మక్షరం పరమం వేదితవ్యం
41
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్।
42
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే॥ 18

టీ. వేదితవ్యం=తెలియవలసిన, పరమం=ప్రకృతికంటె పరమైన జీవునికంటెను పరమమైన, అక్షరం=అక్షరశబ్దవాచ్యమైన వస్తువు, త్వం=నీవు; అస్య విశ్వస్య=ఈ ప్రపంచమునకు, పరం=గొప్ప, నిధానం=ఆధారభూతమైనవస్తువు, త్వం=నీవు; అవ్యయః వికారము లేనివాఁడవు; త్వం = నీవు; శాశ్వతధర్మగోప్తా = నిత్యమైన వేదవిహితధర్మములను పాలించువాఁడవును, సనాతనః=పురాణుఁడవైన, పురుషః=పురుషుఁడవును, త్వమేవేతి=నీవేయని, మే=నాకు, మతః=తెలిసినది.

తా. 'ద్వే విద్యే వేదితవ్యే' ఇత్యాదివాక్యములచే నుపనిషత్తులయందు తెలియఁదగినదిగా నిర్దేశింపఁబడు పరమమైన యక్షరము నీవే. ఈ సమస్తప్రపంచమునకు పరమాధార భూతుఁడవు నీవే. స్వరూపగుణ విభూతులందు ఎల్లప్పుడు నొక్కరూపున నుండువాఁడవు నీవే. నిత్యమగు వైదికధర్మమును ఇటువంటి యవతారములచేత రక్షించువాఁడవు నీవే. 'వేదాహ మేతం పురుషం మహాన్తమ్' (పురుష

---

* ఇందు త్వమ్' శబ్దములు ముందు మాంసపుఁగన్నులకు గోచరించిన యాకారమును ఇప్పుడు అనువదించుచున్నవనియు తక్కిన 'అక్షరం' మొదలైన శబ్దములు దివ్యచక్షువు లభించినపిదప సాక్షాత్కరించిన యాకారమును జెప్పుచున్నవనియు వివేచించుకొనవలయును. మున్ను మాంసచక్షువులకు యదుకులతిలకుఁడుగా నగపడుచుండిన నీవు ఇప్పుడు దివ్యచక్షువునకు 'అక్షరమ్' మొదలైనవాఁడుగా సాక్షాత్కరించుచున్నావనుట. నిధాన మనఁగా ఆధారము. పరం నిధాన మగుటచే ఆధారభూతులకును ఆధారభూతుఁడవైనవాఁ డనుట.

సూక్త) 'పరాత్పరం పురుషమ్' (ముండ. 3-2-8) ఇత్యాదులందుఁ జెప్పఁబడిన పురాణపురుషుఁడను నీవే యని నా కిప్పుడు తెలిసినది. యదుకులతిలకుఁ డని మున్ను నేను తలఁచియుండిన నీ విప్పుడు ఇట్టి వాఁడవుగా నాకు సాక్షాత్కరించితివి అని యర్థము.

43 44
శ్లో॥ అనాదిమధ్యాన్తమనన్తవీర్య
45 46
మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపన్తమ్॥ 19

టీ. అనాదిమధ్యాన్తం=ఆదిమధ్యాంతరహితుఁడవును, అనన్తవీర్యం=అపరిమితపరాక్రమము గలవాఁడవును, అనన్తబాహుం=అనేక బాహువులు గలవాఁడవును, శశిసూర్యనేత్రం = చంద్రసూర్యులవంటి నేత్రములు గలవాఁడవును, దీప్తహుతాశవక్త్రం = జ్వలించెడి యగ్నిహోత్రునివంటి ముఖము గలవాఁడవును, స్వతేజసా = నీ తేజస్సుచేత, ఇదం = ఈ, విశ్వం = ప్రపంచమును, తపన్తం = తపింపఁజేయుచున్న వాఁడవు నగు, త్వాం=నిన్ను, పశ్యామి=చూచుచున్నాను.

తా. ఆదిమధ్యాంతరహితుఁడును, అనవధికాతిశయవీర్యుఁడును =(వీర్యశబ్దము ప్రదర్శనార్థము గనుక అనవధికాతిశయ జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తి తేజస్సులకు నిధి యగు వాఁడని యర్థము), అసంఖ్యేయము లగు బాహువులు గలవాఁడును- (బాహువులను ప్రదర్శనార్థము గావున అనంత బాహూదర పాదవక్త్రములు గలవాఁడను). *చంద్రునివలెను సూర్యునివలెను ప్రసాదముతోను ప్రతాపముతోను గూడిన సకలనేత్ర

* అనేక నేత్రములు కలిగియుండుటచే 'శశిసూర్యనేత్రమ్' అనుటకు చంద్ర సూర్యులే నేత్రములుగాఁ గలిగియుండునట్లు అర్థముచేయుట యొప్పదు. కావున శశి

ములుగలవాఁడును-[నమస్కారాదులు సేయుచున్న దేవాదులగు అనుకూలుర యెడప్రసాదము, వారికివిపరీతులయిన అసురరాక్షసాదులయెడ ప్రతాపము. 'రక్షాంసి భీతాని దిశోద్రవన్తి । సర్వే నమస్యన్తిచ సిద్ధసఙ్ఘాః' (గీత-౧౧-౩౬) అనికదా మీఁద చెప్పఁబడెడిని.] జ్వలించుచున్న ♦ కాలాగ్నివలె సంహారానుగుణమైన ముఖము గలవాఁడును, తన తేజస్సుచేత ఈ ప్రపంచమును తపింపఁజేయుచున్నవాఁడును అగు నిన్నుఁ జూచుచున్నాను. (తేజస్సనఁగా పరులను క్రిందుపఱచు సామర్థ్యము).

అనఁగా *నీవు నిన్ను గుఱించి నాకుఁ బూర్వ ముపదేశించినట్లు నిన్ను సర్వమును సృజించువానినిగాను, సర్వమున కాధారభూతునిఁగాను, సర్వమును ప్రశాసించువానినిగాను, సర్వమును సంహరించువానినిగాను, జ్ఞానాద్యపరిమితగుణసాగరునిఁగాను, ఆదిమధ్యాంత రహితునిఁగాను, ఇట్టి దివ్యదేహము గలవానినిగాను, ఇప్పుడు కన్నులారఁ గాంచుచున్నాను అని యర్థము. ♦ఒక్క దివ్యదేహమునందు అనేకము

---

వలె ప్రసాదమును, సూర్యునివలె ప్రతాపమును జూపు నేత్రములు గలవాఁడని యర్థము గ్రాహ్యము. అయినను కొన్ని నేత్రములు ప్రసాదమును కొన్ని ప్రతాపమును జూపెడినా? లేక ఒక్కొక్కటియు ఏకకాలమున నే ప్రసాదప్రతాపములను జూపెడినా? అన్న యెడల, ఒక్కొక్కటియును ప్రసాదప్రతాపములను జూపెడినని తెలియునది, ఎట్లన, అనుకూలురై నమస్కారాదులుసేయు దేవాదులయెడల ప్రసాదమును, ప్రతికూలురైన రాక్షసాదులయెడల ప్రతాపమును, ఒక్కొక్క నేత్రమును చూపును.

♦హుతాశనుఁడే వక్త్రముగా నుండునట్లు ఇచట చెప్పరాదు. అగ్నివసుగణములం దంతర్యామితుఁడై యీశ్వరునియం దునికి గలవాఁడని వేఱుగా చెప్పఁబడెడిని. కాన 'కాలానలసన్నిభాని' అని మీఁదఁ జెప్పఁబడునట్లే యిచటను హుతాశనునివలెనున్నట్టి అనియే గ్రాహ్యము.

* అంతకు మును పు అర్జునుఁడు ఉపదేశమూలమున విన్నట్టియు నిప్పుడు దివ్యచక్షువుమూలమున కన్నట్టియు భగవదాకారమెల్ల నిందు సంకలితమై యున్నది.

♦వృక్షముయొక్క బోదె యొక్కటినుండి కొమ్మలును కొన్నును పైకిని క్రిందికిని

లైన ఉదరాదులు ఎట్లు? అన్నచో, అది యిట్లు పొసగుచున్నది. దాని కటిప్రదేశము ఒక్కటియె. అది కొలఁదిలేని పరిమాణము గలది గావున దానినుండి మీఁదుగా పూర్వము చెప్పఁబడిన ఉదరాదులును, క్రిందుగా పూర్వము చెప్పఁబడిన దివ్యపాదములును సాఁగినవగుచున్నవి. అందు ఒక్కొక్క ముఖమున నేత్రములు రెండేసియునియు గ్రహించుటచే విరోధము గలుగదు.

అవ. ఇటువంటినిన్నుఁ జూచి దేవాదులును నేనును భీతుల మగుచున్నా మనుచున్నాఁడు.

47

శ్లో॥ ద్యావాపృథివ్యో రిద మన్తరం హి
వ్యాప్తం త్వ యైకేన దిశశ్చ సర్వాః।
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం తవేదం
48
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥ 20

టీ. ద్యావాపృథివ్యోః = ఊర్ధ్వలోకములయొక్కయు అధోలోకములయొక్కయు, ఇదం = ఈ, అన్తరం = మధ్యప్రదేశము, ఏకేన = ఒక్కఁడవైన, త్వయా = నీచేత, వ్యాప్తం హి = వ్యాపింపఁబడియున్నదిగదా. సర్వాః = సమస్తములగు, దిశశ్చ = దిక్కులను,

---

వ్యాపించినట్లే కటి యొక్కటినుండి హస్తాదులును సాఁగుట నెఱుంగునది. కొమ్మలును వేళ్ళును పెక్కులైనను బోదె యొక్కటినిబట్టి అవి యన్నియు నొకవృక్షముగా గ్రహింపఁబడునట్లు ఉదరపాదాదు లనేకములైనను కటి యొక్కటి యగుటచే అన్నియును జేరి యొకవిగ్రహమే యగునని గ్రాహ్యము. ఇట్టి విగ్రహమునందలి ఒక్కొక్క ముఖమునకు రెండేసి నేత్రములుగా గ్రహించినను ఆయొక్కరూపమునకు పెక్కు నేత్రములుగా గ్రహించినను ఆయొక్కరూపమునకు పెక్కునేత్రములు కలిగియుండుట విరుద్ధము కానేరదు.

(వ్యాప్తాః=వ్యాపింపఁబడియున్నవి). హేమహాత్మన్ = గొప్పదైన మనోవృత్తిగలవాఁడా, ఉగ్రం=భయంకర మయినదియు, అద్భుతం =ఆశ్చర్యకరమయినదియు నగు, తవ=నీయొక్క, ఇదం రూపం= ఈ విశ్వరూపమును, దృష్ట్వా=చూచి, లోకత్రయం = అనుకూల ప్రతికూల మధ్యస్థులు అను మూఁడువిధములైన జనులు, ప్రవ్యథితం =మిక్కిలి భీతిఁ జెందియున్నారు.

తా. *(ద్యుశబ్దమును పృథివీశబ్దమును రెండును వరుసగా
49
మీఁదిలోకములకును క్రిందిలోకములకును ప్రదర్శకములు, దివికిని పృథివికిని నడుమఁ గల అవకాశమందే సమస్తలోకములు ఉన్నవి.) ఇట్లు ఊర్ధ్వలోకములును అధోలోకములును నెఱసియున్న యీ యవకాశ మంతయును అన్నిదిక్కులును నీవే వ్యాపించి యున్నాఁడవు. ఓ యపరిచ్ఛేద్యమనోవృత్తీ! యుద్ధము చూడఁగోరి వచ్చిన బ్రహ్మాది దేవాసుర పితృగణ సిద్ధగంధర్వ యక్ష రాక్షసులందు ప్రతికూలురు అనుకూలురు మధ్యస్థులు అను మూఁడు విధములైన లోకులెల్ల
50
వారును అనంతాయామవిస్తార మైనదగుటచే అత్యద్భుతమై అతి

---

* ఇట ద్యుశబ్దమువలన మీఁదిలోకములను పృథివీశబ్దమువలన క్రిందిలోకములను గ్రహించునది. అట్లు గ్రహింపక భూమి యనియు ఆకాశమనియు గ్రహించిన యెడల నప్పుడు, మిక్కిలి మహత్తైన దని ముందు చెప్పఁబడిన విగ్రహము ఇచట క్రింది మీఁదిలోకము లన్నిట వ్యాపింపక, భూమ్యాకాశము లకు నడుమనుండు కొంత ప్రదేశ మునందు వ్యాపించినదని అసంగతముగా నేర్పడును. అంతరమనఁగా నడిమిప్రదేశము కాదు. ఇట అవకాశము (అనఁగా వ్యాప్తమైయుండు బయలు) అని గ్రహించునది. కాన క్రిందనూ మీఁదను ఉండు అన్నిలోకములు దేనిలో నున్నవో అట్టి అనంతమైన యూర్ధ్వాధోవకాశమునందు అని యర్థము. ఇట్టి యవకాశమున నే అనంతాయామవిస్తారము గల విగ్రహము వ్యాపింపఁగూడు నని గ్రాహ్యము.

లోకత్రయమ్' అనఁగా పృథివ్యాదిలోకములు గాదు. అచేతనములగువానికి

భయంకరమైయుండు నీరూపమును జూచి మిక్కిలి భీతి నొందినవా రయిరి.

వీరికిఁగూడ నర్జునునకుంబోలె విశ్వమున కాశ్రయ మగు తన రూపమును సాక్షాత్కరించుటకు సాధనమైన దివ్యచక్షువును భగవంతుఁ డొసఁగినాఁడు. ఎందులకనఁగా, అర్జునునకు తన మైశ్వర్యము సర్వమును జూపుటకు. కాఁబట్టి 'దృష్ట్వాద్భుతం రూప ముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్' అని యిది చెప్పబడెడిని.

---

వ్యథ కలుగదు. కాఁబట్టి అనుకూల ప్రతికూలమధ్యస్థు లనఁబడు త్రివిధజను లని యర్థము. మఱియు విశ్వరూపము అర్జునుఁడుతప్ప తక్కిన మనుష్యులు చూడమిచే, లోక మనఁగా మనుష్యులుతప్ప తక్కిన బ్రహ్మదేవాసుర పితృగణసిద్ధగంధర్వరాక్షసు లనిమాత్రము గ్రహింపఁదగును. వీరందఱును యుద్ధమును జూచుకుతూహలముచే వచ్చుట వచ్చి చేరియుండిరి గాన ఈ జనము నెల్ల నర్జునుఁడు చూచి వారు ప్రతికూలానుకూలమధ్యస్థులని మూఁడువిధములుగా నుండుటచే 'లోకత్రయమ్' అని నిర్దేశించినాఁడు. ఇది యటుండ భగవంతుఁడు తనకు శిష్యభూతుఁడై నిరతిశయభక్తిగలిగి మిక్కిలి ప్రపన్నుఁడైన యర్జునునికి మాత్రమే తన విశ్వరూప విగ్రహమును దర్శించుటకు దివ్యచక్షువు నను గ్రహించెను గాన వాఁడుమాత్రమె దానిని దర్శింపశక్తుఁడు గాని తక్కిన దేవాదులు శక్తులుకారు. మఱియు మీఁద 'దేవా అప్యస్యరూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః' అనుచో దేవాదులు దర్శింపఁగోరుట తెలియుచున్నదేకాని తమంతటు దర్శించినవారైరని తెలియలేదు. కాఁబట్టి దర్శింపఁజాలని దేవాదులు దానిని దర్శించి భీతినొందిరని యర్జునుఁడు చెప్పుట యెట్లు పొసఁగు ననినయెడల దేవాదులకుఁగూడ భగవంతుఁడు దివ్యచక్షువు నిచ్చినాఁడని తెలియవలయును. అర్జునునికివలె వారికిఁగూడ దివ్యచక్షువు నియ్య నేల యనఁగా అర్జునునివలె వారికిఁగూడ దర్శనకాంక్ష యుండుటవలనను, వారికి అట్టి సాక్షాత్కారము లభింపఁదగిన సుకృతపరిపాక మొదవఁ గూడుటచేతను, క్షుద్రు లెట్లో అట్టే మిక్కిలి మహనీయులగు దేవాదులుకూడ తన్న విశ్వరూపమునుజూచి భయపడుటను తెలుపుటచే అర్జునునకు తన నిరంకుశైశ్వర్యము ప్రకాశింపఁజేయఁగూడు ననుతలంపుచేతను, అట్లు ప్రకాశింపఁజేయుట తనప్రకృతి యుద్ధకార్యమున కుపయుక్త మగుటచేతను, వారికిఁగూడ దివ్యచక్షువు నిచ్చినాఁడని గ్రహించునది.

49
శ్లో॥ అమీ హి త్వా సురసఙ్ఘా విశన్తి
50
కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి।
51 52
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసఙ్ఘాః
53
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥ 21

టీ. అమీ=(యుద్ధము చూడవచ్చిన) ఈ, సురసఙ్ఘాః = బ్రహ్మాది దేవతా సమూహములు, త్వాం = నిన్ను (నీ సమీపమును), విశన్తి=చొచ్చుచున్నవి, కేచిత్ = కొందఱు, భీతాః = భయము నొందినవారై, ప్రాంజలయ (స్సన్తః) = చేమోడ్పు గలవారగుచు, గృణన్తి=స్తుతించుచున్నారు, మహర్షి సిద్ధసఙ్ఘాః=మహర్షులయొక్కయు సిద్ధులయొక్కయు సమూహములు, స్వస్తి=క్షేమము, (అస్తు=అగుగాక), ఇతి=అని, ఉక్త్వా=పలికి, పుష్కలాభిః = సంపూర్ణములగు-*నీ మహాత్త్వమునకు అనురూపములైనయనుట, స్తుతిభిః=స్తోత్రముల చేత, త్వాం=నిన్ను స్తువన్తి=నుతించుచున్నారు.

54
తా. యుద్ధము చూడవచ్చిన యీ యుత్కృష్టులయిన దేవతాసమూహములు విశ్వాశ్రయుఁడవైన నిన్నవలోకించి హృష్టమనస్కులై నీసమీపమునకు వచ్చుచున్నారు. వారిలో కొందఱు అత్యద్భుతమైన నీయాకారము నాలోకించి వెఱచినవారలై కృతాంజలు లగుచు తమతమ జ్ఞానముకొలఁదిని స్తుతిరూపములయిన శ్రుతిసిద్ధ వాక్యముల నుచ్చరించుచున్నారు. పరావరయాథాత్మ్యము నెఱింగిన

* 'భవదను రూపాభిః' అని భాష్యమూలము. దీనికి 'భగవదనురూపాభిః' అని పాఠాంతరము, అపుడు భగవంతున కనురూపములైన యని యర్థము.

యితరులగు భృగ్వాది మహర్షులును సనకాది సిద్ధులును *స్వస్తి యని పలికి నీ మహిమకుఁ దగిన పుష్కలములగు స్తోత్రములచే నిన్ను నుతి యించుచున్నారు.

55 అవ.

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యేచ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గన్ధర్వ యక్షా సురసిద్ధ సఙ్ఘా
వీక్షన్తే త్వాం విస్మితా శ్చైవ సర్వే॥ 22

టీ. రుద్రాదిత్యాః=ఏకాదశరుద్రులును ద్వాదశాదిత్యులును, వసవః=అష్టవసువులును, యే సాధ్యాః=సాధ్యు లనుపేరు గలవా రెవరో, (తే)చ=వారును, విశ్వే=విశ్వేదేవతలును, అశ్వినౌ=ఇద్దఱు అశ్విదేవతలును, మరుతశ్చ=మరుత్తులును, ఊష్మపాశ్చ = పితృదేవ తలును, గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘాః=హాహాహూహూ ప్రభృతి గంధ ర్వులయొక్కయు కుబేరాదియక్షులయొక్కయు విరోచనాదిరాక్షసుల యొక్కయు కపిలాది సిద్ధులయొక్కయు సమూహములును, (ఏతే) సర్వేచ=వీరందఱును, విస్మితాస్సన్తఏవ = ఆశ్చర్యపడినవా రగు చునే, త్వాం=నిన్ను, వీక్షన్తే=చూచుచున్నారు.

తా. రుద్రులును, ఆదిత్యులును, వసువులును, సాధ్యులును, విశ్వేదేవతలును, అశ్వినులును, మరుత్తులును, పితృగణములును, మఱి యునుం దక్కిన గంధర్వయక్షరాక్షస సిద్ధసమూహములును అంద ఱును ఆశ్చర్యమును బొంది నిన్నుఁ జూచుచున్నారు.

---

* ఇచట స్వస్తియనుట భక్తులు భక్తిపారవశ్యమున భగవంతుని గుఱించిచేయు మంగళాశాసనముగాఁగాని లేక సేవ్యులైనవారిని సేవకులైనవారు దర్శింపఁగానే చెప్పు నట్టి స్వస్తిశబ్దముగాఁగాని గ్రాహ్యము.

'ఊష్మభాగా హి పితరః' అను శ్రుతివలన ఇచట 'ఊష్మపాః' అనఁగా పితృదేవతలు అని గ్రహించునది.

56 అవ.

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రమ్
మహాబాహో బహుబాహూరుపాదమ్।
బహూదరం బహుదంష్ట్రాకరాళమ్

57

దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్॥ 23

టీ. "హే మహాబాహో=పరాక్రమాద్యనేకములయిన గొప్ప భుజములు గలవాఁడా, బహువక్త్రనేత్రం=అనేకముఖములును నేత్రములును గలదియు, బహుబాహూరుపాదం = అనేక భుజములును తొడలును, పాదములునుగలదియు, బహూదరం=అనేకములగు కడుపులు కలదియు, బహుదంష్ట్రాకరాళం=అనేకములయిన కోఱలచేత భయంకరమైనదియునగు, తే=నీయొక్క, మహత్ రూపం=గొప్ప రూపమును, దృష్ట్వా=చూచి, లోకాః = ప్రతికూలానుకూలమధ్యస్థులనఁదగిన త్రివిధజనులును, ప్రవ్యథితాః=అధిక భయముతో వణఁకుచున్నారు. అహం=నేను, తథా=అట్లె, భయపడుచున్నాను.

తా. మహాభుజా! అనేక ముఖములును, సంఖ్యలేని నేత్రములును, అపరిమితములగు బాహువులును, అనేకములగు, తొడలును, బాహుపాదములును, పెక్కులగు కడుపులును గలిగి పెక్కులైన కోఱలచేత భయంకరమయినదగు నీయట్టి గొప్పయాకారమునుజూచి, ప్రతికూలురు ననుకూలురు మధ్యస్థులు నని మూఁడు తెఱఁగులవారం దఱు నతిభయముతో వణఁకుచున్నారు. అట్లే నేనును భయపడుచున్నవాఁడ.

శ్లో॥ నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్।

58

దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా

59

ధృతిం న విన్దామి శమంచ విష్ణో॥ 24

టీ. హేవిష్ణో=ఓ సర్వవ్యాపి యగువాఁడా, నభస్స్పృశం=పరమాకాశము నంటియున్నవాఁడవును, దీప్తమ్ = ప్రకాశించుచున్నవాఁడవును, అనేకవర్ణం = పెక్కు రంగులు గలవాఁడవును, వ్యాత్తాననం = తెఱవఁబడిన నోరులుగలవాఁడవును, దీప్త విశాలనేత్రం = ప్రకాశించుచున్న విశాలములయిన నేత్రములు గలవాఁడవును అగు, త్వాం=నిన్ను, దృష్ట్వా=చూచి, ప్రవ్యథితాన్తరాత్మా=అత్యంత భీతిఁజెందిన మనస్సు గలవాఁడ నగుచు, ధృతిం=దేహముధరించుటను, శమంచ = మనస్సుయొక్కయు నింద్రియములయొక్కయు ఉపశాంతిని, నవిన్దామి హి=పొందకున్నానుగదా.

తా. ప్రకృతితత్త్వమునకును దాని వికారములకును సర్వావస్థలందలి పురుషునకును ఇట్లన్నిటికిని ఆశ్రయమగుటచే 'నభస్స్పృశమ్' అని చెప్పుటవలనను 'ద్యావాపృథివ్యోరిద మన్తరంహి వ్యాప్తమ్' అని పూర్వము చెప్పఁబడి యుండుటవలనను నభశ్శబ్దము, 'త్రదక్షరే పరమే వ్యోమన్' (తై-నా॰రా॰ ౬-౧-౨) ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్' (పురుషసూ॰) 'క్షయ న్తమస్య రజసః పరాకే' (సామ- ఉత్తర. ౧౮౭-౨ ర) 'యోఽస్యాధ్యక్షః పరమేవ్యోమన్' (యజు॰ ౨ అష్ట-౮-౯౬) ఇత్యాది శ్రుతులచే సిద్ధమై త్రిగుణప్రకృతిని గడచిన పరమవ్యోమమును చెప్పెడిని. సర్వలోక వ్యాపకుఁడవైన యోవిష్ణుమూర్తీ!

* పరమాకాశము నొరయుచు, ప్రకాశమానుఁడ వై, అనేక వర్ణములతోను తెఱవఁబడియుండు నోళ్ళతోను జ్వలించుచున్న విశాల నేత్రములతోను నుండు ని న్నవలోకించి మనం బత్యంతభీతి నొంది దిటను బడయకున్నాను. (అనఁగా దేహమును నిలఁబెట్టలేకున్నాను.) మనస్సునకును ఇంద్రియములకును ఊఱట నొందకున్నాను. అనఁగా సర్వవ్యాపియు అతిమాత్రుఁడును అత్యద్భుతుఁడును అతిఘోరుఁడు నగునిన్నుఁ జూచి భయముచే నవయవములు వెలవెలపోవ మనస్సు కలఁతనొంది యున్నాఁడ నని యర్థము.

60 అవ.

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశో న జానే నలభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస॥ 25

టీ. హే దేవేశ = బ్రహ్మాది దేవతలకును అధిపతి యైనవాఁడా, దంష్ట్రాకరాళాని = కోఱలచే భయంకరములై నవియు, కాలానలసన్నిభాని = ప్రళయకాలాగ్నితో సమానములై నవియునగు, తే = నీయొక్క ముఖాని = ముఖములను, దృష్ట్వా ఏవ = చూచినమాత్రమున, దిశః = దిక్కులను, న జానే = తెలియకున్నాను, శర్మచ = సుఖమును, న లభే = పొందకయున్నాను, హే జగన్నివాస = జగత్తులకాశ్రయమైన వాఁడా, ప్రసీద = ప్రసన్నుఁడ వగుము.

తా. కోఱలచే భయంకరములై యుగాంతకాలాగ్నివలె సర్వ సంహారమునకుఁ బూనిన నీ ముఖములను చూచిన మాత్రమున

* నభస్స్పృశమ్' అనుచో నభస్సు అనఁగా సామాన్యమైన ఆకాశము గాదు. అక్షేని, సవికారసర్వావస్థ ప్రకృతిపురుషాత్మకమైనజగత్తునకంతయు నాశ్రయమైయుండు

దిక్కుల నెఱుఁగలేక సుఖము వడయఁజాలకయున్నవాఁడ. జగన్ని
వాసా! బ్రహ్మాదులగు ఈశ్వరులకును పరమమహేశ్వరా, ప్రసన్నుండ
వగుము. నేను నిమ్మళపాటు నొందునట్లుచేయుమని యర్థము.

అవ. ఇట్లు సమస్తజగములయొక్క స్థితిప్రవృత్తులు తనకు
లోనైయుండుట నర్జునునకుఁ జూపుచు పార్థసారథి యను భగవంతుఁడు
కౌరవులయందును పాండవులయందును రాజవేషములతోఁ బుట్టి
ప్రవర్తిల్లుచున్న అసురాంశసంభవుల నెల్ల సంహరించుటచే తాను
I
జేయఁదలఁచుకొన్న భూభారనివృత్తిని తానే చేయఁబోవుచున్నవాఁ
II
డుగా అర్జునునకుఁ జూపెను. అర్జునుఁడును భగవంతునియొక్క స్రష్టృ
III
త్వాదులను సర్వైశ్వర్యమును కన్నులారఁ గాంచుచో, సర్వాత్ముఁ
డగు నాభగవంతునియందే ధార్తరాష్ట్రులు మొదలైనవారికి కలుగ
నున్న యుపసంహార మింకను కలుగకున్నను భగవత్ప్రసాదలబ్ధమైన
దివ్యచక్షువుచే దాని నిప్పుడు కనుగొనుచున్నవాఁడై యిట్లు చెప్పు
చున్నాఁడు.

61

శ్లో॥ అమీ సర్వే ధృతరాష్ట్రస్య పుత్రా
స్సర్వే సహైవావనిపాలసఙ్ఘైః।

---

విగ్రహము ఈ పరిమితమైన యాకాశమునకే యున్నది యని యసంగతముగా సిద్ధించును. మఱియు 'ద్యావా పృథివ్యోః' అని యీ సామాన్యములయిన ఆకాశాదులెల్ల పూర్వమే చెప్పఁబడి యుండుటవలన మగల నిచట దానినే చెప్పుట పునరుక్తి యగును. కావున ఇట నభస్సు అనగా 'తదక్షరే...' ఇత్యాది శ్రుతులవలన సిద్ధించునదియు త్రిగుణప్రకృతి నతిక్రమించినదియు నైన పరమాకాశమని గ్రహించునది.

భీష్మ ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః॥ 26
వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయానకాని।
కేచి ద్విలగ్నా దశనా న్తరేషు
సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః॥ 27

టీ. అమీ = ఈ, సర్వే = సమస్తమైన, ధృతరాష్ట్రస్యపుత్రాః = ధృతరాష్ట్రుని పుత్రులగు దుర్యోధనాదులను, భీష్మః = భీష్ముఁడును, ద్రోణః = ద్రోణుఁడును, అసౌ = ఈ, సూతపుత్రః = సూతుని కొడుకైన కర్ణుఁడును, సర్వైః = సమస్తములగు, అవనిపాలసఙ్ఘైః సహైవ = ఆ పక్షమునందలి రాజుల సమూహముతోఁ గూడనే, తథా = అట్లే, అస్మదీయైః = మా పక్షమువారగు; యోధముఖ్యైరపి సహ = కొందఱు వీరశ్రేష్ఠులతోఁగూడను, దంష్ట్రాకరాళాని = కోఱలచే వికారరూపములయినవియు, భయానకాని = భయంకరములైనవియునగు, తే = నీ యొక్క, వక్త్రాణి = ముఖములను, త్వరమాణాః = త్వరపడుచున్నవారై, విశన్తి = ప్రవేశించుచున్నారు, కేచిత్ = వారిలో కొందఱు, దశనాన్తరేషు = పండ్లసందులయందు, విలగ్నాః = చిక్కుకొనినవారై, చూర్ణితైః = పొడుముచేయఁబడిన, ఉత్తమాఙ్గైః = శిరస్సులతోడ, సందృశ్యన్తే = చూడఁబడుచున్నారు.

తా. ధృతరాష్ట్ర పుత్రులైన యీ దుర్యోధనాదులందఱును, భీష్మద్రోణకర్ణాదులును, ఆ పక్షమునందలి తక్కిన సమస్త రాజలోకమును, మన బలమునందుఁ గలవీరశ్రేష్ఠు లనేకులును, త్వరతోఁ గూడినవారై కోఱలచే వికృతములును భయంకరములును అగు నీముఖ

ములను *వినాశముకొఱకు బ్రవేశించుచున్నారు. అచ్చట కొందఱు పండ్లసందులలో తగులుకొని నలిగిన తలలతో కనఁబడుచున్నారు.

62

శ్లో॥ యథా నదీనాం బహవోఽమ్బువేగా
స్సముద్రమేవాభిముఖా ద్రవన్తి।
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥ 28

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥ 29

టీ. యథా=ఎట్లు, నదీనాం=నదులయొక్క, బహవః=అనేకములగు, అమ్బువేగాః=జలప్రవాహములు, సముద్రమేవ = సముద్రమును గూర్చియే, అభిముఖాః=ఎదుర్కొనినవై, ద్రవన్తి = పాఱుచున్నవో, తథా=అట్లే, అమీ = ఈ, నరలోకవీరాః=మనుష్యలోకమందలి శూరులు, తవ=నీయొక్క, వక్త్రాణి = ముఖములను, ప్రవిశన్తి=ప్రవేశించుచున్నారు. యథా=ఎట్లు, పతఙ్గాః=మిడుతలు, సమృద్ధవేగాః=అతివేగముగలవై, ప్రదీప్తం=మిక్కిలి మండుచున్న, జ్వలనం=అగ్నిని, నాశాయ=తమనాశముకొఱకు, విశన్తి = ప్రవేశించుచున్నవో, తథైవ = అలాగుననే, లోకా అపి = ఈ మనుష్యులును,

* 'విశన్తి' అనఁగా రక్షణార్థముకూడ ప్రవేశించుట కావచ్చును గనుక నిచట వినాశార్థము ప్రవేశించుచున్నా రనఁబడెను. కొందఱు నాశముకొఱకు ప్రవేశించుచున్నారు కొందఱు నశించునట్లు కనఁబడుచున్నారు అని భావము.

నాశాయ = తమనాశముకొఱకు, సమృద్ధవేగాః=అతివేగము గలవారై, తవ = నీయొక్క, (అభివిజ్వలన్తి=అంతటను జ్వలించుచున్న), వక్త్రాణి = ముఖములను, విశన్తి = ప్రవేశించుచున్నారు.

తా. * నదీజలప్రవాహము లనేకములు సముద్రమునుగూర్చి పాఱునట్లును, మిక్కిలి మండుచున్న యగ్నియందు మిడుతలు అతి వేగముతోఁ జొచ్చునట్లును, వీరులగు నీరాజులందఱు తమ నాశము కొఱకు త్వరపడువారై నలుగడల మిక్కిలి జ్వలించుచున్న నీ ముఖములను తమంతట ప్రవేశించుచున్నారు.

63 అవ.

64
శ్లో॥ లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా
ల్లోకాన్ సమగ్రాన్ వదనై ర్జ్వలద్భిః,
తేజోభి రాపూర్య జగ త్సమగ్రం
65
భాస స్తవోగ్రాః ప్రతప న్తి విష్ణో॥ 30

టీ. హేవిష్ణో=సర్వవ్యాపి యగు ఓస్వామీ, జ్వలద్భిః = జ్వ

---

♦ నాశమునకై పోవుచు తమంత మఱలఁజాలకుండుటకు ప్రవాహదృష్టాంతమును, నాశమునకై తమంతట పోవుటకు పతంగదృష్టాంతమును రాజులకుఁ జెల్లుచున్నవి. సమస్తము ప్రవేశించినను నిండరానిదై యుండుటకు సముద్ర దృష్టాంతమును తోడనే ధ్వంసముచేయునదగుటకు జ్వలనదృష్టాంతమును ఈశ్వరునికి చెల్లుచున్నవి.

* వేగము ప్రవాహరూపమగుటచే ప్రవాహముగాఁ జెప్పబడినది. 'అభివిజ్వలన్తి' అను ముఖవిశేషణము నదీసముద్ర దృష్టాంతములకంటె శలభాగ్ని దృష్టాంతమునందు మిక్కిలి పొసఁగి యుండుటవలన దాని పిదపనే చెప్పఁబడినది. పతంగాదులు ఎక్కువవేగము మొదలైనవానిచే దీపాదుల నార్పుటయుఁగలదు గాన అట్లు ఆర్పరానిదని తెలుపుటకై 'ప్రదీప్తం జ్వలనమ్' అనఁబడినది. ఇట్టి జ్వలనమందు ప్రవేశించుట ఆత్మనాశముకొఱకే కాన తమ నాశముకొఱకు ప్రవేశించుచున్నా రనఁబడెను.

లించుచున్న, వదనైః=ముఖములచేత, సమగ్రాన్ = సమస్తములైన, లోకాన్ = రాజసమూహములను, గ్రసమానః = మ్రింగుచున్న వాఁడవై, సమన్తాత్ = అంతటను, లేలిహ్యసే=ఆస్వాదించుచున్నావు. తవ = నీయొక్క, ఉగ్రాః = భయంకరములగు, భాసః = కిరణములు, తేజోభిః=తమప్రకాశములచేత, సమగ్రం=సమస్తమయిన, జగత్ = జగత్తును, ఆపూర్య = నింపి, ప్రతపన్తి = మిక్కిలి తపింపఁజేయు చున్నవి.

తా. విష్ణుమూర్తీ! యుద్ధమునకు వచ్చియుండు సమస్త రాజ సమూహములను జ్వలించుచున్న నీ ముఖములచేత మ్రింగుచున్న వాఁడవై, ఆ రక్తముచేత పూయఁబడిన నీ పెదవులు మొదలైనవానిని కోపవేగముచేత మాటిమాటికి నాకికొనుచున్నావు. అతిభయంకరము లగు నీ కిరణములు తమ తేజస్సుచేత లోకమునందంతట వ్యాపింపఁ జేయుచున్నవి.

అవ. 66

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
67
నమోఽస్తు తే దేవవర ప్రసీద।
విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం
నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥ 31

టీ. హే దేవవర=బ్రహ్మరుద్రాదిసమస్తదేవతాసార్వభౌమా, ఉగ్రరూపః=భయంకరాకారముగల, భవాన్=నీవు, కః=ఎవఁడవు?- నీ వేమి చేయఁబూనియున్నాఁడవు, ఆద్యం=ఆదిపురుషుఁడవగు, భవన్తం=నిన్ను, విజ్ఞాతుం=తెలిసికొనుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. తవ=నీయొక్క, ప్రవృత్తిం=పూనికను, న ప్రజానామిహి = ఎఱుఁగ

గనుక దా, మే = నాకు, ఆఖ్యాహి = చెప్పుము, తే = నీకొఱకు, నమో ఽస్తు = నమస్కారముగుఁగాక, ప్రసీద = ప్రసన్నుఁడవుగమ్ము.

తా. సర్వేశ్వరా! 'దర్శయాత్మాన మవ్యయమ్' అని నీ నిరంకుశైశ్వర్యమును జూపుమని నేను ప్రార్థించినందులకు నీవు నిరంకుశంబగు ఐశ్వర్యమును జూపవచ్చి యీయతిఘోరరూపమును కనఁబఱిచితివి. ఏమిచేయఁబూని యిట్టిఘోరరూపము గలవాఁడవైతివో తెలియఁగోరుచున్నాను. *నీవు అభిప్రాయపడియున్న పూనిక నాకు తెలియలేదు. కనుక దానిని నాకుఁ జెప్పుము. ఇయ్యది చేయుట కీయభిప్రాయముతో నీ సంహారకరూపమును వెలువఱిచితివి అని నాకుఁ దెలియఁజెప్పి ప్రసన్నరూపుఁడవును గమ్ము. దేవవరా! నీకు నమస్కరించెద.

అవ. 'ఆశ్రితవాత్సల్యాతిరేకముచే నీవు నాకు నీయైశ్వర్య మంతయు జూపఁబోయి తుదకు నిట్టి ఘోరరూపమును వెలిపుచ్చితివే. ఇట్లు చేయుటచే నీ యభిప్రాయ మేమి' యని యర్జునుఁ డడుగఁగా పార్థసారథియైన భగవంతుఁడు, 'అర్జునా నీవు పూనినయెడల నీపూనిక లేకయు నేనే దుర్యోధనుఁడు మొదలైన సమస్త రాజలోకమును జంపుటకు పూనియున్నాఁడ నని తెలుపుటకై సంహారోపయుక్తమైన యీనా ఘోరరూపమును వెలిపుచ్చితిని. ఇట్లు తెలుపుటయు నిన్ను

---

* 'కోభవాన్' అనుచో నీ వెవఁడవు నీ స్వరూపమేమి నీ పేరేమి అని యర్థము కాదు. ఇవియెల్ల నర్జునుఁడు ఉపదేశమువలనను సాక్షాత్కారమువలనను ఎఱిఁగి యున్నాఁడు. భక్తుఁడైననాకు ప్రతికూలురకుఁ జూపఁదగిన ఇట్టి ఘోరరూపమును జూపుటకు నీ యభిప్రాయ మేమి యని తెలియనగుటయే అర్థమగును. 'ప్రసీద' అనుటకు నా సందేహమును తీర్చి పూర్వరూపమునే చూపి యనుగ్రహింపుమని భావము. దీనినే 'తదేవ మే దర్శయ పూర్వరూపమ్' ఇత్యాదులందు మీఁద చెప్పుచున్నాఁడు.

ఈ కార్యము నకుఁ బూనునట్లు చేయుటకొఱకే' అని తనయిట్టి ప్రవృత్తికిఁ గల యభిప్రాయము తెలియునట్లు చెప్పుచున్నారు.

శ్రీభగవాన్ ఉవాచ.

68

శ్లో॥ కాలోఽస్మిలోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వా న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ 32

టీ. కాలః = దుర్యోధనాది రాజలోకముయొక్క ఆయుఃపరిమాణము లెక్కించుచు, లోకక్షయకృత్ = ఆ రాజలోకముయొక్క నాశమును జేయువాఁడనై, ప్రవృద్ధః = మిక్కిలి పెరిఁగినవాఁడనై, లోకాన్ = సకలరాజలోకములను, *సమ్ ఆహర్తుమ్ = ఆ సంహర్తుమ్ = ఎదుటనే చంపుటకు, ఇహ = ఇందు, ప్రవృత్తః = ప్రవర్తించినవాఁడను, అస్మి - అగుచున్నాను, (అతః = కనుక) ప్రత్యనీకేషు = నీ ప్రతిపక్ష సైన్యములందు, యే యోధాః = దుర్యోధనాదులయినవీరు లెవరు, అవస్థితాః = ఉన్నారో, తే సర్వే = వారందఱును, త్వా ఋతే అపి = నీవు లేకపోయినను, నభవిష్యన్తి = ఉండలేరు. (నా సంకల్పముచేత) నశింతు రనుట.

తా. నేను, దుర్యోధనాదులు మొదలైన యీ రాజసమూహముయొక్క ఆయుఃపరిమితిని లెక్కించుచు, వీరిని నాశముచేయుట్కై యిట్టి ఘోరరూపముతో మిక్కిలి పెరిగినవాఁడనై, వీరి నెదుర్కొని చంపఁబూనియున్నాఁడను. కాఁబట్టి యెదుటి సైన్యములందుఁ

69

* 'లోకక్షయకృత్' అనుటచే సంహారము తెలియుచుండుటవలన 'సమాహర్తుమ్' అనుచో ఆ సంహారముయొక్క విశేషమును (అనఁగా ఆభిముఖ్యముతోఁ

గల యీ ధార్తరాష్ట్రాదియోధులందఱు నీ పూనికచేతఁ గాకపోయి

70

నను నా సంకల్పముచేతనైన అవశ్యము నశింతురు.

శ్లో॥ తస్మాత్త్వముత్తిష్ఠ *యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వమేవ

75

నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥ 33

టీ. తస్మాత్=ఆ కారణమువలన, త్వం=నీవు, ఉత్తిష్ఠ=యుద్ధమునకు లెమ్ము, శత్రూన్=శత్రువులను, జిత్వా=గెలిచి, యశః=కీర్తిని, లభస్వ=పొందుము, సమృద్ధం=పరిపూర్ణమగు, రాజ్యం = రాజ్యమును, భుఙ్క్ష్వ=అనుభవింపుము; ఏతే=అపరాధముచేసినవీరు, మయైవ=నాచేతనే, పూర్వమేవ = మునుపే, నిహతాః = చంపఁబడిరి (చంపఁదగినవారని నిశ్చయింపఁబడిరి.) హేసవ్యసాచిన్ = అర్జునా రెండుచేతులతోను యుద్ధముచేయు సమర్థుడా! త్వం=నీవు, నిమిత్తమాత్రం = (శస్త్రాదులవలె) నిమిత్తమాత్రము, భవ=అగుము.

తా. కావున నీవువారితో ప్రతియుద్ధము చేయుటకు లెమ్ము.

71

*ఆ శత్రువుల జయించి కీర్తిఁ బొందుము. ధర్మయుక్తమును పరి

72

పరిపూర్ణంబునగు రాజ్యం బనుభవింపుము. నీ విషయమునం దపరా

జంపుటను) అందలి 'అ' అను ఉపసర్గముచే తెలియనగును. ఇట్లు తెలియుటవలన ఆ బొంటికిని పునరుక్తి కలుగదు.

* నాపూనికలేకయే నీ సంకల్పముచేతనే వీరందఱు నశింపనుండఁగా నన్నేందులకు దీనికై పురికొలుపవలె నని యర్జునుఁ డడుగఁగా నీకు జయయశోరాజ్యాదిలాభము కలుగుటకై నిన్ను పురికొలుపుచున్నానని భగవంతుని యభిప్రాయ మిందుఁ దెలియునది.

*శత్రువులను జయించుటయే యశోలాభమునకును సమృద్ధరాజ్యభోగమునకును

ధము సేసిన వీరందఱు హంతవ్యు లని మునుపే సంకల్పించుకొంటిని.[73] అర్జునా! ఈ సంహారకార్యమునందు, (అనఁగా నేను వారిని జంపుచుం డఁగా[74]) నీవు నాకు శస్త్రాదులవలె నిమిత్తమాత్రుఁడ వగుము.

76 అవ.

శ్లో॥ ద్రోణంచ భీష్మంచ జయద్రథం చ
కర్ణం తథాఽన్యా నపి యోధవీరాన్
మయా హతాం[77] స్త్వం జహి మావ్యథిష్ఠా
యుద్ధ్యస్వ జేతాసి[78] రణే సపత్నాన్॥ 34

టీ. మయా=నాచేత, హతాన్ = చంపఁబడుటకై సంకల్పిం పఁబడిన, ద్రోణంచ=ద్రోణుని, భీష్మంచ=భీష్ముని, జయద్రథంచ= సైంధవుని, కర్ణం=కర్ణుని, తథా=అట్లె, అన్యాన్=ఇతరులగు, యోధ వీరా నపి=యుద్ధముసేయు శూరులను, త్వం=నీవు, జహి=చంపుము, మావ్యథిష్ఠాః=భయపడకుము, యుద్ధ్యస్వ=యుద్ధముచేయుము, రణే= యుద్ధమునందు, సపత్నాన్=శత్రువులను, జేతాసి = జయింపగలవు.

---

హేతువని తెలియునది. అర్జునునికే వారు విరోధులుగాని భగవంతునికిఁ గారు. కనుక భగవంతుఁ డేల వారిని జంపబూనవలెనన్నచో, భక్తుఁడగు నర్జునునకు వారు విరోధు లగుటచే తనకును వారు కృతాపరాధు లైనందున నట్లు పూనినాఁడని తెలియునది. కనుకనే, 'ఏతే' అనుటకు 'అపరాధము సేసిన వీరు' అని అర్థము సేయఁబడినది. వారిని 'హతాః' అని తనచేఁ జంపఁబడినవారినిగాఁ జెప్పినచో మునుపే తనచేఁ జచ్చినవారిని మరలఁ జంపుట కర్జునుని పురికొలుపుట వ్యర్థమగును. 'హతాః' అనుటను తా నిఁకఁ జంపుటకై చేకొన్నవారని అర్థము గ్రహింపఁబడినది. చంపుట యను కార్యమునందు చంపువాఁడే కర్త. వానికి శస్త్రాదులు నిమిత్తమాత్రమే యగును. అట్లె దుర్యోధనా

తా. కృతాపరాధు లగుటచేఁ జంపుటకై నేను వినియోగించుకొన్న యీ ద్రోణుని భీష్ముని జయద్రథుని కర్ణుని తక్కిన యోధాగ్రేసరులను నీవు చంపుము. (గురువులను బంధువులను మనవలెనే భోగాసక్తులయిన యితరులను ఎట్లు చంపుదునని తలఁచి * వారియెడల ధర్మాధర్మ భయముచేతను బంధుస్నేహముచేతను కారుణ్యముచేతను) బాధపడకుము. (ద్రోణాదుల జయించుట కష్టము. దుదకు జయింతునో యోడుదునో యని శంకింపవలదు. కృతాపరాధులగుటచే వారిని నేనే చంపుట కుపయోగించుకొని యున్నందున అట్టి శంకలులేక) యుద్ధముచేయుము. రణమునందుఁ బగవారిని జయింపఁగలవు. (నాకు అపజయశంక లేదు గాని వీరిని జంపుటవలన నృశంసుఁడ నగుదునో యందు వేని వీ రనుకూలురు కారు శత్రువులగుటచే) వీరిని వధించుటయందు నృశంసత్వము కొంచెమైనను కలుగదు. నీకు జయమే కలుగునని భావము.

సఞ్జయ ఉవాచ.

శ్లో॥ ఏత చ్ఛ్రుత్వా వచనం[79] కేశవస్య
కృతాఞ్జలి ర్వేపమానః[80] కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాఽఽహ కృష్ణం[81]
సగద్గదం భీతభీతః ప్రణమ్య॥ 35

దులను నేనే చంపునట్టి కర్త. నీవు శస్త్రాదులవలె నాకు నిమిత్తమాత్రము కమ్ము అని యాశయము.

* ఇచట ద్రోణాదులు గురువులుగాను జయద్రథాదులు బంధువులుగాను తక్కిన యోధముఖ్యులు తమవలెనే భోగాసక్తులుగాను నుండుటవలన వారియెడల క్రమముగా ధర్మాధర్మభయమును, బంధుస్నేహమును, కారుణ్యమును కలుగుట చెప్పఁబడినది.

టీ. కిరీటీ=అర్జునుఁడు, కేశవస్య = శ్రీకృష్ణమూర్తియొక్క, ఏతత్ = ఈ, వచనం=వాక్యమును, శ్రుత్వా=విని, నమస్కృత్వా= నమస్కరించి, భీతభీతః=మాటిమాటికి భయపడుచున్నవాఁ డగుచు, భూయ ఏవ=మఱల, ప్రణమ్య=నమస్కరించి, కృతాఞ్జలిః=చేమోడ్పుగలవాఁడై, వేపమానః=వణఁకుచున్నవాఁడునై, సగద్గదం = డగ్గుత్తికతోఁ గూడినట్లు, కృష్ణం=శ్రీకృష్ణునిఁగూర్చి, ఆహ=పలికెను.

తా. ఇట్లు * ఆశ్రిత వాత్సల్యజలధియైన కేశవునియొక్క యీ వచనములు విని కిరీటి (అర్జునుఁడు) అతనికి నమస్కరించి అత్యంత భయమునొంది మఱియు మఱియుఁ బ్రణామంబులుసేసి చేమోడ్చి వడఁకుచు గద్గదకంఠముతో శ్రీకృష్ణు నుద్దేశించి యిట్లనియెను.

అర్జున ఉవాచ. 82

శ్లో॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగ త్ప్రహృష్య త్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః॥ 36

టీ. హేహృషీకేశ = కృష్ణా, జగత్ = జగత్తునఁగల దేవ గంధర్వాదులనుట, తవ=నీయొక్క, ప్రకీర్త్యా = మిక్కిలియైనకీర్తి చేత, ప్రహృష్యతి = మిక్కిలి సంతోషించుచున్నది. అనురజ్యతేచ=

* ఆపేక్షించిన మాత్రమున స్వవిగ్రహమును జూపినట్లె స్వాభిప్రాయమునుఁ గూడఁ దెలుపుటచే ఆశ్రితవాత్సల్యజలధి యను విశేషణము కూర్పఁబడినది. ఇందు రెండు నమస్కారము లెట్లనఁగా, భగవంతుని వచనము విన్నమాత్రమున అవశ్యము చేయునట్టిది మొదటి నమస్కారము. మిక్కిలి భయపడినవాఁడై తాను జెప్పఁబోవు వాక్యమును చెప్పదొడఁగుటకుఁగాను మఱల ప్రణామమును అంజలియు నని తెలియనది. ప్రణామాంజలులు చేసియె పెద్దలతో వాక్యము చెప్పుకొనవలయును గదా. భగవచ్చరణారవింద వందనముచే కిరీటముతోఁ గూడినశిరస్సు కృతార్థతఁ బొందినదనెడి యభిప్రాయముతో కిరీటిపదము ప్రయుక్తము.

అనురాగమునుగూడఁ బొందుచున్నది (అనుట, యత్ = ఏదియో), రక్షాంసి= రాక్షసులు, భీతాని =భయపడినవారలై, దిశః= దిక్కులను గూర్చి, ద్రవన్తి=పరుగిడుచున్నారు (అనుట, యత్ = ఏదియో), సర్వే=సమస్తమైన, సిద్ధసఙ్ఘాశ్చ =సిద్ధసమూహములును, నమస్యన్తి= నమస్కరించుచున్నవి (అనుట, యత్ = ఏదియో), (తత్ సర్వం= అవన్నియు), స్థానే= యుక్తము.

తా. హృషీకేశా! ఈ యుద్ధమును జూడఁగోరి వచ్చియుండు *సమస్తదేవ గంధర్వ సిద్ధ యక్ష విద్యాధర కిన్నర కింపురుషాదులు నీ ప్రసాదమువలన దివ్యచక్షువుఁబొంది నిన్ను సర్వేశ్వరునిఁగా గనుఁ గొన్నవారై నీ కీర్తికి తామందఱును మిక్కిలి హర్షానురాగములును బొందుచున్నారు. నిన్నుఁజూచి రాక్షసులు భయపడి పలుదిక్కులకుఁ బాఱిపోవుచున్నారు. సిద్ధులు మొదలైన యనుకూలుర సమూహము లన్నియును నీకు నమస్కరించుచున్నారు. ఇవి యన్నియు యుక్తమే- ఇటువంటినిన్నుఁగూర్చి వారువారు చేయునట్టి యీ కార్యములు తగునే యని భావము.

అవ. ఆ యుక్తతనే యుపపాదించుచున్నారు.

శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే। 37½

* ఇందు 'జగత్' అనుటకు జగము అని అచేతనముగా గ్రహించినచో ప్రహర్షానురాగములు దానికిఁ జెప్పుట సరిపడదు గాన దేవగంధర్వాదులని చెప్పఁబడినది. ఇట సిద్ధశబ్దము అనుకూలవర్గమునకు ప్రదర్శకముగాన 'సిద్ధులు.. అన్నియు' ననఁబడెను. 'ప్రహృష్యతి' అనఁగా ప్రియులును అతిథులును లభించుటచే కన్నులకును మనస్సునకును గలుగుప్రీతి యనియు 'అనురజ్యతే' అనఁగా పిత్రాదులందుఁ బుత్రాదులకుంబోలె కలుగు స్నేహ మనియుఁ దెలియునది. ఇట్లు తెలియుటవలన నీ రెంటికిని పునరుక్తి కల్గుగదు.

టీ. హే మహాత్మన్=ఓమహాత్మా, బ్రహ్మణోఽపి=చతుర్ముఖ బ్రహ్మకును, ఆదికర్త్రే=ఆదిభూతుఁడవైన కర్తయును-ఉపాదాన కారణమును నిమిత్తకారణమును, గరీయసే = సర్వోత్కృష్టుఁడవు నైన, తే=నీకొఱకు, కస్మాత్=ఏకారణమువలన, ననమేరన్=హిరణ్యగర్భాదులు నమస్కరింపరు.

తా. ఓ మహాత్మా! నీవు సర్వోత్కృష్టుఁడవు. చతుర్ముఖునకును ఆదిభూతుఁడవైన కర్తవు. కనుక నిట్టి నీ కా హిరణ్యగర్భాదు లేల నమస్కరింపకుందురు-నమస్కరించుట యుక్తమే యనుట.

శ్లో॥ అనన్త దేవేశ జగన్నివాస
త్వ మక్షరం సదస త్తత్పరం యత్॥ 37

త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్। 37½

టీ. అనన్త=అపరిచ్ఛిన్న స్వరూపుఁడును, దేవేశ = దేవతలకును నియంత యైనవాఁడును, జగన్నివాస = జగత్తు నివాసముగాఁ గలవాఁడు నగునోస్వామీ, అక్షరం=జీవాత్మతత్త్వము, త్వం = నీవె, సత్ అసత్ = కార్యకారణభావముతోనుండెడి ప్రకృతితత్త్వము (నీవె), తత్పరం = ప్రకృతికంటెను జీవాత్మకంటెను నితరమగుముక్తాత్మతత్త్వము, యత్ =ఏదియో, (తదపి=అదియును, త్వ మేవ=నీవె), ఆదిదేవః =సృష్టికర్తవును, పురాణః పురుషః = పురాతనుఁడగు పురుషుఁడును, త్వం=నీవే, అస్యవిశ్వస్య= ఈ ప్రపంచమునకు, పరం=శ్రేష్ఠమయిన, నిధానం=ఉంపఁబడినచోటును-ఆధార మనుట, త్వం=నీవె.

తా. అనంతా, దేవేశా, జగన్నివాసా. *(క్షరింపనిది అక్షరము.)

---

* 'అసద్వా ఇద మగ్ర ఆసీత్' 'తతో వై సదజాయత' ఇత్యాది శ్రుతులంబట్టి.

అక్షర మనఁబడు జీవాత్మతత్త్వము నీవే 'నజాయతే మ్రియతే వా విపశ్చిత్' (కఠ. ౧-౨-౧౮) ఇత్యాది శ్రుతిసిద్ధుఁడగు జీవాత్మ క్షరింపఁడుగదా. సత్తనియు అసత్తనియు పిలువఁబడి కార్యకారణభావముల నెలకొనియున్న ప్రకృతితత్త్వము (అనఁగా నామరూపవిభాగము కలిగి యుండుటచే కార్యావస్థమై సత్తని చెప్పఁబడునదియు ఆ విభాగమునకు అనర్హమగుటచే కారణావస్థమై అసత్తని చెప్పఁబడునదియునగు ప్రకృతి) నీవే. ఆ ప్రకృతికిని ప్రకృతిసంబంధి యగు జీవాత్మకును నన్యమగు ముక్తాత్మ తత్త్వము నీవే. ఇట్లు సర్వతత్త్వాత్మకుఁడవగుట వలన ఆదిదేవుఁడవును, పురాణపురుషుఁడవును, నీ శరీరభూతమైన యీ జగత్తున కెల్ల ఆత్మరూపమున పరమాధార భూతుఁడవై యుండువాఁడవును, నీవే.

33

శ్లో॥ వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనన్తరూప। 38

---

కార్యమునకు 'సత్' అనియు కారణమునకు 'అసత్' అనియు వ్యపదేశము గలదు. కనుక నిచట 'సదసత్' అనుట కార్యకారణావస్థలు రెండును గలిగియుండు ప్రకృతితత్త్వము గ్రాహ్యము. రెండవస్థలును ఒక దాని కొట్లు చెల్లు ననఁగా-నామరూపవిభాగము గలయప్పుడు కార్యావస్థయు, దాని కర్హము కానప్పుడు కారణావస్థయుఁ బ్రకృతికిఁ గలవు. 'అక్షరమ్' అనఁగా 'నక్షరతీ త్యక్షరమ్' అను వ్యుత్పత్తిచేతను 'నజాయతే' ఇత్యాది శ్రుతులనుబట్టియు క్షరముకాని జీవాత్మతత్త్వము గ్రాహ్యము. 'తత్పరమ్' అనుచో, తిలతైలములవలెను దారువహ్నులవలెను పరస్పరమిళితమై యుండు అక్షరసదసత్తత్త్వములు రెంటికంటెను అన్యమైనది ముక్తాత్మతత్త్వమగుట ప్రసిద్ధము. 'నిధీయతేత్వయి విశ్వమ్' అని నిధానశబ్దమునకు వ్యుత్పత్తి. విశ్వమునకు 'పరంనిధాన' మ్మనఁగా పరమాధారభూతుఁడని యర్థము. మఱియు 'త్వ మక్షరమ్ పరమం' (అ ౧౧, శ్లో ౧౮) అనుచో అక్షరశబ్దము పరమాత్మపరముగా చెప్పఁబడియుండుటచే నిచట దానిని జీవాత్మపరముగా నర్థాంతర ముచితము.

టీ. వేత్తా = తెలిసికొనువాఁడును, వేద్యంచ = తెలియఁబడునదియును, పరం = ఉత్తమమయిన, ధామచ = ప్రాప్యస్థానమును, త్వమసి=నీవెయై యున్నావు. అనన్తరూప=అంతములేని స్వరూపము గలవాఁడా, విశ్వం=చిదచిదాత్మకమగు సమస్త ప్రపంచము, త్వయా =(ఆత్మరూపముగ) నీచేత, తతం=వ్యాపింపఁబడియున్నది.

తా. *జగత్తునందు తెలిసికొనువారందఱును తెలియఁబడునవి యన్నియును నీవ. ఇట్లు సర్వమునకు ఆత్మభూతుఁడవై నెలకొని యుండుటవలన పరమప్రాప్యస్థానము నీవ. అనంతరూపా, చిదచిన్మిశ్రమగు నీప్రపంచమంతయు నీవు ఆత్మభూతుఁడవై వ్యాపించియున్నాఁడవు.

అవ. ఇట్లు అన్నియు నీకు శరీరమై నీవన్నిటికి నాత్మవై యుండుటవలన వాయువు మొదలైన శబ్దములు నీకే వాచకములనుచున్నాఁడు.

శ్లో॥ వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాఙ్కః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ। 38½

టీ. వాయుః=వాయువును, యమః=యముఁడును, అగ్నిః=అగ్నియును, వరుణః=వరుణుఁడును, శశాఙ్కః=చంద్రుఁడును, ప్రజాపతిః=బ్రహ్మయును, ప్రపితామహశ్చ=అందఱికిని ముత్తాతయు, త్వం అసి=నీవె అయి యున్నావు.

తా. వాయువును, యముఁడును, అగ్నియు, వరుణుఁడును, చంద్రుఁడును, బ్రహ్మయు, అందఱికిని ప్రపితామహుఁడును నీవే. పితామహుఁడు మొదలగువారును నీవె. సర్వప్రజలకును పితలు ప్రజాపతులు. ప్రజాపతులకు పితయగు బ్రహ్మ ప్రజలకు పితామహుఁడు.

---

* కారణావస్థయందలి ద్రవ్యములలో అంతర్యామిగా నుండుట మునుపు చెప్పఁబడినది. కనుక నిపుడు కారణావస్థములగు జ్ఞాతృజ్ఞేయములలో అంతర్యామిత్వము 'జగత్తు ..అన్నియు నీవ' అని చెప్పఁబడెను. 'త్వయాతతం విశ్వమ్' అనుటకు శరీరాత్మభావమే కారణముగాన 'ఆత్మభూతుఁడవై' అనఁబడెను.

బ్రహ్మకును పితయగు నీవు ప్రజలకు ప్రపితామహుఁడవు. పితామహాదులకెల్ల నాత్మభూతుఁడ వగుటచే వారివారి పేళ్లచే నీవే చెప్పఁబడుచున్నావని యర్థము.

84

శ్లో॥ నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే॥ 39
నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ!

టీ. తే=నీకొఱకు, సహస్రకృత్వః = వేయిమాఱులు, నమో నమః అస్తు=నమస్కారములగుఁగాక, పునశ్చ = మరల, నమః = నమస్కారము, భూయోఽపి=వెండియును, తే = నీకొఱకు, నమః= నమస్కారము, పృష్ఠతః=వెనుకను, నమః=నమస్కారము, అథ= ఇఁకను, హేసర్వ=సమస్తము నైనవాఁడా, తే=నీకు, సర్వత ఏవ= అన్నిదిక్కులయందును, నమోఽస్తు=నమస్కార మగుగాక.

తా. అత్యద్భుతాకారుఁ డగు భగవంతునిఁ జూచి *హర్షవికసితములైన నేత్రములతోను అతిభయమువలనఁ గలిగిన నమ్రభావముతోను గూడినవాఁడై అతనికి నన్నిప్రక్కల వేమాఱు నమస్కరించుచున్నాఁడు.

85

శ్లో॥ అనన్తవీర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥ 40

టీ. అనన్తవీర్య=అమితవీర్యముగలవాఁడా, అమితవిక్రమః= అపరిమితమైన పరాక్రమము గల, త్వం = నీవు, సర్వం = సమస్త

* విశ్వరూప ప్రదర్శనమువలన భగవంతుఁడు చూపిన పరత్వసౌలభ్యన అర్జునునికి భయహర్షములు కలిగెనని గ్రాహ్యము.

వస్తుజాతమును, సమాప్నోషి = ఆత్మరూపుఁడవై పొందుచున్నావు, తతః = కాఁబట్టి, సర్వః అసి = సమస్తమును నీవే యగుచున్నాఁడవు - (సర్వశబ్దవాచ్యుఁడవు.)

తా. అపరిమితవీర్యము గలవాఁడా, అపరిమిత పరాక్రముఁడ వగు నీవు చిదచిద్వస్తు సమూహముల నన్నింటిని ఆత్మభూతుఁడవై పొందియున్నాఁడవు. కాఁబట్టి చిదచిద్వస్తువులెల్ల నీకు శరీర మగుటచే నవి నీప్రకారము లగుచున్నవి. ఇట్లు సమస్తమైనదానిని ప్రకారములుగాఁ గలిగి (వానికెల్ల ఆత్మభూతుఁడవైయుండు నీకే వానియన్నింటికిని గల శబ్దములు చెల్లును కనుక) నీవే సర్వశబ్ద వాచ్యుఁడవు. 'త్వమక్షరం స ద సత్' 'వాయుర్యమోగ్నిః' ఇత్యాదు లఁదు సర్వనామానాధికరణ్యనిర్దేశము చేయుటకు హేతువు సర్వము నందు ఆత్మరూపముగా వ్యాపించియుండుటయే యగునని 'త్వయా తతం విశ్వ మనన్తరూప' అనుచోటను 'సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః' అనుచోటను సువ్యక్తముగాఁ జెప్పఁబడినది.

86

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం య దుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి।
అజానతా మహిమానం త వేమం
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి॥ 41

య చ్చాపహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు।
ఏకోఽథవా ప్యచ్యుత తత్సమక్షం
త త్క్షామయే త్వా మహ మప్రమేయమ్॥ 42

టీ. తవ=నీయొక్క, ఇమం = అనంతవీర్యత్వాది రూపమైన యిట్టి, మహిమానం = మాహాత్మ్యమును, అజానతా = ఎఱుఁగని, మయా=నాచేత, ప్రమాదాత్ = పొరపాటుననైనను, ప్రణయేనవాపి =చిరపరిచయముచేతనైనను, సఖేతి=చెలికాఁడవని, మత్వా=తలఁచి, హేకృష్ణ=ఓకృష్ణా, హేయాదవ = ఓయాదవా, హేసఖే = ఓచెలికాఁడా, ఇతి=అని, ప్రసభం=వినయము లేకుండునట్లు, యత్ = ఏది, ఉక్తం=చెప్పఁబడినదో, అపహాసార్థం = పరిహాసముకొఱకు, అసత్కృతోఽసి ఇతి యత్ =సత్కరింపఁబడనివాఁడవైతి వనుట యేదికలదో, హేఅచ్యుత=ఓకృష్ణా, విహారశయ్యాసనభోజనేషు = విహరించునప్పుడును శయనించునపుడును కూర్చుండునపుడును భోజనకాలమునను, ఏకః = ఏకాంతమునఁగాని, అథవా = లేక, తత్సమక్షంఅపి = జనుల యెదుటఁగాని, (అసత్కృతోఽసీతియత్ =సత్కరింపఁబడనివాడవైతి వనుట యేదికలదో), తత్=అట్టి సమస్తాపరాధములను, అప్రమేయం =ప్రమాణములచే నెఱుఁగ నశక్యుఁడ వగు, త్వాం = నిన్ను (నీచేత), అహం= నేను, క్షామయే=క్షమింపఁజేసికొందును.

తా. నీయొక్క అనంతవీర్యత్వము అపరిమిత పరాక్రమత్వము సర్వాంతరాత్మత్వము సృష్టికర్తృత్వము మొదలుగాఁగల మహిమలను నే నెఱుంగక పొరపాటుననైనను చిరపరిచయముచేతనైనను నాకు
87
చెలికాఁడ వని తలఁచి ఓ కృష్ణా ఓ యాదవా ఓ వయస్యా యని విన
88
యము వీడి నే నేమేమి పలికితినో; సకల దేవతలకు సత్కరింపఁదగిన వాఁడ వగునీకు పరిహాసార్థముగా నే నేమి యసత్కారములు చేసితినో; మనమిద్దఱు నొకటిగా విహరించునపుడును ఏకాంతమునఁగాని జనసమక్షమునఁగాని నే నేమి యసత్కారములు గావించితినో; వాని నన్నిటిని అచ్యుతా! అప్రమేయుఁడ వగునీవు క్షమింపవలయునని ప్రార్థించెద.

శ్లో॥ పితాఽసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్।
న త్వత్సమో[89]ఽ స్త్యభ్యధికః[90] కుతో ఽన్యో
లోకత్రయే[91]ఽప్యప్రతిమప్రభావ॥ 43

టీ. హే అప్రతిమ ప్రభావ=అసమానమైన ప్రభావము గల యోస్వామీ, త్వం=నీవు, చరాచరస్య = జంగమస్థావరరూపమైన, అస్యలోకస్య=ఈ ప్రాణిసమూహమునకు, పితా=తండ్రియు-ఉత్పాదకుఁడును, గురుః = అజ్ఞాతజ్ఞాపనము చేయు ఆచార్యుఁడును, గరీయాన్ =శ్రేష్ఠుఁడగు, పూజ్యశ్చ=పూజార్హుఁడవును, అసి = అగుచున్నావు, లోకత్రయేఽపి=మూఁడులోకములయందును, త్వత్సమః =నీతోసమానుఁడు, అన్యః=మఱియొకఁడు, నాస్తి = లేడు, అభ్యధికః=అధికుఁడైనవాఁడు, కుతః=ఎట్లు కలుగును ?

తా. *అసదృశ ప్రభావముఁగల యోస్వామీ, జంగమస్థావర రూపమైన యీ ప్రపంచమున కెల్ల నీవు తండ్రివి. దీనికి నీవు గురుఁ

---

* 'నీవు నన్ను క్షమచూపునట్లు చేసినను నేను క్షమింతునని నిశ్చయమెట్లు? కాఁబట్టి నన్నాశ్రయింపవలదు. వేఱొకని నాశ్రయింపుము' అని భగవంతుని కభిప్రాయమున్నట్లు అర్జునుఁడు భావించుకొని యీ శ్లోకమును అవతలి శ్లోకమును ఉత్తరముగాఁ జెప్పినట్లు గ్రాహ్యము. ఇందలి పితృత్వ గురుత్వాదులు అప్రతిమ ప్రభావత్వమును ఉపపాదించుచున్నవి; కాన అప్రతిమప్రభావపదము మొదట చెప్పఁబడెను. ఈ నిరుపాధికమైన పితృత్వ గురుత్వములే పూజ్యతమత్వమునకు హేతువు. 'న త్వత్సమోఽస్తి' అనుటచేతనే అన్యుఁడు నీకు సముఁడు లేఁడని సిద్ధించుచుండఁగా వేఱుగా 'అన్య' శబ్దము ప్రయోగించుట అనర్థక మగును గాన దానికి 'త్వదన్య' నీకంటె అన్యుఁడు అని చెప్పి పూర్వోక్తమైన అన్వయము చేయఁబడినది. దాని వలన 'నీకంటె అన్యుఁడు నీకు సముఁడు లేఁడు' అనుటచే నీకు నీవే సముఁడవని యర్థవిశేషము లభిం

డవు నగుదువు. కాఁబట్టియే దీనికి నీవు పూజ్యతముఁడవు. మఱి త్రిలోకములయందును నీకంటె వేఱొకఁడు కారుణ్యాది గుణములలో నేగుణమునుబట్టికాని నీకు సమానుఁడు లేఁడనిన, అధికుఁ డెట్లు కలుగును ?

92 93 94

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥ 44

టీ. తస్మాత్ = పూర్వోక్తములైన పితృత్వాదికారణముల వలన, అహం = నేను, కాయం=శరీరమును, ప్రణిధాయ = దండప్రమాణముచేసి, ప్రణమ్య = నమస్కరించి, ఈశం = నియామకుఁడును, ఈడ్యం = స్తోత్రార్హుఁడవు నగునట్టి, త్వాం = నిన్ను, ప్రసాదయే = ప్రసన్ను నిగాఁ జేసికొనుచున్నాను. హేదేవ = ఓకృష్ణా, పుత్రస్య = (అపరాధముచేసిన) పుత్త్రునకు, పితేవ = తండ్రివలెను, సఖ్యుః = చెలికానికి, సఖేవ = చెలికానివలెను, ప్రియః (త్వం) = ఇష్టుఁడవైన నీవు, ప్రియాయ (మే) = ఇష్టుఁడనైన నాకొఱకు, (సర్వం = సమస్తాపరాధములను), సోఢుం = సహించుటకు, అర్హసి = తగుదువు.

తా. దేవా! నీవు సర్వమునకుఁ దండ్రియు, పూజ్యతముండగు గురువును, కారుణ్యాది గుణములచే సర్వాధికుఁడును అగుదువు. కాఁబట్టి నీకు సాష్టాంగ నమస్కారములు గావించి జగదీశ్వరుఁడును స్తోత్రార్హుఁడవును నగునిన్ను ప్రసన్నుఁడుగా వేఁడుకొనియెద. పుత్రుఁ

చుచున్నది. కాన అన్యశబ్దము నిరర్థకముగాదు. ఈ లోకమునందు నీకంటె పూజ్యుఁడును కారుణికుడును లేఁడు గాన నిన్నే యాశ్రయింపవలయును, నీవే కరుణింపవలయునని భావము.

డుగాని సఖుఁడుగాని అపరాధములుచేసి ప్రణామపూర్వకముగా ప్రార్థించినపుడు తండ్రిగాని సఖుఁడుగాని యెట్లు ప్రసన్ను లగుదురో అట్లే నాకు ప్రియుఁడై పరమకారుణికుఁడవగు నీవు నీకు ప్రియుఁడనైన నాయొక్క సమస్తాపరాధములను సహించి క్షమింపఁ దగుదువు.

ఇట్టివాఁడ వగుటచే నిన్నే యాశ్రయింతునుగాని వేఱొకని నాశ్రయింపను గాన నీవు నన్ను క్షమింపవలయును అని యాశయము.

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే।
95 96 97
తదేవ మే దర్శయ దేవరూపం
98 99
ప్రసీద దేవేశ జగన్నివాస॥ 45

టీ. హేదేవ=ఓదేవా, అదృష్టపూర్వం = ఒకప్పుడును జూడఁబడని విశ్వరూపమును, దృష్ట్వా = చూచి, హృషితః=సంతోషించినవాఁడను, అస్మి=అగుచున్నాను. మే=నాయొక్క, మనః = మనస్సు, భయేన=భయముచేత, ప్రవ్యథితంచ=మిక్కిలి చలింపఁబడినదియును, (అతః=కాఁబట్టి), తద్రూపమేవ=ప్రసన్నమగు నీ పూర్వరూపమునె, మే=నాకు, దర్శయ = చూపుము, హేదేవేశ = బ్రహ్మాదిదేవతలకును, అధిపతి యైనవాఁడా, జగన్నివాస = జగదాధారభూతుఁడా, ప్రసీద = ప్రసన్నుఁడ వగుము.

తా. దేవా! పూర్వమెన్నఁడును జూఁడబడని దగుటచే *అత్యద్భుతమై మిక్కిలి యుగ్రమైయున్న నీరూపమును జూచి ప్రీతి నొంది

---

* అదృష్టపూర్వమైనది అద్భుత మగుటచేతను భయావహమైనది ఉగ్రమగుటచేతను, అద్భుతము ఉగ్రము అను రెండు విశేషణములు రూపమునకుఁ గూర్పఁబడెను.

తిని. నామనస్సు (ప్రీతినొందుటయేకాక) భయముచేత వ్యాకులతయుఁ జెందియున్నది. కావున సుప్రసన్నమైన యా నీ పూర్వరూపమునె నాకు కానిపింపుము, బ్రహ్మాదులగు దేవతలకుఁగూడ నియామకుఁడా, సమస్తజగత్తున కాశ్రయమైనవాఁడా, నాయెడఁ బ్రసన్నుఁడ వగుము.

శ్లో॥ కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే॥ 46

టీ. హేసహస్రబాహో = అనేకభుజములు గలవాఁడా, హే విశ్వమూర్తే=విశ్వరూపధరుఁడైన యోస్వామీ, తథైవ=మునుపటి వలెనే, త్వాం=నిన్ను, కిరీటినం=కిరీటము గలవానినిగాను, గదినం =గద గలవానినిగాను, చక్రహస్తం=హస్తమునందు చక్రము గల వానినిగాను, ద్రష్టుం=చూచుటకు, అహం = నేను, ఇచ్ఛామి=కోరు చున్నాను. చతుర్భుజేన=నాలుగు భుజములు గల, తేనైవ రూపేణ =ఆ పూర్వరూపముతోనె, భవ=అగుము. (ఉండుము).

తా. ఓస్వామీ! యిప్పుడు వేయి భుజములతో విశ్వశరీరుఁ డవై కనబడుచున్నావు. నేను కిరీటగదాచక్రములతోఁ గూడిన మునుపటి రూపమునే చూడఁగోరెద. కనుక చతుర్భుజములతోఁ

100

గూడ మునుపటి సౌమ్యరూపమునే తాల్పుము.

శ్రీభగవానువాచ.

శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జు నేదం
రూపం పరం దర్శిత మాత్మ యోగాత్।
తేజోమయం విశ్వ మనన్త మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్॥ 47

టీ. హేఅర్జున=ఓయర్జునా, మే=నాయొక్క, తేజోమయం=తేజోరాశి యయినదియును, విశ్వం = సమస్తమును వ్యాపించినది యనుట, అనన్తం=ఆదిమధ్యాంతములులేనిదియు, ఆద్యం=మదితరములైనవానికెల్ల మొదటిదియును, పరం = ఉత్కృష్టమైనదియును, త్వదన్యేన=నీకంటె నితరుఁడైన వానిచేత, నదృష్టపూర్వం=పూర్వమెన్నఁడును జూడఁబడనిదియును అగు, యత్ =ఏ, రూపం=రూపము (గలదో), (తత్ =అట్టి), ఇదం రూపం = ఈ విశ్వరూపము, ప్రసన్నేన=అనుగ్రహబుద్ధిగల, మయా = నాచేత, తవ = నీకు, ఆత్మయోగాత్ =నా సంకల్పమువలన, దర్శితం=చూపఁబడినది.

తా. అర్జునా! తేజోనిధియును విశ్వవ్యాపకమును ఆదిమధ్యాంతరహితమును సర్వోత్కృష్టమును, నాకంటె నితరములైనవానికెల్ల నాదియైనదియు, నీవొక్కఁడుదక్క పూర్వము నం దెవ్వరును చూడనట్టిదియునగు నా రూపమును నా భక్తుఁడవగుటచే నీయం దనుగ్రహబుద్ధితో నా సత్యసంకల్పమువలన నీకుఁ *జూపితిని.

అవ. నాయందలి యనన్యభక్తి తప్ప తక్కిన యేయుపాయములచేతఁ గాని నన్ను నా కలరూపునఁ జూచుట యశక్యమనుచున్నారు.

శ్లో॥ న వేదయజ్ఞాధ్యయనై ర్న దానైః
న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః।
♦ ఏవం రూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥ 48

---

* అర్జునునకు మాత్రము నిష్కారణముగా తన విశ్వరూపమును జూపినయెడల వైషమ్యనైర్ఘృణ్యదోషములు కలుగును గాన భక్తుఁ డగుటచే వానికిఁ జూపెనని చెప్పఁబడెను.

♦ 'అహం ఏవం రూపః నృలోకే ద్రష్టు మశక్యః' అనుచో 'ఏవం రూపః'

టీ. హేకురుప్రవీర = ఓకురుశ్రేష్ఠుఁడా, ఏవం రూపః = ఇట్టి యప్రాకృతత్వాదిరూపముగల, అహం = నేను, నృలోకే = మనుష్య లోకమునందు, త్వదన్యేన = నీకంటె నితరునిచేత, వేదయజ్ఞాధ్యయనైః = వేదయజ్ఞాధ్యయనముల సాహాయ్యముచేత, ద్రష్టుం = చూచుటకు, నశక్యః = శక్యుఁడైనవాఁడు కాను, దానైః = దానములచేత, న = కాను, క్రియాభిశ్చ = హోమాది క్రియలచేతను, న = కాను, ఉగ్రైః = దుష్కరములగు, తపోభిశ్చ = తపస్సులచేతను, న = చూడ శక్యమైనవాఁడను గాను.

101

తా. అర్జునా! *కేవలములయిన వేదములవలనను, దానముల వలనను, అగ్నిహోత్రాదిక్రియలవలనను, ఉగ్రమైన తపస్సువలనను, మనుష్యలోకములో నాయందు భక్తిగలనీవుదక్క వేఱొక పురుషు

---

అనఁగా ఇటువంటిరూపముగలవాఁడు-అనఁగా ఇప్పుడు నీకుఁగనఁబడుచున్నట్లుఅప్రాకృతత్వము సకలేతర విసజాతీయత్వము మొదలైనవి గలవాఁడనుట-కలరూపు గలవాఁడని భావము. 'నృలోకే' అనుటంబట్టి 'అహమ్' అనుటకు ఇచట విశ్వరూపము గాదు అవతారరూపమును గ్రహించునది. అవతారరూప మందఱికిని గనఁబడునదై యుండఁగా దానిని 'ద్రష్టు మశక్యః' అని చెప్పుట యెట్లనిన, ఇచట కేవలము 'అహమ్' అనుటయే కాక 'ఏవంరూపః' అనియుఁ జెప్పుటచే, నా ఏవంరూపమే చూడనశక్య మైనదికాని, ఏవంరూపముతోఁ గూడియున్న నేను చూడ నశక్యుఁడను కాను అని యర్థము. నా యవతారరూప మందఱికి దృశ్యమే కాని దాని ఏవంరూపము-అనగా అప్రాకృతత్వాది రూపము-అట్లుకాదనుట. ఏకాంత భక్తిరహితు లయినవారు నా యవతారరూపమును ప్రాకృతమైనది గాను మనుష్యాది సజాతీయమైనదిగాను కనుఁగొందురేకాని, అప్రాకృతత్వాది రూపము కలదిగా (అనఁగా కలరూపున, కనుఁగొనలేరని భావము. అనన్యభక్తులే అట్టి కలరూపున కనుగొందురని 'భక్త్యాత్వనన్యయా లభ్య అహమేవం విధోఽర్జున' అను మీఁదిశ్లోకముచేఁ దెలియనగును. ప్రకృతశ్లోమందలి 'ఏవంరూపః' అనుటయు మీఁదిశ్లోకమునందలి 'ఏవంవిధః' అనుటయు సమానార్థకములు.

* వేదయజ్ఞాదులు భక్తితోఁ గూడినవైనయెడల భక్తిద్వారా దర్శనసాధకము లగునుగాని కేవలము లైనయెడల నట్లు కానేరవు. కావుననే కేవలశబ్దము కూర్పఁబడినది.

నకును ఏకాంతభక్తిరహితుఁడైనవానికి నిట్టియప్రాకృతత్వాదులు గల
102
నా కలరూపును జూడ శక్యముగాదు.

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ జ్మ మేదమ్।
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
త దేవ మే రూప మిదం ప్రపశ్య॥ 49

టీ. ఈదృక్ = ఇట్టి, ఘోరం = భయంకరమయిన, మమ = నాయొక్క, ఇదం = ఇప్పుడుచూపిన, రూపం = విశ్వరూపమును, దృష్ట్వా = చూచి, తే = నీకు, వ్యథా = భయము, మా = వలదు, విమూఢభావశ్చ = తెలివి లేకయుండుటయును, మా = వలదు, త్వం = నీవు; వ్యపేతభీః = పోఁగొట్టఁబడిన భయము గలవాఁడవును, ప్రీతమనాః = సంతోషముఁ బొందినమనస్సు గలవాఁడవున్నై, మే = నాయొక్క, తత్ = పూర్వము నీకు వాడుకపడిన, ఇదం = చూపఁబోవు, రూపమేవ = సౌమ్యరూపమునే, పునః = మరల, ప్రపశ్య = చూడుము.

తా. భయంకరమైన నాయీ విశ్వరూపము చూచి నీవు భయమును మోహమును రెంటిని బొందవలదు. నీకు పూర్వము చూచి యలవడియున్న సౌమ్యరూపమునే చూపెద. (నీవు భయరహితుఁడవై సంతోషచిత్తుఁడవై) ఆ రూపమునే యిదిగో మరల చూడుము.

సఞ్జయ ఉవాచ.

శ్లో॥ ఇ త్యర్జునం వాసుదేవ స్త థోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః।

ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా॥ 50

టీ. వాసుదేవః = వసుదేవసూనుఁడగు శ్రీకృష్ణుఁడు, అర్జునం (ప్రతి) అర్జునునిఁగూర్చి, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, తథా = అర్జునుని యొక్క ప్రార్థన ప్రకారమున, స్వకం = తన దైన, రూపం = పూర్వ రూపమును, భూయః= మఱల, దర్శయామాస =చూపెను, మహాత్మా = గొప్పస్వభావము గల-ఆశ్రితులు ప్రార్థించునట్లు, చేయుస్వభావము గల శ్రీకృష్ణుఁడు, పునశ్చ = వెండియు, సౌమ్యవపుః = శాంతమైన రూపము గలవాఁడు, భూత్వా=అయి, భీతం=భయము నొందిన, ఏనం =ఈ యర్జునుని, ఆశ్వాసయామాస=ఓదార్చెను.

తా. వసుదేవపుత్త్రుఁడగు శ్రీకృష్ణుఁడు పాండుకుమారుఁడైన అర్జునునితో నిట్లు చెప్పి వాని ప్రార్థనప్రకారమున తాను వసుదేవ పుత్త్రుఁడై తాల్చియున్న చతుర్భుజరూపమును జూపెను. అపరిచిత మైన తన విశ్వరూపమును జూచి భయపడియున్న అర్జునునికి, పరిచిత మైన తన సౌమ్యరూపమును తాను *సత్యసంకల్పుఁ డగుటచేమరలఁ దాల్చి చూపి, వాని నోదార్చెను.

సర్వేశ్వరుఁడును పరమపురుషుఁడును పరబ్రహ్మమును జగదు పకృతిమర్త్యుఁడు నైన యీశ్వరుఁడు వసుదేవసూనుఁడై యవతరించి నప్పుడు తాల్చియున్న స్వరూపము చతుర్భుజములు కలదియే. వసు

---

* ఏరూపమునుగాని తాను సంకల్పించుకొన్నంతనే చూపఁగలవాఁడగుటచే 'మహాత్మా' అనుటకు సత్యసంకల్పుఁ డనఁబడెను. 'వాసుదేవః స్వకం' అను శబ్దము లచే వసుదేవుని పుత్త్రుఁడై తాను దాల్చిన చతుర్భుజరూపమునే చూపె ననుట సిద్ధిం చినది. 'స్వకం రూపం' అనుట పూర్వరూపము చూపుటకును, 'సౌమ్యవపుః' అనుట అర్జునునిభీతి పోఁగొట్టుటకును ఉపయుక్తములగుటచే రెంటికిని పునరుక్తి లేదు. పాండు కుమారుఁ డనుట సహజ ప్రీతిసూచకము.

దేవుఁడు కంసునివలని భీతిచే వానిని దాఁపువఱకు రెండుభుజములు మఱుఁగుసేయఁ బ్రార్థించుటచే, అంతవఱకు భుజద్వయము నే కృష్ణుఁడు దాల్చియుండి పిదప చతుర్భుజుఁడుగా నుండెను. 'జాతోఽసి దేవ దేవేశ శఙ్ఖచక్రగదాధర! దివ్యం రూప మిదం దేవ ప్రసాదే నోప సంహర! ఉపసంహర విశ్వాత్మన్ రూప మేతం చతుర్భుజమ్' అని కదా వసుదేవుఁడు ప్రార్థించెను. ద్వేషియగు శిశుపాలుఁడును 'ఉదార పీవరచతుర్బాహుం శఙ్ఖచక్రగదాధరమ్' అని అనవరతము భావించు కొనుచుండినది వసుదేవపుత్రుని యీ చతుర్భుజరూపమునే. కాఁబట్టియే అర్జునుఁడు నిచట 'తేనైవ రూపేణ చతుర్భుజేన' అని చెప్పినాఁడు.

అర్జున ఉవాచ.

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః॥ 51

టీ. జనార్దన=ఓకృష్ణా, తవ=నీయొక్క, సౌమ్యం=ప్రసన్నమైనట్టియు, మానుషం = మనుష్యసంస్థానముతోఁ గూడినట్టియు, ఇదం = ఈ-ఇటువంటి అనవధి కాతిశయసౌందర్యాదులుగల యట్టి, రూపమ్=రూపమును, దృష్ట్వా=చూచి, ఇదానీం = ఇప్పుడు, సచేతాః = మనస్సుతోఁ గూడినవాఁడు - మనస్సు తేటనొందినవాఁడు, సంవృత్తః=అయినవాఁడును, ప్రకృతిం=స్వభావమును-స్వస్థతను, గతః =పొందినవాఁడును, అస్మి=అగుచున్నాను.

తా. కృష్ణా, అనవధికాతిశయ సౌందర్యసౌకుమార్య లావణ్యాదియుక్తమై, నీకుమాత్రమె కలయట్టిదై, * మనుష్యాకారముతోఁ

* రూపము 'మానుషమ్' అనుటచే మనుష్యాకారము మాత్రమే కలదిగాని మనుష్యులకుఁ గలుగునట్లు కర్మవశ్యమును ప్రాకృతమును గానిదనుటకై 'ఇదం' అనఁబడెను. అనఁగా ఈ యప్రాకృతసౌందర్యాదులు గలది యని యభిప్రాయము.

గూడినట్టిదై, మిక్కిలియు సౌమ్యమై యొప్పెడి యీ నీరూపమును జూచి మనస్సు కలంక దేఱి పూర్వస్వస్థతను బొందితిని.

శ్రీభగవా నువాచ.

శ్లో॥ సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసి య న్మమ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః॥ 52

టీ. మమ=నాయొక్క, యత్=ఏరూపమును, దృష్టవాన్ అసి = చూచినవాఁడవైతివో, (తత్=అట్టి), ఇదం రూపం= ఈవిశ్వరూపము, సుదుర్దర్శం=చూచుటకు మిక్కిలియు దుర్లభమయినది, దేవాః అపి = బ్రహ్మాదిదేవతలుగూడ, ♦నిత్యం=ఎల్లపుడును, అస్యరూపస్య= ఈవిశ్వరూపముయొక్క, దర్శనకాఙ్క్షిణః=దర్శనము గోరువారు, (భవన్తి=అగుదురు) దర్శింప నిత్యమును గోరుచుందు రనుట.

తా. సర్వమును బ్రకాశించునట్టియు, సర్వాశ్రయమైనట్టియు సర్వకారణభూతమైనట్టియు ఏనారూపమును నీవు చూచితివో యా యీ రూపము ఎవ్వరికిని గనుఁగొన శక్యముగానిది. దేవతలుసయితము నిరంతరమును ఈరూపమునుదర్శింపఁగోరుచుందురు కాని దర్శించినవారుకారు. (ఇప్పుడు ని న్ననుగ్రహించుటకొఱకు బ్రదర్శింపఁబడిన యీ రూపమును బ్రసంగమువలన వారుకూడ చూచినవారైరి.)

అవ. ఏ లనఁగా చెప్పుచున్నారు.

శ్లో॥ నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా॥ 53

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప॥ 54

---

♦ ఇచట నిత్యశబ్దము 'కాఙ్క్షిణః' తో శ్లేషాన్వయించెడిని. యచ్ఛబ్దము ప్రసిద్ధమైనదానిని తెలుపును గాన ప్రసిద్ధాకారములైన స్వప్రకాశిత్వాదులం కూర్పఁబడెను.

టీ. మాం=నన్ను, యథా = ఏప్రకారము-అప్రాకృతమైన ఏయాకారముతోఁ గూడినవానినిగా, దృష్టవాన్ = చూచినవాఁడవు, అసి=అగుచున్నావో, ఏవంవిధః=ఇట్టి స్వరూపముగల వాఁడనుగా, అహం=నేను, వేదైః=వేదాధ్యయనాదులచేత, ద్రష్టుం = చూచుటకు, నశక్యః=సాధ్యుఁడను కాను. తపసా=తపస్సుచేత, న=కాను. దానేన=దానములచేత, న=కాను, ఇజ్యయాచ=యాగముచేతను, న=సాధ్యుఁడను కాను. పరంతప=శత్రువులను దపింపఁజేయునట్టి, అర్జున = అర్జునా, ఏవంవిధః = ఇట్టి స్వరూపియగు, అహం=నేను, అనన్యయా=ఇతర ప్రయోజనముగోరని, భక్త్యాతు = భక్తిచేతనే, తత్త్వేన=యథార్థముగా, జ్ఞాతుం=(శాస్త్రములచేత) తెలిసికొనుటకును, ద్రష్టుంచ = ప్రత్యక్షముగా చూచుటకును, ప్రవేష్టుంచ=పరిపూర్ణముగ పొందుటకును- అనఁగా అనుభవించుటకును, శక్యః = శక్యుఁడను.

తా. నా యథార్థ స్వరూపమును, ఇపుడు నీవు చూచినట్లు నాయందు *భక్తిలేక కేవలములైన వేదాధ్యాపన ప్రవచనాధ్యయన శ్రవణము జపములవలనఁగాని, యాగదానహోమ తపస్సులచేతఁగాని, చూచుటకు సాధ్యముకాదు. అనన్యప్రయోజనమగు భక్తిచేతనైనచో, నన్ను ♦కలరూపున శాస్త్రములచేత తెలియుటకును, కలరూ

---

* వేదములు స్వరూపమాత్రముచేత ఈశ్వరదర్శనమునకు సాధనములగు నను ప్రసక్తి లేదు. ఇట్లు సాధనము లగునని ప్రసక్తి లేనప్పుడు సాధనములు కావని నిషేధించుట పొసఁగదు. అయినను వేదములననుగుణించిన యధ్యయనాదులు సాధనము లగుట కలదు కాన 'వేద' అనుటకు వట్టివేదములను గ్రహింపక వేదాధ్యయనాదులు గ్రహింపఁబడెను. ఇవియెల్లను భక్తితోఁ గూడినవైననే సాధనములగును. అయిన నిచట సాధనములు కావనుటచేనవి కేవలములైనవని చెప్పఁబడెను. యాగదానహోమములు అనుమూఁటిలో యాగదానములుమాత్రము చెప్పఁబడినను అవి హోమమునకుఁగూడ ఉపలక్షకమగుటచే హోమశబ్దము చేర్పఁబడెను. 'ఏవంవిధః' అనుట మనుష్యాది విజాతీయత్వాప్రాకృతత్వాదులను (అనఁగా కలరూపును) దెలుపుచున్నది.

♦ భక్తి మూఁటికి సాధనము. ఆమూఁడెవ్వి యన, జ్ఞానము-అనఁగా శాస్త్ర

పున సాక్షాత్కరించుటకును, కలరూపున ప్రవేశించుటకును (అనఁగా పరిపూర్ణముగ అనుభవించుటకును) శక్యము. ఇట్లే 'నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన। యమే వైష వృణుతే తేనలభ్య స్తస్యైష ఆత్మావివృణుతే తనూంస్వామ్' అని శ్రుతియు ప్రతిపాదించుచున్నది.

---

మూలమున భగవత్స్వరూపజ్ఞానము; దర్శనము - అనఁగా భగవత్సాక్షాత్కారము; ప్రాప్తి-అనఁగా భగవత్ప్రాప్తి. ఇందు 'ద్రష్టుమ్' అని సాక్షాత్కారము పూర్వ శ్లోకమునఁ జెప్పఁబడినది. ఇందు 'జ్ఞాతుమ్' 'ప్రవేష్టుమ్' అని జ్ఞానప్రాప్తులు రెండును గూడఁ జెప్పఁబడిన వని తెలియునది. ఇచట 'తత్త్వతః ప్రవేష్టుమ్' అనఁగా పరిపూర్ణ ప్రాప్తి-అనఁగా భగవంతుని యథావస్థితముగా సర్వాకారముచే ననుభవించుట. ఇదియె సాక్షాన్ముక్తి. ఈ ప్రాప్తికి పూర్వములైన సర్వభేదములను, 'లోకేషు విష్ణోర్నివసన్తి కేచిత్ సమీపమృచ్ఛన్తిచ కేచిదన్యే। అన్యేతు రూపం సదృశంభజన్తే సాయుజ్యమన్యేసతు మోక్షఉక్తః' అని సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యములుగా స్మృతి చెప్పుచున్నది. యాదవప్రకాశులు 'యది ప్రథమాం యోగసిద్ధిం గతో మ్రియతే త్యజతివా యోగం శ్వేతద్వీపే జాయతే. భగవత్సాలోక్యంవా యాతి. యది తతోఽప్యధికాం యోగసిద్ధింగతో మ్రియతే విష్ణుపార్షదో భవతి. యది తతోఽప్యధికాం పార్షదేశ్వరోభవతి. యది తతోఽప్యధికాం ద్వారపాలోభవతి. యది తతోఽప్యధికాం భగవతోఽఙ్గసంవాహకో భవతి. యది తతోఽప్యధికాం మంత్రిస్థానీయః పృథగైశ్వర్యయుక్తో భవతి. యది పూర్ణాం యోగసిద్ధిం గతో మ్రియతే భగవత్సాయుజ్యం గతోముక్తః పరమైశ్వర్యయుక్తో భవతి' అని ప్రాప్తియొక్క పర్వభేదములను ప్రతిపాదించి యున్నారు. జ్ఞానదర్శన ప్రాప్తులకు మూఁటికి వరుసగా సాధనములైన భక్తియొక్క పర్వభేదము లేవనఁగా, పూర్వజన్మసుకృతమువలనఁ గలుగు సాత్త్వికజనులతోడి సంవాదాదులవలన జనించినదై భగవత్స్వరూపమును యథావస్థితముగా వినుటకు అనుగుణమైనదై అట్లు వినుటయందు కొంత ఆనుకూల్యము కలిగియుండుట అనెడిరూపమున నుండుభక్తి మాత్రము శాస్త్రజన్య జ్ఞానమునకు హేతువు. మిక్కిలియు భగవంతుని దర్శింప తహతహ పడుచుండు పరభక్తి సాక్షాత్కారమునకు హేతువు. సాక్షాత్కారము కలిగినను పరిపూర్ణానుభవమునందు అభినివేశము గలిగియుండు పరమభక్తి ప్రవేశమునకు (అనఁగా ప్రాప్తికి) హేతువు. ఇచట అనన్యభక్తి యనఁగా పూర్వము అర్థముసేసినట్లె అనన్య ప్రయోజనమైనభక్తి యని తెలియునది. కేవలములైన వేదాదులచేతఁగాక అనన్యభక్తిచే మాత్రము భగవత్ప్రాప్తి మొదలయినవి కలుగునని 'నాయమాత్మా ప్రవచనేన లభ్యో

103 అవతారిక -

శ్లో॥ *మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః।
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాణ్డవ॥ 55

టీ. హేపాణ్డవ=ఓ అర్జునా, మత్కర్మకృత్ = సమస్తకర్మములు నా యారాధనరూపము లనెడిబుద్ధితోఁ జేయువాఁడును, మత్పరమః=సమస్తారంభములకును నేనే పరమోద్దేశ్యముగాఁ గలవాఁడును, మద్భక్తః=నాయందలి అత్యంత ప్రీతిచే మత్కీర్తనాదులను జేయువాఁడును, సఙ్గవర్జితః = తక్కినవానితోడి సంగమును సహింపలేనివాఁడును, సర్వభూతేషు=సమస్తభూతములందు, నిర్వైరః = వైరములేనివాఁడును, యః=ఎవఁడో, సః = వాఁడు, మాం = నన్ను, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు.

తా. ♦ఎవ్వఁడు, వేదాధ్యయనము మొదలైన సమస్తకర్మములును నాయారాధనములే యని తలంచి చేయుచు, సమస్తములయిన యారంభములకును నన్నే పరమంబయిన యుద్దేశ్యముగాఁ గలిగి,

---

నమేధయా నబహునా శ్రుతేన య మే వైష వృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వామ్' అను శ్రుతియుఁ జెప్పుచున్నది.

* 'ప్రవేష్టుమ్' అని చెప్పిన భక్తిదశావిశేషమును భగవత్ప్రాప్తి హేతువైనదాని నీశ్లోకముచేఁ జెప్పుచున్నారు.

♦పూర్వోక్తము లైన కీర్తనాదికర్మములు భక్తికి అంతర్గతములై 'మద్భక్త' అనుట కర్థమగుచున్నవి గాన 'మత్కర్మకృత్' అనుచో కర్మములనఁగా 'నాహం వేదైః' ఇత్యాదులచేఁ జెప్పఁబడిన వేదాధ్యయనాది కర్మములుగా చెప్పఁబడెను. ఇట కర్మముల ప్రసక్తి యగుటచే వానిచే సాధ్యమగు ఫలమే బుద్ధియం దుండుటవలన 'మత్పరమ' అనుటకు 'సమస్త.. ముద్దేశ్యముగాఁ గలిగి' అనఁబడెను. లౌకికులకు అన్నపానాదులవలె భక్తులకు కీర్తనాదులు ధారకములుగాన 'ఆత్మ ..యని వాఁడై' యనఁబడెను భక్తికాష్ఠను బొందినపుడు గలుగునట్టి నిస్సంగత్వమును 'నేనొక్క...సయింపక యు' అనఁబడెను. అనఁగా దప్పిగొన్నవాఁడు త్రాగునట్టి అమృతధారయందు తృణాదు లడ్డ

నే నత్యంత ప్రియుఁ డగుటవలన నన్ను గుఱించి కీర్తనస్తుతిధ్యానా ర్చన ప్రణామాదులచేతనే తప్ప తక్కినవిధమున ఆత్మధారణము వడయనివాఁడై, నన్నొక్కనినే ప్రయోజనముగాఁ గలిగి, యెప్పుడు నెడతెగక యాకీర్తనాదులను గావించుచును, నే నొక్కఁడే ప్రియుం డగుటవలన తక్కినవాని సంగమునకు సయింపకయు, నాతోడిసంశ్లే షమే సుఖముగాను నాతోడి వియోగమే దుఃఖముగాను గలిగియుండు స్వభావము కలిమింబట్టియు తన దుఃఖమునకు తన యపరాధమే నిమిత్తమని అనుసంధించుటంబట్టియు సర్వభూతములును పరమపురు షునికి పరతంత్రములై యుండునని భావించుటం బట్టియు సమస్త భూతములందు వైరముచూపుటకు నిమిత్తము లేకపోవుచున్నది గాన వైరరహితుఁడై, యుండునో అట్టివాఁడునన్ను నాకలరూపునఁ బొందు

---

పడినచో నెట్లు సయింపఁడో యట్లనుట. ఇందులకు హేతువు 'నే నొక్క...డగుట' యగును. అట్టిభక్తికాష్ఠయందు వానికిఁగలుగు నిర్వైరత్వము శాస్త్రమునకు లోఁకువై యుండుటంబట్టికాదు. సహజముగా వైరమునకుఁ గారణములు లేకపోవుటంబట్టియే. కాన 'నాతోడి...రహితుఁడై' యనఁబడెను. అనగా పరమాత్మునియందు రక్తిగలిగి యుండుటంబట్టి తక్కినవానియందు విరక్తుఁడగునుగాన సాంసారికము లగు క్షుద్ర సుఖములను బాటింపఁడు. కనుక వానిని గలిగించువానియందుఁగాని తొలఁగించు వానియందుఁగాని వానికి వైరము గలుగదు. మఱి తన యపరాధమే తన దుఃఖమునకుఁ గారణమని తలంచువాఁడు పరునియందు ద్వేషముచూపఁడు. సర్వభూతములు భగవం తునికి లోనై నడచుకొనవలయునట్టివి గాన అవి తన కేమి చేసినను భగవంతునిచే ప్రేరితమై యట్లు చేసినవే కాని తమంతట తామట్లు చేయ నేరవనియు తలచుచుండును. మఱి తనవలెనే తక్కినవన్నియు విశ్వరూపుఁడగు భగవంతుని రూపములని యను సంధించుచుండును. ఈకారణములంబట్టి వైరముచూపుటకు నిమిత్తము కలుగఁజాలదు. 'ప్రవేష్టుమ్' అన్నదానినే 'నన్నుఁ గలరూపునఁ బొందుచున్నాఁ' డనఁబడెను. ఈ ప్రాప్తిస్వరూపమునే 'అవిద్య...వించుచున్నాఁడు' అని వివరింపఁబడెను. అవిద్య యనఁగా అజ్ఞానము అన్యథా జ్ఞానము తత్కారణములగు కర్మాదులును. పూర్వావస్థ యందును గొన్నియవిద్యాదుల నివృత్తిగలదుగాన నీ యవస్థయందవి సంపూర్ణముగా నివర్తించుననుటకై 'అశేష' అనియు, సవాసనముగానివర్తించుననుటకై 'కొంచమైనను లేక' అనియుఁ జెప్పఁబడెను.

చున్నాఁడు-అనఁగా అవిద్య మొదలైన యశేషదోషములు కొంచె

104

మైనను లేక తూలఁగా నన్నొక్కనినే యనుభవించుచున్నాఁడని యర్థము.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూప
సందర్శనయోగోనామ ఏకాదశోఽధ్యాయః.

ఇది యుపనిషదర్థ ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ
శాస్త్రంబును శ్రీకృష్ణార్జున సంవాదరూపంబును నగు
శ్రీభగవద్గీతలయందు విశ్వరూపసందర్శనయోగం
బన్నది యేకాదశాధ్యాయము.

---

# ఏకాదశో௨ధ్యాయః

## విశ్వరూపసందర్శనయోగః — అవతారిక.

### విశ్వరూపసందర్శనాధ్యాయ ప్రయోజనములు.

(అ) పుట్టిన భక్తి వృద్ధిచెందుట -

తాత్పర్య చంద్రికలో -

శ్రుతార్థ నిశ్చయాధీన భక్తి వివృద్ధి ఫలభూత దిదృక్షామూల భూతోత్తరాధ్యాయారమ్భః॥ అనగా - "ఇంతవరకు వినిన సకలార్థములను యథార్థమే యను విశ్వాసమును బుట్టించి దానిచే భగవంతునియందు భక్తిని పెంపొందించుటకు మూలభూతమైన దర్శనేచ్ఛకును దర్శనమునకును మూలమైన దీ పదునొకండవ అధ్యాయ ప్రారంభము" అని తెలిపిరి.

(ఆ) భక్తియొక్కటియే ముక్తికి సాధనమని చెప్పుట - ఈ యధ్యాయమునందలి 53, 54 శ్లోకములలో 'నాహం వేదైః...భక్త్యా త్వనన్యయాశక్య అహమేవంవిధో௨ర్జున! ఇత్యాది కలదు.

(ఇ) ఇదివరకు ప్రపంచముయొక్క సృష్టిస్థితి ప్రవృత్తి నివృత్తులకు తానే కారణమని చెప్పి యిప్పుడు సంహారమునకును తానే కారణమని చెప్పుట.

శ్లో॥ కాలో௨స్మి లోకక్షయ కృత్ప్రవృద్ధో ।
లోకాన్ సమాహర్తు మహం ప్రవృత్తః॥

(ఈ) లౌకిక వైదిక సమస్త కార్యములకును దైవమే ముఖ్య కారణమని తెలుపుట -

శ్లో॥ 'అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్।
వివిధాచ పృథక్చేష్టా దైవంచైవాత్ర పఞ్చమమ్'
'సిద్ధయే సర్వకర్మణాం'

అనగా - ఎన్నిసాధనసామగ్రు లున్నను ప్రధానకారణమైన భగవంతుని సహాయోగమున్ననే ఆ కార్యము సిద్ధించును. లేనిచో సిద్ధించదు.

32, 33 శ్లో॥ 'ఋతేపిత్వా న భవిష్యన్తి సర్వే'
'తస్మాత్త్వ ముత్తిష్ఠ'
'మయైవేతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్'

(ఉ) మయి సర్వాణి కర్మాణి సన్న్యస్య;
3-20 శ్లో.

కర్తృత్వమును భగవంతుని యందుంచి ప్రతికర్మను చేయవలెనను సిద్ధాంతమును బలపరచుట. పై ప్రమాణ శ్లోకములే.

(ఊ) మనము గెలుతుమో లేదో యను యర్జునుని శంకను బాపుట.

34వ శ్లో॥ 'యుద్ధ్యస్వ జేతాసి రణే సపత్నాన్'

భీష్మ ద్రోణ కర్ణాది ప్రధానయోధుల మరణోద్యమమునుజూపి నీవే గెలుతువు. యుద్ధమును చేయుము' అనెను.

(ఋ) తన ప్రభావము నెఱింగి కర్తృత్వమునకు గడంగ జేయుట.

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వేనమస్యన్తి చ సిద్ధసంఘాః 11-36 శ్లో.

(ౠ) విశ్వరూపాను సంధానముచే లోకము నుద్ధరించుట-

స్థితే మనసి సుస్వస్థే శరీరేసతి యోనరః ।
ధాతుసామ్యే స్థితే స్మర్తా ।
విశ్వరూపంచ మామజమ్ ।
తతస్తం మ్రియమాణంతు కాష్ఠపాషాణసన్నిభమ్ ।

అహం స్మరామి మద్భక్తం నయామి పరమాంగతిం ।
అనుటచే ధ్యేయమైన విశ్వరూపమును జూపి తరింపజేయుటకు.

(ఇ) పరగత స్వీకార సిద్ధాంతమును బోధించుట -

మన ప్రయత్నముతో మనము భగవంతుని చూడలేము. ఆతను చూపిననే చూడగల్గుదుము.

'యమేవైష వృణుతే తేనలభ్యః।
తస్యైష ఆత్మావివృణుతే తనూం స్వామ్॥

గీత - మన్యసే యదితచ్ఛక్యం మయాద్రష్టు
మితిప్రభో...దర్శయాత్మాన మవ్యయమ్-

అని యర్జునుడు ప్రార్థించగా -

దివ్యం దదామి తేచక్షుః।
పశ్యమే యోగ మైశ్వరమ్॥

(ఈ) తన పరత్వమును జూపుట -

6, 13, 15 శ్లోకములలో బ్రహ్మ రుద్రేంద్రాదులను అందరను తన శరీరైక దేశమున జూపెను.

36 శ్లో.

(ఎ) దుష్కృద్వినాశమునకు తా నవతరింతునని ఋజువు చేయుట.

మయైవేతే నిహతాః పూర్వమేవ ।
నిహతాః - కృతాపరాధాః ఏతే పూర్వమేవ
మయా హననే నియుక్తాః ।
34 శ్లో. 'మయాహతాన్ త్వంజహి'

(ఏ) వెనుక చెప్పిన వన్నియును నిజమేయని నమ్మి కర్తవ్యమునకు గడంగ జేయుట.

(ఐ) భగవంతుని భక్తిపారవశ్యముతో సేవించు పద్ధతిని తెలుపుటకు,

35- కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ -
నమస్కృత్వాభూయ ఏవాహకృష్ణమ్।
సగద్గదః భీతభీతః ప్రణమ్య॥

39 - శ్లో. నమోనమస్తేస్తు సహస్రకృత్వః
పునశ్చభూయోఽపి నమోనమస్తే।
నమోఽస్తుతే సర్వత ఏవసర్వ॥

40 శ్లో. అనన్త వీర్యామిత విక్రమస్త్వం......

43 శ్లో. పితాసి లోకస్య......

44 శ్లో. తస్మాత్ప్రణమ్య.........

అని యిట్లు భగవత్ప్రభావము ననుసంధించి పారవశ్యముతో ఒడలెఱుంగక నమస్కరించుట. తన తప్పులను విన్నవించి క్షమించమని ప్రార్థించుట మొదలుగా -

(ఙ) కృష్ణుడు భక్తులకు చతుర్భుజములతో దర్శన మిచ్చుట.

48 శ్లో. కిరీటినం గదినం చక్రహస్తం...

49 శ్లో. తదేవమే రూపమిదం ప్రపశ్య।

(ఛ) ఆశ్రితవాత్సల్యమును జూపుట.

52 శ్లో. సుదుర్దర్శ మిదంరూపం...
దేవా అప్యస్య రూపస్య।
నిత్యం దర్శనకాంక్షిణః॥

47 శ్లో. మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్।

(జా) ఇదివరకెన్నటినుండియో ప్రార్థించుచున్న అందరకును చూపుటకు -

దేవా అప్యస్య రూపస్య
నిత్యం దర్శనకాంక్షిణః.

(క) 'నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతిసోఽర్జున!'

సకల ప్రాణులును భగవంతుని శరీరైకదేశములే యని జ్ఞాన మున్నచో ఎవరిని ద్వేషింపరు. ద్వేషించిన భగవంతునే ద్వేషించిన వారగుదురు.

'చిన్తయ సర్వం చిదచిద్రూపం ।
తనురితి తస్యహరే రను రూపమ్ ।
తస్మాత్కస్మిన్ కలయసి కోపం ।
పశ్చాద్భజసి దురాపం తాపమ్' ॥

మరియు - భగవానుడర్జును డేదో యడగబోవుచున్నాడని యూహించి, అర్జునా! నేనింతవరకు చెప్పినది నీకేమైనను తలకెక్కినదా! ఇకముందు నేను చెప్పవలసినదియును నీవు వినవలసినదియును నీవేమి గ్రహించితివో చెప్పుము. అని శ్రీకృష్ణు డభిప్రాయపడు చున్నట్లు అర్జునుడు గుర్తించి మొదటి శ్లోకముచే తాను గ్రహించిన మొదటి షట్కార్థమును రెండవ శ్లోకముచే ఏడవ యధ్యాయము నుండి పదియవ యధ్యాయాంతమువరకును తానెఱింగిన విషయమును సంగ్రహముగా జెప్పి మూడవ శ్లోకములో పూర్వార్థముచే నా చెప్పిన విషయములయందు తనకు కలిగిన విశ్వాసమును ప్రకటించి యాపై విశ్వరూపమును జూపమని ఉత్తరార్థముచేతను నాల్గవ శ్లోకముచేతను ప్రార్థించుచున్నాడు.

దానికి ప్రసన్నుడై భగవానుడు 5వ శ్లోకమున 'పశ్యమే పార్థ రూపాణి' యని చూపుటకు సమ్మతించుచున్నాడు.

—: వి వ ర ణ ము :—

మొదటి శ్లోకము ప్రథమ షట్కార్థ సూచమెట్లనగా - అందు 'గుహ్య మధ్యాత్మ సంజ్ఞితం' 'యత్త్వయోక్తం వచస్తేన' అనెను గదా! కర్మయోగము గుహ్యము జ్ఞానయోగము గుహ్యతరము

భక్తియోగము గుహ్యతమమని భగవాను డానతిచ్చుటచే 'గుహ్యం' అనుటవలన ప్రథమషట్క ప్రధాన ప్రతిపాద్యమైన కర్మయోగ మున్ను, దానికి ప్రాణమైన 'అధ్యాత్మజ్ఞాన సంజ్ఞితం' ఆత్మతత్వ మును తా నెఱింగినట్లు సూచించెను.

రెండవ శ్లోకమున 'భవాప్యయౌహి భూతానాం శ్రుతౌ విస్త రశో మయా' అనుటచే సకల ప్రాణులయొక్కయు ఉత్పత్తి స్థితిప్రవృ త్తులు తన యధీనమని చెప్పిన ఏడు ఎనిమిది యధ్యాయముల సార మును, 'మాహాత్మ్య మపిచావ్యయం' అనుటచే తొమ్మిది పది యధ్యా యార్థముల సారమును చెప్పి తాను విని గ్రహించి విశ్వసించితినని యును సూచించెను.

ప్రయోజనములు ముగిసినవి.

(1) ప్రయోజనమును జెప్పుటచే నర్జునునకు చూడవలెన నెడు తలంపు, భక్తి వృద్ధియగుటచేత నే కలిగెనని సూచింపబడినది.

(2) సకలేతర స్వభావ విలక్షణమగు అనగా - అనవధికాతి శయము.

(3) చెప్పిన విషయ విస్తారమును వినుటచే నమ్మకము కలిగి భక్తిపుట్టి పెరిగినది. దాని కేమిఫలము? అర్జునునకు విశ్వరూపదర్శ నేచ్ఛయే. ఆ కోరికకు మూలమైనదియే ఉత్తరాధ్యాయమునకు ఉపో ద్ఘాతము. అట్టి యుపోద్ఘాతరూపమైన అర్జునవాక్యము నవతరింప చేయుచున్నారు.

(4) ఇట్టి నమ్మకము పుట్టుట కా చెప్పిన భగవంతుడు ఆప్తతము డగుటచేతనే యని సూచింపబడుచున్నది. మరియొక యాచార్యుని నుండి వినినచో చూడగోరిక జనించినను దర్శన ప్రార్థనకూడదు గదా!

(5) విశ్వరూపమును జూపమని ముందు మూడు శ్లోకములచే ప్రార్థించుచున్నాడు.

అందు - 'మదనుగ్రహాయ' అనెడు మొదటి శ్లోకముచే కృతజ్ఞతయు, 'భవాప్యయౌహి' అను శ్లోకముచే ఆస్తికత్వమున్ను, 'ఏవమేతత్త్' ను శ్లోకముచే భక్తిమత్త్వమున్ను సూచింపబడినది. ఈ మూడును ఉన్నవాడే ఆ రూపసందర్శనమున కర్హుడు.

(6) భగవంతు డీ రహస్యము నుపదేశించుటలో నర్జునునిపై అనుగ్రహము తప్ప తనకు పొందబడనివియును పొందతగినవియును వేరొండులేవని యిదివరలోనే చెప్పబడెనుగదా! ఇట్లు చెప్పుటచే నర్జునుని యుద్ధమునకు ప్రోత్సహించుటకే గీతోపదేశమనెడు పామర ప్రసంగములు పరిహరింపబడినవి.

(7) ప్రథమషట్కమున చెప్పబడిన ఆత్మతత్త్వమును, ఆత్మను సాక్షాత్కరించుకొనుట కుపాయమును దాని ఫలమును అనువదించెను.

(8) ఈ ప్రథమ షట్కములో జెప్పబడిన గుహ్యమైన నిష్కామకర్మయోగమును, 'పరమం' అని విశేషించుటచే గుహ్యతమగు భక్తియోగమునకు అంగమగుటచే నిదియును గుహ్యతమమని గ్రహించవలెను.

(9) 'ఆత్మని ప్రతిపాదకత్వేన అధివసనాత్ వచసోఽధ్యాత్మత్వం' - అనగా - ఆత్మను గురించి తెలియవలసినవి సాక్షాత్కరించు సాధనములు మొదలగునవి యన్నిటిని గురించియు తెలుపునదగుటచే 'అధ్యాత్మ' మనబడినది.

(10) 'సర్వమును' అనుటచే 'విగత' అనుచో 'వి' యను ఉపసర్గముచే సూచింపబడిన నిశ్శేషవినాశము చెప్పబడినది.

(11) దూరముగ ననుటచే సంస్కారముకూడ నశించిన దనుటచే తిరిగి మొలకెత్తకుండునట్లు నశించినదని భావము.

2వ శ్లోకము

(12) ఈ శ్లోకమునందలి 'హి' యను శబ్దము ముందు చెప్ప బోవు భగవద్దర్శనేచ్ఛను తెలుపుచున్నదని యర్థము.

(13) 'త్వత్తః' అను దానిని 'పరమాత్ముడవగు' అని శ్రీ భాష్య కారులు విశేషించిరి. దానిచే శ్రీకృష్ణుని విషయమై మనుష్యభ్రమ తీరి మాటలాడు అర్జునుని వాక్యమగుటచే 'త్వత్తః' అను దానికి సృష్టి స్థితిలయములకు కారణమైన రూపమే వివక్షితముగాన 'పరమాత్మనః =పరమాత్మవగు' అనిరి.

(14) అర్జునుడు శ్రీకృష్ణుని 'కమలపత్రాక్ష' అని సంబోధిం చుటచే నంతరాదిత్య విద్యలో జెప్పబడిన 'పుణ్డరీకాక్షత్వము' తో గూడిన అప్రాకృత దివ్యమంగళ విగ్రహ సన్నివేశము యీ యువ తారూపమునందును స్ఫుటముగ గోచరించుచున్నదని గ్రహించవలెను.

ఆ విద్య నుపపాదించు నా ఛాందోగ్యోపనిషత్తులో నీ పుండరీ కాక్షునకే సర్వలోక కామేశత్వాది మాహాత్మ్యము తెలుపబడెను.

(15) కాలమునుబట్టిగాని విషయమునుబట్టిగాని సంఖ్యనుబట్టి గాని ప్రకర్షనుబట్టిగాని సంకోచములేని యాధిక్యము మాహాత్మ్యము నకు చెప్పబడుచున్నది.

3వ శ్లోకము

(16) చెప్పిన మాటయందు గట్టినమ్మకము కలుగుటకు కారణ మైన ఆప్తత్వాదు లీ పదముచే వివక్షితములు.

(17) కోరుటమాత్రమే నావంతు, చూపుట నీవంతు అది నీ దయపై ఆధారపడియున్నదని భావము.

(18) రూపం - ఈ శబ్దము దివ్యాత్మ, దివ్యమంగళ విగ్రహాది సమస్తాకారపరము.

దీనికి భాష్యకారులు -

(i) సర్వమును శాసించుటయందును -

(ఉన్న రూపమును 'ద్రష్టు మిచ్ఛామి' అని సర్వత్ర యోజించు కొనవలెను).

అనగా - ప్రశాసన కుపయోగించు శరీరము చేష్టలతో నీప్రశాసన సామర్థ్యమును జూపు రూపమును అని లేక- ప్రశాసనము నందున్న రూపమును- అనగా "యథార్హం కేశవే వృత్తిం అవశాః ప్రతిపేదిరే" అనినట్లు 'శ్రీకృష్ణుడు మన సభలోనికి వచ్చినను' ఎవ్వరును ఆతని నాదరించుటకై మీమీ యాసనములనుండి లేవరాదు. నమస్కరించరాదు' అని దృఢప్రతిజ్ఞతో కూర్చొనియున్న దుర్యోధనాదులందరును శ్రీకృష్ణుని చూడగనే ఆ ప్రతిజ్ఞను మరచి మైమరచి లేచి నిలచి చేతులు జోడించిరి. అట్టి రూపమును అని గాని యర్థము.

(ii) కల్యాణగుణాకరుడవై యుండుటయందు —— రామాద్యవతార శరీరములవలె అజ్ఞానమును అభినయించుట కనర్హమైన రూపమును.

(iii) పాలించుట యందును-

అందరను ప్రవర్తింప చేయదగుటకు తగిన రూపమును.

(iv) సృజించుటయందును -

నీ యవయవములనుండియే చతుర్ముఖ రుద్రాదులను, నాలుగు వర్ణములను పుట్టించుటకు తగిన రూపమును.

(v) సంహరించుట యందును -

అందరిని మ్రింగివేయుటకు తగిన రూపమును.

(vi) భరించుటయందును -

ప్రపంచమునంతను నీ శరీరైకదేశమున జూపినదగిన రూపమును.

(vii) సర్వోత్కృష్టుడవై యుండుటయందును -

బ్రహ్మాదులనుకూడ తన శరీరమున నొకొక్క రోమకూప ములవలె జూపుట.

ఈ యాకారముల నన్నిటిని విశ్వరూపమున జూపును.

(19) పురుషోత్తమ ! -

ఆశ్రితుల దోషములనే యన్వేషించువాడు నీచుడు. నీవు పురుషోత్తముడవు. కాన నా దీనత్వమునే జూచి దయతో నీ రహస్యార్థముల నుపదేశించితివని భావము.

ఇదియే నిరతిశయ పురుషోత్తమత్వము. దానినే పురుషోత్తమ శబ్దము సూచించినది. అందులకే శ్రీ భాష్యకారులు దీనిని వివరించుచు 'ఆశ్రిత వాత్సల్యజలధీ !' యని తెలిపిరి.

పురు=అధికం, సనోతీతి=యచ్ఛతీతి- పురుషః' అను వ్యుత్పత్తినిబట్టి ఆశ్రితాభిమతాధిక ప్రదుడని తెలియుచున్నది.

(20) తొమ్మిదవ అధ్యాయారంభమున 'పశ్య మేయోగ మైశ్వరం' అని చెప్పినది సంశయవిపర్యయములులేక స్పష్టముగా బోధపడకపోవుటచే నట్టిదానిని సాక్షాత్తుగా చూపవలెనని 'రూపమైశ్వరం' అనెను.

ఈ శ్లోకమున -"పరమేశ్వర - పురుషోత్తమ" అను సంబోధనలచే పరత్వ సౌలభ్యములు తెలుపబడినవి.

4వ శ్లోకము

(21) ఈ సంబోధన సాభిప్రాయము.

నీవు చూపదలచినచో నీకేదియును దుష్కరము కాదను భావమును సూచించు గుణవిశేషములను తెలుపును. ఆ గుణము లేవి యనగా నీకంటె నితరులెవ్వరికిని యుండునని ఊహించుటకైనను

మీలులేని జ్ఞానబలైశ్వర్యాదులు. లేక - "యోగేశ్వర" యను సంబోధనలోని తాత్పర్యము నీ 'ప్రభు' శబ్దము తెలుపును. యోగమనగా కల్యాణగుణసముదాయము. ఈశ్వరుడనగా నియమించువాడు అనగా- అశ్వపతి - ధనపతి - యనుచో నెట్లు గుఱ్ఱములను ధనమును అధికముగా కలవాడును వానిని యథేష్టముగా నియమించువాడనియు నర్థమో అట్లే యనంతగుణములు కలవాడనియు వానిని నియమించువాడనియు నర్థము.

(22) సమగ్రముగ - అనగా సమస్త గుణములతోను విభూతులతోను దివ్యశరీరములతోను కూడుకొనియున్న రూపము.

ఈ ప్రార్థనవలన నింతవరకు వినుటచేకలిగిన యర్జునుని వినయము ఆస్తిక్యము మొదలగు యోగ్యతలు - స్వభావమునందు మార్పున్న గోచరించుచున్నవి దీనిని ముందు శ్లోకముయొక్క అవతారికలో చూడుము.

(23) ఇచ్చట అణిమాద్య ష్టైశ్వర్యశక్తియున్న గుణములలో చేరినది. యోగనిర్వాహకత్వాదికము మాత్రము చూడగోరిన యాకారముల కంతరంగము కాకపోవుటచే నిచ్చట నది వివక్షితము కాదు. ముం దేయాకారమును చూపబోవుచున్నాడో అదియే యిచ్చట చూపగోరబడినది. అర్జునునకు విశ్వరూపములో నష్టాంగ యోగమును జూపెనా ?

5వ శ్లోకము

(24) అవతారిక -

ఇట్లు విశ్వరూప సందర్శనమునందలి వేడుక కలిగినట్టియు ఆనంద పారవశ్యముచే డగ్గుత్తిక పడినట్టి యర్జునునిచే ప్రార్థింపబడి భగవంతుడు పలుకుచున్నాడు.

భగవంతు డర్జునుడుకోరినట్లుగా విశ్వరూపమును చూపుటలో కారణము ప్రశ్నించురీతినిబట్టి తెలియుచున్న అవస్థావిశేషమే. దానిని బట్టియే - 'పశ్య' =(చూడుము) అను శ్లోకముయొక్క సంగతి యీ యవతారిక మూలముగ తెలుపబడుచున్నది.

(25) నూరులకొలది వేలకొలది యనుటచే పరవ్యూహ విభవాదులతోకూడిన యనంతమగు నప్రాకృత శరీరములు కలవని తెలుపబడెను. ఒక సూర్యమండలములో నేరూపముకలదో అట్టి రూపములే అనంత బ్రహ్మాండములయందుండు అనంత సూర్యమండలములలో నున్నవనిభావము.

ఇచ్చట దివ్యశబ్దమునకు ఊర్ధ్వలోకములలో నున్నవని యర్థమును చెప్పరాదు. భూమిపై వ్యాప్తియును చెప్పబడుచున్నది గదా! కాబట్టి ద్రవ్యవైలక్షణ్యమే చెప్పబడవలెను గాన అప్రాకృతములని వ్యాఖ్యానింపబడెను.

27 (ఎ) పశ్య=కనుగొనుము -

అనుటచే నీవు చక్కగా చూడగలుగునట్లు చూపెదనని తాత్పర్యము.

ఈ శ్లోకమున 'నానావిధాని' యనుటచే ఆభరణముల యొక్కయు, ఆయుధములయొక్కయు, అలంకారములయొక్కయు, భుజముల యొక్కయును సంఖ్యలోను వాని యాకారములోనుగల అనంత్యము సూచింపబడుచున్నది.

—: విశేష వివరణము :—

ఇంతవరకు జరిగిన 4 శ్లోకములలో అర్జునుడు భగవంతుని విశ్వరూపము నతివినయముతో నర్థించినట్లు గాన్పించుచున్నది గదా!

రామాయణమున అరణ్యకాండ చివర భాగములోని చతుస్సప్తతితమ (74)వ సర్గలో భగవంతుడైన శ్రీరామచంద్రుడు శబరిని

యిదేవిధముగ భాగవతవైభవము నింత వినయముతోనే అర్థించిన విధము గానగును.

గీత - త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ శ్రుతం...(అర్జునుడు శ్రీకృష్ణునితో) గీత 11-2.

రామా - శ్రీరామచంద్రుడు శబరితో -

దనోస్సకాశాత్ తత్త్వేన ప్రభావం తేమహాత్మనః శ్రుతం... రా. అర - 74-19 శ్లో.

గీత - 11-3 శ్లో. ద్రష్టుమిచ్ఛామి తేరూపం ... (అర్జునుడు - కృష్ణునితో).

రామా - ప్రత్యక్షమిచ్ఛామి సంద్రష్టుం ...
(రాముడు శబరితో)

గీత - అర్జు - కృష్ణు - తో ... 4వ శ్లో.

మన్యసే యది తచ్ఛక్యం మయాద్రష్టుమితి ...
రాముడు శబరితో.

రామా - అర. 74 స. 20 శ్లో.

... యది మన్యసే.

గీత - శ్రీకృష్ణుడు - అర్జునునితో 5వ శ్లో. పశ్యమే పార్థ ...

రామా - అరణ్య - 74-21 శ్లో. శబరి - రామునితో-

పశ్యమేఘ ఘనప్రఖ్యం.

భగవంతు డెన్ని యపూర్వవిషయములు తన విశ్వరూపములో చూపెనో అన్ని యపూర్వ విషయములను శబరి శ్రీరామునకు ఆచార్య విశ్వరూపములో జూపెను -

(i) జుహోవాంచక్రిరే తీర్థం మన్త్రవన్మన్త్ర పూజితమ్.

(ii) మేనుసత్కృతాః పుష్పోపహారంకుర్వన్తి॥

తేషాం తతః ప్రభావేన పశ్యాద్యాపి...24 శ్లో.

(13 సంవత్సరములైనను వాడనేలేదు గాలికి చలించలేదు. వర్షములకు కొట్టుకొనిపోలేదు).

ద్యోతయన్తి దిశస్సర్వాః శ్రియా వేద్యోఽతులప్రభాః ...
25 శ్లో. (ఆరిపోలేదు. ప్రజ్వలించుచునే యున్నవి.)

చిన్తితేఽభ్యాగతాన్ పశ్య!
సహితాన్ సప్తసాగరాన్॥
కృతాభిషేకై స్తైర్న్యస్తాః
వల్కలాః పాదపేష్విహ॥ 26 శ్లో.

అద్యాపి నావశుష్యన్తి! ప్రదేశే రఘునన్దన!
దేవకార్యాణి కుర్వద్భిః యానీమాని కృతాని వై!
పుష్పైఃకువలయైస్సార్థం మ్లానత్వం నోపయాన్తి వై. 27 శ్లో.

(పదమూడు సంవత్సరములట్లే వాడకయున్నవి. సప్తసముద్రములును ఏడు గుంటలై వారి స్నానమునకైవచ్చి పడియున్నవి చూడు.

శ్రీకృష్ణు డర్జునునితో -
మయా ప్రసన్నేన తవార్జునేదం!
రూపం పరం దర్శిత మాత్మయోగాత్॥ 47 శ్లో.

.......................
యన్మేత్వదన్యేన నదృష్టపూర్వం॥
శబరి - శ్రీరామునితో -
కృత్స్నం వనమిదం దృష్టం!
శ్రోతవ్యంచ శ్రుతం త్వయా॥ 28 శ్లో.
గీత - అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా! 45 శ్లో.
(అర్జునుడు శ్రీకృష్ణునితో)
రామా - శ్రీరాముడు శబరితో

ప్రహర్షమతులం లేభే ఆశ్చర్యమితి త్వతః।
అర్చితోఽహం త్వయాభక్త్యా॥

విశేష వివరణము ముగిసినది.

6వ శ్లోకము

27 (బి) ప్రధానమైన ముప్పదిరెండు దేవతలను ముందుగా జెప్పుచున్నాడు.

(28) ప్రదర్శనార్థమనగా - ఉపలక్షణము.

అనగా - అర్జునుడుగాని మరి యితరులుగాని యెన్నటను ఎఱుంగనివని తాత్పర్యము.

(29) ఇంద్రియములకు గోచరించని వస్తువు సామాన్యముగా శాస్త్రముచే నెఱుంగబడినను కంటితో జూచియే యెఱుంగవలసినవి ఎన్నియో విశేషములు కలవని సూచింపబడినది.

8వ శ్లోకము

(30) భగవన్నియమనకు తగిన గుణవిభూతియోగము.

(31) ఈశ్వరత్వమనగా - నియమనశక్తి.

(32) దివ్యచక్షువగుటచే జ్ఞానాది గుణములనుకూడా చూడ గల్గును. కావుననే అర్జునుడు ముందు అనన్త వీర్యత్వాదులతోకూడిన రూపమును చూడగల్గుచున్నాను.

10వ శ్లోకము

(33) అనేక ముఖములనుటచేతనే అనేక నేత్రములు చుండగా తిరిగి చెప్పనేలయనగా - ఆగమములో నీ విశ్వాయ ధ్యానమునందు అట్లుండుటచేనని గ్రహించవలెను.

(34) అనేకం - అద్భుతం దర్శనం యస్యతత్ - అనగా అనవధికాతిశయాశ్చర్యముతో చూడబడునది.

(35) ఆశ్చర్యభూతములగు సమస్తతత్త్వములకును ఆధార మైనది.

(36) ఇచ్చట దేవశబ్దమునకు విగ్రహ విశిష్ట విషయముగ చెప్పుటయే సార్థకమగుటచే - ద్యోతమానం=ప్రకాశించుచున్నదని చెప్పబడినది.

16వ శ్లో.

(37) 'సర్వతః' అను పదమును - 'పశ్యామి' తో నన్వయిం చుటలో సార్థక్యమున్నది. అట్లు చూడగలశక్తి దివ్యచక్షుస్సును బడయుటవలన కలిగినదని తెలియవలెను.

(38) విశ్వరూపుడగుటకు కారణము విశ్వేశ్వరు డగుటయే. అనగా - విశ్వనియన్తయని యర్థము. లోపల వ్యాపించి నియమించు వాడు శరీరి. నియమింపబడునది శరీరము - కాబట్టి విశ్వరూపు డనగా విశ్వశరీరి యని తేలినది. విశ్వమంతయు నాతనికి శరీరము గదా !

(39) ఉన్నను చూచుట లేదా? లేకపోవుటచే కానిపించుట లేదా? అనగా -

దివ్యచక్షుస్సుకలవాడున్న దానిని చూడలేకుండుట యెట్లు? కాబట్టి లేదనియే యర్థము, శశశృంగమును చూడలేనట్లు.

ఆదిమధ్యాంతములు లేకుండుట దేశమును బట్టియును కాల మునుబట్టియును. ఆది యంతములను తెలుపు హద్దులున్నచో మధ్య యును తెలియవచ్చును. అవి లేకపోవుటచే మధ్యయును తెలియదు.

17వ శ్లోకము

(40) కిరీటమనియు కరండికయనియు తలకు ధరించునవి రెండు రకములు. అందు కిరీటము గొప్పవారు ధరింతురు.

18వ శ్లోకము

(41) నిధానమనగా - ఆధారము. దానికి 'పరం' అని విశేషణ ముండుటచే జీవుడుకాడని తెలియవలెను.

తనకు వేరొక ఆధారములేనివాడని యర్థము.

(42) విశేషములులేని 'అవ్యయ' శబ్దముచే స్వరూపమునకుగాని గుణములకుగాని వైభవమునకుగాని ఒకప్పుడైనను నాశము తరుగులేకుండుట.

ఈ శ్లోకమున - అక్షరం - అవ్యయం- వేదితవ్యం- అవ్యయం- సనాతనం మొదలగు శబ్దములచే (భగవంతుని ప్రభావమును జూపుట వలన) ముండకోపనిషదాదులలో చెప్పబడిన రూపము జ్ఞాపకము చేయబడుచున్నది.

19వ శ్లోకము

(43) ఇదివరలో చెప్పబడిన 'నాన్తం నమధ్యం' మొదలగునది దివ్యాత్మస్వరూపమును గుఱించినది. ఇప్పుడిది దివ్యమంగళ విగ్రహమును గూర్చినదిగాన 'పౌనరుక్త్యము' లేదు.

లేక ఒకచోట ఉత్పత్తిస్థితి వినాశము అను వికారములు లేవనియు, ఇచ్చట ఆ వికారములకు కారణములు లేవనియును చెప్పవచ్చును.

(44) వీర్యమునకు అనన్త్యమనగా - అంతకన్న గొప్ప వీర్యము లేదనుట.

(45) వెనుక బాహువుల నానాత్వము చెప్పబడినది. ఇచట అసంఖ్యాకములని చెప్పబడుచున్నది.

(46) ఒక్కొక్క నేత్రమే భక్తులకు చంద్రునివలె చల్లగాను శత్రువులకు సూర్యునివలె తాపజనకముగాను ఉన్నదని భావము.

అనాదిమధ్యాన్తం అనెడు శ్లోకమున -

(విశేష వివరణము)

'అనేక బాహూదర వక్త్రనేత్ర' మని అవయవములయొక్క బహుత్వమును మాత్రమే చెప్పుటచే రూపమొక్కటియేయని తోచుచున్నది. అదియునుగాక పూర్వాపరగ్రంథమునుబట్టి ఒకేశరీరమును గూర్చిన పరామర్శయును గాన్పించుచున్నది.

'పశ్యమే పార్థరూపాణి' అని ప్రారంభించుటచే నిచ్చటను అనేక శరీరములు అనేక ఉదరములు మొదలైనవని చెప్పరాదా? అన్నచో అట్లనరాదు, అట్లే చెప్పదలంచినచో అనేక విగ్రహామనియే చెప్పియుండునే. కాకున్నను అనేక శరీరములకు అనేక బాహువులు అనేక ఉదరములు కలవని చెప్పుటలో విశేషమేమున్నది? అట్లైనచో ఆగమములలో నెచ్చటను భగవంతుని కెచ్చటనైనను అనేక ఉదరములున్న రూపము జూపబడెనా? యన్నచో- ఆ శాస్త్రమిచ్చటంతయు ప్రచారములోనున్నదా? నారదాదులు జూచిన రూపములనే మనమా గ్రంథములో గానకున్నాము. నారదుడు జూచిన విశ్వరూప మింతకంటెను వేరైనది. ధృతరాష్ట్రుడు జూచిన విశ్వరూప మదియొకమాదిరి. నానా సంహితలలో వరాహనృసింహాదులకు వేరువేరు రూపములు వేరువేరు రంగులు వేరువేరు భుజములు మొదలగు వైచిత్ర్యమును గాంచుచున్నట్లే. శ్రీ విశ్వరూపశరీరమునందును చెప్పినదానినిబట్టియే ఆయా వైలక్షణ్యముల నంగీకరించవలసినదే.

కొమ్మలు - వేళ్లు అనేకవిధములుగానున్నను మొదలొకటైనచో చెట్టొకటియే యనునట్లు చేతులు కడుపులు వేరువేరైనను భిన్నముగా చెప్పబడకపోవుటచే మొలభాగ మొక్కటియే యగుటచే నిచ్చట రూపమొక్కటియే యని భావించవలెను.

(విశేష వివరణము ముగిసినది.)

### 20వ శ్లోకము

(47) అన్తరం=అవకాశము - మధ్యనున్న ఖాళీప్రదేశము.

నిఘం - అన్తర మవకాశావధి పరిధానాన్తర్ధి భేదతాదర్థ్యే। అని కోశము.

మధ్యఖాళీ, హద్దు,కట్టుబట్ట, మాయమగుట మొదలగు నర్థము లీ శబ్దమునకు గలవు.

(48) మహాత్మన్ ! –

తెలుసుకొనశక్యముకాని గంభీరమగు ఆశయములు కలవాడు.

మహాత్మశబ్దము గంభీరమైన బుద్ధివిశేషము కలవారియందు ప్రయోగింపబడును.

శరీర ముగ్రమైనదనుటచే భయమును గొలిపినట్లు తనోఽభిప్రాయమున్ను తెలియశక్యమైనది కాకుండుటచే నిదియును భయహేతువే యగుచున్నది. గాన నిచ్చట యీ యర్థమే అనుకూలమైనది.

(49) అన్తరం – మధ్యనున్న ఖాళీప్రదేశము చెప్పబడినది. ఇప్పుడు దానికి హద్దులు చెప్పబడుచున్నవి. అందన్ని లోకములును యిమిడియున్నవి. అట్టి శక్తివిశేషముండుటచేతను, అడ్డగల విరోధి పదార్థములు లేకుండుటచేతను ఆ లోకములన్నియు నిమిడినవి.

(50) ఇచ్చట అభిప్రాయమేమనగా – వెనుకవుందును ఉన్న వాక్యములన్నియును శరీరమును గూర్చినవియే యగుటచే మధ్యగా ఆత్మస్వరూపవ్యాప్తిని చెప్పుట నిరర్థకముగావునను ఆ విగ్రహ మతి మహత్తరమైనదని కంఠతవేణ చెప్పుటచేతను శరీరముయొక్క వ్యాప్తియే యిచ్చట చెప్పబడినది.

### 21వ శ్లోకము

(49) అమీ హి త్వాం విశన్తి - అనునది సంహారావస్థకాదు. స్తుత్యాదులతో కలిపి చెప్పబడుచున్నదిగదా ! దుర్యోధనాదులవలె

మరణదశకు దగ్గరించినవారుకారు వీరు - 'వీక్షన్తే త్వాం' అని చెప్పుట కూడా విరోధించును. కాబట్టి దగ్గరకు వెళ్ళుట అను సేవాప్రకారమే గ్రాహ్యము.

(50) కేచిత్ — వీరును దేవతలలోని వారే — మిగిలిన ప్రాణులందరును భయపడి పారిపోవుచున్నట్లు ముందు చెప్పబడును.

(51) మహర్షిసంఘములు - భృగ్వాదిగణములు.

(52) సిద్ధసంఘములు - సనకాదులు.

(53) స్తోత్రములకు పుష్కలత్వ మేమనగా. ప్రమాణసిద్ధమైన సర్వేశ్వరత్వాదికమును జెప్పుటయే.

(54) ఉత్కృష్టులైన - అనగా - బ్రహ్మాదులని భావము. 'కేచిద్భీతాః' అని ధైర్యవిహీనులు వేరుగా చెప్పుటచే నుత్కృష్టులనగా ధైర్యశాలులును ఆనందపరవశులును అని చెప్పబడుచున్నారు గాన బ్రహ్మాది గొప్ప దేవతలందరును సేవార్థమై విచ్చేసిరని చెప్పబడెను.

22వ శ్లోకము

(55) అవతారిక —

ఈ శ్లోకమున నర్జునునకు కలిగిన ఆశ్చర్యము తెలుపబడినది.

23వ శ్లోకము

(56) ఈ శ్లోకమున నర్జునునకు కలిగిన భయము తెలుపబడుచున్నది.

(57) ఈ శ్లోకమునందలి 'ప్ర' అను ఉపసర్గచే ప్రస్థానం - ప్రస్మరణం అను చోటునవలె నిషేధపరముగాక 'మిక్కిలి' యను నర్థము వివక్షితము - అనగా - మిక్కిలి చలించిరి లేక - మిక్కిలి భయపడిరని యర్థము.

24వ శ్లోకము

(58) అచేతనమైన మనస్సునకు భీతి యెట్లనిన - దానియందు చేతనత్వ మారోపించి చెప్పబడినది. ఆ యారోప మేలననగా -అపరిమితముగ భయపడినట్లు తెలుపుటకే.

(59) కేవలము పేరని చెప్పుటకంటె ప్రకృతాను గుణముగ వ్యాప్తి చెప్పబడెను.

25వ శ్లోకము

(60) అవతారిక -

ఈ శ్లోకమున నితరావయవములకన్న ముఖము లతిభయంకరముగ నున్నవని చెప్పబడుచున్నది.

తనకు భయంకరముగ నున్నదనుటచే తనయందు దయతో నా రూపమును జూపినటులనే దాని నుపసంహరించమని తాత్పర్యము.

26వ శ్లోకము

(61) శత్రుపక్షములో 'సహైవ' సర్వే అనుటచేతను, పాండవ పక్షములో 'యోధముఖ్యాః' అనుటచేతను పాండవపక్షమున నున్న వారందరును నశించలేదని తెలియుచున్నది.

(i) అవతారికలో 'తాను చేయదలంచుకొన్న భూభార నివృత్తిని' అనుచో నిందులకే భయంకరరూపమును జూపెను. దాని వలన నర్జునునకు యుద్ధమును చేయవలెనను ఉత్సాహ మినుమడించునని భావము.

(ii) ఈ గ్రంథముచే -

రణరంగమున నున్నవారందరును ముందు చెప్పబడునట్లు భగవంతుని నోట జొచ్చుట యసంభవముగాన నిది యింద్రజాలమో యను సందేహమును బాపుటకై చెప్పబడును.

మరియును - అర్జునాదు లుపకరణ మాత్రులనియు వారేమియు చేయకున్నను తానొక్కడే వారినందరిని సంహరించ గలననియును సూచించెను.

(iii) దీనికి భావమేమనగా -

భగవంతుడు చేయు సకలసృష్టిని దివ్యచక్షుస్సుచే జూచిన వానికి కొలదిపాటి క్షుద్రులను సంహరించుట ఆశ్చర్యముగా తోచదు అనుచున్నాడు.

అనగా - 'సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః' అనునట్లు సమస్త చేతనాచేతనములనున్ను తనకు శరీరముగా గలవాడగుటచే సర్వభూతుడును సత్యసంకల్పుడును నగు సర్వేశ్వరుడే ధార్తరాష్ట్రులందరి సర్వవిధ వినాశమునకును కారణము. అతడే ప్రధానహేతువు. కాన్పించుచున్న అర్జునుడును ఆతని బాణములున్ను కాకతాళీయము వలె నిమిత్తమాత్రమే.

కాకతాళీయ మనగా - తాటిపండు పండి పడుటకు సిద్ధముగా నుండగా దానిపై కాకి వాలినతోడనే అది పడును. దానిని కాకియే పడగొట్టిన దందురు.

అట్లున్నది ప్రకృతవిషయము. ముందు జరుగబోవునదియును స్పష్టముగా కళ్ళతో జూచుచుండుటచే నది యిప్పుడు జరుగుచున్నట్లే చెప్పుచున్నాడు.

28, 29 శ్లో॥

(62) ఇచ్చట సముద్రము ఒక దృష్టాంతముగాను మిడుతలు-మండుచున్ననిప్పు రెండవ దృష్టాంతముగాను చెప్పబడినవి. దీని యభిప్రాయ మేమనగా -

'అభిముఖా ద్రవన్తి' అనుటచే నదులు తమ వేగముచేతనే తాము సముద్రమున విలీనమైనట్లును, మిడుతలు అగ్నిలోపడునట్లు వీరందరును

తమవ్యాపారముచేతనే నశించుచున్నారనియును, అన్ని నదులును ఒకే సముద్రమునందును, అన్ని మిడతలును ఒకే అగ్నిహోత్రమునందును విలీనమైనట్లును వీరందరును ఒకే భగవంతునందు విలీనమగుటకును, ఆ సంహారకు డొక్కడే సకలమును సంహరించుట కనుగుణమైన సామాన్యాకారముతో నుండుటకును రెండు దృష్టాంతము లొసంగబడెను.

మరియును -

నదీప్రవాహము విలీనమగుట యనగా — ఇదివరకు వేరుగా గోచరించుచుండెడి ప్రవాహాకారమును విడుచుటయే. దానిచే దాని పేరు సముద్రముననే చేరిపోయినది. మిడుతలన్నను అట్లుగాక భస్మ రూపమును దాల్చుచున్నవి. ఈ భేద మాదృష్టాంతముచే జూప బడినది.

30వ శ్లోకము

(63) అవతారిక —

సంహారమునకై తమంతట తాము త్వరపడి ప్రవేశించుట యేనా? వాని సంహారమునకై భగవంతుడే ప్రయత్నమును చేయక యూరకుండెనా? అనగా - 'లేలిహ్యసే' ఇత్యాది...సంహార ములకు ముఖ్యకారణమా చేతనుల వ్యాపారమే. వారి వారి సంహార ములను గురించిన క్రోధాదులతోగూడిన భగవంతు డా సంహార మును సంకల్పముతో సాగించుచున్నాడు.

(64) 'లేలిహ్యసే, క్రియా సమభిహారే యఙ్'

క్రియా సమభిహార మనగా —

"పౌనఃపున్యం భృశార్థో వా క్రియా సమభిహారః"

మాటిమాటికిని, అతిశయముగాను చేయుపని.

(65) తినుట కనుకూలముగా నుడికించుచున్నవి. లేక చూచు చున్న బ్రహ్మాదులకున్ను దుస్సహముగా నున్నవి.

31వ శ్లోకము

(66) అవతారిక —

ఇట్టి భయంకరాకారమును చూచుట కసమర్థమైన అర్జునుడు, "నీ సర్వైశ్వర్యమును జూపు"మని నేను ప్రార్థించగా దానినే జూపెద నని యుద్యుక్తుడవైన నీ విట్టి ఘోరమైన రూపమును భక్తుడనైన నాకు జూపుటలో నీ యభిప్రాయ మేమిటైయున్నదో నే నెఱుంగకున్నాను. నాయందు దయయుంచి ప్రసన్నుడవై నీ ప్రసన్నమైన పూర్వరూప మును జూపుమని వేడుచున్నాడు.

(67) బ్రహ్మరుద్రాదులకంటెను గొప్పతనమును చెప్పుచున్న నర్జు నునకు మిక్కిలి గొప్పవాని విషయమై నమస్కారము తగినదేయగు టను సూచించుటకై 'సర్వేశ్వర' పదము వాడబడినది.

ఈ విషయమై అహిర్బుధ్న్యసంహితలో

శ్లో॥ నన్తవ్యః పరమశ్శేషీ । శేషానన్తార ఈరితాః ।
నన్తృ నన్తవ్యభావోఽయం । నప్రయోజన పూర్వకః॥

అనగా —

సర్వేశ్వరుడు నమస్కరింపబడువాడు – మిగిలిన చేతనులంద రును నమస్కరించువారు. ఈసంబంధము స్వాభావికమేగాని ప్రయోజ నాంతరము నుద్దేశించినది కాదని చెప్పబడెను.

32వ శ్లోకము

(68) ఇచ్చట కాలశబ్దమునకు కలాముహూర్తాది కాలపర ముగ నర్థమును జెప్పినచో 'నేనే కాలమును' అని భగవంతునితో నా యచేతనకాలమున కభేదము కుదురదుగాన 'ఇంద్రాధికరణ న్యాయముగ'

1. ఆ కాలమున కంతర్యామి యనిగాని లేక 'ఆకాశ ప్రాణాధి కరణ న్యాయముగ'.

2. కలయతీతి = కాలః = ఆయుస్సును లెక్కించువాడను యౌగి కార్థమునుగాని సృష్టిస్థితి కాలముకంటె విలక్షణమైన సంహార కాలాభిమానముతో గూడియున్న భగవత్స్వరూపాను సంధాన మున కసాధారణమైన.

3. ధ్యేయ విగ్రహావిశేష పరమనిగాని చెప్పవచ్చును.

ఈ మూడర్థములున్ను యౌగికములే - ఈ మూడును ప్రకృతములే.

(69) ఎదురుగానుండి - యోధులతో శత్రువులను నిరసించి నట్లు కాకుండా అని భావము - లేక - ఎదుటగా నిలచియుండుటయే సంహారకారణము.

(70) శ్లో॥ మనసైవ జగత్సృష్టిం
సంహారంచ కరోతియః ।
తస్యారిపక్ష క్షపణే ।
కియానుద్యమ విస్తరః॥

అని శ్రియఃపతి, సృష్టిసంహారములను సంకల్పము మాత్రము చేతనే చేయును. అట్టివానికి శత్రుసంహార మొక లెక్కయా?

33వ శ్లోకము

(71) శ్రీకృష్ణుడు సంధికి ఏగినపుడు విదురునియింట భుజించి సభకేగగా దుర్యోధనుడు నా యింటికిరాక నాయింట భుజించక వృషల=శూద్రభోజన మేలచేసితివని యడుగగా శ్రీకృష్ణు డాతనితో

ద్విషదన్నం నభోక్తవ్యం
ద్విషంచైవ నభోజయేత్
పాణ్డవాన్ ద్విషసే రాజన్
మమప్రాణాహి పాణ్డవాః॥ అనెను

అనగా - శత్రువున కన్నమునుబెట్టుట శత్రువుయింట భుజిం చుట కూడదని పనులనెను. అంత నాతడు మనకిద్దరకును విరోధ మేము న్నది. మన మట్టి శత్రువులముకాముగదా! అనగా - దుర్యోధనా! నీవు పాండవులను ద్వేషించుచున్నావుగదా. పాండవు లెవ్వరు ? వారు నా ప్రాణతుల్యులే కాబట్టి నీవు నాకు ప్రాణశత్రువు వనెను.

(72) భగవంతునకు పక్షపాతముగాని నిర్దయత్వముగాని లేవ నుటకు చెప్పబడినది.

(73) చంపదగినవారుగా సంకల్పించబడిరి. భగవత్సంకల్ప మమోఘము. ఇక వారు చావకమానరు అని అభిప్రాయము.

(74) నేను వీరలను జంపుటకు నిన్ను సాధనముగా జేసికొను చున్నాను. నీవును నట్లే నమ్మియుండుము. దానిచే నీకు పాపశంక గాని నిర్దయత్వదోషముగాని పరాజయముగాని శంకించుట కవకాశ ముండదు.

(75) షచ- సమవాయే - సమవాయమనగా శరములను సంధించుట. అనగా- నీవు ఎడమచేతితోకూడా బాణములను వేయ గలవాడవు. అనగా రెండు చేతులతోను యుద్ధమును చేయ సమర్థు డవు. ఇది యుద్ధమునకు సంబంధించిన అసాధారణమైన అతిశయము. భూభారమును నీద్వారా తీర్చుటకే నీకిట్టి శక్తిని కల్పించితిని. అందు లకే అందరను విడిచి నిన్నే నిర్బంధించి పరికరముగా కల్పించుకొంటి నని తాత్పర్యము.

34వ శ్లోకము

(76) అవతారిక -

అర్జునునకు తగనిచోట కలిగిన స్నేహకారుణ్య అధర్మభీతులకు కారణమగు 'కథం భీష్మం' అను రెండవ అధ్యాయమునందలి 4వ శ్లోక మున తెలిపిన శంకను సాక్షాత్తుగా పరిహరించుచున్నాడు.

(77) అధర్మభీరుత్వమును లక్ష్యపెట్టనుగాని ద్రోణాదులు జయింప శక్యముకాని వీరులుగదా! యుద్ధములో జయము చంచలము. అందులకు భయపడుచున్నానందువా? దాని కెంతమాత్రమును భయ పడకుము. నీవే జయింతువు. భయపడకుము. దుఃఖపడకుము - అని చెప్పుచున్నాడు.

(78) ఘాతుకుడ వందురనియును శంకింపకుము. అనుకూలుల విషయమై ఆనృశంస్యము (ఆశ్రితులపట్ల ప్రీత్యతిశయము) గుణమగును గాని శత్రువులపట్లకాదు అని యీ పదమువలన తెలియుచున్నది.

35వ శ్లోకము

(79) బ్రహ్మరుద్ర రక్షకుడని యర్థము.

(80) కిరీటీ -

భారః పరం పట్టకిరీట జుష్టం।
యస్యోత్తమాఙ్గం న నమేన్ముకున్దమ్॥

ఐహిక పారలౌకిక పరమపురుషార్థములను ప్రసాదించు నారా యణుని యెదుట వంగనితల కిరీటముతో నలంకరింపబడుట భారము నకేగాని ప్రయోజనకారికాదు. ఆ కిరీట మాతలపై నిలువజాలదు. కాబట్టి వెంటనే యర్జునుడు శ్రీకృష్ణునకు ప్రణమిల్లుచున్నాడని తాత్పర్యము.

(81) ఆశ్రితుల సంసారనివర్తకుడు గాన కృష్ణు డనబడు చున్నాడు.

36వ శ్లోకము

(82) ఈ శ్లోకము శ్రీవిష్ణుపంచరాదులయందు వినియో గింపబడు మంత్రమని ప్రసిద్ధికలదు.

38వ శ్లోకము

(83) ధామశబ్దమున కనేకార్థములున్నను స్థానమను నర్థమున

ప్రసిద్ధిగా వాడబడుచుండుటచే నా యర్థమే యిచ్చట ఉచితము. స్థానమన ప్రాప్యమని ప్రసిద్ధమేగదా.

పరమప్రాప్యమనగా భగవంతుడు వేంచేసియుండు అసాధారణమైన వైకుంఠస్థానమని ప్రసిద్ధమేగదా!

ఆ యప్రాకృతస్థానమును గురించి యిట్లు చెప్పబడుచున్నది.

ఛాన్దోగ్యే - 8-5-3 —

> అథ యదరణ్యాయన మిత్యాచక్షతే బ్రహ్మచర్య
> మేవ తత్ - అరశ్చహ వైణ్యశ్చార్ణవౌ
> బ్రహ్మలోకే తృతీయస్యామితో దివి
> తదైరమ్మదీయం సరః తదశ్వత్థ స్సోమ సవనః।
> తదపరాజితాఃపూః। బ్రహ్మణఃప్రభు విమితమ్॥

భూలోకాపేక్షయా మూడవదైన 'ద్యు' అనబడు బ్రహ్మలోకమున అరణ్యములను పేరుగల రెండు సముద్రము లున్నవి. కాబట్టి బ్రహ్మలోకమునకును అరణ్యావాసమునకును అరణ్యాయనమని ఉమ్మడి పేరుకలదు. అరణ్యావాసము బ్రహ్మచర్యముచే సాధింపబడదగినదగుటచే కార్యకారణముల నభేదముగా వ్యవహరింతురు. అనగా అరణ్యావాసమునే బ్రహ్మచర్యమందురు. భూమియు, చతుర్ముఖుని సత్యలోకమువరకుండు లోకములన్నిటిని చేర్చి అంతరిక్షలోకము అను రెండును గాక భగవల్లోకము పైది తృతీయలోక మనబడుచున్నది.

ఇచ్చట ప్రసంగవశముగ వైకుంఠలోకమునకు కొన్ని గుర్తులు చెప్పబడుచున్నవి.

అచ్చట ఐరమ్మదీయమను సరస్సొకటి కలదు. 'ఇరా' యనగా అమృతము. "మాద్య త్యస్మిన్నితి మదీయం" - అనగా మైమరపించు అమృతమయమని యర్థము. మరియు నిచ్చట 'సోమసవన'మను పేరుగల అశ్వత్థవృక్షమున్నది. అది చంద్రునివలె యానందజనకమగుటచే

నట్లు చెప్పబడుచున్నది. మరియు నచ్చటనే - అపరాజితా - (బ్రహ్మ వేత్తలు కానివారికి స్వాధీనముకానట్టి) అనుపేరుగల పట్టణమున్నది. అది శ్రియఃపతిచే తనకు భోగభూమిగా నత్యాదరముతో (తనకు నివాసముగా) పరిగ్రహింపబడినది.

భగవంతుడు స్వరూపముతో సర్వవ్యాపకుడైనను నిత్యమైన దివ్యమంగళ విగ్రహముతో నచ్చట నెప్పుడునుండును. అచ్చటనే బంగారువలె మెరయునట్టి లేక హితమును, రమణీయమునునగు ఆకారముగల మంటపమున్నది అనియును.

ఋగ్వేదమున - సం. 2, 3, 21, 23

"సహస్రస్థూణే విమితేదృఢయత్ర దేవానామధిదేవ ఆస్తే"

వెయ్యి స్తంభములుగలిగి అపరిమితమైనదై బలిష్ఠముగానున్న మంటపమునందు దేవాదిదేవుడు విరాజిల్లుచుండును.

39, 40 శ్లోకములు

(84, 85) 'నమోనమస్తేఽస్తు' మొదలుకొని 'తతోఽసిసర్వః' వరకును సాధారణముగా సమస్త విష్ణుస్థలములయందును సేవించునపు డనుసంధించవచ్చును.

ఇట్లు పదేపదే నమస్కరించుటకు కారణము విశ్వరూపమును జూపిన పరత్వసౌలభ్యముల ననుభవించుటచే కలిగిన భయమును ఆనందములే.

ఈశ్లోకములోని ముఖ్య తాత్పర్యమేమనగా- 'పురుష ఏవేదగ్ం సర్వం" 'ఆత్మైవేదం సర్వం', 'నారాయణ ఏవేదం సర్వం' ఇత్యాది శ్రుతివాక్యములలోనున్న 'సర్వ' శబ్దములతో పురుష - ఆత్మ- నారాయణ పదములకుగల సామానాధికరణ్యమును వివరించుటకై పూర్వము 'సర్వత ఏవసర్వ' అనుచోగల సర్వశబ్ద సామానాధికరణ్యము బాధార్థము (అనగా - బ్రహ్మకంటె వేరగునదేదియును లేదు అనుట)

కాదనియు శరీరాత్మ భావనిబంధనమైన (పరమాత్మకు చేతనాచేత నాత్మక ప్రపంచమంతయును శరీరము ఆతడు శరీరి యనుట) విశి ష్టైక్యమును చెప్పుటలో తాత్పర్యముకలది యను అభిప్రాయము.

సమస్త వేదములలోను వేదాంతములలోను వానికి ఉపబృం హణములగు ఇతిహాస పురాణములలోను భగవంతునికి వాచకమైన శబ్దములన్నియును సమస్త చేతనాచేతనములను తెలుపు సామాన్య శబ్దములతోగాని విశేషశబ్దములతోగాని యభేదముగా నిర్దేశింపబడిన స్థలములయం దంతటను శరీరాత్మభావమే అనగా - నవి పరమాత్మకు శరీరములని మాత్రమే గ్రహింపవలెను.

41, 42 శ్లో.

(86) హే సఖేతి - ఇచ్చట సంధి ఆర్షము.

(87) "ద్వా సుపర్ణా సయుజౌ సఖాయా" అను శ్రుతి జీవేశ్వరు లకు సఖిత్వమును చెప్పుచున్నది. అది యథార్థమేగాని భ్రాంతికాదు- లోకములోనున్న మిత్రభావము ఆభాసమే అని దీనివలన తెలియు చున్నది.

(88) పెద్దల విషయమై పరిహాసార్థముగానైనను అగౌరవ ప్రవర్తన గొప్పతప్పే యని దీనిచే గ్రహించవలెను.

43వ శ్లోకము

(89, 90) పూజ్యత్వమునకు హేతువులైన గొప్పతనములో నీకు మించినవాడు లేడనుటకు చెప్పబడినది.

ఈ శ్లోక సమన్వయము మూలమున నారాయణునకు బ్రహ్మా దులతో సామ్యవాదమున్ను ఐక్యవాదమున్ను ముగ్గురకు పైన వేరొక పరతత్వమున్నదను వాదమున్ను ఇట్టివన్నియును నిరసింపబడినవి.

(91) కృతక - అకృతక - కృతకాకృతక లోకములనిగాని - లోక్యతే అనేనేతిలోకః -

ఇతర ప్రమాణములకు గోచరముకాని యర్థములను చూచుటకు సాధనమ్మైన వేదత్రయమనియునుగాని యర్థము.

ఈ శ్లోకమువలన - కర్మవశ్యులగుటచేతను, పుట్టుటచేతను భగవంతునికన్న వేరైనవారని ప్రసిద్ధిచెందిన బ్రహ్మరుద్రాదులు. ఇట్టివారికి హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే - అనగా - సృష్టికిపూర్వము హిరణ్యగర్భుడు (చతుర్ముఖుడు) ఒక్కడుండెను అనియు, 'యదాతమస్తన్నదివా నరాత్రిః నసన్ నచాసన్ శివ ఏవ కేవలః' రాత్రింబవళ్ళ వ్యవహారమేదియును లేని ప్రళయదశలో శివుడొక్కడే కలడనియు, ఇట్లు హిరణ్యగర్భ శివశబ్దములచే బ్రహ్మయును రుద్రుడును భగవంతునివలె జగత్కారణభూతులని భగవత్సామ్యము చెప్పబడు చున్నది. ఇచ్చట గీతలో భగవ దితరులకు భగవత్సామ్యము నిషేధింపబడుచున్నది. ఇది యెట్లు ఘటించుననగా -

'ఆకాశ స్తల్లిఙ్గాత్' 'ప్రాణ స్తథానుగమాత్' 'శాస్త్రదృష్ట్యా దుపదేశో వామదేవాదివత్' 'సాక్షాదప్య విరోధం జైమినిః' అను సూత్రములుగల నధికరణములలో నిర్ణయింపబడిన న్యాయమునుబట్టి (అనగా - ఆకాశప్రాణశబ్దములు ప్రసిద్ధ భూతాకాశ ప్రసిద్ధ ప్రాణవాయువును చెప్పునవేయైనను పరమాత్మకసాధారణలింగము లా ప్రకరణములలో వినబడుటచేతను, శాస్త్రప్రసిద్ధినిబట్టి వాని కంతర్యామియగు పరమాత్మనే చెప్పుచున్న వనుటచేతను లేక యౌగికార్థము చేతనుగాని పరమాత్మ పరముగా నన్వయింపవలెను అని చెప్పబడినది. కాబట్టి ఆకాశ ప్రాణాదులకువలెనే, బ్రహ్మరుద్రాదులకును భగవంతునితో సామ్యగంధమైనను ఆశంకించుట కవకాశము లేదు.

## 44వ శ్లోకము

(92) తస్మాత్ - ఆ కారణమువలన.

ఆ కారణమేమనగా - వెనుకటి శ్లోకమున చెప్పబడిన నిరు

పాధికమైన పితృత్వము పూజ్యతమత్వము గురుత్వము మొదలైనవి యుండుటవలన.

(93) ప్రణమ్య=శరణవరణజేసి -

ఈ ప్రపత్తికి 'ఆనుకూల్యస్య సంకల్పము - ప్రాతికూల్యవర్జనము, రక్షించునను నమ్మకము, రక్షింపుమని ప్రార్థించుట, ఆత్మసమర్పణము నైచ్యానుసంధాన'మని ఆరుఅంగములుకలవు. అవిపూర్వశ్లోకమునందలి పితృత్వ గురుత్వాదులను జ్ఞాపకమునుచేయు 'తస్మాత్' అను పదముచేత ఆనుకూల్యసంకల్పమున్ను, 'నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యః' అనుటచే ప్రాతికూల్యవర్జనమున్ను 'ఈశమీడ్యం' అనుటచేత - రక్షించునను విశ్వాసమున్ను, 'ప్రసాదయే' యనుటచే రక్షింపుమని ప్రార్థనయున్ను, 'అహం' అనుటచేత నైచ్యానుసంధానమున్ను 'పితేవపుత్రస్య' త్యాదులచే ఆత్మసమర్పణమున్ను తెలుపబడుచున్నవిగాన నీ శ్లోకమున పూర్ణప్రపదమును గమనించవలెను.

(94) 'ప్రణిధాయ' - దీనివలన 'యద్ధిమనసాధ్యాయతి తద్వాచా వదతి' యనునట్లు కరణపూర్తి సూచింపబడినది. 'ప్రణమ్య ప్రసాదయే' అనుటచే ననుగ్రహముకొఱకు నమస్కరించుచున్నాడని యర్థము.

45వ శ్లోకము

(95) ఇచ్చట తచ్ఛబ్దము పూర్వప్రసిద్ధమైన ప్రసన్నాకారమును పరామర్శించుచున్నది. కాబట్టి భాష్యకారులు 'ఆ నీప్రసన్నరూపమును నాకు జూపు'మని వ్యాఖ్యానించిరి. దీనిచే భయము లేక కేవల ప్రీతిని గలిగించునట్టి రూపము సూచింపబడుచున్నది. పూర్వార్థమున విశ్వరూపసందర్శనముచే కలిగిన ప్రీతి బాధతోఁగూడుకొని యున్నదనుటచే నుత్తరార్థమున కేవల ప్రీతిజనకమైన రూపమునే జూపుమనుటకు కారణమగుచున్నది.

(96) మే. ప్రసన్నుడనుగాన నన్ను తప్పక రక్షించవలెనని సూచించుచున్నది.

(97, 98) దేవ! దేవేశ! అను నీ రెండు సంబోధనలున్ను -

'తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్
తం దైవతానాం పరమంచ దైవతమ్'

అను శ్రుత్యర్థమును తెలుపుచున్నవి. కావుననే భాష్యకారులు- దేవానాం = బ్రహ్మరుద్రాణా మపి ఈశః - అని వ్రాయించిరి.

(99) కాన్పించు రూపము 'తత్రైకస్థం జగత్కృత్స్నం' అను నట్లు జగత్తును కంతయును ఆశ్రయమగునట్లు కాన్పించుటచే 'జగన్నివాస' అనుచున్నాడు.

46వ శ్లోకము

(100) వెనుక జూచిన రూపమునకు సజాతీయ రూపమని యర్థము.

48వ శ్లోకము

(101) ఇచ్చట 'కేవల' శబ్దముచే -

'తమేతం వేదాను వచనేన బ్రాహ్మణా వివిదిషన్తి - యజ్ఞేన దానేన తపసాఽనాశకేన' అను శ్రుతిచే వేదయజ్ఞాదులు దర్శనసాధనములుగా జెప్పబడుటచే నిచ్చట నిషేధింపబడనేల యనగా - 'కేవలైః' అనబడెను. అనగా - భక్తిలేని వేదయజ్ఞాదులు దర్శనసాధనములు కావని భావము.

(102) ఏకాంతభక్తి లేనివారు అవతారరూపమును జూచుట సామాన్యమానవునిగాను ప్రాకృత శరీరునిగాను జూచుటయే. కాన నది అయథావస్థిత దర్శనమే యగును.

55వ శ్లోకము

(103) అవతారిక -

వెనుక 'నాహంవేదైః' అను శ్లోకమున నన్ను పొందుటకు వేదాధ్యయనము హేతువుకాదనెను. కాని యుపనిషత్తులో 'వేదాను వచనేన బ్రాహ్మణాః వివిదిషన్తి' అని పరమాత్మను యథార్థముగా నెఱుంగుటకు వేదాధ్యయనము విధింపబడుచున్నది. దీనికి పరస్పర విరోధము రాదా! యను శంకను యీ వేదాధ్యయనాదులను భక్తికి అంగముగా నాచరించిన నవి భక్తిద్వారా ముక్తికి హేతువులగునని చెప్పుచున్నాడు

మఱియు 'ప్రవేష్టుంచ' అనునది ముక్తిప్రాప్తికి కారణమైన భక్తియొక్క అవస్థావిశేషమునున్ను తెలుపుచున్నాడు.

54వ శ్లోకము

(104) మదేకానుభవో భవతీత్యర్థః -
ఇచ్చట - "సర్వం హిపశ్యః పశ్యతి."

అను శ్రుతియందలి సర్వశబ్దమునకు సర్వశరీరుడగు భగవంతు డర్థము - ఈ విషయమునే.

'సమ్ప్రాప్యైనం ఋషయో జ్ఞానతృప్తాః కృతాత్మానో వీత రాగాః ప్రశాన్తాః। తే సర్వగం సర్వతః ప్రాప్యధీరాః యుక్తాత్మానః సర్వమేవా విశన్తి'. అనగా -

తత్వవేత్తలు పరమాత్మను తాము బ్రతికియుండగనే యనుభ వించి ఆ యనుభవముతో సంతుష్టిని చెందినవారై ఆత్మసత్తనుబడసి విషయాశలనువీడి దానిచే స్వాధీనమందున్న యింద్రియములు కలవా రై యుండువారు సర్వత్ర సర్వవస్తువులయందును లోన బయటను వ్యాపించియుండు పరమాత్మను పరమపదమున లభించి, పరమాత్మ సాయుజ్యమునుబడసి నిర్నిరోధమైన ధర్మభూతజ్ఞానముతో సమస్త మును యథార్థముగా ననుభవింతురు.

(105) గీతార్థ సంగ్రహము.

15 - శ్లో॥ ఏకాదశే స్వయాథాత్మ్య
సాక్షాత్కారావలోకనమ్
దత్తముక్తం విదిప్రాప్త్యోః।
భక్త్యైకోపాయతా తథా॥

—: తాత్పర్యము :—

భగవంతు డర్జునునకు తనయొక్క వాస్తవమైన స్వరూప మును కన్నులార చూచుటకొఱకు తగిన దివ్యనేత్రము నిచ్చుటయు, తన నెఱుంగటకేమి తనను చూచుటకేమి తనను పొందుటకేమి భక్తియొక్కటియే యుపాయమనుగుటను పదునొకండవ యధ్యాయ మున చెప్పెను.

# శ్రీ భగవద్గీతా - ద్వాదశోఽధ్యాయః

## భక్తియోగః

---

అవ.[1] * భక్తియోగనిష్ఠులైనవారికి ప్రాప్యభూతుఁడును పరబ్రహ్మమును భగవంతుఁడునైన నారాయణుని నిరంకుశైశ్వర్యమును కన్నులారఁ జూడఁగోరిన యర్జునునకు భగవంతుఁడు నిరవధికాతిశయ కారుణ్యౌదార్య[2] సౌశీల్యాది గుణసాగరుఁడును[3] సత్యసంకల్పుఁడును అగుటచేత తనయైశ్వర్యమును యథావస్థితముగా (అనఁగా కలరూపున) చూపెను. మఱియును కలరూపున భగవంతునిఁ దెలిసికొనుటయు, దర్శించుటయు, ప్రాపించుటయు ♦ ఐకాంతికాత్యంతిక భగవద్భక్తిచేతనే లభింపఁదగినవనియుఁ జెప్పెను. ఇఁక ఆత్మప్రాప్తికి సాధనముగా నుండు ఆత్మోపాసనముకంటె భగవత్ప్రాప్త్యాదులకు సాధనమై భక్తిరూపమైయుండు భగవదుపాసనము, తాను సాధింపవలసిన విషయమును శీఘ్రముగా సాధించునదియు మిక్కిలి సుఖముగా ననుష్ఠింపఁగూడినదియు నగుటవలన *శ్రేష్ఠమైనదనియు, అట్టి భగవదుపాసనమునకు ఉపాయమును, ఆ భగవదుపాసనముచేయు శక్తి

---

*అర్జునుఁడు భగవంతుని సామాన్యగోచరమగు కృష్ణాదిరూపమునఁ గనుగొన్నవాఁడే కాని భక్తియోగనిష్ఠు లుపాసించునట్టియు ప్రాపించునట్టియు పరబ్రహ్మత్వాదివిశిష్టాకారమునఁ జూచినవాఁడు కాఁడు గనుక నట్టి యాకారమును జూడఁగోరెనని తెలుపుటకై 'భక్తియోగ...చూడఁగోరిన' అని చెప్పబడెను. మఱియు నట్టి యాకారమును జూచిననే యతని స్వరూపాదులను బూర్ణముగా నెఱింగి యతనిని పరిపూర్ణముగా నుపాసించుటకు శక్యమగును. కావుననే భక్తియోగ ప్రకరణమున విశ్వరూపమును జూపినాఁడనియు సత్యసంకల్పుఁ డగుటచే దానిని జూపశక్తుఁడైనాఁడనియుఁ దెలియుచున్నది.

♦ చూడు. 3 - వ అధ్యాయము.

* ఉపాస్యముగాని ప్రాప్యముగాని యెంతశ్రేష్ఠమో ఉపాసనమును ప్రాపకమును అంతశ్రేష్ఠము. ఉపాస్యుఁడగు భగవంతుఁడు శ్రేష్ఠుఁ డగుటచే భగవదుపాసనమును

లేనివారికి అక్షరనిష్ఠతయు (అనఁగా ఆత్మోపాసనమును), ఆ యాత్మోపాసనమునకు వలయునవియుఁ జెప్పుచున్నారు. ప్రాప్యభూతుఁడగు భగవంతుఁడు శ్రేష్ఠుఁడగుటంబట్టి ప్రాపకమగు భగవదుపాసనమును శ్రేష్ఠమగునని 'యోగినామపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా। శ్రద్ధావాన్ భజతే యో మాంస మే యుక్తతమో మతః' అని యిందు చెప్పఁబడినది.

అర్జున ఉవాచ.

శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే।
యేచా ప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥ 1

టీ. ఏవం=ఇట్లు, సతతయుక్తాః=ఎల్లప్పుడును నీతోడియోగమును గోరుచున్నవారై- (భగవంతుఁడగు నిన్నే పరమప్రాప్యముగాఁ దలఁచుచున్నవారై) యే భక్తాః=ఏ భక్తులు, త్వాం=నిన్ను, పరి ఉపాసతే = పరిపూర్ణముగా ఉపాసింతురో, యేచ=మఱియు నెవరు, అవ్యక్తం=చక్షురాదీంద్రియములకు వ్యక్తముకాని - అనఁగా గోచరింపని, అక్షరం=ప్రత్యగాత్మ స్వరూపమును, (ఉపాసతే = ఉపాసింతురో), తేషాం=ఆ యిరుతెగలవారిలో యోగవిత్తమాః=*తాము సాధింపవలసినదానిని మిక్కిలిత్వరగాఁ బొందువారు, కే=ఎవ్వరు?

---

శ్రేష్ఠమగుట సిద్ధము. దీని శ్రేష్ఠత్వము నే 'యోగినామపి' అను నుత్తరశ్లోకము తెలుపుచున్నది. అందునన్ను భజించువారు యుక్తతము లనుటచే నాభజనము (అనఁగా భగవదుపాసనము) యుక్తతమ మని (అనఁగా శ్రేష్ఠ మని) యేర్పడుట గ్రాహ్యము.

* 'యోగవిత్తమాః' అనుటకు స్వసాధ్యమును శీఘ్రముగాఁ బొందువారని యర్థమెట్లు? అనినయెడల మీఁద 'భవామి న చిరాత్పార్థ' అని తన్ను తనభక్తులు శీఘ్రముగాఁ బొందుటను తెలుపుటచే దానినిబట్టి యీ యర్థ మిచటఁ జెప్పఁబడినదని గ్రాహ్యము.

తా. 'మత్కర్మకృత్' ఇత్యాదులచేఁ జెప్పఁబడిన ప్రకారమున ఏభక్తులు భగవంతుఁడగు నిన్నే పరమప్రాప్యముగాఁ దలఁచుచు, సర్వవిభూతియుక్తుండును అనవధికాతిశయ సౌందర్య సౌశీల్య సార్వజ్ఞ్య సత్యసంకల్పత్వా ద్యనంతగుణ సాగరుండు నగు నిన్ను పరిపూర్ణముగా నుపాసింతురో, మఱియు నెవరు చక్షురాదీంద్రియములకు గోచరింపని ప్రత్యగాత్మస్వరూపమును ఉపాసింతురో, ఆ యిరుతెగల వారిలో నెవరు యోగవిత్తములు- అనఁగా తాము సాధింపఁగోరు దానిని శీఘ్రముగాఁ బొందువారని యర్థము. (సాధ్యమును బొందుట యందలి) శీఘ్రత్వమును గూర్చియే యోగవిత్తముఁడని చెప్పనగుట మీఁద 'భవామి న చిరా త్పార్థ' అని సూచింపఁడినిగదా.

శ్రీభగవా నువాచ.

శ్లో॥ మ య్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః॥ 2

టీ. యే = ఎవ్వరు, మయి = నాయందు, మనః = నన్నే ప్రాప్యముగాఁగల మనస్సును, ఆవేశ్య = ఉనిచి, నిత్యయుక్తాః = నిత్యసంబంధమును గోరువారై, పరయా = ఉత్కృష్టమయిన, శ్రద్ధయా = శ్రద్ధతో, ఉపేతాః = కూడినవారగుచు, మాం = నన్ను, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తే = వారు, యుక్తతమాః = తమసాధ్యమును శీఘ్రముగాఁ బొందువారని, మే = నాకు, మతాః = తలంపఁబడినవారు- నేను తలంతు ననుట.

తా. ఎవరు, నే నత్యంతప్రియుఁడ నగుటచే నన్నే ప్రాప్యముగా గుఱించిన తమ మనస్సును నాయం * దుంచి, మిక్కిలి

---

* ఉపాసన మనస్సుచేఁ జేయఁబడువ్యాపారము. ఉపాస్యమునందు మనస్సునుంపక వేఱువిధమున ఉపాసనచేయుట పొసఁగదు. ఇట్లు ఉపాసనకై ఉపాస్యమునందు మనస్సునుంచియే తీఱవలయునుగాన దానియందు మనస్సు నుంచుటను జెప్పుట

శ్రద్ధతో నాతోడి నిత్యయోగమును గోరుచున్నవారై నన్నుపాసిం చుచున్నారో వారు యుక్తతము లని నా యభిప్రాయము. అనఁగా నన్ను సుఖముగా స్వల్పకాలములోనే పొందుదు రని యర్థము.

శ్లో॥ యే త్వక్షర[8] మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగ[9] మచిన్త్యం చ[10] కూటస్థ[11] మచలం ధ్రువమ్[12]॥ 3

సన్నియ[13] మ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః।
తే[14] ప్రాప్నువన్తి[15] మామేవ సర్వభూతహితే రతాః॥ 4

టీ. ఇన్ద్రియగ్రామం=ఇంద్రియ సమూహమును, సన్నియమ్య =వానివాని వ్యాపారములనుండి చక్కఁగా నిగ్రహించి, సర్వత్ర= సమస్త దేహములయందుండు ఆత్మలవిషయమై, సమబుద్ధయః = జ్ఞానైకాకారము లగుటచే అవియన్నియు సమానములే యనెడిబుద్ధి గలవారుకనుకనే, సర్వభూతహితేరతాః=సమస్త ప్రాణులయొక్క

---

నిష్ప్రయోజనమేయగును. మఱియును, ఆత్మోపాసకులును ఆత్మప్రాప్తికై భగవంతుని ఉపాయముగాఁ గొని వానియందు మనస్సు నుంచెదరుగాన ఊరక మనస్సు నుంచు మాత్రమున భగవదుపాసకులకును ఆత్మోపాసకులకును భేదమేమియు కలుగదు. ఈ కారణములనుబట్టి భగవంతునియందు కేవలమనస్సు నుంచి యుపాసనసేయుటను జెప్పక అతనిని ఉపేయముగా (ప్రాప్యముగాఁ) గొన్నట్టిమనస్సు నుంచి యుపాసనఁ జేయుటను జెప్పినవారైరి. ఇట్లు చెప్పుటచే కేవల ముపాసనము పొసఁగుటకు మాత్రమే మనస్సు నుంచుటకాదని యేర్పడుటేకాక ఉపాయముగాఁ గొని మనస్సు నుంచునట్టి యాత్మోపాసకులకంటెను ఉపేయముగాఁ గొని మనస్సు నుంచునట్టి భగవదుపాసకులే యధికులని తారతమ్యముకూడ సిద్ధించుచున్నది. కావుననే 'మనః' అనుటకు అట్టి మనస్సును జెప్పక 'నన్నే ప్రాప్యముగా గుఱించిన మనస్సు' అని చెప్పఁబడెను. పూర్వ శ్లోకమందలి 'సతతయుక్త' శబ్దమును ఇందలి 'నిత్యయుక్త' శబ్దమును నిత్యయోగ కాంక్షాపరములుగా గ్రహించునది.

హితమునందు ఆసక్తులై, యేతు=ఎవ్వరైతే, అనిర్దేశ్యం=దేవమను ష్యాది శబ్దములచే నిర్దేశింపఁబడఁదగనిదియు, అవ్యక్తం = ఇంద్రియ గోచరము కానిదియు, సర్వత్రగం (అపి)=దేవాదిసమస్త దేహముల యందుండునది (యైనను), అచిన్త్యం=ఆయారూపములచేత చింతింప నశక్యమైనదియునుగల, కూటస్థం = ఆయా దేవాదులకుఁ గల ఆయా ఆకారములతో సంబంధము లేనిదియు, అచలం=స్వరూపము మాఱ నిదియును, ధ్రువం = నిత్యమైనదియునగు, అక్షరం = ప్రత్యగాత్మ స్వరూపమును, పర్యుపాసతే=ధ్యానించుచున్నారో, తేఽపి = వారు కూడ, మాం=నన్ను, ప్రాప్నువన్త్యేవ=పొందువారె - (మత్సమా నాకారమైనదియగు ఆత్మస్వరూపమును పొందనే పొందరనుట.) 3-4

శ్లో॥ క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే॥ 5

టీ. అవ్యక్తాసక్త చేతసాం = ఇంద్రియగోచరముకాని ఆత్మ స్వరూపమునం దాసక్తమగుమనస్సు గల, తేషాం = ఆత్మప్రాప్తి కాములకు, క్లేశః=ఆయాసము, అధికతరః = మిక్కిలి యధికమైనది. హి=ఏలనఁగా, అవ్యక్తా=ఆత్మస్వరూప విషయమైన, గతిః = ఉపా సనారూపమైన మనోవృత్తి, దేహవద్భిః = దేహము గలవారిచేత - దేహమునం దాత్మాభిమానము గలవారిచేత, దుఃఖం=కష్టముతో, అవాప్యతే హి = పొందఁబడుచున్నదిగదా.

తా. ప్రత్యగాత్మస్వరూపము దేహమునకంటె వేఱైనది గనుక ఆ దేహమునుబట్టి కలుగు *దేవాది శబ్దములచే దానిని నిర్దే

* దేవాదిశబ్దము లాయాదేహములద్వారా అందలి యాత్మలకుఁగూడఁ జెల్లు చున్నను, అవి ఆత్మలకు దేహవిశిష్టాకారముననే చెల్లునుగాని కేవలాకారమునఁ జెల్లవు. కనుకనే వానిని ఆ శబ్దములతో నిర్దేశించుట తగదని భావము.

శింపఁ దగదు. కనుకనే అది చక్షురాదీంద్రియములకు వ్యక్తము

9

కానిదై యుండును. దేవాదిసమస్త దేహములయందు అది వర్తించు

10

చున్నదైనను వాని కన్నిటికిని అది విసజాతీయమై యుండుటవలన
దానిని ఆయా దేహములవంటి రూపములు గలదిగా చింతించు
టయుఁ దగదు. కావుననే ఆయా దేవాదులకుఁ గల ఆయా యాకార
ములతో సంబంధింపనిదై వాని కన్నిటికిని సాధారణమై యుండును.

11

మఱియు అది పరిణామము లేనిదిగనుక దాని స్వరూపమున కెప్పుడును
మాఱుపాటు కలుగమిచే నది నిత్యమై యుండును. ఇట్టి ప్రత్యగాత్మ
స్వరూపమును, ఎవరు, చక్షురాదికమగు తమ యింద్రియ సమూ
హము నెల్ల వానివ్యాపారమునుండి లెస్సగా నిగ్రహించి దేవాది
విషమాకారములు గల సమస్తదేహములం దుండు ఆత్మలన్నియు
జ్ఞానైకాకారము లగుటచే నవి సమానములే యనుబుద్ధి గలవారై,
యిట్టిబుద్ధి కలిగియుండుటవలననే *సమస్తభూతములకును అహితము
చేయుట మానినవారునై, (సర్వభూతములకు అహితము సేయుట
యందలి ఆసక్తికి దేవాదివిషమాకారములు ఆత్మ యాకారములని

* సమస్తభూతములను దేహ వైషమ్యమునుబట్టి దేవుఁడు మనుష్యుఁడు గోవు
అని విషయములుగా తలంచుటచేతనే వానికి కీడుచేయుట కాసక్తిగలుగును. అట్లుగాక
ఆత్మస్వరూప సామ్యమునుబట్టి అవియెల్ల సమానములుగా తలంచుటయే వాని కెకీడును
జేయకుండుటకు హేతువగుచున్నది. మఱియును 'మమసాధర్మ్యమాగతాః' అని మీఁదఁ
జెప్పఁబడుటంజేసియు 'నిరఞ్జనః పరమం సామ్య ముపైతి' అను శ్రుతినిబట్టియు, ఇచట
'మామ్' అనుటకు 'నన్ను' అని చెప్పక 'నాతో సమానాకారముగల ఆత్మస్వరూపమును'
అని చెప్పఁబడెను. అక్షరశబ్దము 'అథపరాయయా తదక్షరమధిగమ్యతే' అని అక్షర
విద్యయందు పరబ్రహ్మమునకు వాచకమైయుండఁగా నిచట జీవాత్మకు వాచక మెట్లగు
నన్నచో 'కూటస్థోఽక్షర ఉచ్యతే। ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మా' అని మీఁదఁ

తప్పందలచుటగదా నిమిత్తము) యుపాసింతురో, వారుగూడ నన్నుం దప్పక పొందుదురు. అనఁగా సంసార రహితమై[15] మత్సమానాకారమై యెప్పు ఆత్మస్వరూపమును తప్పక ప్రాపింతురని[16] యర్థము.

పరమాత్మగాక ఆత్మస్వరూపమునే ప్రాపింతురనుట 'మమ సాధర్మ్య మాగతాః' (గీ. ౧-౪-౨) అనికదా మీఁదఁ జెప్పఁబడెడిని. 'నిరఞ్జనః పరమం సామ్య ముపైతి' (ము. 3-౧-3) అని శ్రుతియు ప్రతిపాదించె డిని, అక్షరశబ్దముచే నిర్దేశింపఁబడు కూటస్థునికంటె పరబ్రహ్మము వేఱగుట 'కూటస్థోఽక్షరఉచ్యతే । ఉత్తమఃపురుష స్త్వన్యః' అని మీఁదఁ జెప్పఁబడుచున్నది. 'అథ పరాయయా తదక్షర మధిగమ్యతే' అని యక్షరవిద్యయం దన్నన్ భూతయోనిత్వాదులంబట్టి అక్షర శబ్దముచే నిర్దేశింపఁబడినది పరబ్రహ్మమే.

తా. ఆత్మస్వరూపము దేహాతిరిక్తమై ఇంద్రియగోచరము కానిదై యుండును. ఆత్మప్రాప్తికాములకు శ్రమము మిక్కిలి యధికమై యుండును. ఏ లనఁగా, *దేహధారులకు దేహమే యాత్మ యను నభిమానముండును. కనుక అట్టివానికి సర్వేంద్రియ వ్యాపా

---

జెప్పఁబడుటచే అక్షరశబ్దనిర్దిష్టమైన కూటస్థజీవాత్మకంటె పరబ్రహ్మము వేఱైనద నియు, జీవాత్మకును అక్షరశబ్దనిర్దేశము కలదనియుఁ దెలియుటచే నిచట జీవాత్మయే గ్రాహ్యము. అక్షరవిద్యయందో, అందలి అక్షరమునకు భూతయోనిత్వాదులుకూడఁ జెప్పఁబడుటవలనను ఆ భూతయోనిత్వాదులు జీవాత్మకుఁ 'గలుగమివలనను, అందలి అక్షరశబ్దము పరబ్రహ్మవాచకమె యని తెలియునది. అక్షరశబ్దవాచ్యమగు ప్రత్య గాత్మను ప్రాప్యముగా నిశ్చయించుకొని పరమాత్మను అందులకు ప్రాపకముగా ఉపా సించువారగుటచే అక్షరనిష్ఠుల నికర్షము తెలియునది.

*సర్వేంద్రియ వ్యాపారము లుడిగిననే మనస్సునకు ఆత్మస్వరూపమునందు వృత్తి కలుగును. దేహమే యాత్మగాఁ దలంచువారికిట్టి మనోవృత్తి కలుగుట కష్టము. మఱియు నీయక్షరనిష్ఠులు భగవంతునియందు మనస్సు నిలుపక ఆత్మస్వరూపమందు

రోపరతిరూపమై ఆత్మస్వరూప విషయమైన మనోవృత్తి కలుగుట యతిప్రయాసము గదా.

అవ. భగవంతుని ఉపాసించువారే యుక్తతములు, అనఁగా తమ సాధ్యమును శీఘ్రముగాను సుఖముగాను బొందువారు, అని సువ్యక్తముగాఁ జెప్పుచున్నారు.

శ్లో॥ యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥ 6

17

తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరా త్పార్థ మ య్యావేశితచేతసామ్॥ 7

టీ. పార్థ = అర్జునా, సర్వాణికర్మాణి = సమస్తలౌకిక వైదిక కర్మములను, మయి = నాయందు, సన్న్యస్య = సమర్పించి, మత్పరాః = నేనే పరమప్రాప్యుఁడని తలంచినవారై, అనన్యేన = ఇతర ప్రయోజనముఁ గోరని, యోగేన = భక్తియనెడి యుపాయముచేత, మామేవ = నన్నే, యేతు = ఎవ్వరైతే, ధ్యాయన్తః = ధ్యానార్చనస్తుతికీర్తన ప్రణామాదులు చేయువారై, ఉపాసతే = ఉపాసించుచున్నారో, మయి = నాయందు, ఆవేశితచేతసాం = ఉంపఁబడినమనస్సు గల, తేషాం = వారలకు, అహం = నేను, మృత్యుసంసారసాగరాత్ = మృత్యువును బోలి ప్రకృతిసంబంధరూపమునను సంసారమనెడి సాగరమునుండి, నచిరాత్ = శీఘ్రముగానె, సముద్ధర్తా = ఉద్ధారకుఁడు (లేవనెత్తువాఁడు), భవామి = అగుచున్నాను.

---

నిలుపుటచేతను వారి కది కష్టమేయగుననియు భావము. మఱియును 'దేహవద్భిః' అనుటకు కేవలముదేహముగలవారు అని యర్థము గ్రహించినయెడల దేహధారులగు సనకాదులకుఁగూడ నది చెల్లును గాన అట్టివారికిని ఆత్మప్రాప్తి కష్టమని సిద్ధించును. కనుక దేహాత్మాభిమానము గలవారు అని అర్థము సేయఁబడెను.

తా. అర్జునా, ఎవ్వరైతే దేహయాత్రకు మాత్రము వినియుక్తములగు కృషి మొదలైనట్టియు దేహధారణముకొఱకుఁజేయు అశనము మొదలైనట్టియు లౌకికకర్మములను, సంధ్యావందనాదికారణములతోఁగూడి స్వర్గము మొదలైనవి యుద్దేశ్యములుగాఁగల యాగదాన హోమతపః ప్రభృతులగు వైదిక కర్మములను, అన్నిటిని పరమాత్మ యగు నాయందు సమర్పించి, నన్నే ముఖ్యప్రాప్యముగాఁ గలవారై, ప్రయోజనాంతరమును గోరనియోగముతో, ఫలమునుబట్టి కాక తమంతటనె మిక్కిలియుఁ బ్రియములైనవియు ప్రాప్యమగు నాతో సమానములైనవియునైన ధ్యానార్చన ప్రణామ స్తుతి కీర్తనాదులను నన్నుగుఱించి చేయుచును నాయందె మనస్సుఁ జొనిపి నన్ను ఉపాసించుచున్నారో అట్టివారిని, మత్ప్రాప్తికి విరోధియగుటచే మృత్యువు వంటిదైన ప్రకృతిసంబంధ మనెడి సంసారసాగరమునుండి, త్వరలోనే నేను ఉద్ధరించువాఁడ నగుదును.

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥ 8

టీ. మయ్యేవ=నాయందే, మనః = మనస్సును, ఆధత్స్వ = లయింపఁజేయుము. బుద్ధిం = బుద్ధిని, మయి = నా విషయమందె, నివేశయ = ప్రవేశింపఁ జేయుము – (నేనే పరమప్రాప్యుఁడ నను అధ్యవసాయము కలిగియుండు మనుట), అతఊర్ధ్వం ఏవ=అటుతర్వాత నే–ఇట్టి యధ్యవసాయముతో నాయందు మనస్సు నిలిపిన తర్వాతనే, మయి=నాయందు, నివసిష్యసి=వసింతువు, సంశయః=సందేహము, న= లేదు.

తా. నేను అతిశయించిన పురుషార్థ మగుటచేతను సులభుఁడ నగుటచేతను స్వల్పకాలములో లభించువాఁడ నగుటచేతను *నాయందే

* 'మన ఆధత్స్వ' అని చెప్పి పిదప 'బుద్ధిం నివేశయ' అనుట పునరుక్తి యగును.

నీవు మనస్సును సమాహితము చేయుము. మఱియు నేనే పరమ ప్రాప్యమనెడి యధ్యవసాయము గలవాఁడవై యుండుము. ఇట్లు నేనే పరమప్రాప్య మనెడి యధ్యవసాయముతో మనస్సు నాయందు నిలిపిన తర్వాతనే ముక్తునివలె నా గుణానుభవమునందే ఆసక్తుఁడ వగుదువు. సందేహము లేదు.

శ్లో. ♦అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్।
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనఞ్జయ॥ 9

టీ. ధనఞ్జయ=అర్జునా, చిత్తం=మనస్సును, మయి=నాయందు, స్థిరం=స్థిరముగా, సమాధాతుం=లయింపఁజేయుటకు, నశక్నోషి అథ=తోడనే శక్తుఁడవు గాకపోయితివేని, తతః=ఆకారణమువలన, అభ్యాసయోగేన = స్మరణాభ్యాసమనెడి యుపాయముచేత, మాం=నన్ను, ఆప్తుం=పొందుటకు, ఇచ్ఛ=కోరుము.

తా. అర్జునా, నాయందు నీ చిత్తమును స్థిరముగా లయించునట్లు తటాలున చేయుట నీకు శక్యము కాదేని, అది యశక్యమగుటం

18

కనుక బుద్ధి యనుటకు అధ్యవసాయ మని యర్థము సేయఁబడెను. 'నివసిష్యసి మయి' అనుచో భగవంతుఁ డాధారభూతుఁడు గనుక నతనియందు నివసించియుండుట యెప్పుడును గలదియే. కాఁబట్టి నివసించియుండుటను క్రొత్తగాఁ జెప్పనక్కరలేదు. అట్లు నివసించియుండుటను గాదు; అట్లు నివసించియున్నార మనుబుద్ధిని ఇటచెప్పినారనినయెడల ఆ బుద్ధియు నుపదేశమువలన మునుపే సిద్ధించియున్నది. కనుక ముక్తునివలె నగుదువు అనికాని, ఆచార్యునియందు శిష్యుఁడును పితయందు పుత్రుఁడును ఎట్లో అట్లె సర్వరక్షకుఁడ నగునాయందు నీవు నెలకొని నిర్భయుఁడవు కమ్ము అనికాని, భావము గ్రాహ్యము.

♦ చిరకాలపరిచితములగు శబ్దాదివిషయములవాసనం దగిలి యున్ననామనస్సునకు నింతవఱకు చూచియెఱుఁగని యిట్టి నీస్వరూపమునందు లయించుట యెట్లు? అని అర్జునుఁ డడిగినట్లు భావించి యందులకు కృష్ణుఁడు చెప్పు నుపాయముగా నీ శ్లోకమును గ్రహించునది.

19
బట్టి *స్వాభావికానవధికాతిశయ సౌందర్య సౌశీల్య సౌహార్ద వాత్సల్య కారుణ్య మాధుర్య గాంభీ ర్యౌదార్య వీర్యపరాక్రమ సార్వజ్ఞ్య సత్య కామత్వ సత్యసంకల్పత్వ సర్వేశ్వరత్వ సకల కారణత్వాద్యసంఖ్యేయ గుణసాగరుండును, నిఖిల హేయప్రత్యనీకుండును అగునన్ను గుఱించి
20
నిరతిశయ ప్రేమగర్భమగు స్మరణమును అభ్యసించుచు అట్టి యభ్యా
21
సముచే నాయందు చిత్తమును స్థిరముగా లయింపఁజేసి నన్ను ప్రాపింపఁగోరుము.

శ్లో॥ ♦అభ్యాసే ప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి॥ 10

టీ. అభ్యాసే అపి = ఇట్టి స్మరణాభ్యాస యోగమందుఁగూడ, అసమర్థః=అశక్తుఁడవు, అసి (యది) = అయితివేని, మత్కర్మ పరమః=

---

* ఇటువంటి కల్యాణగుణములు లేని యితరములను పరిహరించుటకై యిట గుణములు చెప్పఁబడెను. గుణము లుండియు దోషము కొంత కూడ నుండినయెడల విరక్తి గలిగించునో యని 'నిఖిలహేయప్రత్యనీకుఁ' డనఁబడెను. స్మరణాభ్యాసము హిరణ్యకశిపాదులకువలె విపరీతమైనదిగా నుండునో యని 'నిరతిశయప్రేమగర్భము' అని చెప్పఁబడెను. అభ్యాసము మాత్రము అవ్యవహితముగా ప్రాప్తిని కలిగింపఁజాలదు గనుక నడుమ చిత్తసమాధానము చెప్పఁబడెను.

♦ అర్జునుఁడు 'స్వామీ, చిరకాలముగా నాకు వాడుకపడియు ప్రత్యక్షముగా తెలియుచును త్వరగా పొందఁగూడియు నుండు భోగ్యవస్తువులందుఁ దగిలియున్న నా మనస్సును నిగ్రహించి గుణవంతుఁడు విశుద్ధుఁడును అగు నీయందు నిలుచునట్లు వాడుక చేయుట కష్టము. అది తనకు హితములైన యాయా కర్మములందే వాసన కలిగియుండుటంజేసి కర్మములందే వర్తించునుగాని నీయందు వర్తింపనేరదు' అని అభిప్రాయపడినట్లు శ్రీకృష్ణుఁడు భావించి 'అట్లయినయెడల నీకు హితములుగా నుండు కర్మములకు సజాతీయములే యైన ఆలయనిర్మాణాది మత్కర్మములందు వర్తించి తన్మూలమున అభ్యాసయోగచిత్త సమాధానములు పొంది వానివలన మత్ప్రాప్తిని పొందుము'

నాయొక్క కైంకర్యరూపములగు కర్మములయందు ప్రీతిగలవాఁడవు, భవ=అగుము. మదర్థం=నా ప్రీతికొఱకు, కర్మాణి=కర్మములను, కుర్వన్నపి = చేయుచునుగూడ, సిద్ధిం=భగవత్ప్రాప్తిరూపమైన సిద్ధిని, అవాప్స్యసి=పొందగలవు.

తా. అర్జునా, నిరతిశయప్రేమగర్భమగు మద్గుణ స్మరణము నభ్యసించుటకును సమర్థుఁడు గాకపోయితివేని *ఆలయ నిర్మాణము (కోవెలలుగట్టుట), ఉద్యానకరణము (తోఁటలుపెట్టుట), ప్రదీపారోపణము, మార్జనము (ఊడ్చుట), అభ్యుక్షణము (నీళ్లుచల్లుట), ఉపలేపనము (అలుకుట), పుష్పాహరణము (పువ్వులు తెచ్చియిచ్చుట), పూజా ప్రవర్తనము (పూజ జరుపుట), నామసంకీర్తనము, ప్రదక్షిణ స్తుతినమస్కారములు మొదలుగా నన్ను గుఱించిన కర్మములను మిక్కిలి ప్రియములుగాఁ గొని యాచరింపుము. ఇట్లు నాకొఱకు అత్యంత ప్రీతితో కర్మములను జేయుటవలనఁగూడ త్వరలో నభ్యాస యోగమును, పిదప నాయందు స్థిరమైన చిత్తస్థితియును లభించినవాఁడవై మత్ప్రాప్తిరూపమైన సిద్ధిని బొందుదువు.

---

అని యుపాయపరముగా నీ శ్లోకమును జెప్పినారని తెలియుచున్నది, ఇందును అథశబ్దము గూర్చుకొనునది.

* ఇచట కర్మము లనఁగా యజ్ఞాదికర్మములని గ్రహింపరాదు. అవి పర్యాంతరమునఁ జేరినవిగా మీఁదఁ జెప్పఁబడుచున్నవి. మఱియును 'మత్' అను విశేషణమును బట్టి భగవంతునిగుఱించి చేయు ఆలయనిర్మాణాది కర్మములు భక్తి కంతరంగములును, 'సతతం కీర్తయన్తః' ఇత్యాదులందు ప్రపంచితములును, ఇతిహాసపురాణ భగవచ్ఛాస్త్ర ప్రసిద్ధములును అయిన కర్మములు అని గ్రహింపనగును. 'కర్మపరమః' అనుచో పరమ శబ్దముచే ఆ కర్మములను అత్యంత ప్రియములుగాఁ గొని చేయవలయుననుట సిద్ధించుచున్నది. ఆ కర్మములు తమంతట అవ్యవహితముగా భగవత్ప్రాప్తిని కలిగింపఁజాలవు గనుక నడుమ అభ్యాసయోగమును స్థిరచిత్తవృత్తియును గూర్పఁబడినవి. ఈ కర్మములు అతిపవిత్రము లగుటచేతను, భగవంతునిగుఱించిన వగుటచే నొక్కొక్కటియు భగవచ్చింతనమును గలిగించునదిగా నుండుటచేతను, ఇవి త్వరలోనే భగవద్గుణస్మర

శ్లో॥ *అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ 11

టీ. మద్యోగం= నన్నుగుఱించిన భక్తియోగమును, ఆశ్రితః = ఆశ్రయించినవాఁడవై, ఏతదపి=ఆ భక్తియోగమున కంకురము వంటిదైన భగవత్కైంకర్యరూపమైన యీ కర్మమునుగూడ, కర్తుం= చేయుటకు, అశక్తః=శక్తిలేనివాఁడవు, అథ అసి=అగుదువేని, తతః= అటుపైని, (అక్షరయోగము నాశ్రయించి), యతాత్మవాన్=నియమింపఁబడినమనస్సు గలవాఁడవై, సర్వకర్మఫలత్యాగంకురు=సమస్త కర్మములయొక్క ఫలములను త్యజింపుము. (ఫలాభిసంధిరహితమైన కర్మయోగము ననుష్ఠింపు మనుట.)

తా. నా గుణములనే యనుసంధానము చేయుచు, నేనొక్కఁడే ప్రియుఁడుగా గలిగినదై యుండు భక్తియోగమును ఆశ్రయించి, *దానికి అంకురమువలె నున్న యీ పూర్వోక్త మత్కైంకర్య కర్మమునుసయితము చేయుటకు శక్తిలేనివాఁడ వగుదువేని, అప్పుడు ఆత్మస్వభావానుసంధానరూపమై పరభక్తిని బుట్టించునదై పూర్వషట్కమునఁ జెప్పఁబడినదగు అక్షరయోగమును ఆశ్రయించి మనస్సును నిగ్రహించినవాఁడవై, ఆ యక్షరయోగమున కుపాయభూత

ణాభ్యాసమును కలిగించి తన్మూలమున భగవంతునియందు స్థిరచిత్తవృత్తిని లభింపఁజేసి యిట్లు భగవత్ప్రాప్తికి వ్యవహితముగా మూలమగుచున్న దని యాశయము.

* 'నాకొఱకైనకర్మములందే నాకు మనస్సు తెలిగియుండును గాన నీకొఱకైన కర్మములందు మిక్కిలిప్రీతితో వర్తించుట యెట్లు' అని యర్జునుఁ డడిగినట్లు భావించి వానికి నుపాయపరంపరాకాష్ఠాభూతమైన కర్మయోగమును ఈశ్లోకమునఁ దలఁపించుచున్నా రని తెలియునది.

* భక్తియోగము నాశ్రయించి దాని కంకురమువలె నుండు మత్కైంకర్య కర్మములను జేయఁజాలవేని అక్షరయోగము నాశ్రయించి దానికంకురమువలె నుండు కర్మయోగమును జేయుమని భావము. భక్తియోగ మశక్యమైనది గనుక దానికి సాధనముగా

ముగా సర్వకర్మ ఫలత్యాగరూపమైన *కర్మయోగమును జేయుము.
ఏలన, నేనే ప్రియుఁ డగుటచేత నే నొక్కఁడే ప్రాప్యుఁ డనెడిబుద్ధి
అశేషపాపములును బూర్ణముగా క్షీణించిననే పుట్టుచున్నది. కాఁబట్టి
ఫలము నుద్దేశింపక నాయారాధన రూపముగా కర్మము ననుష్ఠించుట
చేత ఆత్మధ్యానము సిద్ధించును. దానిచేత అవిద్యాదులయిన తిరో
ధానములెల్ల నివర్తింపఁగా నాకు శేషమయి యుండుటయే స్వరూప
ముగాఁ గలది యగు ప్రత్యగాత్మ సాక్షాత్కార మగును. పిదప
నాయందు పరభక్తి తనంతటనే యుత్పత్తిల్లుచున్నది. ఇట్లు 'స్వకర్మణా
త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః' (గీత ౧౮-౪౬) అని తొడంగి,
'విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మ భూయాయ కల్పతే। బ్రహ్మ
భూతః ప్రసన్నాత్మా నశోచతి నకాఙ్క్షతి। సమ స్సర్వేషు భూతేషు
మద్భక్తిం లభతే పరామ్' అని మీఁదఁ జెప్పఁబడెడిని.

---

గుణానుసంధానము చెప్పఁబడెను. వృక్షమునకుఁగల అవస్థలలో దాని యంకురావస్థ
కంటె పూర్వమైన యవస్థయెట్లు లేదో అట్లే భక్తియోగావస్థలలో భగవత్కర్మా
నుష్ఠానముకంటె పూర్వావస్థ లేదు. అదియే మొట్టమొదటి యవస్థ. కావుననే భక్తి
యోగమునకు అది అంకురముగాఁ జెప్పబడెను. మధ్యమషట్కోదితమైన యక్షర
యోగము కాదని తెలుపుటకై పూర్వషట్కోదిత మనఁబడెను. ఈ యక్షరయోగము
తనంతటనే భగవత్ప్రాప్తిని కలిగింపఁజాలదు. ఇది పరభక్తిని కలిగించి తన్మూలమున
ప్రాప్తిని కలిగించును గావున పరభక్తిజనకమైన దనఁబడెను, ఇట్టి యక్షరయోగము
నకు ఉపాయము కర్మయోగము. దానికి మనోనిగ్రహ మావశ్యకము గనుక 'యతాత్మ
వాన్' అని చెప్పఁబడెను. మనోనిగ్రహయుక్తమైన కర్మయోగమువలన అక్షరయోగ
మును, అక్షరయోగమువలన పరభక్తియు, పరభక్తివలన ప్రాప్తియు నని తెలియునది.
'సర్వకర్మఫలత్యాగం' అనుటచే ఫలత్యాగము గల కర్మయోగము గ్రాహ్యము.

* భక్తియోగము నాశ్రయించి దానికి సాధనముగా భగవత్కైంకర్యమును
జేయవలయును. భక్తియోగమునందో భగవంతుఁడే ప్రియుఁడుగాఁ గలిగి వాఁ
డొక్కఁడే ప్రాప్యుఁ డనుబుద్ధి యుండవలయును. అట్టిబుద్ధియో పాపములన్నియు
క్షీణించినవానికే కలుగును. కనుక ముందు ఫలాభిసంధిరహితముగాను భగవదారాధన
రూపముగాను కర్మముల ననుష్ఠించుటయనెడి కర్మయోగము ననుష్ఠింపవలయును. దాని

శ్లో॥ *శ్రేయో హి జ్ఞాన మభ్యాసాద్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్॥ 12

టీ. అభ్యాసాత్ =ప్రీతిలేని స్మరణము నభ్యసించుటకంటె, జ్ఞానం = ఆత్మసాక్షాత్కార రూపమైనజ్ఞానము, శ్రేయోహి = శ్రేష్ఠ ముగదా, జ్ఞానాత్ = (నిష్పన్నముకాని) ఆ యపరోక్షజ్ఞానకముకంటె, ధ్యానం= దానికి సాధనము యిన ఆత్మధ్యానము, విశిష్యతే = విశేష మగుచున్నది. ధ్యానాత్ = నిష్పన్నముకాని యీ ధ్యానముకంటె, కర్మఫలత్యాగః=ఫలేచ్ఛ లేక యాచరింపబడు కర్మము, (విశిష్యతే =విశేషించినదగుచున్నది.) త్యాగాత్ =ఫలత్యాగమువలన, (ఫలాభి

వలన ఆత్మధ్యానము సిద్ధించును. దానిచే ప్రత్యగాత్మ స్వరూపమును మఱుఁగుపఱిచి యుండు అవిద్యాదులు సర్వమును నివర్తించును. అప్పుడు భగవచ్ఛేషత్వైక స్వరూప మైన ప్రత్యగాత్మ సాక్షాత్కరించును. ఒక రాజకుమారుఁడు బాల్యమునందు క్రీడా వశమున రాజగృహము వెలువడిపోయి దారితప్పి ఒకబోయకుఁ జిక్కి పెరుఁగుచు పిదప ఒకానొకపట్టణమునఁ దిరుగుచుండఁగా కొందఱాప్తులు 'నీవు రాజకుమారుఁడవు' అని వానికి తెలిపిరేని వాఁడు తన్ను రాజుఁగాఁదలఁచి తనయవయవములందు రాజలక్షణ ములను జూచుకొనుచును తనంతటనే తనతండ్రి యగురాజునందు మిక్కిలి ప్రీతి గల వాఁడెట్లగునో యట్లె పరమాత్మసమానాకారమైన ప్రత్యగాత్మ అనాది కర్మవశమున పదవి తప్పి సంసారమునఁ జిక్కి ఒకానొకజన్మమున వర్తించుచు పెద్దలవలన తన స్వరూపము ఉపదేశింపఁబడినవాఁడై స్వరూపమును బొంది దానివలెనుండు భగవత్స్వ రూపమునందు తనంతట నే ప్రీతి గలవాఁడగును. కనుక ఆత్మస్వరూపము సాక్షాత్క రించినంతనే భగవత్స్వరూపమునందును తనంతట భక్తి కలుగుచున్నది. ఇట్లె పదు నెనిమిదవ యధ్యాయమున 'స్వకర్మణా' అని యోగానుష్ఠానము నారంభించి 'విము చ్య...పరామ్' అని దానిచే క్రమముగా భక్తియోగము సిద్ధించుట చెప్పఁబడియున్నది.

* భక్తియోగాభ్యాసము భగవత్ప్రాప్తికి అవ్యవహితమైన యుపాయము. అయి నను దానియందు అధికారము లేనివారికి అట్టు అధికారములేమికి దుఃఖము గలుగ కుండుటకై వ్యవహితములయిన యుపాయములగు ఆత్మధ్యానాదులను సౌకర్యాతిశయ మునుబట్టి శ్రేష్ఠములైనవిగా ఇందు ప్రశంసించుచున్నారని తెలియునది.

సంధి లేక కర్మము లాచరించుటకు), అనన్తరం=పిదపనే, శాన్తిః= రాగద్వేషాది నివృత్తిరూపమైన మనశ్శాంతి, (భవతి=కలుగుచున్నది.)

తా. ♦ స్మరణాభ్యాసము అత్యంత ప్రీతిపూర్వకముగాఁజేయఁబడనియెడల అది కటువుగానుండును. అట్టి స్మరణాభ్యాసమునకంటె అక్షరయాథాత్మ్య (ఆత్మస్వరూప) నుసంధానపూర్వకమైన ఆత్మ యొక్క అపరోక్షాకారజ్ఞానమే ఆత్మహితమై యుండుటయందు శ్రేష్ఠమైనది. ఆ యపరోక్షాకారజ్ఞానము పరిపక్వము కానియెడల దానికంటెను దానియుపాయమైన ఆత్మధ్యానము ఆత్మహితమై యుండుట యందు విశేషించినది. ఆ ధ్యానముకూడ పరిపక్వము కానియెడల దాని యుపాయమైన ఫలసంగరహిత కర్మానుష్ఠానము విశేషించినది. ఫలాభిసంధిరహితముగా కర్మము ననుష్ఠించినపిదపనే పాపములు నశించి మనస్సునకు *శాంతి కలుగును. మనస్సు శాంతముకాఁగా ఆత్మధ్యానము కలుగుచున్నది; ధ్యానమువలన ఆత్మయపరోక్షాకారము; దాని యపరోక్షాకారమువలన భక్తి; అని యిట్లు భక్తియోగాభ్యాసమునకు అశక్తుఁడగువానికి ఆత్మనిష్ఠయే మంచిది. ఆత్మనిష్ఠగలవాఁడయ్యు మనశ్శాంతి లేనివానికి నిష్ఠకలుగుకొఱకు అంతర్గతమగు

♦స్మరణాభ్యాసము పరిపక్వముకాని అనధికారికి దానియందు ప్రీతికలుగదు. పండు తినఁగోరినబాలునకుకాయ యెట్లు విరసముగా నుండునో అట్లె అనధికారికిని నిష్పన్నము కాని స్మరణాభ్యాసము విరసముగా నుండును. ఉపాయముకంటె ఫలమే శ్రేష్ఠమైనను ఫలము పరిపక్వముకానియెడల దానికంటె దాని యుపాయమును అనుష్ఠించుటయె ఆత్మకు మఱింత హితమగును. కాఁబట్టియె యిచట ఉపాయమగు ఆత్మసాక్షాత్కారముకంటెను ఫలమైన స్మరణాభ్యాసము శ్రేష్ఠమైనను అది పరిపక్వముకామిచే ప్రీతిని గలిగింపక విరసముగాను పిత్తముగలవానికి పాలువలె కటువుగాను నుండుటచే దానికంటె దాని యుపాయమే మఱింత ఆత్మహితమైనదని చెప్పఁబడెను. ఇట్లే తక్కినవానియందును గ్రహించునది.

* 'శ్రేయో...త్యాగః' అనువఱకు ఒకటికొకటి సౌకర్యమునుబట్టి అతిశయించినవిగాఁ జెప్పురీతి యనియు, 'త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్' అనుచో ఒకటివలన మఱొ

పత్మజ్ఞానము గలదియు ఫలాభిసంధి లేనిదియునగు కర్మనిష్ఠయే మంచిదని యర్థము.

అవ. ఫలాభిసంధిరహితమైన కర్మనిష్ఠగలవానికి ఉపాదేయము లగు గుణములను (రాఁగల యేడుశ్లోకములందు) చెప్పుచున్నారు. 22

శ్లో॥ *అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ।
నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖసుఖః క్షమీ॥ 13

సన్తుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మే భక్త స్సమే ప్రియః॥ 14

టీ. సర్వభూతానాం=సమస్త ప్రాణులకును, అద్వేష్టా=ద్వేషి కానివాఁడును, మైత్రః=స్నేహబుద్ధితోనుండువాఁడును, కరుణఏవచ =

---

కటి పుట్టునదిగా చెప్పరీతి యనియు తెలియునది. రెండవ వాక్యమున శాంతికి త్యాగము హేతువుగాఁ దెలియునట్లు మొదటిదానియందును అభ్యాసమునకు జ్ఞానమును, జ్ఞానమునకు ధ్యానమును, ధ్యానమునకు కర్మత్యాగమును హేతువులని తెలియునది. త్యాగము ధ్యానమునకు హేతువేని, అదియే 'త్యాగాచ్ఛాన్తిః' అనుటచే శాంతికిని హేతు వెట్లు అనినయెడల, త్యాగమువలన (అనఁగా ఫలత్యాగరూపమయిన కర్మయోగమువలన) మనశ్శాంతియు దానివలన ఆత్మధ్యానమును కలుగునని క్రమమెఱుంగునది. కావుననే శాంతమయిన మనస్సునకు ధ్యానము కలుగును అనఁబడెను. ఆత్మధ్యానము (అనఁగా ఆత్మనిష్ఠవలన ఆత్మసాక్షాత్కారమును దానిచే పరభక్తియు, దానిచే భక్తియోగమును కలుగును. అవ్యవహితోపాయమైన భక్తియోగమునకుఁ జాలనివానికి వ్యవహితమైన ఆత్మనిష్ఠ మంచిదనియు ఆత్మనిష్ఠ కలిగియు మనశ్శాంతిలేనిచో 'త్యాగాచ్ఛాన్తిః' అనునట్లు శాంతికొఱకు కర్మనిష్ఠ మేలైనదనియుఁ జెప్పఁబడెను.

* ఈశ్లోకము మొదలుకొని యేడు శ్లోకములందు కర్మయోగనిష్ఠున కావశ్యకములయిన గుణములు చెప్పఁబడుచున్నవనిరిగదా. వీనియందే 'యోమద్భక్తస్సమేప్రియః' 'భక్తిమాన్' అని పలుమాఱు భక్తుఁడు చెప్పబడుటచేతను 'ప్రియోహి జ్ఞానినోఽత్యర్థం' అని భక్తునికే ప్రియశబ్దము వ్యవహరించుటవలన వీనియందలి ప్రియశబ్దమును భక్తునకే వాచకము కావలసినదగుటచేతను, ఈ యేడుశ్లోకములందలి అద్వేష్టత్వాదులు భక్తికే యంగములుగాఁ జెప్పఁదగునుగాని కర్మయోగమున కంగములుగాఁ జెప్పుట

దయాపరుఁడును, నిర్మమః= దేహేంద్రియములందు మమత్వము లేని వాఁడును, నిరహఙ్కారః= దేహమునం దాత్మాభిమానము లేనివాఁడును, సమదుఃఖసుఖః=సంకల్పమునఁ గలుగు సుఖదుఃఖములయెడ హర్షోద్వేగములు లేక సముఁడుగానుండువాఁడును, *క్షమీ=ఆ సుఖదుఃఖములు సంభవించె నేని ఏవికారమును బొందనివాఁడును,సన్తుష్టః = ఏదిలభించినను దానితో తృప్తినొందినవాఁడును, సతతం=ఎల్లప్పుడు, యోగీ=ఆత్మానుసంధానముచేయువాఁడును, యతాత్మా=నియమిం

---

యెట్లు? అని అడగవచ్చును. అయినను 'ధ్యానాత్కర్మఫలత్యాగః' అని కర్మయోగ ప్రసంగమునకు పిదపనే యీ అద్వేష్టత్వాదులు చెప్పఁబడుటచే నివి దానికే యంగములగును. ఈశ్లోకమందుఁగల భక్తిశబ్దములు కర్మయోగాంతర్భూతమైన భక్తినే చెప్పుచున్నదికాని సాక్షాద్భక్తిని చెప్పునవి కావు. కర్మమునందు భక్తి యెక్కుడిదనిన 'త్రయాణామపి యోగానాం మాత్ర యాన్యోన్యసఙ్గమః' అని కర్మజ్ఞాన భక్తియోగములు మూఁడును ఒకటియందొకటి కొంత కలిసియె యుండు ననుటచే కర్మయోగమునను కొంతభక్తికలదని తెలియుననది. కావున ఈ శ్లోకములందు భక్తిశబ్దమునకు కర్మయోగముచే నన్ను భజించువాఁడు అని అర్థము చెప్పఁబడెడిని.

* ఇచట 'క్షమీ' యనుటకు అపరాధులను క్షమించువాఁడనరాదు. ఏలన 'అద్వేష్టా' అనుటచేతనే యది చెప్పఁబడినది. కనుక అభిమానికములు సాంస్పర్శికములు అను రెండు విధములగు సుఖదుఃఖములలో 'సమదుఃఖసుఖః' అని అభిమానికములను బట్టియు 'క్షమీ' అని సాంస్పర్శికములనుబట్టియుఁ జెప్పినారని గ్రహించునది. కనుక 'యదృచ్ఛాలాభసన్తుష్టః' అనియు మీఁద, 'సంతుష్టోయేనకేనచిత్' అనియుఁ జెప్పుటయే యిచట 'సన్తుష్టః' అని చెప్పఁబడినది. ఇట్లయె 'యేనకేనచిదాచ్ఛన్నో యేనకేనచిదాశితః యత్రక్వచన శాయీస్యాత్తం దేవా బ్రాహ్మణంవిదుః' అని మఱియొకచో చెప్పఁబడెను. భాగవతమున అజగరుఁడును 'నసన్నిపతితం ధర్మముపభోగం యదృచ్ఛయా ప్రత్యాచక్షే నచాప్యేన మనురున్ధే సుదుర్లభమ్' అని చెప్పెను. 'అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ' అని ఆరాధ్యత్వఫలప్రదత్వములు కర్మయోగనిష్ఠునికి మనోబుద్ధుల నర్పించుటకై యావశ్యకములగుటచే 'భగవంతుఁడగు.. సాధింపఁగలడు' అని తాత్పర్యమునందు చెప్పఁబడెను. ఇచట భక్తః అనఁగా సాక్షాద్భక్తినిష్ఠుఁడు గాఁడు. ఇది కర్మయోగఘట్టము గనుక ఈరెండుశ్లోకములందు వర్ణింపఁబడిన గుణములు గలిగి కర్మయోగముచే నన్ను భజించువాఁడని యర్థము గ్రాహ్యము.

పఁబడిన మనోవృత్తి గలవాఁడును, దృఢనిశ్చయః=అధ్యాత్మశాస్త్రా
ర్థములయందు దృఢమయిన నమ్మకముగలవాఁడును, మయి = నా
యందు, అర్పితమనోబుద్ధిః=సమర్పింపఁబడిన మనోబుద్ధులు గలవాఁడు
నైన, మద్భక్తః=నన్ను భజించువాఁడు, యః=ఎవఁడో, సః=వాఁడు,
మే=నాకు, ప్రియః=ఇష్టుఁడు.

తా. తన్ను ద్వేషించినను తనకు అపకారము చేసినను, సర్వ
భూతములందును తాను ద్వేషము చూపనివాఁడును - అనఁగా తాను
చేసిన యపరాధములకుఁ దగినట్లు ఈశ్వరుఁడు భూతములను ప్రేరే
పింపఁగా అవి ద్వేషమైనను అపకారమైనను, చూపుచున్నవేకాని
తమంతట నేమియు చేయునవి కావు అను అనుసంధానము గలవాఁ
డును, అవి ద్వేషించినను అపకారముచేసినను వానియందెల్ల మైత్రి
గలబుద్ధి నెఱపువాఁడును, ఆ భూతములే దుఃఖము నొందినచో వాని
యెడల కరుణ చూపువాఁడును, దేహేంద్రియములందును వానిని సం
బంధించినవానియందును మమకారము లేనివాఁడును, దేహాత్మాభి
మానము లేనివాఁడును, కాఁబట్టియే మానసికముగా సుఖము దోఁచి
నపుడు హర్షముగాని దుఃఖము తోఁచినపుడు వెగటుగాని పొందని
వాఁడును, ఆ సుఖదుఃఖములే స్పర్శజములై త్రోసిపుచ్చరాక సంభ
వించినను వానినిబట్టి యే వికారమును బొందనివాఁడును, దేహధార
ణమునకుఁ దగినవస్తువు దైవికముగా ఏది దొరకినను దానితోనే సం
తుష్టినొందువాఁడును, ఎప్పుడును ప్రకృతివియుక్తమైన ఆత్మస్వరూ
పమును అనుసంధానము చేయువాఁడును, మనోవృత్తి నడంచినవాఁ
డును, అధ్యాత్మశాస్త్ర ప్రతిపాదితములైన విషయములందు దృఢ

23

నిశ్చయము గలవాఁడును, 'భగవంతుఁడగు వాసుదేవుఁడే ఫలసంగ
రహితమగు కర్మానుష్ఠానముచే నారాధింపఁబడుచున్నాఁడు. అట్లు

ఆరాధితుఁడై ఆత్మసాక్షాత్కారమును నాకు సాధింపఁగలఁడు అని
24
మనస్సును బుద్ధిని నాయందు అర్పించినవాఁడునై ఇట్లు ఎవఁడు కర్మ
25
యోగముచే నన్ను భజించునో, వాఁడు నాకు ప్రియుఁడు.

అవ. 26

శ్లో॥ యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః।
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో య స్సచ మే ప్రియః॥ 15

టీ. యస్మాత్ = కర్మనిష్ఠుఁడగు ఏపురుషుని నిమిత్తమున, లోకః = జనము, న ఉద్విజతే = ఏవగింపదో, లోకాచ్చ = లోకము నిమిత్తమునను, యః = ఏకర్మనిష్ఠుఁడు, న ఉద్విజతే = ఏవగింపఁడో, యః = ఎవఁడు, హర్షామర్ష భయోద్వేగైః = సంతోషము కోపము భయము మనోవ్యాకులత మొదలగువానిచేత, ముక్తః = విడువఁబడిన వాఁడో, సచ = వాఁడును, మే = నాకు, ప్రియః = ప్రియుఁడు - నాప్రీతికి విషయమైనవాఁడు.

తా. ఏకర్మనిష్ఠుఁడు లోకమునకు క్షోభకరమైన కార్యము *కొంచెమైనను చేయఁడో, 'వీఁ డెవరికిని విరోధి కాఁడు' అను నిశ్చయమున సమస్తలోకము ఎవని నుద్దేశించి క్షోభకరమగు కార్యము చేయదో, కాఁబట్టి ఒకనికి సంతోషముగాని ఒకనికి కోపముగాని మఱియొకనికి భయముగాని ఇంకొకనికి మనోవ్యాకులతగాని కలుగఁ జేయనివాఁ డెవ్వఁడో, యట్టి వాఁడును నాకు ప్రియుఁడు. 27.

28 అవ.

శ్లో॥ అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారమ్భ పరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః॥ 16

---

* అపకారము చేయకపోయినను అశ్లీలముగా మాటలాడుట మొదలైనవాని

టీ. అనపేక్షః=ఆత్మేతర వస్తువులయం దిచ్ఛలేనివాఁడును, శుచిః= శాస్త్రీయమగు ఆహారముచే పరిశుద్ధుఁడును, దక్షః=శాస్త్రీయ కర్మములు చేయుటయందు సమర్థుఁడును, ఉదాసీనః=ఇతరకార్యముల యం దుపేక్ష గలవాఁడును, గతవ్యథః=శాస్త్రవిహితకర్మాచరణము వలనఁ గలిగెడి శీతోష్ణములచేత దుఃఖము చెందనివాఁడును, సర్వార మ్భపరిత్యాగీ=శాస్త్రవ్యతిరిక్తములగు సర్వకర్మముల నారంభింపని వాఁడును నై, మద్భక్తః=నా భక్తుఁడు- నన్ను భజించువాఁ డనుట, యః=ఎవఁడో, సః=వాఁడు, మే=నాకు, ప్రియః=ఇష్టుఁడు.

తా. ఆత్మవ్యతిరిక్తవస్తువు లన్నిటియం దపేక్షలేనివాఁడై, శాస్త్రీ యాహారముచే శరీరపోషణము చేసికొనుచు, శాస్త్రీయకర్మాచరణ మందు సమర్థుఁడై, *ఇతర కార్యములయం దుపేక్షగలవాఁడై, శాస్త్రీ యకర్మములు నిర్వర్తించునపుడు అవర్జనీయములుగా సంభవించెడి శీతోష్ణపరుషస్పర్శాది దుఃఖములకు వ్యథఁ జెందక, శాస్త్రీయవ్యతి రిక్త సమస్త కర్మారంభములను పరిత్యజించి, నన్ను భజించువాఁ డెవఁడో, యట్టివాఁడును నాకు ప్రియుఁడు.

---

వలనను లోకమునకు ఉద్వేగము కలుగును గావున అదికూడ చేయఁడనుటకై 'కొంచె మైనను' అని కూర్పఁబడెను. ఈ కూర్పుచే 'అద్వేష్టా' అను పూర్వోక్తమువలనను 'సమ శ్శత్రౌచ' అను మీఁదిదానివలనను ఇచట పునరుక్తి కలుగదు. ఇందు హర్షా మర్ష భయాదులు ఆయా పురుషులనుబట్టి చెప్పఁబడుటచే అర్థలాభాదులనుబట్టి మీఁదఁ జెప్పఁబడు 'యోన హృష్యతి' ఇత్యాదులతో దీనికిఁ బునరుక్తి కలుగుట నివారితమైన దని తెలియునది. అందులకే 'ఒకనికి' అని కూర్పఁబడినది.

* ఇచట శాస్త్రవిహితములు కానివానియందు ఉదాసీనుఁ డనుటచే శత్రుమిత్రు లయం దుదాసీనత్వమును జెప్పు ''సమ శ్శత్రౌ'' అనుదానితో దీనికిఁ బునరుక్తి కలుగుట నివారితము.

29 ఎ అవ.

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః॥ 17

టీ. యః = ఎవఁడు, న హృష్యతి = (ఇష్టమైనది సంభవించినపుడు) సంతోషింపఁడో, న ద్వేష్టి = (అనిష్టము సంభవించినపుడు) ద్వేషింపఁడో, న శోచతి = (ఇష్టవస్తువు నెడఁబాసినపుడు) దుఃఖింపఁడో, న కాఙ్క్షతి = (లభింపని వస్తువులను) కోరఁడో, యః = ఎవఁడు, శుభాశుభపరిత్యాగీ = (బంధహేతువులగు) పుణ్యపాపముల రెంటిని విడిచినవాఁడో, సః = అట్టి, భక్తిమాన్ = భక్తిమంతుఁడు- నన్ను భజించువాఁడనుట, మే = నాకు, ప్రియః = ఇష్టుఁడు.

తా. మనుష్యులకు హర్షమును గలిగించునట్టి ప్రియములు
29 బి
తనకుఁ గలిగినను సంతోషింపక, అప్రియములు సంభవించినను ద్వేషిం
30
పక, మనుష్యులకు శోకనిమిత్తమగు భార్యాపుత్ర విత్తాదులవినాశము తనకుఁ గలిగినను దుఃఖింపక, (ఎద్ది నశింపగా శోకము కలుగునో) అట్టిది తనకు లేనియెడల దానిని గోరక, *పాపమువలెనే పుణ్యమును బంధహేతువగుటయందు సమానమే కావున నా రెంటిని పరిత్యజించినవాఁడై ఏకర్మయోగి నన్ను భజించునో, వాఁడు నాకు ప్రియుఁడు.

---

* పాపమేకాక పుణ్యమును బంధహేతువగుట 'నసుకృతం నదుష్కృతం... సర్వే పాప్మానోఽతోఽనివర్తన్తే' అని శ్రుతియుఁ జెప్పుచున్నది. హేతువు లేనప్పుడు ఎవ్వరికిఁగాని హర్షద్వేషములు కలుగవు. హేతువు కలిగినప్పుడవి లేకుండుటయే విశేషము గాన ప్రియాప్రియములు హేతువులుగాఁ గలుగుట ఇందుఁ జెప్పఁబడినది. 'యః' అనుటకు 'కర్మయోగి' అను వ్యాఖ్యానమువలన, కర్మయోగి ఆత్మవ్యతిరిక్తములైన వానియందెల్ల స్పృహ లేనివాఁడగుటచే ప్రియాప్రియములందు హర్షద్వేషములు లేకుం

అవ. 'అద్వేష్టా సర్వభూతానామ్' ఇత్యాదులందు శత్రు మిత్రాదులయెడల ద్వేషాదులు లేకుండుట చెప్పఁబడినది. ఇచట వారు దగ్గఱనుండియు ద్వేషాదులులేక సమచిత్తము గలిగియుండుట దానికంటె నతిశయించిన విశేషమని చెప్పుచున్నారు.

శ్లో॥ సమ శ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సఙ్గవివర్జితః॥ 18

31

తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సన్తుష్టో యేనకేనచిత్।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః॥ 19

టీ. శత్రౌచ=శత్రువునందును, మిత్రేచ=మిత్రునియందును, సమః=ఏకరీతిగానుండువాఁడును, తథా=అలాగుననే, మానావమానయోః = సమ్మానమునందును అవమానమునందును, శీతోష్ణసుఖదుఃఖేషు = శీతోష్ణములయందును సుఖదుఃఖములయందును, సమః= సముఁడును, సఙ్గవివర్జితః= దేనియందును ఆసక్తి లేనివాఁడును, తుల్యనిన్దాస్తుతిః = దూషించినను సముఁడుగా తలఁచువాడును, మౌనీ = నిందాస్తుతిరూపములైన మాటల నుచ్చరింపనివాఁడును, యేనకేనచిత్ =లభించిన యేవస్తువుచేతనైనను, సన్తుష్టః = సంతోషించువాఁడును, స్థిరమతిః=ఆత్మయందు స్థిరమైనబుద్ధి గలవాఁడును, కనుకనే, అనికేతః=గృహాదులయం దాసక్తి లేనివాఁడును, భక్తిమాన్ = భక్తిగలవాఁడు నగు, నరః=మనుష్యుఁడు, మే = నాకు, ప్రియః = ఇష్టుఁడు.

---

డుటకు హేతువు సూచితమగుచున్నది. ఇచట ద్వేషము ప్రియములనుగుఱించినదగుటచే భూతములను గుఱించిన ద్వేషమును జెప్పు 'అద్వేష్టా'కంటె నిది వేఱైనదని తెలియునది.

తా. శత్రుమిత్రులు దగ్గరనుండినను హర్షోద్వేగములనొందక సమచిత్తుఁడై, సన్మానావమానములను శీతోష్ణములను సుఖదుఃఖములను సమానముగా భావించి, సర్వసంగములను వదలి, దూషణభూషణములను సమముగా నెంచి, వాఙ్నియమము గలవాఁడై, లభించినంతమట్టుకు సంతుష్టుఁడై ఆత్మయందు స్థిరబుద్ధి గలవాఁ డగుటం జేసి గృహాదులయం దాసక్తి లేనివాఁడై, నన్ను భజించుమనుష్యుఁడు నాకుఁ బ్రియుఁడు, 32.

అవ. ఈ యాత్మనిష్ఠునకంటె భక్తియోగనిష్ఠుఁడు శ్రేష్ఠుఁడని ప్రతిపాదించుచు 'మయ్యావేశ్య' అని యుపక్రమించిన విధముననే యుపసంహరించుచున్నారు. 33.

శ్లో॥ *యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్ధధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః॥ 20

టీ. యేతు = ఎవ్వరైతే, శ్రద్ధధానాః = శ్రద్ధావంతులును మత్పరమాః = నేనె ముఖ్యగతిగాఁ గలవారు నగుచు, ధర్మ్యామృతం - ధర్మ్యం, అమృతం = ప్రాప్యమునకు సాధనమైనదియు ప్రాప్యమువలె భోగ్యమైనదియునగు, ఇదం = ఈ భక్తియోగమును, యథోక్తం =

---

*ఉపక్రమమున 'మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః' అను శ్లోకమున భక్తియోగము నాచరించువారు యుక్తతములు అని చెప్పఁబడిరిగదా. ఈ విషయమే 'యేతు' అను నీ శ్లోకమునందును జెప్పి యుపసంహరింపఁబడినది. ఎట్లన అందు 'నిత్యయుక్తాః' అనుటకు ఇందు 'మత్పరమాః' అనియు అందు 'శ్రద్ధయా పర యోపేతాః' అనుటకు ఇందు 'శ్రద్ధధానాః' అనియు, అందు 'మే యుక్తతమాః' అనుటకు ఇందు 'అతీవమేప్రియాః' అనియు నున్నవి. కాఁబట్టి దానిరీతినే యీ యుపసంహారమునున్నది. మధ్యమషట్క ప్రధానార్థమగు భక్తియోగమున కుపసంహార మిటుఁ గావింపఁబడినది. మఱియుఁ బూర్వ

చెప్పఁబడినప్రకారమున, పర్యుపాసతే = ఉపాసించుచున్నారో, తే భక్తాః=ఆ భక్తులు, మే = నాకు, అతీవ = మిక్కిలి, ప్రియాః = ఇష్టులు.

తా. ఎవ్వరేనియు శ్రద్ధావంతులై నేనె పరమార్థమనితలఁచి, ప్రాప్యమువంటిదై (అనఁగా ప్రాప్యమగు నావలె భోగ్యమై), ప్రాపకమైన యీ భక్తియోగమును 'మయ్యావేశ్య మనోయే మామ్' ఇత్యాదులచేత చెప్పఁబడిన ప్రకారమున ఉపాసింతురో అట్టిభక్తులు నా కత్యంతప్రియులు. 34.

---

శ్లోకములం జెప్పఁబడిన కర్మయోగనిష్ఠులైన భక్తులు నాకు ప్రియులైనను ఈ శ్లోకమునందుఁ జెప్పంబడు నాభక్తులే నాకత్యంత ప్రియులని భావము. ఈశ్లోకము సాక్షాద్భక్తియోగనిష్ఠులను గుఱించినది. పూర్వము 'ఉదారాః సర్వ ఏవైతే' అని ఉదారత్వమును బట్టి ప్రియులు. ఇప్పుడు తన కభిమతమయిన యంతరాత్మ కలిమింబట్టి 'అత్యంత' ము ప్రియులని తెలియునది.

# ద్వాదశోఽధ్యాయః

## భక్తియోగము - అవతారిక.

(1) అవతారికకు అవతారిక —

ఈ పన్నెండవ యధ్యాయమున ప్రసక్తమైన భక్తియోగము యొక్క శ్రేష్ఠత చెప్పబడుచున్నది. అట్టి భక్తియోగ ప్రకరణములో విశ్వరూపమేల జూపవలసివచ్చినదో దానినికూడ శ్రీ భాష్యకారులు వివరించుచున్నారు.

కళ్ళతో చూచినగదా ఉపాసనపూర్తిగాచేయ శక్యమగును. అట్టి ఉపాస్యత్వరూపఫలసిద్ధికై విశ్వరూపమును జూపుట సమంజసమే.

(2) తన రూపమును జూపుటకు కారణము కారుణ్యము.

(3) అప్పుడే కార్యము సిద్ధించుటకు కారణము సత్యసంకల్పము.

1వ శ్లోకము

(4) సతతయుక్తాః = భగవంతునితో నిత్యసంబంధము నాశించువారు.

(5) అక్షరశబ్దమునకు ప్రకృతి - ఈశ్వరుడని యర్థమున్నను ఇచ్చట పరిశుద్ధాత్మ (జీవుడు) అనియే యర్థమును గ్రహించవలెను.

(6) 'పఞ్చవింశక మవ్యక్తం । షడ్వింశః పురుషోత్తమః' అనుటచే నిరువదియైదవ తత్త్వము జీవుడు, యిరువది యారవ తత్త్వము నారాయణుడు.

(7) ఎవరు శీఘ్రముముగా తమకు అభీష్టమైన ప్రాప్యమును పొందుదురు - అని యర్థము - ఈ యర్థమెట్లు వచ్చినదనగా - లేనిచో నీ ప్రశ్నయేకూడదుగాన పరిశేషపక్షము నాశ్రయించి యిట్లర్థమును చెప్పవలెను. (వ్యర్థం సదన్యత్ జ్ఞాపయతి) మరియు ముందు 'క్లేశోఽధికతరస్తేషాం' 'భవామి నచిరాత్పార్థ' ఇత్యాదులచే

అక్షరోపాసకులకు ఆలస్యముగా ఫలము లభించుననియు, భగవదుపాసకులకు శీఘ్రముగా ఫలము లభించుననియును చెప్పుటచే నీ యర్థమే సిద్ధించును.

—: వి శే షా ర్థ ము :—

ఈ యధ్యాయము మొదటి శ్లోకమును -

అద్వైతులు – నిర్గుణ=సగుణోపాసనపరముగాను -

ద్వైతులు – లక్ష్మీ - నారాయణ ప్రత్యేక ఉపాసన పరముగాను అన్వయించిరి.

5వ శ్లోకము

(8) అనిర్దేశ్యం - అను శబ్దమునకు 'సర్వథా నిర్దేశింపబడకుండుట' యని యర్థమును చెప్పినచో 'ఉపాసతే' యనెడు స్వవచనమునకే విరోధము మొదలగు దోషములు సిద్ధించుటచే వాస్తవ జీవస్వరూపములో నిషేధించబడదగిన విషయములను చెప్పుచున్నారు.

దేహముకంటె వేరైన జీవుని విషయమై దేహముద్వారా యాతనిని బోధించు శబ్దములు వాడవచ్చునుగాని ప్రత్యేకించి నిష్కర్షగా పరిశుద్ధాత్మను జెప్పుటకు మాత్రము అట్లు చెప్పరాదు. ఆ శబ్దములకా శుద్ధాత్మను చెప్పగలశక్తి చాలదు.

(9) 'సర్వత్రగం' అనుటచే అణుత్వ శ్రుతివిరోధమును పరిహారించుచున్నారు.

(10) పుత్రపౌత్రాది పారంపర్యముగా పుట్టుచు వచ్చుచున్న పురుషులకు ఉమ్మడియగు పూర్వపురుషుడు కూటస్థుడనబడు (వంశమునకు మూలపురుషుడని యర్థము.)

కాని యిచ్చట మాత్రము సాధారణ్యము చెప్పబడును. అందుచే భాష్యమున 'సర్వసాధారణం' అనిరి.

ఒకే సమయమున సర్వసాధారణత్వము సిద్ధించకున్నను ఆయా కాలములలో సకలజాతీయ శరీరములను పరిగ్రహించు సకలవ్యక్తుల శరీరమును పరిగ్రహించుట శక్యము కాదుగదా! అట్టితరి సర్వసాధారణ మెట్లగును? అనగా - 'దేవాద్యసాధారణేత్యాది' వాక్యము - అంతియెగాని అసాధారణమైన దేవత్వాదులు ఆత్మకు సాక్షాత్తుగా సంబంధింపవు.

(11) అచలం - దీనికి చలించని వాడని చెప్పినచో అణువగు నీజీవునకు ఉత్క్రాంతి, గతి, ఆగతులు శ్రుతిలో చెప్పబడుటచే విరోధము వాటిల్లునుగాన దాని భావమును వర్ణించుచున్నారు.

(12) ధ్రువం - పరిమాణమున్నది అనిత్యమగును. అనగా అనిత్యత్వమునకు పరిణామిత్వము వ్యాపకము. వ్యాపకమైన పరిణామిత్వము జీవునకు లేదుగాన వ్యాప్యమైన అనిత్యత్వమున్ను లేదు. కాబట్టి ధ్రువమనబడెను. నిత్యమైనదియని యర్థము.

(13) ఈ శ్లోకమున 'పర్యుపాసతే' యనుటచేతనే నియమనము సిద్ధమగుచుండగా 'సంనియమ్య' అననేల యన్నచో ఆ మనోనిగ్రహమునకు ఉపయుక్తమైనబాహ్యేంద్రియ వ్యాపారనియమనముయిచ్చట చెప్పబడుచున్నది.

(14) తే - అక్షరమనబడు శుద్ధాత్మను (జీవుని) ప్రాప్యముగా నిశ్చయించుకొని దానిని పొందించువాడు పరమాత్మయని ఉపాసించువారు. అనగా - నాకన్న వేరైన ఫలాంతరమును కోరువారున్ను.

(15) 'విష్ణుశక్తిః పరాప్రోక్తా' అని విష్ణుపురాణమునందును 'అవిభాగేనదృష్టత్వాత్' అను బ్రహ్మసూత్రమునందును శుద్ధాత్మను పరమాత్మకు అపృథక్సిద్ధ (ఎన్నడును విడిచియుండని) విశేషణముగా జెప్పుటచే నన్ను అనగా మత్సమానాకారమైన ఆత్మస్వరూపమును అని చెప్పబడినది.

"మామేవ" అను ఏవకారమును 'ప్రాప్నువన్తి' అను క్రియతో చేర్చి "ప్రాప్నువన్త్యేవ" అని కలిపి అత్యంతా యోగవ్యవచ్ఛేదమును సూచించిరి. పొందియేతీరునని తాత్పర్యము.

(16) ఇకముందు ప్రమాణములన్నియును శుద్ధాత్మకన్నను పరమాత్మ భిన్నుడని తెలుపుచున్నవి.

'అథపరాయయా తదక్షరమధిగమ్యతే' అను శ్రుతియందును - 'అక్షరమమ్బరాన్తధృతేః' అను సూత్రమునందును అక్షరపదము పరమాత్మ సాధారణముగా ప్రయోగింపబడుచుండగా నిచ్చట జీవవాచకమని యెట్లు నిర్ధారణ చేయవచ్చుననగా 'అమృతాక్షరం హరః' 'కూటస్థోఽక్షర ఉచ్యతే' ఇత్యాదులలో జీవపరముగను చెప్పబడుటచే సిద్ధించునని భావము.

7వ శ్లోకము

(17) భగవత్ప్రాప్తికి అమృతత్వమని వ్యవహారముండుటచే, సంసారమునకు 'మృత్యు' వను వ్యవహారము యుక్తమే.

9వ శ్లోకము

(18) ఎప్పటికిని యశక్యమైనచో నుపదేశము వ్యర్థమగును. ఇక దానికి ఉపాయోపదేశ మేల ? అందుచే 'తటాలున' అనబడెను. క్రమశః సాధించవచ్చునని తాత్పర్యము.

(19) దేనిని యభ్యసించవలెను? అది మాత్ర మెట్లు శక్యము? దానివలన నీ వెట్లు పొందబడుదువు? అనగా చెప్పుచున్నాడు.

(20) అభ్యాసమనగా ధ్యేయవస్తువునందు మాటిమాటికిని మనస్సును లగింపజేయుట. ఇదియే యోగము. అభ్యాసవైరాగ్యములచే మనస్సునరికట్టవచ్చునని యోగశాస్త్రమునందును ఈగీత 6వ అధ్యాయము 35వ శ్లోకమునందును చెప్పబడినది.

(21) అభ్యాసమైనను వెంటనే పరబ్రహ్మప్రాప్తికి కారణము కాదనుటకు క్రమముగ 'చిత్తమును స్థిరముగ లయింపజేసి' యనబడుచున్నది.

13వ శ్లోకము

(22) అవతారిక -

ఇంతవరకును గీతార్థసంగ్రహశ్లోకమున జెప్పబడిన 'భక్తేశ్శ్రేష్ఠ్యముపాయోక్తి । రశక్తస్యాత్మ నిష్ఠతా' అను శ్లోకాంశము వివరింపబడినది. అనగా- పరమపురుషార్థమును శీఘ్రముగా నొసంగునది - భక్తియోగమే యనియును; దాని ననుష్ఠింపలేనివారలకు అంతకంటె సుఖతర - సుఖతమోపాయములను రెండు శ్లోకములచే చెప్పి ఈ భక్తియోగమును అనుష్ఠించలేనివానికి తుద కాత్మనిష్ఠయే శరణ్యమని యును చెప్పబడెను.

ఇకముందు.

'తత్ప్రకారాస్త్వతి ప్రీతిర్భక్తే ద్వాదశ ఉచ్యతే' కర్మయోగమునకు కావలసిన గుణప్రకారములున్ను భక్తునియందు భగవంతునకు గల అతిప్రీతియును చెప్పబడుచున్నది.

'యేతు ధర్మ్యామృతమిదం'

అను చివర శ్లోకములో -

కావున 'అద్వేష్టా' అను నీ శ్లోకము మొదలుకొని 7 శ్లోకములచే నాత్మనిష్ఠాప్రకారములు చెప్పబడుచున్నది.

14వ శ్లోకము

(23) ఇచ్చట భగవంతు డనుటచే సకలఫలముల నొసంగుటకు వలయు నుభయలింగములు అనగా - దుర్గుణములకు దూరుడగుట, సకల కల్యాణగుణముల కాకరుడగుటయున్ను చెప్పబడినది.

(24) ఆరాధ్యుడని తలంచుటయే మనస్సు నర్పించుట. ఫలమును తప్పక ప్రసాదించునని నమ్మియుండుటయే బుద్ధినర్పించుట.

(25) ప్రియుడనగా ప్రేమకు పాత్రుడు. అనగా- నేను ప్రీతుడనై వానికి కావలసిన వానినన్నిటిని యొసంగుదును.

15వ శ్లోకము

(26) అవతారిక -

మమకారములేనిచో లోకము కంటగించునట్టి కర్మలను చేయకుండుటకు తగిన సద్గుణము జనించును.

ఆ గుణమునకు ఫల మీశ్లోకమున జెప్పబడుచున్నది.

(27) 'యస్మాన్నో ద్విజతే లోకః'

అనుటకు శ్రీ కూరత్తాళ్వారుల చరిత్రలోని యొక ఘట్టము నిచ్చట స్మరించవలెను – క్రిమికంఠుని ఉపద్రవములకు తట్టుకొన జాలక ఉడయవరులు (రామానుజులు) శ్రీరంగమును విడిచి వెడలి పోయిరి. అప్పటి యాలయపరిపాలకులకు నీయుపద్రవములన్నియు వీరి మూలముననేగదా తటస్థించుచున్నవని రామానుజుల సంబంధులకు ఆలయప్రవేశమును నిషేధించి గట్టిగ కట్టుబాటులను చేసిరి. ఈ సంగతి నెఱుంగక శ్రీ కూరేశులు పూర్వమువలెనే ఆలయమున ప్రవేశింపబోగా నచ్చటి ద్వారపాలకులలో నొకపామరుడు వీరి స్వరూప స్వభావముల నెఱుంగక, వీరి నడ్డివేసెను. అంతట వీరిని బాగుగ నెఱింగిన రెండవవాడు వచ్చి మొదటివానితో –

'అయ్యో! దౌర్భాగ్యుడా! వీరినా నిలిపివేసితివి'? 'యస్మాన్నో ద్విజతే లోకో...సచ మేప్రియః'? అనునట్లు ఈ మహానుభావుని నిమిత్తముగ లోకమున నే ప్రాణియును ఉంద్వేగన చెందనవసరము లేని మహానుభావు డీతడు. అందుచే శ్రీరంగనాథులకు మిక్కిలి యిష్టులు కావున వీరిని నిరాటంకముగా లోనికి పోనిమ్మనెను.

(కాని వారు రామానుజుల సంబంధమును వదలుకొందురా? శ్రీరంగనాథునే వదలివేసిరి.)

## 16వ శ్లోకము

(28) అవతారిక –

ఈతని కాత్మమాత్రమే కావలసినది గాన శాస్త్రీయమగు కర్మలయందే జాగరూకుడైయుండునుగాని తద్వ్యతిరిక్తముల యం దెంత మాత్రమును ప్రీతి యీతనికి లేదని తెలుపుచున్నాడు.

## 17వ శ్లోకము

29. (ఎ) అవతారిక –

అప్రయత్నముగా వచ్చిన ప్రియవస్తువులకు పొంగుగాని అప్రియవస్తువులకు క్రుంగుగాని యుండరాదు. శాస్త్రమున నిషేధింపబడ

నివి లభించకున్నను వానికొఱకు కాశపడరాదు - ఇంతియగాక ఆ ప్రియా ప్రియములకు కారణములగు పుణ్యపాపములనుకూడ విడువ వలెననియు నీ శ్లోకమున జెప్పబడుచున్నది.

29. (బి) ఈసందర్భమున నొక కథను జ్ఞాపకముంచుకొనవలెను.

ఒకప్పుడు శ్రీశుకమహర్షి కొందఱు ఋషులతోకలిసి జనక మహారాజునకు వేదాంతార్థములను వినిపించుటలో సదా జనకుడు మహారాజగుటచే మన గురుపుంగవు లాతనివలన ధనాది దృష్టప్రయోజనముల నాశించి యిట్లాతనినే యుద్దేశించి యుపదేశించుచున్నారని భ్రమించిరి. దీనిని కనిపెట్టి శ్రీశుకమహర్షి జనకపురియగు మిథిలా నగరమును, ఋషుల పర్ణకుటీరములను తన యోగమహిమచే తగులబడునట్లు చూపించెను. దానికా ఋషులు భయపడి అయ్యో! నా దండము కాలిపోయెను, నా కమండలము కాలిపోయెను నా శాటీ నా కౌపీనమనుచు లబో లబో యని పరుగిడిపోయిరి. కాని యచ్చట నగ్ని యేమీ కాన్పించకపోవుటచేనిది యాచార్యకృతవిచిత్రమని మెఱింగి చల్లగ వచ్చి సిగ్గుతో తమ తమ ఆసనముల నలంకరించిరి...ఇటులనే జనకచక్రవర్తి యొక్క కోశాగారములు అంతఃపురభవనములును పెద్ద పెద్ద మంటలతో కాలుచుండుటను జూచి కదలక మెదలక కూర్చునియుండిన జనకమహారాజుతో నా గురువుగారు 'రాజా ఇదియేమి? నీ రాజ్యమిల్లు భస్మమగుచున్నను నీ వెఱింగియు నిశ్చల ఉపేక్షించుచు కూర్చున్నావు?' అని యడుగగా నారాజు -

శ్లో॥ అనన్తం బత మేవిత్తం। యస్యమే నాస్తికిఞ్చన।
మిథిలాయాం ప్రదీప్తాయాం। నమేకిఞ్చిత్ప్రదహ్యతే॥

స్వామిన్! నా సొత్తు అంతముకలది కాదు. కాని 'నాది' యనదగినది యొక్కటియును లేదు. మిథిలయంతయును నశించినను నా వస్తువు నశించునదికాదు. నా యాత్మయా నిత్యము. దానికి ప్రభువగు శ్రియఃపతి పాదారవిందములే నా ధనము. 'ధనం మదీయం తవ

పాదపఙ్కజమ్' - భగవంతునియొక్కయు భాగవతులయొక్కయు, ఆచార్యులయొక్కయు పాదపద్మమే నా ధనము. అదియును నిత్యమైనదియే. ఇక నేను దేనికి దుఃఖించి వరుగిడుదు ననెను.

భార. శా న్తిప. 17-19 శ్లో.
మోక్షపర్వం - 282-4 శ్లో.

(30) ఇచ్చట శ్రీ విష్ణు పురాణమునందలి ప్రహ్లాదులు ప్రసాదించిన శ్లోకము ననుసంధించుకొనవలెను.

శ్లో॥ యావ న్తః కురు తేజన్తుః సంబన్ధాన్ మనసః ప్రియాన్ ।
తావన్తోఽ స్యనిఖన్య న్తే హృదయే శోకశఙ్కవః॥

సాంసారిక పరికరములలో (చేతనములుగాని అచేతనములుగాని) నెన్నిటియందు 'నాది నాది' యని మమకారమును నెలకొల్పుకొనునో అన్ని దుఃఖకీలలను తన హృదయమున నాటుకొనుచున్నాడని భావించవలెను. అనగా - అందేయొక్కటి నశించినను దానిమూలమగు దుఃఖ మాతనిని విడువక బాధించును అవి యన్నియు ననిత్యములే గాన నీతనికి దుఃఖము నిత్యమగును.

19వ శ్లోకము

(31) ఇచ్చట మౌనమనగా -

1. మననమని యర్థముకాదు. 'స్థిరమతిః' యనుటచేతనే యది సిద్ధించుచున్నది.
2. మరియు 'మునేః భావః' మౌనం. (ముని యనగా మననశీలుడు) అని చెప్పినచో అప్రసిద్ధార్థమును చెప్పినట్లగును.
3. ఏమాటలైనను పలుకకుండుట యనియు నర్థమును చెప్పరాదు. అట్టి మౌనమున కేమియును ప్రయోజనము లేదు. అవసరమును లేదు - అదియునుగాక సంకీర్తన మొనరించవలసియుండగా నిది యెట్లు పొసగును.

4. ఒకానొక కాలమునందుండవలసిన మౌనవ్రతమన్ననో అది సరసమేగాని ముందు వెనుక గ్రంథముతో సంబంధము కలువదు. ఇక నేమన్నచో.

5. లోకములో నిందించువారిని నిందించుట స్తుతించువారిని - స్తుతించుటయు అలవాటు. అవి కూడదని యిచ్చట మౌన శబ్దమునకు ప్రకరణానుకూలమగు నర్థము. 'సన్తుష్టో యేన కేనచిత్' అనునదియు నిట్టి మౌనమునకొక కారణమగుచున్నది. అట్లు కానిచో 'సన్తుష్ట స్సతతం యోగీ' యని వెనుక చెప్పిన దానినే తిరిగి చెప్పినట్లగును. అప్రయత్నముగా లభించిన దేదోయొక ద్రవ్యముతో తృప్తిచెందని వానికేదో యొకటి కావలసియే యుండునుగాన నెవనినో యొకనిని స్తుతించి యాచించును. ఇవ్వనివానిని తిట్టును. కాబట్టి యీయర్థమే సమంజసము.

(32) ఈ శ్లోకమున -

'సమశ్శత్రౌ చమిత్రే చ। తథా మానావమానయోః' అనునీ రెండు విశేషములున్న సన్న్యాసికి ఉచితమైనవనియు అటులనే 'అనికేతః' అనగా, నవిద్యతే 'నికేతః' ,(యిల్లు) యస్యాసః - అనగా యిల్లులేనివాడనునదియు తదనుగుణమే యనియు కొందరందురు. అది యుచితముకాదు. ఆ రెండు గుణములును ముముక్షువగు గృహస్థునకును ఉండవలసినవే, సన్న్యాసికేకాదు. 'అనికేతః' అనునదియు గృహస్థునకే యొప్పును. 'నచాపి రమ్యావసథ ప్రియస్య' అనునట్లు యింటియందు నిస్సంగమౌటని కావశక్యమని దాని కర్థము. అంతియు కాని గృహస్థున కిల్లుండరాదని యర్థముకాదు. ఇల్లులేనిచో గృహస్థు డెట్లగును? ఆ యిల్లు ఆ ముముక్షువగు గృహస్థునకు యోగము కుపయోగపడవచ్చును. కావున దానియందు సంగమే. అనగా - 'నాది' యను మమకారమే యుండరాదని యర్థము. ఈ యర్థమును సూచించుటచే శ్రీ భాష్యకారులు 'నికేతనాదిష్వసక్తః' అని భాషించిరి.

న శబ్ద శాస్త్రాభిరతస్య మోక్షో।
న చాపి రమ్యా వసథప్రియస్య।
న భోజనాచ్ఛాదన తత్పరస్య।
న లోకచిత్త గ్రహణే రతస్య.

ఏకాన్త శీలస్య దృఢవ్రతస్య।
పఞ్చేన్ద్రియ ప్రీతి నివర్తకస్య।
అధ్యాత్మ విద్యారత మానసస్య।
మోక్షో ధ్రువో నిత్యమహింసకస్య॥

వాసిష్ఠస్మృతి - 17 అ. 7 శ్లో.
ఆపస్తంభస్మృతిలో - 10 అ. 6, 7 శ్లో.

ఈ శ్లోకమున నెట్టివానికి మోక్షము దూరమో, యెట్టివానికి సన్నిహితమో చెప్పబడుచున్నది. కేవలము రాత్రింబవళ్లు తర్కవ్యాకరణాది శాస్త్రములనే పట్టుకొని ప్రాకులాడువానికిగాని, రమణీయ భవనములలో నివసించు కోరికగలవానికిగాని, మృష్టాన్నప్రియునకు గాని, చీనిచీనాంబరములయందు వ్యామోహముగలవానికిగాని లోకములను మెప్పించి వారివలన ధనప్రశంసాదుల నార్జించు నభిలాష కల వానికిగాని మోక్ష మత్యంతదూరమున నుండును.

ఒంటరిగనుండగోరు వానికిని, పట్టిన సాత్త్వికమైన పట్టును విడువనివానికిని పంచేంద్రియముల ప్రేరణకు లోబడువానికిని నిరంతరము వేదాంతవిద్యాభ్యాసమునందే లగ్నమైయుండు మనస్సుగలవానికిని - మనోవాక్కాయములచే నెవ్వరినిగాని పీడించని వానికిన్ని మోక్షము కరతలామలకము.

## 20వ శ్లోకము

(33) ఈ యధ్యాయ ప్రారంభమున నర్జునుని ప్రశ్న కుత్తరముగా నక్షరనిష్ఠునికన్న భక్తియోగనిష్ఠుడు శ్రేష్ఠుడని చెప్పబడినది.

భక్తియోగమును నిర్వహించలేనివానికి అక్షరయోగమే క్రమముగ భక్తియోగమును సాధించుననిచెప్పి ఆ యక్షరయోగికి కావలసిన గుణములు క్రమముగ జెప్పబడినవి. ఈ యధ్యాయారంభమున నడిగిన ప్రశ్నకు విస్తారముగా జెప్పిన సమాధానమును యీ శ్లోకమున ముగించుచున్నాడు.

(34) గీతాసంగ్రహము

16వ శ్లోకము

భక్తేశ్శ్రైష్ఠ్య ముపాయోక్తిః । అశక్తస్యాత్మ నిష్ఠతా ।
తత్ప్రకారాస్త్వతి ప్రీతిః । భక్తే ద్వాదశ ఉచ్యతే॥

తాత్పర్యము.

శుద్ధాత్మ స్వరూపప్రాప్తికి సాధనమైన ఆత్మోపాసనముకంటె భగవదుపాసనరూపమైనభక్తి తనకు ఫలమగు ముక్తిని సాధించుటలో శీఘ్రమును సుకరమును అయియుండుటచే శ్రేష్ఠమైనదై యుండుటయును, భక్త్యుపాయమును దాని నాచరించుటకు శక్తిలేనివానికి ఆత్మనిష్ఠయు దాని కుపాయములైన గుణప్రకారమును, భక్తునివల్ల భగవంతునకు గల అతిప్రీతియు పన్నెండవ అధ్యాయన చెప్పబడెను.

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమద్భగవద్గీత

## తృతీయ షట్కము

ప్రతిపదార్థ - తాత్పర్య- రామానుజభాష్య
ఆంధ్రానువాద సహితము

రచయితలు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణరామానుజజీయరుస్వామివారు

తాత్పర్య చంద్రికావివరణ
విశేషార్థములు
న్యాయవేదాంత విద్వాన్
**తె. కం. గోపాలాచార్యస్వామివారు**

ప్రకాశనము

**శ్రీ మదుభయ వేదాంతాచార్యపీఠము**

వెల రు 15-00 లు

# శ్రీ భగవద్గీతా - త్రయోదశోఽధ్యాయః

## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగః

—//—

### అ వ తా రి క

ప్రథమషట్కమునందు, పరమప్రాప్యుఁడును పరబ్రహ్మమును భగవంతుఁడునగు వాసుదేవుని ప్రాప్తికి నుపాయమైన భక్తి యనెడి భగవదుపాసనమునకు అంగమైనదియు, జ్ఞానయోగ కర్మయోగము లనెడి రెండు *నిష్ఠలచే సాధింపఁ దగినదియు నగు ప్రాప్తయైన ప్రత్యగాత్మయొక్క యాథాత్మ్యమును దర్శించుట చెప్పఁబడినది. మధ్యమషట్కమునందు, పరమప్రాప్యమైన భగవత్తత్త్వముయొక్క యాథాత్మ్యమును (అనఁగా కలరూపును) గుఱించినట్టిదియు దాని మాహాత్మ్యమును గుఱించినట్టిదియు నగు జ్ఞానముతో మున్ను గూడినదై ఐకాంతికాత్యంతికమై యొప్పుభక్తియోగనిష్ఠ ప్రతిపాదింపఁబడినది. అతిశయించిన యైశ్వర్యము నపేక్షించువారికిని, ఆత్మకైవల్యమునుమాత్ర మపేక్షించువారికిని, గల ఆయా అపేక్షితములకు (అనఁగా ఐశ్వర్యకైవల్యములకు) భక్తియోగము సాధన మనియుఁ జెప్పఁబడినది. ఇప్పుడు మీఁదిషట్కమున, పూర్వషట్కములు రెంటఁ జెప్పఁబడిన ♦ప్రకృతి పురుషులును, ఆరెండింటియొక్క సంసర్గరూపమైన

---

*సాధింపఁగోరినది సిద్ధించువఱకు ఎడతెగక సాధనము ననుష్ఠించుటయే యిచట నిష్ఠయని తెలియునది.

♦ప్రథమషట్కము, శాస్త్రోపోద్ఘాతమునకును శాస్త్రావతరణమునకును మూలమైన యర్జునశోకముయొక్క నివృత్తికొఱకు చెప్పఁబడిన ఆత్మదర్శనమును గుఱించి మొదటి రెండు అధ్యాయము లనియు, ఆత్మదర్శనమునకైన సాధనములను ప్రపంచించుటను

ప్రపంచమును, ఈశ్వరునియాథాత్మ్యమును, కర్మజ్ఞాన భక్తిస్వరూపములును, వాని ననుష్ఠించుప్రకారములును, విశేషించి *విశోధింపఁబడుచున్నవి.

అందుఁ దొలుత త్రయోదశాధ్యాయమున దేహాత్మలస్వరూపమును, దేహయాథాత్మ్యమును శోధించుటయు, దేహబంధమును వీడిన శుద్ధాత్మస్వరూపముయొక్క ప్రాప్తికి నుపాయమును, ఆ వివిక్తమైన (అనఁగా దేహమునుండి వేఱైన) యాత్మస్వరూపముయొక్క విశోధనమును, అటువంటి శుద్ధాత్మకు అచిత్సంబంధము కలుగుటకు హేతువును, అచిత్తుకంటె అది వేఱైయుండుట ననుసంధించు ప్రకారమునుఁ జెప్పఁబడుచున్నవి.

అర్జున ఉవాచ.

శ్లో॥ *ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవచ।
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయంచ కేశవ॥ 1

---

గుఱించి పిదప నాలుగధ్యాయములనియు, నిట్లు రెండు తెగలుగా భిన్నమైయున్నది. ద్వితీయషట్కము, సాధనాధికారి ఫలాధిభేదపరికరితమైన భక్తియోగముయొక్క స్వరూపమును గుఱించి మొదటి మూఁడధ్యాయము లనియు, దానియొక్క యుత్పత్తివృద్ధులను గుఱించి పిదప మూఁడధ్యాయము లనియు నిట్లు రెండు తెగలుగా భిన్నమైయున్నది. ఈతృతీయషట్కముకూడ నిట్లె రెండుతెగలుగా భిన్నము. ఎట్లన, ప్రధాన పురుషప్రపంచ సర్వేశ్వరరూపతత్త్వ వివేచనములను గుఱించి మొదటి మూఁడధ్యాయము లనియు, కర్తవ్యాదులైన కర్మధీభక్త్యాదులను గుఱించి పిదప మూఁడధ్యాయము లనియుఁ దెలియునది. ఇందు మొదటి మూఁటిలోఁగూడ ప్రసంగవశమున ఒకించుక కర్తవ్యములను జెప్పఁబడుచున్నవి. రెండవమూఁటిలో కర్తవ్యములు సిద్ధించుకొఱకు ప్రశంగమున ఒక్కించుక తత్త్వమును శాస్త్రవశ్యత్వాదులును జెప్పఁబడుచున్నవి.

*విశోధించుట యనఁగా పూర్వము చెప్పఁబడిన విషయమును మఱలఁగైకొని దానినిగుఱించి యింతవఱకుఁ జెప్పఁబడనట్టియు ఇంకను అపేక్షితములైనట్టియు అంశములను ప్రతిపాదించి దానిని నిస్సందేహముగాఁజేయుట. పూర్వము చెప్పినవానినే మరల చెప్పుట పునరుక్తియగునుగాన, వానిని 'మరల ఊరక చెప్పుట' కాక విశోధించుట యని విశోధన శబ్దముచే అన్నిటికి పునరుక్తిని పరిహరించిరని తెలియునది.

* ఈశ్లోకము రామానుజభాష్యమునందును శంకరభాష్యమందును గానరాదు. రాఘవేంద్రపాఠమునుబట్టి యిట గ్రహింపఁబడినది.

టీ. హే కేశవ=శ్రీకృష్ణా, ప్రకృతిం = ప్రకృతిస్వరూపమును, పురుషంచ=పురుషునియొక్క స్వరూపమును, క్షేత్రం = క్షేత్రమనఁబడుదాని స్వరూపమును, క్షేత్రజ్ఞమేవచ = క్షేత్రజ్ఞుఁ డనఁబడువాని స్వరూపమును, జ్ఞానం=జ్ఞానస్వరూపమును, జ్ఞేయంచ = తెలియవలసిన విషయమును, ఏతత్ =వీనినన్నిటిని, వేదితుం=తెలిసికొనుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. ప్రకృతియు పురుషుఁడును, క్షేత్రము క్షేత్రజ్ఞుఁడును, జ్ఞానము జ్ఞేయమును, అనునవి యెట్టివో యెఱుఁగఁగోరెదను.

శ్రీభగవానువాచ.

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మిత్యభిధీయతే।
ఏత ద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ 2

టీ. హేకౌన్తేయ=ఓ యర్జునా, ఇదం=ఈసామానాధికరణ్యముచే ♦ భోక్తయైన యాత్మతోఁ గూడనే గ్రహింపఁబడుచున్నట్టి, శరీరం= దేహము, క్షేత్రమితి=(భోక్తయైన యాత్మకు భోగ) క్షేత్రమని-అనఁగా కర్మబీజములయొక్క ఫలోత్పత్తికి హేతు వగుటచే క్షేత్రమని, అభిధీయతే = (శరీరయాథాత్మ్యము నెఱిఁగినవారిచే) చెప్పఁబడుచున్నది. ఏతత్ =దీనిని-శరీరమనెడి క్షేత్రమును, యః= ఎవఁడు, వేత్తి = 'దీని నెఱుఁగుదును' అని యెఱుఁగుచున్నాఁడో, తం =వానిని-తాను వేదిత యగుటచే వేద్యమగుశరీరముకంటె వేత్తైన

♦ 'దేవుఁడు అన్నము భుజించెను' అనుచో దేవుఁడు భోక్తయు, అన్నము భోగ్యము నగును. ఈరెండును ఒక్కవస్తువే యైనయెడల అందొకటి భోక్తగాను మఱొకటి భోగ్యముగాను నుండనేరదు. ఇట్లే 'దేవుఁడు ఘటమును తెలిసికొనెను' అనుచో దేవుఁడు వేదిత (తెలియువాఁడు) గాను, ఘటము వేద్యము (తెలియఁబడునది) గాను నుండుటచే రెండును వేఱువేఱె యగును. ఇట్లు భోగ్యభోక్తృభావమును వేద్యవేదితృభావమును వేఱువేఱగు రెండువస్తువులకే కలుగునుగాని ఒక్కవస్తువే యగు రెంటికిఁ గలుగనేరవు. ఆరెండుభావములు దేహాత్మలకు రెంటికిని కలవు గాన దేహమును ఆత్మయు వేఱువేఱె యగునని తెలియనగు.

వానిని, క్షేత్రజ్ఞః ఇతి = క్షేత్రము నెఱుఁగువాఁ డగుటచే క్షేత్రజ్ఞుఁ డని, తద్విదః = ఆత్మయాథాత్మ్యము నెఱిఁగినవారు, ప్రాహుః = చెప్పుదురు.

తా. 'నేను దేవుఁడు' 'నేను మనుష్యుఁడు' 'నేను స్థూలుఁడు' 'నేను కృశుఁడు' అని భోక్తయైన యాత్మతోఁగూడ *సామానాధికరణ్యముచే గ్రహింపబడుచున్న యీ దేహము, భోక్తయు, తనకంటె వేఱువస్తువైనదియు నగు ఆత్మకు భోగక్షేత్రమని శరీరయాథాత్మ్య విదులు చెప్పుదురు. దీనిని అవయవముచేఁగాని మొత్తముచేఁగాని 'ఇది

---

* విశేష్యము విశేషణము అని రెండు. విశేష్యములు వస్తువాచకములు. విశేషణము లావస్తువులజాతిగుణాదివాచకములు. భిన్నప్రవృత్తి నిమిత్తములగు శబ్దములకు ఏకార్థమునందు వృత్తి సామానాధికరణ్యము. ఈలక్షణవాక్యమున కర్థమేమన, శబ్దమునకు అర్థమునందు వృత్తియనఁగా ఆయర్థమును దెలుపుట. ప్రకృష్టమైనవృత్తి ప్రవృత్తి. అనఁగా విశేష్యభూతమైన ప్రధానార్థమును గుఱించిన వృత్తియే ప్రవృత్తి. నిమిత్తము అనఁగా ద్వారము. ప్రవృత్తినిమిత్తము లనఁగా విశేష్యార్థమును దెలుపుటకు ద్వారభూతములైన విశేషణములగు జాతిగుణాదులు. ఏకార్థమునందు వృత్తి అనఁగా విశేష్యభూతమైన ఒక్క ప్రధానార్థమును తెలుపుట. కనుక భిన్నములైన విశేషణములగు శబ్దములు ఒక్క విశేష్యమును దెలుపుట సామానాధికరణ్యమని విశేషయర్థము. అనేక విశేణములకు వాచకములైనశబ్దములు ఏకవిశేష్యమునందే పర్యవసించుట సామానాధికరణ్యమని భావము. సమాన మనఁగా ఒకటి. అధికరణ మనఁగా ఆధారము. అనఁగా విశేషణములకు ఆధారభూతమైన విశేష్యము. కనుక సామానాధికరణ్యమనఁగా ఒక్క విశేష్యమునందే పర్యవసించుట యని భావము. ఇట్లుండ భిన్నప్రవృత్తి నిమిత్తములగు శబ్దము లెవ్వి యని వివేచింతము. శబ్దములు మూఁడువిధములు. కొన్ని విశేషణమునఁ గాని విశేష్యమునఁగాని ఏకార్థము లైనవి. ఘటము, కుంభము, నీలము, కృష్ణము ఇత్యాదులు. కొన్నివిశేషణమునను విశేష్యమునను రెంటను భిన్నార్థములైనవి. గోవు అశ్వము మహిషము నీలము శుక్లము పీతము ఇత్యాదులు. కొన్ని విశేషణమున భిన్నార్థములును విశేష్యమున ఏకార్థములునైనవి. నీలము ఉత్పలము దేవదత్తుఁడు శ్యాముఁడు ఇత్యాదులు, ఇందు మూఁడవపక్షమునఁ జెప్పబడిన శబ్దములకే సామానాధికరణ్యము చెల్లునని లక్షణవాక్యము తెలుపుచున్నది. ఎట్లన-భిన్న ప్రవృత్తినిమిత్తము లనుటచే విశేష్యమునను విశేషణమునను ఏకార్థములగు ఘటము కుంభము ఇత్యాదులందు సామానాధికరణ్యము ప్రవర్తింపదు. ఏకార్థమునందు వృత్తి యనుటచే విశేష్యవిశేషణములు

నే నెఱుఁగుదును' అని యెవఁడు ఎఱుఁగుచున్నాఁడో వాఁడు వేద్యమైన యీ దేహముకంటె వేదిత యగుటంబట్టి వేఱువస్తు వగుచున్నాఁడు. వానిని క్షేత్రజ్ఞుఁడని ఆత్మయాథాత్మ్యవిదులు చెప్పుదురు

మఱియు దేహమునకంటె వేఱైన ఘటాదిపదార్థములను అనుసంధించు సమయమున 'దేవుఁడగు నేను మనుష్యుఁడగు నేను ఘటాదుల నెఱుఁగుచున్నాను' అని కేవలమైన ఆత్మనుగాక దేహసమానాధికరణమై యుండునట్టి యాత్మనే జ్ఞాతను (వేదితను) గా అనుసంధించినను (దేహమును ఆత్మను ఒక్కవస్తువుగా తలఁపఁదగదు. ఎట్లన) *వేదిత తాను దేహమునే యనుభవించుచుచో మున్ను ఘటాదులను వేద్యములుగా ఎట్లను సంధించెనో అట్లె యిప్పుడు దేహమునుసైతము 'దీని నే నెఱుఁగుదును' అని వేద్యముగా అను

రెంటను భిన్నార్థములగు గోవు అశ్వము ఇత్యాదులందును ప్రవర్తింపదు. కనుక విశేషణమున భిన్నార్థములై విశేష్యమున ఏకార్థములగు నీలము ఉత్పలము ఇత్యాదులందే అది ప్రవర్తించును. భిన్నప్రవృత్తినిమిత్తము అనుటచే విశేషణమున భిన్నార్థము లనియు, ఏకార్థమునందు వృత్తి యనుటచే విశేష్యమున ఏకార్థము లనియు నూహించునది. కనుకనే 'ఆదిత్యానా మహంవిష్ణుః' 'అహంశశీ' 'దేవోఽహమ్' 'మనుష్యోఽహమ్' స్థూలోఽహమ్' కృశోఽహమ్' ఇత్యాదులందు సామానాధికరణ్యమని తెలియునది. ఒకటి మఱియొకదానికి సమానాధికరణ మనఁగా ఒకటి యేవిశేష్యమున పర్యవసించుచున్నదో దానియందే మఱొకటియు పర్యవసించుచున్నదనుట. 'నేనుదేవుఁడు' అనుచో నేనుశబ్దము ఆత్మను, దేవశబ్దము దేహమును, నిర్దేశించుచున్నవి. ఇట్టిరెండు శబ్దములు భిన్నప్రవృత్తినిమిత్తములైనను ఆత్మయను ఒక విశేష్యమునందె నెలకొనుచున్నవి. కావున 'నేను దేవుఁడను' ఇత్యాదులందు ఆత్మతోఁగూడ దేహము సామానాధికరణ్యముచే. అనఁగా అది నిలుచువిశేష్యమునందే ఇదియు నిలుచుటచే దానితోఁగూడ నిదియు నొక్కటిగా గ్రహింపఁబడుచున్నది. 'నేను దేవుఁడను' అనుచో జాతియందును, 'నేను కృశుఁడను' అనుచో గుణమునందును 'నేను పోవువాఁడను' అనుచో క్రియయందును. రెండుశబ్దములకును సామానాధికరణ్యము అని తెలియునది.

* భోక్తయు వేదితయు, భోగ్యమునకును వేద్యమునకును అన్యమైన పదార్థమే యగునని భావము. 'నాతల' 'నాచేయి' అని యవయవములను జెప్పుచున్నప్పుడుగాని

సంధించుచున్నాఁడు. (వేద్యముకంటె వేదిత యర్థాంతరము) కనుక వేదితయగు ఆత్మకు (వేద్యములగు) ఘటాదు లెట్లో యట్లు శరీరమును వేద్యమగుటంబట్టి వేఱువస్తువగును; వేద్యములగు ఘటాదుల కెట్లో యట్లే వేద్యమగు శరీరమునకును, వేదితయగు క్షేత్రజ్ఞుఁడు వేఱుపదార్థమె యగును. *శరీరమునకు విశేషణములై అపృథక్సిద్ధములై యుండు మనుష్యత్వము గోత్వము మొదలయినవి యెట్లు ఆయా శరీరములతోఁగూడ సామానాధికరణ్యముచే గ్రహింపఁబడుచున్నవో యట్లే శరీరమును ఆత్మకు విశేషణముగా నుండుటయె స్వభావముగాఁ గలదై కావుననె దానికి అపృథక్సిద్ధమై యుండుటచేత ఆత్మతోఁగూడ అదియు సామానాధికరణ్యముచే గ్రహింపఁబడుచున్నది. ఇట్లు దేహాత్మలకు అభేదముచేతఁ గాక అపృథక్సిద్ధిచేతనె కలుగుటంబట్టి సామానాధికరణ్యప్రతీతి పొసఁగియున్నది.

---

'నాశరీరము' అని యవయవముల మొత్తమగు దేహమును జెప్పునప్పుడుగాని వేదిత తన్ను వేఱుగాను అవయవాదులను వేఱుగాను అనుసంధించుచున్నాఁడేకాని 'నేనే తల' 'నేనే శరీరము' అని తన్నును అవయవాదులను ఒక్కవస్తువుగా అనుసంధించుట లేదు. కాఁబట్టియు దేహమును ఆత్మయు వేఱువేఱ యగును. ఆత్మయొక్క కర్మబీజములు ఫలించుటకు క్షేత్రమువంటి దగుటచే శరీరము క్షేత్రమనఁబడె నని తెలియునది.

* "ఒకవస్తువు తనకంటె భిన్నమైన యింకొకవస్తువునకు సమానాధికరణము కానేరదు. ఎట్లన ఘటము తనకంటె భిన్నమైన పటమునకు సమానాధికరణము కానేరదు. అనఁగా ఘటశబ్దము నిలుచువిశేష్యవస్తువునందే పటశబ్దము నిలువదు. కనుక దేహాత్మలు వేద్యవేదితృభావముచే పరస్పర భిన్నము లగునన్నయెడల నారెంటికిని సామానాధికరణ్యము కలుగనేరదు. మఱి 'నేను దేవుఁడు- నేను కృశుఁడు' ఇత్యాదు లందు రెంటికిని సామానాధికరణ్యము కనుపట్టుటయెట్లు? అనినయెడల, మంటిముద్దకుండ మూఁకుడు ఈమూఁడును వేఱువేఱు నామరూపములు కలిగినవైనను అన్నియు మన్ను అను ఏకద్రవ్యమె యగుటచేత మంటిముద్దకు తద్వికారములైన తక్కినవియు సమానాధికరణములుగా గ్రహింపఁబడుచున్నవి. ఇట్లు ఏకద్రవ్యమగుటవలనియభేదముచేత మంటిముద్ద మొదలైనవానికి సామానాధికరణ్యము కలుగునట్లె దేహాత్మలకును అభేదము కలిగిననదేకాని పరస్పరము భిన్నము లగుటచేతఁ గాదు" అని ప్రతిపక్షు లాక్షేపించుటకు నిది సమాధానమని తెలియునది.

(అయినను అపృథక్సిద్ధివలనఁ గలిగిన సామానాధికరణ్యముచే ఆత్మ దేహముతోఁగూడనే ఘటాదులకు వేదితగా అనుసంధింపఁబడుచున్నను, నిజమునకు ఆత్మ ఒకటిమాత్రమె వేదితకావున అదియొక్కటియె వేదిత యని జను లేల యనుసంధింపరు? అనినచో,) ఆ వేదిత యగు ఆత్మయొక్క జ్ఞానత్వనిత్యత్వ సూక్ష్మత్వాద్యసాధారణాకారము చక్షురాదీంద్రియములకు గోచరముకాని దగుటవలనను యోగ సంస్కారము గల మనస్సునకుమాత్రమె గోచరించున దగుటవలనను ప్రకృతిసన్నిధానమువలననే మూఢులైన జనులు ప్రకృత్యాకారమునే (అనఁగా దేహవిశిష్టాకారమునే) వేదితగా అనుసంధించుచున్నారు. ఈవిషయమె 'ఉత్క్రామన్తం స్థితంవాపి భుఞ్జానం వా గుణాన్వితమ్। విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః' (గీ-౧౫-౧౦) అని మీఁద చెప్పుచున్నాఁడు.

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ॥

టీ. హేభారత=ఓ యర్జునా, సర్వక్షేత్రేషు=సమస్త దేహములయందుండెడి, క్షేత్రజ్ఞమపి=జీవునిగూడ, మాం=నన్నుఁగా-అనఁగా నేను ఆత్మగాఁగలవానినిగా, విద్ధి=ఎఱుఁగుము. ('అపి' అనుటవలన క్షేత్రముకూడ నే నాత్మగాఁ గలది యని అభిప్రాయము.) క్షేత్రక్షేత్రజ్ఞయోః=శరీరముయొక్కయు ఆత్మయొక్కయు, జ్ఞానం=తెలియుట-అనఁగా ఆ రెంటికిని గల వివేకమును గుఱించియు అవి మదాత్మకము లగుటను గుఱించియు, గల జ్ఞానము, యత్ = ఏది కలదో-చెప్పఁబడినదో యనుట. తత్ =అదియే, జ్ఞానం=ఉపాదేయమైన జ్ఞానమని, మమ=నాయొక్క, మతం = అభిప్రాయము.

తా. దేవుఁడు మనుష్యుఁడు మొదలుగాఁ గల క్షేత్రములన్నిటి యందు వేదిత (ఎఱుఁగువాని) యాకారముననే యుండు క్షేత్రజ్ఞుని నన్నుఁగా (అనగా నేనే యాత్మగాఁ గలవాఁనిగా) ఎఱుఁగుము 'క్షేత్రజ్ఞం చాపి' అని అపి (కూడ) శబ్దము వలన క్షేత్రముగాఁగూడ నన్నుఁ దెలియుమని చెప్పినట్లు తెలియఁబడుచున్నది. ఎట్లు క్షేత్రజ్ఞ నకు విశేషణముగా నుండుటయే స్వభావముగాఁ గలిగియున్నందున ఆ క్షేత్రజ్ఞునకు అపృథక్సిద్ధముగ (విడిచి వేఱుగఁ గలుగ లేనిది) అగును గాన దానితోడి సామానాధికరణ్యముచేతనే నిర్దేశింపఁదగియున్నదో అట్లే క్షేత్రమును క్షేత్రజ్ఞుఁడును నాకు విశేషణముగా నుండుటయే స్వభావముగాఁగలవారు గాన నాకపృథక్సిద్ధములై నాతోడి సామా నాధికరణ్యముచేతనే నిర్దేశింపఁ దగియున్నవని తెలియుము. పృథివి మొదలగువాని సంఘాత (మొత్త) మైన క్షేత్రమును క్షేత్రజ్ఞుఁడును భగవంతునికి శరీరముగా నుండుటయె స్వరూపముగఁ గలిగియుండు టనుబట్టి భగవదాత్మకములని 'యః పృథివ్యాంతిష్ఠన్ పృథివ్యా అన్త రోఽయం పృథివీనవేద యస్య పృథివీశరీరం యః పృథివీ మన్తరో యమ యతి స త ఆత్మాన్తర్యామ్యమృతః' (బృ-౫-౭-౩) అని యారం భించి 'య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మానమన్తరో యమయతి స త ఆత్మాన్త ర్యామ్యమృతః' (బృ-౫-౭-౨౨) ఇత్యాదులగు శ్రుతులు చెప్పు చున్నవి. అంతర్యామిత్వముచే సర్వక్షేత్రములందు ఆత్మగా నెల కొనియుండుట యనెడి యిదియే వానితోడిసామానాధికరణ్యముచే భగవంతుని నిర్దేశించుటకు హేతువు. "అహమాత్మా గుడాకేశ సర్వ భూతాశయస్థితః" (గీ-౧౦-౨౦) 'న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్' (గీ-౧౦-౩౯) 'విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్' (గీ-౧౦-౪౨) అని ముందును వెనుకను జెప్పి నడుమ 'ఆదిత్యానామహం విష్ణుః' (గీ-౧౦-౨౧) ఇత్యాదులచే

సామానాధికరణ్యమున నిర్దేశించుచున్నాఁడు. క్షేత్రమును క్షేత్రజ్ఞుఁడును వేఱువే అనుటనుగూర్చియు ఆయిరువురును మదాత్మకములను టనుగూర్చియు ఏజ్ఞానము చెప్పఁబడినదో యాయాజ్ఞానమే యుపాదేయమైనదని నామతము.

కొందఱు, "క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి" అనుచోఁగల సామానాధికరణ్యముచేత భగవంతుఁడును క్షేత్రజ్ఞుఁడును ఒక్కఁడె యని ఏకత్వము స్ఫురించుచున్నది. ఇందువలన భగవంతుఁ డగువానికే అజ్ఞానమువలన క్షేత్రజ్ఞత్వము కలుగునట్లు (అనఁగా తన్ను అన్యునిఁగా-క్షేత్రజ్ఞునిఁగా-భ్రమించియుండునని) ఒప్పుకొనక తీఱదు. కనుకనే అట్టిభ్రమము నివర్తించుటకై యీయేకత్వము చెప్పఁబడినది. (సర్వజ్ఞుఁ డగు భగవంతుఁడు తన్ను అజ్ఞుఁడగు క్షేత్రజ్ఞునిఁగా భ్రమించుటెట్లు? అనిన అతఁడు మాయావేశమువలన ఈశ్వరుఁడు కాఁగా ఆ యజ్ఞానమువలన అట్లు భ్రమించినాఁడు. ఆ యజ్ఞానము నివర్తించుటకే ఈ యేకత్వము ఉపదేశించుటయని తెలియునది. ఉపదేశముచే భ్రమ తొలఁగుట యెట్లనఁగా) రజ్జువును సర్పముగా భ్రమించినవానికి ఆప్తుఁడైనవాఁ రదిసర్పముకాదని చెప్పిన వెనుక ఆ సర్పత్వభ్రమము నివర్తించినట్లె తన్ను క్షేత్రజ్ఞునిగా భ్రమించిన యర్జునునకు ఆప్తతముఁడగు భగవంతుని యుపదేశమువలన ఆ భ్రమ నివర్తించుచున్నది. కనుక సామానాధికరణ్యము ఏకత్వముచేతనే కలిగినదికాని అపృథక్సిద్ధిచేతఁ గాదు అని చెప్పుచున్నారు. ఇచట *ఉపదేశించువాఁడు వాసుదేవుఁడును పరమేశ్వరుఁడును అగు భగవంతుఁడు. అట్టివానికి తన స్వరూపముయొక్క యాథాత్మ్యము సాక్షాత్కరించి యుండును. అట్టి సాక్షాత్కారముచేత వాని యజ్ఞానము నివర్తిం

* ఇచట ఉపదేశించువాఁ డనుటచేత జ్ఞానవంతుఁడగుననియు, వాసుదేవుఁడనుటచే 'సర్వత్రాసౌ సమస్తంచ వసత్యత్ర' అనువ్యుత్పత్తినిబట్టి అంతటను తానును తన

చెనా? లేదా? అని వారిని అడుగవలయును. నివర్తించిన దన్నయెడల, సజాతీయ విజాతీయాది విశేషరహితమైన జ్ఞానమాత్రమె స్వరూపముగాఁగల తనయందు తనవంటిది కానిరూపము లుండునట్లు భ్రమించుట సంభవింపనేరదు. ఇట్లు అంతటను తా నొక్కఁడుతప్ప ఇతరములు కానరామిచే తనకంటె అన్యములైన యజ్ఞనాది భేదములను కనుఁగొనుటగాని, వారు యథార్థముగ లేకుండఁగా అట్టిలేనివారిని గూర్చి తాను ఉపదేశాది వ్యాపారములు చేయుటగాని కలుగదు. ఆత్మసాక్షాత్కారము కలుగమిచే అజ్ఞానము నివర్తింపలేదన్నచో అప్పుడు అజ్ఞుఁడగుచున్నాఁడు గనుక అట్టివాఁడు ఆత్మజ్ఞానమును ఉపదేశించుట సంభవింపదు. "ఉపదేక్ష్యన్తి తేజ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః" అని తత్త్వజ్ఞులేకదా యుపదేశము సేయుఁదగువారని చెప్పఁబడియున్నది. కాఁబట్టి శ్రుతిస్మృతీతిహాస పురాణములకుఁగాని న్యాయమునకుఁగాని స్వవచనములకుఁగాని గలుగువిరోధమును పాటింపక జగత్తును మోహింపఁజేయుటకై ప్రవర్తింపఁజేయబడు నిట్టి వాదములు అనాదరణీయములు.

చిదచిదీశ్వరస్వరూపభేదము.

ఈ విషయమున తత్త్వమెద్ది యనఁగా-అచిత్తు, చిత్తు, పరబ్రహ్మము అని తత్త్వములు మూఁడు. ఇందు అచిత్తు భోగ్యమనియు, చిత్తు భోక్త యనియు పరబ్రహ్మము ఆరెంటికిని ఈశిత (అనఁగా నియామకుఁడు) అనియు వీనిస్వరూపభేదములను గొన్ని శ్రుతులు వచించుచున్నవి. ఆ శ్రుతు లెవ్వి యన,

---

యం దన్నియు వసించునట్టివాఁ డగు ననియు, పరమేశ్వరుఁడనుటచే 'సర్వలోకమహేశ్వరః' 'బిభర్త్యవ్యయ ఈశ్వరః' ఇత్యాదులందు తిన్న ఈశ్వరునిఁగా దలంచుమువీవు లకు సర్వప్రకార మగుతనమై లక్షణ్యా ముపదేశించువాఁ డగుననియు భావము. ఇచట స్వరూపముయొక్క యాథాత్మ్యము, అద్వైతులమతము చొప్పున అంతటను తా నొక్కటి తప్ప వేఱొద్దియులేక అఖండమై యుండుకేవలజ్ఞానపటలమని తెలియునది.

1. "అస్మాన్మాయీ సృజతే విశ్వమేత త్తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" (శ్వే. ౪-౯)
2. 'మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్' (శ్వే. ౪-౧౦)
3. 'క్షరం ప్రధాన మమృతాక్షరం హరః-క్షరాత్మానావీశతే దేవ ఏకః' (శ్వే. ౧-౧౦) ఇందు 'అమృతాక్షరం హరః' అని భోక్త నిర్దేశింపఁబడుచున్నాఁడు; ప్రధానమును ఆత్మకు భోగ్యమైనదిగా హరించుచున్నాఁడు గాన హరుఁడు.
4. "సకారణం కరణాధిపాధిపో - నచాస్యకశ్చిజ్జనితా నచాధిపః" (శ్వే. ౬-౯)
5. "ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః" (శ్వే. ౬-౧౩)
6. "పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్" (తై. నా. ౧౦)

---

* దీనిచేత (ఈప్రకృతిచేత) మాయి (ఈశ్వరుఁడు) ఈప్రపంచమును సృజించుచున్నాఁడు. దానియందు వేఱొకఁడు (జీవాత్మ) (ఈశ్వరుని) మాయచేఁ గట్టువడియున్నాఁడు. [ఇందు చిదచిదీశ్వరులు స్వరూపమున భిన్నములగుట తెలియునది.] 2. మాయను ప్రకృతిగాను మాయావిని మహేశ్వరునిఁగాను తెలియఁదగును. [ఇందు ప్రకృతియు నీశ్వరుఁడును భిన్నులగుట తెలియునది.] 3. క్షరము (నశించునది) ప్రధానము (పరికృతి) అగును. మృతిలేని యక్షరము (ఆత్మ) హరుఁడు. అనఁగా ప్రధానమును తనకు భోగ్యపదార్థముగా హరించువాఁడు-అగును. దేవుఁడొక్కఁడే ప్రకృతిని ఆత్మను (రెంటిని) ఏలుచున్నాఁడు [ఇందుమూఁటికిని స్వరూపస్వభావభేదమును, అచిత్తునకును చిత్తునకును గలభోగ్యభోక్తృభావమును, చిదచిత్తులకును ఈశ్వరునికిని గల నియామ్యనియామకభావమును దెలియునది. 4. వాఁడు (ఈశ్వరుఁడు) కారణము. శరీరావయవములకు అధిపుఁడైనవానికి (అనఁగా జీవాత్మకు) అధిపుఁడు. వానికి (ఈశ్వరునకు) పుట్టించువాఁడు ఒక్కఁడును లేఁడు. అధిపుఁడును ఒక్కఁడును లేఁడు. [ఇందు ఈశ్వరుని సర్వకారణత్వము సర్వాభ్యధికత్వమును దెలియుచున్నవి.] 5. గుణములకు ఈశుఁడు, ప్రకృతికిని క్షేత్రజ్ఞునకిని (జీవాత్మకును) పతి. 6. ప్రపంచమునకు పతి, జీవాత్మకు ఈశ్వరుఁడు.

7. జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ. (శ్వే. ౧-౯)
8. నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానా మేకోబహూనాం యోవిదధాతి కామాన్. (శ్వే. ౧౩; కఠ. ౨-౫-౧౩)
9. భోక్తాభోగ్యం ప్రేరితారంచ మత్వా. (శ్వే. ౧-౫)
10. పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా జుష్టస్తతస్తేనామృతత్వమేతి. (శ్వే. ౧-౬)
11. తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి - అనశ్నన్నన్యో అభిచాకశీతి. (ముం. ౩-౧-౨)

---

నిత్యుఁడు శుభుఁడయినవాఁడు, చెడనివాఁడు. 7. జ్ఞుఁడు (తెలిసినవాఁడు-అనఁగా ఈశ్వరుఁడు) అజ్ఞుఁడు (తెలియనివాఁడు- అనఁగా జీవుఁడు) అని యిద్దఱు. ఈయిద్దఱును పుట్టుకలేనివారు. (అందొకఁడు అనఁగా ఈశ్వరుఁడు) ఈశుఁడు, (మఱియొకఁడు (అనఁగా జీవుఁడు) ఈశుఁడు కానివాఁడు. [ఇందు ఈశ్వరుని సర్వజ్ఞత్వమును జీవుని కించిద్ జ్ఞత్వమును ఉభయుల అజత్వమును నియామకనియామ్యభావమును తెలియునది. 8. నిత్యులలో (నిత్యమైన ఆత్మలలో) నిత్యుఁడును, చేతనులలో (చేతనులయిన యాత్మలలో) చేతనుఁడును, పెక్కండ్రలో (పెక్కులయిన యాత్మలలో) ఒక్కఁడును. (అగు) ఎవఁడుకోరికలనిచ్చుచున్నాఁడో - (ఇందు ఆత్మలు నిత్యములనియు పెక్కులనియు ఈశ్వరుఁ డొక్కఁ డనియు ఫలప్రదుఁ డనియుఁ దెలియనగును.] 9. భోగించువానిని (ఆత్మను), భోగ్యమును (ప్రకృతిని), ప్రేరేపించువానిని (ఈశ్వరుని) ఎఱిఁగి. 10. ఆత్మను ప్రేరితను (ఈశ్వరుని) వేర్వేఱుగా నెఱిఁగి పిదప వానిని (ఈశ్వరుని) గొలుచువాఁడు (జీవుఁడు) వానిచేత (ఈశ్వరునివలననుండి యనుట) అమృతత్వమును బొందును. [ఇందు చిదచిదీశ్వరులకుఁ గల భేదము శబ్దములచేత తెలియుటే కాక ఈశ్వరుని జీవునికంటె వేఱైనవానినిగా నెఱిఁగి వానియందు ప్రీతి కలిగియుండుటవలన మోక్షము కలుగు ననియు తెలియుచున్నది.] 11. ఆ యిద్దఱిలో ఇంకొకఁడు (జీవుఁడు) తియ్యనిపిప్పలమును (కర్మఫలముననుట) తినుచున్నాఁడు. మఱొకఁడు (ఈశ్వరుఁడు) తిననివాఁడై యంతటను ప్రకాశించుచున్నాఁడు. [ఒక శరీరమును ప్రవేశించియుండుజీవేశ్వరు లిరువురిలో ఒకఁడు కర్మఫలములకు భోక్తగాను ఇంకొకఁడుభోక్తకానివాఁడుగాను అట్టిస్థితిలో వారిరువురికిఁగల వైధర్మ్యమును ఇందుఁ జెప్పఁబడినది. ఇందు తియ్యనిపిప్పల మనుట పుణ్యఫలమునకు గ్రాహకము. ఇది ఉపలక్ష

12. అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయన్తీం సరూపాం-అజో హ్యేకో జుషమాణోఽనుశేతే-జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః. (శ్వే. ౪-౫; తై. నా. ౧౨-౫)

13.*గౌ రనాద్యన్తవతీ సా జనిత్రీ భూతభావినీ. (మన్త్రికోపనిషత్)

14*.సమానే వృక్షే పురుషో నిమగ్నో ఽనీశయా శోచతి ముహ్యమానః-జుష్టం యదా పశ్యత్యన్య మీశ మస్య మహిమాన మితి వీతశోకః. (శ్వే. ౪-౭)

ఇత్యాదులు (వీనియందెల్ల ప్రకృతియు జీవాత్మయు నీశ్వరుఁడును స్వరూపమును వేఱువేఱైనవారే యగుదు రనియు, అందు ప్రకృతి జీవునికి భోగ్యమనియు, జీవుఁడు భోక్త యనియు, జీవులు పెక్కండ్రనియు, ప్రకృతికిని జీవులకును నియామకుఁ డీశ్వరుఁ డొక్కఁడనియుఁ బ్రతిపాదితములైయున్నవి.) ఈ గీతయందును ఈ విషయములను గుఱించియే

---

ణార్థము గనుక పుణ్యపాపఫలముల రెంటిని గ్రహించునది.] 12. పుట్టుక లేనివాఁడగు నొకఁడు (బద్ధాత్మ) ఎఱ్ఱనిదియు తెల్లనిదియు నల్లనిదియునగు మఱొకపుట్టని దానిని (ప్రకృతిని) తనకు అనురూపమైన ప్రజను మిక్కిలి కలిగించు దానిని, ప్రేమతో ననుభవించుచున్నాఁడు. పుట్టనివాఁడైనయొకఁడు (ముక్తాత్మ) దీనిని (ప్రకృతిని) అనుభవింపఁబడిన భోగములు గలదానిని త్యజించుచున్నాఁడు. దానివలనఁ గలుగు సుఖముల ననుభవించి దానిని విడుచుచున్నాఁడనుట. [ఇందు ప్రకృతిపురుషుల అజత్వమును, పురుషకర్మానురూపముగ ప్రకృతి పరిణమించుటయు, బద్ధ ముక్త వ్యవస్థయును గ్రాహ్యములు. మఱియు ప్రకృతిలోహితశుక్లకృష్ణమైనదిగాఁ జెప్పఁబడుటచేనది రజస్సత్త్వతమోగుణాత్మకమని చెప్పుటయగును. 'అనుశేతే' అనుటచే బద్ధునిని, 'జహాతి' అనుటచే ముక్తునిని గ్రహించునది] 13. ఈభూమి (ప్రకృతి యనుట) ఆద్యంతములు లేనిది, భూతములను గనునట్టితల్లి. 14. (పరమాత్మతోఁగూడ) నొక్క వృక్షముననే వసించు నీ పురుషుఁడు (జీవాత్మ) భ్రమించుచు (సంసారబంధముల) కట్టువడి ఈశుఁడు లేక దుఃఖించుచున్నాఁడు ఎప్పుడు ప్రేమతోఁ గొలువఁదగినవాఁడును (సంసారబంధములకు) అన్యుఁడునగు ఈశుని అతనిమహిమను జూచుచున్నాఁడో అప్పుడు దుఃఖము లేనివాఁ డగుచున్నాఁడు. *13-14. రెండును కొన్నిగ్రంథములందు కనుపట్టవు.

*"అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా।
అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం" (గీ. ౭-౪-౫)
'సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్'॥
'ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్'॥
(గీ. ౯-౮)
'మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్।
హేతు నానేన కౌన్తేయ జగద్ధి పరివర్తతే'॥ (గీ. ౯-౧౦)
'ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।' (గీ. ౧౩-౧౯)
'మమయోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సమ్భవ స్సర్వభూతానాం తతో భవతి భారత॥' (గీ. ౧౪-౩)

---

* ఈ గీతాశ్లోకములందు -'మేప్రకృతిః' 'ఇత స్త్వన్యామ్' ఇత్యాదులచే చిద చిదీశ్వరభేదము తెలియునది. మఱియు బ్రహ్మము జీవత్వమును అధ్యసించుటయే (అనఁగా బ్రహ్మము తన్ను పెక్కుజీవులుగా భ్రమించుటయే) సృష్టియనియు ఆ జీవ త్వాధ్యాసము నివర్తించుటే (అనఁగా బ్రహ్మము తాను జీవుఁడను భ్రమ మానుటయే) ప్రళయ మనియు పరులు చెప్పుదానికి ఖండనముగా 'సర్వభూతాని.. విసృజా మ్య హమ్' అనుదీని నుదాహరించిరి. ఇందు పరమాత్మునికి శరీరభూతమగు ప్రకృతియొక్క విభాగమే సృష్టియనియు అవిభాగమే ప్రళయమనియుఁ దెలియునది. మఱియు పర మాత్మ భ్రమించుటచేతనే ప్రకృతిపురుషుల చరాచరాదిదశలుకలుగుచున్నవను పరోక్తి నిరసించుటకై 'మయాధ్యక్షేణ...' అని గ్రహింపఁబడినది. దీనిచే పరమాత్మ ప్రకృతి పురుషుల కధిష్ఠానమై యుండుటవలననే వానికి చరాచరాదిదశలు కలుగుచున్నవేకాని భ్రమించుటచేతఁ గాదని తెలియునది. మఱియు బ్రహ్మమునందు జీవత్వము అధ్యసిం చుటచేతనే జీవుఁడు సిద్ధించుచున్నాఁడు అను పరోక్తిని నిరసింప 'ప్రకృతిం పురుషం చైవ' అని గ్రహింపఁబడినది. ఇందు పురుషుఁడు అనాదిగా నున్నాఁ డనుటచే అనా దిగా వేఱై యుండువాఁడే కాని బ్రహ్మము భ్రమించి తానే జీవుఁడుగా సిద్ధించిన వాఁడు గాఁడనుట అని తెలియనగును.

అని చెప్పఁబడియున్నది. ఇందు 'మమయోని...దధామ్యహమ్' అనుటకు, జగత్తునకు యోనిభూతమైనది యగు నామహత్తైన బ్రహ్మము (అనఁగా ప్రకృతి యనుపేరు గల భూతసూక్ష్మమగు అచిద్వస్తువు) ఎదియో దానియందు చేతన మనెడి గర్భమును గూర్చుచున్నాను. పిదప నాసంకల్పముచే నగు చిదచిత్తుల సంసర్గవలననే దేవతలు మొదలుగా స్థావరములవఱకును అచిత్తుతో మిశ్రములైయుండు భూతము లన్నియుఁ బుట్టుచున్నవి యని యర్థము. శ్రుతియందును భూతసూక్ష్మము 'తస్మాదేతద్బ్రహ్మనామరూప మన్నంచ జాయతే' అని బ్రహ్మశబ్దముచే నిర్దేశింపఁబడియున్నది. కాన నిచట బ్రహ్మశబ్దమునకు భూతసూక్ష్మమని యర్థము సేయఁబడెను.

సామానాధికరణ్యము శరీరాత్మభావనిబంధనముచే
ముఖ్యవృత్తమైనది గాని లాక్షణికము గాదు.

ఇట్లు భోక్తృభోగ్యరూపముగా నుండు చిదచిత్తులు సర్వావస్థలందును పరమపురుషునికి శరీరభూతమై అతనికి నియామ్యమై యుండుటచే అవి అతనికి అపృథక్సిద్ధము లనియు (అనఁగా అతనిని విడిచి వేఱుగ నుండఁజాల వనియును) పరమపురుషుఁడు వాని కాత్మయనియుఁ గొన్ని శ్రుతులు చెప్పుచున్నవి. ఎట్లన, *'యఃపృథివ్యాంతిష్ఠన్-పృథివ్యా అన్తరోయం పృథివీ నవేద-యస్య పృథివీ శరీరం-యః పృథివీ మన్తరో యమయతి' అని యారంభించి 'య ఆత్మని తిష్ఠన్-ఆత్మనోఽన్తరోయమాత్మానవేద - యస్యాత్మాశరీరమ్-య ఆత్మాన మన్తరోయమయతి-సత ఆత్మాన్తర్యామ్యమృతః' అని శ్రుతి చెప్పుచున్నది. ఈ యంతర్యామి బ్రాహ్మణశ్రుతి చెప్పినట్లే సుబాలోపనిషత్తును

---

* 'యఃపృథివ్యాం' ఇత్యాదులచే ప్రకృతియును, ' య ఆత్మని' ఇత్యాదులచే ఆత్మయు భగవంతునికి శరీరమై భగవంతుఁ డంతర్యామిగా కలిగియుండుటఁ దెలియనగును. ఈశ్రుతి బృహదారణ్యకోపనిత్తునందలిది.

'యఃపృథివీ మన్తరే సఞ్చరన్-యస్య పృథివీ శరీరమ్'- యం పృథివీ న వేద' అని యారంభించి 'యోఽక్షర మన్తరే సఞ్చరన్ - యస్యాక్షరం శరీరం - యమక్షరం న వేద' - 'యో మృత్యుమన్తరే సఞ్చరన్-యస్య మృత్యుః శరీరమ్-యం మృత్యుర్న వేద - ఏష సర్వభూతాన్తరాత్మా అపహతపాప్మా దివ్యో దేవఏకో నారాయణః' అని చెప్పుచున్నది. ఇచట మృత్యుశబ్దముచే సూక్ష్మావస్థ గలదియు తమస్సు అనబడునదియు నగు అచిద్వస్తువు చెప్పబడుచున్నది. ఎట్లన, ఈయుపనిషత్తుననే 'అవ్యక్తమక్షరే లీయతే-అక్షరం తమసి లీయతే' అని చెప్పఁబడియున్నది. (తమశ్శబ్దము సూక్ష్మావస్థమైన యచిత్తును దెలుపుటచే అందలి యీ మృత్యుశబ్దమునకును అదియే గ్రాహ్యము.) తైత్తిరీయకమును

* 'అన్తఃప్రవిష్టః శాస్తా జనానాగ్ం సర్వాత్మా'

అని చెప్పుచున్నది. ఇట్లు చిదచిత్తులు సర్వావస్థలయందును పరమపురుషునికి శరీరమై ప్రకారములై యుండుటచే ప్రకారియగు పరమపురుషుఁడే కార్యావస్థయందును కారణావస్థయందును ♦ ప్రకారమైన జగత్తురూపమున నెలకొనియున్నాఁడు. ఈ యర్థమును దెలుపుటకే

---

* ఇది తైత్తిరీయక వాక్యము. 'సర్వాత్మా' అని యీశ్వరుని చిదచిద్వస్తువుల కెల్ల ఆత్మగా ప్రతిపాదించి 'అన్తఃప్రవిష్టః' అనియు 'శాస్తా' అనియు అట్లాత్మగా నుండుటకు వలయులక్షణములగు అంతఃప్రవేశ నియమనములను జెప్పినారు. దీనివలన చిదచిత్తులకు శరీరత్వము సిద్ధించుచున్నది. వాయువుకూడ 'అన్తఃప్రవిష్టః' కావచ్చును కనుక అది కాదని తెలుపుటకై 'శాస్తా' యనియు, రాజుకూడ 'శాస్తా' కావచ్చును గనుక వాఁడుకాఁడని తెలుపుటకై 'అన్తఃప్రవిష్టః' అనియు చెప్పఁబడెను. అంతఃప్రవిష్టుఁడును శాస్తయు రెండును అగునని ఆత్మయే కాన అట్టి రెండులక్షణములు గల యీశ్వరుఁడు సర్వమునకాత్మయగుట స్థిరీకృత మగుచున్నది.

♦ చిదచిత్తుల సముదాయమే జగత్తుకాని వేఱుకాదు. కనుక చిదచిత్తులు ఈశ్వరుని శరీరమనఁగా జగత్తు అతని శరీరము అనియే భావము. ఇచట జగత్తు నామరూప

కొన్ని శ్రుతులు ♦కార్యావస్థమును కారణావస్థమును అగుజగత్తు వాఁడే యని చెప్పుచున్నది కాని వేఱు కాదు. ఆశ్రుతులు

*'సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మే వాద్వితీయమ్'
(ఛా. ౬-౨-౧) తదైక్షత బహు స్యాం ప్రజాయేయేతి-తత్తేజో సృజత' (ఛా. ౬-౨-౩) అని యారంభించి, ♦ 'సన్మూలా స్సోమ్యేమా స్సర్వాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః (ఛా. ౬-౮-౬) 'ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా - 'త త్త్వమసి శ్వేత కేతో' (ఛా. ౬-౮-౭) అని చెప్పుచున్నవి. ఇట్లె తై త్తిరీయకమును, ♦'సోఽ కామయత బహు స్యాం ప్రజాయేయేతి-సతపో తప్యత-స తప స్తప్త్వా

---

భాగములు కలిగియుండు కార్యావస్థయందును నామరూపవిభాగములు లేనికారణావస్థ యందును భగవంతునికి అపృథక్సిద్ధవిశేషణ మగుశరీరమైయుండును. శరీరి యగు ఆత్మ శరీరమును రూపముగాఁగలిగి వర్తించునట్లె జగత్తున కాత్మయగు భగవంతుఁడు కార్య కారణావస్థలందు తనకు శరీరమైయుండు ఆ జగత్తునె రూపముగాఁ గలిగియుండును అని భావము.

♦ కొన్నిశ్రుతులు, కార్యకారణావస్థమగు జగత్తు. వాఁడే యనుటచే, జగత్తును వాఁడును ఒక ద్రవ్యమే అను అర్థమును దెలుపుచున్నవని తలఁపరాదు; జగద్రూప ముగా నుండువాఁడు అను పూర్వోక్తమైన యర్థము నే తెలుపునని భావము. ఉభయా వస్థలందును జగత్తు వానిరూపమే యగుటంబట్టి జగత్తు వాఁడే యనఁబడుచున్న దనుట.

* ఓసోమ్యా! ఈసత్తే (అనఁగా భగవంతుఁడే) ఒక్కఁడేయై రెండవదిలేనిదై మొట్టమొదట నుండెను. అది 'పెక్కు అయ్యెదను. ప్రజలను గనెదను' అని కోరెను. అది తేజస్సును సృజించెను.

♦ సోమ్యా! ఈసర్వప్రజలును ఆసత్తె మూలముగాఁ గలిగియున్నవి. సత్తే వానికి ప్రాపు. సత్తే వానికి పట్టు. ఇదియంతయు దానినే (సత్తునే) ఆత్మగాఁ గలిగి యున్నది. అది సత్యము-వాఁడు ఆత్మ. శ్వేతకేతూ! అది నీవు అగుదువు. [ఇందు ఈశ్వరునికిని చిదచిత్తులకును శరీరాత్మభావము కలుగుటయు దానిచేతనే సామానాధికర ణ్యము సిద్ధించుటయు అట్టి సామానాధికరణ్యమే 'త త్త్వమసి' అనుచో ప్రతిపాదింపఁ బడుటయుఁ దెలియనగును.]

♦ 'నేను పెక్కుఅయ్యెదను నేను ప్రజలను గనెదను. అని వాఁడు కోరెను'

ఇదం సర్వ మస్సృజత' (తై. ఉప. ఆనన్ద. ౬-అను) అని యారంభించి, ♦'సత్యం చానృతంచ సత్య మభవత్' (తైత్తి. ఉప-ఆనన్ద. ౬-అను) అని చెప్పుచున్నది.

* సమానాధికరణనిర్దేశము సేయు నీఛాందోగ్యతైత్తిరీయక ప్రకరణములందు సైతము ఇతర శ్రుతిప్రకరణములు ప్రతిపాదించునట్టిచిదచిదీశ్వర స్వరూపభేదము ప్రతిపాదింపఁబడుచున్నది- ఎట్లన,

♦ హన్తాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' (ఛా. ఉప. ౬-3-౨)

♦'తత్ సృష్ట్వా తదేవాను ప్రవిశత్ - తదనుప్రవిశ్య సచ్చత్య

---

వాఁడు (ఇట్లు) ఆలోచనచేసెను. ఆలోచనచేసి దీనినంతయు సృజించెను. [ఇందును చిదచిత్ప్రవేశమును దానిచేఁగలిగిన సామానాధికరణ్యమును దెలియనగును.]

♦ సత్యమైనదియు (పరిణామములేని ఆత్మయు ననుట) అనృతమైనదియు (పరిణామియగు ప్రకృతియు ననుట) సత్యము (ఈశ్వరుఁడు) అయ్యెను.

* సమానాధికరణనిర్దేశము సేయుటేకాక స్వరూపభేదమునుగూడ ఈ శ్రుతులు ప్రతిపాదించుచున్న వనుట.

♦ హన్త! ఈజీవుఁ డగుటచే (జీవుఁడనగు నేను - జీవుని శరీరముగాఁ జేసికొని వానితోఁగూడ నేను అనుట) ఈమూఁడుదేవతలను ((ప్రకృతితత్త్వములగు పృథివి- అప్పు-తేజస్సులను) ప్రవేశించి నామరూపములను వేర్వేఱ ఏర్పఱతును. [ఇది ఛాందోగ్యవాక్యము 'సింహమైననాచే అనేకములు భక్షింపఁబడినవి' అనునపుడు, తాను సింహము కాకపోయినను సింహాకారమునుబొంది యట్లు చేయుట తెలియునట్లే 'జీవుఁడగు నాచే' అనుచో, నేను జీవుఁడుకాదు జీవునిశరీరమును గలిగియుండుటచే ఆ జీవాకారమునుబొంది నేను అన్నిట ప్రవేశించుచున్నానని అర్థము గ్రాహ్యము. ఈ మూఁడు దేవతలనుట ప్రకృతివాచకము. కనుక సమానాధికరణమును జెప్పు నీ శ్రుతియందును చిదచిదీశ్వరుల స్వరూపభేదము తెలియుచున్న దనుట.]

♦ దానిని (చిదచిన్మిశ్రమగు ప్రపంచము ననుట) సృజించి దానియందు ప్రవేశించెను. దానిని ప్రవేశించి, సత్తును (వికారరహితమైన ఆత్మయు) త్యత్తును (వికారియగు ప్రకృతియు) నయ్యెను. (ఒకటి) ఎఱుకగలదియు (మఱొకటి) ఎఱుకలేనిది

చ్చాభవత్...విజ్ఞానం చావిజ్ఞానం చ – సత్యం చానృతము భవత్' అని. [ఇందు 'అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య' అనుచో 'జీవే నాత్మనా' జీవుఁ డగు నాచే అని జీవునికి బ్రహ్మాత్మకత్వము చెప్పఁబడుచున్నది. 'అనేన' అనుశ్రుతియు 'తదను ప్రవిశ్య – సచ్చత్యచ్చాభవత్ – విజ్ఞానం చావిజ్ఞానమ్' అను శ్రుతియు సమానార్థకంబులగుటచే పూర్వశ్రుతియందుఁ జెప్పఁబడిన * జీవుని బ్రహ్మాత్మకత్వము ఉత్తర శ్రుతియందుఁ జెప్పఁబడిన జీవానుప్రవేశముచేతనే (అనఁగా జీవునికిని ఈశ్వరునికిగలశరీరాత్మభావముచేతనే) కలుగునని తెలియుచున్నది.]

---

యును, అవికారియు (ఆత్మయు) వికారియు (ప్రకృతియును) సత్యము (ఈశ్వరుఁడు) అయ్యెను. [ఇది తైత్తిరీయకవాక్యము]. 'ఇమాస్తిస్రోదేవతాః' అనుఛాందోగ్యమున ఈశ్వరుఁడు అచిత్తును ప్రవేశించుట వ్యక్తముగాఁ దెలియుచున్నది కాని, చిత్తును ప్రవేశించుట అంత వ్యక్తముగాఁ దెలియకున్నది. 'జీవుఁడగు నాచే' అని జీవునితోడి సామానాధికరణ్యముమాత్రము దెలియుచున్నది. అయినను జీవునియందు ప్రవేశించుట చేతనే ఈశ్వరునికి జీవునితోడి సామానాధికరణ్యము కలుగుచున్నది కాని వేఱుకాదు. ఇది నిరూపించుటకై ఆజీవానుప్రవేశము వ్యక్తముగా తెలుపు నీతైత్తిరీయక వాక్యమిచట రూపింపఁబడినది. దీనిచే ఈశ్వరుఁడు జీవునియందుఁగూడ ప్రవేశించుచున్నాఁడనియు, అందుచేతనే 'జీవుఁడగునాచే' అని ఛాందోగ్యము ఈశ్వరునికి జీవునితోడి సామానాధికరణ్యము చెప్పినదనియు గ్రహించునది.

* 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య' (ఈజీవుఁడగు నాచే ప్రవేశించి) అనుచో జీవుఁడు తానుగాఁ జెప్పిరి. ఈసామానాధికరణ్యమువలన జీవునికి బ్రహ్మాత్మకత్వము సిద్ధించుచున్నది. ఆత్మశబ్దమునకు ఆత్మపరముగాను తాదాత్మ్య (వేఱుకాకుండుట) పరముగాను అర్థముచెప్పఁగూడును. కాఁబట్టి యిచట బ్రహ్మాత్మకత్వ మనుటకు బ్రహ్మమును ఆత్మగాఁ గలిగియుండుట యని యర్థముచేసి జీవబ్రహ్మములకు శరీరాత్మభావమును గ్రహింపవచ్చును. లేక దానికి, బ్రహ్మమునకంటె వేఱుకాకుండుట (అనఁగా బ్రహ్మమే యగుట) యని యర్థముసేసి జీవబ్రహ్మములకు స్వరూపైక్యమును గ్రహింపవచ్చును. ఇట్లు రెండర్థముల కాస్పదమైయుండుటచేత జీవునికి సామానాధికరణ్యము సిద్ధించిన బ్రహ్మాత్మకత్వము శరీరాత్మభావమునుబట్టియా లేక స్వరూపైక్యమునుబట్టియా యని సందేహము కలుగుచున్నది. అయినను 'అనేన జీవేనాత్మనా' అను ఈశ్రుతియు 'తదనుప్రవిశ్య' అనుశ్రుతియు సమానార్థకములు. అందు రెండవశ్రుతి జీవునియందును

ఇటువంటి (అనఁగా ఈచిద చిదను ప్రవేశముచేఁ గలుగునట్టి) నామరూపవ్యాకరణమే * 'తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీత్

తన్నామరూపాభ్యాం వ్యాక్రియతే' (బృ. ఉప. ౩-౪-౭)

అని యిందునను జెప్పఁబడినది. కనుక *పరమపురుషుఁడే స్థూలసూక్ష్మ చిదచిద్వస్తుశరీరుఁడై కార్యావస్థుఁడును కారణావస్థుఁడు నగుచున్నాఁడు. కారణముకంటె కార్యము వేఱు కానందున కారణము నెఱుఁగుటచే కార్యము నెఱుఁగఁబడిన

---

ఈశ్వరుఁడు ప్రవేశించుటను (అనఁగా జీవేశ్వరులకు శరీరాత్మభావము కలిగియుండు టను) జెప్పుచున్నది. కనుక మొదటిశ్రుతియందలి జీవునిబ్రహ్మాత్మకత్వము రెండవశ్రుతి చెప్పినట్లు శరీరాత్మభావముచేఁ గలిగినదిగాని స్వరూపైక్యముచేఁ గాదని తెలియునది.

* ఇది (ముందు) నిజముగా అవ్యాకృతమై (వేఱువేఱ ఏర్పడనిదై) యుండెను. దానిని (ఇప్పుడు) నామరూపములచే వేఱువేఱ ఏర్పఱచెను. [ఇది బృహదారణ్యకము నందలిది-ఈశ్వరుఁడు చిత్తునం దాత్మగాఁ జొచ్చి దానిని శరీరముచేసికొని ఆ జీవశరీర ముతో అచిత్తునంగుఁ జొచ్చుచున్నాఁడు. ఇట్లు ప్రవేశించుటచేతనే పూర్వము నామ రూపవిభాగము లేకుండిన చిదచిత్తులకు నామరూపవిభాగము కలుగుచున్నది. ఇట్లు చిదచిదనుప్రవేశముచేతనే నామరూపవ్యాకరణము సిద్ధించునని తెలిసెడిని. అయినను 'తద్ధేదం' అనెడి యీశ్రుతి వట్టినామరూపవ్యాకరణమును మాత్రము చెప్పి దానికి హేతువగు చిదచిదనుప్రవేశమును జెప్పకపోయినను ఆ హేతువును ప్రతిపాదించు తక్కిన శ్రుతులనుబట్టి యాలోచింపఁగా ఈ శ్రుతియు ఆ హేతువును వెలిపుచ్చక పోయినను లోపలనుంచుకొనియే యీ వ్యాకరణమును జెప్పినదికాని వేఱు కాదు. కనుక నిందలి వట్టివ్యాకరణము చిదచిదనుప్రవేశముచేఁ గలుగువ్యాకరణమే యనియుఁ దెలి యఁదగునని భావము. ఇట్లె వట్టి నామరూపవ్యాకరణమును మాత్రముం జెప్పుప్రకరణ ములందెల్ల హేతువగు చిదచిదనుప్రవేశమునుగూడ గ్రహించుకొనునది.

* చిదచిత్తులకు నామరూపవిభాగములేని సూక్ష్మావస్థయే కారణావస్థ. నామ రూపవిభాగయుక్తమైన స్థూలావస్థయే కార్యావస్థ. ఈరెండవస్థలందును అవి యీశ్వ రునికి అపృథక్సిద్ధములై అంతయు వాఁడొక్కఁడే యనఁదగియుండును. కనుక సూక్ష్మ చిదచిద్విశిష్టుఁడై కార్యమగుచున్నాఁడు. కాఁబట్టి కార్యావస్థుఁడగు పరపురుషుఁడును కారణావస్థుఁ డగుపరమపురుషుఁడును ఒక్కఁడే యని భావము.

దగుచున్నది. కనుక ♦ ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కలుగు ననుట మఱెంత యుపపన్నముగా నున్నది. మఱియు, 'హన్తాహమిమా స్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామ

---

♦ 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్' అని ప్రమాణము. ఒకటి నెఱుఁగుటచేత సర్వము నెఱుఁగఁబడుచున్నదనియర్థము. ఈవాక్యమునకు ప్రతిపక్షులు చెప్పు అర్థముకంటె విశిష్టాద్వైతులగు తాము చెప్పునర్థము మఱెంత యుపపన్నముగా నున్నదని భావము. ఎట్లన 'ఏకవిజ్ఞానేనసర్వవిజ్ఞానమ్' అనఁగా ఒకనిర్విశేషబ్రహ్మము నెఱుఁగుటచే సర్వము నెఱుఁగఁబడుచున్నదని యర్థము అని పరపక్షులు చెప్పిరేని, అదియెట్లు? అనియడిగెదము. వారు, అంతటను తానొక్కటియె కలదై తక్కినదేదియు లేకుండుటచే అన్నియు తానైయుండు బ్రహ్మమొక్కటి నెఱుఁగుటచే అన్నియు నెఱుఁగఁబడినవే యగునని యర్థము చెప్పుదురేని, బ్రహ్మమొక్కటిమాత్రమె అంతట నెఱుఁగఁబడినదైయుండి కడమయెఱుఁగఁబడునది మఱేదియు లేకుండఁగా 'సర్వమెఱుఁగఁబడుచున్నది' అని సర్వశబ్దమును ప్రయోగింప నేల? ఆ లేనట్టి సర్వము ఎఱుఁగఁబడు టెట్లు? అని అడుగుదుము. ఒక్కటి కెక్కువ సంఖ్య యుండిననే సర్వశబ్దము ప్రయుక్తమగును. ఒక్కటిమాత్రమె యుండినయెడల ఆశబ్దమును ప్రయోగించుటకు వీలు లేదని భావము. ఒక్క నిర్విశేషబ్రహ్మమును తక్కిన సర్వమును ఒక్కటే కాని వేఱుకాదు. కనుక ఒకటి నెఱుఁగుటచే సర్వము నెఱుఁగఁబడునని యర్థముగాఁ జెప్పుదురేని అప్పుడు వారిమతము చొప్పున సత్యమగు బ్రహ్మమును మిథ్యయగు జగత్తును ఏకమే యగుచున్నది. సత్యమును మిథ్యయు నేకమగునా? అట్లేకమగునేని జగత్తునకుఁగాని బ్రహ్మమునకుఁగాని సత్యత్వమిథ్యాత్వములం దేదియైనను కలుగఁగూడదును. కనుక జగత్తే సత్యమనియు బ్రహ్మమె మిథ్యయనియుఁ జెప్పవచ్చునని ఆక్షేపింతుము. మఱియొక్కటిని (బ్రహ్మమును) ఎఱుఁగుటచే తక్కిన సర్వము మిథ్యగా నెఱుఁగఁబడుచున్నదని యర్థము చెప్పుదురేని అప్పుడు ఆ వాక్యమున 'మిథ్యగా' అను పదము అధ్యాహరించుకొనవలసియున్నది. కనుక అధ్యాహారదోషము కలుగుచున్నదని ఆక్షేపింతుము. అవిద్యావిశిష్టమగు బ్రహ్మము నెఱుఁగుటచే తత్కార్యమగు ప్రపంచము సర్వము నెఱుఁగఁబడునని యర్థముచెప్పుదురేని అప్పుడు మీరు శుద్ధబ్రహ్మమును విడిచి విశిష్టబ్రహ్మమును గ్రహించుటచే మాపక్షమును గొంత సమీపించినవారైతిరికాని బ్రహ్మమునకు మీరు చెప్పు విశిష్టత్వముయొక్క రీతి మేము చెప్పు విశిష్టత్వము యొక్క రీతికి విరుద్ధముగా నుండుటయేకాక అది సర్వప్రమాణములకు మిక్కిలి కలఁత కలిగించుచున్నది. కనుక సర్వప్రమాణానుసారముగా మేమావాక్యమునకుఁ జేయు నర్థమేమనఁగా, మృత్తు అను ద్రవ్యమొక్కటియే అనేకవ్యవహారములకొఱకు కుండ మూకుఁడు మొదలయిన నానారూపవికారములచే గలిగిన నానా నామముల నొందినదై

రూపే వ్యాకరవాణి' అనుచో తిస్రోదేవతాః అని అచిద్వస్తువు సర్వమును నిర్దేశించి అందు తాను ఆత్మగాఁగల జీవునిప్రవేశముచే నామరూపవ్యాకరణము కలుగునట్లు చెప్పుటవలన ఆయా వస్తువులకు వాచకములగు శబ్దములన్నియు ఆయావాని యచిద్రూపముతోను అందలి చిత్తుతోను గూడియున్న (అనఁగా అచిజ్జీవవిశిష్టుఁడైయున్న)* పరమాత్మునికే వాచకము లగును.

---

నను అన్నియు ఆ ఒక్కమృత్తికయొక్క రూపవిశేషములే యగును గాన వానిని చూచినప్పుడు 'మృత్తు అను ద్రవ్యమే యిట్లు ఉన్నదికాని మఱి వేఱుపదార్థముకాదు' అని మృత్తు నెఱుఁగుటచే దానిరూపవిశేషములే యగుటక్కన వన్నియు నెఱుఁగఁబడినవే యగుచున్నవి. ఇట్లు కారణమగు మృత్తుజ్ఞానముచేత తత్కార్యములగు కుండమూఁకుడు మొదలైనవి జ్ఞాతములగుచున్నవి అవన్నియు పెక్కు నామరూపములు గలిగియుండినను నిజమునకు మృత్తేయగుటచే వానినెల్ల మృత్తుగా గ్రహించుటే వానిని సరిగా నెఱుఁగుటయగును మృత్తు నెఱుఁగమిచే తదాకారములను జూచినను అవి యిట్టివని యెఱుఁగుట కలుగనేరదు. మృత్తు నెఱిఁగినచో తత్కార్యములను సైతమెఱుఁగనగును. ఇట్లు సూక్ష్మచిదచిద్వస్తుశరీరమగు పరబ్రహ్మము కారణము. అదియె లీలార్థము నానా నామరూపచిదచిత్సముదాయమైన జగత్తు అనుకార్యమయ్యెను. సమస్తమునకు ఏకకారణమైన బ్రహ్మము నెఱుఁగుటచే తత్కార్యములగు చిదచిద్వస్తువులు సర్వమును ఎఱుఁగఁబడుచున్నవి. ఆయేకకారణజ్ఞానముచే సర్వమైన తత్కార్యజ్ఞానముకలుగుచున్నది. ఇదియే ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞాన మనుటకర్థము. ఇదియు నిర్వికార నిర్దోషశ్రుతులకు విరుద్ధము కాకున్నది. కనుక నీ యర్థము ప్రతిపక్షులు చెప్పునర్థముకంటె ఉపపన్నమైనదని భావము. నిర్వికారాదిశ్రుతులకు విరుద్ధముకామి మీఁద చెప్పఁబడును.

* పరమాత్మ జీవశరీరుఁడై యచిత్తును ప్రవేశించుటచేతనే నామరూపవ్యాకరణము కలుగుననుటవలన ఒక్కొక్కయచిద్వస్తువునకును పరమాత్మ అట్లు ప్రవేశింపనియెడల ఏ పేరును రూపును గలుగనేరదు. అదియొకపదార్థము కానేరదు అని తెలియుచున్నది. కనుక ఒక యచిద్వస్తువునకు ఒకపేరు కలిగెనేని దానియందు జీవశరీరుఁడై యీశ్వరుఁడు ప్రవేశించియుండవలెను. దానియందు అట్లు పరమాత్మ ప్రవేశింపకమునుపు ఆపేరు, అట్లు ప్రవేశింపని కేవల పరమాత్మకుఁగాని అతనికి శరీరమైనదై ప్రవేశింపని కేవలమైన చిత్తునకుఁగాని యీరెండును ప్రవేశింపని కేవలమైన దాని యచిద్రూపమునకుఁగాని ప్రత్యేకముగా కలుగనేరదు. ఆమూఁడును శరీరశరీరిభావమునఁగూడి ఒక్కవస్తువైన పిదపనే ఆపేరు కలుగును. అనఁగా ఆ యచిత్తుతోడను అందలి చిత్తు

కనుక కారణావస్థుఁడగు పరమాత్మునికి వాచకమగు శబ్దము తోడఁ తత్కార్యవాచియగు శబ్దమునకు సామానాధికరణ్యము ముఖ్యవృత్తిచేఁ గలుగుచున్నది.

ఇట్లు సామానాధికరణ్యము ముఖ్యవృత్తమగుటచే స్థూల సూక్ష్మ చిదచిత్తులను ప్రకారములుగాఁ గల బ్రహ్మమే

---

తోడను గూడియున్న పరమాత్మునికే యాపేరు చెల్లును. ఏలన, అతఁడు అట్లు చొచ్చుటచేతనేకదా ఆపేరు కలిగినది. కనుక 'యక్షుఁడు' అనునామము యక్షశరీరరూపమైన యచిత్తుతోను అందలి చిత్తుతోను గూడియున్న పరమాత్మునికే చెల్లుచున్నది. అనఁగా కారణమైన సరమాత్మ, యక్షుని యాత్మయగు చిత్తుతోఁగూడి యక్షుని శరీరమైన యచిత్తునందుఁ బ్రవేశించి యక్షుఁడు అనఁబడుకార్యమయ్యెను. కనుక కారణవాచియగు పరమాత్మశబ్దముతో తత్కార్యవాచియగు యక్షశబ్దమునకు 'యక్షుఁడు' 'పరమాత్మ' అని సామానాధికరణ్యము కలుగుచున్నది. ఇట్లు ఈశ్వరుఁడే యన్నిటికిని కారణమును, అన్నియు వానికార్యములును అగుటచే ఆ కార్యములన్నింటికిని వాచకములగు శబ్దములెల్ల తత్కారణమగు నీశ్వరునికే చెల్లును. కనుక కార్యవాచకములగు శబ్దములెల్ల కారణవాచియగు పరమాత్మశబ్దముతో సామానాధికరణ్యము కలిగియుండును.

* శబ్దవృత్తులు-అభిధలక్షణ వ్యంజనయని మూఁడు గలవు. అందు ఒకశబ్దము దానికి సంకేతితమైనయర్థముతోఁ గూడియుండుట అభిధ. 'మృగరాజు సింహము' అనుచో సింహశబ్దము దానికి సంకేతితమైన యర్థమే కలిగియున్నది. ఇట్టిశబ్దము వాచకమనియు, ఇట్టియర్థము వాచ్యము- ముఖ్యము - శక్యము అనియు, ఈవృత్తి అభిధ-ముఖ్య-శక్తి యనియు పేర్కొనఁబడును. ఒకశబ్దము దాని సంకేతితార్థమును జెప్పక ఆ యర్థమును సంబంధించిన మఱొకదానిని జెప్పుటె లక్షణయగును. 'ఆ రాజు సింహము' అనుచో సింహశబ్దమునకు నిజమైన సింహమిచట అర్థముగాక యా సింహమును సంబంధించిన పరాక్రమాదిగుణములే లక్షితములగుచున్నవి. ఇట్టిశబ్దము లక్షకమనియు ఇట్టియర్థము లక్ష్యమనియుఁ బేర్కొనఁబడును. విస్తరభీతిచే నిట వ్యంజన వివరింపఁబడదు. ఇచట సామానాధికరణ్యము కలుగుట ముఖ్యవృత్తిచేతనా లక్షణావృత్తిచేతనాయని శంక కలుగఁగా, కార్యవాచకములగు శబ్దములెల్ల కారణమగు పరమాత్మయందు పర్యవసించుటచే పరమాత్మవాచిశబ్దముతో ముఖ్యవృత్తిచేతనే సామానాధికరణ్యము నొందవలయునుగాని ప్రతిపక్షులు చెప్పునట్లు లక్షణావృత్తిచేఁ గాదని గ్రాహ్యము.

*కార్యకారణములు రెండును అగునుగాన బ్రహ్మమే జగత్తునకు ఉపాదానమగును. ఇట్లు జగత్తునకు బ్రహ్మము ♦ఉపాదానమైనను సూక్ష్మచిదచిద్వస్తువులు శరీరముగాఁగల బ్రహ్మమే కారణముగాని శుద్ధబ్రహ్మము అట్లు కాదని చెప్పియుండుటచే, సంఘాతమే (అనఁగా చిదచిదీశ్వరు లనెడిమూఁటియొక్క కూడికయే) ఉపాదాన మగుచున్నది గాన చిదచిదీశ్వరులకుఁగల స్వభావములు ఒండొంటితోఁ గలసి సంకరము నొందమియు మరింతయుపపన్నముగా నున్నది. ఎట్లనఁగా, తెల్లనివి నల్లనివి ఎఱ్ఱనివి అని మూఁడువిధములగు నూలిపోఁగులయొక్క సంఘా

* కారణవాచి పరమాత్మశబ్దముతో కార్యవాచిశబ్దమునకు సామానాధికరణ్యము ముఖ్యవృత్తిచే గలుగునేని అప్పుడు కారణమును కార్యమును ఒక్కదానియందె పర్యవసించును. అనఁగా పరమాత్మయే కారణమును కార్యమును అగును. ఐనను కేవలమైన బ్రహ్మము స్వరూపమున నిర్వికారమైనది గనుక అది కార్యకారణములుగా పరిణమింపమిచే స్థూలసూక్ష్మ చిదచిద్విశిష్టమైన బ్రహ్మమే కార్యమును కారణమును అగునని చెప్పఁబడెను. స్వరూపమునఁగాక విశిష్టరూపమున కార్యకారణము లగునని భావము.

♦ మృత్తు కారణము కుండ కార్యము. ఇట్లు కారణమును కార్యమును ఏకద్రవ్యములగుటచేకుండకు మృత్తు ఉపాదానమగుచున్నది ఇట్లె బ్రహ్మము కారణమును కార్యమును అగు ననుటవలన కార్యకారణము. లేక ద్రవ్యమగుటంబట్టి కార్యమైన జగత్తునకు కారణమైనబ్రహ్మమే కుండకు మృత్తువలె ఉపాదానమగును. కనుకనే జగత్తు బ్రహ్మోపాదాన మనఁబడెను. ఐనను బ్రహ్మమును జగత్తును స్వరూపమున అత్యంత భిన్నములుగాన రెండును ఏకద్రవ్యము కానేరవు. ఇట్లేకద్రవ్యముకాని యారెంటికి కార్యకారణభావము కలుగనేరదు. కాన బ్రహ్మమెట్లు జగత్తున కుపాదానమగును? అని యడుగవచ్చును. బ్రహ్మము స్వరూపముచే కార్యకారణము లగుటలేదు. చిదచిత్తులతోఁగూడి, వాని స్థూలసూక్ష్మావస్థలచే కార్యకారణము లగుచున్నవి. కనుక కేవలబ్రహ్మము కాక సూక్ష్మచిదచిద్విశిష్టబ్రహ్మమె కారణము. స్థూలచిదచిద్విశిష్టబ్రహ్మమె (అనఁగా జగత్తే) కార్యము. కార్యకారణములయిన యీ విశిష్టవేషములు రెండును ఏకద్రవ్యమె యగుటచే మొదటిది రెండవదానికి ఉపాదానమగుట యొప్పును. ఇట్లు బ్రహ్మము స్వరూపము మాఱుటచేతనే జగత్తు అగుటవలన వానికి స్వరూపహానియులేదు. అది స్వరూపమున నిర్వికారమును విశిష్టవేషమున వికారియు నగుటచే వికారశ్రుతులకును నిర్వికారశ్రుతులకును విరోధము కలుగదు.

తమే చిత్రవస్త్రమున కుపాదానముగా నుండినప్పటికిని, ఆయా నూలిపోఁగు లుండుచోటనే ఆయా తెలుపు మొదలైన వర్ణముల సంబంధ ముండునప్పుడు ఆనూలిపోఁగుల కెట్లు * వర్ణసంకరములేదో, అట్లే వానికి చిత్రవస్త్రరూపమైన కార్యావస్థయందుఁ గూడియుండునప్పుడును వర్ణసంకరము సర్వత్ర కలుగదు. అట్లై చిత్తు అచిత్తు ఈశ్వరుఁడు అను నీమూఁటియొక్క సంఘాతము ఉపాదానమైనను జగత్తునకు కార్యావస్థయందు సైతము భోగ్యత్వ భోక్తృత్వ నియంతృత్వాది సంకరము కలుగదు. మఱియు నామూఁడువిధములగు తంతువులు ఒకటి నొకటి విడిచి వేఱుగా నుండఁగూడినవియు పురుషుఁడు కోరఁగా ఒకానొకప్పుడు ఒకటిగాఁ గూర్పఁబడినవియునగును. అట్టి తంతువులు అట్లు వేఱుగా నుండునప్పుడే కారణముగాను, కూడియుండునప్పుడు కార్యముగాను నుండును. కనుక మూఁడును, కారణమును కార్యమును అగును. ఇందన్నో అట్లు కాదు. చిదచిత్తులు సర్వావస్థలయందును (అనఁగా కార్యకార

* మూఁడువిధములయిన తంతువులు కారణము. చిత్రవస్త్రము కార్యము. కారణావస్థయందు తంతువులు ఒకటిని విడిచి యొకటి వేఱుగా నుండునుగాన వానివర్ణములును ఒకటితోనొకటికలసి సంకరముకావు. అవి ఒక్కటిగాఁగూడి చిత్రవస్త్రరూపమగు కార్యమైనప్పుడును గూడ ఆయా తంతువు ఉండుచోట ఆయా వర్ణమాత్రమె యుండును గాని అన్నివర్ణములు నుండవు కనుక కార్యావస్థయందును వానికి వర్ణసంకరములేదు. ఇట్లే భోక్తయైన చిత్తును భోగ్యమైన అచిత్తును నియంతయగు ఈశ్వరుఁడును ఈ ముగ్గురును ఒక్కటిగాఁగూడి యుపాదానమైన జగద్రూపకార్యావస్థను బొందినను వానివానికిఁగల భోక్తృత్వాదిస్వభావములు ఒండొంటితోఁగలసి సంకరమొందవు. మఱియు శరీరముయొక్కయు ఆత్మయొక్కయు సంఘాతమైన యొక బాలుఁడు యౌవనదశ చెందినప్పుడు వాని బాలశరీరమునకుఁగాని ఆ శరీరమునందలి యాత్మకుఁగాని స్వభావసంకరముకలుగునట్లు సూక్ష్మ చిదచిదీశ్వరసంఘాతము స్థూలసంఘాతమైనను స్వభావసంకరము పొందదని గ్రాహ్యము.

రావస్థలు రెంటియందును) పరమపురుషుని విడిచి వేఱైయుండ నేరక అతనికి శరీరమై ప్రకారమై (విశేషణమై) యుండుట వలననే ఆమూఁడును శరీరాత్మభావమున నొక్కటిగాఁగూడి శరీరి (అనఁగా పరమపురుషుఁడు) అను ఒక్క పదార్థమే యగుటచే, అవి ప్రకారముగాఁ గల ఆపరమపురుషుఁడే కారణమును కార్యమును అగుచున్నాఁడు గనుక వాని ప్రకారములైన చిదచిద్వస్తువులకు వాచకములగు శబ్దము లెల్లప్పుడును (అనఁగా ఉభయావస్థలందును) ప్రకారియగు నాతనికే వాచకములగును. ఇదియు యిందుఁగల *విశేషము. (తంతుసంఘాతమున ఈ శరీరాత్మభావము లేమిచే ఈవిశేషము గలుగదు.) స్వభావభేదమును స్వభావములకు సంకరము కలుగమియు అందును ఇందును సమము. ఇట్లగుటచే పరబ్రహ్మము కార్యమందు ప్రవేశించినను (అనఁగా చిదచిత్తులతోఁగూడ కార్యావస్థ నొందినను) స్వరూపముచేఁగాక విశిష్టరూపముననే అట్లు సేయుచున్నాఁడు. కనుక వాని స్వరూపమునకు మాఱుపాటు

---

* శుక్ల కృష్ణ రక్త తంతువులసంఘాతమైన చిత్రవస్త్రమునకు ఆ సంఘాతములో తెల్లదిగాని నల్లదిగాని ఎఱ్ఱదిగాని యగు నేదైన నొకతంతువుతోడ విశేషించి సామానాధికరణ్యము కలుగదు గదా. అట్లే చిదచిదీశ్వర సంఘాతమైన జగత్తునకు ఆసంఘాతములో నొకటియైన ఈశ్వరునితో సామానాధికరణ్య మెట్లు కలుగును? అని యడిగినచో తంతుసంఘాతమునకును చిదాదిసంఘాతమునకును స్వరూపభేదస్వరూపాసంకరములందు మాత్రమే సామ్యముగాని తక్కినవిధము లన్నిటను సామ్య మున్నదనరాదు. కనుక సామానాధికరణ్యము చిదాదిసంఘాతముననే కలదుగాని తంతు సంఘాతమునఁ గానిపింపదు. ఎట్లన మొదటిదానియందు మూఁడువిధములైన తంతువులును వీడియుఁ గూడియు కారణమును కార్యమునగుచున్నవి. రెండవదానియందో చిదచిత్తులు ఈశ్వరుని ఎప్పుడు వీడకుండుటచే ఆమూఁడు శరీరాత్మభావమున నొక్కటిగాఁగూడి శరీరియగు పరమపురుషుఁ డొక్కఁడుగా నగుటచే పరమపురుషుఁడే కారణమును కార్యమునుగా నున్నాఁడు కనుక చిదచిద్వాచకములుగాని జగద్వాచకములుగాని భగవంతునికిని వాచకము లగుటచే సామానాధికరణ్యము కలుగుచున్నది. ఇట్టి శరీరాత్మభావము

గలుగమివలన వాని కేవికారము కలుగ దనుటయు ఉపపన్న
ముగా నున్నది. * (ఏవికారమైనను పొందకయే కార్యము
కావలయును. స్వరూపమున ఏవికారము నొందకపోయినను
విశిష్టవేషమున నైన ఏవికారమును బొంది కార్యమగు
చున్నాఁడు? అనినచో) ♦కార్యత్వమనఁగా మరియొకయవస్థను
పొందుటే కాని వేఱుకాదు. కనుక నామరూపవిభాగరహిత

---

తంతుసంఘాతమున లేమిచే అందు ఏదానికి వాచకమగు శబ్దముగాని తత్కార్యమగు పటమునకుఁ జెల్లదు. కనుక నందు సామానాధికరణ్యము కలుగదు. శబ్దముల కేకవిశేష్యమునందు పర్యవసించుటకుఁదగిన ప్రకారప్రకారిభావ మెందుఁ గలదో అందే సామానాధికరణ్యముగాని తక్కినచోఁ గాదని తెలియునది.

* ఉపాదాన మగుమన్ను వికారమునొందియే కుండ యనుకార్య మగుచున్నది. ఉపాదానములెల్ల కార్యమగునప్పుడు వికారము నొందునేకాని నిర్వికారము కానేరదు. కనుక ఉపాదానమగు బ్రహ్మము జగత్తు అను కార్యమగునప్పుడు వికారము నొందవలసియుండఁగా అది నిర్వికారమని శ్రుతి చెప్పుట యెట్లు? అనినచో బ్రహ్మము స్వరూపముచేతఁగాక చిదచిద్విశిష్టాకారముచేతనే ఉపాదానమును కార్యమును అగుటచేతను, చిదచిత్తులతోఁగూడినను స్వభావాదిసంకరమునొందవని నిరూపించియుండుటచేతను, వానిస్వరూపమున కేవికారమును గలుగదు. కనుక వాఁడు కార్యమయ్యు నిర్వికారుఁడే యగును. నిర్వికారశ్రుతులు స్వరూపమును గుఱించియు, ఉపాదాన కార్యశ్రుతులు విశిష్టవేషమును గుఱించియుఁ బ్రవర్తించునవిగాన విషయములు వేఱువేఱగుటచే అవి చెప్పునవియు వేఱువేఱుగ నున్నవేకాని పరస్పరవిరోధము చేతఁ గాదని తెలియునది.

♦ ఉపాదానమగు మృత్తు ఘటము అను కార్యమగుచున్నది. మృదవస్థమైనది ఘటత్వావస్థను పొందుటచే కార్యమైనది. దీనిచే, కార్యత్వమనఁగా అవస్థాంతరమును బొందుటయని తెలియుచున్నది. కనుక బ్రహ్మము అవస్థాంతరము పొందినచే కార్యమగును. వానిస్వరూపము నిర్వికారముగనుక అందు అవస్థాంతరము పొందకపోయినను విశిష్టాకారమందైనను అవస్థాంతరము పొందియే కార్యము కావలయును. అట్టియవస్థాంతరమేది? యన్నచో, నామరూప విభాగరహితమైన సూక్ష్మచిదచిత్తులకు ఆత్మగా (అనఁగా నియమనధారణములు చేయువాఁడుగా) ఉండునట్టి యవస్థను విడిచి, నామరూపవిభాగములుగల స్థూలచిదచిత్తులకు ఆత్మగా నుండునట్టి యవస్థను బొందుటయే యవస్థాంతరప్రాప్తి. దీనిచే వానికి వికారము లేకయే కార్యత్వము సిద్ధించుచున్నది.

మైన సూక్ష్మచిదచిత్తుల కాత్మగానుండిన యవస్థనుండి *నామ రూప విభాగసహితమైన స్థూలచిదచిత్తుల కాత్మయగు నవస్థాంతరమును బొందుటచే ఈశ్వరునికి వికారము లేకయే కార్యత్వము కలుగుట యుపపన్నముగా నున్నది. మఱియు నిర్గుణవాదములును (అనఁగా బ్రహ్మమునకు గుణములు లేవను వాదములు) పరబ్రహ్మమునకు హేయగుణ సంబంధము లేమిచేఁ బొసఁగుచున్నవి. ఎట్లన, * 'అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాసః' (ఛా ౮-౭-౧) అని హేయగుణములను ప్రతిషేధించి మఱియును, 'సత్యకామ స్సత్యసఙ్కల్పః' అని కల్యాణగుణగణములను విధించుచున్నట్టి యీశ్రుతియే, తక్కిన శ్రుతులందు సామాన్యముగాఁ దెలియఁ

విశేషణములకు అవస్థాంతరము కలిగినప్పుడు అట్టి క్రొత్తయవస్థయందు ఆయావానిని నియమనము సేయుట యనునది వానియొక్క విశేష్యమునకుఁ గలుగు నవస్థాంతరము.

* ఇచట చిదచిత్తులు విశేషణములనియు పరమాత్మ విశేష్యమనియుఁ దెలియు నది. పరమాత్మ కార్యమగుట (అనఁగా నామరూపములుగల చిదచిత్తుల కాత్మయగుట) యని చెప్పుటచే, ఆ చిదచిత్తుల నామరూపములు ముఖ్యవృత్తిచే పరమాత్మునికి చెల్లునని భావము. నామరూపములు విశేషణములవఱకె చెల్లునేని ఆ విశేషణములె కార్య మనఁదగును గాని విశేష్యమగుపరమాత్మను కార్యమనరాదు. కనుక శ్రుతి నామరూప వ్యాకరణమును లక్షణచేఁగాక ముఖ్యవృత్తిచేతనే పరమాత్మ పర్యంతమైనదని చెప్పుచున్నదని తెలియునది. అట్లు ముఖ్యవృత్తిచేఁ జెప్పుటవలననె పరమాత్మకు కార్యత్వము సిద్ధమని గ్రాహ్యము.

* 'వాఁడు పాపరహితుఁడు, ముసలితనము లేనివాఁడు, మరణము లేనివాఁడు, శోకములేనివాఁడు, ఆఁకలిలేనివాఁడు, దప్పిలేనివాఁడు' అని యర్థము ఇచట పాపము ముసలితనము మొదలైనవి హేయగుణములు. సత్యకామత్వాదులు కల్యాణగుణములు. ఇట్లీశ్రుతి హేయగుణములను నిషేధించి కల్యాణగుణములను విధించుచుండఁగా 'నిర్గుణమ్' అనుటవు ఏగుణమును లేనిదని యర్థము కానేరదు; హేయగుణములుమాత్రము లేనిదని యర్థము గ్రాహ్యము. ఇట్లు ఈశ్రుతినిబట్టి తక్కినచోట్ల సామాన్యముగా గుణముల నిషేధించుట యెల్ల హేయగుణముల నిషేధించుటయె యగునని తెలియునది.

బడిన గుణనిషేధము హేయగుణములను (మాత్రము) గుఱించిన నిషేధమని వ్యవస్థాపించుచున్నది. మఱియును,

♦'జ్ఞానస్వరూపము బ్రహ్మము' అను వాదమునకు సర్వజ్ఞుఁడును సర్వశక్తియు నిఖిల హేయప్రత్యనీక కల్యాణగుణాకరుఁడు నైన బ్రహ్మముయొక్క స్వరూపము జ్ఞానైకనిరూపణీయ మనియు, తనంతనె ప్రకాశించున దగుటచే జ్ఞానస్వరూప మనియ భావము నంగీకరించుటచే నదియు మఱింత యుపపన్నమగును.

* 'య స్సర్వజ్ఞ స్సర్వవిత్' (ము. ౧-౧-౯)

♦ 'పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞానబలక్రియాచ' (శే. ౬-౮)

♦ 'విజ్ఞాతార మరే కేన విజానీయాత్' (బృ. ౪-౪-౧౪)

ఇత్యాదులు జ్ఞాతృత్వమును దెలుపుచున్నవి. మఱియు

---

♦ 'జ్ఞానస్వరూపమ్ బ్రహ్మ' అనుటను బ్రహ్మము వట్టి జ్ఞానమమాత్రమే స్వరూపముగాఁ గలది (అనఁగా అది వట్టి జ్ఞానమొక్కటిమాత్రమే యగును) అని అర్థము కాదు. జ్ఞానముచేతనే నిరూపింపఁదగిన స్వరూపముగలది అని యర్థము. ఏలన 'యస్సర్వజ్ఞః' ఇత్యాదిశ్రుతులు బ్రహ్మమును జ్ఞాతగా ప్రతిపాదించుచుండఁగా జ్ఞాత యగునది వట్టిజ్ఞానమాత్ర మెట్లగును? కనుక 'జ్ఞానస్వరూపమ్' అనుటను 'జ్ఞానమే స్వరూపముగాఁ గలది' అని యర్థముసేయక 'జ్ఞానముచేతనే నిరూపింపఁదగిన స్వరూపము గలది' యని యర్థము సేయఁదగును. అనఁగా, ఒక్కదానికిఁ గలధర్మములు దాని స్వరూపమును ఇట్టిదని నిరూపించునవియగును. ఇచట జ్ఞానముధర్మమును బ్రహ్మము ధర్మియుఁగనుక ధర్మమైన జ్ఞానముచే ధర్మియైన బ్రహ్మముయొక్క స్వరూపము నిరూపింపఁదగునని భావము. మఱియు ధర్మమైనజ్ఞానమెట్లు స్వప్రకాశమైనదో అట్లె ధర్మియగు బ్రహ్మముయొక్క స్వరూపమును స్వప్రకాశమైన దగుటంబట్టి అదిజ్ఞానస్వరూప మనఁబడెనని గ్రాహ్యము.

* ఎవఁడు సర్వము నెఱింగినవాఁడో, సర్వమం దున్నవాఁడో

♦ వానియొక్క పరశక్తియు స్వాభావికములైన జ్ఞానబలక్రియలును వివిధము లని శ్రుతులు చెప్పుచున్నవి.

♦ ఓరీ! అన్ని తెలిసినట్టివానిని దేనిచేఁ దెలియవచ్చును?

♦ 'సత్యం జ్ఞాన (మనన్తం బ్రహ్మ') (తై. ఆన. ౧-౧) ఇత్యాదులును జ్ఞానైక నిరూపణీయ మగుటచేతను స్వప్రకాశమగుట చేతను జ్ఞానస్వరూప మైనదగుటయుఁ దెలుపుచున్నవి. మఱియును

1. "సోఽకామయత బహుస్యామ్" (తై. ఆన. ౬)
2. "తదైక్షత బహుస్యామ్" (తై. ఆన. ౬)
3. "తన్నామరూపాభ్యాం వ్యాక్రియత" (ఛా. ౬-౨-3)
4. * ["ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాతే ఇదం సర్వం విదితం భవతి"
5. "సర్వం తం పరా దాద్యో న్య త్రాత్మన స్సర్వం వేద"
6. "తస్యహావా ఏతస్య మహతో భూతస్య నిశ్వసిత మేతదృగ్వేదః"]

---

♦ బ్రహ్మము సత్యమును జ్ఞానమును అనంతమును- అని యర్థము. స్వరూప నిరూపకములైన ధర్మములకు వాచకము లయినశబ్దము లాధర్మములను ప్రతిపాదించుట ద్వారా వానిధర్మినిసైతము ప్రతిపాదించును. బ్రహ్మస్వరూపనిరూపకధర్మము లయిన జ్ఞానత్వసత్యత్వాదులకు వాచకములైన జ్ఞానసత్యాదిశబ్దము లాధర్మములను ప్రతిపాదిం చుమూలమున వానిధర్మియగు బ్రహ్మమును సైతము ప్రతిపాదించుచున్నవి. 'సత్యం జ్ఞానం బ్రహ్మ' అనుటకు బ్రహ్మము వట్టిసత్యమాత్రము వట్టిజ్ఞానమాత్రము అని యర్థము కాదు. ధర్మి వట్టిధర్మమాత్ర మెట్లగును? ధర్మము ప్రత్యేకముగా ఒకవస్తువును గానేరదు. కనుక ధర్మియగు బ్రహ్మము సత్యత్వజ్ఞానత్వాది ధర్మములుగలవాఁడనిభావము. ఇట్లె 'జ్ఞానస్వరూపమ్' అనుటకు జ్ఞానమాత్ర స్వరూపమని గ్రహింపక జ్ఞానైకనిరూపణీయ స్వరూపమని యర్థము గ్రహించినవారైరి.

1. వాఁడు పెక్కుఅయ్యెదను అనికోరెను. 2. పెక్కుఅయ్యెదను అని ఆలో చించెను. 3. దానిని నానారూపములచే విభజించెను. 4 ఓరీ! ఆత్మయే చూడఁబడె నేని వినఁబడెనేని తలంపఁబడెనేని ఎఱుఁగఁబడెనేని ఈసర్వమును ఎఱుఁగబడిన దగు చున్నది. [ఈసర్వము ఆత్మయేయనుట, ఆత్మ యీసర్వప్రకారముల నున్నదనుట] 5. ఎందాత్మతప్ప అన్నియుఁ దెలియునో అది యంతయు త్యజింపవలయును [పర మాత్మయే యన్నిట అనఁగా అనేక రూపముల-నున్నదనుట] 6. ఈ గొప్పభూతము యొక్క నిశ్వాసములే ఋగ్వేదమగును. [ఈశ్రుతులచేనెల్ల బ్రహ్మము స్వసంకల్పము వలన చరాచరాత్మకములగు నానాప్రకారముల నెలకొనుచున్నాఁడని తెలియునది.

ఇత్యాదిశ్రుతులు బ్రహ్మము తానే తన సంకల్పమువలన విచిత్ర చరాచరవస్తురూపముల నానాప్రకారుఁడై నెలకొనియున్నాఁడని ప్రతిపాదించుచున్నవి. కనుక

1. "మృత్యోస్స మృత్యు మాప్నోతి
య ఇహ నానేవ పశ్యతి (బృ. 3-౪-౭)
"నేహ నానాస్తి కించన" (కఠో. ౨-౧-౧౦)

2. 'యత్రహి ద్వైతమివ భవతి।
తదితర ఇతరం పశ్యతి।
యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్।
తత్కేన కం పశ్యేత్ (బృ. ఉప-౪-౪-౧౪)

ఇత్యాదిశ్రుతులచేత నానాత్వము లేదనుట బ్రహ్మాత్మకములు కానివస్తువుల నానాత్వము తత్త్వము కాదని ప్రతిషేధించుటయే యగునుగాని 'బహుస్యాం ప్రజాయేయ' (తై. ఆన. ౬-అను; ఛా. ౬-౨-3) ఇత్యాదిశ్రుతిసిద్ధమయి స్వసంకల్పకృతమయి నానా నామరూపములఁ బొందుటచేఁ గలిగినదియునయిన బ్రహ్మయొక్క *నానాప్రకారత్వమునుగూడ నిషేధించుటకాదు. ఈవిషయ మిట్టిదే యని

---

[*] ఈశ్రుతులు కొన్నిప్రతులందు కానిపింపవు.

1. ఎవఁడు ఇందు (ఈబ్రహ్మమునందు) భేదమువలె చూచుచున్నాఁడో వాఁడు సంసారమునుండి సంసారమును బొందును. ఇందు (ఈబ్రహ్మమునందు) పెక్కు కొంచెమైనను లేదు. 2. ఎచట ద్వైతమువలె ఏయవస్థయందు ద్వైతమువలె (అనఁగా పరమాత్మకంటె వేఱైనవానివలె లేక స్వతంత్రునివలె) అగపడుచున్నాఁడో, అపుడు ఇతరముగా ఇతరుఁడు చూచుచున్నాఁడు. ఎచ్చట వీనికి అంతయు ఏకాత్మమై కనుపట్టునో అచట ఏది మఱిదేనిచే చూడఁబడెను? [ఈశ్రుతులందు ఒక్కటియే కాని నానాత్వము లేదనఁబడుచున్నది.]

* 'సోఽకామయతి' ఇత్యాదిశ్రుతులు నానాత్వమును విధించుచున్నవి. 'మృత్యోస్సమృత్యుమ్' ఇత్యాదిశ్రుతులు నానాత్వము లేదనుచున్నవి. ఈ విరోధమునకు సమాధానమెట్లు? అనినచో 'సోఽకామయతి' ఇత్యాదిశ్రుతులు బ్రహ్మమునకు స్వసం

* 'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్' (బృ. ४-४-౧४)

ఇత్యాది నిషేధవాక్యముల యారంభమునందుఁ గల 'సర్వం తం పరా దాద్యో న్య త్రాత్మన స్సర్వం వేద' (బృ-४-४-౬)

'తస్యహవా ఏతస్య మహతో భూతస్య నిశ్వసిత మేత దృగ్వేదః' (సుబా ౨-ఖం.)

ఇత్యాదులచే స్థాపింపఁబడినది. ఇట్లు చిదచిదీశ్వరుల స్వరూప భేదమును స్వభావభేదమును జెప్పుశ్రుతులకును కార్యకారణ భావమును కార్యకారణములకు అనన్యత్వమును జెప్పుశ్రుతులకును నెల్ల విరోధము లేదని (చిదచిత్తులకును బరమాత్మునకును సర్వదా శరీరాత్మ భావమును శరీరభూతములైన యారెంటికి కారణదశయందునామరూప విభాగమున కర్హముగాని సూక్ష్మదశ గలుగుటయును కార్యదశయందు అందుల కర్హమగు స్థూలదశ గలుటయును జెప్పు) శ్రుతులచేతనే తెలియుచున్నవి. కనుక బ్రహ్మాజ్ఞానవాదము ఔపాధిక బ్రహ్మభేద వాదము అపన్యాయమూలమగు తక్కిన వాదములును సకలశ్రుతి విరుద్ధములగుటచే వాని కిం దేవిధముననుఅవకాశము కనుపట్టదు. కాన వానినిగుఱించి విస్తరించి చెప్పనక్కఱలేదు

---

కల్పముచే నానా నామరూపములఁ బొందుటవలననైన నానాత్వమును విధించుచున్నవనియు 'మృత్యోః' ఇత్యాదులు బ్రహ్మాత్మకములుగాని వస్తువుల నానాత్వమును నిషేధించుచున్నవనియు విషయభేదమువలన వానికి విరోధము కలుగదనియు తెలియునగు. మొదటితెగ బ్రహ్మము పెక్కురూపములై నాఁడనియు రెండవతెగ బ్రహ్మాత్మకము గానిది పెక్కు (అనఁగా ఒక్కటియు) లేదనియు తెలుపుచున్నదని భావము. కనుక 'నేహనానా' ఇత్యాదులందలి నానాత్వనిషేధము బ్రహ్మాత్మకములుగాని వాని నానాత్వముయొక్క నిషేధమేకాని పరపక్షులు చెప్పునట్లు 'బహుస్యామ్' ఇత్యాదులందలి బ్రహ్మముయొక్క నానాప్రకారత్వము నిషేధించుట గాదని భావము.

* నిషేధవాక్యములందున్న 'యత్రత్వస్య' శ్రుతి బ్రహ్మనానాప్రకారత్వమును నిషేధించుచున్నదని పరపక్షులు చెప్పెదరుగాని ఆవాక్యమునందే మొదటనున్న 'సర్వం తం' ఇత్యాదులు అబ్రహ్మాత్మక నానాత్వమునే నిషేధించుచున్నవిగాని బ్రహ్మ న్నానా

శ్లో॥ తత్క్షేత్రం *యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్।
సచ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శ్రుణు॥ 4

టీ. తత్ క్షేత్రం = ఆక్షేత్రము, యచ్చ = ఎదియో-ఏద్రవ్యమైనదియో, యాదృక్చ = ఎటువంటిదో-వేనికి ఆశ్రయమైనదో, యద్వికారి = ఏవి వికారములుగాఁ గలదియో-దాని వికారము లెవ్వియో, యతశ్చ = ఎందువలననో-ఎందుకొఱకది కలిగినదో-ఏప్రయోజనము కొఱకది పుట్టినదో, యత్ = ఎదియో-ఏస్వరూపమైనదో, సచ = వాఁడును - క్షేత్రజ్ఞుఁడును, యః = ఏస్వరూపముగలవాఁడో, యత్ ప్రభావః = ఏవి ప్రభావములుగాఁ గలవాఁడో - ఉత్కృష్టములై యాశ్చర్యకరములగు వానిస్వభావవిశేషము లెవ్వియో, తత్ = దానిని-దాని నంతయును, సమాసేన = సంక్షేపముగా, మే = నావలన, శ్రుణు = (హెచ్చరికతో) వినుము.

తా. ఆ క్షేత్రము ఏద్రవ్యమైనదో, వేనికి ఆశ్రయమైనదో, దాని వికారము లెవ్వియో, ఏ ప్రయోజనము కొఱకు అది కలిగినదో, ఏస్వరూపమైనదో, ఆక్షేత్రజ్ఞుఁడును ఏస్వరూపముగలవాఁడో, వాని ప్రభావము లెవ్వియో, దానినంతయు సంక్షేపముగా నావలన సావధానముగా వినుము.

---

ప్రకారత్వమును నిషేధింపదు. కనుక నడుమనున్న 'యత్రత్వస్య' శ్రుతియు అబ్రహ్మాత్మక నానాత్వమునే నిషేధింపవలయును. బ్రహ్మ నానాప్రకారత్వమును నిషేధించిన యెడల ఉపక్రమమునకది విరుద్ధమగు నని భావము.

* ఇందు మొదటి యచ్ఛబ్దము ద్రవ్యపరమైనది- అనఁగా జడాజడ ద్రవ్యవిశేషములలో ఏద్రవ్యమైనది యనుట. కడపటి యచ్ఛబ్దము స్వరూపపరము - అనఁగా సంఘాతరూపమైన - అది జడద్రవ్యమని తెలిసినపిదప ఆ జడద్రవ్యములలో నేది- ఏయే జడద్రవ్యముల సంఘాతముచేనైనది యనుట.

శ్లో॥ *ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః॥ 5

టీ. ఋషిభిః = పరాశరాదిఋషులచేత, బహుధా = బహు ప్రకారములుగాను-సంక్షేపవిస్తరాదిరూపములుగా ననుట, వివిధైః= వేఱు వేఱువిధములు గల-వేఱువేఱు ప్రతిపాదించుప్రకారములుగల - వేఱు వేఱు ప్రకారముల ప్రతిపాదించునట్టి యనుట, ఛందోభిః=వేదములచేతను, హేతుమద్భిః=హేతువులతోఁ గూడినవియు, వినిశ్చితైః = లెస్సగా నిశ్చయింపఁబడినవియు-సిద్ధాంతనిర్ణయమువఱకు పర్యవసించునవియు-ఐన, బ్రహ్మసూత్రపదైః=బ్రహ్మమును ప్రతిపాదించు సూత్రము లనెడిపదములచేతను - శారీరకసూత్రములచేత ననుట, పృథక్ = వేఱువేఱుగా - దేహాత్మల స్వరూపములు పరస్పరవిలక్షణము లైనవిగా ననుట, గీతం=వర్ణింపఁబడినది.

తా. ఈక్షేత్రక్షేత్రజ్ఞుల యాథాత్మ్యము పరాశరాది మహర్షులచేత * 'అహం త్వంచ తథాఽన్యేచ భూతై రుహ్యామపార్థివ। గుణప్రవాహపతితో భూతవర్గోపి యాత్యయమ్॥ కర్మవశ్యా గుణా హ్యేతే సత్త్వాద్యాః పృథివీపతే। అవిద్యాసఞ్చితం కర్మ తచ్చాశేషేషు జన్తుషు॥ ఆత్మా శుద్ధోఽక్షరశ్శాన్తో నిర్గుణః ప్రకృతేః పరః' (వి. పు. ౨-౧౩-౬౯-౭౧) అనియు; అశ్లో ♦పిణ్డః పృథగ్యతః పుంసః శిరఃపాణ్యా

* 'అహం...పరః' నేనును నీవును, అట్లె తక్కినవారును, రాజా! (దేహాకారముగాఁ బరిణమించిన) భూతములచే మోయఁబడెదము. ఈ జంతువర్గము గుణప్రవాహమునందుఁ బడిపోవుచున్నది. (గుణమూలమున గమనాదివ్యాపారములను జేయుచున్నదనుట). రాజా! ఈ సత్త్వాదిగుణములు కర్మాధీనములైనవి. కర్మ అవిద్యచేఁ గూర్పఁబడుచున్నది అది సకలజంతువులందును గలదు. ఆత్మ శుద్ధుఁడు, నాశరహితుఁడు, శాంతుఁడు, గుణరహితుఁడు, ప్రకృతికంటె వేఱైనవాఁడు.

♦ 'పిణ్డః...రోమ్యహమ్' రాజా! శిరఃపాణ్యాదిలక్షణములతోఁగూడిన శరీరము పురుషునికంటె వేఱైన దగుటచే 'నేను' అనెడి యీపేరును నే నెచటఁ గావింతును?

దిలక్షణః। తతో౽హమితి కుత్రైతాం సంజ్ఞాం రాజన్కరోమ్యహమ్' (వి. పు. ౨-౧౩-౮౯) అట్లే ♦ 'కిం త్వ మేతచ్ఛిరః కిన్ను ఉర స్తవ తథోదరమ్। కిము పాదాదికం త్వం వై తవై తత్కిం మహీపతే॥ సమస్తావయవేభ్య స్త్వంపృథగ్భూయ వ్యవస్థితః। కో౽హమిత్యేవ నిపుణో భూత్వా చిన్తయ పార్థివ' (వి. పు. ౨-౧౩-౧౦౨; ౧౦౩) అనియు బహుప్రకారముల వేఱువేఱ వర్ణింపఁబడియున్నది. ఇట్లే దేహాత్మలు వేఱు వేఱ వాసుదేవాత్మకము లగుటను * 'ఇన్ద్రియాణి మనో బుద్ధి స్సత్త్వం తేజో బలంధృతిః। వాసుదేవాత్మ కాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ' (మహాభారత-అనుశా-సహస్రనామాధ్యాయ. ౧౪౯-౧౧౩; బృహన్నారదీయే చ. ౩౬-౧౭) అని చెప్పియున్నారు. వివిధములగు ఋగ్యజుస్సామాథర్వ వేదములును ఆ దేహాత్మలయొక్క స్వరూపములను వేఱువేఱు ప్రకారముఁ బ్రతిపాదించుచున్నవి. 'తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః-ఆకాశాద్వాయుః-వాయోరగ్నిః-అగ్నే రాపః-అద్భ్యః పృథివీ-పృథివ్యా ఓషధయః- ఓషధీభ్యో౽న్నమ్-

♦ 'కింత్వ...చిన్తయ పార్థివ' రాజా! నీవు ఈశిరస్సా, లేక కడుపా, నీ వీపాదములు మొదలైనవియా? ఇవియెల్ల నీవియా' రాజా, అన్ని అవయములకంటెను నీవు వేఱై నెలకొనియున్నాఁడవు. రాజా! 'నే నెవఁడు' అని 'నేర్పుతోఁ జింతింపుము' అనియుఁ జెప్పఁబడియున్నవి. ఈశ్లోకములందెల్ల 'ఇదం శరీరమ్' అను శ్లోకార్థము చెప్పఁబడినదని తెలియునది.

* 'ఇన్ద్రియాణి ..క్షేత్రజ్ఞ మేవచ॥' ఈ శ్లోకమునందు 'క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి' అను శ్లోకార్థము చెప్పఁబడెనది. మఱియును- 'తావేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ', ఇత్యాది శ్రుతులందు క్షేత్రజ్ఞశబ్దము పరమాత్మవాచకమై యుండఁగా, అది జీవవాచక మెట్లగునని సందేహము రాఁగా క్షేత్రజ్ఞ శబ్దమును జీవపరముగాఁ జెప్పు నీశ్లోకమువలన అది నివర్తింపఁబడినదని గ్రాహ్యము. 'ఇది నాతల' 'ఇది నాచేయి' అని యవయములచేఁ గాని 'ఇది నాదేహము' అని మొత్తముచేఁగాని క్షేత్రమైన శరీరము నెఱుఁగుటచే పురుషుఁడు క్షేత్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁడనియు 'ఈశరీర మీకర్మారంభమునకై యీ కర్మ ఫలభోగమునకై' అని యిత్యాది క్షేత్రవిషయములను ఎఱుఁగుటచే, పరమాత్మ క్షేత్రజ్ఞుఁడనఁబడుచున్నాఁ డనియు భేదము గ్రహించునది.

అన్నాత్పురుషః- సవా ఏష పురుషోఽన్నరసమయః' (తై. ఆన. ౧-౨) అని శరీరస్వరూపమును జెప్పి పిదప ప్రాణమయము పిదప మనోమయమును జెప్పి, 'తస్మాద్వా ఏతస్మా న్మనోమయాత్-అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః' (తై. ఆన. ౧-౨) అని క్షేత్రజ్ఞ స్వరూపమును జెప్పి 'తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయాత్-అన్యోఽన్తర ఆత్మానన్దమయః' (తై. ఆన-౫-౨) అని క్షేత్రజ్ఞునికిఁగూడ అంతరాత్మభూతుఁడై ఆనందమయుఁడై యున్న పరమాత్మ చెప్పఁబడినాఁడు. ఇట్లె ఋక్సామాథర్వములం దచ్చటచ్చట క్షేత్రక్షేత్రజ్ఞులు వేఱువేఱగుటయు, ఆ రెండును బ్రహ్మాత్మకములగుటయు మిక్కిలి స్పష్టముగా వర్ణింపఁబడియున్నవి. *బ్రహ్మప్రతిపాదకములగు శారీరకసూత్రముచేతను హేతువులతో నిశ్చయమేర్పడునట్లు 'నవియదశ్రుతేః' అని యారంభించి క్షేత్రప్రకార నిర్ణయము చెప్పఁబడినది; 'నాత్మా శ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః' అని యారంభించి (♦'జ్ఞోఽతఏవ' ఇత్యాదులచే) క్షేత్రజ్ఞయాథాత్మ్య నిర్ణయము చెప్పబడియున్నది; అందు

---

* ఇందు 'అస్తితు' మొదలయిన యాఱుసూత్రములును 'ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః- తేజోతస్తథాహ్యాహ-ఆపః-పృథివీ' అను నాలుగుసూత్రములును గ్రాహ్యములు, 'వియత్' అని యాకాశాదుల యుత్పత్తిని జెప్పుటచే వానియొక్క సంఘాతమేయైన క్షేత్రముయొక్క యాథాత్మ్యము చెప్పఁబడినట్లె యని భావము.

♦ 'జ్ఞోఽతఏవ' ఇత్యాదులనఁగా 'జ్ఞోఽతఏవ' 'ఉత్క్రాన్తిగత్యాగతీనామ్' 'స్వాత్మనాచోత్తరయోః' 'నాణు రతచ్ఛ్రుతేరితిచే న్నేతరాధికారాత్' 'స్వశబ్దోన్మానాభ్యాంచ' 'అవిరోధ శ్చన్దనవత్' 'అవస్థితి వైశేష్యాదితిచేన్నాభ్యుపగమాద్ధృదిహి' 'గుణాద్వాలోకవత్' 'వ్యతిరేకో గన్ధవత్తథాచదర్శయతి' 'పృథగుపదేశాత్' 'తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్' 'యావదాత్మభావిత్వాచ్చ నదోషస్తద్దర్శనాత్' 'పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తియోగాత్' 'నిత్యోపలబ్ధ్యనుపలబ్ధి ప్రసఙ్గోఽన్యతరనియమో వాన్యథా' 'కర్తా శాస్త్రార్థవత్త్వాత్' 'ఉపాదానాద్విహారోపదేశాచ్చ' 'వ్యపదేశాచ్చ క్రియాయాం నచే న్నిర్దేశవిపర్యయః' 'ఉపలబ్ధివ దనియమః' 'శక్తివిపర్యయాత్' 'సమాధ్యభావాచ్చ' 'యథాచ తక్షోభయథా' 'పరాత్తు తచ్ఛ్రుతేః' అను వఱకుఁ గల సూత్రజాతము తెలిదియునవి.

'పరాత్తు తచ్ఛ్రుతేః' అని భగవంతునిచే ప్రవర్తింపఁజేయఁబడునది (అనఁగా నియామ్యమైనది) యగుటచే భగవంతునికది (అనఁగా క్షేత్రజ్ఞవస్తువు) శరీరమై భగవంతుఁడే యాత్మగాఁ గలిగియుండుట చెప్పఁబడినది. (నియామ్యమైయుండుట శరీరలక్షణముగదా.) ఇట్లు బహువిధముల వర్ణితమైయుండు క్షేత్రక్షేత్రజ్ఞ యాథాత్మ్యమును నేను నీకు (సులువుగా తెలియుటకొఱకు) సంక్షేపముగాను స్పష్టముగాను జెప్పుచున్నాను వినుము అని యర్థము.

శ్లో॥ మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్త మేవచ।
ఇన్ద్రియాణి దశైకంచ పఞ్చ చేన్ద్రియగోచరాః॥ 6
ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాత శ్చేతనాధృతిః।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్॥ 7

టీ. మహాభూతాని = పృథివ్యప్తేజో వాయ్వాకాశము లనెడి పంచభూతములును, అహఙ్కారః=భూతాది యగు అహంకారతత్త్వమును, బుద్ధిః=మహత్తత్త్వమును, అవ్యక్తమేవచ = మూలప్రకృతియును. ఇన్ద్రియాణి=ఇంద్రియములు, దశ = పదియును (త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వానాసికము లనెడిజ్ఞానేంద్రియము లైదును, వాక్పాణిపాదపాయూపస్థలములనెడికర్మేంద్రియము లైదును), ఏకంచ = ఒక్కటియగు మనస్సును, ఇన్ద్రియగోచరాః = ఇంద్రియములచేఁ దెలియఁబడువిషయములు, పఞ్చచ = (శబ్దస్పర్శరూపరస గంధము లనెడి) అయిదును, ఇచ్ఛా=కోరికయు, ద్వేషః=ద్వేషమును, సుఖం =సుఖమును, దుఃఖం=దుఃఖమును, చేతనాధృతిః-చేతన = జీవాత్మలకు, ఆధృతిః=సుఖదుఃఖోపభోగములకు ఆధారమైన, సఙ్ఘాతః=పంచభూతసంయోగమును, క్షేత్రం=క్షేత్ర మనఁబడును, ఏతత్ =ఈక్షేత్రము, సవికారం = కార్యములతోఁగూడ, సమాసేన = సంక్షేపముగా, ఉదాహృతం = చెప్పఁబడినది.

తా. (*మహాభూతా న్యహఙ్కారో బుద్ధిరవ్యక్తమేవచ అనునవి క్షేత్రారంభకద్రవ్యములు) పృథివ్యప్తేజోవాయ్వాకాశము లను మహాభూతములు; అహంకారమగు భూతాది; బుద్ధియగు మహత్తు; అవ్యక్తమగు ప్రకృతి; ('ఇన్ద్రియాణిదశైకంచ పఞ్చచేన్ద్రియగోచరాః' అనునవి క్షేత్రము నాశ్రయించియున్న తత్త్వములు.) శ్రోత్రత్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణము లయిదు జ్ఞానేంద్రియములును, వాక్పాణి పాద పాయూపస్థము లయిదు కర్మేంద్రియములనుగూడి పది; మనస్సు ఒకటి; ఇంద్రియార్థములు శబ్దస్పర్శరూపరసగంధము లయిదు; ఇచ్ఛ ద్వేషము సుఖము దుఃఖము [ఇవి క్షేత్రకార్యములుగాన క్షేత్రవికారములుగా చెప్పఁబడుచున్నవి. ఇచ్ఛాద్వేషసుఖదుఃఖములు ఆత్మధర్మము లయ్యును అవి ఆత్మకు క్షేత్రసంబంధముచే కలిగినవి కానక్షేత్రకార్యములగుటచే క్షేత్రవికారములుగా చెప్పఁబడుచున్నవి. అవి పురుషధర్మములగుట 'పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే' (గీత. ౧౩-౨౦) అని మీఁదఁజెప్పబడెడిని.] అనెడి యివి యెల్ల, సుఖదుఃఖముల ననుభవించుచు భోగాపవర్గములను సాధింపఁదివురుచుండుచేతనున కాధారముగాఁ బుట్టిన భూతసంఘాత మగును. అనఁగా ప్రకృతి మొదలుకొని పృథివివఱకుఁగల ద్రవ్యములచే నారబ్ధమై, యింద్రియములకు ఆశ్రయభూతమై, ఇచ్ఛాద్వేష సుఖదుఃఖములను వికారములుగలిగి, భూతసంఘాతరూపమై, * చేతనుఁడు సుఖ

---

'చేతనాధృతిః' అనుటచే భోగాపవర్గములను సాధించుట చేతనునికి సుఖదుఃఖోపభోగముల కాధారమై యుండుట యను ప్రయోజనము తెలియుచున్నది. 'సఙ్ఘాతః' అనుటచే భూతసంఘాతరూపమై యుండుదాని స్వరూపముఁ దెలియుచున్నది. కనుక, 'యచ్చయాదృక్చ' అనెడియైదు ప్రశ్నలకును ఇందు ఉత్తరము లైదు ఇయ్యఁబడెనని తెలియునది.

* ఇచ్ఛాద్వేషములును సుఖదుఃఖములును ఆత్మధర్మములు (అనఁగా ఆత్మకు ధర్మభూతమయిన జ్ఞానముయొక్క వికారములు) అగునుగాని క్షేత్రవికారములు కావు.

దుఃఖముల ననుభవించుటకు ఆధారమగుట ప్రయోజనముగాఁ గలిగి యుండునది క్షేత్ర మనఁబడునని యర్థము. ఆక్షేత్రము సంక్షేపముగా దాని కార్యములతో నుదాహరింపఁబడినది.

అవ. ఇఁక క్షేత్రకార్యములైన గుణములలో ఆత్మజ్ఞానమునకు సాధనములుగాఁ గైకొనఁదగిన గుణములు చెప్పఁబడుచున్నవి.

శ్లో॥ అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥ 8

టీ. అమానిత్వమ్ =(విద్యాభిజనధనాది సంపత్తివలన ఉత్కృష్టులైనవారిని తిరస్కరించుట యనెడి) గర్వము లేకుండుట. అదమ్భిత్వమ్=దంభము (ధార్మికుఁడను కీర్తికొఱకే ధర్మముల ననుష్ఠించుట) లేకుండుట, అహింసా =మనోవాక్కాయములచేత పరులను పీడింపకుండుట, క్షాన్తిః=(పరులచే పీడింపఁబడినను) మనస్సు కలఁగకుండుట, ఆర్జవమ్ =పరులయెడల మనోవాక్కాయ ప్రవృత్తులన్నియు ఒకటి

---

ఇవి క్షేత్రముగా పరిణమించుటలేదు. కనుక వీనిని క్షేత్రమునకు వికారము లనుట యెట్లు? అని యడిగినచో, ఇవి యాత్మకు స్వభావసిద్ధముగా కలుగక క్షేత్రసంబంధము చేతనే కలుగుటచే క్షేత్రముయొక్క కార్యములగుచున్నవి. కనుక క్షేత్రవికారము లనఁబడెను. 'కామ స్సంకల్పః' ఇత్యాదులచే అవి మనోవికారములని తెలియుచుండఁగా ఆత్మధర్మములు (అనఁగా ధర్మభూతజ్ఞానవికారములు) అగుట యెట్లు? అనినచో, ధర్మభూతజ్ఞానము వానిని కలిగింపకపోయినను అవి కలుగుటకు ఆశ్రయమైయుండుటచే అవి దానిధర్మము లగుచున్నవి. ఎట్లన, మీఁద కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే' అనుచో అచేతనమైన ప్రకృతి తనంత క్రియలను గలిగింపకపోయినను అవి కలుగుటకు తాను ఆశ్రయమై యుండుటచేత వానికి అది హేతువుగా (అనఁగా దానికి అవి ధర్మములుగాఁ) చెప్పఁబడినవి. అట్లే యిచటను గ్రాహ్యము. ఇట్లు ఇచ్ఛాద్వేషాదులు పురుషధర్మము లగుట, 'పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే' అని మీఁద చెప్పఁబడెడిని.

కొకటి భేదపడక ఏకరూపముగా నుండుట, ఆచార్యోపాసనమ్= (ఆత్మజ్ఞానమును కలిగించు) ఆచార్యుని ఉపాసించుట-అనఁగా అతని విషయమున ప్రణిపాతపరిప్రశ్నసేవాదులు సేయుటయుం దాసక్తుఁడై యుండుట. శౌచమ్ = ఆత్మజ్ఞానమునకును తత్సాధనములకును యోగ్యములైన మనోవాక్కాయము లుండుట - ఇట్టియోగ్యత శాస్త్రసిద్ధమైనదియై యుండఁదగును, స్థైర్యమ్= అధ్యాత్మశాస్త్రప్రోక్తములైన విషయములందు చలింపకుండుట, ఆత్మవినిగ్రహమ్ = మనోనిగ్రహమును - ఆత్మతప్పఁ దక్కిన విషయములనుండి మనస్సును మరల్చుటయు.

తా. ఉత్కృష్టులైనవారిని తిరస్కరింపకుండుట, ధార్మికుఁడనుకీర్తిఁగోరి ధర్మ మనుష్ఠించు దంభము లేకుండుట, త్రికరణముల చేతను పరులను పీడింపకుండుట, పరులు తన్ను పీడించుచున్నను వారినిగూర్చి తాను కలఁత నొందకుండుట, పరులయెడల మనోవాక్కాయ ప్రవృత్తులు మూఁడు నొక్కవిధముగా నుండుట, ఆత్మజ్ఞానప్రదుఁడైన యాచార్యునికి ప్రణిపాత పరిప్రశ్నసేవాదులు తప్పక సేయుచుండుట, ఆత్మజ్ఞాన తత్సాధనములకు అర్హములైనవిగా తన మనోవాక్కాయములను శాస్త్రమూలమున సంస్కరించుకొనుట, అధ్యాత్మశాస్త్రప్రోక్త విషయములందు చలింపకుండుట, ఆత్మస్వరూపముతప్పఁ దక్కినవానినుండి మనస్సును మరల్చుటయు.

శ్లో॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహఙ్కార ఏవచ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥ 9

టీ ఇన్ద్రియార్థేషు=ఇంద్రియార్థములందు -చక్షురాదీంద్రియములకు విషయములగు రూపాదులయందు, వైరాగ్యమ్-విరక్తియు -

అనఁగా * ఆత్మేతరములైనవియెల్ల దోషయుక్తములైనవిగా అను సంధించుటచే వానియందు వెగటుకలిగియుండుట, అనహఙ్కార ఏవచ=అహంకారము (ఆత్మకాని దేహమునందు ఆత్మయను అభిమానము) లేమియు, [ఇది ప్రదర్శనార్థముగనుక దీనిచే మమకారము లేమియు (అనఁగా తనవికాని వానియందు తనవి యను నభిమానము లేమియు) గ్రాహ్యము.] జన్మ...దర్శనమ్ = (శరీరముతోఁ గూడి యుండునప్పుడు) జననము మరణము ముసలితనము వ్యాధి దుఃఖము అనెడి దోషములను త్రోసిపుచ్చరానివిగా అనుసంధించుటయు.

శ్లో॥ ♦ అసక్తి రనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు॥ 10

టీ. అసక్తిః=ఆత్మతప్ప తక్కిన పరిగ్రహములందు (అనఁగా పరిగ్రహింపఁబడువానియందు) సంగము లేకుండుట, పుత్రదార గృహాదిషు=కొడుకు భార్యయిల్లు మొదలైనవానియందు, అనభిష్వఙ్గః = రక్తి లేకుండుట—అనఁగా శాస్త్రీయకర్మములకు వారు ఉపకరణము లగు నంతమాత్రమునకు వారిని పరిగ్రహించి దాని కెక్కువగా పరి గ్రహింపకుండుటయు నని భావము. ఇష్టానిష్టోపపత్తిషు = (సంకల్పి

---

* ఆత్మతప్ప తక్కినవానియందు విరక్తియు, దేహాత్మాభిమానమును మమకారమును లేకుండుటయు, శరీరముతోఁ గూడియున్నప్పుడు జననమరణాదులు అవర్జనీయము లని యనుసంధించుటయు నని భావము. ఈశ్లోకమందును ౧౦-౧౧ ౧౨ వ శ్లోకము లందును భాష్యార్థము టీకయందే కూర్పఁబడియున్నది.

♦ 'ఇన్ద్రియార్థేషు వైరాగ్యమ్' అనుచో సాంస్పర్శికములగు శబ్దాది విషయము లందలి విరక్తి చెప్పఁబడెను. ఇందు 'అసక్తి' అనుచో ఆభిమానిక విషయములందలి విరక్తి చెప్పఁబడెను గాన రెంటికిని పునరుక్తి లేదు. సాంస్పర్శికములనఁగా విషయేంద్రియముల స్పర్శముచేఁగలుగునవి. ఆభిమానికము లనఁగా తలంపుచేఁ (అనఁగా మనస్సుచేఁ) గలుగునవి. ఆభిమానికములైన సర్వధర్మములను పరిత్యజించినయెడల ఆశ్రమ

మునఁబుట్టు) ♦ఇష్టానిష్టములు సంభవించుటయందు, నిత్యం=ఎప్పుడు, సమచిత్తత్వంచ=హర్షోద్వేగములు లేక మనస్సు నేకరీతిగా నుంచు కొనుటయు.

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది॥ 11

టీ. మయి=సర్వేశ్వరుఁడనగు నాయందు, అనన్యయోగేన = ఐకాంత్యయోగముచే - ప్రయోజనాంతరసంబంధము లేకుండుటచే, అవ్యభిచారిణీ=స్థిరమైన, భక్తిః=భక్తియును, వివిక్తదేశ సేవిత్వమ్ = జనులులేని ప్రదేశమును సేవించుటయు - పవిత్రదేశమునందు వసించుట యనుట, జనసంసది=జనసమూహమునందు - అసాత్త్వికజనులు వసించుచోట, అరతిః=ప్రీతిలేకుండుటయు.

తా. సర్వేశ్వరుఁ డగునాయందు ఐకాంత్యముతోఁగూడిన స్థిరభక్తియు, జనులులేని ప్రదేశమునందు వసించుటయు, జనులు వసించుచోట ప్రీతి లేకుండుటయు.

శ్లో॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థచిన్తనమ్।
ఏతద్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం య దతోఽన్యథా॥ 12

టీ. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం=ఆత్మవిషయమైన జ్ఞానమునందు

---

ధర్మములు జరుగుట కష్టముగనుక ఆశ్రమధర్మముల కుపయుక్తములగు పుత్రాదులను పూర్తిగా పరిత్యజింపరాదు. వారియందు అభిష్వంగమునుమాత్రము పరిత్యజింపవలయు నని భావము. ఆశ్రమధర్మముల కుపయుక్త మగునంతవఱకే కాని దాని కధికముగా పరిగ్రహింప రాదని యాశయము.

♦స్పర్శమువలనఁ బుట్టు ఇష్టానిష్టములకు హర్షోద్వేగములు పడకుండుట సాధ్యము కాదు, కనుకనే సంకల్పమునఁ బుట్టు' అని కూర్పఁబడినది.

ఎడ తెగనినిష్ఠ కలిగియుండుటయు, తత్త్వజ్ఞానార్థచిన్తనం = ఆత్మ యాథాత్మ్యజ్ఞానము ప్రయోజనముగాఁగల చింతనమును- అట్టి చింతనమునం దాసక్తియనుట, ఏతత్ = ఇవియే, జ్ఞానం ఇతి = (జ్ఞాయతే అనేన ఆత్మా ఇతిజ్ఞానమ్) జ్ఞానమని - ఆత్మజ్ఞానసాధనమని యర్థము, ప్రోక్తం=చెప్పఁబడినది. అతః = దీనికంటె, అన్యథా = వ్యతిరిక్తముగా, యత్ =ఏదిగలదో, (తత్ = అది), అజ్ఞానమ్ = అజ్ఞానము-ఆత్మజ్ఞానమునకు విరోధమైనది. క్షేత్రసంబంధి యగుపురుషునకు క్షేత్ర కార్యములైన గుణములలో నింతవఱకుఁ జెప్పఁబడిన అమానిత్వాదిక మగు గుణసమూహమే ఆత్మజ్ఞానమునకు నుపయోగించునది. దీని కంటె వ్యతిరిక్తములైన క్షేత్రకార్యములన్నియు ఆత్మజ్ఞానమునకు విరోధమైనవని తాత్పర్యము.

అవ. 'ఏతద్యోవేత్తి' అని వేదితలక్షణములోఁ జెప్పబడిన క్షేత్రజ్ఞుని స్వరూపమును విశోధించుచున్నారు.

శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥ 13

టీ. యత్ =ఏజీవాత్మస్వరూపము, జ్ఞేయం=అమానిత్వాదులచే తెలియఁదగినదో-ప్రాపింపఁదగినదో యనుట, తత్ = దానిని, ప్రవక్ష్యామి = చెప్పెదను, యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని, అమృతం =జన్మజరామరణాదులైన ప్రాకృతధర్మములులేని యాత్మస్వరూపమును, అశ్నుతే=పొందుచున్నాఁడో, తత్ = అది, అనాది = ఆది లేనిది-ఉత్పత్తిలేనిదనుట, మత్పరం = నన్నే ముఖ్యునిఁగా - (అనఁగా శేషిగా) గలది-నాకు శేషభూతమైనదనుట, బ్రహ్మ = బృహత్త్వ గుణములోఁ గూడినది- పెరుఁగుటకలదియనుట, తత్ = అది, సత్ = సత్తు అనియు, అసత్ =అసత్తు అనియు, న ఉచ్యతే = చెప్పఁబడదు.

తా అమానిత్వము మొదలగుసాధనములచేత పొందఁదగిన జీవాత్మస్వరూపమును జెప్పెదను. దాని నెఱింగి, ప్రకృతిధర్మము లగు జన్మజరామరణాదులు లేనట్టి శుద్ధాత్మ స్వరూపమును బొందుదువు. ఈప్రత్యగాత్మకు *ఉత్పత్తి లేదు; కావుననే నాశమును గలుగదు. ఇందులకు 'నజాయతే మ్రియతేవా విపశ్చిత్' (కఠ. ౧-౨-౧౮) అని శ్రుతియు. అది మత్పరము. అనఁగా దానికి నేను పరుఁడను (శేషిని). (అది నాకు శేషభూతమగుట) 'ఇతస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మేపరామ్। జీవభూతామ్' అనికదా చెప్పబడినది. భగవంతునికిశరీరమగుటచే ఆత్మస్వరూపము భగచ్ఛేషత్త్వైకరసముగదా. అట్లె "య ఆత్మనితిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మా నవేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి" (బృ. ౫-౭-౨౨) అనియు, అట్లె 'సకారణం కరణాధిపాధిపో నచాస్య కశ్చిజ్జనితా న చాధిపః' (శే ౬-౯) 'ప్రధానక్షేత్రజ్ఞపతిః గుణేశః) (శ్వే ౬-౧౬) అనియు నిత్యాదిశ్రుతులు. అది *బ్రహ్మము-బృహత్త్వగుణముతోఁ గూడినది-అనఁగా శరీరాదులకంటె వేఱువస్తువై తనంతట శరీరాదులచేఁ

---

* 'అనాది' యని దాని కుత్పత్తిలేమిని జెప్పుటవలన అంతమును లేనిదని గ్రాహ్యము. ఇట్లే శ్రుతియు 'నజాయతే' అనుచున్నది. 'ఇత...భూతామ్' అను నీ వాక్యము పూర్వము ఆత్మస్వరూపమును భగవచ్ఛేషత్త్వైకరస మనియుఁ దెలుపుచున్నది. కనుక 'మత్పరమ్' అనుటకు నన్నే ముఖ్యునిఁగాఁగలది-అనఁగా అది నాకే ముఖ్యముగా శేషమైనదని యర్థము- నేనే దానికి శేషిని అనుట. అది భగవచ్ఛరీరమగుట 'య ఆత్మని...యమయతి' అనియు; అది భగవచ్ఛేష మగుట 'సకారణం...గుణేశః అనియు ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నవి.

* బ్రహ్మ అనఁగా బృహత్త్వగుణముతోఁ గూడినది-వృద్ధి నొందునది యనుట. అణుస్వరూపమై శరీరీరాదులచే పరిచ్ఛేదము కలిగియుండు నీక్షేత్రజ్ఞ తత్త్వమునకు బృహత్త్వమెట్లు? అనినచో, ఇది శరీరముకాదు. శరీరమునకంటె వేఱైనపదార్థము. కనుక దీనిశరీరాదుల పరిమితియే దీని పరిమితికాదు. ఇది జ్ఞానము ధర్మముగాఁగలది. దీపము

బరిచ్ఛేదము (కొలఁది) లేకుండు క్షేత్రజ్ఞ తత్త్వమని యర్థము. 'సచానన్త్యాయకల్పతే' (శ్వే. ౫-౯) అని శ్రుతియుఁ జెప్పెడినిగదా. శరీరముచే పరిచ్ఛిన్నమైయుండుట దీనికి కర్మముచే నయినది. కర్మబంధము నుండి ముక్తుఁడయినచో ఆనంత్యము (పరిచ్ఛేదములేకుండుట) కలుగుచున్నది. ఆత్మయను నర్థమునందు "సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయకల్పతే" (గీ. ౧౪-౨౬) బ్రహ్మణోహి ప్రతిష్ఠాహమమృతస్యావ్యయస్యచ' (గీ. ౧౪-౨౭) 'బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి' (గీ. ౧౮-౫౪) 'సమస్సర్వేషుభూతేషు మద్భక్తిం లభతే పరామ్' (గీత ౧౮-౫౪) అని బ్రహ్మశబ్దము ప్రయోగింపఁబడుచున్నది. అది *సత్తనియు అసత్తనియుఁ జెప్పఁబడదు. అనఁగా కార్యకారణములనెడి యవస్థలు రెండును లేకుండుటచే ఆత్మస్వరూపము 'సత్' 'అసత్' అను శబ్దములచేఁ జెప్పఁబడదు. ఏలన కార్యా

---

కొంచెమైనను దానిప్రభ అంతటవ్యాపించునట్లు, ఇదియణువైనను తనకు ప్రభవంటిదైన జ్ఞానముద్వారా సర్వవ్యాప్తి గలది. కనుక స్వరూపముచేఁ గాకపోయినను ధర్మభూతజ్ఞానముచే బృహత్త్వము కలదియగునుగాన బ్రహ్మ మనఁబడినది. శ్రుతియు 'స చానన్త్యాయ కల్పతే' అని దీనికి ఆనంత్యమును చెప్పుచున్నది. ఇట్లు అనంతమైనదానికి శరీరముచే పరిచ్ఛేదమెట్లు కలిగినదన్నచో అది కర్మమూలమునఁగలిగినది. కర్మబంధమునుండి విడివడినపిదప స్వతస్సిద్ధమైన ఆనంత్యము కలుగుచున్నది. ఆత్మయందు బ్రహ్మశబ్దము ప్రయోగించుట యెట్లన-'సగుణాన్...మద్భక్తిం లభతే పరామ్' ఇత్యాదులనుబట్టి ఆత్మయందు సైతము బ్రహ్మశబ్దము ప్రయోగింపఁదగును.

* 'సత్' అనఁగా ఉండునది, 'అసత్' అనఁగా లేనిది, యని యర్థము. ఆత్మ కార్యావస్థయందు నామరూపముల నొంది గోచరముగా వర్తించుటచే అది 'సత్' అనఁబడుచున్నది. కారణావస్థయందు ఏ నామమును ఏరూపమును లేక, ఉండియు లేనిదానివలె వర్తించుటచే 'అసత్' అనఁబడున్నది. ఈవిషయమే 'అసద్వా...క్రియతే' ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నవి. ఆత్మకు కర్మమనెడి యవిద్య చుట్టుకొనుటవలననే ఈ కార్యకారణావస్థలు రెంటితో సంబంధము కలుగుచున్నది కాని స్వరూపమువలనఁ గాదు. కాఁబట్టి స్వరూపమున దాని కీరెండవస్థలును లేమిచే 'సత్-అసత్' అను శబ్దములు అశుద్ధాత్మస్వరూపమునకుఁ బ్రయోగింపఁదగదు. 'అస ద్వా ఇద మగ్ర ఆసీత్'

వస్థయందు దేవాదినామరూపములను బొందుటచేత 'సత్' అని చెప్పఁ
బడుచున్నది. అందులకు అనర్హమగుటచే కారణావస్థయందు 'అసత్'
అని చెప్పఁబడుచున్నది. ఇట్లై 'అసద్వా ఇదమగ్ర ఆసీత్। తతో వై
సదజాయత' (తై. ఆన. ౭-౧) 'తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీ త్త
న్నామరూపాభ్యాం వ్యాక్రియతే' (బృ. ౩-౪-౭) ఇత్యాదిశ్రుతులును
జెప్పెడిని. ఆత్మకు కార్యకారణము లనెడి అవస్థలు రెండును కర్మ
రూపమైన అవిద్య చుట్టుకొనుటచేఁ గలిగినవి కాని స్వరూపముచేతఁ
కాదు. కావున సదసచ్ఛబ్దములచే ఆత్మస్వరూపము చెప్పఁబడదు.
'అసద్వా ఇద మగ్ర ఆసీత్' అని కారణావస్థమగు పరబ్రహ్మము
(అసత్ అని) చెప్పఁబడుచున్నను, నామరూపవిభాగమునకుఁ దగని
సూక్ష్మ చిదచిద్వస్తువులు శరీరముగాఁ గల పరబ్రహ్మమే కారణావస్థ
మైనది గావున కారణావస్థయందు క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపము సైతము
'అసత్' అని చెప్పఁదగియున్నది. క్షేత్రజ్ఞున కాయవస్థ కర్మకృతము
కాఁబట్టి వాని పరిశుద్ధస్వరూపము 'సత్' 'అసత్' అను శబ్దములచే
నిర్దేశింపఁ దగకున్నది.

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్।
సర్వత శ్శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి॥ 14

---

అనుచో 'అసత్' అను శబ్దముచే కారణావస్థమైన పరబ్రహ్మమె చెప్పఁబడినదికాని
ప్రత్యగాత్మ కాదు గనుక ప్రత్యగాత్మ కెట్లు దానిని ప్రయోగింపఁదగును? అన్నచో,
పరబ్రహ్మము తనంతట కారణావస్థమైనది కాదు. నామరూపవిభాగానర్హ సూక్ష్మ చిద
చిత్తులను శరీరముగాఁ జేసికొనియె యీకారణావస్థ నొంది 'అసత్' అనఁబడినది.
సూక్ష్మ చిదచిత్తులద్వారా దాని కాపేరు కలుగుటచె ద్వారభూతములైన యీ క్షేత్ర
క్షేత్రజ్ఞులకును కారణావస్థయందు 'అసత్' అని పేర్కొనఁదగు నని తెలియునది.
పరిశుద్ధస్వరూపమునకు నామరూపవిభాగము లేమిచే దానినిగూడ 'అసత్' అనరాదా
యనినచో దాని కావిభాగము లేనియవస్థ కర్మకృతమైనది కాదు. కర్మకృత మైననే
'అసత్' అనఁదగును. అట్టి యవస్థ క్షేత్రజ్ఞునికే కలదుగాని పరిశుద్ధస్వరూపమున
కేదియు లేమిచేత స్థూలసూక్ష్మావస్థలచేఁ గలుగు సదసచ్ఛబ్దములు దానికిఁ జెల్లవు.

టీ. తత్ = ప్రకృతిసంబంధములేని యాపరిశుద్ధాత్మస్వరూపము, సర్వతః = అంతటను, పాణిపాదం = చేతులును గాళ్లును గలది- చేతులతోను కాళ్లతోను (తక్కిన కర్మేంద్రియములతోను) జేసెడి కార్యములను జేయ సమర్థమైనదనుట, సర్వతః = అంతటను, అక్షిశిరోముఖం = నేత్రములు శిరస్సులు ముఖములుగలది - నేత్రములు మొదలగువానితోఁ జేసెడి కార్యములను జేయ సమర్థమయినదనుట, సర్వతః = అంతటను, శ్రుతిమత్ = చెవులుగలది - నేత్రములు చెవులు మొదలగు జ్ఞానేంద్రియములతోఁ జేసెడి కార్యములను జేయసమర్థమైనది. లోకే = లోకమందు, సర్వం = సమస్తమును, ఆవృత్య = వ్యాపించి-జ్ఞానముద్వారా అధిష్ఠించి, తిష్ఠతి = ఉన్నది-పరిశుద్ధాత్మస్వరూపము దేశాది పరిచ్ఛేదములు లేక సర్వగతమై యున్నదనుట.

తా. ఆ పరిశుద్ధాత్మస్వరూపము అంతటను పాణిపాదములుగలది. అనఁగా *పాణిపాదములు చేయుకార్యములను జేయసమర్థమైనది. అట్లే అంతట చక్షువులును శిరస్సులును ముఖములును గలది, అంతటను శ్రవణము గలది-అనఁగా అంతట చక్షువు మొదలైనవాని కార్యములను జేయునది. పరబ్రహ్మము 'అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షు స్స శృణోత్యకర్ణః' (శ్వే. 3-౧౯) అని పాణిపాదములు లేకున్నను, అంతటను పాణిపాదాదికార్యములు చేయుట శ్రుతిచెప్పుచున్నది. పరిశుద్ధంబగు ప్రత్యగాత్మయు దానితోడి సామ్యమును

* ఆత్మస్వరూపమునకు శరీరముగాని అవయవములుగాని యింద్రియములుగాని లేవు గనుక దానికి పాణిపాదాదులు చెప్పుటచే అవి యున్నవని తలఁపరాదు. పాణిపాదాదులు లేకయే అవి చేయుకార్యములను జేయుశక్తి ఆత్మకుఁ గలదని భావము 'అపాణి...కర్ణః' అని పరబ్రహ్మము పాణిపాదాదులు లేనిదైనను అంతటను పాణిపాదాది కార్యములను జేయుచున్నది. పరిశుద్ధాత్మస్వరూపము పరబ్రహ్మముతో సమమైనది గనుక దానివలెనె తానును పాణిపాదరహిత మయ్యును పాణిపాదాదికార్యములను జేయునని తెలియునది. శుద్ధాత్మస్వరూపమునకు పరబ్రహ్మముతోడి సామ్యమును

బొందుటచేత అంతటను పాణిపాదాదికార్యములు చేయుట శ్రుతి సిద్ధమే. 'తదావిద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్య ముపైతి' (ము. 3-1-3) అని శ్రుతి చెప్పెడినిగదా. 'ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః' (గీ. 14-2) అని గీతయు మీఁదఁ జెప్పెడిని. అది లోకమునందు సర్వమును ఆవరించియున్నది. అనఁగా లోకమునం దేవస్తుజాతముగలదో దానినంతయు వ్యాపించి యున్నది. పరిశుద్ధస్వరూపము దేశాదిపరిచ్ఛేదములు లేనిదికావున సర్వగత మగునని యర్థము.

శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ॥ 15

టీ. సర్వేన్ద్రియగుణాభాసం=సమస్తమైన యింద్రియవృత్తుల చేతనైన ప్రకాశముగలదియు - అనఁగా తనంతటనేకాక యింద్రియ వృత్తులచేతఁగూడ విషయములను దెలిసికొనునది - ముక్తదశయందు ఇంద్రియములచేఁ దెలిసికొనుటలేదు గనుకఁ దెలిసికొన సమర్థమైన దనుట, సర్వేన్ద్రియవివర్జితం=సర్వేంద్రియములను విడిచినది-స్వాభా వికముగా ఇంద్రియవ్యాపారములు లేకయే తనంతనే సర్వము నెఱుఁ గున దనుట, అసక్తం=సంగము లేనిది-స్వాభావికముగా దేవాదిదేహ ములతోడి సంగము లేనిగనుట, సర్వభృచ్చ ఏవ = దేవాది సమస్త దేహములను భరించునదియును - ముక్తదశయందు అట్లు భరించుట లేదుగనుక భరించుటకు సమర్థమైనదనుట, నిర్గుణం=గుణము లేనిది - స్వాభావికముగా సత్త్వాదిగుణసంబంధము లేనిదనుట, గుణభోక్తృచ =

'తదా...మ్య ముపైతి' అని శ్రుతి చెప్పుచున్నది. 'ఇదం...మాగతాః' అని గీతయు ఈ సామ్యమును జెప్పెడిని. జగద్వ్యాపారముతప్ప తక్కిన విషయములందు ఉభయు లకు సామ్యము కలదని మీమాంసిత మైయున్నది.

సంసారదశయందు కర్మాధీనముగా ప్రాకృత సత్త్వాది గుణములను భోగించునది-ముక్తదశయందు భోగించుట లేదు గనుక భోగించుటకు సమర్థమైనది.

ఆ శుద్ధాత్మ స్వరూపము తనంతనేకాక సమస్తములైన యింద్రియవృత్తులచేతఁగూడ విషయములను దెలిసికొన సమర్థమైనది. అది *స్వాభావికముగా నింద్రియవ్యాపారములు లేనిది-అవిలేకయె తనంతట సర్వమెఱుఁగుచుండుననియర్థము. దానికి కర్మమూలమున దేవాదిదేహసంగము గలిగినది కాని స్వాభావికముగా దాని కట్టిసంగములేదు. ♦ 'సఏకధా భవతి' త్రిధాభవతి (ఛా. ౭-౨౬-౨) ఇత్యాదిశ్రుతులను బట్టి అది దేవాది సర్వదేహములను భరించుటకు సమర్థమైనది. అది స్వాభావికముగా సత్త్వాదిగుణములు లేనిది. ఐనను ఈ గుణముల ననుభవించుటకు సమర్థమైనది.

---

* శుద్ధాత్మస్వరూపమునకు ఇంద్రియవ్యాపారములచే విషయముల నెఱుఁగుటగాని దేవాదిదేహముల భరించుటగాని గుణముల ననుభవించుటగాని లేదు. అట్టిలేని వ్యాపారములను దానికిఁ జెప్పునప్పుడు అది వానిని నిజముగాఁ జేయునని గ్రహింపరాదు. వానిని జేయుటకు సామర్థ్యము మాత్రము కలదని యర్థము గ్రహింపవలయును. కనుకనే యామూఁడు వ్యాపారములపట్టున 'సమర్థమైనది' అనికూడఁ జేర్పఁబడెను. మఱియు, ఇంద్రియరహితమై యుండుటయు, దేవాదిదేహసంగము లేకుండుటయు, సత్త్వాది గుణశూన్యమై యుండుటయు దానికి స్వభావసిద్ధములైనవియె యగును. కనుకనే యామూఁడు పట్టులను 'స్వాభావికముగా' అని కూర్పఁబడెనని తెలియునది. ఉపాధివశమున గుణభోక్తృత్వాదులు కలుగును. స్వభావముచే నవి కలుగవు; తత్సామర్థ్యము మాత్రము నిత్యమైనదని యాశయము.

♦ ముక్తదశయందును దేవాదిదేహభరణ సమర్థమైనది యెట్లు? అనినచో ఆదశయందు 'సఏకధా భవతి - త్రిధాభవతి' అని ఇత్యాదిశ్రుతులు చెప్పుటవలన నిది తెలియఁదగును. ముక్తదశయందు త్రిధాభవనము విగ్రహము దాల్చుటవలననే కలుగఁదగునుగాని ఊరక కలుగనేరదు. కనుకనే ఆదశయందు దేహభరణ సమర్థ మనఁబడెను.

శ్లో॥ బహి రన్త శ్చ భూతానా మచరం చర మేవచ।
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తి కేచతత్॥ 16

టీ. భూతానాం=పంచభూతములయొక్క, బహిః = వెలుపలను, అన్తశ్చ=(జక్షణాదిస్వచ్ఛంద వృత్తులయందు వాని) లోపలను, (వర్తతే=వర్తించుచున్నది), అచరం = (స్వభావముచేత) కదలనిది, చరమేవచ = (దేహసంబంధముచేత) కదలునది, తత్ = ఆయాత్మతత్త్వము, సూక్ష్మత్వాత్ =అతిసూక్ష్మ మగుటవలన, అవిజ్ఞేయం= (దేహమునకంటె వేఱై విలక్షణమై యుండునదిగా) తెలియశక్యము కానిది, తత్ =అది, దూరస్థం = (అమానిత్వాది గుణరహితులకు) దూరమున నున్నదియు, అన్తికేచ = (ఆ గుణములు గలవారికి) సమీపమున నున్నదనియును.

తా. శుద్ధాత్మ పృథివ్యాదిభూతములను పరిత్యజించి అశరీరమై వానికి *వెలుపల వర్తించుచుండును. 'జక్షత్ క్రీడన్ రమమాణః స్త్రీభిర్వా యానైర్వా' (ఛా. ౮-౧౨-3) ఇత్యాది శ్రుతిసిద్ధములగు స్వచ్ఛందవ్యాపారములయిన అనగా (కర్మవశమునఁగాక తనంతట తాను స్వచ్ఛందముగా) జక్షణాదులు చేయఁగోరునపుడు అందులకై యా భూతములలోపల వర్తించును. స్వాభావికముగా అది పాణిపాదాదులులేనిది గనుక చరింపకుండును. దేహియైనప్పుడు చరించునదగును. ఇట్లు సర్వశక్తియుక్తమును సర్వజ్ఞమునైన ఆ యాత్మతత్త్వము ఈ క్షేత్రమునందు వర్తించుచున్నదైనను (సామాన్య

---

* శుద్ధాత్మ పృథివ్యాదిభూతసంబంధమును విడిచి ఆభూతములచేనైన శరీరమును లేనిదై యుండుటచే అది భూతములకు వెలుపల వర్తించునని చెప్పఁబడెను. దానికి శరీరముగాని అవయవములుగాని లేవు. అది జక్షణాది వ్యాపారములు కర్మవశమునఁగాక స్వచ్ఛందముగా తాను జేయఁగోరినప్పుడు సైతము శరీరము తాల్చకతీఱదు. అది తాల్చు శరీరము కర్మకృతమైనదికాదని 'స్వేనరూపేణాభినిష్పద్యతే' అను శ్రుతివలనఁ దెలియ

ముగా తెలియఁబడిన దానివలె తోఁచినను), అది అతిసూక్ష్మమగు టచే దేహముకంటె వేత్తె సర్వజ్ఞత్వాది గుణములచే దానికంటె విల క్షణమై యుండునదిగా సంసారులకుఁ దెలియునట్టిదికాదు. అమా నిత్వాదిగుణములు లేనివారై విపరీతగుణములుగల పురుషులకు అది స్వదేహమునందే యుండువదైనను అతిదూరమున నున్నట్టిది యగును. అట్లె అమానిత్వాది గుణములతోఁ గూడినవారికి అదియె దగ్గర వర్తించును.

శ్లో॥ *అవిభక్తంచ భూతేషు విభక్తమివ చ స్థితమ్।
భూతభర్తృచ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ॥ 17

టీ భూతేషు = దేవమనుష్యాదిభూతములందు, అవిభక్తం= విభజింపఁబడనిదియు - అంతటను వేదితృస్వరూపముచే ఏకరీతిగా గ్రహింపఁబడుటచే వేఱువేఱుగా గ్రహింపఁబడని దనుట, విభక్తమివ =(ఇది తెలియనివారికి దేవాద్యాకారములచే నానావిధముల) విభ జింపఁబడినదానివలె, స్థితంచ = ఉన్నదియు, భూతభర్తృ- భూత = దేహరూపముగాఁగూడిన పృథివ్యాదిభూతములను, భర్తృ = (ఏది) భరించునదో, తత్ = అది-ఆజీవాత్మతత్త్వము. జ్ఞేయం=భరింపఁబడు

నగును. దానిస్వచ్ఛందవృత్తులును, 'జక్షత్ క్రీడన్ రమమాణః స్త్రీభిర్వాయానైర్వా' ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నవి. అట్టి వృత్తులకుఁగాను శరీరము దాల్చుటకై భూతము లలో వర్తించుచున్నది. శరీరము దాల్చుటచే భూతములలో వర్తించుట యెట్లు కలుగు నన్నచో శరీర మనఁగా ప్రాకృతభూతములయొక్కగాని అప్రాకృతభూతములయొక్క గాని సంఘాతమే యగునుగాన దానిని దాల్చుట యనఁగా భూతములలో వర్తించు టయే యని భావము.

* 'అవిభక్తమ్' అనఁగా స్వరూపముచే దేవమనుష్యాదివిభాగములు లేనిదని భావము. 'విభక్తమివ' అనుచో ఇవశబ్దముచే భ్రాంతిని గ్రహించునది. 'పణ్డితా స్సమ దర్శినః' అనుచోఁ జెప్పఁబడినసామ్యమే యిచటఁగూడ వివక్షితము

ఆభూతములకంటె వేత్తైనపదార్థముగాఁ దెలియఁదగినది-అనఁగాఁ దెలియఁగూడుననుట - భరించునది భరింపఁబడువానికంటె వేత్తైనదని తెలియుట సులభమని భావము. గ్రసిష్ణు = (ఆ భూతవికారము లైన అన్నాదులను) గ్రసించునది. జ్ఞేయం=ఆ గ్రసింపఁబడుభూతములకంటె వేత్తైనపదార్థముగాఁ దెలియఁదగినది - గ్రసించునది గ్రసింపఁబడువానికంటె వేత్తైనదని తెలియుట సులభమని భావము. ప్రభవిష్ణుచ =(ఆ గ్రసింపఁబడిన యన్నాదులు రసమలధాత్వాది రూపముగాఁ బరిణమించి మఱల) పుట్టుటకు (అనఁగా అవి మరల రేతోగర్భాదిరూపముగాఁ బరిణమించుటకు) హేతువైనది (ఏదియో యదియును), జ్ఞేయం = ఆ ప్రభవించువానికంటె వేత్తైనపదార్థముగాఁ దెలియదగినది- దెలియఁగూడినదనుట - ప్రభవహేతువైనది ప్రభవించువానికంటె వేత్తైనదని తెలియుట సులభమని భావము.

తా. దేవమనుష్యాదిసమస్తభూతములందు ఆత్మ ఒక్కటే వేదితృస్వరూపమున ఏకరీతిగా నున్నదే కాని వివిధాకారముల నుండునది కాదు. అయినను ఈ విషయములు తెలియనివారికి 'వీఁడు దేవుఁడు మనుష్యుఁడు' అని దేవాద్యాకారములచే వేఱువేఱుగ నుండుదాని వలెఁ దోఁచుచున్నది. "ఆత్మ 'దేవోఽహమ్' 'మనుష్యోఽహమ్' అని దేహముతోడి సామానాధికరణ్యముచే-అనఁగా దేహమును అదియును అభిన్నమైనదిగా - అనుసంధింపఁబడుచున్నను, అది వేదిత యగుట చే వేద్య మయిన దేహమునకంటె వేత్తైన పదార్థముగా నెఱుఁగఁగూడును" అని మొదట 'ఏతద్యో వేత్తి' అను శ్లోకమునఁ జెప్పఁబడెను. ఇప్పుడు వేఱుప్రకారములచేతఁగూడ అది దేహమునకంటె వేత్తైనదిగా ఎఱుఁగఁగూడునని చెప్పుచున్నారు. *దేహరూపమునఁగూడి

* భరింపఁబడువానికంటె వానిని భరించునదియు, గ్రసింపఁబడువానికంటె వానిని గ్రసించునదియు, ప్రభవించువానికంటె వానికి ప్రభవహేతువైనదియు, వేత్తైన పదార్థమె యగునుగదా. ముందు వేద్యవేదితృప్రకారమున దేహాత్మలు వేఱువేత్తైనవని

యున్న పృథివ్యాదిభూతములకు ఏది భర్త (భరించునది) యో యది భరింపఁబడు నాభూతములకంటె వేఱైనదని తెలియఁదగినది-వేఱయిన దని తెలియుట శక్యమని యర్థము. (ఆభూతములె అన్నాదివికార ముల నొంది గ్రసింపఁబడుచున్నవి) అట్లు భౌతికములగు అన్నాదు లను గ్రసించునది-అనఁగా గ్రసింపఁబడు భూతముల (ఆ యన్నాదుల) కంటె గ్రసించువాఁడగుటచే ఆత్మ వేఱైనదని తెలియుట శక్యము. అది ప్రభవహేతువు నగును- గ్రసింపఁబడినయన్నాదులు (రసము మలము ధాతువు మొదలైన వేఱురూపములఁ బరిణమించి మరల రేతోగర్భాదిరూపములుగాఁ బుట్టుచున్నవి. అట్లు పరిణమించి పుట్టువాని కంటె వానిపుట్టుకకు హేతువైనఆత్మ వేఱయినదని తెలియుటయు శక్యమని యర్థము. మృతశరీరమునందు గ్రసన ప్రభవాదులు కనఁ బడవుగాన భూతసంఘాతరూప మయిన క్షేత్రము గ్రసన ప్రభవ భరణహేతువు గాదని నిశ్చయింపఁబడుచున్నది.

శ్లో॥ జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥ 18

---

తెలియుట శక్యమయ్యెను. ఇప్పుడు భార్య భర్తృప్రకారమునను గ్రస్య గ్రసితృప్రకా రమునను జన్యజననహేతు ప్రకారమునను అవి రెండును వేఱువేఱని తెలియుట శక్య మని గ్రాహ్యము. మఱియు ఆత్మభూతములను భరించుటకుగాను అవి దేహరూపముగా సంహత మగుటయు, వానిని గ్రసించుటకుఁగాను అవి అన్నాది వికారమునొందుటయు, వానికిప్రభవహేతు వగుటకుఁగాను అవియన్నాది వికారమున మలధాత్వాదులై రేతో గర్భాదులుగా పరిణమించుటయుఁ జెప్పఁబడినవని యూహించునది. మఱియును ఆత్మకు అవయవములు లేమిచే అది గ్రసనాదులు చేయఁజాలదు. శరీరమే వానిని జేయుట కనఁబడుచున్నది. కనుక గ్రసనాదులను ఆత్మధర్మములుగా 'గ్రసిష్ణు' ఇత్యా దులచే నెట్లు చెప్పవచ్చునన్నచో, శరీరము మృతి నొందినపిదప గ్రసనప్రభవాదులు దానియందుఁ గనఁబడుటలేదు. కనుక భూతసంఘాతరూపమైన క్షేత్రము గ్రసనప్రభవ భరణములకు హేతువుకానేరదు. ఆత్మయె హేతువగునుగాన అవి ఆత్మధర్మములే యని గ్రాహ్యము.

టీ. తత్ =ఆయాత్మస్వరూపము, *జ్యోతిషామపి=సూర్యుఁడు దీపము మణులు మొదలగు ప్రకాశములైనవానికిఁగూడ, జ్యోతిః = ప్రకాశకమైనది- ప్రకాశింపఁజేయునదనుట. తమసః=సూక్ష్మప్రకృతి కంటె, పరం=ఇతరమైనదిగా, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. జ్ఞానం =జ్ఞానైకాకారమని, జ్ఞేయం=తెలియఁదగినది, జ్ఞానగమ్యం = జ్ఞానముచే (అనఁగా అమానిత్వాది జ్ఞానసాధనములచేత) పొందఁదగినది. సర్వస్య=సమస్తప్రాణులయొక్క, హృది=హృదయమునందు, విష్ఠితం-వి+స్థితం=విశేషముగా (అనఁగా భోక్తృరూపమునఁగాని స్వరూపముతోఁగాని) సన్నిహితమై యుండునది.

తా. ఆత్మస్వరూపము దీపము సూర్యుఁడు మణి మొదలగు నితరవస్తు ప్రకాశములకుఁగూడ ప్రకాశకమైనది - అనఁగా, దీపము సూర్యుఁడు మొదలగువానిని సయితము ఆత్మయొక్క ప్రభారూపమగుజ్ఞానమే ప్రకాశింపఁ (దెలియఁ) జేయుచున్నది. దీపాదులన్ననో, విషయములకును ఇంద్రియములకును దారసిల్లుటకు విరోధియగు చీకటిని బోఁగొట్టుట మాత్రమే చేయుచున్నది. అంతమాత్రముననే వానికి ప్రకాశకత్వము. ఆత్మస్వరూపము తమస్సు (అనఁగా సూక్ష్మ

* దీపాదులు తమయొక్క ప్రభచేత ఇతరవస్తువులను దెలియఁజేయునట్లె ఆత్మ తన జ్ఞానరూపమైన ప్రభచేత ఆ యితరవస్తువులనేకాక వానిని దెలుపునట్టి యాదీపాదులను గూడఁ దెలియఁజేయుచున్నది. కాఁబట్టి జ్యోతిస్సులగు దీపాదులకుఁగూడ అది జ్యోతిగాఁ జెప్పఁబడినది. మఱియు దీపాదులు నేత్రేంద్రియమునకును దానికి విషయములగు పదార్థములకును కలుగు సంబంధమునకు విరోధియగు చీఁకటిని బోఁగొట్టుటమాత్రము చేయుచున్నవి. అంతమాత్రముచేత అవి ప్రకాశకములగునే కాని విషయములను తమంతఁ బ్రకాశింపఁజేయుట చేతఁగూడఁగాదు, విషయములను దెలియఁజేయునది ఆత్మయొక్క ప్రభారూపమగు జ్ఞానమే. కాఁబట్టి దీపాదులకాంతి చాక్షుష పదార్థములకుఁ బ్రకాశకములగునేకాని జ్ఞానమువలె సర్వవ్యాపకము కానేరదని సూచితమగుచున్నది. హృదయమునందు విశేషించి సన్నిహితమైనదనుటచే భోక్తగా స్వరూపముతో నున్నదనుట. ఇదియ దానిహృదయస్థితియందుఁ గల విశేషము. తక్కిన యవయవములందో అది తనయొక్క ధర్మమైన జ్ఞానముచే సన్నిహితమైనదని గ్రాహ్యము.

వస్థయుం దున్న(ప్రకృతి) కంటె పరమైనదిగా చెప్పఁబడుచున్నది. కనుక జ్ఞానైకాకారమని తెలియఁదగినది. అది జ్ఞానముచేతఁ బొందఁ దగినది-అనగా పూర్వోక్తములైన అమానిత్వాది జ్ఞానసాధనముల చేతఁ బొందఁదగినది. మనుష్యాదులగు సమస్త ప్రాణులయొక్క హృదయమునందు విశేషముగా (భోక్తృత్వాది రూపములో) సన్నిహితమై యుండును.

శ్లో॥ ఇతి క్షేత్రం తథాజ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే॥ 19

టీ. ఇతి=ఈప్రకారము, క్షేత్రం=క్షేత్ర (శరీర) తత్త్వము, తథా=అట్లే, జ్ఞానం=ఆత్మయాథాత్మ్య జ్ఞానసాధనము, జ్ఞేయంచ= తెలియఁదగినదియు - క్షేత్రజ్ఞయాథాత్మ్యమును, సమాసతః = సంగ్రహముగా, ఉక్తం = చెప్పఁబడినది, మద్భక్తః = నాభక్తుఁడు, ఏతత్=దీనిని (అనఁగా క్షేత్రస్వరూపమును ఉపాయస్వరూపమును క్షేత్రజ్ఞస్వరూపమును), విజ్ఞాయ=తెలిసికొని, మద్భావాయ = నా స్వభావమును (అసంసారిత్వమును) పొందుటకొఱకు, ఉపపద్యతే= తగుచున్నాఁడు.

తా. ఈవిధమున 'మహాభూతాన్యహఙ్కారః' అనుట మొదలుకొని 'సఙ్ఘాతశ్చేతనాధృతిః' అనువఱకు క్షేత్రతత్త్వమును, 'అమానిత్వమ్' అనుట మొదలుకొని 'తత్త్వజ్ఞానార్థచిన్తనమ్' అనువఱకు జ్ఞాతవ్యమైన ఆత్మతత్త్వమును గుఱించిన జ్ఞానమునకు సాధనమును, 'అనాదిమత్పరమ్' అనుట మొదలుకొని 'హృదిసర్వస్యవిష్ఠితమ్' అనువఱకు జ్ఞేయంబగు (తెలియఁదగిన) క్షేత్రజ్ఞుని యాథాత్మ్యమును సంక్షేపముగాఁ జెప్పఁబడినవి. నా భక్తుఁడగువాఁడు దీనిని (అనఁగా క్షేత్రయాథాత్మ్యమును, క్షేత్రమునుండి వివిక్తమైన యాత్మస్వరూపమును

ప్రాపించుటకుఁ గల యుపాయముయొక్క యాథాత్మ్యమును, క్షేత్రజ్ఞయాథాత్మ్యమును) దెలసెనేని వాఁడు నా స్వభావమును (అసంసారిత్వమును) బొంద నర్హుఁ డగును. అనఁగా ఈమూఁటిని దెలిసికొనుటచేత ముక్తికి యోగ్యుఁ డగు చున్నాఁడు.

అవ. ఇఁక మిక్కిలియు వేఱువేఱైన స్వభావములు గల ప్రకృతియు ఆత్మలు అనెడి యీరెంటియొక్క సంసర్గము అనాదియగుటయు, అట్లు సంసర్గము నొందినపిదప ఆ రెండును జేయునట్టి కార్యములకుఁ గల భేదమును, ఆ రెంటికిని సంసర్గము కలుగుటకు హేతువును జెప్పుచున్నారు.

శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసమ్భవాన్॥ 20

టీ. ప్రకృతిం=ప్రకృతిని - త్రిగుణాత్మిక యగు మాయను, పురుషం చైవ=క్షేత్రజ్ఞుఁ డనబడు ఆత్మనును, ఉభౌ అపి = (ఒండొంటితో సంసర్గమునొందిన) ఈరెంటిని, అనాదీ=ఆది లేనివిగా-అనాదిగా సంసృష్టములైయున్నవిగా ననుట, విద్ధి=ఎఱుఁగుము, వికారాన్ చ= (బంధహేతువులై ఇచ్ఛాద్వేషసుఖ దుఃఖాదిరూపములగు) దోషములనును, గుణాన్ చ ఏవ=(మోక్షహేతువులగు అమానిత్వాది) గుణములనును, ప్రకృతి సమ్భవాన్ =(క్షేత్రాకారముగాఁ బరిణమించిన) ప్రకృతివలనఁ గలుగునవిగా, విద్ధి=ఎఱుఁగుము.

తా. ప్రకృతిపురుషు లిరువురును అనాదిగా నొండొంటితో కలసియున్నవా రని తెలియుము. బంధహేతువులగు ఇచ్ఛాద్వేషాది వికారములును మోక్షహేతువులగు అమానిత్వాది గుణములును ప్రకృతివలననే కలుగుచున్నవి అని తెలియుము. పురుషునితో (ఆత్మతో) సంసర్గమునొంది యనాదికాలముగా ప్రవర్తించుచు క్షేత్రాకారముగాఁ

బరిణమించి యున్నయీ ప్రకృతియె ఇచ్ఛాద్వేషాదు లనెడి తన వికారములచేత పురుషునకు బంధహేతు వగును. అదియె అమా నిత్వాదిగుణములనెడి తన వికారములచేత పురుషునకు మోక్షహేతు వగును.

శ్లో॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే।
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే॥ 21

టీ. ప్రకృతిః = ప్రకృతి- పురుషాధిష్ఠితమైనప్రకృతి యనుట, కార్యకారణకర్తృత్వే-కార్య=శరీరముయొక్కయు, కారణ=ఇంద్రియములయొక్కయు, కర్తృత్వే=క్రియలు చేయుటయందు-అవియవి తమతమ వ్యాపారములు చేయుటయం దనుట, హేతుః = కారణముగా-ఆశ్రయముగా ననుట, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. (ప్రకృతి శరీరేంద్రియ రూపముగా ఆయావాని వ్యాపారముల కాశ్రయమై యుండు నని భావము), పురుషః = ప్రకృతిసంసృష్టుఁడైనచేతనుఁడు, సుఖదుఃఖానాం=శరీరేంద్రియములవలన కలుగు సుఖదుఃఖములయొక్క, భోక్తృత్వే=భోక్త యగుటయందు, హేతుః=కారణముగా-ఆశ్రయముగా-సుఖదుఃఖానుభవముల కాశ్రయముగా ననుట, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు. అనఁగా పరస్పరసంసర్గము గల ప్రకృతి పురుషులలో జడ మయినప్రకృతికి యోగసాధన క్రియా ప్రయోజకత్వమును, ప్రకృతిని అధిష్ఠించినచేతనునికి క్రియాఫల భోక్తృత్వమును అని యర్థము.

తా. * శరీరముగాని, జ్ఞానకర్మాత్మకము లై మనస్సుతోఁ గూడిన యింద్రియములుగాని చేయు ఆయావ్యాపారములకు, పురు

*శరీరేంద్రియములు అచేతనములు గనుక వానికి కర్తృత్వమనఁగా తమతమ

షునిచే నధిష్ఠింపఁబడిన ప్రకృతియే హేతువు అనఁగా భోగసాధనము లగు క్రియలు పురుషాధిష్ఠిత మగుక్షేత్రము రూపమునఁ బరిణమించిన ప్రకృతిని ఆశ్రయముగాఁ గలవి యని యర్థము. పురుషునకు అధిష్ఠాతృత్వము మాత్రమే. (దానినిబట్టి "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" ఇత్యాదికము చెప్పఁబడినది.) శరీరము నధిష్ఠించుప్రయత్నమునకు హేతువగుటయేకదా పురుషుని కర్తృత్వము. ప్రకృతితో సంసర్గమునొందిన పురుషుఁడే సుఖదుఃఖములభోక్త యగుటకు హేతువు - సుఖదుఃఖానుభవమునకు ఆశ్రయ మైనవాఁడని యర్థము.

అవ. ఇట్లు ఒకటితోనొకటి సంసర్గము నొంది ప్రకృతిపురుషులు సేయు కార్యముల భేదము చెప్పఁబడినది. పురుషుఁడు తనంతట తన్ను అనుభవించుటయే సుఖముగాఁగలవాఁడై యుండియు విషయసంబంధు లగు సుఖదుఃఖముల ననుభవించుటకు హేతు వగుట యెట్లో తెలుపుచున్నారు.

---

వ్యాపారముల కాశ్రయమై యుండుట యని యర్థ మూహించునది. ప్రకృతి శరీరేంద్రియముల కర్తృత్వమునకు హేతువైనదనఁగా ప్రకృతి శరీరేంద్రియరూపముగా (అనఁగా క్షేత్రాకారముగా) పరిణమించి భోగసాధనములైన యాయాక్రియలకు ఆశ్రయమై యుండునని భావము. అయినను కేవలప్రకృతి యట్లు పరిణమించి యాశ్రయమై యుండ నేరదు. కనుక పురుషాధిష్ఠిత మయిన ప్రకృతి యనఁబడెను. క్రియాశ్రయమైన ప్రకృతిని పురుషుఁ డధిష్ఠించిమాత్ర ముండును. పురుషుఁడు కేవల మధిష్ఠించిమాత్ర ముండినయెడల నప్పుడు వానికి సాక్షాత్కర్తృత్వము లేదు; ప్రకృతికే కలుగుచున్న దన్నచో ఇచట పురుషునికి శరీరము నధిష్ఠించి దానిని వ్యాపారమునకు పురికొలుపు ప్రయత్నమున కాశ్రయమైయుండుట కర్తృత్వమని తెలియునది. ఇట్టి కర్తృత్వమునే 'కర్తాశాస్త్రార్థవత్త్వాత్' ఇత్యాది శారీరకసూత్రములు ప్రతిపాదించుచున్నవి. శుద్ధపురుషుఁడు ప్రియాప్రియవిధురుఁ డని శ్రుతులు చెప్పుటచే ప్రకృతిసంసృష్టుఁ డైనపురుషుఁ డనఁబడెను. హేతుత్వమనఁగా నిచట ఆశ్రయత్వము. సుఖదుఃఖానుభవముల కాశ్రయమైనవాఁడని తెలియునది.

శ్లో॥ పురుషః ప్రకృతిస్థోహి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్।

టీ. పురుషః = పురుషుఁడు, ప్రకృతిస్థస్సన్ = ప్రకృతి సంసర్గము గలవాఁడగుచు, ప్రకృతిజాన్ = ప్రకృతివలనఁబుట్టిన-అనఁగా తత్సంసర్గమువలనఁ గలిగిన, గుణాన్ = సత్త్వాది గుణములను- అనఁగా వానికార్యము లగు సుఖదుఃఖాదులను, భుంక్తేహి = అనుభవించుచున్నాఁడుగదా.

తా. తనంతటఁ దన్ను ననుభవించుచుండుటయే సుఖముగాఁ గల యీ పురుషుఁడు ప్రకృతితోడి సంసర్గము గలవాఁడై యాసంసర్గమువలనఁ గలిగిన సత్త్వాదిగుణముల కార్యములైన * సుఖదుఃఖాదుల ననుభవించుచుండును.

అవ. ప్రకృతితోడి సంసర్గమునకు హేతువు చెప్పుచున్నారు.

శ్లో॥ కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోని జన్మసు॥ 22

టీ. అస్య = వీనియొక్క, సదసద్యోనిజన్మసు = మంచిచెడ్డయోనులందలిజన్మములకు - మంచియోనులందుఁగాని చెడ్డయోనులందుఁగాని జన్మించుటకనుట, కారణం = హేతువు, గుణసఙ్గః = సత్త్వాది గుణములందలి (అనఁగా వానికార్యము లయిన సుఖాదు లందలి) యాసక్తియె.

తా. ఈ పురుషుఁడు ఇంతకుఁ బూర్వము ప్రకృతియొక్క

---

* ఇచట సత్త్వాదిగుణములను సాక్షాత్తుగా అనుభవించుట శక్యముకాదు. అవి తమంతటఁ దెలియక తమకార్యములైన సుఖదుఃఖమోహములచేఁ దెలియనట్టివిగా నుండుటచే నింద్రియాతీతములైనవి. కనుక గుణము లనఁగా నిచట గుణకార్యములైన సుఖదుఃఖాదులే గ్రాహ్యము. ఇచట పురుషశబ్దముచే, యథావస్థితాకారము గల పురుషుని-అనఁగా స్వానుభవమునకైక తానుఁడైన పురుషుని గ్రహించునది,

పరిణామరూపములగు దేవమనుష్యాది నానాయోని విశేషములందుం డిన వాఁడుగనుక ఆయాయోనులచే ప్రయుక్తములైన సత్త్వాది *గుణములవలనఁ గలుగు సుఖాదులందు వానికి సంగము కలుగుచున్నది. ఆ సంగమువలన ఆ సుఖాదులకొఱకు వానికి సాధనములగు పుణ్య పాపకర్మములయందు ప్రవర్తించుచున్నాఁడు. పిదప ఆ పుణ్యపాప ఫలముల ననుభవించుటకై మంచియోనులందును చెడ్డయోనులందును జన్మించుచున్నాఁడు. ఇట్లాయోనులందు జన్మించి కర్మము నారంభించుచున్నాఁడు. దానిచే మరలఁ బుట్టుచున్నాఁడు. ఆత్మ ప్రాప్తి సాధనములగు అమానిత్వాదిగుణములను భజించువఱకే ఇట్లు సంసారము నొందుచుండును. కనుక "కారణం గుణసఙ్గోఽస్య సదస ద్యోని జన్మసు" అని యిది చెప్పఁబడెను.

(అవ. సదసద్యోనులందు జన్మించినపిదపఁ బురుషునకుఁ గలుగు స్వభావములను జెప్పుచున్నారు.)

శ్లో॥ ఉపద్రష్టానుమన్తాచ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతిచాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః॥ 23

టీ. పరః=ఉత్కృష్టుఁడైన, పురుషః= (ఈదేహమునం దున్న) పురుషుఁడు, అస్మిన్ దేహే = ఈ దేహవిషయమున - ఈ దేహేంద్రియ విషయమునను మనస్సువిషయమునను అనుట, ఉపద్రష్టా = చూచువాఁడును - ఈ దేహముయొక్క ప్రవృత్తికి అనుకూలమైన సంకల్పాదులచే నడపువాఁడనుట, అనుమన్తాచ = అంగీకరించువాఁడును - దానిప్రవృత్తులను సమ్మతించువాఁడును - ('ఉపద్రష్టా అను

---

* ఇచట గుణశబ్దముచే పూర్వమువలెఁ దత్కార్యములగు సుఖదుఃఖాదులను గ్రహించునది. సుఖమునందు సంగముకలుగుట సహజముగాని దుఃఖమం దెట్లు? అని నచో సుఖమనెడి భ్రాంతిచే దానియందును సంగము కలుగునని తెలియునది.

మన్తా' అను నీరెంటిచే నియమించువాఁడును అని యర్థము గ్రాహ్యము.) భర్తా=దీనిని భరించువాఁడును, భోక్తాచ= దేహప్రవృత్తివలనఁ బుట్టు సుఖదుఃఖముల ననుభవించువాఁడును, (ఇట్లు నియమనభరణ శేషిత్వ ములు కలిగియుండుటవలన), *మహేశ్వరః=(ఈ దేహేంద్రియ మన స్సుల విషయమున) మహేశ్వరుఁడును, పరమాత్మా ఇతిచ అపి= (వీని విషయమున) పరమాత్ముఁడనియుఁగూడ, ఉక్తః=చెప్పఁబడెను.

తా. ఈ దేహమునందు నెలకొనియున్న యీ యుత్కృష్ట పురుషుఁడు తనసంకల్పము ప్రేరణ మొదలైనవానిచే ఈ దేహమునకు ప్రవృత్తి కలిగించుచు దీనిని నియమించుచున్నాఁడు. అట్లే దీనిని భరించుచున్నాఁడు. అట్లే దేహప్రవృత్తివలనఁ గలుగు సుఖదుఃఖ ముల ననుభవించుచున్నాఁడు - అనఁగా దీనికి శేషి యగుచున్నాఁడు. ఇట్లు దేహనియమనముచేతను దేహభరణముచేతను దేహమునకు శేషియై యుండుటచేతను ఈ దేహేంద్రియములకును మనస్సునకును మహేశ్వరుఁడగుచున్నాఁడు. అట్లే యిందు 'శరీరం య దవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః గృహీత్వైతాని సంయాతి వాయు ర్గన్ధానివాశయాత్' (గీ. ౧౫-౮) అని చెప్పఁబడెడిని. ఈ దేహ మందు దేహేంద్రియమనస్సులకు పరమాత్మ యనియు చెప్పఁబడెను. అనంతరమే "ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మాన మాత్మనా"

* మహేశ్వరశబ్దము ఈశ్వరునికే వాచక మగునుగాని జీవుని కెట్లు? అని యడిగి నచో ఇందే 'శరీరం.. వాశయాత్' అనుచో జీవునికి ఈశ్వరశబ్దము ప్రయుక్తమై యున్నది గనుక మహేశ్వరశబ్దమును ప్రయోగింపఁబడెనని తెలియునది. 'పరమాత్మా' అనఁగా ఉత్కృష్టమైనయాత్మ యని యర్థము. చేతనము లయినయాత్మలలో ఉత్కృ ష్టుఁడైన వాఁడని జీవుని గ్రహింపరాదు. అట్టివాఁడు భగవంతుఁడే యగును. అయి నను ఈపరమాత్మశబ్దము జీవపరముగాఁ ప్రయుక్తమైయుండుటచే ఏయాత్మలలో వీఁడు శ్రేష్ఠుఁడు అని వివేచింపవలసియున్నది. ఆత్మ యనుటకు దేహమనియు మన స్సనియు నర్థములు గలవు. కనుక ఈజీవాత్మ దేహమనెడి యాత్మకును మనస్సనెడి

అని ఆత్మశబ్దము దేహమునందును మనస్సునందును ప్రయోగింపఁ బడుచున్నది. అపిశబ్దముచేత మహేశ్వరుఁడనియును జెప్పఁబడెనని గ్రహింపఁబడుచున్నది. మఱి "అనాదిమత్పరమ్" ఇత్యాదులచేఁ జెప్పఁబడినట్లు పూర్వమపరిచ్ఛిన్నజ్ఞానశక్తులు గలవాఁడైయుండియు ఈ పురుషుఁడు అనాది ప్రకృతిసంబంధముచేతఁ గలిగిన గుణసంగము వలన దేహమాత్రమునకు మహేశ్వరుఁడును దేహమాత్రమునకుఁ బరమాత్మయు నగుచున్నాఁడు.

(అవ. ఇఁక వివేకానుసంధాన ప్రకారమును జెప్పఁబూనినవారై ఆయనుసంధానమునందు ఆదరము కలుగుటకొఱకు దానివలన లభించుఫలములు మొదటఁ దెలుపుచున్నారు.)

శ్లో॥ య ఏనం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥ 24

టీ. యః=ఎవఁడు, ఏనం=ఈ-ఇట్లు చెప్పఁబడిన స్వభావము గల, పురుషం=జీవుని, ప్రకృతించ=ప్రకృతినిని, గుణైస్సహ=సత్త్వాది గుణములతోడ, వేత్తి=ఎఱుఁగుచున్నాఁడో - ఆ రెంటిని వానివాని కలయూపున వివిక్తములుగాఁ దెలియుచున్నాఁడో యనుట, సః= వాఁడు, సర్వథా = అన్నిప్రకారములను - అనఁగా దేవమనుష్యాది

---

యాత్మకును ఉత్కృష్టుఁ డని గ్రహించునది. ఆత్మశబ్దము దేహమునందును మనస్సునందునుగూడ ప్రయుక్తమగుట వెంబడినే వచ్చు 'ధ్యానేనాత్మని పశ్యన్తి కేచి దాత్మానమాత్మనా' అను శ్లోకమువలనఁ దెలియుచున్నది. ఇట్లు జీవుఁడు పరమాత్మ యగుటకు ఆత్మశబ్దవాచ్యములగు దేహమును మనస్సును ఆవశ్యకము లగుటచే, ఇచట దేహము మాత్రమే చెప్పఁబడినను మనస్సుకూడ గ్రహింపఁబడెనని తెలియునది. మఱియును నియమన భరణశేషిత్వములు మహేశ్వరత్వమున కావశ్యకములు. జీవుని కామూఁడును దేహవిషయమున నుండుటచే వాఁడు దేహమాత్ర మహేశ్వరుఁ డనఁబడె నని తెలియునది.

నానావిధశరీరములందు మిక్కిలి క్లేశముతోననుట, వర్తమానోఽపి =ప్రవర్తించుచున్నవాఁడైనను, భూయః=మరల-దేహావసానమునకుఁ బిదప అనుట, న అభిజాయతే = జనింపఁడు-ప్రకృతితో సంబంధింపఁడనుట.

తా. ఎవ్వఁడు జీవుని ఈ చెప్పఁబడిన స్వభావములు గల వానినిగాను, ప్రకృతిని ఈ చెప్పఁబడిన స్వభావములు గల దానిని గాను, సత్త్వాదిగుణములను ఇఁకమీఁదఁ చెప్పఁబడు స్వభావములు గలవానినిగాను, ఈమూఁటిని వానివానికలరూపున వివిక్తాకారముతో నెఱుఁగునో, వాఁడు దేవమనుష్యాది దేహములందు మిక్కిలి క్లిష్ట ప్రకారమునఁ బ్రవర్తించుచున్నవాఁడైనను మరల పుట్టఁడు - ప్రకృతితో * సంసర్గమునకుఁ దగఁడు. అనఁగా ఆ దేహావసానమందే అపరిచ్ఛిన్నజ్ఞాన లక్షణమగు పరిశుద్ధాత్మను పొందుచున్నాఁడని యర్థము.

శ్లో॥ ధ్యానే నాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా।
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ 25

టీ. కేచిత్ = యోగపరిపాకము గల కొందఱు, ఆత్మని (స్థితం)=శరీరమునం దున్న, ఆత్మానం=పరిశుద్ధాత్మను, ధ్యానేన =ధ్యానయోగము (భక్తి) చేత, ఆత్మనా=మనస్సుచేత, పశ్యన్తి= చూచుచున్నారు - విశదముగ ననుభవించుచున్నారు. అన్యే = పరిపక్వము కాని యోగము గలయితరులు, సాఙ్ఖ్యేనయోగేన = జ్ఞానయోగముచేతను, అపరే = మఱికొందఱు (జ్ఞానయోగమునం దధి

---

* వాఁడు ఏదేహమునందుండునపుడు ఈ మూఁటిని వివిక్తములుగా నెఱుఁగునో యాదేహముయొక్క యవసానసమయమున అపరిచ్ఛిన్నజ్ఞాన లక్షణమై అపహతపాప్మమై యొప్పు ఆత్మస్వరూపమును బొందుచున్నాఁడని భావము.

కారము లేనివారు), కర్మయోగేన చ = అసంగ కర్మానుష్ఠానము చేతను, (ఆత్మనా = యోగయోగ్యమైన మనస్సుచే - అట్టి మనస్సు నొందినవారై యనుట), పశ్యన్తి = తెలిసికొనుచున్నారు.

తా. ♦ యోగపరిపాకము గల కొందఱు శరీరమునందున్న ఆత్మను ధ్యానయోగముచేత మనస్సున నెఱుఁగుదురు. యోగసిద్ధి లేనివారు జ్ఞానయోగముచేత మనస్సును యోగమునకుఁ దగినట్లు చేసికొని ఆత్మ నవలోకింతురు. జ్ఞానయోగమునం దధికారము లేనివారును అం దధికారము గలిగియున్నను సులభోపాయమును గోరువారును, ఆచారములకుఁ బ్రమాణభూతులగు శిష్టులును, అంతర్గతజ్ఞానమైనకర్మయోగముచేత మనస్సును యోగయోగ్యముఁ గావించుకొని ఆత్మను కనుఁగొందురు.

శ్లో॥ అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితర న్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ 26

టీ. అన్యేతు = మఱికొందఱైతే, ఏవం = ఇట్లు, అజానన్తః = కర్మయోగముఁగూడ నెఱుఁగనివారై, అన్యేభ్యః = జ్ఞానులగు నితరుల వలన, శ్రుత్వా = విని (ఉపదేశింపఁబడి), ఉపాసతే = ఆత్మోపాసనము చేయుచున్నారు. తే అపి = వారును, శ్రుతిపరాయణా శ్చ = శ్రవణము నందు మాత్రము నిష్ఠ గలవారును మృత్యుం = మృత్యురూపమగు సంసారమును, అతితరం త్యేవ = తప్పక దాఁటుదురు.

తా. మఱికొందఱు ఆత్మదర్శన సాధనములైన కర్మయోగాదుల నెఱుఁగమిచే వానియం దధికారములేనివారై తత్త్వదర్శనము

---

♦ ఇందు జ్ఞానముయొక్క పర్వభేదములు గ్రహించునది.

గల యితరజ్ఞానులవలన నుపదేశ మొంది కర్మయోగాదులచేత ఆత్మ నుపాసించుచున్నారు. వారుగూడ ఆత్మావలోకనము లభించి మృత్యు రూపమగు సంసారమును దాఁటుదురు. శ్రవణమునందు మాత్రము నిష్ఠగలవారలును ఆ శ్రవణమువలనఁ బాపముల వీడి పిదప క్రమ ముగా కర్మయోగాదుల నాచరించి సంసారము నతిక్రమింతురు. [అపిశబ్దమువలనను పర్వభేదములు గ్రహింపఁబడుచున్నవి.]

అవ. * ఇఁక ప్రకృతిసంసృష్టమైన యాత్మయొక్క వివేకము ననుసంధించు ప్రకారమును జెప్పఁ బూని స్థావరజంగమము లైన జంతువు లెల్లను చిదచిత్తులయొక్క సంసర్గమువలనఁ బుట్టిన వని చెప్పుచున్నారు.

శ్లో॥ యావ త్సంజాయతే కిఞ్చి త్సత్త్వం స్థావరజఙ్గమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి భరతర్షభ॥ 27

* ఇట్లు ఆత్మదర్శనము చెప్పఁబడినది. అయాత్మదర్శనమునకై ప్రకృతి పురుష అవివేకమును (వేఱువేఱగుటను) అనుసంధించుట యావశ్యకము. దాని ననుసంధించు ప్రకారము 'సమం సర్వేషు' ఇత్యాదులైన రాఁగలశ్లోకములందు చెప్పఁబడెడిని. ప్రకృతి పురుషులు అవివిక్తములుగా (అనఁగా ఒండొంటితో వేఱుపడనివిగా)తోఁచునప్పుడే వాని వివేకమును ఉపదేశించుట తగునుగాని అవి ఒకటినొకటి వీడియున్నప్పుడు వివేక మునుపదేశించుట నిష్ప్రయోజనమే యగును. కనుక ఆరెంటియొక్క అవివిక్తాకారము ఆవశ్యకము. స్వరూపమున వివిక్తములై యున్న యీరెండును ఏదేనిదోషములేక అవి వి క్తములుగాఁ గనఁబడవు. కనుకవానిని అవివిక్తములుగా తోఁపించుదోష మెద్దియన, ఒకటి భోక్తగాను మఱొకటి భోగాయతనముగాను ఏర్పడుటవలన ఆ రెంటికినిగల్గు సంసర్గవిశేషమే. ఈ సంసర్గవిశేషము తెలిఁగిననే వివేకానుసంధానముసేయఁ బొసఁ గునుగాని లేకున్నఁ బొసఁగదు. కనుక నీశ్లోకమునం దీ చిదచిత్సంసర్గ విశేషమును దెలుపుచున్నారు. తరువాతిశ్లోకములందు వివేకానుసంధానప్రకారమును జెప్పుచున్నారు అని తెలియునది.

టీ. భరతర్షభ = అర్జునా, * స్థావరజఙ్గమమ్ = స్థావరజంగమ ప్రకారమైన, సత్త్వం = జంతువు, కించిత్ = ఏదిగాని, యావత్ = ఎంత-ఎన్ని యనుట, సంజాయతే = పుట్టుచున్నదో, (తావత్ = అంతయును-అన్నియు ననుట), తత్ = అది-అట్లు పుట్టుట, క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ = క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క యొండొంటితోడి సంయోగమువలన అని-అనఁగా క్షేత్రక్షేత్రజ్ఞులు ఒకటితోనొకటి సంయుక్తమై తామే ఆ జంతువులుగాఁ బుట్టుచున్నవని, విద్ధి = ఎఱుఁగుము.

తా. అర్జునా, జంతువులు స్థావరజంగమములుగాఁ బుట్టుటయంతయు క్షేత్రక్షేత్రజ్ఞు లొకరితో నొకరు గలియుటచేతనే యగును- అనఁగా క్షేత్రక్షేత్రజ్ఞులు ఒకటితో నొకటికలసియే స్థావరజంగమప్రకారములైన జంతువులుగా నెల్లఁ బుట్టుచున్నవికాని ఒండొంటిని వీడియట్లు గావని యర్థము.

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥ 28

టీ. సర్వేషు = సమస్తమైన, భూతేషు = ప్రాణులయందు, పరమేశ్వరం = ఆయా దేహేంద్రియమనస్సులకు పరమేశ్వరుఁడై, తిష్ఠన్తం = ఉన్నట్టియాత్మను, సమం = జ్ఞాతృత్వముచే సమానాకారము గలవానినిగాను-అనఁగా అంతటను జ్ఞాతృత్వైకాకారము గలవానినిగాను, వినశ్యత్సు = (దేహాదులు) నశించినను, అవినశ్యన్తం = నశింపని స్వభా

---

* అనఁగా ఒక్కొక్క క్షేత్రజ్ఞుఁడును ఆయాక్షేత్రముతోఁ గూడి స్థావరజంగమములైన ఆయాజంతువులుగాఁ బుట్టుచున్నాఁడని భావము. 'క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్' అనుచో మాతాపితృసంయోగమువలనఁ బుత్రుఁడు కలుగునట్లు క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగమువలన దానికంటె అన్యమైన యొకజంతువు పుట్టునని తలఁపరాదు. ఆరెండును కలసి తామేజంతువుగాఁ బుట్టుచున్నవని గ్రాహ్యము. కనుకనే, 'సంయుక్తమై తామే' అని చెప్పఁబడినది.

వము గలవానినిగాను, యః=ఎవఁడు, పశ్యతి= తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, పశ్యతి=చూచుచున్నాఁడు_ కలరూపునఁ గనుఁగొనుచున్నాఁడనుట.

తా. * చిదచిత్తు లొకటితో నొకటి గలసి భూతములుగా పరిణమించినవిగదా. అట్టిభూతములందుఁ గనఁబడు ఆయా దేవాది విషమాకారములకు వేత్తై, అందందుఁ గల యాయా దేహేంద్రియమనస్సులకు పరమేశ్వరుఁడుగా నెలకొన్నదై యుండెడి యాత్మను, అది అంతటను జ్ఞాతృరూపముననుండుటచే సమానాకారముగలదానిని గాను, ఆ దేహాదులు నశించుచున్నను వినాశానర్హ స్వభావమగుటచే నశింపనివానినిగాను, ఎవఁడు * కనుఁగొనునో వాఁడే దానిని కలరూపున నెలకొనియుండఁ గనుగొనును. ఎవఁడు దేవాదివిషమాకారములనుబట్టి ఆత్మనుగూడ విషమాకారము గలదిగాను జన్మవినాశాదులతోఁ గూడినదిగాను కనుఁగొనునో వాఁడు నిత్యసంసారియగు నని ఫలితార్థము.

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాఙ్గతిమ్॥ 29

---

* పూర్వశ్లోకమునందు భూతములు (అనఁగా జంతువులు) ఒక వస్తువుచేనైనవికాక ప్రకృతిపురుషులను రెంటిచేనైనవిగాఁ జెప్పఁబడినవి, ఇట్లా రెండువస్తువులఁ దెలిపి యిప్పుడా రెంటియొక్క వివేకము ననుసంధించుప్రకారములు మూఁటిని దెలుపుచున్నారు. అవి యేవియన, 'సమమ్' అనుటచే పురుషుఁ డంతట సమానాకారుఁడనియు ప్రకృతి విషమాకారమనియు, 'ఈశ్వరమ్' అనుటచే పురుషుఁడు నియంత యనియు ప్రకృతి నియామ్య మనియు, 'అవినశ్యన్తమ్' అనుటచే పురుషుఁడు నిత్యుఁడనియు ప్రకృతి అనిత్య మనియు, నిట్లు మూఁడుప్రకారముల నా రెంటియొక్క వివేకమును అనుసంధించుట దెలిపినవారైరి.

* శంఖమును పచ్చనిదిగాఁ జూచువాఁడు దానిని జూచుచున్నను జూడనివాఁడే

టీ. సర్వత్ర=అంతటను- దేవాదిసమస్తదేహములయందనుట, సమవస్థితం=(శేషిత్వాదులతోఁ గూడి) ఉన్నట్టి, ఈశ్వరం=ఈశ్వరుఁడైనజీవుని, సమం=(జ్ఞానైకాకారుఁ డగుటచేత) సమానాకారము గలవానినిగా, పశ్యన్ = తెలిసికొనుచున్నవాఁడు, ఆత్మనా = మనస్సుచేత, ఆత్మానం=తన ఆత్మను, నహినస్తి = హింసింపఁడు-రక్షించు ననుట-సంసారమునుండి విడివడఁ జేయునని భావము. తతః = అట్లు జ్ఞాతృత్వముచే అంతటను సమానాకారము గలవానినిగా నెఱుఁగుట వలన, పరాం=ఉత్తమమయిన, గతిం = ప్రాప్యమగు ఆత్మస్వరూపమును, యాతి = పొందుచున్నాఁడు.

తా. దేవాది సమస్తశరీరములందును, ఆయా శరీరమునకు శేషియగుటచేతను ఆధారమగుటచేతను నియంత యగుటచేతను ఈశ్వరుఁడై యుండు ఆత్మను ఆ దేవాదివిషమాకార విముక్తునిఁగాను, శరీరములందెల్ల జ్ఞానైకాకారుఁడై యుండుటచే సమానాకారునిగాను గనుఁగొనువాఁడు, తనమనస్సుచేత తన యాత్మను హింసింపఁడు (అనఁగా) రక్షించుచున్నాఁడు. అనఁగా సంసారమునుండి విముక్తునిగాఁ జేయుచున్నాఁడు. మఱియు నట్లు వాఁడు ఆత్మను జ్ఞాతృత్వరూపమున అంత

---

యగును. అట్లై సమదర్శనము లేనివారు ఆత్మను జూచువారైనను జూడనివారే యగుదురని భావము.

♦ సమదర్శి ఆత్మను హింసించువాఁడు కాఁడు. విషమదర్శియు తన యాత్మ యనిత్యమని తలఁచుటచే దానిని హింసింపఁడు. కనుక సమదర్శికి 'న హినస్తి' అని చెప్పుటచే పసలేదు. కాఁబట్టి ఇచట దానికి 'రక్షించు' నని యర్థముచేయఁబడినది. ఈ ప్రకరణమువలన రక్షించుట యనఁగా సంసారవిముక్తి కలిగించుట యని భావము గ్రాహ్యము. ఇట్లై విషమదర్శికిని 'హినస్తి' అనుట తగదు. 'కంఘాతయతి హన్తికమ్' అనునట్లు ఆత్మ హింసార్థము కామిచే జన్మసముద్రమధ్యమునఁ ద్రోయుట యని దాని కర్థ మూహ్యము. ఈశ్లోకమున ప్రకృతిపురుషులలో స్వాకారానుదర్శనమూలమున నొకటి సంసారహేతువును మఱొకటి మోక్షహేతువునగు ననుటచే వాని విశేషము చెప్పఁబడినది.

టను సమానాకారము గలవానినిగాఁ గనుఁగొనుటవలన ఉత్కృష్ట మైన ప్రాప్యమగు యథావస్థితాత్మ స్వరూపమును బొందుచు న్నాఁడు. దేవాద్యాకారములతోఁ గూడియుండుటచే ఆత్మ అంతటను విషమాకారము గలదిగాఁ గనుఁగొనువాఁడు తన యాత్మను హింసిం చుచున్నాఁడు. అనఁగా సంసారసముద్రమధ్యమునఁ ద్రోయుచున్నాఁడు.

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి॥ 30

టీ. కర్మాణి=కర్మములను, సర్వశః = సమస్తవిధములను, ప్రకృత్యైవ = ప్రకృతిచేతనే, క్రియమాణాని = చేయఁబడుచుండు వానినిగాను, తథా = అట్లె, ఆత్మానం=ఆత్మను. అకర్తారం = కర్త కానివానినిగాను, యః=ఎవ్వఁడు, పశ్యతి = తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, పశ్యతి=ఆత్మను కలరూపునఁ దెలిసికొనుచున్నాఁడు.

తా. 'కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే' అను పూర్వోక్తరీతిని దేహేంద్రియరూపమునఁ బరిణమించిన ప్రకృతి చేతనే సర్వకర్మములు సేయఁబడుచున్న వనియు, జ్ఞానస్వరూపియైన ఆత్మ * కర్తకాఁడనియు, వానికి ప్రకృతితోడి కూడికయు దాని నధి

---

* ఆత్మ కర్తకానియెడల వానికిఁ గర్తృత్వమును భోక్తృత్వమును శాస్త్రములు చెప్పుట యెట్లు? అనినచో, వానికి దేహేంద్రియరూపమైన ప్రకృతితోడి సంయోగ మును, దానిని వాఁ డధిష్ఠించుటయు, దానిచేఁ గలుగు సుఖదుఃఖములవాఁ డనుభవిం చుటయు, కర్మరూపమైన యజ్ఞానముచే వానికిఁ గలిగినదిగాని స్వరూపముచేఁ గలిగినవి గాదు. అజ్ఞానమూలమున కర్తృత్వాదులను చెప్పుటచే ఏదోషములేదు. ఇట్లు కర్తృ త్వాదు లజ్ఞానకృతములైనవిగా నెవఁ డెఱుఁగునో వాఁడు ఆత్మను గలరూపున నెఱుఁ గునని భావము. ఇందు ప్రకృతిక్రియలకు సాక్షాదాశ్రయ మైనదనియు పురుషుఁ డట్లు కాఁ డనియు రెంటికిని వివేకము చెప్పఁబడుట తెలియుచున్నది. క్రియలు చేయఁబడుట యం

క్షించుటయు దానివలని సుఖదుఃఖము లనుభవించుటయు కర్మమనెడి జ్ఞానముచేతఁ గావింపఁబడినవనియు నెవ్వఁడు కనుగొనునో వాఁడే ఆత్మను కలరూపున నెలకొనియున్నదిగా కనుఁగొనుచున్నాఁడు.

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా॥ 31

టీ. యదా=ఎప్పుడు, భూతపృథగ్భావం=(ప్రకృతిపురుషతత్త్వములచేనైన) భూతములయొక్క (జాతిగుణరూపములయందు) వేఱుపడియుండుటను, ఏకస్థం = ఒకటి యగుప్రకృతితత్త్వమునం దున్నదానినిగా-ప్రకృతిమాత్రమునం దున్నదానినిగా, అనుపశ్యతి= తెలిసికొనుచున్నాఁడో, తత ఏవ =ఆ ప్రకృతివలననే, విస్తారం చ = పుత్రపౌత్రాదిభేదముల విస్తారమును, (అనుపశ్యతి = తెలిసికొనుచున్నాఁడో), తదా=అప్పుడు, బ్రహ్మ=బ్రహ్మసాధర్మ్యముగల శుద్ధాత్మస్వరూపమును, సమ్పద్యతే= పొందుచున్నాఁడు.

తా. దేవాదులగు సమస్తభూతములు ప్రకృతిపురుషు లనెడి రెండుతత్త్వములచే నైనవి. అట్టిభూతములందుఁ గనుపట్టు దేవత్వమనుష్యత్వాది జాతిభేదములును హ్రస్వత్వ దీర్ఘత్వాది గుణాదిభేదములును ప్రకృతితత్త్వమం దున్నవిగాని ఆత్మయందు లేవనియు, * ఆప్రకృతివలననే పైపైని పుత్రపౌత్రాది భేదవిస్తారము గలుగుచున్నదనియు నెప్పుడు తెలిసికొనుచున్నాఁడో అప్పుడె బ్రహ్మమును బొం

దఁటకిని తెలియును. అం దవి ప్రకృతిచేతనే చేయఁబడుచున్న వనుటమాత్రము తెలిసినవారికే తెలియునని భేదము రూపించుటకై 'ప్రకృత్యైవ క్రియమాణాని' అనఁబడినది.

* ఇందు ప్రకృతియొక్క పరిణామిత్వముచేతను పురుషుని యపరిణామిత్వముచేతను ఆరెంటికి వివేకము ప్రతిపాదితము. 'ఆత్మా వై పుత్రనామాసి' ఇత్యాదులందు

దుచున్నాఁడు-అనఁగా (బ్రహ్మసాధర్మ్యముగల) అపరిచ్ఛిన్న జ్ఞానై కాకారమగు ఆత్మస్వరూపమును బొందుచున్నాఁడని యర్థము.

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః।
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే॥ 32

టీ. కౌన్తేయ=అర్జునా, అయం=ఈ, పరమాత్మా = ప్రత్యగాత్మ, శరీరస్థోఽపి=శరీరమున నున్నవాఁడైనను, అనాదిత్వాత్ = ఆరంభకద్రవ్యశూన్యత్వాత్ =అనారభ్యుఁ డగుటవలన, అవ్యయః= నాశములేనివాఁడు, నిర్గుణత్వాత్ = సత్త్వాదిగుణరహితుఁ డగుట వలన, న కరోతి = కర్మములం జేయువాఁడు కాఁడు. నలిప్యతే = (దేహస్వభావములచేత) పూయఁబడఁడు-దేహస్వభావములు వానికిఁ దగులువడ వనుట.

తా. అర్జునా, దేహముకంటె వేఱు గావించి నిజస్వభావ ముతో నిరూపింపఁబడిన యీ పరమాత్మ శరీరమునం దున్నవాఁడైనను * ఆరభ్యుఁడు కానందువలన వ్యయ (నాశ) రహితుఁడు.

---

ఆత్మకు పుత్రాదిరూపమైన పరిణామము చెప్పఁబడినను, అది 'అఙ్గాదఙ్గాత్సమ్భవసి' ఇత్యాదులవలన ప్రకృత్యంగగతమైనదిగా తెలియుటచే 'ప్రకృతివలననే' అనుచో ఏవ కార మునుపఁబడినది. మఱియు ప్రకృతితత్త్వము మొదటఁ దానే పొందు దేవాది రూప విచిత్రపరిణామమందును తన్మూలమైన సంతానరూప పరిణామమునందును భోక్తయైన పురుషునిభోగార్థమైన సన్నిధిమాత్రమే యపేక్షితముగాని భోగాయతన మైన దాని యొక్క వికారముల కాస్పదమై యుండుటకూడ అపేక్షితము గాదని తెలుపుటకై ఈ 'ఏవ' కారము ప్రయుక్తము.

* ఇంతవఱకు ఆత్మకుఁ జెప్పఁబడిన నిత్యత్వాపరిణామిత్వాదులు ఇందు సహేతుకముగా స్థిరీకరింపఁబడినవి. ఎట్లన, ఇంతకు మునుపు లేక, క్రొత్తగా ఆరంభింపఁ (జేయఁ) దగునది ఆరభ్యము, ఆరంభింపఁబడినట్టిది వ్యయము నొందును. ఇది యట్టిది కాదు గనుక అవ్యయమైనది. మఱియు ప్రకృతి, గుణములతోఁగూడినది క్రియలు

సత్త్వాదిగుణరహితుఁడగుటవలన కర్మములఁ దాను జేయుఁడు. దేహస్వభావములచే లిప్తుఁడు గాఁడు అనఁగా అవి వానికి పట్టువడుటయును లేదు.

అవ. నిర్గుణుఁ డగుటచే కార్యములు చేయకపోయిననుబోయెఁగాని, శరీరముతో నిత్యయుక్తుఁడై యుండుటచే శరీరస్వభావములచే లిప్తుఁడు కాకుండుట యెట్లనఁగాఁ జెప్పుచున్నారు.

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే॥ 33

టీ. యథా = ఎట్లు, ఆకాశం=ఆకాశము సర్వగతమపి=సమస్తవస్తువులందు వ్యాపించినదైనను, సౌక్ష్మ్యాత్ = సూక్ష్మమగుటవలన, న ఉపలిప్యతే = (తాను వ్యాపించియున్న ఆయా సర్వవస్తుస్వభావములచేత) అంటఁబడదో, తథా = అట్లు, ఆత్మా = జీవాత్మ, సర్వత్ర దేహే = దేవమనుష్యాది సకలదేహములందు, అవస్థితోఽపి = ఉన్నవాఁడైనను, న ఉపలిప్యతే = (ఆయా దేహస్వభావములచేత) అంటఁబడఁడు.

తా. ఆకాశము సమస్త వస్తువులతోఁ గలిసియున్నదైనను, సూక్ష్మమగుటంజేసి యేవస్తుస్వభావముతోడనైన నెవ్విధంబున తగులు పడక యుండునో అట్లు ఆత్మయు దేవమనుష్యాది సర్వదేహములయం

---

చేయును. ఇది యట్టిది కాదు కనుక కర్తృత్వములేనిది. మఱియు పటాదులకు పంకాదులు సంసర్గముచే లేపకములగును. ఆత్మకు ఏవి సంసర్గముచే లేపకము లగునన్నచో 'శరీరస్థోఽపి' అనుచో ఆత్మకు శరీరసంసర్గము చెప్పఁబడుటచే శరీరస్వభావములే దానికి లేపకములు కావలయును. అయినను అవి యట్లు కానేరవని ప్రతిపాదింపఁబడినది.

* సూక్ష్మమునకే అంటకుండఁగా అతిసూక్ష్మమున కంటు టెట్లు అని భావము.

దున్నను * అతిసూక్ష్మమగుటవలన ఆయా దేహస్వభావములతో తగులువడఁడు.

శ్లో॥ యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః।
క్షేత్ర క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥ 34

టీ. హేభారత=అర్జునా, యథా=ఎట్లు, ఏకః=ఒక్కఁడైన, రవిః=సూర్యుఁడు, కృత్స్నం=సమస్తమైన, ఇమంలోకం = ఈలోకమును, ప్రకాశయతి = ప్రకాశింపఁజేయుచున్నాఁడో-తన ప్రభచేత విశద మగునట్లు చేయుచున్నాడో, తథా=అట్లే, క్షేత్రీ = క్షేత్రజ్ఞుఁడగు ఆత్మ, క్షేత్రం=శరీరమును, కృత్స్నం=అంతటను - లోపలను వెలుపలను - పాదము మొదలు శిరస్సువఱకు ననుట, ప్రకాశయతి= ప్రకాశింపఁ జేయుచున్నాఁడు - తన జ్ఞానవ్యాప్తిచేత విశద మగునట్లు చేయుచున్నాఁడు.

తా. అర్జునా, సూర్యుఁ డొకఁడు తన ప్రభచేత నీ సమస్త ప్రపంచమును బ్రకాశింపఁజేయునట్లు క్షేత్రజ్ఞుఁడగు నాత్మయు క్షేత్రమగు శరీరమును 'ఈనాక్షేత్ర మిటువంటిది' యని అంతటను వెలుపలను లోపలను కాలుమొదలు తలవఱకు తన జ్ఞానముచేత ప్రకాశింపఁ జేయును. కనుక ప్రకాశింపఁజేయఁదగు లోకముకంటె ప్రకాశింపఁజేసెడి సూర్యుఁ డెట్లు వేఱో యట్లే తెలియఁబడు నీశరీరముకంటె తెలియువాఁడగుటంజేసి ఉక్తలక్షణుండగు * నీ యాత్మమిక్కిలియు విలక్షణుఁడని భావము.

---

* అనఁగా ఆత్మ తెలిసికొనువాఁడుగాన తెలియబడెడి క్షేత్రముకంటె విలక్షణుఁడని యర్థము. ఈదృష్టాంతము, క్షేత్రజ్ఞుఁడు క్షేత్రమును బ్రకాశింపఁజేయుటను జెప్పుమూలమున క్షేత్రమునకంటె విలక్షణుఁడై యుండుటనుగూడ సూచించుచున్నదని భావము. మఱియు నీయధ్యాయారంభమందు 'ఏతద్యోవేత్తితంప్రాహుః' అని వేద్యవేదితృభావముచే ప్రతిపాదింపఁబడిన భేదము ఇందు దృష్టాంతపూర్వముగా స్థిరీకరింపఁబడినదని తెలియునది.

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షంచ యే విదు ర్యాన్తి తే పరమ్॥ 35

టీ. ఏవం=ఇట్లు, జ్ఞానచక్షుషా=ప్రకృతిపురుషుల వివేకమును గుఱించిన జ్ఞాన మనెడినేత్రముచేత, క్షేత్రక్షేత్రజ్ఞయోః = ప్రకృతి పురుషులయొక్క, అన్తరం = భేదమును, భూతప్రకృతిమోక్షంచ = భూతాకారముగా పరిణమించిన ప్రకృతియొక్క మోక్షోపాయమును-అనఁగా అమానిత్వాదికమును, యే = ఎవరు, విదుః = తెలిసికొను చున్నారో-తెలిసికొని యాచరించుచున్నారో యనుట, తే = వారు, పరం=పరిశుద్ధాత్మ స్వరూపమును, యాన్తి = పొందుచున్నారు.

తా. ఈ చెప్పఁబడినప్రకారముగా క్షేత్రక్షేత్రజ్ఞులకుఁ గల భేదమును భూతప్రకృతిమోక్షమును, ఆరెంటియొక్క వివేక జ్ఞాన మనెడు నేత్రముచేత నెవ్వ రెఱుఁగుదురో వారు నిర్ముక్తబంధమగు ఆత్మను బొందుదురు. మోక్ష మనఁగా 'మోక్ష్యతేఽనేన ఇతి మోక్షః' అని వ్యుత్పత్తి చెప్పఁబడిన అమానిత్వాదికమే మోక్ష సాధన మని యర్థము. ప్రకృతిపురుషుల వివేకవిషయంబైన పూర్వోక్త జ్ఞానముచే వానికిఁగల విశేషమును, భూతాకారముగాఁ బరిణమించిన ప్రకృతియొక్క మోక్షోపాయమగు అమానిత్వాది సాధనవర్గమును, ఎవ్వరెఱింగి యాచరింతురో అట్టివారు సంసారబంధమును విడనాడిన వారై, నిజస్వరూపముతోఁ గూడినదై అనవచ్ఛిన్న జ్ఞానలక్షణమై యొప్పు నాత్మస్వరూపమును బొందుదు రని యర్థము.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ
విభాగయోగోనామ త్రయోదశోఽధ్యాయః.

ఇది యుపనిషదర్థ ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ శాస్త్రంబును శ్రీకృష్ణార్జున సంవాదరూపంబును నగు శ్రీ భగవద్గీతల యందు క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగం బన్నది త్రయోదశాధ్యాయము.

# శ్రీ భగవద్గీతా - చతుర్దశోఽధ్యాయః

## గుణత్రయవిభాగయోగః

—//—

### అవతారిక

త్రయోదశాధ్యాయమునందు పరస్పరసంసర్గము గల ప్రకృతి పురుషులయొక్క స్వరూపయాథాత్మ్యమును దెలిసికొని, భగవద్భక్తిచే అనుగ్రహింపఁబడిన అమానిత్వాదిగుణముల ననుష్ఠించుటవలన సంసారబంధమునుండి విడివడుచున్నాఁడని చెప్పఁబడెను. అచ్చటనే పూర్వపూర్వములును సత్త్వాదిగుణమయములును అగు సుఖాదులందలి సంగమే బంధహేతువుగా "కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోని జన్మను" అని చెప్పఁబడెను. ఇప్పుడీపదునాల్గవయధ్యాయమునందు ఆ సత్త్వరజస్తమోగుణములు బంధహేతువులైన ప్రకారమును వానిని నివర్తింపఁజేయు ప్రకారమును జెప్పఁబడుచున్నవి.

శ్రీభగవానువాచ.

1

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్।
యద్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాంసిద్ధి మితోగతాః॥ 1

టీ. పరం=పూర్వము చెప్పఁబడినదానికంటె నితరమయిన దనియు, జ్ఞానానాం=ప్రకృతిపురుషవిషయజ్ఞానములలోపల, ఉత్తమం= శ్రేష్ఠమైనదియును అగు, జ్ఞానం=సత్త్వాదిగుణముల విషయమైన జ్ఞానమును, భూయః = మఱల, ప్రవక్ష్యామి = విస్తరించి చెప్పఁబోవుచున్నాను, యత్ = దేనిని-(ఆజ్ఞానమును), జ్ఞాత్వా= తెలిసికొని, సర్వే =సమస్తమయిన, మునయః=మననశీలురు-(జ్ఞానాభ్యాసముచేయువా

రనుట), ఇతః= ఈ సంసారమండలముకంటె, పరాం = సర్వోత్తమ మయిన, సిద్ధిం=శుద్ధాత్మస్వరూపప్రాప్తిరూపమయినసిద్ధిని, గతాః =పొందిరో - పొందిరనుట.

తా. పూర్వము నీకు నేను ప్రకృతిపురుషాంతర్గతమైన సత్త్వాది గుణవిషయజ్ఞానమును చెప్పితిని. దానినే మరలఁ జెప్పెదను. అది పూర్వోక్తమైనదానికంటె *విస్తృతమైయుండుటచే వేఱైనది. మఱియు నది ప్రకృతిపురుషవిషయములైన జ్ఞానములలో నెల్ల ♦నుత్తమమైన జ్ఞానము. ఆజ్ఞానము నెఱింగి దాని మననముసేయువారెల్ల ఈసంసార మండలముకంటె నుత్కృష్టమై పరిశుద్ధాత్మస్వరూపప్రాప్తిరూపమై యొప్పుసిద్ధిని బొందుదురు.

అవ. మఱల నా జ్ఞానమునే దాని ఫలమునుబట్టి విశేషించి చెప్పుచున్నారు.

---

* ఇచట 'ఉత్తమమ్' అని ఉత్కృష్టవాచిశబ్ద ముండుటచే 'పరమ్' అనుటకు ఉత్కృష్టమని యర్థముసేయరాదు-పూర్వోక్త మైనదానికంటె వేఱైనదని యర్థము గ్రహింపఁదగును. అయినను 'భూయః' అనుటచే పూర్వోక్తమైనదే మరలఁ జెప్పఁబడు నని తెలియుచున్నది. పూర్వోక్తమే మరలఁజెప్పఁబడు నేని అది పూర్వోక్తమునకు వేఱు ఎట్లగును? ఇట్లురెంటికిఁ గలుగు విరోధమునకు పరిహార మెట్లన, పూర్వాధ్యాయ మందుఁ జెప్పఁబడిన గుణములబంధహేతుత్వమే యిచటను జెప్పఁబడుచున్నది. ఇది తెలియుటకే 'ప్రకృతపురుషాంతర్గమైన' అని కూర్పఁబడినది. అయినను అందు సంగ్రహముగాను ఇందు విస్తరముగాను నుండుటచే అందు చెప్పబడినదానికంటె ఇందలిది 'పరమ్' వేఱగును. అనఁగా విషయము లొక్కటియేయైనను సంగ్రహ విస్తరరూప ములనుబట్టి వేఱువేఱని చెప్పఁబడిన వని తెలియునది. ఇట్లు గ్రహించుటచే విరోధము పరిహృత మగుచున్నది.

♦ 'జ్ఞానానా ముత్తమమ్' అనుటను సర్వజ్ఞానములలో నుత్తమమైనది యన్నచో భగద్విషయజ్ఞానముకంటెనుగూడ ఉత్తమమైనదని యేర్పడును. దానికంటె ఇది

2 అవ.

శ్లో॥ * ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ॥ 2

టీ. ఇదం=ఈ చెప్పఁబడెడి, జ్ఞానం=జ్ఞానమును, ఉపాశ్రిత్య =ఆశ్రయించి, మమ = నాయొక్క, సాధర్మ్యం = సామ్యమును, ఆగతాః=పొందినవారు, సర్గే అపి = సృష్టికాలమునందును, న ఉప జాయన్తే =జన్మింపరు-(జన్మ మొందరనుట). ప్రలయేచ = ప్రళయ మునందును, న వ్యథన్తి=దుఃఖమును బొందరు-అనఁగా నశింప రనుట.

తా. ఈ చెప్పఁబడు సత్త్వాదిగుణవిషయజ్ఞానము నాశ్రయించి నా సామ్యమును బొందినవారలు సృష్టియందును బుట్టరు - అనఁగా సృష్టికి లోను గారు. ప్రలయమందు వ్యథయును బొందరు. అనఁగా సంహారమునకును లోను గారు.

అవ. ♦ఇఁక ప్రాకృతములగు గుణములు బంధుహేతువులగు ప్రకారమును జెప్పఁబూని యందుకొఱకు సమస్తభూతసమూహమును 'యావత్సఞ్జాయతే కిఞ్చిత్' అని మున్ను చెప్పినట్లు ప్రకృతిపురుష సంసర్గముచేఁ బుట్టిన వగుట తాను చేసినదియే యని చెప్పుచున్నారు.

---

ఉత్తమమైనది కాదు గనుక 'ప్రకృతిపురుషవిషయము లైన జ్ఞానములలో' అని యర్థము గ్రహింపఁబడినది.

* పూర్వశ్లోకమున ఇష్టప్రాప్తియు ఇందు అనిష్టనివృత్తియుఁ జెప్పఁబడుటచే రెంటికిని బునరుక్తిలేదని గ్రాహ్యము.

♦ ప్రకృతిగుణములు బంధహేతువులైన ప్రకారముగాని అవి నివర్తించుప్రకార ముగాని యిచటఁ జెప్పవలసియుండఁగా వానిని జెప్పక నడుమ భూతములు ప్రకృతి పురుషసంసర్గమువలనఁ బుట్టుట స్వకృతమే యని చెప్పుట యసంగతముకాదా యని

శ్లో॥ మమ[3] యోనిర్మహ*ద్బ్రహ్మ[4] తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సమ్భవ[5] స్సర్వభూతానాం తతో భవతి భారత॥ 3

టీ. హే భారత = అర్జునా, యోనిః = సర్వజగత్కారణభూతమైన, మహద్బ్రహ్మ = అచేతనప్రకృతి, మమ = నాకు శేషభూతమైనది, తస్మిన్ = దానియందు, గర్భం = జీవాత్మసముదాయరూపమైన బీజమును, అహం = నేను, దధామి = ఉంచుచున్నాను. తతః = ఆరెండు ప్రకృతుల సంయోగమువలన, సర్వభూతానాం = బ్రహ్మాది సమస్త భూతములయొక్క, సమ్భవః = ఉత్పత్తి, భవతి = కలుగుచున్నది.

తా. అర్జునా, సమస్తమైన జగత్తునకు యోనిభూతమగు నామహద్బ్రహ్మమెద్దియో దానియందు గర్భమును నేను ఉంచుచున్నాను. 'భూమిరాపో౽నలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥ అపరేయ మితస్త్వ

---

నచో', భూతము లట్లు పుట్టుట స్వాకృతమేయని చెప్పుటవలన, గుణములు వాని నట్లు పుట్టించుటయు (అనఁగా వానికి జన్మబంధహేతువు లగుటయు) స్వాకృతమె యని తెలియుచున్నది కాన గుణములు బంధహేతువులైన ప్రకారము (అనఁగా ఈశ్వరునిచే బంధహేతువులుగాఁ జేయఁబడుట) ఇందు సూచితమైనది కనుక నిచట అసంగతి యేమియు లేదు.

(* ఇచట బ్రహ్మశబ్దము పరబ్రహ్మపరము గాదు. ఇందుఁగల యోని శబ్దమును బట్టియు, మమశబ్దమును బట్టియు, 'ఏతద్యోనీని భూతాని' 'భూమి ... అపరేయమ్' ఇత్యాదులందు నిర్దిష్టమైన యచేతన ప్రకృతియె గ్రాహ్యము. ఇది మహాభూతములకును తత్కారణమైన యహంకారమునకును తత్కారణమైన మహత్తత్త్వమునకును కారణముగాన - అనఁగా ఆయా కారణములకును ఇది కారణమగుటచే దీనికి 'మహత్' అను విశేషణము లభించినది. 'యస్సర్వజ్ఞ ... జాయతే' అని శ్రుతియు నొక్కచో ప్రకృతిని బ్రహ్మమని నిర్దేశించుచున్నది. మఱియు 'ఇతః ... పరామ్' అని చేతనపుంజరూపమైన పరప్రకృతి సకలప్రాణి బీజమగుటవలన గర్భశబ్దముచేఁ జెప్పఁబడినది.) 'ఆబ్రహ్మస్తమ్బపర్యన్తా జగదన్తర్వ్యవ

న్యామ్' అని నిర్దేశింపఁబడిన అచేతనప్రకృతి, మహత్తు అహంకారము మొదలగు వికారములకు కారణ మగుటచేత మహద్బ్రహ్మమని చెప్పఁ
6
బడుచున్నది; శ్రుతియందును గొన్నియెడల ప్రకృతిసైతము 'యస్స ర్వజ్ఞస్సర్వవిద్య యస్యజ్ఞానమయం తపః। తస్మాదేతద్బ్రహ్మ నామరూప మన్నంచజాయతే' అని బ్రహ్మశబ్దముచే నిర్దేశింపఁబడుచున్నది. 'ఇతస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం। జీవభూతామ్' అని చేతన పుంజరూపమగు పరప్రకృతి యేది నిర్దేశింపఁబడినదో అదియే యిట సకలప్రాణిబీజ మగుటంబట్టి గర్భశబ్దముచే చెప్పఁబడుచున్నది. అచేతనమై యోనిభూతమగు ఆ మహద్బ్రహ్మమునందు చేతనపుంజరూప మగు గర్భమును ఉంచుచున్నాను-అనఁగా భోగక్షేత్ర మగు అచేతన ప్రకృతితోడ భోక్తృవర్గపుంజ మగు చేతనప్రకృతిని గూర్చుచున్నా నని యర్థము. ప్రకృతులు రెంటికిని నా సంకల్పముచేతఁ గావింపఁ బడిన యీ సంయోగమువలన (అనఁగా సంయుక్తములైన యీరెండు ప్రకృతులవలన) బ్రహ్మాది స్తంబపర్యంతముం గల సమస్తభూతములకు పుట్టుక కలుగుచున్నది.

అవ, * కార్యావస్థమైన చిదచిత్ప్రకృతి సంసర్గముగూడ నా చేతనే చేయఁబడినది యని చెప్పుచున్నారు.

---

స్థితాః। ప్రాణినః కర్మజనిత సంసారవశవర్తినః। బ్రహ్మాద్యా స్సకలాదేవా మనుష్యాః పశవస్తథా। విష్ణుమాయా మహావర్త మోహాన్ధతమసావృతాః। హిరణ్యగర్భో భగవాన్' ఇత్యాదులచే బ్రహ్మేశానాదులుకూడ తక్కినవానివలెనే సృజింపఁబడువారు గనుక సర్వశబ్దమునకు బ్రహ్మాది స్తంబపర్యంత మని కూర్పఁబడినది. చతుర్ముఖునిచే సృజింపఁబడునవిగూడ భగవంతునిచే సృజింపఁబడినవిగా చెప్పుట యెట్లన, 'అబుద్ధిపూర్వక స్సర్గః ప్రాదుర్భూత స్తమోమయః' ఇత్యాదులందు చతుర్ముఖునసంకల్పము లేకయే స్థావరాదిసృష్టి కలుగునని చెప్పఁబడుటచే చతుర్ముఖునివలెనే అతనిచే సృజింపఁబడినవిగూడ స్తంబపర్యంతము పరమాత్మునిచే సృజింపఁబడిన వని తెలియనగును.

* పూర్వశ్లోకమున నామరూపవిభాగము లేక కారణావస్థయందున్న చిత్తులకు

అవ. 7

శ్లో॥ సర్వయోనిషు కౌన్తేయ మూర్తయ స్సమ్భవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥ 4

టీ. హే కౌన్తేయ=అర్జునా, సర్వయోనిషు = సమస్తజాతుల యందును, యాః=ఏ, మూర్తయః=దేహములు, సమ్భవన్తి=పుట్టుచున్నవో, తాసాం = వానికి, మహత్ బ్రహ్మ = అచేతనప్రకృతి, యోనిః= కారణము-(మాతృస్థానము). అహం= నేను, బీజప్రదః = బీజమైన చేతనవర్గమును గూర్చువాఁడగు, పితా=తండ్రిని.

8

తా. అర్జునా, దేవ గంధర్వ యక్ష రాక్షస మనుష్య పశు మృగ పక్షి సరీసృపాదులైన సకలయోనులందును ఆయా మూర్తులేవి పుట్టుచున్నవో వానికి మహద్బ్రహ్మ కారణము-అనఁగా ♦నాచేఁ గూర్పఁబడిన చేతనవర్గము గలదై మహత్తు మొదలుకొని పంచభూతములవఱకుఁగల యవస్థావిశేషములనొందిన యచేతన ప్రకృతి

9

కారణమగుచున్నదని యర్థము. నేను బీజప్రదుఁడగు పితను - అనఁగా ఆయామూర్తులందు వానివాని కర్మానుగుణముగా ఆయా చేతనవర్గమును గూర్చువాఁడను నే నని యర్థము.

---

అచిత్తుతోఁడిసంసర్గము చెప్పఁబడినది. ఈ కారణావస్థమైన చిదచిత్సంసర్గమే ప్రాకృత సృష్టి. ఇట్లాచిదచిత్తులు సంసర్గమునొంది దేవమనుష్యపశుపక్ష్యాదికార్యము లైనపుడు (అనఁగా నామరూపవిభాగముగల కార్యావస్థల నొందినపుడు) వానివలననుండి పుట్టు దేవమనుష్యాదిరూపమైన చిదచిత్సంసర్గముకూడ ఈశ్వరకృతమే యని భావము. ఈ కార్యావస్థమైన చిదచిత్సంసర్గమే నిత్యసృష్టి యనఁబడును.

♦ ఇచట చిత్సంపర్కముగాని సర్వేశ్వరుని యధిష్ఠానముగాని లేనిచో కేవలమైన యచిత్తువలన మూర్తులు కలుగఁజాలవు గనుక 'నాచేఁగూర్పఁబడిన చేతనవర్గముగలదై' యనఁబడెను, మఱియు 'సర్వయోనిషు' ఇత్యాదులచే నిర్దేశింపఁబడుచరమవ్యష్టిసృష్టి

అవ. *ఇట్లు సృష్ట్యాదియందు ప్రాచీన కర్మవశమున అచిత్సంసర్గము నొంది దేవాదియోనులందు జనించినవారు మరల మరల దేవాదిభావములతో జన్మించుటకు హేతు వేమనఁగాఁ జెప్పుచున్నారు.

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః।
10
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్॥ 5

టీ. హేమహాబాహో = భుజబలముగల యర్జునా, ప్రకృతిసమ్భవాః = ప్రకృతివలనఁ బుట్టినవైన - సత్త్వం రజః తమః ఇతి = సత్త్వము రజస్సు తమస్సు అనెడి, గుణాః=మూఁడుగుణములు, అవ్యయం=తనంత గుణసంబంధమున కనర్హుఁడగు, దేహినం=ఆత్మను,

---

బహుయోనిక మైనదిగా తెలియుటచే ప్రకృతి యొక్కటిమాత్రము వానికి యోనియగుట యెట్లు? అన్నచో, ఆప్రకృతి యొక్కటియేయైనను మహత్తుమొదలుకొని పంచభూతములవఱకుఁగల యాయాయవస్థలను పెక్కునొంది యాయావానికి యోనులగుచున్నవి. ఇట్లొకప్రకృతి బహుయోను లగుటకై 'మహత్తుమొదలుకొని' ఇత్యాదులు చెప్పఁబడినవి. యోనియందు బీజప్రదుఁ డగువాఁడు పిత యనఁబడునట్లు మహద్బ్రహ్మరూపమైన యోనియందు చేతనపుంజాఖ్యబీజప్రదుఁడగుటచే భగవంతుఁడు పిత యనఁబడెనని యూహించునది. ఆయాచేతనవర్గమును తత్తత్కర్మానుగుణముగా ఆయామూర్తులం దుఁగూర్చువాఁ డని భావము. పూర్వశ్లోకమున ప్రాకృతనైమిత్తికసృష్టులు స్వసంకల్పాధీనములని చెప్పిరి. ఇందు నిత్యసృష్టియు స్వకృతమేయని చెప్పినవా రైరని తెలియునది.

* ప్రాకృతసృష్టియే కాక నిత్యసృష్టియుఁ గలుగనేల? నైమిత్తికసృష్ట్యాదియందు ప్రాచీనకర్మానుగుణముగా పరమపురుషసంకల్పమువలనఁ గలిగిన యచిత్సంసర్గముచే చిత్తునకు జన్మము కలిగెడిని. ఆ ప్రాచీనకర్మము ముగియఁగా తత్ఫలమైనశరీరము సైతము నశించుటచే మరల దేవాదిభావములతో నిత్యసృష్టికి విషయమగుట యెట్లు? అను ప్రశ్నమునకు నిందు సమాధాన మెఱుంగునది. ప్రకృతిగుణములు మరలమరల దేవాదిబంధమును కలిగించుచున్న వని తెలియునది.

దేహే = దేహమునందు - దేహమునందు వర్తించువానినిగా, నిబధ్నన్తి = బంధించుచున్నవి.

తా. అర్జునా, సత్త్వ రజస్తమస్సు లనఁబడు *మూఁడు గుణ
11

ములు ప్రకృతికి స్వరూపమును వీడకుండు స్వభావవిశేషములు. వానిని ప్రకాశాదులైన వానికార్యములచేతనే నిరూపించి తెలిసికొనఁదగును.
12

అవి *ప్రకృత్యవస్థయందుఁ బుట్టక దానివికారములైన మహదాదులందుఁ బుట్టి మహత్తు మొదలుకొని పంచభూతములవఱకుఁ గల ప్రకృతివికారములచే నిర్మితములగు దేవమనుష్యాది దేహములతో సంబంధించియున్న యీ దేహిని (ఆత్మను) తనంతట గుణసంబంధమునకు అనర్హుఁడైనను దేహమునందు వర్తించువానినిగా నిబంధించుచున్నవి - అనఁగా దేహమందు వర్తించుచుండుట యనెడి ఉపాధిచే బంధించుచున్నవి-అనఁగా మరల మరల దేవమనుష్యాది రూపములతో పుట్టునట్లు చేయుచున్నవి యని యర్థము.

15

అవ. సత్త్వ రజస్తమస్సులయొక్క నిరూపకస్వభావమును బంధించుప్రకారమును చెప్పుచున్నారు.

---

* సత్త్వరజస్తమస్సు లనెడి మూఁడుగుణములును ప్రకృతిస్వరూపము నెప్పుడు విడవకుండు ధర్మములే యగునుగాని ఏదైన నొకయుపాధివలన దానికి నడుమఁ గ్రొత్తగా సంభవించునట్టివి కావు. అవి ప్రకృత్యవస్థయందుఁ బుట్టక దాని వికారములైన మహదాదులందుఁ బుట్టును. అయినను 'ప్రకృతి సమ్భవాః' అని అవి ప్రకృతికి సంభవించునవిగా చెప్పుట యెట్లన, అవి ప్రకృతియందు సమములై యుండుటచే స్ఫురింపకుండును. దాని మహదాదికార్యవస్తులందు విషమములగుటచే స్ఫురించును. ఇట్లు స్ఫురించుటయే సంభవించుటగా చెప్పఁబడినదికాని ప్రకృతికి అవి క్రొత్తగాఁ గలుగుట కాదని గ్రహించునది.

* పృథివియొక్క గుణమైనగంధము దానియందు తెలియక దానియం దుత్పన్నమైన పుష్పమునందు తెలియునట్లు.

13
శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్।
14
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ॥ 6

టీ. హే అనఘ=పాపరహితుఁడా, తత్ర=ఆసత్త్వరజస్తమోగుణములలో, నిర్మలత్వాత్ = నిర్మలమగుటవలన, ప్రకాశకమ్=ప్రకాశమును (ప్రకాశసుఖములకు హేతువైన దనుట), అనామయం=ఆమయము (రోగము) అనెడి కార్యము లేనిదియు-ఆరోగ్యమునకు హేతువైనదియు, అగు, సత్త్వం=సత్త్వగుణము, సుఖసఙ్గేన=సుఖమునందలి ఆసక్తిచేతను, జ్ఞానసఙ్గేన = జ్ఞానమునందలి ఆసక్తిచేతను, (పురుషం=పురుషుని), బధ్నాతి=బంధించుచున్నది - జ్ఞానసంగమును సుఖసంగమును బుట్టించుచున్న దనుట.

తా. అర్జునా, ఆ సత్త్వరజస్తమస్సులలో సత్త్వముయొక్క స్వరూప మిట్టిది. *అది నిర్మల మగుటవలన ప్రకాశక మైనది. నిర్మ

*పటికపుఱాలు మణులు మొదలైనవి నిర్మలము లయ్యును ప్రకాశకములుకావు. కనుక సత్త్వముమాత్రము నిర్మలమగుటవలన ప్రకాశమెట్లగునన్నచో ఇచట నిర్మలమనఁగా ఆవరణ (కప్పిపుచ్చు) స్వభావములేని దనుట-ప్రకాశమును సుఖమును గప్పిపుచ్చుస్వభావము లేనిదనిభావము. ఆకాశము వాయువు మొదలైనవి ఆవరణస్వభావరహితము లయ్యును ప్రకాశకములుకావు కనుక సత్త్వముమాత్ర మెట్లు ప్రకాశకమగునన్నచో, ఇచట నిర్మలమనఁగా ప్రకాశసుఖములను గప్పిపుచ్చు స్వభావముమాత్రము గలదియని గ్రహింపరాదు- ప్రకాశసుఖములను బుట్టించుటయే ముఖ్యస్వభావముగాఁ గలిగిన దగుటచే ప్రకాశసుఖములు కలుగుటకు హేతువైన దనియు నర్థము గ్రాహ్యము. కనుక నిది కేవలము వాయ్వాదులవంటిదికాదు. ఇచట ప్రకాశమనఁగా వస్తువుయొక్క యాథాత్మ్యము నెఱుఁగుట. ఇదియె 'జ్ఞానసఙ్గేన' అనుచో జ్ఞానశబ్దముచే నిర్దేశింపఁబడినది గాన వస్తుయాథాత్మ్యజ్ఞానమని తెలియునది. 'సుఖసఙ్గేన' అనియుఁ జెప్పఁబడుటచే ప్రకాశశబ్దముతో సుఖశబ్దముకూడ గ్రహింపఁబడె నని తెలియునది.

లత్వ మనఁగా ప్రకాశమును సుఖమును ఆవరించునట్టి స్వభావము

16

లేకుండుట. ప్రకాశ మనఁగా వస్తువులను కలరూపున తెలియుట. కనుక ప్రకాశసుఖములను బుట్టించుటయే యెప్పుడును స్వభావముగాఁ గలది యగుటచే సత్త్వము ప్రకాశసుఖములకు హేతువైనదనియర్థము. అది అనామయము. (ఆమయము అనెడికార్యము లేనిది అనామయము.) అనఁగా ఆరోగ్యమునకు హేతువైనదని యర్థము. ఈసత్త్వ మనెడి గుణము ఈదేహిని సుఖసంగముచేతను జ్ఞానసంగముచేతను బంధించుచున్నది - అనఁగా సత్త్వము (పూర్వకర్మానుగుణముగా) పురుషునికి సుఖసంగమును జ్ఞానసంగమును బుట్టించుచున్నదని యర్థము. జ్ఞానమునందును సుఖమునందును సంగము కలుగఁగా, పురుషుఁడు

17

వానికి సాధనములైన లౌకికవైదికకర్మములందు ప్రవర్తించుచున్నాఁడు; పిదప ఆ కర్మఫలములను అనుభవించుటకు సాధనములగు యోనులందుఁ బుట్టుచున్నాఁడు. కనుక సత్త్వము *సుఖజ్ఞానసంగము

---

* సత్త్వగుణము, 'సుఖసఙ్గేన జ్ఞానసఙ్గేనచ బధ్నాతి' అనుటకు సుఖసంగమును జ్ఞానసంగమును కరణములుగాఁ గొని పురుషుని బంధించుచున్నదిగాని ఆరెంటిని బుట్టించునది యనికాదు, అవి వేఱొకదానివలనఁ బుట్టునవి యని భావము తోఁచుచున్నది. అయినను సత్త్వము ఆరెంటిని కరణములుగాఁ గొనుటయేకాక వానిని బుట్టించునదియు తానే యగును. కనుక పూర్వోక్తభావము స్ఫురింపకుండుటకై 'జ్ఞానసంగమును సుఖసంగమును బుట్టించునది' అని యర్థము సేయఁబడెను. పురుషునికి జ్ఞానసుఖములచేఁ గూడ బంధము గలుగునా? యన్నచో బంధ మనఁగా నిచట కర్మఫలానుభవమునకౌఱకైన దేహసంబంధమే యగును. పురుషుఁడు జ్ఞానసుఖములందు తనకు సంగము కలుగఁగా వానికి సాధనములైన లౌకికవైదికకర్మములందుఁ బ్రవర్తించుచున్నాఁడు. ఆ కర్మములఫలము ననుభవించుటకు సాధనములైన యోనులందుఁ బుట్టుచున్నాఁడు. కనుక దేహసంబంధరూపమైన బంధము కలుగుచున్నది. (ఈబంధము బీజాంకురమువలె అనాదియైనది.) ఇట్లు సత్త్వము జ్ఞానసుఖసంగమూలమున పురుషుని బంధించుచున్నది. ఇందువలన ఆరెంటిని బుట్టించునదియు, ఆరెంటియందలిసంగమును బుట్టించునదియు అదియే యని తెలియునది.

మూలమున పురుషుని బంధించుచున్నది. జ్ఞానసుఖములను బుట్టించునదియు మరల నారెంటియందును సంగము బుట్టించునదియు సత్త్వమని భావము.

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్॥ 7

టీ. హేకౌన్తేయ=అర్జునా, రజః=రజోగుణము, రాగాత్మకం = స్త్రీపురుషులకుఁగల అన్యోన్యస్పృహకు హేతుభూతముగాను, తృష్ణాసఙ్గసముద్భవం-తృష్ణా = శబ్దాదిసకలవిషయముల యందలి స్పృహయొక్కయు, సఙ్గ=పుత్రమిత్రాదిసంబంధుల యందలి సంశ్లేషస్పృహయొక్కయు, సముద్భవమ్=పుట్టుచోటైనదిగాను, విద్ధి = ఎఱుఁగుము. తత్ = ఆ రజోగుణము, కర్మసఙ్గేన = కర్మములయందలి స్పృహద్వారా, దేహినం=ఆత్మను, నిబధ్నాతి=బంధించుచున్నది.

తా. అర్జునా, రజోగుణము స్త్రీపురుషుల యన్యోన్యస్పృహయనెడి రాగమునకు హేతువైనది. మఱియు నది శబ్దాది సర్వవిషయములందలి స్పృహయనెడి తృష్ణకును పుత్రమిత్రాది సంబంధుల యందలి సంశ్లేషస్పృహ యనెడిసంగమునకును బుట్టుచోటు-అనఁగా తృష్ణాసంగములకు హేతువైనదని యర్థము. అట్లు అది క్రియలందు స్పృహకలిగించి తన్మూలమున దేహిని బంధించుచున్నది. (ఇట రజస్సు కర్మసంగముచే దేహిని బంధించుటయెట్లు? అన్నచో, రజస్సు రాగతృష్ణాసంగములను గలిగించుచున్నది. అవి తమకు సాధనములైన క్రియలందు స్పృహ కలిగించుచున్నవి.) ఆ క్రియలందలి స్పృహచే దేహి చేయునట్టి క్రియలు పుణ్యపాపరూపములైనవి గనుక తత్తత్ఫలానుభవమునకు సాధనములైన యోనులందుఁ బుట్టుకఁ గలిగించుచున్నవి. ఇట్లు రజస్సు (రాగతృష్ణాసంగములను గలిగించి తన్మూల

మున) కర్మసంగమును గలిగించి తన్మూలమున దేహిని (దేహసంబంధ రూపమైన బంధముచే) బంధించుచున్నది. కనుక *రజస్సు ఈ చెప్పఁబడిన ప్రకారమున రాగతృష్ణాసంగములకును కర్మసంగమునకును హేతువగునదిగా చెప్పఁబడెనని తెలియునది. (విషయములందలి స్పృహచేత దానికి హేతుభూతమైన క్రియలయందు స్పృహ కలుగుచున్నది. దీనిచేత క్రియానుష్ఠానము కలుగుచున్నది. ఆ కర్మఫలము ననుభవించుటకొఱకు మరలమరల యోనిసంబంధము కలుగుచున్నది. ఇట్లు రజోగుణము కర్మసంగమూలమున బంధహేతువైన దని భావము.)

18

శ్లో॥ తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్।
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత॥ 8

టీ. తమస్తు = తమోగుణమైతే, అజ్ఞానజం = విపరీతజ్ఞానము వలనఁ బుట్టినదనియు, సర్వదేహినాం = సమస్తప్రాణులకు, మోహనం

---

* సత్త్వము జ్ఞానసుఖసంగముద్వారా వానికి సాధనములైన క్రియలందుఁ బ్రవృత్తి (అనఁగా కర్మసంగము) కలిగించుచున్నది. రజస్సు కలిగించు రాగతృష్ణాసంగములుకూడ సుఖవిశేషసంగములుగానే మీఁద చెప్పఁబడుటచే సత్త్వము సుఖసంగముద్వారా యెట్లో అట్లే రజస్సుకూడ సుఖవిశేష సంగముద్వారా వానికి సాధనములైన క్రియలందుఁ బ్రవృత్తి (అనఁగా కర్మసంగమును) కలిగించుచున్నది. ఇట్లు సత్త్వరజస్సులు రెండును సుఖసంగముచేకర్మసంగమును కలిగించుచో రెంటికిని భేదమెట్లు? అనిన యెడల సత్త్వగుణము సుఖమునే ప్రధానముగాఁ జేసికొని దానికొఱకు వేఱొకదానియందు సంగము కలిగించుచున్నది. రజస్సు ఆయావస్తువులను ఆయా క్రియస్వరూపములను ప్రధానముగాఁ జేసికొనునేకాని వానివలనఁ గలుగు సుఖము కొంచెమా అధికమా యని పాటింపదు. రాజదారాభిలాష, దుష్టపుత్త్రిరక్షణము, వృథాచేష్టలు మొదలైనవానియందు రజోగుణము వ్యక్తమని తెలియునది. కనుకనే ఇది కర్మసంగము కలిగించు ప్రకార మిందు చెప్పఁబడినది. ఇచట తృష్ణ, సాంస్పర్శికశబ్దాదిగుణములను గుఱించినదనియు, సంగము అభిమానికపుత్రమిత్రాది సంశ్లేషమును గుఱించినదనియు గ్రాహ్యము.

= విపరీతజ్ఞానమును బుట్టించునది అని, విద్ధి = తెలిసికొనుము, హే భారత=అర్జునా, తత్ =ఆ తమోగుణము, ప్రమాదాలస్యనిద్రాభిః= పరాకు సోమరితనము నిద్ర మొదలగువానిచేత, నిబధ్నాతి=బంధించు చున్నది.

తా. అర్జునా, జ్ఞానమనఁగా వస్తువుల యాథాత్మ్యమును (కల రూపును) తెలియుట. జ్ఞానమునకంటె అన్యమైనది యిట అజ్ఞానమని అభిప్రాయము. జ్ఞానమునకు అన్యమైనది * విపర్యయమైన జ్ఞానము. తమస్సన్ననో వస్తువుల యాథాత్మ్యమునకు విపరీత మగు విషయము మును గూర్చిన జ్ఞానమువలనఁ బుట్టినది. అది సమస్తదేహులకును మోహనమైనది. మోహమనఁగా విపర్యయజ్ఞానము-విపర్యయజ్ఞానము
19 20
నకు హేతువైనదని యర్థము. ఆ తమస్సు ప్రమాదము నిద్ర ఆలస్యము ననెడివీనికి హేతు వగుటచేత వానిమూలమున దేహిని నిబంధించుచున్నది.

ప్రమాద మనఁగా చేయవలసిన కర్మముకంటె వేఱైనదానియందు ప్రవర్తించుటకు హేతువైనపరాకు (హెచ్చరిక లేమి). ఆలస్య మనఁగా కర్మముల నారంభింపకుండు స్వభావము; ఇదియె స్తబ్ధత్వమును గావచ్చును. పురుషునికి ఇంద్రియప్రవర్తనమువలని యలసటచే సర్వేంద్రియప్రవర్తనములును ఉడిగియుండుట నిద్ర. అందు బాహ్యేంద్రియప్రవర్తనము లుడుగుట స్వప్నము; వానితోడ మనస్సును ఉడుగుట సుషుప్తి.

---

*విపర్యయజ్ఞాన మనఁగా వస్తువుయొక్క యాథాత్మ్యమునకు విపరీతముగానుండు దానినిగుఱించిన జ్ఞానము. ఈజ్ఞానము పాపముల ననుష్ఠించుటద్వారా తమస్సును బుట్టించుచున్నది. తమస్సు విపర్యయజ్ఞానమువలనఁ బుట్టుటేకాక విపర్యయజ్ఞానమును బుట్టించునదిగాను ఉన్నదని తెలియునది. ప్రమాదము, చేయనక్కఱలేనిదానియందుఁ బ్రవృత్తి

అవ. సత్త్వాదులు వేనిని ద్వారములుగాఁ గొని బంధమును గలుగఁజేయుచున్నవో వానిలో ముఖ్యమైనవానిని (వ్యాపారములను) జెప్పుచున్నారు.

శ్లో॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత।
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత॥ 9

టీ. భారత=అర్జునా, సత్త్వం=సత్త్వగుణము, సుఖే=సుఖమునందు, సంజయతి=సంగమును కలుగఁజేయుచున్నది, రజః = రజోగుణము, కర్మణి=క్రియయందు, (సంజయతి=సంగము కలుగఁజేయుచున్నది). తమస్తు=తమోగుణమో, జ్ఞానం = వస్తుయాథాత్మ్యజ్ఞానమును, ఆవృత్య=కప్పి, ప్రమాదే 'ఉత=చేయవలసినవానికి విపరీతమైనదానియందును, సంజయతి=సంగమును అతిశయముగ కలుగఁజేయుచున్నది.

తా. (సత్త్వాదిగుణములకు బంధమును కలుగఁజేయు ద్వారములు కొన్నిగలవు. అందు) సత్త్వమునకు *సుఖసంగము ముఖ్యద్వారము. రజస్సునకు కర్మసంగము ముఖ్యద్వారము. తమస్సు వస్తుయాథాత్మ్యజ్ఞానమును గప్పిపుచ్చి విపరీతజ్ఞానమునకు హేతువైనదగుటచే (కర్తవ్యమునకు విపరీతమైన వ్యాపారమునందు ప్రవృత్తి కలుగఁజేయును గాన) కర్తవ్య విపరీతప్రవృత్తిసంగము ముఖ్యద్వారముగాఁ గలది.

---

కలుగఁజేయునదగుటచే నిది పాపిష్ఠజన్మాదులకు (బంధమునకు) హేతువగుచున్నది. ఆలస్యము, చేయవలసినకర్మములందుఁ బ్రవృత్తి కలుగఁజేయని దగుటచే బంధహేతువగుచున్నది.

* సత్త్వమునకు సుఖసంగము ప్రధానము, అనుటకు జ్ఞానసంగముగూడ సుఖము కొఱకని భావము. రజస్సునకు కర్మసంగము ప్రధానము, అనుటకు రజఃకార్యములైన రాగతృష్ణాదులు కర్మమునందు పర్యవసించుచున్నవని భావము.

అవ. సత్త్వాదిగుణములు దేహాకారముగాఁ బరిణమించిన ప్రకృతికి స్వరూపానుబద్ధములైనవి-అనఁగా అవి దానిస్వరూపము నెప్పుడు విడువకుండునవి. అట్లు ఎప్పుడును దానిని విడువక యుండుటచే ఆమూఁడును ఎప్పుడును ఒక్కతీరున సమముగా వర్తించుచునే యుండవలయునుగాని (యథార్థజ్ఞానమనియు అయథార్థజ్ఞానమనియు సుఖమనియు దుఃఖమనియు పరస్పరవిరుద్ధములైన కార్యములను బుట్టించుట యెట్లు? అని యడుగఁగాఁ జెప్పుచున్నారు.

21 అవ.

శ్లో॥ రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
రజ స్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా। 10

టీ. హే భారత=ఓ యర్జునా, సత్త్వం=సత్త్వగుణము, రజః=రజోగుణమును, తమశ్చ=తమోగుణమును, అభిభూయ=తిరస్కరించి (మించి), భవతి=కలుగుచున్నది (ప్రకాశించుచున్నది.) రజః=రజోగుణము, సత్త్వం తమశ్చ=సత్త్వతమోగుణములను (అభిభూయ భవతి=మించి ప్రకాశించుచున్నది), తథా=అట్లె, తమః = తమోగుణము, సత్త్వం రజః=సత్త్వరజోగుణములను (మించి ప్రకాశించుచున్నది).

తా. అర్జునా, *సత్త్వాదులు మూఁడును ప్రకృతిసంసర్గముల ఆత్మస్వరూపమునకు అనుబంధులే-ఎప్పుడు విడువకుండునవి. అయినను

* సత్త్వాదులు ప్రకృతిసంసృష్టములైన యాత్మలయొక్క స్వరూపములకు అనుబద్ధములైనగుణములు గాన అవియన్నియు నెప్పుడును వర్తించుచుండును గాని ఒకటి లేక మఱొకటిమాత్రము వర్తింపదు. కనుక ఒకదాని కార్యములు లేక మఱొకదాని కార్యములుమాత్రమే విజృంభించి యుండఁతగదు. కనుక మనుష్యుఁడు ఒకప్పుడు యథార్థజ్ఞానము గలవాఁడుగాను ఒకప్పుడు విపరీతజ్ఞానము గలవాఁడుగాను ఒకప్పుడు సుఖా

ప్రాచీనకర్మవశమువలనను దేహమున కాప్యాయనము లగు ఆహారము లందలి వైషమ్యమువలనను సత్త్వాదులు ఒకటి నొకటి పుట్టించుచు అడ్డగించుచు నుండును. ఒకవేళ సత్త్వగుణము రజోగుణ తమోగుణములను దిరస్కరించి తా నుద్రేకించి ప్రవర్తించును. ఒకప్పుడు రజోగుణము సత్త్వగుణ తమోగుణముల నిరాకరించి తా నధికం బై యుండును. మఱియొకవేళ తమోగుణము సత్త్వగుణరజోగుణముల నడంచి తా నతిశయమై యుండును.

అవ. ఆయా గుణముల యుద్భవాభిభవములు వానివాని కార్యములను దెలియుటచేతనే యెఱుఁగఁదగు ననుచున్నారు.

శ్లో॥ *సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత॥

---

సక్తుఁడుగాను ఒకప్పుడు దుఃఖాసక్తుఁడుగాను నుండరాదు. అయిన'నట్లుండుట యెట్లు? అనినచో, పూర్వకర్మవశమున గుణములు ఒకదాని నొకటి యడఁగఁద్రొక్కుచు ఒకటి మాత్ర ముద్రేకించి వర్తించుచు నుండును. మఱియును వాతపిత్తకఫములు ఆయా యాహార ద్రవ్యములచే ఎక్కువతక్కువల నొందునట్లు దేహమున కాప్యాయనమగు సాత్త్వికాద్యాహారములచే ఆయాగుణములును ఎక్కువతక్కువల నొందుచుండును. కనుకనే ఒకటి తక్కినవానిని తిరస్కరించి తా నుద్రేకించి వర్తించునని తెలియునది. ఇట్లు పరస్పర సముద్భవాభిభవరూపమున వర్తించుటచే పురుషునికి జ్ఞానాజ్ఞానాదులు గలుగుచున్నవి. అయినను గుణముల యుద్భవాభిభవములు నియతి లేక తమంతటఁ గలుగుచుండునవికావు. అవి ప్రాచీనకర్మానుగుణముగ ఈశ్వరప్రేరితము లై కలుగుచున్నవని తెలియునది.

* ఇచట ద్వారము లనఁగా దేహమునందుఁ గల జ్ఞానద్వారము లయిన పంచేంద్రియములును మనస్సును గ్రాహ్యములు. ప్రకాశశబ్దము ప్రథమాంతమైనచో జ్ఞానశబ్దముచేఁ బునరుక్తి కలుగును గాన సప్తమ్యంతముగా తెలియునది. సౌభరి మొదలైన యోగులు ఏకకాలమున అనేకదేహములు దాల్చునప్పుడు ఒక్కరికే ఆయా దేహభేదములవలన ఆయా గుణభేదవృత్తులును సంభవించుటచే అట్లు దేహభేదములేదని తెలుపుటకై, 'అస్మిన్ దేహే' అని విశేషించి చెప్పఁబడినది.

టీ. అస్మిన్ దేహే = ఆత్మకు భోగస్థానమైన ఈశరీరమునందు, సర్వద్వారేషు = చక్షురాదీంద్రియరూపమైన జ్ఞానమార్గముల యందంతట, యదా = ఎప్పుడు, ప్రకాశే = వస్తువుల యథార్థస్థితిని ప్రకాశింపఁ జేయుటయందు, జ్ఞానం = తత్త్వజ్ఞానము, ఉపజాయతే = కలుగుచున్నదో, తదా ఉత = అప్పుడే, సత్త్వం = సత్త్వగుణము, వివృద్ధమితి = మిక్కిలి వృద్ధిఁబొందియున్నదని, విద్యాత్ = తెలిసికొనవలయును.

తా. శరీరమునందు చక్షురాదిసమస్తజ్ఞానేంద్రియములద్వారా, వస్తువుల యథార్థస్వరూపము తెలియువిషయమునందు జ్ఞాన మెప్పుడు కలుగుచున్నదో, అప్పుడు ఆ దేహమునందు సత్త్వగుణము మిగుల వృద్ధిఁ బొందియున్నదని తెలియవలయును.

22

శ్లో॥ లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణామశమః స్పృహా।
రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ॥ 12

టీ. హేభరతర్షభ = ఓ యర్జునా, రజసి = రజోగుణము, వివృద్ధేసతి = వృద్ధిఁబొందినదగుచుండఁగా, లోభః = తనద్రవ్యము నియ్యని స్వభావమును, ప్రవృత్తిః = వృథాచేష్టయు, కర్మణాం ఆరమ్భః = ఫలసాధన భూతములగు కర్మముల నాచరించుటయు, అశమః = ఇంద్రియముల యుద్రేకము. స్పృహా = శబ్దాదివిషయములయం దిచ్ఛయు, ఏతాని = ఇవి, జాయన్తే = కలుగుచున్నవి.

తా. అర్జునా, తనద్రవ్యము నీయకుండు స్వభావమగు పిసినితనమును, * ప్రయోజనము నుద్దేశింపకపోయినను (తృణచ్ఛేదాది

---

* ప్రకృతిశబ్దమునకు ఆరంభశబ్దముతో పునరుక్తి కలుగకుండుటకై ప్రవృత్తి యనఁగా ఏయుద్దేశమునులేక చేయు తృణచ్ఛేదాదివ్యర్థచేష్ట లనియు, ఆరంభమనఁగా ఫలోద్దేశముతోఁ జేయుక్రుషి యజ్ఞాదులనియు అర్థభేదము ప్రతిపాదింపఁబడినది. ఆ

వృథాచేష్టలు సేయుట యనియెడి) చలనస్వభావమును, ఫలసాధన భూతములగు (కృషియజ్ఞాది) కర్మముల నారంభించుటయు, ఇంద్రియము లుడుగక యుండుట యనెడి అశమయమును, (శబ్దాది) విషయములయం దిచ్ఛయు, అనునివి రజోగుణము వృద్ధినొందునపుడు కలుగుచున్నవి. ఎప్పుడు లోభాదులు వర్తించునో అప్పుడు రజోగుణము వృద్ధి నొందియున్నదని తెలియవలయునని భావము.

శ్లో॥ ♦అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన॥ 13

టీ. హేకురునన్దన = ఓ యర్జునా, తమసి = తమోగుణము, వివృద్ధేసతి = వృద్ధిహొందినదగుచుండఁగా, అప్రకాశః = జ్ఞానము కలుగకుండుటయు, అప్రవృత్తిశ్చ = కార్యములఁజేయక స్తబ్ధుఁడై యుండుటయు, ప్రమాదః = అకార్యములందుఁ బ్రవర్తింపఁజేయుపరాకును, మోహ ఏవచ = విపరీతజ్ఞానమును, ఏతాని = ఇవి, జాయన్తే = కలుగుచున్నవి.

తా. అర్జునా, వస్తుయాథాత్మ్యజ్ఞానము కలుగకుండుటయు, కార్యములయందుఁ బ్రవర్తింపక స్తబ్ధుఁడై యుండుటయు, అకార్యములందుఁ బ్రవర్తించుట ఫలముగాఁగల హెచ్చరిక లేమియు, విపరీతజ్ఞానమును, అనునివి తమస్సు ప్రవృద్ధమైనప్పుడు కలుగుచున్నవి. వీని చేత తమోగుణము వృద్ధిహొందియున్నదని తెలియవలయునని యర్థము.

---

రెండుశబ్దములచేఁ బునరుక్తి కలుగకుండుటకై అశమశబ్దమునకు ఇంద్రియము లుడుగక ప్రవృత్తిహేతువై యుద్రేకించియుండుట యని యర్థము చెప్పఁబడినది.

♦ ఇచట అప్రకాశమనఁగా జ్ఞాన ముదయింపమి. అనఁగా పూర్వోక్త నిద్రాది రూపమైనది. అప్రవృత్తి యనఁగా పూర్వోక్తమైన యాలస్యము. అనఁగా స్తబ్ధత యని గ్రాహ్యము.

23 అవ.

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రలయం యాతి దేహభృత్।
తదోత్తమవిదాంలోకా నమలాన్ ప్రతిపద్యతే॥ 14

టీ. యదా=ఎప్పుడు, సత్త్వే = సత్త్వగుణము, ప్రవృద్ధేతు = వృద్ధిపొందినదగుచుండఁగా, దేహభృత్ = చేతనుఁడు, ప్రలయం = మరణమును, యాతి=పొందుచున్నాఁడో, తదా – అప్పుడు, ఉత్తమవిదాం=ఉత్తమతత్త్వమగు నాత్మస్వరూపము నెఱిఁగినవానియొక్క, అమలాన్ = అజ్ఞానరహితములైన, లోకాన్ =సమూహములను, ప్రతిపద్యతే=పొందుచున్నాఁడు.

తా. సత్త్వగుణము వృద్ధిఁబొందినపుడు దేహి మరణము నొందునేని ఉత్తమతత్త్వమగు నాత్మస్వరూప యాథాత్మ్యమును దెలిసినవారియొక్క అజ్ఞానరహితములైన సమూహములను బొందుచున్నాఁడు -అనఁగా సత్త్వము పెరిఁగియున్నపుడు మృతుఁడైనవాఁడు ఆత్మస్వరూపము నెఱిఁగినవారియొక్క కులములందు జనించి ఆత్మయాథాత్మ్యజ్ఞానసాధనములగు పుణ్యకర్మములం దధికారము నొందునని యర్థము.

శ్లో॥ రజసి ప్రలయం గత్వా కర్మసఙ్గిషు జాయతే॥ 14½

టీ. రజసి = రజోగుణము, (ప్రవృద్ధేసతి=వృద్ధిఁ బొందినదగుచుండఁగా), ప్రలయం=మరణమును, గత్వా = పొంది, కర్మసఙ్గిషు= ఫలాపేక్షతో కర్మముల నాచరించువారియొక్క వంశమునందు, జాయతే=పుట్టుచున్నాఁడు.

తా. రజోగుణము వృద్ధిఁబొందినపుడు మృతిఁజెందిన పురుషుఁడు ఫలార్థము కర్మములు గావించునట్టివారి కులములందు జనించుచున్నాఁడు. అచట జనించి స్వర్గాదిఫలసాధన కర్మములం దధికారి యగుచున్నాఁడని యర్థము.

శ్లో॥ తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే॥ 15

టీ. తథా = అట్లే, తమసి = తమోగుణము, (ప్రవృద్ధేసతి = వృద్ధిఁ బొందినదగుచుండఁగా), ప్రలీనః = మరణమునొందినవాఁడు, మూఢయోనిషు = (ఏపురుషార్థమునకు తగని) పశ్వాది యోనుల యందు, జాయతే = పుట్టుచున్నాఁడు.

తా. తమోగుణము వృద్ధిఁ బొందినపుడు మరణము నొందిన కుక్క పంది మొదలగు మూఢయోనులయందు జనించుచున్నాఁడు - అనఁగా ఏ పురుషార్థము నారంభించుటకును అనర్హుఁడుగా పుట్టు చున్నాఁ డని యర్థము.

శ్లో॥ కర్మణ స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్॥ 16

టీ. సుకృతస్య = ఫలాపేక్ష లేక భగవదారాధనరూపముగాఁ జేయఁబడిన, కర్మణః = కర్మమునకు, ఫలం = ఫలము, సాత్త్వికం = పూర్వముకంటె నధిక సత్త్వమువలనఁ గలిగినదై, నిర్మలం = దుఃఖలేశము లేనిదనియు, రజసస్తు = (అంత్యకాలమున వృద్ధిఁ బొందిన) రజోగుణము యొక్క, ఫలం = ఫలము, దుఃఖం = (పునర్జన్మరూపమైన) దుఃఖపరంపర యనియు, తమసః = (అంత్యకాలమున వృద్ధిపొందిన) తమోగుణమునకు, ఫలం = ఫలము, అజ్ఞానం = అజ్ఞానపరంపర యనియు, ఆహుః = చెప్పుదురు.

తా. ఇట్లు సత్త్వము వృద్ధిపొందినపుడు మృతినొంది ఆత్మజ్ఞుల వంశమునందు జనించువాఁడు ఫలాపేక్ష లేక యే మదారాధనరూపము గాను అనుష్ఠించు కర్మమునకు ఫలము పూర్వముకంటె నధికసత్త్వము వలనఁ గలిగినదై దుఃఖలేశరహితమైన దగునని సత్త్వగుణపరిణామ

వేత్తలు చెప్పుదురు. అంత్యకాలమున వృద్ధిఁ బొందినరజోగుణమునకు ఫల మన్ననో - ఫలమునుగోరి కర్మములుచేయువారి కులమునందుఁ బుట్టుట, ఫలాపేక్షతో కర్మములను జేయుట, ఆ కర్మఫలముల ననుభవించుట్కై మఱల జన్మించుట, రజస్సు వృద్ధియగుట, మఱల ఫలాపేక్షతో కర్మములను జేయుట, ఇట్లు పరంపరగావచ్చుచుండు సాంసారిక దుఃఖప్రాయమే యని రజోగుణయాథాత్మ్య మెఱిఁగినవారు చెప్పుదురు. ఇట్లు అంత్యకాలమున వృద్ధిపొందిన తమోగుణమునకు ఫలము అజ్ఞానపరంపరారూపము (అనియు తద్గుణయాథాత్మ్యము నెఱింగినవారు పలుకుదురు).

అవ. అంత్యకాలప్రవృద్ధము లైన సత్త్వాదులకుఁ గలుగు నిర్మలాదిఫలములు అసత్త్వాదులకంటె నధికములైన సత్త్వాదులచేఁ బుట్టునవిగాఁ జెప్పఁబడెను. ఇట్లాయధికసత్త్వాదులచేఁ బుట్టునట్టి యానిర్మలాదిఫలము లేవి యనఁగాఁ జెప్పుచున్నారు.

శ్లో॥ సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవచ॥ 17

టీ. సత్త్వాత్ = ఇట్లు బుట్టిన అధిక సత్త్వగుణమువలన, జ్ఞానం = ఆత్మస్వరూప అపరోక్షరూపమైన జ్ఞానము, సంజాయతే = కలుగుచున్నది. రజసః = (అట్లె కలిగినయధిక) రజోగుణమువలన, లోభ ఏవ చ = స్వర్గాదిఫలముయం దాశయె, (సంజాయతే = కలుగుచున్నది) తమసః = అట్లె ప్రవృద్ధమైన తమోగుణమువలన, ప్రమాదమోహౌ = పరాకుచేఁ గలుగు అసత్కార్యప్రవృత్తియు విపరీతజ్ఞానమును, భవతః = కలుగుచున్నవి. అజ్ఞానంచైవ = జ్ఞానము లేకుండుటయును, (భవతి = కలుగుచున్నది).

తా. ఇట్లు పరంపరగా పుట్టిన యధికసత్త్వగుణమువలన ఆత్మ

యాథాత్మ్యపరోక్షరూపమైన జ్ఞానముదయించును. అట్లె వృద్ధినొందిన రజోగుణమువలన స్వర్గాదిఫలములయందు లోభము జనించును. అట్లె వృద్ధినొందిన తమోగుణమువలన ప్రమాదమును - అనఁగా ఎచ్చరిక తప్పి దానిచే క్రమముగా అసత్కార్యములయందుఁ బ్రవృత్తియు, దానిచే విపరీతజ్ఞానమును, దానిచే మఱింత యధికమగుతమస్సును, దానివలన జ్ఞానాభావమును సంభవించును.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః॥ 18

టీ. సత్త్వస్థాః = వృద్ధినొందుచున్న సత్త్వము గలవారు, ఊర్ధ్వం = సంసారబంధమునుండి మోక్షమునకు, గచ్ఛంతి = పోవుచున్నారు. రాజసాః = రజోగుణప్రధానులు, మధ్యే = నడుమ మరల నాజన్మములనే యెత్తి ఆ కర్మములనేచేయుచు, తిష్ఠన్తి = ఉందురు. తామసాః = తామసులు, జఘన్యగుణవృత్తిస్థాః = పైపయి నికృష్టములగు తమోగుణవ్యాపారములంయుం దున్నవారై, అధః = పశ్వాది నీచయోనులయందు జనించుటను, గచ్ఛన్తి = పోవుచున్నారు.

తా. ఈ చెప్పఁబడినప్రకారమున సత్త్వవృద్ధి నొందుచున్నవారు ఊర్ధ్వముగాఁ బోవుదురు-అనఁగా క్రమముగా సంసారబంధమునుండి మోక్షము నొందుదురు. రజస్సు స్వర్గాదిఫలములందు పేరాస కలిగించునది కనుక రాజసులు తాము గోరిన స్వర్గాదిఫలములకు సాధనములుగా కర్మముల నాచరించి యాఫల మనుభవించి మఱల జనించి యాకర్మములనే యనుష్ఠింతురు గాన *మధ్యమందు నుందురు.

* నడుమ నుండుట, యనఁగా ఆ ఫలములనే కోరి యాకర్మములనే చేసి మఱల నాజన్మములనే యెత్తి మఱల నాకర్మములనే చేసి యా ఫలములనే యనుభవించుట యని-భావము.

అది పునరావృత్తిరూపముగుటచే దుఃఖప్రాయమే. తామసులు పయి పయి నీచములగు తమోగుణవ్యాపారములందు నెలకొన్నవారై అధోగతిపాలగుదురు-అనఁగా చండాలత్వము, పిదప దానికంటె నీచ వ్యాపారములు గల పశుత్వము, దానికంటె నీచవృత్తములైన క్రిమికీటాది జన్మములు, ఇట్లె స్థావరత్వము, పిదప గుల్మలతాత్వము, పిదప శిలాకాష్ఠలోష్టతృణాదిత్వమును బొందుదు రని యర్థము. తమోగుణముచేత విపరీతజ్ఞానము, దానిచేత పాపానుష్ఠానము, దానిచేత క్రమముగా చండాల పశు తిర్యక్క్రిమి కీట తరు గుల్మ లతాదిరూపమైన అధోగతులను బొందుదు రని యభిప్రాయము.

25

అవ. ఆహారవిశేషములచేతను ఫలాపేక్షారహిత సుకృతవిశేషములచేతను పరంపరగా (అనఁగా క్రమక్రమముగా) సత్త్వగుణము వృద్ధిఁజెందినవారు తక్కినగుణముల నతిక్రమించి తన్మూలమున ఊర్ధ్వగతిని బొందునట్టిప్రకారమును జెప్పుచున్నారు.

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి।

24

గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ 19

టీ. ద్రష్టా = ఆత్మవిదుఁడు, యదా = ఎప్పుడు (సత్త్వము వృద్ధిపొందినదశయందు), గుణేభ్యః=సత్త్వరజస్తమోగుణములకంటె, అన్యం=ఇతరమైనదానిని, కర్తారం = కర్తనుగా, నానుపశ్యతి = చూడఁడో (గుణములనే కర్తగాఁ జూచునో), గుణేభ్యశ్చ = గుణములకంటె, పరం=ఇతరుఁడగు ఆత్మను, (అకర్తారం = కర్తకానివానినిగా), వేత్తి = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, మద్భావం = నాతో సమాన మగునట్టిభావమును, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

తా. ఇట్లు సాత్త్వికాహారముల సేవించుటవలనను ఫలభిసంధిరహితభగవదారాధన రూపకర్మానుష్ఠానములచేతను రజస్తమస్సులను మరలఁ దలచూపనట్లు అడఁచి మిక్కిలి యుత్కృష్టమై యున్న సత్త్వమునందు నెలకొనియున్న యీ యాత్మవిదుఁడు *గుణములకంటె వేఱైనదానిని కర్తగా నెప్పుడు కనుఁగొనఁడో - అనఁగా గుణములే తమతమ కనుగుణములైన ప్రవృత్తులందు కర్తలైనవిగా నెప్పుడు కనుఁగొనునో; మఱియు కర్తలగు గుణములకంటె నన్యుఁడైన యాత్మను కర్త గానివానినిగా నెఱుఁగునో, అప్పుడు వాఁడు మద్భావమును (అనఁగా నాకుఁ గల యట్టిభావమును) బొందును. ఇందలిభావ మేమనఁగా- ఆత్మ, తనంత పరిశుద్ధస్వభావుఁ డగుటచే వానికి సాంసారిక సాత్త్విక రాజస తామస వివిధకర్మములందు కర్తృత్వము పూర్వపూర్వకర్మమూలమైన గుణసంగముచేఁ గలిగినది



గాని, ఆత్మ తనంతట కర్త గాఁడు, వాఁడు అపరిచ్ఛిన్నజ్ఞానైకాకారుఁడు, అని యిట్లు ఆత్మను ఎప్పుడు కనుఁగొనునో అప్పుడు మద్భావమును బొందు నని భావము.

---

* 'నాన్యం గుణేభ్యః కర్తార మనుపశ్యతి' అనుటను, 'కర్తారం (ఆత్మానం) గుణేభ్యః అన్యం నామపశ్యతి' అని యన్వయముసేసి, కర్తయైన ఆత్మ, గుణములకంటె నన్యుఁడు కాఁడు అని యపార్థము గ్రహింపకుండుటకై, 'గుణేభ్యః అన్యంకర్తారం నానుపశ్యతి' అని యిన్వయముసేసి, గుణములకంటె అన్యమైనది కర్తగాదు-గుణములే కర్తయని యర్థము చెప్పఁబడినది. మఱియు పురుషధర్మభూతమైన ప్రయత్నమున కాశ్రయమైయుండుట యనెడి కర్తృత్వము ఆత్మకుఁ గలదు. అట్టికర్తృత్వము గుణములకు లేదని తెలుపుటకై 'తమతమ కనుగుణములైన ప్రవృత్తులందు' అని కూర్పఁబడెను. ఒకానొకచో అనాత్మవిదులకుఁగూడ అనాత్మయందు (అనఁగా గుణములందు) కర్తృత్వము కనుగొనుట గలదు గాన వారికిని ఈ యాత్మవిదునికిని తారతమ్య మేమి యని శంక రాఁగా దానిని పరిహరించుటకై 'గుణేభ్యశ్చ పరం వేత్తి' అని చెప్పఁబడెను. అనఁగా అనాత్మవిదుఁడు గుణముల కర్తృత్వమును మాత్రమే యెఱుఁగునుగాని గుణములకంటె వేఱైన యాత్మ అకర్తయని యెఱుఁగఁడు-ఈరెంటి నాత్మవిదుఁ డెఱుఁగును.

అవ. కర్తలగు గుణములకంటె వేఱై యకర్తయై యున్న యాత్మను కనుఁగొని భగవద్భావమును బొందుచున్నాఁ డని పూర్వము చెప్పఁబడెనుగదా. ఆ భగవద్భావ మెట్టిదో యిప్పుడు తెలుపుచున్నారు.

శ్లో॥ గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
27
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే॥ 20

టీ. దేహీ=పురుషుఁడు, దేహసముద్భవాన్=దేహమువలనఁ బుట్టిన, ఏతాన్=ఈ, త్రీన్=మూఁడైన, గుణాన్=సత్త్వాదిగుణములను, అతీత్య=అతిక్రమించి, జన్మమృత్యుజరాదుఃఖైః=జననము మరణము ముదిమి యనువానివలనఁ గలిగిన దుఃఖములచేత, విముక్తః=విడువఁబడినవాఁడై, అమృతం=శుద్ధాత్మస్వరూపమును, అశ్నుతే=అనుభవించుచున్నాఁడు.

తా. ఈ దేహి, దేహాకారముగాఁ బరిణమించినదగు ప్రకృతి వలనఁ బుట్టిన యీ సత్త్వాదిగుణములను మూఁటి నతిక్రమించి వాని కంటె వేఱయి జ్ఞానైకాకార మై యొప్పు నాత్మస్వరూపము నవలోకించుచు, జననజరామరణాదులచేఁ గలుగు దుఃఖములనుండి విడివడినవాఁడై ఆత్మానుభవమును బొందును. ఇదియె 'మద్భావ' మని యర్థము.

అవ. ఇఁక అర్జునుఁడు. "గుణాతీతుని స్వరూపమును సూచించు

---

కనుక వీఁడే యధికుఁ డని భావము. 'గుణేభ్యః పరమ్' అనుచో గుణములకంటె ఏ విధమున ఆత్మ పరుఁ డని శంక రాఁగా 'కర్తలగు' అని కూర్పఁబడెను. అనఁగా గుణములు కర్తలు, ఆత్మ అకర్త, కనుక దానికంటె వేఱు అని ప్రకరణానుగుణముగాఁ జెప్పఁబడినది. అయినను 'కర్తా శాస్త్రార్థవత్త్వాత్' అని యాత్మకు కర్తృత్వము చెప్పఁబడినదే యన్నచో, ఆ కర్తృత్వము గుణసంకృతమేకాని స్వరూపసిద్ధము కాదనియు కనుక ఆత్మ తనంత కర్తగాదనియుఁ జెప్పఁబడినది.

ఆచార మెట్లుండును? వాఁడు గుణముల నతిక్రమించుటకు హేతు వేమి?" అని యడుగుచున్నాఁడు.

అర్జున ఉవాచ.

శ్లో॥ కైర్లిఙ్గైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో।

కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణానతివర్తతే॥ 21

టీ. హే ప్రభో = ఓకృష్ణా, ఏతాన్ = ఈ, త్రీన్ గుణాన్ = మూఁడుగుణములను, అతీతః = అతిక్రమించినవాఁడు, కైః లిఙ్గైః = ఎట్టి అంతరలక్షణములతో, (ఉపలక్షితః = కూడినవాఁడుగా) భవతి = అగుచున్నాఁడు, కిమాచరః = ఎట్టి ఆచారము గలవాఁడు, (భవతి = అగుచున్నాఁడు), కథంచ = ఏ ఉపాయముచేత, ఏతాన్ త్రీన్ గుణాన్ = ఈ మూఁడుగుణములను, అతివర్తతే = అతిక్రమించుచున్నాఁడు.

తా. కృష్ణా, *ఈసత్త్వాదిగుణముల మూఁటి నతిక్రమించినవాఁ డెట్టిలక్షణములతోఁ గూడియుండును? వాని కెట్టియాచార ముండును?- అనఁగా వానిస్వరూపమును దెలిసికొనుటకు గుఱుతైన వానియాచారం బెట్టిది యని యర్థము. వాఁడు ఏయుపాయముచేత ఈ సత్త్వాదిగుణత్రయము నతిక్రమించి వర్తించును?

---

* 'కైర్లిఙ్గైః' అని అంతరలక్షణములను, 'కిమాచారః' అని బాహ్యలక్షణములను, జెప్పుటచే ఈరెండును ఏకరాశిగాను ఒకప్రశ్నగాను గ్రహింపఁదగును. కనుక నీరెండిటియొక్క మొత్తమునకు, 'వానిస్వరూపమును (లక్షణము ననుట) దెలుపుటకు గుఱుతైనయాచార మెద్ది' యని యర్థము చెప్పఁబడెను. తాను గుణముల నతిక్రమించుట అంతరలక్షణములచేఁ దనకు మాత్రము తెలియును, పరులకుఁ దెలియుట బాహ్యాచారములచేతనే యని భావము. ఇచట గుణాతీతుని కనుఁగొనుట కాంతరలక్షణము లెవ్వి? బాహ్యలక్షణము లెవ్వి? గుణాత్యయమున కుపాయము లెవ్వి? అని మూఁడు ప్రశ్నలు గ్రాహ్యములు.

శ్రీ భగవానువాచ.

శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తించ మోహ మేవచ పాణ్డవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి॥ 22

టీ. హేపాణ్డవ=ఓయర్జునా, (యః=ఎవఁడు) సంప్రవృత్తాని=(అనిష్టవస్తువులయందు) ప్రవర్తించిన, ప్రకాశంచ=సత్త్వగుణకార్యమగు ప్రకాశమును, ప్రవృత్తించ = రజోగుణకార్యమగు వ్యాపారమును, మోహం చైవ=తమోగుణకార్యమగు అజ్ఞానమును, నద్వేష్టి =ద్వేషింపఁడో, నివృత్తాని=ఆత్మవ్యతిరిక్తములైన యిష్టవస్తువులయందు ప్రవర్తించి నివర్తించినవానిని, న కాంక్షతి=కోరఁడో.

తా. ఎవఁడు, ఆత్మవ్యతిరిక్తము లైన * అనిష్టవస్తువులయందుఁ (తత్సాధనములుగాఁ) బ్రవర్తించునట్టి సత్త్వగుణకార్యమగు ప్రకాశమును, రజోగుణమువలనఁ గలిగిన ప్రవృత్తిని, తమోగుణజన్యమైన మోహమును ద్వేషింపఁడో, అట్లే ఆత్మవ్యతిరిక్తములైన యిష్టవస్తువులయందు (తత్సాధనములు గాఁ బ్రవర్తించి నివర్తించినవానినే మఱలఁ గోరఁడో.

(అవ. శరీరముతోఁ గూడియున్నప్పుడు దాని యిష్టానిష్ట సాధనములందు వికారము లేక ఎట్లుండు ననఁగాఁ జెప్పుచున్నారు.)

---

* ఆత్మకంటె నితరమగువస్తువులు ఇష్టము లనియు అనిష్టము లనియు రెండు విధములు. గుణవశ్యుఁడు అనిష్టములను తత్సాధనములును సంప్రాప్తము లైనపుడు వానిని ద్వేషించుటయు, ఇష్టములను తత్సాధనములును ప్రవర్తించి నివర్తించినపుడు మఱల వానిని గోరుటయు, లోకప్రసిద్ధము. అయినను గుణాతీతునిలక్షణ మెట్లుండు ననఁగా అనిష్టవస్తువులందు వానికి సాధనములుగా సత్త్వాదిగుణకార్యములగు ప్రకాశాదులు ప్రవర్తించినను ద్వేషము లేకయు, ఇష్టవస్తువులయందు వానికి సాధనములుగా నవి ప్రవర్తించి నిలిచిపోయినను మరల వానిని గోరకయు నుండును. అనఁగా సత్త్వాది గుణములు సహజముగా తటస్థించుచుండునని తలఁచునుగాని వానియం దనుకూల ప్రతికూలబుద్ధి చేయఁ డని భావము.

శ్లో॥ ఉదాసీనవ దాసీనో గుణై ర్యో నవిచాల్యతే।
గుణా వర్తన్త ఇ త్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే॥ 23

టీ. ఉదాసీనవత్ = ఆత్మవ్యతిరిక్తములైనవానియందు తటస్థుని వలె, ఆసీనః = ఊరక ఉన్నవాఁడై, యః — ఎవ్వఁడు, గుణైః = గుణముల చేత (పూర్వోక్తద్వేషాకాంక్షలద్వారా), నవిచాల్యతే = చలింపఁజేయఁ బడఁడో; గుణా ఏవ = గుణములే, వర్తన్తే ఇతి = తమతమ కార్యముల యందుఁ బ్రవర్తించుచున్నవని, యః = ఎవఁడు, అవతిష్ఠతి = మిన్నక ఉన్నాఁడో; నేఙ్గతే = గుణకార్యములైన ద్వేషాకాంక్షల ననుసరించి ప్రవృత్తిచేష్టలు సేయఁడో.

తా. ఎవఁడు, గుణవ్యతిరిక్తమైన యాత్మ నవలోకించుటవలనఁ దృప్తుఁడై, తక్కినవానియందుఁ దటస్థునివలె ఆసక్తి లేకయుండువాఁడై,
28
గుణకార్యములైన పూర్వోక్త ద్వేషాకాంక్షలవలన చలింపఁజేయఁ బడనివాఁడై యుండునో, ఎవఁడు ద్వేషాకాంక్షలు కలిగినను గుణ ములు తమతమ కార్యములగు ప్రకాశాదులందు వర్తించుచున్నవి
29
యని యనుసంధించుకొన్నవాఁడై మిన్నకుండునుగాని యా గుణకార్య
30
ములకు అనుగుణముగా చేష్టలు చేయఁడో, (వాఁడు గుణాతీతుఁ డనఁబడును)

శ్లో॥ సమదుఃఖసుఖ స్స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః।
31
తుల్యప్రి యాప్రియో ధీరస్తుల్యనిన్దాత్మసంస్తుతిః॥ 24
శ్లో॥ మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే॥ 25

టీ. స్వస్థః = ఆత్మయందే అత్యంత ప్రీతిగలవాఁడగుటచే దాని యందే నెలకొన్నవాఁడై, సుఖదుఃఖములయందు సమమైనచిత్తము గలవాఁడును సమలోష్టాశ్మకాఞ్చనః = మట్టిపెల్లను రాతిని బంగారమును, సమముగా చూచువాఁడును, తుల్యప్రియాప్రియః=ఇష్టానిష్ట విషయములందు సముఁడును, ధీరః = ప్రకృతాత్మల భేదము నెఱిఁగిన వాఁడును, తుల్యనిన్దాత్మసంస్తుతిః=తన్నొరులు నిందించినను స్తుతించినను సమచిత్తము గలవాఁడును, మానవమానయోః = సమ్మానావమానములయందు, తుల్యః_సమబుద్ధి గలవాఁడును, మిత్రారిపక్షయోః =మిత్రపక్షమునందును శత్రుపక్షమునందును, తుల్యః = సమబుద్ధి గలవాఁడును, సర్వారమ్భపరిత్యాగీ (యః)=సమస్త సాంసారిక ప్రయత్నములను విడిచినవాఁడు నెవఁడో, సః=వాఁడు, గుణాతీతః=సత్త్వాది గుణములను జయించినవాఁ డని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా. (గుణాతీతుఁడు) తన యాత్మయె తన కత్యంత ప్రియమైనదిగాఁ గలిగియుండుటచే దానియందే నెలకొన్నవాఁడై దానికి వ్యతిరిక్తములైన పుత్రాదులయొక్క జన్మమరణాదులనెడి సుఖదుఃఖములందు సమచిత్తుఁడై యుండును. కావుననే మట్టిపెల్లనుగాని ఱాతినిగాని బంగారునుగాని సమానముగాఁ దలఁచును. కాఁబట్టియె ప్రియవిషయములుగాని అప్రియవిషయములుగాని సమానములుగా నెంచును. వాఁడు ప్రకృత్యాత్మవివేకకుశలుఁడై యుండును. ఈవివేకము వలన మనుష్యత్వాది దేహవికారములను వాఁడు ఆత్మగా భ్రమి



యింపఁడు గనుక ఆ మనుష్యత్వాదుల సౌందర్యవైరూప్యాది గుణాగుణములచేఁ గలుగు స్తుతినిందలు తద్వ్యతిరిక్తమైన తన యాత్మకు సంబంధింపనివిగా అనుసంధించుచుండును గాన *ఆస్తుతినిందలందు సమచిత్తుఁడైయుండును. ఇట్లు స్తుతినిందలందు సమచిత్తుఁడై యుండుటచే

దానివలనఁ గలుగు మానావమానములందును అమానావమానము లచేఁ గలుగు మిత్రశత్రుపక్షములందును తనకు సంబంధము లేమిని అనుసంధించుటవలననే సమచిత్తుఁడై యుండును. ఇంతేల, దేహి 33 యగుటవలన, గలుగు సంసారిక సమస్తారంభములను 34 బరిత్యజించిన వాఁడగును. ఇట్టివాఁడే గుణాతీతుఁ డనఁబడును.

అవ. ఏవం రూపమైన గుణాత్యయమునకు ఉపాయములను (అనఁగా హేతువులను) జెప్పిరి. ఇప్పు డా హేతువులలో ప్రధాన మైనదానిని జెప్పుచున్నారు.

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥ 26

టీ. యః=ఎవఁడు, మాం=నన్ను, అవ్యభిచారేణ=చలింపని =ఐకాంతికమైన, భక్తియోగేనచ=భక్తియోగముచేతను, సేవతే= సేవించుచున్నాఁడో, సః=వాఁడు, ఏతాన్ గుణాన్=ఈ సత్త్వాదిగుణ ములను, సమతీత్య = అతిక్రమించి, బ్రహ్మభూయాయ = బ్రహ్మ సమానరూపప్రాప్తికొఱకు, కల్పతే=అర్హుఁ డగు చున్నాఁడు.

తా. "నాన్యంగుణేభ్యః కర్తారమ్" ఇత్యాదులచేఁ చెప్పఁబడిన ప్రకృత్యాత్మవివేకమును అనుసంధించిన మాత్రమున గుణాత్యయము

* ఇందు 'నద్వేష్టి' మొదలుకొని 'ధీరః' అనువఱకు ఆంతరలక్షణములు, 'తుల్య నిన్దాస్తుతిః' అనుట మొదలుకొని 'సర్వారమ్భపరిత్యాగీ' అనువఱకు బాహ్యాచారలక్షణ ములు, ఇవియన్నియును గుణాత్యయమునకు ఉపాయములు, అని పూర్వోక్తప్రశ్నలు మూఁటికి నుత్తరములు దెలియనది. స్తుతినిందలను గైకొనుటవలన మానావమానము లును వానిని చేయుటవలన శత్రుమిత్రులును గలుగుదురు. స్తుతినిందలనే పాటింపమిచే తక్కినవంతయుఁ గలుగనేరదని భావము. ప్రకృత్యాత్మవివేకమే యీస్తుతినిందాదు లందు సమచిత్తత కలిగియుండుటకు మూలహేతు వని గ్రాహ్యము.

కలుగనేరదు. ఏల యన, అది కలిగినను అనాదికాలప్రవృత్తమైన విపరీత వాసనచే బాధితము కాఁగూడును. కనుక [35]పరమకారుణికుఁడును [36]సత్య సంకల్పుఁడును [37]ఆశ్రితవాత్సల్యజలధియు నైన నన్ను [38]ఐకాంతికభక్తి యోగముచేత నెవఁడు సేవించునో, అతఁడీసత్త్వాదిగుణత్రయము అతిక్రమింపరాని దయ్యును దాని నతిక్రమించి బ్రహ్మభావమునకు యోగ్యుఁ డగును. అనఁగా యథావస్థితమును అమృతమును అవ్యయ మును అగు ఆత్మస్వరూపమును బొందు నని యర్థము.

అవ. 39

[40]

శ్లో. బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్యచ।
*శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ॥   27

టీ. హి = నేను భక్తియోగమునకు విషయముగుటవలన, అమృ తస్య — నిత్యుఁడును, అవ్యయస్య = జ్ఞానసంకోచరహితుఁడును నిర్వి కారుఁడునగు, బ్రహ్మణశ్చ = పరిశుద్ధాత్మస్వరూపమునకును, శాశ్వ తస్య = అతిచిరకాలము వర్తించునదయిన, ధర్మస్యచ = ధర్మఫల మగు అతిశయితైశ్వర్యమునకును, ఐకాన్తికస్య = పొందఁదగిన, నిరతిశయా నందసుఖస్యచ = మోక్షసుఖమునకును, అహం = నేను, ప్రతిష్ఠా =

* శాశ్వతిధర్మము ప్రాపకము. నిరతిశయైశ్వర్యము ప్రాప్యము. కనుక ప్రాపక మునే ప్రాప్యముగాఁ జెప్పుట యెటు ? అన్నచో, దీనికి ముందును వెనుకను జెప్పఁ బడిన అక్షరభగవత్ప్రాప్తులు ప్రాప్యము లగుటచే నడుమనున్నయిదియు ప్రాప్యమే కావలయును కనుక ఐశ్వర్యమని యర్థము గ్రాహ్యము. పూర్వము 'దైవీహ్యేషా... ప్రపద్యన్తే' అని యారంభించి, గుణాతిక్రమణములు తత్పూర్వకము లయిన అక్షరై శ్వర్యభగవత్ప్రాప్తులును భగవత్ప్రపత్తి యనెడియుపాయముచేతనే కలుగు నని ప్రతి పాదించిరి అట్లే ఇప్పుడును ఏకాంతభగవత్ప్రపత్తి యనెడి యుపాయముచేతనే గుణా త్యయమును తత్పూర్వక మయిన బ్రహ్మభావమును గలుగునని చెప్పఁబడినది.

ఆధార మైనవాఁడను- ప్రాపకుఁడను.

తా. నేను భక్తియోగమునకు విషయభూతుఁడగుటవలన నన్ను అవ్యభిచారి యగుభక్తియోగముచేత సేవింపఁగా నేను అమృతమును అవ్యయము నగు ఆత్మస్వరూపమునకును (కైవల్యప్రాప్తికిని), 41 అట్లె శాశ్వతం బగుధర్మమునకు (అనఁగా అతిశయితనిత్యైశ్వర్యమునకు) 42 ను, ఐకాంతిక మగు సుఖమునకును- అనఁగా 'వాసుదేవ స్సర్వమ్' ఇత్యాదులచే నిర్దిష్టుఁ డైనజ్ఞానికిఁ బ్రాప్య మగు మోక్షసుఖమునకును 43 నిర్వాహకుఁడ నై యున్నాను. 'శాశ్వతధర్మ' శబ్దము ప్రాపకమును జెప్పును. అయినను దీనికి ముందును వెనుకనుఁ జెప్పఁబడినవి ప్రాప్యములుగ నుండుటచే వానిసాహచర్యమునుబట్టి యిదియు ప్రాప్యమునే 44 గుఱించిన దగును. ఇం దభిప్రాయ మేమనఁగా- పూర్వమందు 'దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా। మామేవ యే ప్రపద్యన్తే' అని యారంభించి గుణాత్యయమునకును తత్పూర్వకము లైన అక్షరైశ్వర్యభగవత్ప్రాప్తులకును భగవత్ప్రపత్తి యొక్కటియే ఉపాయమని ప్రతిపాదింపఁబడియుండుటవలన, గుణాత్యయమునకును తత్పూర్వకమయిన బ్రహ్మభావమునకును ఏకాంత మగుభగవత్ప్రపత్తి యొక్కటియే యుపాయ మగునని భావము.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయ
విభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః.

45. గీతార్థ సంగ్రహము.

# చతుర్దశోఽధ్యాయః

## గుణత్రయ విభాగయోగము - అవతారిక

### 1వ శ్లోకము

1. ఈ శ్లోకమున "భూయః ప్రవక్ష్యామి" అనుటచే చెప్పినదే చెప్పనేల యని యాశంకింపరాదు. వెనుకటి అధ్యాయమున సంగ్రహముగ జెప్పిన గుణము లాత్మను శరీరముతో బంధించురీతినే యీ యధ్యాయమున విస్తరించి చెప్పుచున్నాడు. కావున పునరుక్తిదోషము లేదు.

### 2వ శ్లోకము

అవతారిక

వెనుకటి శ్లోకమున ఇష్టప్రాప్తి చెప్పబడినది. ఈ శ్లోకమున అనిష్టనివృత్తి చెప్పబడుచున్నది. కాబట్టి పునరుక్తి దోషములేదు.

### 3వ శ్లోకము

3. ఈ శ్లోకమున 'మమయోనిః' యని యన్వయించి యర్థమును చెప్పరాదు... అట్లు చెప్పినచో 'పరమాత్మకును వేరొకకారణ ముండ వలసియుండును. ఆ యన్వయము "అహంకృత్స్నస్య జగతః ప్రభవః" "నేనే సమస్తజగత్తునకు కారణ"మను దానికి విరుద్ధము. మరియు నందే 'మత్తః పరతరంనాన్యత్ కిఞ్చిదస్తి ధనంజయ" అని తనకంటె గొప్పది మరియొకటి లేదనియును స్పష్టముగా నిషేధించుటయును కుదరదు. మరియు 'తస్మిన్ గర్భం దధామ్యహ' మ్మని నాకు కారణమైన దాని యందే నేను గర్భమును నెలకొల్పుచున్నాననుట సుతరాం విరుద్ధము.

'తాసాం బ్రహ్మమహద్యోనిః।
అహంబీజ ప్రదః పితా॥

దేవాది సరీసృపాంతయోనులయం దుద్భవించు ప్రాణులకు ప్రకృతికారణము. నే నాప్రకృతియందు వారివారి కర్మానుగుణముగ చేతనులను కూర్చుచున్నానను సూక్తియును విరోధించును.

కాబట్టి జగత్తునంతకును తండ్రియైయున్న తనకు జగద్గర్భాధాన మునకు సమర్థమైన సాక్షాత్తుగా వికరించు నొకపదార్థమును ఇచ్చట యోనిశబ్దమున కర్థముగా జెప్పవలెను. అది ప్రకృతిగాక మరియొకటి యేదికలదు ? కాబట్టి 'యోనిః మహద్బ్రహ్మమమ' అని యన్వయమే సరసమైనది.

పూర్వ—మరియు జగత్తునకంతకును యోనికాదగిన మహద్బ్రహ్మ పరమాత్మయే కదా !

'వాసుదేవః పరాప్రకృతిః'
'యద్భూతయోనిం పరి పశ్యన్తి ధీరాః'
'కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్'

అను శ్రుతివాక్యములలో నా పరంబ్రహ్మమే జగద్యోనిగా చెప్పబడుచున్నాడుగదా ! అట్టితరి అహం యోనిఃపరంబ్రహ్మ అని సామానాధికరణ్యాన్వయము న్యాయముకదా ! 'మమ' యను వ్యతిరేక నిర్దేశమేల ? అన్నచో 'బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా' యనునటుల నిచ్చటను భేదముగా జెప్పబడుట ఔపచారిక మనవచ్చునే యన్నచో.

వెనుకటి రెండుషట్కములలో చెప్పబడిన అర్థములను విశద పరచుటయేగదా మూడవ షట్కప్రయోజనము. కావున 7వ అధ్యాయ ములో 'భూమిరాపోఽనలోవాయుః' ఇత్యాదులచే "మే" యని తనకు శేషభూతముగా జెప్పబడిన ప్రకృతియే యిచ్చటను అచ్చటి 'మే' శబ్ద మునకువలె సంబంధమును తెలుపు షష్ఠీ నిర్దేశముతో 'మమ'యనియు అచ్చట ప్రకృతిశబ్దమునకు పర్యాయమైన 'యోని' శబ్దముచేతను చెప్ప బడినది. ఇచ్చట 'గర్భ' శబ్దము అచ్చట 'పరాప్రకృతి'గా జెప్పబడిన

'జీవసముదాయమే.' ఆ చేతనులు గావించిన పుణ్యాపాపముల ఫలాను భవమునకై ఆధానక్షేత్రముగా (భోగాయతనముగా) నిది తెలుపబడుటచే నేడవయధ్యాయమున జెప్పబడిన అపర ప్రకృతియే యిదియని జ్ఞాపకము చేయబడినది. అచ్చటనే 'ఏతద్యోనీని భూతాని' అని ప్రకృతికి యోనిశబ్దము పర్యాయముగా వాడబడుటయు గమనించవలెను. ఆ మూల ప్రకృతియే పంచభూతములకును వానిని బుట్టించిన అహంకారమునకును దానిని బుట్టించిన మహత్తత్త్వమునకును కారణమైనదగుటచే దానికి 'మహాత్' అను విశేషణమనుచితముకాను. బ్రహ్మశబ్దమును యౌగికముగా (గౌణముగా) కారణత్వ బృహత్త్వములున్న పరమాత్మేతరములయందును ప్రయోగించవచ్చును. అట్లు 'బహ్మ నామరూపమన్నంచ జాయతే' అని శ్రుతిప్రయోగము గలదు. ఇంతమాత్రము పరమాత్మకు జగదుపాదానత్వమునకు భంగములేదు సరికదా అది మిక్కిలి యనుగుణముకూడను. నిర్వికారుడగు భగవంతుడు ప్రకృతి విశిష్టరూపముననే జగత్కారణుడగుట యెంతయో అనుకూలము. దాన నాతనికేవికారములును లేవనుట సుకరము. కావుననే వెనుకనే 'ఏతద్యోనీని భూతాని' యని చేతనా చేతన ప్రకృతులకు జగత్కారణత్వమును జెప్పి వెంటనే "అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా" అని తననిమిత్తోపాదానత్వములను సమర్థించుకొనెను.

## 4వ శ్లోకము

4. 7వ అధ్యాయమున 'యయేదం ధార్యతేజగత్' అని చేతన ప్రకృతిని యాధారముగాను అచేతన ప్రకృతిని ధార్యముగాను చెప్పి యిచ్చట 'తస్మిన్ గర్భం ధధామి' యని వ్యుత్క్రమముగా చెప్పవచ్చునా? యన్నచో- ఇచ్చట ఆధారాధేయభావము దానికధీనమగుట వలనని గ్రహించరాదు. వేరుచేసి ఎఱుంగుటకు శక్యముకాని సంయోగముమాత్రమే. నీటిలో నీరుకలసినట్లు అట్లు కూర్చుటకు ప్రయోజ

నము కర్మవశ్యులగు జీవులకు వారివారి కర్మానుగుణముగా ఫలము నిచ్చుటయే.

5వ శ్లోకము

5. ఇచ్చట ప్రసిద్ధిప్రాచుర్యము లేకుండుటచే భూతశబ్దమునకు మహత్త్వాదిపరముగ నర్థమును జెప్పరాదు. 'సంభవస్సర్వ భూతానా' మని భూతశబ్దముచే సృజింపబడుట చెప్పబడుటచే నది సమస్తచేతనుల కును సమానమేగాన నా భూతశబ్దమునకు బ్రహ్మేశానాదులందరును అర్థముగా చెప్పబడవచ్చును.

ఆబ్రహ్మస్తంబ పర్యన్తాః
జగదన్తర్వ్యవస్థితాః।
ప్రాణినః కర్మజనిత
సంసార వశవర్తినః॥
బ్రహ్మాద్యా స్సకలా దేవాః
మనుష్యాః పశవస్తథా।
విష్ణుమాయా మహావర్త-
మోహాన్ధతమసావృతాః॥

అని సకలప్రాణులతో సమానముగ బ్రహ్మాదులకుకూడ పుట్టుక చెప్పబడుచున్నదిగదా !

3వ శ్లోకము

6. సాధారణరూపముగా సమస్తము నెఱింగినట్టియు, విశేషా కారముతో సమస్తము నెఱింగినట్టియు పరమాత్మయొక్క సంకల్ప రూపమైన జ్ఞానమునుండి జీవునకు భోగ్యభూతమైన పదార్థజాతమంతం యును నామరూపములతో బుట్టుచున్నది.

4వ శ్లోకము

అవతారిక

7. పూర్వశ్లోకములచే ప్రాకృతనైమిత్తిక సృష్టులకు కారణము పరమాత్మయేయని చెప్పబడెను. ఇప్పుడు నిత్యసృష్టికిని తానే కారణ మని చెప్పుచున్నాడు. ఇట్లు చెప్పుటచే పునరుక్తిదోషము పరిహరింప బడినది.

8. చతుర్ముఖ బ్రహ్మచే సృజింపబడిన దేవతిర్యఙ్మనుష్య స్థావర సృష్టికి పిమ్మటనుగూడ ప్రళయపర్యంతము సాధారణమైన క్షుద్రజంతు వుల సంతతిలోనైనను సర్వేశ్వరుడు ఉదాసీనుడై యితరులచే చేయిం చుచు నూరకొనడు. కాని 'దేవగంధర్వ యక్ష- ఇత్యాది గ్రంథమును చూడుము.

9. ఇచ్చట బీజమనగా నేమి ?

తనను 'పిత = తండ్రి' యనుటకు తానా (యోని) ప్రకృతియందు బీజమనబడు జీవులను చేర్చుటయేకదా ! దానికే

'తాసాం బ్రహ్మమహద్యోనిః।
అహం బీజప్రదః పితా॥

యనుటచే సేశ్వర సాంఖ్యులవలె ప్రకృతియే యుపాదానకారణ మనియు పరమాత్మ కేవల నిమిత్తకారణమనియు తోచునే- అది వేద విరుద్ధము కాదా !

మరియు నొకే యోనియందు ఒకేరీతిగ నుండు యొకేతండ్రి బీజమును కూర్చుతరిచుట్టుప్రాణులలో నీవైషమ్య మేల ? అనగా చెప్పు చున్నాడు.

"నేను బీజప్రదుడనగు......

ఇచ్చట గర్భశబ్దమునకు పర్యాయముగా వాడిన బీజశబ్దమునకు ఆయా సృష్టికి అనుగుణమైన చేతను లర్థము.

5వ శ్లోకము

10. మహాబాహో !

ఈ సంబోధనచే నీగుణసంబంధము భుజబలముచే నివారింపదగి నది కాదోయి యని సూచింపబడినది.

11. సత్త్వాదిగుణములు శబ్దస్పర్శాదిగుణములవలె ప్రత్యక్షముగా గాన్పించవు. ఇంద్రియములకు గాన్పింపకున్నను అనుమానముచే తెలియ వచ్చు ననుటకు వీలులేదు. శ్రీభాష్యమున 'నెన్నడు నెవ్వనికిని గాన్పిం చని వస్తువులను అనుమానముచే సాధింపరాదని నిష్కర్షింపబడెను. ఎన్నడు నెవ్వరికిని గాన్పించని యీ గుణములనుగూర్చి యుపదేశిం చుట కాకిపండ్లను గుఱించిన వర్ణనవలెనే యుండును. (అనగా- వ్యర్థము) కావున వైశేషికాదులు చెప్పినటుల వీనికి వేరే నిర్వాహ మును చేయుటయో యుచితమని శంకింపగా- చెప్పుచున్నారు.

దీనిభావ మేమనగా—

గుణములు కాన్పించకున్నను వానికార్యములగు ప్రకాశము-ప్రవృత్తి మోహము రూపములగు కార్యములు గాన్పించుచున్నవిగదా ! కార ణములేక నేకార్యమైనను బుట్టదుగాన కాబట్టి యీ కార్యవిశేషముచే వీనికి కారణమైనవియు సామాన్యముగా సూచింపబడుటకు ఆక్షేపమేమి గలదు. ఆ కారణవిశేషములు సత్త్వాదిగుణములేయని శాస్త్రమును చెప్పుచున్నది. వీనిని గుఱించిన ఉపదేశము వ్యర్థమెట్లగును ?

విషముయొక్కగాని ఔషధముయొక్కగాని శక్తి, కంటికి గాన్పింపకున్నను వైద్యశాస్త్రములో నాశక్తినిగూర్చి మనము వినుట లేదా దానికి ప్రయోజనమేమి ? ప్రతికూలశక్తిగల విషమును వర్జించి యనుకూలశక్తిగల ఔషధమును స్వీకరించుటయేగదా !

అటులనే అనుకూలమగు సత్త్వగుణము నాదరించి ప్రతికూలమైన రజ స్తమోగుణములను వర్జించుటయే ప్రయోజనమనుట కేమిసందేహము ?

12. కార్యములనుబట్టి యూహింపబడదగినవైనచో ప్రళయములో సుఖదుఃఖాదిగుణకార్యము లుండవుగదా! సత్త్వాదిగుణములు లేనట్లేగదా! అట్లగుచో నీ గుణములు స్వరూపానుబంధు లెట్లగును? అన్నచో నీగ్రంథముచే చెప్పుచున్నారు.

6వ శ్లోకము

13. ఇచ్చట మలమనగా చీకటియొక్క స్వభావమైన వెలుగునకు విరోధియగు ఆకారము.

14. 'నకాఙ్క్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖానిచ" అంటివిగాన నీకు సంగము లేదని తెలుపుటకై 'అనఘ' యని సంబోధించెను.

15. నిరూపక స్వభావమనగా–

స్వరూపమును తెలుపు స్వభావము.

16. సత్త్వగుణ మల్పమాత్రముగా కలసియున్న రజస్తమోగుణములుకూడ భ్రమమాత్మకమైన బుద్ధివిశేషణమునకు హేతువులగుచుండగ సత్త్వగుణము ఒక్కటియే జ్ఞానమును బుట్టించునది యని చెప్పనేల? యని శంకింపగా– వస్తువులను– ఇత్యాది. రజస్తమస్సు లట్టివస్తువుల కలరూపజ్ఞానమును బుట్టింపజాలవు. దానిని బుట్టించునది సత్త్వగుణమొక్కటియే.

అట్టిచో రజస్తమస్సులు భ్రమకు అధిష్ఠానమైన త్రాడు–ముత్యపుచిప్ప మొదలగువానియొక్క యథార్థజ్ఞానమును బుట్టించుచున్నవే యన్నచో నది వానితో కలసియున్న సత్త్వాంశముయొక్క కార్యమని యెఱుంగవలెను.

17. ఇచ్చట ఒక ప్రశ్న బుట్టుచున్నది– వైదికకర్మలను చేయుటచే వానిఫలము ననుభవించుటకు మఱియొక జన్మనెత్తిన నెత్తవచ్చును గాని లౌకికకర్మలట్టివి కావే. ఆ కర్మ లిచ్చటనే ఫలము నిచ్చునవిగ జూచుచున్నాముగదా! దానివలన మరియొకజన్మ రాదే; దృష్టాంతము

నకై దానిని చెప్పిరన్నను- అది యొక గొప్ప ప్రయోజనకారి కాదు. అనినచో- ఇచ్చట లౌకికమనగా- స్మార్తకర్మలని యర్థము. లేక నిషిద్ధ కర్మలని గాని యర్థము. 'శత్రుహింస లౌకికశక్తిచే సుఖసాధనము కావచ్చును. దానికిగల అలౌకికశక్తిచే నది పాపిష్ఠజన్మ నిచ్చును అని భావము.

8వ శ్లోకము

18. "తమః తు"

ఇచ్చట 'తు' శబ్దము- తమస్సు వెనుకజెప్పబడిన రజస్సు వంటిదికాదు. ఇది మిక్కిలి నీచమైనది. కాబట్టి దీనిని బొత్తుగ దరిజేర నీయరాదని సూచించుచున్నది.

19. నిద్ర- ఇది బంధమునకెట్లు కారణమగుచున్నది ? అనగా- చేయవలసిన కర్మలను చేయనీయకపోవుటచేతను, చేసినను సకాల మున చేయక, నకాలమున చేయుటచేతను, పాపిష్ఠకలలను (దుస్స్వప్నములను) బుట్టించుటచేతను అని గ్రహించవలెను.

20. చేయరాని పనులను చేయుట యెట్లు పాపిష్ఠజన్మలకు కారణమో అటులనే చేయవలసిన పనులను చేయకుండుటయును పాపిష్ఠ జన్మకు కారణము.

"అకుర్వాన్ విహితం కర్మ నిన్దితంచ సమాచరన్।
ప్రసజంశ్చేన్ద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః॥"

అని స్మృతి తెలుపుచున్నది.

10వ శ్లోకము

అవతారిక

21. రజోగుణ తమోగుణములయొక్క అభివృద్ధిని యరికట్టుటకే యీ శ్లోకము చెప్పబడినది.

12వ శ్లోకము

22. ఆరంభః- ఇచ్చట ఆరంభమనగా- ఇహలోకఫలముల నొసంగు వ్యవసాయాదులనియును, పరలోకఫలముల నొసంగు యజ్ఞాదులనియు నర్థము.

అవతారిక

23. మరణసమయమున పెరిగియున్న సత్త్వాదిగుణములయొక్క ఫలము లిచ్చట వేరువేరుగా జెప్పబడుచున్నవి. అందులకు కారణమేమనగా- వాని ప్రమాదములను గ్రహించి యిప్పటినుండియు సావధానముగా నుండి రజోగుణ తమోగుణముల నరికట్టుటకై ప్రయత్నించవలెనని తెలుపుటయే.

19వ శ్లోకము

24. ఈ శ్లోకమున 'మద్భావ' మనగా- అభేదమని యర్థము కాదు. అట్లైనచో అధ్యాయ ప్రారంభమున చెప్పబడిన 'మమ సాధర్మ్య మాగతాః' అను దానితో విరోధించును.

వేదమున్ను- 'పరమం సామ్యముపైతి' యని సామ్యమునే చెప్పుచున్నది గాని ఐక్యమును జెప్పలేదు.

మరియొక శ్రుతియు-

"యథోదకంశుద్ధే శుద్ధ ఆసిక్తం తా దృగేవ భవతి" ఏవం మునేర్విజానత ఆత్మాభవతి గౌతమ!" అని శుద్ధమైన నీటితో జేరిన శుద్ధమైన నీరు నట్టిదేయగునట్లును పరమాత్మను జేరిన జీవు డట్టివాడే యగునని చెప్పుచున్నది.

మరియును- జనకునకు వసిష్ఠుడిట్లు చెప్పెను.

శ్లో॥ పరేణ పరధర్మాచ । భవత్యేష సమేత్యవై
విశుద్ధధర్మాశుద్ధేన బుద్ధేనచ న బుద్ధిమాన్
విముక్తధర్మాముక్తేన సమేత్యహి తథా భవేత్ ।

విమోక్షిణ్యా విమోక్షీచ సమేత్త్యేహ తథాభవేత్।
స్వతన్త్రశ్చ స్వతన్త్రేణ స్వతన్త్రత్వ మవాప్నుయాత్॥ ఇతి

అనగా- ఎవ్వడెట్టిధర్మములు కలిగినవాని నుపాసించి యెట్టి ధర్మములతో కూడియున్నవానిని పొందునో తానట్టి ధర్మమును కలవాడే యగునని తాత్పర్యము.

25. 'ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః' అని 18వ శ్లోకమున సత్వగుణనిష్ఠులకు మోక్షమును ఫలముగా జెప్పినచో నికముందు శ్లోకమున గుణాతీతునకు మోక్షఫలమును చెప్పుట యెట్లు ఘటించు ననగా జెప్పుచున్నారు- అనగా-

19వ శ్లోకము

25. ఆహారవిశేషాదులు సత్త్వాదిగుణవృద్ధికి కారణమని పూర్వాపర గ్రంథములకు తాత్పర్యము. సంసారమునకు ముఖ్యకారణమైన సత్త్వాది గుణత్రయము నతిక్రమించుట, సత్త్వమభివృద్ధిగా నున్నచో మోక్షపర్యంత ప్రాప్తియు సంగతములే.

26. గుణకార్యములయందు మాత్రమే కర్తకాడు. అసలు ఏ కార్యములయందును కర్త కాడన్నచో 'జక్షన్‌క్రీడన్' అను శ్రుతిలో జెప్పబడు మోక్షదశలోని కర్మలయందును కర్త కాకుండవలసివచ్చును.

20వ శ్లోకము

27. జన్మమృత్యు... దుఃఖైః-

జన్మ మొదలైనవాటివలన బుట్టునట్టి దుఃఖములచేతను అనిగాని, జన్మ మొదలగు వికారములచేతను, వానివలన బుట్టినట్టి దుఃఖములచేతను అనిగాని యర్థము.

23వ శ్లోకము

28. బాహ్యవిషయములనుగూర్చి కార్యరూపముగ ప్రవర్తింపడని భావము.

29. ద్వేష - కాంక్షలనుబట్టి ప్రవర్తించడని భావము.

30. ఖిన్నకుండుట యనగా-

తమతమ కార్యముల నవి చేసుకొనుచున్నవి నాకేమి? యని యూరకుండునని భావము. ఇదియే ఔదాసీన్యము.

24వ శ్లోకము

31. ప్రియము గాని అప్రియము గాని తటస్థించినచో కొంచెమైనను చలించకుండుట యనినది 'తుల్యప్రియా ప్రియాది' శబ్దముల చేతనే చెప్పబడుటచే నిచ్చట 'ధీర' శబ్దమునకు దూషించినను భూషించినను సమచిత్తమును కలిగియుండుటకు కారణమైన బుద్ధిని కలిగి యుండుట యను నర్థము వచ్చునట్లు వ్యాఖ్యానములో 'ప్రకృత్యాత్మ వివేకకుశలః' అని వివరించిరి.

25వ శ్లోకము

32. గుణములను తెలుపుట స్తోత్రమనియు, దోషములను తెలుపుట నిందయనియును జెప్పుదురు. దేహాత్మల వివేకము కలవాడు తన శరీరమునందలి సౌందర్యాదుల నెత్తి స్తుతించుటకు గాని కురూపము నెత్తి నిందించుటకు గాని యెవ్వరైనను ఆరంభించినచో పరులను స్తుతించునట్లును నిందించినట్లును తలంచును గాన తనకు వారియందు ప్రేమను గాని ద్వేషమును గాని కలిగియుండడు. "మూర్ఖాః పూజిత పూజకాః" అనునటుల లోకులు తమను పొగిడిన వానిని ఆదరింతురు. నిందించువారి నవమానింతురు. మానము - అవమానముయొక్క పద్ధతులు లోక రివాజునుబట్టియు శాస్త్రములను బట్టియు నుండును. అనగా- "తనను సన్మానించువారు మిత్రులగుదురు. తన నవమానించువారు శత్రువు లగుదురు. ఇది లోకరివాజు. దానినిబట్టి చెప్పుచున్నారు. "తుల్య నిందా స్తుతిః" యనుటచే- వాచకస్తుతి నిందలు చెప్పబడుచున్నవి. మానావమాన శబ్దములచే మానసిక కాయిక స్తుతినిందలని యర్థమును గ్రహించవలెను.

సమబుద్ధిగల గుణాతీతునకు శత్రువులును మిత్రులు నుండురా ? యనగా–

వీరి దృష్టిలో నందరును సమానమైనవారే యని యుండును కాని పరులు వీరివిషయమై శత్రుమిత్ర భావములను కలిగియుందురు. దానిని బట్టి యీ శత్రుమిత్ర ప్రసంగమని గ్రహించవలెను.

34. ఆరంభమనగా– "ఆరభ్యత ఇత్యారమ్భః" అనగా "చేసిన దానికి ప్రతిక్రియ" యని భావము.

33. సాంసారిక సర్వారంభములను పరిత్యజించుటయే.

బాహ్యాచార లింగములు.

ఆంతరికములైన అద్వేషాదులచేతను బాహ్యములైన ఆరంభ పరిత్యాగములచేతను గుణాతీతుడు గుర్తింపబడును. అదియే గుణాతీతు డగుట కుపాయమున్నా

36వ శ్లోకము

35. సత్యసంకల్పుడైనను సర్వసము డగుటచే నుదాసీనుడు మాత్రము కాడనుటకు పరమకారుణికు డనబడెను.

36. పరమాత్మయొక్క సంకల్పము సంసారబంధ విషయమై నిరంకుశమైనట్లే. అది బంధమును బాపుటకును, నిరంకుశమే యగునని భావము.

37. దోష భూయిష్ఠులగు సంసారులయం దాతనికి దయయుం డుట కేమికారణ మన్నచో చెప్పబడుచున్నది. "ఆశ్రిత వాత్సల్యే" త్యాది– ఈ కారుణ్యమును వాత్సల్యమును చెప్పుటలో భావమేమనగా–

ఆతని సత్యసంకల్పత్వము రక్షించుటకును శిక్షించుటకును సమానమే యైనను అనుగ్రహ మతిశయించి యుండునని తెలుపుటయే.

38. మూలమున నున్న 'అవ్యభిచారేణ' అనుటకు ఇతర దేవత లను, ఇతర ఫలములను ఇతర సాధనములను విడుచుట యని భావము.

ఈ శ్లోకముచే సంగసహితమైన ఐకాన్తిక భక్తియోగముచే సేవింపబడినవాడై భగవంతుడే ముముక్షువునకు మోక్షము నొసంగు ననెడి భావము సూచింపబడినది.

27వ శ్లోకము

అవతారిక

39. బ్రహ్మసూత్రములలోని ఫలాధ్యాయములో ఫల మత ఉపత్తేః' అను సూత్రమున చతుర్విధ పురుషార్థప్రాప్తియు కేవల పరమాత్మవలననే బడయదగినదే గాని మరియొకరివలన నది లభించదని తెలుపుటకై శ్రియఃపతికి సామాన్యముగా సకల ఫలప్రదత్వము చెప్ప బడినది. అటులనే యిచ్చటను మధ్యమషట్కమున జెప్పబడిన ఐశ్వ ర్యము, కైవల్యము భగవత్ప్రాప్తి యనబడు మూడు పురుషార్థముల కును శ్రియఃపతియే హేతువని తెలుపబడుచున్నది.

40. ఈ శ్లోకమున బ్రహ్మశబ్దమునకు 'సాక్షాత్పరం బ్రహ్మ' అర్థమనరాదు. అట్లగుచో- 'అహం బ్రహ్మణః ప్రతిష్ఠా' 'అని నేను బ్రహ్మమే' అని చెప్పుట యసంగతమే. చెప్పెడువాడే గదా బ్రహ్మ. తనకు తానే ప్రతిష్ఠ యెట్లగును? "ప్రతిష్ఠ" యనగా 'ఆధారమైన వాడని' యర్థము. ప్రాపకుడును అనియు నర్థము.

"భోక్తా భోగ్యం ప్రేరితా" అని బ్రహ్మ మూడంశలుగా నుండును. అందు ప్రేరి యనబడు నియంత అనగా ఈశ్వరుడు బ్రహ్మ కంటె వేరుగాన ప్రాప్యప్రాపకభావము సంగతమే యనరాదు. ఈశ్వర బ్రహ్మలకు భేదములేదని నిరూపింపబడినది కదా! సవిశేషమగు బ్రహ్మకు నిర్విశేషమైన బ్రహ్మప్రాపకమని గాని, జీవాత్మ పరమాత్మలకు ప్రతిష్ఠ యనిగాని చెప్పరాదు. అది శ్రుతిస్మృతులకు విరుద్ధమగుటచే నిర్మూలము.

"జ్ఞానీత్వాత్మైవ మేమతం" అని పరమాత్మ తనకు జీవుని యాధారమైన ఆత్మనుగా చెప్పినను అది 'మేమతం' అని విశేషించి

తన యభిప్రాయమని చెప్పుటచే నది ప్రశంసాపరము గాని తత్త్వము కాదు. పోనిండు- 'బ్రహ్మ' శబ్దమునకు మూలప్రకృతి యని యర్థమును జెప్పెదమనిన ఇప్పుడు పరమాత్మకు చెప్పబడు కారణత్వ ప్రకరణములో నది యసంగతము.

ఇక వీనికి నిర్దుష్టమగు నర్థమేది యనగా- "బ్రహ్మ భూయాయ కల్పతే" యని జీవునకు ఫలదశలో శుద్ధస్వరూపమే యిచ్చట బ్రహ్మ శబ్దమునకు అముఖ్యార్థముగా స్వీకరించవలెను. అట్టి శుద్ధాత్మ స్వరూపమునకు భగవంతుడే కారణమనుట సరసము. అనగా- ముముక్షువగు చేతనునకు పరబ్రహ్మతో సమానమైన పరిశుద్ధస్వరూపము లభించుటలో శాస్త్రమున జెప్పబడిన సిద్ధసాధ్య పదార్థములలో ముఖ్యకారణమైనదేది యనగా- 'నేనే' యని పరమాత్మ స్వయముగ సెలవిచ్చుచున్నాడు.

లేక- ప్రతిష్ఠాశబ్దమునకు ప్రాపకమని గాక ఆధారమని యర్థమును చెప్పవచ్చును. ఆ యాధారత్వము నియమనగర్భితము. ఈ విషయము 'ఏతస్యతా అక్షరస్య ప్రశాసనే' యని శ్రుతిచేతను, 'సాచ ప్రశాసనాత్' అను బ్రహ్మసూత్రముచేతను చెప్పబడుచున్నది.

కాబట్టి శుద్ధాత్మ స్వరూపమునకును నిర్వాహకుడు తానే కావున ప్రకృతమగు బ్రహ్మభావము (బ్రహ్మసాదృశ్యము) పరమాత్మ భక్తిచే మాత్రమే సిద్ధించునది యని తాత్పర్యము.

27వ శ్లోకము

41. ఇచ్చట- శాశ్వతధర్మమనగా అతిశయిత నిత్యైశ్వర్యము-

ఇచ్చట చెప్పబడిన ఐశ్వర్యము ఇంద్రుడు బ్రహ్మ మొదలగువారనుభవించు భోగములకంటె గొప్పదని యర్థము. ఇది శాశ్వతమైనదనుటకు తాత్పర్యము చాలాకాలముండుట మాత్రమే.

42. సుఖము ఐకాంతికమనుటకు ఏకాంతియగు భక్తునిచే పొంద బడు సుఖమని యర్థము. ఏకాంతి యనగా 'ఏకభక్తి' యనినటుల ఫలమునందును ఫలమునిచ్చువాడుగాన భగవంతుని యందును గాక ఫలాశ లేక కేవల భగవంతునియందే భక్తి కలవాడని యర్థము. "ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం" అని క్షేత్రకార్యములలో సుఖముకూడ చెప్పబడుటచే సుఖములన్నియు శరీరమునుండి పుట్టు కార్యములే యని తలంపరాదు. ఇచ్చట చెప్పబడు సుఖము 'రసం హ్యేవాయం లబ్ధ్వా నన్దీభవతి' అని రసమని చెప్పబడు సుఖమొక విలక్షణసుఖమని గ్రహిం చవలెను. 'అశరీరం వా వసన్తం ప్రియా ప్రియే నస్పృశతః' అనుటచే మోక్షదశలో దుఃఖములతో పాటు సుఖముకూడ నుండదనుటచే నైయాయికులు చెప్పునట్టి పాషాణావస్థ మోక్షమని గ్రహించరాదు. ఇచ్చట సుఖమనగా దుఃఖముతో కలసిన సుఖమని యర్థము. అదిలేదని చెప్పబడుటచే మోక్షమున నిరతిశయసుఖానుభవ ముండుటలో నాక్షేప మేమియును లేదు.

43. 'శాశ్వత ధర్మ' శబ్దమునకు భాష్యకారులు 'ఐశ్వర్య' మని లక్ష్యార్థమును చెప్పిరి. ముఖ్యార్థమునకు బాధ యున్ననే లక్ష్యార్థమును స్వీకరించవలెను. ఇచ్చట ముఖ్యార్థమగు సాధనమైన ధర్మమే యర్థము. 'నారాయణ శ్శాశ్వతధర్మగోప్తా' అని దానిని పాలించువాడు నారా యణుడేయని ప్రసిద్ధి కలదు. ధర్మశబ్దమునకు శాశ్వతవిశేషణముండుటచే కృతయుగ ధర్మమని యర్థము. ఆధర్మము ప్రళయాదులయందును పాషం డుల ఉపద్రవ సమయములలోను క్షీణించినచో 'యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత' యని చెప్పినట్లు క్రమముగ నాతడే పాలిం చునుగాన దానికాశ్రియఃపతియే ప్రతిష్ఠయనుట సమంజసము — అని శంకింపగా చెప్పుచున్నారు — 'శాశ్వత ధర్మశబ్దము' ఇత్యాది.

"బ్రహ్మణోహి" యనుటద్వారా ప్రాప్యస్వరూపము తెలుప బడినది.

'శుభస్యైకాన్తి కస్యచ' అనుటచే అల్పత్వాది దోషములు కల వగుటచే దూషించబడిన ఆత్మానుభవ సుఖమున్ను, ఐశ్వర్యసుఖ మున్ను నిజముగ పొందదగిన సుఖములు కావని సూచింపబడెను. 'శాశ్వతస్య చ ధర్మస్య' అనుటచే వెనుక ఎనిమిదవ యధ్యాయమున చెప్పబడిన ఐశ్వర్యమే లక్షణావృత్తిచే జెప్పబడినది. పూర్వాపరశబ్ద సందర్భములచే "అగ్ర్యప్రాయ న్యాయము" నవలంబించి సాధనవాచక శబ్దముచే సాధ్యమే చెప్పబడినదని గ్రహించవలెను. అందువల్లనే యిచ్చట ధర్మశబ్దమునకు కృతయుగధర్మము చెప్పబడలేదని స్పష్టము.

44. ఇచ్చట అప్రసక్తమైన ఐశ్వర్యమును జెప్పనేల? గుణా తీతుడగుటకు ప్రధానకారణమును చెప్పుటగదా యిచ్చట ప్రసక్త మైనది. అతిశయితైశ్వర్యమునకు తాను ప్రతిష్ఠ—(ఆధారము = ప్రాప కము) యగుట ప్రసక్తమైన గుణాతీతుడగుటకు కారణము అవ్యభిచరిత భక్తియోగము కారణమన్నచో గుణాతీతుడైనకదా అత్యంతభక్తి యోగము సిద్ధించునది. అన్యోన్యాశ్రయము రాదా? అన్నచో చెప్ప బడుచున్నది—'ఇందభిప్రాయమేమనగా—ఇత్యాది.

వెనుక చెప్పబడిన సకలపురుషార్థములున్ను తన యధీనమని భగవంతు డిచ్చట చెప్పుటచేగుణాతీతుడై బ్రహ్మభావమునకు యోగ్యు డగుటయున్ను తనయధీనమేయని నిరూఢముగా నిరూపించుటకు ముఖ్య ప్రయోజనము.

ఇచ్చట చెప్పబడిన అవ్యభిచరిత భక్తియోగశబ్దము భక్తికి అంగమైన ప్రపత్తినికూడ క్రోడీకరించుటచే పూర్వోత్తర గ్రంథముల కేకార్థపరత్వము సిద్ధించినది.

## గీతార్థసంగ్రహము

### 18 శ్లోకము

గుణబన్ధవిధా, తేషాం,
కర్తృత్వం తన్నివర్తనమ్.
గతిత్రయ స్వమూలత్వం
చతుర్దశ ఉదీర్యతే.

### తాత్పర్యము

పరిశుద్ధమైన ఆత్మను గుణములెట్లు బంధించుచున్నవో, అవి జీవునకు సాంసారిక కర్మలయందు కర్తృత్వము నెట్లు కలుగచేయుచున్నవో, ఆగుణములను తొలగించుకొను విధానమేదియో అక్షరము (కైవల్యము) ఐశ్వర్యము భగవత్ప్రాప్తి యనెడి మూడు పురుషార్థములకును భగవంతుడెట్లు మూలమగుచున్నాడో యీ పదునాల్గవ యధ్యాయమున చెప్పబడినది.



# శ్రీ భగవద్గీతా - పఞ్చదశోఽధ్యాయః

## పురుషోత్తమ ప్రాప్తియోగః

---

### అ వ తా రి క.

* క్షేత్రాధ్యాయ మైనత్రయోదశాధ్యాయమునందు క్షేత్ర క్షేత్రజ్ఞ భావములను బొందిన ప్రకృతిపురుషులస్వరూపమును విశోధించి, పరిశుద్ధుఁడును అపరిచ్ఛిన్నజ్ఞానైకాకారుఁడు నగు పురుషునికే దేవాద్యాకారములుగా పరిణమించి కలుగునట్టి ప్రకృతితోడిసంబంధము ప్రాకృతగుణసంగప్రవాహమువలనఁ గలిగినదై యనాదిగా నుండునని చెప్పబడినది. తరువాతియధ్యాయమునందు పురుషునికి కార్యకారణోభయావస్థలందును గుణసంగమువలనఁ గలుగునట్టి ప్రకృతిసంబంధమును భగవంతుఁడే చేయుచున్నాఁ డని చెప్పి, గుణములతోడి సంగము గలుగు ప్రకారమును సవిస్తరముగా ప్రతిపాదించి, గుణసంగ నివృత్తిపూర్వకమైన ఆత్మయాథాత్మ్యప్రాప్తియును భగవద్భక్తివలననే కలుగునని చెప్పబడినది. ఇప్పుడు పూర్వాధ్యాయముకడపట 'మాంచ' అని భజింపవలసినట్లుగా చెప్పఁబడిన యాభగవంతునికి, క్షరుడైనబద్ధుఁడును అక్షరుడైనముక్తుఁడును (అనఁగా బద్ధసమూహమును ముక్తసమూహమును రెండును) విభూతి యగు ననియు, భగవంతుఁడు నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణగుణైకతానుఁ డగుటచే 'విభూతిభూతులైన బద్ధముక్తపురుషు లిరువురికంటెను మిక్కిలి యుత్కృష్టుఁడై విసజాతీయుఁ

---

* ప్రథమషట్కమందుఁ జెప్పఁబడిన ప్రకృతిపురుషులును వారి ప్రకారవిశేషములును గడచినరెండధ్యాయములందును విశోధింపఁబడినవి.' అనఁగా ప్రకృతియు దాని గుణములును ఎవని కఠినమైనశక్తి గలవియో, పురుషుఁడేయపరాధముచే బద్ధుఁ డయ్యెనో ఎవనిప్రసాదమువలన మోక్షముఁ జెందునో యవి చెప్పఁబడినవి. మధ్యమషట్కమందు జెప్పబడిన పరమాత్మ ఇప్పుడు ఈయధ్యాయమున విశోధింపఁబడుచున్నాఁడని భావము.

డగునుగాన * పురుషోత్తముఁ డగు నని యుఁ జెప్పుట కారంభించుచు న్నారు. అందు మొదట అసంగమనెడి యాయుధముచే సంసారబంధ మును ఛేదించుకొన్న యక్షరమను విభూతిని జెప్పుటకై, ఛేదింపఁదగిన దై బంధరూపముగా విస్తరించియుండు అచిత్పరిణామవిశేషమైన సంసారమును అశ్వత్థవృక్షరూపముగాఁ గల్పించుకొని చెప్పుచున్నారు. 1

శ్రీభగవానువాచ

శ్లో॥ ఊర్ధ్వమూల[2] మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్।
ఛన్దాంసి[3] యస్య పర్ణాని య[4] స్తం వేద స వేదవిత్॥ 1

టీ. (యం) అశ్వత్థం — ఏసంసారమనెడి అశ్వత్థమును, ఊర్ధ్వమూలం = మీఁదవేళ్లు కలదనియును, అధశ్శాఖం = క్రిందికి కొమ్మలు గలదనియును, అవ్యయం = ప్రవాహరూపముగా నిత్యమనియును, ప్రాహుః = (శ్రుతులు) చెప్పుచున్నవో, యస్య = ఏ సంసారవృక్షమునకు, ఛన్దాంసి = కామ్యకర్మప్రతిపాదకములగు శ్రుతులు, పర్ణాని = ఆకుల వలె వృద్ధిచేయునవియో, తం = సంసారరూపమైన అట్టి అశ్వత్థమును, యః = ఎవఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, వేదవిత్ = వేదము నెఱిఁగినవాఁడు.

తా. * సంసార మనెడి యేయశ్వత్థవృక్షమును 'ఊర్ధ్వమూలోఽ

---

* పురుషులకంటె నుత్తముఁ డగుటచే పురుషోత్తముఁ డని భావము. అసంగమును ఆయుధముగా రూపించుటకు సరిగా దానిచే ఛేదింపఁదగిన సంసారమును అశ్వత్థవృక్షముగా రూపించినా రని తెలియునది. ఇచ్చట అశ్వత్థ మనఁగా మూలప్రకృతి యని భావింపరాదు. ఏలన, దానిపరిణామమైన దేహాదులే సాక్షాత్సంగమునకు విషయమగును గాని అది కానేరదు మఱియు నది నాశరహిత మైనదిగాన అసంగశస్త్రిముచే ఛేద్య మగు నని చెప్పరాదు దాని పరిణామములే ఛేద్యము లనఁదగును. కనుక నిచట అచిత్పరిణామవిశేష మైనసంసారము గ్రహింపఁబడినది.

* బ్రహ్మాదిస్తంబపర్యంత మైన చరాచరాత్మకప్రపంచమే సంసారమండలము. ఈ సంసారమే యిచట అశ్వత్థవృక్షముగా రూపింపబడినది. ఇది మొదట బ్రహ్మవలన

వాక్శాఖ ఏషోఽశ్వత్థ స్సనాతనః' (కఠ. ౬-౧) 'ఊర్ధ్వమూలమవాక్శా
ఖం వృక్షంయో వేదసంప్రతి' ఇత్యాదులగు శ్రుతులు ఊర్ధ్వమూలముగను
అధశ్శాఖముగను అవ్యయముగను జెప్పుచున్నవో- సప్తలోకములకు
మీఁద నున్న చతుర్ముఖుఁడు మొదలగుటచే అది ఊర్ధ్వమూలమగును.
భూమియందున్న సకలము లగు నరపశుమృగక్రిమికీటపతంగ స్థావర
ములు కొనలుగాఁ గలదగుటచే క్రిందుగా శాఖలుగలది యగును; అసం
గమునకు హేతుభూతమగు మంచిజ్ఞాన ముదయించువఱకును ప్రవాహ
రూపమున అనువర్తించుచు అచ్ఛేద్యమగుటచే అది అవ్యయ మగును.
ఆయశ్వత్థమునకు ఛందస్సులు ఆకు లని చెప్పుదురు. ఛందస్సు లనఁగా
శ్రుతులు. "వాయవ్యం శ్వేత మాలభేత భూతికామః" (యజు. కా.
౨-౧-౧.) (ఐన్ద్రాగ్న మేకాదశకపాలం నిర్వపేత్ప్రజాకామః" (యజు.

---

నుండియే యుత్పన్నమగుచున్నదిగాన బ్రహ్మయే దీనికి వేరు. అతఁడు సప్తలోకము
లకు మీఁదుగా నుండుటచే దీనివేరు పైనుండు నని చెప్పఁబడినది. భూమియందు
వసించునట్టి నరపశుమృగ క్రిమికీటపతంగాత్మకము లగు జంగమములును స్థావరములు
నైనవస్తువులెల్ల దీనికి కొమ్మలవంటివి. ఇవి భూమియం దుండుటచే క్రింద కొమ్మలు
గలిగినదని చెప్పఁబడెను. మఱియు వేదములు త్రివర్గపరము లని అపవర్గపరములని
రెండువిధములు. అందు త్రివర్గపరములైనవి 'వాయవ్యం శ్వేతమాలభేత భూతికామః
ఐంద్రాగ్న మేకాదశకపాలం నిర్వపేత్ప్రజాకామః, అని కామ్యకర్మములను ప్రతిపా
దించి సంసారమును వృద్ధిచేయుచున్నవి. వృక్షమాకులచేఁ బెరుగునట్లు సంసారవృక్ష
మిట్టివేదములచేఁ బెరుఁగుటచే వీనిని దానికి ఆకులుగ రూపించినవారైరి. అపవర్గపర
ములైన వేదములు సంసారచ్ఛేదమును జెప్పును. ఛేదింపవలసినవృక్షముయొక్క
స్వరూపము నెఱుఁగుట దానిని ఛేదించునుపాయము నెఱుఁగుట కుపయోగించును.
కనుక సంసారవృక్షస్వరూపము నెఱిఁగినవాఁడు తచ్ఛేదనోపాయమునుగూడ, అనఁగా
ఆయుపాయమును జెప్పువేదములనుగూడ, నెఱింగినవాఁ డగును. కనుక 'వేదవిత్'
అగును. మంచిజ్ఞాన ముదయించువఱకు ఈసంసారము ప్రవాహమువలె నెడతెగక
యనువర్తించుచుండును గాన దీనిని ఛేదించుటకు శక్యముగాదు కనుకనే యిది
అవ్యయ మనఁబడినది. వేదములు కూడ 'ఊర్ధ్వమూలో...ఊర్ధ్వమూల...సంప్రతి' అని
యీవృక్షమును జెప్పుచున్నవి. దీని ననుసరించియే యిచటను జెప్పఁబడినదని తెలి
యునది.

కా. ౨-౧) ఇత్యాదిశ్రుతులచే ప్రతిపాదితము లయినకామ్యకర్మముల చేత ఈసంసారవృక్షము పెరుఁగుచున్నది. కావున ఛందస్సులే దాని యాకులుగా చెప్పఁబడెను- ఆకులచేతనేకదా వృక్షము పెరుగుచున్నది. ఎవఁడు ఇట్టిదయిన యాయశ్వత్థమును దెలియునో వాఁడు వేదవిదుఁడు,

4

వేదము సంసారవృక్షమును ఛేదించుట కుపాయమును జెప్పెడినిగదా; ఛేదింపఁదగినదైన వృక్షముయొక్క స్వరూపము నెఱుఁగుట ఛేదించు నుపాయము నెఱుఁగుటకు ఉపయోగించునుగాన (అట్టియుపాయమును జెప్పువేదమును సైతము తెలియవలసినవాఁ డగుటచే) వేదవిదుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. అధ శ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాలాః।
అధశ్చమూలా న్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే॥ 2

టీ. తస్య = ఆ సంసారవృక్షముయొక్క, (అపరాః) శాఖాః = (వేఱుకొన్ని) కొమ్మలు, అధశ్చ = భూలోకమునందు మనుష్యపశ్వాది రూపముగాను, * ఊర్ధ్వంచ = మీఁదుగా గంధర్వయక్ష దేవాది

* 'అధశ్శాఖమ్' అని కొమ్మలు క్రిందుగా ప్రసరించుటను వెనుక జెప్పి యిప్పుడు 'ఊర్ధ్వమ్ ప్రసృతాః' అనుట విరుద్ధము కాదా యనినచో బ్రహ్మనుండి క్రిందికి ప్రసరించిన మనుష్యాదిశాఖలే మరల ఊర్ధ్వముగా ప్రసరింపలేదు గాని వానినుండి వేఱు కొన్ని శాఖలు అట్లు ప్రసరించినవిగా తెలియుచున్నది. కనుకనే 'వేఱు కొన్ని' అని కూర్పఁబడినది. కర్మలోకమునుండి గంధర్వాదిరూపముగా మీఁదఁ బ్రసరించుటచే 'ఊర్ధ్వమ్' అనఁబడినది గాని బ్రహ్మలోకమునుండి ప్రసరించుటచేఁగాదు. కనుక విరోధము లేదు. ఈ కర్మలోకమునందుఁ జేయు పుణ్యకర్మములవలన గంధర్వయక్షాదులుగాను పాప కర్మములవలన మనుష్యపశ్వాదులుగాను బుట్టుచున్నారని భావము. కనుకనే 'ఆయా కర్మములచేనైన' అని కూర్పఁబడినది. సత్త్వాదిగుణప్రవాహమే ఉత్తరోత్తరజన్మహేతువుగాఁ జెప్పఁబడుటవలన అవియె జలమువలె ఈశాఖలను వృద్ధి పొందించుచున్నవి.

రూపముగాను, ప్రసృతాః=ప్రసరించినవి. గుణప్రవృద్ధాః= సత్త్వాదిగుణ
ములచే మిక్కిలి పెరిఁగినట్టివి. విషయప్రవాలాః=శబ్దాదివిషయములే
చిగుళ్లుగాఁగలవి. అధశ్చ = క్రిందను— మనుష్యలోకమునందు ననుట,
కర్మానుబన్ధీని=ఎడతెగక కూడ వచ్చుచున్నట్టి కర్మము లనెడి, మూ
లాని=వేళ్లు, అనుసన్తతాని=విస్తరించియున్నవి.

తా. ఈసంసారవృక్షమునకు మనుష్యాదిరూపములైన శాఖలు
చెప్పఁబడెనుగదా. మరల ఆశాఖలనుండి ఆయాకర్మములద్వారా ఉప
శాఖలు మనుష్యపశ్వాదిరూపమున క్రిందుగను, గంధర్వ యక్ష దేవాది
రూపమున మీఁదుగను వ్యాపించియున్నవి. అవి సత్త్వాదిగుణములచే
మిక్కిలి పెరిఁగినవి. శబ్దాదివిషయములు వానిచిగుళ్లు. (మీఁద వేరుం
డుటఁబట్టి క్రింద కొమ్మలు ప్రసరించినఁ బ్రసరించునుగాక; మరల నా
కొమ్మలే క్రిందికిని మీఁదికిని బ్రసరించుటెట్లు? అనఁగాఁ జెప్పుచున్నారు.

ఈసంసారవృక్షమునకు బ్రహ్మలోకము మూలము. మనుష్యలోకము
మొన గదా. [6] ఆ మనుష్యలోకము నందును, ఎడతెగక కూడవచ్చునట్టి
*కర్మము లనెడిమూలములు విస్తరించి యున్నవి. [7] మనుష్యత్వావస్థ
యందుఁ జేయఁబడిన కర్మములచేతఁగదా క్రిందుగా మనుష్యపశ్వాదు
లును, మీఁదుగా దేవాదులును అగుచున్నారు.

[8] శ్లో॥ న రూప మస్యేహ తథోపలభ్యతే।
నాన్తో న చాది [9] ర్న చ సమ్ప్రతిష్ఠా॥ 2½

టీ. అస్య=ఈసంసారవృక్షముయొక్క, రూపమ్ = స్వరూపము,

---

కనుక 'గుణప్రవృద్ధాః' అనఁబడినది. శాఖలయందు చిగుళ్లెట్లు భోగ్యములో అట్లే దేవాది
రూపములైన శాఖలయందు శబ్దాది విషయములు భోగ్యములుగాన చిగుళ్లుగా రూపింపఁ
బడినవని తెలియునది.

* కర్మములను మూలములు (వేళ్లు) అనుట యెట్లు? అన్నచో, కర్మమువలన
మనుష్యపశ్వాదిజన్మములును దేవాదిజన్మములును గలుగును. మనుష్యపశ్వాదులను దేవా
దులను శాఖలుగా రూపించుటచే వాని కుత్పత్తి హేతువులైనకర్మములు మూలములుగా
రూపింపబడినవి. ఉత్కృష్టులైన దేవాదులు మీఁదుగాఁ బ్రసరించినశాఖలుగాను నీచు

తథా=ముందు నిర్దేశింపఁబడినట్లు, ఇహ=ఇందు-ఇందలి సంసారులచే,న ఉపలభ్యతే=తెలియబడకున్నది. అన్తః = దీనినాశము, (తథా = అసంగ ముచేఁ గలుగునదిగా), న ఉపలభ్యతే=తెలియబడకున్నది. ఆదిశ్చ=ఆది యును-దీనికి గుణసంగమే మొద లనియు, న (ఉపలభ్యతే) = తెలియఁ బడకున్నది. సమ్ప్రతిష్ఠాచ = దీనికి దేహమందాత్మాభిమానరూప మైన అజ్ఞానమే స్థితికారణ మనియు, న=తెలియఁబడకున్నది.

తా. *ఈవృక్షము చతుర్ముఖబ్రహ్మ ఆదిగాఁ గలది యగుటచే ఊర్ధ్వమూలమైనది; బ్రహ్మయొక్క సంతానపరంపరనుబట్టి మనుష్యా దులు దీనికి అగ్రముగా నుండుటచే అధశ్శాఖమైనది; మనుష్యత్వ మందుఁ జేయఁబడు కర్మము లనెడిమూలముచే మరల క్రిందుగను మీఁదు గను దానికొమ్మలు శాఖోపశాఖలుగా ప్రసరించుచున్నవియని దీనిరూపము నిర్దేశింపఁబడినది. అయినను సంసారులు ఇది యిట్టిరూపము గలది యని యెఱుఁగరు కాని 'నేను మనుష్యుఁడను దేవదత్తునికొడుకను యజ్ఞ దత్తుని తండ్రిని అందులకు అనురూపమైన భార్యాదిపరిగ్రహము గల

---

లైన మనుష్యాదులు క్రిందుగాఁ బ్రసరించినశాఖలుగాను జెప్పఁబడినవి. కర్మములు స్వర్గాదిలోకములందు సైతము, ఆత్మను ఎప్పుడును అనుబంధించియుండుటచే ఆలోకము లందును మూలములగును గాని మనుష్యలోకమునందే మూలము లగుననుట యెట్లు? అన్నచో ఇచట మనుష్యత్వదశయందుఁ జేయఁబడు కర్మములను జెప్పుటచే మనుష్య లోకమునందు మూలములుగాఁ జెప్పఁబడె నని తెలియునది.

* ఈసంసారవృక్షమునకు బ్రహ్మ మూలము, మనుష్యాదులు శాఖలు, విష యాదులు చిగుళ్లు, అని మూఢులైన సంసారులు తెలియరుగాని, తండ్రి మూలము, కొడుకులు శాఖలు, దారాదులు చిగుళ్లుగాఁ దెలియుచున్నారు. దీని నిత్యప్రళయమే నాశముగా నెఱుఁగుదురు గాని గుణమయభోగములందలి అసంగమును నాశముగా నెఱుఁగరు. గర్భాదులు దీని కాదిగా నెఱుఁగుదురు గాని గుణసంగ మాది యని యెఱుఁగరని భావము.

వాఁడను' అని యింతమాత్రమే యెఱుఁగుదురు. అట్లే యీవృక్షమునకు నాశమును గుణమయములైన భోగములందలి యసంగము (అనఁగా వైరాగ్యము) చేతఁ గలుగుననియు తెలియరు; అట్లే దీనికి గుణఫల సంగమే ఉత్పత్తియనియు తెలియరు; ఆత్మకానిదానిని ఆత్మగాఁ దలఁచుటయనెడి యజ్ఞానమే దీనికి ఉనికిపట్టనియు (స్థితికారణము) నెఱుఁగరు.

శ్లో॥ అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా।
తతఃపదం త త్పరిమార్గితవ్యం
12
యస్మిన్ గతా న నివర్తన్తి భూయః॥ 3

టీ. సువిరూఢమూలం = చక్కఁగా అనేకవిధముల మొలచిన వేళ్లుగల, ఏనం = ఈ పూర్వోక్తప్రకారమైన, అశ్వత్థం = అశ్వత్థవృక్షమును, దృఢేన = (*జ్ఞానమూలమగుటచే) బలీయమైన, అసంగశస్త్రేణ = భోగముల యందాసక్తి లేకుండుట యనెడి ఆయుధముచేత, ఛిత్త్వా = ఛేదించి, తతః = విషయములందలి వైరాగ్యమువలన, యస్మిన్ = ఏస్థానమునందు, గతాః = ప్రవేశించినవారు-ఏపరిశుద్ధాత్మస్వరూపమును బొందినవారు, భూయః = మగుడ, ననివర్తన్తి = మఱలిరారో, తత్ పదం = అట్టిప్రాప్య స్వరూపమును, పరిమార్గితవ్యం = వెదకఁదగినది.

13 14

తా. ఉక్తప్రకారమై చక్కఁగాను నానావిధములుగాను మొలచినవేళ్లు గలదైయుండు అశ్వత్థమును, సమ్యగ్జ్ఞానమువలనఁగలిగిన

---

*ఆధివ్యాధిక్లేశాదులచేఁగూడ భోగములందు అసంగము ఒకానొకప్పుడు కలుగుట కలదు. అట్టియసంగము దృఢమైనదిగాదు. మంచిజ్ఞానముచే కలుగునదే దృఢమైనదని భావము. విషయత్యాగదశయందే కాక ఆత్మాన్వేషణదశయందును అసంగము ఆవశ్యకము, కనుకనే 'తతః' అనుటకు 'విషయములందలి అసంగమువలన' నని యర్థము చెప్పఁబడినది.

15
దగుటచే దృఢమైన (గుణమయములగు భోగములందు) అసంగము అనఁ బడు ఆయుధముచేత ఛేదించి, యా విషయసంగ రాహిత్యమునుబట్టి యెందుఁ బోయినవారు మరలఁ దిరిగిరారో యట్టి (పునరావృత్తిరహితమైన) పదమును (అనఁగా శుద్ధాత్మస్వరూపప్రాప్తిని) వెదకవలయును.

అవ. గుణమయభోగములందలిసంగమును దానిచేఁ గలుగు విపరీతజ్ఞానమును అనాదికాలమునుండి ప్రవర్తించుచుండుటచే, నవి యెట్లు నివర్తించు ననఁగాఁ జెప్పుచున్నారు.

16
శ్లో॥ త మేవ చాద్యం పురుషం ప్రపద్యే
17
ద్యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥ 4

టీ. తమ్ = ఆ-పూర్వము 'మయాధ్యక్షేణ' ఇత్యాదులందు చెప్పఁబడిన యనుట, ఆద్యం=సమస్తమునకు ఆదిభూతుఁడైన, పురుషమేవచ=పురుషునే,శరణంప్రపద్యేత్ =శరణము నొందవలయును, యతః =ఎవనివలననుండి--సర్వమునకు సృష్టికర్తయైన యెవ్వనినుండి యనుట, పురాణీ=పురాతనమైన, ప్రవృత్తిః=(గుణమయభోగములందలి సంగము యొక్క) ప్రవృత్తి, ప్రసృతా=ప్రసరించినదో-'తమేవ పురుషం ప్రపద్యేత్' అని యన్వయము.

తా. 'మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్' (గీ. ౯-౧౦) 'అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే' (గీ. ౧౦-౮) 'మత్తః పరతరం నాన్య త్కిఞ్చి దస్తి ధనఞ్జయ' (గీ. ౭-౭) ఇత్యాదులందు పూర్వము సమస్తమునకు ఆదిభూతుఁడుగాఁ జెప్పబడిన పురుషునే, అజ్ఞానాదులు నివర్తించుకొఱకు శరణు నొందవలయును. అట్టివానిని శరణుఁజొచ్చిననే యజ్ఞానాదులు నివర్తించును. ఏలన, వాఁడు సమస్తమును సృజించునట్టివాఁ డగుటవలన పురాతనమైన యీ గుణ

మయభోగసంగప్రవృత్తియు వానినుండియే కలిగినది. *(కనుక వాఁడే దీనిని నివర్తింపఁజేయ శక్తుఁడనుట.) దీనిని నేను 'దైవీహ్యేషాగుణ మయీ మమ మాయా దురత్యయా। మామేవయే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే' అని ముందే చెప్పియున్నానుగదా. 'ప్రపద్యే యతః' అనియుఁ బాఠముగలదు. ప్రపద్య ఇయతః అని పదచ్ఛేదము. తమేవ చాద్యం పురుషం ప్రపద్య=ఆయాద్యుఁడైన పురుషునే శరణుఁజొచ్చి, ఇయతః=ఇంతకు-ఈయజ్ఞాననివృత్తి మొదలైనవాని కన్నిటికిని, ప్రవృత్తిః = (సాధనమైన) ప్రవృత్తి, పురాణీ = పురాతనమైనదై–పురాతనులైన ముముక్షువులయొక్క ప్రవృత్తియై, ప్రసృతా=ప్రసరించినది–వ్యాపించిన దనుట–అనఁగా పురాతనులైన ముముక్షువులు నన్నే శరణుఁజొచ్చి బంధనిర్ముక్తులు (అనఁగా అజ్ఞాననివృత్త్యాదుల నొందినవారు) ఐరని భావము. ('ప్రసృతా పురాణీ' అనుట శిష్టాచారప్రదర్శన మని తెలియునది).

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞైః
18
గచ్ఛ న్త్యమూఢాః పద మవ్యయం తత్॥ 5

*ఎవఁడు తనయాజ్ఞ నుల్లంఘించుటచే బంధము కలిగించునో వానినే ప్రసన్నునిఁగాఁ జేసికొన్నయెడల వాఁ డాబంధమును విడిచిపుచ్చును. కనుక ఈభోగసంగరూపమైనబంధమును గలిగించినభగవంతునే శరణుఁజొచ్చినయెడల వాఁడు దీనిని విడిచిపుచ్చు నని భావము. 'దైవీహ్యేషాగుణమయీ మమ మాయా దురత్యయా। మామేవయే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే' అని మాయ వానిచేఁ గలిగినది గాన వాని నాశ్రయించినవారే దాని నతిక్రమింతు రనియుఁ బూర్వమే చెప్పఁబడియుండుట నిచట గ్రాహ్యము.

టీ. *నిర్మానమోహాః=(దేహమే ఆత్మయనెడి) అభిమానరూపమగుమోహము లేనివారును, జితసఙ్గదోషాః=జయింపఁబడిన ఆసక్తియనెడిదోషము గలవారును, అధ్యాత్మనిత్యాః=ఆత్మజ్ఞాననిరతులును, వినివృత్తకామాః=ఆత్మేతరవస్తువులయందు విశేషముగా నివర్తించిన కోరిక గలవారును, సుఖదుఃఖసంజ్ఞైః=సుఖదుఃఖము లనెడిపేరుగల, ద్వన్ద్వైః=ద్వంద్వములచేత, విముక్తాః=విడువబడినవారును, అమూఢాః=ఆత్మానాత్మల తత్త్వజ్ఞానముచేత భ్రమరహితు లగుజ్ఞానులు, తత్ అవ్యయం పదం=ఆశాశ్వతమైనపదవిని-అనఁగా నిర్వికారమైన జ్ఞానమే ఆకారముగాఁ గలశుద్ధాత్మస్వరూపమును, గచ్ఛన్తి=పొందుచున్నారు.

తా ఇట్లు నన్ను శరణుఁజొచ్చుటచే దేహమే ఆత్మయనెడి అభిమానరూపమయిన మోహమును వదలినవారును, సత్త్వరజస్తమోగుణమయము లగు భోగములయందలి సంగమును జయించినవారును,

---

* నిర్మానమోహత్వమువలన సంగదోషజయము కలుగును. దానివలన అధ్యాత్మనిరతత్వము ఫలించును. ఆత్మజ్ఞాననిరతిచే తదితరవస్తువులందు విశేషించి కామము నివర్తించును. విశేషించి నివర్తించుట యనఁగా విషయములు ఎదుటనుండినను దానియందుపేక్షయె కలుగుననుట. సంగము హేతువు, కామము ఫలము: కావున రెంటికిఁ బునరుక్తిలేదు. నిర్మానమోహ శబ్దముచే ఆత్మానాత్మభ్రమనివృత్తి కలుగుననియు, అమూఢాః అనుటచే ఆత్మానాత్మస్వభావజ్ఞానము గలుగుననియు, రెంటికి భేదము గ్రహించునది. 'ద్వంద్వైర్విముక్తాః' అనుటకు ఉపాయదశయందు సుఖదుఃఖములు అనువర్తించుచుండఁగా వానియందు తితిక్ష (అనఁగా ఓర్పు) కలిగియుండుటయు, ఫలదశయందు ఆరెంటిలో దుఃఖముమాత్రము అనువర్తింపక అత్యంతముగా నివర్తించుటయు గ్రాహ్యములు. పదశబ్దమునకు పరమాత్మయని యర్థముకాదు. దీనినే యనంతరశ్లోకమున 'మమధామ' అని భగవంతుఁడు తనధామముగాఁ జెప్పుకొనుటచే తానే యదికానేరఁడు. కనుక పద మనఁగా పరిశుద్ధాత్మస్వరూపమని యర్థము. పదధామశబ్దములు దివ్యస్థానవిషయములనియు గ్రహింపరాదు. అట్లయిన 'పరిమార్గితవ్యమ్' అనుట పొసఁగదు. ఏలన, దివ్యస్థానము ఫలరూపముగా నున్నదని తెలియఁదగినదిమాత్రమే యగునుగాని ఆత్మవలె సమాధిపర్యంతము వెదకఁదగినది కానేరదు- 'మమధామ' అను దానినే 'మమైవాంశః' అనుటచేతను పరశబ్దము శుద్ధాత్మపర మగునుగాని దివ్యస్థానపరము గాదని తెలియునది.

ఆత్మజ్ఞాననిరతులును[19], ఆత్మేతరవస్తువులయందు కోరికలు విడిచినవారును సుఖదుఃఖము[20] లనఁబడు ద్వంద్వములనుండి విడివడ్డవారును, ఆత్మానాత్మలస్వభావము నెఱిఁగినవారును అగుజ్ఞానవిష్ఠులు[21] అనవచ్ఛిన్నజ్ఞానైకాకారమును యథావస్థితమును అగు ఆత్మస్వరూపమును బొందుచున్నారు. నన్ను శరణుఁజొచ్చినవారలకు ఈ ప్రవృత్తులన్నియు నా యనుగ్రహమువలననె సిద్ధిపర్యంతము సులభసాధ్యములై యుండు నని యర్థము.

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥ 6

టీ. తత్=ఆయాత్మజ్యోతిని, సూర్యః=సూర్యుఁడు, నభాసయతే=ప్రకాశింపఁజేయఁడు, శశాఙ్కః=చంద్రుఁడు, న (భాసయతే)= ప్రకాశింపఁజేయఁడు, పావకః=అగ్నియు, న(భాసయతే)=ప్రకాశింపఁజేయఁడు, యత్=ఏ ఆత్మస్వరూపమును, గత్వా=పొంది, న నివర్తన్తే=మఱలరో, తత్=అట్టి, పరమం=సర్వోత్కృష్టమైన, ధామ=జ్యోతి, మమ=నాసంబంధమైనదగుటచే నాయంశము.

తా. * జ్ఞానస్వరూపమైన[22] ఆ యాత్మజ్యోతిని సూర్యుఁడును చంద్రుఁడును అగ్నియు తమకాంతిచేత ప్రకాశింపఁజేయఁజాలరు. జ్ఞానమే

---

*బాహ్యములైన సూర్యాదిజ్యోతిస్సులు విషయేంద్రియముల సంబంధమునకు విరోధియైన చీఁకటిని నిరసించుటమాత్రమే చేయునుగాని విషయములను ప్రకాశింపఁజేయవు. అట్లు ప్రకాశింపఁజేయునది ఆత్మయొక్క ధర్మభూతజ్ఞానమే. అట్టిజ్ఞానము గల యాత్మయే సర్వమును ప్రకాశింపఁజేయునది. అది ప్రకాశకములైన ఆదిత్యాదులకుఁ గూడ ప్రకాశకమైనదగుటచే 'పరమ్' సర్వోత్కృష్టమైన జ్యోతిస్సుగాఁ జెప్పబడినది- ఆదిత్యాదులును జ్ఞానజ్యోతిస్సునకుఁ బ్రకాశకములు గావు. జ్ఞానమే యన్నిటికిని ప్రకాశక మని తెలియునది.

కదా సమస్తమును ప్రకాశింపఁజేయునది. బాహ్యములయిన(సూర్యాది) జ్యోతులు విషయేంద్రియముల సంబంధమునకు విరోధియైన చీఁకటిని[23] నిరసించుటమూలమున ఉపకారకములై యున్నవి. ఆత్మను బ్రకాశింపఁ[24] జేయునది యోగమె, ఆ యోగమునకు విరోధియో అనాదికర్మము. ఆ[25] కర్మమును నివర్తింపఁజేయునది భగవత్ప్రవృత్తిమూలమగు అసంగము[26] మొదలయినవని చెప్పఁబడెను. దేనినిబొంది మరల నివర్తింపరో(అనఁగా మరల ప్రకృతిసంబంధము గలుగదో) ఆ పరమంబగుజ్యోతి (అనఁగా[27] అట్టి సర్వోత్కృష్టమయి తేజోరూపమైన ఆత్మస్వరూపము) నాది.[28] అనఁగా నావిభూతియైనది–నాయంశమని యర్థము.[29] ఆదిత్యాదులను గూడఁ బ్రకాశింపఁజేయున దగుటచే అది పరమమైనది. ఆదిత్యాదులగు జ్యోతులు జ్ఞానజ్యోతికి ప్రకాశకము కాదుగదా. జ్ఞానమే సర్వమును ప్రకాశింపఁజేయునది.

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః।
మనష్షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥ 7

టీ. సనాతనః = అనాదియగు ఈయాత్మ, మమ =నాయొక్క, అంశఏవసన్=అంశమె అగుచు– (చిదచిద్విశిష్టుఁడగు నాయందు ఏకదేశమైన చిదంశమె యగుచు) జీవభూతః=బద్ధజీవుఁడై, జీవలోకే=సంసారమునందు, ప్రకృతిస్థాని = మనుష్యాదిశరీరములయం దుండునవియు, మనష్షష్ఠాని=మనస్సు ఆఱవదిగాఁ గలవియునగు, ఇన్ద్రియాణి = ఇంద్రియములను, కర్షతి=(ఇటు అటు) లాగుచుండును.

తా అనాదియగు నీయాత్మ నాయంశమె యగును. (అట్లైన ఆత్మలన్నియు నిత్యసూరులవలె పరిశుద్ధాకారముతోఁ గూడియుండ
30
రాదా యన్నచో) ఆ యాత్మలలో నొకఁడు కర్మరూపమైన యవిద్య చేత నావరింపఁబడి, *జీవభూతుఁడై జీవలోకమునందు వర్తించుచున్న దేవమనుష్యాది ప్రకృతిపరిణామవిశేషము లగుశరీరములయం దుండెడి మనస్సు మొదలయిన యింద్రియము లాఱింటిని లాగుచుండును. అనఁగా శరీరేంద్రియముల కధిష్ఠాతయై కర్మానుగుణముగా శరీరేంద్రియములను తనభోగార్థము ప్రేరేపించుచుండును. మఱియొకఁడు ముందు చెప్పఁబడినమార్గమున వర్తించి యీ యవిద్యనుండి విడివడినవాఁడై తన స్వరూపముతో నుండును.

జీవుఁ డయినవాఁడో తన జ్ఞానైశ్వర్యములు మిక్కిలి సంకుచితములు కాఁగా, కర్మలబ్ధములును ప్రకృతిపరిణామ విశేషరూపములు నగు శరీరములం దున్న మనస్సు మొదలయిన యింద్రియము లాఱింటికి నియామకుఁడై వానిని కర్మానుగుణముగా ఇటు నటు లాగుచుండును.

శ్లో॥ శరీరం య దవాప్నోతి య చ్చా ప్యుత్క్రామ తీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయు ర్గన్ధానివాశయాత్॥ 8

టీ. ఆశయాత్ = పరిమళమునకు ఆశ్రయములగు పుష్పాదుల నుండి, గంధాన్=ఆ పుష్పాదుల సూక్ష్మావయవములతోఁగూడ నందలి వాసనలను, వాయురివ=వాయువు స్వీకరించికొనిపోవునట్లు, యత్ శరీరం =దేహాంతరమును, అవాప్నోతి=పొందుచున్నాఁడో, యత్–యస్మాత్ =ఏశరీరమునుండి, ఉత్క్రామతి=బయలువెడలుచున్నాఁడో, ఈశ్వరః =ఆ శరీరమునందలి యింద్రియములకు నియంత యగుజీవుఁడు, ఏతాని=

* ఇట్లు ఆత్మలన్నియు నాయంశములే యైనను వానిలోఁ గొన్ని అవిద్యావేష్టితములై బద్ధముక్తావస్థలను జెందునని భావము.

ఈ యింద్రియములను, గృహీత్వా=(సూక్ష్మ భూతములతోఁడ) స్వీక రించి, సంయాతి=పోవుచున్నాఁడు.

తా॥ వాయువు పుష్పమాలికాచందనకస్తూరికాదులనుండి వాని వాని సూక్ష్మావయవములతోఁ గూడ నందలివాసనలను గొని మఱొక చోటికిఁబోవునట్లు, ఇంద్రియముల కీశ్వరుఁడైన యీయాత్మ యేదేహ మును బొందుచున్నాఁడో యేదేహమునుండి వెడలుచున్నాఁడో అచట నుండి ఆ యింద్రియములను భూత సూక్ష్మములతోఁగూడ గ్రహించు కొని పోవుచున్నాఁడు.

అవ. ఆ యింద్రియము లెవ్వి యనఁగాఁ జెప్పుచున్నారు.

శ్లో॥ శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణ మేవచ।
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే॥ 9

టీ. అయం = ఈ జీవుఁడు, శ్రోత్రం = శ్రోత్రేంద్రియమును, చక్షుః=నేత్రమును, స్పర్శనంచ=త్వగింద్రియమును, రసనంచ=జిహ్వేం ద్రియమును, ఘ్రాణంచైవ=ఘ్రాణేంద్రియమును, మనశ్చ = మనస్సును, అధిష్ఠాయ=తమతమ విషయవ్యాపారములకు అనుగుణముగా చేసికొని, విషయాన్=శబ్దాదివిషయములను, ఉపసేవతే=అనుభవించుచున్నాఁడు.

తా. ఈ జీవుఁడు, శ్రోత్రచక్షుస్స్పర్శ జిహ్వాఘ్రాణేంద్రియము లను మనస్సును ఈ యాఱింటిని తమతమ విషయవ్యాపారములకుఁ దగినవానినిగాఁ జేసికొని శబ్దాదివిషయముల ననుభవించుచుండును.

శ్లో॥ ఉత్క్రామన్తం స్థితంవాపి భుఞ్జానంవా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః॥ 10

టీ. విమూఢాః=శరీరమ్యునందాత్మాభిమానముగల అజ్ఞానులు, గుణాన్వితం=గుణములతోఁగూడిన యీ యాత్మను, ఉత్క్రామన్తం= శరీరమునుండి వెడలువానినిగాని, స్థితంవా = శరీరమునందుండువానిని

గాని, భుఞ్జానంవాపి = విషయముల ననుభవించుచున్నవానినిగాని, న అనుపశ్యన్తి — శరీరముకంటె విలక్షణుఁడైనవానినిగా తెలిసికొనఁజాలరు, జ్ఞానచక్షుషః = దేహాత్మవివేక విషయమైన జ్ఞానమనెడి దృష్టి గలవారు, పశ్యన్తి= తెలిసికొనుచున్నారు.

తా. మనుష్యత్వాది పిండాకారములనే ఆత్మగాఁ దలంచు మూఢులు, సత్త్వాదిగుణమయమైన ప్రకృతియొక్క పరిణామవిశేషమగు మనుష్యత్వాది రూపమైన పిండముతో సంసర్గముగల యీ యాత్మను, ఆపిండవిశేషమునుండి వెడలునపుడుగాని, దానియం దున్నప్పుడుగాని, గుణమయములైన విషయములను అనుభవించుచున్నప్పుడు గాని, ఒకానొకప్పుడైనను, ప్రకృతిపరిణామవిశేషములైన యీ మనుష్యత్వాదిపిండములకంటె విలక్షణునిఁగాను *జ్ఞానైకాకారునిఁగాను కనుఁగొనరు. పిండాత్మవివేకమునుగూర్చి జ్ఞానము గలవారు సర్వావస్థలయందును వీనిని వివిక్తాకారునిఁగా (అనఁగా జ్ఞానైకాకారునిఁగా) కనుఁగొందురు. 31 A

శ్లో॥ యతన్తో యోగిన శ్చైనం పశ్యన్త్యాత్మ న్యవస్థితమ్।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః॥ 11

టీ. యతన్తః= కర్మయోగాదులు యత్నముచేయువారు (కనుకనే). యోగినః = దానిచే నిర్మలాంతఃకరణము నొందిన యోగులు, ఆత్మని = శరీరమునందు, అవస్థితం (అపి) = ఉండునట్టిది (అయినను), ఏనం = ఈ యాత్మను, పశ్యన్తి = (స్వరూపముతో) చూచుచున్నారు, యతన్తోఽపి = స్వాతంత్ర్యముతో కర్మయోగాదులందు యత్నముచేయువారైనను. అకృతాత్మానః = (మత్ప్రపత్తిలేమిచే) సంస్కరింపఁబడని

* జ్ఞానైకాకారత్వము ఆత్మయొక్క వైలక్షణ్యప్రకారముల కుపలక్షణము. దీనిచే జ్ఞానత్వ నిత్యత్వ అపరిణామత్వాది ప్రకారములను సైతము గ్రహించునది. ఉత్క్రమణస్థిత్యాదులు సర్వావస్థలకు నుపలక్షణము గనుక ఒకానొకప్పుడైనను అనఁబడెను.

మనస్సు గలవారు, కనుకనే, అచేతసః = (ఆత్మావలోకమునకు తగిన) మనస్సులేనివారు, ఏనం = ఈ యాత్మను, న పశ్యన్తి = (కలరూపున) చూడరు.

తా. *నాయందు ప్రపత్తి గలిగి కర్మయోగాదుల నాచరించుచు వానిచేత నిర్మలాంతఃకరణు లైనట్టియోగులు యోగమనెడి కంటిచేత ఆత్మను, శరీరమునందున్నప్పటికిని, శరీరమునకంటె వేఱై స్వకీయరూప ముతో నెలకొని యున్నదానినిగాఁ గనుఁగొందురు. కర్మయోగాదు లాచరించుచున్నవారైనను అకృతాత్ములగువారు (అనఁగా నాయందలి ప్రపత్తి లేనివారగుటచే మనస్సంస్కారము నొందకయు, దానివలననే ఆత్మావలోకమునకు సమర్థమగు మనస్సు లేకయు నుండునట్టివారు) దానిని గలరూపునఁ గనుఁగొనఁజాలరు.

అవ. ఇట్లు రవిచంద్రాగ్నులు ఇంద్రియసన్నికర్షమున కడ్డపడు చీఁకటిని బోఁగొట్టుటమూలమున నాయింద్రియములకు నుపకారకు లగు టచే ప్రకాశకు లనఁబడిరి. ఈరీతిని ప్రకాశకులైన యా జ్యోతిష్మంతు లను గూడఁ బ్రకాశింపఁ జేయునట్టి జ్యోతియే జ్ఞానము. అట్టి జ్ఞానజ్యోతి యైన యాత్మ 'తద్ధామపరమం మమ' అని ముక్తావస్థయందును 'మమై వాంశో జీవలోకే జీవభూత స్సనాతనః' అని బద్ధావస్థయందును భగవ ద్విభూతి యగునని చెప్పఁబడెను. ఇప్పుడు ఆదిత్యాదిజ్యోతిష్మంతుల యొక్క అచిత్పరిణామవిశేషమైనజ్యోతికూడ భగవద్విభూతియె యగు నని చెప్పుచున్నారు.

శ్లో॥ యదాదిత్యగతం తేజో జగ ద్భాసయతేఽఖిలమ్।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్ ॥

---

* పూర్వశ్లోకార్థమే యిందు సహేతుకముగా నుపపాదింపఁబడినది. 'అచేతసః' అనుటకు కేవలము చేతస్సు లేనివారనుట పొసఁగదుకాన ఆత్మదర్శనమునకు సమర్థమైన చేతస్సు లేనివారని యర్థము గ్రాహ్యము.

టీ. ఆదిత్యగతం=సూర్యునియందుండెడి, యత్ =ఏ, తేజః= తేజస్సు, అఖిలం=సమస్తమయిన, జగత్ = లోకమును, భాసయతే= ప్రకాశింపఁజేయుచున్నదో, చంద్రమసి = చంద్రునియందు, యత్ =ఏ, (తేజః=తేజస్సు, అస్తి=కలదో), అగ్నౌచ=అగ్నియందును, యత్ =ఏ, (తేజః=తేజస్సు, అస్తి=కలదో), తత్ =అట్టి, తేజః=తేజస్సును, మామకం=నాయదియని-నాచే నియ్యఁబడినదని యనుట, విద్ధి=తెలిసికొనుము.

31 B

తా. సమస్తజగత్ప్రకాశక మగు *సూర్యుని తేజస్సును' చంద్రునియందున్న తేజస్సును, అగ్నియందున్న తేజస్సును నాదానినిగా (అనఁగా వారువారు నన్నారాధించుటవలన నాచే నియ్యఁబడిన దానినిగా) నెఱుఁగుము.

అవ. భూతధారిణియైన పృథివియొక్క ధారకత్వశక్తియు నాదియనుచున్నారు.

శ్లో॥ గా మావిశ్యచ భూతాని ధారయా మ్యహ మోజసా।
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః॥

టీ. అహం=నేను, గాం=పృథివిని, ఆవిశ్య=ప్రవేశించి, ఓజసా= నాయసాధారణశక్తిచేత, భూతాని=చరాచరములగు సమస్తభూతములను, ధారయామి=ధరించుచున్నాను, రసాత్మకః =అమృతరసమయుఁడగు, సోమః =చంద్రుఁడును, భూత్వా =అయి-వానిశరీరమై, సర్వాః=సమస్తములయిన, ఓషధీః=ఓషధులను-తృణగుల్మలతాదులను, పుష్ణామి=రసములచేఁ బోషించుచున్నాను, వృద్ధిచేయుచున్నాను.

---

* సూర్యాదుల తేజస్సును 'మామకమ్' అని భగవంతుఁడు తన తేజస్సుగా చెప్పుట యెట్లు? ఒకరితేజస్సు మఱొక్కరిది యగునా? అట్లయినయెడల సూర్యాదులును భగవంతుఁడును ఒక్కటే యగుదురు కనుక 'మామకమ్' అనుటకు 'నే నిచ్చినట్టి తేజస్సు' అని యర్థము చెప్పఁబడెను.

తా. నేను భూమియందుఁ బ్రవేశించి చరాచరములగు సమస్త భూతములను * నాయప్రతిహతసామర్థ్యముచే ధరియింతును. అట్లే నేను అమృతరసమయుఁడగు చంద్రుఁడనై యోషధుల నన్నిటిని రసములచే వృద్ధిఁ బొందింతును.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నంచతుర్విధమ్॥14

టీ. అహం=నేను, వైశ్వానరః=జఠరాగ్నిగా, భూత్వా=అయి, ప్రాణినాం=సమస్తప్రాణులయొక్క, దేహం = శరీరమును, ఆశ్రితః= లోపల ప్రవేశించినవాఁడును, ప్రాణాపానసమాయుక్తశ్చసన్= జాఠరో ద్దీపకములైన ప్రాణాపానవాయువులయొక్క వృత్తిభేదములతోఁగూడిన వాఁడును అగుచు, చతుర్విధం = ఖాద్యచోష్యలేహ్యాపేయము లనెడి నాలుగు విధములయిన, అన్నం=అన్నమును, పచామి=పక్వముచేయు చున్నాను.

తా. నేను జఠరాగ్నినై సమస్తప్రాణుల దేహము నాశ్రయించి, ప్రాణాపానవ్యాపారభేదములతోఁ గూడినవాఁడగుచు, వారు భుజించు *ఖాద్యచోష్యలేహ్యాపేయరూపములుగా నాలుగు విధములయిన యన్నములను పక్వము చేయుచుందును.

---

* భూమియందుఁ గల వస్తువులను నా సామర్థ్యముచే ధరింతు ననఁగా భూమి వానిని ధరించుటెల్ల నా సామర్థ్యముచేతనే యని భావము. నా సామర్థ్యము తోడు లేనిచో భూమియొక్క ధారకత్వశక్తి ప్రతిహతమగును. నా సామర్థ్యము అప్రతిహత మెవది గనుక దానిని తోడుగాఁ గల ఆధారకత్వశక్తియు అప్రతిహతముగా సాగు చున్నదని గ్రాహ్యము.

* ఖాద్యము=నమలఁదగినది, చోష్యము = జుఱ్ఱఁదగినది, లేహ్యము = నాకఁదగినది, పేయము=త్రాగఁదగినది. ఇచట ప్రాణాపానాదులైన లోపలి పచనవృత్తులతోఁ గూడియే యగ్ని పచనముసేయ శక్తుఁడగును గనుక వానితోఁ గూడినవాఁడుగాఁ జెప్పఁబడెను.

అవ. ఇచట భగవంతునికి విభూతిభూతులగుటచే సోమవైశ్వానరులు 'అహంసోమోభూత్వా' 'వైశ్వానరోభూత్వా' అని యాభగవంతునితోడి సామానాధికరణ ముచే నిర్దేశింపఁబడిరి. ఇప్పుడు వారే కాక సర్వభూతసమూహమును పరమపురుషునితోడి సామానాధికరణ్యముచేత నిర్దేశింపఁబడుటకు హేతువును దెలుపుచున్నారు.

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
43
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ।
వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యో
వేదాన్తకృ ద్వేదవిదేవ చాహమ్॥ 15

టీ. అహం=నేను, సర్వస్య=సమస్తభూతసమూహముయొక్క, హృది=జ్ఞానోదయప్రదేశమైన హృదయమునందు, సన్నివిష్టః = ఆత్మరూపముగాఁ జొచ్చినవాఁడను, మత్తః=నావలన, స్మృతిః=స్మృతియును, జ్ఞానం=జ్ఞానమును, అపోహనం చ=ఊహయు, (జాయన్తే=కలుగుచున్నవి), కనుక, సర్వైః=సమస్తములయిన, వేదైశ్చ = వేదములచేతను, వేద్యః = తెలియఁదగినవాఁడను, అహమేవ = వారి కంతర్యామియు నాత్మయు నైన నేనే, వేదాన్తకృత్ = వేదోక్తఫలము నిచ్చువాఁడ ననుట, వేదవిత్ చ=వేదతత్త్వార్థము నెఱింగినవాఁడను, అహమేవ=నేనే.

తా. ఆసోమవైశ్వానరులయొక్కయు సర్వభూతసమూహము యొక్కయు సమస్తప్రవృత్తినివృత్తులకు మూలమైన జ్ఞానము పుట్టు ప్రదేశము హృదయము. అట్టిహృదయమునందు సర్వమును నాసంకల్పముచే నియమించుచు నే నాత్మరూపముతోఁ జొచ్చియున్నవాఁడను.
33
అట్లని 'అన్తఃప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా' (ఆరణ్యక.3-ప్ర.
34
౧౧-అను-౨ పం) 'యః పృథివ్యాం తిష్ఠన్' (బృ. ౫-౭-3. శతపథ.

౧౪-౫-౭-౩౦) [35]'య ఆత్మని తిష్ఠన్నాత్మనో౽న్తరో యమయతి'
(బృ-౫-౭-౨౨) [36]'పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్'
తై. నా. ౧౧ అను.) [37]'అథ య దిద మస్మిన్ బ్రహ్మపురేదహరం పుణ్డ
రీకం వేశ్మ' (ఛా-౮-౧-౧) ఇత్యాదిశ్రుతులును, [38]'శాస్తా విష్ణుర శేషస్య
జగతో యో జగన్మయః' (వి.పు. ౧-౧౭-౨౦)' [39]ప్రశాసితారం సర్వేషా
మణీయాంస మణీయసాం' (మను. ౧౨-౧౨౨) [40]"యమో వైవస్వతో
రాజా య స్తవైష హృదిస్థితః" (మను. ౭-౯౨) ఇత్యాది స్మృతులును
చెప్పుచున్నవి. కాఁబట్టి నావలననే సకలమైనవానికిని స్మృతియును జ్ఞాన
మును అపోహనమును పుట్టుచున్నవి. స్మృతియనఁగా పూర్వమనుభవిం
చినదానిని గుఱించినదై ఆయనుభవముయొక్క సంస్కారమాత్రము
వలనఁ బుట్టినజ్ఞానము. జ్ఞాన మనఁగా ఇంద్రియముల (ప్రత్యక్షము) వల
నను, లింగము (అనుమానము)వలనను, ఆగమము (శాబ్దప్రమాణము)
వలనను, యోగము (సమాధి) వలనను బుట్టువస్తునిశ్చయము. అపో
హనమనఁగా జ్ఞాననివృత్తి లేక అపోహనమనఁగా ఊహనము-అనఁగా
ఊహ. ఊహ యనఁగా ఈప్రమాణ మీయీవిధమున ప్రవర్తింప నర్హ
మైనది యని ఆయాప్రమాణపు ప్రవృత్తియొక్క యర్హతనుగుఱించిన
జ్ఞానము. ఇది సామగ్ర్యాదుల నిరూపించుటవలనఁ గలిగినదై మీఁది
ప్రమాణమునకు ఉపకారకమై యుండును. ఈ కారణమునుబట్టి అగ్ని
సూర్యవాయు సోమేంద్రాదులకు నేనంతర్యామియు ఆత్మయు నగుటచే
వారలను ప్రతిపాదించు * వేదములచేనెల్ల, (శరీరవాచకములైన)

* ఆయా వేదము లగ్నిసూర్యాదులను ప్రతిపాదించుచున్నవి. శరీరవాచకములైన
దేవమనుష్యాదిశబ్దములచే తదంతర్యామియైన జీవాత్మ ప్రతిపాదింపఁబడునట్లే భగవ

దేవమనుష్యాదిశబ్దములచే జీవాత్మవలె, తెలియఁదగినవాఁడను నేనే. మఱియు "ఇన్ద్రం యజేత" (శతపథ. ౫-౧-౬) 'వరుణం యజేత' (శతపథ. ౨. 3-32) ఇత్యాదులగు వేదములకు * ఫలమును (ఫలమునందే కదా ఆవేదములెల్ల పర్యవసించుచున్నవి) కావించువాఁడును- అనఁగా వేదమునందు చెప్పఁబడిన ఫలమును ఒసఁగువాఁడును నేనే యని యర్థము. అది పూర్వమే 'యోయో యాంయాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి' (గీ. 7-౨౧) అని యారంభించి 'లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్' (గీత. 7-౨౨) అని చెప్పఁబడినది. మఱియు 'అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ' 41

అనియుఁ జెప్పఁబడినది. నన్నిట్లు చెప్పునవిగా వేదములను నేనే యెఱుఁగుదును. అనఁగా వేదార్థము నిట్లుగాక వేఱువిధముగాఁ జెప్పువాఁడు వేదవిదుఁడు కాఁడని యభిప్రాయము. 42

అవ. కాఁబట్టి సమస్తవేదములకు సారభూతమైన యర్థమును నావలన వినుము.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ।

44

క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ 16

టీ. లోకే=లోకమునందు, క్షరశ్చ=క్షరుఁడనియు, అక్షరఏవచ= అక్షరుఁడనియు ఇమౌ=ఈ, ద్వౌ=ఇద్దఱు, పురుషౌ=పురుషులు, (స్తః= కలరు), అందు సర్వాణిభూతాని = బ్రహ్మాది స్తంబపర్యంతము గల సమస్తభూతసముదాయము (బద్ధాత్మవర్గము) క్షరం=తన ప్రకాశస్వభావమునుండి జాఱినదగుటవలన క్షరుఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు,

---

చ్ఛరీరభూతములైన అగ్ని సూర్యాదిశబ్దములచే తదంతర్యామియు తదాత్మయునైన భగవంతుఁడే ప్రతిపాదితుఁడగుచున్నాఁడు. అగ్ని సూర్యాదిప్రతిపాదకములైన వేదములచే నెల్ల భగవంతుఁడే ప్రతిపాద్యుఁడు (అనఁగా వేద్యుఁడు) గనుక 'వేదైశ్చసర్వైరహమేవ వేద్యః' అనఁబడినది.

* వేదములెల్ల ఫలమునందే పర్యవసించుచున్నవి. కనుక వేదములకు ఫలమే అంతము. కాఁబట్టి, వేదాంతమనఁగా వేదోక్తఫల మనఁబడెను.

కూటస్థః=అచిత్సంసర్గము వదలి నిజరూపముతోనున్న ముక్తాత్మవర్గము, అక్షరః=అక్షరుఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు

తా. క్షరుఁడు అక్షరుఁడు అని యీ యిరువురు పురుషులు

45 A

లోకమున ప్రసిద్ధులు. అందు క్షరశబ్దముచే నిర్దేశింపఁబడిన పురుషుఁడు బ్రహ్మాది స్తంబపర్యంతము క్షరణస్వభావము గలవై అచిత్సంసర్గము నొంది జీవులని చెప్పందగు సమస్తభూతములు (బద్ధాత్మసముదాయము) ఇచట భూతములకెల్ల అచిత్సంసర్గరూపమైన ఉపాధి యొకటి సమాన ముగా నుండుటంబట్టి 'పురుషః' అని ఏకత్వనిర్దేశము. అక్షరశబ్దముచే నిర్దేశింపఁబడినవాఁడు * కూటస్థుఁడు– అనఁగా అచిత్సంసర్గమును వీడి స్వకీయరూపముతోనున్న ముక్తాత్మ. వానికి అచిత్సంసర్గము లేనందున అచిత్పరిణామవిశేషములైన బ్రహ్మాదిదేహములకు అసాధారణుఁడు (అనఁగా బ్రహ్మాదిదేహసంబంధము వలనఁ గలుగు విచిత్ర సుఖదుఃఖా ద్యసాధారణాకారము గలవాఁడు) కాఁడు కావున కూటస్థుఁడని చెప్పఁ బడుచున్నాఁడు. ఇందును (అనఁగా ముక్తాత్మలకెల్ల) ఏకత్వనిర్దేశము అచిద్వియోగరూపమైన ఉపాధి సమానమగుటంబట్టి చెప్పఁబడినది. ఈ యేకత్వనిర్దేశముచే నింతకుఁబూర్వ మనాదికాలముగా ముక్తుఁడొక్కఁడే యని గ్రహింపరాదు. 'బహవోజ్ఞానతపసాపూతా మద్భావ మాగతాః' (గీ. ౪–౧౦) 'సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ' (గీ. ౧౪–౨) అని ముక్తులు పెక్కులు.

* కూటవత్తిష్ఠతీతి కూటస్థః- కూట మనఁగా సమ్మెట. అది యినుపముద్దల నెన్నియో కొట్టి అవి నానారూపముల నొందినను తానుమాత్రము రూపు మాఱక యేక రీతిగానుండును. అట్లే ముక్తాత్మయు బ్రహ్మాదిదేహములతో సంబంధించియు తద్వికార ములకు లోనుగాక అసంకుచితజ్ఞానైకాకారముతో నుండును; కనుక నిచట కూటస్థుఁ డనఁబడె నని తెలియునది. ముక్తాత్మ బ్రహ్మాదిదేహములకుఁ గలుగు సుఖదుఃఖాద్య సాధారణాకారములు లేక అసంకుచితజ్ఞానరూపమైన తన యసాధారణాకారముతో కూటమువలె నుండును.

45 B
శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
46 47
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః॥ 17

టీ॥ ఉత్తమః పురుషస్తు=ఉత్తమపురుషుఁడన్ననో, అన్యః=క్షరా క్షరు లనఁబడు బద్ధముక్తపురుషులకంటె వేఱైనవాఁడు, పరమాత్మా ఇతి=పరమాత్మయని, ఉదాహృతః=(సకలశ్రుతులందును) ఉదాహరింపఁబడినవాఁడు, యః=ఎవఁడు (ఆ ఉత్తమపురుషుఁడు) *లోకత్రయం=(అచేతనము అచిత్సంసృష్టచేతనుఁడు ముక్తుఁడు అని ప్రమాణములచే) తెలియఁదగినవానిని మూఁటిని, ఆవిశ్య=(ఆత్మగా) ప్రవేశించి, బిభర్తి=భరించుచున్నాఁడు, అవ్యయః=వ్యయస్వభావము లేనివాఁడు, ఈశ్వరః=ఆ లోకత్రయమునకును ఈశ్వరుఁడు.

తా॥ ఉత్తమపురుషుఁడు క్షరాక్షరు లనఁబడెడు ఆబద్ధముక్త పురుషులకంటె వేఱుపదార్థమైనవాఁడు. వాఁడు సర్వశ్రుతులందును పరమాత్మయని యుదాహరింపఁబడినవాఁడు. ఇట్లు పరమాత్మ యని నిర్దేశింపఁబడుటచేతనే యీ యుత్తమపురుషుఁడు బద్ధముక్తపురుషులకంటె నర్థాంతరభూతుఁ డనియుఁ దెలియుచున్నది. ఎట్లన, లోకములు (అనఁగా ప్రమాణగమ్యములైనవి) అచేతనము అచిత్సంసృష్టచేతనము ముక్తుఁడు అని మూఁడు గలవు. ఆ మూఁటియందును వాఁడు ఆత్మయై చొచ్చి వానిని భరించును. ఇట్లు పరమాత్మయై యీమూఁటిని వ్యాపించి భరించుటచే వ్యాప్యములును భర్తవ్యములు నైన యీమూఁటికంటె వాఁడు అర్థాంతరుఁడే యగు నని తెలియుచున్నది. మఱియు వాఁడు అవ్యయస్వభావుఁడు, కనుక వ్యయస్వభావముగల అచేతనముకంటెను, తత్సంబంధమువలన అచేతనము ననుసరించు చేతనునికంటెను, అచిత్సంబంధ
48
మునకు యోగ్యుఁ డగుటంబట్టి పూర్వము దానితో సంబంధించియుం

---

* 'లోక్యతే ఇతి లోకః' అనువ్యుత్పత్తిచేఁ దెలియఁబడునది (అనఁగా ప్రమాణముచే తెలియఁదగినది) యని యర్థము.

డిన ముక్తునికంటెను, వాఁడు అర్థాంతరుఁడే యగును. అట్లే వాఁడు ఆ లోకత్రయమున కీశ్వరుఁడు. కనుక ఈశితవ్యములైన యామూఁటికంటె వాఁడు అర్థాంతరుఁడే యగును.

49

శ్లో॥ యస్మాత్క్షర మతీతోఽహ మక్షరా దపి చోత్తమః।

50

అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥ 18

టీ యస్మాత్=ఎందువలన, అహం=నేను, క్షరం = బద్ధపురుషుని, అతీతః=అతిక్రమించినవాఁడనో, అక్షరాదపిచ = ముక్తపురుషుని కంటెను, ఉత్తమః=ఉత్కృష్టుఁడనో, అతః=దీనివలన, లోకే=స్మృతియందును, వేదేచ= వేదమునందును, పురుషోత్తమ ఇతి= పురుషోత్తముఁడని, ప్రథితః= ప్రసిద్ధుఁడనై, అస్మి=ఉన్నాను.

తా. నేను క్షరుఁ డనఁబడు బద్ధపురుషునికంటె పూర్వోక్త స్వభావములచే నతిశయించినవాఁడనై, అక్షరుఁ డనంబడు ముక్తపురు

52

షునికంటెను పూర్వోక్తహేతువులంబట్టి ఉత్కృష్టతముఁడనై యుండుటంజేసి స్మృతులయందును శ్రుతులయందును పురుషోత్తముఁడని ప్రఖ్యాతుఁడనై యున్నాను.

'వేదార్థావలోకనా ల్లోకః' వేదార్థము నవలోకించుటచే లోకములని స్మృతు లిచట చెప్పఁబడినవి. కాన 'లోకే వేదేచ' యనఁగా స్మృతియందును శ్రుతియందును అని యర్థము. 'పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే స ఉత్తమః పురుషః' (ఛాం. ౮-౧౨-౨) ఇత్యాదిశ్రుతులును, 'అంశావతారం పురుషోత్తమస్య హ్యనాదిమధ్యాంతమజస్యవిష్ణోః' (వి. పు. ౫-౧౭-33) ఇత్యాదిస్మృతులును పరమపురుషుని పురుషోత్తమునిఁగా నిర్దేశించుచున్నవి. ఇందు పురుషోత్తమశబ్దమును నిర్వచించుట పురుషోత్తమత్వమును అనుచింతనము సేయుటకొఱకని తెలియునది) 51

54 అవతారిక.

53

శ్లో॥ యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
న సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత॥ 19

టీ. భారత=అర్జునా, యః = ఎవ్వఁడు, పురుషోత్తమం= పురుషోత్తముఁడనగు, మాం=నన్ను, * అసమ్మూఢః=సమ్మోహము లేనివాఁడై, ఏవం= క్షరాక్షరపురుషులకంటె విసజాతీయునిఁగా, జానాతి=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, సర్వవిత్=అన్నిటిని ఎఱిఁగినవాఁడగుచు, మాం=నన్ను, సర్వభావేన= (నన్నుఁ బొందుటకుఁ జెప్పఁబడిన (భజన కీర్తనయతనాది) ప్రకారము లన్నిటిచేతను, భజతి=భజించుచున్నాఁడు.

తా. అర్జునా, ఎవ్వఁడు చెప్పఁబడినప్రకారమున (అనఁగా క్షరాక్షరపురుషులును నేనును ఒకటియే యను) భ్రాంతి లేనివాఁడై, పురుషోత్తముఁడ నైన నన్ను అవ్యయస్వభావముచేతను వ్యాపనభరణైశ్వర్యాది యోగముచేతను ఆ పురుషులకంటె విసజాతీయునిఁగా నెఱుఁగుచున్నాఁడో, వాఁడు మత్ప్రాప్తికి నుపాయములుగా నెఱుఁగఁదగినవానినెల్ల నెఱుఁగువాఁడగును. * మత్ప్రాప్తి కుపాయములుగా నిర్దిష్టములైన భజనప్రకారము లన్నిటిచేతను నన్ను భజించువాఁడగును. నన్నుఁ గూర్చిన సకలవేదనములచే నా కేప్రీతి గలుగునో, నన్నుఁ గూర్చిన సకలభజనములచే నా కేప్రీతి గలుగునో, ఆ రెండువిధములైన ప్రీతులును ఈ వేదనముచేత నాకుఁ గలుగుచున్నవి.

---

* 'అ+సం+మూఢత్వమ్' = ఏకీకృత్య మోహరహితత్వం, క్షరాక్షర పురుషులను ఉత్తమపురుషునితో ఏకీకారముచేసి భ్రమింపకుండుట.

* ఇచట పురుషోత్తమశబ్దార్థము తెలియుటచేతనే సర్వమును దెలియుటయు సర్వవిధముల భజించుటయుఁ గలుగుననుట యుపపన్నముకాదు. కనుక 'సర్వవిత్' 'సర్వభావేన' అను రెంటికిని 'మత్ప్రాప్తి కుపాయములుగా' అని కూర్చఁబడినది, అయినను పరవ్యూహవిభవగుణచేష్టితవేదనాదులును ప్రాప్త్యుపాయభూతములైన వేదనాదులే యగును. ఒక్క పురుషోత్తమత్వవేదనమే యీపరవ్యూహవిభవగుణచేష్టితాది సర్వవేదనసర్వవిధభజనములు కానేరదు. కనుక ఆసర్వవేదన సర్వవిధభజనములచేత ఏయేప్రీతి నాకు కలుగునో యవిమాత్రము పురుషోత్తమత్వవేదనముచేఁ గలుగు నని భావము గహింపఁబడినది.

56
అవ. ఇట్టి పురుషో_త్తమత్వవేదనమును బూజించుచున్నారు. 55
59
శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ।
60
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత॥

టీ. అనఘ=పాపరహితుఁడవగు, భారత=అర్జునా, ఇతి=ఈప్రకారమున, గుహ్యతమం=మిక్కిలి రహస్యమైన, ఇదంశాస్త్రం=యీగీతాశాస్త్రమునందలి పదునేనవ యధ్యాయము, మయా=నాచేత, ఉక్తం ఉపదేశింపఁబడెను, ఏతత్=దీనిని, బుద్ధ్వా=తెలిసికొని, బుద్ధిమాన్=(నన్నుఁబొంద నిచ్ఛగించువానికి కావలసిన) జ్ఞానము గలవాఁడును, కృతకృత్యశ్చ=అట్టివాఁడు చేయవలసిన సమస్తమును చేసినవాఁడును, స్యాత్=అగును.

తా. అర్జునా, ఇట్లు నాపురుషో_త్తమత్వమును ప్రతిపాదించునదియు సకలమైన రహస్యములలో మిక్కిలిరహస్యమైనదియు నైన ఈ శాస్త్రమును (అధ్యాయార్థమును) నీవు పాపరహితుఁడవుగాన మిక్కిలి యోగ్యుఁడవనితలఁచి నీకుఁజెప్పితిని.* దీనిని దెలిసి బుద్ధిమంతుఁడును
57
కృతకృత్యుఁడు నగును=అనఁగా నన్నుఁ బ్రాపింపఁగోరువానికి ఏబుద్ధి యుపాదేయమో యాబుద్ధి యంతయు లభించినదగును; మఱి యట్టివానికేది చేయఁదగునో యదియంతయుఁ జేయఁబడినట్టిదగునని యర్థము. అనంతరము చెప్పఁబడిన *పురుషో_త్తమవిషయమగు జ్ఞానమును శాస్త్ర

* దీనిని ఎఱిఁగినయతఁడు భగవత్ప్రా_ప్తికి ఉపాయభూతమైన జ్ఞానము గలవాఁడును, అట్టివానిచేఁ జేయఁబడవలసిన దంతయుఁ జేసినవాఁడును అగునని భావము. 'అనఘ' అని పాపరహితత్వమునుబట్టియు 'భారత' అని జన్మమునుబట్టియు నర్జునుఁడీశాస్త్రోపదేశమునకు యోగ్యతముఁడు (అనఁగా అధికారి) యని సూచితమైనది.

* పురుషో_త్తమవిషయజ్ఞానముచే పూర్వశ్లోకమున సర్వవి_త్త్వ సర్వవిధభజనములు కలుగువనియు ఈ శ్లోకమున బుద్ధిమత్త్వకృతకృత్యత్వాదులు కలుగువనియు చెప్పఁబడెను. సర్వవిత్త్వాదులును బుద్ధిమత్త్వాదులును సమానార్థకములే యగును గనుక నిచట పునరు_క్తిదోషము కలుగుచున్నది. అయినను ఇందు ప్రస్తుత మైన

జన్యమైనదానినే యిదియంతయుఁ జేయుచున్నదిగాని సాక్షాత్కార
58
రూపమైనదానిని గాదని యీశ్లోకముచేతఁ జెప్పఁబడుచున్నది. (అర్జునా
దీనిని దెలిసికొని నీవును కృతకృత్యుఁడ వగుము.) 61

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమ
ప్రాప్తియోగోనామ పఞ్చదశోఽధ్యాయః.
62

---

యర్థమునుగాని దానిని గుఱించిన జ్ఞానమును గాని ప్రకటింపక 'శాస్త్రమ్' అని శాస్త్రశబ్దమును ప్రయోగించుటచే పూర్వోక్తపురుషోత్తమ విషయజ్ఞానము సాక్షాత్కారరూపమైనదే కాక శాస్త్రజన్యమాత్రమైనదికూడ ఈ సర్వవిత్త్వాదులను గలిగించునను విశేషము తెలుపఁబడినది. ఈ విశేషమునుబట్టియే పూర్వశ్లోకోక్తమైనది యిందు మరల ప్రతిపాదింపఁబడెను గాన పునరుక్తి లేదని గ్రాహ్యము.

# పంచదశోఽధ్యాయః

## పురుషోత్తమప్రాప్తియోగము - అవతారిక

అవతారికలో

1. త్రయోదశాధ్యాయమునకు సంబంధించిన విషయము చతుర్దశాధ్యాయమున జెప్పబడినది. దానికి చివర 'మాం చ యోఽవ్యభిచారేణ' 'బ్రహ్మణోహి' అను రెండుశ్లోకములచే అవ్యభిచరితభక్తియోగముచే భజింపబడువాడును, ఫలప్రదుడును నగు శ్రియఃపతియే యని ప్రసక్తమైనది. ఇప్పుడీ యధ్యాయమున 'భగవదతిశయ విశేషము'ను శోధించుచున్నాడు. కాబట్టి దీనికి పదనాల్గవ అధ్యాయముతో సంబంధము కలదు.

### 1వ శ్లోకము

2. (i) సంసారమును తలక్రిందుచెట్టుగా పోల్చుట ఛేదించదగినదని సుకరముగ నెఱింగించుటకే.

(ii) కఠోపనిషత్తులో 'ఊర్ధ్వమూల-మధశ్శాఖ' మ్మని సంసారమును తలక్రిందుచెట్టుగా పోల్చుటచే నదేవిధముగ నిచ్చటను పోల్చుట వలన గీతకు శ్రుత్యనుసారిత్వము సూచింపబడుచున్నది.

(iii) పరతత్త్వము నెఱుంగుటకు వలయు జిజ్ఞాసకు కారణమైన వైరాగ్యమును బుట్టించుటకని కొందఱందురు. ఇట్లు చెప్పుటచే నీ సంసారము విభూతిగా నెఱుంగబడును. దానివలన విభూతిమానుని గూర్చిన జిజ్ఞాస బుట్టును. ఈ లీలావిభూతిని తన సంకల్పాధీనముగా నడిపించువాడే గదా పరతత్త్వము.

(iv) అసంగశస్త్రముచే ఛేదింపబడునది అనగా- పరబ్రహ్మచే కల్పింపబడిన సనాతనమైన నీసంసారవృక్షమునకు మూలమువాచామగోచరుడగు పరంబ్రహ్మయే. ఇది యాతని యనుగ్రహముచేతనే

పెరుగుచు వృద్ధినిపొందుచున్నది. దీనికి బుద్ధి ప్రమాను; ఇంద్రియములు తొఱ్ఱలు; పృథివ్యాది పంచభూతములు కొమ్మలు; శబ్దాదివిషయములు ఆకులు; పుణ్యపాపములు పువ్వులు; సుఖదుఃఖములు పండ్లు. ఈవృక్షము సకలప్రాణుల కాధారభూతము. దీనిని జ్ఞానమనెడు గొప్పఖడ్గముచే నరకి వేసినచో ఆత్మానుభవ సుఖమును బడసి తిరిగి జన్మించకుండును.

ఇట్లు శ్రుతి స్మృతులతోఁపోల్చుట సంసారమును హేయమని యెఱుంగుటకే.

ఇచ్చట "ఊర్ధ్వ మూలోఽవాక్శాఖ ఏషోశ్వత్థ స్సనాతనః" అను శ్రుతి ప్రకృతమైనట్టియు ముందుచెప్పబోవునట్టియు పురుషుని పరముగ జెప్పరాదా యన్నచో—

అదికుదురనేరదు. పురుషునకు స్వరూపతః ఊర్ధ్వమూలత్వాదులు కుదురనేరవుగదా! మోక్షాపేక్ష కలవారికి ఆ పురుషునితో సంగమే యపేక్షితమగుటచే దానిని ఛేదించుటయు నసంగతమే యగును. శరీర విశిష్టత్వాది రూపమును ఛేదించి శుద్ధస్వరూపము నాపాదించుటయే విధింపబడుచున్న దన్నచో నన్వయవ్యతిరేకములచే నా యుపాధిభూత మైన దేహమునందే పర్యవసించును. అది ప్రకృతమునకు సంబంధించి నదేగాని వేరుకాదు గాన సమ్మతమే. వృక్షమనుట "వృశ్చు-ఛేదనే" నరుకుట. గాన సంసారమను వృక్షమనుట సంగతమే. "శ్వోనస్థాస్యతీతి అశ్వత్థః" అనుటచే నిది నశ్వరమైనదని యర్థము. ఈరెండు ధర్మములను పురస్కరించుకొనియే సంసారమును 'అశ్వత్థవృక్ష' మని శ్రుతిస్మృతులు బోధించినది,

3. ఆకులు చెట్టుయొక్క వాస్తవరూపమును పైకి గోచరించ కుండునటుల కప్పి రక్షించునటులనే కామ్యకర్మలను బోధించు వేద మంత్రములున్ను సంసారానిత్యత్వమును కనబడనీయక కప్పిబుచ్చి సంసారమును రక్షించి పెంచుచున్నవి.

సంసారమనెడు చెట్టునకు ఆకులుగా చెప్పబడుటచే శ్రుతులనగా నిచ్చట "వేదవాదరతాఃపార్థ" అని రెండవ అధ్యాయమున చెప్పబడిన ధర్మార్థకామపురుషార్ధ ప్రదములైన వేదమంత్రములనియే గ్రహించవలెను.

ఇచ్చట వేదశబ్దమునకు మోక్షార్థమైన వేదభాగమని యర్థము. అనగా ఉపనిషత్తులని భావము.

సంసారాశ్వత్థము నెఱింగినవాడు వేదవేత్తయనుట యసంగతము. సంసారముగాని అశ్వత్థముగాని వేదము కాదుగదా ! కాబట్టి -

ఆద్యంతుత్ర్యక్షరం బ్రహ్మ ।
త్రయీయాయత్ర ప్రతిష్ఠితా ।
సగుహ్యోఽన్యస్త్రివృద్వేదో ।
యస్తంవేద సవేదవిత్ ॥

అకార ఉకార మకారాత్మక అక్షరములు మూడింటితో కూడి యున్నట్టియు శబ్దజాలమున కంతకును మూలకారణమైన ప్రణవమే బ్రహ్మను జెప్పునదగుటచే బ్రహ్మయనబడుచున్నది. వేదమంతయు "ఓమ్ కార ప్రభవో వేదః" అని నట్లాప్రణవమునందే ఆధారపడియున్నది. అది యొక గంభీరమైన రహస్యము. దాని నెఱింగినవాడు వేదమునంతను యెఱింగినట్లే. 'ఏకవిజ్ఞాన సర్వవిజ్ఞానే ప్రతిజ్ఞ' సర్వమునకును సర్వేశ్వరుడు కారణమగుటచేతనే కదా ! సుఘటితమగుచున్నది. అటులనే యిచ్చటను ఎఱుంగవలెను.

పూర్వపక్షము :—

కాబట్టి ఊర్ధ్వమూలమిత్యాది రూపకము ప్రణవవిషయమైనదే. ప్రణవమునందలి అర్ధమాత్రకు సకల జగత్సృష్టికర్తయగు పరమ పురుషుడు దేవతగా నిరూపింపబడెను. కావున ప్రణవమునకు ఊర్ధ్వమూలత్వముసుశకము. 'ఛన్దాంసి యస్య పర్ణాని' యని చెప్పబడిన ఛందఃపర్ణత్వ

మును సమంజసమే. ప్రణవమునుండియే గదా సమస్త వేదములును పుట్టుచున్నవి. అట్టి వేదము నెఱింగిన వానిని వేదవిత్తుగా నీశ్లోకము కొని యాడుచున్నదని కొందఱందురు. దానికై "వేదము సంసార వృక్షమును" ...ఇత్యాది గ్రంథము.

దీని యభిప్రాయమేమనగా :—

సిద్ధాంతము :—

దీనికి ప్రణవపరమైన యర్థమును చెప్పరాదు. అట్లగుచో నది అసంగశస్త్రముచే ఛేదింపబడుట యెట్లు? 'తతః పరం తత్పరిమార్గితవ్యం' అనుటయును యసంగతమే. ప్రణవమును ఛేదించి ఆపై యెఱుంగదగినదేమున్నది. ఉపాసించిన నుదానినేగదా! ఎఱింగినను దాని యర్థమునే గదా! పూర్వపక్షము:- 'శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి' యనునట్లు ప్రణవార్థ నిష్ణాతుడు పరమాత్మ నెఱింగి బడయగల్గునని చెప్పరాదా ! యన్నచో సిద్ధాంతము:- ఇది పరస్పర విరుద్ధ నిర్దేశము. ఏలననగా— పై శ్రుతి వాక్యములో ప్రణవార్ధ నిష్ణాతునకు పరమాత్మ ప్రాప్తి చెప్పబడుచున్నది. ఇచ్చటనన్నో దీనిని నరికి దానికి పైన నన్వేషింపదగిన దని చెప్పుచున్నది. కాబట్టి మరియొక యేయర్థముగాని కుదుర నేరదు. సంసారపరమగు నర్థమునే జెప్పవలెను. దాని నెఱింగినవాడే వేదవేత్త యని ప్రశంసింపబడుచున్నాడు. దానికి కారణము సంసారవృక్షము యొక్క స్వరూపాదులను చక్కగ నెఱింగినచో నది వేదాంతములలో జెప్పబడిన అర్థముల నెఱుంగుట కెంతయో యుపకరించును.

మరికొందరు – సమూలమగు నీ సంసారవృక్షము నెఱుంగుట కన్న మించిన దొకింతయు నెఱుంగదగినది లేదు. కాబట్టి సమూల సంసారవృక్షము నెఱింగిన వానిని సర్వవేదార్థవేత్తయని పొగడబడుచున్న దని చెప్పుదురు. ఊర్ధ్వమూల మిత్యాదికముచే నైమిత్తికసృష్టి ప్రక్రియ చెప్పబడుచున్నది. ఇకముందు 2వ శ్లోకముచే నిత్యసృష్టి ప్రక్రియ చెప్పబడును.

2వ శ్లోకము

(5) మేడయొక్క పై భాగమునబుట్టి క్రిందికి నేలవైపు వ్రేలాడు పెద్ద తీగె భూమిని సోకి వేరులు పారి తిరిగి పైకి కొమ్మలను తొడుగును-అను నభిప్రాయముతో చెప్పుచున్నాడు.

(6) ఇచ్చట మనుష్యలోకశబ్దము — ఇచ్చట కర్మలనుచేయు నధికారులు మిక్కుటముగ నుండుటను తెలుపుచున్నది.

(7) పైకి వ్యాపించిన కొమ్మలుగల మఱ్ఱిచెట్టునకు కొమ్మల చివర నుండు పండ్లలోని గింజలును ఊడలును మూలములగుచున్నట్లే క్రింద కొమ్మలుగల చెట్టునకును సంభవించవచ్చును.

3వ శ్లోకము

(8) అవతారిక:— ఈ సంసారమందఱకును గోచరించునదియే గదా ! "యస్తంవేద" యని యెవనినో యొక్కని గూర్చి దీని నెఱింగినవాడని పొగడనేల ? యన్నచో చెప్పుచున్నాడు.

(9) 'ప్రతితిష్ఠత్యస్మిన్నే వేతి' వ్యుత్పత్తినిబట్టి అజ్ఞానమే దీనికి ప్రతిష్ఠ.

దీని భావమేమనగా :—

వృక్షము నిలచియున్న స్థలము ఆ చెట్టునకు ప్రతిష్ఠ యనబడును. అట్టిదీ సంసారవృక్షమునకు 'కర్మయే' కాబట్టి కర్మమూలమని చెప్పబడినది.

"అవిద్యా సఞ్చితం కర్మ" అనుటచే కర్మ యనగా అజ్ఞానము. దానివలననే గదా కర్మలను చేయుట. ఈ కర్మలకు మూలమైన అహంకారమే మమకారమునకును మూలము. కావున దేహాత్మాభిమాన రూపమైన అహంకారమే సంసారమనెడు వృక్షమునకు ప్రతిష్ఠగా జెప్పబడెను.

(10) మోక్షసాధవమైన జ్ఞానము లేనివారని తాత్పర్యము. సంసారులలో నెవ్వడీ రూపముతో దీని నెఱుంగునో వాడు ముక్తుడన్న మాటయే.

(11) వారలకు పరిహరణీయమగు సంసారమును పెంచుకొనుటకు తగిన జ్ఞానమే యున్నదిగాని దానిని బాపుకొనుటకు తగిన జ్ఞానము లేదని భావము.

(12) నివర్తన్తి–ఇది "నివర్తన్తే" యని యాత్మనేపదిలో నుండవలసినదేమైనను ఛన్దస్సు చెడకుండుటకై పరస్మైపదిలో వాడబడినది.

(13) ఈ చక్కదనమనగా :—

అవిచాల్యముగ నాటుకొనిన వాసనకలదగుటచే నే యితర సాధనములచేగాని ఛేదింపబడదు.

(14) ప్రాయశ్చిత్తములుగా నాచరించి యొక్కొక్క కర్మయనెడు వేరును నరికివేసినను అనాదికాలము నుండియు మనోవాక్కాయములచేత తెలిసియును తెలియకను చేసిన పుణ్యాపాపములు పరిపరి విధముల సంపాదింపబడియున్నవని భావము.

(15) అసంగశస్త్రమనగా :—

శంకర భాష్యమున—

పుత్రేషణ–విత్తేషణ – లోకైషణలు లేకుండుట. అదియే బలిష్ఠమైన శస్త్రము. ఆ శస్త్రమునకు మాటిమాటికిని వివేకము అభ్యాసము అనెడు సానపై పదును పెట్టవలెను. మరియు దానిని పరమాత్మాభిముఖ్యనిశ్చయముచే దృఢము గావించవలెను. అట్టి శస్త్రముచే సంసార వృక్షమును సబీజముగా సంహరించవలెను – అని సెలవిచ్చిరి.

రామానుజభాష్యమున :—

గుణమయభోగములలో బొత్తుగ నాశలేకుండుటయనెడు శస్త్రముచేనని సాయించిరి.

దీనికి వేరొక విశేషార్థము కలదు— "అకారార్థో విష్ణుః" అను ప్రమాణముచే అకారమున కర్థమైన విష్ణువుతో సంగము "అ+సంగము". సంగమనగా - సంబంధము.

అది జీవునకు పరమాత్మకును దొమ్మిది విధములుగ నుండును- ఆ సంబంధాను సంధానమే శస్త్రము. ఆ శస్త్రముచే సంసార వృక్షమును ఛేదించవలెను.

ఆ 'శస్త్రము' 'దృఢేన' యనుటచే దానికి మించిన బలిష్ఠమైన శస్త్రము మఱియొకటి లేదని తాత్పర్యము. "నమేభక్తః ప్రణశ్యతి" నా భక్తుడెన్నడును చెడడు.

"రక్షతే భగవాన్ విష్ణుః, భక్తానాత్మ శరీరవత్"— భగవంతుడు తన భక్తులను తన శరీరమును కాపాడుకొనునట్లు కాపాడును—

తేషామహం సముద్ధర్తా ।
మృత్యు సంసార సాగరాత్ ।
భవామి నచిరాత్పార్థ ॥

అట్టి నా భక్తులను సంసార సముద్రము నుండి వెంటనే నేనుద్ధరింతుననెను గదా !

4వ శ్లోకము

తమేవ చాద్యం పురుషం...

ఇచ్చట "ప్రపద్యేత్ యతః ప్రవృత్తిః" అని యొక సరసమైన పాఠము.

"ప్రపద్య– ఇయతః" అని యొక పాఠము. ఇది క్లిష్టమైనది.

మొదటి పాఠమున పరస్మైపది ప్రయోగము ఆర్షము.

రెండవ పాఠమునకు అవతారికలోని ఆశంకకు సాక్షాదుత్తరమగుటచే నొక స్వారస్యము కలదు.

మరియొకరు "ప్రపద్యే" యని ఉత్తమ పురుషగా నన్వయించి "వర్త ఏవచకర్మణి" యనినటులను 'నబుద్ధిభేదంజనయే దజ్ఞానాం కర్మ సంగినాం । జోషయేత్సర్వ కర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరేత్" అనునట్లును తా నాచరించి తన యనుష్ఠానముచే నితరుల ననుష్ఠింప చేయు తాత్పర్యమును వర్ణింతురు.

కాని యీ పాఠమంత ప్రకరణోచితము కాదు.

"యతః ప్రవత్తిః ప్రసృతా పురాణీ".

అను వాక్యమునకు శంకరభాష్యమున—

"యస్మాత్ పురుషాత్ సంసారమాయావృక్ష ప్రవృత్తిః ప్రసృతా =నిస్సృతా, ఐన్ద్రిజాలికాదివమాయా, పురాణీ= చిరన్తనీ" అని అనగా— ఏ పురుషుని నుండి సంసారమనెడు మిథ్యావృక్షము ఐన్ద్రి జాలికుని నుండి వస్తుతః లేని వస్తువులు బయట వెడలుచున్నట్లు బయలు పడెనో అది నేటిది నిన్నటిదిగాదు. అది యనాది యని యర్థము.

దీనికి తాత్పర్యచంద్రికలో నిట్లాక్షేపించిరి—

ఈ శ్లోకము నందలి "యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ"యను శబ్దములు ప్రయోగింపబడుటచే ప్రపంచము సత్యమనియే తోచుచున్న దిగాని మిథ్య యెంత మాత్రమును కాదు.

ఇంద్రజాల దృష్టాంతము శబ్దస్వారస్యముచేతను ప్రత్యక్ష ప్రమాణముచేతను బాధింపబడుచున్నది.

ఇచ్చట నీక్రింది పూర్వపక్ష సిద్ధాంత శ్లోకముల ననుసంధించు కొనవలెను.

శ్లో॥ మానాత్ సిద్ధ్యతు విశ్వమేతదఖిలం । మానంతు సిద్ధ్యేత్ కుతః?
కింస్వేనైవ తథాస్తు తర్హి భువనం । మానేఽపిమానం యది
హాన్త స్యాదనవస్థితిర్ద్విరమతో మేయంచ నస్యాదితి-
క్వాసౌతిష్ఠతి విశ్వమేతదఖిలం సత్యం బ్రువాణో జడః ॥

ప్రమాణబలముచే ప్రపంచము సిద్ధించుచున్నదందువా కానిమ్ము కాని ఆ ప్రమాణమెట్లు సిద్ధించుచున్నది ? అది స్వతస్సిద్ధమే దానికి కారణము నన్వేషించ పనిలేదందువా ? అటులనే ప్రపంచము కూడ స్వతస్సిద్ధమే యనరాదా ! ఇక సృష్టికర్తతో పని యేమి ? అట్లు కాదు ప్రమాణములన్నిటికిని వేరొక ప్రమాణమున్నదందువా ? దానికేమి ప్రమాణము ? మరియొకటి యేదియో యున్నదందువా అనవస్థాదోష ముకాదా ! కాబట్టి యీ బాధల నుండి బాయుటకు ప్రపంచమంతయు మిథ్య యని యంగీకరించుట యొక్కటయే యుపాయము— అని తాత్పర్యము.

సిద్ధాంత శ్లోకము—

శ్లో॥ ప్రత్యక్ష ప్రభృతి ప్రమాణ విదితం సత్యంచభిన్నం జగత్ ।
బాధస్తస్య నకేనచిత్, స్వవిహతేః బ్రహ్మాత్మకం తజ్జగత్ ।
ద్వైతాద్వైత గిరో విభిన్నవిషయాః బాధాయనాలంమిథః ।
పశ్వాలమ్భ నిషేధవాక్యవదతో విశ్వాపలాపః కుతః ॥

ప్రపంచము ప్రత్యక్షాది ప్రమాణముచే సత్యముగా నున్నదని బోధింపబడుచున్నది. అది బ్రహ్మ కంటె వేరైనది. దానికే ప్రమాణముచేతను గాని విరోధము లేదు. ప్రమాణ సిద్ధమైన దానికే బాధను కల్పించినచో శ్రుతి ప్రమాణసిద్ధ బ్రహ్మయే లేడనవలసివచ్చును. అదియే గదా సర్వశూన్యవాది వాదము— జీవబ్రహ్మలకు జగద్బ్రహ్మలకును అభేదమును బోధించు శ్రుతులు భిన్నవిషయములు. అభేదమునకు తాత్పర్యము విశిష్టైక్యము. భేదమునకు తాత్పర్యము శరీరాత్మభావము. ఇట్లు విషయభేదముచే విరోధమును పరిహరించుకొనవలెను. 'నహింస్యాత్సర్వాభూతాని' అని జీవమాత్రహింసను నిషేధించు శ్రుతికిన్ని 'వాయవ్యం శ్వేతమాలభేత భూతికామః' అని హింసను బోధించు శ్రుతికిన్ని భిన్న భిన్న విషయములను గురించినదని పరిహరించుకొన

నిచో నది యున్మత్త ప్రలాపమేయగును గదా! శాస్త్ర విహితమైన హింస హింసకాదు. దానిని చేసినను దోషము లేదు, అట్లు కానిది పాపము. అదియే 'నహింస్యాత్త'ను శ్రుతిచే నిషేధింపబడుచున్నది. కాబట్టి ప్రపంచమును లేదనరాదు.

5వ శ్లోకము

(18) ఇచ్చట పదం అనగా—

'పద్యతే ఇతి పదం' = పొందబడునది. పరమాత్మవలెనే పరిశుద్ధాత్మయును పొందగినదగుటచే పదమనబడుచున్నది. 'ప్రాపణీయస్త్వధైవాత్మా। ప్రక్షీణా శేషభావనః' అనగా-

బ్రహ్మభావనా - కర్మభావనా - ఉభయభావనా - యను మూడు భావనలు కలవు. ఇవి లేని యాత్మస్వరూపమును ప్రయత్నముచే బడయవలెను. అని.

మమధామ' యని చెప్పబడినవానికే 'మమైవాంశ' యని సంసార దశ చెప్పబడినది. అట్లు కానిచో పరస్థానమును జెప్పిన తరువాత 'మమైవాంశ' యని బద్ధావస్థలోనున్న జీవునిగురించి చెప్పుట సంగతము కాదు.

(19) ఈ యాత్మజ్ఞాన నిరతి - యోగకాలమున నవిచ్ఛిన్నముగను ఉత్థాన (యోగము నుండి లేచిన) కాలమున ప్రాచుర్యముగాను నుండవలెను. మిక్కిలి యభీష్టమైన స్వాత్మజ్ఞానమునందు మిక్కిలి విశేషించి యాసక్తి కలవాడైనచో నితర కామములన్నియును తొలంగిచనును.

ఇచ్చట 'వినివృత్తకామత్వ' మనగా కామము బొత్తుగ తొలంగి యుండుట అనగా - విషయములు దగ్గరగ నున్నను సరకుగొనకుండుట.

(20) అనుకూల ప్రతికూల స్వభావములచేతనని యర్థము.

ఇయ్యది ఉపాయదశను చెప్పుటలో ద్వంద్వమును సహించుటను

చెప్పుటయును ఫలదశను చెప్పుటలో దుఃఖము బొత్తుగ లేకుండుటను జెప్పుటయును.

(21) అవ్యయం — వ్యయములేని. వ్యయమనగా — ఆత్మలు నిర్వికార స్వరూపము కలవిగాన నిచ్చట జ్ఞానసంకోచము జ్ఞానవికాసమే వ్యయమనబడును. అది లేనిది అవ్యయము.

6వ శ్లోకము

(22) వెలుంగునొసంగు పదార్థములేవియు దీనిని ప్రకాశింప జేయజాలవు. అని చెప్పుటకు తచ్ఛబ్దమున కిట్లర్థము జెప్పబడినది. దీనిని సూర్యుడు మొదలగునవి ప్రకాశింపజాలకపోవుట వావి స్వభావములు వేరు వేరగుటచేతనే ఈ శ్లోకము జీవాత్మను గూర్చినదని జెప్పవలెను. ఏమనగా—

తచ్ఛబ్దము ప్రకృత పరామర్శి. అనగా వెనుక చెప్పబడిన వస్తువునే తెలుపునది. వెనుక చెప్పబడినదేది ?

"పదమవ్యయం తత్" అని గదా క్రిందటి 5వ శ్లోకములో చివర కలదు. అది పరిశుద్ధాత్మ స్వరూపమనియే చెప్పవలెను. దానినే యీ తచ్ఛబ్దము పరామర్శించుచున్నది. గాన నీ శ్లోకము జీవపరమని యే సిద్ధాంతము.

(23) జ్ఞానమే యన్నిటిని ప్రకాశింపజేయునదియైనచో బాహ్య వస్తువులను ప్రకాశింప జేయుటకు సూర్యాదు లేల ? ఆ జ్ఞానమే యాపనిని గూడ జేయవచ్చునే ! అట్లైనచో సూర్యాదులను ప్రకాశకులననేల ? అనగా చెప్పుచున్నారు— బాహ్యములైన ఇత్యాది.

(24) ఇట్లన్నిటిని ప్రకాశింప జేయు నాత్మజ్యోతి స్వయముగ నేల ప్రకాశించదు. మరి యది దేనిచే ప్రకాశింపజేయబడును? అనగా చెప్పుచున్నాడు. "ఆత్మను" అని ఉత్తరము— ఆత్మ స్వయంప్రకాశమైనను దానిని ఉన్నిరూపములో సమగ్రముగా నెఱుంగవలెనన్న యోగ మొక్కటియే దాని కుపాయము.

ఇతరము లేవియును దీనిని ప్రకాశింప జేయలేవన్నంత మాత్రముచే నిది అసలే యెఱుకపడదని తలంచరాదు. "విశేషనిషేధః శేషాభ్యనుజ్ఞాపర" మను న్యాయముచే కొన్నిటిని నిషేధించిన మిగిలినవి సిద్ధించునని గ్రహించవలెను. అనగా సూర్యాదులు ప్రకాశింప చేయజాలరనగా యోగము ప్రకాశింపజేయునని చెప్పవచ్చును.

(25) ఈ యోగమందరకు నేల సిద్ధించదనగా జెప్పుచున్నారు. 'ఆ యోగమునకు' సాంసారిక కర్మ, యోగమును బుట్టనీయదని దీని భావము.

(26) అయినచో నెవ్వరికిని సిద్ధించదాయన్నచో చెప్పుచున్నారు "ఆ కర్మమును".

(27) పరమగు జ్యోతి నాదియే ఇది "ధామ" శబ్దార్థము— ఈ శ్లోకమునందలి "ధామ" శబ్దము వెనుకటివలె నియమన స్థానము కాదు కాని సూర్యాదు లపేక్షలేదనుటచే ఆత్మస్వరూపము ప్రకాశాత్మకమైనదని సిద్ధించుటచే జ్యోతిరని యర్థము చెప్పబడినది.

(28) ఇచ్చట మమ=నాదియే యని తన సంబంధమును విధించుటచే ముక్తిదశలో జీవునకు పరమాత్మతో పరమసామ్యము సిద్ధించుటచే స్వాతంత్ర్యము కూడ సిద్ధించునోయను శంకను పరిహరించుటచే సార్థకమే—

(29) ముందు 7వ శ్లోకమున జెప్పదలచిన 'మమైవాంశః' అనుటకు కారణము ఈ శ్లోకమున చెప్పబడినదని సూచించుచు సంబంధ సామాన్యార్థములో ప్రయోగింపబడిన షష్ఠీ విభక్తికి విశేషార్థములో పర్యవసానమును తెలుపుచున్నాడు— 'నావిభూతియైనది' అని.

ఇచ్చట విభూతి యనగా యజమానునకు యిల్లు భూమి వంటిది కాదు. మరి ధర్మినొకప్పుడును విడువక ఆశ్రయించియే యుండు విశేషణాంశమని తెలియవలెను (అపృథక్సిద్ధ విశేషణము).

ఇచ్చట నొక విషయమును గ్రహించవలెను—

నిరవయవమగు (అవయవములు లేని) నొక వస్తువు నొకదానికి అంశ యనరాదు. ఒక వస్తువులో నొక భాగమునకు అంశయని పేరు. అంశాంశి భావము అ రెండింటికిని భేదమునే సాధించును. ఆకు చెట్టులో నొక అంశమైనను ఆకునకును చెట్టునకును భేదము లేదా ? రెండింటికిని (అంశాంశులకు) భేదమే లేకున్న యేది యంశ ఏది యంశి యని నిర్ణయించుటెట్లు? ఒకే వస్తువును (అభిన్నమైన దానిని) తనకు తానే యంశ యని పిచ్చివాడైనను అనడు గదా. లేదా— ఒక వస్తువునకు భేదమును అభేదమును చెప్పుదమన్న నది లోకసమ్మతము కానేరదు. అది పరస్పర విరుద్ధమును బహుశ్రుతి విరుద్ధమును—

'పాదోఽస్య విశ్వాభూతాని' సకల ప్రాణులను భగవంతునికొక పాదము. 'తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్'' ఆ భగవంతుని యవయవ భూతములగు సకల పదార్థములచేతను యీ ప్రపంచ మంతయు వ్యాపింపబడి యున్నది. ఇత్యాది శ్రుతులలో సూచింపబడిన అంశత్వము విశిష్ట వస్తువునందలి విశేషణమనియే గ్రహించవలెను— ఈ విషయము— అంశాధికరణమునందలి 'ప్రకాశాదివత్తు నైవంపరః' అను సూత్రమున నిర్ణయింపబడెను.

ఆ సూత్రమున— అంశయనగా నొక ద్రవ్యమునందలి యొక భాగమే గదా ! కాబట్టి జీవుడు బ్రహ్మలోని యొక యంశగాన జీవుని యందున్న దోషములన్నియును బ్రహ్మయందున్నట్లేగదా ! అని ప్రశ్నించగా— సూత్ర మాశంకను పరిహరించుచున్నది.

జీవుడు బ్రహ్మాంశమైనను ఆతని స్వరూప మాతనిదే. ఆతని స్వభావ మాతనిదే. పరమాత్మస్వరూపము పరమాత్మదే. పరమాత్మ స్వభావము పరమాత్మదే. ఆతడెల్లప్పుడును, దోషరహితుడును, సర్వజ్ఞుడును. సత్యసంకల్పుడునే. అది యెట్లనగా — ప్రకాశాదివత్

వెలుగుగల దీపాదుల కాంతి దీపాదులలో నొక యంశయగునటుల జీవుడును చేతనాచేతన విశిష్టమగు పరమాత్మలో నొక యంశ యనబడును.

విశేషణములు (ధర్మములు)విశిష్టమగు (విశేషములతో గూడిన) వస్తువునందలి యొక భాగమగుటచే దాని యంశలనబడినను ధర్మ–ధర్ములకు స్వరూప - స్వభావములలో గల భేదములుండుటలో విరోధ మేదియును లేదు. 'యఆత్మని తిష్ఠన్ ఆత్మనోన్తరో యమాత్మానవేదః యస్యాత్మాశరీరం' అని శ్రుతి యీ యర్థమునే చెప్పుచున్నది.

అత్యంత భిన్నులగు జీవేశ్వరులు విభూతి– విభూతిమాన్ అనెడు ధర్మమును పురస్కరించుకొని విశిష్టమున కైక్యమును జెప్పినను విశేషణమైన జీవుని నిష్కృష్ట స్వరూపమును నిరూపించునపుడు ప్రధానమగు నీశ్వరుని కంటె భిన్నముగా నంశయనియే చెప్పబడును. "తద్ధామ పరమంమమ" అని ధామకుపరమం అని విశేషణము. ఈ పరమత్త్వము ఆపేక్షికము. ఆనగా సన్నిహిత ఆదిత్యాది జ్యోతుల కంటె గొప్పదని మాత్రమే యర్థముగాని నిరంకుశపరత్వముగల పరమాత్మకంటె గొప్పదని యర్థము కాదు.

7వ శ్లోకము

(30) నీవు చెప్పినట్లు జీవులు నీ విభూతులగుటచే నీ యంశలేమైనచో నిత్య సూరులవలె నందరకును పరిశుద్ధాకారమేల లేదు– అను ప్రశ్న కుత్తరమును జెప్పుచున్నాడు. బద్ధుడును విభూతియే అయినను బద్ధులనియు ముక్తులనియు విభాగమునకు కారణమును వినుమని చెప్పుచున్నాడు.

10వ శ్లోకము

(31 ఎ) నాస్తిక వాదము:—

యన్నాస్త్యేవ తదస్తి వస్త్వితి మృషాజల్పద్భిరేవాస్తికైః ।
వాచాలై ర్బహుభిశ్చ సత్యవచసో నిన్దాంకృతానాస్తికాః ।

హంహోపశ్యత తత్వతోయది పునశ్చిన్నాదితో వ్వర్ణనః।
దృష్టః కిం పరిణామ రూపిత చితిఃజీవః పృథక్త్కైరపి॥

అనగా- అస్తికులము మేము అనేకులముగదా. మాకు నోరున్నదిగదా యని బొత్తుగాలేని వస్తువులన్నియును ఉన్నవని యసత్యములను వదరుచు ఉన్నదానినున్నట్లు చెప్పు సత్యవాదులైన నాస్తికులను బుకాయించుచు నిందించుచుందురు.

ఈయొక్క విషయము నారయుడు. జీవు డనగా పృథ్వివ్యాది నాలుగు భూతముల సమ్మేళనచే నేర్పడు దేహమే యని మే మందుము. ఈసమ్మేళనముచే నేర్పడు జ్ఞాన మను ధర్మమొకటి. దానియందు బుట్టుచే గిట్టుచు నుండును. అట్లుకాదేని శరీరములో నేయేపదార్థములున్నవని మే మందుమో వాని నన్నిటిని మేము కోసి చూపింతుము. మీ రున్నదన్న ఆత్మను మీ రట్లు చూపగలరా? మీలో నెవ్వరైనను ఎప్పుడైనను జూచితిరా ? యందురు.

దాని నీ శ్లోకమున భగవానుడు చక్కగ పరిహరించుచున్నాడు. చూడుడు— పుట్టుగ్రుడ్డివాడు తనకు కాన్పించకుండుటచే తనముందున్న వానినే లేవన్న నవి పోవునా? అటులనే శాస్త్రిములయందు విశ్వాసము లేని నాస్తికులు లేదన్నంతమాత్రమున ఆత్మపదార్థము లేకపోవునా ? నీటిలో కరిగిపోయిన ఉప్పును కంటితో చూచి చేతితో తడిమి లేదన్న మాత్రమున పోవునా? నాలుకతో చూచినవాడు లేదనగలరా? అటులనే ఆత్మ కంటికి కాన్పించు వస్తువుకాదు ఆత్మయున్నదని చెప్పుచున్న శాస్త్రిమే దానిని జూచు ఉపాయమును గూడ చెప్పుచున్నది. అది ఇతరేంద్రియములకు గోచరము కాదు. అష్టాంగ యోగవిశుద్ధమైన మనస్సునకే యది గోచరించును. ఆ సాధనము లేనివాడు కన్నులు లేనివాని వలె గ్రుడ్డివాడే యని చెప్పబడును. వాడు లేదన్నంత మాత్రముచే నది యదృశ్యముకాదు. నీకాసాధనములను సమకూర్చుకొను శక్తి లేనిచో

నవి కలవారు చూచి చెప్పుచున్న మాటను నమ్మును. గ్రుడ్డివాడెప్పు డును "పరప్రత్యయనేయ బుద్ధియే" గదా! ఒకడు చెప్పగా విని గ్రహిం చవలసినవాడేగదా! నీవు విదేశములలో నున్నప్పుడు నీభార్య నీయింటి యొద్ద సుఖప్రసవమై పిల్లవానిని కన్నదని నీయాప్తుడు నీకు పసుపు అం టించి వ్రాసిన ఉత్తరమును చూచి నీవు చూడకున్నను సమ్మతించు చున్నావా? లేదా ? అటులనే శాస్త్రిములునూ ఆప్తవచనములే. నమ్ముము— అని సూచించుచున్నాడు.

12వ శ్లోకము

(31 బి) ఆత్మజ్యోతిని తనకు విభూతినిగాజెప్పి యిప్పుడు దానిని ప్రకాశింపచేయిజాలని సూర్యాది ప్రాకృతజ్యోతులనుకూడ తనకు విభూ తులునుగా జెప్పుట సమంజసమే. ఒకరి తేజస్సు ఒకరి కెట్లువచ్చును? కాన వారిచే నారాధింపబడి నేనే ప్రసన్నుడనై నా తేజస్సులోని యల్పాంశ మును వారికిచ్చితినని చెప్పుచున్నాడు. ఈ విషయము

'యేనసూర్యస్తపతి తేజసేద్ధః'

'ఏశ్రియఃపతి ప్రసాదించిన తేజస్సును బడసి ప్రకాశించుచు సూర్యుడు మనకు వేడిని వెలుంగును యిచ్చుచున్నాడో' యనియు

'యస్యాదిత్యోభా ముపయుజ్యభాతి'

'ఎవ్వాని తేజస్సు నాధారముగాగొని సూర్యుడు వెలుంగు చున్నాడో' యనియు

'నతత్ర సూర్యోభాతి నచన్ద్రితారకం
నేమావిద్యుతోభాన్తి కుతోఽయమగ్నిః
తస్యభాసా సర్వమిదం విభాతి'

ఆ పరంజ్యోతిని పగటిని వెలిగించు సూర్యుడుగాని రాత్రిని వెలుగునిచ్చు చంద్రుడు నక్షత్రాదులుగాని ప్రకాశింపచేయజాలరన్న కని

అగ్నియా ప్రకాశింపకజేయును? ఆతడు దయతో నొసంగిన తేజఃకణము చేతనే సూర్యచంద్ర నక్షత్రవిద్యుత్తులు (మెరుపులు)ప్రకాశించుచున్నవి.

కావున సకల పదార్థములును వస్తుతః పరమాత్మకు శేషభూత ములై (యథేష్టవినియోగార్హములై)వారివారి పుణ్యకర్మానుసారముగ నాతడు సంకల్పించుటచే నే కొలదికాలమో యితరులకును శేషభూతము లగుచున్నవి.

శంకరభాష్యమునను యిటులనే వ్యాఖ్యానమును గావించి పక్షాంతరముగా— తేజశ్శబ్దమునకు చైతన్యాత్మకమైన జ్యోతిస్సుగా నర్థము చెప్పబడినది.

"అథవా యదాదిత్యగతం తేజః" చైతన్యాత్మకం జ్యోతిః' అని

ఇది యంతసంగతముగ లేదని (శ్రీ)దేశికులు వివరించిరి.

సూర్యుని చైతన్యము సమస్త జగత్తు నెట్లు ప్రకాశింపజేయును? సూర్యునియందున్న చైతన్యమాతనికే యుపకరించునుగాని యది మనకు ఘటపటాదుల జ్ఞానమున కెట్లుపకరించును ? కుండ అద్దము రెండును పృథ్వీతత్వము లేయైనను అద్దమే ప్రతిబింబమును గ్రహించునటుల నంతటనుండు చైతన్యమొక్కటియేయైనను సూర్యునియందు సత్వగుణ మధికముగానుండుటచే దానిచే చైతన్యమభివ్యంగ్యమై యన్నిటికిని ప్రకాశింపచేయుననుటయును సమంజసముకాదు. వారి మతమున చైతన్య మొకదానిచే అభివ్యంగ్యమనుట యొప్పదుగదా!

## 13వ శ్లోకము

(32) ఇట్లే సమస్త పదార్థములయొక్కయు నాయాప్రత్యేక ప్రత్యేక కార్యములను నిర్వహించు శక్తియంతయును భగవదధీనమే గాన— 'భూమికి ధారకత్వశక్తి (అన్నిటిని మోయుట), చంద్రునకు సస్యములను పెంచుశక్తి, అగ్నికి ఉడికించు శక్తిలేక జఠరాగ్నికి తినిన

పదార్థములను జీర్ణమొనరించు శక్తియును భగవదధీనమేయని చెప్పు చున్నాడు.

ఇట్లు చెప్పక తన శక్తినిమాత్రమే చెప్పుచున్నాడన్నచో ప్రస్తుత ప్రకరణ మసంగతమగును. ఈవిషయమునే యీ క్రింది శ్రుతులు తెల్పు చున్నవి.

'యేనద్యౌరుగ్రా పృథివీచదృఢా'

"పరమాత్మ అంతర్యామిగానుండి తన శక్తి నుపకరించుటచేతనే ఉపరి తనలోకములున్ను భూమియున్ను శిథిలముకాకయే స్థిరముగ నుండ గల్గుచున్నవి" అని

"సదాధార పృథివీంద్యా ముతేసూం"

ఈ భూమిని ఆకసమును ఆ భగవంతుడే ధరించి నిలబెట్టియుం చినాడనియు,

"ఏతస్యవా అక్షరస్య ప్రశాసనేగార్గి ।
ద్యావాపృథివ్యౌ విధృతేతిష్ఠతః ॥

అ పరమాత్మ భూమ్యాకాశములను ధరించుట తన సంకల్పము చేతనే యనియును తాత్పర్యము.

15వ శ్లోకము

(33) అన్తః ప్రవిష్టః— ప్రాణులందరియొక్క హృదయముల యందు ప్రవేశించియుండి భగవంతుడు వారిని కర్మానుగుణమున ప్రవ ర్తింపజేయుచుండును.

(34) భగవంతుడు భూమి కంతర్యామిగానుండి దానిచే తెలియ బడక దానిని తనకు శరీరముగా కలిగియుండి దానిని నియమించును.

(35) భగవంతుడు జీవుని లోనుండి వానిచే తెలియబడక వానిని తనకు శరీరముగా కలిగియుండి వానిని నియమించును.

(36) హృదయము తామర మొగ్గ ఆకారముగ క్రింద ముఖముగా నుండును. దానిలో పరమాత్మ యుండును.

(37) ఈ శరీరము పరమాత్మకు పురమువలె నివాసస్థానము. దీనిలో నల్పమగు తామరపువ్వువంటి హృదయము కలదు. అందు పరమాత్మ నివసించుచుండును.

(38) శాస్త్రావిష్ణుః:— హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుని "నీకీబుద్ధి గురువులుపదేశించినదికాదుగదా! నీకిది యెవరివలన లభించిన"దని యడుగగా—"నాయనా! భగవంతు డంతర్యామిగా లేనిపదార్థమొక్కటియును లేదు. ఆతడు శత్రువగు నీలోను భక్తుడనగు నాలోను సమముగనుండి మనలను కర్మానుగుణముగ సద్బుద్ధినో దుర్బుద్ధినో పుట్టించి ప్రవర్తింపజేయుచుండు"నని చెప్పెను.

(39) పరమాత్మ సూక్ష్మాతిసూక్ష్మ పదార్థములలోకూడ ప్రవేశించియుండదగినంత సూక్ష్మముగా నుండును. అనగా— ఆయన ప్రవేశము నడ్డగల పదార్థము లేదు. కాబట్టి యాతడన్నిటిలో నంతర్యామిగా నుండి దానిని శాసించును.

(40) అందఱను కర్మానుగుణముగ నియమించువాడు సూర్యమండలాంతర్వర్తి. ఆ దోషములు తన కంటక నిరంతరము ప్రకాశించుచునే యుండును. అట్టివాడు నీహృదయములోనే యున్నాడు. ఆయనతో కలహింపకున్న నీకు చాలును. దానిచే నీకు నీపాపములుపోయి పుణ్యనదులలో మునిగిన పుణ్యమున్ను పుణ్యక్షేత్రముల సందర్శించిన సుకృతమున్ను కరతలామలక మగును.

ఆయనతో కలహించకుండుటయనగా— "నేను స్వతంత్రుడను" అను బుద్ధిని విడిచి "నేను నీ దాసుడను" అను బుద్ధి యుండుట. కలహించని ప్రహ్లాదుడు తరించెను. కలహించిన హిరణ్యకశ్యపుడు నశించెను.

"వేదవిదేవచాహమ్" అనుచోట ఏవకారమును వేదవిత్ శబ్దముతోగాక "అహం" శబ్దముతో నన్వయించవలెను.

ఎందువలననగా:—

ఏవకారము— విశేష్యముతో చేరిన ఏవకారము విశేషణముతో జేరిన ఏవకారము, క్రియతో జేరిన ఏవకార మని మూడు విధములు— విశేష్యవాచకపదముతో చేరిన ఏవకారమునకు అన్యయోగవ్యవచ్ఛేదము అర్థము. యోగమనగా సంబంధము. వ్యవచ్ఛేద మనగా— నిరసించుట.

ఒక ధర్మమొకనికే అసాధారణముగ చెప్పదలంచినపు డాధర్మము ఇతరులకుకూడ ప్రాప్తించునని తోచినచో ఆవిశేష్యవాచక పదమునకు ఏవకారమును చేర్చవలెను. అప్పుడది యాధర్మము నితరులకు చెందకుండగ కాపాడును. ఉదా:— 'పార్థ ఏవ ధనుర్ధరః' ఇచ్చట అర్జునుడొక్కడే ధనుర్ధరుడుగాని యితరులుకారని యాధర్మమును యితరులకు సంబంధించకుండ చేయుటకై 'పార్థ ఏవ' అని 'ఏవ' కారము విశేష్య వాచకపదముతో చేర్చబడెను.

శఙ్ఖః పాణ్డుర ఏవ- ఇది విశేషణసంగత ఏవకారము. ఇది అయోగ వ్యవచ్ఛేదకము- అనగా నొకదానికుండవలసిన ముఖ్యధర్మము దానికి లేకపోవుట సిద్ధించునపుడు దానిని పరిహరించుట కిట్లుప్రయోగింపబడును.

పై ఉదాహరణలో— కామిలదోషముగలవాడొకడు శంఖము పచ్చగానున్నదనును. దానిచే శంఖమునకుండవలసిన సహజమైన తెలుపు లేకపోవుచున్నది. ఆదోషమునీ ఏవకారము నిరసించును. శంఖము తెలుపే గాని పసుపు కాదనును.

క్రియాసంగత ఏవకారమునకు అత్యంతాయోగవ్యవచ్ఛేదమర్థము. అనగా నొకదానికి సహజమైన ధర్మము దానికి సిద్ధించకపోవునను శంక పొడమినపుడిది ప్రయోగింపబడును,

**ఉదా:—** నీలముత్పలం భవత్యేవ.

ఉత్పలమనగా నల్లకలువ. దాని కారంగు సహజము. ఏపరిస్థితి లోను నది మారదు. ఆ సంగతిని తెలుపుటకు దీనివి ప్రయోగింతురు.

ప్రస్తుత శ్లోకమున 'వేదవి దేవచాహం' అనుచో ఏవకారము విశేషణవాచక పదముతో చేర్చబడుటచే భగవంతుడు వేదవేత్త కాడను శంకను పరిహరించుటకని ప్రయోజనమును చెప్పనలసియుండును. సర్వ జ్ఞుడగు బ్రహ్మకు సృష్ట్యారంభమున స్వయముగ వేదోపదేష్టయగు భగవంతునిపట్ల ఆశంకకే అవకాశములేదు. కాబట్టి— 'వేదవిచ్చ అహ మేవ' అని ఏవకారము విశేష్యవాచకముతో చెప్పబడినది. దీనిచే నిక ప్రపంచములో వేదవేత్తయే లేడని అన్యయోగవ్యవచ్ఛేదములో తాత్పర్యము.

(42) "సర్వస్యచాహం హృదిసన్నివిష్టః"

"నేను సమస్త భూతములయొక్క జ్ఞానోదయ ప్రదేశమైన హృద యమునందు ఆత్మరూపముగా వేంచేసియున్నాను".

మానవుడు బాగుపడవలెననిన యీ నిశ్చయమొక్కటియున్న చాలును. భగవంతుడు సర్వశక్తికలవాడను విశ్వాసమున్న వానికి నమ్మి కమున్న తరించుటకు వేరొక ఉపాయము నన్వేషించు అవసరములేదు. పుణ్యకర్మను చేసినను పాపకర్మ చేసినను ముందు దానిని చేయవలెనని మనస్సులో సంకల్పించిగదా చేయవలెను. ఆ సంకల్పించు స్థానమైన హృదయమునందే సర్వజ్ఞుడును సర్వశక్తియును అగు సర్వేశ్వరుడు కూర్చుని కనిబెట్టుచున్నాడనగా నిక చెడుబుద్ధులెట్లు పుట్టును?

"వాచికైః పక్షిమృగతాం, మానసై రన్త్యజాతితామ్
శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః"

మానవుడు మాటలతో చేసిన పాపమునకు మాటలాడజాలని పక్షిగనో పశువుగనో పరమపురుషుడు సృష్టించును. మనస్సున దుస్సం

కల్పములు గావించిన వానిని నీచాతినీచ జన్మలో బుట్టించును. శరీరముతో పాపముల నొనరించిన వానిని యింద్రియములులేని చెట్టుగనో పుట్టగనో బుట్టించును. ఈతత్త్వము నెఱింగినవా డిక పాపచింతన నెట్లు చేయును? ఆ సంకల్పములేనిచో పాపకర్మలను చేయుట యెట్లు? ఆయన అక్కడనే కూర్చుని కనిపెట్టుచున్నాడను నమ్మకమున్నచో నాతనిని ప్రసన్నుని జేసుకొనుటకు ఆతనిని ధ్యానించియు నర్చించియు నాతని కభీష్టమగు కర్మలనే చేయుచు నాతని స్తోత్రములనే పఠించుచు పొద్దు పుచ్చునుగదా! అట్టితరి పాపము పారిపోక నిలచునా? ఆతని నిగ్రహామే కదా పాపము. ఆ శ్రియఃపతి యనుగ్రహామేగదా పుణ్యము. అట్టి సర్వశక్తి సృష్టి సంహారకారకుడైన శ్రియఃపతి యనుగ్రహామునకు పాత్రుడైన నిక లేనిదేమున్నది?

(43) ఈ శ్లోకమున– "ఊహానం" అను పదమునకు "అధ్యాహార స్తర్కఊహాః" అను కోశానుసారముగ 'తర్క' మని యర్థము. ఇది ప్రమాణజ్ఞాపకమునకు సహకారి. అది ఆయా ప్రమాణముల కాయా విషయములలో నుపయోగించు యోగ్యతను తెలుపును. ఉదా-ప్రత్యక్ష ప్రమాణము– రూపమును దాని కాశ్రయమగు వస్తువును దానియందుండు జాతిని సంఖ్యను ఇంకను కంటికి కనిపించదగిన పదార్థమును తెలుసుకొనుట కుపయోగపడునని యీ తర్కము తెలుపును.

## 16వ శ్లోకము

(44) కూటస్థః—— ఈ పదమనేక సంతతికి మూలపురుషుడను నర్థములో వాడబడును.

ఆ త డిచ్చట పరమాత్మకాడు.

'ఉత్తమః పురుష స్త్వన్యః' అని యాతడు వేరుగా చెప్పబడు చున్నాడుగదా!

హిరణ్యాగర్భుడునుకాడు– ఆతనికి దేహాసంబంధముండుటచే క్షరుడనియే చెప్పబడునుగాని యాత డక్షరుడు కానేరడు. ముక్తాత్మయును

ముక్తాత్మయును కాదు. ఆ శబ్దమునకు ముక్తుని యందు ముఖ్య ప్రయోగము నెచ్చటను గానము. కావున యోగవృత్తి ననుసరించి ముక్తాత్మపరముగ నర్థమును చెప్పవలెను.

( 5 ఎ) "లోక్యతే- వస్తుతత్త్వమనేనేతిలోకః"— వస్తువుల నిజస్థితి నెఱుంగుటకు సాధనమగు శాస్త్రమని యర్థము.

క్షరాక్షరముల నెఱింగించు శాస్త్రమేది యనగా-

'అజామేకాం లోహిత శుక్లకృష్ణాం
బహ్వీం ప్రజాం జనయంతీం సరూపామ్
అజోహ్యేకో జుషమాణోఽనుశేతే
జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః.

నిత్యమగు ప్రకృతి ఎరుపు తెలుపు నలుపు రంగులుగల రజస్సత్వ తమోగుణములు కలది. దాని వలన బుట్టిన వికారములన్నియు నాగుణములనే కలిగియుండును. నిత్యమైన జీవు డాప్రకృతి ప్రాకృత పదార్థములయందు భోగ్యతాబుద్ధి కలవాడై ప్రీతితో దాని ననుభవించు చుండును. భోగహేతువగు కర్మ నశించగనే దానిని విడిచిపోవును.

(45 బి) పరమాత్మకు చేతనులతో భేదమా? అభేదమా? యను శంకయుండుటచే భిన్నుడనియే శాస్త్రము తెలుపుచున్నదిగాన దాని నిచ్చట విధించవలసియున్నది. ఈ శ్లోకములో 'అన్యః' అను పదముచే నా విషయమును విధిపూర్వకముగా తెలుపుచున్నాడు.

(46) లోకత్రయమనగా- భూర్లోక- భువర్లోక- సువర్లోకము లని లోకత్రయముగాగాని- స్వర్గమర్త్య పాతాళలోకత్రయపరముగా గాని యర్థమును చెప్పినచో చెప్పదలంచిన యర్థము సిద్ధించదు. చెప్ప దలంచిన యర్థమేమనగా- క్షరాక్షరము లనబడు బద్ధ- ముక్తాత్మల కం టెను పరమాత్మ భిన్నుడనియే- అందులకై ఈ శ్లోకమున చెప్పబడిన

వ్యాప్తియు, ధారణయు, సకలాచేతనములవరకే గాక సమస్త చేతనముల వరకును పర్యవసించును. అప్పు డీ పరమాత్మత్వము సిద్ధించును. లోకశబ్దమునకు రూఢ్యర్థమునే గ్రహించిన నది సిద్ధింపదు. కావున యౌగికార్థమును జెప్పి అచేతనము, దానితో కూడియున్న చేతనులు— దానినుండి విడువడిన ముక్తులు అని యర్థము చెప్పబడినది. లోకశబ్దముచే నందున్న పురుషులనియు 'మంచాః క్రోశన్తి' వలె లక్షణముచెప్పుట కన్నను యీయౌగికార్థ గ్రహణమే సముచితము. 'లోక్యత ఇతిలోకః' అను వ్యుత్పత్తిచే తెలియబడునది. అనగా— ప్రమాణముచే తెలియదగినది అని యర్థము. బద్ధులును ముక్తులును చూడబడరుగదా! వారికి లోకశబ్దముయొక్క యౌగికార్థమెట్లు ఘటించుననగా— 'ప్రమాణావగమ్యములైనవి' అనబడెను.

(47) ఆవిశ్య— బిభర్తి— అవ్యయ— ఈశ్వరః— అను నీవిశేషణములచేతను— పైన విధింపబడిన అన్యత్వమే (భేదమే) సమర్థింపబడుచున్నది.

ఆవేశ—భరణ— ఈశ్వరత్వములకు కర్త భగవంతుడును— కర్మ— చేతనాచేతనములును కావున వాని కీ భేదము తప్పదు.

(48) యోగ్యతయనగా—సహకారి సామగ్రియున్నచో పుట్టుట— లేనిచో లేకుండుటయును. ఇది ముక్తులకును కలదు – ఆ సామగ్రి కర్మయే.

### 18వ శ్లోకము

(49) వాని స్వభావము లేశమైనను లేనివాడనో.

(50) ఇచ్చట 'లోక' శబ్దము— 'లోకస్తు భువనేజనే'— యను కోశానుసారముగ భువనపరముగాని యందుండు జనము పరముగాని కాదు. ఏలననగా—

అది ప్రకృతమైన యీ 'పురుషోత్తమ' శబ్దనిరుక్తికి ప్రమాణమగుటకు సావకాశము బొత్తుగ లేదు. కావ్యాదులలో ప్రయోగపాఠ్రిచు

ర్యముఁను తెలుపుననుటయు సంగతముకాదు. అట్లు చెప్పుటలో గొప్ప స్వారస్యము గాన్పించదు.

(50) కాబట్టి 'వేదేచ' అని వేదముతోకూడ వాడబడిన లోక శబ్దము గాన దాని యడుగుజాడలలో వర్తించు 'స్మృతి'యని యర్థమును జెప్పవలెను. అట్టితరి 'లోక్యతే అనేన పదార్థః' దీనిద్వారా వేదార్థమును నిర్ణయించుకొనవచ్చునని తెలియుచున్నది.

'ప్రాయేణ పూర్వాభాగార్థః
ధర్మశాస్త్రేణ కథ్యతే'

ఇచ్చట నొక ముఖ్యాంశమును గమనించవలెను. "శ్రూయతే నిత్యమితి శ్రుతిః" సదా వినబడునదియే యగుటచే వేదమునకు "శ్రుతి" యని పేరు— అనగా-దీనిని పుస్తకములను జూచి కావ్యములవలె చదువ రాదు— గురుముఖతః విని నేర్చుకొనదగినదని యెఱుంగవలెను. దీనిచే వేదమున కపౌరుషేయత్వమున్ను అందుచే దోషరాహిత్యమున్ను సిద్ధించుటచే దీనిలో జెప్పబడిన ప్రతి యంశమున్ను ప్రమాణమే.

సమస్త వేదములను చదువుకొని తదుక్త సకలార్థముల నెవ్వరెఱుంగగలరు? అల్పజ్ఞులైన మానవులును తెలియశక్యముకాని సమస్త శాఖలలో, నిగూఢమగు నర్థముల నెఱుంగజాలరు గాన వాని నెఱిగించుటకై ఆయర్థములనన్నిటిని సంగ్రహించిచేర్చి వేదార్థములను విశదీకరించుచు పరమాప్తులగు మన్వాదులచే రచింపబడినవి గాన వాని మూలముగ వేదార్థము నెఱుంగుట యుక్తమే.

(51) ఈశ్లోక మీయధ్యాయమునకు ఈపేరుంచుటకు నిదానమైనది. ఇది గుహ్యతమమని పరిగణింపబడి దీని నెఱుంగుటకు ఫలముకూడ చివర శ్లోకమున చెప్పబడినది.

క్రిందటి శ్లోకమున శ్రుతిస్మృతులలో ప్రసిద్ధమైన 'ఈశ్వర' 'పురుషోత్తమ' యను పేరులనుబట్టియు, 'అవ్యయః బిభర్తి'యనువాని భావ్య

ర్థములనుబట్టి "సమాఖ్య" యను తాత్పర్యలింగముచే నారాయణునకు చేతనాచేతనముల కంటె భేదము స్థాపింపబడినది.

ఈ శ్లోకమునను అట్టి మరియొక సమాఖ్య (పేరు) చేతనే స్థిరీకరింపబడుచున్నది. ఈ సమాఖ్య వెనుకటి శ్లోకమునందలి "ఉత్తమఃపురుషః" అను దానిచే జ్ఞాపకము చేయబడినది. "ఈ ప్రదేశము నిప్పుకలది గాన పొగకలది" యని సాధ్యమునే (నిప్పునే) సాధనమునకు (పొగకు) కారణముగా చెప్పినటుల ఈ శ్లోకమునందును "నేను వెనుక చెప్పబడిన హేతువులచే బద్ధముక్తుల కంటె నతీతుడనగుటచే లోక వేదములలో పురుషోత్తముడననబడుచున్నాను" అని సహేతుకముగా జెప్పబడిన సాధ్యమే (బద్ధముక్తభేదమే) హేతువైన సమాఖ్యకు నిదానముగా జెప్పబడినది.

(52) ముక్తుడు బద్ధునికన్న నుత్కృష్టుడు— (గొప్పవాడు) భగవానుడు సర్వాంతరాత్మత్వము మొదలగు చెప్పబడిన కారణములచే నుత్కృష్టతముడు- అనగా- అంతకంటె గొప్పవాడు లేడు.

19వ శ్లోకము

(53) ఇచ్చట"అసమ్మూఢః" అను పదముచే మతాంతరు లంగీకరించు జీవేశ్వరుల కైక్యజ్ఞానము భ్రాంతి యని తెలుపబడినది. మరియు ప్రకృతి–జీవ–పరమాత్మలభేదము పరమార్థమైనదనియును తెలుపబడినది.

(54) అవతారిక—

ఈ శ్లోకమున ఇట్లు పురుషోత్తమశబ్దమునకు వ్యుత్పత్తిని జెప్పుట- ఆతని నట్లనుసంధించుటచే యని తెలియవలెనని సూచించుచు పురుషోత్తమత్వము నెఱుంగుటను స్తుతించుచున్నాడు.

20వ శ్లోకము

(55) అవతారికలో—

పురుషోత్తమత్వము నెఱింగినంత మాత్రముననే భగవంతుని

కన్ని విధములుగను ప్రీతి జనించుననుటచే నిక భజనాదులను గావించ మని విధులేల? అను శంకకు సమాధానమును జెప్పుచున్నారు.

(56) ఈ పురుషోత్తమతత్త్వజ్ఞానమే సకల జ్ఞానములకును మూల కారణము— ఛాందోగ్యోపనిషత్తులోని 6వ ప్రపాఠకమందును ఇతరోప నిషత్తులయందును శ్వేతకేతు ప్రభృతుల కుపదేశించిన 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానప్రతిజ్ఞ' యిట్టిదే. భగవంతుడు జగత్తునకు నిమిత్తోపాదా నకారణభూతుడని ఎఱింగినచో చేతనాచేతనాత్మక ప్రపంచమంతయును తెలియబడుననిగదా అచ్చట సమర్థించబడెను.

ఈ శ్లోకముచే నీ పురుషోత్తమతత్త్వవేదనము పరమగుహ్యమనియు అనధికారుల పాలబడకుండగ చాల శ్రద్ధతో గాపాడదగిన దానిలో నగ్రగణ్యమనియు అత్యంత పరమార్థమైనదనియు అపరిమితఫలప్రద మనియును తెలుపుచు దీనిని ముగించుచున్నాడు.

(57) (శ్రీ) విష్ణుపురాణమున— ప్రహ్లాద చరిత్రలో—

శ్లో. తత్కర్మయన్న బన్ధాయ, సావిద్యాయా విముక్తయే
ఆయాసాయాపరం కర్మ- విద్యాన్యా శిల్పనైపుణమ్.

అని కలదు కర్మ రెండువిధములు— (1) ప్రవృత్తికర్మ (2) నివృత్తికర్మ అని. మొదటిది సంసారమును పోషించును. రెండవది దానిని నిర్మూలిం చును. దాని ద్వారా జన్మరాహిత్యము నొసంగును. అటులనే విద్య యును రెండు విధములు. "అపరవిద్య" "పరవిద్య" యని. మొదటిది అర్థ శాస్త్రాదివిద్య.అది శిల్పనైపుణ్యము నొసంగి ఉదరపోషణ కుపకరించును దాని వలన సంసారము వృద్ధిపొంది బంధములు బిగియును. రెండవది మోక్షప్రదము. నారద–సనత్కుమార సంవాదమును ఉపనిషత్తులలో గాంచనగును. నారదుడు నేర్వని విద్య లేదు. అయినను సనత్కుమారుని ఆశ్రయించెను. నీకేమి కావలయునని ఆసనత్కుమారు డడుగగా, నార

దుడు- స్వామీ! నేనింతవరకు చదివి మంత్రవేత్తనే అయితిని గాని బ్రహ్మవేత్తను కాలేదు. నాకు దానిని ప్రసాదించుమని ప్రార్థించి ఐాందెను. ఉపనిషత్తు- "ద్వేవిద్యే వేదితవ్యే పరాచైవా పరాచ" అని ప్రారంభించి వేదవేదాంగాదుల నన్నింటిని అపరకోటిలో జేర్చి పరవిద్యనుపక్రమించుచు- "అథపరా-యయా తదక్షర మధిగమ్యతే" అని స్వపర- స్వరూపముల నెఱుంగుటయే (జీవతత్వమును, పరమాత్మతత్వము నెఱుంగుటయే) పరమపురుషార్థమునకు ఘంటాపథమని తెలిపెను. ఈ గీతయందే 13వ అధ్యాయమున 'ఏతత్ జ్ఞానమితి ప్రోక్తం అజ్ఞానం యదతోఽన్యథా' అని యీవిషయమునే యుపదేశించెను.

ఇచ్చట 'కృతకృత్యః' అనుటచే ముముక్షువు చేయదగినవన్నిటిని చేసినవాడగునని భావము.

(58) ప్రకరణసిద్ధమైన యర్థమును, దానినెఱుంగుటను పొగడవలెనే గాని యిచ్చట శాస్త్రపదముచే శాస్త్రమును పొగడనేల? అదియును గాక వెనుకటి శ్లోకమునందే ఆప్రశంస చేయబడినదిగదా! ఈపౌనరుక్త్యమేల? యన్నచో "ఏతద్బుద్ధ్వా" అనగా అర్థసహితశాస్త్రజ్ఞానమే యిచ్చట ప్రశంసించబడుచున్నది. కాబట్టి అర్థజ్ఞానమునందే దీనికి తాత్పర్యము. శాస్త్రపదమును ప్రయోగించుట శాస్త్రముచేతమాత్రమే కలిగిన జ్ఞానమున్ను ఫలము నొసంగి తీరునని తెలుపుటకే.

(59, 60) అనఘ ! భారత ! అను సంబోధనలచే వృత్తమును బట్టియు జన్మనుబట్టియు నర్జునున కీ రహస్యమును వినుట కధికారమును సూచించుటచే నీ రహస్యమును చెప్పువాడును వినువాడునుకూడ దుర్లభమే యని తోచుచున్నది. కావుననే 'మయా' అను పదముచే చెప్పదగినవానినన్నిటిని సమగ్రముగ నెఱింగినవాడనియు వినుటకధికారి నెఱింగినవాడనియు అర్జునుని హితమునే కోరుసఖుడనియు తెలుపబడుచున్నది.

భారత! అనుటచే 'అర్జునా! నీవు దీనినెఱింగితివిగాన నీవును కృతకృత్యుడవే సుమా' యని భావము.

61. ఇచ్చట పెద్దలు సెలవిచ్చిన నీ శ్లోకమును అనుసంధించవలెను.

శ్లో. యస్మిన్ ప్రసాదసుముఖే కవయోఽపి తే తే
శాస్త్రాణ్యశాసురిహ తన్మహిమాశ్రయాణి
కృష్ణేన తేన యదిహ స్వయమేవ గీతం
శాస్త్రస్యతస్య సదృశం కిమిహాస్తి శాస్త్రమ్.

గొప్ప గొప్ప కవిపుంగవులు భగవన్మహిమను వెదజల్లునట్టి గొప్ప గొప్ప శాస్త్రములను యేపరమపురుషుని యనుగ్రహలేశమును బడసి యాతని నభిముఖునిగా చేసుకొని రచింపగలిగిరో అట్టి పరమపురుషుడే శ్రీకృష్ణుడుగా నవతరించి స్వయముగ నీ గీతాశాస్త్రమునుపదేశించె నన్నచో దీనితో బోల్చదగిన శాస్త్రము వేరొండుండుటకేమైన నవకాశముకలదా.

# శ్రీ భగవద్గీతా - షోడశోఽధ్యాయః

## దైవాసురసమ్పద్విభాగయోగః

### అవతారిక

—//—

కడచిన మూఁడధ్యాయములందు ప్రకృతిపురుషుల సంసర్గపు యాథాత్మ్యమును, వారి వివేకపుయాథాత్మ్యమును, సంసర్గమునకు గుణసంగము హేతు వగుటయు, వియోగమునకు అసంగము హేతు వగుటయుఁ జెప్పఁబడినవి. మఱియు సర్వప్రకారముల నుండు ప్రకృతి పురుషులు భగవంతుని విభూతు లగుటయు, విభూతిమంతుఁ డగు భగ వంతుఁడు విభూతు లగు అచిద్వస్తువునకంటెను, బద్ధులు ముక్తులు అని యుభయరూపముల నుండు చిద్వస్తువునకంటెను తన యవ్యయత్వ వ్యాపనభరణస్వామిత్వములచేత నర్థాంతరుఁడగుటవలన *పురుషోత్తము డగుటయు, అట్టిపురుషోత్తమత్వముయొక్క యాథాత్మ్యమును వర్ణింపఁ

1

బడినవి. అనంతరము చెప్పఁడినయర్థము సమస్తమును దృఢముగా నెల కొనుటకై ♦శాస్త్రవశ్యత్వము చెప్పఁబూని అందులకై శాస్త్రవశ్య మైన దేవతాసర్గమునకును శాస్త్రవశ్యముకాని యాసురసర్గమునకును పరస్పరముగల విభాగమును జెప్పుచున్నారు.

శ్రీభగవా నువాచ.

2

శ్లో. అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః

దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 1

---

* చూడు ౧౫ వ అధ్యాయము. శ్లో. ౧౮.

♦. దైవాసురసరముల విభాగము చెప్పుటవలన శాస్త్రవశ్యత్వము చెప్పఁబడుట యెట్లు అన్నచో, భగవదాజ్ఞయే శాస్త్రము. కనుక శాస్త్రమునకు వశులై నడచుకొను దేవతలు భగవదనుగ్రహపాత్రులు. దానికి విపరీతముగా నడచుకొను అసురులు భగ

అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్
దయాభూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్. 2
తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత. 3

టీ. హే భారత=అర్జునా, అభయం=భయము లేకుండుట, సత్త్వసంశుద్ధిః-సత్త్వ=అంతఃకరణముయొక్క, [3]సంశుద్ధిః=సర్వదోషనివృత్తి-అనఁగా దోషములకెల్ల [4]మూలమైన రజస్తమస్సుల తాఁకు లేకుండుట, [5]జ్ఞానయోగవ్యవస్థితిః - జ్ఞానయోగ = జ్ఞానయోగమునందు - ప్రకృతి[6]వియుక్తాత్మస్వరూపవివేకమునందు, వ్యవస్థితిః=నిష్ఠయు, దానం=న్యాయముచే ఆర్జించిన ద్రవ్యమును పాత్రమెఱిఁగి యిచ్చుట, దమః చ=[7]మనస్సు విషయములకు ఉన్ముఖము గాకుండునట్లు చేయుట, యజ్ఞః=[8]ఫలాభిసంధి లేక భగవదారాధనరూపముగా మహాయజ్ఞాదుల ననుష్ఠించుట, [9]స్వాధ్యాయః=సమస్తవేదముల నభ్యాసముచేయుటయందు నిష్ఠ,

---

వన్నిగ్రహమునకు పాత్రులు. ఈ యుభయుల తారతమ్యమువలన శాస్త్రవశ్యత్వము (అనఁగా శాస్త్రమునకు వశమై నడుచుకొనుట) ఆవశ్యకమని చెప్పఁబడినదగుచున్నది. ఈ శాస్త్రవశ్యత్వమువలన ఉపదేశింపఁబడిన యర్థమునందు నిలుకడ కలుగుటయెట్లనిన, ఉపదిష్టార్థమునందు వ్యవసాయము శాస్త్రమువలననే కలుగును. కాఁబట్టియే ఈ యధ్యాయముకడపట 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే' అని శాస్త్రవశ్యత్వము చెప్పఁబడినది. ఇచ్చట సర్గశబ్దముచేతను విభాగశబ్దముచేతను పూర్వపుణ్యపాపకర్మానుగుణముగా ఉత్పత్తికాలమునందే భగవదాజ్ఞానువర్తులగు దేవతలుగాను తద్విరుద్ధులగు అసురులుగాను విభక్తులై పుట్టుదురని భావము. విభాగ మనఁగా మీఁదఁజెప్పఁబడు గుణక్రియాదులచే దేవాసురులకుఁ గలుగు వేఱుపాటు అని తెలియనగునది.

10 తపః = భగవంతునికిఁ బ్రీతి గలిగించుటకు కృచ్ఛ్రచాంద్రాయణ 11 ద్వాదశ్యుపవాసాదులను జేయుట, ఆర్జవం=పరులవిషయమున మనో 12 వాక్కాయవృత్తులు ఒక్కరూపున నెలకొనియుండుట, అహింసా=పరు 13 లను పీడింపకుండుట, సత్యం=చూచినదానిని చూచినట్లును భూతము లకు హితమగునట్లును జెప్పువాక్యము. అక్రోధః = పరులుపీడించినను 14 చిత్తవికారముఁ బొందకుండుట, త్యాగః=ఆత్మహితమునకు విరుద్ధమైన 15 వానిని త్యజించుట, శాన్తిః=బాహ్యేంద్రియ నిగ్రహము 16 అపైశునం= ఒకరి కనర్థము కలిగించువాక్యమును జెప్పకుండుట, భూతేషు = సర్వ 17 ప్రాణులవిషయమున, దయా=కనికరము- (దుఃఖము నోర్వఁజాలకుం డుట,) అలోలుప్త్వం = అలోలుపత్వము- అనఁగా 18 విషయములందు 19 స్పృహలేమి, మార్దవం=సజ్జనసాంగత్యమునకుఁ దగియుండుట, 20 హ్రీః= అకార్యములఁ జేయుటయందు లజ్జ, 21 అచాపలం = కోరఁదగినవస్తువు లెదుట నుండియు వానికై చలింపకుండుట, తేజః=దుర్జనులచేత క్రిందు 22 పఱుపరాకుండుట, క్షమా=బాధ ననుభవించునపుడును పరులయెడ 23 దానినిగూర్చి చిత్తవికారములేమి,ధృతిః=గొప్పయాపదయందు సైతము 24 చఱువలసినదానిని చేయునట్టి నిశ్చయము, శౌచం=శాస్త్రీయకర్మము లను జేయుటయందు బాహ్యాంతరకరణములు యోగ్యమై యుండుట. 25 అద్రోహః=ద్రోహము (అనఁగా ఇతరుల కష్టకట్టులువేయుట) లేమి-

(ఇతరుల స్వచ్ఛందవృత్తి నడ్డగింపకుండుట.) న [26] అతిమానితా = తగని చోట గర్వము లేకుండుట, ఈగుణములు, దైవీం=దేవసంబంధి యైన, సంపదం=దేవతల [27] భగవదాజ్ఞానువృత్తి శీలుర భగవదాజ్ఞానువృత్తిని, అభిజాతస్య=అభిముఖము [28] చేసికొని పుట్టినవానికి, భవన్తి = కలుగు చున్నవి.

తా. అభయము మొదలుగా నాతి మానిత్వమువఱకుఁ జెప్పఁబడిన యీగుణములు భగవదాజ్ఞ ననువర్తించి నిర్వర్తింపఁ జేయుటకై జనించినవానికిఁ గలుగునని తాత్పర్యము.

శ్లో. దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవచ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పద మాసురీమ్. 4

టీ. పార్థ=అర్జునా, దమ్భః=ధార్మికత్వ ప్రసిద్ధికొఱకు ధర్మము నాచరించుటయు, దర్పః=విషయానుభవమువలన కృత్యాకృత్యములను తెలిసికొనఁజాలనియుబ్బు, అభిమానశ్చ=తనవిద్యావంశములకుఁ దగని దురభిమానమును, క్రోధః=కోపమును (పరులు బాధించుటచేఁ దనకుఁ గలుగుచిత్తవికారమనుట), పారుష్యంచైవ = సాధుజనుల కుద్వేగము కలిగించు స్వభావమును, అజ్ఞానంచ=పరావరతత్త్వములందును కృత్యాకృత్యములందును వివేకములేమియు (అను ఈగుణములు), ఆసురీం= అసురులకు (భగవదాజ్ఞను అతిక్రమించుస్వభావముగలవారికి) సంబంధించిన, సంపదం=సంపదను- (భగవదాజ్ఞాతిక్రమణమును). అభిజాతస్య= అభిముఖము చేసికొని (ఉద్దేశించి) జనించినవానికి, (భవన్తి = కలుగుచున్నవి.)

తా. అర్జునా, [29] ధార్మికత్వప్రసిద్ధికొఱకు ధర్మము నాచరించుటయు, [30] విషయముల ననుభవించుటవలనఁ గలిగినదై [31] యిది కృత్య మిది,

యకృత్యమనువివేకము లేకుండఁజేయునుబ్బును, తనవిద్యావంశములకు
32 33
తగనిదురభిమానమును, పరపీడవలనఁ గలుగుచిత్తవికారమును, సాధు
జనులకు నొవ్వు గలిగించు స్వభావమును పరావరతత్త్వములయు కృత్యా
34 35
కృత్యములయు వివేకము లేమియు, అనెడి యీస్వభావములు ఆసుర
36
సంపత్తిని పుట్టినవానికిఁ గలుగుచున్నవి. అసురులు భగవదాజ్ఞ నతిక్ర
మించు నడచు శీలము గలవారు.

37 అవ.

శ్లో. దైవీ సమ్పద్విమోక్షాయ నిబన్ధాయాఽఽసురీ మతా.

టీ. దైవీ = భగవదాజ్ఞానువృత్తిరూపమైన, సంపత్ = సంపద, విమోక్షాయ = బంధనివృత్తికొఱకును ఆసురీ (సంపత్) అసురసంబంధమైన (అనఁగా భవదాజ్ఞాతిక్రమణరూప మయిన) సంపద, నిబన్ధాయ = అధోగతిప్రాప్తికొఱకనుట, మతా = నిశ్చయింపఁబడినది.

38
తా. మదాజ్ఞానువర్తన మనెడుసంపత్తి బంధవిముక్తిఁ గలిగించి
40
క్రమముగా మత్ప్రాప్తి నొసఁగును మదాజ్ఞాతిక్రమణ మనెడుసంపత్తి
39
సంసారబంధహేతువై యధోగతిఁ బొందించును.

అవ. దీనిని విని తనప్రకృతి యిట్టిది యని తెలియఁజాలక భీతి జెందియున్న యర్జునునిఁగూర్చి భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో. మాశుచ స్సమ్పదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ. 5

టీ. హేపాణ్డవ = అర్జునా, దైవీం సంపదం = దేవసంబంధి యైన సంపదను, అభిజాతః అసి = ఉద్దేశించి జనించియున్నావు, మాశుచః = దుఃఖింపకుము.

తా. పాండవా, శోకింపకుము. నీవు దైవసంపదయందు (అనఁగా నాయాజ్ఞానువర్తనముతోఁ గూడి) పుట్టినవాఁడవు. పాండవా- అనఁగా ధార్మికాగ్రేసరుఁ డగు పాండురాజునకుఁ బుత్రుఁడవు నీ వని యభిప్రాయము.

43 అన.

శ్లో. ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు. 6

టీ. అస్మిన్ లోకే = ఈకర్మలోకమునందు, దైవః = భగవదాజ్ఞానువృత్తి గలదియు, ఆసురశ్చైవ = భగవదాజ్ఞాతిక్రమణరూప మైనదియు అని. ద్వౌ = రెండువిధములైన, భూతసర్గౌ= ప్రాణులయొక్క యుత్పత్తులు, (స్తః=కలవు), దైవః = మదాజ్ఞానువృత్తశీలురయుత్పత్తి, విస్తరశః=విస్తారముగా, ప్రోక్తః=చెప్పఁబడినది. హేపార్థ= ఓయర్జునా, ఆసురం = మదాజ్ఞాతిక్రమణశీలురయుత్పత్తిని, మే (సకాశాత్) = నావలన, శృణు=వినుము.

తా. అర్జునా, ఈకర్మలోకమునందు కర్మములను జేయు ప్రాణుల *యుత్పత్తులు దైవ మనియు ఆసుర మనియు (అనఁగా భగవదాజ్ఞానువర్తనము గలదియనియు భగవదాజ్ఞాతిక్రమణము గలది యనియు) రెండువిధములు. భూతములు ప్రాచీన పుణ్యాపాపరూపము లగు కర్మములకు లోనై యుండుటంబట్టి, భగవదాజ్ఞానువర్తనమును భగవదాజ్ఞాతిక్రమణమును జేయు కొఱకు ఉత్పత్తికాలమందే యిట్టివిభాగముతో పుట్టుచున్నవని యర్థము. అందు మదాజ్ఞానువర్తనశీలు రగుదేవతల

* ఇచట భూతములనే దైవము ఆసురము అని విభజింపక, వానిసర్గములను (అనఁగా ఉత్పత్తులను) దైవమనియు ఆసురమనియు విభజించుటచే భూతములు తమ తమ ప్రాచీనపుణ్యపాపకర్మవశమున ఉత్పత్తికాలమందే భగవదాజ్ఞానువృత్తులుగాను

44
యుత్పత్తి (అనఁగా వారు ఏయాచారము నాచరించుటకొఱకు బుట్టు
దురో ఆయాచారమును- కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగరూప
45
మైన దానిని) ఇంతవఱకు విస్తరించి చెప్పితిని. ఇఁక మదాజ్ఞాతిక్రమణ
శీలు రగు అసురులయుత్పత్తిని (అనఁగా వారియుత్పత్తి యేయాచారము
46
కొఱకో ఆ యాచారమును) నావలన వినుము.

47
శ్లో. ప్రవృత్తించ నివృత్తించ జనా నవిదు రాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 7

టీ. ఆసురాః=భగద్రాజ్ఞ నతిక్రమించు స్వభావము గల, జనాః=
జనులు, ప్రవృత్తించ=ఐహికఫలసాధన మగు వైదికధర్మమునుగాని,
నివృత్తించ = మోక్షసాధన మగు వైదికధర్మమును గాని, నవిదుః=
ఎఱుఁగరు, శౌచం=మనశ్శుద్ధియు దేహశుద్ధియు, తేషు=వారియందు,
న విద్యతే=లేదు. ఆచారోపి = ఆచారమును, న (విద్యతే)= లేదు.
సత్యంచ=తెలిసినది తెలిసినట్టుగాను భూతహితరూపముగాను పలుకు
టయు, న (విద్యతే)= లేదు.

47
తా. అసురజన్మము గలజనులు ఐహికఫలసాధన మగు వైదిక
ధర్మమునుగాని మోక్షసాధన మగు వైదికధర్మమును గాని ఎంత యుప
48
దేశించినను ఎఱుఁగరు. వారికి వైదికకర్మము నాచరించుటకు శాస్త్ర

---

తదతివృత్తులుగానువిభక్తులై పుట్టుచున్నారు గాని ఉత్పత్తియైనవెనుక నట్లు అగువారు
కారని గ్రహింపవలయును. కనుక ఉత్పత్తులే దైవమని ఆసురమని విభక్తమైనవి.
ఉత్పత్తులకు పిదప దైవత్వాసురత్వములు కలిగినయెడల ఆయుత్పత్తులు దైవ మని
యాసురమని నిర్దేశింపబడవని గ్రాహ్యము 'విస్తరశః' అనుటచే ఇంతవఱకుఁ గడచిన
యధ్యాయములందు విస్తరించి చెప్పంబడిన కర్మయోగాదిరూపాచారము లెల్ల
దైవసంపదభిజాతులనుగూర్చినదని భావము.

49
సిద్ధమైన యోగ్యతారూప మగు శౌచమును (వెలుపలను లోపలను) లేదు. ఇట్లు బాహ్యాంతర శౌచము కలుగుటకు సాధనమై సంధ్యావంద
50
నాదిరూప మైన యాచారముగాని వారియందుఁ గలుగదు. అట్లె "సన్ధ్యాహీనోఽశుచి ర్నిత్య మనర్హ స్సర్వకర్మసు" (దక్ష స్మృతి. ౨-
51
౨౨) అని చెప్పఁబడినది తనకుఁ దెలిసినది. తెలిసినట్లును భూతములకు హిత మగునట్లును పలుకుట గాని, వారియం దుండదు.

అవ. మఱియును.

52 అవ.

53 54 55
శ్లో. అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్
56 57
అపరస్పరసంభూతం కి మన్య త్కామ హైతుకమ్. 8

టీ. తే=ఆసురస్వభావముగలవారు, జగత్=ఆజగత్తు, అసత్యం ఆహుః=అసత్యమని చెప్పుదురు. అనఁగా బ్రహ్మాత్మకము అని చెప్పరు. అప్రతిష్ఠం ఆహుః=బ్రహ్మమునందు ఉండునది యని చెప్పరు. అనీశ్వరం ఆహుః=నియమించువాఁడు లేనిదని చెప్పుదురు. అ పరస్పరసంభూతం=(స్త్రీపురుషుల) పరస్పరసంగముచేత పుట్టినది కానట్టి, అన్యత్=మఱి యొకటి, కిం=ఏది?- ఏదియును లేదనుట, కనుక, కామహైతుకం=కామమే కారణముగాఁగలది యనియు, ఆహుః=చెప్పుదురు.

తా. ఆసురజనులు, ఈజగత్తు సత్య మనఁబడు బ్రహ్మముయొక్క కార్యమయ్యును దీనిని బ్రహ్మాత్మక మనరు: అబ్రహ్మాత్మక మందురు. అట్లే అనంతునియందు ప్రతిష్ఠింపఁబడినదై యుండియు అతనియందు ప్రతిష్ఠిత మైనదని చెప్పరు. "తే నేయం నాగవర్యేణ శిరసా విధృతా మహీ। బిభర్తి మాలాం లోకానాం సదేవాసురమానుషామ్" (వి. పు. ౨-౫-౨౭) అన్నట్లు బ్రహ్మం బగునసంతుఁడు ధరించుటచేతఁ గదా

యీపృథివి సర్వలోకములను భరించుచున్నది. సత్యసంకల్పుఁడును పరబ్రహ్మమును సర్వేశ్వరుఁడునైన నాచేనిది నియమింపఁబడుచున్నదనియు
57
చెప్పరు. 'అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే' (గీ.౧౦-౮) అనికదా చెప్పఁబడినది. వారలిట్లు-అనఁగా స్త్రీపురుషుల పరస్పరసంబంధముచేతనే యీమనుష్యపశ్వాదు లన్నియుఁ బుట్టినట్లు కనఁబడుచున్నవేకాని యిట్లుకాక (అదృష్టదైవాదులచేఁ) బుట్టినట్లేదియుఁ గానిపింపదు, కనుక ఈజగత్తంతయు కామమువలననే (అనఁగా, కామజనితమైన స్త్రీ పురుషసంయోగమువలననే) కలిగినది (గాని యీశ్వరాదులచేఁ గాదు) అనియుఁ బలుకుదురు.

శ్లో. ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽశుభాః. 9

టీ. ఏతాం దృష్టిం = ఈవిపరీతజ్ఞానమును, అవష్టభ్య= అవలంబించి, *నష్టాత్మానః=దేహముకంటె వ్యతిరిక్తమైన ఆత్మ యొకటి కలదని యెఱుఁగనివారు గనుకనే, అల్పబుద్ధయః=వివేకము లేనివారును ఉగ్రకర్మాణః=పరహింసారూపమైన క్రూరవ్యాపారము గలవారును, అశుభాః=(సన్తః)= పాపులును అగుచు, జగతః = ప్రపంచముయొక్క, క్షయాయ=నాశముకొఱకు, ప్రభవన్తి=పుట్టుచున్నారు.

తా. ఇటువంటి విపరీతజ్ఞానము నవలంబించి, దేహాతిరిక్త

* ఆత్మకు నాశములేదు గనుక 'నష్టాత్మానః' అనుటకు 'ణశ అదర్శనే' అను ధాత్వర్థమునుబట్టి 'దేహా...తెలియక' అని యర్థముచేసిరి. నష్టాత్ములును అల్పబుద్ధులు నగుటకు ఫలము 'ఉగ్ర...అశుభాః' అనఁబడెను. 'లోక...జనించుచుండు' రనఁగా అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్' (గీ-3-౧౦) 'పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ (గీ-3-౧౧)ఇత్యాదులచే భగవంతుఁడానతిచ్చిన ధర్మమర్యాద నతిక్రమించుచున్నారని భావము.

58
మగునాత్మ యొకటి కలదని తెలియక, (ఘటాదులవలె దేహముగూడ జ్ఞేయ మగుటచే జ్ఞాత యగు ఆత్మ దేహమునకంటె వేఱై తెలియు
59
చున్నదియును) వివేకము లేనివారై, సమస్తమైనవారికి హింసకులై లోక నాశముకొఱకు జనించుచుందురు.

60 61 62
శ్లో. కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః
63 64 65
మోహా ద్గృహీత్వాఽసద్గ్రాహా న్ప్రవర్తన్తేఽశుచివ్రతాః.

టీ. దుష్పూరం=నిండింప నశక్యమైన, కామం=ఆశను-ఆశ్రిత్య= అవలంబించి, మోహాత్ = అజ్ఞానమువలన, అసద్గ్రాహాన్=అన్యాయ ముగా నార్జించినపరిగ్రహములను, గృహీత్వా = గ్రహించి, అశుచి
66 67
వ్రతాః=శాస్త్రవిహితములు కానట్టి వ్రతములు గలవారును, దమ్భ మానమదాన్వితాః (సన్తః)=దంభమానమదములతోఁ గూడినవారును అగుచు, ప్రవర్తన్తే=ప్రవర్తించుచున్నారు.

తా. వారు, పొందనలవికానివస్తువులను గుఱించి ఆశగలవారై, దానిని సాధించుతలంపుచే నజ్ఞానమువలన అన్యాయార్జితములైనవానిని గ్రహించి, శాస్త్రవిహితము కానివ్రతముగలవారై, దంభమానమద ములతో ప్రవర్తించుచుందురు.

(అవ. ఇట్లు ప్రవర్తించువారికి మీఁదమీఁద కలుగు మనోవికార ములు చెప్పుచున్నారు.)

శ్లో. చిన్తా మపరిమేయాం చ ప్రలయాన్తా ముపాశ్రితాః
68 69
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః.

టీ. అపరిమేయాం=పరిమితి లేనిదియు, ప్రలయాన్తాం=దీర్ఘకాలముచే సాధింపఁదగిన విషయములుగలదియునగు, చిన్తాం=మనోరథపరంపరను, ఉపాశ్రితాః=ఆశ్రయించినవారును, కామోపభోగపరమాః=శబ్దాదివిషయానుభవమే పరమపురుషార్థ మని తలఁచువారును నై, ఏతావదితి=ఇంతియ అని, నిశ్చితాః=నిశ్చయము గలవారు.

తా. [70]నేఁడో రేపో చావనున్నవారైనను, వారిచింత మాత్రము [71]అపరిమితమైనదిగాను, అది గోరువిషయములో [72]ప్రాకృతప్రళయపర్యంతమైన్న దీర్ఘకాలమంతయుఁ బాటుపడి సాధింపవలసినదిగాను నుండును. వారు శబ్దాదివిషయానుభవమే పరమపురుషార్థమని తలంచుచు ఇంతకంటె అధికమైన పురుషార్థము వేఱొక్కటి లేదనియు నిశ్చయము గలవారై యుందురు.

శ్లో. [73]ఆశాపాశశతైర్బద్ధాః [74]కామక్రోధపరాయణాః
ఈహన్తే కామభోగార్థ మన్యాయే నార్థసఞ్చయాన్. 12

టీ. ఆశాపాశశతైః=ఆశ లనఁబడు అనేకవిధములైన త్రాళ్లచేత, బద్ధాః=కట్టఁబడినవారును, కామక్రోధపరాయణాః=కామక్రోధములనే ముఖ్యముగా ఆశ్రయించినవారును నై, కామభోగార్థం=విషయానుభవముకొఱకు, అన్యాయేన=అన్యాయమార్గముచేత, అర్థసఞ్చయాన్ (ప్రతి)=ధనసమూహములనుగూర్చి, ఈహన్తే=ఇచ్ఛించుచున్నారు.

తా. ఆశ లనెడి యనేకవిధములైన త్రాళ్లచేతఁ గట్టఁబడినవారై, కామక్రోధములనే ముఖ్యముగా నాశ్రయించి, [75]విషయానుభవముకొఱకు [76]అన్యాయముచేత ధనములను గూడఁబెట్టుటకుఁ గోరుచుందురు— అనఁగా ధన మార్జించునిచ్ఛతో అన్యాయమార్గములందుఁ బ్రవర్తింతురు. [చింత— చేయఁదగిన కార్యమునుగుఱించినది. ఆశ— ఫలమునుగుఱించినది.]

శ్లో. ఇద మద్య[77] మయా లబ్ధ మిమం[78] ప్రాప్స్యే మనోరథమ్
ఇద మస్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్. 13

టీ. ఇదం=ఈక్షేత్రపుత్రాదికమైన సమస్తము, అద్య = ఇప్పుడు, మయా=నా సామర్థ్యము చేత, లబ్ధం = పొందఁబడినది. ఇమం మనోరథం=ఈకోరికను, ప్రాప్స్యే=(నేనే) పొందఁగలను, ఇదం=ఈధనమ్ము, అస్తి=నాసామర్థ్యముచేతనే లభించినదై యున్నది, పునః=మఱల, ఇదం ధనమపి=ఈధనముగూడ, మే=నాకు, భవిష్యతి=(నాసామర్థ్యముచేతనే) కలుగఁగలదు.

తా. ఈక్షేత్రపుత్రాదికము సమస్తము నాసామర్థ్యముచేతనే లభించినదికాని అదృష్టాదులచేఁ గాదు. ఈమనోరథమును అదృష్టాదుల తోడులేక నేనె పొందగలను. ఈధనము నాసామర్థ్యముచేతనే ఆర్జింపఁబడి నాకుఁ గలిగినది. మఱియు నికగూడ నాసామర్థ్యమువలననే మీఁదఁ గలుగఁగలదు.

శ్లో. అసౌ[79] మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరానపి

టీ. అసౌ శత్రుః=ఈశత్రువు, మయా = (బలవంతుఁడైన) నా చేత, హతః=చంపఁబడెను, అపరానపి = మిగిలిన శత్రువులను గూడ, హనిష్యే=చంపెదను.

తా. నేను బలవంతుఁడను గనుక ఈశత్రువున్ను జంపితిని. మఱియు నేను శూరుఁడను[80] ధీరుఁడను[81] నగుటచేఁ దక్కిన శత్రువులను సైతము చంపెద. (ఇట్లు నాబలశౌర్యధైర్యములచే ఇవియంతయును గలుగఁగా) మందబుద్ధులును[82] దుర్బలులును[83] గలిగించుకొను అదృష్టాది సాధనములచే నిందుఁ బని యేమి?

అవ. మఱియు నట్లే.

84 85 86 87
శ్లో. ఈశ్వరోఽహ మహంభోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ. 14

టీ. అహం = నేను, ఈశ్వరః = స్వతంత్రుఁడను (నియంత యును) అహం=నేను, భోగీ=సకలభోగముల ననుభవించుటకు సమర్థుడను, అహం=నేను, సిద్ధః=(నాయంతటనే) సిద్ధించినవాఁడను, బలవాన్ =(నాయంతటనే) బలవంతుఁడను, సుఖీ=(నాయంతటనే) సుఖము గల వాఁడను.

88
తా. నేను స్వతంత్రుఁడను, తక్కినవారికిని నేనే నియామకుఁడను. నేను నాయంతనే భోగి నైతినిగాని అదృష్టాదులచేఁ గాదు. నాయంతనే నేను గలిగితినిగాని యదృష్టాదులచేతనుగాదు. నాయంతనే నేను బలవంతుఁడ నైతిని, నాయంతనె నేను సుఖి నైతిని.

89
శ్లో. ఆఢ్యోఽభిజనవా నస్మికోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్యే ఇత్య జ్ఞానవిమోహితాః. 15

టీ. ఆఢ్యః=(నాయంతనే) సకలైశ్వర్యసంపన్నుఁడను, అభిజనవాన్= (నాయంతనే) ఉత్తమకులమునఁ బుట్టినవాఁడను, అస్మి=అగుచున్నాను,మయా=నాతో, సదృశః=సమానుఁడు,అన్యః=మఱియొకఁడు, కః=ఎవఁడు? యక్ష్యే=(నాయంతనె) యాగము చేసెదను, దాస్యామి= దానమిచ్చెదను, మోదిష్యే=సంతోషించెదను, ఇతి = ఇట్లని, అజ్ఞానవిమోహితాః=అజ్ఞానముచేత మోహముఁ జెందినవారు, (మన్యన్తే= తలంచుచున్నారు.)

తా. 'నేను నాయంతనె ధనవంతుఁడను ఉత్తమకులమునఁ బుట్టినవాఁడును నైతిని. నావలె స్వసామర్థ్యముచేతనే సర్వవిభవములు లభిం

చినవాఁ డీలోకమం దెవఁడు గలఁడు? నేను నాయంతనె యజ్ఞములు[90] సేయుదును, దానములు సేయుదును, ఆనందింతును - అని యీశ్వ[91]రానుగ్రహ మక్కఱలేక తమంతనె యాగదానాదులు సేయ శక్తుల[92]మగుదు మనెడి యజ్ఞానముచే వివేకరహితులైనవారు తలంతురు.

అవ. 93

శ్లో. అనేక చిత్తవిభ్రాన్తా[94] మోహజాలసమావృతాః[95]
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ. 16

టీ. అనేక చిత్తవిభ్రాన్తాః=నానా విధములగు మనోవ్యాపారములచే భ్రాంతిఁ బొందినవారును, మోహజాలసమావృతాః=అజ్ఞానమనెడి పాశములచేత చుట్టఁబడినవారును, కామభోగేషు= విషయానుభవములయందు, ప్రసక్తాస్సన్తః=అధికాసక్తి గలవారును అగుచు, అశుచౌ=అశుద్ధమైన, నరకే=నరకమునందు, పతన్తి=పడుచున్నారు.

తా. ఇట్లు అదృష్టము ఈశ్వరుఁడు మొదలైనవాని సాహాయ్యమక్కఱలేక తమంతనే సర్వమునుం జేయ శక్తులమని తలంచి, 'ఇట్లు చేయుదుము అదిచేయుదము మఱొకటి చేయుదము' అని నానా చిత్తభ్రమలు గలవారై, యిటువంటి మోహజాలములలో మిక్కిలి తగులువడి, కామభోగములందు మిక్కిలి సక్తులై నడుమనె మృతిఁ బొంది[96] అశుద్ధమగు నరకమునం బడుదురు.[97]

శ్లో. ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భే నావిధిపూర్వకమ్. 17

టీ. ఆత్మసమ్భావితాః=తమ్ముఁ దామే గౌరవించుకొనువారును, స్తబ్ధాః=తాము పరిపూర్ణులమనెడి తలంపుతో నుండువారును, ధనమాన మదాన్వితాః = ధనసంపత్తిచేతను సత్కులజాతుల మనెడి దురభిమానముచేతను గలిగిన మదముతోఁ గూడినవారును, దమ్భేన = దంభముతో, అవిధిపూర్వకం=శాస్త్రోక్తము కానిరీతిని, నామయజ్ఞైః= పేరుమాత్రము ప్రయోజనముగాఁగల యజ్ఞములచేత, యజన్తే = యాగము చేయుచున్నారు.

98. 99

తా. అసురసంపద గలవారు తమ్ముఁ దామే గౌరవించుకొనుచు, పరిపూర్ణుల మనెడి తలంపుతో (గురువందనము మొదలగు

100

వానినయందైనను) ఏదియును జేయక, ధనముచేతను గొప్పవిద్యయు మంచి వంశమునుగలవార మనెడి యభిమానము చేతను బుట్టినమదము

101

గలవారై, తా మొకయజ్ఞము చేయువారమనెడు వట్టి పేరుపనమాత్రమే కల్యజ్ఞములను యజించుచున్నారు. అదియును దంభముచేత (అనఁగా యజించుచున్నారమని ప్రకటించుకొనుకొఱకు) శాస్త్రోక్తవిధి ననుసరింపక యజించుచున్నారు.

అవ. వారు మఱియు నెట్టివంటివారై యజించుచున్నారని చెప్పుచున్నారు.

102 అవ.

శ్లో. అహఙ్కారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః
మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః.

టీ. అహఙ్కారం=సమస్తము నేను చేయుదున నెడి అహంకారమును, బలం=బలమును, దర్పం=గర్వమును, కామం=కామమును,

క్రోధంచ=క్రోధమును, సంశ్రితాః=మిక్కిలి ఆశ్రయించినవారును అగు, తే = ఆసురసంపదగలవారు, ఆత్మపరదేహేషు=తమ శరీరమునందును ఇతర శరీరములయందును, (అవస్థితం=ఉండునట్టి), మాం= నన్ను, అభ్యసూయకాః = అసూయపడువారును, ప్రద్విషన్తః = ద్వేషించుచున్నవారును నై.

తా. మఱియొకరి యపేక్ష లేక సమస్తము నేనె చేయుదునని [103]యహంకారమును, సమస్తమును చేయుటకు నా [104]బలమెచాలునని బలమును, కాఁబట్టి నావంటివాఁ డెవఁడు లేఁడని దర్పమును, ఇట్టినేను కోరినంత మాత్రమున సమస్తము లభించునని [105]కామమును, నా కపకారము చేయువారలనెల్లఁ జంపెద నని [105]క్రోధమును ఆశ్రయించినవారై, స్వదేహములందును బరదేహములయందును అంతర్యామి నై నెలకొని సమస్తమును జేయించుచున్న పురుషోత్తముఁ డగునన్ను *అసూయాపరులై [106]ద్వేషించుచు నుందురు–అనఁగా [107]కుయుక్తులచేత నేనుగల ననెడి విషయమున దోషములు వెలిపుచ్చుచు నన్ను [108]సైఁపక యహంకారాదుల నాశ్రయించి యాగాదులగు సర్వక్రియా సమూహమును జేయుదురని యర్థము.

---

* అసూయతో ద్వేషించుట యనఁగా 'జగత్తు ఈశ్వరపరతంత్రమైనయెడల కర్మవశ్య మెట్లగును? ఫలము కర్మాధీనమగునేని ఈశ్వరునితోఁ బనియేమి' అనునివి మొదలగు కుయుక్తులచేత నాయునికియందే దోషము ప్రకటించుచు నన్ను సహింపనివారై యుండుట.

109
శ్లో. తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
110
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు. 19

టీ. ద్విషతః = నన్ను ద్వేషించువారును, క్రూరాన్=క్రూర స్వభావము గలవారును, అశుభాన్=అశుభమైన కార్యములు చేయు వారును అగు, తాన్=అట్టి, నరాధమాన్=మనుష్యాధములను, సంసారేషు=సంతానములలో, అందును, ఆసురీషు=న్యాయానుకూల్యమునకు విరుద్ధములైన, యోనిష్వేవ=యోనులయందె, అజస్రం=ఎల్లపుడును, అహం=నేను. క్షిపామి=త్రోయుదును.

111
తా. ఎవరు నన్నిట్లు ద్వేషింతురో, యాక్రూరులును బాపులును నగు నరాధములను జన్మజరామరణాది రూపమున పరివర్తమానమగు సంతానములలో, అందును ఆసుర యోనులందే - అనఁగా మదానుకూల్యమునకు విరుద్ధములైన జన్మములయందే, త్రోయుదును. అనఁగా అట్టి ఆయా జన్మములు ఎట్టిప్రవర్తనములచేఁ గలుగునో యట్టిప్రవర్తనములకు హేతువులగు *క్రూరబుద్ధులయందు నేనె చేర్తునని యర్థము.

శ్లో. ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైవకౌన్తేయ తతోయాన్త్యధమాంగతిమ్. 20

టీ. హేకౌన్తేయ=ఓయర్జునా, ఆసురీం = అసురస్వభావముగల, యోనిం=జన్మమును, ఆపన్నాః=పొందినవారును, జన్మని జన్మని = ప్రతిజన్మమునందును, మూఢాః (సన్తః) = (నన్నుగుఱించి) విపరీత

---

*ఇట్లు పాపప్రవృత్తికి హేతుభూతమగు క్రూరబుద్ధి నిచ్చుటయును ప్రాచీనద్వేషాదులకు ఫల మగుటచే, ఈశ్వరునికి వైషమ్యనైర్ఘృణ్యములు లేవని తెలియునది.

జ్ఞానముగలవారున్నై, *మాం=నన్ను, అప్రాప్యైవ = పొందకయె, తతః = ఆ జన్మముకంటెను, అధమాం = నీచతరమగు, గతిం = గతిని, యాన్తి=పొందుచున్నారు.

తా. అర్జునా, నా యానుకూల్యమునకు విరుద్ధముగానుండు జన్మము నొందినవారు, మరల ప్రతిజన్మమునందును నన్ను గుఱించి విపరీతజ్ఞానముగలవారై, కనుకనే సర్వేశ్వరుఁడును వాసుదేవుఁడునగు భగవంతుఁ డొకఁ డనునట్టి జ్ఞానమును బొందకయే యా జన్మము కంటెను మఱిపఱి నీచతరమగుగతిని బొందుచున్నారు.

112 అవ.

అవ. ఈ యాసురస్వభావరూపమైన యాత్మ నాశనమునకు

113

మూల హేతువును చెప్పుచున్నారు.

శ్లో. త్రివిధం నరక స్యైత ద్ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజ. 21

టీ. నరకస్య=ఆసురస్వభావ మనెడి నరకమునకు, కామః = కామము, క్రోధః=కోపము, తథా=అట్లె, లోభః=లోభము, (ఇతి) ఏతత్=అనునది, త్రివిధం=మూఁడువిధములగు, ద్వారం=ప్రవేశోపాయము - హేతువు, (తత్ చ=అదియె,) ఆత్మనః=ఆత్మకు, నాశనం= నాశకం - ఆత్మాపహారకము, తస్మాత్=అట్లు నరక హేతు వగుటవలన, ఏతత్త్రయం=కామక్రోధలోభము లనెడుమూఁడింటిని, త్యజ=విడువుము.

* సత్త్వోత్తరులైనవారికిని భగవత్ప్రాప్తి అనేక జన్మములకుఁ గలుగునదైన యుండఁగా తామసుల కదికలుగు ననెడి ప్రసక్తియేలేదు. ప్రసక్తియే లేనప్పుడు ప్రతిషేధించుటయుఁ గలుగదు గాన 'మాం అప్రాప్య' అని భగవత్ప్రాప్తిని బ్రతిషేధించుట దగదు. మఱి, ప్రాప్తియొక్క ప్రథమపర్వమైన శాస్త్రజన్యజ్ఞానప్రాప్తియే యిచట ప్రతిషేధింపఁదగును గాన 'మామ్' అనుటకు 'నన్ను' అని అర్థము చెప్పక 'సర్వేశ్వ......డున్నాఁడనెడి శాస్త్రజన్యజ్ఞానమును' అని అర్థము సేయఁబడినది.

114
తా. ఆసురస్వభావరూపమైనట్టి నరకమున కీమూఁడు ద్వారములు గలవు. అవి *యాత్మకు నాశకములైనవి. అవియె కామ క్రోధ లోభములు. ఈ మూఁటిస్వరూపము పూర్వమే వివరింపఁబడినది. ద్వారమనఁగా మార్గము - హేతువని యర్థము. ఇట్లు అతిఘోరనరక
115
మునకు హేతు వగుటంబట్టి కామక్రోధలోభము లనెడి యీమూఁటిని
116
దూరమునఁ బరిత్యజింపవలయును. 117 అవ.

శ్లో. ఏతై ర్విముక్తః కౌన్తేయ తమోద్వారై స్త్రిభిర్నరః
118
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్.

టీ. కౌన్తేయ=అర్జునా, తమోద్వారైః = విపరీతజ్ఞానహేతువులైన, ఏతైః=ఈ, త్రిభిః=కామక్రోధలోభము లనెడిమూఁడింటిచేత, విముక్తః=విడువఁబడిన, నరః=పురుషుఁడు, ఆత్మనః=తన యాత్మకు, శ్రేయః=మేలును, ఆచరతి=అచరించుచున్నాఁడు, తతః = దానివలన, పరాంగతిం=పరమప్రాప్యమైనసన్నె, యాతి=పొందుచున్నాఁడు.
119
తా. అర్జునా, నన్నుఁగూర్చిన విపరీతజ్ఞానమునకు హేతువులగు నీ కామక్రోధలోభములనుండి విడివడిన మనుజుఁడు తన యాత్మకు
120
మేలు చేసికొనుచున్నాఁడు - అనఁగా మద్విషయజ్ఞానము లభించి మదానుకూల్యమునందుఁ బ్రయత్నించుచున్నాఁడు. దానివలన పరమప్రాప్యమైనసన్నె పొందుచున్నాఁడు.

* ఇచట ఆత్మనాశమనఁగా ఆత్మనశించుటకాదు, అది నిత్యమైనది. యథావస్థితాత్మస్వరూపప్రాప్తి లేమియే ఆత్మనాశము. తక్కిన నరకములు పాపక్షయము కలిగించును, ఇవియే పాపార్జనము కలిగించును గాన ఘోరనరక హేతువు అనఁబడెను.

అవ. శాస్త్రము నాదరింపకుండుటయు ఈ నరకమునకు ప్రధాన హేతువని చెప్పుచున్నారు. 121.

122

శ్లో॥ య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. 23

టీ. యః=ఎవ్వఁడు, శాస్త్రవిధిం=వేదములనెడి నాయాజ్ఞను, ఉత్సృజ్య=విడిచిపెట్టి, కామకారతః=తన కిచ్ఛవచ్చినట్లు, వర్తతే=ప్రవర్తించుచున్నాఁడో, సః=వాఁడు, సిద్ధిం=స్వర్గాదిఫలసిద్ధిని, న అవాప్నోతి=పొందఁడు, సుఖం=ఇహలోక సుఖమును, న = పొందఁడు పరాంగతిం=పరమప్రాప్యుఁడగు భగవంతుని, న=పొందఁడు.

123

తా. ఎవ్వఁడేనియు వేదములనెడు నాయనుశాసనము నుల్లం

124

ఘించి, తన కిచ్ఛవచ్చినమార్గమున ప్రవర్తించునో, వాఁ డాముష్మిక సిద్ధిని (అనఁగా ఆముష్మికసుఖహేతుభూతమైన ఉపాయసిద్ధిని) దేనిని గాని పొందఁడు; (ఇహలోక) సుఖమును దేనినిగాని బొందఁడు; పరమ

125

గతిని బొందఁడు. ఇహలోకసుఖమునే పొందఁ డనఁగా, పరమ ప్రాప్యుఁడ నగునన్నుఁబొందు టెక్కడిది దని యర్థము.

**126 అవ.**

శ్లో॥ తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి. 24

టీ. తస్మాత్=ఆహేతువువలన – (అవిధిపూర్వకమైనకర్మము నిష్ఫలమగుటచేత,) తే=నీకు, కార్యాకార్యవ్యవస్థితౌ=ఉపాదేయమును (కర్తవ్యమై భగవదారాధనరూపమైన కర్మమును) అనుపాదేయమును (అకర్తవ్యమై భగవదాజ్ఞోల్లంఘనరూపమైన కర్మమును) నేర్పఱచుట

యందు, శాస్త్రం = ధర్మశాస్త్రేతిహాసాదులచే ఉపబృంహితమైన వేదము, ప్రమాణం = ప్రమాణము; కాఁబట్టి, శాస్త్రవిధానోక్తం = శాస్త్రవిధియందుఁ జెప్పఁబడిన, కర్మ = ఉపాదేయమైన కర్మమును, జ్ఞాత్వా = కలరూపున తెలిసికొని, ఇహ = ఇచ్చట, కర్తుం = చేయుటకు-స్వీకరించుటకు, అర్హసి = తగుదువు.

127

తా. కాఁబట్టి, నీకు ఇది యుపాదేయము ఇది త్యాజ్యము అని యేర్పఱచుటకు శాస్త్రమె ప్రమాణము. ధర్మశాస్త్రేతిహాసపురాణా

128

దులచే ఉపబృంహితము లయినవేదములె యీ శాస్త్రము. అవి

129 130

పురుషోత్తమాఖ్యపరతత్త్వమును, తత్ప్రీతికరమును తత్ప్రాప్త్యుపాయ

131

భూతమునైన కర్మమును బోధించుచున్నవి. ఆ శాస్త్రవిధానముచేత చెప్పఁబడిన పరతత్త్వమును పురుషోత్తమారాధనరూపమైన కర్మమును ఎక్కువతక్కువలు లేకుండునట్లు కలరూపున నెఱిఁగినదాని *స్వీకరింపఁ దగుదువు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసమ్ప
ద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః.

ఇది యుపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ
శాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును నగు
శ్రీ భగవద్గీతలయందు దైవాసురసంపద్విభాగ
యోగం బన్నది షోడశాధ్యాయము.

132

---

* ఇందు 'సత్వోత్తరుఁడైన నీవు తక్కిన యాభాసప్రక్రియలను నిరసించిన వాఁడవై, నిత్యభగవదాజ్ఞారూపమైన వేద మనెడు శాస్త్రముయొక్క సారమై కర్మయోగ భక్తియోగరూపమై భగవదనన్యభజనమగు పరమధర్మమును విడువక దానినే యెప్పుడు నీయధికారమునకుఁ దగినదిగా నుపాదేయముగా గ్రహింపుము' అని ముఖ్యతాత్పర్యము.

# శ్రీ భగవద్గీతా - షోడశోఽధ్యాయః

## దైవాసురసమ్పద్విభాగయోగః

### అ వ తా రి క

—//—

(1) వెనుకటి 15వ అధ్యాయమునకు చివర 'ఇతి గుహ్యతమం శాస్త్ర' మ్మని శాస్త్రప్రసంగము ప్రసక్తమైనది. 'అనఘ...భారత' శబ్దములచే శాస్త్రాధికారి సూచింపబడెను. ఆ యధికారియే "మా శుచ స్సమ్పదం దైవీ మభిజాతోఽసి భారత" యని ముందు చెప్పబడును. చెప్పిన అర్థములయందు నమ్మకము శాస్త్రాధీనముగాన పురుషుడు శాస్త్రాధీనుడని చెప్పవలెను. అదియును "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే। కార్యాకార్య వ్యవస్థితౌ। జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహా ర్హసి." అనగా - ఇదిచేయదగినది యిది చేయరానిదను ఏర్పాటునకు శాస్త్రమే మూలాధారము. కాబట్టి శాస్త్రమున విధించిన మార్గము ననుసరించియే నీవీ సంసారమున కర్మలను చేయవలెను. అని యీ యధ్యాయాంతమున చెప్పబడెను. అందులకే వెనుకటి యధ్యాయాంత మున సూచింపబడిన అధికారియొక్క యోగ్యతను పరిశీలించుటకే యీ యధ్యాయారంభమున దైవాసురవిభాగము చేయబడినది. ఈ విష యమంతయు "ఆసురము" ఇత్యాది గ్రంథముచే చెప్పబడుచున్నది.

### 1, 2, 3 శ్లోకములు

(2) తమోగుణమువలన భయము జనించుట సహజము. అది దైవీసంపదకుచెందిన సాత్వికునకుండనేరదు. కాబట్టి 'అభయ' శబ్దమును వివరించుటకై దానికి విపరీతమైన భయస్వరూపమును చెప్పుచున్నారు.

(3) సత్త్వమనగా సత్త్వగుణము ప్రధానముగా గల మనస్సు, దానికి సంశుద్ధి యనగా 'సమీచీనాశుద్ధిః' అనగా సకల దోషములును

పోవుట. ఆ దోషములు ఏవి ? రజస్తమస్సులు - వానివలన బుట్టునట్టి కామక్రోధాది అరిషడ్వర్గమున్ను.

(4) కామరాగాదులకు నిదానము రజోగుణ తమోగుణములు. అవి లేకున్నచో కామము రాగము అసూయ వంచన మొదలగు దోషములన్నియును పోవును.

(5) ఇచ్చట జ్ఞానయోగశబ్దము కర్మయోగాదులను చేరనీయ కుండుటకుకాదు. అవియును సాత్వికున కావశ్యకములే గదా! కాబట్టి యిచ్చట జ్ఞానయోగశబ్దమునకు కర్మజ్ఞానభక్తియోగములు మూడింటి కిని సాధారణమైన శాస్త్రీయమగు ప్రకృతిగంధములేని శుద్ధాత్మ స్వరూప వివేచనమని తెలియవలెను. ఇచ్చట యోగశబ్దమునకు ఉపా యమని యర్థము.

(6) ఈ వినియోగము తన సంపద కనుగుణముగా నుండవలెను.

(7) అంతఃకరణము (మనస్సును) కూడనిదారికి పోకుండ నరి కట్టుట. దానిని యోగశాస్త్రమువలన నెఱుంగవలెను. గీతయందును 6వ యధ్యాయమున నర్జునుని ప్రశ్నకు బదులుగా భగవానుడు 'అభ్యా సేనచ కౌన్తేయ వైరాగ్యేణచ గృహ్యతే' అని అభ్యాస వైరాగ్యము లను మనోనిగ్రహమునకు సాధనములనుగా సెలవిచ్చెను.

(8) ఆసురయజ్ఞములను గూర్చి ముందు వివరింపనున్నాడు గాన నిచ్చట యజ్ఞము సాత్వికమని యెఱుంగవలెను. ఇచ్చట యజ్ఞశబ్దము సమస్త నిత్యనైమిత్తికముల కుపలక్షణము.

(9) చిన్న దేవతలను గురించినట్టియు, స్వల్పఫలముల నాసంగు కామ్యకర్మలను గురించినట్టియు వేదభాగము 'యావానర్థఉదపానే' అను 2వ అధ్యాయమునందలి 46వ శ్లోకముచే చెప్పబడినరీతిగా ముముక్షువుల కభ్యసించదగినది కాదని యిచ్చటను భ్రమించునోయని దానిని పరిహరించుచు త్రైగుణ్య లభ్యసించినటుల కాదని వైలక్షణ్య మును జూపుచున్నారు.

(10) తపస్సనగా - శాస్త్ర మంగీకరించు భోగసంకోచము., అందు కొన్నిటిని చెప్పుచున్నారు.

(11) ఇచ్చట ద్వాదశ్యుపవాస మనగా, ఏకాదశ్యుపవాసమే. ఈ యేకాదశ్యుపవాసమునకన్న ద్వాదశీ సమారాధనయే ముఖ్యమైనది. ఏకాదశ్యుపవాసము దాని కంగము. ఏకాదశినా డుపసించిన వాడే ద్వాదశ్యారాధనను చేయవలెను. ఒక్కొక్కసారి ద్వాదశినాడే ఉపవసించవలసియు వచ్చును.

"ఏకాదశ్యాం మహోరాత్రం, కర్తవ్యం భోజనద్వయమ్
రాత్రౌ జాగరణం చైవ దివాచ హరికీర్తనమ్."

భోజన! జాత్యే కవచనం. ఓ జనులారా! ఏకాదశియందు పగలు భగవన్నామ సంకీర్తనమున్ను రాత్రి జాగరణమును అను నీ రెండున్ను తప్పక చేయవలెను. తపస్సుచే శుద్ధుడైన వానికే భగవదారాధనలో నధికార ముండును. తపస్సు అనగా - శాస్త్రీయమైన భోగసంకోచము. అదియే ఏకాదశ్యుపవాసము.

(12) ఇది స్వపీడకున్ను (తనను తానే బాధించుకొనుటకు) ఉపలక్షణము. అనగా - పరపీడనవలె తన పీడనయును చేయదగదు. మూర్ఖులు పరులను పీడించుట కొఱకు తమను పీడించుకొందురు. కత్తితో చేతిని కోసుకొని తన శత్రువుకోసెనని యాతనిని హింసించు నెపముతో నేరమును మోపును.

(13) "సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్సత్య మప్రియమ్
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏషధర్మ స్సనాతనః."

చూచినదానిని చూచినటుల చెప్పవలెను. దానినైనను వినువానికి ప్రియమైన దైననే పనికట్టుకొని వెళ్లి చెప్పవలెను. యథార్థమేయైనను

వానికప్రియమైనచో తప్పించుకొని పోవలెనుగాని చెప్పరాదు. (నిర్బంధించి వాడేయడిగిన చెప్పినను తప్పులేదు) వానికిష్టముగదా యని యసత్యమును కల్పించి చెప్పరాదు. ఇది సత్యభాషణమును గూర్చిన సనాతన ధర్మము.

(14) స్వాభావికమైన ఆహార నిద్రాదులుగాని, శాస్త్రసిద్ధమైన పంచమహాయజ్ఞాదులుగాని విడువ తగవు గాన విడువవలసినవానిని పేర్కొనుచున్నారు.

(15) 'దమః' అనుటచే మనోనిగ్రహ మింతకు ముందే చెప్ప బడినదిగాన 'శాన్తోదాన్తః' అనుచోటవలె నిచ్చట బాహ్యేంద్రియ నిగ్రహమును చెప్పవలెను.

(16) పైశున మనగా - చాడీలుచెప్పుట. ఇది మహా పాపముగా శాస్త్రమున చెప్పబడినది.

శ్లో॥ లోష్టమర్ది తృణచ్ఛేదీ నఖఖాదీచయో నరః
స వినాశం వ్రజత్యాశు సూచికోఽశుచిరేవచ.

పనిలేక మట్టిబెడ్డలను కాలివ్రేళ్ళతోను చేతివ్రేళ్ళతోను నలుపు వాడును, గడ్డిని (చాపమొదలగువానిని) గిల్లి తెంపుచుండువాడును, పళ్ళతో గోళ్ళను - కొఱికి తీసుకొనువాడును, ఇక్కడిమాట లక్కడను అక్కడిమాట లిక్కడను (అప్రియమైనవానిని) కలహ కారణమైనవానిని చెప్పుచుండువాడును శాస్త్రోక్త ఆచారవిహీనుడును వీరు వెంటనే చెడుదురు.

ఆండాళ్ళుతల్లి తిరుప్పావైలో "తీక్కుఱళైచ్చెన్నోదోమ్" అని దీనినొక ముఖ్యవ్రతాంగమునుగా పేర్కొనెను.

(17) దయాభూతేషు— దయ అనగనే అది ప్రాణుల విషయ మని చెప్పకనే తెలియుచుండగా భూతేషు అని యీ బహువచనముతో తిరిగి చెప్పనేల యన్నచో - ఇది శత్రువులయందేమి మిత్రులయందేమి అందరియందును ఉండవలెనని సూచించుటకేయని యెఱుంగవలెను.

గౌతముడును – దయా సర్వేషు భూతేషు, క్షాన్తి, రనసూయా, శౌచ, మనాయాసో, మఙ్గళ, మకార్పణ్యా, మస్పృహా, అని యీ ఎని మిదిన్ని ఆత్మగుణములని చెప్పెను. సకల ప్రాణులకును కలుగు దుఃఖ మునుజూచి సహింపజాలక దానిని యథాశక్తిగా పరిహరించుటకు ప్రయత్నించుట. వారు తన కపకారమొనరించినను చిత్తమున ప్రతి క్రియ చేయవలెనను వికారము పుట్టకుండుట. పరుల గుణములయందు దోషమునే ఆరోపించకుండుట. శాస్త్రోక్తరీతిగా కరణత్రయమును సత్కా ర్యముల నాచరించుటకు యోగ్యముగా నుంచుకొనుట. చేయవలసిన పనులను చేయుటలో శ్రమచెంది మానకుండుట. ఇతరులకు తనకును క్షేమకరమగు నడవడికను కలిగియుండుట. నిష్ఫలచింత, (కూడని పనులను చేయవలెనను చింత) లేకుండుట. పరుల ద్రవ్యమునందు అయుక్తమగు దురాశ లేకుండుట – అనునవి.

ఇది మిత్రులు ఆప్తులు బంధువుల యందుండుటలో విధించనవ సరములేదు గాని శత్రువులయందుకూడా నుండుటయే విశేషము – తన కపకారమొనరించినను అది తా నొనరించిన పాపమునకు ఫల ముగా భగవంతునిచే ప్రేరేపించబడి వారు గావించినదియేయని భావిం చుటచే కలుగును. దానిచే తా నొనరించిన పాపమునకు ప్రాయ శ్చిత్తమై తాను శుద్ధుడగును. తాను వారి కేవిధముగను అపకరించ లేదని తన యంతరాత్మలో నమ్మకమున్నచో నది మరింత ఉపకార కము: నిష్కారణముగ నపకరించువాడు ఎవరును చేయని ఉపకా రము నీకు చేయును. అనగా నీతడు నీ పాపములకు భాగస్వామి యగును. కావున నాతన్నిపై కోపించక నాతనిని దయతో చూడుము అని శాస్త్రము చెప్పును.

మరియు– అహింసా ప్రథమం పుష్పం– పుష్పమిన్ద్రియనిగ్రహః
సర్వభూత దయాపుష్పం క్షమాపుష్పం విశేషతః
దానం పుష్పం తపః పుష్పం సత్యం శౌచం తథైవచ
పుష్పమష్టవిధం ప్రోక్తం విష్ణోః ప్రీతికరం భవేత్.

అని భగవంతుని యనుగ్రహమునకు సన్నిహిత సాధనములగు నీ యెనిమిది గుణములును ఎనిమిది పుష్పములుగా వర్ణింపబడినవి.

"తాపత్రయేణాభిహతం యదేతదఖిలం జగత్।
తదా శోచ్యేషు భూతేషు కరుణాం నకరోతికః"
అని ప్రహ్లాదుడు చెప్పెను.

అనగా- లోకమున జనులందరును ఆధ్యాత్మిక ఆధిభౌతిక, ఆధి దైవిక దుఃఖములచే కుమిలిపోవుచున్నారు. అట్టి వారిని జూచి అయ్యో యని జాలిపడి వారి యా దుఃఖములను బాపుటకు యత్నించకుండ నెవ్వడుండగలడని భావము.

అనగా- దయయనగా- పరుల దుఃఖమును సహించలేక దానిని పోగొట్టవలెనని కోరుటయేయని సారాంశము.

(18) కూడని వానియందు కోరికలేకుండుట.

(19) గట్టితనమునకు విరుద్ధమైన మెత్తతనము అన్నచో యిచ్చట అర్థము కుదురదు - కాన సజ్జనులతో...అనబడినది. దీనిని సూచించునవి - వారితో ముందుగ తానే మాట్లాడుట, సుముఖముగా వారికి గాన్పించుట మొదలగునవి. కఠినమైన పదార్థము ఇతర పదార్థ ములను తనలో జేరనీయదు. స్తబ్ధస్వభావము కలవాడు రాతివలె కఠినుడు. అట్లుండరాదు. "స్మితపూర్వాభిభాషీచ పూర్వభాషీచ రాఘవః" అనునట్లుండవలెను.

(20) ఉత్తమవంశజులు, విద్వాంసులు, సదాచారసంపన్నులైన మహాత్ములు ఇతరులు గావించు దుష్కర్మలకును సిగ్గుపడుదురు. అట్టి వారు తామే యట్టిపనులను చేసినచో సిగ్గుపడుదురని చెప్పవలెనా?

(21) దీనిచే క్రీడలు, పరిహాసముచేయుట, జూదము మొదలగు వానియందును సంగముండరాదని సూచింపబడినది.

(22) సాపరాధుల విషయమే క్షమగాని నిరపరాధుల పట్ల క్షమ కవకాశములేదు. అట్టివారి విషయమై నిర్వికారత్వమనగా నౌదాసీన్యము మాత్రమే గాని అది క్షమకాదు. నిరపరాధుల యందును కొందరికి క్రోధ ముండుట కలదు.

"బ్రాహ్మణా గణికా వైద్యాస్సారమేయాశ్చకుక్కుటాః
దృష్టమాత్రేణ కుప్యన్తి నజానే తత్ర కారణమ్."

బ్రాహ్మణులు, వేశ్యలు వైద్యులు కుక్కలు, కోళ్ళు - ఇవి అదేమోగాని మనుష్యులు కనిపించినంతనే చిరచిరలాడుచుండును.

(23) మహాభారతమున - ద్రౌపది దుశ్శాసనుడు తన వస్త్ర మును విప్పి తన నవమాన పరుచు సమయమున -

శ్లో. "జ్ఞాతం మయా వసిష్ఠేన, పురాగీతం మహాత్మనా
మహాత్యాపది సమ్ప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః
ఇతి నిశ్చిత్య మనసా, శరణాగతవత్సలమ్
ఆకృష్యమాణే వసనే, ద్రౌపదీ కృష్ణమస్మరత్.

'పూర్వము వసిష్ఠమహర్షి సెలవిచ్చిన ధర్మమును నేనెఱుంగుదును. గొప్ప ఆపద సంభవించినప్పుడు శ్రియఃపతిని స్మరించవలెను' అని నిశ్చయించుకొని తన వస్త్రాపహరణమును ప్రారంభించగనే శ్రీకృష్ణుని స్మరించెను.

ఇట్లు సుకరమును ముఖ్యమును అయిన కర్తవ్యమును విడువకుండుటవలన నితర కర్తవ్యములు నిట్లే విడువక చేయబడియే యుండవలెనని భావము.

గీతయందే 18వ అధ్యాయమున 33వ శ్లోకమున -

ధృత్యా యయా ధారయతే, మనః ప్రాణేన్ద్రియ క్రియాః
యోగేనా వ్యభిచారిణ్యాధృతి స్సాపార్థ సాత్వికీ.

యని అనగా.

ఇతర ఫలములను కోరక మోక్షసాధనమైన భగవదుపాసనము కొఱకు ప్రవర్తించి దానికి సాధనములైన మనస్సు, ప్రాణము, ఇంద్రియములు వీనియొక్క పనులను నిలువబెట్టు ధృతి సత్వగుణప్రధానమైన ధృతి యని చెప్పబడును.

(24) శౌచం - శరీరము, వాక్కు, మనస్సు అనబడు కరణ త్రయము అపవిత్ర పురుషులను తాకుటచేతను, కూడని వస్తువులను వాడుటచేతను సత్వగుణమును కోల్పోవును. అందుచే వానితో చేయ వలసిన కర్మల కవి పనికిరాకుండును. అట్టి ప్రమాదము లేకుండుటయే శౌచ మనబడును.

(25) బలాఢ్యులు దుర్బలులలను తమ వశమున నిడుకొని వారి స్వేచ్ఛను భంగపరతురు. దీనినే ఉపరోధ మందురు. దానిని చేయకుండుట అద్రోహ మనబడును. ఇచట ఇతరులయొక్క అనుటచే - తనయొక్క స్వేచ్ఛాప్రవృత్తి నరికట్టుట తపస్సనబడును. అది తన యోగ మున కుపకారియగుటచే దానిని నిషేధించక "ఇతరుల" అనబడెను.

(26) మానమనగా - గర్వము- దానిని నిషేధించుటలో తాత్ప ర్యము అయినను తగని స్థానమున అనుట సాభిప్రాయము. అది యేమనగా — ఉత్తమవంశమున బుట్టుట, మంచి పరాక్రమమును కలిగియుండుట, గొప్ప కీర్తినార్జించుట మొదలగువానిచే స్వల్పగర్వమే యున్నను అంత ప్రమాదకరముకాదు. అదియున్నను దోషము లేదు, తద తిరిక్తమైన గర్వముఆసుర ధర్మముగాచెప్పబడును. దాని కిచ్చట ప్రసక్తి లేనే లేదు. కాబట్టి "తగినిచోట" అని గర్వమున కొక విశేషణము చేర్చబడెను. శ్రీరామచంద్రుడు విభీషణ శరణాగతి సందర్భములో "అంగుళ్యగ్రేణ తాన్ హన్యాం, ఇచ్ఛన్ హరి గణేశ్వర" అనుట గర్వముకాదు.

'సత్వం దేవగుణం విద్యాత్, ఇతరావాసురా గుణే'.

(27) సత్త్వము దేవతల గుణమని యెఱుంగవలెను. రజస్తమో గుణములు ఆసురములు- అని విభజించుటచేతను, 'సత్త్వాత్సంజాయతే జ్ఞానం' అనగా సత్త్వగుణము అనుష్ఠింప చేయదగిన జ్ఞానమును బుట్టించున దగుటచేతను సత్త్వగుణమధికముగా గలవారు భగవదాజ్ఞారూపమగు శాస్త్రము నతిక్రమింపజాలరు. ఇదియే వారికి సర్వము. అందుచే నిది సంపత్తని చెప్పబడుట. అవివేకులచే భోగ్యపదార్థములును వానికి సాధనములును ఎట్లు సంపదగా తలంచబడునో అటులనే సాత్త్వికులగు దైవీసంపన్నులకు భగవదాజ్ఞ ననువర్తించుట మిక్కిలి యభీష్టమున్ను పరమపురుషార్థమునకు కారణమున్ను అగుచున్నది.

'విష్ణుభక్తిపరో దేవః, విపరీత స్తథాసురః
ద్వివిధో భూత సర్గోఽయం, దైవ ఆసుర ఏవచ'.

ప్రాణులసృష్టి దైవమనియు ఆసురమనియు రెండేవిధములు. విష్ణుభక్తి కలవారైనచో దేవతల వంశములోని వారనబడుదురు. అది లేనివారు ఆసుర సంతతిలోనివా రనబడుదురు.

(28) ఎట్లున్న దైవీసంపద లభించునో అట్లు గావించి పుట్టిన వానికి – దీనివలన – ఇట్టిగుణములు కలవారి కిట్టి సంపద తప్పక లభించి తీరునని యీ 'అభిజాతస్య' అనుటలోని అభిముఖీకరణము సూచించుచున్నది. ఈ విషయమునే –

'జాయమానంహి పురుషం, యం పశ్యే న్మధుసూదనః
సాత్త్విక స్సతు విజ్ఞేయః సవై మోక్షార్థ చిన్తకః.'

పుట్టు సమయమున నెవ్వనిపై శ్రియఃపతి కటాక్షము ప్రసరించునో వాడు సాత్త్విక ప్రకృతి కలవాడగును. అట్టివానికే మోక్షకాంక్ష యుండును.

4వ శ్లోకము

(29) అంతియకాని భగవదాజ్ఞను పాలించు బుద్ధితోకాదు.

(30) ఇందువలననే శాస్త్రము నతిక్రమింతురు.

(31) దీనిచే నాచార్యులను, భగవంతుని, తత్సంబంధులను చూచుటచే కలుగు ఆనందముకాదని సూచింపబడెను.

(32) ఇది పీర్ష్యాదులకును ఉపలక్షణము- మనుస్మృతి - 4-17.

"వయసః కర్మణోఽర్థస్య శ్రుతస్యాభి జనస్యచ
వేషవాగ్వృత్తి సారూప్య, మాచరన్ విహరే దిహ."

తనవయస్సు, ఉద్యోగము, ఐశ్వర్యము, కీర్తి, వంశము అనువానికి తగునట్లు వేషము, మాటలు, జీవనముల నవలంబించుచు మెలంగ వలయునని చెప్పెను. దానికివిరుద్ధముగా సంచరించుట అసురప్రకృతిలో చేర్చబడెను.

'యౌవనం ధనసమ్పత్తిః, ప్రభుత్వ మవివేకితా
ఏకైక మప్యనర్థాయ కిముయత్ర చతుష్టయమ్.'

యౌవనము, ధనసమృద్ధి, అధికారము, మంచిచెడ్డలను గమనించలేకుండుట—అను నీ నాల్గింటిలో నొక్కొక్కటియే యనర్థదాయకమని శాస్త్రము చెప్పుచుండగా నీ నాల్గును నొక్కనియందే యున్నచో నిక చెప్పనేల ?

(33) వేదమును నిందించువారిని, దాని నంగీకరించినను విపరీతార్థములను చెప్పువారిని, దొంగలను, ఘోరముగ దూషించినను దండించినను పెద్ద తప్పుకాదని శాస్త్రి మంగీకరించుటచే 'సజ్జనులకు' అనబడినది.

వారికి బాధను కలిగించి వారిని బహిష్కరించిన శాస్త్రమును కూడ బహిష్కరించుటయే.

(34) ఇట్టి యజ్ఞానమునకు మూలము శైవాద్యాగములలో పరతత్వమును అపరతత్వముగాను, అపరతత్వమును పరతత్వముగాను

(అనగా - క్షుద్రదేవతలను గొప్పవారినిగాను గొప్పదేవతలను తక్కువ గాను) తెలుపుటయును, వేదవిధులకు విరుద్ధముగా నాచరించుటయే.

(35) "పశ్యత్యేనం జాయమానం, బ్రహ్మా రుద్రోథవాపునః
రజసా తమసా చైవ, మానసం సమభిప్లుతమ్."

పుట్టు సమయమున బ్రహ్మయొక్కగాని రుద్రునియొక్కగాని కటాక్షము సోకినచో క్రమముగ నీతని మనస్సు రజోగుణ తమోగుణ ప్రచుర మగును.

(36) దీనిని సంపత్తుగా చెప్పనేల యన్నచో - భగవంతుని యాజ్ఞ నుల్లంఘించుటలోనే యభిరుచియు భోగ్యతాబుద్ధియు కలవారి యభిప్రాయమునుబట్టియనిగాని, నిందారూపముగగాని దానిని సంపద యనుచున్నారని గ్రహించవలెను.

5వ శ్లోకము

అవతారిక —

(37) ఇచ్చట దైవాసుర సంపదలను జెప్పుట దైవీ సంపత్తు నందు శ్రద్ధయును, ఆసురసంపత్తునందు అరుచియును బుట్టించుట కొఱకేయని గ్రహించవలెను.

(38) విమోక్ష శబ్దమునకు కేవల మనిష్టనివృత్తి మాత్రమే కాదు. ఇష్టప్రాప్తిపర్యంత మర్థమును చెప్పగోరి శబ్దమునకు ముఖ్యార్థమైన ఆత్యంతికానిష్ట నివృత్తిని చెప్పుచున్నారు. 'బంధమునుండి' ఇత్యాది.

(39) శ్లోకమున నిబంధమనగా - 'నియతో బంధః' సంసార బంధ మనివార్యమని భావము.

(40) ఇచ్చట క్రమముగ ననుట -

ఈ సంపద క్రమముగగాక వెనువెంటనే పరమపురుషార్థప్రాప్తికి సాధనమన్నచో సమాధిపర్యంత మావశ్యకమని చెప్పుచున్న శాస్త్రము

వ్యర్థమగును. కాబట్టి 'క్రమముగ' ననబడినది. క్రమమనగా – ఆత్మ సాక్షాత్కారాదిద్వారా యని యర్థము.

(41) 'శోకింపకుము'.

ఈ ఐదవ శ్లోక ఉత్తరార్ధమునను్న 'మాశుచః=దుఃఖింపకుము' అని యోదార్చబడు దుఃఖము అధ్యాయారంభములో "అశోచ్యానన్వ శోచ స్త్వం" అనిన దుఃఖముకాదు. అది యనేకోపపత్తులతో పరిహరింబడియేయున్నది. అర్జునుడున్ను అన్నిటిని విని 11వ అధ్యాయారంభ శ్లోకమున 'మదనుగ్రహాయ' అను శ్లోకాంతమున 'మోహోఽయం విగతో మమ' అని స్వయముగనే చెప్పెను. కాకున్నను 'నీవు దైవీ సంపదలో బుట్టితివన్నంతమాత్రమున బంధువధజనిత దుఃఖమెట్లు నివర్తించును' (దేహాత్మభ్రాంతి యెట్లుపోవును). ఇక నేమి యనగా, 'నిబన్ధాయాసురీమతా' యనుటను విని 'నేను శాస్త్రమర్యాదను మనస్సుతో నైనను ఉల్లంఘించలేదుకాని ధీరోదాత్తునకుండు నిగూఢాహంకారము నాకు నితరాం లేకపోలేదు. ఇది నాకు స్వానుభవవిదితమే. అంత మాత్రముచేనైనను నేను ఆసురసంపదకోటిలో పరిగణింపబడుదునేమో' యని తన ప్రకృతిని నిర్ణయించుకొనలేక తిరిగి యపార సంసారసాగరమున మునుంగుదునేమో యను భయమువలన కంటతడిబెట్టిన యర్జునుని జూచి 'నీవు దైవీసంపదకే చెందినవాడ'వని తెలిపి భగవాను డాతనిని ఓదార్చుచున్నాడు. 'ఇదియును తగని దుఃఖమే. దీనిని నీవే తెచ్చిపెట్టు కొనుచున్నావు' అని యభిప్రాయము.

(42) దైవీప్రకృతిలోబుట్టి గొప్ప ధార్మికులుగా మెలంగిన వారి వంశమున ఆసురసంతాన మెన్నడును జనించనేరదని తాత్పర్యము.

6వ శ్లోకము

[43] అవతారిక –

ఆత్మలన్నియును జ్ఞానాకారముతో సమానములేగదా! ఇట్లు దైవాసుర భేదమును కల్పించుటకు నిమిత్తమేమియను ప్రశ్నను పరిహ

చించుచు ఆసుర మత్యంత నిహీనమగుటచే దానిని సుతరాం పరిత్యజించవలెనని తెలుపుటకై దానిని విస్తరించి వివరించుచున్నాడు.

[44] ఇది దేవతల వంశాను చరితము చెప్పబడినట్లు తోచును. అడికాదు. అట్లెచ్చటను చెప్పనేలేదు. ఇకనేమి - చెప్పుచున్నాడు.

[45] 'ప్రజహాతి యదాకామాన్' 'దైవమేవాపరే యజ్ఞం' 'చతుర్విధా భజన్తేమాం' 'మహాత్మానస్తు మాం పార్థ' ఇత్యాదులచే జ్ఞానయోగనిష్ఠులును కర్మయోగనిష్ఠులును భక్తియోగనిష్ఠులుననగు పురుషులు చెప్పబడినను ఆ యోగమును చేయవలెనని చెప్పుటలోనే తాత్పర్యము. కాబట్టి దైవసర్గమును విస్తరించి చెప్పితిననగా దాని కర్తవ్యమును నిర్దేశించుటద్వారానే యని గ్రహించవలెను.

[46] వినుము - అనుట చెప్పుచున్న తాను ఆప్తతముడనని సూచించుటకే యని గ్రహించవలెను.

మరియు - చేయదగిన దేదైనను తెలియనిచో చేయుటకు శక్యము కానటులనే విడువదగినదియు తెలియనిచో విడుచుటకును శక్యముకాదు. కావున నేను చెప్పుచున్నమాటలను సావధానముగా వినుమని హెచ్చరించుచున్నాడు.

7వ శ్లోకము

[47] ఇచ్చట ప్రవృత్తినివృత్తిశబ్దములు లౌకికవిషయములుకావు. ఆసురులు కుమార్గమునుబట్టి ప్రవర్తించుట సన్మార్గములను విడచి వర్తించుటయును లౌకికమగు వారి యనిష్టములను పరిహరించుకొనుటకును యిష్టములను సాధించుకొనుటకేగదా! కాబట్టి "అసురజన్మము" ఇత్యాది గ్రంథము.

కర్తవ్యాకర్తవ్యములుగా విధింపబడినవియును కావు.

రాగప్రాప్తములును శాస్త్రప్రాప్తములును కావు. 'నశౌచం నాపిచాచారః' అనుటచే నవి చెప్పబడుచున్నవి గాన పౌనరుక్త్య దోషము వచ్చును.

కావున నిచ్చట ముముక్షువులకు కావలసిన ప్రవర్తక-నివర్తక ధర్మములని గ్రహించవలెను. ఆ వివేకము వారికి లేదని తాత్పర్యము.

ఆ ధర్మములు- ప్రవృత్తిలక్షణం ధర్మం- ప్రజాపతి రథాఽబ్రవీత్ నివృత్తిలక్షణం ధర్మం ఋషిర్నారాయణోఽబ్రవీత్ - అని చెప్పబడెను.

[48] ఎఱుంగరనుటలో నొక విశేషముకలదు. 'నసత్యం తేషు విద్యతే' అనగా, సత్యమనగా నేమియో నెఱుంగుదురుగాని యాచరించరని నటుల అభ్యుదయసాధన – మోక్షసాధనమగు వైదిక ధర్మము నెఱింగియు నాచరించరని యర్థముకాదు. వారి కవి తెలియనే తెలియవని యర్థము. అనేకసారులు చెప్పినను తమోగుణాధిక్యముచే వారికి తలకెక్కదని తాత్పర్యము.

ఇచ్చట శ్రీ యామునాచార్యులవారు సెలవిచ్చిన స్తోత్రరత్న లోని యీ క్రింది శ్లోకము ననుసంధించవలెను.

శ్లో॥ త్వాం శీలరూపచరితైః పరమప్రకృష్ట సత్త్వేన
సాత్త్వికతయా ప్రబలైశ్చశాస్త్రైః

ప్రఖ్యాత దైవపరమార్థవిదాం మతైశ్చ
నైవాసురప్రకృతయః ప్రభవన్తిబోద్ధుమ్.

స్వామీ! నీ వనేక రీతుల నీ శీలమును నీ రూపమును నీ చేష్టలను అనేకావతారములెత్తి తెలిపినను మిక్కిలి సత్త్వగుణము ప్రధానముగాగల సాత్త్విక ఋషిపుంగవులచే చెప్పబడిన వగుటచే సాత్త్వికములని ప్రసిద్ధిచెందినవి గనుకనే ప్రబలమైన శాస్త్రములచేతను పరతత్త్వమును బాగుగ నెఱింగినవారుగా ప్రసిద్ధిచెందిన మహాపురుషులచే శతశః బోధింపబడినను ఆసుర ప్రకృతికిచెందినవారు బొత్తుగ నెఱుంగనే యెఱుంగరు అని

[49] శాస్త్రమున చెప్పబడిన శౌచము ఆంతరమనియు బాహ్యమనియును రెండురీతులు. చేయవలసిన శుద్ధులను చేసికొనకపోవుటచే బాహ్యశుద్ధియును ఆత్మగుణములు లేకుండుటచే నాంతరశుద్ధియును వారికి యుండనేరదు.

(50) ఆచారము కారణము, శౌచము దాని కార్యమనియు నెఱుంగవలెను. ఆచారమున్ననే బాహ్యాంతర శౌచ ముండును.

సంధ్యావందనము వర్ణాశ్రమధర్మము, నిత్యకర్మ 'ప్రాజాపత్యం గృహస్థానం' మనెడు ప్రమాణములచే వానికిని యొక ఫలము చెప్ప బడుచున్నది. అట్టితరి సంధ్యావందనము సుశౌచమునకు మాత్రమే కారణ మన నేలయన్నచో చెప్పుచున్నారు.

ఇచ్చట సంధ్య లేనిచో కర్మలు చేయు యోగ్యత లేదనుటచే ఆచారమునకును శౌచమునకును గల కార్యకారణభావము దృఢీకరింప బడినది. ఇది కేవలం సంధ్యావందనమునకే కాదు. నిత్యకర్మలలో దేనిని విడిచినను వైదికకర్మలలో దేనిని కూడా నాచరించుటకు తగదని తాత్పర్యము.

(51) మోసగించుటలో నాస్తికులవారగుటచే తెలిసినది తెలిసి నట్లు వారు చెప్పరు. పరుల పీడించుటలోనే వారికి ఆనందము కావున హితమును తెలుపరు.

8వ శ్లోకము

(52) అవ. ఇట్లు సత్యమును భాషించకుండుటయే కాదు. అసత్య మును కూడ భాషించుచుందు రనుచున్నారు.

(53) ఈ శబ్దము 'మిథ్య' యను నర్థమును బోధించదు. ఇది- లోకులందరకును ప్రత్యక్షప్రమాణసిద్ధమనియు, ప్రమాణసిద్ధమైనదానినే మిథ్యయన్నచో శాస్త్రప్రమాణసిద్ధమైన బ్రహ్మయు మిథ్యయే కావలసి వచ్చుననియు మొదలగు హేతువులచే నీ వాదము వెనుకనే నిరసింప బడినది.

ఆసుర ప్రకృతికి చెందినవారు ఐశ్వర్యము పరమార్థమనియు స్థిర మనియు ప్రబలమైన అధ్యవసాయముతో నుండి దివారాత్రములు తమ జీవితమునంతను తత్సంపాదన తత్సంరక్షణలతోనే గడుపుచుందురు.

అట్టివారిని కూటయుక్తులతో నీ ప్రపంచము హుళ్ళక్కియని వంచిం చుట బ్రహ్మకైనను శక్యముగాదు.

ఆసురలకు శాస్త్రమనిన సుతరాంగిట్టదు కాబట్టి శాస్త్రసిద్ధమైన సత్యత్వమునే వీరు నిరాకరింతు రని చెప్పవలెను. శాస్త్రమున సత్య శబ్దమునకు బ్రహ్మయే యర్థము. 'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ' అని వినుచున్నాముగదా !

ఛాందోగ్యోపనిషత్తు యీ సత్యశబ్దము నెట్లు వివరించినదో గమనింపుడు.

'తస్యహవా ఏతస్యబ్రహ్మణో నామ సత్యమితి'
తానిహవా ఏతాని త్రీణ్యక్షరాణి.
సత్ - తి- య మితి.
తద్యత్ సత్ తదమృతం అథయత్తి తన్మర్త్యం
"తేనోభే యచ్ఛతి తస్మాద్యం;
అహరహర్వా ఏవంవిత్ స్వర్గలోకమేతి"

అని- అనగా ('సత్య' మని బ్రహ్మయొక్క ఇత్యాది సత్య మని బ్రహ్మయొక్క ప్రసిద్ధమైన పేరు.

ఈ పదమున సత్, తి, యమ్ అని మూడక్షరములున్నవి. అందు 'సత్' అనగా నెన్నడును నశించనిదై సదా 'సత్ సత్' అని వ్యవహ రింపబడు- జీవాత్మ. 'తి' యనగా త్యజి- హానౌ అను ధాతువునుండి "త్యజతి=క్షణేక్షణే" తన రూపమును విడుచుచున్న (మారుచున్న పరి ణామమును చెందుచున్న) అను వ్యుత్పత్తిసిద్ధమైన ప్రకృతయు, ప్రాకృత ములున్ను ఆ'సత్త'నబడు జీవుని 'తి' యనబడు ప్రకృతిపరిణామమగు శరీ రముతో కర్మానుగుణముగా;యచ్ఛతి=కూర్చువాడు-సత్యం అనబడును.

జీవులను వారివారి కర్మానుగుణముగా శరీరములలో ప్రవేశబెట్టు సృష్టికర్తయగు నారాయణుడని యర్థము. కాబట్టి యిచ్చట సత్యశబ్దము

నకు - సాంఖ్య - మీమాంసక - జైనబౌద్ధచార్వాకులవలె జగత్తును బ్రహ్మాత్మకముగా నంగీకరించరని యర్థము-

(54) అప్రతిష్ఠం - అనుచోట కూడ నిట్లే లోకులందరు నిందింతురని ప్రత్యక్షసిద్ధమైన ప్రతిష్ఠను నిషేధించక శాస్త్రములలో ప్రతిష్ఠ (ఆధారము) గా జెప్పబడిన సమస్తమును నిషేధింతురని చెప్పవలెను. దానినే ప్రమాణముతో నుదహరించుచున్నారు. ఆదికూర్మ, శేష,దిగ్గజ ప్రభృతులచే భూమి ధరింపబడుచున్నదని శాస్త్రము చెప్పుచుండగా శుష్కతర్కవాదులు "కొందరు ధర్త్రాధరిత్ర్యా యది కశ్చిదన్యః తస్యాపరస్తస్య పరస్తతోఽన్యః। ఏవంహి తేషాం అనవస్థితి స్స్యాత్తతోపి భర్త్ర్యాః భువఏవశక్తిః" భూమిని వేరొకడు ధరించుచున్నాడన్నచో వానిని ధరించువాడెవ్వడని ప్రశ్నయుదయించును. దాని కొకనిని కల్పించిన వానినెవ్వడు ధరించును? అని యిట్లు అనవస్థాదోషము సిద్ధించును. కాన అన్నిటిని ధరించు భూమి తనను తానే ధరించుచున్నదందురు- మరి కొందరు వాయువేగముచే భూమి తిరుగుచుండుననియు ఆ తిరుగుటచేతనే (సైకిలు మొదలగు వానివలె) యది పతనముగాకయున్నదని యందురు. జైనులు మాత్రము భూమి బరువైనదిగాన నిత్యము క్రిందకు పడుచుయుండు నందురు. (వారి సిద్ధాంతమున ముక్తియనగా నిరంతరము పైకి పోవుటవలె నిదియు నిరంతరము క్రిందకు పోవుటయే కానోపు. ఇక వారికి పైనను క్రిందను హద్దులేదేమో)

(55) అనీశ్వర శబ్దమునకు యిచ్చట విగ్రహమునుగాని ప్రభువు మొదలగు లౌకిక ఈశ్వరులనుగాని నిషేధించు తాత్పర్యముకాదు. ఏమన "లోకవ్యవహారసిద్ధ ఇతిచార్వాకాః" అనుటచే వారు లోకవ్యవహారము ప్రత్యక్షసిద్ధముగా నిషేధించరు. ఇక బ్రహ్మను నిషేధింతురనియును చెప్పదగదు. అది అసత్యమనుటచేతనే ఏర్పడినది. కాబట్టి యిచ్చట నిషేధింపబడు నీశ్వరుడు - ఈశ - అనుశాసనే అనువృత్పత్తిని బట్టి సిద్ధమైన నియన్తనే నిషేధించుచున్నారు. సర్వేశ్వరుని నియన్తృత్వము నంగీకరించరని యర్థమును చెప్పవలెను.

అనగా - జైనులు - జగత్తంతయు నచిత్తువంటి స్వభావమునే కలిగియుండు జీవ - అజీవాత్మకమనియు వేరొక యీశ్వరుడు లేడనియు నూదియంటురాయివలె ధర్మాదులచేతనే ధరింపబడి నియమింపబడుచున్నదందురు.

కొందరు- హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదునితో నన్నటుల—"పరమేశ్వర సంజ్ఞోఽజ్ఞ కిమన్యో మయ్యవస్థితే?" మూఢుడా! నేనుండగా పరమేశ్వరుడని పేరు బెట్టుకొని మరియొక డెవ్వడున్నాడురా యనునటుల మేము సర్వేశ్వరులమని యభిమానించు కల్పితశాసకులచే శాసింపబడుచున్న దందురు.

(55) మరికొందరు - దేశభేదకాలభేదములచే నీశ్వరులు మారుచుందురనియు, ఇట్టి యీశ్వర ప్రవాహము చేతనే జగత్తు శాసింపబడుచున్నదందురు. ఇట్లు ఎవ్వరు నాకంటె వేరైన బ్రహ్మరుద్రాదులను పరమేశ్వరులనుగా భావించి బోధింతురో వారాసురప్రకృతులని భగవంతుడానతిచ్చుచున్నాడని భావము.

ఇతరులు కొందరీశ్వరులు ప్రవర్తకులుగా గోచరించుచున్నారే. శాస్త్రములచేతను తెలుపబడుచున్నారే. అట్లుండ భగవంతుడొక్కడే సర్వనియంత యందురేల? యనగా చెప్పుచున్నారు—

"అహం సర్వస్య ప్రభవః"- ఇత్యాది.

ఇతరులీశ్వరులై నియంతలగుటయు నావలననే— "పరాత్తు తత్ శ్రుతేః" అని బ్రహ్మసూత్రము గాంచుడు. మొదట జీవుడు కర్త యని సమర్థించి అటుపైన జీవుని కర్తృత్వము భగవదధీనమా? స్వతంత్రమా? అని యాశంకించుకొని అది భగవదధీనమైనదేయని ఈ సూత్రముచే నిర్ణయింపబడినది.

ఏతావతా నీ మూడు పదములచేతను జగత్తుయొక్క ఉత్పత్తి స్థితి ప్రవృత్తులు మూడును పరమాత్మాధీనములని అసురులంగీకరించరని తెలుపబడినది.

(56) పరబ్రహ్మయొక్క అవశ్యకత లేకయే వేరొక మూలమున ప్రపంచము పుట్టుచుండుటచే బ్రహ్మనుండి పుట్టుచున్నదనుట అసత్య మనుచున్నారు.

చెమటవలన బుట్టినట్టి పేలు, నల్లులు మొదలైనవియు, విత్తన ములు వలన బుట్టు చెట్లు చేమలున్ను స్త్రీపురుష సంసర్గము లేకయే పుట్టి నను దేవతిర్యఙ్మనుష్య సృష్టి మాత్రము మిథున సంపర్కముచేతనే గాని భగవంతుని వలన మాత్రమే పుట్టినదనుటకు వీలులేదు. అయో నిజములుగ గాన్పించునవియు పుట్టుచున్నవిగాన యోనిజములనియే ప్రత్యక్ష ప్రమాణబలముచే నంగీకరింతుము- (యూకామత్కుణ ప్రభృ తయః- యోనిజాఏవ- జన్యత్వాత్ - మనుష్యపశ్వాదివత్) స్వేదమధిక ముగానున్న సమయమున నవి యధికముగా బుట్టుచుండుట నవి సన్న గిలినప్పుడుసన్నగిలుటయున్ను బీజములకు భూమినీరు వెలుగుసమయముల సంయోగములచే చెట్టులు, పొదలు లతలు, పుట్టుటయును. అది లేనిచో పుట్టకపోవుటచేతను ఇట్లు అన్వయవ్యతిరేకముచే స్వేదజోద్భిజ్జాదుల యొక్క పుట్టుటయును, గిట్టుటయును చూచుచుండుటచే నాయాసామ గ్రులవలననే అవి పుట్టుచున్నవని సమర్థించుటకు శక్యమగుటచే నిక యీశ్వరుని కర్తగా కన్పించుటగాని ఆగమములచే నంగీకరించుటగాని పని లేదందురు.

(57) కామహేతుక పదము కాన్పించు సమస్త కారణములకును ఉపలక్షణము. అన్నిటికన్నను కామ ప్రావణ్యమధికమైనదగుటచే నా పదము వాడబడినది.

నాస్తికులకు ప్రమాణములైన ఆగమములున్ను ఆయా సంప్ర దాయస్థులచేతనే వ్రాయబడినవిగాన ఉపదేశపరంపరగా వచ్చుచున్న ఆయాగమములచేతనే యీవిధమగు విపరీతార్థములు బోధింపబడుచున్నవి. మరియు శిథిలమైపోయిన ప్రాచీన నగరవృత్తాంతము లెట్లు ఆయాకాల

మునందున్నవారు వ్రాసిన గ్రంథములచేతను వారువారికి వారువారికి చెప్పుకొనుచు వచ్చుచుండుటచేతను ఆయా విషయముల నెఱుంగుచున్న టులనే యీ విషయములును ప్రచారములో నున్నవి.

ప్రతి కల్పమునందును శ్రియఃపతియను శిల్పి జగత్తులను సృష్టించుచున్నను అది యుక్తమగుటలో సంశయము లేకున్నను ఆయుర్దాయము లేనివాడు తీవ్రమైన ఔషధమును ద్వేషించునటుల వీరును శాస్త్రమును ద్వేషించి యిట్లు విపరీతార్థములను కల్పింతురు.

9వ శ్లోకము

(58) నష్టాత్మలగుటకు కారణము అల్పబుద్ధిత్వమేగాన పునరుక్తి దోషము ప్రసంగించును. దానిని జూపుచున్నాను లేక- పశువులు మృగములువలె వీరికిని దేహవిలక్షణమగు నాత్మజ్ఞానము లేకుండుట స్వారసికమైనదే.

అల్పబుద్ధులనుటచే ఆ దుర్బుద్ధిని పోగొట్టుకొనజాలకున్నారని తాత్పర్యము-

(59) 'అనేన ప్రసవిష్యధ్వం; ఏషవోస్త్విష్టకామధుక్'
'పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ'

దేవతలు తమ ఆరాధనకై మీకొసంగిన సంపదలతో వారి నారాధించి వృద్ధిని పొందుడు.

ఈ యారాధన మీకు సకలాభీష్టముల నొసంగును. ఇట్లు మీరును దేవతలును ఒకరినొకరారాధించుకొనుచు పరమశ్రేయస్సును బడయుడు అని భగవంతుడు సెలవిచ్చిన కట్టుబాటుల నతిక్రమించుచున్నారు. మిగిలిన మూర్ఖులు 'తందానతాన' యనుచున్నారు. ఈమూఢులు వారి యుపదేశములను వినియు వారి యడుగులజాడలో నడచియు నదియే తమకు ముఖ్యకర్తవ్యముగా నమ్మి ధర్మార్థకామమోక్షములను బడయజాలక అభివృద్ధిని చెందనివారై ఆధ్యాత్మికాధి దైవికాధి భౌతిక తాపములకు గురియై క్షీణించుచున్నారు.

10వ శ్లోకము

(60) కారణవస్తువు నాశ్రయించవలెననిగదా వైదికమర్యాద వీరికి జగత్కారణము కామమే గాన దానినే ఫలమని నమ్మి దానినే ఆశ్రయింతురు. ఆ యాశ్రయణమున కంగములు దంభాదులే.

(61) దుష్పూరం=నింపనలవికానిది. దానికి కారణము వారి కోరికలు పొందనలవిగాని విషయములను గూర్చినవగుటయే.

'తృష్ణాఖనిరగాధేయం, దుష్పూరా కేన పూర్యతే'. ఆశ యనునది మిక్కిలి లోతైన గొయ్యివంటిది. అది దేనిచేతను నింపనలవికాదు. ఇక దానినెవరు నింపగలరు? ఇందు మరియొక విశేషము కలదు. ఇది "పూరణైరేవఖన్యతే" నింపుటకు పడవేసిన పదార్థములతోనే యది మరింత లోతుగ త్రవ్వబడును.

"నజాతుకామః కామానాముపభోగేన శామ్యతి
హావిషా కృష్ణవర్త్మేవభూయ ఏవాభివర్ధతే"

భోగ్యపదార్థముల నొక్కసారి అన్నిటిని యనుభవించివేసి కామము శమింపజేసికొనుట నెవ్వనికిని శక్యము కాదు. దానివలన నా కామము నేతివలన నగ్నిజ్వాల మరింత ప్రజ్వరిల్లునటుల పెరిగిపోవుచుండును.

(62) మదమనగా నేను ధనవంతుడననియు, చదువరిననియు గొప్ప వంశమున బుట్టితిననియు గర్వించి తోచిన రీతిగ నాచరించుటకు తగిన విరగబాటు.

(63) మోహశబ్దమునకు అజ్ఞానమని యర్థము. అనగా విరుద్ధాచారమునకు కారణమైన కృత్యాకృత్య వివేకము లేకుండుట.

(64) ధార్మికమైన బుద్ధికలవారు న్యాయముగ సంపాదింతురు. విషయలాలసులు శౌర్యద్యూతాదులచే నార్జింతురు.

(65) గ్రాహాన్ గృహీత్వా- తత్కాలమునకు వినియోగార్థమైనవియు, తనవియని స్థిరముగ నభిమానించదగినవియునని రెండింటికి భేదమును గ్రహించవలెను. దీనిచే పునరుక్తి లేదు.

(66) పాషండుల శాస్త్రములలో విధింపబడిన వ్రతముల నాచరించు వారిని చూచినను తాకినను మహాపాపము. ఇట్టివి యాచరించిన వారినే యపవిత్రులను గావించిన నీ వ్రతములు ఇక వానిని స్వయముగ నశుభములని వేరుగ చెప్పవలెనా.

(67) వీరు విషహరణ మంత్రములు. పెద్ద బండలను అనాయాసముగ గుండపిండిని చేయుట సూర్యుని గతినరికట్టుట విగ్రహములను మాటలాడించుట మొదలగు వంచనోపాయములచే వశీకరింపబడి ధర్మదూరులై తామసులై వేదవిరుద్ధమైన వ్రతముల నాచరించుచుందురు.

లేక యిచ్చట వ్రతమనగా- శౌర్యము అహంకారములవలన పుట్టునట్టి శాస్త్రవిరుద్ధమైన సంకల్పమనియును జెప్పవచ్చును. శాస్త్రోక్తమైన వ్రతములనైనను వానిని భగవంతుని యారాధనలేయని యెఱుంగకయును శాస్త్రమర్యాద నుల్లంఘించియు నాచరించుటచే నవియును అశాస్త్రవిహితములుగనే పరిగణింపబడును.

## 11వ శ్లోకము

(68) కామోపభోగ... తమకు కావలెనని కోరబడిన వానిలో కామము తీరుట కుపయోగించునదియే ప్రధానముగా కలవారని యర్థము

(69) స్వర్గము లేదు మోక్షము లేదని వారి యభిప్రాయము.

(70) చేతకానివానికై గావించు వ్యర్థ ప్రయాసను తెలుపుచున్నాడు.

(71) అనేక వస్తువులను గూర్చినదగుటచే చిలవలు పలవలు బెట్టుచుండును.

(72) "ప్రళయాన్తాం" అను పదమునకు "చనిపోవు వరకును" అని చెప్పుటకంటె 'వ్యామోహాధిక్యమును చెప్పుచున్నద'నుటయు క్తము. ఆ వ్యామోహమెట్టిదనగా— చిరకాలము శ్రమించి సాధించవలసిన దానిని అత్యల్పకాలములో సాధింపగోరుటయే. ప్రళయశబ్దమునకు సుప్రసిద్ధార్థమును గ్రహించుట ఉచితము. ఈ చింతించువారు ప్రళయము వరకును బ్రతికియుందురా? ఇక వీరి చింత ప్రళయమువరకెట్లుండును? కాబట్టి 'ప్రాకృతప్రళయేత్యాది' చెప్పబడినది.

12వ శ్లోకము

(73) చింతయనగా— చేయదగిన దానిని గూర్చినది- ఆశయనగా ఫలమును గూర్చినది. ఆశింపబడిన విషయములు అగణ్యములు గనుక ఆశలును అగణ్యములే.

(74) వీరికి క్రోధమే పరమ ప్రాప్యము. అందుచే వారికి అభిమానులే యుండరు. అందుచే వారికి కామమునకును క్రోధమునకును విషయభూతులొక్కరే. కామము అడ్డబడినచో క్రోధముగా మారును.

(75) అయ్యో! మోక్షసాధనమైన పరమ పురుషుని యారాధనకై చేయవలసిన కర్తవ్యమును వీరు విషయభోగమునకై అనర్థముల కొఱకు అతి నీచమైన మెరుపువలె నస్థిరమైన సుఖమువలె పైకి గాన్పించుచున్న దానికై చేయుచున్నారేయని వారి కొఱకు పరితపించుటను తెలుపుచున్నది.

(76) యజ్ఞాదులకువలె న్యాయముగా సంపాదించిన ధనముగాక అక్రమమార్గములతో నార్జించిన ధనముతో కామముల ననుభవించుచున్నారు.

13వ శ్లోకము

(77) అవతారిక—

"సహస్రభగసందర్శనాత్మకశ్చ
మహానన్దలక్షణో మోక్షః"

అని వారి మోక్షలక్షణము- అనగా- పెక్కు స్త్రీలతో సంసర్గించుటయే వారికి మోక్షము గావున దానిని సాధించుటకే పెక్కు ధనముల నార్జింతురని చెప్పుచున్నాడు-

(78) సాత్వికులగు మహాత్ములు తమచే చేయబడినవి భగవంతుడే చేయించెననియు తాము చేయవలసినవి భగవంతుడే చేయించుననియు తలంతురు. వీరట్లుగాక అహంకారముచే వానిని తామేచేయుచున్నట్లు తలంచుట భ్రాంతియని యీ శబ్దముచే సూచింపబడుచున్నది.

యోగపరిపాకములో నొక్కటియగు వ్యతిరేక సంజ్ఞగల యవస్థను చేరిన యోగి ఇంతవరకు పక్వమైనవేవి? ఇంక నేను పక్వముచేయవలసినవేవి? యని యాలోచించునటులనే వీరును లాభనష్టములను కృతకర్తవ్యకర్మలను గురించి నిరంతర మాలోచించుచుందురు.

ఇంతవరకును తన కభీష్టములను లభించుటలోను యనిష్టములను బాపుకొనుటలోను తన సామర్థ్యమే కారణమను భ్రమ చెప్పబడినది.

14వ శ్లోకము

(79) అవ— ఇట్లు యిష్టములను లభించుటను గూర్చి వారి యాశయము వ్యక్తపరచబడినది. ఇకపైన అనిష్టమును పోగొట్టుకొనుటలో వారి యభిప్రాయములను తెలుపుచున్నాడు.

(80) శూరుడనగా- పెద్దపులివలె శత్రువుల ననాదరించి నిర్భయముగా శత్రుసైన్యమున దూరువాడు.

(81) ధీరుడనగా- పరాక్రమముతో శ్రమించుట మొదలగు వికారములు లేనివాడు.

(82) వారి భావమేమనగా- వైదికులు డబ్బు సంపాదించవలెనను లోభముతో రహస్యగ్రంథముల నాధారముగాగొని మోసగించి దానములు యజ్ఞములు మొదలగు వానిని వారిచే చేయించి ఇంటి

లోనున్న ద్రవ్యమును కూడ ఖర్చుపెట్టించి దరిద్రులను చేసివేయుచున్నారని చెప్పుదురు.

(83) బలాఢ్యులను మోసగించనేరికిని శక్యము కాదు. రామాయణమున సుందరకాండలో.

"నభేదసాధ్యాః బలదర్పితా జనాః" అని యాంజనేయులాలోచించిరి. బలముచే గర్వితులను భేదోపాయముతో సాధించ నేరికిని శక్యముకాదు.

(84) ఈశ్వరోఽహం= ఇచ్చట తన సామర్థ్యమైనను అదృష్టాధీనము కాదని చెప్పుచున్నాడు.

ఇచ్చట ఈశ్వరశబ్దమునకు– తానెవరిచేగాని నియమింపబడనను గర్వమును తెలుపును.

మరియు తనకంటె వేరైన సమస్తమును తానే శిక్షింపగలనను అభిమానమనియును చెప్పవచ్చును.

(85) భోగీ— భోగములు సాధనము

(87) సుఖీ— సుఖము సాధ్యము

(86) సిద్ధః— జ్ఞానాద్యతిశయములు కలవాడు ఈశ్వరత్వము మొదలు అభిజనపర్యంతము గల అతిశయము ప్రారబ్ధకర్మ ఫలమని తెలియవలెను.

(88) తన నెవ్వరైనను భూమండలమంతయు నీ భుజములచే ధరింపబడుచున్నది. నీవే సమస్త లోకములకును శిక్షకుడవు అనియన్నచో నుబ్బిపోయి వారికి తన సర్వస్వము నర్పించవచ్చునని తలంతురు.

15వ శ్లోకము

(89) మత్తోఽన్యోమయా సదృశోనాస్తి
అహమేవ మయా సదృశః.

నాతో సమానుడుగాని నన్ను మించినవాడుగాని యొక్కడును లేడు. నేనే నాకు సాటి.

"గగనం గగనాకారం సాగర స్సాగరోపమః

రామరావణయో ర్యుద్ధం రామరావణయోరివ.

ఆకాశమున కాకాశమే సాటి. సముద్రమునకు సముద్రమే సాటి. రామ-రావణ యుద్ధమునకు రామరావణయుద్ధమే సాటి. నాకు నేనే సాటి. అనునట్లది అనన్వయాలంకారము.

(90) వీరి మతమున పరలోకము లేదుగదా! ఉన్నదని తలంచిన మూడు లోకములలోనే కాదు పదునాల్గు భువనములలోను అనెడువాడే. లోకములన్నియును వెదకినను "మ్నృగ్యతాం మాదృశోఽన్యః"

(91) ఈ యానందము యజ్ఞములకు ఫలముగ లభించు స్వర్గాదుల వలనకాదు. మరి యజమానుడనే గొప్పఉపాధి తనకు లభించునని ఆశతో మాత్రమే.

(92) సాత్వికుడని లోకులు తనను తలంచవలెనని మాత్రమే.

16వ శ్లోకము

(93) అవతారిక:- భగవంతునిపై భారముంచినవారే తరచుగ నిశ్చితబుద్ధులై యుందురు. దీనికి వారు విపరీతులగుచున్నారు.

(94) చింతయను వ్యాపారముతో కూడియున్న మనస్సునకు చిత్తమని పేరు.

(95) విభ్రాంతి యనగా విపరీత జ్ఞానము—

"అన్యథా చిన్తితం కార్యం దైవేనకృత మన్యథా"

"నేనొక విధముగ చేయదలంచగ దానిని భగవంతుడు మరియొక విధము గావించెను" అను న్యాయానుసారముగ ఆలోచనలే భ్రాంతి రూపములు.

(96) ఇచ్చట నీశ్లోకమునను సంధించవలెను.

శ్లో. "ఇదం కృత మిదం కుర్యాం!
ఇద మన్యత్ కృతాకృతమ్
ఏవమీహాసమాయుక్తం
కృతాన్తః కురుతే వశే"

నేనింతవరకీ పనులను జేసితిని. ఇంకను చేయవలయున్న వీపనులు ఈ పని యింతవరకైనది. ఇంకను యింత కావలెనని తలంచుచు నిచ్ఛయించుచుండగనే మృత్యు వీతనిని కబళీకరించును.

(97) నరకమున కీ విశేషమేల? యన్నచో- అపవిత్రమగు విషయానుభవమున సక్తులగు సంసారులకట్టి ఫలమే లభించునని యభిప్రాయము. నరకమునకీ యశుచిత్వమెట్టిదనగా చీము-రక్తము మలమూత్రములతో నిండియుండుటయే.

17వ శ్లోకము

(98) వీరి నితరులెవ్వరును పొగడువారే యుండరుగాన 'తామే' యని యవధానముతో (ఏవ) యని చెప్పబడినది.

(99) ఆత్మప్రశంస దోషమని సూచించబడినది. సజ్జనులు ఇతరులు తమను కొనియాడిననే సహించరు.

(100) ధనము- సంతానము- అధికారము- మొదలగు దృష్టసమృద్ధిచే మదించినవారై అదృష్టములయందు విశ్వాసములేక పారలౌకికమగు నేకర్మలయందును ప్రవర్తించరు. "విద్యామదో ధనమదస్తృతీయోభి జనోమదః" అనునట్లు పెద్ద చదువు-అధికైశ్వర్యము-ఉత్తమవంశ జన్మ అను వానివలన బుట్టు మదములు మూడును ఒకదాని వెనుక నొకటి చేరుచుండును. ఇందొకటి యున్నచో తక్కినది తనంతనే చేసనని తాత్పర్యము.

(101) మాత్రమే యనుటచే ధర్మమని చేయరని తాత్పర్యము. కీర్తికి నామ=పేరు అనియు వాడుక కలదు. పేరుకొఱకు అనగా కీర్తి కొఱకని యర్థము. దంభేన యనుటచే నిది సిద్ధము.

నామశబ్దము పేరు అని వాడుకలో నధికముగా నుండుటచే 'సోమ యాజులు' అని పేరును బడయుటకని తాత్పర్యము.

ఇది పరిహాసార్థము చెప్పబడినది.

18వ శ్లోకము

(102) అవ- ఈ శ్లోకమున సాత్త్విక యజ్ఞములకు ఉపకరణము లుగా నుండవలసిన గుణములు కలవారై యాచరింతురని తెలుపు చున్నారు.

సాత్త్వికులు:— భగవంతుడే నన్ను ప్రేరేపించి నాచే ఈ మహా త్కార్యమును తన కైంకర్యముగా చేయించుచున్నాడని నమ్మి చేయుదురు.

అసురులు:— అహఙ్కారము. అనగా గర్వము- నేను కాబట్టి నాశక్తి సామర్థ్యమును నిర్వహించుచున్నాననుకొనును.

"యద్యహఙ్కారమాశ్రిత్య యజ్ఞదాన తపఃక్రియాః
కుర్వన్ తత్ఫలమాప్నోతి పునరావర్తనంతు యత్"

యజ్ఞమునుగాని, దానమునుగాని తపస్సునుగాని అహంకార ముతో చేసినను ఫలమును బడయునుగాని యది నశ్వరమగును.

సాత్త్వికులు:— ఏకర్మలు చేసినను బలమన్త్రముతోనే చేయు దురు. ఆ మంత్ర మేమనగా—

"భగవతోబలేన భగవతో వీర్యేణ భగవతస్తేజసా
భగవతః కర్మణా భగవతః కర్మకరిష్యే" అనునది.

యత్కరోమి యదశ్నామి యజ్జుహోమి దదామియత్, యత్త స్యామి భగవన్! తత్కరోమిత్వదర్పణమ్" అని పురుషమూర్తుతో నీ గీతా శ్లోకమును దానికి తగిన మంత్రమే.

(104) ఆసురులు:— దానికి విరుద్ధముగా- 'నా బలమే చాలు నని' తలంచి చేయుదురు.

ఈ యహంకార బలములు రెండును. ఆ రెండింటివలన పుట్టునట్టి దర్పము పెద్దలను తృణీకరింపజేయును. పూజింపదగిన వారిని పూజించ నీయదు.

సాత్వికులు- ఇష్టవస్తువులు చేజిక్కుటయు అనిష్టములు బాయు టయు భగవదనుగ్రహముచేతనే యని నమ్మెదురు.

ఆసురులు- తమశక్తిచేతనేయని తలంతురు. దానికి మూలము కామక్రోధములు.

(105) సాత్వికులు- యజ్ఞమున కనుకూలించు ఋత్విక్కుల యందును, ప్రతికూలించు దొంగలయందును భగవంతుడున్నాడని గ్రహింతురు.

శ్లోకమునందలి "దేహేషు" అను సప్తమీవిభక్తి అధికరణార్థ మగుటచే భగవంతుని స్థితిని చెప్పును. ఆస్థితి వారిని ప్రవర్తింపజేయు టకే యని యిదివరకే శ్రుత్యాది ప్రమాణములతో నిరూపింపబడెను. ఆసురులు- దానిని ద్వేషించుచుందురు-

(106) 'అసూయాపరులై' హితమున ప్రవర్తింప చేయుటయే వీరికసూయ జనించుటకు కారణము.

ఏపరమాత్మ వైలక్షణ్యము నెఱిగినంత మాత్రముననే మాన వుడు కృతకృత్యుడగునని చెప్పబడెనో అట్టి మహోపకారి వీరికి ద్వేషము నకు అసూయకును పాత్రమగుచున్నాడు.

ఇచ్చట అందరను ప్రవర్తింపజేయు భగవద్గుణములను చెప్పుట అసూయాలక్షణమును జెప్పుటకొఱకే. అసూయనగా- "అసూయాతు దోషారోపోగుణేష్వపి" సద్గుణములయందు దోషముల నారోపించుట.

పురుషోత్తమ ప్రకరణమున స్మృత్యాదులను ప్రవర్తింపజేయుటకు 'సర్వస్యచాహం హృది సన్నివిష్టః' అని చెప్పబడెను.

దానినే యిచ్చట "మామాత్మ పరదేహేషు" అని జ్ఞాపకము చేయుచున్నది. (నేనందరి హృదయములలోను దగ్గరగా నత్తియుందు)నని చెప్పినదానినే "అందరి హృదయములలోనున్న నన్ను" అని యిచ్చట చెప్పుటచే దానికిది స్మారక మగుచున్నది.

చేతను లీశ్వరపరతంత్రులైనచో కర్మవశ్యులెట్లగుదురు? ఫలము కర్మాధీనమైనచో భగవానుడేల? మొదలగు కుత్సితయుక్తులతో.

బృహస్పతి అనసూయకిట్లు లక్షణమును చెప్పినాడు. (అత్రిస్మృతి 1-34)

శ్లో. నగుణాన్ గుణినోహన్తి స్తౌతిమన్దగుణానపి
నాన్యదోషేషు రమతే సాఽనసూయాప్రకీర్తితా.

గుణవంతుని గుణములను లేవనడు- అల్పగుణములున్నవానినిన్నీ స్తోత్రము చేయును. ఇతరుల దోషములపై దృష్టినిడడు. ఇది అసూయ లేనివానికి లక్షణము-

సహించపోవుటయనగా- ఆతని యాజ్ఞనుసహిత ముల్లంఘించి వేయుట. ఇది తననేగాక తన వంశీయులనందరను చీము రక్తము మల మూత్రమయమైన నరకమున ద్రోయును-

ఇందులకు ప్రమాణము భారతేశాంతి - మోక్ష - 356-6)

శ్లో. మజ్జన్తి పితరస్తస్యనరకే శాశ్వతీస్సమాః
ద్విష్యాద్యోవిబుధశ్రేష్ఠం దేవం నారాయణం హరిమ్.ఇతి

దేవశిఖామణియగు నారాయణుని ద్వేషించువాడును వాని పితరులును లెక్కలేనన్ని సంవత్సరముల నరకయాతనలకు పాల్పడుదురు.

శ్లో. యే ద్విషన్తి మహాత్మానం నస్మరన్తిచ కేశవమ్
న తేషాం పుణ్యతీర్థేషు గతిస్సంసర్గిణామపి.

భగవంతుడగు శ్రీమహావిష్ణువును ధ్యానించకున్నమానె ద్వేషించువారును వారితో సంబంధమున్నవారును పుణ్యతీర్థయాత్ర దర్శనోవాసాదిఫలములను బడయజాలరు.

19వ శ్లోకము

(109) సంసారేషు:- "సంసరతి పురుషోఽస్మిన్నితి సంసారః" దీనికే 'సన్తానేషు' అని పర్యాయపదమును శ్రీభాష్యకారులు వాడిరి—అనగా- జన్మాది చక్రవృత్తులలో విరామము లేక నిరంతర మొకేవిధముగ జుట్టుకొని పోవుచుండుటచే సంసారము సంతాన మనబడినది.

ఇచ్చట ప్రయోగింపబడిన బహువచనము భ్రమణములనంతములగుటలో తాత్పర్యము—

(110) పై సంసారశబ్దము మంచి జన్మకును చెడ్డజన్మకును సాధారణమగుటచే వివరించి చెప్పబడుచున్నది.

"ఏతద్ధిదుర్లభతరం" అని యారూఢయోగ భ్రష్టునకు చెప్పబడిన జన్మకు విపరీతమైన తామన జన్మ చెప్పబడినది. ఇట్టి ప్రతికూలజన్మ దేవాది చతుర్విధయోనులయందును కలదు.

(111) ఇచ్చటనున్న నాలుగు విశేషణములచే 'నమాం దుష్కృతినో మూఢాః' అని 7వ అధ్యాయమున చెప్పబడిన నాలుగు విధములైన పాపాత్ములు చెప్పబడుచున్నారు. ఎట్లనగా—

అచ్చట 'నరాధమ' శబ్దమున్నది. ఇచ్చట శ్లోకమున నరాధమ శబ్దము కలదు. అచ్చట "ఆసురం భావమాశ్రితాః" అని యున్నది.

ఇచ్చట 'ద్విషన్తః' అని యున్నది. అచ్చట 'మూఢాః' 'మాయయాపహృతజ్ఞానా' అని యున్నది.

ఇచ్చటనున్న 'క్రూరాన్, అశుభాన్' అను శబ్దములు వానికి సమానార్థములుగా నన్వయించవలెను.

ఇట్లు యోజనను గావించుట అసురులంద రొకేరాశికి చేరినవా రని తెలుపుట కే.

21వ శ్లోకము

(112) అవ. అవతారికకు అవతారిక- ముఖ్యముగా సావధాన ముతో విడువవలసిన విషయములను సంగ్రహముగ చెప్పుచున్నాడు.

(113) ఆసుర స్వభావనమునకు మించిన నరకము వేరుగ లేదని భావము.

(114) మూలకారణమును జెప్పుట అసురస్వభావమును మొద లంట పెరికి పారవేయుట కే.

(115) విడువవలసిన వానియొక్క దోషముల నెఱుంగుట విడువ మని చేసిన బోధ కుపకరించును. ఈ యాసురస్వభావము పాపము నార్జిం చుటకు హేతునగుటచే "నతిఘోర" ఇత్యాది చెప్పబడెను.

(116) అసురస్వభావమునంతయును విడువదగినదియేయైనను ఈ మూడును ముఖ్యముగా వెంటనే పరిహరించదగినవని భావము.

(117) అవ. త్యాజ్యమైన కామక్రోధముల కార్యమును తెలిపి వానిని విడువమని శాసించెను. ఇప్పుడా త్యాగము వలన కలుగు శ్రేయ స్సును క్రమముగ చెప్పుచున్నారు.

(118) ఇది తమోగుణముయొక్క ఫలము.

(119) శ్రేయోమార్గము నవలంబించుట తత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట నేగదా!

23వ శ్లోకము

(121) అవతారికలో- అసురుల స్వభావములలో మూలమగు టచే ప్రధానములైన కామక్రోధ లోభములు చెప్పబడినవి. వానికం కెను ముఖ్యముగా విడిచి తీరవలసిన ప్రధానాంశము నిప్పుడు చెప్పు చున్నాడు.

(122) సకలావస్థలలోనున్న సమస్త పురుషులకును హితము నొనరించుటకే యేర్పడినవగుటచే శాస్త్రశబ్దము వేదములయందే మునుముందు ముఖ్యముగా ప్రయోగింపబడును. దాని కుపబృంహణము లగుటచే స్మృతీతిహాసపురాణము తదుపరి ప్రయోగింపబడును.

(123) 'శ్రుతిస్స్మృతిర్మమైవాజ్ఞా'
యస్తాముల్లంఘ్యవర్తతే
ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ
మద్భక్తోఽపి నవైష్ణవః

వేదమును, దాని యర్థమును విశదీకరించు ధర్మశాస్త్రాదులును నాయాజ్ఞారూపములే. వానిలో చెప్పినటుల నడచుకొననివాడు నాయాజ్ఞ నుల్లంఘించిన ద్రోహియే. కావున వాడు నాభక్తునివలె గాన్పించినను నా సంబంధ మెంతమాత్రమును వానికి లేదు.

(124) "యా వేదబాహ్యాస్స్మృతయః
యాశ్చకాశ్చ కుదృష్టయః
సర్వాస్తాః నిష్ఫలాః ప్రేత్య
తమోనిష్ఠాహి తాస్స్మృతాః".

'వేదము నసలే యంగీకరించని చార్వాక, బౌద్ధ జైనాదులును, దానిని ప్రమాణముగా నంగీకరించియును విపరీతార్థములను జెప్పునట్టి కుదృష్టులును తమోనిష్ఠులేయగుదురు గాన వారికి శరీరమును విడిచిన పిమ్మటనైనను ఫలము శూన్యము''. అని చెప్పుచున్నారు. ఆముష్మిక సిద్ధియనగా- ఆముష్మికసుఖమునకు కారణమైన ఉపాయసిద్ధి.

(125) సంసారమునందలి ఫలప్రాప్తియైనను శాస్త్రోక్తములగు కర్మల నాచరించుటచే కలుగు పరమపురుషుని యనుగ్రహమువలననే.

శ్లో. అనారాధిత గోవిందాః
యేజనాః దుఃఖభాగినః.

భగవంతుని కొలవనివారు దుఃఖములకు పాలగుదురు.

24వ శ్లోకము

(126) ఈ యధ్యాయమున జెప్పినంతయు దీనికొఱకేయని తెలుపుచున్నాడు.

(127) ఉపాదేయమనగా— శాస్త్రానుసారముగ మనస్సుతో గ్రహించుట.

(128) శాస్త్రమేయని యవధారణమేల?

'శ్రుతిస్మృతిస్సదాచారః' అని యున్నదికదా! దానికి విరుద్ధము కాదా! అన్నచో చెప్పుచున్నారు.

ఇచ్చట 'ఆది' పదముచే శిష్టాచారమును గ్రహించవలెను.

(129) శాస్త్రములన్నియును సాక్షాత్తుగానో దేవతాంతర్యామిగనో కర్మలన్నియును పరమాత్మ సమారాధనములేయని తెలుపుచున్నవి.అవి తత్వమును తెలుపుటలో 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' యను శ్లోకముచే సాధారణముగా తెలుపబడిన వానినే యిచ్చట విశేషించి తద్వాచక శబ్దమును వాడి తెలుపుచున్నారు.

(130) సమస్త కర్మలును ఫలమును కోరకుండ చేసినచో పరమాత్మను పొందుటకే ఉపాయములగుటయే స్వభావముగా కలవి.

(131) శ్లోకమునందలి విధానశబ్దమునకు తెలియని విషయములను తెలుపుటయనియె యర్థమని (ఈ బోధించు) అను శబ్దము సూచించుచున్నది.

(132) గీతార్థ సంగ్రహము

శ్లో. దేవాసురవిభాగోక్తి
పూర్వికా శాస్త్రవశ్యతా
తత్త్వానుష్ఠాన విజ్ఞాన
స్థేమ్నే షోడశ ఉచ్యతే.

తాత్పర్యము:—శాస్త్రవశ్యులైనవారు దేవతలు- అట్లు కాని వారు ఆసురులని యీ యధ్యాయమున విభజించెను. దీనివలన శాస్త్రవశ్యత్వమత్యంతావశ్యకమని తెలిపెను. ప్రాప్యమైన తత్త్వమును గుఱించిన జ్ఞానమును దానికి ఉపాయమైన కర్మానుష్ఠానమును గూర్చిన జ్ఞానమున్ను వేదమనబడు శాస్త్రముచేతనే కలుగదగినది గాన అట్టి జ్ఞానము దృఢముగా నుండుటకై దానికి వశ్యమై యుండవలయునని యీ పదునారవ అధ్యాయమున జెప్పబడెను.



# శ్రీ భగవద్గీతా - సప్తదశోఽధ్యాయః

## శ్రద్ధాత్రయవిభాగయోగః.

—//—

### అ వ తా రి క

కడచినయధ్యాయమునందు దైవాసురవిభాగమును వివరించు ప్రస్తావమున ప్రాప్యవస్తువిషయ మైనతత్త్వమును ఆవస్తువును బొందుటకు నుపాయమును వేదమువలననే తెలియఁదగినవని చెప్పఁబడెను. ఈపదునేడవయధ్యాయమునందు శాస్త్రవిహితము కానికర్మము ఆసుర ప్రకృతిగలదగుటచే నిష్ఫలమనియు, శాస్త్రవిహితమైన కర్మము సత్త్వాదిగుణములను బట్టి మూఁడువిధములైనదనియు, శాస్త్రసిద్ధమైనకర్మము యొక్క లక్షణమును జెప్పఁబడుచున్నవి. అందు అర్జునుఁడు శాస్త్రవిహితము కానికర్మము నిష్ఫలమని తెలియనివాఁడై, 'శాస్త్రవిహితములు కానియాగాదులను శ్రద్ధతోఁ జేయఁగా వానికి సత్త్వాదినిమిత్తములవలనఁ గలుగుఫలభేద మేమి' అని *తెలియఁగోరి యడుగుచున్నాఁడు.

1 అవ.

అర్జున ఉవాచ.

శ్లో. యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః
తేషాం నిష్ఠాతు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః ॥ 1

టీ. హేకృష్ణ=ఓకృష్ణా, యే=ఎవరు, శాస్త్రవిధిం=వేదవిధులను, ఉత్సృజ్య=విడిచి, శ్రద్ధయా అన్వితాః=శ్రద్ధతోఁ గూడుకొనినవా రగుచు యజన్తే=యాగాదులు చేయుచున్నారో, తేషాం=వారియొక్క నిష్ఠా

---

* శాస్త్రవిహితము కానిదానికి ఫలము లేదని తెలిసియుండియు దానికి ఫల మేమి అని యడుగఁడు; తెలియమిచేతనే యడిగినాఁడనిభావము.

తు=నిష్ఠ, కా=ఏది, సత్త్వం (కిం)=సత్త్వమా, ఆహో=లేక, రజః (కిం)=రజస్సా, తమః (కిం)=తమస్సా?

తా. ఓకృష్ణా, ఎవ్వరేనియు శాస్త్రవిధి నుల్లఘించి శ్రద్ధాయుక్తులై యజ్ఞాదులు సేయుదురో యట్టివారు నెలకొన్నట్టిది సత్త్వమా రజస్సా తమస్సా తెలుపుము. 'స్థీయతే అస్మిన్నితిస్థితిః' అనువ్యుత్పత్తిని బట్టి సత్త్వాదికమే యిట నిష్ఠ యనఁబడుచున్నది. అనఁగా వారలస్థితి సత్త్వమునందా రజస్సునందా తమస్సునందా యని యర్థము.]

అవ. ఇట్లర్జునుఁ డడుగఁగా, భగవంతుఁడు శాస్త్రవిహితము కాని శ్రద్ధయు అట్టి శ్రద్ధతోఁ జేయఁబడు యాగాదులును నిష్ఫలము 2 లనెడియభిప్రాయమును మనస్సునం దుంచుకొని (అనఁగా నప్పుడు చెప్పక మీఁదఁ జెప్పబోవువారై) శాస్త్రీయము లైనయాగాదులే 3 గుణములనుబట్టి మూఁడు విధములై యుండుటను ప్రతిపాదించుకొఱకు మొదట శాస్త్రీయమైన శ్రద్ధ మూఁడువిధము లగుటఁ జెప్పుచున్నారు.

శ్లో. త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2

టీ. దేహినాం=శరీరసంబంధముగల సమస్తచేతనుల యొక్క, శ్రద్ధా=శ్రద్ధ, స్వభావజా=తమయొక్క అసాధారణభావమువలన కలిగినది. సా=ఆశ్రద్ధ, సాత్త్వికీ=సాత్త్వికశ్రద్ధ యనియు, రాజసీ చైవ=రాజసశ్రద్ధ యనియు, తామసీ ఇతిచ=తామసశ్రద్ధ యనియు, త్రివిధా =మూఁడు విధములుగా, భవతి=అగుచున్నది. తామ్=దానిని, శృణు= వినుము= (ఏస్వభావము గలదియో యాస్వభావమును విను మనుట.) 4

తా. బ్రహ్మాది సమస్తదేహులకు *శ్రద్ధ మూఁడు విధములై యుం

* స్వభావము - అనఁగా నిచట వానివానికి సహజముగాఁ గలిగియుండు రుచి విశేషమని తెలియునది. సత్త్వాదిగుణములు వాసనను గలిగించుచున్నవి. ఈ ప్రాచీన

ఘును. ఆశ్రద్ధ స్వభావమువలనఁ[5] బుట్టునది. స్వభావ మనఁగా స్వకీయమైన అసాధారణభావము. అదియె ప్రాచీనవాసనలవలనఁ గలుగు ఆ యారుచి విశేష మగును. ఎందు రుచియో యందు శ్రద్ధ పుట్టుచున్నది. శ్రద్ధ యనఁగా తన యభిమతమును ఈసాధనము సాధించు[6] ననెడివిశ్వాసము తోడ ఆ సాధనమందుఁ గలుగుత్వర. వాసనయు రుచియు శ్రద్ధయు ఆత్మకు గుణసంసర్గమువలనఁ బుట్టినధర్మములు. ఆత్మధర్మములైన ఆవాసనాదులను బుట్టించునవై దేహేంద్రియాంతఃకరణ విషయము లను సంబంధించినధర్మములై (తమంతటఁ గనఁబడక[7]) తమ కార్యము లగు ప్రకాశాదులచేతనే నిరూపింపఁదగినవై సత్త్వాదిగుణము లుండును- అనగా సత్త్వాదిగుణములు తమతోఁ గూడిన దేహాదుల ననుభవించుట వలనఁ బుట్టునవని అర్థము. కాఁబట్టి యీశ్రద్ధ సాత్త్వికి[8]. రాజసి, తామసి అని మూఁడువిధములు. ఆయీశ్రద్ధను వినుము. ఆశ్రద్ధకు నేమిస్వభా వమో దానిని వినుమని యర్థము.

---

వాసనవలన రుచివిశేషములు కలుగును. ఎందు రుచిగలుగునో యందు శ్రద్ధయుఁ గలుగునని భావము. అయినను 'కామస్సంకల్పో విచికిత్సాశ్రద్ధాధృతిరధృతిః' అని శ్రద్ధాదులు మనోధర్మములుగాఁ జెప్పఁబడుచున్నవి. కనుక శ్రద్ధాదులను 'దేహినామ్' అని ఆత్మయొక్క ధర్మములుగాఁ జెప్పుట యెట్లు అన్నచో, శుద్ధాత్మకు అవి కలుగవు గాని సత్త్వాదిగుణసంసర్గమువలనఁ గలుగుచున్నవి. సత్త్వాదిగుణములు నిర్గుణమైన యాత్మకెట్లు కలుగుననఁగా అది దేహియగునప్పుడు దానియొక్క దేహేంద్రియాంతఃకరణములను సంబంధించిన ధర్మములై వాసనాదులను బుట్టించుచుండును. అవి కనఁబడకున్నను వాని కార్యములైన ప్రకాశాదులచే వాని నిరూపించి తెలిసికొనవలయును. ఇట్లు అతీంద్రియము లయిన యీ గుణములను అనుభవించు టెట్లు? అనుభవింపఁబడని యీ గుణములచే వాసనాదులు కలుగు టెట్లు? అన్నచో, ఆసత్త్వాదిగుణములతోఁ గూడిన దేహాదుల ననుభవించుటచే అవియు అనుభవింపఁబడుచున్నవి. అప్పుడు వాసనాశ్రద్ధాదులు కలుగును అటు కలుగు శ్రద్ధయు ఆ గుణములును మూఁడు విధములగునని చెప్పఁబడినది.

9

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయోఽయంపురుషో యో యచ్ఛ్రద్ధస్సఏవసః. 3

టీ. భారత=అర్జునా, సర్వస్య=సమస్తమైనవారికి, సత్త్వానురూపా=అంతఃకరణమునకు అనుగుణమైన, శ్రద్ధా=శ్రద్ధ, భవతి=కలుగుచున్నది, అయంపురుషః=ఈపురుషుఁడు, శ్రద్ధామయః=శ్రద్ధయొక్క పరిణామమైన వాఁడు, యః=ఎవ్వఁడు, యత్ శ్రద్ధః=ఎట్టి శ్రద్ధగలవాఁడో, సః=వాఁడు, సఏవ=అట్టిశ్రద్ధయొక్క పరిణామమే-(ఆశ్రద్ధ యెటువంటిదో అటువంటి ఫలమును బొందుచున్నాఁ డనుట.)

తా. అర్జునా, సమస్తపురుషులకు తమయంతఃకరణమునకుఁదగినట్లు
10
శ్రద్ధ కలుగుచున్నది- అనఁగా అంతఃకరణము ఎట్టిగుణములతోఁ గూడి యున్నదో అట్టి గుణములను గుఱించినట్టి శ్రద్ధకలుగునని యర్థము.
11
సత్త్వశబ్దము పూర్వోక్తములైన దేహేంద్రియాదులకు ప్రదర్శనార్థము
12 13
ఈ పురుషుఁడు శ్రద్ధయొక్క పరిణామమైనవాఁడు. *ఎవ్వఁ డెట్టి శ్రద్ధగల
14
వాఁడై యుండుదో వాఁడు అట్టి శ్రద్ధయొక్క పరిణామమగును. పుణ్య

---

* 'ఆయుర్ఘృతమ్' (ఘృతమే ఆయుస్సు) అని కారణమునే కార్యముగాఁ జెప్పినట్లు ఇచటను గ్రహించునది. ఫలభేదమును దెలియుటకే యిచట ప్రశ్న కలిగినదిగాన ఎట్టిశ్రద్ధయో యట్టి ఫలము గలుగునని యర్థము సేయఁబడినది. 'సఏవసః' 'శ్రద్ధయే వాఁడు, అనుటకు భావ మేమన- పుణ్యకర్మవిషయమునందు శ్రద్ధగలవాఁడగునేని పుణ్యకర్మఫలముతోఁ గూడియుండును. పాపకర్మవిషయమునందు శ్రద్ధగలవాఁడేని పాపకర్మఫలముతోఁ గూడియుండును. కనుక శ్రద్ధ యెట్టిదో అట్టిఫలము గలుగును. ఇట్లు ఫలము కలుగుటకు శ్రద్ధయె ప్రధానము గనుక పురుషుఁడు శ్రద్ధాపరిణామమని చెప్పఁబడెను.

కర్మవిషయమందు శ్రద్ధగలవాఁడగునేని పుణ్యకర్మఫలముతోఁ గూడిన వాఁడగును. ఫలప్రాప్తియందు శ్రద్ధయే ప్రధానమని యభిప్రాయము

అవ. ఆ విషయమునే వివరించుచున్నారు.

శ్లో, యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతాగణాం శ్చాన్యే యజన్తే తామసాజనాః. 4

టీ. సాత్త్వికాః=సాత్త్వికశ్రద్ధతోఁ గూడినవారు. దేవాన్=దేవతలను, యజన్తే=పూజించుచున్నారు. రాజసాః=రాజసశ్రద్ధతోఁ గూడిన వారు, యక్షరక్షాంసి=యక్షులను రాక్షసులను, (యజన్తే=పూజించుచున్నారు), తామసాః=తామసశ్రద్ధతోఁ గూడినవారగు, అన్యేజనాః= ఇతరజనులు, ప్రేతాన్=ప్రేతములను, భూతగణాన్ చ=భూతగణములను, యజన్తే=పూజించుచున్నారు.

15

తా. సత్త్వగుణప్రచురులు సాత్త్వికశ్రద్ధగలవారై దేవతలఁ బూజింతురు. దుఃఖలేశము లేని యుత్కృష్టసుఖమునకు హేతుభూతమగు దేవయాగవిషయమైన శ్రద్ధసాత్త్వికి యనఁబడును. రాజసులు (రాజసశ్రద్ధగలవారు) యక్షరక్షోగణముల నారాధింతురు. తక్కిన

16

తామసజనులు (తామసశ్రద్ధ గలవారై) భూతప్రేతగణముల నర్చింతురు. దుఃఖముతోఁగూడినట్టి అల్పసుఖమును గలుగఁజేసెడి (యక్షాదియాగ విషయమైన) శ్రద్ధ రాజసి. దుఃఖప్రాయమై అత్యల్పసుఖమును గలుగఁ జేసెడి (భూతగణాదిపూజనవిషయమైన) శ్రద్ధ తామసి.

అవ. 'ఇట్లు శ్రద్ధతోఁగూడి శాస్త్రీయములై యుండు యాగాదు లందే ఆయాగుణములకుఁ దగిన ఫలవిశేషములు కలుగును గాని, అశాస్త్రీయములైన తపోయాగాదులు నాయేర్పాటునకు విపరీతములై నవి గనుక వానియందు సుఖలేశమేదియును గలుగదు; మఱి అనర్థమే

కలుగును. అని యింత వఱకు తన మనస్సునందున్న యభిప్రాయము నిప్పుడు వెలిపుచ్చుచున్నారు.

శ్లో. అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః
17
దమ్భాహఙ్కారసంయుక్తాః కామరాగబలాన్వితాః. 5
కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాం చైవాన్తశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ 6

టీ. యేఃజనాః=ఏజనులు, దమ్భాహఙ్కారసంయుక్తాః-దంభ=ధార్మికత్వప్రసిద్ధితోను, అహంకార = స్వాతంత్ర్యాభిమానముతోను, సంయుక్తాః=కూడినవారును, కామరాగబలాన్వితాః-కామ=విషయాభిలాషతోను, రాగ=శత్రుాదులయం దాసక్తితోను, బల=కామాదుల కనుకూలమైన శక్తితోను, అన్వితాః=కూడినవారును, అచేతసః=వివేకము లేనివారునునై, శరీరస్థం = శరీరమునందున్న-ఆరంభకద్రవ్యమై యనువర్తించుచున్న, భూతగ్రామం = పృథివ్యాదిభూతసమూహమును, అన్తశ్శరీరస్థం=శరీరమునందు నియంతయై వర్తించుచున్న, మాంచైవ=నాయంశమైన జీవునిని, కర్శయన్తః=ఉపవాసాదులచేత కృశింపఁజేయుచున్నవారై, అశాస్త్రవిహితం=శాస్త్రమునందుఁ జెప్పబడని, ఘోరం=దారుణమైన (అనగా మిక్కిలి ఆయాసమును గలుగఁజేసెడి), తపః=తపస్సును- తపోయాగాదుల ననుట, తప్యన్తే = ఆచరించుచున్నారో, తాన్=వారిని, ఆసురనిశ్చయాన్=అసురులైన (అనఁగా నాయాజ్ఞ నతిక్రమించునట్టి) వారియొక్క నిశ్చయమువంటి నిశ్చయముగల వారినిగా, విద్ధి=తెలిసికొనుము.

తా. ఎవరు, దంభాహంకారములతోను, కామరాగములవలనఁ గలిగినదగుటచే అసాత్త్వికమగు బలముతోను గూడినవారై, శరీరము

నందున్న పృథివ్యాదిభూతసమూహమును వ్యర్థములైన యుపవాసా
18
దులచేఁ గృశింపఁజేయుచు, శరీరమునం దంతర్యామినైన నన్ను(అనఁగా
19
నాయంశభూతమైన జీవాత్మను) క్లేశము నొందించుచు, అవివేకులై,
మిక్కిలి ఆయాసకరములైనను శాస్త్రవిహితములుకాని తపములనును
(ఇది ప్రదర్శనార్థకము గనుక) యాగాదులనును జేయుదురో అట్టివారిని
నాయాజ్ఞకు విపరీతముగాఁ గాపించునట్టి అసురులయొక్క స్వభావము
గలవారినిగా ఎఱుఁగుము. అట్టివారు నాయాజ్ఞకు విపరీతముగా వర్తిం
చువారగుటచే వారికి సుఖలేశ సంబంధమును గలుగదు. మఱి వా రనర్థ
సమూహమందుఁ బడుదురని పూర్వమే 'పతన్తి నరకే௨శుచౌ' అని
చెప్పఁబడినది.

20 అవ.

అవ. ఇంతవఱకు శ్రద్ధయందు గుణములనుబట్టి కలుగు ఫలభేద
మును జెప్పిరి. ఈవిశేషమే శాస్త్రీయములైన యజ్ఞాదులందును గుణము
లనుబట్టి కలుగునని విస్తరించి చెప్పుచున్నారు. అందును, సత్త్వాదులు
21
ఆహారమువలననే వృద్ధినొందును కాబట్టి మొదట ఆహారమునందుఁ గల
22
మూడు విధములను జెప్పుచున్నారు. శ్రుతియు 'అన్నమయం హి సోమ్య
మనః' (ఛా. 3-౫-౪) 'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః (ఛా. ఉప ౭-౨౬-౨)
అని యీవిషయమే చెప్పుచున్నది.

శ్లో. ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు. 7

టీ. సర్వస్యతు=సమస్తప్రాణిసమూహమునకును, ఆహారో௨పి=
ఆహారముసైతము, త్రివిధః=మూఁడు విధములైనదై, ప్రియః=ఇష్టము,
భవతి=అగుచున్నది. యజ్ఞః=యజ్ఞము, తపః=తపస్సు, దానంచ=దాన

మును, తథా=అట్లె మూఁడు విధములు గలవి, తేషాం=ఆ యాహార యజ్ఞ తపోదానములయొక్క, ఇమం=ఈ (చెప్పఁబోవు), భేదం=సత్త్వాదిభేదమును, శృణు=వినుము.

23

తా. సమస్తప్రాణిసమూహమునకును ఆహారముకూడ సత్త్వాది గుణత్రయ సంబంధమునుబట్టి మూఁడు విధములై ప్రియముగా నుండును. అట్లె యజ్ఞమును తపమును దానమును మూఁడు విధములై యుండును. ఆ యాహారయజ్ఞ తపోదానములకు సత్త్వాదిభేదములచేతఁగలుగు ఈభేదమును జెప్పుచున్నాను వినుము.

శ్లో. ఆయుస్సత్త్వ బలారోగ్యసుఖప్రీతివివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః. 8

టీ. ఆయుస్సత్త్వబలారోగ్యసుఖ ప్రీతివివర్ధనాః=ఆయుస్సును అంతఃకరణమువలనఁ గలుగు జ్ఞానమును బలమును ఆరోగ్యమును సుఖమును ప్రీతిని వృద్ధిఁబొందించునవియు,రస్యాః=మధురరసము గలవియు, స్నిగ్ధాః=చమురుగలవియు, స్థిరాః=శరీరమునందు స్థిరములైన ధాతుపరిణామములు గలవియు, హృద్యాః=మనోహరములైనవియునగు, ఆహారాః=ఆహారములు, సాత్త్వికప్రియాః=సత్వగుణనిష్ఠుల కిష్టములైనవి.

తా సత్త్వగుణముతోఁ గూడినవానికి సత్త్వమయములైన ఆహా
24 A
రములు ప్రియములగుచున్నవి. సత్త్వమయములగు అహారములు ఆయు
24 B
వును బెంచునవై మరల సత్త్వమును బెంచుచున్నవి. సత్త్వమనఁగా అం
25
తఃకరణము. అంతఃకరణకార్యమగు జ్ఞానమిచట సత్త్వశబ్దముచే చెప్పఁ
26
బడుచున్నది. 'సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానమ్' (గీ. ౧౪-౧౭) అని సత్త్వము

జ్ఞానవివృద్ధికి హేతువగుటంబట్టి సత్త్వమయమగు ఆహారముకూడ జ్ఞాన
27
వివృద్ధికి హేతువగును. అట్లె అవి బలమును ఆరోగ్యమును పెంచు
28
చున్నవి; *సుఖమును ప్రీతిని పెంచుచున్నవి. అనఁగా అవి పరిణమించు
నప్పుడు తమంతటనే సుఖమును పెంచుచున్నవి; అట్లె ప్రీతికి హేతువు
29
లగు కర్మముల నారంభించుట మూలమున ప్రీతిని పెంచుచున్నవి.మఱియు
30 31 32
మధుర రసములతోఁ గూడినవై, చమురుగలిగియు, స్థిరములై సధాతు
33 34
వులుగాఁ బరిణమించియు, రమణీయవిశేషములై యుండును. ఇటు
వంటి సత్త్వమయములగుఆహారములు సాత్త్వికపురుషునకు ప్రియమైనవి.

శ్లో॥ కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః॥ 9

తా॥ కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణ రూక్షవిదాహినః- కటు=చేదు
గాను, అమ్ల=పుల్లగాను, లవణ=మిక్కిలి యుప్పనగాను,ఉష్ణ=మిక్కిలి
వేడిగాను, తీక్ష్ణ=కారముగాను, రూక్ష=శోషకరముగాను, విదాహినః

* ప్రీతిని గల్గుఁజేసెడి కార్యములను చేయించుటచేత ప్రీతివర్ధనము లనఁబడెను.
అవి పరిణమించునప్పుడు తనంత సుఖప్రదముగా నుండును గాన సుఖవర్ధన మనఁబడెను.
ఆహారము స్వరూపముతో స్థిరముగా నుండనేరదు. తాను రసరక్తమాంసాదిసప్తధాతువులు
గాను బలాదులుగాను పరిణమించి అవి చిరకాలము శరీరమునందుండునట్లు చేయు
స్థైర్యమే యిచట గ్రాహ్యము. కనుక స్థిరపరిణామములు గలది యనఁబడెను. హృద్యాః
అనఁగా ఉపయోగమునకుఁ బూర్వమే వెగటుబుట్టించునవిగాఁ దోఁపక చూచినంతనే
ప్రీతిని బుట్టించునవిగా నుండునవని తెలియుచున్నది.

= తాపముకలుగఁజేయునవిగాను ఉండునట్టి, ఆహారాః = ఆహారములు, రాజసస్య=రజోగుణముగలవానికి, ఇష్టాః=ఇష్టములై,దుఃఖశోక ఆమయ ప్రదాః=కష్టమును వ్యసనమును రోగమును గలుగఁజేయునవి అగును.

35 36

తా. చేదుగాను, పుల్లగాను, మిక్కిలి యుప్పనగాను, మిక్కిలి

37

వేఁడిగాను, మిక్కిలికారముగాను, మిక్కిలి వేడిమి మిక్కిలి చల్లన మొదలగు

38 39

లగు వానిచే ఉపయోగింపరాక తీక్ష్ణములైనవిగాను,శోషకరములుగాను,

40

తాపకరములుగాను నుండెడి యాహారములు రాజసగుణము గలవారి కిష్టములగును. అవి రజోమయములగుటవలన శరీరమునకు కష్టమును మనోవ్యాకులతను రోగమును గలుగఁజేయును. మఱి రజస్సును వృద్ధిఁ బొందించును.

41 అవ.

శ్లో. యాతయామం గతరసం పూతి పర్యుషితంచ యత్
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥ 10

టీ. యాతయామం=(వండిన తరువాత) ఒకరాత్రి గడచినదియు— అనఁగా ప్రాఁతదియు, గతరసం = స్వాభావికమైనరుచి పోయినదియు, పూతి=దుర్గంధము గలదియు, పర్యుషితం చ=ప్రాఁతదగుటచే మఱియొక రుచిని బొందినదియు— (అనగా పాసినది), ఉచ్ఛిష్టం అపి=గురువులు మొదలగువారికంటె ఇతరులు భుజింపఁగా మిగిలినదియును, అమేధ్యంచ=పవిత్రముగానిది (భగవన్నివేదితము కానిది) యునగు, యత్ భోజనం=ఏయాహారము, (అస్తి=కలదో, తత్=అది) తామసప్రియం =తమోగుణస్వభావము గలవారి కిష్టమైనది.

42
తా. వండిన తర్వాత నొకరాత్రి గడచినది (అనఁగా వండి చాల
43 44
సేపయినది)యు, స్వాభావికమైన రుచి పోయినదియు, దుర్గంధము గల
45
దియు, (పాఁతదగుటచే మఱియొకరుచి పొందినదియు (అనఁగా పాసి
46
నదియు), గురువులు మొదలగువారికంటె నితరులు భుజింపఁగా మిగిలి
47
నదియు, యజ్ఞార్హముగానిదియు- అనఁగా యజ్ఞశేషము (భగవన్నివేది
తము) కానట్టిదియునగు తమోమయ మగు ఆహారము తామసులకుఁ
బ్రియమైయుండును. మఱియు తమోగుణమును వృద్ధిఁబొందించును.
48
కనుక హితమును గోరువారు సత్త్వవృద్ధికొఱకు సాత్త్వికాహారమునే
సేవింపవలయును.

శ్లో. అఫలాకాఙ్క్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః. 11

టీ. యష్టవ్యమేవ ఇతి = భగవదారాధనరూప మగుటచే అవ
శ్యము యజింపవలయునని, మనః = మనస్సును, సమాధాయ = నిశ్చల
ముగాఁ జేసికొని, విధిదృష్టః = శాస్త్రముచే నియమింపఁబడిన, యఃయజ్ఞః
= ఏయజ్ఞము, అఫలాకాంక్షిభిః = (పరమాత్మ ప్రీతికంటె ఇతరమైన)ఫల
మును గోరనివారిచేత, ఇజ్యతే = యజింపఁబడుచున్నదో, సః = ఆయజ్ఞము
సాత్త్వికః = సాత్త్వికమైనది.

49
తా. ఏయజ్ఞము, భగవదారాధనరూపముగను స్వాదుంప్రయోజ
నముగను యజింపవలయు ననుమనోనిశ్చయముతో, భగవత్ప్రీతికంటె

నితరఫలముఁగోరక, శాస్త్రోక్తముగ (అనఁగా మంత్రద్రవ్యక్రియాదులతోఁ గూడినట్లు) పురుషులచేత యజింపఁబడునో అట్టి యజ్ఞము సాత్త్వికమనఁబడును.

శ్లో. అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థ మపి చైవ యః
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12

టీ. హేభరతశ్రేష్ఠ=ఓయర్జునా, యః=ఏయజ్ఞము, ఫలం=స్వర్గాదిఫలమును, అభిసన్ధాయతు=అపేక్షించియు, దమ్భార్థమపిచైవ=మహాత్త్వప్రకటనముకొఱకు, ఇజ్యతే=యజింపఁబడుచున్నదో, తం=దానిని రాజసం యజ్ఞం=రాజసమైన యజ్ఞమునుగా, విద్ధి=ఎఱుఁగుము.

తా. అర్జునా, ఫలాపేక్షగలవారు యశస్సుకొఱకు నేయజ్ఞము యజింతురో ఆయజ్ఞము రాజసమని తెలియుము.

శ్లో, విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే 13

టీ. విధిహీనం=(బ్రాహ్మణుల) అనుజ్ఞ లేనిదియు, అసృష్టాన్నం =అశాస్త్రీయముగ సంపాదింపఁబడిన వస్తువులు గలదియును, మన్త్రహీనం=మంత్రరహితమైనట్టిదియు,అదక్షిణమ్=ఋత్విగ్దక్షిణలనీయక చేయఁబడునట్టిదియు, శ్రద్ధావిరహితం=శ్రద్ధ లేనిదియునగు, యజ్ఞం=యజ్ఞమును తామసం=తామసముగా, పరిచక్షతే=చెప్పుచున్నారు.

తా. సదాచారవంతులై విద్వాంసులగు బ్రాహ్మణులు 'యజింపుము' అని అనుజ్ఞ యియ్యనట్టిదియు, అన్యాయముగ సంపాదింపబడిన వస్తువులు గలదియు, మంత్రలోపముగలదియు, ఋత్విగ్దక్షిణల నీయకయు శ్రద్ధలేకయు చేయఁబడునట్టిదియునగు యజ్ఞము తామసమని పలుకుదురు.

అవ. తపస్సు గుణములనుబట్టి మూఁడువిధము లగునని చెప్పఁబూని, మున్దు శరీరవాఙ్మనస్సులవలనఁ బుట్టుటంబట్టి యా తపస్సునకుఁ గలుగు స్వరూపభేదమును జెప్పుచున్నారు.

శ్లో. దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. 14

టీ. దేవద్విజగురుప్రాజ్ఞపూజనం = దేవతలను బ్రాహ్మణులను ఆచార్యులను జ్ఞానవంతులను బూజించుటయు, శౌచం = పుణ్యతీర్థస్నానము మొదలగు శుద్ధియు, ఆర్జవం=మనశ్శరీరముల కేకరూపమయిన ప్రవర్తనమును, బ్రహ్మచర్యం=పరస్త్రీలను భోగ్యతాబుద్ధితోఁజూచుట మొదలైనవి లేకుండుటయు, అహింసా=ప్రాణులకు హింస కలుగఁజేయకుండుటయును, శారీరం=శరీరసంబంధమైన, తపః=తపస్సని, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది.

తా. దేవపూజనమును, బ్రాహ్మణారాధనమును, గురుశుశ్రూషయు, ప్రాజ్ఞసమ్మాననమును, పుణ్యతీర్థస్నానాదికమును, మనశ్శరీరములయం[54][55] దేకరూపమయిన ప్రవర్తనమును, పరస్త్రీలను భోగ్యతాబుద్ధితోఁ జూచుట మొదలైనవి లేకుండుటయు, ప్రాణులకు హింస కలుగఁజేయకుండుటయు ననునివియన్నియు శరీరసంబంధియైన తపస్సని చెప్పఁబడును.

శ్లో. అనుద్వేగకరం[56] వాక్యం[57] సత్యం[58] ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

టీ. అనుద్వేగకరం=పరులకు దుఃఖమును గలుగఁజేయునదియు, సత్యం=యథార్థమైనదియు, ప్రియహితం చ=ఇష్టమును హితమునైనదియు, యద్వాక్యం=ఏవాక్యమో, (తత్ = అదియు), స్వాధ్యాయాభ్యా

సనం చైవ=వేదము నభ్యసించుటయును, వాఙ్మయం=వాగ్రూపమైన, తపః=తపస్సని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. పరులకు భయహేతువుగాక, సత్యమును ప్రియమును హితమునైనవాక్యమే పలుకుటయు, వేదాభ్యాసం బొనరించుటయును వాచికతపస్సనఁబడును. (వేదాధ్యయనముచే జపయజ్ఞము చెప్పఁబడు చున్నది.)

శ్లో. మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే. 16

టీ. మనఃప్రసాదః=క్రోధాదిరాహిత్యరూపమైన మనోనిర్మలత్వము ను, సౌమ్యత్వం=మనస్సు పరసమృద్ధియం దాసక్తమై యుండుటయు మౌనం=మనస్సుచేత వాక్ప్రవృత్తిని బంధించుటయు, ఆత్మవినిగ్రహః= ధ్యానముచేయఁదగిన విషయమునందు మనస్సు నిలుపుటయు, భావసం శ్శుద్ధిః=మనశ్శుద్ధియు, ఇతిఏతత్=అనునిది, మానసం = మనస్సంబంధి యైన, తపః=తపమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

59
తా. మనస్సునందు క్రోధాదులు లేకుండుటయు, మనస్సునకు పరులయభ్యుదయమునం దాసక్తియు, మనస్సుచే వాక్ప్రవర్తనము నియ
60
మించుటయు (అనఁగా మితభాషిత్వమును), ధ్యానింపఁదగిన విషయము
61
నందు మనోవృత్తిని నిలుపుటయు, ఆత్మేతరవస్తువులందు చింతలేకుండు టయు నను నివియన్నియు మానసికతపస్సనఁబడును.

శ్లో. శ్రద్ధయా పరయాతప్తం తప స్తత్త్రివిధం నరైః
అఫలాకాఙ్క్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే. 17

టీ. అఫలాకాఙ్క్షిభిః=ఫలాపేక్ష లేనివారును, యుక్తైః= (ఇది భగవదారాధనరూప మనెడి తలంపుతో) కూడినవారునునగు, నరైః=పురుషులచేత, పరయా=అధికమైన, శ్రద్ధయా=విశ్వాసముతో, తప్తం=ఆచరింపఁబడిన, తత్ త్రివిధం=వెనుకఁ జెప్పఁబడిన మూఁడు విధములుగలఁ తపః=తపస్సును, సాత్త్వికం=సాత్త్వికమునుగా, పరిచక్షతే = చెప్పుచున్నారు.

తా. పురుషులు ఫలాపేక్ష లేక 'యిది పరమపురుషారాధనరూప' మనియెడి తలంపుతోఁ గూడినవారై అత్యంత శ్రద్ధతో నాచరించునట్టి కాయిక వాచిక మానసికములనెడి మూఁడు విధములైన తపస్సులు సాత్త్వికము అనఁబడును.

శ్లో. సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. 18

టీ. సత్కారమానపూజార్థం=మనస్సుచేత నాదరించుట కొఱకును నోటఁ బ్రశంసించుటకొఱకును శరీరముచేత నమస్కారాదులు చేయుటకొఱకును, దమ్భేనచైవ=దంభముతోడను, యత్=ఏ, తపః=తపస్సు, క్రియతే=చేయఁబడుచున్నదో, చలం=(స్వర్గాదినశ్వరఫలసాధనమగుటచే) చంచలమైనదియు, అధ్రువం=స్థిరముగానిదియు నగు, తత్ = ఆతపస్సు, ఇహ=ఇచ్చట, రాజసం=రాజసమని, ప్రోక్తం=చెప్పఁబడినది.

తా. మనస్సుచే ఆదరించుట సత్కారము; వాక్కుచేత పొగడుట మానము; శారీరములగు నమస్కారాదులు పూజ. ఫలాభిసంధిపూర్వకముగాను సత్కారాదులకొఱకును దంభమునుబట్టియు ఆచరింపఁబడు తపస్సు రాజస మనఁబడుచున్నది. అది స్వర్గాదిఫలసాధన మగుటచే అస్థిరమైనదిగాన చలించునదియు క్షయించునదియు నగును. పతనభయముచేత చలనహేతువగుట.

62
శ్లో. మూఢగ్రాహే ణాత్మనో యత్పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్. 19

టీ. మూఢగ్రాహేణ=అవివేకకృతమైన పట్టుదలచేత, ఆత్మనః=తనయొక్క, పీడయా=శరీరకష్టముతో, యత్=ఏ, తపః=తపస్సు, క్రియతే=చేయఁబడుచున్నదో, పరస్య=ఇతరునియొక్క, ఉత్సాదనార్థంవా=నాశముకొఱకును, (యత్ తపః = ఏతపస్సు, క్రియతే=చేయఁబడుచున్నదో), తత్=అది, తామసం=తమోగుణసంబంధియని, ఉదాహృతం=చెప్పఁబడినది.

63
తా. అవివేకులు తమశక్తి మొదలగువాని నాలోచింపక దురా
64
గ్రహము నవలంబించి తమ శరీరము నుపవాసాదులచేత పీడించుకొనుచును బరవినాశముకొఱకును ఆచరించు తపస్సు తామసమనఁబడును.

శ్లో. దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే
65 66
దేశే కాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతమ్. 20

టీ. దేశే=పుణ్యక్షేత్రమునందును, కాలేచ=పుణ్యకాలమునందును, పాత్రేచ=సత్పాత్రమునందును, అనుపకారిణే=ప్రత్యుపకారము చేయఁజాలనివానికొఱకు, యత్ దానం=ఏదానము, దాతవ్యమితి=ఫలాభిసంధిహీతముగా ఈయవలసినది యను బుద్ధితో, దీయతే=ఇయ్యఁబడుచున్నదో, తద్దానం=ఆదానము, సాత్త్వికం=సత్త్వగుణసంబంధియైనదని, స్మృతం=తలఁపఁబడియున్నది.

తా. దానార్హమయిన పుణ్యదేశ పుణ్యకాలములందు ప్రత్యుపకారము చేయలేనివాఁడగు సత్పురుషునకు ఫలాభిసంధి రహితముగా నీయఁబడు దానము సాత్త్విక మనఁబడుచున్నది.

67
శ్లో. యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః
68
దీయతే చ పరిక్లిష్టం తద్రాజస ముదాహృతమ్. 21

టీ. యత్ (దానం) తు=ఏదానమైతే, ప్రత్యుపకారార్థం=ప్రత్యుపకారాభిప్రాయపూర్వకముగాను, పునః=మఱల, ఫలంఉద్దిశ్య వా=ఫలము నుద్దేశించికాని, *పరిక్లిష్టంచ=మనః క్లేశముతోఁగూడి నట్లుగాను (లేక అమంగళమైన ద్రవ్యము గలదిగాను), దీయతే=ఈయఁబడుచున్నదో, తత్=ఆదానము, రాజసం=రాజసమని, ఉదాహృతం=చెప్పఁబడినది.

తా. ప్రత్యుపకారము పొందవలయు ననెడి యభిప్రాయము లోపలఁ గలిగియు, ఫలము గోరియైనను, అమంగళద్రవ్యముతోనైనను ఆచరించు దానము రాజస మనఁబడును.

69 70 71
శ్లో. అదేశకాలే యద్దాన మపాత్రేభ్య శ్చ దీయతే
72 73
అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్॥ 22

టీ. అదేశకాలే=ప్రశస్తముకాని దేశకాలములయందును, అపాత్రేభ్యశ్చ=మూర్ఖతస్కరాది దుర్మార్గులకొఱకును, అసత్కృతం=పాదప్రక్షాళనాదిసత్కారరహితముగాను, అవజ్ఞాతం=అవమానయుక్తముగాను-అనఁగా ఉపచారరహితముగాను, యత్ దానం=ఏదానము, దీయతే=ఈయఁబడుచున్నదో, తత్=ఆదానము, తామసం=తామసమని, ఉదాహృతం=చెప్పఁబడినది.

---

* పరిక్లిష్టమనఁగా క్లేశముతోఁ గూడినది. ఒకఁడు ఒక వస్తువును త్యజించునపుడు దానియందలి యాసక్తిచేత క్లేశము గలవాఁడై అందు కల్యాణమైన యంశమును తానుంచుకొని అకల్యాణమైన భాగమును పరులకిచ్చును. కనుక పరిక్లిష్టమనుటకు అకల్యాణద్రవ్య మనఁబడినది. శ్రద్ధలేమిచేతను అకల్యాణమైనదనియుఁ జెప్పవచ్చును.

తా. ప్రశస్తము కాని దేశకాలములయందును, అపాత్రుల (చోరాదిదుర్మార్గుల) కొఱకును, పాదప్రక్షాళనాదిగౌరవరహితముగాను ఉపచారము లేకయు నీయఁబడుదానము తామసదాన మనఁబడును.

అవ. ఇట్లు వైదికము లైన యజ్ఞతపోదానములకు సత్త్వాది గుణ భేదమువలనఁ గలుగు భేదము చెప్పఁబడినది. ఇప్పుడు వైదిక యజ్ఞాదులే, 'ఓమ్' అను ప్రణవముతో నన్వయించుటయు, తత్ సత్ అను శబ్దములచే నిర్దేశింపఁబడుటయుఁ జెప్పుచున్నారు.

74 75
శ్లో. ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
76
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురాః 23

టీ. బ్రహ్మణః=వేదమునకు (అనఁగా యజ్ఞాది వైదికకర్మమునకు), నిర్దేశః=నిర్దేశించుశబ్దము, ఓం తత్ సత్ ఇతి=ఓం అనియు తత్ అనియు సత్ అనియు, త్రివిధః=మూఁడువిధములు గలదిగా, స్మృతః= నిశ్చయింపబడినది, తేన (అన్వితాః) = ఆ మూఁడువిధములు గల శబ్దముతోఁ గూడినవారుగా, బ్రాహ్మణాః = బ్రహ్మక్షత్రియవైశ్యులు, వేదాశ్చ=వేదములును, యజ్ఞాశ్చ=యజ్ఞములును, పురా=పూర్వము - సృష్టికాలమునందే విహితాః=నిర్మింపఁబడినవి.

తా. ఓం తత్ సత్ అని యీమూఁడుశబ్దములు బ్రహ్మముతో అన్వయించున వగును. బ్రహ్మ మనఁగా వేదము. వేదశబ్దముచేత వైదికమగుకర్మము చెప్పఁబడుచున్నది. వైదిక మనఁగా యజ్ఞాదికము. యజ్ఞాదిక మగుకర్మము ఓం తత్ సత్ అను శబ్దములతో అన్వయించిన దగును. ఓం అనుశబ్దముయొక్క అన్వయము వైదికకర్మములకు అంగముగా ప్రయోగాదులందు ప్రయోగింపఁబడుచుండుటంబట్టి కలుగును; తత్ సత్ అను శబ్దముల అన్వయము పూజ్యత్వముకొఱకు వాచక మగు

ఉత్పత్తి (అనఁగా పూజ్యములని చెప్పుటకొఱకు) కలుగును. వేదాన్వయులగు త్రైవర్ణికులును వేదములును యజ్ఞములును ఈ మూఁడు విధములైన శబ్దములతో అన్వయించినవిగా నాచే తొల్లి విహితములు (అనఁగా సృష్టికాలమునందే నిర్మితములు) అని యర్థము.

అవ. బ్రాహ్మణ వేదయజ్ఞములు, ఓమ్ తత్ సత్ అను శబ్దములతో అన్వయించు ప్రకారము చెప్పఁబడుచున్నది. అందు మొదట ఓమ్ అను శబ్దముయొక్క అన్వయప్రకారము చెప్పఁబడుచున్నది.

శ్లో॥ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః

ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్. 24

టీ. తస్మాత్=అట్లు అన్వయము కలవిగా నిర్మింపఁబడుటవలన, బ్రహ్మవాదినాం=వేదవాదులగు బ్రహ్మక్షత్రియవైశ్యులయొక్క, విధానోక్తాః=శాస్త్రోక్తములైన, యజ్ఞదానతపఃక్రియాః = యజ్ఞదానతపస్సులనెడిసత్కర్మములు, సతతం=ఎల్లప్పుడును, ఓమితి=ఓం అని, ఉదాహృత్య=ఉచ్చరించి, ప్రవర్తన్తే=ప్రారంభింపఁబడుచున్నవి.

తా. *కావున వేదవాదులగు త్రైవర్ణికులు (అనఁగా బ్రహ్మక్షత్రియవైశ్యులు) చేయు వేదవిధానోక్తములైన యజ్ఞదానతపస్సులనెడి క్రియలు[78] మొదట 'ఓమ్' అని ఆరంభించి సర్వదా ప్రవర్తించుచున్నవి. వేదములును[79] 'ఓమ్' అని చెప్పి యారంభింపఁబడుచున్నవి. ఇట్లు వేదములకును వైదికములైన యజ్ఞాదికర్మములకును ఓం శబ్దాన్వయము వర్ణితమైనది. ఓం శబ్దముతో అన్వయించిన వేదములను ధరించుట

*పూర్వశ్లోకమున ఓమ్ అనుశబ్దము వేదముల కన్వయించుట చెప్పఁబడెను. 'విధానోక్తాః' బ్రహ్మవాదినామ్ అనుటచే వేదములను ఓమ్ అని చెప్పి ప్రారంభించుట సూచితమైనది.

చేతను ఓం శబ్దముతో అన్వయించిన యజ్ఞాదికర్మములను జేయుట చేతను బ్రాహ్మణశబ్దనిర్దిష్టులైన త్రైవర్ణికులకును, ఓం. శబ్దాన్వయము వర్ణితము.

అవ. ఇక వానికి 'తత్' శబ్దము అన్వయించు ప్రకారమును జెప్పుచున్నారు.

80 అవ.

శ్లో. తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః. 25

టీ. మోక్షకాఙ్క్షిభిః = మోక్షముఁగోరువారిచేత, తత్ ఇతి= భగవదారాధనమనెడిబుద్ధితో, ఫలం=స్వర్గాదిఫలమును, అనభిసన్ధాయ= ఉద్దేశింపక, వివిధాః=సాత్త్వికరాజసతామసరూపములుచే అనేకవిధము లగు, యజ్ఞతపఃక్రియాః=యజ్ఞములు తపస్సులనెడి కర్మములును, దానక్రియాశ్చ=దానము లనెడి కర్మములును, చ శబ్దముచే వేదాధ్యయన క్రియలును, క్రియన్తే=అనుష్ఠింపఁబడుచున్నవి.

తా. మోక్షాపేక్షగల బ్రాహ్మణాదిత్రైవర్ణికులు పరబ్రహ్మ వాచకమగు తచ్ఛబ్దము నుచ్చరించి ఫలాంతరముఁగోరక వేదాధ్యయన యజ్ఞదానతపస్సు లాచరింతురు. అవి బ్రహ్మప్రాప్తి కుపాయమ్ము లగుటచే బ్రహ్మవాచియగు 'తత్' అను శబ్దముచేత నిర్దేశింపఁదగును.

81

'స వః కః కిం యత్తత్పద మనుత్తమమ్' అని (శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రమునందు) తచ్ఛబ్దము పరబ్రహ్మవాచకమగుట ప్రసిద్ధము. ఇట్లు వేదాధ్యయనయజ్ఞాదులు మోక్షసాధనభూతము లగుటచే తచ్ఛబ్దముచే నిర్దేశింపఁదగిన వగుటంబట్టి వానికి తచ్ఛబ్దాన్వయము చెప్పఁబడినది. అటువంటి యన్వయముగల వేదాధ్యయనాదుల ననుష్ఠించుటచేతనే

82

త్రైవర్ణికులకును తచ్ఛబ్దాన్వయము ఉపపన్న మగుచున్నది.

అవ. ఇఁక వీనికి సచ్ఛబ్దాన్వయప్రకారమును చెప్పుటకై లోకము నందు సచ్ఛబ్దము పుట్టినప్రకారమును ముందు చెప్పుచున్నారు.

శ్లో. సద్భావే సాధుభావేచ స దిత్యేత త్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26

టీ. హేపార్థ=అర్జునా, సత్ ఇతి=సత్ అని, ఏతత్=ఈపదము, సద్భావే=కలదనెడి యర్థమందును, సాధుభావేచ = మంచిది యనెడి యర్థమందును, ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది. తథా=అట్లె, ప్రశస్తే=మంగళకరమైన, కర్మణి=లౌకికకార్యమునందును, సచ్ఛబ్దః= సత్ అనెడిపదము, యుజ్యతే=ప్రయోగింపఁబడుచున్నది.

తా. అర్జునా, ఈవస్తు విపుడు కలదనెడి భావమునందును, ఈ వస్తువు మంచి దనెడియర్థమునందును, సమస్తవస్తువులకు 'సత్' అనెడి యీపదము లోకవేదములందుఁ బ్రయోగింపఁబడుచున్నది. అట్లె యే పురుషుఁడేని యనుష్ఠించు వివాహాదిసమస్త లౌకికశుభకార్యములయం దును, 'ఇది సత్కర్మము' అని యీసచ్ఛబ్దము ప్రయోగింపఁబడుచున్నది.

శ్లో. యజ్ఞే తపసి దానేచ స్థితి స్స దితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం స దిత్యే వాభిధీయతే. 27

టీ. యజ్ఞేచ=యజ్ఞమునందును, తపసి=తపస్సునందును, దానేచ =దానమందును, స్థితిః=నిష్ఠ, సత్ ఇతి = (కల్యాణమైనదగుటచే) సత్ అని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది, తదర్థీయం=ఆ వైదికులకొఱకైన, కర్మచైవ=యజ్ఞాదికర్మముసైతము, సత్ ఇతి ఏవ=సత్ అనియే, అభిధీయతే= చెప్పఁబడుచున్నది.

తా. యజ్ఞదానతపస్సులయందు, వైదికులగు త్రైవర్ణికులకు ఏ నిష్ఠగలదో అదియును గల్యాణమైనదగుటవలన సచ్ఛబ్దముచే చెప్ప

బడుచున్నది. ఆ త్రైవర్ణికులయొక్క యజ్ఞదానాదికర్మమున్నైతము సత్తనియే చెప్పఁబడుచున్నది. కాఁబట్టి వేదములు వైదికకర్మములు, బ్రాహ్మణశబ్దముచే నిర్దేశింపఁబడు మూఁడువర్ణములవారును, 'ఓం తత్సత్' అను శబ్దముల యన్వయము గలిగియుండులక్షణముచేత, వేదములు కానివానికంటెను అవైదికులకంటెను వేఱు అని తెలియఁదగును.

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే పార్థ నచ తత్ప్రేత్య నో ఇహ 28

టీ. హే పార్థ = అర్జునా, అశ్రద్ధయా = అవిశ్వాసముతో, కృతం = చేయఁబడిన, హుతం = హోమమును, దత్తం = దానమును, తప్తం = ఆచరింపఁబడిన, తపశ్చ = తపస్సును, అన్యత్ యత్ = తక్కినది ఏది కలదో, తత్ = అది యంతయును, అసత్ ఇతి = అసత్తని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. ప్రేత్య = చచ్చినతరువాత - పరలోకమందు, (ఫలాయ)న = ఫలముకొఱకు కానేరదు, ఇహ చ - ఈ లోకమందును, నో = ప్రయోజనము లేదు.

తా. అర్జునా, అశ్రద్ధతోఁ జేయఁబడుహోమమును దానమును తపస్సును తక్కినకర్మము లన్నియు శాస్త్రీయములైనను అసత్తనఁబడుచున్నవి. ఏలనఁగా, అట్టి యసత్కర్మములు *ఇహలోక పరలోకములందు ఫలప్రదములు గానేరవు - అనఁగా వానివలన మోక్ష

*శ్రద్ధాయుక్తమైనను అవైదికకర్మముగాని, వైదికమైనను శ్రద్ధాహీనమైన కర్మముగాని, దృష్టాదృష్టప్రయోజనములేని దగుటవలన అనుష్ఠింపఁదగనివి. కాఁబట్టి ఉభయవిధప్రయోజనముతోఁ గూడిన దగుటవలన శ్రద్ధాయుక్తమైన వైదికకర్మమే అవశ్య మనుష్ఠింపఁదగిన దని యీయధ్యాయముయొక్క సారాంశము.

రూపమైనఫలము గలుగదు. మఱి సాంసారిక సుఖరూపమైన ఫలమును గలుగదు.

83

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయ
విభాగయోగోనామ సప్తదశోఽధ్యాయః.

ఇది యుపనిషదర్థ ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ
శాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును నగు
శ్రీభగవద్గీతలయందు శ్రద్ధాత్రయవిభాగ
యోగం బన్నది పదునేడవయధ్యాయము.

84



# సప్తదశోఽధ్యాయః

## శ్రద్ధాత్రయవిభాగయోగః — అవతారిక.

### 1వ శ్లోకము

(1) ఈ యధ్యాయారంభమున అర్జునుని ప్రశ్నకు తాత్పర్య మేమనగా —

బుద్ధిమంతులు ఫలములయందున వాని కుపాయములయందును శ్రద్ధకలవారై వానిని తెలునుకొనగోరుచుందురు. కాబట్టి సత్త్వాది గుణనిష్ఠులలో తారతమ్యమునుగూర్చి ప్రశ్నించుట వారివారికి కలుగు ఫలములనుగూర్చిన ప్రశ్నగనే భావించవలెను. నిష్ఫలములని తెలిసిన కర్మలకు ఫలమేమని యెవ్వరును ప్రశ్నించరు. లోకప్రసిద్ధమైన వ్యవసాయము వైద్యము మొదలగు బుద్ధిమంతులు చేయుపనులను సఫలముగనే చూచుచున్నాము. అట్లా శాస్త్రోక్త కర్మలకు ప్రయోజనమే లేకున్నచో వేదమిప్పటి కెప్పుడో నిర్మూలమై యుండెడిది. అటులనే వైదికకర్మలలోను పెద్దలయొక్క ఆచారములవలన సిద్ధించునవి కొన్ని కలవు. అవి నిష్ఫలముకావుగదా! నిష్ఫలమే యగుచో బుద్ధిమంతులు వానిని చేయుదురా? శ్రద్ధగాచేసినచో నేవియో కొన్నియంగములు లోపించవచ్చును. అయినను ఫలములేకుండపోరాదు. అప్పటికిని బుద్ధిమంతులగు పెక్కుమంది మిక్కిలి రొక్కములను వెచ్చించి బహుశ్రమలకోర్చి చేయుకర్మలకు కాన్పించుఫలము లేకున్నను అదృష్టఫలముండునని యంగీకరించవలెను. అయినను శాస్త్రోక్తకర్మకన్న అశాస్త్రమై శ్రద్ధతో చేయుబడిన కర్మకు కొంత తారతమ్యమున్నను అది సత్త్వాదిగుణములచే వచ్చిన ఫలతారతమ్యమేగాని వేరొండుకాదు. అయినచో 'యశ్శాస్త్రవిధి ముత్సృజ్య' ఇత్యాది శ్లోకములలో ఫలము లేదనుట మిక్కిలి యధికమైన సుఖము లేదనిమాత్రమే చెప్పవలెను.

వెనుక 'కామకారతః' అనుట శ్రద్ధతో కూడినది చెప్పుటయే - కాని దురుద్దేశమువలనను, వేదవిరుద్ధాగమములవలనను, తనకు తోచిన రీతిగను ఎవరో ఒక వృద్ధులు చెప్పుటవలనను దానిని ధర్మమేయని నమ్మి శ్రద్ధతో నాచరించుటచే దానికేదో యొక ఫలము తప్పకయుండ వలెనని అర్జునుని యభిప్రాయము.

2వ శ్లోకము

(2) క్రమముగ సరియగు ప్రత్యుత్తరము నొసంగుటకు "మనస్సునందే యుంచుకొని" అనబడినది. వెంటనే సాక్షాత్తుగా ప్రత్యుత్తరము నొసంగకుండుట - ప్రశ్న బాత్తుగ ఆదరించతగనిదని సూచించుటకే.

(3) సత్త్వాదిగుణముల భేదమునుబట్టి ఫలమున భేదముండును.

సాత్త్వికశ్రద్ధతో కూడియున్న సాత్త్వికఫలము, శాస్త్రము నతిక్రమించిన తామసము. రెండును కలసిన రాజసము - అను అభిప్రాయముతో శంకింపబడెను.

శాస్త్రీయకర్మలే శ్రద్ధనుబట్టి ఫలసాధనములగును. అందును శ్రద్ధ ఒకేవిధముగ నుండునని చెప్పుటకు వీలులేదు. కావున శాస్త్రీయమైన శ్రద్ధయే మూడువిధములని చెప్పబడుచున్నది. అంతియగాని యశాస్త్రీయములగు కర్మల ఫలభేదమునుబట్టి మూడువిధములనుట యుక్తము కాదు.

(4) ఆయా దేహములనుబట్టి యధికారులలో భేదముండును.

(5) భావ మనగా - ధర్మము.

(6) ఆత్మకు ప్రకృతిసంసర్గమనెడు ఉపాధివలన ధర్మభూతజ్ఞానమునకు కలుగు పరిణామభేదములే.

సత్త్వాది గుణరహితమగు ఆత్మకు సత్త్వాదులవలన కలుగు వాసనాది సంబంధ మెట్లుకలుగు ననగా -

ఓషధాదులతోఁగూడిన అగ్న్యాదులవలన పార్థివపదార్థముల యందు గుణము లెట్లు మారుచుండునో అటులనే నివి గుణసంబంధ ముచే బుట్టుచుండును.

(7) ఇంద్రియములకు గాన్పించకయు అనుభవింపబడకయు నున్న ఈ గుణములు వాసన నెట్లు బుట్టించుననగా జెప్పుచున్నారు.

(8) సాత్త్వికాది త్రైవిధ్యమును జెప్పెనుగదా వినుమనుట యేలననగా —

గుణముల స్వరూపమును సామాన్యముగా త్రైవిధ్యమున్ను చెప్పబడినను ఇంకను అర్జును డెటుంగని రీతులు పెక్కుకలవుగాన వానిని శ్రద్ధగా వినుమని హెచ్చరించుచున్నాడు.

౩వ శ్లోకము

(9) ఈ శ్లోకమున సత్త్వమనగా — అంతఃకరణమని యర్థమేల చెప్ప

సత్త్వశబ్దమునకు సత్త్వగుణమనియే యర్థమును చెప్పినచో సకలమానవులయొక్క శ్రద్ధయు సత్త్వగుణమూలమే యైనచో శ్రద్ధను రాజస, తామసమని విభజించుటయెట్లు? సత్త్వమంతటను సహకారిగా నుండవలెను గాన చెప్పబడిన దందురా? రజస్తమస్సు లట్టివేగదా! మూడు గుణములును వాతపిత్తశ్లేష్మములవలె పరస్పరము హెచ్చు తగ్గులుగానుండినను కార్యములను బుట్టించుచుండును గదా! కాబట్టి యిచ్చట సకలశ్రద్ధలకును సాధారణకారణముగా జెప్పబడిన సత్త్వ మనగా సత్త్వాది మూడుగుణములతోఁ కూడియున్న అంతఃకరణమేగాని సత్త్వగుణముమాత్రము కాదు

(10) ఏ వస్తువునందు రుచిని బుట్టించు వాసనను బలపరచు సత్త్వాదిగుణములతోఁ కూడియున్నదగునో —

అనగా- సత్త్వగుణ మధికముగానున్నచో అంతఃకరణము సాత్త్వికమై సాత్త్వికవాసనను మేల్కొలిపి సాత్త్వికపదార్థములయందును సాత్త్వికకర్మలయందును రుచినిబుట్టించునని భావము - ఉదా॥ బ్రాహ్మముహూర్తమున సత్త్వగుణ ముద్రేకించియుండును. దానిచే మనస్సు సాత్త్వికమగును. దానివలన వెనుకటి భగవద్భాగవతానుభవమువలన కలిగిన వాసన మేల్కొని వారిసేవనో స్తుతినో అర్చనో ధ్యానమునో గావించవలెనను రుచిని (ఆసక్తిని)బుట్టించి యా కర్మలను చేయించును.

(11) కొన్నికలసి యొక కార్యమును బుట్టించునవియగుచో నందుచెప్పటచ్చుట వానిలో నొక్కదానిని చెప్పుట తప్పుకాదు.

(12) 'శ్రద్ధామయః యనుచో 'మయట్' ప్రత్యయమునకు [1] స్వార్థము [2] ప్రాచుర్యము [3] వికారము అని మూడర్థములుకలవు. అందు స్వార్థమన్నచో నిష్ప్రయోజనము. ప్రాచుర్యమన్నచో ప్రకృతము కుపయోగముండదు. కావున వికారార్థము చెప్పబడినది. శ్రద్ధకు తగిన ఫలము ననుభవించునని చెప్పుట పొసగుటకే యీ యర్థము నిచ్చుట చెప్పుట సప్రయోజనము.

(13) ఇంతవరకు సామాన్యముగ శ్రద్ధకుతగిన ఫలమునే ప్రతిమానవుడును అనుభవించునని సామాన్యముగా జెప్పబడెను. ఇకనిప్పుడు యెట్టి శ్రద్ధచే నెట్టిఫలము ననుభవించునో వివరించి చెప్పబడుచున్నది.

(14) ఆత్మనిత్యము - ధర్మభూతజ్ఞానముయొక్క వికాసము ఇంద్రియములద్వారా కలుగునని నిర్ణీతమైనది. దేహాదులు అచిత్తుయొక్క వికారములు. ఇక శ్రద్ధయొక్క పరిణామము దేనినిబట్టియనగా చెప్పుచున్నారు 'పుణ్యాకర్మల ఇత్యాదిచే.

4వ శ్లోకము

(15) సత్త్వాదిగుణములు పెరిగి తమకు తగిన విషయములయందు శ్రద్ధను బుట్టించుచున్నవి. మూడు గుణములును అందరకును విడువక

యున్నను సాత్వికులు రాజసులు తామసులనుట వారియందా గుణము లధికముగా నుండుటవలననే.

(16) భూతగణములనగా - రుద్రుని పార్షదులు. ద్వారపాలక - అనుచరాదులు.

5వ శ్లోకము

(17) ఇచ్చట బలము కామరాగములతో కూడినదగుటచే నసాత్వికము.

'బలం బలవతాం చాహం కామరాగ వివర్జితః' అనిన దావెనుక చెప్పబడినది.

(18) వీరికి పరలోకమున నరకానుభవము మాత్రమేకాదు. ఇచ్చట బ్రతికియున్నప్పుడున్ను శరీరమునందున్న వృథివ్యాదులను రొండింపజేయుటయే యగును.

(19) ఇచ్చట 'మాం' అను పదమునకు 'నా యంశభూతమైన జీవాత్మను' అనబడినది. ఎందుకనగా -

'అన్తర్యామ్యమృతః' జీవున కంతర్యామిగానున్న పరమాత్మ నిర్వికారుడు అనుటచేతను, 'అనశ్నన్నన్యోఽభిచాకశీతి' జీవునితోపాటు శరీరమునందున్నను కర్మఫలమగు సుఖదుఃఖముల ననుభవించక స్వాభావికకాంతితో వెలుగుచుండు ననుటచేతను 'సస్థానతోఽపిపరస్య భయలిఙ్గం సర్వత్రహి' దోషములతో నిండియున్న ప్రదేశమునందున్నను చక్రవర్తి చామరములచే వీచబడుచుండుటచే వానిబాధ ననుభవించ నటుల పరమాత్మ అన్నిటిలో నంతర్యామిగనున్నను దుర్గుణదూరుడై సద్గుణాకరుడై యే యుండుటచే నాస్థాన ప్రయుక్తమైన దోషములకు దూరుడైయే యుండునని బ్రహ్మసూత్రమునందును.

సహస్రనామములలో నొకటియైన "కః" అను నామమునకు శ్రీ భట్టరువారి భాష్యమున 'మలీమసేషు వసన్నపి కనతీతికః - కనదీప్తౌ'

అని మాలిన్యభూయిష్ఠమైన పదార్థములలో నంతర్యామిగానున్నను దీని దోషములచే నంటబడక స్వస్వరూపముతో ప్రకాశించుచునే యుండునని చెప్పబడుటచే పరమాత్మయొక్క స్వరూపముగాని దాని ధర్మములుగాని కృశించుట యసంభవము. సంభవించునన్నచో శాస్త్రములలో జెప్పబడిన హరివాసరోపవాసాదులచేతనుకూడ కృశింపవలసి యుండును. అట్లగుచో నది యేల విధింపబడును? శరీరము చిక్కినచో దానియందున్న జీవులయొక్క జ్ఞానము సుఖము మొదలగునవి సన్నగిల్లునని శ్రుతిస్మృతులలో చెప్పబడుటయే గాక లోకానుభవసిద్ధమగుటచేతను 'అన్తశ్శరీరస్థం' అని శరీరముతో కూడియున్న జీవుడే సూచింపబడుటచేతను 'క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి' జీవునకును శరీరమునకునుగూడ నేనే యాత్మగానున్నవాడననియు 'మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః' అని సర్వమును తనకు శరీరముగాగల పరమాత్మకు జీవుడు విశేషణాంశభూతుడని చెప్పబడుటచేతను ఇచ్చట 'మాం' అని జీవుడే చెప్పబడును.

ఇట్లు ప్రాకారికముగ చెప్పనేల? అన్నచో – 'నాకు శరీరమైయున్న జీవుని పీడించుట నన్ను పీడించుటవంటిదే' యను నధికదోషమును జూపించుటకేయని గ్రహించవలెను. శాస్త్రము నుల్లంఘించుటచే చేయునట్టి యాత్మపీడనమును పాపముకూడ వీరికి సిద్ధించును. అని భావము.

7వ శ్లోకము

(20) అవతారికకు అవతారిక –

శాస్త్రమున చెప్పబడిన కర్మలకు సాత్త్విక రాజస తామసభేదమున్ను దానికి తగిన ఫలభేదమున్ను కలదా? లేదా? యను ప్రశ్నకు శాస్త్రమున చెప్పబడిన కర్మలకే గుణభేదము ఫలభేదములుగాని అవి తరములకది లేదని చెప్పెను. ఆ చెప్పుటలో శ్రద్ధకును అట్టి కలవారికిని

వారుచేయు కర్మలకును సత్త్వాదిగుణములచే తారతమ్యము చెప్పబడెను. దానిని వినుటచే నర్జునునకు అట్టి యితర విషయములలోకూడ నీ విభాగముండునా? యను శంక పొడమును గావున వానిని చెప్పుచున్నాడు.

(21) శాస్త్రీయములైన యజ్ఞతపోదానము లుండగా రాగప్రాప్తమైన ఆహారమును మునుముందు వివరింపనేల యను శంకను బాపుచున్నాడు.

(22) "వృద్ధిస్సమానై స్సర్వేషాం
విపరీతైర్విపర్యయః"

అని వైద్యశాస్త్రమున జెప్పబడినట్లు మనస్సున కాప్యాయకమైన (పోషించు) ద్రవ్యములయొక్క గుణములనుబట్టి యంతఃకరణాదులకు సత్త్వాదివృద్ధిని వేదమే చెప్పుచున్నది.

'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః'

అనుచో నాహారమునకును మనస్సునకును శుద్ధి యేమనగా - అవి రజస్తమోగుణముల సంపర్కము లేక యుండుటయే.

(23) "పచామ్యన్నం చతుర్విధం"

అని చెప్పినట్టి నాలుగు విధములైన అన్నమునకును ప్రత్యేకించి సాత్త్వికాది గుణభేద మిచ్చట చెప్పబడుచున్నది. సత్త్వగుణము సాత్త్విక పదార్థానుభవమునందే రుచినిబుట్టించును. ఆ యనుభవముచే బుట్టు వాసన సాత్త్వికమైయే యుండును. ఆ సాత్త్వికవాసన తిరిగి సాత్త్వికపదార్థానుభవరుచినే బుట్టించును. ఇట్లే రజోగుణ తమోగుణములున్ను కాబట్టి సాత్త్వికాద్యాహారములు సాత్త్వికాదిగుణములు కలవారికే ప్రియములుగా నుండును.

8వ శ్లోకము

24 (ఎ) ఆయువు సకలపురుషార్థసాధ నానుష్ఠానమున కుపకరించును గాన మునుముందుగ జెప్పబడినది.

24 (బి) ఇదివరకే సత్త్వవృద్ధి కలిగియున్నచో సాత్త్వికాహారముసే తినవలెనను రుచిపుట్టును.

(25) ముముక్షువున కంతఃకరణము ప్రధానసాధనమగుటచే పిమ్మట సత్త్వము=అంతఃకరణము అనగా జ్ఞానము చెప్పబడినది.

"ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః
సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః"

అను శ్రుతివాక్యచ్ఛాయ ననుసరించుచు దానిని విశదీకరించుటకై అంతఃకరణవాచకముగా'సత్త్వ' శబ్దము వాడబడినది. మరియు 'ద్రవ్యాసు వ్యవసాయేషుసత్త్వ' మ్మను కోశమునుబట్టి జ్ఞానవిశేషమైన వ్యవసాయమనగా నధ్యవసాయమునందును సత్త్వశబ్దము వాడబడును. ఆహారముచే సత్త్వగుణమును పెంచుకొనుట జ్ఞానలాభముకొఱకే గావున జ్ఞానమును బోధించుటకై సత్త్వపదము ఔపచారికముగ ప్రయోగింపబడినది. జ్ఞానమునకు కారణము మనస్సుగాన దానిని తెలుపుటకై అంతఃకరణమని వ్యాఖ్యానింపబడినది.

(26) ఆయుర్దాయము మొదలగు వానిని బెంచుట సాత్త్విక ఆహారముయొక్క స్వభావము. వానిలోకొన్ని శాస్త్రమవసరము లేకయే ప్రత్యక్షముగనే నెఱుంగదగినవి. కొన్ని ధర్మ - వైద్యశాస్త్రములచే నెఱుంగదగినవి.

ఆయా పదార్థముల యందుండు రసాదులు శరీరమునందుండు ఆయా ధాతువులను పెంపొందించునవి యని శాస్త్రముచే నిర్ణయింపబడినవియే యైనను ఆ రసము గల పదార్థములను ఆ పనిని చేయునవిగా చెప్పినట్లు - సత్త్వగుణము జ్ఞానవృద్ధికి కారణమైనను ఆ సత్త్వగుణము కల ఆహారపదార్థములున్ను జ్ఞానాభివృద్ధికి హేతువులుగా జెప్పబడు చున్నవి.

(27) "బలారోగ్య - సుఖప్రీతి వివర్ధనాః"

అను సమాసాన్తర్గత బలారోగ్యముల నొక జంటగాను సుఖ ప్రీతుల నొక జంటగాను భాష్యకారులు వివరించిరి. అందులకు కారణము బలారోగ్యములున్ను సుఖప్రీతులున్ను వానిలో నొకటియున్న రెండవది యుండితీరునని వానికిగల అవినాభావమును తెలుపుటకేయని గ్రహించవలెను.

ఇచ్చట బలమనగా - ప్రాణముయొక్కయు జఠరాగ్నియొక్కయు ఆధిక్యము.

ఆరోగ్యమనగా - శరీరమునందుండు ధాతువు లేడును సామ్య స్థితిలో నుండుట. కర్మదోషము, జఠరాగ్ని, సప్తధాతువులు అను వీని యొక్క తారతమ్యమువలననే రోగములు పుట్టుచుండును.

(28) 'రస్యాస్స్నిగ్ధాః' రుచికరములు మనోహరములు, అనుట చేతనే యప్పటికప్పుడే సుఖమునిచ్చునవి యని తెలియుచుండగా తిరిగి 'సుఖవివర్ధనాః' అని వేరుగ చెప్పనేల? పౌనరుక్త్యము కాదాయన్నచో పరిణమించునపుడు ఇత్యాది.

(29) పిచ్చినెక్కించు ఉమ్మెత్తకాయ మొదలగు పదార్థములను తినినచో లోకులకు కోపము నుద్రేకింపజేయు కర్మలను చేయించి వాని యందప్రీతిని వృద్ధిపొందించు నటుల సత్త్వగుణమును బుట్టించు వస్తువులును, అనుభవింపబడ్డవై లోకమున కుపకరించు మంగళకార్యముల యందును పరలోకములకు కారణమైన కర్మలయందును ప్రేరేపించి వానిద్వారా వీనియందు లోకుల ప్రీతిని వృద్ధిపొందించును.

(30) 9వ శ్లోకమునందు కట్వమ్లేత్యాదినా ఇతర రుచులు రాజసములుగా చెప్పబడుటచేతను, రస్యశబ్దము ప్రాయశః తీపియందే వాడ వాడబడుటచేతను, ఇచ్చట రసమనగా మధురరసమనియే యర్థము.

వైద్యశాస్త్రమునుబట్టియు తీపి యితరరుచులకంటె శరీరమును నిలబెట్టుటలో మిక్కిలి ఉపకారకమగుచున్నది. "రసాస్స్వాద్వమ్లలవణ తిక్తోష్ణ కషాయకాః షడ్ద్రవ్యమాశ్రితాస్తేచ యథాపూర్వం బలావహాః" అని బాహటము తెలుపుచున్నది. అనగా తీపి పులుపు ఉప్పు చేదు కారము వగరు మొదలగురుచులు వెనుక వెనుక బలవర్ధకములు. అచ్చటనే భోజనమున ఆరోగ్యవంతునకు తీపివస్తువులే అధికముగా నుండవలెనని చెప్పబడెను.

"షడ్రసాన్మధురప్రాయాన్" అని కలదు.

రసాయనములలో తీపియొక్కటియే ముఖ్యముగా జెప్పబడుచున్నది.

(31) చమురుగల పదార్థములు తినినచో ఆర్చివేయు పదార్థములు తినుటవలనకలుగు శరీరశైథిల్యమును బాపి శరీరమును బలపరచి మొనర్చునని ఆయుర్వేద ముద్ఘోషించుచున్నది.

(32) స్థిరాః అనుటచే తినిన ఆహారము వండినపుడున్నట్లే యుండుట అసంభవము. అట్లున్నను అపకారమునే చేయునుగాని దానివలన శరీరమున కుపకారముండదు. శరీరము పృథివ్యాదిసంఘాతాత్మకము. అట్టి శరీరము స్థిరముగా నుండుటకు తినిన ఆహారము సప్తవిధధాతువులుగా మారవలెను. అవి- రసము, రక్తము, మాంసము, క్రొవ్వు, ఎముకలు, మజ్జా (ఎముకలలోని సున్నితమైన పదార్థము) రేతస్సు అని ఏడువిధములు. అవియును, ఆహారమువలనగలుగు పుష్టియును చిరకాలమువరకును చెడకయుండుటయే యిచ్చట స్థిరాః అనుటలో తాత్పర్యము.

(33) ఆహారపదార్థములు తినుటకుముందుగ చూడగనే అసహ్యించుకొనదగినట్లుండరాదు. చూడగనే దానియందు ప్రీతిబుట్టవలెను. దానినే 'హృద్యాః' అనుటచే వ్యక్తపరచెను.

(34) ధర్మశాస్త్రము,ఆయుర్వేదము రెండు శాస్త్రములు నేకగ్రీవముగా నంగీకరించిన పదార్థములన్నిటి నిట సాత్వికాహారముగా భావింపవలెను.

9 వ శ్లోకము

ఉప్పుస్వరూపతః పనికిరాని పదార్థముకాదు. సాత్వికాహారమునే నియమముగ భుజించువాడైనను వ్రతోపవాసదినములలో తప్ప ఇతర సమయములలో రుచికిమాత్రము తగునంత ఉప్పును వాడవచ్చునని శాస్త్ర మంగీకరించుటచే 'మిక్కిలి' యనబడినది. ఉప్పుచేరిన పదార్థములనే వాడవలెనుగాని ప్రత్యక్షముగా కేవలము ఉప్పు ఆహార మెవ్వరికిని కాజాలదు. అట్టి ప్రత్యేకము ఉప్పు గోమాంసతుల్యమని శాస్త్రము చెప్పుటచేత 'ఉప్పని' పదార్థములని చెప్పబడెను.

(ఇందువల్లనే కానోపు ఆబ్దికశ్రాద్ధ భోజనములో పెరుగుతో కలిసిన ఉప్పునేగాని కేవల ఉప్పును వేయరాదని నియమమేర్పడినది.)

(36) "స్నిగ్ధముష్ణంచ భోజనం" జిడ్డుపదార్థములు(అనగా నెయ్యి వెన్న మీగడ నూనె మొదలగునవి) కలిసినట్టియు కొంచెము వెచ్చగానున్నట్టియు ఆహారమును భుజించవలెనని శాస్త్రముండుటచే 'మిక్కిలి వేడి' యనబడెను.

(37) కారము రాజసాహారమేయైనను మిరియము శొంఠి అల్లము మొదలైనవి ఆయా పదార్థముల రుచిని పెంచుటకు ఈషణ్మాత్రము వాడవచ్చునని శాస్త్రమంగీకరించుటచే నిచ్చటను 'అతి' శబ్దము నన్వయించి 'మిక్కిలి' యనబడెను.

(38) ఉష్ణశబ్దము వేరుగానుండుటచే నిచ్చట తీక్ష్ణశబ్దమునకు ఉష్ణమని యర్థమును జెప్పరాదు. తినినతోడనే తమవికారములను శరీరమునజూపు మిర్చి మొదలగు పదార్థములను ఆయుర్వేదమున తీక్ష్ణములని వాడుకగలదు. కాబట్టి యిచ్చట తీక్ష్ణశబ్దమునకు తిన్నది మొదలు

మిక్కిలి విరుద్ధవికారమును బుట్టించు గిట్టని భోజనపదార్థములను తీక్ష్ణములని వాడెనని గ్రహించవలెను. (క్రొత్త చింతకాయ వెంటనే జలుబు చేయును. మిక్కిలికారముగల (సీమమిరప మొదలగు) పదార్థములు తినగనే కండ్లనుండి ముక్కునుండి నోటినుండి నీటిని కార్పించును. అసలైన ఆవనూనెయు నిట్టిదే. దురదకంద చెప్పనక్కరనేలేదు. ఇట్టివిచ్చట తీక్ష్ణము లనబడెను.)

(39) స్నేహము (జిడ్డు) నకు విరుద్ధమైన గుణము రౌక్ష్యము. (ఆర్చునవి) నేయి లేక కాల్చిన గోధుమరొట్టె మొదలగునవియును వాతమును పెంచునవియును.

(40) పైత్యమును పెంచునది. కటుమొదలగునవి క్లేశమును బుట్టించునవగుట తరుచుగ ననుభవమువలనను ఆయుర్వేదమువలనను ఎఱుంగనగును. అవి దుఃఖప్రదములగుట ధాతువులలో హెచ్చుతగ్గులను బుట్టించి రోగములను తెచ్చుటద్వారాయని యెఱుంగవలెను.

శోకప్రదములగుట వానివలనబుట్టిన బాధలను జ్ఞాపకముచేసికొని 'అయ్యో! వానినేల తింటినని పశ్చాత్తాపమును బుట్టించుట. ఇచ్చట మాత్రము దుఃఖమును బుట్టించుటయేగాక పరంపరగా పరలోకమునందును మరియొక దేహమును ధరించినపుడును కూడ నని యెఱుంగవలెను.

10వ శ్లోకము

అవతారిక-

(41) సాత్త్వికరాజసాహారములవలన బుట్టు కార్యములను చెప్పి యిచ్చట మాత్రము గుణమునే చెప్పుట రాజసమున కీతామసమత్యంత సన్నిహితమైనదగుటచే దాని కార్యములనే యిదియును బుట్టించునదగుటచేతనే-

(42) ఆహారములన్నియును ఒకర్ఝామము గడచినంతమాత్రమున దుష్టములు కాజాలవుగాన యెంతకాలముండిన పనికిరానివిగ పరిగణింప బడునో అంతకాలము నిచ్చట పరిగణించవలెనని తెలుపుటకై చిరకాల మనబడెను. (ఆకాలము దాటినవని యర్థము.)

కొందరు 'యామ' మనగా శ్రేష్ఠమైన భాగమందురు. అనగా అప్పుడు యాతయామ మనగా నిర్వీర్యమై నిస్సారమైన (వెన్నతీసిన పాలు మీగడ తీసివేసిన పెరుగు మొదలైనవి) పదార్థములని యర్థము.

(43) కొన్ని జలమయాహార పదార్థములున్ను కొన్ని పృథివీ మయాహారపదార్థములున్ను వండుటలో గల నేర్పువలన నెప్పటికిని దానిలోని రుచియంతయు పోక నిలచియుండినను అందుచేరిన ఆయా పదార్థముల స్వాభావిక రుచి మాత్రము మారి వేరొక రుచి దానికి వచ్చును. దానినే యిచ్చట గత రసశబ్దముచే జెప్పిరి.

(క్రొత్త మంచిరుచి దానికి వచ్చినను సహజమైన రుచి మారు టచే నది తామసమే.)

(44) పూతిశబ్దమునకు అసాత్వికములని పాంచరాత్రాగమ మున జెప్పబడిన ఉల్లి మునగ మొదలైన పదార్థములయందు వాడుక యున్నను ఇది పదార్థ విశేషములను తెలుపు ప్రకరణముకాకపోవుటచే గుణాదులద్వారా సకలాహారములకును ఉపలక్షణ ఘట్టమగుటచే నిచ్చట పూతిశబ్దముచే లోకవాడుకనుబట్టియు శాస్త్ర ప్రసిద్ధినిబట్టియు పనికిరాని దిగా జెప్పబడిన గుణమును తెలుపునదిగా వ్యాఖ్యానింపబడినది.

(45) కాలము మించుట మాత్రము 'యాతయామ' శబ్దముచే చెప్పబడెను. రుచిమారుట గత రసశబ్దముచే చెప్పబడెను. కాబట్టి యిచ్చట యేపదార్థములు కాలము మించుటచే చెడిపోవునో అట్టి పదా ర్థము లిచ్చట 'కాలముమించిన రుచి మారున'వని చెప్పబడెను. ఇది పనికిరాని వికారములకన్నిటికిని ఉపలక్షణము. అందువలననే కాచిన

నీరు మొదలగునవి యే వికారమును చెందకున్నను ఒకరాత్రి గడచిన తోడనే వాడకుండుట. దీనిచే 'యాత యామ' శబ్దమునకు రుచి మార్పు కున్నను కాలము మించుటచేతనే వాడరాని పదార్థముల నన్నిటిని తెలుపునని సూచింపబడినది.

(46) ఉచ్ఛిష్టములన్నియును తామసములనరాదు. కొన్నియుచ్ఛిష్టములను శాస్త్రమే విధించుచున్నది. ఆచార్యుల (గురువుల) యెంగిలికి 'తళియ ప్రసాద'మని పేరు ఇది కొన్ని పాపములకు ప్రాయశ్చిత్తముగా పవిత్ర ద్రవ్యమని శాస్త్ర ముగ్గడించుటచే దానికన్న వేరైన ఉచ్ఛిష్టములనే యిచ్చట తామసమని గ్రహించవలెను.

గురూచ్ఛిష్టమువలె-తండ్రి-పెద్దసోదరుడు (అన్నగారు) భార్యకు భర్త-వీరి యెంగిలి పవిత్రమైనవిగా పరిగణింపబడినవి.

ఉచ్ఛిష్టమనగా నోటి ఎంగిలియేగాక వండిన గిన్నెలోనుండి యితరులు తినగా మిగిలినదికూడా ఉచ్ఛిష్ట మనబడును.

పూజ్యుడగు నారదుడు జన్మాంతరజ్ఞానము కలవాడు. ఆతడు పూర్వ జన్మమున శూద్రుడై యుండెను. అప్పుడాతడు

'ఉచ్ఛిష్టలేపా ననుమోదితో ద్విజైః।
సకృత్స్మభుఞ్జే తదపాస్త కిల్బిషః॥'

అనగా - చాతుర్మాస్యదీక్షలోనున్న విప్రోత్తము లొసంగిన వారి భుక్త శేషమును ఒక్కసారి యారగించెనట. దానిచే నాతని పాపములన్నియు పటాపంచలై పోయినవట. అందుచే పెద్దలెవ్వరైనను సరియే, వారి యిట్టి యుచ్ఛిష్టము ప్రసాదముగా పరిగ్రహించవచ్చునే యనరాదు. ఆ జన్మలో నారదుడు వారి వలన మంత్రోపదేశమునుకూడ బడసి వారికి శిష్యుడయ్యెను. ఆతడు శూద్రుడుకూడను. అట్టి వానికే ఆ ప్రసాదము స్వీకరించతగినది. అందరకునుకాదు. కావుననే 'ఆచార్యుల పుత్ర భార్యాదుల ఉచ్ఛిష్టము కూడదని' శాస్త్రము చెప్పుచున్నది.

'ఉచ్ఛిష్టాశన వర్జం ఆచార్య వదాచార్య పుత్రేవృత్తిః' అనగా ఆచార్య పుత్రుని పట్లను ఆచార్యుల యందున్నంత గౌరవ ప్రతిపత్తులను కలిగి యుండవలెను. కాని వారి యుచ్ఛిష్టము మాత్రము పనికిరాదు. అట్టి తరి యితరుల ఉచ్ఛిష్టము పనికిరాదని వేరుగ జెప్పవలెనా ?

భాగవతు డొకడు ఆచార్యుల ఉచ్ఛిష్టముకన్న యితర యే యెంగిలి తినినను ఆతనికి తీవ్రమైన ప్రాయశ్చిత్తమును శాస్త్రము విధించుచున్నది. సనత్కుమార సంహితలో 'నిర్మాల్యం భక్షయిత్వైవం ఉచ్ఛిష్ట మగు రోరపి మాసం పయో వ్రతీ భూత్వా । జపన్నష్టాక్షరం సదా బ్రహ్మకూర్చం తతః పీత్వా । ప్రాయశ్చిత్తీయతే నరః' అని చెప్పబడెను. ఇది భగవద్యామునాచార్యులవారి ఆగమ ప్రామాణ్య గ్రంథమున చూడదగును. "అనగా– ఆచార్యులు కాని వారి యెంగిలిని తినినచో ఒక నెల పాలను మాత్రమే త్రాగి నిరంతరముగా అష్టాక్షరీ మహామంత్రమును జపించవలెను. పిమ్మట బ్రహ్మకూర్చను త్రాగవలెను అని యున్నది. ఈ శ్లోకము నందలి గురు శబ్దమునకు ఆచార్యులుగాని తండ్రియనిగాని వ్యాఖ్యానము గావింపబడినది. గురు శబ్దమునకు ఉపాధ్యాయాదులర్థమైనను వారి యందలి యుచ్ఛిష్టమును తినవచ్చునని శాస్త్రమున గాన్పించదు. ఏదో యొకింత చదువు చెప్పినంత మాత్రమున వారి నాచార్యులని తలంచి వారి యెంగిలిని తినరాదు.

ఆచార్యులనగా–

'ఉపనీయ తు యశ్శిష్యం । వేదమధ్యాపయేద్ద్విజః
సకల్పం సరహస్యంచ । తమాచార్యం ప్రచక్షతే॥'

అనగా–ఉపనయన మొనరించి గాయత్రీ మంత్రము నుపదేశించి కల్ప, రహస్యార్థములతో వేదమును చెప్పినవాడే ఆచార్యుడనబడును. అంతియేగాని యితరుల నాచార్యులనుట అముఖ్యము. ఉపనయనమను గావించి ప్రణవాదినిమాత్ర ముపదేశించి యూరకుండువాడును

రహస్యములనబడు మోక్షసాధనములగు మంత్రి మంత్రార్థ ఉపాస నాదుల నుపదేశించు వాడును, ఆయా వేదభాగముల నెఱింగించువాడును ఆచార్యుడే యని ప్రమాణ బలముచే నంగీకరింపవలెను.

యాజ్ఞవల్క్య మహర్షి గుర్వాదుల లక్షణము నిట్లు చెప్పెను-

"సగురు ర్యః క్రియాః కృత్వా । వేద మస్మై ప్రయచ్ఛతి
ఉపనీయ తు తద్వేద మాచార్యః స ఉదాహృతః॥"

ఏక దేశ ముపాధ్యాయః...ఇత్యాదినా-

ఆయా వేదోక్త విధానములతో తత్తదధికారులకు వైదిక కర్మ లనుచేసి వేదము నుపదేశించు వాడాచార్యుడు. అందుకొంత భాగ మును మాత్ర ముపదేశించు వా డుపాధ్యాయుడు-మొదలుగా-

"ఏకాక్షర ప్రదాతార మాచార్యం యోఽవ మన్యతే"

అనగా వేదములోని ఒక్క అక్షరము (లేక ఓ మిత్యేకాక్షరం- అనుటచే ప్రణవమును మాత్రము) నుపదేశించువానిని ఆచార్యుడే- ఆతని నవమానించరాదు-అని చెప్పబడుటచే వేదములో నేకదేశము నే కాదు ఒక్క అక్షరమును చెప్పినను ఆచార్యుడే యని చెప్పబడు చున్నదే యన్నచో-నట్లుకాదు. ఆతనిని కూడా అనాదరించరాదని తెలుపుటకై చూపబడిన ఆచార్య ప్రతిపత్తి గాని ముఖ్యముకాదు.

నిరుక్తి మొదలగు ప్రమాణములను బట్టి యుక్తి శాస్త్రముల నుపదేశించువారును ద్రోణ కృపాదులవలె యాచార్యులనబడుచున్నారు గాన వానిని బట్టి యంతట నాశబ్దము ముఖ్యమే కావలెనని కొందరం దురు. కాని మొంగిలిని స్వీకరించుటకు తగిన ఆచార్యత్వము మంత్ర త్రయమును పరవిద్య నుపదేశించు వాని యందేగాని యన్యత్ర లేదు. ఇది శాస్త్ర శిష్టాచార మర్యాద.

కొందరు 'నారాయణైక నిష్ఠస్య యా యాప్రవృత్తి స్తద్వచనమ్.

... ... ... ... ... ... ... ... ... ... ...

తత్పాదాబ్జ్వతులం తీర్థం తదుచ్ఛిష్టం సుపావనం॥

అనగా - నారాయణుడే పరతత్త్వమని నమ్మియున్న భాగవతోత్తముడు చేయుపనులన్నియును భగవదారాధనయే. ఆయన పాద తీర్థము సాటిలేని పవిత్రద్రవ్యము. వారి యెంగిలి పరమపావన మని యున్నదే యన్నచో నదియును నారాయణ భక్తుని కొనియాడుటయే గాని తాత్త్వికముకాదు. అది విధియని భావింపబడరాదు.

ఉచ్ఛిష్టమనగా వండిన పాత్రనుండి యొకరు తినగా గిన్నెలో మిగిలియున్నదని చెప్పబడినదిగదా! అదియును సమంజసమే. కాబట్టియే శ్రాద్ధాంతమున 'అన్నశేషం కిం క్రియతామ్'ను ప్రశ్నయును 'ఇష్టైస్సహ భుజ్యతామ్' మ్మనుజవాబున్నూ ఫలించుచున్నవి. ఒకరు తినగా వంటగిన్నెలో మిగిలిన యన్నము యెంగిలి వలెనే పరిత్యజించవలసినదే. త్రు శేషమునట్లు భుక్తశిష్టమైనను పరిహరింపరాదని విధి యేర్పడినది. దానిని యిష్టబంధువులతో కలసి భుజించవలెను.

పాంచరాత్రాగమమున-

'నానివేద్య హరేః కిఞ్చి త్యమశ్నీయాత్తు పావనం'

శాస్త్రమున తినదగినదని చెప్పబడిన యే పదార్థమునైనను భగవంతునకు నివేదించకయే తినరాదు, అని చెప్పబడెను.

యజ్ఞశిష్టాశిన స్సన్తోముచ్యన్తే సర్వకిల్బిషైః ॥గీత 3వ అ

ఇది పథ్యము ఇది అపథ్యము అని చెప్పినచో అపథ్యమును విడిచి పథ్యమునే గ్రహించునటుల సాత్త్విక రాజస తామసాహారము ను స్పష్టముగా నిల్లు తెలుపుట రాజసతామసములను విడిచి సాత్త్వికాహారమునే సేవింతురను అభిప్రాయము.

## 11వ శ్లోకము

(49) ప్రయోజనము లేకయే యెవ్వడును చేయడను మాట సత్యమే. అయినను 5వ అధ్యాయమున 'సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి' నన్ను సకల ప్రాణిహితైక తత్పరుడ

నని యెఱింగి కర్మల నాచరించిన పరమశాంతిని బడయగలుగును. 'సుహృదారాధనాయహి । సర్వః ప్రియత తే' తన యోగక్షేమముల నారయు వారిని ప్రసన్నుని గావించుకొనుటకే ప్రతివాదును ప్రయత్నించునను నటుల యజ్ఞాదుల నాచరించుట కుద్యుక్తుడగుటయే ప్రయోజనము గాని దానికి వేరొక ఫలము నాశించరాదని తాత్పర్యము.

(50) విధిశబ్దమునకు ప్రజాపతియనియు నర్థముకలదు. అతడే సర్వయజ్ఞములకును ద్రష్టయని శాస్త్రమున్నది. కాని ప్రజాపతి చూచునని చెప్పుటచే ననుష్ఠానమున ఉపకారాతిశయము ఒకింతయును లేదు. కావున విధి శబ్దమున కిచ్చట ఆయాకర్మలను విధించు శాస్త్రమని యర్థము చెప్పబడినది.

యజ్ఞాదులన్నియును కేవల శాస్త్ర ప్రమాణము చేతనే సిద్ధించుచుండగా తిరిగి 'శాస్త్రదృష్టము'లని చెప్పనేల యనగా- శాస్త్రమున చెప్పబడిన దేశకాల ద్రవ్యక్రమాది నియమములలో నొక్కదానినైనను ఉల్లంఘింపరాదని తెలుపుటకే యని యెఱుంగవలెను.

13వ శ్లోకము

(51) శాస్త్రములో చేయుమని చెప్పబడినను తిరిగి దానినే పెద్దలచే నాజ్ఞాపింపబడి (యనుమోదింపబడి) చేయబడవలెననుచున్నారు.

(52) అన్నదానమును లేక మంత్రమును లేనిచో శాస్త్రములో చెప్పబడిన పద్ధతి నతిక్రమించుటచే 'విధి హీనమే' యగును గదా! ఇక నాశబ్దమును వాడనేల యున్నచో నిచ్చట శాస్త్ర మర్యాద నుల్లంఘించుట మాత్రమే చెప్పబడుటలేదు. ఇంకను చేయవలసిన వానిని కొన్నిటిని చేయకుండుట చెప్పబడుచున్నది. అది బ్రాహ్మణ - ఇత్యాది వాక్యముచే చెప్పబడుచున్నది.

(53) 'అసృష్టాన్నం' - అనగా-కర్మశాంతికై అన్నదానమును చేయకుండుట యని యర్థము సిద్ధించును. కాని -- లోభమధికముగా

నుండుటచే దక్షిణనే యీయనివాడు అన్నదానమును చేయడని చెప్ప వలెనా ? 'అదక్షిణం' అనుటచేతనే ఉపలక్షణముగా నన్నదానమును చేయడనియు సిద్ధించునే-'అసృష్టాన్నం' అని దేనిని తెలుపు ననగా- అది ధ్వనించు అర్థముకన్న దోషమధికముగా గల యొక యర్థవిశేషమును చెప్పవలెను. 'వ్యర్థం సదన్యత్ జ్ఞాపయతి' అనిగదా న్యాయము. కాబట్టి 'సృష్ట' మనగా యజ్ఞమునకై యేర్పడినదని యర్థము. అనగా- న్యాయముగా సంపాదింపబడిన ద్రవ్యము. అసృష్ట మనగా- అన్యాయార్జితము "నయజ్ఞార్థం ధనం శూద్రా ద్విప్రో భిక్షత ధర్మవిత్, యజమానో హి భిక్షిత్వా ప్రేత్య చణ్డాలతాం వ్రజేత్"-ధర్మము నెఱింగిన బ్రాహ్మణుడు తానుజేయు యజ్ఞమునకు శూద్రుని నుండి ధనమును యాచించి తేరాదు. అట్లు తెచ్చి యజ్ఞమును చేసినచో చనిపోయి చండాలుడై జన్మించును.

## 14వ శ్లోకము

(54) దేవతల యొక్కయు బ్రాహ్మణోత్తముల యొక్కయు ఆచార్యుల యొక్కయు సన్నిధిలో వారి వారికి తగునటుల శాస్త్రమున జెప్పబడిన ఆచారములను పాటించుటయే వారిని పూజించుట యని తెలియవలెను.

ఉదా- "ప్రశస్త మాఙ్గళ్య దేవతాయతన చతుష్పథాది ప్రదక్షిణ
మావర్తేత, మనసా వా తత్సమగ్రమ్॥

అనగా- సుప్రసిద్ధములును, మంగళప్రదములును నగు స్థానములు దేవాలయములు, నాలుగు వీథులును కలసిన స్థానములు మొదలగునవి గాన్పించినచో వానికి ప్రదక్షిణమును గావింపవలయును. లేదా అందులకవకాశము లేనిచో మానసికముగనైనను ప్రదక్షిణమును భావించవలెను.

శ్లో॥ "ప్రదక్షిణం ప్రవ్రజేద్విప్రాన్ । గా మశ్వత్థం హుతాశనమ్"

బ్రాహ్మణోత్తములకు ఆవునకు రావిచెట్టునకు అగ్నిహోత్రమునకు ప్రదక్షిణ మొనరించవలెను.

శ్లో॥ ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామన్తి యూన స్థ్సవిర ఆగతే।
ప్రత్యుత్థానా భివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే ॥

అల్పవయస్కునకు, వయస్సు చేతను విద్యచేతను తనకన్న పెద్దలు వచ్చినతోడనే (వాని) ప్రాణములు శరీరమును విడిచిలేచి పోవుట కుద్యమించును. కాని యీతడు వారి కెదురేగి నమస్కరించి నచో తిరిగి వానిని తమ తమ స్థానములయందు చేర్చును. కాబట్టి పెద్ద లేతెంచిన ఎదురేగి నమస్కరించవలెను.

"న హాయనై ర్నపలితై ర్నవిత్తైర్నచ బన్ధుభిః
ఋషయశ్చక్రిరే ధర్మం యోఽనూచాన స్సనో మహాన్ ॥

వయస్సు చేతనుగాని పండిన తలచేతనుగాని ధనాధిక్యము చేతనుగాని గొప్ప బంధువులుండుట చేతనుగాని పెద్దతనముగా భావించరాదు. ఆకారణములను పురస్కరించుకొని ఋషు లెవ్వరిని యాదరించలేదు. సాంగవేదాధ్యయనసంపన్నులగు సదాచారులే మనకు పెద్దలు.

(55) ఇది బ్రహ్మచర్యమునకు లక్షణము.

'స్మరణం కీర్తనం కేళిః ।
ప్రేక్షణం గుహ్య భాషణమ్॥'

అనగా- స్త్రీలను మనస్సులో తలంచుట, వారి గుణములను ప్రశంసించుట, వారితో నాడుట, వారిని భోగదృష్టితో చూచుట, వారితో రహస్య భాషణముల గావించుట మొదలగు కర్మలన్నియును బ్రహ్మచర్యమునకు భంజకములేగాని వానినన్నిటిని విడువవలెను.

### 15వ శ్లోకము

(56) హృదయమున నాటు కఠినోక్తులు పలుకుట, నేరముల నారోపించి యెత్తిపొడుచుట మొదలైనవి.

లేక భయాదులకు కారణము కాని మాటలు.

(57) చూచిన దానిని చూచినట్లు వినువారికి హితమగునట్లు మాటలను పలుకుట.

(58) ప్రియమనగా- స్వాగత వాక్యములు. పరులు గ్రావించు ధర్మముల నారోపించుచు పలుకుట మొదలగునవి హితమని చెప్పుటలో తాత్పర్యము. కూడని నీచులనుస్తుతించుట శాస్త్రమునిషేధించుచున్నది గాన నట్టివి కాకుండుటకై ఆప్రియోక్తులు హితములై యుండవలెనని చెప్పబడెను.

అనగా- ఆ యుక్తులు పురుషార్థములో పర్యవసించవలెను.

### 16వ శ్లోకము

(59) శ్లోకమునందలి 'మనః ప్రసాద' శబ్దమునకు కాలుష్యము లేకుండుట యని యర్థము. మనస్సునకు కాలుష్య మనగా పరుల కనిష్టమునే తలంచుట. సౌమ్యత్వమనగా పరులకు హితమునే కోరుట.

ఈ మనస్సౌమ్యత్వమునకు ఫలము ఆకార సౌమ్యత్వము. ఆకారమునకు సౌమ్యత్వ మనగా-

శ్లో॥ వసతి హృది సనాతనే చ తస్మిన్
భవతి పుమాన్ జగతోఽస్య సౌమ్యరూపః॥

పవిత్ర హృదయమున పరమేశ్వరు డతి ప్రీతితో వసించును. అట్లు వసించిన హృదయము గలవాడు ప్రపంచమునకు మిక్కిలి సౌమ్య రూపముతో గాన్పించును. అనగా - ఆత డందరకును సాత్వికుడుగా గోచరించును. ఇందుల కుదాహరణము-

శ్లో॥ క్షితి రస మతిరమ్య మాత్మనోఽన్తః।
కథయతి చారుతయైవ రసాల పోతః

భూమియందు పైకి గాన్పించక లోలోననే యుండు సారమును అందు మొలచి పెరిగియున్న తియ్య మామిడిగున్నయే తన లావణ్యా మూలముగ పై వారి కెఱింగించును. ఆకార సౌమ్యత్వమును బట్టి మన స్సౌమ్యత్వము నూహించి తెలుసుకొనవచ్చును.

(60) ఆత్మవినిగ్రహ మనగా-

కూడని వానిని తలంచకుండుటయే గాక ధ్యానించవలసిన దాని యం దా మనస్సును లగింప జేయుటయునని యర్థము చెప్పబడినది.

(61) భావమనగా- అభిప్రాయము.

దానికి శుద్ధి యనగా - సకలమగు నితర తలంపుల నన్నిటిని విడచిపెట్టుట.

దీనిని బట్టి పరకాంతల విషయమై మనస్సున కూడా దుస్సంకల్ప ములు బొత్తుగా కూడదని యర్థము సూచింపబడినది.

ఇచ్చట తపస్సు శారీరకము, మానసికము, వాచికమని మూడు విధములుగా విభజించుట ఆ తపస్సున కామూడును ప్రధానమని యెఱింగించుట కే.

## 19 వ శ్లోకము

(62) మూఢానాం- గ్రాహః- అని విగ్రహవాక్యము. మూఢు లనగా- హితము కానిదానిని హిత మనుకొనువారు.

గ్రాహ మనగా- పట్టుదల.

(63) ఇచ్చట 'మొదలగు' అనుటచే శాస్త్రముచే నిషేధింప బడుటయున్ను చేర్చబడవలెను.

శ్లో॥ అశక్యాని దురన్తాని సమవ్యయ ఫలాని చ ।
అసాధ్యాని చ వస్తూని నారభేత విచక్షణః ॥

చేయశక్యముకానివి, చేసిన వెనుక దుఃఖమును బుట్టించునవి దాని కగు ఖర్చు దానివలన కలుగు ఫలము సమముగ నున్నవి. దుస్సాధ్య మైనవి యగు పనులను బుద్ధిమంతు డారంభించకూడదు.

(64) అల్పపరిశ్రమతో తనబలమునకు తగినట్లు చేయవలెనే గాని తనబలమునకు మించిన శ్రమకరమగు కర్మలను చేయరాదు.

శ్లో॥ దేశం కాలం తథాత్మానం । ద్రవ్యాద్రవ్యం ప్రయోజనమ్ ।
ఉపపత్తి మవస్థాం చ జ్ఞాత్వా శౌచం సమాచరేత్ ॥

దేశమును బట్టియు కాలమును బట్టియు తనను బట్టియు వస్తుపరిస్థితినిబట్టియు, దానివలన కలుగు ఫలమునుబట్టియు చేయుటకు తగిన పరికరములను బట్టియు, తన స్థితినిబట్టియు (వయఃస్థితిని) శౌచము నాచరించవలెను- అని ధర్మశాస్త్రము తెలుపుచున్నది.

20వ శ్లోకము

(65) ఇచ్చట దేశకాల శబ్దములు దానమును చేయుటకు తగినదిగా శాస్త్రమున చెప్పబడిన పుణ్యదేశము, పుణ్యకాలము యిచ్చట చెప్పబడినది.

(66) పాత్ర విషయమై-

శ్లో॥ న విద్యయా కేవలయా జన్మనా వాపి పాత్రతా ।
యస్యవృత్త మిమే చోక్తే తద్ధిపాత్రం ప్రచక్షతే ॥

కేవలము చదువుకొనిన వాడనిగాని ఉత్తమ వంశమున బుట్టిన వాడనిగాని దానమునకు తగినవాడని భావించరాదు. ఇవి రెండును ఉండి సదాచారముకూడ నున్నవాడే పాత్రమని భావించవలెను.

21వ శ్లోకము

(67) పూర్వకృత ప్రత్యుపకారమును ఉద్దేశించిగాని ముందెప్పుడైనను ప్రత్యుపకారమున కుపకరించునని తలంచిగాని-

(68) దానమొసంగు వస్తువు మంచిదైనచో దానిని యిచ్చునపుడు 'అయ్యో! మంచిదాని నిచ్చివేయుచున్నామే' యని తలంచువాడు మంచి వస్తువును తనకై యిడుకొని చెడ్డదాని నితరుల కిచ్చును.

ఆ యభిప్రాయముతో చెప్పుచున్నారు. లేక - శ్రద్ధలేకయే అనాదరముగా నొసంగుటయు నకల్యాణమగును. అదియే పరిక్లిష్ట శబ్దమున కర్థము.

22వ శ్లోకము

(69) మ్లేచ్ఛ దేశములు. అపవిత్ర ప్రదేశములు.

(70) రాత్రి - సంధ్య - మొదలగు కాలము.

(71, 72) అగౌరవము_అనాదరము.

ఈ రెండింటికిని మూలము-దానమును తీసుకొనువారికన్న తాను గొప్పవాడనను దురభిమానమున్ను శాస్త్రమునందు ప్రామాణ్య బుద్ధి తక్కువగా నుండుటచే పరలోక మున్నదా? యనియే సందేహ ముండుటయును-

23వ శ్లోకము

(74) ఓమ్- తత్ - సత్ -

అను నీ మూడు పదములున్ను సాక్షాత్తుగా పరమాత్మ నామము లని శ్రుతియే చెప్పుచున్నది.

ఓమ్- 'తత్తే పదం సఙ్గ్రహేణ బ్రవీమి ఓ మిత్యే తత్'

(కఠ. 2_15)

'ఓమ్' అను నీ పదము సంగ్రహముగా పరమ పురుషవాచకము.

తత్ - 'తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి'

తత్_ పరమాత్మ 'నేను బహు రూపు డనుకావలెను. అందు లకై బహుభంగుల బుట్టుదును' అని సంకల్పించెను.

ఏకోనైక స్సవః కః కిమ్ య త్తత్పద మను త్తమమ్॥

అను శ్రీ విష్ణు సహస్రనామములలో 'తత్'అని యొకనామము. 'స్వజ్ఞానభక్తిం భక్తానాం తనోతీతి తదుచ్యతే'తన భక్తులకు జ్ఞానమును భక్తిని విస్తరింప జేయువాడు.

సత్ - సన్మూలాస్సో మ్యేమాః సర్వాః ప్రజాః
సదాయతనాః సత్ప్రతిష్ఠాః ॥ (ఛాం. 6. 8-6)

ఈ సజీవశరీరము లన్నియును పరమాత్మ నుండి బుట్టుచున్నవి. పరమాత్మ యందాధారపడి యున్నవి. ప్రలయమున పరమాత్మయందే విలీనమగుచున్నవి. శాస్త్రముచే ముఖ్యముగా జెప్పబడి పరమాత్మ వాచకపదములను ఉపాసకులు నిర్దుష్టగా పలుకుటకై చెప్పబడుచున్నవి.

కర్మ లోపమున్నను పరం బ్రహ్మ వాచకములగు ఓమ్- తత్ - సత్, అను పదములను ఉపయోగించుట వలన ఆ లోపము తీరి గుణ వంతమగును.

చేయబడుచున్న వేదోక్త పుణ్యకర్మకు మరియొక లౌకిక కర్మచే గాని లౌకిక సంభాషణచేగాని, నిద్రచేగాని, పరాకుచేగాని విఘ్నము కలిగినచో ఆ దోషములను బాపుకొనుటకు పెద్దలు 'ఓం తత్సత్' అని వాడుదురు. దానిచే నా దోషములు పరిహరింపబడును. కావుననే గీతా పారాయణచేయువారు అధ్యాయారంభమందును సమాప్తి యందును అంతటను "ఓం తత్ సత్"అని యుచ్చరించు ఆచారముకలదు.

"ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్మృతః" అను నీ పూర్వార్థము- ఈ మూడు శబ్దములును సాక్షాత్పరబ్రహ్మకు పేరులు అని చెప్పుటకై ఉద్దేశింపబడలేదు. అది యథార్థమే యైనను అచ్చట దానిని చెప్పుటలో అభిప్రాయము లేదు. అటులైనచో నీయధ్యాయమున దీనికి ముందు దీనికనుగుణమైన ప్రశ్న యుండవలసియుండును. అది కాన్పించదు గదా! ఉత్తరార్థమున 'బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః' అని చెప్పుట కూడా దీనికి విరుద్ధమగును. (ఆ అన్వయము కుదురనేరదు). కాబట్టి వేద శబ్దముచే ఉపలక్షణగా వైదిక, యజ్ఞాదికము మూడు విధములుగా చెప్పబడుచున్నవని గ్రహించవలెను.

విహితాః- నిర్మించబడినవి.

(76) వేదము నిర్మింపబడుట యెట్లు ? 'అనాది నిధనా హ్యేషా వాగుత్సృష్టా స్వయం భువా' అది నిత్యమని గదా ప్రమాణములు తెలుపుచున్నవి. కాబట్టి నిర్మింపబడుట యనగా పూర్వమున్న క్రమముగ ప్రవర్తింపజేయబడుటయే యర్థము. 'యోవై వేదాంశ్చప్రహిణోతి తస్మై' బ్రహ్మను సృష్టించి యాతనికి పూర్వ వర్ణక్రమము చెడకుండ సృష్టివ్యాపారమును సాగించుటకొఱకు వానిచే బ్రహ్మ కుపదేశించెనని వేదమే చెప్పుచున్నదికదా!

24వ శ్లోకము

(77) "సతతం"- అనగా నెల్లప్పుడును- అనుటచే-

'వసన్తే వసన్తే జ్యోతిషా యజేత" అనగా ప్రతి వసంతర్తువు నందును జ్యోతిష్టోమ యాగమును చేయవలెననియు, 'శరది వాజపేయేన యజేత' అనగా శరదృతువులో వాజపేయమును చేయవలెనని యును.

ఆయా క్రియా కాలములు శాస్త్రమున విధింపబడియున్నవి. కాని యే క్రియలైనను సరియే ప్రణవము నుచ్చరించి యాచరింపబడినచో నట్టి కాలనియమము లేకున్నను ఫలప్రదములగునని యీ శబ్దము సూచించుచున్నది.

స్వర్గమునకై యాచరింపబడు కర్మలైనను ఆ ఫలమును గోరక మోక్షమునకై యాచరించినను ప్రణవముతో నన్వయించియే యాచరించవలెను.

(78) యజ్ఞాదులు ఓంకారోచ్చారణ పూర్వకముగానే చేయబడవలెననుట ఆయా కర్మలను విధించు శాస్త్రములచేతనే సిద్ధమగుచున్నవి. ఇట్లు యజ్ఞములు "ఓమ్" అని యుచ్చరించి చేయుటకు ప్రయోజనమేమి యనగా - వేదాంతజ్ఞానము కలవారు పరమాత్మ సర్వాంతర్యామి యని యెఱుంగుదురు గాన యీ కర్మలాతని యారా

ధన రూపములని యనుసంధించునట్లగును. దానిచే నవి బంధహేతు వులుగాక మోక్షహేతువు లగును. ఈ విషయమునే శౌనక మహాముని 'హరిమేవ స్మరేన్నిత్యం। కర్మ పూర్వాపరేషు చ' అనగా వైదిక కర్మ లాచరించుటకు ముందును వెనుకను నిరంతరము శ్రీహరిని తలంచ వలెనని. వేదాంతాధ్యయనము లేనివారైనను ప్రణవోచ్చారణపూర్వ కముగా కర్మల నారంభించినచో సమస్త సన్మంగళములును వారి కా కర్మల మూలమున చేకూరును.

ఇట్లు ప్రణవమునకు సమస్త వైదికములతో నన్వయము సిద్ధించినది.

(79) ఈశ్లోకమున వేదవాచక శబ్దము లేకున్న వెనుకటి శ్లోకమున 'బ్రాహ్మణా స్తేన వేదాశ్చ' అని యుండుట చేతను-

"ఓమో వేదాదౌ స్వరః ప్రోక్తో" అనియు, "బ్రహ్మణః ప్రణవం కుర్యా దాదావన్తే చ సర్వదా స్రవత్యనోఙ్కృతం పూర్వం పరస్తాత్తు విశీర్యతే".

అనగా- ఇచ్చట బ్రహ్మశబ్దమునకు వేదము అర్థము. 'సర్వదా' అనగా వేదము నెప్పు డారంభించినను ఎప్పుడు ముగించినను అని యర్థమును చెప్పవలెను.

వేదము నెప్పు డుచ్చరించినను ఎప్పుడు ముగించినను దానికి ముందును వెనుకను కూడ "ఓమ్" అని ఉచ్చరించి తీరవలెను.

"స్రవత్యనోఙ్కృతం పూర్వం" అనగా ముం దుచ్చరించనిచో పరమ తాత్పర్యమునకు విషయమగు ప్రధానార్థమును బోధించదు. "పరస్తాత్తు విశీర్యతే" చివర ప్రణవము నుచ్చరించనిచో ముఖ్యమగు నర్థమును బోధించకుండుటయే గాక మిక్కిలి ఉపయోగించని యసంగతార్థమును బోధించును.

(80) ప్రణవముతో నన్వయము స్వర్గసాధనకర్మలకును, మోక్ష

సాధన కర్మలకును సమానమే యని దాని లక్షణము చెప్పబడెను. మోక్షసాధనమగు కర్మలకు తచ్ఛబ్దాన్వయమును త్రివర్గ సాధన కర్మలకు సచ్ఛబ్దాన్వయమును విశేషించి వానికి లక్షణముగా చెప్పబడుచున్నది. ఈ విషయమును 18వ అధ్యాయావతారికలో చూడుడు.

(81) తచ్ఛబ్దము బ్రహ్మ నామమని సిద్ధించిన గదా ! దానిచే 'తత్ప్రాప్తి సాధనముగా'నని లక్షణమును జెప్పవచ్చును. అది యెట్లు సిద్ధించునది అనగా చెప్పుచున్నారు-

సహస్రనామ స్తోత్ర ప్రారంభమున-

'యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః'

అనియు- అవసానమున-

'నామ్నాం సహస్రం దివ్యానాం'

అనియు నుండుటచే 'యత్తదాది' శబ్దములు సర్వనామములుగా లోకమున ప్రసిద్ధియున్నను విశేషించి సాక్షాత్తుగా పరబ్రహ్మను పేరగుట ప్రసిద్ధము.

(82) వేదాధ్యయనముతో తచ్ఛబ్దాన్వయము చెప్పబడకున్నను ఉపలక్షణముగా నది సంగ్రహింపబడినది. కాని బ్రాహ్మణ శబ్ద నిర్దిష్టమగు త్రైవర్ణికులతో మోక్షసాధనమగు తచ్ఛబ్దాన్వయము కాన్పించదు. కావున దానిని చూపుచున్నారు. 'త్రైవర్ణికులకును' అను గ్రంథముతో 'మోక్షకాంక్షిభిః క్రియన్తే' అనుటచే పరంపరగా త్రైవర్ణికాన్వయము సూచింపబడినదని భావము.

28వ శ్లోకము

23వ శ్లోకమున-

ఓమ్- తత్ - సత్ : అను 3 శబ్దములును ప్రత్యేక ప్రత్యేకముగా వేదములతోను - వేదము ననుసంధించి త్రైవర్ణికులతోను - వేదోక్తమగు కర్మలతోను, అన్వయించునని చెప్పబడినది.

24 వ శ్లోకమున - 'ఓమ్' అను ప్రణవము త్రైవర్ణికులు, వేదములు, యజ్ఞములు అను మూడింటితోను అన్వయించు ప్రకారము చెప్పబడినది.

5వ శ్లోకమున - తచ్ఛబ్దము ఆ మూడింటితోను అన్వయించు ప్రకారము చెప్పబడినది.

26వ శ్లోకమున-సచ్ఛబ్దము యొక్క ఉత్పత్తియు దాని ప్రయోగమున్ను చెప్పబడినవి.

27 వ శ్లోకమున- సచ్ఛబ్దము ఆ మూడింటితోను అన్వయించు ప్రకారము చెప్పబడినది.

28 వ శ్లోకమున - ఆ సచ్ఛబ్దము యొక్క ఉత్పత్తియు దాని ప్రయోగము, దానికి ఫలమును చెప్పబడినవి.

(84) గీతార్థ సంగ్రహము

21వ శ్లో॥ అశాస్త్ర మాసురం కృత్స్నం
శాస్త్రీయం గుణతః పృథక్
లక్షణం శాస్త్రసిద్ధస్య
త్రిధా స_ప్తదశోదితమ్ ॥

తాత్పర్యము :-శాస్త్రమున విధింపబడని కర్మలన్నియును ఆసురములనియు, అందువలన వాని నాచరించుట నిష్ప్రయోజన మనియు, శాస్త్రములో చెప్పబడిన కర్మలే సాత్త్వికములు, రాజసములు, తామసములు అని మూడు విధములనియు, శాస్త్ర ప్రసిద్ధమైన కర్మలు 'ఓమ్ తత్ సత్' అను త్రివిధ లక్షణము కలవనియు పదినేడవ అధ్యాయన చెప్పబడినది.

# శ్రీ భగవద్గీతా-అష్టాదశోఽధ్యాయః

## మోక్షసన్న్యాసయోగః

—//—

అవతారిక. 1

కడచిన రెండధ్యాయములందు వైదిక మగు యజ్ఞతపోదానాది కర్మమే మోక్షసాధనమును నైహికసుఖసాధనమును అగునుగాని మఱి యొకకర్మ మట్లుకానేరదనియు వైదికమగు కర్మమునకు సామాన్యలక్షణము 'ఓమ్'శబ్ద మైన ప్రణవముతో అన్వయమే యనియు, మోక్ష సాధన మగు కర్మమునకు 'తత్' శబ్ద ప్రయోగమువలనను నిహలోక సమృద్ధి సాధనమగు కర్మమునకు 'సత్' శబ్దప్రయోగమువలనను నీరెంటికి భేద మెఱుఁగఁదగినదనియు, యజ్ఞాదికర్మము మోక్షసాధనము కావలయునేని వానిని ఫలాభిసంధిరహితముగ నాచరింపవలయుననియు, అట్టి కర్మమునందుఁ బ్రవృత్తి సత్త్వగుణము వృద్ధిఁబొందుటవలనఁ గలుగుననియు, సత్త్వవృద్ధి సాత్త్వికాహార సేవవలన జనించు ననియుఁ జెప్పఁబడినవి.

ఇప్పు డీయధ్యాయమునందుఁ జెప్పఁబడువిషయము లెవ్వియనిన,

1. మోక్షసాధనములుగా నిరూపింపఁబడిన త్యాగ సన్న్యాసములు రెండును ఒక్కటియే యనియు,

2. త్యాగముయొక్క స్వరూపమును,

3. పురుషుఁడు తా నాచరించు సమస్త కర్మములకును భగవంతుఁ డగు సర్వేశ్వరుఁడే కర్త యని అనుసంధించుటయు,

4. సత్త్వ రజస్తమో గుణములయొక్క కార్యములను వర్ణించుటచేత సత్త్వగుణమే అవశ్యముగా ఉపాదేయమగునని చెప్పుటయు,

5. తమతమ వర్ణ ధర్మమునకుఁ దగినట్లుగాను పరమపురుషారాధన రూపముగాను జేయఁబడు కర్మములే పరమపురుష ప్రాప్తిని గలుగఁజేయు ప్రకారమును,

6. ఈగీతాశాస్త్ర మంతటికిని భక్తియోగమే సారార్థమనియు; ఇవి యన్నియుఁ బ్రతిపాదింపఁబడుచున్నవి.

ఈ యధ్యాయారంభమునం దర్జునుఁడు త్యాగసన్న్యాసములు రెండును నొక్కటియా లేక భిన్నములా యను సంశయమునందు తత్త్వమును నిర్ణయించుటకును, వానిస్వరూప మిట్టిదని నిర్ణయించుటకును ప్రశ్న చేయుచున్నాఁడు.

అర్జున ఉవాచ

శ్లో. సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్
త్యాగస్యచ హృషీకేశ పృథ క్కేశినిషూదన ॥

టీ. హృషీకేశ=ఇంద్రియ నియామకుఁడును, కేశినిషూదన=కేశి సంహారకుఁడును, మహా బాహో = భుజబలము గలవాఁడును అగు శ్రీకృష్ణా,సన్న్యాసస్య=సన్న్యాసముయొక్కయు, త్యాగస్యచ=త్యాగముయొక్కయును, తత్త్వం=కలరూపును, పృథక్=వేఱువేఱుగా, వేదితుం=తెలిసికొనుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. శ్రీకృష్ణా, ఇంద్రియ నియామకా, కేశిసంహారకా, మహా భుజబలకలితా, త్యాగసన్న్యాసములు రెండును *'నకర్మణా నప్రజయా

*'న కర్మణా...ఆనశుః। పరేణనాకం నిహితం గుహాయాం విరాజతే యద్యతయో విశన్తి ॥౨౧॥ వేదాన్త...సర్వే' ॥౨౨॥ అర్థము—నకర్మణా...యత్ = ఏ అమృతత్వమును, యతయః ప్రాప్నువన్తి=యతులు పొందుచున్నారో, యచ్చ=ఏ యమృతత్వమును, నాకస్య ఉపరి గుహాయాం=భగవల్లోకమునకుమీఁద పరమాకాశమందు, నిహితం=ఉంపఁబడి, రాజ తే=ప్రకాశించుచున్నదో, తత్ అమృతత్వం=ఆ యమృతత్వము, న కర్మణా...ధనేన=కర్మప్రజాధనములచేత లభింపదు. (అయినను 'సన్న్యాసస్త్యాగ ఇత్యుక్తః శరణాగతి రిత్యపి' అన్నట్లు భగవచ్చరణారవిందశరణవరణము అనెడి) త్యాగేన=త్యాగముచేతనే, ఏకే=కొందఱు, దానిని ప్రాపించిరని యర్థము. భక్తినిష్ఠులకు సైతము భక్త్యంగముగాను ప్రపన్నులకు ప్రధానముగాను ప్రపత్తి కావలసియున్నది. మఱి 'తస్యచ వశీకరణం తచ్ఛరణాగతిరేవ' 'ఏతేషాం

ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః... వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థా స్సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః। తే బ్రహ్మలోకేతు పరాన్త కాలే పరామృ తాత్పరి ముచ్యన్తి సర్వే' (తై. నా. ౧౦-౨౧-౨౨.) ఇత్యాదులందు మోక్షసాధనములుగా విధింపఁబడియున్నవి గదా. ఈ సన్న్యాసమునకును త్యాగమునకును గల యథార్థమైన స్వరూపమును వేఱువేఱ విశదముగా నేను తెలియఁగోరెదను- అనఁగా, ఈ సన్న్యాస త్యాగశబ్దములు భిన్నార్థముగలవియా ? లేక ఏకార్థముగలవియా ! భిన్నార్థము గలవైనచో వాని స్వరూపమును వేఱు వేఱ ఎఱుఁగఁగోరెదను. అవి యేకమైనను వాని స్వరూపమును దెలుపవలయును అని యభిప్రాయము.

అవ. ఈ సన్న్యాసత్యాగముయొక్క స్వరూప మొక్కటియే యనియు ఆస్వరూప మిట్టిదనియును నిరూపించుటకు మొదట *వాది యొక్క విప్రతిపత్తిని జూపుచు శ్రీభగవాను లిట్లు చెప్పుచున్నారు.

శ్రీ భగవా నువాచ :

శ్లో. కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయోవిదుః
సర్వకర్మ ఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః ॥ 2

---

సంసారివిమోచన భగవత్ప్రప త్తి మన్తరేణ నోపపద్యతే' అని చెప్పఁబడియున్నది. కావున నర్థమిదియె యగును. యత యః=సన్న్యాసులు-యమము మొదలగునవి గలవారనుట, వేదాన్త ... తార్థాః=వేదాంతమువలన పుట్టినజ్ఞానముచేత చక్కఁగా నిశ్చయింపఁబడిన తత్త్వహితపురుషార్థములు గలవారు- తత్త్వాదులను వేదాంతజ్ఞానముచేత చక్కఁగా నిశ్చయించుకొన్నవా రనుట, సన్న్యాసయోగాత్=సన్న్యాస మనెడి ప్రపత్తిచేత, శుద్ధసత్త్వాః=భక్తికి విరోధు లగు పాపములెల్ల నిరసింపఁబడుటచేత నిర్మలమైన అంతఃకరణము గలవారై, ఉపాయము ననుష్ఠించినవారునై, పరాన్తకాలే= కడపటిదగు దేహవియోగకాలమందు, బ్రహ్మలోకే=భగవల్లోకమందు, పర అమృతాత్=ఉత్కృష్టుఁడైన అసంసారివలన- అనఁగా పరమాత్మునిఁ బొంది, సర్వే పరిముచ్యన్తి=అందఱును బంధమునుండి విడివడుచున్నా రని యర్థము.

* ఒక విషయమునందు వాదికి సందేహముకలుగుటకుఁ గారణము వానికి దానియందుఁగల విప్రతిపత్తి (తప్పుగా గ్రహించుట- అనఁగా ఒకటికొకటి విరుద్ధములయిన

టీ. (కేచన) కవయః=(కొందఱు) విద్వాంసులు, కామ్యానాం=ఫలమునుగోరి చేయఁబడు, కర్మణాం=అశ్వమేధాది కర్మములయొక్క, న్యాసం=(స్వరూపముతో)త్యజించుటను,సన్న్యాసం-సన్న్యాసమని,విదుః=తెలియుదురు, (కేచిత్) విచక్షణాః=మఱికొందఱు విద్వాంసులు, సర్వకర్మఫలత్యాగం=(నిత్యనైమిత్తిక కామ్యాది) సమస్తకర్మములయొక్క ఫలములను విడిచిపెట్టుటయె, త్యాగం=త్యాగశబ్దార్థముగా,ప్రాహుః=చెప్పుదురు.

4

తా. *కొందఱు విద్వాంసులు అశ్వమేధాది కామ్యకర్మములను స్వరూపముతోనే త్యజించుట సన్న్యాసశబ్దార్థ మని తెలియుదురు. మఱి కొందఱు విద్వాంసులు నిత్యనైమిత్తికకామ్యము లగు సమస్తకర్మముల ననుష్ఠించుచు వానిఫలమును మాత్రము త్యజించుటయె మోక్షశాస్త్రములందు త్యాగశబ్దార్థమని పలుకుదురు. శాస్త్రములు త్యజింపుమని చెప్పుట దేనిని- కామ్యకర్మముల స్వరూపమునా? లేక సర్వకర్మముల ఫలమునా? అని యిచట వివాదము. ఈ వివాదమునే భగవంతుఁడు తెలుపుచు మొదటిదానిని విడుచుటయందు సన్న్యాస శబ్దమును రెండవ దానిని విడుచుటయందు త్యాగశబ్దమును ప్రయోగించిరి. ఇట్లు రెండు శబ్దములును "విడుచుట" యనునర్థముననే భగవంతుఁడు ప్రయోగించుటచే రెండును ఏకార్థములుగానే యతఁ డంగీకరించియుండవలయునని తెలియుచున్నది. (మరియు నీరెండు శబ్దములను గురించి తన నిర్ణయము చెప్పునప్పుడు ఈరెండును వేఱు వేరైనయెడల వేఱువేఱు శబ్దములను ప్రయోగించి యుండునుగదా. అట్లుకాక) "నిశ్చయం శృణు మే తత్ర

---

యభిప్రాయములను గలిగియుండుట) యగును. కనుక ఆ విప్రతిపత్తిని ముందు తెలిపి సందేహమును తొలగించి పిదప న్యాయమును గొని యావిషయమును నిర్ణయింపవలయును. ఇందులకై ముందు వాదవిప్రతిపత్తిని దెలుపుచున్నా రని తెలియునది.

* ఇందు కొందఱు స్వరూపత్యాగము చెప్పుటచేతను కొందఱు ఫలత్యాగము చెప్పుటచేతను విప్రతిపత్తి తెలియునది.

త్యాగే భరతసత్తమ" (గీ.౧౮-౪.) అని నిర్ణయము చెప్పుచో రెంటి కిని త్యాగశబ్ద మొక్కటియె ప్రయోగించిరి. (కనుక రెండును ఒక్క టియే కావలయును.) మఱియు "నియతస్యతు సన్న్యాసః కర్మణో నోప పద్యతే। మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః" (గీ. ౧౮-౭) "అనిష్టమిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణఃఫలమ్। భవత్యత్యాగినాం ప్రేత్య నతు సన్న్యాసినాం క్వచిత్" (గీ.౧౮-౧౨) (అనుచో 'కర్మణః సన్న్యాసః - తస్యపరిత్యాగః') అని రెంటిని పరస్పరము పర్యాయము లనుట తెలిపిరి. ('అత్యాగినాం భవతి' 'త్యజింపనివారికి కలుగును' అని చెప్పి దీనికి వ్యతిరేకముగా 'త్యాగినాం నభవతి' 'త్యజించువారికిఁ గలు గదు' అని చెప్పఁదగుచో 'త్యాగినామ్' అనుటకు పర్యాయముగా సన్న్యాసినామ్' అని ప్రయోగించిరి) కనుక ఈరెండును ఏకార్థములుగా భగవంతుఁ డంగీకరించినట్లు నిశ్చయ మగుచున్నది.

శ్లో॥ త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్య మితి చాపరే ॥ 3

టీ. ఏకే మనీషిణః=కొందఱు బుద్ధిమంతులు, దోషవత్=రాగా దిదోషములవలె (లేక) రాగహింసాదిదోషయుక్తమై బంధమును గలు గఁజేయున దగుటచే, కర్మ = యజ్ఞాదిసమస్త వైదిక కర్మము, త్యాజ్య మితి=విడువఁదగినదనియు, అపరేచ = మఱికొందఱు పండితులు, యజ్ఞ దానతపఃకర్మ=యజ్ఞము దానము తపస్సు అనెడి కర్మము, నత్యాజ్య మితి=విడువఁదగనిదనియు, ప్రాహుః=చెప్పుచున్నారు.

తా. కపిలసిద్ధాంతమువారును వారిమతము ననుసరించు మఱి కొందఱు వైదికులును యజ్ఞాది సమస్త కర్మములు రాగాది దోష యుక్తములై బంధహేతువు లగుటవలన ముముక్షువులచే త్యజింపఁదగిన వని చెప్పుదురు. *మఱికొందఱు పండితులు యజ్ఞాదికము లగు కర్మ

*ఇందు కొందఱు దోషయుక్తమనియుఁ గొందఱు అట్లు కాదనియు జెప్పు టచే విప్రతిపత్తి తెలియుచున్నది.

ములు త్యాజ్యములు కావని పలుకుదురు. 5.

శ్లో. నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః॥ 4

టీ. భరతసత్తమ = భరతశ్రేష్ఠుఁడా, తత్ర = పూర్వోక్తరీతిగా సందిగ్ధమైన, త్యాగే = త్యాగవిషయమునందు, మే-మత్తః=నావలన, నిశ్చయం=నిర్ణయమును, శృణు = వినుము, పురుషవ్యాఘ్రః= పురుష శ్రేష్ఠుఁడా, త్యాగః=త్యాగము, త్రివిధః = (ఫల త్యాగమనియు కర్మ త్యాగమనియు కర్తృత్వత్యాగమనియు) మూఁడు విధములు గలదిగా, సంప్రకీర్తితః హి=చెప్పఁబడి యున్నదిగదా.

తా. భరతసత్తమా, వాదులచే పరస్పర విరుద్ధాభిప్రాయములతో గ్రహింపఁబడు త్యాగవిషయమునందుఁ గల నిశ్చయమును నావలన వినుము. అర్జునా, *ఆత్యాగము, వైదికములగు కర్మములు అనుష్ఠింపఁబడుచుండఁగానే ఆకర్మములయొక్క ఫలత్యాగమనియు కర్మ త్యాగమనియు కర్తృత్వత్యాగమనియు మూఁడువిధములై యుండునని 'మయిసర్వాణికర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా। నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః' అని చెప్పఁబడియున్నది. "కర్మముల 6
వలనఁ గలిగెడి స్వర్గాదిఫలములు నాకుఁ గావు"అని ఫలత్యాగము. "నా యొక్క ఫలమునకు సాధనముగా నాదైనయీకర్మము" అని కర్మము

---

*కర్మత్యాగముచే సమస్తకర్మములు భగవదాజ్ఞారూపము లగుటచే భగవత్ప్రీతి కొఱకు నాచరింపవలసినవని ముముక్షువు తలంపవలయునని భావము. కర్తృత్వత్యాగ మనఁగా తనకర్తృత్వము భగవదధీన మనియు సమస్త కర్మములు భగవంతుని యను మతిచే చేయఁబడుచున్న వనియు అనుసంధానము చేయుటచేత తాను కర్తకాదని తలఁచుట ఇదియె 'మయి...విగతజ్వరః' అని పూర్వమే చెప్పఁబడియున్నది- 'మయి సర్వాణి కర్మాణి సన్న్యస్య' అనుటచే కర్తృత్వత్యాగమును, 'నిరాశీః' అనుటచే ఫల త్యాగమును, 'నిర్మమః' అనుటచే మమతాత్యాగరూప మైన కర్మత్యాగమును జెప్పఁ బడిన వని తెలియునది.

లందు మమతను బరిత్యజించుట కర్మత్యాగము. సర్వేశ్వరుఁడే కర్త యని అనుసంధించుటచేత తనకర్తృత్వమును త్యజించుట కర్తృత్వత్యాగము.

శ్లో॥ యజ్ఞదాన తపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ 4½

టీ. యజ్ఞదాన తపఃకర్మ = యజ్ఞదానతపోరూపమైన కర్మము, నత్యాజ్యం=విడువఁదగినదికాదు, తత్=అది, కార్యమేవ=చేయఁదగినదే.

తా *యజ్ఞము దానము తపస్సు మొదలగు వైదికకర్మము ముముక్షువులకు ఒకానొకప్పుడును విడువఁదగదు. వానిని ప్రాణము పోవువఱకు ప్రతిదినమును జేయనేవలయును.

అవ. ఏల యన.

శ్లో. యజ్ఞో దాన తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 3

టీ. మనీషిణాం = మననశీలురకు-(మనన మనఁగా ఉపాసనము గనుక) యావజ్జీవము ఉపాసనముచేయుచుండు ముముక్షువుల కనుట, యజ్ఞః=యజ్ఞము, దానం=దానము, తపశ్చైవ=తపస్సును, అనునవి, పావనాని=పవిత్రమైనవి-వారియుపాసన నిష్పత్తికి విరోధియైన ప్రాచీన కర్మమును వినాశనము చేయునవనుట.

తా. ♦యావజ్జీవ ముపాసనము చేయుచుండు ముముక్షువులకు, యజ్ఞదానతపస్సులు మొదలయిన వర్ణాశ్రమసంబంధి కర్మములు పవిత్రమైనవి- అనఁగా, వారికి ఉపాసనకలుగుటకు విరోధియైన పూర్వకర్మములను నశింపఁజేయునవని యర్థము.

---

* ఇది స్వరూపత్యాగపక్షమునకు ఖండనము.

♦ ఇది 'త్యాజ్యం దోషవత్' అనుటకు ఖండనము.

శ్లో. ఏతా న్యపితు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలానిచ
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్॥ 6

టీ. హేపార్థ = ఓయర్జునా, ఏతాని = పూర్వోక్తము లయిన, కర్మాణి అపి=కర్మములుగూడ, సఙ్గం=మమతను, ఫలానిచ=ఫలములను, త్యక్త్వా=విడిచి, కర్తవ్యాని ఇతి=చేయఁదగినవని, మే=నాయొక్క, నిశ్చితం=నిశ్చయింపఁబడినదియు, ఉత్తమం=ఉత్కృష్టమైనదియు నగు, మతం=అభిప్రాయము.

తా. ఉపాసనశీలురైనవారికి యజ్ఞదానతపఃప్రభృతులు పావనము లగుటంజేసి, ముముక్షువైనవాఁడు ఉపాసనమువలెనే యీయజ్ఞాదికర్మములుగూడ మదారాధన రూపములుగాఁగైకొని, కర్మమునందలి మమతను ఫలమును విడిచి, ప్రాణములు పోవువఱకు ప్రతిదినమును ఉపాసన మొడఁగూడుటకుఁగాను వానిని ఆచరింపవలయును. ఇది నిశ్చయమైన నాయుత్తమాభిప్రాయము.

శ్లో. నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥ 7

టీ. నియతస్య=నిత్యనైమిత్తిక రూపమైన, కర్మణః=మహాయజ్ఞాదికర్మముయొక్క, సన్న్యాసః=పరిత్యాగము, న ఉపపద్యతే=యుక్తము కాదు, మోహాత్ =(అవి బంధకములనెడి)అజ్ఞానమువలన, తస్య=ఆనిత్యకర్మముయొక్క, పరిత్యాగః=విడుచుట, తామసః=తమోమూల మని-తమః కార్యమైన అజ్ఞానము మూలముగాఁ గలదని యని, పరికీర్తితః = చెప్పఁబడెను.

తా. నిత్యనైమిత్తికరూపమైన మహాయజ్ఞాదికర్మములను త్యజించుట యొప్పదు. ఏలన, వానిని ద్యజించినచో 'శరీర యాత్రాపిచ తే న ప్రసిద్ధ్యే దకర్మణః" (గీ. 3-౮) అన్నట్లు శరీర యాత్రయే సిద్ధింపదు.

మఱియును శరీరయాత్ర యజ్ఞశిష్టాశనముచే జరుపఁబడునేని సమ్యగ్జ్ఞానము కలిగించుచున్నదిగదా. లేనియెడల 'తేత్వఘం భుఞ్జతే పాపాః' (గీ. 3-13) అన్నట్లు, యజ్ఞశిష్టము చేయని పాపమునే యశనముసేయువారు (అనుభవించువారు) అగుదురు. ఇట్టిపాపాశనముచే మనస్సునకు ఆప్యాయనము కలిగించినయెడల దానియందు విపరీతజ్ఞానము కలుగును. (ఆహారము శరీరమునకేకాని, మనస్సునకు ఆప్యాయన మగుట గలదా

13

యనఁదగదు.) *'అన్నమయంహి సౌమ్యమనః (ఛా. 6-5-4) అను శ్రుతి అన్నముచేత మనస్సు ఆప్యాయిత మగునని తెలిపెడిని. ఇంతేకాక 'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిస్సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః' 'స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాంవిప్రమోక్షః' (ఛా.7-26-2) ('భిద్యతే హృదయగ్రన్థిః... తస్మిన్ దృష్టే పరావరే') ఇత్యాదులందు ఆహారశుద్ధివలన ('తస్మిన్ దృష్టే' అనఁబడు) బ్రహ్మసాక్షాత్కారరూపజ్ఞానము గలుగునని తెలియుచున్నది. (యజ్ఞశిష్టమైననే యాహారము శుద్ధమై బ్రహ్మజ్ఞానమునకు సాధన మగును) కావున మహాయజ్ఞాదినిత్యనైమిత్తిక కర్మము బ్రహ్మజ్ఞానము లభించుటకొఱకు ప్రాణముపోవువఱకు అనుష్ఠింపవలయునేకాని త్యజించుట యొప్పదు. ఇట్లు జ్ఞానోత్పాదకము లయిన యాకర్మములను, బంధకము లనెడి అజ్ఞానము వలన పరిత్యజించుట తామస మని చెప్పఁబడినది. తామస మనఁగా తమస్సు మూలముగాఁగలది. తమఃకార్యమైన అజ్ఞానమువలనఁ గలుగునదిగాన ఈత్యాగము తమోమూలమైనదిగాఁ జెప్పఁబడెను. తమస్సు అజ్ఞానమునకు మూలమగుట 'ప్రమా

* 'అన్నమయంహి సౌమ్యమనః, ఆపోమయః ప్రాణః, తేజోమయీ వాక్' అని శ్రుతి. మనస్సును ప్రాణమును వాక్కును వరుసగా అన్నము యొక్కయు జలము యొక్కయు తేజస్సుయొక్కయు సూక్ష్మాంశములచేత ఆప్యాయితము లగుచున్నవి. కాఁబట్టి మనస్సు అన్నమయము; ప్రాణము జలమయము, వాక్కు తేజోమయ మని యర్థము.

దమోహశా తమసో భవతో౽జ్ఞానమేవచ' అని యిట జెప్పఁబడినదిగదా. అజ్ఞాన మనఁగా జ్ఞానవిరోధి యైనవిపరీతజ్ఞాన మగును. అట్లే 'అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా । సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ' అని తమస్సుచే విపరీతజ్ఞానము గలుగుట మీఁదఁ జెప్పఁబడును. కనుక నిత్యనైమిత్తికాదికర్మముల త్యాగమునకుమూలము విపరీతజ్ఞానమే యని యర్థము.

శ్లో. దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ 8

టీ. (యః=ఎవఁడు), దుఃఖమితి ఏవ=దుఃఖాత్మకమగు ద్రవ్యార్జనముచేతనే సాధింపఁనగిన దనియు, కాయక్లేశభయాత్=ఆయాసరూముపమై శరీరమును గష్టపెట్టున దగుటచేత మనస్సునకు దీనత్వము గలిగించుననుభీతిచేతను, యత్ కర్మ=ఏవర్ణాశ్రమకర్మమును, త్యజేత్= విడుచునో, సః=వాఁడు, రాజసం=రజోమూలమైన, త్యాగం=త్యాగమును, కృత్వా=చేసి, త్యాగఫలం=సాత్త్వికత్యాగమువలని (అనఁగా ఇది కలరూపైన శాస్త్రార్థము కాదు అనెడి సాత్త్వికజ్ఞానము యొక్క యుత్పత్తిరూపమైన) ఫలమును, నైవ లభేత్=పొందనేలేఁడు.

తా. కర్మము పరంపరగా మోక్షమునకు సాధనమైనను, అది

14

దుఃఖాత్మక మగు ద్రవ్యార్జనాదులచే సాధింపఁదగినదియు మిక్కిలి యాయాసముచే శరీరమును గష్టపెట్టునదియు నగుటచే మనస్సునకు దీనత్వము కలిగించునని భయపడినవాఁడై, ఎవఁడు యోగనిష్పత్తికొఱకు జ్ఞానాభ్యాసమునే పూనవలయునని తలఁచి మహాయజ్ఞాద్యాశ్రమ కర్మములను పరిత్యజించునో వాఁడు రజోమూలమైన త్యాగముచేసినవాఁడై, ఇట్లు చేయుట యథావస్థితశాస్త్రార్థముకాదు అనెడి జ్ఞానము గలుగని వాఁడగును. కనుక అట్టిజ్ఞానోత్పత్తి అనెడు త్యాగఫలము వానికి లభిం

పదు. *'అయథావత్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ' (గీ.౧౮-౩౧)
15
అని మీఁదఁ జెప్పబడెడినిగదా. కర్మము దృష్టద్వారమున మనస్సునకు ప్రసాదము కలిగింపదు; అదృష్టమగు భగవత్ప్రసాద ద్వారముననే కలిగించునుగదా.

శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున
సఙ్గం త్యక్త్వా ఫలంచైవ సత్యాగ స్సాత్త్వికో మతః ॥ 9

టీ. హేఅర్జున=ఓయర్జునా, నియతం=నిత్యనైమిత్తికరూపమైన, యత్ కర్మ=ఏవర్ణాశ్రమకర్మము, కార్యమిత్యేవ=స్వయంప్రయోజనముగానే చేయఁదగిన దని, సఙ్గం=మమతను, ఫలంచ ఏవ=ఫలమునును, త్యక్త్వా=విడిచి, క్రియతే=చేయఁబడుచున్నదో, సః త్యాగః=అట్టి పరిత్యాగము, సాత్త్వికః=సత్త్వగుణమూలమైన దని, మతః=తలఁపఁబడినది.

తా. అర్జునా, నిత్యనైమిత్తికములగు మహాయజ్ఞాదివర్ణాశ్రమవిహితకర్మములు మదారాధనరూపము లగుటం జేసి స్వయంప్రయోజనముగా అవశ్యకర్తవ్యము లని తలఁచి వానియందు మమతను ఫలేచ్ఛను బరిత్యజించి యాచరించుట, సాత్త్వికత్యాగ మనఁబడుచున్నది.

---

* 'అయథావత్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ' అని మీఁదఁ జెప్పఁబడినట్లు రాజసబుద్ధికి యథావస్థితజ్ఞానము (అనఁగాఁ గలరూపు నెఱుఁగుట) కలుగదు. సాత్త్విక త్యాగమునకే యథావస్థితజ్ఞానము ఫలము. ఆ ఫలమే యిచట లేదనఁబడెను. కాఁబట్టి 'త్యాగఫలమ్' అనుటకు 'మహాయజ్ఞాద్యాశ్రమకర్మములను దుఃఖాదులుగాఁ దలఁచి విడుచుట యథావస్థితమైన శాస్త్రార్థము కాదు' అను సాత్త్విక జ్ఞానముయొక్క యుత్పత్తియే యర్థముగాఁ జెప్పఁబడెను. కర్మములు దుఃఖాత్మకము లగుటచే మనస్సునకు అవసాదము కలిగించునేకాని ప్రసాదము కలిగింపవు- అని చెప్పరాదు. కర్మములు మనకంటికిఁ దోఁచుమార్గములచే మనస్సునకు ప్రసాదము కలిగింపదు. వానిని భగవదారాధనములుగాఁ జేసితిమేని భగవంతుఁడు ప్రసన్నుఁడై తానే వానివలన ప్రసాదము కలుగఁజేయునని తెలియునది.

ఇచట త్యాగము సాత్త్వికమైన దనఁగా సత్త్వమూలమైనది-యథావస్థితశాస్త్రీయజ్ఞానము మూలముగాఁ గలది యనిభావము. 'సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానమ్' (గీ.౧౪-౧౭) అని చెప్పియుండుటంబట్టియు, 'ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే। బన్ధం మోక్షంచ యా వేత్తి బుద్ధి స్సా పార్థ సాత్త్వికీ' (గీ. ౧౮-30) అని మీఁదఁ జెప్పఁబడు టంబట్టియు, సత్త్వము యథావస్థిత మైన వస్తుజ్ఞానము గలిగించున దని చెప్పఁబడెను.

శ్లో. నద్వే ష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్యతే
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥ 10

టీ. సత్త్వసమావిష్టః= సత్త్వగుణముచేత వ్యాపింపఁబడిన వాఁడును, మేధావీ = యథావస్థితతత్త్వజ్ఞానము గల వాఁడును, (కనుకనె). ఛిన్నసంశయః= ఛేదింపఁబడినసంశయము గలవాఁడును అగు, త్యాగీ= సంగమునుఫలమును కర్తృత్వమును విడిచినపురుషుఁడు,అకుశలంకర్మ = అనిష్టఫలముగల పాపకర్మమును, నద్వేష్టి = ద్వేషింపఁడు, కుశలే=ఇష్ట ఫలము గల శుభకర్మమందు, నానుషజ్యతే=ఆసక్తుఁడు కాఁడు.

తా. ఇట్లు సత్త్వగుణసంపన్నుఁడై దానివలన యథావస్థితతత్త్వ జ్ఞానము గలవాఁడై కనుకనే సమస్తసంశయములు ద్రుంచి, కర్మముల యందు సంగఫలకర్తృత్వములను పరిత్యజించిన పురుషుఁడు అకుశలము లగు కర్మములను ద్వేషింపఁడు. కుశలము లగు కర్మములయం దాశక్తుఁడుగాఁడు. అకుశలకర్మము అనిష్టఫలము గలది. కుశలమైనకర్మము ఇష్టరూపములగు స్వర్గపుత్త్రపశ్వన్నాదిఫలములు గలది. సమస్తకర్మము లందు మమత లేకుండుటచేతను, బ్రహ్మముతప్ప తక్కినఫలములను విడుచుటచేతను, కర్మములకర్తృత్వమును విడుచుటచేతను, ఆకర్మముల నాచరించునపుడు వానియందుఁ బ్రీతి ద్వేషములఁ జేయఁడు. *'నావిరతో

* 'నావిరతః' అనుశ్లోకముచే పరమాత్మోపాసనమునకు అంగములుగాఁ గొన్ని

దుశ్చరితా న్నాశాన్తో నాసమాహితః । నాశా న్తమానసోవాపిప్రజ్ఞానే నైవ మాప్నుయాత్' (కఠో.౧-౨-౨౪) అని దుశ్చరితములను విరమింప కుండుట జ్ఞానోత్పత్తికి విరోధి యగు నని శ్రుతి చెప్పుటవలన, అనిష్ట ఫలమగు పాపకర్మము ఇచట ప్రామాదికమైనదని యభిప్రాయము. ఇట్లు కర్మములందుఁ బ్రీతిద్వేషములు లేకుండుటను మాత్రము చెప్పు టచే వానినిగుఱించి శాస్త్రము 'ు చెప్పుతాఁగను కర్తృత్వసంగఫల ములత్యాగమే కాని స్వరూపత్యాగము కాదని తెలియునది.

అవ. దానినే చెప్పుచున్నారు.

శ్లో. నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే ॥ 11

టీ. దేహభృతా=శరీరము ధరించియుండువానిచేత, కర్మాణి= కర్మములను, అశేషతః=నిశ్శేషముగా- సంపూర్ణముగా, త్యక్తుం=విడు చుటకు, శక్యం నహి=సాధ్యముకాదుగదా, యస్తు=ఎవ్వఁడైతే, కర్మ ఫలత్యాగీ =కర్మములఫలమును విడుచువాఁడో, సః=వాఁడు, త్యాగీ ఇతి=త్యాగి యని, అభిధీయతే=చెప్పఁబడుచున్నాఁడు.

---

ధర్మములను ఉపదేశించుచున్నారు. అవిరతః దుశ్చరితాత్ =అకృత్యములను చేయుట వలననుండి నివర్తింపనివాఁడును, అశాంతః=బాహ్యేంద్రియములు శాంతములుగానివాఁ డును, అసమాహితః=చిత్తము నానావిధవ్యాపారములకు లోనైయుండుటచే మనస్సు వ్యవధానము లేనివాఁడును, అశాంతమానసోవాపి = నిగ్రహింపఁబడని మనస్సు గల వాఁడును, ఏనం = ఈపరమాత్మను, ప్రజ్ఞానేన = జ్ఞానముచేత-ఉపాసనముచేత, న ఆప్ను యాత్ =పొందఁడు-కనుక దుశ్చరితమునుండి విరమించుట మొదలయినవి పరమాత్మో పాసనమునకు అంగములుగా విధింపఁబడినవి దుష్కార్యములు విరమింపకుండినయెడల జ్ఞానోత్పత్తి కవి విరోధము లగును. కనుక సాత్త్వికునికి 'నద్వేష్ట్యకుశలం కర్మః' అని అనిష్టఫలములైన పాపకర్మములందు ద్వేషము లేకుండినయెడల వానికిఁ జెప్పఁబడిన యథావస్థితవస్తుజ్ఞానము కలుగనేరదు. కనుక వారి కట్టికర్మములందు ద్వేషము లే దనుట యెట్లు? అన్నచో, అవి బుద్ధిపూర్వకముగాఁ చేయఁబడిన కర్మములు కాక ప్రమాద వశమునఁ జేయఁబడినకర్మములుగా నిచట గ్రహించునది. అప్పుడు వానికిఁ గలుగు జ్ఞానమునకు విరోధము లేదని గ్రాహ్యము.

తా. దేహము దాల్చియున్నప్పుడు కర్మములు నిశ్శేషముగఁ జేయకుండుట శక్యము కాదు. ఏలన, దేహధారణము కొఱకు అశన పానాదులుగాని వానిని సంబంధించిన కర్మములుగాని విడువ శక్యము కాదు. మఱియు వానికొఱకు మహాయజ్ఞాదుల ననుష్ఠించుటయు విడువ నలవికాదు. అట్టి మహాయజ్ఞాదికర్మములందు ఫలము నెవఁడు త్యజించు చున్నాఁడో వాఁడే 'త్యాగేనైకే అమృతత్వమానశుః' (మను.) ఇత్యాది శాస్త్రములందు త్యాగి యని చెప్పఁబడుచున్నాఁడు. 'త్రివిధ స్సంప్ర కీర్తితః' అని త్యాగము మూఁడువిధము లైనదిగా మొదటఁ జెప్పఁబడు టచే నిచట ఫలశబ్దము ఫలకర్తృత్వకర్మసంగములు మూఁటికిని బ్రద ర్శక మని తెలియునది.

అవ. అగ్నిహోత్రదర్శ పూర్ణమాస జ్యోతిష్టోమాది కర్మము లును మహాయజ్ఞాదులును స్వర్గాదిఫలములతోఁ గూడినవి శాస్త్రములు విధించుచున్నవి. నిత్యనైమిత్తిక కర్మములుగూడ 'ప్రాజాపత్యం గృహ స్థానామ్' (మను.) ఇత్యాదులగు ఫలములతోఁ గూడినవిగానే విధింపఁబడి యున్నవి. విత్తునాటుట మొదలగు కర్మములను ఫలమును గోరకయే చేసి

16

నను అవి ఫలమును తప్పక యిచ్చునట్లు, కర్మములు ఫలమునుసాధించు స్వభావము గలవిగా తెలియఁబడుచున్నవి గాన వాని ననుష్ఠించు నపుడు ఫలము నుద్దేశింపకపోయినను వానివలన నిష్టఫలమో అనిష్టఫలమో కలు గకమానదు. కర్మము మోక్షమునకు విరోధియైన ఫలముగలది. కనుక మోక్షార్థియైన వానికి నట్టికర్మము ననుష్ఠింపఁదగదే యనఁగాఁ జెప్పు చున్నారు.

శ్లో. అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్
భవ త్యత్యాగినాం ప్రేత్య నతు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12

టీ. కర్మణః=కర్మమునకు, అనిష్టం=దుఃఖకరమైననరకాదికమును,

ఇష్టం=సుఖకరమైన స్వర్గాదికమును, మిశ్రంచ=సుఖదుఃఖ మిశ్రమైన పుత్రపశ్వాదికమును నగు, త్రివిధం = మూఁడువిధములైన, ఫలం = ఫలము, ప్రేత్య=కర్మము లాచరించిన తరువాత, అత్యాసినాం=ఫలసంగ కర్తృత్వములను విడువనివారికి, భవతి=కలుగుచున్నది. సన్న్యాసినాం= కర్తృత్వాదులను పరిత్యాగము చేసినవారికి, క్వచిత్ అపి=ఒకానొక ప్పుడు, న (భవతి)=కలుగదు.

తా. దుఃఖకరమైన నరకాదిఫల మగుటచే అనిష్ట[17] మనియు, సుఖకరమైన స్వర్గాదిఫలమగుటచే ఇష్టమనియు,[18] దుఃఖమిశ్రమైన పుత్రపశ్వాదిఫల మగుటచే మిశ్రమనియు, కర్మఫలములు మూఁడువిధములై యుండును. కర్మము లాచరించి యందలి కర్తృత్వ మమతాఫలములఁ ద్యాగము సేయకుండు వారికి (అనఁగా వానిఫలాదుల నపేక్షించువారికి) *కర్మము లాచరించిన తర్వాత నాయాఫలములు కలుగుచుండును. ఫల కర్తృత్వాదిత్యాగము చేయువారికి మోక్షవిరోధియగు ఫలమెప్పుడును గలుగదు. (అనఁగా వారు కృతార్థులగుదురని తెలియునది.) అగ్నిహోత్రమహాయజ్ఞాదులు నిత్యకర్మములే యైనను జీవనాధికారమందును

*ఇచట 'ప్రేత్య' అనుటకు 'మరణించినపిదప' యని యర్థము తగదు- ఏలనఁగా సంతానము వర్షము మొదలైన ఫలములు జీవించియున్నప్పుడు కలుగుటకలదు గాన 'కర్మము లాచరించినతరువాతికాలమున' యని యర్థము సేయఁబడినది. అగ్నిహోత్ర మహాయజ్ఞాదులు వర్ణాధికారికి ఆయావర్ణము నందుఁ బుట్టుటవలనను కామాధికారికి ఆయాకామములను గోరి చేయుట వలనను నిత్యకర్మములే యగును. మోక్షాధికారికిని అవి నిత్యకర్మములే యగును. అయినను అవి మొదటి రెం డధికారములందు ఫలము నిచ్చునటులె మోక్షాధికారమునందును ఫలము నియ్యకుండునా యన్నచో, మోక్షాధికారమునందు వినియోగపృథక్త్వము చేత మోక్షవిరుద్ధమైన ఫలము నిచ్చుట పరిహృతమగు నని తెలియునది. వినియోగపృథక్త్వ మనఁగా వేఱువిధముగా వినియోగింపఁబడుట, ఇది వినియోగింపఁజేయు విధివాక్యములు వేఱగుటచే ఈ వినియోగముకూడ వేఱగుచున్న దని తెలియవలయును.

కామాధికారమునందును వలెనే మోక్షాధికారమందును వినియోగ
19
పృథక్త్వమువలన (విరుద్ధఫలము) పరిహరింపఁబడుచున్నది. వానికి మోక్షమందు వినియోగము 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేనదానేన తపసాఽనాశకేన' (బృ. ౬-౪-౨౨) ఇత్యాదులచేఁ దెలియునది. ఇట్లు కర్మములుచేయుచున్నపుడే వానియందలి కర్తృత్వాది పరిత్యాగమే శాస్త్రసిద్ధమైన సన్న్యాసము. ఇదియె త్యాగమని చెప్పఁబడినది. (కనుక రెండుశబ్దములును సమానార్థకములే యగు నని తెలియునది.)

అవ. ఇప్పు డంతర్యామియు పురుషోత్తముఁడును అగు భగవంతుఁడే కర్తయని అనుసంధించుటవలన తాను కర్తగా దని అనుసంధించు ప్రకారమును జెప్పుచున్నారు. ఈ యకర్తృత్వానుసంధానము వలననే (అనఁగా కర్తృత్వత్యాగమువలన) ఫలకర్మములందు మమతా పరిత్యాగమును గలుగును. కాఁబట్టి 'పరమపురుషుఁడు తనదైన జీవాత్మను గొనియు, తనవియైన కరణకళేబరప్రాణములను గొనియు, తన లీలకొఱకు కర్మముల నారంభించుచున్నాఁడుగదా. కనుక జీవాత్మకుఁ గలుగు ఆఁకలి నివర్తించుట మొదలైన ఫలములును వానికి సాధనములైన కర్మములును పరమపురుషునివే యగును నావికావు' (అని తెలుచున్నది).

శ్లో. పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ 13

టీ. హేమహాబాహో = భుజపరాక్రమముగల వాఁడా, సర్వకర్మణాం=సమస్త కర్మములయొక్క, సిద్ధయే=ఉత్పత్తికొఱకు, *సాఙ్ఖ్యే

*సంఖ్య యనఁగా బుద్ధి, అంత మనగా నిర్ణయము, కృతమనఁగా అనుసంహితమైనది. సాంఖ్యమనఁగా బుద్ధిని (అనఁగా యథావస్థితమైన తత్త్వమునుగుఱించిన

కృతాన్తే=యథావస్థితతత్త్వ విషయమైన బుద్ధిలో ననుసంధింపఁబడు నిర్ణయమునందు, ప్రోక్తాని = చెప్పఁబడిన, ఏతాని = ఈ, పఞ్చ=ఐదు, కారణాని=కారణములను, మే=నావలన, నిబోధ=తెలిసికొనుము.

తా. అర్జునా, యథావస్థితతత్త్వమును గుఱించిన వైదికబుద్ధిలో చేసిన నిర్ణయమందు (అనఁగా యథావస్థిత తత్త్వనిర్ణయము కొఱకు ప్రవృత్తమైనట్టి వేదభాగము నెఱింగినవారు చేయు నిర్ణయమునందు) సమస్తకర్మములయొక్క యుత్పత్తికై ఈయైదుకారణములు చెప్పఁబడి యున్నవి. వానిని నావలనఁ దెలిసికొనుము. 'య ఆత్మని తిష్ఠన్నాత్మనో న్తరో యమాత్మా న వేద- యస్యాత్మా శరీరం. య ఆత్మానమన్తరో యమయతి స త ఆత్మాన్తర్యామ్యమృతః (బ. ౫-౭-౨౨) 'అన్తః ప్రవిష్టశ్శాస్తాజనానాం సర్వాత్మా' ఇత్యాదులందు ప్రతిపాద్యమైన వైదిక బుద్ధియైనది 'పరమాత్మ శరీరేంద్రియ ప్రాణములను జీవాత్మను ఉపకరణములుగాఁ గొని కార్యములకు కర్త అగుచున్నాఁడు' అని నిర్ణయము సేయుచున్నది.

అవ. దానిని చెప్పుచున్నారు.

శ్లో. అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్  
వివిధాచ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥ 14

శ్లో. శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః  
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః॥ 15

టీ. నరః=మనుష్యుఁడు, శరీరవాఙ్మనోభిః=మనోవాక్కాయముల

---

వైదికబుద్ధిని) సంబంధించినది. కాఁబట్టి 'సాంఖ్యే కృతాన్తే' అనఁగా అట్టిబుద్ధిచేత అను సంధింపఁబడిన నిర్ణయమునందు అని యర్థము. వేదమునందు తత్త్వనిర్ణయము చేయు భాగమును గుఱించిన బుద్ధిలో నిర్ణయము చేయు పూర్వులవలన, 'ప్రోక్తాని' చెప్పఁబడిన కారణములనుట. అట్టి వైదికబుద్ధిచే నిర్ణయింపఁబడిన యైదుకారణములను జెప్పెద విను మని భావము.

చేత, న్యాయ్యంవా=శాస్త్రీయమైనదైనను, విపరీతం వా=శాస్త్రీయము
కానిదైనను, యత్ కర్మ = ఏకర్మమును, ప్రారభతే = ఆరంభించుచు
న్నాఁడో, తస్య=ఆ కర్మమునకు, అధిష్ఠానం=జీవాత్మకు స్థాన మైన శరీ
రమును, తథా = అట్లే, *కర్తా = జ్ఞాతృత్వకర్తృత్వములుగల జీవాత్మ
యును, పృథగ్విధం=వేఱు వేఱు వ్యాపారములు గల, కరణం చ =
కర్మేంద్రియము లైదును మనస్సును, పృథక్=వేఱువేఱుగా, వివిధాః=
నానావిధమైన, చేష్టాః=ప్రాణాపానాదిపంచవాయువ్యాపారమును, పఞ్చ
మం = ఐదవది యగు, దైవం చైవ = అంతర్యామి యైన పరమాత్మ
యును, ఏతే పఞ్చ=ఈ అధిష్ఠానాదు లైదును, అత్ర=ఈ కర్మ హేతు
సముదాయమునందు, హేతవః=కారణములు.

తా. శారీరములును వాచికములును మానసములును అగు
సమస్త కర్మములకును, అవి శాస్త్రసిద్ధములు గాని శాస్త్రనిషిద్ధములు
గాని, హేతువు లైదు గలవు. అవి యివి. (మొదటిది) అధిష్ఠానము-
అనఁగా శరీరము. మహాభూతసంఘాతరూపమైన శరీరము జీవాత్మచేత
అధిష్ఠింపఁబడుచున్నది గాన అధిష్ఠాన మనఁబడుచున్నది. అట్లే (రెండ
వది) కర్త- అనఁగా జీవాత్మ. ఈ జీవాత్మునకు జ్ఞాతృత్వమును కర్తృ
త్వమును 'జ్ఞోఽత ఏవ' (శారీ-౨-౩-౧౮) 'కర్తా శాస్త్రార్థవత్త్వాత్'
(శారీ-౨-౩-౩౩) అను సూత్రములచేత ఉపపాదింపఁబడి యున్నది.
(మూఁడవది) ఒక కర్మమును వేఱువేఱగు తమతమ వ్యాపారముల
చేత ఒడఁగూర్చునట్టి వాక్కు పాణి పాదము మొదలగు కర్మేంద్రి
యము లయిదును మనస్సును, (నాలుగవది) వివిధమగు వేఱు వేఱు
చేష్టలు-శరీరమును ఇంద్రియములను ధరించునదై ప్రాణము అపానము
మొదలైన భేదముచేత ఐదువిధములై యున్నవాయువుయొక్క వివిధ

*'కర్తా' అనుటచే కర్తృత్వజ్ఞాతృత్వములు గల జీవాత్మ గ్రాహ్యము. 'జ్ఞోఽ
తఏవ' అని జ్ఞాతృత్వమును 'కర్తా శాస్త్రార్థవత్త్వాత్' అని కర్తృత్వమును సూత్రము
లుపపాదించుచున్నవి.

ములగు వృత్తులును, ఇట చేష్టాశబ్దము పంచాత్మక మగు వాయువు యొక్క వృత్తులకు వాచకముగాన ఆవాయువు చెప్పఁబడుచున్నది. ఈ కర్మహేతువుల సమూహమునందు (ఐదవది) దైవము - అంతర్యామి యగు పరమాత్మ కర్మనిష్పత్తి యందు ప్రధానహేతు వని యర్థము. ఇది 'సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనంచ' (గీ-౧౫-౧౫) అని యింతకు మునుపు చెప్పఁబడియున్నది. ఇట మీఁదను 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా' (గీ. ౧౮-౬౧) అని చెప్పఁబడెడిని. జీవాత్మయొక్క కర్తృత్వము పరమాత్మకు లోనయినదనుట 'పరాత్తు తచ్ఛ్రుతేః' (శారీ. ౨-౩-౪౦) అని యుపపాదింపఁబడియున్నది. ఇట్లు జీవాత్ముని కర్తృత్వము పరమాత్మునికి లోనై యుండఁగా జీవాత్మను గర్మమునందు నియోగింపఁదగదు. *కాఁబట్టి వానికి విధినిషేధ శాస్త్రములు అనర్థకము లగుచున్నవి- (అని యాక్షేపము గలుగుచున్నది.) ఈచోద్యమును అనఁగా ఆక్షేప విషయమును గూడ సూత్రకారునిచేతనే 'కృతప్రయత్నాపేక్షస్తు విహిత ప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః' (శారీ. ౨-౩-౪౧) అని పరిహరింపఁబడినది. ఇం దభిప్రాయమేమన- పరమాత్మ కరణకళేబరాదులను దానే యొసంగి తానే వానికాధారుఁడై జీవాత్మకు శక్తిని గూర్చుచున్నాఁడు; జీవాత్ముఁడును నాపరమాత్మయె యాధారముగాఁ గలిగి యతఁడు కూర్చినశక్తినే పడసి, కర్మమును చేసితీర్చుకొనుటకు స్వేచ్ఛచేత ఆకరణాదులను అధిష్ఠించు

* 'పరాత్తు తచ్ఛ్రుతేః' అను సూత్రము జీవాత్మయొక్క కర్తృత్వము పరమాత్మకు లోనైనదని యుపపాదించుచున్నది. ఇట్లు జీవాత్మ స్వేచ్ఛచేత నేమియుఁ జేయనేరక పరమాత్మ చేయించునట్లే చేయువాఁడు (అనఁగా పరమాత్మకు లోనైన నిజకర్తృత్వము గలవాఁడు) అగునేని, తనంతట స్వతంత్రుఁడై యేమియుఁ జేయనేరని యాజీవాత్మకు, 'ఈకర్మమును జేయుము; ఆకర్మము వలదు అను విధినిషేధములను శాస్త్రములు చేయుట నిరర్థకమే కదా యన్నచో, ఈయాక్షేపమును సూత్రకారులు, కృత ... [విధి

ప్రయత్నము నారంభించుచున్నాఁడు. వానిలోపల నెలకొనియున్న పరమాత్మ తనయనుమతి నొసంగి వానిని ప్రవర్తింపఁ జేయుచున్నాఁడు. కాఁబట్టి జీవుఁడుగూడ స్వబుద్ధిచేతనే ప్రవృత్తికి హేతు వగుచున్నాఁడు. ఎట్లన, మిక్కిలి పెద్ద శిలలను వృక్షములను గదల్చుట మొదలగు ఫలములకైన ప్రవృత్తులయందు, అవి పెక్కుపురుషులచేత సాధింపఁదగిన వగుటంబట్టి అందులకు పెక్కంద్రు హేతువు లగుటయు విధి నిషేధము

---

నిషేధములు వ్యర్థములు కాకుండుట మొదలైనవానినిబట్టి, (జీవునిచే మొదటఁ) జేయఁబడిన ప్రయత్నమును (పరుఁడు) అపేక్షించువాఁడు] అను సూత్రముచే పరిహరించిరి. ఈసూత్రార్థ మేమనఁగా జీవుఁడు స్వబుద్ధి పూర్వకముగా ఏదియుఁ జేయలేనియెడల అట్టి పరతంత్రునికి విధినిషేధములు సేయుటగాని వానియెడల నిగ్రహానుగ్రహములు చూపుటగాని వ్యర్థమే యగును. అయిన నవి వ్యర్థముగాఁ జేయఁబడవుగదా. ఈ కారణమునుబట్టి గ్రహింపవలసినదేమన- ఈశ్వరుఁడు కరణకళేబరాదులకు తాను శక్తిని గూర్చి తానే యాధారమై నిలిచి వానిని జీవాత్మకు నిచ్చుచున్నాఁడు. జీవాత్మయు తాను పరమాత్మయే యాధారముగాఁ గలిగి పరమాత్మచే నీయఁబడినశక్తియుఁ గలవాఁడగును. ఇట్టి సన్నాహముతో జీవాత్మ కర్మ నిష్పత్తికొఱకు (అనఁగా ఒకకార్యము నెఱవేర్చుటకొఱకు) స్వేచ్ఛతో ప్రయత్నమును (అనఁగా కరణముల నధిష్ఠించి వ్యాపారమునకుఁ బురికొల్పుటను) ఆరంభించుచున్నాఁడు. ఇట్లు భగవంతుఁడు మొదట జీవాత్మను స్వబుద్ధిపూర్వకముగానే ప్రయత్నముచేయనిచ్చి పిదప నది పయిపయి కొనసాగుటకు లోపల నున్న తాను తనయనుమతి నిచ్చి దానిని ప్రవర్తింపఁ జేయుచున్నాఁడు. మొదట జీవుని ప్రవృత్తి స్వబుద్ధిపూర్వక మగుటచే విధి నిషేధాదులకు వాఁడు పాత్రుఁడే యగును. పిదప నది అంతర్యామి యైన పరమాత్మ యనుమతిచే సాగుటవలన జీవునికర్తృత్వము పరమాత్మకు లోనైనదియు నగును. అయినను పెక్కంద్రవలన జరుపఁబడు నొక కార్యమును బట్టి అం దొక్కనికే విధినిషేధములు చేయుట తగునా యన్నచో, ఒక పురుషుఁడు పెద్దఱాయి వృక్షము మొదలైవానిని కదలించుటకో మఱి దేనికో ప్రవర్తించునపుడు అది పెక్కంద్రచే సాధ్య మయినదగుటచే పెక్కంద్రను గూర్చుకొని యా కార్యమును తీర్చుచున్నాఁడు. ఆ కార్యమునకు పెక్కంద్రు హేతువు లైనను వారియందు మొదటిహేతు వైన యాపురుషునికి ఆ కార్యమువలని లాభనష్టములును విధినిషేధములును చెల్లుచున్నవి. అటులె జీవుఁడు చేయుకార్యమునందు పంచహేతువు లుండియు జీవునికి విధినిషేధములు చెల్లు నని తెలియునది.

లను బొందుటయుఁ గలుగుచున్నది. అట్లె యిందును దెలియునది.

శ్లో॥ తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః
పశ్యత్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః॥ 16

టీ. తత్ర=ఆకర్మప్రారంభ హేతువిషయమునందు, ఏవం సతి= ఇట్లు జీవాత్మయొక్క కర్తృత్వము పరమాత్మయొక్క అనుమతిపూర్వక మైన దగుచుండఁగా, కేవలం ఆత్మానం తు=ఒకజీవాత్మనుమాత్రమే, కర్తారం=కర్తనుగా, యః=ఎవ్వఁడు, పశ్యతి=తలఁచుచున్నాఁడో, సః= అట్టి, దుర్మతిః=విపరీతబుద్ధి గలవాఁడు, అకృతబుద్ధిత్వాత్ =అధ్యాత్మ శాస్త్రముచేత సంస్కరింపఁబడని (అనఁగా వస్తువును యథావస్థితముగా నెఱుఁగని బుద్ధిగలవాఁడగుటవలన, న పశ్యతి=కర్తను యథావస్థిత ముగా నెఱుఁగఁడు.

తా. ఇట్లు ఆయాకర్మప్రారంభహేతువిషయమునందు జీవాత్మ యొక్క కర్తృత్వము పరమాత్మానుమతిపూర్వక మయిన దగుచుం డఁగా, తనయాత్మను మాత్రమే కర్త యని యెవఁడు తలఁచునో, యా విపరీతమతి యగువాఁడు వస్తువులను ఉన్నరూపునఁ దెలియుబుద్ధి తన కేర్పడకున్నందున కర్తను గల రూపున నెఱుఁగఁడు. ఆత్మ యథార్థ ముగా పరతంత్రకర్త యని యెఱుఁగఁడు. కాఁబట్టియే స్వతంత్రకర్త యనుబుద్ధి భ్రమ మని భావము.

శ్లో. యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాఀ లోకాన్ న హన్తి న నిబధ్యతే॥ 17

టీ. యస్య=ఎవనియొక్క, భావః=మనోవృత్తి-కర్తృత్వవిషయ మైన మనో వ్యాపారవిశేషము, అహంకృతః = నేను అనెడి అభిమా నముచేతఁ గలిగినది-నేను చేయుచున్నాను అనెడి జ్ఞానముతోఁ గూడి నది, న=కాదో, యస్య=ఎవనియొక్క, బుద్ధిః=కర్మవిషయమైనబుద్ధి, నలిప్యతే = (ఫలసంగముచే) పూయఁబడదో- ఫలసంగముకలదికాదో, సః =వాఁడు, ఇమాన్ లోకాన్ =ఈలోకమునందలి ప్రాణుల నందఱను,

హత్వా అపి = చంపియును, న హన్తి=చంపినవాఁడుకాఁడు-హననదోషము ననుభవించువాఁడుకాఁడు, ననిబధ్యతే = (యుద్ధ మనెడి కర్మము చేత) బంధింపఁబడఁడు- ఆకర్మఫలము ననుభవించుటయు లేదనుట.

తా. పరమపురుషుఁడే కర్త యని యనుసంధించుటవలన, కర్మముల 'నేనే చేయుచున్నాను' అనెడి యభిమానము ఎవ్వనికి కలుగదో, 'ఈకర్మమునందు నాకు *కర్తృత్వము లేనందున దీనిఫలము నన్నంటదు, ఇది నాకర్మము కాదు' అనెడి బుద్ధి యెవనికి జనించునో, వాఁడీ భీష్మాదులను మాత్రము కాదు లోకులనందఱను యుద్ధమందు సంహరించినను సంహరించిన వాఁడు కాఁడు. ఇట్లు యుద్ధ మనెడి కర్మముతో సంబంధింప నందున దానివలనిఫలము ననుభవించుటయు లేదు.

అవ. ♦ ఈయకర్తృత్వాదుల ననుసంధించుట యెల్ల సత్త్వగుణ వృద్ధివలననే కలుగుచున్నదిగాన సత్త్వగుణము ఉపాదేయ మైనదని తెలుపుటకొఱకు కర్మమునందు సత్త్వాదిగుణములనుబట్టి కలుగుభేదమును సవిస్తరముగాఁ జెప్పువారై అందులకుఁగాను ముందు కర్మమును విధించి యుండు ప్రకారమును జెప్పుచున్నారు.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసఙ్గ్రహః॥ 18

---

* 'యస్య నాహంకృతో భావః' అనుటచే కర్తృత్వత్యాగమును 'బుద్ధి ర్యస్య న లిప్యతే' అనుటచే ఫలత్యాగమును గ్రహించునది.

♦ కర్మములకు సత్త్వాదులచేఁ గలుగు భేదమును జెప్పుటవలన సత్త్వగుణమే యుత్తమ మని తోఁచునుగాన అదియే యుపాదేయ మని తెలిపిన ట్లగును. కర్మమున కాసత్త్వాదులచేఁ గలుగు భేదమును విస్తరించి చెప్పుట యెట్లనినచో, కర్మము ననుబంధించి యుండు జ్ఞానాదులు ఒక్కొక్కటియు సత్త్వాదులచే మూఁడేసివిధములై భేదము నొందియుండుటను విస్తరించి చెప్పుటవలన కర్మముయొక్క భేదములే సవిస్తరముగాఁ జెప్పఁబడినట్లవును. ఇట్లు కర్మమును విస్తరించి చెప్పుటకు అది విధింపఁబడియుండు ప్రకారమును (అనఁగా అది 'జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా' అని 'జ్ఞానాదులుగా విధింపఁబడి

టీ. జ్ఞానం=కర్మస్వరూపమును దెలిసికొనుటయు- ఈ కర్మము నేను చేయఁదగినది అనెడి జ్ఞానమును, జ్ఞేయం=ఎఱిఁగి చేయఁదగిన కర్మమును - అజ్ఞానమునకు విషయమైన జ్యోతిష్టోమాది కర్మమును, పరిజ్ఞాతా=ఆకర్మమును దెలిసికొనువాఁడును, (ఇతి_అని), కర్మచోదనా= జ్యోతిష్టోమాదికర్మవిధి, త్రివిధా=మూఁడువిధములు గలది; కరణం = సాధనభూతమైన ద్రవ్యాదికమును, కర్మ=యాగాదికమును, కర్తా=అనుష్ఠాతయు, ఇతి=అని, త్రివిధః=మూఁడు విధములుగా, కర్మసఙ్గ్రహః= కర్మముయొక్క సంగ్రహము-కర్మము మూఁడువిధములుగా సంగ్రహింపఁబడియున్నది- అనఁగా అనుష్ఠానముకొఱకు సంక్షేపింపఁబడినది యని యర్థము.

తా. కర్తవ్య మగు కర్మమునుగూర్చిన జ్ఞానము, కర్తవ్యమగు కర్మము, ఆకర్మమును దెలిసినవాఁడు అని కర్మచోదన మూఁడువిధములుగా నున్నది. అనఁగా, జ్యోతిష్టోమాదికర్మ విధి, బోధము (తెలియుట) బోద్ధవ్యము (తెలియఁదగినది) బోద్ధ (తెలియువాఁడు) అనుమూఁటితోఁ గూడి యున్న దని యర్థము. వానియందు బోద్ధవ్యరూపమగు కర్మము - కరణము, కర్మము, కర్త యని మూఁడువిధము లైనదిగా సంగ్రహింపఁబడుచున్నది. కరణ మనఁగా సాధనము లగుద్రవ్యాదులు; కర్మ మనఁగా యాగాదులు; కర్త యనఁగా వాని ననుష్ఠించువాఁడు.

శ్లో. జ్ఞానం కర్మచ కర్తాచ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే యథావ చ్ఛృణుతాన్యపి ॥ 19

టీ. జ్ఞానం=కర్తవ్యకర్మవిషయమైన జ్ఞానమును, కర్మచ=అనుష్ఠింపఁదగిన కర్మమును, కర్తాచ=దాని ననుష్ఠించువాఁడును, గుణభేదతః=సత్త్వాదిగుణములభేదమునుబట్టి, త్రిధా ఏవ =మూఁడువిధములు

యుండు (ప్రకారమును) జెప్పవలయునుగాన దానినే ముందు చెప్పుచున్నారని తెలియనది,

గానే, గుణసఙ్ఖ్యానే = గుణకార్యములను లెక్కపెట్టు ప్రకరణమందు, ప్రోచ్యతే=చెప్పఁబడుచున్నది. తాన్యపి=ఆ జ్ఞానాదులనుగూడ,యథావత్ =కలరూపున, శ్రుణు=వినుము.

తా. కర్తవ్యమైన కర్మమును గుఱించిన జ్ఞానమును, అనుష్ఠింపబడుచున్న *కర్మమును, దానిని అనుష్ఠించువాఁడును, సత్త్వాదిగుణముల భేదమునుబట్టి యొక్కొక్కటియు మూఁడువిధము లగునని చెప్పఁబడుచున్నవి. సత్త్వాదిగుణముల కార్యములను గణించునపుడు, ఆగుణములచే భేదము నొందిన యా జ్ఞానాదులనుగూడ వినఁదగినరీతిని వినుము.

శ్లో. సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20

టీ. విభక్తేషు= =బ్రాహ్మణాదిరూపములచేత విభజింపఁబడిన, సర్వభూతేషు=కర్మాధికారముగల సర్వప్రాణులయందును, ఏకం=జ్ఞానస్వరూపమగుటచే ఏకాకారముగల, భావం=ఆత్మయనెడి పదార్థమును, అవిభక్తం = (బ్రాహ్మణత్వాద్యాకారములతో నుండు భూతములు తెలుపు నిడుపు మొదలైన విభాగములు గలిగియుండియు జ్ఞానైకాకారమగు ఆత్మస్వరూపమున) విభాగరహితమైన దానినిగాను, అవ్యయం=(ఆ బ్రాహ్మణాదిశరీరములు వ్యయమునొందుచున్నను అది) నిర్వికారమైనదిగాను- ఫలాది సంగరూపమైనవికారము లేనిదిగా ననుట, యేన =ఏజ్ఞానముచేత, ఈక్షతే=చూచుచున్నాఁడో (తెలిసికొనుచున్నాఁడో)ఁ తత్ జ్ఞానం=ఆజ్ఞానమును, సాత్త్వికం =సత్త్వగుణమువలనఁ గలిగిన దానినిగా, విద్ధి=ఎఱుఁగుము.

తా. కర్మాధికారులైన సర్వభూతములను బ్రాహ్మణు లని

---

* పూర్వశ్లోకోక్తమైన జ్ఞేయమె యిచట కర్మముగాను పరిజ్ఞాతయె యిచట కర్తగాను చెప్పఁబడెను. జ్ఞాతృత్వకర్తృత్వములు అవస్థాభేదములే కాన రెండును ఏకవస్తువైన యాత్మకే కలుగు నని తెలియునది.

క్షత్రియులని, బ్రహ్మచారు లని గృహస్థు లని నానారూపముల విభక్తమై యున్నవి. ఇట్లని బ్రాహ్మణత్వము మొదలైన యనేకాకారములతోఁ గూడి తెలుపు నిడుపు మొదలైన నానావిభాగములు గలిగియుండియు వానియందుఁగల ఆత్మయనువస్తు వొకటి మాత్రము అంతటను జ్ఞానైకాకారమై యుండుటచే విభాగరహిత మైనదిగాను, ఆ బ్రాహ్మణాది శరీరములు వ్యయమును (వికారములను) బొందునట్టిస్వభావము గలవైనను ఆ యాత్మమాత్రము అవ్యయమైఫలాదిసంగమునకు అనర్హమైయుండునదిగాను, ఒకఁడు తాను కర్మ మనుష్ఠించువాఁడై యుండు సమయమున (అనఁగా నే నీకర్మమును జేయవలయును అని యనుసంధించునపుడు) ఏజ్ఞానముచే తెలిసికొనుచున్నాఁడో అట్టి జ్ఞానమే సాత్త్వికమైనదని తెలియుము.

శ్లో. పథృక్త్వేనతు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్॥ 21

టీ. సర్వేషు=సమస్తమైన, భూతేషు = బ్రాహ్మణాదిశరీరములందు, భావాన్=ఆత్మాఖ్యవస్తువులు, *పృథక్త్వేన=బ్రాహ్మణాద్యాకారములు వేఱువేఱగుటచేత, నానా=(స్వరూపమునందు) అనేకములైనవానినిగాను, పృథగ్విధాన్=తెలుపు నిడుపు మొదలైనగుణములనుబట్టి వేఱువేఱు విధములు గలవానినిగాను, యత్ జ్ఞానం=ఏజ్ఞానము, వేత్తి=ఎఱుఁగుచున్నదో, తత్ జ్ఞానం=అజ్ఞానము, రాజసం = రజోగుణమువలనఁ గలిగిన దానినిగా, విద్ధి= తెలిసికొనుము.

తా. బ్రాహ్మణాది సమస్త భూతములయందుఁ గలబ్రాహ్మణాద్యాకారములును (గుణములును) వేఱు వేఱగుటనుబట్టి వాని వానియం

* ఈశ్లోకమున పృథక్త్వశబ్దము బ్రాహ్మణాది జాతినిబట్టియు, నానా శబ్దము వస్తుస్వరూపమునుబట్టియు, పృథగ్విధశబ్దము గుణములనుబట్టియు ప్రయుక్తము లైనవిగాన పునరుక్తి లేదు.

దుండెడి ఆత్మవస్తువులు సైతము తెలుపు నిడుపు మొదలగు వేఱు పాటుచే వేఱువేఱైన (ఆకారములును గుణములును గల) వి యనియు, అవి ఫలాదిసంగమునకు యోగ్యమైనవి యనియు, కర్మాధికారసమయ మున నేజ్ఞానముచే నొకఁ డెఱుఁగునో అట్టిజ్ఞానము రాజస మైనదని తెలియుము. 20

శ్లో. యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహేతుకమ్
అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్ ॥ 22

టీ. యత్ జ్ఞానంతు = ఏజ్ఞానమైతే, ఏకస్మిన్ కార్యే=కర్తవ్య మైన (అనఁగా చేయవలయునదైన) యొకకర్మమునందే కృత్స్నవత్ = సమస్త ఫలసాధనమైన కర్మమునందువలె, సక్తం=ఆసక్తి గలదియు, అహేతుకం=అట్టిసంగమునకు తగిన హేతువు లేనిదియును, అతత్త్వార్థ వత్=యథార్థముకాని విషయము గలదియును (అనఁగా ఆత్మపదార్థ ములు స్వరూపస్వభావములందు పరస్పరభిన్నము లని తలంచునదియు), అల్పంచ = అల్పమైనదియునై యుండునో, తత్=అది, తామసం = తామసజ్ఞాన మని, ఉదాహృతం = చెప్పఁబడినది.

తా. అత్యల్పఫలము గల భూతప్రేతగణాద్యారాధనరూపమైన కర్తవ్యకర్మ మొకదానియందే సమస్తఫలసాధన మైన కర్మమునందు వలె నాసక్తిగలదియు, ఆకర్మము నిజమునకు సమస్త ఫలప్రదమైనది కానందున దానియం దట్టిసంగము కలిగి యుండుటకుఁ దగిన హేతువు లేనిదియు, పూర్వోక్తరాజసము నందువలెఆత్మపృథక్త్వాదులు గల వనెడి మిథ్యాభూతములైన యర్థములు గలదియు, అత్యల్పఫలము గలదియు, ప్రేతభూతాదుల నారాధించుటనుగుఱించిన దగుటచే నీచమైనదియు నై యుండు జ్ఞానమె తామసమని యుదాహరింపఁబడియున్నది.

అవ. ఇట్లు కర్తవ్యకర్మమును గుఱించినజ్ఞానము అధికారవేళ

యందు *అధికార్యంశమునుబట్టి గుణములచే మూఁడువిధము లైన దని చెప్పి, యిపుడు అనుష్ఠింపవలసినకర్మము గుణములచే మూఁడువిధము లగు నని చెప్పుచున్నారు.

23

శ్లో. నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే॥ 23

టీ. నియతం=తనవర్ణాశ్రమములకుఁ దగినదగు, యత్ కర్మ=ఏకర్మము, అఫలప్రేప్సునా=ఫలాపేక్ష లేనివానిచేత, సఙ్గరహితం=కర్తృత్వము మొదలగువాని సంగము లేకయు, అరాగద్వేషతః=కీర్తి యందు రాగమును అకీర్తి యందు ద్వేషమును లేకయును, కృతం=చేయఁబడినదో-దంభము లేక చేయఁబడినదోయనుట, తత్=ఆకర్మము, సాత్త్వికం=సత్త్వగుణమువలనఁ బుట్టిన దని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. ఫలేచ్ఛ లేనివానిచేత, స్వవర్ణాశ్రమోచిత మగు నేకర్మము కర్తృత్వాదులందు సంగము లేకయు, కీర్త్యకీర్తులందు రాగద్వేషములు వదలియు (అనఁగా డంభము లేకయు) అవశ్యము చేయఁదగినదే యను తలంపుతో నాచరింపఁబడు చున్నదో అయ్యది సాత్త్విక కర్మ మనఁ బడును.

శ్లో. యత్తు కామేప్సునా కర్మ సాహఙ్కారేణవా పునః
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్॥ 24

* 'కరణం కర్మకర్తాచ' అని కర్మము గరణకర్తృవిశిష్టమై యున్నది. ఇట్లు విశిష్టమై కర్మమునకును విశేషణమైనకర్త (అనఁగా అధికారి) ఒక యంశము అగును-కనుక అధికార్యంశ మనఁబడెను. ఆయధికారిని 'అవిభక్తమ్' అని అవిభక్తునిగాను 'పృథక్త్వేన' ఇత్యాదులచే విభక్తునిఁగాను అనుసంధించుటచేత కర్తవ్యకర్మవిషయజ్ఞానమునకు మూఁడువిధములు గలుగు ననియు నిట్లు కలుగుటకు మూలము గుణము లని యును భావము. సాత్త్వికజ్ఞానమున అవిభక్తుఁడుగాను రాజసతామసములందు పృథక్త్వాది యుక్తుడుగాను అనుసంధింపఁబడు ననుట.

టీ. పునః=మఱియును, కామేప్సునా=ఫలాపేక్ష గలవాఁడును, సాహఙ్కారేణవా = కర్తృత్వాభిమానముతోఁ గూడిన వాఁడు నైన యొకనిచేత, *బహులాయాసం=అధిక ప్రయాసకర మగు, యత్ కర్మతు =ఏకర్మమయితే, క్రియతే=చేయఁబడుచున్నదో, తత్ =అది, రాజసం= రాజసకర్మ మని, ఉదాహృతం=చెప్పఁబడియున్నది.

తా. 'అధిక ప్రయాసకర మగు నీకర్మము నాచేతనే చేయఁబడినది' అనెడి కర్తృత్వాభిమానము గలవానిచేత ఫలాపేక్షతో నే కర్మమాచరింపఁబడుచున్నదో అయ్యది రాజసకర్మ మనఁబడును.

22

శ్లో. అనుబన్ధం క్షయం హింసా మనవేక్ష్య చ పౌరుషమ్
మోహా దారభ్యతే కర్మ య త్త త్తామస ముచ్యతే. 25

టీ. అనుబన్ధం=(కర్మము చేసినప్పుడు దాని) వెంటనంటి వచ్చు దానిని- అనఁగా దుఃఖమును, క్షయం=(కర్మమునుజేయు నపుడు) ధననాశమును, హింసాం=అందలి ప్రాణిహింసయును, పౌరుషం చ=(కర్మమును నెఱవేర్చుతన) సామర్థ్యమును, అనవేక్ష్య = ఆలోచింపక, మోహాత్ =అజ్ఞానమువలన- పరమపురుష కర్తృత్వమును గుఱించిన అజ్ఞానమువలన, యత్ కర్మ = ఏకర్మము, ఆరభ్యతే = ఆరంభింపఁబడుచున్నదో, తత్ =అది, తామసం=తామసగుణమువలనఁ బుట్టిన దని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. కర్మమును జేసినపిదప వెంబడిని గలుగుచుండు దుఃఖమును, కర్మమును జేయుచుండఁగాఁ గలుగు ధననాశమును, అందలి ప్రాణిహింసయును, కర్మమును ముగించు తనసామర్థ్యమును విమర్శిం

* ఈకర్మమునకు మూలమైన రజస్సు, ప్రవృత్తియే ప్రధానముగాఁగలదై, వస్తువు యొక్క కలరూపునఁ బ్రకాశింపఁజేయక, దానిని గుఱించి వ్యర్థమైన ప్రయాసమును గలిగించున దగుటచే 'బహులాయాసమ్' అనఁబడినది.

పక, పరమాత్మ కర్తయని తెలియని యజ్ఞానమువలన నారంభింపఁబడు కర్మము తామసకర్మ మనఁబడును.

23

శ్లో॥ ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥ 26

టీ. ముక్తసఙ్గః = విడువఁబడిన ఫలసంగము గలవాఁడును(అసంగా ఫలాపేక్ష లేనివాఁడును), అనహంవాదీ=నేనే కర్తనని చెప్పునట్టిస్వభావము లేనివాఁడును- కర్తృత్వాభిమానము లేనివాఁడును, ధృతి ఉత్సాహసమన్వితః-ధృతి=ధృతితోను (కర్మమునారంభించి యది ముగియువఱకు వర్జింపరానిదై కలుగుదుఃఖమును ధరించుటతోననుట), ఉత్సాహ =ఉద్యుక్తమైయుండు మనస్సుతోను,సమన్వితః = కూడినవాఁడును, సిద్ధి అసిద్ధ్యోః=ప్రాప్తియందును అప్రాప్తి యందును, నిర్వికారః = వికారము నొందని చిత్తము గలవాఁడును అగు, కర్తా = కర్మముల నాచరించు వాఁడు, సాత్త్వికః = సత్త్వగుణ ప్రధానుఁడని, ఉచ్యతే = చెప్పఁబడు చున్నాఁడు.

తా. ఫలసంగము వదలి, తాను కర్తయను నభిమానము లేక, పూనినకార్యము ముగియువఱకు దుఃఖమేదియైన త్రోసిపుచ్చరాక కలిగినను దానిని దాల్చుకొని, ఉత్సాహము (ఉద్యుక్తమైన మనస్సును) గలిగి, యుద్ధాదికర్మముల యందు వాని కుపకరణము లైన ద్రవ్యార్జనాదులు సిద్ధించినను సిద్ధింపకయున్నను మనస్సున నేవికారమును లేక కర్మముల నాచరించువాఁడు సాత్త్వికకర్త యనఁబడును.

24 25

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ 27

టీ. రాగీ=యశస్సును గోరువాఁడును, కర్మఫలప్రేప్సుః=కర్మ

ఫలముఁబొంద నిచ్ఛగించువాఁడును, లుబ్ధః=కర్మమునకుఁగావలసిన ధన వ్యయముచేయు స్వభావము లేనివాఁడును, హింసాత్మకః = పరులను బీడించి వారినిగొని కర్మముసేయువాఁడును, అశుచిః=(కర్మమునకుఁగావలసిన) పరిశుద్ధిలేనివాఁడును, హర్షశోకాన్వితః=కర్మము సఫలమైనపుడు సంతోషముతోను విఫలమైనపుడు దుఃఖముతోను గూడినవాఁడును నగు, కర్తా=కర్మముల నాచరించువాఁడు, రాజసః=రజోగుణప్రధానుఁడని, పరికీర్తితః=చెప్పఁబడినవాఁడు.

తా. యశస్సును గోరువాఁడును, కర్మఫలం బపేక్షించువాఁడును కర్మమునకుఁ గావలసిన ధనవ్యయము చేయుస్వభావము లేనివాఁడును, పరులను బాధించి వారిచే తనకార్యమును జేయించువాఁడును, కర్మాపేక్షితమైనశుద్ధి లేనివాఁడును నై, యుద్ధాదికర్మములందు జయాదులు సిద్ధించినపుడు సంతోషమును అవి సిద్ధింపనపుడు దుఃఖమును జెందుచుఁ గర్మము లాచరించువాఁడు రాజసకర్త యనఁబడును.

శ్లో॥ అయుక్తః[26] ప్రాకృతః[27] స్తబ్ధః[28] శఠో[29] నైకృతికో[30]ఽలసః[31]
విషాదీ[32] దీర్ఘసూత్రీ[33] చ కర్తా తామస ఉచ్యతే ॥ 28

టీ. అయుక్తః=శాస్త్రీయకర్మమునకుఁదగనివాఁడును, ప్రాకృతః=విద్య నభ్యసింపనివాఁడును, స్తబ్ధః=ఆరంభము సేయని స్వభావముగలవాఁడును - పూజ్యులయెడనైతము త్వరపడి యవశ్యము సేయఁదగిన ప్రణామాద్యారంభము సేయక మిన్నకుండు వాఁ డనుట, శఠః=అభిచారాదికర్మములందాసక్తి గలవాఁడును, నైకృతికః = వంచనాపరుఁడును, అలసః=పను లారంభించియు వానిని మందముగా చేయువాఁడును, విషాదీ =మిక్కిలి ఖేదపడుస్వభావము గలవాడును, దీర్ఘసూత్రీచ =అభిచారాది కర్మములుచేయుచు పరులకు దీర్ఘకాలముగా అనర్థములు ఆలోచించుశీలము గలవాఁడును నగు, కర్తా = కర్మముల నాచరించు వాఁడు, తామసః = తమోగుణప్రధానుఁడని, పరికీర్తితః=చెప్పఁబడిన వాఁడు.

తా. శాస్త్రీయకర్మము లాచరింపఁదగనివాఁడును, విద్యాభ్యాసము లేమిచేత వివేకహీనుఁడును, ఆరంభముసేయుని శీలము గలవాఁడును, గూఢముగా అభిచారాద్యప్రియకర్మము లొనరించువాఁడును, వంచనాపరుఁడును, పనులనారంభించియు వానిని మందముగా జరపువాఁడును, అతిమాత్రము ఖేదపడు స్వభావము గలవాఁడును, అభిచారాదికర్మములు చేయుచుఁ బరుల కనర్థములు దీర్ఘకాలముగా నాలోచనసేయుచుండువాఁడును నై కర్మము లాచరించువాఁడు తామసకర్త యనఁబడును.

అవ. ఇట్లు కర్తవ్యకర్మమునుగుఱించిన జ్ఞానమునకును, కర్తవ్యమైన కర్మమునకును, అనుష్ఠాతకును, గుణములనుబట్టి కలుగుమూఁడేసి విధములు చెప్పఁబడినవి. ఇప్పుడు సర్వతత్త్వ సర్వపురుషార్థములనిశ్చయరూపమైన బుద్ధికిని ధృతికిని గుణములనుబట్టి కలుగుమూఁడేసివిధములను జెప్పుచున్నారు.

శ్లో. బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు
34
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ ॥ 29

టీ. హేధనఞ్జయ = ఓయర్జునా, గుణతః = సత్త్వాదిగుణములనుబట్టి, త్రివిధం = మూఁడువిధము లైనదియు, అశేషేణ = సంపూర్ణముగాను, పృథక్త్వేన = వేఱువేఱుగాను, ప్రోచ్యమానం = చెప్పఁబడుచున్నదియునగు, బుద్ధేః = వివేకపూర్వకమై నిశ్చయరూపముగుజ్ఞానముయొక్కయు, ధృతేశ్చైవ = ధృతి (అనఁగా ఆరంభించినక్రియకువిఘ్నము కలిగినను విడువక దాల్చుట) యొక్కయు, భేదం = భేదమును, శృణు = వినుము.

తా. బుద్ధి యనఁగా వివేకమును మున్నిడుకొని చేయునిశ్చయ
35
రూప మగుజ్ఞానము. ధృతి యనఁగా ఆరంభించిన క్రియకు విఘ్నము

కలిగినను విడువక దాల్చియుండుట. అట్టిబుద్ధియును ధృతియును సత్త్వాది గుణములనుబట్టి మూఁడువిధములై యుండును. అర్జునా, ఆయాభేదము లను వేఱు వేఱుగను సమగ్రముగను వివరించెదను వినుము.

36

శ్లో. ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే
బన్ధం మోక్షంచ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ॥ 30

టీ. హేపార్థ=ఓయర్జునా, ప్రవృత్తించ = శ్రేయస్సాధనమైన ధర్మమును, నివృత్తించ=మోక్షసాధనభూత మైనధర్మమును, కార్యాకార్యే = ఇది చేయఁదగినది యిది చేయరానిది యనియు, భయాభయే = శాస్త్రము నతిక్రమించుట భయస్థాన మనియు దాని ననువర్తించుట అభయస్థానమనియు, బన్ధం=సంసారమును, మోక్షంచ=సంసారమును వీడుటయు, యా=ఏ, బుద్ధిః=బుద్ధి- విచారపూర్వకనిర్ధారణ, వేత్తి= తెలిసికొనుచున్నదో, సా=అది, సాత్త్వికీ=సత్త్వగుణప్రధాన మైనది- అనఁగా వృద్ధి నొందిన సత్త్వగుణమువలనఁ గలిగినది.

తా. అర్జునా, ఐహికసుఖసాధన మగుప్రవృత్తిధర్మమును,మోక్ష సాధనమగు నివృత్తిధర్మమును యథావస్థితముగ నేబుద్ధి తెలియునో; ఈ రెంటిలో దేనినిగాని యవలంబించియుండు సర్వవర్ణములవారికి నా

37

యాదేశకాలావస్థావిశేషములందుఁ జేయఁదగిన దిది యనియు, చేయ రాని దిది యనియు నేది యెఱుఁగునో; శాస్త్రాతిక్రమణము భయహేతు వనియు, తదనువర్తనము అభయహేతువనియు, బంధము (అనఁగా, సంసారముయొక్క యాథాత్మ్యమును) మోక్షము (అనఁగా, సంసార

38

నివృత్తియొక్క యాథాత్మ్యమును) నేబుద్ధిచేతఁ దెలియఁబడునో యది సాత్త్వికబుద్ధి యనఁబడును.

శ్లో. యయా ధర్మ మధర్మంచ కార్యం చాకార్యమేవచ
అయథావ త్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ॥ 31

టీ. హేపార్థ = ఓయరునా, యయా = ఏబుద్ధిచేత, ధర్మం = ప్రవృత్తిరూపముగా ద్వివిధమైనధర్మమును, అధర్మం చ = అట్లుధర్మము కానిదానిని, కార్యంచ = చేయఁదగినదానిని, అకార్యంచైవ = చేయరాని దానిని, అయథావత్ = యథార్థము కానట్లుగా (కలరూపు కానట్లు), యయా = ఏబుద్ధిచేత, ప్రజానాతి = తెలిసికొనుచున్నాఁడో, సా - ఆ, బుద్ధిః = బుద్ధి, రాజసీ = రజోగుణప్రధాన మైనది.

తా. ప్రవృత్తినివృత్తిరూపముగ ద్వివిధ మైనధర్మమును, దానికి విపరీతమైనయధర్మమును, ఆయాధర్మములందు నిష్ఠులైనవారికి ఆ యా దేశకాలావస్థాదులందు ఇది చేయఁదగినదనియు, ఇది చేయఁదగని దనియు కలరూపునఁ దెలిసికొనఁజాలనిబుద్ధి రాజసబుద్ధి యనఁబడును.

శ్లో. అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసావృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ ॥ 32

టీ. హేపార్థ = ఓయర్జునా, యా = ఏ, బుద్ధిః = బుద్ధి, తమసా = అజ్ఞానముచేత, ఆవృతా (సతీ) = కప్పఁబడినదై, అధర్మం = నిషిద్ధధర్మ మును, ధర్మమితి = యుక్తధర్మముగాను, సర్వార్థాన్ = సమస్తవిషయ ములను, విపరీతాన్ చ = విరుద్ధములనుగాను, మన్యతే = తలఁచు చున్నదో, సా = ఆబుద్ధి, తామసీ = తమోగుణ ప్రధాన మైనది.

39

తా. అర్జునా, అజ్ఞానముచేఁ గప్పబడిన యే బుద్ధి, నిషిద్ధధర్మ మును యుక్తధర్మముగాను, అధర్మమును ధర్మముగాను, మఱియు ఉన్నయర్థమును లేనిదిగాను, లేనియర్థమును ఉన్నదిగాను, పరతత్త్వ మును అపరమైనదికాను, అపరమును పరమయినదిగాను, నిట్లే సమస్త విషయములను విపరీతములుగాఁ దెలియుచుండునో అది తామసబుద్ధి యనఁబడును.

శ్లో. ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేన్ద్రియ క్రియాః
యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ ॥ 33

టీ. పార్థ=అర్జునా, అవ్యభిచారిణ్యా=ఫలాంతరసంగము లేని, యోగేన = మోక్షసాధనభూత మగుభగవదుపాసనముచేత-ఇట్టియుపాసనమే ప్రయోజనముగాఁగలవాఁడై యనుట, యయాధృత్యా = ఏధృతిచేత-బుద్ధిదార్ఢ్యముచేత, మనఃప్రాణేన్ద్రియక్రియాః=మనస్సు ప్రాణము ఇంద్రియములు వీనియొక్క వ్యాపారములను, ధారయతే=నిలువఁబెట్టుచున్నాఁడో, సాధృతిః=ఆధృతి, సాత్త్వికీ=సత్త్వగుణప్రధాన మైనది.

తా. అర్జునా, ఒకడు ఫలాంతరసంగము లేక మోక్షసాధన మగు భగవదుపాసనమునకై ప్రవర్తించి తత్సాధనభూతము లగు మనస్సు మొదలగువానివ్యాపారములను ఏధృతిచేత ధరించునో అట్టిధృతి సాత్త్విక ధృతి యనఁబడును. 40

శ్లో, యయాతు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ రాజసీ॥ 34

టీ. హేపార్థ = ఓయర్జునా, ఫలాకాఙ్క్షీ=ఫలములను (అనఁగా ధర్మార్థకామములను) గోరువాఁడు ప్రసంగేన=మిక్కిలి సంగముతో, ధర్మకామార్థాన్ = ధర్మకామార్థములను- ధర్మార్థకామములకు సాధనభూతము లైన మనఃప్రాణేంద్రియ క్రియలననుట, యయాధృత్యా = ఏధృతిచేత, ధారయతే=ధరించుచున్నాఁడో, సా ధృతిః=ఆధృతి, రాజసీ= రజోగుణసంబంధము గలది.

తా. ఫలమును గాంక్షించి పురుషుఁడు మిక్కిలిసంగము చేత ధర్మకామార్థములను ఏధృతిచేత ధరించుచున్నాఁడో యాధృతి రాజసము. 'ధర్మకామార్థ' శబ్దముచేత దానికి సాధనభూతములైన మనఃప్రాణేంద్రియక్రియలు లక్షితము లగుచున్నవి. 'ఫలాకాఙ్క్షీ' అనుచోఁ గూడ ఫలశబ్దముచేత రాజసత్వమువలన ధర్మార్థకామములే వివక్షితములు. కాఁబట్టి ధర్మకామార్థములను గోరి మనఃప్రభృతుల వ్యాపార

ములు ఏధృతిచేత ధరింపఁబడుచున్నవో (జరుపఁబడుచున్నవో) యది రాజస మైన దని భావము.

శ్లో. యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ
న విముఞ్చతి దుర్మేధా ధృతి స్సా పార్థ తామసీ ॥ 35

టీ. హేపార్థ=ఓయర్జునా, దుర్మేధా=దుర్బుద్ధి గలపురుషుఁడు, యయా=ఏధృతిచేత, స్వప్నం=నిద్రను, మదం = విషయానుభవము వలనఁ గలిగినమదమును-అనఁగా ఈస్వప్నమదములను గుఱించి ప్రవర్తించు మనఃప్రాణాదిక్రియల ననుట, భయం = భయమును-అనఁగా భయమునిచ్చువిషయమును, శోకం=దుఃఖమును- అనఁగా దుఃఖప్రదమయిన విషయమును, విషాదం = చింతను-చింతావహమయిన విషయము ననుట- ఈభయశోకాదులకు సాధనభూతము లైన మనఃప్రాణాది క్రియలను సైతము, న విముఞ్చతి = విడువఁడో- అనఁగా ధరించుచున్నాఁడో, సా ధృతిః=ఆధృతి, తామసీ=తమోగుణప్రధాన మయినది.

తా. * భయశోకవిషాద శబ్దము లిచట భయశోకవిషాదముల నొసంగు విషయములనుగుఱించినవి. ఏధృతిచేత నిద్రను, విషయానుభవమువలనఁ బుట్టినమదమును (అనఁగా స్వప్న మదములనుగుఱించి కలుగు మనఃప్రాణాదుల క్రియలను), భయశోకవిషాదకరము లగు విషయములకు సాధనభూతము లైన మనఃప్రాణాదిక్రియలను, దుర్బుద్ధి యగు వాఁడు విడువఁడో (అనఁగా ధరించియుండునో), యాధృతి తామస మయినది.

---

* మద మనఁగా దైవాగత మగు ఉన్మాదులు గావనుటకై 'విషయానుభవజనిత' మనఁబడెను. స్వప్నాదులు స్వాధీనము లైనవిగావు; కా॥ వానిని బురుషుఁడు ధరించుట యశక్యము. కనుక స్వప్నాదులనుగుఱించి కలుగు మనఃప్రాణాదిక్రియలను ధరించుటగాఁ జెప్పఁబడినది. భయమును గలిగించువిషయములు దుర్మానమూలమగు ప్రబల విరోధాదులు; శోకమును గలిగించునవి క్రోధాదిమూలమగు బంధువధాదులు; విషాదమును గలిగించునవి వ్యర్థమైన ధనవ్యయాదులు.

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ

టీ. భరతర్షభ=అర్జునా, సుఖంతు = సుఖమయితే, త్రివిధం= గుణములచే మూఁడువిధములైనది, ఇదానీం=ఇప్పుడు, శ్రుణు=(వానిని) వినుము.

తా. పూర్వోక్తములైనజ్ఞానము కర్మము కర్త మొదలైనవి ఏసుఖమునకు శేషభూతములో యట్టిసుఖము గూడ గుణములనుబట్టి మూఁడువిధములైనది. ఆమూఁడువిధముల నిప్పుడు చెప్పెద వినుము.

శ్లో॥ అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తంచ నిగచ్ఛతి॥ 36

టీ. యత్ర=ఏసుఖమునందు, అభ్యాసాత్ =చిరకాలాభ్యాసము వలన, రమతే = (క్రమముగా నిరతిశయము మయిన) రతిని బొందునో, దుఃఖాన్తంచ = సకలసాంసారికదుఃఖములయొక్క నాశమును, నిగచ్ఛతి= పొందునో.

41

తా. ఒకఁడు ఏసుఖమునందుఁ జిరకాలాభ్యాసమువలనఁ గ్రమముగా నిరతిశయానందము నొందునో, దేనివలన సకల సాంసారికదుఃఖములను నశింపఁజేయునో

అవ. ఆసుఖమునే విశేషించి చెప్పుచున్నారు.

శ్లో॥ యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్

42

తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్॥ 37

టీ. యత్తత్ =ఏసుఖము, అగ్రే=మొదట (యోగము నారంభించునపుడు), విషమివ=విషము (దుఃఖము) వలెను, పరిణామే=పరిపాక కాలమునందు, అమృతోపమం (భవతి) = అమృతముతోఁ దుల్యమైన దగుచున్నదో, తత్ = అట్టి, ఆత్మబుద్ధి ప్రసాదజం-ఆత్మబుద్ధి=ఆత్మస్వరూపవిషయమైన బుద్ధియొక్క, ప్రసాదం=ప్రసన్నతచేత-సకలేతరవిషయములనుండి నివర్తించుటవలన, జం=కలిగెడి, సుఖం = సుఖము,

సాత్త్వికం=సత్త్వగుణప్రాధాన్యముచేఁ గలిగినదిగా, ప్రోక్తం=చెప్పఁబడినది.

తా. ఏసుఖము, యోగోపక్రమకాలమునందు బహుకష్టసాధ్యమగుటచేతను వివిక్తమైన శుద్ధాత్మస్వరూపము ననుభవించియుండకుండుట చేతను విషమువలె దుఃఖముగా నుండునో, పరిపాకదశయందు అభ్యాసబలమువలన వివిక్త మైనశుద్ధాత్మస్వరూపము పొడసూపుటచే నమృతమువలె భోగ్యముగను దోఁచుచుండునో, వివిక్తస్వభావ మగుఆత్మ ననుభవించుటవలనఁ బుట్టినయాసుఖము సకలేతరవిషయములనుండి నివర్తించిన దగుటచే ప్రసన్నమై ఆత్మవిషయమై యుండుబుద్ధివలనఁ గలుగుచున్నది. అట్టిసుఖమే 'సాత్త్విక' మని చెప్పబడినది. బుద్ధికి సకలమైన యితరవిషయములనుండి నివర్తించియుండుటయే ప్రసాదము.

శ్లో. విషయేన్ద్రియసంయోగా ద్యత్త దగ్రేఽమృతోపమమ్
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38

టీ. యత్తత్ =ఏసుఖము, విషయేన్ద్రియసంయోగాత్ =విషయయులతో నింద్రియములు సంబంధించుటవలన, అగ్రే=మొదట (అనుభవకాలమునందు), అమృతోపమం=అమృతముతోసమానమైనదియు, పరిణామే=అంతమందు - అన్నపానాదివిషయములను సుఖములనుగాఁ జేయు ఆఁకలిమొదలైన నిమిత్తములు నివర్తించినపిదప ననుట, విషమివ=(అది నరకాదిహేతు వగుటచే) విషమువలెను, (భవతి=అగుచున్నదో), తత్సుఖం=ఆసుఖము, రాజసం=రజోగుణప్రధాన మైన దని, స్మృతం=తలఁపఁబడినది.

తా. విషయములతో నింద్రియములు సంబంధించుటచేగలుగు నేసుఖం బనుభవకాలమునందు అమృతమువలె భోగ్యముగానుండునో, మఱి విషయములను (అనఁగా నింద్రియార్థము లైనయన్నపానాదులను) సుఖప్రదములనుగాఁ జేయు కారణము లైన క్షుత్తుమొదలైనవి నివర్తిం

పఁగా వానివలని సుఖము *నరకాదిహేతు వగుటచే విషపానమువలె ననుభవింపఁబడినదగునో, అట్టిసుఖమే రాజస మని తలఁపఁబడినది.

శ్లో॥ య దగ్రే చానుబన్ధేచ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్ ॥ 39

టీ. యత్సుఖం=ఏసుఖము, అగ్రేచ = అనుభవకాలమందును, అనుబన్ధేచ = పరిణామమందును, ఆత్మనః=తనకు, మోహనం=మోహహేతు వగుచున్నదో, నిద్రాలస్యప్రమాదోత్థం=నిద్రవలనను ఇంద్రియవ్యాపారమాంద్యమువలనను కార్యము లందజాగరూకతవలనను జనించిన, తత్=ఆసుఖము, తామసం=తామసగుణప్రధాన మైనదిగా, ఉదాహృతం=చెప్పఁబడినది.

43
తా॥ అనుభవవేళయందును విపాకమందును దనకు మోహహేతువై నిద్రవలనను ఆలస్యమువలనను ప్రమాదమువలనను గలుగునట్టి సుఖము తామససుఖమనఁబడును. ఇచట మోహ మనఁగా వస్తువుయొక్క కలరూపు తెలియకుండుట యని యభిప్రాయము. నిద్రాదులు అనుభవవేళయందును మోహహేతువులైనవిఁగనుక వానివలనఁబుట్టిన సుఖమును మోహహేతువగుచున్నది). నిద్ర మోహహేతు వగుట స్పష్టమే. ఆలస్య మనఁగా ఇంద్రియవ్యాపారమాంద్యము గనుక నిట్టి మాంద్యమువలన జ్ఞానమాంద్యమును తప్పక కలుగును. ప్రమాదమనఁగా కార్యములందు హెచ్చరికలేమి. కాఁబట్టి దీనివలనను జ్ఞానమాంద్యము కలుగును. కాఁబట్టి యారెండుగూడ మోహహేతువే యగును. (ఇట్లు మోహహేతువులైన నిద్రాదులవలనఁ బుట్టిన సుఖముసైతము మోహ

*వరదారాగమనాదులు మొదట అనుభవించునపుడు స్వల్పకాలము అతిసుఖప్రదములుగా నుండియు వానికి నిమిత్తములైన స్త్రీలు మొదలైనవారు నివర్తించినపిదప రాఁగలుగు భయదండనాదులచేతను నరకాదులచేతను విషపానముచేతవలె నతిదుఃఖావహము లగు నని భావము.

44

హేతువే యగు నని భావము). కాఁబట్టి ముముక్షువు రజస్తమస్సులను విడనాడి సత్త్వమునే స్వీకరింపవలయు నని యభిప్రాయము.

45 అవ.

శ్లో॥ న త దస్తి పృథివ్యాం వా దివి దేవేషువా పునః
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభి స్స్యా త్త్రిభిర్గుణైః॥ 40

టీ. యత్సత్త్వం = ఏప్రాణిజాతము, ప్రకృతిజైః = ప్రకృతివలనఁ బుట్టిన, ఏభిః = ఈ, త్రిభిః = మూఁడైన, గుణైః = సత్త్వాదిగుణములచేత, ముక్తం = విడువఁబడినది, స్యాత్ = అగునో, తత్ = అది, పృథివ్యాంవా = భూలోకమండలిమనుష్యాదులలో నైనను, పునః = మఱియును, దివి = స్వర్గాదిలోకమండలి, దేవేషువా = బ్రహ్మాది దేవతలలో నైనను, నాస్తి లేదు.

తా. భూమియందు మనుష్యులలోఁగాని దివియందు దేవతలలోఁ గాని (అనఁగా బ్రహ్మమొదలు స్థావరములవఱకును ప్రకృతిసంసర్గము గలిగియున్నవి గాన వానియందు) ప్రకృతివలనఁ బుట్టినయీమూఁడు గుణములనుండి విడివడిన ప్రాణి సమూహ మేదియుఁ గలుగదు.

46 అవ.

అవ. 'త్యాగేనైకే అమృతత్వ మానశుః' (తై.నా. ౧౦)ఇత్యాదులందు మోక్షసాధనముగా నిర్దిష్టమై యున్న త్యాగము సన్న్యాసశబ్దార్థమునకంటె వేఱుకాదనియు, కర్మములు చేయు చుండఁగానే వానియందలికర్తృత్వమును త్యజించుటే యాత్యాగమునకు మూలమనియు, పరమపురుషుఁడే కర్త యనెడియనుసంధానమువలననే ఫలకర్మత్యాగమును కర్తృత్వత్యాగమును గలుగు ననియుఁ జెప్పఁబడినది. ఈత్యాగములన్నియు సత్త్వగుణము వృద్ధినొందుటచేఁ గలుగునని గాన సత్త్వమే ఉపాదేయ మని తెలుపుటకొఱకు సత్త్వరజస్తమస్సుల కార్యభేదములు

ప్రపంచింపఁబడినవి. ఇప్పుడు మోక్షమునకు సాధనముగాఁ జేయఁబడు చున్న యిటువంటి కర్మము పరమపురుషారాధనరూపమే యగుననియు అట్లు అనుష్ఠింపఁబడినయాకర్మము భగవత్ప్రాప్తిలక్షణ మైన ఫలము నిచ్చుననియు ప్రతిపాదింపఁబూనినవారై, బ్రాహ్మణులు మొదలైన యధికారులకు వారివారిస్వభావముల నంటియుండుసత్త్వాదిగుణభేదము లనుబట్టి వారివారికి *వేఱువేఱుగా నేర్పడినదై కర్తవ్యమైన దై యుండు కర్మముయొక్క స్వరూపమునువారివారివృత్తులతోఁగూడ చెప్పుచున్నారు

47

శ్లో. బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరన్తప

48

కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః॥ 41

టీ. హేపరన్తప=ఓయర్జునా, బ్రాహ్మణక్షత్రియవిశాం=బ్రాహ్మణ క్షత్రియవైశ్యులకును, శూద్రాణాంచ=శూద్రులకును, కర్మాణి=వ్యాపారములు, స్వభావప్రభవైః = తమతమ జన్మములకుఁ గారణభూతమైన ప్రాచీనకర్మమువలనఁ బుట్టిన, గుణైః=సత్త్వాదిగుణములచేత, ప్రవిభక్తాని = విభజింపఁబడియున్నవి = వేఱువేఱుగ ప్రతిపాదింపఁబడియున్న వనుట.

తా. స్వభావ మనఁగా స్వకీయమైనభావము-బ్రాహ్మణాది జన్మములకు హేతువైన ప్రాచీనకర్మమని యర్థము. ఆకర్మమువలన పుట్టి

49

నవి సత్త్వాదిగుణములు. బ్రాహ్మణునికి స్వభావప్రభవ మైనది రజస్తమస్సుల నడంచుటచేఁ బుట్టినట్టి సత్త్వగుణము. క్షత్రియునికి స్వభావ ప్రభవము తమస్సత్త్వములను గ్రిందుపఱుచుటచేఁ బుట్టిన రజోగుణము. వైశ్యునికి స్వభావప్రభవము సత్త్వరజస్సులను గ్రిందుపఱచుటచే అల్పముగా ఉద్రేకించిన తమోగుణము. శూద్రునికి స్వభావప్రభవము రజస్సత్త్వముల నడంచుటచే మిక్కిలియు నుద్రేకించిన తమోగుణము.

స్వభావప్రభవము లైన యీగుణములతోఁ గూడి కర్మములను (వేఱు వేఱ యాయావర్ణములకు) విభక్తములుగావించి శాస్త్రములు ప్రతిపాదించుచున్నవి; బ్రాహ్మణాదు లిట్టిగుణములు గలవారు; వారికర్మము లివి; వారివృత్తు లివియనికదా వేఱువేఱ శాస్త్రములు విభజించి ప్రతిపాదించుచున్నవి.

శ్లో. శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మస్వభావజమ్॥ 42

టీ. శమః = బాహ్యేంద్రియనియమనమును, దమః=అంతఃకరణ నియమనమును, తపః=భోగనియమనరూపమై శాస్త్రసిద్ధమయిన కాయ క్లేశమును, శౌచం=శాస్త్రీయకర్మమునకుఁ దగిన శుద్ధియు, క్షాన్తిః= ఓర్పును, ఆర్జవం=మనస్సునం దుండునట్లే నడచుటయు (మనస్సునందును నడతయందును ఏకరూపముగా నుండుట), జ్ఞానం=పరావరతత్త్వ విషయమయిన వివేకమును, విజ్ఞానం=పరతత్త్వమందలి అసాధారణ విశేష విషయ మయినజ్ఞానమును, ఆస్తిక్యం= వేదార్థమంతయు సత్య మనెడిదృఢనిశ్చయమును (అనునవి), బ్రాహ్మం = బ్రాహ్మణజాతికితగిన, స్వభావజం = జన్మసిద్ధమయిన, కర్మ =కర్మము.

తా. బాహ్యేంద్రియ నిగ్రహమును, అంతఃకరణనిగ్రహమును, శాస్త్రసిద్ధ మయి భోగనియమనరూపమయిన కాయక్లేశమును, శాస్త్రీయ కర్మమునకుఁ దగియుండుట యనెడిశుచిత్వమును, పరులు బాధించినను చిత్తవికారము లేకుండుటయు, పరులయెడ మనస్సున నున్నట్లే బయటి నడతలను నెఱపుటయు, పరాపరతత్త్వముల యాథాత్మ్యమును గుఱించిన జ్ఞానమును, పరతత్త్వమందలి అసాధారణవిశేషముల నెఱుఁగుట యనెడి విజ్ఞానమును, వేదార్థమంతయు సత్య మనెడి ప్రకృష్టమయిన (అనఁగా ఏహేతువుచేతను గదల్చుటకు అశక్యమైన) నిశ్చయమును.

ఆస్తిక్యమును అనునివి బ్రాహ్మణునికి స్వభావసిద్ధములైన కర్మము లగును. 'పురుషోత్తముఁడును వాసుదేవుఁడును పరబ్రహ్మశబ్దవాచ్యుఁడు నైనభగవంతుఁడు నిరస్తనిఖిలదోషగంధుఁడును, స్వాభావికానవధికాతి శయజ్ఞానశక్త్యాద్యసంఖ్యేయ కల్యాణగుణ గణుఁడును, నిఖిలవేదవేదాంత వేద్యుఁడును అగును; అతఁడే నిఖిలజగదేకకారణమును, నిఖిలజగదా ధారభూతుఁడు నగును; అతఁడే నిఖిలమును బ్రవర్తింపఁజేయువాఁడు; వైదికములైన సమస్తకర్మములును అతనియారాధనములే యగును; అతఁడాయాకర్మములచే ఆరాధితుఁడై ధర్మార్థకామమోక్షరూప మైన ఫలము నిచ్చును' అనెడి యీవిషయము సత్యమె యగు ననునిశ్చయమే ఆస్తిక్యము. ఇదియే 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః' (గీ.౧౫-౧౫) 'అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే' (గీ. ౧౦-౮) 'మయి సర్వ మిదం ప్రోతమ్' (గీ. ౭-౭) 'భోక్తారం యజ్ఞతపసామ్...జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి' (గీ. ౫-౨౯) 'మత్తః పరతరం నాన్యత్ కిఞ్చి దస్తి ధనఞ్జయ' (గీ.౭-౭) 'యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్। స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః' (గీ. ౧౮-౪౬) 'యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్' (గీ. ౧౦-౩) ఇత్యాది గీతావాక్యములయందుఁ బ్రతిపాదింపఁబడియున్నది.

శ్లో. శౌర్యం[52] తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచా ప్యపలాయనమ్
దాన[53] మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ 43

టీ. శౌర్యం=యుద్ధమునందు నిర్భయముగఁ బ్రవేశించు సామర్థ్యమును, తేజః=పరులచేఁ దిరస్కరింపఁబడఁగూడమియు, ధృతిః= ఆరంభించిన కార్యమునందు విఘ్నములు కలిగినను విడువక నెఱవేర్చు సామర్థ్యమును, దాక్ష్యం=సర్వక్రియలను గొనసాగించు సామర్థ్యమును, యుద్ధే=యుద్ధమునందు, అపలాయనమపిచ = పాఱిపోవకుండుటయు,

దానం = తనద్రవ్యమును పరులసొమ్ముగా కావించునంతత్యాగమును, ఈశ్వరభావశ్చ=తన్నుఁ దప్ప తక్కినవారి నెల్ల నియమించుసామర్థ్య మును, (అనునివి), క్షాత్రం=క్షత్రియజాతికిఁ దగిన, స్వభావజం=జన్మ సిద్ధమైన, కర్మ=కర్మము.

తా. యుద్ధమునందు నిర్భయప్రవేశసామర్థ్యమును, పరులకుఁ బరిభవింపరాకుండుటయు; కార్య మారంభించినపిదప విఘ్నములు గలిగి నను దానిని ముగించుశక్తియు, సర్వక్రియల నిర్వర్తించుటకుఁ దగిన నేర్పును, యుద్ధమునందు తనకు మరణము నిశ్చయముగాఁ గలుగ నున్నను వెనుదీయకుండుటయు, తనద్రవ్యమును పరులసొమ్ముగాఁ జేయు నంతవఱకైన త్యాగమును, తన్నుఁదప్ప తక్కినవారినందఱ నియమించు సామర్థ్యమును, అనునివియన్నియు క్షత్రియజాతికి స్వభావజన్యమైన కర్మములు.

54 55 56 57

శ్లో. కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్

టీ. కృషిగోరక్షవాణిజ్యం=పైరుపెట్టుటయు గోసంరక్షణమును వర్తకమును, వైశ్యం=వైశ్యజాతికిఁ దగిన, స్వభావజం = ప్రాచీనకర్మ సిద్ధ మైన, కర్మ=కర్మము.

తా. పైరు పెట్టుటయు, పశుపరిపాలనమును, ధనసంచయహేతు భూతమై క్రయవిక్రయరూప మైనవ్యాపారమును, అనునివి వైశ్యజాతికి స్వభావసిద్ధ మైనకర్మములు.

శ్లో. పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ 44

టీ. అపి = మఱియు, పరిచర్యాత్మకం =సేవారూపమైన, కర్మ= కర్మము, శూద్రస్య=శూద్రజాతికి, స్వభావజం=ప్రాచీనకర్మ సిద్ధము.

తా. మఱియును, పూర్వవర్ణములు మూఁటికిని పరిచర్యచేయు టయే శూద్రునకు స్వభావసిద్ధమైనకర్మము, (ఇట ఆయావర్ణములకుఁ

జెప్పఁబడియుండుకర్మము లివియే యని తలంపరాదు.) నాలుగువర్ణముల వారును తమతమవృత్తులతోఁగూడ నాచరింపవలసిన శాస్త్రవిహిత యజ్ఞాదికర్మముల కిది ప్రదర్శకముగా చెప్పఁబడినది. యజ్ఞాదులు మొదటి[58] మూఁడువర్ణములవారికి సాధారణములుగదా. శమాదులును ఆమూఁడు[59] వర్ణములందలి ముముక్షువులకు సాధారణములు. (అయినను, శమాదులు బ్రాహ్మణులకుమాత్రము చెప్ప నెట్లు అన్నచో) బ్రాహ్మణులకు సత్త్వము స్వాభావికముగానే యుద్రేకించి యుండును గనుక శమదమాదులు వారికి సుఖముగాఁ గైకొనఁగూడునని తలఁచి అవి 'స్వభావజం కర్మ' అని చెప్పఁబడెను. క్షత్రియులకును వైశ్యులకును తమంత రజస్తమస్సులు ప్రధానములై యుండుటచే వారి కా శమదమాదులు గైకొనుట కష్టమని తలఁచి అవి వారికి లేవనఁబడెను. (కాని నిజముగా లేవని యభిప్రాయముకాదు.) బ్రాహ్మణుని వృత్తియో యాజనాధ్యాపనప్రతిగ్రహములు; క్షత్రియునివృత్తిజనపదపరిపాలనము; వైశ్యునివృత్తి పూర్వోక్తకృష్యాదులు;[60] శూద్రునికి కర్తవ్యమైనకర్మమును వృత్తియు రెండును మొదటి మూఁడువర్ణములవారికి పరిచర్య సేయుటయే.

61 అవతారిక.

శ్లో. స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరత స్సిద్ధిం[62] యథా విన్దతి త చ్ఛృణు॥ 45

టీ. స్వేస్వేకర్మణి=తనతనవర్ణాశ్రమోచితకర్మమునందు, అభిరతః=ఆసక్తిగల, నరః = మనుష్యుఁడు, సంసిద్ధిం = పరమపదప్రాప్తిని, లభతే=పొందుచున్నాఁడు, స్వకర్మనిరతః=స్వజాతికర్మమునం దాసక్తుఁడైనవాఁడు; సిద్ధిం=పరమపదమును, యథా=ఏప్రకారముగా, విన్దతి=పొందుచున్నాఁడో, తత్=ఆప్రకారమును, శృణు=వినుము.

తా. తనతన వర్ణాశ్రమోచితకర్మములం దనురక్తుఁ డగు నరుఁడు పరమపదము పొందును. స్వజాతికర్మములం దాసక్తుఁడగువాఁ డేవిధమునఁ బరమపదమునొందునో దానిని వినుము.

శ్లో. యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥ 46

టీ. యతః = సర్వకారణభూతుఁ డైన యేయీశ్వరునివలన, భూతానాం=ప్రాణులకు, ప్రవృత్తిః = ఉత్పత్తి మొదలగుప్రవర్తనము (కలుగుచున్నదో), ఇదం సర్వం=ఈసమస్తప్రపంచము, యేన = అంతర్యామి యైనయేయీశ్వరునిచేత, తతం=వ్యాపింపఁబడినదో, తం = ఆయింద్రాదులం దంతరాత్మయై యుండువానిని, మానవః=మనుష్యుఁడు, స్వకర్మణా=తనవర్ణాశ్రమోచితమైన కర్మముచేత, అభ్యర్చ్య=ఆరాధించి, సిద్ధిం=భగవత్ప్రాప్తిరూప మైనసిద్ధిని, విన్దతి=పొందుచున్నాఁడు.

తా. ఎవ్వనివలన సర్వభూతములకు ఉత్పత్త్యాది ప్రవృత్తులు కలుగుచున్నవో, ఎవ్వఁ డీసమస్తప్రపంచమునందును వ్యాపించియుండునో, అట్టినన్ను ఇంద్రాదులం దంతరాత్ముఁడై నెలకొనియున్నవానిని.

64

స్వవర్ణాశ్రమోచితకర్మముచే ఆరాధించి మానవుఁడు మత్ప్రసాదమువలన మత్ప్రాప్తిరూపమైనసిద్ధిని (అనఁగా మోక్షపదవిని) బొందును. 'నావలననే సర్వముఉత్పన్నమగుచున్నది. నేనేసర్వమును వ్యాపించియున్నాను' అనునది 'అహంకృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా। మత్తః పరతరం నా న్య త్కిఞ్చి దస్తి ధనఞ్జయ'। (గీ. ౭-౬) 'మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా' 'మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్' (గీ. ౯-౪) 'అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే' (గీ.౧౦-౮) ఇత్యాదులందు పూర్వమె ప్రతిపాదింపఁబడియున్నది.

65 అవ.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్

టీ. స్వధర్మః=తనంతనే కైకొనఁగూడినధర్మము-అనఁగా(ప్రకృతి సంసర్గము గలపురుషుని కాప్రకృతివలన ఇంద్రియవ్యాపారము తనంతనే కలుగును. కర్మయోగము ఇంద్రియవ్యాపారరూపమై యుండుటచేవానికి తనంతనె సుకరముగాఁ గైకొనఁగూడినధర్మ మగును గాన) కర్మయోగ మని యర్థము, విగుణోఽపి=గుణము లేనిదైనను, సు అనుష్ఠితాత్=చక్కఁగా అనుష్ఠింపఁబడు, పరధర్మాత్-పర=పరునియొక్క-అనఁగా కర్మయోగివలెఁగాక యింద్రియజయమునందు నిపుణుఁడైనపురుషుని యొక్క, ధర్మాత్=ధర్మమునకంటె-అనఁగా అట్టివానిధర్మమైన జ్ఞాన యోగముకంటెను, శ్రేయాన్=మేలైనది.

తా. ఇట్లు కర్తృత్వాదులను త్యజించి మదారాధనరూపముగా నుండునది స్వధర్మము-అనఁగా తనంతటనే కైకొనుటకు యోగ్యమైన ధర్మము-అనఁగా కర్మయోగాత్మక మగుధర్మము. ఇది ఇంద్రియవ్యాపారరూపమైయుండుటచే ప్రకృతిసంసర్గముగలవానికి సుకరముగాఁ గైకొనఁగూడినధర్మమగును. జ్ఞానయోగము సర్వేంద్రియముల నియమించునదిగావున ప్రమాదముతోఁగూడినదగును. అదిఇంద్రియజయనిపుణుఁడగుపురుషునికే శక్యమైన ధర్మము. మఱియు దానిని చక్కఁగా ననుష్ఠించుట యొకానొకప్పుడేకాని యెల్లప్పుడును కాదు. కాఁబట్టి కర్మయోగ మనెడుస్వధర్మము గుణరహితమైనను చక్కఁగా ననుష్ఠింపఁబడినపరధర్మ మగుజ్ఞానయోగమునకంటె మేలగును.

అవ. దానినే యుపపాదించుచున్నారు.

శ్లో స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥ 47

టీ. స్వభావనియతం=ప్రకృతిసంసృష్టుఁడైనవానికి స్వభావము చేతనే యేర్పడియుండునట్టి, కర్మ=కర్మమును, కుర్వన్=చేయువాఁడు,

కిల్బిషం=సంసారమును, న ఆప్నోతి=పొందఁడు.

తా. కర్మయోగము ఇంద్రియవ్యాపారసాధ్యమై యుండుటచే అది ప్రకృతిసంసర్గము గలవానికి స్వాభావికమైనదై సుసాధ్యమైయుండును. మఱియు నది ప్రమాదము లేనిది గాన దానిని చేయువాఁడు సంసారమును బొందఁడు. జ్ఞానయోగము నియతేంద్రియమనస్కునిచే సాధింపఁదగిన దగుటంబట్టి ప్రమాదయుక్తమై యుండుటచే అందు నిష్ఠ గలవాఁడు ప్రమాదమువలన సంసారమును పొందినను పొందును. కాఁబట్టి కర్మనిష్ఠయె శ్రేష్ఠ మని తృతీయాధ్యాయమునందు చెప్పఁబడిన దానిని మరల స్మరింపఁజేయుచున్నారు.

శ్లో. సహజం కర్మ కౌన్తేయ సదోష మపి న త్యజేత్
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ 48

టీ. కౌన్తేయ=అర్జునా, సహజం=స్వభావజన్యమైన, కర్మ=కర్మయోగము, సదోష మపి=కాయక్లేశాదిదుఃఖములతోఁ గూడినదైనను, న త్యజేత్=విడువఁగూడదు. అగ్నిః=అగ్ని, ధూమేన ఇవ=పొగచేతవలెనే, సర్వారమ్భాః=సమస్తకర్మారంభములును జ్ఞానారంభములును, దోషేణ=దుఃఖముచేత, ఆవృతాః హి=ఆవరింపఁబడినవిగదా.

67

తా. అర్జునా, కర్మయోగము కాయక్లేశాదిదుఃఖములతోఁ గూడినదైనను స్వాభావిక మైనదగుటచే సుకరమును ప్రమాదము లేనిదియు

68

నగును గాన దానిని విడువఁదగదు. అనఁగా జ్ఞానయోగాన్వితుఁడైనను కర్మయోగమునే చేయవలయుననుట. అగ్ని పొగచేతఁ గప్పఁబడి

69

యుండునట్లు సమస్తకర్మారంభములును జ్ఞానారంభములును కాయక్లేశాదిదుఃఖములతోఁ గూడియే యుండును. (ఇట్లు ఉభయవిధయోగ

70

ములును దుఃఖయుక్తములే యైనను) ఆ రెంటికి నింద్రియజయము భేదము-

కర్మయోగము సుకరమును అప్రమాదము నగును; జ్ఞానయోగము దానికి విపరీతముగా నుండును.

శ్లో॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః [71]
[72] నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి ॥ 49

టీ. సర్వత్ర=ఫలాదులయందంతట, అసక్తబుద్ధిః=సంగరహితమైనబుద్ధి గలవాఁడును. జితాత్మా = జయింపఁబడిన మనస్సుగలవాఁడును, విగతస్పృహః = ఆత్మకర్తృత్వమునందు స్పృహలేనివాఁడును, సన్న్యాసేన (యుక్తః) = ఫలసంగకర్తృత్వాదిత్యాగముతోఁ గూడినవాఁడునై, (కర్మకుర్వన్ =కర్మచేయుచు,) పరమాం=ఉత్తమమైన-అనఁగా జ్ఞాననిష్ఠకు ఫలమైన, నైష్కర్మ్యసిద్ధిం=సర్వేంద్రియవ్యాపారోపరతిరూపమైన ధ్యానయోగనిష్ఠను, అధిగచ్ఛతి= పొందుచున్నాఁడు.

తా. ఫలాదులయం దాసక్తి లేనిబుద్ధియు మనోనిగ్రహమును గలిగి, పరమపురుషుఁడే కర్త యని యనుసంధించుటవలన ఆత్మకర్తృత్వమునందు రక్తి వదలి, ఇట్లు త్యాగమునకంటె వేఱు కాదని నిర్ణయింపఁబడినసన్న్యాసముతోఁ గూడి, కర్మములు చేయుచు, పరమంబగునైష్కర్మ్యసిద్ధిని బొందుచున్నాఁడు-అనఁగా పరమంబగుటచే జ్ఞానయోగమునకుఁగూడ ఫలంబైనట్టిధ్యాననిష్ఠను బొందుచున్నాఁ డని యర్థము. సర్వేంద్రియకర్మోపరతిరూపమైన వక్ష్యమాణధ్యానయోగనిష్ఠను బొందుచున్నాఁడు.

శ్లో. సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే
సమాసే నైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50

టీ. కౌన్తేయ=అర్జునా, సిద్ధిం= ధ్యానసిద్ధిని, ప్రాప్తః=పొందినవాఁడు, యథా= ఏప్రకారముచేత, బ్రహ్మ=బ్రహ్మమును, ఆప్నోతి=పొందుచున్నాఁడో, తథా=ఆప్రకారమును, మే (సకాశాత్)=నావ

లన, సమాసేన=సంక్షేపముగా, నిబోధ=నిశ్చయముగ దెలిసికొనుము. యా=ఏది- ఏబ్రహ్మమును- ఆబ్రహ్మ మనుట, జ్ఞానస్య=ధ్యానరూప మైనజ్ఞానమునకు, పరానిష్ఠా=పరమప్రాప్యమో దానిని తెలిసికొను మని అన్వయము.

తా. ప్రాణముపోవువఱకు ప్రతిదినము నాచరించుచువచ్చిన కర్మ యోగముచే నిష్పన్నము కాఁదగుధ్యానసిద్ధిని బొందినవాఁడు, ఏప్రకా రము ప్రవర్తించుచున్నవాఁడై, ధ్యానరూపమైనజ్ఞానమునకు పరము ప్రాప్యమైన *(ఉత్కృష్టఫల మైన) బ్రహ్మమును (పరిశుద్ధాత్మస్వరూప మును) బొందునో యావిధమును సంక్షేపముగాఁ జెప్పెదను దెలిసి కొనుము.

శ్లో. బుద్ధ్యావిశుద్ధయా యుక్తోధృత్యాఽఽత్మానంనియమ్యచ
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్యచ ॥ 51
వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ 52
అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే ॥ 52

టీ. విశుద్ధయా=పరిశుద్ధమైన-యథావస్థితాత్మతత్త్వమును గుఱిం చిన యనుట, బుద్ధ్యా=నిర్ధారణతో, యుక్తః=కూడినవాఁడును, ధృత్యా =ధైర్యముచేత, అనఁగా సాత్త్వికబుద్ధిదార్ఢ్యముచేత, ఆత్మానం=మన స్సును, నియమ్యచ=కట్టుపఱిచియు- విషయములకు విముఖముగను యోగమునకు యోగ్యమైనదిగను జేసికొనియనుట, శబ్దాదీన్ విష యాన్=శబ్దాదివిషయములను, త్యక్త్వా=విడిచియును- సన్నిహితములు

*పరిశుద్ధాత్మస్వరూపప్రాప్తి పరమఫలము. దానిని ధ్యానయోగ మను నుపాయ ముచేతఁ బొందఁదగును. అట్టిధ్యానయోగమునం దేవిధముగఁ బ్రవర్తించుటచేత నా ఫలముఁ బడయఁదగునో యావిధము చెప్పఁబడు నని యభిప్రాయము.

కానివానినిగాఁ జేసియు ననుట, రాగద్వేషౌ = రాగద్వేషములను, వ్యుద స్యచ = పరిత్యజించియును, వివిక్తసేవీ = ధ్యానవిరోధిరహితమైన ప్రదే శమునందు నివసించువాఁడును, లఘ్వాశీ=మితభోజనము గలవాఁడును, యత వా క్కాయ మానసః = ధ్యానయోగ్యములుగాఁ జేయఁబడిన మనోవాక్కాయములు గలవాఁడును, నిత్యం=ఎల్లపుడు, ధ్యానయోగ పరః=ధ్యానమునం దాసక్తుఁడును, వైరాగ్యం=ధ్యానించువిషయమును తప్ప తక్కినవానియందు విరక్తిని, సముపాశ్రితః=పొందినవాఁడును నై, అహఙ్కారం=శరీరము నం దాత్మాభిమానమును, బలం= అట్టియభి మానమునకు హేతుభూతమైన వాసనాబలమును, దర్పం=గర్వమును, కామం=కామమును, క్రోధం = కోపమును, పరిగ్రహం=విషయసంగ్ర హమును, విముచ్య=విడిచి, నిర్మమః=తనది కానివానియం దెల్ల తనది యనుమమత లేనివాఁడు నై, శాన్తః=ఆత్మానుభవమునందే సుఖము గలవాఁడును అగుపురుషుఁడు, బ్రహ్మభూయాయ=పరిశుద్ధాత్మస్వరూ పము ననుభవించుటకు, కల్పతే=తగు చున్నాఁడు.

తా. యథావస్థిత మగు ఆత్మతత్త్వమునుగుఱించిన బుద్ధితోఁ గూడినవాఁడై ధృతిచేత మనసును విషయములనుండి మఱలించి దానిని యోగమునకుఁ దగినదిగాఁ జేసికొని, శబ్దాదివిషయములను సన్నిహిత ములు కాకుండునట్లు చేసికొని, వానివలనఁ గలిగెడి రాగద్వేషముల నిరాకరించి, ధ్యానవిరోధు లొక్కటియు లేని విజనస్థలమునందు నివసిం చుచు, మిక్కిలి తినుటయు తినకయె యుండుటయు రెండును లేనివాఁడై, మనోవాక్కాయములవృత్తులను ధ్యానమున కభిముఖములుగాఁ జేసికొని మరణపర్యంతముప్రతిదినము ను ధ్యానయోగమునం దాసక్తుఁడై, తనకు ధ్యానయోగ్య మగుతత్త్వముతప్ప తక్కినవానియందు దోషములను గనుఁగొనుటచే వానియం దెల్ల విరక్తిని వృద్ధిచేసికొనుచు, శరీరమునం

దాత్మాభిమానమును, అట్టియభిమానవృద్ధికి హేతు వగు పూర్వకర్మ
74
వాసనాబలమును, దానివలనఁ గలుగు దర్పమును (అమార్గప్రవర్తన
మును) కామమును క్రోధమును పరిగ్రహమును వదలి, తనవి కానివాని
యందెల్లఁ దనవియనుబుద్ధి లేక, ఆత్మానుభవమొకటియే సుఖముగాఁ
గలిగియుండువాఁడు ధ్యానయోగము చేయుచు బ్రహ్మభావమునకు దగ్గ
డగును- అనఁగా సర్వబాధవిముక్తుఁడై స్వస్వరూపమున నున్నయాత్మ
ననుభవించు నని యర్థము.

75 అవతా-

76
శ్లో. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ 54

టీ. బ్రహ్మభూతః=శుద్ధాత్మస్వరూపమును బొందినవాఁడు, ప్రస
న్నాత్మా=కర్మసంబంధముచేత కలుషముకాని స్వరూపముగలవాఁడై,
న శోచతి = శోకింపఁడు, న కాఙ్క్షతి=కోరఁడు, సర్వేషు=సమస్తము
లైన, భూతేషు = ప్రాణులయందు, సమః = (అనాదరముచూపుట
యందు)సముఁడై, పరాం=పరమమైన,మద్భక్తిం = నాయందలి భక్తిని,
లభతే=పొందుచున్నాఁడు.

తా. ఆవిర్భవించిన అపరిచ్ఛిన్నజ్ఞానమె ఆకారముగాఁగలిగి
'ఇతస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్' అని చెప్పబడినట్లు నాకు శేష
భూతమై యుండుటె స్వభావముగాఁగలిగియుండు శుద్ధాత్మస్వరూపమును
77 78
బొందినవాఁడు, క్లేశకర్మాదులచేత కలుషము నొందని స్వరూపము
79
గలవాఁ డగుటచే నాకంటె నితరమగు నేప్రాణినిగూర్చి శోకించుటయు
లేదు; దేనిని గోరుటయు లేదు. మఱి యేమనిన, నేనుదప్పఁ దక్కిన
80
సమస్తభూతములయందును సమానముగా అనాదరభావము చూపుచు

81
సకలవస్తువులను తృణముగా నెంచుచు నున్నవాఁడై నాయందలి పర
82
భక్తిని లభించుచున్నాఁడు. అనఁగా, సర్వేశ్వరుఁడును నిఖిలజగదుద్భవ
స్థితిప్రళయములే లీలలుగాఁ గలవాఁడును, నిరస్తసమస్తహేయగంధుఁ
83 84
డును, అనవధికాతిశయాసంఖ్యేయకల్యాణగుణగణైకతానుండును, లావ
85 86
ణ్యామృతసాగరుఁడును, శ్రీమంతుఁడును, పుండరీకనయనుఁడును; తన
స్వామియు నగు నాయందు అత్యంతప్రియానుభవరూపమైన పరభక్తిని
లభించుచున్నాఁడు.

అవ. అట్టిభక్తికి ఫలము చెప్పుచున్నారు.

శ్లో. భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥ 55

టీ. (అహం = నేను), యః = స్వరూపస్వభావములనుబట్టి యెవఁ
డను, యావాన్ చ = గుణములను విభూతులనుబట్టి యెంతటివాఁడను,
అస్మి = అగుచున్నానో, మాం = అట్టినన్ను, భక్త్యా = పరభక్తిచేత,
తత్త్వతః = యథార్థముగా, అభిజానాతి = తెలిసికొనుచున్నాఁడు, తత్త్వతః =
యథార్థముగా, జ్ఞాత్వా = తెలిసికొని, తదనన్తరం = అటుపిమ్మట,
తతః = ఆపరభక్తివలన, మాం విశతే = నన్నుఁ బొందుచున్నాఁడు.

తా. స్వరూపస్వభావములనుబట్టి నే నెవఁడనో, గుణములను
విభూతులనుబట్టి నేనెంతటివాఁడనో, అట్టినన్ను నిటువంటి పరభక్తిచేతఁ
గలరూపున గుఱుతెఱుఁగుచున్నాఁడు. అట్లు తత్త్వజ్ఞానము కలిగిన
పిమ్మట ఆ పరభక్తివలననే నన్నుఁ బొందుచున్నాఁడు—అనఁగా తత్త్వతః
(కలరూపున) భగవంతుని స్వరూప స్వభావ గుణవిభూతులను దర్శించిన
పిమ్మటఁ గలుగునట్టి అనవధికాతిశయభక్తిచేత నన్నుఁ బొందుచున్నా

డని యర్థము. ఇచట భగవత్ప్రాప్తికి హేతువుగా నిర్దేశింపఁబడిన భక్తియే 'తతః' అని చెప్పఁబడుచున్నది. ఏలన, 'భక్త్యా త్వనన్యయా శక్యః' అని యాభక్తియే తత్త్వతః ప్రవేశమునకు (భగవత్ప్రాప్తికి) హేతువుగాఁ జెప్పఁబడియున్నది.

అవ. ఇట్లు వర్ణాశ్రమోచితనిత్యనైమిత్తికకర్మములు వాని ఫలాదులను విడిచి పరమపురుషారాధనములుగా ననుష్ఠింపఁబడునేని, వాని వలనఁ గలుగు విపాకము (అనఁగా సిద్ధి) చెప్పఁబడినది. ఇప్పుడు కామ్యకర్మములనుగూడ ఈ చెప్పఁబడిన ప్రకారముననే అనుష్ఠించినయెడల నదియే విపాకము గలుగునని చెప్పుచున్నారు.

శ్లో. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. 56

టీ. సదా=ఎల్లప్పుడు, మద్వ్యపాశ్రయః = నేనే ఆధారముగాఁ గలవాఁడై (అనఁగా కర్తృత్వము నాయందుంచినవాఁడై), సర్వకర్మాణ్యపి = (నిత్యనైమిత్తికకర్మములే కాక) సమస్త కామ్యకర్మములనుగూడ, కుర్వాణః=చేయువాఁడు, మత్ప్రసాదాత్ =నాయనుగ్రహమువలన, శాశ్వతం=నిత్యుఁడైనట్టియు, అవ్యయం=నిర్వికారుఁడైనట్టియు, పదం=ప్రాప్యమును-పొందఁదగిననన్ను, అవాప్నోతి=పొందుచున్నాఁడు.

తా. నిత్యనైమిత్తిక కర్మములనే కాక సమస్తకామ్యకర్మములనుగూడ, ఎల్లప్పుడును నాయందు కర్తృత్వాదికమును సన్న్యసించి చేయువాఁడు నాయనుగ్రహమువలన శాశ్వతమును అవికలమును అగు పదమును బొందుచున్నాఁడు. అనఁగా (నిత్యుఁడును అవ్యయుఁడును అగు) నన్నుఁ బొందుచున్నాఁడని యర్థము.

అవ. కాఁబట్టి.

శ్లో. చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ॥ 57

టీ. *చేతసా=(ప్రత్యగాత్మ యీశ్వరుఁడైన నాయొక్కవాఁడు నాకు నియామ్యుఁడు అనియెడి) బుద్ధితో, సర్వకర్మాణి=సమస్తకర్మములను, మయి=నాయందు, సన్న్యస్య=విడిచి, మత్పరః=నేనే ఫలముగా పొందఁదగినవాఁ డని తలంచుచు, బుద్ధియోగం=ఈబుద్ధియోగమును, ఉపాశ్రిత్య=ఆశ్రయించి, సతతం=ఎల్లప్పుడు, మచ్చిత్తః=నాయందు మనస్సుగలవాఁడవు, భవ=అగుము.

తా. 'మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా' అని మున్ను చెప్పఁబడినట్లు, ఆత్మ నావాఁడు నా నియమనమునకు లోనైనవాఁడు అనియెడిబుద్ధితో, సమస్తకర్మములను వానికర్తలతోను వానిచే ఆరాధ్యములైనవానితోను నాయందర్పణము చేసి, నేనె ఫలముగా పరమప్రాప్యుఁ డని యనుసంధించి కర్మములు చేయుచు, ఇట్టియీబుద్ధియోగమునే యాశ్రయించి యెల్లప్పుడు నాయందు చిత్తముగలవాఁడవు కమ్ము.

శ్లో. మచ్చిత్త[87] స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథచే[88] త్త్వ మహఙ్కారా న్నశ్రోష్యసి[89] వినఙ్క్ష్యసి[90]॥ 58

టీ. మచ్చిత్తః=నాయందు చిత్తము గలనీవు, సర్వదుర్గాణి =

* ఇచట 'చేతసా' అనుటకు ఆత్మ మదీయమును మన్నియామ్యమును అగుననెడిబుద్ధి యని యర్థము. ఏలన, ఇట్టిబుద్ధిచేతనే భగవంతునియందు 'సర్మకర్మాణి సన్న్యస్య' అని కర్మసన్న్యాసము చేయఁగూడును. ఈవిషయమే 'మయి ... చేతసా' అని పూర్వము చెప్పఁబడియున్నది. మఱియు నిచట 'బుద్ధియోగమ్' అనుటకు 'ఈ బుద్ధియోగమునే యని యర్థము చెప్పఁబడినది. 'ఈ' యనుట, ఈపూర్వోక్తములైనవియు ముముక్షువునకే కలుగుననియు నైన పరమపురుషకర్తృత్వానుసంధానాదు లన్నిటిని గుఱించినది యని తెలియునది.

సమస్తసాంసారికకష్టములను, మత్ప్రసాదాత్=నాయనుగ్రహమువలన, తరిష్యసి=దాటఁగలవు,అథ=ఇఁకను-ఇట్టియుపదేశానంతరము సైతము, త్వం=నీవు, అహఙ్కారాత్=అహంకారమువలన - 'ఇది కృత్య మిది యకృత్య మని నేనే యెఱుఁగుదు'నను అభిమానముతో నని, నశ్రోష్యసిచేత్=(నామాటలు) విన వేని వినఙ్క్ష్యసి=చెడిపోదువు.

తా. ఇట్లు నాయందు మనస్సు నిలిపి సమస్తకర్మముల నాచరింతు వేని, నాయనుగ్రహమువలననే దుస్తరము లైన సమస్త సాంసారికకష్టములను తరింపఁగలవు. ఇఁక 'కృత్యాకృత్యవిషయముల నన్నిటిని నేనె యెఱుఁగుదు' ననియెడిభావమువలన నేను జెప్పినది వినవైతి వేని నాశము నొందఁగలవు. ఏలనఁగా, సమస్తమైన ప్రాణిసమూహము యొక్క కృత్యాకృత్యముల నెఱిఁగినవాఁడును వానిని శాసించువాఁడును నాకంటె వేఱొక్కఁడు లేఁడు. (కనుక నేను జెప్పి శాసించునట్లు నడచుకొనుము, స్వాతంత్ర్యము వల దని భావము.)

91 అవ.

శ్లో. య దహఙ్కార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే [92] [93]

మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి ॥ [94] 59

టీ. అహఙ్కారం=(నా హితాహితములను నేనే స్వతంత్రముగా నెఱుఁగుదు ననెడి) స్వాతంత్ర్యాభిమానమును, ఆశ్రిత్య=అవలంబించి, నయోత్స్యేఇతి=యుద్ధముచేయనని, మన్యసే యది=తలంతు వేని, తే=నీయొక్క, ఏషః=ఈస్వతంత్రమైన, వ్యవసాయః=నిశ్చయము, మిథ్యా=అసత్యము, (భవిష్యతి=కాఁగలదు), ప్రకృతిః=నీస్వభావము, త్వాం=నిన్ను, నియోక్ష్యతి=నియోగింపఁగలదు.

తా. 'నా హితాహితముల నేనె యెఱుఁగుదు' ననెడి స్వాతంత్ర్యాభిమానముచేత నానియోగము నాదరింపక యుద్ధము చేయ నని

నీవు తలంచితివేనియు, నీ యీ స్వాతంత్ర్య వ్యవసాయము వ్యర్థమే కాఁగలదు. ఏలన, నా స్వాతంత్ర్యము నొల్లనియజ్ఞుండ వగునిన్ను
95
*ప్రకృతియె యుద్ధమునందు నియోగింపఁగలదు.

అవ. దాని నుపపాదించుచున్నారు.

శ్లో. స్వభావజేన కౌన్తేయ నిబద్ధ స్స్వేన కర్మణా
96 97
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్॥ 60

టీ. హేకౌన్తేయ = ఓయర్జునా, యత్ = ఏయుద్ధమును, మోహాత్ = అజ్ఞానమువలన, కర్తుం = చేయుటకు, నఇచ్ఛసి = ఇచ్ఛగింపవో, తత్ = ఆయుద్ధమును, స్వభావజేన = నీక్షత్రియస్వభావమువలనఁ గలిగిన, స్వేన = నీయసాధారణమైన, కర్మణా = శౌర్య మనెడికర్మముచేత, నిబద్ధః = కట్టఁబడినవాఁడవు గనుకనే, అవశః అపి = పరవశుఁడ వయ్యును, కరిష్యసి = చేయఁబోవుచున్నావు.

తా. క్షత్రియునకు స్వభావజనిత మయినకర్మము శౌర్యము గదా. అట్టిస్వభావజనితమైన శౌర్య మనెడిస్వకర్మముచేతఁ గట్టువడి,
98
దానివలననే పరవశుఁడవై, ఇపు డజ్ఞానమువలనఁ జేయనొల్లని యుద్ధమును పరుల తిరస్కారమునకు సైఁపక నీవే చేయఁగలవు.

99 అవతారిక–

అవ. సర్వేశ్వరుండగు నేను, సమస్తభూత సమూహమును వాని
100
పూర్వకర్మమున కనుగుణముగా ప్రకృతిని అనువర్తించు నట్లు నియమించియున్నాను. దానిని వినుము.

---

* రజోగుణరూపమునఁ బరిణమించిన నీక్షత్రియస్వభావమే, నీకహితముగాఁ దోఁచెడియుద్ధమునందు నిన్నుఁ బ్రవర్తింపఁజేయును. యుద్ధము చేయ ననియెడి నీనిశ్చయము యబద్ధ మగును.

శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥ 61

టీ. హే అర్జున = ఓయర్జునా, యన్త్రారూఢాని = దేహేంద్రియ రూపమునఁ బరిణమించిన ప్రకృతి యనెడియంత్రము నధిష్ఠించిన, సర్వ భూతాని = సమస్తప్రాణులను, మాయయా = సత్త్వాదిగుణమయమైన తన ప్రకృతిచేత, భ్రామయన్ = ప్రవర్తింపఁజేయుచు, ఈశ్వరః=సర్వ నియంతయగు వాసుదేవుఁడు, సర్వభూతానాం=సమస్తప్రాణులయొక్క, హృద్దేశే=సకలప్రవృత్తినివృత్తులకు మూల మైనట్టి జ్ఞానోదయమునకుఁ బ్రదేశమైన హృదయమునందు, తిష్ఠతి=ఉన్నాఁడు.

తా. అర్జునా, సర్వనియమనశీలుఁడగు వాసుదేవుఁడు తనచేతనే నిర్మింపఁబడినదై దేహేంద్రియరూపమున నుండు ప్రకృతి యనెడి
101
యంత్రము నారోహించి యున్న సమస్తప్రాణులను, సత్త్వాదిగుణమయ
102
మైన తనమాయచేత గుణానుగుణముగాఁ బ్రవర్తింపఁజేయుచు, సకల ప్రవృత్తినివృత్తులకు మూలమైనట్టి జ్ఞానోదయమునకు ప్రదేశమగు వాని హృదయమునందున్నాఁడు. ఈవిషయము పూర్వముకూడ 'సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ' (గీ.౧౫-౧౫) అనియు 'మత్తస్సర్వం ప్రవర్తతే' (గీ.౧౦-౮) అనియుఁ జెప్పఁబడి నది. 'య ఆత్మనితిష్ఠన్' (బృ.౫-౭-౨౨) ఇత్యాదిశ్రుతులును దీనిని ప్రతి పాదించి యున్నవి. 103

104 అవ.

అవ. ఈమాయ నివర్తించుటకు హేతువుఁ జెప్పుచున్నారు.

శ్లో. త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥ 62

టీ. భారత=అర్జునా, సర్వభావేన=సమస్తప్రకారములచేతను, తమేవ=అట్టిసర్వనియంత యగు ఈశ్వరునే, శరణం గచ్ఛ = అనువర్తింపుము, తత్ప్రసాదాత్ = ఆయీశ్వరానుగ్రహమువలన, పరాం= ఉత్తమమైన, శాన్తిం=సర్వకర్మబంధనివృత్తిని, శాశ్వతం = నిత్యమైన పునరావృత్తిరహితమైన స్థానం = పరమపదమునును, ప్రాప్స్యసి = పొందఁగలవు.

తా. అర్జునా, యిట్లగుటంబట్టి (స్వతంత్రుఁడై) సర్వమును
105
శాసించువాఁడయ్యును ఆశ్రితవాత్సల్యముచేత (నీకుఁ బరతంత్రుఁడై) సారథ్యమునందు నెలకొనియు, 'ఇట్లు చేయుము' అని శాసించుచును,
106
ఉన్నట్టివానినే సర్వప్రకారముల ననువర్తింపుము. అట్లు గాక మఱియొక విధము చేసినచో, అజ్ఞుఁ డగునీవతనిమాయచే ప్రేరితుఁడవై యుద్ధాదులను జేయుట తప్పదు. అట్లయినచో నశింపఁగలవు. కావున నతఁడు
107
చెప్పిన ప్రకారమున యుద్ధాదులను జేయుము. ఇట్లు చేయుచు అతని ప్రసాదమువలన సర్వకర్మబంధోపశాంతిని శాశ్వతమైనపరమపదమునుఁ
108
బొందఁగలవు. ఈపదమునే తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూ
109
రయః' (తై. సం. ౧-౩-౬; ౪-౨-౯.) తే హ నాకం మహిమాన స్స
110
చన్తే యత్రపూర్వే సాధ్యా స్సన్తిదేవాః' (తై. ఆర. ౩-౧౨) యత్ర
111
ఋషయః ప్రథమజా యే పురాణాః' (తై. సం. ౪-౭-౧౩) 'పరేణ
112
నాకం నిహితం గుహాయాం' (తై. నారాయణే. ౧౦-౨౧) 'యో అస్యా
113
ధ్యక్షః పరమేవ్యోమన్' (తై. బ్రాహ్మ. ౨-౮-౯) 'అథ య దతః పరో

114
దివో జ్యోతిర్దీప్యతే' (ఛా.3-13-7) 'సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్' (కఠ. 1-3-9) ఇత్యాదిశ్రుతిశతములు ప్రతిపాదించు చున్నవి.

115 అవ.

116 117 118
శ్లో. ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63

టీ. ఇతి=ఈప్రకారమున, గుహ్యాత్ = రహస్యమునకంటె, గుహ్యతరం=అతిరహస్యమైన, జ్ఞానం=కర్మయోగ జ్ఞానయోగ భక్తి యోగవిషయమైనజ్ఞానము, మయా = నాచేత, తే=నీ కొఱకు, ఆఖ్యాతం =చెప్పఁబడినది, ఏతత్ =దీనిని, అశేషేణ=సాకల్యముగా. విమృశ్య= విమర్శించి, యథా = ఏప్రకారము, ఇచ్ఛసి=ఇచ్ఛగింతువో, తథా =అట్లు, కురు=చేయుము.

తా. ఇట్లు ముముక్షువుల కెఱుఁగవలసినదై రహస్యములకెల్ల రహస్యతరమై కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగవిషయమై యొప్పు
119
జ్ఞానమునంతయు నీ కుపదేశించితిని. దీనినంతయు చక్కఁగా విమర్శించి
120 121
నీయధికారమున కనురూపముగా నీవు కోరినట్లు చేయుము - అనఁగా కర్మయోగమునో జ్ఞానయోగమునో భక్తియోగమునో నీయిష్టమైన దాని ననుష్ఠింపు మని యర్థము.

122 అవ.

123 124 125
శ్లో. సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః
126
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్॥ 64

టీ. సర్వగుహ్యతమం=రహస్యము లన్నిటిలో అతిరహస్యమైన దియు, పరమం=గొప్పదియునగు, మే=నాయొక్క, వచః=భక్తియోగ విషయమైనమాటను, భూయః=మఱల, శృణు=వినుము, మే=నాకు, (త్వం=నీవు), దృఢం=అత్యర్థము, ఇష్టోఽసి=ఇష్టుఁడ వగుచున్నావు, ఇతి తతః=అనుదానివలన, తే=నీకు, హితం=హితమును, వక్ష్యామి= చెప్పెదను.

తా. ఈగుహ్యము లన్నిటిలోపల భక్తియోగము శ్రేష్ఠమగుటం బట్టి గుహ్యతమమని పూర్వమే 'ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే' ఇత్యాదులందు చెప్పఁబడినది. మరల దానినిగుఱించి నేను జెప్పు మేలయినవచనమును వినుము. నీవు నాకు దృఢముగా నిష్టుఁడవు కాఁబట్టి నీకు హితమైన దానిని చెప్పెదను.

127 అవ-

128 129

శ్లో. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ 65

టీ. మద్భక్తః=నాయందు భక్తి (అనఁగా అత్యంతప్రీతి) గల వాఁడవై, మన్మనాః=నాయందు మనస్సు గలవాఁడవును-దర్శనసమా నాకారమైనస్మృతి గలవాఁడవనుట, మద్యాజీ=నన్ను ఆరాధించువాఁ డవును, భవ=కమ్ము, మాం=నన్నుఁగూర్చి, నమస్కురు=అత్యంత ప్రీతితో నమస్కరింపుము-వినమ్రభావమును జూపు మనుట. మామేవ =నన్నే, ఏష్యసి=పొందఁగలవు, మే=నాకు, ప్రియః=ప్రియుఁడవు, అసి =అగుదువు. కనుక, సత్యం=(నన్ను నీవు పొందుట) సత్యమని, తే= నీకు, ప్రతిజానే=ప్రతిజ్ఞ సేయుచున్నాను.

తా. వేదాంతములందు, 'వేదాహమేతం పురుషం మహాన్తమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ । త మేవం విద్వా న మృత ఇహ భవతి నాన్యః పన్థావిద్యతేఽయనాయ' (పురుషసూక్తే) ఇత్యాదులందు విహి

తమై వేదనధ్యానోపాసనాదిశబ్దవాచ్యమైదర్శనసమానాకారమై అత్యంత ప్రియమైయుండు స్మృతిసంతానమే యిచట 'మన్మనా భవ' అని విధింపఁబడుచున్నది. నాయందు భక్తితో మనస్సు గలిగియుండుము- అనఁగా నాయందు అత్యంత ప్రీతిగలిగి దానిచే నిరతిశయప్రియమైన స్మృతిసంతానమును గావింపు మని యర్థము. నాయందు భక్తితో నన్ను యజింపుము. యజన మనఁగా పూజనము. నాయం దత్యంతప్రీతి గలిగి ఆరాధనము చేయుచుండుమనుట. ఆరాధనమనఁగా పరిపూర్ణ శేషవృత్తి గదా. నాకు నమస్కరింపుము. నమః అనఁగా నమనము (వంగుట)- నాయందు అత్యంతప్రియమై యుండు అతిమాత్ర వినమ్రభావమును గావింపుమని యర్థము. ఈరీతిని వర్తింతువేని నీవు నన్నే పొందుదువు. నీవు నాకుఁ బ్రియుఁడవు గనుక నిది (అనఁగా నీవు నన్నుఁబొందుట) 130

సత్యమేకాని వట్టిమొగమిచ్చకము కాదని నీకు నేను బ్రతిజ్ఞ సేయుచున్నాను. 'ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహంసచమమప్రియః' అనిపూర్వమే చెప్పఁబడియున్నది. ఎవనికి నాయం దతిమాత్రప్రీతియో నాకుఁ గూడ వానియం దతిమాత్రప్రీతి గలుగునుగాన వానివియోగమును నేనుసైఁపఁజాలక నన్నుఁ బొందునట్లు నేనే వానిని చేయుదును. ఈకారణమును బట్టి 'మామే వైష్యసి' అని నేను ప్రతిజ్ఞ సేసినది సత్యమే యగును. 131

(అవ. ఇట్లు సవిస్తరముగను సంగ్రహముగను జెప్పఁబడిన కర్మయోగాదులకు మూఁటికిని సాధారణమై సారతమమై యొప్పు ననుసంధానవిశేషమునెత్తిచెప్పి దానివలననే 'మామేవైష్యసి' అనెడి యిష్టప్రాప్తికి ప్రతిబంధకము లైనయనిష్టములు నివర్తిందు నని చెప్పుచున్నారు.)

132 అవ.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥ 66

టీ. సర్వధర్మాన్-సర్వ = సమస్తములైన, ధర్మాన్=ధర్మములను- మోక్షసాధనములైనవానినన్నిటిని అనుట- కర్మజ్ఞానభక్తియోగములనని భావము, పరిత్యజ్య = (వానిని ఫలకర్మకర్తృత్వాదులచేతమాత్రము) విడిచి-అనఁగా స్వరూపముచే విడువకయనుట, మాం = నన్ను, ఏకం=ఒకనినే - అనఁగా నన్నే కర్తగాను ఆరాధ్యునిగాను ప్రాప్యునిగాను,శరణం=ఉపాయముగాను, వ్రజ=పొందుము-అనుసంధింపుమనుట, అహం= నేను, త్వా = ఇట్లు వర్తించుచున్ననిన్ను, సర్వపాపేభ్యః = మత్ప్రాప్తివిరోధి సమస్తపాపములవలననుండి, మోక్షయిష్యామి = విడిపింతును, మాశుచః = దుఃఖపడకుము.

తా. పరమనిశ్శ్రేయసమునకు సాధనము లయినకర్మయోగజ్ఞానయోగ భక్తియోగరూపము లైన సమస్తధర్మములు నాయారాధనరూపము లని తలఁచి అతిమాత్రప్రీతితోఁ దనతనయధికారము చొప్పున ఆచరించుచునే చెప్పఁబడినరీతిని, వానిని స్వరూపముచేతఁగాక ఫల*కర్మకర్తృత్వాదుల పరిత్యాగముచేత మాత్రము పరిత్యజించి, నేనొక్కఁడే కర్త యనియు, ఆరాధింపఁదగువాఁ డనియు, ప్రాప్యుఁడనియు, ఉపాయమనియును ననుసంధింపుము. ఇదియే సర్వధర్మములకుఁ గల శాస్త్రీయ

* కర్మత్యాగ మనఁగా స్వకీయతాభిమానమును (అనఁగా తనది యని తప్పుగాఁ దలఁచుటను) త్యజించుట. 'ఏకమ్' అనుచో తన్నే యారాధ్యునిగా అనుసంధించుటను జెప్పుటచే నిచట త్యాజ్యములుగా' జెప్పఁబడిన ఫలకర్మకర్తృత్వాదులలో ఆది శబ్దముచే ఇంద్రాదు లారాధ్యు లనెడియభిమానమునుగూడ త్యాజ్యముగా గ్రహించు కొనునది. ఇట్టియభిమానమును వదలి అట్టియనుసంధానము గలిగియుండవలయునని భావము. ఇచట 'ఏకమ్' అనుటకు తానే కర్తయు ఆరాధ్యుఁడును ప్రాప్యుఁడు ననియు, 'శరణమ్' అనుటకు తానే యుపాయ మనియు భావము. వేదాంతము నెఱుఁగని యితరులు తమ్మే కర్తగాను తమకంటె నితరులైనయింద్రాదుల నారాధ్యులుగాను, ఉభయులకు వేఱైనస్వర్గాదులను ప్రాప్యములుగాను, వానికంటె నన్యమైనకర్మము ను ఉపాయముగాను అనుసంధింతు రనియు, వేదాంతజ్ఞులు భగవంతుఁడగునన్నే కర్తనుగాను ఆరాధ్యునిఁగాను ప్రాప్యునిఁగాను ఉపాయమునుగాను అనుసంధింతు రని

పరిత్యాగము. ఇట్టి పరిత్యాగమే యీ యధ్యాయము మొదట 'నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః' అని యారంభించి 'సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః। నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః। య స్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే' అని మిక్కిలి దృఢముగా ఉపపాదింపఁబడినది. ఇట్లు అనుసంధించుచు వర్తింతువేని మత్ప్రాప్తివిరోధులై అనాదికాలసంచితములై అనంతములై అకృత్యకరణకృత్యాకరణరూపములై యుండు సమస్తపాపములనుండి నిన్ను విడిపించెదను. దుఃఖింపకుము.

* ఈశ్లోకమునకు అర్థాంతరము.

అవ. సర్వపాపవినిర్ముక్తుఁడై భగవంతునియం దత్యంతప్రీతిగలిగి యుండుపురుషుఁడే భక్తియోగము నాచరించుట కర్హుఁడగును. భక్తియోగారంభవిరోధు లగు పాపము లనంతములగుటవలనను, వానిని బోఁగొట్టుకొనుట కాచరింపవలసిన ప్రాయశ్చిత్తరూపములైన ధర్మములు బహుకాలము చేసిన నేకాని పరిమితికాలమునఁ జేసినయెడల ఆవిరోధులను గడచుట కష్టమగుటవలనను, తాను భక్తియోగారంభమున కర్హుఁడు కాఁడని తలపోసి దుఃఖించుచున్నయర్జునునిశోకమును నివారించుటకొఱకు భగవంతుఁడగు శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

టీ. సర్వధర్మాన్=భక్తియోగారంభవిరోధులైన పాపములను

---

యును భావము. భగవంతునే కర్తగా అనుసంధించుటచే స్వకర్తృత్వత్యాగమును; కర్మమునకు వాఁడే ఆరాధ్యుఁడుగా ననుసంధించుటచే కర్మము వానిదే యని గ్రహించుటవలన కర్మత్యాగమును- అనఁగా కర్మనుమందు స్వకీయతాభిమానత్యాగమును, వానినే ప్రాప్యునిఁగా ననుసంధించుటచే స్వర్గాదిఫలత్యాగమును సిద్ధించు నని తెలియునది.

* ఈశ్లోకమునకు ప్రపత్తివిషయమైన రహస్యార్థ మొకటి కలదు. దాని నిచట సంగ్రహముగను అనుబంధమునందు విపులముగను జూడనగును.

ప్రాయశ్చిత్తరూపములైన కృచ్ఛ్రచాంద్రాయణాదిసమస్తధర్మములను పరిత్యజ్య=విడిచి, మామేకం=నన్నొక్కనినే, శరణం=ఉపాయముగా, వ్రజ=పొందుము- ప్రపత్తిసేయు మనుట- ఉపాయ మనెడి అధ్యవసాయము కలిగియుండు మని భావము. అహం=నేను, త్వాం = నిన్ను, సర్వపాపేభ్యః = భక్త్యారంభమునకు విరోధు లైన సమస్తపాపముల నుండి, మోక్షయిష్యామి=విడిపించెదను, మాశుచః=దుఃఖింపకుము.

తా. భక్తియోగారంభమునకు విరుద్ధములై అనాదికాలసంచితములై నానావిధములైనపాపము లనంతములు గలవు. ఆయావానికి అనుగుణముగా ప్రాయశ్చిత్తములుగా విధింపఁబడిన కృచ్ఛ్రచాంద్రాయణకూశ్మాండ వైశ్వానరవ్రాతపతి పవిత్రేష్టిత్రివృదగ్నిష్టోమాదులైన నానావిధధర్మము లనంతములు గలవు. నీవు జీవించుకాలమో పరిమితమైనది కాన నీ కట్టి యనంతములగుధర్మము లనుష్ఠింపనలవికాదు. కనుక ఆధర్మముల నెల్ల పరిత్యజించి భక్తియోగారంభసిద్ధికై పరమకారుణికుఁడును అనాలోచితవిశేషాశేషలోకశరణ్యుఁడును ఆశ్రిత వాత్సల్యజలధియు నైననన్ను ఒక్కనినే శరణుఁజొరుము (అనఁగా ఉపాయముగా నధ్యవసింపుము.) పూర్వము చెప్పఁబడినస్వరూపము గలభక్తి నారంభించుటకు విరోధులైన పాపములన్నిటినుండి నిన్ను నేను విడిపించెదను. దుఃఖపడకుము.

1-3 అవ.

శ్లో. ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
న చాశుశ్రూష వేవాచ్యం నచమాం యోఽభ్యసూయతి ॥

---

టీ. సర్వధర్మాన్ = క్రింద చెప్పఁబడిన సపరికరములైన కర్మయోగాది సమస్తోపాయములను, పరిత్యజ్య = రుచివాసనలతో విడిచి, మాం = నీకార్యమునం దధికరించుకొనియుండు నన్ను, ఏకం = ఒక్కనినే, శరణమ్ = ఉపాయముగా, వ్రజ = అధ్యవసింపుము. అహం = సర్వశక్తుఁడైన నేను, త్వా = నేనుదక్క నితరోపాయములను విడిచి యున్ననిన్ను, సర్వపాపేభ్యః = నన్ను పొందుటకు విరోధులై

టీ. ఇదం=నేను చెప్పిన యీరహస్యమైనశాస్త్రము, తే=నీకు-నీచేతననుట, అతపస్కాయ=తపస్సు లేనివానికొఱకు, న వాచ్యం=చెప్పఁదగదు, అభక్తాయ=నాయందు భక్తి లేనివానికొఱకు, న వాచ్యం=చెప్పఁదగదు, అశుశ్రూషవే=శుశ్రూష చేయనివానికొఱకును, న=చెప్పఁదగదు, యః=ఎవఁడు, మాం=నన్నుఁగూర్చి, అభ్యసూయతి=అసూయపడుచున్నాఁడో, (తస్మై చ=వానికొఱకును), కదాచన=ఒకప్పుడును, న వాచ్యం=చెప్పఁదగదు.

తా. నీకు నే నుపదేశించిన పరమరహస్యమైన యీశాస్త్రమును

134

నీవు తపోరహితునకు చెప్పఁదగదు. తపస్సుగలవాఁడైనను, నచిఱుంచు నీయందును నాయందును భక్తి లేనివానికి నొకప్పుడైనను చెప్పఁదగదు. భక్తియుతుఁడైనను గురుశుశ్రూషారహితుఁ డగువానికి నుపదేశింపఁ దగదు. మఱియు నాస్వరూపమును నామైశ్వర్యమును నాగుణములను ఒకరు చెప్పఁగా విని అసూయతో వానియందు దోషము నారోపించునట్టివానికి చెప్పనే తగదు.

ఇచట 'అతపస్కాయ' 'అభక్తాయ' అని చతుర్థీవిభక్తిని నిర్దేశించుచు వచ్చిన యీప్రక్రమము ననుసరించి 'అభ్యసూయవే' యని చెప్పవలసియుండఁగా 'యోఽభ్యసూయతి' అని ప్రథమావిభక్తిని నిర్దేశించుట, అసూయ గలవాఁ డత్యంత పరిహారణీయుఁ డని తెలుపుటకొఱ కని గ్రహించునది.

---

యందుపాపము లన్నిటివలన, మోక్షయిష్యామి=విడిపింతును, మాశుచః=నీవు శోకింపకుము.

తా. సాంగము లగు సర్వోపాయములను సవాసనముగ విడిచి, వాత్సల్యాదికల్యాణగుణవిశిష్టుఁడైన నన్నొక్కనినె నిరపేక్షసాధనముగ స్వీకరింపుము. సర్వశక్తిత్వాదికల్యాణగుణవిశిష్టుఁడైన నేను, నన్నే యుపాయముగ స్వీకరించియుండు నిన్ను, మత్ప్రాప్తిప్రతిబంధకములయిన పాపములన్నిటినుండి ముక్తునిఁ జేసెదను. నీవు శోకింపకుము.

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥ 68

టీ. యః=ఎవఁడు, పరమం గుహ్యం=అతిరహస్యమైన, ఇదం=ఈశాస్త్రమును, మద్భక్తేషు=నాభక్తులగోష్ఠియందు, అభిధాస్యతి = వ్యాఖ్యానముచేయఁగలఁడో, (సః = వాఁడు), మయి = నాయందు, పరాం =ఉత్కృష్ట మయిన, భక్తిం=భక్తిని, కృత్వా = చేసి, మామేవ = నన్నే, ఏష్యతి=పొందఁగలఁడు, అసంశయః =దీనిలో సంశయము లేదు.

తా. *పరమరహస్యమైన యీగీతాశాస్త్రము నాభక్తుల కెవ్వఁడుపదేశించునో యతఁడు నాయందు మిగుల భక్తిచేసి నన్నే చెందును. ఇందు సంశయము లేదు.

[అవ. తనశాస్త్రమును వ్యాఖ్యానముసేయుట తన్నుఁ బొందుట కెట్లు సాధన మగునో తెలుపుచున్నారు.]

శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా నచ మే తస్మా దన్యః ప్రియతరో భువి॥ 69

టీ. భువి=భూమియందు, మే=నాకు, తస్మాత్ = వానికంటె, ప్రియకృత్తమః=మిక్కిలిప్రియమును చేయువాఁడు, మనుష్యేషు=మనుష్యులలో, కశ్చిత్ చ = ఒక్కఁడును, న= లేఁడు, తస్మాత్ =వానికంటె, అన్యః = ఇతరుఁడు, మే=నాకు, ప్రియతరః = అధికప్రియుఁడు, న భవితా చ=కలుగ లేఁడు.

తా. సకలమనుష్యులలో నిట్లుపదేశము చేయువానికన్న నధిక

---

* ఇచట అధికారులకవశ్య మీశాస్త్రమును వచింపవలయుననియు, ఇట్లు వచించుట అపవర్గాఖ్యఫలమునఁ బర్యవసించు ననియుఁ జెప్పఁబడినది. 'అభిధాస్యతి' యనుటకు ఊరక చెప్పుటగాక అర్థము వినిపించుటయు గ్రాహ్యము గాన వ్యాఖ్యానము చేయుట అని అర్థము చెప్పఁబడినది. ఇట్లు యోగ్యులకు వ్యాఖ్యానము సేయుట, కర్మయోగాదులను గాదు, భక్తియోగాంకురమును గాదు, పరభక్తినే కలిగించునుగాన 'భక్తిం పరాం కృత్వా' అనఁబడినది.

ప్రియకరుఁడు నాకు వేఱొకఁ డిదివఱకుండినది లేదు. ఇఁకమీఁదను నట్టివానికంటె ప్రియుఁడు భూమియందుఁ గలుగఁబోఁడు.

*యోగ్యులకు చెప్పకుండుటకంటెను అయోగ్యులకు చెప్పుట మిక్కిలి అనిష్ట మగుటవలన ఇట అయోగ్యులను మొదట గ్రహించి చెప్పిరి.

[అవ. గురువునొద్ద దీని నధ్యయనము సేయుటకు ఫలమును జెప్పుచున్నారు.]

136

శ్లో. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్ట స్స్యా మితి మే మతిః॥ 70

టీ. యః = ఎవ్వఁడు, ఆవయోః=మనయిద్దఱియొక్క, ధర్మ్యం= ధర్మయుక్తమైన, ఇమం సంవాదం = సంవాదరూపమైన యీ గీతాశాస్త్రమును, అధ్యేష్యతే= అధ్యయనము సేయఁగలఁడో, తేనచ = ఆపురుషునిచేతను, అహం = నేను, జ్ఞాన యజ్ఞేన=జ్ఞానయజ్ఞముచేత, ఇష్టః= ఆరాధింపఁబడినవాఁడను, స్యాం=అగుదును, ఇతి=అని, మే = నాయొక్క, మతిః= నిశ్చయము.

తా. ధర్మయుక్తమైన మనయిరువుర యీసంవాదము నెవ్వఁడు *అధ్యయనము సేయునో (గురుసకాశమున పఠించునో) వాఁడు జ్ఞానయజ్ఞ

*శాస్త్రమున కధికారి యగువాఁడు అపేక్షితుఁడుగాన ముఖ్యుఁడు. అనధికారి అపేక్షితుఁడు గాఁడు. ముఖ్యుఁడైనయధికారిని మొదటఁ జెప్పి అనధికారిని అపేక్షితుఁడు కాఁడని పిదపఁ జెప్పవలసియుండఁగా, ఇచట అనధికారిని 'ఇదం తేనాతపస్కాయ' అని మొదటఁ జెప్ప నేల యన్నచో, అధికారులకు నిది చెప్పకుండుట అనిష్టమైనది దానికంటె అనధికారులకుఁ జెప్పుట మిక్కిలియు అనిష్టమైనది. మిక్కిలి అనిష్టమైన దానిని మొదట నే పరిహరింపవలయును గాన అనధికారివిషయము మొదటఁ జెప్పఁబడిన దని తెలియునది. ప్రియకృత్తముఁ డగుటచే నాకు ప్రియకరుఁడు. కావున నే వానికి 'మామేవైష్యసి' అనుచోఁగల మత్ప్రాప్తి సిద్ధించు నని భావము.

*ఈ గీతాశాస్త్రము నధ్యయనము సేయుట నన్ను జ్ఞానయజ్ఞముచే ఆరాధించు

ముచేత స న్నారాధించునట్టివాఁ డగు నని నాయభిప్రాయము. దీని
137
నధ్యయనము చేయుటమాత్రముచే ఇం దేది జ్ఞానయజ్ఞ మని చెప్పఁ
బడునో దానిచేత యజింపఁబడినట్టివాఁడ నగుదు నని యర్థము.

138 139
శ్లో. శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః
140
సోఽపిముక్తశ్శుభాన్లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్71

టీ. యః=ఏ, నరః=మనుష్యుఁడు, శ్రద్ధావాన్=విశ్వాసముకల వాఁడును, అనసూయశ్చ = అసూయ లేనివాఁడునునై, శృణుయాత్ అపి=విననైనవినునో, సః అపి = వాఁడును, ముక్తః = పాపములవలన విడువఁబడినవాఁడై, పుణ్యకర్మణాం=భగవదారాధనరూప మైనపుణ్య కర్మములు చేసినవారియొక్క - మద్భక్తులయొక్క యనుట, శుభాన్= శుభములైన, లోకాన్=సమూహములను, ప్రాప్నుయాత్=పొందును.

తా. ఈశాస్త్రమును విశ్వాసయుక్తుఁడై అసూయారహితుఁడై యెవ్వఁడు గురువునొద్ద వినునో అతఁడును అట్టి * శ్రవణమాత్రమున భక్తివిరోధిపాపములనుండి విముక్తుఁడై పుణ్యకర్ము లైననాభక్తుల సమూహమును బొందును.

---

టతో సాటియగునని భావము. ఇది 'శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప' అని ప్రథమషట్కమునఁ జెప్పఁబడిన జ్ఞానయజ్ఞముకాదు, 'జ్ఞానయజ్ఞేనచాప్యన్యే యజన్తో మా ముపాసతే' అని భక్తియోగప్రకరణమునఁ జెప్పఁబడిన భగవదనుసంధానవిశేషరూపమైన జ్ఞానయజ్ఞమే యిచట వివక్షితము. దీనిచే ఎంతప్రీతిగలుగునో గీతాధ్యయనముచే నంతప్రీతి గలుగునని యాశయము. ఉపనిషత్సారమగుటచే దీనికి అధ్యయనశబ్దము ప్రయుక్తము. గీతాశాస్త్రపారాయణము జ్ఞానయజ్ఞముతో తుల్యమై భగవత్ప్రీతిజనక మైన దనుట.

*భగవద్భక్తులను జేరుటచే వారివలన యోగోపదేశాదులు కలిగి తన్మూలమున మోక్షమును బొందు ననుట. శ్రవణమాత్రమునకే యింతఫల ముండఁగా, ఇఁక అర్థజ్ఞానాదులకుఁ జెప్పవలయునా యని భావము.

141 అవతారిక.

శ్లో. కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వ యైకాగ్రేణ చేతసా

142

కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనఞ్జయ॥ 72

టీ. హేపార్థ=ఓ యర్జునా, ఏతత్ = నాచేత నుపదేశింపఁబడిన యీ గీతాశాస్త్రము, త్వయా=నీచేత, ఏకాగ్రేణ=నిశ్చలమైన, చేతసా =మనస్సుతో, శ్రుతం కచ్చిత్=వినఁబడినదిగదా. హేధనఞ్జయ=ఓ యర్జునా, తే=నీయొక్క, అజ్ఞానసమ్మోహః= అజ్ఞానమువలనఁగలిగిన మోహము (అనఁగా భ్రాంతిజ్ఞానము), ప్రణష్టఃకచ్చిత్ =నిశ్శేషముగా పోయినదిగదా.

తా. అర్జునా, నే నిదివఱ కుపదేశించినయీయర్థం బంతయు అవహితచిత్తుఁడవై వింటివేకదా. ఏ యజ్ఞానముచే మూఢుఁడవై నీవు యుద్ధము చేయనంటివో అట్టినీయజ్ఞానమువలని సమ్మోహము నశించినదిగదా.

అర్జున ఉవాచ=అర్జునుఁ డిట్లనియెను.

143

శ్లో. నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ॥ 73

టీ. హే అచ్యుత=ఓకృష్ణా, త్వత్ప్రసాదాత్ =నీయనుగ్రహము వలన, మోహః=నావిపరీతజ్ఞానము, నష్టః=నశించినది, మయా=నాచేత, స్మృతిః=యథావస్థిత మైన తత్త్వజ్ఞానము, లబ్ధా=పొందఁబడినది. గతసన్దేహః=పోఁగొట్టఁబడిన సందేహముగలవాఁడనై, స్థితోఽస్మి=ఉన్నవాఁడను. తవ=నీయొక్క, వచనం=మాటను, కరిష్యే=చేసెదను.

తా. అచ్యుతా, నీప్రసాదమువలన నామోహము నివర్తించెను. యథావస్థిత మైనతత్త్వజ్ఞానము నీప్రసాదమువలననే పొందితిని. కనుక పూర్వము బంధుస్నేహకారుణ్యములవలనఁ బెరిఁగినవిపరీతజ్ఞానముచే

నాకుఁ గలిగినదైన్యములన్నియుఁ దీఱి సంశయములు తొలఁగి స్వస్థుఁ డనై యున్నవాఁడను. ఇప్పుడే యుద్ధాదులు చేయవలయు నని నీ వాడిన
144
మాటచొప్పునఁ జేసెదను- అనఁగా నీవుచెప్పినట్లు యుద్ధాదులు చేసె దను అని యర్థము.

మోహ మనఁగా విపరీతజ్ఞానము-అనాత్మయైనప్రకృతిని ఆత్మగాఁ దలఁచుటయు, పరమపురుషశరీరమై తదాత్మకములై యుండునట్టి చిద చిద్వస్తువులన్నియు తదాత్మకములుకావని తలఁచుటయు, నిత్యనైమి త్తికరూపమైనకర్మము పరమపురుషారాధనమే యగుటచే తత్ప్రాప్తి కుపాయమైయుండఁగా నది బంధకమనియెడిబుద్ధియు, విపరీతజ్ఞానమగును. ఇట్టివిపరీతజ్ఞానమెల్ల నశించినదని యర్థము. స్మృతి యనఁగా యథావ స్థితతత్త్వజ్ఞానము-కలరూపును గుఱించినయెఱుక- అనఁగా ఆత్మప్రకృతి విలక్షణమై, ప్రకృతిస్వభావరహితమై, జ్ఞాతృత్వైకస్వభావమై, పరమ పురుషునికి శేషమై, వానికి నియామ్యమైయుండుటే స్వరూపముగాఁ గలిగియుండు ననెడి జ్ఞానమును; పరమపురుషుఁడు, నిఖిలజగదుత్పత్తి స్థితిప్రళయములు లీలలుగాఁ గలవాఁడై, అశేషదోషప్రత్యనీక కల్యా ణైకస్వరూపుఁడై, స్వాభావికానవధికాతిశయజ్ఞాన బలైశ్వర్య వీర్యశక్తి తేజః ప్రభృతిసమస్తకల్యాణగుణసముద్రుఁడై, పరబ్రహ్మశబ్దవాచ్యుఁ డై యుండు ననెడి యీపరమపురుషయాథాత్మ్యమునుగుఱించిన జ్ఞాన మును ఇట్టి పరావరతత్త్వముల యాథాత్మ్యమును గుఱించిన విజ్ఞా నము గలిగి యావిజ్ఞానమును అభ్యాసము సేయుచు నానాఁటికి ప్రవర్ధ మానమగుచున్నపరమపురుషప్రీతియే ఫలముగాఁ గోరి చేయునట్టి నిత్య నైమిత్తికకర్మములచేతను, నిషిద్ధములపరిహారముచేతను, శమదమా ద్యాత్మగుణములచేతను భక్తియోగమును నిర్వర్తించి, భక్తిరూపమును బొందినవరమపురుషోపాసనముచేతనే వేదాంతవేద్యుఁడును బరమపురు షుఁడును వాసుదేవుఁడు నైన భగవంతునిలభింపఁదగు ననెడి జ్ఞానమును

స్మృతిశబ్దముచే గ్రహించునది. ఇట్టితత్త్వజ్ఞానము నీప్రసాదమువలననే నాకు లభించిన దని యర్థము.

అవ. తనపుత్రులును పాండవులును యుద్ధంబునం దేమి చేసెద రని యడుగుచున్నధృతరాష్ట్రునకు సంజయుఁడు చెప్పెను.

సఞ్జయ ఉవాచ

శ్లో. ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్॥ 74

టీ. ఇతి=ఈప్రకారము, వాసుదేవస్య = వసుదేవునికొడుకైన శ్రీకృష్ణమూర్తియొక్కయును, మహాత్మనః = మహాబుద్ధిమంతుఁడగు, పార్థస్య=కృష్ణునిమేనత్తయగు పృథయొక్క కొడుకైన అర్జునునియొక్కయును, అద్భుతం=అత్యాశ్చర్యకరమైనదియు, రోమహర్షణం = పులకాంకురకరమైనదియునగు, ఇమం సంవాదం=ఈసంభాషణమును, అహం = నేను, అశ్రౌషమ్=వింటిని.

తా. ఇట్లు వసుదేవునికుమారుఁడైన శ్రీకృష్ణమూర్తికిని, అతని మేనత్తయైనపృథయొక్కకుమారుఁడై మహాబుద్ధిమంతుఁడగుటచే నతని పదద్వంద్వమాశ్రయించినవాఁడునైన అర్జునునికిని, నడచినయీసంవాదమును *యథోక్తముగా వింటిని. ఇది యత్యద్భుత మగుటచే పులకాంకురమై యుండెను.

శ్లో. వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్య మహం పరమ్
యోగంయోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్॥ 76

టీ. ఏతత్=ఈ, పరం=ఉత్కృష్ట మగు, యోగం = యోగ మనుపేరు గల, గుహ్యం=రహస్యమును, స్వయం=తానే, కథయతః =చెప్పుచున్న, యోగేశ్వరాత్=కల్యాణగుణములకు (జ్ఞానబలైశ్వర్య

*ఇచట 'యథోక్తముగా' ననుటచే నీ కెట్లు నేను చెప్పితినో యట్లే వారివలన వింటిని అని యర్థము. విన్నది విన్నట్లె చెప్పెనాఁడ ననుట.

వీర్యశక్తి తేజస్సులకు) నిధి యగు, కృష్ణాత్=శ్రీకృష్ణునివలన, వ్యాస ప్రసాదాత్ = వ్యాసానుగ్రహమువలన (అనఁగా వ్యాసానుగ్రహము చేతఁ గలిగిన దివ్యచక్షుశ్శ్రోత్ర లాభమువలన), అహం=నేను,సాక్షాత్ =ప్రత్యక్షముగా, శ్రుతవాన్ అస్మి=వినినవాఁడ నైతిని.

తా. పరమరహస్యమైన యీ యోగశాస్త్రమును జ్ఞానశక్తి బలైశ్వర్య తేజస్సులకు నిధి యగు భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు తానే యుపదేశించుచుండఁగా, వ్యాసానుగ్రహమువలనఁ గలిగిన *దివ్యచక్షు శ్శ్రోత్రములం జేసి ప్రత్యక్షముగా వింటిని.

శ్లో. రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76

టీ. రాజన్=ఓధృతరాష్ట్రమహారాజా, అద్భుతం=ఆశ్చర్యకర మైనదియు, పుణ్యం = పావనమైనదియునగు, కేశవార్జునయోః = శ్రీకృష్ణార్జునులయొక్క, ఇమం సంవాదం = ఈసంభాషణమును, సంస్మృత్య సంస్మృత్య=తలఁచితలఁచి, ముహుర్ముహుః చ=మాటిమాటికిని, హృష్యామి=ఆనందించుచున్నాఁడను.

తా. రాజోత్తమా, కేశవార్జునులకు జరిగినట్టియు, ఆశ్చర్యావహమును పావనము నైనట్టియు ఈసంవాదమును సాక్షాత్తుగా విన్న దానిని దలఁచి తలఁచి మాటిమాటికి హర్షించుచున్నాఁడను.

శ్లో. తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః॥ 77

టీ. హేరాజన్=ఓధృతరాష్ట్రమహారాజా, హరేః = శ్రీకృష్ణ మూర్తియొక్క, అత్యద్భుతం=మిక్కిలి యాశ్చర్యకరమైన, తత్ = ఆ-అర్జునునికొఱకు ప్రకాశితమైనదనుట, రూపం చ=విశ్వరూపమునున్ను,

*చక్షుశ్శ్రోత్రములు దివ్యము లగుటచేతనే విశ్వరూపసందర్శనమును దూరస్థవాక్య శ్రవణమును గలిగిన వని తెలియునది.

సంస్మృత్య సంస్మృత్య = తలఁచి తలఁచి, మే=నాకు, మహాన్ = అధిక మగు, విస్మయః=ఆశ్చర్యము, (భవతి=కలుగుచున్నది.) పునఃపునశ్చ= మాటిమాటికిని, హృష్యామి=హర్షించుచున్నాఁడను.

తా. రాజోత్తమా, అత్యద్భుతమైన శ్రీకృష్ణుని యావిశ్వరూప మును అర్జునునకుఁ బ్రకాశితమైనదానిని, నాకు సాక్షాత్కరించినదానిని, దలఁచి తలఁచి హర్షించుచున్న నాకు అత్యంతాశ్చర్యము కలుగుచున్నది. మరలమరల నాకుహర్షమే కలుగుచున్నది.

అవ. వేయేల ?

శ్లో. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
145 146 147 148
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ ॥ 78

టీ. యత్ర=ఏపక్షమందు, *యోగేశ్వరః-యోగ=సమస్తచేతనా చేతనవస్తువుల స్వభావయోగములకు, ఈశ్వరః = నియామకుఁడైన - అనఁగా వానిస్వరూపస్థితి ప్రవృత్తులను స్వసంకల్పాధీనముగా జరపు

* 'యోగేశ్వరాత్ కృష్ణా త్సాక్షాత్కథయతి స్వయమ్' అనుచో 'కథయతః స్వయమ్' అన్నందులకు వలయు ఆప్తతమత్వముకొఱకు యోగేశ్వరశబ్దమునకు జ్ఞానాది కల్యాణగుణనిధి యని యర్థము సేయఁబడినది. ఇచట ఆశబ్దమునకే 'శ్రీర్విజయో భూతిః' అని శ్రీవిజయాదుల నొసఁగఁదగిన యోగ్యతను సూచించునర్థాంతర మావశ్యకము. అందును ఈశ్వరుఁడనఁగా నియంత గనుక యోగశబ్దమునకు ఆనియంతచే నియమింపఁ బడువానిని జెప్పఁదగునుగాన ఆయావస్తువులస్వభావయోగము లని యర్థము సేయఁ బడినది. అనఁగా సమస్తవస్తువులకుఁ గల స్వరూపస్థితిప్రవృత్తివిశేషములను తన సంక ల్పమునకు లోనుగా నియమించి జరపువాఁడనుట. కనుకనే శ్రీవిజయాదుల నొసఁగ సమర్థుఁడని యాశయము. కృష్ణుఁడనఁగా నల్లనివాఁడు. ఈ కృష్ణత్వము భగవంతుని కవస్థాంతరములందును గలదు గాన ఇచట ఈయవతారము నే తెలుపుటకొఱకు 'వసు దేవసూనుఁడైనకృష్ణుఁడు' అనఁబడెను. దీనిచే అవతారదశయందును యోగేశ్వర త్వాదిరూపమగు స్వస్వభావమును వదలనివాఁడగుట సూచితము. అర్జునునకుఁ బూర్వము గల 'విసృజ్యసశరంచాపమ్' అనునవస్థకు వ్యతిరిక్తమైన యవస్థను దెలుపు 'ధనుర్ధర' శబ్దము, భగవంతుఁడనుశాసించినట్లు చేయుటకై గాండీవధనువును గ్రహించినవాఁడని

నియంతయగు, కృష్ణః=శ్రీకృష్ణుఁడు, (వర్తతే=ఉన్నాఁడో), యత్ర= ఏపక్షమందు, ధనుర్ధరః = ధనుస్సును ధరించిన, పార్థః=పృథకొడుకైన అర్జునుఁడు, (ఉన్నాఁడో), తత్ర=ఆపక్షమందు, శ్రీః = లక్ష్మియును, విజయః=జయమును, భూతిః=ఐశ్వర్యమును, నీతిః=నీతియును, ధ్రువా =నిశ్చలమైయుండు నని, మమ=నాయొక్క, మతిః=అభిప్రాయము.

తా. ఉచ్చావచము లైన (అనఁగా ఉత్కృష్టములుగాఁ గాని నీచములుగాఁ గాని యుండు) సమస్తచేతనాచేతనవస్తువులకుఁ గలయాయాస్వభావయోగముల నన్నిటిని నియమించువాఁ డైఁ (అనఁగా స్వేతర సమస్తవస్తువుల స్వరూపస్థితి ప్రవృత్తిభేదములను నిజసంకల్పాధీనములుగా నడపునట్టివాఁడై), వసుదేవసూనుఁ డై యొప్పుకృష్ణుఁ డేపక్షమం దుండునో, అతని మేనత్త యైనపృథయొక్క కుమారుఁ డై యతనిపదద్వంద్వమునే యాశ్రయించినవాఁ డై యొప్పునర్జునుఁడు గాండీవ ధనుర్ధరుఁడై యేపక్షమునం దుండునో యాపక్షమున లక్ష్మియు, జయమును, ఐశ్వర్యమును, నీతియు నిశ్చలములై యుండు నని నాయభిప్రాయము. 149

ఓమ్ తత్సత్.

---

తెలుపుచున్నది. ఈశబ్దమునందు విశిష్టపరికరవిశేషమును వీర్యాదివిశేషమునుగల వాఁడనుభావము గర్భితము. ఇట్టివాఁడు గనుకనే వీఁడున్న పక్షమునందు శ్రీవిజయాదులావహిల్లు నని యాశయము. 'పార్థస్యచ మహాత్మనః' అని పూర్వోక్తపార్థశబ్దము మహామతిత్వమును దెలుపుచున్నది గాన దానివలన 'అతనిపదద్వంద్వమునే యాశ్రయించినవాఁడు' అనుట సిద్ధించినది. నీకొడుకులవలె కృష్ణునిఁ బ్రార్థించి నిస్సారములైన సేనాదిపరికరములను గైకొనక అతనిపదద్వంద్వములే కైకొన్నవాఁడని భావము. 'తత్ర' అనఁగా యోగేశ్వరుఁడైనకృష్ణుఁడును ధనుర్ధరుఁడైన పార్థుఁడు నున్నయాపక్షమునందు - అనఁగా పాండవపక్షమునం దనుట. పాండవపక్షమునం దని స్పష్టముగా ఎదుటఁ జెప్పుట కటువుగాన ఆపక్షమందు అని చెప్పినాఁడని మెలపు గ్రహించునది. ఇచట శ్రీ యనఁగా రాజ్యాదిభోగ్యసమృద్ధిరూప మైనసంపద. నీతి యనఁగా అర్థశాస్త్రమువలన జనించు కర్తవ్యనిశ్చయ మని తెలియునది.

ఇతి శ్రీ మన్మహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం
వైయాసిక్యాం పారమహంస్యాం శ్రీ భీష్మపర్వణి శ్రీ భగవద్గీ
తా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే సకలశాస్త్రార్థకథనమోక్షోప
దేశయోగోనామ అష్టాదశోఽధ్యాయః.

ఇది యుపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకం
బును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదరూపం
బును నగు శ్రీభగవద్గీతలయందు మోక్షసన్న్యాస
యోగం బన్నది పదు నెనిమిదవయధ్యాయము.
శ్రీకృష్ణాయ పరమాత్మనే నమః.

150.

---

శ్లో॥ కృష్ణ స్తత్త్వం పరం తత్పరమపిచ హిత తత్పదై కాశ్రయత్వమ్।
శాస్త్రార్థోఽయం చ షట్కై స్త్రిభిరిహకథిత స్తత్రపూర్వత్రషట్కే।
భక్త్యర్థస్వాత్మదృష్టేః కరయుగళదశా మధ్యమేభక్త్యుపాయః।
స్వోక్తానుష్ఠానవృత్తిం ప్రథయితు మఖిలం ప్రోక్త మస్తేఽప్యశోధి॥

అధ్యాయై శ్శిష్యమోహ స్తదుపశమవిధిః కర్మయోగోఽస్యభేదా
స్తత్త్వాకర్త్యాదియోగ స్తదుచితమహిమా భూతికామాదిభేదః।
భక్తి స్తన్మూలభూమా భజనసులభతా భక్తిశైఘ్ర్యాది జీవ
త్రైగుణ్యం శాసితాజ్ఞా తదధిగమపర స్సారవర్గశ్చ గీతాః॥

తత్త్వం యత్ప్రణవే ధనఞ్జయరథేఽ ప్యగ్ర్యే దరీదృశ్యతే
తచ్చిత్తో భువి వేఙ్కటేశ్వరకవి ర్భక్తోఽనుకంప్య స్సతామ్।
తత్త్వాదృగ్గురు దృష్టిపాతమహిమ గ్రస్తేన యచ్చేతసా
గీతా విష్ణుపదీ యతీశ్వరవచ స్తీర్థై రవాగాహ్యత॥

శ్రీమతే రామానుజాయ నమః.

శ్రీమతే నిగమాన్తదేశికాయ నమః.



# అష్టాదశోఽధ్యాయః

## మోక్షసన్న్యాసయోగము — అవతారిక.

ఈ యధ్యాయారంభమున నర్జునుడు పార్థసారథిగా సన్న్యాస త్యాగముల తత్త్వము నెఱుంగగోరి ప్రశ్నించుచున్నాడు. వెనుకటి యధ్యాయమున నీ రెండింటిలో నే యొకదాని ప్రసంగమైనను గానము. దీని కేమి యభిప్రాయమో ఆరయవలెను.

తాత్పర్యచంద్రికలో శ్రీ వేదాంతాచార్యులు 'మోక్షసాధ భూతాంశ స్వరూపశోధన ముత్తరాధ్యాయేన క్రియతే ఇతి సఙ్గతిః' అని వాయించిరి. అనగా - మోక్షసాధనమైన ప్రపత్తియొక్క స్వరూప మిందు శోధింపబడుచున్నవి.

ఏ శాస్త్రమునందైనను తద్గతపారిభాషిక పదములయొక్క సంకేతము ముందుగ జేయబడును. అమరకోశమున జూడుడు. వ్యాకరణ శాస్త్రమున జూడుడు. అటులనే యీ యధ్యాయమున చివరదియగు మోక్షసాధనమైన ప్రపత్తి గుహ్యాతమముగ నుపదేశింపబడుచున్నది. అది యీ యధ్యాయమునకే కాదు గీతాశాస్త్రమునకే ప్రధానసారమని పెద్దలందురు. అట్టి ప్రపత్తికి ప్రధానాంగము 'సర్వధర్మపరిత్యాగము' ఇచ్చటనున్న త్యాగమున కర్థమును చక్కగ నెఱుంగనిచో ప్రపత్తి ఫలించదు. సరిగదా! ప్రత్యవాయకరమును నగును. అందుచే నధ్యాయారంభముననే శ్రీ భగవాను డచ్చటి త్యాగశబ్దమునకు తనకు వివక్షితమైన సాంకేతికార్థమును 'త్యాగోహి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః' అని ఫలసంగకర్తృత్వత్యాగమే యచ్చటి త్యాగశబ్దార్థ మనియు దానినే సన్న్యాసమందురనియు రెంటింటికి అభేదమును దాని స్వరూపమును వివరించెను.

సన్న్యాస శబ్దమునకు 'సతి-న్యాసః - సన్న్యాసః' అను వ్యుత్పత్తి చే సచ్ఛబ్దవాచ్యుడగు సర్వేశ్వరునియం దుంచుట (విడుచుట). దేనిని? తన

రక్షణభారమును – అని ప్రపత్తి పరమగు నర్థమును గ్రహించవలెను. త్యాగశబ్దమునకును వస్తుతః అదియే యర్థము. 'సన్న్యాసస్త్యాగ ఇత్యుక్తా శరణాగతి రిత్యపి' అని యివి పర్యాయపదములు.

ఇట్లిచ్చట త్యాగమనగా ఫలసంగకర్తృత్వ త్యాగమేకాని స్వరూపత్యాగము కాదని మొదటనే పారిభాషికముగ నిర్ణయించివేయుటచే చరమోపాయ ప్రతిపాదక చరమశ్లోకమునందలి సర్వధర్మ పరిత్యాగమనగా మోక్షోపాయములుగ నింతవరకు చెప్పబడిన కర్మ – జ్ఞాన – భక్తిప్రభృతులను స్వరూపముతో విడుచుటగాక పై విధముగ ఫలసంగ కర్తృత్వములను విడిచి కైంకర్యబుద్ధితో కర్మను, స్వపర స్వరూపజ్ఞానముతో జ్ఞానమును కాలక్షేపమునకు భక్తిని చేయవలెనని భావము.

(2) 'పృథక్త్వేదితు మిచ్ఛామి' యనుచో సన్న్యాసత్యాగముల పృథక్త్వము=భేదమును తెలియగోరుచున్నానని యర్థమైనచో నవి వేరు వేరని యెఱింగియుండి వాని వాని స్వరూపమును మాత్రమే యెఱుంగ గోరుచున్నాడని తాత్పర్యమగును. అది యుక్తముకాదు. అంతకు పూర్వము అవి వేరువేరని తెలుపుటకు తగిన హేతువులు కాన్పించవు. ముందైనను రెండింటికిని ఐక్యమే చెప్పబడుచున్నది. అట్టితరి యర్జునునకు వాని పృథక్త్వజ్ఞాన మెట్లుండును? అందుచే నీ ప్రశ్న ప్రతివచనములు అసంగతమని తోచుచున్నది. అందులకే శ్రీ భాష్యకారులు (రామానుజులు) 'అనగా' యని ప్రత్యేకించి నిరూపించిరి.

ఇచ్చట 'తత్త్వం వేదితుమిచ్ఛామి' యని మాత్రమే వివక్షితము, పృథక్త్వనిర్దేశమేల యన్నచో వేరైనచో చెప్పుము తెలియగోరుచున్నానని మాత్రమే యర్థము.

2వ శ్లోకము

(3) సర్వకర్మఫలత్యాగమే త్యాగమను వారి అభిప్రాయమేమనగా –

కామ్యకర్మ లొసంగు ఫలములు ముముక్షువులకు మోక్షవిరోధులనిగదా కామ్యకర్మలను విడువుమనుట - అందుచే ఫలమునే విడుచుట మంచిది. అయినచో - 'ప్రయోజన మనుద్దిశ్యనమందోఽపి ప్రవర్తతే' అనునట్లు పిచ్చివాడే మెరుగనిపించుకొనునే. అదియునుగాక 'నకుర్యాన్నిష్ఫలం కర్మ' అనియును నిషేధమున్నదే అన్నచో - నిత్యనైమిత్తిక కర్మలకు ఫలము లేకున్నను వాని ననుష్ఠించుటచే భగవంతుడు ప్రసన్నుడగునటుల వీనిని చేయుటవలనను భగవంతుడు ప్రసన్నుడగును. అంతకన్న గొప్పఫల మేమున్నది! అట్టివిధి యున్నదా యని శంకింపరాదు. 'యోవా ఏతదక్షరం గార్గ్యవిదిత్వా జుహోతి యజతే తపస్తపతి బహూని వర్షసహస్రాణి అన్తవదేవాస తస్య తద్భవతి' అను శ్రుతివాక్యముచే అక్షరుడనబడు పరమపురుషుని తెలిసికొని చేసిన కర్మలకు నిత్యఫలము కలదనియు అదేకర్మ అతని నెఱుంగక ఆచరించిన అల్పమైన ఫలము నొసంగుననియు చెప్పబడినదిగదా! కాబట్టి నిత్యనైమిత్తిక కర్మలవలె కామ్యకర్మలకు ఫలతః త్యాగమే గాని స్వరూపత్యాగము లేదని చెప్పుదురు.

(4) కామ్యకర్మల ననలే (స్వరూపతః) విడిచిపెట్టుమను వారి యభిప్రాయ మేమనగా - ఈ కామ్యకర్మలు నిత్యనైమిత్తిక కర్మల వంటివి కావు. ఏలనన -

1. అవి చేయనిచో నరకము కలుగును. 'సన్ధ్యాహీనోఽశుచిర్నిత్య మనర్హస్సర్వ కర్మసు' అనునటుల నితర కర్మలను చేయుట కనర్హుడగును. కావున నవి చేయబడుచున్నవి. ఈ కామ్యకర్మ లట్టివి కావు.

2. త్రివర్గసాధనములు గాన చేయబడవలెనందురా? వీనికి కావలసిన మోక్షమున కవి విరుద్ధములు గదా!

3. అవియే మోక్షసాధనమందురా ? అయినచో నుపాసన శాస్త్రమేల ?

4. ఉపాసన కంగముగా చేయవలెనందురా? దానికొఱకు నిత్య నైమిత్తికకర్మలే చాలును. వాని కింతకన్న వేరే ప్రయోజనము లేదు గదా! అందువలననే 'సర్వాపేక్షాచ యజ్ఞాది శ్రుతేరశ్వవత్' అను సూత్రమున ఆశ్రమధర్మములను మాత్రము చాలునని చెప్పబడెను గదా !

కాబట్టి స్వర్గ - నరకాదులకు కారణమైన కర్మలను ముముక్షువులు బొత్తుగ విడిచిపెట్టవలెనందురు.

3వ శ్లోకము

(5) ఈ శ్లోకమున 'ఏకే' - 'అపరే' యని రెండు పక్షములు చూపబడినవి. మొదటిది సాంఖ్యాద్వైతపక్షము. రెండవది త్యాజ్యోపాదేయ విభాగతత్త్వము నెఱింగిన తన స్వాంతపక్షము.

'కామ్యానాం కర్మణాం' అను శ్లోకమున కర్మలకు ఫలముతో విరోధము జూపబడినది. ఈ శ్లోకమున కర్మలకు స్వరూపతః దోష ముండుటచే నవి యనర్థావహములని చూపించబడినది.

సాంఖ్యులు వేదోక్తమగు హింసయును నిషిద్ధమే యగుటచే నది యును దుష్టమే యందురు.

ఈశ్వర కృష్ణ పండితు లిట్లందురు :— 'దృష్టవదానుశ్రవికః, సహ్యవిశుద్ధః, క్షయాతిశయ యుక్తః' అనగా - లౌకికహింసవలెనే వేదోక్తహింసయును కూడనిదే. నశ్వరమైనదియు నగుచున్నది, అని యర్థము. కాబట్టి వేదమున జెప్పబడిన 'శ్వేతమూలభేత భూతికామాః' అను హింసకూడ కర్తకు దోషావహామే. క్రతువున కుపకారియైనచో కావచ్చును. అంతమాత్రమే అని వారి మతము. ఇది భగవంతుని కసమ్మతము. దీనినిబట్టి సకల కర్మలును స్వరూపతః విడిచిపెట్టవలెననెడు అద్వైత సన్న్యాసవాదము నిరసింపబడినది.

4వ శ్లోకము

(6) తన ప్రీతికి సాధనమని భగవంతుడే స్వయముగ నన్నా కర్మలయందు ప్రేరేపించి నాచే వానిని చేయించుచున్నాడని ముముక్షువు భావించవలెను. సర్వేశ్వరునియందు తన కర్తృత్వమును అనుసంధించుట యనగా_ నా కర్తృత్వము 'పరాత్తుతచ్ఛ్రుతేః' అను సూత్ర సిద్ధాంతానుసారముగ భగవదధీనము. ఆతని యనుమతిలేనిదే నేనే పనిని చేయఁజాలను అని తలంచుట.

ఇచ్చట నొక వేదాంతరహస్యమును గమనించవలెను. మనము పిల్లలకు బెట్టు పేరులలో నొకయంశ భగవదధీనము. ఒక యంశ తండ్రి యధీనము. ఇది యెట్లన – ఏకాదశేఽహాని పితానామకుర్యాత్త 'ని పదునొకండవరోజున బిడ్డకు తండ్రి నామకరణము చేయవలెనని సామాన్యతః నామకరణమునకు భగవదిచ్ఛకలదు. విశేషించి 'రంగదాసు, రామదాసు' అను పేరులలో తండ్రి యిచ్ఛయే కారణము. అటులనే వీను కర్మలను చేయవలెనని సామాన్యముగా భగవదిచ్ఛ. ఆ పనులలో –

ఫలానపని చేయుదునని నిశ్చయించుకొని దానినే చేయుటలో తన యిచ్ఛ కారణము కాబట్టి జీవుని కర్తృత్వము ఉమ్మడి సొత్తు వంటిది. సామాన్యకర్తృత్వము భగవదిచ్ఛాధీనము – విశేషకర్తృత్వము జీవయిచ్ఛాధీనమును. ఉమ్మడిగా బ్యాంకులలో డిపాజిట్టు చేసినచో ఒకనికి అందుండి సొమ్మును తీయవలసి యున్నచో రెండవవాని యనుమతి సంతకము ఉన్ననే వాడా సొమ్మును తీయగల్గును. అటులనే చేతనులకున్న ఉమ్మడి కర్తృత్వములో తానొక పనికి దాని నుపయోగించవలెననిన ఈశ్వరసమ్మతి యవసరము. కర్తృత్వత్యాగ మనగా – అనేకులు కలసిచేసిన ఒకపనిని (నేనొక్కడినే)– చేసితి నను కొనకయుండుట. అనగా – 'అధిష్ఠానం తథాకర్తా కరణంచ పృథగ్విధం– వివిధాచ పృథక్చేష్టా దైవంచైవాత్రపఞ్చమమ్మని. ఐదవకర్తగా పర

మాత్మయని గణింపబడుటచే తా నొక్కఁడే చేసినట్లు భావించక పర మాత్మ తననే చేయించినట్లు తలంచుట.

కర్మలు చేయుచుండగా నీ ఫలసంగకర్తృత్వత్యాగ మెట్లు ఘటించునని యాశంకింపరాదు. అనగా – ప్రయోజనము లేనిదే ఎవ్వఁడు నే పనియును చేయఁడుగదా! చేసినను దాని యందంత ప్రీతియుండదు – కర్మ తనదియును మమకారము దానియందు లేనిచో శ్రద్ధయుండుట కష్టము. తాను చేయుచు నేను చేయలేదనుకొనుట దుర్ఘటము అని కదా ఆ శంక– దానికొక లౌకికయుక్తిని వినుడు.

ఒక గుమస్తా ఒక యజమానియొద్ద పనిచేయుచున్నాడు. ఆ యజమాని లక్షలమీద వ్యాపారమును చేయుచుండును. ఈ యుద్యోగికి నెలకు రెండువందలరూపాయ లిచ్చుచుండును. ఈ గుమస్తా తన నాయజమానునికి నౌకరునని తలంచుచున్నంతవరకు యీ వ్యాపారము నేనే చేయుచున్నాననిగాని, ఇది యంతయు నాదనిగాని వీనిలోని లాభనష్టములు నావి యనిగాని తలంచునా? ఈ వ్యాపారమును యజమాని నాచే చేయించుచున్నాడు ఇది యంతయు నాతనిదే దీనిలోని లాభనష్టము లాతనివేయని గదా తలంచుచుండును. ఇతనికీ వ్యాపారమున ఫలసంగకర్తృత్వములున్నవా? అటులనే మనముకూడ భగవంతునకు నౌఖరులమని (దాసులమని) నమ్మి పనులను చేయుచో మనకు నీ త్రివిధ త్యాగమున్ను ఘటించుట కాక్షేపమేమి?

5వ శ్లోకము

(7) పరమాత్మ సమారాధనరూపమై ఆతనికి ప్రీతిని కలిగించుటచే ఆప్రీతి యుండనేరదు గాన పావనాని యనబడుచున్నది. పుణ్యపాపములకు లక్షణము – శ్లో. య త్త్వత్ప్రియం తదిహ పుణ్య మపుణ్య మస్మాత్ నాన్య త్తయోర్లక్షణ మత్రిజాతు – భగవంతునకు ప్రియమైనచో పుణ్యమనియు అప్రియమగుచో పాపమనియు తప్ప పుణ్యపాపములకు వేరొక లక్షణములేదని శ్రీకూరేశులు అతిమానుష స్తవమున తెలిపిరి.

(8) "ఒకానొకప్పుడును విడిచిపెట్టదగదు" అనుటచే 'యజ్ఞేన దానేనతపసాఽనాశకేన-బ్రాహ్మణా వివిదిషన్తి'యనియును 'కుర్వన్నేవేహకర్మాణి జిజీవిషేత్' అనియు నుండుటచే యజ్ఞదానాదులు భగవంతుని తెలుసుకొనవలెనను యిచ్ఛనుబుట్టించును. అందుచే నాకోరిక జనించువరకే వాని నాచరించవలెను గాని ఆ యిచ్ఛకలిగిన పిమ్మట వానిని విడిచిపెట్టవలెననెడు పక్షము దీనిచే నిరసింపబడినది. 'సఖల్వేవం వర్తయన్ యావదాయుషం' వాడు బ్రతికియున్నంత పర్యంతము నిట్లే కర్మలను చేయుచునే యుండవలెను. అని శ్రుతియు, 'ఆప్రాయణాత్తత్రాపి హిదృష్టమ్' శరీర చరమయాత్ర (చనిపోవు) వరకు సర్వాశ్రమ ధర్మముల ననుష్ఠించవలెనను బ్రహ్మసూత్రము యీ యర్థమునే బలపరచుచున్నది.

(9) ఈ శ్లోక పూర్వార్ధమున 'కార్యమేవేతి' అను నిర్బంధ మేల? విద్యానిష్ఠునకీ కర్మలతో నేమిపని?

1. ఆరాదుపకారకములని యా? అట్లయినచో కర్మజ్ఞానములు సముచ్చిత్య కారణములగును గదా! అది కర్మజ్ఞానముల సంగాంగి భావము నంగీకరించుట మీకు సమ్మతియు కాదే.

2. తత్త్వజ్ఞానము కొఱకందువా? అది యాచార్యోపదేశము చేతను దానినివిని తానుచేయు మననాదులవలననే కలుగునుగదా!

3. ఉపాసన దార్ఢ్యము కొఱకందువా? అది యభ్యాసాతిశయముచే కలుగు సంస్కార పాటవము చేతనే సిద్ధించునే.

4. ఈకర్మలచే ముముక్షువునకు కావలసిన మఱియొక ప్రయోజనమేదైనను సిద్ధించుటకందువా? అట్టిదేదియును దీనివలన కానమే.

ఇట్లే ప్రయోజనమును లేనట్టి కర్మలను ఏ బుద్ధిమంతుడును చేయునా? ఇక నీవిధి యేల యని ప్రశ్న కభిప్రాయము.

(10) నిత్యనైమిత్తిక కర్మలను స్వరూపతః విడువవలెనను పక్షము నిరాకరింపబడుచున్నది అని సన్నిపత్యోపకారములు.

(11) ఉపాసన జీవితాంతమువరకును చేయుచున్నచో దాని కంగములగు యజ్ఞాదులను జీవితాంతమువరకును చేయుచునే యుండవలెను. అందులకే 'కుర్వన్నేవేహ కర్మాణి' 'సరాస్త్వేవం వర్తయన్ యావదాయుషం' ఇత్యాది శ్రుతులట్లుచెప్పుచున్నవి. ఉపాసనకు యజ్ఞములంగము లెట్లగుననన్నచో– 'సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతేరశ్వవత్' 3-4-25 అను బ్రహ్మసూత్ర మీ విషయమును నిర్ణయించుచున్నది. యజ్ఞాది కర్మలలో నధికారము గల గృహస్థులుచేయు బ్రహ్మోపాసనకు యజ్ఞాది సమస్తకర్మాపేక్షకలదు. ఎట్లనగా – గ్రామాంతరమునకు పోవుటకు సాధనమైన గుఱ్ఱమున్నను దానికి జీను కళ్ళెము మొదలగు పరికరములున్ననే గదా అది నిశ్చయముగా ఆ గ్రామమును చేర్చునది. అటులనే యజ్ఞాదులును –

దీని కీ క్రింది శ్లోకము నమసంధించవలెను –

శ్లో. యజ్ఞైరీజిమహే తపశ్చకృమహే జన్మాన్తరే దుశ్చరం

వృద్ధాన్ శేవిమహే ధనందధిమహే పాత్రేషు నూనంవయమ్
యేనాస్మాక మభూదనన్య సులభా భక్తిర్భవద్వేషిణీ
చాణూరద్విషి భక్తకల్మషముషి శ్రేయఃపుషి శ్రీజుషి.

మాకు శ్రీపతియందింత భక్తియెట్లు కలిగినదనగా – మేము పూర్వజన్మమున యజ్ఞదానతపః ప్రభృతులు నాచరించితిమని గోపికలు నారదునితో చెప్పినగుంటు.

(12) 'పూర్వకర్మలను అనుటలో భావమేమనగా – యజ్ఞదాన తపస్సులు ప్రాచీన సంచితకర్మలచే పోగొట్టగలవుగాని ఉత్తరాఘమును పోగొట్టజాలవు. దానినికూడ పోగొట్టగలది ఒక్క– ఉపాసనయే.

'తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్' అను బ్రహ్మసూత్రమున సాక్షాత్కారావస్థనరకు పక్వమైన బ్రహ్మ

విద్యయున్న చో దానివలననే దీనికి పూర్వమందున్న పాపకర్మలన్నియును నశించుటయును, అది పుట్టినపిమ్మట ప్రమాదమువలన తటస్థించిన పాప కర్మల యొక్క ఫలమునిచ్చు శక్తి నశించుటయును వేదములలో చెప్పబడెను.

ఇట్లు పావనములని చెప్పబడుటచే 'త్యాజ్యం దోషవత్' అను పక్షము ఖండింపబడినది.

7వ శ్లోకము

(13) ఛాందోగ్యోపనిషత్తులోని షష్ఠప్రపాఠకములో గల పితా పుత్ర - సంవాదములో జగత్తంతయును త్రివృత్కృతమని ఋజువు చేయుచు తండ్రి మనము దిను ఆహారములోని పృథివ్యప్తేజములు (అన్నము, నీరు నెయ్యి మొ॥నవి) ఎట్లు త్రివృత్కృము లగుచున్నవో చెప్పు ఘట్టములో - 'అన్నమయంహి' అను నీ వాక్యము ప్రసంగించ బడినది. దీని భావమేమనగా - మనము తినిన అన్నము, త్రాగిన నీరు, తిన్న నెయ్యి మొదలగు తేజఃపదార్థములు, శరీరములో ప్రవేశించి పెరుగు చిలకబడినటుల పేగులలో చిలకబడి మూడువిధములుగా విభ జింపబడును. అందు వెన్నవలె పైకితేలిన సూక్ష్మపదార్థములలో పృథివీ పదార్థముచే మనస్సున్ను, జలపదార్థముచే ప్రాణమున్ను, తేజః పదార్థ ముచే వాగింద్రియమున్ను ఆప్యాయితములు గావింపబడునని తెలుప బడినది. ఆహారముయొక్క సాత్త్విక రాజస తామస భేదములచే మనో వృత్తులును సాత్త్విక రాజస తామసభేదములచే మారుచుండును. దీనిని దృష్టాంత పూర్వముగా ఋజువుచేయుమని పుత్రుడు కోరుటచే తండ్రి యాతనిని 15 దినము లాహారమును మాన్పించి మనశ్శక్తి క్షీణించు టను ఏమియు జ్ఞాపకము లేకుండుటయును తిరిగి క్రమమున నన్నమును తినుటచే నవి వృద్ధిచెంది యడిగిన వన్నిటిని చెప్పగలుగుటను సిద్ధాంత మును ఋజువుపరచినాడు.

8వ శ్లోకము

(14) అర్థానా మార్జనే దుఃఖం
ఆర్జితానాంచ రక్షణే
నాశేదుఃఖం వ్యయేదుఃఖం
కిమర్థం దుఃఖభాజనమ్.

ధనము సంపాదించుటలో క్లేశము. ఆ సంపాదించిన దానిని కాపాడుటలో క్లేశము. దానినెవరైనను అపహరించిన క్లేశము. ఖర్చు అయిపోయిన దుఃఖము. ఇట్లెన్ని విధముల మానవుని నేడిపించు నీ ధనార్జన కొఱకీ తాపత్రయమేల?

5వ అధ్యాయమునందలి 22వది యగు

యే హి సంస్పర్శజా దోషాః
దుఃఖయోనయ ఏవ తే.

అను శ్లోకములో తాత్పర్యచంద్రికయందు ద్రవ్యార్జనకు సంబంధించిన ఐదు దోషములను పేర్కొనిరి.

1. ఆర్జనదోషము 2. రక్షణదోషములు 3. క్షయదోషము 4. భోగదోషము 5. హింసాదోషము అని.

1. అసిధారాసమమగు రాజసేవాదులలో అది శ్వవృత్తి (కుక్క బ్రతుకు) అగుటయేగాక శరీరము నశించువరకు ఆర్జించవలసినదోషము.

2. వేయి ప్రాకారములమధ్య నుంచినను రాజులవలననో నిప్పు వలననో, ఎలుకలవలననో, దొంగలవలననో నశించకుండ కాపాడవలసిన రక్షణదోషము.

3. స్వర్గసుఖము ననుభవించువానికిని ఆ సుకృతము తరిగిపోయినచో నేలపాలగుదునను భయము క్షయదోషము.

4. ఉన్నదని దేశ, కాల, ద్రవ్య, పాత్ర, అవస్థానియమములను పాటించక తినుటచే కలుగునవి భోగదోషములు.

5. పరులను పీడించి ధనము నార్జించుటచే హింసాదోషము.

(15) కర్మదుఃఖాత్మకముగదా! మనఃక్లేశమును కలిగించదా? యన్నచో

"ఫలం సంబిభిత్సయా ఆత్మానం ప్రీణన్తి"

"సప్రీతోఽయం- ఫలాయేతి శాస్త్రమర్యాదా"

అనగా- పరమాత్మనుండి తన కభీష్టమైన ఫలమును పొందవలె నను కోరికతో నాతనిని కర్మలాచరించి సంతోషపెట్టును. అట్లాతడు ప్రీతుడై ఫలము నిచ్చును. అనునట్లు కర్మలచే సంతుష్టుడైన సర్వేశ్వరుడు మనస్సుకు శాంతిని ప్రసాదించును.

(16) భూమిపై ప్రమాదవశమున పడిన గింజ మొలవదన్న మాట లేదు. కావున తేలిన సారాంశ మేమనగా కర్మలను బొత్తిగ విడిచిపెట్టి వేయుటయే ఉచితము.

(17, 18) ఇచ్చట అనిష్టమనగా నరకాది ఫలమనియు ఇష్టమనగా స్వర్గాదిఫలమనియును చెప్పుట ముముక్షువు కానివానికి; ముముక్షువునకు స్వర్గాదులును అనిష్టఫలములే.

(19) "నాన్యః పన్థా అయనాయ విద్యతే" అని నియమించుటచే వేదనమే (ఉపాసనయే=భక్తియే) మోక్షసాధనమని చెప్పబడినది. 'అన్యః పన్థాః' అనుటచే కర్మనిరసింపబడినది. అట్లైనచో మోక్షాధికారికి కర్మయేల? కర్మలకు మోక్షవినియోగము వివిదిషలోనే. 'యజ్ఞేన దానేన తపసా వివిదిషన్తి' అని గదా వేదవాక్యము అన్నచో 'అసినా జిఘాంసతి' 'అశ్వేన జిగమిషతి' అనుచో సర్థస్వభావమునుబట్టి కత్తికి చంపుటలోను, గుఱ్ఱమునకు గమనములోను ఉపయోగమును చెప్పవలెను గదా! అటులనే యిచ్చటను ఇచ్ఛలో విషయమైన ధాత్వర్థమగు వేదనములో కరణము- (సాధనము)గా యజ్ఞాదు లన్వయించును. కాబట్టి యజ్ఞాదులు వేదనము ను (ఉపాసనను) బుట్టించి పరంపరగా

మోక్షమునకు సాధనమగుటచే నిది మోక్షములో నిట్లుపయోగించునని తెలియుచున్నది. అయిన కర్మను - 'నాన్యఃపన్థా' యని నిషేధించుచున్నదే అనినచో సవ్యవధానముగా కారణము కాదగినది వేరొకటి లేదని భావము.

21వ శ్లోకము

(20) ఈ శ్లోకములోని - పృథక్త్వ - నానాత్వ - పృథగ్విధ శబ్దములకు -

జాతిభేదము - విశేష్యభేదము, గుణాదిభేదములని యర్థమును చెప్పినచో పౌనరుక్త్య ముండదు.

23వ శ్లోకము

(21) సాత్త్వికమైన కర్మలను చేయు సాత్త్వికుడు పరమాత్మయందు ప్రీతితోను సంసారమునందు ద్వేషముతోనే చేయునుగదా. 'అరాగద్వేషతః కృతం' అనుట యెట్లు పొసగునన్నచో కీర్తియందు రాగము అపకీర్తియందు ద్వేషముకూడదని తాత్పర్యము.

25వ శ్లోకము

(22) 'అనుబంధము'- క్షయమనగా=ఆ పనికై చేయవలసివచ్చిన ధనవ్యయమనెడు దోషమే చెప్పబడుటచే యీ యనుబంధశబ్దములోని 'అను' అనెడు ఉపసర్గవలన - ఆనివలన - అనగా ఈ ఖర్చువలన తరువాత కలిగిన దుఃఖమని యర్థమును చెప్పవలెను

26వ శ్లోకము

(23) అనహంవాదీ

అహం వదన శీలోఽహంవాదీ = నేను చేసితిని, నేనుచేసితిని అని చెప్పువాడు. అట్టివాడు కాకుండుట. (అట్లు చెప్పకుండుట.) అనహంవాదీ.

ఇట్లర్థము చెప్పవలసియున్నను వాక్యానకు ముందు మనస్సుం

డుటవలన (అనగా- మనస్సులో ఆలోచించి పలుకవలెను గాన) కర్తృత్వాభిమానము లేనివాడని చెప్పబడినది.

27వ శ్లోకము

(24) ఇచ్చట 'హింసాత్మకః' అను పదమునకు చక్కని యర్థమును శ్రీ భాష్యకారులు చెప్పిరి.

శాస్త్రము 'కామం ఆత్మానం భార్యాం పుత్రం వా ఉపరున్ధ్యాత్ న త్వేవ దాసకర్మకరం' తనకు సేవచేసిన కింకరునికి కడుపునిండ అన్నమును పెట్టవలెను. దానికై అవసరమైనచో తానైనను ఉపవసించవలెను. అదియును చాలనిచో భార్యనైనను ఉపవసింపచేయవలెను. అదియును చాలనిచో బిడ్డనైనను పస్తుపెట్టవలెను గాని కింకరుని కడుపును కొట్టరాదు- అని చెప్పుచుండగా దానికి విరుద్ధ స్వభావమును కలిగియుండుటయే యిచ్చట హింసయని చెప్పబడుచున్నది.

(25) 'అశుచిః' అనుటచే దర్శన స్పర్శనములకు తగిన శుచిత్వమున్నంత మాత్రముచే కర్మణ్యుడుకాడు. కింతు - ఆ కర్మకు తగిన ఆంతర బాహ్యశుద్ధి కలవాడు కావలెను.

28వ శ్లోకము

(26) ఈ శ్లోకమున 'అయుక్తః' అను పదమునకు శాస్త్రీయములగు కర్మకు తగనివాడనియు కూడని పనిని చేయువాడనియు అర్థము చెప్పబడినది. ఈతడు తామసకర్తగాన రాజసకర్తకు 'అశుచిః' యని కర్మలకు వలయు శుద్ధిలేనివాడని చెప్పబడెను. రాజస కర్మకును తగడు గాన నింకను వీని యయోగ్యత అధికమని చెప్పవలెను. అట్టి వీని యధికమైన అయోగ్యత ఏమనగా -

"శైవాన్ పాశుపతాన్ స్పృష్ట్వా
లోకాయతికనాస్తికాన్
వికర్మస్థాన్ ద్విజాన్ శూద్రాన్
సచేలో జలమావిశేత్"

సాత్త్వికుడై పవిత్రజీవనమును గడపు శ్రోత్రియుడు - పశుపతినే పరతత్త్వమని కొలుచు శైవులును, దేవుడులేడు వారిని గురించిన శాస్త్రము లసత్యభూయిష్ఠములని నమ్మియుండు నాస్తికులైన చార్వాకులను తన విధ్యుక్తధర్మమును విడిచి కూడని యితర వర్ణాశ్రమ ధర్మముల నాచరించు బ్రాహ్మణులను అట్టి శూద్రులను తాకినచో వెంటనే కట్టుబట్టలతో నీట మునగవలెను అనునట్టి అయోగ్యుడని యర్థము.

(27) శాస్త్రగ్రంథమైనను లేక దానియందు చెప్పబడిన ధర్మముల నెఱుంగకుండుటచే సాత్త్వికకర్మలను చేయుటకు తగిన యోగ్యత లేకుండుట - ప్రాకృతశబ్దమున కర్థము.

(28) పూజ్యులైన మహాత్ములను చూడగనే వేగముగ నెదురేగి వారికి తగినటుల సాష్టాంగ ప్రణామము, ఉచితాసన మిడుట, కాళ్ళొత్తుట, విసనికఱ్ఱతో వీచుట మొదలగు సేవలను చేయక స్థిమితముగ కూర్చునియుండుట స్తబ్ధత యనబడును -

(29) శఠుడనగా.

దీనికి నైఘంటికార్థము 'గూఢవిప్రియకృత్ శఠః' రహస్యముగా నొకని కనర్థక్రియలను చేయువాడు. ఇచ్చట ఆ క్రియలనే శాస్త్రమున జెప్పబడినశ్యేనయాగమువంటి అభిచారకర్మలనుచేయువాడని యర్థము.

(30) నైకృతికః - మాయ మోసము వంచన మొదలగువానిని లౌకికకర్మలద్వారా చేయువాడు.

(31) అలసః - 'శ్వఃకార్యమద్య కుర్వీత' రేపు చేయవలసిన మంచిపనిని నేడే చేయుము అనునట్లు శాస్త్రీయమైన పనులలో త్వరపడవలెను. అందులకు విపరీతముగా చేయుటయే 'ఆలస్య' మనబడును. అట్లుచేయువాడే 'అలసుడు'.

(32) షద్ ౡ- విశరణ గత్యవసాదనేషు- అనినటుల ధాతువునకే అవసాదమని యర్థమున్నది. దానికి 'వి' యను ఉపసర్గముండుటచే దాని

యొక్క అతిశయము చెప్పబడుచున్నది. అనగా- మిక్కిలి యవ సాదము - చివరనున్న తాచ్ఛీల్యార్థక ప్రత్యయముచే నది వానికి సహజముగానుండుట యర్థమగుచున్నది.

అవసాదమనగా -

దేశకాల వైగుణ్యాత్ శోకవస్త్వాద్యనుస్మృతేశ్చ తజ్జం దైన్యం- 'అభాస్వరత్వం - మనసోఽవసాదః' అనగా - దేశము, కాలము తన కనుకూలముగా నుండక పోవుటచేతను దుఃఖకరములగు వస్తువులను తలంచుకొనుటవలనను మనస్సునకు కలుగు కుంగు అవసాదమనబడును. (హెచ్చరిక లేకుండుట) అట్టి దైన్యము ఆప్తులగు నితరులకు చూచుట చేతను కలుగు దైన్యముఁకుంగున్ను అవసాద మనబడును.

(33) దీర్ఘసూత్రీ - సూత్ర- సూత్రణే అను ధాతువు. సూత్రణ మనగా చింతించుట. అదియే స్వాభావికముగా కలవాడు (2) దీర్ఘసూత్ర ణాత్ దీర్ఘసూత్రీ. అమాయకమైన పశువులను పట్టుటకు పెద్దతాడును తయారుచేయువాని వంటివా డగుటచే ఔపచారికముగా దీర్ఘసూత్రి యనబడు చున్నాడు అని కొందఱు అర్థమును చెప్పెదరు.

29వ శ్లోకము

(34) ధనఞ్జయ -

ధనమును జయించినవాడు ధనంజయుడు అర్జునుడు. ఇప్పుడీ సంబోధన సాభిప్రాయము. అనగా- దిగ్విజయమున మానుషమైన ధనము నార్జించితివి. అటులనే యిప్పుడు శమాది ధనమును కూడ నార్జించవలెనని తాత్పర్యము.

(35) జ్ఞానము -

జ్ఞానము మూడు విధములని వెనుక చెప్పబడెను. తిరిగి యిచ్చట బుద్ధి త్రైవిధ్యమును చెప్పనేలి? యన్నచో -

అనుష్ఠానదశయం దుండవలసిన యనుసంధానము వేరు. దానికి కారణమై దానికి ముందుండవలసిన శాస్త్రముచేబుట్టు అధ్యవసాయము వేరు. దాని నిచ్చట చెప్పచుండుటచే పౌనరుక్త్యము లేదు.

30వ శ్లోకము

(36) భయము అభయములయొక్క స్వరూపమునందరెఱుంగుదురు. అందుచే నిచ్చట ఆ భయాభయములకు నిమిత్తము నెఱుంగుట చెప్పబడుచున్నది. అందుచే ప్రస్తుత ప్రకరణమునుబట్టి శాస్త్రము నుల్లఘించి వర్తించుట భయస్థానమనియు, శాస్త్రానుసారముగ ప్రవర్తించుట అభయస్థానమనియును గ్రహించవలెను.

'బిభేతి అస్మాదితి భయం' దీనినుండి భయపడుచున్నాడు గాన భయము.

ఈ వ్యుత్పత్తినిబట్టి భయమును పుట్టించు ప్రాణులే యిచ్చట భయశబ్దమున కర్థము. తత్త్వము నెఱింగిన ప్రాజ్ఞులకట్టి భయము సర్వేశ్వరునివలననే పుట్టుచున్నది. అభయమైనను అతనివల్లనే. ఆయన ప్రేరేపించకుండగ నేదియును నెవరిని బాధించుటకుగాని బాధించకుండుటకుగాని శక్యము కాజాలదు.

కాబట్టి యాతని యాజ్ఞను పాలించుటయే అభయ నిమిత్తము. అతని యాజ్ఞ నుల్లఘించుటయే భయనిమిత్తము.

'శ్రుతిస్స్మృతిర్మమై వాజ్ఞా<br>
యస్తాముల్లంఘ్య వర్తతే<br>
ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ<br>
మద్భక్తోఽపి నవైష్ణవః'

'భీషాస్మాద్వాతఃపవతే' ఇత్యాదు లిచ్చట అనుసంధేయములు.

(37) కార్యా కార్యజ్ఞాన మెట్టిదనగా -

శరీరం బలమాయుశ్చ
వయః కాలంచ కర్మచ
సమీక్ష్య ధర్మవిద్బుద్ధ్యా
ప్రాయశ్చిత్తాని నిర్దిశేత్

దేశం కాలంతథాత్మానం...ఇత్యాది ధర్మమును లెస్సగ నెఱింగిన బుద్ధిమంతుడు చేయువాని దేహదార్ఢ్యమును, బలమును వయస్సును సమయమును చేయవలసిన కృత్యమును, బాగుగ నాలోచించి ప్రాయశ్చిత్తములను విధించవలెను. అని శాస్త్రము చెప్పుచున్నది.

కార్యాకార్యశబ్దముచే శక్యాశక్యములను తెలియవలెను.

(38) ఇచ్చట యాథాత్మ్యశబ్దముచే 'బంధం మోక్షంచ' అను శబ్దములకు - బంధమున్నదనియు అది సత్యమనియు, మోక్షమున్నదనియు అది సత్యమనియు నెఱుంగుటయు నర్థమగుటచే బాధము మిథ్యయను నద్వైత వాదమున్ను మోక్షము పాషాణకల్పమను తార్కికవాదమున్ను నిరస్తములగుచున్నవి.

32వ శ్లోకము

(39) దీనినిబట్టి వేదము నంగీకరించనట్టియు, అంగీకరించినను విపరీతార్థములను కల్పించువారి మతము తామసమని యెఱుంగవలెను. దీనిని మనువు యిట్లు చెప్పెను -

'యా వేదబాహ్యా స్స్మృతయః
యాశ్చకాశ్చ కుదృష్టయః
సర్వాస్తాః నిష్ఫలాః ప్రేత్య
తమోనిష్ఠాహితా స్స్మృతాః'

వేదవిరుద్ధమైన స్మృతులను, వేదమునకు విరుద్ధార్థములను చెప్పు కుదృష్టుల గ్రంథములను, అవలంబించువారు శరీరమును విడిచిన వెనుక పరలోక ప్రాప్తికొకింతయును అధికారులుకారు. ఆ గ్రంథము లన్నియును తామసములే.

రాజస తామస బద్ధులకు భేదమేమనగా - అసంపూర్తిగ నెఱుంగుటయు, ఒకదానియందు వేరొకదాని ధర్మములున్నట్లు గ్రహించుట యును రాజసబుద్ధి యనబడును.

అందులకే 'యథావ న్నజానాతి' యనబడెను. అన్నిటిని విపరీతముగా తలంచుట - అనగా - ఒకవస్తువును మరియొక వస్తువునుగా తలంచుట తామసబుద్ధి యనబడును. అందులకే 'సర్వార్థాన్ విపరీతాంశ్చ' అనబడెను.

సంగ్రహముగా - ధర్మవిపర్యాసము, రాజసబుద్ధి; ధర్మివిపర్యాసము - తామసబుద్ధి.

అనగా- శంఖము పచ్చగానున్నదనుకొనుట రాజసబుద్ధి. తాడును పామనుకొనుట తామసబుద్ధి.

(ప్రకారాన్యథాత్వం - రాజసము - ప్రకార్యన్యథాత్వం - తామసము)

అని భేదమును చెప్పినట్లయినది. రెండింటియందును యెదుట నున్న వస్తువునందు దానిది కానిధర్మమే దానియం దారోపింపబడు చున్నది. అయినను - స్వరూప నిరూపక ధర్మము (అసాధారణధర్మము) నకు వైపరీత్యమున్నచో తామసత్వము.

ఉదా - శుక్తినిచూచి రజతమనుకొనుట - నిరూపిత స్వరూప విశేష ధర్మవైపరీత్య మున్నచో రాజసము.

ఉదా - శంఖము పచ్చగ నున్నదనుట

33వ శ్లోకము

(40) ఈ శ్లోకమున స్వీకింది విశేషమును గమనించవలెను.

సాక్షాత్కారమనగా మనస్సుతోచేయు వ్యాపారము. ప్రాణక్రియయు నట్టిదే. 'యత్రమన స్తత్రవాయుః, యత్రవాయు స్తత్రమనః'

అని యుండుటచే రెండును పరస్పరము కలసిపోయుండును. ఇంకను వేరొకచోట -

'పునర్వాయు పథం ప్రాప్య
మనో భ్రమతి వాయువత్'

అని రెండింటికిని సమానవ్యాపారము చెప్పబడినది. ప్రాణాయామ క్రియయు మనస్సునకే సహకారిగా చెప్పబడుచున్నది. దానిచే మనస్సుతో చేయదగిన యోగమునకు విరోధులగు క్లేశములును పాపములును పరిహరింపబడును.

ఇక బాహ్యేంద్రియ క్రియ యనగా -

స్వాధ్యాయాద్యోగ మాసీత
యోగాత్స్వాధ్యాయ మామనేత్
స్వాధ్యాయ యోగసమ్పత్త్యా
పరమాత్మా ప్రకాశతే. (విష్ణు. పు. 6-6-2)

నిరంతరమును యోగము నభ్యసించుట శక్యము కానిదగుటచే దానినుండి విరమించి వేచినపుడు వేదాధ్యయనమును చేయవలెను. నిరంతర మదేపనిగా నుండక దానిని విడిచి యోగము నభ్యసించవలెను. ఇట్లు మార్చి మార్చి స్వాధ్యాయ యోగముల ననుష్ఠించుటచే పరమాత్మను చూడగల్గును. ఇట్లు యోగాంగమగు స్వాధ్యాయ మొనర్చుటయే బాహ్యేంద్రియ క్రియ.

36వ శ్లోకము

(41) సాత్త్విక సుఖము పైచూపున కింపుగా గాన్పించకపోవుటచే దానికభ్యాస మనవసరము. లోకమున నభ్యాసముచే సంపాదించదగిన క్షుద్రమైన ప్రీతియును కలదు.

అది కాదనుటకే 'చిరకాలేత్యాది' గ్రంథ మవతరించినది.

37వ శ్లోకము

(42) ఆత్మను గూర్చిన బుద్ధియొక్క ప్రసాదమువలన బుట్టిన సుఖము. ప్రసాదమనగా – కూడని విషయములతో కలుసుకొనుట యనెడు కాలుష్యము లేకుండుట. అనగా – వివిక్త స్వభావముగల ఆత్మానుభవమువలన సుఖము అమృతమువంటి దగును.

ఇది యమృతమువంటి దెట్లగు ననగా – ముసలితనమును మరణమును మాన్పున దగుటవలన భోగ్యతమమైన దగును. అందుచే దానిని విడచుట దుశ్శకము – అందువల్లనే ఆ సుఖము నమృతముతో పోల్చిరి. పరమాత్మానుభవ సుఖము నిచ్చుట చెప్పలే దేమనగా –

పరమపురుషునకు శేషభూతుడై యుండుటయే స్వరూపముగా గల తనను వాస్తవముగ జూచినచో దానిలో పరమాత్మానుభవ సుఖమున్ను అంతర్గమగుటచే దానిని వేరుగా జెప్పలేదు.

39వ శ్లోకము

(43) రాజస సుఖము పశ్చాదవస్థలో మోహమును కలిగించును గాని తామససుఖము దాని ననుభవించు సమయముననే దుఃఖము నొసంగుట అంద రెఱింగినదే.

నిద్ర సుఖహేతు వెట్లగుచున్న దనగా – మేలుకొనియున్న కాలమున పడిన ఆయాసముయొక్క విశ్రాంతికి కారణమగుటవలనను లేపినవారిపై కోపగించుటవలనను అంద రెఱింగినదియే.

ఇది యింద్రియముల పనులను మందగింప జేయుటయును అవయవముల శోభను పోగొట్టుటద్వారా చేయును. ఇది పరాకునకు కారణమగును. ఎట్లనగా – బుద్ధిని ఏకాగ్రపరచుటకు చేయు ప్రయత్నము నరికట్టుటద్వారా ఆభాససుఖము నొసంగున దనుటచే – అకాల నిద్ర నిచ్చుట గ్రహించరాదు.

'యామ ద్వయం శయానస్తు
బ్రహ్మభూయాయ కల్పతే'

అనగా - రెండు ఝాములు మాత్రమే నిద్రించువాడు శుద్ధాత్మస్వరూపానుభవమునకు తగినవా డగును.

ఆయుర్వేదమునందును -

అకాలేఽతి ప్రసక్తాచ్చ
నచ నిద్రానిషేవితా
సుఖాయుషీ పరాకుర్యాత్
కాలరాత్రి రివాపరా॥

వేళకాని వేళ నిద్రించుట కాళరాత్రివంటిది గావున సుఖముగ జీవించగోరువాడు దానిని దరిచేరనీయరాదు.

(44) గుణములయొక్క విభాగమును తెలుపు నీ ప్రకరణమునకు ప్రయోజనము - వానియొక్క దోషముల నెఱింగి యనుష్ఠానమున సావధానముగా నుండుటయే.

40వ శ్లోకము

(45) అవతారిక -

ప్రాకృతములగు సత్త్వరజస్తమోగుణములను దాటి శుద్ధసత్త్వమయుడైన భగవత్ప్రాప్తియనబడు మోక్షమును బడయువరకును ఆయా లోకములలో వారి వారి కేర్పరచిన భోగములను హెచ్చుతగ్గులుగా ననుభవించుచున్న సమస్తజీవులచేతను పైనచెప్పబడిన గుణసూత్రమును నిశ్శేషముగా విడుచుట శక్యముకాదని తెలుపుచు ప్రకరణమును ముగించుచున్నాడు.

41వ శ్లోకము

(46) అవతారికకు అవతారిక -

ఇట్లింతవరకు సమస్త సంసారులను గుణత్రయ వశ్యులని చెప్ప బడినది. ఆయా సత్త్వరజస్తమో గుణములయొక్క తారతమ్యముతో కూడిన దేహములుగల అధికారులకు వారి వారి యోగ్యతకు తగినటుల శాస్త్రములచే విధింపబడిన కర్మలు ఇప్పుడు విచారింపబడుచున్నవి. ఈ విచారమునకు ప్రధాన ప్రకరణముతో గల సంబంధమును జూపుటకై యీ యధ్యాయారంభములో నారంభింపబడిన విషయమును తెలుపుచున్నారు.

(47) 'బ్రాహ్మణ క్షత్రియవిశాం' అని మూడు వర్ణ వాచక శబ్దముల నొకే సమస్త పదముతో జెప్పుటచే వీరు ముగ్గురును ద్విజులగుటచే వీరికి వేదమును చదువుట కధికారము కలదని చెప్పుటకే.

(48) సత్త్వాది గుణములయొక్క వృద్ధి వెనుకటి కర్మలనుబట్టి యుండునని యిదివరలోనే జెప్పబడెను. కాబట్టి యా గుణాభివృద్ధికి సంబంధించిన కర్మలున్ను యిచ్చట ఆయా గుణము లధికముగాగల పురుషుల కసాధారణ ధర్మములగుటచే స్వాభావికములని చెప్పబడు చున్నది. 'కర్మవశ్యా గుణా హ్యేతే సత్త్వాద్యాః పృథివీపతే' జడభరత రహూగణ రాజసంభాషణ సందర్భమున (శ్రీ) విష్ణుపురాణములో జెప్ప బడెను. కాబట్టి గుణము లౌపాధికములైనను ఇచ్చట స్వాభావికములని చెప్పబడెను.

(49) బ్రహ్మాండ పురాణాదులలో గుణవిభాగపద్ధతి ఇట్లు తెలుప బడినది –

'తమశ్శూద్రే రజః క్షత్రే బ్రాహ్మణే సత్త్వముత్తమం'

ఈ శ్లోకమున కర్థమును జెప్పుచు ప్రకృతి శ్లోకమును వివరించు చున్నాను.

## 42వ శ్లోకము

(50) ఆస్తిక్యం – 'అస్తి – మతిః – అస్యేతి – ఆస్తికః – తస్య భావః – ఆస్తిక్యం.

ఉన్నదను బుద్ధికలవారి ధర్మము.

ఆ బుద్ధి అప్రామాణికములయం దుండరాదు. కంటికి గాన్పించు వాని యందున్నచో విశేషము లేదు. శాస్త్రము యందైనను ఒక్కచో సంశయగ్రస్తమగుచో కుదృష్టులగుదురు. అందుచే 'వేదార్థమంతయు' అనబడెను –

(51) ఇచ్చట చెప్పబడిన 'శమదమాదులు' ఇదివరలో వివరింప బడినను తిరిగి వానిని వివరించుట యెందులకనగా –

1. వర్ణములనుబట్టి సహజగుణములుగా చెప్పబడుటచే వీనికే మైనను అవాంతర భేదము లున్నవా? అని శంక ఉదయించును. దానిని పరిహరించుటకును –

2. 'బ్రాహ్మకర్మ' అనుటచే వీనికి కర్మత్వము సిద్ధించుటకొఱ కును ఇంద్రియనియమనమని వ్యాఖ్యానించుటచే పురుషునికృషిచే సాధిం పదగినవని చెప్పుకొఱకును, అని గ్రహించవలెను.

43వ శ్లోకము

(52) సేనలో ప్రవేశించి శత్రువులచే పరిభవింపబడినచో నా ప్రవేశమే తప్పగును. దానిని పరిహరించుటకే యిచ్చట తేజస్సు గుణముగా చెప్పబడెను.

(53) ఈశ్వరభావమనగా – దుష్టనిగ్రహము. శిష్టానుగ్రహ మున్ను యిచ్చట వివక్షితములు.

44వ శ్లోకము

(54) కర్షతీతి కృషిః=దున్నుట. ఇది యౌగికార్థము పంటలు పండించుట రూఢ్యర్థము.

(55) 'గాః రక్ష్యాయత్ర తత్కర్మ గోరక్ష్యం' – పశువులను పాలించుట, లేక గాం రక్షతీతి గోరక్షః=ఆవులకాయువాడు తస్యకర్మ గోరక్ష్యం=పశుపాలనము.

(56) వణిజఃకర్మ — వాణిజ్యం.

(57) విశఃకర్మ=వైశ్యం.

(58) బ్రాహ్మణునకు చెప్పినవిగాక నింకను

1. తను వేదమును చదువుట.

2. అర్థాలను నితరులకు చెప్పుట.

3. తాను యజ్ఞములను చేయుట

4. తగినవారిచే యజ్ఞములను చేయించుట.

5. యోగ్యమైన పురుషులనుండి సద్ద్రవ్యమును దానముగా గొనుట 6. దేశకాలపాత్రల నారసి న్యాయార్జిత ధనమును ప్రతిఫలాపేక్ష లేకుండ నిచ్చుట అను ఆరు కర్మలు చెప్పబడినవి.

క్షత్రియునకును వైశ్యునకును వెనుక చెప్పబడినవిగాక — వేదమును చదువుట, యజ్ఞములను చేయుట, దానమునిచ్చుట — అను మూడు కర్మలుకలవు.

అటులనే శూద్రునకు — సక్రమముగా పెండ్లాడిన భార్యను ప్రేమించుట — లోపలను బయటను శుచిగానుండుట, తన చేతిక్రింద కొందరు నౌఖరులను పోషించుట, శ్రాద్ధములను చేయుట మొదలగు కొన్ని ధర్మము లున్నవనియును శాస్త్రములు చెప్పుచుండగా పై శ్లోకములలో కొన్నిటిని మాత్రమే చెప్పి కొన్నిటిని విడువనేల? యన్నచో నవి ఉపలక్షణమని చెప్పుచున్నారు. (ప్రదర్శకమన్నను — ఉపలక్షణమన్నను నొక్కటియే).

(59) శమాది గుణములు మోక్షము నపేక్షించు మొదటి మూడు వర్ణములకును అవసరమైయుండ బ్రాహ్మణునకే ధర్మముగా చెప్పనేల యన్నచో చెప్పుచున్నారు—'బ్రాహ్మణునకు'—యాజ్ఞవల్క్యుడు శూద్రుని ధర్మమును ఇవికను చెప్పెను.

శ్లో. శూద్రస్య ద్విజ శుశ్రూషా । తయా జీవన్ వణిగ్భవేత్
శిల్పైర్వా వివిధై ర్జీవేత్ । ద్విజాతి హిత మాచరన్॥
(1-5-121)

ద్విజులనగా - రెండు జన్మలుగల బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు అనగా ఉపనయనముద్వారా వేదాధ్యయ నార్హులు. వారికి సేవచేయుచు శూద్రుడు దానివలన జీవనమును గడపవలెను. అనేక విధములగు చేతి పనులవలననైనను బ్రాహ్మణులకు హితమునొనగూర్చుచు గడపినను మరుజన్మకు వైశ్యుడుగా బుట్టును.

మను విచ్చట కొంత విశేషమును జెప్పుచున్నాడు -

'విప్రసేవైవ శూద్రస్య విశిష్టం కర్మకీర్త్యతే'

ఇతర వృత్తులన్నిటికన్న శూద్రునకు బ్రాహ్మణ సేవయే శ్రేష్ఠ మని చెప్పెను.

ఇచ్చటి నీ పూర్వపక్షసిద్ధాంతములను జాగ్రత్తగా గమనించవలెను.

1. శూద్రునకు 'భార్యారతిః' అనగా సక్రమముగా పెండ్లాడిన భార్యయందు ప్రేమ మొదలగు ధర్మములు చెప్పబడుటయు.

2. 'మాం హి పార్థవ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః-
స్త్రియో వైశ్యా స్తథాశూద్రాః తేఽపి యాన్తి పరాంగతిమ్'

అని భగవంతుడు తనను కొలిచిన శూద్రులకును మోక్షాధికార మున్నదని చెప్పుటచేతను,

3. వసన్తేదీక్షు యేద్విప్రం......హేమన్తే శూద్రయేవచ... 'పఞ్చరాత్ర విధానతః అని శూద్రునకు హేమంతఋతువులో భగ వంతుని యారాధించుటకై పాంచరాత్రాగమరీత్యా దీక్షనొసంగుమని చెప్పబడుట చేతను.

4. బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యైః శూద్రైశ్చ కృతలక్షణైః
అర్చనీయశ్చ సేవ్యశ్చ । నిత్యయుక్తై స్స్వకర్మసు

సాత్త్వతం విధిమాస్థాయ । గీతస్సంకర్షణేన యః
భారతే. భీష్మ. 66-39-40

భగవల్లాంఛనములను ధరించిన బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులునుకూడ తమ వర్ణాశ్రమ ధర్మములను లెస్సగ జరుపుచు పాంచరాత్రీయ ప్రక్రియతో భగవంతుని యర్చించవచ్చునని దీక్షిత శూద్రునకు భగవదర్చన కధికారమున్నదని చెప్పబడుట చేతను.

5. విష్ణుధర్మములో – (108-19).

బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాః । శూద్రాశ్చ కృతలక్షణాః
కృతే యుగే సమభవన్ । స్వకర్మ నిరతా స్సదా
ఏకదేవ సమాయుక్తాః । ఏకమన్త్ర విధిక్రియాః
పృథక్ధర్మాస్త్వేక వేద్యాః । ధర్మమేక మనువ్రతాః
అకామ ఫలసంయోగాత్ । ప్రాప్నువన్తి పరాంగతిమ్.

కృతయుగములో నాలుగు వర్ణములవారును భగవల్లాంఛనములను ధరించి తమ తమ వర్ణాశ్రమ ధర్మములయం దత్యంతాదరము కలవారై అందరును ఫలాశలేకయే నొకేదేవుని కొలుచుచు, ఒకే మంత్రమును ఒకే విధమగు కర్మలను చేయుచు ఒకేతత్త్వమును ధ్యానించుచు వారి వర్ణాశ్రమ ధర్మములను మాత్రము వేరువేరుగా చేయుచు పరగతిని బడయుచుండిరని చెప్పబడుటచేతను –

6. (శ్రీ) సాత్త్వతమున- చతుర్ణా మధికారో వైవృత్తే దీక్షాక్రమేసతి- సాత్త్వతదీక్షను పరిగ్రహించినచో నాలుగు వర్ణములవారికిని భగవదర్చనలో అధికార మొకేరీతిగ నుండునని చెప్పబడుటచేతను –

7. శ్రీ సాత్త్వతే - వ్రతవిధాన పరిచ్ఛేదమునందు -

దానార్చనేతు శూద్రాణాం వ్రతకర్మణి సర్వదా
అసిద్ధాన్నంతు విహితం........
స్వకర్మణా యథోత్కర్షః। మత్యేతి చ తథార్చనాత్
తస్మాత్ స్వేనాధికారేణ।కుర్యాదారాధనం సదా
సర్వత్రాధికృతో విప్రః। వాసుదేవాది పూజనే
యథా, తథా న క్షత్రాద్యాః। తస్మాచ్ఛాస్త్రార్థ మాచరేత్
నయేన్నక్తాశనై ర్భక్త్యా। దినాన్యేతాని మాద్గల
వ్రతాద్యన్తేతు విహితం।పరపీడం హి తస్యవా.

అని వ్రత విశేషపద్ధతి చెప్పబడినది.

అనగా - శూద్రులు దానమునందుగాని, దేవతార్చనయందు గాని వ్రతాచరణమందుగాని యెల్లప్పుడును అపక్వ పదార్థములనే నివేదించవలెను. తన వర్ణాశ్రమ ధర్మాచరణమువలన నెట్టి ఫలమును బడయునో అట్టి ఫలమునే భగవదారాధన వలనను బడయును. కాబట్టి తనకు తగినరీతిగ భగవదారాధనను సదా చేయవలెను. బ్రాహ్మణు డెట్లు భగవదారాధనలో నన్ని వేళలయందును అన్నివిధముల నర్హుడో క్షత్రియాదులట్లు కారు కాబట్టి శాస్త్రోక్తపద్ధతిగనే ఆరాధనను వారు జరుపవలెను. రాత్రి మాత్రమే ఆ వ్రతదినములలో భుజించవలెను. భక్తితో వ్రతదినములను గడపవలెను. లేక వ్రతారంభమునందును అంతమునందును ఉపవసించవలెను. (మాద్గల = శూద్రా, పరపీడం = ఉపవాసము).

8. వౌషట్ స్వాహా వషట్కార నిషానాం తు ప్రతిక్రియా
నమస్కారేణ విహితా.......

మంత్రములలోనే - వౌషట్కార - స్వాహాకార - వషట్కారములు చేయవలసిన తావులయందు వానికి బదులుగ నమస్కారము శూద్రులకు విధింపబడినది. ఇక ఇతర విషయములలో చెప్పనేల?

9. నారదీయమున- అష్టాక్షర కల్పమందు —

నస్వరః ప్రణవోఽఙ్గాని । నాప్యన్య విధయ స్తథా
స్త్రీణాంతు శూద్రజాతీనాం । మన్త్రమాత్రోక్తిరిష్యతే॥

శూద్రస్త్రీలకు మంత్రోపదేశమున – స్వరముగాని ప్రణవము గాని మంత్రాంగములుగాని యితర పురశ్చరణాది విధులనుగాని ఉప దేశించరాదు. మంత్రమును మాత్రమే వా రుచ్చరించవచ్చునని చెప్ప బడెను. దీనినిబట్టివారికి మంత్రోపదేశ తదక్షరశ్రవణ తదుచ్చారణాదులు కలవని స్పష్టమగుచున్నది.

10. ఏకాదశీ వ్రతాదులు అందరకును సమముగనే శాస్త్రమున చెప్పబడుచున్నవి.

11. మరికొన్ని పురాణాదులలో పరిగ్రహించదగినవి – పరిత్య జించదగినవియును చెప్పబడుచున్నవి.

శూద్రుడు కపిలగోవుపాలను త్రాగరాదు. బ్రాహ్మణస్త్రీతో సంగమించరాదు. వేదములను చదువరాదు.

ఇటులనే తలవెంట్రుకలు, గడ్డము, మీసములు గొరిగించు కొనుటలోను గోళ్ళుతీసికొనుటలోను ఆచారభేదములు చెప్పబడినవి. ఇట్లే ఆచమనములోను భేదముకలదు.

అయినచో– కొన్ని శాస్త్రములలో జపము, తపస్సు, తీర్థయాత్ర, సన్న్యాసము, మంత్రపురశ్చరణ, దేవతార్చన మొదలగునవి (స్త్రీలకును) శూద్రులకు పతనహేతువులని చెప్పనేల యనగా – వారికి ముఖ్యముగా శాస్త్రములలో చెప్పబడిన శుశ్రూషకు భంగమును కలిగించినచో నవి కూడనివని చెప్పబడెను. దానివలన గీతలో చెప్పబడిన శుశ్రూషయే ప్రధానధర్మమని తెలియవలెను.

జయసంహితలో –

నశూద్రా భగవద్భక్తాః విప్రాః భాగవతాః స్మృతాః
చాతుర్వర్ణ్యేషు తే శూద్రాః । యేహ్యభక్తాజనార్దనే॥

అను శ్లోకమున నాలుగు వర్ణములలోనున్న భగవద్భక్తులును సమానమేయని చెప్పబడెను.

శూద్రునికిన్ని ధర్మము లాచరించదగిన వుండుటచేతను భగవత్పరిచర్యవలనను వర్ణత్రయ పరిచర్య కుంటుబడవచ్చునే - ఇట్లుండ గీతలో భగవానుడు చేయదగినదియు వర్ణత్రయ పరిచర్యగానే యని చెప్పనేల యనగా —

## ప్రత్యుత్తరము

శ్రేష్ఠమైన సంస్కారములు గుణములు మొదలగు యోగ్యతలు కల శూద్రులకును కొన్నిధర్మములు చెప్పబడినను కూడవసచెప్పిన ధర్మములకన్న వేరైనవి మాత్రమే. ఆ కూడునని చెప్పిన ధర్మముల నైనను వారికి ముఖ్యముగా జెప్పబడిన వర్ణత్రయసేవకు విరోధములు కాకుండగనే, అవియును వారి పరిచర్యయే యను బుద్ధితో చేయు వలెను. అందువల్లనే 'పరిచర్యాత్మైవ' అని యనకుండగ 'పరిచర్యాత్మకం కర్మ' అనబడినది. అనగా ఆ కర్మ వారి పరిచర్యరూపమైనదే యన్నమాట.

రహస్యామ్నాయవేత్త లిట్లు చెప్పుచున్నారు —

తాను శాస్త్రమునెఱింగి దానిని తా నాచరించుచు ఇతరులను బోధించి ప్రేరేపించుట బ్రాహ్మణ ధర్మము - జ్ఞానమును జ్ఞానులను కాపాడుట క్షత్రియధర్మము - జ్ఞానబీజములను వృద్ధిపొందించుట వైశ్యుని ధర్మము- జ్ఞానులకు పరిచర్యచేయుట శూద్రధర్మము- ఇది కృతయుగధర్మము. ఆ యుగాంతమందును త్రేతాయుగారంభము నందును నాలుగు వర్ణములును భేదించినవి. వారివృష్టి మారినది. వారి దారులు మారినవి. ఓషధులును వృక్షములును వెనుకటివలె పుష్పి

లను పూచుట పండ్లనుకాయుట మానివేసినవి. దానిని గాంచి నాలుగు వర్ణస్థులకును అసూయ ప్రబలెను. శూద్రుడు బ్రాహ్మణులకు నేను పరిచర్య చేయననెను.

రెండవ జాతియగు వైశ్యుడు నేను మీకు ఆహారధాన్యమును పండించననెను. మూడవ జాతియగు క్షత్రియుడు నేను మిమ్ములను రక్షించననెను. వారి ముగ్గురి ఔదాసీన్యమును గాంచి బ్రాహ్మణుడును అయినచో నేనును నా కర్తవ్యమును విడిచెదను. నేను మీ కేమియు నుపదేశించననెను.

అని యిట్లు నాలుగు వర్ణముల ధర్మములను రాను రాను ఆ ధర్మములపట్ల వారి వారి ఔదాసీన్యమున్ను తెలుపబడెను –

శ్రీ విష్ణుపురాణమున 6–2–6 లో శ్రీ పరాశరు డిట్లనెను–

శ్లో. మగ్నో௨థ జాహ్నవీతోయాత్ ।ఉత్థాయాహ సుతో మమ
శూద్రస్సాధుః కలిస్సాధు । రిత్యేవం శృణ్వతాం వచః॥

ఋషులందరును కలసి యుగములలో నల్పధర్మానుష్ఠానము వలననే అధికఫల మిచ్చున దేదియనియు, వర్ణములలో నధికమగు నియమ నిష్ఠలు లేకనే ఉత్తమ పురుషార్థమును బడయు వర్ణమేది యనియు శంకించుకొని శ్రీ వ్యాసమహర్షియొద్దకేగగా నాతడు నదికి స్నానార్థ మేగెనని యెఱింగి యా నదియొద్దునకేగి వేచియుండి వారి హృదయము నెఱింగిన వ్యాసమహర్షి- శూద్రుడు సాధు_ కలియుగము సాధు అని యా ఋషులు వినునట్లు గట్టిగా నని నీటమునిగి లేచివచ్చి ఆ ఋషుల నేల వచ్చితిరని పరామర్శింప వారు నవ్వుచు మా సంశయములు తీరి పోయినవిగాని యందులకు కారణములను చెప్పుమనగా నా మహనీయుడు వానిని వివరించిచెప్పెను. అందు శూద్రున కధిక నియమ నిర్బంధములు లేకున్నను భగవద్భక్తి కలిగియుండి వర్ణత్రయ పరిచర్య

చేసినంత మాత్రముననే ఉత్తమ పురుషార్థమును బడయువని సెల విచ్చెనని శ్రీ పరాశరుడు వ్రాసెను. ఇట్టి ప్రకరణములను పరిశీలించ వలెను.

'నశూద్రాః భగవద్భక్తాః విప్రాః భాగవతాస్స్మృతాః, అను శూద్ర ప్రశంసాపర వాక్యముండుటచే నాతెనికి వర్ణత్రయ పరిచర్య లోపించదా? యను ప్రశ్న కవకాశము లేదు. ఏమన - భగవదేకాంత భక్తుడగు శూద్రునకే ఆ భగవద్భాగవతసేవ విధింపబడినది. అందర కునుకాదు. భగవద్భక్తుని స్తుతించుటలోనే దానికి తాత్పర్యమేగాని తన వృత్తిని విడుచుటలో కాదు. కాబట్టియే 'సర్వవర్ణేషు తే శూద్రాః యేహ్యభక్తా జనార్దనే' భగవద్భక్తి లేనివా రేవర్ణస్థులైనను శూద్రులే యని భగవద్భక్తి లేనివారిని నిందించినది. ఇట్లు అన్వయ వ్యతిరేకములచే భగవద్భక్తిని కొనియాడుటలోనే ఆ గ్రంథమునకు తాత్పర్యము - శాస్త్రమున నెచ్చటనైనను స్తుతించిన, నది సాత్వికాన్తఃకరణ గల వానినే, నిందించిన నది లేనివానినే అని గ్రహించవలెను.

శాస్త్రములో బ్రాహ్మణుని స్తుతియును సత్వప్రచురమగు నంతఃకరణమునుబట్టియే బ్రాహ్మణ్యాది జాతివ్యవస్థ శారీరమైన సత్త్వాది గుణ తారతమ్యమునుబట్టియే అయినను ఆ తారతమ్యము వారికి ఆం తర సత్త్వాభివృద్ధివరకు నుండుననియే, వాడు బ్రతికియున్నంత వరకును జాతి వ్యవస్థ మారకయుండును. ఆ వ్యవస్థనుబట్టియే వారాచరించు ధర్మములు వారికి వ్యవస్థితములై చివరవరకు అనువర్తించుచుండెను - అందువల్లనే విదురుడు బ్రహ్మవిద్యను బాగుగ నెఱింగినను తన కర్మ ములను చెప్పుట కధికారము లేదని స్పష్టీకరించెను.

భారతమున ఉద్యోగ ప. సనత్సుజాతీయమున - 41-5.

'శూద్ర యోనావహం జాతః । నాతోఽన్యద్వక్తుముత్సహే

నేను శూద్రవర్ణమున బుట్టితిని గాన నింతకుమైన చెప్ప సాహ సింపజాలననెను.

ఆడుది యని తల్లి ననాదరింతురా? అటులనే శమదమాది గుణ
ములు పుష్కలముగానున్న వ్యక్తిని శూద్రుడని యనాదరించరాదని
తెల్పుటయే జాతినిబట్టి యనాదరించరాదని నిషేధ మేర్పడినది. అందు
వల్లనే 'ఏతైస్సమేత శ్శూద్రోఽపి వార్ధకే మానమర్హతి' అను సూక్తి
వినబడుచున్నది. అనగా - ఈ శమదమాది గుణసంపత్తి శూద్రునకు
ముదిమివరకు విడువకయున్నచో నాతడా వయస్సులో మిక్కిలి యాద
రించదగిన వాడేయని -

కావుననే భగవదుక్తి- గారుడపురాణమున- పూర్వఖండములో-
219-6, 7, 8 శ్లో.

శ్లో. 'మద్భక్త జనవాత్సల్యం। పూజాయాంచాను మోదనమ్
స్వయమభ్యర్చనఞ్చైవ। మదర్థే డంబవర్జనమ్

మత్కథా శ్రవణోభక్తిః। స్వరనేత్రామ్బు విక్రియా
మామనుస్మరణం నిత్యం యచ్చమాం నోపజీవతి
భక్తిరష్ట విధాహ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే
సవిప్రేన్ద్రో మునిశ్శ్రీమాన్ సయతిశ్చ పణ్డితః
తస్మై దేయంతతో గ్రాహ్యం సచపూజ్యో యథాహ్యహమ్॥

అనగా- 1. నా భక్తుల దోషములను పాటింపకుండుట- 2. వారి
నాదరించుటకు సమ్మతించుట లేక వారు కావించు భగవద్భాగవతార్చ
నలయందు ప్రసన్నత. 3. తానును స్వయముగ భగవదర్చన సేయుట.
4. నాకు చేయు పరిచర్యలలో డాంబికత్వమును చూపకుండుట. 5. భగ
వత్కథలను వినుటలో ప్రీతిపూర్వకమైన ఆసక్తి. 6. ఆ కథలను విను
నప్పుడు హృదయము కరిగి గద్గదకంఠము, ఆనందబాష్పములు. ఆపాద
మస్తకము పులకరించుట మొదలగు వికృతులను కలిగియుండుట. 7.
నిరంతరము నాధ్యానములను చేయుట 8. నానుండి సాంసారిక భోగ
ముల నాశించకుండుట అనెడు నీ యెనిమిది విధములగు భక్తికలవాడు

మ్లేచ్ఛజాతికిచెందినవాడైనను సరియే వాడు బ్రాహ్మణోత్తముడే. వాడు మునియే. వాడైశ్వర్యవంతుడే. వాడు యతీశ్వరుడే. వాడు పండితుడే. కాబట్టి వానికి దానధర్మము లిచ్చుటలోను వారిచ్చునవి పుచ్చుకొనుట లోనుకొంచెమైననుసంకోచింపరాదు. వేయేలవానిని నన్నుపూజించినటు లనేపూజింపవలెను చెప్పబడినది. అందుచే శూద్రునకు వృత్తి (జీవిక) కర్తవ్యము రెండు నొక్కటియే. అని ఈ నియమముల నైనను వాడు క్రమతిమించక యున్నంత పర్యంతమే పాలించవలెను- వానికి శ్రేష్ఠులతో చెప్పబడిన సామ్యమైనను అన్నివిషయములలోకాదు- భక్తిలేని మూర్ఖుల కన్న గొప్పవాడనుటలోను ఉత్తమపురుషార్థమగు మోక్షమును బడ యుటలో మాత్రమే. అపశూద్రాధికరణము నుల్లంఘించరాదు. భాగవతుడని శూద్రున కతిశయమున్నను బ్రాహ్మణునకును దానివల్లనే ఉత్కర్షగాన బ్రాహ్మణునకు జాత్యాద్యతిశయ మధికముగ నుండుటచే నాతని గౌరవ మాతని కుండవలనదే అని పెద్దలు సెలవిచ్చిరి.

45వ శ్లోకము

(61) అవతారిక –

వర్ణధర్మము లీ మోక్షశాస్త్రమునందేల చెప్పబడినవనగా - చెప్పుచున్నారు.

(62) అల్పఫలముల నీయదగిన యింద్రాదుల యారాధన రూప ములను వర్ణాశ్రమ ధర్మములు పరమపదము నెట్లీయగలవు? అనగా- ఆ విషయమునే ముందు చెప్పుచున్నాను వినుమనుచున్నారు.

(63) స్వధర్మ నిరతుల కందరకును మోక్షము లభించు నను చున్నారే. శూద్రున కెట్లు పరిచర్యాత్మకమైన తన సహజకర్మవలన పరమపదము లభించును?

ఆతనికి మోక్షమునకు అత్యవహిత ముఖ్యసాధనమైన విద్యలో (ఉపాసనలో) అధికారము లేదని అపశూద్రాధికరణమున చెప్పబడినది గదా!

అపశూద్రాధికరణ మనగా - భగవంతుడు ఉపాసకుల ననుగ్రహించుటకై వారి హృదయములలో నంగుష్ఠప్రమాణముగా వేంచేసి యుండునని చెప్పగా దేవతల కుపాసనాధికారమున్నదా లేదా? యని చర్చరాగా వారికిని ఉపాసనకు వలయు అర్థిత్వము సామర్థ్యమును ఉండుటచే- అనగా- వారికి కోరదగిన పదవులు పటుతర దేహేంద్రియములును ఉండుటచే వారికిని ఉపాసనచేయు నధికారమున్నదని చెప్పగా- వారికన్నను కోరదగినవియు వారికన్నను బలమైన దేహాదులును శూద్రునకున్నవిగదా! వారికిని అధికారముండవచ్చునా? ఉపనిషత్తులలో రైక్వఋషి ఓ శూద్రా! రమ్ము- రమ్ము. నీకు నేను బ్రహ్మోపదేశమును చేయుదునని పిలిచి ఆధ్యాత్మిక విషయముల నుపదేశించినట్లున్నదిగదా! యని శంకించుకొని- శూద్రునకు ఉపనయనము వేదాధ్యయనమును లేవుగాన వానిని ముఖ్యాంగములుగాగల ఉపాసనలో వారికధికారము లేదు. శ్రుతులు స్మృతులు పురాణములు ఇతిహాసములును వారికం దధికారము లేదని నిషేధించుచున్నవి. రైక్వ డుపదేశించినది జీనశ్రుతియను క్షత్రియునకేగాని యాతడు శూద్రుడుకాడు. శూద్రా యని పిలుచుట ఆతనికి బ్రహ్మోపదేశము లేదని దుఃఖమును సూచించును గాని చతుర్థవర్ణముకాదని సోపపత్తికముగా సమర్థించి శూద్రున కుపాసనలో నధికారమును నిషేధించెను.

అని ప్రశ్నరాగా - నిజమే. అందు సందేహము లేదు. కాని వారికి జన్మాంతరమున నట్టి యధికార ముండుటచే పరంపరగా వారికి పరమపదము లభించవచ్చునని తాత్పర్యమగుటచే విరోధమొకింతయును లేదు. విదురాదులకువలె పూర్వజన్మ జ్ఞానముకలవారికి పూర్వజన్మమునందు ప్రారంభించి విడచిన ఉపాసనస్మృతి యుండును. కాన తనకు తగిన వర్ణాశ్రమధర్మములను చేయకుండుటవలన తటస్థించు ననర్థమును బాపుటకై సాక్షాత్తుగనే సంసిద్ధిని బడయుటకు యోగ్యతకలదని చెప్ప

బడుచున్నది. దీనికే శౌనకమహర్షి యిట్లు చెప్పెను. విష్ణుధర్మే - 102 - 30.

శ్లో. ధర్మవ్యాధా దయోప్యన్యే
పూర్వాభ్యాసా జ్జుగుప్సితే
వర్ణావరత్వే సంప్రాప్తాః
సంసిద్ధిం శ్రమణీయథా.

అనగా ధర్మవ్యాధుడు విదురుడు మొదలగు జన్మసిద్ధ జ్ఞానాధికులు కొందరు పూర్వజన్మమునందలి యభ్యాసముచే వారి కసహ్యాకరమైన నీచజన్మలో ప్రారబ్ధ శేషమువలన బుట్టినను ఆ జన్మయందుండియే శబరివలెనే సిద్ధిని బడయగల్గిరి.

46వ శ్లోకము

(64) పరమపురుషుడు సకలమునకును కారణమైనవాడు. సర్వాంతర్యామిగా నుండువాడు. తనచే సృజింపబడిన యింద్రాదులలో నంతర్యామిగా నుండుటచే వారు తనను శరీరభూతులు. శరీర వాచికశబ్దములు శరీరిని చెప్పునుగాన వారి పేరులతో తానే పిలువబడును.కావున నిజమునకు వారి నారాధించుట తన నారాధించుటయే యగును. అందుచే వారి యారాధన రూపములగు వర్ణాశ్రమధర్మములు తన యారాధన రూపములే యగుటచే నవి సంసిద్ధికి సాధనములగుట నిర్వివాదము.

(65) ఇంతవరకును వర్ణాశ్రమధర్మములను బొత్తుగా విడువరాదనియు అవి పరమపదప్రాప్తికి సాధనములనియు చెప్పబడెను.

ఇటువైన ఆ కర్మలే 'దైవమేవాపరే యజ్ఞం' అని ప్రధానమైన కర్మయోగాంతర ముఖ్యధర్మములకు అంగములుగా నాచరింపబడుటచే కర్మయోగములో చేరుచున్నవి. కాన జ్ఞానయోగాధికారులకును విడువతగదని వెనుక చెప్పినదియే తిరిగి యీ శ్లోకముచే తెలుపబడుచున్నది.

## 47వ శ్లోకము

(66) ఈ శ్లోకమున సర్వధర్మమనగా నేమి యని యాలోచించవలెను.

(ఎ) దానికి వర్ణాశ్రమనియతధర్మములని యర్థమునుజెప్పరాదు. శ్రేయస్త్వ మనగా ప్రశస్యతమత్వమని యర్థము. ఒకడు పాపమును చేయుచుండును. వానితో- పాపముకన్న పుణ్యము శ్రేయము గదా యనినచో రెండింటిని పోల్చినప్పుడు పాప మొక్కవాసి తగ్గినను ప్రత్యేకము మంచిదనియే యర్థము సిద్ధించును. అటులనే పరధర్మమును చేయువానిని అంతకంటె నీ వర్ణాశ్రమ ధర్మము శ్రేయముగదా యన్నచో పరధర్మమునకును పరిగ్రాహ్యత్వము సిద్ధించును. శ్రేయస్త్వ మనగా ప్రశస్యతమత్వముగాన పరధర్మము మంచిదేగాని నీ ధర్మమంతకంటె మంచిదని యర్థమగును. ఆ యర్థము తగునా? పరధర్మము తనకు నిషిద్ధమగుటచే తన కధర్మమే యగును గదా!

(బి) వేదబాహ్య ధర్మమిచ్చట పరధర్మమన రాదు. అప్పుడు ఆ ధర్మముకంటె స్వధర్మము అనగా - వైదిక ధర్మము శ్రేయమని యును చెప్పరాదు. అట్లు చెప్పినను పైవలెనే వేదబాహ్యధర్మమునకును శ్రేయస్త్వము దానివలన పరిగ్రాహ్యత్వమున్ను సిద్ధించును.

(సి) క్షత్రియుడగు నర్జునునకు -

'శ్రేయోభోక్తుంభైక్షం' అనబడు బ్రాహ్మణ ధర్మమగు సన్న్యాసము నిషేధింపబడుచున్న దనియును చెప్పరాదు. ఆ ధర్మమతనికి తగునా? తగదా? తగునేని కూడదననేల? తగదేని పాపమేయగును గాన వెనుకటి సమాధానమే- కాకను ఆపదలలో దాని కనంతరవృత్తి న్యాయమే. కాన గృహస్థునకు ఆపదలో సన్న్యాసము తగినవృత్తియే తప్పలేదు. దానిని కూడదననేల?

(డి) కావున నిచ్చట స్వధర్మ - పరధర్మ శబ్దములు వెనుకటి వలెనే కర్మయోగము స్వధర్మమనియు జ్ఞానయోగము పరధర్మమని యును చెప్పవలెను.

ఇచ్చట స్వపరశబ్దములు జాతిపరములు కావు. కాని తదధికారి పరములు.

48వ శ్లోకము

(67) శ్లోకమునందలి దోషశబ్దమునకీ యర్థమునేల చెప్పవలె ననగా- దోషశబ్దమునకు పాపమని యర్థమును చెప్పరాదు. శాస్త్ర ముచే విధింపబడిన కర్మ పాప మెట్లగును! పాపమే యైనచో 'త్యజేత్' విడిచిపెట్టవలెనని చెప్పవలెనేగాని 'నత్యజేత్' అనదగునా? పాపాంశ మందరకును త్యాజ్యమే కదా! కాబట్టి కాయక్లేశాదులతో గూడినదే యని దోషశబ్దమున కర్థమును చెప్పవలెను. సోమరుల కంతమాత్రము చేతనే విడువవలెనని బుద్ధిపుట్టును గాన దానిని నిషేధించుచున్నారు.

(68) మోక్షమును కోరువానికి శాస్త్రమున శ్రేయస్సుగా జెప్ప బడిన కర్మ ఏదో కొలది కష్టజనకమైనంత మాత్రమున విడువవలెనని బుద్ధి జనించునా? ప్రసక్తిలేనిదే యిచ్చట నిషేధమేల? యన్నచో. 'జ్ఞానయోగార్హ్యుడైనను'...అనుచున్నారు 'అపి' యని శ్లోకపూర్వార్థ ములో గలదు. అట్టి జ్ఞానయోగికే కర్మ విడువకూడదని చెప్పిన నిక నితరుని మాట చెప్పనేల? శ్రమలేని యుపాయ మొకటి గాన్పించి నచో తన యోగ్యతను తన యధికారమును జూచుకొనకయే దాని యందు ప్రవృత్తి కలుగుట సహజము. కాబట్టి దానిని నిషేధించు చున్నారు.

(69) ఇంతకుముందు జ్ఞానయోగము దుఃఖజనకమనియు కర్మ యోగ మట్టిదికాదనియు నంగీకరించి సమాధాన మొసంగబడెను. కాని యిప్పుడు ఆ దుఃఖజనకత్వము రెండింటికిని సమానమే యని చెప్పు చున్నారు.

(70) రెండింటికిని దుఃఖమొక్కటియే యన్నచో నొకదాని నేల నిషేధించవలెనన్నచో ఆ రెండింటికిని దుఃఖములో తారతమ్యమున్నది· ఏమనగా– కర్మయోగము నాచరించుటలో శరీరపరిశ్రమ కలదు. అంత మాత్రమే. జ్ఞానయోగము నాచరించుటలో నది ఫలప్రాప్తికి దగ్గరదారి యేమైనను అది యాత్మోపాసన యగుటచే దాని నన్వేషించుటకు ఇంద్రియములను మనస్సును నియమించుట మిక్కిలి దుఃఖాత్మక మగు చున్నది.

49వ శ్లోకము

(71) 'సర్వత్ర అసక్తబుద్ధిః' అని చెప్పియును 'విగతస్పృహః' అనుటలో తాత్పర్య మేమనగా–

ఫలసంగమును విడుచుట యను త్యాగముతోపాటు చెప్పబడిన కర్తృత్వత్యాగమును చెప్పుట ముఖ్యమగుటచే కలలోనైనను తన యందు కర్తృత్వాను సంధాన మొకింతయు నుండరాదని త్యాగము యొక్క చివరహద్దును చెప్పుచున్నారు.

(72) నైష్కర్మ్యం – నిర్గతకర్మా = నిష్కర్మా – తస్యభావః నైష్కర్మ్యం– సకలేంద్రియములతో జేయుకర్మలయొక్క విరామరూప మైన స్థితియని భాష్యకారులు వ్రాయించిరి.

(73) 1. కాయము నభిముఖీకరణ మెట్లనగా – స్థిరాసనమున నుండుట మూలముననే.

2. వాక్కునభిముఖీకరణ మెట్లనగా– ప్రణవమును తప్ప మరి దేనినిగాని యుచ్చరించకుండుటవలన.

3. మనస్సు నభిముఖీకరణ మెట్లనగా– అభీష్టమగు భగవద్ధ్యానము వలన.

(74) దర్పమనగా–

అహంకార మధికముగా నుండుటవలన ఒప్పుకొనవలసినవానిని

ఒప్పుకొనకుండుట. 'నేను యోగిని, నేను 'శాంతుడను' అనియు దర్ప ముండరాదు. ఏలననగా –

ధర్మశాస్త్రమున– 'హృష్టో దృప్యతి దృప్తోధర్మ మతిక్రమతి'

అనగా – ప్రాకృత విషయముల మూలముగ ఒడలెఱుంగని యానందము కలవాడు గర్వించును. గర్వించువాడు న్యాయమార్గ మును తప్పును.

54వ శ్లోకము

(75) అనతారిక–

కర్మయోగాదులచే సాధింపబడిన జీవాత్మానుభవము పరభక్తికి యధికారిని గాపించునని చెప్పుచున్నారు.

(76) పరశేషతైక స్వభావత్వముకూడ నావిర్భవించునని చెప్ప బడెను.

అనగా– ఆత్మ పరమాత్మను మాత్రమే యుద్దేశ్య నినియోగా ర్హాత్వరూపమైన శేషత్వము, స్వరూపముగా కలదనియు గోచరించును.

55వ శ్లోకము

(77) 'రాగాది దూషితే చిత్తే । నాస్పదీ మధుసూధనః' 'రాగా దులతో నిండియున్న మనస్సున మధుసూదను డుండడు' అనినట్లు పర భక్తికి అనర్హతను పోగొట్టునని 'ప్రసన్నాత్మా' (54 శ్లో.) అను పదము యొక్క అర్థమని శ్రీ భాష్యకారులు తెలుపుచున్నారు.

ఇచ్చట క్లేశములనగా = అవిద్యా - అస్మితాదులు అయినను కర్మలనగా=పుణ్యపాపములు.

(78) ఆదిపదముచే విపాకము, ఆశయును గ్రహింపబడెను విపాకమనగా=జాతి.

ఆయువు – భోగములున్ను.

ఆశయములనగా = సంస్కారములు.

(79) ఆత్మానుభవ సుఖమువలన, బాహ్యపదార్థములయందు వైరాగ్య ముదయించునుగాని పరమాత్మ- జీవాత్మకన్నను అధిక సుఖ స్వరూపుడగుటచే నాతని ననుభవించవలెనను కోరిక స్థిరమైయుండును కాబట్టి తదతిరిక్తములగు వేని కొఱకును చింతింపను.

(80) ఆవగింజలలో చిన్న పెద్ద తారతమ్యమున్నను మేరువును బట్టి చూచిన వానిలోని పెద్దదైన యెట్లు లెక్కింపదగినది కాదో అట్లనే బ్రహ్మమొదలు కీటకముపరకు గల హెచ్చుతగ్గులలో బ్రహ్మాదులు గొప్పవారుగా గాన్పించినను పరమాత్మనుబట్టి చూచిన నీ గొప్ప తనము పరిగణింపబడదు.

(81) రత్నపర్వతము నెక్కగోరువాడు గడ్డిమోపు నెక్కగోరునా?

(82) కరణ కళేబరాదుల నొసంగిన మహోపకారుడగు నిత్యమైన పరమపురుషుడుండగా పుట్టుచు గిట్టుచున్నవాని నెవ్వరాశ్రయింతురు? కారణవస్తువునే ధ్యానించవలెనని యుండగా కార్యవస్తువుల నెవ్వరు ధ్యానింతురు?

(83) ఒక్కొక్క గుణాతిశయమే చిత్తాకర్షకమగుచుండగా ననంతగుణము లొక్కచోట నున్నచో నేమి చెప్పవలెను - ఏది గొప్పది. సులభమైనదియో అదియే నాశ్రయింపదగినది గాన సౌలభ్యము నకు వలయు గుణములుకూడ నిచ్చట యనుసంధించబడవలెను.

(84) ఇది ధ్యానించుట కాకర్షమగు దివ్యమంగళ విగ్రహము నకు ఉపలక్షణము.

(85) అందరిచే నాశ్రయింపబడు లక్ష్మీదేవి యీతని నాశ్రయించి విడువకుండును. ఇచ్చటనున్న 'మతుప్' ప్రత్యయము నీ యిరువుర కును గల సంబంధము నిత్యమని తెలుపును. శ్రీ శబ్దమునకు 'శ్రీఞ్'- సేవాయాం అను ధాతువునుండి శ్రీయతే- శ్రయతే- అనగా- అందరి

చేతను ఆశ్రయింపబడునది- శ్రియఃపతి నాశ్రయించునదని వ్యుత్పత్తిని గ్రహించవలెను. అటులనే శ్రు - శ్రవణే - అను ధాతువునుండియు శ్రుణోతి=వినుచున్నది. శ్రావయతి=వినుపించుచున్నదిఅనగా-మన మొరలను తానువిని భగవంతునకు వినిపించి రక్షింపజేయు పురుషకారు నీగాతు రాలనియు నెఱుంగవలెను. ఇట్టి యనేకార్థములను, ఆమె పురుషకార యోగ్యతను- దాని ప్రభావమును దాని యావశ్యకతయు- సంప్రదాయ వేత్తలనుండి యెఱుంగవలెను. దీనివలన - ఉపాస్యత్వము - ప్రాప్యత్వమున్ను సర్వమున్ను సపత్నీకుడగు సర్వేశ్వరునకే కలవని సిద్ధాంతము.

(86) ; ఈ పుండరీకాక్షత్వము నుపాసించినచో సమస్తపాప రాశియు నశించునని శ్రుతి చెప్పుచున్నది.

'తస్య యథాకప్యాసం పుణ్డరీక మేవ
మక్షిణీ - తస్యోదితి నామ ఏష సర్వే
భ్యః పాప్మభ్య ఉదితః ఉదేతిహ వై
సర్వేభ్యః పాపేభ్యః య ఏవం వేద'

అనగా- ఆ భగవంతునకు లోతైన నీటను బుట్టినదై బలసిన కాడయందున్నదై సూర్యకిరణములచే వికసింపజేయబడిన తామర రేకుల వలె సుందరమైన నేత్రములు కలవు. ఆతనికి 'ఉత్' అనిపేరు. ఆతని నే పాపములును అంటవు. ఇట్లెఱింగి యుపాసించు వానికిని పాపము లేవియు నంటవు. అని యీ కంటి చూపువ్వారియందు పడినవారు సకల పాపనిర్ముక్తులై పావనులగుదురు. అందులకే శబరి శ్రీరామచంద్రుని దర్శించి 'చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన' (శ్రీరామ!) నీ సౌమ్యమైన కటాక్షవీక్షణమునకు పాత్రురాలనై పాపములనుబాపు కొని పవిత్రురాల నైతిననెను.

'జాయమానం హి పురుషం
యం పశ్యేన్మధుసూదనః
సాత్త్విక స్సతు విజ్ఞేయః-

అనియును ప్రమాణము కలదు –

58వ శ్లోకము

(87) ఇచ్చట 'మచ్చిత్తః' శబ్దమునకు కేవల భగవద్ధ్యానమే యర్థమైనచో ముందు చెప్పబోవు యుద్ధమును చేయనను పట్టుదలను విడువుమనుట పొసగనేరదు. చిత్త మాతనియందే నిలిపిన నిక యుద్ధ సంకల్ప మెక్కడిది? కావున నీ శబ్దమునకు పూర్వశ్లోకములో జెప్ప బడిన బుద్ధివిశేషముతో గూడిన కర్మవిధియే యర్థమని గ్రహించవలెను. దానిచే ముందు శ్లోకమున యుద్ధమనెడు ధర్మప్రోత్సాహామే స్ఫుట ముగా గాన్పించుటచే నిచ్చటను భగవత్ప్రీతికరముగ భగవదాజ్ఞా పాలనమను బుద్ధితో వానిని చేయువలెనని వ్యాఖ్యానించిరి.

ఏతావతా – నిత్య – నైమిత్తిక – కామ్యకర్మలను ఫల, సంగ, కర్తృత్వ త్యాగముతో సంస్కరించి యాచరించుటయే కర్మయోగము గాన నది పరిపూర్ణముగా భగవత్ప్రాప్తి పర్యంతము గొనిపోవునని దాని విపాకావస్థను జెప్పి కర్మయోగమే చేయదగినదని చెప్పి ముగించెను.

(88) ఇకముందు దానినిచేయనిచో ననర్థమును చెప్పుచున్నాడు.

(89) వినుచునే యున్నాడు గదా! ఇట్లననేల? యనగా – విన్నను దానికి ఫలముండదని తాత్పర్యము. (ఆచరించవలె ననుటలో తాత్పర్యము.)

(90) ఇచ్చట నాశమనగా – అనాది కాలమునుండియు నిట్టి సదుపదేశము లేక లేనట్టిదే అయిన (అసత్ప్రాయమైన) నీ యాత్మ ఇకముందును నట్లేయుండును సుమాయని భయపెట్టుచున్నాడు.

ఈ వినఙ్క్ష్యసి యనునది శాపమువలె (తిట్టువలె) గాన్పించు చున్నది. నిజమున కది యసంగతము.

నీవు నా మాటను వినకుండుటకు (ఆచరించకుండుటకు) కారణము నీకు మరియెవ్వడైనను ఆప్తుడున్నాడనియా? నాకంటె నీ కాప్తు డెవడు? నేను నీ కాప్తతముడను. కాబట్టి నే జెప్పినది వాస్తవము. ఇతరభక్తులందరును నేనిచ్చిన యల్పశక్తితో పరిమితమైన విషయమునే యో కొద్దిగనో నీకు చెప్పుదురు. అంతియే.

'యస్యప్రసాదకలయా కవయోఽపి తే తే
శాస్త్రాణ్యశాసురిహ తన్మహిమాశ్రితాని'

నే నన్ననో ప్రతి యథార్థకని సమస్త హితాహితముల నెఱుంగుదును. ఇతరులందరును జెప్పిన శాస్త్రములును అపౌరుషేయమైన వేదమును నా యాజ్ఞారూపములే గాన ప్రమాణములుగా పరిగణింపబడుచున్నవి.

'శ్రుతిస్స్మృతిర్మమైవాజ్ఞా'

59వ శ్లోకము

(91) అవతారిక —

పైవిధముగ నా మాటలను పాటించక యుద్ధవ్యాపారమునుండి విరమింతువా? దానివలన నీకు కలుగు అనర్థములనన్నిటిని జెప్పితిని. దానినట్లుండ నిమ్ము. యుద్ధమును చేయకుండుటయే నీ తరము కాదనుచున్నాడు.

మరియు — కృష్ణా! సరియే నేను నీవు చెప్పినటుల కర్మయోగము నాచరింతునులే. కర్మయోగ మీ ఘోరమైన యుద్ధమొక్కటియేనా? అనేకరీతులుగా నుండునంటివే. అందు వేసి నొక దానినైనను జేసిన నాకీ వినాశముండదు గదా! అని యర్జును డనునని యాశంకించుకొని చెప్పుచున్నాడు.

(92) నేను స్వతంత్రుడ నను దురభిమానముతో.

(93) నా బాగోగులు నేనే యెఱుంగుదునని తలంచి యుద్ధమును చేయకుందువా?

(94) స్వాతంత్ర్యాభిమాన గర్భితమైన నీ నిశ్చయము వమ్మగును.

(95) నేను చెప్పినప్పుడు నమ్మకముతో యుద్ధమును చేయుదువేని నీ భారమునంతను సర్వజ్ఞుడను సర్వశక్తియును గల నేనే వహింతును. నా యాజ్ఞ నుల్లంఘింతువా నేను నా కెందులకని యూరకుందును. నీవు ప్రకృతి పరతంత్రుడవు గాన నీ రాజస ప్రకృతి (స్వభావము) నిన్ను అహితములయందే ప్రవర్తింపజేయును. అప్పుడు నీవు మునుముం దాశంకించిన యనర్థములన్నియును నిన్ను చుట్టుకొనక మానవు.

60వ శ్లోకము

(96) మోహాదసగా - చెప్పినది చిత్తగించకపోవుట (మనస్సునకు పట్టకుండుట).

(97) 'అపి' - నేను చెప్పిన దానిని యాదరించినచో మరియొక రీతిగనైనను యుద్ధమునే యవశముగా చేసియే తీరుదువు.

(98) చేయవలసిన తరుణములో ధర్మయుద్ధమును చేయక సమయము మించిన పిమ్మట శత్రువుల హేళనచే సిగ్గుపడి గతజల సేతు బంధమును గావింతువు - (తరుణముమించి యుద్ధమును చేతువు). 'నేచ్ఛసి' యను వర్తమాన నిర్దేశముచేతను 'కరిష్యసి' యను భవిష్యన్నిర్దేశము చేతను యీ యర్థము సిద్ధించును.

61వ శ్లోకము

(99) పైన జెప్పిన యుద్ధమును స్థిరపరచుటకై - 'నీవు ఉపేక్షించినచో నేనట్లు ప్రవర్తింతును? నేనట్లు ప్రవర్తించినచో నీకున్న సకల కారణత్వము భంగపడదా? అను శంక నీ శ్లోకముచే బాపుచున్నాడు.

(100) ఆ ప్రకృతి పరవశత్వమున్ను నేను చేసినదే. నేనన్నిటి కిని సాధారణ కారణమైన వాడనగుటచే నా కేదోషములు నుండ జాలవు.

(101) 'శరీరం రథమేవతు' అని కఠోపనిషత్తులో రథముగ రూపింపబడిన శరీరమే యిచ్చట యంత్రము.

(102) భగవంతుడు- గ్రహముపట్టి నడిపించునట్లు నడిపించడు. కానివాని సత్త్వాదిగుణ ప్రచురమైన భావమును పురస్కరించుకొని వెను కటి సంస్కారముచే బుట్టిన సంగము మూలముగనే ప్రవర్తింప జేయును.

శ్లో. నదేవా యష్టిమాదాయ రక్షన్తి పశుపాలవత్
యంహి రక్షితు మిచ్ఛన్తి బుద్ధ్యా సంయోజయన్తితమ్.

దేవతలు పశుకాపరి కఱ్ఱతో పశువులను శిక్షించి రక్షించునట్లు కూడ తిరిగి రక్షించరు. రక్షింపదలచిన వానికి మంచిబుద్ధినిచ్చి వానిచే మంచిపనులను చేయించి రక్షింతురు.

(103) ఈ శ్లోకమున నేనే 'భ్రామయన్ తిష్ఠామి' యని చెప్పక 'ఈశ్వరః- భ్రామయన్ - తిష్ఠతి' యని పరోక్షముగా చెప్పినను చెప్పు వాడు వాసుదేవుడే. కావుననే భాష్యకారులు 'పూర్వమప్యేతదుక్తం' 'సర్వస్యచాహం హృది సన్నివిష్టః' 'మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహనంచ!' అని తానే ఉత్తమ పురుషలో వెనుకనే ఈ విషయమును చెప్పినట్లు వ్యాఖ్యానించిరి.

'య ఆత్మని తిష్ఠన్' అని సుబాలోపనిషత్తులో నిర్దేశింపబడిన అంతర్యామి నారాయణుడే.

'ఏష సర్వభూతాన్తరాత్మా
అపహత పాప్మాదివ్యో దేవ
ఏకో నారాయణః'

అని విశేషించి నారాయణ శబ్దముచే అంతర్యామి నిర్దేశింపబడు చున్నాడు, కాంచుడు.

62వ శ్లోకము

(104) అవతారిక –

స్వతంత్రుడగు భగవంతుడు తన మాయచే ప్రేరేపించుచుండగ పరతంత్రుడగు జీవుడు దీని నెట్లు దాటగలుగును- అను ప్రశ్న కీ శ్లోక మున సమాధానమును చెప్పుచున్నాడు.

(105) అత్యంత స్వతంత్రుడగు నా సర్వేశ్వరుడే యిప్పుడు నీవు రథికుడవైయున్న నీరథమును సారథియై పరతంత్రుడై తోలు చున్నాడు.

'సర్వప్రశాసిత- ఆశ్రిత వాత్సల్య' అను రెండు విశేషణముల చేతను ఆశ్రయించుట కుపయుక్తములగు పరత్వ సౌలభ్యములు చెప్ప బడినవి.

(106) 'వాసుదేవస్సర్వం' అని చెప్పినటుల అంతర్యామిగాను, ఉపదేష్టగాను, ప్రాప్యునిగాను ప్రాపకునిగాను ఉన్నాడని యనుసం ధింపుము.

శ్లోకమునందలి 'శరణ' శబ్దమునకు ఉపదేశాదులద్వారా రక్షకు డని యర్థము. లేక – ఆ విధముగా నుపాయభూతుడనియు నర్థమును చెప్పవచ్చును. ఈ శరణ వరణమును 'సర్వాత్మనా చేయుట (సర్వప్రకా రముల) అనగా- చెప్పినదానిని 'తు' 'చ' తప్పక చేయుటయే. ఇట్లా తడు విధించిన వర్ణాశ్రమ ధర్మములను ఆయన యాజ్ఞగా భావించి యాచరించిననే యాతడు ప్రసన్నుడగును.

'వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరఃపుమాన్
విష్ణురారాధ్యతే పన్థాః నాన్యస్తత్తోషకారకః'.

(107) ఈ యనువర్తనమే యాతని యనుగ్రహమునకు కారణమని ఉత్తరార్థముచే చెప్పుచున్నాడు.

శ్లోకమునందలి 'పరాంశాంతిం' అనగా సర్వదుర్గతరణమే. (ఆనందానుభవమునకున్న ఆటంకముల నన్నిటిని (పాపములను) దాటిపోవుట) శాన్తియందున్న పరత్వ మేమనగా పోయిన క్లేశములవంటివాటిని ఇంకను బుట్టించు కారణ సామగ్రియంతయు మాటువడి పోయినవి తిరిగి మొలకెత్తకుండుటయే. ఆ పదములచే సర్వకర్మ బంధములున్ను నశించి పోవునని చెప్పుటచే ననిష్ట నివృత్తియును 'స్థానం ప్రాప్స్యసి శాశ్వతం' అనుటచే నిష్టప్రాప్తియును చెప్పబడెను.

ఇచ్చట శాశ్వతశబ్దముచే బ్రహ్మాదుల స్థానములు కావని సూచింపబడెను.

(108) ఈ వాక్యము సదా పశ్యదనేక సూరి విశిష్ట దేశవిధి పరము. సర్వమును మానాంతరముచే ప్రాప్తముకానినాడు విశిష్టవిధి కూడునని శాస్త్ర మంగీకరించుచున్నది. ఇచ్చట నిత్యసూరులును వైకుంఠమును ఇతరవాక్యములచే సిద్ధింపక పోవుటచే నీ వాక్యము విశిష్టవిధి పరమగుచున్నది.

(109) భగవత్ప్రపత్తి చేసినవారు భగవత్కటాక్ష రూపవిశేష మహిమావిశిష్టులై నిత్యులైనట్టి తేజోరూపులైన అనంతగరుడ విష్వక్సేనాదులుండునట్టి పరమపదమును పొందుచున్నారు.

(110) పరమ పదమున అతీంద్రియ ద్రష్టలగు అనాదిసిద్ధులగు పురాణపురుషులగు నిత్యసూరు లుందురు.

(111) పరమాకాశమున పరమపదము పరమాత్మతో విరాజిల్లుచున్నది.

(112) పరమపదమునందు దానికధిపతియగు శ్రీ మహావిష్ణువు వేంచేసియున్నాడు.

(113) ఈ ప్రకృతిమండలము దాటిన తరువాత ఉత్కృష్ట తేజోరూపమైన పరమపద మొక్కటి విరాజిల్లుచున్నది.

(114) భగవత్ప్రసాదయుక్తుడైన చేతనుడు శరీరమను రథము నధిష్ఠించి శాస్త్రోక్తవిధి ననుసరించి సంచరించుచు సంసారమార్గము యొక్క హద్దునుదాటి సుప్రసిద్ధమైన శ్రీ మహావిష్ణువుయొక్క పరమ పదము నలంకరించుచున్నాడు.

63వ శ్లోకము

(115) ఇట్లర్జునుని యుద్ధమునకై ప్రోత్సహించుటను మిషగా కల్పించుకొని భగవానుడు అధ్యాత్మశాస్త్రమున తెలియవలసిన సకల విషయములను ఉపదేశించి కర్మజ్ఞాన భక్తులలో, నే నిష్ఠలోనుండినను నిత్యకర్మ చేయకతప్పదు గాన చివరకును యుద్ధము చేయవలసినదియే యని స్థాపించెను. ఇక వినదగిన దేదియును లేదని తెలుపుటకై ప్రారంభించబడిన కర్మజ్ఞాన భక్తులనెడు మూడు నిష్ఠలను సమగ్రముగ చెప్పబడుటచే వారి వారి యధికారానుగుణముగ వా రాచరించవలెనని చెప్పుచు ముగించుచున్నాడు.

(116) శ్లోకమునందున్న 'ఇతి' శబ్దమున కిది వ్యాఖ్యానము- ఇట్లు ముముక్షువుల' కిత్యాది చెప్పదగిన అర్థముల నన్నింటిని చెప్ప దగిన మాటలతో చెప్పితిననియు ఆ విషయములైనను ఒక్కటియును మిగలకుండగ పుష్కలముగ చెప్పితిననియును ఈ శబ్దము సూచించు చున్నది.

(117) 'తే'=నీకు- 'నాపృష్టః కస్యచిత్ బ్రూయాత్'=అడి గినగాని నుడువరాదను. న్యాయమును తప్పకుండగ 'శిష్యస్తేఽహం శాధిమాం ప్రపన్న' మ్మని ప్రపన్నుడవై శిష్యుడవైన నీకొఱకు.

(118) లౌకిక ప్రేమలచే తెలియదగిన విషయజ్ఞానములకన్నను ఆయుర్వేదము,ధనుర్వేదము, గాంధర్వము(సంగీతము) అర్థనీతిశాస్త్రము

మొదలగువానివలన పుట్టు జ్ఞానములకంటెను వేదములవలన తెలియబడునట్టి యతీంద్రియములును పారలౌకికములునగు స్వర్గాది పురుషార్థములను గురించినట్టియు, వానిని పొందించు సాధనములగు యజ్ఞాదులను గురించినట్టియు జ్ఞానము గుహ్య మనబడును.

వేదాంతములచేతను దాని యర్థములను విశదీకరించు గీతాది ప్రబంధములచేతను మోక్షమును గోరువారిచే తమ తమ యధికారమునకు తగునట్లు తెలుసుకొని యాచరించదగినవానిని గూర్చిన మోక్షోపాయజ్ఞానము గుహ్యతర మనబడును. ఇది ధర్మార్థకామములను మాత్రి మపేక్షించువారికి తెలుపరానిదగుటచే గుహ్యతర మనబడును.

ఈశ్లోక ఉత్తరార్థముచే దీనినంతను సమగ్రముగ విమర్శించి నీకు తోచినరీతిగ చేయుమనుటచే నీ గుహ్యతర మీ శాస్త్రముననే చెప్పబడిన సకలకర్మాది యోగములనియే గ్రహించవలెను. వీనిలో గల అవాంతర తారతమ్యమును ముందుశ్లోకమున గుహ్యతమ మని చెప్పగలడు.

(119) సహజమైన సార్వజ్ఞాది గుణములు కలవాడనగుటచే నాప్తతముడను కాబట్టి నీ హితమునే కోరువాడనగు నేను.

(120) వెనుకటి సాధనమును వెంటనే విడిచి ముందునకు సాగరాదని భావము.

(121) నీ యిష్టమైనదాని ననుటచే యుద్ధమును చేసినచేయుము- మానిన మానుమని యర్థముకాదు. ఇక నేమనిన - కర్మయోగికిగాని జ్ఞానయోగికిగాని భక్తియోగికిగాని వర్ణాశ్రమధర్మము లవశ్యానుష్ఠేయములేగాన, 'యద్యహఙ్కారమాశ్రిత' 'స్వభావజేనకౌన్తేయ' అను రెండు శ్లోకములచేతను యుద్ధముచేయకయుండుట యర్జునునకు శక్యము కాదని చెప్పిన భగవంతునకు యుద్ధమును మానుటలో తాత్పర్యమొకింతయు నుండనేరదు. కాబట్టి వారి వారి యోగ్యతకు తగినట్లు

చెప్పబడిన శాస్త్రార్థవర్గములగు కర్మజ్ఞానభక్తులలో నీవు బుద్ధిమంతు
డవుగాన నాకు కర్మయోగమునందే అధికారమని విమర్శించి నీవర్ణము
నకును నీ యాశ్రమమునకును అనుకూలమగు నా కర్మయోగమునందే
నిలిచి యుద్ధమునే యాచరింపుము- అని తాత్పర్యము.

ఇచ్చట నొక ముఖ్యవిషయము గమనించవలెను - గీతాసార
తమముగా పరిగణింపబడు 'సర్వధర్మాన్' అను 66వ శ్లోకమున శ్రీ భగ
వానుడర్జునుని 'మా శుచః' అని యోదార్చుచున్నాడు. ఈ దుఃఖ
మెచ్చటిదని విమర్శించవలెను. గీతోపదేశమునకు ప్రారంభముననున్న
దుఃఖము పదునొకండవ అధ్యాయప్రారంభమున-'మదనుగ్రహాయ...
మోహోఽయం విగతో మమ' అని అది యెప్పుడో పోయినదని చెప్పెను
గదా! ఇక నీ దుఃఖమేది? అది యీ 63వ శ్లోకములో నేర్పడినదే.
అది యెట్లనగా - 'కార్పణ్య దోషోపహతస్వభావః... ధర్మసమ్మూఢ
చేతాః శిష్యస్తేఽహం శాధిమాం ప్రపన్నం' అని సకల భారములు
భగవానునిపై నుంచి నిర్భరుడైయున్న అర్జునునిగూర్చి.

1. గుహ్యాతరం-ఆఖ్యాతం-అనుటచే అయ్యో నేనింతవరకు ఇంత
ఏడ్చి శ్రమపడి వినినదంతయు గుహ్యాతరమేనా ? ఇంకను గుహ్యాతమ
మొక్కటి మిగిలియున్నదే. దానిని వినుట కెంత ప్రయాసపడవలెనో
అని యొక దుఃఖము.

2. 'విమృశ్యైత దశేషేణ' యీ చెప్పినదంతయు నొక్కటి
యును విడువక విమర్శించమనుచున్నాడే. నాకా శక్తిలేదని గదా నే
నతనిని శరణజొచ్చితిని. ఈ విమర్శ నా తరమా యని యొకదుఃఖము.

3. 'యథేచ్ఛసి తథా కురు' నే నీతనిపై శిష్యభావముతో నా
భారమునంత నుంచి వరించినది నాకు తోచినట్లు చేసికొనుటకా?
నన్నిట్టి యిక్కట్టులలో నేల పెట్టుచున్నాడని గొప్ప దుఃఖము కలిగెను.
దానినిజూచి పరదుఃఖమును సహించలేని దయాళుడు గాన

'సర్వగుహ్యతమం భూయః శ్రుణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్'

అర్జునా! నాకు నీవు గాఢమైన ప్రియుడవుగాన నీకు హితమైన రహస్యతమ విషయమునుగూర్చి తిరిగి చెప్పుచున్న దీనికిమించిన మాటలేదనదగిన మాటను వినుమని పీఠికపెట్టి 'మన్మనాభవ- సర్వ ధర్మాన్' అను ఇష్టప్రాప్తి అనిష్ట పరిహారపరములైన శ్లోకములను చెప్పి- 'మాశుచః' ఇక నేడవకుమని దుఃఖ ముపశమింపచేసి- 'కచ్చిదే తచ్ఛ్రుతం పార్థ...కచ్చిదజ్ఞాన సమ్మోహః ప్రణష్టః' అర్జునా! శ్రద్ధగ వింటివా ? నీ యజ్ఞాన పిశాచము మరిపుట్టకుండునటుల విడిచిపోయి నదా? యని ప్రశ్నించి 'నష్టోమోహః' అని యాతనిచేతనే పలికించెను.

64వ శ్లోకము

(122) అవతారిక—

ఇంతవరకు కర్మ- జ్ఞాన- భక్తియోగములను మూడింటిని చెప్ప వలసిన వివరములతో చెప్పి ముగించెను. ఈ మూడును నితర సామా న్యశాస్త్రములకంటె గొప్పవగుటచే గుహ్యతరములనియును చెప్పబ డెను. ఈ మూడింటిలో నేది మోక్షమునకు సన్నిహితోపాయమని నిశ్చయించుకొనుటకై గుహ్యతమశాస్త్ర తాత్పర్యము, సారార్థము భక్తియోగమే యని వెనుక తొమ్మిదవ యధ్యాయాంతమున చెప్పిన దానినే తిరిగి కొలది పాఠభేదముతో చెప్పుచున్నాడు. అందువల్లనే 'భూయః' అని చెప్పెను. అందువలననే గీతార్థసంగ్రహ శ్లోకమున 'శాస్త్రసారార్థ ఉచ్యతే' అని చెప్పబడెను. ఇట్లు శాస్త్రసారార్థ మను టచే సంప్రదాయవేత్తలు 'సారార్థ శేషతయా సారతమం ప్రపదన'మ్మని తెలుపునట్టి ప్రపత్తియు సంగ్రహింపబడినదని సెలవిత్తురు. ఈ ప్రపత్తి పరమగు నర్థమును 'సర్వధర్మాన్' అను శ్లోకవ్యాఖ్యానమున శ్రీ భాష్య కారులు మొదటి యోజనలో సూచించిరి.

ఈ గుహ్యాతమము భక్తియోగమే యనుటకు హేతువులు.

(123) తొమ్మిదవ యధ్యాయము భక్తియోగపరమని షడ్విధ తాత్పర్య లింగములతో నిర్ణయింపబడినది. అచ్చట 'ఇదంతు తే గుహ్యాతమ'మ్మని ప్రయోగించిన శబ్దమునే యిచ్చటను 'సర్వగుహ్యాతమ'మ్మనుటచే నదియే జ్ఞాపకముచేయబడినది.

(124) ఈ శ్లోకమున 'భూయః' అను శబ్దముకలదు. అనగా— తిరిగి యని యర్థము. ఒకసారిచెప్పిన దానినేగదా 'తిరిగి' యందురు? కాబట్టి వెనుకచెప్పిన భక్తియోగమునే యిచ్చట తిరిగి చెప్పుచున్నాడు. తొమ్మిదవ యధ్యాయాంతమున సారతమముగ 'మన్మనాభవ' యను శ్లోకముచే చెప్పబడిన భక్తియోగమే యిచ్చట కొద్ది పాఠభేదముతో శ్లోకముచే చెప్పబడినది.

(125) 'పరమం వచః' పరం — మా — యస్మాత్ సః—తత్ పరమం ఇంతకుమించి చెప్పదగినది లేదని నిగమించుచున్నాడని భావము.

లేక చెప్పదగినది పరమగుటచే దానిని చెప్పుమాటయును 'పర' మనబడుచున్నది. అర్థమునందలి గుహ్యాతమత్వమును మాటయందు లాక్షణికముగ వాడబడినది.

(126) 'ఇష్టః' ప్రీతికి పాత్రుడు. ఆ ప్రీతికి హద్దుమ 'దృఢం' అను పదముచే చెప్పబడుచున్నది. ఈ పదమును శ్రీ వేదాంత దేశికులు ప్రీతియొక్క అవధిని తెలుపు క్రియావిశేషణముగా వన్వయించిరి, 'దృఢం ప్రియః'.

అనగా— 'అత్యర్థం ప్రియః' అనగా నేను చెప్పలేనంత ప్రియుడ వని యర్థము — 'ప్రియోహిజ్ఞానినోఽత్యర్థ'మ్మని తానే వెనుక 7వ యధ్యాయమున చెప్పెను గదా! ఆ జ్ఞానివలెనే నీవు నాకు అతిదృఢమైన ఇష్టుడవు అని. ఆ దార్ఢ్యమేమవగా— అతిరహస్యత మార్థమైనను దాచక నేను నీకు చెప్పునంత ప్రీతికలిగియుండుటయే 'యతో దృఢం

ఇష్టస్త్వ త స్తే హితం వక్ష్యామి' అంత యిష్టుడవు గనుక నే నీకు హితమును చెప్పుచున్నానని భావము.

## 65వ శ్లోకము

(127) అవతారిక—

ఈ శ్లోకమున సాక్షాత్ సాధనమగుటచే గుహ్యతమ మనబడు అంగియైనభక్తిస్వరూపమును వెనుక 9వ అధ్యాయాంతమున చెప్పిన దానినే తిరిగి నాల్గవ పాదములో మాత్రము పాఠభేదములో చెప్పు చున్నాడు.

(128) 'మన్మనాభవ' అనుటచే భక్తియోగము చెప్పబడు చున్నది. ఈ సాధనమునకు ప్రధాన ప్రమాణముగా 'వేదాహమేతం' అను పురుషసూక్తివాక్యము చూపబడెను.

ఫలననగా :— (1) ఇతరోపనిషత్తులన్నియు దీని ననువర్తించవలె నని తెలుపుటకును (2) ఇదివేరొక ఉపాయమునకు సాధనమనియును, ఆ ఉపాయముచేత పురుషార్థము సిద్ధించుననియును భ్రమించకుండుట కును (ఇందు నాన్యః పన్థాః అని యున్నదిగదా) (3) ఇందు 'అతోఽ స్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః' అనిన వాసుదేవుడే యీ పురుషసూక్తముచే తెలుపబడుచున్నాడు గాన 'మన్మనాభవ' అను నీ శ్లోకముచే మహాపురుషోపాసనమే విధింపబడుచున్నదని తెలుపుటకును అని గ్రహించవలెను.

కాని ఈ ప్రమాణము వేదన మొక్కటియే మోక్షసాధనమని చెప్పుచున్నది కాని భక్తి మోక్షసాధనమని చెప్పుటలేదే యనగా—

వేదనము, ధ్యానము, ఉపాసనము, భక్తి, సేవ మొదలగు శబ్దములన్నియు నొకే యర్థమును బోధించు పర్యాయపదములని గ్రహించవలెను. కాబట్టి వేదనమును చెప్పినను భక్తినేచెప్పుచున్నది.

అట్లుకానిచో వేదనము అనగా కేవలము తెలుసుకొనుట మాత్రమే. ఉపాసనమనగా వివేక- విమోక- అభ్యాస- క్రియా- కల్యాణ - అనవసాద- అనుద్ధర్షము అను ఏడు సాధనములతోను అష్టాంగయోగములతోను సాధించవలసినదగుటచే చాలా కష్టము. ఇట్లు తేలికయైన వేదనమునకును ఇంతకఠినమైన ఉపాసనకును వికల్పమున్నచో అనగా వేదనమైననుసరియే - ఉపాసనమైననుసరియే దేనిని చేసినను నీకు మోక్షము వచ్చునన్నచో నందరును తేలికయైన వేదనమునే (బ్రహ్మను తెలుసుకొనుటనే) యవలంబింతురు. అందుచే ఉపాసననుచెప్పెడు వేద వాక్యములన్నియు నిరర్థకములయిపోవును. కాబట్టి వేదనమన్నను ఉపాసనమన్నను ఒక్కటియే.

(129) 'మాం నమస్కురు—నమోనమనం...' ఇట్లనుటచే కేవలము నమస్కార మాత్రమేకాదు. 'మద్భక్తః మాం నమస్కురు' అని చేర్చి యర్థమును చెప్పవలెను. దానిచే నతిమాత్ర ప్రహ్వీభావము వివక్షితము. అనగా- ఆత్మ - ఆత్మీయములన్నియును భగవదధీనమే యని యనుసంధించుట మాత్రమే.

(130) ఇది యిచ్చకముకొఱకు చెప్పుటలేదు. తాను సంధికై కౌరవుల చెంతకేగుచుండగా ద్రౌపది ఆయనను పిలిచి తన పడియున్న శిరోజములను జూపి- ఇవి నేను బ్రతికియున్నంతవరకు నిట్లు విడియుండ వలసినవేనా? నీవు అఘటిత ఘటనాసమర్థుడవుగదా! నీవు వెళ్లిన సంధి కుదరకపోదు. కుదిరిన యుద్ధమే యుండదు. అది లేనిచో కౌరవ సోదరులు చావరు. చావనిచో వారిరక్తముతో నాతల ముడివడుట యెట్లు. అని యేడ్చుచు ప్రార్థించగా— విని శ్రీకృష్ణుడు -

శ్లో. ద్యౌః పతేత్ పృథివీశీర్యేత్ హిమవాన్ శకలీభవేత్
శుష్యేత్తోయనిధిః కృష్ణే! నమే మోఘం భవేద్వచః॥

ఓ ద్రౌపదీ! ఆకసము నేలగూలినను, భూమి తుత్తునియ లైనను హిమవత్పర్వతము ముక్కముక్కలైనను, సముద్ర మెండిపోయినను నా మాటమాత్రము రిత్తవోదు. నేను వారి రక్తముతో నీ ముడి వేయింతును, చూడుమనెను. దీనినిబట్టి మరి యెవ్వరు వెళ్ళినను సంధి కుదిరిపోవునో యను భయముచే చెడగొట్టుటకే తాను వెళ్ళు చున్నట్లున్నది. ఇట్టి శపథమును పురస్కరించుకొని భావమును సాధించుచున్నారు.

అర్జునా! ప్రియోక్తులచే బుజ్జగించుచున్నా ననుకొనకుము- అని వట్టిమొగమిచ్చకము కాదని దృఢపరచుచున్నాడు.

(131) ఈ 64, 65 శ్లోకములకు శంకర భగవత్పాదులు సెల విచ్చిన అర్థవిశేషమును గమనింపుము. వారి భాష్యమున కనువాదము నిచ్చుట పొందుపరచుచున్నాను.

అర్జునా! తిరిగి నే జెప్పునది వినుము. ఇది సమస్త రహస్యార్థ ములకన్నను అత్యంత రహస్యమైనది. వెనుకనే చెప్పితినిగాని ఇది యనేకమారులు వినదగినది. నేనింతకుమించిన గొప్పమాటను చెప్ప జాలను. నేను నీకు దీనిని భయముచేగాని ధనాశతోగాని చెప్పుటలేదు. నాకు నిలకడమైన ప్రియుడవని మాత్రమే చెప్పుచున్నాను. నీ కిది మిక్కిలి హితమైనది. ఇంతకుమించిన హితము నేను చెప్పగలిగినది నీవు వినగలిగినది మరియొకటి లేనేలేదు. అది యేమందువా? వినుము. నీ చిత్తము నాయందే లగింపుము. నన్నే భజింపుము (ధ్యానింపుము) నన్నే పూజింపుము. దానిని మానకుము. నమస్కారములైనను నాకే చేయుము. ఇట్లుపాయోపేయములు వాసుదేవుడే యని యధ్యవసా యము నీకున్నచో నా యొద్దకే రాగలవు. నీకు నేను యీవిషయమై నిజ ముగ ప్రతిన గావించుచున్నాను. నాకు నీవు ప్రియుడవగుటయే ఇందు లకు హేతువు.ఇట్లు భగవంతు డాడితప్పనివాడని నమ్మి భగవద్భక్తునకు

తప్పక మోక్షము లభించుననను విశ్వాసముంచి భగవచ్ఛరణైక పరా యణుడు కావలెను అని.

### 66 వ శ్లోకము

(132) అవతారిక—

ఇట్లు విస్తారముగను సంగ్రహముగను చెప్పిన కర్మయోగాది మూడు యోగములకును సాధారణమైన ఫల, సంగ, కర్తృత్వత్యాగ పూర్వకముగ భగవదారాధనబుద్ధితో నాచరించవలెననెడు సారతమాను సంధానవిశేషము నుపదేశించి దానివలననే 'మామేవైష్యసి' అని స్వప్రాప్తిరూపమైన ఇష్టప్రాప్తిని తెలిపి ఈ శ్లోకముచే దాని కాటంకములగు పాపములు పరిహరింపబడుట యనెడు అనిష్ట నివృత్తిని చెప్పుచున్నాడు. అనిష్ట నివృత్తియును ఇష్టప్రాప్తియునుగదా! అపేక్షితములు. అదియేగదా రక్షణకు ముఖ్యలక్షణము. కాబట్టి యీ రెండు శ్లోకములును కలసి గుహ్యతమమైన భక్తియోగమునకు ఫలమును చెప్పుచున్నవి. ఈ రెండవ శ్లోకము ప్రపత్తిపరమని మన ఆళ్వారుల యొక్కయు పూర్వాచార్యుల యొక్కయు నిర్వాహము. ప్రపత్తి యనగా— 'భగవత్ప్రవృత్తి ప్రతిబంధక స్వప్రవృత్తి నివృత్తి' అనగా మనము మన రక్షణలో నేమాత్రము జోక్యమును తీసికొనినను భగవంతుడు మన రక్షణచేయక యుపేక్షించును. నిజమున కాతడు 'రక్షాపేక్షాం ప్రతీక్షతే' అనునటుల యెవ్వరైనను తనను రక్షించుమని యుపేక్షింతురా యనియెదురు చూచుచుండును. కాని మనప్రయత్నము దాని నడ్డుచున్నది. దానిని విడిచివేసిన నాతని రక్షణ ప్రవృత్తి నిరాఘాటముగా సాగును. ఇదియే రామానుజ దర్శన రహస్యము. దానినే యీ శ్లోకము తెలుపుచున్నది. సీతాదేవి తనను తాను రక్షించికొన శక్తియున్నను విడిచి శ్రీరామచంద్రుని రక్షణకై నిరీక్షించెను. ఆంజనేయులు తన శక్తినిజూపి రక్షింతునని నమ్మించినను ఆమెను శక్తిని

కూడ నుపేక్షించి కేవల శ్రీరాముని శక్తిపైననే నిర్భరురాలై యుండెను. శ్రీరాముడా యధ్యవసాయమునకు మెచ్చివచ్చి ఆమె పాపములవంటి రావణ కుంభకర్ణ ఇంద్రజిత్ప్రభృతులను ద్రుంచి యామెను విమానమున తన తొడపై నిడుకొని అయోధ్యకు చేర్చెను. అట్లు మనమును స్వశక్తి పరశక్తులను విడచి భగవచ్ఛక్తి పైననే నిర్భరులమై యుందుమేని మనలనుకూడ నట్లే తాను తోడుగనుండి యర్చిరాది మార్గమున పరమపదమును చేర్చును. పరమపదమున కయోధ్య యని నామాంతరము కలదు. ఈ విశేషమును మన సంప్రదాయగ్రంథములయందు గాంచవచ్చును.

కావుననే ఈ శ్లోకమును మంత్రముగా నుపదేశింతురు. దీనికి చరమశ్లోకము, చరమ మంత్రమనియును పేరు. చరమమనగా చివరిది. దేనిలో? పరమపద ప్రాప్త్యుపాయములలో దీనికిముందున్న 'మన్మనాభవ' యను శ్లోకము నేల మంత్రముగా నుపదేశించు నాచారము లేదన్నచో- అది ఇష్టప్రాప్తిని తెలుపు శ్లోకము- ఇది యనిష్టనివృత్తిని తెలుపు శ్లోకము. అనిష్టము పోయినచో నిష్టము తనంతనే సిద్ధించును. దానికొక ప్రయత్నమును చేయనవసరములేదు. చెరువుగట్టును తెగగొట్టిన నీరు తనంతనే పైకిపోవును. దానికై వేరే ప్రయత్నము చేయనవసరములేదు. తెరను తొలగించిన వెలుగు తనంతనే ప్రసరించును. అంత పాపరాశిని పారద్రోలగల పరమాత్మ తన చేతులోనున్న ఇష్టము నొసంగజాలడా? ఒసంగడా! దానిని చెప్పవలెనా? (అందులకేగదా 'సర్వధర్మాన్ పరిత్యజ్య' యని ప్రవృత్తిని జెప్పక నివృత్తినే యంగముగా జెప్పెను. కాబట్టి రెండవ శ్లోకమునే మనవారు మంత్రముగా పాటించు నాచారము. ఈ ప్రపత్తిపరమగు నర్థమును శ్రీ భాష్యకారులే గీతాభాష్యమునందే ప్రథమయోజనలో సూచించిరి చూడుడు. 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి'=ఏవం వర్తమానం

త్వాంమత్ప్రాప్తి విరోధిభ్యః అనాది కాలసఞ్చితానన్తాకృత్యకరణ కృత్యాకరణ రూపేభ్య స్సర్వేభ్యః పాపేభ్యః మోక్షయిష్యామి' నన్ను పొందుట కాటంకమ్ములైన సకలపాపములనుండియు విడిపింతును. అనుటచే నిక భగవత్ప్రాప్తికి వేరొక సాధనానుష్ఠానముతో పనిలేదు. ఆ ప్రాప్తియే మోక్షము.

'అథవా' యను రెండవ యోజనలో

'భక్త్యారమ్భ విరోధిభ్య స్సర్వేభ్యః
పాపేభ్యో మోక్షయిష్యామి'

యనుటచే ప్రపత్తి ఉపాసన విరోధులగు పాపములను మాత్రమే పోగొట్టును. ఆపైనచేయు నుపాసనవలననే మోక్షప్రాప్తియని తెలిపెను.

గ మ ని క

భగవద్గీతలో నెచ్చట ప్రపత్తి ప్రసంగము వచ్చినను శ్రీ భాష్యకారులు భక్తియోగమున కంగమగు ప్రపత్తి పరముగనే వ్యాఖ్యానించుటను గమనించవలెను. అంగమనగా- పరంపరగా పురుషార్థము నిచ్చునది. అంగి యనగా సాక్షాత్తుగా పురుషార్థము నొసంగునది. అంగప్రపత్తి ఉపాసనకు (భక్తికి) విరోధులగు పాపమును పోగొట్టి ఉపాసనను సాగించి తద్ద్వారా మోక్షము నొసంగును. అంగి ప్రపత్తి తాను ఇతరాపేక్షలేకయే స్వయముగనే (సాక్షాత్తుగనే) మోక్షము నొసంగును. ఈ యంగి ప్రపత్తి పరమగు నర్థమును ప్రథమ యోజనలోను అంగప్రపత్తిపరమగు నర్థమును రెండవ యోజనలోను చూపించిరి. కాని యాళ్వారులును పూర్వాచార్యులును అందరును భగవద్గీతయందు ప్రతిపాదించబడునది అంగి ప్రపత్తియే యని వ్యాఖ్యానించిరి.

67వ శ్లోకము

(133) అవతారిక—

ఈవిధముగ శ్రీకృష్ణుని యుపదేశమును విని తత్త్వహితములను

గ్గురించి నిశ్చలముగ నెఱింగియున్న నర్జుననకు కర్తవ్యమును విధించు నవమున సంప్రదాయవిధి సిద్ధించుటకై యీ గీతాశాస్త్రమును విను టకు అనధికారులను వ్యక్తపరచుచున్నాడు.

భక్తిలేనివాడెంత బుద్ధిమంతుడైనను ఎంత తపశ్శాలియైనను చెప్పరాదు. ఎంత గుణవంతుడైనను భగవంతునియం దసూయ కల వానికి చెప్పరాదు. ఇచ్చట నీ క్రింది శ్లోకము ననుసంధించవలెను

'గురుం ప్రకాశయే ద్ధీమాన్ । మన్త్రం యత్నేన గోపయేత్
అప్రకాశ ప్రకాశాభ్యాం । క్షీయతే సమ్పదాయుషీ॥'

బుద్ధిశాలియగువాడు తనగురువును లోకమున కెఱుకపరచవలెను. కాని యాతి డుపదేశించిన మంత్రమును మాత్రము సర్వప్రయత్నము చేతను గుప్తముగా నుంచవలెను. అట్లు చేయక దానికి వ్యతిరేకముగ గురువును ప్రకాశపరచక మంత్రమును ప్రకాశపరచినచో వాని సంప దయు ఆయుస్సును క్షీణించును. ఇది ఋషివాక్కు. ఋషులదృష్టిలో సంపద యనగా- 'భగవద్భక్తి' పరాశరమహర్షి భక్తుడైన గజేంద్రుని 'సతునాగవర శ్శ్రీమాన్' అనెను. వాల్మీకి మహర్షి లక్ష్మణుని 'లక్ష్మ ణో లక్ష్మిసమ్పన్నః' అనెను. విభీషణుని 'అన్తరిక్ష గతశ్శ్రీమాన్' అనెను. వీరు నిజమున కా సమయమున రిక్తులే. అయినను భగవద్భక్తి పుష్కలముగ కలవారగుటచే శ్రీమంతులనబడిరి. తనకు మంత్ర మం త్రార్థములను ప్రసాదించిన ఆచార్యుని ప్రకాశపరచనిచో ఆ భక్తి నశించును.

ఆయుష్షు అనగా - శరీరమును నిలబెట్టునట్టి ప్రాణసంచారము. అటులనే 'శేషత్వజ్ఞానము' ఆత్మను నిలబెట్టును. కాబట్టి ఆయుస్సనగా శేషత్వజ్ఞానమే. మంత్రమును బజారున బెట్టినవానికి ఆత్మోజ్జీవనమునకు ముఖ్యమైన ధర్మమగు శేషత్వజ్ఞానము నశించును.

(134) ఇచ్చట 'వచియింతు నీయందు' అనగా నాచార్యుడు -

'ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యాం'

తన నుపసత్తిచేసిన శిష్యునకు చెప్పవలెనను విధికి పాత్రు డాచార్యుడే గదా!

'ఆచార్య దేవవిద్యా విదితా సాధిష్ఠం ప్రాపణ్'

ఆచార్యునినుండి వినిన విద్యయే స్థిరమై ఫలప్రదమగును.

'ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినః'

జ్ఞానులు నీకు తత్త్వము నెఱింగింతురు. అని యిట్లు ప్రమాణము లుండుటచే రహస్యార్థముల నెఱింగించు వా డాచార్యుడు. అట్టి ఆచార్యునియందు -

'యస్య దేవే పరాభక్తిః । యథా దేవే తథా గురౌ'

అని భగవంతునియం దుండునంత భక్తి ఆచార్యుని యందును ఉంచవలెను. అది లేనివానికి గీతాసారమును గాని గీతనుగాని చెప్పవలదని శాసించుచున్నాడు.

శ్లోకమున 'అతపస్కాయ- అభక్తాయ- అశ్రూషవే నవాచ్యం'

అని చెప్పకూడని వారినిచెప్పి ఒకేసారి వీరికి చెప్పరాదని యనక ప్రత్యేక ప్రత్యేకము ఒక్కొక్కని యెత్తి 'చెప్పరాదు.' 'చెప్పరాదు' అని చెప్పనేల? అన్న నో- ఈదోషములు మూడునూ ఒకటియును కొఱతపడకయున్నవానికే చెప్పకూడదుగాని ఒక్కొక్క దోషముమాత్రమే ఉన్నవానికి చెప్పవచ్చునేమో అని భ్రమపడుదురని యిందేయొక్క దోష మున్నను సరియే వానికి చెప్పరాదని తెలియుటకై న, న, అని ఆవృత్తిచేసెను

అయోగ్యులను పరిగణించుటలో మునుముందు తపస్సు చేయని వానిని ఆపైన భక్తిలేనివానిని అటు తరువాత శుశ్రూష చేయని వానిని అని యిట్లే క్రమముగా జెప్పుట మొదటివానికంటె రెండవ

వాడు వానికంటె మూడవవాడు మిక్కిలి యనర్హులని తెలుపుటకే 'గురుశుశ్రూషయా విద్యా' యను నటులను 'పరిప్రశ్నేనసేవయా' అనినటులను రహస్యార్థముల నెఱుంగుటలో శుశ్రూష (సేవ) ప్రధాన సాధన మగుటచే నది చేయనివాడు మొదటి యిద్దరికంటెను మిక్కిలి పనికిరానివాడని భావము.

(135) 'మాం అభ్యసూయతి' నాయెడల అసూయ కలవానికి చెప్పకుము. 'అసూయ' యనగా! 'దోషారోపో గుణేష్వపి' గుణవంతుని ఒక్కొక్క గుణమునందును ఒక్కొక్క దోషము నారోపించుట. ఎట్లనగా :—

శ్లో. జాడ్యం హ్రీమతి గణ్యతే। వ్రతరతే దమ్భ శ్శుచౌ కైతవమ్
శూరే నిర్ఘృణతా। మునావిమతితా। దైన్యంప్రియాలాపిని
తేజస్వి న్యవలిప్తతా। ముఖరతా వక్తర్యశక్తి స్థిరే
తత్కోనామ భవేత్ సుగుణినాం। యోదుర్జనైర్నాఙ్కితః॥

లోకోద్వేగ కరములగు పనులను చేయనివానిని జడుడనియు వ్రతానుష్ఠాన నిరతుని దాంభికుడనియు, సదాచారుని మోసగాడనియు—పరాక్రమశాలిని దయావిహీనుడనియు, నియతముగా మాటలాడువానిని బుద్ధిహీనుడనియు, అందరకు నింపుగా మాటలాడువానిని దీనుడనియు, మంచిచొరవ కలవానిని గర్వియనియు, వాక్చతురుని వదరుబోతనియు నిదానముగా పనులుచేయువానిని అసమర్థుడనియు నాక్షేపించు దుర్జనుని దృష్టిలో దోషము. లేనిసద్గుణ మొండైనకలదా? యని భగవంతుని దృష్టిలో నీ యసూయ యన్నటికంటెను గొప్పదోషము. 'అసూయైకా గుణాన్హన్తి'. శరీరమెంత యందమైనదైనను తెల్లని బొల్లిమచ్చ యున్నచో నది వానినెంత దుర్భరునిచేయునో యీ గుణ మట్టిది. కావుననే గీత తొమ్మిదవ యధ్యాయ ప్రారంభమున శ్రీ భగవాను డర్జునునితో—

'ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే'

అర్జునా! అడిగినగాని నుడువరాని మహత్తరమైన రహస్యార్థమును నీవు అసూయ లేనివాడవు గాన నీకు చెప్పెదననెను.

70వ శ్లోకము

(36) ఈ శ్లోకమున 'అధ్యేష్యతే' అనుచోట - భగవంతుడు సర్వజ్ఞుడు గాన ముందీ భారతము రచింపబడునని యెఱింగి అందీ గీతాశాస్త్రము నధ్యయనము చేయువానిని గురించి ప్రసంగించుచున్నాడని చెప్పటకాదు మరియేమనగా - భూతావేశ న్యాయముచే చెప్పుచున్నాడు. అనగా- భారతము ధృతరాష్ట్రుడు పుట్టుటకు పూర్వమే భగవంతుడు ప్రసాదించిన దివ్యచక్షుస్సుగల పూజ్యుడగు వ్యాసమహర్షి రచించి దానిని తన శిష్యులకు చెప్పెను. దానిని నారదుడు దేవతలకుపదేశించెను. దేవతలు పితరుల కుపదేశించెను. శ్రీ శుకమహర్షి గంధర్వ యక్షరక్షస్సుల కుపదేశించెను. ఈ విధముగా లోకమనుష్య లోకములు తప్ప మిగిలిన ప్రపంచమునందంతటను నీ భారతముయొక్క ప్రచారమునుంచెను. మనుష్యలోకమున జనమేజయునిద్వారా ప్రకాశించెను. దానినిబట్టి 'అధ్యేష్యతే' యని భవిష్యదధ్యయనమును గురించి చెప్పుచున్నాడని గ్రహించవలెను. అధ్యయన శబ్ద మొక్క వేదమును చదువుటలోనే వాడబడును కాని గీతయును ఉపనిషత్సారమే గాన దీనికి ఈశబ్దము సమంజసమే. కావుననే ఆశ్రమములను వర్ణించునప్పుడు 'అనవరతాధీత భగవద్గీతం' అని వర్ణింపబడును.

(137) 'యోశ్వమేధేన యజతే
య ఉచ్చై మేవం వేద
యంక్రతు మధీతే తేనతే నాస్యేష్టం భవతి'

అను ప్రమాణములు అశ్వమేధప్రక్రియ నెఱింగినవాడు దానిని చేసినవాడు పొందునట్టి ఫలమునే పొందును. ఇట్లే ఆయా క్రతుమంత్రముల నధ్యయనము చేసినంతనే ఆయా క్రతువుల ననుష్ఠించిన

ఫలము సిద్ధించును- అని చెప్పబడుటచే నటులనే జ్ఞానయజ్ఞముచే నెంత భగవంతునకు ప్రీతి జనించునో అంతప్రీతి గీతాధ్యయనము చేతనే జనించునని తాత్పర్యము-

71వ శ్లోకము

(138) ఇచ్చట వినుటకు గల యోగ్యతలలో వెనుకచెప్పబడిన ప్రణిపాత- పరిప్రశ్న- సేవలను కూడ చేర్చుకొనవలెను.

(139) ఆచార్యుని ముఖతః వినుటయని గ్రహించవలెను. దీనిచే స్వయముగ గీతను చదువుకొనుటగాని మోసముచేసి వినుటగాని అక్రమముగ వినుటగాని కూడదని గ్రహించవలెను.

(140) ఇదివరకు గీతనొకరికి చెప్పుటకును చదువుటకును మోక్షము ఫలముగా చెప్పబడెను. దానితోపాటు యీ యనూయలేని శ్రవణమునకును అట్టి ఫలమే కలుగునని భగవంతుని యభిప్రాయము.

72వ శ్లోకము

(141) భగవంతు డర్జునుని హృదయమును ఎఱింగినను దాని యం దాదరముతో నాతడు దానిని మరవకుండుటకై తన యుపదేశ మాతని పట్లు యెట్లు ఫలించినదో యెఱుంగ గోరువానివలె నడుగుచున్నాడు.

(142) అజ్ఞానము గారణము గాగల భ్రాంతి జ్ఞానము.

ఈ శ్లోకము స్థూణా ఖనన న్యాయమును స్మరింపజేయుచున్నది. అనగా సంభమును లోతుగ పాతి దానిని రాళ్ళతో గట్టిగ బిగించి బిగిసినదో లేదో నెఱుంగుటకై దానినొకసారి ఊపిచూతురు. అటులనే శ్రీ భగవాను డర్జునుని కదిపి చూచుచున్నాడు.

73వ శ్లోకము

(143) అర్జును డీ యర్థమును ఇదివరకు వినియుండకపోవుట చేతను, వాక్యము వలన మొదటనే స్మృతి కలుగకపోవుటవలనను

ఇచ్చట వాక్యము వలన కలుగు అనుభవమనియే స్మృతిశబ్దమున కర్థమును జెప్పవలెను. అర్థాత్-స్మృతి యనగా బుద్ధి (జ్ఞానమని) యర్థము.

భిన్నభిన్న శాఖలలో-

"సనో దేవః శుభయాస్మృత్యా సంయునక్తు"

భగవంతుఁడు మాకు మంచిబుద్ధి నిచ్చుగాక అనియు,

"సనో బుద్ధ్యా శుభ యా సంయునక్తి"

ఆ భగవంతుఁడు మాకు మంచి బుద్ధి నిచ్చుచున్నాఁడు.

అను రెండు వాక్యములలోను "స్మృతిబుద్ధు" లు పర్యాయములుగా వాడ బడినవి.

(144) "యుద్ధాదుల విషయమైన"

అనుచో ఆదిపదముచే భక్తియోగ పర్యంతమును గ్రహించవలెను. అయినచో భక్తియోగము నాతఁడ (అర్జునుడు) నుష్ఠించనే లేదేమి ? యన్నచో మరచిపోవుటచేత నని తానే చెప్పెను.

శ్లో. యత్తు తద్భవతా ప్రోక్తం పురా కేశవ! సౌహృదాత్
తత్సర్వం పురుషవ్యాఘ్ర! భ్రష్టం మే నష్ట చేతసః॥

పురుషోత్తమా కృష్ణా! నాయందలి రహస్యార్థములనేవో కొన్ని చెప్పినట్లున్నావు గాని నేను బుద్ధిహీనుడ నగుటచే వానిని మరచిపోతిని-అనెను.

దానికి జవాబుగా శ్రీకృష్ణుడును-

(144) "శ్రావి తస్త్వం మయా గుహ్యం। జ్ఞాపితశ్చ సనాతనమ్
ధర్మస్వరూపిణం పార్థ! సర్వలోకాంశ్చ శాశ్వతాన్
అబుద్ధ్యా మాగ్రహీ ర్యస్త్వం। తన్మే సుమహదప్రియమ్
సహిధర్మ స్సుపర్యాప్తో। బ్రహ్మణః పరివేదనే॥

అర్జునా! నేను నీకు రహస్యార్థముల నన్నిటిని వినిపించితిని - సనాతనమైన ధర్మస్వరూపుడగు భగవంతుని యెఱింగించితిని. శాశ్వత

లోకములను తత్ప్రాప్తి సాధనములను నెఱింగించితిని. నీవు బుద్ధిహీనుడవై వానిని గ్రహించి ధరింపలేకపోతిని. అదినాకు చాలా అనిష్టముగా నున్నది. పరమాత్మను సవిభూతికముగ నెఱుంగుటను నే నుపదేశించిన ధర్మము తెంతెమో అనుకూలములని సెలవిచ్చెను.

145. భూతి- యనగా ఐశ్వర్యమని యొక అర్థము చెప్పబడినది. మఱియు లభించిన సమృద్ధిపఉత్తరోత్తరాభివృద్ధిని సంపాదించుటయును రక్షణమును దీని కర్థమని యెఱుంగవలెను.

146. 147. ధృవా- నీతిః.

మీరు గొప్పబుద్ధిశాలులైనను సావధానచిత్తులైనను మీరు గావించిన సామదానభేద దండోపాయములు నాలిగింటిచేతను కూడ పాండవులు తమ ధర్మమునుండి గర్విపరకవాసియైనను చలింపలేదు. చూచితివా వారి నీతి నిష్ఠ యెంతబలిష్ఠమైనదో.

నీతి యనగా- అర్థశాస్త్రమునవలన జనించిన కర్తవ్య నిశ్చయమని చెప్పబడినది. మరియు- ధర్మసమ్మతమైన నడవడిక యనియు స్థాము.

148. సంజయుడు ధృతరాష్ట్రునితో—

విద్యా రాజన్ న తే విద్యా
మమవిద్యా న హీయతే
విద్యాహీన స్తమోధ్వస్తః
నాభిజానాసి కేశవమ్
మాయాం న సేవే భద్రం తే
నవృథా ధర్మ మాచరే
శుద్ధ భావం గతో భక్త్యా
శాస్త్రా ద్వేద్మి జనార్దనమ్.

సంజయుడు ధృతరాష్ట్రునితో- "మమయతిః" అనుటయందలి తాత్పర్యము. నాదియేమతి నీది మతికాదని భావము- లెట్లనగా!

ధృతరాష్ట్రమహారాజా ! నీవిద్య విద్యకాదు. నావిద్యయే విద్య. నావిద్యకు నాశములేదు. నీవిద్య నశించునది. నీకు ఆధ్యాత్మిక విద్య లేకుండుటచే తమోగుణాభిభూతుడవై శ్రియఃపతి నెఱుంగజాలకున్నావు. ఆ భగవంతునిగూర్చి నీకెంత చెప్పినను చెవిటికి శంఖూదినట్లే యగుచున్నది.

నాకీ విద్య యెట్లులభించెనందువా మనమిరువుర మొకే యాచార్యులయొద్ద ఒకే విద్య నభ్యసించినను నేను కపటమును సుతరాం విడిచి డాంబికమునకు గాక పరమపురుషుని ప్రీతికై శాస్త్రవిహితధర్మముల నాచరింతును. దానిచే భగవంతుని యనుగ్రహము కలిగి నా బుద్ధి నిర్మలమైనది. దానిచే భక్తి యుదయించినది. దాని సహకారముచే నేనుచదిన శాస్త్రములు నాకు విపరీతార్థమును గోచరింపజేయక భగవంతుని తత్త్వము నెఱుకపరచినవి. నీకాభాగ్యములేదు.

కాబట్టి నీబుద్ధి స్థిరమైనదికాదు. నాకిట్టి యథార్థమైన బుద్ధి యుదయించినది-"అని చెప్పెను.

149. ధృతరాష్ట్రుడు గీతాప్రారంభమున 'మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ అని ప్రశ్నించెను. దానికి శ్రీభాష్యకారులు 'సర్వాత్మనా అంధః ధృతరాష్ట్రః సుయోధన విజయ బుభుత్సయా సఞ్జయం పప్రచ్ఛ' అనగా- వస్తువులను చూచు కన్నులేగాక మంచిచెడ్డలను గుర్తించు అంతశ్చక్షువు (జ్ఞానము) కూడా లేనివాడనియు అందువలననే ధర్మాధర్మపక్షముల తారతమ్య మెఱుంగజాలక తన కుమారుల విజయవార్తను వినవలెనను ఆశతో నిట్లు ప్రశ్నించెననియును చెప్పిరి.

సంజయు డా ప్రశ్నకు సాక్షాత్తుగా సమాధానమును జెప్పుటకు సాహసములేకుండుటచే-

"ఇఙ్గితజ్ఞాశ్చ కోసలాః
ప్రేక్షితజ్ఞాశ్చ మైథిలాః
అర్ధోక్తాఃకురుపాంచాలాః,

అనునట్లు కోసలదేశస్థులు చేష్టలను బట్టియు, మిథిలవాసులు చూపులను బట్టియు మనుష్యుల హృదయములను జరిగిన విషయములను నెఱుంగుదురనియు, పాంచాలదేశస్థులు సగము చెప్పిన మిగతవిషయము నంతను గ్రహింతురనియు మర్యాదగలదని తాత్పర్యగర్భితముగ శ్రీకృష్ణార్జునుల సంవాదములోగల నద్భుతతత్త్వమును విశ్వరూపవైభవమును, పాండవులపట్ల శ్రీకృష్ణునకుగల బాధ్యతలను స్పష్టముగా విస్తరించి చెప్పినను సర్వాత్మనా అంధుడగుటచే తత్త్వమును గుర్తించలేక నింకను జిజ్ఞాసతో నుండుటనుగాంచి యిప్పుడు సాక్షాత్తుగనే కుండ బ్రద్దలుకొట్టినట్లు ప్రత్యుత్తరము నొసంగుచున్నాడు.

ధృతరాష్ట్రమహారాజా ! నేను నీకు భగవంతుడైన శ్రీకృష్ణుడు అర్జుననికొఱకు రహస్యతమమైన అధ్యాత్మతత్త్వమును అరటిపండు ఒలిచి చేతిలోనుంచినటుల ఉపదేశించెననియు దేవదుర్లభమగు విశ్వరూపమును చిత్రపటమున జూపినటుల జూపెననియు విశదపరచితిని. పాండవులే జయమును బడయుదురని యెఱుంగుట కదియే చాలునను కొంటిని. దాన నీప్రశ్నకు సమాధానమును నీవు గ్రహించియుందువను కొంటిని. కాని నీవు యథాశ్రుతగ్రాహి వగుటచే నా తాత్పర్యము నెఱుంగజాలవైతివి.

ఇక నిట్టిసూచనలు నీకు లాభము లేదని దానినే సుస్పష్టముగా జెప్పుచున్నాను వినుమని 'యత్ర' యని ప్రారంభించెను.

150 గీతార్థసంగ్రహము

18 వ అధ్యాయసారము

22 వ శ్లోకము

ఈశ్వరే కర్తృతాబుద్ధిః
సత్త్వోపాదేయ తాస్తి మే
స్వకర్మపరిణామశ్చ
శాస్త్రసారార్థ ఉచ్యతే.

తా. సర్వకర్మలకు కర్త శ్రియఃపతియే యని యనుసంధించుటయు, సత్త్వరజస్తమో గుణములలో సత్త్వగుణమే సంపాదించుకొనదగినదనియు తన వర్ణాశ్రమములకు ఉచితమగు కర్మలను భగవదారాధన రూపముగ జేసిన పరమపురుషప్రాప్తి బడయజేయునవిగా పరిణమించుననియు గీతాశాస్త్రమునకు సారమైన భక్తిప్రపత్తియోగములును ఈ పదునెనిమిదవ అధ్యాయమున జెప్పబడినవి.

గీతార్థ సంగ్రహము

కర్మయోగము

23 వ శ్లోకము

కర్మయోగస్తపస్తీర్థ
దానయజ్ఞాది సేవనమ్

తా. కర్మయోగమనగా- తపస్సు- పుణ్యస్థాన సందర్శనము, పుణ్యతీర్థస్నానము, సత్పాత్రదానము, కర్తృత్వఫలసంగ త్యాగపూర్వకముగా యజ్ఞాదిర్ణాశ్రమ ధర్మముల నాచరించుటయును-

ఇచ్చట సేవనమనగా- ఫలసిద్ధి పర్యంతము విడువక యాచరించుట.

జ్ఞానయోగము

24 వ శ్లోకము

జ్ఞానయోగోజితస్వాన్తైః
పరిశుద్ధాత్మని స్థితిః

తా. జ్ఞానయోగ మనగా- మనస్సును తమస్వాధీనములోనుంచుకొని కర్మబంధమొకింతయును గాని లేని శుద్ధాత్మను సాక్షాత్కార పర్యంతము ధ్యానించుచుండుట.

భక్తియోగము

24 వ శ్లోకము

భక్తి యోగః పరైకాన్త
ప్రీత్యా ధ్యానాదిషుస్థితిః.

తా. భక్తి యోగమనగా- భగవంతునియందపారప్రీతితో అర్చనప్రణామ కీర్తనాద్యంతరంగిములతో వర్ణాశ్రమధర్మముల నాతని ప్రీతికై చేయుచు నిరంతరముగ ప్రీతితో ధ్యానించుచుండుట.

24 వ శ్లోకము

త్రయాణామపి యోగానాం
త్రిభిరన్యోన్య సఙ్గమః.

తా. కర్మ జ్ఞాన భక్తి యోగములు మూడింటికిని యొకదానితో నొకదానికి సంగము కలదు. అనగా ఒక్కటి ప్రధానముగా గ్రహించి యాచరించుచున్నను దానిలో తక్కిన రెండును బాత్మగ కలియకయుండవు. ఏదియధికముగానున్న దానితోనే యానిష్ఠ వ్యవహరింపబడును.

అగ్నీంద్రాది దేవతలను గురించిన నిత్యనైమిత్తిక వర్ణాశ్రమ ధర్మములు భగవదనన్యభక్తికి ప్రతికూలము కావనుచున్నారు.

25 శ్లోకము

నిత్యనైమిత్తకానాంచ
పరారాధనరూపిణామ్.

తా. ఆయింద్రాదిదేవతలు నారాయణునకు శరీరభూతులేగాన వారికిచేయు ఆరాధనాదులు తదంతర్యామియైన నారాయణునకే చెందునవగుటచే భగవదేకాంతప్రీతి కెంతమాత్రమును భంగములేదు. కావున నా మూడుయోగములకును పరస్పరచేరిక దోషముకానేరదు.

25 వ శ్లోకము

ఆత్మదృష్టేస్త్రయోఽప్యేతే
యోగద్వారేణ సాధకాః.

తా. ఆత్మదృష్టి యనగా ఆత్మావలోకనము. దీనికి ముఖ్యసాధనము చిత్తైకాగ్రత. ఆత్మావలోకన మందరకును కలుగకుండుట యీ చిత్తస్థైర్యము లేకనే. అది లేకుండుటకు రజస్తమో గుణవికారములగు కామక్రోధాది ప్రకోపమే. అది సత్వగుణాభివృద్ధిచేనశించును. ఆ సత్వగుణాభివృద్ధిచే యీ మూడుయోగములు నుపకరించును.

అవ- ఈ మూడుయోగములచే పైవిధముగా నాత్మావలోకనము కలిగి క్రమముగ పరమభక్తి పరమపద ప్రాప్తియును కలుగుననుచున్నారు.

26 వ శ్లోకము

నిరస్తనిఖిలాజ్ఞానో
దృష్ట్వాత్మానం పరానుగమ్
ప్రతిలభ్య పరాం భక్తిం
తయై వాప్నోతి తత్పరమ్.

తా. ఈవిధముగ నీమూడు యోగములను పరస్పర సంసర్గముతో నాచరించగా ఉపాయవిరోధియగు నజ్ఞానమంతయు నశించును. దానిచే భగవచ్ఛేషతైక రసమగు స్వాత్మ యాథాత్మ్య దర్శనమగును. దానిచే ప్రసన్నుడైన శ్రియఃపతి పరభక్తిని ప్రసాదించును. అది పరమ భక్తిగా మారును. దానిచే పరమపదము లభించును. పరభక్తి-అంకురావస్థ- పరమభక్తి ముక్తికి అవ్యవహిత పూర్వావస్థ.

27 వ శ్లోకము

భక్తియోగస్తదర్థీ చేత్
సమగ్రైశ్వర్య సాధనమ్.

తా. 'చతుర్విధా భజన్తే మాం' అని చెప్పినగాన నీభక్తి మోక్షాపేక్ష కలవానికి మోక్షమునిచ్చుటమాత్రమే గాక ఐశ్వర్యార్థి

మును కోరువారికి బ్రహ్మాదు లనుభవించు నైశ్వర్యమునకు మించిన ఐశ్వర్యము నొసంగును.

27 వ శ్లోకము

ఆత్మార్థీచే త్రియోప్యేతే
తత్కైవల్యస్య సాధకాః.

తా. కైవల్యమనగా శుద్ధాత్మస్వరూప మాత్రానుభవము. (అనగా- ఇందు భగవదనుభవముండదు.) ఈ మూడు యోగములును భగవత్ప్రీతిద్వారా ఆ కైవల్యము నపేక్షించువారికి దానిని కూడా సాధించి యిచ్చును.

28 వ శ్లోకము

ఐకాన్త్యం భగవత్యేషాం
సమానమధికారిణామ్.

తా. ఐకాన్త్యమనగా- దేవతాంతరపరిత్యాగము. నారాయణు నొక్కనియందే నక్తుడై యుండుట. ఇది కర్మజ్ఞానభక్తియోగులు ముగ్గురికిని సమానము. కర్మజ్ఞానయోగులకును నిర్విఘ్నముగా సాగుటకై ముందు భగవత్ప్రపత్తి యవసరము. ఆప్రపత్తికి భగవదైకాన్త్య మవసరమేగదా. భక్తునకును వీరికిని భేదమేమనగా వీరికి ఫలప్రాప్తితో నీ యైకాన్త్యము తీరిపోవును. భక్తునకు నిత్యముగా నుండును.

28 వ శ్లోకము

యావత్ప్రాప్తి పరార్థీచేత్
తదేవానన్యమశ్నుతే.

తా. భగవత్ప్రాప్తిరూపమైన పరమపురుషార్థమును బడయు వరకును మధ్యగా నితరఫలమునుగోరి చెడకుండునేని యీభక్తునకు తప్పక భగవత్ప్రాప్తి కలుగును.

అవ. ఇకముందు నాలుగు శ్లోకములచే ఇట్టిభక్తునికి ఉండు ప్రత్యేక విశేషమును అనుష్ఠానవిశేషమును, ఫలప్రాప్తివిధమును తెలుపుచున్నాడు.

29 వ శ్లోకము

జ్ఞానీ తు పరమైకాన్తీ
తదాయత్తాత్మజీవనః
తత్సంయోగ వియోగైక
సుఖదుఃఖ స్తదేకధీః.

29 వ శ్లోకము

తా. పరమైకాన్తి యనగా ఏకాంతులకన్న మిన్న ఎట్లనగా– ఏకాంతులు అనన్యదేవతాకులు (అనగా నితరదేవతలను తన ప్రయోజనసిద్ధికై ఆశ్రయించనివారు) అయినను అనన్య ప్రయోజనులు కారు. మాకు కావలసినది నీవిచ్చునదియేగాని నీవు కావనువారు. పరమైకాంతియన్ననో భగవంతునేగాని భగవంతు డిచ్చువానిని సరకుగొనడు. కోరడు. అందుచేతనే యీతడు ఏకాంతులలో పరుడు=గొప్పవాడు. ఈతనికి ధారకపోషక భోగ్యములన్నియును పరమాత్మయే. తనజీవితము పరమాత్మకు వశమై యుండును. అందుచే నాతనితోగల సంశ్లేషమే సుఖమనియు, విశ్లేషమే దుఃఖమనియు భావించుచు భగవంతునియందే లగ్నమనస్కుడై యుండును.

30 వ శ్లోకము

భగవద్ధ్యాన యోగోక్తి
వందన స్తుతికీర్తనైః
లబ్ధాత్మా తద్గతప్రాణ–
మనోబుద్ధీన్ద్రియక్రియః

తా. భక్తుడు (పరమైకాంతి) నిరంతరము భగవంతునే ధ్యానించుట, భగవంతునిసేవకై దివ్యదేశములకేగుట, భగవంతుని స్వరూప

ద్రూపగుణ విభూతులను తానెఱింగినంత యితరుల కుపదేశించుట, భగ వంతునియెదుట సాష్టాంగప్రణామము లాచరించుట, ఆయనను స్తుతించుట, నిర్లజ్జగా ఉచ్చైస్స్వరముతో కీర్తించుట ఇట్లు చేసి లబ్ధసత్తాకు డగుట (ఉన్నవారిలో జమయగుట) అట్లుచేయుడేని ప్రశిథిలసత్తాకుడగునుగాన తన ప్రాణమును మనస్సును బుద్ధిని ఇంద్రియములను భగ వంతుని యధీనముగావించుటయును కలిగియుండును. ప్రాణము నాతని యందుంచుట యనగా ధారకపోషక భోగ్యములూ భగవంతుడుగనే యుండుట. మనస్సునుంచుట యనగా ఆతని ప్రీతితో ధ్యానించుట. బుద్ధినుంచుట యనగా ఆతడే ప్రాప్యుడని గట్టినమ్మకమును కలిగియుండుట. ఇంద్రియములుంచుట యనగా 'జిహ్వేకీర్తయ' యని ముకుంద మాలలో శ్రీకులశేఖరాళ్వారులు సెలవిచ్చినట్లు సమస్తేంద్రియములతో నా భగవంతుని సేవను గావించుట. అదిలేనిచో 'నదేహం న ప్రాణాన్

నచ సుఖమశేషాభిలషితం నచాత్మానం నాన్యత్కిమపి తవ
శేషత్వవిభవాత్ బహిర్భూతం నాథక్షణమపి
సహేయాతు శతధా వినాశం తత్సత్యం
మధుమథన ! విజ్ఞాపనమిదమ్.

అనునట్టి వినియోగమును కలిగియుండుట.

అవ- ఇట్లుండియును-

31 వ శ్లోకము

నిజకర్మాది భక్త్యన్తం
కుర్యాత్ప్రీత్యైవకారితః

తా. అనుభవజనిత ప్రీతికారిత కైంకర్యనిరతుడై యుండును. అనగా- భగవంతుని యనుభవించుటచే కలిగిన ప్రేమచే నిలువజాలక ఆతని ప్రీతికొఱకై తన వర్ణాశ్రమములకు తగిన కర్మలను శ్రద్ధగా జేయుచు భక్తిపర్యంతము నెఱవుచుండును.

31 వ శ్లోకము

ఉపాయతాం పరిత్యజ్య
న్యసేద్దేవేతు తామభీః.

తా. కర్మాదులను ఉపాయముగా తలంచక వానిని భగవదాజ్ఞ లనెడి నమ్మకముతో నాతని ప్రీతికై వానిని చేయుచు ఆతనినే తనకు పురుషార్థప్రాప్తికి ఉపాయమని నమ్మియుండి నిర్భరుడై నిర్భయముగా నుండును.

32 వ శ్లోకము

తత్ప్రధాన మిదం శాస్త్రం
ఇతి గీతార్థ సఙ్గ్రహః.

తా. ఈ గీతాశాస్త్రము పరమపురుషార్థోపాయము లగు భక్తిప్రపత్తులును, ప్రాప్తమగు పరమైకాంతియును, ప్రాప్తమైన పరమపద మున నారాయణుడును ప్రధాన ప్రతిపాద్యవిషయములుగ గలది.

గీతార్థ సంగ్రహము సమాప్తము.

